# విజ్ఞాన సర్వస్వము

నాలుగవ సంపుటము

## తెలుగు సంస్కృతి - ౨

సంపాదక సమితి

శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మ

శ్రీ మామిడిపూడి వెంకట రంగయ్య

శ్రీ నేలటూరి వెంకట రమణయ్య

శ్రీ మోటూరి సత్యనారాయణ

1961

# ప్రకాశకుల విజ్ఞప్తి

సుమారు రెండుశతాబ్దములపాటు మనదేశము పరాధీనమై యుండుటవలన కలిగిన దుష్ఫలితములలో ముఖ్యమైనది మన దేశభాషల అభివృద్ధికి నిరోధకమయిన ఆంగ్లభాషాప్రాభవము. దానితో పాటు విదేశ సంస్కారములు, విజ్ఞానము, సారస్వతము, నాగరికత మన మలవరచుకోవలసిన ఆవశ్యకత అనివార్యముగా వచ్చిపడినది. ఈ దుస్థితిని గుర్తించిన మన నాయకులు దీనిని కొంతవరకైనను నిరోధించి యుండకపోతే మనదేశ మీపాటికి ఇంగ్లండ్ దేశమునకు చెల్లెలుగానో, బిడ్డగానో తయారై ఉండేది. ప్రత్యక్షగోచరములైనవేకాక మనకు తెలియకుండానే మన మనోదృష్టి, వాంఛలు, ఆశయాలు కూడా చాలవరకు విదేశీయములు, విజాతీయములుగా మారినవి; ఇంకను మారియుండేవి కాని, మన దేశీయులకు చైతన్యము కలిగినది. ఈ దుష్ఫలితాలను అరికట్టుటకు చేసిన ప్రయత్నాలలో ముఖ్యమైనవీ, నిర్మాణాత్మకములయినవీ—స్వదేశీప్రచారము, స్వభాషాప్రబోధము, స్వాతంత్ర్యోద్యమము. రాజకీయరంగములో జరిగిన పోరాటము ఫలితముగా స్వరాజ్యము లభించినది. దీనిని నిలుపుకోవలెనంటే దేశములో కలిగిన ప్రజాచైతన్యాన్ని నిర్మాణాత్మకముగా మనము ఉపయోగించుకొనవలెను. ప్రజలకు విద్యాప్రబోధము వారి మాతృభాషలో కలుగజేయవలెను. మన తెలుగువారు సమర్థత గల పౌరులుగాను, విజ్ఞానవంతులుగాను తయారు కావలెనంటే మన పవులు, ప్రభుత్వ కార్యకలాపాలు, మన న్యాయస్థాన వ్యవహారాలు, సారస్వతము, విజ్ఞానము అంతా మన భాషలో ఉండి తీరవలెను.

పూర్వకాలములో భారతీయ విజ్ఞానమంతా సంస్కృతభాషమూలముగాను, ప్రాకృతభాషల ద్వారాను భారతదేశమందేకాక ఇతర దేశములందుకూడా వెల్లువలై ప్రవహించినది. రానురాను మన దేశము పారతంత్ర్యముపాలయినందున ఈ జ్ఞాన విజ్ఞానసర్వస్వ మంతా అడుగంటినది. దానిస్థానే పరుల విజ్ఞానము, సంస్కృతి ఎక్కువగ వ్యాపించినది. దీనివలన నష్టము కలిగినా, ఒక మేలుకూడా కలుగకపోలేదు. ఆధ్యాత్మికవిద్యల విషయము నిత్యమైనదే అయినా ప్రాపంచిక విజ్ఞానము కాలానుగుణముగా మారేది కనుక మన ప్రాచీన విద్యలకు ఆధునిక విద్యలందుగల మంచిని ఉంచి నూతనముగా ఒక విశిష్టమైన వికాసముతో విజ్ఞానాన్ని రూపొందించుటకు అవకాశ మేర్పడినది.

భారతదేశములోని పలుభాషలు విదేశాలనుండి వెల్లువలుగా ప్రవహించి వచ్చిన విజ్ఞానాన్ని ఆధారంగా చేసికొని ప్రస్తుతము ఎంతో అభివృద్ధిలోనికి వచ్చినవి. బెంగాలీ, హిందీ, మరాఠీ భాషల ప్రాభవం ఏ విదేశభాషల ప్రాభవమునకును తీసిపోదు. ప్రతిదినము ఇతోఽధికంగా ఈ భాషలు అభివృద్ధిపొందుతున్నవి. మన భాషలను ప్రజానీకంయొక్క విజ్ఞానంకొరకు, దాని అభివృద్ధికొరకు ఉపయోగించవలెనంటే ఆధారగ్రంథాలను మొట్టమొదట మనం తయారు చేసికొనడం అవసరం. అందువల్లనే మన పూర్వులు ధర్మశాస్త్రిలకు ఆధారగ్రంథం వేదంగాను, పదజాలమునకు ఆధార గ్రంథం నిఘంటువుగాను, భాషాసూత్రాలకు ఆధారాలు వ్యాకరణాలుగాను, అర్థ, న్యాయ శాస్త్రిలకు ఆధారాలు స్మృతులుగాను నిర్మించి, ప్రజానీకానికి మన విజ్ఞానాన్ని అందించి వారిని తదనుసారంగా నడిపించారు. నేడు మన విజ్ఞానపేటికలో భారతీయ విజ్ఞానమే కాదు—ప్రపంచమంతటిలోను లభ్యమయ్యే సర్వవిధ విజ్ఞానము అమర్చుకొంటేనే కాని మనము వివిధ విజ్ఞాన మంజూషను తయారు

చేయలేము. ఇట్టి మంజూషలు వికాసవంతములయిన అన్ని భాషలలోను ఏర్పడియున్నవి. వీటికి 'ఎన్‌సైక్లోపీడియా' (విజ్ఞాన సర్వస్వము)లు అని పేరు. 'ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికా' ఇంగ్లీషులో ఎంత విశాలమైనదో చూస్తే అచ్చెరువవుతుంది. ఇంగ్లీషు భాషయొక్క, జాతియొక్క భవిష్యత్తును నిర్మించే సామగ్రి అంతా అందులో ఇమిడియున్నది.

మూడుకోట్లమంది జనులకు మాతృభాషయై అతిప్రాచీనమైన మన తెలుగుభాషకు ఇట్టి విజ్ఞాన మంజూష లేకపోవడం లోపముకాదని ఎవరును చెప్పజాలరు. ఈ విజ్ఞాన మంజూష తయారుచేయడం కోసం కాంగ్రెసు గవర్నమెంటు ఏర్పడిన తరువాత మనకు విద్యామంత్రులైన శ్రీ అవినాశిలింగం చెట్టియారు ద్రావిడభాషలలో విజ్ఞానసర్వస్వం తయారుచేయించడం కోసం ఒక ఉద్యమాన్ని మొలకెత్తించారు; తమిళ వళర్చిక్కళగం (తమిళభాషావర్ధకసమితి) అనే పేరుతో ఒక సంఘాన్ని స్థాపించి తద్ద్వారా తమిళభాషాసేవ చేయవలెనని కూడా సంకల్పించినారు. విద్యామంత్రి ప్రారంభించిన ఈ కార్యానికి ప్రభుత్వసహాయం కూడా సులభసాధ్యమైనది. తెలుగుభాషాభివృద్ధికి కూడా ఇట్టి ప్రయత్నం చాల అవసరమనీ, తెలుగు రచయితలను, భాషా సేవకులను ప్రోత్సహించడం కూడా అవసరమనీ తలచి మదరాసులోని తెలుగుభాషాభిమానులు కొందరు 15-10-1947 వ తేదీన విద్యాశాఖామంత్రిగారి ఆహ్వానంమీద సమావేశమయ్యారు. ఈ కార్యాన్ని జయప్రదంగా నెరవేర్చడం కోసం 'తెలుగు భాషా సమితి' అనే పేరుతో ఒక సమితిని ఏర్పాటుచేయడానికి నిశ్చయించడమయినది. ఆ వెంటనే యథాక్రమముగా దానిని స్థాపించడముకూడా జరిగినది. సమితి సంకల్పించిన ఉద్దేశములలో 1. తెలుగు భాషలో ఒక విజ్ఞానసర్వస్వమును, విజ్ఞానవ్యాప్తికి తోడ్పడు ఇతర ప్రచురణలను గావించుట, 2. తెలుగు భాషలో వివిధవిషయములకు సంబంధించిన రచనలను చేయించుటకై ఉత్తమ గ్రంథములకు బహుమతులిచ్చుట, 3. తెలుగుభాష, తెలుగువాఙ్మయము - వీటి అభివృద్ధికి తోడ్పడగల కార్యకలాపాలను నిర్వహించుట, 4. వైజ్ఞానిక విషయములనుగూర్చి చర్చలు, ప్రసంగములు, ఉపన్యాసములు జరిపించుటకు గావలసిన సభలు, సమావేశములు, ప్రదర్శనములు ఏర్పరచుట మొదలగునవి ముఖ్యములు.

సమితి కార్యస్థానముగా ఉపయోగించుటకు మద్రాసు విశ్వవిద్యాలయమువారు ఉచితముగా ఇచ్చిన విశ్వవిద్యాలయ భవనమందలి ఒక గదిలో సమితి ప్రారంభోత్సవము 9-3-1948 వ తేదీని జరిగినది. ఈ ఉత్సవమునకు వచ్చిన పెద్దలు సమితి సంకల్పించిన తెలుగు విజ్ఞాన సర్వస్వ రచనా విధానమును గూర్చి తమ ఆశయములను, అభిప్రాయములను తెలియజేసినారు. ఈ తెలుగు విజ్ఞాన సర్వస్వరచనా విధానమును గూర్చి సలహా నిచ్చుటకు ఒక ప్లానింగు కమిటీ ఏర్పడినది. ఈ కమిటీ సలహాల ననుసరించి సకలకళలను, శాస్త్రములను సాజాత్యమును బట్టి కొన్నివర్గముల క్రింద విభజించి ఒక్కొక్క సంపుటమందు ఒక్కొక్కవర్గములోగల విషయములను, అవకాశమునుబట్టి రెండేసి, మూడేసి వర్గములలోని విషయములను చేర్చి 16 * సంపుటములలో ప్రకటించుటకు సమితినిశ్చయించినది.

---

* ఆది వ్యవస్థలోని 12 సంపుటముల పథకము 1960 లో పునర్వ్యవస్థీకరింపబడి 16 సంపుటములుగా ప్రచురింప నిర్ణయమైనది.

మొదటి రెండు సంపుటములు అనగా (1) చరిత్ర-రాజనీతి; (2) భౌతిక-రసాయన శాస్త్రములు ప్రచురణ జరిగిన పిమ్మట "తెలుగు సంస్కృతి" అను సంపుట ప్రచురణ వచ్చునరికి గ్రంథ విస్తృతి చూడ భీతికరమయ్యెను. 1246 పుటల విషయ సంపదతోను 74 ఏకవర్ణ, ద్వివర్ణ చిత్రములు, 6 త్రివర్ణ చిత్రముల భారముతో గ్రంథము సులువుగా ఉపయోగించుటకు గాను అసాధ్యమయ్యెను. పెక్కుమంది విజ్ఞులు తెలుగు సంస్కృతి సంపుటమును రెండు సంపుటములుగా విడదీసి ప్రచురింప సెలవిచ్చిరి. కాని అప్పటికే కొన్ని ప్రతులు విక్రయింపబడినవి. అయినప్పటికి విషయము సమితి నిర్వాహకులకు గడ్డుసమస్యయైనది. కాగా ఇట్టి గ్రంథవిస్తరణ భీతి ప్రతి సంపుటములోను తటస్థించు అవకాశము కనుపించినది. అప్పుడు సంపుటముల

ఒక్కొక్క సంపుటములో ఉండవలసిన విషయము లన్నింటి వివరణములు, ఆయా విషయములకు కావలసిన పుటలసంఖ్య, రచయితల పేర్లు మొదలయిన అంశములను వివరించి తెలియ జేయుటకు ఒక్కొక్కవర్గమునకు ఒక్కొక్క ఉపసంఘము ఏర్పడినది. ఉపసంఘముల సమావేశములను జరిపి కావలిసిన పని కొనసాగించుటకు ఒక్కొక్క ఉపసంఘమునకు ఒక్కొక్క సమావేశ కర్త (కన్వీనరు) ను నియమించడమయినది. ఈ సమావేశ కర్తలతోను, ఇతరసభ్యులతోను సంప్రదించి, ఉపసంఘముల నివేదికలను తెప్పించి కావలసిన వస్తుసామగ్రిని సేకరించుటకును, సేకరించిన సామగ్రిని పరిశీలించి అమర్చిపెట్టుటకును కావలసిన సంగ్రాహకులను నియమించుటకు నిశ్చయించి, సమితి కార్య నిర్వాహక వర్గము మొట్టమొదట డాక్టరు గిడుగు వెంకట సీతాపతిగారిని ప్రధానసంగ్రాహకునిగా నియమించినది. వీరు 10-5-1948 వ తేదీని పని ప్రారంభించిరి. మరి కొలది కాలములోనే శ్రీ వసంతరావు వెంకటరావు గారిని శాస్త్రసంబంధము గల సంపుటముల విషయములను సేకరించుటకు సంగ్రాహకునిగా నియ మించినది. వీరు 2-4-1949 వ తేదీని పని ప్రారంభించిరి.

తెలుగు భాషకు, వాఙ్మయమునకు, తెలుగువారి చరిత్రకు, సంస్కృతికి సంబంధించిన ప్రత్యేక సంపుటము నొకదానిని ప్రచురించుట సమితి ఉద్దేశము. దాని ప్రకారము కొమర్రాజు వెంకటలక్ష్మణ రావు పంతులుగారికి కుడిభుజముగను, కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారికి సర్వాంగీణముగను విజ్ఞానసర్వస్వ నిర్వహణ భారమును వహించి చక్కని అనుభవమును, నిరతిశయ సామర్థ్యమును సముపార్జించిన ఆంధ్రదేశ చరిత్ర పరిశోధక నిపుణులు, అద్వితీయాంధ్రాభిమానులు నైన శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు 'తెలుగు సంస్కృతి' సంపుటముయొక్క ప్రకటన కార్యమును నిర్వహిం చుటకై సంగ్రాహకులుగా 1950 లో నియమింపబడిరి.

సమితి సంగ్రాహకుల కృషిఫలితముగ (1) "చరిత్ర - రాజనీతి" (2) భౌతిక - రసాయన శాస్త్రములు, (3) తెలుగు సంస్కృతి-౧,† 1954, 1955, 1959, సంవత్సరములలో ప్రకటితము లైనవి. ఆదిలో విడిచిపెట్టబడ్డ 326 పుటలుగల అనుబంధము విషయములను 546 పుటలుగల అకారాద్యను క్రమణమునకు జోడించి 'తెలుగు సంస్కృతి-౨' అను 4 వ సంపుటముగ ఇప్పు డిది ప్రచురింపబడినది. అయిదవదైన 'అర్థ, వాణిజ్య, భూగోళ శాస్త్ర' సంపుటము, ఆరవదైన 'విశ్వసాహితి' సంపుటము మిగత పది సంపుటములును ఒకటి తరువాత నొకటిగా శీఘ్రగతిలో ప్రకటితములు కాగలవు.

ఈ విజ్ఞానసర్వస్వ కార్యకలాపమంతా సాధించడానికి కనీసము 15 లక్షల రూపాయలు కావలసి ఉండునని అంచనా వేయడమైనది. అభిమానులు, ఉదారులు అయిన ధనవంతులవద్ద ధన సేకర ణము చేయడానికి సమితి నిశ్చయించుకొన్నది. విజయనగరము మహారాజుగారు, తిరుపతి దేవస్థానము కమిటీ, సింహాచలము దేవస్థానం కమిటీ, పిఠాపురము మహారాజుగారు, శ్రీ వి. రామకృష్ణ, ఉయ్యూరు

సంఖ్య పెంచుట అను విషయమును గూర్చి సమితి కార్య నిర్వాహక వర్గము దీర్ఘ పునరాలోచన చేసినపిమ్మట సంపుటములలో ప్రస్తావించదగు విషయములను పునర్వ్యవస్థీకరించి పూర్వపు 12 సంపుట పథకమునందు విడిచిపెట్టబడిన విషయములను, ఉన్న విషయములను మరింత విపులీకరించి నూతన వ్యవస్థగా మొత్తము 12 సంపుటముల సంఖ్యను పెంచి 16 సంపుటములుగా ప్రచురించుటకుగాను నిర్ణయించడమైనది.

† పూర్వపు 'తెలుగు సంస్కృతి' సంపుటమునుండి 700 పుటలుగల సమీక్షను విడదీసి కొన్ని ఏకవర్ణ, త్రివర్ణ చిత్రములతో "తెలుగు సంస్కృతి-౧" అను మూడవ సంపుటము వెలువరింపబడినది.

షుగర్ ఫ్యాక్టరీవారు, శ్రీ గోగినేని వెంకటసుబ్బయ్య మొదలగువారు ప్రశంసనీయమైన ఔదార్యముతో విరాళము లొసగియున్నారు. దాతలనుండి చేకూరిన మొత్తము సుమారు రు. 2,50,000 లు. ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర మేర్పడకమునుపు ఉమ్మడి మద్రాసు ప్రభుత్వమువారు సంవత్సరమునకు లక్షరూపాయల చొప్పున ఐదు సంవత్సరములకు ఐదు లక్షలు ఇచ్చుటకు వాగ్దానముచేసిన విరాళములో 1961 సంవత్సరాంతమునకు మద్రాసు, ఆంధ్ర రాష్ట్రములు ప్రసాదించిన మొత్తము రూ. 4,87,964=87. కేంద్ర ప్రభుత్వ శాస్త్ర పరిశోధన, సాంస్కృతి వ్యవహారాలశాఖ ఇప్పటికి రూ. 80,000=00 గ్రాంటుగా సహాయము చేసిరి. వీరందరికిని, సమితి భవన నిర్మాణమునకై దీర్ఘకాల కౌలు పద్ధతి మీద ఎ. 1. 50 సెంట్లు భూమిని తమ ప్రాంగణమున కేటాయించి ఇచ్చిన ఉస్మానియా విశ్వవిద్యాలయ వైస్ ఛాన్సలరు డాక్టరు డి. ఎస్. రెడ్డిగారికిని, మద్రాసు విశ్వవిద్యాలయ భవనములందు ఈ భాషాసమితి కార్యస్థానము నెలకొల్పుటకు అనుజ్ఞ యిచ్చి అనేకవిధముల సౌకర్యములు కలుగజేసిన వైస్ ఛాన్సలర్ డాక్టరు సర్. ఆర్కాటు లక్ష్మణస్వామి మొదలియారుగారికిని, వాల్తేరు శాఖా కార్యాలయము నెలకొల్పుటకు తమ భవనములలో ఉచితముగా స్థలము నిచ్చి సకలవిధముల తోడ్పడుచున్న ఆంధ్ర విశ్వవిద్యాలయాధికారులకును వైస్ ఛాన్సలర్ గారికిని, తమ యధీనమునందు గల చిత్రములను పునర్ముద్రించుకొనుటకు అనుమతి నొసగిన సంస్థలవారికిని కృతజ్ఞతాభివందనములు.

ఈ సంపుటములు సాధ్యమయినంత నిర్దుష్టముగాను, అందముగాను, ఆకర్షకముగానకు ముద్రించిన హిందీ ప్రచార ముద్రణాలయ కార్యకర్తలకును, కావలిసిన చిత్రములకు, దేశపటములకు సంబంధించిన బ్లాకులు చక్కగ తయారుచేసి ఇచ్చిన న్యూటన్ అండ్ కంపెనీ వారికిని ధన్యవాదములు.

తెలుగువారికి సకల విద్యలనుగూర్చి జిజ్ఞాస కలిగించి, వారి బుద్ధి వికాసమునకును, సంస్కృతి సంపదకును తోడ్పడగల విజ్ఞాన మందజేసి, ఇతోఽధికముగా విజ్ఞానసంపన్నులు కాగోరువారికి మార్గము చూపించుటే తెలుగు భాషా సమితి సంకల్పము. ఈ సంకల్పము ఏ మాత్రము నెరవేరినను సమితి కృషి సఫలమైనట్లు సంతోషింపవచ్చును.

చెన్నపురి
17-3-1961
మకాం: న్యూఢిల్లీ.

బెజవాడ గోపాలరెడ్డి
అధ్యక్షుడు
తెలుగు భాషా సమితి

## తెలుగు భాషా సమితి

### కార్య నిర్వాహక వర్గము

## సర్వస్వ విధాన నిర్ణయసమితి

1. డాక్టరు సర్ ఆర్కాటు లక్ష్మణస్వామి మొదలియార్,
   ఎం. డి. ఎల్. ఎల్. డి., డి. ఎస్‌సి., డి.సి.ఎల్. (ఆక్సన్), ఎఫ్.ఆర్.సి., ఒ.జి., ఎఫ్. ఎ.సి.ఎస్.,
2. శ్రీ టి. ఎస్. అవినాశలింగం చెట్టియార్, బి.ఏ., బి.ఎల్.,
3. శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్య, ఎం. ఏ.,
4. శ్రీ విస్సా అప్పారావు, ఎం. ఏ., ఎల్. టి.,
5. శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ,
6. డాక్టరు గిడుగు వెంకట సీతాపతి, బి. ఏ., ఎల్. టి., డి. లిట్.,
7. శ్రీ మాగంటి బాపినీడు, బి. ఎస్‌సి. (కార్నెల్); ఎం. ఎస్‌సి. (కాలిఫోర్నియా),
8. శ్రీ వసంతరావు వెంకటరావు, ఎం. ఎస్‌సి.



# సంపాదకీయ భూమిక

'తెలుగు విజ్ఞాన సర్వస్వ' ప్రకటనమునకు పూనుకొన్న పిదప తెలుగు దేశమునకు సంబంధించిన సమస్త విషయములను దెలుపు "తెలుగు సంస్కృతి" సంపుటము నొకదానిని ప్రకటింపవలెనని తెలుగు భాషా సమితి నిశ్చయించినది. సమితి కోరికపై తెలుగు దేశమునకు సంబంధించిన సమస్త విషయములు వచ్చుట కనువుగ 'ఆంధ్ర' సంపుటము ప్రణాళిక శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారిచే 1950 లో సిద్ధము చేయబడినది. ఇందు తెలుగు సంస్కృతికి సంబంధించిన విషయములనే గాక తెలుగు దేశపు నైసర్గిక భూగోళ విషయములు, అందలి జంతుజాలము, వనౌషధి వర్గము, భూగర్భస్థ ఖనిజవర్గము, జిల్లా భూగోళ విషయాదికములు, నీటి వనరులు, వ్యవసాయము, పశు సంపద, వ్యవసాయ పరిశోధక క్షేత్రములు, వర్తక వ్యాపారములు, పరిశ్రమలు, జనాభా, ఆర్థిక పరిస్థితి మొదలైన విషయములను గూడ సంపూర్తిగ వివరించుటకు అవకాశము కల్పింపబడినది.

తెలుగు దేశమునకు సంబంధించిన విషయము లన్నియు సాధ్యమైనంతవరకు సమగ్రముగ సేకరించి ప్రకటించుట కిదియే ప్రథమ ప్రయత్నము. వీలైనంతవరకు ఏ విషయమున ఎవరు ప్రవీణులో తెలిసికొని ఆయా విషయములను గురించియే వారిని వ్యాసములు వ్రాసి పంప వలసినదిగ వేడుకొనుచు లేఖలు వ్రాయబడినవి. భావ ప్రకటనమున వ్యాసకర్తలకు సంపూర్ణ స్వాతంత్ర్య మొసగ బడినది.

సేకరించిన వ్యాసములు రెండువేల పుటలవరకు పెరుగుటవలనను, తెలుగు సంస్కృతికి సంబంధించిన వ్యాసములు మాత్రము 1200 పేజీలకు పైబడుట వలనను తెలుగు సంస్కృతి సంపుటమును రెండు భాగములుగ ప్రకటించుటకు ప్రకాశకుల విజ్ఞప్తిలో పేర్కొన్నట్లు 1960 వ సంవత్సరములో తీర్మానింపబడినది. ఈ నిర్ణయము ప్రకారము తెలుగు సంస్కృతి - ౧ 700 పుటలతో వెలువడినది. ఈ రెండవ భాగమునందు తెలుగు సంస్కృతికి చెందిన వ్యాసములు అకారాద్యనుక్రమముగ 546 పుటల లోను, ఆంధ్రప్రదేశ్‌కు సంబంధించిన అనేక ముఖ్య వ్యాసములు అనుబంధముగ 326 పుటలలోను ప్రకటింపబడినవి.

ఆంధ్రప్రదేశ్‌లోని ప్రముఖులైన విద్యాధికు లనేకులు ఈ ఉద్యమమునకు ఆదరాభిమానములతో తోడ్పడినందువలననే ఈ సంపుటము నీ రీతిని ఆంధ్ర ప్రజానీకమున కందింపనైనది. ఈ విధముగ సహకరించిన సహృదయులందరికి మా కృతజ్ఞతా పూర్వకాభివందనములు.

ఈ కార్య నిర్వహణమున మాకు సర్వ విధముల తోడ్పడిన తెలుగు భాషా సమితి మద్రాసు కార్యాలయమువారికి మా హృదయపూర్వకాభివందనములు.

చెన్నపురి
17-3-1961

సంపాదక సమితి

# రచయితలు

అ. రా. కృ. శ్రీ రామకృష్ణరావు, అబ్బూరి, ఎం. ఏ.,
లైబ్రేరియన్, ఆంధ్ర విశ్వవిద్యాలయము, వాల్తేరు.
ఉమాకాంతం, అక్కిరాజు; వెంకట అప్పారావు, గురుజాడ; వెంకట అప్పారావు, బసవరాజు.

అ. రా. కృ; తూ. దో. శ్రీ రామకృష్ణరావు, అబ్బూరి; శ్రీ దోణప్ప, తూమాటి,
పగటివేషములు; బొమ్మలాట.

అ. ల. రావు. శ్రీ లక్ష్మణరావు, అయ్యగారి,
లెక్చరర్ ఇన్ ఫిలాసఫీ, ఆంధ్ర యూనివర్సిటీ, వాల్తేరు.
ఆంధ్ర విశ్వవిద్యాలయము.

అ. వా. శా. (అ. వా.) శ్రీ వాసుదేవశాస్త్రి, అవ్వారి, సాహిత్య విద్యాప్రవీణ, భాషాప్రవీణ, సాహిత్యరత్న,
పెదనందిపాడు, (వయా) చీరాల, గుంటూరు జిల్లా.
కృష్ణమూర్తి శాస్త్రి, ప్రతాప; పట్టాభిరామశాస్త్రి, జానపాటి; వెంకటప్పయ్యశాస్త్రి, తాడేపల్లి; సుబ్రహ్మణ్యశాస్త్రి, అవ్వారి.

అ. ల. డాక్టరు లక్ష్మీపతి, ఆచంట, బి.ఏ., ఎమ్.బి.సి.ఎమ్., భిషగ్రత్న,
హారిస్ రోడ్డు, ఎగ్మూరు, మద్రాసు.
రుక్మిణమ్మ, ఆచంట.

ఆ. వీ. రా. శ్రీ వీరభద్రరావు, ఆదిరాజు,
కార్యదర్శి, లక్ష్మణరాయ పరిశోధక మండలి, 78, ఆజంపుర, హైదరాబాదు.
వెంకటరంగారావు, నాయని; మహబూబునగరము జిల్లా (సంక్షిప్త చరిత్ర); హైదరాబాదు జిల్లా; మెదకు జిల్లా; నిజామాబాదు జిల్లా; ఆదిలాబాదు జిల్లా; కరీంనగరము జిల్లా (కొంతభాగము); వరంగల్లు జిల్లా (సంక్షిప్త చరిత్ర); ఖమ్మం జిల్లా; నల్గొండ జిల్లా (కొంతభాగము).

ఆర్. వి. రావు. డాక్టరు రావు, ఆర్. వి., ఎం. ఏ., పి హెచ్.డి.
జాయింట్ డైరెక్టర్, ఇండస్ట్రీస్ & కామర్స్, ఆంధ్రప్రదేశ్, హైదరాబాదు.
పారిశ్రామిక కళలు.

ఇం. హ. శా. శ్రీ హనుమచ్ఛాస్త్రి, ఇంద్రకంటి, ఉభయ భాషా ప్రవీణ,
సంస్కృతాంధ్ర పండితులు, బోర్డు నేషనల్ స్కూలు, రామచంద్రపురం, తూర్పు గోదావరి జిల్లా.
శ్రీనాథుడు.

ఈ. వెం. వీ. రా. శ్రీ వెంకట వీరరాఘవాచార్యులు, ఈయుణ్ణి, ఎం.ఏ., (ఏ. ఇ. యస్), విద్యారత్న,
ఎడిటర్, సంస్కృత అకాడమీ, ఉస్మానియా విశ్వవిద్యాలము, హైదరాబాదు.
జాయప సేనాపతి; ధర్మసూరి, వారణాసి; ధర్మాచార్యులు, కిశాంబి; భద్రాద్రిరామశాస్త్రి, కొంతి; మల్లయ్యశాస్త్రి, పురాణపండ; లక్ష్మీధరుడు, లొల్ల; లక్ష్మీనారాయణశాస్త్రి, వేరి; వామనభట్టబాణుడు,

ఊ. ల. కాం.
శ్రీమతి లక్ష్మీకాంతమ్మ, ఊటుకూరి, ఉభయభాషా ప్రవీణ
బాపట్ల, గుంటూరు జిల్లా.
కవయిత్రులు – ఆధునిక యుగము; తిమ్మక్క, తాళ్లపాక; జాలపాపాంబ; మొల్ల; వెంగమాంబ, తరిగొండ; సుందరమ్మ, దార్ల; క్రీడలు–అచ్చనగండ్లు; ఒప్పులకుప్ప; ఓమనగుంటలు; కంబాలాట; గుజ్జనగూళ్ళు; చెమ్మచెక్క; పులిజూదము; బొంగరాలాట; బొమ్మలపెండ్లి; వెన్నెలవత్తి.

ఎం. బి. జి. శా.
శ్రీ శాస్త్రి, ఎం. బి. జి.
టెక్నికల్ అసిస్టెంటు, చీఫ్ ఇంజనీరు ఆఫీసు (హైవేసు),
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము, హైదరాబాదు.
రవాణా సౌకర్యములు–రోడ్లు.

ఎం. వెం. ర.
శ్రీ వెంకట రమణ, ఎండమూరి, ఎం.ఏ., బి.ఇడి., ఏ.ఇ.ఎస్.
చరిత్ర శాఖాధ్యక్షుడు, పిఠాపురం రాజా ప్రభుత్వ కళాశాల, కాకినాడ.
మత సంప్రదాయములు – బ్రాహ్మ ధర్మము.

ఎస్. ఆర్. ర.
శ్రీ రఘునాథాచార్య, ఎస్. ఆర్., ఎం. ఏ., ఎల్.టి.,
సి-51, రంగా నగర్, శ్రీరంగం.
జంతు సముదాయములు.

ఎస్. ఎం. వే. నా.
శ్రీ వేణుగోపాలనాయుడు, ఎస్. ఎం.
డిప్యూటీ డైరెక్టర్ ఆఫ్ పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్,
గవర్నమెంటు ఆఫ్ ఆంధ్రప్రదేశ్, హైదరాబాదు.
విద్యావిధానము (1958 – 60).

ఎస్. వి. కె. మూర్తి.
శ్రీ మూర్తి, ఎస్. వి. కె.
ఉస్మానియా యూనివర్సిటీ, హైదరాబాదు.
ఉస్మానియా విశ్వవిద్యాలయము.

ఎస్. ఎ. ఖా.
జనాబ్ ఖాదిర్, ఎస్. ఎ., బి.ఎస్‌సి. (మద్రాసు); బి.ఎస్‌సి. ఆనర్సు (మాంచెస్టరు); ఎం.ఐ.ఇ. (ఇండియా); ఎం.ఏ.ఐ.ఇ.ఇ. (అమెరికా).
చీఫ్ ఇంజనీర్ (ఎలెక్ట్రిసిటీ) ఆంధ్రప్రదేశ్, హైదరాబాదు.
విద్యుచ్ఛక్తి.

ఏ. రా. మూ.
శ్రీ రామచంద్రమూర్తి, ఏలేశ్వరపు, ఎం. ఎ., సి. ఎ. ఐ. ఐ. బి.,
ఇనస్పెక్టింగ్ ఆఫీసర్, బ్యాంక్ ఆఫ్ ఇండియా, బొంబాయి.
ద్రవ్యము – బ్యాంకింగు.

ఓ. న.
శ్రీ నరసింహమూర్తి, ఓరుగంటి, బి.ఎస్.సి., బి.ఎల్.,
వ్యవహర్త, తెలుగుభాషా సమితి, హైదరాబాదు.
గోవిందరాజాచారి, వింజమూరి.

ఓ. రా.
డాక్టరు రామచంద్రయ్య, ఓరుగంటి, ఎం.ఏ., పిహెచ్.డి.,
'చరిత్ర – రాజనీతి' శాఖాధ్యక్షులు, ఆంధ్రవిశ్వ విద్యాలయము, వాల్తేరు.
అజంటా; ఆంధ్రులు.

కం. అ. — కీ॥ శే॥ అనంతం, కందుకూరి,
హరిజనోద్యమము.

కం. ఉ. — శ్రీ ఉమాశంకరరావు, కందుకూరి, బి.ఏ. (ఆనర్సు),
53, శరవణ పెరుమాళ్ వీధి, పురశవాకం, మద్రాసు.
కొండాపురము; మెకెన్జీ, కల్నల్ కాలిన్.

కం. రా. — శ్రీ రామశాస్త్రి, కంబంపాటి ('తారకం')
ఆర్ఫనేజ్ ప్రెమిసెస్, కాకినాడ, తూర్పు గోదావరి జిల్లా.
వెంకటరత్నం నాయుడు, రఘుపతి.

క. ల. శా. — శ్రీ లక్ష్మణశాస్త్రి, కప్పగంతుల, ఎం.ఏ., శిరోమణి,
స్పెషల్ ఆఫీసర్ సంస్కృతము, ఆఫీస్ ఆఫ్ ది డి. పి. ఐ., హైదరాబాదు.
మహబూబు నగరము జిల్లా (కొంత భాగము); కరీంనగరము జిల్లా (కొంత భాగము);
వరంగల్లుజిల్లా (కొంత భాగము); నల్గొండ జిల్లా (కొంత భాగము).

క. వ. — శ్రీమతి వరలక్ష్మమ్మ, కనుపర్తి,
బాపట్ల, గుంటూరు జిల్లా.
నోములు; మహిళోద్యమము (ఆంధ్రదేశము).

క. వెం. రా. — శ్రీ వెంకటరావు, కమలాకర, బి.ఏ.,
మచిలీపట్టణము.
కృష్ణరావు, ముట్నూరి.

క. స. నా. — శ్రీ సత్యనారాయణ, కప్పగంతుల,
సహాయ సంపాదకులు, 'ది మెయిల్', వీరభద్రన్ వీధి, మద్రాసు
పరశురామపాత్రో, అన్నెము; మునుస్వామి నాయుడు, బొల్లిని; రామారాయణం
పానుగంటి.

క. సు. రా. — శ్రీ సుబ్బారావు, కల్లూరి, ఎం. ఎల్, ఏ.,
హిందూపురము, అనంతపురము జిల్లా.
లేపాక్షి.

కా. వెం. — శ్రీ వెంకటేశ్వరరావు, కాటూరి,
కాటూరు, కృష్ణా జిల్లా, ఆంధ్రప్రదేశ్.
అనంతామాత్యుడు; తిరుపతి వేంకటకవులు; బాపిరాజు, అడవి.

కుం. ఈ. ద. — శ్రీ ఈశ్వరదత్తు, కుందూరి, బి.ఏ.,
డిస్ట్రిక్టు ఇన్స్పెక్టర్ ఆఫ్ అకౌంట్సు (రిటైర్డు),
చావలివారి వీధి, గాంధీనగరం, కాకినాడ.
వీరభద్రరావు, చిలుకూరి.

కుం. రా. — శ్రీ కున్హాన్ రాజా, సి., ఎం.ఏ., డి.ఫిల్. (ఆగ్జన్),
ప్రొఫెసర్, సంస్కృత శాఖాధ్యక్షులు, ఆంధ్ర విశ్వవిద్యాలయము, వాల్తేరు.
కుమారిలభట్టు.

కృ. రా. పై. — శ్రీ పైడయ్య, కళ్లా రామస్వామి,
ఉషర్, డిస్ట్రిక్టు కోర్టు, గోస్ బెల్లీ, మారిషస్.
మారిషస్‌దీవి – ఆంధ్రులు.

కె. అర్. వెం. రా. — శ్రీ వెంకటరామన్, కె, అర్., పురావృత్తజ్యోతి,
డైరెక్టర్ ఆఫ్ పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్ (రిటైర్డు), పుదుకోట.
'రేబాలహోమ్', 8, వళియమ్మాళ్ రోడ్డు, మద్రాసు.
పుదుకోట ఆంధ్రులు.

కె. ఏ. నీ. శా. — పద్మభూషణ నీలకంఠశాస్త్రి, కె. ఏ., ఎం. ఏ.,
డైరెక్టర్, ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ట్రెడిషనల్ కల్చర్స్,
విశ్వ విద్యాలయ భవనములు, మద్రాసు.
తంజావూరు నాయక రాజులు; మధుర నాయక రాజులు.

కె. గో. కృ. — శ్రీ గోపాలకృష్ణరావు, కోవూరు, ఎం. ఏ.,
ఆంధ్రోపన్యాసకులు, నిజాం కళాశాల, బషీర్‌బాగ్ రోడ్డు,
హైదరాబాదు, ఆంధ్ర ప్రదేశ్.
భాగ్యమతి.

కె. భూ. — శ్రీ భూషణం, కె. బి.ఏ., బి.ఎస్‌సి. (అగ్రికల్చర్).
డిప్యూటీ మార్కెటింగు ఆఫీసర్, 3-4-874 బరకత్‌పురా, హైదరాబాదు.
వ్యవసాయము.

కే. న. — శ్రీ నరసింహశాస్త్రి, కేశవపంతుల, శిరోమణి, విద్వాన్,
ప్రోగ్రామ్ ఎగ్జెక్యూటివ్, 'ఆకాశవాణి', మద్రాసు.
సంస్థానములు (తెలంగానా) – సాహిత్యసేవ.

కొం. వీ. రా. — శ్రీ వీర రాఘవాచార్యులు, కొండూరు, దర్శనాచార్య,
తెలుగు లెక్చరర్, తెనాలి కాలేజి,
కార్యదర్శి, ఆంధ్ర శిల్పకళా పరిషత్తు, తెనాలి, గుంటూరు జిల్లా.
ఆంజనేయశాస్త్రి, యలవర్తి; ఈశ్వరమ్మ; నిరంజనశాస్త్రి, వడ్డెపాటి; వీరబ్రహ్మ యోగి; సిద్దప్ప.

కొ. జో. శ. — శ్రీ జోగయ్యా శర్మ, కొమ్మనమంచి, ఉభయభాషా ప్రవీణ, బి. ఏ.,
పండిట్ అసిస్టెంట్, ఆంధ్ర విశ్వవిద్యాలయము, వాల్తేరు.
ఆదినారాయణశాస్త్రి, పంచాగ్నుల; తిమ్మకవి, కూచిమంచి; దిఙ్నాగాచార్యుడు; నారాయణరావు, చిలుకూరి; పాపయారాధ్యులు, ములుగు; పార్వతీశము, ఓలేటి; పార్వతీశ్వరశాస్త్రి, మండపాక; విశ్వనాథశర్మ, మల్లాది; వీరరాజు, నడకుదుటి; వెంకటపతిరాజు, భూపతిరాజు; వెంకటసాంఖ్యాయనశర్మ, ఆచంట; వెంకట సూర్య ప్రసాదరావు, త్రిపురాన; వేమన; సూర్యనారాయణ తీర్థులు, పురాణం.

కొ. ల. రా. — డాక్టరు లక్ష్మణరావు, కొమర్రాజు,
మెంబరు, సెంట్రల్ వాటర్ పవర్ కమీషన్, న్యూఢిల్లీ,
జలశక్తి, రక్షణ వినియోగములు.

కో. గా. — శ్రీ రామకృష్ణయ్య, కోరాడ, ఎం.ఏ.,
రీడర్ (రిటైర్డు), మద్రాసు విశ్వవిద్యాలయము,
33, సింగరాచారి వీధి, మద్రాసు.
నన్నిచోడుడు.

క్రొ. లిం. రా. — శ్రీ లింగరాజు, క్రొవ్విడి,
దానివాయిపేట, రాజమండ్రి.
సుబ్రహ్మణ్యం, బ్రహ్మజోస్యుల.

క్రొ. వీ. — డాక్టరు వీరభద్రరావు, క్రొత్తపల్లి, ఎం.ఏ., పి హెచ్.డి.,
తెలుగు భాషోపన్యాసకులు, ఢిల్లీ యూనివర్సిటీ, న్యూఢిల్లీ.
ఏకాంకిక ; చార్లెస్ ఫిలిప్ బ్రౌన్.

గ. పా. దే. — శ్రీ పాపయ్య లింగదేవర, గరికిపర్తి,
382/17, ఇంగ్లీషుపాలెం, మచిలీపట్టణము.
కోటయ్యదేవర, గరికిపర్తి.

గ. వెం. శే. శా. — శ్రీ వెంకటశేషశాస్త్రి, గడియారం,
తెలుగు పండితులు, మునిసిపల్ హైస్కూలు, ప్రొద్దుటూరు, కడపజిల్లా.
పోతన.

గ. సు. — శ్రీ సుబ్బరామయ్య, గన్నవరపు, విద్వాన్
పూర్వ సంపాదకులు, భారతి ; సహాయ సంగ్రాహకులు, 'తెలుగు సంస్కృతి-౧'
సంపుటము, తెలుగు భాషా సమితి, మద్రాసు-5.
అగస్త్యుడు ; కాటన్, సర్ ఆర్థర్ థామస్ ; కుమారస్వామిరాజా, పూసపాటి ; కృష్ణశాస్త్రి, హొసకోట ; గోపాలాచార్యులు, దీవి ; త్యాగరాయశెట్టి, పిట్టి ; ప్రకాశదాసు, నిట్టల ; బాలసూర్య ప్రసాదరావు, కందుకూరి ; రామకృష్ణకవి, మానవల్లి ; రామకృష్ణమాచార్యులు, ధర్మవరం ; రామదాసు, ఎడ్ల ; లక్ష్మీనర్సు శెట్టి, గాజుల ; లక్ష్మీనారాయణ, ఉన్నవ ; లీలావతీ విజయము ; వెంకటఅప్పారావు, గుండవరము ; వెంకటరెడ్డి నాయుడు, కూర్మా ; వ్యాసమూర్తిశాస్త్రి, ఆకొండి ; సాంబమూర్తి, బులుసు ; సీతారామరాజు, అల్లూరి ; హనుమంతరావు, కోవల్లి ; హనుమచ్ఛాస్త్రి, గాజులవల్లి.

గి. వెం. సీ. — డాక్టరు వెంకట సీతాపతి, గిడుగు, బి.ఏ., ఎల్.టి. డి.లిట్.,
ప్రధాన సంగ్రాహకుడు (రిటైర్డు), తెలుగుభాషా సమితి, హైదరాబాదు
దేవులపల్లి సోదరకవులు ; లక్ష్మీనరసమాంబ, పులుగుర్తి ; వెంకటరామమూర్తి, గిడుగు ; సీతమ్మ, కొటికలపూడి.

గుం. ల. కాం. — శ్రీ లక్ష్మీకాంతం, గుంటూరు,
యలమంచిలి, విశాఖపట్టణము జిల్లా.
గణపతిశాస్త్రి, అయ్యలసోమయాజుల.

గు. వెం. రా. — శ్రీ వెంటరావు, గుర్తి, ఎం.ఏ., ఎల్.ఎల్.బి.,
ప్రొఫెసర్ (రిటైర్డు), హిస్టరీ డిపార్టుమెంటు, ఆంధ్ర విశ్వవిద్యాలయము,
మహారాణి పేట, విశాఖపట్టణము.
నరసింహశాస్త్రి, మానవల్లి ; భట్టోజీ దీక్షితులు ; భైరవశాస్త్రి, హరి ; శేషకృష్ణశాస్త్రి ; శేషశాస్త్రి, నిట్టల ; సోమయ్యశాస్త్రి, గొర్తి.

గు. వెం. సు. — శ్రీ వెంకట సుబ్బరామయ్య, గుర్రం, ఎం.ఏ., (ఆనర్సు)
ప్రిన్సిపాలు, నిడుబ్రోలు కాలేజి, నిడుబ్రోలు, గుంటూరు జిల్లా.
రామకృష్ణయ్య, పూండ్ల; వెంకటరాయశాస్త్రి, వేదము; వెంకటాచలమయ్య, వేదము.

గు. వేం. సు. — శ్రీ వేంకట సుబ్బారావు, గుమ్మిడదల
గోష్ఠి కార్యాలయము, అమలాపురము.
గోపాలకృష్ణయ్య, దుగ్గిరాల.

గొ. వెం. సు. — శ్రీ వెంకటసుబ్బయ్య, గొర్రెపాటి,
ఘంటసాల (పోస్టు), కృష్ణాజిల్లా.
క్రీడలు–కొక్కాట; కోతికొమ్మచ్చి; గోళీలాట; చెండాట; దొంగాట.

చ. న. — శ్రీ నరసింహం, చల్లా, ఎం. ఏ., బి. యల్., ఐ. ఏ. ఎస్.,
సెక్రటరీ, ప్లానింగ్ అండ్ డెవలప్ మెంట్ డిపార్ట్ మెంటు, గవర్నమెంటు ఆఫ్ ఆంధ్రప్రదేశ్.
ఆంధ్రప్రదేశ్ – అభివృద్ధి ప్రణాళికలు.

చ. పి. శా. — శ్రీ పిచ్చయ్యశాస్త్రి, చల్లా, శతావధాని,
తెలుగు పండితులు, బోర్డు హైస్కూలు, పొన్నూరు, గుంటూరు జిల్లా.
రామసుబ్బయ్య, వారణాసి.

చిం. రా. — శ్రీ రామకృష్ణ చింతగుంట, బి.ఏ., బి.ఎల్. అడ్వొకేటు.
'రాఘవ నిలయము' 3-6-219, హిమాయత్ నగర్, హైదరాబాదు.
రాఘవరావు, చింతగుంట.

చి. వెం. చ. — శ్రీ వెంకటేశ్వరశర్మ, చిలకలపూడి, గాయకరత్న, విద్వాన్.
తాడంకి వీధి, గవర్నరుపేట, విజయవాడ,
దక్షిణామూర్తిశాస్త్రి, సుసర్ల; రామకృష్ణయ్య, పారువల్లి.

చీ. శే. రా. — శ్రీ శేషగిరిరావు, చీమకుర్తి,
సంగ్రాహకుడు, తెలుగుభాషా సమితి, 3-1-299 నింబోలి అడ్డ, హైదరాబాదు.
యజ్ఞేశ్వర చింతామణి, చిర్రావూరి; రంగనాథ మొదలియారు, ఆర్కాటు; రామచంద్రరావు, మోచర్ల; రామదాసు, వేమవరపు; రామలింగారెడ్డి, కట్టమంచి; విక్రమదేవవర్మ; వెంకటజోగయ్య, వరాహగిరి; శ్రీరాములు, దాసు; సత్యలింగ నాయకర్, మల్లాది; శ్రీకాకుళము జిల్లా; విశాఖపట్టణము జిల్లా; తూర్పు గోదావరి జిల్లా; పశ్చిమగోదావరి జిల్లా; కృష్ణా జిల్లా; గుంటూరు జిల్లా; నెల్లూరు జిల్లా; చిత్తూరు జిల్లా; కడప జిల్లా; అనంతపురము జిల్లా; కర్నూలు జిల్లా.

జ. పు. — శ్రీ పురుషోత్తము, జటావల్లభుల, ఎం. ఏ., ఆర్ష విద్యాభూషణ,
సంస్కృతోపన్యాసకులు, ఎస్. ఆర్. ఆర్. అండ్ సి.వి. ఆర్. ప్రభుత్వ కళాశాల, విజయవాడ.
కాశీనాథశాస్త్రి, పేరి; కృష్ణశాస్త్రి, అద్దేపల్లి; చిలుకూరి చతుష్టయము; దక్షిణామూర్తి శాస్త్రి, పుల్య; పాపయ్యశాస్త్రి, బులుసు; బొమ్మగంటి పట్కము; బ్రహ్మయ్య శాస్త్రి, కాశీభట్ట; రామకృష్ణచయనులు, మల్లాది; రామచంద్రశాస్త్రి, కోరాడ;

రామమూర్తిశాస్త్రి, ఆదిభట్ల; రామశాస్త్రి, శ్రీపాద; లక్ష్మీనరసింహశాస్త్రి, శ్రీపాద; విశ్వనాథశాస్త్రి, దండిభట్ల; వెంకట రంగాచార్యులు, పరవస్తు; సంగమేశ్వరశాస్త్రి, గుమ్మలూరి; సర్వమంగళేశ్వరశాస్త్రి, నడిమింటి; సుబ్రహ్మణ్యశాస్త్రి, నోరి; హరిశాస్త్రి, భాగవతుల; ప్రాచ్యవిద్య.

జ. మా. శ. — శ్రీ మాధవరామశర్మ, జమ్మలమడక, మహోపాధ్యాయ, దర్శనాచార్య, లాక్షణిక శిరోమణి.
ఉపన్యాసకులు ఆంధ్ర క్రిస్టియన్ కాలేజి, గుంటూరు.
అన్నంభట్టు; జగన్నాథ పండితరాయలు; భోగనాథుడు; రామరాయకవి; బెల్లంకొండ; విద్యారణ్యుడు; సాయణాచార్యుడు.

జ. రు. శా. (జె. రు. శా.) — శ్రీ రుక్మిణీనాథశాస్త్రి, జలసూత్రం,
స్టాఫ్ ఆర్టిస్, 'ఆకాశవాణి', మద్రాసు.
నాగేశ్వరరావు, కాశీనాథుని; వెంకటసుబ్బారావు, నండూరి.

జ. సు. — శ్రీ సుబ్బారావు, జయంతి,
సభ్యులు, కవితా సమితి; మహాత్మాగాంధి ఖద్దరు సంస్థ, అనకాపల్లి.
రామచంద్రకవి, మారేపల్లి.

జి. ఎస్. ప్ర. రా. — శ్రీ ప్రకాశరావు, జి. ఎస్.,
డిప్యూటీ డైరెక్టర్ ఆఫ్ పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్ (రిటైర్డ్), హైదరాబాదు.
విద్యావిధానము (1813-1958) - తెలంగానా.

జి. న. — శ్రీ చంద్రశేఖరం, జి. ఎం. ఏ.,
రిజిస్ట్రారు, కో-ఆపరేటివ్ సొసైటీస్, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము హైదరాబాదు.
సహకారము.

జి. నా. రె. — శ్రీ నారాయణస్వామి రెడ్డి, జి., ఎం.ఏ., ఎం.లిట్.,
తెలుగు శాఖ, శ్రీ వెంకటేశ్వర విశ్వ విద్యాలయము. తిరుపతి.
చిన్నయసూరి, పరవస్తు.

జె. వి. సో. — శ్రీ సోమయాజులు, జె. వి., ఎం. ఏ.,
గోపతి నారాయణచెట్టి రోడ్డు, త్యాగరాయనగర్, మద్రాసు - 17.
పారిశ్రామికాభ్యుదయము; వర్తక - వ్యాపారములు.

జె. వెం. — డాక్టరు వెంకటేశ్వర్లు, జె. ఎం. ఏ., డి. ఎస్‌సి.,
ప్రొఫెసర్, హెడ్ ఆఫ్ ది డిపార్ట్‌మెంటు ఆఫ్ బాటనీ,
ఆంధ్రాయూనివర్సిటీ, వాల్తేరు.
ఉద్భిజ్జములు.

టి. యన్. రా. — శ్రీ రామచంద్రన్, టి. యన్., ఎం.ఏ., ఎఫ్.ఎ.యస్.,
జాయింటు డైరెక్టర్ జనరల్ (రిటైర్డు), డిపార్టుమెంటు ఆఫ్ ఆర్కియాలజీ;
స్పెషల్ ఆఫీసర్ ఆన్ డ్యూటీ, డిపార్టుమెంటు ఆఫ్ ఆర్కియాలజీ;
నాగార్జునకొండ ఎక్స్‌కవేషన్ ప్రాజెక్టు, నాగార్జునకొండ, గుంటూరు జిల్లా.
నాగార్జునకొండ (కొంతభాగము); సాలిహుండము.

డి. వి. సు. రె. — డాక్టరు సుబ్బారెడ్డి, డి. వి., ఎం. ఎస్‌సి.; ఎం. బి., బి. యస్.,
3-4-542, నారాయణగూడా, హైదరాబాదు.
వైద్య విద్య; ఆరోగ్యము-వైద్యము; ఆధునిక వైద్యము; ఆరోగ్య రక్షణ – వ్యాధి నిరోధము.

తా. ధ. రా. — శ్రీ ధర్మారావు, తాపీ, బి.ఏ.,
'చిత్రకూటం' నెం. 17, కాచిగూడా స్టేషన్ రోడ్డు, హైదరాబాదు, ఆంధ్రప్రదేశ్.
రామబ్రహ్మం, గూడవల్లి; రామస్వామి చౌదరి, త్రిపురనేని; వెంకటపతి, చేమకూర.

తి. కో. రా. — శ్రీ కోదండరామయ్యా, తిమ్మావజ్ఝల, బి.ఓ.ఎల్. (ఆనర్సు),
తెలుగు శాఖాధ్యక్షులు, సర్ త్యాగరాయ కళాశాల, వాషర్‌మన్‌పేట, మద్రాసు.
అన్నమయ్యా; చిన తిరుమలయ్యా, తాళ్ళపాక; చిన తిరువెంగళనాథుడు, తాళ్ళపాకము; తాళ్ళపాకము కవులు; తిరువెంగళప్ప, తాళ్ళపాకము; నరసింగన్న, తాళ్ళపాక; పెద తిరుమలయ్యా, తాళ్లపాక; పెద తిరువెంగళ నాథుడు.

తి. రా. — శ్రీ రామచంద్రాచార్య, తిరుమల,
సబ్ ఎడిటర్, ఆంధ్రప్రభ, విజయవాడ.
పండుగలు.

తూ. దో. — శ్రీ ధోణప్ప, తూమాటి, ఎం. ఏ.,
చీఫ్ అసిస్టెంటు, తెలుగు ఎటిమలాజికల్ డిక్షనరీ స్కీము,
ఆంధ్ర విశ్వ విద్యాలయము, వాల్తేరు.
రాజశేఖర శతావధాని, దుర్భాక.

తె. వి. — శ్రీ విశ్వనాథం, తెన్నేటి, ఎం.ఏ., బి.యల్.,
విశాఖపట్టణం.
నరసింహశర్మ, బయ్యా.

ది. వేం. — డాక్టరు వేంకటావధాని, దివాకర్ల, ఎం.ఏ., పిహెచ్.డి.,
రీడరు, ఉస్మానియా విశ్వ విద్యాలయము, హైదరాబాదు.
వీరేశలింగం, కందుకూరి.

ది. వేం. శి. — శ్రీ వేంకట శివరావు, దిగవల్లి, బి. ఏ., బి. ఎల్.,
అడ్వొకేటు, విజయవాడ – 2.
కరవులు.

దు. వెం. శా. — శ్రీ వెంకటరమణశాస్త్రి, దుప్పూరి, విద్వాన్,
లెక్చరర్, తెలుగు డిపార్టుమెంటు, ఆంధ్ర విశ్వవిద్యాలయము, వాల్తేరు.
వ్యాకరణములు; సుబ్బరాయశాస్త్రి, తాతా.

దే. రం. — శ్రీ రంగయ్యా, దేశభట్ల,
కార్యాలయ కార్యదర్శి, భారతీయ ఆదిమజాతి సేవక సంఘము,
కింగ్స్‌వే, ఢిల్లీ.
ఆదివాసులు.

దే. రా. రా. శ్రీ రామానుజరావు, దేవులపల్లి, బి.ఏ., బి.ఎల్.,
కార్యదర్శి, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాదు.
సాంస్కృతిక పునరుజ్జీవనము (తెలంగాణా)

ద్వా. పా. శ్రీ పార్థసారథి, యస్. సి., శ్రీమతి ద్వారకా పార్థసారథి,
ప్రిన్సిపాల్స్, మద్రాసు సంగీత కళాశాల, గోపాలపురము, మద్రాసు-6.
కూవనసామయ్య; గిరిరాజకవి; గురుమూర్తిశాస్త్రి, పైడాల; గోవిందమంత్రి, పోలూరి; గోవిందసామయ్య; చెంగల్వరాయశాస్త్రి, చెయ్యూరు; వీరభద్రయ్య; శీనయ్య, ఘనం; శేషయ్య, పల్లవి; శ్యామశాస్త్రి; సింగరాచార్యులు, తచ్చూరు; సుబ్బరాయశాస్త్రి.

న. జ. శా. శ్రీ జనార్ధనశాస్త్రి, నరసింహదేవర,
ఆలమూరు, తూర్పు గోదావరి జిల్లా.
సత్యనారాయణ, నరసింహదేవర.

న. రా. శ్రీ రామకృష్ణ, నటరాజ, బి.ఏ.,
డైరెక్టర్ నృత్య నికేతనము, హైదరాబాదు,
కచ్చేరీ నృత్యకళ; కూచిపూడి నాట్యము; నట్టువమేళములు.

ని. వెం. రా. శ్రీ వెంకటరావు, నిడుదవోలు, ఎం.ఏ.,
తెలుగు శాఖాధ్యక్షులు, మద్రాసు విశ్వవిద్యాలయము, మద్రాసు-5.
చినపార్థసారథినాయుడు, ఆవుల; ద్విపద వాఙ్మయము; పండితత్రయము; పట్టాభిరామశాస్త్రి, వేదము; రామస్వామిశాస్త్రులు, వావిళ్ళ; వాసుదేవశాస్త్రి, వావిలాల; వెంకటకవి, గోపీనాథం; వెంకటరత్నం, కొక్కొండ; వెంకటరామ విద్యానందనాథుడు, కనుపర్తి; వెంకటేశ్వరశాస్త్రి, వావిళ్ళ; శేషాచార్యులు, గట్టుపల్లి; శ్రీనివాసరావు, కోలాచలము; సంస్థానములు (ఆంధ్ర)-సాహిత్యసేవ; సుందరరామశాస్త్రి, చదలవాడ; సుబ్బారావు, వావిలికొలను; సోమనాథరావు, ఆదిపూడి.

నీ. శే. శ్రీ శేషయ్య, నీలంరాజు వేంకట,
సంపాదకులు, ఆంధ్రప్రభ, విజయవాడ,
ప్రకాశం, టంగుటూరి; శేషగిరిరావు, చల్లా.

నే. వెం. ర. డాక్టరు వేంకట రమణయ్య, నేలటూరి, ఎం.ఏ., పిహెచ్.డి.,
రీసెర్చి ఆఫీసర్, హిస్టరీ ఆఫ్ ఫ్రీడమ్ స్ట్రగుల్ ఇన్ ఆంధ్రప్రదేశ్,
10. రామన్ వీధి త్యాగరాయనగర్, మద్రాసు.
అనంతరాజు, మట్లి; అనంతా (ఆనందా)చార్యులు, వనప్పాకం; అమరము; ఆనెగొంది; కమ్మ; కుమార అనంతరాజు, మట్లి; కుమార కంపరాయలు; దక్కనీలు-విదేశీ ముస్లిములు; ముదిగొండ చాళుక్యులు; రామకృష్ణమాచార్యులు, కొమండూరి; రామరాయలు, ఆరవీటి; వేములవాడ చాళుక్యులు

నో. న. శా. శ్రీ నరసింహశాస్త్రి, నోరి బి.ఏ., బి.ఎల్., కవిసామ్రాట్,
రేపల్లె, గుంటూరు జిల్లా.
ఎర్రాప్రెగడ.

పం. శ. శ్రీ శరభారాధ్యులు, పండితారాధ్యుల,
సంపాదకులు, శైవతత్త్వ ప్రకాశిక, విజయవాడ.
నాగలింగశాస్త్రి, ముదిగొండ.

ప. రా. స్వా. — కీ॥ శే॥ వెంకట రామానుజస్వామి, పరవస్తు, ఎం.ఏ.,

అక్కయసూరి (అక్షయశాస్త్రి), మోటగుండం; అప్పకొండాచార్యులు, కందాడై; అప్పయాచార్యుడు, బొమ్మకంటి; అహోబల నృసింహసూరి; యజ్ఞేశ్వరుడు; యల్లయార్యుడు, కంచం; రంగాచార్యులు, కపిస్థలం; లక్ష్మీధరుడు, చెరుకూరు; లక్ష్మీనారాయణ, భండారు; విరూపాక్షరాయలు; విశ్వేశ్వరుడు; వెంకటశాస్త్రి, ఆనివిళ్ళ; శివశంకరశాస్త్రి, కస్తూరి; శ్రీనివాసాచార్యులు, వరవస్తు; శ్రీరామశాస్త్రి, వేమూరి.

పా. నా. — శ్రీ నాగభూషణము, పాతూరి,

కార్యదర్శి, ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము, పటమట (పోస్టు), కృష్ణాజిల్లా.

గ్రంథాలయోద్యమము.

పా. ప. — శ్రీ పద్మరాజు, పాలగుమ్మి, ఎం.ఎస్‌సి.,

15, న్యూ బోగ్ రోడ్, మద్రాసు.

ప్రకాశ్, రఘుపతి; బలరామయ్య, ఘంటసాల; లక్ష్మీనారాయణస్వామి, మూలా; వెంకటదాసు, పినపాల; వెంకయ్య, రఘుపతి; 'సినిమా'.

పిం. ల. — శ్రీ లక్ష్మీకాంతం, పింగళి, ఎం.ఏ.,

ప్రొడ్యూసర్, స్పోకెన్ వర్డ్, 'ఆకాశవాణి' విజయవాడ.

రీడర్, తెలుగు డిపార్టుమెంటు (రిటైర్డు), ఆంధ్ర విశ్వవిద్యాలయము, వాల్తేరు.

తిక్కన, కొట్టరువు; పెద్దన, అల్లసాని; సూరన, పింగళి.

పి. వి. శా. — శ్రీ విశ్వేశ్వరశాస్త్రి, పిశుపాటి, విద్వాన్,

ఆంధ్ర భాషాధ్యాపకుడు, శ్రీ వెంకటగిరిరాజా కళాశాల, నెల్లూరు.

చిదంబరశాస్త్రి, పిశుపాటి.

పి. వెం. — శ్రీ వెంకటాచలం, పి.

తెలుగు పండితులు, సాయిబాబా హైస్కూలు, అనంతపురము

వెంకటరావు, సి. ఎన్.

పి. వెం. హ. — శ్రీ వెంకట హనుమంతరావు పిల్లలమర్రి, ఎం.ఏ., సాహిత్యాచార్య,

తెలుగు లెక్చరర్, హిందూ కాలేజి, శారదాపీఠం, పట్టాభిపురం, గుంటూరు.

బుచ్చి సుందరరామశాస్త్రి, మాధవపెద్ది; రామిరెడ్డి, దువ్వూరి; వెంకట నరసయ్య, వేటుకూరి.

పి. స.; బి. అ. రా. — డాక్టరు సత్యనారాయణ, పి.,

కెమిస్ట్, ఫెర్టిలైజర్ అసోసియేషన్ ఆఫ్ ఇండియా, న్యూ ఢిల్లీ;

శ్రీ అప్పాజీరావు, బి.,

అగ్రికల్చరల్ కెమిస్ట్, రీజినల్ రిసెర్చ్ సెంటర్, లాలీరోడ్డు, కోయంబత్తూరు-3.

నేలలు.

పి. సాం. — శ్రీ సాంబమూర్తి, పి. బి.ఏ., బి.ఎల్.,

సంగీత శాఖాధ్యక్షులు, మద్రాసు విశ్వవిద్యాలయము, మద్రాసు.

వెంకట రమణదాసు, వీణ.

పు. అ. — శ్రీ అప్పలస్వామి, పురిపండా, మహాకవి,
అధ్యక్షులు, కవితా సమితి, విశాఖపట్టణము.
పద్మాకరుడు.

పు. నా. — శ్రీ నారాయణాచార్యులు, పుట్టపర్తి, సరస్వతీపుత్ర, మహాకవి,
రామకృష్ణ హైస్కూలు, కడప.
తిమ్మన్న, నంది.

పు. వెం. — శ్రీ వెంకటేశ్వర్లు, పులిపాటి,
శ్రీ రాయల్ నట సభ, తెనాలి, గుంటూరు జిల్లా.
వెంకటరామయ్య, మాధవపెద్ది.

పో. సు. శా. — డాక్టరు సుబ్రహ్మణ్యశాస్త్రి, పోతుకూచి, ఎం.ఏ., ఎం.లిట్., పిహెచ్.డి.,
ఇంగ్లీషు ప్రొఫెసర్, సాగర్ యూనివర్సిటీ, సాగర్, మధ్యప్రదేశ్.
ఆర్యదేవుడు; నాగార్జునాచార్యుడు.

ప్ర. న. — శ్రీ నరసింహశాస్త్రి, ప్రయాగ,
ప్రొడ్యూసర్ రూరల్ ప్రోగ్రామ్స్, 'ఆకాశవాణి', విజయవాడ.
వెంకటస్వామి.

ప్ర. భ. — శ్రీ భయంకరాచార్యులు, ప్రతివాది,
కాకినాడ, తూర్పు గోదావరి జిల్లా.
రాఘవాచార్యులు, ప్రతివాది భయంకర.

బం. క. రా. — శ్రీ కనక లింగేశ్వరరావు, బందా బి.ఏ., బి.ఎల్., డిప్., హెచ్.ఏ.; నాట్యాచార్య
డ్రామా ప్రొడ్యూసర్, 'ఆకాశవాణి', విజయవాడ.
నాటక రంగము.

బ. స. — శ్రీ సత్యనారాయణ, బలిజేపల్లి, 'గానకోకిల'
స్టోన్ హౌస్ పేట, నెల్లూరు.
లక్ష్మీకాంతం, బలిజేపల్లి.

బా. ర. — శ్రీ రజనీకాంతరావు, బాలాంత్రపు, బి.ఏ., (ఆనర్సు)
ప్రోగ్రామ్ ఎగ్జిక్యూటివ్, 'ఆకాశవాణి', విజయవాడ.
నరసింహదాసు; తూము.

బి. రా. రా. — డాక్టరు రామరాజు, బిరుదురాజు, ఎం.ఏ., పిహెచ్.డి.,
రీడరు, తెలుగు శాఖ, ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు.
— గొల్లసుద్దులవారు; గౌరీశంకరవర్మ, నాంపల్లి; జంగములు; జానపదగాయకులు; దాసరులు; నరసింహారావు, వడ్లకొండ; పరకాలస్వామి, కృష్ణబ్రహ్మతంత్ర; పిచ్చుకగుంట్లు; ప్రతాపరెడ్డి, సురవరం; బవనీలు; బీరన్నలవారు; భాగ్యరెడ్డివర్మ, శివశ్రేష్ఠి; మల్లికార్జునశాస్త్రి, ఆలుకూరు; రంగారావు, రావిచెట్టు; రామదాసుకవి, తూము; రామానుజాచార్యులు, బుక్కపట్టణము; విశ్వనాథరావు, మాదిరాజు; వీరముష్టివారు;

వెంకటదత్తాత్రేయశర్మ, అడుసుపల్లి; వెంకటరామానుజాచార్యులు, శేషభట్టరు; శారదకాంద్రు; సదాశివశాస్త్రి, వెల్లాల; సింగరశాస్త్రి, అఖింతల; సుందరమ్మ, నడింపల్లి; సుబ్బాశాస్త్రి, అఖింతల.

బు. అ. — శ్రీ అణ్ణయాచార్యులు, బుక్కపట్టణము,
సంస్కృతాధ్యాపకులు (రిటైర్డు), బోర్డు హైస్కూలు,
పెనుకొండ, అనంతపురము జిల్లా.
అనంతాచార్యులు, నంద్యాల; కృష్ణమ్మ, తిరుమల బుక్కపట్టణము; నృసింహాచార్యులు, పురాణం; బుచ్చి వెంకటాచార్యులు, తిరుమల బుక్కపట్టణం; శ్రీనివాసాచార్యులు, తిరుమల బుక్కపట్టణము.

బు. వెం. ర. — శ్రీ వెంకటరణమయ్య, బులుసు, సాహిత్య విద్యాప్రవీణ, పి.ఓ.ఎల్.,
33-సింగరాచారి వీథి, ట్రిప్లికేన్, మద్రాసు.
కాటయవేమారెడ్డి; కొమరగిరిరెడ్డి (కుమారగిరిరెడ్డి); గంగాదేవి; తమ్మభూపాలుడు, పూసపాటి; తిరుమలాంబ; తుక్కాదేవి; పెదకోమటి వేమారెడ్డి; మధురవాణి; మల్లినాథసూరి, కోలచల; మాధవరాయలు, సురభి; రామభద్రాంబ; శ్రీరాములు, పొట్టి; సింగభూపాలుడు.

బూ. రా. — డాక్టరు రామకృష్ణరావు, బూరుగుల
గవర్నర్, కేరళ రాష్ట్రము, తిరువనంతపురము.
ఉర్దూ వాఙ్మయ పోషణము; బహ్మనీ-కుతుబ్‌షాహి సుల్తానులు.

బొ. శ్రీ. — శ్రీ శ్రీనివాసాచార్యులు, బొమ్మకంటి, విద్వాన్, బి.ఎ.;
సహాయ సంగ్రాహకులు, తెలుగు భాషా సమితి కార్యాలయము, వాల్తేరు.
ఆచార్యసూక్తి ముక్తావళి; ఆముక్తమాల్యద.

బో. శి. — శ్రీ శివరామకవి, బోడపాటి,
సంపాదకులు, ప్రజా పత్రిక, ఆర్యాపురం రాజమండ్రి.
సుబ్బారాయుడు, వడ్డాది.

బ్ర. బా. గం. శ. — డాక్టరు బాలగంగాధర శర్మ, బ్రహ్మజోస్యుల,
ఎం. ఎస్‌సి., డి. ఎస్‌సి., ఎఫ్. జి. హెచ్.ఎస్.; సిగ్మాక్సై
లెక్చరర్ ఇన్ జియాలజీ, ఆంధ్రా యూనివర్సిటీ, వాల్తేరు.
భూగర్భ చరిత్ర.

భా. రా. రా. — డాక్టరు రామచంద్రరావు, భావరాజు, ఎం.బి., బి.యస్.,
'శ్యామల', దానవాయిపేట, రాజమండ్రి, తూర్పు గోదావరి జిల్లా.
వెంకటకృష్ణరావు, భావరాజు.

భా. సూ. శా. — శ్రీ సూర్యనారాయణశాస్త్రి, భాగవతుల,
11, రాజాబాదర్ స్ట్రీట్, త్యాగరాయనగర్, మద్రాసు - 17.
క్రీడలు-అష్టా చెమ్మా; ఉప్పనపట్టీ; చదరంగము; చింతపిక్కలాట; చిల్లగ్ర; చెడుగుడు; పచ్చీసుపాళీ; పెద్ద అష్టాచెమ్మా; వైకుంఠపాళీ.

భో. ప. సీ. — కీ॥ శే॥ పట్టాభిసీతారామయ్య, భోగరాజు,
వెంకటరత్నం, గంజాం; సుబ్బారావు, న్యాపతి.

| | |
|---|---|
| మ. వెం. సు. శ. | శ్రీ వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రి, మద్దులపల్లి, ఉభయభాషాప్రవీణ, విద్వాన్, కావ్యతీర్థ, కవితా సామ్రాజ్యము, నంద్యాల, కర్నూలు జిల్లా.<br>శేషాద్రిశర్మ, జనమంచి. |
| మ. శ. శ. | శ్రీ శరభేశ్వరశర్మ, మల్లంపల్లి,<br>మదరాసు గవర్నమెంటు ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్స్ లైబ్రరి,<br>విశ్వ విద్యాలయ భవనములు, మద్రాసు.<br>ధూర్జటి; మల్లన్న, నంది; సింగయ్య, ఘంట; మల్లన, మాదయగారి; సోమనాథుడు, పాలకురికి. |
| మ. స. శా. | శ్రీ సత్యనారాయణశాస్త్రి, మధునాపంతుల,<br>తెలుగు పండితులు, వీరేశలింగం హైస్కూలు, రాజమండ్రి.<br>లక్ష్మీనరసింహారావు, పానుగంటి; వెంకటరామశాస్త్రి; ఓలేటి. |
| మ. సూ. ప్ర. | శ్రీ సూర్యప్రకాశరావు, మ. ఎం. ఏ., ఎం. లిట్.,<br>లెక్చరర్ ఇన్ ఎకనమిక్స్, శ్రీ వేంకటేశ్వర యూనివర్సిటీ,<br>మారుతీనగర్, తిరుపతి.<br>రామారావు, దామెర్ల; శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము; జనసంఖ్య – వృత్తిస్థితి. |
| మ. సో. శ. | శ్రీ సోమశేఖర శర్మ, మల్లంపల్లి,<br>సంగ్రాహకులు, తెలుగు సంస్కృతి సంపుటములు, లెక్చరర్ ఇన్ ఎపిగ్రఫీ అండ్ న్యుమిస్‌మాటిక్స్, ఆంధ్రా యూనివర్సిటీ, సిరిపురం కాంపస్, వాల్తేరు.<br>అంధకరట్టము; అచ్చమాంబ, భండారు; అన్నదేవచోడుడు; అమరావతి; అమరావతీ స్తూపము–కళ; కడప నవాబులు; కరుణకుమార; కర్నూలు నవాబులు; తిమ్మరుసు; పాశ్వ; తీర్థియసూత్ర భాష్యము; దాక్షిణాత్యాంధ్రులు; దూదేకుల సాయెబులు; దేశ విభాగములు; నందన చక్రవర్తి; పైతాను; మహాలక్ష్మి పండుగలు; ముద్రణము (తెలుగు); రాయలసీమ; లిపి పరిణామము; విజ్ఞాన సర్వస్వము; వీర పురుషులు–వీర పూజ; వెంకట బొర్రయ్య, కావలి; వెంకట లక్ష్మణరావు, కొమర్రాజు; ధర్మపురి; ఉప్పెనలు; తంతి – తపాలా. |
| మా. వెం. రం. | శ్రీ వెంకటరంగయ్య, మామిడిపూడి, ఎం. ఏ.,<br>ప్రొఫెసర్ (రిటైర్డు), ఆంధ్ర – బొంబాయి విశ్వవిద్యాలయములు.<br>80, మారేడుపల్లి, సికింద్రాబాదు, (ఆంధ్రప్రదేశ్).<br>కృష్ణస్వామయ్య, అల్లాడి; పేరరాజు, కృత్తివెంటి; వెంకటకృష్ణారావు, కొచ్చెర్లకోట; వెంకటరంగయ్య, ఒంగోలు; సాంస్కృతిక పునరుజ్జీవనము (ఆంధ్ర); సుబ్బకృష్ణరావు, ఆమంచర్ల; రాష్ట్ర పరిపాలనా విధానము. |
| మి. రా. మూ.<br>(మి. రా. కృ.) | శ్రీ రాధాకృష్ణమూర్తి, మిక్కిలినేని,<br>సభ్యులు, ఆంధ్ర ప్రదేశ్ సంగీత, నాటక ఎకాడమీ,<br>18, రాజాబాదర్ వీథి, త్యాగరాయనగర్, మద్రాసు.<br>గొల్లకలాప ప్రదర్శనము; గొల్లకలాపము; గొల్లవేషవీథి భాగవతులు; గోవిందరావు, వనారస; లక్ష్మీనారాయణ, వేదాంతం; లీలావతి (దాదినమ్మ) భాగవత ప్రదర్శనము. |
| మి. సీ. చ. | శ్రీ సీతారామచయనులు, మిర్తిపాటి,<br>లంకల గన్నవరం, తూర్పు గోదావరి జిల్లా.<br>సీతమ్మ, డొక్కా. |

| | |
|---|---|
| ము. వి. | శ్రీ విశ్వేశ్వర శాస్త్రి, ములుగు, హెచ్. పి. ఐ. ఎం.,<br>వైస్ - ప్రిన్సిపాల్ (రిటైర్డు), కాలేజ్ ఆఫ్ ఇండియన్ మెడిసన్, హైదరాబాదు.<br>దేశీయ వైద్యము - ఆయుర్వేదము. |
| మే. వ. న. | శ్రీ వరాహ నరసింహస్వామి, మేడేపల్లి, బి.ఏ.,<br>సంగ్రాహకుడు, తెలుగుభాషా సమితి శాఖా కార్యాలయము, వాల్తేరు.<br>ఆనందగజపతి; నరసింహాచార్యస్వామి, ముడుంబై; నారాయణదాసు, ఆదిభట్ల; రామమూర్తినాయుడు, కోడి; రామానుజాచార్యులు; రామానుజాచార్యులు, కిడాంబి; వెంకటరమణాచార్యులు, మేడేపల్లి; వెంకయ్య, నందిగానం; సంగమేశ్వరశాస్త్రి, తుమురాడ; సుబ్బారావు, యల్లాప్రగడ. |
| మొ. క. షా. | జనాబ్ కబీర్ షా, మొహమ్మద్, బి.ఏ., బి.ఎల్.,<br>ఇన్‌కంటాక్స్ ఆఫీసర్, కార్యదర్శి, ఉమర్ అలీషా కవి ప్రచురణలు, కాకినాడ.<br>ఉమర్ అలీషా |
| మొ. ఖా. ఖా. | జనాబ్ ఖాసిం ఖాను, మొహమ్మదు, ఎం.ఏ.,<br>ఫైదామంజిల్, నాంపల్లి, హైదరాబాదు, ఆంధ్రప్రదేశ్.<br>ఈదుల్ అజ్ హా (బక్రీద్); మొహర్రమ్; రంజాన్; షియా; సున్నీ. |
| మో. స. | పద్మశ్రీ సత్యనారాయణ, మోటూరి, ఎం. పి.<br>కార్యదర్శి, తెలుగు భాషా సమితి, అడయారు, మద్రాసు.<br>కొవలేంద్రరావు, రామినేని; రాఘవేంద్రరావు, ఈడ్పుగంటి; వల్లభాచార్యులు. |
| యం. యస్. సాం. | శ్రీ సాంబశివన్, యం. యస్., బి.ఏ., బి.కాం.,<br>కార్యదర్శి, ఆంధ్రా ఛేంబర్ ఆఫ్ కామర్సు, మద్రాసు,<br>వెంకటనారాయణస్వామి నాయుడు, బిజయతి. |
| యం. రా. బ్ర. | శ్రీ రామబ్రహ్మ, యం ,<br>బొంబే ఎడ్యుకేషనల్ సర్వీస్ (రిటైర్డు), 'మహాదేవవిలాస్',<br>16, కంకనహళ్ళి రోడ్డు, బెంగుళూరు.<br>మహాదేవశాస్త్రి, అల్లాడి. |
| యం. వెం. ర. | శ్రీ వెంకట రమణరావు, యం., బి.ఏ.,<br>సంపాదకులు, ఆల్ ఇండియా కాంగ్రెసు కమిటీ ప్రచురణలు,<br>7, జంతర్ మంతర్ రోడ్డు, న్యూఢిల్లీ.<br>నారాయణమూర్తి, న్యాయపతి; పున్నయ్య, కోటంరాజు. |
| యం. స. నా. | శ్రీ సత్యనారాయణరావు, యండమూడి, బి.ఏ., బి.ఇడి.,<br>ప్రోగ్రామ్ ఎగ్జిక్యూటివ్, 'ఆకాశవాణి', విజయవాడ.<br>నవలా వాఙ్మయము; రామమూర్తి, అశ్వథాటి; లక్ష్మీనరసింహము, చిలకమర్తి; సూర్యనారాయణమూర్తి నాయుడు, కొమ్మిరెడ్డి. |
| య. సీ. | శ్రీమతి సీతాకుమారి, యల్లాప్రగడ, విద్వాన్, ఎం. ఎల్. ఏ.,<br>1-8-7/2 సర్వోదయ కాలనీ, చిక్కడపల్లి, హైదరాబాదు, ఆంధ్రప్రదేశ్.<br>మహోద్యమము (తెలంగాణము). |

| | |
|---|---|
| యస్వీ. జో.<br>(య. జో. రా.) | డాక్టరు జోగారావు, యస్వీ., ఎం.ఏ., పిహెచ్.డి.,<br>తెలుగు లెక్చరర్, ఆంధ్ర విశ్వవిద్యాలయము, వాల్తేరు.<br>దాక్షిణాత్యాంధ్ర సాహిత్యము; యక్షగానము. |
| రా. సు. | డాక్టరు సుబ్రహ్మణ్యం, రాయప్రోలు, ఎం.ఏ., పిహెచ్.డి.,<br>సూపరింటెండెంటు, డిపార్టుమెంట్ ఆఫ్ ఆర్కియాలజీ, నాగార్జునకొండ<br>ఎక్స్కవేషన్ ప్రాజెక్టు, గుంటూరు, ఆంధ్రప్రదేశ్.<br>నాగార్జునకొండ (కొంత భాగం); హంపీ శిథిలములు. |
| వం. న. రా. | శ్రీ నరసింహారావు, వంగూరి,<br>ప్రొప్రైటర్, కమల కుటీర్, నరసాపురము. పశ్చిమ గోదావరి జిల్లా.<br>సుబ్బారావు, వంగూరి. |
| వ. చ. రా. | శ్రీ చలపతిరావు, వద్దిపర్తి,<br>వ్యవహర్త, ఆంధ్ర సాహిత్య పరిషత్తు, కాకినాడ.<br>రామయ్య, జయంతి; సూర్యారావు, కొత్తపల్లి. |
| వా. బ్ర. శా. | శ్రీ బ్రహ్మయ్యశాస్త్రి, వారణాసి<br>వడాలి, (వయా) ముదునేపల్లి, గుడివాడ తాలూకా, కృష్ణా జిల్లా.<br>ఘంటయ్యశాస్త్రి, వారణాసి. |
| వా. సో. | శ్రీ సోమయాజులు, వావిలాల, బి.ఏ ,<br>ఆంధ్రోపన్యాసకులు, ఆంధ్ర క్రిస్టియన్ కాలేజి, బ్రాడీపేట, గుంటూరు.<br>కథాసాహిత్యము. |
| విం. ల. న. | శ్రీ లక్ష్మీనరసింహరావు, వింజమూరి,<br>రామన్ వీథి, త్యాగరాయనగరము, మద్రాసు.<br>వెంకటరత్నమ్మ, వింజమూరి. |
| వి. అ. రా. | శ్రీ అప్పారావు, విస్సా, ఎం.ఏ., ఎల్.టి.,<br>ప్రిన్సిపాల్ (రిటైర్డు), ఆంధ్ర యూనివర్సిటీ కాలేజీ, అస్సాం గార్డెన్స్, వాల్తేరు.<br>వాగ్గేయకారులు; విద్యావిధానము (ప్రాచీనము); విద్యావిధానము (1818 – 1958)-ఆంధ్రప్రాంతము. |
| వి. ఎల్. ఎస్. ప్ర. | డాక్టరు ప్రకాశరావు, వి. ఎల్. ఎస్., ఎం. ఏ., పిహెచ్. డి.,<br>ఇండియన్ స్టేటిస్టికల్ ఇన్స్టిట్యూట్, రీజినల్ సర్వే యూనిట్,<br>యోజన భవన్, న్యూఢిల్లీ.<br>శీతోష్ణ స్థితి; జన సాంద్రత – జనాభా వ్యాప్తి. |
| వి. రా. | డాక్టరు రాఘవన్, వి., ఎం.ఏ., పిహెచ్.డి.,<br>సంస్కృతశాఖాధ్యక్షులు, మద్రాసు విశ్వవిద్యాలయము, మద్రాసు.<br>నాట్యకళ; కాశీనాథయ్య, మేరత్తూరు; వెంకటరామశాస్త్రి, మేరత్తూరు; వెంకటేశ్వరయ్య, శ్రీధర; సదాశివబ్రహ్మేంద్రయతి. |
| వి. న. | శ్రీ సత్యనారాయణ, విశ్వనాథ, ఎం.ఏ., 'కవిసమ్రాట్' ఎం.ఎల్.సి.,<br>తెలుగు ఉపన్యాసకులు, యస్.ఆర్.ఆర్. అండ్ సి. వి. ఆర్. కాలేజి, విజయవాడ.<br>కృష్ణదేవరాయలు; నన్నయభట్టు; రామకృష్ణకవి, తెనాలి; సోమన, నాచన, |

వెం. స. శా. శ్రీ సత్యనారాయణ శాస్త్రి, వెంపరాల, విద్వాన్, విద్వత్కవిశేఖర, కవితాభూషణ,
తెలుగు లెక్చరర్, కోనసీమ భానోజీరావు కాలేజి, అమలాపురము.
పగటివేషములు (కొంతభాగము); భాస్కరుడు–రామాయణము; రామరాజభూషణుడు.

వే. ఆ. మూ. శ్రీ ఆనందమూర్తి, వేటూరి, ఎం.ఏ.,
తెలుగు లెక్చరర్, వివేకవర్ధనీ కళాశాల, హైదరాబాదు.
ప్రభాకరశాస్త్రి, వేటూరి.

వే. తి. శ్రీ తిరువెంగళాచార్యులు, వేదాల, శిరోమణి,
ఉపన్యాసకులు, సంస్కృత కళాశాల, హైదరాబాదు, ఆంధ్రప్రదేశ్.
ద్వ్యర్థి కావ్య కవులు; యజ్ఞనారాయణ దీక్షితుడు; రఘునాథ నాయకుడు; రాజచూడామణి దీక్షితులు; వేంకటమఖి.

వే. రా. శ్రీమతి రాజేశ్వరి, వేదుల ఎం.ఏ.. (ఆనర్సు)
రీసెర్చి స్కాలర్, ఆంధ్ర యూనివర్సిటీ స్టాఫ్ క్వార్టర్సు, వాల్తేరు.
కాళకవి, చెంగల్వ; వసంతోత్సవము.

వే. వెం. శ. శ్రీ వెంకటకృష్ణ శర్మ, వేపం, విద్వాన్, విద్వత్కవిభూషణ,
60, సామిపిళ్ళె వీథి, చూలై, మద్రాసు-7.
శతకవాఙ్మయము.

వే. వెం. శా. శ్రీ వెంకటరాయశాస్త్రి, వేదం, ఎం.ఏ.,
4, మల్లికేశ్వర సందు, లింగిచెట్టి వీథి, మద్రాసు-1.
అక్కన్న–మాదన్నలు.

వే. వేం. రా. డాక్టరు వేంకట రామనాథం, వేమూరి, ఎం. ఏ., పిహెచ్. డి.,
ప్రొఫెసర్ ఆఫ్ కామర్స్, ఉస్మానియా యూనివర్సిటీ, హైదరాబాదు.
రేవు పట్టణములు; రవానా సౌకర్యములు – రైల్వేలు.

వే. స. శా. శ్రీ సత్యనారాయణశాస్త్రి, వేదుల, 'గౌతమీ కవికోకిల', 'శతావధాని',
తెలుగు లెక్చరర్, కావలి కాలేజి, నెల్లూరు జిల్లా.
మల్లయ్యశాస్త్రి, బంకుపల్లి.

శి. రా. శా. శ్రీ రామకృష్ణశాస్త్రి, శిష్ట్లా, ఎం.ఏ.,
లెక్చరర్, తెలుగు డిపార్టుమెంటు, మద్రాసు విశ్వవిద్యాలయము, మద్రాసు.
కృష్ణారావు, ముంజులూరి; శైవవాఙ్మయము.

శి. శం. స్వా. శ్రీ స్వామి శివశంకరశాస్త్రి,
అధ్యక్షులు-సాహితీ సమితి, కవిత్రయ సమాజము, ఒంగోలు, గుంటూరు జిల్లా.
కేతన, మూలఘటిక; పంచతంత్ర కవులు; పావరాజు, కంకంటి; పినవీరభద్రకవి, పిల్లలమర్రి; మారన; సూరన, వెన్నెలకంటి.

శ్రీ. గో. కృ. డాక్టరు గోపాల కృష్ణమూర్తి, శ్రీపాద, డి. ఎస్‌సి.,
ప్రిన్సిపాలు, గవర్నమెంటు ట్రైనింగ్ కాలేజి, నెల్లూరు.
జానపద గేయ – గేయకథా వాఙ్మయము.

శొం. వెం. రా. మూ. — సర్. వెంకటరామమూర్తి, శొంఠి, బి.ఏ., ఐ. సి. యస్., (రిటైర్డు)
'వెంకట విలాస్', గ్రీమ్స్ రోడ్డు, మద్రాసు-6.
కామేశం, శొంఠి.

'సంపత్' — శ్రీ రాఘవాచార్యులు, సంపత్, ఎం.ఏ., బిఇడి.,
స్పెషల్ ఆఫీసర్, నేషనలైజేషన్ ఆఫ్ టెక్స్టు బుక్స్, హైదరాబాదు.
ఖండకావ్యము – భావకవిత్వము.

సా. కృ. — శ్రీ కృష్ణమూర్తి, సాళ్వ, ఎం.ఏ.,
తెలుగు లెక్చరర్, గవర్నమెంటు ఆర్ట్సు కాలేజి, మౌంటురోడ్డు, మద్రాసు-2.
రామాయణ వాఙ్మయము.

సా. వ. పం. — శ్రీ వరదరాజం పంతులు, సాధు,
46, నార్త్ కార్ స్ట్రీట్, వీరరాఘవపురం, తిరునెల్వేలి జంక్షన్,
దక్షిణాంధ్ర భాషోద్యమము (దాక్షిణాత్యాంధ్రులు).

సి. పా. — కుమారి పార్వతి, సి. బి. ఏ. (ఆనర్సు),
అసిస్టెంటు లెక్చరర్, గవర్నమెంటు ఆర్ట్సు కాలేజి, కోయంబత్తూరు.
స్థాన నిర్దేశము – విస్తీర్ణము ; జలనిర్గమనము ; నీటి వనరులు.

సి. మ. — డాక్టరు మహదేవన్, సి. ఎం. ఏ., పి హెచ్. డి.,
ప్రిన్సిపాల్, ఆంధ్ర యూనివర్సిటీ కాలేజెస్, వాల్తేరు.
ఖనిజ సంపద.

సి. వి. కె. రె. — శ్రీ కొండారెడ్డి, సి. వి.
అసిస్టెంట్ చీఫ్ కన్సర్వేటర్ ఆఫ్ ఫారెస్ట్స్, గవర్నమెంటు ఆఫ్
ఆంధ్రప్రదేశ్, హైదరాబాదు.
అడవులు.

సి. వి. డి. మూ. — డాక్టరు మూర్తి, సి. వి. డి., ఎం.ఏ. (ఆనర్స్), డి.యస్‌సి. (ఆనర్స్), ఇంజనీరింగ్ (లండన్),
ఎం. ఐ. ఇ. (ఇండియా); ఎం. ఇ. ఎం. ఎ. ఐ. ఇ. ఇ.
(న్యూయార్కు); ఎ. ఎం. ఐ. ఇ. ఇ. (లండన్).
డైరెక్టర్, టెక్నికల్ ఎడ్యుకేషన్, గవర్నమెంట్ ఆఫ్
ఆంధ్రప్రదేశ్, హైదరాబాదు.
వృత్తి విద్య.

సి. వెం. రా. — డాక్టరు వెంకటేశ్వరరావు, సి., జి. ఎం. వి.సి. బి. వి. ఎస్‌సి.ఎం. ఎస్‌సి., ఎమ్. ఎస్. (కాన్సాస్),
డిపార్టుమెంటు ఆఫ్ ఏనిమల్ హజ్బెండరీ, వెటర్నరీ కాలేజి,
ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు.
ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రములు ; పశుసంపద.

సి. సి. పు. — శ్రీ పున్నయ్య, సి. సి.
సంపాదకులు, 'గృహలక్ష్మి', కేసరి కుటీరము, మద్రాసు.
కేసరి, కె. ఎన్.; లక్ష్మీబాయమ్మ, ఉన్నవ.

| | |
|---|---|
| సీ. సు. శ. | శ్రీ సుబ్రహ్మణ్యశర్మ, సీతంరాజు, ఎం. కాం. (ఆనర్సు),<br>డిప్యూటీ డైరెక్టర్, బిజినెస్ మేనేజ్‌మెంట్ అండ్ ట్రైనింగ్, స్మాల్ స్కేల్ ఇండస్ట్రీస్ సర్వీసెస్ ఇన్‌స్టిట్యూట్, 23, నుంగంబాకం హైరోడ్, మద్రాసు - 6.<br>పట్టణ, గ్రామాభివృద్ధి. |
| సు. ప్ర. రె. | కీ. శే. ప్రతాపరెడ్డి, సురవరం, బి.ఏ., బి.ఎల్.,<br>వేషభూషణాలంకారములు. |
| స్థా. న. రా. (స్థాన) | పద్మశ్రీ నరసింహారావు, స్థానం, నటకావతంస, నటశేఖర,<br>డ్రామా ప్రొడ్యూసర్, 'ఆకాశవాణి', హైదరాబాదు, ఆంధ్రప్రదేశ్.<br>నటేశం, సి. ఎస్.; ప్రసాదరావు, హరి; రాఘవాచార్యులు, తాడిపత్రి లక్ష్మణస్వామి; ఈమని; సూర్యనారాయణ, యడవల్లి. |
| స్వా. సీ. | కీ॥ శే॥ స్వామి సీతారాం,<br>వెంకటప్పయ్య, కొండా. |
| హెచ్. వి. రా. గో. | శ్రీ రామగోపాల్, హెచ్. వి.,<br>ఆర్ట్ మాస్టర్, గవర్నమెంటు కాలేజ్ ఆఫ్ ఆర్ట్స్ అండ్ క్రాఫ్ట్స్, ఎగ్మూరు, మద్రాసు - 8.<br>కొండపల్లి బొమ్మలు. |

# విషయానుక్రమణిక

## ప్రముఖ చిత్రములు

## దేశ పటములు

## త్రివర్ణ చిత్రములు



---

# ముఖ్య విషయ వివరణము

(అకారాద్యనుక్రమము)

**'అంధకరట్ఠ'ము** గోదావరీ తీరమున నుండినట్లు బౌద్ధ వాఙ్మయమున పేర్కొనబడిన దేశము. దీని సమీపమున బావరి యనుముని నివసించుచుండినట్లు ఆవాఙ్మయము తెలుపుచున్నది. 'సుత్తనిపాత'మందలి 'పరాయనవగ్గ'ములోని 'వత్థుగాథ'లో నుదాహృతులైన 'అస్సక', 'అళ (ముళ)'కులు 'అంధక' రాజులని 'సుత్తనిపాత' వ్యాఖ్యలో గలదు.

**అక్కన్న-మాదన్నలు :** వీరు కుత్బ్ షాహి సుల్తానులలో చివరివాడయిన అబుల్ హసన్ కుత్బ్ షా కొలువులోని ఉద్యోగులు. హనుమకొండ నివాసియు, సుంకాధికారియు అయిన పింగళి భానుజీ పంతుల కుమారులు. విశ్వనాథుడు, మృత్యుంజయుడు వీరి సహోదరులు. అక్కన్న మాదన్నలు గోలకొండకు వచ్చి మొదట సయ్యద్ ముజఫర్ అను సేనాధిపతి కడగుమాస్తాలుగా చేరిరి. అప్పటికి అబుల్ హసన్ తానాషా సుల్తాను పదవికి వచ్చి ఇంకను సంవత్సరము కాలేదు.



చిత్రము 120.
అక్కన్న 'అప్పర్ బహదర్'



చిత్రము 121.
మాదన్న 'సూర్యప్రకాశరావు'

గోలకొండ సుల్తాను అబ్దుల్లా కుత్బ్ షా కు ముప్వురు కొమార్తెలు. పెద్ద అల్లుడు సయ్యద్ అహమ్మద్ సుల్తానును బొమ్మగా ఉంచి సర్వాధికారమును వహించి యుండెను. రెండవ కొమార్తెను పెండ్లాడిన ముహమ్మద్ సుల్తాను ఔరంగజేబు కొమారుడు అయినందున ఢిల్లీలో నుండెను. సుల్తాను మూడవకొమార్తెను పెద్దయల్లుడు తనకు కావలసినవానికిచ్చి పెండ్లిచేయ నేర్పాటు చేసెను. అతడన్న సరిపడక మంత్రులు మూసాఖాన్ సయ్యద్ ముజఫర్ అను వారు మరి యొకనిని వెదకుచుండిరి.

అబుల్ హసన్ తండ్రి పార్శ్వమున రాజబంధువు. తండ్రి గొప్ప వర్తకముచేసి తుదకు నష్టపడి మరణించినందున అబుల్ హసన్ పేదరికమున పడి, బందే నవాజ్ హజరత్ అను ప్రాచీనతపస్వి వంశజుడైన సయ్యద్ రాజు కొత్తాల్ అనుమహమ్మదీయస్వాములకు శిష్యుడై విద్యనార్జించి వేదాంతియై పదునాలుగేండ్లు గడపెను. ఇంతలో పెద్దయల్లుడు తెచ్చిన వరుడు అతనితో జగడమాడెను. వానిని తరుమగొట్టి మంత్రులు తమ యుద్దేశములకు తగినవాడని అబుల్ హసనును కొనిపోయి సుల్తాను మూడవ కూతునకు పెండ్లి చేసిరి. క్రీ. శ. 1673 లో అబ్దుల్లా కుత్బ్ షా మరణించెను. మంత్రుల తంత్రమున అబుల్ హసను సుల్తానయ్యెను. ఇతనికి తానాషా అని పేరు కలిగెను. ఇతడు తన మంత్రులు స్వార్థపరులని తెలిసి వారిని తొలగించనెంచినతరుణమందే అక్కన్న మాదన్నలు సుల్తానును దర్శించినది. మంత్రులు సుల్తానును బొమ్మవలె ఆడించుచుండిరి. వారిని తత్‌క్షణమే తొలగించిన నింద వచ్చుననియు, ఆపని క్రమముగా చేయవలెననియు మాదన్న సుల్తానుకు బోధించి వారికి పరస్పరము విరోధమేర్పడునట్లు భేదోపాయము ప్రయోగించెను. ఒకరితో నొకరికి పడకవారును, వారి సేవకులును కొట్టుకొనుసంత వరకు వచ్చినది. ఒకటి రెండు మారులు సుల్తాను వారిని మందలించి తరువాత శిక్షించి పిదప పదచ్యుతులను గావించి వెంటనే 'సూర్యప్రకాశరావు' బిరుదుతో మాదన్నను మహామంత్రిగాను, అక్కన్నను 'అప్పర్ బహదర్' బిరుదుతో సేనాపతిగాను నియమించి వారికి సర్వాధికారములను ఇచ్చెను. వీరి సోదరులలో విశ్వనాథునకు బక్షిగిరి (సైన్యమునకు జీతమిచ్చు అధికారము), మృత్యుంజయునకు పీష్వా ఉద్యోగము, మేనల్లుడు (బావయని కొన్ని ఆకరములు) వెంకన్నకు 'రూస్తంరావు' బిరుదముతో ఫౌజుదారు ఉద్యోగము, ఇంకొక మేనల్లుడు గోపన్నకు

(రామదాసు) భద్రాచలము తాసీల్దారు ఉద్యోగమును లభించినవి.

మాదన్న అధికారము వహించిన పిదప సామ్రాజ్యములో గొప్ప మార్పు లేవియు తేలేకపోయెను. రాజ్య పాలనముకన్నను రాజ్య రక్షణము పెద్ద పనిగా ఉండెను. అక్కన్న మాదన్నలు తాము చేయుచుండిన పను లన్నియు ప్రతి దినమును సుల్తానుకు నివేదించుచుండిరి.

మంత్రియైన కొలది కాలముననే మాదన్న దేశములో చాల భాగమునకు రక్షణము కలుగజేసెను. మొదటి పనిగా కొండలలోనుండి దేశోపద్రవము చేయు జాతులవారిని శిక్షించి పైరు పంటలకు, గొడ్డు గోదలకును రక్షణ నొసంగెను. జనులను పీడించు జమీందారులను, సుంకపు అధికారులను లాగివేసి రాజ్యమును నిష్కంటక మొన ర్చెను. రెండవ పనిగా అన్ని సుభాలలోను ప్రతి గ్రామమును సర్వే చేయించి పన్ను వసూలు పట్టీలు వివరముగా ఆయా సంవత్సరములకు ప్రత్యేకముగా తయారు చేయించెను; ఈనాములు, అగ్రహారములు, దేవ బ్రాహ్మణ దానములు, నౌకరీ మాన్యములు మొదలైన వాని పాలనలోని అక్రమములను మాన్పించెను. హిందువులకు, మహమ్మదీయులకు పక్షపాతము లేక శిక్షణ రక్షణల నొసంగుచుండెను.

తానాషా సుల్తానుకు ప్రతిసంవత్సరము దాదాపు మూడు కోట్ల రూపాయలు ఆదాయము వచ్చుచుండెను. రాజ్యము సకల సంపదలతో తులతూగెను. ఈ సంపద, వైభవము ఔరంగజేబుకు కనుకుట్టాయెను. మొగలాయిలకు శివాజీతోను, అతని స్నేహితుడైన ఆదిల్ షాతోను యుద్ధము చేయుచుండినందున గోలకొండపై దాడి చేయుటకు మొదట అవకాశము లేకుండెను. అదియును గాక గోలకొండవారు ఏటేట ఢిల్లీకి కప్పము సక్రమముగా పంపుచుండిరి.

మాదన్న పంతులు కొలది మార్పులతో తత్పూర్వము గోలకొండవారు అనుసరించుచుండిన విదేశాంగ నీతినే అనుసరించెను. గోలకొండవారు పైకి స్నేహితులుగా నుండినను మొగలాయిలకు లోలోపల శత్రువులే. రహస్యముగా వారు బిజాపురము ఆదిల్ షాకు ధనసాహాయ్యము చేయుచుండిరి. ఈ విషయము మొగలాయిలును గ్రహించియే యుండిరి. కాని బిజాపురము పరిస్థితులు చాల గందరగోళముగా నుండినందున శివాజీతో మైత్రి చేసికొనుట యుక్తమని ఆలోచించి మాదన్న అతనితో ఉత్తర ప్రత్యుత్తరములు జరిపెను. క్రీ.శ. 1674 లో శివాజీ పట్టాభిషేకానంతర మతని బొక్కసము చాల తగ్గిపోయినందున అతడు సుభిక్షములుగా నుండిన ఆంధ్ర ద్రావిడదేశముల మీదికి దాడి వెడల దలచినట్లు తెలిసి అతనిని గోలకొండకు ఆహ్వానించి, నెలదినములు చాల మర్యాదలుచేసి అతనితో సంధి కుదుర్చుకొనెను. ఈ సంధి వలన, దక్షిణ దేశమును జయించుటకు శివాజీకి దిన మొకటింటికి మూడువేల హొన్నులు (నాలుగున్నర లక్షల రూపాయలు) గోలకొండవారు నెలనెలకు ఇచ్చుటకును, తమ సేనాధిపతియైన మీర్జా మహమ్మద్ అమీన్ నాయకత్వమున వేయిగుర్రపు దండును, నాలుగువేల కాల్బలమును పంపుటకును నిర్ణయమయినది. కొన్ని తుపాకులు, ఫిరంగులు, వలసిన మందు, ఒప్పుకొన్న ద్రవ్యము కొంత ఖర్చులకు ముందుగానే ఇచ్చుటకు సైతము ఒప్పందము జరిగెను.

ఈ సహాయమునకు బదులుగా శివాజి తాను దక్షిణ దేశమును జయించిన పిదప పూర్వము తన తండ్రి షాహాజి పాలించుచుండిన ప్రదేశములను మాత్రము తా నుంచుకొని మిగిలిన వాని నన్నిటిని గోలకొండ వారికి ఇచ్చివేయుటకు వాగ్దాన మొనర్చెను. గోలకొండకు మొగలాయిల వలన ఎట్టి ఉపద్రవమును రాకుండ తాను కాపాడెదనని శివాజి తానాషా అక్కన్న మాదన్నల యెదుట ప్రమాణము చేసెను. తానాషా కూడ, పై యుద్ధ ద్రవ్యము కాక రక్షణ విధానమునకుగాను శివాజికి ఒక లక్ష హొన్ను లిచ్చుటకును, మహారాష్ట్రుల రాయబారి నొకనిని తన యాస్థానమునం దుంచుకొనుటకు నంగీకరించెను. కాని ఆ దేశమును జయించిన పిదప శివాజి తన వాగ్దానమును చెల్లించుకొనలేదు. ఇంతటితో నూరకుండక లంచము లిచ్చి బిజాపురమును స్వాధీన పరచుకొన ప్రయత్నించెను.

శివాజి వలని యాశాభంగమును, అతని క్రొత్త ఎత్తులును తానాషా, మాదన్నలకు దుస్సహము లైనవి. శివాజి యత్నములను భంగపరచుటకు మాదన్న బిజాపురము వారికి ధనమును సిబ్బందిని పంపుటయే కాక వారికిని వారి శత్రువులకును సంధి కుదుర్చుటకును, శివాజిని కొంకణమునుండి వెలికి రానీయక ఉంచుటకును పూనుకొనెను. ఆదిల్ షా సర్దారులుకూడ ఇరువదియైదువేల గుర్రపుదళములతోను, లెక్కలేని కాల్బలముతోను శివాజి మీదికి యుద్ధ సన్నద్ధు లగుచుండిరి.

ఇంతలో మొగలాయి సేనాధిపతి దిలీరుఖాను బిజాపురముపై దండెత్తి వచ్చి దానిని ఓడించి అవమానకరమగు సంధి కొడబడజేసెను. కొన్ని కారణముల వలన బిజాపురమువారు తుదకు మహారాష్ట్రులనే సాయము కోరవలసి వచ్చెను. అందుచేత మాదన్న శివాజిని ఏమియు చేయజాలక పోయెను.

దక్షిణ రాజ్యములకు మొగలాయిల వలని బాధ ఎట్లును తప్ప దనియు, మహారాష్ట్రులను నమ్ముటకు వీలులే దనియు గ్రహించి బిజాపురమువారు ఎట్లున్నను వారితో మాదన్న చాల సఖ్యముగ నుండి వారికి సాయము చేయుచుండెను. ఈ విషయము ఎట్లో ఢిల్లీ పాదుషాకు తెలిసి అతడు గోలకొండ మీదికి దండు పంపెను. ఢిల్లీ పాదుషా ఎట్లైనను గోలకొండను ఆక్రమింపదలచి యుండెను. తానాషా మత ద్రోహి అనియు, మహమ్మదీయు లుండగా హిందువులను మంత్రులనుగా ఏర్పాటు చేసికొన్నా డనియు, హిందూ మతాభిమాని ఇస్లాంద్రోహి అనియు, స్త్రీవ్యసని త్రాగుబోతు అనియు పాదుషా దుష్ప్రచారముచేసి అటువంటి అధర్మ నిరతుని శిక్షించుటకే దం డంపినట్లు ప్రకటించెను. క్రీ. శ. 1685 సంవత్సరమున పాదుషా కుమారుడు షా అలము హైదరాబాదును ముట్టడించెను. చివరకు గోలకొండవారు సంధి చేసికొనవలసి వచ్చెను. దాని ప్రకారము వారు విస్తారము ధనము చెల్లింపవలయుటేకాక తత్‌క్షణమే అక్కన్న మాదన్నలను తొలగింపవలసి వచ్చెను. తానాషా సుల్తాను ధనము నిచ్చుటకు సమ్మతించెను. గాని తన యాప్త మంత్రులను తొలగించుట కాతడిష్టపడలేదు. తానాషా ఆలోచించి పాదుషా సంధినిబంధనలను తిరస్కరించెను. కాని అక్కన్న మాదన్నలకు శత్రువు లేర్పడిరి. ఢిల్లీ పాదుషా యొక్క రాయబారితో చేరి చాలమంది మహమ్మదీయులు కుట్రలు పన్నసాగిరి. మొదటినుండియు అంతఃపురమందలి స్త్రీలకును ఈ హిందూ మంత్రుల మీద ద్వేషభావమే. అబ్దుల్లా సుల్తాను రాణులైన సరోమా, జనీసాహేబులకు తానాషా మీదనుండిన ద్వేషము అతని మంత్రులమీదికి ప్రసరించెను. వారిమీద సుల్తానుతో చాడీలు చెప్పిరి. రామదాసుమీద నుండిన కొద్ది తప్పును కొండంతలుచేసి చూపిరి. అక్కన్న మాదన్నలు మొగలాయిలతో రహస్యముగ కుట్రలు పన్నుచున్నా రనిరి. కాని సుల్తాను నమ్మలేదు.

ఇట్లుండగా క్రీ. శ. 1686 సంవత్సరమున మొగలాయిల ముట్టడి సాగుచుండగా, బిజాపురమును జయించి పాదుషా త్వరలోనే గోలకొండ మీదికి రానుండిన సమయమున ఒక దినము దివానమునుండి ఇంటికి పోవువేళ కుట్ర చేసినవా రందరును అకస్మికముగా అక్కన్న మాదన్నల మీద పడి తలలు నరికి శవములను వీథులవెంట లాగి, తర్వాత తలలను మాత్రము ఢిల్లీ పాదుషా కడకు మెప్పు సంపాదించుటకు పంపిరి. ఆ విధముగ అక్కన్న మాదన్నల జీవితము ముగిసినది. అటు తరువాత కొద్ది కాలమునకే క్రీ. శ. 1687 లో గోలకొండకోట ఔరంగజేబు వశమయినది.

వే. వెం. శా.

**అగస్త్యుడు** (క్రీ. శ. 1292 - 1323)**:** ఇతడు కాకతీయ ప్రతాపరుద్ర మహారాజు కాలమున నతని యాస్థానమున నుండె ననియు, ప్రతాపరుద్ర యశోభూషణ మను నామాంతరముగల ప్రతాపరుద్రీయ మను నలంకార శాస్త్ర గ్రంథమును రచించె ననియు ప్రతాపరుద్రీయము నందలి 'ఔన్నత్యం యది వర్ణ్యతే....త త్త్వాం వర్ణయితుం బిభేమి యది వా జాతోఽస్మ్యగస్త్యస్థితి స్త్వత్పార్శ్వే గుణరత్నరోహణగిరే శ్రీవీరరుద్రప్రభో' అను శ్లోకము వలన తలపబడు చున్నది. విద్యానాథ రచనముగ ప్రసిద్ధి గాంచిన ఈ యలంకారశాస్త్ర గ్రంథము ప్రతాపరుద్రునికి కంకితము చేయబడినది. ఇందలి ఉదాహరణము లన్నియు ప్రతాపరుద్రునే ప్రశంసించుచున్నవి. కావున అగస్త్యుడును, ప్రతాపరుద్రీయ కర్తగా ప్రసిద్ధిగాంచిన విద్యానాథుడును ఒక్కడే యనియు, పాండిత్య ప్రకర్షచేత అగస్త్యునికి విద్యానాథబిరుదము లభించె ననియు భావింపబడుచున్నది. ప్రతాపరుద్రుని యాశ్రితుడును, సౌగంధికాపహరణ కర్త యునగు విశ్వనాథకవి తన సౌగంధికాపహరణమున 'వాచ స్తస్య కవే రుదారమధురా ఇత్యత్ర చిత్రం కిము; ప్రఖ్యాతః....అగస్త్య స్సుధీః....స య న్మాతులః' అని యగస్త్యుడు తన మేనమామ యని వచించినాడు.

ఈ విశ్వనాథకవి శిష్యురాలగు గంగాదేవి తన మధురా విజయ మను వీరకంపరాయ చరిత కావ్యమున

'చతుస్స్రవతి కావ్యోక్తి వ్యక్తవైదుష్య సంపదే;
అగస్త్యాయ జగత్యస్మిన్ స్పృహయేత్ కోనకోవిదః'

అని అగస్త్యుడు గొప్ప కవి యనియు, డెబ్బదినాల్గు గ్రంథములు రచియించె ననియు పేర్కొన్నది.

వానిలో లభించునవి (1) బాలభారతము. ఇది మహాకావ్యము; మహాభారతకథ యంతయు నిందు వర్ణింపబడినది. దీని ననుసరించి విల్లిపుత్తూరార్ అను తమిళకవి భారతమును తమిళమున రచించెను; (2) కృష్ణచరితము: ఇది యొక గద్యకావ్యము. ఇందు శ్రీకృష్ణుని చరితము వర్ణింపబడినది; (3) నలకీర్తి కౌముది: ఇది నాలుగు సర్గముల ఖండకావ్యము: రెండు సర్గములు లభించినవి. ఇంకను దశావతార స్తోత్రము, లక్ష్మీస్తోత్రము, శివస్తవము, శివసంహిత, లలితా సహస్రనామము, మణిపరీక్ష, సకలాధికారము అనునవి నామమాత్రము తెలియవచ్చు చున్నవి. ఇంకొక రచనము అగస్త్యనిఘంటువు. ఘనశ్యాముడను కవి తన ఉత్తరరామ చరిత్రవ్యాఖ్యానమున పలుమారీ నిఘంటువు నుదాహరించెను. కాని అది కానరాదు. గ. సు.

**అక్కయసూరి (అక్షయశాస్త్రి), మోక్షగుండము:** ఇతని తండ్రి పక్షధర యెల్లయార్యునికి సోదరుడైన

వెంకటార్యుడు. ఇతడు వెల్లాల ఉమామహేశ్వరునికి (అభినవ కాళిదాసు) గురువు. ఇతని రచనములు తత్వచంద్రిక రత్నావళియను భాగవత చంపుటీక. ప. రా. స్వా.

**అచ్చమాంబ, భండారు** (క్రీ. శ. 1874 - 1905) తొలుదొలుత మహిళాభ్యుదయమునకు పాటుపడిన ఆంధ్ర విదుషీమణులలో భండారు అచ్చమాంబ యొకతె. ఈమె కృష్ణజిల్లా నందిగామలో జన్మించెను. తండ్రి కొమర్రాజు వెంకటప్పయ్యగారు. ఈమె కొమర్రాజు వెంకట లక్ష్మణరావుగారి సోదరి. భండారు మాధవరావుగారీమె భర్త. అబలాసచ్చరిత్రరత్నమాలయను పేర రచించిన ఈమె గ్రంథమునందు చారిత్రక కాలమునందలి హిందూ సుందరుల జీవితములు మృదు మధుర శైలిలో వర్ణితములైనవి. ఈమె క్రోషా యల్లికను గురించి కొన్ని వ్యాసములను 'హిందూ సుందరి' పత్రికలో ప్రకటించెను. ఆంధ్ర దేశమున పర్యటించి మహిళాభ్యుదయమును గురించి ఉపన్యాసము లిచ్చియు, పత్రికలకు వ్రాసియు, మహిళా సమాజములను స్థాపించియు ఆంధ్రమహిళల ఉద్ధరణమునకు పాటుపడెను; మధ్యప్రదేశ్‌లోని బిలాసపూరులో కీర్తిశేషురాలయ్యెను. మ. సో. శ.



చిత్రము 122. భండారు అచ్చమాంబ

**అజంటా:** చిత్ర, శిల్ప కళలలోని మాధుర్యము నడుగు మోవ జుర్రుకొన్నవి అజంటా గుహాలయములు. ఆ యిర్వది తొమ్మిది గుహలలోను 9, 10, 12, 13 సంఖ్యలవి ప్రాతవి. వానిలోను మొట్టమొదటిది పదవ గుహ క్రీ. పూ. రెండవ శతాబ్ది మధ్యమునకు చెందినది. దేశ కాలముల బట్టి చూచినను, అచటిశాసనమును జూచినను అజంటా రూపకల్పనకు ఆంధ్ర శాతవాహనులే అంకురార్పణ చేసినారనవచ్చును.

ఉత్తరదేశమునుండి వచ్చువారు తపతీనది లోయ దాటి దక్కన్ పీఠభూమిని మెట్టుచోట మహారాష్ట్రములోని ఔరంగాబాదుకు 40 మైళ్లు ఉత్తరముగా తలవాకిలిగా ఉన్న వీ అజంటా కనుమలు. ఇన్నూఱేబది యడుగుల యెత్తునుండి ఒక కొండవాగు మలకలై జలజల క్రిందికి దొరలి 'శాతకుండ' మన్న మడుగై, పొరలి లోయవెంట పారి మందముగా అతి గంభీరముగా ప్రవహించు వాఘేరా నదిలో గలసిపోవును. ఆ కొండ చరియలో అంత పొడవునను అర్ధవలయాకారముగా ఈ అజంటా గుహలను వెలయించినారు.

బౌద్ధము చిందిన తావులైన యీ గుహలను అరణ్యములో దాగియున్నవానిని 1819 లో మొదట కనుగొన్నవారు సైనికులు. 1829 లో రాయల్ ఏషియాటిక్ సొసైటీ పత్రికలోను, 1843 లో ఫెర్గూసన్ వ్యాసమునందును అజంటాలోని లోభనీయదృశ్యముల వర్ణనములు చూచి కుతూహలియై అచటి చిత్ర శిల్ప ప్రతికృతులను 1844 మొదలు 1864 వరకును సేకరించి మేజర్ గిల్ లండనులో ప్రచురించినారు. కాని అంతలో లండను అగ్నికాహుతి కాఁగా ఆ చిత్రములలో ఐదు మాత్రము మిగిలినవి. ఆ తరువాత 1875 లో గ్రిఫ్ఫిత్ బొంబాయి చిత్ర కళాశాల సాయమున మరల వాని ప్రతులను వ్రాయించెను. ఆయనే 1896 లో ఇండియా ప్రభుత్వమువారి పేరట అజంటా బౌద్ధ చిత్రములను ప్రచురించిరి. 1915 లో హెర్రింగ్‌హామ్ సతి మరియొక ముద్రణమును వెలిదెచ్చినది.

ఇట్లు ప్రపంచ శిల్ప చిత్ర విదు లందరి మనసులు లోగొన్న యీ అజంటా శిల్పము లొక్కనాటివి గావు. వాని నిర్మాణమున తదేక మనస్కులై, తన్మయులై, తల్లీనులైన చిత్ర శిల్ప కళాభిజ్ఞులు 7, 8 శతాబ్దము లుపాసించి పంచిన ప్రసాదము లవి; క్రీ. పూ. రెండవ శతాబ్ది నంకురించి వాకాటక మహారాజుల కాలమున పల్లవించి, గుప్తరాజ ప్రాభవ దోహదముల పుష్పించి పరిమళించి క్రమముగ 7 వ శతాబ్దాంతమునకు చలనము లుడిగిన యీ గుహాలయములలో చివర చివరవి 1, 2, 26 సంఖ్యలవి.

పశ్చిమ భారతములోని యితర గుహాలయము లున్న చోటులలో గుహాముఖముల నిలిచి ఎదుట చూచినచో కనుచూపు మేరవరకు పచ్చిక బయలు ఆకస మోరగా మున్నంతవరకు కనుపించును. అజంటాలో అట్లు గాదు. చుట్టును అడవులు కొండలు బలసి ప్రకృతి తన బాహువులతో పొదివి గ్రుచ్చి ఎత్తుకొన్న ట్లనిపించును. ఆ నిర్మాణము లన్నియేండ్లుగా సాగినను వానిలో వైదిక, జైనముల చిన్నెలే లేవు. బౌద్ధమత ప్రసక్తి, ప్రశస్తి - యివియే యం దుండుటచే బౌద్ధ లలిత కళలు, మతము, తత్త్వము, సంస్కృతి వీని పరిణామముల నెరుగగోరినవారికి ఆలయములు పెన్నిధు లనవచ్చును.

ఈ నిర్మాణములు రెండు కోవలవి: 1. చైత్యములు; 2. విహారములు. 9, 10, 19, 26 - యివి చైత్యములు;

ఇతరములు విహారములు. భారతీయ కళా వైభవము తెలియవలెనన్న సూక్ష్మములో మోతుముగా 1, 2, 9, 10, 12, 16, 17, 19, 26 - యీ గుహాల జూచిన చాలును. అన్ని గుహాలలోని నిర్మాణ నైపుణులు, శిల్పముల దీర్చిన తీరులు, చిత్రముల వర్ణరేఖా కలనా సంప్రదాయములు అన్నియు నెరుగవచ్చును.

పదునారవ గుహాలయమున కెదురుగా నిలిచి గుహల జూచినచో అన్నియు అర్ధచంద్రాకృతిగ తీరి అలంకృత సభా ప్రాంగణమువలె, అందమంతయు కొట్టవచ్చిన ట్లుండును. ఆ బౌద్ధ శిల్పులు తమ హృదయముల నన్నిటిని గుహాలయములనుగా మలచుటకై ప్రకృతి నాలంబనముగా గొన్నారు. ఆ 16 వ గుహాముఖమున కిరువంకల శతాబ్దములుగ పేరిన ధూళిలో సగము బ్రుంగుడువడి సగ మగపడు నాపన్గులు, పై వరండాకు పోవు సోపానములకడ మధుర భంగిమతో నెలకొన్న నాగరాజు - బహుశః అదియే కాబోలు అజంటా గుహాలయ ప్రవేశ ద్వారము.

అజంటా గుహాలయములలో శిల్పమునకన్న చిత్రకళకే ప్రాధాన్య మెక్కువ. ఆదృష్టితో చూపరుల నాకట్టునవి 9, 10, 16, 17 గుహాలు. చిత్రకళకే ఒకరూపు పోసినచో దాని హృదయ స్పందనము లన్నియు అచటి చిత్రముల భంగిమ లనుకోవచ్చును. అచటి కళాజీవులు ప్రత్యంగుళమున చిత్రముల దీర్చుటలో నెంత యుదారులో, ఒక్కొక చిత్రమునకై ఉపయోగించిన రేఖలలో నంత లోభులు. క్రేళ్లింతలాడు పశువులు, వానివెనుక గొల్లని పరువులు, సమీపమున స్వేచ్ఛమై తిరుగాడు అడవి మృగములు, లోని స్తంభములపై నిర్వికల్ప బుద్ధమూర్తులు, నల్వంకల గోడలపై గవాక్షములపై ముందు గోడ మలుపున పలువర్ణముల గాథలు, దృశ్యములు తొమ్మిదవ గుహాలో కనుపించును.

పదవ గుహ చైత్యగుహాలయము లన్నిటిలోను పెద్దది. స్తంభగత నిర్వికల్ప బుద్ధమూర్తుల వెనుక గోడలపై నగపడు మూర్తులు లంబాడీ, భిల్లాది జాతులవారు వారి వారి ప్రత్యేకాంగిక లక్షణములతో చిత్రింపబడినారు. 16 వ గుహాలోని చిత్రములలో మొదట ఎన్నదగినది ఆసన్న మరణయగు రాజపుత్రిక చిత్రము. కరుణ లొలుకుటలో దీనికి సాటి మరిలేదు. దీనిని చూచి కరుగని హృదయము, చెమ్మగిల్లని కన్నులు ఉండనేరవు. ఇందలి బుద్ధజాతక కథాచిత్రములలో నంద, సుత్సోమ గాథలు ముఖ్యములు. జాతక కథలకన్నను పేర్కొన వలసినవి సిద్ధార్థ గౌతముని జీవిత ఘట్టముల చిత్రణములు - సిద్ధార్థుని జననము, అసిత ఋషిచే బాలుని జాతక పరిశీలన, విద్యార్థిదళ, ధ్యానగత గౌతములు, రాజగృహాగమనము, సిద్ధార్థుని కీ జీవనము దుఃఖమయమని తెలిపి తన్నివారణార్థము పురికొల్పిన వ్యాధి దారిద్ర్య జరామరణ సన్నివేశ దృశ్యములు, బుద్ధ భగవానునికి సుజాత, త్రపుస్స, భల్లికు లొసగిన భిక్ష - అన్నియు నీ గుహాయందే చూడగలము.

పదునేడవ గుహ ఒక చిత్ర రత్నాకరము. సంసార, రాశి చక్రములు, సింహాసనాసీనులైన రాజదంపతులు, మింటి కెగురు గంధర్వాప్సరసలు, షడ్దంత, మహాకపి, విశ్వంతర, శిబి, శరభ, మాతృపోషక, మత్స్య, శ్యామ జాతకములు, సింహాలావదానము - అన్నియును ఇందు ప్రశస్తములు.

ఒకటవ గుహాలయములోని అవలోకితేశ్వరుని చిత్రము చిత్రకళకే ఒక మేలుబంతి. రెండవ గుహాలో హంస జాతకము, మాయాదేవి చూలు, ఆమెస్వప్నము, లుంబినీ వన సందర్శనము, బుద్ధజననము, సప్తపది, తుషిత స్వర్గమున బుద్ధుని పుట్టువునకై దేశనిర్ణయము, పురన్నావదానము మరెన్నియో ఆలోకనామృతము లున్నవి.

అజంటాలోని చైత్యములలో మిక్కిలియు ప్రాతది 19 వ గుహాచైత్యము. పశ్చిమ భారతమున ఆ జాతి నిర్మాణములకెల్ల అదియే ప్రాతిపదిక. 9, 10 గుహాలను 19, 26 గుహాలతో పోల్చి చూచినచో హీనయాన, మహాయాన శిల్పరీతులలోని భేదములు స్పష్టముగా గోచరించును.

అజంటాలోని కళాఖండముల నొక్కొక్కటిని వర్ణించుట కాని పని. అయినను ఒక్కమాట. అచటి బౌద్ధకళా తపస్వులు జీవితమందువలెనే సౌందర్యమునందును ఏకత్వమునే చూచినారు. వారి నైతిక సౌందర్యము శారీరక సౌందర్యమును త్రోసి పుచ్చునది కాదు. వారి చిత్రణములలో బుద్ధునికిని, ఉపాసికల మూర్తులకును ఎడము అత్యల్పము. ఆ కళాకారులు స్త్రీ భంగిమలను కల్పించు కొన్నవారు కారు; వారు ప్రత్యక్షముగ చూచిన స్త్రీ భంగిమలను చిత్రములనుగా, శిల్పములనుగా తీర్చినారు. స్త్రీమూర్తులు కళారీతులకు, నియమములకు నతీతలు. వారి హాస లీలా లాస్య చేష్టితము లెల్లను సౌందర్య విలసితములుగా, వారి వేషభూష లెల్లను వారి సౌందర్యముచే భాసితములుగా భావించి, తమ సౌందర్యానందోపాసనచే తాము తరించి పరులను తరింపజేసినారు. ఓ. రా.

**అనంతరాజు, మట్లి**: ఇతడు తెనుగు చోళ వంశోద్భవుడైన మట్లి యల్లమరాజు పుత్రుడు; పరాక్రమశాలి. తన యేలికయైన రెండవ వేంకటపతి దేవరాయల (క్రీ. శ. 1584 - 1614) పక్షమున పెక్కు యుద్ధములలో శూరత్వ మేర్పడ పోరాడి కీర్తి ప్రఖ్యాతులు గడించెను.

శా. శ. 1527 విశ్వావసు సంవత్సరమున (క్రీ. శ. 1605) ఇతడు నెలకొల్పిన సిద్ధవట శిలాశాసనమున ఇతడు తన విజయములను, పరాక్రమమును ఉగ్గడించుకొనెను. శాసనోక్త విజయములను సాధించి అనంతరాజును, అతని తండ్రి యల్లమరాజును, తనకు తోడ్పడినందున వారు చేసిన యుపకారమునకు బదులుగ వెంకటపతిరాయలు అంతకు ముందు కొండ్రాజువారు పాలించుచుండిన సిద్ధవటము మొదలైన సీమలను వారికి నాయంకరముగ ప్రసాదించెను.

మట్లి అనంతరాజు విద్యాప్రియుడు, ప్రతిభాశాలియైన కవి. కకుత్స్థ విజయమను శ్రేష్ఠ ప్రబంధమును రచించి సమకాల విద్వత్కవిపుంగవుల మన్ననకు పాత్రుడాయెను. కవి చౌడప్ప, తంజావూరి రఘునాథ నాయకుడు మున్నగు కవిత్వ తత్వ విశారదు లతని కవితను కొనియాడిరి. అనర్ఘ రాఘవ కృతికర్తయగు ఉప్పుగుండూరు వెంకటపతికవి ఇతని యాస్థానమునందే వెలసెను. నే. వెం. ర.

**అనంతాచార్యులు, నంద్యాల :** ఈయన చిన్న తనముననే కాశీకి వెళ్ళి అచ్చట గొప్ప పండితులదగ్గర తర్కశాస్త్రమును చక్కగా నభ్యసించి అద్భుత పాండిత్యమును సంపాదించిరి; పిదప గద్వాల సంస్థానము చేరి అచ్చటి సంస్థానాస్థాన పండితులై వెలసినవారు. బు. అ.

**అనంతా(ఆనందా)చార్యులు, పనప్పాకము :** (క్రీ. శ. 1843 - 1909) : చిత్తూరు జిల్లా కడమంచి గ్రామము వీరి జన్మస్థానము. వీరి తండ్రి శ్రీనివాసాచార్యులుగారు ; చెంగల్పట్టు జిల్లా పొన్నేరి తాలూకా పనప్పాకము గ్రామవాస్తవ్యులు. వీరు చిత్తూరు జిల్లా కోర్టులో శిరస్తదారు పదవిని బడసి కడమంచిలో నివాసమేర్పరచుకొని అచటనే స్థిరముగ నెలకొనిరి. అనంతాచార్యులకు పంద్రెండేండ్ల ప్రాయముననే పితృ వియోగము కలిగెను. ఇల్లొకటి తప్ప మరి యెట్టి యాస్తియు లేదు. ఇట్టి స్థితిలో అతని తండ్రియాప్తమిత్రులైన శ్రీ సి. వి. రంగనాథ శాస్త్రులవారి సాయమున ఆయన క్రీ. శ. 1863 లో మెట్రిక్యులేషను పరీక్షలో నుత్తీర్ణుడై మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాలలో 1865 లో ఎఫ్. ఎ. పరీక్షలో కృతార్థు డయ్యెను. కాని ధనాభావమువలన చదువు చాలించుకొని, ఆ యేటనే మద్రాసు పచ్చయప్ప పాఠశాలయం దుపాధ్యాయ పదవి నంగీకరించి 1869 వరకు అచట నుద్యోగము చేసెను. తరువాత దానిని విసర్జించి ఆ కాలములో నవకాశ ముండుటవలన బి. ఎల్. పరీక్షకు ప్రైవేటుగ చదివి 1869 లో నం దుత్తీర్ణుడై పట్టమును పొందెను. పిదప ఒక మిత్రుని సాయమున మద్రాసు హైకోర్టు న్యాయవాదులలో అగ్రగణ్యులైన కావలి వెంకటపతిరావుగారికడ అప్రెంటిస్‌గ చేరి పనిచేసి 1870 లో హైకోర్టు వకీలుగ నంగీకరింపబడి సన్నదును పొంది క్రమముగ హైకోర్టు వకీళ్ళలో నగ్రగణ్యుడయ్యెను. న్యాయశాస్త్రమునం దతనికి గల యద్భుత ప్రజ్ఞకు ప్రతిఫలముగ గవర్నమెంటువారు క్రీ. శ. 1887 లో విక్టోరియా మహారాజ్ఞి స్వర్ణోత్సవ సందర్భమున 'రాయబహదూర్' బిరుదమును ప్రసాదించి సత్కరించిరి. న్యాయవాదుల స్థితిగతులను చక్కజేసి వారి నభివృద్ధి నందజేయుట కాయన 1889 లో మద్రాసు అడ్వొకేట్స్ అసోసియేషను స్థాపించెను. అది నేటికిని వర్ధిల్లుచున్నది. ఆయన అప్పుడు వాడుకలో నుండిన న్యాయస్థానములను, న్యాయ విచారణ పద్ధతులను సరిదిద్దుటకును, న్యాయవాదుల స్థితి గతులను చక్కబరచుటకొరకును ఆంగ్ల భాషలో రెండు గ్రంథములను రచించి ప్రకటించెను. అనంతాచార్యులు సంస్కార ప్రియుడు, గొప్ప దేశాభిమాని, గొప్ప వక్త, నాటి సాంఘిక రాజకీయ విషయములనుగూర్చి తన యభిప్రాయమును వెల్లడించుచు 'నేటివ్ పబ్లిక్ ఒపీనియన్', 'మదరాసి' మున్నగు పత్రికలలో పెక్కు వ్యాసములు ప్రకటించెను. తిరువల్లిక్కేణిలో స్థాపితమైన 'లిటరరీ సొసైటీ' సంస్థ కాయన అధ్యక్షుడుగ నెన్నుకొనబడెను. మద్రాసు నేటివ్ అసోసియేషన్ అను సంస్థకు 1880 లో కార్యదర్శిగ నియమింపబడి రాజకీయ రంగమున ప్రవేశించి ఆ సంస్థ పక్షమున మిక్కిలి శ్లాఘ్యమైన కృషి సల్పి ప్రజాదరమునకు పాత్రుడాయెను. ఈ సంస్థ సర్కారువారి అనుమానమునకు గురియై క్రమముగ నుత్సన్న మయ్యెను. దాని స్థానమున 1884 లో స్థాపితమైన 'మద్రాసు మహాజన సభ'కు ఎమ్. వీరరాఘవాచార్యులతోపాటు అనంతాచార్యులును కార్యదర్శిగ నెన్నుకొనబడెను.



చిత్రము 123.
పనప్పాకము అనంతాచార్యులు

ఆ సంవత్సరముననే పబ్లిక్ సర్వీస్ కమీషన్ మద్రాసుకు విచ్చేసెను. ఈ కమీషన్‌వారి ముందు ఆయన ఇండియన్ సివిల్ సర్వీస్ పరీక్షను ఇంగ్లాండులోను,

హిందూదేశములోను ఏకకాలమున జరుగున ట్లేర్పాటు కావింపవలెనని వాదించెను.

అనంతాచార్యులు అఖిల భారత దేశీయ మహాసభ 1885 లో బొంబాయిలో సమావేశమైననాటినుండి ఆసభా సమావేశములలో పాల్గొని గణనీయమైన సేవ చేసెను. 1891 లో నాగపురమున నడచిన కాంగ్రెసు సభకు ఆయన అధ్యక్షుడుగ నెన్నుకొనబడెను. ఆంధ్రులలోనే కాక దాక్షిణాత్య భారతీయులలో నెల్ల ఈయనయే ఈ మహా గౌరవమును పొందినవారిలో ప్రథముడు. ఆ యేడే ఆయన కాంగ్రెస్ కార్య నిర్వాహక సంఘములో సభ్యుడు గను, మరుసటి సంవత్సరమున అలహాబాద్ కాంగ్రెసులో కాంగ్రెసు కార్యదర్శులలో నొకడుగను ఎన్నుకొనబడెను. 1895 లో ఆయన భారతీయ సామ్రాజ్య శాసన సభలో మద్రాసు ప్రతినిధిగ ఎన్నుకొనబడి యెనిమిదేండ్ల కాల మా సభలో నిర్భయముగ ప్రజల హక్కులను రక్షించుచు పనిచేసి 1903 లో తన ప్రాతినిధ్య పదవికి రాజీనామా నిచ్చెను ; 1907 లో ఆయన పరమపదించెను.

ఆయన సంస్కృతాంధ్రములను జక్కగ నెరిగిన విద్వాం సుడు ; ఆంధ్రభాషా సారస్వత పోషకుడు ; గ్రంథకర్త ; ముద్రాపకుడు. విద్వద్గోష్ఠి యాయనకు కరము ప్రియము. ఈ కారణముచే ఆయనకు 'విద్యా వినోద' యను బిరు దము కలిగినది. తానును తన యాశ్రితులును రచించిన గ్రంథములనే కాక ప్రాచీన మహాకవికృతాముద్రిత గ్రంథములను ముద్రించుటకొరకును వైజయంతీనామ ముద్రణాలయము నొకదానిని నెలకొల్పి వైజయంతి యను నొక సారస్వత మాస పత్రికను గూడ ప్రకటించెను. ఆయన రచనలలో 'మంజువాణీవిజయ' మను వచనకావ్య మొక్కటియును, 'ఆంధ్ర భారతమునందలి శంతను పౌత్రుల ప్రభుత్వ' మను వ్యాస మొక్కటియును ప్రధానములైనవి. నే. వెం. ర.

**అనంతామాత్యుడు** : ఇతని ముత్తాత బయ్యన భారతకర్తయగు తిక్కనచే 'భవ్యభారతి' అనిపించు కొన్న మేటి 'కవిరత్నము'. ఈతని తండ్రి తిక్కన కృష్ణా తీరమునందు శ్రీకాకుళమున వెలసిన ఆంధ్ర మహావిష్ణువును సేవించుకొనుచు కాలము గడపిన భక్తుడు. ఆయనకు 'విద్వజ్జనానందమైన జీవనస్థితి' 'పెరుమగూరు' అను పురంబునం దుండెనట. ఆయూరు 'కృష్ణవేణి, మలాప హారిణి, భీమరథినా ధరిత్రియందుఁ దనరు నదీత్రయాంత ర్వేది యగు పావనక్షేత్ర'మట. కావున శ్రీకాకుళమునకు ఆరేడుమైళ్ళ దూరమున కృష్ణాతీరమందున్న నేటి పెనమకూరే ఆ పెరుమగూరేమో ? మరియు అనంతుని భార్యకు మేనమామలగు ముదునూరివారి నివాసముగూడ అచ్చటికి నయిదారు మైళ్ళ దూరమం దుండుటచే నితనిది నేటి పెనుమకూరే కానోపు.

తండ్రివలె ఈతడును విష్ణుభక్తుడు. ఆనాటికే నియో గులు ఆరాధ్యశైవులనో, ఆచార్య వైష్ణవులనో గురువు లుగ ఆశ్రయించుట పరిపాటియై చెల్లుచుండెను. అనంతుడుకూడ అట్లే తిరుమల నల్లాన్ గోవింద చక్రవర్తు లచే సమాశ్రయణము పొంది విష్ణుభక్తుడై అహోబల నృసింహదేవుని భజించెను. ఆ దేవునికే తన భోజరాజీయ మును కృతిగా నొసగి పరమ సౌఖ్యముగన్న భక్తకవి ఈతడు. రసాభరణ చ్ఛందోదర్పణములందలి కృత్యంత ములనుబట్టి చూడగా ఈతడు క్రీ. శ. 15 వ శతాబ్ది పూర్వార్ధమందే తనగ్రంథములను రచించెనని తెలుచున్నది.

ఈతని మొదటి కృతి భోజరాజీయము ; రెండవది ఛందోదర్పణము ; మూడవది రసాభరణము. ఈతడు ఛందోదర్పణము రచించునాటికి భీమకవి రచితమగు కవిజ నాశ్రయమను ఛందోగ్రంథ మొకటి యున్నను దాని నీత డెరిగి యున్నట్లు కనబడదు. 'అనంతుని ఛందోదర్పణము నెదుట నుంచుకొని అప్పకవి కొన్ని వృత్తములకు లక్ష్య ములు వ్రాసినట్లు స్పష్టముగా కనిపించుచున్నది. మదరేఖ, తోదక, మనోజ్ఞ, ప్రియకాంత, నర్కుటము, శిఖరిణి, పృథ్వి మొదలయిన వృత్త లక్ష్యపద్యములు అనంతుని పద్యములలోని పదములతో కనబడుచున్నవి....ఈ లాగున అనంతుడు కవిజనాశ్రయము ఎదుట నుంచుకొని తన ఛందోదర్పణము వ్రాసియుండునేమో యని ఎంత పరిశీ లించినను పద్యములలో పోలిక ఎక్కడను కనబడలేదు'.

'వళ్ళు, ప్రాసములు, షట్ప్రత్యయములు...వీటినిగురించి ఛందో దర్పణములో ఉన్నన్ని విషయములు కవిజనాశ్ర యములో లేవు.' జాత్యుపజాతులను గూర్చి ఛందోదర్పణ ములో చెప్పినంత గ్రంథము కవిజనాశ్రయములో లేదు. 'రగడలు, కళికలు, ఉత్కళికలు వీటిని గురించి కవిజనా శ్రయ కర్త ఏమిన్నీ చెప్పలేదు' (ఛందోదర్పణము పీఠిక).

కవిజనాశ్రయమునకు ఛందోదర్పణమునకు మధ్య కాలములో అవతరించిన పెద్దన కావ్యాలంకారచూడా మణియందు కూడా ఛందో విషయములు కలవు. 'ఇందు మొదటిది 10 వళ్లు, రెండవది 12 వళ్లు చెప్పగా ఛందో దర్పణము 24 వడి భేదములను పేర్కొన్నది. అట్లే పూర్వ గ్రంథములందు కానరాని విశేష ప్రాసములు పదునొకం డని అనంతుడు చెప్పినాడు.' 'లాక్షణికు లందరిలోను అనంతుడు ఎక్కువగా పదిసీసభేదములను చెప్పినాడు' (ఛందోదర్పణము పీఠిక).

'అనంతుని ఛందమున ప్రాచీన లేఖన క్రమపద్ధతిలో అరసున్న నిండు సున్నలను గూర్చిన విశేషము తెలుపబడినది. తెలుగు లాక్షణికులలో సార్ధబిందుక, నిర్బిందుక ప్రాసములను గూర్చి తొలుత తెలిపినవా డనంతుడు.' 'వ్యాకరణ విషయమున అనంతుడు సంస్కృత సంధులను గూర్చి విపులముగా దెలిపినాడు. సంస్కృత భాషకు వర్ణంబు లేబదియని తొలుత దెల్పినవా డితడే.' 'ప్రాచీనాంధ్రభాషా సంప్రదాయము ననుసరించి అనంతుడు తన ఛందస్సులో నెన్నియో విషయములు తెలిపినాడు' (ఛందోదర్పణము, ద్వితీయముద్రణ పీఠిక).

ఈ ఛందోదర్పణమును అనంతుడు 'యోగిహృద్విమల తోయజవర్తియు, అనంతమూర్తియు' నగు శ్రీ మహావిష్ణుని నుతిగా రచించినాడు. ఈ గ్రంథమున జెప్పిన లక్షణములకు లక్ష్యభూతములగు పద్యము లెన్నియో ఈతని భోజరాజీయమున కనిపించుచున్నవి.

ఈతని రసాభరణము సాహిత్యశాస్త్రము. కావ్యాలంకారచూడామణిలో వలె ఇందు అలంకార సామగ్రిని, గుణదోషధ్వనులను వివరింపక అనంతుడు కేవల రసస్వరూపమునే చెప్పెను. కావున కావ్యమున కాత్మ రసమని చెప్పిన సాహిత్యదర్పణము నీత డనుసరించి యుండును.

'కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే, సద్యః పరనిర్వృతయే కాంతా సమ్మితతయోపదేశయుజే' అను కావ్యప్రకాశమందలి లక్షణమును గూడ ఈతడు తన భోజరాజీయమున అనువదించుకొనుటచే ఆ రెండు గ్రంథములందలి ప్రశస్త విషయములను ఈతడు గ్రహించి యుండునని రసాభరణ పీఠికా కర్తలు వచించిరి. గుణదోషాలంక్రియాదులు ముఖ్యముగా శ్రవ్యకావ్య సంబంధు లనియు, దృశ్యకావ్యమున రసమే సాధ్య మనియు చెప్పు మతమును గ్రహించి అనంతుడు కేవల రసమును గూర్చి రసాభరణమును రచించెనేమో! 'సంస్కృతమున ఆలంకారికులు పలువురు తెలుపని శృంగార భక్తి వాత్సల్యములకు ఏక కంఠ్యమును కవి సాధించినాడు. 'రతి దా నాయకనాయికాదిపరతన్ రంజిల్లు శృంగారమై క్షితిలో దేవగురు ద్విజాది పరతం జెన్నొందు సద్భక్తియై సుతమిత్రాశ్రిత సోదరాది పరతన్ సొంపారు వాత్సల్యమై.... '(రసాభరణ పీఠిక)'.

ఈ గ్రంథమున లక్ష్యములను కూర్చుటలో అనంతుడు తాను సొంతముగా రచించి చూపుటేకాక రఘువంశ, కుమార సంభవాదులనుండి కొన్ని శ్లోకములను తెనిగించినాడు. ఈతని లక్ష్యపద్యములు ఉదాత్తతయం దించుకయు కొరవడక ఉద్దిష్టార్థములను అద్దమునందువలె ప్రతిఫలింపజేయుచుండును. ఈ గ్రంథము నీతడు ధ్రువపురాధీశుడగు కృష్ణున కంకితముగ రచించెను. ఈ ధ్రువపుర మెచ్చటిదో! కృష్ణా మండలమందలి దరువూరే ఈ ధ్రువపురమని కొందరి యూహ.

ఈ రెండు గ్రంథములును అనంతుని ఛందోలక్షణ రహస్యజ్ఞతను, సాహిత్య తత్త్వవిత్త్వమును చాటి చెప్పుచు ఆ కాలపు కవీశ్వరులలో ఈతని ప్రత్యేకముగా గణనీయుని కావించుచున్నవి. 'వాణీసతి మన్ముఖాబ్జమున నిల్చి విశేష వరంబు లీవుతన్' అని భోజరాజీయ అవతరణికలో ఈతడు కోరుకొన్న కోర్కెల నాతల్లి పూర్ణముగా నీతని కనుగ్రహించినది.

భోజరాజీయ మీతని కృతులలో ప్రథమమే కాదు; ప్రధానము కూడ ననదగును. అప్పటికి ఆంధ్రమున ఇంకను స్వతంత్రకావ్యములు పుట్టలేదు. ఉన్నంతలో మంచన కేయూరబాహు చరిత్రము ప్రధాన కథను విద్ధసాలభంజిక నుండి గ్రహించినను ఒక కొంత స్వతంత్రమని చెప్పదగును. పిమ్మట పేర్కొనదగినది జక్కనవిక్రమార్కచరిత్రము. విక్రమార్కుని గూర్చి ప్రజలు చెప్పికొను కథలను కావ్యమొనర్చెనేకాని జక్కన వానిని కల్పించినవాడు కాడు. జక్కనయు, అనంతుడు నించుమించు ఒక్క కాలమందున్న వారే. ఐనను చరిత్రజ్ఞులు విక్రమార్క చరిత్రము భోజరాజీయము కంటె ముందు పుట్టిన దనియు, దానిని కాంచియే అనంతు డీ గ్రంథమును రచించె ననియు చెప్పుదురు. ఇది నిజమే కావచ్చును; కాని విక్రమార్కుని కథలవలె గాక అనంతునివి స్వకపోల కల్పితములు. ఈ కథలలో భోజుడు నాయకుడు కానేకాడు. ఇవి యన్నియు అన్నదాన సుకృతమును గూర్చి చెప్పినవి. అనంతుడు తన గ్రంథమును 'వివిధ కథా నూత్నరత్న భూషణాభిరామ' మనియు, 'నూతనంబయ్యు పురాతన కృతులట్ల సంతత శ్రవ్యమై జరగు' ననియు చెప్పికొన్నాడు. కావున భోజరాజీయమే ఆంధ్రమున ప్రథమ స్వతంత్ర కావ్యమని చెప్పవచ్చును.

నిజమునకు ఈ గ్రంథము నన్నదాన మాహాత్మ్య మనదగునే కాని కావ్య మనరాదేమో! ఇందు కథానాయకుడు లేడు. 'దీనికి దత్తాత్రేయ మునీంద్రుండు వక్తయు మహుండను కాంభోజ మహీశుండు శ్రోతయు'. ఈ కథలన్నిటికి కలిగిన ప్రసక్తి ఇది:

'అధిగత విద్యాసమాజుండగు భోజుండు పూర్వ జన్మంబున బ్రాహ్మణుండై యుండి, దారిద్ర్య భారంబున.... విరక్తుడై....ప్రయాగయందు శరీర విసర్జనంబు చేసి.... ధారా నగరాధీశుడై పుట్టి రాజ్యంబు సేయుచు....ఒక

నాడు సర్పటియను సిద్ధపుంగవుని గని తన పట్టనంబునకు దోడ్కొని వచ్చుటయు....వాడు పంచలోహమయంబగు భోజుని కొలువు చవికెం దన చేతి ధూమవేధి యను నౌష ధంబుచే శుద్ధసువర్ణమయంబు గావించి, యెందేనిం బోవు టయు....భోజు డాతని నొక్క కృతక మతంబున నాకర్షించి ధూమవేధి నపహరించుటయు, నాతండు కోపించి శాపం బిచ్చుటయు, తదీయ ప్రార్థనంబున శాపంబు గ్రమ్మరించుటయు, తదనంతరంబు భోజననిమిత్తంబున భోజ సర్పటులకు సంవాదవశంబున వివిధ పుణ్యకథా ప్రసంగంబులు' పుట్టెను.

కావున భోజ సర్పటు లొండొరులకు చెప్పికొన్న కథలే భోజరాజీయమైనది. 'సూత్రకథ భోజరాజ చరిత్రము' అని అనంతుడు చెప్పికొన్నను నిజమున కిందలి కథ లన్ని టిని అన్నదాన ప్రభావమే ఒక సూత్రమున గ్రుచ్చినది.

అన్నదానమే సకలదానములలో నుత్తమ మనియు, అతిథిపూజనమే సర్వదేవతా పూజన మనియు, అతిథి కష్టా కలిగా పెట్టుట దోష మనియు, బాహ్యాభ్యంతర శుద్ధిలేని దానము కొరగా దనియు, సత్యము త్యాగము నను సుగుణములు క్రూరమృగములను, ఘోరరాక్షసులనుగూడ హింసావిముఖులను చేయగల వనియు, స్త్రీలకు పాతి వ్రత్యమే సకలార్థప్రద మనియు - ఇట్టి ధర్మములను బోధిం చుటకు అనంతుడు ఈ కథ లల్లెను. కావున 'ధర్మరీతుల్ నీతుల్ చిత్రకథలై తలిర్పగ శ్రోత్రసుఖముగా నొనర్పఁ జొప్పడి యుండున్' అని ఆతడు చేసిన ప్రతిజ్ఞ ముమ్మా టికి నెరవేరినది. కాదంబరీ దశకుమార చరిత్రములందు వలె ఈ గ్రంథమునందును ఒక కథలోనుంచి మరియొక కథ చిత్రముగా పుట్టుకొనివచ్చి, పఠితృ హృదయముల నెలయించుకొని పోవుచుండును. ఆముక్తమాల్యదలోని మాలదాసరి కథకు నిందలి మదనరేఖ కథకు, పాండురంగ మాహాత్మ్యమందలి సుశీల కథకు, నిందలి షష్ఠాశ్వాసము లోని విప్రభార్య కథకు ఎన్నో పోలిక లున్నవి. సద్యో జాతుడగు బాలకు డొక డీ గ్రంథమున అన్నదాన మాహా త్మ్యమును వినిపించుట కళాపూర్ణోదయమందలి మధుర లాలసాకథనమును తలపించు చుండును.

ఈ కథలలో ద్విజులేకాక కాపులు స్వర్ణకారులు రజకులు చర్మకారులు మున్నగు వివిధ వృత్తులవారును, ధీరులు భీరులు, పతివ్రతలు కులటలు, ప్రోడలు ముగుదలు, ఆటవికులు నాగరకులు, వంచకులు తస్కరులు మున్నగు వివిధ ప్రకృతులవారును దర్శన మిచ్చుచు, కథలకు వైవిధ్య మును కల్పించి మనకు కుతూహలమును పెంచుచుందురు. వివిధములగు మానవప్రకృతులనే కాక తిర్యగ్జంతు ప్రకృతిని కూడ అనంతు డీ కథలయం దెంతో స్వభావ రమణీయముగా తీర్చినాడు. మచ్చున కీ యెలుకపిల్లను జూడుడు :

'అ చ్చిఱుతయెలుక తన తొఁటలోనన యుండి వెలు పలికిఁ దనమూతి సాపుచుం దలచూపి మరలం దిగుచుచు నర్ధ శరీరంబు దోఁప నిగుడి మగుడుచుఁ, బుచ్ఛంబు దక్కం దక్కటి శరీరం బంతయు బయలుపడ నించుకసేపు కంపంబునొందుచు నుండియుండి మఱచి తలఁచిన ట్లదరిపడి తిరిగి తొల్లి జొచ్చుచు వెండియు నుండలేక వెలువడి శాఖా మార్గంబునం గొంతద వ్వరిగి పర్ణరవంబులు కర్ణంబులు సోఁకినం బెదరి కోటరద్వారంబునకుం బఱతెంచుచు నిట్లు శైశవక్రీడలు నడిపి తదనంతరంబ యెలప్రాయంబు సొచ్చుడు నూఁగుదోసపిందెగతి నందంబగు దేహంబును దరుణశాకినీ మూలంబునుబోలు వాలంబును శాల్మలీ తూల కంబళంబు విధంబున నత్యంత మృదులంబగు నుదరం బును నాఖుకర్ణిపర్ణంబుల మాడ్కి రిక్కించుకొనియున్న కర్ణంబులును నలంతిపూస లంటించినట్లు దనరు కనుంగవ యును, నుచ్చింత పువ్వులలోని కేసరంబులక్రియ భాసురం బగు పలువరుసయుఁ దనవయోరూపంబున కనురూపంబు లగుచుండ సెలగొమ్మ లెక్కి వ్రేలుచుఁ బలిష్ఠంబులగు తిర్యక్శాఖలపైఁ ద్రుళ్లగింతలు వెట్టుచు నాకు జొంపంబులు సొచ్చిదాఁగుచు నిటు బహువిధంబుల విహరించుచుండ...'

అవును, ఎవరి అందము వారిది. మానవ యువతుల కున్నట్లే మూషక యువతులకు కూడ యౌవన విభ్రమము లుండునుకదా. మన చూపు లా విలాసములను గ్రహింప నేరవు.

'అ మ్మూషక యోషం జూచి యొక్క మూషక తరుణ పురుషుండు వివశాంతఃకరణుం డగుచుఁ జుఱచుఱ నా ప్రామఁకు ప్రాఁకి వేగిరపడి చెనకిన.....'

'మద మొదవంగ మూషక కుమార సమూహము
వెన్నుసమ్మెతై
పొదలిన వాల మార్చుచుఁ బ్రబుద్ధ విటుం డురు ధైర్య
మూలమున్
చెదరఁగఁ ద్రవ్వుగోళ్లఁ గొని చెక్కిలి వ్రేసిన...'

దట. నిజమే. నాయికా మనః ప్రియములగు మాట లతో, చేతలతో నభిసరించుచు, అదనెరిగి కవయు పెరుగని మొరటు విటుల కంతియే శాస్తి. ఆ 'వాలమార్చుటలు' చూచితిరా! మన నాయికల కీల్జడలు జ్ఞప్తికి దగులుచున్నవి.

ఇంతటి స్వభావోక్తియు, లోకపరిశీలనమును మన సాహిత్యమున మరిలేదేమో. ఈ ప్రజ్ఞయే అనంతుని మన కవీశ్వరులలో మేటి కథకుని కావించినది.

ఇంతకు కావ్యరచనము వేరు. కథాకథనము వేరు. కావ్యమందువలె కథలో అడుగడుగున కవి కన్పించ గూడదు. కథ శ్రవ్యమైనను దృశ్యకావ్యమునకు దగ్గరి చుట్టము. ఆకారచేష్టాస్వభావములు కనులకు గట్టునట్లు పాత్రలకు ప్రాణప్రతిష్ఠ చేయనిచో నాటకమును, కథయు రక్తి కట్టవు. ఈ నేర్పు తిక్కనకు, అనంతునకు, సూరనకు అలవడినట్లుగా ఇతరుల కలవడినదికాదు. కదిరీపతి యొకడు మంచి కథకుడు. హంసవింశతి నిఘంటుప్రాయమై వన్నె తరిగినది.

కాగా లోకధర్మానుసరణమే సమస్తకళలకు ప్రధాన లక్షణము. ఆ లోకధర్మమును కళాధర్మానుగుణముగా తీర్చుటయందే ఔచిత్యము, రసము మున్నగునవి సిద్ధించును. భోజరాజీయమందలి కథ లన్నిటిలోను ఈ లోకధర్మాను సరణము వెల్లివిరియుచుండును.

గోవ్యాఘ్రసంవాద మీ కావ్యకథలలో మణిపూసవంటిది. అందు గోవత్సమును కవి యెట్లు చిత్రించెనో చూడుడు:

'పొట్టపొంగునఁ దల్లిపొది వాసి వీథికిఁ
బాఱి క్రమ్మఱఁ బెద్దపరువుతోడ,
తలయెత్తి చూచుచుఁ బలుమాఱుఁ దనుఁ దల్లి
పిలువంగ నిట నటఁ బొలసియాడు,
నిలమీఁద మోమిడి యేమేని మూర్కొనుఁ
బసివెట్టికొనుచుఁ దత్ప్రాంతమందు
నంతంతఁ బసిబిడ్డ లడ్డంబు సుడిసిన
జంకించి మిన్నంటఁ జౌకళించు.'

ఇట్లు ఆకార చేష్టాదులు అభివర్ణించుటయందే కాదు, పాత్రల సంవాదములు నడపుటలో కూడ అనంతునిది అందె వేసిన చేయి. ఈ విషయమున గ్రంథ మంతయు సాక్ష్య మిచ్చుచున్నది. తోడికోడలిపై యీసుచే భర్తలకు దుర్బోధలు చేయు ఇల్లాండ్ర మాటలయందలి లోకాను సృతియు, తిక్కన యొకడు దక్క ఇతరులు నేరని కాకువును కాననగును.

'అత్తకు నేము మార్పలుక
మాయమచిత్తములోని వారమై
వత్తుము పెద్దవారు గల
వారికి నన్నియుఁ జెల్లుఁగాక, నేఁ
డిత్తటి మమ్ముఁ బుచ్చి పని
యెవ్వరు గొందురు, మిమ్ముఁ జూచి నో
రెత్తఁగ నోడి యే పలుకు
లెన్నఁడు చెప్ప మెఱింగి యుండియున్.

'ఇంతట నెటిఁగెద రొండే
నంతట నెటిఁగెదరు గాక యని యుండఁగ మీ
రెంతట నెఱుఁగరు బ్రతికెదు
పంతమె యిది మీకు నేము పగవారలమే?

'ఒకనాఁడైనను మాతో
నొక యాలోచనముఁ జేయ కూరక మోమె
త్తికొనుచు పోదురు మీ రాం
డ్రకు మగలకు నిట్టి వేఱడంబులు గలవే?

'మగఁ డెఱుఁగవలయుఁ గాదేన్
మగువ యెఱుఁగవలయుఁ గాక మనుగడ తెఱఁగ
మ్మగువయు మగఁడును వెలిగా
జగమున సంసార మెట్లు జరగును జెపుఁడీ?

అని పలికి తమతోడికోడలిం బ్రసంగించి

'పని పంప వెఱతు మాబిడ
పని యెప్పుడు చేసి చేసి పాయవడితిమి....
తనచేఁతకుఁ దోడు మమ్ముఁ దప్పులు పట్టున్.

'తా మాకు నత్తయైనది;
యా మఱఁదియు మాకు బావయై వర్తించున్
మే మయ్యిరువురచేతను
బాములఁ బడలేము నాతి పాపుల భంగిన్.

'తన యాలును దానును గుడు
వను గట్టను నిట్టి యీ యవస్థలఁ బడ నే
మును మీరును నటె చాలుం
దనిసితి మీ బ్రతుకుపట్టు దయ్య మెఱుంగున్.'

'కాంతుఁడు సిబ్బితికాఁడై కాంతయు నట్టైన నెట్లు కాఁపుర మింకన్' అను కళా పూర్ణోదయ రచనకు ఇవి ఆచార్యక మొనర్చుచున్నవి. ఈ ప్రజ్ఞ ముఖ్యముగా నాటకకర్తల సొమ్ము. మనకు మొన్న మొన్నటివరకు నాటకములు లేని లోటును తిక్కన, అనంతుడు, సూరన కొంతకు కొంత తీర్చగలిగిరి.

అనంతునిలో ఇతర కావ్య కవుల వర్ణనా పటిమయు, ఈ నాటక రచనా పద్ధతియు సమపాళముగా అమరినవి. కథా గమనమున కడ్డువచ్చు వర్ణనల నీతడు చేయడు. ఆలంబనోద్దీపన విభావములకు పుష్టి కూర్పవలసిన పట్టు లందు సముచితములగు వర్ణనము లీత డొనర్చును. తృతీ యాశ్వాసమందలి వసంతర్తు పుష్పాపచయ జలకేళీ వర్ణనము లిందుల కుదాహరణములు. అవి మన మహాకవులు చేసిన వర్ణనముల కెందును దీసిపోవు. వసంత మేగుదెంచి నంతట తరుచయము కారాకు రాల్చుట 'జర యుడిపి మాకుఁ గ్రమ్మరఁ దరుణత్వం బొసఁగు మనుచు ధరణీదేవిన్ బోరిఁబోరిఁ బూజించిన క్రియ' నున్నదట.

మరియు ఆ వసంత సౌభాగ్యము నెట్లు వర్ణించెనో కనుడు:

'ఎక్కడఁ జూచినం జిలుక లెయ్యెడఁ జూచినఁ గోకిలమ్ము లే చక్కటిఁ జూచినన్ సమద షట్పద సంఘము లెందుఁ జూచినం జొక్కపు శారికల్ బుతువు సొంపు నుతింప వశంబె! పువ్వుఁదే రెక్కిన పంచసాయకుఁడ యెద్దెసఁ జూచిన నవ్వనంబునన్'.

ఇట్లే తత్తదుచిత స్థలంబుల ఇట్టివర్ణనలు గ్రంథ మంతట కలయజిమ్మిన ట్లుండి ఈ కథలకు కావ్యత్వమును గల్పించు చుండును.

ఈ కథలలో పావకలోమరత్నమండనాదుల కథల వంటివి కొన్ని సుదీర్ఘములై ప్రత్యేక కావ్యములుగా గణింపదగినవియు కలవు. నాలుగు వర్ణముల పురుషులు ఒక్కవేశ్య గామించి తమ తగవు దీర్పుమని వంజరుని చెంతకు వచ్చిన కథ యొక్కటి సప్తమాశ్వాసమున గలదు. ఇది పొడుపుకథ వంటిది. ఆ చిక్కు ననంతుడు విప్పి చెప్ప వలసినదేకాని ముందుగా మన మించుకయు నూహింప లేము. నిజముగా ఈ గ్రంథము చిత్రకథా భాండారము; అనంతుడు 'కతరాజు'.

కులటలయు, కాముకులయు, జంతుపులయు కథలు కూడ చెప్పినను అనంతుని శృంగారరస వర్ణనము లెచ్చ టను హద్దు మీరవు. ఈ యౌచితీ విషయమున నీతడు కవి త్రయముతో పోల్పదగినవాడు. మన కవులలో ఇతరత్ర మృగ్యమైన హాస్య రసముకూడ నీతని గ్రంథమున ఎడనెడ హృద్యమై ఒప్పుచుండును. ఎండ్రిపిల్ల కాశీయాత్రకు బయలుదేరుట మున్నగు ఘట్టము లెన్నియో సుకుమార హాస్యరస మిశ్రితములై యున్నవి. హాస్య విషయమున అనంతునిదే అగ్రతాంబూలమేమో. ఇందుల కొక్క యుదాహరణము.

భద్రకుడనే రాజు వేటకు వెళ్ళి అడవిలో నుండగ ఆ చెంత నొకపక్షి ఏమియో పల్కెనట. 'అది యేమి పల్కె' నని రాజు శకునజ్ఞు నడిగెను. 'ఒక శూద్రుడు గడ్డికోసమై కొండకు వెళ్ళుచు త్రోవలో పాము కరచి మరణించునని చెప్పిన' దని శకునజ్ఞుడు తెలిపి 'వాఁ డల్లవాఁడె పోయెడు, నేఁ డతనికి పీడుకోలు నిజ' మనుచు గడ్డి కేగు కాపుం జూపెనట. దాని నిజ మారయ నెంచి రాజు సంజవేళదనుక నచట నిల్చెను. కొంత సేపటి కా కాపు గడ్డిమోపుతో తిరిగి వచ్చుట శకునజ్ఞునకు చూపి రాజు ఉల్లస మాడుచున్నాడు.

'చచ్చినవారలు గ్రమ్మఱ
వచ్చుట కడుచిత్ర మల్ల వాఁ డదె కంటే
చచ్చినఁ బచ్చని కస విటు
దెచ్చుచు నున్నాఁడు వాని తెఱఁగేదియొకో.

'చంపగ వచ్చిన జముని దూతలకు లం
చముపెట్టి వచ్చెనో చావనొల్లఁ
బొమ్మని మోఱకంబునఁ ద్రోచి వచ్చెనో
యింటివారికిఁ జెప్ప కిచటఁ జచ్చి
నట్లైనఁ గోపింతురని చెప్పవచ్చెనో
వీని పెంజెమట నవ్విషము గరఁగి
వడిసెనో సర్వంబు వాతప్పిపోయెనో
శకునంపుఁ బులుఁగు బీసారి భ్రమసి
తప్పఁ జెప్పెనో, యితఁ డేమి విధమునఁ
బ్రతికి, వచ్చె....'

లోకానుసరణమే యీ కథలకు, వానిలోని సంవాదము లకు ప్రాణప్రదమని చెప్పితిని. ఆ సంవాదములకు సామె తలే జీవగర్రలు. అనంతుడు సామెతల పుట్ట. ఇన్ని లోకో క్తులు వాడిన కవి తెలుగున మరియొకడు లేడు. కథలలో నెడనెడ 'కలఁగక యాడుమాట లయకాలునినైన శమింపఁ జేయదే?' వంటి అర్థాంతరన్యాసములను పొందుపరచుచు లోకోక్తుల నదుకుచు అనంతుడు కావ్యార్థములను సూటిగ అందిచ్చుచుండును.

అనంతుని శయ్యాపాకములు కవిత్రయ కవితను దల పించుచుండును. నాచన సోమునితో ఆరంభమై, శ్రీనాథ పోతనాదులను లోగొన్న రీతిమార్గముపొంత పోక అనం తుడు తన కవితను ప్రసన్న గంభీరముగా నడపికొని పోవును. ఉత్ప్రేక్షాదు లందందు వాడినను స్వభావోక్తి యందే ఈతనికి ప్రీతి. సమయోచిత వర్ణనలకై మక్కువ పడునే కాని ఊరక ఊహలపై ఊహ లల్లుకొనుచు కథా ప్రవాహమున కడ్డుకట్టలు వేయడు. గోవ్యాఘ్ర కథ యందు చివరకు విష్ణుడు ప్రత్యక్ష మగును. అంతట 'ఆమొదవును బులియును నప్పురుషోత్తము చరణ సరసిజం బులు తమ శిరంబుల ధరియించిన, నప్పు డవ్విహంగ వాహ నుండు త్రివాహనుండైన ట్లుండె'నట. అంతట నాగక ఆ రమణీయ దృశ్యమును దేవతలచే నిట్లు స్తుతింపజేసెను.

'కలువలఁ దమ్ములన్ సమవికాసము నొందగఁ జేయు క్రాలుఁగ న్నులు గల నీకుఁ భాన్వును మనోజ్ఞ రథంబును నాగ తద్విరో ధులయిన నీకు నారయఁ జతుర్భుజ చేయఁగరాదె గోవునుం బులియును శత్రుభావములఁ బోనిడి మైత్రి యొనర్చునట్లుగన్.'

'హిత మితములు' సముచితములగు ఇట్టి వర్ణనలే కావ్యము నలంకరించునుగాని, ఔచితి నెరుగని కొండవీటి చేద్రాళ్ళు మోతచేటే యగును.

ఈతడు కవిత్రయపు పోకడ లెన్నిటినో తన కావ్యమున సంతరించుకొన్నాడు. శ్రీనాథాదులవలె చేతి కొదవిన సంస్కృత శ్లోకములను తెనిగించుకొన్నాడు.

తిక్కన పోకడలన్న ఈతనికి పరమప్రీతి. నిర్వచనోత్తర రామాయణమున చకోరములు వెన్నెలలో విహరించుటను

తిక్కన వర్ణించెను. మూడుమూర్తుల దానిం బోలినది ఈ క్రింది వర్ణనము.

' నునులేఁతవెన్నెలకొనలు మెల్లనఁ ద్రుంచి
పిల్లతండమునకుఁ బెట్టునవియు,
చవియైన వెన్నెల చంచులఁ గబళించి
యింపారఁ బ్రియుల కందిచ్చునవియు,
కడఁగి యింతటఁగాని వడదేర దనుభంగిఁ
దనర వెన్నెలవెల్లి మునుఁగునవియు,
పగలింటి యాఁకలి పాయఁ బైపైఁబడి
ముదురు వెన్నెలఁ గ్రోలి పొదలునవియు,
కడుపు నిండినఁ గసికాటు కఱచునవియుఁ
గూడి యొండొంటితోఁ జెరలాడునవియు
నగుచు వెన్నెల తమ సొమ్మె యనినయట్లు
కోరి చరియించెఁ జదలఁ జకోరచయము'. (ద్వి.ఆ. 107)

బాణుడు కాదంబరిలో నొక శాల్మలీతరువు నాటెను. అంతకన్న మిన్నగా తిక్కన విరాటపర్వమున నొక 'శమీతరుచక్రవర్తి' నుత్పాదించెను. ఆంధ్ర సారస్వతమున ఈ వనస్పతుల కంటుగట్టిన వృక్షరాజము లింకెన్నియో కలవు. అన్నిటిలో పినవీరన తన యింటిపేరిటి వృక్షమును చిరస్థాయిగా నొనర్చినాడు.

' అమృతాంశుమండలం బాలవాలముగాఁగ
మొలచె నొక్కటి జగన్మోహనముగ,
చిగురించె విలయ సింధుగత కైతవడింభ
శయనీయవరపలాశములతోడ,
పితృదేవతలకు నంచిత సత్రశాలయై
చెట్టుగట్టెను గయాక్షేత్రసీమ,
నిలువ నీడయ్యె నిందీవరప్రియ కళా
కోటీరునకు భోగి కుండలునకు,
మఱ్ఱిమాత్రంబె పిల్లలమఱ్ఱిపేరు
పేరువలెఁ గాదు శారదాపీఠకంబు
వారిలోపలఁ బినవీరు వాక్యసరణి
సరసులకు నెల్లఁ గర్ణరసాయనంబు'.

అనంతుడు పినవీరనయు నించుమించు ఒక కాలము వారే. మరి వీరిలో ఎవరు ఎవరిని అనుకరించిరో కాని భోజరాజీయమునను అచ్చముగా నిట్టి మఱ్ఱియే యున్నది (చూ: ద్వి. ఆ. 61, 62 పద్యములు). అందు సీసపాదములు మూడింట ఇట్టి భావములే అనంతుడును చెప్పి 'పితృదేవతలకు' అనుదానికి బదులుగా

' ఈ మఱ్ఱిమీఁదనొకో మున్ను గజకచ్ఛ
పములతో లంఘించెఁ బక్షివిభుఁడు'

అని చమత్కరించి ఎత్తుగీతిలో

ఇట్టి మఱ్ఱి యుండ నీ ద్వీపమును వట
ద్వీప మనక యేమి తెలివియొక్కొ
తొంటి పెద్ద లెల్లఁ దొడఁగి జంబూద్వీప
మనిరి నాఁగ నొప్పె నక్కుజంబు'

అని మెరుగుపెట్టినాడు.

అనంతుడు పోతనకు గూడ సమకాలికుడే. 'కంజాక్షునర్చించు కరములు కరములు శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ' అను భాగవతగత పద్యమునకు భోజరాజీయమందలి ఈ క్రింది పద్యము జ్ఞాపకమగుచున్నది.

' చూపులు విష్ణుమూర్తులకు సొమ్ముగ జిహ్వలు
విష్ణుమూర్తి యా
లాపసుఖంబుఁజెందగఁదలంపులు విష్ణుమహత్వచింతకుం
బైపడుచుండ........................'

ఇదియే కాదు. భాగవతమున వామనుడు తన్నుగూర్చి బలిచక్రవర్తికి తెలిపే సీసపద్యమువంటిదే ఈ క్రింది సీసము:

' ఒకచోటఁ గాదు నా యునికి యెచ్చటనైన
నుండుదుఁజు మ్మనాథుండ నేను,
నన్నుఁ బ్రీతి నిందు రమ్మని పట్టెఁ డశనంబు
పెట్టు ధర్మప్రాణి పుట్టునొక్కొ
యని యెందుఁ జరియింతు........
ఏమిసేయుదు నింక
నీ యస్థిరపు దేహ మెట్టుగా నున్నదో.......'

ఆ యీ పోలికలు విచారించినచో ఆ కాలమున కవీశ్వరులొకరి నొకరు ప్రీతిమై కలిసికొనుచు నొకరి కావ్యము లొకరికి వినికి సల్పుచు అసూయలు దిగద్రావి చరించెడివారేమో అని తోచును. పరస్పరము వారికి గల గౌరవమున కిట్టి పద్యములు సాక్షులేమో. అనంతుడు గూడ పోతనవలె విష్ణుభక్తుడు. 'పరమ సౌఖ్యమైన భగవదాభిముఖ్యంబుఁ గల్పించుకొని అధిక నిష్ఠతోడ ఈ విమల సత్కృతి కానుకగా నొనర్చి' పరమేశ్వరుని

' నన్ను భవద్భృత్యులలో
నెన్ని దయాదృష్టిఁ జూచి యిది మొదలుగ నీ
వెన్నఁడు వదలకు........'

మని ప్రార్థించిన తుష్టహృదయుడు, వినీతవర్తనుడు. కావుననే ఈతని రచన మంతయు మృదులము, సరసము, సరళమునై ప్రౌఢతన ముట్టిపడుచుండును.

' పెదవులు గదలెం గదలవు
రదనంబులు గానవచ్చె రావనుపాటిన్
మృదువచన రచన లెసఁగఁగ
ముదిత యతని హృదయకమలముం గరగించెన్'.

అని ఒకచో అనంతుడు చెప్పిన మాటలు అతని కావ్య కన్యకకు తూచినట్లు సరిపోవును. కా. వెం.

**అన్నంభట్టు :** గొప్ప తార్కికుడైన ఇతడు గరిక పాడు గ్రామమున జన్మించెను. ఈ గ్రామము తెలంగాణాలో నున్నది. శ్రీ రాఘవసోమయాజి వంశమున జన్మించిన అద్వైత విద్యాచార్య తిరుమలుడు అన్నంభట్టు తండ్రి; ఇతడు ఋగ్వేది; స్మార్త బ్రాహ్మణుడు. అన్నంభట్టు కొండవీడులో నుండి పండ్రెండు వత్సరములు న్యాయవిద్య నభ్యసించి స్వస్థలమున కేగి న్యాయవిద్యాశాల నేర్పరచెను. కాశికి వెళ్లినంతమాత్రమున ద్విజుడు అన్నంభట్టు కానేర డని లోకములో నానుడియున్నది ('కాశీగమనమాత్రేణ నాన్నంభట్టాయతే ద్విజః'). అన్నంభట్టు కాశీపట్టణము నకు పోయి తాను రచించిన గ్రంథముల ప్రశంసలు స్వీకరించెను.

క్రీ. శ. 1724 లో నున్న తత్సదుపాఖ్య వైద్యనాథుడు అన్నంభట్టు గ్రంథమును వ్యాఖ్యానించెను. క్రీ. శ. 1712 లో లిఖితమైన అన్నంభట్టు గ్రంథము లభించుటచే ఈత డంతకు పూర్వుడు కావలయును. క్రీ. శ. 17 వ శతాబ్దారంభ ములో నున్న విశ్వనాథ న్యాయపంచాననుని అన్నంభట్టు అనుకరించుటచే అంత కర్వాచీనుడు కావలయును. కాగా క్రీ. శ. 17 వ శతాబ్దోత్తర భాగమున అన్నంభట్టు ఉనికి నిశ్చయింపవచ్చును. అన్నంభట్టునకు న్యాయ, వ్యాకరణ, మీమాంసా, వేదాంతములందు గొప్ప పాండిత్య మున్నది. ఆయా శాస్త్రములందు సమర్థములయిన గ్రంథములు రచించెను. అవి ఇవి :

1. తర్క సంగ్రహము ; 2. తర్క సంగ్రహ దీపిక ; 3. సుబోధినీ సుధాసారమను రాణకోజ్జీవిని మీమాంస ; 4. బ్రహ్మసూత్ర వ్యాఖ్యానమయిన 'మితాక్షర' ; 5. వ్యాకరణమున అష్టాధ్యాయి టీక ; 6. కైయట ప్రదీప వ్యాఖ్యానము - 'ఉద్యోతనము' (వ్యా) ; 7. న్యాయమున సిద్ధాంజనము - జయదేవ తత్వచింతామణి టీక ; 8. న్యాయ పరిశిష్టప్రకాశనము - ఉదయనగ్రంథవ్యాఖ్య ; 9. తత్వ బోధినీ టీక, - 'వేదాంతము' ; 10. 'మితాక్షరి' - కాశికా గ్రంథ వ్యాఖ్య.

వీనిలో తత్వబోధినీ టీక సంక్షేపశారీరకమను వేదాంత గ్రంథ వ్యాఖ్యానము. సంగ్రహము, దీపిక రెండును న్యాయశాస్త్ర గ్రంథములు. తర్కవిద్య నేర్చుకొనువా రందరు ఈ గ్రంథములను ప్రారంభములో నావశ్యకముగా పఠింతురు. సంగ్రహముపై ఇరువదియైదు వ్యాఖ్యానములు, దీపికపై పది వ్యాఖ్యలు వెలువడినవి. అన్నియు ముద్రిత ములును కాలేదు. సంగ్రహ, దీపికలకు వచ్చిన వ్యాప్తి ఇతరములకు రాలేదు. వీనిలో విషయము సంక్షిప్తముగా, నిశ్చితముగా, సుగమముగా నున్నది. న్యాయ, వైశేషిక రీతులకు వీనిలో సమన్వయమున్నది. దీపిక సంగ్రహము నకు వ్యాఖ్యానము. స్వతంత్రముగ నిశ్చయబుద్ధితో యుక్తియుక్తముగ అన్నంభట్టు దీనిని రచించెను. ప్రాచీన నవీన మతములలో విభేదములు కలిగినపుడు యుక్తి యుక్తముగ నున్నదని ప్రాచీన మతమునే అన్నంభట్టు గ్రహించెను ; బుద్ధిచర్చలో గౌతమ భావమును, ఇతరముల చర్చలో కణాదుని భావములను నిరూపించెను. తర్క విద్యా ప్రవేశము సంపాదించుటకై సంగ్రహపద్ధతి నిరూ పింపదలచిన అన్నంభట్టు గ్రంథములు సర్వామోదము పొందినవి. జ. మా. శ.

**అన్నదేవచోడుడు :** ఇతడు వెరువ తెలుగుచోళ రాజ యిన కామరాజ నామాంతరమున బరగు భక్తిరాజు కొడు కులలో ఒకడు, తల్లి అన్నమాంబ. భక్తిరాజు మరణా నంతరము అతని మరియొక కొడుకయిన చోడ భీమున కును, అన్నదేవ చోడునికిని సింహాసనమునకై సంభవించిన వివాదములో అన్నదేవ చోడుడు విజయము నొంది రాజ్యాభిషిక్తు డయ్యెను, కాని కొద్దికాలములోనే అన వేమారెడ్డి పూర్వదిగ్విజయయాత్రా కాలమున తన స్వాతంత్ర్యమును, రాజ్యమును గోల్పోయెను. నాటినుండి అతడు రాచకొండ, దేవరకొండ రాజ్యాధిపతులగు వెలమ నాయకుల సాయమున తిరిగి రాజ్యమును సంపాదించు కొనుటకు ప్రయత్నించుచు వచ్చెను. కాని అతని ప్రయత్న ములు కుమారగిరిరెడ్డి యున్నంతవరకు సఫలము కాలేదు. రాజమహేంద్ర రాజ్యమును గురించి కొండవీటి పెద కోమటి వేమారెడ్డియు, కాటయ వేమారెడ్డియు పోరాడు కొనుచుండిన కాలమున ఇతడు వెలమ నాయకుల సాయముతో కళింగము మీదుగ రాజమహేంద్రవరముపై దండెత్తి వచ్చుచుండ ఎలమంచిలి రాజధానిగ మధ్య కళింగమును పాలించుచుండిన విశ్వేశ్వర భూపతిచే క్రీ. శ. 1402 లో నోటువడి మరలిపోయెను. క్రీ. శ. 1404 నాటికి రాజమహేంద్రవర రాజ్యములో కొంతభాగ మితనికి వశమైన దనుటకు ఇతని దాక్షారామ శాసనమే తార్కా ణము. ఆ శాసనములో ఈతనికి రాజాధిరాజ, రాజపర మేశ్వర, పూర్వ సింహాసనాధీశ్వర బిరుదములు కలవు. అన్నదేవచోడుడు కూడ తన పైతృక రాజ్యమును సంపా దించు కొనుటకు ప్రయత్నించుటతో మధ్యాంధ్రదేశ రాజ కీయములు మరింత విషమ ఘట్టములో పడినవి. కాటయ వేమ, పెదకోమటి వేమారెడ్లకు తోడు అన్నదేవ చోడుడు కూడ సంగ్రామ రంగమున కురికి దానిని మరింత రక్త

పంకిలము కావించెను. ఈ యుద్ధము రమారమి రెండేండ్లు సాగినది. దీనిలో కాటయ వేమునికి కర్ణాటాధీశ్వరులు సాయముగ వచ్చిరి. అన్నదేవ చోడుడు పెదకోమటి వేమునకు బాసటగ నుండిన ట్లూహింప నవకాశము కలదు. ఈ యుద్ధమునకు సంబంధించిన విశేషములు అన్నదేవ చోడుని రాజమహేంద్రవరము మ్యూజియము శాసనమున వివరింపబడినవి.

ఈ యుద్ధములలో అన్నదేవ చోడుడు సాధించిన విజయములకు ఫలితముగ గోదావరి పశ్చిమతీర ప్రదేశము అతనికి పూర్తిగ స్వాధీనమైనది. అన్నదేవ చోడుడు తరువాత పాలకొల్లు (పడుమటి గోదావరి జిల్లా) వెళ్లి క్షీరారామేశ్వర మహాదేవుని దర్శించి దాన శాసనము చెక్కించెను. ఈ యుద్ధములలో కాటయ వేమారెడ్డి హతుడయ్యెను. పిదప అల్లాడరెడ్డి కాటయవేముని కొడుకు కొమరగిరి పక్షమును, అతడు అకాలమరణము నొందిన పిదప అతని కూతురును, తన కోడలును అయిన అనితల్లి పక్షమును వహించి పోరాటము సాగించెను. అల్లాడ రెడ్డితో జరిగిన ఈ యుద్ధములలోనే క్రీ. శ. 1414 - 1416 సంవత్సరముల నడుమ అన్నదేవచోడుడు హతుడయ్యెను (చూ : కొండవీటి రెడ్డిరాజ్యము). మ. సో. శ.

**అన్నమయ్య** (క్రీ.శ. 1424 - 1503) : తాళ్లపాకము కవులలో ప్రథముడును, ప్రసిద్ధుడును నగు నీతడు క్రీ. శ. 1424 క్రోధి సంవత్సరమునందు జన్మించి డెబ్బదితొమ్మిదియేండ్లు జీవించి క్రీ. శ. 1503 దుందుభి సంవత్సరమున దివ్యధామ మందినాడు. వేదాంత దేశికుల వారు శ్రీ వేంకటేశ్వరస్వామివారి గుడిగంట యంశమున నవతరింపగా అన్నమయ్య స్వామినందకాంశమున నవతరించెనని ప్రఖ్యాతి గలదు. ఇతని తండ్రి నారాయణసూరి, తల్లి లక్కమాంబ. ఇతని చరిత్రము నీతని మనుమడు చిన్నన్న ద్విపదగా రచించెను. అం దీతని జీవిత చరిత్రము సమగ్రముగా వర్ణింపబడినది.

అన్నమయ్య బాల్యమునుండియు భగవద్భక్తి పరాయణుడు. పదునారవయేట నుండియే యాతడు సంకీర్తనములు రచించుట కారంభించెను. అన్నమయ్యకు 'ఆడిన మాటెల్ల నమృతకావ్యమును, పాడిన పాటెల్లఁ బరమగానమును' గాఁజొచ్చినవి. అతడు తిరుపతియాత్రకు బయనమై కతిపయ దినములకు తిరుపతి చేరుకొని దిగువ తిరుపతినుండి వేకువజామున బయలుదేరి కొండమీది కెక్కి పోయెను. తెలియక చెప్పుకాళ్లతో గొండ నెక్కుచు బడలి యాతడు మోకాళ్ల ముడుపు దగ్గఱ వెదురుపొద క్రింద నొక బండపై మైమరచి నిదురించుచుండగా నలమేలు మంగాంబ యాతనికి దర్శనమిచ్చి చెప్పులు విడిచి కొండ నెక్కుమని తెలిపి యంతర్ధానము చెందెనట. అతడు మెలకువగొని యాశ్చర్యమంది యాశుకవితగా నమ్మవారిమీద నొక శతకమును జెప్పెను. అన్నమయ్య కొండమీది కెక్కిపోయి స్వామిని సందర్శించి యచ్చటనే యుండి కొన్నాళ్లు గురు శుశ్రూష చేయుచుండెను. అతని గురు డేవో దివ్యోపదేశములు చేసి యింటికి బొమ్మనగా తనకొరకు వెదకికొనుచు తిరుపతికి వచ్చిన తన తల్లి వెంట నింటి కేగెను. ఇంటి కరిగిన వెనుక నతనికి తిరుమలమ్మ, అక్కలమ్మ యను ఇరువురు కన్యలను పెండ్లిచేసిరి. పిదప నాతడు తాళ్లపాకయందును, తిరుపతియందును, అహోబలము నందును నివసించుచు స్వామిమీద ననేక శృంగార సంకీర్తనములను రచించెను. అహోబలమున ఆదివన్ శఠకోప యతీంద్రునికడ నాతడు వేదాంత శాస్త్రము నధ్యయనము గావించెను. ఆ కాలముననే యాతడు వాల్మీకిరామాయణమును సంకీర్తనాత్మకముగా వెలయించెను. అతని సంకీర్తన పద్ధతి జగన్మోహనమై లోకమున ప్రఖ్యాతి కెక్కెను. అది విని సాళువ గుండ నరసింహరాయ డాతని దర్శన మపేక్షించి వచ్చెను. అప్పు డతడు దండనాయకుడై టంగుటూరిలో నివసించుచుండెను. అత డన్నమాచార్యుని వేడుకొని యాతనిని దనవెంట టంగుటూరికి బిలుచుకొని పోయెను.

రాయడును, అన్నమయ్యయు మిక్కిలి స్నేహముతో టంగుటూరిలో నివసించు చుండిరి. ఇంతలో నరసింగ రాయడు విజయనగర రాజ్యము నాక్రమించుకొని ప్రభువయ్యెను. ఒకప్పుడు నరసింగరాయడు తన బాల్యస్నేహితుడయిన అన్నమయ్యను పెనుగొండకు రావించుకొని సంకీర్తనములు పాడి వినుపింపుమని కోరగా అన్నమయ్య పాడి వినిపించెను. వానిని విని రాయ డానంద పరవశుడై యాతనిని మిక్కిలి సత్కరించెను; పచ్చల కడియాలు మొదలుగా నాభరణాంబరాదు లొసగి యాదరించెను. రాజాదరము పొందుచు అన్నమయ్య కొన్నాళ్లందే యుండగా నొకనాడు నరసింగరాయ డాతనిని బిలిపించి స్వామివారిపై నాతడు రచించిన శృంగార సంకీర్తనములు కొన్ని పాడి వినుపింపగోరెను. అన్నమయ్య కొన్ని సంకీర్తనములు పాడెను. రాయడు గర్వించి వేంకటపతిమీది పదములవంటి పదములు తనమీదను జెప్పుమని అన్నమయ్యను కోరగా నాతడు 'హరి ముకుందునిఁ గొనియాడు నాజిహ్వ నిను గొనియాడంగనేర' దని చెప్పి తిరస్కరించెను. రాయ డందుపై గోపించి యాతనికి మూరు రాయర గండ మను పేరుగల సంకెల వేయించి చెరసాలలో

బెట్టించెను. అప్పు డన్నమయ్య 'ఆకలివేళల నలపైన వేళ లను' నిత్యాది సంకీర్తనలతో స్వామిని స్తుతించి సంకెల వదలించు కొనెను. అన్నమయ్య మాహాత్మ్యమున కచ్చెరు వంది నరసింగరాయడు శరణువేడి యాతని యనుగ్రహము నర్థించెను. పెనుగొండనుండి తిరిగి తిరుపతికి వచ్చిన పిదప అన్నమయ్య స్వామి సన్నిధిని సంకీర్తనము జేయుచు నెన్నో మహిమలు చూపెను. అతడు వృద్ధుడై యుండగా కర్ణాట భాషలో వేలకొలది సంకీర్తనములను రచించి ప్రఖ్యాతి వహించిన శ్రీ పురందరదాసుడు అన్నమాచార్యుని దర్శింప వచ్చి యాతని సంకీర్తనములు విని తనిసి నీవు వేంకటేశ్వరుని యవతారమవేయని సన్నుతింపగా అన్నమాచార్యుడు పురందరదాసుని సంకీర్తనములను విని నీవు శ్రీ పాండురంగ విట్ఠలుని యవతారమవేయని సన్నుతించెనట. అన్నమాచార్యుని రచనములను సంకీర్తనము లనియు, తదితరము లనియు రెండు తెరగుల విభజింప వచ్చును. అన్నమాచార్యుడు యోగ వైరాగ్య శృంగార మార్గములలో ముప్పదిరెండు వేల సంకీర్తనములను జెప్పె నని యన్నమాచార్య చరిత్ర మున గలదు.



చిత్రము 124. అన్నమయ్య

ఇతని యితర రచనము లను సంస్కృతభాషా రచనము లనియు, నాంధ్రభాషా రచనము లనియు దిరిగి రెండు విధముల విభజింపవచ్చును.

సంస్కృతభాషా రచనములు : 'వేంకటాచల మాహాత్మ్యము' అన్నమాచార్య చరిత్రమున '....దివ్య భాష నావేంకటాద్రి మాహాత్మ్య మంతయును గావించి' యని కలదు. దానినిబట్టి యాతడు సంస్కృతమున వేంకటాచల మాహాత్మ్యమును రచించెనని తెలియుచున్నది.

వరాహపురాణాదుల లోనిదిగా సంఘటితమయి నేడు నాగరాంధ్రాక్షరములలో ముద్రితమై వ్యాప్తిగాంచి యున్న వేంకటాచల మాహాత్మ్యము నాడు తాళ్లపాక అన్నమాచార్యుడు రచించినది యయినను గావచ్చును. అన్నమాచార్యుని కుమారుడగు పెదతిరుమలాచార్యుడు స్వామి సన్నిధిని వేంకటాచల మాహాత్మ్యమును బఠించుటకుగాను అనంతాచార్యు లనువారికి గొంత జీవిక యేర్పరచెను. అది తన పితృదేవులయిన యన్నమయ్య రచన మన్న యభిమానముచే జేసినదయిన గావచ్చును. అంతకు బూర్వమే యాస్థలమాహాత్మ్యము గలదని నిరూపింపబడునంతదాక నది అన్నమాచార్య రచితమని తలంచుట యసంగతము కాదు.

సంకీర్తన లక్షణము : అన్నమాచార్యుని మనుమడగు చిన తిరుమలయ్య తన సంకీర్తన లక్షణమున అన్నమాచార్యుడు సంస్కృతమున సంకీర్తన లక్షణమను నొక గ్రంథమును రచించె ననియు, దానిని దన తండ్రియగు పెద తిరుమలాచార్యుడు వ్యాఖ్యానించె ననియు, వాని ననుసరించి తాను తెలుగున సంకీర్తన లక్షణము వెలయింతుననియు చెప్పెను. ఇదియే అన్నమాచార్యుడు సంస్కృతమున సంకీర్తనలక్షణ మనుగ్రంథమును రచించె ననుట కాధారము. కాని యది నేడు లభ్యమగుటలేదు.

తెలుగు గ్రంథములు : 1. ద్విపద రామాయణము. అన్నమయ్య వాల్మీకి రామాయణమును సంకీర్తనాత్మకముగా దెలుగున రచించిన ట్లాతని జీవిత చరిత్రమున బేర్కొనబడినది. ఇది దానికంటె భిన్నమయిన రచనము. ఈతని ద్విపదరామాయణము నేడు గానరాదు; 2. శృంగార మంజరి; ఇది భాషచే, భావముచే శృంగార సుందర మయిన మంజరీచ్ఛందోమయ రచనము. శృంగారమంజరి రచించి అన్నమయ్య దానిని తిరువేంగళనాథ దేవునికి విన్నపము సేయగా నత డాతని ననుగ్రహించెను; 3. వేంకటేశ్వర శతకము : అన్నమాచార్యుడు 'శతకముల్ పదిరెండు సకల భాషలను బ్రతిలేని నానా ప్రబంధముల్ చేసె'నాడని యన్నమాచార్య చరిత్రమున గలదు. కాని యాతడు రచించిన శతకములలో వేంకటేశ్వర శతక

మొకటి మాత్రము నేడుపలబ్ధమగుచున్నది. అది అన్నమయ్య కొండ నెక్కుచు నాళువుగా జెప్పిన శతకము. 'వేంకటేశ్వరా' యని పద్యాంత సంబోధన మున్నను నీతిశతకమున ప్రతిపద్యమును అలమేలు మంగాంబికా ప్రస్తుతిపరమే. ప్రబంధ రత్నావళిలో నిందలి పద్యములు కొన్ని యుదాహరింపబడినవి.

అన్నమయ్య రచించిన తక్కిన పదునొకండు శతకములు నేయే వేల్పులమీద రచితములయ్యెనో వాని పేళ్లేమో యెరుగరాదు (చూ : వాగ్గేయకారులు). తి. కో. రా.

**అప్పకొండాచార్యుడు, కందాడై :** ఇతడు కృష్ణాతీర నివాసి. ఇతని తండ్రి అప్పలాచార్యుడు, తల్లి లక్ష్మి. ఇత డరువది గ్రంథములను రచించెనట. వానిలో మానసోల్లాసమను మనుస్మృతి వ్యాఖ్య, సిద్ధాంతసారము, తత్త్వ నిర్ణయము, కుదృష్టి భంగము, తత్త్వామృతము, విశిష్టాద్వైత నిర్ణయము, తత్త్వనిష్కర్ష, సజ్జనామృతము, రహస్యత్రయ సారార్థము, మాయిభంగము అనునవి మాత్రము తెలియవచ్చు చున్నవి. ప. రా. స్వా.

**అప్పయాచార్యుడు, బొమ్మకంటి :** ఈతడు రేచెర్ల కుమారసింగ భూపాలుని యాస్థానకవులలో నొకడు. క్రీ. శ. పదునాలుగవ శతాబ్ది కడపటిభాగమున నుండెను. ఈతడు అమరసింహ విరచితమైన అమరకోశమునకు అమర కోశ వ్యాఖ్య యనుపేర నొక వ్యాఖ్య రచియించెను. ఈ వ్యాఖ్య వలన ఈతనికి మారపోత నామాంతర మున్నట్లు తెలియుచున్నది. ప్రాయికముగా ఈతని పూర్తినామము పోతప్పయ్య కావచ్చును. అదియే జన వ్యవహారమున అప్పయ్యయైనదేమో. ప. రా. స్వా.

**అమరము :** అమర మనునది విజయనగర యుగమునను, తదనంతరము కొంతకాలమును దక్షిణభారతమున వాడుకయం దుండిన భూస్వామ్య పద్ధతికి పేరు. అమరము అమరు అను ధాతువునుండి యుత్పన్నమైనదని కొందరు చెప్పుదురు కాని యది అంగీకరింపదగినది కాదు. వాస్తవముగ నిది అమ్ర్ అను పార్శీమాట నుండి యేర్పడిన తెనుగుపదము. అమ్ర్ అనగా ఉత్తరువు, ఆజ్ఞ, యని అర్థము. ఇప్పటివలె నప్పుడును వాడుకయం దుండిన న్యాయ నిబంధనముల ప్రకారము దేశములోని భూమి కంతటికిని రాజ్యాధిపతియే యొడయడు; వాస్తవముగ భూమి యెవ్వరి స్వాధీనమునం దుండినను వారికి దాని యందుగల హక్కు లన్నియు నతని ప్రసాదమువల్ల లభించినవే; రాజుయొక్క ముఖ్యకర్తవ్యములలో రాజ్య సంరక్షణ ప్రధానమైనది. రాజ్య సంరక్షణకు సైన్య మవశ్యము. ఇప్పటివలెకాక జీత నాతములను రాయభండారమునుండి ఇచ్చి రాజు సైన్యము నంతటిని స్వయముగ భరించువాడు కాడు. కొంత సైన్య మాతని యాధిపత్యము క్రింద నుండెడిది. దీనికి కైజీతపు బలమని పేరు. ఇదియే రాజనీతి గ్రంథములలో పేర్కొనబడిన షడ్విధబలములలో ప్రధానమైన మూలబలము. కాని దేశ సంరక్షణకు వలసిన బలములో చాల భాగమును రాజు కొలువునందలి నాయకులు సమకూర్చి పోషించి, వలసినపుడు యుద్ధకార్యములకు సంసిద్ధము చేయవలసి యుండెను. ఇట్లు నాయకులచే సమకూర్చబడిన బలములపై వారే ఆధిపత్యము (అమ్ర్)ను వహింపవలసి యుండెను. వీరికి అమరనాయకులని పేరు గల్గెను. దేశసంరక్షణార్థము రాజుయొక్క నియోగమున అమరనాయకులు సమకూర్చి పోషించు బలమున కగు వ్యయమును భరించుటకయి ధనమునకు ప్రత్యామ్నాయముగ వారికి రాజు తగు మాత్రము భూమి నిచ్చువాడు. ఇట్లీయబడిన భూమికి అమరమని పేరు. నే. వెం. ర.

**అమరావతి :** ఇది గుంటూరుజిల్లా సత్తెనపల్లి తాలూకాలో ఈశాన్యదిశను కృష్ణానది దక్షిణతీరమున గల గ్రామము. ఇచ్చటి అమరేశ్వరాలయము వలననే ఈగ్రామమునకు ప్రసిద్ధి. ఈ దేవాలయ మెంతటి ప్రాచీనమైనదో తెలిసికొనుట కాధారములు లేవు. కాని ఈ స్థలము వేయి సంవత్సరములకు పూర్వము నుండియే శైవ క్షేత్రముగా ప్రఖ్యాతి వహించిన దనుట కాధారముకలదు. పూర్వ చాళుక్యరాజుల కాలములో ఇది కాలాముఖ శైవస్థానమై అమరవటేశ్వరమని వ్యవహరింప బడుచు వచ్చెను (చూ : 'శైవము'). ఎట్లయినను ఇప్పటి అమరేశ్వరాలయమును, అమరావతి యను పేరును అర్వాచీనము లయినవే. అమరావతికి ధనకటకము, ధాన్యకటకము, ధాన్యవాటి అనునవి పూర్వపు పేరులు. దీనికి ధరణికోట, దన్నడకోట, ధరణాలకోట అనికూడ మధ్యయుగమున వ్యవహారముండెను. క్రీ. శ. 17 వ శతాబ్ది వరకు గల అమరేశ్వరాలయము నందలి శాసనము లన్నిటిలోను ఈ గ్రామమునకు పైనుడివిన పేరులే కలవు. ధనకటకాది నామములతో నొప్పిన గ్రామము ఇప్పటి అమరావతి కిరుగుననే ఉండెడిది; పూర్వ మది ఆంధ్ర - సాతవాహన రాజుల కాలములలో గొప్ప వైభవము ననుభవించిన నగరము. అది వారి రాజధాని. అప్పు డిది చిన్న శివారుపల్లె. క్రమముగా ఆ నగరము కాలప్రభావమున శిథిలమై జనశూన్యమైనది. ఇట్లుండగా పదునెనిమిదవ శతాబ్దమున ఈ ప్రాంతము నేలుచుండిన రాజా వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడుగారు ఇచ్చటి కించుక ఎగువను కృష్ణాతీరమున నున్న తమ చింత





చిత్రము 124 అ. స్త్రీ, పురుషుల వేషభూషణాలంకరణములు, అమరావతి శిల్పము





716 ఆ

చిత్రము 124 ఆ. స్త్రీ, పురుషుల వేషభూషణాలంకరణములు, అమరావతి శిల్పము

పల్లికోట విడిచిపెట్టి 1796 లో ఇక్కడికి వచ్చి దీనిని తమ ప్రధాన నివాసస్థలము చేసికొని ఇచ్చట స్థిరముగ నివాస ముండదలచినవారికి నివేశ స్థలముల నిచ్చి ఇప్పటి అమరావతీ గ్రామమును రూపొందించిరి. నాటి నుండియే దీని కమరావతి యనుపేరు వాడుకలోనికి వచ్చినది. అమరావతి పంచారామములను శైవ పుణ్యక్షేత్రములలో నొకటి. ఇప్పటికి వేయి సంవత్సరములనుండి యిది పంచారామములలో నొకటిగ పరిగణితమైనట్లు శాసనముల వలన తెలియుచున్నది. మ. సో. శ.

**అమరావతీ స్తూపము, కళ :** అమరావతికి అమరేశ్వరాలయము వలననే కాక కళావిషయకముగ కూడ ప్రఖ్యాతి కలిగినది ఇక్కడి స్తూపమును బట్టి. భూగర్భితమైన ఈ స్తూప మెప్పు డే విధమున మరల బయట పడినదియు, దీని యాకృతి ఎట్లుండినదియు ఇదివరకే తెలుపబడినది (చూ : పుటలు 69-70). ఈ స్తూపపు రాలమీద చెక్కియున్న శాసనములందలి లిపి పరిణామము ననుసరించి చిత్రకారు లీ నిర్మాణ మొక్కమారుగకాక నాలుగు దశలలో క్రీస్తుకు పూర్వము కొన్ని శతాబ్దములకు ముందు ప్రారంభమై క్రీస్తుశకము తొలిశతాబ్దులలో పూర్తియైనట్లు చెప్పుదురు.

ప్రారంభదశనాటి శిలాఫలకములు కొన్నిటిమీద శాసనములు మాత్రమును, మరికొన్నిటిమీద చిత్రములు మాత్రమును, వే రొకకొన్నిటిమీద ఈ రెండును కలవు. ఈ చిత్రము లించుమించుగా భార్హూతు స్తూప చిత్రములను పోలియుండుటచేత ఇవి యా స్తూపకాలము (క్రీ. పూ. 200) నాటివని యూహించు చున్నారు. శాసన లిపి ఆధారమున క్రీ. పూ. చివరి శతాబ్దములోనో, క్రీస్తుశకము ప్రారంభ శతాబ్దములోనో మలచినవనదగు శిల్పచిత్రములు కొన్ని యున్నవి. ఈ చిత్రములలో బౌద్ధాంధ్ర శిల్పి బుద్ధుని పొత్తిళ్ళు, బోధివృక్షము, ధర్మచక్రము, సింహాసనస్థ పాదుకాపూజ, స్తూపము అను సంకేతముల రూపమున సూచించెను. ఈ చిత్రములు స్తూప ప్రాకార శిల్ప చిత్రములకు పూర్వపువని కళావిదుల యభిప్రాయము. స్తూపము చుట్టుగల ప్రాకారరేఖ మూడవదశలో క్రీస్తుశకము ద్వితీయ శతాబ్దోత్తర భాగమున నిర్మింపబడిన దందురు. దీనిని ఆంధ్ర-సాతవాహన మహారాజు ఆదరణమున మహాయాన బౌద్ధ సంప్రదాయ స్థాపకులైన ఆర్య నాగార్జునాచార్యులవారు నిర్మించిరని తిబెత్తు దేశగాథలు తెలుపు చున్నవి. ఈ ప్రాకారరేఖలోని శిలలు వెలుపలి వైపునను, లోపలివైపునను కూడ చిత్రవిచిత్రములైన ఆలంకారిక కల్పనలతోను, మనోహరములైన శిల్ప చిత్రములతోను నిండియున్నవి. వేదిక చుట్టు అతికింపబడిన చిత్ర శిలాఫలకము లన్నియు నాలుగవ దశ నాటివి. ఈ శిలాఫలకముల మీది చిత్ర సంపద శ్రేష్ఠ మయినదని కళావిమర్శకుల అభిప్రాయము.

బౌద్ధమతము వ్యాపించిన కాలమునందు బుద్ధభక్తు లనేకులు మ్రొక్కుబడి చైత్యములనో, చైత్యశిలాఫలకము లనో, చైత్యమునకు సంబంధించిన శిల్పచిత్రాలంకృత ఉష్ణీష శిలలనో, సూచులనో, కంబములనో దానము చేయుచు వచ్చిరి.

అమరావతీ స్తూప శిల్ప చిత్రములలో చాలభాగము బుద్ధుని పూర్వజన్మ కథలకును, బుద్ధుని జీవితగాథలకును సంబంధించినవే. ఒక్కొక్క జాతకకథను, ఒక్కొక్క గాథను చదరముగగాని, దీర్ఘ చతురస్రముగగాని యుండు ఒక గడిలోనో, పెక్కు గడులలోనో చెక్కుచు వచ్చిరి. ఈ స్తూప శిలలలో గండరించిన దేవ, మానవ ప్రతిమలు కొయ్య బొమ్మలవలె బిర్రబిగిసికొని యుండక, మార్దవ సౌకుమార్యములు గలిగి సుఖగతితో నొప్పారుచుండును. అమరావతీ స్తూపశిల్పములోని స్త్రీచిత్ర రచన అత్యద్భుతమైనది. ఒక స్త్రీ చిత్రమును పోలిన దిం కొకటి ఎంత వెదకినను కానబడదు. స్త్రీ చిత్రములలో నంతటి వైవిధ్య మున్నది. స్త్రీ చిత్రములును, పురుష చిత్రములును కూడ రసానుగుణముగ వివిధ భావస్ఫోరకములై జీవకళ లుట్టి పడుచుండును. కాల, మానముల కతీతుడైన దివ్యపురుషు డగుట వలన అమరావతీ శిల్పమున తొలికాలమున సంకేత రూపమున సూచింపబడిన బుద్ధుడు తరువాతి కాలమున బౌద్ధమతములో వచ్చిన మార్పువలన మానవ రూపమున చిత్రింపబడెను. అమరావతీ శిల్పము నందలి బుద్ధవిగ్రహమునకును, గాంధార శిల్పములోనిదానికిని చాల దగ్గర పోలికలు కల వనియు, అందువలన ఆంధ్ర శిల్పులు గాంధార దేశమునందలి గ్రీకు రోమను శిల్పుల నాదర్శముగా బెట్టుకొని దానిని మలచి రనియు కొంద రందురు. కాని ఇది సరియైన యభిప్రాయము కాదు. అమరావతీ శిల్పమున బోధిసత్వ విగ్రహములను, సామాన్య మానవ విగ్రహములను చక్కగా గండరించుట నేర్చిన శిల్పికి బుద్ధ విగ్రహమును మలచుట తెలియదనుట అతని కపచారము చేయుట. అట్లని అమరావతీ శిల్పములో గ్రీకు కళా ప్రభావము ఏమాత్రము లేదని చెప్పుటకు వీలులేదు. గ్రీకు-గాంధార శిల్పమునందలి మనోహర పరికల్పనములను, రీతులను దీసికొని వానిని బౌద్ధాంధ్ర శిల్పి తనవి చేసికొని వానికి తెలుగుతనమును సంతరింపజేసినాడు. ఎరువు తెచ్చుకొన్న యేవో కొద్ది కల్పనలు, వివరములు తక్క

## స్తూపప్రాకార చిత్రములు



చిత్రము 1. ఊర్ధ్వపటము, వెలుపలివైపు



చిత్రము 2. స్తూపశిల, లోపలివైపు



చిత్రము 3. సూచీశిల్ప చిత్రము, లోపలివైపు



చిత్రము 4. వెలుపలివైపు, దిగువభాగము



చిత్రము 5. ఊర్ధ్వపటము, లోపలివైపు

అమరావతీ శిల్పకళలో విదేశీయ మనునది చాల తక్కువ. అమరావతీ శిల్పమున కళాచాతుర్యమును విశదముచేయు పద్ధతియు, రీతియు భార్హుతు, సాంచీ శిల్పకళా సంప్రదాయముల వికాసమే. భార్హుతు మొదలైన చోట్ల శిల్ప చిత్రములు వట్టి కథలుగానే యుండ అమరావతిలో అవి విశిష్ట గుణములను సంతరించుకొని కావ్య ప్రశస్తి వహించినవని గొప్ప కళాభిజ్ఞుల యభిప్రాయము. ఆ కాలము నాటి భారతీయ శిల్పకళ కంతకు అమరావతీ కళ శిరోభూషణ మనియు, దీని కాకాలమున సాటివచ్చునది భారత దేశములో మ రెచ్చటను లే దనియు కళాకోవిదులు వ్రాసియున్నారు. ఈ కారణము చేతనే భారతీయ శిల్పమున అమరావతీ రీతియని యొక విశిష్ట సంప్రదాయ మేర్పడినది. ఆంధ్ర దేశము నందలి బౌద్ధ శిల్పము ప్రధానముగా ఈ సంప్రదాయమునకు చెందినదే. మ. సో. శ.

**అహోబల నృసింహసూరి :** ఇతడు తెలుగు దేశపు వేగినాటి బ్రాహ్మణుడు; తండ్రి నారాయణసూరి; మైసూరు మహారాజగు మూడవ కృష్ణరాజ ఒడయరు ఇతని పోషకుడు. అభినవ కాదంబరి యను నామాంతరము కల త్రిమూర్తి కల్యాణమను గద్య కావ్యమును, నలవిలాస మను నాటకమును ఇతని రచనములు. ప. రా. స్వా.

**అళియ రామరాయలు :** (చూ: రామరాయలు, ఆరవీటి).

**ఆంజనేయశాస్త్రి, యలవర్తి** (క్రీ. శ. 1877-1914) **:** వీరు తెనాలి తాలూకా పెదరావూరు గ్రామమున వైదికాచారసంపన్నమగు విశ్వబ్రాహ్మణ కుటుంబములో జన్మించిరి; యజుర్వేద ప్రసిద్ధులగు శిల్పప్రవర్తకులు. సువర్ణబ్రహ్మ ఋషి వీరి గోత్రకర్త. వీరి తండ్రి బుచ్చయ్య; తల్లి లక్ష్మీదేవమ్మ. వీరు శ్రౌతస్మార్త క్రియాకాండలను, కొన్ని వేద పన్నములను అభ్యసించిరి. సంస్కృతములో కావ్యనాటకాలంకారాది సాహిత్యజ్ఞాన మలవడిన పిమ్మట, తర్క వ్యాకరణ వేదాంత శిల్ప వాస్తు ధర్మశాస్త్రములందు పాండిత్యమును గడించిరి. యోగ శాస్త్ర పరిజ్ఞానము, తదభ్యాసము వీరికి జన్మాంతర ప్రాప్తమైనవి. ఆంధ్రమున స్వయముగనే వలసిన జ్ఞానమును గడించి సంస్కృతాంధ్రములందు కవిత్వములను, ప్రవచనమునను వలతులైరి. యమనియమాద్యష్టాంగ యోగము, గాయత్రీమంత్రానుష్ఠానముతో గూడిన తపస్సు వీరికి వన్నె తెచ్చిన విద్యలైనవి. గృహస్థాశ్రమములో నున్నను, వీరు ఉదయము మొదలుకొని పదకొండు గంటలవరకును స్వకర్మానుష్ఠానముననుండి ఎవ్వరికిని దర్శన మిచ్చువారు కారు. శాస్త్రిగా రనేక వాస్తు గ్రంథములను క్రోడీకరించి తెలుగున వాస్తుసార సంగ్రహమను గ్రంథమును రచియించినారు కాని అది యముద్రితము. వీరు సంస్కృతమున సంధ్యావందన భాష్యమును వ్రాసి ప్రకటించిరి; విశ్వబ్రహ్మోపనిషత్తులు సంపాదించి తెలుగర్థముతో ప్రకటించిరి; యజుర్వేదములోని విశ్వకర్మ సూక్తాది మంత్రములు కొన్నిటికి సవిశేషములగు భాష్యములను వ్రాసిరి. వీరిచే పరిష్కృతమైన దైవజ్ఞస్మృతి అను ధర్మశాస్త్ర గ్రంథము కొంతభాగము ముద్రితమైనది. జానపాటి పట్టాభిరామ శాస్త్రిగారికిని, పంచాక్షైయులగు విశ్వబ్రాహ్మణులకును బ్రాహ్మణత్వమును గూర్చి గుంటూరు న్యాయస్థానములో జరిగిన పండిత వివాద సందర్భమున వీ రైదు దినములు శాస్త్రవాదము చేసి, పండిత సాక్ష్య మొసగి విశ్వబ్రాహ్మణుల బ్రాహ్మణత్వమును నిరూపించి గెలుపొందిరి. వీరు తమ (ద్వితీయ) భార్య సుందరమ్మగారి జీవనోపాధులకు వలసిన వసతుల నేర్పాటుచేసి తన యాస్తిని, గృహమును సర్వస్వ దక్షిణగా విశ్వబ్రాహ్మణ సంస్కృత పాఠశాలలకు దానముచేయుచు మరణశాసనము వ్రాసి యిచ్చిరి. కొం. వీ. రా.


చిత్రము 125.
ఆంజనేయశాస్త్రి, యలవర్తి.

**ఆంధ్రులు :** వీరు అతి ప్రాచీనులు. వీరిని గూర్చిన ఐతిహ్యాము ఐతరేయ బ్రాహ్మణములో కనిపించును. విశ్వామిత్రుని కొడుకు లేబదిమంది శాపహతులై ప్రత్యంత భూములగు వింధ్య సానుదేశాలలో అనార్యులైన పుళింద, పుండ్ర, శబర, మూతిబాదులతో గలసి వసించి ఆంధ్రజాతికి కారకులైనా రన్నది సారాంశము.

ఆంధ్రులు అశునదీ తీరవాసులు. క్రమముగా వారు గంగానదీ ప్రాంతాల కుదురుకొన్నారు. వారిలో బలిరాజు భార్య సుధేష్ణ దీర్ఘతమసుని వలన బడసిన అర్గురు కొడుకులలో ఆంధ్రు డనునాత డేలిన రాజ్య మాంధ్రమై, అచటి ప్రజ లాంధ్రులైనారని ఇది యొక భాగవత పురాణ గాథ. ఆంధ్రనామము ప్రజాదత్తమా, రాజదత్తమా అన్న ప్రశ్న ఒక పట్టున తీరునది కాదు.

జన సంకులములగు కృష్ణా గోదావరీ పరిసరభూములు ఆంధ్రపథమని పేర్వడిన వన్నది మాత్రము నిర్వివాదాంశము. నూతనముగ వచ్చిన ఆర్య సంస్కృతిని త్వరితముగ నలవరచుకొనుశక్తి ఆంధ్రుల కున్నంతగా ఇతర ప్రత్యంత జాతులకు లేదు; కావుననే ఔత్తరార్యులకు ఆంధ్రులు అంత సన్నిహితులైనారు. రామాయణ కాలమునకు జనస్థానమగు గోదావరీ తీర భూమి ద్రావిడార్య సంఘర్షణకు రంగభూమి యైనది. భారతయుద్ధ కాలమున ఆంధ్రులు కాళింగులతోపాటు దుర్యోధనుని కండయైనది ప్రసిద్ధమే.

ఆర్య సంస్కృతిని కాంక్షించే యీ ఆంధ్ర సంఘమును జైన, బౌద్ధములు ముంచెత్తినవి. 'అస్సక, ముళక'ల ప్రజలు ఆంధ్రులు పోదన (బోదన్), పటిట్ఠాన (ప్రతిష్ఠాన) ములు రాజధానులుగా నుండినవారు.

బహుకుటుంబములవారగు నీ ఆంధ్రులు దక్షిణాపథమున సామ్రాజ్య స్థాపకులై ముప్పది తరములవారు నాల్గు వందలేబదేండ్లు పాలించినారని పురాణము లుద్ఘోషించినవి. ఆ ముప్పదుగురు రాజులపేర్లును ఈయబడినవి. పురాణములలో వారినే ఆంధ్రులుగ, ఆంధ్రజాతివారలుగ, ఆంధ్ర భృత్యులుగ పేర్కొని యుండుటచే వారు సామ్రాజ్యాధినాథులు కాక పూర్వము మౌర్యులకు భృత్యులుగ నుండినా రన్నది సిద్ధము.

పురాణములలోని ఆంధ్ర రాజులపేర్లు, పాలనా క్రమములు సరిగ ఆ రీతిగనే దక్షిణాపథమును పాలించిన సాతవాహనుల శాసనములలో, నాణెములలో లభించినవి. పురాణములు వారిని సాతవాహను లనకున్నను, సాతవాహనుల శాసనములు వారిని ఆంధ్రు లనకున్నను వారికి వెలిగా ఆ పేరిట నింకెవరును కానరానందున ఆంధ్ర, సాతవాహను లభిన్నులనుట స్పష్టమే. ఆంధ్ర జాతికి చెందిన పలు కుటుంబములవారిలో సాతవాహన కులులు ఈ కారణమున ప్రప్రధానులైనారు. వారి శాసనములలో కుటుంబ నామమే ఉదాహరించినారు.

ఆంధ్ర - సాతవాహన రాజ్యము మొదట శ్రీకాకుళ, ధాన్యకటకములనుండి తరువాత పశ్చిమమునకు విస్తరించిన దని కొందరును, పశ్చిమమున అంకురించి తూర్పుగ వ్యాపించిన దని మరికొందరును వాదింతురు. కాని చంద్రగుప్త మౌర్యుని కాలమునకే సమష్టిగ ముప్పది దుర్గములు, లక్ష పదాతులు, రెండువేల గుర్రములు, వేయి ఏనుగుల మోహరింప గలిగిన ఆంధ్రజాతి సాతవాహన శ్రీముఖుని రాజ్య స్థాపన కాలమునకు దక్షిణాపథమున పూర్వాపరముల నెల్ల పర్వియుండుట ఆశ్చర్యము కాదు. ఓ. రా.

**ఆచార్య సూక్తిముక్తావళి :** నంబూరి కేశవాచార్య విరచితమైన శ్రీ వైష్ణవాంధ్ర ప్రబంధము. పన్నిద్దరాళ్వారులయు, నిత్యసూరులయు, ఇతర శ్రీ వైష్ణవాచార్యులయు దివ్యచరిత్రము లిందు విశదముగా వర్ణింపబడినవి. గురు పరంపరా ప్రభావము, దివ్యసూరి చరితము, ప్రపన్నామృతము, యతీంద్ర ప్రవణ ప్రభావము మున్నగు శ్రీ వైష్ణవ సంప్రదాయ ప్రతిపాదకములైన ఉద్గ్రంథముల సారభూతమని చెప్పదగిన ఈ ప్రబంధములో వైష్ణవ మతాచార్యుల జీవిత చరిత్రలేకాక వారి యుపదేశ సారముకూడ సుబోధముగా ప్రతిపాదిత మగుటచేత ఈ గ్రంథము వైష్ణవ సంప్రదాయ జిజ్ఞాసువుల కందరకు అత్యంతోపాదేయమైనది.

కవి గ్రంథాంతమున తన వృత్తాంతమును వ్రాసికొనెను. ఈయన మంగళగిరి సమీపమున నున్న నంబూరు నివాసి. ఇతని తండ్రి వేంకట కృష్ణాచార్యుడు; తల్లి అలమేల్మంగమ్మ; గురువు ప్రతివాదిభయంకరాచార్యులు. ఇతని కాలము ఇదమిత్థమని నిర్ణయింపవలనుపడకున్నను ఇతడు చాల అర్వాచీను డగుట మాత్రము స్పష్టము.

ఆచార్యసూక్తిముక్తావళిలో పూర్వభాగము, మధ్యభాగము, ఉత్తరభాగము అని మూడు ప్రధాన విభాగములు అందు పూర్వభాగము ఆరు ఉల్లాసములుగాను, మధ్యభాగము పండ్రెండు ఉల్లాసములుగాను, ఉత్తరభాగము ఆరు ఉల్లాసములుగాను విభక్తము లయినవి. ఈ ప్రబంధములో సగముకంటె నెక్కువ భాగమున ఉడైయవరుల (శ్రీమద్రామానుజాచార్యుల) వైభవమే వర్ణితమైనది. పూర్వభాగమందలి పంచమోల్లాసము మొదలు మధ్య భాగాంతమువరకు నడచిన కథ ప్రబంధమునకు మకుట స్థానీయమై భక్తిబంధురముగ నిర్వహింపబడినది.

శ్రీమద్రామానుజులకే ఈ ప్రబంధ మంకితము చేయబడెను. ధారా శుద్ధిగల సీసపద్యములే తరచు కూర్పబడినను అందందు ఇతర వృత్తములు కూడ విరళముగ వాడబడినవి. 'వాదిభీకరగురు డనె మోద మలర' అను పాదమును మకుటప్రాయము చేసి, ప్రబంధము నంతటిని స్వాచార్యవక్త్రకముగా కవి నిబంధించెను. బొ. శ్రీ.

**ఆదినారాయణశాస్త్రి, పంచాగ్నుల.** (క్రీ.శ. 1890 - 1951) : వీరు వెలనాటి వైదిక వంశీయులు. వీరిది భారద్వాజ సగోత్రము, ఆపస్తంబ సూత్రము, యజుశ్శాఖ. అలమేల్మంగా వేంకటేశ్వరులు వీరి తలిదండ్రులు; అన్నగారు దక్షిణామూర్తిశాస్త్రిగారు.

వీరి పూర్వులు నెల్లూరుజిల్లా ముక్తినూతులపాడు గ్రామవాసులు. ఆదినారాయణశాస్త్రిగారు క్రీ. శ. 1918

ప్రాంతములో మద్రాసుకు వెళ్లి ఆంధ్రపత్రికా కార్యాలయములో నుద్యోగిగా నుండిరి. మొదటి ఆంధ్ర పత్రిక ఉగాది సంచికలు వీరి పర్యవేక్షణముననే బయల్వెడలినవి. 1930 ప్రాంతమున వీరు మద్రాసులోనే ఆర్యభారతీ గ్రంథమాలను నెలకొల్పి కొన్ని సంస్కృత గ్రంథములను బ్రకటించిరి. తరువాత గొంతకాలమునకు బరంపురము కళ్లికోటరాజావారి కళాశాలలో నాంధ్ర పండిత పదవి నలంకరించి జీవితాంతము నచటనే యుండిరి.

శాస్త్రిగారు చక్కని రసజ్ఞులు, గొప్ప సాహిత్య విమర్శకులు, సంస్కృతాంధ్రములందేగాక ప్రాకృతమునందును మంచి పాండిత్యము సంపాదించినవారు. కావ్యతీర్థ బిరుద విరాజితులు, ప్రాచీన పద్ధతులలో విద్యాభ్యాస మొనర్చిన వారైనను నవీన దృక్పథము గలవారు.

సంస్కృత వాఙ్మయములోని సాహిత్య శాస్త్రీయ గ్రంథము లెల్లరకు గ్రాహ్యములై యుండునట్లు ప్రకటింపవలయునని వీరి యభిలాష. ఆ చూపుతోనే శాస్త్రిగారు 1. రాజశేఖరుని కావ్యమీమాంస; 2. వాత్స్యాయనుని కామసూత్రములు; 3. గౌతముని ధర్మసూత్రములు విశేషాంశములను జేర్చి సులభమగు నాంధ్ర వివరణముతో ఆర్య భారతీ గ్రంథమాల ద్వారమున బ్రకటించిరి. కౌటిల్యుని యర్థశాస్త్రమున కపూర్వ విశేషములతో దెనుగు వ్యాఖ్యయు, 'ఆంధ్ర లిపి పరిణామము'ను గూర్చి కూడ నొక గ్రంథమును రచించిరి. అవి యేమైనవో తెలియదు.

నవ్య సాహిత్యమునందును, వ్యావహారిక భాషయందును వీరికి మక్కువ యధికము. కీ. శే. గిడుగు వెంకట రామమూర్తి పంతులుగారికి చేదోడువాదోడుగా నుండి వ్యావహారిక భాషోద్యమమునందును, నవ్యసాహిత్య పరిషత్తువారితో చేతులు కలిపి నవ్యసాహిత్యాభివృద్ధి యందును శాస్త్రిగా రెంతయు గృషి యొనర్చి యనేకములగు వ్యాసములు వ్రాసిరి. వానిలో వ్యావహారిక భాషా వాదమును సమర్థించుచు గిడుగు వెంకట రామమూర్తి పంతులుగారి షష్టిపూర్తి సంచికలో వెలువరించిన 'ప్రాకృత వాఙ్మయమూ - ప్రజాసేవా' యను వ్యాసము వీరి ప్రాకృత భాషా పరిజ్ఞానమునకు నికషోపలము. 'ప్రతిభ' మొదటి సంచికలో వారు వ్రాసిన వ్యాసము నవ్య సాహిత్య స్వరూప స్వభావములను విపులముగను, విశదముగను నిరూపించుచున్నది. రెడ్డిరాణి పత్రికలో బ్రకటితములైన 'జైనుల మత కథలు' శాస్త్రిగారి వివిధ విషయక పరిజ్ఞానమును వెల్లడించుచున్నవి. అంతియ గాదు, 'ఎంకి పాట'లను గూర్చి రేగిన వాదోపవాదములలో వీరు ప్రధాన పాత్ర వహించి, వానిని సమర్థించుచు తత్ప్రాశస్త్యమును వెల్లడించి నవ్యుల మన్ననలకు పాత్రులైరి.

కొ. జో. శ.

**ఆదివాసులు :** ఆదివాసు లనగా మనదేశమున ఆర్య కాలమునుండి నివసించుచుండిన జాతులవారు. వీరిని ఆంగ్ల భాషలో ఎబొరిజినల్ ట్రైబ్సు అనియు, పర్వతముల మీదను, అడవులయందును నివసించుచుండినందున హిల్ ట్రైబ్సు (కొండజాతివారు), ఫారెస్టు ట్రైబ్సు (అడవి జాతివారు) అనియు వ్యవహరించుచున్నారు.

నివాసస్థలము, దుస్తులు, వారిస్వభావము : ఆంధ్ర ఆదిమ జాతులలో నీ క్రిందివారు ముఖ్యముగ పేర్కొనదగి యున్నారు: 1. కోందు లేక కంధ, 2. కోయ లేక కుయి, 3. కొండదొర లేక కొండకాపు లేక ఓజా, 4. పొరజ, 5. గదబ, 6. సవర, 7. చెంచు, 8. ఏనాది, 9. ఇరుళ లేక విల్లవన్, 10. ఎరుకల లేక కొరచ లేక కొరవ, 11. లంబాడి లేక బ్రింజారి, బనజారి, లేక సుగాలి, 12. జాతపు, 13. బగట, 14. గోండు. వీరిలో కోందులు గంజాము విశాఖపట్టణము జిల్లాలలోను, కోయలు, కొండదొరలు గోదావరి విశాఖపట్టణము జిల్లాలలోను తెలంగాణాలోను, పొరజలు, సవరలు, గదబలు గంజాం విశాఖ పట్టణము జిల్లాలలోను, చెంచులు మహబూబునగరు కర్నూలు గుంటూరు జిల్లాలలోను, ఏనాదులు నెల్లూరు గుంటూరు, చిత్తూరు జిల్లాలలోను. ఇరుళలు చిత్తూరు చెంగల్పట్టు ఉత్తరార్కాటు జిల్లాలలోను, జాతపు, బగట జాతులు విశాఖపట్టణము జిల్లా లోను, ఎరుకల, లంబాడివారు ఆంధ్ర జిల్లాలన్నిటి లోను, మైసూరు రాష్ట్రములోను నివసించుచున్నారు.

శుద్ధమైన ఆదిమజాతివారు కొండలమీదను, అడవులలోను, గుహలయందును, చెట్ల నీడలయందును నివసించెదరు. వారు పల్లపు భూములయందు నివసించువారిని చూచినయెడల పరుగెత్తి దాగికొనెదరు. వీరి గ్రామములు నదీనదముల సమీపమున గాని, వాగుల వంకల వెంబడిగాని నిర్మింపబడును. ఆదిమజాతుల గ్రామములు చిన్నవి. ఒక్కొక్క గ్రామములో పది లేక పదునైదు గుడిసెలకు మించి యుండవు. వానలో తల దాచుకొనుటకు వారు చిన్న పూరిగుడిసెలను వేసికొందురు. అవి వలయాకారముగనో లేక చతురముగనో ఉండును. గుడిసెలోనికి పోవుటకు ఇరుకైన పొట్టి గుమ్మములు తప్ప కిటికీలుగాని తలుపులుగాని ఉండవు. గుడిసెల గోడలు సామాన్యముగ మట్టితోనో, మట్టి పూసిన వెదురు తడికెలతోనో అమర్చబడును. ఈ యిండ్లు ఎదురెదురుగ రెండు వరుసలుగనో

లేక అర్ధచంద్రాకారముగనో నిర్మించబడును. వారికి ప్రయాణ వసతులు, రోడ్లు లేవు. అడవులలో సన్నని కాలి బాట యుండును. ఆ బాటలు కూడ వర్షాకాలములో గడ్డి మొలచి అగుపడవు.

ఇంటిపేరులు : ఆదివాసులలో ప్రతి జాతిలోను ఒక్కొక్క కుటుంబమున కొక్కొక్క ఇంటిపేరు (సెప్ట్) ఉండును. అది సామాన్యముగా ఒక జంతువు పేరుగనో, చెట్టుపేరుగనో యుండును : ఉదాహరణమునకు, నక్కల, మామిడి, గుర్రము, పాముల ఇత్యాదులు. ఒకానొకచోట అది నిర్జీవమైన వస్తువుగా నుండును. ఆ యా యింటిపేర్లు గల కుటుంబముల యొక్క పూర్వీకులకు ఆ పేరిటి వృక్షముతోగాని, జంతువుతో గాని, మరి ఇతర వస్తువుతో గాని ఏదో యొక సంబంధము కలదని చెప్పుకొను చుందురు. వానిని ఆ పేరుగల కుటుంబమువారు అతి గౌరవముతో పూజించెదరు. జంతువైన చంపరు. సామాన్యముగ దానిని భక్షింపరు. చెట్టును నరకరు. ఈ సంప్రదాయము ఆస్ట్రేలియా, ఉత్తర అమెరికా, ఆఫ్రికాజాతులలో కూడ నున్నది. ఒక యింటిపేరు గల కుటుంబమువారు ఆ యింటిపేరే గల కులమువారితో వివాహ సంబంధములు చేయరు. ఈ చెట్లు, జంతువులు 'టోటెమ్సు' అనియు, వానియందు నమ్మకము గల జాతులు 'టోటెమిస్టిక్ ట్రైబ్సు' అనియు ఆంగ్లమున వ్యవహరింపబడుచున్నవి.

వ్యవసాయము, ఆహారము, కొన్ని అలవాటులు : నిరాడంబరత్వము, సత్యమార్గావలంబనము, నిష్కల్మషత, సంతృప్తి, సంతోషము - ఇవి వీరి అలంకారములు. విల్లు, అంబులు, సన్నని పొడుగాటి గడ్డపార, టాంగి (ఒకవిధమైన గొడ్డలి) - ఇవియే వీరి ముఖ్యాయుధములు. ఉదయముననే పురుషులు తమ ఆయుధములను చేబూని ఆహార పదార్థములను సేకరించుటకై అడవులకు వెళ్లి పండ్లు, కందమూలములు, ఆకలములు, పక్షులు, వేట జంతువులు మున్నగు భోజనార్హమగు వస్తువుల నేవేని సేకరించుకొని, మధ్యాహ్నముననో, సాయంకాలముననో యిల్లు చేరెదరు. ఒక్కొకప్పుడు రెండు మూడు దినముల వరకు ఇంటికి రారు. కొండలమీదనే కొద్దిగా వ్యవసాయము చేసి వరి, జొన్నలు మొదలగు ధాన్యమును పండించెదరు. వారికి వ్యవసాయమునకు పశువులుగాని, నాగళ్లుగాని లేనందున వారి వ్యవసాయపద్ధతులకు, మన వ్యవసాయ పద్ధతులకు సంబంధము లేదు. వారిది 'పోడు' వ్యవసాయము అని చెప్పబడుచున్నది. కొండజాతులవారు హిందూ సంప్రదాయములను అలవరచుకొనుచు వచ్చిన కొలది నాగటి వ్యవసాయము వాడుకలోనికి వచ్చినది.

వారు కొండలలో చాల ఉన్నత ప్రదేశములందుండు తేనె తుట్టెలను చాల చాకచక్యముతో, మెలకువతో కొట్టి తెచ్చి తేనెను ఆహారముగ వాడెదరు; చేపలు, అడవి జంతువులు, ఎద్దులు, బర్రెలు, ఎలుకలు, బల్లులు, తొండలు, పాములు, కోతులు మొదలగువాని మాంసమును భుజింతురు; సంపాదించిన ఆహారమును దాచిపెట్టుటయన నెట్టిదో యెరుగరు. రేపెట్లు గడుచునా అను ఆలోచన వారి కేకోశమునందును ఉండదు. మద్యపానము చేయక వారు జీవించలేరు, చిన్నతనమునుండి బిడ్డలకు కల్లు త్రాగించెదరు; ఇప్పపూలతో గాని, బియ్యముతోగాని కల్లు తయారు చేసికొనెదరు. కొన్ని జాతులలో పొగాకు, నల్లమందు వేసికొను నాచారము లగపడుచున్నవి. ఈ కాలములో కూడ కొయ్యముక్కలయొక్క రాపిడి చేతనో, తెల్ల పలుగు రాళ్ల రాపిడిచేతనో నిప్పు చేయు జాతులవారు కొందరు ఉన్నారు.

జనసంఖ్య : ఆదిమజాతి వారి జనసంఖ్యను నిర్ధారణ చేసి చెప్పుటకు వీలులేదు. 1951 వ సంవత్సరము జనాభా లెక్కలనుబట్టి ఆదిమ జాతులు అన్నింటిలోని జనసంఖ్య నిర్ణయించుటకు ఆధారములు చాల తక్కువ. ఆ లెక్కలలో ప్రతి జాతియొక్క సంఖ్య ప్రత్యేకముగ లేదు. ఇండియన్ యూనియను అధ్యక్షులచేత 1950 వ సంవత్సరములో జారీచేయబడిన సంవిధాన చట్టము నందలి షెడ్యూల్డు జాతులకు సంబంధించిన నిబంధనల ప్రకారము కొన్ని జాతులు మాత్రమే ఆదిమ జాతులుగా పరిగణింపబడి అట్టి జాతులను షెడ్యూల్డు జాతుల క్రింద చూపినారు. ఆ జాతులవారు కూడ షెడ్యూల్డ్ ప్రదేశములకు చెందిన నిబంధనల ప్రకారము నమోదైన షెడ్యూల్డ్ ప్రాంతములలో నివసించిననే తప్ప వారికి చట్టములోని రక్షణలు అన్వయింపవు. కొన్ని షెడ్యూల్డ్ జాతులవారు సామాజికముగాను, ఆర్థికముగాను అభివృద్ధి పొంది, ఇతర హిందూ ఆచార వ్యవహారములను ఆచరించుచుండుట వలన అట్టివారు షెడ్యూల్డ్ జాతులలో చేర్చబడలేదు. ఆదిమ జాతులను కొన్నిటిని షెడ్యూల్డ్ జాతుల జాబితాలోనుంచి తొలగించి, షెడ్యూల్డ్ కులముల, అనగా హరిజనుల జాబితాలో చేర్చినారు. ఈ కారణము లన్నిటివలన ఆదిమవాసులకు సంబంధించినంతవరకు 1951 వ సంవత్సరపు జనాభా లెక్కలలోని జనసంఖ్యను ప్రామాణికముగ తీసికొనుటకు వీలులేదు.

విద్య : ఆదిమ జాతులకు నవీన విద్యా పరిచయము లేదు. పాఠశాలలు లేవు. భాషలకు లిపి లేదు. ఇప్పుడు సవర భాషకును, మరికొన్ని భాషలకును లిపి ఏర్పడినది. కొన్ని జాతులవారికి ఇరువదికి మించి సంఖ్యలను లెక్క

పెట్టుట కూడ తెలియదు. కాని వారికి నాగరికత, సంస్కృతి లేవని చెప్పుట సరికాదు. సత్యసంధత, కట్టుబాట్లతో గూడిన సంఘ నిర్మాణము, నిరాడంబర జీవనము, నిష్కల్మషత, పరధనాపేక్ష లేమి, దేహకష్టము, కళాభిమానము మొదలైన ప్రశస్త సుగుణములు వారికి వన్నె తెచ్చుచున్నవి.

ఆర్థికస్థితి : ఆదిమజాతులు అడవులలోని చిల్లర ఫలసాయమును (మైనర్ ఫారెస్టు ప్రాడ్యూస్), అనగా తేనె, మైనము, లక్క, చింతపండు, సారపప్పు, వెదురు ఇత్యాదులను మైదానములలోని వ్యాపారుల కిచ్చి వారివద్ద పూసలు, ఆభరణములు, ఉప్పు, వస్త్రములు మొదలగు పదార్థములను కొనుగోలు చేసెదరు. వారికి విద్యాగంధము లేనందున అడవిఫలసాయమును సర్కారువారివల్ల క్రొళ్లకు తీసికొనిన కంట్రాక్టర్లును, ఇతర వ్యాపారస్థులును వారిని మోసగించి వారి వస్తువులను హీనక్రయమునకు తీసికొని వారికి అప్పులు పెట్టి వడ్డీలకు వడ్డీలు పెంచి, ఋణస్థులనుచేసి, ఋణములలోనికి చెల్లుగా వారి భూములను స్వాధీనపరచుకొనుచున్నారు. ఇంతియకాక ఫారెస్టు, రెవిన్యూ, పోలీసు డిపార్టుమెంటుల అధికారులు కొండలమీదికి వెళ్లినప్పుడు ఆదివాసులవల్ల బలవంతముగా వెట్టిచాకిరి చేయించుకొనెదరు; మూటలు మోయించుకొనెదరు; దానికి ప్రతిఫలము చెల్లింపరు. షావుకారు లప్పిచ్చునప్పుడే తమబాకీలు తీరు పర్యంతము నౌకరి చేయవలసిన ఏర్పాటు చేసికొని మరికొంత పైక మప్పు డప్పుడు అప్పుగా నిచ్చుచుందురు ; వారి బాకీలు తీరలేదని చెప్పుచు అప్పుచేసిన వారి హయాములోనేకాక వారి సంతతివారి హయాములో కూడ వారివల్ల చాకిరి చేయించుకొనెదరు. ఇది యొక విధమగు బానిసతనము. ఏజెన్సీ గ్రామములలో 10 లేక 15 ఆదివాసుల గ్రామముల కొక ముఠాదారు డుండును. అతడు పలుకుబడిగల ధనవంతుడు. ఆ గ్రామములలోనివా రందరు ఆ ముఠాదారుని కవసరమైనపుడు నామకార్థపు ప్రతిఫలమునకు నౌకరీ చేయవలసియుండును ; అతని భూములను దున్నవలెను ; వాని మూటలు మోయవలెను ; అతని యింట పెండ్లి సమయములలో కట్నములు చెల్లించవలెను. వారు పనిచేసిన రోజున వారికి పెట్టబడు గంజినీళ్ళే వారికి కూలి. ఈ కారణములవల్ల ఆదివాసులు నానాటికి ఆర్థికముగ కడు దుస్థితికి వచ్చుచున్నారు.

సంస్కరణ, అభ్యున్నతి ప్రయత్నములు : ఆదిమజాతులలోని దుర్గుణములను పారద్రోలి, వారిని సంస్కరించి వారి కష్టములను నివారించి, వారి అభ్యున్నతికి సాయపడుటకు బ్రిటీషు ప్రభుత్వము మనఃపూర్వకముగ నెట్టి ప్రయత్నములు చేసియుండలేదు. తత్ఫలితముగా ఆదిమ జాతులలో అసంతృప్తి కలిగి అచ్చటచ్చట ప్రభుత్వముపై తిరుగబాట్లు జరిగినవి. ఆ ప్రభుత్వమువారు 1874 వ సంవత్సరములో 'షెడ్యూల్డ్ డిస్ట్రిక్ట్సు ఆక్ట్' అను చట్టమును అమలులో పెట్టిరి. ఆ చట్టమును మద్రాసు రాజధానిలోని అప్పటి గంజాము, విశాఖపట్టణము జిల్లాలలోని కొన్ని 'మాళయా' (కొండ ప్రదేశములకును), గోదావరి జిల్లాలోని కొన్ని భాగములకును వర్తింపజేసిరి. 1917 వ సంవత్సరములో ఆదివాసులను షాహుకార్ల బాధలనుండి తప్పించు నిమిత్తము వడ్డీలు తగ్గించుచు వారి భూములు హీనక్రయములకు అన్యాక్రాంతము కాకుండ కట్టుబాట్లు చేయుచు మద్రాసు ప్రభుత్వమువారు ఒక శాసనము చేసిరి. 1919 వ సంవత్సరములో ఇండియా ప్రభుత్వమువారు అడవిజాతులు నివసించు ప్రదేశములను స్థానిక ప్రభుత్వాధికారమునుండి పూర్తిగా మినహాయించిన ప్రదేశములు అనియు, కొంత భాగమే మినహాయించిన ప్రదేశములు అనియు విభజించి మొదటి తరగతి ప్రదేశములమీద గవర్నరుగారికి సంపూర్ణాధికారమును, రెండవ తరగతి వానిమీద శాసనసభలకు నియమిత అధికారమును కలుగజేసిరి. ఈ పద్ధతి కొద్ది మార్పులతో 1935 వ సంవత్సరపు ఇండియా చట్టములో చేర్చబడినది. పై చట్టముక్రింద కొన్ని ప్రదేశములలో ప్రైమరీ పాఠశాలలు, కొన్ని ఆసుపత్రులు స్థాపితమైనవి కాని అవి నామమాత్రమే. వానివలన ఆదివాసులలో మార్పు ఎక్కువగా కలుగలేదు.

స్వరాజ్య స్థాపనానంతరము 1950 వ సంవత్సరపు ఇండియా రాజ్యాంగ విధానములో ఆదిమజాతులవారు పది సంవత్సరములలోపల ఇతర జాతులవారితో సమాన స్థితికి వచ్చునటుల వారిని అభివృద్ధికి తెచ్చుటకై కొన్ని సౌకర్యములు కలుగజేయబడినవి.

అనధికార సంస్థలు కూడ ఆదివాసుల నుద్ధరించుటకై సేవ చేయుచున్నవి. వీనిలో ముఖ్యముగా చెప్పదగినవి : 1. రామకృష్ణ మిషను సంఘము, 2. క్రైస్తవ మిషనరీ సంఘములు. క్రైస్తవ మిషనరీలు ఆదివాసులలో ప్రచారము కావించి వారిలో కొద్దిమందిని తమ మతములో కలుపుకొన గలిగిరి. శ్రీ ఠక్కరు బాబా అను పేరు ప్రతీతిగల శ్రీ అమృతలాల్ విఠల్ ఠక్కరుగారు 1927 వ సంవత్సరములో గుజరాతులో పంచమహలు జిల్లాలో భిల్లుజాతివారికి 'భిల్లు సేవామండలులు' స్థాపించిరి. అప్పటి నుండి ఇతర రాష్ట్రములలో గూడ ఆదిమ జాతులకు సేవ

చేయ ప్రారంభించిరి. ఆంధ్ర రాష్ట్రములో విశాఖపట్టణము, గోదావరి, నెల్లూరు జిల్లాలలో ఈ యుద్యమమును ప్రోత్స హించిరి. 1948 వ సంవత్సరములో ఢిల్లీలో 'భారతీయ ఆదిమజాతి సేవక సంఘము'ను స్థాపించిరి. ఈ సంస్థయు మహాత్మా గాంధీచేత స్థాపింపబడిన 'హరిజన సేవక సంఘ' పద్ధతులమీదనే నడపబడుచున్నది. భారత దేశాధ్యక్షు లైన డాక్టరు రాజేంద్రప్రసాదుగారే ఈ ఆదిమజాతి సేవక సంఘమునకు అధ్యక్షులు. ఈ సంఘమునకు ముగ్గురు కార్యదర్శు లున్నారు. వారిలో నిద్దరు ఆంధ్రులు. భారతీయ ఆదిమజాతి సేవక సంఘము ఆదివాసుల నాగరికత సంస్కృతి నాట్యకళ సద్గుణములు సదా చారములు చెడకుండ కాపాడుటకును, వారి ఆర్థికస్థితి బాగుపరచు నిమిత్తము వారు సేకరించు అటవీ ఫలసాయ మును సరియైన ధరలకు అమ్ముకొనుటకును, వారి జీవితా వసరములను సరియైన ధరలకు కొనుగోలు చేయుటకును సహకార సంఘములను స్థాపించుట, రోడ్లు నిర్మించుట మొదలగు నిర్మాణ కార్యక్రమమును గాంధీపద్ధతులమీద జరిగించు చున్నది. భారతీయ ఆదిమజాతి సేవక సంఘ మునకు అనుబంధముగా భారత దేశమున 26 సంఘములు పనిచేయుచున్నవి. వాటిలో నాలుగు ఆంధ్ర జిల్లాలలో నున్నవి: 1. ఆంధ్రరాష్ట్ర ఆదిమజాతి సేవక సంఘము, నెల్లూరు, నెల్లూరుజిల్లా, 2. ఆంధ్ర శ్రామిక ధర్మరాజ్య సభ, కొవ్వూరు, గోదావరి జిల్లా, 3. ఆంధ్ర ఎరుకల మహా సంఘము, ఈపూరుపాలెం, గుంటూరు జిల్లా, 4. చెంచు మహాసంఘము, గురజాల, గుంటూరు జిల్లా. దో. రం.

**ఆనందగజపతి** (క్రీ. శ. 1850 - 1897): వీరు విశాఖపట్టణ మండలము నందలి విజయనగర సంస్థానమును పాలించిన పూసపాటి వంశజులు. ఈ పేరు వహించిన వారిలో ఈయన రెండవవాడు. ఈ వంశములోని విజయ రామగజపతియే ఫ్రెంచి గవర్నరగు బుస్సీతో నేకమై బొబ్బిలి కోటను ముట్టడించినది. ఈయన తరువాత ఆనంద గజపతి, ఆయన పుత్రుడు నారాయణ గజపతి, ఆయన కుమారుడైన మూడవ విజయరామ గజపతి రాజ్యమేలిరి. ఈయనకు (రెండవ) ఆనందగజపతి, సీతారామరాజు అను ఇద్దరు పుత్రులు, ఒక పుత్రిక జన్మించిరి. రెండవ ఆనంద గజపతి క్రీ. శ. 1850వ సంవత్సరములో జన్మించెను.

ఆనందగజపతికి విద్యాభ్యాసోచిత వయస్సు రాగానే అశ్వారోహణ, శరీరవ్యాయామాదులందే కాక ఆంధ్ర గీర్వాణాంగ్లేయ పారశీకాది భాషల యందును, సంగీతము నందును మిగుల సమర్థులగు శిక్షకులను నియమించి తండ్రి గారు ఆయనను పండితునిగా జేసిరి. ఆ కాలమందు ఆంధ్ర దేశమున మహాపండితులని పేరుగన్న హరిశాస్త్రిగారు ఆనందగజపతికి గీర్వాణ విద్యాగురువు; బహుభాషా విశా రదుడు లింగం లక్ష్మాజీ పండితుడు ఆంగ్లవిద్యా శిక్షకుడు.

తండ్రిగారు ఆనందగజపతికి పదునెనిమిదవయేట ఉప నయనము గావించి ఇరువదవయేట వివాహము చేసిరి. పిమ్మట లోకానుభవ సంపాదనకై ఆనందగజపతిని తండ్రి తనతో భరతఖండోత్తర దేశపర్యటనకై తీసికొని వెళ్ళిరి. ఇట్లు సకల భాషలందు, శాస్త్రములందు, కళలందును ఆరితేరి లోకానుభవజ్ఞుడైన ఆనందగజపతిప్రభువు తండ్రి గారి తరువాతరాజ్యమును స్వీకరించి, ఆయనకన్న రాజ్య పాలన యందు మిన్న అనిపించుకొనుటలో అబ్బుర మేమియు లేదు. తల్లి దండ్రులయందు భక్తి, స్వాశ్రితుల యందు అను రక్తి, దీనులయందు దయ ఆనందగజపతి యొక్క విశిష్ట గుణ ములు. క్షమావంతుడు, పరమధార్మి కుడు, సర్వవిద్యా పారంగతుడు అగు నీ రాజు సర్వదా పండిత మండలీ పరివృతుడై విద్యా గోష్ఠియందు కాలము గడపుచుం డెడివాడు. ఈయన అధికార కాలమందు పాఠశాల లభివృద్ధి చెందినవి; తన యా స్థానమందు దిగ్దంతుల వంటి పండితులను



చిత్రము 126.
ఆనందగజపతి

పోషించుచు వారిచే షడ్దర్శనములకు తెలుగున వ్యాఖ్యాన ములు రచియింపించెను; సవ్యాఖ్యాన ఋగ్వేద సంహిత ముద్రణమునకై మేక్స్ ముల్లరుకును, వాచస్పత్యనిఘంటు రచనకు తారానాథ తర్కవాచస్పతికిని భూరి విరాళ ముల నిచ్చెను. 'విజయనగర సంస్కృత సీరీజ్' అను అము ద్రిత గ్రంథశ్రేణిని ముద్రించుటకు చాల ధనము వెచ్చించెను.

ఈయన చాలకాలము ప్రభుత్వ శాసన నిర్మాణ సభను అలంకరించెను; ఆ సమయమున దరిద్ర బ్రాహ్మణులను పీడించుచున్న కన్యాశుల్కమను దురాచార నిర్మూలనకు శాసనసభయందు ఒక చట్టమును ప్రవేశపెట్టుటకు యత్నిం చెను. కాని ఆ ప్రయత్నము విఫలమైనది.

విజయనగరమందు సుప్రసిద్ధ వీణావాదకులగు గురు రాయాచార్యుల రమణదాసుగారి కీ మహారాజు వీణా

గురువని చెప్పిన మహారా జెంత గానవిశారదుడో బోధపడును. ఆంధ్ర గీర్వాణ భాషలం దనర్గళముగా కవనము చెప్పుట, కావ్యవస్తు విషయములను అలంకార ఔచిత్య దృష్టితో విమర్శించుట - వీనియందు ఆనందగజపతి అత్యంత ప్రగల్భుడు. శాసన నిర్మాణసభా కార్యార్థియై మదరాసుకు పోయినపుడెల్ల తన పండిత బృందము నీతడు వెంట గొనిపోవువాడు. ఈయన పండిత గోష్ఠిని దర్శించిన పండితులు, పామరులుకూడ ఈయనను నూతన విద్యాభోజుడని కీర్తించువారు. ఈయన విద్వత్సభ నలంకరించిన వారలలో భగవత్కవి ముదుంబై నరసింహస్వామి, అపర జైమిని యనబరగు కొల్లూరి కామశాస్త్రి, మండా చిట్టి కామశాస్త్రి, ఈయన కుమారుడు లక్ష్మీకామశాస్త్రి, పేరి వెంకటశాస్త్రి, ఈయన పుత్రుడును వ్యాకరణశాస్త్ర పారంగతుడునగు పేరి కాశీనాథశాస్త్రి, హరికథాపితామహుడగు ఆదిభట్ల నారాయణదాసు ప్రఖ్యాతిని గన్నవారు. ఆనంద గజపతి కుండెడు విద్యాపక్షపాతమును, వదాన్యతను తెలుపు గాథ లనేకము గలవు. ఈయన పోషణయందే తండ్రిగారిచే నెలకొల్పబడిన ఆంగ్లకళాశాల ఫస్టు గ్రేడు కాలేజీగా అభివృద్ధిని గాంచినది. కలకత్తాయందు బౌబజారు వీథిలో 'ఇండియన్ అసోసియేషన్ ఫర్ ది అడ్వాన్స్‌మెంటు ఆఫ్ సైయన్సు' అను సంస్థ యున్న భవనము, అలహాబాదు విశ్వవిద్యాలయములోని సెనెట్ హాలు, మద్రాసులోని విక్టోరియా మెమోరియల్ భవనము ఆనంద గజపతి యొసగిన విరాళములచే వెలుగు జూచినవి. విజయనగరమందు విశ్వవిద్యాలయమును స్థాపించుటకు సంకల్పించుకొని, ఆ సంకల్పము కార్యరూపము దాల్చక పూర్వమే ఆనంద గజపతి దివంగతుడయ్యెను. మే. వ. న.

**ఆనెగొంది :** ఇప్పటి కర్ణాటక రాజ్యమందలి రాయచూరు జిల్లాలో తుంగభద్ర ఉత్తర తటమున హంపీ విరూపాక్ష క్షేత్రమున కెదుట నుండు నొక చిన్న పట్టణము. ఆనెగొంది యనగా నేనుగుగొంది - సందు అని అర్థము. ఏనుగులవలె కానవచ్చు మూడు కొండల కూడలి యందుండుటచే దీని కాపేరు వచ్చెను. క్రీ. శ. 14 వ శతాబ్ది ప్రథమపాదమున బళ్ళారి మండలములోని కుమ్మఠము రాజధానిగ ఈప్రాంతదేశము నేలుచుండిన కంపిలిరాయ లను రాజు మూడేనుగుల సంధి అను పేరుగల ఈ కొండల కూడలియందు శత్రుజన దుర్గమమైన హాసమలె దుర్గమును నిర్మించెను. కాని ఆనెగొంది యను పేరే దీనికి రూఢిగా నిలిచిపోయినది. తరువాత హరిహర బుక్కరాయలు హిందూ స్వాతంత్ర్య పునరుద్ధరణకై నూతన రాజ్యమును స్థాపించినపుడు ఆనెగొంది మొదట వారికి రాజధాని యాయెను. క్రీ. శ. 1336 లో విద్యారణ్య స్వామివారి యాదేశము చొప్పున విజయనగరమును నిర్మించి వారు తమ రాజధాని నచ్చటికి మార్చుకొన్నను దాని ప్రాధాన్యమునకు లోటు వాటిల్లలేదు. ఇది కుంజరకోన, హస్తినావతి యను పేరులతో వర్ధిల్లి, హంపి హస్తినావతి రాజ్యమునకు ముఖ్యస్థాన మయ్యెను. రక్షసి-తంగడి యుద్ధానంతరము క్షీణ దశకు వచ్చినను ఇది అళియరామరాయల సంతతివారికి నెలవైయొప్పినది. కాని పూర్వోన్నతి దానికి మరల కలుగలేదు. నే.వెం.ర.

**ఆముక్తమాల్యద :** ఇది క్రీ. శ. 1509 మొదలు 1529 వరకు విజయనగర సామ్రాజ్యమును పాలించిన శ్రీకృష్ణదేవరాయలు రచించిన ఏడాశ్వాసముల ప్రౌఢ ప్రబంధము. గోదాదేవి అను శ్రీవైష్ణవి పుణ్యజీవితగాథ ఇందలి ప్రధానేతి వృత్తము. నిత్యము తండ్రి కట్టెడి తోమాలెలను ముందు తాను ధరించి చూచి పిమ్మట వానిని మన్నారు స్వామికి సమర్పించుచుండుటచే గోదాదేవికి 'ఆముక్తమాల్యద' అను పేరు వచ్చెను. 'ఆముక్తమాల్యద' అనగా ధరించిన మాలికలను ఇచ్చునది అని అర్థము. గోదాదేవి చరిత్రమే గాక ఆమె తండ్రియగు విష్ణుచిత్తుని (పెరియాళ్వార్)కథ, ఖాండిక్య కేశిధ్వజోపాఖ్యానము, యామునాచార్యుల కథ, మాలదాసరికథ కూడ ఆనుషంగికముగ ఇందు గ్రథితములయినవి. ఇది ఆంధ్రభాషలోని ప్రౌఢప్రబంధములలో నొకటి. బొ. శ్రీ.

**ఆర్యదేవుడు** (క్రీ. పూ. 20 - క్రీ. శ. 100) **:** బౌద్ధ ధర్మ ప్రవర్తకులలో పదునాల్గవవాడగు శ్రీఫలుని కుమారుడు ఆర్యదేవుడు. ఇతడు దేవుడని, స్థవిర దేవుడని, కాణ దేవుడని పేర్కొనబడినాడు. ఈ కడపటి పేరితనికి కలుగుటకు కారణములు వివరించు గాథలు పెక్కుగలవు.

ఇతని జన్మదేశమెద్దియో నిశ్చయముగ తెలియదు. కొన్ని బౌద్ధ గ్రంథములలో సింగల (సింహాల)మని కలదు; మరి కొన్నిటియందు అది ధాన్యకటకమునకు ఉత్తర దిగ్భాగమున నుండెనను సూచనలు కలవు. గుంటూరు ప్రాంతమే సింగలమని కొందరు అభిప్రాయ పడుచున్నారు. మచిలీపట్టణపరిసరములం దితడు జన్మించెనని తలచుట కవకాశము కలదు. కాని ఆర్యదేవుని సింగలము ఎక్కడ కలదో తెలియదు. యువాన్ చ్వాంగ్ దీనిని తక్షశిలకు దక్షిణముగా 120 మైళ్లలో నున్న దనుటయేకాక ఆర్యదేవుడు 'చిషిష్ట్జుకువో'కు చెందినవాడనికూడ వ్రాసినాడు. తోస్సే అను ఫ్రాన్సు దేశపు విమర్శకుడు ధాన్యకటకమునకు దగ్గరగా సింగల ముండవలె ననినాడు. ఈ

సింగలమే సగాలమని వాడెల్ మతము. నేటి గుంటూరు మండలమే సింగలమని లాడెన్ లా అభిప్రాయము.

కంబుగ్రామమున స్థవిరదేవుని ధర్మోపదేశములను విని వొహారక్ తిస్సయను సింహాలపు రాజు ఐదు విహారములను బాగుచేయించెనని, అసురవిహారమున మహాతిస్స ఆర్యదేవుని ఉపదేశములకు ఆనందించి అతనికి మచిలీపత్తన మున భోజన సదుపాయములను కావించెనని 'మహావంశ' మను గ్రంథములో కలదు. దీనివలన ఆర్యదేవుడు సింహాల దేశమునకు ధర్మప్రచారమునకై పోయెనని చెప్పవలెను.

ఆచార్య నాగార్జునునివద్ద విద్య నభ్యసించుటకు ఆర్యదేవుడు వచ్చెనని కుమారజీవుడు, యువాన్ చ్వాంగ్ చెప్పుచున్నారు. నాగార్జునునివద్ద మాధ్యమిక సిద్ధాంతములను అభ్యసించిన సమయమున నలందా విద్యాలయమున గల పండితులను వాదములలో జయింప గల్గిన వైదిక దార్శనికులు బయలుదేరిరి. వీరి వాదములను అరికట్ట వలసినదను ప్రార్థనలు నాగార్జునుని వద్దకు రాగా ఆర్యదేవుడు బయలుదేర సిద్ధపడెను కాని తన శిష్యు డెంత వరకు వాదములో నిలువగలడో పరిశీలింపదలచి నాగార్జును డతనితో వాదమునకు దిగెనట. ఆ వాదములో నద్వితీయ ప్రతిభను చూపుటచే గురువుచే ననుజ్ఞాతుడై ఆర్యదేవుడు వెళ్లి మాధ్యమిక సిద్ధాంతములను మరల స్థాపింప గల్గెనని గాథ లున్నవి.

ఆర్యదేవుడు మాధ్యమిక బౌద్ధుడు. ఇతని సిద్ధాంతములకు, నాగార్జునుని సిద్ధాంతములకు భేదము కలదని విద్వాంసులు కొందరు ఆ కాలమున ఎంచినారు. ఇట్టి భేదమేమాత్రము లేదని ఉభయుల గ్రంథములను వ్యాఖ్యానించిన ఆచార్య చంద్రకీర్తి వ్యక్తపరిచినాడు. నాగార్జున మతానుయాయి అయినను స్వతంత్ర ప్రజ్ఞతో మాధ్యమికమును ప్రచారము గావించినవాడు ఆర్యదేవుడు. మాతృచేట, రాహులభద్రు లితని శిష్యులు. అశ్వఘోషుడుకూడ ఇతని శిష్యుడని కొన్నియెడల చెప్పబడియున్నది.

బోధిసత్త్వ యోగాచార చతుఃశతకము, శతశాస్త్రము, భ్రమప్రమంథనహేతుసిద్ధి, హస్తబలమను మాధ్యమికకారికావ్యాఖ్య అనునవి ఆర్యదేవుని గ్రంథములు. వైదికావైదిక దర్శనములను తీవ్రపరీక్షకు గురిచేసి మాధ్యమిక దర్శనమును నిలబెట్టిన గ్రంథములు ఇవి. వీనిలో చతుఃశతకములోని చివరి తొమ్మిది అధ్యాయములు సంస్కృతీకరింపబడినవి.

జగమున భాసించు వస్తువు లన్నియు స్వభావశూన్యము లని, ప్రత్యక్షాదిప్రమాణములకు స్వతఃప్రామాణ్యముగాని పరతఃప్రామాణ్యముగాని కుదురజాలవని ప్రపంచించు న్యాయ, వైశేషిక, సాంఖ్యదర్శనములను తీవ్రముగా విమర్శచేసిన శతశాస్త్రము ముఖ్యమైన గ్రంథము. వైదిక దర్శనములలోగల మోక్షవాదము, హీనయానికులు చెప్పు నిర్వాణము సరియైనవి కావని భ్రమప్రమంథన హేతుసిద్ధి వివరించుచున్నది. **పో. సు. శా.**

**ఈదుల్ అజ్ హా (బక్రీద్)**: బఖరీద్ (బఖర్ + ఈద్) అను అరబీ శబ్దము వాడుకలో 'బక్రీద్' అయినది. బఖరీద్ ఒక ముస్లిమ్ పండుగ. దీని అసలుపేరు 'ఈ దుల్ అజ్ హా'. ఇది వాడుకలో 'ఈదుజ్జుహా' అయినది. ముస్లిమ్ నెల జిల్ హజ్జా పదవతేదినాడు ఈ పండుగ వచ్చును. పశ్వాలంభనము (ఏదేని పశువును బలియిచ్చుట) ఈ పండుగనాడు జరగు ముఖ్యకర్మకాండ. 'ఈదుల్ అజ్ హా' అనగా 'బలి నిచ్చు పండుగ' అని అర్థము.

ఇబ్రాహీమ్ (బైబుల్ భాషలో అబ్రహామ్) ప్రవక్త తన కుమారుడగు ఇస్మాయీల్ను బలి ఈయబోయిన సంఘటనకు జ్ఞాపకార్థముగ శ్రీ మొహమ్మద్ ప్రవక్త ఈ పండుగను ప్రవర్తింపజేసెను. శ్రీ మొహమ్మద్ ప్రవక్త ఇబ్రాహీమ్ వంశమున జన్మించెను. అంతేకాక ఇబ్రాహీమ్ మతమునే తాను పునరుద్ధరించితినని ఆయన వక్కాణించెను. మక్కానగరమును స్థాపించినది ఇబ్రాహీమ్ ప్రవక్త. ఆ పట్టణమునందలి సుప్రసిద్ధ ప్రార్థనాలయము 'కాబా'ను కట్టినది తండ్రి కొడుకులగు ఇబ్రాహీమ్, ఇస్మాయీలులు. ఇస్లామ్ మతప్రమాణములలో మొదటి అధ్యాయమును తెరచినది ఇబ్రాహీమ్ ప్రవక్త అని ఖుర్-ఆన్. ఈ గ్రంథములో ఇబ్రాహీమ్ ప్రవక్త ప్రవర్తింపజేసిన పెక్కు ఆచారములు, ఏర్పరచిన పెక్కు నియమములు వివరింపబడినవి. అందుచేతనే మొహమ్మద్ ప్రవక్త వానిని తన మతానుయాయులకు విధివిహిత మొనర్చెను.

ఇబ్రాహీమ్ ప్రవక్త తన కుమారుని బలి యిచ్చిన ఉపాఖ్యానము ముస్లిమ్ గ్రంథములలో ఈ క్రింది విధమున కలదు. ముస్లిమ్ గ్రంథము లనుటకు కారణము అదే ఉపాఖ్యానము క్రైస్తవ గ్రంథమగు పాతనిబంధన (ఓల్డ్ టెస్ట్మెంటు)లో కొద్ది మార్పులతో నుండుటయే. బైబుల్లో బలి యియ్యబడిన కుమారుడు ఇస్మాయీల్ కాక 'ఇస్ హాల్ గా' అని పేర్కొనబడినాడు.

ఇస్మాయీల్ బలి కథ యిది: ఒకనాడు ఇబ్రాహీమ్ వింతకల గనెను. దేవుడు కలలో ఇట్లు ఆజ్ఞాపించినట్లు ఆయనకు తోచెను. 'ఓ ఇబ్రాహీమా! నీవు నన్ను నిజముగా ప్రేమింతువేని నీ కుమారుని నా కర్పింపుము' అని. ఇబ్రాహీమ్ నిద్రనుండి మేల్కొని దేవుని ఆజ్ఞను భార్యకు వినిపించెను. లేకలేక కలిగిన ఏకైకపుత్రు డనియైన ఆమె

వెనుకాడక 'దేవుని ఆజ్ఞ నెట్లు జవదాటగలము? ఆలస్యము చేయక వెంటనే భగవదాజ్ఞను నెరవేర్పుడు' అని మగనిని త్వరపెట్టెను. ఇబ్రాహీమ్ తన స్వప్న వృత్తాంతమును కుమారునితో కూడ చెప్పెను. ఆ యువకుడు ఇంచుకంతయు చలింపక 'నాయనా! భగవదాజ్ఞను శిరసా వహింతురుగాక!' అనెను. ఇబ్రాహీమ్ కొడుకును వెంటబెట్టుకొని 'మీనా' అను కొండ నెక్కి కుమారుని భగవంతున కర్పించుట కుద్యుక్తుడయ్యెను. కత్తి పుత్రుని కుత్తుకపై పడుచుండగా భగవదాజ్ఞచే దేవదూతలు ఇస్మాయీలును వధ్యస్థానమునుండి తొలగించి ఆయన స్థానమున ఒక గొర్రె నుంచిరి. ఇబ్రాహీమ్ కత్తి దానిపై పడెను. దేవుడు ఇబ్రాహీమ్ భక్తికి మెచ్చి 'ఓ ఇబ్రాహీమా! నీ భక్తికి మెచ్చితిని. నీవు నాకై నీ సర్వస్వమును అర్పించినవాడవైతివి. అందుచే నేటినుండి నాకు మిత్రసముడవు (ఖలీలుల్లాహ్)' అని పలికెను.

ఇబ్రాహీమ్ మతానుయాయులు నాటినుండియు దీని జ్ఞాపకార్థముగా ఏదో ఒక జంతువును భగవంతునకు బలియిత్తురు. 'ఆ జంతువుల రక్తమాంసములు దేవుని ఎంతమాత్రమును చేరవు. నీ ధర్మాసక్తియే దేవుని చేరుచున్నది' అని ఖుర్-ఆన్ వ్రాక్రుచ్చుచున్నది.

బలి ఇచ్చునపుడు ఈ క్రింది అర్థముగల మంత్రమును చదువుదురు.

'మహామహిమాన్వితుడగు దేవునిపేర నా ప్రార్థనలు. నాబలి, నా జీవితము, నా మరణము అంతయు సర్వేశ్వరుడగు దేవునకే. దేవుని సర్వేశ్వరత్వమున భాగస్వామి లేడు. నే నిట్లు ఆజ్ఞాపింపబడితిని. సర్వస్వము దేవునకు సమర్పించినవారిలో (ముస్లిములలో) నేను ఒకడను'.

బలిపశువు వికలాంగము కానిదై ఉండవలెను. బలిపశువు మాంసమును మూడు భాగములు చేసి ఒక భాగము పేదలకియ్యవలెను; ఒక భాగము బంధువుల కియ్యవలెను; ఒక భాగమును ఇంటివా రుపయోగింతురు.

ఇబ్రాహీమ్ ప్రవక్త ప్రశంస బైబుల్‌లో పెక్కుచోట్ల కలదు. యూదులు ఇబ్రాహీమ్ ప్రవక్తను తమ మూల పురుషునిగ భావింతురు. ఓల్డ్ టెస్ట్‌మెంట్‌లోని 'జెనిసిస్' అను అధ్యాయమున (XI, 27—XXV, 11) ఈ ప్రవక్త కథ కలదు. ఇబ్రాహీమ్ ఒక నూతన మత ప్రవర్తకుడై తన దేశమును, ప్రజలను విడిచి తన అనుయాయులతో విదేశములకు పోయెను. దేవుడు ఆయన నొక క్రొత్తదేశమునకు పొమ్మని ఆజ్ఞాపించెను. ఆయన మతప్రచారము చేయుచు దేశదేశములు తిరిగి తుదకు 'కెనాన్' దేశమున నివాసమేర్పరచు కొనెను. అక్కడ ఆయనకు ఇస్‌హాక్, ఇస్మాయీల్ అను నిరువురు పుత్రులు కలిగిరి. ఇస్మాయీల్ బలిగాథ అక్కడనే జరిగినది.

ఇబ్రాహీమ్ ప్రవక్త క్రీ. పూ. 1550 ప్రాంతమున కెనాన్ దేశమును ప్రవేశించి ఉండవచ్చునని చరిత్రకారుల అభిప్రాయము.

మొ. ఖా. ఖా.

**ఈశ్వరమ్మ :** ఈమె బ్రహ్మవాదిని. వీరబ్రహ్మగురుని పెద్ద కుమారుడగు గోవిందయ్య కూతురు; పదునేడవ శతాబ్ది చతుర్థపాదమున ఈమె కందిమల్లయ్యపల్లెలో జన్మించినది. ఈమె బ్రహ్మంగారు సమాధినిష్ఠుడైన పిమ్మట పుట్టినదని కొందరును, ముందు పుట్టినదని కొందరును భావించుచున్నారు. ఈశ్వరి ఆదిశక్తి అవతారమని తచ్ఛిష్యులయు, భక్తులయు విశ్వాసము.

వేదాంత విజ్ఞాన ప్రచారమునకును, సంఘ సంస్కార కార్యాచరణమునకును ఈశ్వరి వివాహమును మానుకొని జీవితాంతమువరకు బ్రహ్మచారిణియై యుండినది. అగ్రజాతులలో స్త్రీలు బ్రహ్మచారిణులుగా నుండుట ఆనాటి సమాజాచారము కానందువలన సాంఘికముగా పెక్కు ఇక్కట్టులను వీరికుటుంబ మానాడు అనుభవింపవలసి వచ్చినది. తనపై నపప్రచారము చేసిన వారినే ఈమె తన ప్రియశిష్యులనుగా మార్చుకొని కృతార్థులను చేసిన ఘట్టము లెన్నియో గలవు.

తాతగారివలె నీమెయు కొంత 'కాలజ్ఞానము' వ్రాసియు, అనేకములగు తత్వములను, ఏలలను, పద్యములను రచించియు, తత్త్వసాహిత్యమును జనతా సులభము చేసినది. సాధారణముగా వీరబ్రహ్మము, సిద్ధప్ప, ఈశ్వరమ్మగారల కవిత్వము అన్యాపదేశముగ నుండి మర్మలక్షణములతో నొప్పుచుండెను.

స్త్రీల నుద్దేశించి ఈశ్వరీదేవి చెప్పిన తత్త్వములలో 'నడిమి కంటిలోన నారాయణు డుండె నాతులారా, మదుగులో దీపము మరి వెలుగుచున్నది మగువలారా' మున్నగునవి ప్రముఖములైనవి.

ఈశ్వరమ్మ వేదాంత ప్రచారముచేసి క్రీ. శ. 1770 వ సంవత్సరములో పితామహునివలె కందిమల్లయ్యపల్లెలోనే శరీరము త్యజింపగా అచ్చటనే సమాధి చేయబడినది. ఈమె కేఏట నచ్చట ఆరాధనోత్సవములు జరుగుచుండును.

కొం. వీ. రా.

**ఉమర్ అలీషా** (క్రీ. శ. 1885 - 1945) : వీరు పీఠికాపురమున జన్మించిరి. వీరి తండ్రిగారు మహర్షి మొహియుద్దీన్ భాషాగురువర్యులు. వీరి జనని చాంద్ బీబీ.

వీరి తండ్రి అరబ్బీ, పారశీక, సంస్కృతాంధ్రములలో పండితులు; ఆధ్యాత్మిక విద్యాపీఠాచార్యులు; ఆత్మవిద్యా పారంగతులు. వీరి కుటుంబము పూర్వము నుండియు భాషా పాండిత్యములకును, ఆధ్యాత్మిక విద్యా సంపత్తికిని ప్రఖ్యాతి కాంచినది. అలీషా గారు చిన్ననాడే సంస్కృతాంధ్రములను విశేషముగ అభ్యసించిరి; తదుపరి అరబ్బీ, పారశీకాంగ్ల భాషలను నేర్చిరి. వీరు ఆంగ్లమున వ్రాయుట, మాటాడుట యెరుగుదురు కాని ఆంగ్లపద్య కావ్యము లందు ఎంతమాత్రము వీరికి ప్రవేశము లేదు. వీరు సహజకవులు; తమ 14వ వర్షముననే తెనుగున ధారాళముగా కవిత్వము చెప్పిరి; 18 వ యేట 'మణిమాల' అను నాటకము వ్రాసి అచ్చొత్తించిరి. వీరి కనేకులు ఉద్యోగములు ఇచ్చెదమని ఆహ్వానించినను వానిని అంగీకరింపక భాషా సేవ, దేశసేవ చేయుచు తమ జీవితమును గడపిరి. వీరు 1934 వ సంవత్సరము డిసెంబరు నెలలో అఖిల భారత శాసనసభకు సభ్యులై ఆ పదవిని జీవితాంతము వరకు వహించిరి.



చిత్రము 127.
ఉమర్ అలీషా

వీరు ఇస్లాం మతస్థులు; వీరి మాతృభాష ఉర్దూ. వీరు తెనుగున సరసముగ కవిత్వము చెప్పగల సమర్థులు. వీరు రచించిన గ్రంథము లేబదివరకు నున్నవి. అందు ముఖ్యమైనవి: నాటకములు — మణిమాల, విచిత్ర బిల్హణీయము, చంద్రగుప్త, మహాభారత కౌరవరంగము, అనసూయాదేవి, కళ; పద్యకావ్యములు - ఉమర్ ఖయ్యామ్, మహమ్మద్ ప్రవక్త చరిత్రము, సూఫీ వేదాంత ధర్మము, సర్గమాత, ఖండకావ్యములు, బ్రహ్మిణీదేవి. ఇవికాక వీరు రచించిన పెక్కు నవలలు, పారశీక గ్రంథముల తర్జుమాలు, వ్యాసములు కలవు.

వీరు తమ శిష్యులకు దర్శన మిచ్చుటకై నరసాపురము (ప. గో.) వెళ్ళి అచ్చట దివి నలంకరించిరి. మొ.క.షా.

**ఉమాకాంతము, అక్కిరాజు** (క్రీ. శ. 1889 - 1932) : విస్తృతమైన భారతీయ సంస్కారములో అంతర్భాగమైన తెనుగు సంస్కారాన్ని అఖండ రూపములో మననంచేసి ఆరాధించిన మహామహులలో శ్రీ ఉమాకాంత విద్యాశేఖరు లొకరు. చాలవరకు స్వయంకృషివల్లనే విద్య నార్జించారని చెప్పవచ్చును వీరు వంగదేశములో నవద్వీప సంప్రదాయాన్ని అనుసరించి భాష్యాంతముగా సంస్కృత వ్యాకరణమూ, తర్కశాస్త్రమూ అభ్యసించి, 'విద్యాశేఖరు' లైనారు; తమ తర్క-వ్యాకరణ విద్యావ్యాసంగాన్ని వంగదేశములో జరుపుతూ వచ్చారు; వంగ సాహిత్య వేత్తలతో సాహచర్యంవల్లా, లోకజ్ఞానంవల్లా, స్వానుభవంవల్లా, వంగ సాహిత్యాభ్యుదయానికి గల కారణాలను వివేకంతో సూక్ష్మంగా పరిశీలించడంవల్లా తమకు గలిగిన జ్ఞానాన్ని ఆధారంగా తీసికొని తమ మాతృభాష అయిన తెనుగును పరామర్శించడం ఆరంభించారు.

వారు శ్రీ వావిలికొలను సుబ్బారావుగారి తర్వాత మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాలలో అధ్యాపకులుగ పనిచేశారు; కొంతకాలం వావిళ్ళవారు నడిపిన 'త్రిలిఙ్గ' పత్రికకు సంపాదకులుగ ఉన్నారు. లౌకిక దృష్టితో చెప్పుకోదగిన సంఘటన లేవీ ఆయన జీవితంలో లేవు. పాండిత్యానికి తగిన శరీర దార్ఢ్యం ఆయన కెన్నడూ లేక పోయింది. నలభై మూడేండ్లు నిండీ నిండకముందే జీవన యాత్ర చాలించారు.

ఈ అల్పకాలంలోనే ఆయన వ్రాయదలచినవీ, వ్రాసినవీ సూత్రప్రాయంగా వ్రాసి విస్తరింపదలచినవీ గ్రంథాల పేర్లను ఉదాహరిస్తే సర్వతోముఖమైన ఆయన వాఙ్మయ జిజ్ఞాస మనకు విశదమౌతుంది. టిప్పుసుల్తాను అనే నవల, పల్నాటి వీరుల కథలు, షేక్స్పియరు నాటక కథలు, త్రిలిఙ్గ చిన్న కథలు వారు సరళమైన శైలిలో వ్రాసినవి. ఇవి వారి రచనా పరంపరలో మొదటి ఘట్టానికి సంబంధించినవి. పరిశోధించి సలక్షణంగా ప్రచురించిన పల్నాటి వీరచరిత్ర తెనుగువారి వీరగాథలను గూర్చి ఆ ద్విపదకావ్యమునకు వారు వ్రాసిన చక్కని పీఠిక. అలంకార శాస్త్రానికి



చిత్రము 128.
అక్కిరాజు ఉమాకాంతం

సంబంధించిన రసమీమాంస, ఆంధ్ర చంద్రాలోక వివరణమూ, సంస్కృత వ్యాకరణ ప్రదీపమూ, ఆంధ్ర వివరణమూ, పాణినీయమూ తరువాతవి. నైషధతత్త్వజిజ్ఞాస, తెలుగుదేశమునందలి చండాలురు అనేవి మరికొన్ని. వృత్తిసహితంగా వారు వ్రాయడానికి ఆరంభించిన తెలుగు భాషా వ్యాకరణం పూర్తికాలేదు. వారి కృతులలోకల్లా సూత్రాత్మకంగా వ్రాసిన వాఙ్మయదర్శనం ప్రధానమైనది. దానిలో నేటి కాలపు కవిత్వం అనే అధ్యాయానికి తప్ప తక్కిన భాగాలకు వివృతి వ్రాయకుండానే వారు తమ జీవితం చాలించారు. వారు చేసిన వాఙ్మయ పరిశీలనలో నేటి కవులలో దోషాలనే ఎక్కువగా పరిగణనం చేసి గుణగణనం చేయకపోవడంవల్ల వారియెడల మనలో ఒక విధమైన వైముఖ్యం ఏర్పడింది. కాని వారు చేసిన ముఖ్యమైన ఆక్షేపణలకు తగిన సమాధానం ఇంతవరకూ రానే లేదనే అనుకోవలసి వస్తోంది. ఆ. రా. కృ.

**ఉర్దూ వాఙ్మయపోషణము - బహ్మనీ, కుతుబ్ షాహి సుల్తానులు :** ఉర్దూ* భాషా చరిత్రమును పరిశీలించినచో దీనిని గ్రంథస్థ మొనర్చుటకు ముందంజవేసి తీర్చిదిద్ది వాఙ్మయోపయోగకరమగు భాషగా మార్చిన వారిలో ప్రథములు ముస్లిం సూఫీలు, తత్త్వవేత్తలు, భక్తులు — షేఖ్ ఫరీదుద్దీన్ షకర్ గంజ్, షేఖ్ హామీదుద్దీన్ నాగోరీ, షేఖ్ ఫరీదుద్దీన్, అమీర్ ఖుస్రూ, సయ్యద్ ముహమ్మద్ గేసూదరాజు హుసేనీ, మీరాన్‌జీ మున్నగు వారలే ఉర్దూ వాఙ్మయమునకు జనకులని చెప్పవచ్చును. వీరందరిలోను ఉర్దూ భాషలో ఆదికవిగా పేర్కొనదగిన గౌరవము 'అమీర్ ఖుస్రూ'కు లభించుచున్నదని యంద రంగీకరించు చున్నారు. ఈ సుప్రసిద్ధ ఫారసీ కవి ఫారసీ, హిందీ, రేఖ్తా యను మూడు భాషలందును కవనించెను. ఈ మహాకవి రచించిన పద్యములు, గీతములు ఖండ కావ్యములు మున్నగునవి ఇప్పటికిని జనరంజకతను గోల్పోలేదు.

ఉర్దూకవితా ప్రథమ యుగము 'అమీర్ ఖుస్రూ'తో నారంభమైనప్పటికిని, నిజముగా ఉర్దూ కవిత దక్కను లోని గుల్బర్గా, బిజాపూరు, గోలకొండ రాజధానులందే రూపలావణ్యములను దాల్చినది. 1325 లో ఢిల్లీ రాజధానిని దౌలతాబాద్ (దేవగఢ్)కు మహమ్మద్ తుగ్లుకు మార్చినపు డతనితోపాటు ప్రభుత్వాధికారులు, సైనికులు, పండితులు, కవులు, సాహిత్యవేత్తలేకాక వివిధ కళాకారులు, శిల్పులు మున్నగువారును తరలివచ్చి యచట నివసించిరి. ఉత్తర భారతమున హిందూ, ముస్లిమ్ సమ్మిశ్రణమువలన జనించిన ఈ క్రొత్త భాషాలత ఇవ్విధముగా దక్కను క్షేత్రమునందు చేరి పుష్పించి, ఫలించుట కవకాశము గల్గినది. అంతే కాక, ఉత్తరమునందువలె గాక ఈ భాష యచిరకాలములోనే గ్రంథస్థమై పరిణతిని జెందెను. మహమ్మద్ తుగ్లుకు ఢిల్లీకి తిరిగి వెళ్లిన తరువాత నతని జీవిత కాలముననే దక్కను ముస్లిముల స్వతంత్ర రాజ్యమగు బహ్మనీరాజ్యస్థాపన 1347 లో జరిగి 1538 వరకు దాదాపు రెండు శతాబ్దములవరకీ వంశపు రాజుల పరిపాలనము శోభాయమానమై వర్ధిల్లెను. ఐదు శాఖలైన వీరి రాజ్యములో బిజాపూరు, గుల్బర్గా రాజధానులుగా పరిపాలించిన ఆదిల్‌షాహి, బరీద్‌షాహి రాజులు విజ్ఞాన ప్రియులు, కళా పోషకులు, ధర్మచింతన గలవారు. ఈ కాలమున దక్కనులో ఉర్దూభాష సంభాషణకై కేవల ముపయోగింపబడక గద్య, పద్యాత్మకమైన వాఙ్మయ స్వరూపమును దాల్చినది.

ఉత్తర భారతములోవలె, ఇక్కడను మొట్టమొదట సూఫీలు, తత్త్వవేత్తలు, భక్తులు తమ శిష్యబృందములకే గాక తమ యనుచరులకును సుబోధముగా నుండునటుల గ్రంథములను రచించిరి. దక్కనులో ఉర్దూ గద్య పద్య కావ్యములను రచించుట కారంభించినది 'ఖ్వాజా సయ్యద్ ముహమ్మద్ హుసేనీ గేసూదరాజ్' అను ముస్లిము తత్త్వ

* 'ఉర్దూ' అను పదము తుర్కీభాషకు చెందినది. 'సైన్యము' లేక 'సైనికులు' అని ఈ పదమున కర్థము. ఉర్దూ భాషయొక్క యుత్పత్తిస్థానమును గురించియు, కాలమును గురించియు వివిధ దృక్పథములును, అభిప్రాయ భేదములును నుండెడివి. కాని యాధునిక పరిశోధనల వలన నీగౌరవ మేప్రత్యేక ప్రాంతమునకు జెందజాలదని తేలినది. పూర్వకాలములో పెషావరునుండి అలహాబాద వరకు గల ప్రదేశములో విశేష భేదము లెవ్వియు లేనట్టి యొకే ప్రాకృత భాష ప్రచలితమై యుండెననియు, ప్రాకృతము నుండియే 'ఉర్దూ' భాష జనించి యుండుటచేతను పంజాబీ వ్రజ భాష – రెంటికిని మాతృకయైన 'ఖడీబోలీ' యే 'ఉర్దూ' భాషయొక్క జనని యనియు నంగీకరింపబడినది. ఇంతియకాక ఉర్దూ భాషయొక్క జనన పోషణ వికాసములు హిందూ ముస్లిముల సంయుక్త ప్రయత్న ఫలితము లనియు తేటతెల్లమైనది. ఈ భాషను దాని చారిత్రిక పరిణతియొక్క వివిధ దశలనుబట్టి హిందీ హిందూస్తానీ, దక్కనీ, రేఖ్తా యను పేర్లతో బిలుచు చుండిరి. కాని తుదకు గలిగిన పరిణామ ఫలితముగా 'ఉర్దూ' అను పేరు నిలిచి పోయినది.

అక్బరు కాలములో ఫారసీ భాష ప్రభుత్వ భాషగా స్వీకరింపబడిన తరువాత 'రేఖ్తా' మరింత తొందరగా 'ఉర్దూ'గా మారిపోవుట కవకాశము గలిగినది. అప్పటినుండియే హిందీ, ఉర్దూ భాషలు విడిపోవుట కారంభించినవి.

ఇట్లొకే క్షేత్రమున నుద్భవించిన యీ రెండు భాషా లతలు భిన్నాధారముల నవలంబించి రెండు స్వతంత్ర శాఖలుగా మారి పోయినవి.

వేత్త. ఇతడు గుల్బర్గా నివాసి. ఇతని యొక్కయు, ఇతని వంశజుల యొక్కయు దర్గాలు (సమాధులు) గుల్బర్గాలో గలవు. ఖ్వాజా సాహేబుకు 'బందా నవాజు' అను గౌరవ నామము కలిగినది. ఇతడు తన భగవద్భక్తి పరాయణత చేతను, మహిమలచేతను ముస్లిములనే కాక హిందువుల ననేకుల ముగ్ధపరచెను. అతని దర్గాయొక్క ఉరుసు (ఉత్సవము)లో ప్రతి సంవత్సరము లక్షలాది ప్రజలు పాల్గొనుచుందురు. అతడు భక్తిపరముగను, తత్వ సిద్ధాంత ములపైనను వ్రాసిన పద్య, గద్యాత్మకములగు రచనలు లభించినవి. అందువలన అతనిని దక్కనులోని ప్రథమ ఉర్దూ కవియని నిస్సందేహముగ చెప్పవచ్చును. అతని భాష యాకాలపు సర్వసుబోధమైన దక్కనీ ఉర్దూభాష. ఖ్వాజా సాహేబువే గాక మీరాన్‌జీ, షంషుల్ ఉష్టాఖ్, షాహ బురహానుద్దీన్ జానం, అమీనుద్దీన్ అలీ మున్నగు సూఫీ కవుల రచనలు కూడ లభించినవి. బహ్మనీ రాజుల కాలమున మరొక సుప్రసిద్ధ కవి - మూడవ సుల్తాన్ అహ్మదుషాహకు సమకాలికుడు -'నిజామీ' యను నతడు 'కదంరావు - పదం' అనునొక శృంగార కావ్యమును రచించెను. మరియొక సూఫీ కవి 'సదరుద్దీన్' అను నతడును గద్య, పద్య కావ్యములను రచించెను. ఖ్వాజా గేసూదరాజు యొక్క పుత్ర పౌత్రులు రచించిన తత్వగ్రంథములు గుల్బర్గా, బీదరు లలో లభించినవి.

క్రీ. శ. పదునైదవ శతాబ్దముననే గుల్బర్గా రాజులు తమ రాజధానిని బీదరుకు మార్చిరి. అక్కడనే ఆ వంశపు రాజుల సమాధు లన్నియు గలవు. 'మహమూద్ గావాన్' అను మంత్రి యక్కడనే విశ్వవిద్యాలయమును స్థాపించెను. ఆ వాతావరణమునందు ఫారసీ, అరబ్బీ, ఉరుదూ భాషా పండితులకును, కవులకును చక్కని యాశ్రయము లభించి నదని బీదరు రాజ్యచరిత్రవలన దెలియు చున్నది.*

బహ్మనీ రాజుల కాలమున గుల్బర్గా, బిజాపూరు, బీదరు, అహ్మద్ నగరు రాజధానులందు నాటబడిన ఉర్దూ సాహిత్య లత గోలకొండ, హైదరాబాదులందు విశేష ముగా పెరిగి పల్లవించి పుష్పించెను. గోలకొండ కుతుబ్ షాహి రాజులు, ముఖ్యముగా మహమ్మద్ కులీ కుతుబ్ షాహ (క్రీ.శ. 1580 - 1612), మహమ్మద్ కుతుబ్‌షాహ (క్రీ. శ. 1616 - 26), అబ్దుల్లా కుతుబ్ షాహ (క్రీ. శ. 1626 - 1672), అబుల్ హసన్ తానాషాహ (క్రీ. శ. 1672 - 1687) మున్నగువారు స్వయముగా కవులు, రచయితలు.

ఈరాన్‌దేశమందలి 'హమదాన్' పట్టణము రాజ ధానిగా పాలించుచున్న యొక రాజవంశమునకు చెందిన 'సుల్తాన్ కులీ'యను యువకుడు తన పినతండ్రి వెంబడి హిందూస్థానమునకు వలస వచ్చి, బీదరు రాజధానిగా పాలించుచున్న మహమూద్ షాహ బహ్మనీ దర్బారులో చేరెను. అతని రాజభక్తిని, విద్యావైదుష్యమును మెచ్చి యతనిని తిరిగి 'హమదాన్' వెళ్లుట కనుజ్ఞ యివ్వక యొక యుద్యోగము నొసంగెను. కొంతకాలము తరు వాత రాజనీతియందును, యుద్ధరంగమునందును అతడు చూపిన చాతుర్యమువలన కుతుబుల్ ముల్కు అను తెలంగాణా గవర్నరు గతించిన వెంటనే అతడు 1496 లో గోలకొండ ప్రాంతమునకు గవర్నరుగా నియ మింపబడెను; 1518 లో మహమూద్ మరణానంతరము స్వాతంత్ర్యమును ప్రకటించి స్వతంత్ర రాజుగా 1518 నుండి 1543 వరకు పరిపాలించెను. ఇతని కాలములో వైజ్ఞానిక సాహిత్యరంగములలో చెప్పుకొనదగిన ప్రగతి కానరాలేదు. ఇతని తరువాతి వాడగు జంషీద్ కుతుబ్ షాహ (క్రీ. శ. 1543 - 1550) కాలమునను నేమియు జరగలేదు.

ఇబ్రాహిం కుతుబ్ షాహ కాలమున (క్రీ. శ. 1550 - 1580) ఉర్దూ వాఙ్మయాభివృద్ధికి దోహదము కలిగినది. ఫేరోజ్, మహమూద్ అను నిరువురు ప్రతిభాశాలులగు కవు లుండిన ట్లితరగ్రంథములవలన దెలియుచున్నది. కాని వారి రచన లుపలబ్ధము కాలేదు. ఫేరోజ్ కవి 'తౌసప్

*ఇటులే బిజాపురమును రాజధానిగా పాలించిన ఆదిల్ షాహి రాజులును అత్యంత విజ్ఞాన ప్రియులు, కళా పోషకులు. వారిలో రెండవ ఇబ్రాహిం ఆదిల్ షాహ (క్రీ. శ. 1580 - 1626) కాల ములో సుప్రసిద్ధ ఫారసీ కవియగు 'జుహూరీ' బిజాపురమునకు వచ్చి రాజాశ్రయమును గాంచి 1616 లో నక్కడనే మరణిం చెను. ఇబ్రాహిం ఆదిల్ షాహ స్వయముగా హిందీలో గాన కళపై 'నవరస'మను గ్రంథమును రచించెను. ఇతని కాలము లోను, ఇతని తరువాతి రాజుల కాలములోను, ముఖ్యముగా రెండవ ఆదిల్ షాహ (క్రీ.శ. 1656 - 1672) కాలమందు 'నుస్రతీ' యను సుప్రసిద్ధ కవి 'అలీనామా', 'గుల్‌షనె ఇష్కు' మున్నగు ఉర్దూ కావ్యములను రచించెను, ఫైజ్, దౌలత్, అహ్మద్ గుజ్రాతీ, సాదీ దక్కనీ, ఫజల్, ఆషక్, అమీర్, ఆజాద్ మున్నగు కవులు దక్కనులో వెలసిరి. వీ రందరు సూఫీ సిద్ధాంత ప్రచారముననే గాక శృంగార రస పరిప్లుతములగు కావ్య రచనకు పూనుకొనిరి. చారిత్రిక సంఘటనలను కేవల కల్పనములవలె చిత్రించుట, సుప్రసిద్ధ భారతీయ పారసీక వీర ప్రేమగాథలను కవనించుట - వీరు త్రొక్కిన సాహిత్య మార్గము. వీరు వాడిన యా కాలపు దక్కనీ ఉర్దూ భాషలో తరువాత బహిష్కరింపబడిన హిందీ, మహారాష్ట్రీ, తెలుగు, కన్నడ పదములు కనబడును. ఛందస్సు, అంత్య ప్రాసలు మున్నగు రూపము లన్నియు ఫారసీ భాషాను కరణములు.

నామా' యను నొక మస్నవీకావ్యమును రచించెను. ఇబ్రాహిం ముప్పది సంవత్సరముల కాలములో విస్తృత కుతుబ్ షాహి రాజ్యమును పదిలపరచి శాంతి భద్రతలను స్థాపించి ప్రజా కల్యాణమున కుపయోగకరములగు పనులను జేసెను. పాఠశాలలను నిర్మించుట, విద్యా వ్యాసంగములను ప్రోత్సహించుట మున్నగునవి జరిగినవి. ఇతనికి దేశీయమగు తెనుగుభాషతో పరిచయ ముండుటయే గాక దానిని మిగుల పోషించెనని ప్రతీతి. తెలంగాణములోని స్థానికేతిహాసములలో నితడు 'మలికిభరాము'డనియు, మిగుల సుగుణ సంపత్తులు గలిగిన రా జనియు సంస్తుతింప బడియున్నాడు. ఇతడు 'సుల్తాన్ కులీ' యొక్క ఆరవ పుత్రుడు, కనిష్ఠుడు. తండ్రి తన యుత్తరాధికారము నితనికే యొప్పగించదలచి చిన్నతనముననే ఇతనిని దేవరకొండ దుర్గాధిపతిగా నియమించెను, అన్నయగు జంషీదు కుట్ర పన్ని తన తండ్రిని హత్య గావింపించి 1543 లో కారాగారమునుండి విడివడి రాజ్యపీఠ మలంకరించెను. అందువలన ఇతడు దేవరకొండనుండి పలాయనమై మొదట బిజాపూరు రాజులవద్దను, తరువాత విజయనగర రాజులకడను ఆశ్రయము సంపాదించవలసి వచ్చినది. జంషీదు మరణానంతరము 1550 లో ప్రజలకోరికపైన తిరిగి గోలకొండకు వచ్చి రాజ్యపదవిని స్వీకరించెను. ఇతడు పరస్పర విరోధులగు బహ్మనీరాజు లందరిలో సమైక్యతను సాధించిన రాజనీతిపరుడు. తత్పరిణామము గనే 1565 లో విజయనగరరాజ్య మంతరించుట కవకాశము గలిగినది. గోలకొండ కుతుబ్ షాహి రాజ్యమును సంపూర్ణమైన యున్నత స్థితికి 'మలికిభరాముడే' తీసికొని వచ్చెను. ఇతడు దేవరకొండ దుర్గాధిపతిగను విజయనగరాస్థానమునను కొంత కాలము గడపినందున ఆ వాతావరణ పరిణామమువలన తెలుగు కవులకును, సాహిత్య పరులకును ఆశ్రయ మొసంగెను. అద్దంకి గంగాధరకవి 'తపతీ సంవరణోపాఖ్యానము' రచించి కృతి యొసంగిన దితనికే. ఆ కాలపు మరియొక దొడ్డ కవి ఆసూరి మరింగంటి సింగరాచార్యులను నష్టభాషా ప్రౌఢిమ నలరువాడు 'దశరథరాజనందన చరిత్ర' మను నొక పద్యకావ్యమును రచించి మలికిభరామునిచే బహూకరింపబడెను. ఈ కావ్యము శ్రీ లక్ష్మణరాయ పరిశోధక మండలి సేకరించిన యముద్రిత తాళపత్ర గ్రంథములలో నొకటి. ఈ కాలముననే పొనుగంటి లేక పెనుగోటి (? పొన్నికంటి) తెలగనార్యు డనుకవి హైదరాబాదుకు సమీపమునందుండు పొట్లచెరువువాస్తవ్యుడు 'యయాతి చరిత్ర' మను తెలుగు ప్రబంధమును ఆ జిల్లా తాలూకు దారు (కలెక్టరు) అగు అమీన్ ఖాన్ యొక్క ప్రోత్సాహము వలన రచించెను.

ఇబ్రాహిం యొక్క తృతీయ పుత్రుడు మహమ్మద్ కులీ కుతుబ్ షాహ 1580 నుండి 1612 వరకు రాజ్యమును పాలించెను. తండ్రికాలముననే శాంతి భద్రతలు స్థాపింపబడి నిలకడ కలిగియున్నందున నితడు వైజ్ఞానిక, సాంస్కృతిక, సాహిత్య, కళావిషయకమగు నభివృద్ధికి ముఖ్యకారకుడై, కుతుబ్ షాహి వంశ రాజు లందరిలోను మకుటాయమానుడై విరాజిల్లెను. మహమ్మద్ కులీ కుతుబ్ షాహ తన ముప్పదిరెండు సంవత్సరముల పరిపాలనమునందు ఉర్దూవాఙ్మయాభివృద్ధికై మిగుల కృషి సల్పెను. అతడు స్వయముగా ప్రతిభాశాలియైన కవి. 'మానీ' యను కవితానామమును ధరించి ఫారసీ, ఉర్దూ భాషల రెండింటిలో రచనలు గావించెను. తెలుగుభాష యందును అభినివేశము గలిగి కవిత నల్లినట్లు ఉర్దూభాషా చరిత్రకారులు వ్రాసిరేకాని ఇప్పటివర కేరచన లభింప లేదు. ఇతని ఉర్దూకావ్య సంపుటము హైదరాబాదునుండి ప్రకటింపబడినది. ఇతడు ప్రకృతి చిత్రణము, శృంగార భావనా కల్పనము, కథారచనము మున్నగు వివిధరంగము లందు అసామాన్య వైవిధ్యమును, సరళత్వముతోపాటు నూతనత్వమును ప్రకటించి, ఉర్దూభాషకు వన్నె తెచ్చి పెట్టిన రాజకవి. ఇత డక్బరు సమకాలికుడు. ప్రస్తుత భాగ్యనగర(హైదరాబాదు)పట్టణమును నెలకొల్పినరా జితడే. ఇతని ఫారసీ, ఉర్దూ దీవానులు (కావ్య సంపుటములు) 1800 పుటలు, 50,000 పంక్తులు గలిగియున్నవి. భక్తి, శృంగారములను, సాంఘిక ప్రకృతి చిత్రములను, కూరగాయలను, హిందూ ముస్లిము పండుగులను, తరు కుసుమాదులను, వేయేల ననేకచిత్తరువుల ననేకవర్ణములలో చిత్రించెను. ఇతని కాలపు ఇతర కవులలో 'వజీహ' 'అహ్మద్' అనువా రిరువురును ప్రసిద్ధులు. వజీహ అను కవియొక్క 'కుతుబె ముష్తరీ' యను గ్రంథ మిటీవలనే ఉర్దూ, దేవనాగరి లిపులలో హైదరాబాదనుండి ప్రకటితమైనది. ఈ కావ్యమునందు మహమ్మద్ కులీ రాజుయొక్క చరిత్రము, శృంగార విలాసములును వర్ణింపబడినవి; అతని బాల్యము, విద్యావ్యాసంగము, యౌవన విలాసములు వర్ణితములైనవి. చారిత్రికమగు నంశము లం దున్నను స్వప్నసుందరి 'ముష్తరీ' యను బెంగాలు రాజకన్యను వరించుట, యచటికి వెళ్లి యామెను గోలకొండకు గొనివచ్చి పాణిగ్రహణ మొనర్చుట మున్నగు గాథలు కేవల కల్పనములని చెప్పవచ్చును. ఈ రాజు 'భాగ్యవతి' లేక 'భాగమతి' యను తెలుగు నర్తకిని ప్రేమించి యామెనే

వివాహమాడి యామెపేరుననే భాగ్యనగరమును నిర్మించె ననియు, నామెకు పిదప 'హైదర్ మహల్' అను గౌరవ బిరుదు నొసంగినందువలన, భాగ్యనగర మనుపేరు హైదరాబాదగా మారిన దనియు సుప్రసిద్ధ చారిత్రికాంశము. ఈ కావ్యమునకు నాయకుడు మహమ్మద్ కులీ కుతుబ్ షాహ. దక్కనీ ఉర్దూ భాషయొక్క యుత్తమోత్తమమైన పద్య కావ్య మిది. ఈ కవియొక్క గద్య కావ్యము 'సబ్రస్' అనునది ఉర్దూ గద్యమందు ప్రాచీనమైన ఉత్తమ కావ్యమని భావింపబడుచున్నది. ఇదియును ప్రకటితమైనది. ఈ కవియే రాజాజ్ఞ ననుసరించి 'లైలా మజ్నూన్' కథను ఉర్దూభాషలో రచించెను. ఇతడు ముప్వురు రాజుల కాలములో జీవించి దాదాపు శతసంవత్సరాయుర్దాయము కలిగి అబ్దుల్లా కుతుబ్ షాహ కాలమున దివంగతుడయ్యెను. ఈ కాలపు ఇతర కవులలో ఖయాల్, ఆజీజ్, గవ్వాసీ మున్నగువారు గలరు. వీరిలో కొందరు తరువాతి రాజుల కాలములో కావ్యములను రచించిరి.

మహమ్మద్ కులీ కుతుబ్ షాహ తరువాత సుల్తాన్ మహమ్మద్, సుల్తాన్ అబ్దుల్లా కుతుబ్ షాహ, అబుల్ హసన్ తానాషాహ అను రాజులు క్రమేణ సింహాసనాసీనులైరి. సుల్తాన్ మహమ్మద్ రచించిన దీవాన్ ప్రకటింపబడలేదు. ఇతని తరువాతివాడగు అబ్దుల్లా కుతుబ్ షాహ కాలము వాఙ్మయాభివృద్ధిదృష్టిచే నతి ముఖ్యమైనది. ఇతడు స్వయముగా పండితుడు, విజ్ఞాన ప్రియుడు. దాదాపు అర్ధశతాబ్ద పరిమితమైన యీతని పరిపాలన కాలము దక్కనుయొక్క ఉర్దూవాఙ్మయము స్వర్ణయుగము. ఇతని కవిత తాతయగు మహమ్మద్ కులీ కవితయంతమనోహరము కాకపోయినను ధారాశుద్ధి కలిగి యాకర్షకముగా నుండును. ఇతని కావ్య సంపుటము (దీవాన్) ప్రకటింపబడినది. ఇతని కాలమున గవ్వాసీ, ఇబ్నునిషాతీ అను నిద్దరు కవులు ప్రఖ్యాతులు. వీరిలో ప్రథముడు గవ్వాసీ 'బదీయుల్ జమాల్', 'సైఫుల్ ముల్కు' అను స్తుతిపరమైన కావ్యములను, మరియు 'తూతీనామా' అను ననువాదకావ్యమును రచించెను. 'శుకసప్తతి' యొక్క ఫారసీ తర్జుమా 'తూతీనామా'ను ఉర్దూలో ననువదించెను. రెండవవాడు ఇబ్నునిషాతీ ఫారసీ భాషయందలి కథావర్ణనమును ఉర్దూలో ప్రవేశపెట్టి 'ఫూల్‌బన్' (పుష్పవనము) అను కావ్యమును రచించెను. ఈ కావ్య మొకమహా ప్రబంధమని చెప్పవచ్చును. తబయీ, అమీన్, జునైదీ, అహ్మద్, అజీజ్, అల్లియా, గులాం అలీ, సేవక్, ఫైజ్, లతీఫ్ మున్నగువారు మస్నవీలు, కసీదాలు, గజల్లు, రుబాయీలు, మర్సియాలు మున్నగు వివిధ రకములగు కావ్య రచనలు గావించి ఉర్దూ వాఙ్మయమును సంపన్నముగా నొనర్చిరి. జునైదీయొక్క 'మాః పైకర్', తబయీ యొక్క 'బహారాంవగుల్ అందాం', గులాం అలీయొక్క 'పద్మావత్' మున్నగునవి ఫారసీ, సంస్కృత సాహిత్యములనుండి కథావస్తువులను గ్రహించి రచింపబడిన పద్య కావ్యములు. వీ రందరు అబ్దుల్లా కుతుబ్ షాహ, అబుల్ హసన్ తానాషాహ కాలపు కవులు. తానాషాహ ఈ వంశపు రాజులలో నంతిముడు. ఇతడును కవి, పండితుడు, కళా పోషకుడు. కాని కొన్ని చాటు పద్యములు తప్ప నితని రచన లేవియు లభింపలేదు. ఇతడే గోపన్న లేక భద్రాచల రామదాసు యొక్క ప్రభువు.

బహ్మనీ, కుతుబ్ షాహి వంశజులగు రాజులు దాదాపు మూడు శతాబ్దముల వరకు దక్షిణాపథ మందలి గొప్ప భాగమును పరిపాలించిరి. ఒకవైపు మొగల్ సామ్రాజ్యమును, మరియొకవైపు విజయనగర సామ్రాజ్యమును, మరియొకవైపు తమ యాంతరంగిక విభేదములను ఎదుర్కొనుచు స్వతంత్రులై పరిపాలన మొనర్చిరి. వీ రందరు దాదాపు షియామతస్థులు. ఈరాన్ (పర్షియా) దేశముతో వీరి కెక్కుడు సంబంధ ముండియు, దేశీయులగు ప్రజల యాదరమును పొందుటకై మిగుల కృషి సల్పిరి. ఫారసీ, అరబ్బీ భాషలకు గౌరవ మొసంగియు ఉత్తర భారతమున జనించిన ఉర్దూభాష కొక విశిష్ట రూపము నొసంగిరి. దక్కనులో నభివృద్ధి నొందిన ఈ భాషలో మహారాష్ట్రి, తెలుగు, కన్నడ, పదజాలముల వికృతులు విరివిగా కనబడుచున్నవి. పైన పేర్కొన్న కవు లంద రీ మిశ్ర భాషలోనే వ్రాసిరి. కుతుబ్ షాహి రాజ్యాంతమున కొలది కాలమునకే ఉర్దూకేంద్రము ఢిల్లీకి* మారినది.

*ఇతరభాషా సమ్మిశ్రితమైన దక్కనీ ఉర్దూ సంప్రదాయములను విడిచి, ఉత్తర భారతమున కేంద్రరాజధానిలో ఫారసీ దుస్తులను ధరించి ముస్తాబగుచున్న లాల్ ఖిల్లా భాషకు ప్రాధాన్య మొసంగిన కవి 'వలీ' యను ఔరంగాబాదు వాస్తవ్యుడు – క్రీ.శ. 1668–1744 కాలపువాడు. ఇతడు ఉర్దూభాషకు ఛాసర్‌వంటివాడు. ఇతడు ఢిల్లీకి వెళ్లి తన రచనల ప్రచారము గావించినపు డక్కడివారందరు ముగ్ధులై యతని ననుసరింపదొడంగిరి. ఈతని శైలి సరసము, సులభము; పదలాలిత్యము మాధుర్యము, భావ ప్రకటన మున్నగు గుణము లితరుల కనుకరణయోగ్యమై యితని కాచార్యస్థాన మొసంగుచున్నవి. ఇతని భాష ఫారసీ మయమగు ఉర్దూ భాషయైనను హిందీ, వ్రజభాషా పదములు విరివిగానే గన్పడుచున్నవి. కాని యితని శిష్యకోటివారెల్లరు రానురాను వాటిని బహిష్కరించిరి. ప్రస్తుతము ప్రచలితమై యున్న ఉర్దూ సాహిత్య భాషకు ప్రాతిపదిక వేసి నిశ్చిత స్వరూపము నొసగినది 'వలీ' యని యొప్పుకొనక తప్పదు. ఇతని శిష్యు లుత్తర హిందూస్థానమునను, దక్కను, గుజరాతు ప్రాంతములందును

రానురాను ఇతర భాషా పదజాలము బహిష్కృతమై ఢిల్లీ కేంద్రప్రభుత్వ భాషయగు పారసీయొక్క ప్రచండ ప్రభావమువలన ఉర్దూభాష మారిపోయి నేటి స్వరూప మును దాల్చినది.

మొగలు సామ్రాజ్య పతనానంతరము ఉర్దూ భాషకు మరింత యుజ్జ్వలమగు నభ్యున్నతి కలిగినది. ఒక వంక హైదరాబాదను పాలించు ఆసఫ్ జాహి నిజాములును, మరియొకవంక ఈస్టిండియా కంపెనీవారి యున్నతో ద్యోగులును ఉర్దూభాషా సారస్వతములకు సంపూర్ణదోహద మొసంగిరి. క్రైస్తవ మిషనరీలును ఉర్దూభాషకు మిగుల సేవజేసిరి. తెలుగుభాషకు బ్రౌన్ దొరవలె, ఉర్దూ భాషకు నిఘంటు, వ్యాకరణములను డాక్టర్ గిల్ క్రిస్టు రచియిం చెను. ఇవ్విధముగా ఉర్దూ క్రమక్రమాభివృద్ధిని గాంచి, సర్వాంగసుందరమై ప్రతిభావంతమైన సారస్వతముచే నొప్పారి, భారత దేశీయమగు నే యితర భాషకును తీసిపోని సంపత్తిని గలిగి యున్నది. బాలారిష్ట దోషముల నుండి కాపాడి, చక్కని సౌష్ఠవమును, పుష్టిని కలిగిం చుటకై మిక్కిలి పోషించి, నేటి సౌభాగ్యమునకు పునా దులు వేసినది బహ్మనీ, కుతుబ్ షాహి వంశపు రాజులని నిస్సందేహముగా చెప్పవచ్చును. బూ. రా.

**ఎఱ్ఱాప్రెగడ :** ఎఱ్ఱయ శంభుదాసుడై గోవిందగుణా దర ధన్యుడు, ధర్మైక తత్పరాత్ముడు అగుటయే కాక తుది దాకిన ఉన్నతి గన్న శంకరస్వామి సంయమీశ్వర పాదుకాధ్యాన పరుడగు యోగీశ్వరుడు.

ఇతడు తన పేరు అన్నియెడల ఎఱ్ఱయ అనియే వ్యవహ రించెను. ఐనను భారత ప్రతులలో 'ఇక్కడినుండి యెఱ్ఱా ప్రెగ్గడ కవిత్వము' అని యుండుటచేత పేరి చివర ప్రెగ్గడ యను గౌరవ నామము చేర్చియే వ్యవహరించుచుండిరని భావింపదగును. అనపోతారెడ్డి కొల్లూరి శాసనములో ఉదాహరింపబడిన 'యఱ్ఱయప్రగడగారు' ఇతడే యైనచో అది మరింత ధ్రువపడును.

ఇతనిది ఆపస్తంబ సూత్రము కావున కృష్ణయజుశ్శాఖ. శ్రీవత్స గోత్రము, తల్లి పోతాంబ, తండ్రి సూరనార్యుడు (గొప్ప కవి). అతడే ఎఱ్ఱయకు కవితా గురువై యుండ వచ్చును. ఎఱ్ఱయ తాత ఎరపోతసూరి పూర్ణ పురుషా యుష జీవితుడు ; సంయమితుల్య వర్తనుడగు అహోబల నరసింహ భక్తుడు; వేగినాటిలో కరాపర్తి వృత్తిమంతుడు. ఆతని తాత భీమన మంత్రి వెలనాటి చోడని వలన మిగుల మన్నన గనెనట.

తరువాతి వారిలో విప్రనారాయణ చరిత్ర రచించిన చెదలువాడ మల్లయ స్పష్టముగా మన ఎఱ్ఱయను తన వంశకర్తగా పేర్కొన్నాడు. ఆరణ్య పర్వములో ఎఱ్ఱయ తన నెలవు నెల్లూరు జిల్లా, కందుకూరు తాలూకా లోని గుడ్లూరని చెప్పెను. తర్వాత ఆనాడు తన మిత్రు డగు మల్లారెడ్డితో అతడుగాని, అతని తరువాతివారుగాని ఒంగోలు తాలూకాలోని చెదలవాడకో, తాను భూములు సంపాదించిన తెనాలి తాలూకా కొల్లూరు గ్రామము వద్ద నున్న మరియొక చెదలవాడకో కాపురమునకు వెళ్లుట చేత అతని సంతతివారికి చెదలువాడవారని ఇంటిపేరు వచ్చియుండును. అంతే కాని, ఎఱ్ఱయ ఇంటిపేరు చెదలు వాడ అనికాని, గుడ్లూరు అనికాని, కరాపర్తి అనికాని చెప్పుటకు దృఢమైన ఆధారము లేదు. ఏర్చూరువా రన్నది పొరబాటు. భాగవతము షష్ఠస్కంధము రచించిన సింగన తన పూర్వులలో 'ఏర్చూరి శాసనుడగు ఎఱ్ఱయ ప్రెగ్గడను' చెప్పెను కాని అతడు మన ఎఱ్ఱాప్రెగ్గడ అయి యుండడు. కొక్కోక గ్రంథము రచించిన ఎఱ్ఱనామాత్యు డీతడు కాడు.

ఆంధ్రుల చరిత్రములో మిక్కిలి విషాదకరమైన కాల మును, మరల మహోన్నతినందిన కాలమును ఎఱ్ఱయ చూచినాడు. ఎఱ్ఱయ ప్రథమ నివాస స్థలము గుండ్లకమ్మ యొడ్డున నున్న గుడ్లూరు. ఆతనిని ముందు మల్లారెడ్డి 'ఆతతశ్రీ తోడన్ సముపేతుఁ జేసి యెలమిం జేపట్టి' పిమ్మట తన యన్నయు, రెడ్డిరాజ్య స్థాపకుడును అయిన వేమారెడ్డి కిచ్చినాడు.

---

వందలుగా బయలుదేరి రచనలు సాగించిరి. ఢిల్లీలో 'ఖాన్ అరుజూ' మొదలుకొని 'మీర్జా గాలెబు' వరకు నొక కవికుల పరంపర ఏర్పడెను. 1757 వరకు ఉర్దూభాషా సాహిత్యమునకు కేంద్ర స్థలము ఢిల్లీ నగరము, తత్ప్రాంతమే. తత్పూర్వము నుండియు అవధ్ రాజధానియగు లక్నోలో శృంగార ప్రియమగు వాతావరణమునందు సాహిత్యాభివృద్ధి జరగు చుండెను. కాని 1857 లో సిపాయి పితూరి యనబడు భారత స్వాతంత్ర్య ప్రథమ సమరము పర్యవసానముగా బహాదర్ షాహ చక్రవర్తి రంగూన్ లో ఖైదీగా నుంచబడిన తరువాత లక్నోకు ఆ కేంద్రము మారి నది. మిర్జా గాలెబ్ వంటి వృద్ధ కవులు ఢిల్లీని వదలలేక నాంగ్లే యాధికారుల బ్రస్తుతించి యుపకారవేతనముల బుచ్చుకొనుచు, తమ పూర్వ గౌరవమును గోల్పోయినందుకు వాపోవుచు, కస్తూరికై పరితపించిన శ్రీనాథునివలె కరుణరస భరితములగు రచనల జేసిరి. కాని మిగతవా రందరు లక్నో చేరి వాజిద్ అలీ షాహను ఆశ్రయించిరి; అక్కడ నొక విశిష్టమైన సంప్ర దాయమును నెలకొల్పిరి ; 'రేఖ్తీ' యను జనానాభాషలో కూడ కవనింప దొడంగిరి. లక్నో చేరిన వారిలో నిద్దరు సుప్రసిద్ధ కవులు నాసిఖ్, ఆతిష్ అనువారు. వీ రిద్దరు రెండు భిన్న సంప్ర దాయముల కాచార్యులై భిన్న శిష్య పరంపరలు గలిగి యుండిరి. ఆ కాలముననే రాంపూర్, హైదరాబాద పట్టణములును ఉర్దూ సాహిత్య కేంద్రము లయ్యెను.

ప్రోలయవేముని జ్యేష్ఠకుమారుడగు అనపోతారెడ్డి రాజ్యకాలములో (క్రీ. శ. 1353 - 1364) కూడ ఎఱ్ఱయ జీవించియున్నట్లు తోచును. అనపోతారెడ్డి కొల్లూరి దాన శాసనములో ఆ రాజు తమ్ముడు అనవేమ భూపతి 'యఱ్ఱయ ప్రగడ గారికి' కేసరిపాటి యాభై పుట్ల చేను' ధారపోసి కొల్లూరనే కలిపిన ట్లున్నది. ఆతడు మన ఎఱ్ఱయయే అయి యుండును. కావున నితడు తన పేరిటి వాడగు తాతగారి వలెనే పూర్ణ పురుషాయుషజీవిత ధన్యు డనవచ్చును. సుమారుగా క్రీస్తు శకము పదునాలుగవ శతాబ్దములో మొదటి 75 సంవత్సరములు జీవించి యుండె ననదగును.

తండ్రి కంటెను ఎఱ్ఱయ జీవితములో నాతనికి ఆదర్శ ప్రాయుడై యుండి మహత్త్వము చేకూర్చినది గురువు. 'శ్రీ శంకరస్వామి సంయమీశ్వర చరణ సరోరుహధ్యానా నంద సౌందర్య ధుర్యుడ'నని ఎఱ్ఱయ సగర్వముగా తన గద్యము లన్నిటిలో చెప్పుకొన్నాడు. శ్రీ నరసింహావతార ములో నాతనిని 'ఎనిమిది యామములను నిత్య శివరాత్రి వ్రతముగా శివార్చన మొనర్చు యోగామృత తృప్తుడు త్రిజగదర్చితుడు మునీంద్ర భక్తజన వత్సలుడు' అని స్తుతించినాడు. హరివంశావతారికలో 'కామాదుల పొందు వాసి హృత్పద్మములో సదాశివు గాంచుచు, తదేకచింత చింతామణియై తుది దాకిన యున్నతిఁ గన్నవా' డనుచు ఈ శంకరస్వామి 'తన తలపు సర్వము తానయి యుండు గావుత'మని ఆశించినాడు. నరసింహావతారములో భారతీస్తవ మొనర్చుచు, 'కరకమలం బొసంగఁ బటికంపు గమండలువంటి కాంతి' ఇత్యాదిగా సన్యాసి రూపముతో భారతిని అపూర్వముగా ధ్యానించినాడు. శ్రీవిద్యా రణ్యులు స్తోత్రము చేసిన శంకరానందగురుపాదు లితడే కావచ్చును. కాకున్న నాతని సతీర్థ్యుడై యుండును. శృంగేరి మొదలగు మూల శంకర పీఠముల స్వాము లందరు భారతీ సంప్రదాయ యతులగుటచే ఎఱ్ఱయ గురువు కూడ భారతీయతియై యుండును. కర్ణాటక ప్రాంతములలో శ్రీ విద్యారణ్యులు చేసినట్టి ఉద్ధరణ కార్య మునే ఈ శంకరస్వామి శ్రీశైలభూమిలో చేసియుండు ననుటకు సందేహము లేదు. శంభుదాసుడగు లక్షణాభి ధేయము ఎఱ్ఱయ కీ గురువే ప్రసాదించి యుండును.

ఎఱ్ఱయ రచనలు : ఆరణ్యపర్వశేషము, శ్రీ నరసిం హావతారము, రామాయణము, హరివంశము. వీనిని ఎఱ్ఱా ప్రెగడ ప్రాయికముగ ఒకదాని తర్వాత ఒకటిగ వ్రాసి యుండును. ఇందులో మొదటి రెండును మల్లారెడ్డి, వేమా రెడ్ల ప్రాపు దొరకకముందును, మిగిలినవి తర్వాతను వ్రాసి యుండును. దేశనాయకులు విజృంభించుచున్న దినములలో వారికి జయ మాకాంక్షించుచు ఎఱ్ఱయ చేసిన తపస్సు జయ మను సుప్రసిద్ధ నామముగల మహాభారతము పూరించుట. సురారికల్పులగు తురుష్క భటుల దౌష్ట్య ములు చూచుచు తపించి వారిని నాయకులు జయించిన క్రొత్తనాళ్లలో అతని హృదయములో నిండిన భావము లతో హృదయము పొంగుటచే వ్రాసినది నృసింహావతా రము. ఈ రెండును 1328 కు పూర్వము వ్రాసియుండును.

ఆ తర్వాత 1335 కు పూర్వము రామాయణము, హరివంశము వ్రాసియుండును. ఇందులో ముందు వ్రాసి నది రామాయణమని హరివంశావతారికవలన స్పష్టమే. ఇక హరివంశములో ప్రోలయవేముడు రాజ్యమున స్థిరపడి అనేకాగ్రహారములు విద్యాతపోవృద్ధులకు ఇచ్చి చెరువులు గుళ్లు ప్రతిష్ఠించి, హేమాద్రి చెప్పిన వ్రతములు, దానములు అన్నియు నిర్వహించి, పుణ్యకార్యములు చేసి, చేయుచుండి, చేయనున్నాడని యున్నది. అవతారికలో అనపోతారెడ్డి అతని కూర్మిపుత్రు డనుచు, ఉత్తర భాగ ములో నవమాశ్వాసాంతములో ఆతనిని యువరాజవిభవో న్నతుడని యన్నాడు. అనపోతని తర్వాత రాజ్యమునకు వచ్చిన అనవేముని పేరెత్తలేదు. కనుక ఆతడు అప్పటికి పుట్టియుండలే దనుట సమంజసము.

ప్రోలయవేముని ఘనకార్యము లెన్నో చెప్పినను, దీనిలో నెక్కడను శ్రీపర్వతమునకు, అహోబలమునకు సోపానములు కట్టించినది సూచింపలేదు. ఆ రెండు కార్య ములు 1335 నాటిదగు రామతీర్థ శాసనము, 1340 నాటి మంచాళ్ల శాసనము మొదలుగాగల శాసనము లన్నిటిలో ఉటంకింపబడినవి. కావున ఆ కార్యములప్పటికి జరగి యుండి నచో ఎఱ్ఱయ చెప్పియే యుండునని ఊహింప వచ్చును.

ఏది యెట్లున్నను హరివంశ రచనము 1345 కు తర్వాత జరిగియుండుట కవకాశము లేదు. ఉత్తర భాగములో సప్తమాశ్వాసాంతములో కూడ 'శ్రీమల్లచమూపతిసేవా మధురిమ నిత్య సుముఖ' అని సంబోధన ముండుటచే మల్లారెడ్డి జీవించియుండగనే హరివంశ రచన జరిగియుండ వలెను. 1345 కు పూర్వ మాతడు స్వర్గస్థు డయ్యె ననుటకు ధరణికోటలో శాసనము ఆధారముగ కలదు. కాని వీనిలో ఆరణ్యపర్వము నరసింహావతారము కంటె ముం దనియు, రామాయణము హరివంశముకంటె ముం దనియు నిశ్చయముగా చెప్పవచ్చునే కాని ఈ రెండు జంటలలో ఏది ముందో రూఢిగా చెప్పలేము. కాని ప్రస్తావనలలోని సందర్భములనుబట్టి సూక్ష్మముగ పరిశీ లింపగ పై క్రమమే సరియని తోచినది.

ఆరణ్య పర్వశేషము : మహాభారతము ఆరణ్యపర్వములో చతుర్థాశ్వాసములో 143 వ దగు 'స్ఫురదరుణాంశు రాగ రుచి....' ఇత్యాది పద్యము మొదలు పర్వము చివరవరకు వ్రాసి ఎఱ్ఱయ పూరించెను. ఈ రచనవల్లనే ఆతనికి వెంటనే 'ప్రబంధ పరమేశ్వరు' డను ప్రతాపనామము వచ్చినది. ఇప్పటికిని ఆంధ్రలోకముచే విశేష గౌరవము పొందుచుండుటకు ప్రధాన కారణ మదే. అది ఏదో కొంచెము పూరించుటకాదు. 1599 గద్య పద్యములున్న మహాగ్రంథము. నన్నయయే పూర్తిగా మూఁడు పర్వములు వ్రాయగా చివర శిథిలమైన ఏవో అక్షరములున్నయ మొనర్చెనని ఆ మధ్య వింతవాద మొకటి విమర్శకులు లేవదీసిరి. కాని దానిలో సారము లేదని పెద్ద లందరు విచారించి సిద్ధాంత మొనర్చుటచే మరల నది తడవ నక్కరలేదు. 'స్ఫురదరుణాంశురాగరుచి' అని ప్రారంభించుచునే ఎఱ్ఱయ తన పేరును, తలపెట్టిన కార్యమును సూచించినాడని కూడ తెలిసికొనవలెను.

'నన్నయభట్ట మహాకవీంద్రు సరస సారస్వతాంశ ప్రశస్తి దన్నుఁ జెందుటయు....తత్కవితారీతియుఁ గొంత దోఁప ద్రచనయకా నారణ్య పర్వశేషము పూరించె'నని అతడే పర్వాంతమున స్పష్టముగా చెప్పుకొన్నాడు. నన్నయకు విఘ్నము వచ్చుటచేతను, సోమయాజి కూడ వ్రాయక వదలుటచేతను ఆ భాగములో నేదో దోషమున్నదను ప్రవాదము లోకములో ప్రబలియుండును. దాని పేరే ఆరణ్యపర్వము. అందుచే ఎఱ్ఱయ దానిని నన్నయ వ్రాసినట్లే రాజరాజాంకితముగానే వ్రాసెను. ఇట్లనుటలో నెవ్వరికి నెట్టి యవజ్ఞయు లేదు. ఈ గ్రంథము నన్నయపేర వ్రాయుటయే కాక, ఇందులో నాతడు ప్రయత్నపూర్వకముగా నన్నయ కవితారీతి ననుకరించె ననుట స్పష్టము.

ధర్మవ్యాధ చరిత్రము, కుమారస్వామి అవతారాదికము, ఘోషయాత్ర, సైంధవ పరాభవము, రామకథ, సావిత్ర్యుపాఖ్యానము - ప్రత్యేకము చెప్పదగిన పెద్ద ఘట్టములు, ప్రసిద్ధమైనవి. నన్నయ ప్రసన్న కథా కథన ధోరణి, ధారాశుద్ధి, సమాసరచనలో నేర్పు ఎఱ్ఱయ కలవడినవి. ఉత్పలమాలాది వృత్తముల నడక స్పష్టముగా నన్నయ పద్యములను స్మరణకు తెచ్చును. వచనరచన మాత్ర మిందులో హరివంశాదులలోవలె పరిణతి నందలేదనిపించును. నన్నయరీతి ననుకరించుటతో అతడు మొదటి మహాకావ్య మారంభించుటచే ఆతని రచన లన్నిటిలోను - ధారలో, సమాసముల కూర్పులో - నన్నయ మార్గమే తుదివరకు స్థిరపడినది.

శ్రీలక్ష్మీ నరసింహావతారము : ఎఱ్ఱయ దీని కీపేరే పెట్టెను. కాని నృసింహపురాణమను పేరు లోకములో పడిపోయినది. ఇది బ్రహ్మాండాది పురాణోక్తమయిన నరసింహావతారకథ ననుసరించి అహోబల క్షేత్ర మాహాత్మ్యమును వర్ణించు స్వతంత్ర గ్రంథము. దీనిలో 848 గద్య, పద్యములు కలవు. ప్రబంధవాఙ్మయమని తరువాతి కాలములో ప్రసిద్ధిపడిన కావ్యముల కిది సర్వవిధముల మార్గదర్శకమైనది. ఇతర గ్రంథములలోని పురాణ శైలి కాక ఎఱ్ఱయ ఇందులో ప్రబంధశైలి ప్రదర్శించెను. కథాగమనములోకంటె వర్ణనలలోను, పద్యముల జిలుగులోను శబ్దమాధుర్యములోను ఇందులో నేర్పు ఎక్కువ కనబడును. పోతనయే దీనిని మనస్సులో నుంచుకొని ప్రహ్లాద చరిత్ర వ్రాసినట్లు స్ఫురించును.

క్షీరాబ్ధి, శ్వేతద్వీపము రాజగు అచ్యుతుడు - ఈ వర్ణనలు మనోజ్ఞగంభీరముగా చేయబడినవి. 'పయోధి పెందరఁగల ప్రమోఁత మంగళ మృదుధ్వనియై చెలంగఁగన్' నారాయణుడు నిద్రలేచినట్లు వర్ణించునట్లుగానే ఆ భాగ మంతయు పాలసముద్రపు తరగల మృదుధ్వనితోనే నిండియున్నది.

చతుర్థాశ్వాసములోను, పంచమాశ్వాసాదిలోను హిరణ్యకశిపుడు కుమారుని విష్ణుభక్తినుండి మరలించుటకు చేసిన ప్రయత్నములు, అతనికి వేసిన శిక్షలు వర్ణించినాడు. ఈ ఘట్టమును పోతన రచనతో పోల్చినచో ఒకే కథను మహాప్రతిభాశాలులగు ఇద్దరు మహాకవు లెట్లు రెండు వేరు మార్గములలో సమర్థింపగలరో చూడవచ్చును. పోతన ప్రహ్లాదుడు మహాభక్తుడు ; ఎఱ్ఱయ ప్రహ్లాదుడు సర్వాత్మభావ మందుకొన్న మహాయోగి. సర్వమానవ సహజమైన భావములతో పోతనకథ హృదయంగమముగా ఉన్నది. ఏకాంతులై జీవన్ముక్తుల అనుభవము లందుకొనగలవారికే ఎఱ్ఱయ కథ ఆకర్షించును. హిరణ్యకశిపుని వధించిన తర్వాతగూడ పోతననృసింహుడు భయంకరముగనున్నాడు. లక్ష్మీదేవియే డాయ జంకినది. కాని ఎఱ్ఱయ నృసింహుని కార్యము 'దారుణ ఖేలనము - లీల - వీర రౌద్ర భయానక విస్మయాఖ్య రసములతో భువన హృద్యంబుగ నిర్వహించు నిపుణ వక్రతా నటనంబు'. ఈ పోలికచే కవిత్రయసామాన్య ధర్మమగు ఆత్మసంయమనము విస్పష్టమగును.

ఈ గ్రంథములో ఎఱ్ఱయవచనరచన ప్రౌఢ పరిణతి నందినది. నారాయణుని అంగవర్ణన - వచనము తెలుగు సంస్కృతములతో మిశ్రమై నవీన భావముల జిగిబిగితో తొలకాడుచున్నది. స్తంభోద్భవ - వచనము నరసింహావిర్భావమును శబ్దానుకరణముగా ప్రత్యక్షముచేయుచున్నది.

కావ్య రచన చేయనెంచి తాను సమాధినిమీలితేక్షణుడై ఉండగా తాతగారగు ఎరపోతసూరి మనస్సులో నావిర్భవించి తన యిష్టదైవమగు అహోబల నరసింహుని అవతార కథ చెప్పు మనియు, అందువలన అభిలేప్సిత పుణ్య ఫలోదయోన్నతులు చేకూరు ననియు ఆదేశింపగా తాతగారి ప్రీతికై నరసింహాంకితముగా ఈ కావ్యము చెప్పితినని ఎర్రయ అవతారికలో చెప్పినాడు. ఈ కావ్యరచనచే నిజముగా నల్లే ఆతనికి మల్లారెడ్డి స్నేహము, ప్రోలయ వేముని ప్రాపు, వానిచే అభిలేప్సిత పుణ్యఫలోదయోన్నతులు సిద్ధించినవి.

రామాయణము : ఇప్పటికి రెండువందల సంవత్సరముల క్రిందటివరకు కనబడుచుండిన ఈ గ్రంథ మిప్పుడు దురదృష్టవశమున కనబడుట లేదు. శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు కష్టపడి అందులోనివి కాదగు పద్యముల నన్నిటిని లక్షణగ్రంథాదులనుండి సంగ్రహించి భారతిలోను, రెడ్డి సంచికలోను ప్రచురించినారు. కాని అందులో కొన్ని పద్యములు ఎర్రయవిగా తోచవు. భాస్కర రామాయణముగా నేడు ప్రచారములోనున్న గ్రంథములో ఎర్రయరామాయణ పద్యము లుండునని వా రూహించిన దానినిబట్టి ఇంకను పరిశోధన చేయవలసియున్నది. రామాయణ రచనము 'వల్మీకభవు వచో వైఖరి'నే అతడు చేసెనన్న మల్లయ మాటలు మనము నమ్మవచ్చును. హరివంశ పీఠికలో ప్రోలయవేముడు 'రామకథ మున్ జెప్పించి యత్యుత్తమఖ్యాతిం బొందితి'నని ఎర్రయతో అన్న ట్లుండుటచే నదికూడ ప్రోలయవేమునకే అంకితమైనదని నిశ్చయింపదగును.

హరివంశము : హరివంశమును అద్దంకి రాజధానిగా మధ్యాంధ్ర భూమిని ధర్మప్రభువై క్రీ. శ. 1325 - 1353 వరకు ఏలిన రెడ్డిరాజ్య స్థాపకుడగు ప్రోలయవేముని కంకిత మిచ్చెను. దీని అవతారికలో వేముని వంశము, బంధువులు, వారి వారి ఘనకార్యములు, ఆతని వీర ధర్మకార్యములు సంక్షేపముగా వర్ణింపబడినవి.

ఈ గ్రంథములో రెండు భాగము లున్నవి: పూర్వభాగములో 9 ఆశ్వాసములు — 2044 గద్య, పద్యములు; ఉత్తర భాగములో 10 ఆశ్వాసములు — 2660 గద్య, పద్యములు ఉన్నవి. ఇప్పుడు దొరకుచున్న సంస్కృత హరివంశ ప్రతులనుబట్టి మూలములో నున్న ప్రభావతీ ప్రద్యుమ్నోపాఖ్యానము, హంసడిభకోపాఖ్యానము ఎర్రయ ఆంధ్రీకరింపక వదలినట్లు తోచుచున్నది. కాని సంస్కృత హరివంశప్రతు లొకదానితో ఒకటి కలియుట లేదు. కొన్నిటిలో హరివంశపర్వము, విష్ణుపర్వము, భవిష్యపర్వము అని మూడు పర్వము లుండగా, కొన్నిటిలో పర్వవిభాగమే లేక పూర్వోత్తర హరివంశము లనువిభాగమే కలదు. ఎర్రయకు లభించిన మూలప్రతి యెట్టిదో నిర్ధారణ చేయనిది అత డేమైన వదలినది లేనిది తేల్చుటకు వీలులేదు. అతడు ప్రధాన కథలు వదలువాడు కాడు. ఆంధ్రీకరణ విధానము కూడ మహాభారతాంధ్రీకరణ పద్ధతినే నడచినది. సర్వవిధముల ఎర్రయపరిపూర్ణపరిణతి హరివంశములో కనిపించును.

ఆరణ్యపర్వములో ఘోషయాత్ర సందర్భములో వ్యక్తమైన ఎర్రయ గోరక్తి, హరివంశములో ఎన్నో ఘట్టములలో ఉద్దీప్తమై కనిపించును. హరివంశములోని కథలన్నియు నొక్కొకటి యొక్కొక్క అందముతో భాసించుచున్నవి. ఇందు పెద్ద ఘట్టములుగ ఎన్నదగినవి కంసవధ, జరాసంధ యుద్ధములు, రుక్మిణీ కల్యాణము, నరకాసుర సంహారము, పౌండ్రక వాసుదేవ సంహారము, బాణాసుర విజయము. ఈ యన్నిటిలో ముఖ్యముగ వీరము, మధ్య మధ్య శృంగారము చక్కగా చిత్రింపబడినవి. అన్నిటిలో పెద్దదగు 'బాణాసుర విజయము' సమస్త రసములతో నొప్పుచు మకుటాయమానముగ నలరారుచున్నది. యుద్ధ వర్ణనలలో మేటియగు తిక్కనకు ఎర్రయ తీసిపోడని ఆయాఘట్టములు నిరూపించును.

అనేక పాత్రల భావాదులు ఒకే సందర్భమున చిత్రించుటలో తిక్కన నైపుణివంటి నైపుణి కూడ, రుక్మిణిని కృష్ణు డెత్తుకొనిపోగా యుద్ధమున కాయత్తుడైన జరాసంధుని వారించుచు నాతని మిత్రులు ముందుకు వచ్చిన ఘట్టమునందును, అనిరుద్ధుడు కనబడకున్న ద్వారకానగరములో కలిగిన అలజడి సందర్భమునను ద్యోతకమగును. ఏ ఘట్టములోనైనను ఒక్క రసావేశమునుండి ఇం కొక రసము ప్రదర్శింపగల ఆత్మనిగ్రహము ఎర్రయ రచనలందంతట నుద్దీపించును.

ఎర్రయకు భారత ధర్మమం దభిమానమెక్కువ. దానికి బాహ్య చిహ్నమగు గోబ్రాహ్మణ భక్తి — ఆతని రచనలం దెల్లెడ ప్రత్యక్షముగా కనిపించును. వానితోపాటు సత్య నిష్ఠ ఎక్కువగుటచే అతిశయోక్తి యాతనికి గిట్టదు. స్తోత్రములు కూడ ముఖస్తుతులు కాక సత్యస్తుతులుగా నుండవలెనని యాతడు పెక్కు తావుల సూచించెను.

సత్యాభిమానమువల్లనే ఎర్రయ కలవడిన గుణము ఉచితజ్ఞత. కంసాదేశమున రామకృష్ణులను తీసికొనిపోవచ్చిన అక్రూరుని వాక్యములలో ఎర్రయ యౌచితి ఎంతయు విస్పష్టమగును. ఇటు ప్రభు భక్తికి, అటు భగవద్భక్తికి

విరోధము లేకుండ విభావరియెల్ల అక్రూరు డనేక క్రమంబుల జెప్పెను.

ఎఱ్ఱయకు యోగమన్న నభిమానము, అది హఠ యోగము కాదు. ఈశ్వర ప్రణిపాతముతో కూడిన విజ్ఞాన యోగము. ఎఱ్ఱయ తాను 'సమాధి నిమీలితేక్షణుండనై క్షణం బున్న' అని నృసింహావతార పీఠికలో చెప్పుకొన్నది అప్రయత్నముగా వచ్చిన సత్యవాక్యము.

అతనికి ఊర్జిత శబ్దమన్న నెక్కువ ప్రీతి. అట్లే జగత్కల్యాణ కాంక్షతో కావ్యరచన చేయుచుండుటచే కాబోలు కళ్యాణ శబ్దము పదే పదే ప్రయోగించును. అన్నిటికంటె నాతని కిష్టమైనది శ్రీ. శ్రీ యనగా ఇహపరసాధనమైన శ్రేయస్సుకు బీజము. దాని నాతడు నిత్య ముపాసించు చుండుటచే కాబోలును శ్రీ అని ఆతనికి ఊతపదముగా వచ్చుచుండును. శ్రీ శబ్దము సమస్తార్థములు కలదిగా భావించిననే కాని కొన్ని తావులలో ఆతడు ప్రయోగించిన శ్రీపద మన్వయింపదు.

ఎఱ్ఱయ కిష్టమైనది అద్భుతరసమని తోచును. ఆ మాట తరచుగా నాతని నోట దొరలుచుండును. నారదుడు అద్భుత ధన్య శబ్దములకు వాచ్యు డెవడో అన్వేషించిన కథా సందర్భములో ఆ రెండు శబ్దములకు ఎంత దూరార్థమున్నదో వివరించినాడు. కవిత్వములో రస, పాకాదు లెట్లుండవలెనో ధేనుకుని తాళవనములో రామకృష్ణులు క్రీడించిన సందర్భములో రమ్యముగా సూచించినాడు. ఆ సందర్భములో కృష్ణుడు బలరామునితో 'క్రమపాకం బునఁ గెంపుతోడి నలుపెక్కన్....లీ తాళద్రుమశ్రేణులన్' అను పద్యములో వర్ణించిన రస పాకములే ఎఱ్ఱయ కవితలో గలవు. క్రమపాకము, కెంపుతోడి నలుపు, దిక్కులు నిండు మిక్కుటమైన గంధము, రస మంతర్గామియై వెలింగూడ గమియంగారుట, హృద్యముగా నుండుట ఇంతకంటె కవిత్వములో కోర దగిన దేది?

ఎఱ్ఱయ పద్యములు వాద్యకలతో కూడిన గీతములవలె నడచును. బాణాసుర కథాంతముననే కాక అనేక స్థలములలో ఎఱ్ఱయకు సంగీత నాట్యములందు కల ప్రీతి విశదమగును.

ఎఱ్ఱయ కసహ్యమైనది అసత్యము, అధర్మము. పర దారాపహర్తలను శిక్షించినది చూచుటచే కాబోలు సైంధవుని భీముడు పెట్టిన పాట్లు కన్నుల కట్టినట్లు వర్ణించినాడు. అతనిని 'మనుజపశు' వని నిర్దేశించెను.

నన్నయభట్ట, తిక్క కవినాథులయెడగల భక్తి పెంపు, తండ్రి సూర్యకవి శిక్షణము, శంకరస్వామి పాదుకా ధ్యానము, మల్లారెడ్డి మైత్రి, ప్రోలయవేముని ప్రాపు - ఇవి అన్నియుగూడి కవిత్రయములో ఎఱ్ఱయను సర్వ విధముల ధన్య శబ్దవాచ్యుని జేసినవి. **నో. న. శా.**

**ఏకాంకిక :** ఆధునికులచే 'ఏకాంకిక' అని వ్యవహరింపబడుచున్నది నవల, కథానికలవలెనే నేటి కాలమున సాహిత్య క్షేత్రమున వర్ధిల్లుచున్న అంటుయొక్క నవ్య సృష్టి. ఈ సాహిత్య ప్రక్రియను పోలిన రచనలును, వాని లక్షణమును సంస్కృతమున కలవు. కాని ఆ లక్ష్య లక్షణములు సర్వథా నవీన ఏకాంకికలకు ప్రత్యక్షముగ ప్రోత్సాహము ఇచ్చినవి కావు.

పుంఖాను పుంఖములుగ నేడు బయలుదేరుచున్న ఏకాంకికలకు దారి చూపినవి చాలవరకు పాశ్చాత్య సాహిత్యములోని ఏకాంకికలే. విషయ విభాగమునను, వస్తువైవిధ్యమునను, శిల్ప నిర్మాణమునను, పాత్రోన్మీలన పద్ధతుల యందును, వాతావరణమును పరికల్పించుట యందును ఇంచుమించుగా నేటి ఏకాంకిక లన్నియు విదేశ భాషలలోని ఏకాంకికలను అనుసరించుచున్న వనుట సత్యదూరము కాదు.

ఏకాంకికను గూర్చి ప్రసంగించునప్పుడు నాటకమునకును, దీనికిని గల సంబంధ మేమి యను ప్రశ్న పుట్టక మానదు. నాటకమునందలి వివిధాంకములలోని కథను సంక్షేపముగ ఒక అంకములోనికి దింపి వ్రాసిన అది ఏకాంకిక కాదు. వేని శిల్ప ధర్మములు వాని వనియు, ఒకటి బాగుగా వ్రాయగలవాడు రెండవదికూడ బాగుగా వ్రాసి తీరగలడనుట పొరబా టనియు మనము గ్రహింపవలెను.

ఏకాంకిక రచనయందు మాత్రము నాటకీయమైన సంవాదాత్మకరీతి కలది. ఇట ఇది నాటకమును పోలును; కనుక ఉత్తమ ఏకాంకిక చదివినను, ఆడినను కూడ బాగుగ నుండవలెను. రచయిత తనకు తానై చెప్పునది ఏకాంకికలో నాటకములోవలెనే ఏమియు నుండదు. కనుకనే రూపకము ప్రదర్శించునపుడు ఇచ్చినంత పూర్ణరసస్ఫూర్తి కేవల పఠనమప్పుడు ఈయలేదు.

వివిధ సాహిత్యములలోని ఉత్తమ ఏకాంకికలను పరిశీలించి వానిని వ్యాకరించి చూచినచో సామాన్యముగా నాలుగు ముఖ్య బీజములపై ఏకాంకికలు బయలుదేరుచున్నట్లు కన్పట్టును. ఇది స్థూలవిచారణము మాత్రమే. అసంఖ్యాకములైన ఏకాంకికలను పరీక్షించుటకు వీలు కలుగుటకై ఏర్పరచుకొనిన పద్ధతి.

మొదటిది సన్నివేశ బీజకము. జీవితములోని విలక్షణమైన సన్నివేశమును నిశితముగా, నిష్కర్షగా ప్రదర్శించుటకై పాత్రలను కల్పించుకొని ఆ సన్నివేశమునకు ప్రాణప్రతిష్ఠచేసి మనయెదుట పెట్టుట.

రెండవది పాత్రబీజకము. విశిష్టపాత్ర నొక దానిని సృష్టించుటకై సన్నివేశకల్పనము, వస్తునిర్మాణము చేయుట.

మూడవది ఉపదేశ బీజకము. నిత్యజీవితములో మన లను ఎదుర్కొనుచున్న సమస్య నొకదానిని గ్రహించి, దానికి కళరూపు నేర్పుగా చూపి, పరిష్కార విషయమున రచయిత చేయు సూచన; సాహిత్యధర్మము చెడకుండ ఇచ్చు సందేశము. పాత్రలు, సన్నివేశములు - ఈ దృష్టి తోడనే కల్పించుట.

నాల్గవది అద్భుతబీజకము. మానవునిలోని భయాదు లగు ప్రాథమికోద్రేకములను రేకెత్తించు వాతావరణ మును సృష్టించి చూపుట.

ఇతివృత్తమునుబట్టి సాంఘిక, చరిత్రాత్మక, మన స్తత్త్వచిత్రణాత్మక, పౌరాణికాదిభేదములను కల్పించు కొనవచ్చును. రచనా శిల్పమును అనుసరించి వాస్తవిక, కాల్పనిక, సాంకేతికాది భేదములును కలవు. ఈ విభాగము లన్నియు వస్తు వివేకమునకు పనికివచ్చినంతగా రసా స్వాదమునకు పనికిరావని మొదట గ్రహింపవలసియున్నది.

రచనయొక్క ఉపాధిభేదము ననుసరించి స్థూలముగా ఏకాంకికలను పద్య, గద్యములుగా విభజింపవచ్చును. ఇప్పుడు బహుళ ప్రచారములో నున్నవి గద్య ఏకాంకికలే. సర్వవిధముల ఏకాంకిక లనిపించుకొనదగిన పద్యరచనము లును కొన్ని యుండుటచే ఈ విభాగము పేర్కొనబడెను. ఇందు తెలుగు ఏకాంకిక స్థాలీపులాకముగ పరిశీలింపబడినది. కనుక ఇందు పేర్కొనబడి పరిశీలింపబడిన రచనలే తప్ప మిగిలిన రచనలు ఉత్తమములు కావని పాఠకు లూహింప రాదు. తెలుగు ఏకాంకికోద్యానవనములో మనకు ఆమో దము నిచ్చు పూలమొక్క లెన్నియో గలవు. ఇందు పరి శీలింపబడినవి అందులోని కొన్ని మాత్రమే.

ఆధునికాంధ్ర సాహిత్య ప్రక్రియలనుగూర్చి మాటాడు కొనునప్పుడు శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారు అన్ని నవ్య ప్రక్రియలను స్పృశించి అలంకరించినవారు గనుక సమకాలికులలో విశిష్ట స్థానమును గడించినవా రగుట వీరు మనకు ప్రాతఃస్మరణీయులు. సంఘసంస్కర ణాభిలాషతో వీరు రచించిన ప్రహసనములు తెలుగు ఏకాంకిక యొక్క తొలి యుషస్సులలోని రచనలు. వీరి ప్రహసనములలో కొన్నింటికి ప్రోత్సాహ మిచ్చినవి ఆంగ్ల భాషలోని సజాతీయ రచనలు. వీరికి సమకాలికులగు శ్రీ కొక్కొండ వెంకటరత్నం పంతులుగారు సంస్కృతములో వారణాసి ధర్మసూరి రచించిన 'నరకాసుర విజయవ్యా యోగ' మను ఏకాంకిక రూపకమును ఆంధ్రీకరించి సంస్కృతములోని ఏకాంకిక రూపము ఎట్లుండునో తెలుగు వారికి చూపిరి. తరువాత చాలమంది సంస్కృత సాహిత్య ములోని ఏకాంక రూపకముల ననువాదము చేసిరి; ప్రహ సనములను రచించిరి. వీరిలోని సంస్కరణాభిలాషయే చాలమందిని ప్రహసన రచనకు పురికొల్పుటచే వారిలో చాలమంది రచించిన ప్రహసనములలో శిల్పసౌందర్యము కళాసంపద కొంత కొరవడి యుండును.

నేడు దేశములో పద్య ఏకాంకికలను వ్రాయుచున్న వారి సంఖ్య చాల తక్కువ. వానిలో శ్రీ తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రిగారి రచనలు ముఖ్యమైనవి. అందును వారి 'పద్మావతీచరణ చారణచక్రవర్తి', 'యక్షరాత్రి' అనునవి పేర్కొనదగినవి. మొదటిది ఆరు యామముల కాలపరిమితిగల నాటిక; రెండవది యేకయామకాల పరిమితి గలది. అపేలవమైన సులభభాషలో మధురముగ రచింపబడినది. పాత్రలు ప్రాతదుస్తులను ధరించినను వాని భావములును, తలంపులును నవ్యములే.

కాని పద్య ఏకాంకికలకంటె దేశములో గద్య ఏకాంకిక లకు ప్రాచుర్య మధికముగ నుండుటచే ఇవి విశేషముగ అభివృద్ధికి వచ్చెను. పద్య ఏకాంకికా రచయితలలో కూడ గద్య ఏకాంకిలను వ్రాసినవారు కలరు.

చరిత్రాత్మక, పౌరాణిక ఇతి వృత్తములను అప్పు డప్పుడు గ్రహించినను రచయితలు సాధారణముగా సాంఘికేతివృత్తమునే ఆదరించుచున్నారు. ఇందును సంఘములోని అవినీతి, స్త్రీలకు సంబంధించిన సమస్యలు, బీదసాదల నడుమ వచ్చు సంఘర్షణలు మొదలగునవి ముఖ్యముగా నేటి ఏకాంకికా రచయితలను ఆకర్షించు చున్నవి. ఆర్థిక పరిస్థితులకు లభించినంత స్థానము ఏకాంకి కలలో తరచుగా రాజకీయ పరిస్థితులకు లేదు. సాంఘిక పరిస్థితులకు రచయిత లిచ్చుచున్నంత ప్రాముఖ్యము సాధారణముగ ఆర్థికపరిస్థితుల కిచ్చుచున్నట్లులేదు. పౌరా ణికములైన కథలను గ్రహించి ఏకాంకికలు వ్రాయు నప్పుడు, ఆ కథాగమనమున కిచ్చు నిర్వచనము నవీనముగ చేయుట యొకటి కన్పట్టుచున్నది. నవీనము లైన తత్త్వసిద్ధాంతములతో తమకుగల పరిచయమును రచయితలు తమ రచనలలో వ్యక్తముచేయుట ఒకటి సామాన్యమైనది. ఏకాంకికకు సజీవమైన సంభాషణ ప్రాణము. ఈ శిల్పసత్యమును ఆంధ్ర ఏకాంకికా రచ యితలు గుర్తించుటయేగాక చాలవరకు సాధించిరి కూడ.

నవీన ఏకాంకికకు పునాదులు వేసిన ప్రముఖులలో ఒకరగు శ్రీ చింతాదీక్షితులుగారు తమ రచనలలో తమ ప్రతిభను చూపినారు. నుడికారపు సొంపు ఇంపు గొలుపు

తెలుగుభాషలో సాగిన వీరి రచనలు మార్దవమునకు, మాధుర్యమునకు మార్గదర్శకము లయినవి. వీరి రచన లోను, శిల్పములోను లాలిత్యము ముఖ్యధర్మము. వీరి 'చక్రవాక మిథునము' ఈ గుణమునకు చక్కని తార్కాణము.

ప్రాచీనాంధ్రసాహిత్యము ననుసరించి ప్రజలలో బయలు దేరిన కథల నాధారముగా చేసికొని ఏకాంకికలను రచించినవారు కొంద రున్నారు. అట్లు బయలుదేరిన రచన లలో శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి 'కలంపోటు' అనునది ఒకటి. సన్నివేశ కల్పనమందును, సంభాషణను నడపుట యందును వీరు మంచి ప్రతిభను చూపిరి.

పౌరాణికమైన ఇతివృత్తమునే గ్రహించి, మంచి కాల్ప నికమైన ప్రతిభతో శ్రీ అబ్బూరి రామకృష్ణరావుగారు 'నదీసుందరి' నాటికను రచించిరి. ఇది ఈ శాఖకు చెందిన నాటికలలో మేల్బంతియై యున్నది. ఇందులకు ముఖ్య కారణము దీని రచనలోని ప్రత్యేకత, కోమలమైన రచన. మధురమైన భావము, సన్నివేశ నిర్మాణచాతుర్యము — ఈ నాటికలోని ప్రత్యేక ధర్మములై నాటికకు నాటికి, నేటికిగూడ పేరు తెచ్చుచున్నవి. శ్రీ దేవులపల్లి వెంకట కృష్ణశాస్త్రిగారి 'ధనుర్దాసు' మొదలైన నాటికలును ఇట్టివే. వీరి రచనయందును చ్యుతసంస్కారము కాని మధురశబ్ద ప్రయోగమును, భావతీక్ష్ణతయు గోచరించును.

శ్రీ గుడిపాటి వెంకటచలంగారు సాంకేతికములైన 'మృత్యువు' మొదలైన నాటికలు వ్రాయుటయేగాక, పురాణప్రసిద్ధములైన సన్నివేశములను గ్రహించి ఉత్తమ పాత్రలను సృష్టించుకొనుటకు వానిని ఉపయోగించుకొనిరి. వీరి ఏకాంకికలలో ఇట్టిది 'భానుమతి'. దీనిని పాత్రబీజక మైన ఏకాంకిక అనవచ్చును. మహాభారతములో దుర్యో ధనుని భార్యగా పేరునకు మాత్రమే మనకు ఈమె తెలియును. ఇం దీమె మహాసామ్రాజ్ఞిగా చిత్రింపబడినది. పాండవుల భార్యయైన ద్రౌపదికంటె ఈమెయే ఉత్తమురా లన్నట్లుగా రచయిత ఈమెను చిత్రించెను. పురుషుల వలన స్త్రీలు ఎంత బాధపడుచున్నారోకదా యని భాను మతి కుమిలిపోవును; భర్తను పిలిపించి ఆతనికి హితబోధ చేసినట్లుగా కూడ నిందు వర్ణింపబడినది. కాని దుర్యో ధనుడు ఆమెమాట వినక, సభయందు ద్రౌపదికి పరా భవము తప్పదని చెప్పి నిష్క్రమింపగనే 'లాభము లేదు, అక్కా, వారు పురుషులు. ఎంత న్యాయపరులు కానీ, ధర్మవేత్తలు కానీ పురుష సమూహ మంతా ఏకమే. స్త్రీ స్వతంత్రించిందా పురుషశత్రు వౌతుంది. న్యాయ, ధర్మ వివేకాలు మూతలుపడతాయి' అని పల్కును. ఈ నాటిక 'భానుమతి' పాత్రోన్మీలనమునకై ఆమె ద్వారమున రచయిత చెప్పదలంచుకొనిన మాటలను చెప్పుటకై రచింపబడినది.

ఈ విధముగనే పురాణ ప్రసిద్ధములైన పాత్రలను స్వీక రించి వారిచే నవీనాభిప్రాయములకు ప్రాతిపదికలు కాదగిన పల్కులు పల్కించి శ్రీ పాలగుమ్మి పద్మరాజు గారు 'రాధః కృష్ణుడు' అను ఏకాంకికను రచించిరి. యువ కృష్ణునిపై రాధ ప్రణయ ప్రభావముయొక్క పరిణామ వికాసము లిందు చక్కగా ధ్వనితమైనవి. దీనిలో వ్యంగ్య ముగా స్త్రీ పురుషులకు సంఘజీవితములో ఉండవలసిన సమ ప్రాముఖ్యము మనోహరముగ సూచితము.

సామ్యవాద దృక్పథముతో పురాణగాథనే ఇతి వృత్తముగా గ్రహించి శ్రీ గవను వెంకట కృష్ణరావుగారు అతి రమణీయమైన 'భిక్షాపాత్ర' యను ఏకాంకికను రచించిరి. పురాణేతివృత్తము నింత చమత్కారముగా నవీన దృక్పథము ననుసరించి వ్రాసిన ఏకాంకికలు తక్కువ. కాశిలో భిక్ష లభింపని వ్యాసునకు వచ్చిన కోపమును, కాశిని శపింప నెంచిన వ్యాసునిపై కాశీపతికి వచ్చిన కోపమును ఈ నాటికకు వస్తువు. ఇందు కాశీపతి అధికార మత్తుడుగ, ధనమదాంధుడుగ ప్రదర్శింపబడెను. వ్యాసుని శిష్యులలో దేవలుని పాత్ర రమణీయముగ చిత్రింపబడినది. విప్లవము మొదలైన నవీన పదములు విశ్వనాథుని నోట పలికింపబడినవి. ఈ నాటిక చేయు వ్యాఖ్యానము కొందరికి నచ్చకపోవచ్చును. కాని 'ప్రపంచం ఒక్క ప్రతిభను మాత్రం ఎప్పుడూ సహించలేదు' అన్న భావమును వ్యక్తీకరించుటకు రచయిత ఈ వస్తువును గ్రహించినాడని అంగీకరింపక తప్పదు. గ్రహించిన వస్తు వును తీర్చి దిద్దుటలో రచయిత విశేష ప్రతిభను చూపినాడు.

'స్త్రీ - ఆమెకు సంబంధించిన సమస్యలు' నవ్యులకు ఏకాం కికా రచనయందు తరుగు విరుగు లేని వస్తువు. వివాహము, విడాకులు, ప్రేమ, ఈర్ష్య, స్వేచ్ఛ, విశృంఖలత్వము మొదలగున వన్నియు నేటి రచయితలకు నచ్చిన వస్తువులే. పతితకు సంఘమున పునరావాసము కల్పించి, ఉద్ధరించు విషయము కొంతమంది ఇతివృత్తముగా గ్రహించిరి. ఈ రచనలకు వెనుక ఇబ్సన్, బెర్నార్డ్ షా ల వంటి పాశ్చా త్యులు వ్రాసిన రచనలు ఛాయామాత్రముగ అయినను కలవని పాఠకులకు తెలియును. ఇట్టి రచనలు చేయుచున్న ప్రతి రచయితకు పాశ్చాత్య సాహిత్య సంస్కార మున్న దని ఊహించుట సత్యదూరము కాదు. ఈ సంస్కారము అపకర్ష హేతు వనుకొనుటకు వీలు లేదు.

సంఘము దృష్టిలో పతిత అయిన స్త్రీని నాయికగా తీసికొని శ్రీ పి. వి. రాజమన్నారుగారు 'ఏమి మగవాళ్లు', 'నిష్ఫలం' అను రెండు రమణీయమైన ఏకాంకికలు వ్రాసినారు. ఈ రెండింటియందును నాయికలు వేశ్యలయినా, వారు మృచ్ఛకటికములోని వసంతసేనయొక్క స్థాయిని అందుకోగలవారు. కాని వీ రున్న సంఘము మృచ్ఛకటికమునాటి సంఘము కాకుండుటచేతను, వీరి ప్రేమకు పాత్రులైన వ్యక్తులు చారుదత్తునివంటివారు కాకుండుట చేతను వీరి త్యాగమునకు, మంచితనమునకు అపహాస్యమే ఫలితమగును.

స్త్రీల సమస్యలకు సంబంధించినవే భిన్నదృక్కోణములకు చెందినవానిని ఇం కొకరెండింటిని గూర్చి ఇచట ప్రస్తావించుట యుక్తము. మొదటిది శ్రీ ముద్దుకృష్ణగారు రచించిన 'అపవాదు'; రెండవది శ్రీ గోవిందు రామశాస్త్రి గారు రచించిన 'దూరతీరాలు'. ఈ రెండును వాస్తవికతకు సంబంధించినవైనను రచన విషయములో మొదటి దానిలో హెచ్చు వాస్తవికత్వ దృష్టియు, రెండవదానిలో హెచ్చు ఆదర్శ దృష్టియు ప్రదర్శింపబడినవి. ఈ రెండింటిలోని నాయికలును – అనగా ప్రధాన స్త్రీ పాత్రలు – కారణాంతరములచే భర్తలను విడిచి వచ్చినవారే, తమకాళ్లపై తాము నిలుచుటకు చాల శ్రమలు పడినవారే. అపవాదులోని నాయిక లలిత భర్త మరల వివాహముచేసికొనిన వెంటనే భర్తృగృహమునుండి వచ్చి వేరుగా ఉద్యోగము చేసికొనుచు జీవించుచుండును. ఆమె ఆరోగ్యముకొరకు షికారు పోవుటను, పురుషులతో చనవుగా మాటాడుటను సంఘము హర్షింపదు. 'శ్యాం' అను నాతడును, 'హేం' అను నాతడును ఆమె చనవును దుర్వినియోగము చేయ ప్రయత్నింతురు. కాని లాభము లేకపోవును. ఇందు లలితను తీవ్రపరీక్షకు లోనుచేసి మానసికవైకల్యమును కలిగించు సన్నివేశములు లేవు. జీవితములో స్వేచ్ఛగా జీవింపనెంచు స్త్రీకి కలుగు శ్రమలు వర్ణింపబడినవి. అపవాదు స్త్రీ విషయమున ఎంత సులభమో వ్యక్తము చేయబడినది.

ఇంక 'దూరతీరాలు' అను నాటికలోని నాయిక నిర్మల కార్యశూరత్వము కలది. ఆడుది తిండిలేక పోయినను పస్తుండవలెను గాని ఉద్యోగము చేయరాదని భర్త సిద్ధాంతము. ఉద్యోగము చేయగలిగినప్పుడు చేసి పొట్టపోసికొనుటలో దోష మేమియని భార్య ప్రశ్న. ఈ సమస్యకు అంతుచిక్కక నిర్మల భర్తను, పిల్లను విడిచి వెళ్ళిపోవును. ఈ ఏకాంకికలో చక్కని సన్నివేశకల్పన, ఉచితరీతిని పాత్రచిత్రణము ఉన్నవి. శిల్ప విషయమున, పాత్రోన్మీలన విషయమున ఈ నాటిక ఉత్తమ నాటికలలో ఒకటి. ఈ నాటికలోని నిర్మల జయాన్ని, అపజయాన్నికూడ పొందెను. తన జీవితమును తాను జీవింపగలుగుటలో జయము; కాని ఆ జీవితములో సుఖము నిచ్చు పుత్రికా ప్రణయాదులలో అపజయము పొందెను. ఈ సంఘములో స్త్రీ పరిపూర్ణజయమును పొందుట కింకను చాలదూరము పయనింపవలసియున్నదని ఈ నాటిక మనకు కలిగించు భావము. కనుకనే పాఠకులకు నిర్మలపై గౌరవ, సానుభూతులు.

హాస్యనాటికలను రచించినవారిలో శ్రీ మల్లాది విశ్వనాథకవిరాజుగారు, శ్రీ భమిడిపాటి కామేశ్వరరావుగారు, శ్రీ మునిమాణిక్యం నరసింహారావుగారు ఆంధ్రదేశమునందంతటను పేరు సంపాదించిరి. శ్రీ విశ్వనాథకవిరాజుగారి 'దొంగాటకం', 'కిర్రుగానుగ', 'డొంకలో షరాబు' మొదలగు నాటికలలో వారి హాస్యచతురత కన్పట్టును. ఈ నాటికలలో సన్నివేశములు, సంభాషణలు నవ్వు పుట్టించును. వీరు రచించిన 'దిద్దుబాటు'వంటి నాటికలలో హాస్యముతోబాటు ఒక జీవితశకలమునుగూడ మనకు చూపి మన మన్ననలకు పాత్రులైనారు. మాండలిక పదములను ప్రయోగించుట వీరికి ఇష్టము.

శ్రీ భమిడిపాటి కామేశ్వరరావుగారి 'ఎప్పుడూ ఇంతే', 'బాగుబాగు', 'కచటతపలు', 'పెళ్ళి ట్రెయినింగు', 'ఎవళ్ళగొడవ వాళ్ళది' మొదలైన నాటికలలో సన్నివేశములు, సంభాషణలు, పాత్రలు నవ్వు పుట్టించును. సాధారణముగా మానవునిలో ఉండు సుగుణములను, దుర్గుణములను వీరి పాత్రలు ప్రదర్శించుటచే వీని నర్థము చేసికొనుటలో కష్టము లేదు. కనుకనే వీరి నాటికలకు సార్వజనీనత వచ్చినది. వీరి నాటికలలోని పాత్రలు మాటాడు భాషలో కాకుస్వరమునకు ప్రాముఖ్యము హెచ్చు. కనుక ఈ నాటికలను ప్రదర్శించునప్పుడు చూచినచో సభ్యుల ఆనందము ద్విగుణీకృతమగు ననుటలో ఆశ్చర్యము లేదు.

శ్రీ మునిమాణిక్యం నరసింహారావుగారు రసైకజీవి. కనుకనే వారు గృహజీవితమునే కథావస్తువుగా తీసికొని రచనలు సాగించినారు. ఈ వస్తువును గ్రహించి రచనలు సాగించినట్టివారిలో వీరిని మించినవారు లేరనుట ఆంధ్రదేశము అంగీకరించిన మాట. వీరి 'మునిమాణిక్యం నాటికలు', 'యదార్థ దృశ్యాలు' అనునవి రమణీయమైన మధుర రచనలు. వీనిలోని హాస్యము సున్నితమైనది; సభా సాధుత్వము కలది.

మానవునిలోని ప్రాథమికోద్రేకములైన భయాదులను వెలికి తీసి, అప్పు డాతడు తనకు సామాన్యముగా ఇష్టము

లేని పనులను చేసినట్లు చూపి, సభ్యుల హృదయములలో అద్భుతబీజములను నాటునట్టి ఏకాంకికలు కొన్ని బయలు దేరినవి. ఈ శాఖకు చెందినవి - శ్రీ నోరి నరసింహశాస్త్రిగారి 'గజ్జెల మొలతాడు', శ్రీ మొక్కపాటి నరసింహశాస్త్రి గారి 'మొక్కుబడి' అను ఏకాంకికలు. ఈ 'గజ్జెల మొలతాడు' చూచుచున్నంతసేపు భార్యయొక్క మూఢ విశ్వాసము, దానికి ఏవిధముగాను తీసిపోని భర్తయొక్క మూర్ఖాభినివేశము మనల నాకర్షించును. నాటికయొక్క సన్నివేశములు, పాత్రల సంభాషణములు రంగస్థలముపై ఒక విచిత్ర వాతావరణమును సృష్టించి సభ్యుల నాకర్షించును,

'మొక్కుబడి'లో నాస్తికత్వ, మూఢ విశ్వాసముల పరస్పర సంఘట్టన వర్ణింపబడినది. ఈ నాటిక సృష్టించు వాతావరణము అద్భుతమైనది. దీనిని రంగస్థలముపై వేగముగా ప్రదర్శించినప్పుడు సభ్యులు చేష్ట దక్కి కూర్చుండి యుందురు. ఈ నాటిక మన కిచ్చు సందేశము కంటె ఈ వాతావరణ సృష్టియందే మన కెక్కువ మక్కువ. మనలోని ప్రాథమికోద్రేకము లన్నియు ఘాళనమైన ట్లగును.

గ్రామీణ జీవితమును చిత్రించుచు బయలుదేరిన నాటికలలో శ్రీ నార్ల వెంకటేశ్వరరావుగారి 'కొత్తగడ్డ'లోని నాటికలు ఉత్తమములు. గ్రామజీవితములో అనుభూతము లగు సమస్త విషయములను, సన్నివేశములను ఇంచుమించుగా వీరు ఈ నాటికలలో చిత్రించిరి. కనుకనే ఈ నాటికలలో కొన్నింటికి ఆర్థిక ప్రయోజనము, కొన్నింటికి సాంఘిక ప్రయోజనము, కొన్నింటికి రాజకీయప్రయోజనము కలదు. పాత్రోచితమైన గ్రామీణభాషను వీరు మధురముగా రచించిరి. ఇంతేకాక పాశ్చాత్య రచయితలలో కొందరి ననుసరించి శిల్ప విషయమున చేసిన ప్రయోగము లగు కొన్ని నాటికలుకూడ ఇందు కలవు.

వాస్తవికతను సాధ్యమైనంతవరకు ఉన్న దున్నట్లు చిత్రించి, అనేక నాటికలు రచించి ఆంధ్రదేశమున పేరు పొందినవారు శ్రీ ఆచార్య ఆత్రేయగారు. మధ్యతరగతి జీవితము - నిత్యము మన కన్నులయెదుట కన్పట్టుచున్నది - వీరి నాటికలలో చక్కగా చిత్రితమైనది. వీరి నాటికలకు ముఖ్యవస్తువు ఆర్థికసమతలేని జనతాజీవితము. ఆ సమత, ప్రపంచశాంతి ముఖ్యముగ సాధింపవలసినవని వీరి సందేశము. చాలవరకు వీరి నాటికలు సందేశ బీజకము లనవచ్చును. కథా సన్నివేశములు, పాత్రపోషణము మొదలగునవి ఈ దృష్టితోడనే కల్పింపబడును. శిల్ప విషయమున వీరు పాశ్చాత్యుల యొద్దనుండి కొన్ని సూత్రములను గ్రహించి రనవచ్చును. ముఖ్యముగా 'ఎవరు దొంగ' అను నాటిక అందులకు నిదర్శనము కాదగియున్నది. వీరి 'ఎన్. జి. ఓ.' అను నాటికయు, 'ప్రగతి' అను నాటికయు అనేక స్థలములలో ప్రదర్శింపబడి జయమును పొందినవి. వీరిది పాత్రోచిత భాష.

ఆర్థిక సమతలేని సంఘములో జీవించుచు, కష్టనష్టముల పాలగుచున్నవారి జీవితమును ప్రదర్శించుచు రచనలు సాగించుచున్నవారిలో శ్రీ సుంకర సత్యనారాయణగారొకరు. వీరికిని, రాజకీయార్థిక సమస్యలను ఎక్కువగా నాటికలలో చిత్రించుట సహజమైనది. వీరి నాటికలలో భూసమస్యలకు ప్రాముఖ్యము హెచ్చు.

విజ్ఞాన శాస్త్రాభివృద్ధి మానవుని తత్త్వ దృష్టిలో తెచ్చిన మార్పులను పురస్కరించుకొని వ్రాసిన నాటికలు కొన్ని బయలుదేరుచున్నవి. ఇట్టి నాటికలలో శ్రీ బుచ్చిబాబుగారి 'నాలుగోపరిమాణం' ఒకటి. నాయకుడైన విశ్వం పరీక్షలకు చదువుకొనుచుండగా, అతని వివాహము నిశ్చయమైనదని ఉత్తరము వచ్చును. మిత్రు లందరు వచ్చి అభినందించుచుందురు. అందరు మిత్రులు వెడలిపోయిన తరువాత అతనికి నిద్రవచ్చును. అందులో కల. మిగిలిన దంతయు కలలో జరిగినట్లు ప్రదర్శింపబడినది. పాత్రల సంభాషణ విచిత్రము. నాలుగవ పరిమాణముయొక్క అంతరార్థము బాగుగా బోధపడని మన కందరకు ఈ నాటిక నవ్వు తెప్పించును. కాని సమయ, స్థలములు కలిసినట్లు ఊహింపగలిగిన తరమువారికి ఈ భావములో అసందర్భము గోచరింపదు. అట్టివారు భావితరమువారేమో!

చరిత్రలో ప్రసిద్ధిపొందిన వ్యక్తులను గ్రహించి వారి జీవితములపై నాటికలను వ్రాయుటకూడ నవీనులు ఆదరించుచున్నారు. ఆ వ్యక్తుల జీవితములకు, వారి కృత్యములకు నూతన నిర్వచనములు, వ్యాఖ్యానములు కల్పించుచున్నారు. ఇవి చరిత్రలోని సత్యమునకు ఎంత సమీపస్థము లని చూచుటకంటె రచయిత దృక్పథమును ఎంతవరకు మనకు అవి తెలియజేయగలిగినవని మనము పరిశీలించుట మంచిది. ఈ సందర్భమున చరిత్రలో ప్రసిద్ధికెక్కిన అశోకుని జీవితమునకు సంబంధించిన రెండు నాటిక లుదాహరింపదగియున్నవి. మొదటిది శ్రీ శ్రీనివాసశిరోమణిగారి 'పరివర్తనము'; రెండవది శ్రీ బుచ్చిబాబుగారి 'తిష్యరక్షిత'. ఈ నాటికలోని సన్నివేశములు, పాత్రపోషణ, భావపోషణ రమణీయములు. ఈ నాటికకు ప్రాణము తిష్యరక్షిత. ఆమె మూర్తిని, ఆమె మనస్సును, ఆమె హృదయమును రచయిత చిత్రలేఖకునకు సహజమైన విన్నాణముతో తీర్చి దిద్దెను. తిష్యరక్షితకు ప్రేమ, వివా

హము, మతము, సంఘములోని కట్టుబాట్లు మొదలగు వానిపై చాల నవీనములైన అభిప్రాయము లున్నట్లు చూపబడినది. ఈ నాటికను చదివినను, చూచినను, సహృదయునకు - తాత్కాలికముగనైనను - అశోకునకు మతవిషయమునగల అంతశ్శుద్ధిపై అవిశ్వాసము కలిగి, తిష్యరక్షిత చెప్పినది నిజమే అని తోచుననుట సత్య దూరము కాదు; అనగా రచయిత నాటికా రచనయందు పరిపూర్ణ జయమును పొందినా డన్నమాట. తిష్యరక్షిత నోటివెంట రచయిత మాటాడుచున్నను, అ ట్లనిపించదు. దీని ప్రత్యేకత ఇది.

ఇట్లు దిఙ్మాత్రముగ పరిశీలించినదానిని బట్టియే తెలుగు ఏకాంకిక ఎట్లు పురోగమించు చున్నదియు తెలియును. ఇది తెలుగు ఏకాంకికయొక్క స్థూల రూప సందర్శనమే గాని సమగ్ర పరిశీలనము కాదు. దీనిలో చెప్పబడినవే కాక ఇంకను ఎందరో ప్రతిభావంతులయిన రచయితల రచనలు కలవు. క్రొ. వీ.

**కచ్చేరీ నృత్యకళ :** కచ్చేరీ నృత్యపద్ధతి రాజుల ఆస్థానములలో అభివృద్ధి పొంది ముఖ్యముగా దేవదాసీలచే ఆరాధింపబడి ప్రదర్శించబడిన నట్టువ మేళ విద్య. తంజావూరు, కాళహస్తి, కార్వేటినగరము, వెంకటగిరి, విజయనగరము, బొబ్బిలి మొదలైన సంస్థానములలో ఈ విద్య పెరిగి, పోషింపబడి, సంస్కరింపబడి నేటి భరత నాట్య స్వరూపమును తాల్చినది. ఈ నృత్య పద్ధతికి, కూచిపూడి భరత సంప్రదాయమునకు ఎట్టి సంబంధమును ఉండదు. కచ్చేరీ నృత్యమందు సాధారణముగా ఒకే నర్తకి నృత్యము చేయును. కనుక ప్రేక్షకులకు విసుగు తోచకుండ ఉండుటకుగాను నాటి శాస్త్రకారులు నృత్య, నృత్త, అభినయాదులను సరిసమానమైన పాళ్ళలో పోషించు విధమున ఒక నృత్య క్రమమును ఏర్పాటుచేసి ప్రచారములోనికి తెచ్చిరి. అదియే నేటి భరతనాట్య పద్ధతి. క్షేత్రయ్య రచించిన పద సాహిత్య రచనలు రసనిలయములై సాత్వికాభినయనమునకు ఎంతయో అనువుగా నుండుటచే సంస్థానములలోని నృత్యకళావేత్తల రసాభినయమునకు ఆతని పదములే ఆధారములైనవి. క్షేత్రయ్య కాలము వరకు మన భరత విద్యలో ఆంగిక ప్రధానమైన నృత్య, నృత్తములు ఎక్కువగా అభివృద్ధి చెందినను సాత్విక ప్రధానమైన అభినయము ఆతని పదరచన తరువాతనే వృద్ధిపరచబడినది. దీనితో మన నృత్యకళలో ఒక అపూర్వమైన కూర్పు వచ్చినది. న. రా.

**కడప నవాబులు :** కడపసుబాను పాలించిన నవాబులు మయానా తెగకు చెందిన పఠానులు. వీరు దక్కను సుబాదారుకు సామంతులు. వీరిలో మొదటి నవాబు అబ్దుల్ నబీఖాను (క్రీ. శ. 1710 - 1735). ఇతడు ఆర్కాటు నవాబు ప్రతినిధిగ సిద్ధవటము కోటను పాలించుచుండిన రాజా ఫత్తేసింగును మోసమున చెరబట్టి కోటను వశపరచుకొనెను. ఇతని కైదుగురు కుమారులు. వారిలో జ్యేష్ఠుని తనవద్ద నుంచుకొని మిగిలినవారికి తాను జయించిన, తన సుబాలో నున్న దుర్గములను జాగీరులుగ నిచ్చుచు వచ్చెను. సిద్ధవటము కోటను వారిలో అబ్దుల్ హమీద్ ఖానుకు ఇచ్చెను. ఇతనిని హమ్మూ మియా యనియు, బడేమియా యనియు వ్యవహరించుచుండిరి.

అబ్దుల్ నబీఖాను కార్య చతురుడు; పరాక్రమవంతుడు. ఇతడు రాజ్యమును దక్షిణమున పుంగనూరు వరకు వ్యాపింపజేయుటయే కాక బారామహలు నుండికూడ కప్పము గైకొనెను. ఇతడు పాత కడప చెరువు నిర్మించి వ్యవసాయ మభివృద్ధి కావించెనని చెప్పుదురు. ఈ చెరువుకు నీరు వచ్చుటకు బుగ్గవంక కతడు ఆనకట్ట కట్టించెను. ఈ యానకట్ట 1903 లో వచ్చిన వరదల తరువాత నాశనము చేయబడినది.

ఇతని యనంతర మితని పెద్ద కుమారుడు అబ్దుల్ ముహమ్మద్ ఖాను (క్రీ. శ. 1736 - 1747) ఈ సుబాను పాలించెను. క్రమముగా దృష్టి తగ్గినందున ఇతనికి గ్రుడ్డి నవాబని పేరు కల్గెను. ఇతని కాలమున 1740 లో మహారాష్ట్రులు నలువది యేబది వేల గుర్రపు దళముతో చౌథాయి (చౌతు) రూకలను రాబట్టుకొనుటకై వచ్చి రాయలసీమ మీద పడి సీమను దోచుకొని సంక్షోభింపజేసిరి. వారితో యుద్ధము చేసి యిత డోడిపోయి తుదకు లక్ష యేబదివేల రూపాయలను, పెక్కు బహుమానములను ఇచ్చి సంధి చేసికొనెను.

అతని తరువాత అతనికి కొడుకులు లేనందున అతని సోదరుడు అబ్దుల్ ముహసిమ్ ఖాను (క్రీ. శ. 1748 - 1752) కడపకు నవాబయ్యెను. ఇతనిని మూచామియా యందురు. ఆసఫ్ జా నిజాముల్ ముల్కు 1748 లో మృతినొందిన పిదప నాసర్ జంగు దక్కను సుబేదారయ్యెను. అతడు కర్ణాటకముపై దండెత్తినపు డతని సామంతులు కడప, కర్నూలు నవాబులును అతనివెంట వెళ్ళిరి. దండయాత్రనుండి మరలి వచ్చునపుడు ఆ నవాబు లతనితో వాగ్వాదము పెట్టుకొని తిరుగబాటు చేసి 1750 లో అతనిని వధించిరి.

కడపలో గొప్ప సాహుకారులు పన్నీ శిలింఖాను, బాకరా సాహేబు అనువారికిని, నవాబుకును విరోధము కలుగగా వారు సిద్ధవటమును పాలించుచున్న అబ్దుల్

హమీద్ ఖాను కుమారుడు అబ్దుల్ మజీద్ ఖానుకు నాలుగు వేల గుఱ్ఱపు దళమును సమకూర్చుకొనుటకు ధన సహాయము చేసి అతనిని కడపపై దండెత్త ప్రోత్సహింపగా అత డాకస్మికముగా కడపపై వచ్చిపడి ముహసింఖానును చెరబట్టి 1753 లో కడపకు నవాబయ్యెను. తరువాత అతడు గండికోట, గుత్తి, బళ్ళారి, మడకసిర, కోలారు మొదలయిన బారామహల్ దేశముల మీదుగా విజయ పరంపర పొంది అపారధనముతో మరల కడపకు వచ్చి చేరెను. కడప కతడు నవాబైన నాలుగేండ్లనుండి నాలుగువేల గుఱ్ఱపు దళమును, మందిని పోషించుటకు ధన మిచ్చిన సాహుకారులు పైకము వచ్చినంతనే తప్పక యిచ్చెదన్న అబ్దుల్ మజీద్ ఖాను ఆడిన మాట ననుసరించి తమ పైకము నిమ్మని అతనిని నిర్బంధించిరి. అత డప్పుడు సగమును, తరువాత సగమును ఇచ్చెద ననగా వా రంగీకరింపక తామే పోషించుచుండిన ఆ గుఱ్ఱపు దళమును, మందిని వెంటగొని, అతడు సిద్ధవటములో నుండగా కోటను ముట్టడించి పోరాడిరి. ఈ సమయమున మహారాష్ట్రుల దండు కృష్ణయొడ్డున విడిసి యుండగా తనమీద తిరుగబాటు చేసినవారిని వచ్చి శిక్షించినచో కోటి రూప్యము లిచ్చెదనని ముహసింఖాను వారికి వార్త పంపెను. బలవంతరావు నాయకత్వమున మహారాష్ట్రులు కడపకు వచ్చి ముందుగా పైక మిచ్చినచో వారిని హత మార్చెదమని యతనికి కబురు పంపి, తిరుగబాటు చేసిన వారు తిరిగి వచ్చి కడపలోనే యున్నను వారి జోలికి పోక తిన్నగా సిద్ధవటమున కానవాబుపై దండెత్తి వెళ్ళిరి. వారికిని, నవాబుకును బండికనుమవద్ద 1757 లో యుద్ధము జరిగినది. అందు నవాబు హతుడయ్యెను. పిదప మహారాష్ట్రులు తమకు గుఱ్ఱంకొండ, రాయచోటి, పులివెందల, వేంపల్లె, పార్నపల్లె, జంబులమడుగు తాలూకాలను వశముచేయు షరతుమీద ఖైదులో నుండిన మూచామియాను విడిపించిరి. అప్పటినుండి మూచామియా కడప సుబాను మూడేండ్లు (క్రీ. శ. 1758 - 1760) పాలించెను.

కడపటి కడప నవాబు అబ్దుల్ మజీద్ ఖాను కుమారుడు అబ్దుల్ హలీమ్ ఖాను (క్రీ శ. 1761 - 1779). ఆ కాలమున హైదరలీ దండెత్తిరాగా ఇతడు కొంత పైక మిచ్చి, యుద్ధ సమయమున సైన్య మంపుటకును, ఏటేట కొంత పేష్కషు చెల్లించుటకును ఒడంబడెను. కాని అట్లు చేయక వీలు చిక్కినపుడు స్వతంత్రు డగుటకు ప్రయత్నించుచు వచ్చెను. ఇది తెలిసి హైదరలీ కడపపై మరల దండెత్తి వచ్చి అతని నోడించి 1779 లో దానిని వశపరచుకొనెను. అబ్దుల్ హలీం ఖాను సకుటుంబముగా సిద్ధవటమునకు పారిపోగా హైదరలీ దానినికూడ ముట్టడించి సకుటుంబముగా అతనిని పట్టుకొని శ్రీరంగపట్టణమునకు పంపెను. అత డచట ఖైదులో మరణించెను. అంతటితో మయానా ప్రభుత్వ మంతమందెను.

మ. సో. శ.

**కథాసాహిత్యము :** ప్రాచీనాంధ్ర వాఙ్మయము నందలి కథాసాహిత్యములో కేతన (క్రీ. శ. 1255) దశకుమార చరిత్ర గద్య పద్యాత్మకమై అద్భుత రసోపేతమైన ప్రథమ కథామంజూషిక. అనంతామాత్యుని భోజరాజీయము, జక్కన విక్రమార్క చరిత్ర, వెన్నెలకంటి అన్నయ్య షోడశకుమార చరిత్ర, కొరవి గోపరాజు ద్వాత్రింశత్సాలభంజికల కథలు, కదిరీపతి శుకసప్తతి, నారాయణకవి హంసవింశతి, తురగా వెంకంరాజు మర్యాద రామచరిత్రలందు ప్రాచీనాంధ్ర దేశమున విశేష ప్రాచుర్యము వహించిన కథలు కన్పించుచున్నవి. ఇందు కొన్ని నీతి ప్రతిపాదికములు ; కొన్ని అద్భుతరసనిరూపణములు.

ఆధునిక కాలమునందు 1850 ప్రాంతమునుండి కథారచనము ఆరంభమైనది. అంతవరకును పైన పేర్కొన్న గ్రంథములే కాక పేదరాశి పెద్దమ్మకథలు, కాశీమజిలీల కథలు, పిట్టకథలు తెలుగువారు చెప్పుకొని ఆనందించుచుండెడివారు. కర్ణపరంపరగా వచ్చుచున్న ఈకథ లేనాడు పుట్టినవో చెప్పుట కష్టము. 1850 నుండి చిన్నయసూరి, వీరేశలింగం పంతులు, వెంకటరత్నం పంతులు, వెంకటరాయశాస్త్రి ప్రభృతులు సంస్కృత సాహిత్యమునుండి ఎన్నియో కథలను అనువదించియు, అనుకరించియు తెలుగు పాఠకలోకమునకు అందించినారు.

కథావాఙ్మయ శాఖకు దోహద మీయజాలినవి పత్రికలు. 19వ శతాబ్ది పరార్థమందు ఆంధ్రభాషలో కొన్ని పత్రిక లవతరించినవి. ఆ తొలినాటి పత్రికలందు ఆంగ్ల, ఉర్దూభాషలనుండి కొన్ని కథలు అనూదితములై ప్రచురితములైనవి. ఈ జాతికి చెందినవి షేక్స్పియర్ కథలు, యవన యామినీ వినోదములు అను పేరున వచ్చిన అరేబియన్ నైట్స్ కథలు, చార్ దర్వేషు కథలు, అమీరే హంజా అను కథలు.

పై కథ లన్నియు పరరచనా ప్రభావము వలన వచ్చిన కథలేకాని అన్యములు కావు. తెలుగుజాతి స్వశక్తితో జన్మించి సాహిత్యమున ఒక ప్రత్యేక ప్రక్రియగా నివి ఖ్యాతి గడించుకొన జాలవు. 'క్లుప్తముగా నొక యుజ్జ్వల సౌందర్యమునో, భయంకర దృశ్యమునో, కరుణాద్భుత సన్నివేశమునో ఆధారముచేసికొని ఒకేయొక ఉద్దేశముతో ఒక తారాజువ్వవలె ఎగసి పువ్వులు రాల్చి ఊరుకొనునది

చిన్నకథ'. ఇది యొక విచిత్ర సాహిత్యసృష్టి; ఒక రసమయ సన్నివేశ నిరూపణము.

చిన్నకథకు ఆకార ప్రకారములు సంపూర్ణముగా ఏర్పడకున్నను ఒక రీతిగ నిది తెలుగున 1911 ప్రాంతమున జన్మించిన దనవచ్చును. నేటి కథకు 'విఘ్నేశ్వరపూజ చేసినవారు' శ్రీ గురజాడ అప్పారావు. ఆయన రచించిన 'దిద్దుబాటు', 'దేవుడు చేసిన మనుషుల్లారా' అను రెండు కథలు ఆ ప్రాంతమున 'ఆంధ్రభారతి' మాసపత్రికలో ప్రచురితములైనవి. వీటిని కథ లనుటకంటె 'స్కెచెస్' అనుట సమంజసము. అచ్చపు తెలుగు వాడుకభాష సజీవ ముగా చిన్న కథలు వ్రాయుటకు తొలుతవాడినవారు శ్రీ గురుజాడ. 1914 ప్రాంతమున శ్రీ వెదురు మూడి శేషగిరిరావు 'మద్రాసు కథలు' వ్రాసిరి. వానియందును చిన్నకథకు రూప మేర్పడలేదు. 1915 లో ఆంధ్ర దినపత్రిక అవతరించినది, తెలుగు కథకు నూతన దోహదము చేకూరి నది. నాటినుండి పలువురు ప్రముఖులు కథా సాహిత్యమున కృషి సల్పిరి. ఈ ప్రాంతమున సాహితీ సమితి సభాపతి శ్రీ శివశంకరశాస్త్రి 'మురారి కథలు' చెప్పిరి. ఇందు తెలుగునాటి బాలజీవితము వెల్లడి యగుచున్నది. కథా కథనమున ఆత్మాశ్రయ విధానమును ప్రవేశపెట్టినవారు శ్రీ శివశంకరశాస్త్రి.

క్రీ. శ. 1916 మొదలు 1919 వరకున్న మధ్య కాలమున కథానికా రచనము విస్తృతమైనది. ఈ కాలమునాటి ప్రముఖ రచయితలు చింతా భీమ శంకరం, కొడవటి గంటి వెంకట సుబ్బయ్యా, చింతా దీక్షితులు, ముని మాణిక్యం నరసింహారావు, వేలూరి శివరామశాస్త్రి, నోరి నరసింహశాస్త్రి ప్రభృతులు. భీమ శంకరం కథలలో అపరాధపరిశోధన విశేషము. ఇవి ఆర్థర్ కానన్ డైల్ రచనలను జ్ఞప్తికి తెచ్చును. మొదట టాల్‌స్టాయ్ కథలను అనువదించుటతో రచన మారంభించిన శ్రీ వెంకట సుబ్బయ్యా ఈకాలముననే 'సుకుమారి', 'ఎఱ్ఱచీర' వంటి స్వతంత్ర కథలను చెప్పినాడు. వీనియందు కొంతగా సాంఘిక జీవితము, స్త్రీ-పుం పరిశీలన (స్టడీ ఇన్ సెక్స్) గోచరించును. శ్రీ దీక్షితులు బాల బాలికలకొరకు కథలు వ్రాసి బాల వాఙ్మయ సృష్టికర్తలలో ప్రథముడైనాడు. శ్రీ శివరామశాస్త్రి 'ఔపగవ్యుడు' వంటి కథలలో వస్తువును వైదికసాహిత్యమునుంచి స్వీకరించి తత్కాల వాతావరణమును సృజించి కథారచనలలో ఉత్తమ సంస్కారమును నిరూపించినాడు. మునిమాణిక్యం ఈనాటికే గృహస్థజీవిత స్వారస్యాలను కథల మూలముగా ఆంధ్ర సాహిత్యలోకమునకు అందించుట ప్రారంభమైనది. నోరి నరసింహశాస్త్రి రచించిన 'గానభంగం', 'చేసుకున్నవారికి చేసుకున్నంత' వంటి ఈనాటి కథలలోనే ఒకరీతి సన్నివేశ వైచిత్రి, ఆదర్శ ప్రియత్వము వ్యక్తమగు చున్నవి.

శ్రీ శివశంకరశాస్త్రి సభాపతిగా 1919 లో సాహితీ సమితి స్థాపితమైనది. స్వల్పకాలమున నూతనోత్తేజముతో బహువిధ సాహిత్య శాఖ లుద్భవిల్లి పెంపొందుచు వచ్చినవి. కథానికకు వెనుకటికంటె విస్పష్టమైన రూపము, రచనా విన్యాస వైశద్యము చేకూరినవి. శివశంకర శాస్త్రి, వెంకట సుబ్బయ్యా, దీక్షితులు, మునిమాణిక్యం, నోరి వంటి పూర్వరచయితలు విరళముగను, విశ్వనాథ, బాబూరావు, శిరోమణి, వేదుల వంటి రచయితలు నూతనముగను ఉత్తమ కథానికా సృష్టికి కడంగినారు.

క్రీ. శ. 1920లో 'సాహితి' పత్రిక స్థాపనము. దీనితో కథానికకు నూతనశక మారంభమైనది. 1924 లో భారతి అవతరించినది. ఈ నూతన శకమున ఆంధ్రకథానిక క్రమ క్రమముగ పుష్టిని చేకూర్చుకొనుచువచ్చి ఈనాడు ప్రపంచ మున ప్రథమగణ్యమైన ఒకకుసుమమును ప్రసవించినది.

ఆంధ్రకథకులలో ప్రముఖుడుగ పరిగణితుడగుచున్న దీక్షితులది ఒక విశిష్టస్థానము; వీరు తొలుదొల్త బాల సాహిత్య సృష్టి గావించి, 'సూరి, సీతి, వెంకి' వంటి పాత్రలను కల్పించిరి; లీల, సుందరి, శంపాలతలవంటి పాత్రలతో కథానకములను చెప్పిరి; 'చెంచు దంపతుల' వంటి కథలలో అతిస్వాభావికముగ ఆటవిక జీవితమును ప్రతిబింబింప జేసిరి. 'లేడీస్ కల్చర్ క్లబ్' కథలలో తన పాశ్చాత్యనాగరికతా వ్యామోహముతో మనల నాకర్షించు 'వటీరావు' పాత్ర నిరుపమానమైన సృష్టి. 'భైరవశాస్త్రి' కథనములవంటి 'స్కెచెస్' కూడ వీరి రచనలం దున్నవి. వీరి కథావస్తు వైవిధ్యము, రచనా చాతుర్యము మిన్నయైనవి.

ఆంధ్ర కథాలోకమున 'కాంతం' వంటి అమృత పాత్రను సృష్టించిన శ్రీ మునిమాణిక్యం నరసింహారావు గారి దొక విశిష్టస్థానం. వీరి కథలలో గృహస్థజీవిత స్వారస్యాలు, ఉపాధ్యాయ వృత్తిలోని చిక్కులు, స్వల్పవిషయాలకు తబ్బిబ్బులయ్యే అమాయక హృదయాల పరిశీలన కనిపిస్తున్నవి. '20 వ శతాబ్దిలోని మధ్యతరగతి బ్రాహ్మణ కుటుంబాని కీయన కథలు అద్దము'. కైఫియ్యతుల భాషలోను, శాస్త్రపరిభాషలోను వీరు చెప్పిన కథల్లో ఒక వైచిత్రి గోచరిస్తున్నది. వీరి శైలీసారళ్యము, సుఖకరమగు కథనము మెచ్చదగినవి.

తెలుగు కథకులలో ఒకడుగ కీర్తిగన్నవాడు మొక్కపాటి నరసింహశాస్త్రి. వీరి రచనలలో హాస్యము ప్రధానరసము. కొలది మాటలలో పాత్రలను కనులకు కట్టేటట్టు రూపించే

ప్రజ్ఞ ఈ కథకునిదే. 'గాజుపాలెం గాంధీ' ఇందు కొక ఉదాహరణ. కథాకథనములో స్వగతరీతిని వీరు ప్రవేశ పెట్టినారు. 'చిత్తరువు', 'కోతపై కోతలు' కథారచనలో నూతన విన్యాస వైఖరిని నిరూపించినవి.

శ్రీనివాస శిరోమణి కథలు విశేషముగ సాంఘికములు. 'ధర్మస్థాపనము', 'భార్యారూపవతి' వంటి కథలు సుదీర్ఘములు. ఎడ్గర్ ఎలెన్ పో, వెల్స్ ప్రభృతులు చెప్పిన 'చిన్న కథ ఒక్కసారి కూర్చొని 15 నిమిషములు మొదలు 50 నిమిషములలో చదువవలె'నన్న నియమమున కివి లొంగవు. కథలు విశేషముగ నాలోచనాత్మకరీతిని నడచును. వీరి శైలి ఉజ్జ్వలమైనది.

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి అచ్చపు తెనుగు కథకుడు. జమీన్‌దారుల జీవితము, సంఘసంస్కరణ వీరి కథలకు వస్తువు. వీరిది తూర్పుగోదావరి జిల్లాలోని శుద్ధ శ్రోత్రియ కుటుంబాల భాష. కథనముకంటె వీరి కథలందు సంభాషణ విశేషము. ఇంచుమించు కథ వాకోవాక్యములవలె నడచును. 'విష భుజంగము', 'గులాబి అత్తరు', 'ఆడబడుచు'వంటి వీరి కథలు గుర్రపు పరుగుతో సాగును. ఇదివీరి విశిష్టత.

విద్వత్తును ప్రతిఫలింపజేయుచు సజీవముగ కథలు చెప్పగల పండిత కథకుడు శివరామశాస్త్రి. కథలందు అనంతవస్తు వైవిధ్య మున్నది. 'అతిథి దేవుడు', 'అంతర్నాటకం', 'పిత్తల్ కా దర్వాజా', 'డిప్రెషన్ చెంబు' మొదలైన కథ లన్నిటియందును కథకుని చిత్త సంస్కారము అభివ్యక్తమగుచున్నది. శరత్ శివరామశాస్త్రి మిత్రులు. ఆకారణమున వీరి ఇటీవలి రచనములలో శరత్ ప్రభావము కన్పించుచున్నది.

అద్భుత సన్నివేశములతో, ఒయ్యారము లొలికించు సత్యస్వాప్నికములైన రెండు జగత్తుల సమ్మేళనముతో కథారచన మొనర్చినవాడు అడివి బాపిరాజు. సర్వసామాన్యముగ కథావస్తువులలోని ప్రధాన పాత్రలు శిల్పులు; చిత్రకారులు. కథలు పెద్దవి. 'భోగీరలోయ', 'హిమాలయ రశ్మి', 'తిరపతికొండ మెట్లు', 'నాగలి' వంటి కథలు బాపిరాజు రచనాశేముషికి ప్రతీకలు. స్వయముగ చిత్రకారుడగుటచే కథనమున, శైలియందును శిల్పవిన్యాసములు గోచరించును. ఇతనివలన తెలుగు కథారచనమునకు అభ్యుదయము చేకూరినది.

ఒకమతమున గుడిపాటి వెంకటచలం ఆంధ్ర కథకులలో అగ్రపీఠము వహించును. కథావస్తువు విశేషముగ స్త్రీ - పుంసజాత్య సంబంధి. అతిస్వతంత్రములుగ కన్పించు వీరి కథలలో అనేకము మొపాసా, వెల్స్, చెకో, క్రైన్, అనతోల్ ఫ్రాంస్ మొదలగువారి రచనల కనుసరణములుగ కన్పించును. వీరు తరువాత వచ్చిన కావ్యకథా సాహిత్యమునకు మార్గదర్శకులు. వీరి కథలలో శక్తివంతమగు భాష, సాటిలేని వాతావరణ సృష్టి, విశిష్ట రూపములతో పాత్రచిత్రణము, దిగంబరమైన మానసిక స్థితి పరిశీలనము, అసామాన్యకథానిర్వహణ సామర్థ్యము ద్యోతకము లగుచున్నవి. 'వేదాంతం', 'హంపీకన్యలు' వీరి ప్రజ్ఞానిరూపణ కుదాహరణములు.

వివిధ భాషల విజ్ఞానముతో, విచిత్రశయ్యా సౌభాగ్యాలతో అనతి శబ్దజాలమున కథ నల్లగల ప్రజ్ఞాశాలి మల్లాది రామకృష్ణశాస్త్రి. కథలకు నామకరణము చేయుటలో విశిష్టత గోచరించుచున్నది. 'నేతి నేతి', 'మాద్రి' ప్రభృతి కథలు, 'మణిదీపాలు' రామకృష్ణశాస్త్రి ప్రజ్ఞకు నిదర్శనములు. వెంపటి నాగభూషణం కథలు సర్వవిధాల రామకృష్ణశాస్త్రి కథల ననుసరించుచున్నవి.

అత్యధిక సంఖ్యలో కథలు చెప్పినవాడు పూడిపెద్ది వెంకట రమణయ్య. కవికొండల వెంకటరావు పల్లె జీవితము మొదలు పట్టణవాసములోని విచిత్ర జీవిత విశేషాలవరకును వస్తువులను స్వీకరించి కథలు అసంఖ్యాకముగా చెప్పినాడు. భమిడిపాటి కామేశ్వరరావు ఆలోచనాత్మక శైలిలో దీర్ఘమైన హాస్యకథలు రచించినాడు. కొలదియైనను విశిష్ట వస్తువిన్యాసములతో విశ్వనాథ సత్యనారాయణ 'మాక్లీదుర్గంలో కుక్క' వంటి కథలు చెప్పినాడు. వేదుల 'అనితమ్మ' వంటి మరపునకు రాని కొన్ని కథలలో మనోహర రచనా విన్యాసముమ చూపినాడు. నోరి నరసింహశాస్త్రి 'చిలక', 'వీరుడి కథ' ఈ జాతిలోనివి. చారిత్రక వస్తువులతో రచన చేసిన సురవరం ప్రతాపరెడ్డి తెలంగాణా కథకులలో ప్రథముడు.

స్త్రీ రచయితలలో కనుపర్తి వరలక్ష్మమ్మ కథా రచనయందు విశిష్టస్థానము గల వ్యక్తి. 'పింఛను పుచ్చుకున్న మర్నాడు' వంటి కథలు వీరి రచనా ప్రావీణ్యమునకు నిదర్శనములు. పులవర్తి కమలాదేవి, పద్మావతీదేవి, యెల్లాప్రగడ సీతాకుమారి, నాయని కృష్ణకుమారి, మాలతి చందూర్ ప్రభృతులు ఉత్తమ కథలు చెప్పిన స్త్రీలు.

తాతా కృష్ణమూర్తి, దిగుమర్తి రామారావు, పురాణం కుమార రాఘవశాస్త్రి, గోపీచందు, జి. వి. కృష్ణరావు, 'కరుణ కుమార', కొడవటిగంటి, ఇంద్రకంటి, జమదగ్ని, బుచ్చిబాబు, 'అమరేంద్ర' ప్రభృతులు తెలుగు కథాసాహిత్యమునకు నూతనాలంకారములను చేకూర్చుచున్నారు. తెలుగు కథకు ప్రపంచమున నగ్రస్థానమును గడించి యిచ్చిన పాలగుమ్మి పద్మరాజు కథలు విశేషముగా వర్ణనాత్మకములు, మానసిక స్థితి నిరూపణములు. వా. సో.

'కన్ను': ఇతని చరిత్రను గూర్చిన విషయ మంతయు షమ్సి సిరాజ్ అఫీఫ్ అను మహమ్మదీయ చరిత్రకారుడు రచియించిన తారీఖ్-ఇ-ఫీరోజ్‌షా యను గ్రంథమునుండి గైకొనబడినది. ఇతడు ఆంధ్రదేశ వాస్తవ్యుడు. కాకతీయ ప్రతాపరుద్రుని ప్రధాన సైన్యాధిపతులలో నొక్కడు. 1323 లో ఆరాజు ముహమ్మద్ బిన్ తుఘ్లుక్‌చే పట్టుబడి ఢిల్లీ పట్టణమునకు ఖైదిగ గొంపోబడినప్పుడు 'కన్ను' తన రాజు ననుగమించి చనెను. మార్గ మధ్యమున ప్రతాపరుద్ర భూమీశ్వరుడు కాలగతి నందిన పిమ్మట నితడు ముహమ్మద్ బిన్ తుఘ్లుక్‌చే మహమ్మదీయ మతదీక్షను బుచ్చుకొని యతని నాశ్రయించెను. ముహమ్మద్ బిన్ తుఘ్లుక్ ఇతనికి మక్‌బూల్, అనగా పరిగ్రహీతు డను క్రొత్త పేరు పెట్టి తన కొలువులో చేర్చుకొనెను. తన శక్తి సామర్థ్యములవలన సుల్తానుదయకు పాత్రుడై కాలక్రమమున అమీర్ పదమును, ఉన్నత పదవులను పొంది మలిక్ మక్‌బూల్ తెలంగీ యను పేర ప్రఖ్యాతుడాయెను. 1335 లో సుల్తాను దక్షిణ దేశమునకు వచ్చినపుడు తెలుగు దేశమును రెండు భాగములుగ విభజించి యందు ఓరుగల్లు రాజధానిగ గల తూర్పు భాగమునకు మక్‌బూల్‌ను పాలకునిగ నియమించెను. కాని 1336 లో ముసునూరి కాపయనాయకుడు మహమ్మదీయులను తెలంగాణము నుండి పారద్రోలి దేశము నాక్రమించుకొనినప్పుడు మలిక్ మక్‌బూల్ నిభాయింపజాలక ఢిల్లీకి పలాయనము చేసెను. కాని సుల్తానున కతనియెడల విశ్వాసము తరుగలేదు. తరువాత నతడు మాళవ, గూర్జర దేశములలో కొన్ని భాగముల కధిపతిగ నియుక్తుడై 1351 లో ముహమ్మద్ బిన్ తుఘ్లుకు మరణించువరకును అతనికి నమ్మిన బంటయి అతనిని గొల్చెను. ముహమ్మద్ బిన్ తుఘ్లుకు తరువాత ఢిల్లీ సింహాసనము నధిష్ఠించిన ఫీరోజ్‌శాహు మలిక్ మక్‌బూల్‌కు ఖాన్-ఇ-జహాన్ అను బిరు దిచ్చి ప్రధాన మంత్రిగ జేసికొని యతని సహాయమున ఢిల్లీ సామ్రాజ్యమును పరిపాలించెను. సుల్తాను దూరదేశములకు దండయాత్రలు వెడలునప్పుడు ఖాన్-ఇ-జహాన్ మక్‌బూల్‌ను తనకు ప్రతినిధిగ రాజకార్యములను నడపుటకు నియోగించి చనువాడు. అతడు ముఖ్య ప్రధానియై యుండిన పదునెనిమిదేండ్లు సుల్తానుకు కుడిభుజమై సకల రాజకార్యములను కడు సామర్థ్యముతో నిర్వహించి 1370 లో మృతి నందినట్లు తెలియుచున్నది.

ఈ 'కన్ను' అనునత డెవ్వడు? ప్రతాపరుద్రుని కొలువున దుండిన నాయకుల పేర్లు పెక్కు శాసనములలోను గ్రంథములందును కానవచ్చుచున్నను 'కన్ను' అను పే రెందును కానరాదు. కాని ప్రతాపరుద్రుని నాయకులలో నొక్కడును, మారన విరచిత మార్కండేయ పురాణము నంకితముగొన్న వాడునగు నాగయ గన్న సైన్యాధిపతి యొక డున్నాడు. 'గన్న' యనునది 'కర్ణ' శబ్దభవమని తృతీయాశ్వాసారంభపద్యమందలి 'నాగయకర్ణా' యను సంబోధనమువలన తెలియుచున్నది. కావున షమ్సి సిరాజ్ అఫీఫ్ పేర్కొన్న 'కన్ను' 'గన్న' నామము యొక్క భ్రష్ట రూపమని యనుకొన వచ్చును. నే. వెం. ర.

'కరుణకుమార' (క్రీ.శ. 1901 - 56): వీరి అసలు పేరు కందుకూరి అనంతము. వీరు పశ్చిమ గోదావరిజిల్లాలోని తణుకు తాలూకా కాపవరము గ్రామములో 1901 వ సంవత్సరమున జన్మించిరి. వీరు ఉన్నత విద్య నభ్యసించి, తరువాత కళాశాలలో చేరి, ఇంటర్ మీడియేట్ పరీక్షకు చదువుచు ధనాభావము చేత విద్యాభ్యాసము మానివేసి నెల్లూరు జిల్లాలో గవర్నమెంట్ రెవిన్యూ డిపార్టుమెంటులో చేరి డిప్యూటీ తహసీల్దారుగాను, కొంత కాలము తహసీల్దారుగను, తరువాత మద్రాసు హరిజన సంక్షేమశాఖ డైరెక్టరు కార్యాలయములోను పనిచేసి అస్వస్థతచే 1956 ఉద్యోగమునుండి విరమించుకొని పిదప కొద్ది మాసములకే కాలధర్మము నొందిరి.


చిత్రము 129.
'కరుణకుమార'

గ్రామ జీవనము కథావస్తువుగ చిత్రించిన మొదటి కథకులు వీరు. వీరి కథ లన్నియు 'కరుణకుమార' అను మారుపేరుతో ప్రకటితములైనవి. సాధారణముగ వీరి కథలలోని ఇతివృత్తము గ్రామములలో నివసించు పేద రైతులకు, కష్టజీవులకు సంబంధించినది. 'కరుణకుమార కథలు', 'బిళ్ళల మొలతాడు' అను పేర్లతో రెండు గ్రంథములు ప్రకటితమైనవి. ఇవి కాక ఇంకా అనేక కథలు భారతి, ఆంధ్రపత్రిక, ఆంధ్రజ్యోతి, కిన్నెర, స్వతంత్ర పత్రికలలో ప్రచురితమైనవి.

వీరు కేవలము రచయితలే గాక గొప్ప నటనా కౌశలము గలవారు. వీరిది శ్రావ్యమైన కంఠము. స్థానికముగ పెక్కు నాటకములలో ప్రధాన నాయకపాత్ర ధరించి

చక్కగ అభినయించెడివారు. హరిశ్చంద్రుడు, సారంగధరుడు, చిత్రనళీయములోని బాహుకుడు, పాండవోద్యోగ, విజయములలో అర్జునుడు వీరి అభిమాన పాత్రలు.

 మ. సో. శ.

**కర్నూలు నవాబులు:** వీరు పఠానుజాతివారు. దావూదుఖాను సోదరుడైన ఇబ్రాహీంఖానుని సంతతివారు. ఇబ్రాహీంఖాను కొడుకులలో నొకడైన అలీఫ్ ఖాను 1724 లో అదివరకు దావూద్ ఖానుకు జాగీరుగా ఈయబడిన కర్నూలు ప్రాంతమునకు యజమానియగుటచేత ఈ జాగీరు తనదిగా గుర్తింపవలసినదని, తాను విధేయసామంతుడనై యుందునని దక్కను సుబాదారైన ఆసఫ్ జాకు విన్నపము చేసికొనగా అతని కోరిక మన్నింపబడెను. ఆసఫ్ జా అతనిని ఆదవాని కిల్లా కధిపతిని గావించెను. కాని యితడు చిన్నవాడగుటచేత కర్నూలులోనే యుండుటకు ఆసఫ్ జా సమ్మతించెను. అలీఫ్ ఖాను 1733 వరకు తొమ్మిదేండ్లు పరిపాలనము చేసెను. ఇతనికి హిమాయత్ ఖాను, రహమత్ ఖాను అని యిరువురు కొడుకులు.

హిమాయత్ ఖాన్ (క్రీ. శ. 1733 - 1751): తండ్రి అలీఫ్ ఖాను అనంతరము హిమాయత్ ఖాను జాగీరు కధిపతియయ్యెను. ఇతడు పాలించుచుండిన కాలమున 1741 లో దక్షిణదేశదండయాత్రనుండి తిరిగి వచ్చుచు ఫత్తేసింగు నాయకత్వమున మహారాష్ట్రులు కందనోలుసీమ (కర్నూలు సీమ) పైబడి ఊళ్ళు తగులబెట్టి డబ్బుదోచుకొని నానాక్షోభము కావించిరి. 1749 లో ఆసఫ్ జా మృతినొందిన వెనుక అతని పెద్దకుమారుడు ఢిల్లీ మొగలాయి కొలువుకూటమునం దుండుటచేత దగ్గరనుండిన రెండవకొడుకు నాసర్ జంగు సింహాసన మెక్కెను. సింహాసనముకొరకై ఇతనికిని, ఇతని మేనల్లుడు ముజఫర్ జంగుకును కలహము సంభవించినది. నాసర్ జంగు నెదిరింపలేకయతడు కర్ణాటకమునకు పారిపోయి ఫ్రెంచి గవర్నరు మూసా డూప్లే, చందాసాహేబుల తోడ్పాటుతో తాను దక్కను సుబాదారునని ప్రకటించుకొనెను. ఇంక నతని నడచివేసినగాని కార్యములేదని అతనిని సాధించుటకై తలపెట్టిన కర్ణాటక దండయాత్ర సందర్భమున సేనలను సమకూర్చికొని వచ్చి కలియుటకు సంసిద్ధముగ నుండవలసినదని నాసర్ జంగు సేనాని హిమ్మత్యార్ ఖాను కృష్ణకు దక్షిణముననున్న రాజులకు, నవాబులకు ఆజ్ఞ యిచ్చెను. తన తండ్రికాలమున కూడబెట్టబడిన పదునొకండు లక్షల రూపాయలు నజరుగా నదివరకే యిచ్చియుండుటచేత ఇప్పుడు మరల సేనను సమకూర్చి యియ్యలేనని హిమాయత్ ఖాను ప్రత్యుత్తర మిచ్చెను. అందుమీదట హిమ్మత్యార్ ఖానుకు కోపము వచ్చి యతడు కందనోలు కోటను ఖాళీచేసి పోవలసినదని నవాబు కుత్తరువు చేసెను. తన యుత్తరువు నుల్లంఘించినందుకు హిమ్మత్యార్ ఖాను నవాబుపై నెత్తిరాగా నవాబు మూడువందల మందితో పోయి యెదిరించి కాదరాబాదవద్ద జరగిన పోరాటమున నతని నోడించెను. ఈ సంగతితెలిసి హిమాయత్ ఖాను సామాన్యుడు కాడని నాసర్ జంగు అతనిమీదికి సేన పంపుటకిచ్చగింపక రాజీచేయు నిమిత్తము సైఫుద్దీనును పంపెను. తుదకు హిమాయత్ ఖాను సేనతో దండయాత్రలో పాల్గొనుట కొడంబడి నాసర్ జంగు ననుసరించెను. అతడు కర్నూలు విడిచి వెళ్ళిన పిదప హంద్రి, తుంగభద్రానదులు పొంగి కోటగోడలో కొంతభాగము కొట్టుకపోయెను. ఊరికిని కొంత నష్టము కలిగెను. కడపమండలములోని రాయచోటికి వచ్చినప్పు డీ వార్త హిమాయత్ ఖానుకు తెలిసి అతడు కర్నూలు వెళ్ళుటకు నాసర్ జంగు ననుజ్ఞ వేడెను; కాని బంగారిటికలతో కోట కట్టించి యిత్తునని చెప్పి యనుజ్ఞ నతడు నిరాకరించెను.

రాజీ కుదిర్చినచో ఏదియో ఇచ్చెదనని నాసర్ జంగు పెట్టిన యాశ నిరాశయగుట వలన నిదియే సమయమని సైఫుద్దీను నాసర్ జంగుమీద ఉన్నవి లేనివి కొండెములు చెప్పి హిమాయత్ ఖానుకు ద్వేషము రగిల్చెను. ఈ ద్వేషము యుద్ధములో నాసర్ జంగుకు తోడ్పడినందుకు అతడు తనకు కొన్ని మన్ననలను, కొంతప్రదేశము నిచ్చునని ఆశించుచుండిన యాశలకు భంగము కలుగుటతో మరింత వృద్ధియైనది. తమకు లాభము చేకూరని యుద్ధమువల్ల విసిగిపోయి కడప, కర్నూలు, సవనూరు పఠానుదొరలు తనకేమియు నపాయము కలిగింపనని నాసర్ జంగువద్ద నుండి వాగ్దానము తీసికొన్నపిదపగాని లోబడవద్దని ముజఫర్ జంగుకు సలహా యిచ్చిరి. కాని యిది జరగక మునుపే నాసర్ జంగు ముజఫర్ జంగుకు సంకెళ్ళువేసి బంధించెను. దీనితో నొడలు మండి పఠాను దొరలు రహస్యముగ అతని విడుదలకు డూప్లేతో రాయబారము లారంభించిరి; చెంజివద్ద యుద్ధ మారంభమయినప్పుడు యుద్ధరంగమున నూరక యుండినందుకు నాసర్ జంగు చీవాట్లు పెట్టగా కినిసి తుపాకి గుండు పేల్చి అతనిని హత్యచేసిరి. హత్య కావించినది కర్నూలు నవాబని కొందరును, కడప నవాబని కొందరును చెప్పుదురు. నాసర్ జంగు హతుడయిన వెంటనే ముజఫర్ జంగు సుబేదారుగా ప్రకటింపబడెను. మూడేండ్లనుండి బకాయిపడిన కప్పమును మాఫుచేయవలెనని, తమ పాలన యందున్న ప్రదేశమునకు క్రొత్త సీమలు

కలిపి యిక ముందు కప్పము కట్టనక్కర లేకుండ చేయవలసినదని, నాసర్‌జంగు కోశాగారములోని సగము ధనము తమ కీయవలెనని పఠాను నవాబులు ముసఫర్ జంగును కోరిరి. డూప్లే వారితో రాయబారములు నడిపి పూర్తిగా కాకపోయినను కొంతవరకు వారి కోరిక లీడేరునట్లు మధ్యవర్తిత్వము గావించెను. ఫ్రెంచిసేన కాపుదలకై వెంట రాగా ముజఫర్‌జంగు దక్కనుకు బయలుదేరి వచ్చుచు కడప మండలమున ప్రవేశించెను. చెదరుగా వచ్చుచుండిన కొందరు గుర్రపు రౌతులు కడప సుబా గ్రామస్థులతో తగవులాడి వారి గ్రామములను తగులబెట్టిరి. అదివరకే తమ కోరికలు పూర్తిగ తీర్చలేదని కుములుచు సమయము దొరికినచో ముజఫర్‌జంగుపై తిరుగబడవలెనని యుండిన పఠాను నవాబుల కది యవకాశ మిచ్చినది. కడపజిల్లా రాయచోటివద్ద ముజఫర్ జంగు సేనలకు పఠాను నవాబుల సేనలకు యుద్ధము జరిగినది. సవనూరు నవాబు కడికండలుగా కోసివేయబడెను. కడప నవాబుకు గుండె దెబ్బ తగిలి పారిపోయెను. అతనిని తరుముకొని పోవుచుండిన ముజఫర్‌జంగుకు కర్నూలు నవాబు హిమాయత్ బహదర్‌ఖాను ఎదురయ్యెను. తుద కప్పు డుభయులకు పోరాటము జరిగి యుభయులును హతులైరి. ఫ్రెంచివారంతట నాసర్‌జంగు అన్న సలాబత్ జంగును సుబాదారుగా ప్రకటించిరి. తరువాత సుబాదారు సేన కర్నూలు మీదుగా గోలకొండకు పోవుచు కర్నూలు కోటను ముట్టడించెను. అది 1751 మార్చిలో వారి స్వాధీన మయినది. కోటలోనివారు చాలమంది హతులయిరి. నవాబు భార్యయు, ఇద్దరు కొడుకులును ఖైదుచేయబడిరి. పిమ్మట నాసర్‌జంగు తమ్ముడు నిజామలీఖాను కందనోలి ఠాణాకు నియమితుడయ్యెను. తరువాత నిజామలీఖాను 'సెలవుమీద' గద్వాల జమీన్‌దారు రామానాయుడు కోట స్వాధీనము చేసికొనెను. అప్పు డాతని దివాను ఖండోజి పంతులు.

మునావర్‌ఖాను (క్రీ. శ. 1751-52 - 1791-92): గద్వాల రామానాయనికి, ఖండోజీ పంతులకు మనసు కలియనందున రామానాయనికి రాజ్యము పూర్తిగా అమరియు అమరకయున్న సందర్భమున ఆర్కాటు కరిగిన హిమాయత్‌బహదర్‌ఖాను సోదరుడు మునావర్‌ఖాను బహదర్ అను రణమస్త్‌ఖాను క్రీ.శ. 1751-52లో తిరిగి వచ్చి తన పూర్వుల రాజ్యము నాక్రమించుకొనుటకై కడప నవాబువద్దనుండి మూడువేల రూపాయలు బదులుతీసికొని సేనను సమకూర్చుకొని కర్నూలు సీమపై దండెత్తివచ్చెను. ఇతనికి కర్నూలు దేశముఖు ఖండోజీపంతులు రెండువేల మందితో తోడ్పడెను. కందనోలిసీమ జమీన్‌దారులకు మునావర్‌ఖానుకు నెలలతరబడిగా చిన్న పోరాటములచ్చటచ్చట జరగుచునే యుండెను. ఈ రీతిని 1751 మొదలు 1753 వరకు రెండేండ్లు గడచినను రామానాయడు మునావర్‌ఖానులు ఒకరినొకరు సాధింప లేక పోయిరి. పూర్వమునుండి రామానాయనికున్న నాడుగౌడు మిరాసి, ఉంబళిగె గ్రామము లిచ్చుటకు సమ్మతిపడి తుదకు రాజ్యములోని గ్రామములకు నాడుగౌడరికపు రుసుములకు హక్కును, బేతంచర్ల రంగాపురము ఎర్రగుంట్ల గ్రామములను గద్వాల రామానాయని కిచ్చి అతనితో రాజీపడెను. పిదప మునావర్ బహదర్‌ఖాను 1753-54 లో కర్నూలు కోట వశపరచుకొని నిజాము ప్రభుత్వాంగీకారమును బడసెను. ఇతడు నలుబది సంవత్సరములు రాజ్యపాలన చేసెను. తనకు చేసిన సాయమున కితడు ఖండోజీపంతులకు గని గ్రామమును జాగీరుగా ఇచ్చెను. కాని తరువాత నుభయులకు మైత్రి చెడినందున దానిని లాగికొనెను.

మునావర్ బహదర్‌ఖాను రాజ్యపాలన కాలము చివరి భాగమునందు 1775 లో మైసూరు నవాబు హైదరలీ కర్నూలు రాజ్యముపై దండెత్తి వచ్చెను. సైన్యసమేతుడై మునావర్‌ఖాన్ అతని నెదిరింప నరిగెను. కాని యుద్ధమున నాతని జయింపలేక యతనితో సంధి గావించుకొన వలసి వచ్చెను; రాజ్యమును విడిచి వెళ్ళిపోవుటకు హైదరు ఐదులక్షల రూపాయలు కోరెను. కాని మునావర్‌ఖాను రెండు లక్షలు మాత్రమే అతనికి చెల్లించి అతనిని వేడుకొనగా అతడు తన సేనను తరలించుకొని కర్నూలునుండి గద్వాలకు, పిదప నచ్చటినుండి పత్తికొండ తాలూకాలోని కప్పట్రాళ్ళ, కొత్తకొండ పాళెగాండ్ర మీదికి నరిగెను.

మునావర్‌ఖాను క్రీ. శ 1791 - 92 లో చనిపోయెను. ఇతని పెద్దకుమారుడు జాగీరు సంపాదించి హైదరాబాదులో నివసించుచుండెను. రెండవ కుమారుడు హసనల్లీ ఖాను పరిపాలింప నసమర్థుడని మునావర్‌ఖాను తన మూడవ కొడుకు అలూఫ్‌ఖానును నియమించెను. ఇతనికి అల్లబ్‌ఖా ననియు వ్యవహార ముండెను.

అలూఫ్‌ఖాను (క్రీ. శ. 1791-92 - 1815-16): తండ్రి మృతి నొందిన వెంటనే అలూఫ్‌ఖాను రాజ్య మాక్రమించుకొనెను. రాజ్యమునకై ఇతని యన్న హసనల్లీ ఖానుకు ఇతనికి కొంతకాలము యుద్ధము జరగెను. ఈ యుద్ధములో నితడు హసనల్లీఖాను నోడించి యాతని యొక్క వెలుగోటి కోట బురుజులు నాశనము చేసి ఇనుప తలుపులను సిద్ధాపురము చేర్చెను; హైదరాబాదు నిజాము

తన్ను కర్నూలు నవాబుగ నంగీకరించి ఈ రాజ్యము తనకు ఖాయపరచుటకు రాయబారములు నడపుచుండెను. మైసూరు నవాబు హైదరలీకి వశుడయినను, మునావర్ బహదర్ ఖాను హైదరాబాద్ నిజామునే కాని యతనిని తన ప్రభువుగ నంగీకరింపలేదు. అలూఫ్ ఖాను కూడ తండ్రి పద్ధతినే అనుసరించెను. ఆ విధముగా నిజాముతో రాయబారములు జరుగుచుండు కాలమున అతనికిని, మహారాష్ట్రులకును యుద్ధము సంభవించెను. అప్పుడు నిజాము యుద్ధావసరమునకు పంపవలసిన సేనతో బయలుదేరి రావలసినదని అలూఫ్ ఖానుకు వర్తమాన మంపగా పదునాలుగు వందల గుర్రపు దళముతో పోయి అతడు తన ప్రభువును 1795 లో కర్ల యుద్ధరంగమున కలసికొనెను. పిదప తన అన్నకు కొంత ధనమిచ్చు షరతుమీద నిజా మతనికి కర్నూలు రాజ్యమును ఖాయపరచెను.

క్రీ. శ. 1799 లో శ్రీరంగపట్టణపు ముట్టడిలో టీపు సుల్తాను హతుడయిన పిదప అతని మైసూరు రాజ్యమును విజేతలు పంచుకొనుటలో ఇతర మండలములు కొన్నిటితో పాటు కర్నూలు నిజామువంతునకు వచ్చినది. దీని నతడు 1800 లో హైరాబాదులోని బ్రిటిష్ రక్షణసేన పోషణార్థము రొక్కమునకు బదులుగా బ్రిటిష్‌వారికి దత్తము చేసెను. అప్పటినుండి కర్నూలు నవాబు బ్రిటిష్ వారికి సామంతుడయ్యెను

మునావర్ ఖాను (క్రీ.శ. 1815-16 - 1823-24): అలూఫ్ ఖాను ఇరువదినాలుగేండ్లు పాలించి మృతి నొందెను. ఇతని కారుగురు కొడుకులు; జ్యేష్ఠుడు మునావర్ ఖాను; ఆరవవాడు గులామ్ రసూల్ ఖాను. బ్రిటీషువారి తోడ్పాటుతో మునావరుఖాను 1815 లో నవాబయ్యెను. ఇతడు రాజ్యమునకు వచ్చిన స్వల్పకాలమునకే దేశమును పిండారీ దండు వచ్చి దోచుకొనెను. ఈ నవాబు ఎనిమిదేండ్లు పాలించి 1823 - 24 లో చనిపోయెను.

గులామ్ రసూల్ ఖాను (క్రీ. శ. 1823 - 1839): మునావర్ ఖాను అనంతరము గులామ్ రసూల్ ఖాను నవాబయ్యెను. ఇతడు ఆయుధ సామగ్రిని సేకరించి తమమీద తిరుగబాటు చేయుటకు ప్రయత్నించు చుండినట్లు తెలిసి బ్రిటిషువా రితనిని కందనోలు (కర్నూలు) కోట విడిచి పోవలసినదని యాజ్ఞాపించిరి. మార్గాంతరము గానక ఇతడు 1839 లో కోటను బ్రిటిష్‌వారి వశ మొనర్చి దగ్గర నున్న జోలాపురమున కరిగెను. అక్కడ అతని సైనికులు కొందరు తమకు నెలల తరబడిగా బకాయిపడిన జీతము లిచ్చిగాని కదలరాదని అతనిని నిర్బంధించిరి. బ్రిటిష్‌వారప్పుడు జోక్యము కలిగించుకొని అతనిని తిరుచిరాపల్లికి పంపివేసిరి అక్కడ రసూల్ ఖాను భృత్యుడే తనమీద నన్యాయముగ దొంగతనపు నేరము మోపె నన్నుక్రోధావేశమున నతనిని వధించెను. తరువాత అతని జాగీరును బ్రిటిష్‌వారు వశమొనర్చుకొనిరి. మ. సో. శ.

**కవయిత్రులు (ఆధునిక యుగము):** తెలుగు సారస్వతమున క్రీ. శ. 19వ శతాబ్ద మించు మించు అంధకార సదృశ మనవచ్చును. అప్పటి దేశకాల పరిస్థితుల యందలి దుర్భిక్షతయే వాఙ్మయ రంగము నావరించినది. నూత్న విషయ భావ శూన్యమై కవిత్వమన్న కడు ఏవగించుకొను నీ కాలమునకు వైతాళికులై అప్పారాయ, వీరేశలింగ మహనీయు లుద్భవించిరి. దీనితో రంగము మారినది.

ఈ కాలమున అర్ధశత సంఖ్యకు మించిన కవయిత్రులగుపడు చున్నారు. కాని అప్పటి గ్రంథములే ఇప్పుడు చాలవర కగుపడుటలేదు. చరిత్ర తెలిసి, గ్రంథములు కన్పడుచున్న ప్రసిద్ధ కవయిత్రులను మాత్రమే ఇపుడు పేర్కొందును. స్త్రీల సంస్కార విజ్ఞానములకొరకు స్త్రీలచే రచియింపబడిన ప్రబోధాత్మక ధర్మమే ఈనాటి స్త్రీల వాఙ్మయమునకు ముఖ్యలక్షణము. కావున వీరి కావ్యములపట్ల కేవల మీ లక్షణము అనువర్తించినదా లేదా యని మాత్ర ముపలక్షించుటయే చేయవలసిన పని. అట్లని మహాకావ్యములు వ్రాసినవారు అసలే లేరని కాదు. ఈ కాలమునందలి గద్యపద్యాత్మకశాఖ లన్నింటి యందును స్త్రీలు కృషి సలిపిరి. నవలలు, వ్యాసములు, గద్యనాటికలు, మున్నగునవి కూడ పూర్వకావ్యముల వలెనే వీరి రచనములలో మన్నింపబడినవి.

శ్రీ వీరేశలింగ మహాశయుని అనుయాయినులలో ప్రముఖురాలని పేరువడసిన శ్రీ కొటికలపూడి సీతమ్మగారు మహారాష్ట్రరాజ్ఞియు, ఆదర్శ గృహిణియు ఐన అహల్యాబాయి చరిత్రమును కావ్యముగా గానము చేసిరి. ఇంతే కాక సాధురక్ష శతకమును, పెక్కు వ్యాసములను ప్రబోధాత్మకమగు గాథల రూపముగ అనేక మకుటములుగా పద్యములను వ్రాసియున్నారు. బాపట్లయందు జరిగిన ప్రథమాంధ్ర మహాసభయందలి మహిళా సభకు అధ్యక్షత వహించిన మానినీరత్న మీమె. చిక్కని వైదుష్యము, చక్కని ధారాప్రసన్నతయు కల్గి సరళశైలితో వీరి రచనలు చదువరుల కెంతేని చైతన్యము కల్గింపజాలిన వనుట అతిశయోక్తి కాదు.

పీఠికాపుర మహారాజ్ఞియగు రాణి చిన్నమ్మాదేవి స్వయముగ కవయిత్రి యగుటయే కాక కొటికలపూడి సీతమ్మ, జూలూరి తులసమ్మ, పులుగుర్త లక్ష్మీనరసమాంబ,

కళ్లేపూడి వెంకటరమణమ్మ వంటి ఉత్తమ కవయిత్రులతో ఆ స్థానగోష్ఠులు నెరపిన కవయిత్రీ ప్రభ్విణిగా కన్పట్టు చున్నది. ఆమె రచించి పూర్తిచేసిన కావ్యముల నామ ములు సైతము ఇపుడు శ్రుతిగోచరము కాకున్నవి. కాని అటనట చెదరుగా మిగిలిపోయిన కొన్ని పద్యములు, వీరి గోష్ఠులయందు ప్రస్తావింపబడిన సమస్యలు మాత్రము గోచరించుచున్నవి.

భండారు అచ్చమాంబ ప్రసిద్ధ గ్రంథమగు అబలా సచ్చరిత్ర రత్నమాల రచించెను. బుర్రా దేవేంద్రనాథము గారి ధర్మపత్ని సూరమాంబగారు భారతీస్తవ స్తబకము, హరినాథ, నందనార శతకములు, శ్రీ కృష్ణబోధా మృతము, సావిత్రీ విజయకావ్యము అను బహు గ్రంథ ములకు జనయిత్రి. ఈమె శైలి సామాన్యము. ఇందు సావిత్రీ విజయము రుచిరముగా నున్నది.

దాసు శ్రీరాములుగారి పుత్రి వేమూరి శారదాంబ కావ్యద్వయ రచయిత్రి. కడుబాల్యముననే నిర్యాణ మందిన ఈమె ప్రతిభాసంపత్తి అత్యద్భుతము. ఈమె ముఖ్యరచన నాగ్నజితీ పరిణయ మను ప్రబంధము. ఇందలి శైలి తేజఃపూర్ణమై యున్నది. రెండవదియగు మాధవ శతకమున స్త్రీ విద్యావిహీనతను గూర్చి యెక్కువగా ప్రస్తావింపబడి ప్రబోధము కావింపబడినది.

జయపురాస్థాన కవివర్యులగు సెట్టి లక్ష్మీనరసింహము గారి సోదరి సీరము సుభద్రయాంబ గొప్ప కవయిత్రి. ఈమె కొన్నివేల సంఖ్యకల పద్యములతో సుభద్రారామాయ ణము రచించినది. ఈమె బహు గ్రంథ రచయిత్రిగా పేరు కాంచినది. ఈమె శైలి ద్రాక్షాపాక సరళమై, మధురమై చవులూరించుచుండును.

శేషమాంబా, సుబ్బారాయుల పుత్రికయైన అవధూత జ్ఞానమాంబగారు విజయవాడ నివాసిని. ఈమె రచనము లన్నియు తాత్త్వికములు, విశిష్టములు. ఈమెయు బాల్య మున విద్య నెరుగదు. దేవీవరప్రసాదమున అచిరకాలముననే అన్ని చదువుల సారము నెరుంగజాలినది. ఈమె ప్రబోధ పద్ధతియు, రచనా పద్ధతియు కడుగ్రొత్తలు. దేవుడు, విజ్ఞానామృతము, కాశీప్రసాదిని, రంగావధూత, సత్ప్రభు శతకము, గార్గి అనునవి ఈమె రచనలు.

కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారి శిష్యురాలును, బహుళ గ్రంథ నిర్మాత్రియునగు శ్రీ పులుగుర్త లక్ష్మీనరసమాంబ గారి కవిత్వ మతికమనీయమైనది. వీరి పుట్టిన మెట్టిన వంశములు రెండును పండితవంశములే. పులుగుర్త వెంకట రత్నముగా రీమెను పెండ్లియాడి కవితాసఖితోపాటుగ ఈమెకును వికాస మొసంగిరి. వామన పురాణము వీరి బృహద్రచన. ఇదిగాక, వీరు పెక్కు గ్రంథములను రచిం చిరి. వీరి శైలి మిక్కిలి మనోజ్ఞమైనది. వీరి మంగళ హారతులు తెలుగునాట కడుప్రచారము నందినవి.

పీఠికాపుర నివాసినియగు జూలూరి తులసమ్మ బహు గ్రంథకర్త్రి. వీరివి గద్యకావ్యములును, పద్యకావ్య ములును గలవు. వీరి గులేబకావళి తెలుగు నాట హెచ్చుగా ప్రదర్శనయోగ్యత నందినది.

ఈ మహిళావాఙ్మయమును సమీక్షించినచో ఒక్క విషయము తేలుచున్నది. పురుషు లొనర్చిన ప్రతిశాఖా కవిత్వమును వీరును నొనర్చిరి. కాని అన్నింటియందును స్త్రీ సహజమగు ఉచితలజ్జ కాన్పించుచునే యున్నదనునట్లు ఒక పరిమితి, ఒక హద్దు వీరి రచనలను ఆవరించుకొనియే యున్నదని చెప్పవచ్చును. ఊ. ల. కాం.

**కాటన్, సర్ ఆర్థర్ థామస్** (క్రీ.శ. 1803-1899): ఇతడు ఆక్స్‌ఫర్డులోని వుడ్‌కోట్ అను ప్రదేశమున నివ సించు కాల్‌వెలి కాటన్ యొక్క కుమారుడు; అడ్డిస్ కూంనందున్న ఈస్ట్ ఇండియా కంపెనీ మిలిటరీ కళాశా లలో తన పదునైదవ యేట ప్రవేశించి సైనిక శిక్షణము పొందెను; 1819 సంవత్సరము కడపట మదరాస్ ఇంజనీయర్ల కమిషన్ సంపాదించెను; కొంత కాలము కమిషన్ కార్యాలయములో సామర్థ్యముతో పని చేసి తరువాత 1821 సంవత్సరములో అసిస్టెంటు ఇంజనీయర్‌గా మదరాసుకు వచ్చెను; 1824 సంవత్సరములో బర్మా యుద్ధమున పాల్గొని తన సామర్థ్యమును ప్రకటించెను.

1829 సంవత్సరములో నితడు దక్షిణ హిందూ దేశ మున తన జీవిత పరమార్థముగ భావించిన నీటిపారు దల నిర్మాణ సౌకర్యముల నభివృద్ధిపరిచి విస్తరింప జేయుటకై తొలుదొల్త నియుక్తుడయ్యెను.

కాటన్ ప్రారంభ ప్రయత్నముల మూలమున రూపొం దిన నీటిపారుదల సౌకర్య నిర్మాణములు మూడు: 1. కావేరి - కొల్లడములపై ఆనకట్టలు; 2. గోదావరిపై ఆనకట్ట; 3. కృష్ణానదిపై ఆనకట్ట.

మొట్టమొదట కాటన్ తిరుచిరాపల్లి కెగువ కొలది మైళ్ల దూరమున కావేరినుండి చీలి ప్రవహించుచున్న కొల్లడమునకు రెండు చోట్ల ఆనకట్టలు కట్టించి, అందలి నీరు తిరుచిరాపల్లి, తంజావూరు, దక్షిణార్కాడు జిల్లా లలో వ్యవసాయ కార్యముల కుపయోగపడునట్లు చేసెను.

తరువాత పదేండ్లకు రాజమహేంద్రవరమునకు దిగువ కొలది దూరమున గోదావరికి ఆనకట్ట కట్టించు విషయ మున కాటన్ ఒక నివేదికను సిద్ధము చేసెను. అప్పుడు గోదావరీ మండలము చాల దీనస్థితియం దుండి తరచు

క్షామబాధకు గురియగుచుండెను. ఈ దుర్భర స్థితినుండి ప్రజలను కాపాడుటకు కాటను 1847 సంవత్సరములో గోదావరి ఆనకట్ట పని ప్రారంభించి అయిదేండ్ల కాలములో పూర్తిచేసెను. దానితోపాటు ముఖద్వారమువద్ద నున్న సారవంతమైన ఒక లంకకు నీటి పారుదలకోసము ఒక జలవాహిక (అక్విడక్టు) కూడ నిర్మింపబడినది. ఆనకట్టవద్ద నుండి గోదావరి కిరువైపులను, నడిమి లంకమీదను కాలువలు త్రవ్వబడినవి. ఇందువలన నాగోదావరీ మండలము సకల సంపత్సమృద్ధమైనది.



చిత్రము 180.
కాటన్, సర్ ఆర్థర్ థామస్

తరువాత కాటను కృష్ణానది ఆనకట్టను కట్టించుటకు కృషిచేసినాడు. తొలుత నీ కృష్ణానది ఆనకట్టను తలపెట్టినవాడు కీ. శే. కర్నల్ సర్ హెన్రీ అల్వెల్ లేక్ అను నాతడు. తరువాత దాని పనిని సాగించినవాడు కీ.శే. మేజర్ జనరల్ చార్ల్సు ఆర్ అనునతడు. గోదావరి ఆనకట్ట కట్టునపుడు ఇతడు కాటన్ క్రింద పనిచేసి తర్ఫీదయినవాడు; కడుసమర్థుడు. కాటన్‌కు అనారోగ్యము కలుగగా కొలది కాలము గోదావరి ఆనకట్ట పని నితడు సాగించి యుండెను. ఆనకట్ట కట్టుటకు పూర్వము కృష్ణా మండలమును అప్పటి గోదావరీ మండలము వలెనే దుస్థితియందుండినది. పై మూడింటిలో తొలి రెండును కాటన్ ప్రత్యక్ష ప్రయత్న ఫలములుగా రూపొందినవి. మూడవది అతని ప్రయత్న ప్రోత్సాహములు లేనిచో రూపొందుటకు చాల ఆలస్యమయి యుండెడిదేమో. అంతతో పోక కాటన్ హైడ్రాలిక్ ఇంజనీరింగ్ స్కూలు నొకదానిని స్థాపించినాడు. నీటి పారుదల సౌకర్యములను పెంపొందించు విషయమున కాటన్ చూపిన శ్రద్ధా సామర్థ్యములను అప్పటి ప్రభుత్వము చాల మెచ్చుకొనినది. ఇతడు 1862 లో ఇంజనీయరు ఉద్యోగమును విరమించెను. ఇట్లు కాటన్ తలపెట్టిన నీటిపారుదల నిర్మాణము లన్నియు దేశమును తరచు పీడించు చుండిన క్షామబాధను నివారించి సుభిక్షము కావించినవి.

ఇతడు జీవితాంతమువరకు హిందూదేశ వ్యవహారము లందాసక్తి కలిగి యుండెను. జలమార్గముల అవకాశములను పర్యాలోచించుటయే ఇతని జీవితమున ముఖ్య విషయము. హిందూదేశమున రాకపోకలకు నదుల నుపయోగించుకొనక ఇనుపదారులను నిర్మించుట తగని పనియని ఇతని యభిప్రాయము.

1877 లో సైనిక శాఖయందలి యుద్యోగమును విరమించుకొని ఇతడు వెస్ట్‌కోట్‌లో నివసించి యుండెను. చివర దినములలో అతనికి చెవుడు సంప్రాప్తమయినది. కాని అతని మానసిక, శారీరక శక్తులుమాత్రము చక్కగా నుండినవి. ఇతని మరణానంతర మితని సేవను సంభావించి ప్రభుత్వమువారు ఇతని భార్యకు 210 పౌనులు వర్షాశన మొసగిరి.
గ. సు.

**కాటయవేమారెడ్డి :** ఇతడు కుమారగిరి ప్రభుని బావమరది, ప్రధానియు, సర్వసైన్యాధిపతియును (చూ. పుట 320). కాటయవేముడు గొప్ప సంస్కృత పండితుడు. మహాకవి కాళిదాసు రచించిన శాకుంతల, మాళవికాగ్నిమిత్ర, విక్రమోర్వశీయ నాటకములు మూడింటికిని వ్యాఖ్యానములను రచించి తనకు ప్రభువైన వసంతరాజు నెడగల గౌరవముకతన వానికి 'కుమారగిరి రాజీయము' లని పేరు పెట్టెను. ఇయ్యవి మూడును ముద్రితములు. మల్లినాథసూరి వ్యాఖ్యలకంటె ఇవి 40 ఏండ్లు ప్రాచీనములు.
బు. వెం. ర.

**కామేశం, శొంఠి (క్రీ. శ. 1890 - 1954):** పడుమటి గోదావరిజిల్లా, నరసాపురములో ఈయన జన్మించెను. అప్పుడు ఈయన తండ్రి వెంకటరమణయ్య అక్కడ పి. డబ్ల్యూ. డి. ఇంజనీయరుగా నుండెను. ఈయన విశాఖపట్టణములోను, మదరాసు ప్రెసిడెన్సీ కళాశాలలోను చదివి, అనంతరము గిండీఇంజనీరింగు కళాశాలలో చదివి బి. ఇ. పరీక్షలో తన తండ్రివలె మొదటి తరగతిలోఉత్తీర్ణుడయ్యెను.



చిత్రము 181. శొంఠి కామేశం

డెహ్రాడూనులోని అటవీ పరిశోధన సంస్థయం దీయన దారుసంరక్షణ సహాయోద్యోగిగా మొదట ప్రవేశించెను.

భారతీయులు ప్రభుత్వశాఖలలో ప్రధాన అధికారులుగా నియమింపబడని ఆ దినములలో ఈయన ఇంగ్లీషు యజమానులతో హోరాహోరి పోరి దారుసంరక్షణ నిపుణోద్యోగి (ఎక్స్పర్ట్ ఇన్ ఛార్జ్ ఆఫ్ వుడ్ ప్రిజర్వేషన్) పదవిని పొందగలిగెను. అమెరికా, జర్మనీలలోని పరిశోధన సంస్థలలో పరిశోధన చేయు నిమిత్తము పంపబడగా జర్మనీలో డాక్టర్ ఫాక్ తో కలిసి ఈయన పరిశోధనలు సాగించి 'ఫా-క్కా-మేశం దారుసంరక్షణ విధానము'ను కల్పించెను. అదియే తరువాత "అస్క్యూ" దారు సంరక్షక "మను పేర బరగినది. ఈ పద్ధతి ననుసరించి ఆర్సెనిక్, కాపర్ సాల్టులు కొంత నిష్పత్తిలో ఎక్కువ ఒత్తిడితో దారువులోనికి ఎక్కింపబడును. ఇట్లు చేయుట వలన దారువును చెద లంటదు; వానకు తడిసినను అవి చివికిపోవు; ఇతర కీటకము లేవియు వానిని తినివేయవు. ఇంతేకాక అడవి కర్రకు, టేకు కర్రకు గల గట్టి మన్నిక ఏర్పడును. 'అస్క్యూ' విధానమున సురక్షితములైన కర్ర కంబములు, దూలములు ఉక్కు ఎలెక్ట్రిక్ కంబములకును, ఇనుపదారి కమ్మల క్రింది ఉక్కు దూలములకును మారుగా వాడుకలోనికి తెచ్చుటకై ఈయన మిగుల ప్రయాసపడెను. ఉక్కు అరుదుగా దొరకు భారత దేశమున దానికి బదులు ఇదివరలో నుడివిన రెండు విషయము లందును అనేక రాష్ట్రములందు కర్ర వాడబడుచున్నది. ఇందువలన మన దేశమునకు ఆర్థికముగా కూడ లాభము కలిగినది. 'గ్రీన్ సాల్ట్సు'అను పేరుతో 'అస్క్యూ'ను వాడుచున్న అమెరికా దీనిని ప్రపంచములోని ప్రథమగణ్య దారుసంరక్షకముగా నంగీకరించినది. ఈ దారుసంరక్షణ విషయమున చేసినకృషిని మెచ్చుకొని ఆంధ్ర యూనివర్సిటీ ఈయనకు డి.యస్.సి. గౌరవ బిరుదము నిచ్చి ఈయనను సమ్మానించినది.

డేరాడూన్ సంస్థను వదలిన తరువాత ఆయన తిరువాన్కూరులో డెవలప్మెంటు శాఖకు డైరెక్టరుగా నుండెను. అక్కడ ఈయన చేసిన ఘనకార్యము 'అస్క్యూ' పద్ధతి కర్రతో తోటపల్లి ఏటికి కట్టించిన ఒంటి కాను వంతెన. తరువాత ఈయన బెంగుళూరులో ఇంజనీయరు వృత్తి నారంభించి 'అస్క్యూ' విధానపు కలపతో చాల కట్టడములను, వంతెనలను కట్టించెను. అస్క్యూ విధానపు వెదుళ్లతో గట్టి చేయబడిన సిమెంటు పలకలను తయారు చేయుటలో కృతార్థుడయ్యెను. దీనికి 'సాన్ స్టీల్' (ఉక్కులేనిది) అని పేరు పెట్టెను. ఈ పద్ధతిలో ఈయన చాల అభివృద్ధికరమయిన కృషిచేసెను.

కామేశముగారు శాస్త్రవేత్తయే కాక ప్రజ్ఞావంతుడైన కళా విదుడు కూడను. ఈయన స్వయముగ చిత్రకారుడు. ఈయన సేకరించిన కళారచనలు వివిధములైన వనేకము కలవు. కొం. వెం. రా. మూ.

**కాశీనాథయ్యా, మేరత్తూరు :** కూచిపూడి గ్రామము వలె తమిళదేశమున తంజావూరు సమీపమునందు నాట్య సంప్రదాయమునకు ప్రసిద్ధికెక్కిన మేరత్తూరు గ్రామము ఈయన నివాస స్థలము. 'శబ్ద' గీత రచనలలో ప్రత్యేక కృషిచేసి ఈయన అసంఖ్యాకములగు రచనలు చేసెను.

'శబ్ద' మన్నది ఒక నృత్యగీతము; సాధారణముగా అది కాంభోజి రాగములో నుండును. ఆశ్రయదాతను గురించి కాని, దేవుని గురించి కాని విశేషణాత్మకముగను, నమస్కార పూర్వకముగను చేయబడు రచన యది. ఈ గీత మంతయు జతుల కమర్చి నాట్యాభినయానుకూలముగ జేయబడును. ఇది ఉత్తర హిందూదేశములోని 'కవిత్త' అను 'కవిత్వ' గీతములనుండి దక్షిణ హిందూదేశ నాట్య సంప్రదాయములోనికి వచ్చినది.

కాశీనాథయ్య ఈ 'శబ్ద'ములలో కొన్ని మేరత్తూరు వరదరాజస్వామి మీద చెప్పినవి కలవు; మరికొన్ని శబ్దములు తంజావూరు మహారాష్ట్రప్రభువైన షాహాజీ రాజు స్తుతి పరములు; వేరొక కొన్ని ఆ మహారాష్ట్ర వంశమునకే చెందిన శరభోజి, తులజాజి, ప్రతాప సింహులమీద చెప్పినవి. ఈయన 'శబ్ద' మొకదానిలో పోషకుడు నరసింహప్పపే రున్నది. వీటి నన్నిటినిబట్టి చూచినచో కాశీనాథయ్య క్రీ. శ. పదునెనిమిదవ శతాబ్దములో చాలకాలము జీవించి యుండినట్లు కనబడును. ఈయన మేరత్తూరులో స్థిర నివాసము కుదుర్చుకొని నాట్య, సంగీత విద్యలకు పేరు గాంచిన తెలుగు కుటుంబములకు చెందినవాడై యుండవలెను.

ఆయన 'శబ్ద'ములలో భావమును జొప్పించి పలు విధములైన రాగములలో గీతములు రచించెను. తాళపత్ర గ్రంథములలో ఆయన 'శబ్ద'ములు కొన్ని 'రక్తిశబ్ద'ములని పేర్కొనబడినవి. ఆయన రామాయణము, గజేంద్ర మోక్షము మొదలైన ఇతివృత్తములు తీసికొని దీర్ఘములైన కథాగీతములను కూడ రచించెను. 'గజేంద్రమోక్ష శబ్ద'ములో కొంత భాగమునకు 'మండూక శబ్ద'మని పేరు. అందు తటాకవర్ణన చేయు సందర్భమున రచయిత కప్పల బెకబెకల ధ్వన్యనుకరణమును చక్కగ చూపెను. ఆయన రచించిన 'శబ్ద' ముల ననుసరించి ఆయన వాంశికుడని, ఇంటిపేరు వేద(?)వారని, భరతశాస్త్రములో కూడ ఆయనకు పాండిత్యము కలదని తెలియుచున్నది. వి. రా.

**కాశీనాథశాస్త్రి, పేరి (క్రీ. శ. 1858 - 1920) :** వీరు విశాఖపట్టణ మండలములోని గజపతి నగరము

తాలూకాలో పురిటిపెంట అనుపల్లెలో జన్మించిరి. వీరు ద్రావిడ బ్రాహ్మణులు. తండ్రి ఆనాడు వైయాకరణ పితామహులను బిరుదము వహించిన వేంకటశాస్త్రిగారు; తల్లి మహాలక్ష్మమ్మ. వీరు బాల్యమున తండ్రిగారియొద్ద వ్యాకరణమును, మధ్వశ్రీ భీమాచార్యులుగారి సన్నిధిని న్యాయమును, శ్రీ కొల్లూరు కామశాస్త్రిగారికడ వేదాంతాలంకార శాస్త్రములను అభ్యసించిరి; పిమ్మట విజయనగర మహారాజాస్థానమున పండితులుగా ప్రవేశించిరి. 1878 వ సంవత్సరములో శాస్త్రిగారు మహారాజ సంస్కృత కళాశాలయందు ఉపాధ్యాయ పదవిని స్వీకరించి పాఠ ప్రవచన మందును, వాదశక్తియందును మిక్కిలి ప్రఖ్యాతి చెందిరి.

ఆనాడు విద్వాంసులై యుండియు కవిగా రాణించిన కొలది మందిలో కాశీనాథశాస్త్రిగా రొకరు. అపరభోజుడనిపించుకొన్న ఆనందగజపతి మహారాజున కీ కారణమున శాస్త్రిగారియందు మిక్కుటమగు గౌరవ ముండెను. 'యథా కాళిదాస స్తథా కాశీనాథః' అని యీయనను గురించిన స్తుతి నేటికిని వినబడుచున్నది. వివిధములగు కవితలను వెలయించుచు, నానారాజ సందర్శనము చేయుచు, కనకాభిషేకముల నందుచు శాస్త్రిగారు ఆంధ్ర దేశ సంచారము గావించిరి. 'గోదావరీ లహరి', 'బ్రహ్మసూత్ర భాష్యాంధ్రానువాదము' అను రెండు గ్రంథములును వీరివి ముద్రితము లయినవి. 'ఉత్తర శాకుంతలము' మున్నగు అముద్రిత గ్రంథములు నేటికిని విజయనగరరాజ గ్రంథాలయమున నున్నట్లు తెలియుచున్నది. గ్రాంథిక భాషావాద సమర్థనమున శ్రీ కల్లూరి వెంకటరామశాస్త్రిగారికి వీ రండయై యుండిరి. ఉర్లాము మొదలగు అనేక సంస్థానములలో కాశీనాథ శాస్త్రిగారు విద్వత్పరీక్షకులుగ నుండి సమ్మానము పొందుచుండిరి. శాస్త్రిగారికి ఇరువురు పుత్రులు, నలుగురు పుత్రికలు గల్గిరి. సుప్రసిద్ధులు మహామహోపాధ్యాయ తాతా సుబ్బరాయ శాస్త్రిగారు వీరి యల్లుండ్రలో నొకరు. జ. పు.

**కాళకవి, చెంగల్వ :** ఈతడు దక్షిణాంధ్ర యుగమునకు జెందినవాడు. ఈ యుగము కాలపరిమితిచే నెంత సుదీర్ఘమో ప్రక్రియా వైవిధ్యముచే నంత విలక్షణమైనది. వచనరచన, కవులతోపాటు కవయిత్రుల యవతరణ, యక్షగానముల ప్రాచుర్యము, వాగ్గేయకారుల వైశిష్ట్యము ఆ యుగ లక్షణములలో ముఖ్యములు. నాటి వాఙ్మయము పండిత ప్రకాండుల కంచుఢక్కల సవాలులకే కాక, కోటలోని రాజునకును, పేటలోని పౌరునకును మధ్య వంతెనయై నిలచినది. ఆ కార్యకలాపమునకైన సాహిత్యమునకు గీతి తోడైనది. ఈ యుగమునం దుద్భవించిన మేలిమి కృతులలో కృష్ణరాయల రసికతయు, దదన్యములలో క్షీణయుగపు చిహ్నములును గోచరించును. రసరాజమగు శృంగారము ఆ యుగమునకు ధర్మమే యైనది. కాని అయ్యది యతివేలమగుట కొంతవరకు గాలధర్మమునకు విడిచివేయవలెను.

కాళకవి రఘునాథుని కాలములో నుండినవాడు. కాని యాస్థానకవిగా పేర్కొనబడలేదు. విజయరాఘవునకు కాళకవి తండ్రినుండి క్రమప్రాప్తముగ సంక్రమించి పిమ్మట యాస్థానకవియైన ట్లున్నది. రఘునాథ, విజయరాఘవుల యాస్థానములందు సుప్రసిద్ధలగు రామభద్రాంబాది విదుషీమణు లందరకు నించుమించు కాళకవియే గురువు.

గ్రంథస్థ విషయమునుబట్టి కాళకవి పాకనాటి యార్వేల నియోగి బ్రాహ్మణుడుగా, కవి కుటుంబమునుండి వచ్చిన వాడుగా దెలియుచున్నది. ఈతని తండ్రి వెంకటయ్య, తల్లి కృష్ణాంబ. ఈమె రావినూతల తిరుమలయ్య తనూజ.

కాళకవి ఘటికాశత గ్రంథ ఘటనుడు; ఓష్ఠ్య, నిరోష్ఠ్యాదినియమములతో గవిత చెప్పగలవాడు; పరిహృతేతర యుక్తిభాగ నూతన కథాకథకుడు; భరతశాస్త్ర పారంగతుడు. విజయరాఘవుని యాస్థానకవియై ఇతడు తద్రాజ నామాంకితముగా రాజగోపాల విలాసమును వ్రాసినాడు. కాళకవికి రఘునాథునితో గల సంబంధ మెట్టిదైనను, విజయరాఘవునకు మాత్ర మాత డాస్థాన కవియే కాదు ; ఆప్తుడు కూడ. రాజుతోడనేగాక రాజకుటుంబినులయొద్ద గూడ జనవు గలవాడు. విజయరాఘవుడు రాణులతో గూడ గాళకవి మందిరమున విందులారగించు వాడు.

ఇన్నిట బ్రసిద్ధుడైన యిత డెన్ని కృతులను రచించెనో తెలియదు. ఒక్క రాజగోపాలవిలాసము మాత్రము వివాదములేని కృతిగా స్పష్టపడినది. ఇది సరసమైన యొక మధుర ప్రబంధము. అవసర మున్నను లేకున్నను అష్టాదశ వర్ణనల నెట్టెట్టో యిరికించి తీరవలయునను ఛాందసము పొంత బోక కవి యిందు గొంత క్రొత్తదనమును వెలయించినాడు. అది అష్టవిధ శృంగార నాయికలను ఆలంకారికముగా తీర్చి దిద్ది ప్రసాదపూర్వకముగా రాజగోపాలున కర్పణము సేయుట. శ్రీకృష్ణు డష్టవిధనాయికల మనసు వచ్చునట్లు రంజింపజేయుట యిందలి ప్రధానాంశము. అది కథ యనలేము కాని కావ్యమునకాత్మ యదియే.

కావ్యమందలి నాయకుడు దక్షిణుడు. అందులకు సర్వథా అమరిన యన్వర్థ నామధేయుడు గోపాలకృష్ణుడు.

పురాణము మొదలు పువ్వుబోడుల పాటల వరకు గల వాఙ్మయ ప్రక్రియ లన్నియు గృష్ణచరిత్ర మెన్నియో రీతుల నుపయోగించుకొన్నవి. అందు గొన్నిటిలో అష్ట మహిషుల చరిత్రయు గలదు. కాని యందునుగూడ నీ యష్టవిధనాయికలు అలంకార మర్యాద ననుసరించి తీర్చి దిద్దబడినట్లు తోపదు. ఇది కాళకవి తలనే పుట్టిన ప్రత్యేక భావము.

ఇందు మొట్టమొదట పేర్కొనబడిన నాయిక రుక్మిణి. ఈమె యష్టమహిషులలో నగ్రగణ్య. ప్రాచీన వాఙ్మయములో రుక్మిణి కృష్ణునియందు దైవాంశను భావించిన భక్తురాలుగా బ్రతిపాదింపబడి రూఢమైనది. కృష్ణు డెట నున్నను మనసు మాత్రము తత్త్వమెరిగిన రుక్మిణికడనే యుండును. ఆ దృష్టితో చూచినచో రుక్మిణి స్వాధీన పతిక యనక తప్పదు. పురాణపురుషుల వాలకములు దక్షిణాంధ్ర యుగములో మారినట్లే రుక్మిణి కాళకవి చేతిలో గలహాంతరిత యైనది. ఈ మార్పు అలౌకికమైన వాతావరణమునకు గొంత భంగకారి యనక తప్పదు. అలౌకిక పాత్రల నతిలౌకికముగ జిత్రించుట ఆ యుగ కవులకు బరిపాటి. కాళకవియు నద్దానికి గురికాక తప్పినది గాదు.

భద్ర భయశీల. ఆమె శ్రీకృష్ణు నెంత గాఢముగ వాంఛించునో సవతుల రంతుల కంత వెరచును. అది యెరిగినవాడు కాళకవి. కావుననే యామె నభిసారికగా జిత్రించినాడు.

లక్షణ వాసవసజ్జిక. నాడు యదువల్లభుడు తన మందిర మునకు వచ్చు పావనదినము. వేగునప్పటినుండియు సంభ్రమాందోళితయై లక్షణ సలక్షణముగా తనువును, గృహమును భర్తృహితముగోరి యలంకరించుకొని విరహపడును. 'రాజగోపాలుడు రసికుడౌనమ్మా'యని చెలి చెప్పువరకు నామె కూరట లేదు. మనసిజరాగమగ్న మానసుడై గోపాలుడు రాగ మొలచిన మోహభారమున లక్షణ వినమ్రయగును.

జాంబవతి విప్రలబ్ధ; 'సంకేత మరసి నాథుడు రామి వగ జెందు' కాంత. కృష్ణసమాగమాసక్త యగు నీమె విరహము, ప్రియుని యాగమనము, కలికి పొలయలుక కళాశాస్త్రానుసారముగా జెప్పబడినవి.

మిత్రవింద ఖండితగా నిరూపింపబడినది. నిజమున కీ పాత్రధారణము సత్యభామది గాని యీమెది కాదు. కృష్ణుడు తనకు జేసిన బాస లన్నియు మరచి యద్దమరే యిదాక రాక దక్కును. అప్పుడైనను తూలుచు వాలుచు వచ్చిన వాలకము మిత్రవింద శంకించి కుందుటకు గారణ మగును. ప్రియురాలి మన మరయగోరి తా నట్లు నటించితి నని చెప్పి తప్పుకొనుచు ధూర్తగోపాలు డామె ననున యించును.

సుదంత విరహోత్కంఠ. ఆ విరహములో చంద్రో పాలంభనాదులు ప్రబంధోచితముగ సంధింపబడినవి.

పతి తన్ను విడచి గొల్లపల్లె కేగెనని విరహపడు కాళిందిపట్ల ప్రోషిత భర్తృకాత్వము నిరూపింపబడినది. వాడవాడల విలాసములు పచరించు మురళీధరుడు పుర వీథుల బడిపోవ గొల్ల పడతుకలు సాభిలాషిణులై చూతు రేమోయని యామె మనసులోని బాధ. ఇందు రాజు పురవీథుల వెడలుట యను ప్రబంధలక్షణము కాళింది యా శంకలో ముచ్చటగ నిమిడిపోయినది.

సత్యభామ పురాణములనుండి వీథి నాటకముల వరకు, ప్రబంధములనుండి గొల్లసుద్దులవరకు ఖండిత నాయికగా ప్రజానీకము దృష్టిలో రూఢమైనది. నారదునకు గలహ ప్రియత్వ మెంత రూఢమో సత్యభామకు ఖండితనాయి కాత్వ మంత సిద్ధమైనది. కాళకవి యే కారణమువలననో యామెను స్వాధీనపతికగా జిత్రించి మురిసినాడు. 'విజయ రాఘవుని చర్యలు రాజగోపాలుని పేరిట కవి వ్రాసినా' డను వదంతియే నిజమైనచో ఈ మార్పు సాభిప్రాయమే.

ఏవంవిధగుణభూయిష్ఠమగు నీ గ్రంథము ముఖ్య ముగా మూడు భాగములు. మొదటిది యవతారికగా నమరిన కవివంశప్రతిష్ఠా ప్రజ్ఞాదులు, విజయరాఘవుని యాస్థానవైభవమును సూచించును. రెండవ భాగమున శ్రీ కృష్ణుని యష్టవిధ శృంగార నాయికల యుదంతము గలదు. మూడవ భాగమున చంపకారణ్యమును, దక్షిణ ద్వారకావర్ణనము, తన్మాహాత్మ్యమును జెప్పబడినవి. కథాగతి ననుసరించి చూచినచో భాగత్రయమునకు వస్త్వైక్య మంతగా లేదు. ప్రత్యేకించి చూచినచో దేని కది వేర్వేరు ప్రయోజనములు గలవి. చారిత్రక విషయములు, అలంకారశాస్త్ర మర్యాద, క్షేత్రమాహాత్మ్యము అనునవి వరుసగా వర్ణింపబడినవి.

రచనలో ప్రసాద గుణమును మించిన ధారాశుద్ధియు, నర్థగౌరవమును సాధింపబడినవి. పలుకుబడులును, పదబంధ ములును పారిజాతాపహరణముతో ప్రతిభటత్వము వహించినవి. మొత్తముపై కాళకవి రచనలో నొక వైలక్షణ్య మున్నది. సంస్కృత కవులలో భారవి కెట్టి స్థానము గలదో దక్షిణాంధ్ర కవులలో కాళకవి కట్టి పూజ్యత గలదు. ఈ విషయమును 'కలిత లలితోక్తి భారవి కాళసుకవి' యని తానే ముక్తకంఠముగా జెప్పి కొనినాడు.

వే. రా.

**కుమార అనంతరాజు, మట్లి** (క్రీ. శ. 1625-1660): ఇతడు మట్లి తిరువెంగళనాథరాజు కుమారుడు, అనంత రాజు మనుమడు. అనంతరాజయ్య యనియు నితనికి పేరు. ఇతడు పరాక్రమశాలి; ఇరుగుపొరుగు మన్నెదొర లతో పలుమారు యుద్ధములు చేసి జయమందుచు వచ్చెను. దేశముపై నడుగడుగునకు నెత్తివచ్చుచుండిన తురకలతో పలుమారు అతడు పోరాడవలసి వచ్చెను. 1649 వ సంవత్స రమున మీర్ జుమ్లా సేనాధిపతులను ముగ్గుర నెదుర్కొని వధించెను. కాని యటుతరువాత దేశమునం దుండుట క్షేమకరము గాదని నిశ్చయించి కర్ణాటక దేశమునకు పారిపోయెను. ఇతని తరువాతి వృత్తాంతము తెలియ రాదు. మట్లి కుమార అనంతరాజు తిరుమల శ్రీ వెంకటే శ్వరస్వామి భక్తుడు. కొండ దిగువనుండి పైకి పోవు సోపానమార్గ ప్రారంభమున నుండు మట్లివారి గోపుర మితనిచే నిర్మింపబడినదే. మరియు ఇతడు విద్వత్ప్రభువు, కవీశ్వరుల నాదరించి పోషించుటయే కాక తాతవలె కవనము చెప్పగల నేర్పరియై 'కుముద్వతీ కల్యాణ'మను చక్కని ప్రబంధమును రచించెను. దీని పూర్తిప్రతి యింకను దొరకలేదు. ఇది యముద్రితము. నే. వెం. ర.

**కుమార కంపరాయలు** (క్రీ. శ. 1330 - 1374): విజయనగర సామ్రాజ్యమును దక్షిణమున సేతుబంధ రామేశ్వరము పర్యంతము వ్యాప్తినందించిన శూరశిఖా మణి కుమార కంపరాయలు. ఇతడు విజయనగరాధీశ్వరు డైన ప్రథమ బుక్కరాయలకు అతని దేవేరియగు దేపాయిగర్భమం దుద్భవమందిన పుత్రులలో నాద్యుడు; చిక్కకంపన, సంగములనువార లితని కనుజన్ములు. కుమార కంపరాయ లెప్పుడు జన్మమందెనో నిశ్చయముగ దెలి యదు. ఇతనిరెండవ పెదతండ్రి కంపాభిధానుడగుట వలన ఇతనికి ఇమ్మడి కంపరాయలని నామాంతరము గలిగెను.

అప్పటి కింకను విజయనగర సామ్రాజ్యము పరిమాణ మున స్వల్పమైనదే. దక్షిణ కర్ణాటము సమస్తమును, శ్రీరంగము పర్యంతము వ్యాపించిన కావేరీ తీరభూము లును ముమ్మడి బల్లాళరాయల పాలనక్రింద నుండెను. మరియు కొల్లడమున కుత్తరమున నాంధ్రదేశము యొక్క దక్షిణపు సరిహద్దు వరకును వ్యాప్తమై యుండిన తీర ద్రావిడ రాష్ట్రమున కంతటికి అత డధిరాజైనను అతని సామంతుడయిన రాజనారాయణ సంబువరాయల పాలనయం దుండినట్లు చెప్పవలసి యున్నది. ఇతని రాజ్య మునకు దక్షిణమున కొల్లడము యొక్క దక్షిణ తటము నుండి సేతుబంధ రామేశ్వరము పర్యంతము వ్యాప్తమై యుండిన రాష్ట్ర మంతయు మధుర సుల్తానుల పాలనక్రింద నుండెను. తమ యేలుబడిలోని హిందువులను వారు బహు విధములుగ బాధించి హింస పెట్టెడివారు. వారి బాధలను తొలగించుట కొరకు అప్పుడు దాక్షిణాత్య హిందువుల కెల్ల నాయకుడై యుండిన ముమ్మడి బల్లాళరాయలు మధుర సుల్తానుపై దాడివెడలి మొదట విజయము పొంది మధుర మహమ్మదీయ రాజ్యమున కొంత రాష్ట్రమును స్వాధీన పరచుకొన్నను, తుదకు పరాభూతుడై 1342 లో దివంగతుడయ్యెను. తరువాత అతని కుమారుడైన నాల్మడి విరూపాక్ష బల్లాళుని విజయనగరాధీశ్వరులైన హరిహరరాయ, బుక్కరాయలు ఓడించి హొయ్సల రాజ్యమును సమస్తమును ఆక్రమించుకొనిరి. హిందూ ప్రజను, ధర్మమును, సంస్కృతిని సంరక్షించు భారము వారిమీద పడెను.

కుమార కంపరాయల దక్షిణదిగ్విజయయాత్ర యేకాం డమై యొక్కసారి జరగినది కాదు; భిన్నకాలము లందు నడచిన మూడు ప్రత్యేక దండయాత్రల మూలమున నిది సంపూర్ణమాయెను. మొదటి మారు దండెత్తునాటికే మధురసుల్తాను విజృంభించి రాజనారాయణ సంబువ రాయలపై నెత్తివచ్చి యోడించి బందీకృతుని కావించిన ట్లున్నది. ఆ రాజ్యము తురకలచేత బడనీయక కాపాడుట కీ దండయాత్ర క్రీ. శ. 1352-53 లో బయలువెడలెను. ఒక కొంత సేనతో కుమార కంపరాయలు తన నెలవీడైన ముల్బాగలునుండి పశ్చిమోత్తరముగను, అదే సమయమున ఉదయగిరి దుర్గమునుండి పెదకంపరాయల సుతుడైన వీరసావణ్ణ ఒడయలు మరియొక సేనతో సముద్ర తీరము వెంబడిని బయలువెడలి మధురరాజ్యముపై కూచిచేసి పోయిరి. తరువాత యుద్ధ మెచట జరిగెనో స్పష్టముగ తెలియదు; కాని కడపటి పోరాటమున సావణ్ణ ఒడయలును, అతని సామంతులలో నొక్కడైన సాళువ మంగియు తమ పరాక్రమమును ప్రకటించి మధుర సుల్తాను నోడించి చెరయం దుండిన రాజనారాయణ సంబువరాయని బంధనమును బాపి తోడ్కొనిపోయి కంపరాయల కప్పగించి యతని నిజరాజ్యమున సుప్రతిష్ఠి తుని గావించిరి. ఈ ఘనకార్య నిర్వహణ సూచకముగ సావణ్ణ ఒడయలును, సాళువ మంగును 'సంబువరాయ ప్రతిష్ఠాపనాచార్య' యను బిరుదును వహించిరి.

రాజనారాయణుడు రాజ్యమున పునఃప్రతిష్ఠితుడైన పిమ్మట క్రీ. శ. 1361-62 వరకును దాదాపు పండ్రెండేండ్ల కాలము నిర్బాధకముగ రాజ్యపాలన మొనర్చెను. తరువాత నే కారణముచేతనో యతనికి విజయనగరాధీశ్వరునితో వైరము కలిగెను. బుక్కరాయలు కుమార కంపరాయల

కొక గొప్ప సైన్యము నిచ్చి సంబువరాయని జయించి యతని రాజ్యమును స్వాధీనపరచుకొనవలసినదని యతనిని పంపెను. తండ్రియాజ్ఞ చొప్పున నతడు సైన్యముతో కదలి యుభయరాజ్యములకును ఎల్లయై యుండిన పాలేటిని దాటి ద్రావిడదేశమును ప్రవేశించెను. అతని కార్యమునకును, ఖడ్గమునకును కర్తలై మహాప్రధాన సోమప్ప దండనాయకుడును, గోపనదండనాథుడును అతని వెంట యుద్ధమునకు నడచిరి. మునుపటి వలెనే ఉదయగిరి సైన్యము లతనికి తోడ్పడెను. పెదకంపరాయల పుత్రులు సావణ్ణ ఒడయ, సంగమరాయ లిద్దరును వారి ప్రధాని వేదభాష్యకర్త సాయణాచార్యులతోడను, సాళువ మంగు ప్రభృతి సామంతరాజుల తోడను తమ తమ బలగములతో యుద్ధమునకు తరలిరి. విజయనగర సైన్యము లిట్లు రెండు వైపులనుండియు పైకొని రాగా సంబువరాయలు తన రాజ్యమును సంరంక్షించు కొనుటకు యథాశక్తిని ప్రయత్నము చేసెను. కాని పాలేటిగట్టున కంపరాయల నెదుర్కొనిన అతని దండు విరిగి పారెను; గరుడనగరముకడ ఉదయగిరిసేన నరికట్ట బూనిన దండు సాయణాచార్యులచే పరాజయమును పొందెను. బహిరంగ యుద్ధమున విజయనగర సేనలతో సరిపోరజాలక సంబువరాయలు శత్రుజన దుర్భేద్యమని ప్రఖ్యాతినందిన రాజగంభీర గిరి దుర్గమును జొచ్చెను. కంపరాయలు కోటను ముట్టడించి రాకపోకల నాపివేయుటచేత అచటి యునికి దుర్భరమై తుదకు సంబువరాయలు కోటను వెలువడి వచ్చి కంపరాయలతో ద్వంద్వయుద్ధముచేసి రణశయ్య నలంకరించెను. తర్వాత మహాప్రధాని సోమయ దండనాయకుని కుమారుడు గండరగూళి మారయదండనాయకుడు దుర్గము లగ్గలుపట్టి స్వాధీనపరచుకొని రాజనారాయణుని పుత్రుడైన వెణ్రుమణ్ కొండ సంబువరాయని బందీకృతుని గావించెను. దుర్గము హస్తగతమైన పిమ్మట కంపరాయ లచటినుండి సంబువరాయల రాజధానియైన కాంచీపట్టణమునకు పోయి దానిని స్వాధీనము చేసికొని యధివాసస్థానమును గావించుకొనెను. అంతట సంబువరాయసంస్థాన మంతరించి పోయినది. కంపరాయలు తండ్రికి ప్రతినిధియై యతని పక్షమున సంపూర్ణ రాజ్యాధికారములతో ద్రావిడదేశమును పాలింప దొడగెను.

మరియొక పదియేండ్లు శాంతముగ గడచిపోయెను; ఈ లోపల మధుర రాజ్యమున అరాజకస్థితి ప్రబలెను. ఇది గాంచి దక్షిణ భారతమును మహమ్మదీయ దాస్యము నుండి విడుదలచేయుట కదియె మంచి సమయమని నిశ్చయించి కుమార కంపరాయలు దక్షిణసురత్రాణునిపై యుద్ధము ప్రకటించి క్రీ. శ. 1370 - 71 లో దండు తరలెను. కంపరాయల యాదేశము చొప్పున చెంజి దుర్గమున రాణ్యముండిన గోపనదండనాయకుడు ఉభయ కావేరీమధ్యమందలి శ్రీరంగముపై నడచెను. శూర శిఖామణియైన సాళువ మంగు కూడ నీ కార్యసాధనమునకు తోడ్పడెను. తిరుచిరాపల్లి సమీపమందలి సమయవరము కడ నడచిన యుద్ధములో మహమ్మదీయ సైన్యము విరిగి వెన్నిచ్చి పరచెను. అంతట చోళమండలము కంపరాయలకు హస్తగత మాయెను; కాని తురకలను వెనుకొని యాతడు వెంటనే మధురపై గవియలేదు. మొదట కంపరాయలు కణ్ణనూరు దుర్గమున కొంతకాల మాగి మహమ్మదీయుల దుండరికముచే పాడుపడియుండిన శ్రీరంగ, జంబుకేశ్వరాది దేవస్థానములను బాగుపరచి, యా దేవతల నందు పునఃప్రతిష్ఠ చేయించి, యందు పూజాపురస్కారములు యథాపూర్వముగ నడపుటకు దగు నేర్పాటులు గావించెను. పిమ్మట కుమార కంపరాయలు మరల దండును గదల్చుకొని మధురావిజయమునకు బయలువెడలెను. గంగాదేవి 'మధురావిజయము'నుబట్టి చూడగా ఈ దండయాత్ర మధురవరకు నిరాఘాటముగ సాగినట్లు తోచుచున్నది. మధుర పరిసరముల జేరునప్పటికి సుల్తాను సేనతో విజయనగర దళముల నెదుర్కొని పోటు సూపెను. రాజనారాయణ సంబువరాయలవలె మధుర సురతాణియు గంపరాయలతో ద్వంద్వయుద్ధమున హతుడాయెనని గంగాదేవి వక్కాణించు చున్నది. ఈ విజయము వలన మధుర మహమ్మదీయ రాజ్యము రూపుమాసిపోయి సేతు పర్యంత వ్యాప్త దక్షిణదేశ మంతయు విజయనగర సామ్రాజ్యములో కలసి పోయెను. ఈ మధురావిజయము 1371-1373 సంవత్సరముల మధ్య జరగినది.

కంపరాయ లీ విజయానంతరము చిరకాలము జీవించి యుండలేదు. 1374 తుదను ఇతడు వ్యాధిగ్రస్తుడై మృతినందినట్లు తిరువణ్ణామలలోని యరుణేశ్వరాలయ మందలి యొక శిలాశాసనమున చెప్పియున్నది.

దక్షిణభారత చరిత్రయందు కుమార కంపరాయల స్థానమత్యున్నతమైనది. మహమ్మదీయ దాస్యమునుండి విముక్తులను గావించి దైన్యస్థితిని బాపి కుమార కంపరాయలు దాక్షిణాత్య హిందూప్రజలకు మహోపకార మొనర్చెను. కుమార కంపరాయల భార్య లిద్దరు శాసనములలోను, వాఙ్మయమునందును పేర్కొనబడి యున్నారు. వీరిలో రామాదేవియవ్వయాణ యొక్కతె. మరియొకతె సుప్రసిద్ధ కవయిత్రియైన గంగాదేవి. ఈమె గీర్వాణభాషయందు విరచించిన 'మధురావిజయ'మను నామాంతరముగల కంప

రాయవిజయ మనుకావ్యము పూర్వ, పాశ్చాత్య వాఙ్మయ విమర్శకుల ప్రశంసల నందుకొన్నది. జొమ్మణ, హరిహరులు కుమార కంపరాయల పుత్రులు. నే. వెం. ర.

**కుమారస్వామిరాజా, పూసపాటి** (క్రీ. శ. 1898 - 1957): వీరు దాక్షిణాత్యాంధ్ర క్షత్రియులు. వీరి పూర్వులు నాలుగువందల సంవత్సరములకు పూర్వము ఆంధ్రదేశమునుండి మధుర నాయక రాజులకాలములో తమిళదేశమున కుద్యోగులుగా వలసవెళ్ళి రామనాథ పురము జిల్లాయందలి రాజుపాళయమున నివాస మేర్ప రచుకొనిరి. వీరి తండ్రిగారిపేరు సంజీవిరాజా. కుమార స్వామిరాజాగారు 1917 లో ఆనిబిసెంటు ప్రారంభించిన హోంరూలు ఉద్యమములో చేరిరి; తరువాత కాంగ్రెసులో చేరి రామనాథపురం జిల్లా కాంగ్రెసు కమిటీకి ఉపాధ్య క్షులుగను, 1930 మొదలుకొని అధ్యక్షులుగను ఉండిరి; కొంత కాలము ఆ జిల్లాబోర్డు అధ్యక్షులుగను పనిచేసిరి. వీరు తరువాత తమిళ నాడు కాంగ్రెసు కమిటీకి సభ్యత్వమును, ఉపాధ్యక్షపదవిని వహించి యుండిరి; 1930 నుండి అఖిలభారత కాంగ్రెసు కమిటీకి సభ్యులై యుండిరి. వీరు సహాయనిరాకరణోద్యమములో పాల్గొని 1932లో ఒక మారును, వ్యక్తిసత్యాగ్రహములో పాల్గొని 1946 లో ఒక మారును జెయిలుకు పోయిరి; 1934 లో కేంద్రశాసన సభకు సభ్యులై యుండిరి. 1937 మొదలుకొని మదరాసు శాసనసభకు వీరు సభ్యత్వమును వహించియుండిరి. వీరు శ్రీ టంగుటూరి ప్రకాశం - మంత్రిమండలిలో 1946-47 సంవత్సరమున వ్యవసాయశాఖకు మంత్రియై యుండిరి; 1949 లో మదరాసు రాష్ట్రమునకు మంత్రిమండలి నేర్పాటు చేసి దానికి 1952 వరకు ముఖ్యమంత్రియై యుండిరి. అనంతరము 1954 లో ఒరిస్సారాష్ట్రమునకు గవర్నరుగా నియమితులై యా పదవియం దుండి 1956 లో అనారోగ్యముకారణముగా దానినుండి విరమించుకొనిరి. వీరు అనేక విధములుగా సహకార సంస్థలలోను, స్థానిక సంస్థలలోను పాల్గొని ప్రజాసేవ యొనరించిరి. అందులో ముఖ్యముగా రామనాథపురం జిల్లాబోర్డు అధ్యక్షులుగా చేసిన సేవ పేర్కొనదగినది. రాజు పాళయములో కళావిజ్ఞానముల యభ్యున్నతికై కృషిచేయుచున్న 'గాంధి కలై మన్రం'(గాంధి కళామందిరము)నకు ఏబదివేల రూపాయలు విలువచేయు గొప్ప భవనమును దానముచేసిరి. గ. సు.


చిత్రము 132.
కుమారస్వామిరాజా

**కుమారిలభట్టు**: హిందూదేశములోని మేధారంగములో ప్రసిద్ధి కెక్కిన ప్రతిభావంతులలో కుమారిలభట్టు ఒకడు. అటువంటి ప్రతిభావంతులు హిందూదేశములో పూర్వము అనేకు లుండెడివారు. కుమారిలభట్టు రచించిన ఒకటే ముఖ్యమైన గ్రంథము మన కింతవరకు నిలిచి ఉన్నది. ఆయన తన జీవితకాలము నంతను ఈయొక్క గ్రంథము రచియించుటలోనే గడపినాడని చెప్పలేము. ఆయొకటే పుస్తకము రచించిన చాలునని ఆయన అనుకొన్నా డనియు చెప్పలేము. పదునైదువందల సంవత్సరముల కాలము వడపోతలో ఈయొక్క గ్రంథమే చెడక భద్రముగా నుండి, ప్రజలు దానిని గౌరవముగా చూచుకొనుచువచ్చినా రన్నవిషయ మొక్కటే దాని గొప్పతనమును గురించి చెప్పుటకు చాలును. భారతీయ తత్త్వ శాస్త్రము నందలి మీమాంసా సంప్రదాయములోని పన్నెండు ప్రకరణములలో జైమిని రచించిన మూల గ్రంథము సూత్ర రూపమున నున్నది. దానిమీద శబర స్వామి రచించిన భాష్య మొకటి కలదు. కుమారిలభట్టు ఈ భాష్యమునకు వార్తిక రూపమున రచించిన బృహద్గ్రంథమున ఈ సంప్రదాయమునకు చెందిన సిద్ధాంతము లను వ్యాఖ్యానించెను. ఇది మూడు భాగములలో నున్నది. ప్రథమ ప్రకరణ ప్రథమ పాదముమీద శ్లోకరూపమున నున్న వ్యాఖ్యానము మొదటి భాగము. దీనికి 'శ్లోక వార్తిక' మనిపేరు. మొదటి ప్రకరణములోని మిగిలిన పాదములమీదను, తరువాతి రెండు ప్రకరణముల మీదను ఆయన చేసిన విపుల వ్యాఖ్యానమునకు 'తంత్రవార్తిక' మనిపేరు. మిగిలిన తొమ్మిది ప్రకరణములమీదను ఆయన చేసిన వ్యాఖ్యానము 'టుప్‌టీక' అను గ్రంథములో గలదు. ఆయన మొదట 'బృహత్‌టీక' అను పేరుతో ఒక దీర్ఘ వ్యాఖ్యానము రచించెనని యొక యైతిహ్యము కలదు. ఈ బృహత్‌టీకలోని ఉదాహరణ వాక్యములు మీమాంసమీది అర్వాచీన గ్రంథములలో గానవచ్చుచున్నవి. కాని దాని స్వభావమును గురించి మన కేమియు తెలియదు.

కుమారిలభట్టు జన్మస్థలమును గురించి కాని, అతని కాలమును గురించి కాని తెలిసికొనుటకు తగిన ప్రమా

ణము లేవియు లేవు. అతడు దక్షిణహిందూదేశీయుడని చెప్పుదురు; అందునను ఆంధ్ర దేశీయుడని కొందరి విశ్వాసము. మరికొందరు అతడు బీహారుకు చెందినవా డందురు. అతని జీవితములోని కడపటి కార్యము పాప పరిహారార్థ మగ్నిప్రవేశము చేసి స్వయముగా నాశన మగుట. శంకరవిజయ మను గ్రంథము ప్రకారము మొట్టమొదటి మారు శంకరాచార్యులవారు కలిసికొనిన ప్రయాగలో ఇది జరగినది. కుమారిలభట్టు పేరు ననుసరించి ఆయన జన్మస్థలము తెలిసికొనుట కవకాశము లేదు. నిస్సందేహముగా ఆయనకు దక్షిణ భారతీయ భాషలతో పరిచయము కలదు. భాషా సమస్యను గూర్చి చర్చించునప్పుడు ఆయన ఏతద్భాషా పదముల నుదాహరించును.

శంకరాచార్యులవారు క్రీ. శ. 812 లో నిర్యాణముచెందినట్లు చెప్పబడుటవల్లను, ఆయన ముప్పదిరెండు సంవత్సరములు మాత్రమే జీవించినట్లు పరంపరాగతముగా విన వచ్చుటవల్లను శంకరాచార్యులవారును, కుమారిలభట్టును సమకాలికులను పరంపరాగతముగ వచ్చునైతిహ్య ముండుట వల్లను, కుమారిలభట్టు శంకరులవారికంటె వయస్సులో కొద్దిగ పెద్దవా డనియు, ఆయన క్రీస్తు శకము ఎనిమిదవ శతాబ్దములో నుండె ననియు చెప్పుదురు. కాని భోజ ప్రబంధములో నుదాహృతులైన వేర్వేరు కవులను గురించిన కథలకంటె వీటికి ఎక్కువ చారిత్రకపు విలువ లేదు. కుమారిలభట్టు క్రీస్తుశక మారువందలకు చాలకాలము పూర్వమే యుండి యుండవలెను. ఏమన, ఋగ్వేదము మీద స్కందస్వామి రచించిన భాష్యమును, శతపథ బ్రాహ్మణముమీద హరిస్వామి రచించిన భాష్యమును కలవు. హరిస్వామి తాను ఋగ్వేద భాష్యమును రచించిన స్కందస్వామి శిష్యుడ ననియు, తాను క్రీస్తు శకము 639 లో తన భాష్యమును రచించితి ననియు చెప్పుకొని యున్నాడు. 'నిరుక్తము' మీద వ్యాఖ్య రచించిన మహేశ్వరుడు కూడ స్కందస్వామి మరియొక శిష్యుడు. ఇతడు తన గురువుగారి గ్రంథమునుండి కొన్ని యుదాహరణము లిచ్చును. ఈ యుదాహృత ప్రకరణములు స్కందస్వామి విరచిత భాష్యములో కానవచ్చుచున్నవి. ఈ హరిస్వామి మహేశ్వరు లుభయులును కూడ భర్తృహరి, కుమారిల భట్టకృత గ్రంథములనుండి శ్లోక, వాక్యముల నుదాహరింతురు. అందువలన కుమారిలభట్టు 500 ప్రాంతమునగాని, ఇంకను పూర్వమునగాని కూడ ఉండవచ్చును.

కుమారిల, శంకరు లుభయులును కూడ వైదిక సంప్రదాయములను పునరుద్ధరించి హిందూదేశములోని బౌద్ధమును తుదిమారు హతమార్చిరని యుభయులను జతపరచి చెప్పుదురు. కుమారిల, శంకరుల ప్రోత్సాహమున హిందూ రాజులు బౌద్ధులను నానా హింసలు పెట్టినట్లు బౌద్ధ వాఙ్మయములో గాథలు కలవు. కాని కుమారిలుని గ్రంథములు మాత్రము అట్టి నేరారోపణమును ఋజువు చేయవు. బౌద్ధుల సిద్ధాంతములను చర్చించునపుడు గౌరవముగను, సహేతుకముగను, న్యాయ్యముగను నుండుటయే కాక ఆయన బౌద్ధ భావము నెడలకూడ సానుభూతిని చూపెను. బౌద్ధ వాఙ్మయములో ఆయన గొప్ప శాస్త్రీయ జ్ఞానమును సంపాదించెను. ఈ విషయ మాయన వాద పద్ధతిని బట్టియే విదితమగుచున్నది. ఆ యఖండ శాస్త్ర వైదుష్యమున బౌద్ధుల నాయన వారి తర్కము ననుసరించియే సులువుగా నోడించి యుండవచ్చును. కుమారిలభట్టు బౌద్ధాచార్యుని వద్ద బౌద్ధ విద్య నధ్యయనముచేసె ననియు, వాదములో ధర్మకీర్తి యను బౌద్ధాచార్యునిచే ఓడింపబడిన పిదప బౌద్ధు డయ్యె ననియు కూడ ఒక పరంపరాగతమగు ఐతిహ్యము కలదు. ఇది బౌద్ధులవద్దనుండి వచ్చుచున్నదే.

ఇట్లు జరగుటలో అసాధ్య మేమియు లేదు. కుమారిల భట్టు శంకరుని వలెనే బౌద్ధ సంప్రదాయములలో పెరిగి యుండవచ్చును. క్రైస్తవ సంప్రదాయములలో పెరిగిన డార్విను బైబిలులోని సృష్టిప్రకార సిద్ధాంతమునకు భిన్నముగా పరిణామ సిద్ధాంతమును ప్రతిపాదించినట్లుగానే వారును తా మే సిద్ధాంతములను గురించి బాగుగ తెలిసికొనిరో వానితో తృప్తి నొందనప్పుడు క్రొత్త సిద్ధాంతములను ప్రతిపాదించి యుండవచ్చును.

కుమారిలభట్టు బౌద్ధ సమస్యలను బౌద్ధ దృష్టితో చర్చించెను. ఈ విషయము ఆతని గ్రంథములవలన బాగుగ విదిత మగుచున్నది. 'నాది ఒప్పు, మీది తప్పు' అను వాదము కా దతనిది.

కుమారిలుడు మత విషయమున తనతో భిన్నాభిప్రాయము కలిగి యుండిన తన ప్రతిపక్షులను హింసించుటకు రాజుల సహాయమును కోరునట్టివాడు కాడు. హిందువులలో పరంపరగా వచ్చు నైతిహ్యమును బట్టి బౌద్ధులు రాజులను వశ్యము చేసికొని, ఆ పలుకుబడితో ప్రజలకు మత మిచ్చిరని కుమారిలభట్టు నేరారోపణ. కుమారిలభట్టు వారితో తన బుద్ధి తర్కములతోనే వారి వాదమును ప్రతిఘటించెను. పరంపరగా వచ్చు బౌద్ధ గాథలవల్ల అశోక, కనిష్కుల విషయములోవలెనే బౌద్ధులు రాజ పోషణమున తమ మతమును వ్యాపింపజేసికొనినట్లు తెలియుచుండగా ఏ హిందూ ఆచార్యుడును తన సిద్ధాంతములను ప్రచారము గావించుకొనుటకు రాజకీయ సాహాయ్యము నర్థించుచు ఏ రాజునొద్దకు వెళ్ళినట్లు లేదు; కాని

అశోక, కనిష్కుల విషయములో వలె బౌద్ధులు తమ మతమును వ్యాపింపజేసికొనినట్లు వారి యైతిహ్యామే తెలుపుచున్నది.

సమస్త ప్రపంచములోని తత్వవేత్తలలో విశాలదృష్టి లోను, పాండిత్య ప్రకర్షలోను సత్యము నెడ ఆతనికి గల నిర్భయమైన గాఢానుషంగములోను ఆతనికి దీటువచ్చు వారు చాల కొద్దిమంది. అతని గ్రంథోదాహృత భాగముల వల్ల తెలియబడుచున్నట్లు శూద్రులుకూడ వేదాధ్యయనము చేయవచ్చు ననియు, అధ్యయనాంత మన్నమాంసము, మద్యమువంటి ఆహార పానీయ నియమములను సడలించుట మాత్రమే కాని ఆచార్య గృహమునుండి వెడలిపోవుట కా దనియు, సృష్టికర్తవంటి నామ రూపములు గల దేవుడును, ప్రపంచాధినేతయు లే రనియు చెప్పగలిగినటువంటి అట్టి స్వతంత్రుడును, భయరహితుడునైన విద్వాంసుడు ధీమంతులైన తన ప్రతిపక్షులను జయించుటకు రాజ సాహాయ్యమును కోరుటవంటి నీచ చర్యలకు పూనుకొనినట్లు అతనిపై నేర మెంచలేము. ఆతని విద్యా పారంగతత్వమునకును, బుద్ధి నైశిత్యమునకును తోడు అతనిలో మానవతా లక్షణ మున్నది. అది అతనిలో నవ్వు పుట్టించెడు పరిపూర్ణమైన చమత్కార శక్తి. బౌద్ధమత తత్వ శాస్త్రము లోకదానితో నొకటి సరిపడదని ఆయన చెప్పుచున్నాడు. వారి తత్వశాస్త్రములో నేదియు శాశ్వతమైనది కా దన్న యెడల బుద్ధునికిని, అతని ధర్మబోధలకును విలువ లేదు. ఏ బౌద్ధుడైనను వేదముల కెంతటి స్థిర ప్రాతిపదిక యున్నదో బుద్ధమతమునకు నంతటి స్థిర ప్రాతిపదిక యున్నదని చెప్పునెడల అది తగిన జామాత నన్వేషించు కన్యక తండ్రి తన గోత్రమును, తన కూతురికి కాగల మామగారి గోత్రమును నొక్కచే యని చెప్పిన ట్లుండును. అట్లు చెప్పుట వలన నది యే ప్రయోజనము నర్థించి అట్లు చెప్పబడినదో దానికే యనర్థకముగ పరిణమించును.

జీవితమునకు సంబంధించిన ప్రత్యక్ష సమస్యలతో ఏ సంబంధము లేకుండ ఆచార కర్మకాండ స్వతంత్ర యోగ్యతను గురించి నొక్కి చెప్పుటవలన బౌద్ధముతో ప్రతిఘటించి పోరాడుచుండిన మీమాంసా సంప్రదాయమును ఏ ప్రమాద స్థలమునుండి వారు తప్పించవలెనని కోరిరో నిలద్రొక్కుకొన వీలులేని ఆ స్థలమునకే త మ్మీడ్చుకొనిపోవు దారిలో పడిపోయినదని కుమారిలభట్టుకు తోచినది. మనము ప్రపంచమును స్వయంచాలన యంత్రముగా మార్చలేము; మనము మానవ ధర్మ భావములను, కోరికలను జొప్పించవలెను, ఇందువల్లనే ఆయన శిథిలమయిపోయిన యంత్రము మరల జీవకణమువలె చలనముగల దగునట్లును, వైదిక మార్గమునకు దూరగులై బౌద్ధ ధర్మ పక్షము వహించిన వారు మరల ప్రాచీన మార్గములోనికి వచ్చునట్లును దానిలోని మకిలిని పోగొట్టు పద్ధతిని మీమాంసను వ్యాఖ్యానించినాడు. ఆయన బౌద్ధ, వైదిక మార్గములు రెంటిని శుభ్రపరిచి కలియగలిపి ఒక విశాల మార్గము నేర్పరచెను.

కుం. రా.

**కూచిపూడి నాట్యము :** భారతదేశములోని వివిధ ప్రాంతములలో - తమిళ దేశములో, భరతనాట్య మనియు, మణిపూరు, అస్సాం, బెంగాలు ప్రాంతములలో మణిపుర నృత్య మనియు, ఉత్తరమున కథక్ నృత్య మనియు, కేరళ దేశములో కథకళి యనియు, సిరై కేళా ప్రాంతములో 'చౌ' నృత్య మనియు-భరతవిద్య పెక్కుపేర్లతో వ్యవహరింపబడుచున్నట్లే ఆంధ్రదేశములోని నృత్యకళ కూచిపూడి భాగవత నాట్యసంప్రదాయమని ప్రఖ్యాతి కాంచినది. కూచిపూడి బ్రాహ్మణభాగవతులు ఈ కళను విశేషముగా ప్రచారము చేయుటచే దీని కీపేరు వచ్చినది. ఈ భాగవత మేళములలో పురుషులు మాత్రమే పాల్గొందురు. సమస్త శాస్త్రములందు అసమాన పాండిత్యము గలిగి వేదములు, ఉపనిషత్తులు, తర్క వ్యాకరణ మంత్రశాస్త్రములు, సంగీతము, భరతశాస్త్రము క్షుణ్ణముగా పఠించి క్రమశిక్షణలో నభ్యసించి సంప్రదాయము చెడకుండ మన పురాణేతిహాసములయొక్క పవిత్రతను ప్రతిచిన్న పల్లె యందుకూడ నృత్య నాటకములద్వారా ప్రదర్శించి ప్రచారము చేసిన వారిలో నగ్రగణ్యులు కూచిపూడి బ్రాహ్మణ భాగవతులు మాత్రమే. ఈ భాగవతులను గూర్చి మాచిపల్లి కైఫియతులో ఈ క్రింది విధముగా చెప్పబడియున్నది.

'క్రీ. శ. 1502 సంవత్సరములో వీరనరసింహరాయలు విజయనగరము నేలుచుండగా కూచిపూడి నర్తకులు ఆ యాస్థానమును సందర్శించిరి. రాజుగారు ఆ నర్తకశ్రేష్ఠుల యొక్క పాండిత్యమును గూర్చి యదివరకే వినుటచే దివాణములో ప్రదర్శన మిచ్చుటకు అనుజ్ఞనిచ్చిరి. ప్రదర్శన సమయములో సిద్ధవటసీమ నేలుచున్న సంబెట గురవరాజు ప్రజలను పెట్టుచున్న బాధలను మహారాజున కెరుక పరచుటకుగాను వారి జట్టులోనివా డొకడు గురవరాజు వేషము ధరించి స్త్రీ పాత్రధారి రొమ్ములకు చిరుతలు పట్టించునట్లు అభినయించెను. రాయ లాదృశ్యమును జూచి వివరము లా నర్తకులవల్ల దెలిసికొని, సంబెట గురవ రాజును పరిమార్చి సిద్ధవట సీమ ప్రజల కష్టముల బాపెను.

శ్రీ సిద్ధేంద్రయోగి 'పారిజాతాపహరణము' నాటకముగా రచించి దానిని కూచిపూడివారికి నేర్పినట్లును,

ఈ భరతవిద్యను కూచిపూడివారు శాశ్వతముగా నారాధించుటకుగాను వారికి గోలకొండ నేలిన అబుల్ హసన్ తానాషాగారు కూచిపూడి అగ్రహారము ఈనాముగా ఇచ్చినట్లును, కూచిపూడిలో పుట్టిన ప్రతి బ్రాహ్మణ బాలుడు ముక్కులు కుట్టించుకొని తన జీవితములో ఒక్కసారి అయినను 'భామవేషము' కట్టవలెనని శ్రీ సిద్ధేంద్ర యోగులవా రాజ్ఞాపించినట్లును, ఆ యా జ్ఞానుసారమే నేటికిని కూచిపూడివారు తమయింట పుట్టిన ప్రతి బాలునికి యుక్తవయస్సు రాగానే గజ్జెకట్టించి నృత్యకళయందు శిక్షణనిచ్చి ఈ ప్రాచీన నృత్యకళను కాపాడుచు వచ్చుచున్నట్లును చెప్పుదురు.

పై విషయముల ననుసరించి చూడగా కూచిపూడివారి కళ పదునారవ శతాబ్దముననే యుండినట్లు తెలియుచున్నందున అప్పటికి కొన్ని వందల సంవత్సరములకు పూర్వము నుండి వా రీకళ నారాధించుచుండినవారై యుండవలెను. వీరు దైవసంబంధమైన కథలు, శివలీలలు, విష్ణుపరమైన కథలు నాటకముల రూపమున ప్రదర్శించువారు. ఈ నాటకములుకూడ రెండు విధములుగ నున్నవి. ఒకే నర్తకుడు ప్రముఖపాత్ర వహించుచు ఆ నాటకములోని అనేక పాత్రలను తానే పోషించుచు కథ నడపు విధాన మొకటి. నాటకములోని పాత్రల ననుసరించి యనేకు లందు పాల్గొని ఆ పాత్రల నభినయించుట మరొక పద్ధతి. ఆరంభములో ఒకేపాత్ర సూత్రధారుని సహాయముతో కథ నడపు పద్ధతియే యుండియుండవచ్చును. అదే క్రమేణ నాటకరూపములోనికి మారినది.

నేటి కాలమున ప్రచారములోనున్న కూచిపూడివారి నృత్య ప్రధాన నాటకములను రెండువిధములుగా విభజింపవచ్చును: (1) వీథినాటకములు లేక యక్షగానములు: ప్రహ్లాద, ఉషాపరిణయము, రుక్మిణీ కల్యాణము, రుక్మాంగద, రామనాటకము మొదలైనవి. మరియు లీలావతీ విజయము, బాలెంత వేషము. (2) కలాపములు: భామా కలాపము; గొల్లకలాపము మొదలైనవి.

భరతసూత్రములను యథాతథముగా ఆచరణలోపెట్టి భరత సంప్రదాయమును అభివృద్ధిపరచినవారు ఆంధ్ర నర్తకు లొక్కరే. ఆంగికము, వాచికము, ఆహార్యము, సాత్వికము అను వివిధరీతులు కూచిపూడి నృత్యమునందే సంపూర్ణవికాసమును పొందినవి.

కూచిపూడివారు ప్రదర్శించు ఉషాపరిణయము, రుక్మాంగద మొదలైన నాటకము లన్నియు నాట్యతరగతికి చెందినవే. ఇందు కథ ననుసరించి అనేక పాత్రలు ప్రవేశపెట్టబడును. ప్రతి పాత్ర ప్రవేశమునకు ఒక ప్రత్యేకమైన దరు వుండును. ఇవే ప్రవేశదరువులు. ఈ దరువులలో పాత్ర తన పేరు, తన్ను గూర్చిన వివరములు అన్నియు తెల్పుచు నృత్యమాడుచు రంగస్థలము ప్రవేశించును. దరువు నాడు విధమునుబట్టి ప్రవేశించు పాత్రయొక్క స్వభావమును మనము తెలిసికోగలము. మరియు దరువులలోనే పాత్రలయొక్క ఆహార్యమును గూర్చిన వివరములు కూడ చెప్పబడియుండుటచే అవి పాత్రల వేషధారణకు నెంతయో యుపయోగపడును. నృత్యములో లాస్యము నందు ప్రదర్శించు అడుగులకు, తాండవమునందు ప్రదర్శించు అడుగులకు చాల భేద మున్నది. ఈ భేదముల ననుసరించియే దరువుల నృత్యముకూడ కూర్చబడును. హిరణ్యకశిపుడు మొదలైన రక్కసుల ప్రవేశ దరువులు ఉద్ధతముగాను భీకరముగాను, హరిశ్చంద్రుడు రుక్మాంగదుడు మొదలైన వారి నృత్యము గంభీరముగాను, స్త్రీ పాత్రల అడుగులు కోమలముగాను ఉండును. గనుక దరువును పాడు విధము, అంగ విన్యాసమును బట్టి ఆ పాత్రల యొక్క స్వభావము మనము గ్రహించ గలుగుచున్నాము.

నాట్య సభలలో అభినయమునకు పదము లెంత ముఖ్యమో యక్షగానములో భావప్రదర్శనమునందు అభినయదరువు అంత ప్రాముఖ్యము వహించును. నాటకములలో కొన్ని ముఖ్య సన్నివేశములం దొక ప్రత్యేక భాగమును విపులీకరించవలసివచ్చినప్పుడు దరువు రూపములో పాడి అభినయింతురు. దరువు వంతపాటకులు వివిధ సంగతులు వేసి పాడుచుండగా నర్తించు పాత్ర అందలి స్థాయీ భావమును పోషించుచు అనేక సంచారుల నభినయించి ఆ భావము విస్తరింపజేయును. దరువులుగాక కందార్థములు, సీసార్థములు, ధవళములు, ఏలలు, హెచ్చరికలు మొదలయిన సంగీతరచన లెన్నియో యున్నవి. యక్షగాన కథాగమనమునకు దరువులు మాత్రమే ఎక్కువ ప్రాముఖ్యము వహించుచున్నవి.

కలాపములో నాటకములందువలె కథకు ప్రాముఖ్యము ఉండదు. ఒకే పాత్ర వివిధ రసములను ఒప్పించుచు కథ నడపుచు అభినయించును. కలాపములనాడు పద్ధతి మన ఆంధ్రదేశములో తప్ప భారతదేశములో మరి యే ప్రాంతములోను కనిపించుటలేదు. మహారాష్ట్రదేశములో లావణి, లలిత నృత్యములు ప్రచారములో నున్నను అందు మన కలాపములలో నున్న పాండిత్యము కాని, శాస్త్రీయాభిమానము కాని కానము. మన కలాపములు వినోదముతో పాటు విజ్ఞానమునుకూడ ప్రసాదించునట్టివి. ఇతర ప్రాంతములలో నివి కేవలము వినోదమును ప్రదర్శించునట్టివి. కనుక కలాపములు ఆంధ్రుల ప్రత్యేక కళాసృష్టిగా చెప్ప

వచ్చును. నృత్య నాటకములలో సాధారణముగా నర్తకుడు ఆ నాటకములోని పాత్రపోషణకు ప్రాధాన్య మీయవలసి యుండును. కనుక అతని స్వశక్తి ననుసరించి స్వేచ్ఛగా అభినయములో విజృంభించి తనకున్న సంపూర్ణ పాండితీ ప్రతిభను ప్రదర్శించుట కవకాశ ముండదు. కలాపములం దట్టి యవకాశములు మెండు. నర్తకుడు సంపూర్ణ పాండిత్యమును ప్రదర్శించుట కవకాశములు కల్పించుటకే ఈ కలాప రచనలు చేయబడి యుండవచ్చును. ఇందు ప్రముఖనర్తకి నటుని, లేక హాస్యకాని యొక్క సహాయముతో ఎన్నియో శాస్త్రములను గూర్చి చర్చించును. నేటి సాంఘిక వ్యవస్థ మొదలుకొని అనాదినుండి వచ్చుచున్న ఆచార వ్యవహారములను కూడ వారు చర్చింతురు. విద్యావంతులైన పండితులు సభ నలంకరించి నచో వారు చర్చించని శాస్త్రవిషయ ముండదు. కనుకనే ఈ కలాపనర్తకులు కేవలము నాట్యశాస్త్రమును, సంగీత మునే కాక సకల శాస్త్రములందు అసమాన పాండిత్యము కలిగి యుందురు.

'పారిజాతాపహరణము' కథ తెలియని ఆంధ్రు డుండడు. ఆ కథనే ఇతివృత్తముగా తీసికొని నాటకము నల్లి శ్రీ సిద్ధేంద్రులవారు కూచిపూడి వారికి నేర్పిరి. ఇందు సత్యభామ ప్రముఖపాత్ర వహించును. దీనినే భామకలా పమని వ్యవహరింతురు.

భామకలాపములో భామపాత్రధారి రంగస్థలము ప్రవేశించుముందు తెరపై జడవేయు ఆచారము కలదు. తెరపై జడవేయు టనగా తనకు సకలశాస్త్రములందు పాండిత్య మున్న దనియు, సభలో పండితు లెవరైనను తన యొక్క శాస్త్రపరిజ్ఞానమును పరీక్షించవచ్చు ననియు సవాలుచేయుట. అంతట విద్వాంసు లెవరైనను ఆ పాత్ర ధారి పాండిత్యమును పరీక్షించిన పిదప అతడు వాగ్వి వాదములో నోడి పోయినయెడల ఆ పాత్రధారి జడ కత్తి రించి వేయవచ్చును.

బ్రాహ్మణ పండితునికి గొల్లపడుచునకు జరిగిన వేదాంత చర్చయే గొల్లకలాపము. ఇందు వేదములను, ఉపనిషత్తు లను, స్మృతులను, పురాణములను గురించియు, మన సంఘములోని చాతుర్వర్ణ్య వ్యవస్థను, పిండోత్పత్తి క్రమ మును గురించియు చర్చింతురు. భామకలాపము శృంగారరస ప్రధానమై అష్టవిధనాయికల అభినయముతో కూడి యుండును. గొల్లకలాపము వేదాంత చర్చలతో శాంతరస ప్రధానముగాను, భక్తిప్రబోధకముగాను ఉండును.

క్రీ. శ. 17వ శతాబ్దాంతములో శ్రీ నారాయణ యతీం ద్రులవారు రచించిన వర్ణనగీతములైన తరంగములు ఆంగిక ప్రధానమైన నృత్యమునకు పనికివచ్చునట్టి సంగీత రచనలు. కూచిపూడివారు తరంగములకు కూడ నృత్యము కల్పించి ప్రదర్శించుట మొదలు పెట్టిరి. ఈ రచనలు వర్ణన గీతము లగుటచే ఆంగికాభినయమునకు, ప్రత్యేకించి ముద్రాభినయమునకు, చిత్రగతి నృత్యమునకు ఎక్కువ అనుకూలమైన వగుటచే ఇవి ప్రచారమునకు వచ్చిన తరువాత ఆంగిక ప్రధానమైన నృత్యము తరంగ నృత్య ములో సంపూర్ణత నొందినది.

తరంగములను ప్రత్యేకించి అభ్యసించి ప్రచారములోనికి తెచ్చినవారు కూచిపూడి భాగవతు లొక్కరే. తరంగ ములు నృత్యప్రధానములైనను అవి భక్తిప్రబోధకములుగా నుండును. పద, వర్ణములందును నృత్యమే ముఖ్యమైనను అవి శృంగారరస ప్రధానమై నాయికా నాయకులకు సంబంధించిన రచనలగుటచే నృత్యమేకాక కొంతవరకు అభినయమునకు కూడ ఆ రచనలలో అవకాశ మున్నది.

సంస్థానములలోని నృత్యకళ కాలక్రమేణ అభివృద్ధి చెందుచు వచ్చినందున ఆ కళ పూర్వపు స్వరూపము పూర్తిగా మారిపోయినది. కూచిపూడివారు ఈ రెండు విద్యలను వారి సంప్రదాయములో వృద్ధిపరచుచు వచ్చిరి. వీథి భాగవతములను, కలాపములను ఆడుటయే కాక వీరిలో కొందరు కచ్చేరి పద్ధతిలో ఏక పాత్రాభినయము కూడ అభ్యసించి పదములు, వర్ణములు, స్వరపల్లవులు, శబ్దములు, తిల్లానలు ఆడుట ప్రారంభించిరి. కాని ఒక ముఖ్యవిషయము మనము గమనించవలసి యున్నది. వీరు కచ్చేరి సంప్రదాయ సంగీతరచనలను అభ్యసించినను వీరి అభినయపద్ధతి మాత్రము 'భరతకత్తును' అనుసరించియే యుండును.

ప్రత్యేకముగా కూచిపూడి భాగవతపు బాణీలో నేటికిని యక్షగానముల నాడువారు దక్షిణదేశములో మేరటూరు, శూలమంగళము, ఊత్తుక్కాడు భాగవత మేళముల వారును, బంగనపల్లి సంస్థానములోని కపట్రాల గ్రామానికి చెందిన భాగవతులును. వీ రందరు బ్రాహ్మణ భాగవతులే కాక, వీరు ప్రదర్శించు నాటకము లన్నియు తెలుగులోనే యున్నవి. విజయనగర సామ్రాజ్యము అస్తమించిన తరు వాత కూచిపూడి భాగవత నర్తకులు తంజావూరు వెళ్ళి రనియు, ఈ కళారాధకులకు క్రీ. శ. 1561 - 1614 వ సంవ త్సరము వరకు తంజావూరు నేలిన అచ్యుతప్పనాయకుడు అచ్యుతాపురమను అగ్రహారమును ఈనాముగా నిచ్చె ననియు, వీ రచ్చట స్థిరపడి కళ నారాధించుచు వచ్చి రనియు, అచ్యుతాపురమే నేటి మేరటూరు, మేలట్టూరు, (మేళముల ఊరు) అనియు చరిత్రలు చాటుచున్నవి.

మరియు సుమారు రెండు వందల సంవత్సరముల క్రిందట బంగనపల్లి నేలుచుండిన నవాబులు కూచిపూడి నర్తకులను తమ సంస్థానమున కాహ్వానించి తమ సంస్థానములో స్థిర నివాసము నేర్పరచుకొని కళా ప్రచారము చేయుటకు వారికి కపత్రాల అనుగ్రామమును ఈనాముగా ఇచ్చి రనియు, ఆ సంతతివారే నేటికిని దక్కను రాయల సీమ గ్రామాలలో ఈ భాగవత కళను ప్రచారము చేయుచున్నా రనియు కూచిపూడి భాగవతుల చరిత్ర నెరిగిన పెద్దలు చెప్పుదురు. న. రా.

**కూవన సామయ్య :** గోవిందసామయ్యగారి సోదరులు; తెలుగు బ్రాహ్మణులు; సంగీతములోను, తెలుగులోను పాండిత్యము గడించిరి. వీరి నాటకురంజి వర్ణము మాత్రమే ప్రసిద్ధముగా నున్నది. వీరును, వీరి సోదరులును కార్వేటినగర నివాసులని తెలియుచున్నది (చూ : గోవిందసామయ్య). ద్వా. పా.

**కృష్ణదేవరాయలు** (క్రీ. శ. 1510 - 1530): విజయనగర మహాసామ్రాజ్యమును పాలించిన మహాచక్రవర్తి; తుళువ వంశజుడు; నాగలాంబా నరసానాయకుల కుమారుడు; కవి పండిత పోషకుడు; మహాభావుకుడు; పెద్దన్నగారి మహాకవిత్వ లక్షణము తెలిసికొని ఆయన నాంధ్ర కవితా పితామహుని జేసిన భావుక చక్రవర్తి; తాను స్వయముగ గొప్ప కవి. ఈయన రచించిన గ్రంథములు — మదాలసా చరిత్ర, సత్యావధూ ప్రీణనము, సకల కథాసార సంగ్రహము, రసమంజరి, జ్ఞాన చింతామణి, ఉషాపరిణయము, జాంబవతీ కల్యాణము, ఆముక్తమాల్యద. ఉషాపరిణయ, జాంబవతీ కల్యాణములు నాటకములు. వీనిలో గీర్వాణ భాషలో రచించిన జాంబవతీ కల్యాణమును, ఆంధ్రమున రచించిన ఆముక్తమాల్యదయు మాత్రమే ఇప్పటికి లభించినవి.

శ్రీకృష్ణదేవరాయలు వ్రాసిన ఆముక్తమాల్యదా గ్రంథ మాంధ్ర భాషకు బనారసు పట్టుచీర. దానినిండ బంగారపు పువ్వులే. దానికి వెడల్పైన జరీ అంచు గలదు. ఆ యంచే మాలదాసరి కథ. ఈ గ్రంథమునందు మాలదాసరి కథ లేనిచో శ్రీకృష్ణదేవరాయలు వట్టి కవియై యుండెడివాడు. మాలదాసరి కథ వ్రాయుటతో మహాకవి యని చెప్పవచ్చునన్న ట్లున్నాడు. ఈయన వట్టి కవికాడు; ప్రౌఢకవి. ప్రౌఢకవి యనగా తాను రచించిన రచనయందు భాషా పాండిత్యము, పద్యపు బిగింపు, బహుభాషా శబ్దముల ప్రయోగము, ఊహలోని గడుసుదనము, క్రొత్తదనము, సర్వశాస్త్ర పాండిత్యము, తచ్ఛాస్త్రగత విషయములు రచనలో నిముడ్చుట మొదలైన విషయములు కలవని ద్యోతక మగును. శ్రీకృష్ణ దేవరాయలు మహాపండితుడు. రాజు పండితు డగుటలో నాశ్చర్యము లేదు. అందులో నాకవి కవి, పండితపోషకు డైనచో తన్ను దర్శింపవచ్చు కవి పండితు లందరివద్ద సర్వశాస్త్రగత మహా విషయములను వినుచుండును. ఆయనకంటె బహుశ్రుతు డుండడు.

శ్రీకృష్ణదేవరాయలు కవి యనినతోడనే వర్ణనాశక్తి గలవాడని యర్థము. ఆయన కున్నంత వర్ణనాశక్తి యాంధ్ర కవులలో మరియొకనికి లేదు. ఈయన వర్ణనా సాధువు; వర్ణనోన్మాది. ఈ వర్ణనా శక్తి ఎవని కుండునో యతడు నిజముగ కవిశబ్దవాచ్యుడు; వర్ణనాతిశాయి. కథాకథన సూచ్యార్థ సూచనాది శిల్ప పారంగతుడు; మహాకవి. ఈయన వర్ణనాశక్తి వ్యవధిమీరినది. ఈయన తనకున్న వర్ణనా శక్తిని సమృద్ధిగ నెరిగినవాడు కూడను. విల్లిపుత్తూరు వర్ణన, మధురాపుర వర్ణనములయందే వర్ణనయందలి తన సర్వంకషమైన ప్రజ్ఞను చూపి యంతటితో చాలక, గ్రీష్మ, వర్షా, శర, ద్వసంత ఋతువులను యథేచ్ఛముగ వర్ణించెను. ఋతువర్ణనలు తొలుతనే యాదికవి సమృద్ధిగ చేసెను. అంతటి యున్నత స్థాయికి శ్రీకృష్ణరాయలవారి వర్ణనలు పోకపోయినను ఔన్నత్యమునందు కించిదూనములే కాని ఏ మాత్రము తక్కువవి కావు. ఈయన వర్ణనములలోని సొగ సేమనగా లోకమును సమృద్ధిగ చూచుట; ఇంచుమించుగ స్వభావోక్తి వంటిది. తాను చేసిన ప్రకృతి పరిశీలనము దానియంతట నది వ్రాసినచో స్వభావోక్తి యగుచుండగ తత్పరిశీలనాగత విషయములను రూపకాద్యలంకారముల జొప్పించుటచేతను, శబ్దములు కూర్చుటలో నెడము లేకుండ గూర్చుటచేతను, ఆ శబ్దములు కొన్ని మిక్కిలి దేశ్యములు కొన్ని నైఘంటువములు నగుటచేతను, మరియు నంతటి భావన యంతటి యూహా యొక పద్యములోననే యిముడింపవలసి వచ్చినపుడు వాక్య విన్యాసమునకు సహజముగ నేర్పడు క్లిష్టతచేతను ఆముక్తమాల్యదా గ్రంథము మహా ప్రౌఢమైనది. క్లిష్టత యనగా నేకపద్యస్థితమైన వ్యాకరణగత బహువిషయముల సంయోజనము చేసికొనవలసి వచ్చుటయు, నన్వయముకొరకు పది శబ్దములను పరామర్శింపవలయుటయును — ఇదియే క్లిష్టత్వము. ఈక్లేశము ఆముక్తమాల్యదయందు సమృద్ధిగ నున్నది. ఇట్టి కష్టము మురారియందు కూడ ఉన్న దందురు. కాని మురారియందు మధురములైన, దీర్ఘములైన సమాస రచనములచేత మిక్కిలి తక్కువ. ఆముక్తమాల్యదయందు చిని చిన్ని మాటలతో పద్య మంతయు పొదుగుటచేత నీ క్లిష్టత ఎక్కువగుచున్నది. ఒకవేళ సంస్కృత సమాసము లున్నను వాని

కూర్పుకూడ క్లిష్టముగనే యుండును. ఈయన సంస్కృత సమాసములుకూడ సంస్కృతవ్యాకరణ పరిజ్ఞానహీనునకు తొందరగా పొడగట్టవు. 'ఇరమ్మదీకృత' - ఇరమ్మద మనగా మెరుపుతీగ. విద్యుత్తటిత్సౌదామనీ శబ్దములకున్న ప్రాచుర్యము దీనికి లేదు; 'పునారచిత' - పునః రచిత (విసర్గసంధి); జిఘృక్ష, ఊర్జస్వలుడు; అహిపకల్ప - అహి కల్పయన్న శబ్దము సులభముగ నర్థము కావచ్చును. నడుమ 'ప' కారము చేర్చునప్పటికి సామాన్యున కుక్కిరి బిక్కిరి యగును - ఇట్టి సంస్కృతము లనేకములు. తెలుగులు కూడ గడుసుగానే వాడును - అంపపెన్నెలగతి, పొలమ రులు, జావడములు, చుఱపుచ్చుచు, ఱింగణావు, ఉలుపాలు, ఓహరి సాహరి, గోర్మ్రుచ్చులు, ఎఱసంజకుంకుమ, పాక ళపుఏనుగు మొదలైన యచ్చతెనుగు శబ్దములు, ఇవియు గాక ప్రాంతీయములైనవి వృత్తికారులు వాడుకొను శబ్దములు - అనగా కృషికులు, వడ్రంగులు, చెప్పులు కుట్టు వారు, అగసాలులు మొదలగువారు వారివారి వృత్తుల యందు వాడుకొను శబ్దములు - వీని నన్నింటి నీ కవి ప్రయోగించును. అందుచేత నీయన కావ్యము వ్యాఖ్యా సాపేక్షము. వ్యాఖ్యా సాపేక్షత్వ లక్షణముతోబాటు నిర్దుష్టప్రతి లేకపోవుట కూడ పఠితృవ్యాఖ్యాతృగతికి కొంత ప్రతిబంధకము.

ఏ భాషలోనైనను ప్రధానముగ సంస్కృతాంధ్రభాషల యందు సర్వకావ్యముల నొకఱే దృష్టితో చూడరాదు. కవిత్రయమువారి రచనను చూచినట్టు ప్రబంధ కవుల రచన చూడరాదు. కవిత్రయముతో పోల్చి చూడదగినవారు పోతన, భాస్కరుడు మొదలైన పురాణేతిహాస కర్తలు. నాచన సోమనను పోల్చవచ్చును; కాని ఆయన యౌచి త్యముచేత కవిత్రయము వంటివాడు; రచనచేత ప్రబంధకవులకు దగ్గరి వాడు. ఒక విశిష్టమైన ప్రబంధ ధ్వని కల్పనాశక్తి యందు పెద్దనగారివంటివాడు. తక్కిన కావ్యము లన్నియు వేరు వేరు గణములుగ చూడవలయును. అట్లు చూచినచో ఆముక్తమాల్యద వంటి గ్రంథ మదియే. ఇచట నౌచిత్యాది పరిశీలన, కథాకథన శిల్పవిచారణ, పాత్రముల తీర్పు మొదలైన విషయముల పెట్టుకొనరాదు. అవియు నుండవచ్చును. వానికి ప్రాధాన్య వివక్ష తక్కువ. ప్రతిపద్య మొక్క భావము. ఆ భావమును చక్కగ గ్రహించి యా యూహయందు, నా పద్యరచనయందు, నా కల్పన యందు భావుకుడు రమించవలయును. అట్టి రమణశీలు రయిన భావుక బాహుళ్యముచేతనే యాముక్తమాల్యద నిలచినది.

ఆంధ్రభాషలో శబ్దప్రధాన రచనా వైశిష్ట్యము కల వారు ముప్వు రున్నారు. ఒకడు నాచన సోమన. రెండవ వాడు శ్రీకృష్ణదేవరాయలు. మూడవవాడు తెనాలి రామకృష్ణకవి. ఆలంకారికు లోజస్సౌకుమార్యాది గుణము లను చెప్పవచ్చును. వాని నందం దిచ్చటకూడ పొసగింప వచ్చును. కాని ఈ ముగ్గురును వా రేరి తెచ్చుకొను శబ్దములు వారివే. వారి కూర్పులక్షణము వారిదే. తద్గ్రథనముచేత భాసించు నొక విశిష్టమైన శైలి వారి సొంతము. అది మరెవ్వ రనుకరించ రానిది. అనుకరించ రాని లక్షణములలో పాండురంగమాహాత్మ్యము మహత్తమ మైనది. ఆయన శబ్దముల కూర్పే వేరు. ఆముక్తమాల్యద జిలుగుపని. చిన్ని చిన్ని శబ్దములు కూర్చి చేసినపని. ఇది యొక విలక్షణమైన గ్రంథము. కృష్ణరాయ లెంత కవియో యంతటి మహారాజు. తాను చక్రవర్తి; సర్వంకషమైన రాజనీతి తెలిసినవాడు. అందుచేత తన కావ్యమునందు యామునాచార్య వర్ణనమునందు తన రాజనీతి యంతయు జెప్పినాడు.

శ్రీకృష్ణరాయల వర్ణనలోని రహస్యములు కొన్ని విచా రించినచో ఆయన మనోలక్షణములు చమత్కారములైనవి భాసించును. పురనిర్మాణ మెట్లుండవలయునో, గేహము లెట్లుండవలయునో వివరించి విలుపుత్తూరిని రమ్యముగా వర్ణించినాడు.

'తలఁ బక్షచ్ఛటఁ గ్రుచ్చి బాతువులు కేదారంపుఁ గుల్యాంతర
స్థలి నిద్రింపఁగఁ జూచి యారెకు లుపస్స్నాత ప్రయాతద్విజా
వలి పిండీకృతశాటికల్ సవిఁ దదావాసంబుఁ జేర్పంగ రే
వుల డిగ్గన్ వెసఁ బాఱువానిఁ గని నవ్వున్ శాలిగోప్యోఘముల్.'

అనునిది ప్రసిద్ధమైన పద్యము. బాతులు మెడ మలచి వీపుపైన బెట్టికొని నిదురబోవుచుండగా వానిని జూచి యారెకులు బ్రాహ్మణులు స్నానము చేసి వస్త్రములు పిండిపెట్టిరని పొరబాటు పడిరట. ఇది చాల చమత్కార మైన కల్పన. అరటి తోటలను, పనసపండ్లను, చెరకు తోట లను, మావితోపులను కృష్ణరాయలు చిత్ర చిత్రముగా వర్ణించివాడు.

'మలయపుగాలిఁ దేలు వనమాలి విమానపతాక ఘల్లుమం
చులియఁ, బసిండి మువ్వగమి నొక్కొకమాటు గదల్ప, నుల్కి మి
న్నులము తదీయ హేమవరణాంచల చంపక శాఖలందుఁ బ
క్షులు రొదసేయ, వేగెనని కూడుదు రల్కలు దీఱి దంపతుల్.'

గాలికి ధ్వజస్తంభము మీది చిరుగంటలు కదలినవి. ఆ ధ్వనికి పక్షులు బెదరి కూసినవి. జనము తెల్లవారె నను కొన్నారట. ఇదియొక చిత్రమైన వర్ణన. తెల్లవారుజామున చల్లగాలి వచ్చును; పక్షులు కూయును. మరియు వెన్నెల

రాత్రులైనచో నీ భ్రాంతి సార్వత్రికముగా నుండును. ఇట్టి సార్వజనీనమైన, సార్వకాలికమైన యొక యనుభూతి విశేషము చెప్పుట యొక మహాకవితా లక్షణము. ఇట్లు సుఖముగా వర్ణనలు చేయును; మరల కష్టములైన కల్పనలు చేయును.

'అడుగుననుండియుం బదిలమై చదలంటెడుకోట నొప్పు ప్రోల్
చెడనికడంక దంచనపుఁజేతుల గంగనుగాసె దూఱఁగా
నడుమన యుబ్కిఁజేసి యల నాకపురిః సరికై పెనంగి లా
వెడలఁగఁ బట్టి వ్రేయుటకు నెత్తె ననన్ జను మల్లు పోరిలోన్.'

ఆ మధురాపురమును, స్వర్గపట్టణమును నిద్దరు మల్లులు. స్వర్గపట్టణ మను జెట్టిని మధురాపుర మను జెట్టి పైకెత్తెను. స్వర్గమను జెట్టి లంగోటా కట్టెను. ఆ లంగోటా గంగానది. తొడమీది లంగోటాలోనికి చేయి దూర్చి ప్రతి జోదును నేల బడవేయుట మల్లయుద్ధమునందు సహజమైన లక్షణము. ఈ మధురాపురమను మల్లుడు తన దంచనపు చేతులతో గంగయను లంగోటాలోనికి చేయి పోనిచ్చి వానిని క్రింద పడవేయబోవుచున్నా డనుట. దంచనము అనగా నినుపగొలుసులు వేసిన పెద్దరాళ్ళని, లేదా కోటపైనున్న శతఘ్ను లని. ఇది యొక చిత్రమైన వర్ణన. శరీర వ్యాయామాదులతో కాలము గడుపుట రాజులకు సహజమైన లక్షణమేకదా!

ఈ కవి పూర్వ సంస్కృత మహాకవుల కావ్యములన్నియు నెరిగి తన భావముల ఛాయలు వానిని పట్టి తీర్చికొన్నను స్వతంత్రమైన కల్పనలు చేయువాడు. కాళిదాసు కుమారసంభవములో హిమవత్పర్వతమును వర్ణించుచు పర్వతము నడిమి భాగమున నున్న మేఘములవలన క్రింద వానలు కురియుటయు, పైన నెండలు కాయుటయు వర్ణించెను. అట్లే యీయనయు

'ఆపురి సౌధ వీథి నధరాధర భూముల గర్జ మున్నుగా
నావయికి న్వినంబడని యట్లుగ వ్రాలు ఘనాళిఁ దార్చి లీ
లావరతః ఘటింపుదురు లాస్యము సేయగఁ మేఘరంజి నా
లాపముఁ జేసి పోషితకలాపిఁ గలాపి కలాపకుంతలల్.'

ఆ యూరి మేడ లంత యెత్తున్నవనుట. మేడ పైభాగమున నున్నవారికి మేఘముల యురుమే వినిపించదు. అచట పెంపుడు నెమళ్ళాడుటకు, తత్రత్యలైన స్త్రీలు పెంపుడు నెమళ్ళ నాడించుటకు మేఘరంజి రాగాలాపన చేయుదురు. ఈయన వర్ణనలకు కాటుక చేయుట దగ్గర నుంచి వస్తువే. స్త్రీలు దీపము వెలిగించి పైన కంచ మిడి యా కంచమునకు బట్టిన నల్లని మకిలి గీసి యాముదము కలిపి కాటుకగా బెట్టుకొందురు - 'ఘనగత శంపఁ గంచ మిడి కాటుకఁ దీర్చి పునుం గినోష్మ తట్టినది యలంది'.

కృష్ణరాయలనాటికి రెడ్లకు రాజ్యము లేదు. రాజ్యములు పోయికూడ జనములు రాచఠీవి వదలలేరు కదా! అట్టి రెడ్లను శ్రీకృష్ణరాయలు

'గురుగుం జెంచలిఁ దుమ్మి లేఁదగిరిసాకుం దింత్రిణీపల్లవో
త్కరముం గూడఁ బొరంటి నూనియలతోఁ గట్టావి కుట్టారుగో
గిరము ల్మెక్కి తమిం బసుల్ పొలమువోఁ గ్రేఁపు ల్మెయిన్నాక మే
కెరువుం గుంపటిమంచ మెక్కిరి ప్రభుత్వైకాప్తి రెడ్లజ్జడిన్.'

అను పద్యమున ఆక్షేపించుచున్నాడు. ఈయన వర్ణనాశక్తి ఋతువర్ణనలయందు మితిమీరిపోయినది.

'రయమున వృష్టికై యొదిఁగి రచ్చలపై, విధియింతు రుగ్రతన్
హయపతిమీఁద దంతిపతి నాతనిపై నృపతిం గజాదిని
ర్ణయముల మొత్తులాడుదురు, వ్రమబ్బొకయింతయు విప్ప విచ్చుమొ
గ్గయి మఱి పాసిపోదురు సమస్తదిశాగతులైన యధ్వగుల్.'

వాన కురియుచుండగా తల దాచుకొనుటకు రచ్చ చావడులందు జేరి యచట నశ్వపతి, గజపతి, నరపతుల తారతమ్యముల గూర్చి కుమ్ములాడి వాన వెలిసినంతనే వారి కేమియు పట్టనట్లు వెడలిపోవుదురట. వానవచ్చుచున్నదని చెట్ల క్రింద నిలబడగా పూర్వము కురిసిన వానజల్లు నీరు కొమ్మలనుండి వారిమీద బడి పాంథులను తడిపెనని యొక పద్యము :

'పిడుగుల కల్కి లోఁ దొలఁచి భీరులు కంచముఁ జల్లుదీధితుల్
గడవల వెళ్ళరాఁ బొగలకావిరి బ్రుంగిన పుల్గృహంబు లె
ల్లెడఁ గనుపట్టె నీళ్ళ నిలయెల్లను ముంచి రసాతలంబుపై
విడియఁగ దండు డిగ్గిన సవిద్యుదురుస్తనయిత్నులో యనన్.'

చలికి భయపడి చేతులు కంచములో గడగికొని గడప లోపలినుండియే నీళ్ళను వెలికి విసరుచున్నారు. రాజాంతఃపురములయందు నివసించుచు నిట్టి యనుభవ విశేషమును రా జెట్లు గ్రహించె నన్నది యాశ్చర్యము.

'ఇల్లిల్లు దిరుగ నొక్కింతబ్బు శిఖి; యబ్బె
నే నింటిలోఁ బూరి యిడి విసరక
రాఁజదు; రాఁజిన రవులు కో ల్వాసాలఁ
గాని కల్గదు; మఱి దానఁ గలిగె
నేని కూ డగుట మం; దైనఁ బెన్బొగ సుఖ
భుక్తి సేకూర; ధాభుక్తి కిడినఁ
బ్రాగ్భుక్తలకె తీఱు బహుజనాన్నము; దీఱ
నారుల కొదవుఁ బునఃప్రయత్న;
మాజ్యపట ముఖ్యలయ మెన్న; రాలయాంగ
దారులయ మెన్న; రంతిక కారజనిక
పచన నాంధోగృహిణి రామిఁ బదుక మరుఁడు
వెడవెడనె యార్చ నొగిలి రజ్జడిని గృహులు.'

ఏరు సాగిరి — ఏరువాక సాగిరని యర్థము. ఏరువాక పున్నమయని వచ్చును. ఆనాడు కృషికులు క్రొత్తగా

నరక కట్టుదురు. దానిని వర్ణించినాడు. గడ్డి పెరిగియున్న జవుకుమళ్ళలో దున్నుట కష్టము. ఎద్దులను, దున్నలను కట్టి కృషికులు దున్నుచుండగా నా దున్నలును, నెద్దులును పడెడి కష్ట మెట్టిదో యిట్లు చెప్పినాడు శ్రీకృష్ణరాయ మహాప్రభువు. యమ మహిషము నెద్దయి పొలాలు దున్నుట తనకు తప్పినదని సంతోషించినదట. శివుని నంది తాను దున్నకాక తనకు బురదలో దిగుట తప్పినదని సంతోషించెనట.

'రవిఁ జూచి కుడుచువారలకును కృకలాసములకును దృష్టి మిన్నులనె నిలచె.'

కృకలాసములు ముదురు తొండలు. ఈ దృష్టి భవ భూతిది. అల్ప జంతువుల స్వభావముకూడ నిట్లు పరిశీలించుట యొక విశిష్టమైన మనోలక్షణము. ఆ వర్షములో పశు లెంత బాధపడెనో యిట్లు వర్ణింపబడినది.

'తడి తల డిగ్గి ముంప, జడతం దుద లెప్పలఁ గన్ను వీడి పుల్
పొడుచుచు నీరు ముంగఱల పోలిక ముక్కునఁగూడ నోర గొం
తొడియుచుఁ గూఁటి కజ్జ నగ మొత్తుచు టెక్కు విదుర్పు మున్నుగా
వడఁకుచు కాక చేష్టుడిగె వక్షము పశులు జానువుల్ సారన్.'

ఇది స్వభావోక్తి. ఇట్లు పశులను జూచి వ్రాసెనా యని ప్రశ్న పుట్టినచో చూడకుండ నూహచేతనే వ్రాయ వచ్చును.

ఈయన వర్ణనలలో వేటయొక్కయు, యుద్ధము యొక్కయు వర్ణనలు సమృద్ధిగా నుండును. ఇట్లే సర్వ వర్ణనలు నుండును. కథలో కూడ వర్ణనా చమత్కారమే యెక్కువగా నుండును.

ఈయనయొక్క గడుసుగా నిర్వహింపబడిన కథలు రెం డున్నవి. ఖాండిక్య కేశిధ్వజ సంవాద మొకటి; మాల దాసరి కథ రెండు.

ఖాండిక్యుడు, కేశిధ్వజుడు నిద్ద రన్నదమ్ములు; మిథిలా పతులు. వా రిద్దరు రాజ్యముకొరకు యుద్ధమాడిరి. ఖాండిక్యు డోడిపోయి పారిపోయెను. ఖాండిక్యుడు మహా శ్రోత్రి. కేశిధ్వజుడు బ్రహ్మజ్ఞాని. ఈ కేశిధ్వజుడు తా నొక యజ్ఞము చేయుచుండెను. యజ్ఞధేనువు

'పులు మఖశాలికానికటభూముల మేయుచు నేటి వెంటఁ బె
ల్లలమెడునీఱముం దఱిసి యామ్యపశాకన ఘర్మధేను హా
కెళవున నాడువాలభుజగిం గని గోంద్రని యంగలార్చుచున్
గళగత ఘంట మ్రోయ నుటుకం బిడుగుంబలె దాఁకి యుద్ధతిన్.'

'గబ్బు సమక్షికంబయి మొగంబడువ న్దరుపర్ణము ల్పడన్
ద్రొబ్బుచుఁ గార్మొగిళ్ళ రొదతోఁ జెలలాడెడు బొబ్బరింత గా
డ్పుబ్బి విసంజ్ఞగాఁగ జెవు లూఁదిన వల్లవు డుర్విఁ గూలఁగా
బెబ్బులి గొంతు క్రోల్గఱచి పెల్లున మార్మెడ ద్రెళ్ళ దాఁటుచున్.'

'తనువుఁ గొమ్ము గొరిజఁ గొనకుండ మలఁపుచుఁ
జప్పు డెసఁగఁ దోఁక నప్పళించి
శోణితంబుఁ గ్రోలుచునె నేర్పుమై ఘర్మ
గవిని గవికి నీడ్చు నవసరమున.'

'పొలమరు లంది కూత లిడ భూసురు లన్నదిలోన వార్చి మ్రోఁ
కుల తుద లెక్క చప్పటులు గొట్టి యదల్పఁగ సాహిణీలు మా
వులఁ బఱపంగ, వైచి సెలవు ల్వెస నాకుచుఁ బోయె వృక్షమం
డలికయి తేలుచున్ గుటగుటధ్వని సారె మలంగి చూచుచున్.'

జంతు స్వభావ మింత వింతగా వ్రాయువారు రాయలను మించి యుండరు. ఒక పశువును పులి వేసికొని పోవుట లక్షమంది చూచియుండవచ్చును. ఇట్లు కనులకు కట్టినట్లు చిత్రించగలుగుట యొకమహాశక్తి. ఆ పులితోక పామువలె నున్నదట! యమునియొక్క జాపుటావలె నున్నదట! దానిని చూచి యావు మెడలోని గంట మ్రోగగా పరుగెత్తెను. పులి మీదపడినంతనే యీగలు మూగు దాని గబ్బుమొగ మడచెను. ఆవునోటి పరకలు క్రింద పడెను. కాచుచున్న గొల్లవాడు విసంజ్ఞుడై నేల వడెను. పులి యా మెడ నదిమిపట్టెను. పట్టి యావును మార్మెడగా బెడద్రోచి దాట్లుగా నావుయొక్క కొమ్ము గాని, గొరిజగాని తనకు తగులకుండ గీటుకొనుచు పెద్ద మ్రోతగా తోక యాడించుచు నెత్తురు త్రావుచునే గుహకు లాగికొనిపోవుచుండెను. అప్పుడు పొలమరులు బొబ్బలు పెట్టిరి. స్నానము చేయుచున్న బ్రాహ్మణులు చప్పటలు చరచి యదల్చిరి. రౌతులు గుఱ్ఱములతో పులివైపుకు పరుగెత్తిరి. పులి భయపడి యావును వదలి గుర్రు గుర్రు మనుచు, పెదవులను నాకుచు, వెనుకకు తిరిగి చూచుచు వెడలిపోయెను. మూడు పద్యములలో నీ విచిత్రమైన సంఘటనమును జరిగిన యైదారు విషయములచేత కనులకు గట్టినట్లు వ్రాయుట యొక విలక్షణమైన కవితాశక్తి. అది యందరికి చేతనగునది కాదు. ఈ యావు వధచేత యజ్ఞమున కంతరాయము జరిగెను. దీనికి ప్రాయశ్చిత్తము ఖాండిక్యుడే యెరుగును, ఖాండిక్యునివద్దకు బోయి ప్రాయశ్చిత్త మడిగి రావలయును. ఆ ఖాండిక్యుడు తనకు విరోధి. కాని కేశిధ్వజుడు హరిణాజినోత్తరీయుడు, నిరాయుధుడునై ఖాండిక్యునివద్దకు పోయెను. ఖాండిక్యుని యొక్క యనుయాయులు కేశిధ్వజుని రాక ననుమానించిరి. ఎందుకు వచ్చెనో తెలిసికొని తన రాజ్య మడుగు మనిరి. ఖాండిక్యు డట్లు చేయలేదు. ప్రాయశ్చిత్తము చెప్పెను. అతడు పోయి యజ్ఞమును సాంతము చేసికొని గురుదక్షిణ యిచ్చుటకు ఖాండిక్యునివద్దకు వచ్చెను. ఖాండిక్యుని యనుయాయులు చతురర్ణవీవృతోర్వీవలయంబు నశేషంబును వేడు మనిరి. ఖాండిక్యు డది యడుగలేదు. కేశిధ్వజుడు

బ్రహ్మజ్ఞాని. అతడు బ్రహ్మజ్ఞాన మర్థించెను. అంత కేశిధ్వజుడు బ్రహ్మవిద్య నుపదేశించెను. ఈ బోధయందుకూడ వైష్ణవమే శ్రీ రాయలవారు బోధించిరి. తరువాత కేశిధ్వజు డతని రాజ్య మతని కిచ్చెను. ఈ కథయందు కృష్ణరాయలు చేసినవి రెండు: పులి పశువును వేయుటలో వర్ణనా శక్తియు, బ్రహ్మవిద్య బోధించుటలో వైష్ణవమత ప్రతిపాదనమును.

విజయనగర రాజులు మొదటి రాజవంశమైన తరువాత వైష్ణవులైరి. బుక్కరాయలనా డద్వైతులు; విద్యారణ్యముని శిష్యులు. శ్రీకృష్ణరాయలనాడు శఠకోపయతి వీరందరికి గురువు. తుదివరకు వైష్ణవమే నిలచెను. ఈ యాముక్తమాల్యదలోని కథలుకూడ ద్రావిడ ప్రబంధములలోని కథలే. ఇది మహావైష్ణవ గ్రంథము. ఇందు విష్ణుచిత్తుడు తదితర మతస్థులను గెలిచెను. ఆ గెలుచుట పట్టి పరమేశ్వరానుగ్రహము. ఈ విష్ణుచిత్తుడు తోటమాలి. మధుర పాండీడు రాజ్యము చేయుచుండగా శైవము మితి మీరిపోవుచుండెను. ఆ కొలువులో గెలిచి వైష్ణవమును స్థాపించుటకు శ్రీ మహావిష్ణువు విష్ణుచిత్తుని మధురకు బొమ్మనెను. అత డిట్లనెను.

'స్వామీ, నన్ను, నిత: పురాపఠితశాస్త్ర గ్రంథజాత్యంధు నా
రామక్ష్మాఖననక్రియాఖరఖనిత్రగ్రాహితోద్యత్కిణ
స్తోమాస్నిగ్ధకరు న్నవద్భవనదాసు న్వాదిగాఁ బంపుచో
భూమీభృత్సభ నోటమైన నయశంబు ల్మీకు రాకుండునే.

'గృహసమ్మార్జనమో, జలాహరణమో, శృంగార పల్యంకికా
వహనంబో, వనమాలికా కరణమో, వాల్లభ్యలభ్యధ్వజ
గ్రహణంబో, వ్యజనాతపత్త్రిధృతియో, ప్రాగ్దీపికారోపమో
నృహరీ! వాదము లేల లేరె యితరుల్ నీ లీలకుం బాత్రముల్.'

ఈ పద్యములయందలి రచనాశిల్పము విచార్యము. విష్ణుచిత్తుడు నిజముగా నపండితుడా? అయినచో నిట్టి దీర్ఘసమాసములతో తన భావమును చెప్పుటను జేయుంచుట యనౌచిత్యము. గృహసమ్మార్జనమో యన్న పద్యము ఫరవాలేదు. ఏలననగా నందులోనున్న మాటలు సంస్కృతములైనను భక్తులు దైనందినముగా జేయు పను లగుటచేత నివి యించుమించుగా దైనందినోపయుక్తములైన శబ్దజాలములు. తరువాత 'అనినఁ దద్భక్తి కెద మెచ్చి యచ్యుతుండు' అనుటచేత విష్ణుచిత్తుడు సహజముగా పండితుడే. వినయాతిశయముచేత తా నట్లు చెప్పుకొనినాడని సమర్థితము కావచ్చును. విష్ణుచిత్తుడు సహజముగా మహాపండితుడైనచో విష్ణువుయొక్క మాహాత్మ్యము తగ్గిపోవును. ఇత డపండితుడైనచో పరమేశ్వరానుగ్రహముచేత శ్రుతువాదమును నిరాకరించె నన్నచో విష్ణుమాహాత్మ్యము మిక్కిలి భాసించును. 'శాస్త్రయోనిత్వాత్', 'అనుపపత్తేర్న' మొదలైన వైయాసికి యెంత పరమేశ్వరానుగ్రహ మున్నను విద్యావిహీనునకు రాదు. తత్త్వము తెలిసి వాఙ్నైపుణిచేత గెలువవచ్చును. కాని యాతలివాడు ప్రయోగించిన శాస్త్ర పంక్తులు తెలియనైన తెలియవలయునుగదా! ఈ పద్యము నందలి యౌచిత్య మెంతగా సమర్థించినను దానియందున్న దీర్ఘసమాస గ్రథనము రసభావౌచిత్య దృష్ట్యా సమంజసము కాదు. కాని యాపద్యము మిక్కిలి గుంఫన సౌందర్యముకలది. రసభావ సమృద్ధములు కాని పద్యములు గ్రథన నైపుణిచేత రమ్యముగా నుండును. వానిచేత సామాన్యులాకర్షింపబడుదురు. కవిత్రయమును, నాచన సోమన్నను, పెద్దన్నగారిని వదలినచో నాంధ్రకవు లందరు పద్యగ్రథన కౌశలవశులుగాని, రసభావానుకూల రచనా రమణీయ శిల్పమార్గగులు కారు. ఈ రహస్యము ధ్వని ప్రస్థానవేత్తలకు మాత్రమే తెలియును.

ఈ గ్రంథము పెద్దన్నగారు వ్రాసిరని యొక యపప్రథ కలదు. ఆ యపప్రథ నానాటికి మాసిపోవుచున్నది. ఈ నాడు దానికి స్థితియే లేదు. రాయలవా రసమర్థుడు కాడు; అపండితుడుకాడు. ఇంత గ్రంథము తనపేర వ్రాయించుకొనునంత భీరువు కాడు. ఉత్ప్రేక్షోపమలు జాతి పెంపెక్కగా రసికు లౌననగా మదాలసచరిత్ర వ్రాసినవాడు; భావ ధ్వని వ్యంగ్య సేవధిగా 'సత్యావధూప్రీణనము' రచించినవాడు. శ్రుతులనుండియు, పురాణములనుండియు, నుపసంహితల నుండియు నేర్చి 'సకల కథాసార సంగ్రహము' గుంఫించినవాడు. అందుచేతనే నీ కాంధ్రభాష యసాధ్యమా యన్నాడు భగవంతుడు. పైగా శ్రీకృష్ణరాయనికి తెలుగుబాసయందు ప్రేమ యెక్కువ. తెలుగు బాసలో ఆయన మహాపండితుడు. గ్రంథ మంతయు నాంధ్రభాషా మహార్ణవ మథన జనిత రత్నములేకాని వేరు కావు.

ఈ గ్రంథమునందు మరియు కొన్ని విశిష్టతలు కలవు. అచ్చముగా నది వైష్ణవ గ్రంథము. శ్రీరాయలవారు పరమ వైష్ణవుడు; శ్రీ తిరుపతి వేంకటేశ్వరస్వామి భక్తుడు. ఎంత భక్తు డనగా కలలో కన్పడిన యాంధ్ర విష్ణువు 'నీ కలవేంకటపతి యిష్టమైన వే ల్పగుట.' తాను కోరిన యాముక్తమాల్యదా గ్రంథము వెంకటపతికే యంకితము చేయుమన్నాడు – 'ఒక్కొక్క సంకేతముగా కత డరయ న్నేఁగానే'. మూర్తిభేదమే తప్ప యా వేంకటేశ్వర స్వామియే యీ యాంధ్రవిష్ణువని యా భగవంతుడే చెప్పికొనెను. ఈ రహస్యము శ్రీకృష్ణదేవరాయల వారికిఁ తెలియదా? తెలిసికూడ తిరుపతి వెంకన్నకే కృతి యిచ్చెను.

ఒక్కొక్క జీవున కొక్కొక్క మూర్తి యిష్టము; ఒక్కొక్క సిద్ధాంత మిష్టము. అది జీవలక్షణము లోనిది. పరమ వైష్ణవుడైన శ్రీకృష్ణరాయలు కావ్యాదియందు నిత్యజీవులైన యనంతుని, గరుత్మంతుని విష్వక్సేనుని ప్రార్థించి, విష్ణుపంచాయుధములను వర్ణించి, పన్నిద్దరాళ్వారులను స్తుతించెను. ఇంత వైష్ణవ ప్రపత్తి ప్రదర్శించిన యాంధ్రకావ్య మిం కొక్కడు లేదు, ఉన్నను ఆముక్తమాల్యదను మించలేదు.

ఈ కావ్యమునందు మరియొక క్రొత్త విషయము ఆశ్వాసాంతముల యందలి గద్యము. ఆంధ్ర కవు లందరు గద్యము వచనములో వ్రాసినవారే. గద్యమన్న శబ్దమునకే వచనమన్నది రూఢార్థము; ఈ యాముక్తమాల్యదా గ్రంథములో గద్యము లన్నియు పద్యములే. ప్రతి గద్య పద్యము

ఇది కర్ణాట ధరాధృతి స్థిరభుజాహేవాక—.
ఇది భూమండన కొండవీడు ధరణీభృద్దుర్గ—,
ఇది పాత్రప్రహరేశ్వర ప్రభృతి బంహిష్ఠోత్కలానీక—
ఇది సింహాచల దంభకేసరి పదాభిష్టార్చనా—,
ఇది యంధ్రోక్తి యథార్థనామ యవనాసృక్పూర్ణ—
ఇది నైరామన యావనావనిధరాహీనాభ్ర—
ఇది నీలాచల నీలచేలక సుభద్రేందీవరా—

ఈ రీతిగా నారంభించబడును. ఇది యొక విలక్షణత యీ కావ్యమునం దున్నది. ఈ సర్వ పద్యములు శ్రీకృష్ణరాయలయొక్క పరాక్రమాతిశయములనే వర్ణించును. శ్రీకృష్ణరాయలు గొప్ప యహంకారియని చారిత్రకులు చెప్పుదురు. ఆ లక్షణము సర్వ మీ గ్రంథమునం దున్నది. మనుచరిత్రములో లేని శ్రీకృష్ణరాయల వర్ణనలు దీనిలో నున్నవి. ఆ పద్యము లన్నియు శ్రీకృష్ణరాయల యొక్క స్వోత్కర్షాపాదకములే. నిజమున కంతటి మహాప్రభువు తన్ను గురించి చెప్పుకొనినది స్వోత్కర్షగా భావించుట తప్పు. అది యథార్థమైన విషయము.

ఈ కావ్యముపేరు విష్ణుచిత్తీయము. కాని శ్రీకృష్ణరాయలే దీని నాముక్తమాల్యద యని పిలిచికొనినాడు. సర్వాశ్వాసాంతములయందు నాముక్తమాల్యద నాశ్వాసము — ఆద్యము, ద్వితీయము, తృతీయముననిచెప్పికొనినాడు. విష్ణుచిత్తుడే పన్నిద్దరాళ్వారులలో మొదటివాడు. ఆయనను పెరియాళ్వా రందురు. ఈ విష్ణుచిత్తుని కూతురు ఆండాళమ్మ. ఆమెకు మరియొక పేరు గోదాదేవి. అరవములో చూడికుడుత్తాళ్ అని యందురు. ఈమె తన తండ్రి పూదోటలో పూలుకోసి దండకట్టి యది తాను కొప్పులో పెట్టుకొని దానిని స్వామి కిచ్చుచుండెడిది. ఈ స్వామి శబరి యెంగిలి మెతుకుల కలవాటుపడినవాడు. ఉపభుక్తమైన మాల్యమును స్వీకరించుటలో నాశ్చర్యమే మున్నది? ఆ శబరి ముసలిది కనుక తన కానాదేకపత్నీవ్రత మున్నది కనుక మానివేసెను కాని, గోదాదేవి నెందుకు వదలిపెట్టును? ఈమెను పెండ్లియాడెను. ఈయమ్మవారి కథ యైదారేడాశ్వాసములలో నున్నది. మొదటి నాల్గాశ్వాసములకు నీకథకు సంబంధము లేదు. ఐనను గ్రంథమునకు నాముక్తమాల్యద యనియే పేరు పెట్టుకొనెను. అందుచేత గోదాదేవి కథయందు శ్రీకృష్ణరాయల కెంత ప్రీతియో తెలియుచున్నది.

ఈకథలో శ్రీకృష్ణరాయలు మాలదాసరికథ నిమిడ్చెను. విష్ణుచిత్తుడు తనకూతు తనుగ్లాని కత్యంత దుఃఖితుడై తన దుఃఖము తనయూరి గుడిలోని దేవునికి చెప్పెను. అప్పరమేశ్వరుండు తచ్ఛాందసంబునకు మందస్మితంబుచేసి మాలదాసరికథ చెప్పెను. మాలదాసరికథ పరమేశ్వరుడే విష్ణుచిత్తునకు చెప్పెను. సాక్షాద్విష్ణుమూర్తియే చెప్పిన కథ యెట్లుండును? జగన్నాథముగా నుండును.

కథ వేయి విధముల చెప్పవచ్చును. నన్నయ్యయు, పెద్దన్నయు నిగూఢార్థములు వెనుకపెట్టి సామాన్యపాఠకునికి హృదయంగమముగా నుండుటకు కథ చెప్పుదురు. తిక్కన ప్రసంగచాతురి దీపింప నుక్తి ప్రత్యుక్తి వైఖరీ సమేతముగా కథ చెప్పును. మరికొందరు కథాగత వర్ణనాంశములు రమ్యముగా చేసి కథావస్తువు దీపింపజేయుదురు. శ్రీకృష్ణరాయ డొక్కడే కథలో జరిగిన విషయము కన్నులకు కట్టినట్లు వ్రాయగలడు. ఆయనగారి యీవిద్య మాలదాసరి కథయందు కైలాస శిఖరము నంటినది. ఇట్టి కథానిర్వహణము పరభాషలయం దుండదు. ఈ కథానిర్వహణము నందు శ్రీకృష్ణరాయలయొక్క లోకమునందలి పరమాల్ప విషయములనుకూడ పరిశీలించుట, తాను యుద్ధభూములను దర్శించుట, తనయొక్క తెలుగుభాషమీది ప్రౌఢాధికారము, తన మహావైష్ణవ ప్రపత్తి — యీ గుణము లిన్నింటియొక్క పరమ ప్రౌఢ మనోహర సమాహారస్థితి యీకథ. ఈ కథ యాంధ్రసారస్వతము హిమాలయ పర్వతమైనచో నిది యొకమహాశిఖరము.

చెప్పరాని కులమువాడు విష్ణుభక్తు డొకడు కురుంగుడి యను దక్షిణాది గ్రామమునకు మూడు యోజనముల దూరపు బల్లెలో నివసించుచుండును. అతడు దినదినము కురుంగుడికిపోయి బ్రాహ్మీవేళలయందు మంగళ కైశికితో స్వామిని స్తోత్రము చేయుచుండును. అతడు తోలు చొక్కాయు, టోపీయు, శంఖచక్రాలవలె నున్న చెవుల పోగులు, దీపస్తంభము, చిటితాళము మొదలైనవి ధరించి ప్రతిదినము కురుంగుడికి పోవును. అత డానం

డాశ్రువు లుప్పొంగ ప్రొద్దు తిరుగువరకు తాండవ మాడును. పానవట్టము నుండి వెలికి వచ్చు నీ రెవరిచేతనో పోయించికొని త్రాగును. తన తంబురా దండె సాచి దాని మీద ప్రసాదము గ్రహించి తినిపోవును. ఇట్లు దినదినము గడుచుచుండగా నొకనాటిరాత్రి ఒకపెద్దపిల్లి తమ గూటిలో చేరగా కోళ్లు కూసెను. మాలదాసరి తెల్లవార వచ్చె ననుకొని బయలుదేరెను. దారిలో మరులుతీగ త్రొక్కెను. తిరిగిన చోటే తిరిగి తెల్లవారువరకు నొక నిర్మనుష్యమైన యడవిలో పోవుచుండెను. అతడు పోవు చున్న ప్రదేశము పాడు పడినయూరు. అంతయు పొత్రే నుత్తరేను కసింద కోరింద పొదలు, పడిపోయిన గరిసెల క్రింది కలుగులలో జిక్కిపోయిన పందికొక్కులు, చిగిరింత పెరిగిన పాడునూతులు, చీమలు కంచెల వెంట వడ్లగింజలు లాగగా వాన కురిసి మొలచిన నాము, మీసాలాడించు బక్కచిక్కిన పిల్లులు - ఇట్టి నేలలో పోవుచుండెను. అతని కాళ్ళనిండ యుత్తరేని ముళ్లు, పల్లేరుకాయలు గ్రుచ్చికొను చుండెను. అతని కొక చోట నొకపెద్ద మఱ్ఱిచెట్టు కనిపించెను. ఆ చెట్టు రెండు క్రోసులదూరము వ్యాపించి యుండెను. ఆచెట్టు మీద నొక బ్రహ్మరక్షస్సున్నదని జనులు చెప్పుకొందురు. దానికి దూరముగా తొలగిపోదురు. ఇతడు దానిప్రక్క నొకకాలిత్రోవ చూచి యది యేదో దారి యనుకొని దానివద్దకు పోయెను. ఆనేల యంతయు కశ్మలముగా నుండెను - పుఱ్ఱెలు, మాంసము, పండ్లతో గీకిన బొమికెలు, దారి యిరుప్రక్కల నీగలు మూగుచున్న పచ్చి తోళ్లు, గాలిలో నెగురుచున్న వెంద్రుకలు, మనుష్య శరీరావయవముల కొరకు పోరాడుచున్న పెద్దపులులు మొదలైనవి. ఇట్లుండగా కుక్కలు పైనుండి యెవ్వరో కొట్టుదురని భయముతో బొమికె లెత్తుకొని పారిపోవుచున్నవి. చెట్టుకొమ్మలపైన వ్రాలిన గ్రద్దలు కొమ్మల నెవరో కదిలించుటచేత నెగిరిపోవుచున్నవి. దెబ్బ తిని రొండిమీద చేతులుపెట్టి కూయి వెట్టుచు కోతులు పారిపోవుచున్నవి. ఆచెట్టుమీద నొకచోట కనిపించును. మరియు నది కనిపించదు. ఇది యంతయు మాలదాసరి చూచెను. దీనిపైన నేదో పిశాచ ముండెనని గ్రహించెను. ఇంతలో నా బ్రహ్మరక్షస్సు కనిపించెను. వా డొక మనుష్యశవమును గోచిగా పెట్టుకొనెను; నల్లగా నుండెను; ఎఱ్ఱని దుప్పటి కప్పుకొనెను. వాని మొగము కోరలతో, గడ్డముతో నేనుగు తల పైన క్రిందకు క్రింద పైకి త్రిప్పిన ట్లుండెను. నోటినిండ చొంగ. పెద్ద మీసాలు గడ్డము మెడలో ప్రేవులు జందెములుగా వేసికొనినవాడు; పెద్దపొట్ట, పెద్దబట్టతలవాడు. వాడు మాలధాసరిని చూచెను. చూచి పారిపోకుమని మీదికి దూకెను. పూర్వము మాలదాసరి సైన్యములో పనిచేసెను, అందుచేత బెదరక యెదురు తిరిగెను. కొంతసేపిద్దరును యుద్ధము చేసిరి. దాసరి బ్రహ్మరక్షస్సును తన్ని దూరముగా పారిపోవుచుండగా రక్షస్సు తన భార్యలను పిలిచి యందరును వానిని పట్టుకొని మఱ్ఱిచెట్టువద్దకు లాగి వానిని కట్టివేసి 'నన్నింతబాధ పెట్టిన నిన్ను వింతగా వధించి నీ నెత్తురు త్రావుదు' ననెను. అప్పుడు మాలదాసరి యింక ప్రయోజనము లేదని యిట్లనెను. 'ఓయీ! రాక్షసుడా! నిన్ను దేవతలైన గెలువలేరు. నీకు నేను వడ్డించుకొన్న యన్నమను. నీతో నేను పోరితి ననగా ప్రాణరక్షణకై యెవరైన నట్లుచేయుదురు. నాకు శరీరముపై నాసలేదు. నా యీ నశించిపోవు దేహమువలన నొక ప్రాణి సంతసించుట నా కిష్టమే' అని శరీరనశ్వరత్వమును గూర్చి కొంత యుపన్యసించెను. బ్రహ్మరక్షస్సు 'ఓయీ! మా కీచదువు లన్నియు వచ్చును. ఈ చదువులు మాటాడి మమ్ము మెప్పించలేవు'; అనగా దాసరి 'ఓయీ, నీవు సర్వజ్ఞుడవు; నేను హీనకులజుడను; నీతో మాటాడగలనా? నా దొకప్రార్థన: నా దొకవ్రత మున్నది. ఈ ప్రాంతముల నున్న కురుంగుడి వామనదేవుని నేను నిత్యము నాడి పాడుదును. ఈ వ్రతము పాలించి నీవద్దకు వత్తును. తరువాత నీవు నన్ను తిను'మనెను. అనగా నా రక్షస్సు దరహసిత వానిచెక్కిలిమీద కొట్టి 'లెస్స పండించితివోయి దాసరీ! ఎప్పుడురా నీవు దాసరివైనది. దారులు దోచి దోచి నిన్నకదా! ఏ రాజ్యపునరుడు సిద్ధాన్నము వదలిపెట్టును? ఏ రాజ్యపు నరుడు మాట నిలబెట్టుటకు చచ్చుట కోర్చును? చాలు చాలు పో పొ'మ్మనెను. దాసరి చెవులు మూసికొని నారాయణా యని వానిని నమ్మించుటకు అనేకములైన యొట్లు పెట్టుకొనెను. దేనికిని రక్షస్సు సమ్మతించలేదు. అప్పుడు దాసరి యిట్లనెను. 'నేను తిరిగి రాకపోయితినేని విష్ణువుతో మరియొక వేల్పు సమానముగా చెప్పిన పాతకి నౌదు'ననెను. అప్పుడు రక్షస్సు విశ్వసించి వానిని వదలిపెట్టెను. మాలదాసరి కురుంగుడికి పోయి స్వామికి మ్రొక్కి తన కిన్నరమీద స్తుతి ప్రబంధములు పలికి యసత్యభీతిచేత రక్షస్సువద్దకు వచ్చి 'ఓయి రాక్షసుడా! ఇదిగో వచ్చితిని. నన్ను పంపునప్పుడు 'ఏచరణమ్ము లేయుదర మేయుర మేశిర మేకరంబు లీ వాచరణమ్ము లాయుదర మాయుర మాశిర మాకరంబులం' జూచుకొను'మనెను. రాక్షసు డాశ్చర్య పోయెను. కొండంత మేనితో దాసరికడకు వచ్చెను. వానిబట్టతల మీద నెండ తళతళలాడుచుండెను. అతడు వచ్చి దాసరికి ప్రదక్షిణము చేసి వాని పాదములు తన తలమీద

పెట్టుకొని యి ట్లనెను. 'ఓయీ, నీ సత్యము ముందు తపస్సు లెందుకు? నీవు మహానుభావుడవు. ఓయి, కురుంగుడినంబి, కృపావలంబి, నీకెవ్వరు సాటి,' యనెను. ఇద్దరు కౌగిలించుకొనిరి. దాసరి వాని దయవలన తన వ్రతము చెల్లెనని ప్రశంసించెను. 'ఓయీ వాగ్దానముల కేమి? కష్టముగా దొరకిన యన్నము నెవడు వదిలిపెట్టును? నీవు మహానుభావుడవు. నీవు వదలిపెట్టి నన్ను కృతకృత్యుని చేసితివి. ఇంక నన్ను భుజింపు' మనెను. అనగా రాక్షసుడు 'ఎట్టెట్టూ! దయమాలి యి ట్లన వచ్చునా? నే నిట్టి తిండి యెన్నాళ్ళనుండి తినుచుంటిని. ఎవడో మహానుభావుడు వచ్చును. నన్ను రక్షించును అని కదా! చివరికి ఏమనుచున్నావు? నీవంటి భాగవతులు నా పాపము తొలగించనిచో మరి యెవ్వరు తొలగింతురు? పరుసవేది గొడ్డలిని బంగారము చేయును; బ్రాహ్మణ వధ మాచరించిన కత్తినైన బంగారము చేయును. నీవు నన్ను రక్షించవలయును' అనెను. అనిన దాసరి యతని యభిప్రాయము తెలిసికొన నడిగెను. అపుడు రాక్షసుడు తన పాపమును తొలగించుమనెను. 'భగవంతుడు పాపమును హరించును. భాగవతులు చేయలేరా! నేను పూర్వజన్మలో నొక బ్రాహ్మణుడను. నా చేసిన చెడ్డ చేతలవలన నిట్లైతిని. నీ వీనాడు కురుంగుడిలో పాడిన పాట ఫలితము నా కిచ్చితివేని, నా యీ జన్మ తరించు' ననెను. అది విని దాసరి 'అరె! ఒక రోజు పాట ఫలము కాదు. ఒక చిటిక కాలపు పాట ఫలమైన నీయ' ననెను. 'అమ్మయ్యో! పాట ఫలమే, అది యీ శరీరమును రక్షించుకొనుటకా! ఓయి, బ్రహ్మరాక్షసుడా, దిక్పాలుర శరీరమెత్తి బిచ్చపు దేహము లెత్తి, సింహమై పురుగై, యేనుగై దోమై, రాజై దాసరై, సోమాసియై మాలవాడై నీవు నేను ఎన్నిసార్లు పుట్టితిమి కామయ్యా, భక్తులము కాముగాని! ఈ మేను జల్లెడలోని నీరు; చెలది నేసిన బట్ట; ఘుణాక్షరము; కప్పుర మిచ్చి యుప్పు కొనుమందువా?' అనిన రాక్షసుడు 'గోసంగి! ఈనాటి పాటలో సగమైన నీవే' యనెను. అతడు దానికి నొప్పుకొనలేదు. పాతికపా లిమ్మనెను. అతడదియు నీలే ననెను. అప్పుడు రాక్షసుడు వాని పాదములపై పడి యీ ప్రభాత సమయమ్మున పాడిన చరమగీతమైన నిచ్చి ప్రసన్నుండ వగు మనెను. మాలదాసరి పరమ దయార్ద్రుండై యట్లే కానిమ్మని వానిని లేవనెత్తెను. లేవనెత్తి 'కైశికీ గానఫలమ్ము నే నెరుగను. ఆ ఫలము పరమేశ్వరాధీనము. దేని కెంత ఫలమో ప్రపన్నుల కేమి తెలియును? నిన్ను భగవంతుడ రక్షించు నూరడిల్లు' మనిన నన్నోరిమాట నోరన యుండ

'స్నిగ్ధ త్రిభాగ ముండిత శిరశ్శిఖతోడ
హిమధవళోపవీతములతోడఁ
బుణ్యపడ్డ్వి తయోర్ధ్వపుండ్ర వల్లులతోడఁ
దులసికాబ్జ స్రగావళులతోడఁ
గౌపీనకటిసూత్ర కాషాయయుగితోడ
జలపూర్ణ శుభకమండలువు తోడఁ
బాణిస్థ దివ్య ప్రబంధ సంపుటితోడ
నుత్తర వాక్పూర్వకోక్తితోడఁ

బసిఁడి జిగితోడ బ్రహ్మవర్చసము వొల్చు
భాగవతలక్ష్మితో ధూమపటలినుండి
వెడలు శిఖవోలె నమ్మెను వెడలి చూడఁ
జూడ వైష్ణవుఁడై నిల్చె సోమశర్మ.

ఇది మాలదాసరి కథ. ఈ కథయే పరమ రమణీయమైన కథ. అత డితడు మాటాడుకొనుటలో, నుక్తి ప్రత్యుక్తికావైఖరిలో పలుకుబళ్ల సొగసు లెన్ని యున్నవో చదివి తెలిసికొనవలయును. పలుకుబడి రెండు విధములు. లోకమునం దన్న మాటలు యథాతథముగా గ్రహించి పద్యములందు గడుసుగా పొదుగుట. ఇది తమ శక్త్యనుసారము పలుకవులు చేయుదురు. మహాకవులయిన తిక్కన్నవంటివారు, నాచన సోమన్నవంటివారు గడుసుగా పొదుగుదురు. తక్కిన కవులు పలుచపలుచగా సంతరించుకొందురు. లోకములోని గడుసు పలుకుబళ్లు గడుసుగా పొదిగినచో గొప్పగానే యుండును. కాని సామాన్యములైన భావము లుక్తివైచిత్ర్యముచేత లోకోత్తరముగా భాసింపజేయుట శ్రీకృష్ణరాయని రచనలో నొక విశేషము. వి. స.

**కృష్ణమూర్తిశాస్త్రి, ప్రతాప** (1900 - 1948): వీరు వైదిక బ్రాహ్మణులు; ఆత్రేయ సగోత్రులు; ఆశ్వలాయనసూత్రులు; వీరితండ్రి సుబ్బయ్యగారు. వీరి స్వగ్రామము గుంటూరుజిల్లా బాపట్ల తాలూకాలోని తిమ్మరాజుపాళెము.

కింకవీంద్ర ఘటా పంచాననాది బిరుద విభ్రాజితులగు తిరుపతి వేంకటకవులలో నన్యతరులైన చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రులుగారియొద్ద వీరు వ్యాకరణాదిసహిత సంస్కృతాంధ్ర భాషా కావ్య నాటక చ్ఛందో విశేషాదికము నభ్యసించిరి. అష్టావధా నాశుకవిత్వాదిశక్తిసహితమగు చక్కని సంస్కృతాంధ్ర భాషాజ్ఞానము వీరికి కలదు. సంస్కృతాంధ్ర భాషాధ్యాపనశక్తియు, సంగీతపాటవముతో గూడిన రామాయణాది కావ్యగానముచే శ్రోతల నుర్రూతలూగింపజాలెడి పౌరాణికతాశక్తియు వీరికి గలదు.

వీరి రచనలు గణపతివిజయము (పద్యకావ్యము), శివస్తోత్రము (ప. కా.), త్యాగరాజు (ప. కా.). అ.వా.శా.

**కృష్ణమ్మ, తిరుమల బుక్కపట్టణము :** చిన్ననాడే భర్త గతించుటచేత తండ్రియు, ఆత్మకూరు సంస్థాన పండితులునైన బుక్కపట్టణం బుచ్చి వెంకటాచార్యులుగారివద్ద సంస్కృతమును జ్యోతిశ్శాస్త్రమును చదివి ఈమె అద్భుత పాండిత్యమును సంపాదించి చాలమంది విద్యార్థులను, మేనల్లుండ్రను పాఠప్రవచనాదులచేత పండితులను చేసిన విదుషీమణి. బు. అ.

**కృష్ణరావు, మంజులూరి :** ఈయన స్వస్థలము కృష్ణజిల్లాలోని బందరు. ఈయన ఆర్వేల నియోగి. ఈయనకు నాటక ప్రదర్శనమునం దభిరుచియు, అభినివేశము నత్యధికము. ఈయన అహోరాత్రములు నాటక మందిరమందే యుండి నాటకప్రదర్శనములకై నటులను గూర్చుచు, వారికి శిక్షణనొసగి ప్రోత్సహించుచుండువాడు.


చిత్రము 133.
మంజులూరి కృష్ణరావు

ఈయన అవివాహితుడగుటచే కుటుంబ పోషణ భారము లేకపోయినను కొందరు యువకులను గూర్చుకొని నాటక ప్రదర్శనభారమునే యెక్కువగా వహించెడివాడు. ఈయన కింగ్లీషు విద్యాపరిజ్ఞానముకాని, ఆంధ్ర సంస్కృతసాహిత్యజ్ఞానముకాని లేకున్నను ఔచిత్యముతో సరసముగా తనపాత్రను నిర్వహించువాడు. రంగస్థలముమీద నిండుగా నాకర్షకముగా నుండెడి దీయన విగ్రహము.

ప్రారంభమున బందరులో రాయల్ థియేటరులో చిలకమర్తి లక్ష్మీనరసింహంగారి గయోపాఖ్యానమును, ప్రసన్న యాదవమును, తిరుపతి వెంకటకవుల పాండవోద్యోగమును ఆడెడి దినములలో వానిలో ఈయన శ్రీకృష్ణపాత్ర ధరించెడివాడు. వేదం వెంకటరాయశాస్త్రిగారి ప్రతాపరుద్రీయమున యుగంధరుని పిచ్చివాని పాత్రను నిరుపమానముగ గట్టి నాటకకర్తను గూడ మురిపింపజేసినాడు. ఇచ్ఛాపురపు యజ్ఞనారాయణగారి 'రసపుత్రవిజయ' నాటకము పోటీలో పాల్గొని ఈయన రాయల్ థియేటరు కంపెనీవారి 'ఠాకూరు దుర్గాదాసు' పాత్రకు సువర్ణపతకమును పారితోషికముగా పొందగలిగిరి; తరువాత ఏలూరులో మోతే నారాయణరావుగారి నాటక సమాజములో మృచ్ఛకటిక నాటకప్రదర్శనములో 'శర్విలకుని' పాత్ర రమణీయముగా నిర్వహించెను. ఈయన రంగస్థలమున పద్య మర్థమగునట్లు, భావప్రకటనతో, రసవంతముగా, మితమైన రాగముతో చదువువాడు. శి. రా. శా.

**కృష్ణరావు, ముట్నూరి (1879 - 1945):** వీరి స్వస్థలము మచిలీపట్టణము. జిల్లా మునసబు ఉద్యోగము చేసిన నాగభూషణముగారికి ద్వితీయకళత్రమునందు అమలాపురములో వీరు జన్మించిరి. వీరు పుట్టిన నాల్గవ రోజుననే తల్లిని, ఆరవ యేట తండ్రిని గూడ కోల్పోయిరి. అప్పటినుండి వీరి సంరక్షణభారము పినతండ్రి రామస్వామిగారు వహించిరి. కృష్ణరావుగారిని ముత్తవ తల్లి పెంచినది.

కృష్ణరావుగారు మెట్రిక్యులేషనువరకు మచిలీపట్టణము హిందూ హైస్కూలులోను 1896 లో యఫ్. ఏ. నోబులు కళాశాలలోను చదివిరి. శ్రీ రఘుపతి వెంకటరత్నం నాయుడుగా రప్పుడు నోబులు కళాశాలలో అధ్యాపకులు. చిన్ననాటినుండి పవిత్ర జీవనమునందు, ఆధ్యాత్మిక చింతనయందు ఆసక్తిగల కృష్ణరావుగారిని నాయుడుగారినుము నయస్కాంతమువలె నాకర్షించిరి. వారి ముఖ్యశిష్యులలో వీరొకరైరి. కాని మెడలో జందెమును గూడ విసర్జించు అనుష్ఠానిక బ్రాహ్మమతావలంబి మాత్ర మెన్నడును కాలేదు.

విద్యార్థిదశలో వీరి కాంగ్లభాషా సాహిత్యములందమితమైన మక్కువ యుండెడిది. బ్రహ్మసమాజ ప్రార్థన సమావేశములందు వన్నె చిన్నెలు గల వాక్య విన్యాసముతో అలవుగా పెద్ద పెద్ద 'సెర్మనులు' ఇచ్చుచుండెడివారు. 1898 నుండి 1902 వరకు చెన్నపట్టణమున నుండి చదివినప్పుడు కూడ సొంత క్లాసులు వదలి, ప్రిన్సిపాలు మిల్లరు షేక్స్‌పియరు నాటకోపన్యాసములు మిగుల నాసక్తితో బి. యే. తరగతిలో వెనుకప్రక్కచేరి వినుచుండువారు. యఫ్. ఏ. పరీక్షలో తుదకు కృతార్థులు కాలేకనే పోయిరి.


చిత్రము 134.
ముట్నూరి కృష్ణరావు

చెన్నపట్టణములో ఉన్న కాలమున బిపిన్‌చంద్రపాలు గారి 'న్యూ ఇండియా' పత్రిక కృష్ణరావుగారికి నిత్యము మననగ్రంథమైనది. ఆయన స్వదేశీ దీక్షా ప్రవృత్తితో 1903 లో మచిలీపట్టణము తిరిగి వచ్చి, కృష్ణాజిల్లా సంఘము పక్షమున పెట్టిన కృష్ణాపత్రికయందు సహాయ సంపాదకులుగా చేరిరి. తరువాత 1905 నుండి వారే కృష్ణాపత్రికకు ప్రధానసంపాదకులుగ నియుక్తులయిరి.

వంగదేశ విభజనాందోళనపు రోజులలో కృష్ణరావు గారు కొంతకాలము బిపిన్‌చంద్రపాలుగారితో కలిసి వంగదేశమున సంచారము చేసిరి. ఆ కాలములోనే వారు శ్రీ అరవిందఘోషు మున్నగు మహనీయుల గోష్ఠులందు సాక్షిగా పాల్గొనుచుండెడివారు. స్వాతంత్ర్యసంపాదనకు బాంబులు, రివాల్వరులు విని యోగింపబడుచుండిన ఆ కాలములో కృష్ణాపత్రికలో వారి వ్రాతలు చాల తీవ్రధోరణిలో సాగుచుండెను. అందుచే ఒకానొకసంవత్సరములో ప్రభుత్వపు టొత్తిడి వలన జిల్లా సంఘము వీరి సంపాదకత్వమును తాత్కాలికముగా నిలుపుదల చేయవలసి వచ్చెను. తరువాత జిల్లాసంఘము ఎత్తివేయబడి కృష్ణా పత్రిక పూర్తిగా వీరి యాజమాన్యము క్రిందికి వచ్చినది. వారి ప్రధాన వ్యాసములకు మహోన్నతమైన ప్రతిష్ఠ యుండెడిది. వారి వచనశైలి తత్ప్రతిభాజన్యమైన వినూతన సృష్టి.

దేశస్వాతంత్ర్యోద్యమపు వివిధ ఘట్టములలో ఆంధ్ర దేశీయుల కుత్తేజము కల్పించుచు కృష్ణా పత్రిక ద్వారా కృష్ణరావుగారు నిర్వహించిన పాత్ర యసాధారణమైనది. సంఘసంస్కరణ, స్వదేశీవ్రత ప్రచారములకు వీ రెంతగనో దోహదము చేసిరి. అవినీతిని మోమోడక ఖండించి వీరు మాననష్టపు దావాలను ధైర్యముతో నెదుర్కొన్న సందర్భములు కలవు. రవీంద్ర కవిచంద్రుని కవితా తత్వమునుగూర్చి కృష్ణా పత్రికలో వెల్వడిన సమీక్ష లనుపమానమైనవి. ప్రహ్లాదుడు చెప్పిన 'చదువులలో మర్మమెల్ల' తెలిసికొన్న మహనీయత వారి ఉద్బోధలలో ప్రస్ఫుటించుచుండెడిది.

శ్రీ అరవిందయోగి పుదుచ్చేరినుండి 'ఆర్య' పత్రిక ద్వారా వెలువరించుచు వచ్చిన రచనల ప్రభావము కృష్ణరావుగారి చింతనాపటిమ నెంతగనో సుసంపన్న మొనరించినది. కాని వా రేయేకసిద్ధాంతమునకును కట్టుపడిపోక తమ యిష్టదైవమగు 'సాక్షిత్వమే' తమ కేడుగడ కాగా గాంధీమహాత్ముని అహింసాసందేశమున కనితర సాధ్యమైన భాష్యములు చెప్పి, 'కృష్ణరావు కంటిలో ఆధ్యాత్మిక తేజ మున్న'దని వాక్రుచ్చిన మహాత్ముని దృష్టి కెక్కిరి. కాని పదిమందిలోకి రాకుండ మరుగున నుండి పోనిచ్చుగించు ప్రకృతి వారిది. కృష్ణా పత్రికద్వారా మాత్రమే తాము వెల్లడియగుచు 'మౌన ముద్రాలంకారులు'గా వారు విచిత్రమైన జీవితము నడపిరి. ఆ మౌన ముద్రను ఛేదించుకొని పొంగి పొరలి వచ్చు అపార వాగమృతఝరిని సేవించు భాగ్య మత్యంతసన్నిహితులగు ఏ కొలదిమందికో మాత్రమే లభించెడిది. శాసనోల్లంఘనోద్యమమున కారాగృహవాసమట్టి భాగ్యవంతుల సంఖ్య నించుక వృద్ధిచేసినది. వా రెందరికో గురుప్రాయులైరి. కృష్ణాపత్రిక ఆఫీసులో వారి గోష్ఠీచక్రాన్ని కవులు 'దర్బా'రని పిలుచుకొని, శ్వేతకిరీటధారులగు 'గురుగ్రంథ సాహిబుజీ'గా వారిని కీర్తించుకొనిరి. ఈ ఘట్టములోనే కృష్ణరావుగారు 'లో వెలుగు'లను వ్యాసపరంపరను పత్రికలో ప్రకటించి, వేదాంత పరమరహస్యములను వెన్నముద్దలుచేసి ఆంధ్రలోకమున కందించిరి. ఎప్పటి కప్పుడొక విలక్షణమైన నిత్యనూతనత్వము వారి వాక్కులలో ప్రకాశించుచుండెడిది. అపురూపమైన వ్యక్తివిశేష మాయన.

క. వెం. రా.

**కృష్ణశాస్త్రి, అద్దేపల్లి** (1846 - 1907): వీరి జన్మస్థలము కృష్ణాజిల్లా, దివితాలూకాలో చేకుపల్లియను గ్రామము. తండ్రి అద్దేపల్లి శివావధానిగారను ఘనాంత స్వాధ్యాయి. ఈయన కైదుగురు కుమారులు. అందరును విద్వాంసులు ; అందు కృష్ణశాస్త్రిగారు తృతీయులు.

ఇంగ్లీషు నేర్చుకొనుటకై అన్న ధవళేశ్వరములో ప్రవేశపెట్టగా ఆ చదు విష్టము కాకపోవుటచే వీరు ధవళేశ్వరమునుండి విజయనగరము పారిపోయి అచ్చట అప్పన భొట్ల గోపాలశాస్త్రిగారి వద్ద చాలకాలము శుశ్రూషచేసి సాహిత్యములోను తర్క వ్యాకరణములలోను పాండిత్యము సంపాదించిరి. గోపాలశాస్త్రిగారు గొప్ప మంత్ర శాస్త్రవేత్త ; దక్షిణకాళీ ఉపాసకుడు. కృష్ణశాస్త్రిగారు లోకవిఖ్యాతమైన తంత్రశాస్త్ర ప్రావీణ్యము పొందుటకు ప్రథమ కారణము గోపాలశాస్త్రిగారి శుశ్రూషయే. కృష్ణశాస్త్రిగారు వ్యాసంగముచేయని శాస్త్రములలో కూడ వారితో చర్చచేయుట కెల్లరును భయపడు చుండిరి. గణపతి, బాల మున్నగు ఉపాసనలలో వీరి బల మున్నట్టు పండితుల విశ్వాసము. వీరు పాదుకాంత దీక్షాపరులై మూడు మాసములలో ప్రస్థానత్రయము చదివిరి. అంత త్వరలో చదివిన శాస్త్రములో కూడ వీరిప్రజ్ఞ యాశ్చర్య జనకముగ నుండెను.

తూర్పుగోదావరిజిల్లా రాజోలు తాలూకా గోపాల పురములో ఉప్పలపాటి జానకమ్మగారను క్షత్రియసతి విజయనగరాధీశ్వరుల నడిగి పండ్రెండుగురు పండితులను

తీసికొనివెళ్ళి తన గ్రామమునకు సమీపమున పొడగట్ల పల్లిలో ఒక్కొక్క పండితునకు ఒక యిల్లు, నాలు గెకర ముల భూమి యిచ్చి పండితుల నట సభక్తికముగా నిలబెట్టి నది. అట్లు ఆ జానకీపురాగ్రహారములో స్థిరపడిన పండితు లలో కృష్ణశాస్త్రిగారొకరు. జానకమ్మగారు గోపాలశాస్త్రి గారికి మాత్రము విశేషముగా భూమి నిచ్చిరి. గోపాల శాస్త్రిగారు తాము చనిపోవునప్పటికి తమకున్న రొక్క మునంతను, అయిదెకరముల భూమిని కృష్ణశాస్త్రిగారికి సంక్రమింపజేసిరి. గోపాలశాస్త్రిగారు ములికినాటివారు. కృష్ణశాస్త్రిగారు వెలనాటివారు. ఐనను పుత్రునివలె ఆయనయే అపుత్రకులైన గురువుగారికి అపరకర్మను చేసిరి.

ప్రస్తుతము మహాప్రసిద్ధిలో నున్న అన్నవరములో క్రీ.శ. 1892 ప్రాంతమున కృష్ణశాస్త్రిగారు సత్యనారాయణ ప్రతిష్ఠ చేసినారు. అప్పటికి అన్నవరము క్షేత్రముగా సువిదితము కాలేదు. మంత్రశాస్త్ర విషయములను విదేశీ యులు కూడ ఆయనవద్ద తెలిసికొనుచుండిరి. జర్మనీలో ప్రచురించబడిన పుస్తకాల పట్టికలోని జగన్మోహన మంత్ర మును గూర్చిన యొక పుస్తకముపేరు చూచిన ఆంధ్రదేశ పండితు లొకరు దానికొరకు జర్మనీకి వ్రాయగా దానిని అద్దేపల్లి కృష్ణశాస్త్రిగారివద్ద సంపాదించి ప్రతిని వ్రాసి కొని తిరిగి వారికి పంపివేసితిమని సమాధానము వచ్చినది.

శాస్త్రిగారు చాలకాలము గోపాలపుర సంస్థాన పండితు లుగ నుండిరి. పురాణము చెప్పుటలో వీరికి విచిత్రమైన ప్రజ్ఞ యుండెను. ఒక్కొక్క శ్లోకమునకు 108 అర్థములు కూడ చెప్పుచుండుట వీరి పురాణపద్ధతిలోని విశేషము. పండితులను, పామరులను కూడ మెప్పించుశక్తి వీరి కుండెను.

సంస్కృత భాషలో ఆయన రచించిన గ్రంథము లెన్నియో కలవు. వీరు సత్యనారాయణ వ్రతవిధానమును విచిత్రపద్ధతిలో వ్రాసి ముద్రించిరి. రామాయణములోని ఒక శ్లోకమునకు నూరు రీతుల వ్యాఖ్యానము వ్రాసి కాశీ పండితుల యామోదము నొందిరి. ఏకశ్లోక వ్యాఖ్యాన మని యా గ్రంథమునకు పేరు. అలంకారముక్తావళి వ్యాఖ్య రచించి వీరు అలంకారశాస్త్రములో తమ యసా ధారణ వైదగ్ధ్యమును చాటిరి; తర్కశాస్త్రములో 'తర్కామృతతరంగిణి' యనుగ్రంథమును రచించిరి. ఇది యముద్రితము. జ. పు.

**కృష్ణశాస్త్రి, హొసకోట** (క్రీ. శ. 1870 - 1928): వీరు బెంగుళూరు జిల్లాయందలి హొసకోటలో జనన మందిరి; బెంగుళూరు వెస్‌లేయన్ మిషన్ హైస్కూలు లోను, సెంట్రల్ కాలేజిలోను చదివి మదరాసు యూని వర్సిటీ బి. ఏ. పరీక్షలో కృతార్థులైరి. ఆ సంవత్సరమే శాసనపరిశోధనశాఖ కార్యాలయమున డాక్టరు హుల్‌షు దొరకు సహోద్యోగిగా ప్రవేశించి, 1908 లో దక్షిణ మదరాసు మండలముయొక్క అసిస్టెంటు ఆర్కియలాజి కల్ సూపరింటెండెంటు పదవి నధిగమించి, వీరు 1920 లో ఆ శాఖకు ముఖ్యాధికారి పదము నధిష్ఠించిరి.

ఆదినుండియు వీరికి శాసన పరిశోధన మనిన కుతూ హలము మెండు. సంస్కృతమునను, ద్రావిడభాషలయం దును మంచి పాండిత్యము గలిగియుండుటచే ఏ భాష యందలి శాసనముల వైనను వీరు సులభ ముగా అవగాహన చేసికొనగలిగియుం డిరి. వీరిశాసనవిమర్శ లన్నియు శాసన పరి శోధన విషయమున వీరికి గల శ్రద్ధకు, ప్రామాణిక బుద్ధికి నిదర్శనములై, దక్షిణ భారతదేశ చరిత్ర నిర్మాణమునకు ఉప కారకములైనవి. వీరు 1909 మొదలు 1919 వరకు 'దక్షిణ హిందూదేశ శాసనములు' అను రెండవ సంపుటమున నైదవభాగమును, మూడవ సంపుటమున మూడవభాగ మును ప్రకటించిరి; 1907 - 1912 సంవత్సరముల 'ఆర్కి యాలజికల్ సర్వే ఆఫ్ ఇండియా' వార్షిక నివేదికలలో విజయనగర రాజ వంశములు నాలుగింటికిని సంబంధించిన విపులములైన చక్కని వ్యాసములను ప్రకటించిరి; 'ఎపి గ్రాఫియా ఇండికా' అను గవర్నమెంటు త్రైమాసిక పత్రికకు వీరు కొంతకాలము సంయుక్త సంపాదకులు, తరు వాత సంపాదకులు అయిరి. వీరు రచించిన చారిత్రిక శాసన విమర్శవ్యాసము లనేకము కలవు. వానివలన వీరివిమర్శన పటిమ, చారిత్రికవిషయసమన్వయ పద్ధతి విశదము కాగలదు.



చిత్రము 185.
హొసకోట కృష్ణశాస్త్రి

వీరు 1916 లో 'సౌత్ ఇండియన్ ఐకొనాగ్రఫీ' అను పేర ఆంగ్లభాషలో దక్షిణ భారతదేశమునందలి స్త్రీ పురుష దేవతావిగ్రహములను గూర్చి గ్రంథమును రచించిరి.

వీరు ప్రశస్తమైన తమ శాసన పరిశోధన కార్యమున కభిజ్ఞానముగా 1912 లో రావుసాహెబ్ బిరుదమును, 1920 లో రావుబహదూర్ బిరుదమును బడసిరి. గ. సు.

**కృష్ణస్వామయ్య, అల్లాడి** (క్రీ. శ. 1883-1953): వీరు నెల్లూరు జిల్లా పుదూరు గ్రామములో బీదకుటుంబమున జన్మించిరి. వీరి తండ్రి ఏకామ్ర శాస్త్రి తన కుమారుని ఇంగ్లీషు చదివింపదలచి 1891 వ సంవత్సరమున సకుటుంబముగ మదరాసుకు తరలివచ్చెను. కృష్ణస్వామయ్య పెద్దినాయకన్‌పేట మధ్యమ పాఠశాలలోను, చర్చ్ ఆఫ్ స్కాట్లెండు మిషన్ కళాశాలలోను చదివి 1899 డిసెంబరులో మెట్రిక్యులేషన్ పరీక్షయం దుత్తీర్ణు డయ్యెను. ఆయన పదునైదవ యేట తండ్రి హఠాత్తుగా చనిపోవుటచేత అన్న పోషణములోనికి వచ్చెను. ఆయన 1901లో యఫ్.ఏ. పరీక్షలోను, మదరాసు క్రిస్టియన్ కళాశాలలో చేరి చదివి 1903 లో బి.ఏ. పరీక్షలోను ఉత్తీర్ణుడై వెనువెంటనే ఆ కళాశాలయందే చరిత్రోపాధ్యాయుడుగా నియమితుడయ్యెను; ఉపాధ్యాయత్వమును సాగించుచునే ఆయన న్యాయశాస్త్ర కళాశాలలో చదివి 1905లో బి. ఎల్. పరీక్షలో కడతేరెను; అంతనుపాధ్యాయత్వము నుజ్జగించి పి. ఆర్. సుందరయ్యరుగారివద్ద జేరి న్యాయవాద వృత్తియం దనుభవము గడించి 1907 లో మదరాసు హైకోర్టు న్యాయవాదిగ జేరెను; 1920 నాటికి మదరాసునందు ప్రముఖ న్యాయవాదు లనబడినవారిలో నొక్క డయ్యెను. వాస్తవమునకు ఆయన ద్రావిడాంధ్ర దేశములందలి జమీన్‌దారు లందరికిని న్యాయశాస్త్ర విషయమున సలహాదారుడుగా నుండెను. మైసూరు ప్రభుత్వమువంటి ఇరుగు పొరుగు ప్రభుత్వములును న్యాయశాస్త్ర సమస్యల పరిష్కారమునం దాయన సాయమపేక్షించెడివి. 1928 డిసెంబరులో ఆయన మదరాసు రాష్ట్రమునకు అడ్వొకేటు జనరల్ అయి 1944 వరకు ఆ పదవియందే యుండెను. ఇంత దీర్ఘ కాల మా పదవియం దుండినవారు ఇంకొక్కరు లేరు.



చిత్రము 136.
అల్లాడి కృష్ణస్వామయ్య

1935 నాటి ఇండియాచట్టము ననుసరించి 1937 లో స్థాపితమైన ఫెడరల్ కోర్టులోను, సుప్రీం కోర్టులోను రాజ్యాంగసంవిధానచట్టమునకు సంబంధించిన ప్రతిముఖ్యాభియోగమునందును వాదించి ఆయన రాజ్యాంగ సంవిధాన చట్టము విషయమున దాదాపు పరమ ప్రామాణికుడుగా పరిగణింపబడెను.

న్యాయమూర్తిపదవి పలుమా రాయన కీయబడినను దానిని వలదని త్రోసిపుచ్చి న్యాయవాదవృత్తియందే ఎక్కువ మక్కువ చూపెను.

ఆయన సంవిధాన సభ (కాన్‌స్టిట్యూయెంటు అసెంబ్లీ)లో సభ్యుడుగా నియమింపబడెను. చిత్తుసంవిధానమును సిద్ధముచేయుటకై ఏర్పడిన సభలో ఆయన చేసిన కొన్ని యుపన్యాసములు ఎన్నికైనవి. సంవిధానమునుగూర్చి సర్ ఐవర్ జెన్నింగ్సు చేసిన ఆక్షేపణలకు ఆయన రైట్ ఆనరబుల్ శాస్త్రి పేర నేర్పడిన స్మారకోపన్యాసములు చేసిన సందర్భమున సమాధాన మిచ్చెను. కాని ఆ యారు ఉపన్యాసములు పూర్తిచేయుటకు దురదృష్ట వశమున ఆయన అనారోగ్య మడ్డుతగిలినది. ఆయన యిచ్చిన రెం డుపన్యాసములును 'కాన్‌స్టిట్యూషన్ అండ్ ఫండమెంటల్ రైట్స్' అను పేరుతో ప్రకటితములైనవి. అయన 1953 లో దివంగతుడయ్యెను. ఆయనకు భార్య వెంకట లక్ష్మమ్మవలన ముగ్గురు కొడుకులు, నలుగురు కూతుండ్రు కలిగిరి.

ఆంధ్ర విశ్వవిద్యాలయము, మద్రాసు విశ్వవిద్యాలయము, చిదంబరము నందలి మీనాక్షికళాశాల, రామకృష్ణ మిషన్ విద్యార్థి నిలయము, మైలాపూరు సంస్కృత కళాశాల, శారదా విద్యాలయము, సౌత్ ఇండియన్ నేషనల్ అసోసియేషన్ వంటి ప్రజాసంస్థలకు ఆయన కావించిన దానములు సుప్రసిద్ధములు. ఇవి యటుండ, ఆయన వందల కొలది విద్యార్థులకు ప్రతిసంవత్సరము సాయము చేయుచుండువాడు. 1926 లో ఆయన చేసిన పరోపకార కార్యములకు, సాంఘిక సేవకు మెప్పుగ ఆయనకు కైజర్‌హింద్ పతకమును, 1930 లో దివాన్ బహద్దర్ బిరుదమును, 1932 లో నైట్‌హుడ్‌ను లభించినవి. కాని చివరి గౌరవ బిరుదమును చిత్తు సంవిధానమును తయారుచేయ వలసిన సందర్భమున ఆయన పరిత్యజించెను. మా. వెం. రం.

**కేతన, మూలఘటిక**: ఈతడు కౌండిన్య గోత్రోద్భవుడు. మారయ ఇతని తండ్రి; సంకమాంబ తల్లి; ప్రోలనార్యుడు అన్న; దండనాథ భండారు కేతన బావమరది. తిక్కనకు సమకాలికుడగుటచే ఇతడు 1200-1280 లలో నున్నవాడని చెప్పవచ్చును.

దశకుమార చరితము, విజ్ఞానేశ్వరీయము, ఆంధ్ర భాషాభూషణము అను మూడు గ్రంథములు ఇతడు

రచించినవి కానవచ్చుచున్నవి. కేతన వేగిదేశమందలి వెంటిరాల (వె్రిరాల) గ్రామాధిపతిగా నుండి అనంతరము నెల్లూరు చేరి, తిక్కనసోమయాజి సాహచర్యమున ప్రసిద్ధి కెక్కినాడు. కేతన బహుభాషా కోవిదుడు; వివిధశాస్త్ర పారగుడు; సంస్కృతాంధ్రములలో రచనలు చేసినవాడు. సంస్కృతములో దండి విరచిత దశకుమార చరితమును హృద్య గద్య పద్యములలో నాంధ్రీకరించి కేతన తిక్కనకు కృతియిచ్చినాడు; అభినవదండి బిరుదము నొందినాడు.

ఆచార్య దండి మూడు కృతులు సంస్కృతమున రచించి 'దండినః పదలాలిత్యమ్' అను కీర్తిగొన్నవాడు. ఏడవ శతాబ్దిలో దక్షిణదేశమున వర్ధిల్లిన యీతడు జగత్ప్రసిద్ధమైన గుణాఢ్యుని 'బృహత్కథా' విధానము మనసునం దుంచుకొని దశకుమార చరితము రచించినట్టు ప్రతీతి. ఇప్పుడు లభించు దశకుమార చరితములోని పూర్వ పీఠికయు, ఉత్తర పీఠికయు అన్యకవికృతములు. ఎనిమిది యుచ్ఛ్వాసములు మాత్రము దండి రచించినది.

కేతన సంస్కృత దశకుమార చరితములోని కథలను వర్ణనాంశములను కొంతవరకు తగ్గించి రసవత్కథాభాగ ములను ఈ షణ్మాత్రము పెంచి రచించినాడు. మాతృక వచన రూపమున నున్నది. కేతన దానిని పంద్రెం డా శ్వాసముల గ్రంథముగా రమారమి 1625 పద్య గద్యము లలో గూర్చెను. తుదియాశ్వాసములోని కథ మాతృకకు కొంత భిన్నముగా నున్నది. అపహారవర్మ చరితములో గణికా వృత్తాంతము సంక్షిప్తమైనది. నిద్రాళు సుందరీ వర్ణనము సంగ్రహించి, విశ్రుత చరితమున కేతన నీతులు పెంచినాడు. ఎట్లైనను కథాధోరణికి అవరోధము కలుగ నీయలేదు.

కేతన కవిత్వములో అన్వయకాఠిన్యము లేదు; జటిల సమాసములు లేవు. ధారాశుద్ధితో మార్దవము వెల్లివిరియు చుండును. కొన్ని తావులయం దీతడు స్వతంత్రముగా రసోచితముగా పద్యకల్పన చేసినాడు. కేతన తిక్కన యెడ విశేషాదరము కలవాడు. అదివరలోనే సంస్కృ తాంధ్రములలో ఏవో రచనలుచేసి పేరుగన్నవాడు. ఆ రచనలు కాని, ఆంధ్రీకరించినాడను ప్రతీతికల 'కాదం బరి' కాని కానరావు.

విజ్ఞానేశ్వరీయము : యాజ్ఞవల్క్య మహర్షి సంగ్రహిం చిన స్మృతికి విజ్ఞానేశ్వరుడు 'మితాక్షరి' యను వ్యాఖ్య రచించినాడు. ఈ స్మృతిలో ఆచార, ప్రాయశ్చిత్త, వ్యవ హారకాండలు కలవు. మితాక్షరి వ్యాఖ్య సుప్రసిద్ధమైనది. నేటికిని వారసత్వము, విభాగము, స్త్రీ ధనము మొదలగు వానికి సంబంధించిన అభియోగములలో 'మితాక్షరి' నాధారముగా గొని న్యాయస్థానములు తీర్పు లిచ్చు చున్నవి. కేతన ఈ స్మృతిని పద్యరూపమున ఆంధ్రీకరించి తన గ్రంథమునకు విజ్ఞానేశ్వరీయము అని పేరు పెట్టి నాడు. ఇయ్యది ధర్మశాస్త్రమయినను, పద్యములు ధారా ళముగా నడచుచు విషయమునెడ కుతూహలము పురి కొల్పుచుండును. ఇది మూ డాశ్వాసముల గ్రంథము. పూర్వ కాలమున ధర్మగ్రంథముల ననువదించుట సాహసకృత్య మనవలెను. పూర్వాంధ్రకవులు ధార్మికజీవనములక్ష్యముగా వ్యవహరించువా రనుటకు కేతనకవి దృష్టాంతము.

ఆంధ్రభాషా భూషణము : కేతన ఈపేరిట వ్యాకరణ మును 190 పద్యములలో రచించినాడు. ఇది ఆంధ్రభాషలో ప్రథమస్వతంత్రాంధ్ర వ్యాకరణము. కేతనకు పూర్వము వ్యాకరణము లున్నవా అను విషయము నిర్ధారించుట కష్టము. ఉన్నపక్షమున కేతన వానిని జూచియుండడు.

'ఆంధ్ర భాషకు క్రొత్తగా లక్షణము చెప్పుచున్నాను; పరిహసింపవలదు. మీకు సమాధాన మిచ్చుట కష్టము' ఇత్యాది వాక్కులతో కేతన విద్వాంసులకు నమస్కరించి వ్యాకరణము నారంభించినాడు. నూతనముగా శాస్త్ర గ్రంథమును ఆరంభించునపుడు ఏ కాలపు విద్వాంసు లైనను తోడనే అంగీకరింపరు. కేతన అన్నిటిలోను ధీరు డనిపించును. శి. శం. స్వా.

**కేసరి, కె. యన్.** (క్రీ. శ. 1875 - 1953) : గుంటూరుజిల్లా, ఒంగోలు తాలూకా యందలి ఇసమన మెట్లూరు వీరి గ్రామము. వీరి అసలుపేరు కోట నరసింహం. అది చిన్ననాడు మద్రాసు చేరి చదువుకుంటున్న రోజు లలో 'నరకేసరి'గా మార్పుచెందెను.

వీరు జన్మించిన బహుకొద్ది కాలముననే తండ్రి చని పోయెను; క్రమముగా తమ జీవనోపాధికి పూర్తిగా మేనమామగారి కుటుంబముమీద నాధారపడుట కిష్టము లేక, తా మా గ్రామములో మరొక వృత్తి నవలంబించి జీవనము గడపలేక బాల్యమునందే తల్లిని వెంటబెట్టుకొని యిప్పటివలె ప్రయాణ సౌకర్యములు లేని ఆ రోజులలో కాలి నడకను పయనించి మద్రాసుకు చేరిరి; తన మంచి తనము వలన పలువురు దాతల, బంధువుల, స్నేహితుల సహాయముతో విద్యాభ్యాసమున కుపక్రమించిరి. కాని ఆర్థిక స్థిమితము లేని పరిస్థితులలో చదువుసాగినదికాదు. జీవయాత్రకై శ్రీ కన్యకాపరమేశ్వరి ధర్మ వైద్యశాలలో స్వల్పవేతనముమీద వీరు ఉద్యోగమునకు కుదిరిరి. వీరి తల్లి సంపన్నవైశ్య గృహములలో వంటపని చేయుచుండెడిది. కాని మొదటినుండి స్వతంత్ర జీవితము పట్ల ఆసక్తి, ఆత్మ విశ్వాసము కలవారగుటచే వీరు చేయుచున్న నౌకరిపై

ఏవగింపు కలిగి దానిని మానుకొని స్వంతముగా వ్యాపారముచేయ నుద్దేశించిరి. దాని ఫలితముగనే వీరిపట్ల అభిమానము కల స్నేహితుల ప్రాపకముతో కేసరికుటీరము స్థాపించబడి లోధ్ర, అమృత, అర్క మొదలగు ఔషధముల తయారీ, విక్రయములు ప్రారంభమాయెను.

అప్పుడు మేనమామ ఉభయ మంగళసూత్రములను తానే చేయించి తన జ్యేష్ఠ కుమార్తె రేపల్లెమ్మ నిచ్చి వివాహము చేసెను. వివాహ మయినప్పటినుండి వీరి వ్యాపార పరిశ్రమ అమోఘముగా కలసి వచ్చెను.

వ్యాపారాభివృద్ధితో బాటు వీరి సిరిసంపదలు వృద్ధి కాజొచ్చెను. వీరు ఎగ్మూరులో స్వంత భవనమును ఏర్పరచుకొని తమ నివాసమును, వ్యాపారమును అచ్చటికి మార్చుకొనిరి; మరికొంత కాలమునకు పూనమల్లి హైరోడ్డునందలి మరింత వసతిగల దివ్య భవనమునకు నివాసమును, వ్యాపార సంస్థను తరలించి స్వంత భవనములో ముద్రణాలయమును, గృహలక్ష్మి కార్యాలయమును నెలకొల్పిరి.


చిత్రము 187. కె. యన్. కేసరి

కేసరిగారికి ప్రజాహితముపట్ల గల ఆసక్తికి ఆ రోజులలో మహిళల దీనావస్థ కొంత కారణము. అందుకనే మహిళా జనోద్ధరణకని క్రీ. శ. 1928 లో గృహలక్ష్మి పత్రికను స్థాపించి స్వీయ సంపాదకత్వము క్రింద నిర్వహింప సాగిరి; పెక్కుమంది విద్యార్థినులకు సహాయము చేసిరి; ఏటేట గృహలక్ష్మి స్వర్ణకంకణ ప్రదానమును ఏర్పాటుచేసి స్త్రీలలో ఉత్తమ కవయిత్రులను, సంగీత సాహిత్యములలోను, చిత్రలేఖనములోను ప్రావీణ్యముగలవారిని సత్కరించ మొదలిడిరి; స్త్రీల కుపయుక్తమయిన 'శారద లేఖలు,' 'గృహలక్ష్మీకంఠాభరణము' వంటి గ్రంథములను ప్రచురించిరి; అనేక శరణాలయములకు, విద్యా సంస్థలకు, మహిళా సమాజములకు భూరి విరాళముల నిచ్చుచుండిరి.

వీరికి గల రాజకీయ పరిజ్ఞానము కొద్దిదైనను ఉత్తమ జాతీయవాదియై గాంధీజీనాయకత్వము ననుసరించి జాతీయోద్యమమును ప్రోత్సహించిరి. మద్రాసు తెలుగు ప్రముఖులలో నొకరై ఆంధ్రోద్యమమునకు కూడ అధికముగా తోడ్పడిరి.

శ్రీ కేసరిగారు కళా ప్రియులు. సంగీతము, చిత్రలేఖనము, నాట్యకళ వీనియందు అభిమానము మెండు. వీరి ప్రోత్సాహ, సన్మాన సత్కారములతో ఉత్తమశ్రేణి నందుకొన్న పండితులు, విద్వాంసులు, చిత్రకారులు, శిల్పులు అనేకులు కలరు.

కేసరిగారి సహాయ, సానుభూతులు అనేకమంది అనాథల జీవిత పురోభివృద్ధికి తోడ్పడినవి. వారికి విద్యార్థులపై అభిమానము మెండు. దానిని పురస్కరించుకొని అనేకుల విద్యాభ్యాసమునకు తోడ్పడుటయే కాక మద్రాసులో తెలుగు బాలబాలికలకు మాతృభాషలో విద్యావసతులకు గాను ఒక లక్ష రూపాయల నిధితో 'కేసరి విద్యాలయము'ల నెలకొల్పజేసిరి. వీరి సహాయ సహాకారములతో ప్రారంభమయిన ప్రజాహిత సంస్థ లనేక మీనాడు అవిచ్ఛిన్నముగా వర్ధిల్లుచున్నవి.

వీరి జీవితానుభవములు అపారములు. అభివృద్ధి కాముకులకు తోడ్పడగలవని వీరు తమ అనుభవములను, జీవయాత్రలోని సంఘటనలను పొందుపరచి 'నా చిన్ననాటి ముచ్చట్లు' అను గ్రంథమును రచించిరి. సి. సి. పు.

**కొండాపురము :** హైదరాబాదుకు వాయవ్య దిశగా 43 మైళ్ళ దూరములో మెదకుజిల్లా కలబగూరు తాలూకాలో నున్న ఒక గ్రామము. ఈ కొండాపురములోను, దీనికి సమీపమునందున్న తేరప్రోలు గ్రామములోను పురాతనపు దిబ్బ లనేక మున్నవి. వీనిలో కొండాపుర గ్రామమునకు దక్షిణముగా ఇంచుమించుగ నరమైలు దూరములో, దగ్గరగా నున్న చెరువులో గలియు చిన్న వాగుసమీపమునం దున్న యొకదిబ్బను హైదరాబాదు పురాతత్వ శాఖవారు త్రవ్వించినారు. త్రవ్వకమునకు తీసికొన్న దిబ్బ సముద్రపు నీటిమట్టమునకంటె 1788 అడుగుల యెత్తునను, చుట్టు నున్న ప్రదేశముకంటె దాదాపుగ 20, 30 అడుగుల యెత్తునను ఉన్నది. ఇంతవరకు ఇక్కడ చాల పరిమితముగా జరిగిన త్రవ్వకములవలననే ఈ కొండాపురము చాల ప్రాముఖ్యము గల ఆంధ్ర-సాతవాహనకేంద్ర మయియుండు ననియు, మెగాస్థనీ సను యవనరాయబారి పేర్కొన్న ఆంధ్ర మహానగరములు ముప్పదింటిలో ప్రాయికముగా ఇది యొకటి కావచ్చుననియు విశ్వసించుటకు తగిన యాధారములు లభించినవి. ఇక్కడ త్రవ్విన త్రవ్వకములవలన చాల పురాతన గృహముల పునాది గోడలు, బౌద్ధ చైత్య శాలలు, స్తూపములు

విహారములు మొదలైన బౌద్ధ నిర్మాణముల శిథిలములు, కుండసామగ్రి, నాణెములు, గాజులు, మట్టి బొమ్మలు మొదలయిన వనేకము బయటపడినవి.

బౌద్ధ నిర్మాణములైన నేమి, వాసగృహములైననేమి అన్నియు చెరువు మట్టి బెందడితోను, వేరువేరు ఆకృతుల, పరిమాణముల ఇటికలతోను కట్టినవి. ఈ యిటికలు నేటి యిటికలంత దృఢముగ నున్నవి. ఒక్కొక్క యిటిక పొడుగు 22 అంగుళములు; వెడల్పు 12 అంగుళములు; మందము 2½ అంగుళములు. వీనిలో కొన్ని 3 అంగుళముల మందముగలవి కూడ నున్నవి. చిన్న గదులు కట్టుటలో 17 అంగుళముల పొడుగు, 8 అంగుళముల వెడల్పు, 2½, 3 అంగుళములు మందము గల ఇటిక లుపయోగింపబడినవి. స్తూప, గజపృష్ఠాకార చైత్యశాలల వంటి వర్తుల నిర్మాణములలోను, ఇండ్ల మూలలలోను ఉపయోగించుటకవసరమైన వేరు వేరు పరిమాణముల, ఆకృతుల ఇటికలు కూడ వాడబడినవి. ఇక్కడి నిర్మాణము లన్నియు శిథిలమగుటచేత గోడలు మాత్రము కనబడుచున్నవి. ఇక్కడ బయలుపడిన చైత్యములును శిథిలమైనవి. నైరృతి దిశను ఒక చైత్యము(స్తూపము)ను, దాని చుట్టు కొన్ని గదులును ఉన్నవి; వీనిలో కొన్ని పది పండ్రెండడుగుల చదరపు గదులు. మరికొన్ని 10 అ. పొడుగు, 8 అ. వెడల్పు గల చతురస్రాకారపు గదులు. వీనికి దక్షిణముగా రెండు గజపృష్ఠాకారపు చైత్యశాల లున్నవి. ఒక చైత్యశాలలో మట్టి స్తూపపు చిహ్నములు కలవు. స్తూపము, దాని చుట్టు గదులు, దగ్గర చైత్యశాలలు ఉండుటవల్ల ఇది బౌద్ధవిహారమై యుండవచ్చునని కొందరు అభిప్రాయపడినారు. గదుల మధ్యనున్న స్తూపము వ్యాసము 19 అడుగులు. మధ్య కారురాతి ముక్కలతో నింపి చుట్టును ఇటిక కట్టు కట్టిన స్తూప మిది. దీని కుత్తరము వైపున వరుసగా ఆరు గదులును, పడుమట ఒకటియు నున్నవి. 4, 5 గదులకు మధ్య 5 అ. 2 అం. వెడల్పు కల దారి కలదు. గదులకు ముందు సన్నని ఇటిక చప్టా యున్నది. ఇది ప్రాయికముగా వసారా నేల కావచ్చునని యూహించుచున్నారు. తూర్పు వైపు కూడ గదు లున్నవి కాని వాని సంఖ్య తెలియుటకవకాశము లేదు. ఈ వైపునున్న గదుల యేర్పాటు ఒక క్రమము ననుసరించి లేదు. ఈ గదులు ఉత్తరపువైపు వానికి సమకోణముగాను లేవు. ఇది యటుండ పడుమటివైపు ఒకటే గది యున్నది. ఈ కారణములవల్ల ఇది బౌద్ధ విహార మగునా కాదా యని కొందరి యనుమానము.

ఈ దిబ్బ పడుమటికొనను ఇటికతోను, సున్నముతోను, చప్టా చేసిన ప్రదేశము మధ్య 15 అడుగుల వ్యాసముకల స్తూప మున్నది. దీని చుట్టు గదులును, చైత్యశాలయు నుండిన ఆనవా ళ్ళున్నవి. ఇది మరొక బౌద్ధవిహారము కావచ్చును.

సామాన్యముగా ఇచ్చటి యిండ్లకు నేలమాళిగ లుండుట విశేష లక్షణము. ఇట్టి నేలమాళిగలు ఆరు కనబడినవి. వీనిలో మధ్య అడ్డుగోడ లుండి రెండరలుగా ఏర్పడిన నేల మాళిగలు మూ డున్నవి. నేల మాళిగ లన్నియు బెందడితోను ఇటికతోను కట్టి, అడుగున ఇటిక చప్టా చేసినవి; మరికొన్ని చిన్న రాళ్లు పరిచి చదునుగా చేసినవి. ఇవి 5 అడుగులనుండి 25 అడుగులవరకు లోతు గలవి. వీటిలో వెండి, బంగారు మొదలయిన అమూల్యాభరణములు, ఖరీదుగల ముఖ్యమైన వస్తువులు భద్రపరచుకొనుట పురాతనకాలమునుండి వచ్చుచున్న ఆచారము. ఇక్కడి గృహ శిథిలములలో చాల పెంకులు కనబడుటవలన ఇప్పటివలెనే ఆ పురాతన కాలమునగూడ ఇండ్ల కప్పులకు పెంకు నేయుచుండినట్లు తలంపవచ్చును.

ఈ త్రవ్వకములలో ఇక్కడ రెండు కమ్మరి కొలుములును, వాని సమీపమున కొన్ని నిర్మాణములును కాన్పించినవి. ఈ స్థలము పూర్వము పారిశ్రామిక ప్రదేశమై యుండు ననియు, ఆ నిర్మాణములు గనులనుండి త్రవ్వితీసిన ముడిసరుకును వస్తువులుగ తయారుచేసి విక్రయించువారి అంగళ్లై యుండు ననియు కొందరి యూహ. ఇచట ఈటెలు, నాగటి కర్రులు, కత్తులు, కొడవళ్ళు, తొళ్ళికలు, శూలములు మొదలగు రకరకములైన పనిముట్లు దొరకినవి. వీనిలో అనేకము త్రుప్పు పట్టి చెడిపోయినవి. అయినను వీని ననుసరించి ఆ కాలపువారు తమ జీవితావసరములకు వలసిన పరికరములను ఇనుముతో తయారుచేసికొనుచుండిరని, కమ్మరిపనికూడ విరివిగా సాగుచుండెనని తేలుచున్నది.

ఈ త్రవ్వకములలో దొరకిన మృణ్మయ పాత్రలు — మూకుళ్ళు, చట్టులు, కుండలు, బానలు, జాడీలు, గాబులు మొదలైనవి - రకరకములైనవి, వేరు వేరు పరిమాణములు కలవి, వివిధాకృతులు కలవి అనేకము కాన్పించినవి. చాలభాగ మివి యన్నియు పగిలి ముక్కలైనవి; బాగున్నవి చాల కొద్ది. ఇక్కడ మట్టితో చేసిన 'ధూపార్తులు' కూడ గలవు. ఈ కుండసరకు తీర్పు తీరువలు, వాని నునుపు, రంగు, వానిమీది అలంకార కల్పనలు చూడగా ఆనాటి కుమ్మరి పనివానితనము, అతనికి తన కళలో గల నైపుణ్యము విశదమగుచున్నది. ఈ మృణ్మయ పాత్రలు చిన్నవి 18 అంగుళములు మొదలు 20 అంగుళముల వరకు చుట్టుకొలత (వలయము) కలిగి 7 అంగుళముల ఎత్తు గలవి

మొదలుకొని 9 అడుగుల చుట్టుకొలత కలిగి 3 అడుగుల యెత్తువరకు వివిధ పరిమాణములు కలవి ఉన్నవి. ఇక్కడ దొరకిన మృణ్మయపాత్రలలో అడుగు సన్నము, మూతి అంచు మందము, పొట్ట 9 అడుగుల వలయము కల ఒక పెద్ద గాబుకూడ ఉన్నది. ఈ మృణ్మయ పాత్రలమీద బౌద్ధుల త్రిరత్న సంకేతములు, ధర్మచక్రము, పుష్పములు, కమలములు, పుష్పగుచ్ఛములతోడి పూర్ణకుంభములు, రేఖాగణిత కల్పనలు సామాన్యముగా కానవచ్చును. బౌద్ధుల త్రిరత్న సంకేతము శూలమువలె ముమ్మొనలు తీరి యుండును. మట్టితోను, పెంకుతోను. రాగితోను, గాజుతోను, దంతముతోను చేసిన గాజులు, గాజు ముక్కలు, తాయతులు, నెలవంక ఆకారము కలిగి మట్టితోను పెంకుతోను చేసిన ఒక రకమైన వస్తువులు చాల దొరకినవి. వీనిలో మట్టితోను, దంతముతోను చేసిన గాజులమీద చక్కని చిత్రకల్పనలు కలవు. మట్టితో చేసి ఆవములో పెట్టి కాల్చిన మట్టిపూసలు, రాగితో చేసిన చెవిపోగులు, ఉంగరములు విస్తారముగ దొరకినవి.

ఇక్కడ వైడూర్యముతోను, కురువిందముతోను, స్ఫటి



చిత్రము 188. కొండాపురములో బయలుపడిన మట్టి బొమ్మలు.

కమలములలో కొన్ని అరవిచ్చినవి; మరికొన్ని పూర్తిగా వికసించినవి. ఈ కుండ సామగ్రిలో కొంత ఎర్రమట్టితో తయారు చేసి నునుపు చేసినదేమో, నిగనిగలాడుచు తళతళ మెరయుచున్నది. సాదా కుండలు ఇసుక, మట్టి కలిపి చేసినవి; ఆవములో కాల్చిన పిమ్మట ఇవి కొంచెము ఎరుపు రంగు గలవిగానో, పాటలవర్ణము గలవిగానో తయారయ్యెడివి. కొన్ని పాత్రలు తెల్ల మట్టితో చేసినవి. ఈ మట్టితో చేసిన వస్తువులమీద పలుచగ ఏదో రంగు పూసినట్లున్నది. కొన్ని మృణ్మయపాత్రలు రంగులు వేసి శృంగారించినవి. కముతోను, గోమేధికముతోను, వేరు రకములైన మణులతోను, గాజుతోను, మట్టితోను పలురకములైన ఆకృతులలోను, పరిమాణములలోను చేసిన పూస లనేకము దొరకినవి. కొండాపురములోనే కాక పైఠాను, మాస్కిలలోని త్రవ్వకములలో గూడ పూస లసంఖ్యాకముగ దొరకుటవల్ల పురాతన కాలమున దక్కను దేశమున పూసల పరిశ్రమ విరివిగా సాగుచుండె ననవచ్చును. ఇక్కడ పైని చెప్పినవే కాక బంగారు పూసలుకూడ కొన్ని దొరకినవి. పూసల హారములు, ఇతరాభరణములు

మొదలైన వికట విస్తారము దొరకుటవలన ఆనాటి యిచ్చటివారు అలంకార ప్రియులని, వేనితో తయారు చేసినను ఆభరణములు ధరించుట వారి కెక్కువ మక్కువ యని విశదమగుచున్నది.

ఇక్కడి దంతపుపనివారుకూడ తమ పనిలో చాల నేర్పరులని ఇక్కడ దొరకిన దంతపు వస్తువులవల్ల తెలియుచున్నది. ఒక దంతపుముక్కమీద - ఏనుగుమీద ఇద్దరు మనుష్యులు కూర్చుండినట్లు, ఒకని సాయముతో మరియొక డొక శిశువును, దగ్గర నున్న యొక స్త్రీని బలవంతముగ పై కెత్తుచున్నట్లు - చెక్కిన బొమ్మలు కలవు. బొమ్మలు చాల చిన్నవైనను వాని ముఖములలో భావస్ఫూర్తి తోచుచు, జీవకళ ఉట్టిపడుచు అవి చాల రమణీయముగ నున్నవి.

తెల్లమట్టితో చేసిన బోలుబొమ్మలు ఒక విధముగ చాలగనే దొరకినవి. వీనిలో కొన్నిటికి ఆకుపచ్చరంగు, మరికొన్నిటికి ఎర్రరంగు, ఇంకొక కొన్నిటికి పసుపుపచ్చరంగు వేసియున్నవి. కొన్ని బొమ్మలమీద రంగు వేసిన వ్రేళ్ళ గుర్తులుసైతము కనబడుచున్నవి. ఇక్కడ మరొకరకమైన మట్టిబొమ్మ లున్నవి. ఇవి ఇసుక, మట్టి కలిపి చేసిన పూరా గట్టి బొమ్మలు. ఆవములో పెట్టి కాల్చుటకు పూర్వము వీనికి లేత యెరుపు పూత పూసిన ట్లున్నది. బోలువైనను, గట్టివైనను వీనిలో పలువిధములయిన వున్నవి; కొన్ని మానవాకార ప్రతిమలు. వీనిని రచించుటలో ప్రతిమాకారుడు చూపిన కౌశలము మెచ్చదగినది. వీనిలో స్త్రీ విగ్రహములు, పురుష విగ్రహములు కలవు. అంతశ్శాంతిని సూచించు ప్రశాంత వదన మండలములు, అంతరానంద సూచకమై పెదవులమీద తొలకాడు చిరునవ్వు ఈ కళా రచనలు కొన్నిటిలో గానవచ్చు చక్కని లక్షణములు.

ఈ త్రవ్వకములలో దొరకిన వస్తువులలో అన్నిటికంటె ముఖ్యమైనవి నాణెములు. ఇవి దాదాపు రెండువేల వరకు - అంతకు పైనేమో కూడ - దొరకినవి. వీనిలో పోటీన్ (వేరువేరు పాళ్ళలో వెండి, రాగి కలిపి తయారు చేసిన) నాణెములు, సీసపు నాణెములు, వెండి నాణెములు, రాగి నాణెములుకూడ నున్నవి. క్రీస్తుపూర్వము 37 మొదలు క్రీ. శ. 14 వరకు పరిపాలించిన రోమక చక్రవర్తి అగస్టస్ బంగారు నాణెముకూడ దొరకినది. పోటిన్ నాణెములు 100; 1835 సీసపు నాణెములు ఆంధ్రరాజులవి. వీనికి తోడుగా ఇచ్చట నాణెపు అచ్చుదిమ్మలు కూడ దొరకుటచేత పూర్వ మిది ఆంధ్ర-సాతవాహనుల టంకసాల నగరముగా నుండవచ్చునని పురాతత్వవిదుల యభిప్రాయము. సాతవాహనుల కొన్ని నాణెములమీద బ్రాహ్మీ లిపిలో గౌతమీపుత్ర శాతకర్ణి, వాసిష్ఠీపుత్ర శ్రీపులుమావి, యజ్ఞశ్రీ శాతకర్ణి రాజులపేర్లున్నవి. బంగారు, వెండి నాణెములేకాక అందచందములలో బంగారు కాసుల (నాణెముల)తో దీటువచ్చునట్లు అతి సుందరముగాను, సున్నితముగాను మట్టితో తయారై తూములుపెట్టిన మట్టి కాసులపేర్లు కూడ దొరికినవి. ప్రాయికముగా వీనిని ఆభరణాసక్తులయిన బీదపడుచులు ధరించుచుండి యుండురు. ఇక్కడ దొరకిన నాణెములలో అపూర్వమైనది, అమూల్యమైనది క్రీ. పూ. మూడవ శతాబ్దినాటి బ్రాహ్మీ లిపిలోనున్న సాతవాహనరాజు నాణెము. ఈ నాణెము మీద కొన్ని యక్షరములు పోయినను ఇవి నానాఘాటు శాసనాక్షరములను పోలియున్నందున ప్రాయికముగ నీ రాజు సాతవాహన వంశస్థాపకుడే యని చరిత్ర పరిశోధకుల యభిప్రాయము. ఈ సాతవాహనరాజు నాణెములు సాతవాహనులు దక్కను పూర్వభాగమం దుండినవారనుటకు తోడ్పడుచున్నది.

మరొక విశేష మేమన మాహిషిక వంశమునకు చెందిన రాజుల నాణెములు కొన్ని దొరకినవి. వీరినిబట్టియే ఈ ప్రాంతమునకు పురాతన కాలమున మహిషమండలమని పేరు వచ్చియుండును. ఈ మండలము నేలిన రాజుల ప్రస్తావము వాయుపురాణములోను, మహాభారతములోను గలదు. వీరికి మాహిషికులని పేరు. పురాణమువల్ల మాత్రమే ఇంతవరకు తెలియనైన వీరు వాస్తవముగ ఈ ప్రాంతము నేలిన రాజులేయని, వీరి మహిషమండలము మహారాష్ట్ర, విదర్భ, ఋషీక, కళింగముల కిరుగు పొరుగులనున్న ప్రాంతమని, పూర్వపు హైదరాబాదు సంస్థానములోని దక్షిణభాగము కొంత దానిలో చేరియుండెనని ప్రాచ్య పరిశోధక పండితుడైన మిరాషిగారి అభిప్రాయము. ఇంతవరకు పేరు, వంశము తెలియని ఒక క్రొత్త భూపతి సీసపునాణెము కూడ ఒకటి ఇక్కడి త్రవ్వకములలో దొరికినది. ఈతడు సుమహాగ్రామకరాజు. ఇతడు ఎవరో, ఏ వంశమునకు చెందినవాడో తెలియదు.

ఇంతవర కిక్కడ పరిమితముగా జరగిన త్రవ్వకముల వలననే ఇన్ని క్రొత్తవిషయములు తెలియవచ్చినవి. ఇక్కడి దిబ్బల నన్నిటిని పూర్తిగా త్రవ్వి పరిశోధించినచో ఇంకెన్ని విషయములు తెలియునో. కం. ఉ.

**కొమరగిరిరెడ్డి (కుమారగిరిరెడ్డి)**: ఇతడు కొండవీటి రెడ్డిరాజులలో నొకడు; (చూ: పుట. 320 - 326). విద్వాంసుడు. ప్రతి వత్సరము గొప్పగా వసంతోత్సవములను జరిపించుచుండుట చేత ఈతనికి 'వసంతరాజు' అను పేరు ప్రసిద్ధమయ్యెను; ఇతనికి కర్పూర వసంతరాయ

డనియు నామాంతరము కలదు. ఇతడు సంస్కృతమునందు 'వసంతరాజీయ'మను నాట్యశాస్త్ర గ్రంథమును రచించెను. అయ్యది ఇప్పుడు లభ్యముకాలేదు. కాని యతని బావ మరిదియు, రాజ్యకార్య నిర్వాహకుడును అగు కాటయ వేమారెడ్డి తాను వ్రాసిన శాకుంతల వ్యాఖ్యానమున 'వసంతరాజగు కుమారగిరి ప్రభువు భరత, భోజాదుల మతములను బాగుగ పరిశీలించి 'వసంతరాజీయ'మని తన పేరిట నొక నాట్యశాస్త్ర గ్రంథమును రచించె'నని చెప్పి యున్నాడు. సుప్రసిద్ధ వ్యాఖ్యాతలగు మల్లినాథసూరి, అతని పుత్రుడు కుమారస్వామి సోమయాజి, ప్రబోధ చంద్రోదయచంద్రికావ్యాఖ్యాత నాదిండ్ల గోపమంత్రియు ఈ 'వసంతరాజీయము'ను పేర్కొన్నారు. బి. వెం. ర.

**కోటయ్యదేవర, గరికిపర్తి** (క్రీ. శ. 1861 - 1924): వీరి నివాసస్థలము కృష్ణాజిల్లాయందలి బందరు పట్టణమున గల ఇంగ్లీషుపాలెము. వీరు వీరశైవ జంగమ కులస్థులు; లక్ష్మయ్యదేవర, బసవమ్మ దంపతులకు కలిగిన నాలుగవ సంతానము. కోటయ్యదేవరను తల్లిదండ్రులు హూణ విద్య యందు పట్టభద్రునిచేయించ సంకల్పించుకొనిరి. కాని అది నెరవేరలేదు. కోటయ్యదేవర సంగీతవిద్య యందు ఆపేక్షతో టెంకాయ చిప్పతో ఫిడేలు తయారుచేసుకొని స్కూలుకు వెళ్ళక నిర్జన ప్రదేశములకు పోయి పాడు కొంటూ కాలక్షేపము చేసుకొంటూ చివరకు ఎలాగో లోయర్ సెంకడరీ వరకు చదివి చదువుకు స్వస్తి చెప్పిరి. భాతకరవువల్ల ఊరు వదలి వీరు తమ ఫిడేలు, గాలిపటము మాత్రము తీసుకొని హైదరాబాదుకు కాలి నడకను బయలుదేరి పోయిరి. వీరు ఒక దినము విశ్రాంతి సమయమున అలవాటు ప్రకారము తన ఫిడేలు మీద వాయించుకొంటూ తన ధ్యాసలో తా నుండి పోగా హైదదాబాదు జాగీరుదా రొకరు ఆ దారిన తన బండిలో పోతూ కోటయ్యదేవరగారి దీక్షను చూచి ఆశ్చర్యమంది తనతోకూడ తన దివాణమునకు తీసుక పోయి వీరిని మంచిగవాయిగా తయారు చేయించిరి.



చిత్రము 139.
గరికిపర్తి కోటయ్యదేవర

వీరి తల్లిదండ్రులను కూడ పిలిపించిరి. ఈ జాగీరు దారు రాజగోపాలాచారిగారు. ఈయన పేరుతో ఒక వర్ణమును చేసియుండిరి. ఆ తరువాత నవాబ్ జఫర్ జంగ్ దేవిడీలో ఆస్థాన గవాయిగా నుండిరి. తదుపరి హైదరాబాదు స్టేటు గవాయిగా నేర్పడిరి. అప్పటికి కర్ణాటక సంగీతములోకూడ వీరు మంచి విద్వాంసులైరి. తరువాత వీరు గ్వాలియరు, బొంబాయి మొదలగు పట్టణములకు పోయి తమ హిందూస్తానీ సంగీతమును ఇంకను అభివృద్ధి చేసుకొంటూ హిందూస్తానీ, అరబ్బీ, ఫార్సీ, ఉరుదు భాషలు నేర్చుకొనిరి. అప్పటినుండి తిరిగివచ్చి హైదరాబాదు స్టేటు గవాయిగా స్థిరపడిపోయిరి. తదుపరి వీరి పెద్దన్నగారు వీరిని ప్రోత్సహించి కర్ణాటక సంగీతమందు పరిపూర్ణత నొందుటకుగాను తంజావూరు పంపించిరి. అచ్చట కోటయ్యగారు తన విద్యను పూర్తిచేసుకొని తిరిగి హైదరాబాదు చేరుకొని కొంతకాలము అక్కడనే యుండి 1894 లో దక్షిణాదిని పర్యటన సలిపి అనేక సభలు చేస్తుండగా సియాళ నారాయణస్వామి అయ్యర్, తిరుక్కోడికావై కృష్ణయ్యరు వీరిని వెంటబెట్టుకుని తంజావూరు హెచ్. యస్. సకారాం మహారాజావారి ఆస్థానమునకు తీసికొని వెళ్ళగా మహారాజావారు వీరి వేషమును చూచి మహమ్మదీయు డేమిటి, కర్నాటక సంగీతము పాడుట ఏమిటని ఆశ్చర్యపోయి అయినప్పటికి హైదరాబాదు ఆస్థాన విద్వాంసుడు కనుక కచ్చేరి చేయుటకు అనుమతి నిచ్చిరి. అప్పుడు వారు ఫిడేలుతో మేళవించి మంద్ర మధ్యమ తార స్థాయిలలో పాడిన తీరును చూచి రాజావారు పరమానంద భరితులైరి. మహారాజావారు వెంటనే వీరిని తమ ఆస్థాన విద్వాంసునిగా రిజిష్టరు చేయించి తమ ఆస్థానమున ఉండిపోవలసినదని కోరగా తమ దృఢసంకల్పము నెరిగించి అచ్చట నుండి ఇంకను పర్యటన గావించి శియాళ నారాయణస్వామి అయ్యరు, పట్నం సుబ్రహ్మణ్య అయ్యరు, తోడి సుందరరావు, తచ్చూరి సింగరాచార్యులు, వీణ వైద్యనాథ అయ్యరు, గండికోట గురు సుబ్రహ్మణ్యంగారు మొదలగు అనేక విద్వాంసులవద్ద సర్టిఫికెట్లు సంపాదించి సరాసరి తన జన్మస్థానమైన బందరు పట్టణమునకు చేరుకొని తన విద్యను పలువురకు చెప్పుచు 1896 మార్చి 1 వ తేదీన సంగీత పాఠశాలను నెలకొల్పి వందలకొలది శిష్యులకు విద్యను వెదజల్లి గొప్ప కీర్తిని సంపాదించిరి. వీరు తోట్లవల్లూరు, చల్లపల్లి ఎస్టేట్లకు ఆస్థాన విద్వాంసులుగా ఉండిరి.

మదరాసు గవర్నరు లార్డు అండ్ లేడీ ఆంప్తిల్ 1903 లో బందరుకు వచ్చినప్పుడు వారిపై స్వరజతిపాడి

అప్పటి కప్పుడు బందరు, బెజవాడ మధ్య రైల్వే లైను శాంక్షను చేయించిరి. 1915 లో మదరాసు ఆంధ్ర మహాసభవారు వీరికి 'ఆంధ్రగాయక పితామహ' అను బిరుదును, వీరి పుత్రులకు బంగారు పతకములను బి. యన్. శర్మగారిచే ఇప్పించి గౌరవించిరి. వీ రందరు వీరశైవ జంగములగుటచే 'జంగం కోటయ్య' అను వాడుక పేరు ఏర్పడి పోయినది. వీరు గీతములు, స్వరజతులు, వర్ణములు, కీర్తనలు విశేషముగా రచించిరి. గ. పా. దే.

**కౌసలేంద్రరావు, రామినేని** (క్రీ.శ. 1910-1956) : ఈయన 1910 లో మధ్యప్రదేశ్‌లోని విలాసపూరులో మేనమామ డాక్టరు ఈడ్పుగంటి రాఘవేంద్రరావు గారి యింట జననమందెను. కృష్ణ జిల్లాలోని కొమ్మూరు ఈయన స్వగ్రామము. ఈయన తల్లి రాఘవేంద్రరావుగారి అక్క. ఈయన తండ్రి ఆ గ్రామములో గొప్పరైతు. ఆ గ్రామమునకు మునసబు కూడ. ఆయన చాల చిన్న తనముననే గతించెను. విలాసపూరులో ప్రారంభవిద్య పూర్తిచేసి కౌసలేంద్రరావుగారు గుంటూరు జిల్లాలోని తెనాలి బోర్డు హైస్కూలులో చదివి మెట్రిక్యులేషను పరీక్షయం దుత్తీర్ణులైరి. తరువాత మదరాసులో చదువు సాగించి ఎం.ఏ. పట్టమును పొంది తరువాత లండనుకు పోయి అక్కడ స్కూల్ ఆఫ్ ఎకనమిక్సులో బి. యస్. సి. పరీక్షయందు కృతార్థుడయ్యెను; తరువాత లింకల్న్స్ ఇన్నులో న్యాయశాస్త్రవిద్య నభ్యసించి స్వదేశమునకు వచ్చి నాగపూరు హైకోర్టులో 1935 వ సంవత్సరమున న్యాయవాద వృత్తి నారంభించెను; కొన్ని ఏండ్లకు తరువాత ప్రభుత్వ న్యాయవాది పదవిని అయిదేండ్లపాటు నిర్వహించెను; 1946 లో అడ్వకేటు జనరల్‌గా నియమితుడయ్యెను; 1949 లో నాగపూరు హైకోర్టులో న్యాయమూర్తిపదవియం దధిష్ఠితు డయ్యెను.


చిత్రము 140.
రామినేని కౌసలేంద్రరావు

ఈయన ఇన్‌కంటాక్సు డిపార్టుమెంటుకు న్యాయవాదిగను, నాగపూరులోని ప్రముఖములైన కంపెనీలకు న్యాయశాస్త్రమున సలహాదారుడుగను ఉండెను; నాగపూరు విశ్వవిద్యాలయ కార్యనిర్వాహక సభయందును, అకడెమిక్ సభయందును సభ్యుడై యుండెను; మొట్టమొదటి 'ఫైనాన్సు కమీషను'లో సభ్యుడుగా నియమితుడయ్యెను; రీవా లా రిఫారం కమిటీలోను సభ్యుడైయుండెను; నాగపురమందలి 'న్యూ ఇంగ్లీషు స్కూలు ఎడ్యుకేషన్ సొసైటీ'కి ఈయన చిరకాలము అధ్యక్షుడై యుండి దాని యభివృద్ధికి చాల పాటుపడెను. న్యాయవాద వృత్తియందున్నను ఈయనకు నాగపూరులోని అనేక సాంఘిక, విద్యా సంస్థలతో సంబంధ ముండెను. ఈ విధముగా ఆయన నాగపూరు సాంఘిక, పౌర జీవితమును సుసంపన్న మొనర్చెను.

న్యాయశాస్త్రశాఖ లన్నింటి యందును నిరూఢమైన పాండిత్యముగలవా డీయన. ఈయన దృష్టి విశాలమైనది; హృదయము పక్షపాత రహితము, స్వతంత్రము, న్యాయతత్పరము నైనది. ఈయన కేవలము స్వబుద్ధి కౌశలము చేతను, స్వయంకృషిచేతను అభ్యున్నతిని గాంచినవాడు. ఈయన ప్రవర్తనము తోడివారి ప్రేమాదరణములకు పాత్రమై యుండినది. మో. స.

**క్షేత్రయ్య** : చూ : వాగ్గేయకారులు.

**ఖండకావ్యము - భావకవిత్వము** : ఖండకావ్యమన్న పదానికి సూర్యరాయాంధ్ర నిఘంటువు 'చిన్నకావ్యము, మహా కావ్య లక్షణము లన్నియు లేని కావ్యము' అన్న అర్థాన్ని ఇస్తున్నది. ఇది 'సాహిత్య దర్పణ' కారుని 'ఖండ కావ్యం భవే త్కావ్య స్యైకదేశానుసారిచ' అన్న నిర్వచనాన్ని ఆధారంగా చేసుకొని చెప్పిన అర్థం; అనగా ఖండకావ్యము కావ్యములో ఏకదేశమని తాత్పర్యము. దీనికి ఉదాహరణము మేఘదూతమట. ఈ లక్ష్య లక్షణ సమన్వయం చేస్తే, కావ్య లక్షణము లన్నీ లేకపోయినా స్వయంసంపూర్ణమై, పూర్వాపర నిరాకాంక్షమై, పరిసమాప్తార్థకమై రస పర్యవసాయి కాగలిగిన కావ్యైకదేశము ఖండ కావ్యమని నిర్వచనము చేయవచ్చును. మహాకావ్యంలో కవిభావన బహిర్విషయోపాధికమై, నాయికానాయకాదుల నాశ్రయిస్తుంది. స్వీయానుభూతి అన్యాపదేశముగా ఇతివృత్తానురోధిగా సముచిత పరిణామాన్ని పొందుతుంది. ఖండకావ్యములో కవి భావన అంతర విషయోపాధికమై, ఆత్మనాయకమై, స్వాశ్రయమై ఉంటుంది. అతని అనుభూతి అనన్యారోపితమై తీవ్రంగా పలుకుతుంది. నవ్య కవిత్వంలో ఖండకావ్యమన్న పదము పై అర్థములోనే నియతము కాలేదు. ఆధునికార్థములో ముక్తకము, కులకము, పర్యాయ బంధము వంటి కావ్య భేదాలు కూడా గతార్థము లవుతున్నవి. నాతి దీర్ఘములై ఏకవిషయకములైన పద్య రచనలను ఆధునికులు ఖండ

కావ్యాలుగా పరిగణిస్తున్నారు. స్థూలమైన ఈ నిర్వచనాన్ని అంగీకరిస్తే ఆధునికులు వ్రాసే అనేక కావ్య జాతులను ఇందులో చేర్చవచ్చును. అవాంతర భేదాలను అంగీకరిస్తూ ఖండకావ్య మంటే చిన్న కావ్యమని నిర్వచనము చేయటమే ఇప్పటికి సముచితముగా కనిపిస్తుంది.

ఖండకావ్య మన్నపేరు ఇటీవలనే వ్యవహార రూఢమైనది. దీనికి కారణ మిప్పటి కవులు పూర్వులవలె కాక సుదీర్ఘ రచనలు మాని చిన్నచిన్న కావ్యాలు వ్రాయటమే. ఖండకావ్య రచనా వ్యాప్తికి మూలపురుషుడు గురజాడ అప్పారావు. ఆయన 1905 ప్రాంతాలలో నాటక రచనతో పాటు ఖండకావ్య రచనకు కూడ ఉపక్రమించినాడు. పద్య కావ్యాన్ని నవ్యమార్గాలలో కొత్త ఛందస్సులలో నడప వచ్చునని సూచించి శకకర్త అయ్యాడన్న ఖ్యాతి ఆయనకు దక్కింది. కాని నిజానికి ఆయన ప్రతిభ మరొక కావ్య శాఖకు చెందింది. అతడు గొప్ప నాటక కర్త: ఉద్యమ ప్రవక్త; దూరదర్శి. కాలముతో మారి జీవితాన్ని, సమాజాన్ని నిశితంగా ప్రతిపాదించగలిగిన సమీక్ష్యకారి. ప్రయోగ సాహసమున్న ప్రతిభావంతుడు. తీవ్ర సమీక్షకు లక్ష్యములయ్యే సత్యాలను అనుభవముతో పిండి పలికినా ఆయన కవితా రచనలో బంధచ్ఛాయ కనిపించదు. కాని కొన్ని పంక్తులు మాత్రం అర్థ గౌరవములోనే కాక శిల్ప దృష్టిలో కూడ ప్రౌఢములై సచేతనములుగా ఉంటాయి. అంత మాత్రానికే అతనిని మహాకవి కోటిలో చేర్చడం సముచితం కాదు. అతడు మహాకవి కాకపోయినా ఖండ కావ్య రచనకు ప్రేరకుడు, మార్గదర్శి, శకకర్త.

వస్తు నిర్వహణభేదాన్నిబట్టి ఖండకావ్యాలలో కొన్ని తెగలు కల్పించవచ్చును. కొన్ని వర్ణనాత్మకములు, కొన్ని కథనాత్మకములు, కొన్ని ప్రచారాత్మకములు, కొన్ని గేయములు, కొన్ని భావగీతాలు. వీనిలో చివరి తెగ 1910 కి తరువాతను, 1930 కి లోపుగాను ఆంధ్ర దేశంలో బాగా ప్రచారానికి వచ్చి నిశితమైన సమాలోచనకు, తీవ్రమైన విమర్శకు గురి అయినది. 'భావకవిత్వ' మా రోజులలో గొప్ప గాలి దుమారాన్ని రేపింది. కొత్త ఉద్యమం ఏదైనాసరే కొంత ప్రతిరోధాన్ని ఎదుర్కొ-వలసి ఉంటుంది. మార్పును సంప్రదాయం వెంటనే అంగీకరించదు. కొత్త ప్రయోగాలు కూడా నిరోధాన్ని జయించి సంబాళించుకొని నిలువ గలిగితే సంప్రదాయంగా పరిణమిస్తాయి. నిన్నటి ప్రయోగమే ఈనాటి సంప్రదాయమౌతుంది. భావకవితాఉద్యమం కూడా క్రమంగా జన సమ్మతి పొంది ఒకకవితా శాఖగా అంగీకారాన్ని సంపాదించుకొన్నది.

ఒక కృతిని కావ్య మనిపించే లక్షణాలు కొన్ని. అవి కొన్ని చోట్ల భావ సౌందర్యంగాను, కొన్నిచోట్ల శబ్ద సౌందర్యంగాను, కొన్నిచోట్ల రీతి సౌందర్యంగాను భాసిస్తాయి. కావ్య లక్షణాలన్నీ ఈ మూడు తెగలలో ఒదిగి పోతాయి. ఈమూడు తెగల సౌందర్యాలు సమపాకంలో కలిసి ఒదిగి వచ్చేది కావ్యపు జీవస్థానాలలో మాత్రమే. కవి మనోధర్మ మెంత తీవ్రమై కావ్య జాతికి చెందుతుందో అంత భావతీవ్రత, బుద్ధి ఎంత సూక్ష్మమో అంత శబ్దశుద్ధీ, రీతి వైవిధ్యమూ కావ్యంలో కనిపిస్తుంది. భావకవి మనోధర్మమైన భావతీవ్రత నెక్కువ ఆరాధించేవాడు కనుక తన మనోధర్మం ప్రతిబింబించే కావ్యజాతికి భావకవిత అని పేరు పెట్టెను.

వెనుకటి దీర్ఘ కావ్యాలలో ఒక కథ, దాని అంగ ప్రత్యంగాలు, సన్నివేశాలు, పాత్ర పోషణము మొదలైన వన్నీ కలిసి, ఒక అనుభవాన్ని కల్పించి రసాస్వాదనకు హృదయాన్ని ఆయత్తం చేస్తాయి. కథలోని ఒకానొక సన్నివేశపు అనుభవము పూర్వ కథాపరిచయ బలంచేత, ఆర్ద్రార్ద్రమై, రసపర్యవసాయి కాగలుగుతుంది. పూర్వ కథను చెప్పక ఆ సన్నివేశాన్ని మాత్రమే వేరుగా పృథక్కరించి చెప్పినప్పుడు అది భావగీత మవుతుంది. పాఠకుడు ఆ సన్నివేశాని కుచిత పరిణతి పొందిన చిత్తవృత్తినీ, ఉన్ముఖత్వాన్నీ సంపాదించుకో గలిగితే పూర్వ కథా ప్రసక్తి లేకుండా ఆ కావ్యాన్ని ఆస్వాదించ గలుగుతాడు. శాకుంతలములోని ప్రసిద్ధములైన కణ్వుని నాలుగు శ్లోకాలు చాలా చిత్తద్రావకంగా ఉంటాయి. వానిని వేరుగా తీసి 'కణ్వనిర్వేద' మని వ్రాస్తే అది భావగీత మవుతుంది. అప్పుడది ఖండకావ్యమై, పూర్వాపర నిరాకాంక్షమై పరి సమాప్తార్థక మవుతుంది. దాన్ని అవగాహన చేసుకో గలిగిన శక్తి పాఠకుని మనఃపరిపాకముమీద ఆధారపడి ఉంటుంది. అనూచానంగా వచ్చి మనకు పరిచితమై, సంప్రదాయ బద్ధమైన కథా సన్నివేశాలు మన మనస్సులలో సులభంగా పరిణామాన్ని కల్పిస్తాయి. కాని విషయము కొత్తదైనప్పుడు, అందులోనూ లౌకిక జీవిత సన్నివేశాలకు సంబంధించినప్పుడు దానిని అవగాహన చేసుకోవడానికి సానుభూతి, సహనము ఎక్కువగా ఉండాలి. భావగీతాన్ని చదివేటప్పుడు ఆ సన్నివేశాన్ని చిత్రించుకోగలిగిన హృదయ సంవాదం, ఆవేశ సామగ్రిని అందుకోగలిగిన అర్హత ఉండాలి. ఇట్టి మనోధర్మాన్ని ఆలంకారిక పరిభాషలో సత్వప్రకాశనము గల అంతరంగ మని అంటారు. కవి ఏ మనః పరిపాకంతో, ఏ అనుభవ ఉగ్రతతో, ఏ భావ తీవ్రతతో, కావ్యగానం చేశాడో

తెలుసుకొని కావ్యాస్వాదనకు సిద్ధం కాగలిగిన సహృదయత పాఠకునిలో ఉండాలని భావకవుల వాదం.

భావగీతమే నిజమైన కవిత్వమనీ, మహాకావ్య మన్నది లేనేలేదనీ కొందరి వాదము. మహాకావ్య మన్నది భావ కవితాశాఖకు చెందిన ఖండకావ్యాల సంపుటమే కాని వేరు కాదని వారి ఉద్దేశము. మహా కావ్యములో అయువు పట్టులైన భాగాలన్నీ భావగీతాలనీ, అవే దాని మహత్త్వానికి కారణాలవుతాయనీ వారిఅభిప్రాయము. దీనిలో సత్యము కంటె అభిమానపూర్వకమైన దృష్టి ఎక్కువ గోచరిస్తుంది.

తెలుగులో వచ్చిన భావకవితను సవిమర్శంగా పరిశీలన చేస్తే పైన చెప్పిన లక్షణాలే కాక మరికొన్ని చూడ వచ్చును. భావగీతము ఆత్మానుభవ పూర్వకమైనది. భావాన్ని సూటిగా స్పష్టంగా చెప్పక స్ఫుటాస్ఫుట ప్రతీతితో వ్యక్తంచేసి, అనిర్వాచ్య మనోదశలలోని అనంతానంతచ్ఛాయలను శబ్దశబలిత చిత్రంలో పొదగ డానికి భావ కవి ప్రయత్నం చేస్తాడు. అభిధ, లక్షణ, వ్యంజనలేకాక శబ్దాలకు రంగులు, వాసనలు ఉన్నాయని భావకవి అంటాడు. వానిని గుర్తింపక పోతే భావ కవిత లోని సౌందర్య సమర్పకత్వం అర్థం కాదని భావ కవుల వాదం. కొంత అస్పష్టత భావకవితకు శోభను గూర్చే లక్షణమని వారి విశ్వాసము. సంవేదనకు లొంగక వ్యక్తావ్యక్త ప్రతీతి కలిగిన అనుభూతిని లీలగా, ఛాయగా దానికి తగిన శబ్దాలతోనే వెల్లడి చేయగలమనీ, అందు చేతనే కొంత అస్పష్టత అనివార్యమనీ భావకవులు సమ ర్థించుకుంటారు. సాంకేతికమైన పద్ధతితో పలకడంచేతను, అనుభూతిని కొత్త దృష్టితో, కొత్త నుడికారముతో ప్రకటించడంచేతను సంప్రదాయ రీతులకంటె భిన్నంగా ఉండి, సానుభూతి అభ్యాసము లేని పాఠకునికి అర్థ ప్రతీ తిలో కొంత క్లేశాన్ని కలిగిస్తుంది. కొంత అలవాటు పడితే ఆస్వాద యోగ్య మవుతుంది.

భావకవులుగా ఖ్యాతిని గడించిన వారిలో గణనీయులు దేవులపల్లి కృష్ణశాస్త్రి, రాయప్రోలు సుబ్బారావు, వేదుల సత్యనారాయణశాస్త్రి, అబ్బూరి రామకృష్ణారావు, తల్లా వఝుల శివశంకరశాస్త్రి(స్వామి)ప్రభృతులు. వీరిలో కృష్ణ అచ్చమైన భావకవి. ఆయన 1925 లో 'కృష్ణపక్షా'న్ని విడుదలచేశారు. అప్పటికి తెలుగుదేశంలో బ్రహ్మసమాజపు ప్రభావం వీరేశలింగం, వెంకటరత్నం నాయుడు వంటి వ్యక్తుల ద్వారా యువకులమీద పనిచేసింది. బ్రహ్మ సమాజం వంగదేశములో రాజా రామమోహనరాయలతో ప్రారంభమై రవీంద్రనాథ ఠాకూరువంటి కవుల మన్నన పొంది, ప్రాక్పశ్చిమ సంస్కృతి సమ్మేళన ప్రయత్నానికి పూనుకుంది. ఈ ఉద్యమం సామాజిక సంస్కారాన్నే కాక సాంస్కృతిక పరిణామాన్ని కొంతవరకు సాధించింది. ఆ రోజులలో అది పురాతన సంస్కృతి మీద, సమాజం మీద వచ్చిన తిరుగుబాటు. అది క్రైస్తవ మతమూ, ఆంగ్ల సాహిత్యమూ వంగీయుల దృక్పథంలో తెచ్చిన మార్పు. దీనికి తోడుగా బెంగాలు (వంగ) విభజన ప్రయత్నం ఒక కొత్త ఉద్యమానికి కారణ మయింది. వంగదేశమునుండి వచ్చిన బ్రహ్మ సమాజపు సిద్ధాంతాలే కాక వంగసాహిత్య రీతులుకూడా కృష్ణశాస్త్రి యువక హృదయానికి ప్రోద్బ లకములయినవి. ఆయన జీవితంలో వచ్చి పడిన అనుభ వాలు ఈ మనస్తత్వానికి మరింత అనుకూలవాతావర ణాన్ని కల్పించాయి. విద్వత్కవుల వంశములో పుట్టిన కృష్ణశాస్త్రికి పురాణవిద్యతోపాటు తండ్రుల సాహిత్య గోష్ఠి, సంస్కారం లభించింది. ఈ ప్రభావాల ఫలమే కృష్ణ శాస్త్రి కవిత్వం. పతనోన్ముఖమైన ఆంధ్ర సారస్వత రీతులతో విసుగెత్తి, గురజాడ అప్పారావు ఇచ్చిన వైతాళిక గానంతో మేల్కొని, బ్రహ్మ సమాజము వంగాంగ్ల సాహిత్యాలు చూపించిన కొత్త బాటలలో ఆనువంశి కంగా వచ్చిన సాహిత్య సంస్కారముతో కృష్ణశాస్త్రి 'కృష్ణ పక్షా'న్ని 1925 లో ప్రకటించాడు. ఆ తరువాత ఆయన 'ప్రవాసము' 'ఊర్వశి' వచ్చాయి. ఇవన్నీ భావగీతాల సంపుటాలే. స్వచ్ఛంద ప్రియత్వం, భగ్న ప్రేమ, నిర్వేదము, తాత్త్విక దృష్టి ఆయన కావ్యాలలో కనిపిస్తాయి. పద్య రచనలలో తెలుగు జిలుగు ఎక్కువ. తెలుగు నుడికారాన్ని పేశలంగా మెలకువతో ఉపయో గించిన కవి ఇతడు. మాటలను కొత్త పద్ధతిలో కలిపి, చమత్కారమైన విరుపులతో తనదే అయిన ఒక శైలిని నిర్మించుకున్నాడు. కృష్ణశాస్త్రి గేయాలలో ఒక ప్రత్యే కత ఉన్నది. మాటలను పాటగా చేసే గుణం ఆయన పద్యాలలోనే ఉన్నది. గేయంలో అది మరింత పాట వాన్ని సంపాదించుకుంటుంది.

కృష్ణశాస్త్రిని భావకవిగా చేసిన సామాజిక పరిస్థితులు క్రమంగా మారిపోయాయి. వంగదేశమునుండి దిగుమతి అయిన బ్రహ్మసమాజపు ప్రాబల్యంకూడా క్రమంగా క్షీణించింది. వానితోపాటు కృష్ణశాస్త్రి కవితా వాహిని కూడా ఇంకిపోయింది. ప్రేరక సామగ్రి అంతా దూర ప్రాంతాలనుండి రావటంచేత దానిలో తీవ్రత చాలక రవీంద్రుని వంటి గొప్ప భావకవిని తెలుగు దేశం సృష్టిం చుకోలేకపోయింది.

తరువాత కృష్ణశాస్త్రిలో భావ పరివర్తనం వచ్చింది. మారుతూన్న సామాజిక పరిస్థితితోపాటు జీవితపు విలువలు

మారాయి. వానితోపాటు ఆయన దృష్టి మారింది. తాత్త్వికంగా ఆయన మరొకరకమైన కావ్య రచనలను ఆకాంక్షించినా వానిని అందివ్వగలిగిన హృదయ సామగ్రి తన దగ్గర లేదని ఎన్నో ఉపన్యాసాలలో ప్రకటించాడు.

కాని తెలుగు దేశములో భావకవితకు కృష్ణశాస్త్రి ఉద్యమ నాయకుడు. ఆయన వెనుక అనుయాయులు చాలామంది బయలుదేరారు. అందులో గణింపదగినవాడు మల్లవరపు విశ్వేశ్వరరావు. ఆయన 'మధుకీల', 'కల్యాణకింకిణి' అన్న ఖండ కావ్య సంపుటాలు ప్రకటించాడు. కృష్ణశాస్త్రిలోని ప్రతిభావ్యుత్పత్తులు విశ్వేశ్వరరావులో కనిపించకపోయినా ఆయనలో ఒక భావ తీవ్రత ఉన్నది. ఆ లక్షణమే ఆయనను కవిగా చేస్తున్నది. 'మధుకీల'లోని కొన్ని గేయాలు ఏ ఆధునిక కావ్య సంకలన సంపుటానికైనా శోభను చేకూర్చ గలవు.

భావ కవిగా పరిగణించదగ్గ మరొక కవి వేదుల సత్యనారాయణశాస్త్రి ఆయన సంస్కృతాంధ్ర సాహిత్యాలు ప్రాచీన మార్గంలో చదివినా భావకవితా శాఖనే అభిమానించాడు. ఆయన రచనలలో కృష్ణశాస్త్రిలోలేని చిక్కణత్వం కనిపిస్తుంది. మాటలో బరువూ, సంప్రదాయ చ్ఛాయ ఉంటాయి. కృష్ణశాస్త్రి కున్నంత ఆంగ్లసాహిత్య పరిచయ బలం లేనందువల్ల ఆయనలో కనిపించినంత ప్రత్యేకత, ప్రత్యగ్రత ఈయనలో కనిపించవు. కాని సంస్కృత వాణీ సౌకుమార్యం అతని రచనలోని ప్రత్యేక గుణం. 'వేదుల' సౌందర్య స్పృహయాళువు. సుఖశూన్యమైన క్లేశజీవితాన్ని ఎరిగినవాడు. ఈ రెంటి ప్రభావము ఆయన 'దీపావళి'లో చూడవచ్చును. ప్రేమ, సౌందర్యము, నిర్వేదము, కరుణ 'వేదుల'కు అభిమాన కవితా ద్రవ్యాలు. కొన్ని సమయములలో దేశాభిమానం ఆయన చేత కావ్యగానం చేయించినది. 'కాంక్ష', 'ఆషాఢమేఘము' వంటి ఖండ కావ్యాలు చాలా విలువైనవి. ఆయన కవితలోని స్వాదుత్వాన్ని గుర్తించిన వారికి 'గౌతమీ కోకిల' అన్న ఆయన బిరుదు ఎంతో అర్థమైనదిగా కనిపిస్తుంది.

రాయప్రోలు సుబ్బారావు, అబ్బూరి రామకృష్ణరావు ఒక తెగకు చెందిన కవులు. వారు భావగీతాలే కాక కథనాత్మకమైన రచనలు కూడా చేశారు. రాయప్రోలు సుబ్బారావు 1913 లో తృణకంకణ మన్న కావ్యాన్ని ప్రకటించాడు. ఆధునిక కవిత్వానికి తృణకంకణ మాదిమ గ్రంథమని కొందరి యభిప్రాయము. 'ఆ రోజులలో ఈ కృతి వల్ల ఏదో కొత్తలోకంలోకి మార్గం ఏర్పడినట్టయింది. అంతకుముందు ఆధునిక విధానానికి తోవతీసినవారు అనూరు ప్రాయులు. ఈ సూర్యాలోకం వల్ల సాహిత్యసీమలో నూతన రుచి వ్యాపించి కన్నులు మిరుమిట్లు కొల్పింది. కొంతమంది కన్నులు మూతలు పడ్డాయి. కొంతమంది నేత్రపటలాలు నీరయిపోయినవి' అని తల్లావఝుల శివశంకరశాస్త్రి 1938 లో తృణకంకణ రజతోత్సవ ముద్రణానికి పీఠికా ప్రాయమైన 'నీ రాజనము'లో వ్రాస్తాడు. తృణ కంకణం పాతమార్గాలు కొన్ని విసర్జించి కొత్తబాణిలో నడచిన కావ్యం. సుబ్బారావుకు శాంతి నికేతన నివాసం, ఆంగ్ల భావకవుల ప్రభావం కొత్త రచనా పద్ధతికి ప్రోద్బలము లయినవి. ఆయన కవితలో నూతనమై, ఉత్పాద్యమై, లౌకికమైన వస్తు వున్నా రచనా విధానము సంప్రదాయపు సాధుశీలాన్ని విసర్జించదు. పద్య శిల్పములో చేమకూర వేంకటకవి, పెద్దనవంటి కవుల ప్రభావం ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. సరళమైన కోమల ప్రకృతులమీద ఆయన కభిమాన మెక్కువ. ఆయన ప్రాచీన ఔన్నత్యాన్ని స్మరించి ఉద్రిక్తు డవుతాడు. భావాలలో కొంత కాళిదాసుమీది అభిమానం వెల్లడి అవుతుంది. 'తృణ కంకణం', 'కష్టకమల', 'స్నేహలతా దేవి', 'స్వప్న కుమారము' రాయప్రోలువారి కథనాత్మక కావ్యాలు. 'జడ కుచ్చులు', 'ఆంధ్రావళి' ఖండకావ్యాల సంపుటాలు. వీనిలో దేశభక్తి గీతాలుకూడ ఉన్నాయి. ఇవి జనప్రీతి నెక్కువగా చూరగొన్నాయి. 'మధుకలశము' ఉమరు ఖయాముకు పరివర్తనము. 'రమ్యాలోక' మొక విధమైన ఆలంకారిక గ్రంథము. ఆధునికులలో కొంత విరివిగా కావ్యరచన చేసిన వారిలో సుబ్బారావు ఒకడు. ఆయన భావనలో, భాషలో, శయ్యలో, స్వచ్ఛతను సరళతను, సౌకుమార్యాన్ని సాధించాడు. నైతిక, ధార్మిక మార్గాన్ని అన్వేషించే మనస్తత్వ మాయన కవితలో గోచరిస్తుంది. మొత్తముమీద సుబ్బారావు కవిత మధుర మార్గానికి చెందుతుంది.

రాయప్రోలుకు కొంచెము తరువాత వచ్చినా ఆయనతో సమాన స్కంధుడుగా నిలువగలిగిన వాడు అబ్బూరి రామకృష్ణారావు. ఆయన 'ఊహాగానము', 'పూర్వప్రేమ' 1918 లో ప్రకటించినాడు. 'మల్లికాంబ' అతని మరొక ఖండకావ్య సంపుటము. రామకృష్ణారావు మంచి వ్యుత్పన్నుడే కాక చక్కని భావుకుడు. తన ప్రసన్న వాణితో కొన్ని చక్కని భావగీతాలు వ్రాశాడు. కాని రామకృష్ణారావు ఏ కారణము చేతనో కవితా రచన మాని చాలాకాలమైనది.

భావగీతాలు వ్రాసిన మరొకకవి తల్లావఝుల శివశంకరశాస్త్రి (స్వామి); 'హృదయేశ్వరి' ఆయన భావగీతాల సంపుటి. శివశంకరశాస్త్రి గొప్ప వ్యుత్పన్నుడు,

గోష్ఠీ చతురుడు; సరసుడు. ఆయన భావ గీతాలలో అస్పష్టత గాని, అనన్వయ దోషం గాని ఉండదు. అతని కవిత సరళంగా, స్వచ్ఛంగా ఉంటుంది.

ఖండకావ్య రచనలలో భావనా పటిమ, ఉదాత్త కావ్య లక్షణము, సంప్రదాయపు చేవ, రచనా శిల్పము చూపించిన కవి విశ్వనాథ సత్యనారాయణ. ఆయన గొప్ప ప్రతిభాశాలి, పండితుడు. ప్రౌఢమైన దృష్టి, తీవ్రమైన వాణి, ఉజ్జ్వలమైన రీతి సత్యనారాయణలో కనిపిస్తాయి. కాని ఆయనలో అచ్చమైన కవితా హృదయ మెంత ఉన్నదో, పాండిత్య వైయాత్య మంత ఉన్నది. ఖండ కావ్యాలలో సత్యనారాయణ తొక్కని మార్గము లేదు. అతని 'కిన్నెరసాని పాటలు' గేయ కవితకు, 'ఆంధ్ర ప్రశస్తి' కథనాత్మక కవితకు, 'గిరికుమారుని ప్రేమ గీతాలు' భావ గీతాలకు, 'కొండవీటి పొగమబ్బులు', 'తెలుగు ఋతువులు' వంటి కావ్యాలు వర్ణనాత్మక కవితకు, 'శృంగార వీథి' శృంగారానికి ఉదాహరణాలు. వెనుకటి, ఇప్పటి కవితా సంవిధాన చాతుర్యా లన్నిటినీ పుణికి పుచ్చుకున్న కవి సత్యనారాయణ. సంప్రదాయ శీల మైన అతని బుద్ధి పౌరాతన్యాన్ని అభిమానిస్తూనే అద్య తన రీతులను బాగా జీర్ణం చేసుకున్నది. భావన, రచన, ప్రౌఢము కావడంచేత ఆయనలో ప్రసాద గుణం తక్కువ; ఓజస్సు, పటిమ ఎక్కువ. భాష ఆయనకు ఊడిగం చేస్తుంది. ఆయనది 'మురారిపంథా'. ఆంధ్ర సాహిత్యములో 'విశ్వ నాథ' ఒక సమున్నత శిఖరము. ఆయన సామాన్యుల కవి కాడు. 'కవీనాం కవిః.'

ఖండకావ్యాలతో జనప్రీతిని బాగా చూరగొన్న మరొక కవి జాషువా. ఇతనిది నిమ్నోన్నతములు లేని సరళమైన మార్గం. హృదయానికి సూటిగా, వేడిగా, వాడిగా వచ్చి తగిలే మాటలతో అతని కవిత సామాన్య జనాన్ని ఎంతగా ఆకర్షిస్తుందో చదువుకున్నవాళ్ళను అంతగా ఆకర్షిస్తుంది. తనదే అయిన కొత్త పలుకు తీరుతో జనరంజకమైన ఇతివృత్తాలను తీసుకొని వ్రాస్తాడు జాషువ. క్షుద్ర వస్తువులలోకూడ ఉదాత్తతను చూడగలడు. యక్షు నికి మేఘ మెంతటిదో కటికి దరిద్రుడికి గబ్బిల మంతటిది కావచ్చునని 'గబ్బిలము'లో జాషువా ధ్వనిస్తాడు. అతని ఇతర కృతులు 'ఫిరదౌసి', 'తాజమహలు' మొద లైనవి అశేషజన ప్రీతికి పాత్రము లయ్యాయి.

ఆధునికులలో ఖండకావ్య రచయితలుగా పేర్కొదగిన వారు చాలామంది ఉన్నారు. నాయని సుబ్బారావు, కొడాలి ఆంజనేయులు, కొడాలి సుబ్బారావు, పింగళి లక్ష్మీకాంతం, కాటూరి వెంకటేశ్వరరావు, బొడ్డు బాపి రాజు, అడవి బాపిరాజు, ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి, పిలకా గణపతిశాస్త్రి, తుమ్మల సీతారామమూర్తి చౌదరి; ఏటుకూరి నరసయ్య, జంధ్యాల పాపయ్యశాస్త్రి, దువ్వూరి రామిరెడ్డి, కవికొండల వెంకటరావు, వెంకటపార్వతీశ్వర కవులు, బుచ్చి సుందరరామశాస్త్రి, పాటిబండ మాధవ శర్మ, పెమ్మరాజు లక్ష్మీపతి ప్రభృతులు లెక్కింప దగినవారు.

రాయలసీమలో రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, పుట్టపర్తి నారాయణాచార్యులు, బెళ్ళూరి శ్రీనివాసమూర్తి ప్రభృ తులు పరిగణనీయులు. రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ 'గాథాసప్తశతి', 'పరివర్తనము' ఆంధ్ర దేశపు ఆదరాభి మానాలను పొందినవి. 'పుట్టపర్తి' పండితుడు; బహు భాషాకోవిదుడు; రసజ్ఞుడు; బహు గ్రంథకర్త. అతనిది తీవ్రమైన వాణి. 'పెనుగొండ లక్ష్మి', 'సాక్షాత్కా రము', 'షాజీ' వంటి ఖండ కావ్యాలు, 'శివ తాండవ' మనే గేయ రూపకమైన కావ్యము అతనికి మంచి పేరు తెచ్చాయి. బెళ్ళూరి శ్రీనివాసమూర్తి 'ప్రేమ తపస్విని', 'అపశ్రుతి' వంటి కావ్యాలు ప్రకటించాడు.

గేయ కవులలో నండూరి సుబ్బారావుకు విశిష్టమైన స్థాన మున్నది. ఎంకి నాయుడు బావల ప్రేమ పలువిధా లుగా రూపొందిన 'ఎంకిపాటలు' తెలుగు హృదయా లలో ఇంకిపోయినాయి. వాని ముగ్ధ సౌందర్యానికి మురిసి పోని సహృదయు డుండడు. నండూరి సుబ్బారావు పామరజన జీవితం వ్యావహారికభాషలో ఉదాత్తశిల్పంతో నిపుణంగా పొగడితే ఎంత హృదయహారిగా ఉంటుందో చూపించాడు. ఈ పద్ధతిలో ఆయన అద్వితీయుడు. ఆయన మార్గాన్ని మరెవ్వరూ అనుసరించలేదు.

ఇంతవరకూ పేర్కొన్న కవు లందరూ 1910 నుండి సాగి వచ్చిన నవ్య సాహిత్యోద్యమానికి యథాశక్తి తోడ్పడ్డ వారే. అందులోని భావకవితా శాఖ 1930 నాటికి ఉన్న చమురంతా పీల్చి కొడిగట్టి ఆరిపోయింది. ఆ రచన లన్నీ అంతకు పూర్వ ముండిన కవిత్వంమీద తిరుగుబాటుగా వచ్చినా సామాజిక సమస్యలతో సంబంధము లేక మధ్యమ వర్గాల మనస్తత్వాన్ని ప్రతిబింబిస్తూ వచ్చాయి. అప్పు డప్పుడే వికాసము పొందుతూన్న సామాజిక చైతన్యానికి రూప మిచ్చి మాటలలోనికి మార్చే కవికోసం తెలుగుదేశ మెదురు చూస్తున్నది. అంతర్జాతీయ, జాతీయ రంగాలలో అత్యంత ఉద్యమ శీలమైన చిత్తప్రవృత్తిని ప్రచారానికి తెచ్చే విప్లవ శక్తులు విజృంభిస్తున్న రోజు లవి. ఆపరిస్థితిలో 'శ్రీ. శ్రీ.' (శ్రీరంగం శ్రీనివాసరావు) తన కొత్త గొంతుక విప్పాడు; అభ్యుదయ కవితా మార్గాన్ని సృష్టించాడు.

'మహాప్రస్థానము'తో కొత్త కవితారీతులు తెలుగు లోకానికి పరిచయం చేశాడు. ఇతనిది విప్లవాత్మకమైన ప్రగతివాదం. మొదటి అపరిణామ దశలో భావకవుల అడుగుజాడలలో నడచినా 'శ్రీ. శ్రీ.' మార్క్సియ సిద్ధాంత ప్రభావంచేత మేల్కొని స్వతంత్ర మార్గాన్ని వెదుకు కున్నాడు. ఎంతటి తీవ్ర విమర్శకుడయినా మెచ్చుకోక తప్పని సంవిధాన చాతుర్యం, వైవిధ్యం 'శ్రీ. శ్రీ.'కి స్వార్జితమైన ఆస్తి. అగ్గిపుల్లనో, అరటి తొక్కనో, హారతి పళ్ళాన్నో—దేన్నైనా సరే కవితామయంగా చేసే స్పర్శ వేది శ్రీ. శ్రీ. కి తెలుసు. మార్క్సు సిద్ధాంతము శ్రీ. శ్రీ. కి జీవితాన్ని విమర్శించే విచారదృష్టినీ, సమాజ పరిస్థితుల వెనక ఉండే రహస్యాలను అవగతం చేసుకునే శక్తినీ ఇచ్చింది. సాహిత్యాన్ని బుద్ధిపూర్వకంగా విప్లవాత్మకమైన ఆచరణకు సాధనగా వినియోగించాలన్న దృష్టి మార్క్సియ వర్గకలహ సిద్ధాంతమునుండి బయలుదేరుతుంది. వర్గకల హంలో సాహిత్యాన్ని బ్రహ్మాస్త్రముగా మార్చడమే విప్లవవాదుల ఆశయం. 'ప్రతిజ్ఞ'లో ఈ భావాన్నే 'శ్రీ. శ్రీ.' ప్రతిపాదిస్తాడు. 'ధనస్వామ్య వ్యవస్థలో పరస్పర వైరుధ్యాలే దాని పతనానికి కారణమవుతాయనీ, తరు వాత అంతకన్న న్యాయబద్ధమైన, సామ్య సిద్ధమైన వ్యవస్థ ఏర్పడుతుందనీ చేసిన జోస్యం ఫలోన్ముఖానికి వస్తోంది' అన్న ప్రగాఢ విశ్వాసమే 'జగన్నాథ రథచక్రాల'లో కనిపిస్తుంది. కాని 'శ్రీ. శ్రీ.' లో ఈ ఆశావాదం సార్వత్రి కంగా ఉండదు. ఒక్కొక్కసారి సంశయాళువుగాను, వేరొక్కసారి జీవితానికి వైయర్థ్య మారోపించే నిరాశా వాదిగాను 'శ్రీ. శ్రీ.' కనిపిస్తాడు. 'శ్రీ. శ్రీ.' లో ఆశావాదం లోతుగా వేరూని నిలువలేదు. వస్తువరణంలోనే కాక రచనా సంవిధానంలో కూడా 'శ్రీ. శ్రీ.' విప్లవాన్ని సాధిం చాడు. భాషలో, భావములో, ఛందస్సులో అతడు కొత్త మార్గాన్ని చూపాడు. అతని ప్రతిభ ఆత్యంతోద్యమశీల మైనది. ఆధునిక సాహిత్య చరిత్రలో అత డొక మైలు రాయి.

'శ్రీ. శ్రీ.'లో మూడు దశలు గుర్తింపవచ్చును. 1932 కు ముందు వ్రాసిన రచనలు అపరిపక్వంగా అనుకరణశీల ములై ఉండేవి. 1932 నుండి సుమారు 1940 దాకా రెండవ దశ. ఈ దశలోనే అతని ప్రసిద్ధ రచనలు వచ్చాయి. 1940 తరువాత మూడవ దశ. ఈ దశలో అధివాస్తవిక ధోరణి అతని రచనలలో బాగా ప్రవేశించింది.

ఫ్రాయిడ్ ప్రతిపాదించిన 'సైకో ఎనాలిసిస్' సిద్ధాంతం కళాక్షేత్రంలో అధివాస్తవిక (సర్ రియలిజమ్) మతాన్ని అవతరింపజేసింది. మొదట్లో యమ్. ఆంఢ్రే బ్రెటన్ అధి వాస్తవికుల ఆశయాలను వివరిస్తూ 'మనస్సును విడుదల చేయడమే వారి ప్రధానోద్దేశ' మన్నాడు. క్రూర నిరోధక శాసనాలలోని పరిమితత్వాన్ని అధివాస్తవికులు ఖండిస్తారు. సీమితమైన పరిధులను దాటే స్వేచ్ఛ మానవుడి కవసరం. అనుభూతిక్షేత్రం విశాలమై అదే కావ్యవస్తువు కావాలి. సుప్త చైతన్యపు (సబ్ కాన్షస్ మైండ్) లోతులలో అను భూతిక్షేత్రాన్ని విస్తరించుకోవాలి. చైతన్యపు (కాన్ షస్ మైండ్) నిరంకుశాధికారం లేకుండా బాహిరిల్లే సుప్త చైతన్యానికి శబ్దరూప మివ్వడమే అధివాస్తవిక రచన అవుతుందని ప్రాథమిక దశలో వారి వాదం. 1924 లో మొదటసారిగా అధివాస్తవికుల ప్రణాళిక సిద్ధమయినా క్రమక్రమంగా రాజీధోరణి హెచ్చి సిద్ధాంత పరివర్తనం వచ్చింది.

సుప్తచైతన్యం అనేక శబ్దచిత్రాలకు(వెర్బల్-ఇమేజెస్), స్మృతి శేషాలకు (మెమొరీ-రెసిడ్యూస్) పెద్ద భాండా గారం వంటిది. అసంఖ్యాకములైన పూర్వసంవేదనలు సుప్తచైతన్యములో నిక్షిప్తములై ఉంటాయి. సరియైన అనుబోధ (కరెక్ట్ అసోసియేషన్) యాదృచ్ఛికంగా స్ఫూర్తికి వచ్చినప్పుడు దానివెంట సహచారి - సంవేదనలు పైకి జ్ఞానభూమిలోనికి చొచ్చుకొని వస్తాయి. కాబట్టి జీవితంలో ముఖ్యంగా మానసిక జీవితములో రెండు అంతస్థులు గుర్తింపవచ్చును. ప్రతిదీ స్ఫుటంగా తోచి, సరిహద్దులు కనిపించే దొకటి; ఎంతవరకు వ్యాపించిందో తెలియక మరుగు పడిపోయి అస్పష్టమైన దింకొకటి. ఇదే జీవితములో పెద్ద భాగమేమో! మానవుడు పెద్ద మంచు గడ్డలా కొంచెమే పైకి చైతన్యంలో తేలుతూ, కాలప్రవా హంలో పడిపోతున్నాడు. మరుగు పడిపోయిన ఆ జీవితపు కొలతలు తీసి, దాని స్వరూప పరిశీలన చేసే ప్రయత్నం అధివాస్తవికులు చేస్తామంటారు. ఈ ఉద్యమంలో వీ శ్లాన్నో సంకేతాల సహాయం తీసుకుంటారు. ఆధునిక మనస్తత్త్వ శాస్త్రం సంకేతాల స్వరూపాన్ని — ముఖ్యంగా స్వప్న సంకేతాల స్వరూపాన్ని — వ్యాఖ్యానించే ప్రయత్నం చేసింది. ఈ శాస్త్రాధ్యయనం కొందరిని అధివాస్తవిక రచనలకు ప్రేరేపించింది.

'స్వచ్ఛందానుబోధ పద్ధతి'మీద నిర్మింపబడ్డ 'అధివాస్త విక సంవిధానం' నిజానికి స్వచ్ఛందం కాదన్న సంగతి ఫ్రాయిడ్, జంగ్, మెకర్డీ నిరూపణలే ఋజువుచేస్తాయి. సంయుక్తికానుబోధలో (రేషనల్ అసోసియేషన్) యాథార్థ్యంపట్ల ఏర్పడే సామాజికానుభూతి, ఆవశ్య కతాజ్ఞానం భావనాప్రక్రియను పాలిస్తాయి. స్వచ్ఛందాను బోధలో భావనా ప్రక్రియ మీద సుప్తచైతన్యం అధికారం

వహిస్తుంది. కాబట్టి అది స్వచ్ఛందం కాదు. సంఘాని కెదు రీది మానవుడు ముక్తుడు కాడు. సమాజము ద్వారా ముక్తిని సాధించాలి. అనుబోధక పద్ధతిలోను కొన్ని సంప్రదాయాలూ, ఆచారాలూ ఉన్నాయి. అవే ముక్తి చిహ్నాలు. 'అధివాస్తవిక రచయిత బూర్జువా కావడం వల్లనూ, అతనికి సామాజిక సంబంధముమీద స్వాధీనము తప్పడముచేతనూ ఆ సంప్రదాయాలమీదా, అచారాల మీదా తిరుగుబాటు చేయడంలోనే ముక్తి ఉన్నదని విశ్వ సిస్తాడు. ఆదర్శ ప్రాయమైన ముక్తిని కళలో ఐంద్రజాలిక శక్తిచేతను, కళాశిలి మనోవైలక్షణ్యం చేతను సాధించ గలనని భావిస్తాడు' అని అధివాస్తవికతపై విమర్శన మొకటి ఉన్నది.

లోతుగా విమర్శిస్తే కళ కళ కోసమే నన్న వాదమే అధివాస్తవిక రచనా విధానానికి మాతృక. రాజకీయ పరిభాషలో అధివాస్తవిక రచయిత అరాజకవాది. అరాజకవాదమువలెనే అధివాస్తవిక కవితకూడా ఆచరణలో తన్ను తాను ప్రతియోగిస్తుంది.

'శ్రీ. శ్రీ.' లో అధివాస్తవిక ధోరణి 'కోనేటి దినం', 'చక్కని ముత్యాలసరాలు', 'విదూషకుని ఆత్మహత్య' వంటి కావ్యాలలో కనిపిస్తుంది. శ్రీరంగం నారాయణ బాబు వ్రాసిన కొన్ని రచనలలో కూడ ఈ ధోరణి కొంత కనిపిస్తుంది. కాని అతనిలో 'శ్రీ. శ్రీ.' లోని ప్రౌఢ నిర్వహణ సామర్థ్యము కానరాదు. ఈ రకమైన రచన ఏ కొంత మంది రచయితలనో ఆకర్షించింది.

'శ్రీ. శ్రీ.' తరువాత వచ్చిన కవులలో సామాజిక దృష్టి ఎక్కువ. వారిలో 'శ్రీ. శ్రీ.' ప్రభావ మేదో కొంత కనిపిస్తుంది. సామాజిక సమస్యలను పరిష్కరించే దృష్టి వారి కావ్యాలలో ఎక్కువైనది. 'త్వమేవాహ' మన్న కావ్యములో 'ఆరుద్ర' దీనిని కొంత సాధించినట్లుగాను, కవితా రీతులలో అతడు తనకంటె ఒక అడుగు ముందుకు వేసినట్లుగాను, తా నింక కవనసన్యాసము చేయడమే సబబన్నట్లుగాను ఆ కావ్యానికి పీఠిక వ్రాస్తూ 'శ్రీ. శ్రీ.' అంటాడు.

'ఆరుద్ర'లో వైచిత్రి, చమత్కారము, కొత్తగా యుక్తిగా పలుకుదామన్న కాంక్ష ఎక్కువ. ఆంగ్ల సాహిత్య ప్రభావము తగని మోతాదులో పని చేసిన ఫలితమే ఈ కావ్యం. ఏ ఉద్యమం కాని ఆయా దేశాలలో, ఆయా భాషలలో కలిగిన అవసరాలను బట్టి తప్పనిసరిగా వచ్చినప్పుడు నైసర్గికమైన ఉత్తేజనాన్ని పొందుతుంది. కాని దూరదేశాలలో కలిగిన మార్పులను, రీతులను, 'విచిత్రమే సౌందర్యము, సౌందర్యమే విచిత్రము' అన్న అభిమానంతో స్వీకరిస్తే అది కేవలం తెలివిగా, యుక్తిగా పలికినామని సంతృప్తి పడే ధన్యమ్మన్యుల లక్షణమౌతుంది. సంస్కృతాంధ్ర సారస్వతములతో కాని, ఆంగ్ల సారస్వతముతోగాని హృదయదఘ్నమైన పరిచయంలేని కొత్తకారు రచయితలలో అవ్యుత్పత్తి, ప్రతిభాదారిద్ర్యం, పరానుకరణం ప్రధాన లక్షణాలు. శిల్పశూన్యమైన అత్యాధునిక ధోరణిలో వ్రాయడమే ప్రగతి అనుకొనే వారిని చూస్తే జాలివేస్తుంది.

'శ్రీ. శ్రీ.' తరువాత వచ్చిన కవులలో సామాజిక దృష్టి ఎక్కువగా కనిపించినా శిల్ప పాటవం చాలినంత ఉండదు. 'అగ్నివీణ' ఆ జాతికి చెందుతుంది. దాన్ని వ్రాసింది అనిసెట్టి సుబ్బారావు. ఇతడు భావుకుడు. 'అగ్ని వీణ'లో కొన్ని ఖండకావ్యాలు విలువైనవి.

ఆధునిక కావ్యాలలో ప్రత్యేకమైన ప్రశంసకు పాత్రం కాదగినది పఠాభి వ్రాసిన 'ఫిడేలు రాగాల డజన్'. కవి ప్రతిభాశాలి. నూతనమైన మార్గంలో, విచిత్రమై, సంప్రదాయాతిరిక్తమైన పద్ధతిలో ఆధునిక సమాజములోని కుళ్లును క్షాళనం చేసే దృష్టితో, 'వచన పద్యాల'తో ఈ కావ్యాన్ని వ్రాశాడు పఠాభి. ఒక్క మెరపు మెరసి ఇతడు ఊరుకోవడం న్యాయం కాదు.

నవ్య కవిత్వములో చక్కని వేళాకోళపు కావ్యాలు కూడా వచ్చాయి. జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి, మాచిరాజు దేవీప్రసాద్ 'హేళన' కవిత వ్రాసి సారస్వతేయులకు చిరపరిచితులయ్యారు.

ఇటీవల వస్తున్న కవులలో 'దాశరథి' వంటివాళ్లు వికసనక్షమమైన ప్రతిభారేఖలను ప్రదర్శిస్తున్నారు.

1940 తరువాత వచ్చిన రచయితలలో వ్యుత్పత్తి దారిద్ర్యం బాగా కనపడుతుంది. ఒకనిని కవిగా చేయ గలిగిన సామగ్రి వస్తువు, భావము మాత్రమే కాదు. వాటికి తగిన శిల్ప ముండాలి. విప్లవాత్మకమైన విలువలు మాత్రమే రచనలను రసవత్కావ్య పంక్తులుగా మార్చవు. కావ్య శిల్పముతో పొదిపినప్పుడే అవి సాహిత్య శ్రేణిలో చేర్చడానికి అర్హమౌతాయి. కావ్య శిల్పం లేని విప్లవాత్మకమైన రచన ఎంత నీరసమో విప్లవాత్మకమైన విలువలు లేని కావ్య శిల్ప మంత నిరర్థకము. ఈ రెంటి ప్రౌఢ మేళనమే కవి సాధించవలసినది. తాత్కాలికంగా విలాసార్థం వచ్చిన ఛత్రాంక సాహిత్య రీతులలో కాక, నిసర్గమైన ప్రతిభా వ్యుత్పత్తుల దాంపత్యముతో ప్రజాజీవితపు లోతులనుండి చేదుకున్న శక్తులతో సజీవ సాహిత్య నిర్మాణం చేస్తే ఖండ కావ్య సరస్వతి ఇంకా ఇంకా పెరగ గలదు.

'సంపత్'

**గంగాదేవి :** విజయనగరరాజ్య స్థాపకులలో నొకడగు బుక్కరాయల కీమె కోడలు; బుక్కరాయల తృతీయ పుత్రుడగు కుమారకంపరాయల గృహలక్ష్మి; సంస్కృతమున కావ్యరచన చేసిన విదుషీమణులలో నీమె పేరు పడినది.

విజయనగర సామ్రాజ్యారంభ కాలమున మధుర రాజ్యము మహమ్మదీయుల పాలనమున నుండెను. కుమార కంపరాయలు తండ్రి యానతి ననుసరించి ముందు తుండీరమండలమును జయించి, పిదప మధురపైకి దండెత్తి పోయి అక్కడి సుల్తాను నోడించి విజయము గాంచెను (చూ : కుమార కంపరాయలు).

కంపరాయల విజయవృత్తాంతమును కథావస్తువుగా గ్రహించి గంగాదేవి మధురావిజయము రచించెను. ఈ కావ్యమునకు 'వీరకంపరాయచరిత్ర 'మని నామాంతరము.

మధురావిజయ మెనిమిది సర్గల మహాకావ్యము. కాళిదాసు మహాకవి తన కావ్యములలో ఒక్కొక్కసర్గయందు ఒక్కొక్క విధమైన ఛందస్సు నుపయోగించినట్లు గంగాదేవియును వేర్వేరు సర్గలయందును అనుష్టుప్, ఉపజాతి, వంశస్థము, ద్రుతవిలంబితము, పుష్పితాగ్ర మున్నగు ఛందస్సుల నుపయోగించి రచనను సాగించెను. మధురావిజయమునకు మహాకావ్యలక్షణములు సరిగా అమరినవి. ఋతువర్ణన, చంద్రోదయము, ప్రయాణము, నాయకాభ్యుదయము మున్నగు అష్టాదశ వర్ణనములును గలవు. శైలి నిరాఘాటమై, లలితమై వైదర్భీరీతి నున్నది; భావములు మనోహరముగా నుండునట్లు కూర్పు సాగినది. ఈ రీతిని రచన సాగించు నేర్పు ఏకొలదిమందికో కాని యలవడదు.

ఇందు తొలి సర్గమున దైవప్రార్థనాదికమైన పిదప నాయకుని నగరమైన విజయనగరము విపులముగా వర్ణితమైనది. రెండవ సర్గములో బుక్కరాయలకు దేవాయి భార్యయైనట్లును, ఆ దంపతులకు కంపన, సంగమ, కుమార కంపనలు కలిగినట్లును, గంగాదేవి కుమార కంపనకు భార్యయైనట్లును వర్ణింపబడినది. మూడవ సర్గమున బుక్కరాయలు కుమార కంపన కొనరించిన హితబోధయు, నాల్గవ సర్గమున కుమారకంపని జైత్రయాత్రా వర్ణనమును గలవు. నాయకుడు కాంచీనగరమున కొంతకాల మున్నట్లును, వర్షకాలమును చలికాలమును అక్కడనే గడపినట్లును అయిదవ సర్గలో కలదు. శిబిరములలోని కంపరాయల జీవిత మారవ సర్గలో వర్ణింపబడినది. ఏడవ సర్గలో గంగాదేవీ కంపరాయల సంభాషణ వృత్తాంతము కూర్పబడినది. ఎనిమిదవ సర్గలో మధురాపురాధిదేవత ప్రత్యక్షమై తన గోడు వెల్లడించుటయు, కంపరాయలు యుద్ధమున యవనవీరుల నోడించి మధురను జయించుటయు వర్ణితములు. మధురావిజయమున యథార్థమగు చరిత్ర విషయము కథావస్తువుగా గ్రహింపబడినందున దీని విశిష్టత స్పష్టమగుచున్నది. అమూల్యములగు నాటి చరిత్రాంశములను దెలిసికొనుట కీ గ్రంథము మిక్కిలి యుపయోగించుచున్నది.

గంగాదేవి కంపరాయల మహిషిగా గొప్ప అంతస్తులో నున్నను విద్యకు తగిన వినయ విధేయతలు, పెద్దలయెడ గౌరవము ఉన్నట్లు ఆమెగ్రంథమువల్లనే తెలియుచున్నది. ఆమె గురుస్తుతిలో విజయనగరరాజ్య సంస్థాపకులైన హరిహరరాయల యొక్కయు, బుక్కరాయల యొక్కయు గురువైన క్రియాశక్తిని (ఇతని పూర్తి పేరు కాశీవిలాసక్రియాశక్తియట) స్తుతించెను. ఈమె పూర్వకవిస్తుతిలో వాల్మీకి, వ్యాస, కాళిదాస, బాణ, భారవి, దండి, భవభూతి, లీలాశుకులతోపాటు కొంద రాంధ్రవిద్వత్కవులను పేర్కొనెను. వారిలో తిక్కన సోమయాజి యొక్కడు.

తిక్కనతోపాటు గంగాదేవి అగస్త్యుని, గంగాధర పండితుని, విశ్వనాథకవిని ప్రశంసించెను. అగస్త్యునకే విద్యానాథుడను బిరుదము కలదనియు, అతడు ప్రతాపరుద్రయశోభూషణాద్యనేకగ్రంథములను రచించె ననియు చెప్పుదురు. గంగాధరుడు భారతకథను దృశ్యకావ్యముగా రచించెను. విశ్వనాథకవి యగస్త్యునకు మేనల్లుడట. ఇతడు గంగాదేవికి విద్యాగురువైనట్లు 'చిరం స విజయీ భూయాద్విశ్వనాథః కవీశ్వరః; యస్య ప్రసాదా త్సార్వజ్ఞ్యం సమింధే మాదృశేష్వపి' అను దానివలన తెలియవచ్చుచున్నది.

గంగాదేవి కవిత చాల మృదువైనది. ఈమె కావ్యమున కాళిదాసుని శ్లోకములకును, దండిమహాకవి కావ్యాదర్శమునందలి శ్లోకములకును ఎన్నియేని పోలికలను చూపవచ్చును. గంగాదేవికి కాళిదాస మహాకవి యెడల గౌరవ మెక్కువ. ఈమె వర్ణనాచమత్కృతిని చూపుట కొక యుదాహరణము :

'మదాంధకారో హి మహానిశీథినీ
ప్రబోధచంద్రప్రతిరోధకాలికా;
మనోజమత్తద్విపవైజయంతికా
శరీరిణాం శశ్వదలంఘినీ దశా.' (సర్గ 8, ప. 24)

బు. వెం. ర.

**గణపతిశాస్త్రి, అయ్యలసోమయాజుల** (క్రీ. శ. 1878-1936 :) ఈయన వాసిష్ఠ గణపతిముని అని, కావ్యకంఠుడని ప్రఖ్యాతుడు; విశాఖ జిల్లా కలువరాయి గ్రామములో జన్మించెను. తండ్రిపేరు నరసింహశాస్త్రి, తల్లిపేరు

నరసమాంబ. వారితనిని కొన్ని దివ్య నిదర్శనములవలన గణపతి దైవాంశ సంభూతునిగా నెంచి, యితనికి 'గణపతి' యను పేరుంచిరి. పదేండ్ల వయస్సు వచ్చుసరికి ఈయన మూడు కావ్యములు ముగించి కవిత్వ మల్లజొచ్చెను; జ్యోతిశ్శాస్త్ర మాయీడునకే వశమై, పంచాంగగణనమందొక నూత్న పథకమును గూడ రచించి గురువునకు గురువు కాగల్గెను. పదియవయేటనే యితనికి మాతృ వియోగము కలిగెను. ఈయనకు పండ్రెండవ యేటనే వివాహమయ్యెను. అప్పుడాయన భార్య నుద్దేశించి 'భృంగసందేశ' మను సరస కావ్యమును మందాక్రాంత వృత్తమున రచించెను; పదునారవ యేడు దాటుసరికి కావ్యశాస్త్రేతిహాస పారగుడును, నుజ్జ్వల ఆశుకవియు నై తండ్రికడ గైకొనిన మహామంత్ర దీక్షలచే తపస్సు సల్పుటకు నాసిక, భువనేశ్వర దివ్యక్షేత్రములకు వెడలెను.



చిత్రము 141.
కావ్యకంఠ గణపతి శాస్త్రి

ఇరువది సంవత్సరముల వయసు నిండుసరికి గణపతి కవిత్వప్రజ్ఞయందు పూర్వ కవులకుగల ప్రాభవము గడించి, 1900 ల సంవత్సరములో విజిగీషతో నవద్వీప విద్వత్పరీక్షలకు వెళ్లెను. అక్కడ సభలోని పరీక్షక వర్గమువారాయన కవిత్వ ప్రజ్ఞా ప్రదర్శన కలరి 'కావ్యకంఠ' బిరుదము నిచ్చి గణపతి నభినందించిరి. 1903వ సంవత్సరములో చెన్నపురమందు నారాయణ సుదర్శనునితో పోటీలో నెగ్గి ఆరు నిముసములలో కావ్యకంఠు డిరువది యైదు శ్లోకములను రచించి బంగారు కడియమును బహుమానముగా బడసెను. 1902 వ సంవత్సరములో అరుణాచల క్షేత్ర మేగినప్పుడాయన హరుని సహస్ర శ్లోకములచే స్తుతించి యచట నధ్యాపకవృత్తిచే నొకసంవత్సర ముండి పిమ్మట వేలూరులో తెనుగుపండితపదవిని దాదాపు నాలుగేండ్లు నిర్వర్తించి, తుదకు 1907 లో దాస్య వృత్తికి స్వస్తి చెప్పి యరుణాచల మేగెను. అచట నచంచల తపోదీక్షతో చిరకాలమునుండి మౌనియైయున్న బ్రాహ్మణ స్వామి యను తేజస్సంపన్నుని వాసిష్ఠుడు దర్శించి, తపస్సును గురించి యతని కనుభవ వేద్యమైన వాక్యముచే నుపదేశింపవేడెను. ఈస్వామి యొక్క కంఠ నాళము లెండిపోయి బద్ధమై యున్నను, వాసిష్ఠ దర్శనమువలన నార్ద్రమై ఆయన వాగ్రథము కదలగా వెడలిన ఉపదేశవాక్కుచే తపఃపదమునకు తృప్తికరమగు నిర్వచనము లభ్యమై సంతృప్తహృదయు డయ్యెను. ఈ గురువువలన వీరు 'నాయన' యని పిలువబడుటచే వీరి కా ఉపనామము సిద్ధమై సర్వవ్యాప్త మైనది,

అటు పిమ్మట వాసిష్ఠు డీ సిద్ధ గురూపదేశ భాగ్యమును లభింప జేసిన యీశ్వరిని స్తుతించుచు 'ఉమాసహస్ర' మను గ్రంథమును రచించి, తద్ద్వారమున మంత్ర, జప, తంత్ర, యోగ సాధనము లీనవ్యోపదేశముచే సంస్కరింపబడిన తీరును వివరించెను. స్తుత్యుపనిషత్కావ్య శైలుల మూడింటిని కవి యీ గ్రంథమందు మేళవింపజేసి, రసవంతములగు మధుర వృత్తములతోడను, అలంకారముల తోడను, భక్తి నుత్తేజ మొనర్చు స్పందములతోడను నూత్న మార్గమున గ్రంథమును నిర్మించినవాడయ్యెను. అటుతరువాత, తపస్తత్త్వమును సూచించు విజ్ఞాన మథనోపాయమై యున్న యీ ఉపదేశమునకు పూర్వ ఋషు లొకమంత్రకవచమునుగూడ కల్పించియుందురని వాసిష్ఠునకు దోచి, యట్టి మంత్రము విదితమగుటకు తపస్సు నాచరించి, రేణుక యను దేవతాకృపచే దాని దర్శనమును బొందెను. నాటినుండి తన శేషజీవితము నతడు వేదార్థమథనమునకు వినియోగించి తన దర్శనానుభవములను లోకమున కందిచ్చుట కెన్నో గ్రంథములను రచించెను. తపస్సునందు క్రమాభివృద్ధిచే వీరు కపాల భేదనసిద్ధిని జీవించియుండగా సాధించి వేదర్షివలె ప్రకాశించెను. అనుభవవేద్యములైన వీరి గ్రంథములలో స్తోత్రములు, సూత్రముల కూర్పులు, విమర్శలు కూడ కలవు. ఋగ్వేదమునుండి విదితమైన భారత చరిత్రాంశములను నిరూపించు వీరి 'భారత విమర్శ' యనుగ్రంథ మెంతో ప్రబోధదాయకమైనది. అట్లే 'రమణగీత' యను గ్రంథముపనిషత్తులకు, బ్రహ్మసూత్రములకు మించిన సత్య ప్రదర్శిని వంటిది. ముప్పాతిక వరకునున్న యీయన గ్రంథములలో నాలుగైదు మాత్రమే ముద్రణము బొందినవి.

ఈయన 1924 లో కాంగ్రెసు సంస్థలో చేరి, తమిళ రాష్ట్ర కాంగ్రెసు కమిటీ కధ్యక్షు డయ్యెను కాని, కాంగ్రెసునుండి యా సంవత్సరమే విరమించుకొనెను. సంఘక్షేమముకొరకై తద్ అస్పృశ్యతా నివారణమును సమర్థించి, దానిని శాస్త్రీయదృష్టితో పోషించుటకు 'పంచజనచర్చ'యను వ్యాసమును రచించెను.

తుద కీయన ఖడ్గపుర శిష్యుల మధ్య 1936 లో తన భౌతిక దేహమును వీడెను. గుం. ల. కాం.

**గిరిరాజకవి:** ఈయన శ్రీ త్యాగరాజస్వామి పితామహులు; సంస్కృతాంధ్ర భాషలలో మిక్కిలి ప్రజ్ఞ కలవారు; సంగీత విద్యాసంపన్నులు. ఈయన తెనుగున భక్తి రసములైనవి, వేదాంత విషయములైనవి చాల కీర్తనలను రచించి ప్రఖ్యాతి గాంచిరి. ద్వా. పా.

**గురుమూర్తిశాస్త్రి, పైడాల:** వీరు ములికినాటి శాఖకు చెందిన తెలుగు బ్రాహ్మణులు; తిరునెల్వేలి జిల్లాలోని కైత్తారను గ్రామము వీరి జన్మస్థానము. వీరు సంగీతములోను, చతుశ్శాస్త్రములందును పండితులు. పిన్న వయస్సుననే వీరు చెన్నపట్టణమునకు వచ్చి మణలి చిన్నయ్యమొదలియారి చేత సన్మానమును పొందిరి. వీరికి 'వెయ్యిగీతాల గురుమూర్తిశాస్త్రి' అని బిరుదునామము కలదు. వీరు గీతములనేగాక ప్రబంధములను, కీర్తనలను సంస్కృతభాషలోనే రచించిరి. వీరి సంచారిగీతములు, లక్షణగీతములు చాల ప్రసిద్ధికెక్కినవి. ఇవి నిఘంటువు వంటివి. వీరి సోదరులు సుబ్బరాయశాస్త్రి; గొప్ప విద్వాంసులు. వీరిది 'గురుమూర్తి'నామముద్ర. ద్వా. పా.

**గొల్లకలాప ప్రదర్శనము:** చక్కని సాహిత్యం, అందుకు తగిన సంగీతం, సంగీతాని కనువైన కీర్తనలు, దరువులు, గమకాలు, వీటి అన్నిటికీ అనురూపమైన నాట్యము — ఇన్నిటితో కూడిన గొల్లకలాపం ఒక మనోహరమైన కళాఖండం. నాటకంలోవలె ఈ గొల్లకలాపంలో వచ్చి పోయే పాత్ర లేమీ ఉండవు. ఒకసారి రంగస్థలంమీదికి వచ్చినవారు ప్రదర్శనాంతంవరకూ ఉంటారు. జంత్ర వాద్య వాదక గాయక బృందం గాక రంగస్థలం మీద వుండే ప్రధాన పాత్రలు ముగ్గురు: కథానాయకి-గొల్ల భామ. ఈమెకు సహాయంగా మరోభామ సహనాయకి ఉంటుంది. కథ నడిచేకాలంలో ప్రేక్షకులకు విసుగు కలుగకుండా చేయడానికి, వాదోపవాదాలలో ప్రేక్షకులకు కలిగే సందేహాలను తానే గొల్లభామను ప్రశ్నించి భామ చెప్పే సమాధానా లందరికీ అర్థమయ్యేటట్టు పిట్ట కథలతోను, చమత్కారమైన వింత ప్రసంగాలతోను పండిత పామర ప్రజారంజనంచేసే వైజ్ఞానిక పాత్ర హాస్యగాడు - ఒకడు. గొల్ల కలాపప్రదర్శనం రక్తికట్టడం, కట్టకపోవడం అంతా ఈ ముగ్గురు పాత్రధారులమీదే ఆధారపడి ఉంటుంది. గొల్లవేషం కథ వినిపించాలంటే ప్రతిరాత్రీ ఏడేసి గంటల చొప్పున మూడు దినాలు పడుతుంది. రాను రాను ప్రజలలో ఇటువంటి ప్రదర్శనాలు చూడాలనే ఉత్సాహం, వినడానికి ఓపిక తగ్గడం వల్లా, పండితులూ రసికులూ అయిన ప్రేక్షకులు తగ్గడంవల్లా ప్రదర్శన కాల పరిమాణం తగ్గిపోయి ప్రజలకు కావలసిన ఘట్టాలనే ప్రదర్శిస్తూ ఒక రాత్రిలోనే ఇది ముగియడం జరుగుతున్నది. మి. రా. మూ.

**గొల్లకలాపము:** దీనికి గొల్లవేషముకథ అనికూడా పే రున్నది. గొల్లవేషము కథ, భామవేషముకథ, భామకలాపము అనే పేర్లుగల గేయరచనలు యక్షగానభేదములలో చేరినవే అనవచ్చును. సంస్కృతములో దశరూపకాలలోని వీథి యిటువంటిదే. ఈ గొల్లకలాప ప్రదర్శనంలో బ్రాహ్మణుడు విదూషక ప్రాయుడు - హాస్యగాడు. ఈ గొల్లకలాపాన్ని కూచిపూడి వాస్తవ్యులైన భాగవతుల రామలింగశాస్త్రిగారు గోపికా విప్రసంవాదమనే పేరుతో రచించారు. వీరు కాక గొల్ల వేషముకథ అనే పేరుతో భారతి రామరాజుగారు, అత్రేయపురం తమ్మయ్యగారు మొదలైనవారు కూడా రచించారు. శ్రీకృష్ణుని పారిజాతాపహరణ కథ, సముద్ర మథనములవంటివి కూడా గొల్లకలాపమనే యక్షగానభేదంగా రచించినవి ఉన్నాయి. మి. రా. మూ.

**గొల్లవేష - వీథి భాగవతులు:** పేరు ప్రఖ్యాతులు గడించి చాలా మన్ననలూ, సత్కారాలూ పొందిన కూచిపూడి వాస్తవ్యులు వెంపటి వెంకటనారాయణగారు, వేదాంతం లక్ష్మీనారాయణశాస్త్రి, భాగవతుల దశరథ రామయ్యగార్లు ఈ గొల్లవేష కథ వినిపించడంలో సిద్ధహస్తులు. వీరి తరువాత అనేకు లా పాత్ర ధరించినప్పటికీ వీరితో సరితూగలేకపోయినారు.

ఈ గొల్లకలాపాన్ని మారంపల్లి కళావంతులైన చిత్తజల్లువారూ, ఇతర కళావంతులూ ప్రదర్శిస్తూ వచ్చారు. నిడదవోలు సమీపానగల మారంపల్లి వాస్తవ్యలు చిత్తజల్లు లక్ష్మీకాంతం, ఆమె కొమార్తెలు కృష్ణహరి, చిన వెంకటరత్నం, లక్ష్మీకాంతం చెల్లెలు వైదేహీ గొల్లకలాప ప్రదర్శనాన్ని గోదావరి జిల్లాలోనే కాకుండా ఉత్తర సర్కారుజిల్లా లన్నిటిలోను ప్రదర్శించి పేరు ప్రతిష్ఠలు సంపాదించారు. లక్ష్మీకాంతం మధురంగా సంగీతం పాడగలిగిన ప్రజ్ఞావంతురాలు; సంస్కృత భాషాజ్ఞానం కలది; చక్కగా అభినయించగల నేర్పరి. ఆదిలో లక్ష్మీకాంతం కూచిపూడి భాగవతుల భామకలాపాన్నే ప్రదర్శిస్తూ ఉండేది. తరువాత రావూరి కామయ్యగారి సహాయంతోను, వారి తమ్ముల అండతోను గొల్లకలాపం నేర్చుకొని బహుళ ప్రచారం కావించి ఆంధ్రదేశంలో గొల్లకలాప నృత్య కళా రూపాన్ని వ్యాప్తిలోనికి తీసుకువచ్చింది.

రావూరి కామయ్యగారు సంగీత సాహిత్య నాట్యకళానిధి; వెలదుర్రు వాస్తవ్యులు; మారంపల్లివారు గొల్ల కలాప ప్రదర్శనం ఇవ్వడానికి మూలకారకులు. వీరి

మరణానంతరం వీరి సోదరులు నూరయ్యా, వెంకయ్యా, సత్యంగార్లు మారంపల్లిలోనే ఉండి గొల్లకలాపం వేర్పుతూ చిత్తజల్లువారితో కలసి చాలాకాలం ప్రదర్శనా లిస్తూ వచ్చారు. గొల్లకలాపం హాస్యానికి పెట్టింది పేరు. కామయ్యగారు హాస్యం చెప్పడంలో నిపుణులు. కామయ్య గారు తూర్పున విశాఖపట్టణంనుంచి పడమట గుంటూరు వరకు పేరు ప్రతిష్ఠలు సంపాదించారు. వీరి సోదరులు వెంకయ్యగారిది సంగీతంలో ఆరితేరిన చెయ్యి. సత్యంగారు సంస్కృతాంధ్రములలో మంచి పండితుడు. తమ సంచారంలో కలిగిన అనుభవా లన్నిటినీ సమయానుకూలంగా హాస్యంతో జోడించి చెప్పి ప్రజారంజనం చేసేవారు.

లక్ష్మీకాంతం తన కుమార్తె చినవెంకటరత్నానికి, చెల్లెలు వైదేహి కొమార్తె పెదవెంకటరత్నానికి కామయ్య గారి సోదరులవద్ద విద్యాబుద్ధులు చెప్పించి వారిని ఈ గొల్లకలాప ప్రదర్శనంలో నిపుణలను చేయించింది. వైదేహి పంచ కావ్యాలూ అమరమూ, పురాణపండ వెంకటశాస్త్రిగారివద్ద చదువుకున్నది. చిత్తజల్లువారు ఆంధ్ర దేశమం దంతటా గొల్లకలాప ప్రదర్శనా లిచ్చి గొప్ప కళాసేవ చేశారు. అరుదుగానైనా ఇప్పటికీ ఇస్తున్నారు.

చిత్తజల్లువారే కాక మరికొందరు కళావంతులు ఆంధ్ర దేశ మంతటా గ్రామాలలోని స్వామి కల్యాణోత్సవాల లోను, ధనాఢ్యుల యిండ్లలో జరిగే వివాహ సందర్భాల లోను గొల్లకలాప, భామకలాపాలు ప్రదర్శిస్తూవచ్చారు. ఈ కలాపాలు కట్టడంలో మండపేట - దుగ్గిరాల శ్రీ విరాజితం, నంగెగడ్డ - అంబుల వెంకటరత్నం, మండపేట - మాణిక్యం, దుగ్గిరాల - జగదాంబ, ఏలూరు - పువ్వుల పాపాచలం, చాటపర్తి - సుందరి, గుంటూరు - మరకతం, గుడివాడ - మధురం, వెంకటగిరి, పెండాల - సత్యభామ, రామచంద్రపురం - చింతా భద్రం, ఆమలాపురం - అన్నాబత్తుల చిట్టి, ఎండమూరి చిట్టి; పేరూరు - పుష్పావతి పేరు వహించిన దేవదాసీలు; ఈ కళను పోషించి ప్రఖ్యాతికి తెచ్చినవారు. వీరు మేళములుగా ఏర్పడి, జట్లు జట్లుగా వెళ్ళి ప్రదర్శనా లిచ్చేవారు.

కళావంతుల నృత్యాలూ, గొల్లకలాప, భామకలాప ప్రదర్శనాలూ చాలావరకు అంతరించిపోయినవి. ఈనాడు పట్టుదలగా ఈ విద్యలను అభ్యసించేవారే లేరు. కళావంతుల సంఘంలో వచ్చిన సంస్కరణ కారణంగా అందరూ వివాహాలు చేసుకోవడంవల్ల ఈ విద్యపట్ల ఆసక్తి చూపేవారు తగ్గిపోయారు. మి. రా. మూ.

**గొల్లసుద్దులవారు** (సుద్దుల గొల్లలు): కురుమవారికి బీరన్నలవా రెటులో గొల్లవారికి గొల్లసుద్దులవాండ్రటుల. వీరు ప్రధానముగా గొల్లలను యాచింతురు. కాటమరాజు కథ, కృష్ణలీలలువంటి పాటలు ప్రచార మొనర్చునది వీరే. అయ్యలరాజు నారాయణామాత్యుడు గొల్లసుద్దులవాండ్రను వర్ణించియున్నాడు. అత డభి వర్ణించినటులే వీరు కొమ్ములను, వీరణములను వాయించెదరు; కొందరు శంఖములకూడ నూదెదరు. వీరణము పెద్ద డోలువంటిది. గొల్లలకు కాటమరాజు ఆరాధ్య దైవతము. సాధారణముగా గొల్లలు వైష్ణవులు; కొందరు శైవులుకూడ గలరు. గొల్లసుద్దులవారు కథలు చెప్పునపు డొక విశేష ముండును. కథా విషయములు పెద్ద పెద్ద బట్టలపై చిత్రింపబడి యుండును. తెలంగాణమున పాండవులవారను ఒక గాయక భిక్షుక జాతి గలదు. వీరు తెలుగువారిని యాచించెదరు. పాండవుల కథలు పెద్ద చీరలపై వ్రాసి యుంచుట వీరికడ నున్నది. పాండవుల వారివలెనే గొల్లసుద్దులవారుకూడ కాటమరాజు కథలు, కృష్ణలీలలు చిత్రప్రదర్శన మొనర్చుచు కథలు చెప్పెదరు. కాటమరాజునకు నతులు గూర్చుట, గంగకు వేటలు బోనములు సిడులు కావించుట తెలుగునాట గల వీరారాధనము. గొల్లసుద్దులవారి యార్భాట మా సమయములందు కాననగును. సంఘమున బ్రహ్మ, క్షత్రియ, వైశ్యజాతుల తరువాత గొల్లలు పరిగణింపదగినవారు. శూద్రులందు వీ రుత్తములు. గొల్లలం దెన్నియో తెగ లున్నవి. వీనిలో ఎఱ్ఱగొల్ల తెగ శ్రేష్ఠమైనది. గొల్లసుద్దులవారు ఎఱ్ఱగొల్లలు. ఎఱ్ఱగొల్లస్త్రీలు కుడివైపునకు పయట వేసెదరు. ఒకప్పు డాలమందల పెంచినను నేడు గొల్లల ప్రధాన వృత్తి మేకలను పెంచుట. సుద్దుల గొల్లలకు గూడ భిక్షావృత్తితో పాటు మేకలను పెంచుటయును గలదు. వీరిలో కొందరికి మారుమను వున్నది; మరికొందరికి లేదు. ఓలి వంటి యాచారములు కూడ కలవు. పెండ్లిలో ప్రోలు పోయుట, అవి రేణుల నర్చించుట కూడ కలదు. సమాశ్రయణము జరిగిన వారి ఇండ్లయందు వైష్ణవ బ్రాహ్మణులే పౌరోహిత్యము నెరపెదరు. బి. రా. రా.

**గోపన్న**: (రామదాసు; చూ: వాగ్గేయకారులు.)

**గోపాలకృష్ణయ్య, దుగ్గిరాల** (క్రీ. శ. 1889-1928) రామదాస బిరుదాంకితుడు, వెలనాటి వైదికి. ఇంటిపేరు దుగ్గిరాలవారు, హరిత స గోత్రజుడు. తండ్రిపేరు కోదండ రామస్వామి, తల్లి సీతమ్మ. ఇతడు కృష్ణజిల్లా నందిగామ తాలూకా, పెనుగంచిప్రోలులో జన్మించెను. అతని పితృస్థానము గుంటూరుజిల్లా రేపల్లె తాలూకాలోని కూచిన పూడి గ్రామము. కుటుంబస్థితి సామాన్యము. పుట్టిన మూడవ రోజుననే తల్లియు, మూడవయేట తండ్రియు గతించిరి.

కావున బాల్యమం దాతనికి పినతండ్రి శివరామయ్యయు, ముత్తవయు సంరక్షకులైరి. 1903 లో వివాహము. అర్ధాంగి శ్రీ దుర్గాభవానమ్మ; వారి యేకైక పుత్రుడు రామచంద్రమూర్తి. గుంటూరు పురమునం దుద్భవించిన ఆంధ్రోద్యమ మాతని నాకర్షించెను. 1906 వరకు అతడు గుంటూరులోనే విద్యాభ్యాస మొనర్చెను.

విద్యార్థి దశలోనే గోపాలకృష్ణునకు ఆనాటి శ్రీ అరవిందఘోషు, లోకమాన్య బాలగంగాధర తిలక్ గారలు ఆరాధ్యవీరులైరి.

గోపాలకృష్ణుడు మెట్రిక్యులేషన్ పరీక్ష పూర్తిచేసి, బాపట్లలో కొద్దికాలము తాలూకా కచ్చేరీలో గుమాస్తా పని చేసెను. కాని వెంటనే యా పని మానుకొని గుంటూరులో ఇంటర్మీడియెట్ చదువు ప్రారంభించి, అచ్చటినుండి నడింపల్లి నరసింహారావు గారితో గూడి రహస్యముగ ఇంగ్లాండుకు ఉన్నత విద్యాభ్యాసమునకై బయలుదేరి పోయెను. గోపాలకృష్ణుడు 1911 నుండి 1916 వరకు సీమలో నుండి ఎడింబరో విశ్వవిద్యాలయమందు ఎమ్. ఏ. పరీక్షలో నుత్తీర్ణుడై స్వదేశమునకు జేరుకొనెను. ఆంగ్లసీమలో నున్న కాలమందే యాతడు సుప్రసిద్ధ తత్వవేత్త, కళాకారుడు, విమర్శకుడునగు డాక్టర్ ఆనందకుమారస్వామి యొద్ద శుశ్రూష చేసి తన భావిజీవితమును కొంతవరకు రూపొందించుకొనెనని చెప్పవచ్చును.


చిత్రము 142.
దుగ్గిరాల గోపాలకృష్ణయ్య

ఇంగ్లాండునుండి స్వదేశమునకు వచ్చిన పిమ్మట 1917 - 18 లో రాజమహేంద్రవరములోని ప్రభుత్వపు ట్రెయినింగు కళాశాలలోను, 1918 - 19 లో బందరు జాతీయ కళాశాలయందును గోపాలకృష్ణుడు అధ్యాపకత్వమును స్వీకరించెను. కాని స్వాతంత్ర్య ప్రియుడగు యీతని కీ విద్యాలయములు రుచించలేదు. కావున 1919 లో చీరాల-పేరాల సమీపమున అతడు 'శ్రీ మదాంధ్ర విద్యాపీఠ గోష్ఠి' అను పేరిట నొక విద్యాసంస్థ నెలకొల్పెను. ఇంతలో అప్పటి రాజకీయ వాతావరణము ననుసరించి గాంధీమహాత్ము డప్పటి ప్రభుత్వముపై అసహాయోద్యమము నారంభించగా గోపాలకృష్ణుడును అం దొక వీరభటుడై యావద్భారత స్వరాజ్యోద్యమములో తన చీరాల - పేరాల సమస్యను ఒక యంశముగ జేసి ప్రభుత్వముతో పోరాడెను. ఈ రంగమం దీతనికి తోడ్పడిన భటవర్గము శ్రీరామదండు. ఈ యుద్యమ ఫలితముగ గోపాలకృష్ణుడు కారాగారమున కేగి జెయిలులో నొక యేడు గడపి విముక్తు డయ్యెను. అనంతర మాతడు హిందూసంఘమును సంస్కరింప దలపెట్టెను.

'నేను గాయత్రి మంత్రోపదేశముచే ఎల్లరకు ద్విజత్వమిప్పించుటకు సంకల్పించినాను. ప్రతి గ్రామమునం దొక బ్రాహ్మణగోష్ఠి నెలకొల్పెదను. ఇందు జేరువా రెల్లరు బ్రాహ్మణులుగ నెంచబడుదురు. ప్రతి గోష్ఠియు నొక విద్యాలయమును, ఒక వైద్యాలయమును నెలకొల్పవలెను. వీని కుపాంగములుగ నొక గ్రంథాలయమును, సహకార పరపతి సంఘమును, పంచాయితీ కోర్టును స్థాపించవచ్చును. వీని మూలమున ఈ గోష్ఠికి గ్రామ పాలనాధికారము సిద్ధించును. ప్రతి గ్రామము నీరీతి బలపడిన యెడల సంఘీభావము కరతలామలకమై స్వరాజ్యము సుసాధ్యమగును' (బందరు ఉపన్యాసము, తే. 10-11-22). ఇది ఆత డుద్దేశించిన సంస్కరణ పద్ధతి. దాని నాచరణలోనికి తెచ్చుట కాతని కాయుర్దాయము లేకపోయినది.

గోపాలకృష్ణుడు పండితుడు, కవి, గాయకుడు, విమర్శకుడు, రాయకీయవేత్త, మహావక్త, మతప్రవక్త, అన్నిటికంటె మిన్న యాతడు శ్రీరామభక్తుడు. శ్రీ ఆనంద కుమారస్వామితో గలసి అతడు అభినయదర్పణమును ఆంగ్ల భాషలోని కనువదించెను. హిందూ-ముస్లిము ఐక్యత యనగా హైందవ ధర్మము, ముస్లిము ధర్మము, క్రైస్తవ శిఖు పారశీకాది మతము లన్నింటి ధర్మముల యొక్క సమ్మేళనమేయని చాటిన మహామేధావి మన గోపాలకృష్ణుడు. గు.వెం.సు.

**గోపాలాచార్యులు, దీవి** (క్రీ. శ. 1872 - 1920): తండ్రి రామకృష్ణమాచార్యులు; తల్లి రాజ్యలక్ష్మమ్మ; జన్మస్థానము మచిలీపట్టణము. వీరి సుతులలో వీరు జ్యేష్ఠులు. వీరిది పరంపరాగతమైన వైద్యకుటుంబము. పదమూడేండ్ల వయస్సువరకు మచిలీ పట్టణముననే తెనుగు సంస్కృతము చదివినారు. వీరు జ్ఞానతృష్ణతో దేశాటనము పలుమారు గావించి అమూల్యములగు చికిత్సా రహస్యముల ననేకము గ్రహించిరి. మైసూరు మహారాజావారి ఆయుర్వేద పాఠశాలలో చదివి ఆయుర్వేదాధ్యయనమును పూర్తిచేసిరి.

అనంతరము వీరు బెంగుళూరులోని థియొసాఫికల్ సొసైటీ వైద్యశాలలో చికిత్స కోద్యోగమున ప్రవేశించిరి. అచట నున్నపుడు వీరు మహామారి నివారకములగు హైమాది పానకమును, శతధౌతఘృతమును తయారు

చేసిరి. తమ యిరువది నాల్గవయేట మదరాసుకు వచ్చి శ్రీ కన్యకాపరమేశ్వరి దేవస్థానపు ధర్మ ఆయుర్వేద వైద్యశాలలో ప్రధాన చికిత్సకులుగా చేరిరి ; తొలుత మద్రాసు ఆయుర్వేదిక్ లేబరేటరీని, అనంతరము ఆయుర్వేదాశ్రమమును స్థాపించిరి.

శ్రీ కన్యకాపరమేశ్వరీధర్మ సంస్థచేత ఆయుర్వేద కళాశాలను స్థాపింపజేసి దానికి తామే మొదటి ప్రిన్సిపాలయిరి. తరువాత వీరు ఆ కళాశాలను స్వీయము చేసికొని తమ యింట నెలకొల్పి నడపిరి. చెన్నపురి ఆయుర్వేద ప్రచారిణీ సభను స్థాపించి దానికి మేనేజింగు డైరెక్టరుగను, దాని పక్షమున కళాశాలను నడపుచు దానికి ప్రిన్సిపలుగను ఉండిరి. విద్యార్థులసంఖ్య అధికమగుటచే కళాశాలను మరియొక విశాల భవనమునకు మార్చి దాని కనుబంధముగ నొక యుచిత ధర్మ వైద్యశాలను ప్రారంభించి అందు దినమునకు నాలుగైదు వందలమంది రోగులకు చికిత్స చేయుచుండిరి; ఆవల ఆయుర్వేద వైద్యాలయమును నెలకొలిపిరి.


చిత్రము 148.
దీవి గోపాలాచార్యులు

వీరు అమూల్యములు, నపూర్వములునయిన వైద్య గ్రంథములను సేకరించి గొప్ప గ్రంథాలయమును కళాశాల కనుబంధముగా స్థాపించిరి.

వీరు మాధవ నిదానము, అర్థప్రకాశిక, ఆయుర్వేద పరిభాష, రసప్రదీపిక, భేషజ కల్పము మొదలగు వానికి తెనుగున వ్యాఖ్యానములు వ్రాసి ముద్రించి ప్రకటించిరి. చరక, సుశ్రుతములకును వ్యాఖ్యానము వ్రాసిరి.

వీరికి 1907 లో 'భిషఙ్మణి', 'ఆయుర్వేద మార్తాండ' బిరుదము లొసగబడినవి. 1913 లో పంచమ జార్జిచక్రవర్తి వీరి మానవసేవకు మెచ్చి వీరికి 'వైద్యరత్న' బిరుదము నొసగిరి.

బొంబాయి (1913), హరిద్వారము (1917) తిరువనంతపురము (1916), కొల్లెంగోడు (1919) లలో జరిగిన ఆయుర్వేద పరిషత్తులకు, మహాసభలకు వీరు అధ్యక్షత వహించిరి. పలుమారు వీరు అఖిల భారతాయుర్వేద మండలికి అధ్యక్షులైరి ; మదరాసుకు తాము రప్పించిన అఖిల భారత (ఆయుర్వేద) విద్యాపీఠమునకు ఛాన్సెలరు పదము నధిష్ఠించిరి.

ఆచార్యులుగారి హృదయము దయార్ద్రము ; ఆశయ ముదారము ; చేయి దాన తత్పరము ; శిష్యప్రేమ అపారము. వీరు తమ సర్వస్వము నాయుర్వేదాభ్యుదయమున కర్పించిరి ; ఆయుర్వేదాభ్యున్నతికై మైసూరు విశ్వవిద్యాలయమునకు రు. 35 వేల రూపాయలు దానము చేసిరి.

వీరు విద్యార్థులయెడ పుత్రవాత్సల్యము గలిగినవారు ; వైద్యులు, దేశభక్తులు, రాజకీయ వేత్తలు, నాయకులు, పండితులు. ప్రకృతిచేతను, ప్రవర్తనచేతను సకలజనాదరమునకు పాత్రులైనవారు.

వీరు నెలకొల్పిన సంస్థలలో ఆయుర్వేదాశ్రమము మిక్కిలి పెంపొందినది. గ. సు.

**గోవిందమంత్రి, పోలూరి :** ఈయన ఆర్వేలనియోగి వంశీయుడు; ఆపస్తంబసూత్రుడు, కౌండిన్య సగోత్రుడు, ఓబయామాత్యుని పుత్రుడు ; రామామాత్యునికి వెనుకటివాడనియు, వేంకటమఖికి ముందటివాడనియు తోచుచున్నది. ఈయన 'రాగతాళ చింతామణి' అను గ్రంథమును వ్రాసియున్నాడు. ఈ గ్రంథమునకు మరియొక పేరు 'సంగీతశాస్త్ర ప్రబంధము.' దీని నాంధ్రభాషలో పద్యకావ్యముగా శ్రీరామచంద్రాంకితముగా వ్రాసెను. ఇతడు 'పర్వతనారద చరిత్ర' అను కావ్యమును, 'తాళదశ ప్రాణదీపిక' అను లక్షణ గ్రంథమును రచించియున్నాడు. ఈ తాళదశ ప్రాణదీపిక భరతనాట్యశాస్త్రమందలి తాళాధ్యాయమునకు అనువాదము. ఇతడు 16 వ శతాబ్దములో ఉన్నట్లు తెలియుచున్నది. రెండవ ఆశ్వాసమునందు గీతముయొక్క ప్రాముఖ్యమును గురించియు, స్వరూపమును గురించియు వ్రాసియున్నాడు ; మూడవ ఆశ్వాసములో గీతమును గురించియు, గ్రామ మూర్ఛనల లక్షణములను గురించియు వివరించినాడు ; నాలుగవ ఆశ్వాసములో గీతమును గురించి వ్రాసినాడు ; ఔడవ, పాడవ, సంపూర్ణ, తాన రూపములైన త్రివిధ రాగ భేదములను ప్రధానముగా ప్రతిపాదించినాడు ; తక్కినవి నృత్త వాద్య స్వరూపములను అయిదవ ఆశ్వాసములో వివరించినాడు. ద్వా. పా.

**గోవిందరాజాచారి - వింజమూరి** (క్రీ. శ. 1896 - 1948) : ఈయన విశాఖపట్టణము జిల్లా, చీపురుపల్లి తాలూకా, గొల్లలపాళెం గ్రామములో జననమందెను. ఈయన తండ్రి నరసింహాచారి.

ఈయన విజయనగరం మహారాజాగారి కళాశాలయందు చదివి 1916 లో బి. ఏ. పరీక్షయందు మొదటి తరగతిలో నుత్తీర్ణు డయ్యెను. తరువాత రెండేండ్లు ఆ కళాశాలలోనే అధ్యాపకుడై యుండెను. అనంతరము మదరాసు

న్యాయశాస్త్ర కళాశాలలో చదివి యఫ్. యల్. పరీక్షయందు మొదటి తరగతిలో ప్రథమ స్థానమునను, బి. ఎల్. పరీక్షయందు తృతీయ స్థానమునను కృతార్థు డయ్యెను; క్వీన్ యొక్కయు, జనరల్ మాక్డోనాల్డు యొక్కయు బంగారు పతకములను, కార్డోబో, మోర్ హెడ్ బహుమతులను బడసెను,

సుప్రసిద్ధ న్యాయవాది ప్రముఖుడైన సర్ అల్లాడి కృష్ణస్వామయ్యవద్ద న్యాయవాద వృత్తియందు ఈయన మంచి యనుభవమును గడించుకొని 1921 లో మదరాసు నగరమున స్వతంత్రముగా న్యాయవాద వృత్తిని ప్రారంభించెను. కొలది సంవత్సరములలోనే ఈయన న్యాయవాద వృత్తి భాషా సీమలను దాటి నలువైపుల కెగప్రాకి మిక్కిలి అభివృద్ధినొంది ఈయనకు పేరు ప్రఖ్యాతులను తెచ్చినది. 1946 లో ఈయనకు మదరాసు హైకోర్టులో న్యాయమూర్తి పదవి లభించినది.

ఈయన 1932 మొదలుకొని మదరాసు విశ్వ విద్యాలయమునకు న్యాయశాస్త్ర విషయములయందు సలహాదారుడుగా నుండెను; చాల ఏండ్లు మదరాసు అడ్వొకేట్సు సంఘము యొక్క మేనేజింగు కమిటీలో సభ్యుడై యుండెను; 1931 మొదలుకొని మదరాసు బార్ కౌన్సిల్ సభ్యుడై యుండెను. ఈయన కాస్మపాలిటన్ క్లబ్బుకును, దాని మేనేజింగ్ కమిటీలోను సభ్యుడుగాను, దానికి న్యాయశాస్త్ర విషయముల యందు సలహాదారుడుగను ఉండెను. స్మిత పూర్వమగు ప్రియ భాషణము, అతిమాత్రమగు సౌజన్యము, మేలి ప్రవర్తనము, సరళ స్వభావము సహజములగుటచే ఈయన ఎల్లరకు సన్నిహితు డయ్యెను.



చిత్రము 144.
వింజమూరి గోవిందరాజాచారి

ఈయనకు గల న్యాయశాస్త్ర ప్రావీణ్యము, విషయ వివేచన పాటవము, స్పష్టీకరణ నైపుణ్యము, న్యాయైక పక్షపాతము న్యాయవాదులయు, న్యాయమూర్తులయు గౌరవాదరముల కీయనను పాత్రము గావించినవి.

కళలకు, సాహిత్యమునకు, సంస్కృతికి, సంఘమునకు సంబంధించిన విషయములందు ఈయనకు శ్రద్ధాభిమానము లపరిమితము. వర్ధిష్ణు చిత్రకారుల కీయన చేయూత యిచ్చువాడు. తెలుగు భాషా సమితి కార్య నిర్వాహక వర్గమున ఈయన సభ్యుడై యుండెను. ఓ. న.

**గోవిందరావు, వనారస** (క్రీ. శ. 1867 - 1953): వీరు ఆరె మరాటీలు. వీరి పూర్వులది మొదట పూనా ప్రాంతం. వీరు మహమ్మదీయుల దండయాత్రలవల్ల దుండగాలవల్ల బళ్లారి, రాయదుర్గం, ఆదవాని ప్రాంతాలకు వచ్చి అక్కడ ఉంటూ ఉండిన కాలంలో 1876 లో ధాత కరువు వచ్చింది. ఆ ప్రాంతాలనుండి వీరి తండ్రి తాతలు కడపజిల్లా సురభి గ్రామానికి వచ్చి అక్కడ స్థిరపడ్డారు. అందుచేతనే వీరు స్థాపించిన నాటక సంఘాలకు సురభి నాటక కంపెనీలని పేరు వచ్చింది.

గోవిందరావుగారు 1915 వరకు సురభి గ్రామంలోనే ఉండి తరువాత పశ్చిమ గోదావరిజిల్లా ఏలూరు తాలూకా పోలసానిపల్లె గ్రామానికి వెళ్ళి దానిని తమ కాపురస్థలం చేసుకొన్నారు. ఆ గ్రామంలో బాలబాలికల విద్యావ్యాప్తికి ఒక పాఠశాలను స్థాపించి, అచ్చట రెండు మూడు బావులు త్రవ్వించి అక్కడి జనానికి మంచినీటి కొరత తీర్చారు.

గోవిందరావుగారు నాటక రంగంలో స్త్రీ పాత్రలను ధరించుటకు స్త్రీలనే ప్రవేశపెట్టడం ముఖ్యమైన విషయం. నాటకరంగంలో స్త్రీలే స్త్రీపాత్ర ధరించినగాని ఔచిత్యముండదన్న విశ్వాసంతో తాము స్థాపించిన సురభి నాటక కంపెనీలలో తమ కుటుంబములోని స్త్రీలచేత స్త్రీ పాత్రలు ధరింపజేశారు.

వీరు చాలా చిన్నతనంలోనే సంగీత సాహిత్యాలలో ప్రావీణ్యం సంపాదించి సురభి నాటక కంపెనీలలో నాయక పాత్ర ధరిస్తూ వచ్చారు. సురభి నాటకమండలి కధిపతిగా ఉండి సమర్థతతో తమ సమాజాలను నడిపారు.

గోవిందరావుగారు దానధర్మ నిరతులు; అనేకులు కవులకు, నటులకు, నాటక రచయితలకు చాల సహాయము చేసినారు. 1929 లో వీరు, కాశీనాథుని నాగేశ్వరరావుగారు కలిసి ఆచంట వెంకట సాంఖ్యాయన శర్మగారి అధ్యక్షతను ఆంధ్ర నాటక కళా పరిషత్తు స్థాపించి ఆంధ్ర నాటక కళోద్ధారకు లనిపించుకొన్నారు. ఆంధ్రదేశంలోని సాహితీపరులు, నాటక రచయితలు, కళాభిమానులు, నటులు కలిసి 1937 లో ఏలూరులో గోవిందరావుగారి జన్మదినోత్సవం మహా వైభవంగా జరిపి కృతి సమర్పణాది బహుమాన పురస్సరంగా వీరిని సమ్మానించారు; ఏలూరులో వీరి శిలావిగ్రహ ప్రతిష్ఠాపన జరిగింది. ఆంధ్ర నాటకరంగాని కపూర్వ సేవ చేసిన వీరు తమ 86 వ యేట 1953 లో కీర్తిశేషులైనారు. మి.రా.కృ.

**గోవిందసామయ్య :** తెలుగు పదములు రచించిన వారిలో వీరును, వీరి సోదరులు కూవన సామయ్యగారును గణనీయులు ; తెలుగు బ్రాహ్మణులు. వీరికి తెనుగులోను, సంగీతములోను చక్కని పాండిత్యము కలదు. వీరి పదములలో శృంగారరసము చక్కగా ప్రతిబింబించుచుండును. కార్వేటినగర సంస్థానాధీశులపై వీరు మోహనరాగములో నొక వర్ణమును రచించిరి. వీరి నవరోజు, కేదారగౌళ వర్ణములు ప్రసిద్ధి గాంచినవి. ద్వా. పా.

**గౌరీశంకరవర్మ, నాంపల్లి** (క్రీ.శ. 1878-1941) : వీరు చంద్రవంశమునకు చెందిన క్షత్రియులు. వీరిది వరంగల్లు జిల్లాలోని పెద్ద పెండ్యాల గ్రామము. తల్లిదండ్రులు లింగమాంబా శేషయ్యగారల నలుగురి కుమారులలో వీరు కనిష్ఠులు. వర్మగారి బాల్యముననే తల్లిదండ్రులు, ముప్వు రన్నలును గతించగా, వీరి వదినగారగు శ్రీమతి రాజమ్మగారు చాల కష్టపడి వీరికి విద్యాబుద్ధులు నేర్పించినది. వర్మగారు కొన్ని చేతిపనులు నేర్చుకొని తన్మూలముననను, ఉద్యోగమువల్లను ఒకవైపు ధనము సంపాదించుచు ఇంకొకవైపు విద్యా సముపార్జనము చేసిరి. సుప్రసిద్ధ పండితులును, బహుభాషా కోవిదులును అగు కొండల



చిత్రము 145.
నాంపల్లి గౌరీశంకరవర్మ

రావుగారికి శుశ్రూష యొనర్చి తెలుగును, ఉపనిషద్రహస్యములను, వేదాంతమును, యోగమును నేర్చుకొనిరి.

వర్మగారు మొదట సింగరు సూయింగు మెషీన్ కంపెనీలోను, తరువాత కలకత్తా ఇండియన్ టీసస్ కమిటీ వారిక్రిందను పనిచేసిరి.

గాంధిగారి జాతీయోద్యమము వర్మగారి నాకర్షింపగా వారు తమ యుద్యోగమును విడిచిపెట్టి గాంధీతత్త్వ ప్రచారమునకు దిగిరి. హైదరాబాదునుండి కాంగ్రెసు సభ్యులుగా వీరు కరాచీ, కలకత్తా మున్నగుచోట్ల జరిగిన కాంగ్రెసు సమావేశములకు పోయిరి.

తెలుగు భాష, తెలుగు సంస్కృతి యనిన వర్మగారి కభిమానము మెండు. శ్రీకృష్ణదేవరా యాంధ్రభాషా నిలయము స్థాపించిన వారిలో వర్మగా రొకరు. కొన్నాళ్లు దానికి సహాయ కార్యదర్శిగా నుండి భాషా నిలయము నభివృద్ధికి గొనివచ్చిరి.

హైదరాబాదులో విద్యాప్రచారమునకు తోడ్పడిన వారలలో వర్మగా రొకరు. సుల్తాను బజారులో ఆడుపిల్లలకు మాధ్యమిక పాఠశాల లేనందున వర్మగారు దరఖాస్తు వ్రాసి ఇల్లిల్లు తిరిగి సంతకములు సేకరించి ప్రభుత్వము వెంటబడి సుల్తాను బజారులో ఆసుపత్రి కెదురుగా నొక బడి స్థాపించునట్లు చేసిరి. నారాయణగూడలో ఆంధ్ర బాలికా పాఠశాలను స్థాపించినవారలలో వీ రొకరు. వర్మగారు హైదరాబాదులోని ఆంధ్ర సంస్థ లన్నింటికిని నిస్స్వార్థ సేవ చేసిరి. తన్ను పెంచి, పెద్దచేసిన వదినగారి పేర ఉత్తమ గ్రంథ భరితమైన ఒక బీరువాను, కష్టపడి తాము కట్టించుకొన్న గృహముతోకూడ ఆంధ్ర బాలికా పాఠశాలకు దానము చేసిరి. బి. రా. రా.

**ఘంటయ్యశాస్త్రి, వారణాసి** (క్రీ. శ. 1895 - 1957) : జంత్ర గాత్ర గానములకు మృదంగ వాద్యము భాషకు వ్యాకరణమువంటిది. ఆ మృదంగ వాద్యము సునాదమై జంత్ర గాత్ర గానపోషకమైనచో గలుగు నానందము వర్ణనాతీతము. అట్టి రసానుభూతిని పెంపొందించునట్టి విద్వాంసుల కోవలోనివారు వారణాసి ఘంటయ్యశాస్త్రిగారు. రెండవ జగన్నాథ క్షేత్రమని ప్రసిద్ధి గాంచిన కృష్ణామండలమందలి వడాలి యగ్రహారము వీరి జన్మస్థానము. సుబ్బరామయ్య, లక్ష్మీనరసమాంబలు తలిదండ్రులు. వీరి పుత్రులలో శాస్త్రిగారు మూడవవారు. వీరికి ముగ్గురు కుమారులును, ముగ్గురు కుమార్తెలు గలరు.

శాస్త్రిగారు బాల్యమం దన్నగారైన సంగీత విద్వాన్ బ్రహ్మయ్యశాస్త్రిగారి వద్ద విద్య నేర్చి పిదప తోటవల్లూరునందు శివలెంక వీరయ్య అయ్యవార్లంగారి వద్ద శాస్త్రాభ్యాసము చేసి, కుంభకోణమందలి మృదంగం కోదండరామయ్యరు గారివద్ద తమ కళాకౌశలమునకు మెరుగులు దిద్దుకొన్నారు. గానసభలయందు వీరి కళాభిజ్ఞతను దాక్షిణాత్యులు ప్రశంసించి రనుటకు సంగీతమున 'టైగర్' బిరుదువహించిన స్వర్గీయ శ్రీ వరదాచారిగారి అధ్యక్షతను మదరాసు ఆంధ్ర ప్రజాసంఘమును, సంగీత విద్వన్మండలియును 1932 లో సువర్ణ ఘంటాకంకణము లొసంగి వీరిని సన్మానించుటయే ప్రబలనిదర్శనము.



చిత్రము 146.
వారణాసి ఘంటయ్యశాస్త్రి

వీరు అనేక సంస్థానములందు, అనేక నగరములయందు తమ వాద్య నైపుణ్యమును ప్రదర్శించి సువర్ణ ఘంటా కంకణాది బహుమతులం బడసి మృదంగకేసరి, మార్దంగిక శిరోమణీత్యాది బిరుదు లందిరి. వీరి విశిష్టతను, కళాసేవను గుర్తించి — గురజ, ఆకివీడు, నరసాపురం మొదలగు పలుతావుల గానకళాభిమానులు గజారోహణాది సత్కారము గూడ నొనర్చిరి. వీరు తమ 62 వ ఏట కాలధర్మము చెందిరి. వా. బ్ర. శా.

ఛార్లెస్, ఫిలిప్ బ్రౌన్ (క్రీ. శ. 1798 - 1884): పందొమ్మిదవ శతాబ్దియొక్క పూర్వార్ధమున ఆంధ్ర భాషా సాహిత్యములకు అసమానమైన సేవ చేసిన బ్రౌను దొర 1798 లో కలకత్తా నగరమున జన్మించెను. ఈతని తండ్రియగు డేవిడ్ బ్రౌన్ అచ్చట చర్చి ఉద్యోగిగా నుండెను. తండ్రి ప్రోత్సాహమువలన ఇతడు బాల్యమునసే హీబ్రూ, అరబ్బీ గ్రీకు, లాటిన్, హిందుస్తానీ భాషలను నేర్చుకొనెను. అప్పుడప్పుడు తండ్రికి 'ప్రూఫు'లు చదువుట యందు సాయము చేసెడివాడట. ఈ విధముగా చిన్నతనముననే అతని భవిష్యద్వ్యాపారమునకు పనికివచ్చు విషయములలో పునాదులు పడెను. తండ్రి చనిపోయిన తరువాత భారతదేశమును వీడి తన పదునాలుగవ యేట విద్యాభ్యాసమునకై ఇంగ్లండునకు పోయెను. అక్కడ అయిదు సంవత్సరము లుండి 1817 లో మద్రాసుకు వచ్చెను. అంతవరకు అతనికి తెలుగు అను భాష ఒకటి ఉన్నదనికూడ తెలియదట. ఇది అతని జీవితములో మొదటి ఘట్టము.

1817 నుండి తాను 1855 లో శాశ్వతముగ తన దేశమునకు వెడలిపోవువరకు — నడుమ ఒకటి రెండు సారులు సెలవుమీద స్వదేశమునకు పోయినను — మద్రాసు రాష్ట్రములోనే, ముఖ్యముగ ఆంధ్ర ప్రాంతమున బ్రౌను తన జీవితము నంతను గడపెను. ఆ రోజులలో కంపెనీ ఉద్యోగులకు తీరికలేనంత పని యున్నను, తన విశ్రాంతి కాలము నంతను ఆంధ్రభాషాసేవకై వ్యయముచేసి, ఆంధ్రుల మన్ననలకు, కృతజ్ఞతకు పాత్రుడైనాడు. భారతదేశములో ఉన్న సుమారు నలుబది సంవత్సరములు అతని జీవితములో రెండవ ఘట్టము. ఆతనికి శాశ్వత కీర్తిని, ఆంధ్రులకు అనంత లాభమును తెచ్చిన భాషాసేవ యంతయు ఈ కాలముననే జరిగెను.

బ్రౌనుదొరకృషిని విషయమును బట్టి అయిదు విభాగములుగ విభజింపవచ్చును. ప్రారంభ దశలోని అతని కృషి 1829 లో వేమనపద్యముల ఆంగ్లీకరణము మొదటి విభాగము. తాళపత్రములలో 'అసూర్యంపశ్య'ములయి ఉన్న తెలుగు కావ్యముల నుద్ధరించుటకై ఆతడు చేసిన కృషి రెండవ విభాగము. ఈ కృషియం దాతనికి జూలూరి అప్పయ్య, రావిపాటి గురుమూర్తిశాస్త్రి, వఠ్యం అద్వైత బ్రహ్మశాస్త్రి మొదలయిన పండిత ప్రకాండులు సాయము చేసిరి. మనుచరిత్ర, వసుచరిత్ర మొదలయిన, భాషకు మండనాయమానములగు గ్రంథములు వ్యాఖ్యలతో అచ్చగుట బ్రౌనుదొర కృషి ఫలితమే. తెలుగు నేర్చుకొనగోరు పాశ్చాత్యులకు, ఇంగ్లీషు నేర్చుకొనగోరు భారతీయులకు — ముఖ్యముగా తెలుగువారికి — పనికివచ్చునట్లు వివిధ నిఘంటువులను నిర్మించుటకై ఆతడు చేసిన కృషి మూడవ విభాగము. 1852, 1853 సంవత్సరములలో అచ్చయిన నిఘంటువులు, 1854 లో అచ్చయిన 'మిశ్రభాషా నిఘంటువు' ఆతడు కూర్చిన ముఖ్య నిఘంటువులు. ఆంగ్లములో తెలుగునకు సాధ్యమైనంతవరకు సమగ్రమయిన వ్యాకరణము వ్రాయవలెనని అతడు చేసిన కృషి నాలుగవ విభాగము. దీని ఫలితమే 1840 లో అచ్చయిన అతని తెలుగు వ్యాకరణము. తెలుగు వాచకములు, ఛందస్సుపై వ్యాసములు, వివిధ విషయములపై వ్రాసిన వ్యాసములు, హిందూ ముస్లిము చరిత్రకు సంబంధించిన కాలనిర్ణయ పట్టికలు, క్రైస్తవ మత సంబధమైన రచనలు మొదలయినవి అయిదవ విభాగము. పైని పేర్కొన్న అయిదు విభాగములకు చెందని కృషి - తాళపత్ర గ్రంథ సేకరణము, పాఠశాలలను నెలకొల్పుట మొదలగునవి - చాల కలదు. ఏనుగుల వీరాస్వామయ్యగారు మొదలయిన దేశీయ మేధావు లందరు అతని స్నేహితులే. వీరి సాయముతో అతడు భారతీయ సంస్కృతి సౌధమును ప్రవేశించుటయే గాక తన ప్రతిభతో దానిని ప్రకాశింపజేసినాడు.

1855 లో స్వదేశమునకు పోయిన తరువాత 1884 లో తన మృతివరకు ఇంగ్లండులోనే యుండి ఆంధ్ర భాషాసేవ చేసినాడు. ఇది అతని జీవితములోని మూడవ ఘట్టము. ఈ కాలమందే అతడు లండను విశ్వవిద్యాలయమున ఆంధ్రాచార్య పీఠము నధిరోహించెను. ఇట్లీమహోనుభావుడు తాను జీవించిన ఎనుబది యారు సంవత్సరములలో అరువది యేడు సంవత్సరములు (1817 నుంచి 1884) ఆంధ్ర భాషా సేవలో గడిపినాడు. ఆ కాలమున తన ఇల్లే ఒక విద్యా కేంద్రముగ, తానే ఒక మహారాజ పోషకుడుగ వ్యవహరించి ఆంధ్రభాషా సాహిత్యములకు సేవచేసినాడు కనుకనే, పండితులను పోషించినాడు కనుకనే సమకాలికులచే 'నూర్లార్ల లెక్క చేయక.... వేమార్లర్థ మిచ్చు వితరణి' అని కీర్తింపబడెను. క్రొ. పీ.

చిదంబరశాస్త్రి, పిశుపాటి (క్రీ. శ. 1892-1951): నెల్లూరు మండలములోని కరవది వీరి స్వగ్రామము. వీరి

తండ్రి సీతారామయ్య, తల్లి కనకమ్మ. వీరు బాల్యమున సంస్కృతభాష నభ్యసింప మొదలిడి, తరువాత తిరుపతి సంస్కృత పాఠశాలలో ప్రవేశించి అచట నాటకాంత సాహిత్యజ్ఞానము నలవరచుకొని సంస్కృతమున కవిత్వము చెప్పుటకును నేర్చుకొనిరి; ఆకిరిపల్లి మొదలగుచోట్ల మహా మహులగు పండితులకడ చదివి తర్కవ్యాకరణ వేదాంత మంత్ర శాస్త్రములం దఖండ పాండిత్యమును సంపాదించిరి; సంస్కృతములో దినమున కొక శతకమును రచింప గలిగిరి; స్వయంకృషిచే ధర్మశాస్త్రమున ప్రావీణ్యమును గడించిరి. వీ రాంధ్రముననను ధారాళముగ కవిత్వము చెప్పగలిగిరి.

విజయవంతముగ సంస్కృతముననను, ఆంధ్రముననను అష్టావధాన, శతావధాన, ఆశుకవితా సభలను శతాధిక ముగా జరిపి అనేక విధములగు సత్కారములను గాంచిరి.

మైసూరు మహారాజు ఆస్థానమున వీరు 1920 మొదలు కొని ఆస్థాన మహావిద్వత్పదవి నధిష్ఠించి యుండిరి. తిరువాన్కూరు మహారాజాస్థానమున 'నరసింహ కంకణ' సత్కారమును బడసిరి; గజారణ్య క్షేత్రమున (తలకాడు లో) 'ఆశుకవికేసరి' అనియు, దర్భంగ మహారాజు ఆస్థాన మున 'కావ్యకళానిధి' అనియు బిరుదములను పొందిరి; గద్వాలసంస్థానముననను కొంతకాలము ఆస్థానకవి పద మున నుండిరి. వీరికి పెక్కు సంస్థానములందు వార్షికము లును లభించుచుండెడివి.

వీరు 1926 నుండి 15 ఏండ్లు సూర్యరాయాంధ్ర నిఘంటు రచనా కార్యమును ఇతర పండితులతోపాటు నిర్వహించిరి.

1942 వ సంవత్సరమున వెంకటగిరి సంస్థానమున నాస్థానకవి పదవి నధిష్ఠించి ఏబది నాలుగువేల గ్రంథములు గల పద్మపురాణము నాంధ్రీకరింప నారంభించి 1951 లో పరిసమాప్తము గావించిరి. విద్యాభ్యాసముతోపాటు వీరు బాల్యమునుండియే సంస్కృతాంధ్ర గ్రంథములను పెక్కింటిని రచించిరి.

వీరి కవిత్వము సరళమైనది. సంస్కృతాంధ్రములయందు వీరి పాండిత్యము గట్టిది; ప్రవచనము సుబోధమయినది; హృదయము ఉదారమయినది. వీరి రచనములలో పేర్కొన దగినది ఆంధ్రీకృత పద్మపురాణము. పి. వి. శా.

**చినతిరుమలయ్యా, తాళ్లపాక** (క్రీ. శ. 1495 - 1553): ఇతడు తాళ్ళపాక పెద తిరుమలాచార్యుని పెద్ద కుమారుడు. ఇతని తాతయగు అన్నమాచార్యుడే యీతనికి బ్రహ్మోపదేశము చేసెను. ఇతడు సంస్కృతాంధ్రములందు మహాకవి, మహావిద్వాంసుడు. అష్టభాషాకవి చక్రవర్తి యని ఇతనికి బిరుదు. తన తండ్రి తాతలవలెనే యీత డును వేంకటేశ్వర స్వామిపై శృంగార సంకీర్తనములను వెలయించెను. ఇవి కాక యీతడు తెలుగున సంకీర్తన లక్షణము, అష్టభాషాదండకము అను రెండు గ్రంథములను రచించెను. ఇతని సంకీర్తన లక్షణమున అన్నమాచార్యుడు సంస్కృతమున రచించిన సంకీర్తన లక్షణమునకు లక్షణము సమగ్రముగా జెప్పబడినది. దరువులు, ఏలలు, ధవళములు అర్ధచంద్రికలు మొదలగు దేశిచ్ఛందోరచనలకు తెలుగున వెలసిన ఏకైకలక్షణగ్రంథ మిది. 'చారుతరాష్ట్రభాషా చక్రవర్తి' యని చిన్నన్న యీతనిని పేర్కొనెను. తి.కో.రా.

**చినతిరువెంగళనాథుడు, తాళ్లపాకము** (క్రీ. శ. 1498-1561 నడుమ): చిన్నన్నయని ఈతని నామాంత రము. తాళ్ళపాక పెద్ద తిరుమలాచార్యున కీతడు నాలుగవ కుమారుడు. 'చిన్నన్న ద్విపద కెఱగు'నని తెనాలి రామ కృష్ణ కవిచే బ్రస్తుతిగన్న కవీశ్వరు డితడు.

'దినములోననె వేయి ద్విపద లింపొంద, వినుతవర్ణన లతో విరచించువాడ' ననియు, 'కవిశిరఃకంప యోగ్య ప్రతిద్విపద, నవబిరుదాంకుండ' ననియు నీతడు తన 'యష్ట మహిషీకల్యాణము'న జెప్పుకొనెను. కావ్యంబు చెప్పి యెనలేని శ్రీ వేంకటేశు మెప్పించి సకలంబు నెరుగ నసాధారణాంక మకరకుండలము లిమ్మహి గొన్నవాడు ఇతడు; అష్టమహిషీ కల్యాణము, పరమయోగి విలాసము, ఉషాపరిణయము, అన్నమాచార్య చరిత్రము నను నాలుగు ద్విపద ప్రబంధములను రచించెను. ఈతడు జలజాతవాసిని చనుబాలపుష్టిచే గవితా రచన చేసినవాడట.

ద్విపదలక్షణము నీత డొక్కడే నిష్కృష్టముగా నిర్వ చించెను. లక్షణగ్రంథకారు లెవ్వరును నీతనివలె నిర్వ చింపరైరి.

'తాళ్ళపాక చిన్నన్న దండెమీటులు గావు' అనియు, 'అల తాళ్లపాక చిన్నన్న రోమము లైతె తంబురా దండెకుఁ దంత్రులగునె' యనియు నర్వాచీనులు కొందరీతని గొప్ప నాయకునిగా స్మరించిరి. కాని యీతడు గాయకు డనుటకు నిదర్శనముగా నీతడు రచించిన సంకీర్తనము లేవియు గాన వచ్చుటలేదు. ఇతడు సాలెవారి కాచార్యపురుషుడై వారి వంశమర్యాదలకు సంరక్షకుడై వన్నెకెక్కెను. వారు తామ్రశాసనము వెలయించి చిన్నన్న వంశపారంపర్య ముగా, తమ వంశపారంపర్యముగా గురుశిష్యతా సంబం ధము కల్పించుకొనిరి. తి. కో. రా.

**చినపార్థసారథినాయుడు, అవుల** (క్రీ. శ. 1848-1928): వీరు చెన్నపురి వాస్తవ్యులు. 'ఆంధ్ర ప్రకాశిక' అను వారపత్రికను నలుబదియేండ్లు నడపిరి. అందు రాజ కీయ, సాంఘిక, సారస్వతాది సకల వ్యవస్థలను గూర్చి నిష్పాక్షికములును, సహేతుకములును, సప్రమాణము

లును నగు నభిప్రాయములు వ్యక్తము లగుచుండెడివి. కావుననే యా కాలమున ఆంధ్రప్రకాశికకున్న ప్రచారము, ప్రఖ్యాతి మరి యే పత్రికకు లేకుండెను. ఆంధ్ర విద్యార్థులన్నను, కళాశాలాంధ్ర విద్యార్థి సంఘములన్నను వీరికి అంతులేని యభిమానము. ని. వెం. రా.

**చిన్నయసూరి, పరవస్తు** (క్రీ. శ. 1809-1862): వీరు చాత్తాద వైష్ణవులు. శ్రీపెరుంబుదూరు వీరి జన్మ స్థానము. వీరి తల్లి శ్రీనివాసాంబ, తండ్రి పరవస్తు వేంకట రామానుజాచార్యులు. వీరు 'ఈస్టిండియా కంపెనీ' వారి సుప్రీముకోర్టులో న్యాయశాస్త్రవేత్త పదవియందుండి నందువలన చిన్నయసూరికి చెన్నపురిలోనే విద్యాభ్యాసము జరిగినది. వీరి గురువు కంచి రామానుజాచార్యులుగారు. చిన్నయ సంస్కృతాంధ్ర ప్రాకృత ద్రవిడ భాషలందును, వ్యాకరణ తర్క మీమాంసాలంకార శాస్త్రములందును అసమాన పాండిత్యమును సంపాదించెను. ఆంగ్లభాషా పరిచయముకూడ కొంత అలవరచుకొనెను. 1844 మొదలు 1847 వరకు పచ్చయప్ప కళాశాలయందు ఆంధ్రపండిత పదవిని నిర్వహించెను. ఆ సంవత్సరముననే 'పచ్చయప్పనృప యశోమండనము' అనుపేర కొన్ని పద్యములు, శ్లోకములు రచించెను; 1847 లో మదరాసు రాజధానీ కళాశాలలో ఆంధ్రపండితుడుగ నియమింప బడెను. అప్పుడు కళాశాలాధ్యక్షుడు ఆర్బత్‌నాటు దొర చిన్నయగారి ప్రతిభాపాండిత్యములకు మెచ్చుకొని 'చిన్నయసూరి' అని ఆంగ్లాక్షరములతో పేరు చెక్కిన సువర్ణకంకణమును సీమ నుండి తెప్పించి బహూకరించి ఆయనను గౌరవించెను. అప్పటినుండి ఈయన 'చిన్నయసూరి' అని ప్రసిద్ధిగాంచెను. కళాశాలా పండితపదవిని నిర్వహించుచు సూరి ప్రాచీన గ్రంథపరిశీలనకు, భాషాప్రయోగముల సేకరణకు, ప్రామాణికాంధ్రవ్యాకరణ రచనకు ఉద్యమించెను; వాణీదర్పణ ముద్రాశాలను స్థాపించుకొనెను; 'సుజన రంజని' యను సారస్వత మాసపత్రికకు సంపాదకత్వమును వహించెను; జీవితాంతము వరకు ఆంధ్రభాషా సారస్వత సేవయందే నిమిగ్నుడై యుండెను.

సూరి రచించిన గ్రంథములు: నీతి చంద్రిక (1853) స్వీయ ముద్రాక్షరశాలలో ముద్రితమై ఆర్బత్‌నాట్ దొరగారి కంకితమైనది; 2. శబ్దలక్షణ సంగ్రహము 1853లో ప్రచురింపబడినది; గాజులసెట్టి లక్ష్మీనరసింహమున కంకితము; 3. ఆంధ్ర శబ్దానుశాసనము - తెనుగు భాషనుగూర్చి సంస్కృతములో సూత్రములరీతిని వ్రాయబడిన లక్షణ గ్రంథము; 4. పద్యాంధ్ర వ్యాకరణము - పై ఆంధ్ర శబ్దానుశాసనమున కిది ఆంధ్రీకరణము; 5. సంస్కృత సూత్రాంధ్రవ్యాకరణము - నన్నయ అథర్వణాచార్యుల వలె సూత్రరీతిని పాణిని అష్టాధ్యాయిని అనుసరించి వ్రాయబడిన ఆంధ్రవ్యాకరణ గ్రంథము. చివరి మూడు గ్రంథములును బాలవ్యాకరణ రచనకు పూర్వరచనములని తెలియుచున్నది; 6. బాలవ్యాకరణము (1858). గ్రాంథి కాంధ్రభాషకు ప్రామాణికమైన వ్యాకరణ గ్రంథము; తెనుగు వచనమున సూత్రముల నిర్మాణము - ఇది సూరి కీర్తిని చిరస్థాయిచేసిన రచనము; 7. చిన్నయసూరి నిఘంటువు. అకారాది క్రమమును పాటించిన అసమగ్ర రచనము; అముద్రితము; ఆంధ్రసాహిత్య పరిషత్‌కార్యాలయములో ప్రస్తుత మున్నది; 8 విశ్వనిఘంటువు - టీక: ఇది అలభ్యము; 9. అక్షరగుచ్ఛము - భాషాభ్యసనమున కుపయుక్తముగ రచింపబడిన గ్రంథము; 10. విభక్తిబోధిని 1860 లో ప్రచురితము; - సంస్కృతములోని శబ్దమంజరి ననుసరించి రచింపబడినది; నీతి సంగ్రహము - నూరు పద్యములుగల చిన్న సంకలన గ్రంథము. బాలుర నీతిబోధకుద్దేశింపబడినది; 12 ఆంధ్రశబ్ద చింతామణి వ్యాఖ్య - ఇది అలభ్యము.

సూరి ఇంకను కొన్ని గ్రంథములను రచించినట్లు వదంతి. ఆకాలమున ఇంగ్లీషు లాచట్టములను కూడ ఈయన భాషాంతరీకరించినాడు. బ్రౌనుదొర చిన్నయసూరికి సువరిచితుడు. శబ్దరత్నాకరకర్త బహుజనపల్లి సీతారామాచార్యులు సూరి శిష్యుడు. జి. నా. రె.

**చిలుకూరి చతుష్టయము**: సాధారణముగా సముద్ర తీరస్థాంధ్ర దేశమున చిలుకూరివారనుటతోడనే వ్యాకరణ శాస్త్రము మనస్సునకు స్ఫురించును. వీరి నివాస మాదిలో పశ్చిమ గోదావరిజిల్లా, మార్కొండపాడు. ప్రస్తుత మేతద్వంశజులు మార్కొండపాడులోను, ప్రాగ్గోదావరీ మండల మండలి పొడగట్లపల్లి మున్నగు గ్రామములలోను ఉన్నారు; చిలుకూరి చతుష్టయమనువారు సోదరులు; 19 వ శతాబ్ద్యుత్తర భాగములో ఆంధ్ర దేశమందు వ్యాకరణాచార్యులుగ, శాస్త్రార్థ దక్షులుగా విఖ్యాతులైరి.

వీరి కూటస్థ పురుషుడు రామభద్రశాస్త్రి. ఆయన అఖండ రామమంత్రోపాసకుడు. ఆయనయు పొడగట్లపల్లిలో వడ్రి కామశాస్త్రిగారి వద్ద భాష్యాంతము వ్యాకరణ శాస్త్రము నధ్యయనము చేసిరి. ఈ చతుష్టయము రామభద్ర శాస్త్రిగారి కయిదవతరమువారు. వారి తండ్రి కొండయ్య శాస్త్రిగారును, ఆయన సోదరు లారుగురును, ఆయనయు నిత్యము సుమారు నలువదిమంది విద్యార్థులకు తమ ఇంట భోజనము పెట్టి వ్యాకరణ శాస్త్రము బోధించెడివారు.

సోమనాథశాస్త్రి, పాపయ్యశాస్త్రి, లక్ష్మీనారాయణ శాస్త్రి, రామశాస్త్రి అను ఈ చతుష్టయము ముందుగ తండ్రులయొద్ద కొంతకాలము వ్యాకరణశాస్త్రము నధ్యయనము చేసిరి. కౌముది నింటివద్ద ముగించుకొని, సోమనాథ శాస్త్రిగారును, పాపయ్య శాస్త్రిగారును కృష్ణ భూపతి కాలములో జయపురాస్థానములో నుండిన ఇంద్రకంటి గోపాలశాస్త్రిగారివద్ద కేగి వ్యాఖ్యాన గ్రంథములను పూర్తిగా చదివిరి. లక్ష్మీనారాయణశాస్త్రిగారును, రామశాస్త్రిగారును వ్యాఖ్యాన గ్రంథములను కాశీలో జాగేశ్వర పండిత్ జీవారివద్ద చదివిరి. విద్య పూర్తియైనతరువాత నలువురును మార్కొండపాడు చేరి శాస్త్రాధ్యాపనము గావించుచుండిరి.

సోమనాథశాస్త్రిగారికి నిరంతర గ్రంథపరిశీలన శక్తి యుండెను; నూతన పూర్వపక్ష కల్పనా పాటవము పాపయ్యశాస్త్రిగారి ప్రత్యేక లక్షణము. లక్ష్మీనారాయణ శాస్త్రిగారి పాండిత్యము సర్వతోముఖము. సభలలో శాస్త్రార్థములు చేసి ప్రతిపక్షుల నోడించుటలో రామశాస్త్రిగారికి విశేషప్రజ్ఞ యుండెను. ఆ కాలములో గద్వాల, వనపర్తి, విజయనగరము మున్నగు సంస్థానములలోని సభలలో శాస్త్రార్థము చేసి విజ్ఞులను మెప్పించగా వచ్చిన పారితోషికముల తోడనే ఆ నల్గురకును జీవయాత్ర గడచుచుండెను. కావున వారు వార్ధక్యపర్యంతము స్వగ్రామములోనే యుండిరి. లక్ష్మీనారాయణ శాస్త్రిగారు పీఠికాపుర సంస్థానములో మొట్టమొదట శాస్త్రములకు ముఖపరీక్షలుండెడి దినములలో వ్యాకరణమునకు ప్రథమ పరీక్షాధికారిగా నుండిరి. ఈ చిలుకూరి చతుష్టయముయొక్క పుత్రులును, పౌత్రులును, విఖ్యాత వైయాకరణులైరి. వీరు నల్గురును కలిసియే సభలలో శాస్త్రార్థముచేయు నలవాటుగలవారు కావున ఉర్లాము సంస్థానాధీశులు వీరిని 'చిలుకూరి చతుష్టయ' మను ఆదరనామముతో సంబోధించెడివారు. కావున వారి కాపేరు విఖ్యాతమైనది. జ. పు.

**చెంగల్వరాయశాస్త్రి, చెయ్యూరు** (క్రీ. శ. 1810 - 1900): ఈయన వెలనాటి శాఖీయుడైన తెలుగు బ్రాహ్మణుడు. చెంగల్పట్టు జిల్లాలోని మధురాంతకం తాలూకాలోని చెయ్యూరు గ్రామములో జన్మించెను. ఈయన ఇంటిపేరు మారుపెద్దివారు. ఈయనకు సంస్కృతములోను, తెలుగులోను, సంగీతమునందును గొప్ప పాండిత్యము కలదు; నాట్యశాస్త్రమునగూడ గొప్ప విద్వత్త యుండెను. ఈయన కృతులు మాత్రమేకాక ముత్తుకుమార శతకమును, శబ్దములను (నృత్యములో నుపయోగించు రచన), కౌస్తుభములను రచియించెను. ఇవికాక, సుందరేశవిలాస, వల్లీ నాటకము అనురెండు సంగీత నాటకలకు కర్త ఈయన; స్వనామ ముద్రకారులు. ద్వా.పా.

**జంగములు:** వీరికే బుడిగె జంగములని పేరు. బుడిగె, బుర్ర, గుమ్మటము(గుమ్మెట)—ఒకే వాద్యమునకు ఆయా మండలములందు గల పేరులు. గుమ్మెటలకన్న బుడిగెలు చిన్నవిగా నుండును. అవి ఇత్తడి లేక కంచుతో చేయబడును. కూజా ఆకారమునను్న వీనిని బెత్తపు చట్రములలో బిగింతురు. అడుగు వైపున తోలు బిగింతురు, మూతి యనాచ్ఛాదితముగా నుండును. దీనిని మెడకు వ్రేలాడ వేసికొని తోలు బిగించిన వైపున కుడిచేతను, అనాచ్ఛాదితముగా నున్న మూతిపై ఎడమ చేతను వాయింతురు. దాసరులందరు వైష్ణవులైనట్లే జంగము లందరును శైవులు. వీరు చెప్పెడు కథలకు జంగముకథ అని పేరు. ఇవి రగడలు. జంగములు తొలుత శైవకథలనే చెప్పినను రాను రాను శైవేతర కథలను కూడ చెప్పుచున్నారు. దేశింగురాజు కథవంటివి జంగంకథ వరుసలో నున్నవి. విరాటపర్వము - జంగంకథ, భల్లాణ, సిరియాళ, దేవయాని, వామన విజయము, అంబరీషోపాఖ్యానము జంగం కథలు ప్రచారమునం దున్నవి. వీరశైవమునకు దగిన యావేశము వీరికుండును గనుక జంగము కథల వరుసలుకూడ వీరోత్సాహ జనకములుగా నుండును. ధేనువకొండవారి విరాటపర్వము జంగంకథలో జంగముల వర్ణన మున్నది. వారి వేషములు, వారి వాద్యములు అందు చెప్పబడినవి. జంగము లన్ని జాతుల శైవులను యాచించెదరు. అడిదము సూరకవి 'జంగాలపాలు దేవాంగులవిత్తంబు' అనుటచే వీరు ప్రధానముగా దేవాంగులను (శైవులగు సాలెవారిని) యాచింతురని తెలియనగును. తెలంగాణమందున్న బుడిగె జంగములు బలిజలను, పంచదాయకులాలవారిని, కోమటులను యాచించెదరు. బ్రహ్మ క్షత్రియ వైశ్యుల ఇండ్లలో మాత్రమే భుజింతురు. బి. రా. రా.

**జగన్నాథ పండితరాయలు:** పండితరాయలు ఆంధ్ర వేగినాటిబ్రాహ్మణుడు. తండ్రి పేరుభట్టు; తల్లి లక్ష్మీదేవి. కోనసీమలో ముంగండ గ్రామముననే సకల విద్యల నీయన నేర్చెను; కాశీపట్టణమునందున్న శేషవీరేశ్వరుని శిష్యుడై వ్యాకరణ నిష్ణాతుడయ్యెను; సభలలో శాస్త్రార్థదక్షు డయ్యెను; వాదములలో పండితుల నోడించు నుద్దండు డయ్యెను; జయపుర ప్రభుని ఆహ్వానముపై రాజపుత్ర స్థానములోని జయపురమున కేగి అచటి మహాపాఠశాలలో విద్యాధికారి యయ్యెను. అప్పుడు ఢిల్లీ దర్బారులో నుండు కాజి జగన్నాథునితో విషయములు చర్చించి సంతుష్టుడై పాదుషాకు తెలియజెప్పెను. ఢిల్లీ పాదుషా

సర్వసైన్యాధికారిగ నున్న అసఫ్ ఖాన్ రాయముకుంద ద్వారా జగన్నాథ ప్రభావము గుర్తించి జహాంగీరు పరిచయము కలుగజేసెను; స్వయముగా జగన్నాథు నాదరించెను. 'షాజహాన్' క్రీ. శ. 1628 లో రాజ్యాభిషిక్తుడయ్యెను. ఇతడు పండితరాజ బిరుదముతో జగన్నాథుని సత్కరించెను; అధికముగా ఆదరించెను; సహాసన మిచ్చెను. 'ఢిల్లీవల్లభ పాణిపల్లవతలే నీతం నవీనం వయః' అని పండితరాజు చెప్పుకొనెను. షాజహాన్ పెద్దకుమారుడు దారా షుకో జగన్నాథ శిష్యుడై శాస్త్రములను, దర్శనములను తెలిసికొని ఉపనిషత్తులను తన భాషలోని కనువదించినాడు; తన ముత్యాలగొడుగు నీడలను పండితరాజునకు పట్టినాడు. అసఫ్ ఖాన్ గతించెను. షాజహాన్ చిన్నకుమారుడు ఔరంగజేబు రాజ్య మాక్రమించెను. ఆ యలజడిలో జగన్నాథు డటు నిటు తిరిగెను; 1650 లో ఢిల్లీ విడనాడెను. కాశీపట్టణమునకు వచ్చి యచటివారల యసూయల సహింపక కామరూప(అస్సాం)ప్రభువైన 'ప్రాణనారాయణు'ని చేరి అక్కడ 1666 వర కుండెను. ఆ పిమ్మట పండితరాజు వార్త తెలియుట లేదు.

పండితరాయల విషయమై నానావిధములయిన కింవదంతులు లోక మంతట వ్యాపించినవి. విరుద్ధములయిన వానిని విశ్వసించుటకు తగిన యాధారములు లేవు. షాజహాన్ తన పాలన సమయమున హిందూ, ముస్లిం వివాహములను నిషేధించుచు శాసన మొనర్చినాడు. అందుచే పండితరాయల కంటగట్టిన 'లవంగి' యను యవనకన్యాస్వీకార కథ విశ్వసనీయము కాదు. పండితరాయల కవితలో నెచటగాని యవనీసౌందర్య వర్ణన మేమాత్రమును లేదు. వల్లభదేవుని కాలమున ఆంధ్రబ్రాహ్మణ వంశములవారు (వెలనాటివారు) ఆరువందలకు పైగా రాజపుత్ర ప్రాంతముల కేగిరి. ఆ వంశీయుల కన్యనే జగన్నాథుడు వివాహము చేసికొనెనని యచటి గ్రంథములం దున్నది. ఆమె పేరు 'కామేశ్వరి' అని యుదంత కథ.

వ్రజభాషా ప్రసిద్ధకవి, మాథుర చతుర్వేది శ్రీ కులపతి మిశ్ర పండితరాజశిష్యుడు తన 'సంగ్రామసార'మను గ్రంథమున తన గురువగు పండితరాజు 'నానాశాస్త్ర పారంగతుడు; శీల తప- ఋషి, వసిష్ఠసముడు, అష్టభాషా కవిత్వశుముడు' అని వ్రాసెను.ఎట్లో జగన్నాథ వంశీయు లిప్పటికి జయపుర ప్రాంతమున నున్నారు.

జగన్నాథ పండితరాయలు రచించిన గ్రంథములు:

| గ్రంథములు | విషయము | |
|---|---|---|
| 1. అమృతలహరి | యమునాస్తుతి | 11 శ్లో. |
| 2. కరుణాలహరి | విష్ణుస్తుతి | 48 శ్లో. |
| 3. గంగా లహరి | గంగాస్తుతి | 52 శ్లో. |
| 4. లక్ష్మీలహరి | లక్ష్మీస్తుతి | 41 శ్లో. |
| 5. సుధాలహరి | సూర్యస్తుతి | 30 శ్లో. |
| 6 జగదాభరణము | పాదుషా ప్రశంస | ? |
| 7. ప్రాణాభరణము | ప్రాణనారాయణప్రశంస | 53 శ్లో. |
| 8. ఆసఫ విలాసము | అసఫ్ ఖాన్ ప్రశంస | ? |
| 9. భామినీవిలాసము | ముక్తక కావ్యము | 376 శ్లో. |
| 10. చిత్రమీమాంసా ఖండనము | అలంకార శాస్త్రము | |
| 11, రసగంగాధరము | అలంకార శాస్త్రము | |
| 12. మనోరమాకుచమర్దనము | వ్యాకరణము | |
| 13. యమునా వర్ణనము | చంపూగ్రంథము | |

ఇంకను కొన్ని కలవని ప్రతీతి. తుది గ్రంథము లభింపలేదు. పండితరాజకృతులలో రసగంగాధరము సర్వోత్తమము. అలంకారశాస్త్ర జగత్తులో నిది ధ్వన్యాలోకము వలె, కావ్యప్రకాశమువలె ప్రామాణిక గ్రంథము. జగన్నాథు డుత్తమకవియైనందున తన రసగంగాధరమున తన పద్యములనే యుదాహరించెను. రసగంగాధరము సంపూర్ణముగ లభింపలేదు. అయినను దీని మహత్త్వ మసాధారణము; పాండిత్యమునకు నికషోపలము. ఇతరుల వాదములను ఖండించి నిష్కృష్టమైన సిద్ధాంతమును పండితరాయలు నిరూపించినాడు. వ్యాకరణమున పతంజలి భాష్యమువలె, వేదాంతమున శంకర భాష్యమువలె సాహిత్యమున రసగంగాధరము పండితరాజ భాష్యమై ప్రశస్తి కనినది. గ్రంథమున 'ఆననము' అను విభాగ మున్నది. తన గ్రంథము పంచాననములుకల పరశివ సదృశమని పండితరాయ జగన్నాథుడు భావించి యుండును.

పండితరాయలు సాహిత్య శాస్త్ర మూర్ధన్యమైన తన రసగంగాధరమున వైశిష్ట్యము లనేకములను సూచించినాడు. ఈ విధముగా వానిని తెలియవచ్చును.

1. స్వశక్తి: నానాక్లేశము లనుభవించుచు తాను మనన జలధియంతరుదరమున మునిగి లలిత రసగంగాధర మణిని లోకమునకు తెచ్చినాడు. ఇది సర్వాలంకారములను అతిశయించును. కొందరు సహృదయధురీణులు ఎంతగా అర్థ పరిష్కారము చేసినను జగన్నాథుని క్లేశ మేమియు గతార్థము కాదు. ఉదాహరణానురూపముగ నవకావ్యమును స్వయముగ రచించి కూర్చినాడు. ఇతరు లట్లు కాదు. ఉదాహరణలకై యన్వేషించి యెందరినో యనుసరింప వలసివచ్చినది.

2. కావ్యలక్షణము: 'రమణీయార్థ ప్రతిపాదకః శబ్దః కావ్యం' అని యాతని కావ్య లక్షణము. 'ఇష్టార్థ

వ్యవచ్ఛిన్న పదావళిః కావ్య'మ్మను దండి కావ్యాదర్శము లోని కావ్యలక్షణమును పండిత రాజలక్షణము రమణీయము చేసినది. కావ్యమువలన కలుగు ఆనందము లోకసాధారణము కాదు; అది లోకోత్తరము; అనుభవ సాక్షికము; ఒక విశిష్ట స్వభావకము. నవ్యన్యాయరీతి ననుసరించి వాద సమయానుకూలముగ సాహిత్యార్థములను పండితరాజు మాత్రమే పరిష్కరించెను. అతడు తన సిద్ధాంతమునకు ప్రతికూలములయిన ప్రాచీనుల వాదములను యుక్తియుక్తముగ ఖండించినాడు. శబ్దార్థములు రెండును కావ్యమని ప్రాచీను లనిరి. శబ్దమే కావ్యమని యీత డనును. వేద శాస్త్ర పురాణ లక్షణమునకువలె కావ్య లక్షణమునకును శబ్దనిష్ఠతయే సముచితమని నిర్ధరించెను; రమణీయమగు సిద్ధాంతము చేసెను.

3. కావ్యకారణము : శక్తినిపుణతాభ్యాసములు మూడును కావ్యహేతువని ప్రాచీనులు కొందరు తలచిరి. ప్రతిభయను శక్తి యొక్కటియె కావ్యకరణ కారణమని జగన్నాథ మతము. నవనవోన్మేషశాలిబుద్ధి ప్రతిభ. అదియే అపూర్వవస్తు నిర్మాణక్షమమయిన ప్రజ్ఞ. ఈ ప్రతిభ వేరు వేరుగా నుండవచ్చును. ఒకచో దేవానుగ్రహము ప్రతిభలో హేతువు. వేరొకచో వ్యుత్పత్త్యభ్యాసములు. వ్యుత్పత్త్యభ్యాసములు లేకున్నను సప్రతిభుడయినచో నొకడు కావ్యము రచించును.

4. కావ్యవిభాగము : ధ్వని సంప్రదాయానుయాయు లందరు ఉత్తమము, మధ్యమము, అధమము అనికావ్యము త్రివిధము లనిరి. వీనినే ధ్వని, గుణీభూతము, చిత్రము అని యందురు. జగన్నాథుడు కావ్యము ఉత్తమోత్తమము, ఉత్తమము, మధ్యమము, అధమము అని చతుర్విధ మనెను. ఉత్తమోత్తమము ధ్వని కావ్యము. ఉత్తమము గుణీభూతము. మధ్యమము అర్థాలంకార ముఖ్యము. అధమము శబ్దాలంకార ప్రధానకమని జగన్నాథ భావము. శబ్దాలంకార మున్నను, అర్థాలంకార మున్నను అధమకావ్య మనియే ప్రాచీనులు తలచిరి. అర్థచిత్ర, శబ్దచిత్రములందు విశేష మున్నది. రెంటిని ఏకవిధముగ భావించుట యుక్తియుక్తము కాదు; ఆ రెండును రెండు; కావుననే నాలుగు భేదములు. ఏమాత్రము అర్థచమత్కారము లేక, శబ్దచమత్కారమే కల ఏకాక్షర పద్యాదులను అధమాధమ కావ్యముగ పరిగణింప రాదా అని తానే శంకించి, రమణీయార్థప్రతిపాదక శబ్దతారూపమయిన కావ్య సామాన్య లక్షణ మట్టిచోట సంక్రమింపదు కాన అయిదవ భేదమును పరిగణింప నక్కర లేదని నిశ్చయించెను.

5. రసరహస్యము : 'విభావానుభావ వ్యభిచారి సంయోగా ద్రసనిష్పత్తి' అను భరతుని రససూత్రము ననుసరించి రసతత్త్వము నిరూపించినవారి మతము లన్నిటిని చెప్పి చెప్పి సారము తేల్చెను; శ్రీమదభినవగుప్తుని రస సిద్ధాంతమునే యంగీకరించెను; సూత్రవిరుద్ధములైన రస వాదముల నాక్షేపించెను. అభినవగుప్తుని రససిద్ధాంత మంగీకరించుచు నొక యడుగు ముందుకు వేసెను; చైతన్యము కూడిన యంతఃకరణ ధర్మము(చిదుపహితరత్యాది) రస మనుట అభినవగుప్తపాద మతమని నిరావరణమగు నాత్మచైతన్యమే రస మనుట తన యభిలషితమని జగన్నాథుడు నిరూపించెను; 'రసో వై సః రసం హ్యేవాయం లబ్ధ్వా ఽఽనందీ భవతి' అను వేదాంతవచనమును స్వమతమున కుపష్టంభకము చేసికొనినాడు; స్వమత మావిష్కరించుటకై తా నొక పెద్ద రససూత్రము నిర్మించినాడు; తాను వ్యాఖ్యానించినాడు; భగ్నావరణమగు చైతన్యమే రసమని స్వనిశ్చితమయిన రసరహస్య మావిష్కరించినాడు. నిర్వికల్ప సమాధి సమయమున యోగికివలె సహృదయుడగు వానికి రసాస్వాద సమయమున స్వరూపానందాకార మయిన తన్మయీభావనము కలుగును. ఈ యానంద మనంతఃకరణవృత్తిరూప మగుట లౌకికసుఖాంతర సాధారణము కాదు అనియు నిరూపించెను.

6. రసప్రతీతి : రసప్రతీతి యపరోక్షప్రతీతి యని యతడు ప్రతిపాదించెను; 'తత్త్వమసి' అని వేదాంత మహావాక్యమున కలుగు జ్ఞానము శబ్దవ్యాపారజన్యమయినందున శాబ్దమును అపరోక్షసుఖాలంబనమయినందున అపరోక్షాత్మక మయినటులు రసప్రతీతికూడ శాబ్దము, అపరోక్షరూపమునని ప్రతిపాదించెను; తన రస చర్వణ సంవిధానము తన యద్వైత సిద్ధాంతముతో సరియగునటులు జగన్నాథుడు శాస్త్రవాదములను కలిపి నిరూపించినాడు.

7. సంయోగ, వియోగ శృంగారము : శృంగార రసము సంయోగశృంగారమని, విప్రలంభ శృంగారమని ద్వివిధము. ఇందు జగన్నాథ పరిష్కారము భావనీయము. నాయికా నాయకుల యనురాగము సంయోగకాల వ్యాప్తమై యున్నచో సంయోగమని, వియోగకాల వ్యాప్తమైనచో విప్రలంభమని పరిగణింపవలెను. దంపతు లొకచోట నుండుట సంయోగము కాదు. ఒకటే తల్పమున శయనమున్నను వారల కీర్ష్యాదు లున్నచో విప్రలంభమే యగును గాని, సంయోగము కాదు. అట్లే వియోగమును వేరు వేరుగా నుండుట కాదు. వేరుగా నున్నను మనమున రాగ మున్నచో, ఈర్ష్యాదులు లేనిచో సంయోగ మనుటయే

సముచితము. సంయోగ వియోగములు రెండును అంతఃకరణ వృత్తి విశేషములు. విప్రలంభశృంగారము ప్రవాస, విరహ, ఈర్ష్యాదిభేదముల పంచవిధమని ప్రాచీను లనిరి. పరస్పరము వీనిలో విశేషించి భేద మేమియు గోచరము కానందున విప్రలంభమును నొకవిధముగనె జగన్నాథుడు నిశ్చయించెను.

8. వీరభేదములు : దానవీరమని, దయావీరమని, యుద్ధవీరమని, ధర్మవీరమని - వీరము నాలుగు విధము లగుట ప్రాచీనులు చెప్పిరి. పండితరాజు వీరభేదము లింకను చెప్పవచ్చునని తలచెను. శృంగారమునకువలె వీరమునకును ప్రకారము లనేకము లున్నవి. సత్యవీరము, పాండిత్యవీరము, క్షమావీరము, బలవీరములుకూడ నుండును. పండితరాజు చూపిన యీ ప్రక్రియనే యనుసరించి యర్వాచీను లింకను వీరభేదములు పరిగణించిరి.

9. అనౌచిత్యము : జగన్నాథు డౌచిత్యతత్త్వమును బాగుగా ననుసరించినాడు. ఆనందవర్ధనుడు సూత్రప్రాయముగ సూచించిన యౌచిత్యమును క్షేమేంద్రుడు పరిష్కరించి ప్రదర్శించెను. ఆ రీతు లన్నిటిని పర్యాలోకనముచేసి అనౌచిత్యము నెత్తిచూపెను. అనౌచిత్యము రసభంగ హేతువు. దానిని పరిహరింపవలసినదే. జూతాద్యనుచితము లనేకము లున్నవి. గవాదులకు పరాక్రమాదు లున్నవనుట, స్వర్గమున జరావ్యాధ్యాదులు, భూలోకమున సుధాసేవనాదులు, శిశిరమున జలవిహారము, గ్రీష్మమున వహ్నిసేవ, బ్రాహ్మణునకు వేట, యతిబ్రహ్మచారులకు దారోపసంగ్రహణము తాంబూలము, బాల వృద్ధులకు స్త్రీసేవనము, యువకునకు విరాగము - ఇట్టి వన్నియు ననుచితములు. ఇట్టి వభ్యూహ్యములు.

10. గుణచర్చ : రసగంగాధరమున గుణచర్చ సవిశేషముగ సంభావనార్హము. మాధుర్యాదిగుణముల నాధారముగా చేసికొనియుండు సంఘటన రసముల నభివ్యంజనము చేయును. మాధుర్యము, ఓజస్సు, ప్రసాదము, అనునవి మూడు గుణములు. ఇవి ద్రుతి దీప్తి వికాసము లనుచిత్తవృత్తులను కలుగజేయును. మాధుర్యౌజఃప్రసాదము లను నీగుణములు రసమాత్ర ధర్మములు. అవి రసధర్మము లనుటలో ప్రమాణ మేమి ? ఆత్మ నిర్గుణము. రస మాత్మరూపము. మాధుర్యాదులు రసాత్మగుణము లగుట యుపపన్నమే కాదు; కాని శృంగారము మధుర మనువ్యవహార మున్నది. మాధుర్యాది గుణములు ద్రుత్యాది చిత్తవృత్తిప్రయోజకము లన్నచో నిది కుదురును. అశ్వగంధమను ఓషధి యుష్ణత నిచ్చును. అది యుష్ణతా ప్రయోజకమగుట 'అశ్వగంధ యుష్ణము' అని లోకవ్యవహార మున్నది. అట్లే ద్రుత్యాది చిత్తవృత్తి ప్రయోజకత్వము శబ్దార్థ రస రచనాగతముగ నుండును. కాన, శృంగారము మధుర మనుట సంగతమగును. ద్రుత్యాది చిత్తవృత్తిప్రయోజకతారూపమయిన మాధుర్యాదికము శబ్దార్థములకును స్వతఃసిద్ధమయినందున 'శబ్దార్థములందు మాధుర్యాదు లుండు' ననుట యపచారమున నక్కరలేదు.

11. రచనా పరిష్కారము : జగన్నాథు డక్షరతపస్వియై గుణవ్యంజనము చేయు నిర్మితి పరిచయమునకై సామాన్యముగా విశేషముగా వర్జనీయములగువానిని సోదాహరణముగ నిరూపించినాడు. అక్షరమున కక్షరముతో నుండు సంబంధ బాంధవ్యములు కవితారచనలో నెట్లుండవలయునో పండితరాజే పలుకవలయును. మధుర రసములందు విశేషవర్జనీయము లన్నియు ఓజస్వి రసమునందనుకూలము లగును; మధురానుకూలములు ప్రతికూలము లగును. దీర్ఘసమాసములు, విసర్గప్రాచుర్యము, జిహ్వామూలీయప్రాచుర్యము, ఉపధ్మానీయప్రాచుర్యము ఝఙ్ద్వయఘటితసంయోగము, మహాప్రాణ ఘటిత సంయోగము, త్వప్రత్యయము, యజంత యఙ్గంతములు మధురరసములందు ప్రయోగింపరాదు. అట్టివి రసచర్వణలో నిముడవు. అవి సహృదయ హృదయములను తమ కభిముఖములుగ త్రిప్పుకొని రసపరాఙ్ముఖములను చేయును. ప్రత్యేకముగ వైదర్భీరీతి నిర్మాణమున కవి యత్యంతము సావధానుడు కావలయును; కాకున్న పరిపాకభంగము కల్గును; కవియొక్క నిర్మాణ సామగ్రీ దారిద్ర్యము ప్రకాశితమగును. జ. మా. శ.

జానపద గాయకులు : జానపద గేయములు భిక్షుకుల కన్నమిడు కల్పశాఖిక లైనచో, భిక్షుకులు జానపద గేయములకు భద్రపేటికలు. జానపద గాయక భిక్షుకు లెన్నియో కులములవారు గలరు. తీరు తీరుల భిక్షుకులు తీరు తీరుల పాటలు పాడెదరు. పిచ్చుకగుంటులు, శారదకాండ్రు, వీరముష్టులు, జంగములు, దాసరులు, భాగవతులు, బీరన్నలవారు, సుద్దులగొల్లలు, గంగిరెద్దులవారు బాలసంతువారు, బుడుబుడుకలవారు, చిందుమాదుగులు, జోగులవారు, బవనీలు, జక్కులవారు, హట్కారులు, కొమ్మువారు, డక్కలివారు, బొమ్మలాటగాండ్రు మున్నగు తీరు తీరుల భిక్షుకు లాంధ్రదేశమున నున్న జానపద గాయకులు.

ఈ బిచ్చగాండ్రందరును సాధారణముగా దేశద్రిమ్మరులు. ఏ కొలదిమందికో తప్ప తక్కినవారికి ఇల్లు, వాకిలి యనునవి యుండవు. జగ మంతయు వారిదే యన్నట్లు

భ్రమింతు రీ దరిద్ర నారాయణులు. కొలదిమందిమాత్రము దొరలో దాతలో యిచ్చిన మడిమాన్యము లుండుటజేసి కొన్ని కొన్ని గ్రామములందు స్థిరనివాసము కల్పించుకొనిరి. ఇట్టి స్థిరనివాసముగలవారు కూడ ఏడాది కెనిమిది నెలలు తమ గ్రామము బయటనే యుందురు. దేశసంచార మొనర్చి పొట్ట పోసికొనుటే వారి ప్రధాన వృత్తి. వారి కున్న మడి మాన్యములు వారి కుచేల సంతానమునకు సంవత్సరమున కంతటికి సరిపోవు గంజినీళ్ళు పోయజాలవు. కనుకనే చీమలవలె వారు వానకాలము తక్క తక్కిన నెల లన్నియు దేశాటనము చేయుచుండెదరు. సాధారణముగా నీ భిక్షుకులు తల దాచెడు ఇండ్లును, వారి సంసారమును, వారి కున్న వస్తు వాహన సంపదయు సంచార యోగ్యముగనే యుండును. రెండు కట్టెలు, రెండు చాపలు కలిసిన భిక్షుకులపాలిటి భవ్యహర్మ్యము సిద్ధమగును. కూటి కొక కుండ, పులుసున కొక చట్టి, తినుటకు మాత్రము రెండో, మూడో బోలెలు (చిప్పలు), త్రాగుటకు రెండు ముంతలు, స్వామిభక్తిగల యొక కుక్క, వారు పాడుకొను పాటల కుపకరించు వాద్యములు ప్రతి భిక్షుకకుటుంబమున కుండెడు స్థిర, చరాస్తులు. వీరిలో కొందరు భాగ్యవంతు లుందురు. నాలుగు కోళ్ళో, రెండు పందులో, లేదా, యొక గాడిదయైనను, దూడయైనను ఇట్టివారి కుండు విశేష సంపద. ఈ దినమిచట గానుపించిన భిక్షుకుడు తెల్లవారి మరియొక గ్రామమున నివాస ముండును. ఒక చోటినుండి మరియొక చోటికి పయన మనుకొన్నంతనే సంసార మంతయు, భుజముపై గల కావడియందో, వీపున నుండు మూటయందో ఇమిడిపోవును. శీతాతపములు వారిని బాధించవు. చీకటి వెలుగులు రెండును వారికి సమానము. దూషణ భూషణములు కూడ నంతియ. వేష భూషణముల ప్రసక్తియే లేదు. వారి సంపదను దోచుకొను దొంగ యింతవరకును పుట్టలేదు. తీరని కోరికలుగాని, తీర్చవలసిన సమస్యలు గాని వారి కుండవు. ఈ పూటకు దొరికిన రేపటి చింతనము లేదు. 'నిత్య శ్రీరస్తు; నిత్యమంగళాని భవన్తు'. కడుపు నిండినంత నే చెట్టునీడనో పుట్టదరినో వెన్ను వాల్చగలరు. భూమిపై నిటు వెన్నంటుకొనగనే అటు కన్నంటుకొనును. కలతలేని గాఢ నిద్ర భగవంతు డిచ్చిన వరము. దాని ఫలితము రోగము నొప్పియు లేని యారోగ్యము. దురదృష్టవశమున నేదేని యనారోగ్యము తటస్థించెనా వనమూలికలు వా రెరిగిన ఆయుర్వేదము. ఆ మూలికలకు తోడు దరిద్రచింతామణి యనబరగిన జీడిగింజ లేదా శొంఠికొమ్ము లేదా వెల్లుల్లిగడ్డ. రోగము కుదిరెనా యారోగ్యము; లేదా యందరి కున్నట్లే చావు. కాని సడి చప్పుడు లేనిది మూడు దినముల శోక ముద్ర, ఆపై మరల భిక్షాయాత్ర. ఇది జానపద గాయకుల సర్వసాధారణ జీవిత యాత్ర. ఆస్తిపాస్తులు లేనటులే వారికి తగవు తీర్పులును అరుదు. ఏవైనా చిక్కులు కలిగినచో ఏడాది కొకమారు తమ 'కులపెద్ద'కడ సమస్యాపరిష్కారము జరగును. న్యాయవాదుల జోక్యము లుండవు. న్యాయాధికారుల ధర్మ నిర్ణయము లుండవు. మాయ మర్మము లెరుగరు. పెట్టిన సంతోషముతో దీవించి పోదురు; పెట్టక తిట్టినచో భయపడిపోదురు. ఈ జాతులవా రందరును తమ పొట్టపోసికొనుటకైనను జానపదసాహితీసంపదను భద్రపరచినందులకు ఆంధ్రు లెల్లరు కృతజ్ఞులు. (చూ: గొల్లసుద్దులవారు, జంగములు, దాసరులు, పిచ్చుకగుంట్లు, బవనీలు, బీరన్నలవారు, వీరముష్టివారు, శారదకాండ్రు). బి. రా.రా.

**జానపదగేయ - గేయకథా వాఙ్మయము :** జానపదులలో సహజముగ పుట్టి వ్యాపించే గేయము జానపద గేయము. ఉత్సాహవంతులైన జానపదులు తమ ఆనందానికి అందపు రూపు కల్పించడముకోసము గేయమును ప్రారంభించి సాగిస్తారు. ఉత్సాహావేశంతో కుర్రవాడో, కుర్రదో గొంతు విప్పడముతో ప్రారంభమౌతుంది ఈ గేయము. దాని జన్మముకూడ శూరుల జన్మము, సురల జన్మము, ఏరుల జన్మమువలె దుర్జ్ఞేయమే. జానపద గేయమును ఒకడు రెండు పంక్తులు పాడితే ఇంకొకడు రెండు పంక్తులు చేర్చి మరొకడి కందిస్తే మూడోవాడు దానికి కొన్ని మెరుగులు పెట్టితే నాలుగోవాడు ఏ గడ్డిబండిమీద పడుక్కునో, ఏ నావమీద సాగిపోతూనో గొంతెత్తి దాన్ని పాడుతాడు. జనపదాలలో గంధవహుని వలె విహరించి ఆ నోటినుండి ఈ నోటికి ఎగిరిపోయేది జానపద గేయము.

జానపదుల గేయము మాత్రాచ్ఛందస్సులతో కావలిస్తే సాగుతూ ఇరుకైనచోట్ల దాట్లు వేస్తూ సౌలభ్యా న్ననుసరించి ప్రవహిస్తుంది. అన్యాయానికి గురిఅయిన దురదృష్టవంతుల విషాద గాథలు దీనికి వస్తువు. సంగీతమే శయ్య. సాహిత్యమా పోత పోసిన వెండిలాగ ప్రవహిస్తుంది. జానపదుల గేయము హృదయోద్గతమూ, రస పరిపుష్టమూను. ఇన్ని చెప్పి అసలువిషయము చెప్పడము తప్పయిపోతుంది. జానపద గేయా లన్నిటికీ ఈ లక్షణా లన్నీ ఉండ నక్కరలేదు.

జానపద గేయాలు అన్ని భాషలలోనూ వున్నట్లే తెలుగులోనూ, చిరకాలంనుంచీ వున్నాయి. ఇవి కొద్ది చరణాలలో ముక్తకములను పోలి విడి గేయాలుగానూ,

దీర్ఘకథనము చేస్తూ కథా గేయాలుగానూ కనబడుతున్నాయి. నన్నెచోడుడు చెప్పిన ఊయెల పాటలూ, గౌడు గీతములూ, రోకటి పాటలూ, మంగళ గేయములున్నూ, పాల్కురికి చెప్పిన తుమ్మెద, నివాళి, ప్రభాత, శంకర, సంసారమాయా, ఏల పదములున్నూ విడిగేయములు. పర్వత పదములు, సిరియాళు చరిత, కామవల్లి వలపు, పరశురాముని కథ, విద్దికూచి రామాయణము, పల్నాటి వీరకథ — కథా గేయాలు. తాళ్ళపాక తిరుమలమ్మ - అన్నమయ్య దంపతుల చలువవల్ల మనకు క్రమముగా సుభద్రాకల్యాణమనే ఆనాటి స్త్రీల కథా గేయమున్నూ, అనేక రకములయిన జానపద గేయ ఫణితులున్నూ తెలియవస్తున్నవి. సుభద్రాకల్యాణము నాలుగు ఐదేసి మాత్రల ఆవృతాల పాదములు గల సుదీర్ఘ రచన. దీనికంటె ముందు ప్రసిద్ధ కథల పాట లెన్నో వచ్చి యుండవలెను కదా! అవన్నీ ఖండగతివి మాత్రమే కావని త్యాగరాజు ప్రతాపవరాళి కీర్తనలో పేర్కొన్న సీతాదేవి ఓమన గుంటలపాట — త్రిశ్రగతిది — సాక్ష్య మిస్తోంది. చాళుక్య రాజుల వెలయింపునకు తర్వాత అన్నమయ్య చేసిన సంకీర్తనా పరిశుద్ధియే జానపద గేయములకు అక్షర ప్రపంచములో పునర్జన్మ. 'చందమామ రావే' వంటి బాలగేయాలూ, లాలి, జోల, మేలుకొలుపు పాటలూ, జాజరలూ, కోలాటపు పాటలూ, గొబ్బి, శోభనము, సువ్వి, కోత, నూర్పు పాటలూ, చిలుకా - తుమ్మెదా, ఉయ్యాలా - చందమామ పాటలూ, చాంగు బళా, తందనాన వంటి చిందు పాటలూ, ఆనాడు భగవత్సంకీర్తనకు వాడుకలో నున్న పాట లన్నీను అన్నమయ్య చేతిలో నిబంధ పదములుగా మారిపోయినవి. ఇవన్నీ త్రిశ్ర, చతురశ్ర, ఖండగతులవే మొత్తముమీద. ఎక్కడో ఒకటో రెండో రూపక తాళాని కిముడుతాయి. అన్నమయ్య ఏల పదాలు రచించినట్టు లేదు. వీటిలో తక్కిన జానపద గేయాలలోకంటె సంగీతము పాలు యెక్కువ. కనుక జానపదుల నోళ్ళలో నే కాటమరాయడో, కంబమురాయడో, దరమరాజో నాయకుడుగా వృద్ధి అవుతూ దక్షిణాదిని నాయకరాజుల యక్షగానాలలో విరివిగా ప్రవేశించాయి. దేవాలయాలలో ఉత్సవ సమయాలలో స్త్రీలు పాడే ధవళాలూ, మంగళాలూ, శోభనాలూ, హెచ్చరికలూ, సంకీర్తనలూ కూడా యక్షగానాలలో ప్రవేశించాయి. అచ్చు యంత్రము వచ్చినతరువాత మదరాసు గుజిలీ బజారులో అన్నిరకాల తప్పులతోనూ ఈ సారస్వతము కుప్పలు తెప్పలుగా వచ్చింది. స్వాతంత్ర్యోద్యమముతో విద్యాధికుల దృష్టి ఈ సారస్వతముమీద పడింది. స్వాతంత్ర్యము రావడంతో రేడియో వారూ, పత్రికలూ వీటిని వెలుగులోకి తెచ్చారు. వస్తువెంత ధారాళమైనదైనా అంతాకూడా విడిగేయాలూ, గేయకథలూ అన్న విభాగాలకిందికి వచ్చేస్తుంది.

విడిగేయాలన్నీ జానపదుల జీవితఘట్టాల నాశ్రయించిన ఉత్సాహాన్నీ, ఆనందాన్నీ, జాలినీ వెలిబుచ్చేటివే. వాటి లయా, రాగమూ కూడా సందర్భానుసారంగానే వుంటాయి. పసిబిడ్డల్ని నిద్రపుచ్చడానికి పాడే లాలిపాట సామాన్యంగా ఐదేసి అక్షరాల ఆవృతాలతో నడుస్తుంది. నాలుగేసి అక్షరాల ఆవృతా లుంటే పాట జోరుగా నడిచి మగతకు బదులు మెలకువను కలిగిస్తుంది. అయితే ఈ పాటలోని స్వరాలు అడపా దడపా శిశువుకి వినిబడుతూ తక్కిన ఇంద్రియాలను సళ్లించడానికి సాయపడవచ్చును 'లాలీ' అన్న అక్షరాలతో 'రీ సా' అన్న స్వరాలు వినబడి లాలి పాటలో కిక్కిరిసియుండే షడ్జస్వరాల శయ్యమీదికి దింపుతాయి శిశువు చైతన్యాన్ని. నవరోజు, ఆనంద భైరవి, శ్రీ రాగాల్లో వుంటాయి లాలిపాటలు. జోలపాటలు, భగవంతుడిమీద స్తోత్రాలతో 'జో జో' అన్న పాదాంత పదాలతో వుంటాయి. మేలుకొలుపులు శ్రవణపేయములైన భూపాల బౌళిరాగాల్లో వుండి 'మేలుకో' అన్న అక్షరాలను క్రమంగా పొడిచి వినిపించే ఆరోహణ స్వరాలతో పొడిచి మెలకువ తెప్పిస్తాయి. లాలి పాటలు బిడ్డ నిద్రపోవడముతో ముగిసిపోవాలి. మేలుకొలుపులు పాడేవారి ఉత్సాహాన్నిబట్టి ఎంత పొడవేనా ఉండవచ్చును. శ్రీకృష్ణుణ్ణి సంబోధించేవి పురుషలోకానికీ, సీతమ్మను సంబోధించేవి స్త్రీ లోకానికీ ఉద్దిష్టాలివి. వీటి గతి సరళము కానేకాదు, త్రిపుటలయ కూడా హెచ్చరిక కల్పించేటిదే.

గృహజీవన మాధుర్యాన్ని ఆశ్రయించి ఖండగతిలో నడిచే పాటలు రెండేసి పాదాలవీ, నాలుగేసి పాదాలవీ విశాఖమండలములో నేటికీ వినబడతాయి. అబ్బాయి సౌందర్యమూ, అమ్మాయి చేష్టలూ, అమ్మ దీవెనలూ, అమ్మాయి అత్తింటి ప్రయాణమూ, ఆవులు ఇంటికి చేరడమూ, వదినగారితో హాస్యాలూ, బావగారిమీది విసురులూ చాలా వుంటాయి వీటిలో. దంపుళ్లపాటల రూపంలో ఈ పాటలు జీవితా న్నంతటినీ తడివేస్తాయి. ఆడుపడుచు పుట్టింటి అభిమానమూ, అత్తాకోడళ్ళ వాదులాటా, సవతుల మాత్సర్యమూ, పెండ్లి బేరాలూ, నీతులూ, ఆడకూతుళ్ళ అష్టకష్టాలూ చుక్కల్లాగ మెరుస్తాయి దంపుళ్ళ పాటల్లో. రాట్నపు పాటలుగా ఇవి మరికొంత పొడుగౌతాయి. దంపుళ్ళ పాటలలో దంపునుగురించి ఉండే పంక్తులు కొద్ది. అలయికతో కూడిన పని కనక దంపుతో

పాటు పాడడము చాల కష్టము. కనుక ఆ పాటలు పొట్టి. రాట్నపు పాటల కా చిక్కు లేదు. కనుక స్త్రీలకు వారిళ్ళలోనే జీవనాధారము కల్పించే రాట్నము మీది పాటలు మరికొంత బరువుగా తీరికగా సాగుతాయి. రాట్నము స్త్రీలకు కల్పించే ఆర్థికస్వాతంత్ర్యము ఆ పాటలలో తొంగిచూస్తూ వుంటుంది. తిరుగలి పాటలు కూడా బరువైన పనితో చేరినవే. కాని శ్రోతలు ఇద్దరే! పాడే అమ్మ కూడా పాటకు వేరైై ఆలకించేటట్లే వుంటాయి ఆ పాటలు. అన్నగారికి చెల్లెలిమీద అభిమానమూ, మనసీయని పతితో సతి పడే కష్టాలూ తమతో తామే చెప్పుకొని మెత్తబడతారు విసిరే పడుచులూ, పెద్దలూను. తిరుగలి శబ్దము మందమైన శ్రుతిగా వినపడుతూ ఆ పాటలను ఎత్తి వినిపిస్తుంటుంది.

ఇంటి బయట చేసుకునే పని పాటులలో కూడా స్త్రీలూ పురుషులూ పాటలు పాడుతారు. ఈ పాటలు శ్రమాపనోదముచేయడానికే ముఖ్యంగా. కనక వీటిలో ఉచ్చైస్స్వరముతో వినిపించే స్వరాలే ముఖ్యము. మొక్కల ఊడ్పులోనూ, కలుపుతీతలోనూ, కోతలోనూ, నూర్పులోను లయ అన్నది ఉండదు. కనక కూలి పడుచుల కంఠమేళా, నిలిచి విశ్రమిగే స్వరాల రంజకత్వమూ చేరి మెప్పించాలి వినేవారిని. వీటి వస్తువు వ్యవసాయానికి సంబంధిచినదే నూటికి తొంభయిపాళ్ళు; అప్పు డప్పుడు మాత్రము కొంచము కథనముగా సాగుతూంటుంది. 'గునాసారి గున్నమ్మా' వంటి పాదాంత పదాల్నో, అవి పొడవు చాలక పోతే పాదాన్నంతటినీనో అందుకుని మళ్లా పాడతారు తక్కిన వారంతా. త్రిశ్ర, చతురశ్ర, ఖండగతుల్ని దాటవు ఈ పాటలు. దాటితే పనికన్నా పాట బరువై పోతుంది. కపిల పాటలు మాత్రము రూపకతాళంతో నడుస్తున్నట్టనిపించింది నాకు. వాటికి శ్రోతలే లేరు. 'మా' అన్న స్వరము చరణము మధ్యలోనూ, 'సా' అన్నది చివ్వరనా సాగి వినబడుతుంది ఒక ఫర్లాంగుదాకా. పాడేవాడి ఉత్సాహాన్నిబట్టి 'మా' 'పా' అవుతూంటుంది. పార పదాల చరణాలు బాగా పొట్టి - రెండేసి భాగాలు. తవ్వేటప్పుడు 'ఏవూరు' వంటి మొదటి భాగమూ, మట్టి విసిరేటప్పుడు 'భామా' అన్న రెండోభాగమూ అంటారు. దీనిలో స్వరాలు సాగడానికి సావకాశం లేదు. లయ మాత్రమే నిలబడి పనిని సాగిస్తుంది. గొడ్డలిపాటలూ, రంపము పాటలూ కూడా అంతే. ఇటుక లందిస్తూ, అంది పుచ్చుకుంటూ పాడే పాటలు 'ఎయిరా సిన్నో డెయ్‌రా' అంటూ లయని చక్కగా నిలుపుతాయి; పనిని ఆటగా మార్చేస్తాయి. రోలరు లాగుతూ కూలీలు పాడే పాటలు గమనానికి తగినట్లు 'గుంటూరు చిన్నదాన గుళ్ళపేరూల దాన' అంటూ చతురశ్రగతిలోనూ, శ్రమాపనోదము కోసము చిన్నదాని షోకులమీదనూ వుంటాయి. వీటిలో స్వరాలూ, దీర్ఘాలూ, యతులూ, ప్రాసలూ, కల్పనలూ జోరుగా వుంటాయి. బరువు పడవలు మెట్ట చేరితే కళాసులు నీటిలో దిగి పడవను లోతు నీటికి నెట్టేటప్పుడు పాడే పాటలుకూడా బహు క్లుప్తముగానూ, చురుకుగానూ చతురశ్రగతిలోనే వుంటాయి.

ఆటల పాట లన్నిటికీ లయ ప్రాణాధారము. చందమామ, తప్పట్లు, కాళాగజ్జి, గుమ్మాడి, చెయివూచు, వులవలు వులవలు వేయించీ, తోడుపాయసం, చెమ్మచక్క, బుజబుజరేకులు, గొబ్బిళ్ళో పాటలన్నీ లయ ప్రధానాలే. కంఠమేళ బుజబుజరేకుల్లోనూ, దసరా పద్యాలలోనూ విన సొంపుగా వుంటుంది. అక్కడితో పిల్లల తయారీ పూర్తి. ఆ తరువాత వారి రుచీ చాకచక్యమూ అల్లుకుపోవాలి. కోలాటము పూర్తిగా ప్రదర్శనమే. ఆట కానేకాదు. దీనిలో వర్ణచలనమూ, గమన సామరస్యమూ, మువ్వలమ్రోతా, కోలల లయా, రాగ సరళీ, కంఠమేళా, కథా సౌందర్యమూ రంగరించుకుపోయి అలరిస్తాయి. ఇవి సాధారణముగా త్రిశ్ర, చతురశ్ర గతులలో వుంటాయి. దేశి సారస్వతములో ఇవి ప్రత్యేక విభాగము. లాలి, మేలుకొలుపు, మంగళహారతి, కథ, సంవాదము, బోధ అన్నీ ఉంటాయి కోలాటపు కోపులలో. జాజిరిపాటలు చతురశ్రగతిలోవే. అవి గంధపొడి చల్లుకుంటూ వెన్నెలలో పాడే పాటలు. తెలంగాణములో కోపులుగా మారిపోయినవి ఈ నాటికీ వినబడతాయి.

కవులు జీవిత సందర్భానుసారంగా చాటువులు చెప్పినట్లుగా దేశి జనులు బ్రతుకుబాటలలోని అనుభవములను పాటలుగా అల్లుకుంటూరు. ఏచేడెయో నీరాటిరేవులో కడిగిన చాయపసుపు, అత్తింటికి పోయే అడుపడుచుకు చెప్పే బుద్ధులూ, ఆలుమగల కలహాలూ, అత్తగారి ఆరళ్లూ, నీరాటిరేవుకడ తారట్లాటా, వేరింటి కాపురాలూ, తిరునాళ్ళయాత్రా - అన్నీ సామగ్రే ఈ పాటలకి. ఇక పెళ్ళాడే బొమ్మ, కాశీకావడి, గారడీవాడు, నాగుమయ్య సంగతి చెప్పే దేమిటి? వయసులో ఉన్నవారి పరిహాసాలూ, హాస్యాలూ బండ్లకొద్దీని. ప్రేయసిని విడిచి రంగము పోయే నాయుడు బావ, పోతున్న ఓడను చూచి మొత్తుకుని యేడ్చే అమాయిక, కుర్రదానిని మంచె దిగమని కికురించే కుర్రవాడూ, దారి బోతూంచే మోటసరసాలాడే తెగువరీ, అనురక్త అయిన పిల్ల చేష్టలు తలచుకునే చిన్నవాడూ, గిద్దెలగిరి కొండలపై ఎద్దులు కాచే ఓబళేశుడూ, కథలోని నక్కలాగ గైరమ్మను పొగడే పిల్లగాడూ, మోస

పోయి అంగలార్చే గంగమ్మా, తప్పుదారి తొక్కించి సాకులు నేర్పించే గడుసరీ, దూడమీద పెట్టి వలపుకాని కోసము ఏడ్చే కులపాలికా, ఆప్యాయంగా బండి ఎక్కమని అర్థించే బండినాయుడూ, సరసునితో బేరాలాడే పెంకిపిల్లా జానపద గేయాల్లో అడపా దడపా కనబడుతూంటారు. ఈ గాథ లన్నీ నిజము కావు; కుర్రవాళ్లు సరదాగా పాడుకో డానికి కల్పించుకున్నవే. ఎక్కువభాగము ఏలలు 'చంద్ర గిరి చీర లంపరా' వరుసలోనివి. వీటిలోని నైసర్గిక భావాలు వీటిని రస పరిపుష్టనులుగా చేసి వీటి ఆకర్షణకి కారణ మౌతాయి. అలంకార కల్పన మందుకైనా వీటిలో దొరకదు. గుండెలలోని భావాలు కుదురైన మాటలతో వచ్చి సూటిగా తగులుతాయి. ఆ అమాయికపు హృద యాల ఆరాటానికి అందరి హృదయాలూ ఝల్లుమం టాయి. చిత్ర మేమిటంటే (గొడ్డలితో కొట్టితే) చెక్క వచ్చి చెంప దగులుట, నిమ్మముల్లు రొమ్ము దగులుట, కొమ్మ దూగి కొప్పు నిండుట ఈ పాటల్లో తరచు వినబడుతూ తెలుగునాటి జానపద సారస్వతములో వీటి సత్తను నిరూ పిస్తుంటాయి.

విడి గేయాలు వ్యక్తుల కాలక్షేపానికీ, ఆనందానికీ అయితే కథాగేయాలు పలువురి కాలక్షేపానికీ, ఆనందా నికీ తోడ్పడుతాయి. ప్రసిద్ధ కరుణగాథలూ, వీరగాథలూ పురాణకథలూ పదాల రూపాన బవినీళ్ళు, పిచ్చుకుం టులూ, జక్కులవాళ్ళూ, జంగములూ, శారదకాండ్రూ, వినిపిస్తే వేసవికాలపు రాత్రులలో ఆరబయట కూర్చుని గ్రామీణు లీ కథ లాలకిస్తారు. బవినీళ్లు 'తకదుం దుమ్మలు తాళముల్ జవనికల్ తందాన 'లతోనూ, జక్కులవాళ్ళు 'కోణాగ్ర సంఘర్ష ఘుమఘుమ ధ్వనుల'తోనూ, జంగ ములు గజ్జెలూ, అందెలూ, తంబురాలూ, కంచు గుమ్మెటల అట్టహాసముతోనూ ఈ కథలు వినిపిస్తారు. తొలి రోజుల్లో ఈ కథలు నాలుగు 'కిటతకిట' ఆవృతాల పదాలతో జంపె లనేపేరుతో ఉండేవనీ, పాల్కురికివంటి శివకవు లీ దేశిపద్ధతిని కొద్దిగా సంస్కరించి ద్విపదప్రబంధాలు రచించారనీ నా విశ్వాసము. అయినప్పటికీ మాతంగికథ, మాహురమ్మకథ, అగుమంచికథవంటి 14 వ శతాబ్దపు కథలు జంపె వరుసలుగానే సంతరించబడ్డవి. క్రమముగా కిటతక కిటతక అనే ఎనిమిది అక్షరాల ఆవృతాలు నాలు గింటితో బొబ్బిలిపాట వరుసలో బంగారు తిమ్మరాజుకథ వంటివీ, నాలుగు 'కిటతక' ఆవృతాలతో వరాహావతార కథా, కాంభోజరాజుకథవంటివీ వచ్చాయి. కొమార రాముని కథను పోలిన గాంధారికథలో దరువులు ప్రవే శించినవి. గేయకథలు దరువులూ, పద్యాలూ, రగడలూ పెంచుకొని జంగం కథలుగానూ, నాలుగు-ఎనిమిది అక్ష రాల ఆవృతాలో, ఎనిమిది అయిదు అక్షరాల ఆవృతాలో పెట్టుకొని క్రమంగా బొబ్బిలిపాటల వంటివీ, హరిహరీ నారాయణ పదాలవంటివీగా విడిపోయాయి. మొత్తం మీద పదాలు ఎక్కువగానూ, జంగం కథలు అంతకన్న (సంఖ్య) తక్కువగానూ, బొబ్బిలి పాటలవంటివి ఇంకా తక్కువగానూ కనబడుతున్నాయి నేడు.

ఈ మూడు విభాగాలూ వస్తువులో కూడా వేరవడము చిత్రముగా ఉంటుంది. జంగంకథలు శైవ, వైష్ణవ పురాణ గాథలు. బొబ్బిలి పాటల్లాంటివి వీరగాథలూ, పేరంటాండ్ర గాథలూను. పదాలు మళ్ళీ పురాణ గాథలే. జంగంకథలలో కథ నేరుగా సాగిపోతుంది. కథనముతప్ప కవితా సౌందర్య మేమీ వుండదు వాటిలో. ఆ లోటు కప్పిపుచ్చడానికేనేమో కథకుని వేషమూ, చిందులూ, గుమ్మెటల ఘుమంఘుమలున్నూ. ఛందో వైవిధ్యం కూడా కొంత తోడ్పడుతుంది వీటికి. బొబ్బిలిపాటలవంటి కథ లలో మాత్రము రసమయఘట్టాలు - మల్లమ్మ లేఖా, పెద్దాపుర జగపతి ఆపద మ్రొక్కులూ, సర్వాయి పాపని ఆత్మహత్యా, కోటప్ప కొండలో చిన్నపరెడ్డి తప్పుకుపోవ డమూ, దేశింగురాజు శౌర్యమూ అక్క డక్కడ ఉంటాయి. కామమ్మ, పాపమ్మ, యెరుకమ్మ కథలలో ఆ పేరంటాండ్రు సాగుమానానికని భూమి నడిగే ఘట్టాలు హృదయవిదారకాలు. అయితే ఈ కథలలో మొత్తపు కథ అంతా గుండెకు తగలకుండానే దాటిపోతుంది. పదాలు మాత్రము దేశి సారస్వతానికి శిరోభూషణాలు. రావ ణుని సింహాసనం ఎదుట కూర్చున్న హనుమంతుడు జ్ఞాప కాని కొస్తాడు వీటిని ప్రబంధాలతో పోల్చితే. ప్రబంధాల కాల్పనిక వాతావరణం వీటి నైసర్గిక సౌందర్యం ముందు సిగ్గుపడవలసినదే. సమాసాల బాదరబందీలేని అనుష్టుప్పుల వంటి జంపె వరసలూ, పాదాంత విరామమూ కవి యొక్క స్వంత రచనకు బాగా అవకాశం కల్పించాయి. ఏ పూడిపెద్ది బుచ్చెనవంటివారో పాత గ్రంథాలలోని భావాల్ని ఎరువు తెచ్చుకున్నా పసగాడ సన్యాసి, నడి మింటి రామయోగి వంటి కవులు ఈ రకపు రచనకి అమ రత్వము గడించిపెట్టారు. తెలుగు కవుల నైసర్గిక రచనను ఆనందించాలంటే పదాలే చదవాలి. ఇవి విశాఖమండ లమునుండి 1850 నుంచి విరివిగా వచ్చాయి.

జంగంకథలూ, వీరగాథలూ, పదాలూకంటె సంఖ్యలో స్త్రీల కథాగేయాలు చాలా ఎక్కువ. ఇవన్నీ సామాన్య ముగా జంపెవరుసలే. త్రిశ్రలూ, త్రిపుటలూ అక్క డక్కడ వుంటాయి. వీటి వస్తువు పౌరాణికమే. అయితే వాల్మీకీ,

వ్యాసుడూ ఊహించని ఘట్టాలు మన తల్లులూహించారు. వారి రామాయణము స్వర్గలోకంలోని నాటకము కాదు; ఈ లోకములో జరిగిన రసవత్తర గాథ. తమ గొప్ప కోసము కావ్య రచన చెయ్యడము తెలుగు తల్లు లెరుగరు. అయితే వారికి స్త్రీ పక్షపాతము మాత్రము చాలా ఉన్నది (పురుషులకేనా లేదు పక్షపాతము?). రసధ్వని ప్రబంధాదులలో మందుకి మాత్రము దొరికేది వారి ప్రధాన సాధనము. చిత్ర మేమంటే స్త్రీలు అంతగా అభిమానించే అలంకారాలు మాత్రము వారి రచనలలో ఉండవు.

పండితులు చూడకపోయినా జానపద గేయ కథా సారస్వతానికి సత్తా, ప్రచారమూ కూడా కలవు. ఏ కథ తీసుకున్నా సరే దానికి స్త్రీల పాటా, యక్షగానమూ, జంగం కథా, పదమూ, హరికథా ఉండవలసినదే. స్త్రీల పాటలు కొన్ని గజేంద్రమోక్షమూ, రుక్మిణీ కల్యాణమూ, వామనచరిత్రా, పారిజాతాపహరణమూ వంటివి తెలుగు పురాణగాథల్ని విని చెప్పిన ట్లుంటాయి. జంగంకథలు కూడా కొన్ని ఉంటాయి అలాగ. కాని పదాలలో మాత్రము అనుకరణ వుండదు. స్త్రీల గేయ కథలలో కృష్ణుడి పాదమహిమా, అవతార కథనమూ తరచు ఆమ్రేడితమౌతుంది. నగల పేర్లూ, పిండివంటల పేర్లూ, ఆటలపేర్లూ మళ్ళా మళ్ళా వినబడుతూంటాయి. అయితే ముడిమాట ఒక్కటి చెపితేగాని సొగసు లేదు. ఈ కవులు అందరికీ దండాలు చెప్పి తప్పులు క్షమించమంటారు. ప్రబంధ కవుల్లాగ కుకవుల పేరిట సమకాలికుల్ని తిట్టరు. తమ కథలు విన్నవారిమీద దయావర్షము కురిపించమని పరమేశ్వరుణ్ణి చేతులు జోడించి వేడుకుంటారు ఫలశ్రుతిలో. ఎంత అభ్యుదయకాములు ఈ బృహత్తరాంధ్ర సారస్వత నిర్మాతలు!

శ్రీ. గో. కృ

**జాయపసేనాపతి :** ఇతడు క్రీస్తుశకము పదమూడవ శతాబ్ద పూర్వార్ధమం దుండిన కాకతీయ గజసైన్యాధ్యక్షుడు; నాట్యకలాకుశలుడు; వెలనాటిలోని క్రొయ్యూరి కధిపతియైన అయ్యవంశజుడు; భీమయ్యకు ప్రపౌత్రుడు; వెలనాటి దుర్జయసైన్యాధిపతియైన నారప నాయకునికి పౌత్రుడు. నారపనాయకుని నలువురు పుత్రులలోను మూడవవాడయిన పిన్నచోడునకును దామమ్మకును పుత్రుడు. పృథ్వీ, నారపనాయకు లతని సోదరులు. నారమ్మ పేరమ్మ లతని సోదరీమణులు. ఈ యయ్యవంశజు లందరు సామంతులును, సేనానులునై వెలనాటి చోడభూవరులను సేవించిరి. 1213 ప్రాంతమున కాకతీయ గణపతిదేవమహారాజు ప్రాచ్యాంధ్ర దేశముపై దాడివెడలి వెలనాటిని జయించి నారమ్మ, పేరమ్మలను వివాహమాడి వారి సోదరుడగు జాయప గుణసంపద, ధైర్యసాహసములు, పౌరుష పరాక్రములు త న్నాకర్షింప అతనిని దనతో తీసికొనిపోయి గజసాధనికుని జేసెను. జాయ చమూపతికి చక్రవర్తి వైరిగోధూమఘరట్ట (శత్రువులను గోధుమలను తిరుగలివలె పిండిగ నలగగొట్టువాడు) బిరుదము నొసగి గౌరవించెను. చక్రవర్తిపేర జాయప గణపతీశ్వరాలయమును కట్టించి శా. శకము 1153 ఖరవత్సరమున ఆ దేవాలయమున కనేక గ్రామముల నంగరంగ భోగములకై సమర్పించెను. మరియు, నీతడు జనకుని పేర తామ్రపురమున (చేబ్రోలు) చోడేశ్వరలింగమును (శా.శ. 1152 మన్మథ - క్రీ. శ. 1230) ప్రతిష్ఠింపజేసి దేవాలయము నెదుట దేవదాసీగణము నివసించుటకై రెండేసి యంతస్తులుగల ప్రాసాదములు కట్టించి దేవుని భోగోత్సవములకయి మ్రోంతుకూరు (మోదుకూరు) అను గ్రామమును అర్పించెను. గణపతిదేవుడు సంగీత నాట్యశాస్త్ర వ్యసని; విద్వత్కవి పోషకుడు. అతని కుడిభుజమగు జాయప కౌమారప్రాయమునుండియు శాస్త్రములయందు, అందును ముఖ్యముగా నాట్యశాస్త్ర విచారకములగు గ్రంథము లందు వ్యాసంగ మొనర్చి భరతుని నాట్యశాస్త్రము, సోమేశ్వరదేవుని మానసోల్లాసము (అభిలషితార్థ చింతామణి) మొదలగు ప్రాచీన, నవీన గ్రంథములయందలి మర్మముల నెరిగి శాస్త్రశాణోపలపట్టికాకషణమున నిశితమగు ప్రతిభతో నొప్పుటను గుర్తించి చక్రవర్తి ఈతనిని 'నృత్తరత్నావళి' రచింప శాసించెను.

**నృత్తరత్నావళి :** దీని తాళపత్రముల ప్రతులు రెండు తంజావూరు సరస్వతీ మహలున కలవు. 99 పత్రముల గ్రంథలిపిప్రతి యొకటి, తెనుగు లిపిలోనున్న దొకటి. రెండును దోష జుష్టములే. ఎడ నెడ గ్రంథ పాతము లున్నవి. పంచమాధ్యాయము మృగ్యము బహుశః అది పూర్వ పరాధ్యాయములలో గలిసిపోయి యుండ వచ్చును. ఇది ఎనిమిది అధ్యాయముల గ్రంథము. ప్రతి యధ్యాయాంతమున నందలి విషయముల సూచిక కలదు. 7 వ, 8 వ యధ్యాయాంతముల మాత్ర మీ సూచిక లోపించినది. ఈ కృతియందు మార్గ దేశి భేదములుకల నృత్తగీతములు వివరింపబడెను. భరతుని నాట్యశాస్త్రము మార్గ విధానమునకు, భూలోకమల్ల సర్వజ్ఞ సోమేశ్వర ప్రభునిర్మిత మానసోల్లాసము దేశివిధానమునకు జాయప కుపజీవ్య గ్రంథములు. తనకాలమువరకు నృత్త గీతములయందు జరిగిన గవేషణఫలమును, సిద్ధాంత రహస్యములను, సంస్కృతీ వైభవమును ఈ గ్రంథమున జేర్చి జాయప కళాజిజ్ఞాసువులకు మహోపకృతి యొనర్చెను. ఈ గ్రంథమును జాయప సేనా

పతి కలి 4,355 వ యేట ('భూతబాణాగ్ని సాగరైః' - క్రీ శ. 1254) ఆనంద వత్సరమున రచించెను. ఈ.వెం.వీ.రా.

**తంజావూరు నాయకరాజులు :** తంజావూరు నాయకరాజ్యము విజయనగరాధీశ్వరుడైన అచ్యుతదేవ రాయల (క్రీ. శ. 1530 - 1542) పరిపాలన ప్రారంభదశలో ముఖ్యముగా చోళదేశ పరిపాలనము సమర్థతతో సాగునట్లు చూచుటకై స్థాపితమైనది. ఆ ప్రాంతములోని వీర శరసింగరాయ లనుసామంతనాయకు డొకడు క్రీ. శ. 1531 లో తిరుగబాటు చేసినప్పుడు అది యణచివేయబడిన పిదప, ఉత్తరమున చంద్రగిరికిని, దక్షిణమున తిరువడి రాజ్య సీమావధులకును మధ్య నున్న ప్రదేశము రాజకీయముగ రెండు విభాగములు కావింపబడెను. మధుర రాజధానిగా దక్షిణ విభాగమునకు ఆధిపత్యము విశ్వనాథ నాయకునికి స్థిరపరుపబడగా అచ్యుతదేవరాయల దేవియైన తిరుమలాంబ చెల్లెలు మూర్తమాంబ భర్తయైన చెవ్వప్పనాయకు డుత్తర విభాగమునకు పరిపాలకుడుగా నియమితు డయ్యెను. ఈ విభాగమే తంజావూరు నాయక రాజ్య మయినది. మధుర తంజావూరు నాయకులు తమ యధికారము క్రింద నుండిన కొన్ని ప్రదేశములను మార్చుకొనిరి. దీని ఫలితముగా వల్లమ్ చెవ్వప్పకు రాగా విశ్వనాథనాయకునికి తిరుచిరాపల్లి సంక్రమించినది. చెవ్వప్ప నాయకుడు అన్ని మతములను సరిసమానముగ ఆదరించెను; బుడతకీచు(పోర్చుగీసు)లకు ప్రోత్సాహమిచ్చెను.

క్రీ. శ. 1580 లో చెవ్వప్ప నాయకుడు కాలధర్మము నొందిన పిదప, క్రీ.శ. 1560 నుండియే పరిపాలనా నిర్వహణమున తండ్రితో సహకరించుచు వచ్చిన అతని కుమారుడు అచ్యుతప్ప నాయకుడు తంజావూరి సింహాసన మెక్కి 1614 వరకు రాజ్యము పరిపాలించెను. విజయనగర సామ్రాజ్యాధిపతుల కుటుంబమునెడల అతనికి గల రాజభక్తి విశ్వాసములవలన అతనికిని, విజయనగరాధీశ్వరునియెడ ద్రోహ బుద్ధితో నుండిన మధుర వీరప్ప నాయకునికిని వైరము సంభవించినది. క్రీ.శ. 1583 లో వీరప్పనాయకునికిని, విజయనగరాధీశ్వరునికిని వల్లంప్రాకారమువద్ద జరిగిన యుద్ధములో అచ్యుతప్పనాయకుడు తన ప్రభువునకు తోడ్పడెను. అందువలన వీరప్పనాయకుడు తంజావూరిపై రెండు మారులు దాడివెడలెను. అచ్యుతప్పనాయకుడు మహమ్మదీయులతో జరగిన యుద్ధములో విజయనగరాధిపతి ఇమ్మడి వెంకటపతిదేవరాయలకు సాయపడెను. 1589 లో పెనుకొండవద్ద జరగిన యుద్ధమునందు తంజావూరు యువరాజయిన రఘునాథనాయకుడే విజయమును సాధించెను. అచ్యుతప్పనాయకునికిని బుడతకీచులకును పరస్పరము గల సంబంధము అంత హార్దముగ నుండినవి కావు.

తంజావూరి నాయకరాజు లందరిలో గొప్పవాడయిన అచ్యుతప్పనాయక తనయుడు రఘునాథనాయకుడు నాయకరాజ్య పరిపాలనమున క్రీ. శ. 1600 ల నుండి పాల్గొని క్రీ. శ. 1634 వరకు రాజ్యమును పరిపాలించెను. విజయనగర సింహాసనముకై జరగిన మహా సంగ్రామమున (క్రీ. శ. 1614 - 17) యాచమనాయకుడు నాయకత్వము వహించిన రాజభక్త పక్షమున కండగా నిలిచి అతడు పేరు ప్రఖ్యాతులు సంపాదించెను. అతడు కొలరూన్ నదీ ముఖద్వార ప్రాంతమున నిరంకుశ పరిపాలనము నెరపుచుండిన క్రూరకిరాతుడు చోళగుని అణచివైచి జాఫ్నా (యాల్పాణము)లోని బుడతకీచుల కెదురొడ్డి సంగిలి కుమారునికి సాయము చేసెను. ఈతడు పరిపాలించుచుండిన కాలము నందే దక్షిణ హిందూదేశము తూర్పు తీరమునకు డచ్చివారు, డేనులు, ఇంగ్లీషువారు వర్తక వ్యాపారము నిమిత్తము విచ్చేసిరి. రఘునాథనాయకుని రాజ్యకాలము గొప్ప సాహిత్య వ్యాసంగ, కలాత్మక కృషికి ప్రాముఖ్యము వహించినది. ఇందుకు అతడును, అతని ప్రధాని గోవింద దీక్షితులును చాలవరకు కారణభూతులు. రఘునాథనాయకుడే సంగీతసుధ యను గ్రంథమునకు కర్తయని విశ్వసనీయముగా చెప్పుదురు. ఈతడు కర్ణాట సంగీత స్థాపకు డనియు, క్రొత్త రాగములను, క్రొత్త తాళములను కనిపెట్టె ననియు చెప్పుదురు. ఈతని యాస్థానము నలంకరించినవారిలో గోవింద దీక్షితులు, యజ్ఞనారాయణ దీక్షితులు, వెంకటమఖి, రాజచూడామణి దీక్షితులు, భాస్కర దీక్షితులు మున్నగువారు కలరు. తాను వైష్ణవు డయినను రఘునాథనాయకుడు అన్యమతములయెడ సహనభావము కలిగియుండెను. ఈతడు చేసిన యసంఖ్యాక ధర్మములవలన కూడ ఇతని పేరు స్మరణీయమైనది.

రఘునాథనాయకుని కుమారుడు విజయరాఘవ నాయకుడు (క్రీ శ. 1633 - 1673) తంజావూరు నాయకరాజులలో కడపటివాడు. ఇతడు దుర్బలుడయిన రాజు; తన కాలములో చాల భాగము మత వ్యాసంగమునందును, దైవ భక్తి ధర్మ నిష్ఠాపరత యందును గడపెను. అతని రాజ్య కాలము ఆరంభ సంవత్సరములలో విజయనగరాధీశ్వరుల యెడ రాజభక్తి విశ్వాసములు కలిగి యుండినప్పటికి తదనంతర కాలమున, అతని రాజ్యము దక్షిణమున మధుర తిరుమలనాయకుని యొక్కయు, ఉత్తరమున మహమ్మదీయుల యొక్కయు దండయాత్రలకు గురియగుటచేత మూడవ శ్రీరంగ దేవరాయలయెడ అతని వైఖరి అను

మానాస్పదముగాను, చాలవరకు చంచలముగాను మారినది. విజయరాఘవనాయకుడు మధుర తిరుమలనాయకునితోను, చెంజి(జింజి) నాయకులతోను చేరి మూడవ శ్రీరంగదేవరాయలపై కత్తికట్టెను. కాని సరిగా కార్యావసర సమయమున తన తోడివారలను వీడి విశ్వాసఘాతకుడై ప్రవర్తించెను. ఇందువలన సహజముగా తంజావూరు భాగ్య వైభవములు తారుమారయినవి. క్రీ. శ. 1648 లో చెంజి దుర్గమును సాధించిన యనంతరము మహమ్మదీయులు తంజావూరిపై నెత్తి వెళ్ళిరి. విజయరాఘవుడు నిస్సహాయుడై చేయునది లేక వారి కెక్కువగా ధనము లంచమిచ్చి వారిని పంపివేసెను. క్రీ.శ. 1653 నాటికి శ్రీరంగదేవ రాయల యధికార మంతరించుటతో తంజావూరు మరింత దుర్బలమైనది. మధుర తిరుమలనాయకునితోను, అతని యనంతరము రాజ్యమునకు వచ్చిన ముద్దు వీరప్ప నాయకునితోను విరోధపడుటవలనను, తంజావూరు వల్లములపై విజాపురపు మహమ్మదీయు లెత్తివచ్చి యొత్తిడి కలిగించుట వలనను అతడు క్రీ. శ. 1659 లో మహమ్మదీయులు కారణముగా పలాయితు డయ్యెను. మహమ్మదీయులు మరలిపోయిన పిదప అతని సింహాసన మతనికి దక్కినప్పటికి అతనికి శాంతి స్తిమితములు లేకపోయినవి. ఇందుకు కారణము చొక్కనాథనాయకుని దండయాత్ర. యుద్ధములో విజయరాఘవు డతనికి వశుడయ్యెను. మరల నింకొకమారు మధుర నాయకుడు తంజావూరు రాజ్యముపై దండెత్తి వచ్చెను. వల్లము పట్టువడెను. విజయరాఘవ నాయకుడు పరాజితుడై హతుడయ్యెను. చొక్కనాథ నాయకుడు తనకు పాలిచ్చి పెంచిన దాది కుమారుడు అళగిరి నాయకుని తంజావూరు రాజ్యాధిపతిగ నియమించెను. కాని క్రీ. శ. 1675 లో విజాపురపు సుల్తానుచే అతని రాజ్య మతని కిప్పించుటకొరకు పంపబడిన శివాజీ సవతి సోదరుడు వెంకాజీ తంజావూరు నాయకరాజ కుమారుడు చెంగమలదాసునికి ఆ నాయక రాజ్యము నిచ్చివేసెను. కాని యా రాజ్యము నతడు సమర్థతతో విజయవంతముగా పరిపాలింప నశక్తుడని తెలిసికొని ఆ మరుసటి సంవత్సరమునందే సింహాసనము నాక్రమించుకొని వెంకాజీ తంజావూరిలో మహారాష్ట్ర ప్రభుత్వ స్థాపకుడయ్యెను.

శాహజీ భోసలే కుమారుడయిన వెంకాజీ (క్రీ. శ. 1676-1685) చురుకైన పరిపాలకుడైనప్పటికి అతని పరిపాలన ముపద్రవ కరముగను, దౌర్జన్యముగను నుండిన ట్లున్నది; అతని రాజ్యముపై శివాజీ దండెత్తి వచ్చినపుడు అతని కెంతయో ధనమిచ్చి సంధి కావించుకొనెను. వెంకాజీ కుమారుడు రెండవ శాహజీ (క్రీ.శ. 1686 - 1712) 1694 లో మొగలాయిలచేతను, క్రీ.శ. 1700 లలో మధుర పరిపాలకురాలు రాణి మంగమ్మ చేతను పరాజితుడయ్యెను. అతడు గొప్ప సాహిత్య పోషకుడు; పండితులకు ప్రోత్సాహమిచ్చెను. ఇట్టివారిలో జానకీపరిణయ, పతంజలి చరిత్రల కర్తయైన అయ్యదీక్షితు లనురామభద్ర దీక్షితు లొకడు. ఇతడు మరి 45 గురితోకూడ ఇప్పుడు తిరువిశలూరను పేర బరగు గొప్ప వృద్ధిలోనున్న శాహజీ రాజపురమును దానము పడసెను. కె. ఏ. నీ. శా.

**తమ్మభూపాలుడు, పూసపాటి :** ఇతడు పదునేడవ శతాబ్ది తొలి భాగమున నుండిన సూర్యవంశ క్షత్రియుడు; విశాఖపట్టణ మండలములోని విజయనగర సంస్థానమునకు పాలకుడు. ఇతడు 'శ్రీకృష్ణ విజయము' అను పెద్ద ప్రబంధమును అయిదాశ్వాసములలో రచించెను. ఇది శ్లేష, యమకములతోను, చిత్రకవిత్వ రీతులతోను గూడి యున్నది. శ్రీకృష్ణుడు సత్యభామాసహితుడై పోయి నరకాసురుని వధించి, కుండలముల నదితి కిచ్చుటకై స్వర్గమున కేగుట, పారిజాతాపహరణము, పిదప ద్వారక చేరి పదునారువేల కన్యలను పరిణయ మగుట ఇందలి యితివృత్తము. ఈ గ్రంథము 1893 లో ముద్రితము. కాని ప్రకటితము కాలేదు. బి. వెం. ర.

**తాళ్ళపాకము కవులు :** తాళ్ళపాకము ఇంటి పేరుగా గల ఈ కవులలో అన్నమయ్య మొదలుకొని మూడు నాలుగు తరములవారు కవులుగా, గాయకులుగా వర్ధిల్లిరి. ఇంచుమించుగా రెండువందల యేండ్లకు పైబడిన కాలము తెలుగున సుకవితా వ్యాసంగము చేసి భక్తిమయముగా జీవితము వెళ్లద్రోసిన మహనీయులు వీరు. తన కవిత్వమునంతను శ్రీ వేంకటేశ్వరస్వామికే యంకితము గావించి తన్మయముగా గవిత సాగించిన వంశ మది. తాళ్లపాకవారు శ్రీ వేంకటేశ్వర పరముగా, సంకీర్తనాత్మకముగా, కవిత వెలయించుట మాత్రమేకాక కవితలో వివిధ సాహితీ స్వరూపములను జేపట్టి యన్నిటను సిద్ధహస్తు లనిపించుకొనినారు.

తెలుగున వీరశైవ వాఙ్మయమునకు బ్రతిగా వైష్ణవ వాఙ్మయమును వెలయించుట తాళ్లపాకవారి తలంపు గావచ్చును. వీరశైవమత ప్రతిపాదకములుగా శైవకవు లవలంబించిన విధానములను, జేపట్టిన కవితా శాఖలను వీరును అవలంబించి వారి తీరుననే వాఙ్మయసృష్టి గావించిరి. వారు గేయ రచనలు చేసిరి. వీరు సంకీర్తనములు వెలయించిరి. వారు ద్విపద కావ్యములు వ్రాసిరి. వీరును ద్విపద కావ్యములు వ్రాసిరి. వారు శతకము, మంజరి, ఉదాహరణము రగడ, యను వాఙ్మయ శాఖలను జేపట్టిరి.

శివకవు లందరు నొక కుటుంబముగా వీరశైవోద్యమము సాగింపగా నొక కుటుంబము కుటుంబముగా నిట వైష్ణవ ధర్మ ప్రచారమునకై కృషి సల్పినది. వీరశైవోద్యమమే వీరి కాలమున నొక విధమున వైష్ణవోద్యమముగా దిరుగ బెట్టిన ట్లయినది. సాహిత్యమును మతప్రచార సాధనముగా నుపయోగించుటన్నది వీరు శివకవులకడ నేర్చిన విద్యయే.

తాళ్ళపాకవారు తొలుత నందవరీక వైదిక బ్రాహ్మణులు; ఋగ్వేదులు; ఆశ్వలాయన సూత్రులు; భరద్వాజ సగోత్రులు. అన్నమయ్య తొలుత వైష్ణవము స్వీకరింపగా నాతని తరువాత నాతని వంశమువా రెల్లరు వైష్ణవు లయిరి. పొత్తపినాటిలోని 'తాళ్లపాక' యను గ్రామము వీరి పూర్వ నివాసస్థలము. అది నేటి కడపజిల్లా రాజంపేట తాలూకాలో నున్నది. దానిబట్టి వీరికి తాళ్లపాక వారని యింటిపే రయ్యెను (చూ: అన్నమయ్య, చిన తిరుమలయ్య, చిన తిరువెంగళనాథుడు, తిమ్మక్క, తిరువెంగళప్ప, నరసింగన్న, పెద తిరుమలయ్య, పెద తిరువెంగళనాథుడు). తి. కో. రా.

**తిక్కన, కొట్టరువు**: ఇత డార్వేల నియోగి బ్రాహ్మణుడు; గౌతమ సగోత్రుడు. తిక్కనసోమయాజి వంశము వారు అతనికి పూర్వము కొన్ని తరములుగా కవులై, మంత్రులై, దండనాథులై ఆంధ్రజాతిని సేవించి ప్రతిష్ఠ గడించుకొన్నవారు. తిక్కనగారి పితామహుడగు మంత్రి భాస్కరుడు 'సారకవితాభిరాముడు', 'గుంటూరి విభుడు'. ఆ భాస్కరుని కుమారులలో ఒకడగు కేతన మంత్రి ఆంధ్ర పద్యకాదంబరి కర్త. తిక్కనతండ్రి కొమ్మన దండనాథుడు. ఆ దండనాథుని అన్నకుమారుడు ఖడ్గ తిక్కన-కదనభీముడని పేరుగాంచిన శూరుడు. భారతకవి తిక్కన గంటము పట్టుటలో ఎంత కుశలుడో ఈ కదన భీముడు తిక్కన ఖడ్గము పట్టుటలో అంత కుశలుడు. కాబట్టియే సపత్ననామములగు వా రిరువురిలో ఒకరిని కవి తిక్కన యనియు, రెండవవారిని ఖడ్గతిక్కన అనియు లోకులు పేర్కొనుచుండెడివారు. కవి తిక్కన మనుమసిద్ధి రాజునకు మంత్రిత్వముచేయుట ప్రసిద్ధమే గనుక ఆమంత్రి యుద్ధనిపుణు డనియు ననుకొనదగును. తిక్కనగారి మహోదారప్రవృత్తిని, రమణీయ రూపమును దశకుమార చరిత్రావతారికలో శబ్దచిత్రిత మొనర్చి ఆ మూర్తికి వర్ణచిత్రము లేని లోటు తీర్చెను కేతన.

నెల్లూరి తెలుగు చోళులలో రాణకెక్కినవాడును, మనుమసిద్ధికి తండ్రియునైన తిక్కరాజు క్రీ. శ. 1248 వరకు అరిభయంకరుడై రాజ్య మేలె ననియు, పదభ్రంశము నొందిన రాజులకు సాయముచేసి వారిని తిరిగి సింహాసన ప్రతిష్ఠితులను చేసె ననియు శాసనాధారములను బట్టి చెప్పుదురు. ఆ శాసనాధారములనుబట్టియే మనుమసిద్ధి తన తండ్రి తరువాత సింహాసన మెక్కి క్రీ. శ. 1262 ప్రాంతమున దివంగతు డయ్యెనని ఊహింపబడెను. ఆయన సింహాసన మెక్కుట, తిక్కన మంత్రిపదవిని స్వీకరించుట ఇంచుమించు ఏకకాలికములై యుండును. అప్పటికి (క్రీ. శ. 1248 నాటికి) తిక్కనకు ఎంత తగ్గించి చెప్పినను 35, 40 సంవత్సరముల ప్రాయ ముండవలెను. అగుచో తిక్కన కాలము క్రీ. శ. 1205 - 1210 మధ్యకాలమున అయి ఉండును. మరి ఆయన 'సహస్రమాసజీవి' యని లోకమున ప్రసిద్ధి కలదు. ఆయన క్రీ. శ. 1288 వ సంవత్సరమున పరమపదించెనని శాసన పరిశోధకులు నిర్ణయించిరి. కాన తిక్కన జీవితము ఇంచుమించు క్రీ. శ. 13 వ శతాబ్ది ఆదినుండి అంతమువరకు విస్తరిల్లియుండెను.

12 వ శతాబ్ది చివరిభాగములో అపరభారత యుద్ధమనదగిన పల్నాటి యుద్ధము జరిగినది. నిష్కారణ కుటుంబకలహమువలన సంభవించిన యుద్ధాగ్నిలో నానా శూరవంశములు ఆహుతి యయ్యెను. పలనాటి పోరునకు దాయభాగము కొంత కారణమైనను బ్రహ్మనాయడు వైష్ణవము పేర తలపెట్టిన సంఘసంస్కారము ఎదిరి పక్షమువారికి దుస్సహమై వైరమును ప్రబల మొనర్చెను. అదేకాలమున వైష్ణవమునకే కాక అద్వైతమునకును ప్రతిస్పర్ధిగా వీరశైవము విజృంభించి ప్రజలలో మరికొంత మతోద్రేకము పుట్టించెను. వారు ప్రబోధించిన వర్ణాశ్రమ రాహిత్యము, కర్మ తిరస్కారము, అద్వైత ఖండనము, అన్యదేవతా దూషణము మొదలగు వీరావేశ చేష్టలు సంప్రదాయ విధేయులైన ఆంధ్రులకు దుర్భరము లయ్యెను. ఇదికాక పాల్కురికి సోమనాథ ప్రముఖ వీరశైవ కవులు దేశికవిత జాను తెనుగు అనుపేరుమీద ద్విపదరచనలను సాగించి శైవేతరుల భారతాది మార్గకవితారచనలను ఖండింపబూనిరి. సాహిత్య ప్రపంచమున ఏర్పడిన యీ భిన్నశాఖ కవి పండిత వంశములలో ఇం కొక అనైక్యమునకు కారణ మయ్యెను. ఈ విధమైన రాజకీయ, మత, సారస్వత విభిన్నతలవల్ల జాతియొక్క జీవశక్తి విచ్ఛిన్నమై నీరసింప దొడగెను. రాజకీయ ఐక్యముతో పాటు తక్కిన రంగములలో కూడ ఏకత్వము సాధింపబడనిచో అంతఃకలహములు తప్పవు. ఆ శతాబ్దియందలి ఆంధ్ర మహాపురుషులు సాధింప నెంచిన ఐక్యములో ఈ విభిన్నాంశము లన్నియు లీనము కావలసి యుండెను. ఈ వైరుధ్యము లన్నిటిని సమన్వయము చేసి మతమునను, వాఙ్మయమునను ఎల్లరకును అనుసరణీయము, సుగ

మము అగు బాటను తీర్చి దిద్దుటకు తగిన అధికార సంస్కారము కల తిక్కన ఆ భారము వహించుటకు పూనుకొనెను.

తిక్కన మన వాఙ్మయమునందు ఎంత ప్రసిద్ధ పురుషుడో చరిత్రయందును అంతే ప్రసిద్ధికలవాడు. ఆయన సాహితీ గురుపీఠము నలంకరించి తన గృహమునే ఒక విద్యా సంస్థగా నొనర్చెను. తమ కృతులు వినిపించి ఆయన మెప్పు వడయుటకు వచ్చు కవులు, ఆయన ప్రాపును ఆసించి ధన సంపాదనముకొరకు వచ్చెడి పండితులు, రాజకీయ మంత్రాలోచనల కొరకు వచ్చు లౌకికులు, మత చర్చలకై వేంచేసెడి శ్రోత్రియులు మొదలగు విద్వజ్జనములతో ఆయన ప్రాంగణము ఎప్పుడును నిండియుండెడిదట. ఒక్క విద్వత్త వల్లనేకాక రాజోచిత ప్రాభవముగల మంత్రిత్వము వల్లను గొప్ప పదస్థుడు గనుక ప్రజలకు ఆయన మాటయందు అధిక గౌరవ ముండెడిది. ఆ యాచార్యపీఠము నధిష్ఠించి ఆయన మత కల్లోలములలో కుదిర్చిన సామరస్యము శివ కేశవ రూపద్వయాత్మకమైన హరిహరారాధన.

కల్పితములైన నామరూప భేదములచే భగవంతుని పేరను, మతముపేరను దారుణ కలహములకు లోనై అలజడి పొందుచుండిన ఆంధ్రులకు తిక్కన ప్రసాదించిన భగవత్స్వరూపము హరిహరనాథము. ఈ తత్త్వమును భారతక్షేత్రమున ప్రతిష్ఠింపక పూర్వము ఎంతో కాలము నుండి ఆయన ప్రచారముచేసి యుండును.

తిక్కన నాటికి భారతమేకాక రామాయణముకూడ తెనుగున అసంపూర్ణముగానే యుండెను. రంగనాథ రామాయణము ఆరు కాండములే అప్పటికి వ్రాయబడి యుండుటయు, ఏడవది యయిన ఉత్తరకాండము రచింపబడనిచో రామాయణము అసంపూర్ణము అగుటయు గమనించి తిక్కన ఆ యుద్గ్రంథ పూర్తికి దొరకొని నిర్వచనోత్తర రామాయణమును రచించెను. సంస్కృతమున సైతము పుట్టుకచే రామాయణమే భారతము కంటె పూర్వ రచన. తిక్కన మొదటి రచన రామాయణ సంబంధి యగుట సమంజసమే. ఈ గ్రంథము ఆయన మనుమసిద్ధికి మంత్రిగా నున్నకాలమున వ్రాయబడినది. రామాయణ రచనాకుతూహలము గల యీ కవి ఆది నుండియుగాక ఉత్తరకాండము నెత్తుట రంగనాథ రామాయణమును పూర్తిచేయు ఉద్దేశముతోనే అని ఊహించుట దొసగు గాదు. రంగనాథ రామాయణము ద్విపదరూపములో నుండగ దానిని పూర్తిచేయ నెంచిన కవి ద్విపద కావ్యముగ గాక పద్యప్రబంధముగా నేల రచింపవలెనని నిజముగనే యొక శంక పొడమును. అయినను, ఒక సమాధాన మాలోచింతము. నన్నయ భారతమున నుపక్రమించిన గద్య పద్యాత్మక చంపూ పద్ధతి నచ్చకయే పాల్కురికి సోమనాథుడు గద్య సంపర్కములేని ద్విపద రచనలకు పూనుకొనెను. బుద్ధారెడ్డి సోమనాథునితో ప్రతిభటత్వము వహించి తానును ద్విపద రచనయే చేసి తన రామాయణమునకు బసవపురాణమునకు లేని ప్రశస్తిని సంపాదించెను. తిక్కనకు ద్విపదకావ్యము నచ్చదు. అది ధారాళమైన రచనకు అనువగు ఛందమే కావచ్చును గాని ద్విపదలు గలిగించెడి విసుగుదల కావ్యపఠన కుతూహలమును కుంటువడజేయుచుండును. ఆ గ్రంథము పాడుటకు అనువైనంతగా పఠనమునకు అనువు కాదు. చంపూ పద్ధతిలో ఎడనెడ వచ్చెడి గద్యలు పద్యభాగరక్తికి ఉపహతి కల్పించునన్న మిషచే భారతమును నిరసించెడి సోమనాథాదులకు ప్రత్యుత్తరముగా తిక్కన వచనస్పర్శలేని పద్యగ్రంథమును వ్రాసి ద్విపదకావ్యముకంటె ఇది గుణ విశిష్టమని నిరూపించదలచెను. ఆ ప్రయత్నము ఆ కాలమునకు ఆవశ్యక మయ్యెను. దానిని సార్వకాలిక సిద్ధాంతముగా తిక్కన ఊహింపలేదు. అట్లే కానిచో భారతమును ఆయన చంపూ పద్ధతిని రచియించుటయే పొసగదు.

నిర్వచనోత్తర రామాయణ పీఠికలో కావ్య శిల్పమును గూర్చి తిక్కన సార్వకాలికములైన కొన్ని ధర్మములను లోకమున కుపదేశించెను. ఆ యుపదేశములలో సోమనాథుని రచనలయందలి లోపములను విమర్శించెడి అధిక్షేప వాక్యములును గలవు. అది పరోక్షమైన విమర్శ. సోమనాథుడు మాటిమాటికి తెలుగు వాక్యములలో సంస్కృత వాక్యములను (శ్రుతి-స్మృతి-ఆగమాదుల యందలివి) చొప్పించుట, శాంతప్రాస వాడుట, విశేషణ విశేష్యంబుల లింగవచనముల అభేదమును పాటింపకుండుట, వళులు ప్రాసలు పులిమిపుచ్చుట మొదలైన వానిని విచ్చలవిడిగా వాడి తన నిరంకుశత్వమును ప్రకటించెను. ఒక భాషలో ఇంకొక భాషావాక్యములు చొనుపుట రచనా దోషములలో ఒకటిగా ఆధునిక పాశ్చాత్య విమర్శకులు వక్కాణింతురు. దీనినే తిక్కన ఆనాడు 'జాత్యము కాదు' అని సోమనాథుని రచనలో తప్పు పట్టెను. లక్షణ యుక్తమును, నియమబద్ధమును అయిన భాషా సంప్రదాయమును కొనియాడెడి తిక్కనకు సోమనాథుని పోకడలు అధిక్షేపార్హము లయ్యెను.

భారతాంధ్రీకరణములలో తాను చూపిన స్వతంత్రత కంటె ఉత్తర రామాయణరచనలో తిక్కన ఎక్కువ స్వతంత్రతను జూపెను. ఇందు కథారూపములోనే మార్పుతెచ్చెను. కావ్యాదిని కథను సంగ్రహముగా చెప్పి కావ్యాంత

మున రామనిర్యాణమును పరిహరించి స్వయంసంపూర్ణము, మంగళాంతము అయిన ఒక స్వతంత్ర కావ్యమును సృష్టించెను.

భారతము వ్రాయకున్నను, తిక్కన కవితా యశమునకు ఈ గ్రంథమొక్కటే చాలి యుండెడిది. భారతమున కావ్యశిల్ప సంబంధములగు ఏ మహోదార విశేషములు తిక్కన ప్రతిభకు నిదర్శనముగా ఉదాహరింప బడునో అవి అన్నియు ఈ ఉత్తర రామాయణముననే స్థిరరూపము దాల్చినవి. ఆయన కవిత్వమునకు జీవగర్రయని చెప్పదగిన శబ్దార్థౌచితి, సంభాషణ కౌశలము, సజీవ పాత్రసృష్టి, నిశిత ప్రకృతిపరిశీలనము, తీక్ష్ణమనోనిదానము, అల్పాక్షరముల అనల్పార్థ రచన మొదలగు విశేషాంశములన్నియు భారతమునందువలె ఇందును సువ్యక్తములగుచుండును. మరియు ఇందుగల యే చిన్న ఉపాఖ్యానమైనను భారతమునందలి ఉపాఖ్యానముల వలెనే స్వయం సంపూర్ణమును, కావ్యధర్మ శోభితమును నగు శిల్ప ఖండమువలె భాసించుచుండును.

రంభా రావణ సంవాదము, వేదవతీ చరిత్ర, సీతాపరిత్యాగఘట్టము, సీతారాముల వనవిహారవర్ణన మొదలగు ప్రకరణములు మన వాఙ్మయములో గల ఉత్తమ ఖండ కావ్యములు. అందును సీతారాముల ఉద్యానవన విహార, శయ్యాగృహవృత్త వర్ణనలో తిక్కన చూపిన నాగరక మర్యాదాలంకృతమును, ప్రేమనిష్ఠమును, ప్రణయ సుందరమును అయిన దాంపత్యమాధుర్యము వర్ణనాతీతమైన అమృతప్రవాహము. దానికి సాటి రాదగిన కావ్యఖండము సంస్కృతాంధ్ర వాఙ్మయములలో మరెచ్చటను లేదు.

'అమలోదాత్త మనీష నేనుభయకావ్య ప్రౌఢి పాటించు శిల్పమునన్ పారగుడన్ కళావిదుఁడ....' అని ఆత్మ విశ్వాస పూర్వకముగా ఆయన చేసిన ప్రతిజ్ఞను ఈ కావ్యము సార్థకము చేసెను.

తిక్కన రచించిన మరియొక గ్రంథము భారతము. దీనిలో మొదటి మూడు పర్వములు తక్క మిగిలిన పదునైదు పర్వములను ఇతడు ఆంధ్రీకరించెను. ప్రతాప చరిత్ర యనెడి దండకవిలె ననుసరించి కాసె సర్వప్ప వ్రాసిన సిద్ధేశ్వరచరిత్రలో తిక్కన గణపతికి భారతమును వినిపించి మెప్పు పొందినట్లు గలదు.

మనుమసిద్ధి సహాయార్థము తిక్కన గణపతిదేవుని సందర్శించినప్పటికే భారతము రచింపబడినట్లు దీనినిబట్టి స్పష్టపడుచుండుటచే మనుమసిద్ధి బ్రతికియుండగనే తిక్కన భారతరచన కావించెనని చెప్పవలసి యుండును. కనుక భారత రచనము నిర్వచనోత్తరరామాయణ రచన కించుక పూర్వమో లేక కొంచె మర్వాచీనమో యయి యుండ వలెను. కాని నిర్వచనోత్తర రామాయణములో భారత రచనాప్రశంస లేదు. కనుక భారతము దానికి పూర్వమగుట యసంభవము.

ఉత్తర రామాయణ, భారత రచనలలోని తిక్కన యాత్మీయతనుబట్టి చూచిన రెంటికి నడుమ పదునేను సంవత్సరముల వ్యవధి యుండునట్లు పొడకట్టును.

రామాయణమున ఆయన యజ్ఞప్రశంస గాని, భారతమున మంత్రిత్వ ప్రశంస గాని లేవు. భారత కథాప్రవృత్తితో నించుమించు సమానమైన జీవితము గడపి, జీవిత నిస్సారతను గ్రహించి విరాగియై ఫలము బ్రహ్మార్పణ మన్నప్పటి రచన భారతము.

'అమలోదాత్త మనీష' ఇత్యాదిగా తన ప్రౌఢి చెప్పికొన్ననాటి రచన రామాయణము. 'నా నేర్చిన భంగిఁ జెప్పి వరణీయుఁడ నయ్యెద భక్తకోటికిన్' అనెడి బుద్ధి పరిపక్వత కలిగిన కాలమందు రచించినది భారతము.

ఆయన ప్రకృతిలో నింత మార్పు రావలెనన్న నడుమ పదునేను ఇరువది సంవత్సరముల వ్యవధాన ముండితీర వలెను. క్రీ. శ. 1260 ప్రాంతమున నిర్వచనోత్తర రామాయణము రచింపబడిన దన్న, భారతము క్రీ. శ. 1270 – 75 ప్రాంతమున రచింపబడి యుండవలెను. సర్వప్ప పంక్తులు కేవల మసత్యములని వదలివేయకుండ గణపతికి తిక్కన చదివి వినిపించినది సంస్కృత మనియు, దాని నంతకు పూర్వము లెక్కలేనన్నిమార్లు పఠించి యధికారము వచ్చినప్పుడు వ్రాయుదమని కనిపెట్టుకొని యుండి, మననము చేసి భారతార్థము తిక్కనయే చెప్పవలె ననుప్రశస్తి నప్పటికే సంపాదించియుండు ననియు నూహింపవచ్చును. అంతేకాని తెలుగు భారతమే చదివి వినిపించెనని యా పంక్తులనుబట్టి చెప్పరాదు.

భాషాంతరీకరణ పద్ధతులు : ఆంధ్ర భారతము మూలమునకు విధేయము కాక స్వతంత్ర రచనయైన దనెడి గౌరవము భారత కర్తలు ముగ్గురకును జెందవలసినదే. యథామాతృకతాపేక్ష యా ముగ్గురలో నెవ్వరికిని లేదు. అది ఫలములేని వ్రతమని వా రెరుగుదురు. అందును సూక్ష్మపరిశీలన చేసినచో తిక్కన పాలబడిన భాగము చాల దుర్ఘటమైనది. యుద్ధపంచకమునకు పిమ్మటి పర్వము లన్నియు వేదాంత ఘట్టములు. అదిగాక భారతము తెనిగింపరాదని, తెనిగింపలేరని యన్న భగవద్గీతాది భాగములు తిక్కన తెనిగించిన భాగమందలివి. నన్నయనా డీయాంధ్రీకరణమునెడ శ్రోత్రియ పండితులే కారణముచే ననాదరము చూపియుందురో యా

కారణమే తిక్కననాడు బలవత్తరమై నిల్చియుండును; అనగా దేశభాషలలో ఉచ్చరింపరాని భగవద్గీత మొదలగు ప్రకరణములు తెనిగించినచో పండితు లాంధ్రీకర్తను నిరసింతురు. వారి మాటలను పాటించి ఆ ఘట్టములను తెనిగింపక విడిచినయెడల గ్రంథకర్త ఆంధ్రావళికి అపకారము చేసినవాడే యగును. ఈ సంకటావస్థలో తిక్కన ఆత్మధైర్యమే తోడుగా రచన కుపక్రమించి కావ్యతాభంజకము లయిన యాధ్యాత్మిక ఘట్టములను గొన్నిటిని సంక్షేపించి, మరికొన్నిటిని పరిత్యజించి భారత సరస్వతి భుజమునుండి మోయరాని యా బరువు నెంతవరకు తగ్గింపవలెనో యంతవరకు తగ్గించి యామెక్రీడను సుకరము చేసెను.

ఆయన సంక్షేపించిన ముఖ్య వేదాంత ఘట్టము భగవద్గీత. ఈ యుపనిషత్తు తెనిగింపగూడ దనెడి ధర్మమునకు గట్టుపడియే యాయన దాని సారమును సూచనామాత్రము చెప్పెనే కాని నిజముగా తెనిగింపలే దనెడువారు కొందరు కలరు. ఇది మంచి వాదము కాదు. తెనిగింపరానిదే యైనచో దానిని తడవుటకే యాయన యంగీకరింపడు. అట్లుగాక యే కొలదిపాటి శ్లోకములు తెనిగించినను ఆ వ్రతము చెడినట్లే యగును. పూనిన ప్రతిజ్ఞ భంగపుచ్చుకొనుటకంటె పూర్తిగ తెనిగించుటే యుత్తమము. కావున ఆయన కా పట్టుదల లే దనియు, దానికి భంగపాటును రాలే దనియు, ఆవశ్యకమయినంతవట్టు ఆ యుపనిషత్తును దెనిగించె ననియు ఒప్పుకొనితీరవలెను. భగవద్గీతాపరముగ నించుమించు అరువది పద్యములు వ్రాయుట దానిని వదలుట కాదు; సంక్షేపించి తెనిగించుట. శాంతిపంచకములో నిట్లే సంక్షేపింపబడిన తత్త్వఘట్టము లనేకములు గలవు. వానివంటిదే యిదియు. ఈ సంక్షిప్తత తెలుగుసేతకై యాయన యేర్పరచుకొన్న ప్రణాళిక కనుగుణమేకాని విరుద్ధము కాదు. భగవద్గీత యెంత యుత్తమగ్రంథమయినను అందలి యుపదేశమంతయు నా యుద్ధభూమిలో నప్రస్తుతమని నేటి విమర్శకుల యభిప్రాయము. ఈ యౌచిత్యమును గ్రహించియే తిక్కన తత్సారమును సందర్భమునకు బొందుపడునంతమాత్రము చెప్పి సంగ్రహపరచెను. కొందరు శాస్త్రీయమైన శబ్ద నిష్కర్షత సంస్కృతమునందువలె తెనుగున సాధ్యము కా దనియు, ఈ యసాధ్యతను గుర్తించియే తిక్కన దానిని పూర్తిగా తెనిగింపలే దనియు నందురు. ఇది యాయన వాక్కున కున్నశక్తి నెరుగక యన్నమాట. ఆయన కవిత్వమునకు జీవగఱ్ఱ యీ శబ్ద నిష్కర్షతయే. తెనిగించినంతవరకు భగవద్గీతయందును, శ్రుత్యర్థ ప్రతిపాదకము లయిన యితర సందర్భములయందును ఆయన తెనుగుసేతకు లోటేమాత్రమును రాలేదు. అంతమాత్రమే కాదు; మూలశ్లోకాధారములేని కొన్ని పద్యములు ఆధ్యాత్మికార్థము కలవి యచ్చ టచ్చట జొప్పించి తెలుగు భాషకును, విశేషించి తన వాక్కునకును గలశక్తిని సంస్కృతసమానమైనదానినిగ ప్రకటించెను. భగవద్గీతాభాగమున

'ఫలములయెడ బ్రహ్మార్పణ
కలన పరుం డగుచుఁ గార్యకర్మము నడపన్
వలయుం దత్త్వజ్ఞానము
దలకొనినం గర్మశమము దానైకలుగున్'

అన్న పద్యమే దీనికి నిదర్శనము. ఇట్టివి పెక్కులు గలవు. ఈ భాగముననే మరియొకటి రెండు చోటుల నాయన యనువాదకుడుగనే కాక గీతాభాష్య కర్తగ గూడ గనుపట్టును. 'సర్వధర్మాన్ పరిత్యజ్య' యను మూల వాక్యమును 'క్రందుకొను సర్వధర్మవికల్పములను' అని తెనిగించుట యాయనకు గల యాధ్యాత్మికాధికారమునకు, మహాగురుపదవికి తగినట్లుగా నున్నది. పూర్తిగా ఆయనయే భగవద్గీత తెనిగించియున్నచో దెనుగు భాషకు నేటిదనుక మంచి భగవద్గీత లేని లోపము తీరియుండెడిది. ఆ నష్టమైన గలుగుటకు ఆయన అంగీకరించెనుగాని కావ్యతానష్టమున కంగీకరింపలేదు.

ఎత్తివైచిన యాధ్యాత్మిక భాగములలో ముఖ్యమయినది, భగవద్గీతతో సాటివచ్చునది, శ్రుతి ప్రపంచములో చేరదగినది సనత్సుజాతీయము. గీతకు వలెనే దీనికిని శంకరుడు భాష్యము వ్రాయుట దాని ప్రతిపత్తికి నిదర్శనము. దీనిని వదలుటలో తిక్కన చూపిన యౌచిత్యము నిరుపమానమైనది. ఈ ఘట్టమువలన కథకు గలిగిన మే లేమియు లేదు. అది యుండియు, లేకయు నిర్విశేషమే. అది యాలకించు ధృతరాష్ట్రుడు భగవద్గీత నాలకించి యుద్ధోన్ముఖుడైన యర్జునునివలె ధర్మమార్గోన్ముఖుడు కాజాలడు. ఆతని చంచలతను, కృత్రిమ బుద్ధిని మరల్పజాలని యా యుపనిషత్తు నిష్ప్రయోజనముగా నుండుటకంటె దొలగుటయే మేలు. అట్లు తొలగించుటవలన నమూల్యమయిన మహర్షివాక్యము వ్యర్థముగా బోక యాత్మగౌరవమును కాపాడుకొన్నదయ్యెను.

ఈ రెండిటివలన మనము గ్రహింపవలసిన సార మిది: శ్రుత్యర్థములను దెనిగింపరా దనునియమ మాయనకు లేదు. తెనిగింపలేని యశక్తత యంతకు ముందే లేదు. ఒక మా రటు నొకమా రిటు చేసి యనియతముగా బ్రవర్తించెనని లోకు లధిక్షేపింతురను భయ మసలే లేదు. ఆయన పెట్టుకొన్న నియతి సందర్భౌచితిని, కథాగతిని పట్టియుండును. ఈ యంశములకు భంజక మయ్యెనేని యెట్టి

వస్తువయినను ఆయనకు బ్రయోజనకారి కాదు. ఈ యాత్మవ్యవస్థానమే లేనిచో ఆయన కీ భారతమే సాధ్యమయ్యెడిది కాదేమో.

ఇతిహాస రచనాధికారము: భారతమువంటి విపుల కావ్యకర్తకు ఋషిజనోచితమయిన క్రాంతదర్శనము అత్యంతావశ్యకము. భారతము వ్రాసిన ముప్వురిలో వారి వారి రచనా భాగములను బట్టి తిక్కనకే యా శక్తి సమగ్రముగా వశమయినదని చెప్పవచ్చును.

మరియు 'మహేతిహాసకర్త మహోదార జీవితము గడపినవాడు కావలెను' అను విమర్శధర్మముకూడ తిక్కనయందువలె మరి యే యెడను సార్థకము కాలేదు. అదికాక, కథ యెట్టి దయినను అందలి పరమార్థము మాత్రము కవిచే స్వయముగ ననుభూతము కానియెడల రచనకు జీవము కలుగ దనెడి మాటయు పైదానివలెనే త్రోసివేయరాని ధర్మము. ఈ పంచమ వేదమును సవిమర్శముగా విభజించినపు డందు మూడే ముఖ్య విషయములు గోచరించును: (1) రాజనీతి, (2) యుద్ధ తంత్రము, (3) బ్రహ్మవిద్యోపదేశము. పుట్టుకచేతను, నడవడి చేతను, విజ్ఞానముచేతను ఈ మూడు మహావిషయముల నాత్మధర్మములుగ నిర్వహించిన కవి తెలుగునాట తిక్కన యొక్కడే. ఈ కారణములచే భారత రచనకు ఆయన యొక్కడే ఉత్తమాధికారియని చెప్పనగును.

సంస్కృత భారతమును దెనిగించుటకుపూర్వ మాయన యెన్నోమారులు మననముచేసి యమ్మహాకావ్యము ధర్మాద్వైత మూర్తియని దాని సారమును లోకమునకు దానే తొలుదొల్త ప్రకటించెను. దాని కా బిరుద మిచ్చినవాడాయనయే. భిన్నభిన్నములుగ గానవచ్చు భారతీయ ధర్మముల కన్నిటి కీ గ్రంథ మద్వైత భావము సాధించునటులే భిన్నభిన్నములుగ గానవచ్చు భారత పర్వములకు, నందలి యుపాఖ్యానములకు నన్నిటికిని గవిబ్రహ్మయు, మూర్తినిర్మాణమున నద్వైత భావమును సాధించెను. భారత మంతయు నొక ప్రబంధ మండలిగా, నం దొక్కొక్క పర్వ మొక్కొక్క ప్రబంధముగా, పర్వాంతర్గత ములగు నుపాఖ్యానములను ప్రత్యేక కావ్యములుగా నూహించి, ఏభాగమునకును బ్రాధాన్యము చెడకుండ, నే యవయవమునకు నవయవితో పొత్తు చెడకుండ సర్వాంగసౌష్ఠవమును, ధృఢబంధమును గల యీ భారతమూర్తిని శ్రీకృష్ణుని విశ్వరూపమువలె దీర్చి దిద్దెను.

పాత్రచిత్రణ మనునది సాధారణముగ నాటకములందువలె శ్రవ్యకావ్యములందును, పురాణేతిహాసముల యందును బాటింపదగినది కాదు. పురాణేతిహాసములందు విషయము ప్రధానము కాగా ప్రబంధములయందు కథయు, వర్ణనలు ప్రధానము. ఈ రెంటికంటె విలక్షణముగా పాత్రప్రాధాన్యము గలది నాటకము. అందుచే నాటకకవివలె దక్కిన యిరువురును బాత్రనిర్మాణమున శ్రద్ధ వహింపరు. అంతమాత్రమున పురాణేతిహాసముల యందును, శ్రవ్యకావ్యములందును బాత్రలు లేవని కాదు; వాని యునికి ప్రత్యక్షమే. అవి కవిచేత వర్ణింపబడునుగాని ప్రదర్శింపబడవు. కవిసామాన్యు లెల్లరు జేయదగిన పనియే యది. దానిని ప్రదర్శించుటకు మాత్రము మహాశిల్పులకే సాధ్యము. వారిచే సృజింపబడిన పాత్రలు సజీవములై పఠితలకు నేడును దమ కన్నులయెదుట వర్తించుచున్నట్లే మెలగుచుండును. వర్ణింపబడిన పాత్రలలో ఈ చైతన్య ముండదు. ఈ రెండు పద్ధతులకును విమర్శపరిభాషలో ప్రత్యక్షపద్ధతి, పరోక్షపద్ధతి యందురు. భారతము స్వభావముచే పురాణ మనిపించుకొనదగిన మహేతిహాసము. దానికి రూపనిర్మాణమున నైక్యము సంఘటించుటే దుర్ఘటము. అందును శతాధికములయిన యందలి బహువిధ పాత్రలను సజీవములుగ తీర్చి దిద్దుట యామూర్తినిర్మాణమును సార్థకముచేయుట. ఈ కథాసంధాన పాత్రసృష్టు లనెడి రెండు దుర్లభధర్మములను నెరవేర్చి తిక్కన ఈ యితిహాసమును బ్రబంధముగను, బ్రబంధమయ్యు నాటకముగను వినిర్మించెను. ఎక్కడనేని గొన్నిచోట్ల ప్రత్యక్ష పద్ధతినే యవలంబించుటయు గలదు. ఇది వస్తుతః శ్రవ్యకావ్యము గనుక యట్టిది యనివార్యమైనది.

రూప చిత్రణలో తిక్కన చూపిన నేర్పు అతినిపుణులైన చిత్రకారులకు మాత్రమే సాధ్యమయినది. వారయినను స్థిరపదార్థమును జిత్రించినంత సొగసుగా దాని చలనావస్థను చిత్రింపజాలరు. తిక్కన ఏ యాకారమును చిత్రించినను దాని స్థూలాకారమును మాత్రము చిత్రింపక సూక్ష్మాంశ వివరణముతో నతిస్వాభావికముగ, ఛాయాయంత్రముల కందునట్లు వర్ణించును. అందును స్థిరమూర్తులకంటె చరమూర్తుల వర్ణించుటలో ఆయనకు గుతూహల మెక్కువ. తెలుగు కవులలో ఇట్టి శక్తిగలవారు నలుగురైదుగురు మాత్రమే కలరు. వారిలో తిక్కన ప్రథముడు.

భాషాసృష్టి: కావ్యరచనకు యోగ్యమయిన యాంధ్ర భాష లేని రోజులలో శిష్టమయిన భాషను వినిర్మించుకొని కావ్యరచనను నిర్వహించిన సిద్ధసంకల్పుడు నన్నయ. అది తొలుతటి ప్రయత్నము గనుక ఆయన చేతిలో తత్సమశబ్దజాలమువోలె శుద్ధాంధ్రము పెంపొందలేదు. అచ్చతెనుగున కాగౌరవము తెచ్చినవాడు తిక్కన. ఒక భాషయొక్క శక్తియు, సంపన్నతయు అది వ్యక్తముచేయు భావములయు,

నర్థములయు గంభీరతనుబట్టి తెలియవచ్చును. అచ్చ తెనుగుభాష సూక్ష్మాతిసూక్ష్మములయిన మనోభావములను వ్యక్తముచేయుటయందును, అతిగంభీరములయిన పరమార్థములను నిష్కర్షగా వివరించుటయందును గూడ సమర్థమేయని తన ప్రయోగముచే లోకమునకు జూపినవాడు తిక్కన. అట్టి యీ భాష యంతయు ఆయన సృష్టించుకొన్నదే. ఈ సృష్టిలో కొంతవరకు నాటి వాడుక పదములుకూడ సహాయములై యుండవచ్చును. ఆ పదములకే శుద్ధరూపమును, క్రొత్త ప్రాణము నిచ్చి ఆయన భారతమును రచించెను.

తిక్కన శైలి: ఆంధ్రవాఙ్మయములో సంస్కృత జటిలము, సమాసఘటితము, అక్షర రమ్యము నయిన శైలి యొకటియు, దేశ్యపదఘటితము నాతిసమాసభూయిష్ఠము, అర్థసుందరమునయినశైలి యొకటియు రెండు భిన్నమూర్తులుగా దొలినాడే ఏర్పడినవి. వీనిలో మొదటి దానికి నన్నయయు, రెండవదానికి తిక్కనయు గురువులు.

అర్వాచీనులలో నన్నయశైలి ననుకరింపదొడగి కొంత వరకు కృతకృత్యులయిన కవులు కలరు. తిక్కనను అనుకరింపజొచ్చినవా రాయనవలె దేశ్యపదములుగల కవిత్వము చెప్పగలిగిరే కాని తద్రచనలోని తక్కిన విశేషములను స్పృశింపలేకపోయిరి; అనగా ఆయనశైలి యను కరణసాధ్యము కాదు. ఆయన శైలిలోని విశేషము లివి:

అర్థము ననుసరించి శబ్దము నడుచునుగాని శబ్దప్రభావమునుబట్టి యనుకొన్న యర్థ మెప్పుడును భ్రంశము కాదు.

వాక్యము లన్నియు సూచ్యార్థ సూచకములేకాని విపులార్థవివరణములు కావు. ఈ గుణముకల్మివలన తిక్కన రచనకు వెలితిలేని చిక్కదనము సమకూరినది. ఆయన పదములలో అసంఖ్యాకము లానాటి వాడుకభాషలోనివి. లోకవ్యవహారమందలి పదములకు కావ్యమున నూతన ప్రాణప్రతిష్ఠ కావించిన యీ మహాకవియంతటివాడు తెనుగున నింకొకడు లేడు. తెలుగుభాష సహజశక్తిని బరీక్షించి చూచి దాని నర్థసంపన్నము జేయుప్రయత్నములో ఆయన చేసిన భాషాసృష్టి యిది.

కావ్యగుణములుగా నాలంకారికులు పేర్కొన్న వానిలో ముఖ్యముగ మూడు రకము లున్నవి-భావస్ఫోరకములు, శ్రవఃపేయములు, బుద్ధిగమ్యములు. ఉదాహరణార్థము: ఔజ్జ్వల్యము కేవలము భావస్ఫోరకము. ప్రేయస్సు సౌకుమార్యము కేవలము శ్రవఃపేయములు. అర్థవ్యక్తి, సమ్మితత్వము, సంక్షేపము, సమత మొదలగునవి బుద్ధి వికాసకములు. ఈగుణములలో కేవల శ్రవఃపేయము లయిన గుణములను తిక్కన ఆదరింపలేదు. తక్కిన రెంటిలో సందర్భోచితముగా నొక్కొక్కదానికే ప్రాధాన్య మిచ్చి భావమును, బుద్ధిని సమముగా వికసింపజేసి 'తిక్కన కర్థమందే దృష్టి లగ్నమగును' అనుపేరు సంపాదించెను; భావావేశముగల ఘట్టములందును ఈ సమ్మితత్వాది బుద్ధిగుణములకే యధికార మిచ్చెను గాని యా రసభావ ప్రవాహమున బడి మున్కలువేయుచు వీనిని మరువలేదు. తత్ఫలముగా కవితాధర్మములలో శిరోభూషణ మన దగిన యౌచిత్యపరిపాలన మీ పదునేనుపర్వములలోని ప్రతివాక్యమునను స్ఫుటమగుచున్నది. సందర్భశుద్ధిని విడిచి యింపు కోసమే పద్యమును వ్రాయుట తిక్కన యెరుగడు. పిం.ల.

**తిమ్మకవి, కూచిమంచి** (క్రీ. శ. 1684 - 1757): సుప్రసిద్ధులగు ప్రాచీనాంధ్ర కవులలో కూచిమంచి తిమ్మకవి యొకడు. వాసవదత్తాపరిణయ కర్తయగు వక్కలంక వీరభద్రకవి, ధర్మఖండనిర్మాతయగు ఈదరపల్లి భవానీశంకరకవి మున్నగువా రీతనికి సమకాలికులు. రామవిలాసాది గ్రంథకర్తయై భర్తృహరి సుభాషితములను దెనిగించి పేరెన్నికగన్న యేనుగు లక్ష్మణకవి యీతనికి జుట్టమట. చాటుకవితా ప్రియంభావుకుడును, చంద్రరేఖావిలాపాది వికటరచనాధురీణుడును నగు జగ్గకవి యీతని కనిష్ఠసోదరుడు.

తిమ్మకవి గోదావరీమండలములోని పిఠాపురము సంస్థానమునకు జెందిన కందరాడ గ్రామనివాసి; ఆయూరికి గరణమును. ఈత డార్వేల నియోగిశాఖకు జెందినవాడు; కౌండిన్యసగోత్రుడు; బయ్యనామాత్యుని ప్రపౌత్రుడు; తిమ్మయామాత్యుని పౌత్రుడు; తండ్రి గంగనామాత్యుడు; తల్లి లచ్చమాంబ; భార్య బుచ్చమ్మ.

దెందులూరి లింగనారాధ్యునియొద్ద మాహేశ్వరవృత్తి నుపదేశమంది, ఆజన్మాంతము శైవదీక్షాపరాయణుడై తన వాక్కును, జీవితమును ఆ పరమశివునకే యంకిత మొనర్చి, నూగుమీసాల నూత్నయౌవనము మొదలు ప్రాయము క్రైవ్రాలుదనుక నాంధ్రశారద నారాధించిన మహితాత్ముడు తిమ్మకవి.

కవితారంభదశలో గావించిన శతకములును, దండకములును గాక యీతడు తానై తన కృతులలో పేర్కొన్న రచన లివి: (1) రాజశేఖరవిలాసము, (2) రుక్మిణీ పరిణయము (క్రీ. శ. 1715), (3) సింహశైల మాహాత్మ్యము, (4) నీలాసుందరీ పరిణయము, (5) అచ్చ తెనుగు రామాయణము, (6) సారంగధరచరిత్ర, (7) సాగరసంగమమాహాత్మ్యము, (8) సర్వలక్షణసారసంగ్రహము (క్రీ. శ. 1740), (9) రసికజనమనోభిరామము; (క్రీ. శ. 1750), (10) సర్పపుర మాహాత్మ్యము, (11)

శివలీలా విలాసము (క్రీ. శ. 1756), (12) సుజనమనః కుముదచంద్రిక, (13) కుక్కుటేశ్వర శతకము.

పై వానిలో గొన్ని స్థలమాహాత్మ్యములు, మరికొన్ని పౌరాణిక గాథలు. కుక్కుటేశ్వరశతకము తక్క దక్కిన వన్నియు సరసములగు శృంగారకావ్యములు. కవి పరమశివభక్తు డయ్యు భగవంతుడు శృంగార సులభుడని యెంచియో, శృంగార ప్రబంధములు ముమ్మరముగా బయల్వెడలి దేశవ్యాప్తములై యుండుటచే పాఠకుల యభిరుచిని గుర్తించియో తన రచనలు శృంగారమయములుగా నొనర్చి, యైహిక భోగముల కాసపడి వానిని నరాంకితము చేయక, మోక్షార్థియై పీఠికాపుర కుక్కుటేశ్వరునిపేరనే వెలయించి ధన్యుడైనాడు. అదియుగాక శివకేశవుల యెడ నద్వైతభావముగలవాడై యెడనెడ శివస్తోత్రముతోపాటు విష్ణుస్తుతియు గావించుచు తిమ్మకవి ప్రత్యేకించి వైష్ణవ మహిమాన్వితమగు సర్పపుర మాహాత్మ్యమును రచించి భావనారాయణస్వామి కంకిత మొనర్చినాడు. సలక్షణములగు నిన్ని కృతులను నిర్వహించుటలో నిఖిల విద్యాభ్యాస నిపుణుడును, దన సహోదరుడునగు జగ్గకవి తనయులు తిమ్మనయు సింగనయు లేఖకులై, పాఠకులై వానిని ప్రబలజేసెడివారు.

ఇతడు కుక్కుటేశ్వర వరప్రసాదలబ్ధ కవితాసామ్రాజ్య ధురంధరు డనియు, సకల సంస్కృతాంధ్ర లక్షణ కళా కౌశలాభిరాము డనియు, నానావిధ వంగ త్రిలింగ ద్రవిడ దేశభాషావిశేషభూషితాశేషకవితావిలాసు డనియు, బహుకావ్యనిర్మాణబంధురప్రతిభు డనియు, రావునీలాద్రి మాధవరాయనృపతిదత్తకవిసార్వభౌమ బిరుద విభ్రాజితు డనియు, అభినవవాగనుశాసను డనియు దెలియుచున్నది.

ప్రాచీనాంధ్ర ప్రబంధముల రామణీయకమును ఆకంఠముగ నాస్వదించి జీర్ణించుకొనినవాడు గాన తిమ్మకవి తన రచనలు వానికన్న మిన్నగా నుండవలయునని యత్నించిన ట్లనుపదమునను గోచరించును. అట్లని యన్యరచనావిధేయుడు మాత్రము కాడు; మరి అతిస్వతంత్రుడు. అందును జానుదెనుగు నుడికారముల నప్రయత్నముగా నుపయోగించుటలో, చెరకురసమువంటి మధుర ప్రసన్నమగు శైలితో రచన నిర్వహించుటలో నీత డందె వేసినచేయి. అచ్చతెనుగుమాటలవాడుక యెడ నీ కవికిగల ముచ్చట యింతింతనరానిది. ఆ యనుభావమే యీతనిచే రెండు తేటతెనుగు రచనలను వెలయింప జేసినది. అవి నీలాసుందరీపరిణయము, అచ్చతెనుగు రామాయణమును.

తిమ్మకవి కేవల కావ్యకర్తయే కాడు, లాక్షణికుడును. అందుల కీతని 'సర్వలక్షణసారసంగ్రహమే' ప్రమాణము. ఇం దీతడు ప్రాచీనకవిప్రయోగవిశేషము లన్నిటిని గ్రోడీకరించి లక్ష్య లక్షణములను బద్యరూపమున వెలయించినాడు. ఈతని కృతు లన్నిటిలో బెద్దగా పేర్కొనదగినది రసికజనమనోభిరామము. పురాణములు, ప్రబంధములు, లక్షణ గ్రంథములు, కోశములు. నాటకములు, నలంకారములు మున్నగువానిని శోధించి తేనియతేటవలె దానీ రసవత్ ప్రబంధమును సంతరించితినని తిమ్మకవి యా గ్రంథ పీఠికలో బేర్కొనినాడు. నిజ మారసినచో ఆరచన యట్టిదే. కనుకనే యది పిల్లవసుచరితమని పేరుగాంచినది.

మొత్తముపై నీతని గ్రంథములలో బొడసూపు విశేషములు శ్రీనాథుని సీసపాదముల యొయ్యారపు నడక, పోతనామాత్యుని శబ్దాలంకారలాలిత్యము, ఆంధ్రకవితాపితామహుని యల్లిక జిగిబిగి, ముక్కుతిమ్మనార్యుని ముద్దుపలుకుల కులుకుదనము, రామకృష్ణుని పెంకితనపు పోకడలు, రామరాజభూషణుని కల్పనావైచిత్రి, చేమకూర వెంకటకవి సరసరచనానైపుణియు. ఈతని రచనల నన్నిటి నామూలాగ్రము నిదానముగా బరికించినచో తిమ్మకవి ఆ శతాబ్దమందలి యాంధ్రకవులలో నగ్రశ్రేణికి జెందినవాడని గుర్తింప వచ్చును. కొ. జో. శ.

**తిమ్మక్క, తాళ్ళపాక (క్రీ.శ. 1400-1500 మధ్య):** ఈమె సుప్రసిద్ధ వాగ్గేయకారుడైన తాళ్ళపాక అన్నమాచార్యుని సతీమణి. సుభద్రావిజయ మనుద్విపదకావ్యమును ఈమె రచించెను. కడు లలితముగ గాంధర్వవిధిని నిర్వర్తింపబడిన సుభద్రార్జునుల ప్రణయ, పరిణయగాథలు ఈయమ కైత కైసేతతో మరింత మనోజ్ఞముగ మన్నింపబడినవి లలితశృంగార రసప్రధానమైన ఆఖ్యాయికకు తగినట్లు శైలి మృదులమై, మధురమై కావ్య మంతయు హృద్యముగ నున్నది. ఒక్కొక్కచో ప్రాసనియమము పాటింపబడినది. కథను నడుపుకొనుటయందు సందర్భమును, ఔచిత్యమును పాటించి యెంతయో మెలకువ చూపబడినది. తి. కో. రా.

**తిమ్మన్న, నంది :** ఇతడు ఆరువేల నియోగిబ్రాహ్మణుడు, ఆపస్తంబసూత్రుడు, కౌశిక సగోత్రుడు, సింగయామాత్య, తిమ్మాంబలకు పుత్రుడు. ఇతడు కృష్ణదేవరాయల యాస్థానము నలంకరించిన అష్టదిగ్గజ కవులలో నొకడు. పారిజాతాపహరణము అను నైదాశ్వాసముల శృంగార ప్రబంధమును రచించి కృష్ణదేవరాయల కంకితము కావించెను. ఆ రాయల యాస్థానములోనివా డగుటవలన ఇతడు క్రీ.శ. పదునారవ శతాబ్దమునందు పూర్వార్ధమునం దుండెననుట స్పష్టము. ఈతడు రచించిన గ్రంథము పారిజాతాప

హరణ మొక్కటియే తెలియవచ్చుచున్నది. ఇతనికి 'ముక్కు తిమ్మన'యని నామాంతరము కలదు.

'ముక్కు తిమ్మనార్యు'నిది ముద్దుపలుకట! ఏదో చాటువు, ఎవనిదైన నేమి, సత్యమును చెప్పినాడు. రాయలు పెద్దనామాత్యులను గురించి 'శిరీషకుసుమ పేశల సుధామయోక్తు'లని నిండుసభలో 'మెహర్బానీ' నిచ్చెను. పెద్దన్నల యల్లిక నిజముగా 'కోమల' మైనదే కాని తిమ్మన రచన యంతకంటెను మృదువు. 'లాలిత్య' మనెడు ధర్మమును తెనుగులో ఇంత సాధించినవాడు మరి లేడు. ఆ లాలిత్యము ఒక శైలిలో గాదు, భావ నిర్మాణ మున గాదు, కథాసంవిధానమున గాదు 'యెక్కడబట్టిన నక్కడనే' 'పూవున తావివలె' పుంజుకొని యున్నది.

కొందరికి తాము చదివిన చదు వంతయు రచనలో గ్రుమ్మరింపవలెనను పేరాస. వీడరాని యీ లౌల్యమును వీడినవారు కొందరే - తిక్కనాదులు. ఆ కోవలోని పెద్ద మనుష్యుడు తిమ్మనగూడ. అత డక్క డక్కడ అరుదుగ వాడిన 'ఆముష్యాయణ, కూలముద్రుజాది' శబ్దములును ఆ కవి కనుమరపి వ్రాలినవే.

తిమ్మన సంస్కృత సమాసములు ఎంత మృదువులో చెప్పలేము. ఈ గుణమున కీకావ్య మంతయు ఉదాహర ణమే. ఇంకను చిత్ర మేమనగా ఈ కథలో నొక యుద్ధము వచ్చును. దానిని జదివినవా డెవ్వడు నది యుద్ధమని చెప్ప లేడు. అదేపనిగా నచ్చట తిమ్మన లేని గాంభీర్యము తెచ్చి కొని 'దుష్కరప్రాసము'లతో గొన్ని పద్యములు వ్రాసి నాడు. అవి పాపము 'తెచ్చికోలు గాంభీర్యము' ననే యున్నవి. ఆ ధర్మ మాతనికి లేదు ; ఏమి సేయును.

తిమ్మనామాత్యులకు కావ్యరచనకు తాంబూలము పెట్టినది రాయలేయైనను యీ కావ్య మతనికొరకు వ్రాసినది కాదు. మరి యాతని 'చతురాంతఃపురము'నకై కూర్చిన కూర్పు.

కవిత్వము కసరత్తు గాదని తిమ్మన యూహ. అందుచే రచనయం దెక్కడను 'తాను నొవ్వడు', 'ఇతరులను నొప్పింపడు'. ఈ పద్ధతి నాతని కావ్యమం దంతయు జూడవచ్చును. ఈ కవికి 'ముక్కు తిమ్మన' యని పేరు వచ్చుటకును ఒక కథ కద్దు. తిమ్మన 'ముక్కు'పై చక్కని పద్యమును వ్రాసెనట. దానిని భట్టుమూర్తి 'వెల బెట్టి కొని తన 'వసుచరిత్ర'లో జేర్చికొనెనట. ఈకథకు కాళ్ళు బొత్తిగా లేవు. వసుచరిత్రను జదివినవా డెవ్వడు దీనిని నమ్మరాదు.

'లవలీదళపతితమరందబిందుతతి' బురుడించు ఈతని కవితలో యొక లాలిత్యమే కాదు, మరికొన్ని విశేష ములు గూడ నున్నవి. తిమ్మన యక్క డక్కడ కావ్యార్థ సూచనము సేయును. ప్రథమాశ్వాసమున కృష్ణుడు సత్యతో 'యనికిన్ బలసూదను డెత్తివచ్చినన్ డీలుపడంగ దోలి' (1 - 135) యని ప్రతిన సేసెను. ఈ మాటకు బల సూదను డెత్తి వచ్చు ననియే యర్థము. దీనితో బైని జరుగబోవు యుద్ధము సూచింపబడినది.

ఎత్తిపొడుపు లాతనివలె నెవ్వరును చేయలేరేమో యనిపించును. కోపముగొన్న సాత్రాజితి

'పూనుకొని మేలుగీళ్ళకు
లోనయి విహరించువారి లోక మెఱుఁగదో!
యీ నరకాసురదమనుఁడు
దా నెఱుఁగడొ భోజకన్య దా నెఱుఁగదొకో!' (1-61)

యనుచున్నది. ఇందులో నరకాసురుని యుద్ధమున దాను జూపిన విక్రమము నంతయు యేకరువు పెట్టెను సత్య వానిని తానే జయించినట్లు! 'నరకాసురదమనుఁడు' అను శబ్ద మంతటితోనే యాగలేదు. సత్య సహాయము లేకున్న కృష్ణుడు 'నరకుని జయించి యుండునా!' యను చున్నది. వాస్తవమునకు 'సత్యయే కృష్ణుని జయించినది. కాని కృష్ణుడు మాత్రము తాను 'నరకాసుర దమనుడ' నని పేరు పెట్టికొనెను. అయిననేమి, సత్యము ప్రపంచము నకు దెలియునులే యనుచున్నది. ఇంతటితో పోనిచ్చినదా సత్యాదేవి, భోజకన్యను గూడ దడవినది. 'నరకాసుర కథ రుక్మిణికి మాత్రము క్రొత్తయా! ఆ రుక్మిణి యెక్కడ యే పెద్దరికమును చూపినది! ఒకవేళ కృష్ణుడు పారిజాత మును దన కిచ్చినను యే మొగము పెట్టుకొని యామె దీసికొనును? యోగ్యత గలవారుకదా అర్హ బహుమాన మునకు చేయి జాచవలెను' అని దాని కర్థము. యుద్ధ విషయమున 'మేలు గీళ్ళు' పదము ఎంతో ముచ్చటగా నతికిపోయినది. బెత్తెడు కందపద్యము ఇన్ని యర్థములు సూచించుచున్నది. అది తిమ్మన ప్రతిభ.

సత్యాదేవిని గురించి చెప్పునపు డంతయు నాతడు 'లతాంగి' యనును. రోసముగొన్న సత్యాదేవి 'వ్రేటు వడ్డ యురగాంగనవలె' నుండెనట (1-82); నేయి వోయ 'భగ్గన దరికొన్న భీషణహుతాశనకీల' వలె లేచెనట (1-58). కోపగృహమున కామె 'హరిచందన కోటరము నకు నాగతరుణి'యపోలె (1-108) వెళ్లినది. కష్ణుడు చూచినపుడు 'భానుమండలకరావళిహావళి వాడియున్న తీగను' దలపించినది (1-99). 'చీకటింటి కడ కంకటిపై జలదాంతచంద్రరేఖాసదృశాంగియై' పొరలినది. రాయల జీవితమైన చిన్నాదేవిని బోలిన సత్యాదేవి - కొంచెము సన్నగా పొడుగుగా నుండెనేమో ; ఆమె కొంత

శ్యామ 'యు నగునని నా యనుమానము. 'నున్న గావు' లామెకు బ్రియమైనవట! ఈ వైశిష్ట్యములతో ముక్కు తిమ్మన వాత్స్యాయనుని ధడవి మన కొక ప్రత్యేకజాతికి చెందిన నాయికను జూపించుచున్నాడు.

ఇక రుక్మిణి: ఆమె దొక తెరువు. తిమ్మన సృష్టించిన సత్యాదేవికి నోరు చాల పెద్దది. పాపము! రుక్మిణికి నోరే లేదు. ఇంత కథలో నామె యొకసారి యైనను ఒకమాటైనను ఆడి యెరుగదు. 'ఇందిరా ప్రతినిధి'గదా. అందుచే నా స్వతస్సిద్ధమైన గాంభీర్య మామెకు. పారిజాతమును తన కిచ్చిన పిదప నారదుడు 'పోయివత్తు' నన్నాడు. అప్పుడయినను మర్యాదకు గాని ఏమి బదులొసగెనో చెప్పలేదు తిమ్మన. 'కేవలము' వీడుకొల్పిన దన్నాడు: పారిజాత కుసుమమును దనకు గృష్ణుడు కనుగవ 'చిన్ననవ్వు' దొలుకగా నిచ్చినపుడు ఆ నవ్వునకును రుక్మిణి ప్రతిదరహాస మివ్వలేదు. చేకొని 'మౌనికి మ్రొక్కిన'దట. ఆ యొక మ్రొక్కునకు గంపె డర్థములు. పారిజాతాపహరణమునకై బోనున్న కృష్ణుడు రుక్మిణితో నొక్క మాట చెప్పినవాడు గాడు. అప్పుడు చెప్పకున్న మానె, వచ్చిన తర్వాతనైనను అందరి యిండ్లకును ఫనిగట్టుకొని పోయి (5-49) పలుకరించిన కృష్ణుడు ఆమె యింటివైపడుగే పెట్టలేదు. తరువాత గాని పుణ్యకవ్రతము సేయు లోపల ఒక్కసారియైనను ఆమెకడ కేగి 'పట్టుమని పది నిముసము'లు మాటాడలేదు. వ్రతమునకు వచ్చినపుడైనను ఆ దయలేని 'పసులకాపరి' మన మలరింపపల్లెత్తి పలుకలేదు. ఇవి యన్నియు గృష్ణుడు, సత్యయు దోడై రుక్మిణికి జేసిన యపకారములు. వీని యన్నిటి కామె మనస్సునం దేమేమి బాధపడెనో మన మెరుగము. పుణ్యకవ్రత సందర్భమున ద్రౌపదీ, సుభద్రలను సత్యాదేవితో జేర్చినాడు(5-72) కవి. ద్రౌపదిని రుక్మిణితో జేర్చి యుండవలసినదని నా కొరత!

వ్రతసందర్భమున సత్య నారదునికి భర్తను దాన మిచ్చినపుడును, అందరితో బాటు 'రుక్మిణీ' సతియు దల వంచినదే గాని తన 'పట్టపురాణితనము'ను జూపినది గాదు! ఇక కృష్ణుడు 'భోజజనపాలసుతన్, దరుణీమణి సాత్రాజితి' (1-41) నేమి సరిగా జూచినట్లు!

ఇన్ని వగపులు మనసులో నున్నను పుణ్యకవ్రతమునకు 'రా దగవౌనని' యామె వచ్చినది; 'రానని' బిగిసికొనలేదు; తన దుఃఖ మంతయు లోననే యణచికొని నలుగురితోపాటు - 'కృతకమో', సహజమో - ఒక వికాసమును జూపినది. ఆమె లోకజ్ఞ, గంభీర, భూషణములపైనను ఆమెకు ఆదరము తక్కువే. కాని యామెకును స్త్రీసహజములయిన రూపగర్వము, అసూయ, ఆభిజాత్యము మొదలగు భావములు గలవు. ఆమెగూడ 'కులమును రూపమును మగని కూరిమియు గలదాన నంచు' వానికి బెనగును; కాని యా భావములు గంభీరములు. వాని యావిష్కృతియు గంభీరమే. సత్య యట్లు గాదు. ఆ భావముప్పెనవంటిది. రుక్మిణి 'వానికి బెనగుట' విని యామె పెనగుటయే కాదు, ప్రచురణము గూడ జేసివేసినది.

నిర్మాణ శిల్పదృష్టితో జూచినచో పారిజాతాపహరణమునందలి ప్రథమాశ్వాసము చాల గొప్పది. దీనిలో నడికినట్లు కథాశిల్పము మరి పైవానిలో బొందుపడలేదు. ఈయాశ్వాసము నంతయు మూడు రంగములుగ విభాగింప వచ్చును. నడుమ నొక్క చిన్న ప్రవేశకము. నారదుడు వచ్చుట, పారిజాతముమ కృష్ణుడు రుక్మిణి కిచ్చుట. ఇంత వరకు నొక రంగము. సత్యాదేవి యుద్యానవనమున నుండుట రెండవ రంగము. కోపగృహమున గృష్ణు డూరారుచుట మొదలైనవి మూడవ రంగము. ప్రద్యుమ్నుని నారదునిపల్కులూకొట్టుచుండుమని కృష్ణుడు సత్యాదేవి గృహమును దరియు టొక చిన్న ప్రవేశకము. ప్రతిరంగమునకు గావలసిన సాధనసామగ్రి కూడ కవి ఎంతో మెలకువతో నొసగెను. ప్రథమరంగము రుక్మిణీకాంత గృహమునందు. అక్కడొక - 'శశికాంత శిలామయవేది' యున్నది, 'కొందలు మృగాయత నేత్రలు' ఊడిగవుగత్తెలున్నారట. రెండవ రంగము ఉద్యానవనమునందు. అక్కడ ఒక చిన్న కృతకాద్రి. చక్కగా తీర్చిదిద్దిన పూదేనియ యేటి కాలువ. దాని దగ్గరనే యొక 'చంద్రోపలవేది'. దానిపైనంతయు జెంగల్వపుప్పొడులు. సత్యాదేవి యొకచేటితో నట మాటాడుచు ప్రవేశించును. మూడవరంగ మొక చీకటియిల్లు, ఒక కంకటి. కంకటిపై సత్యాదేవి గూర్చొని యున్నది. అప్పు డామె వేషధారణము - మాసిన చీర, వాసెనకట్టు, నిడువాలిక కస్తురిబొట్టు. అంతకుమున్ను సొమ్ము లన్నియు దీసివేసినది. ఈ సాధనసామగ్రి సంగ్రహణమును గమనించినపుడు ప్రథమాశ్వాస కథ నంతయు నాతడు ముందే యోచించి చక్కగ నేర్పాటు చేసికొనెనని యూహింప వచ్చును. అవాంతర వర్ణన బాహుళ్యము లేక పాత్రములు ద్రుతగతి నడచుటయు నిందులోని మరి యొక మహాగుణము. ప్రథమాశ్వాసానంతరము కథాదృష్టితో గావ్యము చచ్చుపడినట్లే. కావ్య శరీరమునకు కథ చాల చిన్నది. కథలో వచ్చిన చిక్కే కాక కవికే స్వయముగా గొన్ని చాపల్యములు గలవు. లేకున్నచో అంత లలితుడైన తాను ఆ బంధకవిత్వములు వ్రాయకున్ననే నష్టము గల్గెడిది! ఇట్టిదే అదితి చేసిన దశావతార

వర్ణనము గూడ. దశావతారములను నారదుడు తొందరగనే ముగించెను. అదితిమాత్రము ప్రతి యవతారమును సాగదీసినది. ఈ దశావతార వర్ణనమునకు ప్రబంధ లక్షణమే కారణము. పద్యములు బాగుగనే యున్నవి. కాని లాభ మేమి? వాని కక్కడ జోటు లేదు.

సత్యాదేవి విషయమున కవి కొన్ని ప్రత్యేక విశేషణములు వాడెను. ఆమె కిన్నెరకంఠి, పాటలగంధి, చకితముగ్ధ మృగీతరళాక్షి (5-79) యట! అంతే కాదు. ఆ కన్నులు 'హాయన మాత్ర కురంగలోచన' ప్రాయము లని నికరముగ కొలిచి చూపెను. సత్యాదేవి వెంట్రుకలు నిగనిగలై కేరళీకబరీభార మంత తరచుగ నుండెడివి. ఈ విశేషణములు శాస్త్రీయములై సత్యాస్వభావమును స్ఫుటముగ జూపుచున్నవి. ఆమె స్వాధీనపతిక. కృష్ణుడు దక్షిణుడైనను అనుకూల నాయకుడు. ఇవి యవస్థాభేదములే గదా! కృష్ణుడు సత్యాదేవి కంత యింత అనుకూలుడు గాడు. ఆమె మాటయే వేద మాతనికి. సత్య కాలితో చూపిన నతడు తలతో జేయును. ఈ దౌర్బల్యమామెకు జక్కగా దెలియును. ఈ రహస్యము వా రిర్వురి నడుమ మాత్రమే యుండుటయు నామె కిష్టము లేదు. ప్రపంచమున కెల్ల దెలియవలయును. అందులకే యుద్ధమునకు ముందు కృష్ణుడు సత్యభామావిధేయుడని యామె దండోరా వేసినది. ఈ విషయము ప్రపంచ మొకసారి యెరిగినచో నామెకు దృప్తిలేదు. అడుగడుగునను ఈ విషయము ప్రచురము కావలెను. ఈ లఘుత్వము ఆమెలో కావ్యమునం దంతయు బ్రత్యక్ష మగును.

సత్యాదేవికి అలంకారములపై మక్కువ యెక్కువ. రూపగర్వ మొక్కటి యుండనే యున్నదిగదా! ఆమె యనేకములైన తొడవులు తరతరము లేరి, క్రొత్తలు క్రొత్తలుగ ధరించును. 'వీటికా రుచులు కెందలిరాకు మోవి' దులకించుచునే యుండవలెను. అనర్ఘరత్నభూషలాతన్వి (5-68) యడుగడుగునను జాగ్రత్తగ తన సొగసు కదికినవో, లేదో యని చూచికొనును. ఈ యాహార్యకములతో దాను రుక్మిణి కన్నను మేలనిపించి సర్వకాలములు కృష్ణుని హృదయము నేలవలెనని యామె యాశ. ద్వారకలో సత్యాదేవి స్నానానంతరము ఆమె యలంకారమును తిమ్మన యిట్లు వర్ణించెను:

'జలకంబాడి మడుంగు గట్టి, మణిభూషాదీవ్యమానాంగియై
కలపం బెంతయు వింతగా నలఁది చెంగల్వ ల్నెఱిన్మించ వే
నలిఁ గీల్కొల్పి పసిండియందెరవళిఁ రాయంచ లంతంతరాఁ
జెలులుం దానును సత్యభామ సనుదెంచెన్ నాథుఁ
డుప్పొంగఁగన్.'

ఈ యలంకారమునం దామెకు గల దృష్టి యేదియో కవియే చెప్పుచున్నాడు గదా! ఇట్లు వచ్చిన 'ప్రియభామ'ను గృష్ణుడు 'గారవించె'నట.

సత్యాదేవికి ఆత్మస్తుతిపై కొంత మక్కువ. ఈ దౌర్బల్యమును బాగుగ నెరిగినవా రిరువురు - కృష్ణ, నారదులు. ఇర్వురును ఆమెకు గల యీ కొరతను తమ పనికి బాగుగ వినియోగించుకొన్నారు. నారదు డామెను బొగడి కొట్లాటలు రెచ్చగొట్టును. కృష్ణు డామెప్రేమ నువ్వెత్తుగ జూరగొనును. అత డామె నెప్పుడు పల్కరించినను కర్ణాట కుల బిరుదములవలె తెగబారెడు సమాసములనే వాడును. 'ఓ లలితేంద్రనీలశకలోపమకైశికా!' (1-135) అనును. 'ఏణీశాబవిలోలనేత్ర!' (2-90) యని పల్కరించును. ఆమె కాలితో దన్నినప్పుడు గూడ యదునాయకుడు 'భవచ్ఛబ్ద' మునే (1-123) వాడెను. ఇట్టి యుపచారములతో నామెకు బ్రహ్మాండమైన యానందము. ఒక భావము గలిగినప్పుడు దానిని గొన్ని నిముసములపాటైనను మనసులో దాచుకొనుటయు, అవసరమున దాని కొక స్వరూపము నొసగి బహిర్గత మొనర్చుటయు సత్య యెరుగదు. క్షణమున నామెకు కోపము వచ్చును. మరుక్షణముననే శాంతించును. పారిజాత వృత్తాంతమును చెలికత్తె వచ్చి చెప్పుటయే తడవు, భగ్గున మండినది. ఆమె దృష్టిలో ప్రపంచమే కూలిపడినది. కృష్ణుడు వచ్చి వెంటనే ఓదార్చినాడు. అంతటి కోప మెక్కడ బోయెనో! 'నీపలతికవలె' జెమర్చినదట! 'సఖీమయూరిక'గూడ దోడనుండుట ఆ దేవి కింకను తృప్తి.

ఆమెకు తొందరయు, అసూయయు (1-90) నెక్కువ. ఆ తొందరలో నామె యెన్నియో యవక తవకలు నేయును. కృష్ణుడు మ్రొక్కినప్పుడు - రామ రామ - అది తొందర కాక మరేమి! పైగా నీచేతను 'పేరలుకన్ జెందిన యట్టి కాంత లుచిత వ్యాపారముల్ నేర్తురే' అని సమర్థించిన కవి చిత్తవృత్తి యెంత లాలసమో యూహాకే యందుట లేదు. ఇంతే కాదు. ఆమె భర్తవెంట స్వర్గమునకు బోయినది గదా! కృష్ణుడు పారిజాతమును దెచ్చుటకే ప్రయాణమును కట్టినది. అచటి కేగిన పిదప అదితి 'నేట రేపటనుండి' పొమ్మని (3-39) కృష్ణునితో జెప్పినది సత్యాదేవి యెదుటనే. వైజయంతమున దిగిన సత్యా కృష్ణులు 'నందన'మునకు పోయినారు. అచ్చట నామె పారిజాతమును జూచెను. ఇక క్షణ మాగ దామె మనసు. 'ఏల తామసంబు' (4-11), 'ఇప్పుడే ఈ వృక్షమును బెకలించుకొని యూరికి పోదము పద' యనుచున్నది. సత్యాదేవి యింత చిత్రమైనది.

ఇన్ని గుణము లున్నవి గనుకనే యామె తర్క మెప్పుడును సమగ్రముగ నుండదు. పారిజాత విషయమున సత్యకు కోపము వచ్చినది - ముఖ్యముగా ముగ్గురిపైన: నారదుడు, కృష్ణుడు, రుక్మిణి. నారదుడు పారిజాతమును గొని రుక్మిణి యింటి కేల పోవలెను, తన యింటికి రాక. పోయినవా డూరక పోక అక్కడ పారిజాతమును గృష్ణున కిచ్చుట మహాపరాధముగదా! ఇచ్చినాడు పో! తన యూ సెందు (1-84) కక్క డెత్తవలెను? కనుక నాతనిపై కోపము. ఇక కృష్ణుడు ఆమె దృష్టిలో ప్రధానముగ నపరాధి. 'నారదు డిచ్చిన పూవును రుక్మిణి కిచ్చు నధికారము కృష్ణున కెవ రిచ్చిరి! ఇంత దుండగమా? ఒకవేళ కృష్ణుడు ఇవ్వబూనుకొన్నను ఆ రుక్మిణి తన తాహతును గమనింపక 'తగుదునమ్మా' యని యెట్లు పూవును గ్రహించినది? ఇది రుక్మిణిది తప్పు కాదా! ఇంతే కాదు, సత్యకు కోపమును దెప్పించిన నాల్గవవా రింకొక రున్నారు. వారు ఆమె సపత్నులు. పారిజాతమును ధరించిన రుక్మిణిని వీ రందరును సిగ్గు విడచి (1-62) భజించిరట! ఇంకను సత్యాదేవి కెవ రెవరిపై రోసము గల్గెనో కవి చెప్పలేదు. ఇందరిలో కొందరి తప్పు నామెయే క్షమించుకొన్నది. 'ముని యేమి సేయును (1-86)? అతడు తన కిష్టపడిన చోటికి వచ్చినాడు. కృష్ణునికి మర్యాదగా పారిజాతము నిచ్చినాడు. అతని తప్పేమున్నది? ఒకవేళ నారదుడు పూవును రుక్మిణి కిచ్చుటకే తెచ్చియున్నను అతని దోషములేదు. రుక్మిణిదియు తప్పు కాదు (1-86). కృష్ణు డిచ్చినాడు, ఆమె తీసికొన్నది. ఇత డివ్వకున్న నామె గుంజుకొనునా? ఇక తప్పంతయు నెవ్వరిది? ఆ మాయదారి కృష్ణునిది.' అతనిదికూడ తప్పులేదని యామె వివేకము (1-92) తెల్పినది. కాని సత్యాదేవి భావోద్రేక మా తర్కమును గారవింపలేదు. ఆమె హృదయము కృష్ణు డపరాధియని సిద్ధాంతించినది. దీనికి కారణము బాగుగ పాదుకొన్న అసూయ, అంతులేని భావోద్రేకము. ఇన్ని యవకతవక లున్నవి గనుకనే ఆమె కృష్ణునికి ప్రియురాలు.

ఈ కావ్యములోని నారదుడు చక్కని మాటకారి. పారిజాతమును దీసికొని తిన్నగా రుక్మిణికడకు వచ్చినాడు. అతడు వచ్చినదే కలహబీజమునకు. కృష్ణుడు చిరునవ్వుతో 'మీ రిటకు వచ్చుటచే నే గృతార్థుడనైనాను, మీ రిట్లు కరుణ గల్గియుండుట యకారణము సుడీ' (1-47) యనెను. అందులకు నారదుడు పొగడ్తలో నాతనికి మచ్చు జల్లి 'ఆ! ఏ మున్నది, ద్వారక వైకుంఠము. ఈ రుక్మిణి లక్ష్మి. మీ రిర్వు రిట నుండుటచే సారెకును గొల్వవత్తు' నని తేలబలికినాడు. ఈ మాటలో కలహమునకంకురార్పణ మున్నది. కృష్ణుడు పూవును రుక్మిణి కిచ్చుటయే తడవు, మొదలుపెట్టినాడు కలహారోపమును.

'ప్రద్యుమ్నుని మౌనిదండ నిడి' కృష్ణుడు సత్యగృహమున కేగిన తర్వాత యేమో పనియుండినట్లు నారదుడును బయలుదేరినా డచ్చటికి. ఈ ప్రయాణ మక్కడి పాక మెట్లున్నదో కనుగొనుటకే. అక్కడి సత్యామాధవు లిర్వురును అనుకూలముగా నున్నారు. ఒక్క యాకులో నారదుడు జరిగిన గాథ యంతయు నూహించివేసినాడు. 'దొంగ తప్పించుకొనె'నని కృష్ణునిపై మరియొక యెత్తు పన్నినాడు. సత్యాదేవి మ్రొక్కినప్పుడు నారదుడు 'అమ్మా! అనిశైనన్ పతి నిన్ను బాసి చనునో!' (2-25) అనుచున్నాడు. మరియొక చిన్న కలహమును బెట్టుదమని యాముని తలపు. కాని యీసారి కృష్ణుడు జాగ్రత్త పడెను. వైనతేయుడు వచ్చుటయే తడవు, ప్రియభామతో గూడ కృష్ణు డాతని యంసముపై నెక్కినాడు.

ఇక దేవేంద్రుడు ఒక తొందరకాడు. కృష్ణుడు ఉపేంద్రుడైనను పరమాత్మ స్వరూపుడని (5-38) యాతనికి దెలియును. తన కిచ్చిన యా దేవేంద్ర పదవికి, సర్వప్రపంచమునకును కర్త కృష్ణుడే యనుటయు (5-40) ఇంద్రునకు దెలియనిది కాదు. కృష్ణుడు తొలుత నాకమునకు వచ్చినప్పుడు 'ఎదురేగి మదకరిన్ డిగి, యంసవిలంబికల్పచేలమును నడుమన్ బిగించికొని, యిలానిహితాత్మశిరఃకిరీటుఁడై (3-4) భక్తినివేశతరంగితాత్ముడై' (3-5) తోడికొని వచ్చినది తాను. పైగా తన యెదుటనే అదితి గోపాలుని దశావతారములు పొగడి వామనావతార వర్ణనమున నాతని సర్వశక్తిస్వరూపమును వివరించినది. ఇంత తెలిసి యింత కథ తన యెదుట జరుగగా పారిజాతాపహరణ వృత్తాంతమును చారుడు విన్నవించినంతనే 'కన్గానదు యాదవుం'డని దేవేంద్రు డనుట యుక్తముకాదు. యుద్ధ ప్రయత్నమును సరిగా లేదు.

కవి కీ దౌర్బల్యము దెలియును. ఇంద్రుని యీ చెయిదమును అత డొక కారణముచే సమర్థింపజూచెను. ఆ పారిజాతము శచీదేవికి ప్రియమైనది. చారుడు పారిజాత వృత్తాంతమును దెచ్చినపు డింద్రుడు 'పులోమజాన్వితుడు'. పైగా నా చారుడు సత్యాదేవి చేసిన (4-58) ఎకసెక్కెము నట్లట్లే చెప్పినాడు. దీనితో దేవేంద్రునకు భార్యా సన్నిధిలో బ్రహ్మాండమైన యవమాన మైనది. 'సత్యా గర్వభారంబు డించి వత్తు' (4-61) నని భార్యతో చెప్పి ప్రయాణమైనాడు.

ఇక మిగిలినవాడు కృష్ణుడు. ఈ కావ్యమున నిత డొక సామాన్యుడు కాడు; 'సింహాసనాధీశ్వరుడు' (2-70) దిన

దినమును తన కొక పెద్దదైన యోలగము (2-70); రాజ్య భారము. ఇన్ని యున్నవానికి 'పారిజాతాపహరణము' లోని శృంగారము రసికతగా గాక దొడ్డ చాపల్యముగ బరిణమించినది. దీనిముందు అతనికి ఒక ధరాధీశ్వరున కుండవలసిన యన్ని గుణములు లుప్తములై పోయినవి.

స్వర్గ ప్రయాణమున కాత డొక యుక్తి పన్నెను; అదితిదేవి కుండలములు తనయొద్ద నున్నవి. వాని నామె కీవలెను. 'వచ్చి యిత్తునని దేవేంద్రునకు చెప్పు'మన్నాడు నారదునితో. ఈ మాటలలో కుండలము లిచ్చుట గాదు కృష్ణుని యూహ. పారిజాతహరణమున కది యొక సాకు; కార్యసంఘటనేచ్ఛతో (2-78) నన్నమాట.

స్వర్గమున కేగి కృష్ణు డదితిని దరిసించినాడు. కుండలములు మహాభక్తిగలవానివలె (3-25) సమర్పించెను. ఆ వృద్ధమాత 'మే నిమిరి శిరసు మూర్కొని' (3-26) యొక రెండు దినము లుండి పొమ్మన్నది. దానికి బదులివ్వక జంభవిరోధిమొగము జూచినాడు. పారిజాతమును గైకొన్నమీదట తల్లి మొగమును గృష్ణుడు చూడనేలేదు. 'పోయివత్తు'నని యైనను చెప్పలేదు. సత్యపైన వలపు మాతృభక్తి నమాంతముగ మ్రింగివేసినది.

'పారిజాతాపహరణము'నను కృష్ణునిది న్యాయము కాదు. ఆ వృక్షము నిజమునకు ఇంద్రుని సొత్తు. మరి ఒక్క మాటైన వాని నడుగవలదా; గోపాలుని యీ చెయిదమును దేవేంద్రుడే కాదు దివిజు లెల్లరును (4-65) గర్హించిరి. దానికి సమాధానమే లేదు. ఈ కావ్యమున రుక్మిణి యెడ (1-41) కృష్ణుడు ప్రవర్తించిన పద్ధతియు యుక్తము కాదు. ఇక కవిమాట యేమైనట్లు? ఈ కృష్ణు డొకలాలసతా స్వరూపము. శృంగారమునకు మచ్చుతునక, ఉద్రేకి. ఈ కృష్ణుని వెనుక లీలగా రాయ లున్నాడు. అతడును మహోద్రేకి. సమకాలికులైన రాయబారు లందరు నీ విషయము నొప్పికొన్నారు.

యాదవేశ్వరుని బుణ్యకవ్రత సందర్భమున సత్యాదేవి నారదునకు కృష్ణుని దాన మియ్యదలచినది. ఆమె పతి నడిగెను. అత డేమనును? ఏమైన నని బ్రతుకునా! 'ఆహాహా యెంత గొప్పదాన' వని పొగడి, 'విచారింపక ధారవోయు' (5-78) మన్నాడు. ఇది యంతయు నారదుని పాలిటికి 'అమానుష గోచరమైన' (5-91) మహిమ. దాని రుచి యాతనికే దెలియవలెను.

ఈతని గ్రంథమునకు మూలగాథ 'సంస్కృత హరివంశము'లోనిదని గొందరు తేల్చిరి. ప్రతిదానిని గీర్వాణముతో ముడిపెట్టనిది మనకు దృప్తి లేదు. కాని 'తిమ్మన' కావ్యమునకు కన్నడములోని 'హరికథాసారము' మూలగ్రంథము. కొన్ని కన్నడ పద్యముల నీతడు మక్కికి మక్కిగా తెనిగించికొన్న పట్టులును ఉన్నవి.

ఈ పారిజాతాపహరణ కథ కుపస్ఫోరకముగా నొక కథ యుండనే యున్నది. కథ యెట్లున్నను కావ్య పరీక్షలో దోచు విషయము నూటికి నూరుపాళ్ళంతే. తిమ్మన చిన్నమదేవి కెక్కువ యాశ్రితుడేమో యని నా యనుమానము. 'తిరుమలదేవి' యూసుకూడ ఇతడు రెండుసార్లెత్తినాడు. ఒకసారి 'తిరుమలదేవీవల్లభ' అని రాయలను సంబోధించెను. ఇంకొకచోట 'తిరుమలదేవీ హృదయేశ' అనును. వేరొకయెడ 'చిన్నమదేవీ జీవితనాయక' అని సొంపుగ అన్నాడు. ఈ విశేషణములను కనుగలిగి గమనించినపుడు కవికి చిన్నమ్మదేవిపై గల పక్షపాతము మనకు అర్థము గాకపోదు. ఇంతే గాక కథాసంవిధానమున గూడ నీ ఛాయలు గోచరించును. కవి సృష్టించిన 'సత్యాదేవి' చిన్నాదేవియేనేమో! చారిత్రకులు కృష్ణరాయనికి చిన్నభార్యపైననే మక్కువ యెక్కు వందురు.

ముక్కు తిమ్మన కవిత్వమునకు మాధుర్యమే శరీరము. కాని దానితోపాటు వెగటుకూడ నున్నది. తిక్కనకవిత వలె జీవితమునకు వెల్లుబాట కాకున్నను అప్పు డప్పుడు చదివి యానందపడవచ్చును. పు. నా.

**తిమ్మరుసు, సాళ్వ :** ఈయన కౌండిన్య సగోత్రుడు; ఆపస్తంబసూత్రుడు; ఆరువేల నియోగి బ్రాహ్మణుడు; ఇంటి పేరు సాళ్వ, సాళువ యనియు వ్యవహరింతురు. వేమరాజునకు పౌత్రుడు; రాచిరాజునకు పుత్రుడు; నాదెండ్లవారి దౌహిత్రుడు. పేరు తిమ్మరాజయినను తరువాతి కాలమున తిమ్మరుసనియే ప్రసిద్ధి గాంచెను (అరుసన్నది రాజశబ్దమునకు పర్యాయపదము). ఈ సాళ్వవారిది మొదట కొండవీటిసీమ యని చెప్పుదురు. రాచిరాజునకు తిమ్మరాజే కాక గోవిందరాజను మరియొక కుమారుడును, కృష్ణమాంబయను నొక కూతురును గలరు. రాచిరాజు తన కొమార్తెను సాళువ నరసింహరాయలయొద్ద మంత్రిగ నున్న కౌశిక గోత్రజుడగు నాదెండ్ల చిటిగంగనామాత్యుని అన్న మనుమడగు తిమ్మరాజున కిచ్చి వివాహము కావించెను. ఈ బంధుత్వము కారణముగానేమో, రాచిరాజు కొండవీటి సీమలోని తమ పరిస్థితులు సరిగా లేకపోవుటచేత కావచ్చును, చంద్రగిరి సీమకు వలస వెళ్లెను. అక్కడ నుండగనే తిమ్మరుసు తలిదండ్రులు గతించిరి. తరువాత తిమ్మరుసు చాల కష్టముల కోర్చి చంద్రగిరిలోను, అటుపిదప గుత్తికి, పెనుకొండకు వెళ్ళి అక్కడను మాధుకరవృత్తిని గొంతకాలము, సత్రములలో భుజించి కొంతకాలము జీవితమును గడిపి

శాస్త్రాధ్యయనము కావించి, తుట్టతుదను అప్పటికే కడు వృద్ధుడై యుండిన నీతిశాస్త్రవిశారదుడును, రాజనీతి తంత్రజ్ఞుడును నగు చిటిగంగనామాత్యునివద్ద రాజనీతి శాస్త్రముల నభ్యసించెను. గోవిందరాజు కూడ వెన్నంటియే యుండినను తిమ్మరుసు చదువులోను, విషయ గ్రహణములోను, ప్రజ్ఞలోను కుశాగ్రబుద్ధియగుటవలన తిమ్మరుసు పేరు ప్రసిద్ధికి వచ్చెను.

కొంతకాల మయినపిదప తిమ్మరుసు విజయనగరాధీశ్వరుడైన సాళువ నరసింహారాయల దండనాథుడగు తుళువ నరసానాయకుని కొలువులో చేరి అతని కార్యకర్తగను, మంత్రిగను వ్యవహరించి అతని మెప్పును పొందెను.

తుళువ నరసానాయకుని తిప్పాంబ, నాగలాంబ, ఓబాంబ అను మూవురు భార్యలలోను తిప్పాంబయందు వీర నరసింహరాయలును, నాగలాంబయందు కృష్ణరాయలును, ఓబాంబయందు అచ్యుతదేవరాయ, రంగరాయలును ఉదయించిరి. సాళువ నరసింహరాయల యనంతర మతని కుమారుడు సాళువ ఇమ్మడి నరసింహరాయలను సింహాసన మెక్కించి నరసానాయకుడే సామ్రాజ్య వ్యవహారములను చక్కబెట్టుచు వచ్చెను. నరసానాయకునికి తరువాత అతని కుమారుడు వీర నరసింహరాయలు సాళువ ఇమ్మడి నరసింహరాయలను కీలుబొమ్మను కావించి అతనిని మొదట నిర్బంధావాసమున నుంచి పిదప సామ్రాజ్యాధికారము నంతను హస్తగతము చేసికొని విజయనగర వజ్రసింహాసనారూఢుడై సాళువ తిమ్మరుసును ప్రధానిని గావించుకొనెను. తిమ్మరుసు నరసానాయకుని వలెనే రాజభక్తి విశ్వాసములతో వీర నరసింహరాయలనుగూడ సేవించి అతనికి కార్య ఖడ్గములు నెరపుచు వచ్చెను. వీర నరసింహరాయలు మరణించునాటికి అతని కొక కుమారుడు గలడు. అతడు పసిబిడ్డ. అయినను అతనినే సింహాసన మెక్కించి అతనికి యుక్తవయస్సు వచ్చువరకు రాజకార్యము లతనికి ప్రతినిధిగ నుండి యతనిపేరనే చక్కబెట్టుచుండవలసినదని వీర నరసింహరాయలు తిమ్మరుసును కోరెను. అంతేకాక, అప్పటికే రాజకార్య నిర్వహణమునకు యుక్తవయస్కుడయిన తన సోదరుడు కృష్ణరాయల వలన తన తనయుని కాపద మూడునని భావించి యాతనిం గడతేర్చి గ్రుడ్లూడబెరికించి తనకు తీసికొనివచ్చి చూపవలసినదని తిమ్మరుసు కాజ్ఞాపించెను. తిమ్మరుసు అప్పటి విజయనగర సామ్రాజ్య పరిస్థితిని, దాని కుత్తరమునను, తూర్పునను ఉన్న మహమ్మదీయ సుల్తానుల యొక్కయు, కటకము గజపతుల యొక్కయు విజయనగర రాజ్య విజయాకాంక్షను గ్రహించి, ఆ పరిస్థితిలో వీర నరసింహరాయల కుమారునికంటెను కృష్ణరాయలను సింహాసన మెక్కించుటయే సామ్రాజ్యమునకు, దేశమునకు క్షేమమని తలపోసి తిమ్మరుసు కృష్ణరాయలను చంపక రహస్యముగ దాచి మేక కన్నులను తీసికొని వెళ్ళి వీర నరసింహరాయలకు చూపి అతని యాజ్ఞ నిర్వహించినట్లు తెలిపెనని ఒక యైతిహ్యము దేశములో తరతరములనుండి వచ్చుచున్నది. మొత్తముమీద వీరనరసింహరాయల తరువాత అతని కొడుకు కాక కృష్ణరాయలే తిమ్మరుసు దూరదృష్టివల్లను, కారుణ్యమువల్లను, ప్రజ్ఞా విశేషమువల్లను విజయనగర సింహాసనారూఢు డయ్యెనన్నది వాస్తవము.

కృష్ణరాయలు తాను సజీవముగ నుండుటకు, తనకు రాజ్యము లభించుటకు కారణము తిమ్మరుసేయని అతని యెడ వినయ విధేయతలు, భయ భక్తి తాత్పర్యములు కలిగి అతనిని తండ్రివలె జూచుకొని అప్పాజీ యని పిలుచుచు వచ్చెను.

'అయ్యా యనిపించుకొంటివి
నెయ్యంబున గృష్ణరాయ నృపపుంగవుచే
నయ్యా నీ సరి యేరీ
తియ్యని విలుకాడవయ్య తిమ్మరుసయ్యా'

అన్న పద్యమే అందుకు తార్కాణము. కృష్ణరాయలు తన తండ్రి యన్నలవలెనే తానుకూడ అతనిని తనకు ప్రధాని గావించుకొనెను. తిమ్మరుసు సలహా లేనిది కృష్ణరాయ లేపనియు జేయువాడు కాడు. క్రి. శ. 1509 లో కృష్ణరాయలకు పట్టాభిషేకమైననాటినుండి 1525 వరకు - ఇంచుమించుగ నాతని రాజ్యకాల మంతయు - తిమ్మరుసే దండనాథుడై, ప్రధానియై, శిరః ప్రధానియై విజయనగర సామ్రాజ్యనౌకకు కర్ణధారు డయ్యెను. తిమ్మరుసు చారచక్షువై స్వ, పర రాజ్యములలోని వ్యవహారములనే కాక, రాజధానీ నగరమందును, రాజాంతఃపురమందును ఎప్పు డెచ్చట నేమి జరిగినను దెలిసికొనుచు రాజును, రాజ్యమును వేయి కన్నుల గనిపెట్టుచు వచ్చెను. కృష్ణరాయలు రాజ్యమునకు వచ్చినంతనే తిమ్మరుసు అమర నాయకులను తగిన కట్టడిలోనికి తెచ్చి రాజ్యాదాయమును, సైన్యమును వృద్ధి నొందించి, సామ్రాజ్య సైన్యమునంతను దన యధీనమునం దుంచుకొనెను. కృష్ణరాయలు తలపెట్టిన దక్షిణ, పూర్వ, ఉత్తర దండయాత్ర లన్నిటిలోను విజయము నొందుట కాతని యుద్ధతంత్ర నైపుణియే కాక తిమ్మరుసు 'మంత్రాంగము'ను, కార్యసాధకతయు, రాజనీతి చతురతయు ముఖ్యకారణములు.

కృష్ణరాయలు తన రాజ్యకాలమున జరపిన ముఖ్య దండయాత్ర లన్నిటిలోను మిగుల ముఖ్యమయినది

పూర్వదేశ దండయాత్ర. ఈ పూర్వ దిగ్విజయయాత్రకు బయలువెడలునప్పుడు అంతవరకు గుత్తి దుర్గాధ్యక్షుడుగ నుండిన తన సోదరుడు గోవిందరాజ దండనాథుని విజయ నగర రాజధానీసంరక్షణమునకును, తన మేనల్లుడు నాదెండ్ల గోపయామాత్యుని గుత్తి దుర్గాధ్యక్షునిగను నియోగించెను. కర్ణాట సైన్యములు ముందు ఉదయగిరిని ముట్టడించెను. సంవత్సరమున్నరకు పైగా ముట్టడి సాగిన పిదపగాని ఆ పర్వతదుర్గము కృష్ణరాయలకు వశము కాలేదు. ఉదయగిరికి తరువాత దుస్సాధమైన గజపతుల దుర్గము కొండవీడు. కొండవీటి విజయమునకు కారణ భూతుడు కేవలము తిమ్మరుసయ్యయే; నడచప్పరములు కట్టి సైనికులను వానిమీది కెక్కించి యుద్ధము చేయించి కోటను లగ్గలు పట్టి, ముట్టడి ప్రారంభమయిన మూడు మాసములకు వశపరచుకొనెను. ఉదయగిరి, కొండవీడుల పతనముతో కృష్ణరాయ లజయ్యుడని కీర్తి కెక్కెను; కొండవీటి విజయానంతరము తిమ్మరుసు తద్దుర్గ పరిపాలన మునకై మొదట తన మేనల్లుడును, అల్లుడును అయిన నాదెండ్ల అప్పయమంత్రిని నియమించెను; తరువాత దాని కధిపతియైనవాడు అతని రెండవ మేనల్లుడును, అప్పయ మంత్రి సోదరుడును అయిన నాదెండ్ల గోపమంత్రి.

కొండవీటిని సాధించిన తరువాత కృష్ణరాయలు కొండ పల్లి, రాజమహేంద్రవరము మొదలైన దుర్గములను సాధించి సింహాచలమువరకు నిరాఘాటధాటి నరిగి పొట్నూరికడ జయస్తంభమును ప్రతిష్ఠించి, అప్పటికిని ప్రతాపరుద్ర గజపతి సంధిబేరమునకు రానందున కృష్ణ రాయలు - తిమ్మరుసు వలదని వారించుచున్నను వినక - గజపతి రాజధానియైన కటకపురిపై దండుసాగించెను.

ప్రతాపరుద్ర గజపతిని రాజభక్తితత్పరులై సేవించు పదునారుగురు పాత్ర సామంతు లుండిరి. వారు తమ రాజ్యమును, అధిపతిని కాపాడుకొనుటకును, కృష్ణరాయ లను పట్టి యిచ్చుటకును ప్రతిన పట్టి దండు గూర్చుకొని కళింగమునందలి దుర్గమారణ్యసీమలందు స్కంధావారము లేర్పరచుకొని విజయనగర సైన్యము నెక్కడి కక్కడే నిరోధించి యుద్ధము చేయజొచ్చిరి. కళింగ పర్వతారణ్య దుర్గములు దుస్సాధములు; పాత్రసామంతు లతిపరాక్రమ వంతులు. ఇన్నిటికిని తోడు కళింగము మన్యప్రాంత మగుట వలన వివిధవ్యాధుల కాకరమై కడు ననారోగ్యకరమైనది. దీనం జేసి కర్ణాటసైన్యము క్రమముగా నశింపజొచ్చినది. స్థానబలము గలవారగుటచేత కటకసామంతులు కర్ణాట సైన్యమును రహస్య మార్గముల వచ్చి తలపడి నురుమాడు చుండిరి. ఇది యంతయు గాంచిన కృష్ణరాయలకు విజయము చేకూరుట య టుండ వెనుకకు సురక్షితముగ మరలిపోవు టయు కష్టమని తోచి యధైర్యము కలిగి ప్రధాని తిమ్మ రుసుకడ కరిగి తాను వేగిరపడి యీ కటకదండయాత్ర తలపెట్టినందుకు పశ్చాత్తాపము నొంది యీ సంకటస్థితి నుండి గౌరవముగ బయటపడుమార్గ మాలోచింపుమని యాతనిని గోరెను. బుద్ధిని బృహస్పతియైన తిమ్మరుసు రాయలకు ధైర్యము గొలిపి విజయము చేకూర బ్రయత్నిం తునని నచ్చజెప్పి సామ దాన దండోపాయములు కార్య కారులు కావని భేదోపాయమును ప్రయోగించెను. 'గజ పతిని బట్టి యిచ్చినచో రాయలవారు మీరు కోరినట్లు చేయుట కంగీకరించి'రని అతడు పదునారుగురు పాత్ర సామంతులకు వేరు వేరుగ పదునారు జాబులు వ్రాసి ధన కనకాభరణములు నింపిన పదునారు పెట్టెలలో నుంచి వానిని పాత్రసామంతుల కప్పగించి ప్రత్యుత్తరములు తెండని పదునారుగురు వీరభటుల కానతిచ్చెను.

ఆ భటులు శత్రుసైన్యమధ్యమునుండి పోవుచుండగ ప్రతాపరుద్ర గజపతికి తెలిసి వారిని పట్టుకొని రప్పించి పెట్టెలను తెరచి యందలి జాబులను చదువుకొని తన పాత్ర సామంతులే తనకు ద్రోహము తలచిరని నమ్మి త న్నేక్షణమున బట్టి యిత్తురో యను భయమున నిక యుద్ధరంగమున నిలువక రహస్యమార్గమున నిజరాజధా నికి పలాయితుడయ్యెను. తథ్య మనుకొన్నజయ మపజయ ముగ మారినది. తమ యధిపతిని గానక, యాతని జాడ తెలియక యుద్ధము విరమించుకొని పాత్రసామంతులును తమ సేనలతో వెన్నిచ్చి మరలి పోయిరి. అంతట కృష్ణ రాయలు హుటాహుటి ముందునకు సాగిపోయి కటక మును ముట్టడించెను.

ఇక చేయునది లేక ప్రతారుద్ర గజపతి సంధి కొడబడు టయే కాక తన కూతురిని రాయల కిచ్చి వివాహము సేయుటకును అంగీకరించెను. ఈ రీతిని పూర్వ దిగ్జైత్ర యాత్ర మహామాత్యుడయిన తిమ్మరుసు అసాధారణ రాజ నీతికౌశలమువలనను, అవక్రపరాక్రమమువలనను విజయ పర్యవసాయి యయ్యెను. ఈ విధముగ తిమ్మరుసు రాయ లకు కుడిభుజమై, ప్రధానియై, మహాసైన్యాధిపతియై ప్రాజ్యరాజ్య ధురంధరుడై రాయరాజ్యమునకు శ్రీరామ రక్షగ నుండెను.

కృష్ణరాయలవారికి చాలకాలమున కిరువురు కుమా రులు కలిగిరి. వారిలో జ్యేష్ఠుడయిన తిరుమలరాయలు ఆరేండ్లవాడు. రాయలవారు చనిపోవునాటికి రెండవ కుమారుని వయసు పదునెన్మిదిమాసములు. రాయలవారు తాను జీవించియుండగనే తన పెద్ద కుమారునికి పట్టాభి

షేకము గావించి తాను ప్రధానియై రాజ్యపరిపాలన మతని పేరనే నడపనారంభించెను. పట్టాభిషేకోత్సవములు జరగు చుండినకాలముననే దైవదుర్విపాకమున తిరుమలరాయలు అకాలమృత్యువువాత బడెను. తిమ్మరుసన్న అసూయా ద్వేష విరోధములు కలిగిన కొలువుకాండ్రు కొందరు తిమ్మరుసే విషముపెట్టి యాతనిని చంపించెనని రాయలకు చాడీలు చెప్పిరి. పుత్రమరణశోకార్తుడగుట యుక్తాయుక్త విచక్షణ గోల్పోయిన కృష్ణరాయ లా మాటలు నమ్మి తిమ్మరుసును, అతని సోదరుడగు గోవిందరాజును, వారి పుత్ర మిత్రులను బంధించి చెరలోనుంచి బ్రాహ్మణుడవధ్యుడని తిమ్మరుసును చంపనొల్లక అతని కను లూడ బెరికించెను. చెరయందుంచి గ్రుడ్లు తోడించె నన్నవిషయము న్యూనిజు వృత్తాంతమువలన దెలియుచున్నది. ఇం దెంత వరకు సత్యము గలదో తెలియదు. కాని తిమ్మరుసును, గోవిందరాజును కృష్ణరాయల యనంతరము కర్ణాటాధీశ్వరుడైన అచ్యుతదేవరాయల రాజ్యారంభసంవత్సరములలో అతని కొలువులో నుండినట్లు శాసన ప్రమాణము గలదు. అప్పు డతడు శిరఃప్రధానిగనే కాదు, ప్రధానిగ నుండినట్లు కూడ తెలియరాదు. న్యూనిజు కథ నిజమైనచో ఒకవేళ తిమ్మరుసు నిర్దోషియని తెలిసినపిదప పశ్చాత్తాపము నొంది ఆతనిని, ఆతని బంధువులను కృష్ణరాయలు చెరనుండి విడిపించియుండును.

అచ్యుతరాయల కాలములో తిమ్మరుసు ఎంతకాలము జీవించియుండెనో, ఆతని జీవిత మెట్లు అంతమయ్యెనో తెలియదు. కాని అప్పటికే అతడు కడువృద్ధుడై యుండవలెను.

తిమ్మరుసు కుటుంబమునుగురించి మన కేమియు తెలియదు. అతనికి తిరుమలాంబ యని కూతురు గలదు. అతడీమెను తన మేనల్లురలో నొకడైన నాదెండ్ల అప్పయ మంత్రి కిచ్చి పరిణయము కావించెను. ఈ యప్పయ మంత్రికే మాదయగారి మల్లన తన రాజశేఖరచరితమును కృతి నిచ్చెను. తిమ్మరుసు రెండవ మేనల్లుడు గోపమంత్రికూడ దండనాథుడును, రాజనీతినిపుణుడేకాక కవి, పండితుడును కూడను. ఇతడు సంస్కృతమున కృష్ణమిశ్రుడు రచించిన ప్రబోధచంద్రోదయమునకు వ్యాఖ్యయు, తెనుగున ద్విపద కావ్యముగ కృష్ణార్జున సంవాదమను గ్రంథమును రచించెను.

తిమ్మరుసు గొప్ప రాజకీయధురంధరుడు, సంగ్రామ ధనంజయుడుమాత్రమే కాక గొప్ప రసజ్ఞుడు, సకలాగమజ్ఞుడు, మహాపండితుడు, కవిపారిజాతము. ఇతడు తాను కృష్ణరాయలయొద్ద శిరఃప్రధానిగ నుండిన కాలముననే అగస్త్యవిరచితమైన బాల భారతమునకు 'మనోహర'యను వ్యాఖ్య రచించెను. ఆ వ్యాఖ్యలోని సర్గాంత గద్య మి ట్లున్నది.

'ఇతి శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర కర్ణాటేశ్వర శ్రీకృష్ణరాయ శిరఃప్రధాన సకలాగమపారావార పారీణ సాళ్వ తిమ్మయదండనాథవిరచితాయాం బాలభారతవ్యాఖ్యాయాం మనోహరాఖ్యాయాం...సర్గః.'

మ. సో. శ.

**తిరుపతి వేంకట కవులు :** చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి జననము ప్రమోదూత సంవత్సర శ్రావణ శుద్ధ ద్వాదశి సోమవారమున; తండ్రి కామయ్య, తల్లి చంద్రమ్మ; తూర్పుగోదావరి మండలమందలి కడియము నివాసము; ఆరామ ద్రావిడ శాఖీయులు; భారద్వాజ గోత్రులు. వీరిది కవి వంశము. వేంకటశాస్త్రి పినముత్తాత నరసకవి యామినీపూర్ణతిలకావిలాసము, వేంకటేశ్వరవిలాసము మున్నగు ప్రబంధములు రచించెను.

దివాకర్ల తిరుపతిశాస్త్రి జననము ప్రజోత్పత్తి సంవత్సర ఫాల్గున శుద్ధ దశమీ బుధవారమున; తండ్రి వేంకటావధాని, తల్లి శేషమ్మ; పడుమటి గోదావరి మండలమున జల్లిసీమలో ఎండగండి నివాసము; వెలనాటి వైదికులు; హరిత సగోత్రులు. వీరిది శిష్టాచార సంపన్నమైన పండిత వంశము. తిరుపతిశాస్త్రి తండ్రి తాతలు సాంగ వేదాధ్యేతలు.

వీ రిరువురును కాశీపండితుడును, షట్శాస్త్రవేత్తయు నగు చర్ల బ్రహ్మయశాస్త్రిచెంత వ్యాకరణశాస్త్రమున సహాధ్యాయులై భాష్యాంతము పఠించిరి. తిరుపతికవియు, వేంకటేశ్వరుడును గలసి తిరుపతి వేంకటకవులని ప్రఖ్యాతి గాంచిరి.

తంజావూరు నాయకరాజుల కాలమునకు బిమ్మట మున్నూరేండ్లు ఆంధ్రకవిత్వశారద రెండు మూడర్థములు గల కావ్యరచనతో, శ్లేషయమకాదులతో గాలక్షేపము చేసినది. క్రీ. శ. 19 వ శతాబ్ది చివరిపాదమునాటికి రాజాస్థానములు సంస్కృత పండితులకు నిలయములైనవి. పట్టనములు ఆంగ్లవిద్యార్థికుల కావాసములైనవి. దాసు శ్రీరామకవి చెప్పినట్లు పల్లెలలో నచ్చటచ్చట "ముదికరణాలు రాము గుడిమోసల రచ్చలు దీర్చి భారతాల్ చదువుచు లోకవార్తల ప్రశంసల 'తెలుంగు బాసమంచిది' " అనుకొనుటమాత్రము కద్దు. అట్టి దుష్కాలమున ఆంధ్రులకు మరల స్వస్థానవేషభాషాభిమానము కల్పించిన మహనీయులలో తిరుపతి వేంకటకవులు ప్రధానముగా పేర్కొనదగుదురు.

వీ రిరువురు అష్టావధాన, శతావధాన విద్యలందు ప్రవీణులు. 19 ఏండ్ల లేఁబ్రాయమున ఈ పండితకవులు కాకి

నాడలో శతావధాన విద్యాప్రదర్శన మొనర్చి అచటి పండితులను, ఆంగ్ల విద్యార్థికులను అద్భుతరసమున నోలలాడించిరి. అది మొదలు తెలుగునాట నాలుగు చెరగుల అవధానవిద్యాప్రదర్శన మొనర్చుచు సంచరించి, తాము మెట్టిన చోటెల్ల సారస్వతతీర్థము గావించిరి. శ్రీనాథాది కవులవలె వీరు రాజాస్థానముల నిరాఘాట సంచారము చేసి అచటి పండితులతో విద్యావివాదము లందు డీకొని జయపత్రిక లందుకొనిరి. రాజులపై వీరు బట్టుపొగడ్తలతో దేవిరి గొట్టు పద్యములు చెప్పక 'విద్యాపోషకులై, శాశ్వత కీర్తి నార్జింపు' డని వారికి హితబోధ సల్పిరి.



చిత్రము 147.
దివాకర్ల తిరుపతిశాస్త్రి

'కవితాలతాంగికిన్, ధనము ప్రధానమా,
రసికతాధికతాసుఖతల్ ప్రధానమా?'

అనియు,

'కవుల మున్పటి రూల్సుకు గట్టుపడము.
ఘనులు పండితరాయాది కవులు చూపు
త్రోవలంబట్టి పోదుము దేవునైన, లక్ష్యపెట్టము'

అనియు స్వతంత్రతయు, ధీరతయు నుట్టిపడ బలుకుచు కవుల గౌరవమునకు పునఃప్రతిష్ఠ సల్పిరి. వీరి చాటువులు, ఛలోక్తులు ప్రజల నాల్కలే ఆకులుగా బహుళ ప్రచారము నొంది, ఆంగ్లభాషావ్యామోహితులైన పడుచువాంధ్రకు, గీర్వాణవాణీమోహితులయిన పెద్దలకుగూడ మరల ఆంధ్రసాహితిపై అభిరుచిని, ఆదరమును, ప్రీతిని గల్పించెను. 1890 మొదలు 1903 వరకు వీరు సాధించిన దీర్ఘ సారస్వత సత్రము ఆంధ్ర సాహిత్యచరిత్రలో మరువదగని ఘట్టము.

పిమ్మట తిరుపతిశాస్త్రి కాకినాడలో పండిత ప్రభువగు పోలవరం జమీందారుచెంత 1900 సంవత్సరములో ఆస్థాన కవిగా నిలిచెను. వేంకటశాస్త్రి బందరు హిందూ హైస్కూలులో ఆంధ్రాధ్యాపకుడుగా 1902 లో ప్రవేశించెను. అప్పటికప్పుడే ఈ జంటకవులు కాశీసహస్ర ధాతురత్నాకర శృంగారశృంగాటకాష్టకము లనుపంస్కృత కృతులు రచించిరి. దేవీభాగవతపురాణ మాంధ్రీకరించుటే కాక శ్రవణానంద, లక్షణాపరిణయ, ఏలామాహాత్మ్య, బుద్ధచరితలను కావ్యములు రచించిరి. శ్రీనివాసవిలాసచంపువు దెనిగించిరి.

పిమ్మట మృచ్ఛకటిక, ముద్రారాక్షస, బాలరామాయణ నాటకములను సరసత యుట్టిపడ తెలిగించుటే కాక భారతకథ నైదు నాటకములుగా రచించిరి. ఈ పాండవ నాటకకవిత కవిత్రయ కవిత్వముతో తులదూగుచుండును. ఇవిగాక దంభవామన సుకన్యా పండితరాజ అనర్ఘనారదాదులగు పెక్కు స్వతంత్ర రూపకములను, పాణిగృహీత పతివ్రత శివభక్తి శివపురాణము సుశీల గోదేవి మున్నగు అనేక ప్రబంధములను రచించిరి. విక్రమాంకదేవచరిత్ర, చంద్రప్రభచరిత్ర, హర్షచరిత్ర లను వీరి గద్యకృతులు తెలుగుసేతలయ్యు అనుపమ శైలిచే నొప్పారుచున్నవి. గీరతము, గుంటూరు సీమలను పద్యకావ్యములు సాహిత్యవివాదములను పురస్కరించుకొని వివిధ సాక్ష్యప్రమాణములతో, ఉదారధాటితో నడచు వీరరసకావ్యములు. ఇట్టివి మన సాహిత్యమునకు క్రొత్తలు. జాతకచర్య యనుగ్రంథమున ఫలజ్యోతిషమునకు వ్యాఖ్యాప్రాయముగ తమ చరిత్ర రచించి తెలుగున స్వీయచరిత్ర రచనకు త్రోవ తీసిరి. వీరి చాటురచనలు నానారాజసందర్శనము, శతావధానసారము. వీరి పాండవరాజసూయము సగము శ్రవ్యము, తక్కినది దృశ్యముగా రచితమైన అపూర్వ గ్రంథము.



చిత్రము 148.
చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి

వీరి ప్రథమకావ్యమగు శ్రవణానందము వస్తువరణమునను, వర్ణనాదులలోను, శైలియందును స్వతంత్రము, నవీనము నగు మార్గము త్రొక్కి, అంతకుమున్ను శ్లేష, బంధ కవితలతో అవరోధసంచారము చేయుచున్న ఆంధ్రశారదకు క్రొత్త వెలుగును, ధారాళవాయుప్రసారము ననుగ్రహించెను. 'మారుమూల పదములు గుప్పిన ముచ్చటగునె, ప్రతి పదమ్మున రస ముట్టిపడినగాక' యనునది వీరి ప్రతిజ్ఞ. 'కాలముబట్టి దేశమును గాంచి, ప్రభుత్వము నెంచి, దేశ

భాష మారును. తెలుగున కున్న వ్యాకరణదీపము చిన్నది కావున లక్షణముకంటె లక్ష్యమే ఆంధ్రకవుల కుపాదేయ' మనుమత మవలంబించిన స్వతంత్రులు వీరు. ఈ మతమే గిడుగు పంతులవలన పిమ్మట బహుళ ప్రచారము నందెను.

భాషావిషయమునవలెనే, ప్రాచీన నవీనాచారము లందలి మౌఢ్యమును ఖండించుటయందుగూడ వీ రవలంబించిన స్వాతంత్ర్యమునకు 'పల్లెటూళ్ళ పట్టుదల'లను ప్రహసనమును, కామేశ్వరీ శతకాదులును తార్కాణము.

ఈ కవుల రచన లెల్ల నిట్లు ఉపజ్ఞామహితములై, సరళ సుందర శైలిచే మనోహరములై, నవీనకాలమును, సంఘమును చిత్రించుటకు వలయు కావ్యభాషను క్రొత్తతరము కవులకు సృష్టించి యొసగెను. వీరికి ఆంగ్లసాహిత్య వాసన లేకున్నను లోకవ్యవహారము నప్రమత్తతతో నిపుణముగా నెప్పటి కప్పుడు పరిశీలించుచు దమ కావ్యముల వర్తమాన సాంఘికపరిస్థితుల సర్వంకషముగ వ్యాఖ్యానించుట కాననగును. 'వీరు కవిత్వాన్ని ఒక ఉద్యమం చేశారు; వీరి విద్యాకుటుంబము చాల విస్తరించియున్నది;' 'కాస్త చదువుకొని కంఠం విప్పుతున్న ప్రతి నోటా వీరి సాహిత్య సమరగాథలు ప్రతిధ్వనించేవి'; 'ప్రాత కవిత్వమునకు వీరు భరత వాక్యము పాడి, నవీనకవితకు నాంది పఠించిరి.'

వీరి కావ్యరచన మంతయు నొక యెత్తు; వేంకటశాస్త్రి సరస ప్రసంగ నైపుణి మరొక యెత్తు. ఆయన 'మోహనమ్మున జగన్మోహనముగ' పద్య పఠన చేసే మాధుర్యము మూడు తరాల పండితులను, విద్యార్థులను పరవశులను గావించి, ఆంధ్రకవితాసపర్య కంకితులను జేసినది. ఆయన అప్రతిమానమగు శిష్టవ్యవహారము నాశ్రయించి కోకొల్లలుగా రచించి పత్రికలలో ప్రకటించిన 'కథలు గాథలు' ఆంధ్రుల సాంఘిక సారస్వత చరిత్రకు రత్నఖనులు. వారి భాషావివాదగ్రంథములు కవులపాలిటి కామధేనువులు.

ఆంధ్రమున మొదటినుండియు జంటకవిత్వము లున్నను వీరి నెయ్యమును, ఒండొంటి బెరసికొని విడదీయరాని వీరి కావ్యశైలియు నొండొకచో మృగ్యములు. అవధానములలో బెరియొకచరణముగా పద్యములు చెప్పినను, కావ్యములు 'ఒక్కరె రచియించిరేనియును గాదగుం దిర్పతివేంకటీయమై' అని వీరు సమయ మేర్పరచికొనిరి. కావుననే 1920 లో తిరుపతిశాస్త్రి స్వర్గతుడైన పిమ్మట 30 పండ్లు జీవించియున్న వేంకటశాస్త్రి తన రచనలెల్ల తిరుపతివేంకటీయములుగానే ప్రచురించుట జూడ ఏదేశమునను ఇంతటి గాఢమధురసాహిత్యమైత్రి కానరాదు.

వేంకటశాస్త్రి 60 యేడ్లు నిస్సపత్నంగా కవితారాజ్యము పాలించి ఆంధ్ర యూనివర్సిటీ వలన కళాప్రపూర్ణ బిరుదు నంది, మద్రాసుప్రభుత్వముచే ప్రథమాంధ్రాస్థాన కవిగా నభిషిక్తుడై, కవిగా పొందదగిన సమస్తగౌరవముల నందికొని 80 పండ్ల యీడున, తుదిక్షణముదనుక శారద నారాధించుచునే 1950 మార్చిలో శివరాత్రి పుణ్యదినమున శివసాయుజ్య మందెను. కా. వెం.

**తిరుమలాంబ** : ఈ విదుషీమణి విజయనగరాధీశ్వరుడైన అచ్యుతరాయల భార్య. రాయల యంతఃపురమున వాచకురాలుగ నుండిన ఓదువ తిరుమలాంబయే యీమెయని కొందరు పరిశోధకు లభిప్రాయపడుచున్నారు. కావచ్చును. ఈమె వరదాంబికాపరిణయ మనుకావ్యమును రచించెను. అం దచ్యుతదేవరాయల దేవేరియగు వరదాంబికయొక్క వివాహ వృత్తాంతము చక్కగ వర్ణింపబడినది. ఈ వరదాంబికకే వరదాదేవి, వరదరాజమ్మ, వరదాజమ్మ అనునవి నామాంతరములు.

వరదాంబికా పరిణయగద్యనుబట్టి తిరుమలాంబ ఏకసంథాగ్రాహిత్వము, సంగీతసాహిత్యములం దసమాన పాండిత్యము కల దనియు, వితరణగుణశాలిని యనియు, పెద్దల దీవనల నందుచుండున దనియు తెలియుచున్నది.

అచ్యుతరాయలు క్రీ. శ. 1527 ప్రాంతమున హంపిలోని విరూపాక్ష గోపురద్వారముచెంత చెక్కించిన శాసన మొకటి సంస్కృత, కర్ణాట భాషలలో కలదు. అందలి శ్లోక మొకటి ఓదువ తిరుమలమ్మచే రచింపబడినట్లు చెప్పుదురు.

వరదాంబికాపరిణయమున అచ్యుతరాయల వంశ వృత్తాంతము, వీరవిలాసములు, పిదప నతనికి వరదాంబికతోడి వివాహము, ఆ దంపతులకు వెంకటాద్రి జనించుట, యుక్తవయస్సు రాగా అచ్యుతరాయలు కుమారునకు యౌవరాజ్యపట్టము కట్టుట వివరింప బడినవి. తిరుమలాంబ తంజావూరి చెవ్వప్పనాయకుని భార్యయగు మూర్తిమాంబకు సోదరియైనట్లు విజయవిలాస ప్రబంధాదులవల్ల తెలియుచున్నది. బు. వెం. ర.

**తిరువెంగళప్ప, తాళ్లపాకము** (క్రీ. శ. 1550 ప్రాంతము) : ఇతడు తాళ్ళపాకము చినతిరుమలయ్య కుమారుడు; గొప్ప విద్వాంసుడు. సంస్కృతామరుక కావ్యము నీతడు చక్కని పద్యములతో ననువదించెను. అందలి పద్యముల కీతడు వ్రాసిన వివరణరూప పరిచయ వాక్యములు శిష్టవ్యావహారిక భాషలో నున్నవి. ఇత డది కాక నామలింగానుశాసనమునకు తెలుగు వ్యాఖ్యను, కావ్య ప్రకాశికా వ్యాఖ్యను రచించి కీర్తి గాంచెను.

తి. కో. రా.

**తీర్థీయ సూత్రభాష్యము :** ఈ భాష్యము బ్రహ్మ సూత్రములకు వ్రాయబడిన నూతన భాష్యము. ఇది దాదాపు ఇరువదియైదు సంవత్సరములకు పూర్వము వాణీ ముద్రాలయములో ముద్రింపబడినది. దీనికి యోగ వాసిష్ఠము ప్రమాణగ్రంథములలో నొకటి. దీనిని రచి యించినవారు శ్రీ అద్వైతానందతీర్థులను యతి. ఈయన బహుగ్రంథ నిర్మాత. వీరి పూర్వాశ్రమ నామము కురుగంటి సుబ్రహ్మణ్యశాస్త్రి. గుంటూరుజిల్లాలోని తెనాలి తాలూకా వేమూరు వీరి స్వగ్రామము; జననము 1841; నిర్యాణము 1926. వీరి తండ్రి పేరు మాధవశాస్త్రి; తల్లి పేరు మహాలక్ష్మి. వీరు అగ్న్యాధానము, జ్యోతిష్టోమము, చయనము మొదలైన క్రతువుల నొనర్చి సుబ్రహ్మణ్యాచయనులని విఖ్యాతులైరి; గొప్ప పండితులు; వేదాంతశాస్త్ర వేత్తలు. 1917 లో ఆశ్రమస్వీకారము కావించిన పిదప అద్వైతానంద తీర్థయతి యనబరగిరి. వీరు పై నుడివిన గ్రంథమునే కాక అద్వైతానందలహరి యనుపురుషసూక్త భాష్యమును, భగవద్గీతాతాత్పర్యదీపిక, బ్రహ్మసూత్రతాత్పర్యదీపిక, ఛాందోగ్యోపనిషద్భాష్యము, పంచోపనిషత్ తాత్పర్య దీపిక అను గ్రంథములను రచించిరి. మ. సో. శ.

**తుక్కాదేవి :** తుక్కాదేవి కటకమున కధిపతియగు ప్రతాపరుద్ర గజపతి కుమార్తె; విజయనగర సామ్రాజ్యాధి నేత శ్రీకృష్ణదేవరాయలదేవేరి. ఈమెకు రుచీదేవి అనియు, వరదరాజమ్మ అనియు, భద్ర యనియు నామములని కొందరు తెలుపుచున్నారు. 'తుక్కాపంచకమును' బట్టి యామె పేరు తుక్కాదేవియని కొందరు నిర్ణయించు చున్నారు. పూర్వదిగ్విజయ యాత్రలో రాయలచే నోటు వడి ప్రతాపరుద్రగజపతి తన పుత్రిక నాతని కిచ్చి వివాహము చేసి సంధి యొనర్చుకొనవలసి వచ్చెను. రాయలు కులీనుడు కాడను అపప్రథ యున్నందున తల్లి కీ వివాహము నచ్చలే దనియు, రాయల నెట్లయినను తుదముట్టింపవలయునని యొకప్పుడు తన ప్రయత్నములో నుండగా రాయలు గ్రహించి యామెను సపరివారముగ పుట్టినింటికి పంపి వేయగా ఆమె కర్నూలుజిల్లాలోని నల్లమలప్రాంతపు టడవిలో స్థిరనివాస మేర్పరచుకొని ధర్మకార్యములతో కాలము గడపె ననియు ఒక కథ గలదు. ఇయ్యదియే పెక్కు కథల కాకరమైనది.

భర్తృవియోగదుఃఖమున పరితాప మొందిన యా దేవి ఒకప్పుడు భృంగాపదేశమున అయిదు శ్లోకములు రచించి రాయలకు పంపినదట. ఆ శ్లోకపంచకమునకే తుక్కా పంచక మనియు, భృంగపంచక మనియు నామ ములు ప్రసిద్ధములైనవి. అం దొకశ్లోకము :

'చలన్వనాంతే నవమంజరీషు, నషట్పదో గంధఫలీ మజిఘ్రత్,
సాకిం న రమ్యా సచకిం న రంతా, బలీయసీ కేవల మీశ్వరాజ్ఞా!'

ఈ శ్లోక పంచకములోని రెండు శ్లోకములు వల్లభదేవుని సుభాషితావళిలోను, వే రొకటి ముకుళభట్టు వ్రాసిన అభిధావృత్తి మాతృకలోను కలవు. వీ రిరువురును రాయల కంటె కొన్ని శతాబ్దులు పూర్వులు; అందువలన నీ యైదు శ్లోకములను తుక్కాదేవి రచింపలే దనియు, ప్రాచీనము లగు ఆ శ్లోకములను సందర్భానుసారముగా వ్రాసి రాయ లకు పంపియుండు ననియు విమర్శకు లభిప్రాయపడు చున్నారు. ఋ. వెం. ర.

**త్యాగరాజస్వామి :** (చూడు : వాగ్గేయకారులు).

**త్యాగరాయశెట్టి, పిట్టి :** ఈయన పాత చాకలపేట (మదరాసు) నివాసియగు అయ్యప్పశెట్టియను సుప్రసిద్ధ వర్తకుని కుమారుడు. చిన్నతనముననే యీయన తెలివి తేటలను గుర్తించి తండ్రి యీయనను చక్కగా చదివించెను. ఈయన విద్యార్థిదశయందు ప్రతిభా సామర్థ్యములను మిక్కిలి ప్రకటించుచుండెను; మెట్రిక్యులేషను పరీక్ష అయినపిదప మదరాసు ప్రెసిడెన్సీ కళాశాలలో గణిత మభిమాన శాస్త్రముగా చదివి 1876 సంవత్సరమున బి. ఏ. పరీక్షయం దుత్తమ శ్రేణిలో తేరెను.

అనంతర మీయన తమ పెద్దలు చేయుచుండిన తోళ్ళ వర్తకమును, నీలిమందు వర్తకమును గూడ సాగించెను; ఇదికాక తమ నివాసభవనములకు చుట్టును మగ్గములను పెట్టించి నేతపరిశ్రమను విరివిగా సాగించెను. ఆ దివసములలో పిట్టివారి వర్తక వ్యాపారములు, పరిశ్రమలు ప్రశంసాపాత్రములైనవి.



చిత్రము 149.
పిట్టి త్యాగరాయశెట్టి

గత శతాబ్ది చివర ఈయన మదరాసు పురపాలక సంఘమునకు సభ్యుడుగా ఎన్నుకొనబడి ప్రజానురాగమునకు పాత్రుడై నలువది యేండ్లు సభ్యత్వమును నిర్వహించెను; తుది వయసున అనారోగ్యము కలుగుటచే దానిని పరిత్యజించెను. ఈ నలుబదియేండ్ల కాలమున ఈయన నగరాభివృద్ధికొరకు త్రికరణశుద్ధిగా పాటుపడెను. 1909 లో ఈయన చేసిన పౌరసేవ కభిజ్ఞానముగా రావుబహాదరు బిరుద మొసగబడెను.

మాంట్ ఫర్డ్ సంస్కరణములు ఆచరణకు వచ్చినపుడు ఈయన మదరాసు పురపాలక సంఘమున కధ్యక్షుడుగా నెన్నుకొనబడి నాలుగేండ్లాయధ్యక్ష పదవిని సామర్థ్యముతో నిర్వహించి 1923 లో ఆ పదవిని, పురపాలక సంఘ సభ్యత్వమును కూడ పరిత్యజించెను. ఈయన స్వార్థరహిత పౌరసేవకు జ్ఞాపికగా నీయన శిలావిగ్రహము మదరాసు పురపాలక సంఘ కార్యాలయ ప్రధాన ద్వారము నెదుట నెలకొల్పబడినది.

ఈయన జాతీయవాది. ప్రజల సాంఘిక పరిస్థితిని చక్కబరచు నుద్దేశముతో 'జస్టిస్ పార్టి' అను నొక పక్షమును నెలకొలిపి ప్రజాహృదయమున రాజకీయ భావమును జాగరిలచేసెను.

ఈయన రాజకీయ రంగమున బ్రవేశించి 1910 లో మదరాసు శాసనసభకు సభ్యుడుగా నియమింపబడి పది సంవత్సరములు సభ్యత్వమును నిర్వహించెను. మరల ఈయన 1920 లో అధిక సంఖ్య వోట్లతో మదరాసు శాసన సభకు సభ్యుడుగా ఎన్నుకొనబడెను. అపుడు గవర్నరు ఈయనకు మంత్రి పదవి నిత్తు ననియు, మంత్రి మండలిని నిర్ణయించుకొను డనియు చెప్పగా ఈయన దానిని నిరాకరించెను. ఈయన కావించిన ప్రజాసేవను, ప్రజాహిత కార్యములను మెచ్చుకొని ప్రభుత్వ మీయనకు 1918 లో దివాన్ బహదర్ బిరుదమును, 1921 లో సర్ (నైట్ హుడ్) బిరుదము నొసగెను.

తరువాత విస్తరిల్లిన అస్పృశ్యతా నివారణ, మద్యపాన నిషేధాది సంఘ సంక్షేమ కార్యములయం దీయన యానాడే పాల్గొని యుండెను. ఈయనయు, ఈయన యన్నయు కలిసి తమ కుటుంబ ద్రవ్యముతో 1897 సంవత్సరములో ఉత్తర మదరాసు (పాత చాకలపేట) లో నొక పాఠశాలను నెలకొల్పిరి. అదియే నేటి సర్ త్యాగరాయ కళాశాలగా రూపొందినది.

ఈయనకు స్వాతంత్ర్య మొక విశిష్ట గుణము. మోమోడక తా నెరిగినదానిని, తలచినదానిని, స్పష్టముగా చెప్పు స్వభావ మీయనది. గ. సు.

**దక్కనీలు - విదేశీ ముస్లిములు** (గరీబులు): ఇవి బహ్మనీ సంస్థానమును, తరువాత దక్కను పంచ పాదుషాల ఆస్థానములను ఆశ్రయించియుండిన మహమ్మదీయ సామంతనాయకులలోని రెండు కక్షలకు పేర్లు. దక్కనీ లనగా దక్కను వాస్తవ్యులు. గరీబు లనగా విదేశాగతులైన మహమ్మదీయులు. హబిషీలు పారశీక, తురుష్కాది మహమ్మదీయులవలె విదేశాగతులైనను వారు గరీబులతో కలియక దక్కనీలతోనే కూడియుండిరి. దీనికి ముఖ్యకారణము వారి వర్ణవ్యత్యాసము కావచ్చును. హబిషీలు దక్కనీలవలె నల్లని దేహచ్ఛాయ కలిగిన వారగుటచే విదేశీయులు వారితో కలసిమెలసి యుండక వారి యెడ భేదబుద్ధితో ప్రవర్తించుచుండిరి. ఈ రెండు కక్షల నాయకులును ఐకమత్యము లేక స్వార్థపరులై ఒండొరులతో నిరంతరము పోరుచుండువారు. తాము ఆశ్రయించిన రాజ్యాలకు వారు కీడు కలుగజేసిరి. వీరి తగవుల మూలముననే మొదట బహ్మనీ సంస్థానమును, తరువాత అహ్మదునగర, బిజాపురాదులగు దక్కను పాదుషాల రాజ్యములును కూలిపోయినవి. దక్కనీలతో కలసిన హబిషీలు యుద్ధమందు ఆరితేరిన శూరులు. విజాపుర, అహ్మదునగర రాజ్యముల యుద్ధములలో విజయవంతముగ కొనసాగించిన వారిలో పెక్కుండ్రు ఈ తెగకు చెందినవారే.

మహమ్మదు గావాన్ ప్రముఖుడు. ఇతడు గొప్ప విద్వాంసుడు. విదేశాగతులలో ఇతడు బహ్మనీరాజ్యమును పాలించిన ముమ్మడి మహమ్మదు షాకు ప్రధాన మంత్రియై రాజ్యకార్యములను తానే నిర్వహించెను. ఇతడు గొప్ప రాజ్యతంత్రజ్ఞుడు. ఇతని ఖ్యాతి మహమ్మదీయ ప్రపంచమునం దంతట వ్యాపించినది. ఇతని కాలమున విదేశమహమ్మదీయు లనేకులు దక్కనుకు వచ్చి ఇతని నాశ్రయించి యుద్యోగములను బడసిరి. ఇతని పక్షపాతమువల్లనే దక్కనీలకును, గరీబులకును గల సహజ వైషమ్యము పెచ్చుపెరిగి రాజ్యముయొక్క శాంతి, భద్రతలకు భంగము కలిగినది. తుదకు దక్కనీల మాయోపాయములలో తగులుకొని ఇతడు సుల్తాను ఆగ్రహమునకు గురియై అతనిచే వధింపబడెను.

హబిషీలనుగూర్చి చెప్పునప్పుడు సుప్రసిద్ధ శూరుడును, రాజనీతిజ్ఞుడునునగు మల్లిక్ అంబరును తలంపక తప్పదు. ఇతడు కూలిపోవుచున్న అహ్మదు నగరరాజ్యమును పునరుద్ధరించి మొగలాయి చక్రవర్తులను నిగ్రహించి దాదాపు ముప్పదియేండ్ల పర్యంతము అప్రతిహతముగ అధికారమును సాగించెను. ఇతడు జీవించియుండునంత వరకు మొగలాయి పాదుషాలు దక్కను పీఠభూమియందు అడుగు పెట్టుటకు సాధ్యము కాకపోయెను. నే.వెం.ర.

**దక్షిణామూర్తిశాస్త్రి, పుల్య** (క్రీ.శ. 1830 - 1900): వీరు వేగినాటి బ్రాహ్మణులు; తండ్రి వీరేశ్వరశాస్త్రి. తల్లి సీతమ్మ. పదునైదు సంవత్సరముల వయసువరకు వీరు తూర్పు గోదావరిజిల్లా పాశర్లపూడి అనుగ్రామమున పెరిగిరి. రాజోలువద్దనున్న కస్తూరివారి పాలగుమ్మి అను గ్రామమున కస్తూరి శివశంకరశాస్త్రిగారివద్ద వీరు కొంతకాలము విద్యాభ్యాసము చేసిరి. అక్కడ

సిద్ధాంత కౌముది ముగియగనే కాశికి వెడలి యచట యోగేశ పండిత్‌జీవద్ద భాష్యాంత వ్యాకరణశాస్త్రమును పఠించిరి. పిమ్మట ఆర్థికాంశ పాఠమునకై వారు చతుష్షష్టి కళాధురంధరులును, సుప్రసిద్ధ బాలశాస్త్రి, గంగాధర శాస్త్రి ప్రభృతుల గురువరేణ్యులును అగు శ్రీరాజా రామశాస్త్రిగారివద్ద చేరిరి. అచ్చట వారు చిరశుశ్రూష చేసి వ్యాకరణములోని ఆర్థికభాగమునేకాక పూర్వోత్తర మీమాంసాది బహుశాస్త్రముల నధ్యయనము చేసిరి.

వీ రిరువది సంవత్సరములు కాశిలో శాస్త్రాధ్యయనము చేసి యా దినములలో శాస్త్ర పరీక్షావిధానమును నడపు చుండిన జంబూమహారాజాస్థానమునకు పోయి యచట షడ్దర్శనములలోను, షట్ఛాస్త్రములలోను పరీక్ష నిచ్చి యుత్తీర్ణులై జయపత్రములను తీసికొని యాంధ్రదేశమునకు తిరిగి వచ్చిరి. ఈ రీతిగా షట్ఛాస్త్రములలోను, షడ్దర్శన ములలోను జయపత్రము నొందినవారు క్రీ. శ. పందొమ్మి దవ శతాబ్దములో నరుదు. శాస్త్రిగారు క్రమముగా నాయా తావుల శాస్త్రార్థములు చేయుచు గౌరవింప బడుచు బరంపురము రాగా నచట ఋగ్వేద పూర్ణాద్వైత లగు ముక్కామల రామావధానులుగారు తమ కుమారిత లక్ష్మీనరసమ్మ నిచ్చి వివాహము చేసిరి. పిమ్మట శాస్త్రి గారు స్వగ్రామమునకు వచ్చి కొలదికాల మట నుండ వారి ఖ్యాతి నెరిగి కోనసీమలోని ముంగండాగ్రహారమునం దుండిన సంపన్న గృహస్థులు పుల్య వెంకట కృష్ణయ్యగారు వారిని ముంగండకు తీసికొని వచ్చి వారికి సగౌరవపోష ణము కావించుచు నొక చక్కని భవనమును నిర్మించి యిచ్చి పైగా నాలుగెకరముల దివ్యారామక్షేత్రము కూడ నిచ్చిరి. ముంగండలో నుండగా శాస్త్రిగారి కొక కొమారుడును, ఇద్దరు కొమారితలును ఉదయించిరి. తమ యేబదవయేట శాస్త్రిగారికి పత్నీవియోగము కలిగెను. శాస్త్రిగారు నిత్యనైమిత్తిక కర్మపరులే కాక ధూళిపాళ నరసంభట్టుగారివద్ద మంత్రశాస్త్రమును గ్రహించి నిత్యము కొన్ని గంటలు పరదేవతోపాసనలో గడపుచుండిరి.

శాస్త్రిగారివద్ద మొత్త మయిదారువందలమంది శాస్త్రా భ్యాసము చేసిరి. వారివద్ద వ్యాకరణ శాస్త్రము భాష్యాం తము జడవల్లి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు మున్నగు దేశీ యులేకాక దాక్షిణాత్యులగు మధ్యార్జునం నారాయణ శాస్త్రి, సేనయ్యశాస్త్రి ప్రభృతులుగూడ పఠించిరి. తార్కికచక్రవర్తులుగా విఖ్యాతులైన శ్రీపాద రామ శాస్త్రిగారు మున్నగువారు శాస్త్రిగారియొద్ద ఉత్తర మీమాంసము అధ్యయనముచేసిరి. వేదార్థ ప్రవక్తలుగా సుప్రసిద్ధులైన భమిడిపాటి చిట్టీలుశాస్త్రి ప్రభృతులు శాస్త్రి గారివద్ద పూర్వమీమాంసాశాస్త్రము పఠించిరి. చెరు కూరి వెంకటశాస్త్రిగారు మున్నగువారికి దక్షిణామూర్తి శాస్త్రిగారు రసగంగాధరాద్యలంకారశాస్త్రములను గర పిరి. శాస్త్రిగారి విద్యాప్రచార, పాండిత్యాదులను గుర్తెరిగి మన్యం మహాలక్ష్మమ్మగారను వైశ్యసాధ్వీమణి వారి కై దెకరముల భూమిని సమ్మానముగా సమర్పిం చెను. శాస్త్రిగారు 70 సంవత్సరములు జీవించి క్రీ. శ. 1900 సంవత్సరములో దేహము చాలించిరి. జ. పు.

**దక్షిణామూర్తిశాస్త్రి, సుసర్ల :** కృష్ణామండలములో కృష్ణానదీతీరమం దున్న పెద్దకళ్ళేపల్లి (కదళీపురము) అను నగ్రహారము వీరి నివాసస్థానము. వీరి జనకులు సుసర్ల గంగాధరశాస్త్రిగారు ; జనని లక్ష్మాంబ. వీరు తెలుగునాటి బ్రాహ్మణశాఖకు చెందినవారు.

దక్షిణామూర్తిశాస్త్రిగారు ఉపనీతులయిన తరువాత కొంతవరకు వేదమును, సంస్కృత భాషను అభ్యసించిరి.


చిత్రము 150.
సుసర్ల దక్షిణామూర్తి శాస్త్రి

తరువాత యుక్తవయస్సున మైలవరపు లక్ష్మీనరసింహ శాస్త్రిగారి కొమార్తయగు వెంకట సుబ్బమ్మను వివా హము చేసికొనిరి. వీరికి సాహిత్యముతోపాటు సంగీ తకళనుగూడ నభ్యసించవలె నని దృఢ సంకల్పము కలిగి నది. ప్రథమమున సంగీత మును కొంతవరకు నేర్చి పిదప తంజావూరు నగర మునకు బోయి ఆచట శ్రీ త్యాగరాజస్వామి శిష్యు లును, బంధువులు నగు మానంజావడి (ఆకుమళ్ళ) వెంకట సుబ్బయ్యగారి దగ్గర సంగీతవిద్య నభ్యసింప నారంభించిరి. వీరికి ద్రవిడదేశపు సుప్రసిద్ధ గాయకులగు పట్నం సుబ్ర హ్మణ్య అయ్యరు, మహావైద్యనాథ అయ్యరు, ఫ్లూట్ శరభశాస్త్రిగార్లు సహాధ్యాయులు, సతీర్థులు నయిరి. సుమారు రెండు సంవత్సరముల కాల మచ్చట సంగీతము నభ్యసించి వీణ కుప్పయ్యర్, వారి కుమారులు ముత్యాలపేట త్యాగయ్యగార్ల వద్ద గీతములు, వర్ణములు, పాఠములు చక్కగా నభ్యసించి పిమ్మట స్వదేశమునకు వచ్చి శ్రీ త్యాగరాజస్వామి సత్సంప్రదాయము నిచట వ్యాపింపజేయ సమకట్టిరి. అనేకులు విద్యార్థులు, సంగీత విద్యా జిజ్ఞాసువులై పెదకళ్ళేపల్లికి వచ్చుచుండిరి. బీద విద్యార్థులకు విద్యాదానముతోపాటు సంపన్న గృహస్థు

లగుటచే శాస్త్రిగారు అన్నదానమును చేయుచుండిరి. వీరు 1922 లో పరమపదించిరి. చి. వెం. శ.

**దాక్షిణాత్యాంధ్ర సాహిత్యము :** దక్షిణాంధ్రయుగ సాహిత్య వాహినీ తీరమునందు తీర్థభూతములైన ఘట్టములు తంజావూరు, మధుర, జింజి, మైసూరు, పుదుక్కోట సంస్థానములు. అందు తంజావూరి దొక ప్రత్యేకత. ఆయుగ విశిష్టత లన్నియు దాని నాశ్రయించినవి.

అస లీసంస్థానాధీశు లందరికంటె ముందుగా ద్రవిడ దేశమునం దాంధ్ర సరస్వతీ ప్రవేశమునకు పూర్వరంగ ప్రవర్తకత్వము నిర్వహించిన కీర్తి గోళ్ళనాయకులది. క్రీ. శ. 1531 - 39 సంవత్సరములనడుమ విజయనగరప్రభువు అచ్యుతరాయలకు లోబడి రామనాథపురమండలమున శివపురి ప్రాంతమును శాలించుచున్న గోల్ల పెదరామప్ప పేర నతని తమ్ముడు చినరామప్ప పచ్చకప్పురపు తిరువేంగళ కవిచే చొక్కనాథచరిత్రమను ద్విపదకావ్యము చెప్పించెను. అయినను గోళ్ళనాయకుల కృషి తాత్కాలికము. తంజాపురాంధ్రనాయకరాజ్యము తలెత్తునంతకు గాని ఆంధ్రసాహిత్య సంపూర్ణవికాసమున కవకాశము కలుగలేదు.

తంజావూరు : తంజావూరినాయకరాజులు రాయ సమ్రాడ్విధేయులై యుండిరి; సాహిత్య విషయమున రాయ సమ్రాట్టుల రసికతల నతిశయించిరి. వారిలో ప్రధానుడు రఘునాథుడు (క్రీ. శ. 1600 - 1631). అతని తండ్రి తాతల కాలము గుడిగోపురములు కట్టించుటతో సరిపోయినది. రఘునాథుడు నొకవంక బహురాజకార్యవ్యగ్రు డయ్యు, మహాయుద్ధములు చేయుచుండినవా డయ్యు కళోద్ధరణ బద్ధకంకణు డైనాడు. ఆత డనేక సంస్కృతాంధ్ర కవి కవయిత్రీపోషకు డగుటయే కాదు, స్వయముగా నుభయభాషల బహుగ్రంథకర్తయును. ఆంధ్రమున నెనిమిది తొమ్మిది కృతులు రచించినాడు. అందు ప్రబంధము లెక్కువ. ద్విపదలు, యక్షగానములు నున్నవి. కొలదిమాత్రమే యుపలబ్ధములు. అం దుత్తమకృతులు వాల్మీకి చరిత్రము, రామాయణము (పద్యకావ్యములు); నలచరిత్ర (ద్విపద). అపురూపములైన స్థానిక ప్రకృతి చిత్రణములందును, అంతరస్నాయువులు స్పృశించు నిశిత పరిశీలనముతో యథావద్వస్తు వర్ణనాచారువుగా కావ్యమును దీర్చుటయందును కృష్ణరాయప్రతిపత్తులను గొన్నిటిని దక్కగొన్నాడు రఘునాథుడు. కాని రాయల శైలివలె గాక రఘునాథుని శైలి ప్రసన్నతామహితముగా నుండును. రఘునాథు డుత్తమకవితా లక్ష్యములు గల కవి. కాని యుగకర్త కావలసినవా డొక్కింతలో నామాట దక్కించుకొనలేకపోయినాడు. తానును యుగ ప్రభావమునకు లోగినాడు. అతని యాస్థానాంధ్రకవి పుంగవులు కృష్ణాధ్వరి, చేమకూర వేంకటకవి. కృష్ణాధ్వరి యుత్తమ పండితకవి; రఘునాథ భూపాలాంకితముగా నారు గ్రంథములు రచించినాడు. అతని యాంధ్ర కృతులందు నైషధపారిజాతీయ మను కావ్యము మాత్రము లభించినది. అది ద్వ్యర్థియైనను రచన సమర్థముగనే సాగినది. వెంకటకవి సారంగధరచరిత్రము, విజయవిలాసము నను రెండు ప్రబంధములను రచించెను. వెంకటకవి కొందరు వెనుకటి కవి దిగ్గజములను డీకొని నెగ్గగల ప్రతిభాశాలి. రఘునాథున కంకితమైన అతని విజయ విలాసము ప్రతిపద్యచమత్కృతిగల కావ్యము. ఆ యుగ కృతు లన్నిట నుత్కృష్టమైనది. రఘునాథు నాస్థానమున కవయిత్రులును గలరు. కాని వారు గీర్వాణముతో నూర కుండిరి; ఆంధ్రమున గ్రంథరచన గావింపలేదు.

రఘునాథుని తరువాత నాతని కొడుకు విజయరాఘవుడు రాజాయెను. అతని రాజ్యకాలము (క్రీ. శ. 1633 - 1673) సుదీర్ఘమైన దగుటచే విపుల వాఙ్మయసేవ కవకాశము గల్గినది. అతడు తండ్రిని మించిన రసికుడు. అతని కొలువు కవులకు కళలకు, నంతకంటె ముఖ్యముగా కళావతులకు నెలవు. అట 'శారదాధ్వజ' మెగిరినది; 'సాహిత్యరాయపెండారము' ఘల్లుమన్నది.

విజయరాఘవునకు పద్యకవిత్వముకంటె పదకవిత్వమునం దధికాదరము. అతని కాలమున పద్యప్రబంధము లొక మూడు మాత్రమే వెలసినవి. అతని ఆస్థాన కవయిత్రులం దగ్రగణ్య, కవయిత్రి మాత్రమేకాక ఉత్తమవిదుషి, విజయరాఘవవిరచిత కనకాభిషేక, రాజరసాలమునకు తన రసికత్వము నంటుగట్టి కలరుచిప్రచురములగు కావ్య ఫలములను పండించిన ధన్యజీవనయైన పసుపులేటి రంగాజమ్మ మన్నారుదాసవిలాసము, ఉషాపరిణయము నను రెండు ప్రబంధములను రచించినది. ఆమె భారత భాగవత రామాయణ సంగ్రహములను పద్యకృతులుగా రచించెనని తెలియుచున్నది. కాని యవి లభింపలేదు. మరియొక కవయిత్రి కృష్ణాజి యనునామె విజయరాఘవు నాస్థానమం దుండె ననియు, నామె ఛందశ్శాస్త్ర సమస్యా పూరణాదికములందు నిష్ణాత యనియు దెలియుచున్నది. కాని యామె కృతులు మాత్రము నే డెవ్వియు గానరావు. ఆమెకును రఘునాథునాస్థాన సంస్కృత కవయిత్రి రామభద్రాంబకును గురుస్థానమైన వాడును, చతుర్విధ కవితా నిర్వహణ నిపుణుడును నైన చెంగల్వ కాళకవి రాజగోపాల విలాస మను ప్రబంధమును సంతరించెను. విజయరాఘవుని

పుత్రుడు మన్నారుదేవుడు విజయరాఘవాభ్యుదయమను ప్రబంధము రచించినట్లు తెలియుచున్నది. కాని యది యలబ్ధము. విజయరాఘవునినాటి ప్రబంధములు పూర్వ ప్రబంధములవలె గాఢబంధములుగాక లలితపదబంధుర ములై కేవల మాంగికవర్ణనల కగ్గముకాక భావప్రధాన శృంగారసుందరములై యొప్పారుచున్నవి. కాని విజయ రాఘవుని కాలమున తదుపజ్ఞములు, తదంకితములునై వెలసిన గ్రంథజాలములో ముక్కాలు మువ్వీసము యక్షగానములే. విజయరాఘవుడు యక్షగానప్రక్రియా ప్రియుడు; తద్రచనావిదగ్ధుడు; అర్వాచీన యక్షగాన సరళి కొజ్జబంతులు దీర్చినవాడు. అతని నాటినుండియే యక్షగానమునకు పండితాదరము, రాజప్రాపకము, రంగ భోగము నతిశయించినవి. తంజావూరు తన్మహనీయస్థితి మూలమై నిలిచినది.

విజయరాఘవుని రచనలు బహుళము. అందు వైవిధ్య మనల్పము. యక్షగానములు, ద్విపదలు, పదములు, రగ డలు, ఏలలు, దండకములు మొదలగునవి అనేకము గలవు. అతని మధురలేఖిని చిందిన యనేక బిందువులలో నొక ద్విపదకావ్యము, ఐదు యక్షగానములు మాత్రము లభించినవి. అందు రచనాగౌరవమునుబట్టి విప్రనారా యణచరిత్ర మను యక్షగాన మన్నిట నుత్తమమైనది. ఇం కొకటి రఘునాథనాయకాభ్యుదయము. గ్రంథకర్త తండ్రియగు రఘునాథుడే యందలి నాయకుడు. ఆ గ్రంథ మున నాటి నాయకరాజులచరిత్ర, దినచర్య, ఆస్థాన వైభవము, అంతఃపుర విశేషములు మొదలగు ననేక విషయము లెరుకపడును. అది మొదట ద్విపదగా రచింప బడి పిదప యక్షగానముగా పరివర్తింపబడెను. అట్లే రంగాజమ్మయు మన్నారుదాస విలాసమును మొదట ప్రబంధముగా సంతరించి పిమ్మట యక్షగాన నాటకముగా పరివర్తించెను. మన్నారుదా సనగా విజయరాఘవుడే. మన్నారు అనగా రాజగోపాలస్వామి యతని యిష్ట దైవతము. అతని 'పట్టంపుకవి' యగు కామరుసు వెంకటపతి సోమయాజి రచించిన విజయరాఘవచంద్రికా విహారము, మరియొక కవి కోనేటి దీక్షితచంద్రుడు రచిం చిన విజయరాఘవ కళ్యాణము నట్టివే. అతని కుమారుడు మన్నారుదేవుడు రచించిన హేమాబ్జనాయికా స్వయం వరము విజయరాఘవుని యిష్టదైవతమునుగూర్చిన రచన యైనను నందును విజయరాఘవుడు కథాగత పాత్రగా రూపొందినాడు. పై రచనలను జూచినచో అంతో యింతో రాజసంబంధములేని రచనయే లేదని చెప్ప వచ్చును. అయినను విశేషము ప్రతి రచనలోను ప్రజాజీవిత స్పర్శ గలదు. రాజపరముగ శృంగారము, ప్రజాపరముగ హాస్యము నతిమాత్రముగ ప్రదర్శింపబడినవి. నాటి కృతు లలో పురుషోత్తమ దీక్షితుని తంజాపురాన్నదాననాటక మున కొక ప్రత్యేకత గలదు. దానికి సత్రమరు లనియు నామాంతరము. నాయకరాజుల అన్నదాన ప్రశస్తి కీ గ్రంథము నిదర్శనప్రాయమైనది. ఇందు విజయరాఘవుని ప్రశంస వచ్చినను తంజావూరి సోమరిపోతుల సామెత సార్థకముచేయు సత్రాతిథులగు నాటి బ్రాహ్మణబ్రువుల వేడబములను పరిహసించుట దీని పరమార్థము. పాత్రో చితభాషలో మంచి నాటకపువాటములో సరదాగా సాగిన రచన.

పై రచనలు యక్షగానములైనను నాటి కవులచే నాటకనామకరణము చేయించుకొన్నవి. మహానాటకము లనుట వట్టి మాటవరుస. నాడు యక్షగాన మొక చాటుకావ్యముగా పరిగణింపబడినది; కోటలోని రాజు గారికిని, పేటలోని ప్రజలకును, సమానముగా నాదర పాత్రమైనది. నాటినుండి తంజావూరున ప్రబంధరచన సన్నగిలినది. ప్రబంధ మొక్కటే ప్రౌఢసాహిత్యమను నపోహయు, యక్షగానమునకు పామరసాహిత్యమను నపప్రథయు బోయినవి. ప్రౌఢి రచన నాశ్రయించి యుండునుగాని ప్రక్రియనుబట్టి గాదు. పై కృతులు ప్రౌఢ ములైనవే; ఆకవులు పండితులే అయ్యు, వారు తమ నాటక పాఠక ప్రేక్షక సమాజములో ప్రజాసామాన్యమును గూడ నుద్దేశించియుండుటచే తద్రచన తరచు సరళముగ నుండును.

ఆ రోజులలోనే ప్రసిద్ధాంధ్ర పదకవితాతీర్థకరుడగు క్షేత్రయ్య విజయరాఘవు నాస్థానమునకు వచ్చి తన్ము ద్రతో గొన్ని శృంగార పదములను వెలయించెను. రాజు నకు దగిన నజరాణా!

విజయరాఘవునితో తంజావూరున నాయకరాజ్య మస్త మించిన దనియే చెప్పవలెను. తదుపరి వచ్చినవారు మహా రాష్ట్ర ప్రభువులు. కాని యప్పటి కింకను ఆంధ్రసంస్కృతీ స్రవంతి మధుర, తంజావూరు మండలము లను ఉభయకూల ముల నొరసి పారుచునే యున్నది. మహారాష్ట్రులు నందు మునుగక తప్పినదికాదు. అసలు రాజ్యాంగము నందును వారి కాంధ్రనాయకరాజుల పరిపాలన పద్ధతియే ఆదర్శ మైనది. వచ్చిన కొలదికాలముననే తెలుగురుచి మరిగిన యా మహారాష్ట్ర ప్రభువులు ఆంధ్రమున సాహిత్యమును బోషించుటయ కాదు, స్వయముగా సాహిత్యసృష్టి గావించిరి. ఆంధ్రచరిత్రలో నిది యొక అపూర్వమైన సన్నివేశము. దేశమా తమిళదేశము; ప్రభుత్వమా మహా

రాష్ట్రులది; రెండును పరకీయములే. అయినను ఆంధ్ర వాఙ్మయము నిలుచుట కాదు; వర్ధిల్లినదన్న నెంత యబ్రము! అల్లే కర్ణాటకమున, పుదుక్కోటలోను.

ఛత్రపతి శివాజీ సవతి తమ్ముడు భోసల ఏకోజీ (వెంకాజీ) క్రీ. శ. 1676 వ సంవత్సరములో తంజావూరున మహారాష్ట్ర ప్రభుత్వము నెలకొల్పెను. అతని కాలము రాజకార్యములతో సరిపోయినది. అతని కొడుకు శాహజీ రాజ్యపాలన కాలము (క్రీ. శ 1684 - 1712) తెలుగు వాఙ్మయము వత్తి నెగసన ద్రోచినది. నాటినుండి నాయక రాజులవలె మహారాష్ట్ర భూపతులును కవికోకిలామాకందశాఖిక లైరి; నాయకరాజుల సాహిత్య సంప్రదాయమునే భజించిరి.

శాహజీపేర నిరువదిరెండు కృతులు - అన్నియు యక్షగానములే - కనిపించుచున్నవి. అం దొకటి రెం డితనివి కావని యనుమానించుట కవకాశ మున్నను శేష మిరువదికి తగ్గదు. అన్నియు నిపు డుపలబ్ధములు. కాని యన్నియు నముద్రితములు. అందు కొన్ని యసలు ముద్రణార్హములా యన్న ట్లుండునన్న నిక నాతని సాహిత్యమునందలి యౌచిత్యము నతిసులభముగా నూహింపవచ్చును. అన్నియు నున్నవి, అంచునకు తొగరే తక్కువ యనున ట్లది యొక్కటియే కొదువ గాని కడమ హంగు లన్నియు నం దున్నవి. శాహజీ అతని యాస్థానమున కవయిత్రులు లే రన్నమాట కాని తనివి తీరని విజయరాఘవుడు మరల తను వెత్తెనా యనునట్లు వ్యవహరించినాడు. అతని కృతు లన్నిట నతని సాహిత్య వైయాత్యమునకు సతీదానశూరము భక్తవత్సలవిలాసనాటకములును, అతని నాట్య సంగీత శాస్త్ర వైదుష్యమునకు త్యాగరాజ వినోద చిత్ర ప్రబంధము, పంచరత్నప్రబంధమును తారకాణలు.

శాహజీ యాస్థానమున సంస్కృతాంధ్ర తమిళ కవులు చాలమంది కలరు. ఆంధ్రమున గ్రంథరచన చేసినాడో లేదో చెప్పలేము కాని ఆంధ్రభాషకు సంస్కృతమున పాణినీయపద్ధతిని వ్యాకరణము రచించిన నివృత్తి శేషాచల సుమతి శాహజీ వలన ఆంధ్రపాణిని బిరుద, కనకాభిషేకాది సత్కారము లందినట్లు తెలియుచున్నది. శాహజీ ఆస్థానాంధ్ర కవులలో దర్భా గిరిరాజు, శేషాచలపతి, బాలకవి సుబ్బన, వాసుదేవ నాగేశ్వర నామకులు నుండిరి. వారు విజయరాఘవు నాస్థానకవులంత విద్వాంసులుగా కనిపింపరు. కాని ప్రతి కవియు శాహరాజుపై నొక పదమో, యక్షగానమో చెప్పి యతనిని మెప్పించినవాడే. వారిలో గిరిరా జగ్రగణ్యుడు. అతడు శాహజీయే కృతినాయకుడు, కథానాయకుడునుగా నైదు యక్షగాన కృతులు రచించినాడు. అం దొకటి కొరవంజి — రాజమోహన కొరవంజి. కొరవంజి పేరిట కొన్ని రచన లీ శాహజీకాలమునుండియే కనిపించును. రచనా ప్రక్రియలో యక్షగానమునకును, కొరవంజికిని భేదము కానరాదు. గిరిరాజు శాహజీ యనుజుడగు మొదటి శరభోజి (క్రీ.శ. 1712 - 1728) యాస్థానమునగూడ నుండెను. అతనిపై లీలావతీకళ్యాణ మనుయక్షగానమును జెప్పెను. శరభోజి తరువాత నతని యనుజుడు తుక్కోజి (తుళజరాజు - క్రీ. శ. 1728 - 1736) రాజాయెను. అతడు శాస్త్ర గ్రంథ రచనా విశ్రుతుడైన సంగీత విద్వాంసుడు; శివకామసుందరీ పరిణయము, రాజరంజన విద్యావిలాసము నను రెండు యక్షగానములను రచించెను. వానిలో తంజావూరి కృతులలో నరుదగు తాత్త్విక స్పర్శ గలదు. ఆంధ్ర కాళిదాస బిరుదాంచితుడును, కస్తూరి రంగకవి శిష్యుడును నగు ఆలూరి కుప్పన యతని యాస్థానకవి. కుప్పన బహుగ్రంథకర్త. అతని కృతులలో ఆచార్యవిజయము (ఆనందగిరి శంకర విజయమున కాంధ్రీకృతి - పద్యకావ్యము), భాగవత యక్షగానము నిప్పు డున్నవి. అతని రామాయణ యక్షగానము లభింపలేదు. నాటి తంజావూరి యక్షగానములకును, కుప్పన కృతికిని చాల భేదము గలదు. కుప్పన యక్షగానము ప్రదర్శనోద్దిష్టము కాని బృహద్గ్రంథము. యక్షగానమున నంత పెద్దదానిని మరికానము. అది యసలు తంజావూరున బుట్టలేదు. తద్రచనాకాలమునాటికి కుప్పన తంజావూరికి బోయియుండడు. తుళజరాజునకు (రెండవ) ఏకోజీ, జయసింహుడు, ప్రతాపసింహుడునను ముగ్గురు కొడుకులు. రెండవ ఏకోజీ వారిలో (క్రీ. శ. 1736 - 37). విఘ్నేశ్వర కళ్యాణమను యక్షగానమును, రామాయణ ద్విపదకావ్యమును వ్రాసెను. రెండవదాని రచన మేల్తరమైనది. ఏకోజీ తరువాత రాజుల రచనా వ్యాసంగము మందగించినది. విజయసింహుడు (క్రీ. శ. 1737 - 1739) ఆంధ్రపాణిని శిష్యుడును, యాదవరాఘవ పాండవీయత్ర్యర్థి కృతికర్త నెల్లూరి వీరరాఘవ కవి పుత్రుడునైన శివరామకవివలన కామకళానిధి యను కామశాస్త్ర గ్రంథము (పద్యకృతి) నంకితముగొనెను. ప్రతాపసింహుని ప్రాపకమున (క్రీ. శ. 1739 - 1763) ముద్దుపళని రాధికాసాంత్వన మను మధురప్రబంధమును సంతరించినది. అతని యనంతరము మూడు యక్షగాన కృతులు మాత్రము వెలసినవి. అవి అమరసింహుని కాలమున (క్రీ. శ. 1787 - 1798) అతని ప్రధాని శివరాయమంత్రి ప్రేరణమున మాతృభూతన రచించిన పారిజాతాపహరణము, చివరి మహారాష్ట్ర ప్రభువు శివాజీ (క్రీ.శ. 1833 - 1855) కృతి అన్నపూర్ణాపరిణయము, అతని యాస్థాన

కవి వెంకటకృష్ణాజెట్టి శివపారిజాతము. చివరి రెండును పేలవములైన రచనలు. కాని మాతృభూతన కృతి ప్రౌఢమైనది; కడు పెద్దకృతి. అందు కన్నడ, తమిళ, హిందీ, మహారాష్ట్ర భాషలలో ప్రసంగములు కలవు. విజయరాఘవుని నాటినుండియే ముఖ్యముగా బహుభాషాకోవిదయైన రంగాజమ్మ మన్నారుదాసవిలాస నాటకాది కృతులలో తమిళ కన్నడ ప్రాకృతాద్యన్యభాషలు వాడబడుచు వచ్చినవి. శాహరాజాదుల సాహిత్యము(తెలుగు)లో గూడ వారి మాతృభాష మహారాష్ట్రమున దరువులు, దరువులలో నరవ మాతృకల కనుకృతులు గన్పించును. అది నాటి వివిధభాషాసంపర్కము, కవుల యభినివేశమును సూచించునుగాని మహారాష్ట్రుల తెనుగు రచన సైతము అన్యభాష 'యాస' లేకుండగనే సాగుట యెన్నదగినది.

మహారాష్ట్ర ప్రభువుల కాలమున తంజావూరు మండలమున రాజాశ్రయము నపేక్షించని కవులును కొందరు గలరు. అందు ముఖ్యులు శివనారాయణతీర్థులు, మెరట్టూరు వెంకటరామశాస్త్రి, త్యాగరాజు - ముప్వురును మునికల్పులు (ఆ యుగమున తంజాపుర మండలమున తప్పబుట్టినవారు). కాని యుగప్రభావము ముప్వురను సోకినది. ముప్వురును దెనుగున యక్షగాన సదృశములైన రచనలు చేసిరి. తీర్థులవారి సంస్కృత రచన కృష్ణలీలా తరంగిణి కడు ప్రసిద్ధమైనది. ఆయన తెనుగున పారిజాతాపహరణమను నాటకమును వెలయించెను. మెరట్టూరు వెంకటరామశాస్త్రి కృతులనుగురించి యాంధ్రు లిదివర కెరుగరు. కాని త్యాగరాజయ్యకంటె ముందుగనే తమిళులకు తెలుగు రుచి మప్పినవాడు, వారి యాదరము చూరగొన్నవాడు వెంకటరామశాస్త్రి. తంజావూరు మండలమున నున్న మెరట్టూరు, శూలమంగళము, ఊత్తుక్కాడు మొదలగు ప్రదేశములలో సుమారు నూటయేబది యేండ్లనుండి యీనాటికి నేఁటేట ననూచానముగా ప్రదర్శింపబడుచున్న ముఖ్యములయిన భాగవతమేళ నాటకము లనేకము వెంకటరామశాస్త్రి కృతములే; అన్నియు తెనుగు రచనలే; కూచిపూడి కులపతుల పవిత్ర సంప్రదాయములకు స్మృతిపతాకలే. కూచిపూడి కలాపాదిక సంప్రదాయమునకు సిద్ధేంద్రయోగి యెట్టివాడో మెరట్టూరు భాగవత మేళ నాటకసంప్రదాయమునకు వెంకటరామశాస్త్రి యట్టివాడు. అతని కృతు లన్నియు రంగమున కెక్కి రాణించినవి. అందు ప్రహ్లాద చరిత్రకు ప్రచార మెక్కువ. సాహిత్య విషయికముగా ఉషాపరిణయ ముత్తమరచన. త్యాగరాజాకృతులను జాల మెచ్చుకొనినట్లు తెలియుచున్నది. త్యాగరాజస్వామియు స్వయముగా నౌకా చరిత్ర, సీతారామవిజయము నను గేయప్రబంధములు, ప్రహ్లాదభక్తి విజయము నను నాటకమును రచించెను. అవి ప్రదర్శన కెక్కకపోయినను చక్కని కృతులు.

తంజావూరున నాయక, మహారాష్ట్ర రాజులకాలమున నెక్కువగా వెలసినది యక్షగాన వాఙ్మయమే. కాని యక్షగాన రచనమన్న గీతాభినయాది శాస్త్ర పరిజ్ఞానము లేనిదే సాహిత్య పౌరోహిత్యముమాత్రమే చేసికొను మహాకవులకును కలము జరుగని పని. తంజావూరి కవు లామూడింటను ప్రోడలు. నాయకరాజులనాటి యక్షగానములపై ప్రబంధముల ప్రభావము, మహారాష్ట్రులనాటి యక్షగానములపై మార్గనాటకముల ప్రభావము నెక్కువగా పడినది. నాయక రాజులనాటి కృతులలో రచనా ప్రౌఢియు, మహారాష్ట్రులనాటి కృతులలో వస్తువైవిధ్యము నెక్కువ.

మధుర: మధుర నాయకరాజులు తరచు యుద్ధములందు తగుల్కొనుటచేతనో, సహజముగా నంత సాహిత్య ప్రియులు కాకపోవుటచేతనో ఆంధ్ర వాఙ్మయ వ్యాసంగమున తంజావూరివారివలె ముందంజ వేయలేకపోయిరి. మధుర తిరుమలనాయకుడు (క్రీ. శ. 1623 - 1659) క్షేత్రయ్యను, తిరుకామకవిని సత్కరించినట్లు మాత్రమే తెలియుచున్నది. కాని తిరుకామకవినైన గ్రంథరచనకు ప్రోత్సహించినట్లు కానరాదు. తరువాత రాజకీయముగ తమ ప్రతిస్పర్థులయిన తంజావూరివారితో మధురవారును వాఙ్మయ రంగమునగూడ స్పర్థతోనే దిగినట్లు కన్పించును. అందుచేత నే వారు తంజావూరివా రత్యంతము నాదరించిన యక్షగానము నుపేక్షించి ముఖ్యముగ వా రుపేక్షించిన వచనవాఙ్మయము నుద్ధరించుటకు బూనుకొనిరి. వారి కాలమున మధురలో వాడుక భాషయందును వచన గ్రంథములు వెలసినవి. అందు ముఖ్యములు రాయవాచకము. మధురమంగాపుంశ్చలీవిలాసము, విజయరంగ చొక్కనాథుని (క్రీ. శ. 1706 - 1732) కృతులు శ్రీరంగ, మాఘ మాహాత్మ్యములు. మొదటిది కావ్య శబ్దవాచ్యము గాదు. అది రాయసామ్రాజ్యమునకు సంబంధించిన చరిత్రాదికము నప్పటి (16 వ శతాబ్దాంతము) రాజకీయోద్యోగుల వాడుకభాషలో కట్టుకథలతో నేకరువు పెట్టు గ్రంథము. రెండవది మధుర మహారాణి మంగమ్మ (క్రీ. శ. 1682 - 06) కోపమునకు గురియైన యొకకవి యామె నధిక్షేపించుచు వ్రాసినది. అది యొకబూతుల బుంగ. కాని దానికి కావ్యత్వమును గొంత పట్టినది. చరిత్రకారుల కది కొన్ని చోద్యములు చూపగలదు. విజయరంగని కృతులు నిర్దుష్టములు కాకపోయినను వాని

కావ్యత్వము నంగీకరింపవచ్చును. మధుర నాయకరాజులలో నత డొక్కడే గ్రంథకర్తయైనవాడు. మధుర నాయకరాజుల కాలమున వెలసిన గ్రాంథిక వచన రచనలలో మొదటిది లింగనమఖి కామేశ్వరకవి (తిరుకామకవి) ధేనుమాహాత్మ్యము. అది చొక్కనాథనాయకున (క్రీ. శ. 1659 - 1682) కంకితము. తరువాత విజయరంగని కాలమున నతని యాస్థాన కవులు సముఖము వెంకట కృష్ణప్పనాయకుడు సారంగధరచరిత్ర జైమిని భారతములను, కుందుర్తి వెంకటాచలపతి భారత రామాయణములను, వెలగపూడి వెంకట కృష్ణయ్య వేదాంత సారసంగ్రహమును, ఆస్థానాశ్రితులు కాని శ్యామరాయ కవి దేవకి వెంకట సుబ్బకవి రామాయణమును, శ్రీపతి రామభద్రకవి హాలాస్యమాహాత్మ్యమును గ్రాంథిక భాషలో వచనములుగా వెలయించిరి. పైవానిలో కుందుర్తి, వెలగపూండ్ల కృతు లలబ్ధములు. శ్యామరాయ కవిప్రభృతుల కృతు లుపలబ్ధము లయ్యు నముద్రితములు. సముఖము సారంగధరచరిత్ర కొంత భాగమును, జైమిని భారతము పూర్తిగను ముద్రింపబడినవి. వానినుండియే నాటి గ్రాంథిక వచనరచనాధోరణి తెలియవచ్చుచున్నది. కాని యీ రెండును పూర్వ పద్యప్రబంధములకు (చేమకూర వేంకటకవి, పిల్లలమర్రి పినవీరభద్రకవి కృతులు) వచన పరివర్తనములు. శైలి శబ్దాడంబరము విడంబించు ప్రబంధ గద్యపాకమున నే పడినది.

మధురలో పద్య కావ్యములు న నేకము వెలసినవి. అందు శృంగార ప్రబంధములకు మధురది పెట్టినది పేరు. చొక్కనాథుని సోదరుడును, క్రీ. శ. 1673 ప్రాంతమున తంజావూరున తత్ప్రతినిధియు నైన ముద్దళగిరి గణపవరపు వెంకటార్యు డనునొక యుద్దండకవిని సన్మానించి యొక దండకమును మాత్రము (విద్యావతీ దండకము) తనపేర వెలయింపజేసెను. అతనిపేర ముద్దళగిరివిజయ మనునొక సీసమాలిక యున్నట్లు తెలియుచున్నది. కాని యది యత్కృతమో తెలియదు. ఇక నతడు ప్రబంధరచనకు ప్రేరేచినది తిరుకామ కవిని. తిరుకామకవి రుక్మిణీపరిణయము, సత్యభామాసాంత్వనము నను రెండు ప్రబంధములు రచించినట్లు తెలియవచ్చుచున్నది. కాని రెండవది మాత్రమే యుపలబ్ధము. అందలి రచన చక్కనిదే కాని రసశుద్ధి తక్కువ. వచనవాఙ్మయమునకువలె ప్రబంధ వాఙ్మయమునకును విజయరంగని కాలమే పంటకారు. అసలు మధురకు సంబంధించినంతవరకు ప్రధానమైన వాఙ్మయవ్యాసంగ మంతయు నా కాలముననే జరిగినది. విజయరంగని యాస్థానము నాశ్రయించి శేషము వెంకటపతి శశాంకవిజయము, సముఖము వెంకట కృష్ణప్పనాయకుడు రాధికాసాంత్వనము అహల్యాసంక్రందనము; కుందుర్తి వెంకటాచలపతి మిత్రవిందాపరిణయము కార్తిక మాహాత్మ్యము, వెలిదిండ్ల అళఘరికవి సుదంతా కల్యాణము, వెలగపూడి వెంకట కృష్ణయ్య మాలతీమాధవ, భానుమద్విజయములు, బద్దెపూడి ఎర్రనృపాలుడు యువజన హృదయానందము రచియించిరి. అందు శశాంకవిజయము, అహల్యాసంక్రందనము రసాభాసమును గడురక్తి కట్టిన మధురప్రబంధములు; రసికజనమనోరథ ఘంటాపథము లైనవి. ప్రసిద్ధ పదకర్తయు, శంశాకవిజయ కృతిపతియు నైన వంగల సీనయ్య విజయరంగని మంత్రి. 'విజయరంగావనీశ్వరసభార్హ్యముగా' నా డొక యక్షగానమును వెలసినది. అది తిరుమలకవి చిత్రకూట మాహాత్మ్యము. కుందుర్తికవియు బహునాటకములు రచియించినట్లు తెలియుచున్నది. కాని గ్రంథములు లభించుట లేదు. అవి ప్రాయశః యక్షగానములే కావచ్చును. మధురలో నాపాటి యక్షగానరచన మిక తంజావూరి వారి ప్రభ తట్టుకొనలేక తప్పనిసరియైనది కాబోలు! శాహాజీ విజయరంగని సమకాలికుడేకాని మధురసాహిత్యము తంజావూరిదానివలె గాక రాజుల అహంప్రత్యయ స్పర్శ లేనిదగుట గమనింపదగినది.

జింజి : జింజికే చెంజియనియు నామాంతరము. మధుర, తంజావూరులకు పాండ్య చోళ మండలములను ప్రసిద్ధి యున్నట్లే జింజికిని తుండీరమండలమను ప్రసిద్ధి గలదు. చెంజినాయకులును మధుర, తంజావూరు నాయకులతో సంబంధబాంధవ్యములు నెరపినవారే. తామును వారివలె వాఙ్మయసేవ చేయ దలపెట్టినవారే కాని వారికి మొదటినుండియు పగతుర తాకిడి మిక్కుటమై వాఙ్మయ కృషి కురుచవారినది. చంపూరామాయణ కర్త బుగ్వేద కవి వెంకటాచలపతి తన గురువైన తిరువెంగళార్యకవి 'చెంజి వరదేంద్రు నాస్థాన వసుధయందు మంతు కెక్కిన' వాడని చెప్పియున్నాడు. వరదేంద్రుని చెంజి పరిపాలన కాలము (క్రీ. శ. 1645 - 1649). కువలయాశ్వచరిత్రమను ప్రౌఢప్రబంధమును రచించిన నవరము చిన నారాయణ నాయకుడు నీ వరదేంద్రుడును సమకాలికులు బంధువులునై యుందురను నూహకు గొంత యుపాధి గలదు. అయినచో కువలయాశ్వచరిత్ర చెంజికి చెందిన కావ్య మనవచ్చును. క్రీ. శ. 1637 - 1649 సంవత్సరముల నడుమ చెంజి సేనాధిపతి తుపాకుల కృష్ణప్ప. తుపాకుల వేంకట కృష్ణ ముద్రతో నున్న క్షేత్రయ్యపదముల నుద్దిష్టుడయినవా డీతడే కావచ్చును. ఇతని కుమారుడే బహువచన గ్రంథకర్తయైన

అనంతభూపాలుడు. క్షేత్రయ్యవలె వివిధ మండలాధీశ్వరు
లచే సత్కృతుడయిన గణపవరపు వెంకటకవి తనకు
తుండీరవిభుడు గావించిన సత్కృతి పేర్కొనెను. ఆ
తుండీరవిభుడు చెంజి వరదప్పనాయకుడే కావచ్చును.
క్రీ. శ. 1677 నుండి చెంజిలో మహారాష్ట్రుల పెత్తనము
కొంతకాలము సాగినది. తంజావూరి శాహజీ యాస్థాన
కవియగు గిరిరాజునకు తమ్ముడును, విచిత్రరాయావతంస
బిరుదాంచితుడును నైన దర్భా వెంకటగిరి(కవిగిరి)కవి
ఖండోజీరాయడను నాతని ప్రేరణమున రుక్మాంగద
చరిత్ర(ద్విపద), అభినయదర్పణము రచించినాడు. క్రీ. శ.
1689 లో చెంజికోటలో ఖండేరాయ నామధేయు డొక
మహారాష్ట్ర సర్దారు గలడని తెలియుచున్నది. ఆతడే యీ
ఖండోజీరాయడు కావచ్చును. అయినచో కవిగిరి కృతు
లును చెంజికి చెందినవే యని చెప్పవచ్చును.

మైసూరు: క్రీ.శ. 1672 - 1703 సంవత్సరముల నడుమ
మైసూరు పరిపాలకుడగు చికదేవరాయలు సాహిత్య
ప్రియుడు. కన్నడ తెలుగు కవులను బోషించినాడు;
కన్నడమున స్వయముగా గీతగోపాలాది ప్రౌఢకావ్య
ములను రచించినవాడు. అతడు తెలుగున కృతులు రచింప
లేదు. కాని తనపేర చికదేవరాయవిలాస మను నొక
ప్రశస్తరచనా రీతిగల యక్షగానమును తెనుగున వెలయింప
జేసినాడు. అది తంజావూరి యక్షగానపు బాణీ నున్నది;
రఘునాథనాయకాభ్యుదయమువంటిది. గ్రంథకర్త పేరు
తెలియదు. తదుపరి చికదేవరాయల పుత్రుడు కంఠీరవ
నరసరాజు (క్రీ. శ. 1704 - 1713) ఆంధ్ర కన్నడ తమిళ
ప్రాకృతభాషలం దొక్కొక్క కొరవంజియు, తెనుగున
నేడు యక్షగానములను, గొన్ని పదములను రచించినాడు.
అన్నిట రచన చక్కగా నున్నది. కాని యెందును నొక
కథ కాని, యొక మనోహరకల్పనకాని లేవు. రాజుగారి
కొలువుబండారము, నట్టువకత్తెల పదచాళిమేళము, అందు
జావళీ శృంగారము - ఇంచుమించుగ నన్నిట నిదే విష
యము. స్వీయకృతులందు నాయకుడు తానేయై సరసత్వ
మునను విరసత్వమునను సమకాలికుడయిన శాహజీ నతిశ
యించినాడు కంఠీరవరాజు. ఆ కాలమున మైసూరు దండ
నాయకులును గ్రంథరచన గావించిరి. కళువె(కళలె) వీర
రాజు భారతమున ఆది సభా భీష్మ పర్వములు వచనముగా
జేసెను. తద్రచనలో నితనికి తుపాకుల అనంతభూపాలుడు
తోడ్పడినాడు. అనంతభూపాలుడును ప్రత్యేకముగా విష్ణు
పురాణాది బహుగద్యగ్రంథములను రచించెను. వీరరాజు
కొడుకు నంజరాజు హాలాస్యమాహాత్మ్యము, కాశీమహి
మార్థదర్పణము నను రెండు వచన కావ్యములు రచించెను.
మైసూరి వచనకావ్యములు సలక్షణమైన భాషలో
ధారాధోరణీ భాసురములుగ నున్నవి. ఆలూరి నరసింహ
శాస్త్రి నంజరాజుపేర సంస్కృతమున వెలయించిన
యలంకార గ్రంథమగు నంజరాజయశోభూషణమునందలి
నాటకోదాహరణమున కొక వ్యావహారికాంధ్ర వచనాను
వాదము వెలసినది. కర్తపేరు తెలియదు కాని యది
యించుక పిదపకాలపు రచనయై యుండును. మైసూ
రున యక్షగానములు, వచనకావ్యములు రెండును
వెలసియుండుటచే నచటి వాఙ్మయము తంజావూరు,
మధురల ప్రత్యేకతల కేకవాక్యత ఘటించిన దనవచ్చును.

పుదుక్కోట: క్రీ. శ. 1730 - 1886 సంవత్సరముల
నడుమ పుదుక్కోటలోను కోటి తొండమాన్ ప్రభువు
లాంధ్ర సరస్వతి నారాధించిరి. ఆ ప్రభువులలో రాయ
రఘునాథ తొండమాన్ (క్రీ.శ. 1768-1789), వారి యాస్థాన
కవులలో నుదురుపాటివారు - అందు వెంకన్న కవి - ము
న్నెన్నదగినవారు. ఆ ప్రభువులలో నాత డొక్కడే కవి
ప్రథితుడు; పార్వతీపరిణయ మను నతిప్రౌఢప్రబంధము
రచించినాడు. నాటి కవులలో వెంకన్నయే కడు ప్రసిద్ధుడు.
తండ్రికిగల ఉద్దండకవిబిరుదమును నిలువబెట్టినవాడు.
అతడు రాయరఘునాథు నాస్థానకవి, బహుగ్రంథకర్త.
అతని రచనలు ఆంధ్రభాషార్ణవ మను అచ్చతెనుగున
గూర్చిన నిఘంటువు, రఘునాథీయ మను నలంకార
శాస్త్రము, మల్లపురాణ మను మల్లయుద్ధశాస్త్ర గ్రంథము,
పార్వతీకల్యాణ మను యక్షగానము, బృహన్నాయికా
దండకము, తొండమాన్ వంశావళి. ప్రతి గ్రంథము నొక
ప్రత్యేకత గలది. రెండవ విజయ రఘునాథుని కాలమున
(క్రీ. శ. 1789 - 1807) గొనసూరు నారాయణయ్యంగారు
భానుమిత్రుని రసమంజరి అనువాదము, నవనప్ప ఖడ్గ
లక్షణశిరోమణియు రచియించిరి. కడమ పుదుక్కోట
కవు లెక్కువగా దండక శతకాదులైన చిల్లరకృతులతో
సరిపెట్టుకొనిరి. పుదుక్కోట సాహిత్యము కొలది
యయ్యును వైవిధ్యవిశిష్టమైనది.

ఇతరకవులు, కవిపోషకులు: పెద్ద పెద్ద సంస్థానముల
ప్రాపునగాక విడివిడిగా నొకమాత్రపు టధికారులు,
సంపన్నులు నాలంబనముగా నాంధ్రవాఙ్మయ లత కొనలు
సాగినది నాడు. మల్లులు, దళవాయిలును కృతికర్తలు
భర్తలు నైన కాల మది. క్రీ. శ. 1746 సంవత్సర ప్రాంత
మున పుదుచ్చేరిలో ఫ్రెంచిప్రభుత్వోద్యోగిగా నున్న
ఆనందరంగపిళ్ళె కస్తూరి రంగకవి రచనలలో ప్రసిద్ధమైన
ఆనందరంగరాట్ఛందమును తనపేర వెలయింపజేసెను.
ఇంచుమించుగ ఆకాలముననే తిరుచిరాపల్లిమండలవాస్త

వ్యులు వెంగళం లింగారెడ్డి, కృష్ణారెడ్డి యనువారలును, సేలము జమీన్‌దారు కంబళ కృష్ణభూపతియు రేవూరి యనంతనార్యునివలన నొక్కొక్క కృతి నందిరి. క్రీ. శ. 1810 సంవత్సర ప్రాంతమున చెయ్యూరు జమీన్‌దారుల కాశ్రితుడైన మార్పెద్ది చెంగల్వరాయశాస్త్రి సుందరేశ్వర విలాస మను నొక యక్షగానప్రాయ నాటకమును, చారుశీలావిలాస మను నొక ప్రత్యగ్రప్రబంధమును చెప్పెను. ఒకరి ప్రాపున గాక స్వచ్ఛందముగా వెలసిన కృతులును కొన్ని కలవు. ఇప్పటికి సుమారు రెండు వందల నలుబది యేండ్లక్రిందట సేలంజిల్లా హోసూరు తాలూకా తోగీరయను నగ్రహారమున వసించిన అన్నదానము వేంకటాంబ రామాయణ బాలకాండమును యక్షగానముగా రచించినది. కాలము తెలియదు కాని చేరదేశములో సేలపురము చేరువనున్న ఉద్దండమల్ల సముద్రమనెడి యూరిలో నుండిన ఎల్లకవి యనునతడు శేషము వెంకటపతి శశాంకవిజయము ననుకరించుచు చంద్రతారావిలాస మను యక్షగానమును రచించెను. ఇట్లింక నెందరు గలరో!

య. జో. రా.

**దాక్షిణాత్యాంధ్రులు :** ఆంధ్రదేశమునకును, దానికి దక్షిణమున నున్న దక్షిణ దేశమునకును రాకపోకలు ఎప్పటినుండి ఆరంభ మయ్యెనో దృష్టాంత పూర్వకముగా చెప్పుటకు సాధ్యము కాదు. కాని దక్షిణాపథమని వ్యవహరింపబడు దక్కనులో సాతవాహనులు రాజ్యము స్థాపించినప్పటినుండియు ఆంధ్రదేశమునకును, దక్షిణదేశమునకును రాకపోక లుండెడి వనుటకును, ఆ రెంటికిని దగ్గర సంబంధ ముండెడి దనుటకును అవకాశము కలదు. ఆంధ్రులయిన సాతవాహన భూపతుల రాజ్యము దక్షిణమున ఇంచుమించుగా కావేరినదివరకు వ్యాపించినట్లు చరిత్రకారులు నిర్ణయించినందువల్ల దక్షిణదేశమునకు ఆంధ్రులు చాల పురాతన కాలమున, అనగా ఇప్పటికి రమారమి రెండువేల సంవత్సరముల క్రిందటి నుండియే పోవుచు వచ్చుచు నుండుట యారంభమయినట్టు చెప్పవచ్చును. సాతవాహన నృపతులలో ఒకడయిన హాలమహారాజు సైన్యాధిపతి విజయనందుడు సింహళముపైకి దండెత్తి వెళ్ళినట్లు 'లీలావతి'యను ప్రాకృతకావ్యము ననుసరించి తెలియుచున్నది. ఈ విధమున ఆంధ్రదేశమునకును, దానికి దక్షిణమున ఉన్న దేశములకును, ద్వీపములకును రాకపోకలు జరగుచుండినట్లు తెలియుచున్నను ఆంధ్రులు అచ్చట వలసలు స్థాపించి రనుటకు నిదర్శనము లేవియు లేవు.

సాతవాహన భూవరులకు తరువాత కృష్ణానదీతీరస్థ దేశమును బరిపాలించిన ఇక్ష్వాకు వంశజుల కాలములో సింహళ ద్వీపమునకును, తెలుగుదేశమునకును రాకపోకలు బాగుగా సాగుచుండినట్లు నిదర్శనము లున్నప్పటికి తెలుగువారు దక్షిణ దేశమునకు వెళ్ళి అక్కడ సుస్థిర నివాసము లేర్పరచుకొని వలసలు స్థాపించుట ఇక్ష్వాకులకు పిదప తెలుగు దేశమును బరిపాలించిన పల్లవ వంశజుల కాలములోనే జరగినదనుట కాధారములు కలవు.

పల్లవులు ఆంధ్రదేశీయులు. సాతవాహన సామ్రాజ్యము భగ్నమయినతరువాత ఆంధ్రదేశములోని కొంత భాగమునకు పల్లవు లేలికలైరి. మొదటి పల్లవరాజులందరు తెలుగు దేశములో రాజ్య మేలినవారే. వారి తరువాత రాజ్యమునకు వచ్చిన సింహవర్మ కుమారుడు మహేంద్రవర్మయు, అతని సంతతివారును తెలుగుదేశమునే కాక తమిళ(చోళ) దేశమునుగూడ పరిపాలించిరి. వీరికి చెంగల్పట్టు జిల్లాలోని కాంచీపురము రాజధాని. అత్యంతప్రాచీనకాలమున కాంచీపురము తమిళ, ఆంధ్ర దేశములకు సరిహద్దుగా ఉండెను. మహేంద్రవర్మసంతతివారు రాజ్యముచేసిన కాలములోకంటెను వారి తరువాత రాజ్యాధికారము కైవసము చేసికొన్న హిరణ్యవర్మ సంతతివారి పరిపాలనకాలములో ఆంధ్రదేశీయులయిన బ్రాహ్మణులకు రాజాశ్రయ మధికముగా లభించినది. హిరణ్యవర్మ సంతతివారు మొదట ఆంధ్రదేశవాసులే; తరువాత వారు తెలుగు దేశమునుండి కాంచీపురము వెళ్ళి రాజ్యాధికారమును వహించిరి. అంతవరకు తెలుగు దేశములో వారికి ఆశ్రితులుగా ఉండిన బ్రాహ్మణులును, పరిచారకులుగాను కొలువుకాండ్రుగాను ఉండిన ఇతర వర్ణములవారును వారితోపాటు దక్షిణ దేశమునకు వెళ్ళియుందు రనుటకు సంశయము లేదు. వారితోగూడ ఏయే కులములవారు వెళ్ళినారో దృష్టాంతపూర్వకముగా చెప్పుటకు అవకాశము లేకపోయినను బ్రాహ్మణ కుటుంబము లనేకములు వలస వెళ్ళిన వనుటకు ఆధారము లున్నవి. హిరణ్యవర్మ సంతతివారిలో కాంచీపురము రాజధానిగ పరిపాలించి ప్రఖ్యాతుడయిన మొట్టమొదటి మహారాజు పల్లవమల్ల బిరుదాంచితు డయిన రెండవ నందివర్మ. బ్రాహ్మణుల కగ్రహారములు దానము చేసి యిచ్చిన దాన శాసనము లితనివి చాల దొరకినవి. ఈతని 'తాండన్ తోట్టం' దాన శాసనములోని అగ్రహార దాన ప్రతిగ్రహీత లయిన బ్రాహ్మణులు అసంఖ్యాకులుగా ఉన్నారు. ఈ ప్రతిగ్రహీత లెక్కడినుండి వచ్చినవారో శాసనములలో చెప్పిన వారి ఇంటిపేర్ల వలన తెలియును. ఆ విధమయిన గ్రామముల పేర్లలో కరంజై, కుండూరు, వంగిప్పులు, అముత్తనూరు, ఉరుప్పిటూరు, పరాందూరు, అంగరై, ఇరా

యూరు, కారంబిచ్చేడు, పిణుక్కిప్పలు, కురోవి, కురవసిరి, నంబూరు, నూత్తిలప్పలు, కొమ్మరై, పట్టుక్కూరు మొదలయినవి కొన్ని. ఇవి అన్నియు తెలుగు దేశములోని యూళ్ళే. శాసనము చెక్కిన తమిళుల చేతులో పడి అవి తమిళపు పేర్లుగ మారిపోయినవి. వీటికి సరియైన ప్రాచీన కాలపు తెలుగు పేరులును, వాని ఇప్పటి రూపములును ఈ క్రింద చూపబడినవి.

| | | |
|---|---|---|
| కరంజై | క్రాజ | కాజ |
| కుండూరు | గుంటూరు | గుంటూరు |
| వంగిప్పలు | వంగిపట్టు | వంగిపురము (?) |
| అముత్తనూరు | అమృతనూరు | అమర్తలూరు |
| ఉరుప్పిట్టూరు | ఉర్పుటూరు | ఉప్పుటూరు |
| పరాందూరు | ప్రాంతూరు | పాతూరు |
| అంగరై | అంగర | అంగర |
| కొమ్మరై | కొమ్మర | కొమ్మర |
| ఇరాయూరు | రాయూరు | రాయూరు |
| కారంబిచ్చేడు | కారంబిచేడు | కారంచేడు |
| పిణుక్కిప్పలు | పెణుకపట్టు | పెణుకపట్టు |
| కురోవి | క్రోవి | క్రోవి |
| కురువసిరి | క్రోవసిరి | క్రోవసిరి (?) |
| నంబూరు | నంబూరు | నంబూరు |
| నూత్తిలప్పలు | నూతులపట్టు | నూతులపట్టు |
| పట్టుక్కూరు | పటుకూరు | పటుకూరు |

ఈ పై పట్టిక ననుసరించి చూచినచో ఈ గ్రామములు నివాసముగా గలిగినట్టి కాని, ఇంటిపేరులుగా గలిగినట్టి కాని బ్రాహ్మణులు పల్లవ రాజాశ్రయము సంపాదించు కొనుటకో, పల్లవరాజుల కాశ్రితులుగా ఉన్న కారణము చేతనో దక్షిణమున తమిళదేశమునకు వెళ్ళి అక్కడ స్థిర వసతులు గడించుకొని ఉండిపోయినట్లు తెలియగలదు. ఈ పైన చెప్పిన గ్రామములే గాక పల్లవరాజ శాసనములలో తెలుగు దేశములోనివిగా గుర్తింపదగిన గ్రామముల పేర్లు ఇంకను చాల ఉన్నవి. ఆ గ్రామముల పేరులన్నియు ఇక్కడ ఉదాహరించుట అనవసరము. పల్లవరాజశాసనములలో ఉదాహృతములైన యీ గ్రామములు ముఖ్యముగా కృష్ణ, గుంటూరు, గోదావరి జిల్లాలలో, అందులోను ఎక్కువగా గుంటూరు జిల్లాలో కనబడును. ఈ జిల్లాలలో నుండిన బ్రాహ్మణులలో అనేకులు ఆపస్తంబ సూత్రులు; మిగిలినవారు భరద్వాజ, ప్రావచన, ఛందోగ, హిరణ్యకేశి, కాశర్ప (?), పవిరియ (?) సూత్రులు; కాశ్యప, ఆత్రేయ, భారద్వాజ, వత్స, వాధూల, కౌశిక, గౌతమ, గర్గ, లోహిత, వసిష్ఠ, పరాశర, ముద్గల, ధూమ్రాయన, కవి, అగ్నివేశ్య, రథీతర, శాలావత, పౌరుకుత్స, మాఠర, వారభ్యాది గోత్రములకు చెందినవారు. సంఖ్యనుబట్టి చూడగా హిరణ్యవర్మసంతతివాడయిన రెండవ నందివర్మ పల్లవమల్ల మహారాజుకాలములోనో, అంతకు పూర్వమో క్రీ.శ. ఎనిమిదవ శతాబ్దినాటికి దక్షిణదేశమునకు వెళ్ళి అక్కడ స్థిరపడిన మొదటి తెలుగువలస ఇదే పెద్దది అనటకు సందేహము లేదు. బ్రాహ్మణ కుటుంబములే ఇన్ని వలసవెళ్ళినప్పుడు ఆ పల్లవ భూవరుల నాశ్రయించుకొని పరివారజనముగాను, సైనికులుగాను దక్షిణదేశమునకు వారివెంబడి వెళ్ళిన ఇతర వర్ణములవారి కుటుంబములు అంతకంటె ఎక్కువగానే ఉండియుండవలెను. ఈ పల్లవరాజుపరిపాలన కాలములో నయిననేమి, తరువాతి పల్లవరాజుల పరిపాలన కాలమున నయిననేమి ఇతర వర్ణములవారుకూడ దక్షిణ దేశమునకు వెళ్ళిరనుట కొక్కఉదాహరణము నీయవచ్చును.

పుదుక్కోటను పరిపాలించిన తొండమానులు తిరుపతి ప్రాంతమునుండి వెళ్లినవారే. ఈ ప్రాంతమునకు తొండమండలమని పేరు. ఇప్పటి చెంగల్పట్టు జిల్లా, ఉత్తరార్కాడు జిల్లాలోని యుత్తరభాగము కొంత, చిత్తూరు జిల్లాలోని తూర్పుభాగము కొంత కలిసిన ప్రదేశమునకు పూర్వకాలములో తుండీరమండలమని, తొండమండలమని, తొండమనాడని పేరు. పుదుక్కోట తొండమానులు మొట్టమొదట ఈ ప్రాంతమున వసించినవారు. వీరు తిరుపతి కొండలమీద నివసించు కళ్ళరులను తెగకు చెందినవారు. ఏనుగులను పట్టుకొనుటలోను, ఏనుగు దంతముల నిచ్చి ధాన్యమును కొను వ్యాపారములోను వీరు నిపుణులు. వీరు పల్లవరాజధానియైన కాంచీపురమునకు సమీపములో నుండుటవలన ఆ రాజులు వీరిని మావటీంద్రుగాను, మహారాజ ప్రాసాదమునకు సంబంధించిన ఏనుగుల గుంపుకు నాయకులుగాను నియమించువారు. పరంపరగా చెప్పుకొను గాథ ననుసరించి వేంకటాచల పల్లవరాయరను ఒక పల్లవ వంశజుని అనుసరించి ఈ కళ్ళరుల తెగలోని యొకడు తన మందిని తీసికొని దక్షిణదేశమునకు వెళ్ళెనట. అతడక్కడ అంబుక్కోవెల మొదలయిన కొన్ని గ్రామములలో భూములు సంపాదించెనట. తొండమానులు తొండమండలమునుండియే వెళ్ళినారన్న విషయము తొండమాను పదమువలననే తెలిసికొనవచ్చును.

ఉత్తర(తెలుగు)దేశమునుండి దక్షిణదేశమునకు జనులు వలస వెళ్లుట ప్రాచీన పల్లవరాజుల కాలముతో ఆగిపోలేదు. తెలుగువారు దక్షిణ దేశమును జయించి అక్కడ తమ అధికారమును నెలకొల్పినపుడును, తెలుగువారు సామంతులుగానో, సరదారులుగానో దక్షిణదేశము

లోని ప్రాంతములను పరిపాలించినపుడును కొన్ని కొన్ని తెలుగు కుటుంబములు దక్షిణదేశమునకు వెళ్ళి స్థిరనివాసముచేయుచు వచ్చినట్లు కనబడును. చాళుక్య - చోళ భూపతులకు సామంతులుగా తెలుగు చోళ, పల్లవ వంశజులు చెంగల్పట్టు, ఉత్తరార్కాడు ప్రాంతాలను పరిపాలించిన కాలములో తెలుగుకులాలవా రనేకులు ఆ ప్రాంతములకు వెళ్ళి అక్కడ వసతులు కల్పించుకొని నిలిచిపోయి రనుటకు ఆధారములు కలవు.

ఉత్తరమున కాకతీయ సామ్రాజ్యము పతనమయి నప్పుడు అంతవరకు కృష్ణా, గోదావరీ నదులమధ్య ప్రదేశమునను, తెలంగాణాలోను నివసించుచువచ్చిన ఆంధ్ర క్షత్రియులు కొందరు విజయనగరసామ్రాజ్యము సంస్థాపితమయినతరువాత అది యాంధ్రదేశమునకు రాజధాని యగుటచేత పశ్చిమాంధ్రదేశమునకు వలస వచ్చి కడప, కర్నూలు, చిత్తూరు జిల్లాలలో స్థిరనివాసము లేర్పరచుకొని, విజయనగరాధిపతుల సైన్యమున చేరియు, అమర నాయకులుగా నియమితులయియు విజయనగర సామ్రాజ్యమునకు సేవచేయుచువచ్చిరి. విజయనగరాధీశ్వరులు దక్షిణ దేశముమీదికి దండెత్తి వెళ్ళినప్పుడు క్షత్రియులు మొదలయిన ఆయుధజీవులు దక్షిణదేశమునకు వెళ్లుచు వచ్చిరి. తెలుగువారు దక్షిణదేశమునకు విస్తారముగా వలస వెళ్ళినది విజయనగరాధీశ్వరుల కాలములోనే.

విజయనగర రాజ్యసంస్థాపకుడైన హరిహరదేవ మహారాయలరాజ్యకాలము చివరి సంవత్సరములలోను, తరువాత రాజ్యమునకు వచ్చిన బుక్కరాయ మహారాయల కాలములోను కుమార కంపరాయలు సాగించిన దక్షిణదేశ దిగ్విజయయాత్రలో పాల్గొని తెలుగువా రనేకులు దక్షిణ దేశమునకు వెళ్లిరి. కుమార కంపరాయలు మధురసుల్తానులను జయించి వారి రాజ్యమును వశపరచుకొని అచ్చట విజయనగరాధికారమును స్థాపించినతరువాత విజయనగర రాజప్రతినిధులను, పారుపత్తెము చేయువారిని ఆశ్రయించుకొని తెలుగువారు కొంద రక్కడ స్థిరపడిపోయినారు. తెలుగు రాజవంశములవారు విజయనగర సింహాసన మెక్కి పరిపాలనము సాగించుచువచ్చినపుడు తమకు విశ్వాసపాత్రులైన తమ తెలుగువారినే రాజకీయముగా ముఖ్యములైన పదవులలో నియోగించుచువచ్చిరి. ఈ విధముగా సాళువవంశమువారి కాలములోను, అంతకంటెను తుళువ వంశమువారి కాలములోను, అంతకంటెను విశేషించి ఆరవీటి వంశమువారి కాలములోను తెలుగుజాతిలోని అష్టాదశ వర్ణములవారును దక్షిణదేశమున కుత్తరోత్తరాభివృద్ధిగా వలస వెళ్ళుట జరిగినది. ఆరవీటి క్షత్రియ వంశజులు పాలించిన కాలములో దక్షిణదేశమున తంజావూరులోను, మధురలోను, చెంజిలోను విజయనగర సామంతరాజ్యములుగ ఆంధ్రనాయకరాజ్యములు శాశ్వతముగ ఏర్పాటయినవి. ఆ రాజ్య సంస్థాపనముతో ఆంధ్రుల దక్షిణదేశాభిగమనయాత్ర పారము ముట్టినది.

విజయనగర రాజవంశజులకును, తొండమాను వంశము వారికిని ఏదో కొంత రాజకీయ సంబంధ ముండవలెనని తోచుచున్నది. పుదుక్కోట రాజులగు తొండమానులలోని ఆవడై తొండమాను ఆ వంశజుల తామ్రశాసనములలో రాయతొండమా ననియే కాని అసలు పేరుతో ఎన్నడును వ్యవహృతుడు కాలేదు. ఆతని కా బిరుదము ఆరవీటి శ్రీరంగరాయ లొసగినది. కర్నూలుజిల్లా ఔకునుంచి వచ్చిన క్షత్రియుల ఇతర సైనికుల అధినివేశములును, తొండమానులు తెలుగు పురోహితులను నియమించుకొనుట, తెలుగుదేశపు భట్రాజుల కాశ్రయమిచ్చుట, తెలుగును ప్రధాన భాషగ అవలంబించి దానిని నేర్చుట వారి వ్రాలు తెలుగులో నుండుట, వారి ప్రతాప కృత్య ప్రశంసాపూర్వకమగు వారి వంశావతార క్రమము తెలుగు పద్యములలో రచియింపబడుట - ఇవి తొండమానులకును విజయనగరమునకును, వారికిని తెలుగు దేశమునకును ఏదో సంబంధ ముండినట్లు తెలుపుటకు చాలును.

విజయనగరాధీశ్వరులు తెలుగు నాయకరాజులను దమకు ప్రతినిధులుగ చోళరాజ్యమునకు, పాండ్యరాజ్యమునకు, తుండీరరాజ్యమునకు నియమించుటతో దక్షిణ దేశములో విజయనగరమునకు కప్పము చెల్లించు మూడు సామంతరాజ్యములు తెలుగువారివి వెలసినవి. వీటికే తంజావూరు, మధుర, చెంచి (జింజి) రాజ్యములని వరుసగా నామాంతరములు. దక్షిణదేశమున కీ తెలుగు నాయకులతో వెళ్ళినవా రెక్కువమంది రాయలసీమ వాస్తవ్యులు. ఈ విషయము ముఖ్యముగా ఈ కాలములో వలస వెళ్లిన బ్రాహ్మణశాఖలను పరిశీలించిన తెలియగలదు. దాక్షిణాత్య ఆంధ్రబ్రాహ్మణులలో చాలమంది ములికినాటిశాఖవారు. నేటికిని వీరి సంఖ్య ఆ దక్షిణదేశములో అధికము; ఉదయగిరి కన్నడిగలు లేక బడగలనాటి కన్నడిగలుకూడ చాల మంది ఉన్నారు.

క్రీ. శ. 1565 లో రక్షసి తంగడి సంగ్రామములో విజయనగరసామ్రాజ్యము గొప్పదెబ్బ తిన్నది. సామ్రాజ్య భాగ్య వైభవములు నాటినుండి తారుమారయినవి. అటు తరువాత ఇంకను కొంత కాల మది కొనయూపిరితో నున్నప్పటికి దాని బల ప్రాభవములు అంతరించిపోయినవి. దేశములో సామంతమండలేశ్వరులు స్వతంత్రులై ఒకరితో

ఒకరు పోరాడుకొనువారు. దేశములో అరాజకము ప్రబలినది. ఇట్టి పరిస్థితిలో విద్యాపోషణకు అవకాశములు మృగ్యమగుటచేతను, తీరస్థాంధ్రదేశమును, క్రమముగా పశ్చిమాంధ్ర మనబడు ఇప్పటి రాయలసీమయును మహమ్మదీయాధికారముక్రిందికి వచ్చుటచేతను కవులు, పండితులు మొదలయినవారు సజాతీయులైన నాయకప్రభువుల, దొరల ఆశ్రయము వెదకికొనుచు దక్షిణదేశమునకు వెళ్ళినారు. ఆంధ్రనాయకరాజుల కాలములో దక్షిణదేశము రెండవ ఆంధ్రదేశ మయినది. నాయకరాజుల కార్యకర్తలు తెలుగువారు; దణ్ణాయకులు, సర్వసైన్యాధిపతులు తెలుగువారు; రాయసములు తెలుగువారు; నాయకులకు లోబడి వేరు వేరు ప్రాంతములను పాలించిన మన్నీలు, పారుపత్తెముచేసినవారు తెలుగువారు. వీరు తమ ప్రజ్ఞ చూపి రణరంగములో శౌర్య, సాహసములను ప్రదర్శించి ప్రభువులకు విశ్వాసపాత్రులుగా పనిచేసి నాయంకరములను, మొఖాసాలను, ఖండ్రికలను, గ్రామములను సంపాదించుకొనుచువచ్చిరి. ఈ రీతినే దక్షిణ దేశములో తెలుగు జమీన్‌దారీలు, పాళెములు ఏర్పడినవి. ఇందుకుదాహరణముగా బోడినాయకనూరు పాళెము, చెన్నప్పనాయకన్ పాళెము, వడగరై దొడ్డప్పనాయకనూరు, ఎలైయరసనందల్, ఎట్టియాపురములను పేర్కొనవచ్చును. బోడినాయకనూరు పాళెమును క్రీ. శ. పదునాలుగవ శతాబ్దిలో రాయలసీమలోని అనంతపురము జిల్లా గుత్తి గ్రామమునుండి వెళ్ళిన 'చక్కునాయకు'డను ఆంధ్రుడు తిరువాన్కూరు రాజువద్దనుండి సంపాదించెనట. దక్షిణదేశములోని తెలుగుజమీన్‌దారీలచరిత్ర తెలిసికొన చాల ముచ్చటయినది. దక్షిణదేశములోని కొన్ని కొన్ని గ్రామాలు కూడ పూర్తిగ తెలుగువే. ఉదాహరణమునకు: రామనాథపురము జిల్లాలోని రాజుపాళయము (రాజుపాళెము)ను తీసికొనవచ్చును. పాండ్య రాజ్యాధిపతులగు నాయకరాజులలో క్రీ.శ. 1659 మొదలు 1682 వరకు రాజ్యమేలిన ఎనిమిదవరాజు చొక్కనాథనాయనయ్యావారివల్ల ఇప్పటి రాజుపాళయపు రాజుల పూర్వులు పూసపాటివారు పొందిన దానశాసనమునకు ఒక తాళపత్రప్రతి నక లున్నది. వారి పూర్వులు సైనికపరిపాలనలో నియుక్తులై రనియు, ముప్పదియారేండ్లు వారా పనిని ప్రశంసాపాత్రముగా నిర్వహించినమీదట వారి కీయవలసిన జీత మిచ్చినపుడు వారి కోరిక ప్రకారము కొంత భూమికూడ ఉచితముగా ఇచ్చి రనియు దానివల్ల తెలియుచున్నది. వీరు మధురనుండి కన్యాకుమారికి పోవు రహదారికి దగ్గరగా అప్పుడు పాతపాళె మనబడు ప్రదేశములో శంకుస్థాపన మొనర్చి గ్రామము నిర్మించుకొన్నారు. అప్పటినుండి ఈ గ్రామమునకు రాజుపాళెమని పేరు వచ్చినది. ఈ రాజుపాళెమునకు చుట్టు తెలుగు కమ్మవారి వలస లుండెడివి. క్రమముగా చుట్టుపట్ల గ్రామాలనుండి క్షత్రియకుటుంబాలు చాల వచ్చి చేరుటచేత అక్కడ జన సమ్మర్ద మెక్కువై గొట్టిముక్కలవారను క్షత్రియులు మరొకగ్రామము నిర్మించుకొనవలసి వచ్చినది. ఈ గ్రామమునకు సింగరాజుకోట అనియు, మిట్టపాళె మనియు పేరు. ఈ గొట్టిముక్కలవారు పూర్వము మహామండలేశ్వర బిరుదాంచితులట. ఈ విధముగా నేర్పడినదే మరియొక గ్రామము జగ్గరాజుకోట. రాజుపాళెములో పూసపాటి, వత్సవాయ, మంతెన, పేరిచెర్ల, ఎర్రగుంటల, సాగి, చింతలపాటి, గొట్టిముక్కల, పెన్మెత్స, దంతులూరి, మందపాటి మొదలయిన యింటిపేర్లు గల క్షత్రియ కుటుంబములవా రున్నారు. వీరిలో వసిష్ఠ, ధనంజయ, కాశ్యప, కౌండిన్య గోత్రాలవారు కలరు. పూసపాటివారు తెలుగుదేశ క్షత్రియులకు నాయకులగుటచేత రాజుపాళెములో క్షత్రియ వివాహాదుల సందర్భములో ఇప్పటికిని పూసపాటివారిదే అగ్రతాంబూలము.

తెలుగు దేశమునుండి దక్షిణ దేశమునకు అష్టాదశ వర్ణములవారు వెళ్ళినట్లు ఇదివరకే చెప్పబడినది. దక్షిణదేశములోని తెలుగు కమ్మవారికి వడుగ కమ్మలని పేరు. ఉత్తరదేశమునుంచి దక్షిణదేశమునకు వలస వెళ్ళిన ఒడ్డె, బెస్త, బలిజ మొదలైన ఇతరులగు తెలుగుకులాలవారి కందరికి తమిళదేశములో వడుగనులని వ్యవహారము. వడుగు అనగా ఉత్తరము. వడుగునుండియే వడుగను వచ్చినది. కోయంబుత్తూరు, చెంగల్పట్టు, ఉత్తర దక్షిణ ఆర్కాడుజిల్లాలలోను, ఇంకను దక్షిణమున ఉన్న తిరునెల్వేలి, నాగర్‌కోయిల్ మొదలగు చోట్లను, కేరళప్రదేశములోని తిరువనంతపురము, కొల్లమ్, అలప్పుయ (అల్లెపి), కొచ్చినులలోను గూడ నాయళ్లు, బలిజలు మొదలైనవా రున్నారు.

క్రీ. శ. 1542, 1544 ప్రాంతాల నున్న సెంట్ జేవియరను జెసూయిట్ పాదిరి తన ఉత్తరములలో తరచుగా బడగులను పేర్కొనును. వీరు దేశపాలకులకు చెల్లవలసిన పన్నులను వసూలుచేయువారట. వీ రందరు నరసింగరాయల రాజ్యమునుండి వచ్చినవారని క్రీ. శ. 1568 లో పాదిరి ఓర్గంటినో వ్రాసెను. 1891 వ సంవత్సరపు జనాభా లెక్క ప్రకార మప్పటికే తమ కులనామము చెప్పక తాము వడుగనుల (ఉత్తరాదివార)మని మాత్రమే చెప్పుకొన్నవారి సంఖ్య 1,80,884; వీరు కాక కులనామమును చెప్పుకొన్న వడుగను(తెలుగువారు)లు ఇంకను అనేకు

లుండిరి. ఇందువల్ల నే 1931వ జనాభా లెక్కలలో దక్షిణ దేశములోని తెలుగువారిని గూర్చి యి ట్లున్నది.

'దక్షిణార్కాడు జిల్లాలోని దక్షిణపు తాలూకాలు మినహాగా తంజావూరు జిల్లా అంతటిలోను, పుదుక్కోట సంస్థానములోను, రామనాథము శివగంగ జమీన్‌దారీల లోను, తామ్రపర్ణినదికి దక్షిణముననున్న తిరునెల్వేలి జిల్లా లోను తెలుగువారు అధికసంఖ్యాకవర్గమువారు కాకపోయి నను తగినంత ఎక్కువమంది ఉన్నారు. తెలుగువా రున్న ప్రదేశములు విడబరిచి గీటుగీసి చెప్పుట కవకాశము లేక పోయినను రెండు విషయములు మాత్రము నిశ్చయముగ చెప్పవచ్చును. దక్షిణదేశములోని తెలుగువారికి మిట్టప్రదేశ ములు, రాయలసీమలోని నల్లరేగడ భూములవంటి ప్రదేశ ములు నివాసప్రదేశములను చేసికొనుటలో సుముఖత అధికము.' 1951 జనాభాలెక్కను బట్టి తమిళదేశములోనే తెలుగువారి సంఖ్య దాదాపు 33 లక్షలు. మ. సో. శ.

దక్షిణాంధ్ర భాషోద్యమము : లక్షలాదిగ నున్న దాక్షిణాత్యాంధ్రు లందరును నేటి పర్యంతము తమ యిండ్లలో తెలుగే మాట్లాడుచున్నారు. ఈ తెలుగు వీరు దక్షిణదేశమునకు వచ్చిన నాటిభాష. వారు నివసించునది ఆంధ్రదేశముకాదు కాబట్టి నిత్యపరిణామ శీలమయిన నేటి ఆంధ్రదేశభాషకంటె ప్రాతవడినది. తమిళ దేశమున కొన్ని శతాబ్దుల కాలము తమిళులతో కలసి నివసించిన వారగుట చేతను, ఇల్లు విడిచి బయటికి వెళ్ళినచో అన్ని వ్యవహారములును తమిళములో జరుపవలసి యుండుట చేతను, తమిళదేశమందలి పాఠశాలలలో విద్యాబోధనభాష తమిళ మగుట చేతను, ఆంధ్రులకు ప్రత్యేకము తెలుగు పాఠశాలలు లేకపోవుటచేతను దక్షిణాంధ్ర సంతతివారు ఇంట తెలుగు మాటాడుచున్నను వ్రాత కోతలకు తమి ళము నేర్చుకొని తమిళముననే వ్యవహారము నెరవుకొన వలసిన యవసరము గలుగుటచేత క్రమముగా తమ మాతృభాష తెలుగునే మరచిపోయినారు.

ఈ దుస్థితిని బోగొట్టి, దక్షిణాంధ్రుల భాషాభివృద్ధికి కృషిచేయుటకు సాధు వరదరాజంపంతులుగారు 'దక్షి ణాంధ్రభాషోద్యమ'మని ఒక యుద్యమమును లేవదీసిరి. లక్షలాదిగనున్న దక్షిణదేశస్థ ఆంధ్రులు తమ మాతృభాష చదువను, వ్రాయను నేర్చుకొని తదభివృద్ధికి కృషిచేయు నట్లు చేయుటయే ఆ యుద్యమము యొక్క ఏకైకోద్దే శము. ఇది కేవలము భాషావిషయకమైన యుద్యమము. ఈ యాశయముతో సుప్రసిద్ధ ఉత్తర, దక్షిణ ఆంధ్రనాయ కుల, ప్రముఖుల సహాయ, సానుభూతి సంపత్తులతో మద రాసులో 'దక్షిణాంధ్రభాషాభివర్ధనీ సభ' యను సొక సంస్థ యేర్పడినది. ఈ సంస్థ స్థాపనకు ఉత్తర, దక్షిణాంధ్రు లనేకులు తమ సంతసమును వెలిపుచ్చి దాని నాశీర్వదించిరి.

ఈ సభ ప్రారంభమైన నాటినుండి దీని ప్రయోజనమును, ఆవశ్యకతను గుర్తించి చెన్నపట్టణములోను, దక్షిణమున చాలచోట్లను పెద్ద లనేకులు దీని కన్ని విధముల తోడ్పడు చుండిరి. ఈ సంస్థకు తొలుదొలుత చెన్నపట్టణమున సుప్ర సిద్ధులగు దివాన్ బహదరు టి. నంబెరుమాళ్ చెట్టి, మున గాల రాజా నాయని వెంకట రంగారావు ప్రభృతుల అధ్యక్షత క్రింద దక్షిణాంధ్రభాషోద్యమమును, దానికి మూలాధారమైన దక్షిణాంధ్రభాషాభివర్ధనీసభయు దిన దినాభివృద్ధి గాంచుచు వచ్చినవి. ఈ దక్షిణాంధ్ర భాషాభి వర్ధనీ సభకు విశేషముగా సాయపడినవారు (బెజవాడ) సోమయాజుల వెంకటేశ్వర శివరామశర్మగారు. వీరు దక్షిణదేశమున నుద్యమాభివృద్ధికి విశేషకృషి చేసిరి. వీరి కృషిచే దక్షిణమున రాజుపాళయములో చెన్నపురి కేంద్ర సంఘమున కొక శాఖాసంఘ మేర్పడినది. అచ్చటి ఆంధ్ర ప్రముఖులలో అగ్రగణ్యులు, ఉత్తమ క్షత్రియ వంశమునకు చెందిన భూస్వాములు పూసపాటి ధర్మరాజు గారు, పూసపాటి రామరాజుగారు, పూసపాటి కుమార స్వామిరాజుగారు మొదలగు పెద్దలు ఆ ప్రాంతములోను, చుట్టుపట్ల ప్రాంతములలోను తెలుగు భాషాభివృద్ధికి గొప్ప కృషిచేసిరి. ఇట్లే తిరునెల్వేలి, తిరుచిరాపల్లి జిల్లాలలో కూడ శాఖాసంఘము లేర్పడి పనిచేయ జొచ్చినవి.

ఓట్టుపిడారము కమ్మవారి ఉన్నత పాఠశాలలోను, తిరునెల్వేలి జిల్లా సమూహారంగాపురములోని పాఠశాల లోను, కోవిలపట్టి బోర్డు హైస్కూలులోను, రాజుపాళ యములోని కొన్నిబడులలోను తెలుగుబిడ్డలకు తెలుగు నేర్పుట కేర్పాట్లు జరిగినవి.

1925లో దక్షిణాంధ్ర ప్రముఖులు రామనాథపురం జిల్లా కలెక్టరుగా నుండిన శొంఠి రామమూర్తి పంతులు గారి అధ్యక్షతక్రింద దక్షిణాంధ్రమహాసభ ఒకటి సాత్తూ రులో జరిపిరి.

ప్రారంభమైననాటినుండి దక్షిణాంధ్ర భాషాభివర్ధనీ సభ చెన్నపురిని కేంద్రముగా పెట్టుకొని 1935 వరకు తెలుగు భాషాభివృద్ధికి దక్షిణమున గొప్ప ప్రచారము చేసినది. ఈ ప్రచారమువలన, సభలవలన ఆంధ్రులలో జాతీయభాషాభిమానము రేకెత్తినది; కాని అంతవరకు చేకూరిన ఫలితములును, చేసిన ప్రయత్నములును శాశ్వత ముగా నిలిచియుండలేదు.

సభయొక్క ఆదేశ, ఉద్దేశములను చక్కగా ప్రచా రము జరిపించవలయునను సత్సంకల్పముతో 1935 లో

'దక్షిణాంధ్రపత్రిక 'అను ఒక తెలుగు త్రైమాసిక పత్రికను స్థాపించి సాధు వరదరాజంపంతులుగారు బహువ్యయ ప్రయాసలకు ఓర్చి దక్షిణాంధ్రుల నిమిత్తము తమిళలిపిలో ముద్రించి ప్రకటించి వారి కుచితముగ పంచిపెట్టుచు వచ్చిరి.

చెన్నపురి ఆంధ్రమహాసభ స్థాయిసంఘ సమావేశము 1936 జనవరి నెలలో అయ్యదేవర కాళేశ్వరరావు పంతులు గారి అధ్యక్షతక్రింద జరిగినప్పుడు ఆంధ్రమహాసభ ప్రధాన కార్యదర్శిగా నుండిన సునర్ల శ్రీరామనృసింహంగారి కార్యోత్సాహముచే, దక్షిణ జిల్లాలలో పర్యటనచేసి, అచ్చట నివసించుచున్న ఆంధ్రుల భాషాదివిషయకస్థితు లను విచారించియు, ఏతద్విషయమై రాష్ట్రాధికారులతో సంప్రదించియు ఒక నివేదికను తయారుచేసి, ఆంధ్రమహా సభ స్థాయిసంఘమునకు సమర్పించుటకు ఒక యుపసంఘ మేర్పడినది. కాని ఈ యుపసంఘ మే పనియు చేయలేక పోయినది.

ఇట్టి స్థితిలో దక్షిణాంధ్రభాషోద్యమనాయకులు సాధు వరదరాజంపంతులుగారు దక్షిణమున చేయవలసిన కార్య ములను చెన్నపట్టణము కేంద్రస్థానముగా పెట్టుకొని పని చేయుటవలన ప్రయోజనము లేదని తలచి, దక్షిణాంధ్రుల మధ్యనే యుండి ప్రచారమును, దక్షిణాంధ్ర పత్రికా ప్రకటనమును సాగించుటకు తీర్మానించుకొని, 1936 ఏప్రిల్‌లో చెన్నపురినుండి కార్యస్థానమును తిరునెల్వేలికి మార్చుకొనిరి. నాటినుండి తిరునెల్వేలి దక్షిణాంధ్రభాషో ద్యమమునకు కేంద్రస్థానమయినది.

పంతులుగారు తిరునెల్వేలి చేరిన వెంటనే ఆ జిల్లాకు డిస్ట్రిక్టు సర్జనుగా నుండిన లెఫ్టినెంటు కర్నల్ తాడేపల్లి శంకరశాస్త్రిగారి అధ్యక్షతక్రింద ఒక గొప్ప దక్షిణాంధ్ర మహాజనసభ జరిపించిరి. ఆ సభలో ముఖ్యముగా ఉత్త రాంధ్రులు కొందరు దక్షిణమున పర్యటనము చేసి, దక్షి ణాంధ్రుల మాతృభాషాస్థితిని గాంచి దక్షిణాంధ్రభాషో ద్యమమునకు తోడ్పడవలయునని కోరబడెను.

వేమవరపు రామదాసుపంతులు, అయ్యంకి వెంకటరమ ణయ్య పంతులు మొదలగువారు కొత్తకోట (పుదుక్కోట) సంస్థానములో సంస్థాన గ్రంథాలయ సభ జరిగిన సందర్భ మున కొత్తకోటకు వచ్చినపుడు అచట తెలుగు భాషాభి వృద్ధికి ఒక సంఘము నెలకొల్పబడెను.

సాధు వరదరాజంపంతులుగారు తమ కృషిని తిరు నెల్వేలిలో కేంద్రీకరింపజేసి ప్రతి పేటలోను ఆంధ్రులను సమావేశపరిచి, వారు తమ మాతృభాష నభ్యసించి యభి వృద్ధిపరచుకొనవలసిన ఆవశ్యకతనుగూర్చి ఉద్బోధించి సుమారు మూడు నెలలు తీవ్రముగా ప్రచారము చేసిరి. తత్ఫలితముగ 1937 తెలుగు సంవత్సరాది దినమున తిరు నెల్వేలి హిందూకళాశాలలో ఆ జిల్లా ఆంధ్రులు అందరు సమావేశమై ఒక బ్రహ్మాండమగు సభ జరిపిరి. ఆ మహా సభకు తిరునెల్వేలి జిల్లాలోని వివిధ ప్రాంతములనుండి ఆంధ్ర ప్రముఖు లనేకు లరుదెంచి తెలుగులో మాటాడిరి. దక్షిణాంధ్రుల మధ్య, ఆంధ్రభాషా ప్రచారము చేయుటకు ప్రచారకులను పంపి సహాయపడుటకును, అట్లు వీలు కానిచో తగిన ధన సహాయము చేయుటకును ఆ మహాసభ వారు ఉత్తరాంధ్రులను కోరుచు తీర్మానములు చేసిరి. ఇవి 1937 లో బెజవాడలో రజతోత్సవము జరిగిన సంద ర్భమున ఆంధ్రమహాసభకు పంపబడెను.

ఇట్లు మహాసభల, చిన్నచిన్న సమావేశముల మూల ముగా చేసిన ప్రచారముచేత దక్షిణ ప్రాంతమున ఆంధ్ర భాషాభిమాన మభివృద్ధిచెంది, తెలుగువారు తమ శుభలేఖ లను, తా మొకరి కొకరు వ్రాసికొను జాబులను తమిళ లిపిలో తెలుగులో వ్రాసికొనుచు వచ్చిరి.

తిరునెల్వేలిలో స్థానిక సుప్రసిద్ధ న్యాయవాదులు రేమాని గురుమూర్తి అయ్యగారి అధ్యక్షతక్రింద జరిగిన దక్షిణాంధ్ర మహాజనసభ దక్షిణాంధ్ర బాలబాలికలు పాఠ శాలలలో తెలుగు నేర్చుకొనుట కవకాశములు కల్పింప వలెనని తీర్మానములు చేసి చెన్నపురి శాసనసభా సభ్యు లందరికిని, ప్రభుత్వమువారికిని, తదితరులగు పెద్దలకును పంపబడెను.

1938 లో చెన్నపట్టణమున వాల్‌టాక్సు థియేటరులో డాక్టర్ సర్ సర్వేపల్లి రాధాకృష్ణ పండితుల అధ్యక్షత క్రింద జరిగిన 20 వ ఆంధ్ర మహాసభ అరవదేశమందు స్థిరపడియుండు ఆంధ్రుల భాషాసమస్యనుగురించి చర్చించి కొన్ని తీర్మానములు చేసినది.

యుద్ధ పరిస్థితులచే పత్రికా ప్రకటనమునకు కావలసిన ధనము లేక దక్షిణాంధ్రపత్రిక 1942 లో ఆగిపోయినది.

దక్షిణాంధ్రభాషోద్యమ ఉద్దేశములు త్వరలో సఫల మగునట్లు చేయుటకు 1942 వ సంవత్సరాంతమున తిరునెల్వే లిలో దక్షిణాంధ్ర మహాజనసభ నొకదానిని జరిపి యక్కడ వరదరాజం పంతులుగారు 'దక్షిణాంధ్రభాషాభివర్ధనీ సభ 'ను స్థాపించిరి. దీనికి నాటినుండి పలువురు దక్షిణాంధ్ర ప్రముఖు లధ్యక్షులుగా నుండి సభ ఆశయములను సిద్ధింప జేయుటకు చాల కృషిచేయుచున్నారు. గ్రామాదులకు వెళ్ళి దక్షిణాంధ్రోద్యమనాయకులు ప్రచారమును, సమా వేశములను జరిపించుచు వచ్చుచున్నారు.

ఈ సంస్థ దక్షిణాంధ్రులు చదువుకొని మాతృభాషాభి వృద్ధి చేసికొనుటకు, ఆంధ్రుల చరిత్ర తెలిసికొనుటకు

వీలుగా వారికి ఉపకరించు తెలుగుభాషా ప్రచురణములను అరవ లిపిలో ముద్రించి వారికి విరివిగా పంచిపెట్టు చున్నది.

ఈ దక్షిణాంధ్ర భాషాభివర్ధనీ సభ ప్రారంభించిననాటి నుండి తీవ్రకృషి చేసి తెలుగు బాల, బాలికలకు పాఠశాల లలో తెలుగు నేర్చుకొనుట కవకాశములు కలుగజేయ వలయునని కేంద్రప్రభుత్వమువారికిని, మద్రాసు ప్రభు త్వమువారికిని, ప్రముఖులైన ఆంధ్రనాయకులకును పంపిన విజ్ఞప్తులు అనంతములు. ఈ సభ కృషి అనతికాలముననే ఫలింపగలదని ఆశ. సా. వ. పం.

**దాసరులు** : దాసరు లందరును వైష్ణవులు. వైష్ణవ మున నున్న దాసభావమువలన ఈ జాతివారికి ఈ పేరు కలిగి యుండును. దాసరులం దెన్నియో తెగ లున్నవి. వీరశైవమువలెనే వీర వైష్ణవము కూడ సర్వవర్ణముల వారి కాశ్రయ మిచ్చినది. నీచ జాతులందు వైష్ణ వము స్వీకరించి భిక్షుకులైనవా రందరును దాస రులే. బుక్క దాసరి, పాగదా సరి, దండెదాసరి, భాగవతదాసరి, బుట్టదాసరి, చిన్న దాసరి, మాలదా సరి వంటి తెగ లనేకము కలవు. ఆముక్తమాల్యద లో మాలదాసరి వర్ణనము బాగు గా చేయబడినది. దండె దాసరులు మొదట వైష్ణవ పీఠాధిపతుల యందలములు మోసెడు వారట. వీరి భక్తికి మెచ్చి కాంచీ పీఠాధిపతులు దండమును, తాళ ములను, తంబురాను, శంఖమును, దివ్వెను ఇచ్చి భిక్ష మెత్తుకొను డనిరట. అప్పటినుండి వీరు భూమిపై అచ్చ టచ్చట దీపస్తంభము నిల్పి శంఖ మూదుచు, తంబురా మీటుచు, చిరుతలు వాయించుచు, విష్ణుసంకీర్తన మొన ర్చుచు, గోవిందలు గొట్టుచు, నాట్య మొనర్చుచు భిక్ష మెత్తుచున్నారట. స్త్రీలు మాత్రము భిక్షమెత్తరు. పూసలు, దువ్వెనలు, అద్దములు అమ్ముచు తిరిగెదరు. పురుషులు కూడ కావడులు పెట్టుకొని వానియందు విష్ణువిగ్రహ ములు, సాలగ్రామములు, శంఖములు, తులసిపేరులు, తిరుమణి శ్రీచూర్ణము లుంచికొని మోయుచు వాని నమ్ము చుండెదరు. బుట్టదాసరి, మాలదాసరి తెగలవారు దాసరు లలో తక్కువవారుగా భావింపబడుదురు. వీరి స్త్రీలు బుట్టలను, చాపలను కూడ అల్లుటచే వీరి కీ పేరు కలిగి యుండును. భాగవత దాసరులు లేదా మిత్తిరి దాసరులు భాగవతములను ప్రదర్శింతురు. పురుషులు స్త్రీ వేషము లతో కాళ్ళకు గజ్జెలు కట్టి తాళ, మృదంగ ధ్వనులతో నాట్య మొనర్చుచు విష్ణుకీర్తన మొనర్తురు; గరుడా చలము, ప్రహ్లాద, రామదాసు వంటి నాటకములు ప్రదర్శిం తురు. దాసరుల ముఖ్యవాద్యములు చిరుతలు, తంబురా లేదా కిన్నెర, తాళములు, గజ్జెలు. వీరిలో మరియొక విశేష వాద్యముకూడ ప్రచారమున గలదు. తంబురా వంటిదే మూడు నాల్గు తీగల దొకవాద్య ముండును. దానిని భూమిపై నుంచి రెండు చేతులందు రెండు సన్నని పుల్లలు ధరించి తీగలపై వాయించెదరు. ఈ పుల్లలు మూరెడేసి పొడ వుండును. పట్టుకొనుచోట చివరన చిన్న చిన్న గజ్జెల గుత్తులు వ్రేలాడుచుండును. దాసరు లంద రును వైష్ణవులు కనుక వీరు పాడునట్టి వన్నియు విష్ణు సంకీర్తనములే.


చిత్రము 151. దాసరి

భిక్షమెత్తుటతోపాటు చేపలు పట్టుట, పావురములు పట్టుట, తాటిచాప లల్లుట, తాటిబుట్ట లల్లుటకూడ దాస రుల కలవాటు. దాసరులలో కొందరికి సాతానులు, మరి కొందరికి వైష్ణవ బ్రాహ్మణులు గురువులు. మద్య మాంసము లందరునారగింతురు. తమ జగడములు 'కుల పంచాయతి'లో తీర్చుకొందురేకాని కోర్టుల కెక్కరు. మారు మనువు వంటి యాచారము లున్నవి. బి. రా. రా.

**దిఙ్నాగాచార్యుడు** (క్రీ. శ. 480 - 569): ఈతడు గొప్ప తర్క పండితుడు. బౌద్ధ మతములో తర్కశాస్త్ర రచనలను ప్రవేశపెట్టినవారిలో మొట్టమొదటివాడు. దిఙ్నాగాచార్యు డనియు, భదంత ధీరనాగు డనియు నీత నికి వ్యవహారము గలదు. కవికులతిలకుడగు కాళిదాసీతని సమకాలమువాడని ప్రతీతి.

దిఙ్నాగుని జన్మస్థానము మదరాసు రాజధానిలోని కాంచీనగరమునకు సమీపమున నున్న సింహవక్త్రి నగర మని కొందరు పేర్కొనిరి. ఈ నగర మేదో నేడు గుర్తిం చుటకు వీలుగా లేదు. నేటి నెల్లూరునకు విక్రమసింహపుర మని ప్రసిద్ధి గలదు. బహుశః ఈ విక్రమసింహపురమే ఆ

సింహావక్త్రనగరముగా పేర్కొనబడెనేమో. ఇది కాంచీపురికి గొంతలో గొంత దగ్గరగా నున్నదికూడ. ఇదే నిజమైనచో దిఙ్నాగుని జన్మస్థలము ప్రస్తుత నెల్లూరు నగరమగును. మహామహోపాధ్యాయ సతీశచంద్ర విద్యాభూషణ్ గారు తమ హిందూ తర్కశాస్త్ర చరిత్రలో (హిస్టరీ ఆఫ్ ది ఇండియన్ లాజిక్) 'దిఙ్నాగుడు తన జీవితములో జాలకాల మాంధ్ర దేశమున గడపె' నని వ్రాసి యున్నారు. జన్మస్థలమేదైనను ఇతడాంధ్ర దేశమందలి వేగిదేశమునకు సమీపముననున్న బౌద్ధవిహారములో నివసించి యున్నట్లు టిబెట్టు గాథలు పేర్కొనుచున్నవి. కాగా దిఙ్నాగుడాంధ్ర దేశమువాడని గుర్తింపవచ్చును.



చిత్రము 152. దిఙ్నాగాచార్యుడు ♦

దిఙ్నాగునిది బ్రాహ్మణ వంశము. తొలుత నీతడు నాగదత్తుడను గురువునొద్ద చేరి బౌద్ధమునందలి హీనయానము నవలంబించెను. తరువాత ఆచార్య వసుబంధుని శిష్యుడై హీనయాన, మహాయానములను గూర్చి కూలంకష విజ్ఞానమును సంపాదించెను. అనంతరము కొంతకాలమునకు బౌద్ధవిద్యాధిదేవతయగు మంజుశ్రీ సాక్షాత్కరింపగా నా దేవత యనుగ్రహమువలన బౌద్ధ ధర్మవిశేషముల నన్నిటిని గ్రహించి, నలందకు వెడలి యచటి సుదుర్జయుడు మున్నగు బ్రాహ్మణులను వాదమున జయించి బౌద్ధమతాధిక్యమును బ్రతిష్ఠించెనట.

అది మొదలు దిఙ్నాగుడు ఉత్కళము, మహారాష్ట్రము మున్నగు దేశముల సంచరించి, యచటి వైదికమతానుయాయులగు పండితులతో శాస్త్రచర్చలొనర్చి యుద్దండపండితు డనియు, తర్కపుంగవు డనియు పేరు గాంచెను. కుమారిలభట్టు, పార్థసారథిమిశ్రుడు మున్నగువారీతనితో శాస్త్రవాద మొనర్చిన వారిలో బ్రధానులు.

ఈ విధముగా నీతడు జీవితాంతము పండితులతో శాస్త్రీయములగు వాదోపవాదము లొనర్చి, మహామేధావియై గొప్ప తార్కికుడై

---

♦ ఈ చిత్రము సతీశచంద్ర విద్యాభూషణ విరచితమైన 'ఇండియన్ లాజిక్ 'అను గ్రంథములో ప్రకటితమైనదానికి ప్రతికృతి. ఈ విగ్రహమును గురించి సతీశచంద్ర విద్యాభూషణులు తెలిపిన విషయములు సంగ్రహముగ ఈ దిగువ నుటంకింపబడుచున్నవి.

ఈ దిఙ్నాగుని రూపు టిబెత్తులోని తంగ్యూరు గ్రంథములలోనుండి తీసికొనబడినది. ఈ విగ్రహమునకు మూలము 'తషి-లూన్ పో 'కు ఆగ్నేయదిశగా పండ్రెండు మైళ్ళ దూరమున నుండిన 'ష-లు' విహారములో తన జీవిత చరమదశను గడపిన సుప్రసిద్ధుడగు టిబెత్తు లామా బు-స్టోన్ సేకరించి రూపొందించిన దిఙ్నాగాచార్యుని ఆకృతి. ఈ బు-స్టోన్ లామా క్రీ. శ. పదునాలుగవ శతాబ్దారంభమునం దుండినవాడు. టిబెత్తుకు హిందూదేశముతో గల అన్యోన్య సంసర్గము కారణముగా క్రీ. శ. 600 - 1200 మధ్యకాలములో అక్కడికి వెళ్ళిన చిత్రము ననుసరించి అతడు దీనిని రచియింపించి యుండవచ్చును.

ఈ విగ్రహములో గమనించదగ్గది కుళ్ళాయి. బౌద్ధము తొలికాలములో బౌద్ధ భిక్షువులు శిరోవేష్టనము ధరించుట నిషిద్ధము. మహాయానము వచ్చినతరువాత బౌద్ధభిక్షువుల దుస్తులలోకూడ మార్పు వచ్చినది. వివిధాకృతులు గల కుళ్ళాయిలు వాడుకలోనికి వచ్చినవి. ఈ దిఙ్నాగ విగ్రహములో దిఙ్నాగాచార్యులవారు ధరించినది 'పండితు'లు ధరించు ఎఱ్ఱ కుళ్ళాయి. ఇది పొడుగుగా మెడమీది కంట దిగజారి పైకి పోను పోను కోనుతేరియుండును. 'పండితు 'డెంత యుత్తమశ్రేణికి చెందినవాడయిన కుళ్ళాయి వెనుకభాగ మంత క్రిందికి వీపుమీదికి దిగజారి యుండును. శాంతరక్షితులవారు ఈ 'పండిత ' శిరోవేష్టనమును క్రీ.శ. 749 లో టిబెత్తుకు తీసికొని వెళ్ళినట్లు చెప్పుదురు. 'పండిత ' అన్నది విక్రమశీల బౌద్ధ విద్యాపీఠమున విద్యార్థులకు ఉత్తీర్ణతా సూచకముగా నొసగబడుచుండిన పట్టపు బిరుదము. ఈ 'పండిత' శిరోవేష్టనము దిఙ్నాగాచార్యులవారికి వారి తర్కశాస్త్ర వైశారద్య సూచకముగ వచ్చినదే కావచ్చును.

దిఙ్నాగాచార్యులవారి ఊర్ణమయ వస్త్రము బౌద్ధము శీతల ప్రదేశములలో వ్యాపించినపిదప బౌద్ధ భిక్షువులును బ్రాహ్మణ ఋషులవలెనే తగిన శీత నిరోధక వస్త్రములను ధరించుట కనుమతి యొసగబడె ననుదానికి సూచకము. పై విగ్రహము యొక్క అరచేతిలో సకలానర్థక పాపనివారకమై, టిబెత్తుభాషలో దోర్జి యనబడు వజ్రముకూడ నున్నది. విగ్రహము చుట్టునున్న పరివేషము దిఙ్నాగాచార్యులవారు సిద్ధు లనుటకు గుర్తు.

పేరు గాంచెను. తన యనుభవము వంతను క్రోడీకరించి 1. ప్రమాణ సముచ్చయము, 2. ప్రమాణ సముచ్చయ వృత్తి, 3. న్యాయ ప్రవేశము, 4. హేతుచక్ర డమరుకము, 5. ఆలంబన పరీక్ష, 6. ఆలంబన పరీక్షావృత్తి, 7. త్రికాల పరీక్ష, 8. న్యాయావయవము మున్నగు ననేక గ్రంథములను రచించెను. ఇవి తర్కశాస్త్ర గ్రంథములు. కుందమాల యనెడి నాటకము గూడ నీతడు రచించినట్లు ప్రసిద్ధి గలదు. ఇవన్నియు సంస్కృతభాషలో వ్రాయబడినవి.

బౌద్ధమతాధిక్యమును నిరూపించుటే యీతని వాదములకును, రచనలకును ముఖ్యాశయము. అక్షపాదుడు, కణాదుడు మొదలగు ప్రాచీన నైయాయికు లవలంబించిన పంచావయవ వాక్యమును ఈతడు మూడవయవములతో గుదిర్చినాడు. ఉపమానమునకును, శబ్దమునకును ప్రామాణ్యమును నిరాకరించి, ప్రత్యక్షానుమానములను మాత్రమే స్వీకరించి, వానికి నూతన లక్షణములను గల్పించిన బుద్ధిశాలి దిఙ్నాగుడు. కొ. జో. శ.

**దూదేకుల సాయెబులు :** దూదేకుట వృత్తిగా గల వారు దూదేకులవారు. తమిళులు వీరిని పంజారిలని, పంజు కొట్టువారని అంటారు. వీరు మొదట హిందువులుగా ఉండి తరువాత ఇస్లాముమతము పుచ్చుకొన్నవారు. అయినప్పటికి వీరు హిందువుల ఆచారములను, మహమ్మదీయుల ఆచారములను కూడా అవలంబిస్తారు. వీరిలో తాళికట్టే ఆచార మున్నది. సున్తీ తప్పనిసరి. వీరు పీర్లను, మేకులను, సయ్యదులను పూజిస్తారు. వేషధారణలో వీరు హిందువులను పోలుదురు. తరచుగా వీరు గడ్డము గొరిగిస్తారు; తలమీద వెండ్రుకలను కూడా ఉంచరు. వీరు సాధారణముగా కన్నడమో, తెలుగో మాటాడుతారు. వీరిలో వారసత్వం మహమ్మదీయ ధర్మశాస్త్రాన్ని అనుసరించి ఉంటుంది. వీరు మసీదులలో ప్రార్థనలు జరుపుతారు. వీరిలో కొందరు హిందువుల పండుగలు చేసుకొంటారు. వీరు బక్రీదు పండుగనాడు తమ పనిముట్లను పూజిస్తారు. అనంతపురం జిల్లా పెనుగొండలోని బాబా ఫక్రుద్దీన్ పీర్ వారి యిష్ట గురువు. ఆయన దరగావద్ద ఏటేటా జరిగే ఉర్సుకు వీరిలో చాలమంది వెళ్ళి ఫతిహరూపాన మొక్కులు చెల్లిస్తారు. మ. సో. శ.

**దేవులపల్లి సోదరకవులు :** దేవులపల్లి సుబ్బరాయశాస్త్రి (క్రీ. శ. 1853 - 1909), వెంకట కృష్ణశాస్త్రి (క్రీ. శ. 1856 - 1912). వీరు వెంకట కృష్ణశాస్త్రిగారి కుమారులు; తెలగాణ్యులు. వీరి నివాసము పిఠాపురమునకు చేరువగానున్న చంద్రంపాలెము. వీరి పూర్వులు పిఠాపురపు ప్రభుపుల ఆస్థానమందు విద్వాంసులై గౌరవ సత్కారములను పొందుతూ, అప్పుడప్పుడు తమ ప్రభువుల అనుమతి పొంది ఇతర సంస్థానములకు పోవుచు ఆయాసంస్థానముల ప్రభువుల సమ్మానముకూడా పొందుతూ ఉండిరి. ఈ దేవులపల్లి వంశీయు లందరును సుప్రసిద్ధ పండితులును, కవులును అయి యుండిరి.

ఈ సుబ్బరాయశాస్త్రి, కృష్ణశాస్త్రి సోదరులు తమ పితామహులగు సీతారామశాస్త్రిగారివద్ద అక్షరాభ్యాసము గావించుకొని వారివద్దనే కాళిదాసత్రయము చదువుకొనిరి. ఆ పిమ్మట తండ్రిగారివద్ద తక్కిన కావ్యములున్ను, చంపువులు అలంకారశాస్త్రము నాటకములు సిద్ధాంత కౌముది తర్కప్రకరణములున్ను నేర్చుకొనిరి. కావ్య పరిచయము కలిగిననాటనుండిన్ని ఈసోదరుల బుద్ధి కవితా గోష్ఠియందే ఎక్కువగా నిలిచి వృద్ధిపొందినది. ఆశువుగా వీరు చెప్పిన శ్లోకములును, పద్యములును ప్రబంధశైలినే రచితములగుచుండెను.

వీరు మొదటినుండిన్ని సంస్కృత గ్రంథము లెక్కువగా చదివి, తెలుగుభాషా పండితు లగుటవలన వీరి తెలుగు కవిత్వము సాధారణముగా సంస్కృతపద భూయిష్ఠమై యున్నది. అయినను కావలసిన సమయము లందు అచ్చతెలుగున సైతము వీరు పద్యములు రచియింప గలిగి యుండిరి.

ఈ కవిసోదరులు అనేక స్థలములందు అష్టావధానములు, శతావధానములు ప్రదర్శించినారు. అష్టావధాన శతావధానములతోను ఆశుకవిత్వముతోను మాత్రమే తృప్తిపడక ఈ కవిసోదరు లనేక గ్రంథములను కూడా రచించినారు. సుబ్బరాయశాస్త్రిగారు రచించిన గ్రంథములు : 1. శ్రీరామపంచాశత్తు (శ్రీరామస్తవము - సంస్కృతము) ; 2. మందేశ్వర శతకము ; 3. శ్రీరావువంశముక్తావళి (సంస్కృతము); 4. మల్హాణస్తవము (ఆంధ్రీకరణము); 5. కుమారశతకము (రాజనీతి తెలుపునది - ఆంధ్రీకరణము) ; 6. మహేంద్రవిజయము (ప్రబంధము - ఆంధ్రము); 7. రామరాయవిలాసము.

వేంకటకృష్ణశాస్త్రిగారు సుబ్బరాయశాస్త్రిగారికి తమ్ములు గనుక వీరికి తమ్మన శాస్త్రిగారను పేరుకూడ వాడుకగా ఉండెది. ఈయన రచించిన గ్రంథములు : 1. నయనోల్లాసము ; 2. యతిరాజవిజయము మొదలగునవి. ఇందులో నయనోల్లాసము శ్రోతల యుల్లములు పల్లవింపజేయగల పద్యములతో రచితమయినది. యతిరాజ విజయము శ్రీ రామానుజాచార్యులవారి ధన్య జీవితమును కథారూపమున కీర్తించిన కావ్యము ; గద్య రహిత పద్య కావ్యముగా రచితమైనది. గి. వేం. సీ.

**దేశవిభాగములు :** ప్రస్తుతము జిల్లాలమాదిరిగానే పురాతనకాలములో తెనుగుదేశము అనేక విభాగాలుగా విభక్తమై ఉండేది. ఈ దేశవిభాగాలకు పూర్వము హార మనీ, విషయమనీ, రాష్ట్రమనీ, నాడనీ పేర్లుండేవి. హార మునకే ఆహారమనికూడా నామాంతరము. ఇన్నిటిలోను హారమే అతిప్రాచీనమయినది. హార మనగా భిన్నము, భాగము అని యర్థము. దేశము మొత్తములో అదొక భాగము గనుక హార మయినది. ఈ విధమైన దేశవిభాగ ములు మన దేశమును అతిపురాతనకాలములో తొట్ట దొలుత పాలించిన సాతవాహనులను ఆంధ్రభూపతుల కాలమునుంచీ ఉన్నవి. సాతాహని (సాతవాహనుని) హారము, కూదూరాహారము అనేవే తెలుగుదేశపు దేశ విభాగములలో అతిపురాతనమైనవి. బళ్ళారిప్రాంత ప్రదేశ మునకు సాతా(సాతవా)హనిహార మని, కృష్ణాజిల్లా గుడి వాడ ప్రాంతమునకు కూదూరాహారమని ప్రాచీనకాల ములో వాడుక. కొందరు కూదూరాహార మను పేరు ఇప్పటి బందరు తాలూకాలోని గూడూరును బట్టి వచ్చినదనీ, మరి కొందరు గుడివాడ తాలూకాలోని గుడివాడనుబట్టి వచ్చిన దనీ చెప్పుదురు. ఇం దేది నిజమో ఇప్పుడు చెప్పలేకపోయి నప్పటికీ నామసామ్యమునుబట్టి గూడూరు ననుసరించియే వచ్చియుండవచ్చునని తోచును. గూడూరు అత్యంత ప్రాచీననగరమనీ, సముద్రము దానికి సమీపమున నుండే దనీ, తూర్పుదేశములకూ ద్వీపములకూ వలసపోవువారు ఇక్కడనే ఓడ యెక్కి పోవుచుండువారనీ చారిత్రక పరి శోధకులు చెపుతారు. తరువాతి కాలములో సాతవాహ నిహారము అనేదేశవిభాగము వ్యవహారములోనుంచి లోపించిపోయినది. కూదూరాహారము క్రీస్తుశకము పదకొండు పంద్రెండు శతాబ్దులవరకూ వాడుకలో ఉండెను. కాని పేరులో మాత్రము మార్పు వచ్చినది. జన వ్యవహారములో కూదూరాహారము కుద్రాహారమై కాల క్రమమున గుద్రాహారమయినది. కూదూర యన్నది కుద్రయైనట్లే హారము వారమయి కుద్రా హారము గుద్రావారమని కూడా వ్యవహృత మవుతూ వచ్చినది.

సాతవాహనుల, ఇక్ష్వాకు నృపతుల కాలమునాటి ప్రాకృత శాసనములలో 'కమ్మకరఠ' (కమ్మరఠ), 'పూగియ (పూకియ) రఠ' అను దేశవిభాగములు వచ్చును. 'కమ్మరాష్ట్ర మనుదాని ప్రాకృతరూపమే 'కమ్మక రఠ'ము. దానికి 'కర్మాంకరాష్ట్ర' మనియు రూపాం తరము. 'పూకియ రఠ'ము సంస్కృతములో పూగిరాష్ట్ర (పూకిరాష్ట్ర) మయినది. శాసనముల ననుసరించి చూడగా తెలుగుదేశములోని దేశ విభాగము లన్నిటిలోను గుద్రా హారము, పూగి రాష్ట్రము, కర్మరాష్ట్రము అనునవే చాలా పురాతనమై, వ్యవహారములో చిరకాలము నిలిచినవి. ఇట్టి దేశ విభాగములు ప్రాచీనాంధ్ర దేశమునం దంతటా కానవచ్చును. ఇట్టివి వందలకొద్దీ ఉన్నవి.

పల్లవరాజుల పరిపాలన కాలమున ఈ దేశ విభాగ ములు రాష్ట్రములని, తూర్పు చాళుక్య నృపతులు పాలిం చిన కాలమున విషయములని, నాడులని వ్యవహరింప బడుతూ వచ్చినవి. ఉదా: కమ్మవిషయము, కమ్మనాడు. పూగి విషయము - ఇదియే తరువాత పాకరాష్ట్రము, పాక నాడు అని వ్యవహరింపబడుతూ వచ్చినది. విషయము - నాడు అన్న విభేద మెందువల్ల కలిగినదో, హారము ఆహార మన్నది ఎందువల్ల వాడుకలోనుంచి తొలగిపోయినదో తెలి యదు. చివరికి ఆహారము, హారము, రాష్ట్రము, విషయము, నాడు అనునవి దేశవాచకములై పర్యాయ పదములయి నవి. కాలము గడిచిన మీదట ఈ దేశ విభాగములలో కొన్నిటికి నాడు, విషయము అనే రెండు పదములనూ - అరుదుగానే - చేర్చి వ్యవహరించుట కూడా కలిగినది. ఉదా: వెలనాటి విషయము, వెలనాడు విషయము. అయితే ఇటువంటివి చాలా అరుదు.

ఆదిమకాలములో ఈ నాడులు ఏ కారణమున ఏర్పడి నవో తెలిసికొనుట కాధారములు లేవు. మన దేశమును పూర్వము పాలించిన ప్రభువులు పరిపాలన సౌకర్యము నిమిత్తము వీటిని ఏర్పాటుచేసి యుండవచ్చునని తోచి నను ఇదే యథార్థమని నిరూపించి చెప్పుటకు ఆధార ములు లేవు. ఎట్లా ఏర్పడినవో చెప్పుట కూడా కష్టమే. అయినా అన్నిటి విషయములోను కాకపోయినా కొన్నిటి విషయములో మాత్రము అవి కొన్ని కొన్ని తెగల వారినిబట్టి అ ట్లేర్పడిన ట్లూహించుటకు వీ లున్నది. పూగియ, హిరణ్యక, ముండకాది జాతులవా రట్టివారిలో కొందరు. ఈ తెగలవారు స్థిరనివాసము చేసికొన్న ప్రాంత ములకే తరువాతి కాలమున పూగిరాష్ట్రము, హిరణ్య రాష్ట్రము, ముండరాష్ట్రము అనే పేర్లు వచ్చినవి. ఇవి నెల్లూరు, కడపజిల్లాల లోనివి. ఆ తెగలవారు కాలక్రమ మున తమ ప్రత్యేకతను గోల్పోయి యాంధ్ర సంఘమున గలసిపోయినను వారి దేశముల కా పేర్లు నిలిచిపోయిన వని భావించవచ్చును. ఇటువంటి దేశ విభాగములు చాల కొద్ది. మిగిలినవాటికి పేర్లు ఎట్లా కలిగినవో చెప్పుట కష్టము. ఇట్లే ఒక్కొక్కనాడు సరిహద్దులను, వైశాల్యా మును నిరూపించి చెప్పుటకూడ అసాధ్యమే. శాసనములలో ఒక్కొక్కనాడులో ఉండినట్టు చెప్పబడిన గ్రామము లిప్పు

డేయే గ్రామములుగ గుర్తింప గుదురునో తెలిసికొని తద్ద్వారా ఆనాడు పూర్వ మెంతలెక్క వ్యాపించెనో నిర్ణయింపవలసి యుండును. ఈ రీతిని చూచిన యెడల పూర్వపు నాడులలో కొన్ని ఇప్పటి రెండు మూడు తాలూకాల ప్రదేశమున వ్యాపించినవీ ఉన్నవి; ఒకటి రెండు జిల్లాలకంటె పెద్దవీ ఉన్నవి. అందువల్ల అవి ఇప్పటి తాలూకాల, జిల్లాలవంటి దేశవిభాగము లన వచ్చును. వంకలు, వాగులు, నదులు, గుట్టలు, కొండలు - ఇటువంటివే ఈదేశవిభాగములకు స్వాభావికపు పరిహద్దులుగా ఏర్పడుతూ వచ్చినట్టు కనబడుతుంది.

క్రీ. శ. ఆరేడు శతాబ్దములనుంచి ఈ నాడులకు కొన్ని కొన్ని సంఖ్యలను కలిపి చెప్పుట ఆచారము; ఎట్లన రేనాడు ఏడువేలు, సిద్ధి వేయి, పాకనాడు ఇరువదియొక్క వేయి, వేంగి(వేగి)నాడు వేయి, కమ్మనాడు ఆరువేలు, ములికినాడు మున్నూరు మొదలైనవి. ఒక్కొక్కనాటితో కలిసియుండే ఈ సంఖ్యలు ఎందువల్లనో ఒక్కొక్కప్పుడు తగ్గుట, ఒక్కొక్కప్పుడు హెచ్చుట కూడా కలదు. ఎట్లన ఒకప్పుడు 'వేయి దేశము'గా నున్న వేంగియే మరియొకప్పుడు పద్నాలుగువేల దేశము, వేరొకప్పుడు పదహారు వేల దేశము అయినది. పరిపాలన సౌకర్యము నిమిత్తము ఒకనాటిలోనుంచి కొన్ని గ్రామములను విడదీసి వేరొక నాడులో కలిపినప్పుడూ, చిన్న చిన్న నాడులనే ఒక పెద్దనాడులో కలిపినప్పుడూ నాడులు చిన్న వగుట, పెద్ద వగుట సహజము. అటువంటి సందర్భములలో నాడును అంటివుండే సంఖ్యలు తరుగుతూ పెరుగుతూ ఉండడం కూడా సహజమే. ఈ సంఖ్యలు గ్రామములను సూచించు ననే విషయము తెలుగు ప్రబంధముల ననుసరించి తెలుస్తున్నది ('ఏకవింశతి సహస్రగ్రామ సంఖ్యాకమై, ధరణిం బేర్చిన పాకనాడు' — కేయూరబాహుచరిత్ర). ఇప్పు డొక్కొక్క తాలూకాలోగల గ్రామసంఖ్యను బట్టి విచారిస్తే పూర్వం ఒక్కొక్కనాడులో ఇన్నిన్ని గ్రామాలు నిజంగా ఉండేవా అనిపిస్తుంది. అందువల్లనే 'గ్రామ' మనేది నిజముగా గ్రామము కాదనీ, దేశ వైశాల్యమును తెలిపే ఇప్పటి మైలువంటి ఒక మానవు ప్రాతిపదిక (యూనిట్) అనీ కొంద రంటారు. అట్లా అనుకొన్నాకూడా గ్రామ మన్నది ఇప్పటి పరిభాషలో ఎంతకు సమానమో తెలియవచ్చుట లేదు. అందువల్ల 'గ్రామ' పరిమాణ మిప్పటికీ సమస్యగానే నిలిచిపోయినది.

పదమూడవ శతాబ్ది నుంచి సీమ అనే పేరుగల మరో విభాగము వాడుకలోనికి వచ్చింది. ఇది నాడు అనే దేశ విభాగముకంటె పెద్దది. కొన్ని నాడులు లేక విషయములు కలసినది ఒక సీమ. నాడు, సీమ అన్నవి కాక స్థలము, భూమి, వళితము, కంపణము మున్నగు చిన్న విభాగములు కూడా ఉండేవి. విజయనగరము, కొండవీడు, రాచకొండ మొదలైన పెద్ద రాజ్యము లేర్పడినకాలములో సీమ అన్నది పరిపాలన సౌకర్యము నిమిత్తము ఒక రాజ్యవిభాగముగా ఏర్పడినట్లు శాసనములవల్ల స్పష్టమవు తున్నది. పూర్వాంధ్ర దేశములో మొదటి మారు ఈ 'సీమ' రెడ్డి రాజుల శాసనములలో కానవస్తుంది. ఒక్కొక్క రాజ్యములో ఇటువంటి సీమలు చాలా ఉండేవి. కొండవీటి రాజ్యములో ఇటువంటి సీమలు పద్నాలు గుండేవట. కొన్ని కొన్ని సీమలు కలిసి ఒక ప్రసిద్ధమయిన దుర్గమునకు అణుకువయై ఉండేవి. విజయనగర రాజ్యములో పెనుగొండ, చంద్రగిరి, ఉదయగిరి, గండికోట మొదలైనవి తెలుగుదేశములోని సుప్రసిద్ధ దుర్గములు. విజయనగర భూపతుల కాలములో ఇటువంటి దుర్గములకు రాజ్యములని పేరు. ఇవి ఇప్పటి రాష్ట్రముల వంటివి. ఇటువంటి రాజ్యములు విజయనగర సామ్రాజ్యములో చాలా ఉండేవి. ఒక్కొక్క 'రాజ్య'మును పరిపాలించు వారికి దుర్గాధిపతులని వ్యవహారము.

ముస్లిం పరిపాలనలో మరల ఈ దేశ విభాగములలో కొంత మార్పు వచ్చింది. వారి కాలములో 'రాజ్య'ములు పోయి వాటి స్థానములో 'పరగణా'లను దేశవిభాగములు వచ్చినవి. పరిభాష మారినదన్న మాటే కాని విభాగము పరిమాణము కొంచెమించుమించుగ నొక్కటే. ఈ విధముగానే 'సీమ'కు బదులుగా వచ్చింది 'సముతు'. ముస్లిములు వచ్చిన తరువాతనే పరగణాలు, సముతులు, జిల్లాలు, తాలూకాలు అనే దేశవిభాగాలు వాడుకలోనికి వచ్చినవి. కొన్ని పరగణాలు కలసి ఒక సర్కారు. సర్కారు కూడ ఒక దేశ విభాగమే. అయితే 'సర్కారు' లేకుండగనే కొన్ని పరగణాలు కలసి ఒక 'సుబా' అవడమున్ను కలదు. ముస్లిం పరిపాలన కాలములో ఇంకను చిన్నచిన్న దేశవిభాగము లున్నట్టు తెలుస్తుంది. కాని వారి కాలములోని ముఖ్యదేశ విభాగములలో సుబా, పరగణా, జిల్లా, తాలూకా, సముతులు ముఖ్యమైనవి.

బ్రిటిష్ ప్రభుత్వము వచ్చిన తర్వాత నాడు లనుదేశ విభాగపు వాడుక పోయినది. సీమలు జన వ్యవహారములో అరుదుగానైనా ఉన్నప్పటికి పరిపాలన విభాగములుగా అంతరించినవి. ముస్లిము పరిపాలనలో నుండిన సుబాలున్ను, పరగణాలున్ను, సముతులున్ను పోయినవి కాని జిల్లాలున్ను, తాలూకాలున్ను మాత్రము బ్రిటిష్ ప్రభుత్వములోనే కాక స్వాతంత్ర్యము వచ్చినతరువాతకూడా ఇప్పటికీ నిలిచి ఉన్నవి. మ. సో. శ.

**ద్విపద వాఙ్మయము :** ద్విపదలు తెలుగు సాహిత్యమున నొక ప్రత్యేకశాఖగా ప్రతిష్ఠ గడించినవి. మార్గ, దేశి అను రెండు సంప్రదాయములుగా ప్రవర్తిల్లిన తెనుగు సాహిత్యములో 'ద్విపద' అనునది పేరును బట్టియే పద కవితకు సంబంధించినది కావున దేశి సంప్రదాయమునకు జెందినది. కేవలము రచనా ప్రణాళిక ననుసరించి, ఆశు, మధుర, చిత్ర, విస్తర అను నాలుగు రీతులుగా విభజింపబడిన తెలుగు కవితలో ద్విపద మధురకవితాశాఖకు జెందినది. ఇది మాత్రాచ్ఛందస్సునకు జెందిన రెండు పాదములు గల రచన. ఒక్కొక్క పాదమునకు మూడింద్ర గణములు, ఒక సూర్యగణమును ఉండును. పాదములోని మూడవ గణము మొదటి యక్షరముపై యతి. ఏ పాదము యతి ఆ పాదముతో సరి. అట్టి రెండు పాదములను ప్రాస కలుపును. ఇట్టి ద్విపదపంక్తు లెన్నియైన వ్రాయవచ్చును. ద్విపదరచనమే విషయభేదమునుబట్టి, స్థలభేదమునుబట్టి, పాఠకభేదమునుబట్టి వేరు వేరు ఛందస్సులుగా మార్పులను బొందుచున్నది. ద్విపదయే ప్రాస లేకుండిన మంజరి యగును. అందలి రెండు పాదములను నొకదాని వెనుక నొకటి వ్రాసిన తరువోజ పాదమగును. నాలుగు పాదములుగల తరువోజ, సీస, రగడ, చంపకమాల, ఉత్పలమాల యను రచనా భేదములను పెంపొందించినది. తరువోజ మూలము ద్విపదగావున నివి యన్నియు తద్వికృతులని నిర్ణయింపదగును.

తెనుగు సాహిత్యమున పదునొకండవ శతాబ్దిని గద్య పద్య సమ్మిశ్రితమగు చంపూ కావ్య రచనాపద్ధతి వెలసినది. చంపువులలోని పద్యములలో వివిధ ఛందస్సు లుండును. వచనమును అచ్చటచ్చట సందర్భానుసారముగా చేర్చుట కలదు. ద్విపద రచనలో నట్టి పద్ధతిలేదు. రెండు పాదములు గల యా రచనతో నెన్ని వందల, వేల ద్విపదలైనను వ్రాయవచ్చును ; అనగా గ్రంథాశ్వాస విభాగ మున్నను గ్రంథమంతయు నేకాకారమైన ఛందస్సుతో నుండును. ద్విపద పద రచన కావున ప్రజలలో పాటల రూపమున పద్య రచనకు పూర్వమే ప్రవర్తిల్లు చుండెను.

క్రీ. శ. పండ్రెండవ శతాబ్ది నుద్భవించిన వీరశైవము వర్ణవ్యవస్థలేని, భక్తిప్రధానమైన మతము. దానిని ప్రజా సామాన్యములో ప్రచారములోనికి దెచ్చుటకు ప్రజల భాషయగు జానుతెనుగును, ప్రజాభిరుచి కనుకూలమగు ద్విపద కవితా రచనయు నావశ్యకములైనవి.

వీరశైవ మతసంప్రదాయము నాంధ్ర, కన్నడ దేశముల తన కవితమూలమున ప్రచారముచేసి వ్యాప్తికి దెచ్చిన మహాకవి పాల్కురికి సోమనాథుడు. ద్విపద మతప్రచారమునకు అనువగు సాధనముగా గ్రహించి, ఆ ఛందస్సులో బసవపురాణము, పండితారాధ్య చరిత్రము - అను గ్రంథములు రచించి ఆ వాఙ్మయ శాఖకు సృష్టికర్తయైనాడు ; కేవలము గేయరూపముగ పేరు లేకుండ నున్న ద్విపద రచనకు కావ్యత్వ గౌరవము నాపాదించి, వాఙ్మయ వీథిని సుప్రతిష్ఠితము గావించినాడు ; ద్విపద యనగా సామాన్యమైనది గా దనియు, నైహికాముష్మిక ద్విపద హేతు వనియు నిరూపించినాడు ; మత వ్యాప్తికేకాక సాహిత్య వ్యాప్తికిని సాధనమని తెలిపినాడు.

సోమనాథుడు ద్విపద రచనలో రెండు విలక్షణ పద్ధతులు పాటించినాడు : 1. ద్విపదలలో ప్రాసయతి వాడుట, 2. ఏ పాదమున కాపాదము విడిగా రచింపక ఒక పాదముతో మరియొక పాదము కలుపుచు, కొన్ని యెడల కొన్ని పంక్తుల వరకు వ్రాయుట. వీనిలో మొదటిది ద్విపద గేయరచన కాబట్టి ప్రాసయతి పాటించిన నది తాళ లయానుగుణ్యముగా నుండి శ్రవణపేయముగ నుండును. విషయము వివరించునపుడును, భావము నుద్బోధింపజేయుటకును సోమనాథుడు ద్విపదతో ద్విపద సంధింపజేసి, దానికి వృత్తరచనతో సమాన ప్రతిపత్తి గల్పించినాడు. సోమన పై రెండురచనములచేతను తెలుగు దేశముననేకాక కన్నడదేశమునను వీరశైవమతవ్యాప్తికి తోడ్పడి, వారి వాఙ్మయమునకు బసవ, పండితారాధ్యుల జీవితచరిత్రలను ప్రసాదించినాడు.

ప్రథమ ఘట్టము 12 - 15 శతాబ్దులు : ద్విపద రచన యందలి సార్వజనీనతను, సహజ మాధుర్య సంపదను, సౌలభ్యమును గ్రహించి, సోమనవెనుక పెక్కుమంది కవులు ద్విపదకావ్యములు రచించిరి. వారిలో తిక్కన యుగమున రామాయణద్విపద రచియించిన రంగనాథుడు ప్రసిద్ధుడు. ఈ రామాయణము గోన బుద్ధకృతిగా గన్పట్టుచున్నను రంగనాథరామాయణ మనియే వాడుకలోనికి వచ్చినది. ఈ రచనయు మనోహరముగను, సులభ గ్రాహ్యముగను నుండును. మరియు సోమనాథుని ద్విపద రచనయందలి వైలక్షణ్య మిందు లేకపోవుటచేత నిది చాలగా వ్యాప్తి జెంది లాక్షణికులకు ఆదరణపాత్రమైనది. ఇందలి కొన్ని ఘట్టములు చంపువుగనున్న భాస్కర రామాయణమునందలి సమానఘట్టములతో సరిచూచిన ద్విపద రచన మెట్లు ప్రజాసామాన్యము నాకర్షించినదియు తెలియగలదు.

పదునాలుగవ శతాబ్దిలో మడికి సింగన భాగవతములోని దశమస్కంధము ద్విపదరూపముగ రచించెను. శ్రీనాథ మహాకవి పల్నాటి వీరచరిత్రమును మంజరి ద్విపదలలో

రచియించెను. అది పాటగా పాడుచుండెడివారని క్రీడాభి రామమువలన మనకు దెలియుచున్నది. కాసె సర్వప్ప విరచిత సిద్ధేశ్వరచరిత్రయు నీ నాటిదే. పదునేనవ శతాబ్ది అంతమున గౌరన యనుకవి నవనాథచరిత్ర, హరిశ్చంద్ర చరిత్ర యను రెండు ప్రశస్త ద్విపదకృతులను రచియించి నాడు. ఈ రెండింటిలో హరిశ్చంద్ర కథ చాల వ్యాప్తిలో నున్నది. ఈతనిరచన సలక్షణమై, జాతీయమై, హృద యంగమముగ నుండును. ప్రసిద్ధ ద్విపదకవులలో గౌరన యొకడు.

కాలక్రమమున వైష్ణవ మతము వ్యాప్తిలోనికి వచ్చి నది. వీరశైవమతమునకు వ్యాప్తి తగ్గుటచే పిడుపర్తి కవులలో నగ్రగణ్యుడు బసవన దీపద కళియారుకథ, పిళ్ళనైనారుచరిత్ర, బ్రహ్మోత్తరఖండము, దీక్షాబోధ అను ద్విపదకృతులు రచించినాడు. అతని కుమారుడు సోమన ప్రభులింగలీలలను ద్విపదకృతి కన్నడమునుండి తెనిగించెను.

ద్వితీయ ఘట్టము : 15-16 శతాబ్దులు : శ్రీ తిరుపతి క్షేత్రమున సంకీర్తనాచార్యులగు తాళ్ళపాకవారితో ద్విపదవాఙ్మయ చరిత్రమున ద్వితీయఘట్టము ప్రారం భము. వీరిలో ప్రథములు ప్రసిద్ధులు అన్నమయ్యగారు 'శృంగారమంజరి' అను ద్విపదకృతిని రచియించిరి. ఆయన కుమారుడు పెద తిరుమలయ్య హరివంశము రెండు భాగములు ద్విపదగా నొనర్చెను. కాని యది కానరా లేదు. అతని కుమారుడు చిన్నన్న. ఈతడు ద్విపదకావ్య కర్తలలో నగ్రగణ్యుడు. ఈతని కృతు లన్నియు ద్విపదలే. అవి పరమయోగివిలాసము, అష్టమహిషీకల్యాణము, ఉషాకల్యాణము అనునవి. ఈతడు పాల్కురికి సోమ నాథుని ద్విపదలలోని వైలక్షణ్యములను తొలగించి 'ద్విపద యే పాదమున కాపాదము విడివడి యుండవలెను. ద్విపదతో ద్విపద సంధిల్లకూడదు' అను నియమముల నేర్పరచినాడు. దినమున కిట్టి నియమములతో వేయి ద్విపదలు రచించువాడు. ఈ తాళ్ళపాకవారి రచనలతో సమకాలికముగ పేర్కొనదగిన ద్విపదరచయితలు గలరు. వారి రచనలు చిన్నన్న నియమముల ననుసరించియుండెను. భద్రకవి లింగకవి దేవాంగపురాణము, సానందోపాఖ్యా నము అను రెండు ద్విపదకృతులను, పచ్చ కప్పురపు తిరువెంగళకవి చొక్కనాథచరిత్రమును రచించినారు. ఈ గ్రంథములతో సమకాలికములగు నాదెండ్ల గోపమంత్రి కృష్ణార్జునసంవాదకృతియు, చదలువాడ మల్లన రుక్మాం గదచరిత్రమును నీ సందర్భమున పేర్కొనదగినవి. ద్విపద బాలభాగవతకర్త దోనేరు కోనేరునాథుడు ఉత్తమ ద్విపద కవి. తంజావూరి నాయకరాజులలో రఘునాథ నాయ కుడు ద్విపద నలచరిత్ర, అచ్యుతాభ్యుదయము అను కృతుల రచించినాడు. వీనిలో రెండవది లభ్యము కాలేదు. అతని కుమారుడు ద్విపద రఘునాథనాయకాభ్యుదయ మునకు గర్త.

తృతీయ ఘట్టము : 17 - 19 శతాబ్దులు : ఉత్తర ప్రబంధయుగములో భారతమునకు ద్విపదానువాదము తిమ్మన, బాలసరస్వతి, సోమన యనువారిచే రచితమైనది. భాగవతము పేకుమళ్ల రంగశాయికవి ద్విపదగా సంతరించి నాడు. వీని యన్నిటికంటె ప్రశస్తరచన కట్టా వరదరాజు ద్విపదరామాయణము. ఇది రామాయణద్విపదలలో నెల్ల పెద్దది; సరళమును, జాతీయమును నగు రచన. ఇవి యన్నియు పదునారు, పదునేడు శతాబ్దులలోనివి.

పదునేడు, పదునెనిమిదవ శతాబ్దులలో ద్విపదకావ్య కవులు శైవ వైష్ణవ మతానుయాయులు చాలమంది కలరు. వారిలో పేర్కొనదగ్గవారు శైవమున మరిబసవ పురాణకర్త బచ్చు సిద్ధకవి, వీరశైవాచారసంగ్రహకర్త పర్వతమంత్రి లింగన, నవచోళచరిత్రకర్త పోలిశెట్టి లింగన, యోగీశ్వరవిలాసకృతికర్త సిద్ధేంద్రయోగి, భక్షాణ చరిత్రకర్త చితారు గంగాధరుడు; వైష్ణవమున శ్రీనివాస విలాససేవధికర్త శ్రేష్ఠలూరి వేంకటార్యుడు, శ్రీ రంగ మాహాత్మ్యకర్త ముకుందయోగి, నలచరిత్రకృతికర్త చక్రపురి రాఘవాచార్యుడు, శశిరేఖాపరిణయకర్త శేషము చెన్నుభట్టారకుడు, ఆదిలక్ష్మీవిలాసకర్త రెంటూరి భావయామాత్యుడు, ముద్వార్తవైభవము కర్త అనంత కవి ముఖ్యులు. దక్షిణాంధ్ర వాఙ్మయమున ద్విపద రచ యిత దర్భా కవిగిరి రుక్మాంగదచరిత్ర, భోసల ఏకోజి రామాయణము, పరమానందతీర్థుని శివజ్ఞాన మంజరి పేర్కొనదగినవి.

క్రీ.శ. 1840 ప్రాంతముల వెలసిన కవయిత్రి తరిగొండ వెంగమాంబ రాజయోగసారమును, భాగవతముపంద్రెండు స్కంధములును ద్విపదగా వ్రాసినది. ఈ కాలమునుండి ద్విపద రచన ప్రాయికముగా నశించినదని చెప్పవచ్చును.

అద్యతన కాలమున మామిడన్న సుభద్రమ్మగారి యధ్యాత్మరామాయణ ద్విపదరచనయు, గార్లదిన్నె సుబ్బ రాయకవిగారి హరిశ్చంద్ర రచనయు, పళ్లె పూర్ణప్రజ్ఞా చార్యులవారి ద్విపదమేఘదూతయు పేర్కొనదగినవి.

ద్విపదలు తొలుత శైవవాఙ్మయముతో ప్రారంభించినను తక్కిన మతములకుగూడ సంబంధించినవి కలవని తెలియ నగును. ద్విపదరచనయందు భాష, భావము, వస్తువు దేశీయమై జాతీయమై, నైసర్గికమై వెలయుటచేత నది తెలుగువారి 'స్వంత యాస్తి'గా పరిణమించినది.

ద్విపద పేరునకు సంస్కృతమైనను, ఆ భాషలో కావ్యరచన లేదు; సాజాత్యములైన తమిళ, కన్నడ, మలయాళ భాషలలో లేదు. కావున దాక్షిణాత్య సారస్వతములలో తెనుగుసాహితీరీతుల ప్రత్యేకవిశిష్టత ప్రదర్శించినది ద్విపదయే యని చెప్పవలెను. **ని. వెం. రా.**

**ద్వ్యర్థికావ్య కవులు :** ద్వ్యర్థికావ్యము అనగా రెండర్థములు కల కావ్యము. రెండర్థములేకాక మూడర్థములు, నాలుగర్థములు నేర్పడునట్లు నిర్మింపబడిన అనేకార్థక కావ్యములుకూడ తెలుగులో కలవు. ఇవి యన్నియు నొకే యర్థమును, లేక యొకే చరిత్రమును ఉపయోగించు కావ్యములకన్న వేరు జాతిలోనివి. ఈ యనేకార్థక కావ్యము లన్నిటికి 'ద్వ్యర్థి కావ్యము'లను పేరు ఉపలక్షణము.

తెలుగులో మనకు దొరికినంతలో తొలి ద్వ్యర్థి కావ్యము రాఘవ పాండవీయము. అది పింగళి సూరనార్యకృతము. అంతకు ముందుకూడ ద్వ్యర్థికావ్యములు వ్రాసిన కవులున్నట్లు సూరన రచించిన 'భీమన తొల్లి చెప్పె' నను పద్యమువలన తెలియుచున్నది. ఆపద్యమువలన వేములవాడ భీమన వ్రాసిన ద్వ్యర్థికావ్య మానాటికే లుప్తమైనదనుట స్పష్టము. అది యట్లు లుప్తమైనను, దాని యునికి వాస్తవమని మాత్ర మంగీకరించి తీరవలయును; ఏమనగా-అథర్వణుడు తన కారికలలో 'శ్లేషే స ఖండ నిర్బింద్వోః మేళనం కుత్రచిన్మతమ్' అని సబిందు, నిర్బిందుకములకు ప్రాస గూర్చుట శ్లేషకావ్యములందే పనికివచ్చునని తెల్పెను. పై కారిక భీమకవి వ్రాసిన ద్వ్యర్థికావ్యమునుగూర్చియే అయియుండునని యూహింపదగియున్నది.

సూరన తర్వాత ద్వ్యర్థికావ్యరచనారీతికి వన్నె పెట్టినవాడు భట్టుమూర్తి. అతని 'హరిశ్చంద్ర నలోపాఖ్యానము' అతనికి సహజములగు ప్రతిభా బల సౌందర్యములను వ్యక్తీకరించుచు నీ రకపు గ్రంథములకు నాయకమణిగా నున్నది. సూరన, భట్టుమూర్తుల ఒరవడిలో మరి యైదు ద్వ్యర్థికావ్యములు తెలుగులో వెలసినవి. పోడూరి పెదరామామాత్యుడు 'శివరామాభ్యుదయము'ను, పిండిప్రోలు లక్ష్మణకవి 'లంకావిజయము' లేక 'రావణదమ్మీయము'ను, మంత్రిప్రెగడ సూర్యప్రకాశము 'కృష్ణార్జున చరిత్రము'ను, లంక మృత్యుంజయుడు 'ధరాత్మజాపరిణయము'ను, బుక్కపట్టణము వెంకటాచార్యుడు 'అచలాత్మజా పరిణయము'ను రచించిరి.

ఈ ద్వ్యర్థికావ్యములే కాక రెండు త్ర్యర్థికావ్యములును, ఒక చతురర్థి కావ్యమును గూడ వచ్చినవి. నెల్లూరి వీరరాఘవకవి వ్రాసిన 'రాఘవ యాదవ పాండవీయము'ను, ఎలకూచి బాలసరస్వతి వ్రాసిన 'యాదవ రాఘవ పాండవీయము'ను త్ర్యర్థికావ్యములు. ఓరుగంటి సోమశేఖరుడు వ్రాసిన 'రామకృష్ణార్జునరూపనారాయణీయము' చతురర్థికావ్యము. పైని చెప్పిన ద్వ్యర్థి, త్ర్యర్థి, చతురర్థి కావ్యములలో కూడ కొన్ని కేవలము వినబడునవియే కాని కనబడుటలేదు.

పింగళి సూరన : పింగళి సూరన రచించిన రాఘవ పాండవీయములోని శ్లేష నానార్థ నిఘంటువు లందలి ఏకాక్షర నియమములనుబట్టి క్లిష్టముగా కూర్పబడినది కాక పోవుటవలన నీ కావ్యము సులభగ్రాహ్యమగు తీరులోనే నడచినది. చూడుడు :

> 'ఏనుం గని కర మరయక
> బూనిరిఁ గా కిట్టియెడలఁ బొసఁగునె యేయన్
> గానమె కాల నియమగతి
> తో నావేఁట మునియుగముఁ ద్రుంగించెఁ దుదిన్'

ఇట రామాయణార్థమున 'ఏనుంగు + అని', 'కానమె + కాలనియమగతి' అనియు, భారతార్థమున 'ఏనుఁ + కనికరము', 'కాన మెకాలు + అనియమగతి' అనియు దెనుగుమాటలు సభంగశ్లేషతో విడివడి సొగ సొదవించును. మరియు

> 'నెలకొనియె వేటతమి న
> బ్బలియుఁడు శిశిరనగరుచిర పరిసర మహిమం
> గల తమస తీర సికతా
> విలసనములు డెందమునకు విం దొనరింపన్'

అనుచోట—రామాయణార్థమున 'శిశిరనగరుచిర పరిసర మహిమం గల తమస, తీర, సికతావిలసనముల' (చల్లని చెట్లతో నందమైన ప్రాన్తమహిమ గల తమసానదియొడ్డున నిసుకతిన్నెలందు) అనియు, భారతార్థమున 'శిశిర నగరుచిరపరిసరమహి, మంగళతమ, సతీ, రసికతా విలసనములు' (మంచుకొండ ప్రాంతభూమియందు మంగళకరములైన తన భార్యల రసికతా విలాసములు) అనియు సంస్కృత పదములు చాల సులువుగా విడివడి యింపు గొల్పును.

ఈ గ్రంథము నందలి శ్లేషమార్గములనుగూర్చి యీ కవియే మొట్టమొదట కొన్ని నియమముల నేర్పరచుకొని వానిని కృత్యారంభమున నొక సీసపద్యములో వివరించినాడు. అవి ఆరు విధములైనవి :

(1) తెనుగునకును, సంస్కృతమునకును శ్లేష : అది మాట విరుపువలన గాని, లేకకాని యేర్పడును.

(2) ఏ భాషలో నాభాషపదములందే శ్లేష.

(3) ముఖ్యగౌణవృత్తిశ్లేష - అనగా వాచ్యార్థమునకును, లక్ష్యార్థమునకును శ్లేష.

(4) పదార్థములను వేరు వేరుగ నన్వయించుటవలన నేర్పడు శ్లేష.

(5) పదములను వేరు వేరుగా నన్వయించుటవలని శ్లేష.

(6) పైన చెప్పిన శ్లేష లొకటి, రెండు, మూ డొక చోట నుండుట.

వీ టన్నింటిని క్రమముగ నుదాహరణముల ద్వారమున కనుగొందము.

1. తెనుగునకును, సంస్కృతమునకును శ్లేష (ఆంధ్ర భాషా, సంస్కృతభాషా శ్లేష):

'మనవి యుక్తి తెఱంగు మీక నినదడవి
నవయ నేటికి ?...................... (ఆ.1, ప.38)

రామాయణార్థమున — 'మనవి = విన్నపము, ఉక్తి తెఱంగు = మాటాడు తీరు' అని తెనుగుభాష. భారతార్థమున 'మన, వియుక్తి తెఱంగు = మన యెడబాటుతీరు' అని సంస్కృత భాష.

2. ఉచిత శబ్దశ్లేష (ఏ భాషలో నా భాషాపదముల సభంగశ్లేష):

'ఏనుం గని కర మరయక
బూనితిఁగాక.........' (ఆ.1, ప.25)

రామాయణార్థమున—'ఏనుంగు + అని, కరము + అరయక = గజమని విచారింపక'; భారతార్థమున 'ఏనున్ + కనికరము + అరయక = నేనుగూడ జాలి తలంపక' అని తెనుగు పదములలోనే సభంగశ్లేష.

ఇట్లే సంస్కృత పదములలోనే సభంగశ్లేషకు—

'ఎందు వేటరారె యితరు లేమనసుతో
దార సంగ సుఖము దప్పఁ ద్రోచి
తకట! పాండురాజ యశ మెన్నవైతివి
క్రూర దశరథేశ కులమురోయ' (ఆ.1, ప.31)

అను పద్యము నుదాహరణముగా గ్రహింపవచ్చును. ఇందు రామాయణార్థమున—'ఇతరులు + ఏమన, సుతోదార సంగసుఖము, దశరథేశ, పాండుర + అజ + యశము = (ఏ మనదగును? అన్యులు వేటకు రారా? బిడ్డ చేరికవలన గలుగు సుఖమును బోగొట్టితివి. దశరథ మహారాజా! నీ తండ్రియగు నజమహారాజు తెల్లని కీర్తిని విచారింపవైతివి), అనియు, భారతార్థమున 'పాండురాజ! ఏ మనసుతో = ఏ యాశయముతో దార సంగసుఖము = భార్య చేరిక వలని సౌఖ్యమును, తప్ప ద్రోచితివి? క్రూరదశన్ = క్రౌర్యముచేత, రథేశ కులము = రథికుల కులము, రోయన్ = అసహ్యించుకొనగా, ఎన్నవైతివి = తలంపవైతివి' అనియు సంస్కృత పదముల మధ్యనే సభంగ శ్లేష.

3. ముఖ్య గౌణవృత్తిశ్లేష (అభిధేయమునకును, అముఖ్యములగు గౌణ లక్ష్యములకును శ్లేష):

'త్రిజగన్మోహనతన్ వసంతఋతు వీరీతిన్ బ్రకాశింపఁగా
యజమానత్వరసప్రకర్ష మహిమన్ వ్యాప్తిన్ విజృంభించె, ది
వ్య జనుల్ మెచ్చ నతాంతసంయమిత విశ్వామిత్రమౌనీశ బు
ద్ధి జయప్రౌఢిని మించు శెంతయు ధరిత్రిన్ వేట తెల్లంబుగాన్' (ఆ.2, ప.8)

రామాయణార్థములో 'విశ్వామిత్ర' పదమునకు గల విశ్వామిత్రముని యను రూఢ్యర్థమునకును, భారతార్థములో 'విశ్వ + అమిత్ర' = ప్రపంచమున శత్రువులు గల, అనగా — అరిషడ్వర్గమును జయించిన యని యోగార్థమునకును శ్లేష. రూఢ పదమందలి రూఢ్యర్థమును వీడి, యోగార్థ మాత్రమును స్వీకరింపవలసినచో లక్షణ తప్పదు కనుక నిది ముఖ్య గౌణవృత్తి శ్లేష యగును.

4. పదార్థమును వేరు వేరుగా నన్వయించుట:

'ధృతిఁ గుంతి మద్ర భూపతుల నెయ్యపుఁగన్య
కలనన వాలు దూపుల జయించి...'

ఇందు 'కన్యకలన్ = కన్నియలను' అను పదము నర్థము భారతార్థమున ముందున్న 'అతనుజయశ్రీల' అనుదాని యర్థముతో నన్వయించును. రామాయణార్థమున 'కన్య = అప్రౌఢమైన, కలనన = యుద్ధమునందు' అని 'కలన' పదము నర్థముతో నన్వయము. ఇట్లు 'కన్య' పదార్థము భిన్న భిన్నముగా నన్వయించుచున్నది.

5. పదముల విభిన్నాన్వయము: ఈ శ్లేష మార్గమును కూడ పై పద్యపాదముననే చూడవచ్చును. ఇందు రామాయణార్థమున 'జయించి' యను పదము 'వరియించె' ననుదానితో హేతువుగా నన్వయించును. రాజుల జయించుటవలన జయలక్ష్ముల నందగలిగెనని తాత్పర్యము. ఇక భారతార్థములో ఈ 'జయించి' అను పదము 'అలరారు' అను ముందరి పదముతో నన్వయించును. జయించి విలసిల్లునట్టి యని యర్థము.

6. రెండు మూడు రకముల శ్లేషల సాంకర్యము: ఇదియు పై పద్యపాదములోనే 'కన్యకలనన' అనుచోట నున్నది. ఇచట తెనుగు సంస్కృత పదముల శ్లేషయు, శబ్దార్థముల విభిన్నాన్వయ శ్లేషయు సాంకర్యము పొందినవి.

పైన పేర్కొన్న షడ్విధ శ్లేషమార్గములను సూరన్న తన ద్వ్యర్థికావ్యమున నుపయోగించెను. సామాన్యముగ శ్లేష కావ్యము లనబడు గ్రంథములం దంతటను గూడ నీ శ్లేషలు వాడబడుచునే యుండును. కాని కడమవారు, అనగా పింగళి సూరన్నకు దరువాతివా రెవ్వరునుగూడ నీ శ్లేష

విభాగములను పేర్కొనలేదు. అయినను, ఈ మార్గము లన్నియు వారిలో గూడ కన్పడుచునే యున్నవి. కాని, ఇతనివలె ధారాళమైన శైలిలో శ్లేషను నడపి యొక రమ్యమైన కావ్యముగా దీర్పగలశక్తి కొలదిమందిలో మాత్రమే కన్పడుచున్నది.

మహాకావ్యతానిరూపకములగు నగరార్ణవశైలర్తు మృగయాది వర్ణనలు 'రాఘవ పాండవీయము'లో నటనట హృదయంగమములై కథ కుంటువడని తీరున గూర్పబడి యున్నవి. పద్యములలో ఉత్సాహము, మాలిని మొదలగు వృత్తవిశేషములు లేకపోలేదు. కాని సీసములే చాల వరకు గూర్పబడినవి. ఈ సీసముల యాధిక్యమును భట్టుమూర్తి తన 'హరిశ్చంద్రనలోపాఖ్యానము'లో గూడ ననుసరించెను.

ఈ గ్రంథమున ముఖ్యముగ గ్రహించి యాస్వాదింప వలసినది కథాద్వయ మేళనచాతుర్యము. కవి రామాయణ, భారత కథల రెండింటియందును బలము, పరాక్రమము, పౌరుషము మొదలగునవి సమానముగా గల వారినే ఏర్చి జోడించెను. దశరథుడు, పాండురాజు; శ్రీరామాది చతుష్టయము, ధర్మజాది పాండవ పంచకము; నీలుడు, ధృష్టద్యుమ్నుడు; సుగ్రీవుడు, కర్ణుడు; హనుమంతుడు, భీముడు - ఈ విధముగ జోడింపబడినారు. అచేతన విషయములందు గూడ అయోధ్య హస్తినతోను, దండకారణ్యము ద్వైత వనముతోను జోడించి వర్ణింపబడినవి.

ద్వ్యర్థికావ్యమేయైనను 'రాఘవ పాండవీయము'లో శయ్యా, పాక, గుణాలంకార, వృత్తి రీతులను విస్పష్టముగ గుర్తింపవచ్చును. 'యా పదానాం పరాఽన్యోన్య మైత్రీ శయ్యేతి కథ్యతే' అను ప్రతాపరుద్రీయ నిర్వచనమును బట్టి శయ్యకూడ శబ్దగుణమైన శ్లేషవంటిదని స్పష్టమగుచున్నది. అది కావ్యముననేకాక, ఈ కవి రచించిన ఇతర కావ్యములందుగూడ చాల సొగసుగా నున్నది. అసలితడు శయ్యనే ప్రథమ గణ్యముగా పేర్కొనుచున్నాడు. 'పొసఁగ ముత్తెపు సరుల్ పోహళించిన లీలఁ దమలోన దొరయు శబ్దములఁ గూర్చి'యని కళాపూర్ణోదయములో కావ్య నిర్మాణ చాతుర్యము నిరూపించుచు మొదటనే శయ్యను దెలిపెను. మృదు, కఠిన, మధ్యమములని శయ్యలు ముత్తెరగులు. అందు రాఘవపాండవీయమందలి శయ్య మధ్యమము. రెండర్థములను గూర్పవలసి యుండుటచే చాలచోట్ల పదభంగము, అనగా మాట విరుపు ఆవశ్యకమై, పారుష్యము కొంత తప్పకపోయినను, ఆ విరుపులు అత్యంత కఠినములు కాకుండుటవలన శయ్య నాతి కఠినమై మధ్యమముగ తయారైనది.

రామరాజ భూషణుడు: ఇతడు రచించిన 'హరిశ్చంద్ర నలోపాఖ్యాన' మను ద్వ్యర్థికావ్యము 'రాఘవపాండవీయము'కన్న సర్వవిధముల నుత్తమమైనదని ప్రశంస లందినది. రాఘవపాండవీయముకన్న హరిశ్చంద్రనలోపాఖ్యానము ముందు రచింపబడినదని కొందరి యభిప్రాయము. కాని సూరన్న తనకు పూర్వమందు భీమకవి గ్రంథప్రసక్తి మాత్రమే యున్న దనెను. అత డసత్య మాడె ననుటకు తగినంత యాధారము లేదు.

'రాఘవ పాండవీయము'లో గనుపడు లోట్లన్నింటిని సవరించుకొనుచు రచించినట్లుగా 'హరిశ్చంద్రనలోపాఖ్యానము' కన్పట్టుచున్నది. కథామేళనము మున్నగువానియందు రాఘవపాండవీయమున గొన్ని లోపములు గలవు. రామాయణ, భారత కథలను జోడించుటలో కొన్ని సందర్భములందు మూలకథలకు విరుద్ధముగ కవి కథలను మార్చెను. సరయూతీరమున దశరథునకు ముని శాపము సంభవించినట్లు రామాయణము చెప్పుచుండగా తమసాతీరమున అని రాఘవపాండవీయమున చెప్పబడెను (ఆ. 1, ప. 18). ఇట్లే భారతకథలోని కుంతీపాండు సంవాదమును సుసంగత మొనర్చుటకై రామాయణ మూలకథలో లేని వసిష్ఠ, దశరథ సంవాదమును గూర్చెను (ఆ. 1, ప. 39-50); భారత కథలోని నారదాగమనమును మేళవించుటకుగాను రామాయణ కథలో శ్రీరామ, పరశురామ సంవాదసందర్భమున నారదాగమనమును కల్పించెను. ఇట్టి వింకను ఎన్నో కలవు.

'హరిశ్చంద్రనలోపాఖ్యానము'లో కథాసంఘటనము నిర్దుష్టముగాను, చాల సొగసుగాను ఉన్నది. రాఘవ పాండవీయకర్త తనకు మూలగ్రంథములు రామాయణ, మహాభారతాదులని చెప్పి (కృత్యాది మూడవ పద్యము) వానికి విరుద్ధముగా మార్పులు, చేర్పులు చేసెను. రామరాజ భూషణుడుమాత్ర మట్లు కాక మూలగ్రంథములలో లేనివియు, శ్లేషోపయోగమునకై కల్పించిన వనదగినవియునైన విషయములు లోకప్రసిద్ధములని ప్రౌఢముగాసూచించినాడు (ఆ. 1, ప. 5).

వర్ణనలు చేయుటలో రామరాజభూషణుడు సిద్ధహస్తుడు. రాజహంసవర్ణనము సంస్కృత నైషధకావ్యమునుగూడ మిగిలియున్నది. మునులను, జలపక్షులను శ్లేషతో వర్ణించిన పట్టు హృదయంగమముగ నున్నది. వేట, వేషవర్ణనములును, మాయాకురంగమును హంసను జోడించి వర్ణించినపట్టులును, ముని హంసలను, మాతంగీ విరహిణులను, తాడిత మాతంగస్త్రీలను నారదుని జోడించిన వర్ణనలును సొగసులు వెదచల్లుచున్నవి.

రామరాజభూషణుడు తన శ్లేషపద్ధతులను పింగళి సూరన్నవలె తెల్పకున్నను, దీనియందలి శ్లేష లన్నియు రాఘవ పాండవీయ మార్గముననే నడచినవి. రాఘవ పాండవీయమునందలి శ్లేషమార్గము లన్నియు నిందు గలవు. భాషాపాండిత్యమును విచారించినచో నీ భట్టుమూర్తికి సంస్కృతమున నున్నంత స్వాతంత్ర్యము తెలుగులో నున్నట్లు కన్పడదు. ఇతని గ్రంథమునందలి శ్లేష లించుమించుగా నూటికి తొంబదిపాళ్ళు సంస్కృత భాషకు సంబంధించినవే! తెనుగులో సభంగాభంగశ్లేష లెక్కువగా వాడబడలేదు. కాని కవితాశిల్పము మాత్రము రాఘవపాండవీయముకన్న చాల మిన్న యైనది. కథల మేళనముకూడ మెరుగైనది. అప్పకవి తెల్పిన బహువిధ కవులలో ఈకవిని 'భూషణార్థికవి'గా నెన్నవచ్చును.

శ్రవణపేయములైన శబ్దాలంకారముల శోభయు, మనోహరములైన యర్థాలంకారముల సౌభాగ్యమును ఈ కావ్యములో నడుగడుగునను వెల్లివిరియుచున్నవి. కంద, శార్దూల, మత్తేభాదులుకూడ నున్నను రాఘవపాండవీయములోవలెనే సీసములు చాల తరచుగ కూర్పబడినవి.

బుక్కపట్టణము వెంకటాచార్యులు : 'సర్వతంత్ర స్వతంత్ర', 'శ్లేషయమకచక్రవ' ర్తీత్యాది బిరుదాంకితుడు శ్రీమత్తిరుమల బుక్కపట్టణము వెంకటాచార్యులు వ్రాసిన 'అచలాత్మజా పరిణయము' అను ద్వ్యర్థికావ్యము గుణమునుబట్టి పై రెండు కావ్యముల తరువాత పేర్కొనదగినది. నిజాం రాష్ట్రములోని సిరిపురసంస్థాన విద్వాంసుడీయన. ఈ కవి కాలము స్పష్టముగ తెలియవచ్చుట లేదు. కావ్యముకూడ అసమగ్రముగానే దొరకినది. లక్ష్మీ. పార్వతుల వివాహకథ లిందు శ్లేషభంగిలో గూర్పబడినవి. అచలా + ఆత్మజ = భూదేవి కుమార్తె 'సిరి' యనియు, అచల + ఆత్మజ = కొండకూతురు 'పార్వతి' యనియు రెండర్థములను బోధించునట్లు అచలాత్మజాపరిణయ మను నీ కావ్యనామముగూడ ద్వ్యర్థిగ గూర్పబడినది.

కవిత్వ విషయమున రాఘవపాండవీయ, హరిశ్చంద్ర నలోపాఖ్యానములంతటి ప్రౌఢిమ గాని, సౌందర్యము కాని ఇందు గన్పట్టదు. కాని ముందు చెప్పబోవు 'రావణ దమ్మీయము' కన్న అందముగా నున్నది.

'పొదలపై బొదలు తుమ్మెదల సమ్మదలస
స్మృదుల గానముల సంపదల నలరి
గిరులపై వరలు పెన్ దరుల నిర్ఝరుల తుం
పురుల చల్వల పరంపరల నరసి...'

అనుప్రాస సంపత్తియు,

'సరసపద క్రమమ్ములు బొసంగెడి సొంగతురంగపుంగవో
త్కరములు పద్మరాగములుదారకళం దగు పుష్యరాగముల్
బరగు నవక్ర చక్రములు పాటిలి యున్న పురీరథాళికిన్
గురథము తున్కలైనవతగ్రుంకిన సాటియనంగ జెల్లునే'

ఇట్టి కల్పనాచాతురియు నడుగడుగున నీకావ్యమున నెదురగును. ఈ కవియు తన శ్లేషపద్ధతులను పేర్కొనకున్నను వెనుకటివారు పెట్టిన యొరవడిలోనే తన కావ్యమును నడపెను. ఉదాహరణమునకు ;

1. సంస్కృతాంధ్ర భాషాద్వయశ్లేష : 'జడజారి కళలతో కడు వేడుకల నుండు ప్రమథవల్లభుని వైరాగ్య మెంత?' అనుపాదమున 'జడజారి = జలజారి, చంద్రుఁడు' అను సంస్కృత పదముగను, 'జడ జారి' అని తెలుగు పదముగను నర్థద్వయమును బోధించుచున్నది.

2. ఆంధ్ర శబ్దార్థశ్లేష : 'వెలిద్విజు వెక్కిరింతలు సల్పఁదగునట్టి జలజసంభవుని యాచార మెంత?' అనుచో 'వెలి' యను తెలుగు పదము 'తెల్లని' అని యొక అర్థమును, 'వెలివేయబడిన' అని మరియొక అర్థమును బోధించుచున్నది. 'పగలె పుష్పిణియైన పద్మిని గలసి భాసిలు హేళి కర్మసాక్షిత్వ మెంత?' అను పాదమందలి సంస్కృత భాషార్థశ్లేషయు, 'పంకలగ్నత లేని పద్మినుల్ ప్రియుని నర్ధాంగికృతుని జేయనట్టి సతులు' ఇత్యాదియగు పద్యమందలి శ్లేషానుప్రాణితమైన న్యూనతాద్రూప్య రూపకమును హృదయంగమములు.

కాని, యీ వెంకటాచార్యుల కవితలో వ్యర్థపదములు చాలగా నుండును. శ్లేషసంగతికైకూడ కొన్ని పదములు కూర్చబడుచుండును. అచలాత్మజా పరిణయములో కథాద్వయ శ్లేషగల పద్యముల నడుమ సమాన వర్ణనలు,— అనగా పుర, వారవనితా, గజ తురగాదికముల వర్ణనలు చేయు పద్దెము లధికముగా గూర్పబడినవి. శ్లేషయు అర్థశ్లేషగా నుండును. ఈ యర్థశ్లేష రెండు భాషలకును, ప్రత్యేక మొక్కొక్క భాషకును గూడ నున్నది.

మొత్తముమీద ఈ గ్రంథములో కథాసందర్భమున రెండర్థములు గల పద్యములు చాల తక్కువ. ఆ శ్లేషయు ప్రౌఢము కాదు ; చాల సామాన్యమైనది. ఏకార్థక కావ్య సామాన్యములో నీ కావ్యము కొంచెము మెరుగు. దండకము, రగడ, లయగ్రాహి మొదలగు వృత్తవిశేషము లిందు గూర్పబడినవి. అలంకారములు నున్నవి. ధార సామాన్యమైనది. శ్లేషాది గుణములును సామాన్యముగా గూర్పబడినవే కాని విశిష్టధోరణిలో లేవు. అయితే కవితలో శయ్యామాధుర్య మున్నది. ఈ కారణమున అనుప్రాసాదులు భావాంతర్లీనములు కాక పృథక్కుగా గోచరించుచున్నను వెంటనే వెగటుగా తోచవు. ఏతావతా,

ఇది శయ్యాలంకారముల దక్క కడమ విషయములలో విశిష్టముగా గ్రహింపదగినట్లు తోపదు.

పిండిప్రోలు లక్ష్మణకవి: తూర్పు గోదావరిజిల్లా, కుయ్యేరుగ్రామమున క్రీ. శ. 18 వ శతాబ్ది ఉత్తరార్ధమున జీవించియుండిన యీ కవి ' రావణదమ్మీయ 'మను ద్వ్యర్థి కావ్యము రచించెను. ఈ కావ్యమును క్రీ. శ. 1797 లో శ్రావణ మాసమున నారంభించెను. ఈ కవి సహస్రమాస జీవి. క్రీ. శ. 1840 ప్రాంతమువరకు జీవించియున్నట్లు నిదర్శనము లున్నవి.

' ఆరెవెట్ట ' (ఆర్యవట)మను నూర నుండెడు దమ్మన్న యను నామాంతరము గల ధర్మరాయ డనువెలమ ' కుయ్యేరు గ్రామము గుత్తసేసి ' కవికి చెందిన యందలి లంకమాన్యము బల్మిని హరింపగా ' తత్ప్రాప్తికై రాము కథయును, మన కథయును జతగాగ నర్థంబు ఘటనపరచి ' కృతి రచియింపుమని తన తండ్రి కలలో కనిపించి ఈ 'రావణ దమ్మీయ'రచనకు తనను ప్రేరేపించినట్లు కవి కృత్యాదిని చెప్పుకొనెను.

ఈ గ్రంథము తిట్టుకవిత్వము. కూచిమంచి జగ్గకవి తరువాత నీతడే తెలుగున తిట్టు కవిత్వము చెప్పెను. కాని జగ్గకవి రచించిన చంద్రరేఖావిలాపము ప్రత్యక్షముగా దిట్టును. ఈ గ్రంథ మట్లుకాక రాఘవార్థమును మాటుగా బెట్టుకొని తిట్టును. ఇతడుకూడ 'రాఘవ పాండవీయము 'న గల శ్లేష ప్రకారముల నన్నిటిని వాడినవాడే! కాని ఆ గ్రంథము నందువలె నీతని గ్రంథమున శ్లేష సుగమముగాను, సులభముగాను ఉండదు. ఇతడు తెలుగునందు మంచి విజ్ఞానము కలిగియున్నను సంస్కృతమున నెక్కువ పాండిత్యము కలిగియున్నట్లు కనబడదు. ఈతని గ్రంథములో నట నట సంస్కృత పదములకడ కొలదిగ వ్యాకరణ విరోధమును, కర్ణకఠోర్తియు కన్పడుచున్నది. వర్ణనాంశములందుకాని, కథల మేళనమందుగాని చెప్పదగినంత ప్రౌఢిమ కన్పడదు. కవితలో కొంతభాగమున—

> ' అనియు శ్రీధరాభవాపహరణుఁడగు
> యాతుభీతికర బలాఢ్యు నిను ర
> మేను రెండు నగుచు నెనఁగు నంబకముల
> గంటి చేసి యలయకమును గదిమి '

వంటి నడకలో కుంటువడిన కొన్ని పద్యము లున్నను ధారాశుద్ధి కలిగి యమకానుప్రాసాది సుభగములైన పద్యములుగూడ ననేక మున్నవి. చూడుడు :

> 'తమ్ములు నీదు పల్కులు హితమ్ములుగాఁ గొని చేయు నార్యజా
> తమ్ములు నీదు సద్గుణశతమ్ములు సంస్తుతిసేయఁ బక్షపా
> తమ్ములులేక న్యాయకలితమ్ములుగాఁ గ్రియలొప్ప సర్వభూ
> తమ్ములు విశ్వసింప సుకృతమ్ములు వర్ధిలునట్లు చేయుమీ ! '

ఈ కవియు అట నట వర్ణనలు చేసి యున్నాడు (చూ. ఆ. 1, ప. 147, 155; ఆ. 2, ప. 43). అవియు కొంత వరకు హృదయంగమములుగానే యున్నవి. కాని, మొత్తముమీద నీతని కవిత్వ మెక్కువ ప్రౌఢమైనదనికాని, ఉత్తమశ్రేణికి చెందినదనికాని చెప్పుటకు వీలులేదు. ఇతని దీ గ్రంథమే కాని మరొకగ్రంథము కానరాదు.

ఈ లక్ష్మణకవిని గూర్చి చాల కథలు ప్రచారములో నున్నవి. వాటిలో నీతని ప్రౌఢిమను గూర్చిన చాల కథలు సత్యములని విశ్వసింపవచ్చును. కాని ఈ కవి ' రావణ దమ్మీయ'మని మొదట గ్రంథమునకు పేరిడగా శిష్టు కృష్ణమూర్తిశాస్త్రిగా రాక్షేపింప నీ కవికి సంస్కృత వ్యాకరణజ్ఞానము చాలమిచే భయపడి దానిని ' లంకావిజయము 'గ మార్చె ననుకథవంటివి కొన్ని విశ్వసింపరానివియు కలవు.

ఇతర ద్వ్యర్థికావ్యకవులు : పై నలుపురే కాక కృష్ణాధ్వరియను కవి ' నైషధ పారిజాతీయము'ను, క్రొత్త లంక మృత్యుంజయకవి ' ధరాత్మజా పరిణయమును ', నెల్లూరి వీరరాఘవకవి ' యాదవ రాఘవ పాండవీయము ' అను కావ్యమును రచించిరి. వీనిలో నైషధ పారిజాతీయము తంజావూరు సరస్వతీమహలు గ్రంథ భాండాగారమున గలదు. రెండవది ఇంతవరకు దొరకలేదు. మూడవది క్రీ.శ. 1888 లో పూండ్ల రామకృష్ణయ్యగారిచే ముద్రింపబడినది. ఇక మిగిలిన త్ర్యర్థి, చతురర్థి కావ్యము లసలే లభింపలేదు.

కావ్యములు ఉత్తమము, మధ్యమము, అధమము అని మూడు రకములు. కొంద రుత్తమోత్తమమని ఇం కొక రకమునుగూడ నిందు జేర్చి, మొత్తము నాలుగు విధము లందురు. ఈ విభాగమున కంతకు మూలము వ్యంగ్య వైభవము.

ద్వ్యర్థికావ్యము లుత్తమోత్తమ కావ్యముల శ్రేణిలో చేరజాలవు. ఈ కావ్యములలో వ్యంగ్యార్థ వైభవమునందు దృష్టి నిల్పు నవకాశమే లేక, ఎంతవరకును రెండర్థములను మూడర్థములను సరిపెట్టుటయందే దృష్టి యధికముగా ప్రవర్తించి తదనుకూలములగు పదములను వెదకుటయందే కవి మనస్సు అధికముగ పనిచేయుచుండును. అందుచేత కవికి రసదృష్టియే యుండదు. ఎక్కడనైన నొక్కయెడ నుండుచో దానిని బూర్తిగా నిర్వహించు తలంపుగాని, పట్టుదలగాని నిలువదు. అట్లు నిర్వహించుటయు జాల వరకు దుర్ఘటమే. కనుక, గుణీకృత వ్యంగ్యకావ్యములుగాగూడ నివి యంగీకృతములు కాజాలవు. అయితే, ఉపమాదీపకాతిశయోక్తి సమాసోక్త్యాద్యలంకారము లట నట నుండినను అవి నిస్తేజములై యుండి చమత్కారాతి

శయము నొదవింపలేకపోవుటవలన చిత్రకావ్యము అను అధమకావ్యముల శ్రేణిలోనే ఇవి చేరవలసినవగుచున్నవి. అలంకారములు గుణీభూతవ్యంగ్యములు అను సామాన్యోక్తి యున్నను అవి శూర్పణఖా శరీరమునందలి యాభరణములవలె ఈ రకపు కావ్యములందు ఆభరణమాత్రములై ఏమాత్రపు సొగసునుగూడ నొదవింపలేకపోగా వైరస్యము నొదవించుచునే యుండును. తెలుగులో వెలసిన ద్వ్యర్థికావ్యములు మొత్తముమీద ఉత్తమకావ్యముల వర్గమున జేరు నవకాశము లేకపోయినను రాఘవ పాండవీయ, హరిశ్చంద్రనలోపాఖ్యానములు మాత్రము కొంత మెరుగుగా కనిపించుచున్నవి.

ఒకటికన్న నెక్కువ అర్థములు ఒకే మాటచే తెలుపబడవలయుచో నట శ్లేష నుపయోగింపక తప్పదు. కవికి భాష విషయమున గొప్ప పాండిత్యమున్నగాని ఇది నెరవేరదు. ఈ శ్లేష నేకాక్షరనిఘంటువులను బట్టియు గూర్పవచ్చును. కాని

'యోజనినాగోపితః
చచార యో వల్లవాంగనా గోపీతః'(నలోదయ కావ్యము)

ఇట్టివి సుఖగ్రాహ్యంబులు కాక, రసాస్వాదమున కవకాశమీయవు. తెనుగున వెలసిన ద్వ్యర్థికావ్యములు మాత్రము అట్లు ఏకాక్షర నిఘంటువు నాశ్రయింపక శ్రోతలను, పాఠకులను ఆకర్షింపజాలునవిగా నుండుట ప్రత్యేకముగా గ్రహింపవలసిన విషయము. వే. తి.

**ధర్మసూరి, వారణాసి** (క్రీ.శ. 1414-1625 నడుమ): ఈ విద్వత్కవి వెలనాటి ఆంధ్ర బ్రాహ్మణుడు; హరితస గోత్రుడు. వాసస్థానము నేటి గుంటూరు మండలమునందలి కశేవరము. తండ్రి పర్వతనాథ సూరి. ఆగమపారదర్శియగు నీతడు దర్శనకారు లార్గుర యొక్క యవతారమట. ఈ పుంభావ సరస్వతి జనార్దనాచార్యుడను నొక వైష్ణవ పండితుని విద్వత్సభయం దోడించి యాతని వాదికేసరిబిరుదమును తాను వహించెనట. ధర్మసూరి అధీతవేద వేదాంగుడైనను విశేషించి చతుర్దశ విద్యాపారీణుడు; పదవాక్య ప్రమాణపారావారపారీణుడు; ప్రాకృతాది భాషావేత్త. తర్కసాహిత్యములందు, సంస్కృత ప్రాకృతముల కావ్యనాటకాదినిర్మాణమునందు నీతనికి మొగ్గు హెచ్చు. న్యాయశాస్త్ర వ్యసనియగు నీతని కవితమాత్రము తర్కకర్కశము కాలేదు.

ధర్మసూరి తన 'సాహిత్య రత్నాకరము'నందు ప్రతాపరుద్ర యశోభూషణకర్తయైన విద్యానాథుని (క్రీ. శ. 1268-1323) రెండు మారులును, భూపాలుని 'రసార్ణవసుధాకర' కర్త సింగభూపాలుని) (క్రీ. శ. 1330 - 1400) ఒక సారియు పేర్కొనుటచే అతడు క్రీ. శ. 1400 కంటె అర్వాచీనుడు. అప్పకవి 'అప్పకవీయము'న 'సాహిత్య రత్నాకరము'ను పేర్కొనుటచే క్రీ. శ. 1556 నాటిదగు అప్పకవీయము 'కంటె 'సాహిత్య రత్నాకరము' ప్రాచీనము. ఆంధ్రుడగు మల్లినాథుడు (క్రీ. శ. 1422) ధర్మసూరినిగాని, సాహిత్యరత్నాకరమునుగాని పేర్కొనలేదు. బహుశః వా రిరువురును సమకాలికులో, లేక ధర్మసూరి యిరువురలో నించుక నవీనుడో. క్రీ.శ. 1625 ప్రాంతములనుండి ప్రఖ్యాతినందిన సాహిత్యవేత్త, ఆంధ్రుడు నగు జగన్నాథ పండితరాయలను గాని 'రసగంగాధర మునుగాని ధర్మసూరి పేర్కొనలేదు. దీనికి కారణము బహుశః ధర్మసూరి పండితరాయలకంటె బూర్వుడని తోచును. కనుక ధర్మసూరి క్రీ. శ. 1414-1625 ల నడుమ జీవించియుండునని నుడువవగును.

ధర్మసూరి రచన లనేకములు: వీనిలో రెండు స్తోత్రములు (కృష్ణస్తుతి, సూర్యశతకము); రెండు కావ్యములు (బాలభాగవతము, హంససందేశము); రెండు రూపకములు (కంసవధ, నరకాసురవిజయము); ఒకటి సాహిత్యగ్రంథము (సాహిత్యరత్నాకరము) మొదలైనవి. సాహిత్యగ్రంథ మొక్కటి తక్క తక్కిన వన్నియు నుత్పన్నములు.

ధర్మసూరి కృతులలో కెల్ల ప్రచురముగా పాఠప్రవచనమున్నది సాహిత్యరత్నాకరగ్రంథమే. ఆంధ్రేతర మండలములగూడ దీనికి విశేషఖ్యాతి గల దనుటకు పదినాలుగేండ్లక్రింద నుత్కలదేశీయపండితునిచే నిది వ్యాఖ్యానింపబడుటయే సాక్ష్యము. ఒక నాట్యనాటకచర్చ తప్ప తక్కిన సాహిత్య విషయము లన్నియు నించుమించుగా నిందు సమీక్షింపబడినవి. మర్త్యమాత్రుడగు ప్రతాపరుద్ర మహారాజునకు తన 'ప్రతాపరుద్రయశోభూషణము' నంకిత మొనర్చిన యగస్త్య విద్యానాథుని 'కుక్షింభరి' యని పేరెత్తకుండ దూషించి ధర్మసూరి తన కృతిని రామచంద్రయశోభూషణసారసురభిళముగా రచించెను. ఇందు లక్ష్యములుగా చూపబడిన శ్లోకము లించుమించుగా నన్నియు రామచంద్ర గుణకీర్తనాత్మకములే. ఇట శృంగార మొక్కటియే రసమను భోజుని మతమును నిరసించి ధర్మసూరి సత్సంప్రదాయలోభమున అభినవగుప్తపాదాచార్యుల యభివ్యక్తిపక్షము నంగీకరించి కరుణాదులందును రసత్వమును సిద్ధాంతీకరించెను. ఈ. వేం. వీ. రా.

**ధర్మాచార్యులు, కిళాంబి** (క్రీ. శ. 1867-1927): చతుశ్శాస్త్ర నిష్ణాతులగు వీరు రామానుజీయ శ్రీ వైష్ణవ బ్రాహ్మణులు. వీరిది యజుశ్శాఖ; ఆపస్తంబ సూత్రము; ఆత్రేయగోత్రము. గృహనామము కిళాంబి. వీరి పూర్వుల

తొలి నివాసస్థానము కాంచీపుర సమీపమున, బాహా నదీతీరమునగల 'అరశాణిపాలె' మను నగ్రహారము.

విశిష్టాద్వైత సిద్ధాంతోద్ధారకులగు శ్రీ రామానుజాచార్యులవారి భాగినేయుడు, శిష్యుడునగు కిడాంబి ఆచ్చాన్ పండితు డీవంశమునకు కూటస్థుడు. ఈయనకు 'ప్రణతార్తిహరాచార్యు'లని నామాంతరము; 'వేదాంతోదయనులు,మహానసాచార్యులు' నని బిరుదములు. రామానుజుల కొకప్పుడు శత్రువులు విషప్రయోగము చేసిరి. భగవత్కృపవలన నాయన కెట్లో యాగండము తప్పెను. నాటి నుండియు నాంతరంగిక



చిత్రము 158.
కిళాంబి ధర్మాచార్యులు

శిష్యుడగు ఆచ్చాన్ పండితుడే యాచార్య దేహప్రాణముల కంగరక్షయు, వజ్రకవచమునై స్వయముగా ఘటములతో నంబువుల (నీళ్ళు) తెచ్చుచు మహానసకృత్యములను స్వయముగా నిర్వహించుచు గురుశుశ్రూష యంతయు దానే యొనర్చుచుండెను. దీనివలన వచ్చిన బిరుదమగు 'ఘటాంబు' భ్రష్టమై కడాంబి, కిడాంబి, కిళాంబిగా మారినది. ఆచ్చాన్ ప్రపౌత్రుడు ఆత్రేయ రామానుజులు (అప్పిళ్లార్) న్యాయకులిశమను ప్రౌఢశాస్త్రగ్రంథమును రచించి 'వాదిహంసజలదాచార్య' బిరుదము నందెను. ఈయనకు భాగినేయులు, శిష్యులు కవితార్కికసింహ, 'సర్వతంత్రస్వతంత్ర' వేదాంత దేశికులు. ఈ కిళాంబి వంశమునకు చెందిన విద్వత్ప్రకాండులే శ్రీనివాసాధ్వరి, తత్తనయుడగు రఘునాథాధ్వరి, ఈయన కుమారుడు విశ్వగుణాదర్శ 'కర్త,' శ్లేషయమక చక్రవర్తియగు వేంకటాధ్వరియు (క్రీ. శ. 17వ శతాబ్ది).

ఈ విఖ్యాతాన్వయమునకు జెందిన పూర్వ పురుషు డొకడు ఆంధ్రదేశమునకు వలస వచ్చి తూర్పుగోదావరి జిల్లా చామర్లకోటలో స్థిరపడెను.

ఈ వంశములోని రఘునాథాచార్యులవారికి, తద్ధర్మపత్నియగు కృష్ణమ్మగారియం దుదయించిన జ్యేష్ఠతనయుడు ధర్మాచార్యులు. ఈయన పదునెనిమిదేండ్ల యీడున సంస్కృత భాషాభ్యాసము మొదలిడెను. కావ్యపాఠమున సిద్ధహస్తులగు వింజమూరి రామావతారముగారి వద్ద స్వగ్రామముననే పదునెనిమిది మాసములకే కావ్యపంచకమును పూర్తిచేసి పిదప బొబ్బిలికి వెళ్ళి యట పీసపాటి వెంకటేశ్వరులుగారికడ 'తర్క సంగ్రహము'ను, బొబ్బిలి సంస్థానమున ప్రఖ్యాతవిద్వాంసులగు సుసర్ల సీతారామశాస్త్రిగారివద్ద గదాధరాద్యుత్తమ తర్కశాస్త్రగ్రంథములను కూలంకషముగ బఠించి, పిమ్మట విజయనగరమున తదాస్థాన విద్వత్సార్వభౌములు, అపరగౌతములునగు గుమ్మలూరి సంగమేశ్వరశాస్త్రిగారివద్ద పై కక్ష్యకు చెందిన న్యాయశాస్త్రగ్రంథములను మథించిరి. విజయ నగరముననే యొక మాధ్వపండితులయొద్ద పూర్వమీమాంసాదర్శనమును, రుద్రాభట్ల రామశాస్త్రిగారి కడభాష్యాంతము వ్యాకరణ దర్శనమును వ్యాసంగమొనర్చి అనంతరము విశాఖపట్టణమున కరిగి 'సర్వతంత్రస్వతంత్రులును', 'మహామహోపాధ్యాయ' బిరుదాంకితులునగు పరవస్తు వెంకట రంగాచార్యులకడ అదివరకు తాము పఠించి పడసిన శాస్త్రవైదుష్యమునకు మెరుగులు దిద్దుకొనిరి; ముంగొండయం దొకయద్వైతపండితులయొద్ద శంకరభగవత్పాదుల శారీరకమీమాంసాభాష్యము నధ్యయన మొనర్చిరి. తదుపరి వీరు దక్షిణదేశము నందలి కుంభకోణమున కరిగి యట విశిష్టాద్వైతవేదాంతమున మహావిద్వాంసులగు కొర్చి రంగాచార్యులవారిదగ్గర మాధ్వ, రామానుజ భాష్యములను గూలంకషముగ వ్యాసంగమొనర్చి స్వదేశమునకు వచ్చి యాంగ్లమునకూడ మంచి ప్రవేశమును పడసిరి. తర్కశాస్త్రగురువులగు సంగమేశ్వరశాస్త్రిలుగారికి శ్రీ భాష్యమును బఠింప గుతూహలము కలుగ నాచార్యులవారు తమ గురువునకే గురుత్వము వహించి చతుస్సూత్రి వరకు గరపిరట. వీరి బహుశాస్త్రవైదుష్యమును గుర్తించి శ్రీ విజయనగరమహారాజసంస్కృతమహావిద్యాలయోద్ధారకులు, మొదటి ప్రిన్సిపాలు నగు కిళాంబి రామానుజాచార్యులవారు వీరి నా విద్యాలయమున 1901 లో నధ్యాపకులుగ నియమించిరి. తరువాత వీరు ఆంగ్లకళాశాలలో సంస్కృతాధ్యాపకులుగా నియమితులైరి. నాటినుండి ధర్మాచార్యులుగారు తమ యవసానకాలమువరకు నక్కడనే పండితులుగా నుండిరి. పీఠికాపురశాస్త్ర విద్వత్పరీక్షలు 1912 లో ప్రారంభింపబడినపుడు తర్క వ్యాకరణములు, అద్వైత విశిష్టాద్వైత వేదాంతములు నను నాలుగు శాఖలకు దిగ్దంతుల వంటి నలుగురు మహావిద్వాంసులు పరీక్షాధికారులుగ నియమింపబడిరి. వీరే ఆయాశాస్త్రములలో నాస్థానపండితులు. ధర్మాచార్యులుగారు విశిష్టాద్వైతమునకు పరీక్షకులుగ నియమింపబడిరి. ఆచార్యులవారి కేటేట విజయదశమికి రు 116 లు బహుమానము దర్బారులో నొసగుచుండెడివారు. పరీక్షకులు పిఠాపుర

మునవే యుండెవలెనను నియమము వచ్చిన నాటినుండియు వీరు పరీక్షకపదవినుండి విరమించి విజయదశమికి పితాపురమునకు వెడలి యాస్థాన విద్వత్సంభావనగా రు 100లు తక్కిన నలుగు రైదుగురితో పాటు స్వీకరించుచుండెడివారు.

ఈ. వేం. వీ. రా.

**ధూర్జటి :** అష్టదిగ్గజములని పేరుమోసిన రాయల యాస్థాన కవులలో ధూర్జటి ఒకడని జనశ్రుతి. జక్కయ కుమారుడు నారాయణామాత్యు డీయనతండ్రి. తల్లి సింగమ. గోత్ర ప్రశంసాదిక మీయన కృతులలో గనరాదు. ఈయన భవపరాఙ్ముఖుడు. ధూర్జటి పౌత్రుడు కుమారధూర్జటి బిరుదాంకుడు, వేంకటార్యుడు రచించిన కృష్ణరాయ విజయమునుబట్టి, ప్రపౌత్రుడు లింగరాజకవి రచించిన కాళహస్తి మాహాత్మ్యమును బట్టి యీయన రాయల యాస్థానమున నున్నట్లు, సత్కారము లందినట్లు రూఢిగ తెలియుచున్నది. ఇన్నింటికి నుజ్జీవకమై తెలుగు దేశమున సుప్రసిద్ధమైన చాటువు, 'స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటి పల్కులకేల కల్గె నీయతులిత మాధురీమహిమ' అన్నది ఆరవి తారకము ధూర్జటి రాయల యాస్థానస్థితిని సాధించుచున్నది. ఇతడు రచించిన కృతులు శ్రీ కాళహస్తీశ్వర శతకము, శ్రీకాళహస్తిమాహాత్మ్యమును. ఈయనది భారద్వాజ గోత్రము. వీరు పాకనాటి ఆరువేలవారు. నివాసము పితృపైతామహముగ గాళహస్తి క్షేత్రమనియే తోచుచున్నది. శతకములోని 'నీ పక్షంబు ప్రసాదముం గొనికదా' యనుట దీని కుజ్జీవకము. గురువు పేరు తెలియదు. ఉపాసనా దైవములు భైరవ, దుర్గా, గణపతులు. ఆత్మదైవము శ్రీ కాళహస్తీశ్వరుడు. ధూర్జటి మంత్ర తంత్ర శాస్త్రములను బరిశీలించినవాడు; సాంఖ్య యోగ రహస్యవేత్త; స్వాధ్యాయ సంపన్నుడు; శాస్త్ర వైదుష్యశాలి; శైవ సంవిత్కాసార మరాళ రత్నము; మాహేశ్వరభక్తి పరతంత్రుడు. భసితోద్ధూళన పాండురాంగులు, సాధిత పంచవర్ణ రసనులు, రుద్రాక్షరాజిసమేతులు ఏ వర్ణమువారైన నితని కారాధ్యులు. 'దివిషవన్నప్రాయ వాగ్గుంభనుడై'న యీయన తన కవిత్వమును శ్రీ కాళహస్తీశ్వరునకై 'మీదు కట్టి' బిరుదుగైకొని ముంజేత కంకణము గట్టికొనిన వ్రతస్థుడు; పరనిందా మూరగుడు. అనుభూతి దూరగులై వాగ్వాదములతో గాలయాపనము సేయు పండితులపై నీయనకు నిరాదరము. ఈయన అంతర్ముఖుడు; యోగానుభవ సంపన్నుడు; జ్ఞాతులవలన మిక్కిలి కష్టములు పడినవాడు. ఈయనకు సన్న్యాసాశ్రమ స్వీకారముపై నాస్థ మెండు. చివరిదశలో సన్న్యసించెనేమో కూడ! కలిమి. లేముల ననుభవించి విడిచిన పిమ్మట గలిగిన సుస్థిరవైరాగ్య మీయనది.

రాయల యాస్థాన స్థితి పూర్వవయస్సు నాటిదై యుండును. సంపత్సమృద్ధమైన విజయనగర రాజధానీ నివాసము జీవితములో నీయనకు అనుభూతి శబలతను సమకూర్చెను. 'నృపధామ ద్వారదేశము'నకు రాకపోకలు నెరపిన నాళ్ళవి. నాటి కంతర్గతమైయున్న 'భవపరాఙ్ముఖత' వెల్లి విరియలేదు. ఈయన యౌవనము శృంగారానుభవ మనెడు మలుపచ్చి గందపు దొడుగు కలది. మనస్సులోనున్న ప్రత్యగ్జ్యోతి శ్రీ కాళహస్తిదైవము మినుకు మినుకు మను చుండెను. రాజకులములయందలి యంతః కాలుష్యము నెరుగని నాళ్ళవి. అంభోజాక్షీ, చతురంతయాన, తురగీ, భూషాదు లుపభోగ్యములు. అవి 'ఆత్మవ్యథాబీజము'లని తెలియుట కింకను సమయము రాలేదు. కాయము వధూనఖాంక చిహ్నితము. నిసర్గ సిద్ధమైన కవితా మాధుర్యమునకు గూడ 'వారవనితా జనతాఘన తాపహారి సంతత మధురాధరోదిత సుధారసధారలు' హేతువుగ రాజసభలో నుత్ప్రేక్షింపబడినవి. తోటి కవులతో నీతని నేస్త మెట్టిదో! కవుల విద్యా మాత్సర్యమును పిమ్మట నత్కీరుని కథలో జిత్రించెను. రాజసభా ప్రవేశమునకు నోచికొనని పెక్కురు కవుల దైన్యమును గన్నార జూచియుండును. నాటి యనుభవములను స్మరించి పిమ్మట శతకములో విద్వాంసులను సృష్టించినందులకు, సృష్టించి వారికి క్షుద్బాధాదులు కలిగించి నందులకు, కలిగించి దుర్మార్గులను రాజులను జేసినందులకు బ్రహ్మను దూయబట్టెను.

సత్కవీశ్వరుడు వచ్చెననగా విని అతని వైదుష్యకవితా ప్రతిభలు విచారించి తెలిసికొని అతడు తిట్టు పద్యములు చెప్పడని నిశ్చయముగ దెలిసిన పిమ్మట 'క్రితమే చూచెను బొమ్మని' పంపెడు లుబ్ధనృపతులను క్షమించి విడువలేదు; పరస్తుతి చేయనొల్లని వ్రతస్థులవలె పైకి వేసములు వేసికొని 'పుత్రీ పుత్ర కళత్ర రక్షణ పరు'లై రాజులను పాత్రభూతులని సేవింపవచ్చు కృపణ విద్వాంసుల యంతస్తత్త్వము నాకళించి కొనెను; ఒకరిని జెరిపి పదస్థులై బ్రతుకనూహించు రాజోద్యోగుల కౌటిల్య తంత్రములను జూచి యేవగించికొనెను. ఈతని యాగ్రహమునకు మిక్కిలి పాత్రమైనవారు పరనిందాపరులైన కొండెగాండ్రు. వారు స్మృతికివచ్చి పరమేశ్వరు నీత డిట్లుపాలంభించెను. 'గజాసురుని జంపిన త్రిశూల మిపుడు నీచేత లేదా? మన్మథుని మసిచేసిన ఫాలలోచనవహ్ని చల్లారినదా?' అని. నానావిధ జనాశ్రయమైన రాజాస్థానమున నీతని కంతశ్శాంతి

నెలకొని యుండదు. అనుదిన సామాన్యమైన ఈ దృశ్యము మరింత హృదయ విదారకమై యుండును. ద్వారద్వారములయందు దండధరులై నిలిచిన ఆ కంచుకులు, తరతమ భేదము నరయజాలని వారి యుద్ధతి, వారు వేత్రములతో నెదురురొమ్ములపై బగ్గన బొడిచి పార్శ్వములకు నొత్తుట, వారాడు దుర్భాషలకు మొగమోడక ప్రార్థించి యెల్లెని సభాప్రవేశము కలిగిన జాలునని యాతనపడు కృపణుల దుస్థితి —— ఈ దుస్థితి యెంత యావేగమును గలిగించినదో యీ మాటలలో దెలియుచున్నది.

'వేళ కింత భిక్షమిడుటకు నూరూర జనులులేరా! వీథులలో చినుగు ప్రాతలు దొరకవా! త్రాగుటకు నేళ్ళలో శీతామృత స్వచ్ఛ జలములు ప్రవహించుటలేదా! ఈ జనులు రాజసేవార్థమై యేల పోయెదరు?'

క్షణికైశ్వర్య మత్తులగు రాజుల దురహంకృతిని జూచి యుదయాస్తాచలావధిగ యుగముల తరబడి పరిపాలించి కాలవశులై పోయిన యాదిమ నృపాలురను దలంచి యీయన జాలిపడును. కృప, ధర్మము, ఆభిజాత్యము, క్షమ, సత్యనిరతి, విద్వన్మిత్ర సంరక్షణము, సౌజన్యము, కృతజ్ఞత అనువానికి 'రాజ' శబ్ద ముచ్చాటనమంత్రమా అని వితర్కించును. ఒకచోట 'రాజ' శబ్దముమీది యీయన యేవ యింతింతనరానిది. 'ఆ రాజశబ్దంబు చీ చీ జన్మాంతరమందు నొల్లనుజుమీ' అనినాడు. దుఃఖ పర్యవసాయములుగ ధ్రువపడుచున్న ఐహిక విషయములమీది వైముఖ్యము, పూర్వవాసనా గతమైన భక్తి, నానాటికి విమర్శోన్మీలితమైన ప్రత్యగ్దర్శనము నీతనిని రాజాస్థానమున నిలువనిచ్చి యుండవు.

'నీ పంచన బడియుండగా లభించిన భిక్షాన్నమైన
నాకు జాలును, నిక్షేప మబ్బినను రాజకీటకముల నిక
నే సేవింపనోపను. నన్ను బంటుగా జేపట్ట దలంచితివేని
ఆశాపాశములతో జుట్టి పంసారార్థమై నన్ను ద్రిప్పకుము'

అని యాక్రోశించుచు ధూర్జటి కాళహస్తిపతిసన్నిధికి జేరికొన్నట్లు దోచును. ఈయన కృతులు రెండును స్వామి సన్నిధినే రచింపబడినవై యుండును. తత్పూర్వము కృతు లేమైన నొనర్చెనో లేదో. స్వామిపై తప్ప నితరులపై గృతులు చెప్పనను వ్రతము రాజసేవానంతరము పట్టినదైనచో దత్పూర్వ కృతులను స్వయముగ నణగించుటకైన వెనుదీయని తీవ్రమతి యితడు! ఈతనికి స్వామిపై గావ్యము చెప్పుమని యడిగిన యతడును, స్వామిపై పద్యములను గంఠస్థము చేసెద నిమ్మని యడిగిన యతడును, స్వామిపై జెప్పిన మంజుప్రబంధమును నిష్ఠతో బఠించునతడును ఆత్మ బంధువులు. లోకరీతిని పిలువగా వచ్చెడు బంధువులు బంధువులు కారు. దినదినము ప్రాతర్వేళల స్వర్ణముఖీస్నానము, స్నానానంతరము నదీతీర్థ స్ఫటిక శిలావేదికపై పద్మాసనాసీనుడై యోగమునందు ప్రత్యగ్జ్యోతిని దర్శించి అందు పరవశుడగుటయు నీయన నిత్యకృత్యములు. ఈయన వివేక పరిపాక మిట్టిది.

'అమరస్త్రీలను రమించినను మోహమన్నది చెడదు,
బ్రహ్మపట్టము సిద్ధించినను ఆశ యన్నది తీరదు.
సర్వలోకములను మ్రింగినను క్రోధమన్నది మానదు.
ప్రాణులు వీనివలన బావుకొను సౌఖ్య మే మున్నది?'

'తమ నేత్రద్యుతిని దాము చూడ నేర్చినచో తాదాత్మ్య సుఖము సంపన్నమై యుండగా, 'విమలములని, కమలాభములని, జితవిద్యుల్లతాలాస్యములని, సుమనోబాణ జయప్రదములని లోకము మృగాక్షుల కన్నుగవల వంక జూచెద రేల?' ఇట్లు విచారించును. ఒకచో బరమేశ్వరుని గూర్చి యీయన యొక చిత్రమైన ప్రశ్న చేసినాడు

'చవి యగునట్లు, చూచునట్లు, వినునట్లు, మూర్కొనునట్లు,
తనువులు సంఘర్షణ జనితమై ఆస్వాదము నందునట్లు—
ఇట్లీ ఇంద్రియ గ్రామముతో బ్రాణుల నేల సృష్టించితివి?
సర్వ పాపములకు మూల మివియే కదా! ఈ మాయావిద్య పన్ని
ప్రొద్దుపుచ్చి వినోదించుటలో నీ కేమి ప్రయోజన మున్న'

దని! కేవలుడవై యుండరాదా యని దీని తాత్పర్యము. జీవితముయొక్క క్షణభంగురత్వమును, మృత్యువుయొక్క నిత్య ప్రత్యాసన్నతను ఇంత హృదయంగమముగ జెప్పిన కవి యింకొక్క డుండడు.

శ్రీ కాళహస్తీశ్వర శతకమునందలి ప్రతి పద్యమును ముక్తిపాంథులకు ఆఘోషణము! లోకము చెవు లుండియును వినదు. 'శ్రీ విద్యుత్కలికాజవంజవ' అని యారంభించిన కవి అమృత హ్రదమునకు సోపానములు తీర్చుచున్నాడు. ఈ శతకము తెనుగు దేశమునకు సాయంప్రాతములయందు పారాయణ గ్రంథము. ఇట్టి మహిమ తెనుగు వాఙ్మయములో భాగవతమునందలి కొన్ని ఘట్టములకు మాత్రమే కలదు. కొన్నింటి కననేల? గజేంద్ర స్తుతి ఘట్టమునకు మాత్రమే కలదు. దానికి పురాణ కథ యనుచు నొక యాధార మున్నది. ఇది వ్యక్తి యంతరాంతరములనుండి చీల్చుకొని వచ్చినది. దీని సార్వజనీనతవే రొకయెడ అరసి కనరానిది.

ఈయన రెండవ కృతి శ్రీ కాళహస్తి మాహాత్మ్యము నాటి యితర కావ్యములకంటె విశిష్టమైనది. ఇందలి వస్తువు, రచన, భావములు వేరు తెరగువి. ఈ కావ్యము మొదటినుండి తుదివరకు కవియొక్క జీవలక్షణమైన

అంతర్ముఖత్వమును పట్టి చూపునదిగ నుండును. క్షేత్ర మహిమ వస్తువయిన కావ్యములు దీనికి ముందటివి, తరు వాతివియు గలవు. అవి దీనివలె ఒక వివిక్తానుభూతిని ముద్రింపజాలినవి కావు. వాని ప్రశస్తి వేరు గుణములను పట్టి. ధూర్జటియాత్మ శివసాన్నిధ్య సుఖము ననుభవించి నది. అచ్ఛమైన ఆ సుఖము ఈ కావ్యమును ద్వార మొనర్చుకొని భావుకుల హృదయ కుహరములలోనికి జొరబారును. విరళజన సంపాతమైన అరణ్యగర్భము నందలి ప్రశాంత సరస్సును ఈ కావ్యమున కుపమానముగ జెప్పవచ్చును. వసిష్ఠ, అజ, లూతా, వాతాశన, సామజ, ఆటవిక, గోత్రాదేవ, నత్కీర, రాజీవాక్షీయుగ, యాద వాధిపుల కథా సూత్రములతో దివ్యలింగ మాలంబన బిందువుగ ఈ కావ్యము సాలీని పటమువలె నల్లబడినది. ఎన్నడో కృతయుగమునాటి సాలెపురుగు, త్రేతాంతము నాటి పాము, ద్వాపర ప్రారంభమునందలి యేనుగు, కలి యందలి ఆటవికుడు కాలాపరిచ్ఛిన్నమైన తత్త్వమునందు సాయుజ్యము నందుట — అను ఈ వస్తువే భావించిన కొలది హృదయమును వివిక్త మొనరింపజాలియున్నది. వీ రందరు కవితో సమానధర్ములు. ఆ సమాన ధర్మము జీవుని యంతరాంతరములనుండి నిర్ఝరమువలె ఒరసికొని వచ్చుశివభక్తి. ఒక రొకరుగ వారు తమ తమ మార్గ ములలో సాయుజ్యాభిముఖముగ నడచిరి.

కాళహస్తి జ్ఞానక్షేత్రము. వసిష్ఠుని మొదలు కీటము వరకు అపవర్గమును గైవస మొనర్చుకొనిన నెలవు. జ్ఞాన ప్రసూన కళికా సౌరభములు ఆ పొలమునుండి వాసించును. ఆదిగృహస్థు డచట భవనిదాఘతప్తులకు హృదయ పాత్రముల నిండ బ్రహ్మవిద్యాధన భిక్షమును పెట్టును. ఈ పురము వర్ణనము విలక్షణమైనది. అచటి యెలదోటలు వనములు. వధూకుచము లద్రీంద్రములు. అది స్థానాం తరగతమైన కైలాసము. అచటి విషయములకు భోగ ప్రకారములకు లౌకికత్వము లేదు. అణిమాది సిద్ధిదము, మోక్షదము నైన దక్షిణ కైలాసపతివైభవ మీ కావ్యము నందు వర్ణితమైన రీతి—

'విహరించు నొకవేళ విపినాగ్రవల్లవ
చ్ఛాయల గిరిజానసహాయుఁడగుచు'

శ్రీనాథుని భీమఖండమునందలి—

'ఒకసారి ధరియించు యువనాశ్వుఁ డిచ్చిన
కట్టాణి ముత్యాల కంఠమాల'

అను దక్షిణకాశికాపతి వైభవమును దలపించుచున్నది. కవిగత భావనను బట్టి దాక్షారామపతి భోగపరాయ ణుడు. శ్రీ కాళహస్తిపతి అంతర్ముఖుడు. శ్రీనాథునితో ధూర్జటికి అభిజనసామ్యముకూడ గలదు. ఇరువురు భార ద్వాజగోత్రులు; పాకనాటి ఆరువేలవారు.

ప్రౌఢిప్రియుల దృష్టికి పాండురంగ మాహాత్మ్యమువలె ధూర్జటి కృతి ఆనకపోవచ్చును. ధూర్జటికి గావ్యవస్తువుతో గల సమాధి రామకృష్ణకవి కున్నట్లు తోచదు. అతని దృష్టి వైచిత్ర్యాది గుణ సంపాదన పరాయణము. ధూర్జటి కున్న శివైకతానమగు భావన రామకృష్ణకవికి విష్ణువునందు సిద్ధించినట్లు తోచదు. అందలి యుపాఖ్యానము లనేకములు క్షేత్రమహిమను సాధించుట కేర్పడిన అర్థవాదము లనిపిం చును. మరి లూతాదుల జగత్తు వేరు. లూత యొకటి పాండురంగక్షోణిని బారాడినచో నా యుపాఖ్యానములు సాధించి పెట్టలేని మహిమ పౌండరీక క్షేత్రమునకు దక్కి యుండెడిది. శబ్దఘటనలో ఈ కవులకు గొంత సామ్య మున్నది — 'స్తబ్ధరోమ విషాణలబ్ధ మౌక్తికములు', 'ముక్తకంచుక మస్త ముక్తాఫలమ్ములు', 'మాలూరచ్ఛ దనోత్పలాబ్జసితపద్మశ్రేణి భారమ్ము' (కా. హ.) ఇత్యా దులు. రామకృష్ణకవిది ప్రౌఢ బంధము. ధూర్జటిది మాధు ర్యోల్బణమైన ప్రౌఢ బంధము.

ధూర్జటిని భావించుచో నొక్కొక్క తరిని పోతనగారు తలపునకు వత్తురు. రాజసేవా తిరస్కృతి మొదలు ఆ ముష్మికపరత వరకు నిరువురకు సామ్యము గలదు, హృదయాంతరాళమునుండి పలుకుదురు. భక్తి వివశము లగు తమ పాత్రములతో దాదాత్మ్యమును భజింతురు. ఇరువురును అంత్యానుప్రాస ప్రియులు.

'దక్షిణ కైలాసము నంబికా హారకృత శ్రీపాదుకాన్యాసమున్'
'వంచిత పాంచభౌతిక సుఖాకారాంగమున్ జిన్నటి
సంచారాంచిత రంగమున్ మునిమనస్సమ్యక్పరిష్వంగమున్'
—కాళహస్తి.

ఈ కావ్యమునకు శ్రోత యాదవ భూకాంతుడు. వక్త శ్రీ కాళహస్తీశ్వరుడే. మొదటిదగు వేణీసముత్క్షేపకథ కావ్యాభిముఖముగ భావుక హృదయములను మంత్రించు టకు గవి వీచిన యింద్రజాలబర్హమువలె నున్నది! శ్రీ కాళహస్తి ప్రథకు మూలమైన యీ క్రింది కథలు ధూర్జటి కవితామహిమకు ఆలంబనములు.

పూజార్థమై చిదుముచున్న బిల్వదళములవెంట శ్రీనామ కమగు సాలెపురు గొకటి శివద్విజుని పుష్పకరండమున బ్రవేశించి యతనితో మొగలేటి నీట దోగి యర్చానమయ మునకు బిల్వదళముల మాటున శివమౌళి నలంకరించెను. దానితో ప్రబోధ వాసనలు కందళించినవి. దాని కదలిక సర్వస్వము శివారాధనైకపర్యవసాయి! శ్రీ 'యాతా యాత విహార జాత నిజగర్భాఽవిర్భ వత్తంతువులతో'

ప్రాకారములు, గోపురములు, కొలువు కూటములు, నర్తన మందిరములు, శ్రీభాండారములు, అంతః ప్రదక్షిణాయతన వీథులు, ఉపహార భోగమంటపములు, గర్భగృహము, కల్యాణమంటపము, సన్నని త్రోవలు, పరివార దేవతా నిలయములు నిర్మించెను.

ప్రాతఃకాలములయందు మంచు కురిసిన శ్రీనిర్మాణములు కొంతసేపు స్వచ్ఛ మౌక్తికాగారములవలె, కొంతసేపు తద్బిందుప్రతిఫలిత రవి కిరణ సంసర్గవశమున బహురత్నోదీర్ణగేహములవలె ప్రకాశించునట! లూతకు దీరిక యుండదు. గాలికి దెగిన ప్రోగులను, జారిన ప్రోవులను బోయి యతుకుపెట్టుటలో దినము వెళ్లును. దాని తపము పండి గర్భాలయమునందు దీపశిఖ నిగిడి పట మంటికొనెను. తంతుమయమయిన దాని కర్మాశయమే కాలి పొగయై పోయెను. మిగిలినది భక్తిభావ మొకటే! ఏండ్లు కష్టపడి కట్టిన కట్టడములు దీపశిఖ కొకత్రుటి యాహారము కాలేదు. కుమ్మరి కొక యేడు గుదియ కొకపెట్టు! విద్వాంసులకు లేని వివేకము కీటకమునకా? భరింపరాని దుఃఖక్రోధములతో దీపశిఖను బ్రమింగెదనని శ్రీ రివ్వున వచ్చెను. స్వామి శ్రీపాణి పల్లవమున ధరించి దాని ననుగ్రహించెను. శ్రీ కోరినవర మిది.

'నా కీ భవదుఃఖమ్ములు'
లేక మహాజ్ఞానరసవిలీనుఁడ నగుచున్
లోకం బెన్నఁడు నెఱుఁగని.
యా కైవల్యమె యభీష్టము'

అని. కొంత కాలమునకు గాళ, ద్విపముల నా దివ్య లింగ మాకర్షించెను. కాళ మొనర్చునది ప్రాతఃకాలార్చనము. మరకత మాణిక్య పద్మరాగములు దీని పూజాద్రవ్యములు. సామజ మొనర్చునది ప్రాహ్ణార్చనము. మాలూరశాఖలు, నాళీక కల్హార కుముదములు దాని పూజాద్రవ్యములు. ఒకదాని పూజ వేరొకదానికి నచ్చలేదు. పాము పేర్చిన మణులు ఎకసక్కెపు రాలవలె నేనుగునకు, ఏను గర్పించిన మాలూర శాఖాదులు ముళ్ళకంపలవలె పామునకు దోచి, తమ పూజలకు గలుగుచున్న యంతరాయమువలన వైరము ప్రవృద్ధమయ్యెను. 'అచ్చపు నీలవర్ణ దృషదావళి నల్లని కల్వలే' అని సామజము, 'కంటకమెట్లు నాక సుముఖత్వము నందితివయ్య!' అని సర్పము స్వామి దెస చింతించినవి. గంధ మృదుత్వ శైత్యములు లేని యర్చన ఏమి యర్చన యని తుండాల మీసడించెను. 'పరార్ఘ్యరత్న పూజను ఈముళ్ళకంపలు పెడద్రోయుట' యేమని పాము కంటగించికొనెను. పగవానికి దైవము తోడగుచుండెనని రెండును విచారించినవి.

వాని రాకపోకలలో, అర్చాప్రకారములలో జాతిలక్షణానురూపముగ వెల్లివిరిసిన శివభక్తిముద్ర ధూర్జటి రచనలో ప్రత్యక్షరమునను బరిమళించుచున్నది. 'నిజ ఫణాగ్ర సమగ్రమాణిక్య దీప్తి తపనునకు తోడు నుషఃకాలతమముఁ దెఱుప', పాపఱేడు శివార్చనకు వచ్చును; కేతకినదినీటఁ దోగి కోనలు కొలఁకులు కలయ దిరిగి, మాలూర శాఖలు, నాళీక కల్హార కుముద పుష్పములు గోసి తెచ్చి దక్షిణ కైలాసపతి మజ్జనార్థము తొండాన గ్రోలిన తోయములతో నేనుగు వచ్చును! దానిభక్తి పరిష్వంగములో 'బిల్వ విటపశ్రేణీ సనాళాబ్జభేద విలీనాంగము' దివ్యలింగము ధన్యమైనది! దినదినము తమ పూజా విఘ్నమునకు మాత్సర్య దుఃఖములు పెరిగి, కాళ ద్విపములు చింతాజ్వరావిష్టములయ్యెను. ఆ జ్వరము వానికి సకల ప్రవృత్తుల యందును వైముఖ్యమును గల్పించెను. కాళము 'ప్రాణనాయికతోడఁ బర్యంక సీమల మసకానఁ బెనగు సంభ్రమము' విడిచెను. ద్విపము 'పిడి యేనుఁగుల వెంటఁ బడిపోక' నిలచెను. ఒకటి మధుర సుధాహారములకు నోకిలించెను. వేరొకటి తామరతూండ్లు మెసవుట మానెను. వైరనిర్యాతనమునకు ప్రాణములు పణములుగ నొడ్డి రెండును ప్రజాగర భావమును భజించెను. ఆ రాత్రి వానికి శివరాత్రియైనది. ఇచటి సూర్యాస్తమయము, రాత్రివర్ణనము నిడుదలై, వాని కాలాక్షమత్వమునకు వ్యంజకములై ప్రతీక్షాతైక్ష్ణ్యమును సూచించుచున్నవి.

కౌముదీనీరాజనములతో, తారాకుసుమములతో, 'శీతగభస్తిబింబ శివలింగము' వాని హృదయములలోని జ్యోతిర్లింగమునకు బ్రతిబింబమై యాకాశమధ్యము నలంకరించెను. మరునాటి యుదయమునకు దక్షిణ కైలాస పాదమున దళితగజకుంభగళితరక్తప్రవాహములలో జిదిసి కాళనాగము పడి యుండెను. ప్రాణాంతహేతువైన వైరము ఉపాధిభంగము నంది రుద్రగణ రూపములను దాల్చిన వారినడుమ స్నేహముగ బరిణమించెను.

ఇక ధూర్జటి వాఙ్మధుకోశమునుండి వచ్చి తేనియలు జలజలరాలిన పట్టు—'పొత్తపినాటిలో విపిన భూమి కిరాతుల కాటపట్టు' మొదలుకొని తిన్నని శివలింగ దర్శనము వరకు గల ఘట్టము. ఆటవిక జీవనములోని మాధుర్యసర్వస్వమునకు నెలవు. వన్యవస్తుసమృద్ధి, కోయసానుల అందము, వారి యలంకారములు, వ్యవసాయములు, జాతరలు, కాటేనిపూజలు, ఆచారములు, పానగోష్ఠులు, వేటలు - ఆ ప్రపంచముతో కవికి గల ప్రత్యక్షానుభవమునకు నిదర్శకములు. తండె దౌహృదవర్ణనమే విలక్షణమైనది. ఆమె దౌహృద మనోరథములలో 'ఖండేందు

శేఖరు గండూషితాంబుధారల మజ్జనము సేయు' కోరిక కలదు. 'నేత్ర నీలోత్పలమ్ముల నీలగళు నర్చించు' తలపు గలదు. శివభక్తి మునుపై పుట్టిన శిశువునకు బొడ్డు కోయుట సంసార మోహ పాశమును కోసినట్లు; భూతి పెట్టుట సర్వేశుభక్తి లక్షణము తెలుపు రీతి; నీళ్ళార్చుట పాప కదంబ జంబాలమును గడిగినట్లు; కడుపునకు చిట్టాముదము పెట్టుట అంతరంగ మలాపహమైన చిత్సుధారస మిడుట. ఆ శిశువు నిద్ర శివధ్యాన పరమసౌఖ్య సుషుప్తి; ఈలోక వ్యాపార మెట్లున్నదో చూతమని యతడు కన్నులు తెరచెను; శివభక్తి రహితమై లోకము చెడిపోయిన దని నవ్వెను. అడుగు విదల్చుకొనుటలో మోహబంధమును తెగ తన్నెను. పాన్పుపై బోరగిల పడుటలో భవపరాఙ్ముఖు డయ్యెను. నేలపై దడవియాడుటలో శివతత్త్వమను మణిని అన్వేషించెను. అతని తిన్నదనమునకు తల్లిదండ్రులు తిన్నడని పేరిడిరి. ఉద్బోధక సన్నిధానమును వేచి వెలి విరియని పుణ్యవాసనలతో, కారణ జన్మలు ప్రాకృతుల వలెనే కనుపింతురు. తిన్నడు వేటకు పోయి డస్సి యొక వకుళవృక్షచ్ఛాయమున నిద్రించుచుండ నొక కల వచ్చెను. ఆకల అతనికి లోకమును గల యొనర్చెను. మాయాహంత యగు శివుడు మాయలు పన్ని తన సన్నిధికి భక్తుల నాకర్షించు కొనును. ఇచ్చటి వరాహోదంత మట్టిది.

ఎట్టయెదుట సమస్త వ్యాపకానంత వేదాంత స్థాపిత చిన్మయాంగము, అవిద్యాధ్వాంత సంతాన సంక్రాంత స్వాంత నిశాంతజంతు సుఖమార్గ ప్రాపకాభంగ రుక్కాంతాపాంగము, వివిక్తధ్యేయ నిర్లింగము, దివ్య లింగమును దిన్నడు చూచెను. సంవిస్మయమై ఆవిష్కరించిన లింగము, యదృచ్ఛాగతమైన కీటకమును పూజా పరాయణము నొనర్చికొన్న లింగము, మరకత పద్మరాగ మాణిక్య మాలూర కల్హార నీరేరుహ భరములను పర్యాయముగ మౌళి నవధరించిన లింగము, అనాది నిజభక్త విరహ పర్యుత్సుకితాంతరంగమైన లింగము, యుగయుగముల నాటి తన యొంటరితనము మోయరాని బరువై కరుణ మయమైన ముగ్ధహృదయముతోడి సహవాసమునకు మోమువాచి పరామరికలేక బైసిమాలి యున్న లింగము కనబడెను. తిన్నని హృదయమున నిట్టవొడిచిన భక్తిజాలి వెల్లువయై శివునకు దలమునుక యయ్యెను. అది పులులు సింగములు గాసింబెట్టు నట్టడవి. ఏటి యొడ్డు. కల్జువ్వి క్రీనీడలో స్వామి యొంటరితనమునకు తిన్నని గుండె యొరసికొనెను. ఆకొన్నవేళ కూడు నీళ్లరయుటకైన నచట యెవ్వరి పొలకువయు గనరాదు. తిన్నడు రుచు లుట్టిపడునట్లు పలు వగల వంటకములు పేర్కొని, వన్యాహార సమృద్ధి నుగ్గడించి, తనవెంట నుడుమూరికి రమ్మని స్వామిని ప్రార్థించెను. చిరుతిండ్లకు కోయత లేరి తెచ్చు అడవి పండ్లను పేర్కొనెను. 'నేరేటి పండులు నెలవూటి పండులు' ఈ పద్య మొకటి అనాస్వాదిత పూర్వకమైన అరణ్యసారమును రసనేంద్రియగోచర మొనర్చుచున్నది. అనునయమునకు బదులురాని కొలది సర్వసుఖాస్పదమని తాను పేర్కొనిన పల్లెతోడి యనుబంధసూత్రము తిన్ననికి ద్రెస్సి పోయెను. 'నను మన్నించెదవేని నీ విపుడు రా నా వెంట రాకుండినన్ నిను నే బాసి చనంగనోప' అని క్రమక్రమముగ బలుకు లుడిగి ధ్యానమగ్ను డయ్యెను. దర్శనమాత్రమున నతనికి దెలియకయే సంసార బంధము లెచటి వచట దెగి యుండెను. జాడ నరయ వచ్చిన కిరాతులీ వైఖరి జూచి విన్నబోయిరి. ఎన్నివిధముల పలుకరించి చూచినను బదులురాలేదు. మైత్ర్యాది ప్రాకృతానుబంధములకు, ఆంతరమగు భక్తికిని ఇచ్చట సంఘర్షణము. భక్తి బలీయసి! దానికి వీనితో సంఘర్షణము లేదు. అవియే భక్తితో నొరయిక పెట్టికొని వీగిపోయినవి.

తిన్నని యర్చాప్రకారము శ్రుతివ్యవహారేతరము. ఇరుగేల మాంసపు దొప్ప లుండుటచే నతనికి బుక్కిలితో గాని మజ్జనాంబువు తే ననువుపడదు. కాలి చెప్పుతోగాని నిర్మాల్యమును దొలగింపరాదు. ధూర్జటి ఈ కథలో శ్రౌతార్చనమునకు, భక్తిప్రధానమగు ఆటవికారాధనమునకును ఒరయిక పెట్టెను. తుదకు భక్తిపరీక్షలో నెగ్గి అరణ్యమధ్యమున కల్జువ్వి క్రీనీడలో స్వామి యేకాంత వాసమునకు దిగులుపడిన ముగ్ధుడు తుది మొదలు లేని చిద్గగనములో బరమైకాంత స్థితి నందెను.

లూతా, వాతాశన, సామజాటవికులు శ్రీ కాళహస్తి వైశిష్ట్యమునకు మూలస్తంభములు. అచ్ఛస్ఫటికముల వంటి వారియందు బ్రతిఫలితమైన సంవిత్తు క్షేత్రమహిమ నుపబృంహిత మొనర్చినది. నత్కీరుని కథ కిట్టిమహిమ లేదు. మధురా ఖండము నుండి యీ క్షేత్రమున కంటు ద్రొక్కబడి అది దక్షిణ కైలాస శిఖర దర్శనమునందు బుష్పితమైనది. నత్కీరుడు లోకములోనివాడు. కవితాభిమాన ధూర్వహుడు. దేవుని నైతము లక్ష్యపెట్టక చార్వాక మొనర్చిన ప్రత్యక్ష వాదప్రవణుడు. శంఖ ఫలకముమీది కవులకు నాయకమణి యగుటలో నతని యహంకార శిఖర మున్నది. కైలాస శిఖరము దృష్టి కానుట కతడు ప్రయాణించిన పరిణామ మార్గము క్లేశ దీర్ఘము. ముక్తి దక్షిణమున నుండగ ప్రయాణ ముత్తరమునకు సాగినది. దక్షిణ కైలాస శిఖర దర్శనము రోగ విముక్తితోపాటు నత్కీరునకు ముక్తిద్వారమును దెరచినది.

గణికాదారికల కథలో కవి పూర్వ జీవితమునందలి వైశిక వృత్తానుభవమును చిల్లతాప్రరోహమునకు బాదు కట్టబడినది. గణికాదారికల పెంపకము, పూర్వవాసనాగత మగు శివభక్తితో గ్రమావిష్కృతమగు వారి యౌవనము, తల్లి చేసిన కులధర్మోపదేశము, వారి సమాధానము, శ్రీ కాళహస్తియాత్ర, గర్భాలయములో జ్యోతిః కర్పూర శకలములవలె స్వామియందు వా రందిన సాయుజ్యము ధూర్జటి వాఙ్ముద్రలో బరిమళించినవి. ఇది నాలుగాశ్వాస ముల ప్రబంధము. షష్ఠ్యంతములలో, ఆశ్వాసాంతములలో కవి ఆత్మానుభవమునకును యోగవిద్యా పరిణతికిని దృష్టాంతములు పెక్కులు.

'అఖిల ప్రపంచ భిన్నాభిన్న జ్యోతికి', 'నాదబిందు కళాతీతేశునకు', 'బహుముఖ సువర్ణ ముఖరీలహరీ శీతల శిలాతలస్థిత మునిహృత్ బహిరబహిః పరిపూర్ణునకు', 'అహరహరుదితునకు', 'పంచేంద్రియ మత్తద్విప పంచాస్యకిశోరమునకు', 'భవఫణి ఖగరాట్పుంచూకోటికి', 'సతత త్రైగుణ్యవశాచ్యుత కేళి జగన్మహుర్మ హుర్నిర్మాణ స్థితి భంజన కరణునకు', 'పాశక్లేశ గుణేష ణేంద్రియ తను ప్రత్యర్థితాపోర్మికా కోశాది వ్యతిరిక్తరూప! త్రిజగత్పూలంకపాకార',

'యోగిస్వాంత శకుంత వాగురిక' 'సర్వోపాధిశూన్యా!'

'తేజో గండూషిత పద్మ జాండభవ చక్షుర్మైత్ర పక్షీశ్వరా!'

'చిద్విద్యా ఘంటాపథచరతారక ఘంటారవహృత మనో మృగ వ్యాధేశా!', 'నీవారాగ్ర శిఖాంత చిద్రసమయా!'

యోగాది విద్యలచే వేదాంతములచే ప్రతి పాద్యమాన మగు పరమానుభవము స్వాదుమార్గమున ఆనీయమాన మగుట యీ కావ్యమునందలి వైశిష్ట్యము.

విశిష్టమైన వాఙ్ముద్ర సర్వకవి సాధారణము కాదనుట కవిత్వ తత్త్వజ్ఞులకు దెలియనిది కాదు. బహుజన్మ పరిణత మైన సంస్కారము సౌరభమై వాక్కును పరివేషించి యుండును. ఒకటి గమనింప వలసినది. సమకాలికములైన కావ్యములతో గలసి కాళహస్తిమాహాత్మ్యము స్ఫురణకు రాదు. వాని యనుశీలనము వలన గలిగెడు రసాను భవము బహిర్విషయాలంబనము. కాళహస్తి మాహాత్మ్యము నందు గలుగునది కేవలము రసానుభవము కాదు. కేవల రసానుభవము! కవిగతమగు యోగిలక్షణమునుబట్టి పాఠ కుని మనస్సిచట లోపలి మొగమై చరమావగాహనీయ మగు ప్రశాంత తత్త్వమునందు విశ్రమించును. ఆ యను భవము సర్వపాఠక సాధరణమా అనుట యాక్షేపము కాదు. ఇట్టి కొన్ని కావ్యముల వైశిష్ట్యమునకు అట్టి కతిపయ పాఠకుల అనుభూతియే ఏకమానము.

క్షేత్రమహిమను వస్తు వొనరించుటకు మార్గదర్శి శ్రీనాథుడు. కాశీఖండ భీమఖండములు వాగ్వైభవము నకు, సుదారతకు నెలవులు. పాండురంగ మాహాత్మ్యము రచనా ప్రౌఢికి ప్రసిద్ధి పడినది. ధూర్జటి కృతియందు బ్రతీయమానమగు నొక వివిక్తానుభవము వానినుండి దీనిని వేరుపరచు చున్నది. పై మూటియందును క్షేత్రమహిమ వ్యాజమున త్రైవర్గికములగు ననేక ధర్మములు రాశీకరింప బడినవి. పతితపావనదక్షమని క్షేత్రమహిమను నిరూ పించుటకు పాపాచరణమున బరాకాష్ఠ వహించిన జీవుల యితివృత్తములు వర్ణింపబడినవి. కాళహస్తిమాహాత్మ్యా మునందీ రణరణకము లేదు. ఇది యేకాంత భావ నిలయము. బహుజన్మ పరంపరా ఫలమగు వైరాగ్యము కడపగ గ్లేశ బహుళమగు సంసృతి వాహిని యావలితీరమును పట్టి కైవల్యాభిముఖముగ బ్రయాణించు కతిపయ యాత్రికుల పదాంకముల వెంట కదలికలు లేని నిర్వృతి సముద్రము ఈ కావ్య నదీ సంగమ ద్వారమున మనకు గోచరమగును. నదులకు సముద్రమువలె ఈ కథాస్రోతములకు శ్రీ కాళ హస్తిశివలింగము విశ్రాంతి భూమి! తంతువులయందు పటమువలె శివమహఃపరివేషము ఈ కథల నావరించి యున్నది.

మ. శ. శ.

**నందన చక్రవర్తి :** ఆంధ్రదేశ చరిత్రలో చారిత్రక వ్యక్తి అగునా కాదా యని అనుమానింపదగినవారిలో ఇత డొకడు. ఇతనిని గురించి పరంపరాగతముగ వచ్చు గాథలు కట్టుకథలేగాని ఇతని శాసనము లేవియు దొరక లేదు. గాథల ననుసరించి ఈతడు చంద్రవంశ క్షత్రియుడు. అభిమన్యు, పరీక్షితుల సంతతిలోని ఉత్తుంగభుజుని కుమా రుడు. కందనోలు సీమలోని నందవర మితని రాజధాని. ఇత డొకప్పుడు తన కొలువుకూటమున కరుదెంచిన ఒక యోగీశ్వరుని యనుగ్రహమును సంపాదించి తద్దత్తములగు పాదుకల ప్రభావమున ననుదినము వేకువనే రహస్యముగ కాశీకి పోయి గంగాస్నాన మాచరించి విశ్వేశ్వరుని, విశా లాక్షిని, అన్నపూర్ణాదులను సేవించుకొని సూర్యోదయా త్పూర్వమే మరలి వచ్చి తల్పగతు డగుచుండెను. కొన్ని దినములకు రాణి వేకువజామున చక్రవర్తి యంతిపురము విడిచి వెళ్లుట తెలిసికొని యొకనాడు భర్తను నిర్బంధించి సంగతి యంతయు తెలిసికొని తన్నుగూడ గొనిపోవలసిన దని పట్టుపట్టెను. భూవరు డందుల కెట్టకేల కియ్యకొని యా మెనుగూడ దోడ్కొనిపోవుచుండెను. ఒకనాడు గంగాయాత్రానంతర మామె చెరగుమాసిన కతన పాదు కల మహిమ యెడలి యథాకాలము తన పురము చేరు కొను వెరవు కానక సుడివడు నా మహీపాలుడు సుస్నా తులై మంత్ర జప పరాయణులైన యచటి బ్రాహ్మణుల నాశ్రయింప వా రాతనిపై దయ దలచి చౌడేశ్వరీ మహా

దేవి నుపాసించి మంత్రోదకంబుల గొని చని పట్టమహి షిపై ప్రోక్షించి యామెను పరిశుద్ధను గావించిరి. అందుకు పరమానందము నొంది ఆ మహారాజు శ్రీ చౌడేశ్వరీమహా దేవి సన్నిధిని నందవరము నగ్రహారముగ దాన మిచ్చి వారి ఆశీర్వచనము అందుకొని యథాపూర్వము స్వస్థాన మునకు మరలి వచ్చెను.

అటు తరువాత కొంత కాలమునకు కాశీప్రాంతభూమి కరవు కాటకముల కిరవగుటచేత కాశి విడిచిపెట్టి యా బ్రాహ్మణులు ఏ నూరిండ్లవారు నందవరాగ్రహారమున వసించు కోర్కెతో వచ్చి రాజును సందర్శించిరి. కాని తా నా యగ్రహారమును దాన మిచ్చిన విషయమును మరచి నందనచక్రవర్తి అందుకు సాక్ష్యము తెమ్మని కోరెను. అంత నా బ్రాహ్మణులు కాశీ నగరమందలి చౌడేశ్వరీ మహాదేవిని బిల్వాది వృక్షసహితము సాక్షిగ రమ్మని ప్రార్థింప నా దేవి వారివెంట వెళ్ళి సాక్ష్య మొసంగె నట. అంతట నందన చక్రవర్తి యా దేవీ సన్నిధానమున శ్రీవత్స, ఆత్రేయ, కౌశిక, వసిష్ఠ, హారిత, మౌద్గల్య, భరద్వాజ, కాశ్యప, కుత్స, భార్గవ, మౌన, వీతహవ్య, అగస్త్య సగోత్రులగు నేనూరిండ్ల బ్రాహ్మణులకు నంద వరము నగ్రహారము చేసి ఉదక పూర్వముగా ధారా దత్తము గావించి నూరిండ్లవారగు శ్రీవత్స సగోత్రులకు నూరు వృత్తులును, అరువదేసి యిండ్ల ఆత్రేయ, కౌశిక, వసిష్ఠ సగోత్రజులకు క్రమముగా అరువదేసి వృత్తులును, నలువదేసి యిండ్ల హారిత, భరద్వాజ సగోత్రులకు నలువ దేసి వృత్తులును, ఇరువదేసి యిండ్ల మౌద్గల్య, కాశ్యప, కుత్స, భార్గవ మౌన, వీతహవ్య, అగస్త్య సగోత్రులకు ఇరువదేసి వృత్తులును సమముగా పంచి శాంభవీ ప్రీతిగా నిచ్చెను. నందవరాగ్రహార ప్రతిగ్రహీతలును, వారి సంతతి వారును నందవరీకు లనబరగిరి. చౌడేశ్వరీమహాదేవి వారి ఉపాస్యదేవత.

నందన చక్రవర్తి నంద్యాల పుర నిర్మాత యనియు, ఆ ప్రభువే ఇప్పుడు మహానంది అని ప్రసిద్ధమైనచోట మహా నందీశ్వరుని ప్రతిష్ఠించెననియు లోక ప్రతీతి. మ. సో. శ.

**నటేశం, సి. యస్. (ఆంజనేయ)**: వీరు స్వంత ముగా ఒక నాటక కంపెనీని నెలకొల్పుకొని ఆంధ్రదేశ మంతయు పర్యటన మొనర్చి భక్తిరస ప్రధానములైన నాటకముల ప్రదర్శనముల నిచ్చి కళామతల్లికి అఖండసేవ చేసినారు. వీరు ఎక్కువగా రామాయణ నాటకములనే ఆడుచుండువారు. అందులో ఆంజనేయ పాత్రము వీరి కభిమాన పాత్రము. వీరు రంగస్థలమునకు వచ్చి ఆంజనేయ వేషములో భక్తిరసాభినయ మొనర్చునప్పుడు తన్మయుడు గాని ప్రేక్షకుడంటూ వుండడు. వీ రాంజనేయోపాసకులు. 'ఆంజనేయ' బిరుదమును ఎన్నడో పొందినవారు. వీరి అభిమాన నాటకరాజము 'లంకాదహనము'.

వీరు ఒకప్పుడు మైసూరు మహారాజావారి సమక్ష మున 'లంకాదహన నాటకము'ను ప్రదర్శించుచుండగా వీరు 'రామ రామ రామ సీతా' అనే కీర్తన పాడుతూ ఆంజనేయ వేషమున రంగ స్థలమున ప్రవేశించినప్పుడు అందలి భక్తిభావమునకు తన్మయత్వము పొంది ఆయ నతోబాటు గంతులుపెట్టు చున్న ఒక పెద్ద కోతికూడ రంగస్థలముమీదకు వచ్చి, ప్రేక్షకులమీదుగా పోయి అదృశ్యమైనదట. ఇందు లకు మహారాజావారును, ప్రేక్షకు లెల్లరును పరమా నందాశ్చర్యముల నొంది ఎంతో యధికముగ సన్మానించి నారట.



చిత్రము 154.
సి. యస్. నటేశం

ఈయనతోబాటు ఈయన సతీమణి నాగమణి గూడ నటించెడిదట. ఈమె మంచి కీర్తిమంతురాలు.

నటేశంగారు 80 సంవత్సరముల వయస్సున 1950 వ సంవత్సరములో కీర్తిశేషులైనారు. స్థా. న. రా.

**నట్టువ మేళములు**: ఈ మేళములవారి నృత్య క్రమములో వీధి ఆటయని, కచ్చేరీ ఆటయని విభాగము లున్నవి. దేవుని ఉత్సవము లప్పుడు, ఊరేగింపులప్పుడు, ఈ పద్ధతిలో నృత్యము ప్రదర్శింపబడును. ఇది కేవలము లయ ప్రధానమై కొన్ని సులభపద్ధతి అడుగులు కలిగి యుండును.

కచ్చేరి ఆట దేవళములలో నృత్యమాడునప్పుడు వీరు 'మేళప్రాప్తి'తో ప్రారంభించి పుష్పాంజలి, పేరణి, గీతము, శబ్దము లేక సలాము, జతి, వర్ణము, పదము, జావళి, నృత్తము (తిల్లాన లేక దరువు)తో ముగింతురు. 'మేళ ప్రాప్తి'యే సాధారణ నాట్యపు కచ్చేరీలలో 'అలరింపు' గా మారినది. దీనితో కచ్చేరీ ప్రారంభింపబడి, తరువాత 'జతిస్వరము' కాని, 'శబ్దజతి' కాని ఆడుదురు. ఇందు నృత్తము ప్రదర్శింపబడును. శబ్దము లేక సలాము, జతి యందు ఆంగిక ప్రధానమైన (భంగిమలు, ముద్రలు విశేష ముగా ప్రదర్శించునట్టి) నృత్యము ప్రదర్శింతురు. అటు పై వర్ణము. వర్ణములో నృత్త నృత్యములు సమముగా

పోషింపబడును. పిమ్మట సాత్విక ప్రధానమైన అభినయము. పదము జావళీలలో ప్రదర్శించి తిల్లాన నృత్తముతో ప్రదర్శనము ముగియును. ఇట్టి నృత్య క్రమములో నృత్యము, నృత్తము, అభినయము చక్కగా ప్రదర్శింపబడుచున్నవి. ఈ సంప్రదాయము నభివృద్ధి పరచినవారు నట్టువ మేళ నాట్యాచార్యులు. న. రా.

**నన్నయభట్టు :** నన్నయభట్టు ఆంధ్రభాషా వాగనుశాసనుడు. అదివరకు ఆంధ్ర భాషలో కావ్యము లేదు. ఆంధ్ర భాషకు వ్యాకరణము లేదు. నన్నయభట్టు తెలుగు భాష కీ రెంటిని ప్రసాదించెను. నన్నయ్య భారతములో మొదటి రెండున్నర పర్వములను వ్రాసెను. ఆంధ్ర శబ్ద చింతామణి యను వ్యాకరణమును వ్రాసెను. ఆంధ్ర శబ్ద చింతామణి వ్యాకరణ సూత్రములు. ఆ సూత్రములు సంస్కృత భాషలో వ్రాయబడినవి. నన్నయ్యగారు భారతమును బౌద్ధ జైన మతముల యొత్తిడి యానాడు తొలగించుటకు వ్రాసెనని కొంద రందురు. కాని యా వాక్యమునకు ప్రమాణము లేదు. నన్నయభట్టు రాజరాజ నరేంద్రుని యాస్థానములో నుండెను. నన్నయభట్టు రాజరాజునకు కులబ్రాహ్మణుడు. కులబ్రాహ్మణు డనగా పురోహితుడని కొంద రర్థము చెప్పుదురు. కొన్ని మరుగుపడిన శబ్దముల యొక్క యర్థము సువిస్పష్టముగా తెలియదు.

నన్నయభట్టు అవిరళ జపహోమ తత్పరుడు; సంహితాభ్యాసుడు; బ్రహ్మాండాది నానా పురాణ విజ్ఞాన నిరతుడు; ఆపస్తంబసూత్రుడు ; ముద్గలగోత్రుడు ; లోకజ్ఞుడు ; సంస్కృతాంధ్రములయందు కవిత్వము వ్రాయగలవాడు ; పరమధర్మ విదుడు ; బుద్ధియందు బృహస్పతి యంతవాడు; మహా ప్రతిభాశాలి. ఈయనకు భారతము రచియించుటలో నీయన సహాధ్యాయి నారాయణభట్టు సాహాయ్యము చేసెను. ఆ సాహాయ్యము యొక్క స్వరూప మెట్టిదో 'పాయక పాకశాసనికి....' అను పద్యమున నన్నయగారే వ్రాసిరి. భారత యుద్ధములో కృష్ణుడు యుద్ధము చేయలేదు. యుద్ధము చేసిన దంతయు నర్జునుడే. కృష్ణు డర్జుననకు యుద్ధములో కొన్ని మెలకువలు చెప్పెను. భారత రచనములో నారాయణభట్టు నన్నయ్యగారి కిట్టి సాహాయ్యమే చేసియుండును. నన్నయ్యభట్టు యొక్క కవితాభిప్రాయము లెట్టివి యన్న విచారణ చేసినచో నాయన భారత రచనములోని కష్ట మెట్టిదో తెలియగలదు.

అన్ని భాషలలోను ప్రథమ కవులే మహోత్కృష్ట కవులుగా నుండుట నానా సారస్వతములలోని యథార్థ విషయము. సంస్కృతములో వాల్మీకిని మించిన కవి లేదు. తెలుగులోకూడ నన్నయ్యగారిని మించిన కవి లేదు. నన్నయ్యగారు తన కావ్యమునందు రుచిరార్థసూక్తిమత్త్వము, అక్షరరమ్యత, ప్రసన్న కథా కలితార్థయుక్తి అను మూడు లక్షణములు ప్రతిపాదింతునని 'సారమతిం గవీంద్రులు....' అన్న పద్యములో గంఠోక్తిగా చెప్పినాడు. ఈ మూడు లక్షణములు తన కవిత్వమునకు ప్రధానమైనవని నన్నయ్యగారే చెప్పికొనెను. రుచిరార్థసూక్తు లనగా బహుధర్మములు మిక్కిలి రమ్యముగా చెప్పుట. అవి సూక్తులై లోకమునందు వెలయుచునే యున్నవి.

'నుతజలపూరితంబులగు నూతులు నూరిటికంటె సూనృత
వ్రత యొకబావి మేలు...సూనృతవాక్యము మేలుసూడగన్,'

'వగవగ సాంగోపాంగము
లగు నాలుగు వేదములయు నధ్యయనము పొ
ల్పుగ నొక సత్యముతో నెన
యగునే యెవ్వియును బోలవలె సత్యంబున్.'

ఇట్టివి సూక్తులు.

ఈ సూక్తులు వట్టి సూక్తులుగా గాకుండ నన్నయ్యగారు తన రచించుకథలో వీనికి సందర్భౌచిత్యమును మిక్కిలిగా ప్రతిపాదించుచు వచ్చినారు. ఇందు మొదటి పద్యము దుష్యంతుడు తన్ను నిరాకరింపగా శకుంతల రాజుతో చెప్పినది. తన కొడుకును తీసికొనిపోయి యతనిని తీసికొమ్మనినది. ఆయన కాదనినాడు. అప్పుడు కొడుకు యొక్క ప్రాశస్త్య మెట్టిదో యంతకంటె యథార్థ వాక్యము యొక్క ప్రాశస్త్య మెట్టిదో యామె చెప్పుటలోని యౌచిత్యము కవితాశక్తిని దాటి శిల్పప్రపంచకమున జేరుచున్నది. రెండవ పద్యము నలుడు తన్నడవిలో వంచించి చీర చించుకొని వెడలిపోయి నపుడు దమయంతి యనిన మాటలు. దమయంతి యియ్యుటంకించిన మాటలలో నలమహారాజు యొక్క సాంగోపాంగ వేదాధ్యయనము చెప్పబడి యట్టివా డసత్య పథమున బోవుట న్యాయము గాదని యనిపించుచున్నది. నన్నయ్యగారి సూక్తు లీ విధముగా సామాన్యమైన రుచిరార్థములే కాక కథా గతౌచిత్య సంపాదకములు, శిల్పాభిరామములు నగుచున్నవి.

నన్నయ్యగారి రెండవ గుణము అక్షర రమ్యత. మూడవది ప్రసన్న కథా కలితార్థ యుక్తి. నన్నయ్యగారే తన రచనయందలి యీ రెండు గుణములను గ్రహించెడి యధికారుల లక్షణమును నిరూపించినాడు. ప్రసన్నకథా కలితార్థయుక్తిని కవీంద్రులు లోపల దెలిసికొందురట. అక్షర రమ్యతను కవీంద్రులు కానివా రాదరింతురట. అక్షర రమ్యత యనగా నక్షరములు కూర్చుటలోని సొగసు. ఈ సొగసు పలు విధములుగా నుండును. అన్ని విధముల యందు ననుస్యూతమై యొక మాధుర్యము నన్నయ్యగారి

సర్వరచనయందు భాసించుచుండును. ఈ మాధుర్యము సందర్భానుసారముగా రసానుగుణముగా కథానుకూలముగా మారుచుండును. ఇట్లు మారుట రచనా శిల్పము. సంస్కృతభాష యందలి పూర్వ లాక్షణికులలో పరమోత్తములైన ధ్వన్యాచార్యుడును జగన్నాథ పండితుడును ఇట్టి రచన రసధ్వని కాయువుపట్టని నిర్వచించిరి. ఈ రచన నన్నయ్యభట్టు సర్వంకషముగా నెరిగినవాడు.

'కురు వృద్ధు ల్గురు వృద్ధ బాంధవు లనేకు....' లను పద్యములోనిది రౌద్ర రసము. కవి సంయుక్తాక్షరములు, పరుషాక్షరములు, తాలవ్యములు మిక్కిలిగా ప్రయోగించి రౌద్ర రసము వ్యంజితము చేసినాడు. శృంగారరసమునందు సుకుమారమైన రచన చేయును. 'జలధి విలోల వీచి విలసత్కలకాంచి సమంచితావనీతల వహనక్షమంబయిన....గోమలిం దిగిచె విశ్రుతకీర్తి యయాతి ప్రీతితోన్'.

పూర్వ పద్యమునందలి రౌద్రరసమునందు క్లిష్టాక్షరములు, ఈ శృంగార రసమునందు సరళాక్షరములు. కాని రెంటియందు మాధుర్య మున్నది. ఈ రీతిగా రసవ్యంజకముగా వ్రాయుచు మాధుర్యగుణమును పరిపోషణ చేయువాడుక మహాకవులలో నొక రిద్దరికంటె నెక్కువ యుండరు. తెలుగులో నన్నయ్యగారు, పెద్దన్నగారు వీ రిద్దరే. మాధుర్య గుణము, రసవ్యంజకమైన రచనయు రెండేకాక నన్నయ్యగారు తన రచనయందు మహాశిల్పమును చేయును. సముద్రముయొక్క కదలుచున్న కెరటములచేత ప్రకాశించుచున్న యొడ్డాణముతో నొప్పు భూతలమును వహించుటకు సమర్థమైనదని యయాతియొక్క కుడిచేతిని వర్ణించెను. మరల దేవయానియొక్క హస్తమును ఉన్నమద్గళదురుఘర్మవారికణ క్రమకరాబ్జ మని వర్ణించినాడు. ఆయిద్దరి చేతులను వర్ణించుటచే నన్నయ్యగారి యుద్దేశ్యము నూతిలోనుండి యూరకే బయటికి తీయుట మాత్రము కాదు, దేవయానిచేయి చెమ్మటచేత మనోహరముగా నున్నదని వర్ణించెను. అందుచేత సాత్త్వికభావోదయము వ్యంగ్యమై శృంగారరసము ధ్వనిత మగుచున్నది. రాజుయొక్క దక్షిణ హస్తము వర్ణించుటచేత, దేవయాని కతడు రాజని తెలియుటచేత దేవయానికి రాజునందలి కోరిక ధ్వనిత మగుచున్నది. అటువంటి చేతిని రాజు పట్టుకొనె ననగా రాజు చూచుచు నా సౌందర్యమును గ్రహించెనని కదా యర్థము! రాజునకుకూడ దేవయాని గతాభిప్రాయ మున్నది. ఇట్లు రస ముభయనిష్ఠమై, ధ్వనితమై, రసానుకూల రచనా పరిపుష్టమై, సామాన్యదృష్టికి మధురాక్షర సంయుతమై ప్రకాశించుచున్నది. నన్నయ్యగారి యక్షర రమ్యత పైకి మాత్రమే యక్షరరమ్యత. ఆయన రచన యంతర్నిగూఢ మహాగుణ సనాథము; మరియు రమణీయ శిల్పాభిరామము; రసధ్వని రమణీయము.

మరి మూడవది ప్రసన్నకథాకలితార్థ యుక్తి. దీనికి ప్రసన్నకథాకవితార్థ యుక్తియని పాఠాంతరము. కథా కవిత యన్న శబ్దము మన భాషకు సహజమైనది కాదు. కథాకవిత యని, మరి యింకొక కవిత యని విభాగము మన సారస్వతమున కనిపించదు. అందుచేత కథాకలితార్థ యుక్తి యనుటయే సమంజసము. కథాకలితార్థయుక్తి యనగా కథతోకూడుకొని యొక మహార్థము ప్రకాశించుట. ఇది యొకమహాశిల్పము. ఇది నన్నయ్యగారి యుపజ్ఞ. ఇది యెట్లుండు ననగా గాంధారి వివాహ కథలో నన్నయ్యగా రిట్లు వ్రాసిరి. 'భీష్ముండు........కావున ధృతరాష్ట్రునకు గాంధారిని వివాహము చేయుదము. గాంధారపతి మనతోడి సంబంధమునకుం దగునని నిశ్చయించి సుబలు పాలికిఁ దగు ముదుసళ్ళం బంచిన సుబలుండును సుముఖుండై కురుకుల విస్తారకుండయిన ధృతరాష్ట్రుండ యిక్కన్యకు నర్హుండు గావున నా రాజునకు గాంధారి నిచ్చితి ననిన వాని బంధుజనంబు లెల్ల దమలో ని ట్లనిరి.

'అంగములలోన మే లుత్తమాంగ మందు
నుత్తమంబులు గన్నుల యుర్వి జనుల
కట్టి కన్నులు లే వను టంతెకాక
యుత్తముఁడుగాఁడె సద్గుణ యుక్తి నతఁడు.'

'అనిన వారి పలుకులు విని గాంధారి ధృతరాష్ట్రునకుఁ బితృవచన దత్తగాఁ దన్ను నిశ్చయించి నాకుఁ బతి యమ్మహీపతియకాని యొరుల నొల్లనని పరమపతివ్రత పరపురుష సందర్శనంబు పరిహరించి'

ఇది గాంధారి వివాహకథ. భీష్ముడు ధృతరాష్ట్రునకు గాంధారి నిమ్మని సుబలునకు గబురంపెను. సుబలు డంగీకరించెను. బంధువులు లోపల సణుగుకొనిరి. కాని గాంధారి యనుమతించెను. ఇది కథ. పైకి కనిపించున దింతియే. ఈ కథయందు కలితమైన యర్థయుక్తి యెట్టిది? అది కవీంద్రులలో నారసి మే లనదగినది. అది యిందులో నె ట్లున్నది - సుబలుడు ఆ రాజునకు గాంధారి నిచ్చితిననిన అన్నది యొక వాక్యము. బంధు జనులెల్ల తమలో నిట్లనిరి - ఇది యొక వాక్యము. అనిన వారి పలుకులు విని గాంధారి - ఇది మూడవ వాక్యము. ఈ మూడు వాక్యములను విచారించిన చో నా యర్థయుక్తి యెట్టిదో తెలియగలదు. గాంధారి నీయదగినది ధృతరాష్ట్రునకు. ధృతరాష్ట్రుడు మహారాజు కొడుకైనను గ్రుడ్డివాడు. అతడు రాజ్యార్హు డగునో కాదో తెలియదు. ఇట్టి స్థితిలో తమ కూతు నెవ రిత్తురు? ఆమె కుంటిది కాదు. గ్రుడ్డిది కాదు. ఆ గ్రుడ్డివాని కిత్తు

నన్నచో తల్లి యొప్పుకొనదు ; బంధువు లొప్పుకొనరు. ఇది గడ్డుసమస్య. ఈ సమస్య యీ కథకు వెనుక నున్నది. ఈ సమస్యను పరిష్కారము చేసినచో నీ కథలో నొక యర్థయుక్తి నన్నయ్యగా రేర్పాటు చేసినట్లుకదా! సుబలుడు 'గాంధారి నిచ్చితి' ననెను. బంధువులు తమలో ననుకొనిరి. కాని పైకేమియు ననలేదు. సుబలుని భార్య యేమన్నదో తెలియదు. ఆమె ప్రసక్తియే లేదు. బంధువులు సుబలుని మాట కాదనలేరు. సుబలుడంత తీక్ష్ణ ప్రకృతి యని యర్థము. అతనిమాట కెదురు లేదు. అతడు చండ ప్రచండుడు.

సుబలుని యీ స్వభావ మంతయు మొదటి రెండు వాక్యములలో నున్నది. అత డిచ్చితి ననెను. తనమాట కెదురు లేదని యతనికి తెలియును. అందుచేతనే బంధువులు తమలో ననుకొనిరి కాని రాజున కెదురుబడి మాటాడలేదు. తమలో ననుకొనుట కూడ నెట్లనుకొనిరి? గాంధారికి విన బడున ట్లనుకొనిరి. గాంధారితో చెప్పలేదు. వారికి గాంధారి స్వభావము గూడ తెలియును. ఆమె తండ్రి యిష్ట ప్రకారమే నడచును. అందుచేతనే సుబలుడుకూడ తన కూతుతో నీ సంగతి చెప్పలేదు. ఆమె నేను గ్రుడ్డివానిని చేసుకోనని యనునన్నభయము సుబలునకు లేనేలేదు. అందుచేత బంధువు లామె వినునట్లు తమలో ననుకొనిరి. ఆమె యిష్టపడక పోయినచో వారు సంతోషింతురు. గ్రుడ్డివానికి పెండ్లియగుట కష్టముకదా! ఈ సమస్యను నన్నయ్యగా రీ విధముగా పరిష్కారము చేసిరి. సుబలుడు తా నెంత తలచినచో నంత చేయువాడు. గాంధారి తండ్రి యిష్టప్రకారము నడచునది. ఈ రెండు పెద్దవిషయములు కథయందు గుప్తములై యున్నవి. సుబలుడు మాత్రము తనకూతు గొంతు కోయునా? అతడును విచారించెను. ధృతరాష్ట్రుడు కురుకుల విస్తారకుడని దైవజ్ఞుల వలన తెలిసికొనెను. పైగా నతడే రాజగునని కూడ సుబలుడు చక్కగా విచారించెను. అందుకనియే 'యా రాజునకు గాంధారి నిచ్చి' యనెను. 'ఆరాజునకు' అనుటలో నీ యర్థ మున్నది.

ఇట్లు నన్నయ్యగారి యొక్క ప్రసన్నకథాకలితార్థ యుక్తి యుండును. ఇది నన్నయ్యగారు వ్రాసిన సర్వ కథలయం దున్నది. ప్రధానకథ భారతకథ. ఉపాఖ్యానములు చాల కలవు. ఈ యుపాఖ్యానములు పలువిధములు. కొన్ని ఋషులకు సంబంధించినవి; కొన్ని మహారాజుల చరిత్రములు ; మరికొన్ని వైదిక కథలు. ఇట్టి కథల నొక్కొక్కజాతి కథ నొక్కొక్క విధముగా చెప్పును. ఋషుల కథలు ఋషులయొక్క త్రైకాలిక పరిజ్ఞానము ద్యోతము చేయున ట్లుండును ; అనగా నా కథలలోని యర్థయుక్తి ఋషులు తమ తపశ్శక్తిచేత నాగామి విషయముల దెలిసికొని య ట్లాచరించిరని సువ్యక్తము కాగలదు. అది ఋషుల కథలయందలి యర్థయుక్తి.

మహారాజుల యొక్క కథలు చెప్పునప్పుడు నన్నయ్యగారి యర్థయుక్తి తద్గత భిన్నాంశములయందు నొక పాత్రయొక్క రహస్యమైన శీల నిరూపణమునందో, యితర పురాణములయందున్న మహావిషయములను సంయోజనముచేయుటయందో యిమిడించును. వైదిక కథలయందు ఖగోళశాస్త్ర విషయములు, శుల్బశాస్త్ర విషయములు, యాజ్ఞిక కర్మ విషయములు నిగూఢములుగా చొప్పించును. ఈ రీతిగా నిన్ని మహావిషయములు కథా కలితార్థ యుక్తిగా నేల చేయవలయు? ప్రత్యక్షముగా చెప్పరాదా యని ప్రశ్న పుట్ట వచ్చును. దీనికి రెండు సమాధానములు : మొదట కావ్యము ధ్వని జీవితము; నన్నయ్యగారు మహాధ్వనిరహస్యవేత్త. ధ్వని మూడు విధములు : అలంకార వస్తు రస ధ్వనులు. రసధ్వని యుత్తమమైన దందురు. 'సాధ్యో హి రసో యథాతథం కవిభిః' అన్నట్లుగా సర్వకవులును తమ శక్త్యనుసారము రసము సాధింతురు. గొప్పకవి గొప్పగా సాధించును. తక్కువకవి తక్కువగా సాధించును. కథ చెప్పికొని పోవుటలోనే కథాభిముఖమైన పాఠకుని బుద్ధిలో కవియొక్క కించిచ్ఛక్తిచేతగూడ రసానుభూతి తదనుకూలముగా కలుగుచుండును. అక్కడ కవి వట్టి కవి. తక్కిన విషయముల యందు శిల్పి. ప్రధానముగా వస్తుధ్వని మహాకథమీద కనిపించుట మహాశక్తి. శిల్పదృష్టితో జూచినచో కథాగతమైన మహావస్తుధ్వని మహోత్కృష్టమైనది. ఈ శక్తి నన్నయ్యగారి కున్నంత సృష్టిలో నే కవికి నుండదు.

రెండవ కారణ మేమనగా నన్నయ్యగారు తా నితిహాసము వ్రాయుచుండెను. కావ్యము వ్రాయుట లేదు భారత విషయమున నన్నయ్యగారిది యితిహాసదృష్టి కావ్య దృష్టికాదు. భారతము ప్రధానముగా నితిహాసము ఈ యితిహాస కథ భాసింపజేయుట నన్నయ్యగారి ప్రథమ దృష్టి. అందుచేత నీ యర్థయుక్తి కవీంద్రులు లో నారసినచో ప్రసన్నమగునట్లు నన్నయ భారతేతిహాసమున వ్రాసెను.

ఇప్పుడు ఋషి మహత్త్వ బోధకమైన కథ యెట్లుండునో చూడవలయును. సౌకన్యోపాఖ్యానము దీని కుదాహరణముగా దీసికొనబడుచున్నది. ఈ సౌకన్యోపాఖ్యాన మరణ్యపర్వములోనిది. ఇందలి కథ యేమనగా

నొక కొలని సమీపమున భృగు సుతుడు పెక్కేండ్లు తపస్సు చేసెను. ఆముని దేహము వల్మీకమున కప్పబడి యుండెను. చాల కాలమునకు సంయాతి యను రాజు తన రాణివాస ముతో నచటికి విహరింపవచ్చెను. అతని కూతురు సుకన్య పుట్టలో మునికన్నులు ప్రకాశించు చుండగా నప్పుడే పుట్టిన యూహతో పుట్ట త్రవ్వించెను. మునికన్నులు మూసికొనెను. ఆమె కేమియు కన్పించలేదు. ముని రాజ సైన్యములకు నిరోధము కలిగించెను. రాజు కారణము తెలియక బాధ పడుచుండగా నామె తండ్రివద్దకు పోయి యిది కారణ మగునేమో యని చెప్పెను. రాజు చ్యవనుని వద్దకుపోయి నీ మహిమ యెరుగక యీమె యిట్లు చేసెను. తరుణుల కెరుక కలుగునా యని యనగా ముని యతిశయరూప యౌవన గర్వితయైన యీ కన్యను పరిగ్రహించిగాని నేను క్షమింప ననెను. రాజు తన కూతు నతని కిచ్చి వెడలి పోయెను.

ఈ కథ కథగా కనిపించుచుండగా నిందులో కొన్ని కిటుకు లుండెను. ఆ కిటుకు లెక్కడ నుండెను? ముని తపస్సుచేయుచున్న పుట్టచుట్టును నికటవల్లీ గుల్మములు పై బ్రాకి యచ్చట పుట్ట యున్నదని తెలియకుండ నుండెను. సుకన్య యావల్లీగుల్మములుదాటి పోయి పుట్టకన్నములో నుండి చూచెను. ఇట్లు చేయవలసిన యవసరము సుకన్య కేమి కలదు? ఆమె యంతటి నిర్భయురాలా? అదుపు మాలిన పిల్లయా? ఆమె పుట్ట క్రొప్పించెను. ముని కని పించలేదు. రాజు వచ్చి చూచినపుడు ముని కనిపించెను. ముని యామెకు కనిపించక రాజున కెందుకు కనిపించెను? పైగా రూపయౌవన గర్వితయగు నాకన్యను పరిగ్రహించి గాని క్షమించ ననుట, ముని యామెను పెండ్లి చేసికొనుట దేనికి? ఆమె యౌవన గర్వము తగ్గించుటకా? ఆమెను శిక్షించుటకా? తాను ముసలివాడు గనుక ఆ పడుచు పిల్లను తాను పెండ్లిచేసికొనినచో నామెకు శిక్ష జరుగునని యా ముని యూహయా? ఆమెను శిక్షించవలయు నన్నచో మరియొక ముసలివానికిచ్చి పెండ్లి చేయవలయును కాని తానే పెండ్లి చేసికొనినచో నామె శిక్ష మాట యెట్లున్నను తాను బడు కష్టము, నప్రతిష్ఠయు నేమి కావలయును? మరియు రాజంత తేలికగా తన కూతు నా వృద్ధున కిచ్చి వెళ్ళిపోయెనా? కథ కథగా కనిపించినను కథలో నిట్టి చిక్కు లున్నవి.

కథలో నున్న యీ ముడులు విడివడుటకు కథాంశ ములనే సూక్ష్మముగా పరిశీలింపవలయును. ఆ మహర్షి సుకన్యను పెండ్లిచేసికొనవలెనని యనుకొనెను. సుకన్య యల్లరిపిల్లయని యాయనకు తెలియును. ఆమె గుణ వతియని కూడ నాయనకు తెలియును. ఆమె యతి శయ రూప యౌవన గర్విత. అందుచేతనే విద్యుల్లతాంగి యని 'సద్యస్సంజాత బుద్ధి సంభ్రమ' యని విశేషణ ములు వేయబడెను. ఆమె యదుపులేని పిల్ల గనుకనే యంత జిగిబిగిగా నున్న తీగలలో ముండ్లలో దూరి పోయి పుట్టలో చూచెను. సామాన్యముగ నట్లెవ్వరు చేయరు. ఆ పుట్ట క్రొప్పించినప్పుడు ముని తాను కనిపించ లేదు. తన్ను పెండ్లి చేసికొనుమని యామె నడిగినచో నేమి ప్రయోజనము? అందుచేత రాజును తనవద్దకు రప్పించుకొనవలయును. రాజు తనవద్దకు వచ్చుటకు రాజ సైన్యమును శపించవలయును. ఈ పుట్ట క్రొప్పించుట యౌవన గర్వముచేత చేసినపనియే గాని యామె దుర్మార్గురా లగుటచేత కాదు. అందుచేతనే తండ్రివద్దకు పోయి తాను పుట్ట క్రొప్పించిన సంగతి చెప్పెను. తండ్రి కోపపడు నేమోయని యూరకుండలేదు. ఆమె యంత మంచిబాలిక. అపుడు రాజు మునిదగ్గరకు వెళ్ళెను. అతడు తపస్సు యొక్క క్లేశముచేత చర్మము బొమికలు మాత్రమే మిగిలిన శరీరము కలవాడు.

రాజు తన కూతు నాయన కిచ్చెను. ఆ రాజునకు చ్యవ నునియొక్క తపోమహిమ తెలియును. తన కూతు నాయన కిచ్చినచో తన కూతు రేమియు బాధపడదు. ఆ ఋషి యామెను వరించెను. తన కూతుయొక్క యోగ క్షేమముల నాతడే చూచుకొనును. ఇది యంతయు విచారించియే రాజాతనికి తన కూతు నిచ్చుట కంగీకరిం చెను. 'ఎఱుక గలరె తరుణులు ధరణిన్' ఇక్కడ వాడిన శబ్దము తరుణులు అనగా యౌవనవతులు; అనగా యౌవ నము వలన కలిగిన యుత్సాహమే కాని తన కూతునకు వేరే దుర్గుణములు లేవని రాజునకు తెలియును. అందువల ననే మునికి భార్యగా నిచ్చినను తన కూతునకు వచ్చెడి యాపద లేదని రాజు తెలిసి యిట్లు చేసెను. ఈ కథ ఇట్లు జరుగుటకు ఋషికి సుకన్యమీద కలిగిన ప్రేమ, యామె యౌవన గర్వము. యామెయొక్క సల్లక్షణము, రాజు వివేకి యగుట — యీ మూడు విషయములు వెనుక నుండెను. ఇవి పరిశీలించినచో తెలియవలసినవి. ఇదియు నన్నయ్యగారి యర్థయుక్తి.

మరియు తరువాతి కథ ప్రసన్నమైన తెర గెట్టి దనగా సుకన్య చ్యవనునకు పరిచర్య చేయుచుండెను. ఋషి తాను వృద్ధుడు. ఆతనియందు సుకన్య కామోపభోగముల ననుభ వించుటలేదు. ఆమె మన స్సెట్లున్నదో? ఆమె తనకంటె నన్యుని వరించుచున్నదో సౌందర్యవంతుని వరించు చున్నదో? ఋషికి తెలియదు. అందుచేత నత డశ్వినీ

దేవతలను సుకన్య వద్దకు పంపించెను. వారు సుకన్యవద్దకు వచ్చి నీ వింత యందకత్తెవు. వృద్ధుని పెండ్లాడి నీ యౌవనమును వృథా చేసితివి. నీ యౌవనమునకు, నీ సౌందర్యమునకు తగిన వరుని వరియింపుము. మేము వానిని తెచ్చెదమనిరి. అమె కోపించి పోయి భర్తతో చెప్పెను. ఋషి యాశ్వినులమీద కోపించలేదు. వారిని తానే పంపించినాడుగా! అందుచేత భార్యతో నీ వాశ్వినుల మాట యొప్పుకొనుమని పంపించెను. వా రన్న మాటలేమి? ఆమె యెవ్వనినో కోరుచున్నచో వానిని తెచ్చిపెట్టుదుమనికదా! ఆమె పోయి యెవ్వనినో కోరలేదు. నాకు యౌవనవరుం గావింపుడని కోరెను. నా భర్తను యౌవనవంతుని జేయుడని యర్థము. అశ్వినులతో చ్యవనుడును చెరువులో ప్రవేశించెను. మువ్వురు నవ యౌవనులై వెలికి వచ్చిరి. అశ్వినులిదివరకే నవయౌవనులు. చ్యవను డొక్కడే యిప్పుడు నవయౌవను డయినది. నల చరిత్రలోవలె మువ్వు రొక్క రూపువారు కాలేదు. అశ్వినీ దేవతలు సౌందర్యవంతులు; చ్యవనుడు కాడు. సుకన్య తన భర్తనే కోరెను; అనగా నామె సౌందర్యమును వాంఛింపలేదు. భర్తయొక్క యౌవనమే వాంఛించెను.

ఈ కథ పరీక్షించినచో నిచ్చట నున్న భిన్నాంశముల చేత నశ్వినీదేవతలు చ్యవనుని మాట చొప్పుననే సుకన్యను పరీక్షించుటకు వచ్చిరని తెలియగలదు. ఆమె 'నేను సంయాతి కూతురను, చ్యవనుని భార్య 'నని చెప్పగా వారు నవ్వి 'యిట్టి రూప విభవంబులు వడసి యీ ముసలివానినా వరించునది? నీ వయోరూపములకు తగినవాని వరియింపుము మేము తెచ్చెద 'మనిరి. అంతియే కాని మేము యౌవనవంతులము; మేము సౌందర్యవంతులము; మమ్ము పెండ్లాడు మనలేదు. ఆమె తన భర్తనే యౌవనవంతుని చేయుడని యడిగినది. ఆమెకు దేహభ్రాంతిగాని దేహగతావస్థాభ్రాంతిగాని లేదని తెలియుచున్నది.

వారిని చ్యవనుడే పంపించె ననుటకు మరియు నింకొక కారణము కలదు. ఎవరో వచ్చి యి ట్లన్నారని చెప్పగా చ్యవనుడు కోపించవలయును. కోపించక వారి మాటల కొప్పికొనుమని భార్యతో చెప్పెను. అందుచేత చ్యవనుని మాట చొప్పుననే వారు వచ్చిరని తెలియుచున్నది. సుకన్యను పరీక్షించవలయునని మునియే యీ పన్నుగడ పన్నెను; లేదా యశ్వినీదేవతలే చ్యవనునివలన తా మేదో లాభము పొందవలయునని చ్యవనుని కీ యుపకారము చేయుటకు వచ్చిరి అని చెప్పినచో నదియు పొసగదు; ఏల ననగా చ్యవనుని యాశ్రమమునకు యశ్వనీదేవతలు సుకన్యను చూచిన ప్రదేశమునకు కొంతదూర మున్నదని 'ఒడంబడుమని పంచిన' యన్న మాటలో నున్నది. వారు తమ యంతటనే తాము వచ్చినచో, వచ్చి యిట్లు మాటాడినచో సుకన్య పోయి యీ మాటలు భర్తతో చెప్పినపుడు ఆయన తొందరపడి శపించవచ్చును. ఈ రీతిగా కథ ప్రసన్నమగుచున్నది. ప్రసన్న మగుట యనగా స్థూలముగా జూచినపుడు కలుగు సందేహము లన్నియు నివారితము లగుట.

నన్నయగారు ఇతర పురాణములయందలి విషయములను ప్రస్తుత కథయందు తా నెట్లు జోడించు ననగా నల చరిత్రములోని హంస దౌత్యము చూచినచో నర్థమగును. హంస దౌత్యము నల కథకు ముఖము. నల దమయంతు లిద్దరు నొక రొకరి గుణములు విని యన్యోన్యము కోర్కి గలవారైరి. 'ఒక్కనాడు నలుడు దమయంతీ గుణబద్ధచేతస్కుండై మదనానలంబు సహింపనోపక ప్రమదవనంబున గ్రుమ్మరువా డంతరిక్ష శ్రీకాంతాహారావళియుం బోలె హంసావళి యవనీతలంబున కవతరించిన' - దమయంతీ గుణబద్ధచేతస్కుడు దమయంతియొక్క గుణములయందు బద్ధమైన మనసు కలవాడు. దమయంతి యను త్రాడుచేత కట్టబడిన మనస్సుకలవాడు. మదనానలము సహింపనోపక అనగా కాలుసేతులు కట్టివేసి నిప్పులో వేయబడినవానివలె నుండెనన్నమాట. అంతరిక్ష మను స్త్రీయొక్క ముత్యాలపేరువలె హంససమూహము భూమి కవతరించెను.

ముత్యాల పేరువలె హంసల వరుస యన్నదనుటచేత గగనమున బకులు గుములుగా నెగురునపుడు మెడలోని హారమువలె నాబద్ధమాలలై పోవుట విదితమయిన విషయమే. ఈ పోలిక చెప్పుట యెందు కనగా నలుడు దూతయైన హంసను పట్టుకొనగా 'పిండుకట్టి తిరుగుచుండె వాతోద్ధూత శారదాభ్ర శకలచయమువోలె' నన్న భావముతోన సమత్వము కల్పించి చమత్కరించుటకు. ఇచట అంతరిక్ష మను శబ్దము అవతరించుట యన్న శబ్దము - ఈ రెండును ముఖ్యములైన శబ్దములు. అంతరిక్ష మనగా వాయు ప్రసారము గల యాకాశము ('వాయు రంతరిక్షే సూర్యో దివి చంద్రమా దిక్షు నక్షత్రాణి స్వలోకే' అని వేదము). ఈ హంసలు వాయు మండలము నుండి దిగినవి. ఎచటినుండి వచ్చినవో తెలియదు. వాయు మండలమునందే యుద్భవించెనేమో! 'అవతరించు' అన్న శబ్దము 'డిగ్గు' అన్న సామాన్యార్థమును చెప్పుచున్నను భగవంతు డవతరించెను అన్నచోటి యర్థమును కొట్టుచున్నది. కనుక వాయువు తనువుగా గలిగిన దైవ మవతరించె నన్నస్ఫూర్తి యీ శబ్దములందు గలదు.

నలుడు 'హంసల నడ బెడంగు చూచి నగుచు' వాని 'నడకలసొగసు చూచి నవ్వుచు' - ఎందుకు నవ్వవలెను?

అవి స్త్రీలవలె నడచుచున్నవి. దమయంతీగత బుద్ధి కదియే కదా యూహా! 'ఎగచి యెగచి యందు నెగయకుండఁగ నొక్క హంసఁ బట్టుకొనియె నతిరయమున'. ఎగరగొట్టి ఎగరగొట్టి పైకి లేవకుండ నుండగా నొక్క హంసను మిక్కిలి తొందరగా బట్టుకొనెను (ఎగచు - ఎగరజేయు, ఎగయు - పైకి లేచు). ఆ హంస యెగురనే లేదు. దానిని మిక్కిలి తొందరగా బట్టుకొనియెను. అది యెగిరిపోవునేమో యని యతని భయము. అది యితడు పట్టుకొనవలయుననియే యెగురలేదు. 'ఆ హంస తన కమ్మనుజేశ్వరుం డపాయంబు జేయుంగా వగచి' చేయునని వగచి కాదు. చేయునుకదా యని యర్థము చెప్పినచో నీ 'కదా' శబ్దమున కర్థము లేదు. అతడు తన కపకారము చేయడు. చేయు నన్న ట్లూహించి యన్న యర్థము కల్పించుకొనవలయును.

'ఆ హంస మనుష్య వాక్యంబులతో నీకుం బ్రియంబు జేసెద. నీ హృదయేశ్వరియైన దమయంతి పాలికిం బోయి' మొదలైన వాక్యములను జెప్పెను. ఈ హంసకు దమయంతి నలుని హృదయేశ్వరి యని యెట్లు తెలియును? తెలియునుబో, నీ కెట్లు తెలియునని నలు డేల ప్రశ్నించలేదు? నలు డనురక్తుడై వదలిపెట్టెను. ఆ హంసపిండు దమయంతివద్దకు పోయి విహరించుచుండెను. అక్కడ దమయంతియు, నామె చెలికత్తెలును హంసలను పట్టుకొనుటకు పరుగెత్తిరి. 'నలుచేతి విడువంగఁబడిన హంస చెలువముగ నందు దమయంతిచేతఁ బట్టువడియె'. 'విడువంగబడిన', 'పట్టువడియె' నని యీ రెండు ధాతువులకు పడు ధాతువనుప్రయుక్తమై యిది యంతయు నొక యుద్దిష్ట కార్యమని తెలియుచున్నది. హంస హంసకాదు. వట్టి హంస కీ మాట లెక్కడివి? ఈ జ్ఞాన మెక్కడిది? ఈ హంస యెవరు? ఈ హంస పిండు 'అంతరిక్ష శ్రీకాంతా హారావళియుంబోలె నవనీతలంబున కవతరించెను'. ఇది దమయంతికి నలునకు సంగమ కారణదూత, సంగమమునకు కారణమయిన దూత. ఈ హంస లేనిచో వారి సంగమము జరుగదా? అదివరకే వా రన్యోన్య లగ్నమనస్కులు. ఈ దౌత్యమువలన దమయంతి యధిక విరహతప్త యగుటయు మొదలయినవి జరిగినమాట నిజమే. అంతమాత్రమున సంగమకారణ దూత యనవలయునా? లోకములో కారణ జన్ముడు మొదలైన శబ్దములు కలవు. ఒక మహాకార్యము సాధించుటకే యతడు జన్మించినాడని యర్థము. అట్లే నలదమయంతుల సంగమ మను మహాకార్యము జరుపుటకొరకే యీ హంస యవతార మెత్తెనని యర్థమగుచున్నది.

శివ పురాణములో నొక గాథ కలదు. పూర్వ యుగములో ఆహుకుడు ఆహుకి యను నిద్దరు భిల్ల దంపతులు పరమ శివభక్తులై యుండగా శివు డనుగ్రహించి 'మీరు భవిష్యత్కాలములో నల దమయంతులై జన్మింతురు. మీకు నేను దౌత్యము చేయుదు'నని చెప్పెను. ఆ గాథ ననుసంధించి నన్నయగారు ఈ కథ వ్రాసెను.

సంస్కృతములో నైషధమును రచించిన శ్రీహర్షునికి, దానిని తెనుగున రచించిన శ్రీనాథునికి ఈ శివపురాణాంతర్గత కథ తెలియదు. అందుచేత వారి హంస పంచతంత్ర కథలలో వచ్చు నొక పక్షివంటిది. నన్నయ్యగారు 'నానా పురాణ విజ్ఞాననిరతుడు'. అందుచేత నన్నయ్యగారి హంస శివుడు. పరమ యోగీశ్వరులకు హంసలని పేరు. యోగీశ్వరేశ్వరుడైన శివుడు హంసగా వచ్చెను. ఇది నన్నయ్యగారి పరమ విజ్ఞానము. 'అమలిన తారకా సముదయంబుల నెన్నను....విధాతృనకైనను నేరఁబోలు నే' అను పద్యమునుబట్టి నన్నయగారు భారతమును జూచిన చూపు తెలియగలదు. మొదటిది భారతములో నక్షత్ర గోళముయొక్క మహావిషయము లున్నవి. ఖగోళ పరిజ్ఞానము లేకుండ భారతము సర్వంకషముగా దెలియదు. రెండవది సర్వ వేదశాస్త్రముల రహస్యము తెలియవలయును. మూడవది దుర్గమార్థ సమన్వితము కనుక ఖగోళ విషయము సర్వవేదశాస్త్రార్థ పరిజ్ఞానము ప్రసన్న కథా కలితార్థ యుక్తిలో నన్నయ్యగారు చొప్పించిన బహ్వర్థ యుక్తులు భారత రచనచేయు కవికి తప్పకుండ కావలయును. నన్నయ్యగా రీ విజ్ఞాన మంతయు కలవారు.

'భూపతికిం దివంబునకుఁ బోల్పనఁగంగ శరత్సమాగమం
బాసకల ప్రమోదకరమై విలసిల్లె మహర్షిమండలో
పాసిత రాజహంస గతి భాసి ప్రసన్న సరస్వతీక మ
బ్జాసనశోభితం బగుచు నబ్జజు యానముతో సమానమై'.

వేదములో ద్యావాపృథువుల దాంపత్యము రూఢమైనది. మహర్షి మండల మనగా సప్తర్షి మండలము. ఈ సప్తర్షి మండలమునకు క్రింది భాగమున కొన్ని నక్షత్రములు హంసాకృతిగా నుండును. అచ్చటనే సరస్వతీ నక్షత్రము బ్రహ్మనక్షత్రముకూడ నుండును. ఈ సంగతు లన్నియు ఋగ్వేద ప్రతిష్ఠితములు. ఖగోళ విజ్ఞాన మహా విషయములు నన్నయ్యగారికి కరతలామలకములు.

వ్యాస మహర్షి భారతములో యాజ్ఞికములయిన సంప్రయోగ వైఖరులు, వేదచ్ఛందోవతారములు కథలుగా నిర్మించి వ్రాసెను. అందులో గరుడికథ గాయత్రీ చ్ఛందోవతార కథ. యజుర్వేదములో కద్రూ వినతలను రెండు ఛందస్సులచేత నమృతము సాధింపబడక

గాయత్రీ చ్ఛందస్సుచేత సాధింపబడిన యుపాఖ్యానము కలదు. దానిని వ్యాసమహర్షి గరుడి యమృతము నాహరించిన కథగా వివరించెను. ఇట్టి కథలతో నన్నయ్య గారి రచనము సర్వథా అమూలార్థము భాసించున ట్లుండును.

ఉపకథలతీ ర్పి ట్లుండును. ప్రధానకథ తీర్పు వేరు విధముగా నున్నది. ఉపకథలయం దర్థయుక్తి చేయుట తేలిక. ప్రధాన కథయం దర్థయుక్తి చేయుట మిక్కిలి కష్టము. అందు భారత కథ చాల క్లిష్టమైన కథ. ఎక్కడి కక్కడికి కథాఘట్టములు సన్నివేశక్లేశము కలవై కవి రచనకు, నౌచిత్యసంపాదనకు కష్టము కలిగించుచుండును. ధృతరాష్ట్ర పాండురాజు లన్నదమ్ములు. ధృతరాష్ట్రుడు గ్రుడ్డివాడు. పాండురాజు పాండురోగి. ఇద్దరకును రాజ్యార్హత లేదు. ఇద్దరును మహాబలశాలులే. అంధుడగుటచేత ధృతరాష్ట్రుని బాహుబలము నిరుపయోగము. రాజ్యము యథార్థముగా పాలించునది పాండురాజు. ధృతరాష్ట్రుడు పేరునకు రాజు. సర్వ దిగ్విజయము చేసి రాజ్యమునకు ప్రతిష్ఠ తెచ్చినది పాండురాజు. తాను నిత్యము హస్తినాపురమున నున్నచో ధృతరాష్ట్రుని రాజత్వమునకు భంగము వచ్చును. కాని ప్రజల బుద్ధిలో పాండురాజే రా జనిపించుచుండెను. భారత కథ ననుసరించి పాండవులు రాజ్యభాగ మడుగుటకు పాండురాజు రాజ్యముచేసినట్లు కనపడవలయును. మొదటనే కథలో నీ క్లిష్టఘట్ట మున్నది. రెండవది ధర్మరాజునకు పదునారవయేట పాండవులు హస్తినాపురమునకు వచ్చిరి. అంతవరకు పినతండ్రి పెదతండ్రి కొడుకు లొకరి నొక రెరుగరు. అంతవరకు దుర్యోధనుడే యువరాజుగా నుండెను. ఒకవేళ సమష్టి కుటుంబముగా నొప్పుకొన్నను కొడుకులలో పెద్దవాడైన ధర్మరాజు యువరాజు కావలసి వచ్చును. ఈ పినతండ్రి పెదతండ్రి బిడ్డలు విరోధము పాటించుకొనజొచ్చిరి. ఒక కుటుంబములోని పిల్లలు పోట్లాడ మొదలిడినచో నెటు చెప్పుటకు వీలులేదు. ఎంత పోట్లాడుకొన్నను తెగతెంపులు చేసికొనుటకు వీలులేదు. ఒకరి నొక రెక్కువగా సాధించుకొనుటకు వీలులేదు. ఈ కౌరవ పాండవుల విరోధ మిట్టిది. ఈ విరోధముయొక్క స్వరూపము ఒక గద్యకావ్యమునకో, యొక యల్ప కావ్యమునకో తగినది కాని మహాకావ్యమునకు తగినది కాదు. కాని భారతము మహాకావ్యము.

కథయొక్క యాత్మ చెడకుండ నీ సమష్టి కుటుంబములో నున్న వ్యవహారము ధ్వనింపజేయుచు నితిహాసము యొక్క యితిహాసత్వము చెడకుండ వ్రాయుట యొక క్లిష్టఘట్టము. ద్యూత ఘట్టముకూడ వారి సన్నిహిత బంధుత్వముచేత క్లిష్టతర మగుచున్నది. ఈ క్లిష్టమైన భాగ మంతయు నన్నయ్యగారి పాలబడినది. తక్కిన భారతకథ దీని దృష్ట్యా కవితాశక్తి యెక్కువ కలవాడు వ్రాసికొని పోవచ్చును. ఈ ఘట్టములు వ్రాయుటకు లోకజ్ఞుడు కావలయును. రాజసభా వృత్తాంతములు చెప్పుటకు మనోభావముల వివరణము చేయుటకు లౌకికుడు కావలయును. అందుకనియే నన్నయ్యగారు తాను 'లోకజ్ఞు నుభయభాషా కావ్య శోభితుడ'నని చెప్పుకొన్నాడు. ఈ మూడు ఘట్టములు మూడు విధములుగా నన్నయ్యగారు సమర్థించిరి. ధృతరాష్ట్రుడు రాజ్యముచేయుచుండగా 'పాండురాజు వినయ విధేయత్వంబున ధృతరాష్ట్రున కభిమత కార్యకరణంబున. బాంధవులకు.......సంతోషంబు సేయుచు, 'మండిత గుణసంపద నధికుం డగుచుం....పాండు మహీశుఁడని బుధసభలు దనుఁ బొగడన్'. పై వచనములో రాజలక్షణము లన్నియు చెప్పి ధృతరాష్ట్రునియందు వినయ విధేయతలతో నుండుట చెప్పి బుధసభలు పాండు మహీశుడు పూరు భరత కురు పతులకు దుల్యుండయి వంశకరుం డగునని పొగడగా నొప్పెనని వ్రాయుట యొక గొప్ప నేర్పు. స్మృతిన్యాయ మె ట్లున్నను జనవాక్యము పాండురాజే రాజుగా నుండెను. కురుపాండవ యుద్ధమునకు బీజభూతమైన సమస్య యిట్లు నిర్దేశింపబడెను. ఆ ఘట్ట మంతయు నిట్టి చమత్కారములైన సూచనలతో నిండి యున్నది. రెండవ ఘట్టముయొక్క క్లిష్టత దుర్యోధనాదుల యౌద్ధత్య నిర్వహణముతో సమర్థింపబడినది. వారు వీరును పినతండ్రి పెదతండ్రి బిడ్డలమని తెలిసికొనుట పదునాలుగేండ్లు పెరిగిన తరువాత జరిగినది. అంతవరకు దుర్యోధనాదులు వారసులుగా బెరిగిరి; రాచబిడ్డలుగా పెరిగిరి. పాండవుల కీపెంపకము లేదు. కౌరవులయు, పాండవులయు నీ పెరుగుదలలోని భేదమువలన విరోధ మెట్లు పొడసూపినదో వ్యంగ్యభూతముగా వ్రాయుటలో నన్నయ్యగారి నేర్పు గలదు. ఆ నేర్పులో నున్న కష్టము మహాకావ్యము యొక్క లక్షణము చెడకుండ పట్టుకొని వచ్చుటలో నున్నది. ద్యూత ఘట్టము కూడ నింత నేర్పుతోడనే నిర్వహింపబడినది. బంధుత్వ మేమి చేయుటకును వీలులేదు. పినతండ్రి బిడ్డలు కానిచో పాండవు లోడిపోయినంతనే నిజముగా దాసులై పరిచర్య చేయవలయును. అట్లు చేసినట్లు లేదు. ధృతరాష్ట్రుడు పిలిచి ద్రౌపదికి మరల రాజ్య మిచ్చునంతవరకు పాండవు లెక్కడ నుండిరి; యెట్టు లుండిరి? ఇట్టి బహువిషయములు వ్యంగ్య భూతములై పాఠకుని యూహా శక్తికి వదలబడి యొండు రెండు మాటలచే సూచింపబడుచు నీ ఘట్టములయందలి నన్నయ్యగారి

రచనా విధానము మనస్సున కందనిదై యనిర్వాచ్య రమణీయమై భాసించుచున్నది.

నన్నయ్యగారి రచన యింత పరమధ్వని సముపేతముగా, నింత పరమాలంకారికముగా నుండుటకు కారణమేమియని విచారించినచో నానాటి వేంగీ దేశమున కావ్యగతాభిప్రాయము లిట్టివి యని నిరూపింపబడుటకు కొన్ని ప్రతిపత్తులు కనిపించుచున్నవి. ఆ నాడు కావ్య శ్రోతృతా పారంగతములయిన సాహిత్య పరిషత్తు లుండినట్లు నన్నయ్యగారి 'పరమ వివేక సౌరభ....గొనియాడి వేడుకన్' అను పద్యముచేత తెలియబడుచున్నది.

ఈ సభలకు నన్నయ్యగారు తన యాదిపర్వము వ్రాసిన తర్వాత తన కావ్యము వినిపించినట్లు కనిపించును; ఏలననగా సభాపర్వమునందలి రెండాశ్వాసములకును, అరణ్య పర్వములో తాను వ్రాసిన మూడాశ్వాసములకును చివర తన కావ్యము అతి రమణీయమ్ముగాను, అతి రమ్యమ్ముగానని వ్రాసెను. ఈ రమ్య రమణీయ శబ్దములు ఆది పర్వముయొక్క యెనిమిదాశ్వాసముల చివరను లేవు. ఆదిపర్వాశ్వాసముల చివర లేకుండ సభారణ్యాశ్వాసాంతములయందు నీ శబ్దము లేల యుపయోగింపబడవలయును? ఆ పరిషత్తులు నన్నయ్యగారి భారతమును వినియట్లు ప్రశంసించి యుందురని యూహించుటలో సామంజస్య ముండవచ్చును. ఈ రమ్య రమణీయ శబ్దములు వేంగి పండితుడైన రసగంగాధరకర్త వాడుటయు, నన్నయ్యగారి కావ్యము అట్లున్నదని సభారణ్య పర్వములయందు కనిపించుటయు, నాదిపర్వమునందు లేకపోవుటయు, పండిత పరిషత్తులను నన్నయ్యగారు వర్ణించుటయు వీనిచేత జగన్నాథపండితు డేది సూత్రించెనో యా యభిప్రాయము వేంగినాటి పండిత పరిషత్తులదై యుండునని యూహించవచ్చును.

నన్నయ్యగారు ఆంధ్రభాషా వాగనుశాసను డనుటలో వాగనుశాసన లక్షణ మెుక్క వ్యాకరణము వ్రాయుటలోననే కాదు, కావ్యము వ్రాసి లక్ష్య నిరూపణము చేయుటలో కూడ నుండును కదా. ఆ లక్ష్య నిరూపణ మెట్టిదో చూడవలయును.

భాషకు నుడికారము ప్రాణము. ఈ నుడికారము నన్నయ్యగారియందు సమృద్ధిగా నున్నది. నన్నయ్యగారు ప్రధానముగా తత్సమ శబ్దములు పొందిన యర్థ విపరిణామము భాసించునట్లు బహు శబ్దములు వాడును.

'మాయందు లేని గుణములు
మీ యనురాగమునఁ జేసి మిగిలి వెలింగెన్
మీ యనుగతి మాకు నభి
ప్రాయము వనవాసదుఃఖభర మోపుదురే'.

ఇచ్చట నభిప్రాయమన్న శబ్దము ఇష్టమన్న యర్థము కలది.

'ఈ యున్న పౌష్యప్రోలికి పోయి కడుం బెద్దదవ్వు పోయినయట్లు' త్రికములోని యీ శబ్దమునకు నుండు ధాతువుయెుక్క భూతార్థక క్రియాజన్య విశేషణము జత పరచి తరువాత నామవాచకము పెట్టి నన్నయ్యగారు రెండు విధములైన మార్గములు చూపించినారు. తెలుగులో సమాస మిట్లు చేయవచ్చు నన్న దొకటి విశేషణ విశేష్యములు క్రియాజన్య విశేషణముచేత వ్యవహితములై సమాస ఘటనము చేయుట. మరియు నిచ్చటి యే తదర్థకమైన యీకారము సమీపదేశ నిర్దేశకముగా వాడబడినది.

'తడయక సామభేదముల దానములం దయతోడనమ్మగా
నొడివియు సత్య మిచ్చియు',

'మనసిచ్చి మాటలాడుటవలె సత్యమిచ్చుట' యని నన్నయగారు వాడినారు.

'పెద్ద యిష్టుడు మీకున్', 'ఈ వ్యాధి యొంటఁ దీఱదు', 'కన్నుమూయదు నాకున్', 'ఏమి గహనము', 'దుర్యోధనుండు దుర్బుద్ధియని యేమి చెప్పవలయును', 'నెల నెల సేవింతురు', 'పగలెల్ల జలదుర్గబలమున జలధినుండి', 'రేలెల్ల చనిన రేగి', 'అక్కుండలమ్ముల తొడుగ నవసరంబై యున్నది', 'నలిపిరి దీర్ఘ వాసరనిశల్', 'రణవీరులు కావుట'—

ఇట్టి వెన్నియో నన్నయ్యగారి తెలుగు ప్రయోగములు.

'మరియెండ యెక్కునంతకు', 'ఎల్లవారికంటె నెఱుకకలవు', 'ఎంత యోటువడిన నంతియ జూదమ్మునందుఁ దగులు', 'పూసి కట్టి తొడి', 'ముదుసళ్లు తమ కిమ్ముగా సదివికొండ్రు', 'గాడ్పు చూలి పిఱుదు కావంగ'—

ఇట్టివియును పలువిధములైన తెలుగు పలుకుబడులు నన్నయ్యగారు వాడగా మరికొంద రితరాంధ్రకవులు వానిని పదేపదే వాడి యా శబ్దములు వారివేమో యన్నంత ప్రేమ కలిగించుకొన్నారు.

మరియు నన్నయ్యగారు సంస్కృత శబ్దములను పలుచోట్ల యౌగికార్థమునందు వాడి కథార్థ యుక్తి కలిగింతురు. ఆంధ్రభాషకు నన్నయ్యగారు పెట్టినది భిక్ష. తక్కిన కవు లందరు నన్నయ్యగారినుండి భాషాశబ్దములు, పద్య రచనలోని యొడుపులు గ్రహించినవారే. కాని యొక్కరికిని నన్నయ్యగారి ప్రసన్నకథా కలితార్థయుక్తి తెలియలేదు. మహాకథ వ్రాయుచు కథా పరమ ప్రయోజనమైన మహావిషయమును వ్యంగ్యభూతముగా గాని, బుద్ధిపూర్వకముగా తత్ర తత్ర నిహిత బహు విషయజన్య స్ఫూర్తిచేత గాని భాసింపజేయగల తెలుగు కవులు కొద్దిమంది. నన్నయ్యగారు ఆంధ్రభాషకు సంస్కృత భాషకు వాల్మీకి యెట్టివాడో తా నట్టివాడనని యెరిగినవాడు. నన్నయ్యగారు వ్రాసిన బహువిషయము లట్లుండగా నాంధ్రభాషకు

గద్య పద్యాత్మకమైన కావ్యమే యుండవలయు ననియు నాంధ్ర కావ్యములలో చంపకమాలోత్పలమాలా మత్తేభ శార్దూలములు కంద సీస గీత పద్యములు బహుళముగా నుండుట రమ్య మనియు దర్శించినవాడు నన్నయ్య. వి.స.

**నన్నిచోడుడు :** ఈ కవి ప్రాచీనాంధ్ర కవులలో ఒకడు. ఇతడు రచియించిన కావ్యము కుమారసంభవము.

'కుమార సంభవము' అనుపే రెత్తుటతోడనే సాహితీ పరులకు వెంటనే స్ఫురించునది సంస్కృతభాషలోని కుమార సంభవకావ్యము. దానిని రచించిన మహాకవి కాళిదాసు. కాని ఆంధ్రభాషలో కూడ ఆ సంస్కృత కావ్యముతో సమానగౌరవము కలిగి ఆ సాహిత్యములో ప్రత్యేక స్థానమును వహింప గలిగినది తెలుగు 'కుమారసంభవము'. కావ్య మిట్టి దొకటి గలదని ఏ కొందరు ప్రాచీనులో తప్ప సామాన్యముగా నాంధ్రసాహిత్య లోకము మొన్న మొన్నటి వరకు ఎరుగనే యెరుగదు. దీనిని రచించిన కవి రాజు మాత్రమేకాదు, అతనికి 'కవిరాజశిఖామణి' యను బిరుదుకూడ గలదు,

ఈ కుమారసంభవ మాంధ్రసాహిత్యమున కొక యపూర్వాలంకార మని చెప్పదగి యున్నది. ఇట్టి యీ మహాకావ్య మనేకశతాబ్దములపాటు మరుగుపడి తెలుగు దేశమున ప్రసిద్ధి నందకయుండగా దీనిని బయటకు దీసి సుమారు నలుబది సంవత్సరముల క్రిందట నాంధ్రలోకమున కందించిన వారు మానవల్లి రామకృష్ణకవిగారు.

అంతకు పూర్వ మాంధ్ర కవిత్వమునకు ఆది పురుషుడని తలంపబడుచుండిన నన్నయ్యభట్టారకునికంటె నీ నన్నిచోడ మహాకవి సుమా రొక శతాబ్దము పూర్వపు వాడై యుండునని కవిగారు తాము ప్రకటించిన గ్రంథ పీఠికలో నిర్ణయింప యత్నించుటచేతనే ఇంతకాలము మరుగుపడియున్న యీ కుమారసంభవ కావ్య మాకాలములో నాంధ్ర సాహితీపరుల దృష్టిని విశేషముగా నాకర్షించి ఆంధ్ర సాహిత్యలోకమున గొంత సంచలనమును గలిగించుటకు ముఖ్యకారణమైనది. అనేకములగు నాభ్యంతర, బాహ్య సాధనములను బట్టి నన్నిచోడకవి నన్నయ్యకు బూర్వుడే యని వారు నిరూపింప యత్నించినను ఆ కాలములోని పండితలోకము నన్నయ్యను త్రోసి రాజని నన్నిచోడుని కగ్రస్థాన మిచ్చుటకు సమ్మతించలేదు. నిస్సందేహములైన తగు నిదర్శనము లింకను లభింపక పోవుటచే నన్నిచోడుని కాల మిదమిత్థమని నిష్కృష్టముగా తేల్పబడినదని చెప్పుట కిప్పటికిని వీలులేకయే యున్నది. ఆంతరంగికములగు గూఢవస్తుమయ కావ్య నిదర్శనములను బట్టి ఇతడు నన్నయకు సమకాలికుడని నిరూపింప యత్నించినవారు కొందరు, కొంతవరకు శాసనాది బాహ్యా నిదర్శనములను, గ్రంథస్థములగు నాభ్యంతర నిదర్శనములను సరిపుచ్చుటకు యత్నించి నన్నయ్య, తిక్కనలకు నడిమి కాలపు వాడని నిశ్చయింప యత్నించిన వారు కొందరు, అట్లు కాదు, కొన్ని సమకాలిక చారిత్రిక నిదర్శనములు కూడ నన్నయ్యకు పూర్వు డనువాదమునకే తోడ్పడగల వని వాదించు నిటీవలి వారు కొందరు నుండుటచే నీకవి కాలనిర్ణయ మింకను విమర్శనీయ స్థితిలోనే యున్నట్లు అగపడు చున్నది. ఏమైనను తాను ఒరయూరి కధిపతి యగు టెంకణాదిత్యుడనని చెప్పుకొనినందువలన గాని, కన్నడ తమిళ సాహిత్యములతో సన్నిహిత పరిచయమును చూపగలిగినంత మాత్రమునగాని, కొన్ని యపూర్వ ప్రయోగములను రచనారీతులను ప్రదర్శించినంత మాత్రమునగాని నన్నయ్యను తలదన్ని ఆంధ్రసాహిత్యములో అగ్రస్థానమును వహించగలడని మాత్రము ఆంధ్రలోక మిప్పటి కింకను తలంచుచున్న ట్లగపడదు. ఈ నన్నిచోడ జనవిభుండుతాను కరికాలచోడ వంశపువాడనని

'కలుపొన్న విరులు పెరుగన్,
కలుకోడిరవంబు దిశలఁ గలయఁగఁ జెలఁగన్,
బొలుచు నొరయూరి కధిపతి,
నలఘువరాక్రముఁడ టెంకణాదిత్యుండన్'

అని చెప్పుకొన్నను తన తండ్రి పాకనాటియం 'దిరువది యొక్కవేయిటి కధీశుడు నాజను చోడబల్లి'యనియు, తల్లి 'హైహయాన్వయాంబర శశిరేఖయైన శ్రీసతి' యనియు దెలిపియుండుటచేత నీతడు పాకనాటి సీమవాడేయై నెల్లూరు ప్రాంతమున నివసించిన చోడవంశపు రాజులలో నొకడై యుండునని తలంపదగి యున్నది. ఈతడు 'కాశ్యప గోత్రజుడు; మిత్రాన్వయ శేఖరుడు; టెంకణాదిత్యుడు;' 'కవి రాజశిఖామణి' యనుబిరుదు కలవాడు; శ్రీశైల మఠాచార్యులలో నొకడగు జంగమ మల్లికార్జున యోగికి శిష్యుడు; అన్యదైవ వితతిని గొలువక 'సద్యమిష్టఫలదుం' డగు నా జంగమ మల్లికార్జునయోగి శ్రీపాదుకలను శ్రీపీఠంబున నిడుకొని సమస్తదేవతా స్వరూపంబుగా భావించి యర్చించినాడు. ఇట్లాతనిని తన గురువుగనే కాక పతిగను భావించి సప్తసంతానములలో నుత్కృష్ట సంతానము సత్కృతియగా నిశ్చయించి సద్రసబంధురం బగు నీ కుమార సంభవ ప్రబంధము నాతనికి గృతియొసంగెను. ఇచట మరియొక విషయముగూడ గమనింపదగినదై యున్నది. ఏ మనగా నీతని గురువు శ్రీశైల మఠాచార్యుడగు జంగమ మల్లికార్జును డైనట్లే యీతని యిష్టదైవము శ్రీశైలమున మల్లికార్జునరూపమున వెలసియున్న పరమేశ్వరుడు. ఈ

పరమేశ్వరుడే తన కుమారసంభవ కథానాయకుడు కూడ. కావుననే

'గురువున కిష్టదైవమునకుం బతికిన్ గృతిఁ జెప్పి పుణ్యమున్
వరమును దేజముం బడయవచ్చు జగంబుల నిశ్చయంబు మ
ద్గురువును నిష్టదైవమును గూర్చు నిజేశుఁడుదాన, నాకుఁ గా
కొరులకు నిట్లు సేకురునె, యొక్కట లాభము
లెన్ని యన్నియున్'

అని మహోత్సాహముతో దలపోయుచు శ్రీనగోత్తుంగమణి శ్రీసంగతమల్లికార్జున దేవుడగు నీశ్వరునితో మునిజన ముఖమణి ముకురుండై సద్గురుండై నెగడు జంగమ మల్లికార్జున దేవునకు అభేదము కల్పించి షష్ఠ్యంత పదముల నాతని పూజించి పరమభక్తియుక్తి నావర్జితహృదయుడై సకల భువన భవనావతార కారణుండైన పరమేశ్వరు వంశావతారంబుగా వ్యావర్ణించి ఆ పరమేశ్వరుడు ప్రకృతి స్వరూపమై వెలసిన సతీదేవిని పరిగ్రహించి విశ్వోదయ కార్యసిద్ధికి తోడ్పడిన కథాసూత్రముతో కథారంభమును గావించినాడు. ఆ కథా సూత్రమే

'పతిజన్మంబుగ గణాధీశ్వర జననము ద
క్షక్రతుధ్వంసముం బా
ర్వతి జన్మంబుం భవోగ్రవ్రతచరితయు దే
వద్విషత్ క్షోభముం శ్రీ
సుతసంహారమ్ము భూభృత్సుతతపము సుమా
సుందరోద్వాహముం ద
ద్రతిభోగంబుం గుమారోదయము నతఁడనిం
దారకుం బోర గెల్పుం'

అనంబరగు సకలావయవంబులం బరిపూర్ణంబై దివ్య కావ్యాంగనా సృష్టికిగూడ మూలమైనదట. దీనినిబట్టి వివేకాబ్జుడు కవిరాజ శిఖామణియగు నీతని కుమార సంభవ కావ్యమందలి 'దివ్యకథ' కాళిదాసాదుల కావ్యము లందువలె నసమగ్రముగాక సకలావయవంబుల బరిపూర్ణం బైన 'దివ్యకావ్యాంగనా సృష్టి' వంటిదని వ్యక్తము చేసినవాడైనాడు.

ఈతని కథాసూత్రము నందలి దివ్యాంగన ప్రకృతి మహామాయ, సర్వపదార్థమూర్తియగు సతీరత్నము పార్వతి. ఈమె సకలావయవములం బరిపూర్ణ. ఆబీజ శక్తులు మిథునచర్యాసక్తి మైకొన్నగాని విశ్వోదయ కార్యసిద్ధి కాదు. ఇట్లు బీజశక్తుల విశ్వసృష్టితో ప్రారంభించిన ఈ కథాసూత్రమును తుదనుశివశక్తుల యేకీ భావముతో, అనగా మరల సర్వాత్మకుని యర్ధనారీ రూప ప్రదర్శనముతో నంతముచేసినాడీకవి. ఆ శివశక్తుల సృష్టికి విషయభూతుడగు కుమారుడుకూడ యోగపద్ధతిని మరల శివుని గాంచి పరమపదమును బొందురీతిని గూడ శివుని యుపదేశము మూలముగా వ్యక్తము చేయుటచే నీ సృష్టికి పరమావధిని, దానిని సాధించు మార్గమును గూడ దెలిపి యీ కావ్యకథా సూత్రమును సకలావయవ పరిపూర్ణంబగున ట్లీకవి చేసినవాడైనాడు. 'సకల నిష్కల స్వరూప సదాశివుండు స్వయంప్రకాశ భావుండై పరమ సుఖలీలఁ బ్రవర్తింపుచుండె' నని యీ కథను ముగించుటచే కలాసహితుడై సృష్టికి కారణభూతుడైన యీ యీశ్వరుడు నిష్కలరూపుడైన సచ్చిదానందరూపమున వెలయు చుండువాడే యని గూడ సూచించినాడు.

ఈ విధముగా నీ కావ్య కథాసూత్రము నిర్దిష్టమైన ఆద్యంతములు గల్గి, సకలావయవంబుల పరిపూర్ణమై నెగడినది. ఈ దివ్య కథారంభమున కభిముఖుడైనప్పుడే సత్కవికావ్యమును (లోను జూడగా బొరపగు చిత్రరూపమును బోలక) సువర్ణబంధ మృదుభావము గల్గి లోన వెల్పటన్ సరియగు రత్నపుత్రికవలె నుండవలె ననియు, పదునాలుగు విద్యల నేర్పు కనబరచుచు వర్ణనాష్టాదశమున బరిపూర్ణంబై, దశప్రాణంబుల సప్రాణంబై, నవరసభావ భరితంబు, షట్త్రింశదలంకారాలం కృతంబునై రమణీయత నొప్పునని చెప్పినాడు.

'జంగమ మల్లయ పేరఁ దత్ప్రభునాజ్ఞ పెంపునన్'

దా నీ మహిని నిల్పదలచిన సప్తసంతానములలో సద్రస బంధురమగు నీ ప్రబంధము ఉత్కృష్ట సంతానముగా భావింపబడినది. తన ప్రభువగు జంగమ మల్లయయాజ్ఞను బట్టియే యీ సప్తసంతానములు – అందీ ప్రబంధమును రచించుచున్నట్లు చెప్పుటచే ఈ నన్నిచోడునకు వేరు 'పతి' సార్వభౌము డెవరు లేరని ఈ సందర్భమున నట్టివారి నెవరిని అతడు ఉద్దేశించి చెప్పలేదని

'గురువున కిష్టదైవమునకుం బతికిం గృతి చెప్పి'

అన్న సందర్భములో కూడ ఈ ప్రభువగు జంగమ మల్లి కార్జుననే భావించినాడుకాని కొందరు తలచునట్లు వేరుపతి నెవ్వరిని భావించినట్లు లేదని స్పష్టము కాక మానదు. తన గురువునే తనకు ప్రభువుగా కూడ నీతడు భావించినాడు. కావుననే గురువును, పతియగు జంగమ మల్లికార్జును నిష్ట దైవము, కథానాయకుడు నగు శ్రీశైల మల్లికార్జున రూప శివునితో నభేదముచేసి యీ కథను సాగించినవాడైనాడు. ఇట్లీతనికి ఒక్క మాటుగా జేకూరిన ఇన్ని లాభము లిత రులకు జేకూరుట దుర్లభమే. ఈ పరిస్థితులలో నీతడు పాటించిన కృతిపతి కథానాయకుల యభేదరూప వర్ణనా పద్ధతి ఆంధ్ర సాహిత్యములో 'ఆశ్వాసాద్యంత పద్యముల నేక విభక్తికముల జేయుట'యను నొక క్రొత్త సంప్రదాయమును నెలకొల్పుటకు కారణమైనది. సామాన్యముగా

దెనుగు కావ్యములలో ఆశ్వాసాద్యంతములందు కృతి నాయకుని విశేషగుణములను వర్ణించుచు సంబోధించి కావ్యార్థము నాతనికి వినిపించుచున్నట్లు రచించుట పరిపాటియైన పద్ధతి. కాని నన్నిచోడు డీ కావ్యమున కథానుసారముగా నాశ్వాసాంతమున ప్రయోగింప వలసి వచ్చిన విభక్తినే కృతినాయకుని గూర్చి ఆ యాశ్వాసాంత్యమునను, తరువాతి యాశ్వాసాదిని రచించు పద్యములోని విశేషణ పదములకుగూడ నతికించి ఆ కథా భాగమందలి కథానాయకునితో పాటు కృతినాయకునికి కూడ వీలైన చోటులయందు అభేదము సాధించి నడుపుటయే ఆతని యుద్దేశము.

ఈ నూతన సంప్రదాయమును నన్నిచోడుడు పంపాది కన్నడ కవుల రచనాపద్ధతిని బట్టి గ్రహించి తెలుగులో బ్రవేశ పెట్టినట్లు కనబడును. ఈ పద్ధతిని తిక్కన నిర్వచనోత్తర రామాయణమున ననుసరింప యత్నించెను గాని అది యింత చక్కగా నిర్వహింపబడినట్లు లేదు. కన్నడ కవులతోను, సాహిత్యముతోను ఈతనికి గలిగిన విశేష పరిచయమునుబట్టి నన్నిచోడు డాంధ్ర సాహిత్యమున బ్రవేశపెట్టిన క్రొత్త విషయము లనేకములు గలవు. భాషా సాహిత్య పరముగా మార్గ, దేశి భేదముల నన్వయించి వీనినిగూర్చి తెనుగులో మనకు మొదట చెప్పినవా డీతడే. ఇంతేకాక చాళుక్య రాజాదులు దేశి కవితను పుట్టించి ఆంధ్రదేశమున తెనుగును నిలిపినవారని మనకు వ్యక్తము చేసినాడు. కన్నడ కవులు వాడిన 'జాణ్ణుడి'ని బట్టియే కావలయు నీతడును 'సరళముగాగ భావములు జాను తెనుంగున నింపు బెంపుతో బిరిగొనవలె'నని చెప్పుచు 'జాను తెనుగు'ను ప్రశంసించినాడు. కన్నడ కవులవలెనే యీతడును దేవతాస్తుతి, కవిస్తుతి, సత్కావ్యస్తుతి, లక్షణము, కుకవినింద, కృతిపతి ప్రశంస, ఆత్మవంశాభి వర్ణనము, షష్ఠ్యంత పద్యరచన, కథాసూత్ర వర్ణనము మొదలగు వానితోగూడిన కావ్యావతారికా రచనకు దారి తీసినవాడైనాడు. కన్నడమున తొలి జైన యుగమునకు జెందినవారై, జైనమతాభిమానులగు నా కన్నడ కవుల వలెనే తరువాతి తెలుగు సాహిత్యమున నెచ్చటను గానరాని జైనమత సంప్రదాయములను గొన్నిటి నీతడు తన రచనలో నెలకొల్పినాడు. దీపవృక్షములు, మందనాంగానోకహములు మొదలగున వట్టి తెగకు జెందినవే. కన్నడ సాహిత్యముతోనే గాక తమిళ సాహిత్యముతో కూడ నీ మహాకవికి గల పరిచయము నీత డిందు ప్రయోగించిన తమిళ, కన్నడ భాషా ప్రసిద్ధమగు శబ్దజాలము, సంప్రదాయముల వలననే సువ్యక్త మగుచున్నది. కన్నడ దేశీయములగు మేఘడంబరములు, పిలితొంగళ్ళు, శితలికలు, బేటంబేటము, వెంచలు కలువడగలు, కొలది వేళ్ళు, గండబేటము, తుంతుర్వని, కైవీగు, పేర్బిందులు మొదలగునవియే కాక నాయి, వేలగొను, ముడి, కట్టాయము, తెంక మొదలగు తమిళ భాషా ప్రచురములగు శబ్దములను ఈతడు ప్రయోగించినాడు. కథా రచనా విషయమున గూడ నీత డనేకవిషయముల నితర సన్నిహిత సాహిత్య సంప్రదాయములనుండి గ్రహించినాడు. గణనాథ జననము విషయమున పార్వతి నలుగుపిండిబొమ్మకు ప్రాణ ప్రతిష్ఠచేసిన కథయేకాని, ఆతడు సతీపుత్రుడని గాని, సతీ, శివులు కరణీ కరిరూపముల గ్రహించి క్రీడించిన కథగాని ఆంధ్రసాహిత్యమున ప్రసిద్ధము కాదు. ప్రాచీన తమిళ సాహిత్యమున గానబడుటచే నీ విషయమును నన్నిచోడు డచ్చటనుండి గ్రహించియుండును. ఇంక ననేకములగు ప్రబంధ రచనారీతులు, భావములు, పదబంధములు మొదలగువానిని కన్నడ కవుల రచనలనుండి గ్రహించినట్లు కూడ కనబడును. నన్నిచోడునికి కన్నడ కవుల గ్రంథములతోడి సన్నిహిత పరిచయముకల దనుటకు ఈతని గ్రంథములోని పద్యములకును, కన్నడ పంపభారత, గదా యుద్ధములలోని వానికిని గల పోలికల నెన్నిటినైన జూపవచ్చును.

ఈతని గ్రంథము బయలు వెడలుట మూలముగా మన సాహిత్యమున ప్రాధాన్యము వహింప జొచ్చినది మార్గ, దేశి రచనాభేద పరిశీలనము, తత్తారతమ్య నిరూపణము. అంతకు పూర్వముగల తెలుగు రచనములలో సంస్కృత భాషా సంప్రదాయానుకరణము హెచ్చుపాలు పడినదను భావముతో కాబోలు మార్గకవులు కొంద రవలంబించిన మార్గము నాక్షేపించి వారిని 'దుర్మార్గ పదవర్తను'లని నిందించుచు, ఉత్తమ మార్గ సత్కవీశ్వరులను గొనియాడుచు - మొత్తముమీద 'దేశి మార్గములను దేశీయములు'గ చేసి రచించుటయే యుత్తమ కవీశ్వరుని లక్షణమని నన్నిచోడుడు చెప్పినాడు. తాను నట్లు చేయుటకు యత్నించిన వాడే యని యాతని రచనను బట్టి కొంత తెలియకపోదు. కథారచనా విషయముననే గాక పలుకుబడియందును ఈతడు తెలుగు దేశీయమును తన రచనలో ప్రవేశపెట్టుటకు చాల యత్నించినవాడే. కాని, యెంత యత్నించినను తరువాతి తిక్కనార్యునివలె నాంధ్రావళికి మోదము గూర్పలేకపోయినాడు. మార్గపద్ధతి నవలంబించుటలో గూడ నన్నయకు వెనుదీసినవాడు కాదు. క్రొత్తరీతి వర్ణనలు, సంస్కృత వృత్త ప్రయోగములో మత్తేభమును వర్ణించునపుడు మత్తేభవృత్తమును, క్రౌంచ

పక్షులను వర్ణించునపుడు క్రౌంచపదవృత్తమును, స్వాగతము చెప్పవలసివచ్చినప్పుడు స్వాగతవృత్తమును - ఈ రీతిగా వృత్తప్రయోగమున చమత్కారముగా సార్థక్యమును సాధించుట, గర్భ బంధ కవితారీతులను గూడ నవలంబించుట - ఈ రీతులలో మార్గరీతిలో వెనుదీసినవాడు కాడు. కాని ఈ రెంటిని సమ్మేళనముచేసి దేశిని పెంపొందింప వలయునను భావము వ్యక్తపరచుటచే కేవల సంస్కృత సంప్రదాయానుకరణ భావమును నిరసించి 'దేశి'కై పోరాడినవాడైనాడు. పాల్కురికి సోమనాథుని రచనలలో నీతడు కొనియాడిన 'దేశి'పాలు పెచ్చుపెరిగి అది అతని మతప్రచార కార్యమున తోడ్పడినదే కాని, ఆంధ్ర సాహిత్యమున ప్రామాణిక కవితా లక్షణమును సంపాదించుకొనగలిగినది కాకపోయినది. అట్టి ప్రామాణికత్వము తిక్కన భారత రచనకే అనేక కారణములవలన వచ్చెను. అయినను కొన్ని ప్రబంధాది లక్షణములలోను, దేశిరచనా విషయమునను యుద్ధాదివర్ణనలలోను, నన్నిచోడుడు తిక్కనార్యునకు గూడ నొక విధముగ మార్గదర్శకుడైనాడని చెప్పక తప్పదు. అయినను అనేక విధముల నాంధ్రసాహిత్యమున మార్గదర్శకుడై, ఆంధ్ర ప్రబంధ రచనాధురీణుడైన నన్నిచోడుడు, ఆతని కుమారసంభవము కాలగర్భమున మరుగుపడి పోవలసి వచ్చెను. న్యాయముగా నీతనికి రావలసిన 'ప్రబంధ పరమేశ్వర' బిరుదము ఎఱ్ఱాప్రెగ్గడకు దక్కినది. ఏ దెట్లయినను ఆంధ్ర సాహిత్యములో ప్రప్రథమ ప్రబంధ పరమేశ్వరుడు కవిరాజ శిఖామణి, నన్నిచోడుడే యనిచెప్పక తప్పదు. **కో. రా.**

**నరసింగన్న, తాళ్లపాక** (క్రీ.శ. 1500 ప్రాంతము): ఇతడు అన్నమాచార్యునికి అతని ప్రథమ భార్యయగు తిమ్మక్క వలన జన్మించినవాడు. ఇతనిని నరసయ్య యని, నరసింహాచార్యు డనియు వ్యవహరించుట కలదు. తెనాలి రామలింగకవి 'చిన్నన్న ద్విపద కెరగు'నని చెప్పిన పద్యమున చిన్నన్న, పెదతిరుమలయ్యలతోపాటు నరసింగన్నను కూడ 'పద్యగద్య శ్రేణిని మిన్నంది మ్రోగు'నని మెచ్చుకొనెను. కాని ఇతడు రచించిన గ్రంథము లేవో తెలియరావు. కవికర్ణరసాయనమును రచించిన సంకుసాల నృసింహకవి ఈ తాళ్ళపాక నరసింగనయే కావచ్చునని వేటూరి ప్రభాకర శాస్త్త్రులవారి యభిప్రాయము. **తి. కో. రా.**

**నరసింహదాసు, తూము**: ఈయన 'భూలోక చాపచుట్టి' అని ప్రసిద్ధి పొందిన పల్లవిగాయకుడు; బొబ్బిలి కేశవయ్య, భక్తశిఖామణి సంకీర్తనకర్తయైన మద్దిరాల వెంకట్రాయకవి - వీరి కోవకు చెందిన భక్తాగ్రగణ్యుడు; ఇతడు గుంటూరిలో 1890 ప్రాంతమున జన్మించెను. ఈయన తల్లి దండ్రులు అచ్చయ లేక అప్పన మంత్రి, వెంకమాంబలు. ఈయన త్యాగరాజ స్వామికి సమకాలికుడు. సంస్కృతాంధ్ర సాహిత్యాలలోను, సంగీతములోను పాండిత్యమును సంపాదించిన ఈయన పొన్నూరిలో కొంతకాలము పేష్కారుగా లౌకికోద్యోగము చేసెను; ఎవరో ఒక మహాత్ముని వలన రామమంత్రోపదేశము పొంది ఇంటిలో రామపీఠము నెలకొల్పి నిత్య పూజార్చనలతో, గద్యపద్య సంకీర్తనలతో భద్రాద్రి రాముని సేవించుచుండెను. రామసేవకు ఆటంకము కల్గించుచున్న తన యుద్యోగమున కొకనాడు రాజీనామా నిచ్చి, నాటినుండి ఈయన జనులకు భక్తిమార్గ ప్రబోధకుడై సంకీర్తనములు రచించి గానముచేయ నారంభించెను. గుంటూరికి తిరిగి వచ్చిన కొన్నాళ్ళకు ఈయన సకుటుంబముగా దక్షిణదేశములోని పుణ్యక్షేత్రములకు యాత్రచేసి శ్రీరంగము, కంచి దర్శించి అక్కడి దేవుళ్ళపై సంకీర్తనలు చేసినాడు; చెన్నపట్టణము వెళ్ళి పార్థసారథి స్వామిని దర్శించి, అప్పుడు తిరువత్తియూరులో వీణ కుప్పయ్యగారి యింట బసచేసిన వాగ్గేయకారాగ్రణి త్యాగరాజ స్వామిని దర్శించి ఆయన సంకీర్తనములను విని అద్భుతానంద పరవశుడై ఆయన మహిమను కొనియాడుచు ఆశువుగా ఈ పద్యములు చెప్పెనట.

'కేశవానంద సంకీర్తనావళి వింటి,
భావసిద్ధియు శుద్ధభక్తి గంటి,
భక్తులు శిష్యులు బలసి కొల్వగ గంటి,
వాఙ్మాధురీవైభవంబు గంటి,
వినయ సత్సంపద్వివేకంబు కనుగొంటి,
శ్రీరామ పదభక్తి చెలువు గంటి,
అజున కందగరాని అనుభవంబును గంటి,
తన్మయత్వం బాత్మ తనర గంటి,

అరసి కనుగొంటి త్యాగరాయార్యునందు
ఇద్ద సద్గుణపుంజ మింకెన్నియైన
దివ్యమహిమాతిశయములు తేజరిలుట
గంటి, హర్షాబ్ధి నోలాడుచుంటి మదిని.

'రామపదభక్తి త్యాగయార్యవరునికిని
సమముగా నేర రెవ్వ రీక్ష్మాతలమున;
ప్రేమ నాథుసు డొకసారి పిలిచెనేని
రాము డోహో యనుచును మా ర్పలుకునంట'.

నెల్లూరి నివాసి, కాంచీపుర వరదరాజస్వామి భక్తుడు అయిన అల్లూరి వెంకటాద్రిస్వాములవారికి నరసింహదాసు ఉపదేశ గురువు. చెన్నపట్టణములో నాగండ్ల వరద రామదాసుకూడ ఈయనకు శిష్యుడు. వరదరామదాసుతో గూడ ఈయన భద్రాచలము వెళ్లి అక్కడ కొంతకాలము

స్థిరనివాస మేర్పరచుకొని సీతారాములపై నిత్యోత్సవ సంకీర్తనాదులను రచించి పాడుచుండువాడు. అదివరకు గోపన్నగారు తానీషా సమ్మతిపైని భద్రాచల రాముల నిత్యకైంకర్యములకు, నిత్యోత్సవములకు కావించిన ఏర్పాటులు మధ్యకాలములో ఆగిపోగా వానిని మరల సాగునట్లు చేసెను. ఈ యేర్పాటు లీ నాటికి సాగుచున్నవి. నరసింహదాసుగారును, వరదరామదాసుగారును చాల కాలము భద్రాచలములోనే ఉండి నిత్యసంకీర్తనములతో రాములవారిని సేవించుచు అక్కడే రాములవారిలో ఐక్యము పొందిరని 'తూము నరసింహదాసు చరిత్ర'అనే హరికథవల్ల తెలియుచున్నది. ఇందులోని కీర్తనలు చాల మట్టుకు నరసింహదాసు రచనలే; నరసింహదాసు ముద్రాంకితములైనవి.

నరసింహదాసు చిన్ననాటనుండి వ్రాయుచు వచ్చిన కీర్తన లన్నిటిలోను పారమార్థికచింత, రామభక్తి ప్రబోధము, వేదాంత తత్త్వము నిండియుండును. వీనిలో చాల ఉత్సవ సంప్రదాయ కృతులైన మేలుకొలుపులు, హెచ్చరికలు, లాలిపాటలు, మంగళహారతులుకూడ నున్నవి. రామదాసు కీర్తనలవలె ఈయన కీర్తనలను నేటికిని భక్తకూటాలలో గానము చేయుచుందురు.

ఈ కీర్తనలలోని కవిత్వము పాండిత్య ప్రకర్షలేని నిరాడంబరమైన మృదులశయ్యలో సాగినది. ఈ కీర్తనల సంగీతపుబాణిలోని ప్రాచీనాంధ్ర సంగీత సంప్రదాయము కూడ మృదువైన పదబంధానికి అనుగుణమైన, సరళమైన రాగ రచనతో శోభిల్లుచుండును. బా. ర.

**నరసింహశర్మ, బయ్యా** (క్రీ. శ. 1867 - 1932) : విశాఖపట్టణం జిల్లా అనకాపల్లికి దగ్గరనున్న తుమ్మపాల గ్రామము వీరి జన్మస్థానము. ఆరవ యేట తండ్రి మరణింపగా మేనమామ పోషణమున చదువు సాగించి యఫ్. ఏ. పరీక్షలో కృతార్థులై వీరు చేతి కందిన తహసీల్‌దారు ఉద్యోగమును నిరాకరించి మెట్‌కాఫ్ విద్యార్థి వేతనమును పొంది బి. ఏ. పరీక్షలో తేరి కొంతకాలము ఉపన్యాసకులై యుండిరి; తరువాత న్యాయశాస్త్ర పట్టభద్రులై 1893 వ సంవత్సరమున విశాఖపట్టణములో న్యాయవాది వృత్తి నారంభించి అచిరకాలములో నుత్తమశ్రేణి నందుకొనిరి. ఆనాటి జమీన్‌దారులలో చాలమందికి వీరు స్థాయిన్యాయవాదులుగ నుండిరి.

క్రీ. శ. 1905 - 1909 వరకు నాలుగేండ్ల కాలము వీరు విశాఖపట్టణము మునిసిపాలిటీ కధ్యక్షులుగ నుండిరి. మండల రాజకీయ, సాంఘిక సభలకును వారు అధ్యక్షత వహించియుండిరి. 1906 లో వీరు మదరాసు శాసనసభకు సభ్యులుగా ఎన్నుకొనబడిరి. వీరు శాసనసభా కార్యములందు కష్టపడి పనిచేయువారు. ఏ విషయమును గురించియైనను వీరు చాల కృషిచేసి తెలిసికొనిగాని యుపన్యసించువారు కారు. ఆయ వ్యయ పట్టిక(బడ్జెటు)లకు సంబంధించిన ఉపన్యాసముల విషయమున వీరు ప్రత్యేక శ్రద్ధ వహించెడివారు. జమీన్‌దారులతో సంబంధ ముండుటవల్ల మదరాసు జమీన్‌దారీ భూములచట్టము (మద్రాసు ఎస్టేట్స్ ల్యాండ్ ఆక్టు) చేయుటలో వీరు ప్రభుత్వమునకు చాల తోడ్పడిరి. మదరాసు రాజధానియందలి ఈనాము నిబంధనల విషయమున వీ రిచ్చిన యుపన్యాసములు నేటికిని ఆ విషయమునుగూర్చి అత్యుత్తమములుగా పరిగణింపదగినవి.



చిత్రము 155.
బయ్యా నరసింహాశర్మ

సామ్రాజ్యార్థిక సంపదకు ఆ రోజులలో రాష్ట్ర ప్రభుత్వము చెల్లింప వలసియుండిన ఆర్థికపు ముడుపు పద్ధతిని మదరాసు శాసనసభా సభ్యులుగా వారు ప్రతిఘటించుచు వచ్చిరి.

ఆ దినములలో వారు భారత జాతీయ మహాసభ (కాంగ్రెసు) విషయములలో మిక్కిలి శ్రద్ధ తీసికొనుచు వచ్చిరి. వారి ముఖ్యోపన్యాసములలో బ్రిటిషు ప్రభుత్వ సైనిక విధానమును ఖండించుచు వారు చేసిన యుపన్యాస మొకటి. వారు రాజ్య తంత్రజ్ఞులలో అతివాది కాకపోయినను (ఆ రోజులలో జాతీయవాదులను అతివాదు లనువారు) వారు విశ్వసింపదగిన స్వతంత్రులుగనే వ్యవహరించుచు వచ్చిరి.

వారు 1915 లో సామ్రాజ్య శాసనసభకు ఎన్నుకొనబడి అయిదేండ్లపాటు సభ్యులై యుండిరి. ఆ పదవియం దుండగనే వారు తిన్నగా కేంద్రప్రభుత్వ కార్య నిర్వాహక సభలో విద్యకు, భూములకు సంబంధించిన వ్యవహారములను నిర్వహించుటకు సభ్యులుగా నియమింపబడిరి. విశ్వవిద్యాలయ విద్యా విషయమున వారికి గొన్ని విశిష్టాభిప్రాయము లుండెను. వీని ఫలితముగా వారు 1919 లో అంతర్విశ్వ విద్యాలయ సభను మొదటిమారు సమావేశపరచిరి. 1919 లో దేశము సంక్షోభస్థితియం దుండిన కాలమున దేశమును భాషా ప్రయుక్త రాష్ట్రములుగా విభజింపవలెనని వారు సామ్రాజ్య శాసనసభలో ఒక తీర్మానమును ప్రవేశపెట్టిరి. కాని అప్పు డది వీగిపోయినది.

1930 లో ప్రథమాంధ్ర మహాసభకు వారధ్యక్షత వహించుటయేకాక తమ జీవితాంతము ప్రత్యేకాంధ్ర రాష్ట్రమునకై విశేషముగ కృషిచేయుచునే యుండిరి. 1919 సంవత్సరమునకు తరువాత వారు వేగముగా సాగి పోవుచుండిన భారతీజాతీయ మహాసభ అడుగులో అడుగు కలపలేకపోయిన మాట నిజమే కాని ప్రముఖ వర్గములలో ఆయనమాట యెల్లప్పుడును చెలామణి యగుచునే యుండెడిది.

గాంధీజీ శంఖారావముతో ప్రభూతమై దేశముపై బడిన నవశక్తి మహాప్రవాహము నందుకొనలేక పోయినను లిబరల్ సంప్రదాయమునకు చెందిన కీ. శే. న్యాపతి సుబ్బారావు, మోచర్ల రామచంద్రరావు ప్రభృతులతో పాటు నిలుకడయైన ప్రజాహిత జీవితమునకు తొలుదొలుత పునాదులు వేసిన వారిలో వీరు ఒకరు. తె. వి.

**నరసింహశాస్త్రి, మానవల్లి :** వీరు ఆంధ్రులు, ములికినాటి బ్రాహ్మణులు. పందొమ్మిదవ శతాబ్ది పూర్వార్ధమున వీరు శాస్త్రాధ్యయనము నిమిత్తము కాశికి వెళ్ళి విద్యా సముపార్జనానంతరము కాశిలోనే స్థిరనివాస ముండిరి. వీరికి రామశాస్త్రి, లక్ష్మణశాస్త్రి, గంగాధరశాస్త్రి అని ముప్వురు పుత్రులు. గంగాధరశాస్త్రిగారు సంస్కృతవిద్యా పారంగతులు. వీరు కాశీ సంస్కృత కళాశాలలో ఆచార్యులుగా నుండిరి. లక్ష్మణశాస్త్రిగారుకూడ సంస్కృతమున గొప్ప పండితులు. వీరు కాశీలోని క్వీన్సు కాలేజీలో సంస్కృతాధ్యాపకులుగా పనిచేసిరి. సోదరు లుభయులును కూడ మహామహోపాధ్యాయ బిరుదాంకితులు. గంగాధర శాస్త్రిగారిని అప్పటి బ్రిటిష్ ప్రభుత్వమువారు సి. ఐ. ఇ. బిరుద గౌరవముల నొసంగి సన్మానించిరి. వీరు 1913 లో కాలధర్మము నొందిరి. మానవల్లివా రిప్పటికిని కాశీలో నున్నారు. గు. వెం. రా.

**నరసింహాచార్యస్వామి, ముడుంబై** (క్రీ.శ. 1842-1924) : అప్రతిమాన ప్రతిభాద్యోతకమగు కవిత్వ పాటవము, షడ్దర్శన తత్త్వావగాహియగు కుశాగ్రబుద్ధి, వేదాంత గూఢార్థదర్శియగు జ్ఞానవైశద్యము - వీటన్నిటికి ఆశ్రయమగు ముడుంబై నరసింహాచార్యస్వామి పాలకొండ దగ్గరగానున్న అచ్యుతాపురమం దావిర్భవించెను. ఈతని తండ్రి రాఘవాచార్యుడు ; తల్లి రంగమాంబ. ఈతని తల్లిదండ్రుల కీత డిద్దరిలో జ్యేష్ఠ పుత్రుడు; చిన్నతనమునందే తండ్రి చనిపోవుటచే విద్వాంసుడగు పితామహునివద్ద కావ్యములను, దర్శన శాస్త్రములను పఠించి తాతగారివద్ద సహాధ్యేతయగు మరంగంటి కూర్మాచార్యుల సహాయమున ఆంధ్ర వ్యాకరణము, ఆంధ్ర చ్ఛందో లక్షణములను బాగుగ నభ్యసించి ఆంధ్ర కవనమున అత్యద్భుత పాటవమును సంపాదించెను. 1864 లో ఈయన పితామహుడు పరమపద మలంకరించ ఇరువది రెండేండ్ల ప్రాయము కల మన కవి తమ్మునితోగూడ దక్షిణదేశ తీర్థయాత్రలకై చని శ్రీరంగాద్యఖిల దివ్య దేశములను సేవించి, ఆ యా స్థలములం దుండిన పండితవర్యులనుండి శాస్త్రమర్మములను గ్రహించి, సింహాచల క్షేత్రమందున్న సింహాద్రినాథుని సేవించి గొట్టుముక్కల కృష్ణంరాజు సహాయముతో నాడు విజయనగరమును పాలించుచుండెడి విజయరామ గజపతీంద్రుని పుత్రుడు, యువరాజునైన ఆనందగజపతి సన్నిధానమునకు పోయి తాను రచించిన పద్యములను, శ్లోకముల నాయన కనేకము వినిపించెను ; ఆనంద గజపతిచే బహూకృతుడై విజయనగరాస్థానమున కాహూతుడై విజయ నగరముననే దుర్గ సమీపమున నివాసమును కల్పించుకొని రాజాస్థానమునకు బోవుచుండెను.

ఒక సమయమున కృష్ణలీలా మహోత్సవమునందు తన తండ్రిగారయిన విజయరామగజపతి సన్నిధిలో మన కవిని ఆనందగజపతి ప్రవేశపెట్టగా ఆయన చదివిన పద్యము.

'ఈ జగమందు నిందునటులెల్లరకున్ గనువిందొనర్చుమై
యోజ గనంగ రాజగుట కుల్లము నందియమొంద దెందునీ
రా జనుమాట మా విజయరామనరేంద్రునకే పొసంగు పై
రాజులు శోకవహ్ని మది రాజుట రాజు లనంగ జెల్లెడిన్'.

అప్పుడు ఆనంద గజపతి ముకుళిత కరకమలుడై 'బాబాజీ! ' రాజు కళంకమూర్తి ' యను పద్యమునకన్న ఈ పద్యము రసవంతముగా నున్నది ' అని మనవి చేసెను.

తరువాత విజయరామనృపతి స్వామికి మాసభృతిని కల్పించి తన యాస్థానకవిగా నియమించెను. తరువాత వేదవ్యాసుని గూర్చి నలుబది రోజులు పంచాగ్ని మధ్యమున తప స్సొనరించి వ్యాస సాక్షాత్కార లాభమువలన నృసింహార్యుడు ఆర్ష ప్రతిభను సంపాదించెను. వ్యాస ప్రసాదిత బుద్ధికౌశలమువలన దర్శనము లన్నిటికిని విశద వ్యాఖ్యానములను రచించి నృసింహార్యుడు ఆనంద గజపతి యాస్థానమునందలి విద్వత్పరిషత్తునందు అగ్రేసర పదము నలంకరించి యుండెను. ప్రభువున కీయనయందు అమితమైన గౌరవాదరము లుండెడివి.

క్రీ. శ. 1873 లో ఆనందగజపతి కాలధర్మము నొందిన తరువాత నృసింహార్యుడు మిక్కిలి నిరుత్సాహుడై సదా భగవద్ధ్యానమునందు, భగవద్వాఙ్మయ సృష్టియందు మగ్నమానసు డాయెను. ఇట్టి యసంప్రజ్ఞాతయోగ ఫలముగా ఈయన శేష జీవితము నిరంతర భగవత్సాక్షాత్కారానుభవమునందే గడచినది. చివరవరకు ఈయన

వేదాంత దర్శన రహస్యములను శిష్యులకు బోధించుచుండెను.

ఈయనచే రచితమైన గ్రంథము లన్నియు ముద్రితమైనవి. స్వంత ముద్రణాలయము నొకదానిని కొని విదుషీమణి యగు తన మూడవ కూతురి పర్యవేక్షణమున తన గ్రంథము లన్నిటిని ఈయన ప్రచురపరచెను. సర్వ దర్శనములకు వ్యాఖ్యానములతో నీయన రచించిన గ్రంథము లొక యేబదికి పైబడి యున్నవి. సంస్కృత కావ్యములు, నాటకములు, చంపువులు, ఆంధ్రములో ముగ్ధా శృంగారము, ప్రౌఢాశృంగారము, సంకీర్ణ శృంగారము, కామినీ దుష్ట శృంగారము, అంగశృంగారము ఈయనచే రచితములు. ఈయన తన 16 వ యేట రచించిన రుక్మిణీ కృష్ణుల విప్రలంభ శృంగారమును వర్ణించు రంగేశశతకము ప్రతి పద్య శిరఃకంపమై ఆమూలాగ్ర మొక రసపేటిక.

ఈయన అనన్య కవితా కల్పనను తెలియజేయుట కొకటి రెండు పద్యములు:

అంగశృంగారము

'త్రిమ్మరి నువ్వుఁ బువ్వులను దేనియ లానెడు తేఁటి భ్రాంతి జుం
జుమ్మని కొమ్మనాసఁ జొరఁజూచిన నాసిక చీదరించి' 'లే!
తుమ్మెదఁ దుమ్మెదన్! దొలఁగు, దూరకు-నేనువుఁబువ్వ గా'
నవన్
గ్రమ్మర వాణి నవ్వెః నళిఁ గన్గొని తుమ్మెదనెన్ విధాతయున్!'

'ఆ తన్వంగి యనంగ ఝూంకరణవజ్జ్యాముక్తచూతాస్త్ర నిర్ఘాతం బోర్వక తమ్ములంచు' అను వసుచరిత్ర పద్యమందు తమ్ములను పదమునందున్న శ్లేష పొల్లుపోకుండ సంస్కృతమున మన స్వామి రచించిన శ్లోకము :

'తన్వంగీకుసుమాస్త్ర ఝూంకరణవజ్జ్యా ధూతచూతాశుగాత్
భీతా 'కిం శరణం భవే దిహ మమే' త్యాలోచ్యన ద్యాం జనేః
సా కంజాత మ వేత్య పద్మ మభజత్ ; తద్బాధతేహంతతామ్
'జ్ఞాతిశ్చేదన లేన కిం?' వచ ఇదం స్వార్థాత్ కథం ప్రస్థలేత్ ?॥

మే. వ. న.

**నరసింహారావు, వడ్లకొండ** (క్రీ. శ. 1893-1955): తెలంగాణపు రాజకీయ, సాంస్కృతిక, సారస్వత, సాంఘిక సంస్థలందు పనిచేసిన కొలదిమందిలో వీ రొకరు. వీరి జన్మగ్రామము హన్మకొండ; తండ్రి శివరామయ్యగారు. క్రీ. శ. 1908 వ సంవత్సరమున నరసింహారావుగారు హన్మకొండలో విద్యార్థి సంఘము స్థాపించి, విద్యార్థుల యభివృద్ధికి తోడ్పడిరి. మూసీ జలప్రళయమున జలపీడితులకై విరాళములు సేకరించి, సహాయముచేసిరి: బందరు జాతీయకళాశాలకు సహాయనిధి సేకరించి, తదభివృద్ధికి తోడ్పడినవారిలో వీ రొకరు. వీరు తెలుగు, ఉర్దూ, ఇంగ్లీషులలో అనర్గళముగా ఉపన్యసించెడివారు.

నరసింహారావుగారు ప్రభుత్వోద్యోగమున సుమారు ముప్పది సంవత్సరములు పనిచేసి ఉపకారవేతన మందుకొనిరి. వీరు ఆంధ్రోద్యమమున తొలినుండియు, నిష్కామ కర్మ మాచరించి, మాడపాటి హనుమంతరావు గారికి



చిత్రము 156.
వడ్లకొండ నరసింహారావు

బాసటగా నుండిరి. ఆంధ్రజన కేంద్రసంఘము, ఆంధ్ర మహాసభలు, శ్రీకృష్ణదేవరాయల భాషానిలయము, బాలికల ఉన్నతపాఠశాల, నిజామ్ ఆయుర్వేద సదరు దవాఖానా, నిజామ్ ఆయుర్వేద కళాశాల మొదలగు సంస్థలను సక్రమముగా నడిపించిరి. వీరు తెలంగాణా కాంగ్రెసు కమిటీ కార్యదర్శిగా నుండి, యా సంస్థను సువ్యవస్థితము కావించిరి. తరువాత హైదరాబాదు ప్రదేశ్ కాంగ్రెసు ఆఫీసు సెక్రటరీగ నుండిరి. హైదరాబాదు గ్రంథాలయోద్యమమున గొప్ప కృషి చేసిరి. శ్రీకృష్ణదేవరాయల భాషానిలయమునకు కార్యదర్శిగా, అధ్యక్షులుగా వీ రొనర్చిన సేవ ప్రశంసావహము. భాషానిలయపు స్వర్ణోత్సవములు వీరి చేతిమీదుగనే జరిగినవి. క్రీ.శ. 1950 వ సంవత్సరములో వీరు ఆల్ హైదరాబాదు ఆయుర్వేదిక్ యూనియన్ గౌరవ సలహాదారుగ చేరిరి. క్రీ.శ. 1951 వ సంవత్సరమున 'ఆంధ్రోద్యమము, ఆయుర్వేదము' అను పుస్తకమును ప్రకటించిరి. ఆయుర్వేదమునకు వీరు చేసిన సేవను మెచ్చుకొని అఖిల హైదరాబాదు ఆయుర్వేద మహాసభా పక్షమున 'ప్రజాసేవా సక్త' అను బిరుదము వీరి కీయబడినది.

బి. రా. రా.

**నవల వాఙ్మయము** : నవల యనగా కల్పనలతో కూడిన ఒక సుదీర్ఘమైన ఊహా నిర్మిత కథయని నిర్వచనము. ఇందు వాస్తవ జీవితమునకు సంబంధించిన స్త్రీ పురుష పాత్రలు, సన్నివేశములు జిగిబిగి అయిన అల్లికతో కలిసిపోయి ప్రకాశించును. ఈ నిర్వచనము నేడు సాహిత్యములో మన కందరికిని పరిచితమగు నవల లనుగ్రంథము లన్నింటికిని సమన్వయించును.

పాశ్చాత్య భాషలతో తొలుదొలుత పరిచయమయిన మన దేశీయులకు ఆ భాషలోని నవల అను సాహిత్య రూపము ఎక్కువగా ఆకర్షించినట్లు కనిపించుచున్నది. దక్షిణాది భాషలలో తెనుగే నవలారచనలో ముందంజ

వేసినదని చెప్పవచ్చును. తెనుగులో స్వతంత్రమైన నవలా రచనకు దారిచూపినవారిలో కందుకూరి వీరేశలింగము గారిని మొదట పేర్కొనవలసి యున్నది. వీరు వ్రాసిన 'రాజశేఖర చరిత్రము' ఆనాటి ఆంధ్రదేశ సాంఘిక పరిస్థితులకు దర్పణము వంటిది. సహజ హాస్యధోరణిలో ఆనాటి సంఘములో ప్రబలియున్న ఆచార సంప్రదాయముల అంధకారముపైన పంతులుగారు లోకవిద్యుద్దీపిక ప్రసరింపజేసినారు. ఇది స్థూలముగా గోల్డ్‌స్మిత్ వ్రాసిన 'వికార్ ఆఫ్ వేక్ ఫీల్డు'కు ఛాయామాత్రముగా సామ్యము కలిగి యున్నది. అంతమాత్రముచేత నిది యనుకరణ మనిగాని, అనువాద మనికాని చెప్పుటకు వీలులేదు. ఆధునికాంధ్ర సాహిత్యవిధాతయని చెప్పుకోదగిన వీరేశలింగకవి మిగిలిన సాహిత్యరూపములకు మేలుబంతులను రచించినట్లే నవలకు కూడ మేలుబంతి యనదగిన 'రాజశేఖర చరిత్ర' రచించినారు. పంతులుగారు 'సత్యరాజా పూర్వదేశ యాత్రలు' అను మరొక నవల వ్రాసినారు. ఇది స్విఫ్ట్ అను ప్రసిద్ధాంగ్ల హాస్యరచయిత వ్రాసిన 'గలివర్స్ ట్రావెల్స్' అను గ్రంథమును పోలియుండును. దాని రచనా సరళి ననుసరించి మన దేశ సాంఘిక పరిస్థితులకు అనుగుణముగా ఇక్కడ జరుగు అనాచారములను అతిశయోక్తిగా చూపి యీ గ్రంథములో ఆడుమళయాళము మొదలగు ఊహాకల్పితదేశాలను సృష్టిచేసి అందు మన యాచార వ్యవహారములను చక్కని హాస్యధోరణిలో పంతులుగారు గేలిచేసినారు. హేళన(సెటైర్)కావ్యములకు ఒరవడి పెట్టుటలో కూడా పంతులుగారే ప్రప్రథము లనిపించుకొన్నారు.

తొలి తెలుగు నవలను గూర్చి కొన్ని వాద ప్రతివాదము లున్నవి. క్రీ. శ. 1864 లో కొక్కొండ వేంకటరత్నము గారు ప్రకటించిన 'మహాశ్వేత' తొలినవలయని కొందరి మతము. ఇది నవల యనుటకంటె కాదంబరికి స్వేచ్ఛానువాద మనుట యొప్పు. క్రీ. శ. 1872లో నరహరిసెట్టి గోపాలకృష్ణ సెట్టిగారు వ్రాసిన 'శ్రీ రంగరాజ చరిత్ర' తొలి తెలుగు నవల యని మరికొందరి యభిప్రాయము. దానిని కూడ నవల యనుటకంటె సమకాలిక జీవిత చరిత్ర యనదగును.

కందుకూరి వీరేశలింగము పంతులుగారు తాము తొలి నవల వ్రాయుటయే కాక ఇంకను అట్టి నవలలు అనేకము తెలుగులో వచ్చుటకు దోహదము చేసినారు. వీరు చింతామణి యను పత్రిక పక్షమున పోటీలు పెట్టి (క్రీ.శ. 1892-99) ఉత్తమ నవల రచనను ప్రోత్సహించినారు. ఈ పోటీలలో నాలుగు సంవత్సరములు వరుసగా చిలకమర్తి లక్ష్మీనర సింహముగారికే ప్రథమ బహుమానము లభించినది. చిలకమర్తివారు వీరేశలింగముగారి ఒరవడినే తాము అనుసరించితిమని తమ స్వీయచరిత్రలో చాలచోట్ల చెప్పుకొన్నారు. చిలకమర్తివారి నవల 'రామచంద్ర విజయము' పరికించినచో 'రాజశేఖర చరిత్ర'లోవలె ఆంధ్రదేశ వర్ణనలు, పాత్ర చిత్రణము, సున్నితమైన హాస్యము వ్యక్తమగును. చిలకమర్తివారు కొన్ని సాంఘిక కథలు తీసికొని నప్పటికి ఎక్కువ భాగము చరిత్రాత్మక కథలే నవలలుగా రచించినారు. 'హేమలత', 'కర్పూరమంజరి', 'అహల్యాబాయి', 'సౌందర్యతిలక' మున్నగునవి చరిత్రగాథలయినను ఆంధ్రదేశ చరిత్రగాథలుమాత్రము కావు. వీరే రమేశచంద్రదత్తు రచించిన 'లేక్ ఆఫ్ పామ్స్' అను నవల ననువదించి 'సుధా శరత్‌చంద్ర' మనుపేర ప్రకటించిరి.

చరిత్రాత్మక కథలు గల నవలలు రెండు తెరగులు; చరిత్రలో వాస్తవ కథలు తీసికొని వ్రాసినవి ఒకరకము; కొంత వాస్తవము తీసికొని దానిపైన కల్పనలతో రచించినవి ఒక రకము. చిలకమర్తివారు రెండు రకముల నవలలను రచించినారు. వీరి ఒరవడిని అనుసరించి తరువాత పెక్కుమంది చరిత్ర కథలు ఆధారముగా తీసికొని ఎక్కువ నవలలు వ్రాసినారు. ముఖ్యముగా కేతవరపు వెంకటశాస్త్రి గారు, భోగరాజు నారాయణమూర్తిగారు చిలకమర్తివారి పద్ధతులనే అనుసరించినవారు. ఈ కథలలో ఎక్కువ భాగము ఇతర ప్రాంతాల చరిత్రకే ప్రాముఖ్యము కనిపించుటచే ఆంధ్ర దేశపు చరిత్ర కథలకు ప్రాధాన్య మీయవలెనను తలంపు కొందరికి కలిగి ఆంధ్రదేశ చరిత్రకు సంబంధించిన నవలల రచనలకు పోటీలు పెట్టి, క్రొత్త నవలల రచనలకు ప్రోత్సాహము కలిగించిరి. వీరిలో అగ్రగణ్యులు కీ. శే. కొమర్రాజు వెంకట లక్ష్మణరావుగారు. వీరు స్థాపించిన విజ్ఞానచంద్రికా గ్రంథమండలి తెనుగులో చరిత్రకు సంబంధించిన నవలల రచనను ప్రోత్సహించినది. భోగరాజు నారాయణమూర్తిగారి 'విమలాదేవి', 'అస్తమయము', కేతవరపు వెంకటశాస్త్రిగారి 'రాయచూరు యుద్ధము', దుగ్గిరాల రాఘవచంద్రయ్యగారి 'విజయనగర సామ్రాజ్యము' విజ్ఞానచంద్రికా ప్రచురణములే. ఇంకను ఆంధ్ర ప్రచారిణి, సరస్వతి, వేగుచుక్క, రామవిలాస గ్రంథ మాలలద్వారా చారిత్రక నవల లనేకములు వచ్చినవి. ఆంధ్రదేశ చరిత్రకు సంబంధించిన కథలలో సాతవాహనుల నాటి కథ తీసికొని 'హిమబిందు'ను, కాకతీయులనాటి కథ ఇతివృత్తముగా 'గోన గన్నారెడ్డి' అను నవలను అడవి బాపిరాజుగారు వ్రాసినారు. వీరి నవలలలో ఆనాటి చారిత్రక పరిస్థితులతోపాటు ఆకాలపు ఆచార వ్యవహారములు, కళ, విజ్ఞానము అభిరుచులు తేటపడుచుండును. పాత్ర

లన్నింటికి అప్పటి సమకాలిక వ్యక్తిత్వము కలిగి సహజత్వ ముతో కన్నుల కట్టినట్లు గోచరించును. ఇట్టి మార్గములో మరింత విశిష్టశైలి సాధించినవారు విశ్వనాథ సత్యనారాయణగారు. వీరు చరిత్ర కథలు తీసికొని ఎన్నో నవలలు వ్రాసిరి. 'ఏకవీర' వీటి యన్నింటిలో ఉత్తమోత్తమమైనది. ఇందలి పాత్రలు అపూర్వ కళామూర్తులు. ఈ రచన వచన ములో నున్నను కవిత్వస్థాయి నందుకొన్నది. వీరి 'ధర్మ చక్రము', 'బద్దన్న సేనాని', "కడిమిచెట్టు". చారిత్రక నవలలయినను కథావిధానములోగాని, కవితాశైలిలో గాని పాత్ర చిత్రణలోగాని 'ఏకవీర'తో సరితూగజాలవు.

యుద్ధానంతరము, స్వాతంత్ర్యసిద్ధి యనంతరము నవ లలు అనేకములు వచ్చినవి. వీరిలో నోరి నరసింహశాస్త్రి గారు రచించిన 'నారాయణభట్టు', 'రుద్రమదేవి' ముఖ్య ముగా చెప్పదగినవి. మొదటిది చాళుక్య నృపతులకాలము నాటిది. రెండవది కాకతీయకాలమునాటిది. ఈ రెండు నవలలయందును ప్రతిపాదించిన సన్నివేశములు, పరస్పర సంఘర్షణలు నేటి సమకాలిక సాంఘిక రాజకీయ పరిస్థితు లను, సంఘర్షణలను కొంచెము పోలియుండును.

ఆంధ్రదేశపు చరిత్ర పరిశోధనలో గొప్ప కృషిచేసిన డాక్టరు నేలటూరి వెంకటరమణయ్యగారు విజయనగర రాజుల కాలమునాటి పరిస్థితులను తీసికొని కొన్ని నవలలు వ్రాసినారు. వానిలో 'మధుమావతి', 'ఛత్రగ్రాహి' అనునవి చెప్పదగినవి. ఆంధ్రదేశపు చరిత్ర కాకపోయినను ఒక ప్రసిద్ధ పురుషుని జీవితగాథ ఆధారముగా గొప్ప నవల వ్రాసినవారు తెన్నేటి సూరి. వీరి 'చెంఘిస్ ఖాన్' మంగోలియన్ నియంత క్రూరవ్యక్తిత్వమును అద్దము పట్టి నట్టు చూపినది.

ఇంకను చారిత్రకగాథలు ప్రోత్సహించుటకు ఆంధ్ర విశ్వవిద్యాలయమువారు పోటీలను పెట్టి క్రొత్త నవలలు వ్రాయించుచున్నారు. ఆ పోటీలలో వచ్చినది మల్లాది వసుంధరగారి 'తంజావూరి పతనము'. ఇందలి రచన విశ్వనాథ సత్యనారాయణగారి రచనా గాంభీర్యమును పుడికి పుచ్చుకొన్న ట్లుండును. ఈ రచయిత్రి విశ్వనాథవారి ఛాత్రి యగుటచేత అట్టి రచన యలవడి యుండవచ్చును. ఈమె వ్రాసిన మరొక నవల 'దూరపు కొండలు' కూడ ఇట్లే యుండును. ఆంధ్ర విశ్వవిద్యాలయ బహుమతి నందుకొన్న మరి రెండు మంచి నవలలు ధూళిపాళ శ్రీరామమూర్తిగారి 'భువన విజయము', కొర్లపాటి శ్రీరామమూర్తిగారి 'చిత్రశాల'. ఇవిగాక పిలకా గణపతి శాస్త్రిగారి 'మీనాంబిక', కాకర్లవారి 'కనకాభిషేకము' తెనుగుదేశపు చరిత్ర కథలే తీసికొని రచించిన నవలలు. వీటి యన్నింటియందును ఆనాటి పరిస్థితులను పునస్సృష్టి చేయుటకంటె ఎవ్వరికిని తెలియని ఒక యభూత లోకము లోనికి అదృశ్యమై యక్కడ క్రొత్త సన్నివేశములు సృష్టి చేసినట్లు కనిపించును. చరిత్ర నవలలో కల్పనకే ప్రాధా న్యము కనుక ఇట్టి రచనలకు పాశ్చాత్య వాఙ్మయమున సైతము ముందున్న ఆదరము తరువాత కలుగలేదు. అందుచేత రచయితలు సమకాలిక జీవితము తీసికొనక తప్పనిసరి అయినది.

సాంఘిక, ఆర్థిక, నైతిక పరిస్థితులలో రచయితలు తమ చుట్టుగల వాతావరణమునే తమ నవలలలో చిత్రించినారు. ఈ విధానములో వీరేశలింగం పంతులుగారు పెట్టిన ఒరవడినే చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు మున్నగు రచయితలు అనుసరించినారు. 'రామచంద్ర విజయము'లో కోనసీను వాతావరణమును చూపినట్లే వీరి ననుసరించిన కేతవరపు వెంకటశాస్త్రిగారు 'అగ్రహారము', 'రాజ్య లక్ష్మి', 'లక్ష్మీప్రసాదము'వంటి నవలలలో ఆంధ్రదేశపు సాంఘిక జీవనమును, స్థానిక వాతావరణమును ప్రతిబిం బింప జేసినారు.

తెనుగు నవల క్రొత్తగా అవతరించిన సమయములో కాగి తము చౌక, ముద్రణ చౌక, చదువరుల సంఖ్యా అధికము. ఆ కారణముచేత ఎన్నో గ్రంథమాలలు వెలసినవి. వానిలో ముఖ్యమైనది ఆంధ్ర ప్రచారిణీ గ్రంథమాల. ఈ గ్రంథ మాలలో వేంకట పార్వతీశ్వర కవులు అనేక ఆంగ్లగ్రంథ ములు, బెంగాలీ నవలలు అనువాదము చేసినారు. ఎన్నో అపరాధ పరిశోధక నవలలుకూడ తర్జుమాచేసి మౌనపఠన మునకు ప్రోత్సాహము కల్పించిరి. కొన్నింటిని అను వాదముచేసి, కొన్నిటిని అనుకరణచేసి తెనుగు వాతావర ణములో పొదిగి క్రొత్త నవలలు వ్రాసి, మొత్తముమీద వందలుగా నవలలు ప్రకటించిరి. వీరు వ్రాసిన నవలలలో 'ప్రమదావనము', 'మాతృ మందిరము', 'శ్యామల' స్వతంత్రములు. వీటియందు గ్రాంథిక భాషలో నున్న ఒకకృత్రిమ సౌందర్యము ప్రతిపద మధురముగా కనిపించు చుండును. వీరిధోరణిలోనే కేతవరపు వెంకటశాస్త్రిగారు, చేకుమళ్ళ రామచంద్రరావుగారు స్వతంత్ర కథలు అల్లి నారు. రామచంద్రరావుగారి 'ప్రణయ చాంచల్యము' 'ఉమార్పణ', వేంకట పార్వతీశ్వర కవుల 'తిరుగుడు పెండ్లి' కథాసరళికి, పాత్రచిత్రణకు సాటిలేనివి. సరస్వతీ గ్రంథమాలలో కూడ అనువాదములు, అనుకరణములు అనేకము వచ్చినవి. వీనిలో గ్రాంథికశైలి మార్పుచేసి వాడుకభాషలో ప్రారంభము చేసిన నవలకు ప్రాధాన్య మిచ్చినవారు శివశంకర శాస్త్రిగారు. ప్రభాత కుమార్

ముఖోపాధ్యాయ రచించిన బెంగాలీ నవలకు వీరుచేసిన స్వేచ్ఛానువాదము ‘కుంకుమ భరణి’ తెనుగు నవలాభిమాను లెవ్వరును మరవలేని మధురగుళిక. ఈ గ్రంథమాలలోనే గుడిపాటి వెంకటచలంగారి తొలి నవల ‘శశిరేఖ’ వెలువడినది. వివాహముతో నిమిత్తము లేకుండ విచ్చలవిడిగా స్వేచ్ఛ ప్రేమతో విహరించవచ్చునను నీతిని ప్రచారము చేసిన ‘చలం’గారి నవలలు ఆనాడు సభ్యలోకములో కొంత అలజకి కలుగజేసినవి. ‘దైవ మిచ్చిన భార్య’, ‘మాకర్మ మిట్లా కాలింది’, ‘కన్నీటికాలువ’ మున్నగు రచనలు ఆనాడు ఏ విమర్శకులును ఆదరించలేదు. రాను రాను ‘చలం’గారు ‘బ్రాహ్మణీకం’, ‘మైదానం’, ‘అరుణ’, ‘అమీనా’ మున్నగు నవలలు రచించినారు. వీని యన్నిటియందును నిగ్రహములేని కామవాంఛకు యీయన ప్రకోపము కలిగించి స్త్రీ పురుషుల స్వేచ్ఛాజీవనము శ్రేయోదాయకమని ప్రతిపాదించిన ట్లుండును.

ఈ భావములను ఆమోదించనివారు కూడ వీరిశైలిలో గల బలమునకు ఆకర్షణ పొంది ఆ గ్రంథములను చదువక విడువరు. డి. హెచ్. లారెన్సు, మపాసాఁ, ఆల్డస్ హక్స్లీ మున్నగువారి భావముల ప్రభావము ‘చలం’గారిమీద నున్న దందురు. మన నవలలలో ‘కందుకూరి’, ‘చిలకమర్తి’ ప్రభృతులు మన సంఘములోని దురాచారములను తూర్పారబట్టి సభ్యజగతిని వాటివైపు దృష్టిని మళ్ళించుటకు ప్రయత్నము చేసినమాట నిజమే. ఆరీతినే నవలను ప్రధాన సాధనముగా ఉపయోగించినవారు ‘చలం’గారు. చలంగారిమీద పాశ్చాత్య రచయితలే కాదు, బ్రహ్మసమాజము, వెంకటరత్నమునాయుడుగారి ఆదర్శ జీవనము, తెనుగు సంఘములో స్త్రీకి గల నికృష్ట స్థితి, ఆధ్యాత్మిక మానసాందోళన - ఇట్టి శక్తు లనేకము పనిచేసి వారిచేత అట్టి రచనలు చేయించినవి. వీటి యన్నింటిలోను, ‘జీవితాదర్శము’, ‘ఓ పువ్వు పూసింది’ అను గ్రంథములు ఒక విశిష్టభావపరిణతి నంది కళాతపస్సు సిద్ధింపజేసికొన్నవి. ‘చలం’గారి నవలలు తెనుగు సాహిత్యములో విశిష్ట దీపకళికలు! తెనుగుశైలిలోని శక్తికి నిదర్శనములు.

రాజకీయములలోను, సాంఘిక శాఖాభేదములలోను జరిగిన అన్యాయములను నిరూపించి ఆ వాతావరణములో కథ అల్లినవారు ఉన్నవ లక్ష్మీనారాయణగారు. వీరు రచించిన ‘మాలపల్లి’ విదేశీ పరిపాలనలో ఎన్నోసారులు నిషిద్ధాజ్ఞలకు గురియయినది. ఇందు జాతీయ సత్యాగ్రహోద్యమము, కారాగృహ జీవనము, అస్పృశ్యతా నివారణము, నేరములు చేయు జాతుల సెటిల్‌మెంటు మున్నగు అనేక సమస్యలు పొందుపరుపబడి యున్నవి. ఇది మాలదాసరి కథ; మరొక పేరు సంగవిజయము. ఇందు వేరే కథలుకూడ అల్లుకొనిపోయి ఉన్నవి. ఇందు ‘కమలమ్మ’ కథ ‘ఈస్టులిన్’ నవలకు ఛాయగా కనిపించును. కాని ఆంధ్రదేశ జీవితమును యథాతథముగా ప్రతిబింబింపజేయుటయందును, ‘ఆంధ్ర సాహిత్య హృదయ పరిణామమును గ్రహించుటకును మాలపల్లి ఉత్తమ కావ్యము’ అని కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు వ్రాసినారు. వీరివలెనే ఏదేని సమస్య తీసికొని దానిని కథలో పొదిగి తమ నవలలలో తెనుగు జాతీయతను ప్రతిబింబింపజేసినవారు శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. వీరు రచించిన ‘రక్షాబంధము’, ‘వడ్లగింజలు’, ‘ఆత్మబలి’ తెనుగు గ్రామ జీవనమునకు మంచి ప్రతిబింబాలు. వీరే గ్రాంథిక శైలిలో ‘అనాథబాలిక’, ‘మిథునానురాగము’, ‘ధర్మచక్రము’ మున్నగు నవలలు వ్రాసినారు. వీటిలో కథ వ్యర్థముగా పెంచినట్లు కనిపించును. సాంఘిక సమస్యలయిన కుల మత భేదములు తీసికొని నవలగా వ్రాసి ఒక కులభ్రష్టుని మతాంతర వివాహ జీవితమును కరుణామయముగా వర్ణించిన కథ మొక్కపాటి నరసింహశాస్త్రిగారి ‘ఏకోదరులు’. ఇందలి సన్నివేశములు హృదయవిదారకములుగా ఉండి సంఘచక్రముమీద ఎటువంటివారికైనను మనస్సు వికలము చేయును. ఇదే ఇతివృత్తమును గైకొని యింతకంటె సున్నితముగా రచించిన నవల రావూరి సత్యనారాయణరావుగారి ‘నెలవంక’. ఇది అనేకులు పాఠ్య గ్రంథముగా పఠించిరి. వీరి యందరి నవలలును ఒక యెత్తు, ‘విశ్వనాథ’వారి సాంఘిక నవలలు ఒక యెత్తు. ఈనాడు సంఘములో వచ్చిన మార్పులు, సంస్కరణలు తప్పుత్రోవను పడినవని ‘విశ్వనాథవారి’ యభిప్రాయము. కనుక తిరిగి పూర్వపు వర్ణాశ్రమ వ్యవస్థ, పూర్వపు మత సాంఘిక సంప్రదాయములు కావలెనని వారు కథ లల్లుదురు; నవలలు వ్రాసెదరు. అట్టి నవలలలో అగ్రగణ్యమైనది వారి ‘వేయిపడగలు’. ఇది ఆంధ్ర విశ్వవిద్యాలయమువారి ప్రథమ బహుమతి పొందినది. ఆంధ్రదేశమున వ్యాపించిన జమీన్దారీ వ్యవస్థకు చిహ్నమైన ఒక యాదర్శ కుటుంబము తీసికొని వారి సంతానములో చతుర్వర్ణములను చూపి వారి కష్టసుఖములను వర్ణించి మూడు తరాల కథను ‘విశ్వనాథ’వారీ నవలలో చిత్రించినారు. ఈ కథపేరున తెనుగు జీవితమున స్పందించుచున్న ఆర్థిక, నైతిక, విద్యా, విజ్ఞాన, కళా విషయము లన్నియును వచ్చినవి. అట్లు వచ్చుటలో కథా విషయైక్యము లోపించుటయును కలదు. అందుచేతనే ఒక ప్రసిద్ధ విమర్శకుడు ‘వేయిపడగలు’లో వేయి పడగలే

కాని పాము ఎక్కడను గోచరించుట లేదని విమర్శించెను. 'విశ్వనాథ'వారు ఇంకను అనేక నవలలు రచించినారు. వీనిలో 'చెలియలికట్ట', 'జేబుదొంగలు', 'మా బాబు' మనోవిజ్ఞానమును ప్రదర్శించునవి. 'వీరవల్లడు', 'స్వర్గానికి నిచ్చెనలు', 'తెఱచిరాజు' మున్నగునవి పూర్వసంప్రదాయములను సమర్థించునవి. 'హాహాహూహూ', 'పులుల సత్యాగ్రహము' భాషా రాజకీయ పరిస్థితులపై వ్యంగ్యముగా గేలిచేయుటకు హేళన ధోరణిలో వ్రాసిన ఊహా చిత్రములు. కొన్ని పరిస్థితులు రచయిత ఉద్దేశించినపుడు అవి ప్రకృత ప్రపంచమునందు సిద్ధించవు కనుక వానికి అనువైన ఊహాప్రపంచమును సృష్టించుట నవలారచనలో ఒక విధానము. ఇదే ఊహాపరికల్పన (ఫాంటసీ) అందురు. ఇటువంటివి పాశ్చాత్య నవలలలో ఎన్నో వచ్చినవి. మన రచయితలలో కందుకూరివారి 'సత్యరాజా పూర్వదేశ యాత్రలు' దీనికి దృష్టాంతము. ఇంగ్లీషు రచయితలలో హెచ్. జి. వెల్స్, జార్జి ఆర్వెల్ మున్నగువారు ఇట్టి నవలలు రచించినారు. 'భవిష్యత్తులోనికి తొంగిచూచుట', లేక చంద్రమండలములోనికి యాత్ర చేయుట-ఇటువంటివి. తెనుగులో ఈ విధానమును అనుసరించియే విశ్వనాథవారు 'పులుల సత్యాగ్రహము', 'హాహా హూహూ' వంటి నవలలు వ్రాసినారు; చలంగారు '1960 లో' అను పెద్ద కథ రచించిరి; కుటుంబరావుగారు 'దిబ్బరాజ్యము' అనుకల్పన చేసినారు. ఈ రకపు ఊహాచిత్రములు అనేకములు తెలుగులో వచ్చినవి. 'విశ్వనాథ'వారివలె ఎక్కువ నవలలు వ్రాసినవారు అడవి బాపిరాజుగారు. వీరి 'నారాయణరావు'కు కూడా ఆంధ్ర విశ్వవిద్యాలయమువారి బహుమానము లభించినది. ఇదికూడ 'వేయిపడగల'వలె కథను విడిచిపెట్టి తెనుగు జాతీయతకు సంబంధించిన అనేక విషయములకు ప్రాధాన్యమిచ్చినది. బాపిరాజుగారు రచించిన 'నరుడు', 'నా పడమటి ప్రయాణము', 'కోనంగి', 'జాజిమల్లి' సాంఘిక నవలలు. కాని అవి 'హిమబిందు' అందుకొన్న స్థాయిలో లేవు. కళలు, రంగులు, చిత్రములు వర్ణించునపుడు బాపిరాజుగారి లేఖిని పరవశమందును. బౌద్ధవాతావరణముతో కూడిన శాతవాహనులనాటి కథ 'హిమబిందు' ఒక ఉత్తమ కళాఖండము. అందులోనే వారి ప్రజ్ఞ పారమందుకొన్నది.

సాంఘిక కథలవలెనే రాజకీయ సమస్యలను ప్రతిబింబింపచేయుటకు ఎన్నో నవలలు వచ్చినవి. సత్యాగ్రహ చరిత్ర ప్రాతిపదికగా తీసికొని రచించిన మరొక రాజకీయ నవల కొడవటిగంటి కుటుంబరావుగారి 'చదువు'. కాంగ్రెసు ఉద్యమమువలన చదువు విడిచిపెట్టిన ఒక యువకుని జీవితపు కష్టసుఖాలు ఈ నవలయందు అభివర్ణితమైనవి. స్వాతంత్ర్య సిద్ధికి ముందువెనుకల సమకాలిక పరిస్థితులు ఆధారముగా తీవ్రవాది అయిన ఒక రాజకీయవాది జీవితచరిత్రను మహీధర జగన్మోహనరావుగారు 'రథచక్రాలు' అను నవలలో చిత్రించినారు. తెలంగాణాలో బయల్వెడలిన ప్రజోద్యమములు, పోలీసు చర్యకు ముందు జరిగిన సంఘర్షణలు ఒక వైష్ణవ యువకుని దృక్పథమును మార్చుటకు ఎట్లు పనిచేసినదియు వివరించు నవల వట్టికోట ఆళ్వారుస్వామిగారి 'ప్రజల మనిషి'. ప్రజలతో ప్రత్యక్షముగా నిమిత్తము లేకపోయినప్పటికిని రామాయణ కథలోని పాత్రలు ఒక సామాన్య రైతుకుటుంబములోని పాత్రలకు సమానాంతరముచేసి వారి సాంఘిక జీవనమును వర్ణించుచు ఆరుద్ర 'గ్రామాయణము' అను ఒక నవల రచించినారు. ఇవి యన్నియు సమకాలిక చరిత్రపైన రచయితల వ్యాఖ్యానములుగా గోచరించుట తప్ప రాజకీయములపై వీటి ప్రభావములేదు.

నవలల విభజనలలో హాస్య ప్రధానమైనవి కూడ కొన్ని యున్నవి. మన సాహిత్యములో ప్రత్యేకముగా హాస్యమునకు ఒరవడి కాకపోయినను వ్యంగ్యముగా వెలువడిన రచనలు కలవు. అట్టిదే కందుకూరివారి 'సత్యరాజు' ఈ పద్ధతిని మరికొన్ని హాస్య నవలలు వచ్చినవి. వీనిలో ప్రథమమైనది 'చిలకమర్తి'వారి 'గణపతి'. ఈ గణపతి వట్టి అప్రయోజకుడు. అతని చేతకానితనమువలన వచ్చిన చిత్రసన్నివేశములే హాస్యమున కవకాశమిచ్చును. ఈ 'గణపతి' రెండవ అవతారమే మొక్కపాటి నరసింహశాస్త్రిగారు సృష్టిచేసిన 'బారిష్టరు పార్వతీశం'. అన్ని చాదస్తములతో సీమ ప్రయాణము చేసిన యీ చిన్న బారిష్టర్ అనుభవాలు అనేక అతిశయోక్తులతో అత్యంత కృత్రిమముగా ఉండి చదువరులకు నవ్వు పుట్టించును. ఇదే స్వభావముగల వ్యక్తి జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రిగారి 'దేవయ్య'. ఈయన వ్రాసిన 'దేవయ్య' స్వీయచరిత్రలో గణపతి మూడవ అవతారము కనిపించును. హాస్యరచనగా చెప్పదగిన మరొకగ్రంథము మునిమాణిక్యం నరసింహారావుగారి 'ఉపాధ్యాయుడు'.

ఇటీవల శాస్త్రవిజ్ఞానాభివృద్ధితోపాటు మనోవిజ్ఞానశాస్త్రము విశేషముగా అభివృద్ధి పొందినది. పాశ్చాత్య దేశములలో ఫ్రాయిడ్ మున్నగు విజ్ఞాన వేత్తల మూలాన స్వప్నములు, ఊహలు, కలవరింతలు మున్నగువాని అంతరార్థమే మారిపోయినది. తీరని కోరికలకు, అవ్యక్త భావములకు క్రొత్త చైతన్య స్రవంతిలి (స్ట్రీమ్ ఆఫ్ కాన్షస్‌నెస్) భావప్రదర్శన చేయుచువచ్చిరి. ఈ ధోరణిలో

రచించిన పాశ్చాత్య రచయితలు జేమ్సు జాయిస్, జీన్ పాల్ సార్త్రీ, వర్జీనియా వుల్ఫ్ మున్నగువారు నవల రచనములోనే విప్లవము తెచ్చినారు. మానవుడు మనస్సులో భావించినది ఉన్న దున్నట్లు గ్రంథస్థము చేసినారు. ఈ యొరవడిని తెనుగులో చాలమంది వ్రాయుచున్నారు. కొడవటిగంటి కుటుంబరావుగారు 'ఆడజన్మ', 'చదువు' అను నవలలలో మనోవిజ్ఞానముతోపాటు కథా విధానమునుకూడ చూపినారు. వీరే పెద్ద కథలయిన చిన్న నవలలలో పాత్రచిత్రణ, కథా చమత్కృతి చక్కగా ప్రదర్శించినారు. వీటికి నిదర్శనములు 'లేచిపోయిన మనిషి', 'కులములేని పిల్ల', 'మారుపేరులు' మున్నగునవి. కథకు, మనోవిజ్ఞానమునకు ప్రాధాన్య మిచ్చిన రచయితలు జి. వి. కృష్ణరావు, త్రిపురనేని గోపీచంద్‌గారలు. పల్లెటూరి వాతావరణమునకు చెందిన 'కీలుబొమ్మలు'అను కథలో పరిస్థితుల చేతులలో పాత్రలు ఎట్లు కీలుబొమ్మలైనది యును జి. వి. కృష్ణరావుగారు నిరూపించినారు. ఇదే తత్వమును గోపీచంద్ గారు తమ 'పరివర్తన'లోను 'అసమర్థుని జీవయాత్ర'లోను ప్రతిపాదించి మానవుడు బలీయమైన వాతావరణమునకు తలయొగ్గక తప్పదని నిర్ధారణ చేసినారు. కథలలో మానసికతత్వమునకు ప్రాధాన్య మిచ్చుటలో ప్రయత్నించుచున్న రచయితలు వి. డి. ప్రసాదరావు, యన్. ఆర్. చందూర్, ధనికొండ హనుమంతరావు మున్నగువారు. కేవలము మనస్తత్వ శాస్త్రములో (మానసిక విశ్లేషణ శాస్త్రము - సైకో ఎనాలిసిస్) అవ్యక్తమానసిక స్థితికి ప్రాధాన్య మిచ్చినవారు బుచ్చిబాబు, 'సొరిన్', రాచకొండ విశ్వనాథశాస్త్రిగారలు. తల్లిమీద ఏదో అపనింద వున్నదని ఆ నింద తన్ను నీడలాగ వెంటాడుచుండగా తన జీవితములో చేసిన సాహసములను, ఎదుర్కొన్న కష్టములను చైతన్య ధోరణిలో వ్యక్తపరచిన వ్యక్తి బుచ్చిబాబు గారి 'దయానిధి'. ఇతడు ఎందరినో వలచి, ఎన్నింటినో పిలిచి, అన్నింటిని అందుకొని ఏదీ కానక 'చివరికి మిగిలేది' ఏమిటి అని ప్రశ్నించును. రాచకొండవారి నవల 'అల్పజీవి'లో ఒకమధ్యతరగతి గుమాస్తా తన జీవితమును, తన అసమర్థతను నిందించుకొనుచు చూచిన పరిసరాలలో మునిగిపోవును. ఈ పద్ధతి రచన తెనుగు సాహిత్యమునకే విశిష్టము. ఏ యితర భారత భాషల నవలలలోను ఈ చైతన్య ధోరణి 'నవలా' రచన ఇంత ఉన్నతస్థాయి నందుకొనుట చూడము.

ఇటీవల పత్రికలలో ప్రకటించు ధారావాహిక నవలలలో ఎన్నో క్రొత్తవి వచ్చినవి. క్రొత్తరచయితలు పరిచితులైనారు. వారిలో తొలి రచనల చేతనే గొప్పకీర్తిని సంపాదించిన ఇద్దరు రచయితలు చెప్పదగినవారు. వారు 'పినిశెట్టి', 'శారద'. 'పినిశెట్టి' పాశ్చాత్య విద్యాగంధము లేనివాడు; తక్కువ తరగతిలో పుట్టి దారిద్ర్యము ననుభవించి యీనాడు రచయితగా ప్రసిద్ధినందినవాడు. ఈతడు రచించిన 'దత్తత' అను నవలలో ధనిక దరిద్ర కుటుంబ జీవితముల తారతమ్యము స్వాభావికముగా అభివర్ణిత మైనది. రెండవ రచయిత 'శారద' - స్వతః తమిళుడు. తెలుగుదేశములో చిరకాలము జీవించి తెనుగుభాష, జాతీయత, పలుకుబడి తనలో పూర్తిగా నింపజేసికొన్నాడు. తనపేర 'నటరాజన్' అని రచనలు చేసి వానిని పత్రికలకు పంపగా అవి తన రచనలు స్వీకరించనందున స్త్రీ పేరున తన రచనలు ప్రకటించి కృతకృత్యుడైనాడు. ఇతడు రచించిన నవలలు మూడు; 'మంచి-చెడు', 'అపస్వరాలు', 'ఏది సత్యం'. వీని యన్నింటియందును మర్యాదస్థులైనవారు పతితులై, భ్రష్టులై గడపిన నికృష్ట జీవనమును రసవంతముగా వర్ణించి వారి జీవితమును కన్నులకు కట్టినట్లు ప్రదర్శించినాడు. ఈ నవలలలో వచ్చిన పాత్రలను మనము నిత్యజీవితములో చూడము. చూచినను ఏవగించుకొని తప్పించుకొని పోదుము. అటువంటి వారి జీవిత రహస్యములను ఏ దాపరికము లేకుండ 'శారద' చిత్రించినాడు. అతడు ఇంకను అనేక నవలలు వ్రాయవలసినది. అల్పాయువై కీర్తిశేషుడైనాడు. కాని తెలుగు సాహిత్యలోకమునమాత్ర మతడు చిరంజీవి.

పుస్తకము చదివింప జేయుటలో కథకు ప్రాధాన్య మిచ్చునవి అపరాధ పరిశోధక నవలలు. వీనిని పాశ్చాత్య భాషలనుండి, వంగభాషనుండి తెలుగువారు అనేకము అనువాదము చేసినారు. ముఖ్యముగా ఆంధ్ర ప్రచారిణీ గ్రంథమాల ద్వారా వేంకట పార్వతీశ్వర కవులు, సరస్వతీ గ్రంథమండలిద్వారా జొన్నలగడ్డవారు, వేగుచుక్క గ్రంథ మండలిద్వారా తాపీ ధర్మారావుగారు అనేక అపరాధ పరిశోధక నవలలు రచించినారు. ఈ తెగలో తెనుగులో తొలి స్వతంత్ర నవల 'చింతా శంకర దీక్షితులు' రచించిన 'చిత్రలేఖ', మాలే రాఘవరావుగారి 'అపరిచిత' అను నవల, సోమరాజు రామానుజరావు, చురువాడ నారాయణ మూర్తి మున్నగువారి అసంఖ్యాక నవలలు స్వతంత్రములు. ఇటీవల వచ్చిన వానిలో 'ఆరుద్ర'గారి 'పలకల వెండి గ్లాసు' 'శారద'గారి 'ఏది సత్యం?' కెంపోరావుగారి 'మిస్టర్ ఎక్సు', కొమ్మూరి సాంబశివరావుగారి 'వలలో చిక్కిన వనిత' పేర్కొనదగినవి. కథానిర్మాణములోను, సన్నివేశముల కూర్పులోను ఇవి మంచి నేర్పు ప్రదర్శించినవి.

ఈ విధముగా ఎన్ని రకముల నవల లున్నవో అన్ని రకముల బీజములను తెచ్చి అంట్లు కట్టి తెనుగు సాహిత్య కేదారమున మన రచయితలు వ్యవసాయము చేయుచునే యున్నారు. మొలకలలో రకము లున్నట్లే వ్యవసాయ పద్ధతిలోకూడ విభేదములు కలవు. 'నవలా' రచనా విధానములో అనేక పద్ధతులు కలవు. కథ క్రమమును తప్పించి గాని, తప్పించకగాని రచయితయే చెప్పుకొని పోవుట సాధారణపద్ధతి. అదిగాక ఒక సన్నివేశముతో ప్రారంభించి అది యెట్లయినదియు నిరూపించుకొని గతించిన వృత్తాంతమును చెప్పుకొని వచ్చుట మరియొకపద్ధతి. కథలో ఎవరో ఒకపాత్రచేత స్వగతము రూపకముగా చెప్పించుట ఒక విధానము. ఈ రీతిగా వచ్చిన కథలు అనేకము లున్నవి. ఆయా పాత్రలచేత స్వగతములుగా గాని, డైరీలుగాగాని వ్రాయించుట మరొకపద్ధతి.

ఈ పద్ధతిని రచించిన నవల కుదాహరణములు ముని మాణిక్యం నరసింహారావుగారి 'తిరుమాళిగ', ఉత్పల లక్ష్మణరావుగారి 'అతడు - ఆమె'. లేఖలవలన, రికార్డుల వలన, డైరీలవలన కథల నల్లుకొనుచు వచ్చిన దృష్టాంతములును కలవు. పాశ్చాత్యభాషలందు నవలా రచనలో ఎన్ని పోకడ లున్నవో అన్నింటిని తెనుగు నవలలోకూడ మన రచయితలు అనువదించినారు; అనుకరించినారు; స్వతంత్రముగా ప్రతిపాదించినారు; అన్ని ప్రయోగములను చేసినారు. మొత్తముమీద తెనుగు నవల విశ్వసాహిత్యములో నవల త్రొక్కిన తెన్ను లన్నియును తెలిసికొని వాటి ననుసరించి యింకను .క్రొత్తదారుల నన్వేషించుచున్నది.

యం. స. నా.

**నాగలింగశాస్త్రి, ముదిగొండ :** క్రీ. శ. 1876 లో వీరు జన్మించిరి. వీరు ఉద్భటారాధ్య వంశజులు. శక్తివిశిష్ట శివాద్వైతులు; భరద్వాజ సగోత్రులు; ఆపస్తంబ సూత్రులు. తండ్రి అఘోరపతి; తల్లి జ్వాలాంబిక; గుంటూరు జిల్లాలోని తాడికొండ వీరి జన్మస్థానము.

శాస్త్రిగారు ముదిగొండ నందికేశ్వరారాధ్యులవారి యొద్ద విద్య నభ్యసించి పిదప పడుమటి గోదావరిజిల్లా కొత్తపల్లి అగ్రహారములోని ఇవటూరి లింగయ్యశాస్త్రి గారియొద్ద శాస్త్రాధ్యయనము పూర్తిగావించిరి. తరువాత కాళహస్తికి వెళ్లి శ్రీ శ్రీనివాసశాస్త్రిగారి యొద్ద వ్యాకరణ శాస్త్రమును, తదుపరి నడుక్కావేరి నివాసులు శ్రీనివాస దీక్షితులవారియొద్ద మీమాంసా వేదాంతాది శాస్త్రములను, నీలకంఠ శంకర రామానుజ మధ్వభాష్యములను సవిమర్శముగను అధ్యయనము గావించిరి. వీరు విద్యాభ్యాస కాలముననే 'రక్షా రుద్రాక్ష చండ మార్తాండ'మను ఖండన గ్రంథమును రచించిరి; ఆ కాలముననే రామనాథపురము రాజావారిచే జరపబడిన వైయాకరణ పరీక్షయందుత్తీర్ణులై పారితోషికము లందిరి. శార్వరి సంవత్సర శ్రావణియందు చెన్నపట్టణమున జరిగిన మత సభలో పండితులతో చర్చ గావించి శివుడే జగత్కారణ మనుట వేద సమ్మతమని సిద్ధాంతీకరించి ఆత్మకూరు సంస్థానాధీశుల వలన సమ్మానము నొందిరి. తదుపరి చెన్నపట్టణమున 'శ్రౌత శైవ ప్రకాశిక' అను మాసపత్రికను నడపిరి. తెనాలి వాస్తవ్యులచే ఆహూతులై ఆ పురమునకు వచ్చి తెలుగు సంస్కృత కళాశాలయందు పదునొకండు సంవత్సరములు సాహిత్య వ్యాకరణాధ్యాపకులుగ పనిచేసిరి. అటుపిదప ఆ యుద్యోగమును మానుకొని 'శైవరహస్య బోధిని' అను మాసపత్రికను నడపి తమ జీవితాంతము మతసేవ చేయుటలో గడపిరి.

1929వ సంవత్సరమున విజయనగరమున బ్రహ్మశ్రీ తాతా సుబ్బరాయశాస్త్రిగారి అధ్యక్షతను జరిగిన ఆంధ్ర సారస్వత పరిషద్వార్షిక సభయందు 'మహోపాధ్యాయ' బిరుదమును, 1937వ సంవత్సరమున శ్రీ విమలానంద భారతీ స్వామివారి అధ్యక్షతను జరగిన ఆంధ్ర సారస్వత పరిషద్వార్షిక సభయందు 'విద్యావాచస్పతి' బిరుదమును బడసిరి.

వీరు తమ పత్రికలయందు కారణోత్తరము, చంద్రజ్ఞానోత్తరము, మకుటోత్తరము అను వానిని ఆంధ్ర తాత్పర్యముతో ప్రకటించిరి; చతుర్వేద తాత్పర్య సంగ్రహము, బ్రహ్మతర్కస్తవము మొదలగు పెక్కు గ్రంథములు రచించిరి. ద్విమతఖండన పూర్వకముగ స్వమత సిద్ధాంతము గావించుచు రచించిన గ్రంథము వీరి బ్రహ్మపథము. వేదాంత చర్చయందు సందిగ్ధ విషయ నిర్ణయమునకై వేదాంతార్థ పరిష్కార తారహారమను గ్రంథమునుగూడ వీరు రచించిరి. నలప్రవాసము, నల వివాసము, నవరసకాదంబరి మున్నగు గ్రంథములు రచించి సాహిత్యసేవ గావించిరి. చరమదశయందు ఉపనిషత్తులకును బ్రహ్మసూత్రములకును, గీతలకును నీలకంఠారాధ్యస్వామి శక్తివిశిష్ట శివాద్వైత పరముగ రచించిన భాష్యములకు శివచింతామణిప్రభ అను వ్యాఖ్యానము రచించిరి. ఇందలి సూత్ర గీతా భాష్య వ్యాఖ్యానములు ముద్రితములు. వీరు ఇటీవలనే కైలాసవాసులైరి.

పం.శ.

**నాగార్జునకొండ :** భారతదేశ మంతటిలో నాగార్జునుని కొండలో నున్న యంతటి విస్తీర్ణమైన బౌద్ధక్షేత్రము మరొకచోట ఎచ్చటను కానరాలేదు. మూడువైపుల కొండలచేతను, నాలుగవ వైపున కొండల నానుకొని ప్రవహించు కృష్ణానదిచేతను పరివృతమైన 2,500 ఎకరముల





చిత్రము 156 క. ఆసన, శయ్యా సామగ్రి, అమరావతీ శిల్పము





చిత్రము 156 చ. ఆసన, శయ్యా సామగ్రి, నాగార్జునకొండ శిల్పము

ప్రదేశములో ప్రభుత్వ పురాతత్త్వ శాఖవారు త్రవ్వుపని సాగించియున్నారు; ఇంకను సాగించుచున్నారు. ఈ ప్రదేశమును మొదట త్రవ్వించినపుడు క్రీ. శ. 2, 3 శతాబ్దములలో ఈ ప్రాంతమును పాలించిన ఇక్ష్వాకు వంశజులనాటివగు పెక్కు శాసనములు, శిథిల విహారములు, చైత్యములు, మంటపములు, నాణెములు, అస్థికలశములు, మట్టిపాత్రలు, సుందరములైన శిల్పచిత్ర శిలాఫలకములు బయలుపడినవి. స్తూప వేదికలపై నున్న అయకస్తంభముల కనర) మహారాజులతోనే కాక మధ్యభారతమున ఉజ్జయిని నధివసించిన క్షాత్రప చష్టనుని సంతతివారితోను వైవాహిక సంబంధము కలిగియుండినట్లును తెలియనగుచున్నది.

ఒక విశేష మేమన: ఇక్ష్వాకు సంతతివారిలో మహారాజులు వైదిక మతావలంబులై అగ్నిహోత్ర, అగ్నిష్టోమ, వాజపేయ యాగములు చేసినవారు కాగా వారి పత్నులు బౌద్ధ మతానుయాయులై బుద్ధదేవాలయములు, విహారములు, స్తూపములు మున్నగువానిని కట్టించుచు వచ్చిరి.

నాగార్జునకొండ (1954 త్రవ్వటములకు పూర్వము)

మీద చెక్కిన శాసనములవలననే ఇక్ష్వాకులనాటి ఈ ప్రాంతపు చరిత్ర తెలియవచ్చుచున్నది. ఇచటి శాసనములు బ్రాహ్మీ లిపిలో చెక్కబడినవి. ఈ శిలాలేఖనములలోని అక్షరములతీరు పూల లతలనుబోలి అద్భుతముగ నున్నది. శాసనములలోని భాష ఆ కాలములో దేశములో చాల భాగమున వాడుకలో నుండిన ప్రాకృతము. ఈ శాసనములవలన ఆ రాజకుటుంబములోని పెక్కురు స్త్రీ పురుషుల పేరులు తెలియవచ్చుచున్నవి. వీరు వనవాస (ఉత్తర స్త్రీలలో ప్రధాన నిర్మాత్రి 'చాంతిసిరి' అను రాజకాంత. ఈమె శ్రీ వీరపురుష దత్తమహారాజు ఆరవ రాజ్యపాలన సంవత్సరమున ఇచటి మహాచైత్యమును కట్టించెను. ఇది కాక ఈమె ఈ మహాచైత్యమునకు తూర్పున ఒక చైత్యమును, ఒక విహారమును కూడ కట్టించినది. ఈ ధర్మకార్య నిర్వహణమునందు పాల్గొనిన రాజ స్త్రీలు మరి ముగ్గురు మహాస్తూపముయొక్క స్తంభ శాసనములలో పేర్కొనబడియున్నారు. వారిలో 'అడవి చాంతిసిరి' అనునామె

ప్రధానురాలు. ఈమె 'చాంతమూల'రాజు కూతురు ; 'సిరి విరపురిసదతు 'ని సోదరి. ధనిక కుటుంబమునకు చెందిన మహాసేనాపతి, మహాతలవర, మహాదండనాయక ఖంద విసాఖంణకుని భార్య. ఈమెకు మహాతలవరియను బిరుదము కలదు. రెండవయామె 'ఛుల్లచాంతిసిరిణిక ' (ఛుల్ల = చిన్న). ఈమెకు 'మహాసేనాపతిని ' అను బిరుదు కలదు. ఈమె కులహాకుల ఇంటి ఆడుపడుచు. 'హిరంణక ' వంశపు మహాసేనాపతి, మహాతలవర 'వాసిఠీపుత కంద చలికి రెంణక ' అనునాతనిపత్ని. మూడవయామె పేరులేదు. కాని యీామె 'పూగియ ' వంశపు మహాసేనాపతి మహాతలవర 'వాసిఠీపుత మహాకందసిరి ' అను నతని భార్యయనియు, 'మహాసేనాపతి, మహాతలవర విణ్హుసిరి ' తల్లియనియు పేర్కొనబడినది. మరియొక ముఖ్యమైన శాసనము రెండు బౌద్ధ విహారములు, ఇటికలతో సున్నముతో కట్టబడిన మూడు గజపృష్ఠాకార చైత్యములు, రెండు శిథిలస్తూపములు మున్నగు నిర్మాణములు గల కొండమీద నుండు ఒక శిథిల చైత్యమునం దున్నది. గజపృష్ఠాకార చైత్యము నొకదానిని రాణి 'చాంతిసిరి ' కట్టించినది. ఇట్టిదేయగు మరియొక చైత్యమును కట్టించినది 'బోధిసిరి ' అనుపేరుగల సామాన్యోపాసిక. ఈమె కిక్ష్వాకు రాజవంశ




చిత్రము 157. చిన్న ధర్మగిరి విహారము, నాగార్జునకొండ.

ముతో నెట్టి సంబంధ ముండినట్లును తెలియరాదు. ఈ చైత్యము 'మాఢరిపుత సిరి విరపురిసదతు ' డను రాజు యొక్క 14వ రాజ్య పరిపాలన వత్సరమున కట్టబడినది ; కాశ్మీర, గాంధార, చీని, చిలాత, తోసలి, అపరాంత, వంగ, వనవాసి, దమిళ, పాలూర, తాంబపంణి అను దేశములలో బౌద్ధ మతమును వ్యాపింపజేసిన సింహాళదేశపు బౌద్ధ సన్యాసులకు అంకితము చేయబడినది. ఇంకను 'బోధిసిరి 'చే కట్టింపబడిన బౌద్ధ నిర్మాణములును, అవి కట్టబడిన



చిత్రము 158.
గజపృష్ఠాకార చైత్యాలయము నమూనా, నాగార్జునకొండ.

స్థలములును ఈ శాసనములందు పేర్కొనబడినవి. ఆమె కట్టించినట్లు పేర్కొన్న నిర్మాణములలో 'కంటకసేల ' (ఘంటసాల) వద్దనున్న మహాచైత్యముయొక్క తూర్పు ద్వారముకడ నుండు శిలామండప మొకటి. ఆ శాసనమునందే నగరము పేరు 'విజయపురి ' యనియు, 'బోధిసిరి ' సింహాళ బౌద్ధభిక్షువులకొరకు కట్టించిన విహారము, గజపృష్ఠాకార చైత్యాలయము కల గుట్టపేరు శ్రీపర్వతమునందలి 'ఛుల్లధర్మగిరి ' అని యుకలదు. శ్రీపర్వతము పేరు శాసనమున చెప్పబడి యుండుట చాల ముఖ్యమయిన విషయము. దివ్యశక్తి గల నాగార్జునుడను సుప్రసిద్ధ బౌద్ధ భిక్షువు దక్షిణ హిందూదేశమున ఆ పేరుతో నెలకొనిన సంఘారామమున తన జీవితోత్తర భాగమును గడపినట్లు ఒక యైతిహ్యము టిబెత్తులో ప్రచారమున నున్నది. ఈ సంఘారామమును, పై శాసనమున పేర్కొనబడినట్టి విజయపురికి తూర్పున నున్న శ్రీ పర్వతము పైనుండు విహారమును ఒకటియే అయిన యెడల ఈ ప్రదేశముతో నాగార్జునునకు గల సంబంధము ఈనాటికిని నాగార్జునకొండ అను పేరునందు సురక్షితముగా పదిలపరుపబడిన ట్లనుకొనవచ్చును. దీనినిబట్టి 'ఛుల్లధర్మగిరి ' సంఘారామము ఉచ్ఛదశయందున్న కాలమున నాగార్జును డందు నివసించుచుండినట్లు విదితమగుచున్నది.

మరియు నింకొక శాసనము 'సిరి చాంతమూలు 'ని కోడలును, 'సిరి విరపురిసదతు 'ని భార్యయు, 'మహారాజ సిరి ఎహువుల చాంతమూలు'ని తల్లియు నగు మహాదేవి 'భటిదేవి ' ఒక విహారమును స్థాపించినట్లు తెలుపుచున్నది. 'సిరి ఎహువుల చాంతమూలు 'ని 11 వ రాజ్య సంవత్సరమున వెలువడిన మరియొక శాసనమున 'సిరి

చిత్రము 1. నాగార్జునకొండ — సామాన్యదృశ్యము



చిత్రము 2. బుద్ధుని సతీసుత సందర్శనము, నాగార్జునకొండ



చిత్రము 3. ముచిలిందుని బుద్ధ పరిరక్షణము, నాగార్జునకొండ

















మిథున ప్రతిమలు, నాగార్జునకొండ

చాంతమూలు'ని పౌత్రియు 'సిరి విరపురిసదతు'ని పుత్రియు, మహారాజ 'వాసిఠీపుత సిరి ఎహువుల చాంతమూలు'ని సోదరియు, వనవాస (ఉత్తరకనరాకు ప్రాచీన నామము) మహారాజు భార్యయు నగు మహాదేవి 'కొడబలిసిరి' అను నామె ఒక విహారమును స్థాపించినట్లు కలదు. 'బోధిసిరి' శాసనమున 'కులహ విహారము', 'సిహాల విహారము' అను రెండు విహారములు పేర్కొనబడినవి 'కులహ విహారము' కులహకులచే కట్టబడినది కావచ్చును. 'సిహాలవిహార'ము సింహాలదేశీయులచేత గాని, ప్రాయశః సింహళ బౌద్ధ భిక్షువుల నివాసార్థముగా గాని నిర్మింపబడి యుండును. సింహాళ విహారమున బోధివృక్షముతో కూడిన బౌద్ధదేవాలయ ముండినట్లు చెప్పబడినది. బౌద్ధ విహారములకు బోధివృక్ష మనుబంధమై యుండు సంప్రదాయము ఈనాటికిని సింహాళమున కలదు. 'సిహాల విహార'మును పేర్కొనుటయే గాక 'తాంబపంణి' బౌద్ధభిక్షుక సంఘముకొరకు 'చేతియఘర'(చైత్యగృహ)మును నెలకొల్పుటయు చూడ కృష్ణాతీరమునందలి బౌద్ధ భిక్షువులకును, సింహళమునందలి బౌద్ధ భిక్షువులకును స్నేహ సద్భావములు వెలసియుండెనని తోచుచున్నది. సింహళపు రేవుపట్టణములకును, కృష్ణాముఖద్వారమునందలి గొప్ప కరపట్టణమగు కంటకసేల(ఘంటసాల)కును జరగుచుండిన సముద్ర వ్యాపారమే ఈ స్నేహ సద్భావములకు కారణము కావచ్చును. బౌద్ధమతము కృష్ణానదీ ప్రాంతముల నభివృద్ధి నొంది యుండుటకు ఈ సముద్ర వ్యాపారము కారణమగుటకు సందియము లేదు. వర్తకజాతులవారే అధికముగా బౌద్ధు లగుచుండిరి. వారి సంపదతో, వర్తకులును, వారి ప్రభువులును అమరావతి యందలి మహాస్తూపము వంటి దివ్య నిర్మాణములను నిర్మించగలిగిరి.

లాంగ్‌హర్స్ట్ పర్యవేక్షణక్రింద జరిగిన త్రవ్వకమువలన ఒక పెద్ద స్తూపము ('మహాచేతియ' - శాసనములలో పేర్కొనబడినది), ఎనిమిది చిన్నస్తూపములు, నాలుగు విహారములు (సంఘా రామములు), ఆరు చైత్యములు (గజపృష్ఠాకార బుద్ధాయతనములు), నాలుగు మండపములు, ఒక రాజగృహనివేశనము మొదలైనవి బయలు పడినవి. ఇవి సరాసరి 20″ × 10″ × 3″ పరిమాణము గల ఇటికలతో కట్టబడినవి. ఇట్టి పరిమాణము గల ఇటికలు పాట్నా (పాటలీపుత్రము) సమీపమున కొన్ని కానవచ్చినవి. గోడలు ఇటికలతోడను, బెందడితోడను కట్టబడి, గచ్చు చేయబడినవి. ఈ యిటిక కట్టడములకు అచ్చులు ఇతరాలంకారములు సాధారణముగ గచ్చుతో చేయబడినవి. గచ్చుపూత సురక్షితముగా నుండుటకే కాక రంగుల పూతకును, జలపోసనమునకును అనువుగా నుండునట్లు ఈ కట్టడములకు క్రిందినుండి మీదివరకు వెల్లవేయబడి యుండును. చెక్కుటకు సులువుగా నుండునని స్తంభములకు,




చిత్రము 159. మహాస్తూపము – ప్లాను, నాగార్జున కొండ.

నెలకట్టుకు, ముఖ్యములైన శిల్పరచనలకు చలువరాయి వలె నుండు తెల్లని, బూడిదరంగుకల పాలరాయి ఉపయోగింపబడినది. ఇది తప్ప వేరు జాతుల రాళ్లు ఇక్కడ వాడబడలేదు. ఇచట ఆరు సంఘారామములు బయలుపడినవి.

సామాన్యముగా ఇటికలతో, సున్నముతో కట్టినవైనను నాగార్జునకొండ స్తూపములు ఉత్తర హిందూదేశమునందలి గట్టి స్తూపములవంటివి కావు. ఇచటి స్తూపముల యొక్కతలవిన్యాసము కుండ, ఆకులు, కట్టు కలిగి చక్రాకారమున నుండును. ఈ భాగములు ఇటికలతో, సున్నముతో కట్టబడి యుండును. ఆకులవలె కట్టబడిన గోడల నడిమి ప్రదేశములు మట్టితో నింపబడిన పిమ్మట వాని చుట్టును ఇటికరాతి కట్టడము కట్టి దానిమీద అండము నిర్మింపబడి యుండును. కాని అది విన్యాసమున చక్రము వలె నున్నను మధ్య చ్ఛేదమున మాత్రము దాని నిర్మాణము ఛత్రాకారమున నుండును. ఈ స్తూపములు వివిధ పరిమాణములు గలవి తొమ్మిది కానవచ్చినవి. అవి యిరువది యడుగుల వ్యాసము గల చిన్న దిబ్బ మొదలుకొని నూటారు అడుగులు వ్యాసము గల మహాస్తూపమువరకు గలవు. చిన్న స్తూపములు కొన్నిటియందు చక్రనాభి స్థానములోనున్న స్తంభము ఒక్కొక్కప్పుడు విన్యాసమున

చతురస్రముగా నుండును. కాని మహాస్తూపమునందువలె పెద్ద స్తూపములలో నది ఛత్రదండమును పోలి గుండ్రముగా నుండవలెనను నుద్దేశముతో కట్టబడిన ట్లున్నది. స్తూపములు పైనుండి అడుగువరకు గచ్చుచేయబడి యుండును. స్తూపముల పరిమాణము ననుసరించి మూడు మొదలు ఐదడుగుల వరకు ఎత్తు గలిగిన వేదికపై అండము కట్టబడియుండును.

నాగార్జునకొండలో లభించిన ఉత్తమ శిల్పము లన్నియు ఆద్యమున ఆయక వేదికలందలివే. ఉజ్వల శిల్పసమంచితములగు శిలాపట్టములును ఆ సుందర వేదికల యంచుల నలంకరించి యుండినవే.

నాగార్జునకొండలో రెండు విధములైన స్తూపము లుండినవి. ఇటికలతో, సున్నముతో కట్టిన సామాన్య స్తూప మొక విధము. క్రిందినుండి మీదివరకు శిల్ప మపరిమితముగాగలది యిం కొకవిధము. దీని దిగువభాగమందలి ఇటిక కట్టుకు శిల్పముగల చలువరాతి పలకలు గచ్చుతో అతికింప బడియుండును. వేదికమీద అండము, దానిమీద దీర్ఘ చతురస్రాకారమగు పెట్టెవలెనున్న హర్మిక కలవు. దానిపై మూత బరువైన రాతిపలకలుగాని, కొయ్యపలకలుగాని ఒండొంటిపై పేర్చి చేసినట్లు కానవచ్చును. ఆ మూతమీద నొకటి కాని, అనేకముగాని ఛత్రము లుండును. ఛత్రములు భరతఖండమున ధర్మసామ్రాజ్యమునకు చిహ్నములు.

శిల్పాలంకృత స్తూపములందు శిల్పరచన శిలలతోను, గచ్చుతోను చేయబడినది. ఇట్లు స్తూపములను శిలాశిల్పముతో కొంత, గచ్చు శిల్పముతో కొంత అలంకరించుట గాంధార బౌద్ధుల చేత కూడ అవలంబింప బడినది. ఆంధ్ర శిలాశిల్పమునం దనేకముగ గాంధారశిల్ప ప్రాబల్యము స్పష్టముగా కానవచ్చుచుండును. ఆంధ్ర దేశ బౌద్ధులకును, గాంధార దేశ బౌద్ధులకును అన్యోన్య సంబంధము మిక్కుటముగా నుండినట్లు శాసనములు తెలుపుచున్నవి. నాగార్జునకొండయం దుపలబ్ధములైన కొన్ని ప్రాచీన శిల్పములపై రోమకశిల్ప ప్రభావ మున్నట్లు గుర్తింప బడినది.



చిత్రము 160. శకవీరుడు, నాగార్జునకొండ.

ఆరవ స్తూపము మహాచైత్యమువలెనే చక్రాకారమున నిర్మింపబడినది. ఆకులవలె కట్టబడిన ఇటికగోడలు చక్రాంతర్భాగమును ఎనిమిది త్రిభుజాకారములగు గదులుగ విభజించు చున్నవి. ఉత్తరపు గదిలో నిక్షిప్తమైన బుద్ధావశేషము కానవచ్చినది. అవశేష మొకచిన్న బంగారు డబ్బిలో నుంచబడినది. ఆ డబ్బి స్తూపాకారమున నున్న వెండి డబ్బిలో నిముడ్చ బడినది. కొన్ని పగడములు, ముత్యములు, గరుడ పచ్చలవంటి పూసల (జేడ్సు) తోపాటు $\frac{5}{8}''$ వ్యాసముగల చిన్ననాణెముల వంటి బంగారు ముద్రికలుకూడ రెం డుండినవి. వానియం దొక్కొక్క దానిమీద రోమక ప్రాబల్యమును వెలిబుచ్చు నెవనిదో యొకని రూపము యొక్క పోలికను తోపజేయు శిరస్సుయొక్క యుబ్బెత్తు ప్రతిమ కలదు.

లాంగ్ హర్స్ట్ త్రవ్వటములో నించుమించు అయిదు వందల శిల్పఖండములు బయలు పడినవి. వానిలో చక్కని శిల్పరచన గల దూలము లనేకము లున్నవి. నిలువుగా నేర్పరచిన ఉబ్బెత్తు చిత్రములుగల నిలువు పలకరాళ్ళును చాల గలవు. ఈ చిత్రములు బుద్ధుని జీవిత విషయములకును, జాతక కథలకును, ఇతర జానపద కథలకును సంబంధించినవి. శిల్పి కథను సంగ్రహపరచి కథయందలి వివిధ భాగములను ఏకఫలకమున సమకూర్చును. బుద్ధుని జీవిత చరిత్రమునకును, ఆతని పూర్వజన్మములకును సంబంధించిన యీ కథ లన్నియు 'జాతక' ములు, 'నిదానకథ', 'లలితవిస్తరము', 'మహావస్తువు', అశ్వఘోషుని బుద్ధచరిత్ర, సౌందరనందములు, దివ్యావదానము, ధర్మపదము మీది బుద్ధఘోషుని వ్యాఖ్య, 'సక్కపన్న సుత్తాంత, 'దీఘనికాయ' మందలి 'మహాపరినిబ్బాన సుత్తాంత', 'దీఘనికాయ' ముమీది 'సుమంగల విలాసినీ వ్యాఖ్య' మున్నగు ప్రాచీనబౌద్ధ గ్రంథములనుండియే కాక చీనా, సింహళ దేశములందు వాడుకయం దుండిన బుద్ధచరిత్రనుండియు గ్రహింపబడినవి.

క్రీ. శ. 1938లో నాగార్జున కొండ త్రవ్వటము మరల ప్రారంభమైనది. త్రవ్వటము సాగించిన మూడు ప్రదేశములలో ఒకటి ఎక్కువ విస్తీర్ణము, ఎక్కువ ప్రాముఖ్యము కలది. అక్కడ ఒక స్తూపము, రెండు చైత్యములు, మధ్యను మండపముగల ఒక సంఘారామము - అన్నియు కలసిన ఒక విహారము బయలు పడినది. దానికి ఉత్తరమున ఒక చిన్న గదియు, కర్మాగారమును, వెలుపల వర్తులముగను లోపల చతురస్రముగను ఉన్న ఒక గృహమును గూడ వెలువడినది. ఆయక వేదికలతో గూడిన స్తూపము యొక్క వ్యాసము 40′ 9″. చాలవరకు సంకీర్ణశిల్ప రచన



886 అ

చిత్రము 160 క. కేశాలంకార పరిష్కారములు, నాగార్జునకొండ శిల్పము





చిత్రము 160 చ. ఆయుధసామగ్రి, నాగార్జునకొండ శిల్పము

గల పాలరాతి కప్పుడు పలకలు అనేకము స్తూప ప్రదేశమున దొరకినవి. వానిలో కొన్నింటిమీద బుద్ధుని జీవిత ఘట్టములకు సంబంధించిన శిల్పరచన గలదు. స్తూపమునకు తూర్పున ఒండొంటి కెదురుగనున్న రెండు గజపృష్ఠాకృతి చైత్యములలో దక్షిణమున నున్న దానిలో ఆరాధన స్తూపమును, ఉత్తరపు దానిలో పాలరాతి బుద్ధ విగ్రహము నున్నవి. బుద్ధ విగ్రహము నిలిచియున్న పద్మాసనము పై భాగమున బుద్ధుని రెండు పాదముల నడుమ ఒక సన్న బిలము కలదు. అది కానరాకుండునట్లు పాలరాతి ముక్కతో మూసి బిగించిచేయబడియుండెను. దాని నూడదీయగా $1\frac{3}{4}''$లోతును, $\frac{1}{2}''$ వ్యాసమును గల బిలము కానవచ్చినది. అందులో $\frac{3}{4}''$ పొడవు, $\frac{1}{3}''$ వ్యాసముగల బంగారు గొట్ట మొకటి యుండెను. ఆ గొట్టములో 95 ముత్తెములు, - వానిలో $\frac{1}{8}''$ వ్యాసము గలది, తక్కినవి ఆవ గింజకన్న చిన్నవి - అస్థిభస్మము నుండెను. బంగారు గొట్టముమూత చేతితో గట్టిగా నొక్కి వేయబడి యుండెను. ఇది బుద్ధ విగ్రహ ప్రతిష్ఠాపనకు చెందిన కార్యకలాపము. ఆధునిక హైందవ దేవతాప్రతిష్ఠాపన కార్యకలాపము నెంతయు పోలియుండుటను తెలుపుటచేత నీ నిక్షేప విషయము చాల ముఖ్యమైనది. చైత్యములకు తూర్పున ఆవరణములేని సంఘారామ మున్నది. దాని విస్తీర్ణము 95′ 8″ × 72′ 2″. ఒక్కొక్కదాని యందు 9′ 3″ × 7′ విస్తీర్ణముగల గదులున్న మూడు పక్షము లున్నవి. నడిమి భాగమున అంగణ ముండవలసినచోట అయిదు వరుసల పాలరాతి స్తంభములు గల మండప మున్నది. దక్షిణ పక్షమున నున్న గదుల వరుసలో, ఆగ్నేయకోణమున దక్షిణమునకు వాలిన చతురస్ర శిలానిర్మిత మూత్రకుండ మున్నది. దాని నట్టనడుమ $\frac{1}{2}''$ వెడలుపుగల రంధ్ర మున్నది. దానిగుండ దక్షిణమున 22′ దూరములో భూగర్భమున నున్న మురికి నీటి గుంటలోనికి నీరు పోవును. ఆ గుంట 10′ పొడవు, 8′ వెడలుపు, 6′ లోతు గలది. దానిలో పెద్ద పెద్ద రాతిముక్కలు, గులకరాళ్ళు, ఇసుక, సున్నము ఒకదానిపై నొకటి పొరలు పొరలుగా పరచబడి యున్నవి.

గదుల యుత్తరపు వరుస చాల ముఖ్యమైనదిగా చూపట్టుచున్నది. ఒకటవసంఖ్య గదిలో నేలమీద పాలరాతి పూర్ణ ఘటము 15″ ఎత్తును, నడిమిభాగమున $10\frac{1}{2}''$ వ్యాసమును, నోటివద్ద 4″ వ్యాసమును గలది దొరకినది. ఘటనిర్మాణము నాలుగు విధములుగా చేయబడినది. అడుగు భాగము ఎత్తు $3\frac{3}{4}''$. ఆ తరువాత $1\frac{1}{2}''$ వెడలుపు పట్టిక. ఆమీద గొంతువరకు ఎత్తు $3\frac{1}{4}''$. గొంతు ఎత్తు $1\frac{1}{2}''$. ఆ గొంతుమీద $\frac{3}{4}''$ ఎత్తు, $5\frac{1}{8}''$ వ్యాసముగల అంచు ఉన్నది. ఘటముఖము పద్మద్వయముతో గట్టిగా బిగింపబడి యుండెను. ఆ పద్మద్వయము మున్ను $6\frac{1}{2}''$ వ్యాసము గల ఆచార ఛత్రమున కాధారముగా నుండినది. అది కర్ణికకు దంతముతో బిగింపబడినది. ఇంత జాగ్రత్తతో చేసిన యేర్పాటు పూర్ణఘటమం దుంచబడిన పదార్థముయొక్క గౌరవమునకు తగినట్లుగనే యున్నది. ఈ ఘటమునందలి $\frac{1}{4}''$ వ్యాసముగల దౌడపల్లును, $\frac{1}{8}''$ వెడలుపుగల ముందు వరుసలోని పల్లును - రెండును చెక్కుచెదరక యుండినవి. దంతావశేషములు చిన్నవి. ఇవి తప్ప పూర్ణ ఘటమున నింకేమియు లేదు. ఏ నాగార్జునుని పేర నీ కొండ వెలసినదో ఆ నాగార్జునునివే ఈ దంతావశేషములని స్థానికముగా నొక యైతిహ్యము కలదు.

సంఘారామమునందలి ఈశాన్య కోణమున మండపము అంచు దగ్గరను, చైత్యములకును స్తూపముయొక్క క్రింది మెట్టునకును నడుమనున్న ప్రదేశమునను వివిధములైన గచ్చు అలంకార శిల్పములు అసంఖ్యముగా దొరకినవి. వానిలో సాధారణమైన కమలము, రేఖాచిత్రములు, అరుదైన గోరింటవర్గ (అకాంతసు) పుష్పము, సింహము, పులి, కోతి, పాము మొదలైన జంతువుల తలల శిల్పముల నమూనాలు కలవు. అవి యన్నియు చెక్కు చెదరక యున్నవి. ప్రాయశః ఎండ వానలు, మానవస్పర్శ సోకని చూరు బొద్దులక్రింద నవి యుండి యుండును.

చైత్యముల కుత్తరముగ ఒక చిన్నగదియు, పెద్ద కర్మాగార మొకటియు కానవచ్చినవి. గది విస్తీర్ణము 12′ 9″ × 6′ 3″. అందు ముక్కుపాత్రలు, చిన్న ఎర్ర బొమ్మలు, - వానిలో తలమీద దీపము పెట్టుకొనియున్నవి కొన్ని - పెక్కు సెమ్మెలు నుండినవి. ఈ దీపములు బహుళః ప్రక్కనున్న సంఘారామములో వాడుకయం దుండినవి కాబోలును. వీనిలో కుంభహారతి - ముఖమునకు చేరువగా గర్భముచుట్టు లగింపబడిన ప్రమిదెలుగల కుండ - కలదు. ఇది మంగళకరమైన హైందవాచార చిహ్నములలో నొకటి.

ఇంకను 12′ 9″ వెడలుపుగల కర్మాగార మొకటి కానవచ్చినది. త్రవ్వటము 26′ 6″ మాత్రమే సాగినది. కావున దాని పొడవు తెలియరాదు. అందొకచోట కర్మాగారమునందువలె పాలరాతి పలకలు పేర్చి పెట్టబడి యుండినవి. దీనినిబట్ట ఇది శిల్పకర్మాగారమని తోచుచున్నది. ఇచట కానవచ్చిన పాలరాళ్ళ యొక్కయు, వేరు రాళ్ళ యొక్కయు చెక్కుడు ముక్క లీ యూహను బలపరచుచున్నవి. అరువదియొక్క శిలాఫలకములలో 48 శిల్పరచన లేని మదుటి పలకలు - ప్రాకారమునకు సంబంధించి

నవి - ఉన్నవి. తక్కినవి శిల్పరచనగల అడ్డు నిలువు పలక రాళ్ళు. ఈ కర్మాగారములో 1′ 8″ × 1′ 2″ పరిమాణము గల బూడిదరంగు పాలరాతిపలక యొకటి యున్నది. కొణిగకొన యందలి నాగదంతము నంటి సగము చెక్కిన కొమ్మను పట్టుకొని కుడిచేతిని నడుముపైనుంచి సవిలాస ముగా నిలిచియున్న యువతియు, (సాలభంజిక), ఆమెకోసము బొట్టుపెట్టెను పట్టుకొని ఆమె దాసియు నున్నట్లు రచింపబడిన రేఖా మాత్ర చిత్రము దానిపై నున్నది. టి. యన్. రా.

నందికొండవద్ద కృష్ణా నదిపై ఆనకట్ట కట్టుటకు తీర్మానింపబడుటవలన సుప్ర సిద్ధమగు ఈ నాగార్జున కొండ లోయ యంతయు పూర్తిగా మునిగిపోవు ప్రమాదము సంభవించినది. అందువల్ల ఇక్కడ విస్తార ముగా పురాతత్త్వశాఖ వారు 1954 నుండి త్రవ్వక ములు ప్రారంభించినారు. పెద్దపెట్టున జరుగుచున్న ఈ త్రవ్వకములవల్ల చాల ముఖ్యమైన సామగ్రి లభిం చుచున్నది. దానివల్ల ఆంధ్ర చరిత్రసంస్కృతులకును, బౌద్ధ మతమునకు, తత్పోషకులకు, అందు ముఖ్యముగా ఈ ప్రాంతపు పాలక వంశముల కును సంబంధించిన అనేక నూతనవిషయములు తెలియ వచ్చినవి. ఇక్కడ బౌద్ధవిహారములు ఎంత ఎక్కువగ నున్నవో, వాటిపరస్పర సంబంధ మెట్టిదో తెలిసికొనుటకై నిర్మాణావశేషములకొరకు కొన్ని కొన్ని నియత ప్రదేశ ములను చెట్టు చేమ నరికించి, క్రమపద్ధతిని పరిశోధించి, త్రవ్వటములను జరిపించుట జరిగినది. దీని ఫలితముగ ఇచ్చటి బౌద్ధప్రదేశమున 26 విహారములు, 10 స్తూపములు, హారీతి ఆలయమును, కందక ప్రాకారావృతమైన విజయపురి నగర ప్రదేశమున అశ్వమేధయాగ వేదికలు, రాచ నగరునుండి కృష్ణానదీ తీరమునకు పోవు సోపానస్నాన ఘట్టము, పౌరోత్సవాది కార్యములను జరుపుటకు ఏర్పా టైన సువిశాల రంగస్థలము (ఎరీనా), పుష్పభద్రుని, సర్వ దేవుని, కార్తికేయుని, నవగ్రహముల దేవాలయములు బయలు పడినవి ఈ దేవాలయములు అంతరాళ, ముఖ మండప, ధ్వజస్తంభాదులతో గూడి గజపృష్ఠాకారమున నుండి శిల్పశాస్త్రములలో ఇటువంటి నిర్మాణములకు చెప్పిన పద్ధతినే అనుసరించి నిర్మింపబడి యున్నవి. ఇక్కడ బయలుపడిన హిం దూదేవ మందిరములు గజ పృష్ఠాకృతినే నిర్మింపబడుట చేత గజపృష్ఠాకార మందిర ములు (చైత్యగృహములు) బౌద్ధ నిర్మాణములకు మాత్రమే చెందిన ప్రత్యేక లక్షణము కానట్లు కనిపించు చున్నది.



చిత్రము 161. శిల్పకర్మాగారములో దొరకిన పాలరాతి పలక, నాగార్జునకొండ.

త్రవ్వటములవల్ల విజయ పురిలో పశ్చిమ భాగమున వైదిక సంప్రదాయమునకు చెంది చక్కగా తీర్చి దిద్దిన దేవాలయ నిర్మాణ విన్యా సములు కానవచ్చినవి. లోయ లోపలి ప్రదేశమున అసంఖ్యములైన బౌద్ధ విహా రాదులున్నప్పటికి దుర్గ రక్షిత ప్రాంతముతోగూడ నది ఉత్తరపు టొడ్డువరకు ముఖ్యముగ హిందూ దేవా లయములు, వైదిక క్రతు కర్మనిర్మాణములు బయలు పడినవి. ఇవి ఇక్ష్వాకు వంశ జుల సహజసిద్ధ వైదిక మతాభిమానమునకు తార్కాణగ నున్నవి.

క్రీ. శ. 3 వ శతాబ్దిలో ఈ ప్రాంతమున గొప్ప పేరు ప్రఖ్యాతులతో ఒక్క ఇక్ష్వాకు వంశమే పరిపాలించుటచేత ఈ నాగార్జునుని కొండలో ముఖ్యముగ ఆ వంశమువారికి సంబంధించిన లౌకిక, మత సంబంధి నిర్మాణములే ఇచ్చట నుండు ననుకొనుట సహజము. కాని బౌద్ధ విహారప్రదేశము నందలి ఎ౯. కె. (V) – (IV); ఎస్. కె. (XIII) అను స్థలములలో కానవచ్చిన రెండు స్మారక స్తంభములమీది



చిత్రము 1. సాలభంజిక, నాగార్జునకొండ



చిత్రము 2. కృష్ణలోనికి సోపానపంక్తి, నాగార్జునకొండ



చిత్రము 3.
సిద్ధార్థుని కంచువిగ్రహము, నాగార్జునకొండ



చిత్రము 4.
అశ్వమేధయాగస్థలి, కూర్మచితి, నాగార్జునకొండ



చిత్రము 5. శిల్పచిత్రశోభిత శిలాఫలకము, నాగార్జునకొండ

శాసనములను, స్నానఘట్టములవద్ద సోపానములమీది పేర్ల శాసన శకలములను ఆధారపరచుకొని చూచినచో ఇక్ష్వాకువంశమువారికి పూర్వపువి, తరువాతి కాలపువి అని చెప్పదగిన నిర్మాణములుకూడ ఈ త్రవ్వటములలో బయలు పడినవి. శాసనములందలి లిపినిబట్టి చూచినచో ఇవి ఉత్తరకాలీన సాతవాహన యుగమునాటివి, ప్రాయికముగా మొదటి శతాబ్ది ఉత్తరార్థమునాటివో లేక రెండవ శతాబ్ది తొలికాలపువో కావచ్చు ననుటకు అవకాశము కలదు. ఎన్. కె. (V)–(IV) అను స్థములలో లభించిన స్మారక స్తంభ ('ఛాయాస్తంభ') శాసనము అందలి లిపిని, భాషనుబట్టి చూడగా ఇక్ష్వాకు వంశజులనాటి శాస నములకంటె పూర్వపుదని చెప్పదగి యున్నది. ఇది ఇక్కడి యుద్ధరంగములో హతుడైన కులహక కులజుడైన 'చాంత మూలు'డను నొక వీరుని పేర్కొనుచున్నది. యుద్ధ భూమిలో అతడు నేల కొరిగిన ప్రాంతముననే అతని స్మారకార్థము ఈ 'ఛాయాస్తంభ'ము నెలకొల్పబడినది. ఈ శాసనమువలన సాతవాహనులు పరిపాలించిన కడపటి సంవత్సరములలో దేశ మరాజకముగా నుండినట్లును, వారి సామంతులు, ముఖ్యముగా కులహకులును, ఇక్ష్వాకులును, ఈ ప్రాంతమున ఆధిపత్యము సంపాదించుకొనుటకు సాహస ధైర్యములతో ప్రయత్నించుచుండినట్లును ఊహించుటకు అవకాశము గల్గుచున్నది. ఎన్. కె. (XIII) అను స్థలము లోని విహార మునకు చెందిన ఒక ఆలయము (వోటివ్ ఛాంబరు) లోపల పడియున్న రెండవ శిలాస్తంభ శాసనము వలన ఇక్ష్వాకు వంశమునకు చెందిన ఒక క్రొత్త భూవరుడు–రుద్రపురుషదత్తుడును, 'బహుఫలస గోత్ర'మునకు చెందిన 'సిరివమ్మ' అను మరియొక రాజును తెలియవచ్చుచున్నారు. ఈ 'సిరివమ్మ'యే అతని పదునొకండవ రాజ్యపాలన సంవత్సరమున వీరపురుష దత్తుని కోడలును, 'ఎహువుల చాంతమూలు'ని భార్యయు, రుద్రపురుషదత్తుని జననియు అయిన రాణి మహాదేవి గౌరవార్థము ఈ ఛాయాస్తంభమును ప్రతిష్ఠించినట్లు ఊహింపబడుచున్నది. ఈ రాణి మహాదేవి మహాక్షత్రపుని కూతురని చెప్పబడినది. ఈ మహాక్షత్రపుడు ఉజ్జయినిని పరిపాలించిన సమకాలిక రాజవంశమునకు సంబంధించినవాడై యుండవచ్చును. 'బహుఫలసగోత్ర'మును 'బృహత్ఫలాయనగోత్ర'మును ఒకటియే యైనచో ఇక్ష్వాకుల తరువాత బృహత్ఫలాయనులు ఈ ప్రాంతమును పరిపాలించి రగుట వాస్తవమునకు దూరము కాదు. గుంటూరుజిల్లా తెనాలి తాలూకా కొండముది గ్రామమున దొరికిన తామ్రశాసనమువలన మన కిదివరకే బృహత్ఫలాయన గోత్రుడైన జయవర్మ మహారాజొకడు తెలియవచ్చినాడు. ఈ శాసనమును ప్రకటించిన హుల్ష్ పండితుడు ఈ శాసనమునందలి లిపి ననుసరించి మైదవోలు తామ్రశాసనము నొసగిన పల్లవ మహారాజు శివస్కందవర్మ యుండిన కాలములోనే ఈతడును ఉండవలయునని వ్రాసియున్నాడు. డాక్టర్ డి. సి. సర్కారుగారు ఈ జయవర్మ మహారాజు మూడవ శతాబ్ది అంత్యవత్సరములలోనో, నాలుగవ శతాబ్ది ప్రారంభముననో ఉండి యుండవలయుననుచున్నారు. ఆ కొండముది శాసనము 'కొడ్డూర విజయస్కంధావార'ము నుండి అతని పదవరాజ్య సంవత్సరమున నొసంగబడినది. జయవర్మ 'మహీస్సరపాద పరిగహితు'డు (మహేశ్వరపాద పరిగ్రహీతుడు) అని వర్ణితుడైనాడు. ఇప్పు డిచట దొరకిన శాసనము ఆ వంశమునకే చెందిన మరియొకరాజు పేరు తెలిపి, ఇక్ష్వాకుల యనంతరము ఈ నాగార్జునునికొండ లోయను అతడు పరిపాలించినట్లు చెప్పుచున్నది. ఈ శాసనములో అతని పదునొకండవ రాజ్యపాలన సంవత్సర ముండుటవలన అతడు కనీసము పదునొకండు సంవత్సరములైన పరిపాలించి యుండవలెను. హిరణ్యకుల, పూగియుల, ఇతరులవలెనే బృహత్ఫలాయనులు కూడ ఇక్ష్వాకులకు సామంతులుగను, బంధువులుగను నుండిరని యూహించుట సత్యదూరము కాదు. ఇంచుమించుగా ఈ కాలమునకు కొద్దిగా తరువాతిదని చెప్పదగిన (ఎన్. కె. VII స్థలములో దొరకిన) శిలాశాసనము వలనను, (ఎన్. కె. XIII స్థలములోను, ఇతర స్థలములందును దొరకిన) దాదాపు అదేకాలమునాటి కొద్దిపాటి చిన్న శిలాశాసనములవలనను బౌద్ధమతము ఇక్కడ అధమము క్రీ. శ. 4 వ శతాబ్ది మధ్యకాలము వరకు ఉండినట్లు విదితమగుచున్నది. ఈ శాసనములు ప్రాకృతభాషలో నున్నవి. పూర్వ మిచట విశ్వవిద్యాలయ ముండిన స్థలములో దొరకిన సంస్కృతభాషా శాసనము క్రీ. శ. 5 వ శతాబ్ది నాటిది కావచ్చును. ఈ శాసనము గొప్ప విద్వాంసుడైన ఒక ధర్మకథికుని పేర్కొనుచున్నది. ప్రాయికముగ నితడు విశ్వవిద్యాలయ ఆచార్య సంఘమునకు చెందినవాడు కావచ్చును. ఈ సంస్కృత భాషా శాసనము ఇక్కడ బౌద్ధ విహారములు నాలుగవ శతాబ్ది తరువాత కూడ ఉచ్చదశలో నుండినట్లు సూచించుచున్నది. మరొక రెండు సంస్కృత భాషాశాసనములు–ఒకటి ఇక్ష్వాకు రాజన్యుడైన 'ఎహువుల చాంతమూలు'ని పదునారవ రాజ్య సంవత్సరమునాటిది; రెండవది ఆరాజు ఇరువది నాల్గవ రాజ్య సంవత్సరమునాటిది – బయలుపడినవి. మొదటి శాసనమువలన ఇక్ష్వాకు వంశమునందలి

ఒక క్రొత్త రాజు అయిదవ యతడు - రెండవ వీరపురుష దత్తుడు - తెలియవచ్చుచున్నాడు. ఇతడు 'ఎహువులచాంత మూలు'ని కుమారుడు. ఇతని రాణిపేరు 'కుపణసిరి'. ఇతడు ఇదివరలో నుడివిన రుద్రపురుషదత్తమహారాజు సోదరుడే. పుష్పభద్రస్వామి అనుపేర మహాదేవునికి ఒక దేవాలయమును నిర్మించి అందు ధ్వజస్తంభమును ప్రతిష్ఠించి నట్లును, దేవాలయములోని పూజాదికముల నిమిత్తము ఒక గ్రామము దానముచేసినట్లును తెలుపుటకే పూర్వోక్త శాసనము పుట్టినది. రెండవ శాసనము బుద్ధ చైత్యములోని శిల్పాలంకృత శిలాబంధము(ఫ్రీజ్) మీద చెక్కియున్నది. ఇది కుమారనంది అను శ్రేష్ఠి యొకడు చైత్యములో బుద్ధవిగ్రహ మొకటి ప్రతిష్ఠ చేసినట్లు తెలుపుచున్నది.

ఈ నాగార్జున కొండ లోయలో ఇదివరలో దొరకిన ఆయక స్తంభ శాసనములవలన ఇచట 'అపర మహావిన సేలియు'ల, 'మహిశాసకు'ల, 'బహుశ్రుతీయు'ల వంటి వేరు వేరు బౌద్ధ సంప్రదాయములవారు ఉండినట్లు తెలిసినది. ఎ౯. కె. V - VI అను స్థలములలో ప్రస్తుతము జరగిన త్రవ్వటములలో దొరకిన బుద్ధ పాద శిలాఫలకము మీద చెక్కిన శాసనము వలన థేరవాదమునకు చెందిన మరియొక సంప్రదాయము వారు విభజ్యావాదుల పేరు కూడ తెలియవచ్చుచున్నది. మౌర్య అశోకచక్రవర్తి అభిమానించిన బౌద్ధ సంప్రదాయ మిది. ఈ శాసనము నందలి లిపి సరిగా ఇక్ష్వాకు శాసన లిపిని బోలి యుండుటచే ఇది క్రీ. శ. 3 వ శతాబ్దినాటిదని యూహింప దగి యున్నది. ఇందువలన ఈ నాగార్జున కొండలో మహాయాన బౌద్ధ సంప్రదాయములతోపాటు థేరవాద బౌద్ధ సంప్రదాయములు కూడ ప్రక్క ప్రక్కనే వర్ధిల్లు చుండినట్లు విదితమగుచున్నది.

ఇటీవల ఈ నాగార్జున కొండలో దొరకిన ప్రముఖము లైన నూతన విషయములలో హారీతి దేవాలయ మొకటి. రెండవది ప్రేక్షకులు లేదా శ్రోతలు కూర్చుండుటకు అనువుగా చుట్టు నాలుగువైపుల అంతరువులుగ అమర్చిన ఆసనములుగల దీర్ఘచతురస్ర ప్రాంగణము (స్టేడియమ్). స్థానికముగ ఫిరంగులబోడు అనబడు గుట్ట ననుసరించి దిగువ త్రవ్విన త్రవ్వటములలో 56′ 3″లు పొడుగు, 47′ 3″లు వెడల్పు గలిగిన ఈ దీర్ఘచతురస్ర ప్రాంగణము బయలు పడినది. దీనికి నాలుగు వైపుల ప్రేక్షకులు లేక శ్రోతలు కూర్చుం డుటకై ఇటికతో ఒకదానికంటె ఒకటి వెనుకకు వెనుకకు మెట్లుగా ఎత్తుగా కట్టి కడపరాతి పలకలు పరచిన ఆసన ముల వరుసలు గల ఏర్పా టున్నది. ఇది ప్రాయికముగా విద్యార్థులు సమావేశమగు సభారంగము కావచ్చును. ఈ రంగమునందు నైరృతిమూలగా ఎత్తైన శిలాపీఠము - ప్రధానవక్త నిమిత్తము, ఈ సంఘారామమును దర్శింప వచ్చినవారినిమిత్తము - ఏర్పాటు చేయబడినది. ఈ రంగ స్థలము ఆరబయలుగ నుండుటచేశ దీనిలో కురిసిన వర్ష మంతయు వెలుపలికి పోవుటకు ఆ దిశనే ఒక పెద్ద తూము గలదు. ఈ దీర్ఘ చతురస్రపు ప్రాంగణ మధ్యమునందు ఒక గుండ్రని స్తంభసదృశ వేదికాభాగ మున్నది. దీనిమీద వక్త నిలువంబడి సభికులకు ఉపన్యసించుచుండి యుండ వచ్చును. ఈ శిలాపీఠములలో ఒకదానిమీద త్రిరత్న సంకేత మును, ధనుర్బాణపు గుర్తులును ఉన్నవి. ఇతరములమీద 'కామశర', 'ధనకస ఆసన' అను శాసనము లున్నవి.

ఈ సభా రంగస్థలమును గురించిన కడు విచిత్రమైనలక్షణము ఇచటి ధ్వని సంబంధమైన అద్భుతము. ఈ దీర్ఘచతురస్రప్రాంగణ మధ్యమున నిలుచుండి వక్త ఉపన్యసించినచో అతని కంఠధ్వని స్పష్టముగా 200 అడుగుల దూరమువరకు వినబడును. ఇంతేకాదు, ఆసనపంక్తి అంతకంతకు ఎత్తగుచు వచ్చినకొలది ఆ ధ్వని మరింత స్పష్టము, స్పష్టతరము నగు చుండును. స్వాభావికమైన చుట్టుపట్ల పరిసరములను ఆధారముగ తీసికొని ఏ తద్రంగస్థల నిర్మాత ఈ యత్యద్భుత విషయమును సాధించియుండును. గుట్టమీద ముందు వైపున కున్న గనిమమీద హారీతిదేవాలయ మున్నది.

నదీతీర ప్రదేశములో త్రవ్వగా బయల్పడినవానిలో చూడదగ్గ మరొక అద్భుత నిర్మాణము అన్నివైపుల మెట్లతో కూడి ఇటికతో నిర్మితమైన ఒక పెద్ద సభా (క్రీడా) రంగస్థలము. సుమారు 346 అడుగుల పొడవున, 322 అడుగుల వెడల్పున దీర్ఘ చతురస్రాకారములో ఇటికలతో నిర్మించిన సోపాన పంక్తుల వరుసలు గల ఈ నిర్మాణము చూడ సొంపుగ నున్నది. పశ్చిమదిశనున్న సోపాన పంక్తుల మధ్యమున ఎత్తైన మండపవేదిక కలదు. ప్రాయశః చక్రవర్తి, తదితర ప్రముఖ రాజకీయోద్యోగులు, రాణివాస స్త్రీలు ఇందు కూర్చొని వినోదములను తిలకించుచుండెడివారేమో. ఈ త్రవ్వటములలో దేవీ విగ్రహము యొక్క మొండె మొకటి ఇక్కడ దొరకినది. ఇది ప్రాయికముగ కార్తికేయస్వామి దేవీ విగ్రహమునకు చెందినది కావచ్చును.

దక్షిణముగా సుమారు 200 గజముల దూరమున చలువ రాతి స్తంభములతో నిర్మింపబడిన ముఖమంటపమును, ఇటికతో గజపృష్ఠాకృతిని మూడు ఆలయములును గల దేవాయతన మొకటి బయలుపడినది. ఈ యాలయమందలి స్తంభములమీద శాలిహుండములోను, ఘంటశాలలోను,







చిత్రము 3. మృగదావ ప్రథమ ధర్మోపదేశము, నాగార్జునకొండ



చిత్రము 4. గౌతముని ఉష్ణీషము స్వర్గమునకు గొనిపోబడుట, నాగార్జునకొండ



చిత్రము 1. ఇంద్రశైలగుహలో శక్రుడు బుద్ధుని దర్శించి మరలుట.



చిత్రము 2. శక్ర, పంచశిఖులు బుద్ధుని దరిశించుట



చిత్రము 3. అష్టమంగళశోభిత బుద్ధపాదద్వయము



చిత్రము 4. ఛన్నుడు సిద్ధార్థమహాభినిష్క్రమణమును శుద్ధోదనున కెఱిగించుట

జగ్గయ్యపేటలోను కానవచ్చిన శాసనములవంటి శంఖ లిపి శాసనములు శిథిలమైనవి ఉన్నవి. ఈ యాలయమునకు దక్షిణముగా రెండు ఫర్లాంగుల దూరమున మరొక స్తంభాలంకృత భవనమును, శిలా విగ్రహముల మొండె ములును, కార్తికేయ విగ్రహము శిరస్సును దొరకి నవి. వీనిలో ఒక అడుగు పది అంగుళముల ఎత్తున సమభంగములో నిలుచుండి యున్న కార్తికేయ విగ్రహ మొకటి, నదీతీర ప్రదేశమున కార్తికేయ విగ్రహములు ఆలయములును, దాని కించుక దూరమున లోపల సక్ర మములైన దేవాలయములు ఎక్కువగ కానవచ్చుటచేత ఇక్ష్వాకుల కాలములో కార్తికేయారాధనము ఎక్కువగ నుండెనని, ఇక్ష్వాకులకు కార్తికేయస్వామి ముఖ్యదైవ మని విదితమగు చున్నది. ఈ కార్తికేయారాధనము తరువాతి కాలమున వచ్చిన చాళుక్యులనాడు కూడ నుండెను. చాళుక్యుల తొలి కర్మ రంగముకూడ విజయపురి యని ఇక్కడి శాసనములవలన స్పష్టమగుచున్నది.

కందక ప్రాకారావృతమైన కోట ప్రదేశమునందలి దాదాపు మధ్య భాగమున ప్రత్యేక వైదిక కర్మకాండ కుపయోగించు నిర్మాణములు కలవు వీనిలో ముఖ్య మైనది అశ్వమేధయాగశాల. దీనికి సంబంధించిన కట్టడ ములు అయిదారు గలవు : (1) కూర్మాకారమున నుండు హోమగుండము ; (2) ఆహవనీయాగ్నికి ఉపయోగించు కట్టడములు ; (3) అవభృథ స్నానఘట్టము ; (4) స్నాన ఘట్టమునుండి పోవు కాలువలు ; (5) ఉపసంవేశనస్థలము ; (6) యాగమున కుపయోగించు సామగ్రి నుంచు గది — మొదలగునవి.

కూర్మాకారముగ నుండు హోమగుండము. ఇది ఇటిక లతో వింతయైన ఆకృతిలో కట్టబడినది. ఇది దగ్గర దగ్గరగా కూర్మమును బోలియుండును గాన ఇది కూర్మచితి యని యూహించవచ్చును. ఇది యిసుక సున్నముతో గచ్చు చేయబడినది. దీనికి పడుమటి దిక్కున ఒక కాలువ గలదు. ఇది బహుశఃయాగము చేయునపుడు పవిత్ర జలము, ఆజ్యము పోవు మార్గము. దీనిలో రెండంతస్తులు గలవు. మొదటిది మొదటి అశ్వమేధయాగమునకు, రెండవది రెండవ ఆశ్వమేధయాగమునకు ఉపయోగింపబడిన వేది కలై యుండవచ్చును. దీని పొడవు 18 అడుగులు, వెడల్పు 12 అడుగులు, లోతు $4\frac{1}{4}$ అడుగులు.

ఆహవనీయాగ్నుల కుపయోగించు కట్టడములు కూర్మ చితికి ప్రాగ్దిశగా చతురస్రాకారమున నున్నవి. వీనియం దగ్నిని జ్వలింపజేసి యాగపరిసమాప్తివరకు అవిచ్ఛిన్న ముగా నుంచుట కవసరమైనవి.

అవభృథస్నాన ఘట్టము : ఇది ఇచటి కట్టడము లన్నిటి లోను పెద్దది. 27 అడుగుల చతురము. ఇది చిన్న కృత్రిమ సరస్సుగా కనిపించును. ఇది పురుష ప్రమాణముగనుక 6 అడుగుల లో తున్నది. నాలుగు దిశలనుండి దిగుటకు, ఇరువైపుల మధ్యనుండి పర్యవేక్షణ వేదికనుండి క్రిందికి దిగుటకు మెట్లున్నవి. దీనికి వాయవ్యముగా పైన ఒక తూము గలదు. ఈ తూమువరకు నీటితో నింపుదురు. యజమానులు స్నానమునకు దిగునపుడు పవిత్రజలము ఈ తూముద్వారా నదిలోనికి బోవును. ఈ తూము నాప రాతితో తొలువబడినది.

స్నాన ఘట్టమునుండి పోవు కాలువలు రెండు : అవి రెండును అవభృథ స్నాన ఘట్టమున నుండు తూముతో చేర్చబడి యున్నవి. ఇవి దగ్గర దగ్గరగా ఒక యడుగు వెడల్పుగల తూములు. ఇవి ఇటికలతో కట్టి సున్నముతో గచ్చు చేయబడినవి. ఒక కాలువ పైభాగము చలువ రాతితో మూయబడి యున్నది. రెండవదిగూడ అటులనే మూయబడి యున్నదని యూహించవచ్చును. వీనినిబట్టి గూడ రెండు అశ్వమేధయాగములు జరగియుండవచ్చునని యూహింపవచ్చును.

అశ్వమును భూస్థాపన చేసిన ప్రదేశము కూర్మచితికి దక్షిణముగా సుమారు 30 అడుగుల దూరమున కలదు. అశ్వాస్థిపంజరమునకు ఎగువను రెండు మూడు మెట్లు గలవు. ఇవి పర్యవేక్షణ వేదికగా నుపయోగింపబడి యుండవచ్చును. ఈ యస్థిపంజరము విచిత్రాకృతిలో నున్నది. శిరమును వాల్చిన విగతజీవియొక్క ఎముకలు అట్లే గోడకు అంటుకొని పోయినవి. ఈ ప్రదేశమున విచ్ఛిన్నమైన అనేక రకములగు జంతువులయొక్క ఎము కలు గలవు. దీనినిబట్టి అశ్వముతోపాటు పలురకములైన జంతువులను భూస్థాపితము చేసి యుండవచ్చునని యూహింపబడుచున్నది.

యాగమున కుపయోగించు సామగ్రి నుంచుటకు అవ భృథస్నానఘట్టమునకు ప్రక్కనే ఒక గది యున్నది, ఇది బహుశః స్రుక్కు, స్రువము, ఆజ్యము మొదలగునవి యుంచుటకును, రాణులు విశ్రమించుటకును ఉపయోగ పడి యుండునని యూహింపవచ్చును.

ఈ యాగము చేసిన ప్రదేశ మంతయు బూడిద, కాలి పోయిన మేకులు, ఇనుపకత్తులు, పలురకములైన పెంకులు, చిన్న చిన్న పిడతలు మొదలయినవి బయటపడినవి.

నాగార్జునుని కొండలో శిలాశాసనములనుబట్టి ఇక్ష్వాకు రాజులైన 'చాంతమూలు'డు ఒక అశ్వమేధయాగమే గాక అగ్నిష్టోమము, వాజపేయము, అగ్నిహోత్రము

మొదలగు వైదిక క్రతువులు గూడ చేసెనని తెలియుచున్నది. ఇక్ష్వాకురాజుల అవరోధజనము బౌద్ధమతాసక్తులు అయినప్పటికి రాజులు అనాది హిందూ వైదిక సంప్రదాయావలంబకులే యని తెలియుచున్నది.

చారిత్రికపు యుగమునాటి ప్రాథమిక నాగరికత యటుండ ఈ లోయలోని అనేక ప్రదేశములలో చరిత్ర పూర్వయుగపు మానవుని శిథిలవస్తు విశేషములు కూడ కానవచ్చుచున్నవి. ప్రాచీన శిలాయుగపు పనిముట్లు - కాలము గడిచినకొలది ఏయే దశలలో నెటువంటి మార్పులు పొందుచు వచ్చినవో ఆ యన్ని దశలనాటివియు- భూమి ఉపరిభాగమునను, కొన్ని నది గండ్లలోను దొరకుచున్నవి.

ఇచ్చటి నూతన శిలాయుగ ప్రదేశము ప్రాచీన శిలాయుగ ప్రదేశమునకంటె చాల పరిమితమైనది. అయినను ఈ ప్రదేశమున నూతన శిలాయుగమునాటి జనులనుగురించి తెలిసికొనుటకు సాధన సామగ్రి బాగుగా లభించుచున్నది. నునుపు చేసిన రాతి పనిముట్లతోపాటు (పిడులులేని రాతి గొడ్డళ్ళు, ఉలులు, సూదిమొనవంటి రాతి పనిముట్లు మొదలైనవి) మెరుగుపెట్టిన బూడిదరంగు నూతన శిలాయుగపు కుండ సామగ్రి, శిశువును లోపల పెట్టి స్థాపితము చేసిన ఒక ఎత్తైన సమాధి బానయు, రాగిముక్కలు, బంకపూసలు, జంతువు ఎముకలు (దున్నపోతువి) - ఇవి యన్నియు నిచ్చట బయలుపడినవి. దీనికి నైరృతి దిశగా అరమైలు దూరమున నూతన శిలాయుగమునాటి సమాధిస్థల మొకటి కనిపించినది. ఇవికాక తరువాతి కాలమునాటి పెద్ద పెద్ద శిలలలో నిర్మింపబడిన (మెగాలిథిక్) సమాధి గోతులలో అతుకులు విడిపోయిన ఆరు కంకాళములు నాటి కుండ సామగ్రితో కలిసి కనిపించినవి.

త్రవ్వటములలో ఫిరంగులబోడు, ఎద్దనబోడుల మొదళ్ల చిన్న చిన్న శిలాయుగపు పనిముట్లు (మైక్రోలిత్స్) ఎక్కువగా దొరుకుటచే ఆపరిశ్రమ ఇచట అభివృద్ధిలో నుండెనని యూహించుట కవకాశము కలదు. ఈ లోయ యొక్క నైసర్గిక స్వరూపము, ముడి సామగ్రి అధికముగ లభించుట - ఇవి చరిత్ర పూర్వయుగపు మానవుడు తన నివాసమునకు ఈ స్థలము అనువైనదని ఎన్నుకొనుటకు తోడ్పడి యుండును.

ఇంతవరకు ఇచట రెండు మహాశిలా (మెగాలిథిక్) సమాధులు తెరువబడి పరిశోధితములైనవి. ఒకటి గొయ్యి త్రవ్వి గోతిలో శవ పేటిక నుంచిన సమాధిరకమునకు చెందినది; రెండవది శిలావలయపు రకమునకు మాత్రమే చెందినది. మొదటి దానిలో పేటిక లోపల మూడు పుర్రెలు, ఇతర మాన వాస్థికలును, వెలుపల నలుపు ఎరుపు కుండసామగ్రి, ఇనుప పనిముట్లును కనిపించినవి. రెండవ దానిలో ఇనుప పని ముట్లును, మహాశిలాయుగమునకు చెందిన కుండ సామగ్రితో కొద్దిపాటి అస్థ్యవశేషములును కనిపించినవి.

ఈ లోయలో దొరకిన ప్రాచీన వస్తుసామగ్రిలో, నాణెములు, పూసలు, మట్టిబొమ్మలు, రాగి ఇనుప వస్తువులు, గచ్చుబొమ్మలు, — కొన్నిటిమీద రంగులతో కల్పన లున్నవి — బంగారు ఆభరణములు గలవు. నాణెములలో రెండు రోమనుచక్రవర్తులవి. వీనిలో నొకటి క్రీ. శ. 16 మొదలు 37 వరకు పాలించిన టైబీరియస్ చక్రవర్తిది. రెండవది ఫాస్టినాది (ది ఎల్డర్). ఇది క్రీ. శ. 141 తరువాత చలా మణిలోనికి వచ్చినది. ఇతర నాణెములలో సీసపువి గలవు. ఇవి యన్నియు సాతవాహన చక్రవర్తుల నాటివి. వీటిమీద పులోమావి, యజ్ఞశాతకర్ణి, చాంతమూల, వీర పురుషదత్త రాజుల పేర్లు గలవు. ఇచట మధ్యయుగము నాటి విజయనగరాధీశ్వరుడు రెండవ హరిహరరాయల రెండు చిన్న వెండినాణెములు, ఒకబంగారు నాణెము కూడ దొరకినవి.

రా. సు.

**నాగార్జునాచార్యుడు** (బౌద్ధుడు) (క్రీ. పూ. 15 - క్రీ. శ. 75): దక్షిణాపథమున గల వేదలియను గ్రామమున మహాయశస్వి, సదసత్పక్షదారకుడునగు నాగార్జునుడు జన్మించెనని లంకావతారమున గల సగాథకాధ్యాయమున (165) చెప్పబడినది. కొందరు టిబెట్ దేశీయులు వేదలి శబ్దమును వేదర్భగా మార్చి విదర్భయను అర్థమును చెప్పినారు. ఈ మాటల నాధారము చేసికొని నాగార్జునుడు విదర్భ దేశీయుడని, రామటెక్ ప్రాంతమందలి కొండలలో నాగార్జునుని విహారములు గలవని కొందరనుచున్నారు. దీనితో పాటు యువాన్ చ్వాంగ్ వ్రాతలననుసరించి దక్షిణకోసలమున నాగార్జునునకు విహారము నిర్మింపబడినదని, ఇది నేటి రామటెక్ ప్రాంతమని కూడ చెప్పుచున్నారు. ఈ వాదము నిరాధారము.

నాగార్జునుడు వేదలి యను గ్రామమున జన్మించినాడు. పల్నాడులో వేదలి యను గ్రామ ముండెడిదని తెలియవచ్చుచున్నది. విదర్భకు దక్షిణమున ఆంధ్రదేశములో నాగార్జును డొక బ్రాహ్మణ కుటుంబమున జన్మించెనని 'పగ్ సంజాన్ జంగ్' అను టిబెట్ చరిత్రలో కలదు. ఏడవ యేట సరహుడను బౌద్ధుని దర్శన మీతనికి లభించెనట. నాగార్జునుని గురువు సరహుడని, రాహులుడని, అశ్వఘోషుడని చెప్పుగాథలేగాక వీరు నాగార్జునుని శిష్యులని పల్కు కథలుకూడ గలవు. ఇతర గాథలలో సింహభద్రు

ఉీతని గురువని తెలియవచ్చుచున్నది. ఎనిమిదవ యేట ఇతడు సింహభద్రునివద్ద సర్వాస్తివాద బౌద్ధమును పఠింపసాగెను ; తర్వాత శ్రావకుడుగా మారి శ్రీ ప్రజ్ఞాధరుడని పేరొందెను ; బౌద్ధ సంఘమునకు పదమూడవ అచార్యుడైననాటినుండి నాగార్జునుడను పేరుతో వ్యవహరింపబడినాడు.

మహావాలుక యను ఉపనదియొక్క ఉత్తరపు ఒడ్డున గల సుందరభూతి గ్రామమునకు దగ్గరగా నాగార్జునుడు జన్మించెనని బుస్తోన్ వ్రాసిన చరిత్రలో గలదు. ఆ కాలమున అంతి వాహనుడని, ఉదయన భద్రుడని పిలువబడు రాజు శ్రీ పర్వత ప్రాంతము నేలెనని, అతని తర్వాత శక్తిమంతుడు రాజ్యమునకు వచ్చెననిగూడ కలదు. ఈ రాజుల పేర్లు మన కితరత్ర కన్పించవు. కాని మహావాలుక కృష్ణ యొక్క ఉపనది గానచ్చును.

నాగార్జునుడు సాతవాహనుల సమకాలికుడు; ఒక సాతవాహన చక్రవర్తికి ఉపదేశము నొసగుచు 'సుహృల్లేఖ'ను వ్రాసినాడు. ఇదే రాజునకు 'రత్నావళి'ని గూడ లేఖగా పంపినాడని అజితమిత్రు డను రత్నావళీ వ్యాఖ్యాత చెప్పినాడు. క్షత్రప నహపానునకు, మొదటి కనిష్కునకు సమకాలికు డీ సాతవాహన చక్రవర్తియని, ఇతడు క్రీ. శ. 124 ప్రాంతము వాడని 'లెవీ' పండితుని వాదము. హుష్క, జుష్క, కనిష్కులు కాశ్మీరము నేలు కాలమున నాగార్జునుడు గలడని రాజతరంగిణివలన తెలియుచున్నది(1-173).

నాగార్జునుని శిష్యుడైన సాతవాహన చక్రవర్తి దక్షిణ కోసలమునకు దక్షిణముగా నొక విహారమును కట్టించెనని, ఈ చక్రవర్తి భక్తి శ్రద్ధలతో నాగార్జునుని గౌరవించెడివాడని, ఈ విహారమున కేబదిమైళ్ళ దూరమున భ్రమరగిరియందు మహాచైత్యమును నాగార్జునునకు ఏర్పాటుచేసెనని యువాన్‌చ్వాంగ్ వ్రాసినాడు. శ్రీపర్వతమని, భ్రమరగిరి యని పిలువబడు కొండ పల్నాడులో నేడు గల నాగార్జున కొండయే. ఈ కొండలచాలు నల్లని తుమ్మెదల బారువలె ఉండుటచేత ఇది నల్లమల కొండలని తెనుగున, భ్రమరగిరి యని సంస్కృతమున వ్యవహరింపబడినది. ఈ శ్రీ పర్వతమున నాగార్జునుడు చాల సంవత్సరములు గడపెనని తారానాథుడు కూడ చెప్పినాడు,

నాగార్జున కొండగల ప్రదేశమున ఇక్ష్వాకుల రాజధాని యగు విజయపురి ఉండెడిది. ఇచటగల మహాచైత్య నిర్మాణము నాగార్జునునికై గావింపబడినది. దీనికి దగ్గరగా పూర్వశైల, అపరశైల చైత్యములు గలవు. మహాయానమునకు దారి చూపిన 'మహాసాంఘికు'లలో 'అంధకు'లు గలరు. ఈ 'అంధకు'లలో పూర్వశైలీయులని, అపర శైలీయులని, మహాచైత్యకులని భిన్న వర్గములు గలవు. ఈశైలములవద్ద గల మహావనము మంజుశ్రీ బోధి సత్త్వుని నివాసభూమి. ఈ మంజుశ్రీ బెజవాడలోని ఇంద్రకీల పర్వమున నుండెడివాడని చంద్రకీర్తి వ్రాసిన 'మాధ్యమిక వృత్తి 'లో ఉదాహృతమైన' మారదమన సూత్ర 'ము వలన తెలియవచ్చుచున్నది (పుట 107). నాగార్జునుడు బయట పెట్టిన 'పారమితా సూత్ర 'ములలోనే మనకు మంజుశ్రీ మొదటిసారి కనిపించుచున్నాడు. ఇంద్రకీల పర్వతమున నాగార్జునుడు తపస్సు చేయుటచే, తర్వాతివారు ఇచట అర్జునుడు తపస్సుచేసినాడని చెప్పసాగినారు. ఇచటి కనకదుర్గయే ఆనాటి కుమారి మంజుశ్రీ కావచ్చును.

నాగార్జునుని కొండవద్దగల మహాచైత్య నిర్మాణమున మహాసాంఘికుడగు ఆనందుడు చాలసహాయము చేసినాడు. 'పారమిత 'లలో కన్పించు ఆనందు డితడేమో అను సందేహము కలుగక మానదు. నాగార్జునుని ప్రశిష్యుడు, జయప్రభాచార్యుని శిష్యుడునగు చంద్రప్రభ బుద్ధుని విగ్రహమును ప్రతిష్ఠించెనని జగ్గయ్యపేటలోని శాసనమువలన తెలియుచున్నది. అమరావతీ స్తూప నిర్మాతలలో కూడ నాగార్జునుడు కన్పించుచున్నాడు. 'వినయసూత్ర'ములను ధిక్కరించిన ఎనిమిదివేల భిక్షువులను, శ్రమణకులను బహిష్కరించిన నాగార్జునుని కాలమున ఆంధ్రదేశమందే విజ్ఞానవాద మొకటి బయలుదేరెనని గూడ వినుచున్నాము.

నాగార్జునుని శిష్యుడగు సాతవాహనుని పేరు షియెన్ తేక లేక షన్‌తేక అని, అతని వంశనామము; షతోపొహన్న అని ఇట్సింగ్ వ్రాసినాడు. షతొపోహన్న శబ్దము సాతవాహన శబ్దమే. ఈ రాజునకు శంకర, జేతక, ఉదయన, శాంతివాహనాది నామములను భోటదేశీయు లిచ్చినారు. 'లీలావతీ పరిణయ'మను ప్రాకృత కావ్యమున (శ్లో 1018, 1019) హాల సాతవాహనుని గురువుగను, మహామాత్యుడుగను నాగార్జునాచార్యుడు గలడని తెలియుచున్నది. హాలుని తర్వాత వచ్చిన కుంతలక శాతకర్ణి కాలమునగల వాత్స్యాయనుడు తన న్యాయభాష్యములో నాగార్జునుని 'విగ్రహ వ్యావర్తని'లోని వాక్యముల నుదాహరించి, విమర్శించి యున్నాడు. కావున హాలుని కాలముననే (క్రీ. శ. 11 నుండి 16 వరకు) నాగార్జునుని ప్రధాన గ్రంథములు వచ్చినవని చెప్పవచ్చును. హాల, కుంతలకుల తర్వాత క్షత్రపులతో సాతవాహనులకు వివాదములు బయలు దేరినవి. మరల నహపానాది క్షత్రపుల నోడించిన సాతవాహన చక్రవర్తి బాలశ్రీ కుమారుడగు గౌతమీపుత్ర శాతకర్ణి (క్రీ. శ. 71 - 95). గౌతమీ

పుత్రుని కాలమునాటికి నాగార్జునుడు వృద్ధుడైనాడు. ఈ గౌతమీపుత్రుని ఉద్దేశించియే నాగార్జునుడు సుహృల్లేఖను, రత్నావళిని చెప్పినాడు.

రత్నావళిలో రాజునకు ధర్మోపదేశము గావింపబడినది. బౌద్ధమత విరోధులు కొందరు చేరి రాజును నాస్తికునిగా జేసి, ధర్మమార్గమునుండి విడదీయనెంచెదరని, అట్టి ముఖ స్తుతులకు లొంగరాదని (1-57, 77), ధర్మపరిజ్ఞానము లేకపోవుట దుర్గతి హేతువని (2-22), హితమును జెప్పువారు కొద్దిమంది మాత్రమే గలరని (2-41), మహాయానమును ద్వేషించువారు ద్వేషముననే దహింపబడువారని (4-70) పరిపరి విధముల జెప్పినాడు. ఈ రాజు నాగార్జునుని మాటలను లెక్కచేయలేదని, మహాయానమునకు ప్రతికూలముగా కూడ వర్తింపసాగెనని ఈ లేఖల వలన తెలియుచున్నది. ఇట్టి రాజు గౌతమీపుత్ర శాతకర్ణియే; ఏక బ్రాహ్మణుడనని, సాతవాహన గౌరవ పునరుద్ధారకుడనని చెప్పికొనినాడు. తల్లి బాలశ్రీ ఆజ్ఞప్రకారము ప్రవర్తించిన గౌతమీ పుత్రునకు చేసిన ధర్మోపదేశము నాగార్జునుని అంత్యకాలము నాటిది. కావున నాగార్జునుడు క్రీస్తు తర్వాత మొదటి శతాబ్దమున ఆంధ్రదేశమున గలడని స్పష్టముగా చెప్పవచ్చును.

మహానాగుని ప్రాసాదమునుంచి మహాయాన సూత్రములను తెచ్చుటచే నితడు నాగార్జును డనంబడినాడు. ఈ మహానాగుడు శ్రీకాకుళ ప్రాంతమువాడు. కృష్ణానదిని దాటి నాగవంశీయులున్న శ్రీకాకుళమునుండి ఈ గ్రంథములను తెచ్చుటచే నితడు సముద్రములోనికి బోయి అచటి మహానాగులవద్ద వీటిని గ్రహించినాడని కథల నల్లినారు.

నాగార్జునుని చరిత్రను చీనాభాషలో కుమారజీవుడు (క్రీ. శ. 384-417) వ్రాసినాడు. ఒకనాడు విషాదస్థితిలో నున్న నాగార్జునుని జూచి జాలిపడిన మహానాగు డొకడు ఇతనిని సముద్రములోనికి తీసికొనిపోయెనని, అచట గల ప్రాసాదమున అమూల్యములైన సూత్రములతో నిండిన 'సప్త పిటక'ములను జూపెనని, మూడు మాసములలో నాగార్జునుడు వాటిని పఠించి అర్థము చేసికొనెనని ఈ చరిత్రలో గలదు. అప్పుడు నాగార్జునునకు సూత్రములన్నియు అవగతములైనవి. మహానాగునివద్దనుంచి ఈ సూత్రములను గ్రహించి, జంబూద్వీపమునకు తిరిగివచ్చి మహాయాన ప్రవక్తయై పదివేల గాథలతోనున్న ఉపదేశముల నొసగెనట. ఈ మహానాగులున్న దేశమును ఉద్యానమని, ఉదయనమని, ఒడియానమని, ఉరగయానమని వ్యవహరించెడివారని, ఇది ధాన్యకటకమున్న దేశమని పద్మసంభవుని చరిత్రనుబట్టి తెలియవచ్చుచున్నది.

మహానాగుని ప్రాసాదమున గల 'ప్రజ్ఞాపారమిత'లను, 'అవతంసక'మును, 'సద్ధర్మపుండరీక'మును ప్రచారములోనికి దెచ్చినవాడు నాగార్జును డను సంప్రదాయము గలదు. మాధ్యమిక కారికలలో మొట్టమొదట నాగార్జునుడు ప్రస్తుతించిన అష్టవిధములగు అభావములు 'అవతంసక సూత్ర'మున కనిపించుచున్నవి. 'శతసాహస్రికా', 'ప్రజ్ఞాపారమిత'లను నాగార్జునుడే రచించెనను శ్రావక సంప్రదాయమును తారానాథుడు హెచ్చరించినాడు. 'ప్రజ్ఞాపారమిత'లు ఆంధ్రదేశమున బయలుదేరినవని 'అష్టసాహస్రికా ప్రజ్ఞాపారమిత' (పుట 225) చెప్పుచున్నది. ఇవి మొట్టమొదట ఆంధ్రదేశమున ప్రాకృతములో వ్రాయబడి యుండెడివని చెప్పుచు, క్రీస్తు పూర్వము మొదటి శతాబ్దమున నివి బయలుదేరినవని తారానాథు డనినాడు. ఆంధ్రదేశమున కృష్ణామండలములోని శ్రీకాకుళమున నాగదేవభట్టారకు డనుబ్రాహ్మణుని వంశము పాలించుచుండెడిదని, ఈ వంశమునుండి సాతవాహనులు బయలుదేరినారని మనము వినుచున్నాము. వీరికి భట్టిప్రోలులో గల సంఘశ్రీ మొదలగు రాజులకు సన్నిహిత బాంధవ్యము లుండెడివి. సంఘశ్రీ బౌద్ధుడు. ఈ నాగవంశీయులవద్ద గల 'పారమిత' లను నాగార్జునుడు సంస్కృతీకరించి, ఇదే శైలిలో కొన్ని సూత్రములను వ్రాసి మహాయానమును ప్రచారములోనికి దెచ్చెను. నాగార్జునుని తర్వాత 'మహాయాన సూత్రము' లేవియు రాలేదని బౌద్ధ సంప్రదాయము.

'పంచవింశతి సాహస్రిక'కు 'ప్రజ్ఞాపారమితాశాస్త్ర' మను వ్యాఖ్యను వ్రాయుటయే కాక, 'శతసాహస్రిక'ను, 'సద్ధర్మ పుండరీక'మును, 'అవతంసక సూత్ర'మును రచించిన నాగార్జునుడు ఆసియా ఖండములోని ప్రజల దృక్పథమును, జీవితమును పూర్తిగా మార్చివేసినాడు. 'గండవ్యూహ', 'దశభూమికా' శాస్త్రములతో నున్న 'అవతంసక సూత్ర' మున బోధిసత్త్వ సమంతభద్రుని సృష్టించినాడు. ప్రాణులకందరకు నిర్వాణము లభించనంతవరకు తనకు నిర్వాణ మక్కరలేదని దీక్ష కట్టుకొనిన సమంతభద్రుడు చీనా, జపానులలోని మతమునకే కాక క్రైస్తవమతమునకుగూడ దారిని జూపినాడు. బుద్ధునకు మరణము లేదని చెప్పు 'సద్ధర్మపుండరీ'కము భక్తిమార్గమునకు ప్రాణభూతమై ఆసియా, యూరపు ఖండములలో నేటివరకు రూపాంతరములలో గన్పించుచున్నది. నాగార్జునుని గ్రంథములు నేటి బౌద్ధ, క్రైస్తవమతములకు పునాదులను వేసినవి.

బోధిసత్త్వ మంజుశ్రీ ఆదేశానుసారము 'అక్షయమతి నిర్దేశ సూత్ర'ము ననుసరించి మాధ్యమిక వాదమును ప్రచారములోనికి దెచ్చినవాడు నాగార్జునుడని బుస్తోన్

మొదలగు టిబెట్ దేశీయులు వ్రాసినారు. 'ప్రజ్ఞాపారమిత' లలో గల శూన్యతను నిఃస్వభావపరముగా వ్యాఖ్యానించుచు, వ్యవహారమునకు విచ్ఛేదము లేకుండ సంవృతిసత్యమని, పరమార్థసత్యమని రెండు విధముల సత్యత్వమును స్థాపించుచు శాశ్వతవాదమును, ఉచ్ఛేదవాదమును నాగార్జునుడు నిర్మూలించెను; పారమితలకు సూత్రప్రాయముగా అర్థము చెప్పుటకు మాధ్యమిక కారికలను 27 అధ్యాయములలో రచించెను; వీటిపై వాత్స్యాయనాదులు గావించిన ఆక్షేపములకు సమాధానముగా 72 కారికలలో విగ్రహవ్యావర్తనిని వ్రాసినాడు.

మాధ్యమిక కారికలు, విగ్రహవ్యావర్తని, చతుఃశతకము, రత్నావలి, మహాయానవింశిక, శతసాహస్రికా ప్రజ్ఞాపారమిత, ఉపాయ హృదయము — అను నాగార్జునుని గ్రంథములు సంస్కృతమున ముద్రితములై యున్నవి. ఇవిగాక ప్రమాణ విహేటనము, అకుతోభయము, మధ్యాంతానుగమశాస్త్రము, మహాప్రజ్ఞాపారమితాశాస్త్రము, దశభూమివిభాషాశాస్త్రము, అవతంసకసూత్రము, సద్ధర్మపుండరీకము అనునవిగూడ ఇతని రచనలే. నాగార్జునుని శిష్యుడు ఆర్యదేవుడు.

మాధ్యమికకారిక ఇరువదియేడధ్యాయముల గ్రంథము. హేతు ప్రత్యయములచే జన్మించిన ప్రతివిషయము పరతంత్రమని, స్వభావ రహితమని ప్రపంచించి, ఇట్టి జగమునకు సంవృతిసత్యతమాత్రమే గలదని వివరించినాడు; సంయోగ సమవాయాది సంబంధములు కుదరవని చెప్పుచు గమన, కర్మ, ఇంద్రియ, స్కంధ, ధాతు, ధర్మ స్వభావములను, ఆత్మకాలములను పరీక్షచేసి అజాతివాదమును నెలకొల్పినాడు; దీనిపై వచ్చిన విమర్శలకు సమాధానముగా స్వోపజ్ఞవృత్తితో 'విగ్రహవ్యావర్తని'ని రచించెను.

నాగార్జునుని మాధ్యమిక వాదములోని తర్కమే చాలవరకు గౌడపాద, శంకర, శ్రీహర్ష, చిత్సుఖ, మధుసూదనులచే స్వీకరించబడినది. ప్రా. సు. శా.

**నాగేశ్వరరావు, కాశీనాథుని** (క్రీ. శ. 1862-1938): ఆంధ్రుల జాతి జీవనములో పాలలో పంచదారవలె కలిసిపోయిన వివేకశాలి ఈయన. వీరి స్వగ్రామము కృష్ణాజిల్లా యందలి ఎలకుర్రు. వీరి తలిదండ్రులు బుచ్చయ్య, శ్యామలాంబగార్లు; గొప్ప నైష్ఠికులు, సామాన్య స్థితిపరులు. నాగేశ్వరరావుగారు బందరు హిందూ హైస్కూలులోను, గుంటూరులోని ఏ. ఇ. ఎల్. ఎమ్. కాలేజిలోను, మద్రాసు క్రిస్టియన్ కాలేజిలోను విద్య నభ్యసించిరి. వీరి సహధర్మచారిణి రామాబాయమ్మగారు. వీరికి ఒక్కతెయే కూతురు కలిగినది. ఆమె శ్రీమతి కామాక్షమ్మ.

నాగేశ్వరరావుగారు విద్యార్థి జీవితము ముగించుకొన్న పిదప తమ యదృష్టము వెదకికొనుచు భారతదేశ విశాలవిపణిఅయిన బొంబాయి నగరమును చేరి ముందుగ బొంబాయి కోట ప్రదేశములో నుండిన విలియం అండ్ కో అను యూరోపియను వ్యాపార సంస్థలో ఉద్యోగిగా చేరిరి. నాగేశ్వరరావుగారి కార్యదీక్ష వలన, వ్యాపార కౌశలమువలన ఆ కంపెనీ యజమానికి ఆయనమీదవిశేషాభిమానము గలిగి హిందూ దేశము విడిచి వెళ్ళిపోవునప్పుడు ఆ సంస్థ నాయన పరము చేసెను. అప్పటినుండి నాగేశ్వరరావుగారు నిర్విరామ దీక్షవల్ల, స్వయం కృషివల్ల వ్యాపార రంగములో వేరూనుకొనిరి. అంతకు పూర్వమునుండియే అమృతాంజనము మొదలయిన మందులు తయారుచేసి వారు వ్యాపారము సాగించుచు వచ్చిరి. అన్ని యౌషధములలోను అమృతాంజనమునకు విక్రయ మధికముగ నున్నందు వలన 1893 లో నాగేశ్వరరావుగారు తమ వ్యాపార సంస్థకు అమృతాంజనము డిపో యని పేరు పెట్టిరి. వ్యాపార మత్యంతలాభకారి యైనది.



చిత్రము 162.
కాశీనాథుని నాగేశ్వరరావు

బొంబాయినగరమునం దుండుటవలన నాగేశ్వరరావుగారిమీద కాంగ్రెసు జాతీయనాయకుల ప్రబోధ, ప్రభావము చాల పడినది. పత్రికలద్వారా మహారాష్ట్రులు చేయుచుండిన దేశసేవ, ప్రజా సామాన్యమున రాజకీయ చైతన్యము కలిగించుటకు చేయుచుండిన ప్రయత్నము వారి హృదయమునకు బాగుగా నచ్చినది. 1907 లోని సూరతు కాంగ్రెసునాటి జాతీయోద్రేకము ఆయన మనసులో పొంగులువారినది. దీని ఫలితమే ఆయన ఆంధ్రపత్రికా స్థాపనము. 1908 లో వారు ఆంధ్రపత్రికను వారపత్రికగా నెలకొల్పి నడపజొచ్చిరి. ఆంధ్రపత్రికా స్థాపనముతో వారు ఆంధ్రజాతి సేవకు, ఆంధ్ర దేశోద్ధరణమునకు కంకణము కట్టుకొనిరి. బొంబాయిలో ఆంధ్రపత్రిక పెట్టి నడపుట ఆ కాలములో బహు వ్యయ ప్రయాస సాధ్యమైన పని. అక్కడ తెలుగు ముద్రాయంత్రములు

లేవు; తెలుగు అచ్చు కూర్చువారు లేరు. అందువలన కష్ట నష్టములకు లెక్కసేయక వారు అచ్చు కూర్చువారి దగ్గర నుంచి సంపాదక వర్గమువరకు అధిక వేతనము లిచ్చి మద్రాసు, ఆంధ్ర దేశములనుండి గొనిపోయిరి. ఆంధ్రులకు ప్రత్యేకరాష్ట్రము రానిదే వారి జీవితమునకు భావి భాగ్యోదయము లేదని, అది మూడు పూవులు ఆరు కాయలుగా వికసించదని ముమ్మొదట గుర్తించి అందులకు తన పత్రికా మూలమున ప్రబోధము కావించి తొలిగా శంఖమును పూరించినవారు వీరు. తమ యౌషధముల, అందు ముఖ్యముగా అమృతాంజనము విక్రయమువలన వచ్చిన ధనమును ఆంధ్రపత్రిక నిమిత్తము, ఆంధ్ర జాతీ యాభ్యుదయము నిమిత్తము వెచ్చించిన త్యాగశీలి. ఆంధ్ర పత్రిక జాత్యభివృద్ధికి చూపని మార్గములేదు; తొక్కని మెలిపుంత లేదు. ఆంధ్రోద్యమమున కీ పత్రిక యిచ్చిన ప్రోత్సాహము, నాగేశ్వరరావుగా రిచ్చిన చేయూత ఇంతంత కాదు.

నాగేశ్వరరావుగారు 1914 లో ఆంధ్రపత్రికతోపాటు తమ నివాసమునుకూడ బొంబాయినుండి మద్రాసుకు మార్చి అంతవరకు వారపత్రికగా నుండిన ఆంధ్ర పత్రికను దినపత్రికగా మార్చిరి. మొదటి ప్రపంచ యుద్ధ ములో ఆంధ్ర దినపత్రికాభివృద్ధి హెచ్చుగా జరిగి నది. దాని వ్యాప్తి హెచ్చినది. ఆంధ్రదేశమున నాటినుండి వచ్చిన యుద్యమముల ప్రచారములో ఆంధ్ర దినపత్రిక కావించిన సేవ నిరుపమాన మయినది. అన్ని రంగములలో కృషిచేయువారికి అది దోహద మిచ్చినది. పానుగంటివారి సాక్ష్యుపన్యాసములు మొదటిమా రీ పత్రిక సారస్వతాను బంధములోనే ప్రకటితము లయినవి. తెలుగు నవ్య కవిత్వ రీతులను, విమర్శలను ఆ సారస్వతానుబంధమే ప్రోది చేసినది. దినపత్రికగ మారిననాటినుండి ఆంధ్రపత్రిక ఉగాది సంచికలు వచ్చినవి. ప్రతి తెలుగు ఉగాదికి నొక పెద్ద సంచిక - ఆంధ్ర సంస్కృతికి, ముఖ్య విదేశవిషయములకు, ఉద్యమములకు, విమర్శలకు సంబంధించిన-పెక్కు వ్యాస ములతో ప్రకటిత మయ్యెడిది. అసంఖ్యాములైన చిత్రము లతో ప్రకటితమైన ఆంధ్రపత్రిక ఉగాది సంచికలను జూచి నచో ఆంధ్రదేశములో గలిగిన పరిణామము, పురోభివృద్ధి విదితమగును.

గాంధీమహాత్ముని 1920 నాటి సహాయ నిరాకరణో ద్యమములో దిగి నాగేశ్వరరావుగారు మహాత్ముని అడుగు జాడలలో నడిచి తన సర్వస్వము నా యుద్యమాభ్యుదయ మున కర్పించి పత్రికద్వారానే కాక దేశము నలుమూలల తిరిగి ప్రచారము చేసి జాతిని మేలుకొలిపిరి. ఆంధ్ర రాష్ట్రీయ మహాసభ కధ్యక్షులుగను, పంద్రెండేండ్లు అఖిల భారత కాంగ్రెసు కమిటీలో సభ్యులుగను ఉండిరి; గుంటూ రులో 1919 లో జరిగిన ప్రత్యేకాంధ్ర మహాసభకును, రాష్ట్రీయ గ్రంథాలయాద్యనేకసభలకును అధ్యక్షత వహించిరి. హిందూస్తాన్ బ్యాంకి డైరెక్టరులలో ఆయన యొకరు. ఆయన కాలములో ఆయన ధన సహాయము చేసి చేయూత నీయని ఏ యుద్యమము లేదు. దేశముకొరకో సారస్వతము కొరకో పాటుపడుచున్నానని తన దగ్గరకు వచ్చిన ప్రతి వ్యక్తికి ఏదో యొక విధమున సాయపడిన మహనీయు డాయన. ఈ కారణముననే 1924 లో మద్రాసులో జరిగిన ఆంధ్రమహాసభ ఆయనకు దేశోద్ధారక బిరుదమును, 1929 లో బెజవాడలో జరగిన ఆంధ్రమహా సభ విశ్వదాత బిరుదము నిచ్చి గౌరవించినది.

ఆయన ఉప్పు సత్యాగ్రహము సందర్భమున కారాగార మున కేగిరి; హిందూదేశ శాసన నిర్మాణ సభకు 1935 లో సభ్యులుగా ఎన్నుకొనబడిరి.

ఆయన 1924 లో భారతీ మాసపత్రికను స్థాపించి ఆంధ్ర సాహిత్యమునకు, ప్రాచ్య పరిశోధనకు, కళలకు చేసిన సేవ గణనీయమైనది. తెలుగు చిత్రకారులు రచించిన ఆలేఖ్యము లను ప్రకటించి వారికి ప్రోత్సాహ మిచ్చినది భారతి. శాసన పరిశోధనకు, చరిత్ర పరిశోధనకు ఆలంబనమై నిలిచి నది భారతి. విలేఖకులకు ప్రతిఫలము నిచ్చు ఆచారమును దేశములో మొట్టమొదట ప్రవేశపెట్టినదియు భారతియే. భారతీ ప్రకటనముతో ఆంధ్ర సంస్కృతీ రంగము విశిష్టము, సుసంపన్నమునయినది.

నాగేశ్వరరావుగారికి కళాభిమానము మెండు. ఈయన చదువుకొనుచుండిన కాలముననే నాటకములలో వేష ములు వేయువారట. మద్రాసుకు ఆయన కాలములో వచ్చి ప్రదర్శనము లిచ్చిన ఆంధ్ర నాటక సమాజముకాని, పేరు ప్రతిష్ఠలు గడించిన నటులుకాని ఆయన సమ్మాన ప్రోత్సాహము లందకుండ వెళ్లినవా రరుదు. ఆయన కళాభిరుచికి గల ఫలమే విజయవాడలోని శ్రీ దుర్గాకళా మందిరము.

బందరులో చదువుకొనునాటినుంచి నాగేశ్వరరావు గారికి విజ్ఞాన సముపార్జనముమీద ఆసక్తి యెక్కువ. పత్రికా ప్రకటనమునను, రాజకీయవ్యాసంగమునను ఉండిన కాలములో గూడ తత్వశాస్త్రమునకు, కళకు, ఆధునిక శాస్త్రవిజ్ఞానమునకు సంబంధించి ఆంగ్లములో ప్రకటితము లైన పుస్తకము లనేకము తెప్పించి ఆయన ఆమూలాగ్ర ముగ చదివి తమకు ముఖ్యములని తోచినభాగములకడ పెన్సిలు గుర్తులు పెట్టుచుండువారు.

నాగేశ్వరరావుగారి వచన శైలికి ఒకప్రత్యేకత కలదు. అది ఆయన సొంతము. ఉగాది సంచికలలో ఆయన వ్రాసిన ప్రస్తావనలును, ఆయన రచించిన ఆంధ్రవాఙ్మయ చరిత్రయు ఇందుకు తార్కాణములు. ఆయన జీవితము చరమదశలో భగవద్గీతకు తెలుగు వ్యాఖ్యానము రచించిరి. కీ. శే. కొమర్రాజు వెంకటలక్ష్మణరావు పంతులుగారు ప్రకటించిన ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము తీసికొని యందలి ఆంధ్ర సంపుటము తయారగుచుండిన కాలముననే వారు కైలాస వాసులైరి (1938). జె. రు. శా.

**నాటకరంగము :** క్రీ. శ. 19 వ శతాబ్ది ఉత్తరార్ధమున కాని తెనుగున నాటకరచన ప్రారంభము కాలేదు. ఆధునిక వాఙ్మయవిశారదులు పెక్కు విధముల దీనికి కారణ మూహించుచున్నారు. కారణ మేదియైనను క్రీ. శ. 1860 వ సంవత్సరమునకు పూర్వము తెనుగున నాటక మున్నట్లు తోచదు. కాని ఒకరిద్దరు వ్రాసినను అవి ప్రచురణ పొందలేదు.

(1) ఆంధ్రనాటక రచయితలలో కోరాడ రామచంద్ర శాస్త్రిగారు మొదటి వారని చెప్పవలసియున్నది. వీరు 'మంజరీ మధుకరీయము' అనే నాటకాన్ని క్రీ. శ. 1860 కి పూర్వమే రచించినారని తెలుస్తున్నది. వీరు క్రీ. శ. 1880 కి పూర్వమే శాకుంతలం, ముద్రారాక్షసం, ఉత్తర రామ చరిత్ర, వేణీ సంహారం నాటకాలనుకూడా అనువదించినారు. (2) మతుకుమల్లి నృసింహకవిగారు కూడ క్రీ. శ. 1860 ప్రాంతములో శ్రీకృష్ణ జలక్రీడా మహోత్సవ మనే నాటకాన్ని రచించినారు. (3) క్రీ. శ. 1880 కి పూర్వమే మాడభూషి వెంకటాచార్య కవిగారి 'వామన' అను నాటకము వచ్చినది. పై నాటకాలు రంగస్థల ప్రచారం లేక పోవడం చేత ప్రసిద్ధికి రాలేదు. అందువల్ల 1880 కి పూర్వం మనకు ఏ కొలదిగానో నాటకా లున్నా రంగస్థలం లేకపోవడంచేత వాటికి తగు ప్రచారం జరుగలేదు.

ధార్వాడయుగము : క్రీ.శ. 1881వ సంవత్సరములో ధార్వాడ కంపెనీ అనే పేరుతో వామనభట్ట జోషి అను వారి పెత్తనముతో ఆంధ్రదేశ మంతట ఒక మహారాష్ట్ర నాటక సమాజం సంచారం చేసింది. వారి నాటక ప్రదర్శనాలు చూచి, నాటకానికి ప్రజలలోనున్న ఆదరణను గుర్తించి తెలుగువారు నాటకప్రదర్శనానికి పూనుకున్నారు. కొందరు హిందీ, కొందరు ఉర్దూ భాషలలో నాటకాలాడారు. తెనుగులోమాత్రం ఏల నాటకాలు ప్రదర్శింపరాదని కందుకూరి వీరేశలింగం పంతులుగారు తమ తెలుగు శాకుంతలమును ఆనాటి విద్యార్థులైన సోమంచి భీమశంకరం, అడవికొల్లు కనకరాజు మొదలగు వారిచే ఆ ధార్వాడ కంపెనీ వారి నాటక శాలలోనే వారి దుస్తులు, రంగాలంకరణాది పరికరాలతోనే ప్రదర్శింపించారు. తరువాత వీరు షేక్స్‌పియర్, షెరిడేన్ నాటకాలను కూడా తెనిగించి ఆడించినారు. ఇ దంతా క్రీ. శ. 1881-82 లో జరిగింది. క్రీ. శ. 1884 లో వడ్డాది సుబ్బారాయుడుగారు వేణీ సంహార నాటకాన్ని తెనిగించి తత్ప్రదర్శనంలో స్వయంగా పాత్రధారణ మొనరించారు. ఆ కాలములో సంస్కృత నాటకానువాద కవులు (1) వావిలాల వాసుదేవశాస్త్రి, (2) కొక్కొండ వెంకటరత్నం పంతులు, (3) కొండుభొట్ల సుబ్రహ్మణ్యశాస్త్రి, (4) ముడుంబై రామానుజాచార్యులు ఇత్యాదులు. వీరు వీరి నాటకాలను ధార్వాడకంపెనీవారి శాలలోనే కాక ఇతర చోట్ల కూడ ప్రదర్శింపించారు.

వీరేశలింగం పంతులుగారు ప్రజలపై నాటకముయొక్క ప్రభావాన్ని గుర్తించి వారి సంఘ సంస్కరణాభిప్రాయాలను ప్రహసనముల రూపములో రచించినారు. ఈ యభిప్రాయాన్నే విజయనగరవాసులు గురుజాడ అప్పారావు పంతులుగారు కందుకూరివారితో నాటకాలలో గ్రాంథిక భాష ఉండాలన్న విషయంలో మాత్రం ఏకీభవించక సామాన్యమైన వాడుక భాషలో క్రీ. శ. 1886 లో ఆనందగజపతి మహారాజా వారి ప్రోత్సాహంతో 'కన్యాశుల్కం' అనే నాటకాన్ని రచించారు. అది వరకున్న అనువాద నాటకరచనాచారం ఆనాటినుంచి కొత్త పోకడలతో విలసిల్లినది.

అనువాదయుగ విశిష్టత : (1) ధార్వాడవారి ఆగమనంతో క్రీ. శ. 1881 లో మనకు నాటకరంగం, నాటకం కూడ ఏర్పడుట ; (2) చదువుకున్నవారు ద్రవ్యాపేక్షలేక నాటక ప్రదర్శనానికి పూనుకొనుట; (3) రచయితలుకూడ అవసరమయితే నాటకాల్లో పాల్గొనుట ; (4) హిందీలో కూడ తరచుగా నాటకాలను తెలుగువారు ప్రదర్శించుట ; (5) ధార్వాడ కంపెనీవారు వెళ్ళిన చోటల్లా నాటక సంఘాలకు ప్రాతిపదికలు వేశారు ; (6) బహుళ ప్రచారములోనికి వచ్చిన నాటక కర్తలు కందుకూరి వీరేశలింగం పంతులుగారు, వడ్డాది సుబ్బారాయుడుగారు ; (7) బందరులో క్రీ. శ. 1882 లోనే నేషనల్ థియేటర్ స్థాపించి ఈమని లక్ష్మణస్వామిగా రను నటులు హిందీ నాటకాలను విరివిగా ఆడేవారు ; ముఖ్యంగా పీష్వా నారాయణరావు వధ అనే నాటకాన్ని రసవంతంగా ప్రదర్శించే వారు. కాకినాడలో దినవహి హనుమంత రావుగారు నాటక సంఘాన్ని స్థాపించి నాటక ప్రదర్శనా లిచ్చినారు. (8) నాటకాలు గద్యలో ఎక్కువగా ఉండేవి. పద్యా లున్నా

సంగీతం లేకుండా చదివేవారు. (9) విజయనగరంలో ఆనంద గజపతి మహారాజులుంగారు స్వయంగా పాత్రధారణ చేసి కర్రా పాపయ్యశాస్త్రులు, గంటి బుచ్చి శాస్త్రులు, చొప్పల్లె నరసింహం, ఆదిభట్ల జగ్గావధానులు, పప్పుశాస్త్రి సోదరుల సహకారంతో వారి కోటలోనే ఆహూతులకు మాత్రమే సంస్కృత నాటకాలు ఆడేవారు. మహారాజావారే ఒకటి రెండు సార్లు దుష్యంతపాత్ర ధరించారట. వీరికి గోమఠం శ్రీనివాసాచార్యులుగారు చేయూత. ఇది కేవలం అనువాద యుగమని చెప్పవచ్చును.

క్రీ. శ. 1884 వ సంవత్సరములో బళ్ళారిలో ధర్మవరం రామకృష్ణమాచార్యులను న్యాయవాదులు సరస వినోదినీ సభను స్థాపించి తెలుగున చిత్రనళీయమును రచించి ఆడించినారు. దీనిలో వారే బాహుకపాత్ర ధరించేవారు. వీరి కీ ఉత్సాహం కల్గించింది ఆ యూరిలో అప్పుడు ప్రదర్శింప బడుతూవచ్చిన కన్నడనాటకాలూ, మహారాష్ట్రంనుంచి ఆ యూరికి సంచారానికి వచ్చిన 'జంఖండీ' కంపెనీ వారి నాటకాలూను. రామకృష్ణమాచార్యులుగారు చిత్రనళీయం అద్భుతమైన వస్తు సన్నివేశ కల్పన చేసి రచించారు. ఆయూరి యుద్యోగులు, న్యాయ వాదులు ఆ సభలో సభ్యులు. హాళగొంది రామచంద్రరావు, ధర్మవరం వెంకట కృష్ణమాచార్యులు మొదలగువారు సహాయ నటకులు. రచన ప్రబంధశైలి. పద్యాలు, పాటలు రాగ యుక్తంగా చదువుట ప్రారంభం చేసిన నటులు వీరే. వీరి విధానాన్ని హరి ప్రసాదరావు అను గుంటూరు నటు డవ లంబించినాడు. ఆయన ఆంధ్రదేశ మంతటా ఈ పద్ధతి వ్యాపింపజేశారు. విషాదాంత నాటకాలు తొలుత రచించి నది ధర్మవరంవారే. వీరి రచనలలో అనువాదాలు లేవు. అన్నీ స్వతంత్ర నాటకములే

వావిలాల వాసుదేవశాస్త్రిగారికి శిష్యులైన చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారు 1888లో హిందూ నాట కోజ్జీవక సమాజాన్ని స్థాపించి గయోపాఖ్యానము, పారిజాతాప హరణము, ప్రసన్నయాదవము మొదలైన నాటకాలు రచించి ఒంగోలు ఇమ్మానేని హనుమంతరావు నాయుడుగారిచే నాయక పాత్రములను, టంగుటూరి ప్రకాశంపంతులుగారిచే నాయికాపాత్రములను ధరింపజేసి నాటకాలాడించారు.

ఈ కాలంలోని విశిష్టత పద్యమును సులభంగా అర్థం అగునట్లు వ్రాయడము; పద్యాన్ని సంగీతం తక్కువగా చదవడము; కథావస్తువును పౌరాణిక గాథలలోనుంచి సేకరించడము. కందుకూరివారి హరిశ్చంద్ర కూడా ఈ కాలంలోనే వచ్చి ప్రచారాన్ని పొందింది. ఊరూరా నాటక సంఘాలు వెలసినవి. విశాఖపట్టణంలో రాజా విక్రమదేవవర్మగారి యాజమాన్యంక్రింద మారేపల్లి రామచంద్రశాస్త్రి, సెట్టి లక్ష్మీనరసింహంగార్ల సహకారంతో 'జగన్మిత్ర సమాజం' స్థాపింపబడింది. రాజావారు తెరలుకూడా లాగేవారట. పౌరాణిక నాటకాలు వందలకొలది రచింపబడినవి. రచించినవారు మహాకవులు. ఆ కాలంలో వాడుక భాషలో రచింపబడిన దొక్క కన్యాశుల్కమే. అది క్రీ. శ. 1906 లో రిప్పన్ స్కూలులో అప్పారావుగారి దర్శకత్వంక్రింద తొలిసారి ప్రదర్శింపబడినది. క్రీ. శ. 1888 నుంచి క్రీ. శ. 1897 వరకు పౌరాణిక నాటకయుగ మనవచ్చును.

ధార్వాడ కంపెనీ అంతఃకలహాలవల్ల చీలిపోయి, పూనా సాంగ్లి కంపెనీ అనే పేరుతో తిరిగి క్రీ. శ. 1885 లో ఒక్కసారి వచ్చి కాశీనాథ పంత్ అనువాని యాజమాన్యం క్రింద నొకటి, జోషి అనువాని యాజమాన్యంక్రింద మరొకటి ఏలూరులో స్థాపింపబడినవి. ఈ కాలంలో బళ్ళారిలో సరస వినోదినీసభ, గుంటూరులో ఫస్ట్ కంపెనీ, బందరులో నేషనల్ థియేటరు, రాజమహేంద్రవరంలో హిందూనాటక సమాజం, కాకినాడలో కృష్ణవిలాస సభ, విశాఖపట్టణంలో జగన్మిత్రమండలి, విజయనగరంలో ఆనందగజపతి మహారాజా వారి కంపెనీ ఇవి ప్రముఖంగా ఉండేవి.

క్రీ. శ. 1891 లో వేదం వెంకటరాయశాస్త్రిగారు నెల్లూరులో ఒక నాటకసమాజాన్ని స్థాపించి శాకుంతలము, నాగానందము ఇత్యాదినాటకాలు అనువదించి ప్రదర్శింపజేశారు; చిన్ననాడు తండ్రిగారివద్ద విన్న కథ నాధారం చేసికొని కల్పించి క్రీ. శ. 1897 లో ప్రతాపరుద్రీయాన్ని రచించి ఆడించారు. పాత్రోచితభాషను తెలుగున నాటకాలలో తొలిగా ప్రవేశ పెట్టినది వీరే. తురక తెలుగు, చాకలి తెలుగు తొలి సారిగా మనం వీరి నాటకాలలోనే చూస్తాము. ప్రతాప రుద్రీయం, కన్యాశుల్కం, సారంగధర - ఇవి తెలుగు నాటక సాహిత్యంలో మైలురాళ్లు.

1897 లో ప్రఖ్యాత పార్శీ కంపెనీ బాలీవాలా థియేటర్ యూరపులో పర్యటించి మదరాసుకు వచ్చి ఆంధ్రలోకూడా సంచారం చేసింది. వైర్ వర్కు, చమ్కీ పూసల దుస్తులు, విద్యుద్దీపాలు, సంగీతంలో పార్శీమట్లు, తబల, హార్మోనియం, స్త్రీపాత్రములు స్త్రీలే ధరించుట - ఇవి వీరి విశేష పద్ధతులు. వైర్ వర్కు - అనగా నాటకంలో నారదుడు మేఘమండలములోనుంచి భూలోకంలోనికి వచ్చినట్లు చూపించవలసివచ్చినపుడు ఇనుపతీగెకు ఊయల వేసి, ఊయలమీద నారదుని నిలువబెట్టి తీగె ఆధారంగా

ఆకాశంనుంచి భూలోకానికి వచ్చినట్లు దింపేవారు. ఆంజనేయులు సముద్రం దాటవలసి వచ్చినపుడు ఆతని నడుముకు ఒక పట్టా కట్టి ఆ పట్టాకు ఇనుపరింగులు వేసి ఆ రింగులు ఇనుపతీగెకు తగిలించి తీగె నాధారంగా జర్రున లాగేవారు. ఇనుపతీగె ఒరిపిడి లేక జర్రున జారడానికి వీలుగా ఉండును. కనుక ఇనుపతీగెను విచిత్రమైన పనులు చూపించడానికి పార్శీ కంపెనీవారు తరచు వాడేవారు. చిత్రమైన అటువంటి పనులను వైర్ వర్కు అనేవారు. వ్యాపార నాటక సమాజ పద్ధతులు వీరిని బట్టియే ఆంధ్రలో ప్రవేశపెట్టబడినవి. వీరిని ఆంధ్రనాటక సమాజములు కొన్నిటిలో అనుకరింపగల్గినవి; కొన్నిట ననుకరింప లేక పోయినవి

స్త్రీలు - నాటకరంగము : బాలీవాలా థియేటరు వారిని చూచిన తరువాత, స్త్రీలు స్త్రీ పాత్రలను ధరించ వచ్చునన్న ధైర్యం కొందరికి కలిగింది; కాని సాహసించ లేక పోయినారు. ఇంతలో మహారాష్ట్రంలో తోలుబొమ్మల ప్రదర్శనం నేర్చుకొన్న వనారసవారనే ఆరె మరాటీ కుటుంబం తెలుగుదేశమునకు వచ్చి సురభి గ్రామంలో మకాం వేశారు. ఆ ప్రాంతపు తహసీల్‌దారుగారు వీరి ఆటను చూచి బొమ్మలాట మానిపించి రామిరెడ్డి, చెన్నా రెడ్డి అనువారల సహాయంతో ఒక నాటక సమాజాన్ని స్థాపించి ఆ వనారసవారి కుటుంబంలోనివారగు పాపా బాయి, వెంకూబాయి అనువారిచేత స్త్రీ పాత్రలు ధరింప జేశారు. తొలిసారిగా ఆంధ్రనాటక రంగంలో స్త్రీలు స్త్రీ పాత్రములను ధరించినది వీ రిద్దరే. తర్వాత వనారస గోవిందరావు, రామయ్య, పాపాబాయి, వెంకూబాయి అనువారలు సురభి సంచార నాటక సమాజాలు స్థాపించి ఆ కుటుంబములోని వారలే పాల్గొంటూ, పాత్రధారణ చేస్తూ నేటివరకు సంచార నాటక సమాజాలు నడపు తున్నారు. విశ్వనాథ కవిరాజుగారు వీరికి నాటకాలు వ్రాశారు. సురభి కంపెనీలలో స్త్రీలు స్త్రీ పాత్రలను ధరించడమే కాకుండా పురుషపాత్రలను ధరించడం కూడా కద్దు. అటుపైని బొంబాయి నుంచి 1904 లో దాదాభాయి తూంతి థియేటరువారు, 1906 లో రిప్పన్ థియేటరువారు ఆంధ్ర దేశానికి వచ్చి నాటకాలు ఆడినారు. దీనితో నాటక సమాజం వ్యాపార పద్ధతులపై నడపవలె నన్న దృష్టితో ధరణిప్రగడ సూరయ్యగారు మానేపల్లి కంపెనీ అన్న పేరుతో నాటక సమాజం స్థాపించి నడిపారు. 1911 నుండి రాజమహేంద్రవరంలో కృత్తివెంటి నాగేశ్వర రావు, సత్యవోలు గున్నేశ్వరరావుగారలు వ్యాపార నాటక సమాజములను కొన్నాళ్ళు ఉమ్మడిగాను, కొన్నాళ్ళు వేరుగాను హిందూ నాటక సమాజం, చింతామణి థియేటరు అన్న పేర్లతో నడిపినారు. పార్శీ నాటకాలు చూచి బందరులో 'జఫర్‌షా' వగైరా ఉర్దూ నాటకా లాడేవారు. కృత్తివెంటి నాగేశ్వరరావుగారు 1916 లో తమసమాజంలో స్త్రీలనే స్త్రీ పాత్రల కేర్పాటు చేశారు. వీరి కంపెనీలో ముప్పిడి జగ్గరాజుగారు నాయిక పాత్ర ధరించి ప్రఖ్యాతి వహించారు.

ఇంతలో జాతీయోద్యమం విజృంభించి అనిబిసెంటు, తిలక్, గోఖ్లేగార్ల నాయకత్వాన దేశ మంతటా ప్రాకింది. ఈ యుద్యమంలో చరిత్రాత్మక నాటకాలు వచ్చినవి. ఇచ్ఛాపురపు యజ్ఞనారాయణగారి రసపుత్ర విజయము, కాళ్ళకూరి సాంబశివరావుగారి రంగరాయ కదన సమవాకారము, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి బొబ్బిలి, 'ప్రతాపాక్బరీయము' వగైరా నాటకాలు ప్రదర్శింపబడేవి. ఈ కాలంలో బళ్ళారిలో కోలాచలం శ్రీనివాస రావుగారు ప్రత్యేకంగా చారిత్రాత్మక నాటకరచనకు పూనుకొని 'సుజన మనోరంజనీ సభ' అనే పేరుతో సుప్రసిద్ధ నటులు తాడిపత్రి రాఘవాచార్యులవారి సహకారంతో ఒకనాటక సమాజాన్ని స్థాపించి నాటక ప్రదర్శనా లిచ్చేవారు. వీరి రామరాజు, సుల్తానా చాందు బీబీ, ప్రతాపాక్బరీయము బాగా ప్రశస్తి వహించినవి. సుప్రసిద్ధ నటులు బళ్ళారి (తాడిపత్రి) రాఘవాచార్యులవారిని ఇవే ఆంధ్రదేశాని కెరుక పరచినవి. ఈ కాలములో వంగదేశ ప్రముఖ నాటకకర్త ద్విజేంద్రలాల్‌రాయిగారి నాటకాలను తెలుగులోని కనువదించినవారు శ్రీపాద కామేశ్వరరావు, జంధ్యాల శివన్నశాస్త్రి, నండూరి శివరావు, జొన్నలగడ్డ సత్యనారాయణ, దినవహి సత్యనారాయణ గార్లు. ఈ చరితాత్మక నాటక ప్రదర్శనాలతో జాతీయోద్యమానికి కొంత బలం చేకూరింది. వీటిలో కొన్ని నాటకాలు బ్రిటిష్ ఇండియా ప్రభుత్వంచేత నిషేధింపబడినవి.

తరువాత సాంఘిక నాటకాలు తలచూపినవి. కాళ్ళకూరి నారాయణరావుగారు చింతామణి, మధుసేవ, వరవిక్రయం రచించారు. గున్నేశ్వరరాయ, నాగేశ్వరరాయ సమాజముల విజయం చూచి మైలవరం జమీన్‌దారు మోతే నారాయణరావు, పెద్దిరెడ్డి మొదలగు ధనికులు నాటక సంఘాలు స్థాపించి దిగ్విజయంగా వ్యాపార పద్ధతులపై నడపినారు. మైలవరం బాలభారతీ నాటక సమాజంవారు శ్రీరాముల సచ్చిదానందశాస్త్రిగారి సావిత్రి, పానుగంటి లక్ష్మీనరసింహారావుగారి రాధాకృష్ణ, మల్లాది అచ్యుత రామశాస్త్రిగారి ద్రౌపది బాగా ప్రదర్శిస్తూ

వచ్చారు. వీటిలో ప్రఖ్యాత నటులు యడవల్లి సూర్య నారాయణ, ఉప్పులూరి సంజీవరావు, గురజ గూడపాటి నరసింహారావు నాయుడు, జొన్నవిత్తుల శేషగిరిరావు, దైతా గోపాలం, పారుపల్లి సుబ్బారావు, నిడుముక్కల సుబ్బారావు, మద్దాలి శేషగిరిరావు, వేమూరి గగ్గయ్య గారలు పాల్గొనేవారు.

మోతే నారాయణరావుగారి శ్రీ సీతారామాంజనేయ నాటక సమాజంవారు పై మైలవరం వారి నాటకములే కాక ఇంకను మృచ్ఛకటిక, విష్ణులీలాది నాటకాలు ప్రదర్శించేవారు. ఇందలి నటులు పై మైలవరంవారి నటులే కాక, పసుపులేటి అంజయ్య, పంచాంగం రామానుజా చార్యులు, కొచ్చెర్లకోట రంగారావు, వీరవెంకయ్య, ఆరణి సత్యనారాయణ, రామనాథశాస్త్రి మొదలగువారు కూడా ఆరితేరినవారు.

బందరులో రాయల్ థియేటరు, ఛత్రపూరులో జగ న్మోహన్ థియేటరు, నేషనల్ థియేటరు, ఇండియన్ డ్రమెటిక్ కంపెనీ ఉండేవి. ముంజులూరి కృష్ణారావు, పింగళి నరసయ్య, లక్ష్మీకాంతం సోదరులు, డి. వి. సుబ్బా రావు, వెంపటి వెంకటేశ్వరులు, అంబటిపూడి కోటయ్య, మంత్రాల పరదేశి, మాగంటి సుబ్బారావు, కృత్తివెంటి సుబ్బారావు, శంభూరావు, శ్రీపతి పట్టాభిరామయ్య, యడవల్లి కనకసుందరం, వేమూరి రామారావు మొద లైనవారు ప్రఖ్యాతనటులు తరచు పాండవ నాటకాలు, రసపుత్ర విజయం ఆడేవారు. పింగళి నాగేంద్రరావు గారు వింధ్యరాణి, నా రాజు అనే నాటకాలు రచించి డి. వి. సుబ్బారావుగారికి సమర్పించి వారి సమాజముచే ఆడించారు.

గుంటూరులో ఫస్ట్ కంపెనీ, సెకండ్ కంపెనీ అనేవి ఆవిర్భవించి బళ్ళారివారి నాటకా లాడేవి. వీటిలో ప్రఖ్యాత నటులు హరి ప్రసాదరావు, బలిజేపల్లి లక్ష్మీకాంతం సోద రులు, పత్రి శీనప్ప, కోపల్లె హనుమంతరావు, బొడ్డుపల్లి శాస్త్రులు, ఇవటూరి వియ్యన్న పాల్గొనేవారు. బలిజేపల్లి లక్ష్మీకాంతంగారు హరిశ్చంద్ర రచియించారు. వీరి హరి శ్చంద్ర, తిరుపతివెంకటకవుల పాండవ నాటకాలు, కాళ్ళ కూరి వారి చింతామణి నేటికీ నాటకరంగంలో స్వేచ్ఛా విహారం చేస్తున్నవి.

1918 లో కాకినాడలో 'ఆంధ్రసేవా సంఘం' స్థాపింప బడినది. ఈ సంఘంవారు బాలురచే నాటకా లాడిస్తూ ఉండే వారు. వీరి ననుసరించి ఆ యూరిలోనే యంగ్ మెన్స్ హాపీ క్లబ్, గుంటూరులో దంటు కృష్ణయ్యగారి యాజ మాన్యమున బాలమిత్రసభ, పిప్పరలో కేశవాచార్యులు గారు బాలుర నాటక సంఘాలు స్థాపించి వారిచే నాటకా లాడించారు. దంటు కృష్ణయ్యగారు ప్రత్యేకం స్త్రీలతో క్రీ.శ. 1924 లో నవలా నాటక సమాజం స్థాపించారు. ఇంతలో వచ్చిన పి. వి. రాజమన్నారుగారి 'త ప్పెవరిది' అన్న నాటకాన్ని బళ్ళారి టి. రాఘవాచార్యులవారు బెజవాడలో ప్రదర్శించారు. ఇందు స్త్రీలే స్త్రీ పాత్రలను ధరించారు. శ్రీమతులు కొమ్మూరి పద్మావతి, గుళ్ళపల్లి విశ్వేశ్వరమ్మ, అన్నపూర్ణగారలు ఇందు పాల్గొనిరి. పోటీలు, బహుమతులు, విమర్శలు ఆకాలంలో తారస్థాయి నందుకొన్నవి. పురాణం సూరిశాస్త్రి, శ్రీపాద కామేశ్వర రావు, పసుమర్తి యజ్ఞనారాయణశాస్త్రి, గొల్లపూడి శ్రీరామశాస్త్రిగారలు ముఖ్య విమర్శకులు. నెల్లూరిలో క్రమశిక్షణతో వేదం వెంకటరాయశాస్త్రిగారి యాజ మాన్యం క్రింద కందాడై దొరస్వామి, సరస్వతుల రంగ స్వామి, శ్రీనివాసాచారి, నెల్లూరి నగరాజారావు, తూములూరి శివరామయ్యగారల సహకారంతో చక్కని నాటకాలు ప్రదర్శింపబడినవి. చిత్తూరులో ఆర్. బి. రామకృష్ణరాజు, రాయప్రోలు సుబ్రహ్మణ్యం, గొల్లపూడి శ్రీరామశాస్త్రిగారలు ఒక నాటక సమాజాన్ని స్థాపించారు. అల్లూరులో పర్వతరెడ్డి రామచంద్రారెడ్డిగారు రామ దాసు నాటకంలో కబీరు పాత్ర ధరించేవారు. బళ్ళారిలో ధర్మవరం గోపాలాచార్యులగారి 'రామదాసు, సుభద్ర', కోలాచలం సుబ్రహ్మణ్యశాస్త్రిగారి 'లవకుశ, కృష్ణలీల' ప్రఖ్యాతి వహించినవి. 1924 నాటికి వ్యాపార సమాజా లంతరించినవి.

తెనాలిలో భాగవతుల రాజగోపాలం, త్రిపురారిభొట్ల వీరరాఘవస్వామిగారలు, స్థానం నరసింహారావు, మాధవ పెద్ది వెంకట్రామయ్య, పెద్దిభొట్ల చలపతిరావు, గోవింద రాజుల సుబ్బారావు, పిల్లలమర్రి సుందరరామయ్య, తంగి రాల ఆంజనేయులు, పులిపాటి వెంకటేశ్వర్లుగారల సహ కారంతో రామవిలాస సభ స్థాపిత మైనది. వీరు రోష నార, ప్రతాప రుద్రీయం, షోరాబ్ రుస్తుం, కన్యాశుల్కం నాటకాలు ప్రదర్శించేవారు. తాడిపత్రి రాఘవాచార్యులు గారు (బళ్లారి రాఘవ) ఆంధ్ర దేశంలో పర్యటించి రామరాజు, ప్రహ్లాద నాటకాలు ప్రదర్శించి నటనలో కొత్తపోకడలు చూపడంతో ఆంధ్రలో అమెచ్యూర్ (ఔత్సాహిక) నాటక సంఘాలు పొడసూపినవి.

తరువాత సినిమాల ప్రవేశంతో దేశంలోని నాటకశాల లన్నీ సినిమాహాలు లయినవి. నటులు సినీమాప్రవేశం చేసి నాటకరంగాన్ని పరిత్యజించారు. చౌకబారు వినోదం దొరక డంతో ప్రజలు నాటకాలను చూడడం మానివేసినారు.

నాటకరంగానికి ఆంధ్రలో పతనం ప్రారంభమైంది. పెట్టుబడిదారు లంతరించడంతో కంట్రాక్టరు అనే వ్యక్తి బయలుదేరి నాటకరంగానికి వేరుపురుగుగా పరిణమించినాడు. నటులు తమ పతనాన్ని గుర్తించుకోలేక ఈ కంట్రాక్టరుకు బానిసలైనారు.

ఈ యవస్థలో ఆంధ్రనాటక కళాపరిషత్తు క్రీ. శ. 1929 లో ఆచంట వెంకట సాంఖ్యాయన శర్మగారి అధ్యక్షతను వనారస గోవిందరావు, కాశీనాథుని నాగేశ్వరరావుగారల ప్రాపకంతో స్థాపింపబడి నానాటికి అభివృద్ధి పొందినది; 'బళ్ళారి రాఘవ', గోవిందరాజుల సుబ్బారావు, స్థానం నరసింహారావు, మాధవపెద్ది వెంకట్రామయ్యగారల అధ్యక్షతలక్రింద అనేక ప్రదాళికలు సృష్టించింది. అందు ఔత్సాహిక నాటక సంఘాలకు నాటకపు పోటీలు జరిపి నటులకు బహుమతు లివ్వడం ఒక విశేషం. ఈ కారణంవల్ల ఆంధ్రలో అనేక ఔత్సాహిక నాటక సంఘాలు బయలుదేరినవి. 'ఆచార్య ఆత్రేయ' ఆధునిక నాటకకర్త అయినాడు. గుమస్తా అనే నాటకాన్ని రచించి ఔత్సాహిక నటులకు అందించాడు. ఇంగ్లీషు భాషనుండి అనువాదనాటకాలు కుప్పలుగా వచ్చినవి. వృత్తి నాటక సంఘములలో ఏలూరులో ప్రభాత్ థియేటర్సు, బెజవాడలో రాజరాజేశ్వరీ నాట్యమండలులు మిగిలినవి.

ఆంధ్ర విశ్వవిద్యాలయం రెజిస్ట్రారు కూర్మా వేణుగోపాల స్వామిగారు కళాశాలలనుంచి నాటక సమాజాల నాహ్వానించి విశ్వవిద్యాలయంలో దాని తరఫున పోటీలు జరిపి నాటకాలు ప్రదర్శింప జేసి నాటక ప్రయోగంలో కొన్ని విశిష్ట సిద్ధాంతాలను ప్రవేశపెట్టినారు; విద్యుద్దీప ప్రసారంలో కొన్ని వింత పద్ధతులను కనిపెట్టినారు.

అమెచ్యూరు నాటక సంఘాలు దేశంలో కొల్లలుగా వెలసినా అవి శాశ్వతత్వం కుదుర్చుకోలేకుండా ఉన్నవి. వృత్తి సంఘాలు బ్రదుకడం కష్టంగా ఉన్నవి. పోషించే దాతలు లేకపోగా ప్రదర్శించడాని కందుబాటులో నాటకశాలలు లేకపోవడం, ప్రజలకు సినీమాలపై మోజు పెరగడం నేటి ఆంధ్రనాటకరంగం పతనానికి కారణాలు. బం.క.రా.

**నారాయణదాసు, ఆదిభట్ల** (క్రీ. శ. 1864 1945): వీరి జన్మస్థానము శ్రీకాకుళము జిల్లా, బొబ్బిలి తాలూకాలోని సువర్ణముఖి నదీతీరమందున్న అజ్జాడ. వీరు ద్రావిడులు, ఆహితాగ్నులునగు బ్రాహ్మణవంశమందు స్వయముగా కళాభిజ్ఞులైన నరసమాంబా వేంకటచయనుల కనిష్ఠ తనయులు. తండ్రి పండితుడు, కవి. తల్లి చదువులయవ్వ; తోడిమహిళలకు పోతన భాగవతమును రసవంతముగా వ్యాఖ్యానించు భావుకురాలు. దాసుగారు తండ్రి నుండి పాండిత్య మహిమను కవితాకౌశలమును, తల్లినుండి రసభావుకత్వమును ఆర్జించుకొన్నారు. వ్రాయుటకు బాగుగా నేర్వని యీడులోనే ఈయన భాగవతమును 'రాగ వరుసగా' చదువుటకు నేర్చుకొనినాడు. ఈయన ధారణాశక్తి అనన్య సామాన్యము. ఈయన కితరులవలన అబ్బిన విద్య తక్కువ; సహజముగా స్వయంకృషివలన అలవడినది యెక్కువ.

ఈయన గాత్రస్వాదిమను గుర్తించి వాసా సాంబయ్య అను బొబ్బిలి వైణికుడు ఈయనకు కొన్నాళ్ళు వీణను నేర్పెను. తరువాత ఈయన విజయనగర మహారాజావారి కళాశాలలో చేరి మెట్రిక్యులేషన్ తరగతిలో కృతార్థుడై, యఫ్. ఏ. క్లాసులో కొద్దినాళ్ళు చదివి హూణవిద్యాభ్యాసమునకు స్వస్తి చెప్పెను.



చిత్రము 163.
ఆదిభట్ల నారాయణదాసు

సహజ లబ్ధమైన మేధాశక్తిచే గీర్వాణాంధ్ర భాషలలో వ్యాసంగ మెక్కువ చేసి ప్రథమ వయస్సుననే సొంతరచనలు మొదలిడెను. పోతనయొక్క భక్తిరసాస్వాదన చకితమైన యీయన హృదయము భక్త్యుపన్యాసములగు హరికథల కంకితమైనది. ఈయన తొలుత యక్షగానములు, తరువాత హరికథా ప్రబంధములు రచించెను. ఇవిగాక దేశ్యాంధ్రమున షేక్స్పియర్, కాళిదాసుల సూక్తి రత్నములకు అనువాదములు, ఉమర్ ఖయ్యాం అను ప్రసిద్ధ పారశీక కవీశ్వరుని నీతిపద్యములకు గీర్వాణ దేశ్యాంధ్రాను వాదములు చేసెను. ఈ కాలమందే వీణావాదన, నృత్యసంగీతములం దసమానప్రజ్ఞను సంపాదించెను. లయలో ఈయనకు గల సామర్థ్యము సాటిలేనిది. ఒకప్పు డీయన షణ్ముఖి ప్రదర్శనమునందు చల్లపల్లి జమీన్దారుగారిచే గజయాన, గండపెండేర సత్కారములను పొందెను.

పిదప పిఠాపురము, ఏలూరు, బెజవాడ, బళ్ళారి, మదరాసు నగరములలో హరికథలను జరపుచు అనేకరాజ సంస్థానముల సత్కారము లందుచు దేశపర్యటనము సాగించెను. బెంగుళూరులో తన హరికథా కథన ప్రజ్ఞను

ప్రదర్శించిన సందర్భమున ఈయన మైసూరు మహారాజుచే దర్బారున కాహూతుడై అత్యుదార సన్మానము నందెను.

అన్యదేశములలో ఈయన గడించిన కీర్తిని గుర్తించి ఆనందగజపతి మహారాజు దాసుగారిని దర్బారు పండితునిగా జేసెను. మహారాజు నాకర్షించినవి ఈయన ప్రతివాది ముఖపిధానక్షమమగు సమయస్ఫూర్తి, ఈయన కవితాచాతుర్యమును. ఆనందగజపతి దివంగతుడైన తరువాత దాసుగారు మరల హరికథలద్వారా ప్రజాప్రబోధమును మొదలిడెను.

1919వ సంవత్సరములో అప్పటి విజయనగర సంస్థానాధీశ్వరులైన శ్రీ విజయరామగజపతి సంగీతపాఠశాల నొకదానిని స్థాపించి దాని కధ్యక్షునిగా దాసుగారిని నియమించెను. ఈ పదవిలో 17 ఏండ్లు పనిచేసి 1936 లో నిండు జీతముపై ఉద్యోగమును వదలివేసెను. తరువాతి కాలములో వయస్సు పైబడుటచే హరికథా ప్రచారము కొంత తగ్గినను, ప్రజలు కోరినపుడెల్ల వారి మాట కాదనక హరికథాలాపములను చేయుచుండెడివాడు. పెక్కురు శిష్యుల కీయన హరికథా కథనములో శిక్షణ యిచ్చెను. అనేక శాస్త్రములలో కళలలో ప్రథమశ్రేణికి చెందిన పండితుడయ్యును ఈయన కథకుడుగా తన జీవితమును గడుపుటకు వెనుదీయలేదు.

ఈయన హరికథలు పామర జనులనేకాక పండితులను కూడ రంజింపజేయగల సర్వతోముఖ వైదుష్య ప్రదర్శనములు. తన సర్వతోముఖ పాండిత్యమును కథాలాపమునకు అంగముగా జేసి జనప్రబోధ సాధనముగా హరికథా కాలక్షేపమును మలచిన ధీరుడు ఈతడు. అందువలననే యీయనకుగల 'ఆంధ్రదేశ హరికథా కాలక్షేపకర్తృ పితామహు'డను బిరుదము అన్వర్థమగు చున్నది.

'జానాతే యన్న చంద్రార్కౌ:
జానంతే యన్న యోగినః;
జానతే యన్న భర్గోఽపి
తజ్జానాతి కవి స్స్వయమ్'

మార్బర్గు విశ్వవిద్యాలయమందు సంస్కృత భాషోపాధ్యాయుడుగా ఉండిన ప్రొఫెసర్ గెల్డ్నెర్ నారాయణదాసకృతియగు 'తారక'మను సంస్కృత కావ్యమును చవిచూచి దాసుగారి కందజేసినది పై యభినందన శ్లోకము.

దాసుగారు శ్రీ విద్యోపాసకులు, పరమేశ్వరీ కటాక్షపాత్రులు; ఈయన మనుమనికి మశూచి సోకి ఆ బిడ్డ అపాయ దశలో ఉన్నప్పుడు తన అభిమత దైవమతమగు పరమేశ్వరిని ప్రార్థించి, మనుమని బ్రతికించుకొనెను. మే. వ. న.

**నారాయణమూర్తి, న్యాపతి** (క్రీ.శ. 1897-1951): నారాయణమూర్తిగారి ప్రతిభ ముఖ్యంగా పత్రికా రచనా రంగంలోను, రాజకీయ రంగంలోను, ఆయనకు ఖ్యాతి సంపాదించినది. ఏడేళ్లప్పుడే 'వందేమాతరం' నినాదం ఆయన హృదయంలో స్వాతంత్ర్యజ్యోతిని వెలిగించింది. ఆ బాలుని చిన్న ఎలుగే ఆనాటి పోలీసులు వారింటిని సోదా చేయుటకు పురిగొలిపింది. ఆయనలో విప్లవ బీజాలు ఆనాడే నాటుకొన్నవి. స్కూలు జీవితంలో పాఠాలమీద ఆయనకు శ్రద్ధ తక్కువ. కాని యితర కళాత్మకవిషయాలలో ఆయన తోడి విద్యార్థులకు నాయకుడు. తెలుగు వ్యాసరచన, తెలుగు వక్తృత్వము ఆయన స్వాభావిక ప్రజ్ఞా విశేషాలు. నాటకాలలో ఆయనకు అభిలాష ఎక్కువ. ఆయన అభినయ కౌశలం పెద్దలను, పిన్నలను ఆకర్షించినది. ఆయనకు కవిత్వమందు కూడా అభిరుచి.



చిత్రము 164.
న్యాపతి నారాయణమూర్తి

గాంధీ మహాత్ముని పిలుపు ఆయనను సహజంగా ఆకర్షించినది. 1921వ సంవత్సరంలో మదరాసులో బి.ఏ. చదువుచు చదువుకు స్వస్తి చెప్పి తన అభీష్ట రాజకీయ రంగంలో దుమికి, దేశ స్వాతంత్ర్యపు పోరాటంలో చాల సార్లు కారాగారవాసం చేసి, ఆంధ్రరాష్ట్ర యువకులలో ఖ్యాతి సంపాదించెను. ఆయన ఉపన్యాస ధోరణి అద్వితీయము. ఆంధ్ర యువకులలో ఆయన రేకెత్తించిన స్వాతంత్ర్య జ్వాల స్వాతంత్ర్య సాధనతోనేగాని చల్లారలేదు.

ఆంధ్ర ప్రదేశకాంగ్రెసు సెక్రటరీగా, ఆలిండియా కాంగ్రెసు కమిటీ సభ్యుడుగా ఆయన ఆంధ్రరాష్ట్రంలో స్వాతంత్ర్యపు పోరాటాని కిచ్చిన దోహదం మరువరానిది. ముఖ్యంగా ఆయన జన్మస్థానం గంజాం జిల్లాలో సామాన్య ప్రజలలో, ప్రత్యేకంగా యువకులలో కాంగ్రెసు కార్యదర్శిగానేమి, ఆయన నడపిన 'ఆంధ్రవాణి', 'కళింగ', 'భారతి' తెలుగు పత్రికల ద్వారానేమి ఆయన చేసిన ప్రచండ ప్రచారంవల్ల, స్వాతంత్ర్య పిపాస బయలుదేరి, విజృంభించిన దనుట అతిశయోక్తికాదు.

ఆయన రాజకీయ జీవితంలో సువర్ణఘట్టం 1945వ సంవత్సరంలో జరిగిన కేంద్రశాసనసభ ఎన్నికలలో గంజాం

విశాఖజిల్లాల సంయుక్తనియోజక వర్గంనుండి ప్రాతినిధ్యం లభించడం. ఆ యెన్నికలలో ఆయనకు వచ్చినన్ని వోట్లు దేశంలో మరెవ్వరికిని రాలేదంటే, ఆ జిల్లాలలో ఆయనకు గల పలుకుబడి, ఆయనంటే అచ్చట ఉన్న ప్రజలకు గల అనురాగం నిస్సంశయమైన కారణాలు.

తెలుగు పత్రికా రచనలో ఆయన సిద్ధహస్తుడు. పరిమిత రంగంలో ఆయన సంపాదకత్వంక్రింద వెలువడిన ఆంధ్ర వాణి, కళింగ ఆయన రచనలలోని గాంభీర్యానికి, ఉద్రే కానికి తార్కాణాలు. జన్మస్థలం బరంపురం విడచి 1936 లో మదరాసుకు స్థిరంగా తన నివాసం మార్చిన తరువాత 'వాహిని' పత్రికలో ఆయన పత్రికా రచనా నైపుణ్యం విశాలాంధ్రావనిని కైవసం చేసికొన్నది. 'ఆంధ్ర ప్రభ' ప్రథమ సంపాదకుడుగా ఆయన సంపాదకీయాలు, ఆయన ప్రత్యేక శీర్షిక 'పాన్ సుపారి' ఆంధ్ర ప్రజలను ఆకర్షించి ఆయనకు ఖ్యాతి సంపాదించినవి. కొంతకాలం విరామం. మరొక దినపత్రిక 'విజయప్రభ' కాయన సంపా దకుడయ్యెను. అన్ని కళా ఖండాలవలెనే, ఆర్థికపు స్తోమత లేక ఈ పత్రికకూడ అంతరించింది. కాని నారాయణ మూర్తిగారి కలానికి విరామం లేదు. మరల 'జై భారత్' వారపత్రిక ప్రభవించింది. 'కాన్సర్' ఆయన ఆరో గ్యాన్ని క్రుంగజేసింది. ఒక సంవత్సరంపైగా ఆ జబ్బుతో బాధపడి, చివరి వరకు పత్రికా రచనా వ్యాసంగంలో గడపినారు.

యం. వెం. ర.

**నారాయణరావు, చిలుకూరి**(క్రీ. శ. 1890-1952): వీరి పూర్వులు విశాఖజిల్లా, పొందూరుకు సమీపముననున్న యానందపుర గ్రామవాసులు. వీరి జన్మస్థలము నదియే.

వీరు శ్రీకాకుళము మునిసిపల్ హైస్కూలులో నున్నత విద్య నభ్యసించి పర్లాకిమిడి రాజావారి కళాశాలలోను, విజయనగర మహారాజావారి కళాశాలలోను జదివి పట్టభద్రులైరి; మద్రాసు విశ్వవిద్యాలయము నుండి తెనుగునను, కన్నడమునను ఎం. ఏ. పట్టము నందిరి. తరువాత ఎల్. టి. అయినారు. పదకొండవ శతాబ్దమునాటి యాంధ్రభాషనుగూర్చి పరిశోధనచేసి మదరాసు యూని వర్సిటీ డాక్టరు బిరుదము పొందినారు.



చిత్రము 166.
చిలుకూరి నారాయణరావు

ఉత్తర సర్కారుజిల్లాలలో నింగ్లీషు బోధన విధానము ప్రచారము చేయుటకై జె. ఎ. ఏట్సు దొరతో గలిసి కొంత కాలము వీరు పాఠశాలా పరీక్షకులుగా పనిచేసిరి; కొంత కాలము రాజమహేంద్రవర ప్రభుత్వ కళాశాలలో పనిచేసి తరువాత అనంతపురము వెళ్ళి అచ్చటి ప్రభుత్వ కళా శాలలో చిరకాల మాంధ్రోపన్యాసకులుగా నుండి యనంత పుర వాసులైరి.

వీరు బహుగ్రంథ కర్తలు; మతము, ధర్మశాస్త్రము, స్తోత్రములు, చరిత్రలు, జీవితములు, భాష, సారస్వతము, విద్యావిధానము మున్నగువానిని గూర్చి సుమారు 1,25 000 పుటలుగల 240 గ్రంథములు రచించిరట. అన్ని రచనలు నొకయెత్తు కాల్డ్వెల్ సిద్ధాంతమును ఖండించుచు వీరు వ్రాసిన 'ఆంధ్రభాషా చరిత్ర' మొకయెత్తు. వీరి గ్రంథములలో ముఖ్యములైనవి:

మతము: అథర్వవేదము (ప్రతిపదార్థ తాత్పర్యములు), త్రిపిటకములు, జైనమతము, ఖురాను షరీఫ్, బైబిలు (వచనము) మున్నగునవి; స్మృతులు: ఆపస్తంబ ధర్మ సూత్రము మొదలగునవి; శాస్త్రగ్రంథములు: సిద్ధాంత కౌముది, తర్క సంగ్రహము (తెనుగు వివరణము) ఇత్యాదులు; చరిత్రలు: ఆంధ్రదేశము, రోము; మున్నగు 20 దేశచరిత్రలు; గాంధి ప్రముఖులైన ఎనమం డుగుర జీవిత చరిత్రలు; భాషాశాస్త్రములు: ఆంధ్ర భాషా చరిత్ర (రెండు సంపుటములు); ఆంధ్రవాఙ్మయ చరిత్ర, 10 సంపుటములు; కవిజీవిత గ్రంథములు మున్నగు నవి; నాటకములు: అంబ, అశ్వత్థామ మొదలగునవి. పద్య కావ్యములు: రుబాయత్ ఇత్యాదులు; నిఘంటువులు: సంస్కృతాంధ్ర నిఘంటువు మున్నగునవి. కాని వీనిలో ముద్రితములైనవి చాలకొద్దిమాత్రము. ఆంగ్లములో వీరు రచించిన గ్రంథములును కలవు.

నారాయణరావుగారు కేవల గ్రంథరచనముతో దనివి నొందక యఖిలాంధ్ర దేశమునందును గర్ణాట ప్రాంతము నను పర్యటించియు, నుత్తరదేశ నగరములకు వెడలి యఖిల భారత మహాసభలలో బాల్గొనియు దెనుగుభాష యొక్క ప్రాశస్త్యమును వెల్లడి చేసిరి.

వీరు అనేక సంస్థలకు వ్యవస్థాపకులు. రాజమహేంద్ర వరములో 'ఆంధ్ర దేశీయేతిహాస పరిశోధక మండలి' నెలకొల్పిన వారిలో వీరు ఒకరు; తొలిసారి దానికి అధ్య క్షత వహించిరి; నవ్యసాహిత్య పరిషత్ స్థాపకులై, యధ్య క్షులై చిరకాల మా పరిషత్తును నడిపించిరి. రాయల సీమలో కృష్ణరాయ విద్యాపీఠమును ప్రతిష్ఠించి యధ్యక్షు లుగా నుండి రాయలసీమ అభివృద్ధికై యెన్నో విధముల

పాటుపడిరి. విశాఖమండలమునందలి అరసవిల్లిలో హరిజనుల కొకటియు, దక్కినవారి కొకటియు, రెండు పాఠశాలలు నెలకొల్పిరి. ఇవిగాక యెన్నియో సారస్వత సభల కధ్యక్షత వహించియు, ఆంధ్ర మద్రాసు మైసూరు మున్నగు విశ్వవిద్యాలయము లందలి వివిధ సంస్థలలో సభ్యులుగా నుండియు నాంధ్రభాష కెంతయో సేవ యొనర్చిరి.

వీరు కవులు, పండితులు, విమర్శకులు, పరిశోధకులును; ప్రాచీనతయం దెంత గౌరవమో నవ్యతయందు నంత మమకారము గలవారు; వ్యవసాయము నందు గూడ నభిమానము గలవారై గంజాం జిల్లాలో జరిగిన వ్యవసాయపరిశోధన పోటీలో సువర్ణపతకము బహుమాన మందిరి.

ఈ విధముగా వీరు బహుముఖ ప్రజ్ఞ గలవారై ఆంధ్ర విశ్వకళా పరిషత్తుచే 'కళాప్రపూర్ణ' బిరుదమును, కాశీ సంస్కృత విద్యాపీఠమున 'మహోపాధ్యాయ' బిరుదమును బొంది, నాటక రచనా విమర్శన విధానముల ప్రఖ్యాతి వహించి, ఆ జీవితాంతమును ఆంధ్రశారదనారాధించిరి. కొ. జో. శ.

**నిరంజన శాస్త్రి, వడ్డెపాటి** (క్రీ.శ. 1877 - 1937): వీరు శిల్పర్షి పంచకములో సానగ ఋషి గోత్రమునకు చెందినవారు ; ఋగ్వేదాధ్యాయులు. తెనాలి తాలూకా దుగ్గిరాల గ్రామములో జన్మించిరి; తల్లి భద్రమ్మ; తండ్రి కోటయ్య. వీరు ఉపనయనానంతరము వేదమును, ఉపనిషత్తులను జెప్పుకొని, అటుపిమ్మట సంస్కృతాంధ్రము లందు పాండిత్యము సంపాదించిరి; వంశ వృత్తులగు నినుముకొయ్యపనులాడుచు బాడుచు తండ్రిగారి కర్మశాల లోనే నేర్చుకొనిరి; శిల్ప, వాస్తు, జ్యోతిశ్శాస్త్రము లందును ప్రతిభ సంపాదించిరి; క్రమముగా వేదశాస్త్రాగమ దర్శనములయం దెనలేని ప్రవేశమును, పాండిత్యమును గడించి వాదధోరణి నలవాటు చేసికొనిరి. వీనికి తోడుగా వీరి కున్నత పాఠశాలా పండితోపాధ్యాయ పదవి చేకూరినది.


చిత్రము 166.
వడ్డెపాటి నిరంజనశాస్త్రి

వీరు తన పదునెనిమిదవ యేటనే వీరబ్రహ్మ గురుని చరిత్రమును 'కల్యంధ కౌముది' యను పేర శ్రవ్యకావ్యముగా వ్రాసిరి ; తారకాసురవధాంతముగా గల కుమారస్వామి చరిత్రమును 'కుమారాభ్యుదయ' మను పేర నాటకముగా వ్రాసిరి. పిమ్మట రచించిన 'భీష్మోదయము', 'ధర్మపాల చరిత్రము' అను రెండు ప్రౌఢ ప్రబంధములును, మాఘ మాహాత్మ్యమున కాంధ్రీకరణమును శాస్త్రిగారి అసంపూర్ణ రచనలు. ఇవిగాక 'సూర్యశతకము', 'సుబ్బరాయతారావళి', 'బ్రహ్మానంద లీలలు' అను నాటకమునుగూడ వీరు రచించి యున్నారు. వీరి వేద శాస్త్రాగమ పాండిత్యమునకు నికషోపలముగా రచితమైన మహా గ్రంథము 'విశ్వకర్మబ్రాహ్మణ వంశాగమము'. శాస్త్రిగారి సర్వంకష పాండిత్య మిందు ప్రస్ఫుటమగును.

శాస్త్రిగా రుత్తమ సంఘసేవకుడు, సంస్కర్త, యాజకుడును. బందరు వాస్తవ్యులు కొండిపర్తి వీరభద్రాచార్యులు గారును, వీరును గలసి 1908 వ సంవత్సరమున కృష్ణా గుంటూరు మండల విశ్వబ్రాహ్మణ మహాసభల నెలకొల్పి, ప్రబోధినీ పత్రికను స్థాపించి నీతి, మత, భాషా శిల్పసాంఘిక విషయముల సముద్ధరణకై యెంతయో కృషిచేసినారు ; ఆంధ్ర, తమిళ, కర్ణాటక, మహారాష్ట్ర దేశములందు సంచారము చేసి శిల్పశాస్త్రసంపాదన మొనర్చినారు. శాస్త్రిగా రుత్తమ యాజకులై ఆంధ్ర, ఆంధ్రేతర ప్రాంతములందు పలుతావుల అహింసాయజ్ఞముల నిర్వహించి వైదిక ధర్మపరాయణులైనారు. మద్రాసు, గుంటూరు, గోకర్ణ క్షేత్రము మున్నగుతావుల జరిగిన విశ్వబ్రాహ్మణుల బ్రాహ్మణత్వ వివాదములలో దిగ్దంతులవంటి పండితులతోవాదించి పండిత సాక్ష్యములిచ్చినారు. కొం. వీ. రా.

**నృసింహాచార్యులు, పురాణం**: వీరు అరితేరిన వ్యాకరణ పండితులు ; మంచి సాహిత్యాలంకార పాండిత్యముగలవారు ; గద్వాల సంస్థాన పండితులు. మైసూరు మహారాజాగారి గురువులై వాగీశ బ్రహ్మతంత్ర పరకాల స్వామివారను పేరుతో యత్యాశ్రమమును స్వీకరించి మైసూరులో వేంచేసి యుండినవారు. బు. అ.

**నోములు** : మన తెలుగు దేశమున స్త్రీలును, బాలికలును నోములు నోచెడి ఆచారము చిరకాలముగ నున్నది. స్త్రీలకు బాల్యమునుండియు సదాచారసంపత్తి నలవరచుటకే ఈ నోములు పట్టు ఆచారము ఏర్పడినదని ఊహింపనగును. ఈ వ్రతములలో బాల్య, యౌవన, కౌమార, వార్ధక్యము లనెడి చతుర్వయోదశలందును ఆచరించు వ్రతము లున్నవి. చిరుత ప్రాయమున స్త్రీలు కోరవలసిన సామాన్య సుఖ సంతోషప్రాప్తి మొదలుకొని వార్ధక్యమున వాంఛించు కైవల్య ప్రాప్తివరకు కోరుచు ఆచరింపదగిన

వ్రతములు ఉండుట చూడ స్త్రీల కీ వ్రతములనే సకలార్థ సాధకములుగ మన పూర్వులు నిర్ణయించినట్లు తోచుచున్నది. సంస్కృత సారస్వతమున మున్నూట అరువది వ్రతములు కలవని ప్రతీతి. కాని మన తెలుగునాట దాదాపు రెండు వందల వ్రతములకంటె ఎక్కువ ప్రచారమున లేవు.

చిన్న చిన్న నోములు కొన్ని కన్నెలు పట్టవలసినవిగా కథలలో చెప్పబడిఉన్నను మొన్న మొన్నటివరకు మనదేశమున అతి బాల్యవివాహములు ఆచరణలో ఉన్నందున వివాహానంతరము నోములు నోమించుటే ఆచారముగా ఏర్పడినది.

ఆడుపిల్లలు ఎప్పటికైనను తాము జన్మించినచోట ఉండక మరియొకచోటికి పోవలసినవారేకదా! క్రొత్తయింట, క్రొత్తవారి నడుమ క్రొత్త క్రొత్త గృహమర్యాదలతో మెలగవలసిన క్రొత్తడి ఎంత మెలకువతో, అణకువతో మెలగవలసి యుండును? అట్లు క్రొత్తయింట మెలగవలసిన నడవడులు నేర్పవలసిన బాధ్యత ఎవ్వరిది? తల్లిదే. అయితే ఆ పద్ధతు లన్నియు కాగితముపై వ్రాసి వల్లెవేయించిన బాలిక అట్టి మర్యాదలు నేర్చుకొనగలదా? అది శిక్షణమార్గ మగునా? కాదు. అందు ఆకర్షణ లేదు. ఉత్సాహము లేదు. ఆనందము లేదు. ఒక పాటగను, పద్యముగను, కథగను, వ్రతముగను ఉన్న అది చిత్తాకర్ష కముగ ఉండగలదు. పిల్లలకు చిన్నతనములో అలవడిన లక్షణముల మీదనే వారి భవిష్యజ్జీవితముయొక్క మంచి చెడ్డలు ఆధారపడి యుండును. ఇతరుల యింట అణకువతో మెలగవలసిన బాలలకు సదాచార సంపత్తియందు సుశిక్షణ మొసగుటకే మన ప్రాచీనులు ఆడుబిడ్డలకు చిన్నతనముననే నోములు పట్టించు ఆచారము ఏర్పరచినారు. బాలికకు పని ముద్దు, పాట ముద్దు అను సామెత ఉన్నది. ముందు ముందు ఉత్తమగృహిణియై గృహనిర్వాహకత్వము చేయవలసిన బాల ఎంత పని నేర్చి యుండవలయును? మాతృస్థానము వహించి పసిపాపల లాలించి జోలలు పాడవలసిన బాల ఎన్ని పాటలు నేర్చి యుండవలయును? గృహనిర్వాహకత్వము, శిశుపోషణము సామాన్య ధర్మములా? దేశకల్యాణ మంతయువాని యందే యిమిడి యున్నది. ఇల్లు చూచి ఇల్లాలిని చూడుమను సామెత కలదు; అనగా ఇల్లు ఎంత పరిశుభ్రముగా, అలంకారశోభితముగా ఉన్న ఆ యిల్లా లంత శుచిమతియు, లలితకళావిశారదయు నని విదితమగును. స్త్రీ ఆస్తిక్యబుద్ధి కలిగి భగవద్విశ్వాసిని అయి భగవదారాధనతత్పర కాకున్న గృహిణీ జీవితములో కలుగు కష్టనష్టములను సమన్వయించుకొను సమర్థురాలు కాజాలదు. ఈ విషయము లన్నియు ఊహించియే నియమనిష్ఠలతోను, కథలతోను, దేవీపూజలతోను, పాటలతోను కూడిన వ్రతములను పెద్దలు నిర్ణయించిరి.

ఈ వ్రతములయందు బ్రహ్మ విష్ణు మహేశ్వరు లను త్రిమూర్తులు వారి వారి దేవేరులతో కూడ పూజింపబడుట కలదు. 'నిఖిల పురాణ వ్యాఖ్యాన వైఖరీసమేతుండయిన' సూత పౌరాణికుడు శౌనకాది మహామునులకు చెప్పిన వ్రతములు కూడ కలవు. త్రిలోక సంచారిఅయిన నారదమహామునికి గూడ ఇందు ప్రవేశము కలదు. కాని పురాణ దంపతులైన పార్వతీ పరమేశ్వరులే ఈ వ్రతములకు ముఖ్యాతిముఖ్యులు. వైష్ణవాది ఇతర సంప్రదాయములకు చెందినవారికి తప్ప గౌరీపూజ లేని వ్రతమే లేదు. శివుడు అర్ధనారీశ్వరుడుగదా! గౌరిని పూజించిన శంకరుని పూజించినట్లే. బాలిక ప్రాతఃకాలముననే నిద్రలేచుట ముఖ్యమని చెప్పబడినది. తల్లివద్దనున్న దినములలో అమ్మాయి ఏ వేళకు లేచినను ఇబ్బంది లేదు. అత్తవారింట అట్లు జరగదు. ఉదయాత్పూర్వమే నిద్ర లేచి ఆమె చేయవలసిన నిత్య కృత్యము లెన్నియో ఉండును.

మార్గశిరమాసము నడచుచుండును. ధనుర్మాసము ఆరంభమైనది. ప్రాంగణములందు తీర్చిన రంగవల్లులలో గొబ్బిళ్లు చేసి పిడుకలు కొట్టకున్న మాఖశుద్ధమందు వచ్చు రథసప్తమికి పొంగలి పొంగించుటెట్లు? నోములు పట్టుటెట్లు? అందువల్లనే తెలుగుకన్నె చలిని లెక్కచేయకుండ పాక పాక తిరిగి ఆవుపేడను ప్రోగుచేయును; దొడ్డి దొడ్డి తిరిగి గుమ్మడిపూవులు తెచ్చును; గొబ్బిళ్ళు చేసి ముంగిలిని తీర్చిన రంగవల్లిలో నుంచి ఆనందించును.

తల్లి కొమార్తెకు వివాహమైన సంవత్సరమున మాఖ మాసములో రథసప్తమి రాగానే పెరటిలో తులసికోట వద్ద గొబ్బి పిడుకలతో పాలు పొంగించి సూర్యనారాయణ మూర్తికి ప్రీతికరముగా పొంగలి తయారుచేసి పిమ్మట యథావిధిగా గౌరీపూజ చేయించి గౌరీదేవికి కదళీ నారికేళాది ఫలములను, సూర్యనారాయణమూర్తికి పొంగలియు నివేదన పెట్టి తొట్టతొలిగా 'ఉదయ కుంకుమ' నోము పట్టించును. ఈ నోముపట్టిన బాలిక ప్రతిదినము ఉదయమే నిదురలేచి మొగము కడుగుకొని బొట్టు పెట్టుకొని మరియొక ముత్తైదువకు బొట్టు పెట్టవలయును; ఒక్క సంవత్సర మిట్లు వ్రతము నడిపి మరుసటి ఉదయమున ఒక ముత్తైదువకు తలంటి నీళ్ళుపోసి, భక్ష్య భోజ్యములతో భోజనము పెట్టి చీరయు రవికలగుడ్డయు, కుంకుమతో నిండిన కుంకుమ బరిణయు, దక్షిణ తాంబూలములతో ఆ ముత్తైదువకు వాయన మిచ్చి ఉద్యాపన చేసికొనవలయును. ఈ నోముతోబాటు చిట్టిబొట్టు, కాటుక గౌరీ

వ్రతము, నిత్యశృంగారము, పువ్వు తాంబూలము, పండు తాంబూలము మొదలగు నోములనుగూడ తల్లి విధిగా పట్టించును. ఈ నోము లన్నియు బాలిక జీవితారంభమునకు తొలి పాఠములని చెప్పవచ్చును.

చిట్టిబొట్టు : చిట్టిబొట్టు పట్టిన బాల ఉదయమే లేచి కాల్య కృత్యములు తీర్చుకొని, తల దువ్వి జడ వేసికొని స్నానము చేసి ఉదికి ఆరవేసిన మడివస్త్రములు ధరించి బొట్టు, కాటుక పెట్టుకొని పసుపు గంధము పూసికొని అక్షతలు చేతిలో పట్టుకొని

చిట్టిబొట్టు – పట్టవలె సిరిగలయింట పుట్టవలె
పట్టుపుట్టం – కట్టవలె పసిడినగలు పెట్టవలె
ఏడుగు రన్నలతో పుట్టవలె – ఏకచక్రం యేలవలె
పదుగురన్నలతో పుట్టవలె – పట్టభద్రుని చెట్ట పట్టవలె

అని కథ చెప్పుకొని అక్షతలు పైన వేసికొనవలెను. తరువాత అయిదుగురు ముత్తైదువలకు పసుపు, బొట్టు, గంధము ఇచ్చి బొట్టుకు క్రిందుగా గంధపుచుక్క పెట్టి దానిపై రెండు అక్షతలు అంటించి, అక్షతలు వారి చేతిలో పెట్టి పాదములకు మ్రొక్కి అక్షతలు తలపై వేయించుకొని వారిచే దీవన లందవలెను.

ఒక సంవత్సర మిట్లు అనుదినవ్రతము సలిపి ఈ సంవత్సరము లోపుగాగాని పిమ్మటగాని అయిదుగురు ముత్తైదువలకు తలంటి నీళ్లు పోసి తాను తలంటి నీళ్లు పోసికొని యథావిధిగా గౌరీపూజచేసి అయిదు బొట్టుపెట్టెలు కొని ఒక్కొక్క పెట్టెలో ఒక అద్దము, దువ్వెన, పసుపు, కుంకుమ, కాటుకకాయ, పండు ఉంచి దక్షిణ తాంబూలములు ఉంచి ఒక్కొక్క ముత్తైదువకు దాన మిచ్చి ఉద్యాపన చేసికొనవలయును.

కాటుక గౌరీవ్రతము : చిట్టిబొట్టు నోముతో బాటుగ కాటుక గౌరీవ్రతము గూడ పట్టినచో చిట్టిబొట్టు పెట్టినపుడే ముత్తైదువలకు కాటుకగూడ ఇవ్వవలయును. కాటుక నేత్రములకు చాల మంచిది. అనుదినమును పచనాది కార్యములను చేయుచు సెగలలో, పొగలలో మెలగవలసిన స్త్రీలు నిత్యము ఏమరక కాటుక పెట్టుకొనినచో చాల మంచిది. ఈ నోము పట్టుటవలన బాలికలకు చిన్నతనముననే కాటుక పెట్టుకొనుట అభ్యాసమగును. కావున ఈ నోము ఆరోగ్యవిధిచే గూడ తప్పక పట్టదగినది. ప్రతిభావంతులైన మన పూర్వులు వ్రత విధులతోబాటు ఆరోగ్యవిధులను గూడ మేళవించి వానిని అనుల్లంఘనీయములు చేసి యున్నారు. గృహిణి ఎల్లప్పుడు చేయని శృంగారము, మాయని మడతగా ఉండుట గృహమునకు శోభాకరము. కావున ఆమె ఉదయమేకాదు సాయంత్రము కూడ చక్కగా అలంకృతయై కలకలలాడుచు ఉండవలయును. నిత్యశృంగారము నోము ఈ విషయము తెలుపును.

నిత్యశృంగారమునోము (అలంకార గౌరిదేవి వ్రతము) : ఈ నోము పట్టిన బాల ప్రతిదినము సాయంకాలమునకు ముందు తల దువ్వుకొని జడవేసికొని, బొట్టు కాటుకలు పెట్టుకొని, పసుపు పూసికొని, గంధము పూసికొని ఒక ముత్తైదువకు పసుపు పూసి బొట్టు పెట్టి గంధము పూసి పాపటలో నూనె రాచి అద్దము చూపి తల దువ్వుచు అలంకారమైనదా అని అడిగి పిమ్మట తాంబూలమిచ్చి పాదములకు నమస్కరించి అక్షతలు తలపై వేయించుకొని దీవన లందవలెను. ఒక్క సంవత్సర మిట్లు వ్రతము జరిపి పిమ్మట ఒక్క ముత్తైదువకు తలంటి నీళ్ళు పోసి భోజనముపెట్టి చీర, రవిక, అద్దము, దువ్వెన, బొట్టుపెట్టె, కాటుకకాయ, కుంకుమబరణి, సవరము, సన్నజాజులు, నల్లపూసల జోళ్ళు, గంధపు చెక్క, దక్షిణ తాంబూలాదులతో వాయన మిచ్చి ఉద్యాపన చేసికొనవలయును.

పువ్వులతాంబూలము నోము : ప్రతిదినము ఐదు పువ్వులు తాంబూలములో పెట్టి ముత్తైదువకు బొట్టుపెట్టి ఇవ్వవలెను. ఒక సంవత్సరము వ్రతము జరిపి తరువాత ఒక పళ్లెము నిండ పూలు పోసి దానిపై ఒక బంగారు పువ్వు కూడ ఉంచి చీర రవికల గుడ్డలతో, దక్షిణ తాంబూలములతో ముత్తైదువ కిచ్చి ఉద్యాపన చేసికొనవలయును. పువ్వులు అనురాగసూచకముకదా !

పండు తాంబూలము నోము : ఈ నోము పట్టినవారు ఏడాది కథ చెప్పి అక్షతలు వేసికొని ఒక పళ్లెము నిండ పాతిక (25)కు తక్కువ కాకుండ పండ్లు వుంచి చీర, రవికల గుడ్డ దక్షిణ తాంబూలములతో ఆ పళ్ళెమును దాన మియ్యవలెను. దాన మీయనెంచిన ముత్తైదువకు ముందుగా తలంటి నీళ్లు పోసి పిండివంటలతో భోజనము పెట్టవలెను. పండు తాంబూలము నోము సంతాన ప్రదము.

పదారు ఫలముల నోము : ఈ వ్రతవిధి రకమునకు పదునారు ఫలములచొప్పున పదునారు రకముల ఫలములను ముత్తైదువకు దక్షిణ తాంబూలములతో ఇచ్చుట మాత్రమే.

పూర్ణాదివారముల నోము : పూర్ణాది వారముల నోము కడుపుశోకము లేకుండ చేయును. ఈ నోమును పట్టినవారు ప్రతి ఆదివారము కథ చెప్పి అక్షతలు వేసికొని ఆనాడు ఒంటిపూట భోజనము చేయవలయును. పిమ్మట ఒక ముత్తైదువకు తలంటి నీళ్లుపోసి అయిదుమానికల

బియ్యము ఉండ్రాళ్ళు వండి దక్షిణ తాంబూలములతో ఆమెకు వాయన మియ్యవలయును.

సంపద శుక్రవారము నోము: ప్రతిశుక్రవారము మహాలక్ష్మిని పూజించుచు ఒంటిపూట భోజనము చేయుచు అయిదు వత్సరములు ఈ వ్రతము నడపి అయిదుగురు ముత్తైదువలకు తలంటి నీళ్లు పోసి పిండివంటలతో భోజనము పెట్టి రవికల గుడ్డయు, దక్షిణ తాంబూలములు ఇచ్చి ఉద్యాపన చేసికొనవలెను.

శ్రావణ మాసము ఆంధ్ర స్త్రీలకు అతివేడుకైన మాసము. శ్రావణ మంగళవారము, శుక్రవారము పేరంటములతో తెలుగు నెలతలు ఆనందమున నోలలాడెదరు. ఈ వర్షాకాలమున మదమాతంగము వంటి నీల జీమూతములతో, తటిల్లతలతో, ఇంద్ర ధనుస్సులతో, నీరెండలతో ఆకాశలక్ష్మి యెంత శోభాయమానముగా నుండునో వన్నెవన్నెల చీని చీనాంబరములతో, స్వర్ణాభరణములతో కుంకుమ తిలకములతో, గంధపు పూతలతో, పసుపు పారాణులతో, చంక బిడ్డలతో పేరంటములకు వెడలు ఆంధ్ర గృహలక్ష్ములు అంత శోభాయమానముగ నుందురు.

శ్రావణ మంగళవారము నోము: శ్రావణమంగళవారము నోమును వివాహితలును, కన్యకలును పట్టెదరు. యథావిధిగా మంగళగౌరిని పూజించి మొదటి సంవత్సరము అయిదుగురు ముత్తైదువలకును, రెండవ సంవత్సరము పదిమందికిని, మూడవ సంవత్సరము పదునేనుమందికిని, నాల్గవ సంవత్సరము ఇరువదిమందికిని, అయిదవ సంవత్సరము ఇరువదైదుమంది ముత్తైదువలకును పసుపు, బొట్టు, గంధము, జ్యోతులపై పట్టిన కాటుకను ఇచ్చి, సెనగలు, తాంబూలము వాయన మిచ్చి పాదములకు ప్రణమిల్లి అక్షతలు తలపై వేయించుకొని దీవెన లందవలెను. ఈ వ్రతము అయిదు సంవత్సరములు జరిపి మట్టెలు, మంగళసూత్రము, 33 జోళ్ళ అరిసెలు క్రొత్త కుండలో పెట్టి రవికలగుడ్డ వాసెన కట్టి దక్షిణ తాంబూలములతో వివాహకాలమందు పెండ్లికొమార్తకు వాయన మీయవలయును. ఈ నోము కథను సాధారణముగా పాటగా ఉన్న దానినే పాడుకొని అక్షతలు వేసికొనుట అలవాటు.

వరలక్ష్మీవ్రతము: ఇది ఆంధ్ర స్త్రీలకు ఒక కమ్మని నోము. ఆంధ్ర స్త్రీలు ఆయురారోగ్య ఐశ్వర్యములు, సత్సంతానము, అయిదువతనము మొదలయిన సమస్త సుఖ సౌఖ్యముల నిమిత్తము కనే కల లన్నియు ఈ వ్రతము వల్లనే సఫలమౌనని వారి విశ్వాసము. ఈ వరలక్ష్మి వ్రతమునకు నోము పట్టుట అనునది లేదు. ఇన్ని పండ్లని నియమము లేదు. ఉద్యాపనము లేదు. మాంగల్యవతులయిన స్త్రీ లందరు సర్వ వర్ణములవారు సర్వకాలము నోచుకొను నో మిది. శ్రావణ మాసములో పూర్ణిమముందు శుక్రవారమున ఈ వ్రతము చేయవలయును. తల్లి, బిడ్డలు, అత్తలు, కోడండ్రు, ఇతర బంధుస్త్రీలు అందరు కలసి నోచుకొనవచ్చును. యథాశక్తి బ్రాహ్మణుని సన్నిధిని శుక్రవారము పూజ చేసి పండ్రెండు అపూపములు బ్రాహ్మణునకు సదక్షిణముగ దాన మీయవలయును; బంధుమిత్ర సహితముగా ఇష్ట మృష్టాన్న భోజనము చేయవలయును.

నందికేశ్వర వ్రతము: తెలుగునాట అధికవ్యాప్తి యందున్న నోములలో ఈ నోము ఒకటి. ఈ నోము పట్టుట వలన సకలైశ్వర్యములు కలుగును. ఇంటికి వచ్చినవారి కెల్ల పని చెప్పరాదనేది ఈ నోములో ఉన్న నీతి. ఈ నోమున అయిదు శేర్లు పెసరపప్పును వండి ఆ గుండిగకు అయిదుమూళ్ళ అంగవస్త్రమును చుట్టబెట్టి బంగారముతో నందిప్రతిమను చేయించి ఉపనయన సందర్భమున నంది హోమపు సమయమున వటువునకు దక్షిణ తాంబూలములతో ఇవ్వవలయును.

తద్దె పండుగలు: ఆంధ్ర సంస్కృతికి ఆటపట్టులైన పండుగలు ఉండ్రాళ్ళతద్దె, అట్లతద్దె పండుగలు. ఆంధ్రబాలికలకు ఈ పండువులవల్ల కలుగు ఆనందము అనిర్వచనీయము. తలంటిపోసికొనుట, గోరంటాకు పెట్టుకొనుట, తెల్లవారుజామున భోజనము – వేడివేడి అన్నము, వేపుడు కూరలు, పప్పు పచ్చడులు, మీగడ పెరుగులు; పండుగ ముస్తాబులు, ఉయ్యాల ఊపులు – ఎంత ఉత్సాహాకరమైన పండుగ! తెలుగు బాలికలు ఉయ్యాల లూగుటకు కదుపులు కట్టి పోవుట ఎంత రమణీయముగా నుండును! పెండ్లియైన బాలికను ఉయ్యాలపై కెక్కించి పెద్ద పెద్ద ఊపులు ఊపుచు పెనిమిటి పేరు చెప్పుదనుక విడువక పోవుట, ఆ బాల సిగ్గులతో ఉగ్గులు భర్తపేరు చెప్పుట, చెలికత్తె లెల్లరు చప్పటులు చరిచి దిగ్విజయము చెందినట్లు కేరింతలు కొట్టుట, పెండ్లియైన ఆ బాల చిన్ని చెల్లెండ్రు ఉయ్యాల ఊపులకు ఓపలేక అమాయికముగా అక్క చెప్పిన బావగారి పేరునే తామును చెప్పుట, ఎల్లరు పకపక నవ్వుట – ఎంతరమణీయ మా దృశ్యము! ఏ పండువునైనను మతముతో ముడిపెట్టనిది దానికి విలువలేదు. ఉండ్రాళ్ళ తద్దె, అట్లతద్దె నోములు ఈ విషయకమైన విలువను పండుగకు కల్పించుచున్నవి. పెండ్లియైన తొలిసంవత్సరమే బాలికలచే తల్లి ఈ నోములను పట్టించును. భాద్రపద బహుళ తదియ ఉండ్రాళ్ళతద్దె నోము పట్టు శుభవాసరము. ఆనాడు బాలిక ఉదయమే పసుపు కుంకుమ తీసికొని నేలములగమొక్క వద్దకు వెళ్ళి 'చీమ తుమ్మెదాకా,

చింతలు పూసేదాకా, నేనై పిలిచేదాకా నీవై రావ 'ద్దని చెప్పి వచ్చి తరువాత పూజ చేసికొనబోవునప్పుడు ఆ మొక్కను పెళ్ళగించి తెచ్చి పసుపు గౌరమ్మవద్ద పెట్టి పూజ చేసికొనవలయును. పిమ్మట కుడుములు ఉండ్రాళ్ళు కాని, గారెలు బూరెలుగాని ఐదు పళ్లెములలో దక్షిణ తాంబూల సహితముగా వాయన మియ్యవలెను. పిమ్మట ఉండ్రాళ్ళ తద్దెనాడు గాని, అట్లతద్దెనాడు గాని అయిదుగురు ముత్తైదువలకు తలంటి నీళ్ళు పోసి గోరంటాకు పెట్టి పిండివంటలతో తెల్లవారుజామున భోజనము పెట్టి మరల మధ్యాహ్నము గారెలు, బూరెలు కలిపి ఒక్కొక్క ముత్తైదువకు అయిదు భక్ష్యములు, రవికలగుడ్డ, దక్షిణ తాంబూలము, వెండి ములగకాయ వాయన మిచ్చి అక్షతలు వేయించుకొని భోజనములు పెట్టవలెను.

అట్లతద్దె నోముగూడ పూర్తిగా ఉండ్రాళ్ళతద్దె నోమువలెనే జరుపవలెను. కాని దీనికి ఉత్తరేణి మొక్కను తెచ్చి గౌరీదేవితోబాటు పూజింపవలయును. పదునొకండు అట్లచొప్పున పదునొకండుమంది ముత్తైదువులకు దక్షిణ తాంబూలములతో వాయన మిచ్చి ఉద్యాపన చేసికొనవలయును. భోజనములు పెట్ట నవసరములేదు. మరియు తద్దె పండుగనాడే చేయనక్కరలేదు. ఎప్పుడైనను చేయవచ్చును.

మోచేటి పద్మము (మూగ నోము): ఆశ్వయుజ బహుళ అమావాస్య మొదలుకొని కార్తికశుద్ధ పూర్ణిమ వరకు సాయంత్రపువేళ కంఠస్నానము చేసి శుచియై మడుగు వస్త్రములు ధరించి తులసమ్మవద్ద నాలుగు పద్మములు పెట్టుకొని నాల్గు వత్తుల దీపము వెలిగించి మాటాడకుండ నలుగురు ముత్తైదువులకు బొట్టు పెట్టి నాలుగు నక్షత్రములు లెక్కపెట్టవలయును. రెండవయేట ఎనిమిది పద్మములు పెట్టి ఎనిమిది వత్తుల దీపము వెలిగించి ఎనమండుగురు ముత్తైదువులకు బొట్టుపెట్టి ఎనిమిది నక్షత్రములు లెక్కపెట్టవలయును. మూడవయేట పండ్రెండు పద్మములు పెట్టి పండ్రెండు వత్తుల దీపము వెలిగించి పండ్రెండుగురు ముత్తైదువులకు బొట్టుపెట్టి పండ్రెండు నక్షత్రములు లెక్కించవలయును. దీనికి ఉద్యాపన తొలియేడు నాలుగేసి అట్లు నలుగురు ముత్తైదువలకును, మలియేడు ఎనిమిదేసి అట్లు ఎనిమిదిమంది ముత్తైదువలకును, మూడవయేడు పండ్రెండేసి అట్లు పండ్రెండుమంది ముత్తైదువలకును నల్లపూసలు, లక్కజోళ్ళు ఉంచి దక్షిణ తాంబూలములతో వాయనమియ్యవలెను. నోచుకొన్నకన్యకు రెండు చేతుల మీద రెండు కాళ్ళమీద రెండేసి అట్లు, రెండేసి డబ్బులు ఉంచి అన్నగారు తలుపు వెనుక ఉండి 'తిని కుడిచేకాలానికి రాకే పెడసరగండ' అంటే 'ఇప్పుడు రానా ముప్పన రానా' అనవలెను. అప్పుడు నోచుకొన్న కన్య ఇప్పుడే రమ్మనవలెను. అన్న వచ్చి పుస్తకముతో నాల్గు దెబ్బలు కొట్టి నాలుగట్లు తీసికొనవలెను.

మొగదోసిళ్ళ నోము: ఈ నోము పట్టిన ఆమెకు సవతితల్లి బాధయు, దరిద్రపు బాధయు తప్పును. ప్రతిదినము ఒడలికి నీళ్లు పోసికొని పసుపు కలిపిన నీళ్ళు నిత్యము మూడు దోసిళ్లు లెక్క చూచుకొని పోసికొనవలెను. ఏడాది అయిన తరువాత మూడు దోసిళ్ళ ముత్యములు, మూడు దోసిళ్ళ పగడములు శివాలయములో శివుని రుద్రపాదముమీద పూజచేసి యథాశక్తి దక్షిణ తాంబూలాదు లియ్యవలయును.

వావిలి లక్ష్మీవారము నోము: ఈ నోము పట్టిన వారికి పుట్టింటి నిరాదరణ తొలగును. ఏడాది కథ చెప్పి అక్షతలు వేసికొని ఏడాదైన తరువాత కొత్త చేటలో అడ్డెడు తవ్వెడు కడిగిన బియ్యము, అడ్డెడు తవ్వెడు కడుగని బియ్యము పోసి పాతచేట మూతవేసి వావిలికొమ్మ పెట్టి రవికలగుడ్డ దక్షిణ తాంబూలములతో గోడమీద నుండి ముత్తైదువకు వాయన మిచ్చి ఉద్యాపన చేసికొనవలయును.

పెండ్లిగుమ్మడి నోము: ఈ నోము నోచినామెకు సంపదలు కలుగును. మూడు బూడిదగుమ్మడి పండ్లు తెచ్చి అందులో ఒకపండు, మానెడు సోలెడు బియ్యము, దక్షిణ తాంబూలము తీసికొని ఒక బ్రాహ్మణుని ఇంటికి వెళ్ళి అవి ఆయన కిచ్చి నమస్కరించి నేను నోము నోచుకొనెదను, వాయన మందుకొన రండని పిలిచి రావలయును. ఆయన ఇంటికి వచ్చిన తరువాత రెండవ గుమ్మడిపండును, అడ్డెడు తవ్వెడు బియ్యము దక్షిణ తాంబూలము ఇచ్చి నమస్కరించవలయును. మూడవ గుమ్మడిపండును ఐదు శేర్ల బియ్యమును స్వయంపాకమును తీసికొని వెళ్ళి ఆ బ్రాహ్మణుని భార్యకు వాయన మిచ్చి ఆనాడు వారి ఇంట్లోనే ఆ నోచుకొన్న పడతి భోజనముచేసి రావలయును.

సూర్యచంద్రుల నోము: ఏటి కెదురుగా చూచి మాఖమాసాన పున్నమి ముందర రథసప్తమినాడు విఘ్నము కాకుండ విఘ్నేశ్వరునికి ఉండ్రాళ్లు పోసి ఆదిత్య భగవానునికి పాలు పొంగించి ఆయనను మూడు కోరికలు కోరి, ఏడుంగాలాలు కథ నాచరించి షష్ఠినాడు ఉపవాసముండి సప్తమినాడు అరటి స్తంభాలతో, చెరకుగడలతో పందిళ్లు వేసి, చేమంతిపువ్వుల యెత్తులు పెట్టి, అట్లతో అరుగులు వేసి, బుట్లతో మూలలువేసి, కుడుములతో కోటలు వేసి, కుంకుమతో కుదుళ్ళు గట్టి, అల్లముతో అరుగులు పెట్టి, బెల్లముతో ప్రొయిలు పెట్టి పాలాను ప్రారం దీర్చి, పంచవన్నెల

ముగ్గులు పెట్టి, పన్నెండు పద్మాలు పెట్టి, పసుపుతో గడప వేసి, ఏడేసి మానికల బియ్యముతో సూర్య, చంద్ర దేవులకు మండపముచేసి చిన్నముపాతిక బంగారాన సూర్యదేవునకు, చిన్నముపాతిక వెండితో చంద్రదేవునకు ప్రతిమలు చేయించి పైడిగిన్నెను పచ్చని వస్త్రాన సూర్యదేవు నలంకరించి, వెండి గిన్నెను వెల్లని వస్త్రాన చంద్రదేవు నలంకరించి వేగు జాముదాకా ఆటను పాటను జాగరణ చేసి, ఉదయమే తాను లేచి అలికి ముగ్గులు పెట్టి ఆవునేతితో దీపము పెట్టి, ఆవునేతితో బూరెలు వండి, చిరగని అరటాకులో అల్లము పెట్టి, బెల్లము పెట్టి, తేనె పెట్టి, టెంకాయ పెట్టి, అరటి పండ్లగెల పెట్టి ఆదినారాయణమూర్తి కారగింపు పెట్టి, ఉమాదేవి పేరు చెప్పి, రోహిణీదేవి పేరు చెప్పి పండ్రెండు మంది బ్రాహ్మణులకు, ఇద్దరు ముత్తైదువులకు ఇష్టమృష్టాన్నములు సంతుష్టిగా పెట్టి తాంబూల మిచ్చి దక్షిణ యిచ్చి దండము పెట్టి దివాకరుడా, దివ్యమూర్తీ, బాలభాస్కరా, ప్రభాకరా, అలంకార ఆదినారాయణా అని నమస్కరించి అక్షతలు వేసికొనవలయును. ఈ నోమువలన ఇష్ట కామ్యములు సిద్ధించును.

**పోలి స్వర్గమునకు వెళ్లు నోము:** ఈ నోముకు ఉద్యాపన లేదు. కథ చెప్పుకొని అక్షతలు వేసికొనిన అక్షయ లోకములు కలుగును. భక్తి ముఖ్యము; భేషజముతో పనిలేదు. భక్తి గలవారిని ఏ కులమువారినైనను భగవంతు డనుగ్రహించు నన్నది ఈవ్రతముయొక్క నీతి.

**నిత్యదానము నోము:** కథ చెప్పుకొని అక్షతలు వేసికొని ఒక ఏడాది ప్రతిదినమును ఒక బ్రాహ్మణునకు చేరెడు బియ్యమును ఒక కూరయు నియ్యవలయును. దీనికి ఉద్యాపన ఎద్దు తొక్కని ధాన్యము పదుము కుంచెడు జాగ్రత్తపెట్టుకొని క్రొత్త పంచెలచాపును, కాయగూరలు, దుంపకూరలు, పిండివంట సామానులు యథాశక్తిగా దక్షిణ తాంబూలములతో బ్రాహ్మణునకు దాన మీయవలెను.

**సావిత్రి గౌరీ వ్రతము:** ఇది చాల ప్రశస్తమైన వ్రతము. ఇది ప్రతి సంవత్సరము పుష్యమాసములో సంక్రాంతి పండుగ వెళ్ళిన రెండవ దినమున ఆచరింపబడును. ఈ వ్రతము ఒక్కరే నోచుకొనునది కాదు. ఎవరో ఒకరి ఇంటియందుగాని, దేవాలయము సత్రము మొదలయిన పవిత్రస్థలములందుగాని చేరి పెక్కుమంది యువతులు ఈ నోము నోచుకొనవలయును. ముక్కనుము నాడు ఉదయమే నోచుకొనెడి స్త్రీలు అభ్యంగస్నానమాచరించి మడుగు వలువలు ధరించి కంసాలి యింటగాని, మరి యే శిల్పకారుని యింటగాని తయారుచేయబడిన సావిత్రీ గౌరిని మంగళ వాద్యములతో కొనివచ్చి ఒకానొకచోట ప్రతిష్ఠించి అఖండమును పెట్టి సహస్ర నామములతో ఉదయమును, సాయంత్రమును పూజ చేయవలయును. పుట్టిననాడు పులగము, రెండవనాడు చిమ్మిలి, మూడవనాడు ముద్దకుడుములు, నాలుగవనాడు నానుబాలు, అయిదవనాడు అప్పాలు, ఆరవనాడు గారెలు, ఏడవనాడు అట్లు, ఎనిమిదవనాడు పాయసము, తొమ్మిదవనాడు తొమ్మిది రకముల కాయలు వేసిన పులుసు అమ్మవారికి నివేదించి ముత్తైదువకు వాయన మియ్యవలయును. తొమ్మిదవ దినమున అమ్మవారికి ఉద్యాపన చెప్పి మంగళ వాద్యములతో అమ్మవారిని ఏదైన నదివద్దకుగాని, చెరువువద్దకుగాని కొనిపోయి చల్ది నైవేద్యము పెట్టి నీటియందు ఓలలాడించవలయును. తొమ్మిదేండ్లు నోము నోచుకొనవలయును; తొమ్మిది సూత్రముల తోరము కట్టుకొనవలయును; తొమ్మిది భక్ష్యములు, తొమ్మిది డబ్బులు, తొమ్మిది ఆకులు, తొమ్మిది వక్కలు, తొమ్మిది నల్లపూసలు, కుంకుమ బరణి, కాటుకకాయ, చీర, రవికలగుడ్డ, దక్షిణ తాంబూలములుగల తొమ్మిది మూసివాయనము లుంచి తొమ్మిదిమంది ముత్తైదువులకు నోము నోచినచోటనే భోజనము పెట్టి ఆవాయనము లిచ్చి ఉద్యాపన చేసికొనవలయును. ఈ నోము ఎంత పెద్దనోమో అంత ఉత్సాహకరమైనది. సాముదాయికముగా పెక్కుమంది స్త్రీలు ఒక్కచోట చేరి నోచుకొను చుండుటచే చూచువారల కెంతో ఆనందకరముగా నుండును. సౌభాగ్య వర్ధనమును, సకల సంపత్ప్రదమును నగు ఈ వ్రతము తెలుగునాట ఎంతయో ప్రచారమున నున్నది. ఈ వ్రతమును బొమ్మల నోమని గూడ చెప్పుదురు.

మన తెలుగుదేశమున ఈ నోములకు గల ప్రచారము లత్యధికము. ఆర్ష సంప్రదాయముల ప్రాశస్త్యము వెల కట్టరానిది. బీజమునందు వృక్ష గుణధర్మము లన్నియు గర్భితములై యున్నట్లు ఈ వ్రతములయందు దయ, సత్యము, శౌచము, నీతి, ఆరోగ్యము, మోక్షము మొదలయిన హైందవ సంప్రదాయము లన్నియు గర్భితమై యున్నవి. సమస్త అభీష్టములు నెరవేరుటకు పురుషులకు తపసు ఎట్లు నిర్దేశింపబడినదో స్త్రీలకు వ్రతము అట్లు నిర్ణయింపబడినది. కావుననే సామాన్యమైన సిరిసంపదలు కలిగించు నోములు మొదలుకొని అపవర్గ ప్రాప్తిని కలిగించు నోముల వరకు నున్నవి.

ఈ వ్రతములయందు నిగూఢమైన మొదటి ధర్మము వితరణ. వ్రతముపేర కలిగినంతలో పండో, పత్రమో, వస్తువో, వస్త్రమో, ధనమో, ధాన్యమో, భోజనమో ఇతరు

లకు చెందజేయుట యనునది ముఖ్య లక్ష్యముగా కనిపించును. దానములేని వ్రతము లేనేలేదు. ఏదియో యొక నోము నోచెనేని ఎంత 'ఇల్లో నారాయణమ్మ' అయినను ఒకరి కింత పెట్టక తప్పదు. మథన ద్వాదశి వ్రతకథలో పెట్టనివారికి పుట్టదను విషయము తెలిసికొనగలము. రెండవ ప్రయోజనము భగవద్భక్తి, ప్రార్థనాశీలత. శివుని అర్ధశరీరమే పార్వతి. సామేను సతికి నిచ్చిన సోమార్ధధరుడా హరుడు. ఆ శివతత్త్వము అభిన్నము. అది ఏకత్వమున కేర్పడిన రెండు ముఖములు మాత్రమే. అందువల్లనే మనము పసుపుగౌరిని లింగాకారముగా చేసి పూజ చేయుచున్నాము. ఒకే మూర్తిలో పురాణ దంపతు లిరువురు ఉన్నారు. కావున ఏకాకారుడైన ఆ యుమామహేశ్వర మూర్తియందే ఇరువురిని అర్చించిన ట్లగుచున్నది. పార్వతి శక్తిప్రదాయిని; శంకరుడు విభూతిప్రదుడు. కావున సర్వకామ్యములు వారే తీర్చగల సమర్థులు. భగవంతునియందు ఈ ఆస్తిక్య భావము బహుధా దృఢపడుటయే వ్రతములవలన కలుగు మరియొక ప్రయోజనము. తదుపరి వ్రతములవలన కలుగు ప్రయోజన మిం కొకటి యున్నది. అది సదాచార సంపత్తి. ఉదయమే లేచుట, నిత్యకృత్యములు తీర్చుకొనుట, స్నాన మాచరించుట, మడి వస్త్రములు ధరించుట, పచన కార్యముల నెరవేర్చుట, భక్తి శ్రద్ధలతో షోడశోపచారములతో పార్వతీ పరమేశ్వరులను పూజించుట, వారికి నివేదించిన ప్రసాదమును ఇంటిలోని వా రందరికి పెట్టి తానును భుజించుట - ఇట్టి సదాచార సంపత్తి బాల్యప్రభృతి అలవరచునవే వ్రతములు. జీవితము కష్టసుఖ ద్వంద్వము. స్త్రీలకు వైధవ్యము, దారిద్ర్యము, కడుపు శోకము మొదలయినవి తీరని దుఃఖములు. పతి ఇరుసు, స్త్రీ చక్రము. ఆ జీవిత చక్రములోని ఆకులన్నియు ఇరుసుపై ఆధారపడి యున్నవి. ఎప్పుడు ఇరుసు విరిగిపోవునో అపుడు దానికి సంధింపబడిన ఆకులతో సహా చక్రము విచ్ఛిన్నమైపోవును. కనుక అట్టి విచ్ఛిత్తి కలుగకుండ, అట్టి కష్టము సంభవింపకుండ సౌభాగ్య వర్ధనమునకై చేయు వ్రతములు అత్యధికముగా ఉన్నవి. సతీపతులు అన్యోన్యానురాగము గలవారై ఉండుటను కోరుచు పట్టునవి పువ్వు తాంబూలము నోము, దంపతుల తాంబూలము నోము మొదలైనవి. సతీపతులు అన్యోన్యముగా నుండిన చాలదు. దాంపత్యజీవితము బంధురముగా నిబద్ధమగుటకు సంతాన మవసరము. సంతానము లేని జీవితము పచ్చని పూరి లేని ఎడారివంటిది. మాతృస్థానము వహింపవలసిన స్త్రీ ఆ యెడారి జీవితము గడపలేక దుస్సహవేదన నొందును. అందువల్లనే పతికంటె సతి ముందుగ బిడ్డలకొరకు ఆతురత జెందును. శ్రావణ మంగళవారము నోము, రేగులగౌరి నోము మొదలైనవి అట్టి సంతానప్రాప్తిని కోరునవే. గర్భముతో నున్న చాలదు. ఆ గర్భము విచ్ఛిత్తి గాకుండ నుండవలయును. అందులకే కడుపు చెదరని ఆదివారము నోముగూడ చెప్పబడినది. నవమాసములు మోసి పిల్లలను కనిన చాలదు. ఆ పిల్లలు కుంటి, గ్రుడ్డి, చెవిటి, మూగి మొదలయిన అంగవైకల్యములు లేకుండ నుండవలయును గదా. పదారు ఫలముల నోము మొదలగునవి ఈ విషయము తెలుపును. మంచి ఫలదానము చేసినవారికే మంచి సంతానము. ఇతరుల కిచ్చునది శ్రేష్ఠమైనదిగా నుండవలయును. సరి సంతానము కలిగి ఆ సంతానము మంచిదై యుండియు చాలదు. అది ఆయుష్మంతమైనదిగా నుండవలయును. కనుకనే కడుపు శోకము లేకుండుటకు పెక్కు నోములు చెప్పబడివి. కడిపెడు బిడ్డలు కలిగి గంపంత సంసారమై దోసతోటవలె ఇల్లు కలకలలాడుచుండిన నేమి? ఆ బిడ్డలకు అన్నవస్త్రాదులకు కొరత లేకుండవలయును. దారిద్ర్యము రాకుండుటకు, వచ్చిన దారిద్ర్యము నివారణ యగుటకు నోచెడు నోము లెన్నో ఉన్నవి. సంపద శుక్రవారము మొదలైన వ్రతము లిందుకే. స్త్రీ తా నొక్కరిత సిరి సంపదలతో తులతూగిన తుష్టి పొందజాలదు. తన పుట్టింటివారుగూడ సంపన్నులై యుండవలయును. వావిలి లక్ష్మీవారము కథలో ఈ విషయము తెలుపబడినది. పుట్టింటివారి దారిద్ర్యము నివారించుట కామె వేవిధముల ప్రయత్నించును. తల్లిచేత మార్గశిర లక్ష్మీవారము నోము పట్టించి కృతార్థురా లగును.

బాలికలకు చిన్న తనముననే మాతృ వియోగము సంభవించుట, మారు తల్లి ఏర్పడుట పెద్ద కష్టము. కన్నె తులసి, మార్గశిర లక్ష్మీవారము నోము మొదలైనవి ఈ కష్ట నివారణకు చెప్పబడినవి. మారేడు దళము నోములో మారుతల్లి డబ్బు పుచ్చుకొని చచ్చిన వానితో కట్టి సహగమనము చేయుటకు సవతి కూతురును విక్రయించును. ఆ పిల్ల ఎట్లో వ్రత ప్రభావమువలన విముక్తి నొంది గతించిన భర్తను బ్రతికించుకొని సుఖించును.

ఈ వ్రతములలో చేయగూడని పనులను కొన్ని చెప్పుచు అట్టి పనులను చేసినందువల్ల కలుగు ఫలితములు వివరించు వ్రతములు కొన్ని ఉన్నవి. ఇవి చాల ముఖ్యమైనవి. కూడని పను లన్నియు పట్టిక వ్రాసి వానిని వల్లెవేయుట వలన ఎవరును వానిని పాటింప జాలరు. ప్రతి దోషమునకు ఒక వ్రతము, ఆ వ్రతమున కొక కథ, ఆ కథలో అనుచితమైన ఆ పని చేయుటవలన కలిగిన ఫలితము సూచితమైనది.

అక్క చెల్లెండ్రనుగాని, కొమార్తెలనుగాని నిరాదరించరాదు. ఇంటికి వచ్చినవారికెల్ల పని చెప్పరాదు. ఇతరులను చూచి నవ్వరాదు. ఆపద ఎట్లుండునని పలుమారు తలచరాదు. ఐశ్వర్యముతో గర్వించరాదు. అధికారము కలదని నిర్లక్ష్యముతో ప్రవర్తించరాదు. శుచి శుభ్రతలు లేకుండ ఉండరాదు. ఇట్టి నీతు లెన్నియో ఈ వ్రతములలో ఉన్నవి ; ఈ వ్రతములలో ఉండుటే కాదు, ఈ భావములు ఆంధ్ర స్త్రీల మనస్సులలో జీతించిపోయినవికూడ. క. వ.

**పంచతంత్ర కవులు :** గీర్వాణ వాణిలో సంకలితమైన పంచతంత్ర మనెడి కథాసందోహమును ప్రాచీన కవులలో ఇరువు రాంధ్రీకరించినారు. మొదటివాడు దూబగుంట నారాయణ కవి ; రెండవవాడు బైచరాజు వెంకటనాథుడు.

దక్షిణదేశమున మహిళాపురమున అమరశక్తి యను ప్రభువు తన ముప్వురు కుమారులు మూర్ఖులుగా నుండుటచే విద్వాంసులను బిలిపించి వారికి విద్య నేర్పు డని కోరెను. విష్ణుశర్మ యను వృద్ధ బ్రాహ్మణుడు ఆరు మాసములలో వారికి రాజనీతి నేర్పుదు నని ప్రతిజ్ఞ చేసి అయిదు తంత్రములుగల యీ కథాసందోహమును చెప్పెను. ఇది మిత్రభేదము, సుహృల్లాభము, విగ్రహ-సంధి, లబ్ధనాశము, అసంప్రేక్ష్యకారిత్వము అను విభాగములతో గద్యపద్యములతో నొప్పారుచున్నది. ఇందలి పాత్రలు విశేషభాగము జంతువులు. సింహమునకు దేహబలమే కాని బుద్ధి బల ముండదు. నక్క యెల్లప్పుడును జిత్తులమారి. పిల్లిది వంచనా శీలము. మానవ పాత్రల కంటె జంతుపాత్రల వలననే వస్తుస్వభావము, లోకసత్యము కథలలో పరిస్ఫుట మగుచుండును. ఇందు హాస్యరసమునకు విశేషావకాశము కలదు. పంచతంత్రము నీతిని, విశేషించి రాజనీతిని మృదువుగా బోధించుటకై ఏర్పడినది. ఇందలి మొదటి మూడు తంత్రములలో కథానిర్మాణ చాతుర్యము బిగువు కానబడును. నాలుగవ తంత్రములోని కథలో పటుత్వము తక్కువ. అయిదవ తంత్రములో కథా పీఠము కడుదుర్బలము. తుది రెండు తంత్రములును మొదటి మూడు తంత్రములకు అదుకువలె దోచుచున్నవి. మొత్తము మీద లోక స్వరూప, స్వభావములను బయలుపరచును.

నారాయణకవి, దూబగుంట: నారాయణకవి మైత్రావరణ గోత్రుడు. ఈయనతల్లి నాగమాంబ, తండ్రి బ్రహ్మయమంత్రి. దూబగుంట పురశాసనుడనని చెప్పుకొనుట వలన ఇత డాగ్రామమునకు కరణము కానోపును. ఈతని గురువు నాగనార్యు డను మాహేశ్వరుడు. శారదాదేవి యీతని ఉపాస్య దేవత. ఇతడు తమ్మరాజు బసవరాజు అను ప్రభువు కోరిక ననుసరించి పంచతంత్రము నాంధ్ర భాషలో కర్ణామృతముగా నేర్పు మెరయ కూర్చి యాతని కంకితము చేసెను. ఇతడు నిజ కవిత్వమునందు విశ్వాసము కలవాడు. కవిత్రయమును మాత్రము స్మరించుటచే శక్తిమంతు డనిపించును. తమ్మరాజు బసవరాజు క్రీ. శ. 1450 ప్రాంతముల నుండుటచే నారాయణకవి కాలము స్పష్ట మగుచున్నది. నారాయణుడు పంచతంత్రమును రెండు సారులు పంచతంత్రి యన్నాడు. ఇందు అయిదు తంత్రములు, ఇంచుమించు 1300 గద్యపద్యములు కలవు. గద్యభాగములు సుదీర్ఘములు కాక అలతి యలతిగా సరళముగా నున్నవి. ఇతని శైలి రమ్యమైనది. కొలదితావులలో మాత్రము సమాసఘటన కానబడుచున్నది. కథా గమనమున కాటంకము లేని ప్రక్రియలో నడచు నీతని ఫణితి సుబోధమై హృదయంగమమై అలరారుచున్నది.

వేంకటనాథుడు, బైచరాజు : ఈతడు క్రీ. శ. 1500 ప్రాంతమువా డని బ్రౌన్ దొర యభిప్రాయము. కాని వాస్తవముగ నితడు వర్ధిల్లినది 16 వ శతాబ్ద మధ్యమునందు. ఇతని తాత బైచభూపాలుడు. ఆయన పేరును బట్టి యీతని యింటి పేరు వెలసినది. పర్వతరా జితని తండ్రి. తనపెద తండ్రిని వర్ణించుపట్ల 'కుమార లింగక్షోణిపాలుండు యవన సైంధవ కాననానలుండు' అనుట వలన ఇతడు హిందూ ముసల్మాను యుద్ధ కాలమున నుండెను. నెల్లూరు మండలవాసి కానోపును. ఈతడు వేంకటేశ్వర స్వామిభక్తుడు, పాండిత్యమునను, కావ్యరచనము నందును ప్రౌఢుడు.

> •ఏ చనవు కలదు హరిహర
> సాచివ్యము నొంద నన్యజనులకు మది నా
> లోచింప, తిక్కయజ్వకు
> నాచన సోమునకు మఱియు నాకుం దక్కన్'.

అని సధైర్యముగా వ్రాసికొన్నాడు. కావ్యస్వరూపమును గూర్చి యీతడు చెప్పిన పద్యము విశ్వజనీనము.

> 'ఘనతర ఘూర్జరీ కుచయుగక్రియ గూఢము గాక ద్రావిడీ
> స్తనగతిఁ దేట కాక అరచా టగు నాంధ్ర వధూటి చొక్కపుం
> జనుగవలీల గూఢతయు చాటుదనంబును లేకయుండఁ జె
> ప్పిన యదె పో కవిత్వ మనిపించు నగిం చటు కాక యుండినన్'.

లోకో భిన్నరుచిః అనెడి సూక్తిని ఇతడు సరసముగా వివరించినాడు. అలంకారమున కొకరు, వార్తా సమృద్ధి కొకరు, శబ్దస్ఫూర్తుల కొకరు, అర్థసృష్టికి వే రొకరు, రసాభోగతకు మరియొకరు, ఉపమాచర్చికకు, పదప్రౌఢి

మకు, జాతిశ్లాఘకు కొందరును సంతసింతురు. కాని అందరను ఆనందింప జేయుట సాధ్యము కాదు. కావ్యములో లోపము లుండ వచ్చునని వెంకటనాథు డన్నాడు.

ఈతడు నారాయణకవి కృత మైన పంచతంత్రమును చూచెనో చూడలేదో. వెంకట నాథుడు సరళ సరణి ననుసరింపక ప్రౌఢిమతో రచన చేసినాడు. మాతృకలో లేని విషయములను చేర్చి, వర్ణనలు పెంచుటచే అట నట కథాగమనమున కవరోధము కలుగుచుండును. ఈతని గ్రంథములలో రమారమి రెండువేల గద్య పద్యము లున్నవి. ఈ రచన సాధారణుల కన్న విద్యావంతులకు వేడుక కలిగించును. తన కృతి నీతడు హరిహరనాథున కంకితము చేసినాడు.

దూబగుంట నారాయణ కవియు, బైచరాజు వేంకట నాథుడును పాటలీపుత్రము నేలువాడు సుదర్శన ప్రభువు అని చెప్పినారు. మహిళారోప్యము నేలురాజు అమర శక్తియని లేదు. వారికి లభించిన పాఠములలో అటు లుండెనేమో.

పంచతంత్రము వంటి సంస్కృత నీతి గ్రంథము హితోప దేశము నారాయణకవి గ్రథితము. ఇందు నాలుగు తంత్ర ములే కలవు. ఇందలి 43 కథలలో 25 కథలు పంచ తంత్రము లోనివి. ఇందు పాటలీపుత్రము నగరము పేరు; సుదర్శనుడు రాజు పేరు. ఒకవేళ దీనిని కవు లనుసరించిరేమో. శి. శం. స్వా.

**పండిత త్రయము:** ఆంధ్రదేశమున వీరశైవ మతము రెండు సంప్రదాయముల మూలమున వ్యాప్తి జెందినది. అందు మొదటిది యవైదికమగు బసవసంప్ర దాయము లేక జంగమ సంప్రదాయము. రెండవది సవైదికమగు పండిత సంప్రదాయము లేక ఆరాధ్య సంప్రదాయము. ఈ రెండవ సంప్రదాయమునకు చెందిన వారినే లింగధారులని వ్యవహరింతురు. ఈ సంప్రదాయపు ప్రవర్తకులైన శైవాచార్యులు ముగ్గురు: 1. శ్రీపతిపండి తుడు, 2. శివలెంక మంచన పండితుడు, 3. మల్లికార్జున పండితుడు. వీరినే పండిత త్రయమని వ్యవహరింతురు.

పౌరాణికముగ సృష్టి, స్థితి, లయకారులని ప్రసిద్ధిగన్న బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల యాధిక్యము నణగద్రొక్కి శివుడే ఏకైక దైవమని, త్రిమూర్తుల కందరాని దివ్యలింగ స్వరూపుడని వేదాగమ శాస్త్రేతిహాస ప్రమాణములచే పండితత్రయము నిరూపించి యీ సంప్రదాయమును ప్రవర్తిల్ల జేసిరి. శ్రీపతి పండితుడు బ్రహ్మవాదులను, శివ లెంక మంచన విష్ణువాదులను, మల్లికార్జున పండితుడు శివుడు కేవలము సంహారకర్తయను పాశుపతశైవ వాదు లను ఖండించి శివభక్తిని, శివుని సర్వోత్కృష్టతను ప్రద ర్శించిరి. వీరు ముప్పురును సంస్కృత భాషయందు నుద్దండ పండితులైనను ఆంధ్రదేశీయులైన కారణమున తెనుగు భాషనే మత వ్యాపనకొరకు సాధనముగా గ్రహించి ఆ భాషకు గౌరవము నాపాదించిరి.

వీరు మతప్రచారము కొరకు విశిష్ట మహిమలను ప్రదర్శించి వీరశైవ మతమును చిరస్థాయిగా నుండునట్లు పరిశ్రమించిన మహనీయులు.

శ్రీపతి పండితుడు: శైవ పండిత త్రయములో శ్రీపతి పండితుడు కాలక్రమమున ప్రథముడని సోమనాథుడు ఇట్లు చెప్పియున్నాడు!

'కడునర్థి యుత్పత్తి కర్తనా బ్రహ్మ
వడి బ్రహ్మమను బ్రహ్మవాదులఁ ద్రుంచి
హర భక్తి యుత్పత్తి కధిపతి నాఁగ
బరగె దాఁదొల్లి శ్రీపతి పండితయ్య
స్థితికర్త హరి ఉమాపతికి మ్రొక్కించి
ఢిలి విష్ణువాదుల గీటడగించి
చెనసి భక్తి క్రియాస్థితి కర్తయనగ
జనియెను లెంక మంచన పండితయ్య
గాఢమై సంహారకర్తయె యనుచు
సాధారణముగ నీశ్వరుఁ బల్కు భక్తి
దూరాన్యసమయ సంహారుఁడై చనియె
ఘూరుండు మల్లికార్జున పండితయ్య'

దీనినిబట్టి వీరి కాలమును స్థూలముగ దెలుపవచ్చును. వీరిలో మల్లికార్జున పండితుడు క్రీ. శ. 1150 - 1160 ప్రాంత మున ఉన్నవాడు. అతనికి మంచన పండితుడు ముందు వాడు. ఈతడు క్రీ. శ. 1025 ప్రాంతమున నున్నవాడని కన్నడకవి చరిత్రమునుబట్టి తెలియుచున్నది. శ్రీపతి పండితుడు ఈతనికి ముందని సోమనాథుడే చెప్పియున్నాడు. కావున శ్రీపతి పండితుని కాలము క్రీ. శ. 650 - 1000 ప్రాంతము కాదగును. ఇతడు విజయవాడ వాస్తవ్యుడు. శివ మాహాత్మ్యమును ప్రతిపాదించుటకు అగ్నిహోత్రమును తన వస్త్రమున సంగ్రహించినాడు. బ్రహ్మవాదులైన వైదిక బ్రాహ్మణులకు అగ్నిహోత్రము ప్రధానము. వారు శివపారమ్యమును అంగీకరింపరు. కావుననే వారిని జయించుటకు అగ్నిహోత్రమును తన బట్టలో కట్టి శివ మహిమను ప్రదర్శించినాడు. బ్రాహ్మణులు అతని భక్తికి మెచ్చి అగ్నిహోత్రమును విడువుమని యాతని ప్రార్థించిరి. శివమతము సుప్రతిష్ఠమయినది. నాటినుండియు కొంగున నిప్పును మూటగట్టుటయను నానుడి తెలుగు దేశమున ప్రచారమున నున్నది. ఈతడు బ్రహ్మసూత్రములకు

శివపరముగ శ్రీకర భాష్యమను నొక గొప్ప వ్యాఖ్యాన మును రచించినాడు. సోమనాథుడు శ్రీపతి పండితుని కవిగా నొకచోట చెప్పియున్నాడు. ఈతని తెలుగు కృతులు మనకు లభ్యము కాలేదు.

శివలెంక మంచన పండితుడు : ఈతని చరిత్ర సోమ నాథుని బసవ పురాణమున షష్ఠాశ్వాసమున వర్ణింపబడి యున్నది. ఈతడు కాశీక్షేత్రమునందు విశ్వేశ్వర స్థాన మునం దుండెడివాడు. అచ్చట ముప్పూటలను దన పది వ్రేళ్ళను శివున కర్పించుచు మగుడ బడయుచు వర్తించు చుండెను. ఇంతియకాక 'యన్యదర్శనుల ముక్కుపై గత్తి' యని యొక చెక్క మప్పురి నెత్తించి తనతో వాదింపదివురువారలతో వాదించి వారి నోడించి పంపు చుండెను. అంత నచటి పండితు లందురు నొక్కమొగి నాతని పైకి మూగి వాదించిరట. మంచన పండితుడు శ్రుతి స్మృతి పురాణ శాస్త్రార్థ సహితముగ వారితో వాదించి అసమాన ప్రతిభ గాన్పించి వారి నోడించుటయే కాక శివమాహాత్మ్యమును జూపింతునని అచ్చటి విష్ణు దేవుని శివునకు మ్రొక్కుమని పిలిచి వా రందరు చూచు చుండగ శివునకు మ్రొక్కించెనట. అచటివా రందరు నాశ్చర్యపడి మంచనగారి భక్తి మాహాత్మ్యమును బొగడుచు తమ యిండ్లకు నేగిరట. పై కథయే కాక కన్నడ కవిచరిత్రము నుండి యీతనిగూర్చి యీ క్రింది విషయములు తెలియుచున్నవి. ఇతని తాత సోమశంభు దేశికుడు; తండ్రి సకలాగమా చార్యుడు. ఈతడు కామికా ద్యాగమములకు వృత్తి దీపికలను రచించినాడు. ఈతని నుండి పదునారు తరముల వరకు గల పురుషులను నీల కంఠాచార్యుడు క్రీ. శ. 1485 లో పేర్కొని యున్నాడు. మంచన తెలుగు కృతులుగాని సంస్కృత రచనములుగాని కన్పింపవు. కన్నడమున మాత్రము 'మంచనగళ వచన'ము అను నొక వచన గ్రంథము గాన్పించు చున్నది. తెలుగు దేశమున శివలెంకవారు మంచన పండితుని వంశీయులే.

మల్లికార్జున పండితుడు : ఈతడు పండితారాధ్యు లను పేర ప్రసిద్ధుడై ఆరాధ్య సంప్రదాయమును చిరస్థా యిగ నెలకొల్పిన మత సంస్కర్త. పాల్కురికి సోమ నాథుని పండితారాధ్య చరిత్రమునకు కథానాయకుడు. ఈతడు గోదావరీ మండలము నందలి దాక్షారామక్షేత్ర నివాసి; కోటిపల్లి యారాధ్యదేవుని శిష్యుడు. ఈతడు వానస వంశీయు డనియు, గౌతమ గోత్రజు డనియు గ్రంథాంతరముల వలన తెలియుచున్నది. ఈతడు క్రీ. శ. 1163-1180 వరకు రాజ్యమేలిన రెండవ వెలనాటి చోడనికి, క్రీ. శ. 1162 లో నున్న పానుగంటి యుదయావ నీశునికి, క్రీ. శ. 1171 లో నున్న కొండపడుమటి బుద్ధరాజు నకు సమకాలికుడగుటచేత క్రీ. శ. 1100 నుండి 1180 వరకు విలసిల్లి యుండెను. పండితుడు చూపిన మహిమలలో తన కన్నులను శివున కర్పించి తిరిగి వానిని బడయుట ముఖ్యమైనది. పండితుడు చందవోలులో వెలనాటి చోడని యాస్థానమున బౌద్ధులను వాదమున జయించినందున తన్మతాచార్యు నొక్కని పండితుని శిష్యులు చంపిరి. పండితుడు బౌద్ధుని చంపిన నేరము తనపై మోపుకొని యా వారి కీయదగిన శిక్ష తానే యనుభవింతునని తన కన్నులను రెండింటిని తానే పెరికివైచుకొని శివున కర్పిం చెను. శివు డాతని భక్తికి మెచ్చి ఇదివరకు గల రెండు కన్నులకు తోడుగా నూర్ధ్వ భాగమున మరిరెండు కన్నుల నిచ్చెను. ఈ నిలువు కన్నులు పడసిన విషయము శైవ గ్రంథములలో పలుమారులు ప్రశంసింపబడినది. పండితుడు సంస్కృతాంధ్ర కర్ణాట భాషలలో నుద్దండ పండితుడే కాక ప్రశస్త కవి. ఈతనిని శివకవి యని, కవిమల్లుడని సోమనాథుడే తెలిపి యున్నాడు.

సంస్కృతమున నీతడు రుద్రమహిమ, పంచగద్యలు, అష్ట కములు మున్నగు రచనలు గావించి యున్నాడు. ఈతని తెలుగు రచనలలో ప్రధానమైనది శివతత్త్వ సారము. ఇది వీరశైవ మత గ్రంథములలో ప్రాథమికము, ప్రామాణి కమునై యున్నది. ఇందు మత తత్వ మంతయు కంద పద్య ములలో చక్కగా వివరింపబడినది. సోమనాథు డీ గ్రంథ మును యథామాతృకముగ వలసినచోట్ల తన పండితా రాధ్యచరిత్రమున పొందుపరచి యున్నాడు. ప్రస్తుత గ్రంథ ములో 489 కందము లున్నను కన్నడ భాషలో పండితునిచే రచితమైన శివతత్వసారముబట్టి చూడగా నిందు వేయి పద్యము లుండునని యూహించుటకు అవకాశము గలదు. కన్నడ గ్రంథమయినను పూర్తిగ లభ్యము కాలేదు. అతిగంభీరమగు మత విషయములను తేట తెలుగులో సులభ గ్రాహ్యముగను, ఇమిడికగను చెప్పు కవితా సామర్థ్యము పండితునియందు నిండారి యున్నది. ఇదియే కాక పర్వతవర్ణన యను నొక కృతియు, శ్రీగిరి మల్లికార్జున శతకమను నొక శతకమును నీతడు రచించియున్నాడు. పర్వత వర్ణన పండితారాధ్య చరిత్ర లోని పర్వత ప్రకరణమునకు మూలము. మల్లికార్జున శత కమున నొక్క పద్యము మాత్రమే లభించినది. ఈతడు పద కవితయందు కూడ ప్రవీణుడు. 'సిరిగిరి నుండెద శివశరణు' అను కన్నడ గౌడపదకృతి యీతని యంతిమ రచన.

ని. వెం. రా.

**పగటి వేషములు :** లోకవృత్తాంత దర్శకములుగా ప్రవర్తిల్లిన కళా విన్యాసములలో పగటి వేషములకు గల పేరు పెంపులు పెద్దవి. ప్రజలలో ధర్మనిష్ఠను, జ్ఞానతృష్ణను పెంపొందించుట కేర్పడిన మేల్కొలుపుల జోగయ్యలు, సంక్రాంతి పండుగనాటి సాతాని జియ్యరులవలె ఈ పగటి వేషధారులును విరామ మెరుగని ప్రజల జీవితమునం దణిగియున్న పరిహాసశీలతను, రసలోలుపతను ఆత్మ విమర్శన పద్ధతిని పుడికి పుచ్చుకొని తత్ ప్రదర్శనమూల ముగా సమాజ పురోభివృద్ధికి తోడ్పడువారు.

ప్రజా వినోదమునకును, తత్త్వ జిజ్ఞాసకును ఏర్పడిన పెక్కు కళా రూపములు రాత్రివేళయందే ప్రయోగింప బడుచున్నవి. పగటిపూట ప్రదర్శించుట కారణముగా ఈ వేషములకు పగటి వేషములను పేరు వచ్చినది. కాని ఈ నిర్వచనమున అవ్యాప్తి, అతివ్యాప్తి దోషములు లేకపోలేదు. రెడ్డి, పంతులు, పఠాను, మరాఠీదండు మొదలగు వేషములు రాత్రివేళల వేయబడినను అవియును పగటి వేషములుగానే పరిగణింపబడుచున్నవి. పగటివేషధారులే వీనిని ప్రదర్శించుచుందురు. రెడ్డి, పంతులు వేషములను కొన్ని ప్రాంతముల వాలకములని వ్యవహరింతురు.

పగటివేషధారణలో కూచిపూడి, గడ్డిపాడు భాగవతులు, క్రిష్టపాడు జంగములు జగమెరిగినవారు. తొలుత బ్రాహ్మణులే ఈ వృత్తిని అవలంబించినట్లును, అర్వాచీన కాలమున బ్రాహ్మణేతరులును కొందరు దీని నాశ్రయించి నట్లును తెలియుచున్నది. పగటివేషధారులకు చాల తావుల ఇనాము భూములు, హాస్యగాని మాన్యము, దొర మాన్యము కలవని తెలియుచున్నది. గడ్డిపాటి భాగవతులకు గోలకొండ సుల్తానులు మాన్యము లిచ్చి మన్నించిరని ఆ యా దాన పత్రములు తెలుపుచున్నవట. పగటివేషధారులు, సమష్టిగను వ్యష్టిగను తిరిగి ప్రదర్శనము లిచ్చు చుందురు.

ప్రయోగ యోగ్యమైన ఉత్తమ నాటకమువలె ఈ పగటివేషధారణ అన్ని పరీక్షలకు నిలువగలిగిన కళా ఖండము. సాహితీ రంగమున మహా కావ్యమునకు ఖండ కావ్యమువలె నాటకమున కిది రంగశాలతో పనిలేని ఏకాంకిక వంటిది. చతుర్విధాత్మకమైన అభినయమును దీన నిర్వహింపబడుచున్నది. ఆ యా వేషములకు కావలసిన ఆహార్య సామగ్రి పగటి వేషధారుల 'గణియము'న నుండును. తెలుగునేల నాలుగు చెరగులు తిరిగినవా రగుటచే అన్ని మండలముల 'యాస', మాండలిక పదములు వీరి కవగతములు; అన్ని వర్ణముల పలుకుబడులు, పడికట్టు పదములు వీరికి కంఠస్థములు.

పగటివేషములలో పాత్రోచితముగనే కాక ప్రకరణోచితముగను వాచికము నిర్వహింపబడుచున్నది. అన్ని మండలముల, అంతరువుల ప్రజలతో వీరికి గల పరిచయమే దీనికి మూలము. నడక తీరు, పలుకు పొంకము, కంఠధ్వని లోని విరుపులు, ఊపులు, నొక్కులు వీరికి వెన్నతో పెట్టిన విద్యలు. ప్రయోక్తలు సుశిక్షితులు. వీరి ప్రయోగ కౌశలము ఏండ్ల తరబడి గురుముఖమున గావించిన సాధనకు ఫలము. పరంపరాయాతమైన వృత్తి యగుటచే తత్సంబంధి సమస్త విజ్ఞానము వీరిలో జీర్ణించి యుండును.

సంఘములో సామూహికముగా వ్యాపించిన చెడుగులను, చెడుదారుల పెడదారుల బట్టిన సమాజశాసకులను, కుహనా సంస్కర్తలను ఆ యా పాత్రముల ముఖమున ఎత్తి చూపెట్టు నంశములే ఈ పగటి వేషముల కథన వస్తువులు. వారి వారి లోపములను, బలహీనతలను కాంతా సమ్మిత కావ్యములవలె విమర్శించి నయబోధచే సమాజ పథమును చక్కదిద్దుటలో ఈ వేషములు సాటిలేనివి. ఇందు హాస్యము ప్రధాన రసము. తక్కినవి గౌణములు. పగటి వేషము దీనికి పట్టుగొమ్మ. ఎంత పగ్గములు పట్టి లాగినను కొన్నికొన్ని చోట్ల ఈ హాస్యము అస్థానపతిత మగుట అనివార్యము. ప్రయోక్తల కక్కురితియు, ప్రేక్షకుల లౌల్యమును దీనికి కారణములు కావచ్చును.

పగటివేషధారులు అరువది నాలుగు రకముల వేషములు వేయుదురట. వానిలో బుడబుక్కల వేషము, సోమయాజి-సోమిదేవి, శారద వేషము, జంగము వేషము, కోమటి - లింగబలిజ వేషము, అర్ధనారీశ్వరుడు, బాపన వితంతువు, రెడ్డి, పంతులు, పఠాను,మరాఠీ, మాదిగవాడు మొదలగునవి కొన్ని. కొన్ని జట్టులవారు భారత భాగవత రామాయణములలోని కొన్ని ప్రధాన ఘట్టముల స్వీకరించి ఒక్కొక్క దృశ్యము నొక్కొక్కనాడు ప్రదర్శించెదరు. కొందరు దినమున కొక్కటి చొప్పున పది దినములలో దశావతార ప్రదర్శనములను పూర్తిసేయుదురు. వేష ప్రదర్శన సమయమున కాక, వేష ప్రదర్శనానంతరమున వీరు యాచన సేయుదురు. అ. రా. కృ. ; తూ. దో.

సంఘమునందలి దురాచారములను బయలుసేయుటకే పగటి వేషములు పుట్టినవి. అయ్యవి హాస్యరస పరిప్లుతములుగా నుండుటచే నెవరి మనసునకు నొప్పి కలిగింపక యే సంఘమును సంస్కరింప సాధనములుగా నేర్పరచినట్లు కనబడును.

రాత్రివేళ పెద్ద పెద్ద దీపముల వెలుతురున వేషములు వేసి ప్రజలను నమ్మించుటకంటె పట్టపగలు వేషము వేసి నమ్మించుట మహాకష్టముగదా! అట్టి కష్టాతికష్టమగు

విద్య ఆంధ్రదేశమున కూచిపూడి బ్రాహ్మణవంశములలో తొలుత నవతరించిన దందురు. తరువాత గోదావరీ మండలమందలి కాకరపఱ్ఱు గ్రామ మా విద్యకు గురుకుల మైనది. ఆ రెండుచోట్లను సుశిక్షితు లైనవారే యావ దాంధ్ర దేశమున దమ విద్యను బ్రదర్శించి గ్రామీణుల చేతను, పౌరులచేతను మహారాజుల చేతను ఆదరమును బడయగల్గిరి. బైరాగి వేషము మొదలుకొని శారద వేషముదాక నున్న ముప్పదిరెండు వేషములు గ్రామ గ్రామములలో ప్రదర్శించి ప్రజల మెప్పును బొంది సంఘ మును సంస్కరింపబూనుకొను వీరి వేషము లాంధ్రుల ప్రత్యేకత కొక చిహ్నమని చెప్ప వచ్చును. వీరు వేయు వేషము లన్నియు పగటియందలివే యైనను, పంతులు పఠాణీ వేషము, అర్ధనారీశ్వరి వేషము, దాదినమ్మ వేషము మాత్రము రాత్రివేళ ప్రదర్శింప బడును.

ఈ వేషములు వేయుటలో కూచిపూడి యందలి హరి వారు, వేదాంతమువారు ప్రసిద్ధులు. గోదావరీ మండల మున పాలంకి నారప్ప, రావూరి సూరయ్య, వేదుల బాపయ్య, భాగవతుల కోనయ్య, కాలనాథభట్ల వెంకయ్య మొదలగువారు ప్రసిద్ధి వహించి కీర్తిశేషులైనారు. వారి కా విద్యయందు పరిపూర్ణత యుండుటచే ఎట్టి కఠోర పరీక్షకైనను నిలువగలిగెడివారు. అంతదాక మనతో మాటాడిన వ్యక్తియే వేషము ధరించి వీథిలోనికి వచ్చుసరికి నడక, మాట, చూపు, రూపు మారిపోయి యెవరో క్రొత్త మనుష్యుడు అనిపించునంతగా నభినయింపగల నేర్పు వారియం దుండెడిది. ఆ విద్య నేర్చుకొనుటలో పొందిన గురువుల శిక్ష యట్టిది.

మొట్టమొదట బైరాగి వేషముతో జట్టంతయు నొక గ్రామమునకు వచ్చి యింటింటికి నేగి గ్రామీణుల నందరను భ్రాంతి గొల్పి తుదకు వాస్తవమును జెప్పి వారి యనుమ తిపై పరికరములతో నా గ్రామమున బసచేసి వరుసగా నన్ని వేషములు వైచి ఆ యా వేషముల సంబంధమగు గ్రంథము నంతయు గ్రామస్థుల సభయందు వివరముగా వినిపించి యా వేషములతో నింటింటికి వెళ్లి ఆబాల గోపాలమునకు కొంత కొంత వేష సంబంధమగు విషయ మును వివరింతురు. తుట్టతుదను శారదా వేషము. దీని యందు 'ఓ శారదా! కరుణానిధే' అను మకుటము గల యక్షగాన రూపమగు రామాయణ గాథను లయ సమ న్వితముగా గాన మొనర్చుచు స్త్రీ వేషముతో ప్రతియింటి కేగి గృహస్థు లొసంగు బహుమతులను గ్రహించి యా వేషధారులు గౌరవపూర్వకమగు గ్రామీణుల యనుమతిని బొంది మరొక గ్రామమున కరుగుదురు.

బైరాగివేషమున బైరాగులు చూపు మాయను చమ త్కారముగ దెలుపుదురు. కోమటి వేషమున వర్తకము నందు కోమటు లాడు యుక్తి మాటలు, వారి ధనాకర్షణ మందలి నేర్పు హాస్య ముప్పొంగ ప్రదర్శింతురు. సోమ యాజులు, సోమిదేవి వేషమున వైదిక సంఘములోని లోపములను వెల్లడింతురు. తర్క వ్యాకరణాది షట్ఛా స్త్రము లందలి వివాదములు, చతుర్వేదముల స్వరూపము, పద క్రమ జటా ఘనాది వికృతులు, షోడశ కర్మములు చేయించుట మున్నగు వైదిక తంత్ర మంతయు వికట ములు, హాస్యరసపూరితములు నగు తెలుగు సంస్కృత ములు కలసిన విచిత్ర మంత్రములతో నడపింతురు. ఈ స్మార్తకర్మలను చేయించు ఘట్టమందే కోనసీమ వేదపండితు లచే కాలనాథభట్ల వెంకయ్య శాలువజోడు బహుమానము నందిన ఘనుడు. ఇంత శ్రోత్రియ సంభాషణమున కలవడిన యాతడే మరునాడు గొల్లవేషము వేసి గొల్లని యమా యికపు మాటలు పలుకుచుండ, చూడ వచ్చిన గొల్లలు కొందరు తమవానిగా నెంచి మాటాడబోవ సభయంతయు గొల్లుమనిరి. గారడీ వేషమున నతడు చూపు నింద్రజాల మత్యద్భుతము. జేంద్రవేషమున బట్టలనేత, బట్టల అమ్మకము, కోడి పందెములు, త్రాగుడు, శివపూజ విచిత్ర హాస్యముతో ప్రదర్శింపబడును. అందొకటి రెండు తావుల హాస్యము ముదురుపాకమున నడచును. పెద్ద వేషములలో పెద్దవి పంతులు, పఠాణి వేషములు. పంతులు దివాను; వ్యాపారి బ్రాహ్మణుడు; పఠాణి సుల్తాను; మహమ్మ దీయుడు. ఒక మహమ్మదీయ ప్రభువు, అతని దివాను ఏ రీతిగ వేశ్యాభోగలోలురై రాజ్య వ్యవహారములను చూచుకొనక భ్రష్టులైరో యీ రెండు వేషములు తెలుపును. ఇవి యొక రాత్రియే వరుసగా ప్రదర్శింపబడును. దివాను పంతులకు గుమాస్తా చిట్టిపంతు లుండును. పంతులు వేశ్యా లోలుడై వర్తకులను, వ్యవసాయదారులను బాధించి యేరీతిగ ధనమార్జించునో, ఆర్జించిన యా ధన మంతయు నెట్లు వేశ్యల పర మొనరించునో చూపబడును. రైతులు వితంతు మాన్యముల శిస్తు లీయక యెట్లు బాధింతురో, భట్రాజులు యాచనకు వచ్చి యెట్లు పీడింతురో చూప బడును. తుదకు దివానుగారి దివాలాతో ఆ ఘట్టము పూర్తి యగును. రాత్రి ఒంటిగంటకు పఠాను వేషము వచ్చును. అతనికి గులా మొక డుండి వేశ్యలను, పరకాంతలను తార్చుచు ధనము హరించుట చూపబడును. పఠాను వేష మున రమారమి ముప్పది నలువది యంగరఖాలైన ధరింప వలెను. పైనుండి లోనికి వెళ్ళుకొలది వెల తక్కువవి యుండును. ఆడెడు భోగకాంతల కొక్కొక్క హారము,

నొక్కొక్క యంగరఖా, చొప్పున పతా నిచ్చివేయు చుండును. తుట్టతుదకు ఫకీరువేషమున కనువగు తెల్ల అంగరఖాయు, తెల్లని, పచ్చని పూసలపేర్లు మిగులును. ఫకీరులు పాడునట్టి 'దిందీం అల్లావ్ దిందీం అల్లావ్ యాఖుదస్త హై మహమ్మద్ రసూనిల్లావ్' అను పాటను పాడుకొనుచు వెడలిపోవును. ఇది ప్రభువులకు, ప్రధానులకు నెంతో నీతిబోధకమగు వేషము. అర్ధనారీశ్వర వేషమును రాత్రివేషమే, సగమాడు వేషము, సగము మగవేషము. ఆ రచన యనితర సాధ్యము. ఇందు బ్రహ్మచారి రూపమున వచ్చిన శివునితో పార్వతి భాషించుట, తుద కిరువురును నొకటి యగుట చూపబడును. ఇంకను దాదినమ్మ వేషము మొదలగునవి యిట్టివే. వెం. సూ. శా.

**పట్టాభిరామశాస్త్రి, జానపాటి** (క్రీ.శ. 1874-1945): వీరిది హరిత సగోత్రము; ఆపస్తంబసూత్రము. వీరి తండ్రి లక్ష్మీనారాయణ; తల్లి పేరమ్మ. వీరి నివాసస్థానము గుంటూరు జిల్లా పలనాడుతాలుకా జానపాడు.

వీరు రామడుగు వెంకయ్యశాస్త్రిలుగారు మున్నగు మహామహుల యొద్ద గురుసేవ యొనర్చి వ్యాకరణాది జ్ఞానవిశిష్ట సంస్కృతాంధ్ర భాషా సాహిత్యములందు నేర్పు గడించిరి; ప్రబంధ రచనానువాదాది శక్తి సహితమగు వష్టావధా నాశుకవిత్వాదిక మలవరచు కొనిరి.

ఆమరణాంతము వీరు అభినవ సరస్వతీ పత్రికాధిపతిత్వ, సంపాద కత్వములను వహించినవారు. వీరి కృతులు - అనువాదములు : నాగర ఖండము, స్వర్ణకార వ్యవహారము, పుళిందావివాహము, వర్ణ వ్యవస్థ, జాతక చర్య మున్నగునవి. అ. వా. శా.

**పట్టాభిరామశాస్త్రి, వేదము** (క్రీ. శ. 1760-1820): ఈతడు పుదూరి ద్రావిడ శాఖా బ్రాహ్మణుడు; నెల్లూరి జిల్లా, ఆత్మకూరు తాలూకా విరూరు గ్రామవాసి. సంస్కృతాంధ్రములయందు, ధర్మశాస్త్రములయందు చాల పరిశ్రమ చేసిన విద్వాంసుడు. మరియు తమిళభాష యందు తిరుక్కురళ్ మొదలగు ప్రాచీన గ్రంథములను చదివి యా భాషయందును ప్రావీణ్యమును సంపాదించెను. ఈతని పాండిత్యమునకు, బహుభాషా వేత్తృత్వమునకు మెచ్చి, ఆ కాలమున కుంపిణీ ప్రభుత్వమువారు తాము 1812 లో నెలకొల్పిన ఫోర్టు సెంటు జార్జి కళాశాలలో ప్రధానాంధ్ర పండితునిగ నియమించిరి. అత డా పనియందు ఎనిమిదేం డ్లుండి 1820 లో కీర్తిశేషు డయ్యెను.

ఆ కాలమున ఆ కళాశాలకు అధ్యక్షులుగా నున్న యఫ్. డబ్ల్యు. ఇల్లిస్‌గారు బహుభాషావేత్తలు. వారు ద్రావిడ భాషా పరిశోధనమును పట్టాభిరామశాస్త్రిగారి తోడ్పాటుతో సాగించిరి. వారి యాదేశమున శాస్త్రి గారు తెనుగున 'ధాతుమాల'ను వ్రాసిరి. అది పొర పాటున చిన్నయసూరి కృతముగా ముద్రితమైనది. ధాతు మాలనే కాక ఆయన పద్యాంధ్ర వ్యాకరణమును, పట్టాభి రామ పండితీయమను పేర ఆంధ్రశబ్దచింతామణికి ఒక పెద్ద వ్యాఖ్యానమును రచించిరి. అన్నింటికంటె ముఖ్యముగా తిరుక్కురళ్‌లోని కొన్ని తమిళ పద్యములకు వీరు సంస్కృతానువాదము గావించిరి. ఇంగ్లీషువారి పరి పాలన ప్రారంభమున పేరెక్కిన పండితులలో పట్టాభి రామశాస్త్రిగారు ప్రథమ గణ్యులు. ని. వెం. రా.

**పద్మాకరుడు** (క్రీ. శ. 1753 - 1833): ఇతడు హిందీ మహాకవులలో ప్రసిద్ధి వడసిన ఆంధ్రుడు. ఇతని పూర్వులు గోదావరీ మండలమునుండి ఉత్తర హిందూ స్తానము వెళ్ళి అచటి రాజులకు గురువులైనారు. పద్మాకరుని తండ్రి మనోహరలాలు భట్టు హిందీ సంస్కృత భాషలలో మంచి పండితకవి; మంత్రవేత్త. ఇతనికి బుందేలు.ఖండములో సాగర గ్రామమున 1753 వ సంవత్సరములో పద్మాకరుడు కలిగినాడు. అతడు సంస్కృత ప్రాకృత హిందీ భాషలలో గొప్ప పాండిత్యము సంపాదించి మంచికవి యైనాడు; మంత్రతంత్ర శాస్త్రము లభ్యసించి ప్రవీణుడైనాడు; ఇతడు అనేక సంస్థానాధి పతులచే ఆదర సమ్మానములు పొందినాడు. బుందేలుఖండ 'సుగ రాకుల పహాడ్' పాలకుడు అర్జునసింగు తన దర్బారులో గొప్ప సమ్మానముచేసి ఇతనిని సత్కరించినాడు. లక్ష్మణ సింగు పద్మాకరుని శిష్యుడు. అతని రాజవంశమునకు పద్మాకర వంశజులే రాజగురువులు.

క్రీ. శ. 1801 లో జయపుర రాజ్య సింహాసన మెక్కిన ప్రతాపసింహుడు పద్మాకరుని తన యాస్థాన కవిగా చేసుకొని గౌరవించాడు. కాని 1803 లో ప్రతాపసింహుడు కాలధర్మము పొందినాడు; రాణికూడ సహగమనము చేసినది. తరువాత సింహాసన మెక్కిన జగత్సింహుడు పద్మాకర కవిని ప్రతాపసింహునికంటె అధికముగ ఆదరించి గౌరవించాడు. అతని కోరిక ప్రకారమే అతనిని కథా నాయకుని చేసి పద్మాకరుడు 'జగద్వినోద'మని ఒక మహా కావ్యము రచించాడు. ఇది హిందీ రీతికావ్యాలలో ఉత్తమ శృంగార కావ్యము. ఈ కావ్యము విని జగత్సింహుడు పద్మాకరునికి 12 లక్షల రూపాయలూ; 12 ఏనుగులూ, 12 గ్రామాలూ బహుమానమిచ్చాడు.

క్రీ. శ. 1818 లో జగత్సింహుడు కాలధర్మము పొందిన తర్వాత జయపుర సంస్థానమును విడిచిపెట్టి పద్మాకరుడు గ్వాలియరు సంస్థానము చేరినాడు. గ్వాలియరు మహారాజు

దౌలతరావు సింధియా పద్మాకర మహాకవిని పల్లకి ఎక్కించి ఏనుగులు, గుర్రాలు, మొహరులు ఇచ్చి ఆదరించినాడు. దౌలతురావు పేర పద్మాకరుడు 'ఆలీజాహ ప్రకాశ' కావ్యము వ్రాసినాడు. గ్వాలియరులోనే పద్మాకరుడు 'ఊరాజీ' అనే దాక్షిణాత్య పండితుని ప్రోత్సాహముతో హితోపదేశమును హిందీలోనికి అనువదించినాడు.

గ్వాలియరునుండి పద్మాకరుడు చరఖారి సంస్థానానికి వెళ్ళినాడు. ఆ సంస్థానాధిపతి రత్నసింహుడు పద్మాకర మహాకవికి స్వాగత మివ్వలేదు. కోపముతో పద్య మొకటి వ్రాసి పంపి పద్మాకరుడు చరఖారినుండి వెళ్ళిపోయినాడు. పద్య మందుకొని రత్నసింహుడు పశ్చాత్తాపపడి అతనిని సగౌరవముగ ఆహ్వానించినాడు. కాని పద్మాకరుడు వెళ్ళలేదు.

చివరి దినాలలో పద్మాకరుడు రాజ సంస్థానాలు రోసి వైరాగ్యము స్వీకరించి గంగాతీరములో నివాస మేర్పరచుకొన్నాడు. అతడు 'గంగా లహరి' వ్రాసిన దక్కడనే. ఇదివరలో చెప్పినవికాక 'హిమ్మత్ బహదర్ బిరుదావళి', 'రామరసాయన్, ప్రబోధపచాసా' అనేవి పద్మాకరుని గ్రంథాలు. ఉత్తర హిందూస్తానంలో నేటికి అతని చాటువులు బహుళ ప్రచారంలో ఉన్నాయి. పద్మాకర కవి తన జీవిత కాలములో 56 లక్షల రూపాయలూ, 56 గ్రామాలూ, 56 ఏనుగులూ సంస్థానాధీశ్వరులవల్ల గడించినాడు. కాని అతడు గతించేనాటికి ఏమీ అతనికి మిగల లేదు. పు. అ.

**పరకాలస్వామి, కృష్ణబ్రహ్మతంత్ర:** (జననము వికారి సంవత్సర జ్యేష్ఠ శుక్ల పంచమి; మరణము ఆనంద నామ సంవత్సర కార్తిక బహుళ పంచమి). స్వామివారు యావదాంధ్ర ప్రశస్తిగాంచిన పండితకవులు; ప్రఖ్యాతులగు శ్రీనివాస తాతాచార్యులవారి కుమారులు. వీరి పూర్వాశ్రమ నామము హాసనదుర్గము కృష్ణమాచార్యులు. వీరి కుమారులు శ్రీనివాస రాఘవాచార్య, దేశికాచార్యులిరువురును పండితకవులు. శ్రీవారు కర్నూలు మండల మందలి పేపలిలో విద్యాభ్యాస మొనర్చిరి. సుప్రసిద్ధ వైయాకరణులగు అయోధ్య కొండమాచార్యులు వీరి గురువులు. స్వామివా రఖండ పాండితీ వైభవము కల వారు; గొప్పకవులు. వీరు తెలంగాణ మందలి వనపర్తి, గద్వాల, ఆత్మకూరు సంస్థానము లన్నియు తిరిగి అనేక సత్కారములు, సన్మానములు పొందిరి. వారు తమ పూర్వాశ్రమమున కొన్నాళ్ళు వనపర్తిలో ధర్మాధికారిగా నుండి ఆ యాస్థాన ప్రభువునుగూర్చి రామేశ్వర విజయచంపు వను ప్రబంధము నిర్మించిరి. ఆత్మకూరు సంస్థానమందున్న శ్రీనివాసస్వామివారిపై చెప్పిన మరియొక ప్రబంధము శ్రీనివాస విలాస చంపువు. స్వామివారి హంస సందేశవ్యాఖ్య పండితుల మన్నన లందుకొన్నది. వీరు హయగ్రీవ స్వామిని లక్ష్యముగా పెట్టుకొని శతాలంకారముల లక్ష్యలక్షణ సమన్వయముగల 'అలంకార మణిహార'మను శాస్త్రగ్రంథమును రచించిరి. గద్వాలలో కార్తికమాసమున జరిగెడు ఉత్సవములను వర్ణించుచు రచించిన గ్రంథము కార్తికోత్సవ దీపిక. లక్ష్మీసహస్ర వ్యాఖ్య, నృసింహవిలాసచంపువువంటి వీరి యముద్రిత రచనము లెన్నియో కలవు. వీరు తమ నలుబదియవయేట ఆశ్రమ స్వీకారము చేసిరి. మైసూరులోనున్న పరకాల మఠాధిపతులగు శ్రీ రంగనాథ స్వామివారు శ్రీవారి పాండిత్య నీతి నియమములచే ముగ్ధులై తమ తరువాత వీరిని మఠాధికారిగా నియమించిరి. శ్రీవారు సుమారు ముప్పదియైదు సంవత్సరములు మఠాధిపతులుగానుండి విజ్ఞాన బీజములు వెదజల్లిరి. శ్రీవారికి 'విద్వత్కవి సార్వభౌమ', 'కవిగండభేరుండా'ది బిరుదులు గలవు. శ్రీవారి ముద్రితాముద్రిత రచనములు కొన్ని: శ్రీ పరకాల గురువిజయము, రఘునాథ విజయము, రంగరాజ విలాసము, నృసింహ విలాసము, కేశవోత్సవ మాలిక, శ్రీ లక్ష్మీసహస్రమ్, రసాస్వాదిని, ఆచార్యవేదపాదస్తవ వ్యాఖ్యానము, నవరత్నహారస్తవ వ్యాఖ్యానము, కావ్యోత్కర్ష రక్షా, సరస్వతీ మూలధనమ్, శ్రీకృష్ణజయంతీ పౌర్వాపర్య నిర్ణయమ్, శిష్టసిద్ధాంత పద్ధతి, శూద్రాశీర్నిర్ణయము, కర్తృక్రమ నిర్ణయము, స్వయంవ్యక్త ప్రతిష్ఠా నిర్ణయమ్, అధికమాసోత్సవ నిర్ణయమ్, సోదరకన్యాద్వయ వివాహనిర్ణయమ్, అతిక్రాంత శ్రాద్ధకాల నిర్ణయమ్, వివాహకాల నిర్ణయమ్, ప్రపన్నాభరణమ్, వృత్తి ముక్తాహార స్తుతివ్యాఖ్యానమ్, సుభద్రా పరిణయమ్, విక్రాంత రాఘవమ్, ఉన్మత్త పాండవమ్ మొదలైనవి. వీరు అసంఖ్యాకములగు స్తోత్రములు రచించిరి.

ఇవికాక ఇంకను అహ్నికరత్నమ్, మేఘమాల, సమయామృతమ్, సూర్యోపరాగ దర్పణమ్, రాజవంశరత్నావళి, కల్యాణగీతమంజరి, ఉత్తరరంగ మాహాత్మ్యమ్, శ్రీ రామాయణ వైభవమ్, శంభురహస్యమ్, శ్రీ శరదంబుజమాలా, శ్రీ సర్వర్తు కుసుమమాలా, శ్రీ రామచంద్ర మంగళ మాలికా వంటి వివిధములగు రచనము లనేకములు స్వామివారి బహుముఖప్రతిభను చాటునట్టివి. బి. రా. రా.

**పరశురామ పాత్రో, అన్నెము:** ఈయన బరంపురము న్యాయవాదులలో ప్రముఖుడు; ఆంధ్ర ముఖ్యులలో నొకడు; పూర్వము కాంగ్రెసు పక్షమున నుండి తరువాత

మితవాది పక్షమున జేరి పేరుగాంచిన రాజకీయవాది యయ్యెను. గ్రామములకు సంబంధించిన ఆర్థిక, స్థానిక పరిపాలన, సారస్వత, పారిశుద్ధ్య విషయములను చక్కగా అధ్యయనము చేసి, అవగాహన మొనరించుకొని, ఆయా విషయములం దుపయోగకరములగు పుస్తకముల నీయన వ్రాసెను. వీరి గ్రంథములలో 'రూరల్ ఎకనమిక్సు' అనునది యొకటి.

ఈయన గంజాం మండలము నందలి స్థానిక పరిపాలన సంస్థలలో పాల్గొని ఇరువది యారు సంవత్సరముల కాలము ప్రజాహితమునకయి కృషి చేసెను. గంజాం మండలము నందలి ప్రజలకు ప్రతినిధిగా 1921 లో మదరాసు రాష్ట్ర శాసన సభకు సభ్యత్వమును వహించెను; 1921 మొదలు కొని 1926 వరకు మదరాసు రాష్ట్రమున మంత్రియై విద్య మున్నగు శాఖలకు సంబంధించిన వ్యవహారములను నిర్వహించు చుండెను; 1927 మొదలుకొని కేంద్ర శాసన సభకు సభ్యుడై యుండెను. 1931 లో జినీవాలోని లీగ్ ఆఫ్ నేషన్సుకు భారత దేశ ప్రతినిధిగా ఎన్నుకొన బడెను; ఆ సంవత్సరము, మరు సంవత్సరము జరిగిన రౌండ్ టేబిల్ మహాసభకు భారత దేశ ప్రతినిధిగా ఎన్నుకొనబడెను జస్టిస్ ఉద్యమ అఖిల భారత సంఘమునకు నాయకుడుగా ఎన్నుకొన బడెను. 1930 లో డిల్లీలో జరిగిన అఖిల పక్ష సమావేశమున కీయన అధ్యక్షుడుగా ఎన్నుకొన బడెను. మదరాసు యూనివర్సిటీ 1923వ సంవత్సరపు పునర్నిర్మాణము చట్టము రూపొందుట కీయన బాధ్యుడు.

ఈయనకు బ్రిటిష్ ప్రభుత్వము వారు రావు సాహెబ్ బిరుదమును, 1920 లో రావుబహాదర్ బిరుదమును, 1935 లో సర్ (నైట్ కె. సి. ఐ. ఇ.,) బిరుదములను ఒసగి గౌరవించిరి. క. స. నా.

**పాపయారాధ్యులు, ములుగు :** (క్రీ. శ. 1778 - 1852) : వీరు ద్వాదశారాధ్యులలో నొకరగు వేమనారాధ్యుల వంశమునకు జెందినవారు. కౌండిన్యసగోత్రులు. వీరి మొదటి నామధేయము సంగమేశ్వర శాస్త్రి. వీరి స్వగ్రామము చింతపల్లి. తరువాత అమరావతీ వాసులైరి. పాపయారాధ్యులు అక్కమాంబా సంగమేశ్వరారాధ్యులకు పౌత్రులు; భ్రమరాంబా వీరనారాధ్యులకు పుత్రులు.

వీరు ఉభయ భాషలయందును నిండైన సాహిత్యము, ఉభయ వ్యాకరణములందును మెండైన పాండిత్యమును గలిగి, రెండు భాషలయందును ఆశు కవితాదక్షులై, శరపరంపరగా గృతి రచనను నిర్వహించిన మేటి.

అంతియగాదు, వీరు పరమ మాహేశ్వరులు, పరదేవతోపాసకులు, యోగసాధనా ప్రవీణులు, మంత్రశాస్త్రవేత్తలును. సంస్కృతాంధ్రములలో గ్రంథములు రచించుట యందును, పఠన పాఠనాదులు నెరపుట యందును, అమితమగు ప్రజ్ఞ గలవారై, శతాధికముగా గృతులను రచించి వందలకొలది శిష్యులను దయారొనర్చిరి.

వీరు 1. కల్యాణ చంపువు, 2. ఏకాదశీవ్రతచంపువు, 3. ఆర్యాశతీ శివస్తోత్రము మున్నగు సంస్కృత గ్రంథములను, 1. సర్వమధురము, 2. సరస హృదయానురంజనము, 3. దేవీ భాగవతము, 4. అహల్యా సంక్రందన విలాసము, 5. వేమనారాధ్య చరిత్రము, 6. శంతను చరిత్ర, 7. ఘూర్జర చరిత్ర, 8. ఇంద్రాత్మజా పరిణయము మొదలగు తెనుగు రచనలను సంతరించిరి.

వీరు అమరావతి నేలిన వాసిరెడ్డి వెంకటాద్రి నాయనింగారికి (క్రీ. శ. 1756 - 1816) గురువులుగను, ఆస్థాన కవి పండితులుగను వన్నె కెక్కిరి. రాయలవారికిని పెద్దనామాత్యునకును గల సంబంధ మెట్టిదో, వీరికిని రాజా వెంకటాద్రి నాయనింగారికిని గల సంబంధ మట్టిది. కాని ఈయన యాప్రభుని పేర నేకావ్యము నంకిత మొనర్చినట్లు కన్పట్టదు. వెంకటాద్రి నాయనింగారి దత్త పుత్రులగు జగన్నాథరాయల ప్రార్థన ననుసరించి దేవీ భాగవతమును శ్రీ కాశీవిశ్వనాథాంకితముగా వెలయించిరి.

వీరి రచనలను బరికించినచో పాపయారాధ్యుల వారు అఖండమైన పాండిత్యముగలవా రనియు, వశ్యవాక్కు లనియు, పవిత్రజీవను లనియు, మాహేశ్వర దీక్షితులయ్యు శివకేశవుల యెడ నద్వైతభావము గల వారనియు దెల్లమగును. వీరు తమ రచనల చేతను, పాండిత్య ప్రకర్ష వలనను, 'అభినవ కాళిదా' సనియు, 'పుంభావ సరస్వతి' యనియు పేరు వడసిరి. క్కొ. జో. శ.

**పాపయ్యశాస్త్రి, బులుసు** (క్రీ. శ. 1815-1885) : వీరు అమలాపురము తాలూకా అయినవల్లి గ్రామములో జన్మించిరి. వీరి తండ్రి అచ్చయ్యగారు యజుర్వేదము ప్రధానముగా చతుర్వేదములను, మీమాంసలను పురాణములను, ధర్మశాస్త్రమును, శ్రౌతస్మార్త కర్మకాండలను నేర్చిన మహా విద్వాంసులు. వీరి యొద్దనే పాపయ్య శాస్త్రిగారు పై విద్యల నన్నిటిని నేర్చిరి. ముప్పది సంవత్సరముల వయస్సు వచ్చుసరికి వీరు విద్యాభ్యాసము ముగించి మైసూరున కేగి విద్యారణ్య వేదభాష్యము నధ్యయనము చేసిరి. మైసూరు ప్రాంతవాసులును, మహారాజులును శాస్త్రిగారి పాండిత్యమున కాశ్చర్యపడి బహుభంగుల సమ్మానించిరి. శాస్త్రిగారు హైదరాబాదులోను, వివిధాంధ్ర మండలములలోను మహాసభలను జరిపి విజ్ఞాన గోష్ఠుల నెరపుచు సకల జన సత్కారములను పొందుచు

చాలకాలము సంచారము చేసిరి. వేదార్థము చెప్పుటలో వీరు నిరుపమానమైన ఖ్యాతిని సంపాదించిరి. శాస్త్రిగారు మైసూరు మహారాజుల వలన పొందిన సమ్మానము త్వరలోనే యాంధ్రదేశ మంతయు విదితమాయెను. శాస్త్రిగారు లీలావతీ గణితముపై చేసిన ఉపన్యాసములను విని మహారాజు రజతచ్ఛత్రమును, దుశ్శాలువలను, గుర్రమును, దక్షిణను సమ్మానముగా నిచ్చి బెజవాడవరకును తన మనుష్యుల నిచ్చి సాగనంపెను. పిఠాపురమహారాజగు గంగాధర రామారావుగారు శాస్త్రిగారినిగూర్చి తెలిసికొని అయినవల్లిలో వారి పూరింటిలోనే శాస్త్రిగారిని దర్శించి, తాము ధన మొసగుదు మనియు, దానితో చక్కని భవనమును నిర్మించుకొనవలసిన దనియు శాస్త్రిగారిని ప్రార్థించిరి. ఎంతో బ్రతిమాలగా శాస్త్రిగారు చివర కంగీకరించిరి. మహారాజుగా రయిదువేల రూపాయల నొసగిరి. దానితో శాస్త్రిగారు గృహ నిర్మాణము చేసికొనిరి. పిమ్మట మహారాజుగారు శాస్త్రిగారికి వానపల్లి గ్రామములోని 176 యకరముల భూమి నొసగిరి. అది కాక గంగాధర రామారావుగారు శాస్త్రిగారి నేఁటేటను 1116 రూపాయలతో సత్కరించుచుండిరి. ఇదే సత్కారమును విజయనగర సంస్థానము వారును, బొబ్బిలి సంస్థానము వారును చేయుచుండిరి. ఏఁటేట నొక్కొక్కసారి శాస్త్రిగా రీసంస్థానముల తిరుగుటలో మార్గవశమున ఎన్నియో పట్టణములను చూచుచు వేదార్థ ప్రవచనముచే ప్రజల నుద్దీపింపఁజేయుచునుండిరి.

శాస్త్రిగారి వేదార్థ ప్రవచనములో వారి సకల శాస్త్ర విజ్ఞానము వెల్లడి యగుచుండెను. వారికి విసుగు లేకుండ నెన్ని గంటలైనను గహనమైన వేదవిషయములను సభ్యులానందపారవశ్యముతో వినునట్లు చెప్ప నేర్పుండెను; సందర్భమును బట్టి సంగ్రహముగను ప్రసంగించుచుండిరి. ఒకప్పుడు ఆనందగజపతి మహారాజుగారు రెండువందల మంది విద్వాంసులును, వేయిమంది సామాన్య జనులును గల సభలో 'ఏ కార్యమైనను ఆశీర్వచనమును యజుర్వేదముతో ఏల ప్రారంభింతురు ?' అను ప్రశ్నను విద్వాంసుల ముందు పెట్టిరట. సమాధానము రాలేదు. అంత పాపయ్యశాస్త్రిగారినే సంబోధించి యడిగిరట. 'తస్య యజురేవ శిరః' అని యొక్క వేదవాక్యము లోనే శాస్త్రిగారు సమాధాన మిచ్చిరట.

కాశీలో గొప్ప ధర్మశాస్త్ర సందేహములను పరిష్కరింపవలసి నప్పు డచ్చటి పండితులు పాపయ్యశాస్త్రిగారి యభిప్రాయమును తీసికొనుట పరిపాటిగా నుండెను. జ. పు.

**పాపరాజు, కంకంటి :** క్రీ. శ. 17 వ శతాబ్దపు ప్రారంభములో నెల్లూరి మండలములోని ప్రళయ కావేరి అను ప్రదేశమున అమీన్ పదవియందున్న యీ కవి 'విష్ణుమాయా విలాస' మను యక్షగానమును రచించి, ఉత్తర రామాయణమును సంస్కృతమునుండి ఆంధ్రీకరించెను. ఈత డారువేల నియోగి బ్రాహ్మణుడు; శ్రీవత్స సగోత్రుడు, ఆపస్తంబసూత్రుడు. ఈతని తండ్రి అప్పయామాత్యుడు; తాత అయ్యనమంత్రి; తల్లి నరసమాంబ; పితామహి నరసమాంబ. ఈతడు నియోగుల ప్రజ్ఞా విశేషమును, ప్రాభవమును, గుణగణమును సగర్వముగా వర్ణించుకొన్నాడు.

ఇతనికి నెల్లూరు మండలాంతర్గతమైన మోడేకుంట గ్రామనివాసియు, భర్తృహరి నీతిశతకము నాంధ్రీకరించి సమీరకుమారవిజయ మను కావ్యమును వ్రాసినట్టియు పుష్పగిరి తిమ్మకవి సమకాలికుడు,

పాపరాజుకు శ్రీ మదనగోపాలస్వామి ఉపాస్య దైవతము. తదనుగ్రహముచే నితనికి చతుర్విధ కవిత్వమునందు ప్రజ్ఞ కలిగినది. ఈతడు రాజనీతికోవిదు డనియును, గణిత శాస్త్ర పారంగతు డనియును తోచును. లౌకికు డగుటచే జనరంజనార్థము విష్ణుమాయావిలాసమును యక్షగాన విధానమున రచించి విద్వత్కవి యగుటచే ప్రౌఢరసిక ప్రమోదార్థము ఉత్తరరామాయణమును గంభీరవాగ్గుంభనలతో విరచించెను. మంత్రోపాసకు డగుటచే మదన గోపాలమూర్తి యీతనికి స్వప్నమున సాక్షాత్కరించి కర్తవ్యము నుపదేశించెను.

తాను ఉత్తర రామాయణమును రచించుటకు ప్రధాన కారణములను పాపరా జిట్లు చెప్పినాడు :

'పరమశ్రావ్య మపూర్వయామితకథాభవ్యంబు దివ్యత్సుధీ
పరిషత్సంతతసేవ్య, మబ్జభవసంభావ్యంబునై మించు ను
త్తర రామాయణ కావ్యమున్ మృదువచోధారార్థసందర్భని
ర్భరతత్త్వరసముల్ రహింప రచియింపం బూనితిన్ వేడుకన్.'
'మానక కర్మభూమిపయి మానుషదేహముతో హితాహిత
జ్ఞాన మెఱుంగు బ్రాహ్మణుఁడు చారుకవిత్వము నేర్చిజానకీ
జానికథల్ రచింపక, యసత్కథ లెన్ని రచించెనేనియున్
వాని వివేక మేమిటికి, వాని కవిత్వ మహత్వ మేటికిన్ ?'
'ఇహపరసాధకం బన రహించు ప్రబంధ మొనర్ప శ్రీరఘూ
ద్వహుని చరిత్రమున్ దొరకె......'

ఈ యుత్తర రామాయణమును పాపరాజు తన యిష్ట దైవతమును, మదనగోపాలరూపుడు నగు కృష్ణభగవానునకే అంకితము చేసి ధన్యుడయినాడు.

రామాయణమున ఏడవకాండమగు ఉత్తర రామాయణము సంస్కృతమున నాలుగువేల శ్లోకముల గ్రంథము. తిక్కన సోమయాజి నిర్వచనోత్తర రామాయణముగా దాని నాంధ్రీకరించి పది యాశ్వాసములలో 1260 పద్య

ములలో ముగించెను ; పాపరాజు ఎనిమిది యాశ్వాసము లలో 3000 పద్య గద్యములలో ముగించినాడు. తిక్కన సంక్షేపించినాడు. పాపరాజు విపులీకరించినాడు.

నిజగ్రంథము కృష్ణప్రీతిభాజనమగు ననుటకు శ్లేషోక్తిగ పాపరా జిట్లు చెప్పినాడు :

'వైదర్భీ విలసద్విలాసమునఁ జెల్వం బూని, సత్యోక్తి నెం
తే దీపించి కళిందజోజ్జ్వలరసాప్తిన్ మించి, భద్రాత్మకం
బై దివ్యద్యుతి నలక్షణాశ్రయసమాఖ్యం గాంచు మత్కావ్య మా
హ్లాదం బిచ్చు గ్రహింప కృష్ణునకు నర్హంబే కదా యెయ్యెడన్.

తిక్కన్న తన నిర్వచనోత్తర రామాయణమున రామ నిర్యాణము వర్ణింపలేదు. భారతమున శ్రీకృష్ణ నిర్యాణము చెప్పినాడు.

సుప్రసిద్ధములైన ఉత్పల, చంపక, మత్తేభ, శార్దూలాదులు విశేషముగాను, చాల కొలదిగా పంచచామర, భుజంగప్రయాత, సుగంధి, తోటక, ఉత్సాహ, మత్తకోకిల, మాలిని, కమల విలసిత, పృథ్వి, మానిని, కవిరాజ విరాజిత, స్రగ్ధర, మహాస్రగ్ధరా, లయగ్రాహి, లయవిభాతి, క్రౌంచ పద వృత్తములును ఉత్తరరామాయణమున కానవచ్చు చున్నవి. పాపరాజు రెండు తావుల రగడలను, ఒకచో దండకమును వాడినాడు. ఒక్కచోట మత్తేభగర్భిత సీసపద్యము గలదు. ఇరువది తావుల సుదీర్ఘ గద్యములు కానవచ్చుచున్నవి. వచన రచనలోకూడ కంకంటి కవి గట్టివాడు. యమకము, ముక్తపదగ్రస్తము మొదలగు శబ్దచిత్రములతో నలరారు వచన భాగములు వీనుల విందు గొలుపుచుండును.

ఉత్తర రామాయణమును పాపరాజు విస్తరముగా, వివిధ వర్ణన భాసురముగా, సమగ్ర సుందరముగా ప్రబంధ విధానమున నిబంధించినాడు. కావ్య శరీరమున కనువగు సకల లక్షణములు నిందు కానబడును. తెనుగు నుడికారమును తీరుగా గూర్చుటలో నేర్పు ప్రస్ఫుటమైనను సంస్కృతపద గుంఫనలందును, సమాసఘటనమునందును శక్తి మహా విశేషముగా గోచరించును.

రామాయణములో కేవలము క్రూరాత్ములుగను, రాక్షసులుగను కానబడు రావణాదులు ఉత్తర రామాయణమున మానవులుగను, బంధుప్రీతి గలవారుగను, ధీరులుగను, సాహసికులుగను గానబడుచున్నారు. వీరివి కొన్ని కొన్ని యుత్తమ గుణములు వర్ణింపబడినవి.

గ్రంథములో అన్ని రసములకును స్థాన మున్నను శృంగార వీర కరుణములకు ప్రాచుర్యము కలదు. సంభాషణములు సాగించుటలో కవి కడు నేర్పు చూపినాడు. ప్రబంధ రీతిలో రచింపబడిన యీ గ్రంథము వెన్నెలకంటి సూరన కవికృత విష్ణుపురాణము తరువాత రసవంతమైన పురాణ కావ్యము. శి. శం. స్వా.

**పార్వతీశము, ఓలేటి** (క్రీ.శ. 1889 - 1955) : వీరి జన్మస్థానము తూర్పు గోదావరి జిల్లా, పిఠాపుర ప్రాంత మందలి కొమరగిరి. వీరు నియోగి శాఖీయ బ్రాహ్మణులు; గౌతమసగోత్రులు ; తండ్రి అచ్యుతరామయ్య, తల్లి వెంకమ్మ. వీరు ఆంధ్ర దేశమున కవిరాజ హంసలుగా ప్రసిద్ధి నందిన 'వెంకట పార్వతీశ్వర' కవుల జంటలో నొకరు ; బాలాంత్రపు వెంకటరావుగారు రెండవవారు. వీరిర్వురును పిఠాపుర పరిసర గ్రామవాసులు. 1908 వ సంవత్సరము వరకు నొకరి నొక రెరుగనివారు.


చిత్రము 167.
ఓలేటి పార్వతీశము

ఆ కాలములో విమర్శకాగ్రేసర నడకుదుటి వీరరాజు పంతులుగారు పిఠాపురములో విద్వజ్జన మనోరంజనీ ముద్రాలయము నెలకొల్పి యాంధ్ర సారస్వత సేవ చేయుచుండిరి. పంతులుగారే వీరిద్దరి నొకరి కొకరిని బరిచయ మొనర్చి సంధానము చేసిరి. నాటినుండియు వీరిర్వురు నేకమై 'వెంకట పార్వతీశ్వర' కవులైరి.

వీరు కలిసిన నాటినుండియు నిద్ద రొక్కరై గ్రంథరచన మొనర్ప గడగిరి ; సంస్కృతాంధ్రములలో దిట్టలై వంగ భాషను గూడ నధ్యయన మొనర్చిరి. క్రీ. శ. 1911 వ సంవత్సరములో 'ఆంధ్రప్రచారిణీ గ్రంథమాల'ను నెలకొల్పి దీని ద్వారమున వీ రనేకములగు గ్రంథములను వెలయించిరి. వంగభాషనుండి పెక్కునవలలను తెనుగులోని కనువదించిరి. వానిలో వీరి స్వంత రచనలు కొన్ని. ఇవికాక ఖండకావ్యములను, నాటకములను రచియించిరి. పద్యకావ్యములలో కావ్యకుసుమావళి, బృందావనము ఏకాంతసేవ ప్రసిద్ధమైనవి నాటకములు - ధనాభిరామము వెంకటరావుగారి ప్రత్యేక రచన ; తారాశశాంకము, సువర్ణమాల పార్వతీశ్వరకవిగారి ప్రత్యేక రచనలు. వీరు రచించిన స్వతంత్ర నవలలలో మాతృమందిరము ప్రత్యేకముగ పేర్కొన దగినది.

వీరి రచనయం దన్నిట నొకక్రొత్త దనమును, వింత చెలువమును నెలకొన్నవి. వీరి సారస్వత సేవను, నవ్య

రీతులలో కవితారచనను గాంచి నరసరావుపేటలో జరిగిన ఆంధ్ర సారస్వత పరిషత్తున వీరికి 'కవిరాజహంస' బిరుద మొసగి యాంధ్రలోకము గౌరవించినది. 1943 లో రాజమహేంద్రవరమున వీరికి షష్టిపూర్తి మహోత్సవము జరిపి 'కవికులాలంకార' బిరుద మొసగ బడినది. వీరు రామాయణము నాంధ్రీకరింప దొరకొని కొంతవరకు రచన సాగించిరి. కొ. జో. శ.

**పార్వతీశ్వరశాస్త్రి, మండపాక** (క్రీ.శ.1833-1897): వీరిది విశాఖమండలములో బొబ్బిలి తాలూకాకు జెందిన పాలతేరు గ్రామము. అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి, మాడభూషి వేంకటాచార్యులు, కొక్కొండ వెంకటరత్నం పంతులు మున్నగువారు వీరికి సమకాలికులు. శాస్త్రిగారిది సుప్రసిద్ధమైన వెలనాటి కుటుంబము; ఆపస్తంబసూత్రము; పారాశరగోత్రము; తండ్రి కామకవి, తల్లి జోగమ్మ; వీరిది పండిత వంశము.

పార్వతీశ్వరశాస్త్రిగారు బాల్యములో కొంతకాలము తండ్రిగారియొద్దనే చదివి, తరువాత తాతా సూర్యనారాయణశాస్త్రిగారికడ విద్యాభ్యాసమొనర్చి, పిమ్మట త్రైప దేవేంద్రస్వామివారి నాశ్రయించి వేదాంతవిద్య నధ్యయన మొనర్చిరి. అనంతరము స్వయముగ కృషి యొనర్చి సంస్కృతాంధ్రములలో గొప్ప పాండిత్యము గడించిరి.



చిత్రము 168.
మండపాక పార్వతీశ్వరశాస్త్రి

వీరు శతాధిక గ్రంథ కర్తలు. వీరి రచనలలో శతకము లధికసంఖ్యాకములు. వీరి గ్రంథములలో ఉపలభ్యములు - వచనకావ్యములు: యయాతి చరిత్ర, గురుచిత్ర కథ, లఘుచిత్రకథ, బొబ్బిలి మహారాజవంశావళి; పద్యకావ్యములు: రాధాకృష్ణ సంవాదము, బొబ్బిలి మహారాజ వంశావళి, ఉమాసంహిత, కాంచీమాహాత్మ్యము, అమరుకము, అక్షరమాలికా నిఘంటువు; సంస్కృత రచనలు: గుణశ్లోకాది చిత్రరచన, కవితావినోదకోశము, సీతా నేత్ర స్తుతి, కాశీశ్వరాష్టకము, మంగళాష్టకచతుష్టయము, వేంకటగిరిప్రభుద్వ్యర్థి శ్లోకకదంబము. ఇవిగాక శతకములు, దండకములు, మాలికాకృతులు ననేకము.

శాస్త్రిగా రుభయభాషా పాండిత్యనిధులై, చతుర్విధ కవితా నిపుణులై, సమస్యాపూరణమున నసమాన ప్రతిభ గడించి విజయనగరము, వేంకటగిరి మున్నగు సంస్థానములలో నద్భుతమగు కవితానైపుణిని బ్రదర్శించి, ఆ సంస్థానాధిపతుల మెప్పును మన్ననలను బడసి, బొబ్బిలిసంస్థానమునందు వెంకట శ్వేతాచలపతి రంగారావు బహద్దరు వారి కాలమున (క్రీ. శ. 1876-1897) ఆస్థానవిద్వాంసులై వన్నెకెక్కిరి.

వీరు ఆశు, చిత్ర, బంధ, గర్భ కవిత్వముల నిర్వహించుటయందద్భుత ప్రతిభ కలవారు; భాషావిషయికములగు వాదోపవాదములందు దిట్టలు. 'ఆత్మచర్యా' యనదగు హరిహరేశ్వరశతకము వీరి వివిధ విద్యానైపుణ్యములను బ్రదర్శించు చరిత్రవంటిది. వీరి రాధాకృష్ణసంవాదము, కృష్ణాభ్యుదయము, అమరుకమును ఆంధ్ర దేశమున మంచి ప్రశస్తిగాంచినవి. కొ. జో. శ.

**పిచ్చుకగుంట్లు**: వీరిని తీరు తీరులుగా పిచ్చకుంట్లు, పిచ్చుకకుంట్లు, భిక్షుకుంట్లు అని అందురు. పాల్కురికి సోమనాథుని కాలమునగూడ నీ జాతి యున్నట్లు పండితారాధ్యచరిత్రము వలన దెలియనగును. 'పిచ్చుకకుంటుపై బ్రహ్మాస్త్రము' మనుమాట సాహిత్యమున వీరి యంగ వికలతా దౌర్బల్యమును సూచించును. భిక్షుకుంట్ల శబ్దముకూడ కలదు. కాబట్టి పిచ్చుక యనునది తొలుత భిక్షుక శబ్దమై యుండును. కుంటిభిక్షుగాండ్రు రానురాను పాటలు పాడుచు పొట్టవోసికొనువారుగా పరిణమించి యుండుదురు.

వీరు ప్రధానముగా కాపులను (రెడ్లను) 'అడిగికొని' జీవింతురు. కాపుల కులగోత్రములు, వంశావళులు వీరు వల్లింతురు. తరువాత గొల్లలనుకూడ యాచించుట మొదలిడిరి. వీరు లక్ష్మమ్మ, కామమ్మ, బాలనాగమ్మ, సరోజమ్మ, రాములమ్మ, సోమనాద్రి, సదాశివరెడ్డి, పర్వతాల మల్లారెడ్డి, సూర్యచంద్ర రాజులు, హరిశ్చంద్ర మున్నగు కథాగేయములు పాడెదరు.

వీరి జాతి పుట్టుకగూర్చి రెండు వింత కథ లున్నవి. త్రిమూర్తుల వివాహవేళ వారి గోత్రములు చెప్పగలవాడొకడు కావలసి వచ్చెను. అప్పుడు వా రొక మట్టి బొమ్మను చేసి దానికి ప్రాణము పోసిరి. బొమ్మను చేయునప్పు డొకకాలు కుంటిగా నుండెను. కనుక నాతని సంతాన మంతయు పిచ్చుకగుంట్లయిరట. మరియొక కథలో నొకప్పు డేడుగురు గొల్లభామలు సంతానమునకై శివునిగూర్చి తపమొనర్చిరి. శివుడు వారి కొక కుంటిపిల్లవాని నిచ్చెను. వారు వాని బెంచుచుండి గర్భిణులై ఏడుగురు స్త్రీ శిశువులను గని శివునాజ్ఞచేత తమ తమ బిడ్డల నాతని కిచ్చి వివాహముచేసిరి. శివు డా కుంటివానికి

శంఖము, గంట, ఎద్దు, త్రిశూలము ఇచ్చి బిచ్చమెత్తి జీవించు మనెను. కుంటివా డాయెద్దు నెక్కి శూలము ధరించి, శంఖ మూదుచు గంటగొట్టుచు బిచ్చమెత్తువాడు. వాని సంతానమే పిచ్చుకగుంట్లు. ప్రతి పిచ్చుకగుంటు తన జాతినిగూర్చి ఈ కథలను జెప్పును. కాపు, గొల్లల సంతానమే పిచ్చుకగుంట్లయి యుందురని యూహింపవచ్చును.

పిచ్చుకగుంట్లలో 1. గొల్ల, 2. తెలగ, 3. గంట, 4. తురుక, 5. తొగరు, 6. మంద, 7. తిత్తి యను ఏడుపజాతు లున్నవి. తొగరువా రందరికన్న తక్కువవారు. గంట, తిత్తియను పేరులు వా రుపయోగించు వాద్యముల వలన వచ్చి యుండును. ఒకరితో నొకరికి వియ్యము లుండవు. ఒకే శాఖలో వివాహము లుండును. గంటెడువారు, బండారువారు, సింగమువారు, పిడమువారు, అంతుగలవారు మున్నగా గలవి వీరి గోత్రనామములు. ఇక వారి ఇంటిపేరులు తాళ్ళవారు, గండిసరివారు, కుంకులవారు, బాణమువారు మున్నగునవి.



చిత్రము 169. పిచ్చుకగుంట్లు

పిచ్చుకగుంట్లు సాధారణముగా శైవులు. మల్లికార్జునుడు వీరి యారాధ్య దైవతము. వీరు పోచమ్మ, ఎల్లమ్మ, ఇడమ్మ మున్నగు క్షుద్ర దేవతలను గూడ గొలుతురు. వీరికి జంగములు గురువులును, పురోహితులును. ఆయా దేవతలమీదుగా స్త్రీలను జన్నెవిడుచుట కలదు. శవములను ఖననము చేయుట పరిపాటి. సాంఘిక వ్యవస్థయందు శారదకాండ్రకు, వీరముష్టులకు నున్న గౌరవమే వీరికిని కలదు. వీరు మద్యమాంసములు బహుళముగా వాడెదరు. వీరిలో కొందరు పందులను గూడ పెంచెదరు.

కాపులను, గొల్లలను యాచించుటే తొలుత వీరి ప్రధానవృత్తి. కాని వారి బిరుదావళులతోపాటు తదితరుల కథలుకూడ చెప్పుచు, అందరిని యాచించుటకు మొదలిడినప్పటినుండి వీరి వాద్యములును గంట, తిత్తినుండి శారదకాండ్ర వాద్యములవరకు పెరిగిపోయినవి. బి. రా. రా.

**పిన వీరభద్రకవి, పిల్లలమఱ్ఱి:** ఈ విద్వత్కవి నివాసము నెల్లూరు మండలములోని బిట్రగుంటకు సమీపమందలి సోమరాజుపల్లె కాని, తత్ ప్రాంతముగాని కావచ్చునని కొందరు విమర్శకు లన్నారు. కాని హైదరాబాదు సంస్థానములోని పిల్లలమఱ్ఱి యను గ్రామము తన్నివాస మనియు, గ్రామనామమునుబట్టి గృహనామ మేర్పడిన దనియు వేరొకకొంద రనిరి. ఈతని తల్లి నాగమాంబ, తండ్రి గాదయామాత్యుడు, అన్న పెదవీరన్న, గురువు భారతీతీర్థులు.

సామాన్యముగా కవులు తమయిష్టదేవతాప్రసాదము వలన కవిత్వ మలవడెనని చెప్పుదురు. ఈతడు భారతీతీర్థ శ్రీచరణకరుణాపాత్రుడైనట్లుచెప్పుకొనుటవలనను, 'భావజ్ఞులకు పరా పశ్యంతిమధ్యమా వైఖరులేదేవి వర్ణసరళి' అనుటవలనను ఇతడు మంత్రోపాసకుడనియు తంత్రరహస్యవేత్త యనియు చెప్పవచ్చును. ఈతని తండ్రియు, తాతయును కవులే. పినవీరన నియోగియని కొందరును, వైదికుడని కొందరును వ్రాసిరి. ఇతడే శాఖవాడైనను ఉత్తమకవి.

నవరసదర్పణము, నారదీయము, మాఘమాహాత్మ్యము, మానసోల్లాసము మొదలగు గ్రంథములు తాను రచించినట్లు పినవీరభద్రకవి చెప్పుకొన్నాడు. అయ్యవి నేడు కానరాకున్నవి. ఇప్పు డున్న వెల్ల జైమిని భారతమును, శకుంతలా పరిణయమును.

ఈతడు శృంగార శాకుంతలమును సోమరాజుపల్లి నివాసి యైన చిల్లర వెన్నయామాత్యునకు కృతియిచ్చినాడు; జైమిని భారతమును విజయనగరప్రభు వైన సాళువగుండ నరసింహరాయలకు అంకిత మిచ్చెను. నరసింహరాయలు క్రీ. శ. 1487 నుండి క్రీ. శ. 1490 వరకు రాజ్యపరిపాలనచేసి యుండుటచేత వీరభద్రకవి అప్పుడు వర్ధిల్లినవాడు. శ్రీనాథునివలె పినవీరన విద్వత్కవి యని ప్రసిద్ధుడు.

'వాణి నారాణి' అని యాత డన్నట్లు ప్రతీతి. ఇందు రాణి యనుమాటకు భార్య యను నర్థము కొందరు భావించినారు. అది పొరబాటు. రాణికి అర్థము తనను పాలించు ప్రభ్వి దేవత యని. 'ప్రణవపీఠమున మంత్ర పరంపరలు కొల్వ నుండు నేదేవి పేరోలగమున.... అ మ్మహాదేవి వాగ్దేవి నభినుతింతు'అని యాతడు స్తుతించుటచే వాగ్దేవీభక్తు డనుట విశదము. మంత్ర, తంత్ర శాస్త్రము లలో దేవతకు రాజ్ఞి యను సంజ్ఞ కలదు.

వీరన భారత, అభిజ్ఞాన శాకుంతలములనుండి కథాంశ ములను గ్రహించి స్వాభిమత ప్రకారముగ మార్పులు చేయుచు రచన చేసినాడు. భారతమున శకుంతలయే తన చరిత్ర చెప్పుకొన్నది. అభిజ్ఞానశాకుంతలమున అనసూయా ప్రియంవదలు శకుంతలా వృత్తాంతము చెప్పి నారు. ఈ కావ్యములో కణ్వుని శిష్యుడు శకుంతల చరిత్రను రాజుతో చెప్పును. భారతములో అనసూయా ప్రియంవదలు లేరు. నాటకమున వా రిరువురు శకుంత లను ఆశ్రమోపాంతమువరకు ననుసరింతురు; ఈ కావ్య మున దుష్యంతుని యాస్థానికిగూడ పోవుదురు. అంగు ళీయక శాపవృత్తాంతములు భారతమున లేవు; నాటక మున నున్నవి. నాటకమున అంగుళీయకము జారిపోయి నీటిలో పడి చేపలవానికి దొరికి రాజుచేతికి వచ్చును. ఈ కావ్యమునం దా ప్రస్తావన లున్నవి. కాని ఉంగరము శకుంతల వ్రేలనే యుండును. ఇట్లు వీరభద్రకవి కొన్ని కొన్ని మార్పులుచేసి నాటకమునుండి కొన్ని పద్యముల నాంధ్రీకరించినాడు శకుంతలా పరిణయ కావ్యమున నాలుగాశ్వాసములు, 770 పద్యములును గలవు.

సంస్కృతమునుండి జైమినిభారతము నీత డాంధ్రీ కరించినాడు. భారతాశ్వమేధపర్వ కథయే ఇందలి వృత్తము. ఇందు అద్భుత వృత్తాంతము లెన్నో కలవు. దీనిలో శ్రీకృష్ణుని మహిమ విశేషముగా వర్ణింపబడినది. బభ్రువాహనచరిత్రము, ప్రమీల వృత్తాంతము, చంద్ర హాసుని చరిత్రము కలవు. సంస్కృత మాతృక లభింప కుండుటచే ఆంధ్రీకరణ విధానమునుగూర్చి చెప్పుట కవ కాశము లేదు.

వీరభద్రుని శైలి సంస్కృతాంధ్రపదసమాస సమ్మేళన ముతో మనోహరముగా నుండును. ఈతనికి శ్లేష మీద ప్రీతి కలదు.

'కువలయ మనోజ్ఞయును స
త్కవిసేవితయును సుధాప్రకాశయునై రా
ఘవు కీర్తి బోలు జాహ్నవి
నవనిజ గని ధన్యనైతి నని కొనియాడెన్'.

ఈయన కవిత్వము రమణీయమార్గమున నడచుచు గంభీర తాత్పర్యాలంకృత మయి యుండును. ఈయన జైమిని భారతమున ఎనిమిది యాశ్వాసములును, 1475 గద్యపద్య ములును గలవు. ఈ పినవీరభద్రునిది కవి వంశము. ఈతడు, ఈతని యగ్రజుడును, ఈతని జనకుడును కవిత్వ మును చెప్పినవారు. శి. శం. స్వా.

**పుదుకోట్టై ఆంధ్రులు :** భారత దేశమునందలి స్వదేశ సంస్థానములు రద్దు కాకపూర్వము తిరుచిరాపల్లికి దక్షిణమున పుదుకోట్టై యనునది ఏకైక తమిళ సంస్థా నమై యుండెను. తత్పరిపాలకుడు ప్రాచీన చోళ, పాండ్య సామ్రాజ్యాధిపతుల యాధునిక ప్రతినిధిగా పాటింపబడుచు వచ్చెను. తంజావూరికిని, తిరుచిరాపల్లికిని చాల సమీపము నను, మధురకు 75 మైళ్ళ దూరమునను ఉండిన ఈ పుదు కోట్టై ఆ నగరములతోపాటు తమిళ సంస్కృతి కేంద్ర ముగా ప్రాధాన్యము వహించియుండెను. తొండమాను ప్రభువులు సహజముగా తమిళభాషా పోషకులు. కాని ఈ సంస్థానమునకు తంజావూరితో సన్నిహిత సంబంధ ముండుటచే తెలుగు, మహారాష్ట్ర భాషలుకూడ నిచట నధికముగా నాదరింపబడుచుండినవి. సంస్థాన ప్రజల జీవి తముమీదను, భావములమీదను చిరకాల మీ రెండు భాషల - అందు ప్రధానముగా తెలుగు ప్రభావము కలదు.

పుదుకోట్టై పరిపాలకునియొక్క పూర్వుడు పల్లవుల కాలమునాటివా డనవచ్చును. ఇతడు తొలుత పల్లవుల వెంబడి దక్షిణమునకు వచ్చి, తరువాత చోళులకు ప్రఖ్యా తులైన రాజ్యాంగ నిర్వాహకులను, సేనాపతులను సమ కూర్చిన తొండైమానుల సంతతికి చెందినవాడు. ఈ తెగ వారిలో నొక కుటుంబము తంజావూరు జిల్లాలో ఆగ్నేయ దిశనున్న అరంతాంగి యను చిన్న రాజ్యమును పాలిం చెను. ఇంకొక కుటుంబము అరంతాంగికి సమీపముననే ప్రకృతము అంబుకోవిల్ అనబడుచున్న అంబుంబిల్‌కు ఆధిపత్యము వహించి యుండెను. క్రీ. శ. 17 వ శతాబ్దము ప్రారంభమున అంబుంబిల్ కుటుంబమునకు చెందిన రఘు నాథ తొండమానుడు పుదుకోట్టై పట్టణమును స్వాధీనము చేసికొని సంస్థానమును రూపొందించెను. అతని సమకాలికు లగు మధుర, తంజాపుర నాయకులు ఈ తొండమానుని సాహాయ్యమును పొందుచుండిరి. అతని పరాక్రమమును మెచ్చి విజయనగర చక్రవర్తి శ్రీరంగరాయలు అతనికి రాయరాహుత్తరాయ, వజ్రిడురాయ, మణ్ణిడురాయ మున్నగు పెక్కు గౌరవ బిరుదముల నొసగెను. అతని ప్రశస్తిని తెలుగు భట్రాజులు గానముచేసిరి. కవచముమీద ధరించు జలతారు బుటేదారి యాయుధపట్టి కాలంకృత

మగు అతని యంగీమీద 'శ్రీ బృహదంబాసహాయము' అనియు, అచ్చట చెలామణీలో నున్న చిన్న రాగి నాణెము మీద 'విజయ' అనియు తెలుగు లిపిలో నున్నది.

తొండమానులు సంస్థానమును కట్టుదిట్టము చేయుటకు పూర్వము అందలి కొన్ని భాగములు మధుర నాయకుని రాజభక్తితో సేవించునట్టి మరుంగాపురి బుచ్చినాయకులు, కుమరవాడి లక్కయ్యనాయకులు, కరిశల్ పట్టి వారా ప్పూరు బొమ్మినాయకులు, ఇలుప్పూరు కామాక్షీ నాయకులు అను పాళెగాంధ్ర స్వాధీనమున నుండెను.

సంస్థాన ప్రజలలో నొక భాగమున, కొలదిపాటియే యైనను, స్పష్టమయిన ఆంధ్ర మిశ్రణము కానవచ్చు చున్నది. తెలుగు బ్రాహ్మణులలో పూర్వము సివిలు, సైనిక ఉద్యోగములం దుండిన నియోగులును, వైదికులు (పురోహితులు)ను గలరు. తొలుత ఆంధ్ర దేశములో స్థిర పడి, అచ్చట తెలుగు భాషను అభ్యసించి, వారి ఆచార ముల నవలంబించి తరువాత తమిళదేశమునకు వచ్చిన కోనసీమ (కోనసముద్రం) ద్రావిడ కుటుంబములే కాక, ములికినాడు, వెలి(వెల)నాడు, వేగి(వెంగు)నాడు, కరణ కమ్మకుటుంబములును కలవు. తెలుగు బ్రాహ్మణుల యాచారములను కొన్నింటి నవలంబించిన తెలుగు కమ్మకు (కమ్మరు)లును కలరు. ఇటీవల కొంతకాలమువరకు వారు తమిళ కమ్మకులతో సహపంక్తి భోజనము కాని, వివాహ సంబంధము కాని చేయువారు కారు. స్థానికముగా వడుగరు (ఉత్తరాదివారు) అనబడు బలిగ(? బలిజ)లు తమకు నాయక రాజులతో సంబంధము గలదని సామాన్య ముగా చెప్పుదురు. కాని వారిలో విజయనగర సైన్యముల వెంబడి వచ్చిన కాపు, రెడ్డి, కమ్మ, వెలమ మొదలగువారి నుండి యేర్పడిన మిశ్రజాతి యొకటి కలదు. ఆదిని ఆయుధ జీవనులై యుండిన ఆ జాతివారు తరువాత సాధుజీవనులగు కర్షకులైరి. ఈ సంస్థానములో గాజుల కాపులు పెంపొందించిన గాజుల పరిశ్రమకు వైత్తూరను గ్రామము కేంద్రమై యున్నది. చిల్లర సరకులను తిరిగి అమ్మ జనప్పనులును, జెట్టీ లను మల్లవిద్య వృత్తిగా గల వారును ఈ సంస్థానమున కొద్దిగా నున్నారు. సైన్యవర్గము నకు చెందిన రాజులు, కాపు కమ్మ వెలమలును గొప్ప గౌరవముతో జూడబడు కులములు. వీరు ఏ కులమున కా కులములోనేకాని ఇతర కులములవారితో వివాహ సంబంధములు చేయరు. రాజులు జందెములు వేసికొందురు. పెండ్లివేళ ఖడ్గమును పూజింతురు. ఇంగ్లీషువారిచే క్రీ. శ. 1816 లో కండిపట్టణమునుండి సకుటుంబ బాంధవము రాజ కీయ బందీలుగా పుదుకోట్కటకు పంపివేయబడిన వీరు తాము కడపటి కండిరాజునకు సంబంధించినవారమని చెప్పు దురు. వీరి తెగ చాల చిన్న దొకటి యున్నది. ఈ తెగ స్త్రీలు తమ కులీనత కుపలక్షణముగా బంగారు వీరమద్దియ లను కాలి బొటనవ్రేలికి తొడుగుకొందురు. భట్రాజులు ప్రశస్తి పాఠకులు. తోటీలలో తెలుగు మాటాడుచు తమ కులములోనే వివాహ సంబంధములు చేసికొనుచు పేరు చివర నాయక పదమును చేర్చుకొను తెగ యొకటి యున్నది. వీధులు రోడ్లు ఊడ్చు ఒడ్డరులలో కొందరు తెలుగువారు. తాదనులు తిరునామములు పెట్టుకొని పాటలు పాడుచు ఊరూర తిరుగువారు. రాహుత్త (తెలుగు ఆశ్వికుడు) శబ్దభవమైన రౌతు అనునది సామాన్య మైన ఉపనామము. ఈ తెగలవారు మాటాడు తెలుగు అంత్య ప్రత్యయములు కలిసిన తమిళ పదములతో గూడి యున్న ఇంచుమించుగ ఒకవిధమైన గ్రామ్యము.

సాళువ నాయకుడు, గోప తిమ్మయ్య, సాళువ నర సింహరాయల సోదరుడు తిమ్మరాయలు, తుళువ నర సింహరాయల మంత్రులు కొందరు, నరసింగనాయకుడను నామాంతరము గలిగి పుదుకోట్కట రాజ్యమున కధిపతిగ నుండిన చెల్లప్ప అనువారు పుదుకోట్కట శాసనములలో పేర్కొనబడిన ప్రముఖ విజయనగర నాయకులు.

కళలకు, సాహిత్యమునకు ఆంధ్రులు చేసిన సేవో దంతము మనోహరమైన చరిత్ర. స్థానికులగు తెలుగు నాయకులు తమిళ కవులను పోషించినట్లు సంస్థాన శాసన ములవలన తెలియుచున్నది. బాలకృష్ణ చొక్కనాథ లక్కయ్యను ఒకతమిళకవి ప్రశంసించుచు వ్రాసిన శాస నము కలదు. మరియొకటి వెంకట నాయకుడు పాండి కవిరాశను తమిళకవికి భూదానము చేసినట్లు తెలుపు చున్నది.

క్రీ. శ. 16-17 శతాబ్దులలో పుష్పించిన తంజావూరు సాహిత్యశాఖ పుదుకోట్కట సంస్థానముమీద కూడ తన పరిమళమును విరజిమ్మినది. అఖిలిఖితమైన ఈ పుదుకోట్కట రాజవంశమువారి తొట్టతొలుతటి చరిత్ర తెలుగుకవి వెంకన్న (క్రీ. శ. 1769 - 89) రచియించిన తొండమాను వంశావళి. ఇతని కుమారుడు సాంబయ్యా తొండమాను విజయమును రచించెను. వెంకన్న తన 'ఆంధ్ర భాషార్ణ వము' అవతారికలో తొండమానువంశమునందలి ప్రముఖ పరిపాలకులలో నొక్కడైన విజయ రఘునాథ తొండమానుని పరాక్రమము నభివర్ణించినాడు. మాతృ భూతమయ్యా, సుప్రసిద్ధవైణికులు పచ్చిమిరియం ఆది యప్పయ్య, అతని కుమారుడు కృష్ణయ్య, ఇతని కుమా రుడు సుబ్బుకుట్టిఅయ్యా అనువారు పుదుకోట్కట సంస్థానా

స్థానమున మాననీయులగు సంగీత విద్వాంసులై యుండిరి. వీరు తెలుగు వాగ్గేయకారులు. సుప్రసిద్ధుడగు త్యాగరాజు ఈ యాస్థానమునకు విచ్చేసెనట. ఆ సమయమున అద్భుత విషయ మొకటి జరిగినట్లు పరంపరగ చెప్పబడు నైతిహ్య మొకటి కలదు. సంస్థానాధిపతి తన యాస్థాన సంగీత విద్వాంసుల కొక వింత పరీక్ష పెట్టెనట; వెలిగింపని దీపమును వారి నడుమ నుంచి ఎట్టి దాహక పదార్థములను ఉపయోగింపక గానమహిమచే దానిని వెలుగజేయవలెనని వారిని కోరెనట. త్యాగరాజు జ్యోతిస్స్వరూపిణియను రాగము నాలాపింపగా సభ యబ్బురపోవునట్లు దీపము తనంత రగిలి, రాగారోహణావరోహణ క్రమమున కనురూపములగు మార్పులతో ప్రజ్వరిల్లుచుండెనట. నేటికిని తెలుగున ఒకటి రెండు పదములను పాడక యే పురాణ కథా కాలక్షేపమును జరుగుట లేదు. జీవనాళములు కదిలించివేయు భద్రాచల రామదాసు కీర్తనలు ఇచ్చట చాల జనరంజకముగా నున్నవి. పుదుక్కోట ప్రభువులు స్వయముగా తెలుగున మంచి పాండిత్యముగలవారు. క్రీ. శ. 19 వ శతాబ్ది ఉత్తరార్ధమున సంస్థాన పరిపాలకుడై యుండిన రామచంద్ర తొండమాను ప్రభువును కవిగాయక బృందము పరివేష్టించి యుండెడిది. వీరిలో ననేకులాంధ్రులు. వారి కుటుంబము లిప్పటికిని పుదుక్కోట నగరమున నున్నవి.



చిత్రము 170. విజయరఘునాథ తొండైమాను

విరాహిమలయందలి సుప్రసిద్ధ సుబ్రహ్మణ్య దేవాలయమున లక్కయ్య నాయకులు, బుచ్చినాయకులు కట్టించిన సుందర మండపము లున్నవి. మధురయందలి మీనాక్షీ దేవాలయముయొక్క వాస్తు శిల్ప సంపద్వైభవమునకు లఘుప్రతికృతియైన అమ్మన్‌కురిచిలోని మీనాక్షీ సుందరేశ్వరుల దేవాలయము క్రీ. శ. 1691 లో బుచ్చినాయకునిచే నిర్మింపబడినది. ఈ యాలయమునందలి ముందరి మండపమున తిరుమల బుచ్చినాయకుడు, ఓవల బుచ్చినాయకుడు అను నిరువురు వీర బుచ్చినాయకుల విగ్రహములతో శిల్పాలంకృతములై పసందైన పోగర పనిగల గొప్ప శిలాస్తంభములు గలవు. ద్రావిడ దేవాలయ వాస్తుపద్ధతి యందలి మధురా సంప్రదాయమునకు ఈ యాలయము చక్కని యుదాహరణము. మధురాధిపతుల సంస్కార సంపన్నమగు వదాన్యతను ప్రతిస్పర్ధించుచు వారి తెలుగు సామంతులు దక్షిణ దేశమున కళలను, దేవాలయవాస్తువును పోషించుటలో వారికి సమకాలీనులైన తమిళ సామంతుల కెంతమాత్రము వెనుకబడి యుండలేదు. కె. ఆర్. వెం. రా.

**పున్నయ్య, కోటంరాజు** (క్రీ. శ. 1885-1948): విశ్వవిద్యాలయ యోగ్యతలు లేకుండా, మెట్రిక్యులేషన్ పరీక్షలోకూడ ఉత్తీర్ణుడు కాకుండా, తెలుగు పత్రికారచనతో ప్రారంభించి, ఇరవై సంవత్సరాలు ఆంగ్ల దిన పత్రికా సంపాదకులుగా పరాయి రాష్ట్రములో, పరాయి

ప్రజల మధ్య మెలగి, గౌరవాన్ని సంపాదించి, ఆ రాష్ట్ర రాజకీయ, సాంఘిక జీవనములో పలుకుబడి సంపాదించిన గొప్పతనం, గౌరవం ఒక్క పున్నయ్యగారికే దక్కింది.

పున్నయ్యగారు పుట్టింది చీరాలలో. ఆయన పుట్టిన సంవత్సరం భారత జాతీయ చరిత్రలో చిరస్మరణీయమైనది. మన దేశానికి స్వాతంత్ర్యం సంపాదించిన ఇండియన్ నేషనల్ కాంగ్రెసు ఆ సంవత్సరమే మొట్టమొదట బొంబాయిలో సమావేశమైనది.

పున్నయ్యగారు బాపట్ల, గుంటూరు పట్టణాలలో విద్యాభ్యాసం చేసి, మెట్రిక్యులేషన్ పూర్తి చేయకుండానే బొంబాయికి కట్టుగుడ్డలతో జీవితాన్ని స్వతంత్రంగా గడపడానికి వెళ్లి, అచ్చట చాలా అవస్థలు పడ్డారు. ఒక దాక్షిణాత్యునికి కాల్బాదేవి — బొంబాయిలో మూడవ అంతస్తుకి బాల్చీలతో నీళ్లు మోసి పొట్టపోషించుకొన్న గడ్డు దినాలు కూడా ఆయన గడిపారు. అదృష్టం కొద్దీ కీ. శే. కాశీనాథుని నాగేశ్వర రావుగారి పరిచయం కలిగి అమృతాంజనం ఆఫీసులో ఉద్యోగం సంపాదించి ఆయన మెప్పు పొంది, తరువాత ఆయన ప్రారంభించి నడిపించిన ఆంధ్రవార పత్రికలో పనిచేసి పత్రికను నడిపే ప్రావీణ్యం సంపాదించి, 1914 లో మద్రాసు వెళ్లి, అక్కడ ఆంధ్ర దిన పత్రికలో కొన్నాళ్లు పనిచేశారు. అక్కడున్నప్పుడే 'హ్యూమానిటీ' అనే ఆంగ్ల వారపత్రికను నడుపుతూ, ఆంగ్లములో రచనా సామర్థ్యాన్నికూడా సంపాదించారు. మద్రాసులోనే ఆయన బ్రహ్మసమాజమందు ఎక్కువ అభిలాష, నమ్మకం పొంది అనుష్ఠాన బ్రహ్మసమాజంలో కృషిచేసి తన జీవితాన్ని ఆ మత ప్రచారంలో గడుపుతుండేవారు. 1918 ప్రాంతంలో సాధు వాస్వానిగారి ఆహ్వానంపై 'న్యూ టైమ్సు' అనే పత్రికకు సంపాదకుడుగా కరాచీ వెళ్లుట తటస్థించింది. కొద్ది కాలం పిమ్మట వారపత్రికనుండి, దినపత్రికగా మారిన 'సింధ్ అబ్జర్వర్' పత్రికకు పున్నయ్యగారు సంపాదకులుగా నియమింపబడ్డారు.



చిత్రము 171.
కోటంరాజు పున్నయ్య

ఆయన 'సింధ్ అబ్జర్వర్' పత్రికా సంపాదకత్వ మొక దిగ్విజయయాత్ర. ఆయన పేరు ప్రతిష్ఠలు సింధు రాష్ట్రమంతా మారు మ్రోగసాగినవి. అచ్చటి రాజకీయాలను, ఆయన తమ మేధాశక్తిచేత, రాజకీయ పరిజ్ఞానంచేత దిద్ది తీర్చా రనుటకు సందేహం లేదు. ఆయన సలహాలేనిదే ఏ సదుద్యమం అక్కడ సాగలేదు. ఆయన ప్రాంతీయ ఉద్యమాలలో పాల్గొని తన పత్రికలోని వ్రాతలవల్ల వానిని ఉత్తమ మార్గాలలో నడిపించుటకు తోడ్పడ్డారు. ఆయన కరాచీ, సింధు ప్రజలకు చేసిన సేవను గుర్తించి, ఆ పట్టణంలో ఒక ప్రాంతానికి 'పున్నయ్య పూరు' అని పేరు పెట్టారంటే పున్నయ్యగారు అక్కడి ప్రజలలో ఎంత పలుకుబడి సంపాదించారో ఋజువవుతుంది. పాకిస్తాను ఏర్పాటవడంతో 1948 లో ఆయన కరాచీ విడిచిపెట్టారు. హిందూ కాందిశీకుల విషయంలో ఆయన ఎంతో శ్రద్ధ తీసుకున్నారు.

ఆయన చివరి రోజులు దుఃఖభూయిష్ఠం. ఎదిగిన కొడుకులు పోయి, ఆయన జీవితం విషాదపూరితమగుట తటస్థించింది. కాని దేవునియందు నమ్మకం, ప్రార్థనయందు పరిపూర్ణ విశ్వాసం ఆయనను కుంగతీయలేదు. 1948 జూలైలో బొంబాయి నగరంలో ఆయన భౌతిక జీవితం చాలించారు.

యం. వెం. ర.

**పెదకోమటి వేమారెడ్డి :** ఈతడు కొండవీటి రాజ్యాధిపతి; పెదకోమటి నందనుడు. ఇతడు గొప్ప విద్యారసికుడు, విద్వాంసుడు నగుటచే ప్రఖ్యాతులగు కవీశ్వరుల నాదరించి, శాశ్వతకీర్తి నార్జించినాడు. పరాక్రమమును బట్టి జగనొబ్బగండ, వీరనారాయణ బిరుదులును, పాండిత్యమునుబట్టి 'సర్వజ్ఞచక్రవర్తి' బిరుదమును ఇతనికి లభించినవి. పేరు పొందిన మామిడి సింగనాదు లీతని మంత్రులు; కవిసార్వభౌముడగు శ్రీనాథుడు విద్యాధికారి; అభినవ భట్టబాణుడగు వామనభట్టు ఆస్థాన విద్వాంసుడు.

పెదకోమటి వేమభూపాలుడు సంగీత సాహిత్యములు రెండింటను అఖండ పండితు డగుటచే, ఆ రెండు శాస్త్రము లందును అమూల్యములగు గ్రంథములను రచించెను. సాహిత్యచింతామణి, సంగీత చింతామణి, శృంగార దీపిక, భావదీపిక, వీరనారాయణచరితము (భాణమును, కావ్యమును) అనునవి యీతని రచనలు.

'సాహిత్య చింతామణి' అలంకార శాస్త్రగ్రంథము మమ్మటాచార్యుడు వ్రాసిన కావ్యప్రకాశము ననుసరించి ఆ పద్ధతిలోనే యిది వ్రాయబడినది. ఇందు కావ్యము ధ్వని, రసములు, గుణములు, దోషములు, అలంకారములు మున్నగు వాని లక్షణోదాహరణములు వివరింపబడినవి. 'సంగీతచింతామణి' సంగీతశాస్త్ర లక్షణగ్రంథము 'శృంగారదీపిక' అమరుక కావ్యమునకు తత్కవి హృది

యమును వెల్లడించుచు వ్రాయబడిన వ్యాఖ్యానము. 'భావదీపిక' శాలివాహనుని 'గాథాసప్తశతి'లోని 104 గాథలకు చక్కని వ్యాఖ్యానము. దీనినిబట్టి యీతని ప్రాకృతభాషా పాండిత్యము సువ్యక్తము. వీరనారాయణ చరిత నామక గ్రంథములు లభింపలేదు (చూ ; పెదకోమటి వేమారెడ్డి పు. 329). బి. వెం. ర.

**పెద తిరుమలయ్య, తాళ్ళపాక** (క్రీ. శ. 1493 - క్రీ. శ. 1553) : ఇతడు అన్నమాచార్యుని రెండవ భార్య యగు నక్కలాంబకు జనించెను. ఇతడు మహిమాన్వితుడు ; శ్రీ వేంకటేశ్వరస్వామి కనేక కైంకర్యములు జరపెను.

తండ్రివలెనే ఈతడును వేంకటేశ్వరస్వామిపై శృంగార సంకీర్తనములను, అధ్యాత్మ సంకీర్తనములను రచించుటే



చిత్రము 172. తాళ్లపాక పెదతిరుమలయ్య

కాక ఇతర గ్రంథములును పెక్కు రచించినట్లు చిన్నన్న తన అష్టమహిషీకల్యాణమున బేర్కొనెను.

ఈ పెద తిరుమలయ్యకు శ్రీ మద్వేదమార్గ ప్రతిష్ఠాపనాచార్య, శ్రీ రామానుజ సిద్ధాంతస్థాపనాచార్య, వేదాంతాచార్య, కవితార్కిక కేసరి, శరణాగతవజ్రపంజర బిరుదములు కలవు. ఇతనికి శ్రీ వేంకటేశ్వరస్వామి త్రిపురుష పర్యంతంబుగా ప్రత్యక్షంబును, సప్త పురుష పర్యంతంబుగ మోక్షంబు నొసగెదనని వర మిచ్చినట్లు రేవణూరి వెంకటాచార్యుని శకుంతలాపరిణయంబునందు గలదు. ఇతడు సంకీర్తనభండారమునకు బెంపు వెలయించి తండ్రి సంకీర్తనములను, దన సంకీర్తనములను రాగి రేకులపై జెక్కించి భద్రపరచెను. సంకీర్తన భండారమున కిరువైపులను తన తండ్రి అన్నమాచార్యుని విగ్రహమును, తన విగ్రహమును జెక్కించెను. తి. కో. రా.

**పెద తిరువెంగళనాథుడు** : ఇతడు తాళ్ళపాక పెద తిరుమలాచార్యుని మూడవ కుమారుడు. స్వామి సన్నిధి నీతడు సంకీర్తనములు పాడుచుండగా స్వామి యాడుచుండెడివాడని రేవణూరి వెంకటాచార్యుడు తన శకుంతలా పరిణయమున దెలిపినాడు. ఈతడు రచించిన గ్రంథము లేవియో దెలియవచ్చుట లేదు. తి. కో. రా.

**పెద్దన, అల్లసాని** : ఈతడు ఆశ్వలాయన సూత్రుడు; ఋక్శాఖాధ్యాయి; వసిష్ఠ సగోత్రుడు; చొక్కనామాత్యుని పుత్రుడు; శఠకోపయతి శిష్యుడు; నందవరీక నియోగి బ్రాహ్మణుడు ; కృష్ణదేవరాయల యాస్థాన కవులలో నగ్రగణ్యుడు. ఇతడు స్వారోచిష మనుసంభవ మను నామాంతరము గల మనుచరిత్రమును, హరికథాసార మను మరొక గ్రంథమును రచించెను. రెండవ గ్రంథము లోని పద్యములు లక్షణ గ్రంథములలో మాత్రమే ఉదాహరింపబడినవి కాని గ్రంథముమాత్ర మింతవరకు లభింపలేదు.

పెద్దనకు కృష్ణదేవరాయలు కోకట గ్రామాద్యనేకాగ్రహారము లిచ్చెనట; ఇంతియకాక, కరివాచిసీమ (దక్షిణార్కాడు జిల్లా) నాయంకరమున కిచ్చినట్లు శాసనములవలన తెలియుచున్నది. పెద్దన కవియే కాక నాయంకరమున కధిపతియై రాజకార్యములయందును పాల్గొనుచువచ్చెను.

సాహితీ సమరాంగణ చక్రవర్తియైన శ్రీ కృష్ణదేవరాయల ఆస్థాన కవులలో అగ్రగణ్యుడును, ఆ మహారాజువలన ఆంధ్రకవితాపితామహ బిరుదమును నిండోలగంబున పొందినవాడును అగు అల్లసాని పెద్దనామాత్యుడు వయసున రాయలకంటె నించుమించు పది పదునైదు సంవత్సరములు పెద్దవాడై యుండును.

మనుచరిత్రము క్రీ శ. 1519 వ సంవత్సర ప్రాంతమున రచియింపబడి యుండునని ప్రామాణికులైన చరిత్రకారులే నిర్ణయించిరి. ఆనాటి కించుమించు ఏబదియేండ్ల వయసుగల పెద్దన క్రీ. శ. 1470 ప్రాంతమున జన్మించి యుండవచ్చును. 'కృష్ణరాయలతో దివి కేగలేక బ్రతికియున్నాడ జీవచ్ఛవంబ నగుచు' అని నిర్వేదము పొందిన ఆ కవి రాయల మరణకాలమైన క్రీ.శ. 1530 దవ సంవత్సరమునకు పిమ్మట గూడ కొంత కాలము బ్రతికియుండె ననుట ప్రసిద్ధమే. ఆ జీవిత శేషమును నిర్ణయించుటకు తగిన ఆధారములు లేవు; ఊహాయు చాలదు. బహుశః అది యైదేండ్లు కావచ్చును. ఈ నిరూపణమును బట్టి అల్లసాని పెద్దనామాత్యుడు ఈ యాంధ్ర భూమిలో క్రీ.శ. 1470 - 1535 వరకు 60 సంవత్సరములకు పైగా జీవించి తరలిపోయి యుండును.

తెనుగు సారస్వతములో క్రీ.శ. 1500 - 1600 వరకు గల నూరు సంవత్సరముల కాల ఘట్టమును కృష్ణదేవరాయల యుగమని పేర్కొందురు. ఆ యుగమున నూత్న తేజముతో వెలుగొందు సామ్రాజ్య వైభవముతోపాటు నవనవోన్మేషమైన స్వతంత్ర సారస్వత వైభవముకూడ వెల్లివిరిసెను. అదియే మన ప్రథమ నవ్యకవితోద్యమము. ఆంధ్రులు తమ ప్రత్యేక సారస్వతసిద్ధిగా కొనియాడుకొనదగిన ప్రబంధ ప్రక్రియ నూతనముగా ఆవిర్భవించుటయే ఆ యుద్యమమునకు ప్రథమ లక్షణము. ఆంధ్ర సరస్వతీ విహారమునకు అనువైన సుందరోద్యానవనము ప్రబంధము. కృష్ణరాయల మనోరథానుసారముగ ఆ యుద్యాన నిర్మాణభారమును మొదట వహించిన మహాపురుషుడు ఆంధ్ర కవితాపితామహుడు అల్లసాని పెద్దన. ఆ యుద్యానమున తొలుతగా పుష్పించి ఫలించిన రసాలము మను చరిత్రము.

ఈ మనుచరిత్ర కథ మార్కండేయ పురాణమునుండి గైకొనబడినది. ఆ పురాణమును 1330 వ సంవత్సర ప్రాంతమున తిక్కనసోమయాజి శిష్యుడైన మారన తెనిగించెను. మారన రచితమైన కథనే పెద్దనయు అనుసరించెను. ఈ ప్రబంధ కథకును, ఆ మూలకథకును ఒకటి రెండు చోట్ల స్వల్ప భేదము లున్నను, విస్తారమైన వ్యత్యాస మేమియు లేదు. ఆ యలతి మార్పులైనను ప్రబంధమునకు గుణాధిక్యమునే సమకూర్చెను గాని కళంకము నాపాదింపలేదు.

ఈ కావ్యములో మాతృకాభిన్నమైన ప్రధాన వస్తు కల్పన స్వరోచిమృగయావర్ణన. ఈ వేట వర్ణన ఆ ప్రకరణమున జరగు కథాప్రవృత్తికి రంగముగా చిత్రింపబడినది. ఈ కవి భయచకితయైన మనోరమను భయంకరుడైన రాక్షసుడు తరుముకొని వచ్చు భయానకవృత్తాంత ప్రదర్శనమునకు బీభత్స భయానకమైన వేట జరగిన అటవీప్రదేశమును రంగస్థలముగా నలంకరించి ప్రదర్శించి ఆ రెండు పాత్రలను ప్రవేశపెట్టి తన వర్ణనాశిల్పకౌశలమును సార్థక మొనర్చుకొనెను. దీనినే వాతావరణ సృష్టి (ది క్రియేషన్ ఆఫ్ ది అట్మాస్ఫియర్) అని పాశ్చాత్య విమర్శకు లందురు. ఇది మన శాస్త్రములోని ఉద్దీపన విభావమునకు ఇంచుమించు సరిపోవును.

తక్కినయెడల ఆ మూలకథయే ఇంచుమించు ఇందు చెప్పబడినది. అయినను రచనా విశేషమును బట్టి ఈ ప్రబంధము ఆ పురాణోపాఖ్యానముకంటె సర్వవిధముల మేల్తరమైన శిల్ప సృష్టిగా వెల్గొందుచున్నది. పురాణములోని ఉపకథలకును, ప్రబంధ కథలకును సహజముగా నుండు భేదమే అట్టిది.

ఈ మనుచరిత్రము జననకాలమునుబట్టియేకాక, గుణసంపదను బట్టియు, ఆంధ్రప్రబంధములలో అగ్రగణ్యమని నాటినుండి నేటికిని కొనియాడబడుచున్నది. ఈ గ్రంథమునకు పూజ్యస్థాన మొసంగిన గుణగణములలో మొదటిది ఇందలి శైలీ సౌభాగ్యము; రెండవది ఈ గ్రంథమునకు ఆయువుపట్టని చెప్పదగిన వరూధినీవృత్తాంత రచనాప్రౌఢి.

శైలియందు దీనిని మించిన ప్రబంధ మింతవరకును పుట్టలేదు. ఆడంబరములేని గాంభీర్యము, సౌమ్యమయిన ప్రాభవము, ఉద్వేగములేని శీఘ్రగమనము, పేలవత్వము లేని స్వాభావికత, వెలితి లేక నిండారి మెరుగులు దీరిన పద గుంఫనము ఈ కావ్యశైలికి ముఖ్య లక్షణములు. ఇన్ని గుణము లొక్కచో రాశీభూతమై ఆవిర్భవించిన మొదటిప్రబంధ మగుటచేత తరువాతి ప్రబంధకర్త లెల్లరు బుద్ధిపూర్వకముగానో, అప్రతర్కితముగానో దీనిని అనుకరించిరి. ప్రబంధకవులలో పెద్దనార్యుని అగ్రస్థానమునకు ఇది ప్రబల దృష్టాంతము.

వరూధినీవృత్తాంత శిల్పచమత్కృతి: కావ్యమునకు పూర్వార్ధమైన ఈ వృత్తాంతములో తొలి ఘట్టమున తాండవించెడు వరూధినీ ప్రవరు లనెడు రెండు భిన్న ప్రకృతులు పరస్పర విరుద్ధములైన శాంత శృంగారము లనెడి రెండు భిన్న రసములకు ఆలంబన విభావములు (పాత్రలు). ఈ రెండు పాత్రలును భిన్న ప్రకృతు లగుటయే గాక భిన్న లోకములలో ఉద్భవించినవి. ప్రవరుడు మర్త్యలోకము నందలి మానవుడు. వరూధిని దేవలోకమునందలి గంధర్వ యువతి. అతనిది కర్మభూమి. ఈమెది భోగభూమి. ఆ లోకమునందలి సాంఘిక నియమములకును, ఈ లోకము నందలి సాంఘిక నియమములకును సాదృశ్యము లేదు. ఎవరి నియమానువర్తనము వారికి ధర్మము. సౌందర్య ప్రియులును, ప్రణయ జీవులును అయిన గంధర్వులలో పుట్టిన వరూధిని ప్రవరుని అతిలోకసౌందర్యమును చూచి మెచ్చి ప్రేమించుట ఆమె జాతిధర్మమే కాని ఆమె తలపున పాపకార్యము కాదు. పరపురుష శబ్దమునకు ఆమె అర్థమే యెరుగదు. తన మనసునకు నచ్చిన సుందరాకారుని తన జీవిత సర్వస్వముగా ఆరాధించి, వానితో సమస్త భోగము లనుభవించుటయే ఆమెకు జన్మసాఫల్యము ఆమె నేర్చిన నీతియు, ఎరిగిన ధర్మమును ఇదియే. ఇక ప్రవరుడో పరదారగమనపాపమును సహింపని, సదాచార సంపత్తియే పరమధర్మముగా గల మానవ లోకము నందలి ఏకపత్నీవ్రతుడు. అతని దృష్టిలో వరూధిని వలపు పరమ నికృష్టమైన దుష్కార్యము. ఆమె దృష్టిలో అతని తిరస్కారము క్షంతవ్యముకాని కాఠిన్యము. ఆమె యా

భావనతోనే ఆ యపరశుకుని హృదయ దుర్గమును భేదింపదొరకొనెను. కాని వజ్రకవచమువంటి శీలము గల ఆ బ్రాహ్మణుని శరీరమును ఆమె సమ్మోహనాస్త్రములు తాకజాలవయ్యెను. తీరమునందలి పర్వతముమీద ఉప్పొంగుచు విరిగిపడి విచ్ఛిన్నమైన సముద్ర తరంగ పరంపరవలె వరూధినీ హృదయమున పొంగి పొరలిన ప్రణయ ప్రవాహ తరంగములు మేరుధీరుడైన ప్రవరుని చలింపచేయజాలక ఛిన్నాభిన్నములై నిష్ఫల శ్రమకు లోనయ్యెను. తన హృదయానురాగమును వాచ్యముగా వివరించి చెప్పి, దీనాలాపములతో వేడుకొనుటే గాక తన బుద్ధి గరిమచే ఆతని సదాచార సిద్ధాంతములను పూర్వపక్షము చేయ జూచిన వరూధిని యుక్తులకును, సహజవైరాగ్యసంపన్నమైన ధర్మబుద్ధితో ఆమె తలంపును మరలింపదొరకొనిన ప్రవరుని సమాధానములకును కలిగిన సంఘర్షణము పెద్దనార్యుని సంభాషణచాతుర్యమునకు, బుద్ధివ్యాపార విన్యాసమునకు పరమావధిగా నున్నది. పుంఖానుపుంఖముగా వరూధిని ప్రయోగించిన సమ్మోహనాస్త్రములు శీల కవచితమైన ప్రవరుని హృదయమును తాకజాలక మొక్కవోయెను. ఈ రెండు పాత్రలను ఆధారముగా గొని ఆపెనకువను చిత్రించుటలో ఈ కవి వహించిన నాటకీయ తాటస్థ్యము (డ్రామెటిక్ ఆబ్జెక్టివిటీ) శ్రవ్య కావ్యకర్తల కెల్లరకును సాధ్యము కాదు. అంత ఆత్మిక శక్తితో సృష్టించిన పాత్రలు కావుననే వరూధినీ ప్రవరులు నేటికిని ఎక్కడనో సజీవులై యున్నట్లే భావుకుల మనో నయనమునకు గోచరించుచుందురు. మనుచరిత్ర పుట్టినది మొదలు జితేంద్రియత్వమునకు శుకమహర్షిని పేర్కొనుట మరచి ఆంధ్రులు ప్రవరుని దృష్టాంతముగా చెప్పుకొనుచున్నారు. తిక్కన సృష్టించిన భారత పురుషులకు పిమ్మట ఆంధ్రులతో ఇంత సన్నిహిత బాంధవ్యము గల పాత్రలు భారతమునకును, మనుచరిత్రమునకును నడుమ వెలసిన వాఙ్మయములో ఇంకొకచోట లేవు.

ఈ రెండు పాత్రలను చిత్రించుటలోను, ఈ రెండు రసములను పోషించుటలోను గ్రంథకర్త తా నేదెసకును మ్రొగ్గక ఇరువైపులను సమ దృష్టినే పెట్టి ఆ రెండు రసములను సమగాంభీర్యముగల ప్రవాహములుగానే నడపెను. అందువలననే పాఠకులు సయితము ఆ యుభయ పాత్రలయెడలను సమానాదరమునే చూపుచు, ఆ యుభయ రసములను సమముగానే ఆస్వాదించి యానందింతురు. ఈ గ్రంథము చదివిన రసికు లెవ్వరును వేశ్య యనిగాని, శ్రోత్రియునకు వ్రతభంగము చేయనెంచిన వలపుకత్తెయనిగాని వరూధినిని గర్హింపరు. మీదుమిక్కిలి ఆ యువతి యనురాగము అస్థానపతితమైనదని చింతిల్లు సహృదయులును ఉందురు. ఆమెకు లోబడక ధీరుడై తప్పించుకొని యిల్లు చేరిన ప్రవరుని తలచి భక్తిపూర్వకముగా మరల వారే జోహారు లర్పింతురు.

ఆ యపర మన్మథుడు తన్ను తిరస్కరించి, దిగనాడి వెడలిపోయినపిమ్మట ఆ యబల పర్వతమేఖలలవెంట కానలలోబడి దుఃఖనిర్మగ్నయై దరిజేరగరాని వియోగ సాగరమును ఈదలేక మునుగుచు, తేలుచు విలపించు అవస్థను చిత్రించుటలో పెద్దన చూపిన విరహిణీ హృదయ వివర్తపరిజ్ఞానము మహాశ్చర్యకరము. అంతలో చిరకాలము నుండి అదనువేచియున్న గంధర్వవంచకుడు తన మాయాబలముచే ఆ ముద్దరాలిని మోసగించి డక్కగొనునప్పటి ఆ యమాయకురాలి దుర్దశ మరింత శోచనీయముగా గోచరించును. విషాదకరమైన ఈ వరూధినీ ప్రణయ గాథతో ఈ కావ్యముయొక్క పూర్వార్ధము ముగియును. కావ్యములోని తేజముగూడ అంతతోనే మందగించును.

కథాస్వభావమునుబట్టి ఉత్తరార్ధము, పూర్వభాగముతో తులతూగదగినది కాదు. అందు కథానిర్వహణ మాత్రమునకు అక్కరకు వచ్చు అలతి యలతి వృత్తాంతములు మాత్రమే కొన్ని గలవు. అవన్నియు వరూధినీ కుమారుడైన స్వరోచియొక్క జీవితయాత్రలోని వివిధ ఘట్టములు. పెద్దనవలె కృతహస్తుడుగాని కవియైనచో ఆ భాగము పేలవముగా తేలిపోయెడిది. ఈ కవీంద్రుడు అయ్యెడగూడ కథావస్థానుసారముగ పద్యరచనా సౌందర్యమును, కథనచాతుర్యమును ప్రదర్శించి గ్రంథమునకు వెలితిరాకుండ కాపాడెను.

ఈ కావ్యసౌభాగ్యమునకు హేతుభూతమైన ఇంకొక సుందరాంశము ఇందలి దృశ్యవర్ణనాసంపద. పూర్వ భాగమునందలి హిమవద్గిరిదరీఝరీసానువర్ణనలును, ఉత్తర భాగమునందలి అటవీమృగయావిహారవర్ణనలును చిత్ర లేఖనమునకు ఒరవడి కాదగిన దృశ్యములు; కథా సందర్భమునకు ఉచితములును, కథాకార్యమునకు ఆవశ్యకములును అగును. ఇట్టి వర్ణనలు ఈ కావ్యశ్రీ నాటకమునకు రంగాలంకారవ్యాపారము నిర్వహించుచు ఆయాయి యెడల పొడము రసభావములకు ఉద్దీపన విభావములుగా వెలుగొందుచుండును. మరియు వర్ణితదృశ్యముయొక్క స్వభావమునుబట్టి పదగుంఫనముగూడ ఒకయెడ సరళముగా, ఒకయెడ ఉదాత్తముగా, ఒకయెడ గంభీరముగా, ఒకయెడ సంశ్లిష్టముగా రూపొందుచుండును. శబ్దసరణి ఎన్నిరూపాంతరములు పొందినను పెద్దనవాక్కునకు సహజమైన ప్రసన్నత ముత్యములోని లావణ్యమువలె ప్రస్ఫుట

మగుచునే యుండును. మరియు అర్థానుగుణముగా నినదించునట్లు శబ్దములను గుంఫనచేయుటలో ఈకవి అద్వితీయుడు.

కావ్యములో స్థిరపదార్థములను వర్ణించుటకంటె చర పదార్థములను వర్ణించుట కష్టతరము. అంతకంటెను దుష్కరము ప్రాణుల ఆంతర పరివర్తనములను వర్ణించుట. పెద్దన ఈ త్రివిధవర్ణనలు చేయుటయందును సమాన నైపుణిగల మహాకవి. అందును, చరద్రూపములను చిత్రించుటలోనే ఆయనకు కుతూహల మెక్కువ.

నలకూబరసన్నిభుడైన ప్రవరుడు తొలుత తన కంటబడినపుడు వరూధిని 'ఝుళంఝుళత్కటకసూచితవేగ పదార విందయై లేచి, కుచంబులున్ దురుము లేనడు మల్లలనాడ నయ్యెడన్ పూచిన యొక్క పోకనును బోదియ జేరి, విలోకనప్రభావీచికలన్ తదీయపదవీ కలశాంబుధి వెల్లి గొల్పుచు' కొంకువలని లౌల్యము, మోదమువలని విస్తీర్ణత, మెప్పువలని రెప్ప లల్లార్పు, అనుషంగస్థితివలని రిచ్చపాటు పొందిన కన్నుదోయితో ఆతని సౌందర్యామృతమును చూరగొనునప్పటి యామె చలత్సౌందర్యమును చిత్రించుట ఊహామాత్రసాధ్యమైన కార్యము గాదు.

ఈ విధముగా కథనచమత్కృతియు, వర్ణనా నైపుణియు, పాత్రసృజనశక్తియు, రసదీప్తియు గలిగి సమగ్ర ప్రసాధితమైన రంగమునందు ప్రదర్శింపబడిన నాటకమువలె ఈ మహాకావ్యము సహృదయరంజకముగా నాల్గువందల సంవత్సరములనుండి ఆంధ్రప్రబంధలోకమున తన ప్రాభవము నకుంఠితముగా నిర్వహించుకొను చున్నది.

కొందరు విమర్శకులు వరూధినీవృత్తాంతము రసాభాస మందురు; అనగా- రతిస్థాయికమైన వరూధిని చరిత్ర శృంగార పర్యవసాయి కాలే దనుట. వరూధినీవృత్తాంతములో శృంగారరసపరిపోషణమున ఎట్టి లోపమును లేదు. సంయోగ రూపసిద్ధికి ఈ కథలో అవకాశము లేదు. కథలో లేని సంయోగమును ఏ కవియు సాధింపలేడు. కథానుసారముగా రసమును పోషించుటే కావ్యరచనాధర్మములలో మొదటిది.

ఈ వరూధినీ ప్రవరులకథలో అంగిరసము శాంతము, అంగరసము శృంగారము. శమప్రధానుడైన ప్రవరుడు ఆలంబనముగా శాంతమునకును, ప్రణయ ప్రధానయైన వరూధిని ఆలంబనముగా శృంగారమునకును, ఇచ్చట సమ్మేళనము జరిగెను. ఈ రెండును సహజవిరుద్ధరసములు. ఇవి అన్యోన్యజిగీషతో సల్పిన పోరే ఆ రసములకు గల్గిన పరిపోషణ. అంతమున ప్రవరుడు వరూధినీ ప్రణయ ప్రవాహముచే ముంచివేయబడక, ధీరుడై తన వైరాగ్యనిష్ఠను కాపాడుకొనుటే అతనికి గల్గిన జయము. అదియే శాంతరససిద్ధి.

కథను ప్రవరుని చరిత్రతోనే ఉపక్రమించుటయు, ఆతని సచ్ఛీలమునే మొదట వర్ణించుటయు, ఎట్టి ప్రత్యవాయములు కల్గినను, ఆ శీలమును అకుంఠితముగా ప్రదర్శించుటయు గమనించితిమేని గ్రంథకర్త ఈ ఘట్టమును ప్రవరుని చరిత్రాంశముగానే సంకల్పించె ననియు, శాంతమునే అంగరసముగా ప్రతిపాదించె ననియు గోచరింపక మానదు.

వరూధినీవృత్తాంతములోని ఉత్తర భాగమైన మాయా ప్రవర గాథలో పరస్పరానురాగ మున్నట్లు పాత్రలకు పొడకట్టునుగాని, పాఠకునకు అది ఏకత్రానురాగముగానే నిజస్వరూపమున భాసించుచుండును. రసము సామాజిక నిష్ఠమేగాని, పాత్రనిష్ఠము గాదు. అందుచే నిచట నిజముగా రసాభాసమే కలదు. కథాంతర్భూతమైయున్న ఆ యాభాసమును ఏ కవియును పరిహరింపజాలడు. పరిహరింపవలసిన ఆవశ్యకతయు లేదు. ఈ గాథలో రసాభాసమే లేదనియు, అది ఉభయత్రానురాగమే యనియు వాదించువారును గలరు. అది అతివాదము. రసాభాస మున్నదనుటయే మేలు. అయిన నేమాయె. లోకములో ఏకత్రానురూపరసాభాసకథలు ఎన్నెన్ని కావ్యార్పితములై ఆయా వాఙ్మయములలో రాణించుట లేదు? కథాకథనము, పాత్రచిత్రణము, మూర్తిచిత్రణము, శబ్దగుంఫనము, దృశ్యవర్ణన మొదలగు శిల్పధర్మముల నిర్వహణసౌష్ఠవమువలన ఆ కథలుగల కావ్యములు ఆయా సారస్వతములకు అలంకారములుగానే వెలుగొందుచున్నవి. ఆ రస మనునది కూడ పైన పేర్కొన్న శిల్పధర్మనిర్వహణమును ఆశ్రయించి యుండును గాని, ఊరక గాలిలో పుట్టునది కాదు. రస శబ్దమునకు సంకుచితార్థమును చెప్పుట ఆధునికవిమర్శకులు ఒప్పుకొనరు. అసలు ప్రాచీనాలంకారికులైనను రసాభాస ముపాదేయము గాదని ఎచ్చటను చెప్పియుండరు.

కావ్యములో కథైక్యము లేదనియు కొంద రందురు. కథలో ఐక్యము లేకపోవుట అసత్యము. అంతకంటె ఇతివృత్తము విస్తృతమైన దనుట కొంతవరకు నిజము. ఆ విస్తృతియైనను అనావశ్యకముగా జరిగినది కాదు. స్వారోచిషమనుసంభవమనెడి నిర్వహణమునకు ఏయే కథాంశములు పూర్వాపూర్వకారణకలాపములుగా ఆవశ్యకములో కవి వానినే సూత్రించెనుగాని అనావశ్యకమైన ఏ సందర్భమును కూర్చలేదు. ఏ ఘట్టమును పరిశీలించినను ఉపసంహార ప్రవణముగానే యుండునుగాని తద్విరుద్ధముగా ఉండదు. అట్టి ఏకసూత్రతయే కథైక్యమును సాధించెను.

ఈ కథావిస్తృతికి కారణము వరూధినీ వృత్తాంతము, స్వరోచి చరిత్రము అనెడి రెండు స్వయంసంపూర్ణకథలు రచింపబడుట. ఈ రెండును మనుసంభవమునకు ఆవశ్యకములే. స్వారోచిషుని పుట్టుకకు వరూధినీ వృత్తాంతము వ్యవహిత కారణమును, స్వరోచి చరిత్ర అవ్యవహిత కారణమును అగుచున్నవి. కవి కథావిస్తృతి తగ్గింపవలెనన్నచో వ్యవహితకారణమైన వరూధినిని తొలగింపవలసి వచ్చును. అట్లు జరగునేని స్వారోచిషుని జననము సంభవించును గాని అతడు మను వగుట మాత్రము సంభవింపదు.

మనువు లనగా సకలభూభవనరక్షాదక్షులును, తేజోనిధులును అయిన ధర్మస్వరూపులు. వారు మానవలోకవాసులయ్యు మానవాతీతులు, దేవతాంశ సంభూతులు. స్వారోచిషునకు మనుత్వము నొసగ గలిగిన అట్టి యర్హతలు అతని జనకుడైన స్వరోచినుండి అతనికి సమగ్రముగా సంక్రమించుటకు తాత్త్వికముగా అవకాశము లేదు. స్వరోచి వరూధినివలె దేవతాంశసంభూతుడే, భువనరక్షాదక్షతగల శౌర్యవంతుడే. అయ్యు, లోకమును ధర్మమార్గమున నయింపదగిన ధర్మస్వరూపుడు కాడు, అతడు కామపరాయణుడైన వ్యసని. బాల్యముననే భక్తివైరాగ్య సంపన్నుడై, చిరకాల తపశ్చర్యవలన శ్రీ మహావిష్ణుని సాక్షాత్కరింపజేసికొనిన స్వారోచిషుని ఆధ్యాత్మికసంపద ఆ తండ్రివలన సంక్రమింప నపుడు మరి ఎక్కడనుండి వచ్చియుండును ? 'పూర్వజన్మ సంస్కారమువలన' అని ఒక సులభ సమాధానము చెప్పవచ్చునుగాని అది యేమియు తోచనపుడు అనవలసిన త్రోపుడుమాట.

నాయుద్దేశము స్వారోచిషుని మనుపదమునకు అర్హమైన ధర్మనిష్ఠాగరిమ తలిదండ్రులనుండి కాక వారిపై తరమునుండి - స్వరోచి తలిదండ్రులనుండి సంక్రమించినది అని. స్వరోచి జననీజనకులు వరూధినీ మాయా ప్రవరులు గదా. ఈ జంటలో తల్లియొక్క సౌందర్యము ప్రణయ స్వభావము స్వరోచిలో అచ్చుపడి అతనిని తల్లిపోలిక కొడుకుగా పరిణతి నొందించెను. ఇక మాయా ప్రవరుడు ఇతని పుట్టుకకు నిమిత్తమాత్రమే కాని తాత్త్వికమైన జనకత్వ మాతనికి లేదు. అట్టి జనకస్థానమున నున్నవాడు బ్రాహ్మణ ప్రవరుడు. అన్యమనస్కురాలై, తదేకధ్యానముతో ఆ బ్రాహ్మణ కుమారుని ఆరాధించిన వరూధిని గర్భధారణవేళ తాల్చినతేజము ఆ బ్రాహ్మణునిది. అతని పవిత్రతయు, అతని యాధ్యాత్మికతయు స్వరోచికి సంక్రమింపవలసి యుండెను. కాని, ఆ గుణసంపద అతనిని త్రోసిపుచ్చి, అతని కుమారుడైన స్వారోచిషునకు సంక్రమించెను. లోకములో కొందరు తండ్రుల గుణములతోను, కొందరు తాతల గుణములతోను జనించుచుండుట స్వాభావికమే. ఈరహస్యము జీవశాస్త్రన్యాయమునను సమ్మతమే.

కావున మనుసంభవమునకు ప్రభవకారణమైన ప్రవరుని చరిత్రమే లేనిచో ఈ కావ్యమునకు బీజమే ఉండదు. అందుచే వరూధినీ వృత్తాంతము అపరిహార్యమును, అత్యంతావశ్యకమును అయ్యెను.

ఇట్టి మహాగ్రంథమును సరస్వతీసేవాసక్తుడును, రసికజన చక్రవర్తియునైన శ్రీకృష్ణదేవరాయలకు కృతిగా సమర్పించి పెద్దనామాత్యుడు తన యశమును, తన యేలిక యశమును అజరామరముగా ఆంధ్రభూమిలో ప్రతిష్ఠించెను. పిం. ల.

**పేరరాజు, కృత్తివెంటి** (క్రీ. శ. 1856 - 1910) : ఈయన మచిలీపట్టణమునకు చేరువనున్న కృత్తివెంటి జమీన్‌దారీకి సంబంధించిన కృత్తివెంటి కుటుంబములోని యొక కనిష్ఠశాఖకు చెందినవాడు. ఈయన తాత నిజాం కొలువును వదలి తూర్పు ఇండియా కంపెనీ కొలువులో ప్రవేశించెను. ఉత్తర సర్కారులు జిల్లాలుగా విభజింపబడినతరువాత ఈయన రాజమహేంద్రవరము కలెక్టరుకు అసిస్టెంటుగా నియమింపబడెను. జిల్లా రాజధాని కాకినాడకు మారగా అక్కడకు వచ్చి, ఉద్యోగ విరామానంతరము అక్కడనే నెలవుకొనెను.



చిత్రము 173.
కృత్తివెంటి పేరరాజు

పేరరాజుపంతులు కాకినాడలో జనించెను. ఈయన యేడవయేట తండ్రి మరణించెను. కుటుంబపు ఆస్తిలో చాల భాగము నష్టమైపోయినది. ఈయన కాకినాడలోను, మచిలీపట్టణములోను చదువుకొనెను. ఈయనను పెంచిన నాయనమ్మకు ఇష్టములేని కారణమున ఈయన చదువు మెట్రిక్యులేషన్ పరీక్షయందు కృతార్థు డగుటతో తుద ముట్టినది. తరువాత ఈయన రెవిన్యూ పరీక్షలోను, ప్లీడరు పరీక్షలోను ఉత్తీర్ణు డయ్యెను; అనంతరము కొంతకాల మీయన కాకినాడయందున్న పాఠశాలలో ఉపాధ్యాయుడుగ నుండెను; ఆవల ప్లీడరు వృత్తి ప్రారంభించెను. ఆ వృత్తిలో ఈయన గొప్ప ప్రఖ్యాతి గడించెను. ఆ జిల్లాలోని జమీన్‌దారు లందరు నించుమించుగా, కాకినాడ పురమునందలి వర్తకులును ఈయనను తమకు సలహాదారుగా ఏర్పాటు చేసికొనిరి.

ప్లీడరువృత్తి ప్రారంభ దినములలో ఈయనకు హిందూ పత్రికా వ్యవస్థాపకులగు శ్రీ సుబ్రహ్మణ్య అయ్యరువంటి వారితో పరిచయ మేర్పడుటచే ఈయన రాజకీయ విషయముల నధిగమింప మొదలుపెట్టెను; ఉత్తర దక్షిణ హిందూస్థానములందలి పత్రికలకు వ్యాసములు వ్రాయు చుండెను; హిందూదేశమునకే కాక ఇంగ్లండు, హాలెండు, జపాను దేశములకును సంబంధించిన భూములు, వ్యవసాయము, విద్య - వీనికి సంబంధించిన సమస్యలనుగూర్చి కూడ చక్కగా తెలిసికొనుచు, అందు పరిశ్రమచేయు చుండెను. భారత జాతీయ మహాసభయందు చేరి ఈయన గోదావరిజిల్లా ప్రతినిధిగా నుండెను. చాలమారులు అందు పైన పేర్కొనిన విషయములను గూర్చిన తీర్మానములను ఆమోదించుచునో, బలపరచుచునో యుండెను. 1908 లో మచిలీపట్టణమున జరిగిన రాష్ట్రీయ మహాసభకును, 1909లో కర్నూలులో జరిగిన రాష్ట్రీయ పారిశ్రామిక సమ్మేళనమునకును ఈయన అధ్యక్షుడుగా ఎన్నుకొనబడెను.

ఈయన పదునొకండు తెలుగు జిల్లాల ప్రతినిధిగా శాసన నిర్మాణసభకు 1901 లో ఒకమారును, మరల 1909 లో నింకొకమారును ఎన్నుకొనబడెను. కాకినాడ పురపాలక సంఘమునకు ఎన్నుకొనబడిన మొదటి అధ్యక్షుడు ఈయన; ఆ పదవి నీయన చాలకాల మలంకరించెను. ఆ కాలమున కాకినాడ నగరమునకు నీటి వసతులు కలిగించెను; నగరమును విస్తరింపజేసి అభివృద్ధికి తెచ్చెను. ఈయన జిల్లాబోర్డులోకూడ సభ్యుడు. స్వతంత్రుడుగా నుండగోరి, జిల్లాబోర్డు ఉపాధ్యక్ష నియామకమును ఈయన పలుమారు నిరాకరించెను.

ఈయన 1906 లో కాకినాడకు సమీపముననున్న రామచంద్రపురమున ఒక పాఠశాలను నెలకొల్పి దానికి నేషనల్ హైస్కూల్ అను నామమిడి దాని నిర్వహణమునకై ఆ దినములలో మూడులక్షల రూపాయల విలువ జేయు భూస్థితిని దానముగా నిచ్చెను. వ్యవసాయాభివృద్ధికి, పరిశ్రమల యభివృద్ధికి ఉపయుక్తమగు విద్యను బోధించుట, నైతికభావమందును సహకారజీవితమందును శరీరవ్యాయామమునందును యువకులకు తగిన శిక్షణ నిచ్చుట మొదలైన ఆశయములతో ఆ పాఠశాలను స్థాపించెను కాని దాని యాజమాన్యము జిల్లా బోర్డుకు సంక్రమించుటచేత నీయన యుద్దేశము లేవియు సఫలము కాలేదు. మా. వెం. రం.

**పైఠాను :** ఇది హైదరాబాదు రాష్ట్రమందలి ఔరంగాబాదు జిల్లాలోని పైఠాను తాలూకాకు ప్రధాన స్థానము; గోదావరీనది ఉత్తరపు టొడ్డున నున్నది. ఇది దక్షిణాపథమునందలి పురాతన నగరములలో ఒకటి. బౌద్ధ వాఙ్మయమున ఇది 'పటిట్ఠాన' మని పేర్కొనబడినది. బౌద్ధగ్రంథము 'సుత్తనిపాత'ములో 'పటిట్ఠాన'ము 'అళక' దేశమునకు రాజధానియని, దక్షిణాపథము నుండి ఉత్తర హిందూస్థానములోని 'సావత్థి'కి వర్తక మార్గము 'పటిట్ఠాన'ము మీదుగానే పోవునని చెప్పబడినది. ఈ 'యళక'మే 'ముళక'మని కొన్నిగ్రంథములలో కలదు. అందువల్ల 'అళక'మునకు బదులు 'ముళక'మే సరియైన రూపమని పరిశోధక పండితుల అభిప్రాయము. దానంజేసి 'పటిటాన'ము ముళక దేశమునకు రాజధాని యనియు, 'పటిట్ఠాన'ము చుట్టుపట్ల ప్రాంతమే పురాతనకాలములో మొదట ముళకదేశమని వ్యవహృతమయ్యెననియు చెప్పవచ్చును. మౌర్యవంశజుడైన అశోకచక్రవర్తి ధర్మలిపులలో పేర్కొనబడిన 'పెటనికు'లనువారు ప్రాయికముగా పైఠాను ప్రాంతవాసులేయని చరిత్రకారు లందురు. చాలీస్‌గాం దగ్గరి పితల్ ఖరగుహలలోని క్రీ. పూ. రెండవ శతాబ్దినాటి శాసనములలో ప్రతిష్ఠానపు రాజును, వర్తకులును పేర్కొనబడినారు. టాలెమీ యను భూగోళ శాస్త్రవేత్తప్రకారము ఇది సాతవాహన భూవరులలో ఒకడయిన రెండవ పులుమాయి రాజధానియని తెలియుచున్నది. 'పెరిప్లస్ ఆఫ్ ది ఎరెత్రియన్ సి' అను గ్రంథము ననుసరించి ఇది గొప్ప వాణిజ్య కేంద్రము. ఇంతియ కాదు, శాలివాహన శక కర్తయని విశ్వసింపబడు శాలివాహనుని జన్మస్థలము, రాజధాని కూడను. నేడు ఆనవాళ్లయినను లేకుండ పురాతన నగరము పూర్తిగా రూపరిపోయినది.

ఆధునిక నగరములో అత్యంత సుందరమైన కర్ర పోగరపని గల హిందూదేవాలయములు అనేకములు కలవు. ఈ పైఠానులోనే క్రీ. శ. 14 వ శతాబ్దము మధ్యమున మహానుభావ (మాన్ భావ్) మతసంప్రదాయ మావిష్కృత మైనది. మ. సో. శ.

**పోతన :** ఇతని తండ్రి కేసన; తల్లి లక్కమాంబ, అన్న తిప్పన, కుమారుడు మల్లన, మనుమడు ప్రౌఢసరస్వతి, మునిమనుమలు కేసన, మల్లన కవులు - ఇది మనకు దెలిసిన పోతన కుటుంబము. పేదకాపుర మనియు, వృత్తి వ్యవసాయ మనియు జనశ్రుతి చెప్పుచున్నది. పోతన క్రీ. శ. 1420 ప్రాంతమున జన్మించెనని తెలియుచున్నది. ఆయన నివాస మోరుగల్లని కొందరు, ఒంటిమెట్టయని కొందరు, రెంట నుండవచ్చునని కొందరు చెప్పుచున్నారు.

పోతన యే గురువులకడ నే యే విద్య లభ్యసించెనో తెలియదు. 'చదువనివాఁ డజ్ఞుండగుఁ, జదివిన సదసద్వివేక చతురత గలుగున్' అన్న ట్లేదో కొంత చదివెనో, 'తా

నన్నియు రూపించిన మిథ్యలని నిరూఢమనీషన్ ' యాదృచ్ఛికముగా జదివెనో, 'చక్రహస్తునిఁ బ్రకటించు చదువు చదువు; కుంభినీధవుఁ జెప్పెడి గురుఁడు గురుఁడు' అని హరిభక్తినే చదివెనో పసిపట్టలేము గాని, 'చదువులలో మర్మమెల్లఁ జదివితిఁ దండ్రీ' యన్నట్లు సకల విద్యా రహస్యములాయనకు గరతలామలకములని భాగవతము చెప్పుచున్నది. ఇది చిదానంద యోగీశ్వరుని మంత్రోపదేశము వలన సిద్ధించినదని లోకు లందురు గాని 'శ్రీ పరమేశ్వర కరుణాకలిత కవితావిచిత్ర - సహజ పాండిత్య' యని యాశ్వాసాంత గద్యమున పోతనయే చెప్పికొన్నాడు.

పోతన మొదట భోగినీ దండకమును, భాగవతరచన తరువాత వీరభద్రవిజయమును రచించెనని యాతని కృతులవలన దెలియవచ్చును. అవి పోతన రచితములు కావని కొందరి యభిప్రాయము. శైలినిబట్టి పోతన భోగినీ దండకమును కవితాప్రథమయావనమున రచించి యుండుననుట సంగతమే యనదగును. దండక శైలివలె వీరభద్ర విజయ శైలి పోతనశైలీ సగోత్రత్వమును రుజువు చేసికొన లేకున్నది. మరియు ' భాగవతమున శివనింద చేసిన పాప పరిహారమునకై శైవ శాస్త్రాగమ వీరభద్ర విజయంబు రచించెద ' నని పోతనయే చెప్పినట్లున్న యీ పద్యము అదే భక్తిభావ పరిణతమైన పోతన హృదయమును స్పృశింపలే దనవలయును. కాన నది యాతని రచన కాదని కొంద రనుటయు సహేతుకమే యనిపించును. ఏమైనను, పోతన కవితా పాండిత్యములు భాగవతమున నిండుగా బండినవని పండితుల ప్రశంస.

భాగవత రచనతో పోతన వైష్ణవాచార సంపన్నుడనియు, ఊర్ధ్వపుండ్ర తులసీమాలాశోభితు డనియు గొందరు భావింపవచ్చును. కాని పోతనయు, ఆతని తండ్రి తాతలును, ఆయనకు దరువాతి తరమువారును బరమ శైవులు. పోతన భక్తి శివ కేశవ భేదము లేని కేవలాద్వైతమూలము. 'విష్ణురూపాయ నమశ్శివాయ' యని తన భావమును తిక్కన హరిహరాద్వైతముగా బిలుచుకొన్నాడు; పోతన తన హృదయమున విలుచుకొన్నాడు. ఇంతే భేదము.

సంస్కృత భాగవత నిర్మాణమునకు కారణ మిది: ' వేదవ్యాసుం డొక్కనాడు సరస్వతీ జలంబుల స్నానాది కర్మంబులు దీర్చి శుచియై యొంటిఁ గూర్చుండి ' కాలంబు నన్ జేసి యుగధర్మంబులకు భువి సాంకర్యంబు నొందు, యుగ యుగంబులకు భౌతిక శరీరంబులకు శక్తి సన్నం బగు, బురుషులు నిస్సత్త్వులు మందప్రజ్ఞులు నల్పాయువు లయ్యెద 'రని తన దివ్యదృష్టిన్ జూచి సర్వ వర్ణాశ్రమంబులకు హితంబు సేయం దలంచి......' భారతమిషమున బలికితి వేదార్థ భావ మెల్ల, దీనఁ జేసి యాత్మ సంతస మందదు, భాగవత విధంబుఁ బలుకనైతి, మోసమయ్యె'నని పలువిధముల వగచుచుండెనట. అప్పుడు నారదుం డేతెంచి వ్యాసునకు జిత్తోపశమనంబు సేయుచు - ' భక్తిహీనంబులైన జ్ఞాన వాచా కర్మ కౌశలంబులు నిరర్థకంబులు...... కామ్య కర్మంబులందు రాగంబు గల ప్రాకృత జనులకు నియమించిన ధర్మంబులు సెప్పి శాసకుండవగు నీ నడవడి దగదు, వార లదియె ధర్మం బని జుగుప్సితంబులగు కామ్య కర్మంబులు సేయుచు తత్త్వ జ్ఞానంబు మఱతురు, హరిపద సేవఁ బాసినఁ గులధర్మ గౌరవము సిద్ధింపదు, శ్రీవిభుకీర్తులు పొగడుము, జనములకున్ దుఃఖమెల్ల శాంతిం బొందున్ ' అని యుపదేశించెనట. దాన సంతుష్టుడై ' భువన క్షేమంకరంబైన భాగవతామ్నాయము బాదరాయణుఁడు దాఁ గల్పించె 'నట. ఇది సంస్కృత భాగవతావతరణ ఘట్టము. ధ్యాన నిష్ఠులై అచ్చట వ్యాసులు - ఇచ్చట పోతన - వారే మహర్షులు - అవే నదీ తీరములు - అవే ప్రజాహిత చింతనములు - ఆ ప్రజల ధర్మ కర్మ గుణదోష ప్రవర్తనలు నట్టివే - తత్సమన్వయముగా భక్తిమార్గ ప్రబోధము నదియే - అన్నియు బింబ ప్రతిబింబములుగా నచ్చుపడినవి. పోతనలో నిరూఢమైన భావమునకు వ్యాసుని భాగవతమే లక్ష్య మయ్యెనో, వ్యాస భాగవత పఠనమువలననే యీ భావములు పోతనలో నిరూఢమయ్యెనో చెప్పలేము కాని, భారత రచనానంతరము భాగవత రచనావశ్యకతయు, ప్రజాశ్రేయమునకై భక్తిమార్గ ప్రబోధము, అందుకై తిక్కన, యనంతరము పోతన తెనుగునేలలో గారణ జన్ములుగా నవతరించు భాగ్యము - ఇవన్నియు దైవ నిర్ణయముగా సంఘటిల్లినవి. పోతన హృదయమునుండి పొంగిన యీ భావము లన్నియు నాంధ్రభాగవతమున సందర్భోచితముగ నంతట వెల్లివిరిసినవి.

తిక్కనకు హరిహరనాథుడు స్వప్నమున సాక్షాత్కరించి భారత మంకిత మిమ్మని యడుగగా పోతనకు రామభద్రుడు ధ్యాన సమాధియందే ప్రత్యక్షమై 'మన్నామాంకితంబుగా శ్రీ మహాభాగవతంబు తెనుంగుసేయుమని యానతిచ్చె 'నట. ఆ హరిహరనాథుడు, నీ రామభద్రుడును ఈ యిరువురికి నప్పటికి గ్రొత్తవారే; చిక్కని సీసపద్యముల నిండుగ వర్ణింపబడిన దివ్యరూపములతో నప్పుడే సాక్షాత్కరించినవారు. తిక్కన 'ఆంధ్రావళి మోదముం బొరయ' భారతము సెప్పగా పోతన 'జగద్ధితంబుగాఁ జెప్పె 'నట. ఇవి వీరి పోలికలు: పోతనలో నీ విశేషము చూడుడు. ' నన్నయ తిక్కనాది కవు లీయుర్విం బురాణా

వళుల్ తెనుఁగుం జేయుచు మత్పురాకృత శుభాధిక్యంబు తా నెట్టిదో తెనుఁగుం జేయరు మున్ను భాగవత 'మని పోతన తన పుణ్యమున కుప్పొంగును; 'భాగవతము తెలిసి పలుకుట చిత్రంబు శూలికైనఁ దమ్మిచూలికైన' అని భాగవత మహత్త్వముతో దన వినయము వెల్లడించును. 'పలికెడిది భాగవతమఁట, పలికించెడువాఁడు రామభద్రుండఁట' యని తాను నిమిత్తమాత్రుడై యంతయు భగవదధీనము చేయును. ఈ నిరాడంబరతలో 'భారతమునకు తిక్కన వలె భాగవతమునకుఁ బోతనయే యవతరింపవలసివచ్చిన' దనియు, 'ఈ యిరువురి నడుమ నెందరో మహాకవు లున్నను భాగవతము రచించు నంతస్సారము, ఆత్మ నిగ్రహము, అఖిలమానవహితచింత పోతనకే దక్కిన' వనియు మనకు స్ఫురింపజేయును. మరియు 'దీనిం దెనిఁగించి నా జననంబున్ సఫలంబుఁ జేసెదఁ బునర్జన్మంబు లేకుండఁగన్' అని తనకు బునర్జన్మంబు లేకుండ దెనిగించెదనని చెప్పుచున్నను భాగవతమునకు మరియొకరివలన బునర్జన్మంబు లేకుండు నట్లుగ దెనిగించెదనని రసికులకు దోవ జేయును. ఇదంతయు పోతన ప్రౌఢప్రయోగ పరిమళము.

భాగవతము నంకితము సేయుటనుగూర్చి విచిత్ర గాథలు వినబడుచున్నవి. ఇందలి సత్య మెట్లున్నను, ఈ సందర్భమున చెప్పిన 'ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి' యను పద్యము పోతన భోగ విముఖత్వమును, పాప భయ శీలమును, భగవద్భక్తిని వెల్లడిచేయుచున్నను ఆయన నట్టి నిశ్చయమునకు ప్రోత్సహించినదియు, రాజులను మనుజేశ్వరాధములనుగా బేర్కొనజేసినదియు నగు నేదో దుస్సంఘటన మాయన హృదయమును వెచ్చచేసి యుండునని స్ఫురింపకపోదు. అట్లు జరగుట యా కాలమున సంభావ్యమే యై యుండును. కనుకనే యాతడు నరాంకితము చేయనని పట్టుపట్టియుండును. ఈ పట్టున పోతన ధీర హృదయ మెంతయేని ప్రశంసింపదగినది. కాలగతిచే భాగవత భాగములు కొన్ని శిథిలములైనను తత్ప్రభావము చేతనే నారయ, గంగయ, సింగనాదులు వానిని బూరింపగా సమగ్రమైన భాగవత కల్పవృక్షము మనకు దక్కినది.

భారతాదుల వలెనే భాగవతానువాదము స్వతంత్రమైనది. మూలము నిమిత్తముగా, వ్యాసుని హృదయావిష్కరణము ప్రధానముగా దన యనుభూతివెంట నిండు తెనుగుదనమున దీర్చి దిద్దినాడు దీనిని పోతన. మూలమున నొక వాక్యమందో, శ్లోకమందో రేఖామాత్రమగు విషయమనువాదమున నవయవపుష్టితో నంచులు దీరియుండును. కథాసూత్రమున చొప్పదంటువలె బెరిగిన యంశము చెరకుగడవలె రసనాడులతో బలిసియుండును. సంగ్రహించుటో విస్తరించుటో, ఉన్నదానిని తొలగించుటో, లేనిదానిని దెచ్చి యలంకరించుటో ఆయనచేయు సన్నివేశోపస్కారము. శ్రీకృష్ణ ప్రేషితుడైన యుద్ధవుని గోపికలు చుట్టుకొని 'మా అక్కఱ దీఱినదిగాన కృష్ణుడిం కేల యిచ్చటికి వచ్చు'నని నిష్ఠురము లాడునప్పుడు మూలమున

'పుంభి స్త్రీషు కృతా యద్వత్ సుమనస్స్వివ షట్పదైః
నిస్వం త్యజంతి గణికా..........
జారో భుక్త్వా రతాం స్త్రియం'

ఇత్యాదిగా మూడు శ్లోకములతో జెప్పిన యుపమానములన్నియు వదలి 'ఆఁకటిపని దీరిన నళులు విరులఁ బాయునో లేదో' యని ఒక్క మాటతో ముగించి తర్వాత శృంగాపదేశమున నర్మోక్తులు పలికించినాడు. గౌరీదేవికి నమస్కరించి రుక్మిణి యాలయమునుండి వెలుపలికి వచ్చునపుడు 'మునివ్రత మథ త్యక్త్వా నిశ్చక్రామాంబికాగృహాత్' అని మూలమున నిరాడంబరముగా నుండగా పోతన సజ్జరసపు వెలుగులలో తెర యెత్తించి భామవేషమును జూపించిన రీతి 'మేఘమధ్యంబు వెలువడిన మెఱుఁగు తెఱంగున....కమలభవనర్తకుం డెత్తిన జవనిక మఱుగు దెరలి పొడసూపిన మోహినీదేవతకైవడి........' 'మహార్ణవ మధ్యంబునుండి చనుదెంచు నిందిరా సుందరీ వైభవంబున నిందుధర సుందరీ మందిరంబు వెలువడి'—యని పెక్కు లుపమానములతో రుక్మిణిని మన కన్నుల యెదుట బెట్టును. ప్రౌఢమైన వేదాంతశాస్త్ర విషయము నెత్తికొని 'సత్తైన ప్రకృతివలన నుత్పన్నంబైన యీ జగత్తు సత్తుగా దనవలయు' అని సాంఖ్యుండు పలికిన విని యద్వైతవాది యిట్లను 'ఎయ్యది యుత్పన్నంబుగా దది సత్తునుగా' దను వ్యతిరేకవ్యాప్తి నియమంబు 'నిత్యసత్యంబైన బ్రహ్మంబునందుఁ దర్కహతం బగు....' అని యరటిపండొలిచి యిచ్చినట్లు విడదీసి నాటక ఫక్కితో వ్యాఖ్యానించును. ఒకప్పుడు 'ఇంతింతై వటుఁ డింతయై మఱియుఁ దా నింతై నభోవీథిపై నంతై' యని వామనమూర్తివలె విజృంభించి తెలుగు పలుకుబడిలో బ్రహ్మపదంబు ముట్టును. నృసింహమూర్తి యావిర్భవించె ననుచో సంస్కృత దీర్ఘ సమాసములతో నొకటిన్నరపుట నడిచిన యొక పెద్ద వచనము, 'ఒక్కమకరేంద్రుఁ డిభరాజు నొడిసి పట్టె' ననుచో 'భుగభుగాయిత భూరి బుద్బుదచ్ఛటలతో' అని బారులు దీరి నడుచు సీసము, హరిభక్తిలేని సంసారము వ్యర్థమనుచో 'అంధేందూదయముల్ మహాబధిర శంఖారావముల్' అని సంస్కృతధాటితో సింహనాదములు సేయు శార్దూలము—ఇట్టి వెన్నియో భాగవతము

నిండుగ భారతీ విహారమునకు బోతన నిర్మించిన సాహిత్యోద్యాన సుందరలతామందిరస్ఫాటికశిలామణిమయవితర్దికల వలె నింపు నింపుచుండును. ఈ యన్నింట నాయాసందర్భములలో నావేశముతో బొంగిన యీయనభక్తిభావతరంగము లుత్తుంగములై గడ్డ లొరసి పొరలి పారుచుండును.

ప్రత్యేకముగా ప్రహ్లాద చరిత్ర, వామనచరిత్ర, గజేంద్ర మోక్షము, రుక్మిణీ కల్యాణము, నరకాసురవధ, కుచేలో పాఖ్యానము - ఇత్యాది ఘట్టములు మూలమునకు బదింతలై యంగ ప్రత్యంగ సౌందర్యములతో స్వతంత్ర కావ్యములుగా విరాజిల్లినవి. శ్రీకృష్ణుని బాల్యక్రీడలు, రాసక్రీడలు, గోపికాగీతలు, భ్రమరగీతలు - ఇట్టి మధురభావ ఖండములు ముగ్ధభావనాకందములై మంజుల కవితా కుంజములవలె బరిమళించు చున్నవి. ఈ యన్నింటిపై మానవజాతికి పోతన యిచ్చు దివ్యసందేశములు పాలతరగలపై మీగడతరకలవలె జున్నులు గట్టి తేలియాడుచుండును. ఇంతగా దీరిన యాంధ్రభాగవతము మూలమున నిరువదివేలు తెలుగున ముప్పదివేలకు బెరిగినదై తెలుగువారికి ప్రాణప్రియమైన ప్రబంధముగా వారిచేతుల యందే గాదు, హృదయములయందు గూడ పీఠమువేసి కొన్నది. భాగవతపద్యములన్ని యితర పద్యములు కోటికి వచ్చినవారు చాలమంది లేరనుట యతిశయోక్తి గాదు. ఇదంతయు పోతన యమృతలేఖినీ ప్రభావము.

భాగవతమున కింతటి ప్రజాదరము అందలి భక్తి ప్రభావమువలననే గాదు, మంద్రగంభీరగమనముగల యాతని శైలివలనను వచ్చినది. అది సహజధారా విలసితము; ఓజః ప్రసాద గుణోజ్జ్వలము. బిగువైన యాపదబంధమున సంస్కృతములు, తెలుగులు చెరిసగముగా గ్రుచ్చిన మల్లెలు, జాజులై పరిమళించుచుండును. నన్నయధారా శుద్ధి, తిక్కన రసస్ఫురిత బంధము, ఎర్రన సూక్తివైచిత్రి, సోముని సాహితీ విదగ్ధత, శ్రీనాథుని క్రొత్తయెత్తుగడలు - అన్నియు నొక మూసలో గరగినచో పోతన శైలి పాంచభౌతికశరీర మగును. దానికి పోతన యాత్మవర్చస్సు జీవనాడియై యా ప్రసన్నమూర్తి సత్త్వగంభీరముగా బ్రబంధము నిండ బదవిన్యాసము చేయుచుండును. ఏని కేకాండముగా భాగవత మంతయు నుదాహరణమై చెప్పు 'ఇది పోతనశైలి' యని యే పద్యము నెత్తి చూపగలము? అందులో గొన్ని సొగసులు మాత్రము తొంగి చూడగలము.

గంగాప్రవాహమువంటి పోతన పద్యధారలో నంత్యానుప్రాసాదులు తీవె పొడవున విచ్చిన తామర పువ్వులై మొగములు విచ్చుకొని మొదట గనబడును. అందలి ఘల్లు ఘల్లారవములు భారతీపద మంజీర శింజితములై భావధ్వనులకు సుతివేయుచుండును. అది ఈయనశైలి కొక ప్రత్యేకాలంకారము. చూడుడు: 'క్షోణితలంబునన్ నుదురు సోకగ మ్రొక్కి నుతింతు సైకత శ్రోణికిఁ జంచరీకచయ సుందరవేణికి' - ఇట్లే పద్య మంతయు వాణికి జోహారులు పెట్టును. ఈ యనుప్రాస లొకప్పుడు నడుమనే తునిగి 'జలధరదేహు నాజానుచతుర్బాహు సరసీరుహాక్షు విశాలవక్షు' అనియు, 'దితిసుత నిరాకరిష్ణుఁ శ్రితవదనాలంకరిష్ణు జిష్ణుఁ విష్ణున్' అనియు, 'అలి మఱచె నిజగణాళి మఱచె' అనియు వింత నడకలు నడచును. ప్రాసలకూర్పునందే పోతన యెన్నో విన్నాణములు చూపును. 'లక్ష్యంబైన, అజ్ఝల్ గొందలు, శుభ్రఖ్యాతిని, అక్షీణోగ్ర—' ఇవి దుష్కరప్రాసలు. 'ఆరాటము - పోరాటము, ఉన్నారము - విన్నారము, అడచితివో - కుడిచితివో' ఇవి ద్విప్రాస, త్రిప్రాసాదులు.

'తడవాడిరి బలకృష్ణులు
తడవాడిరి వారిఁజూచి తగ రంభాదుల్
తడవాడి రరులు భయమునఁ
దడవాడిరి మంతనములఁ దపసులు వేడ్కన్'

ఈ ప్రాస యన్నిటికంటె నర్థచమత్కారముతో వాడినది.

'మా మా వలువలు ముట్టకు
మా మా! కొనిపోకు పోకు; మన్నింపు తగన్,
మా మాన మేల కొనియెదు...'
'లేమా; దనుజుల గెలువఁగ
లేమా! నీవేల కడఁగి లేచితి; విటురా:
లే; మాను; మానవేనిన్
లే; మావిల్లంది కొనుము'

ఈ ప్రాసలు అక్షరములను, స్వరములను ఇటునటు ఊపి లాగి ఊది నాట్యము చేయును. ఈ యమకములు ఛేకములు స్వరలఘువులతో నెట్లు కునిసి నడచుచున్నవో చూడుడు:

'అడిగెద నని కడువడిఁ జను
నడిగినఁ దను మగుడ నుడుగఁడని నడ యుడుగున్;
వెరవొప్ప నుడుగ సిరియురమున గల
హరి హరిహాయ కొలఁకు దనుజు నడుగం జనియెన్'

పోతన పద్యము నెత్తికొనుటయందే యొక క్రొత్త కనబడును.

'రాకేందుబింబమై రవిబింబమై యొప్పు
నీరజాతేక్షణ నెమ్మొగంబు
వనజాక్షి నే గన్న వైజయంతికసైన
గదిసి వ్రేలుడుగదా కంఠమందు'

ఇత్యాదిగా సీసములు, 'ఇతఁడే దానవచక్రవర్తి', 'స్వస్తి జగత్త్రయీ భువన శాసనకర్తకు', 'తాటంకాచలనంబుతో

భుజనటద్ధమ్మిల్ల బంధంబుతో ', 'విప్రాయ ప్రకటవ్రతాయ భవతే ' ఇత్యాదిగా వృత్తములు గుత్తమైన యెత్తుగడలతో బిత్తరించుచుండును. ఒకప్పుడు ' ఘుమఘుమారావ సంకుల ఘోరజీమూత పటల సంఛన్నాభ్రభాగ మగుచు ' అని సంస్కృత బంధమును, ' గొల్లవారి బ్రదుకు గొఱఁ తన వచ్చునే గొల్లరీతి బాలకుప్పఁ దచ్చి 'యని తెలుగు తీయ మును జూపించును. ఇంకొకప్పుడు ' అకూపార వేలాతట కుటజకుసుమగుచ్ఛ పిచ్ఛిలస్వచ్ఛ మకరంద సుగంధి గంధ వహంబులఁ గ్రొంజెమటనీటి వెనువఱదగము లొడళ్ళ నిగుర 'నని సంస్కృత సమాసంబుపై దెలుగు నుడికారము మాకందశాఖపై బూవుగుత్తివలె విరియజేయును. ' ఏమి నోముఫలమొ యింత ప్రొద్దొకవార్త ', ' నెల మసలఁ జీర చిక్క నెలఁతకు ' ఇత్యాది పలుకుబళ్ళు; ' ఎండ కన్నెఱుఁగని యింద్రుని యిల్లాలు ', ' చల్లడముక్రింద దూరని మల్లురు ' ఇత్యాది జాతీయములు ; ' చుంచుదువ్వు, చెక్కిలి ముద్దుగొను, నీళ్ళాడు, పిరిసుట్టు ' ఇత్యాది నుడికారములు జాజితోట పూచినట్లు భాగవతమునిండ బరిమళించును.

శాబ్దికమైన యీ బాహ్య సౌందర్యముకంటె నార్థిక మైన భావోపస్కారము భాగవతమున మిన్నగా గోచ రించును. తన భావమును సాకారముగా చిత్రింపదలచి నపుడు పోతన చక్కని కల్పనచేయును. వామనుడు విశ్వ రూపుడై పెరుగునపుడు ' రవిబింబం బుపమింపఁ బాత్రమగు ఛత్రంబై శిరోరత్నమై '- క్రమముగా నొక్కొక్క యవ యవమున నొక్కొక్క సొమ్మై కడకు పాదపీఠమైనదట ! గోపికలు శ్రీకృష్ణుని పాదముద్రలబట్టి యాతని జాడ లరయునప్పుడు 'కొమ్మకుఁ బువ్వులఁగోసినాఁ డిక్కడ, ఒక యెలనాఁగచేయూఁదినాఁడిక్కడ 'నని యాయా గుర్తులను బట్టి చేసిన పరిశీలన మంతయు రెండు సీస పద్యములతో వర్ణింపబడినది. ఎంత సమర్థుడైన రహస్య పరిశోధకోద్యోగి కూడ నింత నిపుణముగా బసిపట్టజాలడు.

ఇట్లే గజేంద్ర రక్షణమునకై ' సిరికిన్ జెప్పక ', కడకు ' శ్రీ కుచోపరిచేలాంచలమైన వీడక ' హరి పరువెత్తునపుడు ' తనవెంటన్ సిరి, లచ్చివెంట నవరోధవ్రాతము ' ఇట్లు వరుసగా వాహనాయుధ పరివారములు బారులు దీరి వచ్చు నప్పటి యా దృశ్యమును, సత్యభామ నరకునితో యుద్ధము చేయు నా ఘట్టమును పోతన అద్భుత భావనా కల్పన లతో గన్నుల గట్టినట్లు చిత్రించినాడు. గజేంద్రుని సరో విహారము, సముద్ర మథనము, నృసింహావతారము, బాల్యక్రీడలు, రాసక్రీడలు మున్నగువాని వర్ణనములు అనల్ప కవితాశిల్ప సందీప్తము లైనవి. ఆ యా సన్నివేశ ములలో పోతన కూర్చు నలంకారములు మిక్కిలి హృద్య ములు. ' మెలత మొగిలుపిఱిఁది మెఱుఁగుదీవయుఁబోలె జలదవర్ణు వెనుకఁ జనియె ' - ఇది యుపమ. వామనుడు త్రివిక్రముడైనప్పుడు ' ఒక పాదముక్రిందనున్న భూమి పద్మమున కంటిన పంకమా ' యన్నట్లు, ' మరియొక పాద ముపై నున్న యాకసము తమ్మిపై తుమ్మెదా ' యన్న ట్లున్నవట! ఇది యుత్ప్రేక్ష. సత్యభామ నరకునితో యుద్ధము చేయునపుడు ' సరోజాక్షుండు మేఘుంబుగాఁ దా విద్యుల్లతభంగి 'యై ఆ యుద్ధరంగమును బ్రావృ ట్కాలముగా జేసినదట! ఇది రూపకము. ఇట్లే శ్లేషలు, అర్థాంతరన్యాసములు, స్వభావోక్తులు మున్నగు నలం కారము లన్నియు పోతన కవితా భారతీ దివ్యాభరణ ములై యొప్పుచున్నవి.

పోతన స్ఫురింపజేయు భావార్థ ధ్వనివిశేషము లి ట్లుండును. బలిచక్రవర్తి వామనుని ' వడుగా ఎవ్వరివాఁడ వెవ్వఁడవు ? సంవాసస్థలం బెయ్యది ' యని యడుగగా ' ఇది నాకు నెలవని యే రీతిఁ బలుకుదు నొక చోటనక యెందు నుండనేర్తు .... ఒరులు గారు నాకు నొరులకు నే నౌదు, నొంటివాఁడ చుట్ట మొకఁడు లేఁడు, సిరియుఁ దొల్లి గలదు, చెప్పెద నాలెంకి, సుజనులందుఁ దఱచు చొచ్చియుందు ' అనెనట. ఇచ్చట నితడు విష్ణుడని యెట్లు తోపించుచున్నాడో కనుడు! యశోద బాల కృష్ణుని గట్టివేయుచు ' ఎక్కడనైనను దిరిగెద, వొక్క యెడన్ గుణము కలిగియుండవు, నియమం బెక్కడిది నీకు, మఱచినఁ జక్కఁగఁ బోయెదవు పెక్కుజాడలఁ బుత్రా ' అని దండించుచున్నది. ఇందులో అర్థాంతర స్ఫురణలు, ' తోయములివి యని తొలఁగక చొచ్చెదు,తలఁచెదు గట్టైనఁ దరలనెత్త ' ఈ సీసము నిండుగ నున్న చిన్నతనపు దుడుకు చేష్టలలో దశావతార స్ఫురణలు మిక్కిలి హృదయంగమ ములు. ఇవన్నియు నా మహాకవి తీర్చిన కావ్య జీవితములు.

ఇట్లే సందర్భ పాత్రౌచిత్యము, శృంగారాది రసపోష ణము, భగవద్భక్తి ప్రభావగుణ వర్ణనము, ధర్మనీతిప్రబో ధము మున్నగా కావ్య గుణములు, కావ్య ప్రయోజన పరమార్థములు భాగవతము నిండుగ శారద జ్యోత్స్నవలె వెల్లివిరిసినవి. ఆంధ్రమహాభాగవతము పోతన మహాకవియై మహాభక్తుడై ప్రజాహితమునకై సురభాషనుండి తెలుగు నేలకు దించుకొని వచ్చిన పారిజాతము. గ. వెం. శే. శా.

**ప్రకాశ్, రఘుపతి :** వీరు మద్రాసులో ప్రసిద్ధ ఛాయా చిత్రకారులైన రఘుపతి వెంకయ్యగారి కుమారులు. క్రీ. శ. 1918వ సంవత్సరములో వీరు ఇంగ్లండు వెళ్లి లండనులోని ' పోర్కర్ మోషన్ పిక్చర్స్

లిమిటెడ్' వారి స్టూడియోలో చలనచిత్ర నిర్మాణంలో తరిఫీదు పొందారు; అక్కడనుండి అమెరికా వెళ్లి 'యూనివర్సల్ సిటీలో' కొంతకాలం తరిఫీదు పొంది స్వదేశానికి తిరిగి వచ్చారు; 1920 వ సంవత్సరంలో 'ది స్టార్ ఆఫ్ ది ఈస్ట్ ఫిలిమ్స్' అనే సంస్థను వారి తండ్రిగారి సహాయంతో స్థాపించారు. ఆ సంస్థ ఆధ్వర్యాన ఎన్నో మూకచిత్రాలు వారు నిర్మించారు — గజేంద్ర మోక్షం, మత్స్యావతారం, నందనారు, భీష్మప్రతిజ్ఞ మొదలైనవి. నేడు చిత్ర దర్శకులుగా ప్రసిద్ధి పొందిన శ్రీ సి. పుల్లయ్య, వై. వి. రావు ప్రభృతులు ఆ రోజులలో ప్రకాశ్‌గారివద్ద తరిఫీదు పొందినవారే. వీరు 1924 - 25 సంవత్సరాలలో 'గారంటీడ్ పిక్చర్స్ కార్పొరేషన్' అనే సంస్థను స్థాపించారు. ఆ తరువాత 1928లో తమిళ చలనచిత్ర రంగానికి మూలపురుషుడుగా ప్రసిద్ధిచెందిన శ్రీ ఎ. నారాయణ్ గారితో కలిసి 'ది జనరల్ ఫిలిం కార్పొరేషన్' అనే సంస్థను స్థాపించారు. 1930 లో 'గోర్డన్ అండ్ కో' అనే 'ఫిలిం లెబొరేటరీ'ని ప్రారంభించారు.



చిత్రము 174.
రఘుపతి ప్రకాశ్

శ్రీ ఎ. నారాయణ్‌గారు నిర్మించిన చిత్రాలకు వీరు దర్శకులుగానో ఛాయాగ్రాహకులుగానో పనిచేశారు. ఆ రోజులలో వీరు నిర్మించిన చిత్రాలలో కొన్ని - పాండవ నిర్వహణ, విశ్వామిత్ర, మాయామధుసూదన, 'రోజ్ ఆఫ్ రాజస్థాన్' మొదలైనవి.

టాకీయుగం ప్రారంభమయిన క్రొత్త రోజులలో శ్రీ నారాయణ్‌గారు నిర్మించిన 'సౌండ్ సిటీ'లో వీరు కొన్ని 'టాకీ'లను నిర్మించారు. వీరు మొదట నిర్మించినవి తమిళ టాకీలు — ఇంద్రసభ, కృష్ణనారది, నళాయిని మొదలయినవి. ఆ తరువాత వీరు ఎన్నో తెలుగు తమిళ చిత్రాలకు దర్శకత్వం వహించారు. అందులో కొన్ని 'సోల్జర్స్ వైఫ్', 'ఆర్ఫన్ గర్ల్', 'కృష్ణన్ తూతు', 'బారిస్టర్ పార్వతీశం', 'చండిక', 'తారాశశాంకం', 'మాయపిల్ల' మొదలైనవి.

1956 నవంబరులో కాలధర్మం చెందేవరకు వీరు చిత్రనిర్మాణం సాగిస్తూనే ఉన్నారు. పాశ్చాత్య చిత్ర నిర్మాణ రహస్యాలు తెలుసుకున్నవారూ ప్రతిభావంతులూ మాత్రమేకాక, నేటి తెలుగు సినీమా పరిశ్రమకు పునాదులు నిర్మించిన ఆది పురుషులలో వీరు ముఖ్యులు. పా. ప.

**ప్రకాశం, టంగుటూరి** (క్రి. శ. 1872 - 1957): ఒంగోలు తాలూకా కనపర్తి గ్రామంలో ఆరువేల నియోగి బ్రాహ్మణ కుటుంబంలో ఈయన జన్మించారు. ఈయన తాతముత్తాతలు వెంకటగిరి సంస్థానంలో కరణాలు. బాల్యంలోనే తండ్రిని కోల్పోవడం, కుటుంబం ఆర్థికమైన చిక్కులకు లోనుకావడం కారణంగా అతిప్రయాసతోకాని ఈయన విద్యాభ్యాసం కొనసాగలేదు. 12వ ఏట ఈయన ఒంగోలులో మిడిల్ స్కూలు చదువు ముగించినవెనుక తనను చేరదీసి, ఆశ్రయమిచ్చిన ఇమ్మానేని హనుమంతరావు నాయుడుగారి సాయంతో రాజమహేంద్రవరం చేరి అక్కడనే మెట్రిక్యులేషను, ఎఫ్. ఏ. పరీక్షలలో ఉత్తీర్ణులైనారు; 1892 - 93 లో మదరాసు లా కాలేజిలో న్యాయశాస్త్రం అభ్యసించారు; సెకండరీ గ్రేడు ప్లీడరుగా 1894 లో రాజమహేంద్రవరంలో ప్రాక్టీసు ప్రారంభించారు; ఒంగోలు, రాజమహేంద్రవరాలలో చదువు సాగుతున్న రోజులలోనే నాటక ప్రదర్శనాలలో పాల్గొన్నారు; 1901 లో రాజమహేంద్రవరం మునిసిపల్ చైర్‌మన్ పదవికి పోటీచేసి, పురపాలక సంఘాధ్యక్షులై ప్రజాదరణ పాత్రులైనారు.



చిత్రము 175.
టంగుటూరి ప్రకాశం

ఆయన 1903 లో ఇంగ్లండుకు వెళ్లి బారిష్టరు పరీక్షలో ఉత్తీర్ణులై, స్వదేశానికి వచ్చి 1907 లో మదరాసు హైకోర్టులో ప్రాక్టీసు ప్రారంభించారు; 1907 నుంచి 1921 వరకు 14 సంవత్సరములు సివిల్ క్రిమినల్ శాఖలు రెంటిలోనూ ఆయన విస్తారమైన కీర్తిని, అపారమైన ధనమూ ఆర్జించి గాంధి మహాత్ముని శంఖారావం విని మద్రాసు న్యాయవాదులందరిలో ప్రప్రథమముగా వృత్తికి స్వస్తి చెప్పినారు.

రాజమహేంద్రవరంలో ఉన్నంతవరకు స్థానిక సంస్థలకు సంబంధించిన వ్యవహారాలలో పాల్గొన్నా, ఇంగ్లాండుకు వెళ్లిన తరవాతనేకాని ఆయన చూపు భారత రాజకీయాల వైపుకు మరలలేదు. లండను ఇండియన్ అసోసియేషన్‌లో

సభ్యులుగా చేరడంవల్ల ఆ సంస్థతో సంబంధం కల దాదాబాయి నౌరోజీ, రమేశచంద్రదత్తు, డబ్లియు. సి. బెనర్జి మొదలైన మహామహులతో ఆయనకు పరిచయం కలిగింది. స్వదేశానికి మరలి వచ్చిన పిమ్మట అప్పు డప్పుడు కాంగ్రెసు మహాసభలకు హాజరైనా మొత్తంమీద 1921లో అసహాయోద్యమంలో అడుగుపెట్టేవరకు రాజకీయాలతో అయనకు ప్రత్యక్ష సంబంధం లేదనే చెప్పవచ్చు. అది మొదలుకొని ఆయన జీవితం తుదివర కొక త్యాగగీతం; నడచిన మార్గం అతి కంటకితం. తన ప్రజల దృష్టిలో ఆయన రూపొందిన సాహసం.

ప్రజలలో సహాయ నిరాకరణ, శాసనోల్లంఘన కార్యక్రమాలను ప్రచారం చేసేటందుకు 1921 లో కొందరు కాంగ్రెసు నాయకుల సహకారంతో ఆయన స్వరాజ్య అనే ఆంగ్లదైనిక పత్రికను స్థాపించారు. పాలకుల నిరంకుశ చర్యలను నిర్భయంగా విమర్శించడంలో, దేశభక్తి నుద్బోధించి ప్రజల నుత్తేజపరచడంలో 'స్వరాజ్య' పత్రిక కొత్త వరవడి పెట్టింది.

ఉప్పు సత్యాగ్రహం మొదలైన ప్రజోద్యమాలలో, అధికారుల అనుచిత నిషేధాజ్ఞల ఉల్లంఘనలో ఆయన ప్రదర్శించిన ధైర్యసాహసాలు అనుపమానమైనవి. 1927లో మదరాసు నగరం హర్తాళ్‌తో సైమన్ కమిషన్‌ను బహిష్కరించిన సందర్భంలో శాంతియుతంగా పికెటింగు చేస్తున్న ప్రజానీకంపై బ్రిటిషు నిరంకుశాధికారం తుపాకులు ప్రయోగించినందున ఒక అజ్ఞాత వీరుడు తుపాకి దెబ్బలకు నేల కొరిగాడు. అధికారుల అమానుష చర్య తాత్కాలికంగా ప్రజలను స్తంభింపజేసింది. ప్రకాశం భయ విహ్వలమైన ప్రజాసమూహంలోనుంచి ముందు కురకగా బారులు తీర్చిన సాయుధ భటులు మరొకతూరి తమ తుపాకులు బారు చేశారు. 'సిద్ధంగా వున్నా' నంటూ ఆయన తన ఎదురు రొమ్మును సైనికులకు చూపారు. సాయుధభటులు వెనుకంజ వేశారు. 'ఆంధ్ర కేసరి' బిరుదు ఆయన పట్ల అన్వర్థమైంది.

ప్రప్రథమంగా 1937 లో కాంగ్రెసు మంత్రి పదవులను స్వీకరించినపుడు శ్రీ సి. రాజగోపాలచారి ముఖ్యమంత్రిత్వములో ఆయన రెవెన్యూశాఖ మంత్రిగా ఉండిరి. జమీన్‌దారీ రైతాంగానికి రెవెన్యూ మంత్రిగా ఆయన సల్పిన కృషి చిరస్మరణీయం. ఆనా డాయన తయారు చేయించిన సమగ్ర నివేదికే విప్లవాత్మకమైన జమీన్‌దారీల రద్దు చట్టానికి ప్రధాన సాధనమైనది.

కాంగ్రెసు అధిష్ఠానవర్గాన్నీ, గాంధిజీని సయితం నిగ్రహించి 1945 లో ఆయన చెన్నరాష్ట్రానికి ముఖ్యమంత్రికావడం కాంగ్రెసు రాజకీయ చరిత్రలో అపూర్వ ఘట్టం. ప్రకాశం మంత్రివర్గం అమలు జరిపిన బహుళార్థ సాధక సహకార సంఘాలు, ఫిర్కా అభివృద్ధి ప్రణాళికలు, మరకదుళ్ల నిరోధక విధానాలు మొదలైన సంస్కరణలవల్ల పెట్టు బడిదారీ వ్యవస్థకు, గుత్త వ్యాపారాలకు దెబ్బ తగిలి అభివృద్ధి నిరోధక శక్తులలో రేకెత్తిన ఆందోళన, ఆంధ్రులలో తలచూపిన అనైక్యత-ఒకటికొకటి తోడై అధికారానికి వచ్చిన ఏడాది లోపలనే అది పతనమైనది. చివరకు తాను తన దేశంలో పెంచి పోషించిన కాంగ్రెసు సంస్థనుంచి వైదొలగి ప్రజాపార్టీతో చేతులు కలపడానికి సయితం సమతాసిద్ధాంతాలపై ప్రకాశంగారికి గల గాఢానురాగమే కారణము. తాత్కాలికంగా కాంగ్రెసుతో ఎడబాటు కలిగినా ప్రజలకు మాత్రం ఆయన దూరం కాలేదు. మహదైశ్వర్యంగానీ, కటిక దారిద్ర్యంగానీ ఆయన ప్రకృతిని మార్చలేకపోయాయి. ఈ లక్షణమే ఆయన్ను ప్రజల కత్యంత ప్రేమాస్పదుని చేసింది. ఈ కారణంచేతనే కాంగ్రెసునుంచి చీలిపోయినప్పటికి ఆయనే 1953 లో ప్రత్యేకాంధ్ర రాష్ట్రానికి ప్రథమ ముఖ్యమంత్రి కావడం తటస్థించింది. క్రొత్త రాష్ట్రానికి అవసరమైన ఆర్థిక సౌష్ఠవం, సమస్తహంగులు గల రాజధానీ నగరం లేకున్నా, ఆంధ్రరాష్ట్రం బాలారిష్టాలను గడిచి అభ్యుదయ పథంలో పురోగమించడానికి చైతన్యవంతమైన ఆయన నాయకత్వమే సాయపడింది.

85 వసంతాలు నిత్య యౌవనంగా, త్యాగధన విశిష్టంగా జీవించి, ఆంధ్రుల మహదాశయమైన విశాలాంధ్ర అవతరణను కనులార కాంచి 1957 లో ఆంధ్ర ప్రదేశ్ రాజధాని హైదబాదులోనే ఆయన స్వర్గస్థులైనారు. రాజగౌరవ లాంఛనాలతో ఆయన అంత్యక్రియలు జరిగాయి. **నీ. శే.**

**ప్రకాశదాసు, నిట్టల:** వీరు గోదావరిజిల్లాలో కాపురముండినవారు; భద్రాద్రి శ్రీరామభక్తులు; కులమత విభేదబుద్ధి లేని మహాయోగి; 19 వ శతాబ్దము తొలిభాగమునం దుండిన తత్త్వ సంకీర్తన కర్తలలో చెప్పుకోదగిన వారు. వీరి తత్త్వములు కొన్ని సంకీర్తనాత్మకములు; మరికొన్ని భక్తుని మనోధర్మమును ప్రకటించునవి; ఇంకొక కొన్ని శృంగారరసస్ఫోరకములు. పిఠాపురప్రభువైన రావు నీలాద్రిరాయనింగారికి ఈయన యొకవేళ సమకాలికుడై యుండవచ్చునని ఈయన రచించిన యొకానొక కీర్తనలోగల 'రావు నీలాద్రిరావును రమ్యముగ రక్షించుమంటిని' అను మాటలవలన నూహింప నవకాశము కలదు. ఈయననుగూర్చి, ఈయన మహత్తునుగూర్చి అనేకాద్భుత కథలు ప్రచారములో నున్నవి.

'గౌతమి నే కనుగొంటిని కన్నుల పండువుగాను
రాతి నాతిగ జేసిన సీతారాముల కరుణామహిమను'

అనునట్టి ఈయన కీర్తన ప్రసిద్ధమయినది. ఈ కీర్తన పాడుచు గోదావరినదిమీద ఈయన తేలిపోయెడివాడట. కాకినాడలో ఈయన సమాధి కలదు. గ. సు.

**ప్రతాపరెడ్డి, సురవరం** (క్రీ. శ. 1896 - 1953): వీరు తెలంగాణమును మేలుకొలిపిన వైతాళికులు. నారాయణరెడ్డి, రంగమ్మగార్ల జ్యేష్ఠ పుత్రులు; అలంపురము తాలూకా ఇటికాలపాడు గ్రామమున జన్మించిరి; హైదరాబాదు నిజాం కళాశాలలోను, మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాలలోను చదివి. బి. ఏ., బి. ఎల్., పట్టభద్రులైరి. రెడ్డిగా రుపనిషత్తులను, వ్యాకరణ తర్కమీమాంసములను అభ్యసించిరి.

వారు కొన్ని సంవత్సరములు హైదరాబాదులో న్యాయవాది వృత్తి నవలంబించిరి. కాని ఆ వృత్తి వారికి కేవలము మన్వాది ధర్మశాస్త్రముల లోతు పాతులు తరచి చూచుటకు మాత్రము పనికివచ్చినది. వారి దృష్టి, దేశమందును, దేశ భాషయందును కేంద్రీకృతమైనది. వారు 1924 నుండి 1934 వరకు 'రెడ్డివిద్యార్థి వసతిగృహసంస్థ' భారమును వహించి చక్కని గ్రంథాలయమును, అముద్రిత తాళపత్ర గ్రంథములను దాని కనుబంధముగా చేర్చిరి. వారు 'గోలకొండ' అను తెలుగు అర్ధవారపత్రికకు 1925 నుండి 1948 వరకు సంపాదకులుగ నుండి నిరంకుశ ప్రభుత్వమున కెదురొడ్డి నిలిచి కేవలము రాజకీయముగనే కాక సాహిత్యకముగా, సాంస్కృతికముగా కూడ తెలంగాణమున కపారసేవ యొనర్చిరి. పోలీసుచర్య తరువాత రెడ్డిగారు 1951 లో 'ప్రజావాణి' యను మరియొక పత్రికను ప్రారంభించిరి. కాని అది కారణాంతరములచే కొలది దినములకే ఆగిపోయినది.



చిత్రము 176.
సురవరం ప్రతాపరెడ్డి

తెలంగాణా రాజకీయ చరిత్రమున రెడ్డిగారు ముఖ్యులు. 1927 ప్రాంతమున ఏర్పడిన తెలంగాణా ఏకైక ప్రజాసంస్థ యగు ఆంధ్రమహాసభయొక్క ప్రథమ మహాసభకు అధ్యక్షత వహించిరి. అప్పటినుండి ఆంధ్ర మహాసభలోవారు ప్రదర్శించిన ఉత్సాహము, సేవ ప్రశంసనీయములు. వారు నిజామాబాదు ఆంధ్రమహాసభలో సభా వేదికపై ఆంధ్రమే మాటాడబడవలయునని తౌరక్యాంధ్రులతో వివాదపడి అభివృద్ధి పక్షమును స్థాపించిరి; తరువాత తమ జీవితపు చివరిభాగమున మరల నొకమారు రాజకీయములందు ప్రవేశించి వనపర్తి నియోజకవర్గమునుండి హైదరాబాదు శాసనసభా సభ్యులుగా నెన్నుకొనబడిరి.

ప్రతాపరెడ్డిగారి సేవాభాగ్యమునకు నోచుకొనని సంస్థయే తెలంగాణమున లేదు. వారు 23 వ ఆంధ్రదేశ గ్రంథాలయమహాసభకు (పెదపాళెము) అధ్యక్షులుగను, ఆంధ్రదేశ గ్రంథాలయసంఘమునకు ఉపాధ్యక్షులుగాను ఎన్నుకొనబడి అప్పటినుండి జీవితాంతమువరకును, గ్రంథాలయోద్యమమున పనిచేసిరి. వారి 'గ్రంథాలయోద్యమ' మను పుస్తకము 1940 వ సంవత్సరమున వెలువడినది. ఇందు వారు ప్రాచీనకాలమునుండి నేటివరకును గల గ్రంథాలయముల చరిత్రమును సంగ్రహముగ వ్రాసినారు.

ఆంధ్ర సారస్వత పరిషత్తు స్థాపకులలో రెడ్డిగా రొకరు. వారే 1944 - 45 వ సంవత్సరమున ఆ పరిషత్తున కధ్యక్షులుగా నుండిరి. విజ్ఞానవర్ధనీ పరిషత్తునకు రెడ్డిగారు స్థాపకులును, అధ్యక్షులును. రెడ్డిగారికి ఆయుర్వేదముపై అభిమానము మెండు. వారు పిల్లల పాటలం దుండెడు ఆయుర్వేద రహస్యములను కనుగొని ప్రకటించినారు. హైదరాబాదు ఆయుర్వేద సంస్థకు వారు ప్రథమాధ్యక్షులై చాల కాలము సేవచేసిరి.

ప్రతాపరెడ్డిగారు కవిగా, నాటక రచయితగా, నవలకారుడుగా, మహాపరిశోధకుడుగా యావదాంధ్రమున ప్రశస్తి గాంచిరి. నిజామురాష్ట్ర పరిపాలనము, మొగలాయీ కథలు, గ్రామదర్పణము, మద్యపానము, సంఘోద్ధరణము, ప్రాథమిక స్వత్వాలు, యువజన విజ్ఞానము, కర్నూలు రాజవంశావళి, కాశ్మీరు ట్రాజిడీ, ఉచ్ఛల విషాదము, గ్రంథాలయములు, పౌరస్వత్వములు, హిందువుల పండుగులు, పూనా వ్యవసాయ ప్రదర్శనము, హైందవ ధర్మవీరులు, హంవీరసంభవమువంటి ఖండ కావ్యములు, గోలకొండ కవుల సంచిక, లిపి సంస్కారము, రామాయణ విశేషములు అనునవి ప్రతాపరెడ్డిగారి బహువిధ రచనలు. వారి సాంఘిక చరిత్రము భారత ప్రభుత్వముచే ఐదువేల రూప్యముల బహుమాన మందిన తొలి తెలుగు పొత్తము. శుద్ధాంత కాంత నవల, చంపకీభ్రమర ప్రబంధము, తుకారామ్ నాటకము - వంటివి రెడ్డిగారి యముద్రిత రచనలు. బి. రా. రా.

**ప్రభాకరశాస్త్రి, వేటూరి** (క్రీ. శ. 1888 - 1950): కృష్ణజిల్లా, దివి తాలూకా పెదకళ్ళేపల్లి వీరి జన్మస్థానము. వీరి తండ్రి సుందరశాస్త్రిగారు; తల్లి శేషమ్మ గారు. బాల్యమందే వీరు స్వగ్రామమున మహోదయులగు మద్దూరి రామావధానులు, అద్దేపల్లి సోమనాథ శాస్త్రిగార్లవద్ద సంస్కృత మభ్యసించిరి. అటుపై తమ పదమూడవ యేటనే చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రులవారిని శుశ్రూషించి సంస్కృతాంధ్రములతోపాటు అవధాన విద్యనుగూడ నభ్యసించిరి.

పదునెనిమిదవ యేటనే ప్రారంభమైన వారి సాహిత్య జీవిత మంతయు ముఖ్యముగా రెండు ఘట్టములుగా జరిగినది. తొలుత నొక ముప్పది యైదేండ్లకు పైబడి మద్రాసులోను, అటుపై పదేండ్లు తిరుపతిలోను గడచినది. వీరు పదునెనిమిదవ యేటనే మదరాసులోని కెల్లెట్ మిషన్ హైస్కూలులో తెలుగు పండితులుగా చేరి రెండేండ్లు ఆ యుద్యోగమును నిర్వహించిరి. అటుపై



చిత్రము 177.
వేటూరి ప్రభాకరశాస్త్రి

ప్రభుత్వ ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమున పండితులుగా ముప్పది సంవత్సరములకు పైబడి పనిచేసిరి. ఆ నాళ్ళలోనే శివకవుల రచనలపై అపారమైన పరిశోధన గావించిరి. ఆ దినములలోనే భాషావిషయమున చెలరేగుచుండిన వాద వివాదములను పరిశీలించి వ్యావహారిక భాషావాదమున కెంతయో చేయూత నొసగినారు. అప్పటి వీరి కృషి ఫలితమే యీ క్రింది కొన్ని రచనలు:

వీరిచే పరిష్కృతములు: బసవపురాణము, ఉద్భటారాధ్యచరిత్రము, హరవిలాసము, మనుచరిత్రము, క్రీడాభిరామము, రంగనాథరామాయణము మున్నగునవి అమూల్యములగు పీఠికలతో; శృంగార శ్రీనాథము (విమర్శ గ్రంథము); కపోత కథ, కడుపుతీపు, మూన్నాళ్ల ముచ్చట, విశ్వాసము స్వతంత్ర కృతులు; ప్రతిమ, కర్ణభారము, మధ్యమ వ్యాయోగము - ఈ మూడును భాసకవి రచనములకు, భగవదజ్జుకము - బోధాయన కృతికి, మత్తవిలాసము - (మహేంద్ర విక్రమవర్మ రచనమునకు), నీతినిధి (ఆంగ్ల మూలమునకు) అనువాదములు. ఇవేకాక ప్రాచీన తాళపత్ర గ్రంథములను పరిశోధించుచున్నప్పు డందందు దొరకిన కవుల చాటువులను సంకలనపరచి 'చాటుపద్య మణి మంజరి' అనుపేర ప్రకటించిరి. ఇది వారి పరిశోధన దక్షతకు స్వతంత్ర ప్రతిభకు తార్కాణము. తిరుపతి(శ్రీ వెంకటేశ్వర ఓరియంటల్ ఇన్‌స్టిట్యూట్)లో వీరి జీవిత మంతయు వైష్ణవులయిన తాళ్ళపాక కవుల కవితాప్రతిభను లోకమునకు జాటుటకే అంకితమైనది. అన్నమాచార్యచరిత్ర పీఠిక, ఉత్తర హరివంశ వ్యాఖ్యానము అప్పటి వీరి రచనలలో నతిముఖ్యమైనవి. వీరి వచన రచన మనోహరమైనది. వీ రుత్తమ తరగతికి చెందిన యుపాధ్యాయులు, వక్త కూడ.

ఇట్లు చిన్ననాటనే వీరు సంస్కృతాంధ్రములం దసామాన్యమైన పాండిత్యమును గడించి, ప్రతిభతో కవిత లల్లి రసగుళిక లనదగిన లఘుకావ్యముల నెన్నో చెప్పి, అవధానము లొనర్చి, ఉద్యోగ ధర్మమున ప్రాచీనతాళపత్ర గ్రంథములు వేనకువేలు సేకరించి పఠించి, శాసనములు పరిశీలించి, పరిశ్రమించి పరిశోధించి, ఉత్తమ స్థాయికి చెందిన విమర్శక వ్యాసముల నెన్నో వెలయించి, ఉత్తమ పండితుడుగాను, కవిగాను, గ్రంథపరిష్కర్తగాను, విమర్శకుడుగాను, చారిత్రకుడుగాను, బహుముఖ ప్రతిభావంతుడుగాను వన్నెకెక్కినారు. సాహిత్యక్షేత్రమున వీ రడుగిడని నెలవు లేదు; తీయని లోతు లేదు; చూడని యంచు లేదు. కలము పట్టినప్పు డెల్ల కలకాలము నిలుచునట్టి క్రొత్త విషయమును దెలుపుటయే వీరి ప్రతిజ్ఞ. అదియే వీరి ప్రజ్ఞ.

తొలుదొల్త సాహిత్యసౌధ నిర్మాణమున నిరంతర కృషి సలుపుచుండిన కారణముగా 1916 లో వ్యాధిగ్రస్తులై మృత్యుముఖమున బడిపోగా వారి నప్పుడు రక్షించి ప్రాణభిక్ష నొసగిన యమృత సన్నివేశ మొకటి వారి జీవితమును సాహిత్యమునుండి ఆధ్యాత్మిక చింతనము వైపునకు మళ్ళించినది. వా రనుసరించిన యోగ మార్గమున తాము సిద్ధులై యెందరినో కాపాడినారు, కారుణ్యము, ప్రేమ, సౌశీల్యము ఆకృతి దాల్చిన శాస్త్రిగారి మానుషము వారి శిష్యకోటి కనవరతము గౌతమబుద్ధుని స్ఫురింపజేసినది. ఇట్లీశ్వర ప్రీతికరమైన జీవితమును గడపుచు, ఉద్యోగ ధర్మమును నెరపుచు మ్యూజియము నొకదానిని నెలకొల్పుటకై ప్రయత్నపడి, జబ్బుపడి తమ భౌతికమును తిరుపతిలోనే త్యజించిరి. **వే. ఆ. మూ.**

**ప్రసాదరావు, హరి:** వీరు వెలనాటి బ్రాహ్మణులు. కూచిపూడి భాగవతుల వంశమునకు చెందినవారు. వీరు పూర్వకాలపు మెట్రిక్యులేషన్ వరకు చదివి కొన్నాళ్ళు

టెలిగ్రాఫ్ సిగ్నలర్ ఉద్యోగమును, తరువాత కొంత కాలము గుంటూరు జిల్లా కోర్టులో 'కాపీయిస్టు' ఉద్యోగమును జేసిరి. వీరి పుట్టుక గిట్టుక గుంటూరునందే జరిగి పోయినవి. వీరు కీర్తిశేషులైన నాటికి వీరి వయస్సు ఎనుబది దాటినది.


చిత్రము 178.
హరి ప్రసాదరావు

వీరు 1882-84 సంవత్సరముల నడుమ గుంటూరునందు స్థాపించబడిన ఫస్టు కంపెనీలో ప్రదర్శించిన నాటకములలో ప్రధాన నాయక పాత్రములను ధరించుచుండెడివారు. వీరు వేణీ సంహారమునందు 'దుర్యోధనుడు', చిత్రనళీయమందు 'నల, బాహుకులు', చంద్రహాసయందు 'చంద్రహాసుడు', హరిశ్చంద్రయందు 'హరిశ్చంద్రుడు', సారంగధరయందు 'సారంగధరుడు', శాకుంతలమందు 'దుష్యంతుడు' మొదలగు నాయక పాత్రములను అభినయించుచుండెడివారు. వీరికి 'నట పితామహ' బిరుదు గలదు. ఆంధ్ర నాటక రంగములో పాత్రాభినయమందు తమకుతామే సాటియై, అనుకరణాతీతులై అఖండ కీర్తిప్రతిష్ఠల నార్జించిన నటావధూత వీ రొక్కరే. అరవై సంవత్సరముల వయస్సు మించిన కాలమందైనను వీరి నటనా కౌశలము నవయావనోత్సాహోద్రేకములతో విలసిల్లుచుండె ననుటలో అణుమాత్రమైనను అసత్యము లేదు; అతిశయోక్తియు లేదు.

ప్రసాదరావుగారి చూపులు, రాచపోకడలు, భావ వైదుష్యము, అవయవ చాలనము, గాత్ర వైఖరులు, ఉత్తమ నాయక ప్రౌఢత్వమునకే వన్నెలు మున్నగునవి పెట్టుచుండెడివి. వీరి గానాభినయ రీతులందలి లోపములు గూడ నాట్యాదర్శములుగ పలువురచే నభినందింపబడుచుండెడివి.

స్థా. న. రా.

**బలరామయ్య, ఘంటసాల:** చిత్ర నిర్మాణంలో అడుగు పెట్టకముందు వీరు నాటకరంగంలో ఎంతో అనుభవం సంపాదించిన నటకులు. శ్రీ రామా ఫిలింసువారు తులసి చిత్రం నిర్మిస్తున్న రోజులలో వీరు ఆ సంస్థలో నిర్మాణ నిర్వాహకులుగా ఉన్నారు; ఆ తరువాత 1938 వ సంవత్సరంలో 'కుబేరా ఫిలింసు' అనే సంస్థను స్థాపించి మార్కండేయ, మహిరావణ చిత్రాలను నిర్మించారు; 1948 లో 'ప్రతిభా పిక్చర్సు' అనే సంస్థను స్థాపించి ఎన్నో తెలుగు చిత్రాలను నిర్మించారు. ఈ నాడు తెలుగు చలన చిత్ర రంగంలో తలమానికంగా ఉన్న సంస్థలలో 'ప్రతిభా పిక్చర్సు' ఒకటి. వీరు నిర్మించిన చిత్రాలు జనరంజనం ప్రధానంగా కలిగినవి. కథలను ఎన్నుకొనడంలోనూ, వాటిని చిత్రీకరించడంలోనూ సామాన్య జనం అభిరుచులకు అనుగుణంగా, వారిహృదయాలకు దగ్గరగా ఉండే విధంగా చేయగలగడం వీరి ప్రత్యేక శక్తి. అందుకు బలరామయ్యగారి నాటకానుభవం ఎంతో ఉపకరించి


చిత్రము 179.
ఘంటసాల బలరామయ్య

ఉంటుంది. 'ప్రతిభా' సంస్థ నిర్మించిన చిత్రా లన్నిటికి వీరు నిర్మాతా, దర్శకులూను. గరుడ గర్వభంగం, పార్వతీ కల్యాణం, సీతారామజననం, ముగ్గురు మరాఠీలు, బాలరాజు, స్వప్నసుందరి మొదలైనవి వీరు నిర్మించిన చిత్రాలలో కొన్ని. 'రేచుక్క' చిత్రం నిర్మాణం అవుతుండగా వీరు కాలధర్మం పొందారు. వీరి చిత్రాలలో చాలభాగం ప్రజాదరాన్ని ఎక్కువగా పొందినవే. చలనచిత్ర వినోదాన్ని సామాన్య జనానికి అతి సన్నిహితంగా జేసిన వారిలో వీ రొకరు.

పా. ప.

**బవనీలు:** వీరికే బైండ్ల, పంబాల యను పేరు లున్నవి. వీరు తెలుగుదేశమం దంతటను కలరు. వీరు తెలంగాణమున గ్రామదేవతల కొలువులు కొలుచుటకును, గత్తర, స్ఫోటకమువంటి రోగములను కుదిర్చెడు మాంత్రికులుగను ప్రసిద్ధి గన్నవారు. క్రీడాభిరామమున నేకవీరా మహాదేవి యెదుట నిల్చి పరశురాముని కథ లెల్ల ప్రౌఢి బాడిన బవనీల చక్రవర్తి ప్రశంస గలదు. పరశురాముని కథకే ఎల్లమ్మకథ యనియు, రేణుకా కథ యనియు మారు పేరులు. ఇప్పటికిని వీ రెల్లమ్మ, పోచమ్మ కథలను చెప్పుచు భిక్ష మెత్తెదరు. వీ రంకమ్మను కూడ కొల్చెదరని థర్‌స్టన్ పండితుడు వ్రాసియున్నాడు. మాలవారి యిండ్లలో కొలువులు కొలుచుట, శుభాశుభకర్మలందు పూజాదికములు నెరపుట వీరికి పరిపాటి. వీరు మాలలం దొక జాతివారు.

బైండ్లవా రనుపేరు వీరు వాయించెడు వాద్యమువలన కలిగి యుండును. వీరి వాద్యములకు జమిడిక, జమళిగ లనిపేరు. శిష్టులు వీనిని బవనిక లందురు. బవనికలు వాయించువారు బవనీలు, బైండ్లవారు. జమిడిక యనునది ధ్వన్యనుకరణ శబ్దము. జమిడికలం దొకటి (పెద్దది) వాయించునపుడు జమిడిక జమిడిక యని ధ్వనించును. బవనీ లెప్పుడును రెండు జమిడికలు వాయించుచు కథలు చెప్పుదురు. వంతపాట పాడెడువాని చెంత నుండునది చిన్న జమిడిక. ఇది కేవలము శ్రుతికై యుపయోగ పడును. టింగు టింగుమను తంత్రీ ధ్వని ఇం దుండి వెడలును. రెండిటి యాకార మొకే తీరుగా నుండును. చిన్న జమిడిక నిర్మాణ మిటు లుండును. ఒక కఱ్ఱ సోలకు మేక బక్క యొకవైపున నతికించెదరు. రెండవవైపు ఏమియు నుండదు. సోల కానుకొని యొక మూరెడు దండ ముండును. దండమునకు చివర భాగమున నొక జీవగఱ్ఱ యుండును. సోలలోపలి నుండి బక్క మధ్య భాగమున కట్టబడిన తీగ యొకటి జీవగఱ్ఱకు బిగించి యుండును. ఆ తీగపై చేతితో వాయించిన టింగు టింగు మని మ్రోయుచుండును. పెద్ద జమిడిక సోల కఱ్ఱతో చేయబడదు. ఇది ఇత్తడితో చాల పెద్దదిగా చేయ బడును; చిన్న జమిడికకన్న నాల్గింత లుండును. దీనికి వాడబడు బక్క ఎద్దు, దున్న మొదలగు పెద్ద జంతువులది. మరియొక విశేష మేమన దీనిలో తీగెకు బదులుగా నర ముపయో గింతురు. ఆ నరముచివర నొక చిన్న కఱ్ఱపిడికిలి కట్టబడి యుండును. ఎడమచేత కఱ్ఱ పిడికిలిని లాగిపట్టి కుడిచేతితో నరముపై వాయించినచో భీకరమయిన మూడు నాలుగు డప్పులు మ్రోగిన చప్పుడు పుట్టును. చిన్నపిల్ల లా ధ్వనికి భయపడగలరు. శక్తుల, గ్రామదేవతల కొలుపులు చేయు నపుడు వీ రతి బీభత్స కార్యము లొనర్చుచు నీ వాద్యముల మ్రోగించుచు గుండె లదరునట్లు చేయుదురు. మత్తు పదార్థ ములు గ్రోలి శక్తుల ముందర గంతు లిడుచు బలిపశువులను గావుపట్టుటలో వీరు సమర్థులు. గావు పట్టుట యనగా బలిపశువును నోటితో మెడకొరికి చంపుట. దాని నెత్తురు గ్రోలి, ప్రేవులు ధరించి దొబ్బలు నోట గరచికొని జమిడి కెలు వాయించుచు వీరు వీధి వీధుల తిరుగునప్పు డత్యంత బీభత్సముగా నుండును. ఈ బవనీలే రాయలసీమలో పెద్ద దేవర కథను చెప్పెదరని కీ. శే. సురవరము ప్రతాపరెడ్డి గారు వ్రాసియున్నారు. బి. రా. రా.



చిత్రము 180. బవనీలు

**బాపిరాజు, అడవి** (క్రీ. శ. 1895 - 1952): తండ్రి కృష్ణయ్య, తల్లి సుబ్బమ్మ. ఆర్వేల నియోగులు, సాలంకాయన సగోత్రులు. పశ్చిమ గోదావరి మండల మందలి భీమవరం నివాసం.

1920 పిమ్మట నడచిన ఆంధ్ర సాహిత్య చరిత్రలో బాపిరాజు వంటి అద్భుత వ్యక్తి మరొకడు లేడు. కవి, కథకుడు, చిత్రకారుడు, ఆఖ్యాయికా కర్త, అధ్యాపకుడు, పత్రికా సంపాదకుడు, సినీమాలో కళాస్రష్ట - ఎన్నని చెప్పను? ఇన్ని ప్రజ్ఞ లున్నవ్యక్తి ఏ కాలమందైనా దుర్లభమే. కల్లకపటాలు, మాయ మర్మాలు ఎరుగక మిత్రు లందరికి తలలో నాలుకయై పసివాళ్ళలో పసివాడు, పెద్దలలో పెద్దయునై, అందరిచే 'బాపిబావ' అనిపించు కొంటూ, జనముద్దుగా బ్రతుకు వెళ్ళబుచ్చుకొన్నాడు బాపిరాజు.

బాపిరాజు పుట్టుకతోనే కవీ, శిల్పీ, కథకుడూను. కవి, గాయ కుడు, చిత్రకారుడు అగు ఆస్వాల్డు కూల్డ్రే పండితుడు రాజమండ్రి ఆర్ట్సు కాలేజి ప్రిన్సిపాలుగా వుండి బాపిరాజువంటి పుట్టురత్నముల నేరి తరిమెనపట్టి పుణ్యము గట్టుకొనెను.

చిననాటినుండి బాపిరాజు కథ లన్నచో చెవులుగోసి కొనెడివాడు. హైస్కూలులో చదువుచున్నప్పుడే పద్యము లల్లెడివాడు; ఏవో బొమ్మలు గీయకుండ అతనిచేతు లూరకొనేవి కావు. ఆర్ట్సుకాలేజిలో కూల్డ్రేతో బాపి రాజు ఆంగ్ల సారస్వతమును మథించెను. అతను భారత భూమియంతయు గలియదిరిగి ఆలయశిల్పములను, గుహా కుడ్య చిత్రములను దర్శించి, గురుముఖాన ఆయా విశేష ముల నాకళించుకొన్నాడు. తెలుగునాటి పల్లెపదాలు, వీధి భాగవతములు, తోలుబొమ్మలాటలు చూచి కూల్డ్రే పరవశు డై వాని యందచందములను బాపిరాజుకు బోధించెను.

అత నంతట జానపద జీవన మాధుర్యముచే ఉప్పొంగి 'గమళ్ళ చెల్లాయి కూతురు' మొదలగు పదము లల్లుకొని పాడదొడగెను; పల్లి జీవనాన్ని రంగులలో చిత్రించుకో నారంభించెను. పట్టపరీక్ష నిచ్చి, దేశభక్తి సముద్దీపితుడై 1922 లో ఒక యేడు కారాగృహవాసం చేసి, 'బరన్సు' కవి గీతాలు ఒరవడిగా తాను రచించిన అప్పటి పాటలన్నీ 'తొలకరి' అను గ్రంథాన ప్రకటించెను; జైలులోనే శాతవాహన కాలాన్ని చిత్రించే అద్భుత కథా కల్పనతో 'హిమ బిందు' అనే నవల రచింప నారంభించెను.



చిత్రము 181.
అడవి బాపిరాజు

పిమ్మట అతను బందరు ఆంధ్ర జాతీయ కళాశాలలో మూడేళ్లు ప్రమోద కుమార ఛటోపాధ్యాయుని సేవించి భారతీయ చిత్రకళారహస్యా లన్నీ ఆకళించుకొన్నాడు; 'సముద్ర గుప్తుడు' మున్నగు చిత్రములను రచించి ఆ గురువునకు దగ్గర శిష్యుడై విఖ్యాతి నార్జించెను.

ఆవల లాయరు పరీక్ష యిచ్చి అతను భీమవరంలో నాలుగేళ్లు వకీలు వృత్తి చేస్తూ 'నారాయణరావు' అనే సాంఘిక నవల, 'తిక్కన' చిత్రము రచించి ఆంధ్ర యూనివర్సిటీ బహుమతు లందుకొన్నాడు; 1934 లో ఆంధ్ర జాతీయ కళాశాలా ప్రధానాచార్యత్వ మంగీకరించి నాలుగేండ్లచట నుండి శిల్పబాల, వీణ, హిమాలయరశ్మి మున్నగు చిన్నకథలు రచించెను; 1939 లో సినీమా కళచే ఆకృష్టుడై 'అనసూయ', 'ధ్రువవిజయం', 'మీరాబాయి' మున్నగు చిత్రములందు కళాదర్శకత్వం వహించి ఆ కళ యందు తన ప్రతిభచే నొక కొత్తదనము సంపాదించెను.

1944 లో హైదరాబాదులో 'మీజాన్' అనే దిన పత్రికకు సంపాదకత్వం వహించి మూడేళ్ళుండి ఆ కాలమందే 'తుపాను', 'గోన గన్నారెడ్డి', 'కోణంగి' మున్నగు నవలలు రచించి ప్రకటించి, పదులకొలదిగా నున్న చిన్న కథలను ప్రకటించడం జరిగింది. చిననాడే తాను కల్పించుకొన్న 'శశికళ' అనే ఆరాధ్య దేవతపై అతను నూర్ల కొలది ప్రేమ భక్తి గీతములు రచించెను. బాపిరాజు సమస్త రచనలందు పనితనం యించుక కొరవడినా, అమేయమైన భావనా, నిశితమైన లోకపరిశీలనం, అపార పాండిత్యం, అడుగడుగునా మనకు గోచరిస్తుంది. కావ్యములో చిత్రకళా ధర్మం, చిత్రరచనలో కావ్యకళా ధర్మం మేళవించి రెంటికిని నవీనత్వ మిచ్చిన ప్రతిభాశాలి బాపిరాజు.

కా. వెం.

**బాల పాపాంబ** (క్రీ. శ. 1565 - 1664): శైవ వాఙ్మయమున సుప్రసిద్ధి నందినట్టియు, కాలజ్ఞాన గ్రంథము వలన మహాతత్త్వవేత్తిగా పరిగణింపబడుచున్నట్టియు ఈమె వీరవసంత వసుమతీశుని కుమార్తె. ఈమె అక్కమహాదేవివిభోధోల్లాస మను యక్షగానమును రచించిన ప్రశస్తాంధ్ర కవయిత్రి. ఈమె రచనములను బట్టి ఈమె యోగ శాస్త్రమున ప్రత్యేక ప్రవేశముగల విదుషీమణి యని తెలియుచున్నది. ఈమె యక్షగానమునకు నాయికయగు అక్కమహాదేవి అల్లమప్రభువునకు సమకాలీనయైన మహాభక్తురాలు. ఈమెనుగూర్చి కన్నడదేశమున అనేక గ్రంథములు కలవు. బాలపాపాంబ శైలి సులభమై తత్త్వబోధన కనుగుణమై యొప్పి యున్నది. ఈ యక్షగానమున జంపెలు, రచ్చరేకులు, ఏకతాళి మొదలగు దేశిపదరచనలు, జోల పాటలు, మంగళహారతులు మొదలైనవి కలవు. ఊ.ల.కాం.

**బాలసూర్య ప్రసాదరావు, కందుకూరి**: వీరు గంజాము మండలములోని దేవిడి జమీన్‌దారులు. వీరి పూర్వులు హైదరాబాదు నిజాముల దగ్గర నున్నత పదవుల యం దుండినవారు. సూర్యప్రసాదరావు గారు సర్వతోముఖమైన విజ్ఞానము నార్జించిరి. తెనుగున రచనా కౌశలము, కవితాశక్తి నలవరచుకొనిరి; తమ యాస్థాన పండిత సాహాయ్యముతో వీరు 'ఆంధ్ర విజ్ఞాన' మనుపేరు గల యేడు సంపుటముల ఆంధ్ర విజ్ఞానసర్వస్వమును స్వయముగా రచించి ముద్రించి ప్రకటించి ఆంధ్రలోకమున కందజేసిరి. ఇది మెచ్చుకొనదగిన విషయము. వీరు ఈ గ్రంథము కాక (1)సీమంతినీ పరిణయ మనుప్రబంధమును, (2) వీథి నాటక మనుపద్యకావ్యమును (శ్రీనాథుని వీథి నాటకము వంటిది), (3) మాతులసుతోద్వాహ మను ప్రేమ వృత్తమును వర్ణించు పద్యకావ్యమును, (4) ప్రబోధ అను ప్రహసనమును రచియించిరి.



చిత్రము 182.
కందుకూరి బాలసూర్య ప్రసాదరావు

గ. సు.

**బీరన్నలవారు**: వీరికే ఒగ్గువారని మరియొక పేరు కలదు. వీరు కురుమ జాతికి చెందినవారు. కురుమవారికి

బీరన్న, బీరప్ప ఆరాధ్య దైవతము. బీరన్న కొలుపులు కొలుచుటచే బీరన్న కథలు చెప్పుటచే వీరికి బీరన్నలవారను పేరు కలిగినది. ఒగ్గు వీరి ప్రత్యేక వాద్యము. సంస్కృతములో దీనిని డమరుక మందురు. ఇతరజాతి భిక్షుకు లెవ్వరును దీని నుపయోగించునట్లు గానరాదు. డుబుడుక్కల (బుడుబుడుక్కల)వా రుపయోగించెడు వాద్య మిట్టిదే



చిత్రము 183. బీరన్నలవారు

కాని చాల చిన్నదిగా నుండుటయే కాక ధ్వనిలో గూడ భేద ముండును. ఒగ్గుతోపాటు వీరు పెద్ద పెద్ద డోళ్ళు, తప్పెటలు కూడ నుపయోగింతురు. గొల్లలకన్న కురుమ జాతి కొంచెము తక్కువగా పరిగణింప బడును. కురుమలు గొర్రెలను, మేకలను పెంచెదరు; వాని యున్నితో కంబళ్లు నేయుదురు. బీరన్నలవా రిట్టి కురుమలిండ్ల పౌరోహిత్యము నెరపెదరు; కురుమలను యాచించి జీవించెదరు. బీరన్నలవారు కొమిరెల్లి మల్లన, ఐలోని మల్లన్న కథలు చెప్పుదురు. మల్లికార్జున స్వామియే మల్లన్న. ఈతడే బీరన్న యని నా యనుమానము. కాటమరాజు కథలో నొక బీరన్న ప్రసక్తిగలదు. ఆ బీరన్నకును, కురుమల దైవతమగు బీరన్నకును నెట్టి సంబంధమో తెలియదు. వీర శబ్దమునుండి బీరన్న పుట్టి యుండును. కురుమలుకూడ శైవులే కనుక వీరన్న, వీరభద్రుడు బీరన్న రూపముగా పూజ లందుచుండును. మల్లన్న కురుమవారి కిలవేల్పు. తెలుగుదేశపు కురుమలకు లింగధారణములేదు. కన్నడ దేశమున లింగధారులగు కురుమలును, బీరన్నలవారును కలరు. కురుమలలో కొద్దిమంది వైష్ణవులు కూడ కలరు. కార్తిక, మాఘమాసములందు వీరన్న కొలుపులు, పూజలు జరుగును. బీరన్నలవారు పోచమ్మ, మైసమ్మవంటి దేవతలనుకూడ కొలుతురు. మల్లన్న కథలో నాతడు శివుని వరమున కాపులిండ్ల పుట్టినట్టుగా నున్నది. మల్లన్న రెండవభార్య రత్నాంగి. ఈమె బ్రాహ్మణ కన్యక. బీరన్నలవా రీమె సంతానమట. బహుశః ఈ జాతివారు బ్రాహ్మణ, కాపుజాతుల సమ్మేళనమువలన పుట్టియుందురు. 'ఐనవోలు (ఐనోలి—ఐలోని) లో నున్న మల్లేశ్వరస్వామియే మైలారు దేవుడు. అతని భటులు, భక్తులు మైలారుభటులు. బీరన్నలవారిలోగూడ మైలారు భటులు కలరు. బి. రా. రా.

**బుచ్చి వేంకటాచార్యులు, తిరుమల బుక్కపట్టణం :** వీరు అమరచింత, ఆత్మకూరు సంస్థానాస్థాన పండితులు; వ్యాకరణ వేదాంత శాస్త్రములలో చక్కని పాండిత్యముగలవారు. చిన్న తనమున చాల బీదతనము ననుభవించి 20 వ సంవత్సరముననే తమ పాండిత్యము వలన పై సంస్థానాస్థాన పండితు లయిరి. వీరు సుమారు 50 సంవత్సరములకు ముందు పరమ పదించినారు. బు. అ.

**బుచ్చిసుందర రామశాస్త్రి, మాధవపెద్ది (క్రీ. శ. 1890 - 1950) :** వీరు గుంటూరు జిల్లాలోని బ్రాహ్మణ కోడూరు గ్రామమునందు సుప్రసిద్ధ వైదిక బ్రాహ్మణ కుటుంబములో జన్మించినారు. ఈ కవి తండ్రి శంకరయ్య పరమ పౌరాణికోత్తములు, తల్లి ఆదెమ్మగారు. భార్య కామేశ్వరి; సంతానము ముప్పురూ పుత్రికలే.



చిత్రము 184, మాధవపెద్ది బుచ్చిసుందర రామశాస్త్రి

తిరుపతి వేంకటేశ్వర కవు లవధానాలు చేస్తూ ఆంధ్ర దేశము నలుమూలలా పర్యటనం చేస్తూ ఉండిన సందర్భములో ఈ కవి ఆకర్షింపబడినవాడయి అళువుగా పద్యాలు రచించే సామర్థ్యము నలవరచుకున్నాడు. 1912 ప్రాంతాన వెంకట శాస్త్రిగారికి శిష్యుడై ఈయన మాఘకావ్యమును, సిద్ధాంత కౌముదిని చదివినాడు. అయితే 'అతనికి తోచినట్టు చదువుటయే కాని వెంకట శాస్త్రిగారి 'ఏర్పాటును బట్టి చదువువాడు కాదు.'

ఈ యనకు నాదనామక్రియ రాగముమీద అభిమానము మెండుగా ఉండేది. పద్యాల నారాగములో పాడుతూ, కవితావినోదంతో కాలక్షేపము చేస్తూ ఉంటే యీకవి చుట్టూ అనేకులు సహృదయులు చేరి చిత్రార్పిత ప్రతిమలై, పరవశులై పోతూ ఉండేవారంటే ఇందులో అత్యుక్తి ఏమీ లేదు. ఈతని సంభాషణాచాతుర్య మనితరమైనది. మాటలలో, పద్యాలలో హాస్యాన్ని మేళవించి సామాజికులను చక్కిలిగింత పెట్టడములో ఈతని కీతడే సాటి.

స్వస్థలమైన బ్రాహ్మణకోడూరులోని, చింతపల్లిపాడు, రెంటచింతల, ఫిరంగిపురములలోని పాఠశాలలలో తెలుగు పండితుడుగా పనిచేసి ఈయన విశేషఖ్యాతి నార్జించినాడు.

జీవితములో తనకు గల్గిన క్లేశాలను పద్యములలో ఏకరువు పెట్టిన కవి యీతడు (చూ: 'బృందావనము' అను కృతిలో 23-33 పుటలు; 56-64 పుటలు, 64-67 పుటలు, 76-82 పుటలు). భార్యా వియోగ మీతనిని క్రుంగదీసి 'సతీస్మృతి' రచనకు హేతువైనది; పారలౌకిక చింత యీతని హృదయములో ప్రాదుర్భవింపజేసినది. ఆర్థిక దురవస్థ యీ కవిని పీడించివైచినది. ఈత డారోగ్యము చెడి శరీరము ఉబ్బసమునకులోనై చాలకాలము బాధ చెందినాడు. సహృదయులైన ఆప్త మిత్రులు కొందరీచివరి దశలో ఆదుకొన్నారు.

ఈతని కృతులు 1. బృందావనము, 2. శబరి, 3. పంచవటి, 4. ఉమర్ ఖయాం, 5. మృత్యుంజయం, 6. శృంగార చాటువులు, 7. సుభాషితములు.

నవ్యాంధ్ర సాహిత్యమున కీ కవి నూతనాలంకారములను చేకూర్చినాడు. జాతీయ ప్రబోధము సల్పి హరిజనాభ్యుదయమునకై పాటుపడిన కవి యీతడు. జాతీయోద్యమములో పాల్గొననివారిని గూర్చి అధిక్షేపించుచు 'అంటరానివా రెవరో కాదు మావెంట రానివారె' అని నాడు. నేటి నాగరకతను అవహేళన చేస్తూ యీ కవి వ్రాసిన పద్యాలు వ్యంగ్యపూరితాలై, ఆంధ్రావళి నాకర్షించినట్టివి.

'కనులన్ జూడదు భార్యయేనియును నీ కాలస్థితింబట్టి జ
ర్మను తైలమ్ము జపానుస బ్బమెరికా క్రాపున్ వియన్నా సులో
చనముల్ స్విడను చేతి బెత్తమును, స్విట్జర్లెండు రిస్టువాచి ఫా
రెనుడ్రెస్ ఫ్రెంచికటింగుమీసలును పారిస్ ఫ్యాషనే లేనిచోన్'.

ఆంగ్ల పదాలను, హిందూస్థానీ పదాలను పద్యాలలో బహుళంగా జొన్పడములో ఈ కవి మార్గదర్శి అనవలె; ఈతని హాస్యప్రకృతి కవిత్వములో ప్రతిఫలించి ఆహ్లాదం కలిగిస్తూ ఉండడము మరొక విశేషము. ఇతడు అంతర్ముఖుడై మృత్యుంజయాన్ని మిక్కిలి రసవంతముగా రచించి ఉత్తమ శతక సాహిత్య నిర్మాతలలో ఒకడై శాశ్వత స్థానాన్ని అలంకరించినవా డౌతున్నాడు. ఈతని 'పంచవటి' నూత్న మార్గాన్ని అవలంబించిన ఖండకావ్యం. ఇందలి పాత్ర ప్రవేశ ధోరణి వినూత్నము. 'రామదూత' అన్న శీర్షిక క్రింద వ్రాసిన పద్యము లత్యంత మనోహరములు, 'కవిప్రశంస' విశిష్ట భావ విలసితమై రసజగత్తును నిర్వచించుటలో నిరుపమానమై విరాజిల్లుచుండుట ప్రశంసార్హము. పి. వెం. హ.

**బొమ్మగంటి షట్కము :** బొమ్మగంటివారు హారితస గోత్రులు; తూర్పుగోదావరి జిల్లా ర్యాలిగ్రామము వారి నివాసము. వెంకటనృసింహశాస్త్రి, రామస్వామి అవధాని, అచ్చన్నశాస్త్రి, నృసింహశాస్త్రి, సీతారామశాస్త్రి, జగన్నాథశాస్త్రి - అని ఆర్గురును సోదరులును మహావిద్వాంసులు నగుటచే వీరు 'బొమ్మగంటి షట్క' మను సాముదాయిక నామముతో వ్యవహరింపబడుచుండిరి. వీరి తండ్రి పేరుశాస్త్రి; తల్లి సుభద్రమ్మ.

వెంకట నృసింహశాస్త్రి (క్రీ. శ. 1850 - 1925): వేదము నధ్యయనముచేసి వేదాంతశాస్త్రములో గొప్ప పాండిత్యము సంపాదించిరి. వీరి వేద వేదాంత సన్నివేశము మిక్కిలి యరుదు. ఉగ్లాములో విద్వాంసులను సత్కరించుటకు సభలు జరుగుచుండిన కాలములో వీ రచట ఘన యశస్సును సంపాదించిరి.

రామస్వామి అవధాని (క్రీ. శ. 1852 - 1931): వీరు ఘనాంత స్వాధ్యాయపరులు. ఉగ్లాములో వేదమునకు పరీక్షాధికారిగా నుండిరి. అది సామాన్యపదవి కాదు.

అచ్చన్నశాస్త్రి (క్రీ. శ. 1854 - 1922): వీరు తర్కశాస్త్రములోను, జ్యోతిషములోను పరిపూర్ణ పాండిత్యము కలవారు; సాహిత్యచక్రవర్తి యని విఖ్యాతినొందినారు; దేవీపూజా ధురంధరులు. వీరు బొబ్బిలిలో విద్యాభ్యాసము చేసిరి; తమ పినతండ్రి సుబ్రహ్మణ్యశాస్త్రిగారి వద్ద వేదాంత శాస్త్రాభ్యాసము చేసిరి; కొవ్వూరు ఆంధ్ర గీర్వాణ విద్యాలయములో 1919 వరకు అధ్యాపకులుగ నుండిరి. సాహిత్యగ్రంథముల ననేకులకు పాఠము చెప్పిరి; తూర్పు గోదావరి జిల్లా తాపేశ్వరములో కొంతకాల ముండిరి.

నృసింహశాస్త్రి (క్రీ. శ. 1856 - 1934): వీరు బహుశాస్త్ర విశారదులు. రాజుపాలెము గ్రామవాస్తవ్యులగు పొక్కునూరి వెంకటశాస్త్రిగారి జ్యేష్ఠ పుత్రిక రామలక్ష్మి వీరి ధర్మపత్ని. సుప్రసిద్ధులైన భాగవతుల హరిశాస్త్రిగారివద్ద వీరు వ్యాకరణ శాస్త్రాధ్యయనము చేసిరి; పుల్య దక్షిణామూర్తి శాస్త్రిగారివద్ద



చిత్రము 185.



చిత్రము 186.



చిత్రము 187.



చిత్రము 188.



చిత్రము 189.



చిత్రము 190.



చిత్రము 191.

చిత్రములు 185 - 188 తెలుగు దేశములోని తోలుబొమ్మలు

చిత్రములు 189 - 191 జావా తోలుబొమ్మలు



చిత్రము 185.



చిత్రము 186.



చిత్రము 187.



చిత్రము 188.



చిత్రము 189.



చిత్రము 190.



చిత్రము 191.

చిత్రములు 185 – 188 తెలుగు దేశములోని తోలుబొమ్మలు

చిత్రములు 189 – 191 జావా తోలుబొమ్మలు

గాను ఆడబడుచుండెడివని పరిశోధకుల మతము. తూర్పిండియా దీవులలోని 'వాయంగ్' వినోదములు, సింహళమునందలి 'కలమ్‌నాటిమ', తుర్కిదేశపు 'కరఘేజ్' ప్రదర్శనములు వీని కోవలోనివే. యూరపుఖండమునందలి కొయ్యబొమ్మలాటలకు మాతృకలు ప్రాచ్యసీమలలోని బొమ్మలాటలేయని పిషెల్ మొదలగు పండితులును అంగీకరించినారు.

కొయ్య బొమ్మలాటలు : తెనుగుదేశమున కొయ్య బొమ్మలాటలకు తోలు బొమ్మలాటలకు గల ప్రచారము లేదు. 'పెళ్లాడే బొమ్మ బీబీనాంచారి'యని పాడుచు బిచ్చమెత్తుకొను యాచకు లాడించు బొమ్మలవంటి వీ కొయ్య బొమ్మలు. ఇవి బోలు - డొల్లు - బొమ్మలు. వివిధావయవములకు సూత్రములు గట్టి వాని నన్నిటిని బొమ్మతల గుండ తెచ్చి ఒకయుంగరమునకు గూర్చి దానిని చేత నుంచుకొందురు. ఈ సూత్రములతో బొమ్మల నాడించుటకు చాల నేర్పు కావలెను. ఏ మీట నొక్కిన ఏ విద్యుద్దీపము వెలుగునో స్పష్టముగా దెలిసినట్లు ఏ సూత్రము లాగిన ఏ యవయవము కదలు ననునది ఈ బొమ్మల నాడించువారికి మంచినీళ్ళప్రాయము. తెరముందు వీని నుంచి తాము తెరవెనుక ప్రేక్షకులకు కన్పింపకుండ నుండి ఆడించెదరు. తెనుగునాట కొన్నిచోట్ల వీని నారు బయట ఆడించెదరు. వీరికి తెరలతో, వేదికలతో పనిలేదు. దీపముమాత్రము చాలును. వీరిని గంటెభాగవతు లందురు. తోలుబొమ్మ లాటగాండ్రకంటె వీరు కొంత డొక్కశుద్ధి కలవారు. ఆట చూడవచ్చిన అమ్మలక్కలు, అభిమానులు గరిటెలతో చమురు తెచ్చి ప్రమిదెలలో పోసి తమకు తోచినంత తృణమో పణమో అందు వేయుదురు. అదే వారి సంపాదన. ఉదయము బొమ్మలతోగూడ ఇంటింటికి పోయి యాచన సేయుదురు. నేడవి చాల యపురూపమైనవి ; కేరళ, మైసూరు, రాజస్థానప్రాంతములలోమాత్ర మరుదుగా ప్రదర్శింపబడుచున్నవి.

పంద్రెండవ శతాబ్దినాటికే తెలుగునాట నీయాటలు కలవని ఆంధ్రసాహిత్యానుశీలనమువలన తేలుచున్నది. పదునారవ శతాబ్దినాటికి శాసనాధారములును గలవు. కోలారు మండలమందలి సిద్దలఘట్ట ప్రాంతముల నొక బొమ్మలాట వీరప్ప కుమారుడు క్రిష్టప్పయు, హంపి - విజయవగరమున నొకబొమ్మలాట కాళయయు, నెల్లూరి సీమలో ఉదయగిరి ప్రాంతముల నొక బొమ్మలాట వీరప్పయు, అనంతపుర మండలము లేపాక్షిచుట్టుపట్ల బొమ్మలాట సిద్దయ్య కుటుంబము రమారమి ఏకకాలమునుండి ప్రభువాల్లభ్యమును, ప్రజాదరమును చూరగొన్న బొమ్మలాటలవారు.

తోలు బొమ్మలాట : తోలు బొమ్మలాటలను ప్రదర్శించువారు పశ్చిమాంధ్ర ప్రాంతముల చాలవరకు మరాఠీ వారు. వీరిని కన్నడ నాడులలో కి(షి)ల్లెక్యా(ఖ్యా)త జాతి వా రనియు, పశ్చిమోత్తర తమిళ మండలములలో కిల్లెక్యాతవా రనియు, తెలుగుదేశమున బొమ్మలాట వారు, చర్మ నాటకులు అనియు వ్యవహరింతురు. వీరి యాటలో జానపదుల దృష్టిలో బంగారక్క, కేతిగాండ్రు ముఖ్యులు. రాయలసీమలో నీబొమ్మను కిల్లేగిత్తిరిగా డందురు. కొంటె కోణంగి, జగడాలమారియని ఈ పదమునకు ద్రావిడభాషా సామాన్యమగు నర్థము. బొమ్మలాటలో కిల్లేగిత్తిరి(కేతి)గానికి గల ప్రాముఖ్యము, ప్రజాకర్షక శక్తినిబట్టి తత్ ప్రదర్శకజాతికిని ఆ నామము సంక్రమించి యుండనగును. భాగవతకథా ప్రదర్శకులు భాగవతు లనియు, యక్షగానము (జక్కులకథ) లను ప్రయోగించువారు జక్కు లనియు వ్యవహరింప బడినట్లే (కిల్లే)కేతిగాని బొమ్మను ఆడించువారి కాపేరు వచ్చి యుండునని సంభావించుట సహేతుకమును, సమంజసమును. వీరి మాతృభాష అపభ్రంశ మహారాష్ట్రీ మాండలికము. బెల్గాము, సతారా, కొల్హాపూరు, పూనా, బిజాపూరు ప్రాంతములనుండి వీరు పరిసరదేశములకు వలస వచ్చిరి. పాలకుల జైత్రయాత్రలలో, స్వీయసీమలలోని రాజ్యోపప్లవాదులలో, ప్రక్కవారి ఆదరాభిమానములో వారివలసకు హేతువులై యుండవచ్చును సాతవాహనుల పరిపాలన కాలమునుండియు నీ రెండు నాడులకు గల సంబంధ బాంధవ్యములు విడివడరానివి. శ్రీశైలపు 'పరుస నడక'లలో తెనుగులు, తక్కిన ద్రావిడులతోపాటు 'ఆరె' వారును కల రనుటకు పండితారాధ్య చరిత్ర పరమ ప్రమాణము. శివరాత్రి మహోత్సవవేళ కొయ్యబొమ్మలాటలు, తోలుబొమ్మలాటలు ప్రయోగింప బడినవి. ప్రయోక్త లెవరో అందు పేర్కొన బడలేదు. కాని, శ్రీశైలము మల్లయ్యను జూడవచ్చిన ఇరుగు పొరుగు నాడులలోని జను లందరికిని ఈ బొమ్మలాటలు సుపరిచితములే యనుట సత్యదూరము గాదు.

'ఆరె' వారి నుండియే తెనుగులు తదితరులు నేర్చిరో, లేక స్వయముగా నెరిగియుండిరో, ఎవరినుండి ఎవరు సంగ్రహించిరో నిర్ధరించుట కాధారములు చాలవు. మీదు మిక్కిలి దక్షిణదేశమందలి బొమ్మలాటజాతివా రందరును 'మరాఠీ'వారు కారు. మైసూరు సీమలో 'ఊరు జంగాలు', బొంబాయి మైసూరు సరిహద్దులలో 'కతుబు' లనువారు, మధుర తంజాపురు మండలములలో 'కూత్తాడి' లను నట్టువజాతివారు, బళ్లారి జిల్లాలో కొన్ని ప్రాంతము

లందు 'బలిజలు ' విశాఖజిల్లాలో ఈకె, బొందిలీ తెగవారు, గోదావరీ మండలమున తెలుగు గొల్లలు, గుంపుతెగవారు, జంగాలు మొదలగువారు ఆరెవారికంటె భిన్నులగు బొమ్మలాటగాండ్రు. ఆంధ్రదేశమున సర్వసిద్ధి, శృంగ వరపుకోట, కళ్లేపల్లి అగ్రహారము (విశాఖ), మండపేట, అంగర, ఎలమంచిలి, తణుకు (గోదావరి); సింగరాయ కొండ (నెల్లూరు); రామదుర్గము, బెళగల్లు (కర్నూలు); కడమలకుంట, ఆవులన్న, జరుట్లరామపురము (అనంత పురము); సొండూరు, తోరణగల్లు (బళ్లారి) ప్రాంతము లలో బొమ్మలాట లాడువా రెక్కువగా కలరు. కొన్ని చోట్ల వీరికి ఈనాము భూములును గలవు.

ఆదరించువారుకల గ్రామములలో వీరు ప్రదర్శనము లిచ్చుచుందురు. వర్షాభావ వేళలలో వీరిని ప్రత్యేకముగా పిలిపించి గ్రామస్థు లాడించుచుందురు. తోలుబొమ్మలు ఊరి చావడులయందో, లేక ఆరుబయట తాత్కాలికముగా వేసిన వేదికయందో ఆడుచుందురు. తలుపుచెక్కలతోడనో, కొయ్యపలకలతోడనో నేలకు రెండు, రెండున్నర అడు గుల యెత్తున అట్టువ కట్టుదురు. తురకవేప అడ్డుపట్టెలు, వెదురువాసములతో రంగశాల నిర్మింతురు. ముందు చలువచేసిన తెల్లని తెర. ఊరి చాకలియే తెల్లరుమాళ్లను తెరగా వాడుట కెరవుగా నిచ్చుచుండును. తక్కిన ప్రక్కల నీలికోకలో, నల్ల కంబడులో వాడుదురు. తెర వెనుక నాలుగుమొద లారువరకు తైలపాత్రలు బొమ్మ లాడించువారి నీడ సాధ్యమైనంతవరకు తెరమీద పడకుండు నట్లు వ్రేలాడదీయుదురు. నాటి యాటకు కావలసిన చమురును - ఆముదమో, మంచినూనెయో - కోమట్లో, ఆటాడించువారో ఉచితముగా నొసగుచుందురు. మేళ నాయకుడు 'వాయంగ్ ' ఆటలలో 'దలాంగ్ 'వంటి వాడు. ఇతర హంగుదారులు వారి వారి పరికరములతో తెరవెనుక వేదికమీద నుందురు. బొమ్మల నాడించువా రిరు వురు, ముయ్యురు నుందురు. పురుష పాత్రల వెనుక పురు షులు, స్త్రీపాత్రల వెనుక స్త్రీలును ఉండి వాచికము పూర్తి సేయుచుందురు. వీరికి తోడుగా బొమ్మల నందుకొనుట కును, కొత్తవి అందిచ్చుటకును వేరుగా నొక రుందురు.

ఆట సరిగా రెండవ జామునుండి తెల్లగా వేగుదాక జరుగును. సూత్రధారుడు - మేళనాయకుడు - ప్రార్థన సమయమున పరంపరగా నేర్చిన అనేక పద్యములను చదువును. మొట్టమొదట విఘ్నేశ్వర పూజ, పిమ్మట సరస్వతీస్తవము. గణపతి, సరస్వతి బొమ్మలు తెరమీదికి వచ్చి ప్రదర్శకులను, ప్రేక్షకులను ఆశీర్వదించి పోవును. పిమ్మట బంగారక్క, కేతిగాడు, తెరమీది కెక్కుదురు. గందోడిగాడు, కేతిగాడును కలిసి ప్రదర్శనకారకులను ప్రశంసించి గ్రామ ప్రముఖులను పేరు పేరుల పేర్కొని పొగడుదురు.

సూత్రధార పారిపార్శ్వకులను బోలినవారు గందోడి గాడు, కేతిగాడు. వీరి తొలి సంభాషణము గీర్వాణరూప కము లందలి ప్రస్తావనవంటిది. నాటక ప్రస్తావనతో వారి పని సరి. ఆట పూర్తి యగువరకు వీ రపు డపుడు తెర యెక్కుచునే యుందురు. ఆట చప్ప చప్పగా నుండి ప్రేక్షకు లల్లరి మొదలుపెట్టు తావుల వీరితోపాటు బంగారక్కయు తెరమీద ప్రత్యక్ష మగుచుండును. వీరు బండబూతు ప్రసంగములు సేయుచుందురు.

భారత, రామాయణాదులలోని కథాంశములే యీ యాటల ప్రధాన కథావస్తువులు. లంకాదహనము, మైరావణ చరిత్ర, ఇంద్రజిత్తు వధ, యయాతి కథ, కీచక వధ, దుశ్శాసన కథ, ప్రహ్లాద చరిత్ర మొదలైనవి వీని యితివృత్తములు. దేశీయములగు జింజి దేసింగురాజుకథ, పల్నాటి వీరచరిత్ర, కరెభంటన కథ, కుమారరాముని కథ మొదలగునవియు అరుదుగా ప్రదర్శింపబడుచుండును. ఈ కథావస్తువు లన్నియు ప్రేక్షకులకు చిరపరిచితములే. ముఖారి, అసావేరి, దేవగాంధారి, రేగుప్తి, మధ్యమావతి, ఆరభి, ఆనందభైరవి వీరు వాడునట్టి రాగములు. అందును ముఖారి వీరి గుత్తసొమ్ము. కథాకథన సమయమున వచ్చు వ్యక్తుల నామములను, ప్రధాన పదసముదాయమును గూర్చి వివరించుచు మేళనాయకుడు అమరకోశము, విశ్వకోశము, ఆంధ్రనిఘంటుత్రయములనుండి పర్యాయ పద పట్టికలమ ఒప్పజెప్పుచుండును. పది పదునైదు రూపి కలు 'కేళిక 'కు (ఆటకు) దయచేసిన చాలు వీ రా టాడె దరు. ఆటయైన ప్రొద్దున బృంద మంతయు కలిసి ఇల్లిల్లు తిరిగి, అభిమానుల నాశ్రయించి ధాన్యము, పశువులు, గుడ్డలును దానము గొనుచుందురు.

సాధారణముగా బొమ్మలను తయారుచేయుటలో, జింక, దుప్పి, మేక, గొర్రె, గాడిదెల చర్మముల నుపయో గింతురు. బొమ్మల ప్రమాణ మొకటినుండి యే డడుగుల యెత్తువరకు ఉండును. తొలుత తోలును పారదర్శకము (ట్రాన్స్‌పేరెంట్) గా నుండునట్లు పదును చేయింతురు. తోలుమీద తామో, లేక కమసాలి, జీనిగిరి మొదలగువారి సాయముననో వలసిన వ్యక్తియొక్క రూపు నూహించి ఆ యాకృతిని గీయుదురు. లేక, అంతకు పూర్వపు బొమ్మను నమూనాగా నుంచుకొని ఆ బొమ్మ ఆకారము మేరకు రేఖారచనము కావించెదరు. ఆ గీతలమేరకు తోలును కత్తిరించెదరు. ప్రధానపాత్రలు జింకతోలు

తోడను, తక్కినవి మేక మొదలగువాని చర్మముతోడను చేయుదురు. భూషణాదికభ్రాంతి కలుగ-సీరణము, పోగ రలతో చిన్న చిన్న రంధ్రములు నియమితస్థానముల కావించి నిర్ణీతమగు వర్ణలేపనము సేయుదురు. పాత్రల గుణశీలములు, కథలో వానికిగల స్థానమును అనుసరించి బొమ్మలకు రంగులువేయుట జరగుచుండును. రూపకల్ప నము, రేఖావిన్యాసము, వర్ణలేపనము అంత సుకుమార తను, ఉదాత్తతను వెలార్చునవి కాక చిత్రలేఖనపు ప్రాథమికదశను గుర్తునకు దెచ్చు మోటు సంప్రదాయము వీనిది. లేపాక్షిచిత్రములు, తంజాపుర చిత్ర సంచయమును వీనికి కొంత దగ్గరగా నుండును.

జిగురు పూసి పురిపెట్టిన దారముతో బొమ్మల అవయ వములను కీళ్లవద్ద కలిపి కుట్టెదరు. ఈ దారపు కట్లు ఏడాదిపాటు నిలువగలవు. బొమ్మలను అభిముఖ, పార్శ్వ భంగిమలయందును తయారుచేయుదురు. బొమ్మకు వెనుక వైపున తలనుండి వెన్నెముకమీదుగా కాళ్లదాకను, చేతులకు భుజములకును వెదురుబద్దలు కట్టి, కాళ్లకు దారములు కట్టి వీని సాయమున బొమ్మల నాడించెదరు. బొమ్మలను తెరమీద నిలుపవలసివచ్చినపుడు తుమ్మ ముండ్లతో వానిని తెరకు గ్రుచ్చి యుంచెదరు. ఒకేవ్యక్తికి సంబంధించి వివిధ ప్రమాణములుగల బొమ్మలు నాలు గయిదువరకు నుండును. హనుమంతుడు లంకలో రహస్య ముగా ప్రవేశించు సూక్ష్మరూపము, తాను వాయు దేవుని పుత్రుడనని సీతమ్మవారికి నమ్మకము కలుగుటకు చూపు విశ్వరూపము, రావణుని కొలువులో తోక చుట్టచుట్టుకొని కూర్చుండి రావణునితో మాటాడు బొమ్మ, సాధారణ రూపము - ఇట్లు వివిధ ప్రమాణములుగల బొమ్మ లుండును. వ్యక్తుల బొమ్మలే కాక పుష్పలతావృక్షాదికములయు, పశుపక్ష్యాదులయు బొమ్మలు వారి చిత్రసంచయమున నుండును. ఒక్కొక్క బొమ్మకు నూరు రూపాయల వరకు వ్యయ మగునట: అభిమానులగు శ్రీమంతులు కొన్ని బొమ్మలను కొని వీరి కిచ్చుటయు, లేక వాని కగు వ్యయమును భరించుటయును సాధారణము. ప్రదర్శన సమయమున నాయా బొమ్మలు 'ఫలానా దానకర్ణు'ల ధర్మమని పొగడుదురు. కొన్నియెడల నేర్పరులగు వారి నుండి బొమ్మలను కొనుచుందురు. బొమ్మలాటజట్టువారి కలిమి, బలిమినిబట్టి పాతిక మొదలు నూరుదాక బొమ్మ లుండును. బొమ్మల విరివినిబట్టి ఆట రక్తికట్టుచుండును.

ప్రదర్శనానంతరము బొమ్మలమీది దుమ్ము దులిపి పేముపెట్టెయందో, వెదురుపేళ్ల బుట్టయందో వానిని భద్రపరతురు. బొమ్మలు, తదితర ప్రయోగపరికరములు అమరుటకు కొన్నివేల రూపాయ లావశ్యకము. కాని పెట్టుబడి యొకనాటిది కాక తరతరముల కానాచిగా సంక్రమించి పెంపొందిన మూలధనము గావున నొక్క సారిగా వారి కంత ధనవ్యయము సేయు నక్కర యుండదు. అ. రా. కృ; తూ. దో.

**బ్రహ్మయ్యశాస్త్రి, కాశీభట్ట (క్రీ. శ. 1863-1940):** వీరు తూర్పుగోదావరి మండలమందలి పలివెల గ్రామ ములో తమ మాతామహులగు మైలవరపు నరసన్నగారి గృహమున జననమొందిరి. రాజోలునకు సమీపమున నున్న కడలి గ్రామము శాస్త్రిగారి పూర్వుల నివాసము. వీరు తెలగాణ్య బ్రాహ్మణులు: గౌతమసగోత్రులు. శాస్త్రి గారి ముత్తాతగారు కాకి నాడలో నివాసమేర్పరచు కొనిరి. అచట జగన్నాథ పురములో స్వగృహము లోనే శాస్త్రిగారు తమ జీవిత మంతయు గడపిరి. వారి తండ్రి బ్రహ్మావధాని గారు వేదశాస్త్ర పండితులు; తల్లి సుబ్బమ్మగారు.



చిత్రము 192.
కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి

శాస్త్రిగారు మెట్రిక్యు లేషను పరీక్షలో నుత్తీర్ణులై ఎఫ్.ఏ. తరగతి చదువుచు కుటుంబ పరిస్థితులనుబట్టి ఆంగ్ల విద్యాభ్యాసమును వీడిరి. అప్పటికి వీరికి సంస్కృతాంధ్ర ములలో చక్కని జ్ఞానము గల్గెను. వారు సంస్కృతాంధ్రాంగ్ల భాషా సాహిత్యములను సాదృశ్య పరిశీలన దృష్టితోను, సవిమర్శముగాను మథించి ఆంధ్రములో విమర్శ సాహిత్య మును నూతన పద్ధతిలో వెలయింప మొదలిడిరి. ఈ విమర్శదృష్టి మత విషయములలోను, సాహిత్య విషయ ములోను సమముగానే బ్రసరించెను. వీరు సనాతన హిందూ మతముపై ఇతర మతస్థులును, నవనాగరకతాభి మానులైన హిందువులును గావించు విమర్శలకు సమా ధానము లిచ్చుటయను మహాభారమును మీదవైచుకొనిరి. ఉపన్యాసముల మూలమునను, వ్యాసముల మూలమునను, గ్రంథరచన మూలమునను వారు గావించిన సారస్వత విమర్శలు, మత విజ్ఞాన ప్రచారము మహా పండితులను, జన సామాన్యమునుకూడ ఆకర్షించి వారి నామమును యావదాంధ్ర దేశ విశ్రుతము గావించినవి.

శాస్త్రిగారి విమర్శలు కందుకూరి వీరేశలింగము పంతులుగారి రచనలకు ఖండనములుగా వెలువడినవి.

వీరేశలింగముగారి సాహిత్య, మత విషయక విమర్శల పైననే కాక వారి రాజశేఖరచరిత్ర మున్నగు గ్రంథములపై గూడ వారు విమర్శలను గావించిరి. వారికి ఆంధ్ర సారస్వతసభవా రొసగిన 'విమర్శ కాగ్రేసర' బిరుదము ఆయన నామమునకు పర్యాయ పదముగనే చెల్లుబడి అగుచుండెను. ప్రతిపక్షుల వాదములలోని యొక్కొక్కయంశమునే తీసికొని దానిని రాచిరంపమున బెట్టుట వీరికి పరిపాటి. వీరి మాటలలో సూటిదనము తేటదనము నుండుటచే వీరి విమర్శలు పాఠకుల హృదయములలో గాఢముగా నాటుకొనుచుండెను.

జీవితములో చాల భాగము ప్రభుత్వోద్యోగములో సామాన్య పదవిలో కలెక్టరు కార్యాలయమున లేఖకులుగా నుండియు శాస్త్రిగారు విజ్ఞాన, సారస్వత సేవచేయుట గమనింప దగినది. ఆర్యమతబోధిని యను పత్రికను వీరు చాల కాలము నడపిరి. 'వివేకానంద పుస్తక భాండాగారము'ను స్థాపించిరి; 'ఆర్యబృందానందసంధాయిని' అను నాటక సమాజమును స్థాపించి చాల నాటకముల నాడించిరి; 'భక్త సమాజము', 'హిందూమత బాల సమాజము'లను స్థాపించిరి. సెలవు దినములలోను, ఉద్యోగ రీతిగా అధికారులతో పర్యటనమున కేగినపుడును వీరు బహుస్థలములలో సారస్వతమును గూర్చియు మతమును గూర్చియు ఉపన్యాసముల నొసగుచుండిరి.

భాషాసాదృశ్య శాస్త్రము, సంస్కృతాంధ్ర వ్యాకరణములు, తత్త్వశాస్త్రము, దేశ చరిత్రలు, శ్రౌతము మున్నగు బహువిద్యలలో ప్రత్యేకముగా కృషి చేసిన వారికి కూడ ఆశ్చర్యమును గొలుపు నంశములను వీ రాయాశాస్త్రములకు సంబంధించిన విమర్శలలో వెల్లడించెడివారు. విమర్శలనే కాక మౌలికములైన గ్రంథములను గూడ ననేకము వీరు రచించిరి. వీరి విమర్శ వ్యాసములు కొన్నిమాత్రము 'ఉపన్యాస పయోనిధి' యనుపేర నొకసంపుటముగా ప్రకటింపబడినవి. వీరి పెద్దాపుర సంస్థాన చరిత్ర మున్నగు కొన్ని గ్రంథములు ముద్రితములై ప్రచారము నొందినవి.

అసంఖ్యాకములయిన శాస్త్రిగారి వ్యాసములలో గ్రామ్యము గ్రాంథిక భాషగా నుండదగునా?' త్రిలింగము నుండి తెలుగు పుట్టెనా, తెలుగునుండి త్రిలిఙ్గము పుట్టెనా ?, అలంకారములు, సంస్కృతము మృత భాషయా ?, నన్నయకు పూర్వము కవులు కలరా ?, అల్లసాని పెద్దనార్య కవిత్వ తత్త్వము, రామాయణము నందలి వానరు లెవరు ?, అభినవ కవితా ప్రశంస, కన్యాశుల్కమందలి గ్రామ్యభాష, అరవమునందలి వింతయక్కరము తెలుగున కలదా ?, మనుచరిత్ర విమర్శనము, ఆంధ్ర కవితాగురు కవిత్వ ప్రశంస అనునవి మాత్రము పేర్కొనదగినవి.

జ. పు.

**భట్టోజీ దీక్షితులు :** వీరు ఆంధ్రులు. శాస్త్రాధ్యయనము నిమిత్తము వీరు కాశికి వెళ్ళి శేషకృష్ణులయొద్ద విద్య నభ్యసించిరి. వీరు మహారాష్ట్ర కన్యను వివాహమాడి ఆమెవలన వీరేశ్వర దీక్షితులు, భామహ దీక్షితులు అను నిరువురు తనయులను బడసిరి. వీరి పౌత్రులు హరి దీక్షితులవారు - నవ్య వ్యాకరణ రచయితయైన నాగోజీ భట్టుగారి గురువు.

గు. వెం. రా.

**భద్రాద్రిరామశాస్త్రి, కొంఠి (క్రీ.శ. 1850 - 1915):** శాస్త్రిగారు వెలనాటి వైదికులు, ఆపస్తంబ సూత్రులు, గౌతమ గోత్రజులు. వీరి జన్మస్థలము పిఠాపుర సమీపము నందలి కొమరగిరి; తండ్రి గంగారామయ్య, తల్లి కామాంబ; పితామహుడు పద్మనాభశాస్త్రి; మాతామహుడు వారణాసి కామశాస్త్రి యను విద్వత్కవి. వీరి గురువు శ్రీరామ పదభక్తులు, నైష్ఠికులు, వేదశాస్త్ర కవితా సంపూర్ణ సాహిత్య విద్యోరు ప్రజ్ఞులు నగు సూర్య ప్రకాశశాస్త్రిగారు. అటు పితృవంశమున నిటు మాతృవంశమున నాంధ్ర గీర్వాణ వైదుష్య సంపన్నులు, ఉభయభాషా కవిత్వముల నిష్ణాతులు పలువు రుండుటచే దద్వంశాంకురమగు రామశాస్త్రిగారికి ఆంధ్ర గీర్వాణములలో నగాధ పాండిత్యమును, మనోహర కావ్య నిర్మాణ నైపుణియు నిరువది యేండ్ల యీడునకు బూర్వమే యలవడినవి. ఆ కాలమున కౌముదీ పాఠ ప్రవచనమున వీరు సిద్ధహస్తులని ప్రఖ్యాతి. వీరికి ఆంధ్రభాషా సారస్వతములయందు తలస్పర్శమగు పాండిత్యము, వీనిని విశదముగా బోధించు నేర్పు, ఆంధ్ర ప్రబంధ రూపకాదుల రచించు కౌశలమును విశేషము. వీరు ఉర్లాము సంస్థానమునను, రాజా మంత్రి ప్రెగడ భుజంగరావుగారి సంస్థానమునను ఆస్థాన పండితులుగా నుండెడివారు. ఈయన పరమ నైష్ఠికులు.



చిత్రము 193.
కొంఠి భద్రాద్రి రామశాస్త్రి

వీరి కృతులు : సంస్కృతమున అహోబల పండితుడు రచించిన తెలుగు వ్యాకరణమగు అహోబల పండితీయమున కాంధ్ర వ్యాఖ్య; ఆంధ్రీకృత లఘుకౌముది; వసు

చరిత్ర భూమిక; ఇవికాక వీ రింకను సంస్కృతమున ముక్తావళి (రూపకము), శంబరాసుర విజయచంపువు, శ్రీరామ విజయ చంపువు; తెలుగున కాళిందీ పరిణయము, చిత్రసీమ, జగన్నాథక్షేత్ర మాహాత్మ్యము, మల్లిక, శంతనూపాఖ్యానము, శివరామశతకము, శ్రీరామస్తవము, ముక్తావళి (నాటకము), శ్రావణమహోత్సవ తారావళి— రచించిరి.

ఈ. వేం. వీ. రా.

భాగ్యమతి : ఈమె నర్తకి; ఈమె మహమ్మదు కులీ కుతుబ్‌షా (క్రీ. శ. 1580 - 1612) ప్రియురాలు; పాదుషా బహిః ప్రాణము. ఈమె వంశమును గురించిన విశేషములు తెలియవు. ఈమెపేర కుతుబ్‌షా భాగ్యనగరమును నిర్మించెననియు, ఈమెకు హైదర్ మహల్ అను బిరుదము నొసగిన తరువాత భాగ్యనగరము హైదరాబాద అనుపేర ప్రసిద్ధమైన దనియు ముస్లిము చరిత్రలవలన తెలియుచున్నది. ఉర్దూ, పారశీక గ్రంథములందు 'భాగమతి', 'భాగనగరము' అను రూపములే కన్పట్టుచున్నవి; కాని భాగ్యమతి, భాగ్యనగరము అను రూపములే సరియైనవని తోచుచున్నది.

భాగ్యమతి, భాగ్యనగరములను గురించి ప్రప్రథమమున వివరించిన చరిత్రకారుడు మహమ్మదు కులీ కుతుబ్‌షాకు సమకాలికుడైన మహమ్మద్ ఖాసిమ్ ఫెరిస్తా. ఇతడు కుతుబ్‌షా నర్తకియగు భాగమతిని ప్రేమించె ననియు, కొన్నాళ్ళకు తరువాత భాగమతి ప్రణయ చిహ్నమగు భాగనగరమును హైదరాబాదగ మార్చె ననియు, గోలకొండ దర్బారుకు భాగమతి సహస్రాశ్విక దళపరివృతయై సగౌరవముగ వచ్చుచుండె ననియు తెలిపి యున్నాడు. ఇతని తరువాత పేర్కొనదగిన మొగల్ చరిత్రకారులలో అబుల్ ఫజల్, ఫైజీ అనువారు ముఖ్యులు. అబుల్ ఫజల్ రచించిన 'అక్బర్ నామా' లోను, ఫైజీ రచించిన 'లతీఫ ఫయాజీ' లోను భాగమతి, భాగనగరముల చరిత్ర కొంత కన్పట్టుచున్నది. ఢిల్లీ చక్రవర్తి ఫైజీని గోలకొండకు పంపి అచటి విశేషములను రహస్యముగ తెలుపుట కాజ్ఞాపింపగా అతడు అట్టి వివరములను లేఖల రూపమున తెలిపిన గ్రంథమే 'లతీఫ ఫయాజీ'. కుతుబ్‌షా 'షియా' శాఖీయుడనియు, అతడు తన ప్రియురాలు భాగమతిపేర భాగ్యనగరమును నిర్మించె ననియు అందు కలదు. అక్బర్ నామాలోకూడ భాగనగర ప్రస్తావ మున్నది.

పదునెనిమిది, పందొమ్మిది శతాబ్దములయందు పారశీక భాషలో రచింపబడిన చరిత్ర గ్రంథములందును పైగాథలే వివరింపబడినవి. 1799 లో విరచితమైన 'హదీ ఖతుల్ - ఆలం'లోని విషయములకు 'తారీఖే మహమ్మద్ కుతుబ్ షాహి' అను గ్రంథమును, ఫెరిస్తా గ్రంథమును ఆధారములు. గులామ్ హుసేన్ అనునతడు 1842 లో రచించిన 'గుల్జారే ఆసఫీ' అను గ్రంథములో కులీ కుతుబ్‌షా 'చిచిలం' (నేటి చార్మినార్‌కు సమీపస్థము) గ్రామమున నివసించుచున్న సుందరి భాగమతిని సందర్శించుటకు రాత్రిపూట రహస్యముగ గోలకొండనుండి వచ్చుచుండెననియు, ఒకనాడు వర్షపాతాధిక్యమువలన మూసినది పొంగుచున్నను అతడు సాహసముతో ప్రాణాపాయమునకు జంకక ప్రియురాలివద్దకు వెళ్లెననియు, ఈ విషయము గూఢచారులవలన తండ్రి ఇబ్రాహీం కుతుబ్‌షా తెలిసికొని 'పురానా పూల్' కట్టించె ననియు గాథ కలదు. మూసీనదిపై గల 'పురానా పూల్', 'ముస్లిమ్‌జంగ్ పూల్', 'నయా పూల్', 'చాదర్‌ఘాట్ పూల్' అను నాల్గు వంతెనలలో మొదటిదే అతి ప్రాచీనమైన దందురు; దీని నిర్మాణము క్రీ. శ. 1576 లో ప్రారంభమై 1578 లో పూర్తియైనది.

పై నుడివిన గ్రంథము లన్నియు పారసీక భాషలో గలవు. ఇక సమకాలికములైన ఉర్దూ రచనలు కొన్ని గలవు. కులీ కుతుబ్‌షా రసజ్ఞుడు; కవి. అతడు రచించిన పద్యముల సంపుటికి 'కులియాత్ కులీ' అని పేరు. అతని సమకాలికుడు, సుప్రసిద్ధ కవి వజీ రచించిన 'కుతుబే ముష్తరి' అనునది రసవంతమైన కావ్యము. అసంఖ్యాముగ నుండిన మహమ్మదు కులీ కుతుబ్‌షా ప్రియురాండ్రలో పద్మిని, సుందరి, ముష్తరి, సజని, హైదర్ మహల్ అనువారు అతని హృదయము నేలిన సుందరీమణులు. అతడు వారినిగూర్చి రసవంతములగు గీతములు రచించెను. ఇవి యన్నియు 'కులియాత్ కులీ'లో నున్నవి. హైదర్ మహల్‌పై మూడు గీతములు కలవు. ఈ గ్రంథమున భాగమతి హైదర్ మహల్ అనియు, ముష్తరి అనియు పేర్కొనబడినది. ఈ గీతములను రచించునాటికే భాగ్యమతి హైదర్‌మహల్ బిరుదాంకిత అనుట స్పష్టము. 'కుతుబే ముష్తరీ' అను గ్రంథమునందు వజీకవి పాదుషా ప్రణయమును చిత్రించెను. ఇది ఒక విధమైన రూపక (అల్లిగరి) మనవచ్చును. కుత్‌బ్ అనగా ధ్రువ నక్షత్రము. మహమ్మదీయుల పురాణము ననుసరించి ముష్తరి ప్రకాశవంతమగు ఒక నక్షత్రము. ఇది ధ్రువనక్షత్రము ననుసరించి భ్రమించుచుండును. ముష్తరి అను పేరు కులీ రచనయందు కూడ కలదు. కావున ముష్తరి భాగ్యమతియే కావచ్చు ననుట కవకాశము కలదు.

కులీ కుతుబ్‌షా ప్రాపంచిక సుఖములం దాసక్తుడుగాని అతని అల్లుడును, హయాత్ బఖ్షీ బేగమ్ భర్తయు నగు

సుల్తాన్ మహమ్మదు మాత్రము పవిత్ర జీవితమును గడ పెను. ఇతడు మత విశ్వాసము గలవాడు. జీవితములో ఒక నాడైనను నమాజు తప్పనివాడు. ఒకపూటయైనను నమాజు తప్పనివారిచేత పునాది వేయించి మక్కా మసీదు నిర్మించ వలయునని అతడు చాటెను. కాని ఎవరును రాలేదు. చివరకు సుల్తాన్ మహమ్మదే ముందుకు వచ్చి నమాజు తప్పనివాడనని ప్రజలకు చెప్పి 1617 లో మక్కా మసీదుకు (చార్మినార్ వద్ద కల మక్కా మసీదే) పునాది వేసెను. హాయాత్ బక్షీ బేగమ్ పట్టపురాణి కొమార్తె అని కొందరు విశ్వసింతురు. కాని రాజకుమారులు, రాజకుమారికలు జన్మించినపుడు జన్మ సంవత్సరము అధికారపూర్వకముగ తెలుపుట రాజసంప్రదాయము; హాయాత్ బక్షీ బేగమ్ జన్మించినపుడు అట్టిది జరుగలేదు. కావున ఈమె భాగ్యమతి కొమార్తె అనియే విశ్వసింపవచ్చును. ఈమెపేర హైదరా బాదుకు కొన్ని మైళ్ళదూరమున హాయాత్ నగర మేర్పడి నది. ఇది నేటికిని కలదు. కుతుబ్‌షా పట్టపురాణి ప్రశంస ఎచ్చటను లేదు. ఈమె అంతఃపురమున నున్నను కులీ భాగ్యమతిని ప్రేమించు చున్నందు వలన ఆమె ఊరుపేరు లేని జీవితమును గడిపియుండవచ్చును; లేదా తన పుట్టిల్లగు ఇస్ఫహాన్ వెళ్ళియుండవచ్చుననుటకు కారణములుకూడ కొన్నికలవు.

పైన పేర్కొనబడిన కొన్ని మహమ్మదీయ చరిత్రలలో భాగ్యమతి, భాగ్య నగరములను గురించిన ప్రస్తావము లేక పోవుటచేత కొందరు చరిత్రకారులు భాగ్యమతి, ఆమెకు సంబంధించిన గాథ వట్టి కల్పన యని త్రోసిపుచ్చుదురు. ఈ విషయము సవిమర్శముగ చర్చించుట కిది అదనుకాదు. కాని కల్పన కాదనుట కవకాశము కలదు. కె. గో. కృ.

**భాగ్యరెడ్డివర్మ, శివశ్రేష్ఠి** (క్రీ. శ. 1888 - 1939): వీరు హరిజనులగు మాదరి రంగమాంబా వెంకయ్యా దంప తుల గర్భవాసమున హైదరాబాదు నగరములో జన్మించిరి. వీరి పదియవయేటనే తండ్రి చనిపోయెను. వీరి విద్యాభ్యా సమునకు రావిచెట్టు రంగారావుగారు తోడ్పడిరి. వీరి భార్య లక్ష్మీదేవి. 1913 వ సంవత్సరమున జరిగిన వైదిక ధర్మ ప్రచారిణీసభ వార్షికోత్సవములందు బాజీ కృష్ణా రావు పండితుడు వీరికి ఆర్యసమాజదీక్ష నిచ్చి తమయజ్ఞోప వీతము వీరిచే ధరింపజేసి, వర్మబిరుద మిచ్చెను. తన జాతి నుద్ధరించుటకు బద్ధకంకణులై వీరు తమ యుద్యోగమునకు స్వస్తి చెప్పి వివిధ స్వరూపములతో హరిజనోద్యమము నడిపించిరి. ఆంధ్రభాషలో అనర్గళముగా ఉపన్యసింపను, చక్కగా వ్రాయను నేర్చి, హిందీ, మరాఠీ, కన్నడ, తమిళములలో సంభాషింప సమర్థులైరి.

1906 వ సంవత్సరములో వీరు జగన్మిత్ర మండలి స్థాపించిరి. వీరు బాలబాలికలకు విద్యానీతులు గరపుట, శుభాశుభ కార్యములందు మద్యమాంసముల నిషేధించుట, దేవదాసీల (జోగులు, పార్వ తమ్మలు, దాసరాండ్రు) బహిష్కరించిరూపుమాపుట, బాల్య వివాహముల నిషే ధించుట, మతసామరస్య మునకై పాటుపడుట, ఆస్తిక్య ప్రచారము చేయుట మున్నగు కార్యక్రమములు నడిపిరి. 1910 వ సంవత్సర ములో హరిజనులలో ధార్మిక, నైతిక ప్రబోధ మొనర్చుటకు వైదిక ధర్మ ప్రచారణీ సభను స్థాపించిరి.



చిత్రము 194.
శివశ్రేష్ఠి భాగ్యరెడ్డివర్మ

వర్మగారు 1912 వ సంవత్సరములో అహింసా సమాజ మును, తరువాత 1915 వ సంవత్సరములో జీవరక్షాజ్ఞాన ప్రచారకమండలిని స్థాపించి జంతు హింసానిరోధమునకై గొప్ప కృషి చేసిరి.

1914 వ సంవత్సరములో ఆదిహిందువుల (హరిజనుల) యభ్యున్నతిని దృష్టియం దుంచుకొని బ్రహ్మసమాజము స్థాపించి 15 వేల రూప్యములు ప్రోగుచేసి దాని కొక చక్కని భవనమును నిర్మించిరి. ఈ సమాజమునకు పిఠా పురము మహారాజుగారు ఆర్థిక సహాయ మొనర్చిరి. వీరు 1915 వ సంవత్సరములో సంఘసంస్కార నాటకమండలి స్థాపించి హరిజనులచే నాటకములు వేయించి సంఘ సంస్కార ప్రచార మొనర్చిరి. 1916 వ సంవత్సరములో విశ్వాసగృహ పరిచారక సమ్మేళనమును గావించి శ్రీమం తుల ఇండ్లలో పనులుచేయు ఆది హిందూ స్త్రీ పురుష ధర్మముల ప్రచార మొనర్చిరి.

వీరు తాము ప్రారంభించిన యుద్యమములను ప్రభుత్వ ముచే ఒప్పించి శాసనరూపమున ప్రకటించువరకు విశ్ర మింపలేదు; దేవదాసీల పద్ధతిని నిషేధించుచు నిజామ్ ప్రభువుచే ఫర్మానా తీయించిరి. అటులే బక్రీదునాడు జరిగెడు గోవధమునుకూడ ఫర్మానా తీయించి మాన్పిం చిరి. వీరు తమ జాతివారిని ఆదిహిందువు లనిరి. 1922 వ సంవత్సరములో వీరు ఆది హిందూ సాంఘిక సేవాసమితి స్థాపించిరి; 1928 వ సంవత్సరములో ఒక ముద్రణా లయమును సంపాదించి 1931 వ సంవత్సరములో 'భాగ్య నగర పత్రిక'ను స్థాపించి విజ్ఞానప్రచార మొనర్చిరి. ఇది తరువాత 1937 వ సంవత్సరములో 'ఆది హిందూ

పత్రిక 'గా మారినది. ఈ విధముగ స్వసంఘోద్ధరణము, జాతీయ స్వాతంత్ర్యము అను నీ రెంటిని సమన్వయపరచి దేశాభివృద్ధికి పాటుపడిన ప్రజాహితజీవి భాగ్యరెడ్డి వర్మగారు. బి. రా. రా.

**భాస్కరుడు - రామాయణము :** వాల్మీకి రచించిన సంస్కృత రామాయణము నాంధ్రీకరించిన ప్రథమకవి ఎఱ్ఱాప్రెగడ యని హరివంశావతారికవలనను, పింగళి సూరనాది కవుల పూర్వకవిస్తుతి పద్యములవలనను దెలియవచ్చు చున్నది. కాని యది యాంధ్రుల దురదృష్టముచే నామావశేషమైనది. తరువాత నా గ్రంథము తెనుగున రచించిన కవి హుళక్కి భాస్కరుడు. పదమూడు, పదునాలుగు శతాబ్దుల సంధికాలమున, పరిమిత ప్రదేశమునకు ప్రభువైన సాహిణి మారన యోలగమున ప్రధానకవిగా నుండి పుత్ర, మిత్ర, చ్ఛాత్ర సహాయుడై రామాయణము తెనుగున రచించి యాత డా ప్రభున కంకిత మొనర్చెను. హుళక్కి అనగా తాంబూలమని కన్నడ బిరుదపదము. కవిత చెప్పి ప్రభువుల మెప్పించి యనితర సాధ్యమగు తాంబూలము కానుకగా గొని యాత డీ బిరుద మార్జించిన వా డనియు, నంతకు బూర్వము మంగళంపల్లి యను గృహనామమువా డనియు చారిత్రకులు నిర్ణయించు చున్నారు. యుద్ధకాండాంతమున 'అమర హుళక్కి భాస్కర మహాకవి చెప్పగనున్న యుద్ధకాండము తరువాయి చెప్పె ....అయ్యలార్యు' డనుపద్యముచే భాస్కరుని హుళక్కి భాస్కరుడను నాధారము ప్రబలముగా నున్నది. మంత్రి భాస్కరుడే రామాయణకర్త యనుటకు పదునొకండవ శతాబ్ది తుదనున్న మంత్రి భాస్కరుడు పదమూడవ శతాబ్దిలోనున్న సాహిణి మారనకు గృతిగా అరణ్యకాండము రచించుట పొసగదు. కావున ఆ వాదము విడిచిపెట్టి స్వారసికముగా పరిశీలించిన హుళక్కి భాస్కరుడే రామాయణకర్త యనుట స్ఫుటము.

ఇందు అరణ్య కాండమును, యుద్ధకాండమున 1139 పద్యములును మాత్రమే భాస్కరుడు రచించెను. ఆతని యానతినే కానోపును, పుత్రుడగు మల్లికార్జునభట్టు బాల, కిష్కింధా, సుందర కాండములును, శిష్యుడగు కుమార రుద్రదేవుడు అయోధ్యాకాండమును, మిత్రుడగు అయ్యలార్యుడు యుద్ధకాండ శేషమును రచించి భాస్కరుని పేరనే రామాయణము వెలయించి యాంధ్రుల కృతజ్ఞతకు బాత్రులైరి. భారతమును కవిత్రయము, భాగవతమును కవిచతుష్టయము బూర్తి యొనర్చినట్లే రామాయణమును భాస్కరాది కవి చతుష్టయము పూర్తి యొనర్పగలిగెను.

ఈ నలుగురు కవుల రచనయు నించుమించుగా ఏక రీతినే నడచుటచే 'ఇక్షుక్షీరగుడాదీనాం మాధుర్య స్యాంతరం మహత్, తథాపి న త దాఖ్యాతుం సరస్వత్యాపి శక్యతే' అనిన ఆచార్య దండి సూక్తి చొప్పున తారతమ్య పరీక్ష దుష్కరము. అయినను స్థూలముగా గోచరించు విషయము లొకటి, రెండు మాత్రము చూపబడును. ఈ నలువుర కవిత్వము సంస్కృత పద నిబిడము. ద్రాక్షా పాకము నడుమ నడుమ గనవచ్చినను కదళీ పాకము ప్రచురము. రసోచిత పద గుంఫనము సార్వత్రికము. ఓజః ప్రసాద మాధుర్యాది గుణములు సర్వాంగీణములు; శబ్దార్థాలంకారములు శోభావహములై బహుళముగా గనబడును. పోతనామాత్యుని యంత్యానుప్రాసమునకు మార్గదర్శకములగు కొలది పద్యములు అచ్చటచ్చట గలవు. మరియు మూలమునగల కథ లొకటి రెండు విడిచినను, అందు లేనివి పెక్కు కథ లీ రచనలలో గనబడును. మక్కికి మక్కిగా దెలిగింపబడక పోవుటయే యందులకు హేతువు.

**మల్లికార్జున భట్టు:** ఇతడు అసాధారణ ప్రతిభా వ్యుత్పత్తులు గల ప్రాజ్ఞుడు. ఉభయ భాషలయందు స్వతంత్రుడు. ఇందలి అవతరణిక యాంధ్ర కావ్యము లన్నిటికంటె విజాతీయముగా నున్నది. రాఘవ! రామా! అని రాముని సంబోధనముతో నారంభించి ఏడు పద్యములలో వాల్మీకిని ఆంజనేయుని బాలరామాయణ శ్లోకముల కనువాదమున స్తుతించి, 'అని యిట్లు దశరథనందన, వల్మీకభవ, పవననందనుల స్తుతియించి పూర్వకవులం గొనియాడి, తత్ప్రసాదంబున నాదికావ్యంబగు రామాయణంబు నే నాంధ్ర భాష రచయింపం బూనితిఁ దత్కథాప్రారంభం బెట్టిదనిన' అని మాత్రమే కలదు. కాని రచనకుగల హేతువుగాని, కృతిపతి కాశీర్వచనముగాని, యతని సబహుమాన ప్రార్థనముగాని, కృతిపతి వంశవర్ణనముగాని, షష్ఠ్యంతములు గాని కనబడవు. ఇం కొక చిత్రము : కాండాదిని 'రాఘవ రామా' అని సంబోధనమును, కాండాంతమున 'శివ! గిరిజేశా!' అని శివసంబోధనమును గనబడును. ఈతని రచనయగు కిష్కింధా కాండమున మొదట సంబోధనాంతముగా నీశ్వరున కొక్కటే విశేషణము. తుదిని 'సాహిణి మారా' యని యొక పద్యమును, 'స్ఫురదురుగిరిచాపా' అని యొక పద్యమును గనవచ్చు చున్నవి. సుందరకాండమున మొదట సాహిణిమారుని, తుదను 'గౌరీనాథా!' 'భవ్యకోటీర గంగా 'యని శివుని సంబోధించుటయు గలదు.

ఈతని రచన సంస్కృతపద మేదురమైనను, తెలుగు నుడికారపు సొంపునకు గొరతపడనిది. తరచిన కొలది

ప్రతిభా వ్యుత్పత్తులలో నీతడు మిన్న యనిపింపక మానడు. మూలమున లేకున్నను ప్రబంధ ఫణితిని గజాశ్వాది వర్ణనము సంస్కృతపద నిబిడముగా జేసినను అశ్వవర్ణనమున చక్కని దేశ్యపదములతో తగు మాత్రము సంస్కృత ముతో సరితూకమున నడపెను. పురమును వర్ణించిన పెద్ద గద్యమున భట్టబాణుని దలపించుచు 'ఛత్రచామరము లంద కనకదండంబులు, తరుణులయంద బంధంబులు' అని పరిసంఖ్యాలంకారమును, 'అలకాపురంబునుంబోలె నిధాన ధనేశాశ్రితంబయి' అని శ్లిష్టోపమయు, 'పద్మాకరంబయ్యు విషపంకవర్జితంబయి' అని విరోధాభాస మును చక్కగ కూర్చి ప్రబంధ కవులకు త్రోవ చూపెను. ఉపమోత్ప్రేక్షాతిశయోక్త్యాద్య లంకారము లుచితస్థలము లలో ఎన్నియో కూర్చెను. కాని విసువు రానీయని యుచితజ్ఞుడు.

సంవాదములందును, సన్నివేశములందును జూపిన చమత్కృతులకు మేర లేదు. స్త్రీ పురుష విభేద మెరుగని ఋశ్యశృంగుడు తన్ను వలపింపవచ్చిన వేశ్యలతో నాడిన మాటలలోని రసోచిత పదగుంఫనము నిరుపమానము. మూలమున 'వేశ్యలు మోదకములు పెట్టిరి. అవి తినుచు ఈ పండ్లచెట్లయందు లభించును' అని ప్రశ్నించినట్లు మాత్రము గలదు. దీని నాధారముగా గొని వేశ్యల గానమునకు ముగ్ధుడై 'ఈ మధురస్వరవేదం బే మెన్నడు వినము మీకు నే ముని చెప్పెన్' అని అడిగి, వెంటనే 'ఓ మునివరులార! చెప్పుఁ డొప్పుగ నాకున్' అని బేలయై యడుగును. మోదకములు తినుచు 'ఈపగిది ఫలము లెన్నఁడు నేపొలములఁ దరులఁ గాన మెందుల వివి' అని ప్రశ్నించును. తన ముందట నిలిచియున్న 'తరుణుల వృత్తస్తనములు హారంబులఁ జందనచర్చలఁ బోలఁజూచి'

> 'నాకుఁబోలెఁ గావు మీ కురంబున రెండు
> వలుద గుజ్జుకొమ్ము లలరుచున్న
> వలఁతి తులసిపూస లతిసితములు మేనఁ
> దగ నలందినారు తా విభూతి'

అని యమాయికముగా బాలునివలె నడుగును. ఈ ఘట్ట మున మృదువగు హాస్యము స్వభావసిద్ధమై లలితపద సంపదచే దీప్తిని గలిగించుచు గవిప్రతిభకు స్ఫోరకముగా నున్నది. వ్యుత్పత్తివిషయమై నలువురు కవులును ఒకరి కొకరు తీసిపోనివారే కాని కిష్కింధాకాండమున వర్షర్తు వర్ణనమున రచించిన మత్తేభపద్యమువంటిది యాంధ్ర వాఙ్మయముననే లే దనినను సాహసము కాబోదు.

> 'యమునార్ధగంగము కృష్ణభూమదిల మబ్జాషన్మనుష్యంబు నీ
> లమహీధ్రన్ని భిలాచలావళి....' కిష్కిం. కాం. 383

ఈ పద్యమున నామధాతువులపైన శతృప్రత్యయము చేసి బహువ్రీహి సమాసములుగా విశేషణము లన్నియు ధారాళమగు శయ్యలో గూర్పబడినవి. వ్యాకరణశాస్త్ర మర్మజ్ఞుడు కానిదే యిట్టివి కూర్పలేడు. అట్టి పఠితగాని చదివి యానందింపను లేడు. ఉదాహరణమున కీయొక్క సమాసము చూడనగును. 'కృష్ణా చ సా భూమిః', 'కృష్ణభూమిః' అని కావలసియున్నను 'కృష్ణోదక్పాండు సంఖ్యాపూర్వాయా భూమే రజిష్యతే' అను వార్తికముచే 'కృష్ణభూమము' అని అకారాంతమై, ఆపైని నామ ధాతువై శతృప్రత్యయము చేరి 'కృష్ణభూమత్' అని రూప సిద్ధి. దానిపై ఇలాశబ్దముతో బహువ్రీహియై 'కృష్ణభూమ దిలము' అగును. వ్యాకరణకోలాహలమాత్రమే కాదు. 'గంగ యమునవలె నల్లనగుచున్నది' అను నిట్టి స్వగుణ త్యాగము, అన్యోత్కృష్టగుణస్వీకార మన్నివిశేషణములం దుండుటచే సర్వత్ర తద్గుణాలంకారము విడువక యెంతయు శోభ కలిగించుచున్నది. ఈ యొక్కపద్యము రామాయణ కనకసౌధమునకు రత్నదీపము గదా!

కుమారరుద్రదేవుడు: ఇతడు అయోధ్యాకాండ మొక దానిని మాత్రము రచించెను. ఇతకు భాస్కరుని శిష్యు డనినారు. ప్రతిభా వ్యుత్పత్తులలో మల్లికార్జునభట్టును మీరినవాడు కాదు. కాని తదితరుల కించుమించులో సము డనవచ్చును. ఇతడు అయోధ్యాకాండము నాద్యంతము లందు సాహిణిమారుని సంబోధించుచునే మల్లికార్జునభట్టు శయ్యలో శయ్య గలిపి చక్కగ రచించెను. ఈతడు మూలకథను సంగ్రహముచేసి చెప్పిన ట్లగపడును. 'భరతుని మేనమామయగు యుధాజిత్తునింటికి భరత శత్రుఘ్నులు వెళ్లియుండిరి' అని కాండాదిని గల మాటయే యెత్తక, దశరథుడు

> 'ఉల్లమున మనోరథములు
> మల్లడి గొన నవ్విభుండు మధురస్ఫుటవా
> గ్వల్లికసఫలతకై సభ
> కెల్లం జిత్త మిగురొత్త నిట్లని పలికెన్'

అని ప్రజలసభలో పలుకుచున్నట్లు కాండము నారంభిం చెను. పరిశీలింప నిందలి తొలిభాగము శిథిలమైయుండునని తోచుచున్నది. పిదప రాముని రప్పించి 'నిను యువరాజు నొనర్తు' నని దశరథుడు చెప్పిన ఘట్టమును సంగ్రహము గానే యున్నది.

మూలమున భరత శత్రుఘ్నులు మేనమామ యింటికి వెళ్లియుండ, నొకనాడు దశరథుడు నిండుకొలువై తాను వృద్ధుడనైతి ననియు, రాజ్యభారము రామునిపై బెట్టెద ననియు జెప్పి రాముని సుగుణములను పెద్దగా వర్ణించి

చెప్పును. ప్రజలును ఆమోదించుచు రాముని గుణగణము లను స్తుతింతురు. పిదప దశరథుడు వసిష్ఠాదులను అభిషేక యత్నమును జేయు డని కోరి సుమంత్రుని బంపి రాముని రావించి యా విషయము చెప్పి మరునాడు సీతతో నుపవ సింప నానతిచ్చినట్లును, ఈ శుభవార్త నాప్తులు కౌసల్యకు దెలుప సంతసించి యామె వారికి గోవులను ధనములను, మణులను నొసంగినట్లును, తండ్రియనుజ్ఞ నొంది రాముడు తన గృహమున కేగినట్లును, ప్రజలును సంతసించుచు వెడ లినపిదప మరల రాముని బిలిపించి తన వార్ధకమును, తనకు వచ్చుచున్న దుస్స్వప్నములకు దైవజ్ఞులు చెప్పిన దుష్ఫలములను దెలిపి భరతుడు యోగ్యుడేయైనను అతడు రాకముందే పట్టాభిషేకము కావలె ననియు, 'కింతు చిత్తం మనుష్యాణా మనిత్య మితి మే మతిః' అనియు, రేపే యభిషేకము జరుగు ననియు జెప్పి దశరథుడు పంపివేయు నీ భాగము రమారమి రెండు వందల శ్లోకములలో మూలమున నుండ తెనుగున తొమ్మిది పద్యములలోను, నొక వచనమునను గలదు.

'మంధర కైకేయితో వచ్చిన జ్ఞాతి దాసి' యని మాత్రమే మూలమున నున్నది. కాని 'రామునిపై పగ గలది' యని లేకున్నను, 'తొల్లి కౌసల్యాతనయునిచేతం దనకునైన చరణతాడనభంగంబు వైరంబుగాఁ గొని' యని యిందు వైరకారణము కల్పింపబడినది.

వనవాసమున కేగునప్పుడు గంగాతీరమున సీతా రాములు తృణశయ్యలపై నలసి నిద్రించుచుండ గావలి యున్న గుహుడును, లక్ష్మణుడును సంభాషించుకొను సందర్భమున

> 'ఆ పదునాలుగేఁడులు నహర్నిశముఁన్ దన నిద్రఁ దప్పి యా
> రోపితచాపుఁడై రఘువరుం గొలువన్ బరమాద్భుతప్రతి
> జ్ఞాపరుఁడైన లక్ష్మణుఁడు...'

అని పదునాలుగేడులు నిద్ర మాని రాముని సేవింతు నను ప్రతిజ్ఞమాట మూలమున లేనిది తెనుగున జేర్పబడెను. ఇట్టి మార్పుల కధ్యాత్మరామాయణ మాధారము కావచ్చును. ఇట్లు కుదించియు, పెంచియు యథేష్టముగ రచించుచు కథాగమనము ముఖ్యముగా నెంచి యిక్కవి రెండవ కాండము పూరించెను.

విరళముగా నుపమోత్ప్రేక్షాద్యలంకారములు కనబడు చున్నను అర్థాలంకారములకంటె శబ్దాలంకారములు హెచ్చుగా నీతని రచనలో గానవచ్చును. 'రీతి రాత్మా కావ్యస్య' అను వామనుని సూక్తి ననుసరించి యుండును.

> 'ధీరోదారుఁడు నిర్వికారుఁడు జగద్వీరుండు సౌజన్యవి
> స్తారుం డుత్తమశీలుఁ డర్కకులవిస్తారుండు శూరుండు గం
> భీరుం డిద్ధవిచారసారుఁడు...॥'

అను పద్యమున 'ఉత్తమ శీలుఁడు' అనునది విడిచినచో అంత్యానుప్రాసము నిండియున్నది. '....వీర్యోల్బణ్ గుణాలంకరిష్ణుని భూయిష్ఠ వరిష్ఠ నిష్ఠుర రణానుష్ఠాన నిష్ఠాపరున్' అను నీ పద్యమున వృత్త్యనుప్రాసము మనోజ్ఞ ముగా నున్నది. ఏది యెట్లున్నను నీతని ధారాశుద్ధి మాత్ర మెంతయు స్తవనీయము.

> 'జననివి నీవు వేఁడుదఁటె సత్యము తండ్రికి నెక్కునట్టె నా
> యనుజుఁడు నేల యేలునఁటె యక్కడ సమ్మనిపాదపద్మవం
> దనమఁటె కృత్య మిట్లగుట ధన్యుఁడ నేఁ గెదఁ గాన కేను మీ
> పనిచినయట్లనే భరతుఁ బట్టము గట్టు పవిత్ర ధాత్రికిన్'

అని యలతి పదములతో, అనుప్రాసముతో హృదయ మునకు దాకు భావముతో నీ పద్య మెంతయు సరళ ముగ నడచినది.

కైకేయిని భరతుడు నిందించు ఘట్టమున 'అడవుల రామచంద్రుఁడు' అను పద్యములో 'పాపపుం, గడుపునఁ బుట్టి యీ భువనగర్హకుఁ బాత్రుడఁ నైతి రాక్షసీ' (అయో. కాం., 230) అను వాక్యమునం గల రసాంతర, భావాంతర ధ్వనులకు విలువగలదే? ఇట్లు ధ్వనిప్రధాన కావ్యనిర్మాణ మున నీ కవి దిట్ట యనుట కిది యొక యుదాహరణము.

సంస్కృతపద సంఘటనలోని సొంపు పెక్కు తావుల గననగును.

> 'అళికుల మల్లనల్ల నవపల్లక మొల్లక కేసరోల్లస
> ద్దళదరవిందమందిరవితానము చేర నగాధదీర్ఘికా,
> జలజనవీనగంధములు చల్లుచుఁ జల్లని గాడ్పు లిమ్ములన్...'

ఇందు స్వభావోక్తి మాత్రమే కాక అనుప్రాసము ననుస్యూతమై యున్నది. మల్లికార్జునభట్టు మార్గమున రచించిన యంత్యానుప్రాసములుగల పద్యములును బెక్కు గానవచ్చును. ఇట్లుభయభాషా ప్రయోగనైపుణిచేతను, శబ్దార్థాలంకారఘటనాపటిమచేతను కుమారరుద్రదేవుడు భాస్కరుని గురుత్వమునకు గౌరవము నాపాదించెను.

**భాస్కరుడు :** పుత్రమిత్రచ్ఛాత్రుల సాయమున రామాయణ మాంధ్రమున వెలయింపబూని ముందుగనే యరణ్యకాండము నారంభించిన ధీరుడు హుళక్కి భాస్కరుడు. ఈతని పాండితియు బరిపుష్టకవితాధారయు దక్కిన మువ్వురకు నొజ్జబంతి యనవచ్చును. అరణ్య కాండము రెండాశ్వాసములుగా విభాగింపబడెను. అందు లక్ష్మణుని పరిచర్యలచే సీతారాములు సుఖముగా వనమున కాలము గడిపిన కథ యొక యాశ్వాసము. వారి వియోగ మును, దుఃఖమును రెండవ యాశ్వాసము. మొదటి యాశ్వాసముతుదను సీతారాముల నెడబాప బీజము మాత్రము నాటబడి, రెండవ యాశ్వాసమునకు సూచ్యార్థ

సూచకమైనది. అరణ్యకాండము విఘ్నకారియని లోకమున బ్రవాద ముండుటచే ఇతడు ప్రథమాశ్వాసము సుఖాది, సుఖాంతము నగునట్లు పూర్తిచేసి యుండును; లేకున్న 1330 పద్యములుగల యుద్ధకాండమందలి తన రచనలో నెట్టి విభాగమును చేయక 730 పద్యములు మాత్రముగల యీ కాండమును సమముగానైనను విభజింపక 292 పద్యములు మొదటి యాశ్వాసముగను, 438 పద్యములు రెండవ దానిగను నేల విభాగించినాడు? ఈ విభాగమున కింతకంటె వేరుకారణ మూహింపరాకున్నది.

ఇంక నీతని రచనము గంభీరగమనము, సంస్కృతపరిపుష్టము, నాంధ్రజాతీయవిశిష్టమును నై యలరారును. మూలమును సంగ్రహపరచుటయు, గ్రొత్త కథలు చేర్చుటయు నీయనయే తక్కిన మువ్వురకును నేర్పినా డనవచ్చును. జంబుకుమారుని లక్ష్మణుడు చంపిన కథ యిట్టిదే. శూర్పణఖ రామునియొద్దకు వెదకికొనుచు వచ్చుటకు జంబుకుమారవధయే కారణముగా గూర్చుట చక్కగ నున్నది. అంతియ కాదు. 'పుత్రశోకమును కూడ మరచునంతటి కాముకురాలు శూర్పణఖ' యనియు సూచితమగుచున్నది. మూలమునలేని యెన్నియో వర్ణనములు, ప్రసన్నరాఘవాది గ్రంథములందలి శ్లోకముల కనువాదములు ఉచితస్థలంబుల గూర్చి ఇతడు నూత్న శోభ గూర్చినవాడు. 'ప్రకృతి వర్ణనమున భాస్కరునకుఁ బ్రీతి హెచ్చు' అనుటకు మాయలేడిచేష్టల వర్ణనమును (అర. కాం., 227), జటాయుర్యుద్ధవర్ణనమును అరసిన దెలియును.

'ధరణీసంజాత ప్రీతిం దనుఁ గనుఁగొని న
	ద్యద్గతిం బాఱుఁ దాఱుం,
బొరి డాయుం బారి మేయుం బొలుపుగ నిగుడున్
	బొంగుఁ గ్రుంగున్ జెలంగున్,
దిరుగుం గుప్పించు మించున్ దెసల నెసఁగ వ
	ర్తించు వే చౌకళించున్,
గరమొప్పన్ నిల్చుఁ బొల్చుం గనకహరిణ మ
	క్కాన నాంతంబులోనన్'

అను మహాస్రగ్ధరా పద్యమున స్వభావోక్తి ప్రధానముగా కారక దీపకాలంకారమును, చక్కని యనుప్రాసమును శోభిల్లుచున్నవి. జటాయుర్యుద్ధ వర్ణనమునను నాలుగు పద్యము లిట్లే స్వభావోక్తి(కారక) దీపకాలంకారములే కాక ముక్తపదగ్రస్తముగూడ నొకట రెంట గనబడును.

'ఖండించున్ జించు నొంచున్ ఖరచరణ నఖా
	గ్రంబులన్ బోఁజుఁ దేరు
ద్దండాటోపంబునన్ భూస్థలిఁ బడ నడఁచున్
	దండడిన్ ద్రిప్పు నుద్య
త్సండినోడ్డీనవృత్తిన్...'

మరియు,

'వెనుకొని పాఱుఁ బాటి నడి
	వీపు మహోగ్రతఁ దన్నుఁ దన్ని మా
ర్కొని వడి నొంచు నొంచి యిల
	కున్ దివికిన్ జననిచ్చు నిచ్చి యే
నని వెస నార్చు నార్చి వెగ
	డందఁగ దండడిఁ జేరి దుర్దశా
వినిహతు నద్దశాననుని
	వ్రేయు జటాయువు పేర్చి వెండియున్.'

ఇందు స్వభావోక్తి, దీపకాలంకారములే కాక ముక్తపదగ్రస్తమును గలదు. ఈ రీతిగా రచించిన ప్రౌఢుడు గావుననే రామాయణ మాతనిపేర ప్రసిద్ధినందెను. సీతాపహరణ ఘట్టమున సీతారాముల విలాపమును, జటాయువు మరణించు పట్టును రాలనుగూడ నీరుచేయ వర్ణించిన యసాధారణ ప్రతిభాశాలి. యుద్ధకాండమున చంద్రోదయవర్ణన పద్యములలోని 37 వ పద్య మాతని కవితాధారకే కాదు కల్పనకు, రమ్యమగు నుత్ప్రేక్షకు, అనుప్రాసమునకు మచ్చుతునకగదా.

అతని వ్యుత్పత్తికూడ నసామాన్యమే యనవచ్చును. అరణ్య కాండమున 'ఇచటికి సార్ధయోజన సమీపమునన్ శరభంగుఁడున్నవాఁడు....' అను పద్యమున 'ఇచటికి' అను పదములోని 'ఇ'కారమునకు, 'సమీపము' అను పదములోని మకారముమీది 'ఈ' కారమునకు యతి గూర్చుట గమనింపదగినది. 'సమ్ + ఈపము' అని కాకున్న యతి కుదురదు. ఈప మన నేమి? యని యరయగా 'ఋక్పూరబ్ధూః పథా మానక్షే' అను పాణినీయ సూత్రమున సమాసాంతమున అప్ప్రత్యయము వచ్చి మకారాంతమై 'ద్వ్యంతరుపసర్గేభ్య ఈత్' అను సూత్రమున 'సమ్' అను నుపసర్గముమీద వచ్చిన 'అప' అనునది కావున దానిలోని అకారమునకు ఈకార మాదేశమై 'ఈప'యను రూపము సిద్ధించి పిదప 'సమీప' అగును. ప్రాదు లుభయ యతుల లోనివే కావున నిచట అచ్చుతో యతి గూర్పబడినది. ఈ యొక్కటియే భాస్కరుని 'వ్యాకరణ మార్మికుఁ'డని ధ్రువపరచుచున్నది. మరియు యుద్ధకాండమున 'ప్రాణంబుల్ వలతేని రాము దెస సౌభ్రాత్రంబు వోఁబెట్టి నిద్రాణ క్రూరభుజంగమున్....' అను పద్యమునందలి 'సౌభ్రాత్ర, నిద్రాణ' అను శబ్దములును నీ జాతిలోని వనియే తెలియదగును. ఇట్టి వాతని రచనయందు బహుళముగా నున్నను, రసపోషణమునను, దెలుగు నుడికారమునను, నసాధారణ ప్రతిభాయుతుడని మాత్రము మరువరాదు.

అయ్యలార్యుడు: యుద్ధకాండ శేషము 1356 పద్యములలో బూరించి భాస్కరుని కీర్తిమూర్తిని పూర్తిచేసిన

వా డయ్యలార్యుడు. ఈతడు 1140 వ పద్యము మొదలు తుదిదాక రచించి రాము నయోధ్యలో సింహాసన మెక్కించి తా నుత్తమ కవికోటి కెక్కినాడు. భాస్కరుని కవితలో గలియునటుల చెప్పిన యీతని కవితనుగూర్చి విశేషించి చెప్ప నావశ్యకత యుండదు. ఈత డింద్రజిల్లక్ష్మణ యుద్ధ మున రంగమున బ్రవేశించి, రాముని సింహాసన మెక్కించు దాక గంటము దింపలేదు. ఈతడు శబ్ద సౌష్ఠవమునకు గాని, అర్థగాంభీర్యమునకుగాని, అలంకారఘటనకుగాని, ధారాశుద్ధికిగాని, రససిద్ధికిగాని, కథాకథన నైపుణికిగాని తక్కిన మువ్వురకు దీసిపోవువాడు కాడు. లక్ష్మణుడు మూర్ఛిల్లగా విలపించు రాముని పలుకులందు గరుణరసము నెంత చక్కగ పోషించినాడు!

'అడవికి వచ్చునాఁడు నయమారఁగ నిన్ దగ నప్పగించె వా కడలుచు నేను 'నట్ల యగు' నంటి నయోధ్యకు నింక నేఁగఁ ద ల్లడమున నిన్నుఁగాన కొగి లక్ష్మణుఁ డేఁ డనుచున్ సుమిత్ర న న్నడిగిన నేమి చెప్పుదు? దశాననుచే ననిఁ గూలె నందునే?'

ఇందు 'సుమిత్ర నన్నడిగిన నేమి చెప్పుదు' ననునంత వరకు మూలమున నున్నదియే. 'దశాననుచే ననిఁ గూలె నందునే' అను వాక్యమున గరుణరస మెంతగా కరుడు కట్టినదో తెలుపు టెట్లు? చిన్న వాక్యముచే పద్యమున కెంత దీప్తి వచ్చినదో యరయనగును. ఈ పద్య మాతని కవితకు రత్నదీపిక యనవచ్చును.

'శ్లో॥ దేశే దేశే కళత్రాణి దేశే దేశే చ బాంధవాః,
తం తు దేశం నపశ్యామి యత్ర భ్రాతా సహోదరః'

అను ప్రసిద్ధ శ్లోకమున కీతం డొనర్చిన యాంధ్రీకరణము తక్కిన రచన కుపలక్షణముగా గ్రహింప వచ్చును.

'ఎలనాఁగలుఁ జుట్టంబులు
గలుగుదు రెచ్చోటనైనఁ గరమరుదారం,
దలఁప సహోదరు నెలమిం
గలుగఁగ నెచ్చోటఁ బడయఁగాఁ దరమౌనే?'

అని మూలమందలి భావ మిందు బ్రతిబింబింపజేసెను. ఇట్ల నర్గళప్రతిభావ్యుత్పత్తులు మెరయ

'అమర హాళక్కి భాస్కర మ
హాకవి చెప్పఁగనున్న యుద్ధకాం
డము తరువాయి చెప్పెఁ బ్రకట
ప్రతిభాషణుఁ డప్పలార్య స
త్తమసుతుఁ డయ్యలార్యుఁడు కృ
తస్థితి నార్యులు మెచ్చునట్లుగా
హిమకర తార భాస్కర మ
హీవలయస్థిరలక్ష్మి చేకురన్'

అని మంగళాంతముగ ముగించి భాస్కరుని పేరుతో దన పేరును శాశ్వతమగునట్లు చేసికొనిన ధన్యుడు అయ్యలార్య కవిమూర్ధన్యుడు. వెం. సూ. శా.

భైరవశాస్త్రి, హరి: వీరు మొదట కృష్ణాజిల్లా గుడివాడ తాలుకాలోని కలువపాముల వాస్తవ్యులు. 19వ శతాబ్ది ప్రారంభములో శాస్త్రాధ్యయ నార్థము వీరును, వీరి సోదరులును కాశికి వెళ్లిరి. విద్యాభ్యాసానంతరము సోదరుడింటికి తిరిగి వెళ్లెనుకాని ఆయన ప్రయాగ కరిగి దారాగంజ్‌లో స్థిరనివాస మేర్పరచుకొనిరి. వైద్యనాథ శాస్త్రి, జగన్నాథ శాస్త్రియని వారి కిద్దరు కుమారులు, గంగమ్మ, అన్నపూర్ణమ్మ, కాశీఅమ్మ అని ముగ్గురు కొమార్తెలు. గంగమ్మ నిట్టల శేషశాస్త్రి దౌహిత్రుడు భమిడిపాటి శేషనారాయణశాస్త్రి భార్య. అన్నపూర్ణమ్మ కాశీ నివాసియైన మరొక ఆంధ్రుడు పెనుమర్తి కృష్ణ శాస్త్రిభార్య. కాశీ అమ్మ దారాగంజిలో తన సోదరునితో గూడ స్థిరనివాస ముండిన గొర్తి సోమయ్యశాస్త్రి భార్య. భైరవశాస్త్రి సంతతివా రిప్పటికి ప్రయాగలో నున్నారు. గు. వెం. రా.

భోగనాథుడు: ఇతడు మహాకవి. మాధవాచార్య, సాయణాచార్యులకు తమ్ముడు, అన్నలవలె సుప్రసిద్ధుడు; బుక్కరాయల అన్నయగు కంపరాయల కుమారుడగు (ద్వితీయ) సంగమ భూపాలునకు నర్మసచివుడు. భోగనాథుడు తాను రచించిన 'బిట్రగుంట ప్రశస్తి' లో సంగమ భూపాల నర్మసచివుడనని చెప్పినాడు. సాయణుడు తన 'అలంకార సుధానిధి' గ్రంథమున భోగనాథ గ్రంథముల నుల్లేఖించినాడు. అవి యేవన: 1. రామోల్లాసము, 2. త్రిపుర విజయము, 3. శృంగార మంజరి, 4. ఉదాహరణ మాల, 5. మహాగణపతి స్తవము, 6. గౌరీనాథాష్టకము.

'బిట్రగుంట ప్రశస్తి' శ్లోకములే లభించినవి. పై నుడివిన యారు గ్రంథములు సమగ్రముగా లభింపలేదు. లభించిన భాగములు చూడగా భోగనాథుడు ప్రతిభా పాండిత్యములు కల మహాకవి యనిపించును. అలంకారోదాహరణ ప్రసంగమున సాయణుడు 'భోగనాథస్య వా కవేః' 'తేషా ముదాహరణాని భోగనాథ కావ్యేషు ద్రష్టవ్యాని'యని తమ్ముని కవితపై సమధికముగా నాదరము చూపినాడు.

భోగనాథుని యౌదార్యము సూచించు శ్లోకములు కొన్ని అలంకారసుధానిధిలో నున్నవి. భోగనాథుని కవిత కావ్య విదుల కుపదేశకము. పదబంధ చమత్కారము, శ్రుతిహిత వివేచనము, అర్థగౌరవము మొదలగు సాహిత్యవిశేషము లిందున్నవి.

అలంకారసుధానిధిలోని భోగనాథుని శ్లోకములను చూడగా వారి వంశకథయు కొంత గోచరించును. సాయణునకు 'కంపణ, మాయణ, సింగణ' లను ముగ్గురు

కుమారు లున్నారట. కంపణుడు సంగీత కలాకుశలుడు. మాయణుడు కావ్యకలావీథీ పథికుడు, గద్యపద్య రచనా చతురుడు. సింగణ క్రమజటాచర్యా చర్చలు కల వేదాభ్యాసములలో విస్మయనీయ చాతుర్యము కలవాడు. జ. మా. శ.

**మధుర నాయకరాజులు :** విజయ నగరాధీశ్వరు డైన కృష్ణదేవరాయలు తన పరిపాలనాంత్యకాలమున దక్షిణ దిశను తుదిభాగమునందలి రాజ్య వ్యవహారము లను చక్కబెట్టుటకై నాగమనాయకుని పంపిన సందర్భ మున మధురనాయకరాజ్య మేర్పడినట్లు ఒక్కొక్కప్పుడు చెప్పుచుందురు. కాని ఆరాజ్య సుస్థిర సంస్థాపనము నాగమ నాయకుని కుమారుడు విశ్వనాథ నాయకునివలన జరిగిన దనుట మిక్కిలి సమంజసము. అచ్యుతదేవరాయలు క్రీస్తు శకము పదునారవ శతాబ్దపు మూడవ దశకములో తంజా వూరు, మధుర లనుపేర రెండు సామంత రాజ్యముల నేర్పాటు చేసినప్పుడు చెవ్వప్పనాయకుని (అచ్యుతదేవ రాయల దేవియైన తిరుమలాంబ చెల్లెలు మూర్తమాంబ భర్త) తంజావూరు రాజ్యమునకును, విశ్వనాథ నాయకుని మధుర రాజ్యమునకును అధిపతులుగ నియమించెను. అటు తరువాత రెండు శతాబ్దములవరకు మధుర రాజ్యము దక్షిణ హిందూదేశ రాజకీయ, సాంస్కృతిక రంగము లలో ప్రముఖపాత్ర వహించినది. తుది కాలమున పాలిం చిన ఇద్దరు రాణులతో గలిపి మధురనాయక రాజ్యము నేలినవారు పండ్రెండుగురు కలరు. ఇద్దరు రాణులలో ఒకతె మంగమ్మ తన కుమారుడైన ఇమ్మడి చొక్కనాథ నాయకునికి (క్రీ. శ. 1689) ప్రతినిధిగా రాజ్యమును పాలించినది. రెండవయామె ఇమ్మడి చొక్కనాథ నాయ కుని పట్టమహిషి రాణి మీనాక్షి. భర్త మరణానంతరము (క్రీ. శ. 1732) చందాసాహేబు ఆమెను నమ్మించి ద్రోహము చేసి చెరసాలలో పెట్టునంతవరకు నాలుగేండ్లు రాజ్యమును పరిపాలించి తుద కామె చెరలోనే యాత్మ హత్య కావించుకొన్నది.

మధుర రాజ్యమును ఇంచుమించుగా కట్టుబడి వృత్తి పద్ధతిని డెబ్బది రెండు పాళెములు(పాళయములు)గా నేర్పాటు చేయుటలో విశ్వనాథ నాయకునికి ఆతని దళ వాయి అరియనాథ ముదలియారు కడు సమర్థతతో తోడ్పడెను. ఈ పాళెములకు పారుపత్తెము చేయువారిని పాళెగాండ్రందురు. వీరికి పాళెములు వంశ పారంపర్య ముగ ననుభవించు హక్కుతో నీయబడినవి. తిరుచిరాపల్లి కిని, కన్యాకుమారికిని మధ్యగల భూమండలమే కాక సేలము, కోయంబత్తూరులు కూడ ఈ మధుర రాజ్యములో చేరినవే. వారి కనువైనప్పుడు వారు విజయనగర సింహాస నమున కేటేట చెల్లించుచుండవలసిన కప్పమును చెల్లించుట తరచుగా మరచిపోవుచు వచ్చినప్పటికిని సాధారణముగా మధుర నాయకరాజులు విజయనగర సామ్రాజ్యమునకు రాజభక్తిగల సామంతులుగనే యుండిరి. విశ్వనాథనాయ కుని మరణానంతరము (క్రీ. శ. 1564) అతని కుమారుడు మొదటి కృష్ణప్పనాయకుని పరిపాలనారంభ కాలమున తలికోట యుద్ధోపద్రవము సంభవించినది. ప్రళయ సదృశ మైన ఈ యుద్ధము వలన విజయనగర కేంద్ర ప్రభుత్వము దుర్బలమై అది దక్కను ముస్లిము రాజ్యముల వైరమువల్ల నిరంతరము వేధింపబడుటచేత ఈ మధుర సామంత రాజ్యమునకు వెనుకటికంటె నెక్కువ స్వాతం త్ర్యము వహించుటకు అవకాశము కలిగినది. కర్ణాట చక్రవర్తులు ముస్లిము దండయాత్రల నెదుర్కొనుటలో నాయకరాజ సాహాయ్యముపై నాధారపడవలసి వచ్చినది. తలికోటయుద్ధములో కర్ణాటక చక్రవర్తికి సాయపడు టకై ఉత్తరదేశమున కరిగిన అరియనాథ ముదలియారు రాజ్యములో లేని సమయము నదనుగా తీసికొని తుంబిచ్చి నాయకుడు, ఇతర పాళెగాండ్రును తిరుగబాటు చేయగా కృష్ణప్పనాయకుడు వారి నెదుర్కొని అణచి వేసెను. అతడు సింహళముమీదికి దాడివెడలి కండిరాజును వధించి అక్కడ తన పాలకు నొకని నియమించెను.

క్రీ. శ. పదునేడవ శతాబ్దమునందలి మొదటి దశక ములో రామనాథము జిల్లాలోని మరవదేశము సేతుపతు లని పేరుపడిన రాజులక్రింద మధురరాజ్యములోని ఒక ముఖ్య సంస్థానమైనది. అదేకాలమున క్రీ. శ. 1606 లో ఇటలీ దేశపు జెసూయిట్ మతబోధకుడు రాబర్టు డి. నోబిలి మధురలో స్థిరనివాస మేర్పరచుకొని ప్రజలలో క్రైస్తవమత వ్యాపనమునకు గట్టి ప్రచారము కావించెను. తన కార్యమును చక్కగా సాధించుకొనుట కతడు భార తీయ సన్న్యాసి దుస్తులను ధరించి సంస్కృతమును, తమిళ మును గూడ నేర్చెను.

చక్రవర్తియైన రెండవ వెంకటపతిదేవ మహారాయలు చనిపోయిన యనంతరము సంభవించిన విజయనగర రాజ్యమునందలి యంతఃకలహములలో మధురాధిపతి అయిన వీరప్ప నాయకుడు గొబ్బూరి జగ్గరాజు పక్షము నందుజేరి అతనితోకూడ పోరాడి యాచమనాయకుడు నాయకత్వమును వహించిన రాజభక్తిపక్షమువారిచేత తోపూరు సంగ్రామమునందు(1617) పరాజయము పొందెను. తిరుచిరాపల్లి క్రీ. శ. 1616 సంవత్సరమునుండి శాఖా (రెండవ రాజధానీ) నగర మయినది.

క్రీ. శ. 1623 నుండి 1659 వరకు పరిపాలించిన తిరుమల నాయకుడు మధురనాయకరాజు లందరిలోను అత్యంత శక్తి సామర్థ్యములు కలవాడును, రాజ్య విస్తరణాభిలాష కలవాడును. అతడు తిరువాన్కూరుపై దండెత్తెను; సేతుపతిని పూర్తిగా అణచివేసి తన యధికారము క్రిందికి తెచ్చుకొనెను. అతడు ముస్లిం దండయాత్రలను ప్రతిఘటించి సామ్రాజ్యమును సంరక్షించుకొనుటకు కర్ణాటక చక్రవర్తి మూడవ శ్రీరంగదేవ రాయలు(క్రీ. శ. 1642 - 1672) చేసిన ప్రయత్నములలో అతనికి సాయపడక పోవుటయేకాక మీదు మిక్కిలి గోలకొండ నవాబులతోను, విజాపురపు నవాబులతోను కుట్రలు సాగించెను. ముస్లిము రాజ్యము లన్నియు తుట్టతుదకు హిందూ రాజన్యులను ప్రతిఘటించుటకై ఏక మగుటకు సంసిద్ధముగ నుండెనని యే మాత్రమును గ్రహింపక అతడు సేతుపతి సాయముతో మైసూరు రాజ్యాధిపతితో కూడ యుద్ధము చేసెను. ఈ యుద్ధమున శత్రువులు పరస్పరము ఒకరి నాసిక లొకరు ఖండించు కొనుచు వచ్చుటచేత దీనికి 'నాసికల యుద్ధమని' పేరు కలిగినది. తిరుమల నాయకుడు క్రైస్తవులతో స్నేహభావముతో వర్తించెను. ఇతడే ఆధునిక మధురానగర నిర్మాత. ఇతడు మధుర మీనాక్షి దేవాలయమును, రాజప్రాసాదమును కట్టించెను. ఈ బ్రహ్మాండమైన భవనములును, వీనిని నిర్మించుటలోగల అద్భుత సాహసములును థీబ్స్ నగరములోని ప్రాచీన కాలపు భవన నిర్మాణములను ఆ నాటి జెసూయిట్ పాదిరీలకు తలపునకు తెచ్చుచుండెడివి. ప్రఖ్యాత సంస్కృత విద్వాంసుడును, అనేక దివ్యసాహిత్య గ్రంథ (శివలీలావర్ణన, గంగావతరణ, నలచరిత నాటక, నీలకంఠ విజయచంపూ) రచయితయు అయిన నీలకంఠ దీక్షితులు ఈతిరుమలనాయక రాజాస్థాన విద్వద్వతంసము.

తిరుమల నాయకుని కుమారుడు ముత్తు వీరప్ప నాయకుడు కొద్దికాలమే పరిపాలించి చనిపోయెను (1659). ఇతని రాజ్యకాలములో ఇతడు విజాపురపు దండయాత్రల నెదుర్కొనుటకు తగినంతగా తిరుచిరాపల్లికోటను కట్టుదిట్ట పరచెను. ఇతని కుమారుడు మొదటి చొక్కనాథ నాయకుని కాలమున (క్రీ. శ. 1659 - 1682) తంజావూరు, మధుర రాజ్యములకుగల ప్రాతపగలు రగులుకొన్నవి. తంజావూరు నాయకరాజును, అతని రాజకీయోద్యోగులలో కొందరును విజాపురపు సైన్యాధిపతికి సాయపడిరి. చొక్కనాథనాయకుడు తంజావూరు రాజ్యముపై దండెత్తెను ; వల్లము కోటను పట్టుకొనెను. కాని తన రాజ్యమునం దవసరమైన ఇతరకార్యములను చక్కబెట్టు కొనవలసి వచ్చుటచేత దానిని తంజావూరు విజయరాఘవ నాయకునికి మరల నిచ్చివేసెను. అతడు శత్రువులను మరింత సమర్థతతో నెదుర్కొనుటకుగాను రాజధానిని మధురనుండి తిరుచిరాపల్లికి మార్చెను. అతడు తరువాత తంజావూరిని జయించి తనపెంపుడు తల్లి కొడుకైన అళఘురి నాయకుని క్రీ. శ. 1673 లో దానిని పాలించుటకు నియమించెను. కాని వెనువెంటనే అళఘురి నాయకుడు స్వామిద్రోహి యయ్యెను. అళఘురి నాయకుడు తన కొలువులోనికి తీసికొనిన రాయసం వెంకన్న అనునతని తంత్రములకు ఫలితముగా తంజావూరు విజాపురమునుండి విజాపూరు సేనాని ఏకోజీ (వెంకాజీ) నాయకత్వమున వచ్చిన మహారాష్ట్రులకు వశమై పోయినది. కాని అనతికాలముననే ఏకోజీ తంజావూరు రాజ్యములోని చాల భాగమును నిర్బంధముగా అతని సవతి తమ్ముడైన శివాజీకి యిచ్చి వేయవలసి వచ్చినది. చొక్కనాథనాయకుడు మైసూరుతో రెండు తడవలు యుద్ధము చేసెను. మొదటి యుద్ధములో అతడు సేలము, కోయంబత్తూరులను కోల్పోయెను. రెండవ యుద్ధములో అతడు తిరుచిరాపల్లి కోటలోనే ముట్టడికి లోనయ్యెను. ఆ పరిస్థితులలో మైసూరు సైన్యము ముట్టడిని లేపక పూర్వము అతడు తంజావూరి మహారాష్ట్ర ప్రభువయిన ఏకోజీ యొక్కయు, చెంజి నాయక రాజుయొక్కయు సాహాయ్యమును వేడుకొనవలసి వచ్చెను. రుస్తుంఖా నను ఒక ముస్లిము సాహసికుడు చొక్కనాథనాయకుని పదభ్రష్టుని గావించి రెండు సంవత్సరములు (క్రీ. శ. 1678 - 1680) మధుర సింహాసనము నాక్రమించుకొనెను. చొక్కనాథనాయకుని మరణానంతరము అతని పట్టమహిషి మంగమ్మ (మంగమ్మాళ్)కు జనించిన కుమారుడు వీరప్పనాయకుడు మధురరాజ్యాధిపతియై క్రీ. శ. 1689 వరకు పరిపాలనము నెరపెను. అతడు కాలధర్మము నొందినపిదప జనించిన అతని కుమారుడు రెండవ చొక్కనాథ నాయకునికి ప్రతినిధిగా అతని తల్లి మంగమ్మ రాజ్యమేలెను. ఆమె ఢిల్లీ పాదుషా ఔరంగజేబు ఆధిపత్యము నంగీకరించెను (1693). వాడుక ప్రకారము చెల్లింప వలసిన కప్పమును చెల్లింపనందు కామె తిరువాన్కూరుపై దండెత్తి ఆ రాజ్యాధిపతి నణచివేసెను. ఆమె తంజావూరుతో జరిపిన యుద్ధము రాయబారములతో అంతమయినది. సేతుపతులు మాత్రము క్రీ. శ. 1702 లో తమ స్వాతంత్ర్యమును ప్రకటించిరి. క్రైస్తవులను హింసించిరి. రాణి మంగమ్మ వారియెడ మైత్రి కలిగి యుండెను. ఆమె చాల ధర్మాత్మురాలు, అనేకము ధర్మకార్యములు చేసెను. ఆమె ప్రధాని నరసప్పయ్య. క్రీ. శ. 1706 లో మంగమ్మ చనిపోయిన



చిత్రము 1. తిరుమలనాయక విగ్రహము



చిత్రము 2. విశ్వనాథనాయక విగ్రహము



చిత్రము 3. తిరుమలనాయక ప్రాసాదము, మధుర

పిదప చొక్కనాథనాయకుడు సింహాసన మెక్కి 1732 వరకు రాజ్యమును పరిపాలించెను. అతడు 'నిస్సంతు'గా చనిపోయెను. దుర్బలుడైన ఆ చొక్కనాథ నాయకుని పట్టమహిషి రాణి మీనాక్షి ఒక పిల్లవానిని పెంచుకొని అతనికి ప్రతినిధిగా కొంతకాలము పరిపాలించెను. కాని ఆమె ఆర్కాటు నవాబు దోస్తు అలీ అల్లుడైన చందా సాహేబు పన్నిన తంత్రములో పడి చెరపెట్టబడి, ఇది వరలో నుడివినట్లు తుట్టతుదకు ఆ ఖైదులోనే ఆత్మహత్య కావించు కొనెను. సాధారణముగా ఇది క్రీ. శ. 1736, 1737 సంవత్సరములలో జరిగినట్లు చెప్పుదురు. కాని 1739 ఫిబ్రవరి 9 తేదీని రాణి మీనాక్షి యిచ్చిన తామ్రశాసన మొక్కటి (తిరువాన్కూరు ఆర్కియ లాజికల్ సీరీస్, సం. 5, నెం. 81, పుట 289) యున్నది. కె. ఏ. నీ. శా.

**మధురవాణి :** ఈమె రఘునాథ నాయకుని ఆస్థాన మున నుండిన విదుషీమణి. విద్యా వినోదియగు రఘునాథ నాయకు డీమె వాఙ్మాధుర్యమునకు మెచ్చి 'మధురవాణి' అను బిరుదము నీమె కొసగినట్లు రామాయణ సంగ్రహ శ్లోకమువలన దెలియవచ్చుచున్నది. బిరుద నామమే ఈమె పేరుగా వ్యవహరింపబడుచున్నది. ఈమె పేరేమియో తెలియుట లేదు.

మధురవాణి రఘునాథనాయకుని యాస్థానమున నుండి, అతడు రచించిన తెలుగు రామాయణమును విని దానినే సంస్కృతమున రచించినట్లు చెప్పుదురు. ఇంతవర కును లభించిన రఘునాథ నాయకుని రామాయణ భాగ మును, మధురవాణి రచించిన సంస్కృత రామాయణ భాగమును పరిశీలించి చూడగా ఆంధ్రమునకు సంస్కృత మనువాదమైనట్లు కానరాదు.

మధురవాణి తాను రచించిన కావ్యమునకు 'శ్రీరామా యణ సార' మని పేరు పెట్టినట్లును, రఘునాథరాయల దయవలన సంస్కృతాంధ్ర కవితాపాటవమును, వీణా వాదన నైపుణిని గడించినట్లును, 'రామాయణసారము' నే కాక నైషధ, కుమారసంభవకావ్యములనుకూడ రచించి నట్లును రామాయణసార కావ్యపు సర్గల చివరగల శ్లోక ములవలన తెలియుచున్నది.

ఈమె తాను విద్వాంసుల కుటుంబములో పుట్టినట్లే కాని యా వంశమునుగూర్చి మ రేమియును తెలుపలేదు.

మధురవాణి చతుర్విధకవిత్వములందును ఆరితేరినది; అరగడియలో నూరు శ్లోకములను చెప్పు కవితాధార కలది; వ్యాకరణ శాస్త్రమున గొప్ప ప్రజ్ఞ గలది; అనేకములగు అవధానములు చేసి తన ప్రతిభను వెల్ల డించినది; రఘునాథరాయలవలన కనకాభిషేక గౌరవ మును పొందిన విదుషీమణి. వీణావాదనమున నీమె సమర్థురాలు.

మధురవాణి గ్రంథములలో ఒక్క రామాయణసార మున కొంత భాగము మాత్రమే లభించినది. కుమార సంభవము, నైషధము లభింపలేదు. ఉపలబ్ధ రామాయణ భాగము కూడ గ్రంథపాతములతో గూడి బెంగుళూరు నగరమందలి మల్లేశ్వరములోని వేదవేదాంతమందిర గ్రంథాలయమున మాత్రము గలదు. ఉపలబ్ధములైన పదు నాల్గు సర్గలలోను మొదటి సర్గమున గ్రంథరచనా కార ణము వివరింపబడినది. తరువాతి సర్గలలో కథ సీతాన్వేష ణము, హనుమత్సీతా సందర్శనము, శ్రీరామునకు హనుమ సీతావృత్తాంతము నెరిగించుటవరకు సాగినది.

మధురవాణి కవిత నాతిప్రౌఢమై, నాతిపేలవమై పరి మిత శబ్దాలంకారములతో మనోజ్ఞమై యుండును.

రఘునాథనాయకుడు శ్రీరామ భక్తుడు. మధుర వాణికి శ్రీరాముని యెడలను, రఘునాథనాయకుని యెడ లను గూడ భక్తి మెండు. ఆమె యొక శ్లోకమున రఘు నాథుని శ్రీరామునితో బోల్చి వర్ణించుచు తన యపార భక్తి గౌరవములను వెల్లడించినది. ఆ శ్లోక మెంతయు హృద్యమైనది :

'నిశమ్య దంతాత్మని భద్రపీఠే
నిషణ్ణ మర్త్యే రఘునాథభూపమ్;
తస్మిన్ జనం పుష్పక మావసంత
మమన్యతాద్యం రఘునాథమేవ.'

బు. వెం. ర.

**మల్లన, నంది; సింగయ్య, ఘంట:** ఈ కవి వృషభ యుగళమే తెనుగు వాఙ్మయమునందలి మొదటి కవి యుగళము. శరీరసంబంధమున మొదటి యతడు మేన మామ; రెండవ యతడు మేనల్లుడు. బ్రతికిన నాళ్ళలో వీరు శరీర ప్రాణములవలె జరించిన సౌహార్ద సంపన్నులు. కృతియందలి ప్రతి పద్యమునకు చాటు ప్రతిపత్తి కలుగు నట్లు చెప్పనేర్చిన యమృత వాక్కులు; వాగీశ్వరీమంత్ర రాజసిద్ధి పారగులు; మహాదేవాంఘ్రి జలజ భక్తి పర తంత్ర మతులు; కౌశిక, భారద్వాజ గోత్రులు; ఆపస్తంబ సూత్రులు; దక్షిణామూర్తి, అఘోర శివగురుల శిష్యులు; అతి శాంతచిత్తులు; భాషాద్వయకృతి నిరూఢ శేముషీ భూషణులు.

మల్లయ మనీషి 'సంగీత నంది' యని పేరు మోసిన నంది సింగమంత్రికిని, పుణ్యశీల పోచమ్మకును నాత్మసంభ వుడు. సింగయమంత్రి ఘంట నాగధీమణికిని, పుణ్యచరిత అమ్మలాంబకును కూర్మి తనయుడు. ఈతనికి 'మలయ

మారుత కవి' యను నామాంతరము గలదు. అది బిరుద నామము కావచ్చును. ముద్దుపలుకునకు సుప్రసిద్ధుడైన పారిజాతకవి నంది తిమ్మన యీయన మేనల్లుడు. తిమ్మనకు మల్లన పితామహుని వరుస. పితామహుడైన గావచ్చును. తిమ్మన తన కృతిలో పితామహుని పేర్కొనలేదు; 'మలయమారుత కవీంద్రునకు మేనల్లుండ' ననిమాత్రమే చెప్పికొనెను. మేనమామమీది యభిమాన మట్టిది కానోపును. అది కవితాభిమానమూలక మనియే తోచుచున్నది. ఇరువురును 'అఘోరశివగురు' శిష్యులే. వీరి ఆశ్వాసాంత గద్యములును పోలిక కలవి; 'ఇది శ్రీమదుమామహేశ్వర వరప్రసాదలబ్ధ సారస్వతాభినంది నంది'.

ఈ కవియుగళము రచించిన కావ్యములు నేటికి దొరకునవి రెండు; ప్రబోధచంద్రోదయము, వరాహ పురాణమును. మొదటి కావ్యము పురుషోత్తమ గజపతికి సామంతుడును, మాధవవర్మ వంశజుడునునగు, బసవ నృపాలునకు మంత్రియగు పెసరవాయ గంగనామాత్యున కంకితము. రెండవది శ్రీకృష్ణరాయల తండ్రియగు తుళువ నరసానాయకున కంకితము. వీరు మొదట గంగనామాత్యునకును, పిమ్మట నరసానాయకునకును నాశ్రితు లగుటచే పదునైదవ శతాబ్ది చరమభాగమున వెలసియుండినవారనుట నిర్వివాదాంశము. గంగనామాత్యున కేలికయగు బసవనృపతి గజపతులకు సామంతుడు; ఉదయగిరి దుర్గము భేదించిన శౌర్యశాలి (గజపతి సురథాణి గడి దుర్గములకెల్ల నేరాజు వజ్రంపుఁ బోరుతలుపు). ఈ రాజు దూబగుంట నారాయణ కవివలన పంచతంత్రమును గృతి నందిన రసజ్ఞప్రభువు. ఈతని అమాత్యుడు గంగయ్యమంత్రి 'నీళ్ళలోపలి నరసిజినీ దళంబు సరవి నిర్లేపుఁడైన సంసారయోగి.' శ్రీనాథుని బావమరదియగు ప్రశస్తకవి దగ్గుపల్లి దుగ్గనచే నాసికేతోపాఖ్యానమును, ప్రకృత కవులచే ప్రబోధ చంద్రోదయమును గృతు లందుటయే ఈయన యంతఃప్రవృత్తిని జాటుచున్నది. గంగన్న మంత్రి గొప్ప రాజనీతివేత్త ('నరసింహ నృపవశీకర నయవిద్యాకరణ చతుర్దశ విద్యాకరుఁడు'). ఈ నరసింహ నృపతి సాళువ నరసింహ నృపతి యనియు, గంగన మంత్రి నయ విద్యాకౌశలమున కొక సందర్భమున వశీకృతు డయ్యె ననియు చారిత్రకులు గుర్తించుచున్నారు. సాళువనరసింహ నృపతి జైమినిభారతమునకు గృతిపతి. కాగా నీ కవులందరు నించుమించుగ సమకాలికులు. ప్రబోధచంద్రోదయమున గంగనమంత్రి యిట్లు వర్ణింపబడెను.

'జలకము మూర్ధ చంద్రసుధ షట్కమలంబులఁ బూజ ధూపము జ్వలతరబోధ వాసన నివాళి సుషుమ్న వెలుంగు సౌఖ్యముల్ తలఁపున నీగి బోనము సదా తన నాదము ఘంటగాఁగ నిష్కలుషత నీయనంతవిభు గంగన గొల్చు నిజాత్మలింగతన్.'

గంగనమంత్రి రాజ్యతంత్రములు నడపుటయు, పుష్ప చందన వనితాది సౌఖ్యము లందుటయు, సంగీత సాహిత్య సరస విద్యల ప్రొద్దు పుచ్చుటయు, శిష్ట రక్షణ దుష్ట శిక్షణములచే స్వామి హితమును నెరపుటయును సాక్షిమాత్రముగనే. ఈయన అంతర్ముఖుడు; నిత్య శివపూజా పర తంత్రుడు; 'ప్రత్యక్ష శంభుమూర్తి' యని ప్రకృతకవులీయనను బ్రశంసించిరి. ఈయన కటాక్షములు సుకవులకు మరగిన కామధేనువుల మందలు. సిద్ధరస ప్రవాహములు; కల్పవృక్షముల తోటలు; జంబునదీ సమూహములు; సురపతి రత్నపుంజములు; శుద్ధసుధాఘుటికలు. ఇట్టి యోగ్యత కనురూపముగ యోగ్యకవులచే బ్రబోధ చంద్రోదయము ఆంధ్ర భాషలో గృతి నందుమని యొకనాటి శివపూజావసానమున విద్వాంసు లీయనను బ్రబోధించిరట!

ప్రకృత కవులను బిలిపించి గంగనమంత్రి 'తత్సమయ సంపూజాలసచ్చుంబు మూర్ధ నవీనేందు కళా సుధా సురభి గంధంబైన హస్తాంబుజంబునఁ గర్పూరపు వీడియంబు లిడి తన పేర ప్రబోధచంద్రోదయమును గృతి యొనర్పుడని యభ్యర్థించెను.

విరూరి వేదాద్రి రామకృష్ణ కవి కిచ్చిన వీడియములో 'పద్మనాభార్చనాకలనా పావన హస్త కంకణఝణత్కారములు' మాత్రమున్నవి. ఈ గంధ, మృదుత్వ, శైత్య, మాధుర్యములు లేవు.

వెలయెక్కునట్లు మౌక్తికహారమును పోహళించు లీల గావ్యము నుపక్రమోపసంహార రమణీయముగ గూర్చు నేర్పు వీరి సొమ్ము. వీరి కావ్యములయం దెల్లెడల నీ పనితనము గోచరించును. వ్యర్థపదములు గనరావు. ప్రతి పద్యము నచ్చుకట్టిన ట్లుండును. ప్రబంధపరమేశ్వరుడైన శంభుదాసుని వాగ్విలాసములు వీరికి మేలుబంతులు. ప్రబోధ చంద్రోదయము సంస్కృతమున నాటకము. మందమతియైన శిష్యునకు దత్త్వమును సుబోధ మొనరించుటకు గృష్ణమిశ్రు డనుకవి దీనిని రచించెనని చెప్పుదురు. సర్వ వేదాంతసార మనియు, సుస్థిరజ్ఞానమునకు మార్గ మనియు, నవరసాశ్రయ మనియు, షడ్దర్శనములు నిందు గలవనియు, దీని యనుశీలనమునగాని సందేహములు తీర వనియు, ఈ కావ్యరసపాకమును జవిగొన్న జనుడు మరల జననీస్తన్యము నెరుగ డనియు (పునర్జన్మ యుండ దనుట) ప్రకృత కవులు దీని ప్రాశస్త్యమును వర్ణించిరి. స్వభావోక్తిప్రియులైన యీ కవులు చెప్పినది అక్షరశః సత్యము. సంస్కృతములో ఆ నాటకమునకున్న గౌరవ మట్టిది.

దానిని వీరు ప్రబంధశయ్యకు నొనగూర్చిరి. ఈ కాలము లోనే పిన వీరనయు 'శాకుంతలము'ను కావ్య మొనరించెను. ఎవరు ఎవరికి మార్గదర్శకులో చెప్పలేము. నాటకములను నాటకములుగా ననువదింపక వీరు ప్రబంధములను చేసినందులకు నేటి విమర్శకులు కొందరు చింతింతురు. ఆధునికులు పలువురు పై రెంటిని నాటకములుగ ననువదించి యున్నారు. శృంగారశాకుంతల, ప్రబోధచంద్రోదయముల యందలి రసపరిపాకము నాటకరూపానువాదములలో గనరాదు. ఇక ముందు రాగలదనునాశయు లేమి పూర్వు లవలంబించినదియే సముచిత ప్రక్రియ యని తోచును.

'ప్రబోధచంద్రోదయ' మనగా జ్ఞాన మనెడి చంద్రుని పొడుపని యర్థము. సూర్యోదయ మనక చంద్రోదయ మనుటవలన ఆహ్లాదమును, శాంతియు నుద్దిష్టములు. దీని వెనుక 'సంకల్పసూర్యోదయములు' వెలువడినవి.

ప్రబోధచంద్రోదయము నందలి కల్పన అద్భుతావహమును, అద్వితీయమును. ఈశ్వరునకును, మాయకును సంగము లేకయే 'మనస్సు' అను పుత్రు డుదయించెను. ఆ మనస్సే నిఖిలసంసారమునకును కర్త. అతనికి ప్రవృత్తి, నివృత్తులు భార్యలు. ప్రవృత్తియందు మోహ, లోభ, కామాదులగు దుష్కర్ములను గనెను. నివృత్తి యందు విమలమతులగు వివేక, వస్తువిచార, సంతోషాదులను గనెను. ఈ యిరుతెగలవారును రాజ్యకాంక్ష మెయి కురుపాండవులవలె పోరాడిరి. 'మనస్సు' ధృతరాష్ట్రుని వంటివాడు. అతనికి మోహునియందు పక్ష మెక్కువ. వివేకాదులు పాండవులవలె కొన్నాళ్లు వనవాసాజ్ఞాతవాసములు చేయవలసి వచ్చెను. పరముడును నిరంజనుడు నగు జగత్పతి అహంకారమోహ వశుడగు 'మన' స్సను పుత్రుని దుశ్చేష్టితములవలన దీనదశకు గొనిరాబడెను. 'మనస్సు'నకు వివేకము పుత్రుడే యైనను 'గురో రప్యవలిప్తస్య కార్యాకార్య మజానతః' అను న్యాయమునుబట్టి యహంకార మోహ పరివేష్టిత మగు 'మనస్సు' యొక్క సమూల నిర్మూలనమునకు కృత ప్రతిజ్ఞుడయ్యెను.

ఇరుదెగలు నొడ్డిన వ్యూహములలో 'మిథ్యాదృష్టి' 'శ్రద్ధా'దులగు స్త్రీ పాత్రములు గూడ పాల్గొనును. యుద్ధమునందు 'కాముని' 'వస్తు విచారుడును' 'క్రోధు'ని 'క్షమ'యును 'లోభు'ని 'సంతోషు'డును బరిమార్తురు. తుట్టతుదకు వివేకునకు 'శ్రద్ధా' సమానీతయగు 'ఉపనిషద్దేవీ' సమాగమము వలన 'విద్యా', 'ప్రబోధచంద్రు' లుదయింతురు.

ఇది భావములకు రూపకల్పనమైనను ఈ పాత్రములు ప్రాణులకన్న ప్రాణవంతములై స్ఫుటరేఖలతో మన యెదుట సాక్షాత్కరించును. ఈ కృతి తత్త్వనిరూపణ పరమైనను వివిధ సన్నివేశములయందు వివిధ రసములకు ప్రవేశము కల్పింపబడినది. దీనియందు శాంతరసము తరువాత ముఖ్యమైనది హాస్యరసము. జైన, బౌద్ధ, కాపాలికుల సంవాదమునందు దీని పరాకాష్ఠను జూడ వచ్చును. ఇందలి పాత్రములు, కొలదియిడరా నన్ని. జటిలములగు దార్శనికవాదములు, దురవబోధమగు తత్త్వము, మనోమయజగత్తునందలి వివిధ భావములు కృష్ణ మిశ్రుని ప్రతిభవలన రూపసిద్ధి నంది మన కనులముందాడును. ఈ తెనుగుకావ్యమును సంస్కృత నిరపేక్షమైన స్వతంత్ర కావ్యమా ? అని యచ్చెరువు కల్పించునంత ప్రసాదగుణమహితముగ నీ కవులు సృష్టించిరి. ఈ కావ్యము 'నీటి కొలది తామర'గ నర్థము చేసికొన దగినది. తామ్రపర్ణీ జలాంతర్గతమైన మౌక్తికమువలె తత్త్వ మిందు ప్రకాశించుచున్నది.

భాషా ప్రయోగములు కొన్నింట నీ కవులు స్వతంత్రులు. 'ఇంకా నొక కొన్ని కూర్పవలె', 'గుడిమ్రింగ వానికిన్ దల్పు లప్పడముల్ గావు' 'ప్రాసఁగువిత్తువంటి' మున్నగునవి మొదట ప్రయోగించినది ఈ కవియుగళమే.

> 'స్వేచ్ఛాలబ్ధములైన వన్య ఫలముల్ తృప్తాస్థగాఁ గల్గఁగా
> నచ్ఛస్వాదుజలమ్ము వాహినులయం దవ్వారిగాఁ బాఱఁగాఁ
> బ్రచ్ఛాయస్థల పల్లవ ప్రకరతల్పం బబ్బఁగా నేల యా
> శాచ్ఛన్నుల్ ధనికాంగణమ్ముల వృథా సంతాపముం
> పొందగన్.'

> 'తరుణి యనంగ మారుని ప్రధానశరం బది భగ్నమైనఁ ద
> త్పరికరముల్ సుధాంశుఁడు కదంబవనాగత కోమలా నిలాం
> కురములు చంద్రికా నిశలు కోకిల కీర మధువ్రతంబులున్
> బరువపుఁ బువ్వుతోఁటలు నపార్థములైనవి గావె చూడఁగన్.'

వీరి రెండవకృతి వరాహపురాణమునాటికి వీరు వాగీశ్వరీమంత్రసిద్ధి నందిరి. ప్రబోధచంద్రోదయమునందు ఆకాశ తత్త్వమూర్తిగ విఘ్నేశ్వరుడు మాత్రమే స్తుతింపబడెను. మంత్రసిద్ధికి నిదర్శకముగ వరాహపురాణ మున్నది. వరాహ పురాణము వీరి సూక్తిభాండారము. ఇం దుండి పిమ్మటి కవులు కొల్లగొనిరి. అచుంబితములైన యూహల నీ కావ్యమునందు వీరు చేసిరి. భూదేవిని దంతాగ్రమున దాల్చిన వరాహస్వామి 'జలదాళ్లేషైక శృంగోన్నమత్కైలాసము' వలె నున్నాడట. ఇది యెంత మనోహరమైన యూహ !

'నాలుగు నీరజంబు లొక నాళమునన్ బ్రభవించె నెట్టి చోద్యాలని, ముగ్ధలైన వనితల్ తన మోములు

చూడ' బ్రహ్మ నవ్వుకొనుచుండెనట! సరస్వతీదేవి హస్తమున దిరుగు జపవ్యావృత్త స్ఫటికాక్షదామము — 'లావణ్యాంబులు నాభికూపమున వెల్లం దోడి ముద్రీజవద్భావ క్షేత్రమునందు వంచు ఘటయంత్ర' మట!

ఈ పురాణము భూదేవీ వరాహమూర్తుల సంవాద రూపమైనది. సర్గ ప్రతిసర్గములు, వంశము, మన్వంతరములు, రాజవంశానుచరితము అను ఈ పురాణలక్షణములే కాక గృహస్థుల కుపయోగించు వివిధ దేవతా విషయకములైన అనేక పూజాకల్పము లిందు వివరింపబడినవి. ప్రతిపన్ముఖ్యరాకాంత తిథి దేవతాచరిత్రములు, వారి పూజా విధానములు నిరూపింపబడినవి. అపూర్వములు, నద్భుతావహములునైన యుపాఖ్యానముల కిది పుట్టినిల్లు. ఇందలి దుర్జయోపాఖ్యాన మొక్కటి చాలును వీరి కవితా ప్రౌఢి నెరుగుటకు; దుర్జయుని సేనాపరాగముచే నజాండము భూతికరండము కాగా చుక్కలు దుక్కిలో విత్తిన విశాఖ విత్తులవలె నున్నవట. వీరి వర్ణనలు హృదయంగమములు. 'చంచుదగ్రైక మృణాళకాండ చక్రవాకదంపతులు' వినోదవాదనానంతరంబున సరోలక్ష్మి నిలిపిన 'దంత ప్రవాళ సమంచిత విపంచి' వలె నున్నవట! వీరి శృంగార వర్ణనలు లలితములు, నుదాత్తములును.

'మేలం బాడుచు వచ్చు వెచ్చెలియపై మిథ్యాలసత్వంబు నూ
ల్కొ లోలోపల వేడుకల్ నిగుడ సిగ్గుల్ దేలు నొయ్యారపున్
గ్రాలుంగన్నులఁ గ్రొమ్మెఱుంగులు దొలంకన్ మందయానంబుతో
నా లీలానిలయంబు చేరుదురొకో! నాళీకపత్రేక్షణల్.'

వీరు లోకోక్తులను బుష్కలముగ వాడిరి. 'ఆలి నొల్లని వాడు దా నీలకూర కుప్పు చాలలే దన్నట్లు'—ఇట్టివి పెక్కులు.

ఈ కవులు దశావతారస్తుతి చేసిరి. అది తరువాతి ప్రబంధ కవులకు మార్గదర్శక మయ్యెను.

'భంగములై నభంబున గుభాలునఁ ద్రెళ్ళఁ గరళ్ళ దాఁటుతో
నింగికిఁ బొంగు వారిధి మునింగిన భూవలయంబుఁ గన్నె గే
దంగితుద న్వసించిన మదప్రద సౌరభ నిశ్చలీభవ
ద్భృంగముఁబోలఁ గొమ్ముకొన నెత్తె
మురారి వరాహరూపమై' —వరాహ.

'కే, తకముకుళాగ్ర సంగత మద భ్రమరీసమరీతిగాఁగఁ గొ
మ్ముకొనఁ దగిల్చి యెత్తుకిటిమూర్తినిఁ దాల్చితిగా జనార్దనా!
—పా. హ.

ఈ పురాణములో నొక ధర్మవ్యాధోపాఖ్యానము గలదు. అది మిక్కిలి రమ్యమైనది. ఈ కవులు సమృద్ధమైన పలుకుబడి కలవారు. వస్తురుచి చాలనివారికికూడ వీరి రచన యాస్వాద్యమై యుండును. రాయలయు, తదాస్థాన కవులయు ప్రౌఢ ఔజ్జ్వల్యములలో నరసానాయకుడును, బ్రకృత కవులును మరుగుపడిపోయినట్లు తోచును. తెనుగు వాఙ్మయమునందు ప్రబోధ చంద్రోదయ, వరాహ పురాణ కర్తలకు విశిష్ట స్థానము గలదు.

దళము లాహారపాత్రంబులు రచియింపఁ
బదను తప్పెడునని ముదుర వెఱచు,
తావి పోయెడునని దేవతాపూజావ
సరము దాఁక విరులు విరియవెఱచు,
నతిథిభిక్షకు నల్పమౌనని పిందె లా
రఁగఁబండ కొకటియు రాల వెఱచు,
తపము సల్పెడువారు తపనదీధితులఁ గం
దెదరని నీడలు దిరుగ వెఱచు,
నారవైచిన వ్రేలుచు నహరహమ్ము
నుపరిభాగాంతరమ్ముల నున్న నార
చీర లేపాటి కెడఁకినఁ జిరుగు ననుచు
విటపము గదల్ప వెఱచు నుర్వీరుహములు. —వరాహ.

వీరి కవితాతత్త్వమున కొక మచ్చు. మ. శ. శ.

**మల్లన, మాదయగారి**: రాయల ఆస్థానమందలి అష్టదిగ్గజములలో మల్లన యొకడని ప్రసిద్ధి; ఇతని ఊరి పేరు అయ్యంకి. ఇది కృష్ణామండలములోనిది. ఇతని ఇంటి పేరుకూడ 'అయ్యంకి'యే యైయుండునని 'కవితరంగిణీ' కర్తల యూహ. తండ్రి మాదయామాత్యుడు ('నాచన సోముని'వలె 'మాదయగారి మల్లన' వ్యవహార ప్రసిద్ధుడు). ఇతనిది శౌనక గోత్రము. ఇతడు అఘోర శివాచార్య గురు కరుణాలబ్ధసారస్వతుడు; శంకరపాద సేవన వశంవద మానసుడు; దురక్షరానన భయంకరుడు (కుకవిభయంకరుడు); అయ్యంకి పురాగ్రహార విభవాకరుడు. ఈయన రచించిన కావ్యము రాజశేఖర చరిత్రము. ఇది తిమ్మరుసు మంత్రి యల్లుడగు నాదెండ్ల అప్పామాత్యున కంకితము. గోపమంత్రి యితని సోదరుడు. ఈ గోపమంత్రి ప్రబోధ చంద్రోదయమునకు వ్యాఖ్య వ్రాసిన మనీషి. ఈ కావ్యము రాయల రాజ్యాభిషేకమునకు బూర్వమో లేక యాతడు కొండవీటిని జయింపక పూర్వమో రచింపబడి యుండ వచ్చునని 'కవితరంగిణీ' కర్తల యాశయము. రాయల యాస్థానమున నున్న కవులెల్లరు రాయల కంకితములుగనే కావ్యములను రచించితీరవలయునను నియమ ముండి యుండదు. ఈ కావ్యరచనముచే లబ్ధప్రతిష్ఠుడైన పిమ్మట మల్లనకు రాయల యాస్థాన ప్రవేశ గౌరవము కలిగియుండ వచ్చును. మల్లన తిమ్మరుసుమంత్రిని ప్రకృతకావ్యమునం దిట్లు కీర్తించెను.

'పమంత్రిమణి నిజస్వామికార్యక్రియా
తత్పరమానసోత్సాహశాలి,

ఏమంత్రిమణి మిత్రహితబాంధవాశ్రిత
ప్రకరరక్షణకళాప్రౌఢబుద్ధి,
ఏమంత్రిమణి వచోహేలాతినైర్మల్య
శీతలతాధూతశీతరోచి,
ఏమంత్రిమణి సుధాధామశాంభవధామ
ధాళధళ్యసుతుల్యధవళకీర్తి,
అట్టి మంత్రికులోత్తంస మహితనృపతి
పటలమకుటాగ్రఘటిత పత్పద్మయుగళ
సకలకర్ణాటరక్షా విచక్షణుండు
దినసురశాఖి సాళువ తిమ్మమంత్రి.'

రాజశేఖరచరిత్రమునకు బిమ్మట కావ్యములను రచింపకపోవుటకు

' చెప్పఁదగుఁ గవిత రసముల్
చిప్పిల నప్పప్ప బళిబళీ యన ; లేదా
యెప్పుడు చేయక యుండుట
యొప్పుసుమీ ! సుకవి యెంత యుచితజ్ఞుఁడో కో !'

అను నితని యాశయము హేతువై యుండును. ' కాకర పండువంటి జిగి కల్గిన మేలిపసిండి 'వంటి ఈతని కవితలో అర్థగౌరవము ' పోకకు బుట్టె 'డమ్మును.

' నీలకంఠుని శిరసుపై నీళ్లు చల్లి
పత్తి రిసుమంత నెవ్వఁడు పారవైచుఁ
గామధేనువు వానింటి గాడి పసర
మల్ల సురశాఖి వానింటి మల్లెచెట్టు ;'

రాజశేఖరచరిత్రమునందలి వస్తువు కాల్పనికము. ఆవంచిపురాధీశ్వరుడగు హేమధన్వుడను రాజునకు లేక లేక శివప్రసాదమున రాజశేఖరుడను పుత్రు డుదయించుటయు, అతడు విశంకటుడను రాక్షసుని జంపి జటిలకౌశికుడను మునియొక్క కుమారికను విడిపించుటయు, కాళీప్రసాదమున నొక అద్భుత రత్నమును, తత్పరిచారికయగు నొక యోగిని వలన 'త్రికాలవేది 'యను నొక చిలుకను బడసి యతడు తిరిగి వచ్చుచో 'నుత్సవ 'వనమునందు సింధు రాజ కుమారికయగు ' కాంతిమతిని ' జూచి వలచుటయు, శుకదౌత్యమును, కాంతిమతీరాజశేఖరుల వివాహమును మాత్రమే యిందలి యితివృత్తము.

అచ్చమైన కవితాశక్తి వస్తునవ్యతకై యెదురుచూడదు. సుపరిచితములైన వస్తువులే దాని స్పర్శవలన నిత్య నూతనములై భాసించును. పెద్దకాలము గడచియు బుత్రా నన దర్శనమునకు నోచికొనని తండ్రుల వర్ణనను మన పూర్వ కావ్యములలో నెరుగుదుము. మల్లనభావనలో మన కిది ప్రాత యనిపించుట లేదు.

' లోచనానంద కల్లోలినీ భర్తకుఁ
దోయజారాతి పుత్రుండె కాఁడె...'

ఈ చిత్రణమునందలి ప్రాణకళ నరయునది—

' చందురువంటి నెమ్మొగము చక్కటిఁ దూలఁగఁ
బుట్టువెండ్రుకల్
కెందలిరాకు పాదములఁ గీల్కొనఁజేసిన యట్టి చిన్ని పైఁ
డందెలు గల్లు గల్లురన నాడుచు నల్లనఁ జేర వచ్చి నా
ముందఱ నాడ నెన్నఁడొకో ! ముద్దియ ముద్దు
కుమారుఁ గాంచుటల్.'

ఇట్టి భావనకు దోడు మల్లనది మధురమైన ఫణితి :

' కించిన్మర్దల నృత్యగీత సరస క్రీడావిధంబుల్ శుకి
చంచూ చంచదనూన రత్నఖచిత స్తంభంబు లభ్రంకషో
దంచద్గోపుర పంక్తులున్ మెఱయ నుద్యద్భక్తి నూరూరఁ గ
ట్టించెన్ భూపతి దేవతానిలయకోటిన్ జాహ్నవీ జూటికిన్.'

' రాజచ్చంద్ర శిలాతలాంతరలతారమ్యప్రదేశమ్ములన్
గాజుంగు ప్పెలలోని యచ్ఛతరగంగావారి నోలార్చి—'

పద్యరచనయందలి యెడుదులలో రసభావముల నుబికించు సుళువు లితని చేతికి తెలియును.

' కేళీ కాంచన సౌధ వీథికలచక్కిన్ దొట్లలోఁ జెట్టి ఓ
ప్రాలేయాచలకన్యకాధవ కృపాపారంగతా ! నిద్రవో
వే ! లావణ్యపయోనిధీ !......'

ఈ కవి యౌవనము నిట్టు లుల్లేఖించెను :

' వనితానేత్రచకోరచంద్రిక, తనుస్వచ్ఛందకాంతిచ్ఛటా
ఖని, యుత్సాహకళాఖురీ, మతిరేఖామంత్రసంసిద్ధి, భో
గనివాసంబు, లతాంత సాయక భుజాగర్వావలంబంబు...'

లేమి నుద్దేశించి :

' కులనిర్మూలన కారణంబు, ప్రతిభాకుట్టాక, ముద్వేగకో
పలతాదోహద, మాజవంజవసుఖప్రత్యూహ, మాత్మవ్యథా
జ్వలనజ్వాలిక, కామినీ నయనవీక్షాపాతసంరోధి ని
త్యలఘుత్వాశ్రయభూమి...'

అని పేర్కొనెను. రక్కసునిచే బిడ్డను గోల్పోయిన జటిలకౌశికుని యాయడలు నరయునది :

' నాచిన్ని ముద్దుకూఁతురు,
నాచక్కనితల్లి వీథి నడయాడఁగ న
న్నీచు కొనిపోయె.........!'

' ఏడవఁ యేటిది యెవ్వరు
వేడుక కదలించిరేని వెక్కుచు నేడ్చున్...'

' అత్త దయామతి తనకడ,
నత్తమిలక నిద్రవోవ దహరహమందున్
బొత్తునఁ గుడువక తాఁ గడి
యెత్తదు తజ్జనని యింత కేమయ్యెనొకో !'

ఇట్లు రసానుకూలముగ భాష యితని చేతిలో వెన్న పూస యగును. ఈ కావ్యమునందలి జలక్రీడాది వర్ణనలు సజీవములు. రాజశేఖరునకు విషదిగ్ధశరమై నాటిన యా ' కాంతిమతి ' విలాసము నరయునది !

'శీలన్ దామరక్రొవ్విరిన్ బిరబిరన్ జేశీగతిన్ ద్రిప్పుచున్
వాలారున్‌గొనగోళ్ల ఘర్మకణికావ్రాతంబు పోమీటుచున్
గ్రాలుంగన్నుల ముద్దులేనగ విగుర్పన్ జెవ్వ లల్లార్ప క
వ్వాలుంగంటి ననుం గనుంగొనినభావం బెన్నఁడున్
బాయునే.'

గవాక్షమునుండి కాంతిమతి రాజశేఖరుని జూచినపుడు :

'చిలుక పురోహితుం డగుచుఁ జెంగట నుండఁగ
సిగ్గుపెందెరల్
దొలఁగఁగ ద్రోచి బంధుగతిఁ దోరపుఁగోర్కులు
సందడింపఁగా,
తలఁపు లతాంగికన్న మును దాన కనుంగవ
దోయిలించి చూ
పులఁ దలఁబ్రాలు వోసె నృపపుత్రునిపై విరహాగ్ని సాక్షిగన్.'

'అయం ముహూర్త స్సుముహూర్తోస్తంచు' ప్రభావతీ ప్రద్యుమ్నమునందు పౌరోహిత్యము నెరపిన శుచిముఖి యీ చిలుక కేమి కావలెనో సూరననే యడిగి తెలిసికొన వలయును. ఈ చిలుకకు భాషాదేవి 'త్రికాలవేది' అని పేరు పెట్టినది. 'ఉపమాతిశయోక్తి కామధేనువున' కొజ్జబంతి యగు నిది తన్నుగూర్చి యిట్లు చెప్పికొన్నది.

'వాదింతున్ బహువేదశాస్త్రకలనావైయాత్యసంసిద్ధి న
వ్వేదవ్యాసులతోడనైన మది సంపీడించి యెచ్చోట నేఁ
గాదన్నన్ మఱి నిర్వహింపఁగ నశక్యం బేరి కస్మద్వచ
శ్శ్రీదాంపత్యము నాక నాక యనుకో సిగ్గయ్యెడున్
భూవరా!'

కాంతిమతి తల్లియును, ఇదియును ఈ కావ్యమునందలి ప్రాణవత్పాత్రములు. ఈ కవి ప్రతిభ యంతయును వివాహవర్ణనమునందు గలదు. పెండ్లికూతును పీటలమీదికి దీసికొని వచ్చుట మొదలు అప్పగింతలవరకుగల వివిధ సన్నివేశములను జిత్తరువు లొనరించి భావుకహృదయములను గొనివైచెను. త్రికాలవేదికి గాంతిమతితల్లి కాంతిమతి నప్పగించుటలో రసము పరాకాష్ఠ నందినది. కాంతిమతి తల్లి నిర్మాణమునకు అమృత ముపాదానమై యుండును. పెండ్లిసిరి రూపమెత్తిన యీ ముత్తైదువుల వినయ మాధుర్యము త్రైకాలికమగు జగన్మంగళము.

'ఢాకేల న్నిజ కన్యకామణుల కంఠశ్రేణిఁ గీలించి, వీ
ణాకంజాతము లాత్మ పాదనఖరేఖం దార్చి సంగీత వి
ద్యాకౌశల్యము గానరా మదికి నాహ్లాదంబు సంధిల్ల గౌ
రీకల్యాణము పాడి రప్పుడు పురంధ్రీరత్నముల్ వేడుకన్.'

అత్తవారింటికి పంపునపుడు పల్లకియొద్దకు వచ్చి కాంతిమతితల్లి కాంతిమతిని :

'తలఁ గ్రుచ్చి కౌఁగిలించుచుఁ
దెలిగన్నుల నీరు తుడిచి దీవించి నినున్
నలువది నాళ్లకె తోడనె
పిలిపించెద నింతయేల బెగడకు తల్లీ!'

అని బుజ్జగించును. ఈ సన్నివేశమునకు రాలుగూడ నేడ్చును. మల్లన అమృతహస్తుడు. అష్టదిగ్గజములలో నొకడుగ బరిగణింపబడిన దిందుకు. మల్లన కవితా తంత్రి యందు సార్వజనీనములును, సార్వకాలికములునైన భావములు నిత్యనూతనములై హృదయంగమముగ బలుకును. శివభక్తివాసితమగు వాఙ్మాధుర్యమునందు ధూర్జటికి నితనికి గొంత పోలిక కలదు.

'చూడం జిత్రము పత్రపుష్పముల కంచున్ జేర నేతెంచి పెన్
బ్రోడల్ శైవకథారహస్యములకై పోరాడుచుం బోవుచోఁ
గూడన్ వచ్చి తదీయ వాదముల చిక్కుల్ దీర్చుఁ బో పట్టణ
క్రీడా కానన వీథికాగ్రశుక శారీ కిన్నర ద్వంద్వముల్.'

'తరుణీ రత్నము లేమి దొడ్డు మదమాద్యద్దంతి యూథంబులే
యరు దత్యున్నత భోగభాగ్య విభవ వ్యాపార మేలెక్క...'

ఇట్టి పద్యము ధూర్జటి శతకములో నొకటి కలదు. అతని యావేశమును, తీవ్రతయు నితనిలో లేవు. ఇతని సౌకుమార్యమును, లాలిత్యమును వేరు. 'కటిశాటీభవదేణ కృత్తితను', 'లాలాట సమర్పితాంజలి', 'రతీశ్వర మధుర ధనుర్నీరద కరకాంతములు', 'కింశుకసూనాంత రభాసమానశుకి' - ఇట్టి యీతని గుంఫనములు లలిత మధురములు.

ఇక జాతీయములను, లోకోక్తులను ఎంత అనాయాసముగ వాడునో చూడుడు : 'నేరిచి బ్రతికిన వారలు నేరక చెడ్డట్టివారు', 'సూదిపిఱింది దారమయి చొచ్చిన చోటులు చొచ్చి', 'ఆవులు చేపి చన్నవిసి పితుకు', 'సకల సస్యములు దున్నకయ పండు', 'ప్రజలు నూరేండ్లును బరిణమింత్రు', 'మూసిన ముత్యమవై', 'పట్టాన దేవివైయె'.

ఇప్పటికీ పుష్పాపచయము చాలును. ఇతని తోటలో నిం కెన్నియైన దొరకును. మ. శ. శ.

**మల్లయ్యశాస్త్రి, పురాణపండ** (క్రీ. శ. 1853 - 1925) : ఆంధ్ర గీర్వాణములలో మహా విద్వాంసులయిన మల్లయ్యశాస్త్రిగా రుభయ భాషలలోను దిగ్దంతులవంటి పండితులైన భద్రయ్యశాస్త్రిగారికిని, రామమ్మగారికిని తనయులు, ఆరామ ద్రావిడశాఖ బ్రాహ్మణులు; వీరిది భారద్వాజ గోత్రము, ఆపస్తంబసూత్రము; యజుశ్శాఖ. వీరి జన్మస్థలము పెదతాడేపల్లి; వాసస్థానము ఇప్పటి పశ్చిమగోదావరి మండలమునందలి ఖండవల్లి.

ఆంధ్ర గీర్వాణములలో మహావిద్వాంసులగు జనకుల సన్నిధినే వీరు మొదట విద్యాభ్యాస మొనరించి, పిదప విజయనగరమున బెక్కు వత్సరములు శాస్త్రములయందు కఠోర వ్యాసంగ మొనర్చి సాహిత్య తర్క వ్యాకరణాది

శాస్త్రముల దృఢ వ్యుత్పత్తి నంది పిమ్మట వీరు ప్రస్థానత్రయ వేత్తలగు వెంపరాల దక్షిణామూర్తి శాస్త్రిగారి సన్నిధిని యథావిధిగా శాంకరసూత్రభాష్యమును మథించిరి. సాధారణముగా శాస్త్రవేత్తలకు తెలుగు గ్రంథములన్న నీసడింపుగా నుండును. కాని శాస్త్రిగా రట్లుగాక ముద్రితములగు ఆంధ్ర ప్రబంధాదులనే కాక యచ్చుపడని ప్రఖ్యాత ప్రబంధములను కూడ నెంతో ప్రయాసపడి సంపాదించి పఠించెడి సాహిత్య వ్యసని. వారు పఠించిన గ్రంథజాత మంతయు వారి జిహ్వాగ్రమున నాట్యమొనరించున ట్లుండెడిది. ఆంధ్ర గీర్వాణములలో నే ప్రాచీన గ్రంథమైనను అంతేవాసు లధ్యయనము చేయుచుండ గ్రంథావలోకనము లేకుండగనే వారు కూలంకషముగ వ్యాఖ్యానము చేసి, విశదముగా బోధ చేయుట పరిపాటి. ఎట్టి క్లిష్ట విషయముల నడిగినను నిలిచినపాటున జక్కగా సమాధానము చెప్పి ప్రమాణములను రెండు మూడు నిముసములలో దడుముకొనకుండ జూపు మేధానిధి. దేహపటిమ, ధీపటిమ, ధారణ పాటవము గల వీరికి సహజమైన వాక్చమత్కృతి పెట్టని భూషణము.



చిత్రము 195.
పురాణపండ మల్లయ్యశాస్త్రి

వీరు 1877 లో బెజవాడయొద్ద నున్న కొండపల్లి హైస్కూలులో నాంధ్ర పండితులుగ ప్రవేశించిరి ; తరువాత రాజమహేంద్రవరమున సంస్కృత పాఠశాలలో 1884వరకు దెనుగు పండితులై యుండిరి ; 1886 - 1906 వరకు అమలాపురమున హైస్కూలులో నుద్యోగము చేసిరి ; నాటినుండి పిఠాపురోన్నత పాఠశాలలో పండితులుగా గొన్నియేం డ్లుండిరి; పీఠికాపురాస్థానమున నాంధ్ర గ్రంథ పరిశోధకులు, వ్యాఖ్యాతలుగా నుండిరి ; సూర్యారాయాంధ్ర నిఘంటు కార్యాలయమునను కొన్ని యేండ్లు పండితులుగా నుండిరి.

వీరి రచనలు శుక్రనీతి సారము (ఆంధ్ర వచనానువాదము), అల్లమరాజు సుబ్రహ్మణ్యకవికృత 'భద్రాపరిణయ'మను ప్రబంధమునకు సమగ్ర వ్యాఖ్య, ప్రభావతీప్రద్యుమ్నమునకు భూమిక, వ్యాఖ్య (ఈ ప్రబంధమునకు హరివంశము మూలమని పండిత మండలికి దొలుత ప్రకటించినవారు వీరే), ఉపనిషత్కథలు ; ఆంధ్ర సూత్ర భాష్యమున కాంధ్రీకరణము.

ఈ. వేం. వీ. రా.

**మల్లయ్యశాస్త్రి, బంకుపల్లి** (క్రీ. శ. 1876-1946) : వీరు ఆరామ ద్రావిడులు. వీరిది భారద్వాజ గోత్రము. ఉర్లాము సంస్థానమువారి యాశ్రయమున నా పురమునందు వసించుచుండిన గంగన్నగారి సంతానమున వీరు జ్యేష్ఠులు. వీరి తల్లి సూరమ్మ. వీరి బాల్య మంతయు ఉర్లామునందే కడచెను. వీరు భళ్ళమూడి లక్ష్మణ శాస్త్రిగారివద్ద కావ్య నాటకాలంకార సాహిత్యమున ప్రజ్ఞనలవరచుకొని, పిదప తుని యాస్థాన పండితులు, షడ్దర్శనీ పారగులు నగు మహామహోపాధ్యాయ పరవస్తు రంగాచార్యులవారికి శుశ్రూష చేసి వ్యాకరణ శాస్త్ర మభ్యసించి, ఉర్లాము శ్రావణి సభలో పరీక్ష నిచ్చి పండిత సత్కారము నందిరి. తరువాత విజయనగర పండితులు, తర్క వేదాంతశాస్త్ర పారంగతులు నగు కూరెళ్ళ సూర్యనారాయణశాస్త్రిగారి యొద్ద బాధాంతము తర్కశాస్త్ర మభ్యసించిరి. అప్పుడు వీరికి ప్రథమ కళత్ర వియోగము కలుగగా ఒకవిధమగు విరక్తితో వీరు విద్యాభ్యాసము చాలించి బంకుపల్లి కామశాస్త్రిగారికడ మంత్రశాస్త్ర మభ్యసించుచు వారివల్లనే గణపతి భువనేశ్వరీ మంత్రోపదేశ మంది మంత్రసిద్ధి సాధించి పూర్ణదీక్షాపరులైరి.

వీరు 1897 లో శ్రీకాకుళమునందలి యున్నత పాఠశాలయందు ఆంధ్ర పండితులయిరి. వీరి పాండిత్యమును కర్ణాకర్ణిగ తెలిసి పర్లాకిమిడి సంస్థాన సంగీత విద్వాంసులగు పోకల సింహాచలముగారు వీరికి తమ కుమార్తె నిచ్చి వివాహము గావించిరి. ఉద్యోగ వాంఛకన్న విజ్ఞాన తృష్ణయధిక మగుటచే వీరు మరల భళ్ళమూడి దక్షిణామూర్తి శాస్త్రిగారిదగ్గర పంచదశ ప్రకరణములు, గీతాభ్యాసము పూర్తిచేసి పిమ్మట శ్రీకూర్మమందలి సంస్కృత పాఠశాలలో పండితులుగ నున్న నౌడూరి వెంకటశాస్త్రిగారి శుశ్రూష చేసి మనోరమ, పరిభాషేందుశేఖరము మున్నగు శాస్త్ర గ్రంథముల నెల్ల జదివి భాష్యాంతము వ్యాకరణశాస్త్రము బోధింపగల సామర్థ్యము సంపాదించిరి. పిదప పర్లాకిమిడి ఉన్నత పాఠశాలయం దాంధ్ర పండితులుగ రెండేండ్లు పనిచేసి యచిరకాలముననే తమ పాండితీ ప్రతిభలచే పర్లాకిమిడి రాజావారి యనుగ్రహమునకు పాత్రులై



చిత్రము 196.
బంకుపల్లి మల్లయ్యశాస్త్రి

అచ్చటి కళాశాలయందు సంస్కృతోపన్యాసక పదవి యందు నియమితులై యాస్థాన పండితులుగ గూడ గౌర వింపబడిరి. పర్లాకిమిడి యాస్థాన దైవజ్ఞులగు నీలమణి పాణిగ్రాహిగారియొద్ద వీరు జ్యోతిషశాస్త్ర మభ్యసించి కొన్నేండ్లు సూర్యసిద్ధాంతము ననుసరించి దృక్సిద్ధ పంచాంగము గుణించి ప్రకటించుచుండుటయేకాక గంటి సూర్యనారాయణ శాస్త్రిగారి సాయమున వేదాంత మీమాంసా శాస్త్ర గ్రంథములు చదివిరి. వీరు గిడుగు రామమూర్తి పంతులుగారికడ ఆంగ్లభాషాజ్ఞానము గూడ సంపాదించిరి ; తమ మామగారికడనే సంగీతమును నేర్చు కొనిరి. వీరి లయజ్ఞానమును నారాయణదాసుగారు కూడ పలుమారు లుగ్గడించిరట. వీరు భారత భాగవత రామాయణములను, వసుచరిత్రాది ప్రబంధములను 'పురాణ హరికథ' యనుపేరిట నృత్య గీత తాళ యుత ముగ పాడి యాంధ్రదేశ మందలి పల్లీపట్టణములందలి పండిత పామరులను రంజింపజేయుచు వచ్చిరి. పర్లాకిమిడి రాజావారు స్థాపించిన నాటక సంఘమున సభ్యులై వీరు సంస్కృతాంధ్ర నాటకములలో ప్రధాన పాత్రధారణ మొనర్చి రసజ్ఞుల ప్రశంస లందుకొనిరి.

వీ రెంత సనాతన ధర్మపరాయణులో అంత సంస్కార నిరతులు. వీ రెక్కువగా ధర్మపరిశోధనచేసినవా రగుట చేతనే రజస్వలా వివాహము, హరిజనోద్యమము, అక్షత కన్యా పునర్వివాహము, శాస్త్ర సమ్మతమని పండిత సభలలో వాదోపవాదము లొనర్చి దక్షిణదేశమం దంతట ప్రచార మొనర్చిరి. వివాహ తత్త్వము, అస్పృశ్యత యను గ్రంథములు తెనుగున రచించి జనసామాన్యము గూడ ధర్మరహస్య మెరుంగుటకు మార్గ మేర్పరచిరి. పండిత సభలలో అనర్గళముగ, ధారాళముగ సంస్కృతాంధ్ర ములం దుపన్యసింపగల వాగ్ధోరణి వీరిది.

కావూరి వినయాశ్రమమువారి ప్రేరణచే వీరు విద్యా రణ్య భాష్యానుసారముగ నాలుగు వేదములను ఆంధ్రీక రించిరి. ఋగ్వేదమును మాత్రము ఆశ్రమమువారు ప్రక టించిరి. వీరి రచన లెన్నియో యముద్రితములు గలవు. వానిలో అరవిందుని పురుషోత్తమతత్వముననుసరించి భగవద్గీతపై వ్రాసిన గీతారహస్యమను గ్రంథమును, సాహిత్యదర్పణమున కాంధ్రానువాదమును ముఖ్యమైనవి. వీరు పెక్కు యక్షగానములు రచించిరి. వానిలో పర్లాకిమిడి రాజావారికి కృతి యొసంగిన చైతన్యచరిత్రము, ముద్దాడ వెంకటప్పలనాయున కంకిత మొనర్చిన రుక్మిణీకల్యాణము మాత్రము అచ్చయినవి. కంసవధ, కృష్ణజననము, రామకృష్ణ పరమహంసచరిత్రము మున్నగునవి యముద్రితములు.

వీరు స్త్రీ పునర్వివాహాది సంస్కరణములను ప్రచారము చేయుటేగాదు, తమ కుమార్తెకు, కుమారునికి సంస్కరణ వివాహ మొనర్చి ప్రశంస లందుకొన్న మహానుభావుడు. అధీతి బోధాచరణ ప్రచారములతో తన జీవితమును సార్థక మొనర్చుకొన్న పండిత దిగ్గజము. వీరు సంస్కృత మున సీతాకల్యాణము, జానకీవహ్నిప్రకాశమను హరి కథలు రచించి చెప్పి చీకటి సంస్థానాధిపతులచే భూరి బహూకృతియు, పురాణ వాచస్పతియను బిరుదము నందుకొన్న గొప్ప పౌరాణికులు. వీరు భార్యా సమేతులై కాశీయాత్ర కరిగి తిరిగి వచ్చుచు ఖరగ్‌పురమున పరమ పదించిరి.

**వే. స. శా.**

**మల్లికార్జునశాస్త్రి, అలుకూరు** (క్రీ. శ. 1871 - 1917): వీరు రాయచూరు మండలమందలి అలుకూరు వాస్తవ్యులు. వీరిది గొల్లాపిన్ని వంశము; శ్రీవత్స సగోత్రము; ఆపస్తంబ సూత్రము. వీరు సుబ్బమాంబా వేంకటరామశాస్త్రుల కుమారులు. ఈ వంశమువా రేడు తరములనుండి పండితకవులు. వీరి భార్య డోణేకల్లు ఆలూరి వెంకటరామశాస్త్రిగారి కూతురు సుబ్బమాంబ.

వీరు తమ తండ్రిగారిచెంతనే నాటకాంత సాహిత్య మును, తత్త్వబోధినీ వ్యాఖ్యా సమేతముగా కౌముదిని, న్యాయవేదాంతశాస్త్రము లను కూడ చదివిరి. వీరు తమ తండ్రిగారివెంట బాల్య మందే గద్వాల, వనపర్తి, ఆత్మకూరు సంస్థానములు తిరిగి, పండితులను మెప్పిం చి, 'భారతీ బాలలీలా రూపు'డను బిరుదు నందిరి పితృమరణానంతరము వీరు గడేహోతూరు వేంకట రామశాస్త్రులవారి చెంత జ్యోతిషము నేర్చుకొనిరి తరువాత కాళహస్తి కేగి తద్వాస్తవ్యులగు రాఘవాచార్యులవారికి శుశ్రూష యొనర్చి మహాభాష్యాంత వ్యాకరణమునను, ముహూర్త జాతకసిద్ధాంత రూప స్కంధత్రయ జ్యోతిషశాస్త్ర మునను ఉత్తీర్ణులైరి. అప్పుడే గురువులవారి యన మతితో కలియుగాది దశసహస్రవర్షముల తిథి, వార నక్షత్ర, యోగ, కరణ, ఘటికా, విఘటికల ప్రమాణమున అతి శీఘ్రకాలమున బోధించు 'ఖచరమణిపేటి' అన జ్యోతిష గ్రంథమును రచించి గురువుల కర్పించిరి. వీర



చిత్రము 197.
ఆలుకూరు మల్లికార్జునశాస్త్రి

స్వగ్రామమగు ఆలుకూరునకు తిరిగి వచ్చి పితామహులగు సుబ్బాశాస్త్రులకడ సమగ్ర వేదాంతశాస్త్రము నధిగమించి ఇరువదియవ యేట విద్యా వ్యాసంగమును ముగించిరి.

వీరు బళ్లారి, కడప, మున్నగు ప్రదేశములందు శతావధాన ప్రదర్శనములు చేసిరి; గద్వాల, వనపర్తి, ఆత్మకూరు సంస్థానముల కేగి తమ పాండిత్యము ప్రకటించి సన్మాన్యులైరి. వీరికి 'కవితాసార్వభౌమ', 'సకలశాస్త్రాభిజ్ఞ' బిరుదు లొసంగబడినవి. తరువాత వీరు కేశవేశాంకితముగా 'వాసుదేవానంద' మను అలంకారగ్రంథమును రచించిరి. ఇది అముద్రితము. వీరి మరియొక గ్రంథము 'జ్యోతిశ్శాస్త్ర సుధర్మసారము'. వీరు దీనిని కాలడి అగ్రహారమున శృంగగిరి నృసింహభారతీ స్వాములవారు శంకర ప్రతిష్ఠ యొనర్చినపుడు జరిగిన పండిత సభలో స్వామివారి కర్పించిరి. స్వామివారు మల్లికార్జునశాస్త్రి గారికి అగ్రతాంబూల మిచ్చి 'పండితసార్వభౌమ' బిరుద మొసగిరి. వీరు హంపీ విరూపాక్షేశ్వరానుగ్రహము సంపాదించి, అచట 'బ్రహ్మసత్రము' చేసి అవబృథము కాశిలో నొనర్చిరి. బి. రా. రా.

**మల్లినాథసూరి, కోలచల:** ఇతడు క్రీ. శ. 15వ శతాబ్దిని ఆంధ్ర దేశములో పుట్టి గొప్ప సంస్కృత విద్వాంసుడై, పెక్కు గ్రంథములకు వ్యాఖ్యలను రచించి 'వ్యాఖ్యాతృ చక్రవర్తి' అని పేరు పొందెను. ఇతని నివాసస్థలము తెలంగాణా యందలి మెదకు జిల్లాలోని కొలచెలమ యని కొందరును, తూర్పు గోదావరి జిల్లా రాజమహేంద్రవరమని మరి కొందరు నందురు. ఇతడు 14 వ శతాబ్దిలో నుండెనని కొంద రందురు.

మల్లినాథునకు పెద్దిభట్టు తమ్ము డనియు, మల్లినాథుడు మందబుద్ధి, పెద్దిభట్టు కుశాగ్రబుద్ధి యనియు, మల్లినాథుడు తన్ను భక్తితో చాలకాలము సేవించుచు వచ్చినందుకు ఒక యోగి సంతుష్టుడై యతనికి తన యవసాన సమయమున సారస్వత మంత్ర ముపదేశింప సంకల్పింపగా సోదర నియుక్తుడైన పెద్దిభట్టే అట్టి సమయమున దగ్గర నుండుట తటస్థించుటచేత అతనికే ఉపదేశ మొనర్చి 'దీని ఫలమును మీ అన్నగారికే చెందజేయవలె' నని చెప్పెనట. అట్లే పెద్దిభట్టు తాను వ్రాసిన గ్రంథములను అన్నయగు మల్లినాథుని పేరనే ప్రకటించెనని యొక యైతిహ్యము కలదు. పెద్దిభట్టును గురించిన కథ లింకను కలవు.

మల్లినాథుడు పదవాక్యప్రమాణ పారావార పారీణుడు, మహా మహోపాధ్యాయుడు అని ఇతని కుమారుడగు కుమారస్వామి సోమయాజి తన ప్రతాపరుద్రీయ రత్నాపణవ్యాఖ్యలో తన జనకుని గురించి ఇట్లు చెప్పెను:

'వాణీం కాణభుజీ మజీగణ దవాసాసీచ్చ వైయాసికీ
మన్తస్తంత్ర మమంస్త పన్నగ గవీగుమ్ఫేషు చాజాగరీత్,
వాచా మాచకలద్రహస్య మఖిలం యశ్చాక్షపాదస్ఫురాం
లోకే౽భూ ద్యదుపజ్ఞ మేవ విదుషాం సౌజన్యజన్యం యశః'

'త్రిస్కన్ధ శాస్త్రజలధిం చులుకీకురుతే స్మ యః,
తస్య శ్రీ మల్లినాథస్య తనయో౽జని తాదృశః'.

మల్లినాథునికి పూర్వము కాళిదాసాది కవుల కావ్యములకు వ్యాఖ్య లుండెను. కాని అవి కవిహృదయమును ఆవిష్కరింపజేయకుండె ననియు, ఇతని వ్యాఖ్యలు వెలసిన పిదపనే పంచ కావ్యములకును అధిక ప్రచారము కలిగెననియు ప్రతీతి. వ్యాఖ్యాతలలో మల్లినాథసూరి కున్న పేరు మరి యొకరికి లేదు.

మల్లినాథుడు మహాకవి కాళిదాసు రచించిన రఘువంశ, కుమారసంభవ, మేఘసందేశ కావ్యములకు 'సంజీవనీ' వ్యాఖ్యను వ్రాసెను. భారవికృత కిరాతార్జునీయమునకు 'ఘంటాపథము'ను, మాఘకవి వ్రాసిన శిశుపాల వధమునకు 'సర్వంకష'ను కూర్చెను. శ్రీ హర్ష మహాకవి రచించిన నైషధచరితమునకు 'జీవాతు' వ్యాఖ్యను రచించెను. భట్టి కావ్యమునకు 'సర్వపథీన'ను, ఏకావళికి 'తరళము'ను, తంత్రవార్త్తికమునకు 'సిద్ధాంజనము'ను, స్వరమంజరికి 'పరిమళము'ను తార్కికరక్షయను జ్యోతిష గ్రంథమునకు 'నిష్కంటిక'ను రచించెను. ఇతడు 'రఘువీర చరితము' అను కావ్యమును వ్రాసినట్లు చెప్పుదురు. అది యితని కృతియే యని నిర్ణయింప వలనుపడదు. మల్లినాథసూరి మల్లినాథుని పౌత్రు డనియు, కపర్దిపుత్రు డనియు, కుమారస్వామి మల్లినాథుని సోదరుడగు పెద్దిభట్టు కుమారు డనియు కొందరు చెప్పుదురు. కాని కుమారస్వామియే తానుమల్లినాథసూరి పుత్రుడనని, పెద్దయార్యుని సోదరుడనని

'కోలచలపెద్దయార్యః ప్రమాణ పదవాక్య పారదృశ్వా యః;
వ్యాఖ్యాత నిఖిలశాస్త్రః ప్రబంధకర్తాచ సర్వవిద్యాసు.'

'తస్యానుజన్మా తదనుగ్రహాత్త
విద్యో౽నవద్యో వినయావనమ్రః;
స్వామీ వివవృ ద్వితనోతి టీకాం
ప్రతాపరుద్రీయ రహస్యభేత్త్రీమ్'.

అని రత్నాపణమున స్పష్టముగ చెప్పియుండుటచే ఇతడు పెద్దిభట్టు కొడుకను ఊహ సరికాదని తెలియుచున్నది. కుమారస్వామి రచించిన 'రత్నాపణ'ము మాత్రమే లభించుచున్నది. అతడు వేరు గ్రంథములను రచించెనో లేదో తెలియుటలేదు. అతని యన్న యగు పెద్దయార్యుడు పెక్కు గ్రంథములను, వ్యాఖ్యలను రచించినట్లు కుమార

స్వామి చెప్పుటయే తప్ప ఆ గ్రంథము లేవియు లభింప లేదు.

మల్లినాథుడు గణాధిప ప్రసాదమున మహా విద్వాంసు డైనాడట! రఘువంశాది కావ్య వ్యాఖ్యలందు తొలుత గణపతి శ్లోకము లున్నవి. కుమారస్వామియు తన 'రత్నాపణము'న గణపతినే స్తుతించెను. బు. వెం. ర.

**మహాదేవశాస్త్రి, అల్లాడి** (క్రీ. శ. 1861 - 1926): ఈయన గొప్ప సంస్కృత పండితుడు, శాస్త్రవేత్తయు నైన రామబ్రహ్మశాస్త్రి కుమారుడు. నెల్లూరు జిల్లాలోని పుదూరులో ఈయన జన్మించెను. పదుమూడేండ్ల వయస్సు వరకు ఈయన స్వగ్రామములోనే సంస్కృతాంధ్రములను, వేదమును చదువుచుండెను. పిదప కర్నూలు హైస్కూలులో నాలుగేండ్లు ఆంగ్ల విద్యాభ్యాసము చేసి మెట్రిక్యులేషను పరీక్షలోను, 1879 లో మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాలలో చేరి చదివి 1883 లో బి.ఏ. పరీక్ష యందును ఉత్తీర్ణుడయ్యెను. పిదప మూడేండ్లు వేలూరు హైస్కూలులోను, ఆవల మైసూరు వెళ్లువరకు నెల్లూరు హిందూ (ఇప్పటి వి.ఆర్.) హైస్కూలులోను ఉపాధ్యాయత్వమును నిర్వహించెను; సంస్కృతమును చక్కగా చదివి వేదాంత శాస్త్రమునందుకూడ గొప్ప కృషిచేసెను. దివ్యజ్ఞాన సమాజ ప్రారంభకాలముననే దానిలో చేరి జీవితాంతమువరకు ఈయన సభ్యుడుగా నుండెను.



చిత్రము 198.
అల్లాడి మహాదేవశాస్త్రి

మైసూరు ప్రభుత్వము 1891 లో ఓరియంటల్ లైబ్రరీని మొదట కొద్దిపాటి సంస్కృత, ఆంగ్ల, కర్ణాట గ్రంథములతోను, తాళపత్ర గ్రంథములతోను నెలకొలిపి దాని కీయనను క్యూరేటరుగా నియమించెను. ఈయన శ్రద్ధాసక్తులవలన, కృషివలన పదేండ్లలో అన్ని విషయములకు సంబంధించిన సంస్కృత గ్రంథములతోను, తత్త్వశాస్త్ర చరిత్ర పురాతత్త్వశాస్త్రాదులకు సంబంధించిన ఆంగ్ల గ్రంథములతోను, కన్నడ వాఙ్మయగ్రంథములతోను నిండి మైసూరు ఓరియంటల్ లైబ్రరీ హిందూ దేశములోని అటువంటి ఉత్తమ ప్రాచ్యగ్రంథ భాండాగారములలో నొకటిగా ప్రసిద్ధి కెక్కినది. సంస్కృతములోను, కన్నడములోను ఉన్న గ్రంథములకు నిర్దుష్టములైన చక్కని ప్రతులను తయారుచేసి ప్రకటించుట ఈ గ్రంథాలయ కార్యములలో నొకటి. ఈ గ్రంథాలయ ప్రచురణములలో శంకర భాష్య సహితముగ ప్రకటించిన భగవద్గీత యొకటి. రెండేండ్లు కష్టపడి కృషిచేసి ఈయన శంకర భాష్యముతో భగవద్గీత కాంగ్లానువాదమును రచించి దానిని 1897 లో ప్రకటించెను. ఆ దినములలోనే ఈయన కొన్నాళ్లు మహారాజావారి సంస్కృత కళాశాలకు కార్యదర్శిగ నుండెను. కొన్నాళ్లు ఆ కళాశాలకే ప్రిన్సిపాలుగ నుండి వేదాంత శాస్త్రమును బోధించుచువచ్చెను.

ఇప్పటికిని శంకర గీతాభాష్యమునకు వీరి యనువాదము ఉత్తమముగ పరిగణింపబడుచున్నది. తరువాత ఈయన మూడు ప్రధానేతర (మైనర్) ఉపనిషత్తులకు కూడ ఆంగ్లానువాదము కావించిరి. ఉపనిషత్తులకు సంబంధించినంతవరకు ఈయన రచించిన గొప్ప గ్రంథము శంకర, సురేశ్వరాచార్య, శాయనాచార్య భాష్యములతోడి తైత్తిరీయోపనిషత్తున కాంగ్లానువాదము. ఇది 800 ల పుటల బృహద్గ్రంథము.

ఈయన సంఘ సంస్కార ప్రియుడు. 1907 లో మైసూరునందు వెలసిన ఆర్య ధర్మోజ్జీవిని సభను స్థాపించిన వారిలో ఈయన యొకరు. ఈ సభ పక్షమున బెంగుళూరు సంస్కృత కళాశాలలో 1907 లో హిందూసంఘమునందలి బాల్యవివాహ పద్ధతిని సప్రమాణముగా ఖండించి రజస్వలానంతర వివాహ పద్ధతిని శాస్త్రీయముగా నిర్ణయించుచు నిచ్చిన యుపన్యాసము తరువాత గ్రంథరూపమున ప్రకటితమైనది. సంఘ సంస్కరణమును గూర్చి యీయన రచించిన మరియొక గ్రంథము 'వైదికమతము-వర్ణము'. సముద్రయానము నిషేధము కాదని శ్రుతిస్మృత్యాది ప్రమాణములతో ఈయన నిరూపించెను. సంస్కార ప్రియుడగు బరోడా మహారాజు కోరగా ఈయన 1909 లో బరోడాకు పోయి వివాహాది విషయ సంస్కరణములనుగూర్చి యుపన్యాసముల నొసంగెను; బరోడా సంస్కృత గ్రంథమాలలో సంస్కృత గ్రంథములను కొన్నింటిని పరిష్కరించెను.

1916 లో క్యూరేటరు పదవినుండి విరమించు కొనిన పిదప ఆనిబిసెంటు ఈయనను అడయారు లైబ్రరీకి డైరెక్టరుగా నియమించెను. అడయారులోనే నివాసము కల్పించుకొని జీవితాంతమువరకు ఈయన ఆ పదవియందే యుండి ఆ లైబ్రరీ గ్రంథమాలయందు పెక్కు సంస్కృత గ్రంథములను పరిష్కరించెను.

ఈయన దివ్యజ్ఞాన సమాజ ప్రారంభ దినములనుండి తన జీవితాంతము అచంచల విశ్వాసముతో తత్సామాజికుడై

యుండెను. ఈయన తన జీవితము కడపటి రెండు సంవత్సరములలో భారతసమాజ దైవారాధన విధానము, భారత సమాజ వివాహ ప్రక్రియా విధానమును నిర్వచించు గ్రంథ రచనయం దుండెను. యం. రా. బ్ర.

**మహాలక్ష్మి పండుగలు :** వసంతోత్సవములు, మహాలక్ష్మి పండుగలు తెలుగువారి పండుగలలో ముఖ్యమయినవి. మహాలక్ష్మి పండుగ దినములకు దేవీ నవరాత్రములని, శరన్నవరాత్రములని పేరు. ఇవి శరదృతువులో వచ్చునవి. వసంతఋతువులో వచ్చునవి వసంతోత్సవములు. ఇవియు తొమ్మిది దినములు జరుగును. అందువలన వీనికి వసంత నవరాత్రములని పేరు. తెలుగువారికి ఈ రెండును ఎంత పండుగ దినములో అంత పర్వదినములు; చాల పవిత్రమయినవి.

మహాలక్ష్మి పండుగ దినములలో దుర్గ, లక్ష్మి, సరస్వతి పేర్లతో దేవీమూర్తిని తొమ్మిది దినము లారాధించెదరు. తొమ్మిదిదినములు పూజ చేయలేనివారు పుస్తకములుపెట్టి సరస్వతీ రూపమున చివరి మూడు దినములయినను పూజ చేయుదురు. సంగీత సాహిత్యాధిదైవతము సరస్వతీదేవి ఆరాధన మగుటచేత ఇవి నిజముగా సంస్కృతి పూజా దినములు. కళ లన్నిటికి సంకేతము సంగీతము, అన్ని విద్యలకు సంకేతము సాహిత్యము. సరస్వతీపూజ సంస్కృత్యారాధనమే. మ. సో. శ.

**మహిళోద్యమము** (ఆంధ్రదేశము): ఆంధ్రదేశమునందలి అనేక సంస్కరణములకును, ఉద్యమములకును, జనకులైనటులే కందుకూరి వీరేశలింగం పంతులుగారు ఆంధ్ర మహిళాభ్యుదయోద్యమమునకును, జనకుడై ఆంధ్రస్త్రీలకు ప్రాతఃస్మరణీయుడైనాడు.

అంతవరకు స్త్రీని ఒక మానవ వ్యక్తిగానే పరిగణింపని పూర్వాచార పరాయణులకు పంతులుగారికృషి ఆగ్రహ కారణమయ్యెను. వారికేకాదు స్త్రీలకే అహితమయ్యెను. అయినను ఆ మహనీయుడు తన యత్నమును విరమింపలేదు. పందొమ్మిదవ శతాబ్దపు కడపటను, ఇరువదవ శతాబ్దపు ఆరంభమునను దాదాపు ఏబది సంవత్సరములు పూర్వాచార పరాయణుల ప్రతిఘటనమును లెక్కచేయక పంతులుగారు ఆంధ్ర మహిళోద్ధరణకు కృషి సల్పిరి. పంతులుగారి నిరంతర కృషివలన ఆంధ్రస్త్రీలను ఆవరించి యుండిన అవిద్య విచ్చిపోవ దొడగెను. సాంఘిక నిర్బంధములు సడలుటకు ఆరంభించెను. ప్రతి బాలవితంతువునకు వివాహము చేయవలె ననెడిసంకల్పము కలుగకపోయినను వారికి విద్యనేర్పవలెనను తలంపు తలిదండ్రులకు కలిగెను. ప్రజలును, ప్రభుత్వమువారును స్త్రీ విద్యావశ్యకతను గుర్తించిరి. ఆంధ్రమహిళోద్యమమునకు ఇది ప్రారంభ దశయని చెప్పనగును.

ఉచిత పాఠశాలలు నెలకొల్పి స్త్రీలకు విద్య నేర్పించుటయేకాక చదువుకొనెడి స్త్రీలకు ముఖ్యముగా బాల వితంతువులు మొదలైన నిరాధారలకు ఉపకారవేతనములు కూడ ఈయసాగిరి. మతప్రచారోద్దేశముతో నైనను క్రైస్తవమత ప్రచారకులు కూడ స్త్రీ విద్యకు దోహదము చేయసాగిరి. ఈ క్రైస్తవ మిషనరీలు అగ్రజాతులలో కంటె అంత్యజాతులలో ఎక్కువ పలుకుబడిగలవారగుటచే వీరి స్త్రీ విద్యా ప్రచారము దిగువజాతిస్త్రీల విద్యాభివృద్ధికి ఎక్కువగా తోడ్పడెను. సంఘ సంస్కారులైన సోదరులు కొందరు తమ కుమార్తెలకు ధైర్యముగా విద్య చెప్పించుట వలన కొందరు యువతులు బి.ఎ., ఎం.ఏ., పట్టములనుకూడ పడయ గలిగిరి.

ఆ దినములలో స్త్రీ విద్యాభిమానులైన మహనీయులు కొందరు నెలకొల్పిన నర్సాపురము తాలూకా అభివృద్ధి సంఘమువారి స్త్రీల బహుమతి పరీక్షలు, విజ్ఞాన చంద్రికా మండలివారి పరీక్షలు పాఠశాలకుపోయి చదువుకొను నవకాశములేక ఇంటియందే ఉండి విద్యాభివృద్ధి గావించుకొననెంచు స్త్రీలకు ఎంతయో సహాయము చేసినవి. స్త్రీ పురుషులు ఎల్లరకు జరుపబడెడి విజ్ఞానచంద్రికా పరిషత్పరీక్షలలో కొన్ని యేండ్లు వరుసగా స్త్రీలే సర్వప్రథమలుగా ఉత్తీర్ణులై స్వర్ణపతకములు, నూటపదారులు బహుమతులు పడసి అచ్చెరువు కలిగించిరి.

విద్యావతులగు స్త్రీలు స్త్రీ సమాజములు నెలకొల్పి స్త్రీల విద్యావిజ్ఞానములు పెంపొందింప కృషిచేయసాగిరి. కాకినాడ, రాజమహేంద్రవరము, ఏలూరు, గుంటూరు, మద్రాసు మున్నగు నగరములలో ఇట్టి స్త్రీ సమాజములు వెలసెను. స్త్రీలలో ఆస్తికభావము పెంపొందించుటకై స్త్రీ ప్రార్థనా సమాజములు కొన్ని ఏర్పడెను. వీనిద్వారా స్త్రీలు తమ అభ్యుదయమునకు తామే కృషి సల్ప నేర్చుకొనిరి.

శ్రీమతి భండారు అచ్చమాంబగారు, కొటికలపూడి సీతమ్మగారు మున్నగు సోదరీమణులు గ్రంథములు వ్రాయ దొరకొనిరి. శ్రీమతి భండారు అచ్చమాంబగారు వ్రాసిన 'అబలాసచ్చరిత్ర రత్నమాల' అను ఉద్గ్రంథము ఆంధ్ర భాషకు ఒక అమూల్యాభరణము అనియే చెప్పవలెను. ఆ గ్రంథపఠనమువలన స్త్రీలకు తాము అబలలముకా మనియు, కష్టపడి నేర్చిన వివిధ విద్యలయందు ప్రావీణ్యము బడయ గలుగుదు మనియు ధైర్యము కలిగెను. శ్రీమతి కొటికలపూడి సీతమ్మగారి సాధురక్షణ శతకము,

అహల్యాబాయి అను పద్యరచనలు స్త్రీల కవితా ప్రావీణ్యమునకు నిదర్శనములై కనిపించెను. ఆనాడు పులుగుర్త లక్ష్మీ నరసమాంబగారి పాటలును, కందుకూరి రాజ్యలక్ష్మమ్మగారి ప్రార్థనాగీతములును స్త్రీ లోకములో బహుళ ప్రచారమును గాంచినవి. స్త్రీలకు గ్రంథరచనతో పాటు పత్రికా నిర్వహణాభిలాషయు ఉదయించినది. పులుగుర్త లక్ష్మీనరసమాంబగారి 'సావిత్రీ'పత్రిక, బాలాంతరపు శేషమాంబగారి 'హిందూసుందరి', వింజమూరి వెంకట రత్నమ్మగారి 'అనసూయ', కళ్ళేపల్లి వెంకట రమణమ్మగారి 'ఆంధ్రలక్ష్మి' భారత మహిళా సంఘము మద్రాసు ఆంధ్రశాఖవారి 'స్త్రీ ధర్మ' మొదలైన పత్రికలు స్త్రీలు వివిధరచనలు చేయుటకు దోహదములైనవి.

ఏ స్త్రీ యైనను స్త్రీ సమాజములో చేరిన దనినను, స్త్రీలసభకు వెళ్ళిన దనినను ఆ స్త్రీ చాల తెగించిన మనిషిగాను, పెద్ద తప్పిదము చేసినదిగను, మర్యాద నెరుగనిదిగను ఆనాడు భావింపబడుచుండెడిది. పురాణములకును, హరికథలకును తండోపతండములుగ వెళ్లెడి ఆంధ్ర స్త్రీలు సైతము స్త్రీల సభకు వెళ్ళుటకు ఇప్పటికిని జంకుచుందురు. ఈ విధమైన జంకు ఆంధ్రరాష్ట్ర మహిళాసభలు చాలవరకు పోగొట్టినవి.

1913 సంవత్సరములో బాపట్లయందు జరిగిన ప్రథమాంధ్ర మహాసభతోపాటు ప్రథమాంధ్ర మహిళాసభయు జరిగి స్త్రీలకు సంబంధించిన పెక్కు విషయములు చర్చితములై తీర్మానింపబడెను. నాటినుండి దేశమున జరిగెడి ప్రతి రాజకీయ సాంఘిక మత వర్ణ వర్గ సభతోను మహిళా సభ జరగుట పరిపాటియైనది.

ఇంతలో భారతదేశమునందలి అన్ని ప్రాంతములందును స్త్రీలలో కలిగిన విద్యా ప్రబోధమువలన స్త్రీల యభివృద్ధికి స్త్రీలే పాటుపడవలెనను అభిప్రాయము కలిగి భారతవర్షమునందలి విద్యాధికలైన స్త్రీలు యావద్భారత మహిళాసంఘమును స్థాపించి తత్సమావేశమునకు అఖిలభారత మహిళలను ఆహ్వానించిరి. విద్యావతులైన ఆంధ్రమహిళలు కొందరు ఆ యాహ్వాన మందుకొని ఢిల్లీలో జరిగిన యావద్భారత మహిళాసభలో పాల్గొని దానికి అనుబంధ సంస్థగా ఆంధ్రరాష్ట్ర మహిళాసభను ఏర్పరచుటతో ఆంధ్రమహిళోద్యమము మరొక అడుగు ముందుకు వైచినట్లయినది. ఈ రాష్ట్ర మహిళాసభకు అనుబంధముగా గ్రామ, పట్టణ, తాలూకా, జిల్లాల మహిళా సంఘములు ఏర్పరచి ప్రతి సంవత్సరము క్రమము తప్పక జరుపుటతో అనతికాలములో రాష్ట్రసభ అతివిస్తృతమగుటయు, స్త్రీలలో అఖండ ప్రచారము జరుగుటయు సంభవించినది. ఆంధ్రరాష్ట్ర మహిళాసభ ఒక్కొక్క సంవత్సరము ఒక్కొక్క జిల్లాయందు జరుగుటచేత పండ్రెండు జిల్లాల సోదరీమణులు ఒక్కచోట కలిసికొని, తమకు సంబంధించిన విషయములను గురించి చర్చించి తీర్మానించుటకే కాక ఆంధ్రస్త్రీల పరస్పర పరిచయములకును దోహద మొసంగెను. ఆంధ్రరాష్ట్ర మహిళాసభ ఆంధ్ర మహిళోద్యమమునకు చేకూర్చిన బలము మరువరానిది.

ఆంధ్రరాష్ట్ర మహిళాసభ అఖిలభారత మహిళాసభకు అనుబంధముగా నుండి దాని సూచనల మేరకు కార్యక్రమములు నడపుచుండుటచేతను, అఖిలభారత మహిళా సంఘము అంతర్జాతీయ మహిళాసంఘముతో సంబంధము కలిగియుండుటచేతను ఆంధ్ర మహిళలు కొందరు అంతర్జాతీయ మహిళాసంఘమునందు ప్రాతినిధ్యము పడసి ఖండాంతరయాత్ర చేసి అచటి మహిళా సంస్థలతో పరిచయము కలుగజేసికొని ఆ యనుభవమును తమ తెలుగు స్త్రీల పురోభివృద్ధికి వినియోగించగల అవకాశము కల్గినది. ఆంధ్ర నారీమణులు కొందరు అఖిలభారత మహిళా సంఘమున బాధ్యతగల పదవులు చేకొని దక్షతతో నిర్వహించి అఖిలభారత మహిళల మన్ననల నందుకొనగల్గుట ఆంధ్రస్త్రీలు గర్వించ వలసిన విషయము.

ఆంధ్ర మహిళోద్యమ చరిత్రయందు మహాత్మాగాంధీగారి సహాయనిరాకరణోద్యమము ఒక స్మరణీయ ఘట్టము. భారత స్వాతంత్ర్య సమరసారథియై యావద్భారత వర్షమున శాంతి సమరమును సాగించి భారతమహిళలను కూడ సమరరంగమునకు ఆహ్వానించి నప్పుడు ఆంధ్రస్త్రీలు కూడ నం దుత్సాహముతో పాల్గొని సభలు, సమ్మెలు, సత్యాగ్రహములు, శాసనోల్లంఘనములు, పికెటింగులు, ఊరేగింపులు, ఉత్సవములు జరిపి కారాగృహముల కేగిరి; లాఠీ దెబ్బలు తినిరి; తుపాకిగుండ్ల కెదురునడచిరి. ఈ దౌర్జన్య రహిత శాంతి సమరమునందు ఆంధ్రస్త్రీలు పల్లి పట్టణము అను విభేదములేక విద్యావతులు, అవిద్యావతులు అను భేదములేక, చిన్నలు పెద్దలు అను వ్యత్యాసములేక పనిచేసి ఎన్నియో కష్టనష్టములు సహించి యశోవిరాజితలైరి. ఒకవంక ఆంధ్రరాష్ట్ర మహిళాసభ ఆంధ్రస్త్రీల విద్యాభివృద్ధికిని, సాంఘికాభివృద్ధికిని, ఆస్తి హక్కులకును కృషిచేయుచుండ స్వాతంత్ర్య సంగ్రామము ఆంధ్రస్త్రీల రాజకీయ చైతన్యమునకును, దేశాభిమానమునకును, స్వార్థత్యాగమునకును, సేవాభిలాషకును ప్రోద్బలమిచ్చినది. ఆంధ్రస్త్రీలలో కలిగిన ఈ ప్రబోధము వారొక్క దేశస్వాతంత్ర్యోద్యమమున నే కాక ఇతర

రాజకీయోద్యమములలో కూడ పాల్గొను ఉత్సాహమును కలుగజేసినది.

ఈ విధముగా సహాయనిరాకరణోద్యమమువల్ల విస్తృతమైన ఆంధ్రమహిళోద్యమము స్త్రీలయందు సంఘసేవాభిలాషను ఇతోధికముగా ఉదయింప జేసినది. మహాత్ముని ప్రబోధమువలన కలిగిన ప్రజాహితైక కాంక్షయు, సేవాభిలాషయు వారిని దేశహితైక కార్యములకు పురికొల్పినవి. భారత స్వాతంత్ర్యసంగ్రామమునందు కాకలుదీరిన ఆంధ్ర మహిళలు విదేశ వేష భాషా నాగరికతలయందు వైముఖ్యమును, దేశీయ వేషభాషా సంప్రదాయములయందు అభిమానమును కలిగినవారై జాతీయ స్త్రీ విద్యాసంస్థలను నెలకొల్పి వానిద్వారా కృషి సాగించినారు. ఈ విధముగా నేర్పడినవే గుంటూరు, నెల్లూరు, రాజమహేంద్రవరము, ఏలూరు, కాకినాడ, మద్రాసు మున్నగు నగరములలో ఏర్పడిన జాతీయ స్త్రీ విద్యాసంస్థలు. ఈ జాతీయ విద్యాసంస్థలు దేశ భాషలకు, దేశీయ సంప్రదాయములకు, దేశీయ కళలకు ప్రోత్సాహమిచ్చుటయేకాక జాతి భేదము పాటింపక హరిజన బాలికలను సైతము విద్యాలయములలో చేర్చుకొనుటయు, వసతిగృహములందు చేర్చుకొని భోజనాదులను పెట్టుటయును చూడ, మహాత్ముని ప్రబోధము ఆంధ్ర స్త్రీలలో ఎంత సంస్కారము కలిగించినదియు విదితమగుచున్నది. దేశసేవికలు కొందరు ఇట్టి స్త్రీ విద్యాసంస్థలు నెలకొల్పి స్త్రీల పురోభివృద్ధికి కృషిచేయుచుండ, కొందరు స్థానిక సంస్థలలోను, మరికొందరు శాసనసభలలోను చేరి ప్రముఖ మంత్రిత్వము, శాసనసభోపాధ్యక్షత్వము మొదలగు పదవులందుకొనగలిగిరి; కొందరు విశ్వవిద్యాలయములందు సభ్యురాండ్రుగను, కొందరు పాఠ్యగ్రంథ నిర్ణాయక సంఘసభ్యురాండ్రుగను ఉండి తమ విధులను సక్రమముగ నిర్వహింపగలిగిరి. ఈ విధముగా ఆయా సంస్థలద్వారాను, స్వయముగను ఆంధ్రస్త్రీలు చేసిన బహువిధకార్యములు గమనించిన ఆంధ్ర మహిళోద్యమము సంపూర్ణ ఫలితము నందినదని చెప్పవలెను.

1947 సంవత్సరమున భారతదేశము స్వాతంత్ర్యము పడయుటతో ఆంధ్ర మహిళాభ్యున్నతి మరియొక మెట్టు ఎక్కినట్టులైనది. ఇప్పుడు స్త్రీవిద్య నిరాక్షేపణీయమైపోయినది. ఆంధ్ర బాలురవలెనే బాలికలును సర్వసామాన్యముగా ఉన్నతవిద్య నభ్యసించుచున్నారు; ఉత్తమ శ్రేణిలో ఉత్తీర్ణలు నగుచున్నారు; బహుమానములందుకొనుచున్నారు. స్వదేశ, విదేశ ప్రభుత్వముల విద్యార్థి వేతనములు పడసి విదేశములకు పోయి ఉన్నత విద్య నభ్యసించుచున్నారు; అరమరలు లేక అన్ని శాఖలయందును ఉద్యోగములు చేయుచున్నారు; కళాశాలాధ్యక్ష లగుచున్నారు; ప్రభుత్వమువారి అఖిల భారత మహిళాసంక్షేమ సంఘమునందు ఉన్నత పదవు లందుకొనగల్గినారు; స్త్రీల మితవ్యయోద్యమమునందు పనిచేయుచు స్త్రీలు ధనమును నిల్వచేయు తెన్నులు చూపుచున్నారు; సేవావ్రతలై వరదలు, కరవులు మున్నగు ఆపత్సమయములలో ధనము వసూలుచేసి బాధితులకు సహాయము చేయుచున్నారు. సారస్వతరంగమునను, ఆంధ్ర మహిళల కృషి ప్రశంసనీయముగనే యున్నది. గద్య పద్య రచనల రెంటను స్త్రీలు కౌశలము గడించుచున్నారు. కావ్యరచనయందును, నవ్యమని చెప్పబడెడి భావకవిత్వమందును, గేయరచనయందును, నవల నాటిక చిన్నకథ పెద్దకథ చరిత్ర విమర్శనము వ్యంగ్యకృతులు మున్నగు వివిధ రచనలయందును ఆంధ్రస్త్రీలు నైపుణ్యము చూపుచున్నారు; గ్రంథములు వ్రాయుచున్నారు; స్వరాష్ట్రమునందును, అఖిల భారతదేశమునందును ప్రభుత్వ పక్షమున జరిపెడి గ్రంథరచనల పోటీలయందు పాల్గొని బహూకృతు లందుచున్నారు. సహకార సంఘములో పాల్గొని, యువతీగృహపరిశ్రమ సహకార సంఘములు స్థాపించి మధ్యతరగతి కుటుంబములయందలి స్త్రీల సుఖజీవనమునకు తెన్నులు చూపుచున్నారు. రేడియోలయందు ఆంధ్రస్త్రీలు వివిధ విషయములపైన చేసెడి ప్రసంగములు వారి బహువిషయ పరిజ్ఞానమును వెల్లడించుచున్నవి.

సంగీతకళలోకూడ ఆంధ్రస్త్రీలు వెనుకపడలేదు. ఆంధ్రస్త్రీల గానవిద్యాకౌశలము స్వరాష్ట్రమునందును, పరరాష్ట్రములందును, రేడియోప్రసారములందును, త్యాగరాజోత్సవములందును, గ్రామఫోను రికార్డుల యందును నిండారి ప్రశంసింపబడుట ముదావహము; ఇప్పు డిప్పుడు ఆంధ్రయువతులు నృత్యకళయందును నైపుణ్యము చూపుచున్నారు. ఆంధ్ర స్త్రీలయందు మంచి చిత్రకారిణులును కలరనుటకు అట నట జరిగెడి చిత్రకళా ప్రదర్శనములలో వారు ప్రదర్శించెడి చిత్రములే సాక్షి. చిత్రకారిణులే కాదు, శిల్పవిద్యా నిపుణలును కలరనుటకు రాజమహేంద్రాది నగరములలోకల శిల్పములే ప్రమాణములని చెప్పవచ్చును.

నాటకప్రదర్శనములందును, చలనచిత్ర ప్రదర్శనములందును ఆంధ్రస్త్రీలు గొప్ప నటనాకౌశలమును చూపుచున్నారు. కేవలము సినీమాలో నటించుటయేగాక చలనచిత్ర వ్యాపారమున దర్శకురాండ్రుగను, నిర్మాతలుగను,

కథా రచయిత్రులుగను ఉండి పిమ్మట ఫిల్ములు తీయుట ఆంధ్రస్త్రీల పరిశ్రమాభిరుచిని, వ్యవహారదక్షతను విశదీకరించుచున్నది.

హిందీ ఉపాధ్యాయినులుగా ఉండుటేకాక, చక్కని హిందీరచనలను తెలుగున అనువాద మొనర్చి, అనువాద రచనయందును మహిళలు తమ నేర్పును ప్రదర్శించుచున్నారు. కస్తూరిబా స్మారకనిధి పేర జరిగెడి వృత్తి విద్యాపాఠశాలలు, మాతాశిశు కేంద్రములు, గ్రామ పునరుద్ధరణకార్యములు విద్యావతులైన స్త్రీలు దక్షతతో నిర్వహించుచున్నారు.

ఆంధ్ర మహిళోద్యమము స్వరాష్ట్రమునందే కాక రాష్ట్రేతరప్రాంతములందును ప్రబోధకారణమైన దనుటకు, బొంబాయి, కలకత్తా, ఢిల్లీ, హైదరాబాదు, జెమ్‌షెడ్‌పూరు, ఖరగ్‌పూరు, మైసూరు మున్నగు ననేక ప్రాంతము లందు నడపబడుచున్న ఆంధ్రమహిళాసంస్థలే నిదర్శనములుగ పేర్కొనదగియున్నవి. క. వ.

తెలంగాణము : తెలంగాణములో కరుకుతనమేగాని చురుకుతనము లేని ప్రభుత్వ పరిపాలనలో మహిళలు బానిసలక్రింద బానిసలై అత్యధికమైన అనర్థాలకు గురియైనారు. ఎక్కడ చూచినా అవిద్య, అతి బాల్యవివాహాలు, మూఢ విశ్వాసాలు, ఘోషా మొదలైన దురాచారములతో తెలుగు మహిళలు ఆంధ్రదేశములో వారికంటె వెనుకబడిపోయినారు.

ఇన్ని విధాలుగా వెనుకబడిపోయిన ఈ మహిళల ప్రగతికోసము విద్యా సాంఘిక రంగాలలో విపులమైన ప్రయత్నము జరుగవలసి వచ్చినది. ఆనాటి హైదరాబాదు ప్రభుత్వములో విద్యాబోధనము ఉర్దూభాషలోనే జరుగుచుండెడిది. అందువలన ఆడపిల్లల విద్య మరియు అధ్వాన్నముగా ఉంటూ వచ్చినది. 1931 జనాభా లెక్కల ప్రకారము తెలంగాణములో చదువుకున్న స్త్రీలు నూటికి ఇద్దరు మాత్రమే ఉండేవారు.

ఈ దుస్థితిని తొలగించుటకు నగరములోని కొందరు ప్రముఖులు మొదట వివేకవర్ధనీ పాఠశాలను, తరువాత నారాయణగూడెము బాలికోన్నతపాఠశాలను స్థాపించారు. వివేకవర్ధనీ పాఠశాల తెలుగు, మరాఠీ భాషలలోను, బాలికోన్నతపాఠశాల తెలుగులోను విద్యను బోధించుచూ ఉండేవి. కాలక్రమాన ఈ పాఠశాలలు వివేకవర్ధనీకళాశాలగాను, రాజా బహద్దరు వెంకటరామారెడ్డి కళాశాలగాను పరిణమించి అనుబంధ సంస్థలను కలిగి బహుళ ప్రయోజనాలను సాధింపగలిగినవి. ఈ పాఠశాలల స్థాపకులలో మాడపాటి హనుమంతరావు, బూర్గుల రామకృష్ణరావు, రాజా బహద్దరు వెంకటరామారెడ్డి, అహల్యా మల్లన్న, వామన నాయకు మొదలైనవారి కృషి ప్రశంసనీయమైనది.

ఈ పాఠశాలలను ఆదర్శంగా పెట్టుకొని రాష్ట్రమంతటా మరికొన్ని బాలికా పాఠశాలలు ప్రారంభమైనవి. వానిలో బాలసరస్వతీ పాఠశాల, శారదా కన్యా పాఠశాల, సావిత్రీ కన్యా పాఠశాల, గజానన కన్యా పాఠశాల, పరోపకారిణీ బాలికా పాఠశాలలు ముఖ్యమైనవి. ఈ విధముగా ఆనాడు, హైదరాబాదులో నున్న 'ఖాంగి' (ప్రభుత్వేతర) పాఠశాలలపై ప్రత్యేక నిర్బంధ శాసనములు గల ఆనాడు ఈ ప్రాథమిక పాఠశాలల సంస్థాపనమే ఒక మహత్కార్యమయిపోయింది.

స్త్రీ విద్యా విషయములో ఇటువంటి ప్రయత్నములు ఒకవైపున జరుగుచుండగా వారి సాంఘికాభ్యుదయము కోసము తెలంగాణములో హైదరాబాదు మహిళాసభ (ఏ. ఐ. డబ్ల్యు. సి.), నిజాంరాష్ట్ర ఆంధ్రమహిళా సభ, ఆంధ్ర సోదరీ సమాజము, ఆంధ్ర యువతీ మండలి మొదలైన అనేక సంస్థలు కృషి చేయడానికి ప్రారంభించినవి.

వీర ప్రసవమైన తెలంగాణము ఇరువురు వీర మహిళలను భారతదేశమునకు సమర్పించినది. అం దొకతె తెలుగు రాణి రుద్రమదేవి; మరియొకతె తెలుగు గవర్నరు సరోజినీదేవి. హైదరాబాదులో జన్మించి ముత్యాల గోవింద రాజుల నాయుణ్ణి వివాహమాడిన సరోజినీదేవియే హైదరాబాదులోని మహిళోద్యమమునకు మూలస్తంభమైనది.

1915 వ సంవత్సరమున మార్గరెట్ కజిన్స్ సతి హైదరాబాదునకు వచ్చి సరోజినీదేవిని, మరికొందరు ఉన్నత తరగతికి చెందిన విద్యావతులను ప్రోగుచేసి 'హైదరాబాదు స్త్రీల విద్యా సాంఘికాభివృద్ధి సంఘము' అను నొక సమాజమును స్థాపించెను. ఇది అఖిలభారత మహిళా సభకు హైదరాబాదు శాఖయై ప్రతి సంవత్సరము సమావేశములను జరుపుటయే కాక కొన్ని బాలికా పాఠశాలలను, స్త్రీల వసతిగృహమును కూడా నెలకొల్పినది.

కాని చిరకాలమువరకు ఈ సంఘము సాధారణ ప్రజాజీవితములో చొచ్చుకొనిపోలేక పోయినది; అట్టి ప్రయత్నములో ఆంధ్ర మహిళాసభ కృషి కొంతవరకు ఫలించినది. ఆ రోజులలో రాజకీయ చైతన్యము లేక అనేక విధముల వెనుకబడిపోయిన తెలంగాణా తెలుగు ప్రజానీకమును మేలుకొలుపుటకై నిరాడంబరమైన గ్రంథాలయోద్యమము తప్ప గత్యంతరము లేకుండెడిది. ఇంచుమించుగా నీ యుద్యమముతోపాటుగానే తెలంగాణా స్త్రీజనోద్యమము గూడా ప్రారంభమైనది.

1911 ప్రాంతములో రావిచెట్టు రంగారావు, మాడపాటి హనుమంతరావు మొదలగువారి సాధన ఫలితముగా హైదరాబాదులోని శ్రీ కృష్ణదేవరాయ ఆంధ్రభాషా నిలయములో కొందరు స్త్రీలను గూడా సభ్యులనుగా చేర్పించుట, అచ్చట జరుగు సభలలో, సమావేశములలో ఈ స్త్రీలు తెరల వెనుక కూర్చుండి ఉపన్యాసములను విను నట్లుగా చేయుటయే ఆనాడు వారిని ముందుకు తీసికొని వచ్చుటకు జరిగిన మొట్టమొదటి ప్రయత్నము. తరువాత కొందరు మహిళలు ఆంధ్ర సోదరీ సమాజ మను పేరుతో స్త్రీల సాంఘిక, సాంస్కృతిక ప్రగతికి పాటుపడసాగినారు. వారిలో నడింపల్లి సుందరమ్మ, పండిత పీరరాఘవమ్మ, లోకనంది జానకమ్మ, పురం రుక్మిణమ్మ మొదలైనవారు ముఖ్యులు.

ఇదిగాక తెలంగాణములో అచ్చటచ్చట జరుగుచుండు ఆంధ్రమహాసభలతోపాటుగా చిన్న చిన్న మహిళాసభ లనుగూడా జరిపి ఆనాటి ఆంధ్రనాయకులు స్త్రీలకు గూడా కొంత ప్రోత్సాహము కల్పించు చుండెడివారు. మొట్టమొదట 1925 వ సంవత్సరములో సూర్యాపేటలో ఒక స్త్రీల సమావేశము జరుపుటకై నగరములోనుండి కొందరు విద్యావతులైన స్త్రీలు అచ్చటి ఉత్సాహవంతులైన ప్రజల సహకారముతో ఒక సమావేశమును జరిపిరి; ప్రజలు ఏ పెండ్లి వేడుకో యని విరగబడి చూచిరి.

అప్పటినుండి జిల్లాలలో ప్రతి సంవత్సరము మహిళా సభలు 1942 వరకు జరుగుచు వచ్చినవి. ఈ సభలు వరుసగా నడింపల్లి సుందరమ్మ, టుంకూరు వరలక్ష్మమ్మ, యల్లాప్రగడ సీతాకుమారి, మాడపాటి మాణిక్యమ్మ, బూర్గుల అనంతలక్ష్మీదేవి, నందగిరి ఇందిరాదేవి, ఆర్. యోగ్య శీలాదేవి, రంగమ్మ ఓబలరెడ్డి, గుడిగుంట లలితాదేవి మొదలగువారి అధ్యక్షతక్రింద మెదకు, నల్లగొండ, ఖమ్మం (కంబం)మెట్టు, సిరిసిల్ల, మహబూబు నగరము, నిజామాబాదు, మల్కాపురము, వరంగల్లు, హైదరాబాదు నగరాలలో జరుపబడినవి. వీనిలో మొదటి సమావేశాలు కేవలం వినోదంగానే జరిగినా రానురాను విద్యావతులైన స్త్రీలు అధికముగా పాల్గొనడమూ, ఆనాటి స్త్రీల సమస్యలను తీవ్రముగా చర్చించుకొనడమూ జరుగుచుండెడిది.

1935 నాటికి నవయువతీలోకములో కలిగిన అణప రాని ఉత్సాహమువలన 'ఆంధ్ర యువతీ మండలి' అనే మరియొక మహిళా సంఘము ప్రారంభింపబడినది. దీనికి ముఖ్య స్థాపకులు అప్పటి నిజామురాష్ట్ర ఆంధ్ర మహిళా సభాధ్యక్షురాలుగా నుండిన యల్లాప్రగడ సీతాకుమారి; కథా రచయితగా పేరు గాంచిన ఇల్లిందల సరస్వతీదేవి. తరువాత దానిని పెంచి ప్రోదిచేసినవారు బూరుగుల అనంత లక్ష్మీదేవి, రంగమ్మ ఓబలరెడ్డి, ఇతర మహిళలును.

సమాజ సంస్కరణములో విప్లవ భావములు కలిగిన ఈ నవయువతుల చేతులలో నిర్వహింపబడిన ఈ మండలి మరింత త్వరితగతితో అభ్యుదయ మార్గములో పురోగమించినది. హైదరాబాదు చరిత్రలో మొదటిసారిగా వీరు తమ సభలకు పురుషులనుగూడా ఆహ్వానించడమూ, కొందరు విద్యావంతులైన మహాపురుషులచేత ఉపన్యాసము లిప్పించడమూ ప్రారంభించి, ఆనాటి తెలుగువారిలో గూడా కొన్ని వర్గాలలో అధికముగా పాతుకొనిపోయిన ఘోషాను దూరము చేయడానికి ప్రయత్నించినారు. ఈ సంస్థ ఈనాడు హైదరాబాదు మహిళా సంస్థలలో ప్రముఖ స్థానమును వహించి రెండు మూడు లక్షల విలువ కలిగిన భవనములను, ఇతర పరికరములను, అనేకశాఖోపశాఖలను కలిగి మహిళలకూ, బాలబాలికలకూ సేవ చేస్తూ ఉన్నది.

దీని తరువాత పేర్కొనదగిన సంస్థ మహిళా నవజీవన మండలి. ఇదికూడా ఇంచుమించుగా యువతీ మండలితో పాటుగానే స్థాపింపబడి స్వర్గీయ సరోజినీదేవి పేరుమీద కొన్ని లక్షలు విలువ కలిగిన భవనములను నిర్మించుకొని స్త్రీలకు సేవచేయుచున్నది. పై రెండు సంస్థల యాజమాన్యములోను గ్రంథాలయములు, కుటీర పరిశ్రమలు, శిశు విహారములు, సంగీత నృత్య శిక్షణములు మొదలగు కార్యక్రమములు జరుపబడుతూ ఉన్నవి.

తెలంగాణములోని మరియొక మహిళా సంస్థ ఇందిరా సేవాసదనము. అనాథలు, నిరాశ్రయలు నైన మహిళలకు ఆశ్రయమిచ్చి వారికి విద్యా విజ్ఞానములను కలిగించడానికి సంగెం లక్ష్మీబాయమ్మచేత సరూరు నగరములో స్థాపింపబడిన ఈ సంస్థ కొన్ని లక్షల విలువైన ఆస్తి కలిగి వివిధములైన చేతిపరిశ్రమలకు స్థానమై స్వయంపోషకమై వ్యవహరించుతూ ఉన్నది.

ఇదిగాక కస్తూరిబాయి గాంధీ సంస్మరణార్థము స్థాపించిన ట్రస్టులోని తెలంగాణా శాఖను జ్ఞానకుమారి హెడా నిర్వహించుతున్నారు; ఎందరో ఆశ్రయహీనలైన స్త్రీలకు 'హైదర్షా కోట' లోని శిబిరములలో శిక్షణ నిచ్చి ఆదర్శవతులయిన గ్రామసేవికలనుగా తయారుచేసి తెలంగాణములోని గ్రామములలో సేవ చేయించుతున్నారు.

ఆర్య సమాజమువారి పక్షమున బేగముపేటలో నిర్వహింపబడుతున్న కన్యాగురుకులమునందు స్త్రీలకు ధార్మిక శిక్షణముతోబాటు లాటీ కర్రలతో స్వయంరక్షణోపాయములనుగూడా నేర్పి వీర మహిళలను సృష్టించుటకై పాటుపడుతున్నారు. ఇంతేగాక వీరు స్త్రీలకు ఉపనయనములు

చేసి యజ్ఞోపవీతముల నిచ్చి సంధ్యావందనాది వైదిక పద్ధతులనుగూడా ప్రచారము గావింపజేసినారు.

ఆధ్యాత్మికముగా స్త్రీల అభ్యున్నతికి పాటుపడు సంస్థగా ముషీరాబాదులో సచ్చిదానంద ఆశ్రమమును నెమిలికంటి లక్ష్మీనరసమ్మగారు కొందరు మహిళలసహాయముతో నిర్మింపజేశారు. స్వయంపోషకమైన ఈ యాశ్రమములో అధికముగా సన్యాసినులైన వితంతువులును, కొందరు వానప్రస్థలైన యోగినులు నియమబద్ధమైన జీవితాలతో, అనుష్ఠానములతో పుణ్యకథా కాలక్షేపాలతో ప్రాచీన మునికాంతలను స్మరణకు తెస్తూ నివసిస్తూ ఉంటారు. ఈ సంస్థకు అనుబంధముగా రాష్ట్రములో మరి కొన్ని భజన సమాజములు గూడా నిర్వహింపబడుతున్నవి.

ఈ విధముగా మహిళా సంఘములు నిర్వహించిన కార్యక్రమములవలన తెలంగాణా స్త్రీలలో చక్కని చైతన్యము కలిగి, స్త్రీ విద్య అభివృద్ధి చెంది, ఘోషా మూఢాచారములు నశించి ఎందరో స్త్రీలు అన్ని కళాశాలలలోను ఉన్నత విద్యలను పొంది అనేకమైన ఉన్నత పదవులను నిర్వహిస్తూ సమాజ సేవ చేయుచుండుట గమనించగలము.

సాహిత్య సేవలోగూడా తెలంగాణములో చక్కని రచయితలు వెలసినారు. పరసా జానకీదేవి, నేమాని భారతీరత్నాకరాంబ, నందగిరి ఇందిరాదేవి, యల్లాప్రగడ సీతాకుమారి, యశోదా తిరుమలరెడ్డి చక్కని కథలు, పద్యాలు వ్యాసాలు వ్రాసి భాషాసేవ చేస్తుండేవారు. వీరుగాక ఇల్లిందల సరస్వతీదేవిగారు ఆంధ్ర సాహిత్యములో చక్కని ప్రవేశము కల్పించుకొని చిన్న కథలు, ఏకాంకికలు, బాలవాఙ్మయము, విమర్శక వ్యాసములు, వ్రాసి తెలంగాణా మహిళ లెవ్వరు నిర్మింపనంత వాఙ్మయాన్ని సృజించినారు.

ఇంతేగాక ఈ ముప్పదియేండ్లూ హైదరాబాదు చరిత్రలోను ఎన్నో సంఘటనలు జరిగినవి. ఆ సందర్భములోనూ, ముఖ్యముగా రాష్ట్ర కాంగ్రెసు సాగించిన స్వాతంత్ర్య సమరములోను స్త్రీలు పాల్గొని తమ ధర్మాన్ని సముచితంగా నెరవేర్చారు. దాని ఫలితముగా ఈనాటి ఆంధ్ర ప్రదేశ శాసనసభలో వారికి తృప్తికరమైన స్థానములు లభించినవి. మొత్తము ఆంధ్రప్రదేశ శాసనసభలో నున్న పదునైదు స్థానములలోను ఐదుగురు స్త్రీలు మాత్రమే ఆంధ్ర ప్రాంతానికి చెందినవా రుండగా తెలంగాణా ప్రాంతమునకు చెందినవారు పదిమంది మెరికలవంటి సంఘసేవకురాండ్రు ఉండుటయు, గడచిన మంత్రివర్గములో ఒక మహిళకుగూడా స్థాన ముండుటయు గమనింపదగిన విషయము.
య. సీ.

**మాధవరాయలు, సురభి :** ఈతడు రేచర్ల గోత్రజుడు ; మల్లక్ష్మాపాలుని పుత్రుడు ; పదునారవ శతాబ్ది చివర నుండిన అళియ రామరాయల సమకాలికుడు; అతని వలన జటప్రోలు సంస్థానమును బహుమానముగా గ్రహించి దానిని పాలించినవాడు ; ఇతడు 'చంద్రికా పరిణయము' అను ఆరాశ్వాసముల ప్రౌఢ ప్రబంధమును రచించెను. రచన శ్లేష యమక భూయిష్ఠము. ఇది అన్ని విధముల ఆ కాలమందే వెలసిన రామరాజభూషణుని వసుచరిత్రతో తులతూగుచున్నది. ఈ ప్రబంధము 'జటప్రోలు' నగరమందలి మదనగోపాలమూర్తి కంకితము చేయబడినది. పేరొందిన యాంధ్రప్రబంధ ప్రపంచములో నీ 'చంద్రికాపరిణయ' ప్రబంధ మొకటి.
బి. వెం. ర.

**మారన :** ఈతడు నియోగి బ్రాహ్మణుడు ; తిక్కనామాత్యునకు పుత్రుడు ; తిక్కన సోమయాజికి శిష్యుడు. కాకతి ప్రతాపరుద్రదేవ చక్రవర్తికడ సేనానిగా నున్న గన్నయ్యకు ఈతడు మార్కండేయ పురాణమును సంస్కృతము నుండి యాంధ్రీకరించి యంకితముచేసెను. మార్కండేయ పురాణములో 'ఆ చతుర్థకుల సుధాంభోధి నుదయించె' అని యున్నందున గన్నయ్య శూద్రుడని స్పష్టము.

ప్రతాపరుద్రుడు క్రీ. శ. 1295 - మొదలు 1323 వరకు పరిపాలన చేసినాడు కావున గన్నయ్య ఆ కాలమువాడు. మారన కవియును అప్పటివాడు ; గద్యములో తాను తిక్కనామాత్య పుత్రుడనని చెప్పికొనినాడు. ఈతని తండ్రి కవి తిక్కనసోమయాజి యని కొందరు భ్రమపడినారు కాని కాదు. మారన జన్మస్థాన మేదియో తెలియదు. తదితర ముఖ్యవిషయములు కూడ తెలియవచ్చుట లేదు. నన్నయ తిక్కనలనుమాత్ర మీతడు స్తుతించుటచే ఎఱ్ఱాప్రెగడకు ముందు వర్ధిల్లినవా డనిపించును.

అష్టాదశ మహాపురాణములలో మార్కండేయ మేడవది. మహాభారతములో సంపూర్ణములు కాక సంశయాస్పదములగు కథలను మార్కండేయ పురాణము వివరించుచున్నది. ఈ పురాణ మనేక హృదయంగమ కథలకు నిలయము. మదాలసా కువలయాశ్వుల చరిత్ర, బహులా ఉత్తముల కథ, మానినీ రాజ్యవర్ధనుల వృత్తాంతము, రుచి ప్రజాపతి కథ ; స్వారోచిష మనుసంభవము మొదలగు నుపాఖ్యానము లెన్నియో యిందు గలవు. హరిశ్చంద్రోపాఖ్యాన మిందు విశిష్టమైనది.

మారనకవి మాతృకనుండి కొంతవరకే యాంధ్రీకరించెను. మరుత్తుని కుమారుడగు అరిష్యంతుని చరితము పౌత్రుడగు దముని చరిత్రము ఏలనో ఆంధ్రీకరింపలేదు.

మారన యనువాదము మాతృకకు సమీపముగా నుండును. ఈతని వర్ణనా విధానము సరసము. కథాంశములకు విలువ పోనీక యితడు రసమును పోషించును. ఆధ్యాత్మిక, ధార్మిక, కథాసంభృతమైన యీ పురాణములో మారన శృంగారరసమునకు తావు కల్పించినాడు. ప్రామాణికుడైన యీ కవి తన గురువగు తిక్కన సోమయాజిని ఎడనెడ స్వల్పముగ ననుకరించునట్లు కానవచ్చును.

మొత్తముమీద మారన మధుర కవి. ఈతని మార్కండేయ పురాణ మెనిమిది ఆశ్వాసములతో 2,500 గద్య పద్యములతో నొప్పారుచున్నది. శి. శం. స్వా.

**మారిషస్ దీవి* - ఆంధ్రులు :** ఈ ద్వీపములో సుమారు 40 వేలమంది ఆంధ్రు లున్నారు. భారతదేశము నుండి మొదటిసారి 1825 లో 75 గురు భారతీయు లీ దీవికి వలస వెళ్ళిరి. అప్పటినుండి ఏటా అనేకులు తరలి వెళ్లుటచే ఈనా డచట భారతీయులు అందరికన్న అధిక సంఖ్యాకులుగా నున్నారు. 1860 - 1865 ప్రాంతములో మొదటిసారి ఆంధ్రులు అచ్చటికి వెళ్ళినట్లు తెలియుచున్నది. వారు సోదర భారతీయులయిన తమిళులు, మహారాష్ట్రులు, హిందీభాష మాటాడువారితో కలసి సుఖజీవనము చేయుచున్నారు. వారు ద్వీపములో ఒక్క ప్రాంతములో కాక, అన్నిచోటులందును వ్యాప్తిచెందియున్నారు. వ్యవసాయదారులుగాను, వ్యాపారస్తులుగాను, చిన్న చిన్న భూస్వాములుగాను ఆంధ్రు లనేకులున్నారు. విద్యావంతులయిన ఆంధ్రు లనేకులు ప్రభుత్వోద్యోగములలో నున్నారు.

ఆంధ్రులకు ఈ ద్వీపములో అనేక సంఘములు, దేవాలయములు, సభాభవనములు ఉన్నవి. వీటిలో ముఖ్యముగా పేర్కొనదగినవి 'విష్ణుమందిరము, సింహాచల మందిరము, రామేశ్వర శివమందిరము, కృష్ణమందిరము'లు ఆ ద్వీపములో పలుచోట్ల ఆంధ్రసంఘములు పనిచేయుచున్నను ఒక కేంద్ర సంస్థ లేని లోటును తీర్చుకొనుటకై 1946 లో మారిషస్ ఆంధ్రమహాసభ స్థాపించబడెను. దీని ప్రధాన కార్యస్థలము రాజధానీనగరమయిన పోర్టులూయిలో గలదు.

ఈ సభయొక్క ముఖ్యోద్దేశములు : (1) ఆంధ్రుల సాంఘిక, ఆర్థిక స్తోమతను అభివృద్ధిపరచుట ; (2) వేదాంతము, సారస్వతము, లలితకళలు, విజ్ఞానశాస్త్రము, చరిత్ర మొదలగు శాస్త్రపఠనము ఆంధ్రులలో పెంపొందించి ఆంధ్రసంస్కృతిని వ్యాప్తిచేయుట ; (3) తెలుగు భాషాబోధనకు, వ్యాప్తికి, పుస్తక భాండాగారములను, పాఠశాలలను, ఉచిత విద్యాసంస్థలను నెలకొల్పుట ; (4) సభలను, సమావేశములను జరిపి ఆరోగ్యము, శుభ్రతలను గూర్చి ప్రజలకు తెలియపరచుట ; (5) సంఘ ఉద్దేశములను వ్యాప్తి చేయుటకు పుస్తకములు, సంచికలు, కరపత్రములు ప్రచురించుట ; (6) మరణించిన సభ్యుల కుటుంబములకు అవసరమయిన ఆర్థిక సాహాయ్యము చేయుట.

ఈ సభకు ముప్పదియారు కార్యస్థానము లున్నవి. ఈ సంస్థ పదునెనిమిది సాయంత్రపు పాఠశాలలను నడపుచున్నది. భారతదేశమునుండి తెలుగు పుస్తకములు, దిన పత్రికలు తెప్పించి, తెలుగు భాషావ్యాప్తికై పాటుపడుచున్నది.

---

* మారిషస్ ద్వీపము ఆఫ్రికాఖండ సమీపముననున్న మడగాస్కర్ ద్వీపముదగ్గర ఉన్నది. ఇది 1810 సంవత్సరమునుండి ఒక బ్రిటిషు కాలనీగా నున్నది. మదరాసు, కలకత్తా, బొంబాయి రేవులలో ఓడ నెక్కి 10, 12 రోజుల ప్రయాణములో అచ్చటకు చేరవచ్చును. ఈ ద్వీపము 460 వేల ఎకరముల విస్తీర్ణము కలది. 38½ మైళ్లు పొడవు, 28½ మైళ్లు వెడల్పు దీని గరిష్ఠ ప్రమాణములు. దీని సముద్ర తీరము కొలత 140 మైళ్లు. ఈ ద్వీపము యొక్క రాజధానీ నగరము 'పోర్టు లూయి'. ఈ పట్టణమే ఈ ద్వీపపు ఓడరేవు. ఇక్కడి వాతావరణము సమశీతలముగ నుండును. ఏప్రిలు మాసమునుండి జూలైవరకు వర్షములు కురియును; సెప్టెంబరునుండి ఏప్రిలువరకు ఎండాకాలము. ఇచటి నేల చాల సారవంతమయినది. చెరకు విస్తారముగ పండును. చక్కెర ఉత్పత్తి ఇచ్చటి ముఖ్య పరిశ్రమ. తేయాకు, పొగాకు, నారతయారి ఇచటి ఇతర పరిశ్రమలు. ఇచ్చట కొబ్బరి చెట్లు విస్తారముగా ఉన్నవి. ఇచట భారతదేశములో దొరకు ఫలము లన్నియు దొరకును. ఈ ద్వీపము 'బ్రిటిష్ కలోనియల్' శాఖ ఆధిపత్యము క్రింద గవర్నరు పరిపాలనలో నున్నది. ఒక ప్రజా ప్రతినిధుల సభ, ప్రభుత్వ కార్యములను చూచు కార్యనిర్వాహక సభకూడ ఉన్నవి. ఈ రెండు సభలలోను భారతీయులకు ప్రాతినిధ్య మున్నది.

1953 అంచనాలనుబట్టి ఈ ద్వీపపు మొత్తము జనసంఖ్య 5,01,415 ; దీనిలో భారతీయులు 3,35,327 ; ఐరోపాదేశస్థులు, ఆఫ్రికనులు 1,48,238 ; చీనాదేశీయులు 17,850.

భారతీయులలో ఉత్తరాదివారు - ముఖ్యముగా హిందీ మాటాడువారు 1,70,327 ; మహమ్మదీయులు 70,300 ; తమిళులు 50,000 ; ఆంధ్రులు 40,000 ; మహారాష్ట్రులు 5,000.

అన్ని భాషలవారు - భారతీయులు ప్రభుత్వములో ఉన్నతోద్యోగములలో నున్నారు. పలువురు చెరకు పండించుటలోను, వ్యాపారములోను, ఇతర వృత్తులలోను ఉన్నారు. రాజ్యాంగసభ, కార్యనిర్వాహక సభలలోను, పురపాలక సంఘములలోను భారతీయులకు ప్రాతినిధ్యము కలదు.

గ్రామ పంచాయితీలు పూర్తిగా భారతీయులచేతిలో నున్నవి. ఈ పంచాయతీలు గ్రామసంక్షేమముపట్ల శ్రద్ధ వహించుచున్నవి.

సభ్యులలో కొందరు విద్యావేత్తలు వివాహాది శుభ కార్యములు జరిపించుచు, ఆంధ్రములో ఉపన్యాసముల నిచ్చుచున్నారు. గీతారహస్యమును గురించి, ఆంధ్ర సంస్కృతి, వేదాంతశాస్త్రములనుగురించి ఉపన్యాసములు, చర్చలు జరుపబడుచున్నవి. ఆంధ్రబాలురు గవర్నమెంటుచే నడపబడు పాఠశాలలలో, కళాశాలలలో ఫ్రెంచి, ఆంగ్ల భాషలుకూడ అభ్యసించి 'సీనియర్ కేంబ్రిడ్జి' పరీక్షయందు ఉత్తీర్ణులై ఉద్యోగములు చేయుచున్నారు. కొందరు ఉన్నత విద్యకై ఇంగ్లాండు, ఫ్రాన్సులకు పోయి వైద్యము, న్యాయ శాస్త్రములలో పట్టములు పొంది తిరిగివచ్చుచున్నారు. సంగీతములోను, పాటలలోను పోటీలు తరచు జరిపించి పిల్లలలో సంగీతాభివృద్ధికి కృషి జరుగుచున్నది.

ఇచ్చటి ఆంధ్రులు జరుపుకొను పండుగలు: సంక్రాంతి, మహాశివరాత్రి, శ్రీరామజయంతి, శ్రీకృష్ణజయంతి, దీపావళి, గంగాస్నానము, ఏకాదశీవ్రతము, పితృపక్షము (మహాలయపక్షాలు) హోలీ, కామదహనము మొదలైనవి.

గ్రామపంచాయితీలకు, పురపాలక సంఘములకు, రాజ్యాంగ సభలకు ఎన్నికలనిమిత్తము దరఖాస్తులను ఆంధ్రులు తమ సొంతభాషలో వ్రాయవచ్చును. జిల్లా కోర్టులలోను, ప్రధానన్యాయ స్థానములలోను ఆంధ్ర అనువాదకు లున్నారు.

మారిషస్‌లోని రేడియో కేంద్రము ప్రతి సోమవారము అయిదు గంటలకు తెలుగు కార్యక్రమములను ప్రసారము చేయుచున్నది. ఆంధ్రభాషనుగురించి ప్రసంగములు, తెలుగు రికార్డులు, పాటలు ప్రసారముచేయబడుచున్నవి.

మారిషస్‌లో ఆంధ్ర మహిళాసభకూడ పనిచేయుచున్నది. దీనికికూడ అనేక కార్యస్థానము లున్నవి. ఈ సంస్థకూడ అనేక గ్రంథాలయములు నెలకొల్పి సభల, సమావేశములద్వారా భాషాభివృద్ధికి తోడ్పడుచున్నది. ప్రయాణికుల సౌకర్యార్థము పోర్టు లూయి పట్టణములో ఆంధ్రమహాసభ ప్రధాన కార్యస్థానముచేత ఒక పెద్ద ధర్మశాల నడపబడుచున్నది.

అచ్చటి ఆంధ్రులు స్వయంకృషివల్ల నేర్చిన విద్యచే ఆంధ్రభాష, సంస్కృతి కాపాడబడుచున్నవి. కాని తెలుగులో ఉన్నత విద్యాబోధనచేయుటకు ఉన్నత కళాశాల లేదు. ఆంధ్రదేశపు పండితులు, శాస్త్రవేత్తలు మారిషస్‌లో ఉన్నత విద్యావ్యాప్తికి సహాయపడవలసి యున్నది.

1946 లో ఆంధ్రమహాసభ స్థాపితమైననాటినుండి నెలకొల్పబడిన పాఠశాల లనేక మెంతో అభివృద్ధికావలసి యున్నవి. ఇచటి విద్యార్థులను ఆంధ్రదేశపు కళాశాలలకు పంపి, వారికి ఉన్నత విద్యాభ్యాసమునకు అవకాశము కల్పించి తన్మూలమున ఇచ్చటి విద్యావ్యాప్తికి, భాషాభివృద్ధికి దోహద మిచ్చుట చాల అవసరము. ఆంధ్ర సంస్కృతికి ఆలవాలమైన త్రిలింగదేశము ప్రవాసాంధ్రులు ఎచ్చట నున్నను, వారి సర్వతోముఖాభివృద్ధికి సాయము చేసి, చేయూత నిచ్చి ఆంధ్రసంస్కృతిని భాషను నిలబెట్టి, పెంపొందింపజేయు బాధ్యత ఆంధ్ర ప్రజానీకముపైన, ప్రభుత్వముపైన నున్నది.

కృ. రా. పై.

**ముదిగొండచాళుక్యులు :** తెలంగాణమున రాష్ట్రకూటయుగమునందు వర్ధిల్లిన రెండవ చాళుక్య సంస్థానము ముదిగొండ శాఖకు జెందినది. ఆధునిక చరిత్ర పరిశోధకు లీ శాఖ కీ పే రేల పెట్టిరో తెలియదు. వీ రేలిన రాష్ట్రము మంచికొండమండలము. ఇది తెలంగాణము యొక్క తూరుపు గడిదేశమున దక్షిణమున కృష్ణాతీరమందలి కొండపల్లి కడనుండి యుత్తరమున వరంగల్లు జిల్లాలోని కొరవివరకును వ్యాప్తమై యుండినది. ఈ వంశమునకు మూలపురుషుడు కొక్కిరాజు. ఇతడు క్రీ. శ. 9 వ శతాబ్దమునం దీ ప్రాంతము నేలుచుండిన రణమర్దుడను నాతని పుత్రికను పెండ్లిచేసికొని యామెకరముతోపాటు రణమర్దనరాజ్యశ్రీని గ్రహించెను. ఈ వంశమువా రాద్యము నుండియు వేంగీదేశమును పాలించుచుండిన పూర్వ చాళుక్యులకు సామంతులై యుండిరని తోచుచున్నది. ఇందు మొదట బేర్కొనదగినవాడు కొక్కిరాజు తనయుడైన ప్రథమ కుసుమాయుధుడు. ఇతడు రాష్ట్రకూట చక్రవర్తి యగు ద్వితీయ కృష్ణరాజు మొదటి చాళుక్య భీముని పై నెత్తివచ్చి నప్పు డతనికి బాసటయై నిలిచి రాష్ట్రకూటసేనల నోడించి తరుమగొట్టి చాళుక్య భీమునికి పట్టాభిషేక మొనర్చి యతనిచే నర్ధరాజ్యమును బొంది సుప్రసిద్ధుడై పుడమిని పాలించెను. ఇతని కుమారుడు బెజ యితడు. ఇతనికి బిజ్జ, విజయాదిత్య నామాంతరములు గలవు. ఇతడు రాష్ట్రకూట చక్రవర్తి నాల్మడి గోవిందరాజు కోపమునకు గురియై యతని భాటి కాగజాలక వేములవాడ పాలకుడగు ఇమ్మడి అరికేసరిని శరణు వేడెను. ఇతని పక్షము వహించి అరికేసరి గోవిందరాజుతో యుద్ధ మొనర్చి యతనిని రాజ్యభ్రష్టుని గావించెనని ముందు చెప్పి యున్నది. ఇతని సంతతివారు పూర్వచాళుక్యులకు ఆశ్రితులై వారికి యుద్ధకార్యములందు తోడ్పడుచు వచ్చిరి. రెండవ అమ్మరాజ విజయాదిత్యుని కాలమున నొక కుసుమాయుధు డుండెను. ఈ వంశజులగు మల్లియ, గొండియ లనువారలు దానార్ణవునికి కార్యఖడ్గములందు దోడ్పడి యాతనివలన పొత్తపి రాజ్యమును బడసిరి. అటుపిమ్మట వీరి చరిత్రనుగూర్చిన విషయము

లెవ్వియు దెలియరావు. పదునొకండవ శతాబ్దమున కొరవిప్రాంతభూముల నేలుచుండిన నాల్గవ కుసుమాయుధుడు వీరిలో కడపటివాడని తోచుచున్నది. నే. వెం. ర.

**ముద్రణము(తెలుగు)** : పూర్వము ప్రతి పుస్తకమును భూర్జ పత్రములమీదనో తాటాకులమీదనో గంటముతో వ్రాసెడివారు. పుస్తకములు వ్రాయుటకు మన దేశములో తరచుగా తాటియాకులనే వాడుక చేసెడివారు. భూర్జ పత్రములు ఉత్తర హిందూస్తానములో కాని విరివిగా దొరకేవి కావు. అందువలన మన రామాయణ మహాభారతములు, భాగవతాది పురాణములు, కావ్యములు అన్నీ తాటాకులమీదనే వ్రాసేవారు. తాటాకులను చక్కగా సవరచేసి కత్తిరించి గ్రంథలేఖనమునకు తయారుచేయడము, వాటిమీద గంటముతో వ్రాయడము ఒక విద్య. గ్రంథములను పొంకముగా ముద్దు లొలికేటట్టు వ్రాసే మునసద్దీ లేఖకు లుండేవారు. ఒక్కొక్క మహాగ్రంథము వ్రాయుటకు కొన్నేసి నెలలు పట్టేది. ఈ విధముగా గ్రంథముల మాతృకలకు పుత్రికలు వ్రాయుట విలేఖకులకు ఒక వృత్తిగా ఏర్పడినది. అటువంటి విలేఖకులకు జొన్నలో, బియ్యమో, కొన్ని వరహాలో యిచ్చి సంపన్నులయినవారు, మహారాజులు, సామంతులు మొదలైనవారు తమకు కావలసిన గ్రంథాలను వ్రాయించుకొనేవారు.

ఈ విధముగా పుస్తకము సంపాదించడమే కష్టమయ్యేది. సాహిత్యముమీద అభిరుచో, చదివితే పుణ్యమో పురుషార్థమో కలుగుతుందన్న విశ్వాసమో ఉన్న సాహిత్యాభిమానులకు మాత్రమే గ్రంథములు దొరికేవి. విలేఖకులచేత వ్రాయించిన గ్రంథమును యజమానులు మరొకరి కివ్వడము చాలా కష్టముగా ఉండేది. పూర్వుల భావనలో గ్రంథము సరస్వతి అపరరూపము. అందువలన దానిని ఎంతో శ్రద్ధ తీసికొని జాగ్రత్తపరచి పూజించేవారు. వ్రాసిన తాటియాకును తొక్కినట్లయితే కళ్ళు పోవుననే మన పూర్వుల విశ్వాసము. అందువల్ల పాత తాటియాకుల గ్రంథాలు శిథిలమై చెడిపోయి ఆకులు చిందరవందరవడమే తటస్థిస్తే వాటిని తీసుకొని వెళ్ళి ఏ నదిలోనో కట్టకట్టి పారవేసేవారు కాని వాటిని తగులబెట్టేవారు కారు. పూర్వము మహాకవుల కావ్యాలు, పండితులు రచించిన శాస్త్రాలు చదువుకోవాలనే అభిలాష ఉన్నవారికి కూడా గ్రంథములు లభించడం కష్టంగా ఉండేది - అందరికిని ధనధాన్యాలిచ్చి గ్రంథములు వ్రాయించుకొనే శక్తి ఉండేదికాదు కనుక. తాళపత్రములనేకాక మన పూర్వికులు కడితములపై దినసరి లెక్కలను, గ్రంథములను వ్రాయువారు. కడిత మనగా జిగురు పదార్థముతో మసిని గలిపి చరిమి యెండబెట్టి పుస్తకరూపమున మడతపెట్టిన వెడల్పు తక్కువయైన నిడుపు వస్త్రము. దీనిపై సుద్దబలపములతో వ్రాయువారు.

పూర్వము మనదేశములో కాగితము తయారవుతూ వుండే దనుటకు ఆధారము లున్నవి. రెడ్డి మన్నీలకాలములో కాకితము వాడుకలో నుండినట్లు శ్రీనాథుని భీమేశ్వర పురాణము వల్లనే తెలుస్తున్నది. అయినప్పటికీ, కాకితము విరివిగా ఉత్పత్తి కాకపోవడమువల్లనో, ఉత్పత్తి అయిన కాగితము ధర ఎక్కువగా వుండడమువల్లనో సాధారణముగా కవులు, పండితులు, గ్రంథములు వ్రాసేటందుకు ఉచితముగా లభించే తాటియాకులనే సామాన్యంగా వాడుతూ వచ్చారు. ఈ స్థితి అచ్చు వచ్చిన తరువాత మారింది.

అచ్చును మొట్టమొదటిమారు క్రీ. శ. 1550 లో పోర్చుగీసువారు (బుడతకీచులు) దక్షిణ హిందూదేశములోని గోవాకు తీసుకువచ్చినారు. చెన్నపట్టణమునకు అది 1772 లో వచ్చింది. అయితే తెలుగులో మొదటి పుస్తకము 1746 లోనే - చెన్నపట్టణములో కాదు - జర్మనీ యందలి ప్రష్యా దేశంలోని మాగ్డిబర్గ్‌కు చెందిన హాలీనగరంలో అచ్చయినది. ఇది క్రైస్తవ మతానికి చెందిన విషయాల ప్రార్థన పుస్తకం. దీనిని అచ్చువేయించినవాడు రెవరెండ్ బెంజమిన్ స్కల్జ్. ఈ మతాచార్యుడే మొదటిమారు 1747 లో యూరోపియనులకు తెలుగు లిపిని గురించి, తెలుగుభాషను గురించి తెలియజేసినాడు. కర్ణాటిక్ మిషన్‌కు సంబంధించిన క్రైస్తవ మిషనరీలు కొందరు కలకత్తా దగ్గర నున్న శ్రీరాంపురములో ఒక 'మిషను' స్థాపించి బైబిలును దేశభాషలలో ముద్రించి దేశీయులలో క్రైస్తవ మతవ్యాపన చేయవలెననే ఉద్దేశంతో నాగరి, తెలుగు మొదలైన ఏడెనిమిది లిపులలో అష్టకష్టములు పడి అచ్చు అక్షరములు తయారుచేసి ముద్రాయంత్రము నెలకొల్పినారు. ఈ యక్కరములతో అచ్చయిన తెలుగు పుస్తకములు 1746, 1747 నాటివి శ్రీరాంపురం కళాశాల పుస్తక భాండాగారములో ఉండేవి. ఈ విధంగా అచ్చును మన దేశానికి తీసుకొని వచ్చినవారు క్రైస్తవ మిషనరీలు. తమ మతగ్రంథములను తెనిగించి, అచ్చువేసి దేశీయులలో తమ మతమును వ్యాపింపజేయడమే వారి ప్రధాన లక్ష్యము.

మద్రాసు నగరములో మొదటిమారు అచ్చయిన తెలుగు గ్రంథము క్రీ. శ. 1807 నాటిది. ఇది తెలుగు వ్యాకరణము. ఆ కాలములో క్రైస్తవమత బోధకులకూ, దేశము కుంపిణీవారికి స్వాధీనమై వారి పరిపాలన క్రిందికి వచ్చిన తరువాత దేశపాలకులుగ నియమితులైన బ్రిటిషు

అధికారులకూ తెలుగుభాష అభ్యసింప వలసిన ఆవశ్యకము కలిగినది. అందువలన కుంపిణీ ప్రభుత్వమువారే వ్యాకరణములు, నిఘంటువులు వ్రాయించి, అచ్చొత్తిస్తూ వచ్చినారు. ఈ విధముగ తెలుగులో మొదట అచ్చయినవి క్రైస్తవమత గ్రంథాలూ, తెలుగు వ్యాకరణములూను. 1810 లో తెలుగులో ముద్రిత మయినది సెంట్ లూక్ (లూకా సువార్త); 1811 లో అచ్చయినది బైబిలు క్రొత్త నిబంధనల పుస్తకము (న్యూ టెస్టమెంటు). డాక్టరు క్యారీ అను క్రైస్తవమత ప్రచారకుడు వ్రాసిన తెలుగు వ్యాకరణము 1814 లోను, ఏ. డి. క్యాంబెల్ రచించిన తెలుగు వ్యాకరణము 1816 లోను అచ్చయినవి. తరువాత 1817లో అచ్చయినది చార్లెస్ ఫిలిప్ బ్రౌను తెలుగు వ్యాకరణము. తరువాత కాలక్రమమున అచ్చు కూటములు ఒక్క మద్రాసు నగరములోనే కాకుండా గుంటూరు, రాజమహేంద్రవరము, విశాఖపట్టణము మొదలైన నగరములలో కూడ స్థాపితములైనవి. ఈ ముద్రాయంత్రములను మొదట స్థాపించినవారు క్రైస్తవ మతబోధకులే.

1806 - 07 లో చెన్నపురిలో తెలుగు ముద్రణము ఆరంభమైనప్పటికీ ప్రారంభదశలో ఉండే కష్టాలవల్ల అది 1830 వరకు ఎక్కువ అభివృద్ధి పొందలేదు. ముద్రణమువల్ల కలిగే సౌకర్యమును గమనించి దేశీయులు 1830 తరువాత నుంచి పుస్తకము లచ్చువేయుట కారంభించారు.

మరొక పాతిక సంవత్సరములలో తెలుగు పత్రికలు కూడా అచ్చయి ప్రకటన అవుతూ వచ్చినవి. '1830 వ సంవత్సరము వరకు ముద్రణములో అభివృద్ధి ఏమిన్నీ లేదు. ఇపుడు తెలుగులోను అరవములోను పత్రికలు ఉన్నప్పటికి వాటిలో మతమునకు సంబంధించినవో కులమునకు సంబంధించినవో పరస్పర దూషణములు వాద ప్రతివాదములు ఉంటేనేకాని అవి నిలవటమే లే' దని సి. పి. బ్రౌను 1852 లో వ్రాసియున్నాడు.

ఆంధ్రరాష్ట్రములో 1830 వ సంవత్సరమునుండి ముద్రణాలయములు క్రమముగా వృద్ధి పొందినవి. కాని తెలంగాణాలో 1935 వరకు తెలుగు ముద్రణాలయములు, ఎక్కువగా స్థాపితము కానేలేదు. 1935 లో తెలంగాణాలో స్థాపితమైన 'నీలగిరి' పత్రిక యొక్క సంపాదకీయములోని పంక్తులివి: 'హైదరాబాదు సికింద్రాబాదు నగరములను వీడి రాష్ట్ర మంతయు వెదకినచో ఓరుగల్లు, నల్లగొండ, ఇనుగుర్తులందు తప్ప మరేస్థలమందు నాంధ్ర ముద్రణాలయము గోచరింపదు. మొత్తముపై రాష్ట్ర మంతటను గల ఈ ముద్రణాలయములను వ్రేళ్ళపై లెక్కింపవచ్చును. వీనిలోనైనను తగినపని కలదా లేదా యని విచారించునపుడు మాత్రము ఆశ్చర్యము జనింపక మానదు. ఈ వృత్తిలో ప్రవేశించినవారు దండుగలు పడి ముద్రణాలయములను సగము వెల కమ్ముకొని తమవృత్తిని మానుకొనుచున్నారు. ఇప్పటికి హైదరాబాదు వంటి ముఖ్యపట్టణములలో కేవల మాంధ్రాక్షరముల నుంచుకొని జీవించు ముద్రణాలయమే గోచరింపదు.'                         మ. సో. శ.

**మునుస్వామినాయుడు, బొల్లిని** (క్రీ. శ. 1891 - 1934): జస్టిస్‌పార్టీ నాయకులుగా, మదరాసు రాష్ట్ర ముఖ్యమంత్రి పదవిని అందుకొన్న ఆంధ్రులలో వీ రొకరు; 1903 లో బి. ఎల్. డిగ్రీని పొంది లాయరు వృత్తిని ప్రారంభించి, రాజకీయాలలో ప్రవేశించారు. చిత్తూరు మునిసిపల్ కౌన్సిల్ చైర్మనుగాను, జిల్లాబోర్డు అధ్యక్షులుగాను స్థానిక పరిపాలనలో అనుభవం గడించారు; మదరాసు యూనివర్సిటీ సెనేటులో మెంబరయినారు. 1919 నుంచి 1934 వరకు మదరాసు లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యులుగా వున్నారు; 1830 లో మదరాసు ప్రభుత్వ మంత్రిగా నియమింపబడినారు; 1930 నుంచి 1934 వరకు ముఖ్యమంత్రి పదవి నలంకరించినారు. 1926 లో వీరికి బ్రిటిషు ప్రభుత్వం దివాన్‌బహదర్ బిరుదు ఇచ్చింది.       క. స. నా.

**మెకెన్జీ, కల్నల్ కాలిన్** (క్రీ. శ. 1754 - 1821): ఇతడు స్కాట్లండుకు పశ్చిమమున నున్న సముద్రము నందలి లూయి ద్వీపములోని స్టార్నొవే గ్రామములో జన్మించెను; తండ్రిపేరు మర్డొక్ మెకెన్జీ; తల్లి బార్బరా మెకెన్జీ. తండ్రి ద్వీపములోని చేపల పరిశ్రమ, చిల్లర వ్యాపారములలో ధనార్జన చేసి అచటి మోతుబరులలో ఒకడయ్యెను; ఆ యూరి పోస్టు మాస్టరుగా కూడ నియమితు డయ్యెను.



చిత్రము 199.
కల్నల్ కాలిన్ మెకెన్జీ

మెకెన్జీ స్టార్నొవేలోని చిన్న పాఠశాలలో మాత్రమే విద్యాభ్యాసము చేసెను. స్వయంకృషివల్ల ఆ యూరిలో నెట్లో గణితములో కొంత ప్రవేశము పొందగలిగెను. ఈ శాస్త్రమన్న అతనికి చిన్నప్పటినుండి అభిమానము. అతడు మొదట స్టార్నొవేలోని సుంకముల ఆఫీసులో గుమాస్తాగా నుండెను. ఈ కాలమున మెర్చిస్టౌన్ నివాసియగు నేపియరు ప్రభువు ఘాతాంకములు ('లోగరిథమ్స్') కనిపెట్టిన తన పూర్వుడు

జాన్ నేపియరు జీవితము వ్రాయునప్పుడు మెకెన్జీని తన క్రింద పనిచేయుటకు వేసికొనెను. ప్రాచీన హిందువుల గణితశాస్త్ర పరిజ్ఞానమును గురించి, ఘాతాంకముల స్వభావోపయోగములను గురించి కొంత విషయమును సేకరించుటలో మెకెన్జీ అతనికి సాయపడెను. ఈ పనిద్వారా హైందవ విజ్ఞానములో అతనికి గొప్ప ఆసక్తి కలిగెను.

నేపియరు మరణానంతరము మెకెన్జీ 1782 లో ఓడలో బయలుదేరి మదరాసుకు వచ్చి 'ఈస్టు ఇండియా కంపెనీ' (కుంపినీవారి) ఇంజనీరింగు శాఖలో ఉద్యోగిగా చేరెను. నేపియరు ప్రభువు అల్లుడయిన శామ్యూలు జాన్‌స్టన్ అప్పుడు కుంపినీ ఉద్యోగములో మధురలో ఉండెను. అతని ఆహ్వానమున ఆ రోజులలో గొప్ప హైందవ విద్యా కేంద్రమైన మధురకు వెళ్లి మెకెన్జీ మొట్టమొదటిసారి అచ్చటి బ్రాహ్మణ పండితులను కలిసికొనెను. వారితోడి సంభాషణలవల్ల దేశీయ వాఙ్మయములోను, ప్రాచీన వృత్తాంతములలోను దేశచరిత్రకు ఉపకరించు సాధన సామగ్రి చాల ఉన్నదని తెలిసికొని ఆ సామగ్రి సంపాదించ వలెనను సంకల్పము అతనికి కలిగెను.

కాని ఇంజనీరింగుశాఖ ఉద్యోగిగా కుంపినీ సైన్యముతో కూడ వెళ్లవలసి వచ్చుచుండినందున అతని వాంఛ ప్రకారము పనిచేయ వీలుపడలేదు. 1783 లో అతడు కుంపినీ సైన్యముతో దిండిగల్లు, కోయంబుత్తూరులలో పనిచేసి, 1784 - 90 సంవత్సరములలో మదరాసుకు ఉత్తర ప్రాంతమున కృష్ణానదివరకుగల దేశములో జరిగిన యుద్ధములలో పాల్గొనెను. ఈ కాలములో మెకన్జీ మొదటిసారి నెల్లూరునుండి తూర్పు కనుమల లోయలద్వారా రాయలసీమ (దత్తమండల) ప్రాంతమునకు, ఒంగోలునకు రహదారి మార్గముల నమూనాలతో దేశపటములను తయారు చేసెను; 1788 లో గుంటూరు సర్కారును ఆక్రమించుకొనుటకు వెళ్లిన కుంపినీ సైన్యములో పనిచేసెను. మెకెన్జీ తన పనిలో చూపిన ప్రజ్ఞను, అతని నివేదికలను చూచి పై అధికారియగు ప్రధాన ఇంజనీరు మెచ్చుకొని కలకత్తాలోని కుంపినీ ఉన్నతాధికారులకు వ్రాసినందున వారు 1790 లో గుంటూరుసీమను పూర్తిగ సర్వేచేయుటకు అతని కుత్తరువు లిచ్చిరి. కాని పని ప్రారంభ దశలోనే కుంపినీకి మైసూరు రాజులతో యుద్ధములు ప్రారంభమగుటవలన కుంపినీ సైన్యములతో ఆ యుద్ధములలో మెకెన్జీ పాల్గొన వలసి వచ్చెను. 1792 లో టిపుసుల్తాను యొక్క శ్రీరంగపట్టణము కోట ముట్టడిలో కూడ మెకెన్జీ కుంపినీ సైన్యపు ఇంజనీరుగా కారన్‌వాలిస్ ప్రభువు క్రింద పనిచేసెను.

మెకెన్జీ తరువాత హైదరాబాదు నైజామునకు సాయముగా పంపబడిన సైన్యమునకు ఇంజనీరుగా నియమితుడై ఏలూరికి బదిలీచేయబడెను. కారన్‌వాలిస్ ప్రభువు ఆనతిని కడప, కర్నూలు, నల్లమల ప్రాంతమగు రాయలసీమ (దత్తమండలములు), గుంటూరు, నెల్లూరుసీమల ప్రాంతమును సర్వే చేసి పట్టణములు, రహదారులు, నదులు చూపునట్టి ఆ ప్రాంతపు నైసర్గిక పటము వ్రాయు పనిలో నియుక్తుడయ్యెను. ఇతని కృషి ఫలితముగా మొట్ట మొదటిసారి దక్కను ప్రాంతపు సర్వే జరిగినది. జరుగుటయే కాదు, దక్షిణ ప్రాంతపు (ముఖ్యముగా నెల్లూరు, గుంటూరు, రాయలసీమ, మైసూరు ప్రాంతముల) దేశపటమును, నైసర్గిక పటమును తయారైనవి.

మెకెన్జీ ఈ సర్వే పనులలో దేశాటనము చేయునప్పుడు ఆయా గ్రామములలోని అనేక సుందర దేవాలయములు, అక్కడి సుందర శిల్పములు, శాసనములు అతని దృష్టి నాకర్షించినవి. ఆ కాలమున ఏలూరు వాస్తవ్యుడగు కావలి వెంకట బొర్రయ్య అను బ్రాహ్మణ యువక పండితుని సాయమున అజ్ఞాత లిపిలో నున్న ఎన్నో తెలుగు, కన్నడ శాసనములలోని సంగతులు మెకెన్జీ తెలిసికొన గలిగెను. అతడు గ్రామ చరిత్రలను వ్రాయించుటకు, తాళపత్ర గ్రంథసేకరణకు, చరిత్ర కుపకరించు ప్రాచీన నాణకాదులు సంపాదించుటకు బొర్రయ్యకు వేతన మిచ్చి నియోగించెను. కాని యతడీ పనిలో చేరిన కొద్దికాలమునకే చాల చిన్నవయస్సులో మరణించెను. అది మెకెన్జీ కృషికి గొప్ప అంతరాయ మయ్యెను. కాని బొర్రయ్య తమ్ముడు కావలి వెంకట లక్ష్మయ్య కూడ అన్నగారి అడుగుజాడలలో నడచి మెకెన్జీ కెంతో సాయపడెను.

మెకెన్జీ 1810 లో మదరాసు ప్రాంతమునకు సర్వేయరు జనరల్‌గా నియమితుడయ్యెను; 1811 - 15 లలో జావా ద్వీపపు ఆక్రమణకు వెళ్లిన సైన్యములోని ఇంజనీరుల అధికారిగా అచటికి వెళ్లెను; ఈ దేశమునకు మరల వచ్చిన తరువాత 1816 లో భారతదేశపు మొదటి సర్వేయరు జనరలుగా నియమితుడై కలకత్తాకు వెళ్లెను. మెకెన్జీ 1821 లో అచటనే కాలధర్మము చెందెను.

మదరాసులో సర్వేయరు జనరలుగా పనిచేయు కాలములో మెకెన్జీక్రింద కావలి వెంకట లక్ష్మయ్య ప్రధాన అనువాదకుడుగా పనిచేసెను. మెకెన్జీ సిఫారసువలన లక్ష్మయ్యయొక్క సేవకు, సాయమునకు మెచ్చి కుంపినీ అధికారు లతనికి నెలకు మూడు వందల రూపాయల పింఛను ఇచ్చిరి. మెకెన్జీ కూడ లక్ష్మయ్యకును, అతని

తమ్మునికిని తన సొంత ద్రవ్యములో కొంత మొత్తము తన వీలునామాలో వ్రాసి ఇచ్చెను.

1793 నుండి 1816 వరకు తాను దక్షిణాపథమున కుంపినీ ఉద్యోగములో ఉండగా మెకెన్జీ చరిత్ర కుపకరించు తాళపత్ర గ్రంథములు, వ్రాతప్రతులు సుమారు 1,568 సంస్కృతము, తమిళము, తెలుగు, కన్నడము, మలయాళము, ఒరియా, మరాఠీ, హిందీ, ఫారసీ, అరబ్బీ, హిందూస్తానీ, జావానీస్, బర్మా భాషలలో వ్రాసినవి సేకరించెను. ఇవి కాక 2,070 స్థానిక చరిత్రలు, వృత్తాంతములు, 8,076 శాసన పాఠములు, 79 దేశపటములు, 2,630 బొమ్మలు (డ్రాయింగ్స్), 6,218 నాణెములు, 106 శిల్ప చిత్రములు, 40 పురాతన వస్తువులు సేకరించెను. గవర్నరు జనరలుగా పనిచేసిన మార్క్వెస్ ఆఫ్ హేస్టింగ్స్ వీటిని పది వేల పౌనుల నిచ్చి కొనెను. వీటిలో సంస్కృతము, అరబ్బీ, ఫారసీ, జావానీస్, బర్మా భాషలలోని తాళపత్ర గ్రంథములు, నాణెములు, శిల్పములు, శిలాప్రతిమలు, ఇంగ్లాండుకు పంపబడినవి. దక్షిణ భారతపు భాషలలో ఉన్న తాళపత్ర గ్రంథములు, స్థానిక చరిత్రలు సుమారు మొత్తము 5,31,255, ఎనిమిది వేలకు పైగా శాసన పాఠములు మదరాసుకు పంపబడినవి. ఇవి మొదట సెంట్ జార్జికోటలోని కాలేజి లైబ్రరీలో ఉంచబడి, తరువాత మదరాసు ప్రాచ్య లిఖిత గ్రంథ భాండాగారమునకు మార్చబడినవి. సుమారు నలువది సంవత్సరములకు తరువాత తెలుగు భాషకు అసమాన సేవ చేసిన సి. పి. బ్రౌను దొరగారు శిథిలము లగుచున్న కొన్ని స్థానిక చరిత్రలకు, తాళపత్ర గ్రంథములకు మరల ప్రతులు వ్రాయించిరి. మెకెన్జీ కైఫియతు లనుపేరిట ఆ గ్రంథాలయమున నిప్పటికి అతడు సేకరించిన చారిత్రక వృత్తాంతములు చాలగ నున్నవి. వీనిలో కొన్ని కలకత్తాకును, కొన్ని లండనుకును చాలకాలమునకు పూర్వమే కొనిపోబడినవి.

మెకెన్జీ భారత చరిత్రకారునికి చేసిన సేవ అపారము. ప్రపంచ చరిత్రలో ఒక్క మనిషి తన స్వయం కృషివల్ల ఇన్ని చారిత్రక పరికరములు సేకరించినట్లు ఇంకెక్కడను వినము, కనము.

కం. ఉ.

మొల్ల : ఈమె రామాయణమును 6 కాండముల పద్య కావ్యముగా రచియించి శ్రీరామ చంద్రునికి అంకితము చేసినది. ఇది మొల్ల రామాయణమని ప్రసిద్ధికెక్కినది. ఈమె కుమ్మర కులజయని చిరకాలమునుండి ప్రతీతి యున్నది. ఈమె భర్త పేరుగాని, ఇంటిపేరుగాని తెలియదు. ఈమె తనతండ్రి శివభక్తిపరుడును, గురులింగ జంగమార్చన పరుడునైన ఆతుకూరి కేసయయనియు, తనకు శ్రీ మద్గౌరీశ్వరుడైన గోపవరపు శ్రీకంఠమల్లేశ్వరునిప్రసాదమున కవితా సంపద లభించిన దనియు తన రామాయణములో చెప్పుకొన్నది. ఈమె జన్మస్థలము నెల్లూరు మండలములోని ఆత్మకూరని కొంద రందురు. గోపవరము ననుసరించి యీమె విషయమేదైన తెలియునేమో యన్నను నాంధ్రదేశమున గోపవరములు చాల గలవు. నెల్లూరు మండలములోను గోపవరము కలదు. ఎట్లయిన నీమె నివాసస్థల మేదియో నిర్ణయించుటకు సాధ్యముకాదు. కొంద రీమె విజయ నగరాధీశ్వరుడైన కృష్ణదేవరాయల కాలమునాటి దందురు. ఈమె కాలము విషయమునను నిట్టి చిక్కే కలదు. ఈమె తన గ్రంథములో పదునైదవ శతాబ్దిలో నుండిన శ్రీనాథుని మాత్రమే పేర్కొని అతనికి తరువాతి కవుల నెవ్వరిని దలపెట్టక పోవుటచేత నా శతాబ్దికి దరువాతి దనుట నిశ్చయము. రామాయణ మొకటి తక్క ఈమె రచించిన గ్రంథము లింకేవయిన గలవేమో తెలియదు. పోతనగారి నాదర్శముగా గొని ఈమె తన రచనా సంవిధానము నిర్ణయించుకొనినదా అని 'అవ్వాలిఁ బ్రతాపశాలి మృడవందనశీలి సురాలి మెచ్చఁగన్'. మున్నగు పంక్తులు తోపింప జేయుచున్నవి. మిక్కిలి పాండిత్యోద్ధతితో నిర్వహింపవలసిన 'విరోధాభాస శ్లేషాద్యలంకారములను సయితము వసుచరిత్రకారుడగు భట్టుమూర్తికి' ముందే ఈమె యత్నించి నిపుణత చూపి లోపరహితముగ నిర్వహించినది. స్వభావోక్తి రమణీయములైన ఘట్టములు, పద్యములు నీమె కావ్యమునందు కొల్లలుగా కాన్పించును.

మరియును, తన దిక్కులేమి తలపోసి దుఃఖించు సీతకు వినబడునట్లు 'ఉన్నాడు లెస్స రాఘవుడు' అనియు, సీత జాడ లరసి శ్రీరామచంద్రుని దర్శించినపుడు ప్రప్రథమమున అల్లంత దూరమున నుండియే 'కంటిఁ జానకి' ననియు సందేహ నివృత్త్యర్థకముగ, సమయస్ఫూర్తిగ భాషించిన అంజనానందనుని మాటల తీరును బట్టియు ఈయమకు ఔచిత్యస్ఫూర్తి మెండని రసజ్ఞులు అంగీకరించిరి.

ఇంత ప్రౌఢతతో కావ్యరచనము చేసినను అట నట దుష్ట సమాసములు మొదలగు నపప్రయోగములు కన్పించుచున్నవి. అయినను అవి యీామె రచన కపకర్ష కల్గించునట్టివి కాజాలకపోవుట గమనింపదగినది.

మొత్తముపై ఈమె కావ్యము 'తెనుగునకుఁ బొంకై, రుచియై, వీనుల విందై విబుధుల మదికిఁ' కానుపించునట్లు, 'కందువ మాటల సామెత, లందముగా గూర్చి' మిక్కిలి జాతీయమైన కవిత్వముతో కూడి తెల్గులకు గర్వకారణముగా నేటికిని మెరయుచున్నది.

డి.ల.కాం.

**మొహర్రమ్ :** 1. ముస్లిమ్ నెలలలో మొదటి నెల; (2) కర్బలా మైదానమున శ్రీ మొహమ్మద్ ప్రవక్త మనుమడును, అలీ ఫాతిమా (ఫాతిమా శ్రీ మొహమ్మద్ ప్రవక్త కూతురు)ల రెండవ కుమారుడును అగు హుసైన్ వీరమరణగాథ జరిగినది మొహర్రమ్ మొదటి పది రోజులలో అగుటచే సర్వ ముస్లిమ్ ప్రపంచము, ప్రత్యేకముగా షియాలు — ఆ దినములను దుఃఖదినములుగా పరిగణింతురు. మన దేశమున దీనిని పీర్ల పండుగ అందురు. నిజమునకు ఇవి పండుగ దినములు కావు, దుఃఖ దినములు.

శ్రీ మొహమ్మద్ ప్రవక్త పిదప ఖలీఫాలైనవారిలో నాల్గవవాడు ఆయన అల్లుడైన అలీ ఆయన మరణానంతరము ఆయన పెద్ద కొడుకగు హసన్ ఖలీఫా అయ్యెను. కాని అప్పటి మాండలికులలో ముఖ్యుడును, బలవంతుడును అగు ముఆవియా ఖలీఫా పదవి నాక్రమించెను. అతని మరణానంతరము హసన్ ఖలీఫా అగునట్లు ఒడంబడిక జరిగెను. ముఆవియా కుమారుడగు యజీద్ దుర్మార్గుడు. వాడు హసనుకు విష మిప్పించి చంపించెను. తండ్రి మరణించిన వెంటనే ఒడంబడిక ప్రకారము హసన్ తమ్ముడగు హుసైనుకు రావలసిన ఖలీఫా పదవిని తానపహరించెను. యజీద్ అధికారమునకును, దౌష్ట్యమునకును భయపడి పలువురు ఇది అన్యాయమని తెలిసియు పైకి పొక్కకుండిరి. కొందరు మాత్రము, ప్రత్యేకముగ కూఫానగర వాస్తవ్యులు హుసైను పక్షమున తాము పోరాడుదుమని హుసైనుకు రాయబారములు పంపిరి. నాటి ముస్లిమ్ సామ్రాజ్యమందలి ముఖ్యనగరములలో కూఫా ఒకటి. ఇది యూఫ్రటిస్ నది పశ్చిమ తీరమున బాగ్దాదుకు నాల్గు దినముల ప్రయాణములో ఉండెను.

హుసైను కూఫా ప్రజల ఆహ్వానము నంగీకరించి సకుటుంబ పరివారముగ ఆ నగరమునకు బయలుదేరెను. కూఫాలో జరగనున్న తిరుగబాటు సంగతి యజీదుకు తెలిసెను. వెంటనే వాడు ఉబైదుల్లా అను ఒక క్రూరుని కూఫాకు గవర్నరుగ నియమించి కుట్రదారులను అణచివేసెను. ఉబైదుల్లా వెంటనే హుర్ అనువాని ఆధిపత్యము క్రింద ఒకఆశ్వికదళమును హుసైన్ దారి నడ్డగించుటకై పంపెను; తాను నిజమైన ఖలీఫానని వారి నుద్బోధించెను. వారా మాటలను పెడచెవిని పెట్టి హుసైనును ఉబైదుల్లా పక్షమునకు రాగోరిరి. 'చావునైనను ఇచ్చగింతునుగాని ఉబైదుల్లా ఆజ్ఞలకు తలయొగ్గను' అని హుసైన్ బదులు చెప్పి తన పరివారమును ముందుకు సాగవలసినదని ఆజ్ఞాపించెను. హుర్ వారి దారి కడ్డు నిలిచి 'మీతో యుద్ధము చేయుటకు నా కాజ్ఞ లేదు. మిమ్ముల నెట్లయినను కూఫాకు పట్టుకురమ్మని ఆజ్ఞాపింప బడినాను' అని హుర్ ధృఢముగ చెప్పెను. హుసైన్ కూఫాకు పోవ నిరాకరించెను. అది మొహర్రమ్ మొదటి తేది నాటి మాట (హి. శ. 61 లేక క్రీ. శ. 680). హుసైన్ నాటి రాత్రి యంతయు ప్రయాణము సాగించెను కాని కూఫాకు మాత్రము కాదు. హుర్ ఆయన వెన్నంటి పోవుచుండెను.

మరునాటి ఉదయము ఉబైదుల్లానుండి ఒక వార్తావహుడు వచ్చెను. కోటగాని, పట్టణముగాని దగ్గరగా లేని చోటివరకు హుసైనును ప్రయాణము చేయనిచ్చి ఒకచోట హుసైను దారి నడ్డగించవలసిన దనియు, తాను వెంటనే సిరియన్ సైనికులను పంపించుచుంటి ననియు ఉబైదుల్లా ఆజ్ఞ వ్రాసి పంపెను. మరునాడే అమర్ అను సేనానాయకుడు నాలుగువేల ఆశ్విక దళముతో అక్కడికి వచ్చి చేరెను.

'మీ రిక్కడకు ఏల వచ్చితిరి ?' అని అమర్ హుసైను నడిగెను.

'కూఫావాసులు నన్ను రమ్మని వ్రాసిరి. ఇప్పుడు వా రణచబడినారు. అందుచే నేను తిరిగి మక్కాకు వెళ్లిపోవుచున్నాను' అని హుసైన్ ప్రత్యుత్తర మిచ్చెను. అమర్ దానికి సంతోషించెను. ఉబైదుల్లాకు ఈ వృత్తాంతము వ్రాసి పంపెను. కఠినుడగు ఉబైదుల్లా 'యూఫ్రటిస్ నదికిని, హుసైన్ పరివారమునకును మధ్య నీ సైన్యమును నిలబెట్టుము' అని ఆజ్ఞాపించెను. అమర్ అట్లే చేసెను. హుసైన్ పరివారము ఈ విధముగ అడ్డగింపబడిన మైదానమునే కర్బలా మైదాన మందురు.

హుసైనున కిదంతయు అర్థము కాలేదు. 'నేను యజీదును చూడబోయెదను. అది మీ కిష్టము లేదా మక్కాకు మరలిపోవుదును' అని హుసైన్ కబురంపించెను. ఉబైదుల్లా మొట్టమొదట కొంత మెత్తబడెను. కాని షుమ్ర్ అను సేనాని దాని కొప్పుకొనలేదు. అమర్ కుట్రదారులలో చేరినాడని వాడు ఉబైదుల్లాకు కొండెములు చెప్పి హుసైను వ్యవహారమును తన్ను చక్కబెట్టనీయ గోరెను. ఉబైదుల్లా దాని కంగీకరించి వానిని కర్బలాకు పంపెను. హుసైను ఏ షరతును లేకుండ లొంగిపోవలె ననియు అట్లు లొంగనిచో యుద్ధముచేసి హుసైనును వధించవలె ననియు షుమ్ర్ నిశ్చయించెను.

ఇదంతయు అయిదు రోజులలో జరిగిపోయెను. అది మొహర్రమ్ 9 వ తేది. అమర్ గుఱ్ఱము నెక్కి హుసైన్ శిబిరమునకు పోయి ఉబైదుల్లా షరతులను వినిపించెను. హుసైన్ మరునా డుదయము జవాబిచ్చెద ననెను. నాటి రాత్రి యంతయు హుసైన్ దైవప్రార్థనలో గడపెను.

తెల్లవారుజామున తన పరివార ప్రజలతో ఆలోచనలు సలిపెను. 'ఉబైదుల్లా నన్నొక్కనినే నాశము జేయగోరు చున్నాడు. నేను నశింతును. మీ రందరు ఇండ్లకు పొండు' అని ఆయన వారిని వేడుకొనెను. పరివారములో ఒక్క రును దాని కనుమతింపరైరి. యుద్ధమున వీర మరణము పొందుటకే అందరును నిశ్చయించిరి. దానికి తగు సన్నాహ ములు చేయసాగిరి. వా రందరు మొత్తము డెబ్బది ఇద్దరు.

ఇంతలో కొందరు అశ్వికులు తటాలున వారి గుడార ముల ముందునకు వచ్చిరి. శత్రువులు వచ్చిరని ఎక్కడివా రక్కడ ఆయుధహస్తులైరి. అట్లు వచ్చినది శత్రువులు కారని వెంటనే తెలిసెను. ప్రవక్త మనుమనితో యుద్ధము చేయుటకు హుర్‌కు ధైర్యము చాలలేదు. అతడు తన అనుచరులు కొందరితో కలిసి హుసైను పక్ష మవలంబించు టకు వచ్చెను.

త్వరలోనే యుద్ధము ప్రారంభమాయెను. అది మొహర్రమ్ 10 వ తేదీ. ఆ రో జంతయు ఘోరయుద్ధము జరిగెను. హుసైను సపరివారముగ వధింపబడెను. క్రూరు లగు శత్రువులు పిల్లలను సైతము చంపిరి.

ఈ సంఘటన ముస్లిమ్ ప్రపంచము నంతటిని దుఃఖమున ముంచెను. నాటినుండియు మొహర్రమ్ నెల పది దినములు ముస్లిము లందరును దుఃఖదినములుగ పరిగణింతురు. హుసైన్ చరిత్రమును, కర్బలా మైదాన వృత్తాంతమును సభలలో చదివి వినిపింతురు. చదువువారు ఆవేశముతో చదువుదురు. శ్రోతలుకూడ ఆవేశపరవశులై కన్నీరు కార్తురు. కొందరు గుండె బాదుకొందురు. ఇట్లు ఎక్కువ ఆవేశపూరితులగునది షియాలు.

'పంజా' లను అలంకరించి 'అషూర్ ఖానా' లలో నిలబెట్టుదురు. 'పంజా' అనగా హస్తము. అది హుసైన్ ధ్వజ చిహ్నము. విగ్రహములను చేయుట ఇస్లామ్ ధర్మ మందు నిషేధ మగుటచే హుసైన్ ధ్వజచిహ్నమును మాత్రము నిలబెట్టుదురు. పంజాలను 'అలమ్' అని కూడ అందురు 'అలమ్' అనగా ధ్వజము. ఆంధ్రదేశమున 'అలమ్' లను 'పీరు' లందురు. 'పీర్' అనగా 'గురువు' లేక 'మతగురువు' అని అర్థము.

మొహర్రమ్ పదవ దినమునాడు 'తాజియా' లేక గుమ్మటములలో పంజాలను ఉంచి జలోత్సర్జనము చేయు దురు. ఆంధ్రదేశమున గుమ్మటములను 'తాబూత్' లందురు. ఇది హుసైన్ సమాధికి ప్రతీకము. హుసైన్ సోదరుల మహత్తును చూపుటకై అగ్నిగుండములను త్రొక్కుట, ఇనుప శూలములను కంఠమున గ్రుచ్చుకొనుట మున్నగునవి 'శక్తులు' చేయుదురు. త్రాగుటకు నీరైనను లభించక క్రూరమరణమునకు పాలైన హుసైన్ కుటుం బమువారి ఆత్మశాంతికై నాడు షర్బత్ దానము చేయు దురు. అన్నదానముకూడ చేయుదురు; నాటి 'షహీదు' (ధర్మమార్గమున ప్రాణములను బలిదానమును చేసినవారు)ల ఆత్మశాంతికై పెక్కు ధర్మ కార్యములను చేయుదురు.

ఆంధ్రదేశమున మొహర్రమ్ జాతి మత కుల భేదము లేక అందరును చేయుదురు. ఒకప్పు డిది ఉద్ధృతముగ ఉండెను. మతాభినివేశము తగ్గుచున్నకొలది మొహర్రమ్ పూర్వ ప్రాముఖ్యము కొంత తగ్గినది. మొ. ఖా. ఖా.

**యక్షగానము :** ఆంధ్రతా ముద్రను భద్రపరచిన దేశి సాహిత్య ప్రక్రియలకెల్ల తలమానికము యక్షగానము. యక్షగాన గ్రంథము లాంధ్రమున పరశ్శతముగ వెలసినవి. అదియొక ప్రత్యేక శాఖగా వర్ధిల్లుచు వచ్చినది. కాని యది వట్టి సాహిత్యప్రక్రియ మాత్రము కాదు. సంగీతాభినయ కళలకును తానకమై దేశి సంస్కృతి కోశమై పరిఢవిల్లినది. అది కథకళికళాప్రతిష్ఠలు గల మలయాళ రాష్ట్రము వినా యావ ద్దక్షిణ భారతదేశ వ్యాప్తమైన కళాస్వరూప ముగా విరాజిల్లినది. అయితే ఆంధ్రమున యక్షగానమున కున్నంత ప్రాచీనతాస్థితి కడమయెడల గానరాదు.

యక్షగాన శబ్ద విచారమును, యక్షగానోత్పత్తి విచార మును, యక్షగాన ప్రాచీనతయు వాదవివాదములకు, ఊహా కల్పనములకు తావలములైనవి. కాని విషయ నిర్ధారణమున కింతవరకు తోడ్పడలేదు. కాని యక్ష గానము తొలుత మతప్రచారమున కేర్పడిన దనుట యథార్థముగ గన్పట్టును.

మన వాఙ్మయమున మొట్టమొదట యక్షాది నేపథ్య ములతోడి ఆటపాటల ప్రసక్తి పాల్కురికి సోమనాథుని పండితారాధ్య చరిత్ర పర్వత ప్రకరణమున గన్పట్టును; తదుపరి క్రీ. శ. 1430 ప్రాంతమున రచితమైన శ్రీనాథుని భీమఖండమున దాక్షారామ ప్రశంస సందర్భమున 'కీర్తింతు రెద్దాని కీర్తి గంధర్వులు గాంధర్వమున యక్షగాన సరణి' అను సీసపద్య పాదమున. యక్షగానమను సమస్తపద మొక విశిష్టార్థమున గనబడుట కిదే మొదలు. గానకళా ప్రావీణ్యా మునకు గంధర్వులది పెట్టినది పేరు. అట్టి గంధర్వులు 'యక్షగాన సరణి' పాడి రనగా అది యొక ప్రత్యేకమైన గానశైలి యని స్ఫురించుచున్నది. మార్వారు గంధర్వజాతి సామ్యమున మన రాష్ట్రమున నున్న జక్కులజాతి యొక ప్పుడు ఆ యక్షగానమును ప్రధానవృత్తిగా నవలంబించిన జాతి యనియు, వారి వృత్తికి సంబంధించిన యక్ష శబ్దము తత్రాపి వారికి జాతివాచకముగా పరిణమించి యుండు ననియు నూహింప వచ్చును.

యక్షగానము జక్కులపాట, యక్షశబ్దము జక్క శబ్దము అగుట భాషాశాస్త్ర సమ్మతము. నేటికిని గుంటూరు, గోదావరి మండలములలో అటనట జక్కులవా రున్నారట. వీరు కళావంతుల కోవకు చెందియున్నారు. వీరు అభినయ కళానుబంధము కలవారుగ తెలియుచున్నది. క్రీ. శ. 15వ శతాబ్ది ప్రథమ పాదమున వెలసిన క్రీడాభిరామమున 'జక్కులపురంధ్రి' గానకళా ప్రావీణ్యము విశేషముగ ప్రశంసింపబడినది. అందే ఆ వెంటనే భంగ్యంతరమున 'యక్షకన్యల' (జక్కుల పడుచుల) నృత్యముగూడ ప్రసక్తమైనది. జక్కులరేకు లనుపదములు, జక్కిణియను నృత్య ప్రబంధ విశేషము వీరి పేరనే ప్రసిద్ధములైయుండిన నుండ వచ్చును. క్రీ. శ. 15వ శతాబ్ది ఉత్తరార్ధమున ప్రోలుగంటి చెన్నశౌరి చెప్పినాడన్న సౌభరి చరితము 'జక్కులకథ' జక్కులవారు చేయుగానరూప కథాఖ్యాన ఫక్కిక మూదలగా రచింపబడి యుండును. క్రీ. శ. 16 వ శతాబ్ది చిత్రభారతమున 'యక్షకామినుల నాట్యము', 'యక్షవనితలపాట' రెండును ప్రత్యేకముగా పేర్కొనబడినవి. అవి యీ జక్కులపురంధ్రుల యాటపాటలకే భంగ్యంతర సూచనలు కావచ్చును. క్రీ. శ. 17 వ శతాబ్ది తంజాపురాన్నదాన నాటకమున జక్కుల రంగసాని సత్రములో పదకేళిక పట్టినట్లు కలదు. ఇన్ని విషయములు జక్కుల జాతికి గీతాభినయ కళలతోడి యనుబంధమును నిరూపించుచుండ యక్షగానమునకు వారితోడి యనుబంధము నూహించుట యసమంజసము గాదు. యక్షగాన ప్రాదుర్భావమునకు వారి యాటపాటలే కారణమై యుండును. వారి సంబంధము కారణముగా క్రీడాభిరామమున నుదాహృతమైన కామవల్లిపాట యను వారి కామేశ్వరీవ్రతకథ శివకేళవోభయ సంబంధి యగుటచేతను, అది యొక విశిష్ట వ్రతసంప్రదాయ ప్రతిపాదక మగుటచేతను యక్షగానము హైందవమతబీజక మనజెల్లును.

కొందరు విమర్శకులు యక్షగానోత్పత్తి విషయమును కొరవంజి బొమ్మలాటలతో ముడిపెట్టిరి. అవి యక్షగానములకంటె ప్రాచీనములైనవే యగును గాక, కాని యక్షగానమునకు వానితోడి సంబంధము మిగుల నర్వాచీనము. క్రీ. శ. 17 వ శతాబ్ది ముందుకాలమున వాని సంబంధము కనిపించదు. అదియునుగాక యక్షగాననామ సార్థకత నవి సమర్థింపలేవు. దానిని సమర్థింపగల యాధారాంతరములు కానరావు. అట్టి యాధారాంతరములు కనుపించునంత వరకు ఇప్పటి మట్టునకున్న యాధారములనుబట్టి యక్షగానమునకు జక్కుల సంబంధము నంగీకరించుటయే సమంజసముగా తోచుచున్నది.

రాయలసీమలో జక్కులవారి పేర ననేకగ్రామములు, వారి కొలమువేల్పులైన అక్కదేవతల కొండయు నుండుట మొదలగు విషయములనుబట్టి యది యక్షగానము జనుస్థానమని చెప్పనొప్పును. అక్కడనుండియే యది యటు తమిళ కన్నడ దేశములకును, ఇటు తెలంగాణా, సాగరతీరాంధ్ర ప్రాంతములకును వ్యాపించి యుండును. ఆయా ప్రదేశముల కది సరియైన కేంద్రముగ కూడ నమరియున్నది.

యక్షగాన మెంతో ప్రాచీనమైనదని పలువురు పండితుల తలంపు. కాని, క్రీ. శ. 1280 - 1340 నడుమ నుండిన పాల్కురికి సోమనాథుడు తన గ్రంథములలో సమకాలికములు, పూర్వకాలికములునగు ననేక దేశీయ నాట్య సంగీత సాహిత్య ప్రక్రియలను పట్టు పట్టినట్లు పట్టికలుగా నేకరువు పెట్టెను. కాని యక్షగానమును ప్రత్యేకముగా ఆ పేరుతో పేర్కొనలేదు. బహుశః యక్షగానము అప్పటి కొక విశిష్ట ప్రక్రియగా రూపొందలేదేమో! జక్కుల ప్రసక్తియు, వారి గానకళాప్రసక్తియు మన వాఙ్మయమున క్రీ. శ. 15 వ శతాబ్ది మొదటినుండియే కన్పట్టును అందుచే యక్షగానమున కాపేరు సార్థకము కాగల రూపము వచ్చియుండుట క్రీ. శ. 14 వ శతాబ్ది యుత్తరార్ధమున జరిగియుండునని యూహింప వచ్చును. భీమఖండోదాహరణమునుబట్టి గానరూప స్తోత్రపాఠము, క్రీడాభిరామోదాహరణమునుబట్టి గానరూప కథాఖ్యానము యక్షగానము యొక్క ప్రాథమిక స్వరూపము లనియు నూహింపనగును. ఆనాడు యక్షగాన పదంబులు

'సముచితానేకవిధతాళసంగతులను
నవరసాలంక్రియాసవర్ణంబు లగుచు'

నలరు చుండెడివని తాళ్ళపాక అన్నమాచార్యు డనియెనట. ఆ పదములు మొదట జక్కులపురంధ్రులచే జంత్రగాత్రములతో సపాదవిన్యాసముగా ప్రయోగింపబడుచుండి యుండును. కాలక్రమమున యక్షగానమునకు యక్షవేషములతో, జక్కులతో సంబంధము సడలినది. ఆ జక్కుల పాటల ఫక్కి కాకృష్టులై కొందరు శిష్టకవు లట్టి రచనలు పచరించిరి. అవి తత్రాపి రూపకకళ బ్రాపించినవి.

ఈనాడు యక్షగానమును దేశి సరణికి చెందిన నాటకముగా పండితులు పరిగణింతురు. మార్గ (సంస్కృత) సరణికి భిన్నమైనది దేశి. ఆ సంస్కృత రూపకోపరూపక లక్షణములకంటె విలక్షణముగా నుండుటయే యక్షగానము దేశిత్వము నిరూపించు లక్షణములలో మొదటిది. ప్రాచీన యక్షగాన గ్రంథములందు సంస్కృత రూపకము లందువలె నాందీప్రస్తావనలు, అంకవిభాగము, సంధినియ

మములు మొదలగునవి కానరావు. వానిలో సామాన్యముగా గనుపట్టు ప్రధాన రచనాంగములు మూడు: (1) రగడవికారము, తాళప్రధానములైన రేకు; (2) ద్విపద, (3) ఏలలు, అర్ధచంద్రికలు, ధవళ శోభనములు, అల్లోనేరేళ్ళు మొదలగు పదములు. ఈ మూడును దేశిచ్ఛందఃప్రక్రియ లనియే పలువురు పండితుల తలంపు. అట్లు నిరూపింప నవకాశము కలదు.

యక్షగానమునకు పుట్టినిల్లు ఆంధ్రదేశము. అటు తమిళ కన్నడ దేశములు, ఇటు తెలంగాణమును దానికి విహార భూములైనవి. ఒక్కొకచోట దాని పరిణామము ప్రత్యేకముగా పరిశీలింపదగినది.

మన వాఙ్మయమున నిప్పటికి తెలియవచ్చినంతలో చెన్నశౌరి సౌభరిచరితమే మొదటి యక్షగానరచన. అది క్రీ. శ. 15వ శతాబ్ది ఉత్తరార్ధమునాటిది. అప్పటి రచనాప్రక్రియ చూతమన్న చెన్నశౌరి గ్రంథము ఇపు డుపలబ్ధము కాదు. క్రీ. శ. 1550 నాటి చిత్రకవి పెద్దన లక్షణసారసంగ్రహమున నదే మొదలుగా యక్షగాన లక్షణపు టుబుసు కొంత వచ్చినది; అనగా నంతకుముందే లక్ష్యకోశము కొంత యుండవలెను. నేడం దొక్కటైనను మచ్చునకు లేకుండ బోయినది. ఇపు డుపలబ్ధములగు యక్షగానములలో కవికాలము తేలినంతలో కందుకూరి రుద్రకవి సుగ్రీవవిజయమే ప్రాచీనతమమైనదిగా పరిగణింపబడుచున్నది. రుద్రకవి పెద్దన కొక్కింత యర్వాచీనుడు. సుగ్రీవవిజయమును యక్షగానమని వక్కాణించి యున్నాడు కవి. పెద్దన యక్షగానములం దుపయుక్తములగు రగడ భేదముల నుదాహరించుచు ఏ రగడ కే తాళము సరిపడునో మాత్రమే చెప్పియున్నాడు. సుగ్రీవ విజయమును జూచినచో నం దట్టి తాళప్రభేద విశిష్టములగు రగడబంధములే (రేకులే) కాక ద్విపదలు, అర్ధచంద్రికలు, ఏలలు, ధవళ శోభనములు, కొలది పద్యములు, సంధి వచన ప్రాయములైన చిన్న చిన్న వచనములును గన్పట్టును. క్రీ. శ. 1600 ప్రాంతపు చక్రపురి రాఘవార్యుని విప్రనారాయణచరిత్ర, బాలపాపాంబ అక్కమహాదేవిచరిత్ర మొదలయిన యక్షగాన రచనాప్రక్రియ యిట్లే యున్నది. అస లాంధ్రదేశమున యక్షగాన రచన సుమారు రెండు శతాబ్దులదాక ఇంచుమించుగ అట్లే కొనసాగినది. కంకంటి పాపరాజువంటి విదగ్ధులు కొందరు విశేషములు చేర్చుచు వచ్చిరి. పాపరాజు యక్షగాన కృతి విష్ణుమాయావిలాసము. క్రీ. శ. 1650 ప్రాంతమం దుండిన అప్పకవి పెద్దన చెప్పిన లక్షణమును పునశ్చరణ చేసినాడు. అత డొక లక్ష్యమును రచించినాడట కాని అది యలబ్ధము. ఆ లక్షణ మపర్యాప్తమే. కాని వా రా యక్షగానరచనాంగములలో ముఖ్యమైనదానిగురించిమాత్రమే చెప్ప సంకల్పించిన ట్లున్నది. ఇరువురకును సుమా రొక శతాబ్ది యెడమున్నను అదే లక్షణమును అప్పకవి యంతటి లాక్షణికుడు మరల చెప్పినా డనగా తాళప్రధానమైన ఈ రేకే, అనగా దాని మూలప్రకృతియగు రగడయే చాల కాలము యక్షగాన ప్రధానాంగముగా పరిగణింపబడుచుండె ననుట నిర్వివాదము. దరు వన్నది సంస్కృత 'ధ్రువా' శబ్ద భవమై యుండును. భరతమునందువలెనే యక్షగానమునందు నిది యనేక ప్రయోజనముల కుపయోగింపబడినది. ఇది రాను రాను కర్ణాటక హిందూస్తానీ సంగీత పద్ధతులకు ప్రచారము గల్గిన రోజులలో కవుల యుపజ్ఞ కొలది రగడ వికృతి విడిచి రాగప్రాధాన్యము వహించినది. అప్పకవి తరువాత యక్షగానపు టుబు సెత్తుకొనిన లాక్షణికు లొకరిద్దరు లేకపోలేదు. కాని యెవరు చెప్పినను ఆ లక్షణమున కవ్యాప్తి పట్టుచునే వచ్చినది. ఎట్టి ఛందోబంధమునైనను తనలో నిముడ్చుకొనగల్గునట్టిది యక్షగానము. కాని బహుగ్రంథ పరిశీలనమువలన దేలిన విషయము - యక్షగానములో రేకు లేక దరువు, ద్విపద, గద్య పద్యములు ముఖ్యములైన రచనాంగములు.

ఆదినుండి మన వాఙ్మయమున వర్ధిలుచు వచ్చిన ప్రధాన కావ్య పద్ధతులు రెండు - చంపువు, ద్విపద. చంపువు గద్యపద్యోభయాత్మకమైనది. అందు ద్విపద కవకాశము లేదు. అది మార్గి. ద్విపద కావ్యములందు గద్యపద్యములు లేవు. అది దేశి. పండిత కవులు యక్షగానరచన చేపట్టి జక్కుల పాటలలో ప్రాయశః ప్రధానములై యుండు రేకులను, పదములు మొదలగు దేశి సరణికి చెందిన ఇతర మధుర కవితారచనలను గ్రహించుచు పై రెండు పద్ధతులకు నేకవాక్యత ఘటించిరి. ఆ మధుర కవితారీతులలో అర్ధచంద్రికలు, ఏలలు, ధవళ శోభనములు మొదలగువానికి వ్యాప్తి యెక్కువ. ఇతరములు - సంస్కృత శ్లోక చూర్ణికలు అష్టకములు మొదలగునవియు ఆ యా కవుల యభిరుచులనుబట్టియు, అవకాశములను బట్టియు చేరుచువచ్చినవి. తొలుతటి యక్షగానములలోని వచన భాగము స్వల్పము - ఎడనెడ కథానుసంధానమున కుద్దిష్టములైన చిన్న చిన్న సంధి వచనములవంటివి.

సుగ్రీవవిజయమును జూచినచో అది ప్రదర్శన సౌలభ్యము గల రచన యనియే తోచును. పాత్రల సంభాషణలు వచనమున లే వన్నమాటగాని గ్రంథమున ఆఖ్యానశైలి కంటె సంవాదశైలికే ప్రాధాన్యము. సంభాషణ లెక్కువగా దరువులలో సాగినవి. ఎడనెడ నున్న చిన్నచిన్న వచన

ములు కథానుసంధానమున కుద్దిష్టములైనవి. అవి యే సూత్రధారునివంటివానిచేతనో పఠింపబడును. ఇది పలువురచే పాడబడుటయు, వీథియాటగా నాడబడుటయు గల దని కీ. శే. ప్రభాకరశాస్త్రిగారును, ఇది కవికాలమున నే ప్రదర్శింపబడియుండునని డాక్టరు నేలటూరి వెంకట రమణయ్యగారును సెలవిచ్చియున్నారు; అనగా క్రీ. శ. 16 వ శతాబ్దినాటికే యక్షగానము ఆంధ్రదేశమున ప్రదర్శన కెక్కియుండునని కొంత నిబ్బరముగా పలుక వచ్చును. ఆనాటి యక్షగానము లెట్లు ప్రదర్శింపబడినవో కాని, అప్పటికే వీథినాటకాది ప్రదర్శనముల నతి ప్రసిద్ధులును, భరతవిద్యాధురంధరులును నగు కూచిపూడి భాగవతులవలన పిదపకాలమున యక్షగాన ప్రదర్శనల కొక నూతన చైతన్యము, ప్రచారము గల్గినవి. క్రీ. శ. 17 వ శతాబ్ది ఉత్తరార్ధమునందలి వారి కులపతి సిద్ధేంద్ర యోగి అపూర్వసృష్టియగు 'కలాపము' ప్రదర్శన ప్రక్రియలో నృత్యప్రధానమైనది. కాని దాని రచనా ప్రక్రియకు కొంతవట్టు యక్షగానమే మూదల యన వచ్చును. ఆ కలాప ప్రభావము అర్వాచీన యక్షగానముల మీదను పడినది. కూచిపూడివారు తెలుగునేల నాలుగు చెరగులకును దిరిగిరి. వారి ప్రదర్శనలు కారణముగా ఆయాయూళ్ళ మొలిచిన యక్షగాన మేళములవారు కూచిపూడికత్తె నెవరి యోపినకొలది వా రనుకరించిరి. ఏనాదులు, గొల్లలు మొదలగువారును యక్షగానప్రదర్శనలకు బూనుకొనిరి.

యక్షగానము ప్రదర్శనల కెక్కినను చాలకాలము దనుక దాని శ్రవ్యప్రయోజనముకూడ ప్రక్క ప్రక్కల సాగుచునే యున్నది. క్రీ. శ. 18 వ శతాబ్దినాటి రాయదుర్గ దళవాయి తిమ్మప్ప రచించిన ప్రసన్న వెంకటేశ్వర విలాసము, గోగులపాటి కూర్మనాథకవి మృత్యుంజయ విలాసము మున్నగునవే యిందులకు తార్కాణలు. అవి గ్రంథకర్తలచేతనే రెండు ప్రయోజనములకు నుద్దేశింపబడినవి.

క్రీ. శ. 19 వ శతాబ్ది ఆంధ్రదేశమున యక్షగాన మెక్కువగా పరిణతి చెందిన కాలము. యక్షగానములు కోకొల్లలుగా వెలసినవి. ఇంచుమిం చన్నియు నాటకనామముతో ప్రదర్శనల కెక్కినవే. యక్షగానమేళము లనేకము వెలసినవి. యక్షగాన రచనలలో ప్రదర్శనలలో స్త్రీలును పాల్గొనిరి. బొమ్మలాటలకుగూడ నుపయుక్తములగు నట్లు యక్షగానములు రచింపబడినవి; ఉదాహరణము: గుజ్జువాడ లక్ష్మణమూర్ఛ, సంతవేలూరు కుశలవ, పాత పట్టణము బాణాసుర నాటకము మొదలైనవి. బాగేపల్లి అనంతరామాచార్యులు, ఆదిభట్ట నారాయణదాసు మొదలగు హరిదాసులు తమ హరికథలను యక్షగానము లనియు వ్యవహరించిరి. కన్నడదేశమునను యక్షగానము నిట్లు బొమ్మలాటలకు, హరికథలకు నుపయోగించు నాచారము కలదట. గాయకవాడ పెద్దన, ధేనువుకొండ వెంకయ్య, పుసులూరి సుబ్బరాయకవి మొదలగు జంగంకథల కవులును యక్షగానములు రచించిరి. ఆ శతాబ్ది ఉత్తరార్ధమున ఆంధ్రలో యక్షగానముపై అంక రంగవిభాగాది విషయముల ఆధునిక నాటకప్రభావమును పడినది. ఇందులకు ప్రబలోదాహరణము కేశిరాజు వెంకట సుబ్బరాయ కవిగారి రామదాసు నాటకము. యక్షగానమే ఆధునిక నాటక ప్రాథమికస్వరూప మనువాదము ప్రామాదికము. అది ధార్వాడ నాటక ప్రదర్శనముల ఫలితము. ఈ క్రీస్తుశక మిరువదవ శతాబ్ది పూర్వార్ధమున యక్షగాన రచనా ప్రదర్శనములు ఆధునిక నాటకముల, సినీమాల ప్రభావమున అతివిరళముగా సాగి ఈనాడు అడుగంటుచున్నవి.

ఆంధ్రదేశపు యక్షగానములందు ముక్కాలు మువ్వీసము పౌరాణికేతివృత్తములే. బసవేశ్వరుడు, విప్రనారాయణుడు, భద్రాచల రామదాసు, పోతులూరి వీరబ్రహ్మము మొదలగు ప్రసిద్ధ పురుషుల జీవితోదంతములును యక్షగానేతివృత్తము లైనవి. ముందునాటి పారిజాతాపహరణ, కళాపూర్ణోదయాది ప్రసిద్ధ ప్రబంధములును యక్షగానములుగా పరివర్తింపబడినవి. అంతే కాదు; రచనా ప్రక్రియలోను, షష్ఠ్యంతములు ఆశ్వాస విభాగము వర్ణనలు శైలి మొదలగు విషయములలోను యక్షగానములపై ప్రబంధపు పలుకుబడి అతి మాత్రముగా గన్పట్టును. కొన్ని యక్షగానములు ప్రబంధము లనియు వ్యవహరింపబడినవి.

ఆంధ్రదేశమున యక్షగాన రంగవిషయమున మాత్రము అభివృద్ధి కన్పట్టదు. అప్పటి కప్పు డే యూరి మొగనో, ఏ గుడి ముంగిటనో తాటాతూటముగా నిర్మింపబడిన పందిరిక్రింది కరకునేలయే రంగస్థలము. చుట్టును కనుచూపున కందుమేర యంతయు ప్రేక్షాగారమే. భరత విద్యాధురంధరులగు కూచిపూడివారును ఊరూర దిరుగువారగుటచే రంగస్థలవిషయమున శ్రద్ధ వహింపరైరి. అటునిటు చెరియొకనిచే పట్టుకొనబడిన తెల్లని గుడ్డయే తెర. తెర కటు నిటు నూనె దివిటీలు. తెరవెనుక హంగుదారులు, వంతపాటకులు, హంగు - తిత్తి మద్దెల తాళపు చిప్పలు. తెరముందు సూత్రధారుడు. అతడే ప్రదర్శన ప్రవర్తకుడు. ప్రార్థనాదికము, కథాసందర్భ వివరణ, పాత్ర ప్రవేశసూచన, పాత్రలను పల్కరించుట, పాత్రలకు

వంతపాటకులకు పల్లవు లందించుట, పాత్రల అభినయాను కూలముగ తాళము వేయుట, సంధి వచనములు చదువుట, అప్పు డప్పుడు హాస్య ప్రసంగములు నెరపుట మున్నగునవి యతని పనులు. సాధారణముగా ప్రదర్శనలు జాము రాత్రికి ప్రారంభమై తెల్లవారులు నుండును. కొన్ని కొన్ని కథ లైదారు రాత్రులు ప్రదర్శింపబడుటయు కలదు. ఆంధ్రదేశ యక్షగాన ప్రదర్శనల సామాన్యపద్ధతి యిది. ఆయా ప్రదేశముల ప్రదర్శకుల అభిరుచులనుబట్టి, అవకాశ ములనుబట్టి విశేషము లుండవచ్చును. పాత్రల ఆహార్య విషయమున కూచిపూడివారి గణియములు, సరంజామా పేరు పడ్డవి. ఆంధ్రదేశమున వారి ప్రదర్శన పద్ధతులే ఆదర్శప్రాయములైనను ఆ పద్ధతుల లగువు బిగువులు కడమచోట్ల నంత కానరావు. ఒకప్పు డాంధ్రుల నాట్య కళా ప్రతిష్ఠ కధిష్ఠానమైన కూచిపూడిలోనే ఈ నా డా ప్రతిష్ఠ లడుగంటిన వనగా కడమయెడల యక్షగాన ప్రదర్శనల పరిస్థితి యడుగ నక్కరలేదు.

తంజావూరిలో యక్షగానమునకు రాజభోగము పట్టి నది. రాజకవియగు రఘునాథుడే యక్షగాన రచన చేపట్టి నాడు గాని యతని కొడుకగు విజయరాఘవుని రాజ్య కాలమున (క్రీ. శ. 1633 - 73) దాని ప్రతిష్ఠ మిన్నుముట్టి నది. అతని కాలమున యక్షగానమున కా పేరు పోయి నాటకనామము ధ్రువపడినది. నాటకశబ్ద మిట సామాన్య దృశ్య ప్రబంధవాచి. నాడు అది యొక చాటుకావ్యముగా పరిగణింపబడినది. నాటికవు లనేకులు యక్షగాననాటకము లను రచించిరి. అవి యన్నియు నాడుకొలువు నట్టువమేళ ములవారిచే ప్రదర్శింపబడుటకు రచింపబడినవి. అందు దరువులకు తాళప్రాధాన్యము తగ్గి రాగప్రాధాన్యము హెచ్చినది. మధుర కవితారీతుల ప్రాచుర్యము కొంత తగ్గి క్షేత్రయ్య పదములవంటి పదములు, జానపద గేయము లును చేరినవి. పద్యము కంటె గద్యమునకు ప్రాముఖ్యము వచ్చినది. సంధి వచనముల సంఖ్య తగ్గి పాత్రలు వచనమున పరస్పరము సూటిగా సంభాషించు పద్ధతి యెక్కువగా పాటింపబడినది. అట నట రంగప్రయోగ సూచనలు కలవు. మార్గ రూపక సంప్రదాయమునుండి భరత వాక్యము గ్రహింపబడినది. తాత్కాలిక విషయములు నితివృత్తములైనవి. అందు నాయకరాజుల వివాహ శృంగార విహారాదికము, ఆస్థాన వైభవము మొదలగు రాజోదంతములు ప్రధాన విషయములు. ఔపచారికముగ ప్రజా జీవిత విశేషములు ననేకము గ్రహింపబడినవి. విజయరాఘవుని రఘునాథాభ్యుదయమున పురవీథుల నూరేగవచ్చిన నాయకుని జూచి నాయిక మరులుకొనుట

అను తమిళ 'ఉలా' ప్రబంధపు పోకడ గలదని మల్లం పల్లి సోమశేఖర శర్మగారు గుర్తించిరి. ఇది యొక ముఖ్య విశేషమే. తరువాతి దక్షిణ దేశపు ప్రభునాయకములైన యక్షగానములం దీ పోకడ తరచుగనే కన్పట్టును.

విజయరాఘవునితో తంజావూరున నాయకరాజ్య మంత రించినది. మహారాష్ట్రులు ప్రభువులైరి. వారును మన తెనుగు యక్షగాన నాటకములయెడ అధికారము చూపి యుండుట కడు ముదావహము. అందు శహాజీ (క్రీ. శ. 1684 - 1712) అనునతడు వాని విషయమున అపర విజయరాఘవుడు. అతడు స్వయముగా నిరువదింటికి కర్త. అందు కొన్ని నాటకములు, కొన్ని ప్రబంధములు నని పేర్కొనబడినవి. అన్నియు ప్రయోగోద్దిష్టములైనవే. శహాజీ గ్రంథారంభమున ద్విపదలో కథాసంగ్రహము చెప్పును. గణపతిప్రార్థనతోపా టతని నొక పాత్రవలె ప్రవేశపెట్టును. కటికవాని వాలకము నొక సాంప్రదా యిక హాస్యపాత్రగా రూపొందించెను. పాత్రోచిత భాషతో, వాకోవాక్య పద్ధతితో వచనప్రచురముగా రచన గావించెను. అడుగడుగున పాత్రప్రవేశసూచక కథానుసంధానకములైన సూత్రధార ప్రసంగములు, అట నట భాగవతులు పాత్రలను పలుకరించుట మొదలగు విశే షము లతని కృతులలో గన్పట్టును. అతని త్యాగ వినోద చిత్రప్రబంధనాటకమున అంకవిభాగముకూడ గన్పట్టును. అతని యాస్థానాంధ్ర యక్షగాన కవులలో దర్భా గిరిరా జగ్రగణ్యుడు. అత డారు యక్షగానప్రాయము లైన రచనలను చేసెను. అన్నియు రాజసంబంధేతివృత్త ములు. అం దొకటి యక్షగానమని పేర్కొనబడియుండు టయు, అది పేరికి తగినట్లు తాళప్రధానములగు దరువు లతో నుండుటయు విశేషము. ఇతని కృతులలో విశిష్ట మైన దిం కొకటి రాజమోహన కొరవంజి. ఇది యక్షగాన ప్రాయమైన రచనయే. కొరవంజి యనగా నది తమిళ శబ్దము, ఎఱుకత యని యర్థము (సింగి యనియు నామాంతరము). కావ్యప్రక్రియగా తత్పాత్ర విశిష్టము లగు యక్షగానములకే అది యొక నామాంతరముగా గన్పట్టుచున్నది. కొరవంజి ఒక నృత్యవిశేషముగా ప్రాచీన తమిళ వాఙ్మయమున ప్రసక్తి కలదు కాని యిట్టి దృశ్య రచనలు తమిళమునను క్రీ. శ. 17వ శతాబ్దికి ముందు గన్పడుట లేదు. విజయరాఘవునినాటి యక్షగాన ములలోనే కొన్నిట కొరవంజిపాత్ర గన్పట్టుచున్నది. కాని ఆ పాత్రకు ప్రాముఖ్యము గల్గి ఆ పేరుతో వ్యవహ రింపబడినవానిలో మన కిప్పటికి గిరిరాజకృతియే మొద టిది కావచ్చును. మైసూరి కంఠీరవరాజు రచించిన ఆంధ్ర

కొరవంజియు నించుమించుగా ఆ కాలమునాటిదే. పిదప కాలమున ఆంధ్రదేశముననను కొన్ని కొరవంజులు వెలసినవి. కొరవంజులలో ప్రాయికముగా విప్రలబ్ధయైన నాయిక కామె ప్రియ సమాగమమును గూర్చి కొరవంజి సోది చెప్పుట ప్రధాన విషయము. అందు కొరవంజి వేషభాషలు, కులాచారములు, తిరిగిన దేశములు, కొలిచిన దేవతలు, ప్రియుడగు సింగనితో ప్రసంగములు మొదలగు విషయము లుండును.

శహాజీనాటినుండి చిట్టచివరి శివాజీనాటివరకు (క్రీ. శ. 1833 - 1855) నల్లే యక్షగాన నాటక రచనయు, ప్రదర్శనములును సాగినవి. విజయరాఘవుని భరతవాక్యము శహాజీనాటి అంకవిభాగము మొదలగు విషయముల ద్వారా వికీర్ణముగా పొడసూపిన మార్గ నాటక ప్రభావము తుళజరాజు (క్రీ. శ. 1728 - 1736) రచనలలోని నాందీ ప్రస్తావనలద్వారా విస్తరిల్లి శివాజీరచనయగు అన్నపూర్ణాపరిణయమున పరిపూర్ణత నందినది. యక్షగాన ముత్పత్తిలో దేశియైనను పరిణామమున మార్గియైనదనవలెను.

తంజావూరున రాజాశ్రితులుగాని యక్షగాన కవులును కొందరు గలరు. వారిలో ముఖ్యులు నారాయణ తీర్థులు, త్యాగరాజు, మేలత్తూరు వెంకటరామశాస్త్రి. ఈ వెంకటరామశాస్త్రి కృతులనే మేలత్తూరు భాగవతమేళనాటకము లందురు. అవి రచనా ప్రక్రియలో తంజావూరు యక్షగానములవంటివే. కాని ప్రదర్శన ప్రక్రియ, సంప్రదాయములు కథకళి, కూచిపూడి కత్తులవలె విశిష్టములైనవి. వీనికి నృత్యనాటకము లనియు పేరు. ఇవి బ్రాహ్మణ భాగవత మేళములచే మాత్రమే ప్రదర్శింపబడును. నేటికిని తంజావూరున ప్రదర్శన ప్రతిష్ఠలు మిగిలినది వీనికే.

క్రీ. శ. 18 వ శతాబ్దిలో మధుర పుదుక్కోట మైసూరుల రాజాస్థానములలోను, కడమ కన్నడ తమిళ ప్రాంతములందును కొలదిగానైనను వెలసినవి తెలుగు యక్షగానములు. అందు మైసూరి ప్రభువగు కంఠీరవరాజు స్వయముగా తెనుగున కొన్ని కైశికీవృత్తి విశిష్ట నృత్యప్రయోగోద్దిష్టములగు యక్షగానప్రాయరచనలు చేసియుండుట విశేషము. ఆ కాలముననే తమిళ, కన్నడ భాషలందును యక్షగానరచన చురుకుగా సాగినది.

దక్షిణదేశపు యక్షగానములలో పౌరాణికేతివృత్తములేకాక తాత్కాలిక రాజ సంబంధేతివృత్తము లనేకము వెలసినవి. సాంకేతిక చిత్రణతో తత్త్వ విషయకములును కొన్ని వెలసినవి. దక్షిణదేశమున యక్షగాన ప్రదర్శనలు రాజాస్థానములం దతివైభవముతో భరత విద్యాపద్ధతి నించుమించు మార్గరూపక ప్రదర్శనల స్థాయిలో జరిగినవని యూహింపనగును.

తెలంగాణమున యక్షగానములు వందకు పైచిలుకు కన్పడుచున్నవి. అయితే అచట యక్షగాన రచన క్రీ. శ. 18 వ శతాబ్దినుండియే విరళముగా ప్రారంభమైనది. అచటి యక్షగానములు తొలుత ప్రదర్శనలకంటె పారాయణము లందే ఎక్కువ ప్రచారము కాంచినవి. క్రీ. శ. 1780 ప్రాంతమునాటి శేషాచలకవి ధర్మపురి రామాయణము, క్రీ. శ. 1834 ప్రాంతమునాటి ముద్దయకవి మంథెన రామాయణము మొదలగునవి అట్టివే. అందు ధర్మపురి రామాయణము ప్రతిష్ఠ ఆంధ్రరాష్ట్రమునకును - విశాఖ మండలముదాక ప్రాకినది. ఆంధ్రదేశ యక్షగాన ప్రదర్శకు లందలి దరువుల నుపయోగించుకొనుట కద్దు. తెలంగాణలో క్రీ. శ. 19 వ శతాబ్ది ఉత్తరార్ధమునుండి ప్రదర్శనోద్దిష్టములైన రచనలు సాగినవి. గోవర్ధనం నరసింహాచార్యులు, శేషభట్టరు కృష్ణమాచార్యులు, వట్టెము పాపకవి మొదలగు పండిత కవులును యక్షగానరచన చేపట్టిరి. ఆ కాలమున నచట యక్షగానరచనకు రాజాశ్రయమును లభించినది. ఆత్మకూరు సంస్థానాధీశుడగు ముక్కర సీతారామ భూపాలున కాశ్రితుడు రామదాసను కవి తారాశశాంకము, భీమసేన విలాసము అను యక్షగానములు రచించెను. ఆ కాలముననే అచట ఒక గొల్లభామకలాపము (గోవర్ధనం వారిది), ఒక కురవంజి (రూఘానుపేట రత్నమ్మ గారిది)యు వెలసినవి.

క్రీ. శ. 20వ శతాబ్దిలో తెలంగాణములో యక్షగానరచనయు, ప్రదర్శనములును సజీవములై యున్నవి. ప్రసిద్ధ పురాణగాథలతోపాటు పల్లెపట్టులందు పదములు గట్టి పాడబడుచుండు కాంబోజరాజుకథ, బాలనాగమ్మకథ, ఆరె మరాటీలకథ, పెదబొబ్బిలిరాజుకథ మొదలగునవి యచట యక్షగాన వస్తువులైనవి. ఇట్టి రచనలకు జీవత్కవి చెర్విరాల భాగయగారిది పెట్టినది పేరు. వీరి యక్షగాన కృతులు ముప్పదిరెండు. ఇన్ని యక్షగానములు రచించిన కవి ఇప్పటి కాంధ్రదేశమున మరిలేడు. యక్షగాన రచనలో ఆయన కొందరు కవులకు గురుత్వము వహించినవారు. వీరు తమ కృతులను యక్షగానములనియే వ్యవహరించిరి. వీరి తరువాత నేటి తెలంగాణపు యక్షగానకవులలో ప్రసిద్ధులు బూరుగుపల్లి సోదరులు. వీరు తమ కృతులను నాటకములని వ్యవహరించిరి. తెలంగాణములో వీథినాటక, వీథి భాగవత నామములతోడను కొన్ని గన్పట్టుచున్నవి. అవియు యక్షగానమానసపుత్రికలే. అన్నియు ప్రదర్శనోద్దిష్టములైనవే. వీనిపై ఆధునిక నాటక ప్రభావము;

యుగ ప్రభావమును బాగుగ గన్పట్టును. నటీసూత్రధారుల ప్రస్తావనలు, సంధివచనములకంటె పాత్రల ముఖాముఖి సంభాషణములు తరచు కన్పట్టును. కాలానుగుణముగ కల్పితకథలు నితివృత్తములైనవి. ఉదా: పట్లోరి వీరప్ప గారి క్రోధాపురి రైతువిజయ మను వీథినాటకము. ఒకవిధమగు నేటి సామ్యవాద సిద్ధాంతమును ప్రతిపాదించునట్టి దిందలి యితివృత్తము. ఇందు గాంధీస్తుతి, భారతమాతస్తుతియు గలవు.

తెలంగాణములో యక్షగాన రచన ఆలస్యముగా ప్రారంభమైనను ఆధునికయుగమున చకచక సాగి విషయ వైవిధ్యమును ప్రదర్శించి ప్రదర్శన ప్రతిష్ఠ లందుకొన్నది. ఆ రచన లంత నిర్దుష్టములు గాకపోయినను ప్రజామోద మును చూరగొన్నవి. ఆంధ్ర యక్షగానవాఙ్మయకోశమున తంజావూరు 'వాటా' యెట్లు స్మరింపరానిదో తెలంగాణపు వాటాకూడ నట్లు విస్మరింపరానిది. యస్వీ. జో.

**యజ్ఞనారాయణ దీక్షితుడు:** ఇతడు రఘునాథ నాయకుని గురువును, మంత్రియును నైన గోవిందదీక్షితుని జ్యేష్ఠపుత్రుడు. రఘునాథునకు శిష్యుడై సకల విద్యల నభ్యసించి గురువునుండి మెప్పుగా గర్ణాలంకారమును, పదకమును బొందెను. ఇత డెరిగిన విద్యలను గూర్చి

'పాతంజలం భాట్టమతం చ తర్క-
మద్వైత రాద్ధాంతమపైమి కీర్తేః
ప్రబంధ సందర్భ భరైః కవిత్వ
విద్యా మిదానీం ప్రకటీకరోమి'

అని సాహిత్య రత్నాకరమున జెప్పికొనినాడు. ఇతడు సాహిత్య రత్నాకరము, రఘునాథవిజయము (కావ్యము), రఘునాథ విలాసము (నాటకము), అలంకార రత్నాకరము అను గ్రంథములను రచించెను. రఘునాథవిజయమున రఘునాథనాయకుని చరిత్ర తన కాలమునుండి వర్ణించెను. వే. తి.

**యజ్ఞేశ్వర చింతామణి, చిర్రావూరి** (క్రీ. శ. 1880-1941): చింతామణి విజయనగరమున జన్మించెను. విజయనగర మహారాజావారి కళాశాలలో చదువుకొనునపుడే ఆయనను దేశ సేవ ఆకర్షించినది. అంతటితో చదువునకు స్వస్తి చెప్పి 1900 సంవత్సరములో నానాకష్టములు పడి కాంగ్రెసుమహాసభలో పాల్గొనుట కాయన లాహోరునకు పోయెను; అక్కడ వివిధ విషయములపై ప్రసంగించి సురేంద్రనాథ బెనర్జీవంటివారిచే ప్రశంసల నందెను.

ఆయన తిరిగి స్వస్థలమునకు వచ్చినపిదప విజయనగరములో 'తెలుగు హార్ప్' అను పత్రికను కొంతకాలము నడపెను; తరువాత విశాఖపట్టణమునుండి 'వైజాగ్ స్పెక్టేటరు' అను పత్రికను కొంతకాలము, 'ఇండియన్ హెరాల్డ్' అను పత్రికను కొంతకాలము నడిపెను; ఈ ప్రయత్నములు సరిగ సాగకపోవుటచే మద్రాసు చేరి 1901 లో 'యునైటెడ్ ఇండియా' అను ఆంగ్లపత్రికా కార్యాలయమున నొక చిన్న యుద్యోగమున జేరి, క్రమముగా 'మద్రాసు స్టాండర్డు' అను దైనిక పత్రికలో ప్రవేశించెను.



చిత్రము 200.
చిర్రావూరి యజ్ఞేశ్వర చింతామణి

కాని అచట తనకు సరియగు అవకాశములేదని తలచి 1909 లో ఆయన అలహాబాదులోని 'ఇండియన్ పీపిల్' అనుపత్రికకు సంపాదకుడుగ వెళ్ళెను; 1911 లో పండిత మదన మోహన మాలవ్యా వగైరాలచే నడపబడు 'లీడరు' పత్రికకు సంపాదకుడుగా నుండి తన రచనా కౌశలముచే ఆ పత్రికకు దేశవ్యాప్తమగు కీర్తి తెచ్చెను; 1916 లో రాజకీయములందు పాల్గొనవలయునను కోరికతో పత్రికా సంపాదక పదవికి రాజీనామా నిచ్చెను.

1916 నుండి 1923 వరకును, మరల 1927 నుండి 1936 వరకును సంయుక్త పరగణాల శాసనసభ (కౌన్సిలు)యందు ఆయన సభ్యుడుగ నుండెను; 1921 నుండి 1923 వరకు సంయుక్తపరగణాల(యునైటెడ్ ప్రావిన్సెస్)ప్రభుత్వమున విద్యా పారిశ్రామిక మంత్రిగ నుండెను; మొదటి రౌండ్ టేబిల్ సమావేశమున ప్రతినిధిగా నియమింప బడెను.

రాజకీయాలలో మితవాదిగా పేరు పొందినను కొన్ని విషయములలో ఆయన అతి స్వతంత్రుడుగ వ్యవహరించెను. 'ఇండియన్ డెయిలీ మెయిల్' సంపాదకుడుగా బొంబాయి వెళ్ళినపుడు అక్కడ పత్రికాధిపతితో రాజకీయముగ నేర్పడిన భేదములను పురస్కరించుకొని ఆయన వెంటనే రాజీనామా నిచ్చెను.

1927 నుండి 1936 వరకు ఆయన మరల 'లీడరు' పత్రికా సంపాదకుడుగ నుండెను. కాశీ విశ్వవిద్యాలయమువారు యల్. యల్. డి., అలహాబాదు విశ్వవిద్యాలయమువారు డి. లిట్., అను గౌరవపట్టముల నిచ్చి ఆయనను సత్కరించిరి. ప్రభుత్వ మాయనకు 1939 లో 'సర్' బిరుద మొసగెను. ఆంగ్లమున భారత రాజకీయములను గురించి ఆయన యొక గ్రంథమును వ్రాసెను.

ఆయన వార్తాపత్రికలు నడుపుటయం దద్భుతమైన ప్రజ్ఞకలవాడు. ఉత్తర హిందూస్తానమున వార్తా పత్రికా రంగమున ఆంధ్రుల శక్తి సామర్థ్యములను వెల్లడిచేసి తన జన్మభూమికిని జాతికిని పేరు తెచ్చిన మహనీయు డాయన. ఆయన మార్గము ననుసరించి ఆంధ్ర పాత్రికేయు లనేకులు ఉత్తర హిందూస్తానమందలి అలహాబాదు, లక్నో మున్నగు స్థలములను జేరి పత్రికాకార్యస్థానములలో మంచి ప్రాపకము సంపాదించిరి.

చింతామణి పత్రికా రంగమునందువలె రాజకీయ వ్యవహారములందును తన ప్రజ్ఞచూపి దేశీయనాయకులలో సుప్రఖ్యాతులైన మాలవ్య, మోతీలాల్ నెహ్రూ, సప్రూ లకు సమానస్కంధు డయ్యెను. ఈ శతాబ్ద పూర్వార్ధమున గోఖలేగారి మరణానంతరము ముందుకు వచ్చిన మితవాది నాయకులలో చింతామణి అగ్రశ్రేణికి చెందినవాడు. మితవాదు లందరివలె ఆయనయు నుదారాశయుడు; కాని వారిలో ననేకులవలె పదవుల కాశించి ఆత్మ స్వాతంత్ర్యమును గోల్పోక తన వ్యక్తిత్వమును నిల బెట్టుకొనెను. చీ. శే.

**యజ్ఞేశ్వరుడు:** ఇతడు కొండుభట్టోపాధ్యాయుని కుమారుడు; చెరుకూరి లక్ష్మీధరుని మేనల్లుడు; అలంకార సూర్యోదయము, అలంకార రాఘవము, కావ్య ప్రకాశికకు వ్యాఖ్యానము వ్రాసెను. ఇత డింకను శాస్త్ర దీపికకు ప్రభామండల మనువ్యాఖ్యానమును, పంచపాదికా వివరణోజ్జీవనియను వేదాంతగ్రంథమును వ్రాసెను. ప. రా. స్వా.

**యల్లయార్యుడు, కంచం:** ఇతనికి యల్లయసూరి, యల్లుభట్టు అని నామాంతరములు. ఇతడు దైవజ్ఞవిలాసమును, వాత్స్యాయన గృహ్యసూత్రసరణిని జ్యోతిష దర్పణమును, బాలప్రబోధమును, కారికాకదంబమును, గణకదర్పణమును, సర్వతోభద్ర అనుగ్రంథమును రచించి నట్టు తాను వ్రాసిన స్మృతికదంబములో చెప్పి యున్నాడు. ఇత డింకను తత్త్వచింతామణ్యుపన్యాసము, మీమాంసాసూత్రదీపిక అను రెండు గ్రంథములను వ్రాసి నట్లు కలదు. ప. రా. స్వా.

**రంగనాథ మొదలియారు, ఆర్కాటు:** ఈయన 1879 లో జన్మించెను; మదరాసు క్రైస్తవ కళాశాల, న్యాయ కళాశాలలలో విద్యాభ్యాసము పూర్తిచేసి 1901 లో సర్కారు ఉద్యోగమున ప్రవేశించి 1913 లో డిప్యూటి కలెక్టరయ్యెను; కాని ప్రభుత్వోద్యోగ మానాడు ప్రజాసేవ కొక యడ్డంకిగ నుండుటచే ఈయన 1915 లో తన ఉద్యోగమునకు రాజీనామా నిచ్చెను.

ఈయన దివ్యజ్ఞాన సమాజ సభ్యుడు. అందలి తత్త్వ విషయములను దెలియజేయు గ్రంథము నొకదాని నీయన ఇంగ్లీషున బ్రచురించెను. ఈయన దివ్యజ్ఞాన సమాజపు జనరలు కౌన్సిలునందును, భారతశాఖ కౌన్సిలునందును సభ్యుడుగ నుండెను; 1939 లో భారతదేశ దివ్యజ్ఞాన సమాజమునకు జనరల్ సెక్రటరీగా ఎన్నుకొనబడెను.

ఈయన 1917లో భారత రాజకీయాలలో ప్రవేశించి హోమ్ రూలు ఉద్యమమున పాల్గొనెను. కో ఆపరేటివు ఉద్యమమునందును, పంచాయతీలు గ్రామప్రజల యితర సమస్యలయందును ఈయన చాల కష్టపడి పనిచేసినాడు; అనేక జిల్లా సహకార మహాసభలకు అధ్యక్షత వహించెను; మదరాసురాష్ట్ర కోఆపరేటివు యూనియన్‌కు ఉపాధ్యక్షుడుగ కొంతకాలము పనిచేసెను. రాయలసీమకు ఈయన చేసిన సేవ అపారము. రాయలసీమను కరవు పిశాచము బారినుండి తప్పించుటకు ఈయన చాల కృషిచేసెను; ఆ జిల్లా ప్రజల కష్టసుఖములను ప్రభుత్వదృష్టికి తెచ్చి వారికి సాధ్యమైనంత సహాయము చేయించెడివాడు.

రాజకీయములలో మితవాది అయినకాలమున గూడ ఈయన అతి స్వతంత్రుడుగ నుండెను. 1924 లో నేషనల్ కన్వెన్షను తరఫున ఇంగ్లాండుకు పంపబడిన రాయబారి వర్గములో ఈయన ఒక సభ్యుడు.

1926 నుండి 1928 వరకు జస్టిసు మంత్రివర్గమున ఈయన యొక మంత్రిగ నుండి తన అధికారమును, కాలమును, ప్రజా సమస్యల పరిష్కారమునకై వినియోగించెను. ఈయన మంత్రిగా నున్నప్పుడు 'టౌన్‌సెండు కమిటీ'ని నియమించెను. కో ఆపరేటివు సొసైటీల స్థితిగతులను విచారించుట కేర్పడిన సంఘ మిది. ఈయన కుటీర పరిశ్రమలను సర్వేచేయించుట కొక యుద్యోగిని నియమించి ఒకనివేదిక తయారు చేయించెను. సైమను కమిషను 1928 లో మద్రాసుకు రానున్నపుడు తనకు గవర్నరుతో కలిగిన అభిప్రాయ విభేదములను పురస్కరించుకొని ఈయన వెంటనే తన మంత్రిపదవికి రాజీనామా నిచ్చెను.

తరువాత 1929 లో ఈయన అఖిల భారత కాంగ్రెసు కమిటీ సభ్యుడుగ నుండెను; 1936 నుండి 1939 వరకు మూడు సంవత్సరముల కాలము తిరుమల-తిరుపతి దేవస్థానముల కమీషనరుగ పనిచేసెను.

యువజన సమస్యలయందుగూడ ఈయన శ్రద్ధ వహించెను. ఈయన 1917 నుండి చాలకాలము వై. యం. ఐ. ఎ. (భారత యువక జన సంఘము) యందు సభ్యుడుగ నుండెను; 1922 నుండి చాలకాలమువరకు బళ్లారి జిల్లా స్కౌటు కమీషనరుగ నుండెను.

ఈయన గుత్తి కేశవ పిళ్లెగారివలె ఆంధ్రదేశ వాస్తవ్యులైన తమిళులలో ముఖ్యులు. ఈయనకు ఆంధ్రదేశము మీదను, ఆంధ్రప్రజ మీదను మక్కువ ఎక్కువ; అందును ముఖ్యముగ రాయలసీమయందలి జనులు వీరికి ప్రాణపదము. చీ. శే.

**రంగాచార్యులు, కపిస్థలం :** వీరు మహామహోపాధ్యాయ కపిస్థలం దేశికాచార్యులవారి సోదరులు. వీరు అలంకారసంగ్రహమను అలంకార గ్రంథమును, సుభాషిత శతకము, శృంగారనాయికాతిలకము, పాదుకాసహస్రావతారకథాసంగ్రహము అను కావ్యములను వ్రాసిరి. గోదాచూర్ణిక, రహస్యత్రయసారరత్నావళి, సన్మతికల్పలత అను వేదాంతగ్రంథములుకూడ వీరు రచించినవే. ప. రా. స్వా.

**రంగారావు, రావిచెట్టు** (క్రీ. శ. 1877-1910): తెలంగాణపు వైతాళికులందు రంగారావుగా రొకరు. వీరు నల్లగొండ మండలమునగల దండంపల్లి గ్రామమున వెంకటమ్మ, నరసింహారావు దంపతులకు జన్మించిరి; బాల్యముననే తల్లిదండ్రులను గోల్పోయిరి. వీరికి తమ పదమూడవయేటనే వివాహమైనది. వీరి భార్య లక్ష్మీనరసమ్మగారుకూడ తెలంగాణమున కెనలేని సేవజేసిరి.

వీరు తమ తండ్రి మన్సబు ననుభవించుచు తాము మన్సబుదారులైరి. వీరు మొదట నొక సంస్కృత గ్రంథాలయమును స్థాపించి తదభివృద్ధి కెంతయు తోడ్పడిరి. మునగాల రాజాగారగు రాజా వెంకట రంగారావు బహద్దరుగారితోను, వారి మంత్రిపుంగవులగు కొమర్రాజు వెంకట లక్ష్మణరావు పంతులుగారితోను సంప్రదించి రంగారావుగారు తమ యింటనే 1901 లో శ్రీకృష్ణదేవరాయ గ్రంథాలయము నెలకొల్పి, మొదటి ఐదు సంవత్సరములు తామే కార్యదర్శిగా పనిచేసిరి; ముందుగ స్థాపించిన సంస్కృత పుస్తక భాండాగారమును శ్రీకృష్ణదేవరాయ గ్రంథాలయముననే లీనముచేసి దానికి గొప్ప సేవ చేసిరి. హనుమకొండలోనున్న రాజరాజనరేంద్రాంధ్రభాషా నిలయమునకుగూడ వీరే స్థాపకులు, సాహాయ్యకులు, మరియు నభిమానులు. వీరికి మునగాల రాజాగారి తోడను, కొమర్రాజు వారితోడను కలిగిన మైత్రి అనేక సత్కార్యములకు, ఉద్యమములకు కారణమయినది. అట్టివానిలో 'విజ్ఞానచంద్రికామండలి' స్థాపన మొకటి. ఈ మండలి మదరాసుకు పోవువరకును, రంగారావుగారు దాని కెంతయు సేవచేసియుండిరి.



చిత్రము 201.
రావిచెట్టు రంగారావు

'ఆంధ్ర మహిళాసంఘము' స్థాపించి దానికి తమ భార్యయగు లక్ష్మీనరసమ్మగారినే కార్యదర్శినిగా నియమించి స్త్రీ విద్యకై వీ రెంతయో పాటుపడిరి.

వీరు కలకత్తా కాంగ్రెసు సమావేశమునకు పదిసంవత్సరములకు పూర్వమే స్వదేశీఉద్యమము లేవదీసి ఆచరణ ప్రచారములందు అగ్రగాములైరి. అప్పుడు వారు స్వదేశ వస్తు భాండాగారములను నిర్వహించిరి.

వీరు 1908 వ సంవత్సరమున హైదరాబాదులో కలిగిన జలప్రళయమున ఆపద్బాంధవులై ఎంద రెందరకో సహాయ మొనర్చిరి. బీదలగు ప్రజలకు, విద్యార్థులకు వీరు కల్పశాఖి. వీరు తమ ముప్పదిరెండవ యేటనే అకాలమృత్యువు వాతబడిరి. బి. రా. రా.

**రంజాన్ :** ముస్లిము సంవత్సరమునందలి తొమ్మిదవ నెల. ఈ నెల అంతయు ముస్లిములు ఉపవాసముందురు. రంజాన్ శబ్దము 'రమ్జ్' (కాలుట) అను ధాతువునుండి ఉత్పన్నమైనది. శరీరమును శుష్కింపజేయునదియు, పొట్టను మాడ్చునదియు నగు ఉపవాస ముండునెల యగుటచే దీని కీ పేరు వచ్చినది. 'పాపములను దహించునది' అనికూడ దీనికి కొంద రర్థము చెప్పిరి.

ఇస్లాము మతముయొక్క ముఖ్యమైన అయిదు విధులలో ఉపవాస ముండుట ఒకటి. 'శ్రద్ధతో రంజాన్ నెలయంతయు ఉపవాస ముండువారి సమస్త పాపములు క్షమించబడును' అని శ్రీ మొహమ్మద్ ప్రవచనము.

రంజాన్ నెల ఉపవాసమునుగూర్చి ఖుర్-ఆన్ ఈవిధముగ చెప్పుచున్నది.

'ఓ విశ్వాసవంతులారా! మీ పూర్వులకువలె మీకు కూడ ఉపవాసము విధివిహిత మొనర్పబడినది. దీనివలన మీకు చెడుగు అంటకుండును.

'(ఈ యుపవాసము)కొన్ని నిర్ణీత దినములందు మాత్రమే విధింపబడినది. కాని మీలో రోగగ్రస్తులై ఉన్నవారును, ప్రయాణమునం దున్నవారును, (వారికి వీలయిన) ఇతర దినములలో ఉపవాస ముండి ఆ దినములను పూర్తిచేసికొనవలెను. ఉపవాసముండ నశక్తులైనవారు ఒక బీదవానికి అన్నము పెట్టిన చాలును. ఎవరైనను సంతోషముతో ఇంకను ఎక్కువ సత్కర్మ నాచరించుచో వారికి ఎక్కువ పుణ్యము లభించును. మీరు జ్ఞానవంతులైనచో ఉపవాసవిధి నాచరించుటయే ఉత్తమము.

'ఈ రంజాన్ నెలలో ఖుర్-ఆన్ అవతరింప మొదలిడినది. మానవుల కది మార్గదర్శకమైనది; సన్మార్గము యొక్క స్వచ్ఛమగు నిదర్శనములు కలది; సత్యాసత్యములను వేరుపరచి చూపునది. అందుచే మీలో ఆరోగ్యవంతులైనవారు ఉపవాస ముండుడు. రోగగ్రస్తులైనవారును, ప్రయాణమునందున్నవారును తప్పిన దినములను శక్తియున్నప్పుడు ఇతర దినములం దుపవాసముండి పూర్తి చేసికొనవచ్చును. భగవంతుడు మీకు సౌలభ్యమునే కలిగింపగోరును; మీకు కష్టము కలిగింపగోరడు. అందుచే (నిర్ణీత దినముల)సంఖ్య పూర్తిచేసికొనుడు'.

దిన మంతయు ఏమియు తినకపోవుటయే కాక నీరు సైతము త్రాగకూడదను నియమముచే ఈ నెల వేసవిని వచ్చినప్పు డెల్ల ఉపవాసము కఠోరవ్రత మగును. ఈనెలలో రాత్రిప్రార్థన దీర్ఘముగ నుండును. దీనిని 'తరావీః' అందురు. కొంద రీ నెల అంతయు రాత్రులు మసీదునందే ఉండిపోయి ఐహికములైన సమస్త వ్యవహారములను మానుకొని ఖుర్ - ఆన్ పారాయణమునందును, ప్రార్థనలయందును కాలము గడపుదురు. దీనిని 'ఎతిఖాఫ్' అందురు.

రంజాన్ 27 వ తేదినాటి రాత్రి 'లైలతుల్ ఖదర్' (మహత్తు గల రాత్రి) అందురు. నాడు రాత్రి అంతయు జాగరణము చేసి ఖుర్ - ఆన్ పారాయణము చేయుదురు; ప్రార్థనలు సల్పుదురు. నాడు ఖుర్ - ఆన్ 'భూమిపై అవతరించిన' రాత్రి అని ఖుర్ - ఆన్ చెప్పుచున్నది.

రంజాన్ నెల పూర్తియైన పిదప షవ్వాల్ నెల. నెల పొడుపుచూచి మరునాడు పండుగ చేసికొందురు. తెలుగు దేశములో నాడు ముస్లిములు సేమియా పాయసము చేయుదురు. పెద్ద పట్టణములలో 'ఈద్ గాః'(పండుగ ప్రార్థన చేయు పెద్ద మైదానము)లకు పోయి ప్రార్థనలు చేయుదురు. అక్కడ చేరినవా రందరు ఒకరి నొకరు కౌగలించుకొందురు. బంధువులు, మిత్రులు ఒకరి ఇండ్ల కొకరు పోయి 'ఈద్ ముబారక్' (ఈద్ శుభాభినందనము) అనుచు పరస్పరము అభినందించుకొందురు. మొ. ఖా. ఖా.

**రఘునాథనాయకుడు :** నిసర్గ మధుర గంభీరమగు నాంధ్ర వాఙ్మయము యొక్క పూర్వపరిణామ మంతయు, అందును విశేషముగా ప్రబంధముల పరిణామము రాజులకు మరియు సన్నిహితత్వము కలిగియున్నది. అట్టి భూపాల వర్గములో నిద్దరు విశిష్టస్థానము నలంకరించు చున్నారు. అందు ప్రథముడు కృష్ణదేవరాయలు; రెండవవాడు రఘునాథరాయలు. ఇరువురును రాజులై కవిరాజులై కవులను పండితులను పోషించుచు తమ యాస్థానములలో సకల విద్యాగోష్ఠులు జరుపుచు సరస్వతికి రంగస్థలమును గూర్చినవారు. రాయలయుగమున నారంభమైన ప్రబంధ రచన తంజావూరు కవుల కాలమునాటికి మరియు శృంగార ప్రధానమై తెనుగుదనమునందును, జాతి వార్తలయందును ప్రసిద్ధికెక్కి మధుర తరములగు కావ్యవిశేషములకు దారి తీసినది. అప్పటికి తెలుగు కవిత్వము గాంభీర్యము కోలుపోయినను మాధుర్యమును జెంపొందించుకొనినది. రఘునాథ నృపాలుని కాలమున సంస్కృతాంధ్ర వాఙ్మయములు రెండును అభివృద్ధి చెందినవి. సమగ్రములగు సంగీత సాహిత్యములకు రెంటికిని సమానమగు స్థానము లభించినది. రఘునాథనాయకుడు శ్రీకృష్ణరాయలవలె బలపరాక్రమశాలియై సంగీత సాహిత్యములందు సమానముగ ప్రవీణుడై కవి పండిత పోషకుడై యనేక కావ్య ప్రబంధములకు గృతికర్తయై కవులకు గురువై మెలగినవాడు. ఇతడు తంజావూరి నాయకరాజులలో మూడవవాడు (చూ : తంజావూరు నాయకరాజులు). ఈయన వైష్ణవమత మవలంబించిన విష్ణుభక్తుడు. అయినను సర్వమతముల వారి నాదరించెను.

అచ్యుతప్ప నాయకుడు చాల వృద్ధుడగు వరకు జీవించి యుండి వార్ధకమున రాజ్యమును దన కుమారుడగు రఘునాథ నృపాలునకు వదలి తాను శ్రీరంగమున దైవసన్నిధిని కాలము గడిపెనట. ఇతని కాలమున తంజనగరము 'రమానటీనర్తన రంగశాల'; సరస్వతీ విలాసమున కాలవాలము. ఈయనకాలమున నాంధ్రసరస్వతి ధ్వజాదిరాజచిహ్నములతో ప్రభుత్వము నెరపినది. రఘునాథనాయకుడు విలువిద్యయందువలెనే కావ్యరచనయందును గడుసేర్పరి. ఇతడు పారిజాతాపహరణప్రబంధమును యామద్వయమున జెప్పగా వ్రాయువారికి మిక్కిలి శ్రమకలిగినదట! మన దురదృష్టవశమున నీగ్రంథ మిప్పుడు అలభ్యము. ఈ మహారాజున కశ్వ గజాది విద్యలుకూడ తెలియునట. ఇతని వ్యూహరచనాసామర్థ్యము, యుద్ధకౌశలము, శౌర్య సాహసాది విషయములు, రాజ్యపరిపాలనలోని సారళ్యము మొదలగు నంశము లన్నియు ఇతని కావ్యములలో గాననగును. ఇతని గ్రంథము లన్నియు శ్రీరాముడు మొదలగు నవతారస్తోత్రములతో ప్రారంభమగును. ఈతని యాస్థానమున శాంకరాద్వైతియగు గోవిందదీక్షితులు మంత్రి; కుమారతాతాచార్యుల కుమారుడు శ్రీనివాసాచార్యుడు ప్రత్యక్షగురువు. సుధీంద్రుడను మాధ్వయతి ఇతనివలన కనకాభిషేకము నొందెను. పలు మాటలేల, ఇతడు తుదకు క్రైస్తవులకుగూడ గుడులు కట్టుకొనుటకు స్థలము లిచ్చెను. ఈ విధముగ నసన్యమగు

మతసామరస్యము వెలయించిన ప్రభువు నేప్రజలు రాజుగా, గురువుగా, నాప్తునిగా, సకలవిధ బంధువునుగా సంభావింపరు ? ఇతడు తోపూరు యుద్ధమున శత్రువుల నణగద్రొక్కిన వెనుక పదునైదు సంవత్సరముల కాలము విశ్రాంతిగా రాజ్యపరిపాలన మొనర్చెను. ఈ విశ్రాంతి సమయమునందే రఘునాథనాయకు డత్యంతము చక్కని విద్యావ్యాసంగముల నేర్పరచెను. ఈత డాదినములలో ననేకులగు పండితులకును, కవులకును, కవయిత్రులకును, గాయకులకును, గాయనీమణులకును ఇంకను తదితరులగు ననేకవిద్యలవారికి నాశ్రయ మొసగి యాదరించెను. వారి కందరకును నిరుపద్రవమగు స్థితిని తన యాస్థానమందు కల్పించి యాదరించుటవలన నితని యనుగ్రహాఫలములగు నానావిధ శాస్త్ర కావ్య నాటకాది గ్రంథములు పండినవి. సహృదయుడు, పండితుడు, లలితకళాభిజ్ఞుడునగు కృతిపతి కథానాయకుడు లభించుట యానాటి సంస్కృతాంధ్ర కావ్యకన్యకల యదృష్టము. రామభద్రాంబ, మధురవాణి మొదలగు కవయిత్రీమణులుగూడ నీయన సభ కలంకారములైరి; సంస్కృతము, తెనుగు బాసలలో నత్యంత రుచిరప్రబంధముల నిర్మించి కీర్తి నొందిన వనితామతల్లు లా సభకు చిరకీర్తి దెచ్చుటకు గారకులైనారు. మధురవాణికిని, గోవిందమఖి జ్యేష్ఠపుత్రుడగు యజ్ఞనారాయణునకును విద్యాగురుడు రఘునాథుడే. మధురవాణి కవితలోని మాధుర్యము నాస్వాదించిన రఘునాథనాయకుడే ఈమెకు మధురవాణి యనుబిరు దొసగెను. తెనుగున రఘునాథ నృపాలుడు రచించినది నాలుగాశ్వాసముల రామాయణ మొక్క టున్నది. ఇది మూడాశ్వాసములవరకే యుండి నశించిపోవుట మిక్కలి శోచనీయము. ఇది మృదుమధుర శైలిలో జాల యందముగనే కూర్చబడినది.

రఘునాథభూపాలు డంకితమందిన గ్రంథములు మనకు దెలిసినంతవరకు సుమా రిరువది యున్నవి. చక్కని విశ్రాంతి ననుభవించిన పదునాలుగు సంవత్సరముల పరిపాలనలో నరుదగు సంగీత సాహిత్య గ్రంథము లనేకముల నితడు రచించియుండెను. సంగీతమున నీయనపాండితి యద్వితీయము. ఇందుల కుదాహరణము యజ్ఞనారాయణుని సాహిత్యరత్నాకరమున నారవసర్గయే. మరియు నిది వరలో బూర్వు లెవ్వరును కనిపెట్టని క్రొత్తరకపు తాళములు - రామానందము మొదలగునవి - గనిపెట్టెను. రాగములుకూడ జయంత సేన మొదలగున వీతనిచే గనిపెట్టబడినవే. వెంకటమఖి, మధురవాణి మొదలగువారి కీయన వీణాగురువు. మరియొకవిశేష మేమన వీణలలో గ్రొత్త విధానములను స్థాపించుట. అంతవరకును వీణావాదకులు రాగము ననుసరించి మరల మరల దీగలను, మెట్లను మార్చుకొనవలసి వచ్చెడిది. ఈ విధానమును మార్చుటకు వసుచరిత్రకాలమునుండి ప్రయత్నములు జరిగినవి కాని, కార్యరూపమునకు వచ్చినది రఘునాథుని శేముషీవైభవము వలననే! ఈయన 'రఘునాథమేళవీణ'యను నొక క్రొత్త వీణను నిర్మించి ప్రతిరాగమును దీగలు, మెట్లు మార్చ నవసరములేకయే వాయించుట కనువగునట్లు నిర్మాణముచేసెను. ఈ విషయము చతుర్దండిప్రకాశికలోను, సంగీతసుధలోను జెప్పబడినది. ఈవిధముగ సంగీతమున రఘునాథుడు విద్వాంసుడై గ్రంథములు రచించి, యితర గ్రంథకర్తలను బోషించి నూతన మార్గములకు మార్గదర్శకుడైనాడు.

రఘునాథభూపాలుని కవిత్వము మృదుమాధుర్యగుణైక ప్రధానము. ఈయనశయ్యనుగూర్చి సమకాలికులగు పండితులు వేనోళ్ల ప్రశంసించియున్నారు. ఈయన రచనకు మెచ్చి తండ్రి యీయనకు గనకాభిషేక మొనర్చెనట.

రఘునాథభూపాలుడు సంస్కృతమున సంగీతసుధ యనియు, భరతసుధ యనియు రెండుగ్రంథములను రచించినట్లు తెలియుచున్నది. మహాభారత తాత్పర్య సంగ్రహమను మరియొకగ్రంథముకూడ నీయన రచించినదేయని తెలియుచున్నది. ఆంధ్రమున పారిజాతాపహరణము, గజేంద్రమోక్షము, రుక్మిణీకృష్ణవివాహము(యక్షగానము), జానకీపరిణయము, అచ్యుతాభ్యుదయము, వాల్మీకిచరిత్రము, శృంగారసావిత్రి, నలచరిత్రము, రఘునాథరామాయణము నను గ్రంథములను రచించినట్లు తెలియుచున్నది. ఇందు మొదటి యైదుగ్రంథములును నామమాత్రావశిష్టములు.

లభ్యమైనంతవరకు ఈయన గ్రంథములను పరిశీలించి కవితాగుణములను నిర్ణయించుటలో నాక్షేపణ లేదు. దొరకిన కావ్యములలో గూడ కొన్ని సంపూర్ణముగ దొరకలేదు. శృంగారసావిత్రిలో నాశ్వాసాదిపద్యములును, బూర్వపీఠికయును లేవు. రఘునాథరామాయణమున కొంతభాగము మాత్రము లభించినది. ఆ కావ్యములోని ఋశ్యశృంగ తపోభంగ సందర్భమునందలి పద్యములు కొన్ని సావిత్రి లో కనబడుచున్నవి. ఈయన కవిత్వమున కనిపించు ప్రధానలక్షణము లేమనగా దూరాన్వయము, క్లిష్టాన్వయములేని యత్యంతలలితమగు శయ్యాసౌభాగ్యము, ద్రాక్షాపాకమును. ఈయన భావములందు సహజమగు నుదాత్తత, మనోహరత్వము వెల్లివిరియుచుండును. ఈ రెండు కావ్యములందును ధారాశుద్ధి చాల బాగుగ నున్నది. అవ్యాహతముగ సాగిపోవు స్వభావ మీయన కవితకు లక్షణము. పదములయందు సౌష్ఠవౌదార్య విశేష

సుభగత్వము గలిగి, పరస్పరమైత్రి గలిగి శయ్యాసౌందర్యము నొలికించును. యతిప్రాసలకై తడుముకొన నవసరములేకుండ నాయాచోటుల కుదిరిన ట్లుండును. వ్యర్థపదము లసలే లేవనజాలము. కాని నూరు పద్యములకు పదిపదునైదు పదము లుండునేమో! కవితమాత్రము మధురపాకమున బడి 'తేనె సోక నోరు తీయనయగుమాడ్కి' యని మొల్ల చెప్పినట్లు చదువుకొలదియు నాస్వాదనీయమై కౌతూహల ముదయింపజేయును. ఉదాత్తములగు భావములను శయ్యారీతులనుగూడ విజయవిలాస, సారంగధర చరిత్రములు రెండు నీ గ్రంథముల తరువాతివే! సహజ మధురములగు భావములు, సంఘటనల సహజ చమత్కారకత యిం దున్న ట్లచట కనబడవు. చేమకూరకవితలో శాబ్దికమగు శ్లేషాది చమత్కృతి హెచ్చు. శబ్దచిత్రము గొప్ప గుణముకాదని యాలంకారికులు ఘంటాపథముగా పలికియున్నారుగదా! ఇంతమాత్రమున వాని గొప్పదనమును దగ్గింపబూనను. ఈ గ్రంథముల పోకడలు, మాధుర్యోదాత్తతలు చాల రుచిరములైనవని చెప్పుటయే తాత్పర్యము. అసలు కవితకు ప్రాణము మధురోదాత్తము, రసవ్యంజకమునగు భావసంపదయే. అది వ్యంజనామార్గమున నిట సువ్యక్తమై సహృదయలోకమునెల్ల నాస్వాదింపజేసి వారిని దనవంక కాకర్షించుకొనగలదు. కావ్యమునకుగల కాంతాసమ్మితత్వ మదియే. ఈ సందర్భమున నొక సూక్ష్మాంశ మున్నది. తెనుగు కవితకు మొదటినుండియే రెండు విభిన్నమార్గము లేర్పడినవి. ఒకటి నన్నయమార్గము, రెండవది తిక్కన మార్గము. రెండవ మార్గమున నౌచిత్యము, సంభాషణచాతురి, భావక్లుప్తి యున్నంతగా కావ్యశిల్పము,రససిద్ధియు నుండవని యొప్పుకొనక తప్పదు. ఇందు సమస్తాలంకారిక సమ్మతమును, రసాత్మకమునగు కవితామార్గము నన్నయది. తరువాతి కవులలో నీరెండు పక్షములకు జెందినవారు నున్నారు. రఘునాథభూపాలుడు రసమార్గములోనివాడు. బుద్ధిగమ్యమగు నైపుణికన్న రసమార్గమే ఈయన కావ్యమునకు లక్షణము. ఈమార్గము ననుసరించి సహృదయాకర్షణ మొనరింపగలిగి రససిద్ధికి దారితీయు భావసంపదయు నత్యంతోదాత్త గంభీరుడగు నీ కవిరాజురచనలో మెదిగి రసరూపమున మన కాస్వాదగోచరమగును. అలంకారములు, భావము, రీతులు, వృత్తులు, శయ్య మొదలగు కావ్యోపస్కరణము లన్నియు నుచితమగు విన్యాసవిశేషములతో నీతని గ్రంథములం దంతటను రసభావాది వ్యంజనలయం దంతర్లీనములై వాని ననుభవములోనే యనుభవింపబడును. వ్యంగ్య స్వరూపములగు నలంకారముల కొకచక్కని యుదాహరణము :

'సొగసైన నా మోముఁ జూడఁగల్గినఁజాలుఁ
గలువతేఁ డున్నాఁడు కడమకెల్ల,
నునుదావి యూర్పు మూర్కొనఁగల్గినను జాలుఁ
బవమానుఁ డున్నవాఁ డవలికెల్లఁ
గలుకుఁజూపు తెలుంగఁగల్గినఁ జాలును
గొనితూపు లున్నవి కొదవ కెల్ల
నింపుఁబల్కుల నాలకింపఁగల్గినఁ జాలుఁ
జిలుకచా లున్నది వెలితికెల్ల
ననుచుఁ దలపోసి.............. (శృం. సా., ఆ. 1)

వస్తువుచే నలంకార ధ్వనికిని, గవిప్రౌఢోక్తి మూలకధ్వనికి నింత సొగసైన యుదాహరణము లెక్కువమంది కవులలో గనిపించవు.

అలంకారములు మొదలైనవన్నియు వాక్యార్థములగు రసభావాదుల రూపముననే యేర్పడిన ట్లుండును :

'ఈకాంత చివురుమో విసుమంత చవిఁగొన్న
నమరేంద్రుతోడఁ బోరాడరాదె!
ఈబోటి చురుకుఁజూ పేపాటఁ బారిన
నించువిల్తునిఁ గలహించరాదె
ఈచాన తేటవ ల్కేమైన దొరకిన
బ్రహ్మతోడను వాదు పెట్టరాదె!
ఈలేమ పసిఁడిమే నెద నూనఁగల్గిన
హరికి గొలారిక మంపరాదె!

దీనిఁ బొసగించి బిగువు సందిటఁ గదించి
కళలు గరఁగించి చొక్కించి గారవించి
మిగులఁ దేలించి లాలించి వగలు మించి
పంత మొనరించువాఁడు సౌభాగ్యశాలి' (శృం.సా.,ఆ. 1)

ఇచ్చట వ్యంగ్యములగు రూపకాతిశయోక్త్యాదులైన యలంకారాదులు శృంగారములో నాస్వాదింపబడుచుండుటయు ననుభవములోనిదే కదా! కథా నిర్వహణమును బరిశీలింపవలయునన్నచో ఘట్టము లుదాహరింపవలసి వచ్చును. ఈయన పద్యములలోని యన్వయమువలెనే కథ కూడ సూటిగా నుండును. ఈయన ప్రయోగించు పదములవలెనే సృజించు నంశములుగూడ మధురములు, రసపోషకములునై యుండును. ఈయనజాతీయములవలెనే సంభాషణలుగూడ హృదయమును స్పృశించునవియై యుండును. ఈయన కవిత్వమున నొక్కొక్క పద్యమునందు గల సౌందర్యమే కావ్యమం దంతటను వ్యాపించి యుండును.

ఈ సరస కవి కవిత్వమునుగూర్చి యీతని యాస్థాన కవివతంసమగు చేమకూర వెంకటకవి యిచ్చిన యభిప్రాయము చెప్పనిచో నీ విమర్శ యసమగ్ర మగును. ఆయన తన విజయవిలాసమున రఘునాథ భూపాలుని కవిత్వమును గూర్చి యిట్లు ప్రశంసించి యున్నాడు.

'తా రసపుష్టిమైఁ బ్రతిపదంబున జాతియు వార్తయుం జమ
త్కారము నర్థగౌరవముఁ గల్గ ననేకకృతుల్ ప్రసన్నగం

క్షీరగతిన్ రచించి మహి మించినచో నిఁక నన్యు లెవ్వర
య్యా! రఘునాథభూపరసికాగ్రణికిం జెవిసోఁకఁ జెప్పఁగన్'

ప్రతి పదమునను రసపుష్టి యున్నదను టీయనపట్ల స్వభావోక్తి యగునని కావ్యములు జదివిన సహృదయులకుఁ దెలియును. చమత్కార మనగా శబ్ద చిత్రమువంటిది కాదు. ఇదియే జగన్నాథపండితుడు లోకోత్తరాహ్లాదజనకచమత్కారిత యని చెప్పిన రమణీయత. అట్టి యర్థమును బ్రతిపాదింపగల శబ్దమేకదా కావ్యమగునది! ప్రసన్న గంభీరత యనుపద ముత్తమకవితకు సూత్రప్రాయమగు లక్షణము. సామాన్యముగా నెక్కువమంది కవులకు బ్రసన్నత యున్నచో గంభీరత యుండదు. గంభీరత యున్నచో బ్రసన్నత యుండదు. ఈ రెండును రఘునాథుని కవితలో గనిపించునని చెప్పిన విజయవిలాసకవి చాల సహృదయుడు. ఈ చెప్పిన లక్షణములు, నర్థగౌరవము కలిసి యొక యెత్తు. ఇక జాతియు, వార్తయు ననునవి యొక యెత్తు. ఈ రెండు లక్షణములను దండి మొదలగు నాలంకారికు లుద్ఘాటించినను పాటించినవారిలో ముఖ్యులు తెనుగు కవులే. ఈ రెండు విషయములును జాలమందికి క్రొత్తవి. అందువలన నించుక వివరించుట యప్రస్తుతము కాదు. జాతియనగా స్వభావోక్తియని కొందర రనిరి. జాతియును, స్వభావోక్తియు నొక తెగకు జెందినవే కాని కొంత భేద మున్నది. స్వభావోక్తి యనగా నొక పాత్ర యొక్క స్వాభావికమగు నవస్థను జిత్రించునది. ఈ పాత్రల స్వభావమే కొన్ని తాత్కాలిక మనః పరిణామములకు లోనై వాని నిమిత్తముగా జిత్రింపబడునప్పుడు జాతి యనవలెను. ఉదాహరణకు

'ప్రొద్దున లేచి తాఁ బసుపు పూసుక కుంకుమబొట్టు దీర్చి యా
పెద్దల కెల్ల మ్రొక్కి తన పెన్మిటికిం బరిచర్య సేయఁగాఁ
బ్రొద్దొక జాము సాఁగుటయు బోటిని బిల్చి ప్రియంబుతోడ నిన్
వద్దనలేము చాలు నుపవాసము పారణసేయు మిం కిటన్'

అనుపద్య మున్నది. ఇందు మనోహరమగు స్వభావోక్తి యున్నది. ఇది శీలవతియగు సావిత్రియొక్క సామాన్యచేష్టాదికము మనోహరముగ జిత్రించుటవలన నేర్పడినది. మరల

'తానమాడుటె కాని మానె సంకల్పంబు
నీళ్ళు చల్లుటె కాని నిలిపె సంధ్య
వ్రేలెన్నుటె కాని విడుపుచేసె జపంబు
తడవు మ్రొక్కుటె కాని విడిచె భక్తి
ముక్కుపట్టుటె కాని గ్రుక్కె నోంకారంబు
మౌనమొందుటె కాని మఱచెఁ దెల్వి
కన్ను మూయుటె కాని కనఁడు లోలక్ష్యంబు
ధ్యానించుటె కాని యాచెఁ దపము
కోర విన సోఁకఁ గన రుచిగొనను మూరు
కొనను మౌనియు మేన పల్కులును మేను
రూపు వాతెర మైతావి దోఁప మనము
చెవి యొడలు కన్ను జిహ్వ నాసికయు మఱచు'

అను పద్యమును బరికింపుడు. ఇందు చిత్రితమైనది స్వభావోక్తివలె నుండును. కాని మౌనికి స్వాభావికముగ నిట్టి యవస్థ సంఘటిల్లదు గనుక స్వభావోక్తి కాదు. అప్సరస యగు మేనకపైని గలిగిన మోహము నిమిత్తముగా నిట్టి ప్రవర్తన సంభవించినది. దీనినే జాతి యనవలెను.

ఇక వార్తవిషయము. వార్త యనగా లోకసముదాచారముల చిత్రణము. దేశ కాల పాత్రాదికమును జిత్రించెడి యుచితమగు సంప్రదాయ విశేషము, మర్యాదలు మొదలగునవి వార్త. ఈ జ్ఞానములేని కవిత్వమునకు రాణింపు లేదు. పాత్రలను గూర్చిన వాతావరణము పాఠకునకు కలిగించుటలో నిది యెంతేని యవసరము. ఇది లేనిదే కథ తెలియును, పద్యములు బాగుండును, రసభావము లుప్పతిల్లును గాని రససిద్ధి కలిగించుటకు గవి మరణవేదన పడినను గొంతవరకే కృతకృత్యు డగును. పాఠకుడు క్షణకాలములో నాయాపాత్రల దేశకాల పరిసరములలోనికి భావనతో సమగ్రముగా యానముచేసి చేరికొనవలెను. దీనిని సాధించునది వార్త యొక్కటియే.

ఈ జాతి, వార్త యనునవి కవితకు విలక్షణత్వమును జేకూర్చును. ఇవి కొందరి కవితలో సహజముగా సిద్ధించును. కాని సిద్ధించనివారు తమ కవితలో రుచియెందుకు రాదో తమకే తెలియక బాధపడుచుందురు. దీని విషయము సమగ్రముగా తెలిసినవారు పూర్వాంధ్రకవులు, నేటి యాంధ్రకవులలో నొకరిద్దరును.

'శృంగార సావిత్రి' తంజావూరు సరస్వతీ పుస్తకశాలలో నున్న ప్రాత పుస్తకము ననుసరించి యచ్చువేసిరి. ఇందు కొంత గ్రంథపాత మున్నది. మొదటి యాశ్వాసము లేదని కావ్యమును జూచిన దోచును. ఆశ్వాసముల మొదటి పద్యములుగాని, చివరి పద్యములుగాని, కావ్యమునకు బూర్వపీఠికగాని లేవు. వాల్మీకి చరిత్రకు వలెనే యాశ్వాసాంత గద్యలును లేవు. ప్రస్తుతము మనకు లభించిన గ్రంథము రెండాశ్వాసములు గలది. దీని కర్తృత్వము గూడ శంకింప వలసియుండును. కాని యిది రఘునాథునిదే యనుట కొక యసాధారణమగు సాక్ష్య మున్నది. రఘునాథ నాయకుడు రచించిన రామాయణమందలి ఋశ్యశృంగ తపోభంగసందర్భమున నున్న పద్యము లీ గ్రంథమున గనిపించుచున్నవి. రఘునాథుని రామాయణకర్తృత్వము నిర్వివాదాంశము. దానికి గ్రంథాదిలో సుస్పష్టమగు నంతస్సాక్ష్య మున్నది. ఈ యాధారమున సావిత్రి గ్రంథకర్తృత్వమును నిర్ణయించుకొన

వచ్చును. మరియు నీయన కృతులని స్పష్టముగా దెలిసిన వానిలో లభ్యములగు వాల్మీకి చరిత్రము, నలచరిత్రము, రామాయణములలోని కవితకును, సావిత్రి గ్రంథమునకును జాల పోలిక లున్నవి. రామాయణమును దెనుగున గావ్యముగా రచించిన యీ కవి భారతకథను కూడ రచించి యుండవచ్చు నని నూహ యసంభవము కాదు. అది నిజమైనచో నీ సావిత్రికథ యందలిది కావచ్చును. మహాభారతమున నారణ్యపర్వమున మార్కండేయుడు ధర్మజున కీ కథ చెప్పినట్లు కలదు గావున నిచ్చట నది రచింపబడవచ్చును. మరియు దపస్వుల తపోభంగముతో నీకథకు ప్రసక్తి లేకున్నను వాల్మీకిచరిత్రలోను, శృంగారసావిత్రి యందునుగూడ నా ఘట్టము కనిపించుటయు, ఆ ఘట్టములు తీర్చిన పద్ధతియు నేకకర్తృత్వమున కాధారములు. ఈ రెండు గ్రంథములయందు గల రగడలను బరిశీలించినచో వాని యొద్దికలోగూడ పోలికలు కనబడుచున్నవి. ఈ పోలికల ననుసరించియు, పైన జెప్పిన ప్రధాన నిదర్శనములనుబట్టియు శృంగారసావిత్రికావ్యము రఘునాథనాయకకర్తృకమే యని స్పష్టముగా నూహింపనైనది. సావిత్రి కథ సహజముగా కరుణ శాంత రసములతో నిండియుండు స్వభావముగలది. అయినను నీ గ్రంథమున శృంగారమే హెచ్చుగా బోషింపబడినది. హాస్యరసము కూడ సముచితమగు పాళ్ళలో దానికి మెరుగుపెట్టినది. ఆ కాలమునాటి రఘునాథుని పరిపాలనసౌభాగ్యము ననుసరించి యేర్పడిన లౌకిక ప్రవర్తన మంతయు నిందు ధ్వనించునట్లు కూర్పబడినది. అప్పటి వేశ్యావినోదము, క్రీడావినోదము, సంభోగశృంగారము, రాజుల యాస్థానములలో జెల్లుబడియగు మర్యాదలు, రాజధానియగు తంజావూరుయొక్క యఖండ సౌభాగ్య విలాసములు, వంతఃపుర సంప్రదాయ మర్యాదలు, కవితా గోష్ఠులు మున్నగు నంశము లన్నియు నశ్వపతి రాచరికమున వర్ణింపబడినవి. అంతేకాక సత్యవంతుని విద్యాభ్యాసాదికమున నారదు డతనియొద్ద కవిత్వము నేర్చుట, యతనికి సంగీతమున జిత్రింపబడిన యసాధారణ పాండిత్యములును రఘునాథుని యాత్మకథాస్ఫోరకములై యా రాజుకడ యజ్ఞనారాయణదీక్షితులు చేసిన శిష్యత్వముగూర్చి తెల్పుచున్న వనుటలో సందియము లేదు.

వాల్మీకిచరిత్రము రఘునాథుని కావ్యము లన్నిటిలో సమగ్రముగా లభించిన గ్రంథము. ఇందుగల గద్యమును బరికించినచో ననేక చారిత్రిక విషయము లవగతమగును. కవి తన యిష్టదైవమగు శ్రీరామచంద్రుని యాజ్ఞమేర కీ వాల్మీకిచరిత్రమును రచించితినని యిందు జెప్పుకొనినాడు. ఇందలి పెక్కు ప్రయోగము లీయన వ్యాకరణ విజ్ఞాన విశేషమునకు నిదర్శనములై యున్నవి.

సంస్కృతమున ఈవాల్మీకి చరిత్రము ధర్మఖండ వాసిష్ఠ రామాయణములలోను, భక్తవిజయమునందు నున్నది. ధర్మఖండములోని కథకును, మిగిలిన రెండింటిలోని కథకును భేద మున్నది. జన్మతః కిరాతుడగు వాల్మీకికి దోపిడి వృత్తి యుండుటయు, నతడు సప్తర్షులను బాధించి తుద కెట్టకేలకు వారివలననే శ్రీరామమంత్ర ముపదేశమై తపస్సుచేసి మహర్షియై శ్రీరామ సాక్షాత్కారము నంది యాజ్ఞ వడసి రామాయణమహాకావ్యరచన చేసినట్లును ధర్మఖండమం దున్నది. తక్కిన రెంటిలో నిత డుత్తమ బ్రాహ్మణునకు జన్మించి యౌవనమున కిరాతవనితా లోలుడై మహాత్ముల సాంగత్యమున మహర్షి యయ్యెనని యున్నది. రఘునాథుడు ధర్మఖండమందలి కథనే మూలముగా గైకొనెను. ఇందు తెల్లదీవిలో శ్రీ మహావిష్ణువును జూచి వచ్చుచు ననేకపుణ్యక్షేత్ర తీర్థ దర్శనములు చేయుట, నారదుడు వాల్మీకిని గలియుట, వాల్మీకి తపస్సందర్భమున నింద్రుడు రంభాద్యప్సరసలను తపోభంగముచేయ బంపుట, వాల్మీకి చలించకుండుట, దానిని జూచి సప్తర్షులు మెచ్చుకొనుట మున్నగు ఘట్టములలోని కల్పనము మనోహరము. మూలకథ మూడు పద్యములకు సరిపడును. దాని నిత డిట్లు చక్కగ తీర్చి దిద్ది ప్రబంధీకరించుటలోనే యాతని ప్రతిభా నైపుణ్యము వెల్లడి యగుచున్నది. ఇందు మూడవ యాశ్వాసమునందలి రంభోర్వశుల వివాద ప్రసంగములో నాట్యవిభేద వర్ణన మితని సొంతమే. దానివలననే యితని కాశాస్త్రమున గల పాండిత్య విశేషము స్పష్టమగును. నాట్యకళ రఘునాథనాయకుని యాస్థానమున నత్యున్నత స్థితిలో రాణించినది. దీనిని శృంగారసావిత్రిలో గూడ కథలో నప్రసక్తమైనను నేదో యొకవిధమున బ్రసక్తి గల్పించి యీ కళను ప్రభేదములతోగూడ జాల సొగసుగ దీర్చినాడు.

ఈ మహాకవి రచించిన యితర కావ్యములు, గ్రంథములు గూడ గాలక్రమమున లభించినచో నాంధ్ర వాఙ్మయ మదృష్టము ఫలించినట్లే. వే. తి.

**రాఘవరావు, చింతగుంట** (క్రీ. శ. 1896-1954) : వీరు ప్రతిభావంతులగు న్యాయవాదులలోను, న్యాయమూర్తులలోను ముఖ్యులుగా నెన్నదగిన ఆంధ్రులు. గుంటూరు జిల్లాలోని గోవాడ గ్రామంలో వీరు జన్మించిరి; బాపట్లలో ఉన్నత పాఠశాలా విద్యాభ్యాసము ముగించుకొని కాకినాడ కళాశాలలో ఇంటర్మీడియటు పరీక్షకు చదివిరి; తరువాత మదరాసు ప్రెసిడెన్సీ కళాశాలలో

నాంగ్లభాషయందు బి. ఏ. ఆనర్సు పరీక్షకు చదివి ఉన్నత శ్రేణిలో నుత్తీర్ణులైరి. వీరు గొప్ప వక్తలు; విద్యార్థిదశలోనే వక్తృత్వ నిర్ణయసభలలో ప్రథమములుగా నిలిచి సువర్ణపతకమును బహుమానముగా పడసిరి; పిమ్మట న్యాయపట్టభద్రులై వీరు సుప్రసిద్ధులగు సర్ అల్లాడి కృష్ణస్వామయ్యగారి యొద్ద వృత్తి నేర్వ నారంభించి అటుపిదప గణనగల న్యాయవాదులలో ముఖ్యులైరి. వీరి వాదనలు న్యాయశాస్త్రపాండితిని వెల్లడించునవే కాక, చమత్కృతి, భాషాపాటవములతో కూడుకొని న్యాయమూర్తులను రంజింప జేసెడివి. ఒక సందర్భమున 'కింగు' అను న్యాయమూర్తి వీరి వాదనకు ముగ్ధుడై అది ఆంగ్ల పండితుని ఉపన్యాసమువలె నున్నదని ఉగ్గడించెను. వీరు అతి క్లిష్టములగు గొప్ప వ్యాజ్యములు పెక్కింటిలో న్యాయవాదిగా పనిచేసిరి; ములకల్లంక వ్యాజ్యములో ప్రివీ కౌన్సిల్ వారి యెదుటకూడ వాదించిరి; 1934 మొదలు బార్ కౌన్సిలు సభ్యులుగా అయిదుమార్లు ఎన్నుకొనబడిరి; కొంతకాలము మదరాసు విశ్వవిద్యాలయపు సెనేటు సభ్యులుగా కూడ నుండిరి.



చిత్రము 202.
చింతగుంట రాఘవరావు

1949 లో వీరు మదరాసు హైకోర్టు న్యాయమూర్తిగా నియమితులైరి. వీ రొసగిన తీర్పులలో స్వతంత్రదృష్టి, బహుముఖ విజ్ఞానము, భాషాసౌందర్యము సర్వత్ర చూడ నగును. వ్యక్తిగతముగా వీరు ఉదారులు, సరళస్వభావులు. వీరికి దైవచింతన మెండు. శ్రీకృష్ణకర్ణామృతమును గూర్చి వీ రొసగిన రేడియో ఉపన్యాసములు శ్రోతలను తన్మయ మొనర్చినవి. చిం. రా.

**రాఘవాచార్యులు, తాడిపత్రి :** వీరి నివాస స్థలము బళ్లారి; శ్రీవైష్ణవ వంశజులు; ధర్మవరం కృష్ణమాచార్యులుగారికి మేనల్లురు; విద్యాధికులు; బి.ఏ., బి. ఎల్., ప్యాసయి బళ్లారిలో న్యాయవాదివృత్తియందు ఎన్నికగన్నవారు; అంతేగాక బళ్లారిలోనే పబ్లిక్ ప్రాసిక్యూటరుగా కొంతకాలము పనిచేసినారు.

ఆంధ్ర, ఆంగ్ల, కన్నడ, హిందూస్తానీ, తమిళ భాషలందు మంచి వ్యావహారికజ్ఞాన ముండడమేగాక వాటియందు కొంత పాండిత్యముగూడ సంపాదించుకొన్న సభ్యులు, సరసులు, యోగానంద సమాధి నిష్ఠాగరిష్ఠులు, పూజ్యులు అయిన తారానాథ్ గారికి ప్రియశిష్యులు. వీరి విగ్రహము సర్వాంగ సుందరమేగాక సభాకర్షణీయము. వీరినేత్రము లెంతటి ప్రశాంత, శృంగార, సౌశీల్య ప్రభావపూర్ణములో అంతటి క్రోధ, రౌద్ర, బీభత్సతాభీషణ భావాగ్నిగోళములు. అ వెంతటి భక్తిపూరితములో అంతటి హాస్యానురక్తియుక్తములు. వీరు నాటకకళారాధనా దేశమున స్వాభావిక నటుడుగా వరమంది జన్మించిన ఒక మహనీయజీవి.

అశేష లోకానుభవముతోను, ఆంగ్లాంధ్రభాషాభావ పరిపుష్టితోను, వాఙ్మాధుర్య చాతుర్యముతోను, సమయస్ఫూర్తితోను, అంగాంగ సౌందర్య విన్యాసముతోను, అన్ని రసములందును ఆనందమును చిలుకు వీరి నాటకరంగ పాత్రాభినయము ఆంధ్రావనికి నవ్యశోభ నివ్వడమేగాక ఆదర్శమై అలరారుచుండెడిది.

కళామతల్లికి వీరు చేసిన సేవ అగణ్యము, అనన్యము, నిర్దుష్టము, విస్పష్టము. వీరి కళాప్రబోధము కళారంగమునకు గౌరవప్రదమైనదేగాక మకుటాయమానమైనది. వీరికి దాదాపు ముప్పది సంవత్సరముల నాటకరంగానుభవము కలదు.



చిత్రము 203.
తాడిపత్రి రాఘవాచార్యులు

ఆంధ్రమందు రచింపబడిన నాటకములలో రామదాసునందు 'రామదాసు', చంద్రగుప్తలో 'చాణక్యుడు', ప్రహ్లాదయందు 'హిరణ్యకశిపుడు', చంద్రహాసయందు 'దుష్టబుద్ధి', సుభద్రార్జునీయమందు 'అర్జునుడు', రోషనారయందు 'శివాజి', సారంగధరయందు 'రాజరాజు', రామరాజు చరిత్రయందు 'పఠాణి', సావిత్రియందు 'యమధర్మరాజు' మున్నగు పాత్రల అభినయకీర్తి ప్రతిష్ఠలు వీరికి ఆంధ్రావనియందేగాక రాష్ట్రేతరాంధ్రావనియందు గూడ ఆనందనీరాజనము లెత్తినవి. వీరు రవీంద్రనాథ టాగూర్ గారి మెప్పును పొందినారు. ఖండాంతరములందు ఆంగ్లనాటకాలలో పాత్రలు ధరించి ఆంగ్లేయుల అదరాభిమానములను చూరగొన్న నటశిఖామణి వీరు. వీరి

'ఒథెల్లో', మాక్బెత్, హామ్లెట్, షైలాక్' మొదలగు పాత్రముల అభినయము ఆంగ్లనటకులకే ఆశ్చర్యమును గొల్పినవి. వీరి అసామాన్యనాట్యకళాకౌశలమున కుపలక్షణముగా ఆంధ్ర విశ్వకళాపరిషత్తువారు వీరికి 'కళాప్రపూర్ణ' బిరుదము నొసంగి వీరిని గౌరవించిరి. ఈ బిరుదము వీరిపట్ల సర్వవిధముల చరితార్థమైనది.

ఈ కళాప్రపూర్ణులు అరువదేండ్లు దాటిన వయసున పరమపదమును ప్రాపించిరి. స్థా. న.

**రాఘవాచార్యులు, ప్రతివాదభయంకర :** వీరు క్రీ.శ. 1760 ప్రాంతములో నేటి తూర్పుగోదావరిజిల్లా గొల్లప్రోలు గ్రామమునందు జన్మించిరి. వీరిది శ్రీవత్స గోత్రము; యజుశ్శాఖ; 'ప్రసిద్ధః పరగోష్ఠీషు ప్రతివాది భయంకరః' అని పదునాల్గవ శతాబ్దములో జగద్విఖ్యాతి గాంచిన ప్రతివాది భయంకరం అణ్ణన్‌గారికి వీరు పదియవ తరము వారు. వీరి తండ్రి స్వామిదేశికులను వెంకటాచార్యుల వారు; తల్లి లక్ష్మమ్మగారు. వీరు చీమలకొండ అద్వైత బ్రహ్మశాస్త్రులుగారియొద్ద తర్కశాస్త్రమును కూలంకషముగా నభ్యసించిరి. ఒకసమయమున వీరు క్రోడపత్రముల నన్వయించుకొనుచు గురుసన్నిధి నుపన్యసించుచుండ శాస్త్రిగారాశ్చర్యపడి వీరియన్వయమును ఆ గ్రంథమునకు వ్యాఖ్యానముగా నొనర్చి ప్రశంసించిరట.

వీరు చతుశ్శాస్త్రములయందు నపార ప్రజ్ఞ కలవారు. వీరినిగూర్చి 'గాదాధర గ్రంథ ఖండనచతురుండు' అనియు, 'కైయ్యట గ్రంథార్థ ఖండన చతురుండు' అనియు సాతులూరి సుభద్రాచార్యులుగారు తాము రచించిన 'బలరామ శతకము'నందు పేర్కొనియున్నారు. ఏకైకశాస్త్ర నిష్ణాతులగు నలుగురు పండితు లొకవంక నిలబడినప్పుడు వీ రొక్కొక్కరితోడనే వాదించి గెల్వొందెడివారు. ఆకాలమున రాఘవత్రయమని ప్రసిద్ధికెక్కినవారిలో వీ రొకరు. వీరు దిగ్విజయముచేసి అనేక సంస్థానముల కేగి జయపత్రికల నొందియుండిరి. వీరు సహస్రావధానమును జరుపుచుండెడివారట.

వీరు పీఠికాపురాధీశ్వరులగు శ్రీరాజా రావు నీలాద్రి రాయణింగారి యాస్థానపండితులయి, యా ప్రభువువలన యర్థాసనాద్యనేక గౌరవ, సత్కారముల నొందియుండిరి. వీరి వాదశైలి యతిప్రౌఢమై సామాన్య పండితులకు దురవగాహమై యుండెడిదట.

దిగ్విజయావసరమున వీరు కృష్ణ జిల్లాలోని అమరావతికి ప్రభువగు శ్రీరాజా వాసిరెడ్డి వెంకటాద్రినాయుడు గారి యాస్థానమునకు జనినప్పు డక్కడ సహస్రావధానము జరిగెనట; అపుడు రాజుగారుకూడ గంటము పట్టుకొని కూర్చుండిరట. ఆ యవధానకాలమున రాజుగారు 'స్వామీ! తప్పినదం'డని పల్క వారు 'మీ గంటము తప్పినది కావచ్చును కాని నా కంఠము తప్పదు; చూచుకొం'డని పల్కిరనియు, రాజుగారే తప్పు వ్రాసినట్లు తెలిసికొని వారిని సత్కరింప యత్నింప మానధనులగు నాచార్యులవారు 'మేము ప్రతిష్ఠాకాములము కాని ధనకాములము కా'మని జయపత్రికనుమాత్ర మందుకొని సత్కారములను తృణీకరించి వెడలిపోయి రనియు చెప్పుదురు.

రాజమహేంద్రవరములో 'రెవిన్యూ బోర్డు' ఏర్పడినప్పు డక్కడ వీరు శాస్త్ర పండితులుగా నియమింపబడిరి. వీరు శాస్త్రమునకు ప్రతిభటముగా గీస్త్రమను గ్రంథము రచించిరి. శాస్త్రప్రమాణములను యుక్తులచే ఖండించి తిరిగి యా ఖండనను పూర్వపక్షము చేసి, శాస్త్ర ప్రమాణములను స్థాపించుట - 'శాస్త్రం గీస్త్ర పరాహతం వితనుతే సద్యుక్తిభిః' అన్నది యీ గ్రంథమున ప్రతిపాదింపబడిన విషయము.

సుప్రసిద్ధ విద్వాంసులగు సురపురం వెంకటాచార్యులు గారితో శాస్త్రప్రసంగము చేయుటకై వీరు పయనించుచుండగా నా పండితులు పరమపదించినట్లు వార్త విని, వీరు వెనుకకు తిరిగి వచ్చిరట. వీరికి మంత్రశాస్త్రమున కూడ అఖండమగు పాండిత్యము గలదు. వీరు 'లక్ష్మీ తంత్ర'మను గ్రంథమును 'గౌరీతంత్రము'నకు ప్రతిగా చెప్పినట్లు ప్రసిద్ధి. వీరు 'తత్త్వభాష్య నిరాస' మను గ్రంథమును గూడ రచించిరి. వీరు 19 వ శతాబ్ది పూర్వార్థమున పరమపదించిరి. ప్ర. భ.

**రాఘవేంద్రరావు, ఈడ్పుగంటి** (క్రీ. శ. 1890 - 1942): వీరి తండ్రి కృష్ణ జిల్లా నివాసులు నాగన్నగారు; సైనిక శిబిరాలకు ఆహారసామగ్రి మొదలైన సామానులు బండ్లమీద తోలే కంట్రాక్టు పనిమీద నాగపూరు చేరారు. ఆపని ఆగిపోవడంచేత అక్కడనుంచి వ్యాపారంకోసం బిలాసపూరు వెళ్ళి అందులో గొప్ప ఆస్తిపాస్తులు సంపాదించారు.

రాఘవేంద్రరావుగారి ఉన్నత విద్యాభ్యాసం ఇంగ్లాండులో జరిగింది. వీరు బారిష్టరీ ప్యాసయి తిరిగి వచ్చేసరికి తండ్రి మరణించిరి. వీరు ఇంగ్లాండునుండి వచ్చినతర్వాత న్యాయవాది వృత్తిలో కొంతకాలము కృషిచేశారు. వీరికి మొదటినుండి ప్రజాజీవితంలోను, రాజకీయంలోను ఉన్న మక్కువ తమ వృత్తిలోను, తమ తండ్రి చేస్తూ వచ్చిన వ్యాపారంలోను లేకపోయింది. వీరు లోకమాన్య బాలగంగాధర తిలకువద్ద, తదితర మహారాష్ట్రీయ నాయకులవద్ద రాజకీయాలలో మొదటి పాఠాలు నేర్చు

కున్నారు; బిలాసపూరు మునిసిపలు చైర్మనుగా రాజకీయ జీవితం ప్రారంభించారు.

1918 లో తిలకు అస్తమించిన తరువాత వీరు మహాత్మాగాంధీ నాయకత్వము క్రింద 1927 వరకు ప్రసిద్ధ కాంగ్రెసు నాయకులుగా ఉండిరి; మహాకోసల రాష్ట్రీయ కాంగ్రెసు సంఘానికి మొదటి అధ్యక్షులైరి. వీరు కాంగ్రెసులో ఉన్నంత కాలమూ ఆ సంఘాని కించుమించుగా వీరే అధ్యక్షులు. ఆ ప్రాంతాన్ని ఏకసూత్రంమీద నడిపించడం కోసము వీరు గొప్పకృషి చేశారు. వీరు కేవలం స్వశక్తితో వృద్ధిలోనికి వచ్చిన ప్రతిభాశాలి.



చిత్రము 204.
ఈడ్పుగంటి రాఘవేంద్రరావు

వీరి రాజకీయ జీవితమంతా స్వయంగా నిర్మించుకొన్నదే. వీరికి కలిగిన ప్రతి విజయమూ స్వశక్తిమీద పోరాడి సంపాదించుకొన్నదే. వీరు నాగపూరులోనే రెండేండ్లు మధ్య రాష్ట్రానికి ప్రధాన మంత్రిగాను, ఏడేండ్లు హోమ్ మినిస్టరుగాను, నాలుగు మాసాలు గవర్నరుగాను కూడ పనిచేసి ప్రభుత్వశాఖ లన్నింటిలో తమ అసమానమైన ప్రతిభను ప్రతిబింబించేటట్టు చేశారు; ఖద్దరు టోపీతోను, ఖద్దరు దుస్తులతోను గవర్నరు గద్దెమీద కూర్చుని రాష్ట్రాన్ని శాసించారు; ప్రజాసేవకు ఉత్సాహం కల్పించారు. వీరు ఆడంబరంలేక అధికారమును పురస్కరించుకొని సేవచేసిన దేశాభిమాని.

మోతీలాల్ నెహ్రూ చిత్తరంజనదాసులు కోర్టులు, స్కూళ్లు, శాసనసభలు బహిష్కరించడం తప్పని నిర్ధారణ చేసి స్వరాజ్య పార్టీని స్థాపించి శాసనసభలలోకి వెళ్ళి ప్రభుత్వాన్ని ప్రతిష్టంభింప జేయవలెనని, మంత్రివర్గాలు ఏర్పడకుండా చేయాలని 1929 లో జరిగిన ఎన్నికలలో కాంగ్రెసువారిని శాసన సభలకు నిలిపారు. కాంగ్రెసు వేసిన ఈ ఎత్తు కాంగ్రెసు పార్టీకి వీరు నాయకులుగా నుండిన ఒక్క మధ్యపరగణాలలో తప్ప ఇతర రాష్ట్రాలలో ఎక్కడా సాగలేదు.

కాని 1927 లో వీరి రాజకీయ దృక్పథంలో గొప్ప మార్పు కలిగింది. ప్రజాసేవకై ప్రభుత్వ పరికరాల నెందుకు ఉపయోగించుకోగూడ దనే భావనతో బ్రిటిషు వారు ఇవ్వడానికి సిద్ధపడిన అధికార మంతా అందుకోవచ్చునని 'రెస్పాన్సివ్ కో-ఆపరేషన్' అనే పేరుతో దేశంలో ఒకఉద్యమం బయలుదేరింది. మహారాష్ట్రులు తొక్కిన ఈ పంథాలో తాముకూడ తమ వారితో ముందుకు పోవాలని వీరు వెంటనే మంత్రివర్గ మేర్పరచి తమ 36 వ యేట మధ్యరాష్ట్రానికి ప్రధాని అయినారు. ప్రభుత్వపు ప్రాకారంలో ఉన్నా వీరిలో అమితంగా ఉన్న దేశాభిమానంలో మార్పు రాలేదు.

వీరిది శ్రుత పాండిత్యం కాదు; పఠితపాండిత్యం. అంతఃరాష్ట్రీయ రాజకీయములు, చరిత్ర, సారస్వతం, కళ వీనిలో వీరు గొప్ప పండితులు. గొప్ప గొప్ప యూనివర్సిటీలలో కూడ ఉండని గ్రంథసంచయం వీరి దగ్గర ఉండేది. రసాయన శాస్త్రం మొదలుకొని ఖగోళశాస్త్రం వరకు, ఇంగ్లీషు నాగరికతలో భోజనపుబల్లవద్ద వుండే మర్యాదలు మొదలుకొని పార్లమెంటు మర్యాదల వరకు సర్వ విషయాలు ఆయనకు కొట్టిన పిండి.

వీరు రైతుబిడ్డ; రాజకీయాలలో అత్యంతోన్నత పదవి నధిరోహించి కూడా రైతుసమస్యలను మరచిపోలేదు. దేశంలో ఎవరూ కలగూడగనని ఋణవిమోచన చట్టాన్ని వీరు 1932 లోనే మధ్యప్రదేశ్‌లో ప్రవేశపెట్టారు.

వీరు 1939 లో ఇంగ్లండులో ఇండియా మంత్రికి సలహాదారుడుగా పనిచేశారు. సరియైన ఆహారాభావం వల్ల వీరి కక్కడనే వ్యాధి సంభవించింది; క్రమంగా ఆ వ్యాధి హెచ్చింది. అయినా ఈయన 1941లో వైస్రాయి కోరికమీద రక్షణశాఖ సభ్యుడుగా పని చేశారు. రోగిగా ఉండికూడా ప్రజారక్షణ వ్యవస్థలో వీరు చూపిన స్ఫూర్తి స్తుత్యం.

1942 లో 'బ్రిటిష్ ప్రపోజల్సు' తెచ్చిన సర్ స్టాఫర్డు క్రిప్సు అపుడు వైస్రాయి కౌన్సిలులో డిఫెన్సు మెంబరుగా వున్న వీరిని ఆహ్వానించారు. వీరు క్రిప్సుతో 'రక్షణ శాఖనుకూడా ప్రజాయత్తం చేస్తేనే మీకూ మాకూ రాజీ; లేకపోతే మీరు వచ్చిన ప్రయోజనం లేదని నిస్సంకోచంగా చెప్పారు. 'రాఘవేంద్ర రావుగారు ఏ స్వతంత్ర దేశంలోనైనా పుట్టివుంటే కర్మణ్యులకు ఆరాధ్యదేవత అయ్యేవార'ని ద్వారకాప్రసాదమిశ్ర అన్నారు. మో. స.

**రాజచూడామణి దీక్షితులు** : ఇతడు రత్నఖేట శ్రీనివాస దీక్షితుల మొదటి కుమారుడు; రెండవ కుమారుడర్ధనారీశ్వరుడు; మూడవవాడు రాజచూడామణి. శ్రీనివాసదీక్షితుడు చెంజిరాజగు సూరప్పనాయకునియాస్థానములోనివాడు; అప్పయదీక్షితునకు మామ. రాజచూడామణి దీక్షితుడు అర్ధనారీశ్వరునికడ విద్య నభ్యసించెను; వెంకటమఖికడ కూడ విశేషములను గ్రహించెను. ఇతడు ఆనందరాఘవ నాటకము, కమలినీకలహంస(నాటిక),

తంత్రశిఖామణి (వేంకటమఖి వార్తికా భరణమునకు వ్యాఖ్య), ప్రాయశ్చిత్త ప్రదీపము, ఉపనిషద్భాష్యము, యజుర్వేద వ్యాఖ్య, సంకర్షముక్తావళి, కర్పూరవర్తిక, మణిదర్పణము, న్యాయ చూడామణి, రాఘవకృష్ణ పాండవీయము (త్ర్యర్థి), రత్నఖేట విజయము (తన తండ్రిచరిత్ర), యుద్ధకాండ చంపువు (భోజ చంపునకు శేష గ్రంథము), వృత్తి రత్నావళి, శంకరాచార్య తారావళి, శంకరాభ్యుదయము, కంసధ్వంసనము, కాంతిమతీ పరిణయము, చిత్రమంజరి, శృంగార సర్వస్వము, రఘునాథభూపవిజయము, కావ్యదర్పణము, అలంకార చూడామణి, రుక్మిణీ పరిణయము అనుగ్రంథములను రచించెను. 'సాహిత్య సామ్రాజ్య' మితని రచన యని టి.ఆర్. చింతామణిగారు వ్రాసిరి; కాని రాజచూడామణి తన తంత్రశిఖామణి పీఠికలో తన గురువగు వేంకటమఖి యీ గ్రంథమును రచించినట్లు స్పష్టముగ చెప్పియున్నాడు; తనకు సమస్త విద్యలను నేర్పిన యన్నను దన ప్రతి గ్రంథమునందు స్మరించి తన కృతజ్ఞతను దెలిపినాడు.

యజ్ఞనారాయణుని సాహిత్య రత్నాకరమున, రామభద్రాంబ రఘునాథాభ్యుదయమున గూడ తోపూరి యుద్ధము బేర్కొనబడియుండుటచే నివి యా యుద్ధము తరువాత రచింపబడినవి. కమలినీకలహంస నాటిక రఘునాథనాయకుడు పుండరీకపురమునకు వెడలినపు డతని యానతివలన బ్రదర్శింపబడిన ట్లానందరాఘవనాటకమున నున్నది. రాజచూడామణిని చిన్నతనముననే యాస్థాన పండితపదము నిచ్చిరఘునాథుడు గౌరవించినట్లు కనబడును. వే. తి.

**రాజశేఖర శతావధాని, దుర్భాక** (క్రీ. శ. 1888 - 1957): వీరు కడపజిల్లా జమ్ములమడుగులో జన్మించిరి. వీరి అసలుపేరు కాశీశాస్త్ర్రయ్య, అధికారనామము రాజశేఖరశతావధాని. వీరిది శాలంకాయన గోత్రము; ములికినాటి శాఖ. వీరి తండ్రి దుర్భాక వెంకటరామయ్యగారు; తల్లి సుబ్బమ్మ. వీరు జమ్ములమడుగు, ప్రొద్దుటూరులలో ప్రాథమిక విద్యాభ్యాసము చేసిరి; 1904 - 1907 ల మధ్య తార్కికసింహ బిరుదాంకితులు కందాళ దాసాచార్యులు గారి కడను, కళాప్రపూర్ణ జనమంచి శేషాద్రిశర్మగారి సన్నిధిని సంస్కృతాంధ్ర సాహితీ గ్రంథములు, నాటకాలంకార శాస్త్రములు చదివిరి; కడప ఉన్నత పాఠశాలలో చదివి 1907 లో మెట్రిక్యులేషన్ పరీక్షలో కృతార్థులైరి; చెన్నపురి క్రైస్తవ కళాశాలలో ఎఫ్. ఏ. చదువుచు నడుమంత్రముననే చాలించిరి; 1908 నుండి ప్రొద్దుటూరిలోని జిల్లా మునసబు కోర్టులో గుమాస్తాగా పని చేసి, గాంధీ ఉద్యమ ప్రభావమువలన 1921 లో ఉద్యోగము మానుకొని కొంతకాలము ప్రొద్దుటూరి మునిసిపల్ కౌన్సిలరుగాను, 1928లో వైస్ ఛెయిర్మన్ గాను పనిచేసిరి; 1927 - 32 లలో ప్రొద్దుటూరు తాలూకా బోర్డు ఉపాధ్యక్షులుగా నుండిరి; మదరాసు సెనేటు సభ్యులుగాను, వేదపాఠశాలా కార్యదర్శిగాను పనిచేసిరి. వీరు గడియారము వెంకటశేషశాస్త్రి గారితో కలసి 'రాజశేఖర - వెంకటశేష కవు'లను జంటపేరుతో 1920 - 28 ల మధ్య పలు తావుల శతావధానములు సలిపి సన్మానము లందిరి. ఈ యవధాన పంచాననుల అవధాన విధానము నెరుగుటకు వీ రిరువురిపేర వెలువడిన 'అవధానసారము' ప్రధాన సాధనము.



చిత్రము 205
దుర్భాక రాజశేఖరశతావధాని

చారిత్రిక విషయములకు కావ్యత్వము సంపాదించు సాధనలో కృతార్థులైన రాజశేఖరులకుగల 'వీరప్రబంధ పరమేశ్వర' బిరుదము సార్థకము. 'రాణా ప్రతాపసింహ చరిత్రము', 'అమరసింహ చరిత్ర', 'వీరమతీ చరిత్రము', 'చండనృపాల చరిత్రము', 'పుష్పావతి' - పద్య కావ్యములు, 'పద్మావతీ విజయము' (నాటకము) మొదలగునవి, 'వీరగాథావిభాత' 'చారిత్రక కవితాచార్య' యను వీరి అన్వర్థ బిరుదముల కాకృతి దిద్దిన యితర కృతులు.

సీతాకల్యాణము, సీతాపహరణము, వృద్ధిమూల సంవాదము, పద్మావతీ విజయము అనునవి వీరు వ్రాసిన నాటకములు; విలయ మాధుర్యము, స్వయంవరము, అనఘుడు, గోదానము, శరన్నవరాత్ర పద్యావళి - వీరి తక్కిన రచనలు. కామేశ్వరీ స్తోత్రమాల యను సంస్కృత కృతి వీరు రచించినది కలదు. 'ది హీరోయిన్స్ ఆఫ్ హిందూస్తాన్' అను గ్రంథమును వీ రాంగ్లవచనమున రచించిరి. రాణి సంయుక్త హరికథ, తారాబాయి (నవల), టాడ్ చరిత్రము (కావ్యము), రాజసింహ మొదలగు వీరి కృతు లముద్రితములు. వీరు రచింప మొదలిడిన 'ఉత్తర రఘువంశ' మను మహాకావ్యము సగములో ఆగిపోయినది.

కవిసార్వభౌమ, కవిసింహ, కావ్యకళానిధి ఇత్యాది వింశత్యధిక బిరుదములు వీరికి కలవు. రాయలసీమ కళా

పరిషత్తు (హిందూపురము) ప్రథమ వార్షికోత్సవ సందర్భమున పరిషన్నిర్వాహకులు వీరికి స్వర్ణమయ రత్నఖచిత కిరీటమును సమర్పించి సన్మానించిరి. తూ. దో.

**రామకృష్ణకవి, తెనాలి :** సారస్వతములో తెనాలి రామకృష్ణునిపేరు సర్వజనులకు తెలియును. ఈ తెలియుటకు కారణ మతని కవితాశక్తికాదు. అతనిని గురించి ప్రచారములోనున్న యనేకములైన హాస్యకథలు దానికి కారణము. అందులో నేవి శ్రీరామకృష్ణకవిచేత జేయబడినవో, యేవి కల్పింపబడినవో విడదీసి చెప్పుటకు వీలులేదు. గాని ఒక్కటిమాత్రము నిజము. అతడు అమిత వాక్చమత్కృతి కలిగినవాడు. ఈ చమత్కృతి యాతని కావ్యములయం దెచ్చటను గానరాదు. ఆయన తెలుగు భాషలోనున్న మహాప్రౌఢకవులలో నొకడు.

ఈయన వ్రాసినవి 'ఘటికాచలమాహాత్మ్యము', 'ఉద్భటారాధ్య చరిత్రము', 'పాండురంగ మాహాత్మ్యము'. ఉద్భటారాధ్య చరిత్రము వ్రాసిన కవిపేరు తెనాలి రామలింగకవి యనియు, పాండురంగ మాహాత్మ్య కృతికర్త తెనాలి రామకృష్ణకవి యనియు నున్నది. ఉద్భటారాధ్య చరిత్రము శైవ గ్రంథము; పాండురంగ మాహాత్మ్యము వైష్ణవ గ్రంథము. ఇద్దరి పేరులు లింగ కృష్ణ భేదము కలిగియుండుట, శైవ వైష్ణవ మతభేదము కలిగియుండుట నిద్దరు నొక్కరు కాదేమోయను సంశయమునకు స్థానభూతమైనది. కాని ఉద్భటారాధ్య చరిత్రమునకు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు పీఠిక రచించి దానియం దీయిద్దరు కవులు ఒకరేకాని యిద్దరు కాదని నిరూపించిరి. ఉద్భటారాధ్య చరిత్రమునందును, పాండురంగ మాహాత్మ్యమునందునుగూడ భావములలో సామ్యము లున్నవి.

రామకృష్ణకవి తన చిన్ననాటి గ్రంథములలోని భావములే తరువాతి గ్రంథములలో నధికమైన యుక్తి వైచిత్ర్య సంపాదనము చేసి చెప్పినాడు. ప్రభాకర శాస్త్రిగారీ గ్రంథకర్తల యేకత్వమును కాలికముగాగూడ సాధించిరి. ఉద్భటారాధ్య చరిత్రము దేచమంత్రి కంకితము చేయబడినది. ఆయన కొండవీటి దుర్గాధ్యక్షుడైన నాదెండ్ల గోపమంత్రికడ ముఖ్యోద్యోగి. శ్రీకృష్ణదేవరాయలు క్రీ. శ. 1517 లో కొండవీడు జయించెను. గోపమంత్రి 1517 లో దేచమంత్రి కగ్రహార మిచ్చెను. కనుక నుద్భటారాధ్య చరిత్ర రచనాకాలము 1517 తరువాత. పాండురంగ మాహాత్మ్యము విరూరి వేదాద్రి మంత్రి కంకితము. ఈయన మంగయ గురవరాజు కొడుకైన పెద్దసంగభూపాలునొద్ద వ్రాయసకాడు. ఈ వేదాద్రిమంత్రి కందాళ అప్పలాచార్యుల శిష్యుడు. సారంగు తమ్మయ్యయు నీ అప్పలాచార్యులవారి శిష్యుడే. క్రీ. శ. 1542 లో గండికోట ప్రభువు కందాళ అప్పలాచార్యులవారి కొక దానశాసన మిచ్చెను. అందుచేత పాండురంగ మాహాత్మ్యము 1542 దాటిన తరువాతిది కావచ్చును. ఈకాలము చూచినచో తెనాలి రామకృష్ణకవి బ్రతికియుండదగిన కాలముగా కనిపించుచున్నది. ఇదియుగూడ నొక సామ్యహేతువు.

ఇంతేకాక పాండురంగమాహాత్మ్య మంతయు వైష్ణవ పరమైన గ్రంథమైనను నిందు శివభక్తి యపారముగా నున్నది. ఆముక్తమాల్యదయు, పాండురంగమాహాత్మ్యమును - రెండును వైష్ణవ గ్రంథములే. గ్రంథకర్త లిద్దరు వైష్ణవులే. అయినను వారి వైష్ణవములో చాల భేదమున్నది. ఆముక్తమాల్యదలో నవతారికయందు శివస్తుతియు, పార్వతీ స్తుతియు లేవు. నిత్యముక్తుల స్తుతులు మాత్రమే కలవు. పాండురంగ మాహాత్మ్యమున శివస్తుతి సామాన్యముగా లేదు.

' ఈ చివురాకు నీ ప్రవవ మీవువుదేనియ యెంతయు ప్పెడిన్
జూచితి రే యటంచుఁ దనిచుట్టు శుకాదులుగొల్వఁగాఁ గవ
ర్థాచిత చంద్రగాంగ జలమైన శివాహ్వయ కల్పశాఖ వే
దాచలమంత్రికీర్తి కలశాబ్ధిని వెన్నెలమాడ్కిఁ జూచుతన్ ॥'

ఈ పద్యమునందు శివభక్తికేమియు గొదవలేదు. ఇతని వైష్ణవము తెచ్చికొన్న వైష్ణవము, జన్మతోడిది గాదు. ఇతనిది జన్మతోడిది శైవము. పాండురంగమాహాత్మ్యమున శివప్రశంస యెందు వచ్చినను కవియొక్క యాహావైభవ మంతయు కనిపించును. కాశికాపురిలో మృతి కైలాస హేతువగుట నిత్యవిషయము, సర్వపురాణవేద్యము. అట్టి స్థితి పాండురంగ క్షేత్రమునకుగూడ గలదని చెప్పుటకే యీ గ్రంథము వ్రాసినట్లున్నది :

' ఒకనాఁడుఁ దీర్థోపయోగిగాని శరుండు
నౌదల ధరియించు నభ్రగంగ
ఆ ప్రొద్దు ప్రొయి రాజనట్టి నిర్వేదయు
భోగించు నైశ్వర్యము లెనిమిదియు
.......................
......మతిలేని మేదకుడు గూడ
మౌనివర్యులఁ జదివించు మట్టినీడ '
పంచముఖపీఠ మే నోసరించెనేని

ఇతని శివభక్తి యపారము. నాకనదీప్రదీప్తపులినంబుల యందు సన్మునులు సైకతలింగ పూజనము సలుపుదురట! కుమారస్వామి ప్రభృతులు కైలాసమునకు పోదురు. అచట శివపార్వతుల లీలావైభవము విస్తరించి వర్ణించెను. పుండరీకుడు పాండురంగని దర్శించును. అచట పాండురంగని వర్ణించుచు అతనినేత్రముగానున్న శివుని వర్ణించును. ఈగ్రంథమునందు శివసంబంధమైన వర్ణన

మెక్కడ వచ్చినను విలక్షణముగా గన్పించును. ఇవి యన్నియు రామకృష్ణకవి వైష్ణవము స్వీకరించినవాడుగా ధ్రువపరచును.

రామకృష్ణకవి మహాకవియే. మహాకవి యనగూడదు; ఉక్తి వైచిత్ర్యము కలిగినంత మాత్రమున నెవ్వడును మహా కవికాడు - సుకవి యగును. ఉక్తివైచిత్ర్యము కూడ లేక మాధుర్య సౌకుమార్యాది గుణములు కలిగిన యొక చక్కని శైలియు, తీర్చి దిద్దినట్లు పద్యములు వ్రాయుటయు మొదలైన లక్షణములు కలవాడు కవి. మహాకవి యగుటకు రసభావముల తీర్పు, కథానిర్మాణశక్తి, కథారచనాశక్తి లోకోత్తరస్థితియం దుండవలయును. ఈస్థితి శ్రీకృష్ణరాయ యుగమునందు పెద్దన్నగారికి తప్ప మరియెవ్వరికిని లేదు. కాని తత్కాలగత బహుకవులు సుకవులు; కొందరు ప్రౌఢ కవులు. ఆముక్తమాల్యదయు, పాండురంగ మాహాత్మ్యమును ప్రౌఢప్రబంధములు; వసుచరిత్రము శ్లేషకావ్యము; పారిజాతాపహరణము సుకుమార కావ్యము; కాళహస్తిమాహాత్మ్యము మధురకావ్యము. ఆముక్త, పాండురంగ, కాళహస్తి కావ్యములలో భక్తి ప్రధానము. తద్భావప్రతిపాదకముగా నీ కావ్యములు బహుకథా సమ్మిశ్రితములు. అందందు రసస్పర్శ యుండదనిగాని, కథ చెప్పుటలో నల్పాల్పములైన శక్తులు భాసించవనిగాని చెప్పుట కాదు. ప్రధానముగా నీ కావ్యము లట్టివి కావు. అట్టి యూహ యీ కవులకు లేదు.

తొలుత నీయన యనుకరణ శ్రీనాథునిగూర్చి సాగినది. ఇతని యుద్భటారాధ్యచరిత్రయు, ఘటికాచలమాహాత్మ్యము శ్రీనాథుని ననుకరించు సీసపద్య రచనతో సాగినది. శ్రీనాథుడు సీసపద్యమున కొక నిండు తెచ్చెను; ధారాశుద్ధి తెచ్చెను. అతని ననుకరించుట సామాన్యముగ చాల కవుల కందరకు సహజము. శ్రీనాథుడు శైవుడు; శివదేవుని లీలావైభవములు తన కావ్యములం దంతట నింపినవాడు; గోపాలకృష్ణుని జగన్మోహనమూర్తిగా పోతన్నగా రెట్లు తీర్చిరో శివుని నట్లు తీర్చినవాడు. స్మశానవాసియై యోగీశ్వరేశ్వరుడైన శివుని శృంగార మూర్తిగా శ్రీనాథుడు చేసెను. మరియు వ్యాసుని యొక్క కాశీవిరహాది సందర్భములలో మిపుల హృదయంగమముగా వ్రాసినవాడు. ఆ లక్షణము లన్నియు నుద్భటారాధ్యచరిత్రములో తెనాలి రామకృష్ణయ్య యనుకరించెను. ఈపద్యము శ్రీనాథునిగూర్చి తెనాలికవి యనుకరణకు గొప్ప యుదాహరణము:

'భక్తవత్సల విశ్వభర్త శంకర నాదు
కోర్కి యాడేర్పుమీ కొంకులేక
అన్నపూర్ణాదేవి అంబ సైకతనితం
బిని నన్ను రక్షించుమీ ప్రియమున
దుంఠివిఘ్నేశ యుత్కంఠ నున్ముఖవృత్తి
నొందుమీ ననుఁ బ్రోచు నోరిమ గలిగి
యఖిలలోకనమస్య యాకాశగంగ ని
ర్మలమూర్తి యొసఁగుమీ మహిమ నాకు
రవ్యమతులార యోవరిష్ఠాట్టులార
యొరిమ సంకల్పసిద్ధి చేయుండు మిమ్ముఁ
గొలిచి యున్నాఁడు చల్లగా నిలిచినాఁడ
నరుగు చున్నాఁడ మీయాజ్ఞ నాత్మపురికి.'

తరువాత నొకమార్గములో శ్రీనాథు డెంతవాడో మరి యొకమార్గములో నంతటివాడైన శ్రీకృష్ణదేవరాయ లుదయించెను. ఆముక్తమాల్యద తత్కాలమున నాశ్చర్యము కలిగించెను. మరియు పెద్దన్నగారి మనుచరిత్రములోని రచన శ్రీనాథుని మాధుర్యమునకు వంకలు దిద్దెను. తెనాలి రామకృష్ణకవి వానిని చదివెను. అందుచేత అతని ప్రత్యేక శైలి యేర్పడెను. ఆ శైలి యొక స్వతంత్రమైన శైలి. ఈ శైలిలో నాముక్తమాల్యదా లక్షణము లున్నవి. కాని దానికంటె భిన్నమయి యొక రమ్యత భాసించెను. మరియు నీతని సీసపద్యముల శైలి శ్రీనాథుని లక్షణములు, నాముక్తమాల్యదయొక్క ప్రౌఢియు గలిసి యేర్పడినది.

తెనాలి రామకృష్ణకవి ప్రతిష్ఠ సంపూర్ణముగా నతని పాండురంగమాహాత్మ్యముమీద నాధారపడియున్నది. పలుమంది పెద్దన్నగారి మనుచరిత్రము సంపూర్ణముగా చదువనట్లే పాండురంగమాహాత్మ్యముకూడ సంపూర్ణముగా చదివియుండరు. కాని నిగమశర్మోపాఖ్యానము, అయుతనియుతోపాఖ్యానము ప్రధానముగా చదువుదురు. ఈ రెండు కథలు తెనాలికవి కవితకు మచ్చుముక్కలు. అతని క్రొత్త పలుకుబడి, సర్వవైభవము నీ రెండు కథల యందు సంపూర్ణముగా నున్నది.

'ఉష్ణాని హోమాగ్ని యూఁద నొల్లఁడుగాని
విరహజ్వరార్తిమై వెచ్చనూర్చు'
'పరమేష్ఠినుండి నీ తరముదాఁక విశుద్ధ
తరమైన వంశంబుఁ దలఁచవైతి'
'ఉత్తాల ఫణిభుగ్గరుత్తాలవృంతాని
లాశాంత ఘర్మాంబువయ్యె మేను'
'ఆజానుదీర్ఘంబులై హారిన్మణిమయ
స్తంభంబులకుఁ గులస్వామి లగుచు'

ఈ నిగమశర్మోపాఖ్యానములోని సీసపద్యములును,

'హుంకారములు లేవె యుపపురందరహాతో
త్పాటన క్రియకుఁ జాల్పడవుగాక'
'ఉర్వీధరము లెక్కి యుఱుక నే కుచకుంభ
యుగమొల్లఁగాక దా నుఱుకు మనిన'

ఉక్తి వైచిత్ర్యమునకు అయుతనియుతోపాఖ్యానములోని యీ సీసపద్యములును,

'జీర్ణైక కృత్తివేష్టిత శాస్త్రకబళికా
వారపేటిక లొక్క వటువు పూన'

'ఉద్యదుత్థాన సముద్యోగ మాత్రావ
శిష్టచేతస్సార దష్ట దర్భ'

'వత్సనాభీగంధవహమయ్యె నాయావు
పైగాలి నీవారపాకములకు'

ప్రౌఢి కీ సీసపద్యములును, తక్కిన వృత్తములలో

'ప్రారంభించిన వేదపాఠమునకుం బ్రత్యూహ మౌనంచునో'
'ఈ కడజాతి నాతి కిహిహీ మహిదేవుఁడు చిక్కెనంచు'
'నాదు సహోదరుండు సుజన స్తవనీయనయప్రసక్తి'
'వానోనిగ్రహమెన్న రాఁకలియు నిర్వట్టుం గడింపర్'

మొదలైన పద్యములును తెనాలి రామకృష్ణకవి ప్రతిష్ఠా మూల స్తంభములు. ఈ పద్యములు లేనిచో తెనాలి రామ కృష్ణకవి కింత ప్రతిష్ఠ లేదు. తక్కిన రచన కంతకు నీ పద్యము లుపలక్షకములు:

'నవసుధాపరిఖాంబు నివహ ముబ్బెడుచోట
మెఱుఁగుఁ బుత్తడికోట మించుచోట
నిగిడి యోఁగుల కెంపు నెలకట్టు గలచోటఁ
గల్వకావిరికాఱు గ్రమ్ముచోట
నలరుమొగ్గనల కట్టావు లూరెడుచోటఁ
గెలఁకుల కొలఁకులు తొలఁకుచోట
గంధర్వ గాంధర్వ గంధ మింపగుచోట
గరుడ కేతనములు క్రాలుచోట...'

మొదలైన యీతని పద్యము,

'మృగనాభినికరంపు భుగభుగ ల్గలచోట
చదలేటి తుంపురు ల్చెదరుచోట
వకుళవాటీగంధవహుఁడు పైకొనుచోట
కర్పూరతరుధూళి కప్పుచోట...'

మొదలైన పెద్దన్నగారి పద్యమును జూచి వ్రాసినది. కాని పెద్దన్నగారి పద్యమును మించినదికాదు. నూఱుమంది యనుకర్తలలో నొక డెచ్చటనో యొకచోట మించును.

'విషయాంకురము గిల్లివేయనివారికి
నినుపకచ్చడమున కెంత దవ్వు'

ఇది పాండురంగ మాహాత్మ్యములోనిది.

'ఇనుపకచ్చడా ల్గట్టుకొను మునిముచ్చు లెల్లఁ
దామరసనేత్రలిండ్ల బందాలు కారె'

అన్నది పెద్దన్నగారి మాట. ఇట్లు పెద్దన్నగారి మాటలను, రచనా పద్ధతులను ఈయన యందందు స్వీకరించెను.

'కోపంబు నాఁగి మిక్కిలి
పాపములకు లోఁగి బుద్ధి పశ్చాత్తాపా
టోపశిఖఁ గ్రాఁగి కరుణా
ద్వీపవతీలహరిఁ దోఁగి విప్రుఁడు మఱియున్.'

'వరణాద్వీపవతీతటాంచలమునన్'

'వరణాద్వీపవతీ' బదులు 'కరుణాద్వీపవతీ.' 'మును సంచిమొద లిచ్చి మనుప దక్షులు' అన్న పెద్దన్నగారి 'సంచిమొదలు'వంటి 'సంచెకట్టు' అను మాటను తెనాలి కవి మిక్కిలిగా వాడును. ఇక నీయన కాముక్తమాల్యదపై ప్రీతి యెట్టిదో చూడవలయును.

'యమదండ చండమగు భుజ
గమునకు వెఱచఱచి యాఖుకన్యక కమలా
రమణాంఘ్రిఁ జేరె గురుభీ
తమతికి నాముక్తమాల్యదకు నెన యగుచున్.'

ఆపేరే తీసుకవచ్చి యిందు జొనిపెను. ఇది సుశీలయను పతివ్రత కథానంతరమున నొక కాకియు, హంసయు, జిలు కయు మొదలయిన జంతువులు పాండురంగస్వామి యాల యమున మోక్షమును పొందినకథలో పాము మోక్షమును పొందిన కథాభాగము. ఎలుక పోయి కమలారమణాంఘ్రి చేరెను. దానిని తరిమిన పాము మోక్షమును పొందెను. ఎలుక మోక్షమును పొందుట యిందు వర్ణితము కాదు. పైగా పామునకు వెరచిన యెలుకతో తండ్రికి వెరచిన గోదాదేవితోడి పోలిక రమ్యముగాను లేదు. కాని యాముక్తమాల్యదా శబ్దమును వదలిపెట్టలేదు. ఇది యాతని యాముక్తమాల్యదాగ్రంథమందలి యభిమాన మునకు మాత్రమే సాక్ష్యముగా నున్నది.

'సంపదచేతఁగాని కొనసాగవు సువ్వె గృహస్థ ధర్మముల్
సంపద పూర్వజన్మవికసత్సుకృతమ్మునఁ గాని చేర దా
సంపద చేరియున్ మదవశంవదుఁజేయు మహాత్మునేనియున్
జంపకు నన్నుఁ గన్నుసిమి చంపుదు ముంపుదు బోధగాథలన్.'

వృద్ధ బ్రాహ్మణాకారమున వచ్చిన యింద్రునితో నయుతుడు చెప్పిన మాట లివి. మాలదాసరికథలో మాల దాసరి వేదాంతమును జెప్పగా బ్రహ్మరాక్షసుడు నిల్లే యన్నాడు. 'ఈ వేదార్థములతో నన్ను చంపకుము; చదివిన కూరవు నాకు దొరకితి'వని. అక్కడ 'చంపకు' మన్న మాట ప్రయోగించుటలో రమ్యత కలదు. అన్నవా డధి కుడు; విన్నవా డల్పుడు. ఇచట నట్లు చెప్పుటకు వీలు లేదు. 'చంపకు నన్ను' అన్నమాట విసిగించకు మన్న యర్థములో జమత్కారముగా నున్నది. ఆ చమత్కారము చెప్పినవాని యాధిక్యముచేత నౌచిత్యము సంపాదించును. 'చంపకు' ఏక వచనక్రియ. చంపుదు, ముంపుదు బహు వచనక్రియలు. దాని యనౌచిత్య మదే చెప్పుచున్నది.

ఈ కవియొక్క యిట్టి విలక్షణపు శయ్య యే విధముగా సముపస్థితమైనదియో విచారితమైనచో దానికి పలులక్షణ

ములు గలవు. ఇతని కవిత్వమందు ప్రౌఢితో కలసి సౌకుమార్యముండుట యొక లక్షణము. ఈ సౌకుమార్యము రెండు విధములుగా కవి సంపాదించును. మొదటి పద్ధతి భావగతము :

'బలభిదారామసంభవలతాంతశ్రేణిఁ
జన్నము నా కొక్క చిన్ని తేరు
కాళికెంగేలి చిల్కలరాజుఁ గొనితెచ్చి
నావెంటఁ బడివాగె నడవఁబనుపు
గగనచరద్రాశిగణవర్తి మకరంబు
బిరుదుటెక్కెముగ వేగిర మొనర్పు
మదనగోపాలుండు మాతండ్రిచే నాకు
తెలుకుచే మలిపింపు కలకు విల్లు
వనజహితు వేఁడి తమ్మి తూపునకుఁ దెమ్ము
దివ్యములఁగాని సాధింపఁదీర దీకు
నంబ! నీ వంచు రుక్మిణి నట్టు నిట్టుఁ
దిరుగు శైశవచాపలార్థితుఁడు మరుఁడు.'

ఇందు మన్మథునిబాల్యము వర్ణితము. అతనియాట వస్తువు లన్నియు నతడు పెద్దవాడైన తరువాత వెలసిన లక్షణముల కనుకూలముగా కల్పింపబడి వాని యందలి సహజ సౌకుమార్యముచేత సౌకుమార్య సంపాదకములగు చున్నవి.

'జలధి వీచీవాత్యఁ జలి తాఁకెఁగా యని
యక్కున నందంద నలమి యలమి
ప్రామట్టియా కొత్తి రాయిడిఁ బొందెఁగా
యని సన్నపొత్తుల నునిచి యునిచి
వాపోయి వాపోయి వసివాడి యాఁకటఁ
బెగడెఁగా యని యగ్గు వెట్టి వెట్టి
పెను జీఁకటులు గ్రమ్మె పెన్నైట వసియించి
వెఱచెఁగా యని పుల్ల విఱిచి విఱిచి
మంచి లక్షణముల పుట్టుమచ్చవాఁడు
నేత్రములు విప్పనట్టి యీనెత్రుగందు
వరద నేతెంచె నెవ్వారివాఁడొ యంచు
విలయవారిఁ దెచ్చి పెంతు రప్వీటి సతులు.'

ఇది వైకుంఠపురమునందలి స్త్రీలు వటపత్రశాయిని లాలించిన వైఖరి. పసిపిల్లలకు చలి తగులునని, యొత్తు కొనునని, దృష్టి తగులునని చేసెడు పనులయందు సహజముగ మానవజాతికి సుకుమారభావము లుండును. ఆ భావమును స్వీకరించి ఇచట సౌకుమార్య సంపాదన చేయబడినది. ఈ రీతిగా నందందు భావగత సౌకుమార్యమును సంపాదించును. ఇట్లే శబ్దగత సౌకుమార్యమునుగూడ పలుచోట్ల సంపాదించును.

'చలనవిహీనవృత్తి నడిసన్నఁ బరాశరుఁడాదియైన య
య్యల యలజాయివంటి హృదయంబులు నీరుగఁ
జేయు బోయపూ
విలుతున కెంత దొడ్డపని వెన్నెల బిజ్జని కాసినంతలో
వలనఁ గలంగి పొంగు వసిబాలుర చిత్తము మెత్తచేయఁగన్'

'వెన్నెల బిజ్జని కాయులోపల' - ఇట్టి మాటలను దెచ్చి సౌకుమార్యమును దెచ్చును. ఈ సౌకుమార్యము కొన్ని గడుసు మాటలతో గలిసి యొక విలక్షణత పొందును.

ఇతని శైలికి ప్రధాన విలక్షణత్వము యమకము :

'కలహంస మొకటి యదుకుల
కులహంసము గుడిఁ జరించు'

'శుకమొకటి చంచుజిత కింశుకమై'

'పారయును గాతఁ గాతర సముద్ధరణోచితకార్యధుర్య'

'కలశీసుతుండు కరుణా
కల శీతల దృష్టిఁ దెలియఁగా'

'ధాతృసంజాతల సత్స్మితాస్యజలజాతల
జాతలతాంతసాయకద్యోతల'

'బెడఁకి యాడిన కీడన నెవ్వఁడోపు'

'బుద్ధిఁ దలంక కలంక చంద్రముక్తాతతిఁ బోల్చు'

ఇట్టి వనంతములు. తరువాతి పలు తెలుగు కవులకు వీనిదే యొరవడి. ఈ యమక మొక్కొక్కప్పుడు రమ్యతా సంపాదకముగాకూడ నుండకుండ జేయబడుచుండును. 'నలినాసన్నలినాసనానన పురాణస్థానముల్' - నలిన్, ఆసన్, నలినాసన = తగినట్లు అళతో బ్రహ్మదేవుడు మొదలైన - ఈ రీతిగా నుండును.

మరియు శబ్దాంతరుకారముమీది యుకారము లోపింప జేసినచో తత్రత్యమై యొక ప్రౌఢి భాసించును. 'పొంద ర్పునర్జన్మముల్', 'ఆకలియు నీర్వట్టుం గణింప ర్తల ల్మాసెంగా యనరు'.

పద్యమునం దితరమయిన ప్రౌఢి యున్నచో నిదిగూడ ప్రౌఢి సంపాదనకు హేతువగును.

మరియు వృత్త్యనుప్రాసగంధిగా, యమకగంధిగా జేయుచు హ్రస్వాక్షరబాహుళ్యము, సంయుక్తాక్షర బాహుళ్యముతో జేసిన పద్యమున కొక బిగింపు వచ్చును.

'అంజన పుంజ నవ్యతరమై తగు నీ తిరుమేని కప్పు క
ల్మిం జలుకంగఁ జేకుఱుఁజుమీ కమలేక్షణ సూక్ష్మదృక్కలా
కంజభవాది వృద్ధులకు'

'కీలారముననుండి పా లింట కేతేఱ'

'పే, రుక్కున నేఱు నిక్కచన నొక్కఁడు
వంకలు వొక్క శక్తుఁడే'

'మట్టిన బిట్టు మండిపడి మౌని సముత్థితుఁడయ్యె మేనిపైఁ
బెట్టిన పుట్ట నెట్టవిసి బీటలు వాఱ శ్రవశ్శకుంతముల్
చట్టువలెత్తి ముందటికి సాగఁదలంప జటాచ్ఛటాచ్ఛవిన్
ద్రుట్టెలు కట్టి నిద్రిలు మరుద్భుగధీశకులంబు మేల్కనన్'

ఇట్లు బహుపద్యములం దీయక్షర సంయోజనముచేత ప్రౌఢి సంపాదిత మగుచున్నది. మరియు జశ్త్వసంధి తత్పరిపోషకముగా నుండును.

'మరుద్భృగధీశ' – ఇదియే

'ముదశిమదంగభాగితాలికితవిభ్రమంబు.'

మరియు నుకారేకారోపరి సకారాంతములైన శబ్దముల మీద నచ్చులు వచ్చినప్పటి రకారప్రయోగముకూడ నేతత్ప్రౌఢి సంపాదక మగును – 'వపురుగ్ర', 'చక్షూరాజీవము' మొదలైనవి.

వీనికితో డీయన యనేకములైన తెలుగు మారుమూల శబ్దముల వాడును. 'గొబ్బుండ్ల బేసము, దర్దరుటలు (దర్ద ఱిలుటలు), లావటము, నిరుకుళము, ప్రాసఁగువిత్తు, లాడిగావింతు, లంటసిలంబడుట, కుడుకకూటి ప్రాయము వాడు, బుడిబుడితాల్పుడు, ముచ్చుట్టులు, కట్టిండి – ఇట్టి మాటలు సంస్కృత సమాసముల నడిమి జొప్పించి విచ్ఛిత్తి విశేషమును కల్పించును. ఈపని శ్రీనాథుడు కొంత చేసెను. తరువాత నాముక్తమాల్యదలో నెక్కువగా నుండెను. పెద్దన్నగారును అందందు చేసిరి. ఇతనియం దిది సమృద్ధిగా నుండి యితని శైలీవైలక్షణ్యమును సంపాదించెను.

దీనికి తోడు లోకోక్తులను బహుధా సంగ్రహించుట యొక విచ్ఛిత్తివిశేషమును వీని కవనమునకు సమకూర్చెను.

'కాపురము నాకుఁ గడు పెద్దకంచియంత' – ఉద్భట.

'కంపలఁబడ్డకాకికైనై',

'భొందు పట్టుల నప్పులు పొడిచి పొడిచి'

'తలలోపల నాలుక పూసలలో దారంబు'

'ధనవంతుఁడయ్యు నుద్వాహంబు దొఁగిఁగి మూతులు నాకుఁ బెఱవితంతువులఁ దగిలి'

'బారాదిసొమ్ము లుండఁగ'

'కామిని దీపించె దొండ కాచిన భంగిన్'

'బీదకన్నువడి బూడిదపండునుఁబోలె బూదు పాఁజాదు నొకదుప్పి'

'అత్తటి నిప్పు ద్రొక్కినటు లౌదల తేల్గొనినట్టు లావ యవ్వెత్తుగ ద్రాగినట్లు ...'

ఈ రీతిగా ననేకములైన లోకోక్తులు, పలుకుబళ్ళు తన ప్రౌఢ సమాస బహుళమైన రచనలో జొనిపి తన రచన కిత డొకవైలక్షణ్యము సంపాదించెను.

కొన్ని గడుసు పలుకుబళ్ళు సమకూర్చును.

'కెరలక క్రమ్మఱింప నడు గెంటనె నిల్చు'

అడుగు వెంటనె యనుటకు – ఇది 'యెఁడు' ప్రత్యయముగా దీసికొని 'అడుగెఁడు' అడుగెండు – అప్పు డౌపవిభక్తికము జేసికొని 'అడుగెంట'నని యర్థము జేసికొనవలయును.

అనుయాయి పృథుకహస్తాంతర = అనుసరించుచున్న కుఱ్ఱ వానిచేతిలో. ఈ పృథుక శబ్దమనుయాయి శబ్దము తరువాత వాడుట జటిలమయిన పద్ధతి. 'మన్మ సంతానము' – మనుమల యొక్క సమూహ మనుటకు. 'జటిలవ్యాఘ్రము'; 'తృట్టిక దొట్ట' – షకారాంతమైన యీ శబ్దమును ఉకారాంత్య హల్ద్విత్వముగా జేయుట.

'నడి కోరిచి వంకవఱక చాటు న్మానెన్'

వంకర గడ్డిపోచ చాటుకూడ తీసివేసెను.

ఇట్టి ప్రయోగములతోబాటు కొన్ని యచ్చతెలుగు కూర్పులు చేయును. 'చిలువాయనపు వేల్పుకొలము', 'తరిత్రాడు సీద్రంపు పొరలంటి', 'కలదు లేదను వాదముల కోర్చి' మొదలైనవి. తోరహత్తు సయ్యాటము – వీని మీద నించుక్క చేర్చి ధాతువులు చేయుట. మస్తరించు, పటాపంచు, సల్లబెట్టు మెదుగుడులు, బత్తళిక, తాసటము, ద్వారవతి గలంతి, వెంబరపుట్టువు, కూఁకులు వత్తులు, బుజలు వైచుట, సల్లబెట్టుట మొదలైన పలు తెలుగు మాటలు తెచ్చి వాడును.

సమస్త మరుత్కరి – సర్వదేవతాశ్రేష్ఠుడని యర్థము. కడారు పటుఁడు – పీతాంబరుడని యర్థము. ఇట్టి మాటలు కొన్ని. పలు పద్యములు సంబోధనతో మొదలుపెట్టును. ఆ సంబోధనలు క్రాంతపూర్వశబ్ద బహువ్రీహులు – 'ఛత్రితశేష' ఇటువంటివి. నల్లని తలవెండ్రుకలు కలదానా యనుటకు 'మేచకమేఘసంపదుపమేయశిరోజ'. కొన్ని సమాసములు విపరీతపు కూర్పు గలవి: 'కార్మకర వాశ్లిష్టాశులు' – ఆశ – దిక్కు అను నర్థములో, 'ఉద్యన్న ఖర ప్రఘాణములఁ దంత్రులు మీటుచు', 'సభవజ్జన కమ్ముగ', 'పుంగ్రామణి', 'ధరాధోభువన స్వర్గధామనుతుడు' — ఇట్టి సమాసములతో కొంత ప్రౌఢి సమకూర్చుట. మరియు శివుని 'నక్షికాషేయు' డనుట; కృష్ణుని 'అర్జునరథభూషణము', మందప్రోయాంఘ్ర కూరిమి మ్రానిపండు', దేవకీతర్ణకము' ననుట. స్త్రీని 'చంద్రముఖి' యనుటకు 'నీహారమయూఖజిన్ముఖి' యనుట. ఇట్టి మాటలచేత నీ గడుసుదనము మరియు విజృంభించును.

వీని యన్నింటికి మకుటాయమానమైనది సీసపద్యమున కొక ప్రత్యేకపు చేత చేయుట. ఇతని సీసపద్యములకు వచ్చిన ప్రతిష్ఠకు కారణము ప్రధానముగా తగణ బాహుళ్యముతో చరణములు తీర్చుట. వానితో యమకము జోడించి కొంత వాడుకలో లేని మాట లుపయోగించినచో కొంత విలక్షణత్వము సమకూడును. అదియే యితని సీస పద్యములలోని ప్రధాన లక్షణము.

'భూశాఖమైన లక్ష్మీతీర్థమునకు దక్షిణమున'
'వాలోరు గోరు పెస్గిలిము చేసె'
'ఉత్తాల ఫణిఖుగ్గరుత్తాలవృంతాని'
'కాద్రవేయాకల్ప కంఠమూలచ్ఛాయలు'
'ఆజానుదీర్ఘమ్ములై హరిన్మణిమయస్తంభమ్ములకు'
'మూలాలవాలస్థలిలేలిహానంబు'

ఇట్లు కూర్చినచో సీసపద్య చరణమునందు ధారాశుద్ధి యెక్కువ యుండును. ఆ పద్యములు చదువుకొనుటకు రమ్యముగా నుండును. ఈ తగణము తరువాత 'సగ' మొకటి యెక్కువగా గూర్చినచో సీసపద్యము నడక రమ్యమనిపించును. మరియు తెలుగును, సంస్కృతమును గలిపినచో సీసపద్యమునం దొకవిచ్ఛిత్తి విశేషము వచ్చును.

'బహుసంకుమదపంక పాణింధమంబైన
తాళిగోణపుజుంగు నేల జీఱ'

పూర్వార్ధమంతయు సంస్కృతము, ఉత్తరార్ధము తెలుగు. పద్య రచనలో శబ్దగతమైన యొక సమత ప్రాపించును.

'హుంకారములు లేవె యుపపురందరహాటో
త్పాటనంబునకుఁ జాల్పడవుకాక'

ఇది సమతయను గుణము. ఏ తద్గుణోదాహరణమునకు నరస భూపాలీయ కర్త యొక పద్యమును వ్రాసెను. కాని యది దీనిముం దెట్లు నిలుచును? ఈ పద్యమున కిదియే సాటి. ఇట్లు సారస్వతములో నాన్యతోదృష్టములైన, పరమ రమణీయ విచ్ఛిత్తివిశేష సంపాదకములైన పద్యములు నొకటి రెండుగా తెలుగు బాసలోని గొప్ప కవులు పదిమంది, పన్నిద్దరు తమ కావ్యములలో వ్రాసిరి.

శబ్ద, సమాస, తదితరవిషయములగూర్చి యింత చెప్పుట యేల యనగా వీని యన్నింటియొక్క సమాహార స్థితియే యితని ప్రౌఢ శైలీసంపాదక లక్షణమని చెప్పుటకు. యథేచ్ఛముగా వీని నన్నిటిని నించుమించుగా సర్వత్ర నిక్షేపించుటచేత నిట్టిశైలి మూర్తి కట్టినది.

ఈయన శ్రీనాథుని తొలుత దినములలో పద్యరచనయం దనుకరించినవాడు. పాండురంగని కథనాటికి పద్య రచనానుకరణము తగ్గిపోయి భావానుకరణము మిగిలెను. శ్రీనాథునివలెనే ఈయనకూడ భోజనప్రసక్తి వచ్చినప్పుడెల్ల దానినిగురించి విస్తారముగా వ్రాయును.

'జలుకులు వాఱ లెస్సఁగ దంచి వెదురు బి
య్యమును బువ్వులవలె నలఁతిలోనె
వార్చి దించిన క్రొత్తవంటకం బతిమాత్ర
ధౌత శరావపాత్రమునఁ జాల
వడ్డించి పలువన్నె వన్యామిషంబులు
చుట్టువాఱఁగ నుంచి చొక్కటముగఁ
గాఁచిన గుఱునెయ్యి సేచాఁచఁజాలినం
తయుఁ గ్రుమ్మరించి తత్తక్రపూరము'

మొదలైనవి.

'ఒక కొన్ని వడియమ్ము లొక కొన్ని వరుగులు
నొక కొన్ని తెఱఁగుల యొలువుఁ బప్పు
లొక కొన్ని ద్రబ్బెడ లొక కొన్ని తాలింపు
లొక కొన్నివిధముల యొజ్జచేరు
లొక కొన్ని కలగల్పు లొకకొన్ని బజ్జులు'

పద్య మంతయు నిట్లే.

ఒకవిధమైన ప్రౌఢ సౌకుమార్యసంపాదనబుద్ధికి నాటవిక గ్రామీణ స్త్రీల వర్ణనములు రుచించును. వాని వర్ణనములం దొకచమత్కృతిని బుద్ధికి కలిగించును.

'కొనలఁ జుట్టిన తీగె పెనచేఁ జమరవాల
పరికరంబుల జుట్టు పట్టి తిగిచి
కమ్మ సంపంగి మొగ్గల నిరుగడరాయు
జేగురుఁదిరికలఁ జెంపవెట్ట'

లోపాముద్రాగస్త్యులు పోవుచుండగా మృగవధాజీవ శుద్ధాంతమీననయన లర్చసేసిరట. నిగమశర్మోపాఖ్యానమున గ్రామీణలైన స్త్రీలను వర్ణించును. ఈరీతిగానే పల్లెటూరి జాతరలు వర్ణింపబడెను. మరియు, నీయన యాకాలమునందలి కొన్ని విద్యలను గురించి విస్తారముగా వ్రాయును. వేదాద్రిమంత్రి వ్రాయసములు లలితముక్తాఫలాకారవిలసనములుగా నుండునట. పట్టి, వట్రువ పరిపుష్టి కలవిగా నుండవలయును. తలకట్టు, గుడి, సున్న, క్యావడి, వట్రువసుడి, మూవత్తు, ఐత్వ మేత్వము మందముగా నుండవలయునట. వలపలగిలుక బంతులు నిలుపు పొలుపుగా నుండవలయునట. అన్నిటియందు నొక న్యాయ ముండవలయునట. ఆ యక్షరములు నిశ్చయముగా దెలియవలయును; ఒక యంద ముండవలయును; చెక్కినట్లుండవలయును; హల్లులు తజ్జాతిని చెప్పవలయును. వ్రాయసమును గూర్చి యింత యున్నది. ఇది యానాటి విద్య.

ఓడలుకట్టు శాస్త్రము పేరు మాలిమిశాస్త్రము. మన దేశమునందు అదిగొప్ప పరిణతి పొందినది. అదెట్టిదియో తెనాలి రామకృష్ణకవి దశావతార వర్ణనములో బౌద్ధావతారమును వర్ణించుచు వ్రాసెను. పూర్వ కవులు తమ దేశాచారములు, దేశమునందలి విద్యలు, దేశిక్రీడాదివర్ణనములు, పలుకుబడి సొగసులు - దీనియొక్క బాహుళ్యమే తమ కవితావైభవముగా గలవారు. శ్రీకృష్ణుని వర్ణించుచు బ్రహ్మను డాగురు మూత లాడించెనని, గోవర్ధనగిరితో కందుకక్రీడ సల్పెనని, రాసక్రీడ నాల్గుస్తంభాల యాటయని, రత్నములతో వెన్నెల వత్తి యాడెనని, కాళియాహి నెత్తిమీద తన్నుబిళ్ళయాడెనని తెనాలికవి తెలుగు పిల్లల యాటలను సమకూర్చెను.

ఏతాదృగ్విషయముల బాహుళ్య ముండినను అందందు గొప్ప కవితాలక్షణములు లేకపోలేదు. లోకోత్తరము లయిన యుత్ప్రేక్షలు మహాకవితాలక్షణములు. శ్రీకృష్ణుడు తలమీద చిక్కమును వేసికొనెను. ఆ చిక్క మిట్లుత్ప్రేక్షింపబడినది.

'మును మీనగుటఁ బట్ట మునులు వైచిన బత్తి
వలబోలెఁ జిక్క మౌదలఁ దలిర్ప,

అతడు తొలుమీను కనుక నతనిని పట్టుకొనుటకు ఋషులు భక్తియను వలను వేసినట్టు లున్నదట. ఇది యాశ్చర్యకరమైన యుత్ప్రేక్ష.

'ఇట నభ మిట భూవలయం
బిట బలిసద్మంబు నుండు నిరవు లివి యనం
బటువులగు వళుల చెలువునఁ
బుటపుటనై యున్న చిన్నిబొజ్జ కదలఁగన్.'

త్రివళుల నిట్లు వర్ణించుట యొక యాశ్చర్యకరమైన కల్పన. నారదుని వర్ణించుచు నతని జడలు 'నిగిడి సుషుమ్న యూనిన పిల్ల వెలుఁగుల వడువున' నున్న వనుట యొక యుదాత్త విషయము.

'ఉమ పసుపాడి మోముతడి యొత్తిన హత్తిన తన్నిశాంకదృ
క్కమలదళాంజనాంకకలకంబుగ నింబగుచేలఁ గేలివి
భ్రమగతిఁ గప్పినాఁ డనఁగఁ బచ్చని నల్లని చాఱలన్మనో
రమమగు ద్వీపిరాడజినరత్నము యత్నముమీఱఁ దాల్చుచున్.'

శివుడు తాల్చిన పులితోలు పార్వతి పసుపు పూసికొని కాటుక పెట్టుకొని మొగము తుడిచిన గుడ్డ తాను కప్పికొన్నా డన్న ట్లున్నది. ఈ యుత్ప్రేక్షలో నద్భుతత్వము లేదు. శృంగారరసవ్యంజకముగా నున్నది. పాము యమదండచండమువలె నున్నదనుట యొక యర్థవత్తయిన కల్పన. మొత్తముమీద నితని రచనయందు లోకోత్తరతాగుణసంపాదన మర్థమునందుకాక శబ్దమునందే యెక్కువ యుండును. వర్ణ్యము లైన విషయములచేత దేశాచారాదుల యందు ఎక్కువ యనురాగము, కథానిర్మాణములోని గడుసుదనమును, మానవ జీవిత ఘట్టములలోని క్లిష్టసమస్యలు, పాత్రల తీర్పులోని మానసిక పరిణామ రమ్యతలు మొదలయిన మహావిషయములు తక్కువగా నుండును. ఒకవేళ నట్టి సందర్భములు వచ్చినను లోకమునందు వాడుకొను సామాన్య భావములు గడుసుగా చెప్పుకొని పోవుటతో నీ కవు లందరు దాటుకొనిపోదురు.

ఇత డేరి కోరి దుష్కర ప్రాసములు సమకూర్చుకొనును. ఇది యీయనకు చిన్నప్పటినుండియు నున్న గుణము. 'యుగ్యము లయ్యె నెవ్వనికి నోలిచతుశ్శ్రుతులు' అని ఉద్భటారాధ్య చరిత్రలో. ఈ లక్షణము ప్రధానముగా నాచన సోమునిది. తరువాత నాముక్తమాల్యదలోనిది. ఈయనయు 'నక్షత్రంబులు', ధర్మస్తేయము', 'అద్రిగ్రావము', 'మూర్తి మదిక్షుకార్ముకము', 'తృష్ణారహితులు', 'శాణోత్తేజిత', 'అంతర్వాణి', 'పోర్మహిషున్నిజాంఘ్రిగలఁ బొట్టన వ్రేలిట', గర్వోద్రిక్త', 'విస్మమదీయ నేత్రశిఖ', 'ఆఖైమీనది', 'అస్మత్ క్షేత్రస్థితి' మొదలైన సంయుక్తాక్షర ప్రాసలతోనే పద్యములు ప్రారంభించును.

ఈతని కథాగత సన్నివేశ కల్పనాచారుతాభూము లగు వానిలో నిగమశర్మకు నతని యక్కగా రుపదేశించిన వైఖరి ప్రసిద్ధమైనది; పలుమందిచేత నుదాహృతమైనది. సామాన్యసంసారములలో నక్కగారికి తమ్మునిమీద నదుపుండును. అక్కగారి మాట తమ్ముడు కాదనలేడు.

'ఇంతలు నంతలు నగు తన
సంతానము చంట వెంట సందడిసేయన్'

ఇది ఇండ్లలోని సంపద. ఎలయు సీత్కారములతోడ నీళ్ళు గ్రుక్కి జడలు కట్టిన తల విడదీసి కొనగోళ్ళతో దువ్వి పేలను చంపి మెడమన్ను నలచి కుడివైపునుండి బిడ్డ చను ద్రావగా తమ్ముని కామె హితోపదేశము చేసెను. ఈ వర్ణన సామాన్యమైన యుత్తమ కుటుంబములలోని యొకానొక సన్నివేశము పరిస్థితిని కన్నులకు కట్టినట్టు లున్నది. ఇది యొక గొప్ప కవియొక్క రచనా వైదగ్ధ్యము. జీవితమునకు గవిత ప్రతిబింబముగా నుండవలయుట యొక కవితా లక్షణమే యగును. అదియే పరమమైన లక్షణముగా ననుకొనినచో నీ ఘట్టము రామకృష్ణుని మహాకవుల తరగతిలో చేర్చును. మరియు నీమె తమ్మునితో మాటాడుచు చాల గడుసుగా మాటాడును; లాలించుచు బెదరించుచు హితము చెప్పుచు బలువిధములైన వాగ్వైచిత్రితో జెప్పును. 'ఏమీ మునులే గృహస్థులు రమించుట యెగ్గె కులాంగనాతతిన్' అని హితోపదేశము చేసెను. వేయిమందినైనను పెండ్లాడి వారితో రమించ రాదా యనెను. ఈ రమించుట యన్న శబ్దము వాడుట ధాత్వర్థముగా సరియేగాని లోకమునందు వాడుకొను నర్థములో కొంత యనౌచిత్యము లేకపోలేదు. ఐనను మధ్యమ సంపత్తిగల కుటుంబములలో కొంత మోటుగా మాటాడుట యుండును. ఇచటి ధర్మము చింత్యము. వందమందిని పెండ్లియాడి కామోపభోగము లనుభవించ వచ్చును. వారకాంతల తగులు పనికిరా దనుట సంపన్నుల కేర్పరచిన ధర్మ మనుకొనవలయును.

ఇది యొక క్షేత్ర మాహాత్మ్యము. దీనిలోని కథలలోని సర్వపరమార్థము ఎట్టి దురాచారవంతుడైనను ఎన్ని పాపములు చేసినను, ఎన్ని ఘోరములు చేసినను భగవంతుడు

తుడు ప్రసన్నమైనచో వానికి మోక్షము లభించునని యనుట. దానికి మించిన సిద్ధాంత మిందులోనిది. తత్కాల భగవద్బుద్ధి గూడ నక్కరలేదు. స్థలము, కాలము తద్దేవతా మాహాత్మ్యముయొక్క సన్నిహితత్వము కలిగిన వగుచుండగా యాదృచ్ఛికముగా జరిగిన యొక క్రియ తద్భగవత్సేవగా పరిణమించి వానికి భగవత్సన్నిధానము చేకురుట. మనోవాక్కాయ కర్మముల సంపుటి యుత్తమ భక్తి లక్షణము. ఆంధ్రభాషాసారస్వతమునందలి ప్రబంధములలో పాండురంగమాహాత్మ్యము ఏతాదృక్ ప్రౌఢశైలీ నిర్మాణ నైపుణ్యముచేత కైలాసశిఖరమువంటిది. భాషలో తరువాతి కవులందరకు ప్రాఢిసంపాదన కితనిరచన యొరవడి. వి.స.

**రామకృష్ణకవి, మానవల్లి** (క్రీ. శ. 1866-1957): వీరు చెన్నపట్టణములో నుంగంబాకమున జననమందిరి. వైదిక బ్రాహ్మణశాఖకు చెందినవారు వీరు. వీరిది పండిత వంశము. వీరి తాత వెంకట కుప్పసోమయాజి; తండ్రి అష్టాదశభాషలలో, విద్యలలో ప్రవీణుడును, నాట్యశాస్త్ర వ్యాఖ్యాతయనగు రామశాస్త్రి. వీరు మొదట మదరాసులోనే చదివి బి. ఏ. పరీక్షలోను, తరువాత సంస్కృతాంధ్రములందు ఎం. ఏ. పరీక్షయందును కృతార్థులైరి.

వీరు మొట్టమొదట మదరాసులో చింతాద్రిపేట మిడిల్ స్కూలులోను, పిదప క్రిస్టియన్ కళాశాల హైస్కూలులోను, పచ్చయప్ప కళాశాల హైస్కూలులోను అధ్యాపకులై యుండిరి; పిమ్మట వనపర్తి సంస్థానమున గ్రంథ ప్రచురణ కార్య నిర్వాహకులై పదేండ్లుండిరి; తరువాత ఆరేండ్లు మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారముయొక్క ప్రాచీన తాళపత్ర గ్రంథ సంపాదనశాఖ కధ్యక్షులై యుండిరి; పిదప మద్రాసు ప్రభుత్వ విద్యాశాఖలో ప్రవేశించి రాజమహేంద్రవర కళాశాలలో కొంత కాలము అధ్యాపకులైయుండిరి; అనంతరము 1935 వరకు తిరుపతి దేవస్థానపు విద్యాశాఖాధికారి పదమును వహించిరి; పిమ్మట మదరాసు విశ్వవిద్యాలయ చరిత్రశాఖలో మెంకెజీ రికార్డుల పరిశీలన కార్యము నారేండ్లు నిర్వహించిరి; తదనంతరము తిరుపతి ప్రాచ్య పరిశోధనాలయమున సంస్కృతశాఖలో పదియేండ్లకాలము రీడరుపదవి నధిష్ఠించి యుండిరి. ఈ పదియేండ్లలో నొకమారు వీరు తత్పరిశోధనాలయమునకు డైరెక్టరుగాకూడ కొంత కాలము పనిచేసిరి.



చిత్రము 206.
మానవల్లి రామకృష్ణకవి

కవిగారు ద్రావిడ కర్ణాట కేరళ ప్రాకృతాది భాషా సాహిత్యములలో కూడ గొప్ప వైదుష్యము గలవారు. ప్రాచీన సంస్కృతాంధ్ర సాహిత్య, తచ్చరిత్రల విమర్శా పరిశీలనములు వీరికి పరమ ప్రియములు. ప్రాచీన గ్రంథ సంపాదన, పరిశీలనములకై తమ జీవితమును, ధనమును సమర్పించిన స్వార్థదూరులు వీరు.

ప్రాచీన గ్రంథపరిశోధన సంస్కరణములందును, శబ్దార్థ స్వరూప నిర్ణయమునను వీరి ప్రజ్ఞ సునిశితమైనది. వీరు సంస్కృతాంధ్రములందు సరస ప్రబంధ ధోరణిని కవిత్వము చెప్పగల సమర్థులు. పెక్కు శాస్త్రములందు వీరికి మంచి పాండిత్యము గలదు. సౌజన్యము, సహృదయత వీరికి ప్రకృతి సిద్ధములు.

వీరు వనపర్తియం దుండినపుడు 'విస్మృత కవులు' అను శీర్షిక క్రింద ననేక ప్రాచీనాంధ్ర గ్రంథములను సంస్కరించి ప్రకటించిరి. నన్నెచోడుని కుమారసంభవము, వల్లభరాయని క్రీడాభిరామము, మడికి సింగన సకలనీతిసమ్మతము, బద్దెభూపాలుని నీతిశాస్త్రముక్తావళి, భైరవకవి శ్రీరంగమాహాత్మ్యము, ప్రబంధమణిభూషణము, వేంకటేశోదాహరణము, ఆంధ్ర తిరువాయ్మొఴి వానిలో కొన్ని.

'దక్షిణ భారత సంస్కృత గ్రంథమాల' నారంభించి అందు వీరు అపూర్వ ప్రాచీన సంస్కృత గ్రంథములను సంస్కరించి ప్రకటించిరి. వానిలో కొన్ని : దండి రచించిన అవంతిసుందరీకథ, చతుర్భాణి (శూద్రకుని పద్మప్రాభృతకము, ఈశ్వరదత్తుని ధూర్తవిటసంవాదము, వరరుచి ఉభయాభిసారిక, శ్యామలకుని పాదతాడితకము అను భాణ చతుష్టయము), భోజుని శృంగారప్రకాశము, దిఙ్నాగుని కుందమాలనాటకము, విజ్జిక విరచించిన కౌముదీ మహోత్సవ నాటకము, వత్సరాజచరితము.

వీరి స్వతంత్ర కావ్యములలో నాద్యము, తొలి ప్రాయమున రచించినది మృగావతి-రసవత్కావ్యము; వసంత విలాసము కళాపూర్ణోదయమును బోలిన-తొమ్మిది ఆశ్వాసముల ఉత్తమ కావ్యము; ఇది యముద్రితము; పాటలీపుత్రకమనునది మరొకపద్యకావ్యము; కళింగసేన - మాలతీ మాధవమువంటి ప్రకరణము.

వీరు భరతనాట్యశాస్త్రమును అభినవగుప్తాచార్యుల వ్యాఖ్యానముతోకూడ చక్కగా పరిష్కరించి గైక్వాడ్ ఓరియంటల్ గ్రంథమాలలో మూడు భాగములు ప్రకటించిరి. ఇంకను ఒక భాగము అప్రకటితము. ఇది వీరి భరత

నాట్య శాస్త్రజ్ఞానమున కొరగల్లు. వీరి సర్వంకష ప్రజ్ఞకు నిదర్శనమయినది భరతకోశ మను గ్రంథ మిం కొకటి. ఇందు నాట్యశాస్త్ర సంబంధులగు పదము లన్నియు అర్థ వివరణములతో, లక్షణోదాహరణములతో అకారాదిగా కూర్పబడినవి. వయో విజ్ఞానములు పండిన వయస్సులో వీరు రచించిన యీ గ్రంథమును తిరుపతి ప్రాచ్య పరిశోధ నాలయము ప్రకటించినది.

వీరు భాసనాటకములను కొన్నిటిని అనువదించిరి. ఇంకను అనేక గ్రంథములను రచించిరి. వీరి ప్రాచీన గ్రంథ సంపాదన ఫలముగా, నుపలబ్ధములైన సంస్కృతాంధ్ర గ్రంథము లనేక మముద్రితము లింకను కలవు.

సరస్వతీ సేవా తత్పరతతో జీవితము నంతయు గడపిన వీరియెడ లక్ష్మి ప్రసన్నురాలు కాకుండెను. వీరి సాహిత్య సేవను గుర్తించి జీవితముయొక్క అత్యంతచరమదశ యందు ప్రభుత్వము వీరి కుపకార వేతనము నొసగెను.

వీరు జీవితపరమార్థముగా ప్రాచీనగ్రంథ సంపాదనము నకు పూనక యుండినచో ప్రాచీనగ్రంథము లెన్నియో నేడు లోకమునకు లేకయే పోయియుండెడివి. గ. సు.

**రామకృష్ణచయనులు, మల్లాది** (క్రీ. శ. 1865 - 1941): వీరు గుంటూరుజిల్లా, సత్తెనపల్లి తాలూకా గోరంట్ల అగ్రహారములో జన్మించిరి. వీరు వెలనాటి బ్రాహ్మణులు; తండ్రి రాఘవయ్యగారు; తల్లి అచ్చమ్మగారు. బాల్యమున దత్తతకై హైదరాబాదు రాజ్యములో నొక గ్రామమునకు గొనిపోబడి, యట పార్సీ, అరబ్బీ, ఉర్దు కొంత నేర్చి దత్తత సరిగా సాగనందున పదునాల్గవ సంవత్సరమున తిరిగి గోరంట్లకు వచ్చి సంస్కృత భాషాభ్యాసము ప్రారంభించిరి.



చిత్రము 207.
మల్లాది రామకృష్ణచయనులు

కావ్యములను ముగించుకొని వీరు అమలాపురము తాలూకా ఇందుపల్లి కేగి అచట పలేశ్వరపు తమ్మన్న శాస్త్రిగారివద్ద కావ్య నాటకాది సాహిత్య గ్రంథములు చదివిరి; పిమ్మట పేరూరులో మంథా చెన్నయ్య శాస్త్రిగారివద్ద తర్క ప్రకరణములను, పేరి నరసింహ శాస్త్రిగారివద్ద వ్యాకరణ గ్రంథములను చదివిరి; పిమ్మట శ్రీపాద రామశాస్త్రిగారివద్దను, విజయనగరములోని భీమాచార్యులుగారివద్దను తర్కశాస్త్రాధ్యయనము చేసి యా శాస్త్రములలో సునిశితపాండిత్యమును సంపాదించిరి. వీరు తమ యిరువదిరెండవ యేట కొడవటిగంటి గ్రామములో నొక సప్తాహ సందర్భమున నొక ప్రసిద్ధ పండితుని వాదములో నోడించుటయు, దాని ఫలితముగా వీరి ఖ్యాతి వ్యాపించుటయు, వీరికి అమరావతి వాస్తవ్యులైన గుడిమెళ్ళ వెంకట సుబ్బయ్యగారు తమ కొమార్తె కృష్ణవేణమ్మగారి నిచ్చి వివాహము చేయుటయు సంభవించెను.

వీరు తమ యిరువదినాల్గవ యేట మైసూరి కేగి యచట పజమాని సుందరరామశాస్త్రిగారివద్ద బ్రహ్మసూత్ర శాంకర భాష్యము, వేదాంతపరిభాష మున్నగు గ్రంథములను, అద్వైతసిద్ధిని గూడ చదివి పిదప బెంగుళూరు సీతారామశాస్త్రిగారివద్ద తర్కములోని కొన్ని యుద్గ్రంథములను పఠించిరి. వీరు విద్యాభ్యాసమునకై తమిళదేశమునకు కూడ నేగి యట నా దినములలో వేద శ్రౌతముల లోను, షట్శాస్త్రములలోను అసమాన ఖ్యాతిగన్న త్యాగరాజశాస్త్రిగారివద్ద వాచస్పత్యము, కల్పతరువు, వ్యుత్పత్తివాదము అను ఉద్గ్రంథములను చదివిరి. ఈ త్యాగరాజ శాస్త్రిగారు అప్పయ్య దీక్షితులవారికి తొమ్మిదవ తరమువారు.

వీరు స్వదేశమునకు తిరిగి వచ్చి అమరావతిలో గృహనిర్మాణము గావించుకొని యట స్థిరనివాసము చేసికొనిరి. తరువాత విజయవాడలోకూడ నివాసము నేర్పరచుకొనిరి. తమ ముప్పదియారవ యేట వీరు తిరిగి దక్షిణ దేశమున కేగి తిరువయ్యారులో స్థలపురాణం బాలకృష్ణ శాస్త్రిగారివద్ద ఉపనిషద్భాష్యములను, ఇతర వేదాంత గ్రంథములను పఠించిరి.

వీరిట్లపారపాండిత్యమును సంపాదించి యాంధ్రదేశమున విశేషసంచారము చేసి ధర్మ, వేదాంత ప్రబోధము గావింపదొడగిరి. చిరకాలము వీరు పుష్పగిరి పీఠమునకును, హంపి విరూపాక్ష పీఠమునకును ఆస్థాన పండితులుగా నుండిరి. వీరికి వైదిక కర్మానుష్ఠానమం దాసక్తిమెండు. వీరు 1904 లో అమరావతియందు జ్యోతిష్టోమమును, 1922 లో విజయవాడయందు చయనమును చేసినారు. చిరకాలము 'రామకృష్ణశాస్త్రిగా'రని వ్యవహరింపబడుచుండిన వీరు తరువాత 'రామకృష్ణ సోమయాజులు', 'రామకృష్ణ చయనులు' అను ఆహితాగ్ని నామములతో వ్యవహరింపబడుచుండిరి.

శ్రుతి స్మృత్యుక్తమైన సనాతన ధర్మమునుగూర్చి ప్రజానీకములో విశేష ప్రచారము చేయుటలో వీరికి

సాటియైనవారు పండితమండలిలో అరుదు. అంతియే కాక వేదాంత శాస్త్రమును సర్వజన సమ్మతముగా భాష్య ప్రవచన రూపముననే కాక ఉపన్యాస రూపమున కూడ చెప్పుటలో వీరు నిరుపమానులు. పండితులలో మహావక్తలుగా ఖ్యాతిగన్న కొలదిమందిలో వీరు ముఖ్యులు. కాశీపండితులు వీరి వేదాంత ప్రవచనము విని వీరిని 'పండిత ప్రవర' బిరుదముతో సత్కరించిరి. వీరు పంజాబులో కూడ సంచారము చేసి యచట 'వ్యాఖ్యాన వాచస్పతి' బిరుదము నొందిరి. వీరు యావద్భారత ఖ్యాతి నార్జించిరి; అఖిలభారత వర్ణాశ్రమ స్వరాజ్య సంఘములో కార్య నిర్వాహకసభ్యులుగ నుండిరి. వీరు 'బాలబోధిని', 'భ్రమ భంజని' యను వేదాంత గ్రంథములను, ప్రాయశ్చిత్త పశువిషయక విమర్శగ్రంథములను, 'మహాభారత కథా తత్వ నిర్ణయమును' రచించిరి. జ. పు.

**రామకృష్ణమాచార్యులు, కొమాండూరి :** ఈయన నెల్లూరికి సమీపమున గంగవరమను శ్రీవైష్ణవాగ్రహార మున జన్మించెను; నెల్లూరు నందలి వెంకటగిరి మహారాజాగారి యున్నత పాఠశాలలో చదివి మెట్రిక్యులేషను పరీక్షలోను, తరువాత మదరాసులోని క్రైస్తవ కళాశాలలో విద్య నభ్యసించి ఎఫ్. ఏ. పరీక్షయందును కృతార్థుడై పిమ్మట పచ్చయప్ప కళానిలయమున చదివి బి. ఏ. పట్టము నందెను.


చిత్రము 208. కొమాండూరి రామకృష్ణమాచార్యులు

ఈయన మొదట నెల్లూరిలో కొంతకాల ముపాధ్యాయ వృత్తి నవలంబించి పిదప కలెక్టరు కచ్చేరిలో పని చేసి అటువెనుక ప్రభుత్వ పురాతత్వశాఖ (ఆర్కియలాజికల్ డిపార్టుమెంటు)కు సంబంధించిన శాసనశాఖలో చేరి ప్రాచీన లిపులలోనున్న శాసనములను జదువుటలో నిష్ణాతువయ్యెను. ఆ శాఖలో ఈయన సూపరింటెండెంటు పదవి నలంకరించి తుద కా యఖిల భారతశాసన పరిశోధన శాఖ కధిపతిగ (ఎపిగ్రాఫిస్ట్ ఫర్ ది గవర్నమెంట్ ఆఫ్ ఇండియా) నియుక్తుడయ్యెను. ఈ యున్నతపదవి నధిష్ఠించుట కీయనకు శాసనపరిశోధనమున గల నైపుణ్యమే కారణము. ఈయన యమూల్య పరిశోధనలకు మెచ్చి గవర్నమెంటువా రీయనకు రావుబహాదరు బిరుదము నొసగిరి.

ఈయన మేధావి; సంస్కృతాంధ్రములు రెంటియందును చక్కని వైదుష్యము గల విద్వాంసుడు. వ్యాస కృత సంస్కృత మహాభారత మీయన కభిమాన గ్రంథము. దానికి చక్కని విషయసూచిక (ఇన్‌డెక్స్) నొకదాని నాంగ్లమున రచించెను. కాని యది యింకను ముద్రితము కాలేదు. కాని యా సూచీగ్రంథమునకు పీఠికగ ఈయన వ్రాసిన 'ది క్రేడిల్ ఆఫ్ ది ఇండియన్ సివిలిజేషన్' అను వ్యాసము మాత్రము ముద్రింపబడినది. ప్రాచీన భారతీయులు భరతఖండమునుండి ఆసియా, యూరపు, ఆఫ్రికా ఖండములకు వ్యాపించి యచ్చట రాజ్యములను నెలకొల్పిరని రుజువు చేయుటకు ఈయన పురాణములందలి భూగోళ రాజవంశాదికముల వర్ణించు భాగములనుండి పెక్కు విశేషాంశములను సంగ్రహించి అందు పొందుపరచి యున్నారు. దక్షిణ ఇండియా శాసన సంపుటములలో కొన్నింటి ప్రకటన ఈయన యాజమాన్యము క్రింద జరిగెను. నే. వెం. ర.

**రామకృష్ణమాచార్యులు, ధర్మవరం (క్రీ. శ. 1853 - 1912):** వీరు అనంతపుర మండలమున తాడిపత్రి తాలూకాలో ధర్మపురి అను అగ్రహారమందు జన్మించిరి. బళ్లారి వార్డ్‌లా కళాశాలలో తెలుగుపండితులుగా నుండిన వీరి తండ్రి కృష్ణమాచార్యులుగారియొద్దనే వీరు సంస్కృతాంధ్ర కర్ణాట భాషల నభ్యసించిరి; ఆంగ్లమున యఫ్. ఏ. పరీక్షయందు కృతార్థులై ఆదవాని తాలూకా కచేరిలో కొంతకాలము గుమాస్తా యుద్యోగము చేసి విరమించి ఫస్టుగ్రేడు ప్లీడరు పరీక్షకు చదివి కృతార్థులైరి; తరువాత బళ్ళారిలో న్యాయవాదివృత్తి నవలంబించి యందు ప్రఖ్యాతి గడించి, ప్రభుత్వ న్యాయవాదియు నయిరి.


చిత్రము 209. ధర్మవరం రామకృష్ణమాచార్యులు

వీరికి ఆయుర్వేదమునను, జ్యోతిషమునను గొప్ప పాండిత్య మలవడినది. చదరంగ మాడుట యందును వీరు కడుచతురులు.

చిన్నతనమునుండియే వీరికి నాటకములు, నటనము అనిన నెక్కుడు ప్రీతి. ఆంధ్రమున తొలి స్వతంత్ర రచనయగు 'చిత్రనళీయ' నాటకము వీరి ప్రథమ రచనముగా 1886 లో వెలువడినది. అది మొదలుగా వీరు తెలుగున

నిరువదెనిమిది నాటకములు రచించిరి. వీనిలో పదునాల్గు ముద్రితములు. రెండు కన్నడ నాటకములను, ఒక ఆంగ్ల నాటకమును(హరిశ్చంద్ర)కూడ వీరు రచించిరి. అవియును మెప్పు గాంచినవి. చిత్రనళీయము, విషాద సారంగధర, పాదుకా పట్టాభిషేకము, ప్రహ్లాద, ప్రమీల, చిరకారి మున్నగు వీరి నాటకము లాంధ్రదేశమం దంతటను ప్రదర్శనముల మూలమున ప్రసిద్ధిగాంచినవి.

వీరు గొప్ప నటకులు; తాము రచించిన నాటకము లలో దశరథుడు, బాహుకుడు, రాజరాజనరేంద్రుడు మున్నగు పాత్రములను నటించి ఆనాటి నటులకు మార్గ దర్శకులైరి. వీరు బళ్లారిలో 'సరసవినోదినీ సభ' యను పేర నొక నాటకసమాజమును స్థాపించి, నటకులకు చక్కని శిక్షణము నొసగి నాటకములను ప్రదర్శించుచు వచ్చిరి. 1910 వ సంవత్సరమున నాటక రచనమునను, నటనమునను సిద్ధహస్తులైన వీరికి గద్వాల సంస్థానా ధీశులు 'నాటక పితామహ' బిరుదమును, బళ్ళారి పౌరులు రత్నకిరీటమును బహూకరించిరి.

ఆంధ్రనాటక వాఙ్మయమున వీరి స్థాన మున్నతమైనది. 19 వ శతాబ్దాంతమునను, ఇరువదియవ శతాబ్ద ప్రారంభ మునను విశేషకృషి చేసి తెనుగున తత్పూర్వములేని నాటక సారస్వతమునకు పునాదులు వేసిన ఇద్దరు ముగ్గురు ప్రము ఖులలో వీ రొక్కరు. సంస్కృతభాషాభిజ్ఞులైనను సంస్కృత నాటకముల నాంధ్రీకరించుటకు పూనుకొనక స్వతంత్ర రచనలయందే వీరు నిమగ్నులైరి. వీరికి సంస్కృత నాటక రచనా పద్ధతికంటె నాంగ్ల పద్ధతియే కరము ప్రియమగుట వలన వీరు ఆంగ్లనాటకకర్తల మార్గమునే అనుసరించిరి. వీరి నాటకము లన్నిటిలోను చిత్రనళీయము, విషాద సారంగధర ఉత్తమోత్తమములు; సారంగధర విషాదాంత నాటకములలో తొలిరచన. విషాదాంత రచనలకు భరత నాటక సంప్రదాయమున తావు లేదు. ఆంగ్ల భాషావిశారదు లైన వీరు పాశ్చాత్యాదర్శముల నంగీకరించి తెనుగునాటక సాహిత్యమున క్రొత్తమార్గమును చూపెట్టిరి. వీరి నాటక ముల ఇతివృత్తములు ప్రాచీనములును, చిరపరిచితములు నైనను కథాసంవిధానమున వీరికిగల ప్రజ్ఞ సామాన్య మైనది కాదు. పాత్ర నిర్మాణ పోషణములలో వీరి కౌశల్య మద్భుతమైనది. అప్పటి నాటకములలో పెక్కింటియందు వలె వీరి నాటకపాత్రలు నిర్జీవచ్ఛాయాచిత్రములు కావు; అవి సచేతనములు. వీరి రచన లన్నియు చక్కని గ్రాంథిక భాషయందే నడచినవి. వానిలో పద్యముల బిగికంటె పాటలబిగి యెక్కువ. ఆంధ్రనాటకములలో పాటలను ప్రవేశపెట్టినవారిలో వీరే ప్రథములు. సంభాషణ నడపు టలో వీరికి చాకచక్యము గలదు. కాని వీరి పాత్రల యందు సామాన్యసంభాషణకంటె ఉపన్యాసధోరణియే యెక్కుడై కాన్పించును. భాష నాతికఠినమైనను అను ప్రాస భూయిష్ఠమై ఇంచుక బరు వనిపించును. మొత్తము మీద వీరి నాటకములను సమీక్షించిచూచిన వీరు ఆంధ్ర నాటకరచయితలలో నగ్రశ్రేణికి చెందినవారని చెప్పక తప్పదు. వీరు చేసిన భాషాసేవ మరువరానిది. గ. సు.

**రామకృష్ణయ్య, పారుపల్లి** (క్రీ. శ. 1883 - 1952): కృష్ణామండలములోని కృష్ణాతీరమం దున్న శ్రీకాకుళ క్షేత్రము వీరి జన్మస్థానము. వీరు ఆరువేల నియోగి బ్రాహ్మణ శాఖకు చెందినవారు; శ్రీవత్స సగోత్రులు. వీరి జనకుడు శేషాచలంగారు; జనని మంగ మాంబ. వీరి కొక యగ్రజుడు, ఇరువు రనుజులు, నలుగురు సోదరీమణులు గలరు. వీరు ఉపనయనానంతరమున స్వగ్రామములోనే లౌకిక మగు విద్య నభ్యసించిన తరువాత పెదకళ్ళేపల్లెలో తాణేదారుగా నున్న అడవి పట్టాభి రామయ్యగారి దగ్గర లెక్కలు వ్రాయు పద్ధతి నభ్యసింప వెళ్ళిరి. అచ్చట నుండగా వీరికి జన్మతో నేర్పడిన సంగీతపు ధోరణిని గమనించి యా బంధువుడు వీరిని సద్గురు లగు బ్రహ్మశ్రీ సుసర్ల దక్షిణామూర్తి శాస్త్రిగారి దగ్గర శుశ్రూష యొనర్చి సంగీతవిద్య నభ్యసించు నేర్పాటు చేసెను. శాస్త్రులుగారు వీరి కుశాగ్రబుద్ధికి సంతసించి అత్యంత ప్రేమతో వీరికి విద్య గరపిరి. వీరు పంద్రెండేండ్లు గురుకులవాస మొనర్చి సంగీతమునందు గొప్ప పాండిత్య మును గడించిరి.



చిత్రము 210.
పారుపల్లి రామకృష్ణయ్య

వీరు కొంతకాలము మచిలీపట్టణములో నుండి, పిమ్మట విజయవాడలో నివాస మేర్పరచుకొనిరి; ఆంధ్ర దేశమున పలు తావుల సంగీతపు కచ్చేరీలు చేసి గొప్ప గాయకు డని కీర్తి గడించిరి.

కొంతకాలము తమిళదేశముననుండి యచటి గాయ కుల యుత్తమ రీతులను వీరు బాగుగా గ్రహించిరి. వీరికి గాత్రపాటయందే కాక ఫిడేలు వాద్యమున, వేణు వాదనమున గొప్ప ప్రజ్ఞ కలదు. వీరు కాకినాడలోని సరస్వతీ గానసభవంటి పెక్కు గానసభలయందు ఉత్తమ

బహుమానముల నందిరి; అనేక సంగీత పరిషత్తులకు అధ్యక్షత వహించి సంగీతమందలి తమప్రతిభను ఉపన్యాస రూపమున, గానరూపమున ప్రదర్శించిరి; మదరాసు నగరమందలి గానసభలలో గానప్రదర్శనముల నొనర్చి గౌరవ బహుమతులను బడసిరి; తమ గాన విద్యా ప్రౌఢిమచే నెన్నియో సువర్ణ పదకములను, సువర్ణ కంకణములను, దుశ్శాలువలను బహుమతులుగా నందుకొనిరి. 1931 లో గుంటూరు జిల్లాలోని ఆంధ్ర సారస్వత పరిషత్తు వీరి పాండితీ గరిమకును, విశ్వవ్యాప్త కీర్తికిని సంతసించి పలువురు గాయకోత్తముల సభలో వీరికి 'గాయకసార్వభౌమ' బిరుదము నొసగెను. మదరాసు, హైదరాబాదు, విజయవాడ, రేడియోలలో పెక్కు వత్సరములు వీరు గాన ప్రదర్శనముల నొనర్చిరి; ఆంధ్రవిశ్వవిద్యాలయము వారి గానవిద్యాపరీక్షల కుత్తమపరీక్షాధికారిగా నుండిరి.

వీరి గురుభక్తి అనితర సామాన్యమైనది. వీరు గురువర్యులు పరమపదించినప్పటినుండియు నత్యంతభక్తితో గుర్వారాధనోత్సవములను జరుప నారంభించిరి; తమ శిష్యగణములకు తమ గురువర్యులవలెనే అత్యంత ప్రేమతో సంగీత విద్యను బోధించిరి.

రామకృష్ణయ్యగారి కొక కొమార్త గలదు. గుర్వారాధనోత్సవములను జరుపుచు గురుస్మరణ చేయుచు వీరు అనాయాసముగ భౌతిక దేహమును చాలించిరి. చి. వెం. శ.

**రామకృష్ణయ్య, పూండ్ల** (క్రీ. శ. 1860 - 1904): వీరు ఆర్వేల నియోగి బ్రాహ్మణులు; పాఠశాలయందు అప్పర్ ప్రైమరీ వరకే చదివిరి; స్వయంకృషిచేతనే సంస్కృతాంధ్రములందు అఖండ పాండితిని సంపాదించిరి.

వీరు నెల్లూరిలో 'అముద్రిత గ్రంథచింతామణి' అను పేర నొక మాస పత్రికను తమ సంపాదకత్వమున నెలకొల్పి 1885 నుండి 1904 వరకు పందొమ్మిది సంవత్సరములు నిరంతరాయముగ నిర్వహించిరి. 'హరిశ్చంద్ర నలోపాఖ్యానము', 'చంద్రాంగదచరిత్ర', 'ప్రబంధరాజ వేంకటేశ్వరవిజయవిలాసము' మున్నగు ఆంధ్ర ప్రబంధ రాజములు ఈ పత్రికయందే తొలుదొల్త వెలువడినవి. వీరి పత్రికకు వెంకటగిరి రాజప్రభృతు లగు ప్రభువర్యులను పోషకులుగా, దిగ్దంతులగు పండిత ప్రకాండులను మహాకవులను విలేఖకులుగా ఆకర్షించి తన్మూలమున ప్రజానీకమునకు అమూల్యమగు విజ్ఞాన ప్రబోధము సలిపి శాశ్వత కీర్తి నార్జించిరి. ఈ పత్రిక విలేఖకులలో అగ్రగణ్యులు కళాప్రపూర్ణ వేదము వెంకటరాయ శాస్త్రిగారు. రామకృష్ణయ్యగారు శాస్త్రిగారిపై అపార స్నేహ గౌరవములు కలిగియుండిరి. ఈ పత్రికా ముఖమున శాస్త్రిల వారి వ్యాసములు 1894 నుండి 1900 వరకు అప్పు డప్పుడు భాసిల్లుచుండినవి.

పత్రిక మొదటి నాలుగు పుటలందు 'మయూఖములు' అనుపేర సాహితీ చర్చలును, మిగిలిన భాగమున అముద్రిత గ్రంథములును ప్రకటింపబడుచుండినవి. 1898 లో ఈ పత్రికామయూఖములందు 'ప్రతాపరుద్రీయ' నాటక సమీక్షయు, ఆ నాటకముపై రసికవతంసులు అప్పటి వెంకటగిరిరాజా శ్రీ రాజగోపాల యాచేంద్ర బహద్దరు వారి పరితోషవ్యాసమును ప్రకటింపబడినవి. కట్టకడపటి పత్రికలో ముద్రిత మగుచుండిన యుద్గ్రంథము 'వసుంధరా పరిణయము'.

వీరు 1901 లో 'ఆనందదాయిని' అను పేర నొక నాటక సమాజమును స్థాపించి నిర్వహించిరి; తత్సామాజికులచేత 'మదాలస', మంత్రిప్రగడ భుజంగరావుగారి 'సత్య హరిశ్చంద్ర' మున్నగు నాటకముల నాడించిరి. వీరియొద్ద వీరు సేకరించిన పుస్తకములు సుమారు 2,000 ల వర కుండెను. వీరి గ్రంథ సంచయ మొకపుస్తకభాండాగారమే. వీరు తమ యీ గ్రంథాలయమునందు చాల భాగము నెల్లూరు హిందూ హైస్కూలు కిచ్చునట్లు 1904 లో మరణ శాసనము వ్రాసిరి; తమ సాహిత్యాభినివేశము కతమున ప్రతి వత్సరము జరుగు కవి పండిత సంఘ సమావేశములలో బాల్గొనుచుండిరి.

వీరు మంచి వర్చస్సు గల గంభీర వ్యక్తి; సాధారణ సంభాషణమందు ఇంచుక వాఙ్నిరోధము కనిపించినను స్వశిక్షణవలన ఉపన్యాసాదులందు ఆ కొరంత నావంతయు బయలుపడనీయక అనర్గళ వాగ్ధాటితో ప్రసంగించువారు. ముఖ్యముగ 'అముద్రిత గ్రంథచింతామణి' మూలమున వా రొనర్చిన మహోపకారము ఆంధ్రవాఙ్మయచరిత్ర యందు స్వర్ణాక్షరములతో లిఖింపదగినది. నిక్కముగా వీరు ఆంధ్రసారస్వతపత్రికా నిర్వహణ పితామహులు.

వీరు సమకాలిక విద్వత్ప్రపంచమున నొక వాఙ్మయ సంస్థప్రాయులై వర్ధిల్లిరి. వాఙ్మయ పరిశోధనకు పునాదులు వైచిన మహనీయులలో వీ రొకరు. ప్రాచీన తాళపత్ర గ్రంథములను వెదకి సంపాదించి చక్కగ పరిష్కరించి ప్రకటించి వీరు ఆంధ్రభాషకు చేసిన సేవ యద్భుతమైనది. వీరి వాఙ్మయ విమర్శ ప్రాత పద్ధతులపై నడచినను ఆధునిక విమర్శనావిధానమునకు దారులు చూపినది. హరిశ్చంద్ర నలోపాఖ్యాన, ప్రబంధరాజవేంకటేశ్వర, విజయవిలాసాది గ్రంథములకు వీరు రచించిన యుపోద్ఘాత వ్యాసరాజములు వీరి కూలంకష పాండిత్యమును, సునిశిత విమర్శనా శక్తిని వెల్లడి చేయుచున్నవి. వీరి 'అముద్రిత

గ్రంథచింతామణి' అప్పటి కవులకును, విద్వాంసులకును, విమర్శకులకును సాహితీ సమరాంగణమై విరాజిల్లు చుండినది. వీరిని 'వాఙ్మయ విమర్శక బ్రహ్మ'యనిన నది నిజము చెప్పుట యగును. గు. వేం. సు.

**రామచంద్రకవి, మారేపల్లి** (క్రీ. శ. 1874-1951): వీరి జన్మస్థలము కృష్ణజిల్లా, గన్నవరము తాలూకాలోని కనకవల్లి అగ్రహారము; వీరి తల్లిదండ్రులు కనకదుర్గా శ్రీరాములుగార్లు. వీరిది వెలనాటి శాఖ; కౌండిన్య సగోత్రము. శాస్త్రిగారి పెద్దలు శ్రోత్రియులు, కర్మిష్ఠులు, వేదాధ్యయన సంపన్నులు.

శాస్త్రిగారు ప్రాథమిక విద్యను తమ గ్రామములోను, ఉన్నత విద్యను కాకినాడలోను, విశాఖపట్టణములోను చదివిరి; 1893 లో మెట్రిక్యులేషన్ పరీక్షలో ఉత్తీర్ణులైరి; ఎఫ్. ఏ. ఆరు మాసములు మాత్రమే చదివిరి; ఆ సమయములోనే కళాశాలా వార్షికోత్సవము జరిగినది. శాస్త్రిగారు మృదుమధుర శైలిలో పద్యములువ్రాసి వార్షిక సభలో చదివిరి. కళాశాల ప్రిన్సిపాల్ మెచ్చుకొని 'కవి కవి' అని వీరిని శ్లాఘించిరి.


చిత్రము 211.
మారేపల్లి రామచంద్రకవి

వీరు నాటక ప్రదర్శనములద్వారా ప్రజలకు విద్యాభివృద్ధిని, విజ్ఞానాభివృద్ధిని చేయదలచి 1895 లో 'కలాభిలాషక సమాజము'ను స్థాపించిరి. ప్రదర్శనములందు వీరును ముఖ్యపాత్రలను ధరించుచుండిరి. అందువలన వచ్చు ఆదాయమును వీరు బీద విద్యార్థులకును, ప్రజోపయోగ కార్యములకును వినియోగించెడివారు. వీరు తమ సమాజ సభ్యులు వ్రాసిన నాటకములనే ప్రదర్శించెడివారు. వీరికి కత్తిసాములో అసమాన ప్రజ్ఞ కలదు. వీరు నాలుగు కత్తులతో కూడ సాము చేసెడివారు. రంగస్థలమందు శాస్త్రరీత్యా నిషిద్ధములైన శయ్యాగారము, దూర ప్రయాణము, యుద్ధము స్వతంత్రించి నాటక ప్రదర్శనముల వీరు చూపుచుండిరి.

వీరు విశాఖపట్టణములో వేశ్యాంగనల పడుపు వృత్తి మాన్పింపదలచి 1912 లో 'సంగీత మానినీ సమాజము' స్థాపించి వారికి సంగీతశిక్షణ మిచ్చిరి. వీరు నటుడు, నాటకకర్త, నాట్యాచార్యుడు అని కూడ పేర్గాంచిరి.

వీరు 1898 లో ఉపాధ్యాయవృత్తిని అవలంబించి విశాఖపట్టణ మిషన్ హైస్కూలులోను, కాలేజీలోను తెనుగు పండితులుగా పనిచేసి విద్యార్థుల హృదయముల నాకర్షించిరి; వారిచేత ప్రజోపయోగ కార్యములు చేయించినారు; మతప్రచారమునందు మిషన్ హైస్కూలు పాఠశాలాధికారులతో అభిప్రాయభేదము కలిగి 1913 లో పండితపదవి విరమించుకొనిరి. వీరు సర్వస్వతంత్రులై మతప్రచారము చేసి చాల మందిని క్రీస్తుమతమందు చేర కుండ చేసినారు.

ఆంధ్రదేశమందు తొలిసారిగా విశాఖపట్టణమున మలరిగ ఆదినారాయణమూర్తిగారు నెలకొల్పిన సార్వజనీన గ్రంథాలయమును వారి యనంతరము వీరు మూల్యమిచ్చి తీసికొని విశాఖపట్టణ హిందూపఠన మందిర మందు 'విశాఖపట్టణ గ్రంథాలయము' అనుపేర నెలకొల్పిరి. తెలుగు జిల్లాలలోను, తెలంగాణాలోను గ్రంథాలయప్రచారము చేసి తమ గ్రంథములను గ్రంథాలయముల కిచ్చిరి.

వీరు సుమారు ఏబది యేండ్ల క్రిందటనే అస్పృశ్యతా నివారణోద్దేశముతో మాలపల్లెలకు పోయి యచటి వారికి స్వతంత్ర వృత్తినిగూర్చి బోధించిరి.

వీరు ఆనిబిసెంటుగారి హోమ్ రూల్ లీగ్ పక్షమున విశాఖపట్టణములో స్వరాజ్య సమితిని ఏర్పరచి దానికి కార్యదర్శిగ పనిచేసిరి; ఆమెయందలి గౌరవమునకు సూచకముగా తమ ధర్మాశ్రమమందు 'వసంతమ్మ ధర్మ పఠనమందిరము'ను నెలకొల్పిరి.

1920 లో సహాయనిరాకరణోద్యమమునకు ముందు వీరు ఏర్పాటుచేసిన ప్రజాసంఘమును కాంగ్రెసు సంఘముగా మార్చివేసి విశాఖపట్టణము జిల్లాలోని పల్లెపల్లెకును కాలినడకను పోయి కాంగ్రెసు ప్రచార మొనర్చిరి. 1930 లో ఉప్పు సత్యాగ్రహ సమయమున వీరు జిల్లా నియంతగా ఎన్నుకొన బడిరి; తోడిసత్యాగ్రహులతో చట్టము నుల్లంఘించి విశాఖపట్టణ సముద్రతీరమున ఉప్పు తయారుచేసి ఆరు మాసములు జైలుకు వెళ్ళిరి; 1932 లో మరల జిల్లా నియంతయయి ప్రచారమొనర్చి తమ తరువాతి నియంతను ఏర్పాటుచేసి ఎలమంచిలిలో నిర్బంధింపబడి ఒక సంవత్సరము కఠినకారాగారశిక్షను పొందిరి.

గ్రాంథిక వ్యావహారిక భాషా వివాదములలో దేశమున కవి రెండును అవసరమని చెప్పి వీరు వ్యావహారిక భాషలో కూడ వ్యాసములు వ్రాసినారు.

వీరి మొదటి రచన 'పశ్చాత్తాప మహత్త్వము', ('పేరడైజ్ లాస్ట్ అండ్ పెరీ'కి అనువాదము); తరువాత వీరు

పెక్కు నాటకములు, పద్యకావ్యములు, చాటువులు, వచన గ్రంథములు, హరికథలు రచించిరి. వీనిలో మూడు నాటకములు, తెలుగు సంధ్యావందనము మాత్ర మచ్చుపడినవి. ఇవి వీరు 1904 లో నెలకొల్పిన 'శ్రీ కలాభిలాషకకావ్య మాలిక' లో వెలువడినవి.

విశాఖపట్టణమందు 1926 లో స్థాపితమైన 'కవితా సమితి' కి కవిగారే తమ జీవితాంతము వరకును అధ్యక్షులుగా నుండిరి. ఇదిగాక మరికొన్ని భాషా సంస్థలకు గూడ వీరు అధ్యక్షులు. వీరు తమ జీవితము చరమదశలో 'నుడికడలి' అను గ్రంథమును వ్రాయుచుండిరి. అది పూర్తి కాకుండానే వీరు పరమపదించిరి. జ. సు.

**రామచంద్రరావు, మోచర్ల** (క్రీ.శ. 1868-1937) : ఈయన మదరాసు నందలి తిరువళ్ళిక్కేణి హిందూ హైస్కూలులోను, ప్రెసిడెన్సీ కాలేజీలోను, లా కాలేజిలోను చదువు పూర్తిచేసి ఏలూరులో వకీలు వృత్తికి బూనుకొనెను. ప్లీడరీవృత్తియం దనతి కాలములోనే పేరును, ధనమును సంపాదించి పౌర వ్యవహారాలమీదగూడ శ్రద్ధ వహించుచుండెను.



చిత్రము 212.
మోచర్ల రామచంద్రరావు

ఈయన కృష్ణా, గోదావరిజిల్లాల తరపున పంద్రెండేండ్లు మద్రాసు శాసన నిర్మాణసభ సభ్యుడుగా నుండెను; 1924లో సామ్రాజ్యశాసన నిర్మాణ సభలో సభ్యుడయ్యెను; 1919 లో ప్రజల తరపున జాయింటు పార్లమెంటరీ కమిటీ యెదుట సాక్ష్యమిచ్చెను; 1927 లో సంస్థాన ప్రజల తరపున ఇంగ్లాండునకు డెప్యుటేషను నడపెను; 1932 లో నేషనల్ లిబరల్ ఫెడరేషను మహాసభకు అధ్యక్షత వహించెను.

ఈయన మంచి వక్త; హేతువాది; ఎట్టి సమావేశములోనైనను సులభముగ తన వాదమును నెగ్గించుకొనువాడు; ఇందువలన ప్రభుత్వదృష్టిని ఆకర్షించి, వారిచే చాల కమిటీలలో మెంబరుగ నియమితుడైనాడు. లిట్టను కమిటీ, స్కీను కమిటీ, సాండర్స్టు కమిటీ, రౌండ్ టేబిలు కాన్ఫరెన్సు, దానిలోని సబ్ కమిటీలు, సంస్కరణల సంఘములు,- వీని యన్నింటియందును ఈయనను ప్రభుత్వము మెంబరుగ నియమించినది. ప్రభుత్వము నియమించినను ఈయన ప్రజల పక్షముననే, ప్రజాశ్రేయస్సును దృష్టియందిడుకొని వ్యవహరించెడివాడు; ప్రతి విషయమును సాంగముగ పఠించి అందలి లోతుపాతులను దెలిసికొని తగు సూచనల నిచ్చెడివాడు.

ఈయన రాజకీయములలో మితవాది అయినను అతి స్వతంత్రుడు; ముక్కుకు సూటిగ బోయెడివాడు; ప్రజాశ్రేయస్సునకు మంచిదని తోచినప్పుడు ఎట్టివారితోనైనను వ్యతిరేకించెడివాడు. అందువలననే ఈయనకు దక్షిణ హిందూస్థానపు గోఖలే అని ప్రశస్తి కలిగినది.

ఒకరి నాశ్రయించి పదవి సంపాదించుకొనుట ఈయనకు గిట్టదు. అవకాశము లెన్నియో లభించినను, ఒకరికి లొంగవలసి వచ్చునను భయముచే ఈయన వానిని తిరస్కరించెను. ప్రభుత్వ మీయనకు 'దివాన్ బహదర్' బిరుదమును, సర్ బిరుదము నొసగి ఈయనను సత్కరించెను.

మదరాసురాష్ట్ర భూమితనఖా బ్యాంకున కధ్యక్షుడుగ నుండి ఈయన రైతుల ఋణబాధల తొలగించుటకై తన శక్తి నంతయు వినియోగించి కృషిచేసి ఆ బ్యాంకు నభివృద్ధిపరచెను. చీ. శే. రా.

**రామచంద్రశాస్త్రి, కోరాడ** (క్రీ. శ. 1816-1900) : వీరు వేగినాటి బ్రాహ్మణులు; అమలాపురము తాలూకా కేశనకుర్రులో తమ మాతామహుల యింట పుట్టి యించుమించు బాల్య మంతయు నచ్చటనే గడిపిరి. వీరి తండ్రి లక్ష్మణశాస్త్రిగారు గొప్ప రామోపాసకులు; కుమారునకు పంద్రెండవయేట రామతారకమంత్రోపదేశము చేసిరి.

వీరు మాతామహునివద్ద రఘువంశము చదివి పిమ్మట స్వగ్రామమైన నడవపల్లికి వచ్చి యచట సోమయాజుల సూరన్నగారివద్ద కావ్య నాటకాదులను, తర్క వ్యాకరణాది గ్రంథములను చదివి సాహిత్యములో గొప్ప ప్రావీణ్యము సంపాదించిరి. నడవపల్లికి సుమా రెనిమిది మైళ్ళ దూరములో ముక్తేశ్వరములో నుండిన సుప్రసిద్ధ మహాకవి శిష్టు కృష్ణమూర్తిశాస్త్రిగారివద్ద చాలకాలము వీరు శుశ్రూషచేసి వారివలన ఆంధ్ర గీర్వాణములలో రసవంతముగ కవిత్వము చెప్పుశక్తి సంపాదించిరి; ఛందోవ్యాకరణాది లక్షణ గ్రంథములలో చక్కని పాండిత్యము సంపాదించిరి; తమ గ్రంథములలో 'శ్రీ కృష్ణమూర్తి పదాబ్జ సేవనాత్తసద్గ్రంథకల్పనావిత్తసుమతి'గా తమ్ముగురించి చెప్పుకొనిరి.

వీరి పాండిత్యమును, కవితాశక్తిని జూచిన మిత్రులు చెన్నపట్టణమున కేగినచో వీరి విద్య రాణించు ననియు, ధనార్జనము సాధ్యమగు ననియు చెప్పగా చెన్నపురికి బయలుదేరి బందరువరకు వెళ్ళిరి. అచట పలువురు వీరి ప్రతిభ కక్కజమంది మద్రాసుకు పోనీయక నిలిపివైచిరి.

బందరులో వీరు తమ శక్తిచే మన్ననల నందుటయే కాక నూతనముగా విద్యాభ్యాసమునకు పూనుకొని ఇంగువ రామస్వామిశాస్త్రిగారి వద్ద మంత్రశాస్త్ర గ్రంథములను పఠించిరి. వీరు అమలాపుర వాస్తవ్యులు గొడవర్తి నాగేశ్వరావధానులుగారి కొమార్తను పరిణయమాడిరి. ఆ దినములలో నడవపల్లిలో వీరు శతావధానమును జయప్రదముగా నిర్వహించినారు.



చిత్రము 213.
కోరాడ రామచంద్రశాస్త్రి

వీరు కొంతకాలము బందరు నోబులు హైస్కూలులో పండితులుగా పని చేసిరి. ఆ సంస్థ కళాశాల అయినతరువాత కూడ వీరం దధ్యాపకులుగ నుండిరి.

వీరు సుమారు ముప్పది గ్రంథములు రచించిరి. కాళిదాసు మేఘసందేశ పద్ధతి ననుసరించి వీరు రచించిన 'ఘనవృత్త'మను సంస్కృత కావ్యము అన్నింటికంటె ప్రసిద్ధము. మేఘుడు యక్షుని వార్తను యక్షపత్నికి చెప్పుట యిందలి వస్తువు. వీరు రచించిన సంస్కృత గ్రంథము లివి: కుమారోదయ మను చంపువు, శృంగార సుధార్ణవ మను భాణము, రామచంద్ర విజయమను వ్యాయోగము, ధీసాధమను వ్యాకరణ గ్రంథము, శృంగారమంజరి, కమలానంద మను భాణము, పుమర్థ సేవధి కావ్యము, దేవీవిజయమను చంపువు, మృత్యుంజయవిజయము, కాళిదాసరచిత కవికంఠపాశమను కావ్యమునకు వ్యాఖ్య, అమృతానందయోగి సర్వాలంకారసంగ్రహమునకు వ్యాఖ్య. వీరి సంస్కృత కవిత సరళమై, రసవంతమై యలరారును. వీరి ఆంధ్ర రచనలు కొన్ని క్లిష్టముగను, కొన్ని సరళముగను ఉండును. ఉన్మత్త రాఘవము, ముద్రారాక్షసము, శాకుంతలము, వేణీసంహారము, ఉత్తరరామచరితము అను సంస్కృత గ్రంథములను వీరు తెనిగించిరి. రథాంగదూతము, నయప్రదీపము, పరశురామవిజయము అనునవి వీరి గద్య గ్రంథములు. వీరు కల్పిత వస్తువుగల మంజరీమధుకరీయ మను నాటికను రచించిరి. జ. పు.

**రామదాసుకవి, తూము** (క్రీ. శ. 1856 - 1904): రామదాసకవి కాపుకులాలంకారము. ఓరుగల్లు ఇతని జన్మస్థానము. ఇతడు తన ఇరువది యొకటవ యేట కవితారచనము నారంభించి ఆ మరణాంతము 23 సంవత్సరములు సాహిత్య జీవితము గడపెను. ఇతనికి సరస కవితా విశారదులగు ప్రతాపపురం రంగాచార్యులుగారు సంస్కృతాంధ్రభాషాగురువులు; కాంచీపుర వాస్తవ్యులు, షట్ఛాస్త్రవేత్తలు నగు కందాళ సింగరాచార్యుల వారు పంచసంస్కారప్రదాతలగు కులగురువులు.

ఇతడు మొదట కొంతకాలము హైదరాబాదు ప్రభుత్వమున అటవీశాఖలో పనిచేసెను; పిదప ఆత్మకూరు సంస్థానమున రాజకీయ వ్యవహర్తగ నుండెను.

రుక్మిణీకళ్యాణ మను గేయకావ్యము, గోపికావిలాసము, మిత్రవిందోద్వాహము నను ప్రబంధములు ఇతని రచనలు. వీనిలో మొదటి దలభ్యము. ఇతడు వీనిని కాక కాళిదాస నాటకమును, ఆంధ్ర పదనిధాన మను సటీకా శుద్ధాంధ్రపద్యనిఘంటువును రచియించెను. ఆంధ్రపద నిధానము రామదాసు చివరి పదియేండ్ల కృషి ఫలితము. తెలంగాణమందున్న దేశి శబ్దములు దీనిలో చేర్చబడినవి. గ్రంథము పూర్తియైనపిమ్మట మొదటి రెండు కాండములు సంస్కరించి టీక స్వయముగా తానే వ్రాసెను. మూడవ కాండమును సంస్కరించి టీక వ్రాయుట కారంభించి ఇతడు రాచపుండు బాధతో స్వర్గస్థుడయ్యెను. బి. రా. రా.

**రామదాసు, భద్రాద్రి**: (చూ. వాగ్గేయకారులు).

**రామదాసు, ఎడ్ల**: ఈ రామదాసు జన్మస్థానము విజయనగర సమీపమునందలి కలవచర్ల అగ్రహారము. ఈయన తండ్రి అప్పయ్య, తల్లి మహాలక్ష్మమ్మ. పది పం{్రెం}డేండ్ల వయసున ఈయన కాకినాడకు చేరెను. అక్కడ మంతెన వెంకటాచార్యు లనువారికి శిష్యుడై ఈయన అచలయోగతత్త్వమును గ్రహించెను. ఇది భక్తి ప్రధానమైన యోగము. ఈయన తన అనుభవములను, బోధలను పద్యములుగను, కీర్తనలుగను రచించి సాంఖ్య తారకామనస్కయోగ మనెడు సుజ్ఞానచంద్రిక అను పేరుతో గ్రంథరూపమున ప్రకటించెను. ఈయన సంగీత సాహిత్య జ్ఞానము శ్రుతమాత్రమైనను ఈయన రచించిన కీర్తనలు (తత్త్వములు) తెలుగు దేశములో మంచి ప్రచారమున నున్నవి. ఈయన పందొమ్మిదవ శతాబ్ది చివర, ఇరువదవ శతాబ్ది ప్రారంభమున నుండినవాడు. గ. సు.

**రామదాసు, వేమవరపు**: ఈయన కృష్ణజిల్లాలో 1878 వ సంవత్సరమున జన్మించెను; మదరాసు క్రైస్తవ కళాశాల యందును, న్యాయ కళాశాలయందును విద్య నభ్యసించి 1899 లో వకీలై 1911 వరకు మచిలీపట్టణ మందు లాయరుగ పనిచేసెను. కృష్ణజిల్లాలోని రాజకీయ, సాంఘిక, సారస్వతోద్యమములకు పునాదులు వేసిన

వారిలో ఈయన యొకడు. 1907 నుండి 1908 వరకు ఈయన కృష్ణాపత్రిక సంపాదకుడుగ నుండెను.

ఈయన 1911 లో మదరాసునందు ప్రాక్టీసు మొదలిడెను. లాయరు వృత్తితో పాటు ఈయన సామాజిక కార్యరంగము విస్తృతమయ్యెను; 1912 లో కృష్ణా-గుంటూరు జిల్లా మహాసభకును, 1915 లో మదనపల్లెలో జరిగిన డివిజనల్ కాన్ఫరెన్సుకును అధ్యక్షత వహించెను. ఈయన ఎక్కువగ న్యాయశాస్త్ర పాండిత్యమున పేరు పొందెను; 'మద్రాసు ఎస్టేట్సుల్యాండు ఆక్టు' కు వ్యాఖ్యానమును రచించెను; మదరాసు యూనివర్సిటి సెనేటునందును, అకడమిక్ కౌన్సిలునందును సభ్యత్వమును వహించి ఎమ్. ఎల్. తరగతికి పరీక్షకుడుగ నుండెను.



చిత్రము 214.
వేమవరపు రామదాసు

ఈయన జాతీయవాది; బెంగాలు విభజనమునకు వ్యతిరేకముగ కృష్ణాపత్రికద్వారా ప్రచార మొనరించెను; ఆంధ్ర స్వరాజ్య పక్షమునకు కొంతకాల మధ్యక్షుడుగ నుండెను; అఖిల భారత కాంగ్రెసు కమిటీయందును చాలకాల మీయన సభ్యుడు. ఈయన చెన్నపురి మహాజన సభకును, హిందూ మహాసభకును కొంతకాల మధ్యక్షుడుగ నుండెను; 1925, 1929 సంవత్సరములందు కౌన్సిల్ ఆఫ్ స్టేట్ సభ్యుడుగ నెన్నుకొనబడి కాంగ్రెసు ఆదేశము ననుసరించి 1930 లో ఆ పదవికి రాజీనామా నొసగెను. మదరాసు రాష్ట్రమున సహకారోద్యమ వ్యాప్తికై ఈయన చాల శ్రమపడెను; సహకార విషయములందు ఒక ప్రామాణికుడుగ భారత దేశముననే గాక యితర దేశములందును పేరు సంపాదించెను. ఈయన అఖిల భారత రాష్ట్రీయ సహకార బ్యాంక్ అసోసియేషను, అఖిల భారత కోఆపరేటివ్ సంస్థల అసోసియేషన్, మదరాసు రాష్ట్రీయ కోఆపరేటివ్ యూనియన్, మదరాసు ప్రొవిన్షియల్ కోఆపరేటివ్ బ్యాంక్ - వీనికి అధ్యక్షుడుగ పనిచేసెను.

ఈయన ప్రతిభా విశేషములను గుర్తించి ప్రభుత్వము ఈయనను టౌన్‌సెండ్ కమిటీయందు, సెంట్రల్ బ్యాంకింగు ఎంక్వైరీ కమిటీయందు సభ్యునిగా నియమించెను.

దక్షిణభారత కోఆపరేటివ్ భీమా కంపెనీని స్థాపించిన దీయన. ఈయన 'ఇంటర్ నేషనల్ కోఆపరేటివ్ అలయన్స్' (అంతర్జాతీయ సహకార మైత్రి) సభ్యుడై కొంతకాల ముండెను; 1934 లో లండనులో జరిగిన అంతర్జాతీయ సహకార సమ్మేళనమునకు భారతదేశపు ప్రతినిధిగ వెళ్లెను. 1944 లో ఈయన కీర్తిశేషుడయ్యెను. చీ. శే.

**రామబ్రహ్మము, గూడవల్లి** (క్రీ. శ. 1898-1946): ఆంధ్ర దేశములో చలనచిత్ర పరిశ్రమ వికాసానికి ముఖ్య కారకులలో రామబ్రహ్మముగారు ప్రముఖులు. వీరు కృష్ణాజిల్లా నందమూరు గ్రామములో సంపన్న కమ్మ కుటుంబములో జన్మించారు; చిన్నప్పటినుంచి లలిత కళలయం దభిరుచి, సాహితీపరుల సహవాసము, ప్రజోద్యమాలలో ఉత్సాహము కలవారు. ఇంటర్మీడియట్ చదువు చుండగా, దేశవ్యాప్తమయిన విద్యాలయ బహిష్కరణము వీరి నాకర్షించగా చదువు చాలించారు; సత్యాగ్రహోద్యమ సందర్భంలో తెనాలి సత్యాగ్రహ శిబిరములో ఉత్సాహముతో పాల్గొన్నారు. కమ్మ చరిత్ర వ్రాయాలని వీరు మద్రాసు వచ్చి అక్కడ జస్టిసుపార్టీ వారి 'సమదర్శిని' అన్న ద్వైవార పత్రికకు సంపాదకులుగా నుండి తరువాత కృష్ణాజిల్లా ప్రజామిత్ర పక్షమువారి వార పత్రిక 'ప్రజామిత్ర'ను బెజవాడనుండి మద్రాసుకు తెప్పించి, దానిని ప్రశంసాపాత్రంగా దాదాపు పది సంవత్సరాలు నడిపించారు. వీరి సంపాదకత్వంలో ప్రజామిత్ర విజ్ఞాన వికాసానికి, కళాభిరుచికి, అభ్యుదయ భావాలకు ఆనాటి ఆంధ్ర వారపత్రికలలో అగ్రగణ్యమనిపించుకొన్నది.



చిత్రము 215.
గూడవల్లి రామబ్రహ్మము

ఆ రోజులలోనే సుప్రసిద్ధ సినిమా డైరెక్టరు కీ. శే. పి. వి. దాసుగారు వేల్ పిక్చర్స్ అన్న సంస్థను స్థాపించి చిత్రనిర్మాణము చేస్తుండేవారు. వారి పరిచయం వల్ల వీరికి చలనచిత్ర రంగములో ప్రవేశము కలిగినది. దాసుగారి సహవాసమున లభించిన చిత్ర నిర్మాణ విజ్ఞానముతో వీరు సరస్వతీ టాకీసు (బెజవాడ)వారి 'ద్రౌపదీ వస్త్రాపహరణ' నిర్మాణంలో శ్రీ హెచ్. యమ్. రెడ్డిగారితోను, 'బాలయోగిని' చిత్ర నిర్మాణములో డైరెక్టర్ శ్రీ. కె. సుబ్రహ్మణ్యముగారితోను కలిసి కృషి చేశారు. మంచి సాంకేతిక జ్ఞాన మలవడింది వీరికి. పరిచితులైన కవులు, గాయకులు, నటకులు అనేకులను, తమ

సమర్థతయందు నమ్మకము గల ధనిక మిత్రులను అండగా చేసుకొని వీరు 'సారథి ఫిలిమ్స్' అన్న పేరుతో ఒక చిత్ర నిర్మాణ సంస్థను మద్రాసులో స్థాపించారు; ఆనాటి ప్రజా సమస్యలనే కథావస్తువులుగ తీసికొని ప్రతిభాద్యోత కములయిన చిత్రాలను నిర్మించారు. 'మాలపిల్ల'లో హరిజన సమస్యను, 'రైతుబిడ్డ'లో జమీన్‌దారీ సమస్యను విశదీకరించడమే వీరి అభ్యుదయ దృష్టికి ప్రబల నిదర్శనము. ఆ రెండు చిత్రాలు ఆనాడు ప్రజలలో గొప్ప సంచలనము కలుగజేశాయి. నాటి బ్రిటిషు ప్రభుత్వము 'రైతుబిడ్డ'చిత్ర ప్రదర్శనలమీద ఆంక్షనుగూడ విధించింది. తరువాత వీరు కొన్ని యితర సినిమా సంస్థలకు 'అపవాదు', 'ఇల్లాలు' చిత్రాలను డైరెక్టుచేసి యిచ్చారు; ఆవెనుక స్వతంత్రంగా 'శారదా ఫిలిమ్స్' స్థాపించి 'పంతులమ్మ' మొదలగు చిత్రాలను తీశారు; 'పల్నాటి యుద్ధం' నిర్మిస్తుండగా రాచకురుపువల్ల పరమపదించారు.

ఉదారబుద్ధి ఉన్నవారు అవుటవల్ల వీరు చాలమంది కళాకారులను, కవులను సత్కరించి ప్రోత్సహిస్తుండేవారు. లలితమైన అభిరుచులు, మంచి కలుపుగోలుతనము ఉన్నవారవడముచేత ఆనాడు వీరి కార్యాలయము ఆంధ్ర కవులకు, కళాకారులకు సమావేశ స్థలముగా నుండేది. ఏ చిన్న విషయాన్నయినా కొంత ఆడంబరముతో జరిపించి మద్రాసు నగరములోని ఆంధ్రేతరుల దృష్టిని ఆకర్షించే నేర్పు వీరి కపారము. సినిమా రంగములో వీరు సంపాదించిన పేరువల్ల వీరు స్వల్పకాలములోనే 'మద్రాసు మోషన్ పిక్చర్ ప్రొడ్యూసర్సు కంబైన్' అన్న నిర్మాతల సంస్థకు మేనేజింగు డైరెక్టరు కాగలిగారు. ఆంధ్ర చలన చిత్రాలు ఉత్తమస్థాయిలో ఉంటాయి అన్న ప్రఖ్యాతి ఇతర ప్రాంతాలలో వ్యాపించినట్లు చేసిన అగ్రగాములలో వీ రొకరు. 'మాలపిల్ల', 'రైతుబిడ్డ'లలో అభ్యుదయదృష్టి, 'పత్ని', 'పల్నాటి యుద్ధము'లలో చారిత్రకదృష్టి, 'అపవాదు', 'ఇల్లాలు'లలో సంఘ సంస్కరణ దృష్టి, అన్నిటియందు లలితకళాదృష్టి ప్రకటించి వీరు బహుముఖ ప్రశంసల నందుకొన్నారు. తా. ధ. రా.

**రామభద్రాంబ**: ఈమె తంజావూరి రఘునాథ నాయకుని యాస్థానమునం దుండిన విదుషీమణులలో అగ్రగణ్య; సంస్కృతాంధ్రములందు మంచి పాండిత్యము కలది. రాజగోపాల విలాసము మున్నగు గ్రంథములను రచించిన చెంగల్వ కాళకవి యీమె విద్యా గురువు. ఈమె వారాంగన యనియు, రఘునాథరాయల భోగకాంత యనియు ప్రతీతి. ఈమె తన యేలికయగు రఘునాథరాయల ప్రతాపాదులను, విద్యా విశేషములను వర్ణించుచు రఘునాథాభ్యుదయ మనుపేర పండ్రెండు సర్గముల మహాకావ్యమును గీర్వాణ భాషలో రచించెను. లలిత లలితముగను, సర్వజనాకర్షకముగను కవిత్వము చెప్పుటలో నీమె అద్వితీయురాలు. రఘునాథాభ్యుదయము కేవలము కావ్య ప్రయోజనములనేకాక మధురావిజయమువలె ఆ కాలపు చరిత్రాంశములను పెక్కింటిని తెలిసికొనుట కుపయోగించు ప్రధాన చరిత్ర గ్రంథమని చెప్పవచ్చును. బి. వెం. ర.

**రామమూర్తి, అశ్వధాటి** (క్రీ. శ. 1876 - 1944): ఈయన గొప్ప మార్దంగికుడు; అతి సుకుమారమైన వాద్య నైపుణి కలవాడని ప్రసిద్ధి పొందినవాడు. బందరు ఈయన జన్మస్థలము. తన తండ్రి సుబ్రహ్మణ్యముగారివద్ద ఈయన మృదంగవిద్య నభ్యసించి తరువాత రంగని గుడిలో ప్రతి శనివారం జరిగే భజనలలో మృదంగం వాయించి ఆ విద్య నభివృద్ధి చేసుకున్నాడు.

ఈయనకు సహజంగా అలవడిన ప్రజ్ఞ ఒక టుంది. అది 'చాటు'లో తెచ్చిన అతి సుకుమారనాదం. దానికితోడు



చిత్రము 216.
అశ్వధాటి రామమూర్తి

స్పష్టత, దురితగతి కూడ ఈయనకు అలవడ్డాయి; అశ్వధాటి ఇంటిపేరు సార్థకమయింది. ఈయన మృదంగం వాయించడంలో మంచి ప్రావీణ్యము సంపాదించాడు; పారుపల్లి రామకృష్ణయ్య, తుమురాడ సంగమేశ్వరశాస్త్రి, హరి నాగభూషణం మున్నగు తెలుగు సంగీత విద్వాంసులకు ప్రక్కవాద్యం వాయించి వారి మన్ననలు పొందాడు; ఏటేటా జరిగే సరస్వతీ గాన సభలలో పాల్గొని కాకినాడలో ఆ సభలకు విచ్చేసిన ఉత్తరాది, దక్షిణాది విద్వాంసుల ప్రశంస లందుకొన్నాడు. 1932 లో కాకినాడ సరస్వతీ గానసభ పక్షమున కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తిగారీయనకు సువర్ణఘంటాకంకణం బహూకరించి ఈయనను సత్కరించారు. 1926 లో ఈయన షష్టిపూర్తి ఉత్సవం దేశోద్ధారక నాగేశ్వరరావుపంతులుగారి అధ్యక్షతక్రింద విజయవాడలో వైభవంగా జరిగింది. ఆ సందర్భంలో ఈయనను ఏనుగుపై నెక్కించి ఊరేగించారు. ఆ సభలో చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు ఈయనకు 'మార్దంగికాచార్య'అనే బిరుద ప్రదానంచేసి గౌరవించారు. కీర్తిశేషులైన పొట్లూరి వీరరాఘవయ్యచౌదరి, పువ్వుల రత్నం,

గండు సుబ్బారాయుడు, కాకినాడ భుజంగరావు అను పేరుపొందిన నలుగురు వీరి శిష్యులే. యం.స.నా.

**రామమూర్తి నాయుడు, కోడి** (క్రీ.శ. 1885-1942): ఇతడు నాగావళీ నదీతీరమునందు వీరఘట్ట మను గ్రామమున 'భూకామం'దగు కోడి వెంకన్నగారికి జన్మించెను. ఇత డైదేండ్ల ప్రాయమునుంచి ఇరుగు పొరుగులవారితో చీలి జగడములు తెచ్చుచుండుటచే తండ్రి పదేండ్ల వయసున ఇతనిని విజయనగరములో పోలీసు ఇన్స్పెక్టరుగా నున్న తన తమ్ముడు కోడి నారాయణస్వామిగారి వద్దకు చదువుకొన బంపెను. అచ్చటను ఇతని పెంకితనము ప్రబలుచుండెను. ఇతడు తాలిమ్‌ఖానాలలో చేరి యెక్కువగా శరీర వ్యాయామము నభ్యసించి, మంచి శరీరబలము నార్జించెను. నారాయణస్వామిగారితనికి చదు వబ్బకుండుటగని, ఇతనిని శరీర వ్యాయామ శిక్షణకు సైదాపేట పంపించిరి. ఒక యేడాది అక్కడ వ్యాయామము నభ్యసించి శరీర వ్యాయామ శిక్షణోపాధ్యాయుడుగా సర్టిఫికెట్టును పొంది విజయనగరము వచ్చి యచట ప్రావిన్షియల్ లోవర్ సెకండరీ పాఠశాలలో వ్యాయామాధ్యాపకుడుగా చేరెను.


చిత్రము 217.
కోడి రామమూర్తి నాయుడు

వ్యాయామాధ్యాపకుడుగా నున్నప్పుడే ఒకసర్కసు నెలకొల్పవలెనని ఇతనికి సంకల్పము కలిగినది. దానికై కొందరు శిష్యులకు తగిన అభ్యాసము నిచ్చి తయారు చేసెను; అప్పటి తుని ప్రభువుల ప్రాపున గొప్ప సర్కసును జరుపుటకు వలసిన ద్రవ్యమును, సంభారములను సంపాదించెను; ఇట్లు సర్కసు సంఘమును కల్పించుకొని తెలుగు జిల్లాలలో ప్రదర్శనముల నిచ్చుచు 1912 లో మద్రాసు చేరుకొనెను. సర్కసులో తక్కిన ఆటకాండ్ర ప్రదర్శనము లటుండ శరీరమునకు కట్టిన ఉక్కు గొలుసును ఊపిరితిత్తులలో గాలిని పూరించి తెంపుట, రొమ్ముపై పెద్ద రాతి బండను పెట్టుకొని సమ్మెటలతో మోదించుకొనుట, రొమ్ముపై ఏనుగును భరించుట, వడిగా పోవుచున్న మోటారుకారును ఆపుట మున్నగు ఈతని అపూర్వ ప్రదర్శనములు తండోపతండములుగా ప్రజల నాకర్షించినవి; రాబడి అపరిమితమైనది. ఈ రోజులలోనే మద్రాసులో నుండిన ఆంగ్ల దేశీయుడగు యూజిన్ సాండో అను నాతనిని రామమూర్తి కుస్తీకై ఆహ్వానించగా కుస్తీ తన వృత్తి కాదని అతడు తప్పించుకొనెను.

1912 లో ఇతని తండ్రి మరణించినపిదప బెంజమిను అను ఆంగ్లేయు డొకడు ఈతనిని చేపట్టి ఇంగ్లండునకు తీసికొనివెళ్లెను. సర్కసు సంఘమును భారతదేశమందు విడిచి ఇతడు గామా తమ్ముడగు ఇమామ్ బక్ష్ మొదలగు నలుగురు కుస్తీ ఫైల్వానులతోను, ఒక ఏనుగుతోను ఇంగ్లండునకు ప్రయాణము సాగించెను. బెంజమిను ఈతనికి సలహాదారుడుగా పనిచేయుచు, ఈతనిని వంచించి ఈతని వద్ద నున్న ద్రవ్యము నంతయు దొంగిలించి పరారి యయ్యెను. అంతట ఇంగ్లండులో ఇతడు లేమిచే బాధపడుచు, తన ప్రదర్శనములవల్ల మరల ధనము సంపాదించి తన ప్రతిష్ఠను ఆంగ్లదేశమున వెల్లడిచేసి మిగిలిన ఒక ఏనుగుతో 1914 లో మరల విజయనగరము చేరెను. మరల సర్కసు సంఘమును సమకూర్చుకొని హిందూదేశ మంతటను ఒక పదియేండ్లపాటు తిరిగి తిరుపతి వచ్చుసరికి ప్రదర్శనములవలన వచ్చు రాబడి ఖర్చులకు చాలక సర్కసు భగ్నమైనది. 1924 లో తిరిగి విజయనగరమును చేరుకొని భారతదేశమందలి రాజులను, సామంతులను దర్శించుటకై ఇతడు బయలుదేరెను. బనారసు విశ్వవిద్యాలయపు మొదటి వైస్‌ఛాన్సలరైన మదనమోహన మాలవ్య ఈతని నొక యేడాదిపాటు తన అతిథిగా నుంచుకొని సత్కరించెను. భారతదేశమం దొక వ్యాయామవిద్యాసంస్థను స్థాపించుటకై ధనము ప్రోగుచేయు నుద్దేశముతో ఈతడు నానారాజ సందర్శనమును సాగించెను. కాని ఈతని యత్నము ఫలించినదికాదు. ఇతడు విజయనగరమునకు తిరిగివచ్చి చేరుకొనెను. ఈ కాలములోనే ఈతనికి కాలిపై రాచపుండు లేచి కాలు తీసివేయ వలసి వచ్చినది. సేకరించిన ధనము అయిపోయినది. బలంఘీర్ పాట్నాలో కల్హాండిపరగణా ప్రభువు పోషణమున దినములు గడపుచు ఇతడు దివంగతుడయ్యెను.

ఈతని శరీర దార్ఢ్యము, సౌష్ఠవము కనిన ప్రతి మనుజునికి ఇతడు ప్రాకృతిక మానవుడు కాక, మూర్తిగన్న బలమే యనిపించెడిది. మన పురాణములలో భీముడు, ఆంజనేయుడు బలశబ్దమునకు పర్యాయ పదములుగా పేర్కొనబడినట్లు ఇతని నామధేయము సార్వజనికఆంధ్ర భాషా వ్యవహారమున బలమునకు పర్యాయపదముగా పరిగణింపబడు చున్నది. మే. వ. న.

**రామమూర్తిశాస్త్రి, ఆదిభట్ట** (క్రీ. శ. 1861-1920): వీరు బొబ్బిలి తాలూకా మురగడాం అగ్రహారములో 1861 ప్రాంతమున జన్మించిరి; తండ్రి సుబ్రహ్మణ్యముగారు;

తల్లి మహాలక్ష్మమ్మ. వీరు ద్రావిడ బ్రాహ్మణులు. వీరు స్వగ్రామముననే పంచకావ్యములు చదివి పిమ్మట శ్రీపాద రామశాస్త్రిగారివద్ద తర్క ప్రకరణములను, పంచలక్షణి, వ్యధికరణము, సిద్ధాంత లక్షణము, అవచ్ఛేదకత్వ నిరుక్తి, పక్షత, సామాన్యనిరుక్తి యను తర్క గ్రంథములను చదివిరి; అనంతరము కాశిలో మహావిద్వాంసులైన కర్ణాటక సీతారామశాస్త్రిగారివద్ద సవ్యభిచారము, సత్ప్రతిపక్షము, అవయవము అను ఉద్గ్రంథముల నధ్యయనము చేసిరి; పిదప బంగాళీ పండితులైన వజ్రకుమార విద్యారత్న భట్టాచార్యులవారివద్ద వ్యుత్పత్తివాద, శక్తివాదములనే కాక ప్రామాణ్యవాదము, విధివాదము, ముక్తివాదము అను అపూర్వ గ్రంథములను పఠించిరి.

ఇట్లు తర్కమును ఆ మూలచూడము నధ్యయనము చేసిన పిమ్మట వీరు కలకత్తాలో ప్రభుత్వ మేర్పరచిన పరీక్షయం దుత్తీర్ణులై 'తర్కతీర్థ' బిరుదమును, 500 రూపాయల నవరత్నరూప బహుమానమును పొందిరి. పిదప వీరు కాశిలో ద్రవిడ సుబ్రహ్మణ్య దీక్షితులుగారివద్ద వేదాంతసూత్ర శాంకరభాష్యములో చతుస్సూత్రివరకు అధ్యయనము చేసి మిగిలిన వేదాంతశాస్త్రమందలి దశోపనిషద్భాష్యమును, గీతాభాష్యమును, సూత్రభాష్యమును, అద్వైతసిద్ధిని, గౌడబ్రహ్మానందమును స్వీయప్రతిభచేతనే శిష్యుల కధ్యాపనము చేసిరి.

కర్ణాటకదేశమందలి చిత్రాపూరులోని శంకరపీఠ స్వామికి వేదాంతమును, విద్యార్థులకు తర్కమును బోధించుచు వీ రచట మూడేం డ్లుండిరి. వీరు దర్భంగ, మండి మున్నగు అనేక సంస్థానములందు గౌరవముల నందిరి. ఆ దినములలో ఉర్లాము జమీన్దారు పండిత సత్కార నిర్ణయార్థము వివిధశాస్త్రములలో జరపుచుండిన పరీక్షలలో వీరు తర్కశాస్త్ర పరీక్షాధికారిగ నుండిరి. మూడు సంవత్సరములు తూర్పు గోదావరిజిల్లా మండపేటలోను, పంద్రెండు సంవత్సరములు రాజమహేంద్రవరములోను, రెండు సంవత్సరములు విజయనగరమహారాజావారి సంస్కృత కళాశాలలోను అధ్యాపకులుగానుండి, బహుసంఖ్యాక శిష్యులకు తర్కశాస్త్రమును బోధించి పిమ్మట వీరు తిరుపతి సంస్కృత కళాశాలకు ప్రధానాచార్యులుగా వెళ్లిరి. కాని వీ రా కళాశాలను త్వరలోనే వీడి దక్షిణదేశసంచారము చేసి పండితులతో శాస్త్రార్థములను గావించి తిరిగి లుకులాం అగ్రహారము చేరిరి. అక్కడ బ్రాహ్మణ గృహస్థులగు బూర్లె శ్రీరాములు గారివలన భూ, గృహ వసతులను పొంది సుఖముగా విద్యార్థులకు పాఠములను చెప్పుకొనుచుండిరి. వీరు 'శక్తివాదము' పై నొక వ్యాఖ్యానము రచించిరి కాని యది ముద్రితము కాలేదు.

శాస్త్రిగారు విద్యార్థిదశనుండియు శ్రీ విద్యోపాసకులు. అవసానదశ సమీపించుచున్న సమయమున నదీతీరమును కోరి రాజమహేంద్రవరమును చేరి అక్కడ కొంతకాలముండి వీరు సన్న్యాసము స్వీకరించిరి. జ. పు.

**రామయ్య, జయంతి** (క్రీ. శ. 1861 - 1941): గోదావరి జిల్లా కోనసీమలోని ముక్తేశ్వర గ్రామము వీరి జన్మస్థలము. వీరిది వెలనాటిశాఖ. వీరు పదునాలుగు సంవత్సరములవరకు తమ గ్రామములోనే సంస్కృతాంధ్ర భాషల నభ్యసించిరి. పిదప వీరు రాజమహేంద్రవరమున నాంగ్ల భాష నభ్యసించిరి. 1882 వ సంవత్సరమున పట్టభద్రులయిరి; 1884 వరకు పిఠికాపుర మహారాజావారి పాఠశాలయందు ప్రధానాధ్యాపకులుగ నుండిరి; తరువాత న్యాయవాదిపరీక్షయం దుత్తీర్ణులై ప్రభుత్వమండలాధికారి పదవి బడసిరి; 1911 వ సంవత్సరమున రాష్ట్ర న్యాయాధీశులయిరి. వీరి ఈ పదవీ నిర్వహణము సర్వశక్తి సమర్థము. న్యాయదృష్టికి, ధర్మబుద్ధికి వీరు జీవగర్ర. సాహిత్యమున వీ రద్వితీయులు. శాస్త్రజ్ఞానము వీరికి వెన్నతో బెట్టినది. వీరు ఆంధ్ర వాఙ్మయమునకు చేసిన సేవ సర్వతోముఖము.



చిత్రము 218.
జయంతి రామయ్య

మండలాధికారిగా నున్న దినములలో వీ రనేక శాసనములను సంపాదించి పరిశోధించిరి. వీరి పరిశోధనము చరిత్ర విషయకము, వాఙ్మయ విషయకము అని రెండు విధములు. వీరు పరిష్కరించి ప్రకటించిన శాసనములద్వారా చరిత్ర జ్ఞానము చాల పెంపొందినది. ముఖ్యముగ విజయనగరమున సంగమవంశ రాజులకు, తుళువ వంశ రాజులకు మధ్య సాళువవంశ రాజులు పాలించిన విషయము వీరు సంపాదించిన దేవులపల్లి శాసనమువలన తెలిసి అంతవరకతుకు కలియని చరిత్ర కతుకు కలిసినది. బెజవాడ యుద్ధమల్లుని శిలాశాసనము భాషా విషయకమైనది. ఈ యుద్ధమల్లుడు నన్నయకు బూర్వుడు. ఈ శాసనమునందలి తెలుగు పద్యముల యాధారమున నన్నయ మహాభారతమునకు బూర్వముకూడ తెలుగు కవిత్వ మున్నదని వీరు తెలుగువారి దృష్టిపథమునకు దెచ్చిరి; ప్రాచీనాంధ్రశాసన

ముల గల పద్యములను క్రోడీకరించి శాసనపద్యమంజరి యను పేర రెండు భాగములుగ ముద్రించిరి. ప్రభుత్వశాఖ వారు తాము అంతకు పూర్వము ప్రకటించినవి కాక 1926 వరకు సేకరించి యుంచిన మిగిలిన తెలుగు శాసనములను వీరికి పరిష్కరింప నొసంగిరి. ఈ శాసనగ్రంథమే దక్షిణ హిందూదేశ శాసనములు పదియవ సంపుటముగ ప్రకటితమైనది.

వీరు రాష్ట్ర న్యాయాధీశులుగ నున్న దినములలో పిఠాపురము, బొబ్బిలి, వెంకటగిరి సంస్థానాధీశుల ప్రోత్సాహమున ఆంధ్రసాహిత్యపరిషత్తు నేర్పరచిరి. ఇందు వీరయిదువేల తాళపత్ర సంపుటములను సేకరించి పెట్టిరి. ఇం దముద్రితములయిన యమూల్య గ్రంథము లెన్నియో యున్నవి. ఇవి కాక యపూర్వములయిన ముద్రిత గ్రంథము లనేకము వీరు పరిషత్తునకు సంపాదించిరి. వీరు పరిషత్కార్యనిర్వాహక వర్గమునకు యావజ్జీవాధ్యక్షులుగ నుండిరి. ఈ పరిషత్తు మొదట చెన్నపురిలో నుండి పిదప కాకినాడకు మార్చబడినది. పరిషత్పక్షమున నొక యాంధ్రసాహిత్యపత్రికను ప్రకటించి అందు రాయవాచకము, కవిజనాశ్రయము మొదలైన ఎన్నియో యముద్రిత గ్రంథములను ముద్రించి వానిని ప్రత్యేక గ్రంథములుగాగూడ ప్రచురించిరి. పిఠాపుర మహారాజావారి యర్థసాహాయ్యముచే ఆంధ్రనిఘంటు రచనకూడ చేయింపసాగిరి; వీరు శాస్త్ర పారిభాషిక పదముల పట్టిక కొంత వరకు సిద్ధముచేసి పరిషత్పత్రికలో ప్రకటించిరి. ఆంధ్ర మహాభారతములోని పదముల కనుక్రమణిక వ్రాయించిరి.

వీరు రససిద్ధులగు కవులు. ఉత్తరరామచరిత్ర, చంపూ రామాయణము, అమరుకము వీరి యాంధ్రీకరణములు. ముక్తేశ్వరశతకము, బాలరామాయణము వీరి స్వతంత్ర రచనలు. ఇవికాక వీరు 'ఆంధ్ర వాఙ్మయ వికాసవైఖరి' అను విమర్శనాత్మక గ్రంథమును, ఆంగ్లమున 'డిఫెన్సు ఆఫ్ లిటరరీ తెలుగు', 'ద్రవిడియన్ లెక్సికోగ్రఫీ' అను భాషాశాస్త్రగ్రంథములును రచించిరి. చరిత్రకు భాషకు నుపకరించు వీరి ప్రత్యేక వ్యాసముల నేకము పరిషత్పత్రికలో ప్రకటితమైనవి. వీరు గ్రాంథిక భాషావాదులు; గిడుగు వారి వ్యావహారికభాషా వాదమున కెదురొడ్డి పాఠశాలలలో వ్యావహారిక భాషకు ప్రవేశము కలుగకుండ జేయించిరి.

ఆంధ్రసాహిత్యపరిషత్తున కొక శాశ్వతభవనము నిర్మింపవలెనను వీరి సంకల్పము వీరి నిర్యాణానంతరము వీరి సోదరీమణి ప్రభల వెంకట సుబ్బమ్మగారి ద్రవ్యసహాయముతో రూపొందినది. వీరు చేయింప దలపెట్టిన నిఘంటు రచన వీరి జీవితకాలములో పూర్తి కాలేదు. **వ. చ. రా.**

**రామరాజ భూషణుడు :** ఆంధ్రభారతికి పూర్ణ యౌవనకాలమైన పదియారవ శతాబ్దమున పదియారు కళలతో వెలుగు కళానిధి యనదగి శారదామూర్తి యని మెప్పొందిన (బట్టు)మూర్తి మహాకవియే రామరాజభూషణుడు. నరసభూపాలీయము, వసుచరిత్రము, హరిశ్చంద్ర నలోపాఖ్యానము అను కావ్యత్రయ మాతని కృతిరత్నములు. అందు నరసభూపాలీయమున 'మూర్తికవి'ననియు, తక్కిన రెండింటియందు 'రామరాజభూషణుడ' ననియు జెప్పికొనుటచే మూర్తి, రామరాజభూషణులు వేరనియు, తాత ముత్తాతల పేళ్లును, నింటిపేరు నభిన్నములుగను, తండ్రుల పేళ్లుమాత్రము వేరుగ నగపడుటచే పినతండ్రి పెదతండ్రి కొడుకు లనియు, అట్లు గాదు - హరిశ్చంద్రనలోపాఖ్యానమున తండ్రిగా జెప్పబడిన సూరపరాజున కౌరసపుత్రుడును, నరసభూపాలీయమున తండ్రిగా జెప్పబడిన వెంకటరాయభూషణునకు దత్తపుత్రుడు ననియు పెక్కు వాదోపవాదములు బయలుదేరినవి.

కాని ఈ విభేదవాదములు తగు నుపపత్తులచే మరల్పబడినవి. 'కృష్ణరాయభూషణ' ప్రభృతి ప్రభునామాంకిత బిరుదనామము లొకటి రెండు ఆనాటి కవీశ్వరుల కుండుటం జేసి వెంకటపతిరాయల కాశ్రితుడైన పేతువున సూరపరాజు వెంకటరాయభూషణ బిరుదనామ మొందెను. అళియ రామరాజున కాశ్రితుడై బహు సంస్కృతాంధ్ర కృతులచే మెప్పించి మూర్తికవి 'రామరాజభూషణ' బిరుదనామము నొందెను. కావున వెంకటరాయభూషణ బిరుదాంకితు డగు సూరపరాజునకు రామరాజభూషణ బిరుదాంకితు డగు మూర్తికవి పుత్రుడని చరిత్ర శోధకులగు పండితులచే నిర్ణయింపబడినది.

ప్రబంధాంకమని యింటిపేరు గల బట్టుకులమున మూర్తి యను నామమున బుట్టి, సకల విద్యాధూర్వహుడై తొరగంటి దుర్గాధ్యక్షుడును, (అళియ) రామరాజ, తిరుమలరాయ సోదరద్వయమునకు మేనల్లుడు నగు నహోబల (ఓబయ) నరసరాజునకు 'కావ్యాలంకారసంగ్రహ' మనబడు నరసభూపాలీయము కృతిగా నొసంగి కవిలోకమున నగ్రగణ్యత గాంచి, ఆ కాలమున కృష్ణరాయని యనంతరము కర్ణాటసామ్రాజ్యమును మహమ్మదీయుల బారినుండి తప్పించి యథాపూర్వముగా నెలకొల్పి, నిరంతరదీక్షతో రాజ్యపాలకుడైనట్లే, వేదశాస్త్ర సకలభాషాకవిత్వాది విద్యా పాలకుడైన రామరాయలచే నాహూతుడై ఆశుకవిత్వ, శతలేఖినీ పద్యాది లోకోత్తర కవితా విశేషముల జూపి సత్కృతుడై రామరాజభూషణ బిరుదనామము నొంది, క్రీ.శ. 1565 వ సంవత్సరమున నా ప్రభువు తలికోట

యుద్ధమున స్వర్గస్థుడు కాగా కర్ణాటరాజ్యమును బునరుద్ధరించిన తత్సోదరుడగు తిరుమలరాయనికి వసుచరిత్రము కృతినొసంగి, యఖండగౌరవము నొంది యైహిక సుఖములందు దృప్తుడై, ముముక్షువై ఇష్టదైవత మగు హనుమంతుని స్వప్నమున గాంచి తదాజ్ఞను తాను రచించుచున్న హరిశ్చంద్రనలోపాఖ్యానమును శ్రీరామచంద్రునకు గృతియిచ్చి రామరాజభూషణుడు ధ్రువకీర్తి యైనాడని సకలవాదోపవాదములపై దేలిన సారాంశముగా గ్రహింపదగును.

'మత్ప్రత్యయాభావస్య అల్లసాని పెద్దనార్యశిష్యేణ భట్టుమూర్తిమహాకవినా విరచితే వసుచరిత్రే' అని వెంకటరాయల విద్యాగురువగు మండ రామానుజాచార్యుని ముమ్మనుమని మనుమ డగు లక్ష్మీనరసింహాచార్యులు రచించిన యాంధ్రకౌముదియం దుండుటచేతను, లోకమున గల ప్రసిద్ధినిబట్టియు మూర్తికవి పెద్దనార్యునకు శిష్యుడై యుండవచ్చును. పెద్దన వార్ధక్యమున నీతడు బాలుడై యుండి శుశ్రూషించి, చతుర్విధ కవితాపాటవ మలవరచుకొని కృష్ణరాయల యాస్థానమున అష్టదిగ్గజములలో నొకడై యుండునని సిద్ధాంతీకరింపబడినది. 1515 - 25 సంవత్సరముల నడుమ జన్మించి, 1570 సంవత్సరములోపల వసుచరిత్ర రచన కావించి, యనంతర కాలమున హరిశ్చంద్ర నలోపాఖ్యానము రచించి, పూర్ణాయుష్య మొంది చతుర్విధ పురుషార్థములను సాధించి ధన్యు డయ్యెనని చారిత్రకులు నిర్ణయించిరి. ఈ మహాకవి జన్మ, విద్యాదిక విషయ విమర్శన మటు పెట్టి సువర్ణఘటిత రత్నమయాలంకారములుగ నాంధ్రసరస్వతి కత డర్పించిన కావ్య విశేషములను సంగ్రహముగా నరయుదము.

నరసభూపాలీయము : విద్యానాథుడు ప్రతాపరుద్రుని పేర లక్ష్యములను గూర్చినట్లే నరసభూపాలీయమున లక్ష్యము లన్నియు నరసరాజు పేరం గూర్చుచు లక్షణము లన్నియు బ్రతాపరుద్రీయ లక్షణముల కనువాద మొనర్చి ఈత డాంధ్రమున కొక యపూర్వాలంకారము ఘటించినాడు; తెనుగునం గల యలంకార గ్రంథముల కిదియే శిరోభూషణ మనిపించినాడు. విన్నకోట పెద్దన కృతమగు కావ్యాలంకారచూడామణి యొకటి యున్నను నరసభూపాలీయమునకు గల ప్రశస్తి దానికి రాలేదని ప్రాజ్ఞుల యభిప్రాయము.

> 'చిరేణ చరితార్థోఽభూత్ కావ్యాలంకార సంగ్రహః
> ప్రతాపరుద్రదేవస్య కీర్తి ర్యేన ప్రకాశ్యతే'

అని విద్యానాథుడు కావ్యాలంకారసంగ్రహమని యిడిన సంజ్ఞనే గ్రహించి మూర్తికవియు కావ్యాలంకార సంగ్రహ మనియే పేరిడినాడు. కాని లక్ష్యములను బట్టి 'ప్రతాపరుద్రీయ' మని సంస్కృతగ్రంథము ప్రసిద్ధమైనట్లే ఈ గ్రంథమును నరసభూపాలీయ మని ప్రసిద్ధి నొందినది. నాయక, కావ్య, రస, దోష, గుణాలంకార ప్రకరణము లన్నియు మూలమున కనుకూలముగా ననువదింపబడియు నాటక ప్రకరణము మాత్ర మిందు విడువబడినది. అనువాదమట్లుగాక స్వతంత్ర గ్రంథమువలె ఈ గ్రంథము సహృదయ హృదయాకర్షకమగు రచనచే దెలుగుల గొప్పదనమును జాటుచున్నది.

వసుచరిత్రము : ఇది రామరాజభూషణుని కావ్యత్రయమందే కాదు, యావదాంధ్ర కావ్య ప్రపంచమునందును చుక్కలలోని చంద్రు డనిన స్తుతి కానేరదు. తన యసమాన సకలవిద్యావిశారదత్వమును, అప్రతిమప్రతిభను మేళవించి శబ్దార్థశ్లేషవైచిత్రీపూర్ణముగ ననితరసాధ్య కవితా శిల్పపారమ్యముతో నానాలంకారలక్ష్యభూతముగా, రసజ్ఞరసాయనముగా, వ్యంగ్య సమృద్ధముగా నిమ్మహాకవి తిరుమలరాయలకు వసుచరిత్రమును ఆతని కోరికపై రచించి అంకిత మొనర్చి తన పేరు ధ్రువకీర్తి కంకిత మొనర్చుకొనినాడు; కవిశిరోభూషణ మైనాడు.

శ్లేషకవిత్వము రెండవరక మనుకొను రసికులు కొందరు లేకపోలేదు. వాస్తునిర్మాణమున తాజ్‌మహాలు వంటిదే వసుచరిత్ర కవితాశిల్ప సౌందర్యమున. తాజ్‌మహాలు శిల్పసౌందర్యము రసికులకు కన్నులద్వారా మనసునకు హత్తుకొనునట్లే వసుచరిత్రమందలి శిల్పసౌందర్యము శ్రవణద్వారమున మనసునకు హత్తుకొని యానందపారవశ్యము చేకూర్చును. కావున పాఠకుడు సహృదయుడై యుండవలెను. నాడే దాని వైశిష్ట్యమును, వైచిత్ర్యమును నవగతము లగును.

కవితా కళయందు శిల్పనైపుణి మెరయింపగోరిన రామరాజభూషణుడు తన నరసభూపాలీయమున లక్షణముల కనువుగా నరసభూపాలనామాంకితముగా లక్ష్యముల గూర్చెను. కాని దానితో దనియక, తన శ్లేష యమకానుప్రాసాది నానాముఖ కవితావైచిత్ర్య ప్రదర్శనార్థము వసుచరిత్ర రచించినట్లు కనబడును. నరసభూపాలీయమున కథ యేమియు లేమింజేసియు, నేకవస్తువర్ణనమాత్ర మగుటయు దనివొందక ఇత డుత్తమనాయకంబై శృంగారరసప్రధాన మగు గిరికా వసువుల పెండ్లికథ నిమిత్తముగా జేసికొని, యసదృశమగు భావనామహిమ నంతయు స్పష్ట మొనర్చుకొనెను.

కావ్య స్వరూపము చెప్పుచు నరసభూపాలీయము ద్వితీయాశ్వాసమున—

'తను వగు శబ్దార్థంబులు
ధ్వని జీవ మలంక్రియావితానము సొమ్ముల్
దనరు గుణంబులు గుణములు
ఘనవృత్తులు వృత్తులౌర కావ్యేందిరకున్'

అని నిరూపించెను. కావ్యలక్ష్మీశరీరములో మొదటి దగు శబ్దములం దీతడు మెరయించిన శిల్ప మొక నూతన పక్కిని నడచినది. పరిణతమై, వశ్యమైన వాక్కుగల యీ మహాకవి శబ్దార్థముల నొక దానిని మించి యొక దానిని అలంకారభూషిత మొనర్చి యిటీవలి కవుల కెంద రకో యనుసరణీయు డయ్యెను. కవియగు ప్రతివాడును కవిత్వమునకు శరీరమగు శబ్దార్థముల నేదో యొక రీతి సృష్టించుచునే యున్నాడు. కాని యేతాదృశమగు లోకోత్తరశిల్పచమత్క్రియా పరిపూర్ణత యనన్యసాధ్య మని ఘంటాఘోషముగా జెప్పవచ్చును.

'ఏ రాజు భూరితేజోరుణాలోకంబు
లోకంబు తమము నిరాకరించు
నే ధన్యు బాహాధరాధరాభోగంబు
భోగంబు సవరించు భూమిసతికి
నేపుణ్యు నభిరూప రూపానుభావంబు
భావంబుఁ గరఁగించు భామినులకు
నేభవ్యు శుభకీర్తి శోభావిహారంబు
హారంబు దశదిశాయోషితమున
కతఁడు మతిమంతుఁ డతిశాంతుఁ డరి కృతాంతుఁ
డనుపమస్వాంతుఁ డాశ్రిత వనవసంతుఁ
డనఘతర కందనోలు మహాపురీ ని
శాంతుఁడగు రామ మేదినీ కాంతుఁడలరు' (1-30)

ఇందు సీసపాదములలోని ఛేకానుప్రాసమును, గీతము లోని వృత్త్యనుప్రాసమును జెవులున్న ప్రతివాని హృద యమును కదలింపక మానవు. ఇం దర్థాలంకారములును లేకపోలేదు. ప్రతి పాదమున నొక్కొక్క రూపకాలం కారము గలదు. అవి పరస్పర నిరపేక్షము లగుటచే తిల తండులములవలె సంసృష్టి యను నొక యలంకారము కాగలదు. ఇట్లే యమకానుప్రాసాది శబ్దాలంకార ప్రాధా న్యము చూపెడుచోట్లగూడ నర్థాలంకారముల నెంతయో నేర్పున నమర్చి 'యత్ర యమకం రసపుష్టి ర్న విద్యతే' యను సూక్తి కపవాదముగా నెన్నియో పద్యముల నమ్మహాకవి రచించెను. గానవిద్యా ప్రకారము లయాను కూలముగా నియ్యనుప్రాసము లెన్నో తావుల గూర్చి యితడు తన సంగీతకళారహస్యజ్ఞత నర్థమునసే కాక శబ్దమునను జిత్రించుట యపూర్వము.

'ఉద్ధతరిపువిద్ధతపన
పద్ధతి కరిభవన దవనిపటదంబుధిసం
పద్ధరణ సముద్ధరణ స
మిద్ధరణరజోప్రజోద్యదిభమదసృతికిన్' (1-88)

ఓజోగుణభరితమై, గౌడీరీతికమై యనుప్రాసరమ ణీయమగు నీ పద్యమున నతిశయోక్తి యను నర్థాలం కారమే కాక సంగీతకళారహస్యముగూడ వ్యక్తమగు చున్నది. 'ఉద్ధతరిపు, విద్ధతపన, పద్ధతికరి' అను నపుడును, 'సం-పద్ధరణ సముద్ధరణ సమిద్ధరణ' అను నపుడును మద్దె లపై 'తకిటతక, తకిటతక, తకిటతక' అని ముమ్మారు ముక్తాయించిన ట్లింతో మనోజ్ఞముగా ఘటింపబడినది. అర్థము పరిశీలింప అరిభవనత్, అవనిపటత్ అనునవి నామ ధాతువులపై గగ్గిన కృదంతరూపములు. భవన (గృహము) అను నామవాచకమునే ధాతురూపము చేసి దానిపై, 'త్' అను శతృప్రత్యయము ('వర్తమాన కాలిక విశేషణ ప్రత్యయము') కూర్చి ఇతడు తన వ్యాకరణమార్మికతయు బ్రకటించెను. ఇట్టిదే 'పటత్' అనునదియును. పటము అనగా బట్ట. పటతి = బట్టగా నగుచున్నది అని క్రియాపదము. పటత్ = బట్టగా నగుచున్న అని శతృ ప్రత్యయాంతమగు కృదంతము. ఈ రీతిని సంస్కృత భాషా రహస్యములను దుష్కరమగు యమకానుప్రాసాదుల నడుమ హేలగా ఘటించిన రామరాజభూషణకవి యెంతటి వశ్యవాక్కో పేర్కొన శక్యమగునా? గాన కళాభిజ్ఞతను దెలుపు నీ పద్యమందలి ముక్తాయింపులవంటి వీగ్రంథమున నెన్నియో చోట్ల గలవు. 'నిజామాదుల్ వజీరుల్ భజింతురు (1-43), ధారాధర, ధారాజల ధారాహత (1-114), వయః, కోలా హలకోలాహల లీలా హలహాలిక (1-163), అంద్రైన నిం ద్రైన విం ద్రైనాదంబు (2-16), తచ్చికురపాళీనీరదాళీమి శన్నృతికేళీ (3-75),' మున్నగునవి సొంతము గలవు.

ఇట్టి చిత్రణము సంస్కృత శబ్దములం దెంత యనా యాసముగా జూపఁబడెనో తెలుగు శబ్దములం దంతకంటె సులభముగా నటనట జూపబడెను.

'అనుచు నాగంధవహుని ధౌర్త్యములు దెలుపు
లీల విరిసిన విరులు రాలిన రజంబు
లొలికిన రసంబు, లురిలిన ఫలము లధిపు
మ్రోల నిడి పల్కి రుద్యానపాలు రపుడు'. (1-134)

'తలిరుఁ బ్రాయమువాని నలరాజు నలరాజు
నలరాజుఁ దెగడు సోయగమువానిఁ
బసిఁడిచాయలవానిఁ బగడంబు జగడంబు
జగడంబు గల మోవి సొగసువానిఁ
దళుకుఁ జెక్కులవానిఁ దులకింపు పలుకెంపు
పలుకెంపు లొలయు నవ్వొలుకువానిఁ
జికిలిచూపులవాని సిరిమించు దొరయించు
దొరయించు కాంచనాంబరమువాని...' (3-46)

ఇది యొక విధమగు రచన. ఈ రీతిగా ఆదిమధ్యాంత యమకములతో సంస్కృతప్రాయముగను, అచ్చాంధ్ర ప్రాయముగను, మిశ్రితముగను సీసపద్యము లెన్ని గతుల సంగీతమున కనువుగా నుండునో యించుమించుగా నన్ని గతుల వసుచరిత్రమున నడపబడినవి.

'ఒకచాయ ననపాయపిక గేయసముదాయ
మొకసీమ నానామయూరనినదము!' (2-7)

ఇది యొకవిధమగు గడుసుపోకడ.

'మందయానఘు నేర్పు నిందిందిరాజీవ
రాజీవరాజన్మరాళ రాజి
కలికిపల్కులు నేర్పు లలితనానావాస
నావాసనికటకాననశుకాళి' (2-28)

ఇదియొక విధమగు శబ్దశిల్పము. ద్వితీయదళాదిని ముక్త పదగ్రస్తము. ఇన్నిటిని దలదన్ని సంస్కృతపద ఘటిత దీర్ఘసమాసయుతమై, శబ్దాలంకారమాత్రమేకాక, అర్థ గంభీరమై, యర్వాచీన కవుల కనేకులకు నోరూర జేసిన నిరుపమానము, రమ్యము నగు సీసపద్యశిల్పము పరికింపుడు :

'లలనాజనాపాంగవలనావసదనంగ
తులనాభికాభంగ దోఃప్రసంగ
మలసానిలవిలోలదళసాసవరసాల
ఫలసాదరశుకాలపనవిశాల
మలినీగరుదనీకమలినీకృతధునీక
మలినీసుఖితకోకకులవధూక
మతికాంతసలతాంతలతికాంతరనితాంత
రతికాంతరణతాంతసుతనుకాంత
మకృతకామోదకురవకావికలవకుళ
ముకుళసకలవనాంత ప్రమోదచలిత
కలితకలకంఠకులకంఠ కాకలీవి
భాసురము వొల్పు మధుమాసవాసరమ్ము' (1-125)

ఈ పద్యము కావ్యగుణములలో నొకటియగు '....విమల విచిత్రా, యతవర్ణావృత్తులు గల, యతిమృదుబంధంబు కాంతియగు' (నరస. 4-66)నను లక్షణ లక్షిత మగు 'కాంతి'యను గుణమునకు లక్ష్యముగా మెరయు చున్నది. మరియు కమ్మచ్చున దీసినట్లు, తీగ సాగినట్లు, వీణ మీటి నట్లు, లలితాతి లలిత సమాస సంఘటనము, మధుర మగు భావము, పూవు విచ్చినట్లు సొగసైన శ్లేషము, రసప్లుతి, వ్యంగ్యసంపద గలుగ సంస్కృతాంధ్రముల నిపుణముగా ఘటించి, శాస్త్ర సంప్రదాయముల విడువక, కావ్యలక్ష్మికి శబ్దరూపశరీరము పరిష్కరించుటలో నూత్నత వెల్లడించి బట్టుమూర్తి యొక విశిష్టస్థాన మాక్రమించినాడు. మచ్చున కొక పద్యము :

'శతపత్రేక్షణ వెంట నంటిన వసుక్ష్మాపాలకాలోకమున్
బ్రతిరోధింపఁగఁజాలదయ్యె భవనప్రాంతోరుకాంతారవే
ల్లితవల్లీవలయంబు తచ్చికురపాశీనీరదాళీమిళ
న్నృతికేళీరసకేకి లోకగరుదున్మీలన్మరుల్లోలమై' (3-75

ఇట్లు ఇతడు నానావిధ శబ్ద శిల్ప రహస్యముల బహువి ములుగా సంగీత శాస్త్రమున కనుకూలముగా గూర్చి 'పల్కుఁజెలికిం బాలిండ్ల జోడైన సంగీత సాహిత్య నామ విద్యాయుగళంబు' ప్రదర్శించినాడు. ఎంతెంత యవ కానుప్రాసాది శబ్ద వైచిత్ర్యము ప్రకటించినను సరస్వ ప్రవాహమువలె నంతర్లీనమైన యర్థగాంభీర్యము నెచ బరాకుపడియుండలేదు.

కావ్య లక్ష్మికి ఇక మిగిలిన అర్థరూపమగు శరీరా మును రామరాజభూషణుడు చక్కగా పోషించి భూషించినాడు. అత డుభయ భాషలు, సకల శాస్త్ర ములు సరహస్యముగా నేర్చినవా డగుటచే అందరవ గాక శ్లేషార్థముచే కవితను బుష్టమొనర్చుకొనెను. హ శ్చంద్రనలోపాఖ్యానమున శబ్దశ్లేషమువలె వసుచరిత్రము అర్థశ్లేషము హెచ్చుగా ఘటించెను.

భారతమున 'వసురాజు తపముచేయుచుండ నింద్రుడ ప్రత్యక్షమై దివ్యమగు నొక విమానమును, సకల ప్రహర ములను వారించు నింద్రమాలయు, దుష్టశిక్షణ మొనర్చ నొక వేణుయష్టియు నిచ్చి, స్వర్గమునకు వచ్చి పోవుచుండ నట్లు వర మిచ్చెను. ఆ విమాన మెక్కి చరించుచు ఉప చరవసుసంజ్ఞతో నతడు ఇంద్రమాలికను ధరించి, వేణ యష్టి కేళేట నింద్రోత్సవము చేయువాఁడు. ఆతని యర్థ స్థానపుర సమీపమున శుక్తిమతీనదిని గామించి కోల హాలుడను పర్వతరాజు నిరోధింప, నాయేటి నీటిలో జగ మంతయు మునిగిపోవుచుండ వసురాజు తన కాలి కొనగోట నా కొండను దూరముగా జిమ్మి లోకము గాపాడెను. కోలాహలుని సమాగమమున శుక్తిమతికి వస పదుడను కొడుకును, గిరికయను కూతురును బుట్టగా శుక్తి మతి కృతజ్ఞతచే వా రిద్దరను వసురాజున కర్పింప నారాజ వసుపదుని సేనాపతిగా, గిరికను భార్యగా స్వీకరించెను అని యున్నకథ రసాదుల కనుగుణముగా మార్పబడినది.

భారతమునందలి 'శుక్తిమతియను మహానదిం గోల హాలంబను పర్వతంబు గామించి యడ్డంబు పడిన...... నన్నదికిఁ బర్వత సమాగంబున వసుపదుండను కొడుకు గిరికయను కూఁతురుం బుట్టిన....' (భార. ఆది., 3-26 అను లోకసామాన్యమునకు విరుద్ధముగా గానవచ్చు విషయము గొని సంశయముల కవకాశము లేకుం శ్లేషబలమున శృంగార రసబంధురముగ రచింపబడి

యవాంతరగాథ యిది. గొప్ప ప్రతిభాశాలి కావున కొండను నాయకుని జేసి, నదిని నాయికను జేసి శృంగారమును జక్కగా బోషించి యిక్కవి యలోక సామాన్య చమత్కృతి చూపగల్గెను; గాలి మూట గట్టెను; కొండను పిండి రసమును దీసినాడు.

శుక్తిమతీనామ భవ్యతటినీ స్వరూపము తొలుత నిట్లు చెప్పెను :

జీవన మెల్ల సత్కవినిషేవిత, మాశయ మెల్ల నచ్ఛతా
పావనతాగభీరతలపట్టు, ప్రచారము లెల్ల విశ్వధా
త్రీవలయత్రికాల ఫలదేశికముల్, నవకంబు లెల్ల ము
క్తావళివిభ్రమాస్పదము లానదిపెంపు నుతింప శక్యమే? (2-104)

కవులను సేవించిన విజ్ఞానవతి, నిర్మల పవిత్ర గంభీర హృదయ, జీవన్ముక్తులకు గూడ నచ్చెరువు గూర్చులావణ్యవతియగు నొక ముగ్ధానాయికగాను, జలపక్షులచే సేవింపబడు నుదకముతోను, స్వచ్ఛములై పవిత్రములై లోతగు జలాశయములతోను, పుడమి నలువంక ముక్కారు పంటల కనువుగా బ్రవహించు ప్రవాహములతోను, ముత్యాలు పుట్టునట్టి శంఖములతోను ప్రకాశించునదిగాను ఈ పద్యమున జెప్పబడినది.

'సుమనోధివాసభాసురశిఖోన్నతివాఁడు
ఘనసారతిలకవాసనలవాఁడు
.....................హైమగర్భ
గేహమున కేఁగువాడు కోలాహలాఖ్యుఁ
డొకధరాధీశుఁ డెదురయ్యె నువిద కపుడు' (2-108)

ఈ పద్యమున సిగలో పువ్వులు తురిమి, కప్పురపు బొట్టు దిద్ది, చెక్కుల జవ్వాది యలదుకొని, దంతము తెల్లవార దమ్ములము సేవించుచు మెడను నక్షత్రమాల దాలిచి, మంచి గందము మేన బూసికొని, బంగారు మొలత్రాడు రతనాల యందెలను దాలిచి, యింకను రత్నాభరణములను విచిత్రమగు వస్త్రములను ధరించి శృంగార రస మూర్తియగు ధరాధీశుడు రాజు ఒక డెదురయ్యెనని నాయక పరముగాను, దేవతలు నివసించు శిఖరముతో, మిగుల చేవగల తిలక వృక్షములతో, జవ్వాది యంటిన చాపరాలతో, కెంపులుగల (కొండ) నడిమిదేశముతో, మంచి గందపు టడవులతో, బంగరు చరియలతో, రత్న వికారమగు ప్రత్యంతగిరులతో నొక ధరముల కధీశుడు - కొండలరాజు - ఎదురయ్యె నని కోలాహలపరముగాను సరళమైన మధురమైన శయ్యలో వర్ణింపబడెను. శుక్తిమతి ఎదురేగి యక్షతాదులచే బూజించి యుపచారము లొనర్చెనని తెలిపిన ఈ క్రింది

'అతులశైవలవతీశతము లీనెడు మీకు
నా యిచ్చు విమలార్ఘ్యతోయ మెంత
ప్రాలేయనిలయసంభవము గాంచిన మీకుఁ
బన్నీట నొనరించు పాద్య మెంత
.................................
అనఘ యెవ్వారలైనఁ గొండంతవారిఁ
కవనిఁ గొండంత పూజ సేయంగఁగలరె
భక్తి నే నిచ్చు నీపుష్ప పత్ర తోయ
మాత్రములు గైకొనుటెకాక గోత్రతిలక'

అను పద్యమున కొండంత వారికి కొండంత పూజచేయ గలరా అను జాతీయము కొండపరముగా గూర్చిన నేర్పు శ్లాఘ్యము.

కోలాహలపర్వత సమాగమమున శుక్తిమతీనది గర్భిణియయ్యెను. తరువాత కొడుకును గూతురును బుట్టిరి; కొడుకు వసుపదుడు; కూతురు గిరిక. వారిని బెంచి పెద్దవారిని జేసి విద్యల నేర్పించు పర్యంతము రెండు పక్షముల యర్థములు చెక్కుచెదరని రసభావములతో నపూర్వమగున ట్లొకయవాంతర కావ్యము సృజింపబడినది. ప్రధాన కథయు నాటకఫక్కి నౌచితీధుర్యముగా నడపబడినది.

ఈకావ్యమున మొదట బూర్వఫక్కిని నగరవర్ణనముతో నారంభింపబడినను వసంతర్తు వర్ణనము మొదలుకొని కథయంతయు నాటకరీతిని అద్భుతముగా నడపబడినది. ఉద్యానమున శ్లేషమహిమచే జడములగు లతలను స్త్రీలనుగా నిరూపించి, వారిచే రాజున కుపచారములు చేయించి, పక్షిమిథునముచే భావిని సూచన చేయించి అటనుండి నర్మసచివునితో రాజును కోలాహలపర్వతమున నొకచో బ్రవేశింప జేయును. ప్రబంధములం దెందును గనబడని యీ నర్మసచివుని పాత్రానుసంధానము నాటకఫక్కికి ద్యోతక మగుచున్నది. అనంతరము గానధ్వని. దాని నరయ నర్మసచివు నంపుట, తిరిగి వచ్చిన యతనివలన కన్యావృత్తము విని వానివెంట రా జరిగి, శాకుంతలమున దుష్యంతుడు పొదరింట దాగినట్లు తా నొక లతాగృహమున నుండుట, యతివేషమున నున్న నర్మసచివు డాయువతుల యెదుటికి బోవు టెట్లా యని వేచియుండుట - ఇవి యన్నియు జమత్కారముగా జూపినను ఆ నర్మసచివుని ప్రవేశ మొనర్చు పట్టున గవి చూపిన రమణీయ కల్పనము విచ్ఛిత్తిజనకమై కావ్యమున కంతకును దీప్తి ఘటించుచున్నది. మాయాయతి - నర్మసచివుడు - చెలికత్తెలతో నుండిన గిరిక యెదుటికి వచ్చెను. ఆమె భయ, వినయ సంభ్రమములతో మ్రొక్కగా నా మాయాముని 'ఓయనన్య సామాన్య లావణ్య ప్రభావ! సువల్లభుం బెండ్లియాడు'మని దీవించెను. ఇచట సభంగశ్లేష శక్తి - 'లావణ్యప్రభా వసువల్లభుం బెండ్లియాడు' మను నర్థాంతరము ధ్వనింపజేయబడెను. తరువాత వారి కోర్కిపై నుచితాసనమున గూర్చుండి యుపచారముల

నొంది యా నర్మసచివుడు మంజువాణియను చెలికత్తె కోర్కిపై తాను వసునాథుని అనగా సూర్యుని భక్తుడననియు, ఆయన పద్మినీప్రియుడు గాన ఆయన పూజకై అర్హమగు పద్మినీసముదయము తెచ్చుటకై వెడలి యీ కొండపై వెదకుచుండ నీమె గానమున నాకృష్టుడనై వచ్చితినని పైకి స్ఫురించునట్లును, తాను వసురాజ భృత్యుడననియు, ఆయన కర్హాలగు పద్మినీజాతి స్త్రీలను దెచ్చి వివాహమొనర్ప దేశ మంతయు నరయుచు నిచటికి వచ్చితిననుసత్యము ధ్వనించునట్లును మాటాడిన ఘట్టమున శ్లేష కవిత నిజముగా సార్థకమైనది. ఆ మౌని 'యాంతర దృష్టిం జూచితిమి; ఈ యజ్ఞాననం బెండ్లియాడు వసురాజేంద్రు' డనెను. మంజువాణి 'యా వసుధేశ్వరు డెన్నడు వచ్చు, నెన్నడు గాంచు, నెన్నడు గారవించు 'నన ఆ మౌని 'లలనా! యీయమను వసురాజు తప్పక పెండ్లాడును. నమ్మవా, యిపుడే నా మంత్రమహిమ రప్పింతును. చూడు 'మని 'మజ్జా' అనెను. పూబొదరింటనుండి వసురాజు ప్రత్యక్ష మగును. ఇది యొక చిత్రసంఘటనము. నాటక ఫక్కి యిట్టిదేకదా?

గిరికావిరహ వర్ణనఘట్ట మింతకంటె నాటక కళను జాటుచున్నది. విరహాగ్నితప్తయై చెలు లెన్ని యుపచారములు చేసినను ఆమె స్వస్థచిత్త కాలేదు. ఉపవనవిహారము, పుష్పాపచయము, జలక్రీడ బాధకములే యైనవి. ఏ కావ్యమున నెవ్వరును వర్ణింపని మన్మథుని దేవతగా భావించి విగ్రహము నేర్పరచి పూజచేసిన ట్లిందు వర్ణించి మూర్తికవి యొక క్రొత్త పోకడ చూపెను. గిరిక పూజావసానమున మన్మథుడు ప్రత్యక్షమయినట్లును, అది చూచి మూర్ఛిల్లినట్లును గూర్చిన కూర్పు మెచ్చదగినది. అంత జెలులు తత్తరముతో నుపచరించుచు 'నెలత కీ వసులాభంబు నించుము' అని యసువులు - ప్రాణములు ఇమ్మని మదనుని ప్రార్థించు వాక్యంబులతో 'వసులాభ' శబ్దము వినిపింప 'నల' శబ్దము విని మూర్ఛనుండి లేచిన నైషధములోని దమయంతివలె గిరిక చైతన్య మొందెనని చక్కగా రచింపబడినది.

చంద్రికాప్రసారమున వలవంతబడిన గిరిక వృత్తాంతము వసురాజునకు దెల్పి యతని యాశయము గనుగొని వత్తునని మంజువాణి గిరికాగళహారము చేకొని యేగెను. ఇచట గిరిక చంద్రుని, మన్మథుని, మలయానిలుని నుపాలంభించి, వెన్నెలవేడి కోర్వలేక యెగ్గెత్తి యేడువగా జెలు లూరడించుచు 'మంజువాణి రాదేమే' యనుకొనుచుండ వసురాజేంద్రుని యుంగరముతో మంజువాణి వచ్చి తా బోయివచ్చిన వృత్తాంత మంతయు చెప్పను.

రాముని యుంగరము సీత కిచ్చి సీత శిరోమణి దెచ్చి రామున కిచ్చి యుభయుల నూరడించిన హనుమంతుని మనసున నిడికొని హనుమద్భక్తు డగు రామరాజభూషణ కవి మంజువాణిపాత్రమును సృజించినా డనుకోవలెను.

వివాహసంఘటనార్థ మింద్రముఖ్యులగు దేవతలతో గంగానదికూడ నరిగినదట. ఇటువంక దేవత్వము, నటువంక నదీత్వము బాంధవ్యమున కనుకూలించునను నూహ యొకటే కాదు, దుర్ఘటమగు వివాహాదికార్యములందు స్త్రీలకే ప్రాగల్భ్య ముండునని పార్వతీవివాహసంఘటనార్థము సప్తర్షులతో నరుంధతినిగూడ హిమవంతునొద్దకు బంపిన కాళిదాస కుమారసంభవము ననుసరించి యొక పెద్ద ముత్తైదువకూడ నుండవలెనను నూహతోగూడ గంగానదిని దేవతాసంఘముతో జేర్చినాడు మూర్తికవి. అచట పార్వతి మునులకు మ్రొక్కి వారి యాశీస్సు లంది, సువర్ణావతంసము జార సంభ్రమించుచు నరుంధతికి మ్రొక్కగా నామె పార్వతి నొడిలో గూర్చుండబెట్టుకొనెను. ఇచట గిరిక యందరు దేవతలకు జనకాజ్ఞచే నమస్కరింప నందు గంగానది 'గరిమన్ ననఁబోణిని గౌఁగిలించి యో యన్నువపట్టి! నిన్ గనినయన్న వసుంధరసింధుజాతిలో, వన్నియ కెక్కె, నీవు గలుగన్ దండ్రియు నియతోన్నతిఁ గాంచె' నని కొండాడి, 'చరణాగ్రాన మితాచలేశ్వరునిఁగా, సన్మార్గసంచారిఁగా, స్థిరకళ్యాణ సమాఖ్యుఁగా హరికృపఁ శ్రీఘంబ చేపట్టి యో గిరికన్యాయరలేక నీ వతఁడు నేకీభావముం జెందుమా, గిరికన్యామణికన్న ధన్యవయి యక్షీణానుమోదంబునఁ' అని దీవించినది. ఆ దీవనలో నొకానొక మహారాజును చేపట్టుమనిన ట్లున్నను, విశేషము లన్నియు వసురాజపరముగ నర్థమగుచుండుటచే గంగాదేవివా క్కమోఘమని యింద్రుని చేత 'చరణాగ్రానమితాచలేంద్రుడు, సదాసన్మార్గసంచారి, సుస్థిర కళ్యాణసమాఖ్యుఁ డా వసుధరాధీశుం డహో శైలశేఖర! గంగావచనం బపార్థ మగునే' యని సమర్థింప జేసిన చమత్కృతి నిరుపమముగదా!

ఈ రీతిగా అల్పమగు వస్తువును గ్రహించి కావ్యాంగముల నెల్ల విధముల బెంచి యనల్ప శిల్పరామణీయకమున గన్నులు మిరుమిట్లుగొన నీ వసుచరిత్రమును నారాశ్వాసముల గ్రంథముగా సంతరించిన రామరాజభూషణ మహాకవి ప్రతిభా వ్యుత్పత్తుల గణింప నెంచుట సామాన్య విషయమా? ఈతడు సప్తవిధ కవులలో భూషణార్థియారాచికుడా మరొకడా యని పరీక్షించుటకంటె సప్తవిధ కవుల ప్రతిభా విశేషముల మూర్తియే యని యంగీకరించుట సమంజసము.

మరియు కవిరాజమనోరంజనము, శకుంతలాపరిణయము, చంద్రికాపరిణయము, రసికజనమనోభిరామము మున్నగు పెక్కు కావ్యములు పిల్లవసుచరిత్రములను బిరుదముతో వసుచరిత్రమును అనుసరించుటచే వసుచరిత్రమొక వర్గపు గావ్యముల కాదర్శమైనదని యంగీకరింపక తప్పనియప్పు డక్కావ్యప్రశస్తినిగూర్చి చెప్పుట పునరుక్తి కాకమానదు. వానిలో గొన్ని కల్పనములందు, గొన్ని శబ్దాలంకారములందు, గొన్ని వృత్తవరణమునందు వసుచరిత్రమునకు బ్రతిబింబములై ధన్యములైనట్లు గర్వించినవే కాని యన్యములు కావు.

ఇన్ని యాంధ్ర ప్రబంధము లుదయించినను, సంస్కృత భాషలోని కనువదింపబడిన ప్రబంధ మొక్కటియు వినము గదా! ఎంత గొప్పదనము చూడక అప్పయ్యదీక్షితులవారి శిష్యుడట; కాళహస్తీశ్వరకవియట; వసుచరిత్రమును సంస్కృతీకరించెనట; సంస్కృతగ్రంథముగూడ ఆరాశ్వాసములేనట. దీనినిబట్టి వసుచరిత్రమున సంస్కృతపండితులకు గూడ నెంత గౌరవముగలదో వెల్లడి యగుచున్నది.

హరిశ్చంద్ర నలోపాఖ్యానము : ఇది ఈతని మూడవ కావ్యము. ఇది ద్వ్యర్థికావ్యము. ఈ కావ్యమందలి యవతారికా పద్యములు పరిశీలింప సూరనసూక్తి ననుసరించి నిజపాండిత్య ప్రకర్షము ప్రకటింప నెంచి కాక కేవల మాముష్మిక ఫలప్రాప్తికే రామరాజభూషణుడు సంకల్పించిన ట్లగపడును (చూ : ద్వ్యర్థికావ్యకవులు).

ఈతడు తన యుపాస్యదైవతమునకును, తనకును నుపాస్యుడగు శ్రీరామచంద్రునకు దన్మహిమాభివర్ణన పూర్వకముగ నీ కృతి యొసగి పురుషార్థచతుష్టయము సాధించుకొని ధన్యజీవను డయినాడు. వెం. సూ. శా.

**రామరాయకవి, బెల్లంకొండ** (క్రీ. శ. 1875 - 1914): ఈయన వైష్ణవ సంప్రదాయము ననుసరించు ఆంధ్ర నియోగిబ్రాహ్మణుడు; గుంటూరు మండలములోని నరసారావుపేట పరిసరముననున్న పమిడిపాడు గ్రామమున సంపన్నకుటుంబములో జన్మించెను. ఈయనది ఋక్శాఖ; ఆశ్వలాయన సూత్రము; భారద్వాజగోత్రము. బాల్యముననే ఈయన తండ్రి గతించెను. ఈయన కొంత కాల మాంగ్లము చదివి మానుకొని సంస్కృతము నభ్యసించెను. హయగ్రీవోపాసకుడై ఈయన మొదట విశిష్టాద్వైతమత నియమములతో నుండెను; కుశాగ్రబుద్ధియై చిన్నతనముననే సంస్కృతమున నిత్యము కవితల నల్లెడివాడు; రఘువంశమున రెండు, కుమారసంభవమున రెండు సర్గలు మాత్రము చదివెను; మేఘదూతమును ఆరంభించి వినెను; పిమ్మట స్వయముగ నన్నిటిని అన్వయించుకొనెను; పదునారు సంవత్సరముల వయసున 'రుక్మిణీ పరిణయము', 'రమాపరిణయము' అను చంపూ కావ్యములు రచించెను. ఈయనభార్య నెల్లూరు సింగరాజు వెంకటరమణయ్యగారి ద్వితీయకుమారిక ఆదిలక్ష్మమ్మ.

కంఠమువరకు నీటిలోనుండి మంత్రానుష్ఠానముచేయుట, చింతతోటలో నరుగుపై ఉపాసన మొనర్చుట, ఇంటిలో హయగ్రీవార్చనము చేయుట, విద్యార్థుల కన్నపానీయము లిచ్చి సాహిత్యాలంకార పాఠములను చెప్పుట ఈయన నిత్యకృత్యములు. ఈయన పురిఘళ్ల రామశాస్త్రి, సుబ్రహ్మణ్యశాస్త్రిగార్ల సమక్షమున కొన్ని నెలలు తర్క, వ్యాకరణములను జదివెను; వ్యాఖ్యావ్యాకరణములను తానే గ్రహించెను; సిద్ధాంతకౌముదిపై శరద్రాత్రి యను వ్యాఖ్య రచించెను. నిత్యము వేదాంతగ్రంథ వ్యాసంగము చేసి ఈయన అద్వైత వేదాంత గ్రంథముల నన్నిటిని స్వయముగ నన్వయించి గ్రహించెను; విశిష్టాద్వైతాభిమానము విడిచి అద్వైతి యయ్యెను; వంశ పరంపరగా వచ్చు వైష్ణవగురువులకు దూరమై అద్వైత నిష్ఠు డయ్యెను; శాంకర వేదాంతగ్రంథములను పాఠము చెప్పెను. ఈయన 143 గ్రంథములను రచించెను; తానే స్వయముగ కొన్నిటిని ముద్రించి ప్రకటించెను. ఇంత యల్పవయస్సున నిన్ని యుద్గ్రంథములను రచించిన వ్యక్తి యరుదు.

ఈయన రచించిన స్తోత్రగ్రంథములు, శతకములు అనేకములు. వానిలో 68 అష్టక, స్తోత్రము లున్నవి. అన్నిటను అద్వైతతత్త్వమే ప్రతిపాదింపబడెను. శంకరగీతాభాష్యమునకు ఈయన వ్యాఖ్య వ్రాసెను. ఈయన గ్రంథములం దీక్రిందివి ముఖ్యములు: (1) గీతాభాష్యార్కప్రకాశిక (శాంకరభాష్య టీక); (2) వేదాంత ముక్తావళి(శ్లోకాత్మక దశోపనిషత్తులు); (3) శంకరాశంకర భాష్య విమర్శ(అద్వైతము); (4) సిద్ధాంతసింధువు (మధుసూదన సరస్వతిగ్రంథ వ్యాఖ్య; (5) వేదాంత కౌస్తుభము (అద్వైత తత్త్వము); (6) అద్వైతాన్య మతఖండనము; (7) శరద్రాత్రి(కౌముదీ వ్యాఖ్య); (8) చంపూభాగవత వ్యాఖ్య; (9) అనర్ఘ రాఘవ(మురారి)నాటకవ్యాఖ్య; (10) సముద్రమథన చంపువు (కావ్యము); (11) కృష్ణలీలాతరంగిణి(కావ్యము).

ఈయన గ్రంథరచన మహాతపస్సుగా సాధించెను. ఈయన కవిత నిసర్గధారాశుద్ధి, శబ్దశుద్ధి కలది. గ్రంథము లిప్పటికి 30 కి పైగా ముద్రితములయినవి. ఈయన అంతర్ముఖుడు; సమావిష్టుడయిన మహాయోగి. జ. మా. శ.

**రామరాయలు, అరవీటి** (క్రీ. శ. 1474 - 1564): రామరాజు చంద్రవంశ క్షత్రియుడు. చాళుక్య వంశాంతర్గత

మగు ఆరెవీటికులమున సంభవించిన బుక్కరాజుయొక్క మునిమనుమడు ; కందనవోలు రామరాజునకు పౌత్రుడు ; శ్రీరంగరాజు పుత్రుడు. ఇతని కేవురు పుత్రులును, నలుగురు కుమారితలును గల్గిరి. అతని పుత్రులలో రామరాజు మధ్య ముడు. కొండరాజు, తిమ్మరాజు లనువార లితని కగ్రజులు; తిరుమల(ఎఱతిమ్మ)రాజు, వేంకటాద్రి యనువార లితని కనుజన్ములు.

మొట్టమొదట రామరాజు గోలకొండ మహమ్మదీయ రాజ్య స్థాపకుడైన సుల్తాన్ కులీ కుతుబ్‌శాహు కొలువు నందు గోలకొండ విజయనగర సీమావధి ప్రాంతములం దుండు నొక దుర్గమున కధిపతియై యుండెను. పితృ పితామహ ప్రపితామహులు విజయనగర సామంతులై యుండగా రామరా జొక్కడు కుతుబ్‌శాహి కొలువునం దేల ప్రవేశింపవలసి వచ్చెనో తెలియదు. కాని యతడు చిరకాల మా కొలువునం దుండలేదు. క్రీ. శ. 1515 వ సంవత్సర ప్రాంతమున విజయనగరాధీశ్వరుడగు కృష్ణరాయల పూర్వ దిగ్విజయ యాత్రలో అతనికిని, కుతుబ్‌శాహుకును గడిదేశమున గొంత పోరాటము జరిగెను. ఆ సందర్భమున రామరాజు రాయరాణువను ప్రతిఘటింపజాలక తన పాలనయం దుండిన కుతుబ్‌శాహి దుర్గమును రాయలకు కైవసము జేసెను. ఈ విషయము తెలిసి కుతుబ్‌శాహు ఆగ్రహపరవశుడై రామరాజు రణభీరువని రోసి యతని దన రాజ్యమునుండి వెడలనడిచెను. అంతట రామరాజు విజయనగరమునకు బోయి కృష్ణరాయల నాశ్రయింపగా నతడు రామరాజు గుణాధిక్యమును, శక్తి సామర్థ్యములను జక్కగ గుర్తించి యతనికి తన కుమారితయైన తిరుమ లాంబ నిచ్చి వివాహ మొనర్చి తన యాస్థానమం దుంచు కొనెను. ఇందువలన ఇతనికి అళియ(అళె) రామరా జనియు, అల్లుడు రామరా జనియు పేరు కలిగెను. జన సామాన్య మితనిని రామప్పయ్య యని, బడేరామరాయ లని వ్యవహరించుచు వచ్చెను. కృష్ణరాయలు తన రాజ్య కాల చరమవర్షములలో ప్రభుత్వాధికారమును సర్వమును రామరాజుపై మోపి సైన్యాధిపత్యమును అతని తమ్ము డయిన తిరుమలరాజున కొసగెనని యొకానొక పోర్చు గీసు చరిత్రకారుడు వ్రాసియున్నాడు; కాని యిది విశ్వాస పాత్రము కాదు. కృష్ణరాయలనాటి శాసనములందుగాని, గ్రంథాది అన్యచరిత్రసాధనములందుగాని రామరాజు ప్రస్తావ మెందును గానరాదు. రాజ్యమును, సైన్యమును నతనికిని, నతని తమ్మునికిని వశమై యుండిన కృష్ణరాయల మరణానంతర మచ్యుతదేవరాయలు రాజ్యపీఠము నధిష్ఠిం చుటకు వీలుపడియుండెడిది కాదు. కావున రామరాజు తిరుమలాంబ నుద్వాహము జేసికొనియుండినను అందు మూలమున నతనికి రాజకార్యములందు ప్రవేశము కలిగె నని యెంచుట కవకాశము లేదు.

కృష్ణదేవరాయలు క్రీ. శ. 1529-30 లో మృతినొందు నప్పటికి పదునెనిమిది మాసముల యీడుగల కొడు కొక డుండినను అతని యనంతరము సింహాసన మధిష్ఠింపదగిన వాడు అతని యనుజన్ముడైన యచ్యుతరాయలని నిశ్చ యించి యతనికి రాజ్యాభిషేక మగునంతవరకును రాజ్య మున శాంతి భద్రతలకు భంగము కలుగకుండుటకు దగిన యేర్పాటులను గావించియుండెను. రామరాజున కది నచ్చక అతడు కృష్ణరాయల కుమారుని పక్షము వహించి అచ్యుతరాయలతో కలహము పెట్టుకొనెను. అచ్యుత రాయ లితనితో పోరాటము సామ్రాజ్యమునకు శ్రేయస్కరము గాదని యెంచి సమాధానము చేసికొనెను. ఈ యొడంబడిక ప్రకారము కృష్ణరాయల పుత్రు డచ్యుత రాయలతో సామ్రాజ్యాధిపత్యమునందు సమానమైన హక్కుగల భాగస్వామియని యంగీకరింపబడెను. అచ్యుత రాయలతోపాటు రామరాజుగూడ బాలుని పక్షమున ప్రభుత్వ కార్యములను నిర్వహించుటకు నిశ్చయింపబడెను. రెండు మూడేండ్లకాల మీ యేర్పాటు ననుసరించి ప్రభుత్వము సాగెను. అంతట నా కృష్ణరాయల కుమారుడు వ్యాధిగ్రస్తుడై మృతినొందెను. తరువాత అచ్యుతరాయలు రామరాజుతో చేసికొన్న సంధి పాటింపవలసిన యావశ్యకము లేకపోయెను. వారి యుభయుల సౌహార్దము చెడి వైషమ్యమున కెడమిచ్చినది. ఇట్లు కొంతకాలము నడచిన పిమ్మట తంత్రముమీద క్రీ. శ. 1536 లో రామరాజు అచ్యుతరాయలను బందీకృతుని గావించి సింహాసన మధిష్ఠింప దలపెట్టెను. కాని సామంతామరనాయకులు అతని యత్నమును సాగనీయక ప్రతిఘటించుటవలన నతడు విజయనగర రాజధానిని విడిచి పెనుగొండకు ప్రవాసము పోవలసివచ్చెను.

క్రీ. శ. 1542 లో అచ్యుతరాయలు మృతినొందిన పిమ్మట అతని కుమారుడు వెంకటపతిదేవ మహారాయలు సామ్రాజ్యాధిపత్యము వహించి యైదారు మాసముల కాలము ప్రజాపరిపాలన మొనర్చెను. అతనిని చంపి యతని మేనమామ సలకరాజు తిరుమలదేవ మహారాజు సింహాసనము నాక్రమించుకొనెను. అంతట రామరాజు అచ్యుతదేవరాయల యన్న రంగరాయల పుత్రుడయిన సదాశివరాయలను చక్రవర్తి యని ప్రకటించి యతని పక్షమున సలకరాజు తిరుమలదేవ మహారాజును యుద్ధ మున వధించి, సదాశివరాయలకు పట్టాభిషేక మొనర్చి

యతనిని ముం దుంచుకొని క్రీ. శ. 1542 మొదలు 1564 వరకును నిరువది రెండేండ్లకాలము విజయనగర సామ్రాజ్యమును మహావైభవముతో పరిపాలించెను. ఈ యిరువది రెండేండ్ల కాలమును రెండు భాగములుగ విభజింపవచ్చును. మొట్టమొదట కొన్ని యేండ్లవరకు అతడు సదాశివరాయలకు దండనాయకుడై, సర్వాధికారియై సామ్రాజ్యమును పాలించెను. తరువాత నతడు సకల రాజచిహ్నములను, బిరుదులను ధరించి సదాశివరాయలతోపాటు తానును సామ్రాజ్యాధిపతియై రాజ్య మొనర్చెను. దండనాయకుడైననేమి, సామ్రాజ్యాధిపత్యమునందు భాగస్వామియైన నేమి ఇరువది రెండేండ్లలోను విజయనగర సామ్రాజ్యమునకు వాస్తవముగ నతడే యధిపతి యని చెప్పక తప్పదు.

సదాశివరాయలను సామ్రాజ్య పీఠముపై సుప్రతిష్ఠితుని గావించిన పిమ్మట రామరాయలు రాజ్యమును నిష్కంటకముగ జేసి తన యధికార మవిచ్ఛిన్నముగ సాగున ట్లేర్పాటులను చేసెను. పూర్వము తన్ను ధిక్కరించి యనతులై యుండిన దాక్షిణాత్యనాయకులపై దాడివెట్టి వారినెల్ల పరాభూతులను జేసి వశవర్తులను గావించుకొనెను. దేశాధిపత్య, దుర్గాధిపత్యములను దన బంధువులకును, విశ్వాసపాత్రులైన యాశ్రితులకును నొసగెను. రాజ్యమునందంతట శాంతి భద్రతలు నెలకొనుటచేత ప్రజలు తమ కులవృత్తుల నవలంబించి సుఖముగ జీవయాత్ర సలుపుచుండిరి.

అయినను రామరాజునకు శత్రువులతో పోరాటము తప్పదాయెను. అతడు రాజనీతి మర్మజ్ఞుడు: కావున నప్పుడు తన పొరుగున వర్ధిలుచుండిన దక్కను దేశపు మహమ్మదీయ రాజ్యముల రాజకీయములలో ప్రవేశము కలిగించుకొని సామ దాన భేద దండోపాయముల మూలమున నా రాజ్యాధిపతులను దన యదుపాజ్ఞలలోనికి దెచ్చుటకు దన యావచ్ఛక్తిని వినియోగించెను. వారు ఒండొరులయెడ సుహృద్భావము కలిగి యుండక మత్సరగ్రస్తులై నిరంతరము పోరాడుచు దక్కను భూమిని రక్తసిక్తము చేయుచు దమ ప్రతిపక్షులను నిర్జించుటకొరకు తరుచుగ రామరాజుయొక్క సాయము నర్థించెడివారు. కావున రామరాజు పై బేర్కొనిన మహమ్మదీయ ప్రభువులలో నొక్కొక్కనిమీదను నెప్పుడో యొకప్పుడు కత్తిదూసి యుద్ధము చేయవలసి వచ్చినది. ఈ యుద్ధములలో నెల్లప్పుడును రామరాజే విజయము పొందుచు వచ్చుటవలన నతని బల పరాక్రమము లత్యంత మభివృద్ధి నొందుటచే దక్షిణాపథమున కంతటికి నతడు నేత యాయెను (చూ: పుటలు 401-406). ఇది దక్కను మహమ్మదీయ ప్రభువులకు గనుకుట్టినట్లాయెను. కావున క్రీ. శ. 1564 వ సంవత్సరమున వా రంద రేకమై రామరాజుపై దండెత్తి వచ్చి కృష్ణా మలాపహారీ నదుల సంగమము కడ రక్షసి - తంగడి యను గ్రామముల మధ్య జరిగిన ఘోరయుద్ధమున అతనిని వధించిరి. దీనినే మహమ్మదీయ చరిత్రకారులు తలికోటసంగ్రామమని చెప్పుదురు. యుద్ధమున తొలుత రామరాజునకే జయము చేకూరెను. కాని మహమ్మదీయ ప్రభువులు సంధి కోరువారివలె నటించుచు ఆత డాదమరచియుండగ నొక్కుమ్మడి నతని స్కంధావారముపై బడిరి. మరల రణము ఘోరమై చెలరేగెను. రామరాజు కొలువునం దుండిన మహమ్మదీయ సర్దారులు కొందరు మతాభిమానముచేత స్వామిద్రోహమున కొడిగట్టి దక్కను తురుష్క ప్రభువులతో గలసి యతనితో యుద్ధము చేయగడగిరి; కాని యప్పుడుగూడ జయలక్ష్మి యతనినే వరించిన ట్లగపడినది. తొంబదియేండ్ల ముదుకడగు రామరాజు బడి గుర్రముపై నెక్కి శత్రు సైన్యముపై నురువడించుచుండగా నెం దుండియో తుపాకిగుం డొకటి వచ్చి యతని శిరమును తాకినది. అంత నతడు గతాసువై నేల గూలెను. విజయనగర సైన్యములు వెన్నిచ్చి పారిపోయెను. రామరాజు అస్తమయముతోడనే రాయ సామ్రాజ్యముయొక్క పేరు ప్రఖ్యాతులు గతించినవి.

రామరాజు గొప్ప రాజ్య తంత్రజ్ఞుడు. నర్మదా సేతు మధ్య భూభాగము ప్రత్యక్షముగనో, పరోక్షముగనో అతని యదుపాజ్ఞలలో నుండినది; దక్కను మహమ్మదీయరాజులకతడు గుండె గాలమై వారిని నిర్జించి కప్పములు గొనుచుండెను. హిందూధర్మమున కతడు పెట్టని కోటయై తురకల దౌర్జన్య ముడిపి వసుచరిత్రకారుడు చెప్పినట్లు వారిని సన్మార్గసంగతులుగ జేసెను. రామరాజు దృఢ సంకల్పుడు; విఘాతము లెన్ని సంభవించినను పట్టిన పట్టు వదలక తాను తలపెట్టిన యుద్యమములను విజయవంతముగ గొనసాగించువాడు; సామ దాన భేద దండోపాయములను సమయ మెరిగి ప్రయోగించి కార్యమును నెరవేర్పగల నేర్పరి; రణకోవిదుడు; క్షత్రియ ధర్మమును దృష్టియం దుంచుకొని శత్రుబలమును సరకుగొనక పోరజాలిన నెరజోదు; భాషాభిమాని; కవిజనాశ్రయుడు. రామరాజు దక్షిణాపథమును బరిపాలించిన హిందూరాజులలో నగ్రగణ్యుడు.

నే. వెం. ర.

**రామలింగారెడ్డి, కట్టమంచి** (క్రీ. శ. 1880 - 1951): ఈయన చిత్తూరుజిల్లా కట్టమంచి గ్రామమున జన్మించెను; చిత్తూరు హైస్కూలునందును, మద్రాసు క్రైస్తవ కళాశాలయందును విద్య నభ్యసించి 1901 లో

బి. ఏ. డిగ్రీ పొంది రాజకీయార్థికశాస్త్రమున, తత్త్వశాస్త్రమున పతకముల నందెను; ప్రభుత్వ విద్యార్థి వేతనము పొంది ఇంగ్లండునకు పోయి కేంబ్రిడ్జియందు ఉన్నత విద్య నభ్యసించెను; అచట 1903 లో 'రైట్సు' బహుమతి పొంది 1906 లో చరిత్రయందు ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణు డయ్యెను; అచట చదువునపుడు 'కేంబ్రిడ్జి యూనియన్' అను విద్యార్థిసమితికి కొంతకాల ముపాధ్యక్షుడుగ నుండెను.

తరువాత ఈయన 1907 లో గాయక్వాడ ప్రభువు చేసిన ధనసాహాయ్యముతో అమెరికాకు వెళ్ళి విద్యాపరిశ్రమ మొనరించి వచ్చి బరోడా కాలేజీలో వైస్ ప్రిన్సిపాల్‌గా జేరెను. 1909 లో మైసూరు ప్రభుత్వ విద్యాశాఖయందు అసిస్టెంటు ఇన్స్పెక్టరు జనరల్‌గా జేరెను; తరువాత మైసూరు మహారాజా కళాశాలలో ప్రొఫెసరుగ చేరి మైసూరు యువరాజుతోకూడ యూరపు పర్యటన మొనర్చెను; ఆ వెంటనే విద్యావిషయక పరిజ్ఞానముకొరకై



చిత్రము 219.
కట్టమంచి రామలింగారెడ్డి

కెనడా, ఫిలిప్పైన్స్, జపాను వగైరా దేశములలో పర్యటనముచేసెను. 1913 లో ఈయన మరల మైసూరు మహారాజా కళాశాలలో జేరి ప్రిన్సిపాలై క్రమముగ 1916 లో మైసూరు విద్యాశాఖకు ఇన్‌స్పెక్టరు జనర లయ్యెను.

ఈయన ఆపదవికి 1920 లో రాజీనామా నిచ్చి అప్పటి జస్టిసు పార్టీతో కొంత కాలము రాజకీయములలో ప్రవేశించెను. మద్రాసు యూనివర్సిటీ తరపున ఈయన రెండు పర్యాయములు శాసనసభ కెన్నుకొనబడెను.

1926 లో స్థాపింపబడిన ఆంధ్ర విశ్వవిద్యాలయమునకు ఈయన ప్రథమ ఉపాధ్యక్షుడయ్యెను. ఈయన తన ప్రజ్ఞాబలముచే బాలారిష్టములనుండి తప్పించి ఆంధ్రవిశ్వవిద్యాలయమును పోషించి పెంపొందించగలిగెను; మరల 1928 లో ఉపాధ్యక్షుడుగ నెన్నుకొనబడెను. కాని 1930 లో సత్యాగ్రహమును అణచుటకై ప్రభుత్వ మవలంబించిన నిరంకుశ చర్యలయెడ నిరసన వెలిపుచ్చుటకై ఈయన ఆపదవిని త్యజించి 'ఉపయెన్నిక'లో చిత్తూరుజిల్లా నుండి 1935 లో మద్రాసు లెజిస్లేటివు కౌన్సిలుకు మెంబరుగ నెన్నుకొనబడెను.

1936 లో ఈయన కాంగ్రెసులో చేరి కొలదికాలములోనే అందుండి విడిపోయెను. 1936 లో ఈయన మరల ఆంధ్ర విశ్వవిద్యాలయమునకు ఉపాధ్యక్షుడుగ ఎన్నుకొనబడి మరణపర్యంత మాపదవియందే యుండెను; 1937 లో మద్రాసు లెజిస్లేటివు కౌన్సిలు మెంబరుగ నియమితుడయ్యెను. 1937 లో ఆంధ్రవిశ్వవిద్యాలయము ఈయనకు 'కళాప్రపూర్ణ' బిరుదము నిచ్చెను. నిజాము, తిరువాన్కూరు ప్రభువులనుండి సయితము ధనము సంపాదించి ఈయన ఆంధ్రవిశ్వవిద్యాలయాభివృద్ధికై గొప్ప కృషి చేసెను.

ఈయన ఆంధ్ర దేశముననే కాక భారతావనియందంతటను వాసికెక్కిన ఆనాటి మేధాసంపన్నులగు ప్రముఖులలో మొదటి వరుసకు జెందినవాడు. ఈయన ఆంధ్రాంగ్లములు రెండింటను శ్రోతలను రంజింపజేయగల నిరుపమాన వాగ్ధాటిగల మహావక్త. ఈయన రాజనీతి విద్యావిశారదుడు; భారత రాజకీయములను గూర్చి యచట నచట తరచుగ నుపన్యాసముల నిచ్చువాడు. ఈయన బహు స్వతంత్రుడు; ప్రతిపక్షుల నెవ్వరినైనను తీవ్రముగ విమర్శించువాడు.

అన్నిటికంటె ఈయన మహనీయత ఆంధ్రసారస్వత రంగమున తేజోవంతమై వెల్గందినది. భారతాది యుద్గ్రంథముల యంతరార్థము నీయన చక్కగా గ్రహించెను. ఈయన చక్కని కవనము చెప్పజాలిన నేర్పరి. ఈయన కవితా ప్రతిభకు గొప్ప నిదర్శనము ఈయనకృతి 'ముసలమ్మ మరణము', ఈయన 'కవిత్వతత్త్వవిచారము' ఒక గొప్ప విమర్శన గ్రంథము. ఇం దీయన ప్రాచీనములగు ఆంధ్ర ప్రబంధములను నిశిత దృష్టితో పరిశీలించి తద్రచయితల రచనా పద్ధతులను విమర్శించెను. ఈ గ్రంథమును తీవ్రముగ ఖండించుచు వ్యాసములను, గ్రంథములను పలువురు విరచించిరి. కాని ఈయన విమర్శనపద్ధతి మాత్రము అసామాన్యమయినది. నవ్యాంధ్రకవిమండలి కీయన గురుతుల్యుడాయెను. కావున ఈయన ఆధునికాంధ్ర సాహిత్య విమర్శన చరిత్రకు యుగపురుషు డననొప్పును. ఈయన భాష తేటతెల్లమైనది, నుడికారమును, బిగుమానమును దాని ప్రత్యేక లక్షణములు; వాక్యము లాశుగములవలె తీక్ష్ణాతితీక్ష్ణములు; శైలి పటిష్ఠమైనది. చీ. శే.

**రామశాస్త్రి, శ్రీపాద** (క్రీ. శ. 1846 - 1897): వీరి జన్మస్థానము తూర్పు గోదావరి జిల్లా, నరసాపురము తాలూకా గుమ్మలూరు. వీరు వెలనాటి బ్రాహ్మణులు; తండ్రి పుల్లయ్య, తల్లి మహాలక్ష్మమ్మ. వీరు బాల్యమున అన్నయైన వెంకటశాస్త్రిగారి వద్ద కావ్యములు చదివి, బరంపురము వెళ్ళి యచట సుసర్ల రాజారామశాస్త్రి

గారివద్ద కొంతకాలము విద్యాభ్యాసముచేసి యా పిమ్మట పదునైదవ సంవత్సరములో కాశీపురము చేరిరి. అక్కడ షట్ఛాస్త్ర పండితులగు శ్రీ గణేశ శ్రౌతులయొద్ద కొంత కాలము విద్యాభ్యాసముచేసి, పిదప తార్కికశిఖామణి శ్రీ నీలదేవపండిత్‌జీవద్ద శుశ్రూషచేయుచు పదునాల్గు సంవత్సరములు తర్కశాస్త్రము నధ్యయనము చేసిరి. శ్రీహర్షకృతమైన 'ఖండనఖాద్య' మనుగ్రంథము ప్రపంచములో నే భాషలోనైననేమి కఠిన గ్రంథములలో మొదటిదిగా చెప్పదగినది. ఆ తర్కగ్రంథమును వీ రొక సంవత్సర కాలము శ్రీ తారాచంద్ర భట్టాచార్యుల వారి వద్ద పఠించిరి. దానితో వీరికి లోకోత్తరమైన వాదకౌశల మేర్పడెను. కర్నాటక సీతారామశాస్త్రిగారు మున్నగు మేటిపండితులతో శాస్త్రార్థ చర్చలు చేయుచు వీరు మరి కొంతకాలము కాశిలో నుండిరి. ఆ కాలములో కాశిలో శాస్త్రచర్చలలో గెల్చిన వారికి పాండిత్యసూచక బిరుద పత్రములు రాగిరేకులపై చెక్కించి యిచ్చెడివారు. వీ రట్టి తామ్ర విజయపత్రములను సంపాదించి కాశి, బరోడా, దర్భంగ మున్నగు మహారాజాస్థానములను దర్శించిరి. ఆ దినములలోని మర్యాదనుబట్టి యా మహారాజులు వీరిని తమవద్దనుండిన ఉద్దండపండితులతో శాస్త్రార్థము చేయించి వీరి పాండిత్యముయొక్క లోతును గ్రహించి వీరికి బహుమతుల నొసగుటయే కాక యేటేటను ఇంత సత్కార మను నిర్ణయమును గూడ గావించిరి.

సద్యశస్సుతో వీరు ఆంధ్రదేశమునకు తిరిగి వచ్చి బరంపురములోను, విజయనగరములోను, బొబ్బిలిలోను కొంతకాల ముండి అచట ననేకులకు శాస్త్రపాఠములను చెప్పి, నవీనతర్కము నాంధ్రదేశములోనికి తీసికొని వచ్చిన ప్రముఖులుగా విఖ్యాతులైరి. పండితమండలి వీరిని 'నవీనగౌతము'డను బిరుదముతో వ్యవహరింపజొచ్చెను.

తర్కపండితులు తప్పక వేదాంతశాస్త్రము చదువుట మనదేశములో చిరకాలమునుండి కలదు. తర్కపటిమకు ఉత్తమ వినియోగము బ్రహ్మతత్త్వమును తెలిసికొనుటయే యను సిద్ధాంతముపై నీ యాచారము బయలుదేరెను. వీరు సుసర్ల దక్షిణామూర్తిశాస్త్రిగారివద్ద వేదాంతభాష్య శాంతి చేసి స్వగ్రామమగు గుమ్మలూరులో నివసించుచు శ్రీరామమంత్ర, శ్రీ కామేశ్వరీమంత్ర జపనిష్ఠతో నిర్లిప్తులై యుండి నిరాడంబరముగ జీవయాత్ర గడపిరి. జ. పు.

**రామసుబ్బయ్య, వారణాసి** (క్రీ.శ. 1882 - 1911): వీరు గుంటూరుజిల్లా బాపట్ల తాలూకా పొన్నూరుగ్రామ వాస్తవ్యులు. వీరి తండ్రి కోటయ్యగారు; ఆనాటి సంగీత విద్వాంసులలో సువర్ణకంకణాదిసన్మానము లందినవారు. వీరు రాజనాల వెంకటప్పయ్య - సంగీత విద్వచ్ఛిరోమణి గురువువలన కొలది దినములలోనే సంగీతమున అపారజ్ఞాన ముపదేశ మాత్రముననే గ్రహించిరి.

వీరు సుప్రసిద్ధులైన ప్రాచ్యదాక్షిణాత్య సంగీత విద్వచ్ఛిరోమణులచే 'స్వరజ్ఞాన', 'స్వరకల్పవల్లరి', 'అర్వాచీనాంధ్ర గాయనవాచస్పతి' మొదలైన బిరుదముల నందిరి.



చిత్రము 220.
వారణాసి రామసుబ్బయ్య

గోష్ఠీవనమను నామాంతరముగల పొన్నూరి భావనారాయణ దేవస్థానము నందు స్వస్తివాచక కుటుంబ వర్గమునం దొకరగుటచేత వీరు వేదమునుకూడ అధ్యయన మొనర్చిరి. వీరికి వేద మంత్రములను గాత్రమునందువలె జంత్రమునందు కూడ దూరస్థులకు కంఠధ్వనిగా వినవచ్చునట్లుపలికించు నేర్పుండెడిది. వీరు 'త్రిస్థాయిగాత్రపాఠకు'లని ప్రసిద్ధి గాంచిరి. శ్రీ భావనారాయణాంకితముగా కొన్ని వర్ణములు, కృతులు, ఖడ్గములు, బంధములు మొదలైన వివిధ గేయములు రచించి చరితార్థులైరి. 'పాతీఫోను' మీద నవరోజురాగములో పల్లవి, కల్యాణిరాగము మొదలైనవి రికార్డు నొసంగి కనకాభిషేకము నొందిరి. చ. పి. శా.

**రామస్వామిచౌదరి, త్రిపురనేని** (క్రీ. శ. 1886 - 1943) : వీరు సుప్రసిద్ధ కమ్మవంశజులు; కృష్ణాజిల్లా అంగలూరు గ్రామములో జన్మించారు. తండ్రి చలమయ్యగారు; తల్లి రామమ్మ. వీరిది విద్వత్కుటుంబము. వీరి అన్న గోపాలకృష్ణయ్య తెలుగు సంస్కృతాలలో విశేష కృషి చేసి 'రాణీసంయుక్త' మొదలైన రచనలు చేశారు.

రామస్వామిచౌదరి బందరు కళాశాలలో ఎఫ్. ఏ. చదివారు. ఆ పిన్నవయస్సులోనే వీరు చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారికి ప్రియశిష్యులయి అవధానాలు చేసి ప్రశంసల నందేవారు. విద్యార్థిదశలోనే వీరికి సునిశితమైన విమర్శన శక్తి, గాఢమైన దేశాభిమానము ఉండేవి. వంగవిభజన సందర్భములో బిపిన్ చంద్రపాల్ ఆంధ్రదేశ పర్యటనము చేస్తూ ఇచ్చిన ఉపన్యాసాలతో ఆవేశం పొంది వీరు 'రాణా ప్రతాప్' అన్న నాటకాన్ని వ్రాశారు.

తరువాత వీరు ఇంగ్లండు వెళ్ళి బారిష్టర్ పరీక్షలో ఉత్తీర్ణులయారు; స్వదేశానికి వచ్చిన తరువాత బందరు, బెజవాడ నగరాలలో కొంతకాలము వకీలుగా వుండి,

తరువాత తెనాలి చేరి అక్కడే స్థిరనివాసం కల్పించుకొన్నారు. వకీలు వృత్తిలో వుండినా వీరి దృష్టి ఎక్కువగా సాహిత్యము, సంఘము, దేశము మొదలయిన విషయాలమీదనే లగ్నమయి వుండేది. భారతము పాండవ పక్షపాతముతో వ్రాసిన గ్రంథమని తమ స్వతంత్ర భావాలతో 'కురుక్షేత్ర సంగ్రామము' అన్న నాటకం వ్రాసి వీరు అనేక తర్జన భర్జనలకు దారితీశారు; రామాయణము ఆర్యదృష్టిని వ్రాసిన గ్రంథమని, దానిపై తమ విమర్శతో 'శంబుకవధ'ను వ్రాశారు; వేనరాజును సమర్థిస్తూ 'ఖూనీ' నాటకాన్ని రచించారు. ఆంధ్రదేశములో ఆర్య ద్రావిడ వివాదానికి రూపం ఇచ్చినవారిలో వీరు ప్రముఖులు. 'లోకులు తిట్టినన్ నిజమె వాకొనఁగా గట్టిపట్టుపట్టిన వాఁడన్' అన్నది వీరి ముఖ్యనియమము.



చిత్రము 221.
త్రిపురనేని రామస్వామిచౌదరి

పురాణాలను ఇతిహాస దృష్టితో పరిశీలించి వీరు 'పిట్టకథలకు నివి యెల్ల పుట్టినిండ్లు' అని 'సూత పురాణము' అన్న కావ్యం రచించారు. ఆర్యులు మోసంతో ద్రావిడ జాతినీ, సామ్రాజ్యాన్నీ జయించారని ఆ కావ్యంలో నిర్దేశించారు. దానిపై వాదోపవాదాలు చాలా కాలము జరిగాయి. వీరు భగవద్గీతకు విమర్శనగా పల్నాటి యుద్ధములో బ్రహ్మనాయుడు బాలచంద్రుడికి బోధించునట్టు నూతనభగవద్గీతను వ్రాశారు. కారెంపూడి కదనం, ధూర్తమానవ శతకం, సూతాశ్రమ గీతాలు, కుప్పుస్వామి శతకం, వివాహవిధి అన్న అనేక రచనలను చేశారు.

సంఘములోగల న్యూనాధిక్యాలు వీరి దృష్టి నాకర్షించాయి. జన్మవల్ల ఆధిక్యం రాదని, వేదపౌరోహిత్యాధికారాలు అందరికీ కలవని అనేక సభలలో వాదించి బ్రాహ్మణేతరులు వేదాల నభ్యసించి, స్వసంఘ పౌరోహిత్యము చేసుకోగలుగునట్టు చేసి 'వివాహవిధి' వ్రాశారు. భోగంమేళా లుండినా, స్వసంఘపౌరోహిత్యం లేక పోయినా వారు ఏ వివాహానికీ పోయేవారు కారు. అస్పృశ్యతానివారణకోసం గట్టిగా ప్రయత్నించడమే కాక వీరు ఇతరమతాలకు వెళ్ళినవారిని తిరుగ హిందూ మతంలో కలుపుకోడానికి 'శుద్ధి' ఉద్యమం సాగించారు.

వీరిది దేశభక్తిపూరిత హృదయము. వీరు ఉప్పుసత్యాగ్రహం రోజులలో 'వీరగంధము తెచ్చినారము; వీరు లెవరో తెల్పుడీ' మొదలయిన గేయాలు వ్రాసినారు; నియమంతో ఖద్దరు ధరించేవారు; కొన్ని సంవత్సరాలు పురపాలక సంఘాధ్యక్షులుగా వుండి పురజనుల ఆదరాభిమానాలు చూరగొన్నారు; ఆంధ్రవిశ్వవిద్యాలయంలో సెనేట్ సభ్యులుగా వుండేవారు. విజయవాడలో జరిగిన ఆంధ్రమహాసభలో సభ్యులు వీరికి 'కవిరాజు'అన్న బిరుదు నిచ్చారు. గుడివాడలో వీరికి గొప్ప కవిపూజ చేశారు. మత, సాహిత్య, సాంఘిక రంగాలలో వీరు నడపిన ఉద్యమాలు, ప్రతిపక్షులతో వీరు సాగించిన పోరాటాలు ఆంధ్ర యువకలోకాన్ని విశేషంగా ఉత్తేజపరచాయి. తా.ధ.రా.

**రామస్వామిశాస్త్రులు, వావిళ్ళ** (క్రీ. శ. 1832 - 1891): వీరు వేదపండితులు; సంస్కృతాంధ్రములను చక్కగా చదివినవారు; శంకరాద్వైత సిద్ధాంతమున నభినివేశము గలవారు; శ్రీ శృంగేరీ పీఠమునకు చెన్నపురిలో ప్రతినిధులుగ నుండువారు. వీరు అసంఖ్యాకములైన తెలుగు గ్రంథములను, తెలుగు లిపితో సంస్కృత గ్రంథములను ముద్రించి, ఆంధ్రముద్రణకళ కొక ప్రత్యేకత సంపాదించిరి. వీరే 1860 లో ఇప్పటికి తెలుగుదేశములో సర్వేసర్వత్ర వ్యాప్తిలో నున్న గ్రేట్ ప్రైమర్ అను టైపును మొదట కనిపెట్టి అక్షరములను పోత పోయించినవారు. ఆ టైపుతోడనే మన ప్రాచీన గ్రంథములను ముద్రించి 1854లో 'వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్' అనే సంస్థ స్థాపించినారు. గ్రంథములు పండిత పరిష్కృతములై మనోహరముగ నుండి ప్రజల నాకర్షించినవి. వీరి సంస్కృత గ్రంథములలో రామాయణము (వ్యాఖ్యాన సహితము), భారతము మున్నగునవి పేర్కొనదగినవి. ని. వెం. రా.



చిత్రము 222.
వావిళ్ల రామస్వామిశాస్త్రులు

**రామానుజాచార్యులు**: క్రీ. శ. 11వ శతాబ్దమందు మతవిషయకమైన కల్లోలము లెక్కువగా నుండెను. నాడు ప్రచారములోనున్న శాంకర, శాక్తేయ, పాశుపతాది మతములు వేని కవి మానవ సంఘమును సంస్కరించి దక్షులైన ఆచార్యులను అండగా గొని మతబోధనయందు

ప్రథమ స్థానము నందుకొనుటకు తీవ్రముగా యత్నించుచుండెను. ఇట్టి సమయమునందు రామానుజాచార్యులు అదివరకే అవతరించి దేశమందు విరళప్రచారములో ఉన్న వైష్ణవ మతమునకు ప్రస్థానములను కల్పించి జనసంఘమందు బహుళప్రచారమును కల్గించిరి. ఆళ్వందారుయొక్క మునిమనుమడు రామానుజులు.

ఆళ్వందారునకు ఇద్దరు కొమార్తెలు. వారిలో ఒకయామె శ్రీపెరుంబుదూరు వాస్తవ్యుడు ఆసూరి కేశవ భట్టరు భార్య. ఈ దంపతులకు కలిగిన మగశిశువువే రామానుజుడు.

తన చిన్నతనముననే రామానుజులు తండ్రిని కోలుపోయెను. ఈతడును, ఈతని పినతల్లి కుమారుడు గోవింద భట్టరును కాంచీపురమందు ప్రసిద్ధ అద్వైత మతబోధకుడైన యాదవప్రకాశులవద్ద శిష్యులుగా చేరిరి. అంతరాదిత్యవిద్యను ఉపదేశించు 'కప్యాసం పుండరీక మేవమక్షిణీ' అను ఛాందోగ్యశ్రుతికి అపార్థము కల్పించిన యాదవప్రకాశుని రామానుజులు విమర్శింప నాగురువు ఆతనిని దారిలో తుదముట్టింప నెంచి కాశీయాత్ర సంకల్పించెను. గురువు కాపట్యము రామానుజులకు తెలిసి తప్పించుకొని అతడు కాంచీపురమునకు తిరిగి చేరుకొనెను. రామానుజుల ప్రతిభా పాండిత్యములను గుర్తించి తన తరువాత ఆతడే శ్రీరంగమందు వైష్ణవమత ప్రవర్తకుడుగా ఉండగలడని కృతనిశ్చయుడైన యామునాచార్యులు పెరియనంబి యను శిష్యుని ఆతని తనవద్దకు తీసికొని రమ్మని ఆజ్ఞాపించెను. విధివశమున అదివరకే రుజాపీడితుడైయున్న యామునుడు రామానుజులు వచ్చి తన్ను కలియకమునుపే ఈ లోకమును విడిచెను.

యామునాచార్యులకు మూడు కోరిక లుండిపోయినవని ఆతని శిష్యులు రామానుజులకు తెలియజెప్పిరి. అందులో ముఖ్యమైనది బ్రహ్మసూత్రములకు భాష్యము రచించుట. రామానుజులు ఈ కోర్కెలను నెరవేర్ప ప్రతినచేసి తిరిగి కాంచీపురమును చేరుకొనెను.

ఇచ్చట రామానుజులు వరదరాజ దేవాలయార్చకుడైన తిరుక్కచ్చినంబి ఇంటియందు నివసించుచు ఆతనివలన కొన్ని మతవిషయక రహస్యములను తెలిసికొనెను. ఆయన భార్య నంబిభార్యతో కలహించి నంబివిషయమై అవజ్ఞ చూపి అపచారమును కావించిన దను వ్యాజమున రామానుజులు భార్యను పరిత్యజించి సన్న్యసించెను.

ఈ సమయమందు శ్రీరంగమందు నెలకొనియున్న ఆళ్వందారు శిష్యులు రామానుజులను వైష్ణవమత స్థాపకులుగా శ్రీరంగమున కాహ్వానింప ఆయన యచటి కరిగి అచటనే తన నివాసము నేర్పరచుకొనెను. అచట పెరియనంబి, తిరుక్కోట్యూర్ నంబి యను ఇద్దరు మతాచార్యుల వలన వైష్ణవమత రహస్యములు మరికొన్నిటిని ఉపదేశము పొందెను. ఇచ్చట నొకవిశేషము. అష్టాక్షరీమంత్ర రహస్యార్థములకై రామానుజులు తిరుక్కోట్యూర్ నంబిగారిని పెక్కుసారు లుపపత్తిని గావించినను రామానుజుల అభినివేశమును పరీక్షించుటకై నంబి నిరాకరించుచువచ్చెను. తుదకు అనధికారులకు వెల్లడిచేయనని గట్టిగా శపథము చేయించుకొని మంత్రార్థమును నంబి రామానుజుల కుపదేశించెను. ఉపదేశము పొందిన వెంటనే తను గురువునకు చేసిన శపథమును తిరస్కరించి మంత్రార్థము సర్వజనులకు తెలియునట్లు కోవెలగోపుర మెక్కి రామానుజు లుద్ఘోషించెను. తిరుక్కోట్యూర్ నంబి రామానుజుల ధార్ష్ట్యము విని తనవద్దకు పిలిచి 'గురువుయొక్క ఆజ్ఞ నుల్లంఘించినందులకు శిక్ష శాశ్వత నరకనివాసమని నీకు తెలియునా' అని రామానుజులను గద్దించెను. రామానుజులు అది విని 'స్వామీ మంత్రార్థబోధవలన ఇంతమంది జీవులకు మోక్షము లభించుచుండ నే నొక్కడను నరకము ననుభవించిన ఏమి నష్టము' అని బదులుచెప్పెను. రామానుజుల నిర్వ్యాజత్యాగమును గురువు మెచ్చుకొని ఇటుపై వైష్ణవదర్శనము 'రామానుజదర్శనము' అనుపేర పరగునని శిష్యుని ఆశీర్వదించెను.

శ్రీరంగమందు మతప్రవర్తకుడుగా రామానుజులు అపరిమితమైన కీర్తిని గడించెను. ఈయనకీర్తిని సహించలేని కొందరు ఈయనను విషముపెట్టి చంపించవలెనని చూచిరి. కాని దైవవశమున నా ప్రయత్నము వ్యర్థమైనది.

తరువాత ఆయన బ్రహ్మసూత్రభాష్యరచనకు పూనుకొనెను. బ్రహ్మసూత్రములకు అదివరకు బోధాయన మహర్షి వ్రాసియుంచిన వృత్తిని అనుశీలించుటకై రామానుజులు తన ముఖ్యశిష్యుడగు కూరత్తాళ్వానుతో కాశ్మీర దేశమునకు పోవలసివచ్చెను. కాశ్మీరమునుండి తిరిగి వచ్చి బోధాయనవృత్తిని ఒక పర్యవేక్షణలోనే కంఠస్థము చేసికొనిన కూరత్తాళ్వానుయొక్క విచిత్రధారణాశక్తి సాహాయ్యమున రామానుజులు బ్రహ్మసూత్రభాష్యమును రచియించెను.

ఈ సమయమందే శైవమతాభినివిష్టుడగు చోళదేశపు రాజు కులోత్తుంగుడు వైష్ణవులను శైవమత స్వీకారమునకై నిర్బంధింపజొచ్చెను; ఇయ్యకొననిచో ప్రాణాపాయము వాటిల్లు ననుభీతిచే రామానుజులు శ్రీరంగమునుండి హొయిసల బిట్టిదేవరాజు రాజ్యమునకు పారిపోయెను. అచట బిట్టిదేవుని కుమార్తెను ఆవేశించిన దయ్యము నుచ్చాటించి

రామానుజులు ఆతనిచే మతగురువుగా స్వీకరించబడెను. అచ్చటనున్న దినములలో రామానుజులు మేల్కోట అరణ్యములోనున్న తిరునారాయణపుర దేవాలయము జీర్ణోద్ధారమును కావించి అక్కడనే పండ్రెండేండ్లు గడపెను. ఇంతలో కులోత్తుంగుడు చనిపోయి శ్రీరంగవాసము నిష్ప్రమాదమాయెనని విని రామానుజులు మరల శ్రీరంగమును జేరుకొనెను. తరువాత దక్షిణమందు, ఉత్తరమందు ఉన్న దేవాలయములను దర్శించుటకు రామానుజులు పర్యటనమును సాగించెను. తాను దర్శించిన దేవాలయములం దెల్లెడల వైష్ణవమతప్రకారము అర్చనావిధానములను నెలకొల్పి తిరిగి శ్రీరంగమునకు విచ్చేసెను.

రామానుజులు బ్రహ్మసూత్రభాష్యమునకు విశిష్టాద్వైత దృష్టితో వ్యాఖ్యానమును రచించెను. రామానుజదర్శన ప్రకారము చిత్తు, అచిత్తు, ఈశ్వరుడు అను మూడు తత్త్వము లున్నవి. ఈశ్వరుడే పరబ్రహ్మ; చిత్తు జీవాత్మ; అచిత్తు జడజగత్తు. బ్రహ్మ సత్యము, చిదచిద్రూపమైన జగత్తు అవిద్యాకల్పితము అను శంకరాద్వైతమును ఖండించి చిదచిత్తులు పరబ్రహ్మకు శరీరము లనుసిద్ధాంతమును రామానుజులు సోపపత్తికముగా స్థాపించెను. ఇట్టి చిదచిద్విశిష్టుడైన పరబ్రహ్మయొక్క అద్వైతమును నిరూపించునది అగుటచే రామానుజసిద్ధాంతమునకు విశిష్టాద్వైతము అని పేరు వచ్చినది.

విశిష్టాద్వైత మత ప్రచారము భావికాలమందు నిర్విఘ్నముగా కొనసాగుటకై రామానుజులు తన శిష్యులలో ప్రముఖులగు డెబ్బది నలుగురిని ఏర్చి వారిని మతసింహాసనాధిపతులుగా నియమించెను. తాను నిర్వహింప దలచుకొన్న పనులు పూర్తియయిన తరువాత తన 120 వ ఏట రామానుజులు తన అవతారమును చాలించుకొనెను.

పరమపద నివాసియగు పరబ్రహ్మ భూలోకమందు విశిష్టాద్వైతమతమును స్థిరముగా ప్రతిష్ఠించుటకై తన తల్పమగు ననంతుని రామానుజులుగా అవతరింపజేసెనని వైష్ణవమతానుయాయుల విశ్వాసము.

రామానుజులు ఆంధ్రుడని ఒక ప్రతీతి కలదు. ఈ ప్రతీతికి సప్రమాణములగు ఆధారములు లేవు. ఆసూరి అని ఇంటి పే రుండుటచే ఈయన తమిళుడు కాడేమో నని తోపజేయును.

మే. వ. న.

**రామానుజాచార్యులు, కిడాంబి** (క్రీ. శ. 1853 - 1928) : వీరు విజయనగరము మహారాజ కళాశాలలో సుమారు 33 సంవత్సరములు ప్రధానాచార్య (ప్రిన్సిపాల్) పదవి నిర్వహించి ప్రముఖ విద్యావేత్తగాను, క్రమశిక్షణలో, కళాశాలా నిర్వహణలో లక్ష్యప్రాయులైన ప్రధానాచార్యులుగాను ప్రసిద్ధిపొందిన మహనీయులు.

పశ్చిమగోదావరి జిల్లా, పెంటపాడు గ్రామములో వీరు జన్మించిరి. ఇరువది ఏండ్లు వచ్చువరకు వీరు స్వగ్రామములోనే సంస్కృతాధ్యయనము చేసి కావ్య నాటకాలంకారములలోను, వ్యాకరణ శాస్త్రములోను మంచి పాండిత్యము సంపాదించిరి. ఆ రోజులలోనే వీరి సునిశిత మేధాశక్తి పలువురు పెద్దల నాకర్షించినది. నానార్థరత్నమాల, మేదిని మొదలగు నిఘంటువులు వీరి జిహ్వాగ్రమున నుండెడివి. ఏకసంథాగ్రాహకులుగా వీరు ప్రసిద్ధి పొందిరి. 16, 17 సంవత్సరముల వయస్సులో నున్నప్పుడే అష్టావధానములు చేయుచు, సంస్కృతాంధ్రములలో చక్కని కవిత చెప్పుచు అప్పుడప్పుడు రాజాస్థానములు కూడ సందర్శించి సమ్మానితు లగుచు వచ్చిరి. 'హేస్టింగ్స్ చరిత్ర', 'మతవిద్య' మున్నగు ఆంధ్రాంగ్ల గ్రంథములు కొన్ని రచించినను, గ్రంథకర్తగాకంటె విద్యావేత్తగానే ప్రధానముగ వీరు విశ్రుతులైరి.



చిత్రము 223.
కిడాంబి రామానుజాచార్యులు

క్రీ. శ. 1873 లో వీరు విజయనగరము వచ్చి అక్కడ సంస్థాన ప్రధానామాత్యులు పెనుమత్స జగన్నాథరాజు గారిని, ఆనందగజపతి మహారాజులుంగారిని తమ వైదుష్యముచేత మెప్పించి, వారి ఆదరణమున అక్కడి హైస్కూలులో చేరి 1874 లో ప్రవేశపరీక్షలో ప్రశంసాపాత్రులుగా ఉత్తీర్ణులైరి. తరువాత మహారాజిచ్చిన విద్యార్థివేతనముతో చెన్నపురి ప్రెసిడెన్సీ కళాశాలలో చదివి ఎం. ఏ. పట్టము పొందిరి. ఆంధ్రులలో మొట్టమొదట ఎం. ఏ. పట్టము పొందిన వారిలో వీ రొకరు. అనంతరము వీరు న్యాయశాస్త్ర మభ్యసించి, బి. ఎల్. పట్టము కూడ పొందిరి.

ఉన్నత విద్యాభ్యాసము ముగిసి విజయనగరము తిరిగి రాగానే వీరు మహారాజ కళాశాలలో మొదట ఉపప్రధానాచార్యులు (వైస్ ప్రిన్సిపాల్)గా నియమితులై, అనతి కాలములో 1887 లో కళాశాలప్రధానాచార్యులైరి; 1920 వరకు ఆ పదవిలో ఉండి, పిమ్మట కొంతకాలము

విజయనగర సంస్కృత కళాశాలా ప్రధానాచార్య పదవి కూడ నిర్వహించిరి.

విద్యారంగములో వీరి అసాధారణ సేవను గుర్తించి నాటి ఆంగ్ల ప్రభుత్వము 1912 లో వీరికి 'రావు బహదరు' బిరుదము నిచ్చి సత్కరించినది. మే. వ. న.

**రామానుజాచార్యులు, బుక్కపట్టణము** (క్రీ. శ. 1898 - 1947) : వీరు సుప్రసిద్ధ పత్రికా రచయితలు. తలిదండ్రులు రంగమ్మ, రామాచార్యులు. విద్యాభ్యాసము పూర్తియైనంత వీరు హైదరాబాదులో కొన్నాళ్ళు న్యాయవాది వృత్తిలో పనిచేసి, అది నచ్చక పత్రికారచయితలై 1929వ సంవత్సరములో 'హైదరాబాదు బుల్లెటిన్' పత్రికకు సంపాదకులైరి. వీరి వ్యాసములు 'గ్రేట్ ఎక్స్పెక్టేషన్స్' అను పేరుతో పుస్తకరూపమున ప్రచురింపబడినవి. 1937 లో వీరు వీరి సహాధ్యాయులగు శ్రీరాజగోపాల్ గారితో కలసి 'దక్కన్ క్రానికల్' అను ఇంగ్లీషు వారపత్రిక నారంభించిరి. రెండేండ్ల తరువాత అది దినపత్రికగా మారినది. ఇంగ్లీషులోవలెనే తెలుగులో కూడ దినపత్రికను మొట్టమొదట నారంభించినది వీరే. 'గోలకొండ పత్రిక' దినపత్రికగా మారక పూర్వమే 1942లో 'తెలంగాణ పత్రిక'ను వీరు దినపత్రికగా ప్రకటించిరి. యుద్ధపు దినములందు యుద్ధ సమాచారములు తెలుపుటకై కేవలము సైనికులకొరకు ఇంగ్లీషులో సాయంవేళలందు 'గారిసన్' పత్రికను ప్రకటించుచువచ్చిరి. 'ఈవ్స్ డ్రాపర్' అను గుప్తనామముతో వీరు వ్రాయుచువచ్చిన 'చార్ మినార్ గాసిప్స్' హైదరాబాదు ప్రజల నత్యంత మాకర్షించెడివి. మాటపట్టింపులపై 'దక్కన్ క్రానికల్' పత్రికతో వీరికి సంబంధము విడిపోయినది. 1947 లో వీరు 'డెయిలీ న్యూస్' అను మరియొక ఇంగ్లీషు దినపత్రికను స్థాపించిరి. కాని దాని నారంభించిన నెల దినములకే హఠాత్తుగా గుండెజబ్బుతో వీరు మరణించిరి. వీరికి తెలుగు సాహిత్యమునకూడ చక్కని యభినివేశ ముండెడిది. ఇప్పటి ఆంధ్రసారస్వత పరిషత్తునకు రూపురేఖలు దిద్దినవారిలో వీ రొకరు. పరిషత్తు మొదటి కార్యనిర్వాహక వర్గమునందు వీరు ఉపాధ్యక్షులుగా నుండి ఎంతయో సేవచేసిరి. బి. రా. రా.

**రామాయణ వాఙ్మయము :** కావ్యము కాంతా సమ్మితము. లౌకిక జీవనముచే కలుషితమైన మనస్సు కావ్య పఠనము ద్వారమున సత్త్వప్రధానమై రసానందము ననుభవించి తదనంతర ముత్తమ సంస్కారము నుజ్జీవింపజేసికొనుచున్నది. మానవత్వమున కుపలక్షకమగు నచ్చమైన సాత్త్వికప్రవృత్తి రసస్వరూపుడగు భగవంతున కభిముఖముగ సర్వముఖముల నడచి యందు పర్యవసింప గోరుటయే 'భక్తి' యనవచ్చును. రామాయణ కావ్య పరంపరను పఠించుటకును, రామపరమగు భక్తికిని నిట్లు సమన్వయము చెప్పవచ్చును. తెలుగునాట రామాయణ వాఙ్మయ ప్రభావము ప్రజలలో భక్తిరూపమున వెలసినది. దేశమున నలుమూలల రామభక్త సంఘములు, భజన కూటములు గలవు. విస్తారమగు రామకథా వాఙ్మయము తెలుగువారి యార్ద్ర హృదయమున కన్ని కోణముల బదను పెట్టినది; జీవితమున లోతుపాతులు త్రవ్వి చూపినది; ఆదర్శ జీవనము నభ్యూహింపజేసినది; సాహిత్యము సాధించగల సత్ఫలితము లన్నియు సాధించినది. మనమే సృష్టించుకొనిన రామకథాపరమగు నీ యాదర్శ వాఙ్మయ ముఖమున మనలను మనము సంస్కరించుకొనుచున్నాము. ఆ సంస్కరించుకొనుటలో అంతర్ముఖత, సర్వోత్కృష్టమగు జీవిత స్వరూపలబ్ధి, తదుపాసనము, తత్ స్థితికై పురోగతి మనకు గలిగిన ఫలములు.

వాల్మీకి రచితమగు శ్రీమద్రామాయణము సర్వాలంకార శోభితమగు మహాకావ్యము. ఇది సర్వరసములకు నిలయము. సీతాపహరణానంతర మందందు విప్రలంభ శృంగారమును, శూర్పణఖావృత్తాంతము త్రిజటుని వృత్తాంతము - వీనియందు హాస్యమును, దశరథుని మృతి లోనగువానియందు కరుణము, లక్ష్మణుని వృత్తాంతమున వీరము, రావణుని వృత్తాంతమున రౌద్రము, మారీచాది వృత్తాంతముల వికృత క్రూర దర్శనాదులచే భయమునుండి భయానకము, కబంధ విరాధుల వర్ణనమున బీభత్సము, రావణ యుద్ధమున అద్భుతము, శబరీ వృత్తాంతమున శాంతము వర్ణింపబడి యున్నవి.

రామకథలో వస్త్వైక్యము(యూనిటీ ఆఫ్ ప్లాట్)కలదు. అందుచే పఠిత ఆసక్తి వికేంద్రీకృతము కాక రసానుభవము కేవలోన్ముఖతాప్రాప్య మగును. ఇట్టి గుణముచే సామాన్యులకు, కావ్యనిర్మాణోత్సుకులగు కవులకు రామాయణము ప్రాణప్రదమైనది. ప్రధానముగ అందలి ఆదర్శదాంపత్య భావము సర్వులకు శిరోధార్యమై ఉపాస్యమైనదిగదా!

ఇట్టి రామకథ భారతజాతిపైన గాఢమగు ప్రభావము గలది యైనది. ఆదికావ్యము ప్రభావము మన జాతి సంగీత సాహిత్యములందే కాక వాస్తుశాస్త్ర, చిత్రలేఖన, శిల్ప కళలపై, తుదకు నాణెములపై గూడ ఉన్నది. ఈ దేశముననే కాక మరికొన్ని ప్రాగ్దేశములందును రామాయణ ప్రభావ మాయా కళలందు కానవచ్చుచున్నది.

తెనుగు సాహిత్యముపై రామాయణ ప్రభావ మతివేలమనియే చెప్పవచ్చును. వైదిక మత పునరుద్ధరణమునకు

భారతాంధ్రీకరణము జరిగినది. శైవమత ప్రభావమున వీరశైవవాఙ్మయ ముప్పతిల్లినది. వైష్ణవమత వ్యాప్తి ననుసరించి ఆముక్తమాల్యదాది గ్రంథములు వచ్చినవి. రామాయణకథారచనముమాత్ర మీ సూత్రమున కప వాదముగ నేమతప్రసక్తియు లేక నన్నయనాటినుండి నేటివరకు జరుగుచునేయున్నది.

భారతమువలె నద్వితీయముగ తెనుగున రామాయ ణము రాలేదు. అనేకములగు ననువాదములు, స్వతంత్ర రచనములు వచ్చినవి. రామాయణ గ్రంథ సంఖ్యయు, స్వతంత్ర కావ్య సంఖ్యయు పెరిగిపోయినది. ముఖ్యముగ రామకథ జన్మసాఫల్యకారి అను నమ్మికవలన గ్రంథ సంఖ్య విస్తృత మగుట కవకాశము కలిగినది.

తెలుగున సాహిత్య ప్రక్రియ లెన్ని గలవో అన్నిటను రామాయణ కథారచనము జరిగినది. విపుల కావ్యములుగ (యథానువాదములు కొన్ని, స్వతంత్రానువాదములు కొన్ని), సంక్షేప కావ్యములుగ, కావ్య ప్రబంధములుగ, కళ్యాణ కావ్యములుగ, అచ్చతెనుగు కావ్యములుగ, ద్విపద శ్లేష కావ్యములుగ, భిన్న రామాయణానువాదములుగ, లఘు కావ్యములుగ, దండకములుగ, యక్షగానములుగ, గేయములుగ, పాటలుగ, వచన కావ్యములుగ, స్వతంత్ర నాటకములుగ, అనూదితనాటకములుగ రామాయణకథా వస్తు వాంధ్రవాఙ్మయమున తామరతంపరగ వ్యాపించి నది. తిట్టు - కావ్యములలోగూడ రామకథ చెప్పబడినది.

**భాస్కర రామాయణము :** తెనుగున ఇంతవరకు దొరకిన రామాయణము లన్నిటిలో నిది ప్రాచీనమైనది. విపుల కావ్య పరంపరకును నిదియే మొదటి దగుచున్నది. దీనికి కర్తలు నలువురు - మంత్రి భాస్కరుడు మొదలైన వారు (చూ : భాస్కరుడు - రామాయణము). ఈ రామా యణమునకు తెనుగునాట బహుళప్రచార మున్నది. బహు కర్తృక మయ్యును నీ రచనమున సొంపు చెడలేదు. కావ్య మున శిల్పదృష్టియు, రచనమున వృత్తవిన్యాసచాతురియు కానుపించును.

**ఎఱ్ఱాప్రెగడ రామాయణము :** కవిత్రయము వారిలో నొకడగు ఎఱ్ఱాప్రెగడ రామాయణమును రచిం చెను కాని నష్టమైనది. కూచిమంచి తిమ్మకవి తన 'సర్వ లక్షణ సారసంగ్రహము'న బాలకాండములోని కొన్ని పద్యముల నుదాహరించెను. "యుద్ధకాండమునందలి పద్య ములను గొన్నింటిని వేటూరి ప్రభాకరశాస్త్రిగారు 'భారతి'లో ప్రకటించిరి. భాస్కర రామాయణమున ఎఱ్ఱాప్రెగడ పద్యములు కొన్ని తర్వాతికాలమున చేరి పోయినవని శాస్త్రిగారి యూహ.

**గోపీనాథ రామాయణము :** భాస్కర రామాయ ణము తరువాత ప్రసిద్ధమైనది గోపీనాథ రామాయణము. కర్త సింహపురనివాసి గోపీనాథ వేంకటకవి. ఈ గ్రంథము వాల్మీకి శ్రీమద్రామాయణమునకు 'అన్యూనాతిరిక్త' మగు ననువాదము. తెనుగున భారత, భాగవతములవలె రామాయణము భగవదంకితముగా రచింపబడకుండు టయు, పూర్వపు రామాయణము లన్నియు కొన్ని కించి న్న్యూనముగ, కొన్ని కించి దతిరిక్తముగ మూలము ననుస రించినవే యగుటయు నీ గ్రంథ రచనకు కారణములు. దీనిని లోకమున వెలయింపజేసినవారు వేంకటగిరిపుర వరాధీశ్వరులగు శ్రీమద్వెలుగోటి సర్వజ్ఞ కుమార యాచేంద్ర బహదరువారు (క్రీ. శ. 1859). ఈ కావ్యము శ్రీకృష్ణాంకిత మగుటయు, భాస్కరాదుల రామాయణము లందు వాల్మీకి రామాయణమునందలి యర్థము సమగ్ర ముగ కథితమైనదికా దనుటయు నీ గ్రంథమునకు రాజా దరణమును లభింపజేసినవి.

గ్రంథాదిని పూర్వకావ్యములందువలె స్వప్నవృత్తాంత మొక టున్నది. అంతేకాక కవి వాల్మీకిని స్తుతింపగా ఆయన ప్రత్యక్షమై 'తన కజు డొసగిన తెల్విని ఘనముగ' తన కొసగి చనినట్లు చెప్పికొనెను.

రామాయణ షట్కాండకథమాత్రమే యిం దున్నది. అనువాద విషయమున మూలమును జాగ్రత్తగ ననుస రించినదయ్యు రచనము కుంటువడలేదు. శరన్నదివలె ప్రసన్న మధురముగ చివరిదాక నడచినది. తెలుగు శబ్దములపై నీ కవికి మక్కువ యెక్కువయయ్యు మూల ముపై నాదరమున గాబోలు, చాలవర కచ్చటి శబ్దము లనే తత్సమములు జేసి రచన సాగించినాడు. అనుప్రాసాది శబ్దాలంకారములు మితముగ నాదరింపబడినవి. కాండాం తములందు బంధకవిత్వము కానుపించుచున్నది.

ఇతిహాసమున ప్రధానగుణమగు 'నిష్ఠ' శ్రీమద్రామా యణమునందువలెనే యిందును సంపూర్ణముగ ననుసరింప బడుటయే ఈ గ్రంథ ప్రశస్తికి మూలము. మూలమునందలి కవితామాధుర్యము నందించగలుగుటయే దీని కీర్తికి జయపతాక. ఆర్షకవితాగుణములగు సంయమనశక్తి, అకృత్రిమత ఇందుపాసింపబడినవి; రచన ద్రాక్షాపాకము.

**యథావాల్మీకి రామాయణము :** కర్త ఘనగిరి రామకవి. అసమగ్రముగ - బాలకాండమున కొంతవరకే లభ్యము; సంస్కృతమున 76వ సర్గవరకు పంద్రెండాశ్వాస ములలో ననువదింపబడినది. 'గ్రంథము మిక్కిలి యన్యథా భావము బొరసినది.' ఆశ్వాసాంతములందు బంధకవిత్వ మున్నది.

ఆంధ్ర వాల్మీకి రామాయణము : కర్త శ్రీ వావిలికొలను సుబ్బారావుగారు. ఆంధ్ర వాల్మీకి యని ఈ గ్రంథ రచనమువలన వీరికి బిరుదు. వీరు మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాలయం దాంధ్రపండితులుగ బనిచేసిరి. 'చెనఁకి చెఱిచి నాఁడు భాస్కరుఁడు, గాకుండిన రామాయణము బండ్ల కెక్కింపనా' యని పోతన చెప్పినట్లు చెప్పబడు నీమాటల లోని భాగవతకర్త సంకల్పము నెరవేర్చు బుద్ధియే ఈ రచనకు ప్రేరణము. వాల్మీకిరామాయణ ముత్తర కాండతోఁగూడ నేడుకాండము లనువదింపబడినవి. ఈ గ్రంథరచనాకాలము క్రీ. శ. 1900 - 1908. భాషాంతరీకరణ మున కొన్ని పద్యము లెక్కువ వ్రాసిన చోట నవి గుర్తింప బడినవి. పరికర పరికరాంకురాద్యలంకారములు, శ్లేష యథాశక్తి పోషితములు. గాయత్రీమంత్రము, రామషడక్ష రీత్యాది మంత్రములు మూలమునందువలె ననువాదమునను నిక్షిప్తములు. అట్లే వాల్మీకముననున్న బీజాక్షరము లన్నియు నిందును చేర్చబడినవి. విడిగ గాయత్రీ రామా యణమును, శ్రీరామకథాంశములతోఁడి శ్రీరామనుతియు ముద్రింపబడినవి. ఇది భాస్కరరామాయణము తర్వాత నధికతరమగు ప్రచారము గల గ్రంథము. అనువాద మయ్యు స్వతంత్ర రచన మనిపించును. తెలుగు సంస్కృత ములు సమపాళ్లలో గలిసిన ఈ రచనమున ఔచిత్యమెరిగిన సమాసఘటనము గలదు. అసిధారావ్రతమునుబోలు అను వాదకార్యమున మూలమును స్మృతికి దగులనీయని స్వతంత్రత, మాధుర్యము దీనికి ప్రాణము వోసినవి.

మరియు ఆధునికులలో జనమంచి శేషాద్రిశర్మగారు 'ధర్మసార రామాయణము' ను రచించిరి. విశ్వనాథ సత్య నారాయణగారు 'శ్రీమద్రామాయణ కల్పవృక్ష' మను స్వతంత్ర విపులకావ్యమును రచించుచున్నారు. రామా యణమును రచించుచున్న ఆధునిక కవు లింకను కలరు.

రామాభ్యుదయము : సంక్షేపకావ్య పరంపరలో మొదట పేన్నదగిన దిది. కర్త అయ్యలరాజు రామ భద్రకవి (క్రీ. శ. 1510 - 1580). గ్రంథరచనాకాలము క్రీ. శ. 1550 ప్రాంతము. అళియరామరాయల కల్లుడగు గొబ్బూరి నృసింహరాజున కంకితము. సకలకథాసార సంగ్ర హమను షట్చక్రవర్తుల కథలుగల కావ్యమును రామ భద్రుడు రచించెనని కవి చరిత్రకారులు తలచిరి. అది స్వతంత్ర గ్రంథము కా దనియు, తత్కర్త ఈ రామభద్రుడు కాఁ డనియు కవితరంగిణీకారుల యభిప్రాయము. ఈ రామాభ్యుదయము ప్రౌఢమగు ప్రబంధము. ఉత్తరకాండ కథ యిందు లేదు. అచ్చ టచ్చట పాండురంగమాహాత్మ్య పదగుంఫనము కాననగును. చెవి కింపగు కవిత.

మొల్ల రామాయణము: మొల్ల పూర్వకవి స్తుతిలో శ్రీనాథుని పేర్కొనుటయు, పదునారవ శతాబ్దికవులను పేర్కొన కుండుటయు జూడ పదునారవ శతాబ్ది పూర్వార్ధ మున నున్నట్లును, పోతన ననుసరించి 'చెప్పుమని రామ చంద్రు' డను పద్యమువలన నాతనికన్న నర్వాచీనురా లనియు చెప్పవచ్చును. ఈమె ప్రధానములగు కథాంశము లతో రామకథను సంక్షేపించి వ్రాసినది. కావ్యము శబ్దార్థాలంకారములతో మధురముగ నడచినది. చంపకో త్పలములు, కందము, సీసములు మాత్రమే ప్రధానముగ నాదరింపబడినవి. ఒక్కచో మాత్రము చూర్ణిక యొకటి గలదు. రచనలో 'స్త్రీ హస్తము' గోచరించును. బహుళ ప్రచారము నందిన గ్రంథ మిది (చూ : మొల్ల).

రఘునాథనాయకుని రామాయణము : - సంగ్ర హము. 'మాటికి రసపరిపాటికి మేటికవులు మెచ్చి మేలు మేలన' మాటల పొందికలు గుమగుమ పిసాళింపగ రఘు నాథనాయకుడు తేటగ కూర్చిన రామాయణ మిది. ప్రాబంధికత సంతరించుకొన్న ఈ గ్రంథమున నాటి సాంఘిక జీవితము స్పష్టముగ ప్రతిబింబించుచున్నది. ఈ రాజకవికిగల శాస్త్రపరిజ్ఞానము, పాత్రచిత్రణకౌశలము గమనింపదగినవి. శృంగార హాస్యముల కిందలి ఋశ్య శృంగచరిత్రము చూడవచ్చును. గ్రంథమున కొంతవరకే లభ్యము (చూ : రఘునాథనాయకుడు).

పైనుడివినవారు కాక అనంతరాజు జన్నయ, చిత్రకవి వెంకటరమణకవి, మిక్కిలి మల్లికార్జునుడు అనువారుకూడ రామాయణమును సంగ్రహముగ రచించిరి. జన్నయకృత రామకథాభిరామము పదియాశ్వాసముల గ్రంథము. ఇందలి కవిత నాతికఠినమై సరసమైనది. మల్లికార్జునకృత రామ చంద్రోపాఖ్యానము పడాశ్వాసముల నిర్వచన ప్రబంధము; లింగమపర్తిలో శకము 1778 లో రామప్రతిష్ఠ చేసిన ఉడుతల పాపయార్యుని ప్రేరణమున రచింపబడినది.

కావ్య ప్రబంధ పరంపర : సంక్షేప కావ్యములకంటె నంతగా భిన్నములు కానివయ్యు సంగ్రహపరచుటకంటె కథావస్తు విషయమున కించిత్స్వాతంత్ర్యమును, ప్రాబంధి కతయే ప్రధానములుగ రచింపబడిన కావ్యము లివి.

పట్టాభిరామ విలాసము : శైవ బ్రాహ్మణుడగు నాగ లింగకవి కర్త. ఇందు రామకథయు, కృతిపతియగు మానూరి వెంకట రామనాథుడు కొండవీటికడ పేబ్రు గణేశుపేటలో రామప్రతిష్ఠ చేయుటయు చెప్పబడినవి. కవి రాము డయోధ్యకు లంకనుండి పోవుచున్నపుడు మార్గ మధ్యమున హనుమముఖముగ వినుకొండ, కొండవీడులను వర్ణింపించి రామునిచే తా నందు కలియుగమున నిలిచెద

నని చెప్పించి తర్వాత వచ్చు రామప్రతిష్ఠకు ప్రసక్తిని కల్పించెను. ఇది యమకాద్యనుప్రాసభూయిష్ఠమగు ప్రాబంధిక రచన. ఈ క్రిందివికూడ ఈ పరంపరలోనివే.

రామచంద్రోపాఖ్యానము : ఆరాశ్వాసముల ప్రబంధము ; కర్త వారణాసి వెంకటేశ్వరకవి ; పిఠాపురము కుక్కుటేశ్వరస్వామి కంకితము. దాశరథివిలాసము : ఏడాశ్వాసముల ప్రబంధము ; కర్త క్రొత్తపల్లి లచ్చయ ; తిరుపతి వేంకటేశ్వరుల కంకితము. శృంగార రాఘవము : సీతాపహరణకథతో ముగియుచు నసమగ్రముగ లభ్యము ; కర్త చెరుకుమూడి కృష్ణ కవి ; రసవత్కవిత ; కాశేపల్లి అయ్యనార్యుని కొడుకగు నారాయణమంత్రి కంకితము. రఘురామవిజయము : కర్త భావనకవి ; ఎనిమిది ఆశ్వాసములు ; స్కాందపురాణములోని రామకథలు వర్ణింపబడినవి; మల్లెపూడి రాజగోపాలస్వామి కంకితము. దశరథరాజనందన చరిత్రము : నిరోష్ఠ్య ప్రబంధము ; కర్త మరింగంటి సింగరాచార్యుడు. సీతాచరిత్రము : ఐదాశ్వాసములు ; రావు చెల్లయామాత్యుని కొడుకు అప్పలరాజు కర్త. శ్రీరామ చరిత్రము : అసమగ్రము ; నందూరి బాపమంత్రి కర్త. సాంఖ్యరామాయణము : ప్రబంధము ; అసమగ్రము ; కర్త చెన్నకృష్ణయ్య ; పోతనను తలపించు రచన. రామవిలాసము : ఈ ప్రబంధమునకు కర్త ఏనుగు లక్ష్మణకవి ; మృదుమధురవాగ్గుంభనములుగల రచనము ; వత్సవాయ గోపరాజున కంకితము ; లక్ష్మణకవివని చెప్పబడు నెనిమిది గ్రంథములలో నిదియు సుభాషితరత్నావళియు మాత్రమే లభ్యములు. సీతారామ విలాసము : ఆరాశ్వాసముల ప్రబంధము ; రచనాకాలము 1651 - 1852; కర్త మంత్రిపెగడ సూర్యప్రకాశకవి - కృష్ణార్జున చరిత్ర, భీమలింగ శతకముల కర్త. లక్ష్మణ విజయము : రామాయణకథ ; ఎనిమిది ఆశ్వాసములు ; కర్త బెహరా రామకృష్ణకవి - నల, ధర్మాంగద, జగన్నాథచరిత్రములు రచించిన కవి. అనర్ఘరాఘవము : సంస్కృతమున మురారి రచించిన ఈ పేరుగల నాటకమున కనువాదము ; ఐదాశ్వాసములు ; బిజ్జలకులమున కృష్ణరాయ మహీధవుని కుమారుడు తిమ్మభూపాలునిచే రచింపబడినది ; రసవత్తరమగు రచన.

కల్యాణ కావ్యపరంపర : 'మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతాని (కావ్యాని)' అను అనుశాసనము ను పాటించుట భారతీయ కవిలోక సంప్రదాయము. ఇట్టి దృష్టియే భారతీయ వివిధభాషా సాహిత్యములందలి పరిణయకావ్యపరంపరాదరణమునకు హేతువు. తెలుగునను నిట్టి కావ్యము లనేకములు గలవు. భారత భాగవతములనుండి సుభద్రాకళ్యాణము, రుక్మిణీ కళ్యాణము నను పేరులతో విడిగ చదువుకొను నాచారమును గలదు. రామకథలో సీతాకళ్యాణమువరకు గల కథాభాగముతో కొన్ని గ్రంథములు వెలసినవి. ఈ క్రింద పేర్కొన్న వట్టివి.

సీతాకళ్యాణము : నిరోష్ఠ్యపద్య ప్రబంధము — మొదటి నాలుగాశ్వాసములు లభ్యము ; కర్త పిడుపర్తి బసవప్పకవి - బసవనకొడుకు. దీక్షాబోధము, పద్యబసవపురాణము రచించిన పిడుపర్తి కవులతో నీతని కెట్టి సంబంధమో తెలియదు. చెన్నవరమంత్రి యనునతడును నీ పేరున నొక ప్రబంధమును రచించెను. జానకీరాఘవము ; ఐదాశ్వాసముల గ్రంథము ; సమగ్రముగ లభ్యము, కర్త బేతపూడి కృష్ణయ. ఈ కావ్య మడప నారప్ప కంకితము. అలమేలు మంగావివాహము, పండిత మనోభిరామము ఈతని యితర కృతులు. జానకీపరిణయము : చంద్రరేఖావిలాపమను తిట్టు కావ్యమును, మరికొన్ని కావ్యములను రచించిన కూచిమంచి జగ్గకవి దీనికి కర్త. సీతాకళ్యాణము : నిరోష్ఠ్యముగ మరింగంటి సింగరాచార్యుడు రచించినది.

అచ్చతెనుగున రామాయణమును రచించిన కవి బహుగ్రంథకర్తయు, లక్షణకవియనగు కూచిమంచి తిమ్మకవి. ఇతడు వివిధ కావ్యప్రక్రియలం దారితేరినవాడు. అచ్చతెనుగున వ్రాయబడియు నీ గ్రంథమున రచన కుంటువడదు ; సరళమగు కవిత.

ద్విపదకావ్యములుగ రచింపబడిన రామాయణములలో ప్రసిద్ధమైనవి రంగనాథరామాయణ, కట్టా వరదరాజకృత రామాయణములు.

రంగనాథరామాయణ కర్తృత్వ విషయమున వివాదమున్నది - రంగనాథుడని కొందరు ; గోన బుద్ధారెడ్డి యని మరికొందరు. గ్రంథస్థాధారమును బట్టి ప్రత్యక్షముగ బుద్ధారెడ్డి యగును. ఈతని జననకాలము క్రీ. శ. 1270 ప్రాంతము. ఈ రామాయణ రచనాకాలము క్రీ. శ. 1310 - 1320 కావచ్చును. పండిత పామరులచే నాదరింపబడుచు పశ్చిమాంధ్రదేశమున బహుళ వ్యాప్తి నందిన ఈ గ్రంథము వాల్మీకి రామాయణమునకు స్వతంత్రానువాదము. వాల్మీకమునలేని పెక్కు విషయములు ఇందు కలవు (చూ : ద్విపదవాఙ్మయము). పాల్కురికి సోమనాథునితో సమకాలికుడైన ఈ గ్రంథకర్త ద్విపదను స్వీకరించి కావ్యరచన చేసి ఆతనికంటె మిన్నయగు స్థానమును బడసెను. మధురమగు రచనము.

సూర్యవంశక్షత్రియుడును, శ్రీరంగమాహాత్మ్య పరమభాగవత చరిత్ర కర్తయునగు కట్టా వరదరాజు (క్రీ. శ. 1600 - 1650) ద్విపదరామాయణమును రచించెను. ఇది

యథావాల్మీకము. కాని స్వతంత్రములగు కూర్పులు లేక పోలేదు. రంగనాథ రామాయణముననున్న కొన్ని యవాల్మీకముల నీతడు పరిహరించెను. అవాల్మీకమైనను గౌతముడహల్యను పాషాణము గమ్మని శపించిన ట్లున్న విషయమును రంగనాథ, భాస్కరాదుల ననుసరించి ఇతడు చేర్చికొనెను. రామావతార ఘట్టమున మూలమునకంటె నధికముగ వారమును భాస్కరరామాయణము ననుసరించి చెప్పినట్లు తోచును. మూలములో లేని పట్టుల నితడు జాతి వార్తాచమత్కారములచే నింపును. సీతా కళ్యాణమునకు ముందు జనకుడు దశరథునకు బంపినలేఖ రాయసము వారు వ్రాసెడు వక్కణ ననుసరించి నడచినది. ఆనాడు వ్యవహారముననున్న యనేకవిషయము లిందు కనిపించును. ఈ రచనమున శబ్దవిశేషములు, వ్యాకరణ విశేషములు గలవు. ఈతని సంస్కృతాంధ్ర భాషాశైలి ప్రసన్నమధురము. సీతారామలక్ష్మణభరత సంవాదములు రసపూరితములు. ఈతడు వర్ణనములవట్టుననే సంస్కృత సమాస రచన చేయును. ఈ గ్రంథ మిష్టదైవమగు వేంకటేశ్వర స్వామి కంకితము. ఈ వరదరాజు రామాయణమందలి ద్విపదలు కొన్ని రంగనాథరామాయణమున చేరిపోయినట్లు కనుగొనబడినవి. అట్లే అన్నమాచార్య రచిత రామాయణ ద్విపదలు నం దుండునని యనుమానింపబడుచున్నది.

క్రీ. శ. 1408 - 1503 ప్రాంతమున తాళ్లపాక అన్నమాచార్యులు ద్విపదరామాయణమును రచించినట్లు తెలియుచున్నది. కాని గ్రంథము నష్టమైనది. కొంతభాగము రామకథయనుపేరున తంజావూరి పుస్తక భాండాగారమున నున్నట్లు తెలియుచున్నది. తాళ్లపాక చిన్నన్న తన అన్నమాచార్య చరిత్రమున నీరామాయణమును గూర్చి చెప్పెను.

భోసల ఏకోజీ (క్రీ. శ. 1735) రామాయణమును ద్విపదలో యథామాతృకముగ తెలిగించి తన తండ్రి కంకితము చేసినాడు ; క్రీ. శ. 1729 - 1736 వరకు తంజావూరు పాలించిన తులజాజికొడుకు. ఇతడు క్రీ. శ. 1735-1736 న నొక సంవత్సరమే రాజ్యము పాలించెనట. గ్రంథము పూర్తిగ లభ్యమగుచున్నది.

ఇవికాక ద్విపదలో తరిగొండ వెంకమాంబ వాసిష్ఠ రామాయణమును రచించెను. ఇది సంస్కృతముననున్న వేదాంతగ్రంథమునకు తెలుగు.

శ్లేష కావ్యపరంపర : రెండర్థములపద్య మొక్కటి చెప్పిననే చమత్కారముగ నున్నచో కావ్య మంతయు నట్లే సంతరించినచో నత్యంత చమత్కారావహముగ నుండునను యూహయే శ్లేషకావ్యరచనకు దారి తీసినది. ఇట్టి శ్లేష కావ్యములలో పింగళిసూరనార్యుని రాఘవపాండవీయము మొదటిది (చూ : ద్వ్యర్థికావ్యకవులు). అచలాత్మజా పరిణయము ద్వ్యర్థిలో పరిణయకావ్యము ; మూడాశ్వాసములే లభ్యము. యాదవ రాఘవ పాండవీయమను పేరున ఎలకూచి బాలసరస్వతియు, నెల్లూరి వీరరాఘవ కవియు, అయ్యగారి వీరభద్రకవియు త్ర్యర్థికావ్యములు రచించిరి. ఇట్టివే మరికొన్ని గ్రంథములు గలవు. రామకథా పరముగ నున్న మరికొన్ని అప్రసిద్ధములగువానిలో రామకృష్ణోపాఖ్యానము, రాఘవవాసుదేవీయము ముఖ్యమైనవి. మొదటిదానిలో రామాయణ భాగవతానుసారములగు కథలు కలవు. కర్త శ్రీపాద వెంకటాచలపతి. ఈ గ్రంథమునకు వ్యాఖ్యానము నీతడే రచించెను. వ్యాఖ్యారచనమున ఇతని మేనమామయు, ఆదికావ్యమును తెనిగించిన వాడును అగు వారణాసి లక్ష్మీపతి సాయపడెనట. వ్యాఖ్యానమును లభ్యము. రెండవది ఐదాశ్వాసముల ద్వ్యర్థి కావ్యము. కర్త క్రొత్తపల్లి సింగరాచార్యుడు. చిత్రకవి యని బిరుదు. ఈ కావ్యమున రామ కృష్ణకథలు శ్లేషించి చెప్పబడినవి. కర్తృత్వము పండిపెద్ది కృష్ణస్వామికి చెప్పబడుచున్నది. కాని అం దుండు చక్రబంధము సింగరాచార్య కృతమనుటను తెలుపుచున్నది. ఇది నెల్లూరు మండలమున నున్నచుండికాపురాధిపతియగు బంగా రంకభూపాలున కంకితము. లంకావిజయము కూడ ఇప్పట్టున పేర్కొనదగినది (చూ : ద్వ్యర్థి కావ్యకవులు).

ఇవికాక చంపూ రామాయణములని, విచిత్ర రామాయణములని, శతకంఠ రామాయణములని, అద్భుత రామాయణములని మరికొన్ని రామాయణములు వచ్చినవి. సంస్కృతమున భోజుడు రచించిన రామాయణచంపువునకు తెలుగున చంపూరామాయణ మనుపేర పద్యకావ్యమును బులుసు సీతారామకవి రచించెను. 'అభిషిక్త రాఘవ' మనుపేర నడిమింటి వెంకటపతి భోజచంపువు ననువదించినట్లు తోచుచున్నది. సిద్ధవటప్రభువగు మట్ల తిరువెంగళనాథుని ఆనతిపై అతని పినతండ్రి మట్ల వెంకట రామభూపతి కీగ్రంథ మంకితము. కావ్యమున నవతారిక, కథలో నైదుపద్యములు మాత్రము లభించుచున్నవి. ఋగ్వేదం వెంకటాచలపతియను నతడును చంపూరామాయణమును రచించెను. ఆధునికులలో పూసపాటి రంగనాయకుడు భోజుడు వ్రాసిన ఐదుకాండములను మాత్రమే కాక లక్ష్మణసూరి పూరించిన యుద్ధకాండమునుగూడ శ్రీమదాంధ్ర చంపూరామాయణ మనుపేర తెనిగించెను.

ఓఢ్రభాషలో సిద్ధేశ్వర యోగి రామాయణమును వ్రాయగా డొంకా గోపీనాథుడు దానిని తెనుగున వచన

ముగ వ్రాసెను. ఇది యాధారముగ తెలుగున మరి కొన్ని విచిత్ర రామాయణ పద్యకృతులు వెలసినవి. కొమ్మాజీ సోమనాథశిల్పాచార్యు డనునతడు గోపీనాథుని వచన కృతినే పద్యకావ్యముగ సంతరించెను. ఇతడు లాంగలీ నదీ సమీపమునందలి పార్వతీపురమున కధిపతి ధనంజయ ధాత్రాజు ప్రాపుగలవాడు. వీని ననుసరించి మరికొన్ని పద్యకావ్యములు వచ్చినవి.

శతకంఠరామాయణమున సీత శతకంఠరావణుని వధించుట కథావిషయము. శతముఖరామాయణ మనియు, సీతావిజయ మనియు ఈ కథకే పేళ్లు. మర్దన యనునతడు ఈ శతముఖ రామాయణమును రచించెను. లింగనయను మరియొకకవికూడ (క్రీ. శ. 1700) శతకంఠరామాయణమును నాలుగాశ్వాసముల గ్రంథముగ రచించెను. సీతావిజయమను పేర కర్తృనామ రహితముగ మరియొక గ్రంథ మున్నది. రంగయ యనునతడు వ్రాసినది దీనికంటె భిన్నమగు గ్రంథము మరియొకటి కలదు. శతాననవధ ప్రకారముగల యీ కథను (క్రీ. శ. 1800) పెనుమళ్ళ బాపయామాత్యుడు సీతావిజయ మనుపేరనే రచించెను. ఇది కౌశికీ తీరమున గల విష్ణు సంవేద్యక్షేత్ర మాహాత్మ్యమట.

సంస్కృతమున సీతామాహాత్మ్య ప్రతిపాదకముగ వాల్మీకి ప్రోక్తమగు నద్భుత రామాయణమునకు తెలుగున నొక యనువాదము అద్భుత రామాయణము కానబడుచున్నది. గ్రంథ మసమగ్రము. కృత్యవతరణిక, తుద - లేవు. కర్త ముడుంబి కృష్ణయ్య యని యూహింపనగును.

సంస్కృతమున విశ్వామిత్ర విరచితమగు నధ్యాత్మ రామాయణమునకు తెలుగున కొన్ని యనువాదములు వచ్చినవి. వానిలో కాణాద పెద్దన సోమయాజి (క్రీ. శ. 1775 - 1800) గద్వాల ప్రభువుల యాశ్రయమున రచించినదొకటి. భాస్కరమంత్రి పుత్రుడగు కోటంరాజు నాగయామాత్యుడు (క్రీ. శ. 1860) రచించినది మరియొకటి గలదు. రామయామాత్యు డనునాతడు రచించిన యధ్యాత్మ రామాయణమున కిష్కింధాకాండమునుండి కొంతవరకే లభ్యము. కాశీఖండమును ద్విపద చేసిన కంచర్ల శరభన గూడ సంస్కృతమునుండి ఈ గ్రంథము ననువదించెను. కాళహస్తి సుబ్రహ్మణ్యకవి అధ్యాత్మ రామాయణమును సంకీర్తనలుగ రచించెను కాని యుద్ధకాండము మాత్రము లభ్యము. ఈ గ్రంథము లన్నియు రామకథాపరముగ జెప్పబడు వేదాంతార్థ ప్రతిపాదకములు.

వాసిష్ఠ రామాయణములును వేదాంతార్థ ప్రతిపాదకములే. పదునారేండ్ల ప్రాయమున శ్రీరామునకు తత్త్వ జిజ్ఞాస కలుగగ విశ్వామిత్రుని కోరికపై వసిష్ఠుడు రామునకు తత్త్వోపదేశము చేయుట ఇందలి విషయము. గ్రంథ మంతయు వేదాంతమే చెప్పబడును. ముప్పిడి భూపతి ఆస్థానకవియగు మడికి సింగన సంస్కృతమున నున్న జ్ఞాన వాసిష్ఠమును క్లుప్తీకరించి వాసిష్ఠరామాయణమను పేర రచించెను. ఈతనిచేయగు పద్మపురాణోత్తరఖండమునను రామకథ అభివర్ణింపబడియున్నవి. కృష్ణగిరి వెంకటరమణ కవి యనునతడు గూడ జ్ఞానవాసిష్ఠమును తెనిగించెను.

తారక బ్రహ్మరాజీయము సంస్కృతమున ప్రయాగ నారాయణాశ్రమి వ్రాసిన గ్రంథమున కనువాదము. ఏతత్ కర్త చింతలపూడి రాధామాధవకవి (ఎల్లయ). ఈతడు రాధామాధవ మనుగ్రంథమును రచించి శ్రీకృష్ణ దేవరాయలచే రాధామాధవకవి యని బిరుదుగొన్నవాడు. గ్రంథము నాల్గాశ్వాసములే లభ్యము. అచ్యుతదేవ రాయలు ప్రతి సంవత్సరమును వేంకటేశ్వర స్వామికి ప్రబంధ కుసుమార్పణము చేయించెడివాడట. ఆతనిమంత్రి యగు తిమ్మరుసునాజ్ఞచే నీగ్రంథము రామాంకితము చేయబడినది. వేదాంతము. వ్యాకరణ దోషము లున్నను రసవంతమగు రచన.

రామచరితమానససరోవరము : తులసీదాస రామాయణమున కనువాదము. దోహా, చాంద్, చౌపాలు మొదలగు వైభాషీయ వృత్తము లిందును ఉపయోగింపబడినవి. మధురమగు రచన. కర్త శిష్టు కృష్ణమూర్తిశాస్త్రియని యూహింప వీలగుచున్నది. గ్రంథమున కర్త పేరు లేదు.

కంబరామాయణము : తమిళమున కంబన్ రచించిన ప్రసిద్ధ రామాయణమున కనువాదము. వాల్మీకి రామాయణమునకును, దీనికిని చాల భేదములు గలవు. శ్రీరాముడు మిథిలా రాజవీథిలో తమ్మునితో నేగుచుండగ సీతారాములు పరస్పరము చూచికొనుట, అందుపై వారి యనంగదశావర్ణనము, దశరథుడు తన కౌర్ధ్వదైహికములు భరతుడు చేయరాదని చెప్పియుండుటచే వసిష్ఠుడు శత్రుఘ్నునిచే జేయించుట, అగస్త్యాశ్రమమునుండి పంచవటికి పోవుచు సీతారామ లక్ష్మణులు జటాయువుతో భాషించుట, రావణుడు సీతను దీసికొనిపోవుచో పర్ణశాలతోగూడ భూమిని పెల్లగించుకొని పోవుట, సుగ్రీవునికి తారయందు మాతృభావము, రావణునకు విభీషణుడు హిరణ్యాకశిపుని వధ చెప్పుట, ఆహవరంగమున విభీషణ కుంభకర్ణుల సంభాషణము, రావణుడు రామలక్ష్మణ శిరోధనువులు కల్పించి చూపి సీతను లోగొనజూచుటకు మారుగ మాయ జనకుని గల్పించి దుర్నీతులు చెప్పించుట మొదలగునవి తమిళ రామాయణమున విశేషములు. సుగ్రీవ విభీషణుల కంటె నీకవికి రావణ కుంభకర్ణులపై గౌరవ మెక్కుడట.

డాని అనువాదకులు పూతలపట్టు శ్రీరాములురెడ్డిగారు. ఇది రసవత్తరమైన గ్రంథము.

ఆద్యంతములందు పట్టాభిషేక వర్ణనములతో ప్రధానముగ నుత్తరకాండ కథ పట్టాభి రామాయణమున చెప్పబడినది; కర్త ఘట్టు వెంకటరామకవి; లలితకవిత. శఠగోపాచారి యను నతడును ఇట్టిదే రచించెను.

ఇవేకాక తత్త్వసంగ్రహ రామాయణము, తారక బ్రహ్మరామాయణము, సహస్ర కంధర రామాయణము, దండక రామాయణము (దండకము) మొదలగునవి అనేకము లున్నవి.

**ఉత్తర రామాయణములు : నిర్వచనోత్తర రామాయణము :** కవిత్రయము వారిలో నొకడగు తిక్కన (క్రీ. శ. 1260) దీనికి కర్త. పూర్వ రామాయణమున ఉత్తమ మానవుడుగ చిత్రింపబడిన రాముడు ఉత్తర కాండమున దివ్యత్వ మారోపింపబడి వర్ణింపబడెను. అందుచే సంస్కృతోత్తర రామాయణమునే కొందరు ప్రక్షిప్త మనుట తటస్థించెను. తిక్కన మాత్రము రాముని రాజుగను, ఉత్తమ మానవుడుగను చిత్రించెను (చూ : తిక్కన, కొట్టరువు).

ఉత్తర రామాయణము : తిక్కన సోమయాజి చివర విడనాడిన కథాభాగమును గొని రచింపబడిన ఏకాశ్వాస పూరణము; కర్త జయంతి రామభట్టు. ఇం దెడనెడ వచనములును గలవు. ఇది భద్రాద్రి శ్రీరామున కంకితము.

ఉత్తర రామాయణము : కర్త కంకంటి పాపరాజు (క్రీ. శ. 1775 - 1800); సుప్రసిద్ధ ప్రబంధము. పుష్పగిరి తిమ్మన ఈ రచనమున పాపరాజునకు సాయపడెనట. కరుణాశృంగార వీర రసము లద్భుతముగ పోషింపబడినవి; ఇందు వర్ణనా బాహుళ్యము గలదు. కొన్ని ద్వ్యర్థిపద్యములు, అచ్చ తెనుగు పద్యములును ఇందు గలవు; అనర్గళమగు ధార. తిక్కన నిర్వచనోత్తర రామాయణమున వదలిన కథ లన్నింటి నీతడు తెనిగించెను. సీతావనవాసము కరుణకును, రావణ దిగ్విజయము వీరత్వమునకును, కపిలసందర్శనము బీభత్సమునకును, బలిచక్రవర్తిసన్నిధి హాస్య భయానకాద్భుతములకును తావులు. ఇందలి గద్యలును ప్రౌఢములై పద్యములవలె నడచును; రసవత్కవిత. ఈ మధుర ప్రబంధము మదనగోపాలస్వామి కంకితము.

రంగనాథ రామాయణ మని పేర్కొనబడుచున్న ద్విపద రామాయణముయొక్క ఉత్తర భాగమును గోనబుద్ధారెడ్డి కొడుకులగు గోన కాచభూపతి, విఠలరాజు నను వారలు రచించినట్లు గ్రంథమువలన తెలియుచున్నది. పూర్వ రామాయణమును, ఈ యుత్తరరామాయణమును కలిపి రంగనాథుడే రచించె ననువాద మొకటున్నది. ఈ యుత్తరభాగము నీ కవులు తమతండ్రి యవసానకాలపు కోర్కెపై రచించినట్లు చెప్పుకొనిరి; ప్రశస్తమగు రచనము. పూర్వ రామాయణము శైలికిని దీని శైలికిని అంతగా భేద మున్నట్టు తోపదు. ఇది క్రీ. శ. 1320 - 1325 ప్రాంతమున రచింపబడి యుండవచ్చునని కవితరంగిణీకారుల యూహ.

మైరావణచరిత్ర (చంపువు) : కర్త మాడయ; సర్వయామాత్యుని కొడుకు. కృత్యవతరణిక తక్క తక్కినది లభ్యము. మైరావణుడు ఆహవభూమి నలసి నిద్రించు రామలక్ష్మణుల గొని పాతాళలంక కేగుటయు, హనుమంతుడు వానిం జంపి వీరిని విడిపించుటయు మొదలగు హనుమత్పరాక్రమము చెప్పబడినది. తంజావూరు పుస్తక భాండాగారమునందలి ప్రతిలో కృత్యవతరణిక గలదట. ఈ గ్రంథము లేజెళ్ళ గోపామాత్యున కంకితము. కవిచరిత్రకారు లీ కవిని 18వ శతాబ్దిని చేర్చిరి. మైరావణచరిత్ర (ద్విపద) : మంజరీ ద్విపద వికారమగు ఛందస్సులో హనుమంతుడు మైరావణుని హింసించిన యీ కథను కాచన యను బ్రాహ్మణుడు రచించెను; గ్రంథము సమగ్రముగ లభ్యము. 'హనుమద్విజయ' మను పేర పాతూరి అమ్మయామాత్యునికొడుకు తిరుమలయ్య కూడ నీ మైరావణ చరిత్రను ద్విపదలో రచించెను.

యక్షగాన కావ్యపరంపర : లేపాక్షి రామాయణము, కొమ్మాలపాటి రామాయణము - సుందరకాండము, బొమ్మలాట రామాయణము, సీతాకల్యాణము, సుగ్రీవ విజయము, రామనాటకము, విభీషణ పట్టాభిషేక నాటకము, కుశలవ చరిత్రము, అధ్యాత్మ రామాయణము, లక్ష్మణ ప్రాణరక్షణము, మైరావణ చరిత్ర - యక్షగానములుగా విరచింపబడినవి. లేపాక్షి రామాయణము మొదలైనవి షట్కాండముల కథ; మూడు రాత్రుల ప్రదర్శనమున కనువుగ విభజన మున్నది. ఇందు కైకపాత్రపోషణమున శ్రద్ధ తీసికొనబడినట్లు కానవచ్చును. కర్త వెంకటనాయక కవి; లేపాక్షీశ్వరున కంకితము; పాటలు లేపాక్షీశ్వరాంకితములు.

గుత్తెనదీవి రామాయణము ప్రసిద్ధమైనది. కర్తయెవ్వరో తెలియదు; గుత్తెనదీవి హనుమంతుని పేర చెప్పబడినది. పాటలు గుత్తెనదీవి హనుమదంకితములు. ప్రతి పాటకును రాగతాళములు చెప్పబడినవి. ఇందు వర్షర్తువేళ సీత నెడబాసియున్న రాముని విరహము చక్కగ వర్ణింపబడినది. ఈ కావ్యమున మొత్తము ఏబది కీర్తనలున్నవి. ధారాళమై మధురమగు చక్కని దేశీయరచన.

ఇటువంటిదే 'శారదా రామాయణము'ను. 'అవు శారదా కరుణానిధీ' అను చరణాం తానుప్రాసము గల

రచన. కర్త యెవ్వరో స్పష్టముగ తెలియదు. కాని గ్రంథాంతమున 'మధురమైనట్టి అమృతసారంబు, వేంకటేశ్వరుని పాలి దైవంబు, చేసినాడయ్యా ఈ పురాణంబు, రామచంద్రులమూర్తిదైవంబు' అని యుండుటచే కవి పేరు వెంకటేశ్వరుడేమో ననిపించుచున్నది.

పదునేడవ శతాబ్దినుండి తెనుగున వచన మారంభమై ఆదరింపబడిన వెనుక వచనకావ్యములు ననేకము వచ్చినవి. ఆధునిక కవు లనేకులు రచించిన నాటకములును చాల కలవు. సా. కృ.

**రామారాయణం, పానుగంటి** (క్రీ. శ. 1866 - 1928): రామారాయణంగారు ప్రఖ్యాతి పొందిన వెలమ కుటుంబంలో జన్మించారు. వీరి పూర్వికులు దక్కను లోని పానగల్లునుంచి కాళహస్తికి వచ్చి అక్కడ నివాసం ఏర్పరచుకొన్నారు. గొప్ప కుటుంబములో పుట్టిన రామారాయణంగారు తమ పదహారవ యేటివరకు సంస్కృతాంధ్ర భాషలను చదువుకొని పిదప మదరాసు వచ్చి ఇంగ్లీషు చదువు ప్రారంభించారు; తమ 27 వ యేట, బి.ఏ., 30 వ యేట ఎం.ఏ. డిగ్రీలను పొందారు. విద్యార్థి దశనుంచి రాజకీయాలపట్ల అభిమానం చూపినప్పటికీ వీరు చాలాకాలం విద్యా సంస్కరణల విషయమై శ్రద్ధ వహించారు.


చిత్రము 224.
పానుగంటి రామరాయణం

రామారాయణంగారు రాజకీయాలలో పూర్తిగా ప్రవేశించినది 1912 లో. ఆ సంవత్సరంలోనే భూస్వాముల నియోజకవర్గంనుంచి వీరు ఇంపీరియల్ లెజిస్లెటివ్ కౌన్సిలుకు ఎన్నుకొనబడినారు; మూడు సంవత్సరాలు ఆ కౌన్సిలు సభ్యులుగా ఉండి దేశంలోని వివిధ సమస్యల పట్ల తమకు గల జ్ఞానాన్ని, తమ ప్రజ్ఞను, నిమ్న జాతుల ఉద్ధరణపట్ల తమకు గల శ్రద్ధనూ ప్రదర్శించినారు. డాక్టరు టి. ఎం. నాయర్, సర్ పిట్టి త్యాగరాయశెట్టిగార్లు 1917 లో జస్టిస్ పార్టీని స్థాపించినప్పుడు రామారాయణంగారు కూడా ఆ పక్షములో చేరారు. వీరు 1917 ఆగస్టులో జరిగిన జస్టిస్‌పార్టీ మహాసభకు అధ్యక్షులుగా ఎన్నుకోబడినారు. ఈ పక్షం బాగా బలపడి 1919 లో జస్టిస్ పార్టీ అభ్యర్థులు ఎక్కువగా ఎన్నికలలో గెలుపొందడంతో మద్రాసు రాజధానిలో జస్టిస్‌పార్టీ మంత్రివర్గం 1920 లో ఏర్పాటయింది. ఈ పార్టీలో ముఖ్యులయిన రామారాయణంగారు ఒక మంత్రిగా నియమింపబడినారు. అయితే మంత్రిమండలి ఏర్పాటయిన కొద్ది మాసాలకే ముఖ్యమంత్రి దివాన్ బహదర్ ఎ. సుబ్బారాయలు రెడ్డియార్ చనిపోవడంతో రామారాయణంగారు ముఖ్యమంత్రి అయి 1926 వరకు పదవిని అలంకరించారు.

గ్రామాలలో ప్రజారోగ్యాన్ని పెంపొందించడం, ఆదిద్రావిడుల స్థితిని బాగుపరచటం, ప్రభుత్వోద్యోగాలలో పెద్ద పెద్ద ఉద్యోగాలకు భారతీయులనే నియమించుటకు కృషిచేయడం కాక, ముఖ్యమంత్రిగా రామారాయణంగారు చేసిన గొప్ప కార్యాలలో ముఖ్యంగా పేర్కొనదగినవి హిందూ దేవాదాయ, ధర్మాదాయాల చట్టాన్ని అమలులోకి తేవడం ఒకటి; మదరాసులో దేశీయ వైద్య పాఠశాల(స్కూల్ ఆఫ్ ఇండియన్ మెడిసిన్)ను స్థాపించడం మరొకటి. దివాన్ బహదర్ బిరుదును 1918 లోను, వంశ పారంపర్యంగా రాజా అనే బిరుదును 1922 లోను, సర్ బిరుదును 1926 లోను ఇచ్చి బ్రిటిష్ ప్రభుత్వం రామారాయణంగారిని గౌరవించింది. క. స. నా.

**రామారావు, దామెర్ల** (క్రీ. శ. 1897 - 1925): ఇతడు పశ్చిమ, ప్రాచ్య శిల్పములందలి విశేష గుణములను పుణికి పుచ్చుకొని, వాటిని సమన్వయించి మేలుకలయికగా చేయ బూనుకొనెను. ఇతడు రాజమహేంద్రవర కాపురస్థులగు రమణరావుగారి ద్వితీయ కుమారుడు; చిన్ననాట విద్యార్థిదశయందే ఇతని చిత్రరచనావ్యాసంగమందలి శ్రద్ధయు, ప్రజ్ఞయు వెల్లడియయ్యెను. ఆ పట్టణమందలి ప్రభుత్వ కళాశాల ప్రిన్సిపాలగు ఓ.జె. కూల్డ్రే దొర ఉత్సాహపరచుటచేతను, సాహాయ్య మొసంగుటచేతను ఇతడు 1919 వ సంవత్సరమున బొంబాయిలోని సర్. జె. జె. స్కూల్ ఆఫ్ ఆర్ట్సుకు పోయి చిత్రకళ నభ్యసించి తుద కందే చిత్రకళాధ్యాపకుడుగా నియుక్తుడయ్యెను; మేయోపతకమును బొందెను.


చిత్రము 225.
దామెర్ల రామారావు

బొంబాయిలో నున్నపుడే ఇతడు అజంటా, ఎల్లోరా, ఎలిఫాంటా, కార్లీ, నాసిక్ మున్నగు క్షేత్రముల కేగి

అచటి కళాలయములను దర్శించి, అచటి రీతుల నభ్యసించి, చాతుర్యముల గ్రహించి, అందముల నలవరచుకొని తన విద్యయం దుత్తీర్ణుడయ్యెను. 1921 లో కలకత్తాకు పోయి సుప్రసిద్ధ చిత్రకళాచార్యులగు అవనీంద్రనాథ ఠాకూరు, నందలాలు బోసు లను దర్శించి వంగ కళాతత్త్వము నర్థముచేసికొనెను. 1921 లో బొంబాయిలో అమ్ముడు పోయిన 'సరోవరము'ను, కలకత్తాలో వైస్రాయి రీడింగ్ ప్రభువునకు విక్రయింపబడిన 'గోదావరి కనుమ' యను ప్రకృతి రచనయందును, మానవాకృతి రచనయందును సమానముగా ఇతడు ప్రజ్ఞావంతుడన్న అభిప్రాయమును బలపరచు నిదర్శనములు. 1920 లో భావనగరములో ఆ రాజ్యపు రాకుమారుల రూపచిత్రములను చిత్రించుటకు వెళ్లియుండిన సమయమున మహాకవి రవీంద్రుడు అచటికి రాగా పదినిముషములలో నితడు ఆ కవి ముఖాకృతిని వ్రాయగా ఇతని వైదుష్యమునకు కవి యచ్చెరువొందెను.

ఇతడు సంపూర్ణముగా భావస్వతంత్రుడు. ఒక శైలికి సంప్రదాయమునకు, సిద్ధాంతమునకు వాదమునకు ఇతడు మానసిక దాసుడు కాలేదు. పాశ్చాత్యరీతియు, ప్రాచ్య రీతియు ఇతనికి కరతలామలకము లైనవి. పాశ్చాత్యు లారాధించు ప్రకృతిని, ప్రాచ్యులు ప్రాణముగా గణించు భావమును ఇతడు తన చిత్రరచనలో సమన్వయించుకొనెను. మూర్తులకు సహజత్వ మాపాదించుచునే, భావస్ఫుటత్వ మునకు లోటు రాకుండ చూచుకొనుచు, వర్ణముచే ఘన పరిమాణము స్ఫురింపజేయుచు, జీవకళకొరకై రేఖమీదనే యాధారపడుచు ఒకానొక నూతన సంప్రదాయము నితడు స్థాపించి దానికి 'ఆంధ్రసంప్రదాయ' మని పేరిడెను.

ఇతడు 1920 వ సంవత్సరాంతమున రాజమహేంద్ర వరమునకు తిరిగి వచ్చి స్వగృహమునందే స్టుడియోను ఏర్పాటుచేసికొనెను; సత్యవాణిని వివాహమాడెను. ఆమె సహధర్మచారిణియే కాక చిత్రకారిణికూడ నగుటచేత అన్యోన్య దాంపత్యభాగ్య మితనికి లభించెను. ఇతడు ప్రతి సంవత్సరము వివిధ లలితకళా ప్రదర్శనములలో పాల్గొనుచు బహుమానములను అందుకొనసాగెను. 'సిద్ధార్థుని రాగోదయము' టొరాంటోనగరమం దేర్పాటుచేసిన కెనెడియను భారతీయ ప్రదర్శనము నలంకరించెను.

1922 లో ఇతడు 'ఆంధ్రభారతీయ చిత్రకళాపరిషత్తు'ను స్థాపించెను. పిన్నవయసువారు పలువురు ఆంధ్రచిత్ర కారులు దానిలో సభ్యులై ఇతడు పెట్టిన ఒరవడినే దిద్దుకొనుచు పోసాగిరి. ఉజ్జ్వలమగు భావిజీవిత ప్రాంగణ మం దడుగిడగానే ఇతడు మశూచివలన అకాలమృత్యువు వాతబడెను.

నవ్యాంధ్రమున సంభవించిన లలితకళల పునరుజ్జీవనోద్యమమునందు లభించిన తొలిపంట రామారావు కృషి. స్థూలముగా చూచిన అందు మూడుదశ లున్నట్లు తోచును. అవి యవనదశ, అజంటాదశ, ఆంధ్రదశ యనునవి. మొదటి రెండు దశలను దాటి ఇతని దృష్టి చివరకు ఆంధ్రమునందలి నిత్యజీవిత రంగములపై ప్రాలినది. పరిణతి పొందుచు వచ్చిన ఇతని శైలి ఇప్పటికి పరిపక్వము నందినది. ఇప్పటి చిత్రములు 1923 - 27 నకు మధ్య వ్రాసినవి. ఇవి ఆంధ్రము నందలి అందచందములకు పేటికలు. చాలవరకు లావణ్య సౌష్ఠవములకును, మానస దివ్యభూతులకును, భావరూప ములకును సహజమైన సంయోగమును కలుగజేసి ఇతడు కృతకృత్యుడయ్యెను. **మ. సూ. ప్ర.**

**రామిరెడ్డి, దువ్వూరి** (క్రీ. శ. 1897 - 1947): ఇతడు నెల్లూరు మండలములో జన్మించినాడు; ఇరువది యేండ్ల ప్రాయమప్పుడే (1917) స్వకుటుంబ వృత్తమైన 'నలజారమ్మ అగ్నిప్రవేశము'నకు చకితస్వాంతుడై కావ్యమల్లెను; విజయనగర సంస్థానమువారు నిర్వహించిన కావ్యపరీక్షలో నుత్తీర్ణుడై యీ కవి వెలయించిన కావ్యము (1918) 'వన కుమారి' తర్వాతిది. ఇం దెనిమిది మంజరులు గలవు. సంభాషణ ధోరణిలో ప్రకృతి వర్ణనలతో విలసిల్లు నీ కావ్యము 'నానాదేశస్థ రసిక హృదయముల' నలరించినది. ఈ కవి కావ్యము లన్నిటం బ్రశస్తి వహించిన కావ్యము (1919) 'కృషీవలు' డనునది. రైతుబిడ్డ యైన యితడు గ్రామీణ సౌభాగ్యమును, కర్షకుని దైనందిన జీవితమును చిత్రింప దొరకొని స్వచ్ఛంద విహారియై, ప్రకృతిబిడ్డవోలె నిందు తనివిదీర గానముచేసినాడు. ఆంగ్ల వాఙ్మయమున 'పాస్టరల్ పొయెట్రీ' ప్రభావ మున్నట్లు కన్పించినను 'అకృత్రిమ జీవిత స్వభావాదుల' గ్రామ సౌభాగ్యముల తనవిగా జేసికొన్న యీ కవి యాలాపములు స్వీయానుభవ వినిర్గతములే యనదగినవి.



చిత్రము 226.
దువ్వూరి రామిరెడ్డి

> 'వనలతయైన నా కవిత పత్ర పుటంబులఁ బూవు రెమ్మలన్
> దినదిన జృంభమాణయయి తేజరిలెన్ సహజప్రరోహ వ
> ర్ధననియమానుసారముగ...'

నని కవి తానే చెప్పుకొన్నాడు. 'జలదాంగన' (1920),

'యువకస్వప్నము', 'కడపటి వీడుకోలు' (1924) అనెడి ఖండములు పరిణతి చెందిన కవిహృదయము నందించు చున్నవై ఉత్తమ భావుకత్వమును, మనస్తత్వ పరిశీలన శక్తిని, స్వాతంత్ర్య కాంక్షను వెలిబుచ్చుచున్నవి. పారశీక భాషా పరిచయమే కాక యందు పాండిత్యమును గూడ సంపాదించి యీ కవి 'పానశాల' (1934) అనెడి సుప్రసిద్ధ కావ్యము నొసగి యాంధ్ర రసిక జనుల మెప్పు వడసినాడు. 'ఉమ్రఖయ్యాము' రుబాయీల కనువాదమైనను యిందలి పద్యములు - అటనటనున్న పారసీకపదముల నటుంచినచో స్వతంత్ర కావ్య ధోరణికి చెందినవన్నట్లొప్పుచున్నవి. ఈ కావ్యమునకు ఇతడు స్వయముగా వ్రాసిన ఉపోద్ఘాతము మణిబంధమువంటిది. దేశ స్వాతంత్ర్యము, ప్రేమ, ప్రకృతి మున్నగు వస్తువైవిధ్యముతో కూడిన యీతని ఖండ కావ్యము లొక సంపుటముగా వెలువడినవి (1936). ఈ కవిని బెజవాడలో ఆంధ్ర మహాసభవారు 'కవికోకిల' బిరుదుతో గౌరవించిరి.

కొంతకాలమునకు కవిత తనను వీడినదని తెలిసికొన్నవాడై యీ కవి 'కడపటి వీడుకోలు' రచించెనట. కవితాస్పర్శ లేక కాలము గడిచినవెనుక 'కవి సంశయావస్థ' అని ఇతడు కొన్ని పద్యములు వ్రాసినాడు. కాని యా తర్వాత మూడు మాసములకే మీరాబాయి (కుంభరాణా) నాటకము, తర్వాత మాధవ విజయ మను నాటకమును వ్రాసెను. గావున ఆ పద్యములు 'నా కవితా ఋతువునకు పురోగామిగా' దొరలినవని కవియే సమన్వయించుకొన్నాడు; చివరి దినములలో 'పలితకేశము', 'గులాబితోట' (గులిస్తాన్ అనువాదము) లను రచించినాడు. 'కళ' అను పత్రికలో (1923) ప్రకటితములైన యీతని వ్యాసములు 1935 నాటికి 'సారస్వతవ్యాసములు' అను గ్రంథరూపమును దాల్చినవి. సాహిత్య సూత్రములగూర్చి యాలోచనము నెరపుచున్న యీ వ్యాసములు చాలవర కాధికారికములైన వనవచ్చును.

ఈ కవి నాటకములను సైతము వ్రాసినాడు. సీతావనవాసము, కుంభరాణా, మాధవవిజయము అన్నవి పౌరాణిక చారిత్రకములు. 'కాంగ్రెసువాలా' అన్నది వ్యావహారికము, మిశ్రమునైన భాషలో వ్రాసినట్టిది.

సినిమా సంస్థతో సంబంధముగలవాడై చివరి దశలో కొంతకాల మితడు గడపినాడు. ఇతనికి శాస్త్ర విజ్ఞానముపై మక్కువయే కాక ప్రజ్ఞ కూడ నున్నట్టిది.

'అణువునందున్న తేజస్సె యధికమగును
ఒక్క భువనంబుఁ జూర్ణించి యూఁదివైవ'

అని యేనాడో గుర్తించిన విజ్ఞాని యీతడు. తుదకు తన యాస్తిలో గొంతభాగ మీ 'కవికోకిల' శాస్త్ర విజ్ఞాన పరిశోధనలకు బహూకృతుల నీయుటకై నియామకము చేసి 1947 సెప్టెంబరులో కన్ను మూసినాడు. 'పదలాలిత్యము అర్థగాంభీర్యములతో సమరసింపజేయగల కృతార్థకవిపయులలో ఈయన ఒకరు' అనుట యథార్థము. పి.వెం.హ.

**రాయలసీమ :** రాయలసీమ అన్నది కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురములకు దాదాపు ముప్పదియైదేండ్ల నుంచి వాడుకలోనికి తేబడినపేరు. అంతకుపూర్వము వీటికి దత్తమండలములని పేరు.

బ్రిటిషువారితో హైదరాబాదు నిజాం ప్రభువు క్రీ. శ. 1792-1799 సంవత్సరములలో ఒడంబడికలు చేసికొని వారికి సాయము వెళ్ళి రెండవ, మూడవ మైసూరు యుద్ధములలో విజయము చేకూర్చెను. ఈ విజయమునకు ఫలితముగా అదివరలో చేసికొన్న ఒడంబడికల ప్రకారము హైదరాబాదు నవాబు నిజామునకు మైసూరు రాజ్యము నుండి కొన్ని మండలములు దఖలుపడినవి. నిజాంప్రభు వీ మండలములను తన రాజ్యములో తన సాహాయ్యార్థము ఉంచిన సేన వ్యయపోషణముల నిమిత్తము బ్రిటిషువారికి దత్తము చేసెను. నాటినుంచి ఈ మండలములకు దత్తమండలములని పేరు కలిగెను. ఇవే వనగా బళ్ళారి, కడప, పూర్వము కర్నూలుజిల్లా అనబడు దానిలోని నాలుగు తాలూకాలు. కర్నూలుజిల్లాలోని మిగిలిన తాలూకాలప్పుడు నిజాంప్రభువుకు సామంతుడుగా నుండిన కర్నూలు నవాబు అధీనములో నుండెను. ఇట్లు దత్తము చేయుటలో నిజాముప్రభువుయొక్క సర్వాధిపత్యము కుంపిణీవారికి సంక్రమించినది. క్రీ. శ. 1839 లో కర్నూలు నవాబు పితూరీ చేసినందువల్ల ఆతని అధికారముక్రింద నుండిన కర్నూలు జిల్లాలోని తాలూకాలను బ్రిటిషువారు వశము చేసికొనిరి.

క్రీ. శ. 1882 లో పరిపాలన సౌకర్యము నిమిత్తము బళ్ళారిజిల్లాను బళ్లారి, అనంతపురము అను రెండు జిల్లాలుగా విభజించిరి. ఈ విధముగా ఏర్పాటయిన కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురము జిల్లాలు నాలుగింటికి ఇటీవలివరకు దత్తమండలము లనియే పే రుండెను.

దేశములో జాతీయాభిమానము, గౌరవము హెచ్చిన కొద్ది 'దత్తమండలము'లను పేరు ప్రజలకు న్యూనతగాను, అగౌరవముగాను తోచినది. అందువలన వారు క్రొత్తపేరు పెట్టుటకు ప్రయత్నము చేసిరి. తత్ప్రయత్న ఫలితమే 'రాయలసీమ'.

కృష్ణదేవరాయలు ఏలిన దేశము గనుక ఈ దత్తమండలములకు రాయలసీమ అను పేరు ఉచితమైనదని కొందరు చెప్పుదురు. కాని రాయలు ఒక్క రాయలసీమనేకాక ఇతర

ప్రాంతమునుకూడ పాలించెను. కాబట్టి ఆ కారణమున ఈ నామకరణము చేయబడిన దనుట సరికాదు. కాని ఈ ప్రాంతమునకు రాయలకు పూర్వమునందును, అటుతరువాతనుకూడ ఇంచుక వ్యత్యాసముతో ఈ పేరే ఉన్నది. అప్పు డీ దేశమునకు మార్జవాడి అని పేరు.

విజయనగరాధీశుల కాలములో పరిపాలన సౌకర్యము నిమిత్తము ఉదయగిరి మార్జవాడి, పెనుగొండ మార్జవాడి అని మార్జవాడి రెండు విభాగములుగా విభజింపబడినది. ఈ విధమయిన పద్ధతివలన మార్జవాడిలోని తూర్పు విభాగము ఉదయగిరి దుర్గమునకును, పడుమటి విభాగము పెనుగొండ దుర్గమునకును అణకువయై యుండెను.

మార్జవాడి అన్నది మహారాజపాడి, మహారాజవాడి అనుదాని భ్రష్టరూపము. పాడి, వాడి, నాడు - ఇవి దేశ వాచకములు. మహారాజవాడి, మహారాజపాడి అనునవి మారాజవాడి, మారాయపాడి, మార్జవాడిగా వాడుక భాషలో మార్పుచెందినవి. ఈ రూపము లన్నియు క్రీస్తు శకము పదుమూడు,పదునాలుగవ శతాబ్దులనాటి శాసనములలో కానవచ్చును. ఇది ఏడువేల దేశము. దీనికి పండ్రెండు, పదుమూడు శతాబ్దములలో కడపజిల్లాలోని వల్లూరు రాజధానిగా ఉండెను. క్రీస్తుశకము పదునొకండు, పండ్రెండు శతాబ్దముల నాటి శాసనములలో తూర్పు మారాయపాడికి కీఙ్ మారాయపాడి అని, పడుమటి విభాగమునకు మేల్ మారాయపాడి అని పేర్లుండెను. ఈ మహారాజపాడికే మహారాజరనాడు, మహారాజుల దేశము అని కూడ వ్యవహారము. మహారాజరనా డనగా రాయలసీమయే. ఈ మహారాజరనాడు దక్షిణమున కోలారుజిల్లా, చింతామణి తాలూకా కైవారమునుండి ఉత్తరమున నలగొండజిల్లా పానగల్లువరకు వ్యాపించి యుండినట్లు పదుమూడవ శతాబ్దినాటి శాసనములవలన తెలియుచున్నది.

తొమ్మిదవ శతాబ్దమునాటి శాసనములలో కూడ 'మహారాజరనాడు' కానవచ్చుటచేత ఈ దేశమున కా పేరు అంతకు పూర్వము చాలకాలమునుండి ఉండినట్లు తలపవలసియున్నది. క్రీస్తు శకము ఏడు, ఎనిమిది శతాబ్దములనాటి శాసనములలో పేర్కొనబడిన 'రేనాడు' అను దేశవిభాగమును, ఈ 'మహారాజరనాడు'ను ఒక్కటే అనుటకు ఆధారము లున్నవి. 'రేనాడు' అనగా రాజుల (మహారాజుల) దేశము. 'రేనాడు'ను ఏడువేల దేశమే. ఈ దేశమునకు 'రేనా' డను పేరు పల్లవుల నాటినుండి ఉండుటచేత అది పల్లవమహారాజులను బట్టి వచ్చిన దనుటకు వీలులేదు. ప్రాయికముగా యిది ఈ ప్రాంతమును తొలు దొల్త పరిపాలించిన ఆంధ్ర సాతవాహనులనుబట్టి వచ్చియుండునని తోచుచున్నది. ఎట్లయినను ఈ ప్రాంతమునకు చాల పూర్వకాలమునుండి రాజులదేశము 'రేనాడు', మహారాజుల దేశము (మహారాజరనాడు, మారాయపాడి, మారాజవాడి, మార్జవాడి) అను పేరులు చెల్లుచునే యుండెను. అనుద్దిష్టముగనో, ఉద్దేశపూర్వకముగనో మరల ఆ యర్థమునే యిచ్చు 'రాయలసీమ' అనే పేరు ఈ ప్రాంతమునకు కలుగుట విచిత్రము. మ. సో. శ.

**రుక్మిణమ్మ, అచంట** (క్రీ. శ. 1891 - 1951): ఈమె తుమ్మలపల్లి రాజా రామారావుగారి రెండవ కూతురు; చూడమ్మగారికిని, మధుర వాస్తవ్యులు ఉగ్గెళ్ళ శ్రీనివాసరావుగారికిని జన్మించినది.

ఆ కాలములో ఆడపిల్లలు స్కూళ్ళకు పోయి చదువుట అంతగా వాడుకలో నుండెడిది గాదు. 6, 7 సంవత్సరముల వయస్సుననే ఈమెకు వివాహము చేయుటకై తల్లిదండ్రులు ప్రయత్నించిరి. కాని తగిన వరుడు దొరకక విఫలమనోరథులైరి. అదిగాక ఆ కాలములో వరకట్నముల బాధ మిక్కిలి హెచ్చుగా నుండెను. అంతట వివాహప్రయత్నము నిలిపి ఈమె తండ్రిగారు తన కుమార్తెను బి. ఏ. ప్యాసు చేయించవలయునని నిశ్చయించి ఎగ్మూరు ప్రెసిడెన్సీ ట్రైనింగు స్కూలులో చేర్పించినారు. పట్నములో ప్రసిద్ధి చెందిన వీణ ధనమువద్ద ఈమె వీణ నేర్చినది; లండన్ వెళ్ళినప్పుడుగూడ ఒక గొప్ప సభలో వీణ వాయించి భారతదేశముయొక్క కీర్తిని ప్రకటించెను. ఈమె మెట్రిక్యులేషన్ క్లాసుకు వచ్చేవరకు ఈమె తండ్రిగారు 1910 లో అకాలమృత్యువు పాలైరి. నాటినుండి ఈమెను పినతండ్రి నెమలి పట్టాభి రామారావుగారు తమ కుటుంబములో జేర్చుకొని ఆదరించిరి. ఈమె మెట్రిక్యులేషన్ పరీక్ష ప్యా సయినది. తండ్రిగారు పోవునప్పటికి ఈమెకు 19 సంవత్సరములు. ఇంతకు ముందే పట్నములో సుప్రసిద్ధముగా వైద్యము చేయుచున్న డా. లక్ష్మీపతిగారి వద్దకు ఏదో ఒక చిన్న వ్యాధికి చికిత్సనిమిత్తమై తండ్రిగారు ఈమెను తీసికొనివెళ్ళినప్పు డేర్పడిన ప్రేమాంకురములు వృద్ధియై పట్టాభిరామారావుగారు అంగీకరింపక


చిత్రము 227.
ఆచంట రుక్మిణమ్మ

పోయినను ఉభయులు 1911 లో వివాహమాడిరి. రజస్వలానంతర వివాహము ఆ కాలములో సంఘము నిషేధించినను పట్నములోని పెద్ద లందరు ఈ వివాహమున పాల్గొనిరి.

1911 లో ఈమె భారతీయ మహిళా మండలి మద్రాసు శాఖకు కార్యదర్శిగానుండి పట్నములోని స్త్రీల నందరిని సభ్యులుగా చేర్చి సభలు, ప్రదర్శనములు జరుపుచుండెను. ఇప్పుడు మౌంటు రోడ్డులో నున్న స్వదేశీ స్టోర్సు ఈ మహిళామండలి తరపున స్థాపింపబడినది. ఈమె 1920 లో బి. ఏ. పరీక్ష ప్యాసయ్యెను.

1921 మొదలు ఖద్దరు ప్రచారము, విదేశవస్త్ర బహిష్కరణము మొదలగు ఉద్యమములలో ముందుగా నిలిచి పనిచేయుచు ఈమె 1926 వ సంవత్సరములో పారిస్‌లో జరిగిన 'ఇంటర్ నేషనల్ విమెన్స్ సఫ్రేజ్ అలైన్స్ కాంగ్రెసు' యొక్క పదవ సభకు భారతదేశపు ప్రతినిధిగా వెళ్లెను. దేశమునకు తిరిగివచ్చిన తరువాత చెంగల్పట్టు జిల్లాబోర్డు మెంబరుగాను, మద్రాసు అన్నామలై యూనివర్సిటీల సెనేటు మెంబరుగాను, సత్యమూర్తిగారు మేయరుగానున్నప్పుడు మద్రాసు కార్పొరేషన్‌లో ఎగ్మూరు డివిజనుకు ప్రతినిధిగాను, వర్క్సు సబ్ కమిటీ చైర్మనుగాను, పనిచేసెను. 1930 మే లో ఉప్పు సత్యాగ్రహోద్యమ సందర్భమున వేదారణ్యమున ఉప్పుసత్యాగ్రహము చేసి భారతదేశమున బంధితలైన స్త్రీలలో మొట్టమొదటి స్త్రీ యయ్యెను. అప్పటినుండి 1942 'క్విట్ ఇండియా' ఉద్యమమువరకు చాలసార్లు జైలుకు వెళ్లెను. ఈమె తమిళనాడు ప్రొవిన్షియల్ కాంగ్రెస్ కమిటీ అధ్యక్షురాలుగాను, మద్రాసు లెజిస్లెటివ్ అసెంబ్లీలో డిప్యూటీ స్పీకరుగాను పనిచేసెను. 'ఆల్ ఇండియా విమెన్స్ కాన్ఫరెన్సు'కు మొదటి కార్యదర్శినిగా నుండి మిసెస్ కజిన్స్, శ్రీమతి ముద్దులక్ష్మి రెడ్డిగార్లతో కలిసి పనిచేసి లాహోరు సభకు అధ్యక్షురాలయ్యెను.

1946 లో ప్రకాశంగారి మంత్రివర్గంలో ఆరోగ్యశాఖకు మంత్రిగా నుండినపుడు కార్యకలాపములు ఎక్కువగుటచే ఆరోగ్యము చెడెను. ఈమెకు దైవభక్తి, సంగీత విషయాలన్న అభిలాష మెండు.

ఈమెకు ఇద్దరు కుమార్తెలును ఒక కుమారుడును కల్గిరి. ఈమెయొక్క దేశహిత కార్యముల కన్నిటికి ఈమె భర్త వెనుకనుండి సహాయము చేయుచు ప్రోత్సహించేవారు.

గుంటూరులో మెడికల్ కాలేజీ స్థాపించుట కీమె పట్టుదలతో పనిచేసెను. చెన్నపట్నములో ఇండియన్ మెడికల్ స్కూలును కళాశాలగా మార్పించి ఈమె దేశీయ వైద్యాభివృద్ధికై మిక్కిలి కృషిచేసెను. ఆవడి సమీపమున కోవెల్ పదాహి గ్రామములో ఈమె జ్ఞాపకార్థమై ఒక జలాశయమును, ఆరామమును నిర్మించి యున్నారు. ఆ.ల.

**లక్ష్మణస్వామి, ఈమని :** ఈయన కృష్ణాజిల్లా, బందరు వాస్తవ్యుడు ; ఆంధ్ర బ్రాహ్మణుడు ; భారీ విగ్రహము; స్ఫురద్రూపి; ఎట్టివారి నైనను ఇట్టే ఆకర్షించు అందమైన నేత్రయుగ్మము గలవాడు ; సదాచారపరుడు ; ఆంగ్లభాషాకోవిదుడు కాకపోయినను హిందీ భాషావిశారదుడు; గొప్ప పండితుడు కాకపోయినను మంచి సమయస్ఫూర్తిగల భాషా చతురుడు. హిందీ గద్యనాటక రచన,అందలి పాత్రపోషణము, ప్రదర్శనాకౌశలము, ఉత్తమ నటనానుభవము, వాటి లక్ష్యలక్షణములు ఈయన కలవడిన సహజ పాండిత్యము. అందుపై ఈయన సాధన మహోత్తమ నటునిగ ఈయనను తీర్చిదిద్దినది.



చిత్రము 228.
ఈమని లక్ష్మణస్వామి

ఈయన సుమారు 1884 వ సంవత్సరమున బందరులో 'నేషనల్ థియేటరు' నొకదానిని స్థాపించి, హిందీ భాషలో తానే నాటకములను రచించి, ప్రదర్శించుచుండేవాడు. అందులో ఈయన పఠాణి, ఘుమేర్‌సింగ్, రాణా ప్రతాప్, యుగంధరుడు, శివాజీ వేషములు అశేష రసజ్ఞ ప్రేక్షకామోదమును పొందుచుండెడివి. ఈయన శివాజీ పాత్రాభినయము అసలు శివాజీనే మరపించుచు ఒకప్పుడు బిపిన్ చంద్రపాలుగారి మెప్పునుగూడ పొందినది. ఈయన భావప్రకటనలో చిప్పిలు కరుణ, ప్రభుభక్తి, దైవచింతన, ధర్మబోధ, రోషావేశము, కోపము, పశ్చాత్తాపము, బీభత్సము, భయానకము మొదలగు భావములు కుప్పతిప్పలుగ పొర్లి మందులకొట్టు తగులబడినట్లుగను, తోకచుక్కలు రాలినట్లుగను, పెనుగాలితో వర్షము కురిసినట్లుగను, ప్రేక్షకులకు తోచి భయ విస్మయానందములు గలిగించుచుండెడివి.

ఈయనకు సంగీతము రాకపోయినను, గద్య భాషోచ్చారణలోని శబ్దమాధుర్యము సంగీతమునే ఒలికించుచుండెడిది. ఈయన తన నాటకాభినయముతో ఆంధ్రావనికేగాక మొత్తము భారతావని జాతీయతకే వన్నెబెట్టిన ఆదర్శ నాయక నటశిఖామణి. స్థా. న. రా.

**లక్ష్మీకాంతం, బలిజేపల్లి** (క్రీ. శ. 1881-1953): వీరి జన్మస్థలము గుంటూరుజిల్లా బాపట్లతాలూకా ఇటికంపాడు. తండ్రి నరసింహశాస్త్రిగారు; తల్లి ఆదిలక్ష్మమ్మ. వీరు మేనమామ భాగవతుల చెన్నకృష్ణయ్యగారి వద్దనుండి విద్య నభ్యసించిరి. భారత భాగవత రామాయణములు చక్కగా చదివి అర్థము చెప్పగల వీరి మేనత్త సరస్వతమ్మ వీరికి తద్గాథామృతమును ప్రసాదించినది. వీరు చిన్నతనముననే సంస్కృతాంధ్రముల నభ్యసించిరి; కర్నూలులో చదివి మెట్రిక్యులేషన్ పరీక్షయందుత్తీర్ణులైరి. వీరికి చిన్ననాడే కవిత్వముచెప్పు శక్తి యలవడినది; సంగీత సాహిత్యములందభిరుచి యెక్కువ. వీరు విద్యాభ్యాసానంతరము కొంతకాలము కర్నూలులో సబ్ రిజిస్ట్రారు ఆఫీసులో హెడ్‌గుమాస్తాగాను, తరువాత కొంతకాలము గుంటూరు హిందూ కళాశాలలో ప్రధానాంధ్రోపాధ్యాయులుగాను పని చేసిరి; పిదప అవధానాదులలోకూడ ప్రజ్ఞా పాటవములు సంపాదించి ఉద్యోగమును విడిచిపెట్టి తెలుగు సంస్థానములను సందర్శించి అవధానములను గావించిరి; 1922 లో చల్లపల్లి రాజావారి సాయముతో గుంటూరులో చంద్రికా ముద్రణాలయమును స్థాపించిరి; ఉప్పుసత్యాగ్రహమునందు పాల్గొని రెండు సంవత్సరములు కారాగృహవాస మనుభవించిరి. అప్పుడు వీరు సత్యహరిశ్చంద్రీయ నాటకమును రచించిరి. కారాగారమునుండి విడుదలయైన పిదప మిత్రుల సాయముతో 1926 లో గుంటూరులో 'ఫస్టు కంపెనీ' అని పేరొందిన నాటక సమాజమును స్థాపించి వీరు 'సత్యహరిశ్చంద్రీయ', 'ఉత్తర రాఘవా'ది నాటకములను పలుమారులు ప్రదర్శించిరి; అందు వేషములు వేసి చక్కగా నటించి ప్రఖ్యాతి కెక్కిరి. 1930 లో రంగూన్ ఆంధ్రుల ఆహ్వానముమీద అచ్చటికి వెళ్ళి అచటి కళాశాలలో విద్యను గూర్చి ఉపన్యసించి సత్యహరిశ్చంద్రీయ నాటకమును ప్రదర్శించిరి. తత్ప్రదర్శనానంతరము అచటి ఆంధ్రులు సన్మానించి వీరికి 'కవితా కళానిధి' యను బిరుదొసంగిరి. తరువాత కొంతకాలమునకు వీరు చిత్తజల్లు పుల్లయ్యగారి ప్రోద్బలమువలన చలనచిత్ర పరిశ్రమలో ప్రవేశించి అనేక చిత్రములకు కథ, సంభాషణలు, పాటలు రచించియు, వానిలో పాత్రలను ధరించియు చలనచిత్రరంగమున పేరు సంపాదించిరి. 1942 లో చలనచిత్ర సంఘమువారు వీరిని ఘనముగ సన్మానించి 'పుంభావ సరస్వతి' యను బిరుదము నొసంగిరి.


చిత్రము 229.
బలిజేపల్లి లక్ష్మీకాంతం

సత్య హరిశ్చంద్రీయములో నక్షత్రకుడు వీరి అభిమాన పాత్ర. వీరు తమ చరమదశలో కాళహస్తిలో నివసించి అచ్చటనే పరమపదించిరి. వీరు రచించిన గ్రంథములు: శివానందలహరి శతకము (శంకరుల కృతికి ఆంధ్రీకరణము); స్వరాజ్య సమస్య (పద్య కృతి); బ్రహ్మరథము, మణిమంజూష - నవలలు; బుద్ధిమతి విలాసము, సత్య హరిశ్చంద్రీయము, ఉత్తర రాఘవము (భవభూతి నాటకమున కాంధ్రీకరణము) - నాటకములు. జీవిత చరమ దశలో వీరు రచంచిన కావ్యము రామాయణము-సుందర కాండము. ఇది యసంపూర్ణము. బి. స.

**లక్ష్మీధరుడు, చెరుకూరు**: ఇతడు విజయనగర ప్రభువగు తిరుమలరాయల యాస్థానమున నుండెను. గుంటూరు మండలములోని చెరుకూరు ఇతని గ్రామము. ఇతడు గీత గోవిందమునకు 'శ్రుతిరంజని'యను వ్యాఖ్యానమును, ఒక భరతశాస్త్ర గ్రంథమును, 'తిమ్మభూపాలీయ' మను ప్రసన్నరాఘవ నాటక వ్యాఖ్యానమును, ఋతు 'క్రీడా వివేకము 'ను వ్రాసెను. 'షడ్భాషాచంద్రిక'యను ప్రాకృత వ్యాకరణమును, 'స్వర్ణమంజరి', 'అలంకార ముక్తావళి' యను గ్రంథములను వ్రాసెను. అనర్ఘరాఘవ, ప్రసన్న రాఘవములకు వ్యాఖ్యానమును రచించెను. ప. రా. స్వా.

**లక్ష్మీధరుడు, లొల్ల** (క్రీ. శ. 1465 - 1530): సప్తపురుషాంతరములవరకు మహావిద్వాంసులైన వంశములు ప్రాతఃకాల తారకలవలె నెక్కడనోకాని కానరావు. ఇట్టి విఖ్యాత వంశాంకురము లక్ష్మీధరుడు. హరిత సగోత్రజుడు, ఆపస్తంబ శాఖీయుడు. ఈయన జనకుడు 'నూతన వ్యాస', 'మహోపాధ్యాయ', 'విద్వత్సార్వభౌమ' బిరుదముల నంది 'నయ వివేక దీపిక'ను రచించిన విశ్వనాథ భట్టారకుడు, జనని పార్వతి. పితామహుడు ప్రభాకరామృతవాహిని, ప్రభావళీ ఖండనాది బహుగ్రంథ ప్రవర్తకుడగు లక్ష్మణార్య మహోపాధ్యాయుడు; ప్రపితామహుడు. 'మీమాంసాద్వయ', 'జీవాతు' కర్త పురుషోత్తమ మహోపాధ్యాయుడు. పురుషోత్తమ పండితుని జనకుడు 'భరతార్ణవ పోతము', 'సాహిత్య మీమాంస' యను కృతులకు కర్తయైన విరించిమిశ్రుడు. విరించి మిశ్రుని తండ్రి 'సాహిత్య పారిజాత' స్మృతి కల్పతరువు, లను గ్రంథములను నిర్మించిన లక్ష్మీధరార్యుడు. ఈ లక్ష్మీధరుని పిత మన లక్ష్మీధరునకు సప్తమ పూర్వపురుషుడు

మహామహోపాధ్యాయ మహాదేవాచార్యుడు. ఈయన భ్రమరాంబికా వరప్రసాద సముల్లసిత సారస్వతుడు; లోల్లకుల సంప్రదాయ ప్రవర్తకుడు. భట్టలోల్లటుని నాట్య శాస్త్ర వ్యాఖ్యానమునకు వివరణమును రచించెను. ఈ మహాదేవాచార్యుడును, ఆంధ్ర కవిత్రయమునందలి ఎర్రాప్రెగడయు రెడ్డిరాజ్య స్థాపకుడైన ప్రోలయ వేమారెడ్డి యాస్థాన విద్వత్కవులు.

కృష్ణదేవరాయల యాస్థానము నలంకరించిన విద్వత్కవు లిరువురు; లొల్ల లక్ష్మీధరుడు, దివాకరుడు. వీరిరువురు మొట్టమొదట ఉత్కల దేశాధీశ్వరుడగు ప్రతాపరుద్ర గజపతి యాస్థానమున నుండెడివారు. క్రీ. శ. 1516 లో నీ గజపతి కృష్ణదేవరాయల ధాటి కాగలేక సంధి కొడంబడి తన తనయను ఆతని కిచ్చి వివాహము చేసెను. కృష్ణదేవరాయలు శ్వశురాస్థానమున నున్న పై కవిద్వయమును తన రాజధానికి తీసికొనిపోయెను. ఈ యిరువురిలో లక్ష్మీధరుడు సాహిత్య మహారథుడు; షడ్దర్శనీ పారంగతుడు; ఉదాత్తగ్రంథ నిర్మాత; నిఖిల యామళ తంత్రమును మథించెను; 'సరస్వతీ విలాసా'ద్యనేక ధర్మశాస్త్ర గ్రంథములను రచించెను. 'సరస్వతీ విలాసము'ను గజపతి రచనగా నీతడే రచించి తిరిగి యేలనో తన సౌందర్యలహరీవ్యాఖ్యయందలి గద్యమున నీ గ్రంథమును తన కృతిగా జెప్పుకొనెను. 'సాహిత్య లక్ష్మీధరము' మొదలగు మీమాంసాగ్రంథములను, 'యోగదీపి'కాది యోగ గ్రంథములను, 'మానవధర్మశాస్త్ర టీక'ను, 'కర్ణావతంస-బర్హావతం'సాద్యనేక కావ్యములను రచించి మహోపాధ్యాయ బిరుదము నందెను. శంకరాచార్యుల 'సౌందర్యలహరి' కీయన చక్కని విపుల వ్యాఖ్య (లక్ష్మీధరము)ను రచించి, తద్గద్యమున స్వవంశవృత్తాంతమును, తన పూర్వ పురుషుల వైభవ, వైదుష్యములను బేర్కొనెను. ఈయన కెంచము యెల్లయార్యునితో గలసి దైవజ్ఞవిలాసమును రచించెను. ఈ. వేం. వీ. రా.

**లక్ష్మీనరసమాంబ, పులుగుర్తి :** ఈమె చింతలపూడి నీలాచలముగారి కూతురు; పులుగుర్తి వేంకటరత్నంగారి ధర్మపత్ని. ఈమె పితామహులును, మాతామహులును కవి పండిత భక్త వంశములకు చెందినవారు. పండితులును, విమర్శకాగ్రేసరులును అయిన నడకుదుటి వీరరాజుగారు ఈమెకు మేనమామ. వీరేశలింగముగారికి సంఘసంస్కార విషయములోను, దానినిబట్టి సాహిత్య విషయములోను విరోధులుగా నుండిన కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు ఈమెకు గురువు లగుటవలన ఈమె సనాతన ధర్మమునకు వ్యతిరేకమైన సంఘసంస్కారమును ఆమోదించలేకపోయినను స్త్రీవిద్య యెడల అభిమానము కలది యగుట చేత గ్రంథ రచన కావించుటే కాక 'సావిత్రి' పత్రికా సంపాదకురాలుగా చాలకాలము స్త్రీల రచనలకు ప్రోత్సాహము కలిగించుచుండెను. తెలుగుదేశ మందలి స్త్రీ సమాజములలో మొట్టమొదటిది అనదగు 'విద్యార్థినీ సమాజ'మును ఈమె కాకినాడలో స్థాపించెను. ఈమె తన 15 వ యేట 'మహిళాకళాబోధిని'యను కావ్యమును రచించినది. ఈమె వ్యాసములు, రచనలు సావిత్రి పత్రికలోనే కాక జనానా, హిందూసుందరి మొదలయిన పత్రికలయందును ప్రకటితములయినవి. ఈమెకు హిందీ, వంగభాషల యందు కూడ ప్రవేశ ముండుటచేత ఈమె ఆ భాషలలోగల పుస్తకములు అనువదించెను. అమరవిజయము, కమలా కుమారి, లోక బాంధవి, కామమంజరి మొదలయిన గద్య కావ్యములును, యోగీశ్వరి, అన్నపూర్ణ, వామన పురాణము, మహిళాకళాబోధిని, స్త్రీ నీతిగీతములు, సతీధర్మములు, అమూల్యము అను పద్యకావ్య సంపుటి, నీతిపదములు మొదలయిన పద్యకావ్యములును, మంగళహారతులును ఈమె రచనలలో పేర్కొనదగినవి. గి. వేం. సీ.

**లక్ష్మీనరసింహము, చిలకమర్తి** (క్రీ. శ. 1867 - 1945) : వీరు గోదావరిజిల్లా ఖండవల్లిలో తన మేనమామ యింట జన్మించిరి; మొదటి పేరు పున్నయ్య; తర్వాత లక్ష్మీనరసింహమూర్తి యని తలిదండ్రులు పిలిచేవారు. వీరు ఆరామ ద్రావిడ బ్రాహ్మణులు, కాశ్యప గోత్రులు, ఆశ్వలాయన సూత్రులు; ఋగ్వేదులు. వీరు తొలుత వీరవాసరములో చదివి 1881లో 'కంపేరిటివ్ ఎగ్జామినేషన్' అనే చిన్న పరీక్ష పూర్తిచేశారు. కొన్ని రోజులు కొండపల్లి మిషను స్కూలులోను, మరికొన్ని రోజులు తణుకులోను చదివి చివరకు రాజమహేంద్రవరమున 1886 లో మెట్రిక్యులేషన్ పూర్తిచేశారు; 1892 లో ప్రథమ శాస్త్రపరీక్షలో కృతార్థులు కాలేక చదువు విరమించుకొని ఉపాధ్యాయ వృత్తి నవలంబించారు.



చిత్రము 230.
చిలకమర్తి లక్ష్మీనరసింహము

ఆనాడు నాటక సమాజములు పెట్టి ప్రదర్శనలు ఏర్పాటుచేసే ఇమ్మానేని హనుమంతరావునాయుడు అనే ఆయన నిమిత్తం వీరు వచనములో మొదట నాటకములు రచించారు. వీరి తొలినాటకం 'కీచకవధ' (1889). 'ద్రౌపదీ పరిణయము' తరువాతది. 1889 లో 'శ్రీరామ జననము', 1890 లో 'గయోపాఖ్యానము' 'పారిజాతాప హరణము', 'నలచరిత్ర', 'సీతాకల్యాణము' వచ్చినవి.

వీరికి రంగస్థలావసరములు తెలియును. అందుచే ఆయా సమాజములతో కలసిమెలసి ప్రదర్శనయోగ్యము లైన మంచినాటకములు వ్రాశారు. 1920 లో సత్యవోలు గున్నేశ్వరరావుగారు నాటక సమాజము పెట్టి పద్య ములు పాడగల్గిన నటులను నియమించినప్పటినుండి వీరు నాటకములలో పద్యములుకూడ రచించినారు. మొదట వ్రాసిన 'గయోపాఖ్యానము' మొదలైన నాటక ములలో పద్యములు చేర్చి వీరు ప్రజాభిమానము చూర గొన్నారు.

సొంత రచనలు కాక అనేక సంస్కృత నాటక ములను వీరు ఆంధ్రీకరించారు. వానిలో 'పార్వతీ పరిణ యము' వీరి తొలిరచన. భాసుని నాటకములన్నీ తెనుగు చేసి ప్రచురించారు. 'పృథ్వీరాజీయము'ను 200 పద్య ములలో వీరు పూర్తిచేశారు.

వీరికి మొదట రేచీకటి. 1910 వ సంవత్సరములో అది ముదిరి పగలుకూడ కనిపించడం పోయింది. వీ రే పుస్తకమైనా ఎవరైనా చదివితే విని మననం చేసేవారు; తాము వ్రాసేది చెప్పి వ్రాయించేవారు. దృష్టిలోపం వీరిని ఏకసంథాగ్రాహిగా చేసింది.

కందుకూరి వీరేశలింగంగారు స్వతంత్ర రచనలు ప్రోత్స హించుటకు పెట్టిన ఉత్తమ నవలల పోటీలో చిలకమర్తి వారు 1894 లో 'రామచంద్ర విజయము' వ్రాసి 'చింతా మణి' బహుమతి నందుకొన్నారు. దాని తరువాత 'హేమ లత', 'అహల్యాబాయి', 'కర్పూరమంజరి', 'సౌందర్య తిలక'లను రచించి ప్రథమ బహుమానములు పొందిరి.

వీరు వీరేశలింగంగారిని గురువుగా స్వీకరించారు. నవలారచనలోను, ప్రహసనాల రచనలోను వారే వీరికి ఒరవడి. వీరి 'రామచంద్ర విజయము' ఇంచుమించుగా 'రాజశేఖర చరిత్ర'ను అనుసరించింది. వీరు వీరేశలింగం గారికంటె రసవత్తరంగానూ, వినోదదాయకంగానూ, మృదుమధురంగానూ నిర్వహించి చక్కని రచనలు చేశారు; 'మెడోస్ టెయిలరు' అనే ఆంగ్ల రచయిత వ్రాసిన టిప్పు సుల్తాను, తార, చాందు బీబీ అను నవలల పద్ధతిలో 'హేమలత', 'అహల్యాబాయి' రచించినారు; రమేశచంద్రదత్తు రచించిన 'లేక్ ఆఫ్ ది పామ్స్'ను అనుస రించి 'సుధాశరచ్చంద్రము'ను వ్రాసిరి. వీరు 'సరస్వతి' అను పత్రికలో తమ నవలలను, 'మనోరమ' (1906) మాసపత్రికలో రాజస్థాన కథావళి, మహాపురుషుల జీవిత చరిత్రములు, వినోదములు, కర్పూరమంజరి ప్రకటించారు. వీరు 1910 లో 'దేశమాత' అను వారపత్రిక పెట్టి సంపాద కులుగను, ముద్రాపకులుగను ఉండి అందు 'రామాయ ణము', 'ధర్మవిజయము' మున్నగు గ్రంథములు ప్రకటిం చారు; విదేశప్రభుత్వముక్రింద జరుగుచుండిన అన్యాయ ములను విమర్శించుచు నిర్భీక వ్యాసములు రచించారు. 1911 లో ప్రచండంగా రేగిన గ్రామ్య, గ్రాంథిక భాషా వివాదంలో వీరు గ్రాంథికభాషోద్యమాన్ని సమర్థిస్తూ ఉప న్యాసాలు చేసేవారు; 1922 లో ఋగ్వేదమును ఒక మండలము తెనిగించుట పూర్తిచేసి ధనాది సౌకర్యాభావం వల్ల విరమించుకొన్నారు. 1928 మార్చి 11 వ తేదీని రాజ మహేంద్రవరములో వీరి షష్టిపూర్తి మహోత్సవ సన్మాన ములు మహావైభవముగా జరిగినప్పుడు వీరి సంపూర్ణ గ్రంథావళి పది సంపుటములుగా ప్రకటితమైనది. చిలక మర్తివారు దేశాభిమాని; 'భరతఖండంబు చక్కని పాడియా'వను వీరి చారిత్రాత్మకమైన పద్యము జాతీయ సారస్వతములో ప్రథమ సృష్టి.

1943 లో ఆంధ్ర విశ్వవిద్యాలయంవారు వీరికి 'కళా ప్రపూర్ణ'బిరుద మిచ్చి వీరిని గౌరవించారు. 1944 లో ఆంధ్రాభ్యుదయ రచయితల సంఘంవారు వీరి స్వీయ చరిత్ర ప్రకటించి వీరిని గౌరవించారు. యం. స. నా.

**లక్ష్మీనరసింహారావు, పానుగంటి** (క్రీ. శ. 1865-1940): ఇరువదవ శతాబ్ది ప్రారంభమున పేరుగాంచిన తెలుగు రచయితలలో వీరు అగ్రగణ్య పంక్తికి చెందిన వారు. ఆరు భాగములుగా రచింపబడిన 'సాక్షి' వ్యాస సంపుటములు వీరికి సుప్రతిష్ఠ నార్జించి పెట్టి నవి. ఆంగ్లభాషలోని 'స్పెక్టేటరు'నకు 'సాక్షి' దూరాను సరణము కావచ్చును గాని, యిట్టి వ్యాసగ్రంథము తెలుగు వాఙ్మయములో నపూర్వము. వీరి గూఢ మధురమైన హాస్యరసమునకు, విమర్శన వివేకమునకు, జాతీయాభి మానమునకు 'సాక్షి' దర్పణమువంటిది. మతము, స్త్రీలు, నాగరికత, విద్యావిధానము, రాజకీయము, మున్నగు నెన్నో విషయములను వీరి 'సాక్షి' వ్యాస ములు వేడిగా, వాడిగా జర్చించి యున్నవి. జంఘాల శాస్త్రి, వాణీదాసు, బొర్రయశెట్టి పాత్రలు వీరి దయకు పాత్రములై తెలుగు పాఠకుల నుర్రూత లూగించుచు సజీవ ములుగా వెలయుచున్నవి.

వీరు శబ్ద వైచిత్రిని వలచిన రచయిత. తెలుగు వచన రచనలో నొక ప్రత్యేకస్థానము వీరు సంపాదించుకొనిరి. వ్యావహారికమునకు సన్నిహితమైన సలక్షణ భాషలోనే వీరి యావద్రచనయు సాగినది. ఒకే విషయము వివిధ భంగులుగా మార్చి మార్చి చెప్పుట వీరి రచనలోని క్రొత్తతీరు. 'కందుకూరి', 'చిలకమర్తి' కవుల హాస్యముకంటె వీరి హాస్యములో నొక విలక్షణత యున్నది. సంఘదోషములు వెల్లడించుటకు వీరి కలము వెనుదీయలేదు.


చిత్రము 231.
పానుగంటి లక్ష్మీనరసింహారావు

వీరి 'సాక్షి' రచన మొకయెత్తు, నాటకరచన మొకయెత్తు. 'షేక్స్పియరు' వ్రాసినన్ని నాటకములు వ్రాయవలెనని వీరి సంకల్పము. ఒండు రెండు తక్కువగా వీరు తమ సంకల్పము నెరవేర్చుకొనిరి. కల్యాణ రాఘవము, రాధాకృష్ణ, సారంగధర, నర్మదాపురుకుత్సీయము, విప్రనారాయణ మున్నగునవి వీరి పౌరాణిక నాటకములు; ప్రచండ చాణక్యము, చూడామణి ఇత్యాదులు చారిత్రక నాటకములు; కోకిల, సరస్వతి, వృద్ధవివాహము, రాతిస్తంభము మొదలగునవి కల్పిత నాటకములు. వీరి నాటకములలో కంఠాభరణము, రాధాకృష్ణ మున్నగు నైదారు నాటకములు రంగస్థలమున కెక్కి గొప్ప ప్రజాగౌరవము సంపాదించుకొన్నవి. వీరి నాటకములలోని హాస్యమున కొక ప్రత్యేకత ఆంధ్ర వాఙ్మయమున నున్నది. వీరి బహునాటకములు, 'సాక్షి' వ్యాసములు తెలుగు సంఘమున కొక సంస్కారము, వెలుగు చేకూర్చిన వనుట నిర్వివాదమైన మాట. పిఠాపుర ప్రభువులు రావు సూర్యారావుగారి సంస్థానమున నుద్యోగియై వీరు రాజ సమ్మానము నందిరి. మ. స. శా.

**లక్ష్మీనర్సుశెట్టి, గాజుల** (క్రీ. శ. 1806 - 1868): ఈయన చెన్నపట్టణములో జనించెను. సిద్దులశెట్టి ఈయన తండ్రి. 'సిద్దులశెట్టి కంపెనీ'ని పెట్టి తండ్రి కుమారులు నీలిమందు, మదరాసు రుమాళ్ళ వర్తకములను సాగించిరి. అంతఃకలహము మూలమున అమెరికాలో ప్రత్తిపంట అగిపోయిన కాలములో అనేకులవలె ఈ కంపెనీవారును ప్రత్తి వర్తకములో విస్తారముగా ధనము నార్జించిరి.

బొత్తిగా ఇంగ్లీషురాని దేశీయులు నాటి యిక్కడి ప్రభుత్వాధికారులవలన పడుచుండిన కష్టములను నివారింపజేయుటకై ఈయన 'చెన్నపట్టణస్వదేశసంఘము'ను స్థాపించి అందు ధనవంతులగు వర్తకులను, పుర ప్రముఖులను సభ్యులుగ జేర్చెను. ఆ సంఘమువారు ప్రజల కష్టములను చర్చించి తన్నివారణమునకై ఇంగ్లాండులోని అధికారులకు మహజరులను పంపుచుండిరి.

ఆ దినములలో క్రైస్తవ మత ప్రచారకులవలన హిందువులకు జరగుచుండిన అన్యాయముల నరికట్టుటకై ఈయన 'క్రెసెంటు' అను పత్రికను 1844 లో ప్రారంభించెను; అందు మతబోధకుల దురాచారములను నిర్భయముగా ఖండించుచు వచ్చెను; 1845 లో ఒక సభ కూర్చి క్రైస్తవ మతములో కలిసినవారికి పిత్ర్యమునకు అర్హత కలిగించుటకై ప్రభుత్వము చేయదలపెట్టిన చట్టమువలన హిందువుల ఆచార వ్యవహారములకు కలుగు హానిని చర్చించి దానిని ప్రతిఘటించి అది శాసనము కాకుండ చేయించెను; మత ప్రచారకులు, వారితో కలిసి దొరతనమువారు హిందువులకు కలిగించుచుండిన ఇబ్బందులను గూర్చి పలుమారు సభలు సమావేశపరచి చర్చించి మహజరుల ద్వారా ఇంగ్లండు దొరతనమునకు తెలుపుచుండెను. ఈయన ప్రజలలో రాజద్రోహము పురికొల్పుచున్నాడని కూడ గవర్నరు మొదలగువారు ఇంగ్లండుకు తెలియపరచిరి. పలుమారీయన పంపిన మహజరుల మూలమున ఈయన పేరు పార్లమెంటు సభ్యులకు పరిచితమయ్యెను.


చిత్రము 232.
గాజుల లక్ష్మీనర్సుశెట్టి

ఆ కాలమున పార్లమెంటు సభ్యులలో నొకడైన సీమరుదొర ఈ దేశమునకు వచ్చిన సమయమున ఇతడు ఆతనిని కలిసికొని తన యింట అతిథిగా నుంచుకొని ఇక్కడ హిందువులకు జరుగుచుండిన యపకారముల నన్నింటిని అతనికి వివరించి చెప్పెను; కొన్ని ముఖ్యప్రదేశముల కాయనను పిలుచుకొని పోయి అక్కడ పన్నులు చెల్లింపలేక రైతులు పడుచున్న బాధలను, వారికి దొరతనము విధించుచుండిన కఠిన శిక్షలను ఆయనకు జూపెను.

సీమరు తాను చూచిన సంగతులను వ్రాసికొని దండన పరికరములను కొన్నింటిని మాదిరికై ఇంగ్లండునకు తీసికొనిపోయెను. ఆతడు ఈ విషయముల నన్నిటిని 1854 లో పార్లమెంటుసభయందు వివరింపగా వానినిగూర్చి చర్చలు జరిగి తుద కీవిషయములను విచారించుటకై ఒక చిన్న సంఘము నియమింపబడెను. తత్ఫలముగా రైతుల బాధలు కొంతవరకు తొలగినవి. ఈయన అప్పు డప్పుడు పంపుచుండిన మహజరుల మూలమున హిందూదేశీయులకు వర్తక వ్యాపారములు, విద్య, ఉద్యోగములు - వీని విషయమున కొన్ని అనుకూలములగు మార్పులు జరిగినవి. తమ మతమునకు విరుద్ధముగా ప్రవర్తింపవలెనని నిర్బంధించుటచేతనే 1857 లో సిపాయీలు తిరుగుబాటు చేసిరని ధైర్యముతో పార్లమెంటుకు వ్రాసిన ధైర్యశాలి ఈయన. ఈయనను ద్వేషించినవా రందరు ఈయన ప్రజాహిత కార్య తత్పరతకు, ధైర్యమునకు ఈయనను మెచ్చుకొనుచు వచ్చిరి. ఇంగ్లీషుదొరతనమువారు మైసూరు రాజుయొక్క పుత్రస్వీకారమునకు సమ్మతించి రాజ్యమును రాజున కిచ్చునట్లు ఈయన ప్రయత్నము చేసెను; తంజావూరు రాణుల దురవస్థలు, కర్ణాటక నవాబుకుటుంబ కష్టములు తొలగుటకై సాయపడెను. ఈయన సొంత సొమ్ముతో స్త్రీలకు పాఠశాలలు పెట్టించెను; ఆంధ్ర ద్రావిడ పండితులను తరచు సత్కరించెను.

దొరతనమువారు ఈయనయొక్క స్వార్థరహిత సేవకుపలక్షణముగా 1863 లో సి. యస్. ఐ. బిరుదము నిచ్చి గౌరవించుటయేకాక ఈయనను గవర్నరు శాసన సభకు సభ్యునిగా నియమించిరి. ఈయన పచ్చయప్ప మొదలియారు ధర్మసంస్థ ధర్మకర్తలలో నొక్కడుగ నియమింపబడెను. ఈయన మరణానంతరము పుర ప్రముఖులు మహాసభ చేసి ఈయన ప్రతికృతిని పచ్చయప్ప విద్యాశాలయందు నెలకొల్పుటకును, ప్రెసిడెన్సీ కళాశాలలో ఉత్తముడగు సంస్కృత విద్యార్థి కొకనికి ప్రతి సంవత్సరము వేతనము నిచ్చుటకును తీర్మానించిరి. గ. సు.

**లక్ష్మీనారాయణ, ఉన్నవ** (క్రీ. శ. 1873 1958): భారతజాతీయోద్యమమును, ఆంధ్రరాష్ట్రోద్యమమును, సంఘసంస్కరణోద్యమమును తలపెట్టి సామర్థ్యముతో నిర్వహించిన ఆద్యులగు అగ్రశ్రేణి ఆంధ్రనాయకులలో నొక్కడు, రాజకీయ పరిజ్ఞాతలలో, ఆంధ్రసాహిత్య తత్త్వ జిజ్ఞాసువులలో, ప్రజాహిత గ్రంథ రచయితలలో, స్త్రీవిద్యాభ్యుదయాకాంక్షులలో ఎన్నిక గన్నవాడు, సౌజన్య సౌహార్దములు సహజాలంకారములైన స్వభావము గలవాడు, స్మితపూర్వముగను, మృదువుగను సంభాషించువాడు, అచంచల దీక్షతో స్వార్థరహితముగ దేశసేవ, ప్రజాసేవ నిర్విరామముగ నొనరించిన ధైర్యశాలి అగు వీరు గుంటూరుజిల్లా సత్తెనపల్లితాలూకాలో వేములూరుపాడు గ్రామమున జననమందిరి. వీరి తండ్రి శ్రీరాములుగారు. ఎఫ్. ఏ పరీక్షయందు కృతార్థులగువరకు వీరు గుంటూరు క్రిశ్చియన్ కళాశాలలో చదివిరి. తరువాత నడుమ కొన్ని చిన్న యుద్యోగములుచేయుచు ప్లీడరుపరీక్షయం దుత్తీర్ణులై 1903 నుండి గుంటూరులో ప్లీడరుగా నుండిరి.

వీరు 1913 న ఐర్లెండుకు పోయి డబ్లిన్ నగరమున చదివి బారిస్టరు పట్టమును పొందిరి. అక్కడనున్న దినములలో వీరికి ఐర్లెండు స్వాతంత్ర్యోద్యమ నాయకుడగు డివాలెరాతో పరిచయము కలిగినది. తత్పూర్వమే వీరియందు నెలకొనియున్న స్వాతంత్ర్య భావమున కది చాల



చిత్రము 233.
ఉన్నవ లక్ష్మీనారాయణ

దోహదము నిచ్చినది. అక్కడనుండి వీరు తిరిగి వచ్చి మద్రాసు గుంటూరు నగరములలో బారిస్టరు వృత్తి నవలంబించి కీర్తిని, ధనమును విశేషముగా నార్జించుచుండిరి. గాంధీ మహాత్ముని ఆదేశానుసారము 1920 లో బారిస్టరు వృత్తిని పరిత్యజించి వీరు సహాయనిరాకరణోద్యమమును చేపట్టిరి; 1921 లో పల్నాటి పుల్లరిసత్యాగ్రహమును సాగించియు, తరువాత వీరు తీవ్రములగు వివిధ రాజకీయోద్యమములందుపాల్గొనియు 1922, 1930, 1942-3 లలో కూడ కారాగారవాస శిక్ష ననుభవించిరి.

వీరు 1902 న గుంటూరులో వితంతు శరణాలయమును నెలకొలిపి 1907 వరకు దానిని నిర్వహించుచు వితంతువుల కనేకులకు వివాహము కావించి వారి నుద్ధరించిరి. తరువాత కొలదిపాటికాలము వీరేశలింగముగారి కోరికపై రాజమహేంద్రవరమునందలి వారి వితంతు శరణాలయమునకు నేతగానుండి దానిని మానుకొని 1908 లో గుంటూరున మరల వితంతు శరణాలయము నారంభించి దానిని నిర్వహించుచుండిరి. స్త్రీ విద్యాభ్యుదయమునకై వీరు 1922 లో గుంటూరునందు ' శారదా నికేతనము 'ను స్థాపించి ప్రభుత్వ సహాయము నపేక్షింపక జాతీయ విద్యావిధానము ననుసరించి స్త్రీలకు సామాన్య విద్యావిజ్ఞానములనేకాక, వృత్తి విద్యావిజ్ఞానమును కూడ సమకూర్చుచుండిరి. శారదా

నికేతనమున విద్యావిజ్ఞానముల నార్జించిన స్త్రీలు వివిధ జీవిత రంగములందు రాణించుచున్నారు; కొందరు జాతీయ నిర్మాణ కార్యములను చేపట్టి దేశసేవ చేయుచున్నారు.

వీరు 1910 లో ఏలూరునందు జరిగిన కృష్ణా - గుంటూరు మండల సంయుక్త సభలో మొట్టమొదట భాషారాష్ట్ర నిర్మాణమును కోరుచు తీర్మానమును చేయించి మరు సంవత్సరము విశాలాంధ్ర నిర్మాణమునకై అఖండ ప్రచారము చేసిరి; 1913 లో బాపట్ల ఆంధ్ర మహాసభ ఆహ్వాన సంఘమునకు కార్యదర్శియు, 1922 లో చిత్తూరు ఆంధ్ర మహాసభకు అధ్యక్షులు నైరి.

వీరి రచనలో అగ్రగణ్యము 'మాలపల్లి' పెద్దనవల. అది ఆంధ్ర దేశమునందలి తత్కాలీనములగు రాజకీయార్థిక సాంఘిక వైజ్ఞానిక పరిస్థితులకు ప్రతిబింబము. దానికి సాటి నాటికి నేటికి నది యొక్కటియే. నాటి ప్రభుత్వము దాని ప్రచారమును నిషేధించినది. అందుకు కారణము అది ప్రజాహృదయమున నెట్టి విపరీత పరిణామమును కలిగించునో అనుభయమే. మాలపల్లి ఎల్ల భాషలలోనికి పరివర్తింపదగినది. నాయకురాలు, భావతరంగములు, స్వరాజ్యసోదె, బుడబుక్కల జోస్యము మున్నగునవి వారి ఇతర రచనములు. ఇటీవల వీరు రచింప తలపెట్టిన తిక్కన నవల పూర్తికాలేదు; తిక్కన సాహిత్యవిషయవిమర్శనరూపమైన వీరి కృషికి ఫలము ననుభవించు భాగ్యమును ఆంధ్రులకు మృగ్యమైనది.

వీరు సాగించి సాధించిన ప్రజాహిత కార్యము లన్నింటను నిరంతర భాగస్వామినియై వీరికి పేరు కీర్తులు సంపాదించిపెట్టి తన సహధర్మచారిణీత్వమును సార్థకపరచుకొనిన వీరి ధర్మపత్ని లక్ష్మీబాయమ్మ ఇటీవల కీర్తిశేషురాలయినది. అపరవయస్సున వీరికి సంభవించిన యీ పత్నీవియోగము సహింపరానిదే యయ్యును వీరి కార్యదీక్ష క్షేమాత్రము భంగము కలిగించినది కాదు.

సహస్రమాసప్రాయ సుదీర్ఘ మగు వీరి జీవితము నిత్య ప్రజాహిత పరాయణము. వీరి సమస్త కార్యములు ప్రజాహితకరములు. గ. సు.

**లక్ష్మీనారాయణ, భండారు :** ఇతడు కృష్ణదేవరాయల యాస్థానమున వాగ్గేయకారుడుగా నుండెను. ఇతనికి అభినవ భరతాచార్యుడు, తోడరుమల్లు, సూక్ష్మ భరతాచార్యుడు మొదలగు బిరుదు లుండెను. ఇతడు సంగీతసూర్యోదయమును రచించెను. దీనికి లక్ష్మణభరతమని నామాంతరము. ప. రా. స్వా.

**లక్ష్మీనారాయణ, వేదాంతం** (క్రీ. శ. 1875 - 1957): వీరు అగ్రశ్రేణికిచెందిన కూచిపూడికళాకారులలో ప్రముఖులు; రామేశయ్యగారి కుమారులు. యక్షగానాలలోను, వీథిభాగవతాలలోను వంశపారంపర్యంగా వస్తుండిన నాట్యసంప్రదాయంతో తృప్తి పొందక వీరు ప్రత్యేక కృషి చేసి భరతనాట్య సంప్రదాయాలను బాగా తెలుసుకొని నారాయణ తీర్థులవారి కృష్ణలీలాతరంగిణిలోని తరంగాలను, జయదేవుని అష్టపదులను, క్షేత్రయ్య మువ్వగోపాల పదములను, కృష్ణకర్ణామృత, పుష్పబాణవిలాసములలోని శ్లోకాలను చక్కగా పాడి, అభినయించి నాయికానాయక లక్ష్యలక్షణ సమన్వయం కావించి సాంప్రదాయికంగా వస్తూవుండిన నాట్యకళకు ఒక క్రొత్త శోభ తెచ్చి శిష్యప్రశిష్యుల నెందరినో తయారుచేసిన నాట్యకళావేత్తలు; భామకలాప ప్రదర్శనంలో సత్యభామపాత్ర ధరించి, అఖండ ప్రజ్ఞనుచూపి పండిత ప్రకాండులసంస్తుతు లందుకొన్న ప్రజ్ఞావంతులు; భామకలాపంలో 'మదనా, మదనా, మదనా



చిత్రము 234.
వేదాంతం లక్ష్మీనారాయణ

యనుచును' అనే దరువు నెత్తుకొని పల్లవినిమాత్రం తీసుకొని జాగాలు మారుస్తూ తాళగతులను మారుస్తూ, ఒకసారి 'స్వరపోకడ', మరొకసారి 'శబ్దకల్పన' చూపిస్తూ, ఇంకొకసారి 'హా లలనా, చెలియా, మగువా' అని సంబోధిస్తూ, అభినయ ముద్రలతోను, హావభావ చేష్టలతోను, హస్తవిన్యాసాలతోను, ఆశితాశి ప్రత్యాశి మొదలైన నృత్యం చేస్తూ నాలుగైదు గంటల కాలం ఆయొక్క పల్లవినే వినిపించి ప్రేక్షకులను మైమరపించి ఆనందంలో ఓలలాడించేవారు. వీరు ఒక్క భామకలాప, గొల్లకలాపాలను మాత్రమే కాక దాదినమ్మ (లీలావతీవిజయంలో లీలావతి) వేషం, బాలెంత (శ్రీకృష్ణ జననంలో)వేషం మొదలైన పాత్రలను అత్యద్భుతంగా ప్రదర్శించేవారు. వీరు రామాయణం, మండూకశబ్దం, ప్రహ్లాదపట్టాభిషేకం, తాటకాసంహారం, దశావతార వర్ణన మొదలైనవి శబ్దరూపంలో నృత్యం కూడ చేసేవారు.

వీరు భామకలాప ప్రదర్శనంలో, తెరమీద జడను వేసి తద్ద్వారా తమయొక్క పాండితీ ప్రకర్షను వెల్లడించేవారు; ఈ జడవర్ణనను పరిశీలించి తప్పులు పట్టడానికి పండిత ప్రకాండు లందరూ ముందువరుసలో కూర్చుండేవారు. జడకు 27 నక్షత్రా లుండేవి; ఇవి ఒక నక్షత్రమాలగా జడపై అలంకరింపబడేవి; జడగంటలను

నవగ్రహాలనేవారు. తలమీద సూర్యుడూ, చంద్రుడూ ధరించేవారు; ఈ జడను తెర వెలుపలిభాగంలో ప్రేక్షకులకు కనపడునట్లు వ్రేలాడనిచ్చేవారు. దీనిని మయుడనే శిల్పి సృజించాడని ప్రతీతి. వీరు జడలోని ఒక్కొక్క నక్షత్రానికి ఒక్కొక్క శ్లోకం చదివేవారు; ఇది జడయొక్క స్వరూపం. ప్రదర్శన ప్రారంభంలో జడను వీరు వర్ణిస్తూ వుండగా పండితులలో ఎవరైనా జడనుగురించి ప్రశ్నిస్తే తగిన సమాధానం చెప్పి వారిని ఆశ్చర్య చకితులను చేసేవారు. అలా సమాధానం చెప్పలేకుంటే పండితులు ఆ జడను కత్తిరించి, కళాకారులను అవమానపరచవచ్చును. అట్లు కాకుండా తమ వైదుష్యం చూపి వీరు జడవర్ణనను పూర్తి చేసి పండితులను తృప్తి పరిచేవారు.

వీరి భామకలాప ప్రదర్శనం చూచి ఉదయశంకర్ వీరిని వేనోళ్ల స్తుతించి తమ అల్మోరా నాట్యపాఠశాలకు ఆంధ్ర నాట్య కళారీతులను బోధింప ఆహ్వానించారు; కాని వీరు వెళ్లలేదు. వీరు పిఠాపురం, నూజివీడు, వుయ్యూరు, చల్లపల్లి, జటప్రోలు మొదలైన సంస్థానాధిపతుల పోషణలోనే ఉండేవారు.

వీరివద్ద కూచిపూడి నాట్యసంప్రదాయాన్ని, అందులోను భామాకలాప, గొల్లకలాపాలను అభ్యసించిన వారిలో దేవదాసీలుకూడ ఉన్నారు. బందరులో అజాద్ బాలికా పాఠశాలలో వీరు నృత్యశాఖలో పనిచేశారు. వీరి కుమారులు జగన్నాథ శర్మగారుకూడ ఈ విద్యను తండ్రిగారివద్ద నేర్చినవారే. మదరాసులో ప్రసిద్ధ నాట్యాచార్యులైన రామయ్యాపిళ్లెగారు కూచిపూడి నృత్యంలో వున్న ప్రత్యేకతా, శబ్దసౌందర్యం శాస్త్రిగారివద్ద అభ్యసించి కొన్ని మెళుకువలను గ్రహించినారు.

భావనగర్ మహారాజా గవర్నరుగానున్న కాలంలో ఉమ్మడి మదరాసు రాష్ట్ర ప్రభుత్వం పి. వి. రాజమన్నారు గారి సమక్షమందు వీరిని ప్రముఖ కళాకారునిగా గుర్తించి పండిత శాలువలను, సువర్ణఘంటా కంకణాలను బహూకరించి సత్కరించింది. శాస్త్రిగారి వృద్ధాప్యంలో కేంద్ర ప్రభుత్వంవారు కళాకారుల కిచ్చే గౌరవవేతనాన్ని ఏర్పాటుచేశారు. మి. రా. మూ.

**లక్ష్మీనారాయణశాస్త్రి, పేరి** (క్రీ.శ. 1877-1949): న్యాయభూషణ, న్యాయస్థాపక బిరుదాంకితులగు శాస్త్రిగారు గోదావరిజిల్లాయందలి కోనసీమలోని పేరూరు అగ్రహారమున జన్మించిరి. వీరి జనకులు శ్రీ విద్యోపాసకులు, విద్యాశీల సంపన్నులునగు అనంత రామావధానులుగారు. జనని వెంకమాంబ; పితామహులు వేదాధ్యయన సంపన్నులు, పార్థివలింగ పూజాపరాయణులు, శ్రీ విద్యోపాసనాది సత్కర్మ నిరతులు, ద్రావిడ బ్రాహ్మణులునగు సుబ్బావధానులుగారు. శాస్త్రిగారికి బాల్యముననే పితృవియోగము కలుగగా జననియే వీరి నల్లారుముద్దుగ పెంచి గర్భాష్టమ ప్రాయముననే వీరి కుపనయనము కావించెను. వీరు పదునారేండ్ల ప్రాయమువరకు నైయాయిక చూడామణి యగు మంథా చెన్నయ్యశాస్త్రులవారి కంతేవాసియై సంస్కృత కావ్య నాటకములను, న్యాయ వేదాంత ప్రకరణ గ్రంథములను కూలంకషముగ వ్యాసంగ మొనర్చిరి; తర్కారణ్యమున బ్రవేశించిన యల్పకాలమునకే దుర్బోధములగు శాస్త్రవిషయముల నిట్టె గ్రహించుచు, తమ నిశిత ధిషణా సంపదచే గురువుల కచ్చెరువు కలిగించుచుండిరి. పిమ్మట వీరు విజయనగరమున మహారాజ సంస్కృత కళాశాలలో న్యాయశాస్త్ర ప్రధానాధ్యాపకులు, అపర గౌతములునగు గుమ్మలూరి సంగమేశ్వర శాస్త్రిగారి సన్నిధిని పదియేండ్లును, పీఠికాపురాస్థాన విద్వాంసులలో నొకరును, నైయాయిక సార్వభౌములు


చిత్రము 235.
పేరి లక్ష్మీనారాయణశాస్త్రి

నగు శ్రీపాద లక్ష్మీనరసింహ శాస్త్రిగారి యొద్ద రెండేండ్లును న్యాయశాస్త్రమును మథించిరి. అసాధారణ వైదుషీ భూషితులగు వీరు ఉర్లాము, పిఠాపురము మొదలగు సంస్థానముల యందు జరుగు శాస్త్ర పరీక్షలలో ప్రథమ స్థానమును బడసి బహుమానముల నందిరి. స్వస్థానమునన్యాయ వేదాంతముల ననేకులకు బోధించుచుండగా, వీరి కీర్తి నలుగడల వ్యాపించెను. వీరు 1902 లో విజయనగర సంస్కృత మహావిద్యాలయమున న్యాయశాస్త్రాధ్యాపకులుగ నియుక్తులైరి; 1913 లో సంగమేశ్వరశాస్త్రిగారి యనంతరము ప్రధానన్యాయశాస్త్రపండితులైరి. 1924 లో వీరు మహారాజాజ్ఞవలన జయపుర (రాజపుత్రస్థానము నందలి) సంస్థానమున కరిగి, తమ ప్రతిభా వైదుష్యములను, వాదకౌశలమును ప్రదర్శించి, మహావిద్వత్సభయందు 'న్యాయభూషణ' బిరుదము నందిరి. విజయవాడ యందలి 'త్రిలింగ విద్యాపీఠము'వారు శాస్త్రిగారికి 'న్యాయస్థాపక' బిరుదము నొసగి సమ్మానించిరి. 1937లో సంస్కృత కళాశాలప్రధానపండితపదము నలంకరించి వీరు రమారమి అయిదేండ్లు గడపి విశ్రాంతిని గైకొనిరి. బ్రిటిషు

ప్రభుత్వమువారు 'మహామహోపాధ్యాయ' బిరుదము నొసగి వీరిని సత్కరించిరి. ఈ మహాబిరుదము నందిన యాంధ్రులలో వీరైదవవారు. వీరు అధీతి బోధాచరణ ప్రచారణములయందు జీవితమును గడపి, న్యాయవేదాంత ములయందే కాక మంత్ర, జ్యోతిశ్శాస్త్రములయందును జితశ్రములై మహారాజుల యాదరమును బడసిరి.

వీరు కఠోర వ్యాసంగమునగాని లొంగని ఉదయనా చార్యుల 'కుసుమాంజలి'ని సరళముగ నాంధ్రీకరించిరి; గదాధరభట్టాచార్యుల 'హేత్వాభాస సామాన్య నిరుక్తి, 'సవ్యభిచార సామాన్య నిరుక్తి' అను నవ్యన్యాయశాస్త్ర గ్రంథరాజములకు 'లలిత' యను సరళ వివరణములను రచించి తమ యనుగమ కౌశలమును, న్యాయశాస్త్రమున దమకుగల దృఢ వ్యుత్పత్తిని ప్రదర్శించిరి. మాధవా చార్యుల 'సర్వదర్శన సంగ్రహము' నందలి పెక్కుభాగ ములకు వీ రాంధ్రానువాదము కావించిరి. ఇది యము ద్రితము. ఈ. వేం. వీ. ర.

**లక్ష్మీనారాయణస్వామి, మూలా** (క్రీ. శ. 1912 - 1950): వీరి స్వగ్రామం తాడిపత్రి. వీరి తండ్రి వెంకట రంగయ్య; తల్లి రంగమ్మ. వీరు చిన్నతనంలోనే చక్కని వ్యాపార దక్షతను అలవరచుకొన్న యువకులు; ఉత్సాహ వంతులు; 1938 వ సంవత్సరములో నేటి ప్రముఖ దర్శకు లైన బి. యన్. రెడ్డి, కె. వి. రెడ్డిగార్ల సాహచర్యంతో 'వాహినీ పిక్చర్స్ లిమిటెడ్' అనే సంస్థను స్థాపించారు; రామనాథ్, శేఖర్ గార్లవంటి ప్రతిభావంతు లయిన చలనచిత్ర నిర్మాణ చతురులను, నాగయ్యగారి వంటి నటశేఖరులను, సంగీత దర్శకులను సమన్వయపరచి, వారి సహకారంతో తెలుగు చిత్ర పరిశ్రమకు ఒక స్థితిని, గౌరవాన్ని సమకూర్చి నారు. వందేమాతరం, సుమంగళి, పోతన, స్వర్గ సీమ, వేమనవంటి ఉత్తమోత్తమ చిత్రాలను 'వాహినీ పిక్చర్స్' నిర్మించింది. 1944 వ సంవత్సరంలో వ్యాపార దృష్టినిబట్టి కేవల చిత్రనిర్మాతలు కొంత పెద్ద పెట్టు బడితో 'వాహినీ ప్రొడక్షన్స్ లిమిటెడ్' అనే మరొక సంస్థను స్థాపించారు. గుణసుందరి కథ, మల్లీశ్వరి, పెద్ద మనుష్యులు, బంగారుపాప - ఈ సంస్థ నిర్మించిన చిత్రాలు.



చిత్రము 236.
మూలా లక్ష్మీనారాయణస్వామి

1947 లో వీరు నేడు ఆసియాలోని కంతకీ పెద్దదిగా ప్రసిద్ధి చెందిన 'వాహినీ స్టూడియో' నిర్మాణం ప్రారంభిం చారు. వ్యాపారదృష్టిని, కళాదృష్టిని చక్కగా సమన్వయ పరచి, పండిత పామర రంజకమయిన చిత్రాలు నిర్మించిన 'వాహినీసంస్థలు', 'వాహినీ స్టూడియో' వీరి ఉత్సాహ కార్యదీక్షాఫలితాలు. వీరు అకాల మరణానికి గురికాక పోతే ఈ సంస్థలు ఇతోధికమయిన ఫలితాలను సాధించ గలిగి యుండుటకు సందేహము లేదు. పా. ప.

**లక్ష్మీనృసింహశాస్త్రి, శ్రీపాద** (క్రీ.శ. 1861-1941): వీరి జన్మస్థానము గోదావరిజిల్లా నరసాపురము తాలూకా గుమ్మలూరు; వీరు వెలనాటి బ్రాహ్మణులు. వీరి తండ్రి పుల్లయ్యగారు; తల్లిమహాలక్ష్మమ్మ. వీరు రెండవ అన్న అగు వెంకటశాస్త్రి గారి వద్ద కావ్యాదులను, పిమ్మట పెద్దన్న అగు రామశాస్త్రిగారివద్ద తర్క శాస్త్రమును సమగ్రము గా చదివిరి. ఆంధ్ర దేశ మునందలి పండితులలో మేధాసంపత్తికి ప్రఖ్యాతి చెందిన వారిలో వీరి స్థానము అద్వితీయము. వీరు అయిదు సంవత్సర ములలోనే తర్కశాస్త్రమును పూర్తిచేసి పిమ్మట సహాధ్యా యులగు సంగమేశ్వరశాస్త్రిగారితోను, ఆదిభట్ట రామ మూర్తి శాస్త్రిగారితోను కలసి కాలి నడకను కాశి కేగి కొంతకాల మచట శాస్త్రాధ్యయనము కావించి తిరిగి అన్న వద్దకు వచ్చి చేరిరి. తరువాత వివాహము చేసికొని వీరు అమలాపురములో కొంతకాలము నివసించిరి. ఆ సమయ మున వీరివద్ద తర్కశాస్త్రాధ్యయనముచేసి విఖ్యాతపండితు లైనవారిలో మరువాడ శంభన్నశాస్త్రిగారు, ధూళిపాళ సూర్యనారాయణ శాస్త్రిగారు, పేరి లక్ష్మీనారాయణ శాస్త్రిగారు పేర్కొనదగి యున్నారు. ఈ ముగ్గురిలో నొక్కొక్క రనేకులకు తర్కశాస్త్రమును బోధించి యాంధ్రదేశమున నా శాస్త్రము హెచ్చుగా వ్యాపించు టకు తోడ్పడిరి.



చిత్రము 237.
శ్రీపాద లక్ష్మీనృసింహశాస్త్రి

పిమ్మట వీరు గుమ్మలూరులో కొంతకాలమును, నరసా పురములో కొంతకాలమును నివసించి శిష్యగణము నకు శాస్త్రాధ్యాపనము గావించిరి; రెండేండ్లు రాజ మహేంద్రవరమున నివసించిరి. అపుడు పిఠాపుర ప్రభువు

తమ యాస్థానమున దిగ్గజములవంటి పండితులను గూర్చుకొనదలచి శాస్త్రిగారిని అట్టివారిలో నొకరుగా తీసికొనిరి. అది మొదలు జీవితాంతము వరకు ముప్పదిరెండు సంవత్సరములు శాస్త్రిగారు పిఠాపురములోనే ఆస్థానమున జరుగుచుండిన శాస్త్ర పరీక్షలలో తర్కమునకు పరీక్షాధికారిగా నుండిరి.

తర్కములో తమ శిష్యులై వేదాంతములో అపార పాండిత్యము గల్గిన దెందుకూరి నరసింహశాస్త్రిగారు శిష్యులకు శాంకర భాష్య ప్రవచనము చేయుచుండగా సన్నిహితులైయుండి వీరు వేదాంత గ్రంథములలో అసాధారణ శక్తిని సంపాదించిరి.

శాస్త్రిగారు చాలకాలము ఆంధ్రవిశ్వ విద్యాలయములో విద్యావిధాన పరిషత్తులో సభ్యులుగాను, పరీక్షాధికారిగాను నుండిరి; హైదరాబాదు, చెన్నపట్టణము, నెల్లూరు, బెజవాడ మున్నగు స్థలములలో బహువిధ సత్కారములను పొంది జగద్గురు శ్రీ కంచి కామకోటి పీఠాధిపతులవలన 'శాస్త్ర రత్నాకర' బిరుదమును బడసిరి. ఒకప్పుడు పండిత మదనమోహన మాళవీయగారు వీరిని హిందూవిశ్వవిద్యాలయాచార్యత్వమున కాహ్వానించుటయు, శాస్త్రిగారు పిఠాపురము విడుచుట కంగీకరింప కుండుటయు కూడ జరిగినది. జ. పు.

**లక్ష్మీబాయమ్మ, ఉన్నవ :** ఈమె సుప్రసిద్ధ సంఘసేవకురాలు; సంస్కరణాభిలాషి; జాతీయోద్యమంలో మహిళలకు నాయకత్వము వహించి వీరోచితముగ పోరాడిన మహిళారత్నము. ఈమె గుంటూరు జిల్లా సత్తెనపల్లి తాలూకాలో అమీనాబాద గ్రామమందు జన్మించెను. తండ్రి నడింపల్లి సీతారామయ్య; తల్లి లక్ష్మిదేవమ్మ. పుట్టింట అల్లారుముద్దుగా పెరిగిన దీమె. ఈమెను పది యవయేటనే వేములూరుపాడు కాపురస్తులు ఉన్నవ లక్ష్మీనారాయణగారి కిచ్చి వివాహము చేసిరి.



చిత్రము 238.
ఉన్నవ లక్ష్మీబాయమ్మ

ఈమె బాల్యమున గొప్పగా చదువుకొనకపోయినను కాపురమునకు వచ్చినతరువాత ఈమెభర్త స్త్రీవిద్యాభిమాని యగుటచే స్వయముగా నీమెకు భారత భాగవతాది గ్రంథములను చదివి అర్థము చేసికొనగల విద్యను బోధించెను. మొదట ఈమెభర్త ఆర్య, బ్రహ్మ సమాజములపట్ల ఆసక్తి గలవారై యుండినను, హిందూ మతమునుండి విడిపోయి ప్రత్యేక సమాజములలో చేరుట కిష్టపడక హిందూ సంఘమున నిలిచియే సంఘశ్రేయః పురోభివృద్ధుల కొరకు సంస్కరణలను సాధించ నుద్దేశించిరి. సహధర్మచారిణిగా ఈమె సాంఘికముగా, రాజకీయముగా నెన్ని మార్పులు వచ్చినను భర్తతోపాటు సనాతన ధర్మపక్షముననే నిలిచియుండెను.

ఈ దంపతుల దృష్టి మొదట వితంతు వివాహముల వైపు మరలెను. వీరు గుంటూరులో వితంతు శరణాలయము నెలకొల్పి 1907 వరకు నిర్వహించిరి. దీనావస్థలో నున్న అనేకమంది బాల వితంతువులకు వివాహములు జరుప బూనినపుడు ఈమె భర్తతో నిర్విరామముగ కృషి సలిపెను. తరువాత కందుకూరి వీరేశలింగం పంతులుగారి కోర్కెపై ఈ దంపతులు రాజమహేంద్రవరమునకు వెళ్ళి వారి శరణాలయమునకు అధిపతులుగా పనిచేసి 1908 సంవత్సరములో వారితో అభిప్రాయభేదము కలిగి గుంటూరికి తిరిగి వచ్చి మరల వితంతుశరణాలయ నిర్వహణకు పూనుకొనిరి.

1921 లో గాంధీజీ అసహాయోద్యమ సందర్భమున పల్నాటిసీమలో అడవిపుల్లరి - సత్యాగ్రహోద్యమంలో భర్త ప్రభుత్వమువారిచే బంధింపబడగా, తరువాత తన భర్త స్థానమును తా నాక్రమించి ఈమె ఆంధ్రదేశ మంతట సత్యాగ్రహోద్యమ వ్యాప్తికి ప్రచారము గావించెను. ఈమె గొప్ప వక్త. ఈమె ఉపన్యాసములు విద్యార్థులను, స్త్రీలను లక్షలాదిగా ఉత్సాహపరచి జాతీయోద్యమంలో పాల్గొనుటకు పురిగొల్పేవి. ఈమె ధైర్య సాహసాలు, పట్టుదల స్వాతంత్ర్య ఉద్యమంలో అనేక విజయాలను సాధించినవి. జాతీయోద్యమ తీవ్రత తగ్గగానే నిర్మాణ కార్యక్రమములో ఈమె పాల్గొని ముఖ్యంగా ఖద్దరు ప్రచారము, అస్పృశ్యతా నిర్మూలనము, మహిళాజనోద్ధరణములకై కృషిచేసినది.

జాతీయ విద్యా విధానము నమలుపరచుటయందు ఈ దంపతుల ఆసక్తి అపారము. ఇందువల్లనే వీరుభయులు 1922 లో బాలికల నిమిత్తము శారదా నికేతనమును గుంటూరులో స్థాపించి, మాతృభాషలోనే అన్ని విద్యలూ నేర్పుతూ సంస్కృతాంధ్రములకు ప్రాముఖ్య మిచ్చి ప్రభుత్వసహాయ సహకారముల నాసింపక నిరంతరము కృషి సలుపదొడగిరి. ఆ సంస్థలో సంగీతము, చిత్రలేఖనము వంటి లలితకళలను, కుట్టు, అల్లిక చేనేతవంటి వృత్తి విద్యలను సయితము నేర్పుటకు ఏర్పాటులు జరిగెను.

శారదా నికేతనములో విద్యా విజ్ఞానము లార్జించినవారు వివిధ రంగాలలో ఉన్నత పదవులలో నున్నవారును కలరు. మరికొందరు జాతీయ నిర్మాణోద్యమ కార్యకలాపాలలో గొప్ప సేవ చేస్తున్నారు. ఈమె అహోరాత్రాలూ శారదా నికేతనాభివృద్ధికి పాటుపడుచుండినను 1940 లో స్వాతంత్ర్య సమర సందర్భమున మూడుసార్లు చెరసాలకు వెళ్ళి వచ్చినది. సంఘ నిర్మాణ నైపుణిలోను, పలువురి సహాయ సహకారముల సమీకరణములోను ఈమెకు గల శక్తి సామర్థ్యాలు ఈమెను నిరంతరము ముందుకు నడపినవి. చివరి దశలో అయిదారు సంవత్సరములు ఆరోగ్యము చెడినది. అయినను బొందిలో ప్రాణ మున్నంతవరకు సేవానురక్తి కలిగి జాతీయాభ్యుదయ, పురోభివృద్ధులకు గాను ఆరాటపడుచుండిన నారీమణి ఈమె. సి. సి. పు.

**లిపి పరిణామము** (తెలుగు): హిందూ దేశము నందు నేడు వాడుకలో నున్న ఇతర లిపు లన్నియు పుట్టినట్లే నేటి తెలుగు లిపి కూడ రెండువేల సంవత్సరములకు పూర్వము వ్యాప్తియం దుండిన బ్రాహ్మీలిపినుండియే పుట్టినది. మహంజోదరో, హరప్పా నగరములయందు జరిగిన పురాతత్వ పరిశోధనల ఫలితముగా తెలియవచ్చిన 'సింధు లిపి' (ఇండస్ స్క్రిప్ట్)ని వదలివేసినచో మౌర్య వంశావతంసమైన అశోకచక్రవర్తి రాజ్యపరిపాలన కాలమున వాడుకయం దుండిన బ్రాహ్మీ, ఖరోష్ఠీ లిపులే అత్యంత ప్రాచీనము లైనవి. శిలలమీద చెక్కినవైన నేమి, శిలా స్తంభములమీద చెక్కినవైన నేమి అశోకుని శాసనము లన్నియు బ్రాహ్మీ, ఖరోష్ఠీ లిపులలోనే యున్నవి. హిందూదేశములో ఉత్తరమున నేపాలు మొదలుకొని దక్షిణమున మైసూరువరకు, తూర్పున జగన్నాథము మొదలుకొని పడుమట బొంబాయివరకు గల ప్రదేశములో కానవచ్చిన అశోకుని శాసనములు బ్రాహ్మీలిపిలో నున్నవి. పశ్చిమ హిందూదేశమున కానవచ్చిన అశోక శాసనములు ఖరోష్ఠీ లిపిలో నున్నవి. హిస్టాస్పెస్ కుమారుడయిన డరయసు తూర్పు అఫ్గానిస్తానము, పంజాబులోని ఉత్తర, పశ్చిమ భాగములు కలిసిన ప్రాచీన గాంధార దేశమును జయించిన పిదప అక్కడ అతడు ఈ ఖరోష్ఠీ లిపిని వాడుకలోనికి తెచ్చినట్లు చెప్పుదురు. పెరిషియను, అరబ్బీ లిపులవలె ఖరోష్ఠీలిపి కుడివైపునుండి ఎడమ వైపునకు వ్రాయువారు; బ్రాహ్మీలిపి హిందూదేశము నందలి నేటి ఆధునిక లిపులవలె ఎడమవైపునుండి కుడి వైపునకు వ్రాయబడుచుండెను; ఎడమవైపునుండి కుడి వైపునకును, కుడివైపునుండి మరల ఎడమ వైపునకును పంక్తి క్రమమున బ్రాహ్మీలిపిలో వ్రాయబడిన అశోక చక్రవర్తి శాసనములును గలవు. కాని ఇవి చాల అరుదు. ఆంధ్రప్రదేశ్‌లోనే కర్నూలు జిల్లాయందలి ఎర్రగుడి గ్రామమున గానవచ్చిన అశోకుని లఘు శిలా శాసనములలో ఒకటి పైన చెప్పినట్లు ఎడమవైపునుండి కుడివైపునకు, మరల కుడివైపునుండి ఎడమవైపునకు పంక్తి క్రమమున వ్రాయబడి యున్నది. అశోక శాసనభాష ప్రాకృతము. నేటి భారతీయ లిపు లన్నియు - దేవనాగరితో కూడ - మౌర్యులనాటి బ్రాహ్మీలిపినుండియే పుట్టినవి. ఇంతే కాదు, తిబెత్తు, బర్మా, సింహళము మొదలైన బృహద్భారతదేశ (గ్రేటర్ ఇండియా) లిపులకు కూడ బ్రాహ్మీలిపియే మాతృక. కాలము గడచినకొలది ఈ బ్రాహ్మీలిపి ఖరోష్ఠీలిపి వాడుకయం దుండిన దేశము లందు కూడ వ్యాపించి దానిని త్రోసిరాజని దాని స్థానము నాక్రమించుటచేత క్రమముగా అది అంతరించినది. క్రీస్తు శకము అయిదవశతాబ్దము మధ్యకాలమునకు తరువాత ఖరోష్ఠీ లిపిలో ఒక్క శాసనమైనను కానరాలేదు.

మౌర్యసామ్రాజ్య కాలమునందు ఆసేతు హిమాచలమును వాడుకయం దుండిన బ్రాహ్మీ లిపియైనను ఒకచే రకమైనది కాదు. బ్రాహ్మీ లిపిని, తద్వికృతి పరిణామములను బహు శాసన పరిశోధన కావించి బాగుగ కనిపెట్టిన బూలరు పండితుడు ఉత్తర హిందూదేశమునందలి అశోక శాసన లిపికి దక్షిణ హిందూదేశమునందలి అశోక శాసన లిపికి వైవిధ్యము కల దనియు, అందువలన బ్రాహ్మీలిపిలోనే ఉత్తరదేశపు రక మొకటి, దక్షిణదేశపు రక మొకటి రెండు రకము లుండినట్లు తెలిపియున్నాడు. అదియునుగాక ఆయన ఉత్తర హిందూదేశపు బ్రాహ్మీ లిపిలోనే స్థానిక వ్యత్యాసములను కనిపెట్టెను. ఇది యటుండ ఈ బ్రాహ్మీలిపిలోని యక్షరములలో కొన్ని పురాతన రూపములతోపాటు వాని యర్వాచీన రూపములు కూడ కానవచ్చుట కలదు. వీని నన్నిటిని పురస్కరించుకొని అశోకుని కాలమునకు చాల పూర్వమునుండియే వ్రాత కల దనియు, దానికి దీర్ఘమైన చరిత్ర కల దనియు, అశోకుని కాలమున ఈ బ్రాహ్మీలిపి మార్పు పొందుచుండిన స్థితిలో నుండె ననియు ఆయన నిర్ధరించి యున్నాడు. అశోకునినాటి బ్రాహ్మీలిపియొక్క దక్షిణ దేశభేదము గిర్నారు, ధౌలి, జౌగడ, సిద్ధాపుర శాసనములలో గన్పట్టుచున్నదని ఆయన నుడివియున్నాడు. ఆయన కాలమునాటికి ఎర్రగుడి, మాస్కి, బ్రహ్మగిరి, రాజుల మందగిరి ల లోని అశోక శాసనములు దొరకలేదు. ఇవి కూడ బ్రాహ్మీ లిపి దక్షిణపు రకమునకు చెందిన వనియే చెప్పనగును.

చిత్రము 288-ఏ. అశోకుని రుమ్మిండే శాసనము (క్రీ. పూ. 3వ శతాబ్దము)

1. దేవానపియేన పియదసిన లాజిన వీసతి వసాభిసితేన
2. అతన అగాచ మహీయితే హిద బుధే జాతే సక్యమునీతి
3. సిలావిగడభీ చా కాలాపిత సిలాథభే చ ఉసపాపితే

చిత్రము 288-బి. సాతవాహనుల కాలమునాటి నాసిక గుహాశాసనము (క్రీ. శ. మొదటి శతాబ్దము)

1. సిద్ధమ్ 卐 రాజ్ఞః క్షహరాతస్య క్షత్రపస్య నహపానస్య జామాత్రా దీ
2. నీకపుత్రేణ ఉషవదాతేన త్రిగోశతసహస్రదేన నద్యా బార్ణా
3. సాయాం సువర్ణదానతీర్థకరేణ దేవతాభ్యః బ్రాహ్మణేభ్యశ్చ

చిత్రము 288-సి. ఇక్ష్వాకుల కాలమునాటి శాసనము (క్రీ. శ. 3వ శతాబ్దము)

1. సిధం మహారాజస అసమేధయాజిస అనేక హిరంణకోటిగోసతసహస హలసత
2. సహసపదాయిస సవథేసు అపతిహతసంకపస వాసిఠీపుతస ఇఖాకుస

చిత్రము 288-డి. శాలంకాయన నందివర్మ శాసనము (క్రీ. శ. 4వ శతాబ్దము)

1. స్వస్తి విజయవేఙ్గీపురాత్సైనిక సమరావాప్తవిజయినో
2. హస్తివర్మ్మమహారాజస్య ప్రపౌత్రః వివిధ ధర్మ్మ
3. ప్రధానస్య నన్దివర్మ్మమహారాజస్య పౌత్రః

చిత్రము 288-ఇ. విష్ణుకుండి ఇంద్రవర్మ శాసనము (క్రీ. శ. 6వ శతాబ్దము)

1. స్వస్తి పురనిసజ్జమ వాసకాత్ భగవచ్ఛ్రీప్రవ్వర్తస్వామిపాదానుద్ధ్యాత సకలమహీమణ్డలావనత
2. సామన్తమకుటమణికిరణావలీఢచరణయుగో విఖ్యాతయశాః శ్రీమన్మహారాజా మాధవవర్మ్మా తస్యో
3. జ్జిత శ్రీ విష్ణుకుణ్డి పార్థివోదితోదితాన్వయతిలకసముద్భూతైకాదశాశ్వమేధావభృతావధౌతజగత్కల్మ
4. షః క్రతుసహస్రయాజినః స్నానపుణ్యోదకపవిత్రీకృతశిరసః

చిత్రము 288-ఎఫ్. (తమిళ - గ్రంథలిపి) పల్లవ మొదటి నరసింహవర్మ శాసనము (క్రీ. శ. 640)

1. ......వత్సరే ఆత్మనో రాజ్య వర్షే చ వర్ద్ధమానో త్ర...
2. ......సింహేన మహామల్లేన విద్విషామ్ వాతాపిరతిమా...
3. ......రిష్ణురతులం గోత్రం గుణై రాత్మనో

చిత్రము 238-జి. పల్లవ రెండవ నరసింహవర్మ రేయూరు శాసనము (క్రీ. శ. 711)

1. అమితాత్మనో యథావదాభృతాశ్వమేధాద్యనేకక్రతుయాజిన స్సత్యవ్రతస్య ధర్మా
2. త్మనో మహి మపి మహేన్ద్రస్య,పరమేశ్వరవర్మ్మణః పుత్ర భగవద్భక్తిసద్భావసమర్పి
3. త సర్వ్వప్రజానురంజన పరిపాలనోద్యోగ సతత సత్యవ్రతాదీక్షిత క
4. లియుగదోషావహృత ధర్మ్మోద్ధరణ నిత్య సన్నద్ధో అనేకసమర సంఘట్టజనిత విక్ర
5. మవసుధాతలైః కవిరరాజరిషిగుణసర్వ్వసన్దోహవిజిగీషు పరమభగవత..

చిత్రము 238-హెచ్. పూర్వచాళుక్య - రెండవ భీమమహారాజు శాసనము (క్రీ. శ. 10వ శతాబ్దము)

1. స్వస్తి శ్రీ మతాం సకలభువనసంస్తూయమానమానవ్యసగో
2. త్రాణాం హారీతిపుత్రాణాం కౌశికీవరప్రసాదలబ్ధరాజ్యానాం మా
3. తృగణపరిపాలితానాం స్వామి [ మ* ] హాసేన పాదానుధ్యాతానాం భగవ
4. న్నారాయణప్రసాదసమాసాదితవరవరాహలాంచనేక్షణ

చిత్రము 238-ఐ. నన్నయ కాలపు లిపి (రాజరాజ నరేంద్రుని శాసనము - క్రీ. శ. 11వ శతాబ్దము)

1. శ్రీధామ్నః పురుషోత్తమస్య మహతో నారాయణస్య ప్రభో న్నాభీపంకరుహా ద్బభూ
2. వ జగత స్స్రష్టా స్వయంభూ స్తతః జజ్ఞే మానససూను రత్రి రితియతస్మాన్మునే రత్రిత స్సోమో
3. వంశకర స్సుధాంశురుదిత శ్రీకణ్ఠ చూడామణిః । తస్మాదాసీత్సుధాసూతేర్బుధో బుధనుత స్త
4. తః జాతః పురూరవానామ చక్రవర్త్తి సవిక్రమః । తస్మాదాయు రాయుషో నహుషః తతో యా

### తిక్కనకాలపు లిపి
### (కాకతి గణపతిదేవుని శాసనము-
### క్రీ. శ. 13 వ శతాబ్దము)

1. స్వస్తిశ్రీః జయతి హరివరాహః క్షేమసం
2. క్రాంత పృథ్వీస్తనభర పరిరంభారంభ
3. దృప్తస్య యస్య। పుళకచుళుకితాంభ
4. స్సంచయ స్తోయరాశిః పునరవిరళని
5. య్యత్స్వేద పూరైరపూరి ॥ హేరంబస్య
6. వికల్పదంతముకుళం గౌరీ రహస్యో
7. త్సవప్రత్యాసంన విలాసదీపకలికా
8. గంగామృణాళాంకురః। దేవస్యత్రిపుర
9. ద్రుహో విజయినా పుష్పేషుణా మస్త
10. కే విన్యస్తాంకుశ విభ్రమా విజయతే
11. చూడాసుధాంశోః కలా ॥ పాయాద్వః ప
12. రివర్తమానలహరీ ప్రాగ్భార మాస్ఫా
13. లయ న్నాయంకాలతరంగకేళిషు కరాస్క
14. ందేవ మందాకినీం। దేవస్యారభటీ పరిభ్ర
15. మకలా సంరంభ సంభావినః శంభోరంబు
16. మృదంగవాద్య రచనారంభాయ లంబోదరః ॥

చిత్రము 288–జె.

చిత్రము 288–కె.

### ఎఱ్ఱాప్రెగడ కాలపు లిపి (క్రీ. శ. 1346)

1. అంహస్సంఘ భయానకస్త్రిభువనే సద్ధానకీర్త్యా
2. నకః క్షామక్షీణ సమస్తదీనజనతాసంత్రానకశ్శ్వానకః ॥ తస్యాన్వయే జ
3. యడి కందయ పెద్దిభట్టః శ్రీశైలసీమ్ని కృతవిశ్రుతసత్రయాగః। వ్యాఖ్యా
4. నకృద్గిరిశనామ సహస్రకస్య పంచాగ్రహార పరిరక్షిత బంధువర్గః।

## శ్రీనాథుని కాలపు లిపి
## (పెదకోమటి వేమారెడ్డి శాసనము- క్రీ. శ. 1409-10)

1. శాకాబ్దములు సహస్రము
2. ను మున్నూంట ముప్పది యొ
3. క్కండును నైన భవ్యసంఖ్య । వఱలు
4. విరోధి సంవత్సరంబున ఫాల్గు
5. నంబున బహాళపక్షంబు విదియ
6. శుక్రవారంబున శుభముహూ
7. ర్తంబున శ్రీధాన్యవాటీపురాధిప
8. తియుం గ్రిష్ణవేణ్ణాజల క్రీడా వినో
9. దుండ్డు నగుగన్నభూపాలు నను
10. ంగుంబుత్రి వీరనారాయణుం
11. డు వేమ విభుని దేవి । భూరి సద్గుణ
12. నికురుంబ సూరమాంబ । జగము
13. వినుతింప సంతాన సాగరాఖ్య వర
14. తటాకప్రతిష్ఠోత్సవం బొనచ్చెఁ ॥ జాహ్న
15. వీ యమునాది సకళ పావన నదీ
16. విమలతీర్థాఁంభః పవిత్రితంబు । స
17. విధ దేశస్థాయి శివమౌళి బాలేందు
18. కౌముదీ సంపుల్ల కైరవంబు ।

చిత్రము 238-ఎల్.

చిత్రము 238-ఎం. పెద్దన కాలపు లిపి (కృష్ణదేవరాయల శాసనము - క్రీ. శ. 1516)

1. శుభమస్తు ॥ శ్రీమన్‌మహారాజాధిరాజ రాజపరమేశ్వర మూరురాయర
2. గండ అరిరాయవిబాడ భాష గెతపువరాయరగండ యవనరాజ్య
3. స్థాపనాచార్య శ్రీ వీరప్రతాప కృష్ణదేవమహారాయలు విజయ
4. నగరాన సింహాసనారూఢులై పూర్వ దిగ్విజయ యాత్రకు విచ్చేశి
5. ఉద్దగిరి కొండవీడు కొండవల్లి రాజమహేంద్రావరం మొదలైన
6. దుర్గాలు సాధించి సింహాద్రికి విచ్చేసి స్వస్తి శ్రీ జయాభ్యుదయ

బుద్ధి కలిగిన తెలుగువాండ్లలోపల
వాడికెడికె పుణ్యాపుదావ
చూపించ్చే

# నూరుజ్ఞాన వచనాల

యొక్క

చిన్న పుస్తకం

ఇతి

---

+వెయ్యంగ అచ్చెదేశంలో వుండే హాల్లె
అచ్చెటూరంలో ఇతి అచ్చుతుంద్ది

చిత్రము 288-ఎన్.

క్రీ. శ. 1747 సం॥న సెరాంపూర్ కళాశాల గ్రంథాలయమున నుండిన రెవరెండు బెంజమిన్ స్కల్జియస్ ప్రష్యాదేశమున మాగ్డిబర్గునకు చేరిన హాలీ పట్టణమున తెలుగు భాషలో ముద్రించిన 'నూరుజ్ఞాన వచనాల' ముఖపత్రము.

౨౦ ❀ )०( ❀

గాదిక దినముల్లు సాపించ్చగలవా
డివు అయితే నివు నిన్నె శోదించ్చిని
బుద్ధియొక్క మనసు ముందుగా నె
లస్తుడుగా వుండి నిలవ కూడదు పా
యూవంటె నివు యేవిూదట సర్వేశ్వరు
డియొక్క న్యాయం తీర్చబడను ముం
దుగా మెద్దెంతోను నిలుతువనెడి
మెస్సుగా విచారించ్చను కూడవాడివు
౬౦ నిత్యకాలానికంట యప్పుడును న
డిచె కూర్మి అదికంగా యెంచ్చుకొ
వవెను అదెమంటె యి కాలంయొక్క
వక గెడియలోపల మనుష్యుడు మద
సాపడి తనకు ఆదాయంగాను
యేవొకొకొకటి నిచె మోక్షానందాన్ని
సంపాదించ్చ వచ్చును అయితే కాబో
యెలోకంలో వుండె నిత్యమయిన కా
లంలో మనుష్యుడు గొప్పకొండు
కలిన ప్రపంచ్చకాలంయొక్క వక నిమి
షం మొదలుగాను సంపాదించ్చ
కూడదు

౬౧

చిత్రము 288-ఓ.

'నూరుజ్ఞాన వచనాల'లోని ఒక పుట.

ష్పహాయమునోత|మేదిసాధించతగినద్|అదిపరాక్రమంచాతసాధించతగినదికా
డు|వొకచెట్టుమీదకాకిగుడ్లుపెట్టినప్పుడల్లా|ఆకిందపుట్టలోవుండేకృష్ణసర్పంతిని
పోతూవుండేది|యీశత్రువిరోధంయేలాగునివర్తింస్తుందాఅనికాకిఆలోచన
చేసుకుంటూవుంది|వకరోజునఆదేశపురాజభార్యస్నానంచెయ్యబొయ్యేటప్పు
డు|తననగలుయావత్తూతీసిఅక్కడవుంచినసమయంలో|అందులోవొకబంగార
పునానుముక్కునకరుచుకునిపోతూవున్నంతల్లో|ఆమెతాలూకునౌకర్లుచూచివెం
ఠకూడావెళ్లినమీదటవాండ్లుచూస్తూవుండగా|ఆపుట్టలోవేశినది||అంతటవాం
డ్లుఆపుట్టతవ్వించినంతల్లో|ఆపాముకనుపించినందున|దాన్నిచంపి|అనానుపట్టు
కునిపోయి|రాజభార్యకుయిచ్చినారు||

చిత్రము 288-పి.

క్రీ. శ. 1817 లో అచ్చయిన విలియం బ్రౌను 'గ్రామర్ ఆఫ్ ది జెంటూ లాంగ్వేజ్' అను గ్రంథమునుండి.

| | అ | ఆ | ఇ | ఈ | ఉ | ఊ | ఏ | ఐ | ఓ | ఔ | క | ఖ | గ | ఘ | ఙ | చ | ఛ | జ | ఝ | ఞ | ట | ఠ | డ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| మౌర్యకాలపు బ్రాహ్మీ లిపి క్రీ.పూ. 3వ శతాబ్దము | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| భట్టిప్రోలు ధాతుకరండము మీది బ్రాహ్మీ లిపి క్రీ.పూ. 3వ శతాబ్దము | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| సాతవాహన కాలపు బ్రాహ్మీ (గుహా) లిపి క్రీ.శ. మొదటి శతాబ్దము | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| ఇక్ష్వాకు కాలపు బ్రాహ్మీ లిపి క్రీ.శ. 3వ శతాబ్దము | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| గుప్తుల కాలపు లిపి క్రీ.శ. 4వ శతాబ్దము | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| శాలంకాయన కాలపు పురాతన తెలుగు-కన్నడ లిపి - క్రీ.శ. 5వ శతాబ్దము | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| పల్లవుల కాలపు గ్రంథ,తమిళ లిపులు క్రీ.శ. 7వ శతాబ్దము | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| తెలుగు - కన్నడ లిపి క్రీ.శ. 7వ శతాబ్దము. | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| పూర్వచాళుక్య యుగపు తెలుగు-కన్నడ లిపి క్రీ.శ. 10వ శతాబ్దము | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| రాజరాజ నరేంద్రుని కాలపు తెలుగు-కన్నడ లిపి క్రీ.శ. 11వ శతాబ్దము నన్నయ భట్టయుగము - మార్పుకాలము | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| కాకతి గణపతి దేవుని కాలపు తెలుగు-కన్నడ లిపి క్రీ.శ.13వ శతాబ్దము.... తిక్కన యుగము | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| ప్రోలయ వేమారెడ్డి కాలపు తెలుగు లిపి క్రీ.శ. 14వ శతాబ్దము - ఎఱ్ఱాప్రగడ యుగము | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| పెదకోమటి వేమారెడ్డి కాలపు తెలుగు లిపి క్రీ.శ. 15వ శతాబ్దము - శ్రీనాథుని యుగము | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| కృష్ణదేవరాయల కాలపు తెలుగు లిపి క్రీ.శ. 16వ శతాబ్దము - పెద్దన యుగము | | | | | | | | | | | | | | | | | | | | | | | |

| | ఢ | ణ | త | థ | ద | ధ | న | ప | ఫ | బ | భ | మ | య | ర | ల | వ | శ | ష | స | హ | ళ | ఱ | క్ష |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| మౌర్యకాలపు బ్రాహ్మీ లిపి క్రీ.పూ.3 వ శతాబ్దము | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | | | |
| భట్టిప్రోలు ధాతుకరండము మీది బ్రాహ్మీ లిపి – క్రీ.పూ.3వ శతాబ్దము | | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | | [illegible] | [illegible] | [illegible] | [illegible] | | |
| సాతవాహన కాలపు బ్రాహ్మీ(గుహా)లిపి క్రీ.శ. మొదటి శతాబ్దము | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | | |
| ఇక్ష్వాకు కాలపు బ్రాహ్మీ లిపి క్రీ.శ. 3వ శతాబ్దము | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | | |
| గుప్తుల కాలపు లిపి క్రీ.శ. 4వ శతాబ్దము | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | | |
| శాలంకాయన కాలపు పురాతన తెలుగు-కన్నడ లిపి – క్రీ.శ. 5వ శతాబ్దము | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] |
| పల్లవుల కాలపు గ్రంథ.తమిళ లిపులు క్రీ.శ.7వ శతాబ్దము | | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] |
| తెలుగు-కన్నడ లిపి క్రీ.శ. 7వ శతాబ్దము | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] |
| పూర్వచాళుక్యయుగపు తెలుగు-కన్నడ లిపి క్రీ.శ. 10వ శతాబ్దము | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | | [illegible] | [illegible] |
| రాజరాజనరేంద్రుని కాలపు తెలుగు-కన్నడ లిపి.. క్రీ.శ. 11వ శతాబ్దము నన్నయ భట్టయుగము-మార్గకాలం | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] |
| కాకతిగణపతిదేవుని కాలపు తెలుగు-కన్నడ లిపి క్రీ.శ.13వ శతాబ్దము – తిక్కన యుగము | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | |
| ప్రోలయ వేమారెడ్డి కాలపు తెలుగు లిపి క్రీ.శ.14వ శతాబ్దము – ఎఱ్ఱాప్రగడ యుగము | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | |
| పెదకోమటి వేమారెడ్డి కాలపు తెలుగు లిపి క్రీ.శ.15వ శతాబ్దము – శ్రీనాథుని యుగము | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | |
| కృష్ణదేవరాయల కాలపు తెలుగు లిపి క్రీ.శ.16వ శతాబ్దము – పెద్దన యుగము | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | - |

పూర్వోక్త అశోక శాసనము లటుండ భట్టిప్రోలు స్తూపమునందలి ధాతుకరండముల మీద బ్రాహ్మీలిపిలో నున్న శాసనములు కొన్ని గలవు. ఈ శాసన లిపిలోని యక్షరములు అనేకము అశోకునినాటి దక్షిణదేశపు బ్రాహ్మీలిపి వర్ణములను బోలి యొక్కరీతినే యున్నవి కాని కొన్నిమాత్రము పూర్తిగ భిన్నముగా నున్నవి. ఇటువంటివానిలో ఘ, చ, ద, ధ, భ, మ, ల, ష, శ లు ముఖ్యమైనవి. వ్రాయునట్టి పద్ధతిలోను, తలకట్టుతో కూడిన అక్షరముల తీరులోను ఈ లిపిలోనివానికిని, ఆ లిపిలోనివానికిని చాల భేద మున్నది. ఈ భేదమును పురస్కరించుకొని బూలరుపండితుడు ఈ భట్టిప్రోలు శాసన లిపికి 'ద్రావిడీ బ్రాహ్మి'యని పేరిడెను. ఈ శాసనములు ఆయన యభిప్రాయములో క్రీస్తు పూర్వము రెండువందల నాటివి. ఈ ద్రావిడీబ్రాహ్మి మూలబ్రాహ్మి నుండి విడిపోయిన ఒక శాఖ కాదగు ననియు, మాతృలిపినుండి యిది - ఎంత ఇటీవల అనుకొనినను - క్రీస్తు పూర్వము అయిదవ శతాబ్దినుండి విడిపోయి యుండవలె ననియు ఆయన యూహించియున్నాడు.

అశోక చక్రవర్తి రాజ్యపరిపాలన కాలములో దేశమున రాజకీయైక్యము సాధింపబడిన విధముననే అది సాంస్కృతికముగకూడ శిల్ప, లిపి విషయములందును ఏకత్వము కుదురుకొనుట కారంభమైన కాలము. ఆనాడు భారత దేశమం దంతటను ఏకైకశాసనభాష ప్రాకృతమువలెనే ఏకైకలిపి బ్రాహ్మీలిపి వాడుకలోనికి వచ్చినది. క్రమక్రమముగా బ్రాహ్మీలిపి వర్ణములకు - అవి నిలువు, అడ్డు గీట్లతో కొన్ని ప్రాంతముల కోణములు తీర్చి వ్రాయబడిన నేమి, వంపులు తేరి కుటిలముగ వ్రాయబడిననేమి - ఏకరూపత సిద్ధించినది.

బ్రాహ్మీలిపిలో బాగుగా గమనింపదగిన తరువాతి పరిణామము క్రీస్తుశకము మొదటి శతాబ్దమునాటిది. మౌర్యుల కాలమునుండి బ్రాహ్మీలిపి యక్షరములు కొద్దికొద్దిగ మార్పు చెందుచు శుంగవంశజుల తరువాతికాలము నుండి ఈ పరిణామమునకు దారితీసినవి. ఈవిధమైన లిపి పరిణామము కుషాణవంశజులైన కనిష్క, హువిష్క, వాసుదేవాదుల శాసనములలో కనబడును. వీరి శాసనములు మథురలోను, దాని చుట్టుపట్లనుండు ప్రదేశమునందును అసంఖ్యాకములుగ కానవచ్చును. ఈ లిపిలోని శాసనములను తూర్పు రాజపుతానా, మధ్య భారతము, (సాంచి)లలోకూడ చూడవచ్చును. అక్షరముల తీరులో నొక విలక్షణత్వ ముండి అవి యించుక వెడల్పుగను, బొద్దుగను ఉండుటవలన కుషాణకాలపు బ్రాహ్మీలిపి శాసనములను చూచీచూచుటతోనే ఆ కాలపువని సులభముగ గుర్తుపట్టవచ్చును. పశ్చిమ హిందూదేశమునందలి కుషాణ సామంతులైన క్షత్రపులు శక, పహ్లవ, వంశజులుకూడ తమ శాసనముల నీ లిపిలోనే వ్రాయించిరి.

ఉజ్జయిని రాజధానిగా పరిపాలించినవారు శకవంశజులు. వీరి రాజ్యమును గుప్తవంశజు లాక్రమించుటతో వీరి పరిపాలన మంతరించినది. క్షత్రపులలో శకవంశజులు క్షహరాతులు కలరు. భూమక, నహపానులు క్షహరాత వంశజులు. నహపానుని అమాత్యుడైన అర్యముని శాసనము పూనా జిల్లాలోని జున్నారులో నున్నది. నహపానుని అల్లుడును, హిందూమతావలంబియును అయిన వృషభదత్తుని (ఉషవదాత) శాసనములు పూనాజిల్లాలోని నాసిక, కార్ల గుహాలయములలో చెక్కబడియున్నవి. ఇవి యన్నియు కుషాణులనాటి బ్రాహ్మీలిపిలోనే యున్నవి. యవన, శక, పహ్లవులను యుద్ధమున జయించి సాతవాహన వంశప్రతిష్ఠను నిలిపి రాజ్యమును విస్తరింపజేసిన గౌతమీపుత్ర శాతకర్ణియొక్కయు, అతని కుమారుడైన వాసిష్ఠీపుత్ర పులుమావియొక్కయు శాసనములుకూడ పశ్చిమ హిందూదేశమునందలి పూర్వోక్త గుహాలయముల యందే ఆ లిపిలోనే యున్నవి. వీనిలో వాసిష్ఠీపుత్ర పులుమావి కాలమున అతని పితామహి గౌతమీ బాలశ్రీ నాసికగుహలో చెక్కించిన శాసనమునందలి అక్షరములలోని వివిధ రేఖలు ఒకదాని కొకటి అనురూపముగ నుండి కోణములుదేరి చూడ ముచ్చటగ నుండును. ఆంధ్ర - సాతవాహనుల శాసనములు పశ్చిమ హిందూదేశమునందలి నాసిక, కార్ల గుహలలోనే కాక కన్హేరి, నానాఘాటు గుహలలోను, అమరావతి, చినగంజాము, రామిరెడ్డిపల్లి మొదలగు ఆంధ్ర ప్రదేశ్‌లోని గ్రామములలోను కనబడినవి. వారి మొదటి శాసనములు పశ్చిమ హిందూదేశ గుహాలయములలోనే కానవచ్చుటవలన వానిని ప్రకటించిన పందొమ్మిదవ శతాబ్ది చివరిభాగమునాటి ప్రాచ్య పరిశోధక పండితులును, లిపిశాస్త్రజ్ఞులును ఆ శాసనలిపి కుషాణలిపిని పోలియే యున్నను 'గుహాలిపి' యను స్థానిక నామమున వ్యవహరించుచువచ్చిరి. గుహాలిపి యన్నంతమాత్రమున అది క్రొత్తలిపి యని యూహింపరాదు. అది మౌర్యాశోకునినాటి బ్రాహ్మీలిపి పరిణామమే కాని వేరు కాదు. కొంచె మించుగ అశోకుని కాలమునుండి ఆంధ్ర-సాతవాహనుల పరిపాలనము చివరికాలమువరకు బ్రాహ్మీలిపిలో వచ్చిన పరిణామములను క్రీస్తుకు పూర్వము ప్రారంభమై నాల్గు దశలలో పూర్తియైన అమరావతీ స్తూపపు శాసనములలో గుర్తింప గుదురును.

క్రీస్తు శకము మూడవ శతాబ్దమునుండి ఉత్తరహిందూ దేశమున కుషాణకాలపు బ్రాహ్మీలిపి క్రొత్త పరిణామములకు దారి తీయుచుండ పశ్చిమ, మధ్య హిందూదేశములలోను, దక్కనులోను ఆ లిపి తరువాతికాలమున దక్షిణదేశ లిపులుగా మారిన పరిణామమునకు శ్రీకారము చుట్టినది.

క్రీస్తుశకము మూడవ శతాబ్ది ఉత్తరార్ధమున కృష్ణానదీతీరమునందలి విజయపురి రాజధానిగ ఆంధ్రదేశమును పరిపాలించిన ఇక్ష్వాకువంశపు రాజుల కాలమున ఆంధ్ర సాతవాహనులనాటి బ్రాహ్మీలిపిలో అత్యధికమును, అత్యంత రమణీయము నైన మార్పు వచ్చినది. ఒక్కొక్కప్పుడు శతాబ్దులతరబడి కాలములో సంఘములోకాని, మతములోకాని ఏ మార్పును గనబడదు; మరియొకప్పుడు శతాబ్దులు పట్టునట్టి మార్పులుకూడ ఒక్క శతాబ్దిలోనే వచ్చివేయుటయు కలదు. ఇటువంటిదే ఇక్ష్వాకుల రాజ్య పరిపాలన కాలము. రాణివాసపు స్త్రీల పేర్లలో, తుదకు సామాన్య జనము పేర్లలోకూడ అంతకు పూర్వ కాలమునకు ఇప్పటికి మార్పు వచ్చినది. మనోహరము లైన ఆ పేరులు ఆ కాలస్వభావమును తెలుపు సంకేతములు; ఆ కాలము శృంగార విభ్రమాంచిత మైనది; ఈ విధమైన శృంగారకల్పనాభిరుచి నాటి శిల్పరచనలలోను, లిపిలోను గూడ గోచరించును. ఇక్ష్వాకు శాసనములయందలి లిపి అక్షరావయవములందు పొంకము కలిగి చూడ ముచ్చటయిన తీర్పు తీరువలతో పూలతీవల ననుకరించుచు కనులకు విం దొనరించుచుండును. అందులో నీ శాసనములు పాలరాతిమీద చెక్కినవగుటచేత చక్కని నును పైన ఫలకములపై కడు రమణీయముగ చూపట్టును. కుషాణ కాలపు లిపివలెనే ఇక్ష్వాకు శాసన లిపిని చూచీ చూచుటతోడనే వారి కాలపుదని సులువుగా గుర్తుపట్టవచ్చును.

క్రీస్తు శకము నాలుగవ శతాబ్దము బ్రాహ్మీలిపికి అవధి. ఉత్తర హిందూదేశమున గాని, దక్షిణ హిందూదేశమున గాని ఆ శతాబ్దమునుండి పరిణామమును పొందిన లిపిని బ్రాహ్మీలిపి యనరు. క్రీస్తుశకము నాలుగవ శతాబ్దమునుండి దక్షిణ దేశమున వచ్చినట్లే ఉత్తరదేశమునందును బ్రాహ్మీ లిపిలో గొప్పమార్పు వచ్చినది. అది క్రీస్తు శకము నాలుగవ శతాబ్ది మధ్యకాలమునుండి నాగరి లిపికి ప్రాథమిక - ఆద్య స్వరూపముగా మారగా దక్షిణదేశమున దాక్షిణాత్య లిపుల ప్రాథమిక స్వరూపముగా మార్పుచెందినది. ఆ శతాబ్దమునుండి కాఠయవాడ, ఉత్తర గుజరాతు దేశములలో తక్క నర్మదానది కుత్తరమున నున్న దేశమునందలి శాసనము లన్నియు నేటి ఔత్తరాహలిపుల కాద్య స్వరూపము లైన నాగరి లిపిలోనే వ్రాయబడుచు వచ్చినవి. ఇక వింధ్యకు దక్షిణమునందున్న దక్షిణదేశమునం దంతట నేటి దాక్షిణాత్య లిపుల కాద్యస్వరూపమయి, ఇక్ష్వాకు రాజ్యకాలానంతరమున ప్రాక్పశ్చిమ దక్షిణ మధ్య ప్రాంతములందు స్థానికము లైన కొద్దిపాటి ప్రాంతీయ భేదములతో శాసనములలో గానవచ్చు లిపియే వాడుకలోనికి వచ్చినది. ఈ లిపిలోనే ప్రాచీన పల్లవ, శాలంకాయన, కందార, విష్ణుకుండి వంశజుల శాసనములును, వేంగీ(తూర్పు)చాళుక్యవంశపు మొదటి భూవరుల శాసనములు నున్నవి. ఈ లిపి ఒక్క తెలుగు దేశముననే కాక కన్నడ దేశమునందును వాడుకలో నుండెను. కన్నడ దేశమున వివిధ ప్రాంతములందు పరిపాలనము నెరపిన పశ్చిమగాంగ, నొడంబ, కదంబ, బాదామి, చాళుక్యాది రాజవంశజుల శాసనము లన్నియు ఈ లిపిలోనే యున్నవి. ఇది తెలుగు - కన్నడ లిపియొక్క ఆర్ష (అతి పురాతన) రూపమని చెప్పవచ్చును. ఈ తెలుగు - కన్నడ లిపి బహుళ ప్రచారము కలది; దక్షిణ దేశమున బహువ్యాప్తి కలది; ఒక్క తెలుగు, కన్నడ దేశములందే కాక, ఇంచుమించుగ ఇది దక్షిణదేశమం దంతటను వాడుకలోనికి వచ్చినది. కొన్ని యక్షరములలో వేరు వేరు ప్రాంతములందు స్వల్ప భేదములు కానవచ్చినను లిపి స్వరూపములో మాత్ర మే విధమైన భేదమును లేదు. పురాతనమైన ఈ తెలుగు - కన్నడ లిపికే వేంగీలిపి యని పేరు. పందొమ్మిదవ శతాబ్ది ఉత్తరార్ధమున శాసనసంపాదనకు, శాసన పరిశోధనకు పూనుకొనిన యూరోపియను ప్రాచ్య పరిశోధక పండితులకు వేంగీపురము రాజధానిగా తెలుగుదేశమును పరిపాలించిన శాలంకాయననృపుల తామ్రశాసనములు మొట్టమొదట లభించుటచేత ఈ శాసన లిపికి వారు వేంగీలిపి యని పేరు పెట్టిరి. నిజమున కిది తెలుగు - కన్నడ లిపియొక్క ఆర్ష రూపమే కాని దానికి భిన్న మైనది కాదు. ఇండోచీనా, మలేషియాలవంటి హిందూ వలసరాజ్యములలో తొలుదొల్త కానవచ్చిన శాసనలిపి వేంగీలిపియే. అందువలన ఆ కాలమున సముద్రతీరస్థాంధ్రదేశీయులు ప్రాగ్దేశములతోను, ప్రాగ్ద్వీపములతోను వర్తక వ్యాపారము సాగించుచు వలసరాజ్య స్థాపనమున పాల్గొనుచుండిరనియు, వారే ఈ లిపి నచటికి గొనిపోయి ప్రవేశపెట్టిరనియు చెప్పుట కవకాశము గలదు.

కళింగ దేశమున క్రీస్తుశకము నాలుగయిదు శతాబ్దుల నుండి వాడుకలో నుండినది ఈ పురాతనపు తెలుగు - కన్నడ లిపియే. క్రీస్తుశక మేడవ శతాబ్దాంతమునుండి ఉత్తర హిందూదేశముతోడి సంపర్కమున కళింగ గాంగ

శాసనములలో నాగరి (బంగాళదేశపు కుటిలలిపి) అక్షరములు కానవచ్చుట ఆరంభమైనవి. ఎనిమిదవ శతాబ్దమధ్యకాలమునకు కళింగ గాంగతామ్రశాసనములలో వాని ప్రాచుర్యము హెచ్చినది. తొమ్మిదవ శతాబ్దారంభమునకు గాంగశాసనములలోనుండి తెలుగు - కన్నడ లిపిని తరిమివేసి నాగరిలిపి దాని స్థానము నాక్రమించినది. అంతటినుండి కళింగ గాంగ తామ్రశాసనములలోని లిపి నాగరియే

కాంచీపురము రాజధానిగ పరిపాలించిన పల్లవరాజు మహేంద్రవర్మ కాలమువరకు (క్రీ. శ. 600 - 630) పల్లవ నృపులు తమ శాసనములలో వాడిన లిపి కూడ వేంగీలిపియే (తెలుగు - కన్నడ లిపి ఆర్ష రూపము). ఏడవ శతాబ్దికి పూర్వము తమిళదేశమున గానవచ్చినవి బ్రాహ్మీలిపి శాసనములు. ఈ శాసనములు క్రీస్తు పూర్వము 200 ల నాటివి కాదగు ననియు, ఈ లిపిలోని యక్షరములు భట్టిప్రోలు శాసనలిపిలోనివానిని పోలియున్న వనియు తమిళ లిపిశాస్త్రజ్ఞులు చెప్పుదురు. ఈ శాసనము లింకను ప్రకటితమును కాలేదు; వీని యర్థ మింకను సుబోధమును కాలేదు. ఈ బ్రాహ్మీలిపి శాసనములు ముఖ్యముగా మధుర, రామనాథపురం, తిరునెల్వేలి జిల్లాలలోను, తిరుచిరాపల్లి జిల్లా దక్షిణభాగమునను కానవచ్చినవి. ఇవన్నియు ఒకటి రెండు పంక్తులలో పంచపాండవపడుక లను సహజముగ నేర్పడిన గుహలలో రాలమీద చెక్కినవి. వీనిలోని భాష తమిళమని కొందర, కాదని కొందర అభిప్రాయము. ఏమయిన నేమి వీని తరువాత ఏడవ శతాబ్దినాటి పల్లవ మహేంద్రవర్మ కాలమువరకు తమిళదేశమున శాసనములే కానరాలేదు. మహేంద్రవర్మ మొదటి శాసనములు - మహేంద్రవాడి, మండగపట్టు మొదలైనచోట్ల వేంగీ లిపిలోనే యున్నవి. ఈ పల్లవరాజు కాలమునుండియే తమిళదేశములో వేంగీలిపి గ్రంథ లిపిగా మారుట కారంభించినది. ఇంతటినుండి తెలుగుదేశములోని పల్లవరాజు శాసనములు వేంగీలిపిలోను, తమిళదేశమునందలి శాసనములు గ్రంథలిపిలోను వ్రాయబడుచు వచ్చినవి. ఇందుకు పల్లవ మొదటి పరమేశ్వరవర్మ (క్రీ. శ. 670 - 680) నలజనంపాడు, కూరమ్ శాసనములును, నరసింహవర్మ (క్రీ. శ. 680 - 720) మహాబలిపురశాసనములును, రేయూరు దానశాసనమును చూడవచ్చును. సంస్కృతభాషను వ్రాయుటకు తమిళదేశమున వాడబడు లిపికి గ్రంథమని పేరు. సంస్కృత గ్రంథమును గ్రంథ మందురు. అందువలన సంస్కృత భాషలో నున్న గ్రంథములను, లేక శాసనములను వ్రాయు లిపికి గ్రంథ లిపి యని పేరు వచ్చినది. ఈ గ్రంథ లిపితోపాటు తమిళులు మాటాడు తమిళ భాషకు వేరొక లిపి కలదు. దీనికి తమిళ లిపి యని పేరు. తమిళ లిపిలోని శాసనములు కూడ క్రీస్తుశక మేడవ శతాబ్దమునుండియే కనబడుచున్నవి. పదునొకండవ శతాబ్ద ప్రారంభమువరకు ఈ లిపిలో నున్న శాసనములు తమిళ దేశపు ఉత్తర భాగమయిన తొండమండలము, చోళ మండలము, కొంగుదేశములందుమాత్రమే కానవచ్చుచున్నవి. తమిళలిపిలోని యక్షరములును, గ్రంథలిపిలోనివి చాలవర కొకటే విధమున నుండును; మిగిలిన యక్షర రూపములు గ్రంథాక్షర రూపములకు కొద్దిగ భిన్నముగ నుండును. ఈ విషయము మొదటి పరమేశ్వరవర్మ కూరమ్ తామ్ర శాసనమును చూచిన విదితమగును. దీనం జేసి ఈ రెండు నొకటే లిపి యనియు, ప్రాచీన తమిళలిపి కూడ వేంగీలిపి పరిణామమే యనియు చెప్పదగి యున్నది.

ఆంధ్ర, కర్ణాట దేశములం దీ తెలుగు - కన్నడ లిపి వాడుకలోనికి వచ్చినదని చెప్పినపుడు కర్ణాట దేశమునందు క్రీస్తుశక మెనిమిదవ శతాబ్ది మధ్యభాగమున బాదామి చాళుక్య రాజ్యమును కూలద్రోసి తమ స్వతంత్ర రాజ్యమును స్థాపించిన రాష్ట్రకూట నృపతులుకూడ తమ శాసనములం దీ లిపినే వాడుక చేసిరని వేరే చెప్పనక్కర లేదు. మొదటి వేంగీ చాళుక్య, రాష్ట్ర కూట భూపతుల శాసనములందలి ఈ పురాతనపు తెలుగు - కన్నడ లిపి కంటికి కానరాని కొద్దిపాటి మార్పులు పొందుచు క్రీస్తు శకము పదవ శతాబ్దమునాటికి సంపూర్ణ వికాసము నొంది అప్పటినుండి ఆధునికపు తెలుగు - కన్నడ లిపిగ పరివర్తనము చెంద నారంభించినది.

తెలుగు - కన్నడ లిపికి క్రీస్తు శకము పదవ, పదునొకండవ, పండ్రెండవ శతాబ్దములు పరివర్తన కాలము. దీనికే బర్నెల్ పండితుడు సంధికాలమని పేరిడెను. ఈ పరివర్తనము రెండు మూడు వందల యేండ్లు సాగినది. మార్పు చెందిన ఈ లిపి మొదటి మారు తెలుగు దేశమున క్రీస్తుశకము పదునొకండవ శతాబ్దినాటి వేంగీదేశ శాసనములలో కనబడును. తెలుగు - కన్నడ లిపిలోని ఈ మార్పు పశ్చిమ చాళుక్య, రాష్ట్రకూట శాసనములలో ఇంతకు కొంచెము ముందుగ వచ్చినది. అక్షరములలోని ఈ మార్పు క్రీస్తుశకము 14 వ శతాబ్దమునుండి మరింత విస్పష్టమగును. ఈ లిపియే ఇప్పటి తెలుగు, కన్నడ లిపులయొక్క ప్రాచీన రూపము.

ఈ పరివర్తన కాలముననే తెలుగు - కన్నడ అక్షరములకు ఇప్పటి తలకట్టులవంటివి ఏర్పడినవి. అంతకు పూర్వము తలకట్టు అక్షరముయొక్క శిరోభాగమున అడ్డుగీటు

వలన జూపబడుచు వచ్చెను. ఇక ఈ కాలములో వచ్చిన ముఖ్యము లైన మార్పు లివి: ల, చ, ఛ, భ ల స్వరూపము ఇప్పటికి పూర్తిగ మారిపోయినది. ఇంతకు పూర్వ మను స్వారము - చుక్కవలె జూపబడిననేమి, సున్నగా వ్రాయ బడిన నేమి - అక్షరము శిరోభాగముననో, దాని కెగువ కుడిప్రక్కనో యుండెడిది. ఇప్పు డది పంక్తిలోనికి వచ్చి నది. మహాప్రాణములకు (ఘ, ఛ, ఝ, థ, ఫ, భ) ఒత్తు లేర్పడినది ఈ కాలములోనే. ఒత్తుయొక్క ప్రాథమిక రూపము బోరగిలవైచిన అర్ధచంద్రరేఖవంటి గుర్తు. ఇది అక్షరపు కుడివైపు రేఖకు దిగువ తగిలి యుండెడిది. ఈ గుర్తు శాసనలిపిలో పదుమూడవ శతాబ్దమునుండియే కానవచ్చుచున్నను ప్రచురముగ ఇది పదునాలుగు, పదు నైదు శతాబ్దులనాటి లిపిలో కానబడును. ఈ సంకేతము కాలక్రమమున అంతకంతకు అక్షరము దిగువ భాగమున పొక్కిలియొద్ద క్రిందికి నిలువుగీటుగ కుదురుకొనినది.

క్రీస్తు శకము పదునైదవ శతాబ్దమునుండి తెలుగు, కన్నడ లిపులకు ప్రత్యేకత సిద్ధించి క్రమముగా అవి రెండును విడిపోవ నారంభించినవి. విజయనగరాధీశ్వరు డగు కృష్ణదేవరాయల పదునారవ శతాబ్దమునాటి తెలుగు దేశ శాసనములకును, కన్నడదేశ శాసనములకును లిపిలో వ్యత్యాసము కాన్పించును. ఈ తెలుగు కన్నడ లిపులు ఎంత వేరుపడినను, విడిపోయినను అవి రెండును మొట్ట మొదటినుండియు కలిసియే యున్నందున కవలలకువలె ఈ రెంటికి నెక్కువ దగ్గర పోలిక లుండుటచేత స్వల్ప ప్రయత్నముతోనే కన్నడ శాసనములను తెలుగువారు సులువుగా చదువవచ్చును. ముద్రణము వచ్చినప్పటినుండి తెలుగు కన్నడ లిపులకు విభేదము మరింత యెక్కువయి నది. అంతే కాదు, ముద్రణము వచ్చినప్పటినుండియే తెలుగు అక్షరములు కూడ - ఇతర భాషా లిపులవలెనే - పోతలో పడి మార్పుచెందుట ఆగిపోయినవి. మ. సో. శ.

**లీలావతీ విజయము :** ఉజ్జయినీ నగరాధిపతియగు భోజరాజునకు మానవతియందు లేకలేక శివుని వరమున జననమందిన పుత్రిక లీలావతి. తలిదండ్రు లామెకు ఏడు కోటలనడుమ నొక యొంటికంబపు మేడను కట్టించి యం దామె నుంచి ముద్దు మురిపెములతో పెంచుచుందురు. ఆమె తన చెలికత్తెలతో నా మేడయందు విహరించుచుండును.

ఇంద్రవిభవుడైన మగధరాజు ఒకనాడు కొలువు తీరి యుండ అతని పురోహితుడు వచ్చి భోజతనయ యగు లీలావతి యతని కెంతయు తగిన యిల్లాలని చెప్పి, ఆమెను తప్పక పెండ్లాడు మనెను. మగధరాజు మమత రెట్టింప ఆమెను తన కిచ్చి పెండ్లిచేయుమని ఉజ్జయినీరాజు నడుగ బంపును. అత డందు కంగీకరింపకపోగా మగధరాజు ఎట్లయిన లీలావతిని పెండ్లాడ నిశ్చయించి తన రాజ్యములో ఎన్నికగన్న కన్నగాండ్రను పిలిపించి తనకు లీలావతిని దెచ్చియిచ్చినవానికి తన రాజ్యమున సగము బహుమతిగా నిచ్చెదనని చెప్పును. అంత దొంగలలో మేటియైన 'పగటి చుక్క' తా నామెను తెచ్చియిచ్చెదనని మగధాధిపతికి గట్టిగా మాట యిచ్చి వలసిన పరికరములను గొని వెంటనే బయలుదేరును.

లీలావతి యొక నా డర్ధరాత్రమువరకు చెలికత్తెలతో చదరంగ మాడియాడి పడకటింటిలో బంగారపుకోళ్లు, కుందనపు పట్టెలు, తీరైన దోమతెర గల మంచమున మెత్తని పరుపుపై పవ్వళించి నిద్రించుచుండిన తరి పగటిచుక్క ఉజ్జయినీనగరమును ప్రవేశించి, ఏడుకోటలు దాటి ఒంటి కంబపు మేడమీది కురికి దానికి కన్నమువేసి పడకటింట జొచ్చి ఆమెపై మత్తుమందు చల్లి యామె పరుండియున్న మంచమును తలపై నుంచుకొని తిన్నగా మరల ఏడు కోటలు దాటి యరణ్యములో బడిపోవును. ఆ దొంగపేరు 'కర్ణకరు' డని మరియొక పాఠము.

అపుడు లీలావతి మేలుకాంచి చోరుడు తన్నెత్తికొని పోవుచుండుట తెలిసి దురపిల్లును; చెలికత్తెలను పిలిచి పిలిచి వాపోవును; తన కనేకవిధముల అపనిందలు కలుగు నని మరి మరి వందురును; చోరు ననేకవిధముల నిందిం చును; రాజదండనము తప్పదని వానిని బెదరించును; మోసమున గొనివచ్చి త న్నిన్ని కష్టముల పాలుచేయుట తగదని యనునయించును; తన్ను దయజూడుమని దైవ మును పరిపరి విధముల ప్రార్థించును; పుణ్యాత్ములు త న్నెవరైన నాచోరుని బారినుండి విడిపింపుడని మొర వెట్టును. చోరు డామె దీనాలాపములను లెక్కచేయక మంచముతో కూడ ఆమె నెత్తుకొని పోవుచుండును.

ఆ యడవికి వేటకు వచ్చి వేటాడి అలసి యొక పొన్న చెట్టు నీడను విశ్రమించి యుండిన మాళవరాజునకు ఆమె రోదనము వినబడ అత డా దిక్కునకు పోయి చోరుడు మంచముపై యువతిని గొనిపోవుచుండుట గాంచును. ఆమె భోజరాజసుత లీలావతియని గ్రహించి యాతడు చోరుని దెగటార్చి లీలావతిని దోడ్కొని యుజ్జయినికి బోయి భోజుని కప్పగించును. భోజు డాతని యుపకారమునకు మెచ్చి లీలావతి నాతని కిచ్చి పెండ్లి చేయును.

ఈ లీలావతీ విజయము వీథిభాగవత పద్ధతిని రచింపబడి అల్లంపాటీశ్వరుని కంకితము చేయబడినది. కర్తయెవడో తెలియరాదు. ఇందు దరువులు, ద్విపదలు, పద్యములు, ఎడనెడ చిన్ని వచనములు గలవు; ఇది అముద్రితము. దీని

ప్రతి మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున నున్నది. దీనికి 'దాదినీవేషకథ'యని నామాంతరము. దీని కాపీ రెట్లు వచ్చినదో దెలియదు. లీలావతీ పరిదేవనము అటతాళములో:—

బాలనమ్మా – నే – బాలనమ్మా
బాలనపకీర్తి – పాలైతినమ్మా

అని మొదలిడు దరువుతో ప్రారంభమగును. గ. సు.

లీలావతి(దాదినమ్మ) భాగవత ప్రదర్శనము: దాదినమ్మ అంటే పందిరిపట్టి మంచము. ఈ మంచం ఒక వ్యక్తి పరుండడానికి సరిపోయినంత పొడవూ, వెడలుపూ కలిగి ఉంటుంది. ఆ మంచానికి అలంకారాలు: ఒక చిన్న పందిరి, ఆ పందిరికి చాందినీ, దోమతెర, లోపల పందిరికి వ్రేలాడే రకరకాల పన్నీరుబుడ్లు. మంచం వెదురుకర్రలతో చేసి చాల తేలికగా ఉంటుంది. లీలావతీ పాత్రధారి మంచం మధ్యలో దూరి మంచాన్ని అటూ ఇటూ కదలకుండా నడుముకు కట్టివేసుకుంటాడు. నడుము క్రిందిభాగమంతా పాదాలవరకు కాళ్లు కనబడకుండా మంచంకోళ్ల చుట్టూ మంచానికి జాలరు దించిఉంటుంది. చూచేవారికి మంచం ఎంతో అందంగా కనబడుతుంది. కాళ్లకడ మంచానికి రెండు లక్కకాళ్లు బైటికి కనబడేటట్టు అమరుస్తారు. ఇలా కాళ్లు అమర్చడంవల్ల మంచంలో దిగబడిన లీలావతీ పాత్రధారి మంచంలో పరుండినట్లే ప్రేక్షకులకు భ్రాంతికలిగేది. భూమిమీద ఆనకుండా మంచం దానంతట అది మధ్య నిలబడినట్లు కనబడేది. కాళ్లకు గజ్జెలు కట్టి పాట ప్రారంభించి లీలావతీ పాత్రధారి నృత్యంచేస్తూంటే పరుండినవ్యక్తి పరుండినట్లుగానే ఉన్నప్పుడు మంచం ఎట్లా నృత్యం చేయగలుగుతున్నదా అని ప్రేక్షకులకు సంభ్రమాశ్చర్యాలు కలిగేవి.

కర్ణకరుడు మత్తుమందు చల్లి తీసుకుపోయే సమయంలో లీలావతి మంచంలో పరుండి ఈ విధంగా తన వృత్తాంతం చెప్పుకుంటూ వాపోతుంది.

దాదినమ్మా – నే దాదినమ్మా
దాదిలో చిన్న – దానసేయమ్మా
బాలనమ్మా – నే బాలనమ్మా
బాల నపకీర్తి – పాలైతినమ్మా
పుట్టకోటా – భూమికోటా
కంచుకోటా – కల్వకోటా
ఇనుపకోటా – ఇత్తడికోటా
వెండికోటా – వెలసినాదీ
ఏడుకోటల – నట్టానడుమా
వొంటిస్తంభం – మేడమీదా
పవ్వళించి – నే నుండంగా
మాయదారి – కర్ణకరుడూ
మచ్చు జల్లి – నన్నూ తెచ్చే......

(మదరాసు ప్రాచ్యలిఖిత భాండాగారమందలి పుస్తకములోని దాని కీ పై దరువు ఖిన్నమైనది.)

ఇట్లా తాళ లయ గతుల కనుకూలంగా పాడుతూ లీలావతీ పాత్రధారి అభినయించేవాడు.

ఈ ప్రదర్శనం కనీసం మూడుగంటలకాలం జరిగేది. మంచం బరువుతో మూడుగంటలకాలం ఒకే పాత్రధారి ప్రేక్షకులకు విసుగు జనింపకుండా పాడుతూ అభినయిస్తూ నృత్యంచేస్తూ ప్రేక్షకులను ఆనందింపజేసేవాడు. లీలావతి పాత్రను పురుషుడే ధరించేవాడు. ఈ ప్రదర్శన లివ్వడంలో కూచిపూడి భాగవతులు సిద్ధహస్తులు. వీరిలోనైనా అందరూ దీన్ని ప్రదర్శింపగలిగేవారు కారు. దాదినమ్మవేషం వేయడంలో పూర్వం నాట్యకళానిధి వేదాంతం లక్ష్మీనారాయణశాస్త్రి, వెంపటి వెంకటనారాయణగార్లు సుప్రసిద్ధులు. వీరి తరువాత చెప్పవలసినవారు లక్ష్మీనారాయణ శాస్త్రిగారి కుమారుడు జగన్నాథశర్మ, చింతా రామమూర్తి, భాగవతుల రాజయ్య మొదలైనవారు.

వీధిభాగవతానికి వలెనే గ్రామంలోని నాలుగు వీధుల నడుమా రచ్చబండవద్ద వేసిన పందిరిలో ప్రదర్శనం. తెరా, కాగడాలూ, వంతపాటగాండ్రూ, హాస్యగాడూ మొదలైన హంగులతో ఇరువైపులనుంచి జోడించి పట్టిన కాగడాలమీద చల్లిన గుగ్గిలం భగ్గుమనడంతో తెర తొలగిపోయేది. తరువాత వెంటనే దాదినమ్మ పాత్ర ప్రవేశమై భాగవత మారంభ మయేది. మి. రా. మూ.

లేపాక్షి: ఇది అనంతపురము జిల్లాలోని హిందూపురమునకు తూర్పున ఎనిమిదిమైళ్ల దూరమున నున్న గ్రామము. విజయనగర చక్రవర్తుల కాలమున ఇది ప్రసిద్ధ క్షేత్రమేగాక గొప్ప వర్తకకేంద్రముకూడ. నూటయెనిమిది పవిత్ర శైవక్షేత్రములలోను లేపాక్షి యొకటని స్కాందపురాణమున చెప్పబడినది. ఇచటి కూర్మశైలముమీద నున్న పాపనాశేశ్వరలింగము అగస్త్యమహర్షి ప్రతిష్ఠయని ప్రతీతి. పాపనాశేశ్వరు డనుపేర శివమూర్తియు, ఆ మూర్తి కెట్టయెదుట రఘునాథమూర్తి విష్ణువు కూడ నుండుట ఇచ్చటి విశేషము.

లేపాక్షి దేవాలయము కన్నులపండు వొనరించు ఒక సుందర దృశ్యము. అది అత్యద్భుతమైన ఒక కళాఖండము. దేవాలయ ప్రాకార మంతట ఎటు చూచినను ఉజ్జ్వల కాంతిస్ఫురిత నేత్రద్వయమే కనిపించును. విశాలమై విస్ఫారితమై రత్నదీప్తిమంతమై నిర్మలమైన ఇచటి కళాసౌందర్యము మనలను వెన్నంటి మరువరాని అనుభూతులను

కల్గించును. చరిత్ర యుగయుగాలలో వేదకాలపు ఋషులు, విజయనగరకాలపు దేవదాసీలు దీనిని వర్ధిల్లజేసిరి.

క్రీ. శ. 1538 లో విజయనగర చక్రవర్తియైన అచ్యుత దేవరాయల కోశాధికారి విరూపణ్ణ. ఇతడు నంది లక్కిసెట్టి కుమారుడు; వీరణ్ణకు అగ్రజుడు. సోదరు లిరువురును మహాశివభక్తులు. పాపనాశేశ్వరాలయము విరూపణ్ణ నాటికి పూర్తియైనట్టు లేదు. చిన్న చిన్న గుళ్లన్నిటిని ఒక ప్రాకారములోనికి చేర్చి సుందరములైన విశాల మండపములను నిర్మించి ఆలయ నిర్మాణకార్యమునకు విరూపణ్ణ పూనుకొనెను. ఇతడు అపూర్వ కళాశోభితములైన రంగమండప, కళ్యాణ మండపములను నిర్మించి అందు తన కులదైవమైన వీరభద్రస్వామిని ప్రతిష్ఠించినట్లు శాసనములవలన తెలియుచున్నది. కాని ఆలయ నిర్మాణము అసంపూర్ణముగనే యుండిపోయినది. ఇందు కొక కథ చెప్పుదురు. అది వట్టి వట్టి కల్పనా కథ యని కొట్టిపారవేయలేము. ఆకథ ఇది: విరూపణ్ణ, వీరణ్ణ - ఇరువురు ఉదారులైన సోదరులు. లేపాక్షిలో వారడుగుపెట్టుసరికి ఆ క్షేత్రము యొక్క ప్రాచీన ప్రసిద్ధి మనస్సునకు తట్టి దానిమీది ఆస్థ పల్లవించి పుష్పించినది. అంతట వారాకాలములోని సుప్రసిద్ధ రథకారులను, శిల్పులను నియోగించి కళలోను, శిల్పములోను ఒక అద్భుతసృష్టి చేయించినారు. వారిచటి శిల్ప, వర్ణచిత్రాలకు కళాత్మకమైన వన్నె చేకూర్చినారు. కల్యాణమండపములోని అసమానము, అద్భుతము అయిన స్తంభములకు రూపము దిద్దించుచుండిన కాలములో వారు అంతఃపురపుకుట్రకు లక్ష్యభూతమైనారు. అది అచ్యుత దేవరాయలమీద ఈర్ష్యాళువులైనగణికాజనమునకు చాల పలుకుబడి ప్రభావము లుండిన కాలము. సోదరు లిరువురు కీర్తికాములై, స్వార్థపరులై, రాజధనాగారములోని ధనమును దుర్వినియోగము చేయుచుండిరని ఆ చక్రవర్తికి నివేదింపబడినది. క్రోధావేశపరవశుడైన ఆ కర్ణాటాధీశ్వరుడు విరూపణ్ణను బంధించి అతని కను లూడబెరికింపుమని యాజ్ఞాపించెను. రాజాగ్రహమువల్ల తనకు గలిగిన శిక్షావమానమును భరింపలేక విరూపణ్ణ తనంత తానే తన గ్రుడ్లూడబెరికికొని వానిని దేవాలయపు గోడకు విసరికొట్టెనట. నేటికిని నేత్రాకారముగానున్న రెండు గుంటలను, రక్తపు మరకలను మనము గోడమీద చూతుము. వేలకు వేలు మెరసిపోవు విశాలనేత్రములతో దేవాలయపు గోడలను గప్పిన మనిషే తన కనుల నూడబెరికికొనుట ఒక విచిత్ర సంఘటన. అప్పటికి నతడు విడిచి పోలేక కొద్ది నెలలపాటు ఆ యాలయముచుట్టు తారాడుచునే యుండెడివాడని చెప్పుదురు. పూజ్యభావముకంటెను ఎక్కువ కటువుదనముగలవారు ఈ దేవాలయమును లేపాక్షి (అంధీకృతాక్షి - బ్లైన్డ్ ఐ) అందురు.

ఈ దేవాలయమును సందర్శించినపుడెల్ల ఈ కలానిధానమున క్రొత్త అందచందములు గోచరించి ఆనందముతో ఒడలు పులకరించును. నాటి రచయితల అలవాటులు, దుస్తులు, నగలు ఎట్లుండెడివో తెలిసికొనుటకు కళాకారులు దీనిని దర్శింప వచ్చుచుందురు. కర్ణభూషణములు, కంకణములు, కేయూరములు, మంజీరములు, ఒడ్డాణములు మొదలైన ఆభరణములను రచించుటలో చతురమును, చైతన్యవంతమునైన రీతి శైలిలో ఒక విశిష్టతను వ్యక్తము చేయును.



చిత్రము 239. నాగేంద్రవిగ్రహము, వీరభద్రేశ్వరాలయము, లేపాక్షి

లేపాక్షిశిల్పము సాంప్రదాయిక కళారూపముల ప్రధాన సార మనిపించును. ఈ శిల్పులు ధైర్యముతో క్రొత్త పోకడలు పోయిన సూచనలును కలవు. అచ్చటచ్చట కొంత విస్తృతమైనప్పటికి కల్పన అభినవముగ నున్నది.

కళ్యాణ మండపమునందలి స్తంభములు సమ్మోహనముగ నున్నవి. ఇందుకు కారణము తొంబదియారు రేఖాగణిత రేఖాచిత్ర కల్పనలును, బ్రహ్మర్షి రాజర్షి చిత్రములును, చతుర్ముఖబ్రహ్మ అష్టదిక్పాలక విగ్రహములును, మనుష్య ప్రమాణమున నున్న రాజర్షుల, బ్రహ్మర్షుల విగ్రహ ఫలకములు ఈ లేపాక్షిలో ప్రేక్షకుని దృష్టి నాకర్షించు అసామాన్యదృశ్యము. ఋషి విగ్రహములలో అంతః ప్రశాంతత, ఆధ్యాత్మికానురక్తి చక్కగా నిరూపింపబడినవి. వారు మనలను ఆశీర్వదించుటకు కదలి వచ్చుచున్నట్లనిపించును. రాజర్షుల కిరీటములు రమణీయముగ నున్నవి.

బ్రహ్మర్షుల నిడుపాటి జటలు అంత కినుమిక్కిలి నేర్పుతో తీర్చబడినవి. కల్యాణమండప శిల్పములో ఒక భావైక్యము, సృష్టిపరిపోషణము కలవు. గిరిజాదేవి పరిణయదృశ్యము అత్యుత్కటమైన ఆనందపారవశ్యమును స్ఫురింపజేయును. తుదకు వధువు తలమీద పోయునట్టి సేసలుకూడ చాల నేర్పుతో అద్భుతముగ మలచబడినవి.

చతుర్ముఖబ్రహ్మ విగ్రహము శిలలో రేఖాకృతి, భావము విషయమున కళాత్మకవిజయమే. నాలుగు ముఖములును చక్కగా తీర్చబడి భయవిభ్రమానందములను కలిగించుచుండును. శిల్పి వానిలో నిశ్చితముగ జగద్రహస్యమును అభిలిఖించిన ట్లనిపించును. ఉత్తమములైన విగ్రహములు కొన్ని దుష్టుల నాశన ప్రవృత్తి వల్ల ముక్కులు పోయి, చేతులు పోయి ఎన్నియో విధముల విరూపములైనవి. అయినను ఈ చిత్రములను చూచినప్పుడు ఉజ్జ్వలములైన భావములు శిలలో రూపు కల్పించుకొని జీవముతోప్రఫుల్లములైనవా అనిపించును.

రంగమండపము ఒక నిపుణమైననిర్మాణకల్పన. ఇందు హళెవీడు సోమనాథ దేవాలయ శిల్పముల లోని నిర్దుష్ట సౌందర్యమును స్ఫురింపజేయు లక్షణములు కలవు. అయినను ఇచ్చటి శిల్పులు రచనాస్వేచ్ఛలోను, సరళతలోను, పరంపరాధిగత పద్ధతులకంటె చాల ముందంజవేసిరి.

రంగమండపములోని అరువదినాలుగు స్తంభములును ఒంటిరాతి కంబములు. వీనిలో రెండు నేలమీద మోవని ఆకాశ స్తంభములు. ఇం దొకటి చెడిపోయి ఒకమూల నేలమీద ఆనుచున్నది. ఆ రంగమంటపమున శివతాండవ కేళి చిత్రింపబడినది. దేవాలయ మండపములలోని కెల్ల ఇదియే చాల రమణీయమును, అద్భుతమునైన నిర్మాణము. నిజమున కిది నాట్యమంటపమే. చతుర్ముఖబ్రహ్మ మృదంగమును, తుంబురుడు వీణను, నందికేశ్వరుడు హుడుక్కను వాయించుచున్నారు. దేవతలలో నొకడు తాళము వేయుచున్నాడు. దేవవేశ్య - రంభయేమో - నాట్యము చేయుచున్నది. శివమూర్తి ఆనందతాండవ రూపములో కడు మనోహరముగ చెక్కబడినది. ఈ విగ్రహము లన్నియు వేర్వేరు స్తంభములమీద గండరింపబడి ఈ యాలయమునకే ఒక విశిష్టత చేకూర్చుచున్నవి. దేవతల వేషపద్ధతి, జంత్రవాద్యము, భావభంగిమ, భూషణములు సహజముగ నుండి శిల్పికిగల నాట్యవాద్య పరికరాభిజ్ఞతను స్ఫురింపజేయుచున్నవి. వట్టి రాతిబండలకు లేపాక్షి శిల్పులు రూపము, కాంతి, సౌందర్యము నిచ్చి వాని నందగింపజేసిరి.



చిత్రము 240. వీరణ్ణ విరూపణ్ణలు-వర్ణచిత్ర ప్రతికృతి, లేపాక్షి

ఈ యాలయశిల్పములో శిల్పప్రతిమల యోగ్యతను పరిశీలించుటకు అన్నపూర్ణ, మృత్యుంజయ, పద్మినీ విగ్రహములను ప్రత్యేకముగ తీసికొన్న చాలును. అన్నపూర్ణ విగ్రహములో రేఖలలోను, ఇంగితములోను ఒకవిధమైన ఆధ్యాత్మిక సంయోజనము కానవచ్చును. భిక్షాటనమూర్తియై శివుడు పార్వతినుండి భిక్షవేడును. ఆమె యొక విధమైన ఆధ్యాత్మిక పారవశ్యములో నుండును. ఆమె కట్టిన చీర కటిబంధరేఖకు చాల దిగువ నుండును. పార్వతియొక్క నైతికకంపము సున్నితమైన రచనలో చూపబడినది. దీప్తిమంతమైన శివవిగ్రహములో రేఖాసమృద్ధియు, ధ్రువత్వమును పూర్తిగ జూపబడినది. చిత్రములో ప్రదర్శితమైన శివుని సంపూర్ణ శక్తియు, పురుష సౌందర్య సంపదయు విస్మరింపరానివి.

మృత్యుంజయ గాథలోని ఇతివృత్తము కాలమాసన్నమైన మార్కండేయుని పాశబద్ధుని గావించి కొనిపోవచ్చిన

మృత్యుదూతను శిక్షించి యతనిని రక్షించుట. ఈ గాథ చిత్రింపబడిన పద్ధతిని చూచినచో దీనిని పుట్టుకతోనే శిల్పియైనవాడు చెక్కియుండవలె ననిపించును. కొనిపోదలచిన ఆసన్న మరణునికి యమపాశము తగిలింపబడుచుండిన భయానక వికృత దృశ్యము అలంకార చిత్రబంధద్వారముననే వివృతమైనది. సాక్షాత్కరించిన శివుని విగ్రహము రేఖలలో త్వరిత ప్రచలగతి చూపట్టును. శివాభరణములైన సర్పములు బుసలుకొట్టుట మనకు శ్రుతిగోచరమగును. ఆ సత్యప్రకాశము కనులకు మిరుమిట్లు కొలుపును. శివుని నేత్ర, పాదాకృతులు క్రోధావిష్టుడైన దేవత యొక్క ఉగ్రత్వమునకు స్ఫోరకములు.

విగ్రహ సౌందర్యసరళిలో నల్లశాణమురాతిలో చెక్కిన పద్మినీ విగ్రహములో శిల్పి యొక్క కళానిపుణత పరిపూర్తి నందినది. ఇది స్త్రీ సౌందర్యమునకు పరమావధి. ప్రవృత్తమైన తాళగతి, శిల్ప సంబంధమైన హర్షపారవశ్యము, రేఖారూప ప్రమాణములు - ఇవి లేపాక్షి శిల్పచిత్ర సంచయమున దాని నుత్తమమైనదానిగా దిద్దుచున్నవి.

చిత్రము 241. కనకతప్పెట వాద్యకాడు, లేపాక్షి

సిరియాలుని కథ శివకథలలో ప్రసిద్ధమైనది. మహాశివభక్తుడైనసిరియాలుని తల్లిదండ్రులు తమ యేకైక పుత్రుడైన ఆతనిని కుహనాయోగి రూపమున వారి భక్తిని పరీక్షింప వచ్చిన శివునికొరకు వధించుట మొదలైన విందలి ఇతివృత్తము. తమ భక్తిపాశముచేతనే బద్ధులైన సిరియాలుని జననీజనకుల హృదయము ఏకైకపుత్రవధ విషయమున సంక్షుభితమైనది. అతిథిగా వచ్చిన యోగి 'మీరు చేసిన బాసను నెరవేర్చు'డని అధికారికముగ వారిని దండించుచున్నాడు. తమ యేకైక పుత్రుని వధించి వండిపెట్టి ఆ యోగి నరమాంసక్షుధ తీర్పవలసియున్నది. ఒక వికటమైన నైతిక పరిస్థితి ఏర్పడినది. మాయాత్మకమైన బాహ్య జీవనమునుండి విశ్వాసాధారకమైన అంతరజీవనమునకు కథ మారినది. వధించుటకు తల్లిదండ్రులకు చేతులాడక పోవుట, వధించుటకు వెనుకాడుచున్నా రను యోగి నిందారోపణ, లేత చిగురాకువలె చలించిపోవుచుండిన బాలుడు - అన్నియు కలసి భయావహమైన చిత్రముగా రూపొందిన దీ వృత్తము. ఈ యాతన ప్రేక్షకులను స్తంభీభూతులను జేయును. తుదకు యోగి మానసము కరుణావిల మగును అంతట నా పరమ యోగి స్వధర్మార్థము తన ప్రాణములను బలిదానము కావించిన ఆ బాలునికి ప్రాణప్రదానము చేయును. ఈచిత్రము నందలి విషయము భావావేగము శిల్పి యొక్క కళకే జయ పతాక.



చిత్రము 242. లేపాక్షి 'బసవయ్య'

మనము గర్భగుడి చేరునరికి లేపాక్షిశిల్పుల రచనా విధానముతోడి పరిచయము విస్తృత మగును. గర్భగుడి కెట్టయెదుట నున్న

నల్లరాతి వీరభద్ర విగ్రహములో సాధారణముగా గాన వచ్చు జడత కనబడదు. శివలింగము, రామ విగ్రహము మనల నాహ్వానించుచున్న ట్లుండును. దుర్గా విగ్రహము వెనుక చెక్కబడియున్న నర్తకితోపాటు అడుగులో అడుగు కలుపవలెనని ప్రేక్షకునికి బుద్ధిపుట్టును. మోహినీ విగ్రహములను ఏ చీకటి మారుమూలనో యుంచుట శిల్పులకు పరిపాటి.

నిలుచుండిన గణేశ విగ్రహ, సరస్వతీ విగ్రహములలో ఒక క్రొత్త తీర్పున్నది. ఒడ్డు-పొడువు, పై తీర్పు, దుర్ జ్ఞేయమైన వ్యక్తిత్వము-ఇవి గణేశ విగ్రహమును గంభీరమైనదానినిగా చేయుచున్నవి. తిరిగి వెళ్లుచు ఆ గణేశ విగ్రహమును మరల నొకమారు తిరిగి చూడకుండ ఉండలేము.



చిత్రము 243. 'నందీశ్వరుడు' త్రివర్ణచిత్రమునకు ప్రతికృతి, లేపాక్షి

కల్యాణ మండపములోని, చతుష్కోణ కూటములోని విగ్రహములు మరింత పృథగాత్రములుగా చెక్కబడినవి.

లేపాక్షిలోని స్త్రీ పురుష దేవతా మూర్తులే ఇంతటి సొగసుగా నుండ ఇందు చెక్కిన జంతు, పుష్ప లతాదికము లెంత యందముగ నున్నవో వేర చెప్పనక్కరలేదు.

లేపాక్షిలో ప్రత్యేకముగ చూడవలసినది ఇరువది యడుగుల యెత్తు, ముప్పది యడుగుల పొడవుగల నందీశ్వర విగ్రహము; ఇది లేపాక్షి బసవయ్య యనుపేర తెలుగుదేశమం దంతట ప్రసిద్ధిగాంచినది. ఇది ఊరి బయట ఏకాండపు రాతిలో కాళ్లు ముడుచుకొని పరుండినట్లు ముద్దులు మూటకట్టు తీర్పులో చెక్కియున్న బ్రహ్మాండమైన విగ్రహము. పరుండియున్న తీవి, మోము సొంపు, కొమ్ముల సొరు, మెడనూలి సొగసు, చిరుత గజ్జియల చక్కదనము, పెద్ద గంటలపేరు తీరు, సింహతలాటపు పట్టిక వైచిత్రి, గిట్టల తీర్పు-ఇది యది యని చెప్పుటయేల, అదొక శృంగార గంభీరమూర్తి.

లేపాక్షి శిల్పము రూపురేఖలలోని అప్రమత్త దృష్టి ననుసరించి ఆహ్లాదకరముగా నుండ ఇచ్చట గోడలమీదను, లోకప్పుమీదను రంగులతో వ్రాసిన వర్ణచిత్రములందలి స్త్రీ చిత్రములు వాని యన్యోన్యానురూపతకు, వాని రచనలోని సిద్ధహస్తతకు ప్రసిద్ధి కెక్కినవి. ఈ చిత్రములలో సౌందర్య మెంత యత్యధికముగ నున్నదో పురుష చిత్రములలో అది యంత కొరవడియున్నది. పరిమాణములో పొడుగు, కనుగవల తీరు, సన్నని నడుము, చికిలి చేసినట్లుండు నాసిక, వంపుదేరి గుంటలుపడిన చిబుకము, పరిమితమైన ఫాలతలము, పైకి కొప్పుగా ముడిచిన కేశభారము-స్త్రీ చిత్రములలో నివి యన్నియు ఒక దానిని మించి యొక టుండును. పరిచారికల, చెలికత్తెల చిత్రములు రమణీయములుగ నున్నవి.

ఈ వర్ణచిత్రములు తెలుపు, నలుపు, పసుపు, ఎరుపు రంగులతో రచింపబడినవి. దాదాపు రెండు వందల కుడ్య చిత్రములు మాత్రము పాడుకాకుండ నున్నవి. వందలకొద్ది సంవత్సరముల కాలములో పైన దేవాలయపు కప్పు బీటలు తీసి వర్షము కురియుటచేత దాదాపు వెయ్యి కుడ్య చిత్రముల రంగులు చెడిపోయి యున్నవి. ఆశ్చర్యకరమైన వర్ణచిత్ర ఫలకములు (గడులు) రంగమండపములోను, పార్వతి శిలాశయ్యామందిరమునందును కలవు.

రంగమండపనిర్మాత తప్పక శైవుడని అందలి చిత్రములు చెప్పక చెప్పును. అందువల్ల అందలి వర్ణచిత్రములన్నియు ప్రసిద్ధమైన శివలీలలకు సంబంధించినవి. ఇక్కడి చిత్రలేఖకులు ఈ కథ లన్నిటిని మహాభారతమునుండి, పురాణములనుండి తీసి విజయనగర వాతావరణమున పొదిగి ప్రదర్శించినారు.

వీనిలో అర్జునుడు మత్స్యయంత్రమును భేదించు చిత్ర మొకటి. ఇది అత్యంత రమణీయముగ నున్నది. ప్రతి క్షణము ఏమగునో యన్న ఆదుర్దా ఏమాత్రము తగ్గదు. అర్జునుడు ధనస్సు నెక్కుపెట్టుట, బాణము సంధించుట, బాణముతో మత్స్యమును కొట్టుట, కృష్ణుడు అభినయ

ముతో మత్స్యమును చూపుట, అర్జునుని విలాసవంతమైన ధనుర్విద్యాపాటవము - ఇవి రీతికి, వివిధ విషయసమాహార రచనకు అవధులు. నందీశ్వరుని వివాహమును గురించిన చిత్రముగూడ చూడ ముచ్చటైనది.

సృజనాత్మక కళ భావుకతను రేపును. ఈ దృష్టితో చూచినయెడల కిరాతార్జునీయ గాథకు సంబంధించిన చిత్రములు పేర్కొనదగినవి. విశ్వజననియైన పార్వతి ద్వంద్వ యుద్ధములో మహావీరుడైన అర్జునుని వెన్నుచూడ నభిలషించును. ఆమె యభిలాష నెప్పుడును తీర్చుటకు సిద్ధముగా నుండు శివుడు కిరాతవేషము ధరించి ధనుర్బాణ ధారియై బయలుదేరును. అడవిలో మాయామయ వరాహము కన్పట్టును. శివార్జును లిరువురు దానిని వేటాడుదురు. వారుభయుల బాణములవల్ల అది చనిపోవును. ఎవరికి వారే తాము దానిని చంపితిమని వాదులాడుదురు. అంతట వారిరువురికి ద్వంద్వ యుద్ధము జరుగును. ఇందలి పార్వతి చిత్రము చూచి నకొద్దీ చూడవలెననిపించును.



చిత్రము 244.
ముచుకుంద వర్ణచిత్ర ప్రతికృతి, లేపాక్షి

లేపాక్షి చిత్రములలో ఎక్కడను స్త్రీ నగ్నచిత్రము కనుపింపదు. కిరాత స్త్రీయొక్క కాళ్లుమాత్రము అనాచ్ఛాదితములై యున్నవి. శివుని ధృఢబాహువు భయమును, దయను సూచించుచున్నవి.

ఇటువంటివే మాధవవర్మ, దక్షయజ్ఞ గాథలు. మాధవవర్మ గాథలో అత్యంత కల్పనాత్మకచిత్రము నందీశ్వరుడు రంగమున ప్రత్యక్షమై మరణశిక్ష విధింపబడిన యువరాజును, యువరాజు రథచక్రములక్రింద పడి నిహతమైన వత్సమును బ్రతికించుట.

దక్షయజ్ఞములో సతి యజ్ఞవాటిక ప్రవేశించుట, ప్రవేశించిన మీదట తండ్రియైన దక్షునిచే అవమానింపబడుట, ఆమె ప్రాణత్యాగము, సతీపరాభవమునకు క్రోధావిష్టుడైన శివుడు తన జటాజూటమునుండి ఒక కేశమును పెరికి భూమిపై వేసి కొట్టుట, అందుండి రౌద్ర, భయానక మూర్తియైన వీరభద్రుని ఆవిర్భావము, అతడు దక్షాధ్వరమును ధ్వంసము చేసి దక్షుని శిరమును ఖండించి వికట నృత్యము చేయుట - ఈ మొదలైన వన్నియు తత్తద్రసానుగుణముగ నుండి ప్రేక్షకులను భయవిభ్రాంతులను జేయును.



చిత్రము 245.
శివుని వర్ణచిత్ర ప్రతికృతి, లేపాక్షి

ఇవి కాక విష్ణు చిత్రము, పార్వతి అంగాలంకరణము, ఆమె శివునితో చదరంగ మాడుట, యోగనరసింహ చిత్రము మొదలైనవి ఎన్నియో అద్భుతచిత్రము లున్నవి.

పార్వతి శిలాశయ్యామందిరమునందలి కుడ్యచిత్రములలో లేపాక్షి కళాత్మక రచనాపద్ధతి చరితార్థత కాంచినది. లేపాక్షి విగ్రహముల పండగ. వర్ణములో సౌందర్య సంకేతములనుండి, కల్పనలనుండి జాలువారు లయాభిబద్ధగతుల యుత్సవ మది. క. సు. రా.

**వల్లభాచార్యులు** (క్రీ. శ. 1473 - 1531): వీరు ఆంధ్రులు; కృష్ణా గోదావరీ మధ్యదేశంలో కాకరవాడ అనే గ్రామానికి చెందిన ఒక వెలనాటిబ్రాహ్మణ కుటుంబములో జన్మించారు. ఉత్తర హిందూదేశంలో వీరి తల్లిదండ్రులు కాశీయాత్ర చేస్తుండగా వర్తమాన మధ్యప్రదేశ్‌లో రాయపూర్ దగ్గర వీరు జన్మించారనీ, జన్మించినప్పుడే వీరిలో దివ్యజ్యోతి కనపడిందనీ ప్రతీతి. తండ్రి లక్ష్మణభట్టుగారు, తల్లి ఎల్లమ్మగారు. వీరు ఈశ్వరాంశ సంభూతులని, జన్మతః మహాప్రతిభావంతులని, ఈశ్వరసాక్షాత్కారమును పొందిన మహా విద్వాంసులని వీరి అనుయాయులందరికీ నమ్మకము. వీరి ఇంటిపేరు కంభంపాటివారు.

వల్లభాచార్యులు చిన్నతనమందే వేదవేదాంగాలను, సమస్త సాహిత్యాన్ని అభ్యసించారు; కౌమారావస్థలోనే మహాపండితులని ప్రశంస పొందారు. వీరు కాశీ నగరంలో విద్య నభ్యసించి అలహాబాదుదగ్గర సాహిత్యసేవ చేసి, వ్రజభూమిలో తాను నమ్మిన మతాన్ని ఎక్కువగా ప్రచారము చేశారు.

వీరు వ్యాపింపజేసిన మతానికి శుద్ధాద్వైతమని పేరు. మొదటినుండి శంకర, మధ్వ, రామానుజుల ద్వారా ప్రచారములోనికి వచ్చిన జ్ఞాన, కర్మ, భక్తి సిద్ధాంతాలకు క్రొత్త అర్థాలు చెప్పి వీరు 'పుష్టిమార్గము 'అనే ఒక నూతన సిద్ధాంతాన్ని వ్యాపింపజేశారు; పుష్టిమార్గము వీరు స్వతంత్రముగా నిర్మించినదే. శంకరాచార్యులయొక్క మాయావాదాన్ని వీరు ఖండించారు. పరిశుద్ధమైన ప్రేమ ద్వారా పరమేశ్వరుని ఆరాధించటం, ప్రేమయొక్క శక్తిని తనలో విజృంభింపజేసుకొని ఈశ్వర సాన్నిధ్యంలో నివసించటం పుష్టిమార్గము యొక్క వైశిష్ట్యము. ఈ మార్గాన్ని వర్ణవిచక్షణ, స్త్రీ పురుష భేదము లేకుండ అవలంబించడానికి వీరు దారి చూపించారు. ఈ మార్గము విశ్వజనీనమైనది. ఇట్టి భేదభావములేని మార్గమే వేదసమ్మతమైనదని కూడ వీరు నిరూపించారు. ఈ విధంగా వీరు గొప్పసంఘసంస్కర్తలని కూడ చెప్పవచ్చు. మోక్షాన్ని అపేక్షించి తత్సిద్ధికోసముగాక పరమాత్మునిపట్ల పరిశుద్ధమైన, ప్రేమపూర్ణమైన స్నేహం అలవరచుకొని ఆ స్నేహంద్వారా పూర్ణరసానుభూతిని పొందటం పుష్టిమార్గములో ఒక ముఖ్యమైన విశేషం. భగవంతునితో నిర్మలమైన స్నేహం సంపాదించటానికి గోపికలు మార్గదర్శకులు. వారి ద్వారానే ఈశ్వరునితో స్నేహపాత్రత సంపాదించటానికి అవకాశం ఉంది. అందువల్లనే వీరి అనుయాయులు పూజించే భగవంతునికి గోపీజనవల్లభుడని పేరు. అందువల్ల ప్రతి భక్తుడూ తాను ఒక గోపికనని, తాను ఈశ్వరసాన్నిధ్యం సంపాదించటానికి ప్రయత్నం చేస్తున్నానని అనుకుంటాడు.



చిత్రము 246. వల్లభాచార్యులు

వల్లభాచార్యుని అనుయాయులు భజించే దేవునికి గోవర్ధననాథుడని, నాథ్‌జీ అని పేరు. భాగవత ధర్మానుసారం వీరి ఆరాధ్యదేవతానిర్మాణం జరిగింది. ప్రస్తుత రాజస్థాను (పూర్వపు ఉదయపూర్ సంస్థానం) లోని 'నాథద్వారా' వల్లభాచార్యుని అనుయాయులకు ముఖ్య తీర్థస్థానం. భాగవతములోని 12 స్కంధాల ననుసరించి ఈ గోవర్ధన నాథుని స్వరూప నిర్మాణం జరిగింది. ఈ గోవర్ధన నాథునికి పూర్ణపురుషోత్తము డనికూడ పేరు. పుష్టిమార్గంలో సేవా మార్గానికి గొప్ప ప్రాముఖ్యం ఉంది. ఈశ్వర సేవయే మోక్షసాధనమని వీరి నమ్మకం. అందువల్లనే వీరు పవిత్ర గంగానదీ తోయములో జలసమాధి పొందే ముందు తమ బిడ్డలకూ, తమ అనుయాయులకూ ప్రతి మనుష్యుడూ తన శక్తికొలది ఈశ్వర సేవ చేయాలనీ, హృదయసామర్థ్యముతో స్నేహ భావాన్ని పెంపొందింప జేసుకొని ఈశ్వరునికి స్వంతమైపోవాలనీ, ఈ మార్గం విడిస్తే అధోగతి తప్ప వేరే గతి లేదనీ సందేశించారు.

వల్లభాచార్యులు మహా విద్వాంసులు; వేదాలకు, భగవద్గీతకు, బ్రహ్మసూత్రాలకు, భాగవతానికి భాష్యం వ్రాశారు. వేదాలలో వచ్చే సందేహాలు భగవద్గీతలోను, భగవద్గీతలో కలిగే సందేహాలు బ్రహ్మసూత్రాలలోను, బ్రహ్మసూత్రాలలో కలిగే సందేహాలు భాగవతములోను తీరగలవని వీరు నిరూపించారు. వీరు ఎంతో స్వతంత్ర సాహిత్యాన్ని సంస్కృతంలో నిర్మించారు.

వీరి కుటుంబంవారు ఇప్పటికి కూడ తెలుగుదేశంలోని కన్యలనే వివాహం చేసుకుంటారు. గుజరాతులోను, రాజస్థాన్‌లోను, ఉత్తర ప్రదేశ్ యొక్క పశ్చిమ ప్రాంతముల లోను వల్లభాచార్య మతం విరివిగా వ్యాపించింది. వేల కొలది తెలుగు కుటుంబాలు ఈ మత ప్రచారంకోసం పై ప్రాంతానికి పోయి నివాసాలను ఏర్పాటు చేసుకున్నవి.

వల్లభాచార్యులవారు ఆచార్యచతుష్టయ మని ప్రఖ్యాతి చెందిన నలుగురు ఆచార్యులలో - శంకర, రామానుజ, మధ్వ మహాచార్యుల తరువాత - కడపటివారు. వీరు తమ జీవితంలో హిందూదేశము నంతటిని ఎన్నోమార్లు చుట్టి వచ్చారు. రెండుసార్లు దక్షిణ హిందూదేశ యాత్ర

కూడా చేశారు. విజయనగర సామ్రాజ్యాధిపతి యగు కృష్ణదేవరాయల కాలంలో రాయలయెదుట శాస్త్రచర్చ జరిపి కనకాభిషేకాన్ని పొందారనీ, అప్పుడు రాయల నాటి పీఠాధిపతి అయిన విష్ణుస్వామి వల్లభాచార్యుల పాండిత్యానికి మెచ్చి తమ పీఠాన్ని అలంకరించమని కోరినప్పటికీ వీరు దాని కంగీకరించక తమ ధర్మమును ప్రచారంచేయటానికి ఉత్తర హిందూదేశానికి వెళ్లారనీ వీరి చరిత్ర తెలుపుతూ ఉంది. మహా పాండిత్యమునకు మెప్పుగా శాస్త్రార్థము జరిపి, కనకాభిషేకము పొందిన వీరికి రాయలవారి విద్వత్సదస్యులలో ఆచార్య బిరుదు లభించింది. వీరి మతానికి సంబంధించిన సాహిత్యం సంస్కృతంలోను, వ్రజభాషలోను, గుజరాతీలోను, హిందీ లోను, ఇంగ్లీషులోను విరివిగా లభిస్తుంది. మో. స.

**వసంతోత్సవము:** హిందూదేశమున అనుశ్రుతముగ వచ్చు ఋతుసంబంధమగు పండుగులలో నిది యొకటి. ఇది వసంతకాలమున మన్మథునిగూర్చి చేయబడును. కథా సరిత్సాగరములోను, వాత్స్యాయనుని కామసూత్రముల లోను దీని ప్రసక్తి కలదు. కాత్యాయనుడు దీనిని 'సువసంతక' మనినాడు. కామసూత్ర వ్యాఖ్యానకర్త యగు జయమంగళుడు వినోదకరమగు నీ శృంగారక్రీడనే మదన మహోత్సవమని పేర్కొనినాడు. గీర్వాణభాషయం దున్న హర్షుని రత్నావళీ నాటకమునందును, కాళి దాసుని మాళవికాగ్నిమిత్ర నాటకము నందునుగూడ దీని ప్రస్తావన కలదు. అందు రత్నావళీనాటకరచన వసం తోత్సవముతోనే ఆరంభమగును.

హేమాద్రి తన వ్రతఖండమున ఈ మహోత్సవము నొక వ్రతముగ జెప్పి తదాచరణ విధానమును వర్ణించి నాడు. దాని ప్రకారము శుక్లపక్ష త్రయోదశినాడు ఈ వ్రతమును ఆచరింపవలయును. స్నానము చేసి శుచియై పిదప అశోకవృక్షాకృతిని తయారుచేసి పూజాప్రదేశమును రంగవల్లులతో నలంకరింపవలెను. కామదేవ, విఘ్నేశ్వర, శివ, వసంత ప్రతిమలను, అప్సరోగణ ప్రతిమలను బంగారు మొదలగు లోహములతోగాని, ఇతర పదార్థములతోగాని తయారుచేసి వానిని మధ్యాహ్నకాలమునందు పుష్ప చందన ధూప దీపాది షోడశోపచార విధులతో రాణీ సమేతుడైన రాజు సతీసమేతులైన అతని మంత్రులతోను, తదితరులతోను పూజ గావించి తదనంతరము వివిధము లైన భక్ష్యములను చేసి బ్రాహ్మణదంపతులకు వాయనము లిచ్చి దక్షిణతో కర్పూర తాంబూలాదుల నీయవలెను. ఆ దినమున భార్యలు తమ భర్తలను పూజించి పుష్పములతో వారికి నూతన వస్త్రాభరణములను సమర్పించవలె ననియు, ఈ వ్రత మాచరించువారు నాటి రాత్రి జాగరముచేసి రాసమహోత్సవము నలుపవలె ననియు, ఆయా ప్రదేశము లన్నియు దీపాలంకృతములు గావింపవలెననియు, కుంకుమ కర్పూర చందనాది పరిమళ ద్రవ్యములను పంచిపెట్టవలె ననియుకూడ వ్రతఖండమున చెప్పబడినది. తన నిమిత్తము దహింపబడిన మన్మథుని మరల బ్రతికింపుమని గౌరి శివుని వేడుకొనగా వసంతకాలమున శుక్లపక్ష త్రయోదశినాడు అతడు దేహి యగునని చెప్పి ఆ దేవదేవుడు కైలాసమున కేగె ననియు, అందువలన ఆనాడీ వ్రత మాచరింపవలె ననియు వ్రతఖండమున గలదు.

తెలుగుదేశమున ఈ మదనమహోత్సవమునకు 'వసంత మహోత్సవ' మనియు, కాముని పండుగ యనియు, తద్వ్రతాచరణ కాలమున వచ్చు ఫాల్గుణ శుద్ధ పూర్ణిమకు కాముని పున్నమ యనియు పేర్లు. పదునాలుగవ శతాబ్ద మునకు పూర్వ మీ పండుగ తెలుగు దేశమున జరుపబడు చుండెనో లేదో తెలిసికొనుట కాధారములు లేవు ; కాని ఆ శతాబ్దమున ఆంధ్రులు స్వతంత్రరాజ్యమును మరల స్థాపిం చిన తరువాత ఈ యుత్సవము ఎక్కువ వైభవముతో జరుగుచు వచ్చినది. అప్పటినుండియు ఆంధ్రదేశమున అది సాధారణవ్రతములవలెను, షోడశమహాదానములవలెను మిగుల ప్రాముఖ్యము వహించినది. కొండవీటి రెడ్డిరాజులు దీని నత్యంత వైభవముతో జరుపుచుండిరి.

ఈ యుత్సవ మపు డంత వైభవముతో జరుగుటకు నాడు సుగంధద్రవ్యములకు ప్రసిద్ధి కెక్కిన ప్రాగ్ద్వీపములతోను, దేశములతోను తెలుగుదేశము జరుపుచువచ్చిన సముద్ర వర్తకమే కారణము. ఆనాడు ప్రసిద్ధమైన రేవుపట్టణమగు మోటుపల్లికి వచ్చెడి సముద్రవర్తక వ్యాపారులకు అన పోతారెడ్డి ఇచ్చిన సౌకర్యములు, ఆయాసరకులమీద విధింప బడుచుండిన సుంకముల విషయమున అతడు చేసిన సంస్క రణములు తూర్పుదీవులతోను, దేశములతోను ఈ వర్తక మెక్కువగా సాగించుటకు తోడ్పడినవి.

కొండవీటి రెడ్డిరాజుల కాలమునను, అటు తరువాతను ఈ మహోత్సవ మెట్లు జరుపబడుచుండెనో తెలిసికొనుటకు శ్రీనాథుని భీమేశ్వరపురాణము, కొరవి గోపరాజకృత సింహాసనద్వాత్రింశిక పరమాధారములు. ఈ రెండు గ్రంథ ములలోను ఈ యుత్సవము విపులముగ వర్ణింపబడినది. వాని యాధారమున వసంతోత్సవ మాకాలమున ఈ క్రింది విధముగ జరుగుచుండినట్లు చెప్పవచ్చును:

ఆ కాలమున వసంతమహోత్సవమునకు రంగము పుర బాహ్యోద్యానవనము. అది ఉత్సవమునకు ముందు మనో హరముగ అలంకరింపబడును. ఆ యుద్యానవనమున నొక

పూజామండపమును, అందు వేరు వేరు దేవతలకు వేర్వేరు పూజావేదికలను నిర్మించి వేదికలపై కస్తూరి కలయంపి చల్లి పూజామండపమందును, వేదికలమీదను కర్పూర రజముతో రకరకములైన రంగవల్లులు తీర్చి దిద్ది వేదికల మీద దేవతా విగ్రహముల నుంచి పూర్ణకుంభముల నమర్చె దరు. కదళీ వృక్షములతోను, చూతపల్లవ తోరణముల తోను, వివిధవర్ణ కేతనములతోను, పూలదండలతోను పూజామండపము నలంకరింతురు. ఉత్సవావసరమునకై వేయబడు చలువపందిళ్లు ఆరామశోభను ద్విగుణీకృతము చేయును. లక్ష్మీనారాయణులు, ఉమామహేశ్వరులు, రతీ మన్మథులు, శచీసురేంద్రులు, వసంతుడు, విఘ్నేశ్వరుడు - వీరి విగ్రహములు వేదికలపై నుంచబడును. రాజు రాణుల తోను, అమాత్య దండనాయక పురోహిత విదూషకాంతః పురజనముతోను సర్వసేనాపరివృతముగ ఉత్తమాశ్వా రూఢుడై ఘనమైన యుత్సవముతో మంగళవాద్యములు సెలగ పూజార్థమై పురబాహ్యోద్యానమునకు బయలు దేరును. భూపాలుని వెనువెంటనే సర్వాలంకారభూషి తలై వసంతోత్సవమునకు అలంకారప్రాయలగు పడుచులు బయలుదేరుదురు.

ఉత్సవసందర్భమున తమ తమ విద్యలను ప్రదర్శించి బహుమానముల నందుటకు కవి పండిత గాయన గాయనీ మణులు, శిల్పులు, నటులు మొదలగు కళాకారు లెందరో విచ్చేయుదురు. అట్టి వసంతోత్సవమును తిలకించుటకు రాజ్యము నలుమూలలనుండి జనము ఆబాలగోపాలము వచ్చెడివారు. కావుననే నాడు వసంతోత్సవము కోటలోని రాజునకును, పేటలోని పౌరునకును వంతెనవంటిదైనది.

పయిరీతిని ఉత్సవముతో రాజు ఆరామము చేరి సాంద్ర సహకారవృక్షచ్ఛాయ నమర్పబడిన ఆసనముపై ఆసీను డగును. అప్పుడు సామంతులు, మండలేశ్వరులు రాజునకు కట్నములు కానుకలు కప్పములు చెల్లింప ప్రధాని రాజునకు వారి నందరిని వేర్వేర నిరూపించి చెప్పును. అంతట రాజు విదూషకాది జనముతో కొంతతడవు వినోదగోష్ఠి సలుపును.

ఈ సమయమున ఉత్సవముతో వచ్చిన సుందరీమణులు ఉద్యానవనశోభను తిలకించి పుష్పాపచయమొనర్చి పూదీ గెలతో నిర్మింపబడిన ఊయల లూగుచు ఏలలు, జాజరలు పాడుచు క్రీడింతురు.

రా జంతట సామంతరాజుల యోగక్షేమముల నరసి రాణులతోను, మంత్రులతోను, పురోహితవర్గముతోను పూజామండపము చేరుకొనును. శృంగారవతులు పూవులు పూలమాలలు తెచ్చి వేదికలకడ నుంతురు. రాజు స్నానా నంతరము రాణులతో కలసి మన్మథుని, తదితర దేవతలను షోడశోపచారవిధుల పూజించి తదనంతరము బ్రాహ్మణ దంపతులకు దక్షిణసహితముగ కర్పూరతాంబూలాదులను సమర్పించును

తరువాత రాజు హిమాంబు, మృగమద, ఘనసార, చందనాది సుగంధద్రవ్యములు తదనంతరము జరుగు వినోద కేళికి అనుమతిచిహ్నముగా అచ్చటి జనసమూహముపై చల్లును. అంతట జనులు సంతోషముతో ఒండొరులపై పరిమళద్రవ్యాదులను, వసంతమును, బగ్గుండి మొదలగు వానిని చల్లుకొని వినోదింతురు. ఆవినోద క్రీడానంతరము రాజు రాణులతో చేరువనున్న పద్మాకరమున జలక్రీడలాడి కొంతతడవు వినోదించును.

పిదప రాజు నిండుకొలువు దీరును. అపుడు గాయకులు నటులు, శిల్పులు తమ తమ విద్యలను, కవులు తమ కవితా నైపుణిని, పండితులు తమ శాస్త్రపాండిత్య ప్రకర్షను ప్రదర్శించి యథోచితరీతిని రాజుచే గౌరవ సమ్మానముల నందుదురు. దీపావళీశోభిత నగరారామమున నాటి రాత్రి జాగరము, రే యంతయు నాటక ప్రదర్శనములతోను, నృత్య సంగీత వినోదములతోను గడచిపోవును.

వసంత మహోత్సవము ఉల్లేఖాలంకారమై ఒక్కొక్కరి కొక్కొక్క విధముగ భాసించును. అది కవుల కొక ప్రత్యేక మైన పండుగ ; గాయకుల కొక పర్వదినము ; కళాకారుల కొక సుప్రభాతము ; రసిక బృందమున కొక శృంగార వాహిని. కాగా రాజున కది లలిత కళాంశములతో రూపొం దిన కీర్తికాంత తన్ను బహూకరింపవచ్చిన సందర్భము.

రెడ్డిరాజన్యులలో ఈ యుత్సవమును మొదట ప్రారం భించినవాడు అనవేమారెడ్డి. నాటినుండి వసంతోత్సవము రెడ్డిరాజ్యమున వైభవోపేతముగ జరుగుచుండెడిది. ఈ యుత్సవములను జరుపుటచేతను, ఆ మహోత్సవ సమయ ములలో కర్పూరాది పరిమళద్రవ్యములు వెదచల్లుటచేతను అనవేమారెడ్డి, కుమారగిరిరెడ్డి మొదలైన రెడ్డిరాజులకు వసంతరాయ, కర్పూరవసంతరాయ బిరుదములు కలిగినవి.

రెడ్డిరాజుల కాలమునుండి ఈ వసంతమహోత్సవము ఆంధ్రదేశమున జాతీయోత్సవమైనది. విజయనగరాధీశ్వ రుల కాలమునగూడ ఇది మహావైభవమున జరుగుచుండె ననుటకు

'ప్రతివర్ష వసంతోత్సవ
కుతుకాగత సుకవినికర గుంఫితకావ్య
స్మృతి రోమాంచ విశంకిత
చతురాంతఃపురవధూప్రసాధనరసికా'

అను పద్యమే తార్కాణము.

హిందూప్రభుత్వ మంతరించి దేశము పరాధీనమైనవెనుక ఈ మహోత్సవ మంతరించినట్లు తోచుచున్నది. వే. రా.

**వాగ్గేయకారులు :** రాజరాజనరేంద్రుని కాలము నాటికి పద్యకవిత్వమే కాకుండ గేయకవిత్వముకూడ జనసామాన్యములో వాడుకలో ఉండియుండవలెను కాని దాని స్వరూపము నేడు గోచరించుట లేదు.

పాల్కురికి సోమనాథుడు బసవపురాణ, పండితారాధ్య చరిత్రలలో తుమ్మెద పదములు, ప్రభాత పదములు, పర్వత పదములు, గొబ్బి పదములు, వెన్నెల పదములు మొదలగు మధురకవితా రచనలు పూర్వము ప్రజలు పాడుకొనుచుండిరని చెప్పియున్నాడు. అవి ఎట్టివో తెలియుట లేదు. సోమనాథునికి పూర్వుడైన కృష్ణాచార్యుడు ఛందోబద్ధములుగాక తాళ బద్ధములు మాత్రమేయైన తాళగంధివచనములను రచించెను. వెంకటేశ్వర వచనములు కూడ ఇట్టివే.

ద్రవిడ కర్ణాటాంధ్ర భాషలలో నెల్ల ప్రాచీనములైనట్టి, పల్లవి చరణములు కలిగినట్టి పదకవితా రచనలు - సంకీర్తనలు - నేటివరకు దొరకినవానిలో - తాళ్లపాక అన్నమాచార్యులు రచించినవే.

తాళ్లపాక అన్నమాచార్యుడు (క్రీ.శ. 1424-1503): వేంకటేశ్వరస్వామి ఈయనకు పదునారవయేటనే ప్రత్యక్షమైనట్లు, నాటినుండి సంకీర్తనలను వ్రాయ నారంభించినట్లు రాగిరేకులమీద చెక్కబడియున్నది. ఈయన ముప్పదిరెండువేల సంకీర్తనలను వ్రాసెను. అవి పెద్ద రాగిరేకులమీద అందముగా చెక్కబడినవి. తాళ్లపాకమువారి 'అర' అను తిరుమలకొండపైనున్న కొట్టులో ఈరేకులు భద్రపరుపబడియుండెను ; కొన్ని అహోబలమందు గలవు.

పదునారేండ్ల వయస్సుననే అన్నమాచార్యులు తిరుమలకు బోయి శ్రీ వేంకటేశ్వరస్వామి సాన్నిధ్యముననే సంకీర్తనలను వ్రాయుచు గడపెను.

సంకీర్తనలక్షణ మనుగ్రంథమును సంస్కృతమున అన్నమాచార్యుడు రచించెను. అన్నమాచార్యులకు పదకవితాపితామహుడని, సంకీర్తనాచార్యుడని బిరుదులు కలిగెను. ఆనాటికి వ్యాప్తిలో నున్న సంగీతరచనలనుగురించి ఈ లక్షణగ్రంథములో వివరింపబడినది. సంకీర్తనలనినను, పదములనినను ఒకటే. ఇవి అధ్యాత్మ సంకీర్తనలని, శృంగార సంకీర్తనలని రెండు విధములు. అన్నమయ్య తరువాత ఒకటి రెండు శతాబ్దములకు శృంగార కీర్తనలకు పదములని రూఢి నామము కలిగెను. అవి నేటికిని ఆపేరుననే వ్యవహరింప బడుచున్నవి. అధ్యాత్మ సంకీర్తనలు దివ్యనామములని, కీర్తనలని, కృతులని వాడుకలోనికి వచ్చినవి. సంకీర్తన లక్షణములో పాల్కురికి సోమనాథుడు పేర్కొన్న ప్రాచీన గేయరచనములలో కొన్నిటికి లక్షణము లున్నవి. అవి చందమామ పదములు, తుమ్మెద పదములు, లాలి, గొబ్బి, శోభన, కూగూ మొదలగునవి. వీనికి అన్నమాచార్యుల పదములలో లక్ష్యము లుండుటచేత ప్రాచీన గేయరచనల స్వరూప స్వభావములను కొన్నిటివైనను మనము తెలిసికొన గలుగుచున్నాము. ఇది గొప్ప విశేషము. కొన్ని యుదాహరణలు :

శ్రీరాగము

పల్లవి : తొల్లిటివలె గావు తుమ్మెదా యింక
నొల్లవుగా మమ్ము నో తుమ్మెదా ॥

చరణము : . . . . . 1
. . . . . 2
దొరవు వేంకటగిరి తుమ్మెదా – మా
తురుమేల చెనకేవు తుమ్మెదా
దొరకె నీ చనవులు తుమ్మెదా – యింక
నొరు లెరింగిరి గదవో తుమ్మెదా 3

దేశాళము

పల్లవి : కొలని దోవరికి గొబ్బిళ్లో, యదు
కులస్వామికిని గొబ్బిళ్లో

చరణము : కొండ గొడుగుగా గోవుల గాచిన
కొండుక శిశువుకు గొబ్బిళ్లో
దుండగంపు దైత్యుల కెల్లను, తల
గొండుగండనికి గొబ్బిళ్లో ॥ ॥కొలని॥ 1
. . . . . ,, 2
దండివైరులను దఱిమిన దనుజుల
గుండెదిగులునకు గొబ్బిళ్లో
వెండి పైడియగు వెంకటగిరిపై
కొండలయ్యకును గొబ్బిళ్లో ॥కొలని॥ 3

దేశాళము

పల్లవి : నెయ్యము లల్లో నేరేళ్లో
ఒయ్యన నూరెడి యువ్విళ్లో ॥

చరణము : పలుచని చెమటల బాహుమూలముల
చెలమలలో నా చెలువములే
తలతలమను ముత్యపు చెఱగు సురటి
దులిపెడి నీళ్ల తుంపిళ్లో ॥నెయ్యము॥ 1
. . . . . ,, 2
గరగరికల వేంకటపతి కౌగిట
పరిమళములలో బచ్చనలు
మరుని వింటి కమ్మని యంపవిరుల
గుటితాకు లినుప గుగ్గిళ్లో ॥నెయ్యము॥ 3

భౌళి

పల్లవి : తందనాన ఆహి తందనాన పురే
తందనాన భళా తందనాన ॥

చరణము : . . . . . 1
అనుగుదేవతలకును అల కామసుఖ మొకటె
ఘనకీటపశువులకు కామసుఖ మొకటే

దిన మహో రాత్రములు తెగి ధనాఢ్యుని కొకశె
ఒవర నిరుపేదకును నొక్కచే నవియు ॥తంద॥ 2
. . . . 3

## సామంతము

పల్లవి : తత్తా తిగుడి దింధితక దింధిం
తి త్తి తి త్తితి తితి తితి తితి ॥

చరణము : దానవ వదన వితాన దానసం
దానరుధిర నిజపాన మిదం
నానాభూత గణానాం గానం
దీనజనానాం తి త్తితి తితి ॥ 1
. . . . 2
తిరువేంకటగిరి దేవనిధానం
పరమామృత రసభాగ్య మిదమ్
కరుణావరణం కమాలఘటనం
తిరో తిరో తి త్తితి తితి తితి 3

## శంకరాభరణము

పల్లవి : గుఱు తెలిగిన దొంగ కూగూగు వీడె
గుడిలోన దాగేని కూగూగు

చరణము : . . . . 1
. . . . 2
తావుకొన్న దొంగ దగిలి పట్టం డిదె
గోవులలో దొంగ కూగూగు
శ్రీవేంకటగిరి చెలవుండో యేమొ
కోవిదుడగు దొంగ కుగూగు ॥గుఱు॥ 3

'కూగూగు' దొంగని పట్టం డోహోయని హెచ్చరించునట్టి శబ్దమని తోచుచున్నది.

ఒక సుప్రసిద్ధమైన జోలపాట :

## రాగము-అటతాళము

పల్లవి : జో అచ్యుతానంద జో జో ముకుంద
రావె పరమానంద రామ గోవింద ॥ ॥జోజో॥
. . . . 1
. . . . 2
అంగుగా తాళ్లపా కన్నయ్య చాల
శృంగార రచనగా జెప్పె నీ జోల
సంగతిగ సకల సంపదల నీవేళ
మంగళము తిరుపట్ల మదనగోపాలా ॥ ॥జోజో॥ 3

తిరుపట్ల మదనగోపాలునిపైన చెప్పినది :

## ముఖారి

పల్లవి : చాలు జాలు నీజాజఱ, నన్ను
జాలి బఱచే నీ జాజఱ ॥

చరణము : వలపు వేదనల వాడేను యీ
తలనొప్పులచే తలకేను
పులకల మేనితో పొరలేను కడు
జలిగొని చల్లకు జాజఱ ॥ ॥చాలు॥ 1
వొల్లని నిను గని వుడికేను నీ
చిల్లర చేతల జిమిడేను
కల్లగందపొడి గాగేను పై
జల్లకు చల్లకు జాజఱ ॥ ॥చాలు॥ 2
. . . . 3

జాజఱపాట యనునది చాలా పురాతనమైనది. పదియవ శతాబ్దిలో పశ్చిమ చాళుక్యరాజగు రెండవ సోమేశ్వర కృతమగు 'అభిలషితార్థ చింతామణి'యను గ్రంథములో ఇది 'చర్చరీ'యని చెప్పబడినది. దాని లక్షణ మియ్యబడినది. ఇది ప్రాకృతపదమనికూడ చెప్పబడియున్నది. పాణిని అష్టాధ్యాయిలో సంగీత సంబంధమగు మాటలు కలవు. అందు 'జర్ఝరీక' అను పేరు గలదు. సందర్భమును బట్టి 'జర్ఝరి' పాడువాడని దీని కర్థము చెప్పవలసియున్నది. ఇదే 'చర్చరీ' యని, 'జాజఱ'యని క్రమముగా మారియుండును. సంస్కృతరచన తరువాత ప్రాకృత రచన, తరువాత తెలుగు రచన వరుసగా ఈ పేళ్లను పొందియున్నవని తోచుచున్నది. ఇది నేటి హోళీ పండుగలలో వినోదార్థము రంగునీళ్లు చల్లుకొను సందర్భమునకు చెందిన గీతము కావచ్చును. పై నుదాహరించిన గేయము లన్నియును దేశిరచనలు, మధుర రచనలు, శృంగార పదములు, జానపదులయొక్క 'మృదుమధుర మనోజ్ఞవాక్య మిశ్రములైన గ్రామ్యోక్తులు'.

అన్నమాచార్యునివలెనే ఆయన రెండవ కుమారుడగు పెద తిరుమలయ్య, ఆయన పెద్ద కుమారుడగు పెద తిరువెంగళనాథుడుకూడ ఎన్నిటినో సంకీర్తనలను వ్రాసిరి. వీరు ముగ్గురు తాళ్ళపాక పదకర్తలుగా వాడుకలో నున్నారు. వేదార్థములను గేయములలో వ్రాసిన ఆంధ్ర వేదాంతకర్తలు, పంచమాగమ సార్వభౌములు, ఈ పేరు వారి అధ్యాత్మ కీర్తనలను బట్టి వచ్చినది.

## దేశాళము

అదివో తాళ్ళపాక అన్నమాచార్యులు
యిదె వీడె శ్రీవేంకటేశు నెదుట
వెదపెట్టి లోకములో వేదము లన్నియు మంచి
పదములు చేసి పాడి పావనము చేసెను ॥
. . . .
కలిదోషములు వాప ఘనపురాణము లెల్ల
పలుకుల నించి నించి పాడినాడు హరిని ॥
(తిరుమలాచార్యుని పదము)

ఈ యధ్యాత్మ పదములే, వైరాగ్య పదములుకూడ. ఇది 'గంభీర పదశ్రేణి' కలిగి 'అగ్రామ్యము' లగు మాటలతో నుండవలెనని అన్నమయ్య లక్షణము నిచ్చినాడు. ఒక యుదాహరణము :

శుద్ధవసంత

పల్లవి: చీ చీ వివేకమా చిత్తపు వికారమా
ఏచి హరి గొలువక హీను డాయ జీవుడు ॥

చరణము: . . . . . . . : 1
దొడ్డవాడ నయ్యేనని దొరల గొలచి వారి
కడ్డము నిడుపు మొక్కు నతిదీనుడై
దొడ్డతన మేది యందు దొర యాడ నున్నవాడు
వొడ్డి హరి గొలువక వోడువడె జీవుండు ॥చీచీ॥ 2
. . . . . . . . 3

అన్నమాచార్యులు, తిరుమలాచార్యులు హరిదాసుల వేషములు ధరించి తంబురా, చిరుతలు చేత బూని గజ్జలు కాళ్ళకు కట్టుకొని భావోద్రేకముతో పాడుచు ఆడుచుండిరి. అన్నమాచార్యులు భజనకూటములను స్థాపించిన భక్తాగ్రేసరుడు. తాళ్ళపాకవారి గేయరచనలలో సంగీతము కంటె సాహిత్యమే ప్రధానమని చెప్పవలెను. వీరి భాష నాటి తెలుగు నుడికారములతో నిండి సహజధారాయుతమైనది. వీరు భగవత్సాక్షాత్కార మనుభవించిన మహావైష్ణవులు.

వీరి కీర్తనలకు రాగములే గాని తాళములు చెప్పబడి యుండలేదు. పల్లవియేగాని అనుపల్లవి లేదు. చరణములు మూ డుండును. అన్నమాచార్యులవారి తరువాతనే వెలసిన శ్రీ పురందరదాసులవారి కీర్తనలలో పల్లవి, అనుపల్లవి ఏర్పడి యున్నవి. తాళము చెప్పబడి యున్నది.

తాళ్ళపాకమువారు వాడిన రాగములలో ఆహిరి, అమరసింధు, గీతనాట, తెలుగు కాంభోజి, దేశాళము, పాడి, భౌళి, రామక్రియ, ముఖారి, పంతుమెంచ భౌళి, సామంతము, కొండమలహరి, సాళంగము మొదలగునవి నేడు లేవు.

తాళ్ళపాకమువారి కీర్తనలను నియతమగు వేళలలో ప్రతిదినమును స్వామి సన్నిధిని కైంకర్యములయందు పాడుచుండిరి. ఆ వాడుక అంతరించినది. ఆ కీర్తనల ధాతు ఎట్టిదో తెలియని దురవస్థ కలిగినది. దేశమందు కష్టించి వెదకిన కొంతవరకు తెలియవచ్చునేమో!

అన్నమాచార్యులవారు తన్ను నాయికగా భావన చేసికొని శ్రీ వేంకటేశ్వరస్వామిని నాయకునిగా భావించి తన్ననుగ్రహించుమని యనేక రీతుల పాడుకొనెను. ఈ మధుర భక్త్యావేశములో చెప్పిన శృంగార పదములలో అలంకారశాస్త్ర మందలి నాయికా నాయకులకు చక్కని లక్ష్యము లున్నవి. ఇవియే తరువాత వ్రాయబడిన క్షేత్రయ్య పదములకు మాతృకలు. వీరి కీర్తనలు భక్తిపూరితములు. జ్ఞానబోధకములు, నీతిదాయకములు, అజ్ఞానదూషకములు, తిరువేంకటపతి ప్రశంసలు 'వేంకటశైలవల్లభ రతిక్రీడా రహస్యంబులు.'

క్షేత్రయ్య (క్రీ. శ. 1600 - 1660): ఈతడు కృష్ణ జిల్లాలోని (మొవ్వ) గ్రామవాసి. మొవ్వలోని గోపాల స్వామికంకితముగా శృంగారరస పూర్ణములైన పదములను తెనుగులో వ్రాసెను. వీటిని మువ్వగోపాలపదము లందురు. పదకవిత్వములో ఇతనికి ఇతడే సాటి. అన్వయ సౌలభ్యములోను, అర్థ గాంభీర్యములోను, భావ సౌకుమార్యములోను, పదలాలిత్యములోను ఇతని కవిత్వ మొక విశిష్టతను, పరిణతిని పొందినది. ప్రతి పదమునను శృంగార రసము తొణికిసలాడు ఒక మధుర ఖండకావ్యము.

అన్నమయ్య శృంగార పదములే క్షేత్రయ్యకు మాతృకలు. తాళ్ళపాకమువారి దినములలో 1560 ప్రాంతము వరకు శృంగార, అధ్యాత్మ కీర్తనలు రెండింటికిని పదము లనే పేరు. కాని క్షేత్రయ్యనాటికి శృంగార పదములే పదము లనువాడుక రూఢియైనది. క్రీ. శ. 1630 ప్రాంతమందు తంజావూరు పాలకుడగు రఘునాథనాయకుని కొలువులో క్షేత్రయ్య ప్రవేశించెను; అతని కుమారుడగు అచ్యుత విజయరాఘవ నాయకుని కాలములో కొన్నేండ్లు రాజ సభలో మిక్కిలి గౌరవమును పొందెను. క్షేత్రయ్య తంజావూరు, మధుర, గోలకొండ రాజాస్థానములలో సుమారు నాలుగువేలకు పైగా పదములను చెప్పినట్లు 'వేడుకతో నడచుకొన్న విటరాయడే' అన్న పదములో వివరింపబడినది కాని నేడు 350 పదములకంటె లభ్యము కాలేదు. క్షేత్రయ్య అనేక క్షేత్రములు దర్శించి అచ్చటి దేవుళ్ళ పేర పదములను చెప్పియున్నాడు. కాని ప్రతి పదమును అభేదముగా మువ్వగోపాలునికే అంకితము చేసినాడు.

ఈ పదములు సుమారు నలుబది రక్తిరాగములలో రచింపబడినవి. అన్నమాచార్యు లుపయోగించిన చాల రాగములు క్షేత్రయ్య కాలమునకే వాడుకనుండి తొలగిపోయినవి. క్రొత్త రాగములు వాడుకలోనికి వచ్చినవి. శృంగారరస ప్రకటనకు మిక్కిలి అనువయిన కాంభోజి రాగములో పెక్కు పదములు కలవు. ఆ రాగముయొక్క సర్వ భావములును ఈ పదములలో బీరుపోకుండ వ్యక్తము లగుచున్న వని సంగీతవేత్తల యభిప్రాయము. ముఖారి, భైరవి, కల్యాణి, తోడి, సావేరి మొదలగు రాగములలో చాల పదములు కలవు. పదసాహిత్యమందలి అర్థమునకు, భావమునకు అనుగుణముగా రాగ, భావములతో సంగీత రచన చేసినవారిలో క్షేత్రయ్య మొదటివాడు, మార్గదర్శి. ఒక్క రాగమే వివిధ భావ భేదములయందు

ఎట్లుపయోగింపబడినదో పల్లవి, అనుపల్లవి, చరణములలో రాగవృద్ధి ఎట్లు చేయబడినదో పరిశీలించినచో క్షేత్రయ్య ఎట్టి సంగీతవేత్తయో గోచరించును. రాగమునకు సర్వ సంపూర్ణమగు స్వరూపమును తీర్చిదిద్దినవారిలో క్షేత్రయ్య మొట్టమొదటివాడు. సైంధవి, ఘంటారవము, ఆహిరి, పున్నాగవరాళి మొదలగు రాగములకు నేటికిని ఈతని పదములే ప్రమాణములు. ముత్తుస్వామి దీక్షితులవారు క్షేత్రయ్య పదము లెన్నిటినో నేర్చిరని, అందలి రాగ సంచారాదులనే మాతృకలుగా గ్రహించి కృతులను రచించి రని చెప్పుదురు. నాటివరకు సాహిత్యమునకు గల అగ్ర స్థానమును సంగీతమునకు కట్టబెట్టినవాడు క్షేత్రయ్య. సంగీత రస భావములను సాహిత్యరస భావములతో మేళ వించి రసికుల సహృదయతకు దోహద మొనర్చి రసభావ స్ఫూర్తిని సులభముగా అందించు మార్గమును మొదట ఏర్పాటు చేసి సంగీతాభివృద్ధికి తోడ్పడినవాడును, సంగీ తమునందు నూతనాధ్యాయమును ప్రారంభించినవాడును క్షేత్రయ్యయే.

క్షేత్రయ్య ఈ పదములను అభినయానుకూలముగా వ్రాసెను. రసగ్రహణమునకు అభినయము సంగీతము కంటె ఎక్కువ తోడ్పడును. భావమును చక్షుర్గోచరము చేసి ప్రకటించును. అందుచేత పాడి, ఆడినచో పదభావము అతిసులభముగా వెల్లడియై, ఆనందము నిచ్చును. సంగీత సాహిత్యములయందే గాక నాట్యవిద్య యందును క్షేత్రయ్య మేటి. పదములను పాడి, ఆడి, రసమగ్నులై ప్రేక్షకులను రసాంబుధిలో ముంచి తంజావూరు సభాం గణమును సరస్వతీ కళామందిరముగా చేసినవాడు క్షేత్రయ్య. నాట్యాభినయములకు నేటికిని ఈ పదములే పట్టుకొమ్మలు.

ఈ పదములలో అలంకారశాస్త్రములో చెప్పిన నాయికా నాయక భావము లన్నిటికిని లక్ష్యములు దొర కుటయేగాక, ఆ శాస్త్రమునకే నూతన లక్ష్యములుగూడ గన్పించును. స్త్రీ స్వభావములోగల సుకుమారమైన మానసికతత్వములు, వృత్తులు, అవస్థలు రసమయములై ఈ పదములయందు నిండి యున్నవి. త్రిపుట, చాపు, జంపె తాళములలో విలంబకాలములో ఎక్కువగా ఈ పదములు పాడవలసి యున్నది. అందుచేత నృత్యాభినయములచేత భావప్రకటన చేయుటకు ఇవి అనుకూలములై యున్నవి. ఈ విధముగా కూడ క్షేత్రయ్య నాట్యవిద్యయందు నూతనాధ్యాయమును ప్రారంభముచేసి యున్నాడు. ఇన్ని విధముల సంగీతముయొక్క పూర్ణస్వరూపమును ప్రకటింపగల సంగీతరచనలు తెలుగులో నిక లేవు. తెలుగు భాషలోనే కాదు, మరి యే భాషలోను క్షేత్రయ్య పద ములవంటివి లేవని చెప్పుటలో అతిశయోక్తి లేదు.

సారంగపాణి : ఇతడు పదునెనిమిదవ శతాబ్దాంత మునకు జెందినవాడు. కార్వేటినగర సంస్థానాధీశ్వరు డైన సాళువ మాకరాజున కాశ్రితుడు. ఈతడు పొన్నేరి ప్రాంతమునుండి పొట్టపోసికొనుటకై కార్వేటినగరము నకు వచ్చి యుండెనట. 'శ్రీ కార్వేటినగర పురవరాధిష్ఠిత శ్రీమద్వేణుగోపాల నామాంకితముగా సంగీతసాహిత్య, జాతీయ, కవిత్వ చమత్కారములుగా' పదముల నీతడు రచించెను. 'శ్రీమన్మహామండలేశ్వర కఠారి సాళ్వ మాక రాజపుంరే, రాజకుమార వేంకట పెరుమాళ్ళరాజు బహ దర్ దేవమహారాజులంగారి యాజ్ఞ ప్రకారము' ఈతని పదములు 1867 లో అచ్చువేయబడినవి. ఇట్లు అచ్చొత్తిం చిన రాజావారు మాకరాజునకు దౌహిత్రులు.

సారంగపాణి సంగీత రచనలు నాల్గు విధములైనవి :

1. శృంగారపదములు : ఇవి క్షేత్రయ్య పదముల వంటివి. కొన్ని క్షేత్రయ్య రచనలతో తులతూగు చుండును. రాగములపేర్లు సాహిత్యములో నిమిడ్చి 'రాగ ముల పదము'ను రచించినాడు. ('ఈ సీమల హరిణాక్షుల వలెగా - మోహనాంగి'). స్వరాక్షరములను పదములో నిమిడ్చి పదము పాడునప్పు డాస్వరములే పలుకునట్లు స్వరస్థాన పదమును వ్రాసెను.

'దాని పాయము పదారేండ్లు నీ - దానిగా నేలుకోరా' మరియు 'తరుణి కేమని ధారబోసి వచ్చెనె మద - దంతి కొమ్మా - ఎంతో మురిపెము లేకనే యిచ్చిన మరువంపు - మొలకకొమ్మా' - అని ఆరు చరణములుగల కొమ్మల పద మును రచించెను. ఇట్టివి 75 లభ్యమైనవి.

2. దేశీయపదములు(అరువదియారు): ఇతడు నాయికా నాయకులేగాక, నాయికతల్లి సోదరుడు మొదలగువారిని గురించిన పదములను దేశీయముగా రచించినాడు. ఇందలి విషయము సామాన్యము ; అంత ఉదాత్తత కలదిగాదు.

పల్లవి : 'లంజహారి తమ్ములకే యిప్పుడు
రాజశీవులన్ని — యెందుకు'

అనుపల్లవి : 'కంజభవునికి వసుమతిలో గుడి -
కరువైనది వేణుగోపాల ॥ లంజ ॥'
'ఖాసాబంతి భోజనమాయ ర
వీసు తమలపాకుల విడెమాయ
......................'

3. జాతీయపదములు (పదునారు) : వీటిలోని భాష కేవ లము నింద్య గ్రామ్యము. పల్లెటూరివారి భాషను యథాతథ ముగ వాడినాడు. భావములును దీనికి తగినట్టులే యున్నవి.

పల్లవి : 'అగ్గి తిరునాళ్ళంట అజ్జుని కతలంట
అవురా యంతటి సోద్దెమే – భారతకత'
అనుపల్లవి : 'సుగ్గి జయము దీని – సుట్టూ బలాదూరు
అగ్గురోరవు అయ్యో – ర్నడిగే నీ సాచ్చిగ ॥అగ్గి॥'

4. సంకీర్తనలు (నలువదిరెండు): ఇవి భక్తిగేయములు, భజనకూటము వారి కుపయోగములు.

'వేణుగోపాలుని విడువము–మరి–వేరే వక్కరిపేరు నుడువము'
'హరినామస్మరణ సేయకుంటే – అవతల గతియేమి,
వెరవు దెలిసి సత్సంగతి వదలక – వేణుగోపాలుడైన
శ్రీనర ॥హరి॥'

సుబ్రహ్మణ్యకవి (క్రీ. శ. 1760): ఇతడు పదునెనిమిదవ శతాబ్ద మధ్యమునకు చెందినవాడు. 'తంజావూరు మండలమునకు చెందిన మునిపల్లె గ్రామనివాసి'. కాళహస్తి ప్రభువగు శ్రీరాజా దామర కుమార వెంకటప్ప నాయని వారి యాహ్వానముపై ఈ కవి కాళహస్తి సంస్థానమునకు వచ్చెనట. ఈతడు శ్రీ వేంకటేశ్వర స్వామివారి భక్తుడు. 'శ్రీశేషగిరిపతి' ముద్రతో అధ్యాత్మరామాయణ మను సంస్కృత గ్రంథవిషయమును నూటనాలుగు కీర్తనలుగా రచించెను. ఇవి దక్షిణాదిలో అంతగా ప్రచారములో కానరావు.

ఈ కీర్తనలు సంస్కృత భూయిష్ఠమైన తెలుగులో వ్రాయబడినవి. పాండిత్య ప్రకర్ష, పద యమకములు ఎక్కువగా నుండును. 'ఆత్మానాత్మపరాత్మల జాడలు త్రివిధము' లని, 'ఆకాశము త్రివిధంబైనట్లు పరాత్మ త్రివిధమాయె' నని, 'రాముడు పరమానందమయుడు, సర్వచరాచర పరిపూర్ణు డవ్యయుడు సామగానలోలు డచలు డాద్యుడు సర్వసాక్షి....యేమనవలెనే (సీత వాక్యము) ప్రకృతిని, యీ మహాత్ముని సన్నిధాన మాత్రను యీ మహాద్భుతము లొనర్తురు మూఢులు స్వామియందు నారోపణ సేయుదురు' అని, యిట్లెన్నో మహోజ్జ్వలములగు అధ్యాత్మ విషయములు ఈ కీర్తనలయం దున్నవి.

క్షేత్రయ్య వాడిన నలుబది రక్తిరాగములు గాక ఇంకను సుమారు ఇరువదిరాగములను – కర్ణాటక సారంగ, జుజావంతి – దేశీయ దేవగాంధారి, పరజు, నాయకి, లలిత పంచమి, మాంజి, మారువ, యమున, గౌరి, పూర్వి, నాటకురంజి, సారంగ, గుమ్మకాంభోజి, శుద్ధసావేరి, హిందూ – ఘంటారవము మొదలైనవి. ఈ కవి వాడియున్నాడు. యుద్ధకాండలో మాత్రమే ఘనరాగములైన నాట, గౌళ, ఆరభి, శ్రీరాగములను వాడినాడు. ఇది గమనించదగిన విషయము. ఈ కీర్తనలలో సాహిత్యమునకే ప్రాధాన్యము కలదు. రసమునుబట్టి కీర్తన నడక, తాళగతి, పదములకూర్పు భేదించు చుండును. ఈ కీర్తనలలో గీతములలో వలెనే, సంగీతమందలి స్వరాక్షరములు సాహిత్యములోని యక్షరములకంటె ఎక్కువగా నుండవు.

రామదాసు, భద్రాద్రి (క్రీ. శ. 1650): ఇతడు నేలకొండపల్లి గ్రామనివాసి; కంచర్ల లింగనమంత్రికి, ఆయన సతి యగు కామాంబకు శ్రీరామానుగ్రహమున జన్మించిన ఏకైక పుత్రుడు. ఇతని అసలు పేరు కంచర్ల గోపన్న. ఈతడు చిన్నతనమునుండియు రామభక్తిపరుడై యుండెను; రామతారకమంత్రము నుపదేశమై సిద్ధిపొందినాడు; 'దాశరథీ కరుణాపయోనిధీ' అను మకుటము గల దాశరథీ శతకమును రచించెను. రామభక్తి కారణముగా రామదాసు అనుపేరు ఇతనికి రూఢి యయ్యెను. భద్రాద్రి తహసిల్‌లో ఉద్యోగిగా నుండి సర్కారుపైకము రామకైంకర్యము నిమిత్తము ఖర్చుపెట్టి తానీషాచేత బందిఖానాలో పంద్రెండేం డ్లుంచబడి, చాల ఇడుమలబడి శ్రీరామానుగ్రహమును పొందినాడు. బందిఖానాలో భక్త్యావేశమున, దుఃఖావేశమున చెప్పిన కీర్తనలనే రామదాసు కీర్తనలని వాడుచున్నాము. ఇవి సంగీత సాహిత్యములందు అంతవిశేషము కలవి కాకున్నను భక్తి పారవశ్యము కలిగించువానిలో మేలుతరములు; తెలుగునాట ఆబాలగోపాలమునకు నోట వచ్చి యుండునవి. దాసరు లనువారు వీటిని ప్రత్యేకముగ పాడుచు, భజన చేసికొనుచు దేశాటనము చేయుచుందురు. ఈ కీర్తనలలో సుమారు ఇరువదియైదురాగము లుపయోగింపబడినవి. నాదనామక్రియలో చాల కీర్తనలు కలవు. అసావేరి, సావేరి, వరాళి, పున్నాగవరాళి, పంతువరాళి, ఆనందభైరవులలోకూడ పెక్కు రచనలు గలవు. ఈ కీర్తనలు భజనకూటములలో మిక్కిలి వాడుక గలిగి యున్నవి. ఇవి పద యమకములతో మహాధారగా నడచిపోవును.

నారాయణతీర్థులు (క్రీ. శ. 1700): డాక్టర్ ఎమ్. కృష్ణమాచారిగారు వ్రాసిన సంస్కృత వాఙ్మయ చరిత్రలో నారాయణతీర్థుల జన్మస్థానము గోదావరి జిల్లా కోనసీమలోని కూచిమంచివారి యగ్రహారమని యున్నది. ఈయన అత్తవారియూరు కృష్ణాతీరమందలి వేదాద్రి కెదుటనున్న గ్రామమట. ఈయన వేదవేదాంగములు, సంస్కృతసాహిత్యము, సంగీత నాట్యములు బాగుగా తెలిసిన పండితుడు. సన్న్యాసమును పుచ్చుకొన్న తరువాత తిరుమలకు పోయి తపస్సుచేసియతియయ్యెను. ఇచ్చటనే బోధేంద్ర సరస్వతుల వారు ఆయనకు శిష్యులైరి. ఉదరవ్యాధి సంప్రాప్తము కాగా త న్నివారణమునకై భగవత్ప్రేరితుడై కావేరి తీరమునగల వరహూర్ గ్రామములోని విష్ణ్వాలయమునకు వెళ్లెను. వ్యాధి నివారణమైనది. ఆ యాలయమున వెలసి

యున్న భూదేవీ సమేతుడగు రమానాథుని కీర్తించి ఆయన 'కృష్ణలీలా తరంగిణి 'ని రచించెను.

'జయ జయ రమానాథ జయ జయ ధరానాథ
జయ జయ వరాహపురి శ్రీ వేంకటేశ జయ జయ ॥'
(1వ తరంగము, 4)

ఈ గ్రంథము పన్నెండు తరంగములుగా విభాగింపబడినది. భాగవతదశమస్కంధమందలి ప్రథమభాగము, రుక్మిణీ కళ్యాణముతో ముగిసిన భాగమును శ్లోకములు, గద్యలు, కీర్తనలుగా రచించెను. ఒక్కొక్క తరంగమందు చాల కీర్తన లుండును. ఇవి ప్రౌఢమును గంభీరమును అగు సంస్కృతమున వ్రాయబడినవి. ఉపనిషత్సారములతో ఈ కీర్తనలు నిండియున్నవి.

'సామనిగమాంత వచనార్థ ముపలభ్య
స్వానుభవ మేక మఖిలైక రసభూతం
ఏతదమృతం భవభయాపహార మాద్యం
నారాయణానందతీర్థపరిగీతం ॥'

'వేదభాగ విచారజాతమతి ప్రియప్రణయేన
వర్ణితం శివరామతీర్థ పదాంబుజ భ్రమరేణ వయమిహ'

అని యున్నది. ఈయన గురువు శివరామతీర్థులవారని తెలియుచున్నది. విమర్శచేసి, స్వానుభవమును కలిగిన వేదాంతవేద్యులు, మహాభక్తులు నారాయణ యతీంద్రులు.

వీరు రమానాథుని సన్నిధిని పరవశులై తరంగములను పాడి యాడుచుండిరట. ఈ రచనలలోని ముఖ్యవిశేషము - కీర్తనల చివర శబ్దములను కూర్చి చేర్చుట. వీటి నుచ్చరించుచు వాటి ననుసరించి తాళగతులను చూపించుచు నృత్యము చేయుటకై ఇవి యేర్పడినవి. రసభావము పొంగి పొరలగా, కీర్తన చివరిభాగమందు, ఈ నృత్యము ద్వారా భక్తుడు మైమరపు పుట్టించు ఆనందమును పొందగలడు. సప్తమ తరంగమందలి రాసక్రీడా ఘట్టమం దీ నృత్యకళ పరమావధి పొందినదని చెప్పవచ్చును. ఇందు సప్తతాళముల భేదములతోడను, అలఘుపదము, లఘుపదము మొదలగు ననేక భేదములుగల నాట్యరీతులతోడను, రసభావ ద్యోతకములగు అభినయములతోడను గోపికలు కృష్ణునితో తన్మయులై రాసక్రీడ సల్పుట వర్ణితమైనది.

తరంగములను పాడియాడుటలో కూచిపూడి భాగవతులు ఆరితేరినవారు. వారు 'బాలగోపాల మాముద్ధర' అను ప్రసిద్ధమగు తరంగమును చరణమున కొకతాళము చొప్పున నైదు తాళములలో చిత్రవిచిత్రగతుల విన్యాసముతో కొన్ని గంటలవరకు నృత్యము చేయుదురు. ఇందలి శబ్దముల కూర్పులు బహు ప్రౌఢములు, చిత్రవిచిత్రములు.

'రేహురేహురే రింఖణ రింఖణ–కాహుకాహురే కంజరి కంజరి
ఝకుఝకురే ఝణతజ్జగగిణ–ఢేకుఢేకురే డింకుకు డింకుకు
రుంఝురుంఝురిహ రిటకుమురింఖణ–తక్కిటకిటతక
దిక్కిట కిటతక
తొంగిట కిటతక నంగిట కిటతక – తతహత దిమిత
ధణేకు దధిగిణతోం'.

ఈ తరంగ కీర్తనలను పాడునప్పుడు చరణమున కొక్కొక రాగము నుపయోగించు వాడుకగలదు. 'జయ జయ గోకుల బాల' అను కీర్తన నట్లు పాడుట అందరకు తెలిసినదే.

ఈ రచనలలో ముప్పదినాలుగు రాగములు వాడబడినవి. క్షేత్రయ్య వాడిన రాగములు చాల కలవు. మరియు ద్విజావంతి, కురంజి, సారంగ, కర్ణాటకసారంగ, దేశాక్షి, కమాస్ మొదలైనవి క్రొత్తవి గలవు. వీటియందు సంగీత ప్రకర్షకంటె సాహిత్య జటిలత, నాట్యవిద్యా ప్రకర్ష చాల ఎక్కువ. ఈ తరంగములవలన ఆంగికాభినయ ప్రధానమగు నృత్యకళ బాగుగా అభివృద్ధిచెందినది.

నారాయణతీర్థులవారు 'పారిజాతాపహరణ' నాటకమును తెలుగులో రచించిరి. ఈ యముద్రితతాళపత్ర గ్రంథము మేలటూరిలోని బాలసుబ్రహ్మణ్యశాస్త్రిగారివద్ద గలదు. మేలటూరికి పూర్వనామమైన 'అచ్యుతాపుర' మందు వేంచేసియున్న వరదరాజస్వామివారి కది యంకిత మీయబడినది. మరియు ఈ యతీంద్రులు 'హరిభక్తి సుధార్ణవ' మను భాగవత దశమస్కంధ కథాసంగ్రహమును సంస్కృతమున వ్రాసిరి. ఇందలి మంగళ శ్లోకమును హరికథా ప్రారంభమందు భాగవతార్లు నేటికిని పాడుచుందురు. ఇంతే కాదు; భజనకూటములలో 'శ్రీనారాయణ తీర్థ సద్గురు వరం తన్నౌమి ముక్తి శ్రియై' యను మకుటముగల ధ్యానశ్లోకములను పఠింతురు. వీటినిబట్టి నారాయణతీర్థులవారు భజనపద్ధతికి చాల ముఖ్యులని చెప్పనగును. వీరు తరంగములను పాడియాడుటయేగాక నాట్యాచార్యులై శిష్యు లనేకులకు తరంగనృత్యమును నేర్పిరట.

వరహూరునకు సమీపమున నున్న తిరుపుంతురుత్తి గ్రామములో మాసిమాసము, గురువారము, శుద్ధఅష్టమి, కృత్తికా నక్షత్రమందు నారాయణతీర్థులవారు సిద్ధిపొందిరి. ప్రతిసంవత్సరము ఇట ఉత్సవము జరుగును. శ్రీకృష్ణజయంతి నాడు కృష్ణలీలా తరంగిణి నంతయు పాడి యాడుదురు.

త్యాగరాజస్వామి (క్రీ. శ. 1767 - 1847): వీరి జన్మస్థానము తంజావూరివద్ద తిరువారూరు. వీరి తండ్రి కాకర్ల రామబ్రహ్మముగారు; తల్లి సీతమ్మ. రామబ్రహ్మము తాతగారి కాలములో ఈ కుటుంబమువారు తిరువారూరునకు వచ్చిరి. కాకర్ల కర్నూలు జిల్లాలోని గ్రామము.

రామబ్రహ్మముగారి తండ్రి గిరిరాజకవి యక్షగానములను రచించెను. రామబ్రహ్మముగారు రామభక్తులు. త్యాగరాజు తల్లి శ్రావ్యముగా రామదాసు కీర్తనలను పాడెడిదట. ఆమె తండ్రి వీణ కాళహస్తయ్యగారు గొప్ప సంగీత విద్వాంసుడు. అందుచేత ఉభయకుటుంబ సంప్రదాయములు చేరి త్యాగయ్యగారికి శ్రీరామునియెడలభక్తి, సంగీత సాహిత్యములు అలవడ జేసినవి. చిన్నతనముననే వీరు తండ్రిగారితోపాటు తిరువయ్యారునకు వచ్చివేసిరి; అచ్చట సంస్కృతాంధ్రములు, సంగీతము, జ్యోతిషము, మంత్రశాస్త్రమును నేర్చిరి; బాల్యము నుండి రామభక్తిగలవారైరి; సంగీతశాస్త్రగ్రంథముల నన్నింటిని అవలోడన జేసికొనిరి; తండ్రిగారి పూజాసమయమున రామ పరముగా దివ్యనామసంకీర్తనలు చేసి పాడుచుండిరి. 'నమో నమో రాఘవాయ' యనునది వీరి మొదటి సంకీర్తన యని ప్రతీతి. వీరు రామతారక మంత్రము నుపదేశమై 96 కోట్లు జపించి రామసాక్షాత్కారమును పొందిరి. వీరు ప్రథమదర్శనమందు కనబడిన మూర్తినే 'ఏల నీ దయ రాదు' అనే కృతిలో వర్ణించి కీర్తించిరని వాడుక. ఈ మూర్తినే చాలచోట్ల — 'అలకల్లలాడగ గని', 'శ్రీరామ జయరామ' మొదలయిన కృతులలో వర్ణించి యున్నారు. వీరు ఇరువదినాలుగువేల కృతులను శ్రీరామాంకితముగా 'త్యాగరాజనుత' యను మకుటముతో వ్రాసియుండిరని చెప్పుదురు. కాని వెయ్యి కీర్తనలుమట్టుకే నేడు లభ్యములగుచున్నవి. అందు సుమారు ఐదువందలవరకు వర్ణమెట్టు గలవి.



చిత్రము 247. త్యాగరాజస్వామి

త్యాగరాజస్వామి ఉంఛవృత్తిని జీవితమును ఆనందముగా గడపిరి; ఇతరులసేవ నపేక్షించలేదు. వీరు నిరంతర రామసేవా తత్పరులై, భక్తి పరవశులై రామ సన్నిధానము ననుభవించుచు అనేక విధముల శ్రీరామునితో ముచ్చటలాడుకొనినట్లు వారి కృతుల వలన గ్రహించ వచ్చును.

త్యాగరాజస్వామి సంగీతబ్రహ్మ. వీరు సంగీతమందు మహత్తరమగు నూతన యుగమును కల్పించిరి. ఈయన రచన లనేక విధములైనవి. ప్రాచీన ఉత్సవ సంప్రదాయములోని షోడశోపచార పూజలకు తగిన కీర్తనలు, భజన కూటములకు కావలసినట్టి భక్తిపూరితములై సెలయేటి ప్రవాహమువలె నడచు దివ్యనామ సంకీర్తనలు రక్తి రాగములలో వ్రాసినారు. ఈ రచనలలో విషయము ప్రధానము. సంగీతము ప్రక్కప్రక్కలను సుందరముగా అనుసరించుచుండును. వీరు సాహిత్యగాంభీర్యము, పదగుంభన, తాళజటిలత గల కీర్తనలను కొన్నిటిని రచించిరి; సంగీతసాహిత్యములను మేళవించి, పటిమగల, సులభసాధ్యము కానట్టి, నిరుపమానములగు 'ఘనరాగ పంచరత్నము'లను గొప్ప సంగీత శిల్పములను సృష్టించినారు. సాహిత్య శృంఖలాబద్ధమైన సంగీతమును విడిపించి త్యాగరాజస్వామి సాహిత్యము నప్రధానముచేసి సంగీతము స్వేచ్ఛావిహార మొనర్చుటకై

నూతనములు, సుందరములునైన కృతులను దివ్యభవన రాజములను నిర్మించినారు. ఇట్లు సంగీతమును త్యాగరాజస్వామి సర్వాంగసుందర మొనర్చినారు; అభ్యాసకులకు, విద్వాంసులకుకూడ సులభములు, కష్టములు, కష్టతరములు అగు పలుతరగతుల కృతులను రచించి సంగీతమునకు మహోపకారము చేసిరి.

త్యాగరాజస్వామి యేర్పరచిన మార్గమువలన పాటకుడు తన మనోధర్మమును, భావోద్రేకమును కృతి పాడునపుడు రసవంతమగు నొకచోట జాగా చేసికొని వ్యక్తము చేయుట కవకాశము కలిగినది. మరియు త్యాగరాజస్వామి సంగతు లని మనము చెప్పుకొను నూతనాలంకారమును సంగీతసరస్వతికి సమర్పించిరి; ఇవి కృతులకు జీవము వంటివి. సాహిత్య భావము నెన్నివిధముల వ్యక్తము చేయవచ్చునో అన్ని విధముల భావానుగుణమైన రాగ విన్యాసములతో వీరు పాడుట కేర్పరచినారు. 'ఆరగింపవే పాలారగింపవే' యను కృతిలో పా లారగింపుమని అనేక రీతుల బుజ్జగించి, బతిమాలి, నయమున, భయమున చెప్పి, వేడుకొని యున్నట్లు సంగతులలో వ్యక్తమగును. మరియు వీరు రాగాలాపన పద్ధతిలో రాగవృద్ధి నెట్లు చేయవలెనో, ఆ క్రమమును పల్లవి, అనుపల్లవి, చరణములయందలి సంగతుల మూలమున ఉదాహరించి చూపిరి; తోడి, ఖరహరప్రియ మొదలగు రాగములలో సప్తస్వరములతోను భావమునుబట్టి ఎత్తుగడచేసి, స్వరసంచారమును చేసిరి. ఒక రాగములోనే అనేకభావములు కల కృతుల నెట్లు రచించవచ్చునో, ఎత్తుగడస్వరముతో రసభావము లెట్లు మార్పు చెందునో, ఏ రాగచ్ఛాయ లే భావమును పోషించునో ఈ మొదలగు సంగీత రహస్యములు త్యాగరాజు కృతులలో స్పష్టము చేయబడినవి.

అదివరకు ప్రచారములోలేని ఖరహరప్రియ, హరికాంభోజి, చక్రవాకము, షణ్ముఖప్రియ మొదలగు రాగములను వీరు ప్రచారములోనికి తెచ్చిరి; మేళకర్త రాగములకు, జన్యరాగములకు అనేకములకు లక్ష్యములను రచించిరి. భక్తిపూరితుడై అంతరాత్మచే ఉద్బోధితుడై రసావేశముతో నిండిన హృదయముతో అనేక మనోభావములను వ్యక్తపరచుటలో నూతన రాగములను - నవరస కన్నడ, బహుదారి, కుంతల వరాళి, జయంతశ్రీ, గరుడధ్వని, రాగపంజరం, స్వరావళి మొదలైనవి - త్యాగరాజ స్వామి సృజించినారు. సంగీత మర్మములను కొన్నిటిని వీరు కృతులలో ఉదాహరించిరి. స్వర రాగ మూర్ఛనా భేదములను వీణావాదన తత్పరుడై తెలిసికొనవలెనని, ఆ భేదములను తెలిసికొననిచో రాగముల నిజస్వరూపము తెలియజాలరని వీరు చెప్పిరి. దగ్గర దగ్గరగా నున్న శ్యామ - ప్రతాపవరాళి, దర్బారు - నాయకి, జగన్మోహిని - గౌళ మొదలగు రాగములయొక్క సూక్ష్మ భేదములను ఎత్తుగడలోను, స్వరముల కూర్పులోను వ్యక్తపడునట్లు కృతులను వీరు రచించిరి. శ్రుతి భేదముచేత రాగభేదమెట్లు కలుగునో 'మరియాద గాదయ్య' అను భైరవి రాగ కృతిలో లాలిత్యముగా, చమత్కారముగా చూపించినారు; రాగమునకు, సాహిత్యమునకు విచిత్ర సంబంధమును కల్పించి చమత్కారమును చూపినారు. ఉదాహరణ:

(1) 'మేను జూచి మోసపోకే మనసా,
మాయామయమగుచాన ॥మేనుచూచి॥'

అను కృతి 'సరసాంగి' రాగములో నున్నది.

(2) 'ఎవరైనలేరా పెద్దలు ఇలలో దీనుల బ్రోవను'

సేనలు సేనలుగా సిద్ధులు పెద్ద లున్నారే వా రేమైనారు అన్నట్లు 'సిద్ధసేన' రాగములో దీనిని రచించిరి.

(3) 'ఒక పారి జూడగరాదా',
'ఎన్నడు జూతునో'

అని కళావతి యగు నాయిక పల్కుచున్నట్లు 'కళావతి' రాగములో వ్రాసిరి.

(4) 'ఎవరితో దెల్పుదు నాలోని జాలి'

అని మానవతులు భర్తతో తప్ప ఎవరితో చెప్పుకొందు రన్నట్లు 'మానవతి' రాగములో వ్రాసిరి.

(5) 'చిన్ననాటనే నాచేయి బట్టితివి...
విడనాడుదామనో పలుకొందమనో'

అని కళానిధియగు పరమపురుషునికి మనవి జేసికొనుచున్నట్లు 'కళానిధి' రాగములో వ్రాసిరి.

సాహిత్యబంధమునుండియేగాక తాళబంధమునుండి కూడ సంగీతమును త్యాగరాజస్వామి విడిపించినారు; ఎదురెత్తుగడ నడకలు, అడ్డదిడ్డపు వక్రతాళగతులు కృతులలో వాడలేదు; ఎక్కువగా ఆదితాళమునే వాడిరి. భావ రాగ తాళములనుసరసముగా మేళవించి భావమును తాళ మనుసరించునట్లు చేసి రసస్ఫూర్తి వెంటనే అగునట్లు కృతులను రచించిరి; భావమునుబట్టి మధ్యమకాలములోను, విలంబ కాలములోను కీర్తనలను వ్రాసిరి. వీరి కీర్తనలలో 'ఎవరి మాట విన్నావో' వంటివి కొన్ని క్షేత్రయ్య పదముల వంటివి గలవు. వీరు హిందుస్తానీ సంప్రదాయమును కర్ణాటమునకు అనుగుణముగా జేసి రాగములలో కృతులను వ్రాసిరి; పాశ్చాత్యుల పోకడలను గ్రహించి క్రొత్త మెట్లలో 'రమించువా రెవరురా', 'శ్రీరామపాదమా' మొదలగురచనలు గావించిరి; క్రొత్తపోకడల నవలంబించి

కర్ణాటక సంగీతము నభివృద్ధిచేయుట అవసర మను విషయమును సూచనగ బోధించిరి.

త్యాగరాజస్వామివారి మనోధర్మములు, ఆశయములు, మానవత్వము ప్రశంసనీయములు. రామునితో చెప్పుకొను వారి బాధలు మన బాధలవలెనే తోచును; 'నాదుపై బలికేరు నరులు' అని తన్ను నిందించుట వీరు వెళ్లబోసుకొందురు. వీరు చాటు మాటు లేని అమాయకులని తెలియుచుండును. లోకరీతి విరుద్ధముగా బోవుచున్నదని, కాని కాలము వచ్చినదని, భక్తిమార్గము తెలియని డాంబికులున్నారని ఈయన బాధ పడుదురు.

కొన్ని కృతులలో త్యాగరాజస్వామి రాముని అన్ని వేళలయందు ఎట్లు సేవ సల్పుచుండిరో తెలియగలదు. వారు సంసారులైనను రాజయోగమార్గముచే ఎట్లు తరించ నగునో చెప్పినారు; రామరాజ్యమువలె పరిపాలన చేయు విధమును చూపినారు; 'సీతమ్మ మాయమ్మ' యను కృతిలో లోక మంతయు తన బంధువులనే విశాల భావమును వెల్లడించినారు. సర్వమానవ సౌభ్రాతృత్వములో మతభేదములు, దైవభేదములు లేవను అనేక జీవిత సమస్యలకు సమాధానముల నిచ్చి, తలిదండ్రులవలె, ఆచార్యునివలె, సోదరునివలె త్యాగరాజస్వామి బోధనలను జేసిరి.

త్యాగరాజస్వామి ప్రహ్లాదభక్తి విజయము, సీతారామ విజయము, నౌకా చరిత్రము అను మూడు సంగీతనాటకములను వ్రాసిరి. వీటిలో ముఖ్యముగా నౌకాచరిత్ర మధురభక్తి పూరితమైనది.

త్యాగరాజు అధ్యాత్మ తత్వవేత్త; నాదోపాసకుడు; సంగీతమార్గమున ఆధ్యాత్మిక సత్యమును సాధించిన సంగీత యోగి. ఈయన 'నాదోత్పత్తి క్రమము', 'ఓంకారనాద విశేషము', నాదబ్రహ్మతత్వమును వివరించిరి. మరియు అద్వైత సిద్ధాంతమును కొన్ని కృతులలో సారవంతమగు మాటలలో నిర్ణయించినారు; ఉత్తమ పురుషార్థమగు మోక్షమును సాధించుటలో శాంతగుణము ప్రధానమని ప్రబోధించినారు. ఇట్లు ప్రస్థానత్రయములోని, వాల్మీకి రామాయణములోని వేదాంత సత్యమును కృతులలో చాల చోట్ల సులభముగా బోధపడునట్లు చెప్పి వీరు లోకమునకు మహోపకార మొనర్చినారు.

త్యాగరాజస్వామి మహాపురుషుడు, గొప్ప పండితుడు, నిరుపమాన వాగ్గేయకారుడు, మహాసంగీతవేత్త, కవి, సంస్కర్త, ఆచార్యుడు, మహాభక్తుడు, అధ్యాత్మతత్త్వవేత్త, సంగీతయోగి, త్యాగోపనిషత్తు - అనదగిన కృతిరాజములను రచించిన ప్రతిభాశాలి. వి. అ. రా.

**వామనభట్ట బాణుడు** (క్రీ. శ. 1350 - 1420 ప్రాంతము): షడ్భాషావల్లభ, గద్యకవిసార్వభౌమ, అభినవభట్టబాణ బిరుదాంకితుడగు నీ కవి వత్సగోత్రజుడు. ఇతని తండ్రి కోమటియజ్వ; పితామహుడు వరదాగ్నిష్టోమయాజి. ఈతడు తాను విజయనగర సామ్రాజ్యమునకు మూలస్తంభమగు విద్యారణ్యుల శిష్యుడ నని 'శబ్దచంద్రిక'లో నుడివెను. మొదటకొంతకాల మీతడు రెండవ హరిహరరాయల కాలమున విజయనగరమును గాంచి, యానాటి సాంఘిక జీవితమును తన 'శృంగార భూషణ భాణము'న చిత్రించి క్రీ. శ. 1403 ప్రాంతములో కొండవీటి పెదకోమటి వేమ భూపాలుని యాస్థానమున కరిగి యచట మహావైభవమున జీవిత శేషమును గడిపెను.

సంస్కృతమున సర్వతోముఖ వైదుష్యముతోబాటు ప్రసన్నమధురమగు కవితా సంపద కలవా డీత డనుట కితని కృతిరాజములే సాక్షులు. పద్యరచనమున కాళిదాస కవియు, గద్యనిర్మాణమున భట్టబాణుడును సిద్ధహస్తులగుచో దన వాణికి పద్యగద్యముల రెంటను విశిష్టపటిమ గలదని 'ఉషాహరణము'న నితడు చెప్పుకొనెను. ఈతనికి సాహిత్య 'చూడామణి' యను బిరుదము కలదు. ఇతడు రచించిన గ్రంథములు పదునొక్కటి :

పద్యకావ్యములలో నలాభ్యుదయము పూర్తిగా లభింపలేదు; బాణాసురవిజయము వ్రాతప్రతి (గ్రంథలిపి) పూర్తిగా తంజావూరు సరస్వతీ మహలు గ్రంథాలయమున నున్నది; రఘునాథ చరితము 30 సర్గముల మహాకావ్యము పూర్తిగా నున్నది; హంసదూత - కాళిదాసుని మేఘదూతను బోలిన యీ కావ్యమున గూడ రెండే సర్గలు. ఇందు వార్తాహరుడు మాత్రము హంస.

రూపకములు : ఉషాహరణము : ఉషా నిరుద్ధుల కల్యాణ మిందలి వస్తువు; కనకలేఖ : కనకలేఖా వ్యాస వర్మలను విద్యాధరులు శాపవశమున మానవులై పరిణయ మాడిన కథ; పార్వతీపరిణయము : పార్వతీపరమేశ్వరుల కల్యాణగాథ; శృంగార భూషణ భాణము : మాయావి యగు విలాసశేఖరుని చర్య లిందు చిత్రింపబడినవి.

నిఘంటువులు : శబ్దచంద్రిక - అముద్రితము; ఇది అయిదు కాండముల కోశము; శబ్ద రత్నాకరము - ముద్రితము; ఇందు మూడు కాండలు గలవు.

ఆఖ్యాయిక : వేమ భూపాల చరితము - ఇందు ఇతడు తన పోషకుడేకాక ఘన పండితుడును, సర్వజ్ఞ చక్రవర్తియు, కవిశిరోమణియు నగు పెదకోమటి వేమ భూపాలుని యత్యద్భుతార్థమగు చరితమును నాలుగుచ్ఛ్వాసములలో రచించెను. వీరనారాయణుడని వేమ

భూపాలునికి నామాంతర మగుటచే ఈ కృతికి వీరనారాయణచరిత మనియు పేరు. ఇది పెదకోమటి వేమభూపాల విరచితమై యతని 'సాహిత్య చింతామణి'లో నుదాహృతమైన 'వీరనారాయణచరిత'ము (కావ్య, భాణ) కృతికంటె భిన్నము.

ఇంకను బృహద్రత్నాకరము, కాదంబరీకథను వివరించు 'బృహత్కథామంజరి'లో నొక భాగమును ఇతని రచన లందురు. ఈ. వెం. వీ. రా.

**వాసుదేవశాస్త్రి, వావిలాల** (క్రీ. శ. 1851-1897) : భాషాత్రయ (తెలుగు, సంస్కృతము, ఇంగ్లీషు) విశారదు లని ప్రసిద్ధిగన్న వీరు బందరు కళాశాలలో విద్య నభ్యసించి, 1873 లో పట్టపరీక్షలో కృతార్థులైరి; ఇంగ్లీషు భాషా పట్టపరీక్షలో ప్రథమశ్రేణిలో గణనీయులై మాక్డొనాల్డు బంగారు పతకమును బడసిరి; సంస్కృతాంధ్ర భాషలయం దసమానమగు కృషిచేసి, పండితులై కవులై తా మాంగ్ల భాషాచార్యులైనను, రాజమహేంద్రవర కళాశాలలో దేశభాషా పర్యవేక్షకులై యుండిరి. ఆంధ్ర నాటక రచనా పరిణామమున, వీరి కొక విశిష్టస్థానము గలదు. 1883 లో ప్రథమమున భవభూతి ఉత్తరరామ చరిత్రము నాంధ్రీకరించినది వీరే. ప్రథమముగ నాంగ్ల నాటకానువాదము కావించినది వీరే; 1876 లో షేక్స్పియరు రచితమైన 'జూలియస్ సీజరు' నాటకమును పద్యరూపమున ననువదించిరి; అందు పాత్రల నామములను మార్చలేదు. ఇది యాంగ్ల నాటకానువాదములకు నాంది. ప్రత్యేక స్వతంత్ర నాటకము రచించినవారిలోను వీరే ప్రథములు. ఆ రచనకు 'నందక రాజ్య'మని పేరు. ఇది సాంఘిక నాటకము; కృష్ణా మండలమున నా కాలమున



చిత్రము 248.
వావిలాల వాసుదేవశాస్త్రి

రేకెత్తిన నియోగి వైదిక విభేద వివాదములను పురస్కరించుకొని 1880 లో వ్రాసినది. ఇంగ్లీషులోని పద్యముల ననువదించుటలోను వీరే మొదటివారు. కౌపరు రచించిన 'ఆన్ రిసీట్ ఆఫ్ మై మదర్స్ పిక్చర్' అను పద్యఖండికను వీరు 'మాతృ పటము' అనుపేర ననువదించిరి. ఇ వన్నియు ముద్రితములు. వీరు 'ఆంధ్రభాష'ను గూర్చి భాషాతత్త్వశాస్త్రము ననుసరించి 1881 లో నొక విపుల వ్యాసము వ్రాసిరి. తెలుగున భాషాతత్త్వశాస్త్ర రచన కది మొదటి గ్రంథము. అది యా కాలమున వెలువడిన 'చింతామణి' అను పత్రికలో ముద్రితమైనది. 'బ్రాహ్మణీయ'మను నొక ప్రబంధము మాత్రము ముద్రితము. వీరు పాశ్చాత్య విద్య నభ్యసించియు సనాతన హైందవాచారమును పురస్కరించుకొని కర్మిష్ఠులై తమ జీవితము సాగించిన మహనీయులు. ని. వెం. రా.

**విక్రమదేవ వర్మ** (క్రీ. శ. 1869 - 1951) : వీరి తండ్రిపేరు శ్రీకృష్ణచంద్రదేవ మహారాజు; తల్లి రేఖాంబ. వీరు విశాఖ పట్టణము నందలి జయపుర సంస్థానాధీశ్వరులకు సన్నిహిత జ్ఞాతులు. 1930 లో జయపురాధీశ్వరులు నిస్సంతుగ చనిపోవుటచే వారసత్వరీతిని ఆ సంస్థానము వీరికి సంక్రమించి వీరు జయపురము జమీన్దారులైరి.



చిత్రము 249.
విక్రమదేవవర్మ

వీరు తమ మాతృభాష ఓఢ్ర మైనను ఆంధ్రభాషను కూడ ప్రేమించి, అభ్యసించి అందు పండితులైరి. వీరు ఆంధ్రమున రచించిన కావ్యములును కొన్ని గలవు. వానిలో మానవతీ చరిత్రము, కృష్ణార్జునచరిత్రము ముఖ్యమైనవి. స్వయముగ కవియే గాక వీరు కవిపోషకులు. వీరు పండితులను, కవులను సత్కరించి సాయము చేసిరి.

విద్యావ్యాప్తియందు వీరి కాసక్తి ఎక్కువ. ఆంధ్ర విశ్వవిద్యాలయమునకు తగిన ధనసాహాయ్య మొనర్చుటయే గాక వీరు తమ జమీన్దారీనుండి ప్రతి సంవత్సర మొకలక్ష రూపాయ లాదాయము వచ్చు నేర్పాటు చేసిరి.

సార్వజనికకార్యములందు, విద్యావ్యాప్తి యందు వీరికి గల ఆసక్తిని, ఉత్కళ, ఆంధ్ర సంస్కృతములందు వీరికి గల పాండిత్యమును గుర్తించి ఆంధ్ర విశ్వవిద్యాలయమువారు వీరికి డి. లిట్. పట్ట మొసగిరి. వితరణశీలి యగు వీ రనేక ప్రజాహిత సంస్థలకు విరివిగ ధన సాహాయ్య మొనర్చిరి. వీరు జీవితాంతము ఆంధ్ర విశ్వవిద్యాలయమునకు ప్రోఛాన్సలర్ గా నుండిరి. వీరి దాన ప్రవణతకు కృతజ్ఞతా సూచకముగ ఆంధ్ర విశ్వ విద్యాలయము నందలి 'సయన్స్ టెక్నాలజీ కళాశాల' లకు వీరి పేరు పెట్టబడుటయేగాక వీరి పురుషప్రమాణ కాంస్య విగ్రహము

కూడ తక్కశాశాల భవనమునకు ముందుగ ప్రతిష్ఠింప బడి యున్నది. చీ. శే.

**విజ్ఞానసర్వస్వము :** విజ్ఞానసర్వస్వము, విజ్ఞాన కోశము, జ్ఞానకోశము అనునవి ఒకవిధమైన నిఘంటువుల వంటివే. నిఘంటువులు శబ్దముల కర్థము తెలిపి ప్రయోగముల నిచ్చును. విజ్ఞానసర్వస్వములు విషయ వివరణ ప్రధానములైన కోశములు. విజ్ఞానసర్వస్వ, విజ్ఞానకోశ, జ్ఞానకోశము లను పేర్లతో కాకపోయినను వేరువేరు విద్యలకు, కళలకు సంబంధించిన విషయముల నొక్కచోట జేర్చి వివరించు విస్తృత గ్రంథములు ప్రాచీన సంస్కృత వాఙ్మయమున నెన్నియో గలవు. పెక్కు శాఖలతోకూడిన ఒక్కొక్క శాస్త్రమునకు సంబంధించిన విషయముల నన్నిటిని దెలుపు గ్రంథములేకాక ఒకటే గ్రంథమున పెక్కు విషయములను దెలుపునవియు గలవు; పురాణాదులు ఇట్టివే.

> 'సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశోమన్వంతరాణిచ
> వంశానుచరితం చేతి పురాణం పంచలక్షణమ్'

అని పంచలక్షణాత్మకములుగ చెప్పబడిన పురాణము లొక విధముగా విజ్ఞానకోశములే. ఇవి సృష్టి, ప్రళయము - ప్రతిసృష్టి, వంశము (దేవదానవ వంశాదికము), మన్వంతరములు (మనువుల యుగములు), వంశాను చరితములు (పూర్వరాజవంశచరితములు) తెలుపు సందర్భమున వీనిలో భూగోళ, ఖగోళా ద్యనేక విషయములు వివరింపబడినవి. ఇవికాక వీనిలో తరువాత దాన, వ్రత, తీర్థాదులు, శ్రాద్ధ కర్మలను గురించినట్టియు, విష్ణ్వాది అవతారములను గురించినట్టియు విషయములు చేర్చబడినవి. మహామహోపాధ్యాయ హరప్రసాద శాస్త్రిగారు గొప్ప పరిశోధన కావించి పురాణములను ఆరు వర్గములుగ వర్గీకరించి యున్నారు. వారి యభిప్రాయము ప్రకారము అగ్ని, నారద, గారుడపురాణములు ఒకవిధమైన విజ్ఞాన సర్వస్వములు. సంస్కృత వాఙ్మయమునందలి కళలను, విద్య (శాస్త్రము)లను గురించిన ఉద్గ్రంథములందలి విషయమంతయు వీనిలో సంగ్రహముగ నున్నది. వీనిలో పురాణ పంచలక్షణములకు తోడు వైద్యము, వ్యాకరణము, నాట్యము, సంగీతము, జ్యోతిషము మొదలగు విషయములును గలవు. పద్మ, స్కాంద, భవిష్య పురాణములు ప్రధానముగా తీర్థములను గురించి, వ్రతములను గురించి చెప్పును; బ్రహ్మాండ, వాయు పురాణములు చరిత్ర ప్రధానములైనవి. భవిష్య, మత్స్య పురాణములు దేవప్రాసాదములు, వాని నిర్మాణమును గురించి తెలుపును. మత్స్య పురాణములో నీ విషయమును గురించి యొక ప్రత్యేక ప్రకరణమే కలదు. ఈ పురాణములలో ఆనుషంగికముగ వాస్తువిద్య, రత్నపరీక్ష మున్నగు నెన్నియో విషయములను గురించి తెలుపబడినది. పురాణము లనేకములు జీవితమునకు లక్ష్యభూతములైన ధర్మ, అర్థ, కామ, మోక్షములను గురించి తెలుపునవే. ఈ రీతిని మన పురాణము లొకవిధమైన విజ్ఞానకోశములే. తాంత్రిక వాఙ్మయము కూడ ఇట్టిదే.

ఇట్లే ప్రాచీనకాలమునుండి మన భారతవర్షమున విద్యా విజ్ఞానాది సమస్త విషయములను గురించిన సంక్షేప గ్రంథములు రచింపబడుచునే వచ్చినవి. ఉదాహరణమున కొక్క అభిలషితార్థ చింతామణిని పేర్కొన్న జాలును. 'మానసోల్లాస'మను నామాంతరముగల దీనిని కుంతల చాళుక్య చక్రవర్తియైన భూలోకమల్ల సోమేశ్వర భూపతి (క్రీ.శ. 1126 ప్రాంతము) రచించెను. ఇం దాతడు తన కాలమునాటికి తెలిసి, రాజకుమారుడు నేర్వవలసిన విద్యలను గురించియు, కళలను గురించియు సంస్కృతమున శ్లోకరూపమున వివరించియున్నాడు. ఈ గ్రంథమునందు ఇరువది వింశతులు (ఖండికలు)గల అయిదు ప్రకరణములు గలవు. మొదటి ప్రకరణమునకు రాజ్యప్రాప్తికారణవింశతి యనియు, రెండవ ప్రకరణమునకు ప్రాప్తరాజ్య స్థైర్య కారణవింశతి యనియు, మూడవ ప్రకరణమునకు ఉపభోగ వింశతి యనియు పేరులు. మిగిలిన రెండు ప్రకరణములందును వినోదములు (హస్త్యశ్వమేషవృషభా ద్యుద్ధములు), క్రీడలు వర్ణితములైనవి. ఈ విషయములు వివరించు పట్టున రాజకుమారుడు నేర్వవలసిన స్వామి, అమాత్య, సుహృత్, కోశ, రాష్ట్ర, దుర్గ, బల నిరూపణాదులను గురించియు, సంధి విగ్రహములను గురించియు, యాన (విజయయాత్రా తన్ముహూర్తాదియోగ, శకున విచారములతోకూడ), ఆసన, ఆశ్రయ, ద్వైధీభావ, సామ, భేద, దాన, దండోపాయాదులను గురించియునే కాక ప్రాసంగికముగ రాష్ట్రనిరూపణ సందర్భమున గజాశ్వ లక్షణ, శిక్షణములు, వానికి వచ్చు రోగములు, చికిత్సలు, ఖనిరక్షణ, భూమిగతనిధి దర్శనోపాయ, నిధ్యుద్ధారక ప్రకారములు, రత్నపరీక్ష, కృత్రిమరత్న పరీక్ష, ధాతువాదము, మద్యములు మొదలైన విషయములను గురించియు తెలుపబడినవి. ఇట్లే ఉపభోగ వింశతి యందలి గృహోపభోగ, స్నాన, పాదుకా, తాంబూల, విలేపన, వస్త్ర, మాల్య, భూషా, ఆసన, చామర, ఆస్థాన, పుత్రోపభోగములును, అన్న, పానీయ, పాదాభ్యంగ, యాన, ఛత్ర, శయ్యా, ధూప, యోషిదుపభోగములును వర్ణించిన సందర్భమున గణితము, పంచాంగము, జ్యోతిషము, గృహనిర్మాణోపయుక్త ముహూర్తాదికములు, ధ్వజా

ధ్యాయ చతుర్భద్రాది నిరూపణము, రాజభవన లక్షణ, వాస్తుమండల, గృహప్రవేశార్హ నక్షత్రాది నిరూపణము, ఆలేఖ్యకర్మ, సాముద్రికము, నాట్యము, దేవతామూర్తి లక్షణములు మొదలైన వనేకము లిందు వివరింపబడినవి. ఇట్లు కళలకు, విద్యలకు సంబంధించిన వివిధములైన పెక్కు విషయములను గురించి తెలుపు ఈ యభిలషితార్థ చింతామణి ఒక విజ్ఞానసర్వస్వమే. హేమాద్రి విరచిత చతుర్వర్గ చింతామణి, మాధవాచార్య కృత సర్వదర్శన సంగ్రహము మొదలైనవి-కూడ ఒకవిధమైన విజ్ఞానకోశములే.

'విజ్ఞానసర్వస్వ' మన్నది ఆంగ్లభాషలో 'ఎన్‌సైక్లోపీడియా' అను పదమునకు ఆంధ్రులు సమానార్థకముగ నుపయోగించుచున్న పదము. గ్రీకు భాషలోని 'ఎన్' (లోపల), 'క్లుకోస్' (క్షేత్రము, చక్రము) అను పదముల నుండి 'ఎన్‌సైక్లోపీడియా' పదము పుట్టినది. గ్రీకు, లాటిన్ భాషలలో ఈ 'ఎన్‌సైక్లోపీడియా' పదము మొట్టమొదట పూర్వుల కప్పటికి తెలిసిన సమస్తవిధములైన కళలు, విద్యలతోగూడిన సంపూర్ణ విద్యాక్షేత్రము నెరుకపరచుట, సమగ్ర విద్యా విజ్ఞానములను గరపుట అను నర్థములో వాడియున్నారు.

పురాతనకాలమున యూరోపియను భాషలలో, ముఖ్యముగా ఇంగ్లాండులో, వివిధ విజ్ఞాన విషయములను దెలుపు గ్రంథము లుండెను. ప్లినీ అనుగొప్ప విద్యావేత్త విశ్వసృష్టి, జ్యోతిషము, మానసికశాస్త్రము, భూగోళము, జంతుశాస్త్రము, వృక్షశాస్త్రము, వైద్యము, ఓషధులు, ధాతు లలితకళా ఖనిజశాస్త్రములు మొదలైన వివిధ విషయములను గురించి అప్పటికి తనకు తెలిసిన విజ్ఞానము నంతను క్రోడీకరించి 2,493 ప్రకరణములు గల ముప్పదియారు సంపుటములలో 'ప్రకృతిచరిత్ర' (నాచురల్ హిస్టరీ) అను పేరుతో రచించెను. ఇన్ని విషయము లుండినను దీనికి 'ఎన్‌సైక్లోపీడియా' అను పేరు లేదు.

అటుతరువాత ఈ పదము మానవునికి తెలిసిన విజ్ఞానము యొక్కయు, దానిలోని వేరువేరు శాఖలయొక్కయు ప్రతి సువ్యవస్థిత సమీక్షకు వాడబడుచు వచ్చినది. క్రీస్తు శకము పదునారవ శతాబ్దమువరకు యూరోపియను భాషలలో గ్రంథనామముగ ఈ పదము వాడుకలోనికి రాలేదు. పదునేడవ శతాబ్దిలోనే వివిధములైన విద్యా విజ్ఞానములను దెలుపు గ్రంథముగ ఇది యుపయోగింపబడినది. ఈ పదమును మొట్టమొదటిమారు గ్రంథనామముగ నుపయోగించినవారు క్రీ. శ. 1541 లో రిన్‌గెల్ బెర్గియస్‌ను, క్రీ. శ. 1606 లో మార్టియస్‌ను. తరువాత 'ఎన్‌సైక్లోపీడియా' అను పేరుతో వివిధ విద్యావిజ్ఞాన విషయములను గూర్చిన గ్రంథమును ప్రకటించినవాడు అలాస్టెడ్. మానవుడు తన జీవితములో తెలిసికొనవలసిన విద్యా విజ్ఞాన విషయము లన్నిటినిగూర్చి ఈ గ్రంథమున తెలుపబడినది. ఈ యర్థముననే ఇప్పుడు సామాన్యముగా 'ఎన్‌సైక్లోపీడియా' పదము వాడబడుచున్నది. కాని యిది అకారాద్యక్షర క్రమమున లేదు.

క్రీ. శ. 1704 ప్రాంతమున జాన్‌హారిస్ అను లండను మతాచార్యుడు వ్రాసిన 'ఎన్‌సైక్లోపీడియా ఆఫ్ ఆర్ట్స్ అండ్ సయన్సెస్' అనునదే ఆంగ్లభాషలో అకారాద్యక్షర క్రమమున మొట్టమొదటిమారు వచ్చిన 'ఎన్‌సైక్లోపీడియా'. అప్పటినుండి 'ఎన్‌సైక్లోపీడియా'లు అకారాద్యక్షర క్రమమున వచ్చుట ఆచారమైనది. 'ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికా ఆఫ్ ఆర్ట్స్ అండ్ సయన్సెస్' అనునది 'క్వార్టో' సైజున 2,670 పుటలుగల మూడు సంపుటములలో మొదట ప్రకటితమైనది. దీనిని వారమున కొక సంచిక చొప్పున నూరు సంచికలలో ప్రచురించుటకు నిర్ణయింపబడినది. మొదటి రెండు సంచికలు 1768 లో వచ్చినవి. దీనిలోని కళలు, శాస్త్రము లను గూర్చిన వ్యాసము లొక్కొక్కటి ఒక్కొక్క పొత్తమే. ఇందు ప్రకటితమైన శరీరస్థానము(అనాటమీ)ను గురించిన వ్యాసము 166 పుటలు ; శస్త్రచికిత్సను గురించిన వ్యాసము 238 పుటలు. దీని రెండవకూర్పు 1776 లో సంచికలుగనే ప్రకటించుట కారంభమై చివరి సంచిక 1784 లో ప్రకటితమై పది సంపుటములలో పూర్తియైనది. దీనికి చివర 200 ల పుటల సూచీపత్రము (ఇన్‌డెక్సు) కలదు. దీని మూడవ కూర్పు 1787 లో ఆరంభమై 1797 లో పూర్తియైనది. ఈ కూర్పులలో మార్పులు, చేర్పులు జరుగుచునే వచ్చినవి. 'ఎన్‌సైక్లోపీడియా' జర్మనుభాషలో 1732 లో వచ్చినది. ఫ్రెంచి భాషలో మొదటిమారు మొదటి సంపుటము 1751 లోను ప్రకటితమైనది. మిగిలిన సంపుటములు నడుమ నడుమ ప్రకటింపబడి 1759 నాటికి అది పూర్తియైనది.

ఈ యిరువదవ శతాబ్దారంభమునుండి పెక్కు 'ఎన్‌సైక్లోపీడియా'లు చిన్నవి, పెద్దవి వేరు వేరు యూరోపియను భాషలలో ప్రకటితములైనవి ; ఇంకను అగుచున్నవి. అమెరికాలోకూడ వేరు వేరు 'ఎన్‌సైక్లోపీడియా'లు వచ్చినవి.

బ్రిటిషు ప్రభుత్వము హిందూదేశములో స్థిరపడి ఇంగ్లీషువిద్య ఉన్నత పాఠశాలల ద్వారాను, కళాశాలల ద్వారాను దేశపరివ్యాప్తమై భారతీయు లనేకులు ఆంగ్లభాషలో ప్రవీణులై ఆంధ్ర వాఙ్మయ ప్రక్రియల నన్నిటిని తెలిసికొన్న పిదప భారతదేశములోకూడ

ఇంగ్లీషు భాషలోనున్న 'ఎన్సైక్లోపీడియా'ల వంటి జ్ఞానకోశములను ప్రకటింపవలెనను అభిలాష కలిగినది. దీనికి ఫలితముగ విశ్వకోశములు, విజ్ఞానకోశములు, విజ్ఞాన సర్వస్వములు, జ్ఞానకోశములు అనుపేర్లతో భారతీయులు అటువంటి గ్రంథప్రకటనమునకు పూనుకొనిరి. ఇటువంటి వానిలో బంగాలీభాషలో విరచితమైన 'విశ్వకోష్' మొదట పేర్కొనదగినది. ఇది సరిగా ఇంగ్లీషు 'ఎన్సైక్లోపీడియా బ్రిటానికా'ను నమూనాగా పెట్టుకొని అకారాద్యక్షర క్రమమున రచింపబడిన ఇరువదిరెండు సంపుటముల మహా గ్రంథము ; ఏడు లక్షల వ్యయముతో ఇరువదియేడు సంవత్సరములలో పూర్తియైనది. దీని ముఖ్య సంపాదకుడు బాబూ నాగేంద్రనాథ వసు. ఇతనితో సహకరించినవారుకూడ ఇతనితో సరిసమానులైన పండితులు. ఉత్తర హిందూస్థానమున దేశభాషలలో ఇంగ్లీషు 'ఎన్సైక్లోపీడియా' వంటి గ్రంథము రచియింపబడుట కదియే ప్రథమ ప్రయత్నము.

జ్ఞానచక్రము, జ్ఞానకోశము అను పేర్లతో గుజరాతీ, మహారాష్ట్ర భాషలలోకూడ వివిధ విషయములకు చెందిన గ్రంథములు వెలువడినవి. కాని ఇవి 'ఎన్సైక్లోపీడియా' వంటివి కావు; నిఘంటువుల వంటివి.

ఈ సందర్భమున పేర్కొనవలసిన మరొక ఉద్గ్రంథము 'లఘుశబ్దార్థ సర్వస్వము'. ఏతద్రచనకు పూనుకొన్న మహావ్యక్తి మహామహోపాధ్యాయ పరవస్తు వెంకట రంగాచార్యస్వామి. ఈయన పందొమ్మిదవ శతాబ్దపు మధ్యకాలమున ఐరోపీయ భాషలలోని విజ్ఞానకోశములను పురస్కరించుకొని సంస్కృతభాషలో ఈ గ్రంథమును రచించుటకు పూనుకొని ఆ శతాబ్దపు చివరి సంవత్సరములలో దానిని ముగించెను. ఇదికూడ అకారాద్యక్షర క్రమముననే యున్నది. భారతదేశమున మరెచ్చటను సంస్కృతభాషలో నిట్టి 'ఎన్సైక్లోపీడియా' ప్రకటితమైనట్లు వినము. ఆచార్యులవారు దీనిని పరసహాయము లేకయే, స్వయముగ ఒక్కచేతి మీదుగ రచింప బూనుకొని ముగించుట ప్రస్తుతింపదగిన గొప్ప విశేషము. ఈ విజ్ఞాన కోశము సంస్కృతవాఙ్మయమునందుగల జిజ్ఞాస్య విషయములను సవిస్తరముగా వివరించుటయేగాక నిఘంటు రూపమునకూడ సంతరించబడినది. దీనిని మత, శాస్త్ర, వాఙ్మయ సర్వస్వమని చెప్పవచ్చును. ఇది రంగాచార్యస్వామివారి అత్యద్భుత కూలంకష పాండిత్యమునకు తార్కాణము. శాస్త్రములందు కూడ దుర్లభమగు వైశద్యము శాస్త్ర విషయ నిరూపణమున నిందు కన్పట్టును. ఈ సర్వస్వమున పొందుపరుపబడవలసిన విషయములను పగలు అవలోడన చేసికొని రాత్రిపూట ఏకాంతముగానున్న సమయమునందు ఆయన వాటిని వ్రాయుచుండినట్లును, పగటిపూట అవలోడనము చేసికొన్న విషయము లన్నియు మరునా డుదయమునకు వ్రాయుట ముగింపబడుచుండినట్లును చెప్పుదురు. ఇట్లు అహోరాత్రములు నిరంతరకృషితో వెంకట రంగాచార్యులుగారు సంపూర్ణముగా సిద్ధముచేసిన యీ లఘు శబ్దార్థ సర్వస్వపు సంపుటములలో మొదటిదగు 'అ' యను అక్షరముతో మొదలగు విషయములు గలది తెలుగు లిపిలో విశాఖ పట్టణమున వారిదేయగు ఆర్ష ముద్రాక్షర శాలయందు 1877 లో ముద్రితమైనది. ఇది డెమీ క్వార్టో సైజున 412 పుటల గ్రంథము. 'ఆ' యక్షరముతో నారంభమగు విషయములుగల రెండవ సంపుటము 1898 లో అచ్చయినది. ఇందలి పుటలు 244 అటుపిదప వెంకటరంగాచార్యులుగారు పరమపదించుటచేత దేశ దౌర్భాగ్యవశమున తరువాతి సంపుటములు ముద్రణభాగ్యమునకు నోచుకొనలేదు.

'ఎన్సైక్లోపీడియా బ్రిటానికా' నమూనా మీద అకారాద్యక్షర క్రమమున తెలుగుభాషలో సమస్త విజ్ఞానమును దేశీయుల కందించుటకు మహోదయులు కొమర్రాజు వెంకట లక్ష్మణరావుగారి ముఖ్య సంపాదకత్వమున ఆంధ్ర విజ్ఞానసర్వస్వ ప్రకటనము 1912 లో ఆరంభమైనది. క్రౌను క్వార్టో సైజున నెలకు నూరేసి పుటల గ్రంథము పాఠకుల కందించుటకు నిశ్చయింపబడినది. హిందూ దేశమునకు సంబంధించిన విషయము లన్నియు - భూగోళ, భౌతిక శాస్త్రాది విషయములు తక్క - చక్కగ పరిశోధించి స్వతంత్రముగ వ్రాయబడినవి. ఇందలి కొన్నికొన్ని వ్యాసములు - అమరము, అద్దకము, అద్వైతము, అలంకారములు మొదలగునవి - ప్రత్యేకము చిన్న పుస్తకములే. ధనాభావమువల్లనైననేమి మరే కారణమువల్లనైననేమి ఇందు 1920 నాటికి మూడు సంపుటములు మాత్రమే ప్రకటితమైనవి. ఈ మూడు సంపుటములలోను 'అ' కారాది విషయములు మాత్రమే పూర్తియైనవి. ఇంతలో 1923 లో వెంకటలక్ష్మణరావుగారు కాలధర్మము నొందుటవలన తద్విజ్ఞాన సర్వస్వప్రకటన మాగిపోయినది. తరువాత దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు దీనిని 1926 - 27 లో తీసికొని అదివరకు వచ్చిన మూడు సంపుటము లందలి విషయములను తత్ప్రకటనమునకు తరువాత తెలియవచ్చిన విషయ విజ్ఞానమున కనుగుణముగ అక్కడక్కడ కొన్నికొన్ని వ్యాసములను సవరించియు, కొన్నిట క్రొత్త విషయమును పొందుపరచియు, కొన్ని క్రొత్త యంశములను చేర్చియు, క్రౌను క్వార్టోనుండి డెమీ

క్వార్టోకు మార్చి వర్ణచిత్రములను, సాదాచిత్రములను, దేశపటములను ఎక్కువ చేర్చి మరల రెండు సంపుటములుగ చక్కని బైండులో ప్రకటించిరి. మూడవ సంపుట మచ్చు పడుచుండగ నాగేశ్వరరావు పంతులుగారు 1938 లో లింగైక్యము నొందుటచే నంతటితో ఆంధ్రవిజ్ఞాన సర్వస్వ ప్రకటన మాగిపోయినది.

1912 లో మొదటిమారు ఆంధ్రవిజ్ఞానసర్వస్వ ప్రకటన మారంభమైన పిదప ఈ ప్రయత్నమును జూచి మహారాష్ట్ర భాషలో మహారాష్ట్ర జ్ఞానకోశ ప్రకటనము 1915 లో ఆరంభమైనది. ఇది 21 సంపుటములలో 1927 నాటికి పూర్తియైనది.

'ఆంధ్రవిజ్ఞాన' మను పేర అకారాద్యక్షర క్రమమున పండిత సాహాయ్యముతో ఉర్లాం జమీన్‌దారు కందుకూరి బాలసూర్యప్రసాదరావుగారు ఏడు సంపుటములలో విజ్ఞాన సర్వస్వమును స్వయముగా రచించి ప్రకటించిరి. ఈ సంపుటములు 1938 - 1941 సంవత్సరముల నడుమ ముద్రితములై ప్రకటితములైనవి. ఇందు భూగోళ, భౌతిక, వేదాంత శాస్త్రాది విషయములు కొన్ని చేర్పబడలేదు.

హిందూదేశమునకు 1947 లో స్వాతంత్ర్యము లభించిన వెనుక వేరువేరు రాష్ట్రములలో దేశభాషలకు రాష్ట్ర ప్రభుత్వము లిచ్చుచున్న ప్రోత్సాహమువలన చాల దేశ భాషలలో విజ్ఞానసర్వస్వ ప్రకటన ప్రయత్నములు విరివిగా జరిగినవి, ఇంకను జరుగుచున్నవి. మ. సో. శ.

**విద్యానాథుడు** : (చూ : అగస్త్యుడు.)

**విద్యారణ్యుడు** (క్రీ. శ. 1296 - 1386) : ఈయన విజయనగరరాజ్య సంస్థాపకులైన, హరిహర బుక్కరాయల గురువు. మాధవాచార్యుడని ఈయన పూర్వాశ్రమ నామము. వీరి ఇంటిపేరు సాయణమువారు. శ్రీమతీ, మాయణుల కీయన జ్యేష్ఠపుత్రుడు. సాయణ, భోగనాథు లీయన సహోదరులు. వీరిది బోధాయన సూత్రము ; భరద్వాజ సగోత్రము.

'మాధవార్యో మాధవార్యః సాయణః సాయణః పరమ్
భోగనాథో భోగనాథః ప్రథతే భువనత్రయే ॥' (అ. సు.)

మాధవ, సాయణ, భోగనాథులకు సాటివచ్చువారు లేరు. మాధవుడు క్రీ. శ. 1386 సంవత్సరమున సిద్ధి పొందెను. విద్యాతీర్థ, భారతీతీర్థ, శంకరానందు లీయన గురువులు. భారతదేశమున వైదికధర్మము వైదేశికుల దండయాత్రలో లుప్తప్రాయ మగునప్పుడు ఈ మాధవాచార్యుడు రాజనీతిజ్ఞుడై, ధార్మికుడై, తాత్త్వికుడై దానిని సముద్ధరించెను ; హరిహర, బుక్కరాజాదులగు తన శిష్యులను ప్రోత్సహించి ధర్మరక్షణకై సన్నద్ధులను జేసెను ; మొదట హరిహరునకు కులగురువై, ముఖ్యమంత్రియై తుంగభద్రాతీరమున విజయనగరరాజ్య సంస్థాపనకు కారణభూతుడయ్యెను ; హరిహరున కనంతరము బుక్కభూపాలునకును ప్రధాన మంత్రి యయ్యెను. ఆకాలమం దీయన అనేక గ్రంథములను రచించెను. ఈయన 1356 వ సంవత్సరమున కాశీ కేగెను. కాని రాజు కోరికపై విజయనగరమునకు మరలి వచ్చెను.

మాధవ, విద్యారణ్యు లొకరేయగుదురాయని కొందరు సందేహింతురు. కాని చాల నిదర్శనములు అభేదమునే చెప్పుచున్నవి. ఈయన భారతీకృష్ణతీర్థ సమక్షమున సన్న్యాసదీక్ష స్వీకరించి శృంగేరీ పీఠాధిపతి యయ్యెను. ఆ పరిసరములందద్వైత విద్యాప్రతిష్ఠకై ఇతడు నవపీఠములు సంస్థాపించి నవశంకరు డయ్యెనని శాసనములు పేర్కొనుచున్నవి. విశిష్టాద్వైతమున సుప్రసిద్ధుడగు వేదాంత దేశికుడు మాధవునకు సఖుడు, సహపాఠి.

మాధవవిద్యారణ్యు డసాధారణ ప్రతిభాసంపన్నుడు ; మీమాంసా, జ్యౌతిష, ధర్మశాస్త్ర, వేదాంతములందు మహాగ్రంథములను రచించెను అవి :

(1) పరాశర మాధవము (పరాశరస్మృతి వ్యాఖ్య) ; (2) కాలమాధవము (ధర్మశాస్త్రము - కాలనిర్ణయ మని నామాంతరము); (3) జైమినీయ న్యాయమాలా విస్తరము (మీమాంస-రాజు కోరికపై తానే వ్యాఖ్య చేసెను). విద్యారణ్యుడై వేదాంత గ్రంథములును రచించెను : (4) పంచదశి ; (5) జీవన్ముక్తివివేకము ; (6) వివరణ ప్రమేయ సంగ్రహము ; (7) అనుభూతిప్రకాశము ; (8) అపరోక్షానుభూతి - టీక ; (9) బృహదారణ్యక వార్తికసారము ; (10) ఐతరేయోపనిషద్దీపిక ; (11) తైత్తిరీయోపనిషద్దీపిక ; (12) ఛాందోగ్యోపనిషద్దీపిక. ఇవికాక 'సర్వదర్శన సంగ్రహము'ను కూడ విద్యారణ్యుడు రచించె నందురు. 'శంకర విజయ' మను గ్రంథము, 'సంగీత సారము' విద్యారణ్య కృతులని కొంద రందురు.

విద్యారణ్యుడు శంకర మతానుయాయి. అద్వైత సంప్రదాయమున విద్యారణ్యుని ప్రధానాచార్యునిగ పరిగణింతురు. అద్వైతవాదములందు విద్యారణ్యునకు ప్రత్యేక భావములు కొన్ని కలవు : (1) ప్రతిబింబవాదము - అద్వైతమున జీవేశ్వరుల విషయములో అవచ్ఛేదవాదమని, ఆభాసవాదమని, ప్రతిబింబవాదమని కొన్ని వాదములు కలవు. విద్యారణ్యుడు ప్రతిబింబవాదము నాశ్రయించెను. జలాకాశ, మేఘాకాశములకు వలె జీవేశ్వరులకు సంబంధ మున్నది; (2) అద్వైత సిద్ధాంతానుసారమున అవిద్యయే ప్రపంచ ప్రతీతి కారణము. ఈ యవిద్య దేని

నాశ్రయించినది ? ఇందు రెండు మతములు కలవు; అంతఃకరణాశ్రిత మని, శుద్ధ చేతనాశ్రిత మని. విద్యారణ్యుడు చేతనాశ్రయవాది; (3) స్వప్న ప్రపంచాధిష్ఠానము చెప్పుటలో అహంకార సహితమయిన చేతన స్వప్నాధిష్ఠానమని కొందరందురు. విద్యారణ్యుడు రెండవవాద మంగీకరించెను; (4) జ్ఞానసాధనము విచారణమె. దానికై శ్రవణ మనన, నిధిధ్యాసము లావశ్యకములు. తత్పూర్వము చిత్తశుద్ధికై నిష్కామకర్మాచరణము, ఉపాసన మావశ్యకము. సర్వవిధములయిన ఉపాసనాపద్ధతులు చిత్తశుద్ధికి సాధనములు. కాని నిర్గుణోపాసనమే ప్రధానము. నిర్గుణోపాసనమునకు సంవాదిభ్రమ యని, ఇతరోపాసనములకు విసంవాదిభ్రమయని పేరు. భ్రమ భ్రమయైనప్పటికి ఇష్టసిద్ధిని కలుగజేయునది యైనచో సంవాదిభ్రమ యగును. అసలు బ్రహ్మ యుపాస్యమే కాదు. అది ఉపాసనా విషయము కాజాలదు. అయినను, చిత్తశుద్ధితో నుపాసన యొనర్చిన బ్రహ్మసిద్ధి కలుగును. జ. మా. శ.

**విద్యా విధానము** (ప్రాచీనము) : ప్రాచీనకాలమున విద్యా గురువులను, సంస్థలను రాజులు పోషించెడివారు. కాని వారికి విద్యావిధానమం దెట్టి యధికారము నుండెడిది కాదు. బ్రాహ్మణాగ్రహారములు గొప్ప విద్యాపీఠములుగ నుండెను. ప్రాచీనకాలమున ఘటికాస్థానములను సంస్థలుకూడ ప్రఖ్యాత విద్యాకేంద్రములుగ నుండెను.

వంశపారంపర్యముగా వచ్చు వృత్తివిద్యలను తండ్రులు పిల్లలకు నేర్పుచుండిరి. వృత్తులవలెనే కళలుకూడ ప్రత్యేక కులములవారి యధీనమున నుండెడివి. వృత్తివిద్యలు, కళలు నేర్పుటకు ప్రత్యేకించిన కర్మశాలలు, కులపతుల యాజమాన్యమున నేర్పాటై యుండెడివి. ప్రతి గ్రామమందును ప్రాథమికవిద్య నేర్పు బడు లుండెడివి. విద్యార్థులు వ్రాయను, చదువను, లెక్కలు కట్టను అచట నేర్చుచుండిరి.

మత శాస్త్ర సంబంధములగు విద్యల నేర్పు ఆచార్యులను సంఘము దైవసమానులనుగా భావించి మిక్కిలి గౌరవించుచుండెను. వేద, శాస్త్ర, పురాణేతిహాసములను చదువ దలచినవారు పేరొందిన గురువులవద్దకు బోయి వానిని నేర్చుచుండిరి. ఆచార్యుడు శిష్యులను పుత్రప్రాయులుగా చూచుకొనుచుండెను. శిష్యుడు గురువుగారింటనే యుండి వారికి సపర్యల నొనర్చుచు, పాదసేవ చేయుచు వారి బోధనామృతమును గ్రోలుచు నిరంతర సాన్నిధ్యముచేత మేధావంతుడును శీలవంతుడునై గురువును మించిన శిష్యుడై సెలవు దీసికొని స్వగృహమునకు వెడలుచుండెను.

ఇంత యని నియామకముగా ఏ పారితోషికమును శిష్యుడు గురువునకు చెల్లించువాడు కాదు. కొందరు శిష్యులు గురువుల యింటనే భోజనముచేయుచు వారింటనే యుండెడివారు. కొందరు ఇరుప్రొద్దుల గృహస్థుల యిండ్లకు బోయి మాధుకరవృత్తితో జీవించుచుండిరి. రాను రాను మఠములయందు, సత్రములయందు, ప్రత్యేక వసతిగృహములయందు విద్యార్థులకు భోజనపు టేర్పాటులు జరుపబడినవి.

అన్ని విద్యలకు మూలము వేదవిద్య. అది గురుముఖతః నేర్చుకొనవలసినదే. వేదపఠనమందు ఎంతమాత్రమును మార్పు రాకుండుటకై పద, క్రమ, జటా, ఘన పద్ధతుల నాల్గింటి నేర్పరచిరి. క్రమాంతమువరకు కొందరు, ఘనాంతమువరకు కొందరు స్వాధ్యాయమును నేర్చుకొనుచుండిరి. వేదములను వల్లించుటకు పది పదిహేను సంవత్సరములు పట్టుచుండెను. ఇట్టి క్రమాంత ఘనాంత స్వాధ్యాయపరులు, జిహ్వాగ్రమున వేదముకలవారు పెక్కురున్నను వేదార్థమును చెప్పగల గొప్ప అధికారులు సకృతుగా ఉండిరి. స్వరయుక్త మగు వేదముల శుద్ధ పాఠమును గురుముఖతః నేర్చుట పరంపరగా వచ్చుటచేత భారతీయ విద్యార్థులలో జ్ఞాపకశక్తి చాల పెంపొందుచువచ్చెను. ఏకసంథాగ్రాహులు, ద్విసంథాగ్రాహులు, త్రిసంథాగ్రాహులు చాలమంది బయలుదేరుట కవకాశము కలిగినది. అచ్చుపుస్తకములు లేకుండటచేతను, వ్రాతపుస్తకము లందరకు లభించకుండుటచేతను శాస్త్రములనుకూడ కంఠస్థము చేయుచుండిరి. వాటి అర్థమును, తాత్పర్యమును, వ్యాఖ్యానమును గురువువద్ద కడుశ్రద్ధతో నేర్చుకొనుచుండిరి. కంఠస్థముచేయుటకు సులువుగా నుండుటకై వచనములో వ్రాయవలసిన శాస్త్రవిషయములనుకూడ శ్లోక పద్యరూపముననే వ్రాయుచుండిరి. ఈ పద్ధతి ఒకటి రెండు వందల ఏండ్ల క్రిందటివరకు బాహాటముగ వాడుకలో ఉండెను. సర్వశాస్త్రములకు, కావ్యాలంకార గ్రంథములకు టీకాతాత్పర్యములను, వివరణలను నిరాఘాటముగా తడవుకొనకుండ అట్టివారు చెప్ప సమర్థులైయుండిరి. క్లిష్టభాగములకు సుబోధకముగా వ్యాఖ్యానమును చేయ సమర్థులైయుండుటయేగాక వ్యాఖ్యానములకు మెరుగులు దిద్ది నూతన సిద్ధాంతములను ప్రతిపాదింపగలిగియుండిరి.

ఉపాధ్యాయుడు శిష్యులందరకు ప్రత్యేకముగా పాఠము చెప్పుచు వారి వారి శక్తికి తగినట్లు బోధించుచుండెడివాడు. శిష్యు లందరకు వాగ్రూపమగు పరీక్ష నిత్యము జరిగెడిది. చురుకైన విద్యార్థుల పాఠము ముందుకు సాగి, వారు ముందుగా ఉత్తీర్ణు లగుచుండిరి. అందరిలోను మొనగాడయిన పెద్దతరగతి విద్యార్థి క్రింది తరగతుల వారికి పాఠమును చెప్పుట పరిపాటిగ నుండెను. దీనివలన

అట్టి పెద్ద విద్యార్థులకు విద్యాబోధనలో మేలైన శిక్షణ, మంచి పేరు వచ్చి విద్యార్థిజీవితానంతరము ఉపాధ్యాయత్వమును వహించుటకు తగిన సమర్థత కలుగుచుండెను. ఎంతటివానికైనను విద్య పూర్తియగుట యనునది లేదని, ఆజన్మవ్యాసంగ మావశ్యకమని, దానివలన రాను రాను పాండిత్యప్రకర్ష పెరుగునని పూర్వాచార్యుల యభిప్రాయము.

బౌద్ధయుగమున ఉన్నతవిద్య సంఘారామములలో నేర్పబడుచుండెను. సాతవాహనుల రాజధానియైన ధాన్యకటకమం దుండిన బౌద్ధవిహారములు గొప్ప బౌద్ధ విద్యాపీఠములుగ నుండెను. వివిధ దేశములనుండి విద్యావ్యాసంగమునకై వివిధ బౌద్ధసంప్రదాయములకు చెందినవా రీ విద్యాపీఠములకు వచ్చుచుండిరి.

ధాన్యకటకములోవలెనే నాగార్జునకొండవద్ద కృష్ణలోయలో స్థాపింపబడిన విద్యాపీఠమును ప్రఖ్యాతి చెందినది. సర్వవిద్యాపారంగతుడు, మహాయానబౌద్ధసంప్రదాయ స్థాపకుడు, ప్రవర్తకుడు, గొప్ప ప్రతిభాశాలి, సిద్ధుడును అగు నాగార్జునాచార్యులవారు అందు ప్రధానాచార్యుడుగా నుండెను. అచట ఆచార్యులు, శిష్యులు, నివసించుటకు వేరు వేరు భవనములు, పాఠశాలలు, భోజనశాలలు ఉండెనని, పారిశుద్ధ్యమునకు తగు ఏర్పాట్లు కలవని నాగార్జున కొండవద్ద జరిగిన పురాతత్వ ఖనన పరిశోధన వలన తెలియవచ్చినది.

రాజమందిరములలో రాజపుత్రులకు, పుత్రికలకు, విద్యలు, కళలు మాత్రమే కాక రాజ్యతంత్రము, యుద్ధతంత్రముల విషయమునగూడ తగిన శిక్షణ నిచ్చుచుండిరి.

క్రీస్తుశకము అయిదారు శతాబ్దములనాటికి బౌద్ధమత ప్రాబల్యము క్రమముగా తగ్గినది. వైదికమతము తలయెత్త నారంభించినది. ప్రాకృతముకంటె సంస్కృతమునకు ప్రాధాన్యము చేకూరినది. శాలంకాయన, విష్ణుకుండి గోత్రజుల కాలమునాటికి సంస్కృతము రాజభాషయైనది.

వైదికమతముతోపాటు జైనమును తెనుగుదేశములో వర్ధిల్లినది. జైనులు విద్యాప్రియులు. జైనుల మతవిద్యలకు వారి బస్తీలు కేంద్రములైనవి.

జైనమునకు పిదప వ్యాపించిన కాలాముఖ, పాశుపత శైవసంప్రదాయముల కాలములోకూడ వైదిక విద్యలు, మతవిద్యలు శైవమఠములలో నేర్పబడుచువచ్చెను. శైవాచార్యులు, మఠాధిపతులుకూడ సర్వవిద్యాపారంగతులైన విద్వాంసులుగా నుండిరి. ఆనాడు శ్రీశైలక్షేత్రము శైవులకు కేంద్రస్థానమైనది. అందైదు శైవమఠము లుండెడివి. కాకతీయులకాలమున శ్రీశైలమువలెనే అలంపురము, మందడము, ఓరుగల్లు మొదలగునవి గొప్ప విద్యాస్థానములుగా నుండెను. ఇవి రాజపోషణవల్ల వర్ధిల్లుచువచ్చెను.

ఈ కాలమునాటికి ఓనమాలతో 'ఓం నమః శివాయ సిద్ధం నమః' అని అక్షరాభ్యాసము చేయుట బాగుగా వాడుకలోనికి వచ్చినది. శైవసంప్రదాయసిద్ధమగు 'ఓం నమః శివాయ' అను మంత్రముతో బౌద్ధ, జైన సంప్రదాయసిద్ధ మగు 'సిద్ధం నమః' అనుదానిని చేర్చి విద్యాభ్యాసారంభమునకు సర్వమత సమ్మత మగునట్లు మన పూర్వులు ఓనమాలను ఏర్పాటు చేసినట్లు తలంచవచ్చును. ఈ యాచార మిప్పుడును వాడుకలో కలదు.

కాకతీయులకు తరువాత రెడ్డిరాజులు కొంతకాలము దేశమును పాలించిరి. కాకతీయులవలెనే వారును విద్యాప్రియులు. ఆయుర్వేదపండితులకును, జ్యోతిశ్శాస్త్రజ్ఞులకును రెడ్డిరాజు లిచ్చిన యగ్రహారము లనేకములు. వారు ఆయుర్వేదము, జ్యోతిషము, సంగీతము, నాట్యము మొదలగు శాస్త్రవిద్యలను పెంపొందించిరి. తెలుగుదేశములో అదివరకుకూడ వైష్ణవ ముండినను అది ఎక్కువగా వ్యాపించినది రెడ్డియుగము మధ్యకాలమునుండియే.

వైష్ణవము వ్యాపించిన కాలమున పెక్కురు వైష్ణవాచార్యులును, వైష్ణవ మఠాధిపతులును తమ శిష్యులకు శాస్త్రవిద్యలను, మతవిద్యలను బోధించుచువచ్చిరి. వైష్ణవ గురువులు కేవలము సంస్కృతవిద్యనేకాక తెలుగుసాహిత్యమును కూడ తమ శిష్యులకు బోధించి తెలుగుభాష అభివృద్ధికి కారణభూతులైరి. విజయనగర సామ్రాజ్యములో వర్ధిల్లిన తెలుగుకవులలో కొందరికి సాహిత్యవిద్యను బోధించి వారిని తెలుగు కవులుగ తీర్చిన వైష్ణవాచార్యులు కలరు. విజయనగరయుగమున శైవ, వైష్ణవ సంప్రదాయములే కాక జైనమును వర్ధిల్లినది. శైవ, వైష్ణవాది మఠములును, జైనబస్తీలును పూర్వమువలెనే విద్యాస్థానములుగా నుండి విద్యావ్యాప్తికి తోడ్పడినవి. మహారాజులును సామంతులునేకాక భాగ్యవంతులైన ఆయా యాచార్యుల శిష్యులుకూడ పెక్కు భూదానాదులతోను ధర్మములతోను ఆయా మఠములను, బస్తీలను పోషించుచువచ్చిరి.

విజయనగరప్రభువులు సంగీతవిద్య నాదరించుచుండిరి. నాట్యవిద్యయు ప్రబలియుండెను. రాయలకోటలో నర్తనశాల యుండెను. అందు రాజపుత్రికలు నృత్యవిద్య నేర్చుచుండిరి. విజయనగరమున ఆయుర్వేదవైద్యశాల లుండెను. అందు అరబ్బులు, పారసీకులు, ఇతర దేశస్థులు కూడ విద్య నభ్యసించుచుండిరి. 'బాహట'మను వైద్యగ్రంథము పాఠము చెప్పెడివారట.

స్త్రీలు సకలవిద్యలను అభ్యసించుచుండిరి. సంస్కృతాంధ్రములయందు కవయిత్రులు బయలుదేరిరి. సంగీత నాట్యములు వారి సొమ్మైయుండెను. ఈ విద్యలయందు నిపుణులును, గడసరులు నగు గణికలు పెక్కు రుండిరి. సాము గరిడీల నభ్యసించు స్త్రీలును కొంద రుండిరి.

తిరుపతిక్షేత్ర మీకాలమందు గొప్ప విద్యాకేంద్రముగా, సంగీత కళానిలయముగా నుండెను. అందు పెక్కుమఠము లుండెను. అచట వైష్ణవ మతసంబంధమగు విద్యలు, ఆగమశాస్త్రము బోధింపబడుచుండెను.

విజయనగర సామ్రాజ్యము విచ్ఛిన్నమైన తరువాత ప్రాగాంధ్ర దేశములో చిన్న చిన్న రాజ్యములు చాల వెలసెను. ఇటువంటివానిలో వెంకటగిరి, కార్వేటి నగరము, కాళహస్తి, చల్లపల్లి, నూజవీడు, పెద్దాపురము, పిఠాపురము, విజయనగరము, బొబ్బిలి, మాడుగుల, జయపురము మొదలైనవి ముఖ్యమైనవి. ఈ సంస్థానాధీశ్వరులు పూర్వపు హిందూమహారాజులవలెనే వేద శాస్త్ర పండితులను, తెలుగుకవులను పోషించుచువచ్చిరి. వీరు కాశీ, నవద్వీపము మొదలగు విద్యాపీఠములలో తర్క, వేదాంత, జ్యోతిష, వ్యాకరణాది విద్యలయం దుత్తీర్ణులై వచ్చిన పండితుల నాదరించి గౌరవించి అగ్రహారములను, భూమిని దానమిచ్చియు, వార్షికముల నేర్పాటుచేసియు వారికి వసతులు కల్పించుచువచ్చిరి. ఈ పండితులు వేదము, వేదాంతము, శాస్త్రము మొదలగు ఆర్ష విద్యలను విద్యార్థుల కుచితముగా బోధించుచుండిరి. తిరుపతిలోను, కృష్ణా గోదావరీతీర ప్రాంతములయందు - మంథెన, కాళేశ్వరము, దివిసీమ, కోనసీమలయందు - వేదవిద్య ప్రబలియుండెను. అచ్చట వేదాంగములు, మంత్రశాస్త్రము తెలిసిన పెద్దలు అగ్రహారములలో శిష్యులకు విద్యలు గరపుచుండిరి. పిఠాపురము, ఉర్లాము మొదలగు సంస్థానముల వారు వేదవిద్యాపరీక్షలు జరిపి పండిత సత్కారమును జేయుచుండిరి. కాశీ, నవద్వీపములలో పండ్లకొలది విద్యల నభ్యసించిన మహాపండితు లనేకులు తెలుగునాడున ప్రసిద్ధి కెక్కియుండిరి.

చాల ఇటీవలివరకు ప్రాథమిక, లౌకికవిద్యలు నేర్పుటకై ప్రతిగ్రామమునందును వీథిబళ్లు ఉండెడివి. ఆ యుపాధ్యాయులను ఊరివారు పోషించి పిల్లలకు చదువు చెప్పించుకొనుచుండిరి. ఈ బడులలో నాల్గు తరగతుల వరకు చదువు ఉండెడిది. బడిపంతుళ్లు పెద్ద విద్య నేర్చిన వారు కారు. వారు నేర్పువిద్య లోకవ్యవహారమున కుచిత మైనదై యుండెను. ఐదుబరులు, గుణింతములు పిల్లలచే ఇసుకలో దిద్దించువారు. విద్యార్థులు పేర్లు వ్రాయుట నేర్చినపిదప పలకలు పట్టించువారు. దస్తూరి కుదురుటకు చూచివ్రాత వ్రాయించువారు. తప్పులు లేకుండ వ్రాయుటకు ఉక్తలేఖనము చెప్పువారు. కడితముపైన బలపము తోను, తాటాకుమీద గంటముతోను, పీచుకాగితములమీద మసిబుర్రలలోని సిరాతో బాతుకలములతోను వ్రాయుట విద్యార్థులకు నేర్పుచుండిరి. గుణింతము ఇసుకలో దిద్దించువారు. లోకవ్యవహారమునకు, కరిణీకమునకు, వ్యాపారమునకు, ప్రభుత్వోద్యోగమునకు ఉపకరించు లెక్కలు, పంచాంగ విషయములు, పురాతన రాజచరిత్రలు, వ్యవహారమునకు కావలసిన వివిధములైన వ్రాత మసాయిదాలు మొదలైనవి విద్యార్థులకు నేర్పుచుండిరి. సమర్థులు భారత భాగవతాది పురాణపఠనమును నేర్చుకొనుచుండిరి. పెద్దబాలశిక్ష, నలచరిత్ర, బాలరామాయణము, ప్రహ్లాద చరిత్ర, గంజేంద్రమోక్షము, దాశరథిశతకము మొదలగునవి పై తరగతులలో వల్లింపజేయువారు. వీథిబడులలోని చదువు రాను రాను కఠిన మగుచువచ్చెను. పిల్లలను కఠినముగా శిక్షించెడివారు. గోడకుర్చీలను వేయించుట, కోదండములను తీయించుట, నిర్దాక్షిణ్యముగా చిళ్లల ప్రాటితోను, పేపబెత్తములతోను కొట్టుట మొదలైన శిక్షలు వాడుకలో నుండెడివి. బడికి వెళ్లుటయన్న పిల్లలకు భయముగా నుండెడిది. ఈ బడులలో చదువుకొనువారందరు మగపిల్లలే. ఆడపిల్లలకు బడిచదువు లేదనియే చెప్పవచ్చును. కాని కొన్ని కొన్ని కుటుంబములలో తల్లులు, తండ్రులు ఆడపిల్లలకు చదువను వ్రాయను నేర్పుచుండిరి. ఆంధ్రదేశమందు వివిధ ప్రాంతములలో కొంత కొంత భేద మున్నను మొత్తముమీద ప్రాథమిక విద్యా విధానము ఏకరీతినే యుండెనని చెప్పవచ్చును.

పందొమ్మిదవ శతాబ్దము ప్రారంభమునాటికి ఇంగ్లీషు వారు ఫ్రెంచివారి నోడించి ఆంధ్రదేశమును తమ అధికారము క్రిందికి తెచ్చుకొనిరి. అప్పటినుండి కంపెనీ వారు విద్యావిధానమున ఐక్యము కలుగజేసికొన ప్రారంభించిరి. వి. అ. రా.

**విరూపాక్షరాయలు :** ఇతడు రెండవ హరిహరరాయల కుమారుడు. ఇతడు నారాయణ విలాస మను నైదంకముల నాటకమును, ఉన్మత్తరాఘవ మను నాటకమును రచించెను. ప. రా. స్వా.

**విశ్వనాథరావు, మాదిరాజు :** వీరు వనపర్తి తాలూకా, శాఖాపుర మను గ్రామమున జన్మించిరి. లక్ష్మాంబా, రామారావుగారలు వీరి తల్లిదండ్రులు. వీరు మదరాసు ప్రెసిడెన్సీ కళాశాలలో ఉన్నత విద్య నభ్యసించిరి ; తెలుగు, సంస్కృతము, ఉర్దూ, ఇంగ్లీషు, ఫారసీ

భాషలం దసమానమైన పాండిత్యము గడించి, ఆ యా భాషలందు కవిత అల్లిరి. హిందూధర్మశాస్త్రమున వీరు నిధి. వీరు కొన్ని దినములు వనపర్తి సంస్థానమున పేష్కారుగా నుండి, సంస్థాన వ్యవహారములను చాక చక్యముతో నడిపించిరి. వీరే 'అష్టభాషా బహిరీ గోపాల రాయ' గ్రంథాలయ స్థాపనము చేసినది.

వీరు శాకుంతల నాటకమును, కుమారదాసుని జానకీ పరిణయకావ్యమును, బిల్హణుని కర్ణసుందరి నాటికను తెనిగించిరి. ఉచ్చల యను మరియొక నాటకమును రచియించిరి. బిల్హణ విరచిత విక్రమాంక దేవచరితము 3 సర్గలను వీరు కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారితో కలసి అనువదించిరి. వీనిలో విక్రమాంక దేవ చరితమున ఒక సర్గమును, కర్ణసుందరి నాటికయును మాత్రమే ముద్రితములు. విశ్వనాథరావుగారు చిన్నతనమందే ఉబ్బస ముతో బాధపడుచు కవితారచనము చేయుచునే క్రీ. శ. 1948 వ సంవత్సరమున పరమపదించిరి. బి. రా. రా.

**విశ్వనాథశర్మ, మల్లాది** (క్రీ. శ. 1900 - 1947): వీరు వెలనాటి వైదికశాఖకు చెందినవారు; విశాఖపట్నము జిల్లా, బొబ్బిలితాలూకా, శ్రీకాకుళ గ్రామవాసులు. వీరు పర్లాకిమిడిరాజావారి కళాశాలలో ఇంటర్మీడియట్ వరకు చదివిరి; కొంతకాలము దక్షిణామూర్తిశాస్త్రిగారి వద్ద ప్రత్యేకముగా సంస్కృతాంధ్రము లభ్యసించి అటుపై 1921 మొదలు జీవితాంతము వరకు విజయనగరము మహా రాజావారి కళాశాలలో ఆంధ్ర పండితులుగా నుండిరి.

శ్రీ కామకోటిపీఠాధీశ్వరులు వీరి కవితాప్రావీణ్యము నకు మెచ్చి 'కవిరాజ' బిరుదము నొసగి గౌరవించిరి. అది యాదిగా వీరు 'విశ్వనాథకవిరాజు'గా ప్రసిద్ధులైరి.

వీరు లౌకిక ప్రవృత్తికై యొకరిచేతిక్రింద నుద్యోగము నిర్వహించు చున్నను అతి స్వతంత్రమగు స్వభావముగల వారు; ఎయ్యెడను, ఎప్పాటను, ఎవ్వరికిని తల వంపని ఆత్మాభిమానులు; అట్లని ఉద్ధతులుగారు; అతిసహృద యులు; ఆప్తులయెడను, మిత్రులపట్లనేగాక యంతేవాసుల విషయమునగూడ నెంతయో స్నేహభావమునెరపు సరళ ప్రవృత్తికలవారు.

సంస్కృతాంధ్రాంగ్లములయందు వీరి పాండిత్యము సునిశితమైనది. అందును ఆంధ్రగ్రంథరచనయందు వీరి ప్రజ్ఞ బహుముఖము. వీరు మధురములగు పద్యరచనలను, లలిత ములగు నాటకానువాదములను, హాస్యరసప్రధానములగు నవ్యనాటికలను, జిజ్ఞాసాచోదకములు, విమర్శనాత్మక ములు నగు వ్యాసములను రచించిరి; చిక్కని గ్రాంథికము వ్రాయుటలో నెంత దిట్టలో చక్కని వ్యావహారికము వాడుటలో నంత నేర్పరులు; ఆ రెండు భాషలయందును అనేక రీతుల రచనలను వెలయింపచేసి అటు గ్రాంథిక వాదులయు, నిటు వ్యావహారికాభిమానులయు ఆదరాభి మానములను చూరగొనిరి. వీరి రచనలు - ఆంధ్రీకృత నాటకములు: ఆశ్చర్యచూడామణి (శక్తిభద్రుని నాటక మున కనువాదము), మాళవికాగ్నిమిత్రము, విక్రమోర్వ శీయము, అనర్ఘరాఘవము, మృచ్ఛకటికము (అముద్రి తము); శివపురాణము (అముద్రితము); నవ్యనాటికలు: దొంగాటకము (ఇది హిందీ బెంగాలీ భాషలలోనికి గూడ ననూదితము), కిట్టుగానుగ, వారసులు, ప్రహ్లాద.

వీరు ముఖ్యముగా నాటకరచనయం దత్యంతాదరాభి మానములు గలవారు, సిద్ధహస్తులును; అంతియ గాదు నాటకప్రదర్శనము నందును, పాత్రధారణము నందును అభి నివేశముకలవారు. వీరు చలన చిత్రములకు కథలు,పాటలు, మాటలు వ్రాయుచుండిరి. 'పరమానందయ్య శిష్యులు', 'పంతులమ్మ' అనువానికి 'స్క్రిప్టు'లు వీరు వ్రాసినవే.

వీరు హాస్యప్రియులు. అది వీరి మాటలలో, చేతలలో, ప్రసంగములో, రచనలో, మొత్తముపై వీరి జీవితములోనే అడుగడుగునను పొడసూపుచుండును. కొందరి హాస్యము వలె కటువును, గ్రామ్యమును గాక వీరి హాస్యధోరణి మార్దవము సంతరించుకొని సున్నితమై పాఠకులను, ప్రేక్ష కులను, శ్రోతలను కడుపుబ్బ నవ్వించునది. జన్మచే నద్వైతి యైన వీరు నడుమ హరనాథభక్తులై తత్సూక్తులను ఆచరణలో పెట్టుటయేగాక తన్మత ప్రచారమునకై యాంధ్రమున నొక పత్రికకూడ నడపిరి. కొ. జో. శ.

**విశ్వనాథశాస్త్రి, దండిభట్ల**: వీరు వెలనాటి బ్రాహ్మ ణులు. వీరి జన్మస్థలము తూర్పుగోదావరిజిల్లా రాజోలు తాలూకా, విశ్వేశరాయపురము. వీరు 1840 ప్రాంతమున జన్మించిరి. వీరి తండ్రి వీరరాఘవుడుగారు.

వీరి శాస్త్రాధ్యయనము ప్రధానముగా కాశీలో జరిగెను. వీరు జగత్ప్రసిద్ధిచెందిన బాలశాస్త్రిగారివద్ద చిరకాలము విద్యాభ్యాస మొనరించిరి; తర్క వ్యాక రణములలో సమస్త గ్రంథములను చదువుటయేకాక యన్నింటిపైనను స్వతంత్రమైన వ్యాఖ్యానములను రచింప గల్గిన అధిక్యమును సంపాదించిరి. ఇతర శాస్త్రములలో కూడ వీరి పాండిత్య మనల్పము. వీరు పూర్వోత్తర మీమాంసలలో మహావిద్వాంసులు. వీ రాంధ్ర దేశములో కొంతకాలమును, కాశీలో కొంతకాలమును నివసించుచు నిరంతరము విద్యార్థులచే ననుసరింపబడుచుండిరి.

లోకోత్తరమైన ప్రతిభ, బహుశాస్త్రవేత్తృత్వము, అసాధారణ వాక్ప్రౌఢిమ, లోకములో నెట్టివారినైనను

గూడ లెక్కచేయని నిర్లక్ష్యభావము, తిరస్కృత పురందరత్వము - ఇవి వీరి లక్షణములు. వీరు కాశీలో చిరకాలము విద్యార్థిగను, ఆచార్యుడుగనుకూడ నుండి యావద్భారతదేశ విద్వాంసులచేతను భయభక్తులతో నీక్షింపబడుచుండిరి. నేటికిని కాశీలో పండిత మండలిలో వీరి పేరు సుపరిచితము. వీరు రచించిన శాస్త్రగ్రంథములు పండితులచే శిరసావహింపబడుచున్నవనుటచేతనే వీరి ఘనత విదితమగును.

శబ్దరత్నముపై 'శబ్దరత్నప్రభ'యు, పరిభాషేందు శేఖరముపై 'పరిభాషేందుచంద్రిక'యు, శబ్దేందుశేఖరముపై 'శబ్దేందుచంద్రిక'యు వ్యాకరణ శాస్త్రములో వీరు రచించిన మూడు వ్యాఖ్యాన గ్రంథములు.

వీరు మహారాష్ట్ర, సౌరాష్ట్రాది దేశములలో సంచారము చేసి శాస్త్రార్థ చర్చలలో దిగ్విజయము చేసినవారు. ఎక్కడి కేగినను జయమేకాని యపజయము లేదు. వీరికి కొంచెము అతిధోరణిగా మాటాడు నలవాటు కలదందురు. 'వ్యాకరణములో రావణవధ చేస్తాం, తర్కములో వాలి వధ చేస్తాం, ఎందులోనైనా వధ తప్పదు, మనదే జయం' అనుచుండెడివారట. దీని తాత్పర్య మిది: ఈ రెండు శాస్త్రములలోను వా రద్వితీయులే యైనను వ్యాకరణము వారి కభిమాన శాస్త్రము. అందులో నిరాఘాటముగా సరళమైన ధోరణిలోనే ప్రతిపక్షులను జయించెడివారు; అవసరమైనచో నొక్కొక్కప్పుడు తర్కములో కొంచెము వక్రమార్గములో వెళ్ళి శత్రువును పడగొట్టెడివారు. ఎట్లయినను శత్రువును జయించుట సమానమే. బరోడా సంస్థానములో ఏ పండితుడును వీరిని గెలువజాలనందున తుదకు పండితు లందరు కుట్రచేసి స్వర వైదికములలో ప్రశ్నలు వేసి వీరికి చికాకుగల్పించిరట. స్వరవైదికములు వేదమునకు సంబంధించిన భాగము లగుటచే వానిని శాస్త్రార్థ చర్చలలోనికి దింపు పరిపాటి వీరికి లేదు.

ఆనందగజపతి మహారాజుగారు శాస్త్రిగారిని 'మీకు నెలకు 30 రూపాయ లిచ్చెదము; ఇక్కడ ఉందురా? లేక మీ రెక్కడ నున్నను నెలకు 15 రూపాయలు పంపుచుందుము. ఆ ప్రకారము చేయుమందురా?' అని యడిగిరట. దానికి 'మేము స్వతంత్రులముగా నుందుము' అని వీరి సమాధానము. అయినను విజయనగరాధీశులు వీరికి ఎచ్చట నున్నను ప్రతి మాసము 15 రూపాయలు పంపుచు వచ్చిరి. వీరు చాలకాలము నేదునూరిలో నుండిరి.

వీరి యవసానగాథ మిక్కిలివిషాదకరమైనది. ఒకసారి వీరు భార్యాసమేతులై కాశికి పోవుచుండగా రైలులో నొక హిందూస్తానీవానితో పోట్లాట వచ్చెననియు, వారిద్దరు నొక చిన్న స్టేషనులో దిగగా రైలు కదలెననియు, భార్య సూరమ్మగారు కాశికిపోయి భర్త యాగమనమునకై యెదురుచూచి చూచి తుదకు దుఃఖభరమున పుట్టినింటికి వచ్చివేసె ననియు కొందరు చెప్పుదురు. ఖర్గపురము స్టేషనులో ఎవరో జర్మనులు వీరితో మాట్లాడి రనియు, వారి ప్రేరణమున ఆయన జర్మనీకి వెళ్ళె ననియు, జర్మనులు వారి సాయమున అథర్వవేద రహస్యములను తెలిసికొని రనియు కొందరు చెప్పుదురు. వీరు చింతామణి, గణపత్యుపాసకులని తెలియుచున్నది. జ. పు.

**విశ్వేశ్వరుడు:** ఇతడు సింగభూపాలుని యాస్థానమున నుండెను. 'ఇతడు చమత్కారచంద్రిక' యను నలంకార గ్రంథమును రచించెను. ఇందలి యుదాహరణము లన్నియు సింగభూపాలు నభివర్ణించునవి. ఈ గ్రంథమును బట్టియు, రసార్ణవ సుధాకరమును బట్టియు నీతడు 'కందర్పసంభవ' మను నొక ప్రకరణమును రచించినట్లు తెలియుచున్నది. 'కర్మవిపాకము', 'అష్టావక్రదీపికా వ్యాఖ్యానము' కూడ నీతని కృతులే. ప. రా. స్వా.

**వీరపురుషులు - వీరపూజ:** సహజముగనే శైవము వీరమతము. కాకతీయులు పరిపాలించిన మధ్యయుగములో అది మరింత వీరోచితమైనది. దానితో ధైర్య సాహసోపేతములైన భయంకరాచారకర్మలు వాడుకలోనికి వచ్చినవి. శైవములో నొక సంప్రదాయమైన తాంత్రిక మతమువలన అవి జనాదరపాత్రము లైనవి. వీనిలో ముఖ్యమైన యాచారము ఆత్మబలిదానము - దేవికి తన తల తరిగి యొసగుట. దేవి యాగ్రహమువలన దేశారిష్టములు, అంటువ్యాధులు మొదలైనవి సంభవించు నను నూహతో తదాగ్రహోపశమనమునకు, ఇష్టకామ్యార్థ సిద్ధికి మ్రొక్కుకొన్న వారు తమ తల దేవీసన్నిధానమున తరిగి యిచ్చి ఆత్మబలి ప్రదానము కావించుట ప్రాచీన కాలమునుండి వచ్చుచుండిన ఆచారము. దీనికి అరవములో 'తలైబలి' అని, తెలుగులో 'మిడితల' అని వ్యవహారము. మధ్యయుగమునందు శైవము ముమ్మరముగ వ్యాపించిన కాలమున తాంత్రిక శైవప్రభావమునను, కన్నడదేశము నందలి బసవేశ్వర పునరుద్ధృతమైన వీరశైవ సంప్రదాయ ప్రభావమునను ఆంధ్రదేశమునందీ యాచారము పురికొని బలపడి యేపు మీరినది. అష్టదిక్కులయందున్న యష్ట భైరవులను అష్టాంగరుధిరముతో అర్చన చేసి రక్తసిక్త కంఠము బలియిచ్చునెడల శక్తి జనుల కోర్కెలను ఫలింపజేయు నను విశ్వాసము జనులలో ప్రబలిన కాల మది. భక్తుడు అత్యంత భక్తిభావావేశముతో తన యిష్టదేవతకు తన్ను దాను బలి యిచ్చుకొనుటకంటె సమర్పించుకోదగిన

మరియొక ఉత్తమోపాయన మేదియు లే దన్న భావము, విశ్వాసము ప్రబలమై ఈ యాచార మా కాలమున నెక్కువగ ప్రబలినది. ఈ విధముగ దేవికి తమ శిరస్సులను ఖండించి యిచ్చువారు వీరులు - వీరులే కాదు, వీరాధి వీరులు. ఈ యాత్మబలి ప్రదాన సమయమున వీరపురుషులు గమనింపవలసిన లక్షణములు కొన్ని కలవు; తన శిరస్సు ఖండించి యిచ్చువాని కంటివెంట నీటిబొట్టు రాల రాదు; వీరుడు శిరఃఖండనమైనవెనుక ముందుకు దేవి పాదములమీదికి వ్రాలవలెను కాని వెనుకను వెల్లకిల బడరాదు. సాధారణముగ ఈ ఘోర కఠోరవ్రతాచరణము భైరవ, వీరభద్రాలయముల ముందు గాని, భద్రకాళీ దుర్గాదేవీ సమక్షమునగాని జరపబడును. తల తరిగి యిచ్చినచో రెండు కన్నులు పోయి మూడు కన్నులు, రెండు బాహువులు పోయి దశ భుజములు, ఒక ముఖము పోయి పంచాస్యములు వచ్చి తా మష్టమూర్తి వలె భాసింపగల యుత్కృష్టోత్సవ సమయ మా యాత్మ బలిదాన తరుణమని వారి ధృఢవిశ్వాసము. అది వారికి మహోత్సవ సమయము. బంధు మిత్రులతో ఉత్సవముతో వారు గుడి కేతెంతురు.

శైవము ముమ్మరముగా వ్యాపించిన కాకతీయ రాజన్యుల కాలమునందును, కొండవీటి రెడ్డిరాజుల ప్రభుత్వ కాలమునను ధర్మరక్షణ నిమిత్తము, గ్రామారిష్ట నివారణము నిమిత్తము తాము కొలుచునట్టి ప్రభువునకు సంభవించు ఆపదను నివారించు నిమిత్తము శైవులైన వీరపురుషు లీవ్రతమునకు పూనుకొనుచు వచ్చిరి. తమ యభీష్టము నెరవేరిన పిదప వారు శివప్రీతికరముగ, శక్తిప్రీతికరముగ ఏ పుణ్య శైవతిథినో, ఏ మహాశివరాత్రి సందర్భముననో గుడి కరిగి వ్రతదీక్షా నిర్వహణబద్ధు లయ్యెడివారు. ఆ కాలమున ఈ విధముగా తన్ను తాను త్యాగము గావించుకొనుట పరిపాటి యైనది. ఆకాలమున నిట్టి వీరులు ఈ కుల మాకుల మనక, ఈ జాతి యాజాతి యనక యెల్ల శైవకులములనుండి, యెల్ల శైవజాతులనుండి యుద్భవించుచుండిరి. నాటి శైవ వీరాచారములు క్రీడాభిరామమున గొన్ని వర్ణితములైనవి.

వీరు లాత్మబలి యిచ్చుట కరుగుచుండిన గుళ్లకు 'చంపుడుగు' ళ్లని పేరు. మహాశివరాత్ర్యుత్సవ సందర్భమున ఇట్టి వీరులు పవిత్ర శైవక్షేత్రమైన శ్రీశైలమున కరిగి అచ్చట ప్రత్యేక మీ కర్మ నిర్వర్తించుకొనుకొరకు కొండవీటి రెడ్డి ప్రభువైన అనవేమారెడ్డి కాలమున అచట వీరశిరోమండపమని యొక మండపము కట్టింపబడినది. దీని వర్ణన మీ క్రింది శ్లోకమున పొందుపరుపబడినది :

'స్తంభై రూర్జిత మంగపంచకయుతై రష్టోత్తరత్రింశతో
మధ్యే రంగ శిలావిశాల మువరి ప్రత్యగ్ర పద్మాంచితం
భద్రాంక మ్మఖభద్ర తోరణయుతం సద్వారపాలాం స్థితం
శ్రీశైలే కృత మన్నభూమిపతినా వీరాశిరోమండపం'

కాకతీయుల కాలమున గ్రామరక్షకులైన వీరులు ప్రత్యేకము శైవమతముల నాశ్రయించుకొని యుండెడివారు. వీరు నాల్గు వర్ణములలోనుండి వచ్చినవా రనియు, చోడదేశజు లనియు శాసనములు చెప్పుచున్నవి. భుజచ్ఛేద, శిరచ్ఛేద, కుక్షిచ్ఛేదాది కర్మలచేత వీరు వీరభద్రులని ప్రసిద్ధులైరి.

ఈ విధముగా ఒక యుత్తమాశయముకొరకు, ఒక యుత్తమాదర్శముకొరకు గ్రామరక్షణార్థము ఆత్మబలి యిచ్చిన వీరుల విగ్రహములు చేసి పూజించుట ఆచారమైనది. వీటికి వీరశిలలని పేరు. కన్నడమున వీటిని వీరకల్లు లందురు. ఇటువంటి వీరుల శిలావిగ్రహములు కర్నూలు జిల్లాలోని త్రిపురాంతకములోను, కడపజిల్లాయందలి మోపూరులోను, గుంటూరుజిల్లాయందలి కారెంపూడి, మాచెర్లగ్రామములలోను, ఓరుగంటిలోను ఇంకను ననేక శైవక్షేత్రము లందును గాన్పించుచున్నవి.

క్రమముగా ఈ విగ్రహములకు గుడులు కట్టి వీరులను పూజించు నాచారము ప్రబలినది. వీరపురుషపూజ నిమిత్తము రాజప్రతినిధులు మొదలైనవారు భూదానముకూడ చేయుచుండిరి. ఈవిధమైన వీరపురుషపూజ కాకతీయుల పరిపాలనకాలమునందే క్రీస్తు శకము పదునాలుగవ శతాబ్ది నాటికే వాడుకలోనికి వచ్చినది. కట్టతెగిన మహాప్రవాహమువలె ఢిల్లీనుండి ఆంధ్రదేశముపై నెత్తివచ్చుచుండిన మహమ్మదీయ సైన్యము నెన్నో తడవలు కాకతి ప్రతాపరుద్రభూపతి యోడింపగలుగుటకు ఆనాడు దేశములో పొంగులు దేరుచుండిన వీరత్వమే కారణము.

వీరపురుషుడు తనుత్యాగము చేసిన దినమున నేఁటేట యుత్సవము జరుగుచుండెను. ఆ సందర్భమున నాత డే యుత్తమాశయార్థము, ఏ సత్కార్యము నిమిత్తము తనువు దొరంగెనో యా విషయ మంతయు జానపద గేయముగా విరచితమై పాడబడి చిరస్మరణీయముగ జేయబడుచుండెను. మ. సో. శ.

**వీరబ్రహ్మయోగి :** వీరు విజయనగర సామ్రాజ్య పతనానంతరము దేశము మహమ్మదీయాక్రాంత మైనప్పుడు పదునేడవ శతాబ్దపు టారంభమున ఆంధ్రదేశమున నవతరించిన కొలదిమంది సిద్ధపురుషులలో నొకరు; ఉపనిషత్తులకు నూతనభాష్యకర్తయై, హిందూ మహమ్మదీయ మతసామరస్యమునకును, నవసమాజ నిర్మాణమునకును రాజబాట వేసిరి.

వీరు అతిమానుషములగు మహిమలను ప్రదర్శించిరని చెప్పుదురు. మైసూరు రాష్ట్రములోని పాపఘ్ని మఠాధిపతులగు వీరపాపమ్మ, వీరభోజయాచార్య దంపతులు; శైశవముననే తల్లిని కోల్పోయిన వీరిని పెంచి యుపనయనాది సంస్కారముల నొనర్చినారు. ఆనాటి వీరి పేరు వీరనారాయణ. పిమ్మట దేశాటనకై బయలుదేరి బనగాన పల్లెలోని గరిమరెడ్డి అచ్చమ్మగారియింట పండ్రెండేండ్లుండి గోవులను కాయుచు, నాకాలమున నొక కొండ గుహలో గూర్చుండి కాలజ్ఞాన గ్రంథమును రచించుచు దానిని అన్నాజయ్య యను నొక బ్రాహ్మణ శిష్యున కుపదేశించు చుండువారు; తరువాత తన మహిమను గుర్తించిన అచ్చమ్మ, వెంకటరెడ్డి దంపతులకు మంత్రోపదేశము చేసిరి. అటుపిమ్మట వీరు అల్లాడపల్లెలో తామే చెక్కిన వీరభద్రస్వామి మూర్తి నొక దేవళమున ప్రతిష్ఠించి యా దేవునే గురువుగా భావించి కొంతకాలము లోకసంగ్రహమునకై యోగమార్గము ననుసంధించిరి; తరువాత కందిమల్లయపురమునకు వచ్చి కొన్ని మహిమలను జూపి గోవిందమ్మ యను కన్యను పెండ్లాడి గృహస్థాశ్రమము నిర్వహించిరి. వీరు జీవితాంతమువరకు గృహస్థుగానే యుండి, సన్న్యాసులకు దక్క అన్యులకు మోక్షములేదను మూఢ విశ్వాసము నున్మూలించిరి.

వీరు కందిమల్లయ్యపల్లిలో నున్నపుడే తమవద్ద శిష్యుడుగా చేరిన సిద్దప్ప యను మహమ్మదీయబాలునికి ఉపనిషత్తులను, యోగతత్త్వ మార్గములను బోధించిరి. వీరు కడప, కర్నూలు, సిద్ధవటము మున్నగు ప్రదేశములను పాలించుచుండిన నవాబులవద్ద కేగి మతసామరస్యబోధన చేసియు, మహిమలను బ్రదర్శించియు, వారిని శిష్యులుగా జేసికొని మత సమైక్యమునకు పునాదులువేసిరి. వీరు సిద్దప్ప కుపనిషద్బోధ చేయుటయు, మరికొందరు బ్రాహ్మణేతరులకు వేదాంతము బోధించుటయు పుష్పగిరి అగ్రహారికులకు, శంకరపీఠాధిపతులకు సహింపరానిదై వీరిని వాదమున కాహ్వానించిరి. వీరు వారితో సమరసవాదముచేసి, శంకరాచార్య మతోద్దేశమును తేటపరచి, గుణకర్మలను బట్టి యెవ్వడైనను తత్త్వవిద్యాధికారి కావచ్చునని వారికి నచ్చచెప్పిరి. గురుదేవుని యీ తత్త్వబోధకును, అతిలోక దివ్యమహిమలకును ముగ్ధులైన యగ్రహారికు లాయనను బ్రహ్మరథారూఢునిజేసి యూరేగించి పూజించిరి. ధానం జేసి వీరు 'పుష్పగిరి బ్రహ్మరథారూఢు' లను బిరుదము నందిరి. వీరు అస్పృశ్యతా నివారణమునకు కూడ ప్రచారము సల్పిరి. ఈ రీతిగా నన్నికులములును బాగుపడవలయునని వీరు చేసిన ప్రబోధప్రచారములు. వీరి తత్త్వ సారస్వతములో పొడగాంచగలము. వీరు శిష్యులనుండి భిక్షాదక్షిణలు వసూలుచేసి కుటుంబపోషణ మొనర్చుకొనన నిచ్చగింపక శిల్పవృత్తులగు కమ్మరమును, వడ్రంగమును జేసి గడించిన విత్తముతోనే యాదర్శ జీవితమును గడపిరి.

వీరు రచించిన కాలజ్ఞాన తత్త్వములు, గోవింద వాక్యము లను గేయములు చాల కలవు. సరళమగు జాను తెలుగులో రచించిన వీని ద్వారమునను, కందములు కందార్థముల ద్వారమునను వీరు వేదాంత సాహిత్యమును సర్వజన సాధారణము చేసిరి.

ఈ గురుని వేదాంతమును 'అచలమత' మని కొందరును, 'శివాద్వైత'మని కొందరును చెప్పుదురు. వీరి తత్త్వ సారస్వతమునుబట్టియు, వీరి ఆచరణమును బట్టియు, గురుశిష్య పరంపరనుబట్టియు చూడగా వీరిది అష్టాంగయోగముతో గూడిన మహావాక్య పర్యవసాయి యగు నద్వైత వేదాంతమార్గమని తెలియుచున్నది. ఈయన శిష్యప్రశిష్యులు పెక్కురు గృహస్థులే. ఈ యుపనిషదద్వైతము వాచా వేదాంతము మాత్రమే కాకుండుట కద్దానికి వీరు యోగ మార్గము ననుసంధించినారు. కావుననే వీరగురుదేమి, శిష్యుడు సిద్దప్పయేమి, శిష్య ప్రశిష్యులేమి పెక్కురు జీవత్సమాధినిష్ఠులై బ్రహ్మైక్యము నందినారు.

'బ్రహ్మక్షేత్ర'మని పేరుపొందిన కందిమల్లయపల్లిలోని బ్రహ్మముగారి మఠమువద్ద నేఁటికి వైశాఖ శుక్ల దశమినాడారాధనోత్సవమును, మహాశివరాత్రినాడు కల్యాణోత్సవములును నీ గురుమహాదేవునకు జరుగును. కొం.వీ.రా.

**వీరభద్రయ్య** (క్రీ.శ. 1741 - 1765): వీరు త్రైలింగ బ్రాహ్మణ గాయకులు; తెనుగున మంచి ప్రజ్ఞ కలవారు. ప్రతాపసింహ మహారాజు తంజావూరి నేలినప్పుడు రాజుగారి వితరణౌదార్యములను విని వారిని కలిసికొనగోరి పెణ్ణేటిగట్ట వచ్చి బహుదినములు వేచియుండిరట. వీరభద్రయ్యగారి యోగ్యతాగౌరవములను విని రాజు వీరి నివాసమునకే వచ్చి వీరి గానమాధుర్యమును గ్రోలి ఆనందించి తంజావూరికి పిలుచుకొనిపోయి యాదరించిరట. వీరు అనేక రక్తిరాగములలోను, దేశీయరాగములలోను బహుకీర్తనలు రచించిరి. ఇవి గాక ప్రతాపసింహమహారాజుమీద వీరు పదములు, తిల్లానలు మొదలైనవి అనేకములు విచిత్రగేయ కల్పనలతో రచించిరి. ద్వా. పా.

**వీరభద్రరావు, చిలుకూరి** (క్రీ. శ. 1872 - 1939): ఈయన ఆర్వేల నియోగి బ్రాహ్మణుడు; ఆపస్తంబ సూత్రుడు; వాధూల సగోత్రుడు; వీరరాజు, సీతమాంబల కేకైక పుత్రుడు; పశ్చిమ గోదావరిజిల్లా నరసాపురము

తాలూకాలోని పెనుమదమను గ్రామమున జన్మించెను. తరువాత తణుకు తాలూకాలోని రేలంగి గ్రామ మీయన స్వస్థలమయ్యెను. ఈయన క్రీ. శ. 1880 - 86 ల మధ్య తణుకులో విద్యాభ్యాసముచేసి సంస్కృతాంధ్ర భాషలలో పాండిత్యము సంపాదించెను. ఆ కాలమున కందుకూరి వీరేశలింగము పంతులు గావించు చుండిన సంఘ సంస్కరణ ప్రచారమును, సారస్వత ప్రచురణములును ఈయన జీవిత దృక్పథమును పూర్తిగ మార్చివేసెను.

1892 న వీరేశలింగకవి సంగ్రహ జీవితము వ్రాసి గ్రంథ విమర్శనమును గావించి, 'ఆంధ్ర ప్రకాశిక' యందొక వ్యాసమును ఈయన ప్రచురించెను; తర్వాత 1895 లో ఏలూరిలో 'దేశోపకారి' పత్రికకు సహాయ సంపాదకుడయ్యెను; 1896 లో 'విబుధరంజని' పత్రికా సంపాదకత్వమును వహించెను; 1897లో ముద్రాలయ మొకటి కొని దానికి విద్యాసాగరు నిపేరిడి, రెండేండ్లు 'దేశోపకారి' పత్రికను సొంతముగ ప్రచురించెను. ఇట్లు కొన్ని సంవత్సరములు ఏలూరులోను, బెజవాడలోను పత్రికా ప్రచురణమునందు గడిపి 1905 లో ఈయన రాజమహేంద్ర వరము చేరి వీరేశలింగముగారి 'చింతామణి' ముద్రణాలయమున కధికారియై 'సత్యవాదినీ' పత్రికా కార్యనిర్వాహకులలో నొకడయ్యెను.


చిత్రము 251.
చిలుకూరి వీరభద్రరావు

వీరేశలింగముగారితో నభిప్రాయభేదములు కలిగి వృత్తికి విరామ మేర్పడినను రాజమహేంద్రవరమునందే ఈయన యుండెను. ఇంతలో 'చింతామణి' ముద్రాలయము సత్యవోలు గున్నేశ్వరరావుగారి కమ్ముడుపోగా మరల దానికి ఈయన కార్యనిర్వాహకుడుగను, వారు స్థాపించిన 'ఆంధ్రకేసరి' పత్రికకు సంపాదకుడుగను ఏర్పడెను. దానంజేసి వీరభద్రరావు ద్విగుణీకృత ధైర్యోత్సాహములతో పత్రికా సంపాదకత్వమును వహించి, సంఘసంస్కరణ ప్రచారమును, సారస్వతసేవయు జేసి, ఆంధ్రదేశమునందు రాజకీయోద్యమము వృద్ధినొందుటకు ఈయన సహాయభూతుడయ్యెను.

ఈయన ఆంధ్రచరిత్ర రచనమే జీవితాదర్శముగా భావించి పత్రికా సంపాదకత్వమునకు స్వస్తిచెప్పి 1909 లో చెన్నపట్టణమునకు వెళ్ళి యచ్చట నాలుగేండ్లు గడిపి కొమర్రాజు వెంకట లక్ష్మణరావుగారి సాయముతో 'విజ్ఞాన చంద్రికా మండలి' వారి గ్రంథమాలలో 1910 లో 'ఆంధ్రుల చరిత్ర' ప్రథమభాగమును, 1912 లో ద్వితీయ భాగమును ప్రచురించి, ఆంధ్రులకు ఉత్తేజము గలిగించి ఆంధ్రోద్యమ మూలకారకులలో నొకడయ్యెను. 1916 లో ఆంధ్రుల చరిత్ర మూడవభాగమును ఈయన రాజమహేంద్రవరమున నెలకొల్పిన ఇతిహాస తరంగిణీగ్రంథమాలలో ప్రథమ కుసుమముగ ప్రచురించెను; కాకతీయాంధ్ర రాజయుగ చరిత్రమును ప్రత్యేకము ఆంధ్రుల చరిత్ర ఐదవ సంపుటముగ పలువురు చరిత్రాభిమానుల తోడ్పాటుతో స్వయముగ 1936 లో ప్రచురించి దానిని విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి సంపాదకులును, తన కాంధ్రచరిత్ర రచనావిధాన ప్రచురణములందు తోడ్పడినవారును అగు లక్ష్మణరావుగారికి కృతజ్ఞతతో నంకిత మిచ్చెను. ఈయన చారిత్రక పరిశోధన పరిజ్ఞానము, నిశిత నిర్ఘృణ విమర్శనా నైపుణ్యము, ఉద్రేకభూయిష్ఠ రచనావిధానము ఆంధ్రదేశ మెరింగిన విషయములు. 1928 లో సర్వేపల్లి రాధాకృష్ణగారి యాజమాన్యమున నంద్యాలలో జరిగిన ఆంధ్రమహాసభలో ఈయనకు 'ఆంధ్రచరిత్ర చతురానన' డను బిరుద మీయబడెను. ఈయన మొదట రచించిన చరిత్రగ్రంథము 'జీర్ణకర్ణాటరాజ్య చరిత్రము'. స్యూయల్ దొర రచించిన 'ఫర్గాటెన్ ఎంపైర్' అను గ్రంథము దీని కాదర్శము.

ఈయన ఆంధ్రుల చరిత్రమునే కాక కొన్ని చారిత్రక నవలలను, మహాపురుషుల జీవితచరిత్రములను గూడ రచించెను; 1913 లో భారతవీరుల చరిత్రమును రెండు భాగములుగ రచించెను; 1916 లో 'కర్ణసామ్రాజ్యము', 'నాయకురాలి దర్పము' అను చారిత్రక నవలలను బ్రచురించెను; 1917 - 18 లలో 'తిమ్మరుసు', 'తిక్కనసోమయాజి', 'శ్రీనాథకవి'; 1930 లో 'అళియరామరాయలు' అను జీవిత చరిత్రములను రచించెను; 1937 లో కల్లూరి వెంకటరామశాస్త్రులవారి జీవితచరిత్రమును వ్రాసెను.

జీవితాంతము వరకు భార్యాసమేతముగ ఈయన కొవ్వూరిలో తన యల్లుడు మామిడన్న సుబ్బారావుగారి గృహమునందే నివసించి వారి గృహముననే కీర్తిశేషుడయ్యెను.

కుం. ఈ. ద.

**వీరముష్టివారు :** వీరముష్టి, వీరభట, భద్రపాద మున్నగు పేర్లన్నియు నీ జాతికి చెల్లును. ముష్టి యనగా పిడికిలి. వీరులగు యోధు లనియు, వీర(శైవ) భిక్షుకు లనియు వీరముష్టివారి కర్థము చెప్పవచ్చును. వీరు కోమటులను, జంగములను యాచించుచు, వీరశైవమునకు

సంబంధించిన గేయములనో, భక్తుల కథలనో పాడుచు భిక్షమెత్తెదరు. వీరి వాద్య మొక జేగంట లేదా తప్పెట. కోమటులు వీరి నధికముగా నాదరింతురు. వీరు కోమటుల కిలవేల్పగు కన్యకామ్మవారి పాటలు పాడెదరు. కన్యకను చెరపట్టుటకై వచ్చునపుడు రాజరాజు సేనయందున్న వీరముష్టులను, అందలము మోయు వీరముష్టులను కావలెనని కొంత జాగు చేసిరట. కనుకనే కన్యకకును, ఆమె ననుగమించిన వారికిని అగ్నిప్రవేశమున కవకాశము కలిగినదట. వీరముష్టు లాలసింపనిచో రాజరాజు తొందరగా వచ్చి కన్యకను చెరపట్టెడువాడే. కనుకనే తమ జాతి గౌరవమును కాపాడి సాయమొనర్చిన



చిత్రము 252.
వీరముష్టి

వీరముష్టులన్న కోమటుల కింత యాదరము. వీరముష్టు లధికముగా పాడెడు పాట లన్నియు కన్యకా సంబంధములు. అయ్యలరాజు నారాయణామాత్యుడు వీరముష్టులను తడవియున్నాడు. వీరముష్టుల జన్మప్రకారమును గూర్చి యొక వింతకథ కలదు. తొల్లి వీరభద్రుడు దక్షాధ్వరధ్వంసము చేయునప్పు డాతని చెమటనుండి వీరు జన్మించిరట. వీరు 'ఖడ్గము'లనుకూడ చెప్పెదరు. వీరభద్ర, దీకుకు, విభూతి పిండాలవంటి వీరి గోత్రనామములు వీరి వీరశైవమును చెప్పక చెప్పును. వీరిలో కొందరు లింగధారులై జంగములుగా మారెదరు. వీరముష్టుల గురువులు ఆరాధ్య బ్రాహ్మణులు. వీరు ముత్యాలమ్మ, పోచమ్మ, మారెమ్మ వంటి దేవతలనుగూడ కొలిచెదరు.

వీరముష్టులందు కొందరు భక్తులు వీరశైవులవలె నారసములు గ్రుచ్చుకొనుట, నాల్కలు గోసికొనుటవంటి వీరభక్త్యాత్మక ప్రదర్శనము లొనర్తురు. విభూతిపండ్లు చేసి యమ్ముట, భిక్షమెత్తుట వీరి వృత్తి. వీరిలో లింగధారులు తక్క తక్కినవారు కల్లు త్రాగి మాంసము లారగింతురు. క్షురకర్మ వీరముష్టులకు పనికిరాదు. కనుక నొకప్పుడు సిక్కులవలె వీరముష్టులుకూడ వీరభటులుగా నుండిరని తెలియుచున్నది. స్త్రీలు చాప లల్లుట, పచ్చబొట్లు పొడుచుట వంటి పను లొనర్చెదరు. బ్రాహ్మణులు, కోమటులు, జంగములు, బలిజలు వండిన యన్నము దప్ప ఇతరుల చేతి కూడు వీ రొల్లరు.

బి. రా. రా.

**వీరరాజు, నడకుదుటి** (క్రీ. శ. 1871 - 1937): వీరి పూర్వుల నివాసమగు తూర్పుగోదావరిజిల్లా కాకినాడ తాలూకా శహాపుర గ్రామములో వీరు జనన మందిరి. తరువాత వీరు పిఠాపురములో స్థిరనివాస మేర్పరచుకొనిరి. వీ రార్వేల నియోగిశాఖకు జెందినవారు; కౌశిక సగోత్రులు; ఆపస్తంబసూత్రులు; తండ్రి రామన్నకవి; తల్లి సీతమ్మ.

వీరు సంస్కృతాంధ్రములలో మంచి పాండిత్యముగలవారు; బాల్యమునుండియు కవితా ప్రావీణ్యముగలవారు; ఏకసంథాగ్రాహులును; పిన్నవయసులోనే అష్టావధానము లొనర్చి పలువురి మన్ననల బడసిరి; గ్రంథ విమర్శనమునందును, శిలా తామ్ర శాసనపరిశీలనమునందును పరిశ్రమ చేసి 'విమర్శకాదర్శక' యని బిరుదు వడసిరి; విద్వజ్జన మనోరంజనీ ముద్రాక్షరశాలను స్థాపించి యనేక గ్రంథములను బ్రకటించిరి; భీముని పట్టణమున జరిగిన యాంధ్ర సాహిత్య పరిషద్వార్షికోత్సవమున కధ్యక్షత వహించిరి.



చిత్రము 253.
నడకుదుటి వీరరాజు

వీరు కొంతకాలము పురాణ గ్రంథమాలికా సంపాదకులుగా నుండి శివ, విష్ణు, బ్రహ్మ, వామనాది పురాణములను వచన రూపమున వెలయించిరి. (1) సకలజన మనోభిరంజనము, (2) వీర మహిమ, (3) విదురుడు, (4) విభ్రమ తరంగిణి, (5) విమర్శన తరంగిణి, (6) జానకీ పరిణయము (దీక్షిత కవిచంద్రుని సంస్కృత నాటకమునకు వచనరచన)- వీరి రచనలలో ముఖ్యములైనవి.

వీ రొకవంక గ్రంథరచన మొనర్చుచు, మరొకవంక నముద్రితములగు రచన లెన్నిటినో సంస్కరించియు, టీకలు వ్రాసియు బ్రకటించిరి. రాధామాధవము, ధర్మ

ఖండము (ఈదురుపల్లి భవానీశంకరకవి), ఏకాంత సేవా విలాసము (మద్దిరాల వెంకటరాయకవి), విష్ణుమాయా నాటకము (ఎల్లనార్యుడు) అట్టివానిలో ముఖ్యములు.

వీరు చక్కని పాండిత్యమును, ప్రతిభయు గలిగి యా నాటి పండిత విమర్శకులలో మంచి పేరుప్రతిష్ఠలు గడించిరి. వీరు స్వేచ్ఛాజీవులు ; జీవితాంతమును సారస్వత సేవ యొనర్చిన ధన్యాత్ములు. కొ. జో. శ.

**వీరేశలింగం, కందుకూరి** (క్రి. శ. 1848-1919): ఆంధ్రదేశమున నుద్భవించిన మహనీయులలో వీ రొకరు. స్త్రీ విద్యాభివృద్ధికిని, వితంతూద్ధరణమునకును, వాఙ్మయ సంవర్ధనమునకును, సంఘ సంస్కరణమునకును వీరు తమ జీవితము నంతను ధారవోసిరి.

వీరు రాజమహేంద్రవరమున పున్నమాంబా సుబ్రహ్మ ణ్యము లను పుణ్యదంపతుల కుదయించిరి. వీ రారువేల నియోగి బ్రాహ్మణశాఖీయులు; బాల్యమునుండియు విద్యా విషయమున మిక్కిలి ఆసక్తి ప్రదర్శించెడివారు. అందుచే వీరికి చిన్నతనముననే ఆంధ్రమందు చక్కని పాండిత్య మలవడెను. వీరు ఆంగ్లమున ప్రవేశ పరీక్షలో నుత్తీర్ణులైరి. అప్పటికే వీ రాంధ్రమున అనర్గళమైన కవిత చెప్పజాలి యుండుటేగాక జన మనోరంజకముగా ఉపన్యాసములు కూడ నీయజాలి యుండిరి. తాము హృదయపూర్వకముగ విశ్వసించినదాని నాచరించుటకు వీ రెప్పుడును వెనుదీసి యుండలేదు.

విద్యార్థి దశకు పిమ్మట వీరు తొలుదొల్త రాజ మహేంద్రవరముననను, పిదప ధవళేశ్వరముననను నుపాధ్యా యులుగా పనిచేసిరి. ఆదర్శ గురుపుంగవులై విద్యార్థులందు విజ్ఞానమునేకాక శీలమునుకూడ పెంపొందించుట కనేక విధముల వీరు తోడ్పడిరి. వీరు సంస్కారాభిలాష కలవా రగుటచే తమచుట్టునున్న సంఘమును, వాఙ్మయము నందలిలోపములను సవరించుటకు కృతనిశ్చయులైరి.

వీరి దృష్టిని మొదట నాకర్షించినది స్త్రీజన సమస్య. నాడు బాలవితంతువుల స్థితి మిక్కిలి విషాదకరముగా నుండెను. మరల వారు వివాహమాడుటకు సంఘ నియ మము లంగీకరింపకుండుటచే వారి జీవితము దుర్భరముగ నుండెను. వీ రిదుస్థితిని చూచి యంధకారబంధురములైన వారి జీవితాకాశముల ఆశాలోకరేఖల ప్రసరింపజేయ నుద్యమించిరి. ఈ విషయమున వీరు స్థాపించిన 'వివేక వర్ధని' యను మాసపత్రిక అనేక విధముల తోడ్పడెను. 1876 లో వీరు ధవళేశ్వరమునుండి మరల బదిలీయై వచ్చి నప్పటినుండియు వీరి సంస్కారోద్యమమునకు రాజ మహేంద్రవరము కేంద్రమయ్యెను. వీరు శ్రుతిస్మృతి పురాణములనుండి ప్రమాణముల నొసంగుచు వితంతూ ద్వాహముల సామంజస్యమును గూర్చి యుపన్యాసము లొసంగ నారంభించిరి. సనాతన మత సంప్రదాయానుసారు లగు పండితులు వీరి యభిప్రాయములను దీవ్రముగ ఖండింపదొడగిరి. వారి ఖండనము లన్నిటికి సయుక్తికము లైన సమాధానములొసంగుచు వీరు తమ వాదబలముచే వారిలో గొందరిని తమవైపునకు త్రిప్పుకొనజాలిరి. 1881 లో వీరు పలువురు పెద్దల సమక్షమున రెండు వితంతూద్వాహములు జరిపించి వారి మన్ననలు గడించిరి. అప్పటినుండి ఇతరులుగూడ ధైర్యము వహించి వితంతూ ద్వాహములు చేయదొడంగిరి. వీరు రాజమహేంద్రవర మున 'వితంతుశరణాలయము'ను స్థాపించి దానికి ముప్పది వేల రూప్యములను విరాళమొసంగిరి. ఈ విధముగ నసాథ లైన వితంతువులకు వీ రొనర్చిన యుపకార మింతింతని చెప్ప నలవికాదు.

వితంతూద్ధరణముతో పంతులుగారు స్త్రీజన సమస్యను విడువక స్త్రీలుకూడ విద్యావంతురాండ్రైనగాని సంఘము నిజమైన యౌన్నత్య మును బడయజాలదని, స్త్రీలకు విద్యా విజ్ఞాన వికాసము లొసంగి వారికి సద్వర్తనమును, సౌశీల్యము నలవర చుట విద్యాధికుల కర్తవ్యమని వివేక వర్ధనియందు పలువ్యా సములు వ్రాయుచు వీరు ప్రచారము సాగిం చిరి. స్త్రీ విద్యా విము ఖులగు పలువురు పెద్ద లతో వీరు వాదించి వారిచేతనే స్త్రీవిద్య బహుళ ప్రయోజనకారియని యొప్పించి కొందరి తోడ్పాటుతో ధవళేశ్వరమున నొక బాలికా పాఠశాల స్థాపించిరి. వీ రీవిధముగా స్త్రీవిద్యా విషయమున గావించిన కృషి క్రమక్రమముగా ఫలించి ప్రతి గ్రామమునందును, ప్రతి పట్టణమునందును బాలికా పాఠశాలలు వెలసినవి.



చిత్రము 254.
కందుకూరి వీరేశలింగం

వీరు దురాచారములను ఖండించుటలోను, దోషమని తోచినదానిని నిర్భయముగ వ్యక్తము చేయుటలోను వీరు వారు అనక చూపిన ధైర్య మనన్య సామాన్యమైనది. వీరి సంఘసంస్కరణ పరాయణతకు మెచ్చి క్రి. శ. 1893 లో

ప్రభుత్వమువారు వీరికి 'రావు బహద్దరు' బిరుదము నొసంగిరి.

వీరు సాంఘిక రంగముననే కాక సారస్వత రంగమున కూడ పెక్కు సంస్కారము లొనర్చి, నూతన రీతులకు మార్గదర్శకులై యఖండమైన కీర్తి నార్జించిరి. వీ రాంగ్ల భాషను కూడ బాగుగా నభ్యసించిన వారగుటచే నం దుండిన యుదాత్త ప్రక్రియ లన్నియు పరిశీలించి వాని నాంధ్ర వాఙ్మయమున ప్రవేశపెట్టుటకు యత్నించిరి. తొలుదొల్త వీ రితర పండితులవలెనే సంప్రదాయ సిద్ధమైన ప్రబంధ పద్ధతియందే ఎక్కువ మక్కువచూపిరి. 'శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధము' మున్నగు వీరి రచన లిందుకు తార్కాణము. కాని పరిశీలనపై శబ్దచిత్రముల తోడను, ప్రౌఢ సమాసములతోడను గూడిన ప్రబంధాదుల వలన సామాన్య జనుల కంత మేలు చేకూర దనియు, సరళ సుందరమైన వచనమే బహుళ ప్రయోజనకరము కాగల దనియు, నెంచి వీరు ఎక్కువగా వచన రచనలు కావింప నారంభించిరి. తమ కవ్యవహిత పూర్వము వెలసిన కావ్య వాఙ్మయము ప్రతిభా రహితమును, అనుకరణ ప్రాయమునై అనుప్రాస యమకాది శబ్దాలంకారములతో గూడి నిర్జీవమైయుండుట గాంచి వీరు 'సరస్వతీనారదసంవాద'మను ఖండకావ్యమున నా డాంధ్ర సరస్వతి పొందుచుండిన దురవస్థ నెంతో విశదముగ వర్ణించిరి. వీరి దృష్టి ప్రబంధపద్ధతినుండి మరల వచన మార్గమున ప్రవర్తిల్లుట కది కూడ కారణమైనది.

వచన రచనలో మొదట పరవస్తు చిన్నయసూరిగారి పద్ధతి ననుసరించి వీరు 'సంధి - విగ్రహము'లను రచించిరి. కాని తద్రచన వీరికి తరువాత నచ్చలేదు. అట్టి రచనలు కూడ ప్రౌఢ సుందరములే యయ్యు సామాన్యజనుల కర్థమగునవి కాక పోవుట వలన వీ రప్పటినుండి స్పష్టభావములును, విషయ ప్రధానములును, విజ్ఞాన ప్రదములును, సర్వజన సుబోధములునైన సరళ రచనలు చేయ నారంభించి యం దనన్య లభ్యమైన పరిణతి నార్జించి, 'గద్య తిక్కన'యను సార్థకనామము బడసిరి.

వీరు గద్యరంగమున త్రొక్కిన వాఙ్మయమార్గములలో నవల, స్వీయచరిత్ర, వ్యాసము, విమర్శ, శాస్త్రము ముఖ్యమైనవి. వీ రాంగ్లమున 'గోల్డుస్మిత్' కవివరుడు రచించిన 'వికార్ ఆఫ్ వేక్‌ఫీల్డు' అను నవల ననుసరించి 'రాజశేఖరచరిత్ర'యను పేర నొక సాంఘిక నవల రచించిరి. ఆంధ్రమున వెలసిన మొట్టమొదటి నవలయయ్యు నది తరువాతివాని కేవిధముగను తీసిపోకుండ నుండుట వీరి ప్రతిభావిశేషమునకు తార్కాణము. ఇట్లే వీరు 'గలివర్సు ట్రావెల్సు' అను ఆంగ్ల గ్రంథము ననుసరించి 'సత్యరాజా పూర్వదేశ యాత్ర'లను హాస్యరస ప్రధానమైన ఆక్షేపక గ్రంథమును రచించిరి. ఇది కూడ రాజశేఖర చరిత్రవలెనే ఆంధ్రసంఘమునందలి పూర్వాచార పరాయణుల మూఢాచార విశ్వాసములను అవహేళన చేయుటకు వ్రాసినదే. ఈ రెండు గ్రంథములు నాంగ్ల గ్రంథములకు ఛాయలని చెప్పవలసి యున్నను స్వతంత్ర గ్రంథములవలె నొప్పి తరువాతివా రెందరికో మార్గదర్శకములు కాజాలినవి.

ఆంధ్రమున మొదటి నవలను వలెనే మొదటి జీవిత చరిత్రను గూడ వీరే రచించియుండిరి. 'విక్టోరియా మహారాజ్ఞి చరిత్రము', 'జీసస్ చరిత్రము' అనునవి వీరు రచించిన జీవిత చరిత్రములు. తరువాత స్వీయచరిత్రను 1910 లో వెలువరించి యుండిరి. ఇందు వీరు తమ బాల్యము నుండియు జరిగిన విశేషము లెన్నియో, సూక్ష్మాంశములను గూడ విడువక చక్కగా వివరించియుండిరి. ఇది అపూర్వమైన వీరి మేధా విశేషమునకు నిదర్శనము.

వీరు సంస్కరణాభిలాషు లగుటచే తమ యభిప్రాయములను ప్రచారము చేయుటకై సారస్వతమును సాధనముగా గ్రహించిరి. వీరి ప్రహసనములు పెక్కుప్రయోజనమునకై వ్రాయబడినట్టివే. ఆంధ్రమున ప్రహసనములు రచించుటలో కూడ వీరే ప్రథములు.

వీరు తమ జీవితకాలమున ఏకేశ్వరోపాసనము, బాల్య వివాహములు, వితంతూద్వాహములు, విగ్రహారాధనము మున్నగు విషయములనుగూర్చి పలుచోట్ల హృద్యములైన యుపన్యాసము లొసంగియుండిరి. ఆ యుపన్యాసము లన్నియు వ్యాసముల రూపమున ముద్రితములైయున్నవి. ఈ వ్యాసములు పంతులుగారి విజ్ఞానమునకును, స్వమత ప్రతిష్ఠాపన, పరమత ఖండనములకును, శక్తిమంతమైన శైలికిని దృష్టాంతములు.

వాఙ్మయవిమర్శ పంతులుగారికి వెన్నతోపెట్టిన విద్య; పరిశోధనమన్న వీరి కెంతయో ప్రీతి. అందుచేతనే వీరు తమనాటి కముద్రితములైన తాళపత్రగ్రంథముల నెన్నిటినో పరిశీలించి పరిష్కరించి ముద్రించియుండిరి.

వీరి రచనలలోనికెల్ల మిక్కిలి యుదాత్తమును, శాశ్వతము నైనది వీరి 'కవుల చరిత్ర'; నన్నయమొదలు తమనాటి వరకుగల కవుల చరిత్రలను, వారికాలములను, వారు రచించిన గ్రంథముల పౌర్వాపర్యమును, శాసనాద్యాధారములతో నిర్ణయించి మూడు భాగములుగా వెలయించిరి. కవిచరిత్ర పరిశోధకుల కిప్పటికి నదే యాధారగ్రంథమని చెప్పినచో దాని ప్రాశస్త్యమును వేర చెప్పనక్కర యుండదు.

తెలుగున శాస్త్రగ్రంథములు వ్రాసినవారిలో కూడ వీరే మొదటివారు. వీరు 'తర్క సంగ్రహము'ను తేట తెనుగున వెలయించిరి; జ్యోతిశ్శాస్త్ర, శరీరశాస్త్రాది గ్రంథములను సంగ్రహముగా రచించియుండిరి. ఈ విధముగా వచన రంగమున నొక్క చిన్నకథ తప్ప పంతులుగారు చేయివేయని ప్రక్రియ మరేదియు లేదని చెప్పవచ్చును.

'కావ్యేషు నాటకం రమ్య'మ్మను విషయము నెరింగినవారయ్యు పూర్వాంధ్ర కవు లెవ్వరును ఆంధ్రమున నాటక రచనకు పూనుకొని యుండలేదు. అదిగాక సంస్కృత నాటకముల ననువదింపబూనియు వారు వానిని నాటక రూపమునగాక ప్రబంధరూపమున ననువదించియుండిరి. పందొమ్మిదవ శతాబ్ది నడుమ సంస్కృతనాటకాంధ్రీకరణములు సాగువరకును తెలుగున నిజమైన నాటకము లేదనియే చెప్పవచ్చును.

పంతులుగారుకూడ నాటకరచనకు పూనుకొని తొలుత కాళిదాసుని 'అభిజ్ఞానశాకుంతలము' నాంధ్రీకరించిరి. తరువాత నీ నాటకరాజమున కనేకాంధ్రీకరణములు వెలసినను వాని యన్నిటిలోగూడ వీరి యనువాదమే మిన్నయై నేటికిని పండితుల మన్ననలు పడయుచున్నది. తరువాత వీరు ప్రబోధచంద్రోదయము, మాళవికాగ్నిమిత్రము, రత్నావళి మొదలగు నితర సంస్కృతనాటకములనుగూడ చక్కగా తెనిగించిరి. చమత్కారరత్నావళి, కల్యాణకల్పవల్లి, వెనీసువర్తకోదంతము, రాగమంజరి మొదలైనవి యాంగ్లనాటకములకు వీరు చేసిన యనువాదములు. ప్రహ్లాద, దక్షిణగోగ్రహణము మున్నగునవి వీరి స్వతంత్రనాటకములు.

ఈ విధముగా పంతులుగా రాంధ్ర వాఙ్మయమునకు చేసిన సేవ అపారమైనది. వీరు రచించిన గ్రంథములు నూటయిరువదికి పైగా నున్నవి. అందలి వైవిధ్యమువీరి ప్రతిభకును, విజ్ఞానమునకును ప్రబల నిదర్శనము. వీరి శైలి సరళమై సుందరమై, నిర్దుష్టమై, సర్వజన సుబోధమై ఎడనెడ హాస్యరసమున కాకరమై మిక్కిలి హృద్యముగా నుండును. ఆధునికులలో నింత వైవిధ్యమును, విజ్ఞానమును ప్రదర్శించినవా రెందరో లేరు. దుర్బల శరీరులును, అనారోగ్యవంతులు నయ్యు ఇట్లు సాంఘిక సాహిత్యరంగములందు విశేషకృషి సల్పి వీరు నూతన యుగప్రవర్తకులై చిరకీర్తి గడించిరి. వీరు కార్యశూరులు; తమ సర్వస్వము లోకమునకై దానముచేసిన మహాత్యాగులు. రాజమహేంద్రవరమునందలి వీరేశలింగోన్నత పాఠశాల వీరి త్యాగమున కెత్తిన శాశ్వతమైన వైజయంతిక. ది. వేం.

**వెంకట అప్పారావు, గుండవరము** (క్రీ.శ. 1886-1950): ఈయన గుంటూరు మండలమున వినుకొండ తాలూకా ముప్పాళ్ళ గ్రామమున జననమందెను. ఈయన తండ్రి కృష్ణయ్య; తల్లి సీతమ్మ. ఈయన చిన్నతనమున అల్లరి చేయుచు చదువు నొల్లక పండ్రెండవయేట ఇంటి నుండి పారిపోయి మచిలీపట్టణము చేరి అచట నొక యైంద్రజాలికునియొద్ద నుద్యోగము చేయుచు విలువిద్య నేర్చుకొనెను; లక్ష్యశుద్ధిని సాధించెను; ఇతరులు ప్రయోగించిన బాణములను అర్ధచంద్ర బాణములతో ఖండింప నేర్చెను; విలువిద్యయందు మంచినేర్పు కలిగినతరువాత స్వతంత్రముగా నా పట్టణమునందే యస్త్రవిద్యా కౌశలమును ప్రదర్శించుచుండెను.

అనంతర మీయన పూనాలోని ధనుర్విద్యా విశారదుడగు షా అనునాతనితో కలిసి అద్భుతముగా అస్త్ర ప్రయోగములను పెక్కింటిని కావించుచుండెను. కోడి రామమూర్తినాయుడితో గూడ జేరి అస్త్రవిద్యా నైపుణ్యమును ప్రకటించు చుండెను. ఈయన శబ్దభేది బాణ ప్రయోగము, మత్స్య యంత్రమును కొట్టుట, సప్తతాళములను ఛేదించుట మున్నగువానివంటి పురాణప్రసిద్ధములైన వివిధాస్త్రప్రయోగ ప్రక్రియలద్వారా తమ విలువిద్యయందలి సామర్థ్యమును ప్రకటించుచు 'కలియుగార్జును'డను పేరుతో ప్రసిద్ధిగాంచెను.

1947 లో దృష్టిమాంద్యము కలిగిన పిదపగూడ నిర్దిష్ట లక్ష్యమును ఛేదించి యీయన తిరుపతి వెంకటకవులచే—

'తప్పి చనకుండ లక్ష్యభేదన మొనర్పఁ
జాలుకృతహస్తు లిర్వురు జగతిఁ గలరు;
పంక్తికంఠకంఠచ్ఛిద ప్రవణుఁడైన
రాఘవుం డొక్కరుం డప్పరాయఁ డొకఁడు'

అని చాల మెప్పుపొందెను. రాయప్రోలు సుబ్బారాయ కవియు నీయననుగూర్చి తన జడకుచ్చులలో హెచ్చుగా ముచ్చటించెను.

'వందేమాతరం' ఉద్యమదినములలో ఈయన ధనుర్విద్యా విశారదత్వ ఫలముగ ప్రభుత్వమునకు విరోధివర్గము వాడని నిర్బంధింపబడి కారాగారమున నుంచబడెను. ఇందుమూలమున నీయనకు మతి చెడుటయు నయినది. పోలీసువా రప్పటినుండి యీయన నొకకంట కనిపెట్టుచునే యుండిరి. చివరిదినములలో ఈయన దైన్యముపాలయి 1950 లో శరీరము చాలించెను. అపుడీయన వయస్సు అరువది నాలుగేండ్లు. గ. సు.

**వెంకట అప్పారావు, గురుజాడ** (క్రీ. శ. 1861 - 1915): ఈయన ఎలమంచిలి తాలూకా రాయవరం

గ్రామంలో జన్మించినాడు; బాల్యదశలో విద్యాభ్యాసమంతా చీపురుపల్లిలో జరిగింది; తరువాత కొన్నాళ్ళకు విజయనగర కళాశాలలో పట్టభద్రుడై ఆ విద్యాసంస్థలోనే కొంత కాలం ఉపన్యాసకుడుగా పనిచేశాడు; అదే కాలంలో విజయనగర ప్రభువైన ఆనందగజపతి సంస్థానంలో ప్రాచీనలిపిపరిశీలకుడుగా వ్యవహరిస్తూ తెనుగుభాషా స్వరూపాన్ని బహుముఖంగా పరిశోధించి తన రచనా పద్ధతి కనుకూలంగా తెనుగు పలుకుబడిని మలుచుకోగలిగాడు. కాని ఈ కృషి కేవలం భాషా విషయకమే కాదు; లోకవృత్తానికి సన్నిహితమైన అనుభవం కూడా దీనిలో మిళితమైంది. లోకవృత్తానికి దగ్గరగాఉన్న వస్తువునూ, లోకవ్యవహారానికి చేరువగా ఉన్న జీవద్భాషా ప్రయోగాన్నీ రమ్యంగా మేళవించడంలోనే ఇతని రచనా విశిష్టత స్పష్టమౌతుంది.

ఈయన ఎంతో విరివిగా అన్ని సాహిత్య రంగాలలోను చిరస్మరణీయంగా కృషి సాగింప నారంభించిన సమయంలో భాషలోనే కాక తత్త్వాన్వేషణ క్రమంలో కూడా అవ్యవస్థ ప్రబలంగా ఉండేది. అందువల్ల తన భావ వైలక్షణ్యానికి అనుకూలించే భాషా రూపాన్ని గూడా ఈయన కల్పించుకోవలసి వచ్చింది. సమకాలికులైన ఇతర రచయితల వలెనే మొదటి దశలో అప్పారావు కూడ పాత పద్ధతిలో కృషిసాగించినట్లు నిదర్శనా లున్నవి. తన ప్రత్యేక రచనా పద్ధతిలోనే వైశిష్ట్యం పరిణతమైన తరువాత మిగిలిన కొద్ది వ్యవధిలోనే నాటకం, కథ, ఖండకావ్యం మొదలైన వివిధ వాఙ్మయ రూపాలలో నేటికీ మరువరాని ఖండాలను ఈయన మనకు ప్రసాదించాడు.



చిత్రము 255.
గురుజాడ వెంకట అప్పారావు

ఇతని రచనల్లో ప్రధానమైనవి: నాటకాల్లో కన్యాశుల్కం; ఖండకావ్యాల్లో పూర్ణమ్మ, కన్యక, లవణరాజుకల మొదలైన కథాగేయాలు. 'దేశమును ప్రేమించుమన్నా', 'లంగరెత్తుము' మొదలైనవి మరికొన్ని దేశిచ్ఛందోరచనలు. కథానికలు - 'నీ పే రేమిటి?', 'మెటిల్డా', 'సంస్కర్త హృదయం' మొదలైనవి. ఇవి కాక, 'కొండుభట్టీయం', 'బిల్హణీయం' మొదలైన కొన్ని అసంపూర్ణ రచనలూ, వాదప్రధానాలైన వ్యాసాలూ, దినచర్యావృత్తాంతాలు.

తన సమకాలికులపైన అల్పంగాను, తరువాతివారిపైన ఎక్కువగాను ఈయన ప్రభావం రెండు విధాలుగా కనిపిస్తుంది. తెలుగు కవితా సంప్రదాయంలో చిరకాలం నుంచి కనిపించే సంస్కృత వృత్తానుకరణంగాని, కథా కావ్యగ్రథనంలోకూడా వృత్తవైవిధ్యాన్ని పాటించడంగాని ఈయన రచనలో ఎక్కడా కన్పించవు. ఈయన కథాగేయాలు ధారావాహికంగా ఒకే వృత్తంలో శిష్ట వ్యవహారానికి చేరువగా ఉండే జీవద్భాషలో దేశిచ్ఛందస్సులలో నడచినవి. ఇంకోవైపున ఉదాత్త భావోన్మీలనానికి అనువైన వస్తువును గ్రహించి అన్యభాషలలోని ఏ ఉత్తమ నాటకానికీ తీసిపోని, శక్తిమంతములైన సంభాషణలు తెలుగు వాడుకభాషలోకూడ రచించడం సాధ్యమని నిరూపించిన వారిలో ఈయన అగ్రగణ్యుడు. ఈ దృష్టితో చూస్తే 'కన్యాశుల్కం' అనన్యసామాన్యమైన రూపకభేదం అనవచ్చును. మన కింతవరకు పరిచితమైన ప్రాచీన రూపకలక్షణాలతో సరిపోయే త్రివిధైక్యాలుగాని, సంధి సంధ్యంగాలు కాని ఇందులో కన్పించవు. రంగ బాహుళ్యంలోను, నానావిధపాత్రచిత్రణలోను, ప్రయోగ యోగ్యతలోను కొరవడిందని భావించడానికి కొంత అవకాశం ఉన్నా, భవిష్య దాంధ్రనాటక పురోగమనానికీ, పటిష్ఠమైన నాటకీయ సంభాషణకూ కన్యాశుల్కం మార్గదర్శకమయిందని ఒప్పుకోక తప్పదు.

నవ్యాంధ్ర సాహిత్య ప్రవర్తకుడుగా గురుజాడ రచనలలో ఇం కొక అపూర్వమైన ధోరణి విస్పష్టంగా కనిపిస్తుంది. 'లోకా స్సమస్తా స్సుఖినో భవన్తు' అనే ఉదాత్త భావాన్ని ఆరాధించే ఈ భారత భూభాగాన్ని మాతృత్వారోపణ చేసి 'భారతమాత'గా భావించడం జాతీయోద్యమ ఫలితంగా వచ్చింది. ఈభావం అనేక వక్రగతులలో విస్తృతమై ప్రాంతీయ దురభిమానాన్ని ప్రతిబింబించే రచనలు జరిగే సమయంలో ఈయన 'దేశమంటే మట్టి కాదోయ్, దేశమంటే మనుషులోయ్' అనీ, 'దేశమును ప్రేమించుమన్నా, మంచి అన్నది పెంచుమన్నా' అనీ విశ్వశ్రేయఃపరంగా గానం చేశాడు.

తెలుగుభాషా సాహిత్యాలలో దాదాపు అర్ధశతాబ్దం పాటు అవిరళంగా కృషిచేసి, తను కన్నవీ, విన్నవీ, అనుభవించినవీ ఎన్నో సన్నివేశాలను సమ్యగ్దృష్టితో తన రచనలలో ప్రతిఫలింపచేసి, తన స్థాయిని అందుకోలేని సమాజంలో ఆందోళన పడుతూ కూడా సహజమైన సౌజన్యాన్ని

గాని, స్వారస్యాన్నిగాని కోల్పోని మొక్కవోని దీక్షతో తన సాహితీ లక్ష్మిసాధనకోసం తపించిన మహాపురుషుడు ఈయన. అ. రా. కృ.

**వెంకట అప్పారావు, బసవరాజు** (క్రీ. శ. 1894-1933): గడచిన నూరేళ్ళ తెలుగు వాఙ్మయ పురోగమనంలో కొన్ని కొన్ని గుర్తించదగిన కొత్తపోకడలు లేకపోలేదు. ఇందులో ప్రధానమైనది వీరేశలింగంపంతులు గారు ప్రవర్తింపజేసిన సాహిత్యోద్యమం. లోకవృత్తానికి సన్నిహితంగా ఉండడం అనేది ఇందులో చెప్పుకోదగిన లక్షణం. తెలుగు సామాజిక వ్యవస్థలో శ్రేయోదాయకమైన సంచలనాన్ని కలిగించడమే ప్రథమలక్ష్యంగాను, సాహిత్యకృషి దానికి ఉపాంగంగాను ఈ ఉద్యమం గ్రహించింది. అందువల్ల పరిపుష్టమై, పరిణతమైన సాహిత్యరూపం ఈ కృషిలోనుంచి ఆవిష్కృతం కాకపోయినా సజీవమైన సాహిత్య సృష్టికి సుస్థిరమైన ఆలంబం చేకూరింది. ఇంచుమించు ఈ మార్గాన్నే అనుసరించిన గురుజాడ అప్పారావు గారి రచనలలో సాహిత్యానికే ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వడంవల్ల లక్ష్యభూతాలైన వాఙ్మయ రూపాలు కొన్ని మనకు లభించినవి. కాని విధిదుర్విపాకంవలన ఈ మహోద్యమం అనతి కాలంలోనే శుష్కించి భిన్న ప్రవృత్తులు గల అనేక మార్గాంతరాలు ఏర్పడడం తటస్థించింది. ఉద్యమ ప్రవర్తకుల శక్తి ఎంత సన్నగిల్లినా, మార్గాంతరాల ప్రభావంకూడా అంతో ఇంతో కలసినా బసవరాజు అప్పారావు గురుజాడ కోవకు చెందిన తుది రచయితగా భావించవలసి ఉంటుంది.



చిత్రము 256.
బసవరాజు
వెంకట అప్పారావు

బెజవాడకు సమీపంగా ఉన్న పటమట గ్రామంలో బసవరాజు అప్పారావు జన్మించాడు. చాలా చిన్నవయసులోనే తల్లి చనిపోవడంవల్ల మేనమామలైన గోవింద రాజులవారి ఇంటనే ఇతని బాల్యం గడిచింది. బెజవాడ క్రైస్తవ ఉన్నతపాఠశాలలో 1912 వ సంవత్సరంలో స్కూల్ ఫైనల్ పరీక్షలో ఉత్తీర్ణుడై తరువాత ఇతడు చెన్నపట్టణం రాజధాని కళాశాలలో చేరి 1916 వ సంవత్సరంలో పట్టభద్రుడయాడు; అటు తరువాత 5, 6 ఏళ్ళ పాటు ఆంధ్ర పత్రికకు, కొన్నాళ్లు భారతికి సహాయ సంపాదకుడుగా పనిచేశాడు; ఆపైన చెన్నపట్టణంలో న్యాయ కళాశాలలో చేరి, 1926 లో బి. యల్. పట్టం పొందాడు. వెంటనే బెజవాడలో న్యాయవాది వృత్తిలో ప్రవేశించినా, అప్పటికే జీవితాన్ని సాహిత్యోన్ముఖం చేసుకోవడంవల్ల న్యాయవాదిగా కృతకృత్యుడు కాలేకపోయాడు; 1932 లో తన చిత్తవృత్తి కనుకూలించే ఉద్యోగం సంపాదించేనిమిత్తం ఢిల్లీకి వెళ్ళి కొద్ది రోజులలోనే అక్కడ చిత్తవైకల్యాన్ని పొంది ఆ వెంటనే బెజవాడ తిరిగివచ్చి తన 39 వ ఏట జీవితం చాలించాడు.

అప్పారావు మధురమైన కంఠస్వరం గల గాయకుడు. 'నోట పలికే దంత పాటగా మోగేను' అనే చరణం కవితా రచనలో ఈతని లక్ష్యాన్ని ద్యోతకం చేస్తుంది. గురుజాడ రచనలంటే ఇతనికి, ఇతని సహాధ్యాయులు కొందరికి అనల్పమైన ప్రీతి ఉండేది. ఆ ప్రభావం వల్లనే ఇతని కవిత్వం అంతా దేశిచ్ఛందో రూపాలతో, ముఖ్యంగా గానయోగ్యమైన నడకతో నడచింది. 'రొమాంటిక్కులు' మని చెప్పుకునే ఇతర సమకాలిక కవులవలె కాక ఇతని కావ్యభాష లోక వ్యవహారానికి చాల చేరువగా సాగి కొంతవరకు జనామోదాన్ని పొందగలిగింది. ఇతడు గురుజాడ అడుగుజాడలలోనే నడవదలచినా, 'లోకము నను మోసగించె, నాకము నన్నీసడించె' వంటి చరణాలలో మానవహృదయోద్వేగాన్ని రమ్యంగాచిత్రించడానికి ప్రయత్నించినా, తమ సమకాలికుల ప్రభావంవల్ల 'లోకముతో మన కేటికి? లోలాక్షీ! రా పోదము' అనే కర్తవ్యతాపరాఙ్ముఖత్వాన్ని ధ్వనింపజేసే రచనకూడా చేశాడు.

అప్పారావు పద్య రచనలలో ముఖ్యమైనవి అతని జీవితకాలంలోనే ప్రచురించిన 'సెలయేటి గానము', మరణానంతరము స్మృతి ముద్రణగా వెలువడిన 'బసవరాజు అప్పారావు గీతములు' అనే పద్య సంకలనం. 'వాయు సందేశం' అనే అముద్రిత కావ్యంలోని భాగాలుకూడా చాలావరకు ఈ స్మృతి ముద్రణంలో ఉన్నవి. ఇతని 'ఆంధ్రకవిత్వ చరిత్ర' వావిళ్ళవారిచే ముద్రితమైంది. 'ఆంధ్రరత్న చరిత్ర', 'అరేబియన్ నైట్ కథలు' అముద్రితముగానే ఉండిపోయినవి.

అప్పారావు 'ఎంకిపాటల గాలి దుమారం' మొదలైన వ్యాసాలద్వారా నిశితమైన సాహిత్య విమర్శకుడుగా కూడా ఎన్నికగన్నవాడు. అ. రా. కృ.

**వెంకటకవి, గోపీనాథము** (క్రీ. శ. 1820-1890): వీరు నెల్లూరు జిల్లా కావలి తాలూకా లక్ష్మీపుర గ్రామ వాస్తవ్యులు; వెలనాటి వైదికులు; కౌండిన్య గోత్రులు; తమ పదునారవయేట వేదగిరియందు నొక మహాయోగి

వలన కవిత్వవిద్యను బడసి ప్రథమమున రామాయణమును పద్యకావ్యముగా రచించిరి. దీనినే గోపీనాథరామాయణ మందురు. ఇది వాల్మీకిరామాయణముననుసరించియున్నది. ఇందలి రచనయు రసవంతమై, ప్రాచీనకవిత్వమును దల పించుచుండును. కవి దీనిని 1859 సంవత్సరమున బూర్తి గావింపగా నీయుదంతము నప్పటి వెంకటగిరి ప్రభు వైన సర్వజ్ఞ కుమార యాచేంద్రుడు విని, కవిని రప్పించి సన్మానించి, గ్రంథమును ముద్రించి ప్రకటింప జేసెను. ఆపై నా మహారాజు నాజ్ఞచేత వీరు బ్రహ్మకైవర్త పురాణములోని కృష్ణజన్మ ఖండమును పద్యకావ్యముగా రచించిరి; ఆవెనుక 'రాధికాపరిణయ' మను ప్రబంధమును, బ్రహ్మానంద శతకమును (ఇది కామశాస్త్ర విషయికము), భగవద్గీతను రచియించిరి. వీరి గ్రంథము లన్నియు ముద్రితములైనవి. వెంకటగిరి ప్రభు వెంతగా తమ్ము సంభావించినను వీరు తమ కృతు లన్నిటిని శ్రీకృష్ణభగవానునకు కృతి యొసంగి జీవయాత్ర గడపిన ధన్యులు. వీ రధునాతనులే యైనను కవితాప్రతిభచేత ప్రాక్తన పురాణ ప్రబంధ కవులతో తుల్యత గడించిన కవితల్లజులు. ని. వెం. రా.



చిత్రము 257.
గోపీనాథం వెంకటకవి

**వెంకటకృష్ణరావు, భావరాజు** (క్రీ. శ. 1895 - 1957) : రాజమహేంద్రవరమున కృష్ణరావుగారు జన్మించిరి. వీరి తండ్రి బాపిరాజు పంతులు; తల్లి శ్యామలాంబ. కృష్ణరావుగారి 15వ యేటనే తండ్రిగారు పరమపదించిరి.

వీరి ప్రైమరీ విద్యార్థిదశ కైకలూరునందు, చిన్న తరగతులు బందరునందు జరిగెను. వీరు బందరు నోబుల్ కాలేజీలో 1912 లో స్కూలు ఫైనల్ చదివి, ఇంటర్మీడియేటు విశాఖపట్టణంలోను, బి. ఏ. మద్రాసులోను చదివి పూర్తిచేసిరి; బి.ఎల్. పరీక్ష మొదటి శ్రేణియందు మదరాసు యూనివర్సిటీలో రెండవ స్థానమున కృతార్థులైరి.

గొప్పజ్ఞాని, మంచి పండితుడు, 'చిత్తబోధామృతము' శతకకర్త అయిన తన తండ్రిగారి శిక్షణక్రిందనే కృష్ణరావుగారు చాల చిన్నతనముననే ఎన్నియో గుణముల నలవరచుకొనిరి.

వీరు 1920 నుంచి 1943 వరకు న్యాయవాదిగా పనిచేసి పేరు గడించిరి; 1943 నుంచి అయిదు సంవత్సరములు మద్రాసు ప్రభుత్వమునందలి మత, ధర్మాదాయశాఖ కమిషనరుగాను, అటుతరువాత హైదరాబాదు సంస్థానమున మత, ధర్మాదాయశాఖ స్పెషల్ ఆఫీసరుగాను పని చేసిరి; అటుపిదప రాజమహేంద్రవరమునకు తిరిగి వచ్చి న్యాయవాదవృత్తిలో ప్రవేశించిరి.

వీరికి చరిత్రపరిశోధనయం దమితప్రీతి. వీరు తెలుగు నాటకములందు శ్రద్ధకలవారు; రంగస్థలమునందలి గుణదోషైక విచారణలో మిక్కిలి అనుభవజ్ఞులు.

వీరు కొంతకాలము 'గౌతమీగ్రంథాలయము' నకు కార్యదర్శిగా నుండిరి; ఆంధ్రేతిహాస పరిశోధకమండలి స్థాపకులలో ఒకరు; ఆ మండలి ప్రథమకార్యదర్శికూడ వీరే. చాలకాలము ఆ మండలి పక్షమున ప్రకటితమగుచున్న పత్రికకు వీరు సంపాదకులుగా నుండిరి. వీరు రాజరాజ నరేంద్రుని పట్టాభిషేక నవమ శతవార్షిక వర్ధంతిని రాజమహేంద్రవరమున నతివైభవముగా జరిపి, తత్సందర్భమున పలువురు పరిశోధక పండితుల తోడ్పాటుతో మండలి పక్షమున 'రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచిక'ను తమ సంపాదకత్వమున ప్రకటించిరి; దక్షిణ హిందూదేశచరిత్రకు, అందు ముఖ్యముగా ఆంధ్రదేశచరిత్రకు సంబంధించిన వ్యాసముల నెన్నిటినో బీహార్ అండ్ ఒరిస్సా రీసెర్చి సొసయిటీ, ఆంధ్ర హిస్టారికల్ రీసెర్చి సొసయిటీ పత్రికలలో ప్రకటించుచు వచ్చిరి; తూర్పు చాళుక్యశాసనములను కొన్నిటిని ఎపిగ్రాఫియా ఇండికా అను పత్రికలో విపుల వివరణముతో పరిష్కరించి ప్రకటించిరి.

వీరు చరిత్రపరిశోధకులేకాక, తెలుగులో చక్కని కథకులు కూడ. వీరు రచియించిన చారిత్రక కథలు కొన్ని భారతి, ప్రబుద్ధాంధ్ర మొదలగు పత్రికలలో ప్రకటితమైనవి. తెలుగులో వీరు రచించిన గ్రంథములు: రాజరాజనరేంద్రుడు, ప్రాచీనాంధ్ర నౌకాజీవనము, ఆంధ్ర దేశము - విదేశ యాత్రికులు. తూర్పు చాళుక్యుల చరిత్రను కూడ వీరు ఇంగ్లీషులో వ్రాసిరి; కాని అది యముద్రితము.



చిత్రము 258.
భావరాజు వెంకట కృష్ణరావు

1938 లో న్యాయవాది వృత్తిలో నుండియే వీరు ఇంగ్లీషులో 'ఎర్లీ డైనాస్టీస్ ఆఫ్ ది ఆంధ్ర కంట్రి' అను గ్రంథమును రచించి ఆంధ్ర విశ్వవిద్యాలయమునకు పంపి

ఎం. ఏ. పట్టమును పొందిరి. వీరు మంచివక్తలు; వీరు ఎం. ఏ. పరీక్షాధికారులుగా కొన్ని యూనివర్సిటీలలో పనిచేసిరి. భా. రా. రా.

**వెంకట కృష్ణరావు, కొచ్చెర్లకోట** (క్రీ. శ. 1871 - 1918): వీరు సర్కారు జిల్లాలలో కొన్ని తరములనుండి ప్రఖ్యాతిగాంచిన బ్రాహ్మణ కుటుంబమున జన్మించిరి. అయిదవయేట వీరిని పోలవరం జమీన్‌దారిణి యగు కామాయమ్మగారు దత్తత చేసికొనిరి. అందుచేత వీరు పోలవరం జమీన్‌దారుగ ప్రఖ్యాతిగాంచిరి. కొంతకాలము వీరు ఇంటి వద్దనే సంస్కృత, ఆంధ్ర భాషల నభ్యసించి తర్వాత 1884లో పదమూడవయేట ఇంగ్లీషు విద్య నభ్యసించుటకై రాజమహేంద్రవరము వెళ్లిరి. అచ్చట 1886 లో మెట్రిక్యులేషన్ పరీక్ష యం దుత్తీర్ణులైరి; తరువాత చెన్నపట్టణములో క్రైస్తవకళాశాలయందు ప్రవేశించి చదివి 1900 లో బి. ఏ. పరీక్షయందు కృతార్థులైరి. 1895 లో వీరు ఆంధ్రభాషోజ్జీవినీ సంఘమును స్థాపించిరి.



చిత్రము 259. రాజా కొచ్చెర్లకోట వెంకట కృష్ణరావు

అవల వీరు కాకినాడలో స్థిరవాసము కల్పించుకొని సరస్వతీ పత్రికను పెట్టి సుమా రిరువదియైదు సంవత్సరముల కాలము దానిని నడపి ఆంధ్రభాషకు గొప్పసేవ చేసిరి. వ్యావహారిక భాషోద్యమములో వీరు అభిమానమును చూపిరి. వీరు గోదావరిజిల్లాసంఘ కార్యనిర్వాహక సభా సభ్యులుగను, ఉపాధ్యక్షులుగను నుండిరి; పదునాలుగు సంవత్సరములకాలము జిల్లాబోర్డు సభ్యులుగను, కొంత కాలము 'గోదావరిజిల్లా వ్యవసాయ సంఘము'న కుపాధ్యక్షులుగను ఉండి, ప్రజాహిత కార్యములందు విశేష శ్రద్ధను, ప్రజ్ఞను ప్రదర్శించిరి.

జమీన్‌దారుల తరపున వీరు కొంతకాలము మద్రాసు శాసనసభలో సభ్యులై రాజకీయ సంస్కరణములందు పాల్గొనిరి. రైతులయొక్కయు, సామాన్య ప్రజలయొక్కయు, పురోభివృద్ధికై పాటుపడిన వారిలో వీ రొకరు. ఇరువది సంవత్సరములపాటు వీరు కాంగ్రెసులో సభ్యులుగ నుండిరి. హోమ్ రూలు ఉద్యమప్రచారమందు ప్రముఖ పాత్రను ధరించిరి; అనేక పండితులను, కవులను ఆదరించిరి. మా. వెం. రం.

**వెంకట జోగయ్య, వరాహగిరి** (క్రీ.శ. 1870-1939): ఈయన గోదావరిజిల్లా చింతలపల్లిలో జన్మించెను. ఇతని పినతండ్రి నరసయ్యపంతు లీయనను దత్తుచేసికొనెను. ఈ నరసయ్య పంతులు కొంతకాలము మందసా సంస్థానమున దివానుగ నుండెను. వెంకటజోగయ్య పంతులు 1888 సంవత్సరమున బరంపురం నేటివు కాలేజియందు ఎఫ్. ఏ. ప్యాసయి 1894 లో ఫస్టుగ్రేడ్ ప్లీడర్ పరీక్షయం దుత్తీర్ణుడయ్యెను. వకీలు వృత్తియం దీయన కొద్ది కాలములోనే రాణించి అభివృద్ధికి వచ్చెను. 1896 లో ఈయన బి. ఏ. యం దుత్తీర్ణుడయ్యెను.

బరంపురం కోర్టులో ఈయన ప్రముఖ న్యాయవాదిగా పేరు గాంచి బార్ అసోసియేషను ప్రెసిడెంటుగాను, పబ్లిక్ ప్రాసిక్యూటరుగాను కొంతకాల ముండెను; పర్లాకిమిడి కేసులో ప్రివీ కౌన్సిల్ ఎదుట వాదించి పేరు పొందెను.

సార్వజనిక కార్యములలో పాల్గొనుటకు పబ్లిక్ ప్రాసిక్యూటరు పదవి అడ్డు వచ్చుటచే ఈయన ఆ పదవిని పరిత్యజించెను. ఈయన చాలకాలము మునిసిపాలిటీ, తాలూకా బోర్డులలోను, 1907 నుండి 1917 వరకు అఖిల భారత కాంగ్రెసు కమిటీలోను, సభ్యుడై యుండెను. రాజకీయ, సాంఘిక రంగములలో ఈయన పాల్గొనని ఉద్యమము ఆనాడు లేదు. కేంద్ర శాసనసభలో ఈయన ప్రజాప్రతినిధిగ కొంతకాల ముండెను.

బరంపురం ప్రాంత మంతయు ఉత్కళ రాష్ట్రమున జేర్చబడిన తరువాత ఈయన అక్కడి ఆంధ్రులు పడు దురవస్థలను గురించి పై అధికారులకు తెలుపుటకై ఎంతయో శ్రమించెను. ఒరిస్సా సరిహద్దునిర్ణయకాలముననే ఈయన ఆంధ్రుల కన్యాయము జరగకుండ జూచుటకై మూడు పర్యాయములు లండనువెళ్ళి ఆ నాటి బ్రిటిషు ప్రభుత్వమున కన్ని విషయములను తెలియబరచెను. ఆ సందర్భముననే ఈయన యూరపునందలి వివిధ దేశములందు పర్యటించెను.



చిత్రము 260. వరాహగిరి వెంకట జోగయ్య

1937 సంవత్సరపు ఎన్నికలలో మదరాసు శాసనసభకు ఈయన విశాఖపట్టణ మండలము పక్షమున ప్రజాప్రతినిధిగ నెన్నుకొనబడెను. చీ. శే.

**వెంకట దత్తాత్రేయశర్మ, అడుసుమల్లి** (క్రీ. శ. 1897 - 1950): వీరు అడుసుమల్లి సూర్యనారాయణ సిద్ధాంతిగారి జ్యేష్ఠ పుత్రులు; జగద్గురు శ్రీ బోధానంద సరస్వతీ స్వాములవారికడ సంస్కృతాంధ్ర భాషలను, మంత్రశాస్త్రమును కూలం కషముగా నభ్యసించిరి; తాము చదివిన మహబూబు కాలేజీయందే 30 సంవత్సరములు ఆంధ్రభాషా పండితులుగా నుండిరి; 1913 లో సికింద్రాబాదు నగరమున, సంస్కృత కళాభివర్ధనీ గ్రంథాలయమును స్థాపించి, 1935 వరకు నిర్వహించిరి. ఆంధ్ర సంవర్ధనీ గ్రంథాలయ భారమునుకూడ వీ రనేక సంవత్సరములు వహించిరి; 'దక్కన్ కేసరి' మాసపత్రికకు రెండేండ్లు సంపాదకులుగా నుండిరి. వీరు 1945 లో ఆంధ్ర సారస్వత మహాసభకు కార్యదర్శిగా నుండిరి. వీరికి నాట్యకళపై అభిమానము మెండు. వీ రుత్తమశ్రేణికి చెందిన నటకులు. వీరు రెండు మూడు నాటక సమాజములు స్థాపించి, తమ సర్వస్వమును ధారవోసిరి.


చిత్రము 261.
అడుసుమల్లి
వెంకట దత్తాత్రేయశర్మ

వీరు 'అయేషా', 'ధర్మాత్మ', 'అశ్వత్థామ', 'శ్రీకృష్ణదేవరాయలు' అను పెద్దనాటకములను, ఏకాంకికల ననేకములను రచియించిరి.

సికిందరాబాదులోని ప్రతి సాంఘికోద్యమమునకు వీరే కారకులు. క్రీ. శ. 1940 - 1941 లో ఆంధ్రమహాసభా కార్యనిర్వాహకవర్గ సభ్యులుగా వీరు రాజకీయరంగమున గూడ కొంత పనిచేసిరి. బి.రా.రా.

**వెంకటదాసు, పినపాల**: వీరి జన్మస్థానం బందరు. చిత్రప్రదర్శన వ్యాపారంలోకి రాకముందు వీరు బర్మా షెల్ కంపెనీ ఏజెంట్‌గా ఉండేవారు. రేపల్లెలోని కృష్ణా టాకీస్ అనే ప్రదర్శనశాల వీరిది. బందరులోని మినర్వా సినిమాలో వీరికి భాగం ఉంది. తరువాత వీరికి జి.డి. స్వామిగారితో పరిచయం ఏర్పడింది. వీరు మొదట రఘుపతి వెంకయ్యగారికి ఛాయాచిత్రగ్రహణంలో సహాయకులుగా ఉండేవారు; తరువాత హిందూస్తాన్ సినిమా కంపెనీ ప్రతినిధిగా సినిమా మెజస్టిక్ నిర్వహిస్తుండేవారు. దాసు, స్వామి, ఎమ్. టి. రాజన్‌గార్లు భాగస్వాములుగా వేల్ పిక్చర్స్ అనే స్టూడియో నిర్మించబడింది. ఆ స్టూడియోలో మొదటి తెలుగు టాకీ అయిన 'సీతాకల్యాణం' నిర్మించబడింది. నేడు తెలుగు చలనచిత్రపరిశ్రమలో ప్రముఖ నిపుణులలో చాలామంది వేల్ పిక్చర్స్ స్టూడియోలో తరఫీదు పొందినవారే. దాసుగారి కార్యదీక్ష, పట్టుదల, అనుచరుల యెడల వారికిగల సానుభూతి అసమానము లని ప్రతీతి. వీరు నిర్మించిన రెండవ తెలుగుచిత్రం, 'కృష్ణలీల' విశేష ధనాన్ని ఆర్జించింది. మూడవచిత్రం 'మాయాబజారు', నిర్మిస్తుండగా 1935వ సంవత్సరంలో వీరు అకాల మరణానికి గురి అయ్యారు. ఆ చిత్రం స్మారకచిహ్నంగా వీరికి అంకితం చేయబడింది. 'మాయాబజారు' కూడా విశేషంగా ప్రజాదరాన్ని పొందింది. రఘుపతి వెంకయ్యగారు మూకచిత్ర పితామహులయితే వీరు తెలుగు టాకీకి ఆదిపురుషులు. పా. ప.

**వెంకట నరసయ్య, ఏటుకూరి** (క్రీ. శ. 1911 - 1949): ఈయన పల్నాటిసీమకు చెందిన రైతుబిడ్డ. గుంటూరుజిల్లాలోని పెదకూరపాడు ఈయన స్వగ్రామము. కమ్మ కుటుంబములో జన్మించిన ఈయన సుమారిరవై సంవత్సరాల ప్రాయమువరకు హలమును బట్టి 'తలంపులను గిల్గింతలు' పెట్టే దృశ్యాలలో ప్రకృతి సౌందర్యాన్నీ, ప్రజాశక్తినీ అవలోకించి సృష్టి రహస్యాలను గ్రహించి, తన హృదయాన్ని ఆర్ద్రముచేసికొన్నాడు. అందాలు చిందే గ్రామీణ జీవిత శోభను హృదయంలో పదిలపరచుకొని తర్వాతికాలాన కవిత్వరూపాన లోకాని కందిచ్చిన 'ప్రకృతి కవి' ఈయన. కలమును బట్టి కవితాసాధన చేస్తూ యీయన కీ.శే. త్రిపురనేని రామస్వామి చౌదరి 'చేతిలో పడి', శిష్యుడై కవిగా రూపురేఖలు దిద్దుకొన్నాడు; ఉభయభాషాప్రవీణుడై కొల్లూరు, నిడుబ్రోలులలో ఉన్నత పాఠశాలా పండితుడుగా యువకలోకానికి కవితాభిరుచి కల్గించినాడు. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు యాజమాన్యాన శ్రీ యన్. జి. రంగా ఏర్పరచిన జాతీయ విజ్ఞాన పరిషత్సభకు మద్రాసులో 1949 లో అధ్యక్షుడై జాతీయ సాహిత్య కృషికోసం ఉద్బోధించినాడు.


చిత్రము 262.
ఏటుకూరి వెంకట నరసయ్య

కవితాభ్యాసముకోసము వ్రాసిన ఖండికలైనా 'కాలాభిరుచి గడవరానిదిగదా' అని చిల్లర పనితనము గల

పాయలను 'త్రివేణి'గా అల్లి తారణ సంవత్సరాన తా నవతరించినాడు; తరువాత 'ఆయాయెడల ప్రకృతిబాంధవు డగు కర్షకుని' హృదయమంటి నడచినాడు; కూలిబాబు జాలిచూపుల నోలగించినాడు. కళాదృష్టితో లక్ష్యమర్యా దను' పాటిస్తూ 'క్షేత్ర లక్ష్మి'ని చిత్రించినాడు; ఆ తర్వాత పల్నాటి వీరగాథను చేబట్టి అనేక కృతులను రసవంతముగా వెలయించినాడు. నాయకురాలు, మగువ మాంచాల, ప్రేమాలోకము, సిద్ధాశ్రమము, వీర భారతము, రుద్రమదేవి, బాలచంద్రుడు, గాథావళి నీతి కథామంజరి, రైతు(హరికథ) అన్నవి యీయన యితర ముద్రిత గ్రంథాలు. అంగద రాయబారము, అలరాజు రాయబారము, గేయసంపుటము అన్నవి అముద్రితాలు.

'ఏటుకూరి' సహజకవి; తొల్లిటి కావ్య మర్యాదల సడల్పక వానిపై గౌరవ ముంచిన ప్రాజ్ఞుడు; అధునిక కవిత్వ విధులను నిరసింపక క్రొత్తలం దుల్లాన్ని చేర్చిన నవ్యుడున్ను; 'దేశికవితోచితమార్గాల గమించితి'నంటాడు. పండితుల తల లూపించే కండగల కవిత్వం, పామరుల నుద్రేకంతో ఉర్రూత లూపించే భావావేశం ఈయన కావ్యాలలో కన్పిస్తుండే గుణాలు. రైతు జనోద్ధరణము, స్వాతంత్ర్యాభిలాష ఈయన కుచ్ఛ్వాస నిశ్వాసాల్లాంటివై ఒప్పినవి. ప్రత్యేకభాషా దృష్టి కలిగి యీయన పల్నాడు మాండలికాలను, రైతుజన పారిభాషిక పదాలను అనేకం తన కావ్యాలలో భద్రపరిచినాడు. పల్నాటిసీమలో పుష్కలంగా లభించే వీరరసాన్ని వాగులువాగులుగా ప్రవహింపజేసి సాహిత్య క్షేత్రాన పరిశ్రమించి పసిడి పంటలను, వీరకావ్య ఫలాలను పండించి యిచ్చిన యీ కవి కర్షకుని ప్రతిభ యసామాన్యమైనదే అయి విశిష్టంగా భాసిస్తున్నది. పి. వెం. హ.

**వెంకట నారాయణస్వామి నాయుడు, బిజయతి** (క్రీ. శ. 1907 - 1955): ఈయన బిజయతి దేవరాజులు నాయుడుగారి కుమారుడు. ఈయన భారతదేశమునను, ఆంగ్లదేశమునను విద్య నార్జించి ప్రశస్త పాండిత్య విజ్ఞాన ముల సముపార్జించెను. నిరతిశయ దేశాభిమానియగు ఈయన అణ్ణామలై విశ్వవిద్యాలయమున ఆర్థిక శాస్త్రా చార్య పదమును, మదరాసు పచ్చయప్ప కళాశాలయందు ప్రధానాచార్య పదమును అధిష్ఠించెను. ఈయన శిష్యలోక ప్రీతికి పాత్రుడగుటయే కాక ఎల్లతరగతి ప్రజల ప్రశంసా గౌరవములను కూడ పొందగలిగెను. ఈయన శిష్యు లెందరో దేశ, విదేశములందు వివిధ జీవితపథములందు ఉన్నత పదవుల నధిష్ఠించియున్నారు.

అనంతరము ఈయన మదరాసు ప్రభుత్వమునకు 'ఎకనమిక్ అడ్వైజర్' పదవి నధిగమించెను. 1947 లో మదరాసు ప్రభుత్వ మేర్పాటుచేసిన 'ఇండస్ట్రియల్ ప్లానింగ్ కమిటీ'లో ఈయన సభ్యుడుగా నియమింపబడెను. పిదప ఆ సంవత్సరముననే 'ఇండియన్ టారిఫ్ బోర్డు'లో సభ్యుడుగా నియమింపబడి ఈయన మన దేశమును పారి శ్రామికముగా పెంపొందించుటకు మిక్కిలి కృషి చేసెను.

ఈయన 'ఫార్వర్డు మార్కెట్ కమీషను'కు ప్రథమా ధ్యక్షుడై తా ననారోగ్య పీడితుడై యుండియు, భారత దేశమందు 'ఫార్వర్డు మార్కెట్ల' నేర్పాటు చేసి, నియమబద్ధముల నొనరించెను. ఇది ఈయన నిర్వర్తించిన యపూర్వ ఘనకార్యము. ఈయన దేశములో 'ఫార్వర్డు మార్కెట్ల'ను గట్టి పునాదులమీద నెలకొల్పు టకై చివరివరకును ఉత్సాహముతో పనిచేయుచుండెను. పెక్కు కమిటీలకీయన సభ్యుడుగను, అధ్యక్షుడుగను ఉండెను. ఈయన కార్యనిర్వహణ కౌశలము, ఋజుహృదయము, ఉదారాశయములు గలవాడు; అల్పవయస్సుననే ఈయన భారతదేశమునందలి అగ్రగణ్యులగు ఆర్థిక శాస్త్రవేత్త లలో నొకడుగా ప్రఖ్యాతిగాంచెను.



చిత్రము 263.
బిజయతి వెంకటనారాయణస్వామి

ఈయన వివిధ విషయములను గూర్చి రచించిన గ్రంథ పరంపర ఈయన కాయా విషయములందు గల పాండి త్యాతిశయమును ప్రకటించును. ఈయన రచనలలో కొన్ని: జానపద ఋణసమస్య (ది ప్రాబ్లం ఆఫ్ రూరల్ ఇన్ డెటెడ్‌నెస్); మదరాసు రాష్ట్రమునందలి చేనేతపరిశ్రమ పరిస్థితులను గూర్చిన వివరములు (స్టడీ ఆఫ్ ది వర్కింగ్ కండిషన్స్ ఆఫ్ హాండ్‌లూమ్ ఇండస్ట్రీ ఇన్ ది మెడ్రాస్ ప్రెసిడెన్సీ); తోళ్ళపరిశ్రమ, దానితో సంబంధము గల ఇతర పరిశ్రమలలోని పనివాండ్ర పనిపాటులకు సంబంధించిన సమస్య వివరములు (స్టడీ ఆఫ్ ది ప్రాబ్లం ఆఫ్ ది వర్కింగ్ కండిషన్సు ఆఫ్ వర్కర్స్ ఇన్ టానరీ అండ్ అలైడ్ ఇండస్ట్రీస్); వేరుసెనగ (గ్రౌండ్ నట్); అమ్మకపు పన్ను (సేల్స్ టాక్సు); భారతీయ వ్యవసాయ - ఆర్థికశాస్త్రము (ఎకనమిక్స్ ఆఫ్ ది ఇండియన్ అగ్రికల్చర్); వర్తక వ్యాపార నిర్మాణ మూలసూత్రములు

(ఫండమెంటల్స్ ఆఫ్ బిజినెస్ ఆర్గనైజేషన్); ప్రభుత్వము, ఆర్థిక జీవితము (స్టేట్ అండ్ ఎకనమిక్ లైఫ్); మదరాసు ఫైనాన్స్. యం.యస్.సాం.

**వెంకటపతి, చేమకూర :** 'ఊతిలో నీ మార్గ మెవరికిన్ రాదుసుమీ' అనీ, 'ఇంటిపేరు ననగా నున్నా కవిత్వం పసగా ఉన్న 'దనీ 'చేమకూర పాకానపడ్డ 'దనీ, 'చక్కెర మడిలో అమృతము పారించి పండించిన చేమకూర' అనీ పండితులూ, కవులూ, విమర్శకులూ అసాధారణముగ ప్రశంసించిన కవిశేఖరుడు చేమకూర వెంకటపతి సారంగధర చరిత్రము, విజయవిలాసము అన్న రెండు ఉత్తమ ప్రబంధాలను ఆంధ్ర సరస్వతి కమూల్యాభరణాలుగా సమర్పించి ధన్యుడైనాడు. ఈతడు 1600 మొదలు 1633 వరకు తంజావూరు రాజ్యమును పాలించిన 'అభినవభోజ రాజ' బిరుదాంకితుడు రఘునాథ నాయకుని ఆస్థానమందుండిన కవి.

ఈ రఘునాథ నాయకుడు క్రీ. శ. 1509 నుండి 1530 వరకు విజయనగర సామ్రాజ్యము నేలిన శ్రీ కృష్ణదేవ రాయల తరువాత మరల నంతటి రాజని ప్రఖ్యాతిగన్నవాడు. రఘునాథుని కొలువుకూటమంతా సాహిత్యమయము. వాతావరణమంతా లలితకళాభరితము. సదస్యు లంతా అనేక శాస్త్ర పారంగతులు. సాధారణ ప్రతిభగల కవిగాని, గాయకుడుగాని, మాటకారిగాని, నటవేషధారిగాని ఆ సభాస్తారుల తీవ్ర విమర్శనలకు గురికాక తీరదు. కాబట్టే కవి చౌడప్పలాంటివాడుకూడ —

'నేరుతునని మాటాడగ
వారిజభవు నంతవాని వశమే తంజా
వూరి రఘునాథనాయని
గారి సభను కుందవరపు కవి చౌడప్పా'

అని అనక తప్పినది గాదు. ఈ పండిత ప్రకాండులు కవనములో రసపుష్టి చూచేవారు; ప్రతి పదము పట్టి సార్థక్యాన్ని విమర్శించేవారు; చమత్కారము, అర్థగౌరవము పరిశీలించేవారు; వేయేల 'క్షోదక్షమ రసభావ సుకవిత' గుర్తించడానికి అగ్నిపరీక్ష చేసేవారు. ఆ రసిక విమర్శకులలో అగ్రగణ్యుడు రఘునాథనాయకుడని వేరె చెప్పనక్కరలేదు.

ఆ వాతావరణములో పెరిగినవాడు మన చేమకూర కవి; శ్రీ సూర్యనారాయణ వరప్రసాద సారస్వతాభిరుచి గలవాడు; కుశాగ్రమైన బుద్ధి, అపారమైన శ్రద్ధ, అసాధారణమైన జిజ్ఞాస గలవాడు; ఆ నాటికి తెలుగు సారస్వత రంగములో ఉండిన భారతకవులు, శ్రీనాథుడు, అల్లసాని పెద్దన, రామరాజ భూషణుడు, ముక్కు తిమ్మన, పాండు రంగ విభుడు, పింగళి సూరన మొదలైన ఉత్తమకవి శిఖామణుల గ్రంథాలను సవిమర్శంగా పఠించేవాడు; 'రసోపగుంభిత పదవాసనల'తోపాటు 'ప్రసన్నతయును, సౌకుమార్యము' పరికించి, పదాల విలువను గుర్తించి, కల్పనా విశేషాలను ఆకళించుకుని వారివారియం దున్న మేలి విషయాలను యేర్చి తన కవితా సామగ్రిలో చేర్చుకునేవాడు.

ఈతని జీవితము, విద్యావిధానము, కవితా వ్యాసంగము మొదలైన విషయాలను తెలుసుకోడానికి ఇతర ఆధారాలు కానరావు. కాబట్టి ఇతడు వ్రాసిన ప్రబంధాల నుండే వాటిని పునర్నిర్మించుకోవాలి. ఇందు ముఖ్యముగా తోడ్పడగలవి రెండు. ఒకటి విజయవిలాసము అవతారికలోని పద్యాలు; రెండు సారంగధర చరిత్రములోను, విజయవిలాసములోను ఉన్న ఆశ్వాసాంత గద్యలు.

'సామాన్యుడవే సూర్యవరప్రసాది విజ్జగ మెరుగన్' అని యితనిని గురించి రఘునాథనాయకు డన్నాడు. కాబట్టి ఈ కవి తంజావూరులో పేరుగాంచిన ఒక సంపన్న కుటుంబములో జన్మించిన వాడనే భావించవలసి ఉంటుంది. పేరు గాంచిన కుటుంబమే కాకపోతే తలిదండ్రులు సంతానాభిలాషతో సూర్యు నారాధించి వరప్రసాదిగా ఈ పుత్ర సంతానాన్ని పొందడం ఇజ్జగము (సందర్భాన్నిబట్టి ఆ తంజావూరి రాజాస్థానమే అని అనుకొన్నప్పటికీ) ఎరుగవలసిన అవకాశము కలుగదు. సంపన్న కుటుంబజాతుడు కాబట్టే కవి—

'.................నిక్కెడు, నీల్గెడు విర్రవీగెడున్
ఊతి నిటుగాదె ఒక్కొకనికిన్ నడుమంత్రపు కల్మి గల్గినన్...'

అని నడుమంత్రపు కలిమిని మెత్తగానైనా యెత్తి పొడవగలిగాడు. ఇతడు చిన్నతనములో క్షత్రధర్మము నవలంబించినాడు; అనగా సైనికుడుగానో, సైనికోద్యోగిగానో సంస్థాన సేవలో ఉండేవాడు; దానికి తగినట్లు వ్యాయామములోను, ఆటలలోను, పందెములలోను, వేటలలోను పరిశ్రమ చేశాడు.

రఘునాథుడు శత్రు నిర్మూలనము కొరకు చేసిన యుద్ధాలలో వెంకటరాజుకూడ క్షత్రధర్మములో పాల్గొని 'ప్రయోజకుడు'గా ఉన్నాడని ఊహించవలెను. దీనికి తగినట్లు ఈతని కవిత్వములో, యుద్ధ ప్రసక్తిలేని సన్నివేశాలలో కూడా యుద్ధ విన్యాస వర్ణనలు కనబడుతూ ప్రత్యక్షానుభవాన్ని తెలుపుతాయి. ఈ విధంగా తానెంత ప్రయోజకుడైనా కవిదృష్టి యెల్లప్పుడు విద్యాగోష్ఠుల మీదను, కవితా వ్యాసంగము మీదను లగ్నమై యుండేది. కాబట్టి కొన్నాళ్ళకు యుద్ధావసరాలు తీరిన తరువాత

రఘునాథునితోపాటు తాను కత్తిని పారవేసి గంటాన్ని చేపట్టాడు; తన సామర్థ్యము చూచుకొనుటకా అన్నట్టు మొదట సారంగధర చరిత్రను ఆరంభించాడు. అది తనకు సంపూర్ణముగ తృప్తి కలిగించలేదు; దాని నలాగే వుంచి విజయవిలాస కావ్యమును రచించాడు. ఈ విజయవిలాస కృతిని అంకితమిచ్చిన నాటికి చేమకూర కవి తమ్ములు, కొడుకులు రాజోద్యోగాలలో వున్నట్లు రఘునాథుడే అన్నాడు. ఉద్యోగార్హులైన కొడుకులు ఉన్నారు. కాబట్టి కృతి సమర్పణనాటికి (1620) మన కవి వయసు దాదాపు యాభై సంవత్సరా లుండునని అనుకోవచ్చును.

ఈ కవి విద్యాది విశేషాలు తెలుసుకోటానికి ఉపకరించే రెండవ ఆధారము ఆశ్వాసాంత గద్యలు. మొదట రచించిన సారంగధర చరిత్రలోని గద్య: 'ఇది శ్రీ సూర్యనారాయణ వరప్రసాదలబ్ధ ప్రసిద్ధ వాగ్విభవ చేమకూర లక్ష్మణామాత్య తనూభవ సదారాధిత బుధ సమాజ వేంకటరాజ ప్రణీతంబైన సారంగధర చరిత్రం బను మహాప్రబంధంబునందు...' అని ఉన్నది. విజయవిలాసములోని గద్య: 'ఇది శ్రీ సూర్యనారాయణ వరప్రసాద లబ్ధ సారస్వతాసార జనిత యశోలతాంకూర చేమకూర లక్ష్మణామాత్య తనయ వినయ ధురీణ సకలకళా ప్రవీణాచ్యుతేంద్ర రఘునాథభూపాల దత్తహస్త ముక్తాకటక విరాజమాన వేంకట కవిరాజ ప్రణీతంబైన విజయ విలాసంబునందు....' అని ఉన్నది. విద్యాగురువునుగాని, కవిత్వదేశికుణ్ణిగాని వెంకటరాజు ఎక్కడా చెప్పలేదు. ఆ నాటి కవులు, పండితులు, కవయిత్రులు ఎందరో తమ గురువుగా పేర్కొన్న రఘునాథ నాయకుని కూడా మనకవి గురువుగా వర్ణించలేదు. తన సారస్వతాభిరుచి శ్రీ సూర్యనారాయణ వర ప్రసాద లబ్ధమనే గద్యలలో ప్రకటించాడు. కాబట్టి ప్రసిద్ధులైన గురువుల దగ్గర తాను విద్యనుగాని, కవితనుగాని అభ్యసించలేదని తేటపడుతుంది. 'సదారాధిత బుధ సమాజ' - ఉద్దండ పండితులతో నిండిన ఆ కొలువుకూటమే మన కవికి భాషాపాండిత్యా న్నిచ్చింది. ఆ యాస్థానకవి ప్రకాండుల రచనా విమర్శనములే తన కవిత్వానికి మెరుగులు దిద్దాయి.

వారి సాంగత్యములో వెంకటరాజు తన సామర్థ్యమును, అభిరుచిని శ్రద్ధవల్ల, కృషివల్ల అభివృద్ధిచేసుకున్నాడు. పదములకున్న విలువలను, వాటి పొందికలోనున్న శక్తిని ప్రత్యేకంగా అవగాహన చేసుకున్నాడు; కవిత్వములో మన కవి ప్రధాన లక్ష్యము పదము. ప్రతిపదము రస పుష్టితో, చమత్కారముతో అర్థగౌరవముతో ఉండాలని అతని నియమము. ఒకే అర్థాన్నిచ్చే పదాలు నూరున్నా సన్నివేశానికి తగిన పదమునే ప్రయోగించడములో ఒక గొప్ప అంద ముందని గ్రహించాడు. 'వెడవిలుకాడు' అనదగినచోట 'అంగజరాజు' అనడు. 'తరుణి' అంటే అర్థగౌరవ మున్నచోట 'వెలది' అని ప్రయోగించడు. ఈ పదప్రయోగ నియమము మన కవికిగల ప్రత్యేకప్రతిభ. దీని నుద్దేశించి రఘునాథుడు 'వాఙ్నియమరూఢి నీయంత వాఁ డికేఁడి' అన్నాడు.

పదములను సార్థకముగా ప్రయోగించడములో మన కవికి ఎంత నేర్పుందో లలిత లలితములగు ఆ పదములను కూర్చడములో అంత కౌశల మున్నది. 'అందందు నరుగ నరుగానరుగా', 'యమునానది గూడినతోయము నానది', 'సవ్యసాచి నింద్రోపలరోచిఁ జూచి తల యూఁచి యులూచి రసోచితంబుగన్....', 'చనుదెంచె నుదంచ దూర్మికా నికర విలోల ఖేల దళినీ కలగాన లసత్ ప్రఫుల్ల హల్లక సుఖడోలికా విహృతి లాలస బాలసమీరమయ్యెడన్' - చదువుతూ వుంటే సంగీతం విన్న ట్టుంటుంది. రఘునాథరాజుగారి కవిపండిత పోషణ ఆ దినములలో ఆకర్షించిన మహాప్రతిభాశాలు రనేకులు. వారి నాశ్రయించి వారి వాదోపవాదాలను, గుణదోష విమర్శలను ఈతడు శ్రద్ధగా పరికిస్తూ ఉండేవాడు. దాని ఫలితంగా మన దృష్టికి సాహిత్య విజ్ఞానము మూడు అంతస్తులుగ గోచరించినది.

'ఎందును విద్యలే యెఱుఁగ రెవ్వ; రెఱింగినఁ గొంతమాత్రమే;
యందును సాహితీరసమహత్త్వ మెఱుంగ; రెఱింగిరేని యా
యంద మెఱుంగలేరు...'

సాధారణముగ తెలియడం, సాహితీరస మహత్వంతో తెలియడం, ఈ రెంటినీ మించి అది ఇది యని చెప్పనలవి గాని ఆ యందమును తెలియడం. శ్రద్ధగా పరిశీలించినవారికి ఈతని రచనయందు ఈ సోపానములు కనపడకమానవు.

'కలరా యిలరాయనికిన్
గులసతి రత్నాంగి భోగకుటిల శిరోజా
తిలకము చిత్రాంగియు నన
నెలజవ్వను లిరువు రంబు జేందు నిభాస్యల్'

అన్న సారంగధర పద్యములో రత్నాంగిని కులసతియని ఆమె సత్స్వభావాన్నీ, చిత్రాంగిని కుటిలశిరోజయని ఆమె కుటిల స్వభావాన్నీ సూచించాడు. వీ రిద్దరు క్రమంగా అంబుజనిభాస్య, ఇందునిభాస్య లని పద్మానికి చంద్రునికి వలె వీ రిద్దరికి ఉన్న వైరము చెప్పకే చెప్పాడు. వీరినే మార్చి ఇందునిభాస్య, అంబుజనిభాస్య అనినా యో వైరము స్ఫురిస్తుంది. కాని కవి ఆ పని చెయ్యలేదు. ఎందుకంటే ఈ వైరంలో బాధ కలిగించేది చంద్రుడే కాబట్టి

చిత్రాంగినే ఇందునిభాస్యను చేసి ఆమెవల్ల రత్నాంగికి హాని కలుగుతుందని కథను ముందుగా తెలియపరచాడు. ఇలాంటిదానినే కవి 'ప్రసన్న గంభీర గతిన్ రచించుట' అని పేర్కొన్నాడు.

దీనికితోడు సునిశితమైన విమర్శన దృష్టితో, విశాలమైన హృదయముతో మన కవి మానవ స్వభావాలను, భావ పరిణామాలను పరిశీలించేవాడు. వీటి నన్నింటినీ మేళ వించి లలిత పదములతో మృదుమధురమై రసవంతమైన కవనముతో వెంకటరాజు ఎందరినో మెప్పింప గలిగాడు. రఘునాథనాయకుడు కూడ అప్పుడప్పుడు యీ కవిని సంతోషాతిశయముచే సన్మానము చేస్తుండేవాడు. ఆనాటి తక్కిన కవీశ్వరుల లాగానే తానుకూడా రఘునాథుని కంకితముగా కావ్యము చెప్పాలని వెంకటకవి అభిలాష. కాని రాజు సామాన్యుడుకాడు; 'అనేకకృతుల్ ప్రసన్న గంభీర గతిన్' రచించిన దిట్ట. అట్టి వానికి 'ఇక శక్తు లెవ్వరయ్యా రఘునాథభూప రసికాగ్రణికిన్ జెవిసోఁకఁ జెప్పఁగాన్'—అని కొంత జంకాడు. అయినా ఆరాజు నిజాశ్రిత పక్షపాతము గలవాడు. 'అణుమాత్రమైన నొక కానుక తెచ్చినఁ గొండఁగ కనుంగొను' శ్రీరామునివంటి వాడు అని కొంత ధైర్యము తెచ్చుకొని ప్రయత్నించాడు.

మొదటి గ్రంథముగా తా నెన్నుకున్నది సారంగధర చరిత్రము. అంతకుముందు గౌరనకవి వ్రాసిన సారంగధర చూచాడు. కరుణ, శృంగారాది వివిధ రసాలకు ఆకథలో అవకాశముంది. సంతానాభిలాష, బాల్యక్రీడలు, పావురా పందెములు, వేట, వలపు, ధర్మనిరతి, రంకుకు తగిన బొంకు, దోషవిచారణ, న్యాయనిర్ణయము, కడుపుతీపి, తపోమహిమ - యింక నెన్నో విషయాలలో తన నేర్పు చూపడానికి వీలుంది. గ్రంథరచన ఆరంభించాడు; ఆవిద్వ త్సంస్థానములో రఘునాథుని కంకితము చేయడానికి తగిన యోగ్యత తన ప్రబంధానికి కలదో లేదో అని సంశయిం చాడు; అందుచేత ఈ సారంగధరకు అవతారిక పద్యాలు గాని ఆశ్వాసాంత పద్యాలుగాని వ్రాయక, కథను మాత్రం మూడు ఆశ్వాసాలుగా వ్రాశాడు. హృదయం గమమైన ఆ రచనను చూచి పండితులు, కవులు మెచ్చు కున్నారు. కొందరు ధనికులు ఆ గ్రంథమును తమ కంకి తము చేయమన్నారు. ప్రయోజనము లేదు. మన కవి రఘునాథునికి తప్ప యింకొకరికి కృతినీయడు. ఎందరు మెచ్చినా యీ సారంగధర తన కవిత్వ లక్ష్యానికి అంద లేదు. రఘునాథుని 'చెవులు పట్టి ఆడించ'డానికి తన కవి త్వము యింకా పరిపక్వము కావాలని నిశ్చయించు కున్నాడు. విజయవిలాసము తరువాతయినా సారంగ ధరను సభాముఖములో కృతి సమర్పించలేదు. ఈ రచనతో ఇతడు తన కత్తిపదును చూచుకున్నాడన్న మాట. ప్రతి పద ములో సార్థకత, ప్రతిపద్యములో చమత్కారము, సులభ మగు శ్లేషలు, అందమైన మాట విరుపులు, సంగీతములా ధ్వనించే యమకములు, అర్థగౌరవముగల ఉపమానాలు, అక్షరాలా అనుగుణమైన సామెతలు, సున్నితమైన భావ పరిణామ చిత్రణలు అన్నింటిని ఈ గ్రంథములో చికిలి చేసుకొన్నాడు; మరొక రసవత్తర ప్రబంధము వ్రాయా లని సంకల్పించుకొన్నాడు; మరికొంత కవితా సామగ్రిని సముపార్జించాడు; తన కౌశల్యాన్ని తీర్చి దిద్దుకున్నాడు.

ద్విగుణీకృతమైన ఈ ప్రయత్నముతో సారస్వతా సారము (జడివాన) కురిసింది. కవి యశోలత అంకురిం చింది. జగత్ప్రసిద్ధి కవికి సిద్ధించింది. సకలకళా ప్రవీణుడు అచ్యుతేంద్ర రఘునాథనాయకుడు హస్తముక్తా కటకము (ముత్యాల ముంజేతి కంకణము) బిరుద పారితోషికముగా ప్రసాదించాడు. 'వాసించు కవిత'తో మనోహరములగు చికిలి సేతలతో, సకలాలంకార శోభితముగ 'విజయవిలాస' మన్న ప్రబంధ రత్నము అవతరించింది. కవి విమర్శనకు ఈ కావ్యం నిలిచింది. ఆ పండిత ప్రభువున కంకితము చేయ డానికి ఇతనికి ధైర్యము కలిగింది. రఘునాథరాజు తన యుద్ధ విజయముల జ్ఞాపకార్థము కొత్తగా కట్టించిన విజయ విలాసమను సుందర భవనములో కొలువు తీర్చియున్నపుడు,

'...............తెచ్చితిఁ గాన్కఁ బరి గ్రహింపు మ
య్యా రఘునాథభూప రసికాగ్రణి మామక కావ్యకన్యకన్'

అని ఇతడు కేవల భక్తిని ప్రకటిస్తూ కల్లాకపటం లేని మనస్సుతో భెట్టూభేషజం లేకుండా స్ఫటికనిర్మలమైన హృదయంతో, ఇదే తన జీవిత పరమార్థమని భావించి తన కృతిని సమర్పించాడు. ఆ అభినవభోజుడు ప్రతిపద్య చమత్కృతిని గుర్తించాడు. 'అన్ని విధాలా అందమైన నీ కృతిని హద్దులేని ఆనందంతో విన్నా'మన్నాడు. చేమ కూరకవి చిరకాల వాంఛితము ఈడేరింది. కవి తన జన్మ తరించినట్టుగా భావించాడు; పరవశుడైనాడు; రాజు చేసిన సన్మానంవల్ల కవి, కవి సమర్పించిన కృతివల్ల రాజు - వీరిద్దరివల్ల ఆంధ్రసరస్వతి అందరూ రాణించారు. అంతకు ముందు సారస్వత రంగములో అగ్రస్థానముల నలంకరిం చిన అనేక ప్రబంధాలు ఈ విజయ విలాసానికి తావిచ్చి వెనుకకు పోవలసి వచ్చింది. ఆ నాటి కవులకు ఆదర్శ ప్రాయంగా ఉండే మను, వసు చరిత్రల వలెనే భావి కాల కవుల కీ విజయ విలాసము వరవడియై గౌరవమునందినది. అప్పకవి సిద్ధాంతాల రీతిని కొన్ని దోషాలు చేమకూర కవిత్వ ములో ఉండినా ఆ లాక్షణికుడు ఈ రెండు కావ్యాలను

ప్రమాణ గ్రంథాలుగా అంగీకరించాడు. దీనిని బట్టి వెంకటకవి కవనములోనున్న గుణాధిక్య మెంతో తేటపడ గలదు. నాటినుంచి నేటివరకు (ఆంధ్ర భాష యున్నంత కాలము గూడా వుంటుంది) తెలుగు వాఙ్మయములో పేర్కొనదగిన రసవత్తర కావ్యాలలో ఈ విజయవిలాసము ఒక అత్యున్నతస్థానము నలంకరించింది.

మొదటి గ్రంథము 'సారంగధరచరిత్రము'లో శృంగార రసము అభాసములో పడినది. ఆ రోజులు శృంగారరస పిపాస గలవని వేరే చెప్పనక్కరలేదు. కాబట్టి చేమకూర కవి తన రెండవ కావ్యమునకు శృంగారరస ప్రధానమైన 'సుభద్రాపరిణయము'నే కథావస్తువుగా తీసుకున్నాడు. దీనిలో అర్జునుడు ఉలూచిని, చిత్రాంగదను, సుభద్రను వివాహం చేసుకుంటాడు. ఉలూచి అర్జునుణ్ణి చూడక పూర్వమే అతన్ని ప్రేమించింది. సుభద్రను చూడక మునుపే అర్జునుడు ఆమెను ప్రేమించాడు. పూర్వప్రేమలు ఏమీ లేని వివాహము చిత్రాంగదది. ఒకటి తన్ను వలచినది, ఒకటి తాను వలచినది. ఈ రెంటికిని మధ్యనున్నది సాధారణకాంత. మూడువిధములైన సన్నివేశాలు. ఈ సంగతినే 'మూడు వలపుల్ వలచెన్' అన్న మాటలవల్ల కవి సూచించాడు. తన్ను వలచిన ఉలూచి ఘట్టములో తా నుదాసీనుడు. తాను వలచిన సుభద్ర విషయములో ఆతురుడు. చిత్రాంగద ఘట్టంలో సఖుడు విశారదుణ్ణి పంపి సాధారణ వివాహ మర్యాదలు నడిపినాడు. ఈ మూడు వలపులను కవి భిన్నభిన్నమైన విధానములలో వర్ణించి తన అద్భుత చాతుర్యమును కనబరిచాడు. ఉత్తమోత్తమమైన శృంగార ప్రబంధమును ఆంధ్ర సారస్వతానికి ప్రసాదించి చేమకూర వెంకటరాజు సుస్థిర కీర్తి నార్జించుకుని ధన్యుడైనాడు. కొందరు ఉలూచి పాతాళ లోకపు కాంతయని, చిత్రాంగద మర్త్యకాంత యని, సుభద్ర దేవాంశసంభూత కాబట్టి దివిజకాంతయని ఈ మూడు వలపులను అర్థంచేసుకున్నారు.

మన కవి మానవ స్వభావ పరిశీలనయందు ఎంతటి విమర్శకుడో అంతటి సౌమ్యుడు. నింద్యార్హములైన విషయములను వర్ణించునప్పుడుసైతము ఈతని నోట కటువైన మాట వెలువడదు. శ్రీనాథుని నైషధంలోనుంచి, పినవీరభద్రుని శాకుంతలంనుంచి 'అర్థపుందెరువాటుల్ తెగఁగొట్టిన'వారేయైనా అల్లసాని పెద్దనాది కవీశ్వరులు కుకవులను కటువుగా దూషించి 'కొరత' నెక్కించారు. మన కవి కుకవులను నిందింపలేదు; 'ఏగతి రచియించిరేని సమకాలమువారలు మెచ్చరేకదా!' అనిమాత్ర మని, తన సౌమ్యతను ప్రకటించుకొన్నాడు. ఆనాటి కున్న పూర్వ సాహిత్యములో ఎంత పరిచయము గలవాడైనా ఆ కృతులలో యెన్ని విషయాలు యోగ్యముగా కనుపించినా తానుమాత్రము వాటి ననుకరించినట్టు బయట పడలేదు.

పెద్దన మనుచరిత్రలో వ్రాసిన 'కమ్మని కుందనంబు కసుగందని....అమ్మకచెల్ల వీని వికచాంబకముల్ శతపత్త్ర జైత్రముల్' అన్న పద్యమును చూచి మనకవి మెచ్చుకొని ఉంటాడు. దానిని మనసునం దుంచుకొనే విజయ విలాసములో 'కమ్మని జాళువా నొరయఁగల్గిన....ధిక్కరించువాఁ డమ్మకచెల్ల! నా హృదయ మమ్మక చెల్లదు వీని కెయ్యెడన్'- కమ్మని అన్న పదముతో ఆరంభించి అమ్మకచెల్ల అన్న పాదముతో అంతము చేసినా ఈ పద్యములో కవి నిర్మించిన శిల్పము, అమ్మకచెల్ల అన్న పదమును విరవడము ఎంతో బాగుగా నున్నది. బంగారాన్ని గీటుపెట్టగలవాడు, జాతి కెంపు వెలకట్టగలవాడు, యెంత ఖరీదైనను యివ్వగల ధనికపుత్రుడు ఒక్కడు ఒకచోట కనబడ్డాడు; కాబట్టి తన హృదయమను రత్నాభరణమును వానికి అమ్మకతీరదు అని ధ్వని ప్రధానంగా యెంతో మనోహరంగా వర్ణించాడు. శ్రీనాథుడు వ్రాసిన 'మహిమ హిమవేళలందు నమ్మానవతికి....' అన్న పద్యమును చూచి, ఆ విరుపు తనకు నచ్చినది కాబట్టి తాను 'హిమరసైక సైకతములందు విహరించు కైరవేషువేషు ఘన నిభాంగు', 'తమినిగుడ గుడాకేశుం డమరనదీ విమలవారి నాడుచునుండన్' మొదలైన చక్కని పద్యములలో బయటపడకుండగనే అనుకరణ సాగించాడు.

శృంగార నైషధములో కథ హంస సహాయముతో నడిచినది. ప్రభావతీ ప్రద్యుమ్నములో కథ శుచిముఖి అన్న హంస కథను నడిపింది. ఆ పక్షులు అసాధారణ ప్రజ్ఞ కలిగి మనుష్య భాషలతో చేదోడు వాదోడుగా ఉన్నాయి. చేమకూరకవికూడా పక్షుల సహాయముతో క్లిష్టమైన సన్నివేశాలను పరిష్కరించుకున్నాడు. అర్జునుడు త్రిదండి వేషములో సుభద్రను ప్రతిదినము చూస్తూఉండేవాడు; అయినా సుభద్రతో వివాహ విషయమునుగురించి ప్రసంగించడానికి అవకాశం చిక్కలేదు. తొందరపడిన కార్యభంగము కాకతప్పదు. కాబట్టి అనుకూలమైన సమయముకొరకు వేచియున్నాడు. ఇంతలో ఒకనాడు సుభద్ర 'కంగుల్ దీర్చిన పైఠినీ రవిక....' అన్న పద్యములో ఉన్నట్టు హంస కాలి అందియను పొడుస్తూండగా ముద్దుచిల్క చేదోడువాదోడుగా ఉండగా కనిపించింది. యతీశ్వరుడు వివాహము అను లౌకిక విషయాన్ని గురించి ప్రస్తావించడానికి ఒక సమంజసమైన సమయము

చేకూరింది. ఏదో కల్యాణసూచకమైన శుభశకునము కనబడినట్లు —

> 'చెలియ నిను రాజకీరంబు చెట్టపట్టె,
> కలికి నిను రాజహంసంబు కాలు ద్రొక్కె,
> మంచి శకునంబు లవిగొ నామాట చూడు,
> కన్నె ఈలోన పెండ్లి కాఁగలదు నీకు'

అని ప్రసంగం ఆరంభించగలిగాడు. అర్జునునకు చిక్కు తప్పినది ఈ పక్షులతోనే. తరువాత శృంగార రసావేశముతో వారి అన్యోన్యానురాగాల వర్ణనలతో అర్జునుడు సుభద్రను 'బాహోపరిరంభ సంభ్రమ రసాయత్తైక చిత్తంబునన్' వీక్షించినంతవరకు పోయింది. కథ యింక పైకి పాగకూడదు; సుభద్ర తప్పించుకొని పారిపోవాలి. ఏలాగా అని కవికి మరొక చిక్కు వచ్చింది. ఇక్కడకూడా పక్షులే కవికి సాయంచేశాయి. 'అందియల మ్రోఁతన్(మ్రోతతో) కేకినుల్ రా సఖిజను లేతెంచి రటంచు వే మొరగి హస్తంబున్ విడంజేసి నేర్పున' సుభద్ర తప్పించుకొనిపోయింది. తరువాత కథ నిర్విఘ్నంగా సాగింది.

ఈ విధంగా అనుకరణలోగూడ తన స్వాతంత్ర్యాన్ని ప్రదర్శించేవాడు. కవితా ప్రాశస్త్యాన్ని సాధించటానికి మన కవి ఉపయోగించిన సాధనసంపత్తి పరిశీలించడం సంతోషప్రదము. మనకవి ఉపమావాచకములను మిక్కిలి శ్రద్ధతో, అర్థగౌరవముతో ఉపయోగించగల నేర్పు అలవరుచుకున్నాడు. ఈ విశేషము ఆంధ్రకవి శ్రేణిలో ఇం కెవ్వరికిని లే దని నిరాఘాటముగా చెప్పవచ్చును. సాధారణ ఉపమావాచకాలు 'వలె', 'పోలె' మొదలైనవికాక ఉపమానము తెలియజేయుటకు కవులు ఉపయోగించే తమ్ముడు, స్నేహితుడు, జోడు - మొదలగు పదములను కడుంగడు నేర్పుతో ఉపయోగించి పాఠకులకు ఆనందము సమకూరుస్తాడు చేమకూరకవి.

> 'అతని నుతింప శక్యమె ? జయంతుని తమ్ముఁడు
> సోయగమ్మునన్,
> బతగకులాధిపధ్వజుని ప్రాణసఖుండు కృపారసమ్మునన్
> క్షితిధర కన్యకాధిపతికిన్ బ్రతిజోదు సమిజ్జయమ్మునం
> దతనికతండెసాటి చతురబ్ధి పరీత మహీతలమ్మునన్'

అన్న పద్యములో శ్రీనాథునివలె తమ్ముడు, ప్రాణసఖుడు, ప్రతిజోదు అన్న మాటలను ఉపమావాచకాలుగా ప్రయోగించాడు ; 'జయంతుని తమ్ముడు సోయగమ్మునన్'- అందములో సుప్రసిద్ధుడైన జయంతుని వంటివాడు అన్న అర్థముతోపాటు జయంతునకు అర్జునునకుగల పురాణ ప్రసిద్ధమైన అన్నదమ్ముల వరుసను తెలియజేసి తన చమత్కారమును చూపించాడు ; జయంతుడు, అర్జునుడు ఇద్దరూ ఇంద్రుని కుమారులేకదా! అలాగునే కృపారసంబులో నారాయణుని పోలినవాడని చెప్పుతూ ప్రాణ సఖుడు అన్న పదమువల్ల 'నరనారాయణులకు' గల స్నేహాన్ని సూచించాడు కవి; కిరాతార్జునీయములోని ఈశ్వరార్జునుల పోరాటాన్ని సూచిస్తూ 'ప్రతిజోదు' అన్న మాటను ప్రయోగించాడు ; ఇంత చమత్కారము చూపించినా కవికి తనివి తీరక నాల్గవపాదములో 'అతని కతండెసాటి చతురబ్ధి పరీత మహీతలమ్మునన్' అని పాద పూరణములాగ కనబడేటట్లు వ్రాశాడు. పై చరణాలలో ఉపమానముగా చెప్పిన జయంతుడు, నారాయణుడు, ఈశ్వరుడు క్రమముగా స్వర్గములోను, వైకుంఠములోను, కైలాసములోను ఉన్నవారగుటచేత విశాలప్రపంచములో చతురబ్ధి పరీత మహీతలమ్ములో సరిపోలినవారు లేరని అతని కతండె సాటియని పద్యాన్ని ముగించాడు కవి.

లోకోక్తుల ప్రయోగములో మన కవికి అసాధారణమైన నేర్పు గలదు. 'అందినన్ సిగయు, అందకయున్న కాళ్లు' ఎందరో కవులు ప్రయోగించకపోలేదు. ఆ లోకోక్తినే ఈతడు ఈవిధంగా ఉపయోగించాడు :

> 'శివుఁ డిటు రమ్మటంచు దయచేసినచోఁ దలకెక్కి తుగ్రమై
> భవమునఁ జూచుచో నడుగు వట్టితి, వేమనవచ్చు నీగుణం ?
> బవునవు, నందినన్ సిగయు నందకయున్నను కాళ్లు పట్టుకొం
> దువు హరిణాంక, వేలకొలఁదుల్ గద నీనడకల్ దలంపఁగన్'

'అందినప్పుడు చంద్రుడు ఈశ్వరుని సిగపట్టడం, అందని నాడు (దక్షాధ్వరధ్వంసములో) కాళ్లుపట్టడం' వర్ణిస్తూ లోకోక్తికి మనోహరమైన అన్వయము కల్పించాడు ; అంతటితో సంతృప్తి పడక చంద్రుని 'వేలకొలఁదుల్ గద నీ నడకల్ దలంపఁగన్' అంటూ నీ ప్రవర్తన వేయి విధాలుగా వుంటుందన్న బాహ్యార్థముతోపాటు ఆకాశమునందు చంద్రుని సంచారము వేళను పట్టి కొలవవచ్చును అన్న యథార్థాన్నిగూడ స్ఫురింపచేశాడు. 'మోక్షమునకు పోవ మొసలెత్తుకొనిపోయె' అన్న లోకోక్తిని అర్జునుని సౌభద్ర తీర్థయాత్రలో, స్నానము చేయువానిని నిజముగా మొసలి పట్టుకొను సన్నివేశములో ఉపయోగించి, అక్షరాక్షర సమన్వయము కలిగించాడు. 'చేసినది జపము, వేసినది గాలము' అను లోకోక్తిని

> 'చేసె జప మతఁడు కడు వి
> శ్వాసము చెలిచూపుబేడిసలపై నిగుడన్ ;
> చేసినయది జపమున్ మఱి
> వేసిన యది గాల మనుట వృథ గాకుండన్.'

లో జపమును, బేడిసలనుచూపి కవి అర్థవంతం చేశాడు. ఇటువంటి సొగసునే కవి తిరస్కారవాక్య ప్రయోగములోగూడా విశేషంగా కనపరుస్తాడు.

అర్థగౌరవముతో రసము చిప్పిలినట్టు చేసిన పద ప్రయోగము చేమకూరకవికి వెన్నతోడ బెట్టిన విషయము. ఊహించిన కల్పనకు వ్రాయనున్న పద్యమునకు అనుగుణ మైన పదములు తమంత తామే కవికి స్ఫురిస్తాయి. వాటిని కవి ప్రయత్నించి ఉపయోగించాడనడము దోషము. తాను చదివిన చదువు, చేసిన విద్యావ్యాసంగము, వినియో గించిన శ్రద్ధాభక్తులు అన్నీ ఈపద సారాంశము తెలిసికో డానికే. కవిదృష్టిని ప్రతిపదము ఒక వ్యక్తిత్వము కలిగిన ట్లుంటుంది.

శ్లేష మన కవి చేతుల్లో చాల చమత్కారంగా ప్రకా శించింది. రామరాజ భూషణుడు సంస్కృత పదములతో చూపించిన శ్లేష సొగసులను ఇతడు తేటతెలుగు మాట లలో చూపగలిగి ప్రశస్తి పొందాడు. ఈతని శ్లేషలు తమంత తామే విడిపోవు పూవులవంటి వనడము సత్యము. చేమకూర కావ్యములలో హృదయంగమములగు శ్లేషలు లెక్కకు మిక్కిలిగా పాఠకులకు ఆహ్లాదమును కలిగించును.

కవికి ఔచిత్యము పాటించుటయందు శ్రద్ధ విశేషము. 'భక్తి విశ్వాసముల్ నీ సొమ్ములు' అన్న రఘునాథుని మాటలు రాజునందేకాక వర్ణనకు ఎత్తుకొనిన విషయముల యందును, భక్తి విశ్వాసములు కవికి ఉండునని ఊహించ వలెను. కాబట్టే అతడు అతివ్యాప్తి, అవ్యాప్తి దోషాల పొంత పోకుండ శ్రద్ధతో ఔచిత్యాన్ని పోషిస్తాడు.

ఇన్ని మంచి లక్షణములతో ఇంత చక్కని కవిత్వము చెప్పిన చేమకూరకవి కొన్ని వ్యాకరణ విరుద్ధములైన ప్రయోగములు చేశాడని ఒక విమర్శన కలదు. అనవల, సంటిగాక, అటుచూపిటు, ఇటుచూపటు వంటి క్త్వార్థకే కార సంధులు - ఊడుకపోవులాంటి 'కొని' కి 'క' ప్రయోగ ములు - సిగ్గుకు, వాదుకు వంటి నుగామములేని ఉదంత షష్ఠివాడటము 'ర' 'అ'లకు యతి నిలపటము వానిలో కొన్ని. తెలుగు నుడికారము బాగా తెలిసినవాడు. పదముల కూర్పులో గల మార్దవము గుర్తెరిగినవాడు కాబట్టే కవి చెవులకు ఇంపుగానుండి మనస్సునంటేలాగ ప్రయోగించా డనడమే సమంజసము. అటుచూపి యిటు, యిటుచూపి యటు అంటే ఆ సొగసు కనబడదని వేరె చెప్పనక్కర లేదు. అక్కడక్కడ ఇలాటి వ్యాకరణోల్లంఘన చేసిన వారేగదా శ్రీనాథుడు, ముక్కుతిమ్మన మొదలైన కవి చక్రవర్తులు.

అంతేగాని చేమకూరకవి నియమాల నుల్లంఘించాలన్న ఊహ కలవాడు కాడు; కాబట్టే తాను అవసరముండినా లేకపోయినా అష్టాదశ ప్రబంధ వర్ణనలను తనకావ్యము లలో పాటించాడు; తన గుణాధిక్యము, భావస్వాతం త్ర్యము, అంతా ఈ నియమాలకు లోబడియే ప్రదర్శించ నెంచాడు. అయినా తన కథాగమనానికి అడ్డు తగిలేలాగ కవి ఈ వర్ణనల వ్యామోహంలో పడలేదని మాత్రం చెప్పక తప్పదు. కథ నడపవలసిన పట్టులలో ఆ యా సన్నివేశ ములు, అందుగల భావములు, వాని పరిణామములు ఇతడు మిక్కిలి శ్రద్ధతో పాఠకుల కంటికి కట్టినట్లు చిత్రించాడు; కథ ప్రధానముకాని వర్ణనలవిషయములో అపూర్వము లగు కల్పనలతోను, అద్భుతములగు పద చమత్కారముల తోను హృదయ రంజకముగా వర్ణించాడు; ఇలాగున కథ, వర్ణన, నిరూపణలయందు తన సామర్థ్యాన్ని చూపగలిగి ఆంధ్రులకు అభిమానకవులలో ఒక్కడయి వన్నె కెక్కాడు.

ఆంధ్ర సారస్వతానికి మరవరాని మహాకావ్యాలను ప్రసాదించిన ఈ వెంకటరాజు భోగినీకుల సంజాతుడని ఒక వాద ముంది. నిజంచేత సత్కవిత్వానికి కులమతములతో పనిలేదు. సర్వజన శ్లాఘా పాత్రుడయిన, ఏ కులములో పుట్టినను అగ్రగణ్యుడే. తన ఆశ్వాసాంత గద్యలలో 'చేమ కూర లక్ష్మణామాత్య తనయ వినయ ధురీణ....' అని ఉండడంవల్లనూ, ముప్పయి ఇద్దరు మంత్రుల చరిత్రలో చేమకూరప్పరా జన్ననియోగి పేరుండడంవల్లనూ ఈ కవి తండ్రి లక్ష్మణుడన్న నియోగి బ్రాహ్మణుడని ఊహించారు. దీనికి 'క్షత్ర ధర్మమేకద నీకు కలది మొదల' అన్న పద్య విషయము ప్రతికూలము. కాబట్టి చేమకూర లక్ష్మణా మాత్యునికి భోగకాంతయందు పుట్టినవాడని నిర్ణయిం చారు. గద్యలోనున్న 'అమాత్య' శబ్దమే ఈ వాదనకు మూలము. ఈ వెంకటరాజు స్వహస్తముతో వ్రాసిన గద్యలో 'లక్ష్మణామాత్య' అని ఉందో, కాక 'లక్ష్మ ణార్య' అనే వుందో చెప్పలేము. లేఖకులు అభ్యాసాన్ని బట్టి పొరపాటున అమాత్యపదము చేర్చి ఉండవచ్చును. అదీకాక అమాత్య అన్నమాటకు ఈనాడు మనము నియోగి అని అర్థం చెప్పుకుంటున్నా అసలు 'అమా = సహావసతి - అమాత్య' అని 'కూడనుండువాడు' అన్న అర్థములో కవి ఇట్లన్నాడో చెప్పలేము.

నియోగికి పుట్టినవాడనని కవి చెపుతూ ఉండగా రఘు నాథనాయకుడు 'క్షత్రధర్మమెకద నీకు కలది మొదల' అని అంటాడా? ఆ దినాలలో ఈనాయకులే రాజులు కదా! వారిదేకదా క్షత్రధర్మము. సంకరజాతివానిని తమలో కలుపుకుంటారా? ఈ కవిపేరు వెంకటరాజు అని రాజు పదముతో నుండడానికి అంగీకరిస్తారా? తంజా వూరు నాయక రాజుల పాలనలో ఉన్నప్పుడు నాయక పీరులు చాలవరకు రాజు అన్న పేరుతో నున్నవారే. రాజు అన్నది ఆనాటి నాయకులకు బిరుదు పదము. ఒక

వేశ్యాపుత్రుడు తాను వెంకటరాజునని ఆ బిరుదు పదముతో నిలబడితే ఆ నాయకరాజులు ఊరుకోరు. ఆ దినాలలో ఇలాంటి పేరులలోను, గౌరవాలలోనూ పట్టింపు మరీ విపరీతముగా ఉండేది.

మరొక్కవిశేషము : ఈ లక్ష్మణామాత్యు డెంత వేశ్యాలోలుడయినా ఆ కొడుకు తన యింటి పేరుతో బ్రతకడానికి అనుమతి నిస్తాడా ? ఇస్తే ఆ వంశంవారు అంగీకరిస్తారా ? భోగినీపుత్రు లెక్కడైనా తల్లియింటిపేరుతోనే ఉంటారు, కాని ఆ తల్లి నుంచుకొనిన సరసుని యింటిపేరు ఉంచుకోరు. ఆ వేశ్య యింటిపేరుకూడా చేమకూరవారే అనడం సాహసమవుతుంది.

చేమకూరవారు నాయుళ్లలో ఇప్పటికీ ఉన్నారు. ఆ శూరవంశములో పుట్టినవాడు కాబట్టే మన కవి ఆడువారిపేరు వెలుపలికి రానీయలేదని భావించవచ్చును. ఆమె సంతాన వాంఛతో సూర్యనారాయణునారాధించి ఈ వరప్రసాదిని కన్నది. వేశ్యలు యౌవనకాలం పొడిగించడానికే చూస్తారు కాని యౌవన విచ్ఛేదనకు 'కుఠార 'మనదగిన సంతానా న్నపేక్షించరు. ఈ తల్లి సూర్యారాధన జగద్విదితమని రఘునాథనాయకుని మాటలు — 'సామాన్యుడవే సూర్యవరప్రసాది విజ్జగ మెరుగన్' - చాటి చెపుతున్నాయి. ఆ తల్లివలన విన్న సంతానవాంఛ, శైశవక్రీడలు మొదలయిన విషయాలనే వెంకటరాజు తన సారంగధర చరిత్రములోనికెక్కించి యుండునేమో. లా. ధ. రా.

**వెంకటపతిరాజు, భూపతిరాజు** (క్రీ. శ. 1872 - 1943): వీరి పూర్వుల నివాసస్థలము జన్మస్థలముకూడ విశాఖపట్టణముజిల్లా, భీమునిపట్నము తాలూకా రేవిడి గ్రామము. పద్మనాభరాజుగారు వీరి జనకులు; తల్లి అప్పల నరసమ్మగారు. తరువాత వీరు జోగి జగన్నాథరాజు - సీతయ్యమ్మ దంపతులకు దత్త కుమారులైరి. వీరి భార్య అప్పలనరసమ్మగారు. ఈమె చనిపోగా వీరు మరల వివాహ మొనరించుకొనిరి. ఆమెపేరుకూడ అప్పలనరసమ్మ గారే. వా రిర్వురియందును శ్రీ రాజుగారికి ఆరుగురు కుమారులును, ఏడుగురు కుమార్తెలును గలిగిరి.

వీరు బాల్యములో విజయనగరము మహారాజావారి యున్నత పాఠశాలలో మెట్రిక్యులేషను పరీక్షయం దుత్తీర్ణులై రాజమహేంద్రవరము కళాశాలలో ఇంటర్మీడియేటు చదివి, మద్రాసు క్రిశ్చియన్ కాలేజీలో 1894 లో బి. ఏ. పట్టభద్రులై, 1896లో బి.ఎల్. డిగ్రీ గైకొని 1897 మొదలు జీవితాంతమును విశాఖపట్టణమున న్యాయవాదిగ నుండిరి.

వీరు న్యాయవాద వృత్తిలో ప్రవేశించిన అచిరకాలముననే న్యాయశాస్త్ర ప్రవీణులుగను, సుస్పష్టమగు భావవ్యక్తీకరణ శక్తి గలవారుగను పేరు పొందిరి ; విజయనగరము, ఉరట్ల, తుని మున్నగు సంస్థానములయొక్క వారసత్వపు హక్కును గూర్చిన వ్యాజ్యములను అతి సమర్థతతో నిర్వహించి వానిని జయప్రదములు గావించిరి.

వీరు న్యాయవాదవృత్తియం దెంత నిపుణులో సాంఘిక రాజకీయ రంగములం దంత ప్రవీణులు. విశాఖపట్టణము, గోదావరి, గుంటూరు, నెల్లూరు పట్టణములలో జరిగిన జిల్లా రాజకీయ సమావేశములకు వీరు అధ్యక్షత వహించిరి. ఆంధ్ర మహాసభా నిర్వాహక ప్రముఖులలో వీరొకరై, కడపలో జరిగిన తత్సమావేశమున కధ్యక్షత వహించి గంభీరోపన్యాస మొసగిరి. వీరు విశాఖపట్టణ పురపాలక సంఘమునకు చిరకాల మధ్యక్షులుగా నుండి పట్టణాభివృద్ధి కెన్నియో విధముల తోడ్పడిరి; ఈ నగర న్యాయవాది సంఘమునకును, టౌను హాలు క్లబ్బునకును అధ్యక్షులుగా నుండి ఆ సంస్థల నెంతయో బాగుచేసిరి ; 1924 లో అఖిలభారత క్షత్రియ మహాసభను నెలకొల్పి చాలకాలము దానిని నిర్వహించిరి.



చిత్రము 264.
భూపతిరాజు వెంకటపతిరాజు

ఫిజీ దీవులలోని హైందవుల కష్టములను విచారణ చేయుటకై ప్రభుత్వముచే నియమింపబడిన సంఘమునకు వీ రధ్యక్షులై ఆ దీవులకు వెళ్లి యచ్చటి హిందువుల పరిస్థితులను విచారించిరి. దానిపై వీరు పంపిన నివేదిక ప్రభుత్వమునకు దిగ్భ్రాంతి కలిగించినదట.

వీరు మదరాసు రాజధానిలోని భూస్వాముల నియోజకవర్గమునుండి మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిలునకు రెండు పర్యాయములును, ఢిల్లీ లెజిస్లేటివు అసెంబ్లీకి రెండు పర్యాయములును సభ్యులుగా నియమితులై ఆ పదవులను అతి సమర్థతతో నిర్వహించిరి. వీరి కార్యదక్షతకు మెచ్చి ప్రభుత్వమువారు వీరికి సి. ఐ. ఇ. బిరుదము నిచ్చి గౌరవించిరి. ఏ విషయము గూర్చియైనను, ఎప్పుడైనను విమర్శింపవలసివచ్చినప్పుడు మోమోటమి లేకయే నిస్సంకోచముగ విమర్శించుటయే వీరి తత్త్వము. క్షత్రియుల యభ్యుదయమునుగూర్చి వీరి భావము లెంత యుదాత్తములో పంచముల యభివృద్ధినిగూర్చిగూడ వీరి ఆశయము లంత యుదారములు. కనుకనే పంచముల

విద్యాభివృద్ధికిని, అభ్యుదయమునకును విశాఖపట్టణములో నెలకొల్పబడిన సాంఘిక సంస్థకు వీ రధ్యక్షులుగా నుండి చేసిన సేవ చిరస్మరణీయము. కొ. జో. శ.

**వెంకటప్పయ్య, కొండా** (క్రీ. శ. 1866 - 1948): ఈయన నివాసము మొదట పాత గుంటూరు. ఈయన తండ్రి కోటయ్యగారు.

ఈయన గుంటూరులో మిషను పాఠశాలలోను, మదరాసు క్రైస్తవ కళాశాలలోను విద్య నభ్యసించెను; బి. యల్. పరీక్షయం దుత్తీర్ణుడై మచిలీపట్టణములో న్యాయవాద వృత్తి నారంభించెను. పౌర వ్యవహారముల యం దీయనకు చిన్నతనమునుండియు ఆసక్తి యెక్కువ. కృష్ణాపత్రికను స్థాపించిన వారిలో ఈయన యొకరు. ఈయన దానికి కొద్దికాలము సంపాదకుడుగా నుండి రాజకీయముగ గొప్ప ప్రబోధము కావించెను. కృష్ణ జిల్లా గుంటూరు, కృష్ణ జిల్లాలుగ విభజన యైన పిదప ఈయన గుంటూరికి వెళ్లి అచ్చట తన వృత్తిని సాగించెను; అందు పేరు ప్రతిష్ఠలు సంపాదించి అచటి న్యాయవాదు లలో ప్రముఖు డయ్యెను.

ఈయన ఆంధ్రోద్యమ జనకుడు. 1913 లో ప్రథమాంధ్ర మహాసభ బాపట్లలో జరిగెను. అప్పు డేర్పడిన స్థాయీ సంఘమునకు ఈయన కార్యదర్శియై కాంగ్రెసు స్వరాజ్య సంగ్రామ మారంభమగువరకు ఆ పని నకుంఠిత దీక్షతో చేయుచు వచ్చెను. గాంధిమహాత్ముడు స్వరాజ్య సంపాదనమునకు సహాయ నిరాకరణోద్యమమును ప్రారంభించి కోర్టుల బహిష్కారమును ప్రబోధించక మునుపే ఈయన ఆంధ్రోద్యమవ్యాప్తి, ప్రబోధముల నిమిత్తము 1915 నుండి సంవత్సరమునకు దాదాపు పది, పండ్రెండు వేలు ఆదాయము వచ్చు న్యాయవాద వృత్తిని వదలిపెట్టెను. 1917 లో నెల్లూరులో జరిగిన ఆంధ్ర మహాసభకు ఈయన అధ్యక్షుడుగ ఎన్నుకొన బడెను. ఆ సంవత్సరమే మాంటేగ్యు - చెమ్స్ ఫర్డుల వద్దకు ఆంధ్ర రాష్ట్ర స్థాపనావశ్యకతను గురించి వివరించుటకై వెళ్లిన రాయబారివర్గములో ఈయన యొకడు.



చిత్రము 265.
కొండా వెంకటప్పయ్య

ఈయన గాంధిమహాత్ముని ఆదేశమును అక్షరశః స్వీకరించి కాంగ్రెసు రాజకీయములందు చరించిన నాయకులలో నొకడు. కాంగ్రెసు అధికార పదవులలో జిల్లా కాంగ్రెసు అధ్యక్షపదవినుండి అఖిల భారత కాంగ్రెసు అధ్యక్షపదవివరకు ఈయన అధిష్ఠింపని పదవి లేదు. కొంత కాలము గుంటూరుజిల్లా కాంగ్రెసు కార్యదర్శిగ, తరువాత అధ్యక్షులుగ నుండి ఈయన 1918 లో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుకు అధ్యక్షుడై 1923 వరకు ఆ పదవి నలంకరించెను; అఖిలభారత కాంగ్రెసు కమిటీలో చాల సంవత్సరములు సభ్యుడుగ నుండెను; 1923 లో అఖిలభారత కాంగ్రెసుకు కొంతకాల మధ్యక్షుడుగ నుండెను.

ఈయన గాంధిమహాత్ముని నాయకత్వమున జరిగిన వివిధోద్యమములందు ప్రముఖపాత్ర వహించెను. తత్ఫలితముగ ఈయనను ప్రభుత్వము 1921, 1930, 1932, 1942 లలో నిర్బంధించి కారాగారమున నుంచెను. కారాగారమున ఈయన స్నానపానములు, జపతపములు, గ్రంథరచన, పురాణవ్యాసంగము చేయుచు జీవితము గడపెను.

1937 లో ఈయన గుంటూరు - తెనాలిపట్టణ నియోజక వర్గము పక్షమున మదరాసు శాసనసభకు ప్రతినిధిగ నెన్నుకొనబడెను. ఈయన యప్పుడు శాసనసభలోని కాంగ్రెసు పక్షమునకు కార్యదర్శిగ నుండెను.

రాజకీయాందోళనలోకంటె ఈయనకు నిర్మాణకార్యక్రమమందు విశ్వాస మెక్కువ. అఖిలభారత చరఖా సంఘమున కీయన యావజ్జీవ సభ్యుడుగ నుండెను. ఆంధ్ర రాష్ట్రమున హరిజన దేవాలయ ప్రవేశవిషయమున గొప్ప ప్రచారకృషి చేయుటయే కాక కేరళమున గురువాయూరు సత్యాగ్రహమున సైతము ఈయన పాల్గొనెను.

స్వరాజ్యపు పోరాటము దినములలో వీరి భార్య పక్షవాతముతో బాధపడి మృతినొందెను. ఈయన కిరువురు కొమార్తెలు. ఈయన కడలూరు కారాగృహమున నుండిన కాలమున 'డచ్ రిపబ్లిక్' అను ఉద్గ్రంథమును రచించెను. అది ఈయన మరణానంతరము ప్రకటితమైనది. ఈయన ఆంగ్లమునను, ఆంధ్రమునను గొప్ప వక్త; కవి. ఈయనకు నాటకములన్న మక్కువ ఎక్కువ. చిన్నతనములో ఈయన స్త్రీపాత్ర ధరించి ప్రేక్షకుల మన్ననల బడయుచుండెను. వివిధరంగములం దీయన చేసిన సేవను గుర్తించి ఆంధ్ర ప్రజానీకము ఈయనకు 'దేశభక్త' బిరుద మొసగిరి. స్వా. సీ.

**వెంకటప్పయ్యశాస్త్రి, తాడేపల్లి**: వీరు వైదిక బ్రాహ్మణులు, ఆత్రేయ సగోత్రులు, ఆపస్తంబ సూత్రులు. వీరి స్వస్థలము గుంటూరుజిల్లా, బాపట్ల తాలూకా చందవోలు. వీరి తండ్రి హనుమచ్ఛాస్త్రి, తల్లి లక్ష్మమ్మ, భార్య హనుమా

యమ్మ. వీరు నిరంతరము మహానిష్ఠతో శ్రీదేవ్యుపాసన చేయుచు నుభయభాషా పాండిత్యముతో శిష్యులకు నిష్ఠతో విద్య గరపుచు అనూనమైన కవిత్వము చెప్పుచు గొప్ప భాషా సేవ చేసినవారు. శ్రీరామకథామృతము అనుపేర రామాయణము షట్కాండలు, ఉత్తరకాండమును గొప్ప గ్రంథముగా రచించిరి; కవిగుణప్రకాశిక, త్రిశంకు స్వర్గము (నాటకము), భద్రాయురుపాఖ్యానము, శ్రీశంకర విజయ కథాసార సంగ్రహస్తోత్రము మున్నగువానిని కూడ వీరు రచించిరి. వీ రించుమించుగ నిరువదవ శతాబ్ది పూర్వ భాగావసానమున మరణించిరి. అ. వా.

**వెంకట బొ్రయ్యా, కావలి** (క్రీ.శ. 1776 - 1803): ఇతడు ఆరువేల నియోగి బ్రాహ్మణ శాఖీయుడు; వెంకట సుబ్బయ్యగారి కుమారుడు. పడుమటి గోదావరిజిల్లా ఏలూరు గ్రామము ఇతని స్వస్థలము. తెలుగు సంస్కృత ములలో చిన్నతనముననే పాండిత్యము సంపాదించి ఇతడు సంస్కృతములో చక్కని శ్లోకములు రచించుటకు మొదలుపెట్టెను; ఈస్టిండియా కంపెనీవారి కొలువులో చేరుటకు యోగ్యత సంపాదింపదలచి ఏలూరికి తూర్పున రెండు మైళ్ల దూరములో నున్న కొత్తూరు గ్రామము జాగీరుదారు ఖాసీవద్ద ఫారసీ, హిందూస్తాని భాషలు నేర్చుకొని ఈ రెండిటిలోను గొప్ప పాండిత్యము సంపాదించెను. ఇతడు తన పండ్రెండవ యేట కసింకోటజిల్లా జమీన్‌దారు సోదరిని వివాహము చేసికొనెను; పదు నాలుగవ యేట మచిలీపట్నములోని మార్గన్ పాఠశాలలో చేరి చదివెను; తరువాత అచటి సైనిక వేతనాధ్యక్షుని కార్యాలయములో చేరి ఒంగోలు, మునగాల, కొండపల్లి మొదలైన చోట్లనున్న సైన్యములకు జీతములు పంచి పెట్టుటకు చాల తడవలు నియోజితు డయ్యెను; పదు నెనిమిదవయేట మాధవాయిపాలెము (నరసాపురము) లోని మిస్టర్ డెంట్ వద్ద లేఖకుడుగా కుదిరెను; తరువాత ఆ కాలములో నిజాము రాజ్యమును సర్వే చేయుచుండిన ఇంజనీర్లలోని లెఫ్టినెంట్ (తరువాత కల్నల్) మెకెంజీకి ప్రధాన లేఖకుడుగాను, దుబాసిగాను నియమితు డయ్యెను. మెకెంజీ తరువాత మేనిల్లా దండయాత్రలో పాల్గొనుటకు హిందూదేశమును విడిచి వెళ్లవలసివచ్చెను. అపుడు విధి లేక బొ్రయ్యా ఇంటికి తిరిగి రావలసి వచ్చినది. ఇతడు హైదరాబాదునుండి మద్రాసు వచ్చుచుండగా తన దైనిక చర్య వ్రాయుటయే కాక సంస్కృతములోను, తెలుగు లోను కొన్ని శ్లోకములు, పద్యములు వ్రాసెను.

దండయాత్రనుండి మెకెంజీ మరలివచ్చి ఎప్పటివలె తన సర్వే పనిలో నియోజితుడైనప్పుడు మరల అతనివద్ద చేరి అతడు టిప్పుసుల్తానుతోడి యుద్ధసందర్భమున శ్రీరంగము వెళ్లినప్పుడు ఇతడును వెళ్లెను. 1799 లో ఇంగ్లీషువారు శ్రీరంగపట్టణము కోటను సాధించినప్పుడు ఇత డక్కడ నుండి ప్రత్యక్షముగ ఆ ముట్టడిని చూచి తెలుగులో ఒక కావ్యము చెప్పెను. ఈ కావ్యరచనకు సంతసించి మెకెంజి ఇతనిని బహుమానించెను.

తరువాత మెకెంజి మైసూరు దేశమును సర్వేచేసి నపుడు బొ్రయ్యా అతనితో బెంగుళూరు, నిడిగల్లు సీరా మార్గమున చిత్రదుర్గమువరకు వెళ్లెను; హరిహర్ వద్ద సర్ ఆర్థర్ వెల్లస్లీ సేనతోవెళ్లి ధోండియా అను మహారాష్ట్ర నాయకుని పట్టుకొన్నప్పుడు ఆ సందర్భమున కనుగుణ ముగా ఒక కావ్యము రచించెను. ఇతడు వ్రాసిన మరొక కావ్యము ఉమ్మత్తూరు సంస్థాపన దగ్గరనుండి దానిని పాలించిన శ్రీరంగపట్టణరాజులవంశావళి. ఇదికాక యాదవ రాజ వంశావళి అను గ్రంథమునుకూడ ఇతడు రచించెను.

మెకెంజి యభీష్టము ననుసరించి ఇతడు గణితవిద్య లోను, భూగోళ ఖగోళాది శాస్త్రముల విషయమునను యూరోపియను పద్ధతి ననుసరించియు, హిందూ పద్ధతి ననుసరించియు గొప్ప పాండిత్యము సంపాదించెను. ఇతనికి తెలుగు, హిందూస్తానీ, ఫారసీ, ఇంగ్లీషు, కన్నడము, అరవము, మహారాష్ట్రము అను ఏడు భాషలు వచ్చును. డ్రాయింగు వేయుటలోను, దేశపటములను తయారు చేయుటలోను ఇతనికి గొప్ప ప్రజ్ఞ కలదు. ఇతడు వేసిన దేశపటములను జూచి మెకెంజి చాల మెచ్చుకొనువాడు.

ఒకప్పుడు నిజాము రాజ్యములో సర్వే చేయుచుండి నపుడు మెకెంజి కాగితములు మొదలయినవాటిని ఒక జమీన్‌దారుని మనుష్యులు దొంగిలించిరి; వాటిని తిరిగి సంపాదించుటకై పోయిన బొ్రయ్యాను చెరలో ఉంచిరి. కాని ఇతడు తన సాధువర్తన వల్లను, మనసు కరగునట్లు ఆ జమీన్‌దారుమీద వ్రాసి పంపిన పద్యములవల్లను ఆ జమీన్‌దారు కఠిన హృదయము మెత్తబడి ఇతనిని తన సమక్షమునకు పిలిపించుకొనెను. ఇతడు తన పాండిత్యము వల్లను, కవిత్వమువల్లను, ప్రసంగ చాతురివల్లను జమీన్ దారుని మెప్పించి కాగితములను తిరిగి సంపాదించుకొని వచ్చుటయేకాక ఆయనవలన బహుమతులుగూడ బొందెను.

ఆంధ్రదేశమునందేకాక హిందూదేశమునందు సైతము ప్రాచీన శాసనములను చదివి అర్థము చేసికొనలేని కాల ములో ఈతడే మొదటిమారు ఆ పనియందు కృతకృత్యు డయ్యెను. ఈతడు వచ్చువరకు మెకెంజిగాని, అతనియొద్ద నున్న ఇతరులుగాని ఒక్క ప్రాచీనశాసనమునైనను చదివి అర్థము చేసికొనలేకపోయి రనియు, ఈతడు

వచ్చిన తర్వాత వా రందరు అయిదారు భాషలలోని శాసనములను చదువ సమర్థులైరనియు, ఈతడు వీనిని విడదీసి చదివి అర్థము చెప్పిననాటనుంచి హిందూ విజ్ఞాన మందిరమున ప్రవేశించుటకు బొర్రయ్య యను ద్వారము తనకు దొరకిన దనియు మెకెంజి వ్రాసియున్నాడు.

బొర్రయ్య ఎన్నో పాత నాణెములను సంపాదించెను; ప్రాచీన లిపిలో నున్న వేరువేరు ప్రాంతపు శాసనములకు నకళ్ళు వ్రాసెను. ఒకప్పుడు దోదరిలో దొరకిన తెలుగు - కన్నడ లిపిలోని హళెకన్నడ శాసనమును ఇతడు చదివి అర్థము చెప్పినపుడు మెకెంజి అపరిమితానందము నొంది అతని పేరు దానిమీద చెక్కించి ఏషియాటిక్ సొసైటి మ్యూజియములో ఉంచెనట.

కల్నల్ మెకెంజి మదరాసుకు బదిలీయై వచ్చినపుడు ఆయనతోకూడ ఇతడు మదరాసు వచ్చెను. అచట రెండేండ్లు మెకంజీక్రింద పనిచేసిన పిదప ఇరువదియారేండ్ల లేత వయసుననే ఇతడు కాలధర్మము నొందెను. ఇతని మరణమునకు మిక్కిలి దుఃఖించి ఇతనిని దహనము చేసిన చోట మెకెంజి చిన్న శాసనము వేయించెనట. అది 1834 వరకు ఉండినట్లు తెలియుచున్నది. మ. సో. శ.

**వెంకటరంగయ్య, వంగోలు** (క్రీ.శ. 1867 - 1949): వీరు వంగోలు శేషాచలపతి పంతులుగారి ముఫ్వురి కుమారులలో కనిష్ఠులు; ఆరువేల నియోగిశాఖకు చెందిన ఆత్రేయసగోత్రికులు; మెట్రిక్యులేషన్‌వరకు నెల్లూరు హిందూ స్కూలులో చదివిరి; చిన్నతనములో సాము గరిడీలలోసైతము కృషిచేసి కొంత ప్రావీణ్యమును గడించిరి.

ఉన్నతవిద్యకై వీరు చెన్నపట్టణములోని క్రైస్తవ కళాశాలలో చేరిరి; అచట వీరికి ప్రభుత్వసహాయము కొంత లభించినను, సంపన్నులు కాకపోవుటవల్ల ఎల్లెల్లో చదువు పూర్తి చేసికొనిరి; విద్యార్థులను క్రైస్తవులుగ చేయుటకై అప్పటి కాలమున జరుగుచుండిన ప్రయత్నములను ప్రతిఘటించి ప్రఖ్యాతి గాంచిరి. వీరు తర్వాత బి.యల్. పట్టము పొందిరి; కాని కొంతకాలము రిజిష్ట్రారుగ పనిచేసి, ఆటుపిమ్మట 1899 లో నెల్లూరున వకీలు వృత్తి మొదలిడిరి.



చిత్రము 266.
వంగోలు వెంకట రంగయ్య

వకీలు వృత్తిలోని ఆసక్తికంటె వీరికి మొదటినుండియు వివిధగ్రంథముల పఠనమందును, విమర్శయందును ఎక్కువ ఆసక్తి. వీరు గ్రీకు, లాటిన్, ఫ్రెంచి, అరబ్బీ మొదలైన విదేశభాషలలోను, సంస్కృతము, హిందీ ఉర్దూ మొదలైన దేశభాషలలోను పాండిత్యము గడించిరి; అనేక శాసనములను పరిశోధించి చారిత్రకవిషయములను గురించి వీరు గొప్ప వ్యాసములు ప్రకటించిరి; కొన్ని శాసనములను కూడ పరిశోధించి విమర్శక వ్యాసములతో ప్రకటించిరి. భరతనాట్యశాస్త్రములోని తాండవలక్షణమును చక్కని ఉపోద్ఘాతముతో ఆంగ్లమున రచించిరి.

ప్రత్యేక ఆంధ్రరాష్ట్రముకొరకు కృషిచేసిన మూలపురుషులలో వీ రొకరు. ఈవిషయమై మాంటేగు ఛెమ్సుఫర్డులవద్దకు వెళ్లిన రాయబారములో వీరు పాల్గొనిరి; వెంకటగిరి రాజాగారి హైస్కూలు పాలకవర్గములో చాల కాలము సభ్యులుగ నుండి, హైస్కూలు కళాశాలగ మార్చు ఉద్యమములో గొప్ప కృషిచేసిరి. మా. వెం. రం.

**వెంకటరంగాచార్యులు, పరవస్తు** (క్రీ.శ. 1822 - 1900): వీరి జన్మస్థానము విశాఖపట్టణము. వీరి తండ్రి శ్రీనివాసాచార్యులయ్యవార్లంగారు వీరికి సంస్కృత సాహిత్యములోను, తర్కవ్యాకరణ వేదాంతములలోను చక్కని ప్రవేశమును కలిగించిరి. వీరు ఎనిమిదవ యేటనే కుంభకర్ణవిజయ మను సంస్కృతకావ్యమును రచించిరి. వీరు కొంత కాలము రామానుజాచార్యులుగారివద్ద వ్యాకరణమును, వెంకటరాఘవాచార్యులగారివద్దను, కొండపల్లి వెంకటశాస్త్రిగారివద్దను, సుబోధన మిశ్రులవద్దను తర్కశాస్త్రమును అధ్యయనముచేసి, పిమ్మట షట్ఛాస్త్రములలోను, సమస్తదర్శనములలోను, వేదవాఙ్మయములోను స్వయంకృషిచేతనే గొప్ప పాండిత్యము సంపాదించిరి. పాండిత్యమునకు తోడు వక్తృత్వము కూడ కలవారగుటచే ఎల్లరకును వీరు సుశ్లోకులైరి. ఉర్లాములో శ్రావణికి జరుగు విద్వత్సభకు వీ రధ్యక్షులుగా వరింపబడుచుండిరి. చీకటి, విజయనగరము మున్నగు సంస్థానముల యధిపతులు వీరికి భూదానాది బహువిధ సత్కారములు చేసిరి. వీరి సంస్కృతభాషా వక్తృత్వమున



చిత్రము 267.
పరవస్తు వెంకట రంగాచార్యులు

కక్కజమంది మైసూరు సంస్థానాధీశ్వరులు వీరికి 'మహా విద్వత్సంభావన 'ను గావించిరి.

సంస్కృతాంధ్రములలో చక్కని కవిత్వము చెప్పు శక్తి వీరికి బాల్యముననే అలవడెను. వీరు అనేక శతావధానములను గావించిరి; లఘువ్యాకరణ మనుపేర సంస్కృత వ్యాకరణమును శ్లోకములలో రచియించిరి. సంస్కృత భాషలో నొక విజ్ఞానసర్వస్వ ముండుట యవసరమని తలచి వీరు ' శబ్దార్థ సర్వస్వ 'మను నొక బృహద్గ్రంథమును రచించుటకు పూనుకొని చాలవరకు సాగించిరి (శబ్దార్థ సర్వస్వములోని అకార ఆకారాది పదకోశములను వీరే తెలుగు లిపిలో నచ్చువేయించిరి). ఈ గ్రంథము వీరి సర్వతోముఖ పాండిత్యమునకును, కార్యదీక్షకును, విమర్శనా కౌశలమునకును నికషోపలము. దీనితో వీరి కపారఖ్యాతి చేకూరెను. కాని ధనాభావమువలన ఈ పని పొంతము కాలేదు. (చూ: విజ్ఞానసర్వస్వము)

1858 లో వీరు సంస్కృతములో 'ఆంగ్లాధిరాజ్య స్వాగత'మను కావ్యమును, నలచరిత్ర కథావస్తువుగా తీసికొని రస నాయకాద్యుచితములైన మార్పులను చేసి 'మంజుల నైషధ 'మనుపేర నొక సంస్కృతనాటకమును రచించిరి. శాకుంతల నాటకమును తెనుగులోని కనువదించుటలో వీరు మొదటివారు. వీ రాంధ్రీకరించిన మరియొక సంస్కృతనాటకము రాజచూడామణి దీక్షితకృత ' కమలినీ కలహంస 'ము. ఉపనిషద్వాఙ్మయమునుగూడ వీరు కొంత గద్యముగను, కొంత గీతముగను అనువదించిరి. ఆర్షమతమును ప్రకాశింపజేయు గ్రంథముల ననేకములను వీరు రచించిరి. వేదములోని యర్థవాదభాగములకు కొన్నింటికి వీరు నూతనార్థములను వివరించిరి. ఈ రచనలు ' వేదరహస్య ' మను గ్రంథములో ముద్రితమైనవి.

బ్రిటిషుప్రభుత్వమువారు 'మహామహోపాధ్యాయ' బిరుదము నేర్పాటుచేసిన 1887 లో ఆ బిరుదమును పొందిన నలుగురిలో వీ రొకరు.

వీరు అనే కాస్థానములలో పుష్కలముగా ఆర్థిక సత్కారములను పొందిరి. సంస్థానాధిపతుల సన్మానముల కభిలషించి యాత్మగౌరవమును కోల్పోవుటకు వీరెన్నడును సమ్మతింపలేదు; చీకటి సంస్థానపు జమీన్దా రొకసారి తగిన గౌరవమును చూపలే దనుకారణమున ఆ జమీన్దారు ఇచ్చిన అగ్రహారమును పరిత్యజించిరి. వీరికి సంచయాభిలాషకంటె దానాభిరతి మిక్కుటముగా నుండెను. వీరు వేద సంస్కృత పాఠశాలను స్థాపించి కొంతకాలము నడపిరి; ఆర్షవాఙ్మయ ప్రచారమునకై యొక ముద్రణాలయమును కూడ నెలకొల్పిరి. ఆర్షమత మహత్త్వమును ప్రజలలో ప్రబోధించి ఆచార్యులుగారు హిందువులలో క్రైస్తవమత వ్యాప్తిని కొంతవరకు అరికట్టిరి. జీవితములో చివరి పదిసంవత్సరములును రంగాచార్యులుగారు తునిలో నివసించుచు జమీన్దారుగారివలన నేటేటను సహస్రరూప్యముల పారితోషికమునేకాక బహువిధ సన్మానములను పొందుచు వచ్చిరి. జ. పు.

**వెంకట రంగారావు, నాయని** (క్రీ. శ. 1875 - 1958) : వీరు వరంగల్లుజిల్లా తొర్రూరు నివాసులు. వీరు కృష్ణజిల్లా మునగాల సంస్థానాధీశ్వరి యయిన శ్రీరాణి లచ్చమ్మారావుగారికి దత్తపుత్రులైరి. వీరి బాల్యములో సంస్థానము ' కోర్టు ఆఫ్ వార్డ్సు'లో ఉండుటచేత కృష్ణజిల్లా కలెక్టరుగారు వీరికి రక్షకులుగా నుండిరి. జమీన్దారీ హక్కు వ్యవహారము కోర్టుకెక్కినను జిల్లాకోర్టు, హైకోర్టు, ప్రివికౌన్సిలులలో సంస్థానము వీరికే దక్కు నట్లు తీర్పులు జరిగెను.



చిత్రము 268.
నాయని వెంకట రంగారావు

వీరు కృష్ణజిల్లా కలెక్టరు వారి పర్యవేక్షణమున విద్యావివేకములను గడించిరి. వీరికి దివాను కీ. శే. కొమర్రాజు వెంకట లక్ష్మణరావుగారు. వారి సలహాల ప్రకారము రాజావారు స్వదేశాభిమాన, స్వభాషాభిమాన పూరితులై కార్యజాతమును నడుపసాగిరి; ఆంధ్ర దేశములో నెలకొనిన పెక్కు సంస్థలకు పునాదులు వేసి, దోహదముచేసిరి.

1901 లో వీరు ' శ్రీ కృష్ణదేవరాయాంధ్రభాషా నిలయము'ను స్థాపించి పెక్కుసంవత్సరములు దాని కధ్యక్షులుగా నుండిరి; దానికి ప్రారంభదశయందు ఉద్గ్రంథములను కొనిపెట్టుటయందును, ద్రవ్యసహాయము చేయుటయందును వెనుకాడలేదు. వీరు నిలయభవన విస్తరణమునకును భూరివిరాళము లొసంగిరి; గుంటూరులోని శారదానికేతనమునకు భూదానముచేసి దానికి పట్టుకొమ్మయై, దాని యభివృద్ధికి తోడ్పడిరి.

విజ్ఞానచంద్రికా మండలి స్థాపకులును, అధ్యక్షులును రాజావారే. వీరు లక్ష్మణరావుగారు ప్రారంభించిన ' ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము 'నకు కుడిభుజముగా నుండిరి; ఆంధ్ర విశ్వ విద్యాలయమునకును, నారాయణగూడ బాలికల ఉన్నత పాఠశాలకును భూరివిరాళము లొసంగిరి.

వీరు ఆయుర్వేదమునకు, చేనేతవస్త్ర పరిశ్రమకును పోష కులుగ నుండిరి. వీరే హైదరాబాదులోని 'శ్రీలక్ష్మణరాయ పరిశోధకమండలి'కి స్థాపకులును, అధ్యక్షులును. తన్మండలి పక్షమున ప్రకటితమైన 'తెలంగాణాశాసనములు' అను గ్రంథ ముద్రణ భారము నంతయు వీరే భరించిరి.

జమీన్‌దారులు పూర్వము రాజకీయము లన్నను, కాంగ్రె సన్నను భయపడుచుండువారు. కాని వీ రట్టి జంకుగొంకులు లేకుండ కాంగ్రెసు మహాసభలకు వెళ్లుటయే కాక నందిగామలో జరిగిన కృష్ణామండల రాజకీయ, సంఘ సంస్కరణ మహాసభల నిర్వహణబాధ్యత వహించిరి.

వీరు పండిత ఆదిపూడి సోమనాథరావుగారి శ్రీకృష్ణ దేవరాయచరిత్ర ప్రబంధమును కృతినంది కవిని బహుళ ముగ సత్కరించుటయేకాక వారి జీవితమును భీమా చేయించి ప్రీమియములు తామే చెల్లించుచు భీమా సొమ్ము వారికి ముట్టునట్లుచేసిరి. వీరు గొల్లపూడి సీతారామ శాస్త్రిలవారు ప్రకటించుచుండిన ఆంధ్ర వేదగ్రంథములకు ధనసహాయముచేసిరి. ఇట్లు వీ రింక నెన్నో గుప్తదానములు చేసిరి. వీరికి దుర్వ్యసనములు లేవు. వీరు బంధుప్రీతికల వారు; వ్యవహారదక్షులు; దేశభక్తులయెడ నాదరము గలవారు. ఆ. వీ. రా.

**వెంకటరత్నం, కొక్కొండ** (క్రీ. శ. 1842-1915): వీరు గ్రాంథికభాషాపీఠము నధిష్ఠించి ప్రాచీన సంప్రదాయ ములను నవయుగ వికాసమునకు తోడ్పడునట్లు భాషా సేవ గావించి వీరేశలింగమునకు మార్గదర్శకులైన విశిష్ట వ్యక్తి. వీరికి వేంకటరత్నం పంతులని వ్యవహారము. వీరు సాహిత్య రంగముననే గాక మత సాంఘిక వ్యవస్థలయందు బహుముఖముగ పరిశ్రమించినవారు; సాహితీవిషయమున సమీచీనమగు నవ్యతాదర్శము గలిగియు సంఘసంస్కరణ విషయమున సనాతనులు; జన్మముచే ద్వైతమతాను యాయి యయ్యు శాస్త్రీయపద్ధతిని శంకరాద్వైత మత మును స్వీకరించి నియోగియైన సర్వతంత్ర స్వతంత్రులు; ఆర్యమత దర్శనములను భాష్యములను అవలోడించి యక్షర సాంఖ్యశాస్త్రమును నాంధ్రలోకమున కందించిన వారు; 'ఆంధ్రభాషా జాన్‌సన్' అను బిరుదము నందిన పాండితీధనులు; శ్రీ బిల్వనాథక్షేత్రమున బిల్వేశ్వరుని ఉపాసించి తత్కరుణాసిద్ధి బడసిన మహాభక్తులు.

ఆంగ్లభాష రాజభాషయై జీవనాధారమై యఖండ ప్రభావము జూపుచున్న దినములలో నిత్య వ్యవహారమునం దైన నాంగ్లభాషా పదముల నుపయోగింపక వానికి సరియైన పారిభాషిక పదములను నిర్మించి వ్యాప్తిలోనికి తెచ్చిన కీర్తి వీరిదే. 'ప్రిన్సాఫ్ వేల్స్ తారావళి' అను గ్రంథమూలమున లండన్ క్రౌన్ పర్‌ఫ్యూమరీ కంపెనీ వారిచే సన్మానితులై ఖండాంతరముల తెనుగు కవితకు ప్రథమ గౌరవస్థానము నార్జించిన దీ విద్వత్కవియే. నీతిచంద్రికకు పూరణమగు విగ్రహతంత్రము, ప్రిన్సాఫ్ వేల్స్ హిందూస్థాన సందర్శనము అను వీరి వచన రచనలు రెండును ఆంధ్ర వచన వాఙ్మయమున కలంకార ప్రాయ ములు. 'మహాశ్వేత'అను వీరి కృతి మన భాషలో మొదటి నవల. నరకాసుర విజయ వ్యాయోగమును వీరాంధ్రీకరించి సంస్కృత నాటకాంధ్రీకరణమునకు నాందీపూజ గావించిరి.

వీరు శ్రీ బిల్వేశ్వరీయ మహాకావ్యము (తిరువెళ్లంక్షేత్ర మాహాత్మ్యము), కొక్కొండ మాహాత్మ్యము, మంగళగిరి క్షేత్ర మాహాత్మ్యము, ఘటికాచలక్షేత్ర మాహాత్మ్యము, అన్నవరక్షేత్ర మాహాత్మ్యము, సింహాచలక్షేత్ర మాహాత్మ్యముఅను పద్య కృతులు రచించిరి.



చిత్రము 269.
కొక్కొండ వెంకటరత్నం

ఇరువదిరెండేండ్లు మదరాసు రాజధానీ కళాశాలయందును, ఎనిమిదేండ్లు రాజ మహేంద్రవరము కళాశాలయందును తెలుగు పండితులుగా పనిచేసి, సంస్కృతేతర పండితజనదుర్లభ మగు భారతవర్ష 'మహామహోపాధ్యాయ' బిరుదమును ప్రప్రథమముగా బడసి, ఆ పదవికి గౌరవ ప్రతిష్ఠలను గలుగజేసిన యశస్వి వీరు.

ఆంధ్రదేశ పత్రికా వాఙ్మయమున ప్రథమ శ్రేణిలో లెక్కింపదగిన 'ఆంధ్ర భాషా సంజీవనీ' పత్రికను ఇరువ దేండ్లు నడిపి, తెలుగు పత్రికల వాఙ్మయశాఖ కొక ప్రత్యేక స్థానమును గడించినది వీరే. మదరాసులో నాంధ్రు లచే నడుపబడిన పత్రికలలో నిదియే మొదటిది.

జాతీయ మహాజనసభలు లేని కాలమున 'హిందూ శ్రేయోభివర్ధనీ' సభను స్థాపించి, ఆంధ్రభాషలో వక్తృ త్వము, ఉపన్యాస పద్ధతి నెలకొల్పి వాని మూలమున నార్యమత ప్రచారము గావించినది వీరే.

నిత్య వ్యవహారమునందును గ్రాంథిక భాషనే ఉపయో గించి వీరు గ్రాంథికభాషా వాదులకు మూలస్తంభాయ మానులైరి.

పంతులుగారు తెనుగుననేకాక సంస్కృతమున, సంగీత మున పండితులు. సంస్కృతమున జయదేవుని గీతగోవింద మునకు ప్రతిగా వీరు రచించిన 'గీతమహానటనము' సంస్కృత వాఙ్మయ చరిత్ర కెక్కినది. ఇదికాక బిల్వనాథ శతకము, తనుమధ్యార్యాశతకము, అక్షరసాంఖ్య శాస్త్రము మొదలగు కృతులు సంస్కృతమున వీరు రచించిరి; తెలుగున అజామిళోపాఖ్యానము, గీతనారాయణము అను గేయ ప్రబంధములను రచించిరి. ప్రసన్న రాఘవము, ధనంజయ విజయ వ్యాయోగము, బిల్వేశ్వర శతకము, దీక్షితచరిత్రము, గోదావరి వర్ణన మున్నగు తెనుగు కృతులు వీరివి ముద్రితములై ప్రచారమున నున్నవి. బిల్వేశ్వర శతకమున వీరి స్వకీయ వృత్తాంతము గలదు. ఆంధ్ర వాఙ్మయమున నవ్యయుగ ప్రవర్తక త్రయమున (చిన్నయసూరి, వెంకటరత్నము, వీరేశలింగము) మధ్యమ స్థానము నాక్రమించిన మహనీయులు వెంకటరత్నం పంతులుగారు. ని. వెం. రా.

**వెంకటరత్నం, గంజాం** (క్రీ. శ. 1858 - 1910): వీరు తణుకుతాలూకాలోని వేల్పూరు గ్రామములో మేన మామలయింట జన్మించిరి. వీరి చదువుసంధ్యలు యావత్తున్నూ మేనమామల ఆదరణక్రింద జరిగినవి. నరసాపురములో వీరు మెట్రిక్యులేషను పరీక్షయం దుత్తీర్ణులయి వెంటనే పోస్టు ఆఫీసులో గుమాస్తాగ ప్రవేశించిరి; తరువాత ఫస్ట్‌గ్రేడు ప్లీడరు పరీక్షయం దుత్తీర్ణులై కాకినాడలో న్యాయవాదిగ పనిచేసిరి. త్వరలోనే వీరి పేరుప్రతిష్ఠలు పెరిగినవి.


చిత్రము 270.
గంజాం వెంకటరత్నం

వీరి మనస్సు ప్లీడరీవృత్తిమీద కంటె ప్రజాహితసేవ మీద ఎక్కువగా నిలిచినది. 'ల్యాండ్ రెవెన్యూ' సమస్య లంటే వీరికి ఎంతో అభిమానము. 1863 లో ఎకరము మూడు రూపాయల నుండి నీటిపన్ను 1894 లో ఎకరము నాలుగు రూపాయలకు హెచ్చింపబడగా దీనిని నిరోధించుటకు గోదావరి, కృష్ణజిల్లాలలో మిక్కుటమగు ఆందోళన జరిగియుండెను. 'ల్యాండు రెవెన్యూ సెటిల్‌మెంటు' అను శీర్షికక్రింద సెక్రటరీ ఆఫ్ స్టేటు గారి డెస్పాచెస్‌ను ప్రచురించి దీర్ఘమైనట్టియు, గాఢమైనట్టియు వ్యాసములు ఇంగ్లీషు భాషలో వెంకటరత్నంగారు ప్రచురించుచుండిరి. 1897 - 98 సంవత్సరముల ప్రాంతములో కలెక్టరుగా నుండిన వి. ఎ. బ్రాడీగారు 1898 లో వీరిని గోదావరి జిల్లా బోర్డునకు ఉపాధ్యక్షునిగా నియమించి అన్ని అధికారములను వీరి వశము చేసి తాను నామకార్థము అధ్యక్షులుగా నుండి వీరే సర్వాధికారములను చలాయించునట్లు ఏర్పాటుచేసిరి. 1899 లో వెంకటరత్నంగారు మద్రాసు శాసనసభకు ఎన్నుకొనబడిరి. వీరు శాసనసభయందు సభ్యులుగ నున్నది ఒక 'టరం' - అంటే రెండుసంవత్సరములు - మాత్రమే. వీరు తమ 36వ ఏటనే ప్రాక్టీసు మానుకుని రెండు సంవత్సరములు ఏకదీక్షగా 'ల్యాండు రెవెన్యూ పాలిసీ'ని గూర్చిన దస్తావేజులు చదివి ఆ పద్ధతులను ఖండించుచుండిరి.

వీరు తాము సంపాదించిన కొద్దిపాటి ఆస్తిలో కాకినాడ టౌన్ హాలుకు రెండు వెయ్యిన్నూటపదహార్లు దానము చేసిరి. చివరి రోజులలో వీరికి మతిస్తిమితము తప్పి కాలధర్మము నొందిరి. భో. ప. సీ.

**వెంకటరత్నంనాయుడు, రఘుపతి** (క్రీ శ. 1862-1939): వీరు మచిలీపట్టణములో జన్మించిరి; తండ్రి సుబేదారు అప్పయ్యానాయుడుగారు; తల్లి శేషమ్మగారు.

చిన్నతనంలో తండ్రిగారి పటాలం ఎక్కడికి పోతే అక్కడ వీరి విద్యాభ్యాసం జరిగింది. వీరు ఉత్తరహిందూస్తానం 'బాందా'లో దీననాథ బెనర్జీ, గంగాధర ముఖర్జీ అను అధ్యాపకులవద్ద, పిమ్మట దక్కను హైదరాబాదులో సుప్రసిద్ధ ఆచార్య అఘోరనాథ చటోపాధ్యాయులవద్ద చదివి మెట్రిక్ పరీక్షలో ఉత్తీర్ణులైనారు; ఉర్దూభాషలో కూడ అఖండ పాండిత్యం సంపాదించారు. 'బాందా'లో చదువుకొనేటప్పుడే బ్రాహ్మ ధర్మ బీజములు వీరి హృదయ క్షేత్రంలో నాటుకొన్నాయి. వీరు 1885 లో చెన్నపురి క్రైస్తవ కళాశాలలో డాక్టరు మిల్లరువద్ద చదివి పట్టభద్రులయినారు. జీవితాంతం వరకు వీరి 'గురుదేవులు' మిల్లరుదొరగారి ప్రభావం వీరిలో విస్పష్టంగా గోచరించేది. వీరు 1891 లో ఎం. ఏ., 1897 లో ఎల్. టి. డిగ్రీలను పొంది 'లా' చదువు నారంభించి విరమించారు.

వీరి కిరువది యేడవయేటనే పత్నీవియోగం కలిగింది. తరువాత వీరు వివాహం చేసుకోక బ్రహ్మచర్యం సాగించారు. వీరు 1886 లో 'బ్రహ్మ ప్రకాశిక', 'ది ఫెలో వర్కర్', 'పీపుల్స్ ఫ్రెండ్' అను పత్రికలు ఆంగ్లంలో నడిపించి 1886 మొదలు 1898 వరకు ఏలూరు, రాజమహేంద్రవరం, సికింద్రాబాదు, మద్రాసు, బందరు పట్టణాలలో ఉన్నత పాఠశాలలలోను, కళాశాలలలోను ఉపాధ్యాయులుగా పనిచేశారు; యువకులు క్రైస్తవమతంలో పడిపో

కుండా వారి ధర్మ జిజ్ఞాసను భారతీయ సంస్కృతి సంప్రదాయంవైపు మరలించారు ; బందరులో కళాశాలాధికారులతో పడక అక్కడినుండి తప్పుకొన్నారు. ఎంత గంభీరమైన విజ్ఞానమో, ఎంత లోతైన దీక్షతో అంత వినయం, నమ్రత ఉండేవి ఈయనలో. వీరు 1889 నుంచి 1904 వరకు సికింద్రాబాదు మహబూబు కాలేజిలోను, తరువాత 1905 మొదలు 1919 వరకు కాకినాడలో పిఠాపురం రాజావారి కళాశాలలోను ప్రధానాచార్యులుగా పనిచేసి అసమానమైన ప్రతిభతో స్వీయధర్మాన్ని నిర్వహించి ఉద్యోగం నుంచి విరమించుకొన్నారు. విద్యార్థులను నీతిపరులయిన జాతీయపౌరులుగా తయారు చేయడమే వీరి లక్ష్యం. విద్యార్థినులకు, నిమ్నజాతులకు ఉచితంగా విద్యాదానం చేయడం ఆంధ్ర ప్రాంతంలో మొట్టమొదటిసారిగా కాకినాడలో వీరి యాజమాన్యాన ప్రారంభింపబడింది.



చిత్రము 271.
రఘుపతి వెంకటరత్నంనాయుడు

విద్యా రంగంలో నాయుడుగారు అధిష్ఠించిన స్థానాలలో మకుటాయమానమైనది మద్రాసు విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షపదవి. వీరే ఎన్నికవలన ఆ పదవిని 1925-28 లలో అలంకరించిన ప్రప్రథములు. వీ రెంతో నేర్పుతో ఆ పదవిని నిర్వహించి కొత్త సంస్కరణలు ప్రవేశపెట్టి ద్రవిడ భాషలకు తగిన గౌరవ పీఠాన్ని అక్కడ ఏర్పాటు చేశారు ; పరిశోధనలకు సౌకర్యాలు కల్పించారు.

వీరు 1906 లో అఖిల భారత ఆస్తికమహాసభ కధ్యక్షులయినారు. స్థానిక సంస్థలందు, శాసనసభలందు, సెనేటు సభలందు, సాంఘిక సమావేశములందు, ఎన్నో ప్రజాహిత సంస్థలందు ప్రధాన సభ్యులుగా ఉంటూవచ్చారు. వీరిని రావు బహద్దరు, దివాన్ బహద్దరు, సర్ బిరుదులున్ను ; డి. లిట్., ఎల్. ఎల్. డి. గౌరవ పట్టాలున్ను వాటంతట అవే వచ్చి వరించాయి. కడకు బ్రహ్మసామాజికులు భక్తితో వీరిని 'బ్రహ్మర్షి' అని గౌరవించారు. శ్రీ పిఠాపురంరాజావారిచే అనేక సంస్థలకు ధన సహాయం చేయించడమే కాకుండా వీరు బ్రాహ్మధర్మ ప్రచారకనిధి, బ్రహ్మమందిరం, అనాథ శరణాలయం, విద్యాలయం కాకినాడలో నెలకొల్పించారు.

ఏబది సంవత్సరము లభినవాంధ్ర యువకులను సత్యసాన్నిధ్యమున నిలబెట్టిన 'సోక్రటీస్' వీరు ; కులపతులు. అధ్యాపక పీఠమును, ఆచార్య వేదికయు నాయుడుగారి సన్నిధిని కలిసిపోయెడివి. 'కుడిచెయ్యి యిచ్చేది ఎడమ చెయ్యి ఎరుగదు' అనే సామ్యం నాయుడుగారి గుప్తదానాలకే చెల్లుతుంది. పరీక్షల ఫీజుకు, నెల జీతాలకు, బట్టలకు, భోజనాలకు, ఎన్నింటికో ఎంద రెందరు పేద విద్యార్థులో నాయుడుగారి ఉపకృతులను పొందారు. వీరు తమ గురుదేవులు డాక్టరు మిల్లరు పేరిట చెన్నపురి విద్యాలయంలో ప్రతి సంవత్సరం విజ్ఞాన ప్రబోధం గావించడానికి పదివేల రూపాయలు నిధిని ఏర్పాటు చేశారు. తమ షష్టిపూర్తి కానుకగా తమ శిష్యగణం సమర్పించిన సర్వస్వం ఆంధ్ర విశ్వవిద్యాలయ పట్ట ప్రదాన సదస్సులలో ఏటేట విద్యార్థులకు బహుమానాలకై ఇచ్చివేశారు.

పొగ త్రాగడం కల్లు త్రాగడం నిషేధించే కార్యకలాపం, హరిజనోద్ధరణ, కళావంతుల సంస్కరణ, స్వదేశ వస్తువుల వాడకం మొదలగు నిర్మాణాత్మక కార్యక్రమానికి కాంగ్రెసు ప్రారంభించడానికి అర్ధ శతాబ్దము పూర్వమే నిష్కామంగా, ఈశ్వరార్పణంగా, తపస్సుతో వీరు సుస్థిరమైన పునాదులు వేశారు.

వీరు పండిత శివనాథశాస్త్రిగారివద్ద బ్రాహ్మధర్మ దీక్షగైకొన్నారు. వీరిది భక్తిపూరితమైన కర్మయోగం. పాప పంకము చాటున పవిత్ర పద్మమును చూడగల విశ్వాసము, దైన్యమున ఆత్మ గరిమను ప్రతిష్ఠింపగల ధీరవృత్తి, దౌర్బల్యమున శక్తిని సాధింపగల ఉపాసనాబలము వీరి శిష్యులను వీరి పాద పీఠమునకు గట్టివైచినవి. వీరి జీవితము భక్తిరస సింధువు; పతితులకు నావ; అనాథలకు పట్టుకొమ్మ ; భక్తులకు అమరగానము. కం. రా.

**వెంకటరత్నమ్మ, వింజమూరి** (క్రీ. శ. 1888 - 1951): ఈమె పిఠాపురసంస్థాన విద్వన్మహాకవులు దేవులపల్లి తమ్మన్నశాస్త్రి అనే వెంకటకృష్ణశాస్త్రిగారి కొమార్తె. ఈమెభర్త పండితకవి శ్రీ వింజమూరి నరసింహారావుగారు. చిన్నతనంలో తండ్రి పెదతండ్రులయొద్ద కావించిన పరిశ్రమవల్ల ఆంధ్రభాషలో ప్రావీణ్యమూ, ఆంధ్ర వాఙ్మయంతో మంచి పరిచయమూ ఈమెకు లభించాయి. నరసాపురంలో అఖిలాంధ్రదేశస్త్రీలకై జరుప బడుతూ వచ్చిన పోటీ పరీక్షలో 1911 సంవత్సరంలో ఈమె ప్రప్రథములుగాను, 1913 లో విజ్ఞాన చంద్రికా మండలివారి పోటీ పరీక్షలో రెండవదిగాను ఉత్తీర్ణయైనది ; ఆ దినాలలో వెలువడుతూ వచ్చిన 'సావిత్రి', 'హిందూసుందరి' పత్రికలకు, తరువాత 'కేసరి'గారి 'గృహలక్ష్మి' పత్రికకు అనేక వ్యాసములు గద్యపద్యాలుగా వ్రాసినది.

1916 లో 'అనసూయ' అనే మాసపత్రికను ప్రత్యేకం స్త్రీలకోసం పెట్టి తన సంపాదకత్వమున పెక్కేండ్లు జయప్రదంగా నడిపినది.


చిత్రము 272.
వింజమూరి వెంకటరత్నమ్మ

ఈమె నాడు కందుకూరి వీరేశలింగం, రఘుపతి వెంకటరత్నం నాయుడుగార్ల నాయకత్వాన్ని సాగే సంఘ సంస్కరణోద్యమాలలో పాల్గొన్నది. ఆ నాటి నవ్య సాహితీ సమితిలో ఈమె ఒక్కతెయే స్త్రీ సభ్యురాలు. వెంకటరత్నమ్మగారు స్వరాజ్యోద్యమ సందర్భంలో ఖద్దరు వ్యాపకంకోసం ప్రచారంచేసి చాల పాటుపడినది. విం.ల.న.

**వెంకట రమణ దాసు, వీణ** (క్రీ.శ. 1866-1948): దాసుగారి తండ్రి చిన్న గురురాయాచార్యులుగారు, తల్లి లక్ష్మీనరసమ్మగారు. వీరు మాధ్వులు. వీరికి పూర్వ మేడు తరములనుండి వీరిది వైణిక కుటుంబము. దాసుగారి తాతగారును, వీణ శేషణ్ణ (మైసూరు) తాతగారును సోదరులు. 'విరిబోణి' (భైరవి) వర్ణమును రచించిన సుప్రసిద్ధ గాయకుడు పచ్చిమిరియము ఆదియప్పయ్య ఈ సోదరుల పూర్వులలోనివాడు. ఆనందగజపతి మహారాజుల పోషణమున విశ్రుత గాన కళామందిరమైన విజయనగరమున వెలసిన విఖ్యాత గాయక, వైణిక శిఖామణులలో దాసుగా రొకరు. దాసుగారు ప్రతిదినము పది పండ్రెండు గంటలసేపు మూడు స్థాయిలలో నాలుగు కాలములలో వీణపై సాధనము చేయువారు. వీరు బస్కీలు, దండెములు విడువక చేయుచుండిరి. వీరి ముంజేయి కడుదృఢము గను, స్థూలముగను నుండెను.

వీరి వీణాగానము మూడు విశిష్ట లక్షణములతో నొప్పు చుండెను; ఒకటి నాదసంపద; రెండు అనుకరణ సాధ్యము కాని వేగము; మూడు కల్పనానైపుణియందు సాఫల్యము. 'కొలువై యున్నాడే' (భైరవి), 'శ్రీ సుబ్రహ్మణ్యాయ నమస్తే' (కాంభోజి)వంటి కృతులను త్రికాలములందును సంగతులు స్పష్టముగా బోధపడునట్లు అతిమాత్ర వేగముతో వీరు వీణపై వాయించువారు; బాహ్యశబ్దముల నన్నింటిని మించునట్లు వీణానాదము నుప్పతిల్ల జేయగలవారు.

ఈ శతాబ్ది ప్రారంభకాలమున కర్జను ప్రభువు నవరత్న ఖచిత సువర్ణ సింహతలాట కంకణమును బహూకరించుచు ఈ వైణిక శిఖామణిని మిక్కిలి ప్రశంసించెను. పెక్కు సంస్థానములు వీరిని బహువిధముల సత్కరించినవి.

వీరు సితారును, రుద్రవీణను చక్కగా వాయింప గలరు. కుండమీది మూత వలకకు లోవైపున వ్రేలునట్లొక స్ప్రింగు నమర్చిన వీణను మైసూరు మహారాజుగారు వీరికి బహుమతి గావించిరి. దీని నొకింత వంచినయెడల మధుర స్వర పరంపర పుట్టును.

వీరు తంజావూరిలో అబ్రహాం పండితుడు ఏర్పాటు చేసిన సంగీత మహాసభలలో ప్రాముఖ్యము గలిగియుండిరి. 1916 సంవత్సరము బరోడాలో జరిగిన ప్రథమ అఖిల భారత సంగీత మహాసభయొక్క కార్యక్రమములో ప్రముఖముగ వీరు పాల్గొనియుండిరి. వీరి ఆలాపనము, తానములు శ్రోతలను కళాప్రపంచమున నే యజ్ఞాత రమణీయ ప్రదేశములకో కొనిపోవును. వీరి గానసభలలో పెక్కింటికి మృదంగముసైతం ముండెడిదికాదట.

ఆనందగజపతి మహారాజుగారు వీరి వీణాగానము నాలకించుటకే కాక వీరితో కలసి సాధనము చేయుటకును పలుమారు వీరి యింటికి వచ్చుచుండువారు.

వీరు 'వీణారహస్య ప్రకాశిక' యను నొక చిన్న గ్రంథమును రచించి 1912 లో ప్రకటించిరి. ఇందు సంస్కృతమున పదునారు శ్లోకములును, వానికి తెలుగున అర్థమును గలదు. వీణావాదన క్రమమును వివరించిన పిదప నిందు బంధతానముల (గుచ్ఛతానబంధము)ను గూర్చి వివరించిరి.


చిత్రము 273.
వీణ వెంకటరమణదాను

ఇరువదిరెండవయేటనే వీరికి భార్యా వియోగము సంభవించినను వీరు మరల వివాహము చేసికొనలేదు. 1926లో వీరికి పాపము కటికి చెవుడు సంప్రాప్తమైనది. దానితో వీరి వీణాగానామృతపాన భాగ్యమును లోకము కోలుపోయినది. పి. సాం.

**వెంకటరమణాచార్యులు, మేడేపల్లి** (క్రీ. శ. 1862 - 1943): ఆచార్యులవారి పూర్వులు, గోల్కొండ వ్యాపారి బ్రాహ్మణులైనను శ్రీవైష్ణవమత సంప్రదాయమును బాగుగ నలవరుచుకొని ఆచార్య కృత్యమును నెరపినవారు. వీరి తాతగారు రాయాచార్యులవారు; పండిత కవులు; వైష్ణవ ప్రపత్తి ప్రవణులు, ఉరట్ల జమీన్‌దారులగు

సాగివారి ఆస్థాన పండితులు. వీరి పుత్రులు రఘునాథదాసు గారు. వీరి తనయులే వెంకటరమణాచార్యులుగారు; అనకాపల్లి వీరి జన్మస్థలము. వీరి మూడవయేట వీరి తండ్రి గారు ఉద్యోగరీత్యా విజయనగరవాస్తవ్యులైరి.

వీరు తండ్రివద్ద పంచకావ్యములు చదివిరి; అచటి మహారాజావారి హైస్కూలులో చదివి 1877లో మెట్రిక్యులేషన్‌లో కృతార్థులైరి. ఈలోపుననే వీరు కూరెళ్ళ సూర్యనారాయణశాస్త్రిగారివద్ద సిద్ధాంతకౌముది, కాశికావృత్తి, తర్క ప్రకరణములను నేర్చి, సంస్కృతమందు మంచిపాండిత్యమును సంపాదించిరి; ఎఫ్. ఏ. పరీక్షకు చదువుట కారంభించియు సాగకపోవుటచే కాలేజి ఆఫీసులో గుమాస్తా ఉద్యోగమున ప్రవేశించిరి. వీరు తపోనిష్ఠా సమాసాదిత సకల విద్యాతంత్రులు, శ్రీ మదానంద దంతీంద్రాస్థాన విద్వదోఘ శిరోమణులు నగు ముడుంబై నరసింహాచార్యులవారి నాశ్రయించి వారివద్ద వేదాంత విద్యను, వారి తమ్ములైన వరాహస్వామిగారివద్ద ద్రావిడామ్నాయమును అభ్యసించిరి. తరువాత వీరు 1891లో కాలేజిలో సంస్కృతోపాధ్యాయులుగా నియమితులై 1935 వరకు పని చేసిరి. ఇంగ్లీషుభాషయందు కూడ వీరికి ప్రావీణ్య ముండుటచే విద్యార్థులకు తులనాత్మక భాషాశాస్త్రమును (కంపేరిటివ్ ఫైలాలజి), సంస్కృత భాషా చరిత్రమును బోధించుటయందు వీరు ప్రశంసార్హమగు ప్రావీణ్యమును సంపాదించిరి.


చిత్రము 274.
మేడేపల్లి వెంకటరమణాచార్యులు

వీరు చిన్నతనమునందే ఆంధ్రమునందుకూడ మంచి పాండిత్యమును సంపాదించిరి. ఆనందగజపతి మహారాజు 'సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్' అను మకుటముతో ఒక శతకమును వ్రాయుడని తమ ఆస్థాన విద్వాంసు లందరిని కోరగా వచ్చిన శతకము లన్నిటిలో వీరి 'సత్యవ్రతి శతకము' మొదటి తెలుగు రచనయే యైనను మిక్కిలి ప్రశంసను కన్నది. వీరి తరువాతి తెలుగు రచనలు: నమ్మాళ్వార్ల గాథాసహస్రసంఖ్యాకమగు తిరువాయిమొళి యనుదానికి పద్యరూపాంధ్రీకరణము. తరువాత వానికి సంస్కృత శ్లోకములను వీరు పొందుపరచి, 'ఆంధ్ర గీర్వాణ శఠకోప సహస్ర'మనుపేర ప్రకటించిరి. వీరి ఆంధ్ర గ్రంథములలో దేవవ్రత చరిత్ర యనునది ప్రబంధపాకమున పడినది. ఇదిగాక 'నాలాయిర' మను నాలుగువేల ద్రావిడభాషా గాథలను వీరు తెలుగు పద్యములలో ననువదించిరి. వీరు రచించిన ఇతర గ్రంథములు: పార్థసారథి శతకము, ఆంధ్రసేతుబంధ మహాకావ్యము, ఆంధ్ర హర్ష చరిత్ర (గద్య), శ్రీకృష్ణ చరిత్రము (గద్య), షేక్స్పియరు నాటక కథలు (సంస్కృత గద్య), ప్రాకృత భాషోత్పత్తి, నిఘంటుచరిత్ర, పాండురంగ మాహాత్మ్య విమర్శనము, ఆర్యభాషా విభాగము, అలంకారశాస్త్ర చరిత్ర, ముప్పదిరెండు ఉపనిషద్విద్యలకును తెనుగున విపులమైన వ్యాఖ్యానము. చివరివరకు గ్రంథరచన, పాఠన ప్రవృత్తులందే వీరి జీవితము గడచినది. **మే. వ. న.**

**వెంకట రామమూర్తి, గిడుగు** (క్రీ. శ. 1863 - 1940): వీరి తాత ముత్తాతల నివాసస్థలము తూర్పు గోదావరిజిల్లాయందలి అమలాపురము తాలూకాలోని ఇందుపల్లి గ్రామము. జీవనోపాధికోసము వీరి తండ్రి వీరరాజుగారు విశాఖపట్టణము జిల్లాలోని విజయనగర సంస్థానములో సముద్దారు (రెవిన్యూ ఇన్‌స్పెక్టరు) ఉద్యోగము సంపాదించుకొనిరి. వీరు శ్రీకాకుళం జిల్లాలో ముఖలింగ క్షేత్రమునకు సమీపమునగల పర్వతాలపేటలో ఉద్యోగము చేయుచుండిన కాలమున రామమూర్తిగారు జన్మించినారు. 1875 వరకును వీరి బాల్య కౌమారదశలు పర్వతాలపేటలోను, 1875 మొదలు 1880 వరకును విజయనగరములోను గడచినవి. 1880 లో వీరు మెట్రిక్యులేషన్ పరీక్షలో ఉత్తీర్ణులైనారు. తరువాత వీరు 1880 లో గంజాం జిల్లాయందలి పర్లాకిమిడిలో గల ఉన్నత పాఠశాలయందు ఉద్యోగము చేయుచు స్వతంత్ర విద్యార్థిగా చదువు సాగించి 1886 నాటికి ఎఫ్.ఏ.పరీక్షలోను, 1890 నాటికి బి.ఏ. పరీక్షలో ఇంగ్లీషు, సంస్కృత భాగములందును ఉత్తీర్ణులయినారు; బి. ఏ. పరీక్ష పూర్తిగా కొనసాగించుటకు చరిత్ర భాగమునకు కావలసిన చదువు సాగించిరి; కాని వీరు ఇతర విద్యా వ్యాసంగములలో నిమగ్నులగుటచేత చదువుఆగిపోయినది.

1880 నుండి 1895 వరకును బడిపనులు చూచుకొంటూ వీరు గావించిన విద్యా వ్యాసంగములలో ముఖ్యమైనవి రెండు: శాసనముల చదువు, సవరభాషాకృషి. ముఖలింగ క్షేత్ర మందలి దేవాలయపు గోడలపై నున్న శాసనములు వీరి దృష్టి నాకర్షించినవి. ఆవిధముగనే పర్లాకిమిడికి చేరువగా కొండలలో నివసించు సవరల భాష, ఆచార వ్యవహారములు వింతగా తోచి వీరి నాకర్షించినవి. స్వయంకృషివల్ల ప్రాచీన లిపిలోను, సవర భాషలోను వీరు కృతకృత్యులు కాగలిగిరి; దీర్ఘాసిశాసనము, మూడవ

వజ్రహస్తుని దానపట్టాశాసనము మొదలయినవి తమ వ్యాఖ్యానముతో వ్యాసరూపమున వ్రాసి ఎపిగ్రాఫియా ఇండికాలో ప్రకటించారు; అంతేకాక 'ఆంటిక్విటీస్ ఆఫ్ ముఖలింగం' అనే చిన్న గ్రంథముకూడ ప్రకటించినారు. అందులో గంగవంశపు కళింగరాజుల రాజధాని ముఖలింగమే కాని కళింగపట్టణము కాదని బుజువుచేసినారు; సవరభాష అలవరచుకొంటూ సవరల ఆచార వ్యవహారములను తెలిసికొని ఒక చిన్న గ్రంథము ఇంగ్లీషులోనే రచించిరి. ఈ గ్రంథమందలి ముఖ్య విషయము లన్నీ థర్‌స్టన్ ప్రకటించిన దక్షిణ హిందూదేశములోని కులములు, జాతులు (కాస్ట్స్ అండ్ ట్రైబ్స్ ఆఫ్ సౌత్ ఇండియా)అనే గ్రంథములో సవరలు అనే శీర్షిక క్రింద వివరింపబడినవి. అదిగాక, వీరు సవర - తెలుగు, తెలుగు-సవర నిఘంటువులున్ను, సవరకథలు, పాటలున్ను ప్రకటించుటకు కొంత కృషి సాగించిరి. కాని ఈ పని అప్పట్లో ఆగిపోయినది. వీరు తమ అభిమాన వ్యాసంగములను కట్టిపెట్టి చదువు సాగించి 1896 లో బి.ఏ. చరిత్ర భాగమునకు సంబంధించిన పరీక్షలో మొదటి తరగతిలో రెండవ వారుగా ఉత్తీర్ణులైనారు.



చిత్రము 275.
గిడుగు వెంకట రామమూర్తి

1896 మొదలుకొని రాజావారు స్థాపించిన రెండవ గ్రేడ్ పర్లాకిమిడి కాలేజీలో 1911 వరకును వీరు చరిత్రాధ్యాపకులుగా పనిచేసిరి. ఈ కాలములో వీరు రచించిన సవర - తెలుగు నిఘంటువు, తెలుగు - సవర నిఘంటువు, తెలుగు లిపిలో రచించిన సవరవాచకములు, కథలు, పాటలు మొదలైన గ్రంథములు మద్రాసు ప్రభుత్వము వారు ముద్రించి ప్రకటించినారు. అందుకు వీ రేమీ పారితోషికము పుచ్చుకొనలేదు. 1913 లో వీరికి ప్రభుత్వము వారు 'రావు సాహెబ్' బిరుదము నొసగిరి.

1906 నుండి 1940 వరకును వీరి కృషి అంతా తెలుగు భాషాసేవకు వినియోగమయినది. స్కూళ్ళ ఇన్‌స్పెక్టరుగా నుండిన ఏట్సుదొరగారి ప్రోత్సాహముతో వీరు శిష్టజన వ్యావహారిక భాష గ్రంథరచనకు గ్రాహ్యమైనదిగా చేయుటకు అత్యంతము కృషిచేసి ఈ విషయమున కృతకృత్యు లయినారు. వీరేశలింగం పంతులుగారు వీరి వాదమున కొంత యథార్థ మున్నదని అంగీకరించిరి. వీరి వ్యావహారిక భాషావాదము బలపడినది. ఆ పిమ్మట 1919 - 20 లో వీరు వ్యావహారిక భాషోద్యమ ప్రచారము కొరకు 'తెలుగు' అనే మాసపత్రిక నడిపినారు. ఈ వాదమును తీవ్రముగా ప్రతిఘటిస్తూ ఉండిన ఆంధ్ర సాహిత్య పరిషత్తువారు 1925 లో తణుకులో సమావేశపరచిన వార్షికసభయందు పండితుల సమక్షమందు నాలుగు గంటలసేపు తమ వాదమును నిలబెట్టు కొనుటకు గ్రంథములందు ప్రయోగములను ఎత్తిచూపిస్తూ వీరు చేసిన మహోపన్యాసమును బట్టి వీరి వాదమునకు అనుకూలముగా ఒక తీర్మానము చేయబడినది. సాహితీ సమితి, నవ్యసాహిత్య పరిషత్తు మొదలయిన సంస్థలుకూడ వీరి వాదమును బలపరచినవి. క్రమముగా వ్యావహారిక భాషారచయితల సంఖ్య అధికమవుతూ వచ్చినది.

వీరి గ్రంథములు: (1) బాలకవి శరణ్యము; (2) వ్యాస మంజరి; (3) పండిత భిషక్కుల భాషాభేషజము; (4) గద్య చింతామణి - ఇవి వీరి సప్తతితమ జన్మదినోత్సవ ప్రచురణములుగా ప్రకటితము లయినవి. వీరినిగూర్చి, పెక్కు విద్యా విషయములను గూర్చి పలువురు విద్యాధికులు రచించిన వ్యాసములు గల 'వ్యాస సంగ్రహము'తోపాటు ఈ గ్రంథములు రామమూర్తిగారికి సప్తతితమ జన్మదినోత్సవ మహాసభలో సమర్పితమైనవి.

సవరభాషకు సంబంధించిన వీరి గ్రంథములు: (1) సవర మేన్యుఅల్ అండ్ రీడర్; (2) సవర - ఇంగ్లీషు డిక్షనరీ; (3) ఇంగ్లీషు - సవర డిక్షనరీ - 1932 - 34 లో మద్రాసు ప్రభుత్వమువారు ముద్రించి ప్రకటించినారు. 1934 లో వీరికి ప్రభుత్వమువారు 'కైజర్ - ఇ - హింద్' అనే బంగారుపతక మొసగి వీరిని గౌరవించిరి. వీరికి చిన్నప్పటినుండిన్ని విద్యాసక్తి, కార్యదీక్ష, సత్యాన్వేషణము ప్రధాన లక్షణములు. సవరలు హరిజనులవంటి అంటరాని జనులే అని సంఘ మెంచుచుండిన కాలములో వీరు సవర విద్యార్థులకు తమ యింటనే వసతు లేర్పరచి భోజనము పెట్టుచుండిరి. ఒరిస్సారాష్ట్ర మేర్పడనున్నప్పుడు పర్లాకిమిడి రాజావారు తమ పర్లాకిమిడి తాలూకాఅంతా ఒరిస్సా రాష్ట్రములో చేర్పించుటకు ప్రయత్నించినప్పుడు వీరు తెలుగువారికి నాయకులుగా నిల్చి ప్రతిఘటించిరి. వీరు ఆ తాలూకాలో చాల భాగమును, పర్లాకిమిడి పట్టణమును అక్రమముగా ప్రభుత్వమువారు ఒరిస్సాలో చేర్పుటవలన తెలుగువారికి అన్యాయము జరిగినదని తెలియజేస్తూ 1936 లో ఒరిస్సారాష్ట్రమునకు ప్రారంభో

త్సవము జరిగిననాటి ఉదయమే పర్లాకిమిడిలో నుండుటకు సమ్మతింపక వీరు రాజమహేంద్రవరమునకు వచ్చి యచ్చట తమ జీవితమును గడపినారు. వీరి పట్టుదలకు ఇది గొప్ప నిదర్శనము.

తాము నమ్మిన విషయమును ప్రకటించుటలో వీరికి అభినివేశము మెండుగా నుండెను. వాదన చేయునప్పుడు ఎదిరివారితో పోట్లాడునట్లు తీవ్రముగా ఆవేశముతో మాటాడినా ఎదిరివారియెడ వీరికి గల మైత్రి, సద్భావము ఎన్నటికీ తగ్గేదికాదు. వీరి మాటలు ఎంత దారుణమైనవో హృదయ మంత మెత్తనిది. వీరు కాపట్యము, మొగమోటమి లేని వ్యక్తి. గి. వేం. సీ.

**వెంకట రామయ్య, మాధవపెద్ది:** వీరిది పూర్వము గుంటూరు జిల్లా తెనాలి తాలూకా బ్రాహ్మణ కోడూరు. వీరు వెలనాటిశాఖ బ్రాహ్మణులు. వీరు తెనాలి తాలూకా హైస్కూలులో దాదాపు స్కూల్ ఫైనల్ వరకు చదివినారు. తరువాత వీరు బందరు నేషనల్ కాలేజీలో మెకానికల్ కోర్సు చదివి గుంటూరు జ్యూటు మిల్లులో కొంతకాలం ఉద్యోగంచేసిరి. వీరికి హిందీ, సంస్కృతం కూడ కొంచెం వచ్చును; తెలుగు భాషలో మంచి ప్రవేశము కలదు. వీరిది చక్కని విగ్రహం; ఆజాను బాహువు. బాగుగా వ్యాయామం చేసి విద్యార్థి జీవితంలో వీరు కుస్తీలు, చెడుగుడు పోటీలలో గెలుపొందినవారు; స్నేహపాత్రులు. సంభాషణచే జనాకర్షణ చేయుటలో వీరికి గొప్ప నేర్పు కలదు. వీరు ఉదార స్వభావులు.

చిత్రము 276.
మాధవపెద్ది వెంకట రామయ్య

వీరు గొప్ప నటులు; ప్రారంభకాలములో గయోపాఖ్యానంలో సహదేవుడు, రసపుత్రవిజయములో గులాం, తదుపరి కురుక్షేత్రంలో దుర్యోధనుడు, రోషనారలో శివాజీ, బొబ్బిలి నాటకంలో రంగారాయడు, ఇతర నాటకములలో గూడ పెక్కువేషములు వేసి పేరు ప్రతిష్ఠలు గడించారు. సాటిలేని మేటి నటుడుగా వీరికి కీర్తి తెచ్చినవి దుర్యోధన, శివాజీ, రంగారాయ పాత్రలు. వీరు తెలుగుటాకీలలో - సీతాకళ్యాణంలో విశ్వామిత్రుడు, కీచకవధలో కీచకుడు, తులసీజలంధర్ లో ఈశ్వరుడు, ద్రౌపదిలో శిశుపాలుడు మున్నగు - పాత్రలు ధరించి నటించిరి; ఆంధ్ర నాటక కళాపరిషత్తుకు ఒకమారు అధ్యక్షులుగా ఎన్నుకొనబడిరి. పు. వెం.

**వెంకటరామ విద్యానందనాథుడు, కనుపర్తి** (క్రీ.శ. 1803 - 1899): వీరు 'కైవల్య నవనీతము' అను పద్యకృతిని రచించుటయేగాక ద్రావిడభాషలో మకుటాయమైన తిరువళ్ళువరు కృత 'తిరుక్కురళ్' అను గ్రంథమును తొలుత తెలుగుచేసిన మహనీయులు. వీరు దీనికి 'త్రివర్గ దీపిక' అని పేరిడిరి; అందు ధర్మకాండము, అర్థకాండము అను రెండింటిని మాత్రమే తెనిగించిరి. వీరు తెలుగున అర్థకందములలో భావము నిమిడ్చి వానికి టీక తాత్పర్యము వ్రాసి యున్నారు. వీరి కైవల్యనవనీతము వేదాంత విషయకమైనది. సీతారామాంజనేయ సంవాదము వెనుక ఇంత ప్రచారముగల గ్రంథము వేరొకటిలేదు. ని. వెం. రా.



చిత్రము 277.
కనుపర్తి వెంకటరామ విద్యానందనాథుడు

**వెంకటరామశాస్త్రి, ఓలేటి** (క్రీ.శ. 1883 - 1939): వీరు పిఠాపుర సంస్థానకవులు, శతావధానులు నగు 'వెంకటరామకృష్ణకవు'లలో ప్రథములు. వీరు కాకినాడ తాలూకా పల్లిపాలెమునందు కామేశ్వరీ నారాయణ శాస్త్రి దంపతులకు జన్మించిరి. వీరి సాహిత్య గురువు చర్ల నారాయణ శాస్త్రిగారు; శబ్దశాస్త్ర గురువు రామడుగుల వీరేశ్వర శాస్త్రిగారు. తన మేనత్త కుమారుడగు వేదుల రామకృష్ణకవి తోడ్పాటుతో 1909వ సంవత్సరమున వీరు అష్టావధానములు గావించి పిఠాపుర సంస్థానాధీశులు శ్రీరావుసూర్యారావుగారిచే సత్కృతులై నాటినుండి తత్సంస్థానమున విద్వత్కవులుగా నెలకొని యుండిరి.



చిత్రము 278.
ఓలేటి వెంకటరామశాస్త్రి

'కవిత'యను మాసపత్రిక సుమారు పది సంవత్సరములు వీరి సంపాదకత్వమున వెలువడినది.

సుప్రసిద్ధులైన తిరుపతి వేంకటకవులకును వీరికిని చాల కాలము కవిత్వవిమర్శన - ప్రతివిమర్శనములు సాగినవి. శతఘ్ని, పాశుపతము, అట్టహాసము, రామకృష్ణ మహాభారతము మున్నగు నాటి విమర్శ గ్రంథములు జిజ్ఞాసువులకు విజ్ఞానము పంచినవి.

వేంకటరామకృష్ణకవులు అను జంటనామములతో వెలువడిన గ్రంథములు ముప్పదివరకు నున్నవి. వానిలో వెంకటాధ్వరి విశ్వగుణాదర్శము, క్షేమేంద్రుని ఔచిత్య విచారచర్చ, కవికంఠాభరణము, సువృత్త తిలకము ఇత్యాద్యాంధ్రీకరణములు పేర్కొనదగిన రచనలు.

వీరి కృతులలో మకుటాయమానమని చెప్పదగిన గ్రంథము 'ఆంధ్రకథా సరిత్సాగరము' దీనిలో ఆరు లంబకములు ప్రచురితములై యున్నవి. అమృతమధురమైన యిందలి కవితారీతి యనేకుల ప్రశంసలకు భాజనమైనది.

'నూటపదియార్లు' అను పేర అభినవకవిత్వపు తీరులో వీరు రచించిన యొక సీసశతకము వీరి కృతులలో స్వర్ణఖండమని చెప్పదగినది. వీరు పిఠాపుర ప్రభువులతో యావద్భారతదేశమున పర్యటన మొనర్చిరి. మ. స. శా.

**వెంకటరామశాస్త్రి, మేరత్తూరు :** తంజాపుర మండలమున ఉన్నతపురి, అచ్యుతాబ్ధి యను నామాంతరములు గలిగి చోళులకాలమున నృత్య గీతములకు నిలయమై, మహారాష్ట్రప్రభువుల కాలమున నవి పెంపొందిన స్థానమగు మేరత్తూరులో ఈయన జన్మించెను. ఈయన శ్రీవత్స గోత్రుడు; వెలనాటి బ్రాహ్మణశాఖీయుడు; గోపాల కృష్ణార్యుని పుత్రుడు; లక్ష్మణార్యుని శిష్యుడు; దేవీ, నారసింహోపాసకుడు; తంజావూరిని పాలించిన మహారాష్ట్ర ప్రభువులు శరభోజీ, శివాజీల (క్రీ. శ. 1800-1850) కాలమువాడు.

దేవాలయముతోను, అందలి స్వామితోను సంబంధము కలిగి నృత్యనాటకములని, దేవదాసినృత్యమని పూర్వకాలమున వర్ధిల్లిన రెండు శాఖలలో మొదటిదానిని బ్రాహ్మణులు, అందులోను పురుషులు ఆదరించి ప్రయోగించుచు వచ్చిరి. దీనికి భాగవత సంప్రదాయమని పేరు. ఈ సంప్రదాయమునుండియే మేరత్తూరు, నల్లూరు, సీయమంగలం, ఊత్తుక్కాడు, శూలమంగలములలో భాగవత మేళ నృత్యనాటకము లావిర్భవించినవి. పౌరాణిక కథేతివృత్తములు కలిగి తెలుగుపాటలతో కూడిన ఈ శాఖ నాటకములకు - యక్షగానములకు - ఈయన నవజీవము, సౌందర్యము పోసి తెలుగున పెక్కింటిని రచించి వాటికి దోహదమిచ్చెను. ఈయనయొక్క ఈ నృత్యరూపకములకును, కూచిపూడి సంప్రదాయమునకును దగ్గరసంబంధము కలదు.

ఈయన సులలితమైన కైశికీవృత్తి కవితారచనలో ప్రవీణుడు. ఈయన నృత్యరూపకములలో సంగీతమునుగురించి తెలిసికొనవలసిన విషయము లనేకము కలవు. వీనియందు చాల అరుదైన రక్తిరాగములకు లక్ష్యము లున్నవి.

అసంఖ్యాకములగు ఈయన రచనములలో మార్కండేయ చరిత్ర, హరిశ్చంద్రచరిత్ర, రుక్మాంగద, ఉషాపరిణయము, రుక్మిణీకల్యాణము, కంసచరిత్ర, ప్రహ్లాదచరిత్ర పేర్కొనదగినవి. వీనియందలి నృత్యగీతము లటుండ వీనియందు ప్రబలముగనున్న భక్తిరస ముదాత్త మగుటచే వీని కధిక గౌరవ మబ్బినది.

ఈయన సమకాలీనుడగు త్యాగరాజునకంటె వయస్సున పెద్దవాడు. ఈయన సాహిత్యమును త్యాగరాజు మెచ్చుకొనుచుండ త్యాగరాజు వర్ణమెట్టుల నీయన మెచ్చుకొనువాడట.

ఈయన నృత్యరూపకములనేకాక కొన్ని చిందులను, అద్వైతకీర్తనలనుగూడ రచించెనని చెప్పుదురు. వి. రా.

**వెంకటరామానుజాచార్యులు, శేషభట్టరు** (క్రీ.శ. 1900-1944) : వీరి జన్మగ్రామము భువనగిరి తాలూకాయందలి దత్తప్పగూడెము. రామానుజమ్మ, కృష్ణమాచార్యులు వీరి తల్లిదండ్రులు. వీరిది కౌండిన్యసగోత్రము; ఆపస్తంబ సూత్రము.

ఆచార్యులవారు జన్మించినది నిరుపేదకుటుంబమున; చదువుకొనవలె ననెడి ఆశమాత్రము కొండంత. వీరి యుత్సాహమునకు దినమొక యిల్లుభోజనమిడినది. బ్రతుకలేక మొదట బడి పంతులు పని ప్రారంభించినను వీరి విద్యాకృషిమాత్ర మవిచ్ఛిన్నముగా సాగినది. న్యాయవాదవృత్తి వీరినాకర్షించినది. కష్టపడి చదివి ఇరువదియవయేట మూడవతరగతి ప్లీడరుగా నుత్తీర్ణులై ప్రాక్టీసున కారంభించి దేవరకొండ, భువనగిరి, నల్లగొండ, హైదరాబాదులలో తిరుగునప్పటికి పై రావృత్తిలో నగ్రశ్రేణికి చెందినవారైరి. తెలుగు, సంస్కృతము, ఉరుదు, అరబ్బీ, ఫారసీ, మహారాష్ట్ర, కర్ణాటక భాషలు నేర్చి వీరు ఆయా భాషలలో చక్కని కవిత్వము, విమర్శనము వ్రాయగల సామర్థ్యము సంపాదించిరి; వడ్రంగము, గృహవాస్తువు,



చిత్రము 279.
శేషభట్టరు
వెంకటరామానుజాచార్యులు

తోటపని, ఫోటోగ్రఫీ, పాకకళ - వీనియందు అనన్య సామాన్య ప్రతిభను ప్రదర్శించిరి. సంఘ సంస్కర్తగా, పత్రికారచయితగా, మహాకవిగా, ఉత్తమ నటుడుగా, రాజకీయములలో అతి తీవ్రవాదిగా వీరి జీవితము చిత్ర విచిత్రముగా సాగినది. న్యాయవాదవృత్తికి స్వస్తిచెప్పి వీరు 1940 ప్రాంతమున ప్రభుత్వోద్యోగము కూడ కొన్ని దినములు చేసిరి.

వీరు తమ పేరుతోను, 'లోకజ్ఞు'డను మారుపేరు తోను వ్రాసిన పద్యములు, వ్యాసములు నీలగిరి, సుజాత. తెలుగు పత్రికలందు కానవసును. నిగార్, హుమాయూన్ పత్రికలందు వీరి ఉర్దూ, అరబ్బీ, ఫారసీ భాషా పటిమ కాన నగును. ఆంధ్ర సాహిత్యమున ఆచార్యులవారు సాధించని రచనా ప్రక్రియ లేదు. కాని ముద్రితములైన రచనములు మాత్రము కొలదియే. గేయములు, ప్రహసనములు, కథలు, అనేక మముద్రితములు. 'అఖిల భారత తస్కర మహాసభ' (400 పుటలు) అచ్చయిన అవహేళన కృతి. పొడుపు పద్యములు మేధావులకు పని కల్పించు సమస్యలు. వీరు రచియించిన ఆంధ్రనామ సంగ్రహము చక్కని హాస్యాత్మకృతి. వీరు కొన్ని లోకోక్తులనుకూడ సేకరించి అకారాదిగా వ్రాసియుంచినారు. ఆంధ్ర లిపి సంస్కార మునుగూర్చి కూడ ప్రయత్నించినారు. బి. రా. రా.

**వెంకటరాయశాస్త్రి, వేదము** (క్రీ.శ. 1853-1929): వీరు పుదూరు ద్రావిడశాఖీయుడు, విద్వద్వరేణ్యుడు, ఋషితుల్యుడు నగు వెంకటరమణ శాస్త్రిగారి కుమారులు; తల్లి లక్ష్మమ్మ. వీరి జన్మస్థానము మదరాసు. వీరు తమ పదునారవయేట మెట్రిక్యులేషన్ పరీక్షలో మొదటి తరగతిలో జయమొందిరి; ఇరువదిరెండవ సంవత్సరమున యఫ్. ఏ. పరీక్షలో నుత్తీర్ణులైరి; 1886 లో మదరాసు క్రైస్తవ కళాశాలయందు సంస్కృత పండిత పదవిని బడసి దాని నిరువదియైదు వర్షములు అతిశ్లాఘ్యముగ నిర్వహించిరి; 1887 లో బి. ఏ. పరీక్ష ఆంగ్లముననుు, సంస్కృతమున ప్రథమస్థానముననుు ఉత్తీర్ణులైరి; 1916 లో సూర్యారాయాంధ్ర నిఘంటువునకు ప్రధాన సంపాదకులై కొంతకాలము పనిచేసిరి; 1920 లో ఆంధ్రమహాసభవారిచే 'మహోపాధ్యాయ' బిరుదముతో, వేయిన్నూటపదహారు రూప్యములతో సమ్మానింపబడిరి; 1922లో శ్రీ శ్రీ ద్వారకా పీఠ శంకర భగవత్పాదులచే 'సర్వతంత్ర స్వతంత్ర', 'మహామహోపాధ్యాయ', 'విద్యాదానవ్రతమహోదధి' బిరుదములతో సత్కరింపబడిరి; 1927 లో ఆంధ్ర విశ్వ కళాపరిషత్తువారిచే 'కళాప్రపూర్ణ' బిరుదముతో గౌరవింపబడిరి. 1932 నుండి ప్రతివర్షము వీరి వర్ధంతి నెల్లూరు వర్ధమాన సమాజము వారిచే జరుపబడుచున్నది. 1953 లో వీరి శతవర్ష వర్ధంతి మహోత్సవము నెల్లూరున అత్యంత వైభవముగా జరిగినది.

వీరి గ్రంథములలో ముఖ్యమైనవి: ప్రతాపరుద్రీయము (1897), ఉషాపరిణయము (1901), బొబ్బిలి యుద్ధము (1916), నాగానందము (1891), శాకుంతలము (1896), ప్రియదర్శిక (1910), మాళవికాగ్ని మిత్రము (1919), ఉత్తరరామచరిత్ర (1920), రత్నావళి (1921), విక్రమోర్వశీయము, మేఘ సందేశవ్యాఖ్య (1901), శృంగార నైషధ సర్వంకషవ్యాఖ్య (1913), ఆముక్తమాల్యదా సంజీవనీ వ్యాఖ్య (1921), స్త్రీ పునర్వివాహ దుర్వాద నిర్వాపణము, గ్రామ్యభాషా ప్రయోగ నిబంధనము (1899), విసంధి వివేకము (1912), తిక్కన సోమయాజి విజయము (1919), విమర్శవినోదము (1920), ఆంధ్ర హితోపదేశ చంపువు, ఆంధ్రసాహిత్య దర్పణము.

వీరు బహుభాషాకోవిదులు; సంస్కృతము, ఆంధ్రము, ఆంగ్లము, అరవము, కన్నడము, హిందీ భాషలందు సమగ్ర పాండిత్యము గడించిరి; సాహిత్యమందేగాక తర్కము, వ్యాకరణము, వేదాంతము మున్నగు శాస్త్రములందును పారంగతులైరి; రచయితగా, వక్తగా, అధ్యాపకుడుగా, ధర్మోపదేష్టగా, నాటక కళాచార్యుడుగా అసమాన ఖ్యాతిని గాంచిరి; తొలుదొల్త నాగానంద నాటకమున స్త్రీలకు, నీచ పాత్రలకు గ్రామ్యభాషను వాడి తెలుగు నాటకములందు వ్యావహారికభాషను బ్రయోగించు సంప్రదాయమునకు మార్గదర్శకులైరి. ప్రతాపరుద్రీయనాటకమున ఎనిమిది, తొమ్మిది తెగల గ్రామ్యభేదములు కలవు. ఇది ప్రథమాంధ్ర జాతీయ స్వతంత్ర నాటకము. బొబ్బిలియుద్ధమును ఆంధ్ర జాతీయ స్వతంత్రనాటకమే. రెండును వీరరస ప్రధానములు; ఆంధ్రుల ప్రతిభను, ప్రాభవమును జాటునవి; ఆంధ్ర సంస్కృతి మహనీయతకు దర్పణ తుల్యములు. వీనివలన శాస్త్రులవారికి అజరామరకీర్తి లభించినది. వీరి యనువాదములు, వ్యాఖ్యానములు, విమర్శనములు వీరి సర్వతోముఖ పాండితీ ప్రతిభలను బ్రకటించునవి; సాధుపాఠ నిర్ణయ



చిత్రము 280.
వేదము వెంకటరాయశాస్త్రి



గౌతమీ అవతరణము

చిత్రకారుడు.
సి. ఎన్. వెంకటరావు

మందును, కవిహృదయ ప్రకాశనమందును, ప్రౌఢభావ విపులీకరణమందును, పదప్రయోజన సారస్యగ్రహణ మందును వీరి యసమానప్రజ్ఞను వెల్లడించుచున్నవి. వీరి కథా సరిత్సాగరము తెలుగున మృదుమధురమగు వచన రచనకు వరవడియైనది. వీరి గ్రంథములందును, వీరి యాశయములందును ప్రాక్పశ్చిమ, ప్రాచీన నవీన సంస్కృతులు సమానముగ ప్రతిబింబించు చున్నవి. ఈ యుభయ ముల సమ్మేళనమే వీరి సారస్వతమునందలి వైశిష్ట్యము.

ప్రాచీన సంప్రదాయ పరాయణులైనను వీరు ఆధునిక గ్రంథరచనయందు కొన్ని మార్పులను బ్రవేశపెట్టిరి. వచనరచనయందు పద్యరచనయందువలె సంధినియమ ములను సర్వత్ర పాటింపవలసిన యావశ్యకతలేదని వీరి యభిప్రాయము. దీని కనుగుణముగ వీరు కథా సరిత్సాగర రచనను సాగించిరి. ఈ రీపద్ధతిని వివరించుచు, 'విసంధి వివేకము' అను గ్రంథమును విరచించిరి.

ఈ మార్పుకంటె ప్రబలమైనది వ్యావహారికభాషా ప్రయోగము. వీరు వ్యావహారికవాదులు కారు. గ్రంథ రచనయందు సంప్రదాయసిద్ధమైన గ్రాంథికభాషనే వాడ వలయునని వీరి దృఢాభిప్రాయము. గ్రామ్య భాషానిర సన మను పుస్తకమును వ్రాసి వీరు వ్యావహారికవాద మును ఖండించిరి; కాని తమ నాటకములందు పాత్రోచిత భాష నెపమున వ్యావహారికభాషను మాత్రమేకాక గ్రామ్యమునుగూడ విపులముగ వాడియున్నారు. ఈ కారణమువలన సమకాలికు లనేకులు వీరిని 'గ్రామ్య శాస్త్రి'యని నిందించి తద్విరచిత గ్రంథములను బహిష్క రింప సమకట్టిరి. కాని యవి జనాదరణకు పాత్రము లగుట వలన తుదకు వీరిదే మీది చేయియైనది. వీరు వ్యావ హారికవాదము నెంత నిరసించినను వ్యావహారికవాదులు మాత్రము వీరిని తమ వాదమునకు వేగు జుక్కవంటివా రని భావించుచున్నారు; ఇది సత్యము. గు. వేం. సు.

**వెంకటరావు, సి. ఎన్.** (క్రీ. శ. 1885 - 1940): వీరు ఆంధ్రదేశమందు ప్రసిద్ధికెక్కిన చిత్రకారులు. వీరి తండ్రి నారాయణరావుగారు; తల్లి సత్యభామాబాయి. వీరి విద్యాభ్యాసము అనంతపురము, వేలూరు, నెల్లూరులందు జరిగినది. వీరికి బాల్యముననే చిత్రకళయం దభినివేశము కలిగి ఆంజనేయుని చిత్రమును తరచుగ వ్రాయుచుండిరి. చిత్రకళ నభ్యసించుటకై వీరు ఇలు వీడిపోయి చెన్నపట్టణ మున చిత్రకళా పాఠశాలయందు జేరి మూడు సంవత్సర ములు విద్య నభ్యసించి యోగ్యతాపత్రమును బొందిరి.

పిమ్మట వీరు అనంతపురమున పురపాలకోన్నత పాఠ శాలయందు చిత్రకళాధ్యాపకులుగా కుదురుకొని ఉద్యో గము జేయుచు నిర్విరామకృషి సల్పుచు చిత్రకళ యందు చాతుర్యమును పెంపొందించుకొనిరి; ఆ సమయ మున వీ రనేక తైలవర్ణ చిత్రములను రచించిరి; పిమ్మట అనంతపురమును విడిచి పెనుకొండ బోర్డు ఉన్నత పాఠ శాలలో చిత్రకళోపాధ్యాయులుగ జేరిరి. ప్రకృతిశోభా రమణీయములగు పరిసరములుగల పెనుగొండ జీవితము వీరి చిత్రకళారాధన కెంతయో అనుకూలించినది.

వీరు చిత్రించిన ప్రథమ తైలవర్ణచిత్రము 'ధ్రువ నారాయణ'. వీరి తైలవర్ణ చిత్రములలో 'హరిహరులు', 'లంకిణీ సంహారము', 'శ్రీరామ పట్టాభిషేకము', 'కురు క్షేత్రము' - వీరి ఉపజ్ఞకు, భావనాశక్తికి, వర్ణ సమ్మే ళనమునందలి నిస్సీమకౌశలమునకును నికషోపలములు.

వీరి చిత్రకళారాధనకు కళాభిమానియు, సహృదయు డును అగు శ్రీ టి. యల్. ఆర్. చంద్రన్ అను ఐ.సి.యస్. ఉద్యోగి యొసగిన చేయూత ప్రశంసింపదగినది. వారి ప్రోద్బలమువలన తైలవర్ణ చిత్రములను వ్రాయుట మాని వీరు నీటిరంగు చిత్రములను వ్రాయ నుపక్రమించిరి. శ్రీ చంద్రన్‌గారి ప్రోత్సాహమువలన వీరు మద్రాసుకు వెళ్లి కొంతకాలము సుప్ర సిద్ధ చిత్రకారులగు దేవీ ప్రసాద్‌రాయ చౌదరిగారి యొద్ద కృషిచేసిరి. పిమ్మట కలకత్తా, లాహోరు, బొం బాయి మున్నగు నగరముల లోని చిత్రకళా పాఠశాల లను దర్శించి ఆయా సంప్ర దాయములలోని విశిష్టతను ఆకళించుకొని జీర్ణించు కొనిరి. ఇట్లు వివిధ కళా సంప్రదాయములను సమ న్వయపరచుకొని విజయ నగర శిల్పకళానిధులను తరచి తరచి వర్ణసమ్మేళనమున స్వీయప్రతిభను జోడించి క్రొత్త పోకడలతో చిత్తరువులు వ్రాయుట కుపక్రమించి సిద్ధహస్తులైరి.



చిత్రము 281.
సి. ఎన్. వెంకటరావు

'రతీ మన్మథుడు', 'అర్ధనారీశ్వరుడు', 'గౌరీశంకర్', 'సుగాలిపడుచు', 'కాపుపడుచు', 'మేరీ బూ', 'తత్ప రత', 'శివకుటుంబ నృత్యము', 'ద్వైతాద్వైత ప్రేమ తత్త్వము', 'జటాయుమరణము', 'శాంతిపుష్పము', 'దైవాయతనము' 'కళాజననము', 'గాన జననము' మొదలగు వీరి చిత్రము లనేకములు గలవు. హైదరాబాదు సాలార్ జంగ్ మ్యూజియమునందు వీరి చిత్రములు

కొన్ని కలవు. వీరి చిత్రములు స్వదేశమునందు నలుమూలల పరివ్యాప్తములై యుండుటయే కాక ఇంగ్లండు, జర్మనీ, జపాన్, అమెరికా మొదలగు దేశములకును కొన్ని వెళ్లినవి. వీరి 'గౌతమీ అవతరణము' రాష్ట్రపతి రాజేంద్ర ప్రసాదుకు బహూకరింపబడినది.

వీరు తమ జీవిత చరమదశాబ్దమునందు నాలుగువందల చిత్రములను చిత్రించిరట. వీరి చిత్రములం దొక విశిష్టత యుండును. దానిని జూడగనే యది వీరి చిత్రమని చెప్ప వచ్చును. ఔచిత్య మెరిగి రసభావముల కనుగుణములగు వర్ణములను మేళవించుటలో వీరికి వీరే సాటి. వీరి భావ ములు విశాలములు; రచనలు స్వతంత్రములు. వీరికి దైవ భక్తి, దేశభక్తి, పురాణవిషయములం దనురక్తి కల దనియు, వీరు అన్నిమతములను సమరసభావముతో నాదరించువా రనియు వీరి చిత్రములనుబట్టి యూహింపవచ్చును.

వీరు పెనుకొండయందు విజయనగర చిత్రకళాశాలను స్థాపించి పలువుర కీవిద్యను నేర్పిరి.

వీరు ఆరు భాషలయందు అనర్గళముగ సంభాషణ జరుపుచుండిరి; గొప్ప హాస్యచతురులు; నాటకములందు భూమికను నిర్వహించుచుండిరి. 'ఇందిర', 'రామస్వామి' అను రెండు నాటకములనుగూడ వీరు రచించియుండిరి. ఏకనాదము, డక్కి, తందాన బుఱ్ఱ, దాసరయ్యల శంఖము, వీరి కభిమాన వాద్యములు. వీరు ఉషఃకాలమున నేదేని యొక వాద్యమును గ్రహించి మ్రోగించుచు పాటలు పాడెడివారు. వీరి హృదయము నవనీతమువంటిది. వీరు కష్టపడువారి నాదరించి తోడ్పడుచుండిరి. పి. వెం.

**వెంకటరెడ్డినాయుడు, కూర్మా** (క్రీ. శ. 1875 - 1940) : పదునెనిమిదవ శతాబ్ది ఉత్తర భాగమున ఆంగ్లే యులు ఫ్రెంచివారితోను, డచ్చివారితోను సమరము సాగించుచున్న దినములలో కూర్మావారి పూర్వులలో సాంబన్న యను నొక వీరపురుషుడు ఆంగ్లేయుల సైన్య ములో కమాండెంటుగా నుండెను. అతనిని జనసామాన్యము కుమందన్ సాంబన్న యనెడివారు. ఆ సాంబన్న సంతతి లోనివాడే వెంకటరెడ్డినాయుడు. కూర్మావారు తొలుత దాక్షారామ క్షేత్రముతో సంబంధము కలిగియుండిరి. వీరి యింటిపేరుతో నంకితమైన కూర్మపురము, గంగ వరము గ్రామములు వీరి సొంతములై యుండెడివి.

వెంకటరెడ్డినాయుడు రాజమహేంద్రవరములో జనన మందెను. ఈయన తండ్రి బాపనయ్యా నాయుడు పోలీసు సబ్ ఇన్స్పెక్టరుగా నుండెను. ఈయన రాజమహేంద్ర వరము యునైటెడ్ హైస్కూలులో చదివి మెట్రిక్యు లేషన్ పరీక్షయందును, అచటి గవర్నమెంటు కళాశాల లోను, మదరాసు క్రిస్టియన్ కళాశాలలోను చదివి బి. ఏ. పరీక్షయందును (1894లో) కృతార్థు డయ్యెను. రాజ మహేంద్రవరము నందలి గవర్నమెంటు కళాశాలలో ఉపన్యాసక పదవియందును, అమలాపురము బోర్డు హైస్కూలులో ఉపాధ్యాయ పదవియందును కొంత కాలము గడపి యీయన 1900లో బి. ఎల్. పరీక్షలో నుత్తీర్ణుడై రాజమహేంద్రవరమున న్యాయవాద వృత్తి నారంభించెను. ఈయన కచిరకాలమున వృత్తియందు మంచి పేరు వచ్చినది. అప్పటి గోదావరిజిల్లా రెండుగా విభజింప బడిన తరువాత నివాసము ఏలూరికి మార్చి ఈయన అచటి న్యాయవాదులలో నగ్ర శ్రేణి నందుకొనెను; మండ లాంతరములందును గణ్యత గాంచెను.



చిత్రము 262.
కూర్మా వెంకటరెడ్డినాయుడు

నాలుగేండ్లీయన రాజ మహేంద్రవర పురపాలక సంఘమున సభ్యుడై యుండుటయే కాక కొలది కాల మా సంఘమున కధ్య క్షుడునై యుండెను. 1907 నుండి ఏలూరు పురపాలక సంఘమున కీయన పోటీ లేక యెన్నుకొనబడు చుండెను; కొంత కాలము పోలవరము తాలూకా బోర్డులో సభ్యుడుగను, దాని కుపాధ్యక్షుడుగను ఉండెను. గోదావరి జిల్లాబోర్డులో మూడేండ్లీయన సభ్యుడుగా నుండెను.

ప్రజాహిత కార్యములం దీయన అత్యంతము శ్రద్ధ గలిగి యుండువాడు. గ్రామప్రజల శ్రేయోభివృద్ధికిని, వారి యిబ్బందులను తొలగించుటకును, ప్రారంభవిద్యా వ్యాప్తి కిని మిక్కిలి కృషి చేయుచు స్థానిక సంస్థలలో నీయన తన పలుకుబడిని వినియోగించి ఆ యా ప్రజాహిత కార్యము లను సాధించుచు ఆ యా ప్రదేశములందలి ప్రజలయొక్క ఆదరమునకు పాత్రుడయ్యెను.

ఈయన 1919లో బ్రాహ్మణేతర పక్ష ప్రతినిధి వర్గము నకు నాయకుడై ఇంగ్లండుకు పోయి ఉద్దిష్ట కార్య సాధన మునకై సర్వవిధముల ప్రయత్నించెను. 1929లో నీయన జెనీవాలో జరిగిన అంతర్జాతీయ మహాసభా సమావేశము నకు భారత ప్రభుత్వ ప్రతినిధిగా వెళ్లెను. దక్షిణాఫ్రి కాలో భారత ప్రభుత్వ ప్రతినిధిగా నీయన నియమింప బడెను; 1935లో స్టేటు కౌన్సిలు సభ్యుడుగా నియమితు డయ్యెను; ఆవల మద్రాసు ప్రభుత్వపు న్యాయశాస్త్ర

సభ్యుడయ్యెను; ప్రభుత్వ కార్యనిర్వాహక సభ్యుడయి శాసన సభకు నాయకు డయ్యెను. మద్రాసు గవర్నర్ ఎర్స్కిన్ ప్రభువు సెలవు పుచ్చుకొనినపుడు ఈయన గవర్నర్ పదవి నలంకరించెను. 1936 ఎన్నికలకు తరువాత, కాంగ్రెసు పరిపాలనను నిరాకరించిన దినములలో నడు మంత్రపు మంత్రిమండలి నేర్పరచి మూడునెల లీయన పరిపాలనను నిర్వహించెను; 1940 లో చిదంబరము నందలి అణ్ణామలై విశ్వవిద్యాలయమున కుపాధ్యక్షుడయ్యెను.

ఈయన మంచి వక్త. ఈయన యుపన్యాసములు విజ్ఞాన వైదుష్య సంపన్నములై యుండెడివి. 1911 లో కలకత్తా కాంగ్రెసునందలి మార్లే సంస్కరణములను గురించినట్టి వియు, 1916 మదరాసు కాంగ్రెసునందలి ఇండియన్ వాలంటీర్లను గురించినట్టివియు నగు ఈయన యుపన్యాసములు ప్రసిద్ధములైనవి. గ. సు.

**వెంకటలక్ష్మణరావు, కొమర్రాజు** (క్రీ. శ. 1877 - 1923): వీరు ఆరువేల నియోగిశాఖకు చెందినవారు; లింగధారి బ్రాహ్మణులు. వీరి జన్మస్థలము కృష్ణజిల్లా, నంది గామ తాలూకా పెనుగంచిప్రోలు గ్రామము. వీరితండ్రి వెంకటప్పయ్యగారు; తల్లి గంగమ్మగారు. వీరి మూడవ యేటనే తండ్రి గతించుట వలన బాల్యమున వీరి సవతి అన్నగారైన శంకరరావుగారి వద్ద కొంతకాలము భువన గిరిలో ఉండి విద్యాభ్యాసమైన వెనుక మొదటి తరగతులు చదివిరి. నాగపూర్‌లో పి. డబ్ల్యు. శాఖలో సబ్‌డివిజనల్ ఆఫీసరుగ పనిచేయుచుండిన భండారు మాధవరావుగారు తమ ప్రథమ కళత్ర వియోగానంతరము వీరి అక్కగారైన అచ్చమాంబగారిని వివాహమాడిన పిదప వీరి విద్యార్థి జీవితము పూర్తిగా నాగపూరులోనే గడచినది.

1898 లో నాగపూరు మారిస్ కళాశాలలో చేరి చదివి వీరు వేదాంత శాస్త్రములోను, సంస్కృతములోను ఆనర్సుతో బి. ఏ. పరీక్షయం దుత్తీర్ణులైరి. వీరు 1901 లో కళాశాలలో చేరకుండ విడిగా కలకత్తా విశ్వవిద్యాలయము వారి యమ్. ఏ. పరీక్షకు చదివి కృతార్థులైరి.

అది మహారాష్ట్ర దేశ మగుటవలన చిన్న తరగతుల నుండియు వీరు మహారాష్ట్ర భాష నభ్యసింప వలసి వచ్చినది; దానితోపాటు సంస్కృతముకూడ నభ్యసించి మహారాష్ట్ర, సంస్కృతభాషలలో గొప్ప పాండిత్యము సంపాదించిరి. చిన్నతనము నుండియు వీరు తమ జీవితము మధ్య ప్రదేశ్‌లో గడపుటచేత మహారాష్ట్రము వీరి కించుమించుగ మాతృభాషయే యైనది. వీరు హిందీభాషకూడ చక్కగా నేర్చిరి వీరు మెట్రిక్యులేషను పరీక్షకు చదువుచుండిన కాలమున మహారాష్ట్రభాషలో వృద్ధ వివాహము సపహాసించుట కై యొక ప్రహసనమును రచించిరట. వీరు ఎఫ్. ఏ. క్లాసులో చదువుచుండి నప్పుడే మహారాష్ట్రభాషలో పత్రికలకు వ్యాసములు, భావగీతములు వ్రాసి పంపుచు వచ్చిరి.

ఈ రీతిని చిన్నతన మంతయు మహారాష్ట్ర దేశముననే గడచుట వలన వీరికి మహారాష్ట్రుల వేష భాషాచారములు, వారి కార్యశూరత్వము, దీక్ష బాగుగ నలవడినవి.

ఆ కాలమున మహారాష్ట్రమున చెలరేగిన వివాదములలో రామాయణములోని పంచవటి మహారాష్ట్రము లోనిదా? తెలుగుదేశములోనిదా? అనున దొకటి. ఇట్టి వివాదములలో పాల్గొని వీరు పంచవటి తెలుగుదేశము లోనిదే యని సప్రమాణముగ నిరూపించిరి; మహారాష్ట్ర భాషలో మోరోపంత్ రచించిన కర్ణపర్వమును పరిష్కరించి ప్రకటించిరి.

ఈ రీతిని వీరు మహారాష్ట్రమున అపార పాండిత్యము సంపాదించినను ఆంధ్రము నుపేక్షింపలేదు. వీరు తమ సోదరి అచ్చమాంబగారిని కూడ ప్రోత్సహించి ఉభయులు కలసి తెలుగులో కృషిచేయుచు వచ్చిరి. తెలుగు పత్రికలకు కూడ వీరుభయులు వ్యాసములు, కథలు వ్రాసి పంపుచు వచ్చిరి. వీరికి మొదటి నుండియు భౌతిక శాస్త్ర విజ్ఞానమును దేశీయుల కందజేయ వలయునని యుత్కటమైన కోరిక. ఈ కోరికతో వీరు 1898 లోనే తెనుగు జనానా పత్రికలో 'విశ్వముయొక్క విరాట్ స్వరూపము', 'విశ్వము యొక్క బాల్య స్వరూపము' అనువానిని గురించి సంభాషణ రూపమున రచించి ప్రకటించిరి.



చిత్రము 283.
కొమర్రాజు వెంకటలక్ష్మణరావు

వీరు తెలుగు దేశమునకు వచ్చినపిదప వీరి పితృ, పితామహులు మునగాల జమీన్‌దార్లకు దివానులుగ నుండుటచేత వీరును ఆ సంస్థానమునకు దివానుగా నియమితులయినారు. ఎస్టేటు దావా కారణముగా వీరు మద్రాసులో ఉండవలసిన అవసర మేర్పడినది. మునగాల రాజావారుకూడ అత్యవసర సమయములందు తప్ప వీరు మద్రాసులోనే ఉండి భాషాసేవ చేయుట కుదార హృదయులై అవకాశము కలిగించిరి. దేశీయులలో ఆధునిక

విజ్ఞానమును, స్వాతంత్ర్యాభినిరతిని, దేశచరిత్ర జ్ఞానమును పెంపొందించుటకు వీరు 1906 లో విజ్ఞాన చంద్రికా గ్రంథమాలను స్థాపించి దేశ చరిత్రలు, పదార్థ విజ్ఞాన, రసాయన, జీవ, వృక్ష శాస్త్రాదులు; అబ్రహాం లింకన్, అశోక, చంద్రగుప్తులవంటి మహాపురుషుల జీవితములు; హిందూదేశ, ఆంధ్రదేశ చరిత్రలు; ఆంధ్రదేశ చరిత్రాత్మక నవలలు మొదలైనవి ప్రకటించి ఆంధ్రదేశీయులకు ఆధునిక విజ్ఞాన సౌధ కవాటమును తెరచి యపార సేవ కావించిరి. విజ్ఞాన చంద్రికా సంస్థాపనతో ఆంధ్రదేశమున సాంస్కృతికముగా ఒక నూతన శకమే ప్రవృత్తమయినది. అంతటితో తృప్తినొందక వీరు ప్రాచ్య, పాశ్చాత్య విద్యా, విజ్ఞానము నంతను ఆంధ్రదేశీయుల కందీయవలెనను ఉత్కటాభిలాషతో 1912 - 13 లో 'ఇంగ్లీషు ఎన్ సైక్లోపీడియా' పద్ధతిని వీరు తమ ముఖ్య సంపాదకత్వము క్రింద 'ఆంధ్ర విజ్ఞాన సర్వస్వ' ప్రకటనము నారంభించిరి; పెక్కు కష్టనష్టముల కోర్చి తమ సర్వశక్తులను ధారపోసి మూడు సంపుటములను మాత్రమే ప్రచురింపగలిగిరి. ఇందు అకారాది పదకోశము మాత్రమే పూర్తియైనది. దక్షిణ హిందూదేశ భాషలలో ప్రప్రథమమున ప్రకటితమైన విజ్ఞానసర్వస్వమిది యొక్కటే.

వీరు రాజకీయ సంఘసంస్కరణ, పరిశోధక, సారస్వత మహాసభల కధ్యక్షత వహించి దేశభాషాభ్యుదయ సూచకములగు నుపన్యాసముల నిచ్చియున్నారు.

విజ్ఞాన చంద్రికామండలిలో ప్రకటితములైన భౌతికాది శాస్త్రములకు వీరు వ్రాసిన పీఠికలును, ఎడనెడ వీరు పత్రికలకు వాయు బ్రహ్మాండ పురాణములు, శృంగారము - పూర్వలాక్షణికులు, లలితకళలు మొదలైనవానిని గురించి వ్రాసిన వ్యాసములును, ఆంధ్రవిజ్ఞాన సర్వస్వమునకు వీరు వ్రాసిన అభిజ్ఞాన శాకుంతలము, అథర్వవేదము, అద్వైతము, అలంకారము, అష్టాదశమహాపురాణములు, అష్టాధ్యాయి మొదలైనవియు వీరి పరిశోధనా కౌశలమునకు, వివిధ కళాశాస్త్రాదులందు వీరికిగల కూలంకష పాండిత్యమునకు, విమర్శనపాటవమునకు గీటురాళ్లవంటివి. వీరు అక్కిరాజు ఉమాకాంతముగారి 'తెలుగు వాఙ్మయ పత్రిక'లో గౌతమ న్యాయదర్శనమును కొంతవర కాంధ్రీకరించిరి. వీరు ప్రాచీనామూల్యశాసనముల నెన్నిటినో చక్కని వ్యాఖ్యతో విమర్శించి ప్రకటించినారు. ఇవి కాక మహమ్మదీయ మహాయుగము, హిందూ మహాయుగము, శివాజీ చరిత్ర, హైందవ చక్రవర్తులు అనునవి వీరి గ్రంథరూప రచనములు. వీరి శైలి చాల సులభమైనది; ఎంత కష్టమైన, క్లిష్టమైన విషయమైనను అరటిపండొలిచినట్లు తేటతెల్లమైన శైలిలో చెప్పుటలో వీరిదే అగ్రతాంబూలము. వీరి వాదచాతురి తర్కజటిలమైనది; ఆకారము శాంతోదారమయినది; హృదయము నవనీతము; దృష్టి విశాలము. వీరు సంఘ సంస్కరణవాదులు; ఎందరో యువకులను రచనకు, పరిశోధనకు ప్రోత్సహించిన మహోదయులు. మ. సో. శ.

**వెంకటశాస్త్రి, అనివిళ్ల**: ఈయన పశ్చిమ గోదావరి మండలవాసి. క్రీ. శ. పదునెనిమిదవ శతాబ్ది పూర్వభాగము వాడు; అనేక శాస్త్రములలో పండితుడు; పెద్దాపురము, నూజివీడు మొదలగు సంస్థానాధీశులచే గౌరవింపబడినవాడు; ఈయన మహేశ్వర మహాకావ్యము, సతీశతకము, భాస్కర ప్రశస్తి, రుక్మిణీ పరిణయము అను కావ్యములను, అలంకార సుధాసింధువు, రసప్రపంచము అను నలంకార గ్రంథములను వ్రాసెను. అప్పారాయ యశశ్చంద్రోదయ మను ఈయన మరియొక యలంకారగ్రంథమునందలి యుదాహరణములు నూజివీడు జమీన్‌దారగు మేకా వెంకట నరసింహఅప్పారావు స్తుతిపరములు. ఇత (డాపస్తంబ) శ్రౌతసూత్రములకు వ్యాఖ్య కూడ రచించెను. ప.రా.స్వా.

**వెంకట సాంఖ్యాయన శర్మ, అచంట** (క్రీ. శ. 1864 - 1933): వీరి పూర్వులు గోదావరిజిల్లా, ఆచంట గ్రామవాసులు; వీరి నాయనగారి కాలములో వలస వచ్చి నాగావళీ ప్రాంతమున కిచ్చాడ గ్రామములో నివసించిరి; ఆ కారణముచే వీరు విశాఖమండల నివాసులైరి. వీరు



చిత్రము 284.
ఆచంట వెంకట
సాంఖ్యాయనశర్మ

ఆరువేల నియోగిశాఖకు జెందినవారు; సాంఖ్యాయన సగోత్రులు; తండ్రి బాపిరాజు, తల్లి నరసాంబ.

వీరు స్ఫురద్రూపులు కుశాగ్రబుద్ధులు, చమత్కారముగ బ్రసంగించెడివారు; బహుముఖ ప్రజ్ఞగలవారు; బాల్యముననే సంస్కృతాంధ్రముల యందు బలమైన పాండిత్యము సంపాదించిరి; కవన, చిత్రలేఖన, గానములయందు బ్రవీణులు; నాట్యశాస్త్రజ్ఞులు కూడ. ఇన్నిటికి తోడు వీరు మంచి వక్త. ఆంధ్ర సారస్వత సభ (1923), ఆంధ్ర సాహిత్య పరిషత్తు్రయోదశ వార్షికోత్సవము (1924), ప్రథమాంధ్ర నాటక కళాపరిషత్తు (1929) మున్నగు సభలకు వీ రధ్యక్షత వహించిరి; నండూరులో

జరిగిన ఆంధ్ర సారస్వత సభలో 'మహోపాధ్యాయ' బిరుదముచే గౌరవింపబడిరి.

వీరు 'సుజన ప్రమోదిని', 'కల్పలత' యను పత్రికలు నడిపిరి. వీనిలో మొదటిది 1881 లోను, రెండవది 1903 లోను స్థాపితములైనవి. వీనిలో పదార్థ విజ్ఞాన, రసాయన శాస్త్రములు భూ, వృక్ష, క్రిమి, కీటక, ఖనిజ తత్త్వము మున్నగు విజ్ఞాన విషయకములగు వ్యాసములను ప్రచురించిరి.

వీరు ఆంగ్లభాషయందు గూడ ప్రవీణులు ; స్వయముగా కృషిచేసి మాధ్యమిక పాఠశాలా పరీక్షయందు రాజధానికి ప్రథములుగా నుత్తీర్ణులయి, న్యాయవాది పరీక్షయందుగూడ కృతార్థత వహించి, ప్రాచీన, అధునాతన భారత రాజ్యాంగ విషయములను బాగుగా పరిశీలించి పార్వతీపురము మునసబు కోర్టులో న్యాయవాదిగా నుండిరి ; పార్వతీపుర ప్రాంతములోని మేరంగి సంస్థానములో గొంతకాలము దివానుపదవిని నిర్వహించిరి.

(1) సుధానిధి, (2) మనోరమ (పద్యకావ్యములు); (3) పార్థపరాజయము, (4) అవదాతకలభకము (స్వతంత్ర నాటకములు); (5) విక్రమోర్వశీయము, (6) ఉత్తర రామచరిత్ర (అనువాదములు); (7) రహస్య దర్పణము (విజ్ఞాన విషయక వ్యాస సంపుటము); (8) ఆంధ్ర పద్యావళి (ఖండకావ్య సంపుటము) మొదలైనవి వీరి రచనలు. ఇందు వీరి రచనాకౌశలమును, హాస్యచతురతయు కన్పట్టును. వీరికి వెంకటరాయ సాంఖ్యాయన శర్మయను నామాంతరము కలదు. కొ. జో. శ

**వెంకటస్వామి :** వీరు ద్రావిడ బ్రాహ్మణులు ; వీరిని కాలుకుంటి వెంకటస్వామిగా రనేవారు. పందొమ్మిదవ శతాబ్ది చివరలో తూర్పు జిల్లాలలో ప్రసిద్ధికెక్కిన భాగవతులలో వీరు ముఖ్యులు. వీరి భామవేషం ఆ రోజులలో బొబ్బిలి, విజయనగర ప్రాంతాలలో వేనోళ్ల పొగడేవారు. వీరి స్వగ్రామం ఎంగిలాపల్లి అగ్రహారం. కూచిపూడిలో వలెనే ఈ యగ్రహారీకులు భాగవతులుగా భామకలాపం కట్టేవారు. వీరి శిష్యులలో మంథా కామప్పగారి భామవేషం ప్రసిద్ధి కెక్కింది. అర్ధశతాబ్దికి పైగా ఈ గురుశిష్యుల నటనా నైపుణ్యం తూర్పు ప్రాంతాలలో పేరు మ్రోగింది. వీరి ప్రక్కవాద్యాలలో వీరాచ్చారి మృదంగం, సాలూరు బెన్నయ్య మద్దెల ప్రత్యేకంగా చెప్పుకొనేవారు. సగంకాలంవరకు మామూలు హంగుదారులు వాయిస్తే భామ తెరవెళ్లి వచ్చి చంద్రోదయవర్ణన, జటవర్ణన జరిగిన తరువాత 'భామనే సత్యభామనే' అను దరువు పాడేది. అపుడు సత్యభామ శ్రీకష్ణపరమాత్మకు జాబు వ్రాసి పంపేది.

'ఉత్తరము చూచుకొమ్మనే
వాని వేగ, తత్తరపడి లేచి రమ్మనే....'

అనగానే మాధవి వెళ్లి స్వామివారికి రాయబారం వినిపించేది.

'నన్ను బంపిందిరా భామామణి
నిన్ను రమ్మనమని - నన్ను...'

ఎదురెత్తుగా వచ్చే ఈ పాటలకు సాలూరు బెన్నయ్యగారు మద్దెల వాయించేవారట. వీరి గాన నటనా నైపుణ్యానికి అనువుగా వీరి మృదంగ వాద్యం సున్నితంగా చాటు మాటులతో రక్తి కట్టించేదని చెప్పుకునేవారు.

కూచిపూడివారి భామకలాపానికీ ఈ భామకలాపానికీ గ్రంథం ఒకటే అయినప్పటికీ, కొన్ని దరువులు పాటలూ తూర్పువారు చేర్చుకొన్నారు. ఇప్పటికీ వీరి బాణీలు తూర్పుభాగవతులు, వీథిభాగవతులు పాడి భామవేషం కడుతున్నారు. వీరిలో భాస్కరభట్లవారి జట్టు ఇటీవల ప్రసిద్ధిలోనికి వచ్చింది. ప్ర. న.

**వెంకటసుబ్బారావు, నండూరి** (క్రీ. శ. 1884 - 1957) : పశ్చిమగోదావరిజిల్లా, వసంతవాడలో ఈతడు జన్మించెను. ఈతని తండ్రి చిన్నబాపన్నగారు ; కృష్ణాజిల్లాలోని నరసన్నపాలెమునకు కరణము.

ఈతని చిన్నతనపు చదువు ఏలూరులో ; కాలేజీచదువు కాకినాడలో. కాకినాడ కాలేజీలో ఇతనికి ఆంగ్లమందు గాఢమగు అభినివేశము కుదిరి ఆంగ్లకవనమును సదా చదువుచు పరీక్ష తప్పెను. కాని తన ఆంగ్ల నైపుణివల్ల రఘుపతి వెంకటరత్నము నాయుడుగారి మనస్సునకెక్క గలిగినాడు. ఈతనికి బసవరాజు అప్పారావు దగ్గర బంధువు. వీరుభయుల స్నేహము ఘనిష్ఠమైనది. అప్పారావు ప్రేరణచే ఇతడు చదువుకని మదరాసుకు వచ్చి చదివి ఎఫ్. ఏ. పరీక్షలో ఉత్తీర్ణుడై బి.ఏ. కై క్రిస్టియన్ కళాశాలలో చేరెను.



చిత్రము 285.
నండూరి వెంకట సుబ్బారావు

న్యాయవాదవృత్తి నభిలషించి న్యాయశాస్త్రమును చదువగోరి ఆర్థికములగు ఇబ్బందులవల్ల కొంతకాలము ఉపాధ్యాయుడుగా కుదిరి సొమ్ము నిలవచేసికొని ఇతడు న్యాయశాస్త్రమును చదివి ఉత్తీర్ణుడయ్యెను ; 1926 సాలు నుంచి ఏలూరులో న్యాయవాదిగా జీవయాత్ర గడపెను.

తాను నమ్మిన కవితామార్గమును, దాని విశిష్టతను, కవిత్వ కళామర్మములను నిరంతరము బోధించు అప్పారావును తనకు గురువుగా ఇతడు భావించెను. కాని గురజాడ అప్పారావును ఒక్కసారియైన చూడకున్నను 'ముత్యాల సరముల'ను చదివి, అందలి కవనమాధురికి చొక్కి ఇతడు తనకు తెలియకయే ఆయనకు శిష్యుడయ్యెను. ఇతనికి ఆయన కవనము, అందును ముఖ్యముగా 'లవణరాజుకల' యను కావ్యము గాఢముగా — ప్రగాఢముగా హత్తుకొన్నది. తన యెంకి-నాయుడు బావలు లవణరాజుకలలోనుంచి మొలుచుకొని వచ్చినట్లుగా, యెంకి నాయుడుబావల మనికిపట్టు ఏటిదరి తోట లవణ రాజు కలలోనిదిగా ఇతడు వ్యాఖ్యానించువాడు; ఆనాటి సాహిత్యసీమలో, కంచుఢక్కా మ్రోతలవలెనున్న శతావధానాది మార్గములను వదలి ఇతడు తన కవనమార్గమును, వినూత్నమైనదానిని, తానుగా సృష్టించుకొనెను.

'ఒకనాడు కాలేజీనుండి ట్రాం బండిలో వస్తూండగా గొంతులో సన్నని రాగం బయలుదేరింది. దానిని నాలో నేను పాడుకోవాలని సాహిత్యం జ్ఞాపకం చేసుకోపోయాను. ఎప్పుడో విన్న పదంలాగున! 'గుండె గొంతుక లోన కొట్లాడుతాదీ' అన్న పల్లవి వచ్చింది. అదే మననం చేసుకోగా చేసుకోగా యిల్లు చేరేసరికి నేను వ్రాసిన మొదటి పాట తేలింది' - ఇవి అతని మాటలు.

తొలిపాట దగ్గరనుంచీ ఎక్కువగా మెప్పుల వర్షమును, అంతకంటె దెప్పులజల్లును, హోరుగాలిని, దుమారమును మూట కట్టుకొన్న వీయెంకి పాటలు. యెంకిపాటలు కొద్దిగా రచితమైన కాలములో వసంతవాడ గ్రామములో ఒక పెండ్లిలో జరిగిన సాహిత్యగోష్ఠియందు, శతావధానులు వేలూరి శివరామ శాస్త్రిగారు, అప్పటికి వ్రాసిన బసవరాజు అప్పారావు పాటలను, ఈతని యెంకి పాటలను విని —

'యేతా మెత్తేకాడ యెదురూగ కూకుండి...
సూరియుణ్ణి తిట్టు నాయెంకి
మల్లీ యెప్పటల్లె తెల్లారబోతుంటె—
సెందురుణ్ణి తిట్టు నాయెంకి'

అన్నచోట 'ఇంతవరకూ శృంగారనాయికల చంద్రోపాలంభనం విన్నాము; సూర్యోపాలంభనం బహుకొత్తగా, రమ్యంగా వుంది! బాగు. మీలో గురువుపాటలకంటె, శిష్యుడిపాటలే రసవత్తరాలు, పరిణతాలు. యెంకిపాటలు సంస్కృత అలంకార శాస్త్రములోని ఉన్నత ప్రమాణాలకు నిలబడతై' అన్నారు. తదాదిగా అప్పారావు యెంకి పాటల యెడల ఈసుగొని వైమనస్యము పెరిగి వారుభయులు జీవితపర్యంతము దూరమైనవారైరి.

ఇతనిది అతి తియ్యని కంఠము; ప్రసన్నమైన వాక్కు. ఇతడు సరసుడు; బహుగంభీరుడు; తన ప్రేమ, అనిష్టములను సైతము ఎవరికిని తెలియనిచ్చువాడు కాడు; బహు మిత భాషి. తనను, తనకు ప్రాణపదములైన యెంకిపాటలను విమర్శపేర గేలిచేసి నొవ్వబలికిన వారిని సైతము తాను నొచ్చియు నొవ్వబలుకనివాడు; తనకు ససిపడని తావుల నుండి వైదొలగి వచ్చెడివాడుకాని, వాదించుట యెరుగడు.

1925 లో నూజివీటిలో జరిగిన అభినవాంధ్ర కవి మిత్రమండలి సభకు కారకు డయ్యెను. ఆ మహాసభలందు కళాప్రపూర్ణులు, వేదము వెంకటరాయశాస్త్రిగారి అధ్యక్షతను, యెంకిపాటలు ఏలపాటల పరాకాష్ఠగా నిర్ధరింపబడినవై పండిత పామరుల ప్రేమను ఒడుచుకొనినవి. 'రసమంజరీ అమరుక పుష్పబాణవిలాసాదులకుంబోలెను, షేక్స్పియరు సానెట్టులకుంబోలెను మీ యెంకిపాటలు రససిద్ధి నందిన' వని వెంకటరాయశాస్త్రిగారు ఈ యెంకి పాటలను మెచ్చుకొనిరి.

యెంకిపాటలు సుమారు నూరు పాటలు. ఈ నూరున్నూ ఆణిముత్యాలవంటివై రసజ్ఞలోకమును ఆకర్షించి అలంకరించి ఎందరినో రసమార్గము దెసకు లాగినవి. ఈ పాటలు ఒక కథాసూత్రమునకు ముడిపడినవి కావు. ఏ పాట కాపాటే ఒక కావ్యముగా, మహాకావ్యముగా ఒప్పినది. బహుకొద్ది పరిధిలో, బహుతక్కువ తేలిక మాటలతో అంతంత భావప్రదర్శన చేయుట అసిధారావ్రతము. యెంకిపాటలలోని పాత్రలలో ప్రధానులు - యెంకి, నాయుడుబావలు. వీరి నివాసస్థానము యేటిదరి తోట. ఇద్దరూ ప్రేమైకజీవనులు. ఇక అప్రధానపాత్ర యెంకి యొక్క చెల్లి సీతాయి. సుబ్బారావు రసహృదయము ఇతని జీవితములోని తుదిగడియవరకూ ఎంకిమయముగా భాసించినది. జ. రు. శా.

వెంకట సూర్యప్రసాదరావు, త్రిపురాన (క్రీ. శ. 1889 - 1945): వీరు శ్రీకాకుళము తాలూకా సిద్ధాంతం గ్రామవాసులు. వీరి తండ్రి తమ్మయ్య దొర, తల్లి నారాయణమ్మ.

వీరిది సుసంపన్నమైన తెలగ వంశము; తండ్రి తమ్మయ్య దొర కూడ మంచి వ్యుత్పన్నుడు. ఆంధ్రమున గ్రంథ రచన మొనర్చియు, కవి పండితుల నాదరించియు మంచి పేరు ప్రతిష్ఠలు సంపాదించినవాడు. సూర్య ప్రసాదరాయ కవి తమ యింటి పండితుడగు శ్రీ ముక్కవిల్లి సాంబయ శాస్త్రిగారియొద్ద విద్యాభ్యాసమొనర్చి సంస్కృతాంధ్రములలో మంచి సాహిత్యము సంపాదించి తండ్రిని మించిన పుత్రుడై యనేక కృతులను రచించెను. వీనిలో రఘూ

దయము, రతివిలాపము, నిర్వచన కుమార సంభవము, మొయిలు రాయబారము (మేఘ సందేశమునకు గేయాను వాదము) ముద్రితములు. ఇవిగాక ఇందుమతీ పరిణయము ఉత్తరరామ చరిత్రము (భవభూతి నాటకమున కాంధ్రము), కిరాతార్జునీయము(భారవికి దెనిగింపు) మున్నగునవి యముద్రితములు. చక్కని దేశీయ గేయములలో రచింపబడిన వీరి మొయిలు రాయబారము వీరి రచనలలో మేలు బంతి.



చిత్రము 286. త్రిపురాన వెంకట సూర్యప్రసాదరావు

సూర్యప్రసాదరాయకవి గారి రచనలలో నింపైన తెనుగు పలుకుబడు లడుగడుగునను బొడసూపును. ప్రసన్న గంభీరమగు వీరి రచనా నైపుణ్యమునకు మెచ్చి ఆంధ్ర విశ్వకళాపరిషత్తువారు క్రీ. శ. 1943 లో 'కళాప్రపూర్ణ' బిరుద మొసగి వీరిని గౌరవించిరి.

కొ. జో. శ.

**వెంకటాచలమయ్య, వేదము** (క్రీ. శ. 1864 - 1931): అద్భుత ప్రతిభాశాలి, సుప్రసిద్ధ పండితుడు, ఆదర్శ న్యాయవాది అయిన వీరు పుదూరు ద్రావిడ శాఖీయుడు, విద్వద్వరేణ్యుడు, ఋషితుల్యుడునగు వేంకటరమణశాస్త్రిగారి తృతీయ పుత్రులు; తల్లి లక్ష్మమ్మ; సుప్రసిద్ధ విద్వత్కవిపుంగవుడు కళాప్రపూర్ణ వెంకటరాయ శాస్త్రి అనుజులు. వీరు గోదావరిజిల్లా పోదూరు గ్రామమున జన్మించిరి; తండ్రి విశాఖపట్టణమున నార్మల్ స్కూలులో ఆంధ్ర పండితులుగా నుండినందున మూడు నాలుగు తరగతులు ఆ స్కూలులోను, పిమ్మట అచటి హిందూ హైస్కూలు (ఇపుడు మిసెస్ ఎ. వి. యన్. కాలేజీ) లోను చదివిరి; కొంతకాలము 'కళాప్రపూర్ణుల' యొద్ద గూడ విద్యాభ్యాస మొనర్చిరి. తదుపరి 1878లో తండ్రిగారు రాజమహేంద్రవరము గవర్నమెంటు కాలేజీలో ప్రధాన పండితోద్యోగము స్వీకరించినందున వీరును ఆ కాలేజీలోనే చదువుకొని, 1883లో బి. ఏ. పరీక్షలో సంస్కృతమున రాజధాని కెల్ల ప్రథములుగా ఎన్నికగాంచి విజయనగరము మహారాజాగారును, గోడే వారును ఇచ్చుచుండిన 550 రూప్యముల బహుమతిని గడించిరి; 1886లో ఔను ఇన్నిస్‌పేట హైస్కూలు ప్రధానోపాధ్యాయులైరి. 1887 లో వీరికి వివాహమైనది. ఈయన భార్య శాంభవమ్మ. వీరు 1888 లో రెండవ గ్రేడు ప్లీడరు పరీక్షయైరి; 1889 లో అచ్చటనే మహర్షటా హైస్కూలు ప్రధానోపాధ్యాయులుగా జేరి రెండేండ్లు పనిచేసిరి. తత్పూర్వము కావలికి ఎనిమిది మైళ్ల దూరమున నున్న స్వగ్రామము మల్లయపాళెము శ్రోత్రియములో తండ్రిగారు చేరియుండినందున వారికి సమీపమున నుండవలయునను కోరికతో వీరు తరువాత కావలికి వచ్చి మూడు సంవత్సరములు న్యాయవాదిగ పనిచేసిరి. తదుపరి 1894లో వీరు ఫస్టు గ్రేడు, బి. యల్., రెండును పరీక్షయై నెల్లూరిలో న్యాయవాదవృత్తి నారంభించి జీవితాంతము వరకు గడపిరి. పరమపదించునాటికి వీరికి ఇరువురు కొమాళ్లు, ఒక కొమార్తె యుండిరి.

వీరి ధారణాశక్తి అత్యద్భుతము; ఏ భాషయందే సత్కావ్యమునేని ఒక్కసారి పఠించిన అది వీరికి కంఠస్థము కావలసినదే. వీరు స్వయంకృషిచే 11 విదేశభాష - గ్రీకు, ల్యాటిను, ఇంగ్లీషు, ఫ్రెంచి, ఇటాలియన్, జర్మన్, అరబిక్, పర్షియన్, జెండ్, ఈజిప్షియన్, అస్సీరియన్ - లందును; 9 భారతీయభాష - సంస్కృతము, తెలుగు, అరవము, కన్నడము, మళయాళము, మహారాష్ట్రము, హిందీ, ఉర్దూ, గుజరాతీ - లందును సమగ్ర పాండితి నార్జించిరి. పారసీక మతగ్రంథ మగు జెండ్ అవెస్తాను వీరు వేదమును వలె స్వరయుక్తముగ గానము చేయగలిగియుండిరి.



చిత్రము 287. వేదం వెంకటాచలమయ్య

వీరికి ప్రాచీన భూగోళశాస్త్రమునందును, ప్రాచీన చరిత్రయందును భారతీయ విజ్ఞానమందును, భాషాచరిత్రయందును శ్రద్ధాసక్తు లధికముగా నుండెను. వీరు తమ విరామకాలము నంతయు పై విషయముల పరిశోధనయందే గడిపిరి. వీరి యమూల్య రచనలు ముద్రితములును, అముద్రితములును పెక్కులు గలవు. ముద్రితములు: 'Mythological Investigation and the Aryan Hypothesis', 'The Adventures of the God of Madura', 'Bharatavarsha', 'Aryavarta', 'The Tamils three thousand years ago', 'Post Mortem Life in Ancient Egyptian Belief', 'The Sanatana Dharma of Hindu Marriage', 'The

Seven Dwipas of the Puranas', 'A Chapter of Ancient History', 'SROASHA of the Zoroastrian system, His Identity', 'Year-Measurement in Ancient Times', 'Notes on the Preliminery Chapters of Mahabharata, being an attempt to separate the genuine from the spurious', 'Bhishma-Panchakam'.

ఆంధ్రమున వీరి రచనలు: 'కతిపయశబ్దార్థ స్వరూప విచారము' అను శీర్షికపై వ్యాసములు. అముద్రిత రచనలు: 'రామాయణ విమర్శ', 'లలితాసహస్రనామ భాష్యము', 'అమరకోశవ్యాఖ్య' మున్నగునవి.

వీరు గంభీర విగ్రహులు, దుర్ధర్షులు, సచ్ఛీలురు, సత్య సంధులు, మోమోట మించుకయు లేక ఉన్న దున్నట్లు నుడువువారని పేర్గాంచిరి. న్యాయవాద వృత్తిలో నీతికి, నిజాయితికి వీరితో సమానులు వీరే. వీరు సత్యదూరమగు 'కేసు' నెన్నడును చేపట్టలేదు. వీరు కాల నియమమును కఠినముగా పాటించువారు. గు. వేం. సు.

వెంకటేశ్వరయ్య, శ్రీధర: ఈయన తంజావూరు నేలిన మహారాష్ట్ర వంశీయుడగు శాహజీ (క్రీ. శ. 1684-1740) రాజు పోష్యవర్గములోనివాడు; తంజావూరు జిల్లాలోని తిరువిశనల్లూరను శాహజీపుర గ్రామ ప్రధాన ప్రతిగ్రహీతలగు నలువదియైదుగురిలో నొకరి కుటుంబమునకు చెందినవాడు. ఆ యూరనున్న యీయన గృహమును, ఆయన గౌరవచిహ్నముగ నచట నేటేట జరగు నుత్సవమును ఈయన ఆయూరివాడనుటను సంపూర్ణముగ రుజువు చేయుచున్నవి. ఇంటిపేరునుబట్టి యీయన ఆంధ్రుడని తెలియుచున్నది. సమకాలీను లీయనను వెంకటేశుడని, వెంకటేశ్వర శాస్త్రియని వ్యవహరించుచుండిరి.

సామాన్యముగ వెంకటేశయ్య నందరును 'అయ్యావాళ్' అనెడివారు; అనగా 'అయ్యగారని' యర్థము. ఈయన సమకాలీనుడగు బోధేంద్రునితోగూడ భక్తి సంప్రదాయమునకు చెందిన ఒకవిధమైన పూజాపద్ధతిని తమిళ దేశమున నెక్కువగా వ్యాపింపజేసెను. భగవత్సంకీర్తనమును, నామసిద్ధాంతమను భగవన్నామమును జపించుటయును ముక్తి కవితథ మార్గమని ఈ పద్ధతి ననుసరించువారి నమ్మకము.

'అయ్యావాళ్'(అయ్యగారిని)ను గురించియు, ఈయన ఆధ్యాత్మిక సిద్ధులను గురించియు అనేకములగు చిత్రకథలు పరంపరగా వచ్చుచున్నవి. ఒకప్పుడు అనావృష్టి సంభవింపగా ఈయన కుళీరాష్టకమను స్తోత్రమును చెప్పి వానలు కురిపించెనని చెప్పుదురు; తారావళీ స్తుతితో నొకశిశువును బ్రతికించెననియో, ఆసన్నమృత్యువునుండి కాపాడెననియో చెప్పుదురు.

ఈ రెండిటికంటెను అద్భుతమైనదియు, చాల ప్రసిద్ధమైనదియు అయ్యావాళ్‌కు - క్షుధార్తుడగు చండాలునకు సంబంధించిన కథ. జరిగిన ఈ కథయే ఈయన ఋషికల్పుడని భావింపబడుటకును, కార్తిక బహుళ అమావాస్య నాడు ఏటేట ఈయనపేర ఉత్సవము జరుగుటకును కారణము. ఒకప్పుడు శ్రాద్ధదివసమున ఈయన కావేరీనదికి పోవుచుండగా క్షుధార్తుడగు చండాలు డొకడు మృత్యుముఖమున నుండుట చూచెను. సర్వప్రాణులయందును భగవంతుని దర్శించెడు పూజ్యుడగు నీయన నిర్భర కరుణా తరంగితుడై తమయింట శ్రాద్ధమునకై నిమంత్రితులగు బ్రాహ్మణులకొరకు సిద్ధముచేయబడిన యన్నమును ఆ చండాలునకు బెట్టించెను. ఆచారకాండ ప్రకారమీయనకు గంగాస్నానరూపమగు ప్రాయశ్చిత్తము విధి. ఇందుకై ఈయన వెంటనే గంగామాతను స్తుతించెను. చూపర కాశ్చర్యము కలుగునట్లు ఈయన యింటిలోని బావి జలములలో నామె ప్రత్యక్షమయ్యెను. నూతిలోని జలము లుబికి వచ్చి పైకి పొంగి పారలెను. ఈ నాటికిని ప్రతిసంవత్సరమును అయ్యగారి యుత్సవమునకు వచ్చు అసంఖ్యాక జనుల హృదయములను క్షాళితమొనర్చి పవిత్రమొనర్చుట కా జల ముపయోగపడుచున్నది.

ఈయన సమకాలీనులలో బోధేంద్రుడును, పెరియప్పకవియు నుండిరి. పెరియప్పకవి తన్నుగూర్చి శ్రీధర వెంకటేశానుగ్రహీతుడనని చెప్పికొనెను. ఈయన శ్రీచరణ సన్నిధి నుపవసించిన ప్రసిద్ధ గ్రంథకర్తలలో తెలుగు విద్వాంసుడును, వీణావాదనమున నిపుణుడునగు వీణ అయ్యన్న దీక్షితు డొకడే ఎరుక కందినవాడు.

శ్రీధర వెంకటేశుని కృతులలో నామసిద్ధాంత భక్తి సంప్రదాయ పరివ్యాప్తికి ప్రేరకములైన ఈయన స్తోత్రగీతములు చాల జనాదరమును పొందినవి. ఆఖ్యాషష్టి, దయాశతకము, ఆర్తిహరస్తుతి, కుళీరాష్టకము, అచ్యుతశతకము మొదలైనవి ఈయన కృతులలో కొన్నిమాత్రమే. ఇవికాక శ్రీధరుడు నామసిద్ధాంతమును గూర్చి 'భగవన్నామభూషణ' మను ఉద్గ్రంథమును రచించెను. దురదృష్టవశమున నీ గ్రంథ మింతవరకు దొరకలేదు. కాని యిది యితర గ్రంథములలో నుదాహృతమైనది. పోషకుడగు శాహజీరాజు నాజ్ఞచే ఈయనయు, ఈయన సనాముడగు వెంకటేశ్వరశాస్త్రి, నల్లాధ్వరి యనుసమకాలీనులు గలిసి గ్రథించిన 'పదమణిమంజరి'యను శబ్దకోశము మరియొకటి. తన్నాదరించిన శాహజీరాజుపై

జెప్పిన 'శాహేంద్రవిలాస'మనున దొక్కటియే యీయన రచించినట్లుగ తెలియవచ్చిన కావ్యము. ఈయన తన స్తోత్ర గీతములచేతను, భజన సంప్రదాయమున కొనర్చిన సేవ చేతను మాత్రమే విశ్రుతు డయినాడు. తమిళదేశము నందు తన్నామాంకితములగు పాటలను పాడి ఈయనను ప్రథమమున స్మరింపని భజనయే యుండదు. వి. రా.

**వెంకటేశ్వరశాస్త్రి, వావిళ్ల** (క్రీ.శ. 1885 - 1956): వీరు రామస్వామి శాస్త్రిగారి పుత్రులు. వీరు తండ్రిగారు నెలకొల్పిన వావిళ్ల సంస్థను చాలగా నభివృద్ధి పరచిరి; ప్రాచీనాంధ్ర ప్రబంధములను, శతకములనే గాక, నూతన గ్రంథములను ప్రకటించిరి; సంస్కృతమున, మహాభారతము 18 పర్వములు దాక్షిణాత్య సంహితా పాఠములతో ప్రకటించిరి. ఆంధ్ర గ్రంథ ముద్రణమునకు వీరు చేసిన సేవకు మెచ్చి ఆంధ్ర విశ్వకళా పరిషత్తువారు వీరికి క్రీ. శ. 1955 లో 'కళాప్రపూర్ణ' బిరుదము నిచ్చి సత్కరించిరి. వీరు భాషాపోషకులు. ని. వెం. రా.


చిత్రము 288
వావిళ్ల వెంకటేశ్వరశాస్త్రి

**వెంకయ్య, నందిగానం** (క్రీ. శ. 1858 - 1906): ఈయన గానవిద్య కులవిద్యగా సాధించి వాసి కెక్కిన గానవిద్యా పారంగతుడు; నందిగానంవారి వంశమున బొబ్బిలిలో జన్మించినాడు. ఈయన తండ్రి పరమ ఛాందసుడు; వ్యాకరణశాస్త్ర వేత్త. కులవిద్య అయినప్పటికిని సంగీతమన్న ఆయన కనిష్టము. గానవిద్యాభ్యాసము శీలమును చెరుపునని ఆయన రూఢవిశ్వాసము.

చాలకాలమువరకు తలిదండ్రులకు సంతానము కలుగక తిరుపతిదేవుని వరప్రసాదముగా పుట్టినందున ఈయనకు పెట్టిన వెంకటేశ్వరనామమే వ్యవహారములో వెంకయ్యగ మారినది. ఈయనను సంస్కృత సాహిత్య మార్గములో పెట్టవలెనని తండ్రి పట్టుదల; కాని ఈయన కది అబ్బలేదు. తల్లిమట్టుకు ఈయన అభిరుచిని కనిపెట్టి ఈయనకు కులవిద్య సంగీతము నేర్పించుమని భర్తతో ఎప్పుడును పోరాడుచుండెడిది. కొనకు తల్లి కోరికయే ఫలించినది.

నందిగానంవారి కుటుంబము బొబ్బిలి సంస్థానమును ఆశ్రయించుకొని ఉండెడిది. బొబ్బిలిలోనే వీణలో పేరు పొందిన వాసావారి శిక్షణలో ఈయన సంగీతములో ప్రథమ పాఠములు మొదలుపెట్టినారు. వాసావారు గాత్రములో అంతగా పరిశ్రమ చేసినవారుకారు. ఈయనకు గాత్రపాటలో ప్రజ్ఞ సంపాదించవలెనని ఆశ మెండు. దక్షిణదేశములో మహావిద్వాంసులున్న చోటికి పోయి విద్య సంగ్రహించవలెనను ఈయన కోరిక తల్లి చేసిన దోహదమువల్ల ఫలించినది. ఈయన తిరువైయారుకు వెళ్ళి తద్గ్రామ వాస్తవ్యులు మహా వైద్యనాథయ్యరుగారిని ఆశ్రయించినారు. ఈయన అద్భుత గాత్రము వారి చిత్తము నాకర్షించినది. వారి శిష్యకోటిలో ఈయన శిరోమణిగా తేలినారు. వైద్యనాథయ్యరుగారు పట్టుదలతో మర్మము విడిచి సంగీత కళారహస్యముల నన్నిటిని ఈయన కుపదేశించినారు. సమర్థుడైన అధికారి అగుటచేత ఈయన పది సంవత్సరములు శుశ్రూష చేసి కష్టపడి సాధన చేసి గురువుగారి ప్రతిబింబముగా తయారై 1893 ప్రాంతమున స్వదేశము చేరుకొని, బొబ్బిలి ఆస్థాన విద్వాంసుడుగా నమోదైనాడు. ఆ రోజులలోనే ఆంధ్ర వైణికాగ్రేసరులైన తుమురాడ సంగమేశ్వరశాస్త్రిగారిని శిష్యునిగా స్వీకరించి ఈయన గురువుగారి ఋణము తీర్చుకొన్నాడు. సంగమేశ్వర శాస్త్రులవారి అత్యద్భుత వీణావాదన నైపుణికి మూల కారణమైన 'లక్షపూర్తి' అనెడు రాక్షస త్రిస్థాయీ సాధకము ఈయన ఉపజ్ఞయే.

ఆ రోజులలో సంగీత విద్యకు తంజావూరు పుట్టినిల్లు, విజయనగరం అత్తవారిల్లు అని వాడుకగా నుండెను. విజయనగరాధీశ్వరుడు ఆనందగజపతి సభలో తమ వైదుష్యమును ప్రదర్శించి మెప్పు పొందవలెనని ఈయనకు కుతూహల ముండెను. ఆనందగజపతితో చతురంగ మాడుచుండెడు వెలిదిండి జోగారావు అను గోల్కొండ వ్యాపారి పంతుల పురుషకారమువల్ల ఈయనకానందగజపతి సభా ప్రవేశము చేకూరినది. ఒకనాడు ఈయన గానమును విని ఈయనను తమ సభకు వచ్చుచుండుడని ఆనందగజపతి ఆజ్ఞాపించినారు. ఈయన బొబ్బిలి సంస్థానాశ్రితులగుటచే విజయనగరాస్థానములో కొలువుకు కుదురలేదు. కాని వారి సభకు అప్పుడప్పుడు వచ్చుచుండువారు.


చిత్రము 289
నందిగానం వెంకయ్య

ఒకనాడు ఆనందగజపతి సభకు అభిరాంపిళ్లె అను దాక్షిణాత్య గాయకుడు వచ్చి తన సామర్థ్యమును మహారాజు ముందర కనబరచెను. పిళ్లెగారిని మహారాజు మరొక

నాడు సభకు రా నియమించి ఈయననుకూడ ఆ సభకు పిలిపించెను. నాడు ఆస్థాన గాయకు లందరు ఒకరి తరువాత నొకరు కచ్చేరి చేయవలసినదిగా మహారాజు ఆజ్ఞాపించెను. కొనకు ఈయన తన వీణను, గాత్ర పాటను వినిపించినారు. సభ ముగియుముందు ఆనందగజపతి పిళ్లెగారిని తమ అస్థాన విద్వాంసుల వైదుష్య మెట్లున్నదని అడుగగా పిళ్లెగారు పాటకులలో ఒక్క ఈయనదే పాట అన్నారు. దీనికి కారణము ఈయనది గౌళగాత్ర మగుటయే. ఈయన గాత్రము సింహగర్జనవలె నుండెడిది; వీణ వాయించిన క్రిందనున్న భూమి వణికెడిది. ఈయన గొంతు ఎంత పెద్దదో ఈయన వీణ తీగెమీటు కూడ అంత దృఢమైనది. రెండును స్వర మహత్వమును కల్పించెడివే. ఈయన వీణమీద 'ఘనం' వాయించునప్పుడు ఒక 'ఆర్కెస్ట్రా' ధ్వని పుట్టెడిది.

1898 ప్రాంతములో కసింకోట జమీన్‌దారుగారి ఆహ్వానమున ఈయన కసింకోటకు మకాము మార్చినారు; శిష్యులకు విద్య నేర్పుచు అచ్చటనే కాలధర్మ మొందినట్లు తెలియుచున్నది. ఈయన ఆంధ్ర సంగీతమునకు ఒక అందము, ఒక వరుస, ఒక ప్రతిష్ఠ తెచ్చినారు. మే.వ.న.

**వెంకయ్య, రఘుపతి** (క్రీ. శ. 1869 - 1941) : వీరు బందరు పట్టణంలో సైనికాధికారుల కుటుంబంలో జన్మించారు. ఆంధ్ర విద్యావేత్తలలో ప్రముఖులు, 'బ్రహ్మర్షి' రఘుపతి వెంకటరత్నంగారు వీరి సోదరులు.

వెంకయ్యగారు ఒక రకంగా దక్షిణదేశ చలనచిత్ర పరిశ్రమకే గాక, భారతదేశ చలనచిత్ర పరిశ్రమకే పితామహులని చెప్పవచ్చు. ప్రప్రథమంలో వీరు ఛాయాచిత్ర గ్రాహకులుగా (స్టిల్ ఫోటోగ్రాఫర్) మద్రాసు వచ్చారు. మౌంటు రోడ్డులో వీరి స్టూడియో ఉండేది. 1909వ సంవత్సరంలో ఐదవ జార్జి సార్వభౌముని సమక్షంలో ఒక ప్రదర్శనం జరిగినట్లు పత్రికలలో పడింది. ఆ ప్రదర్శనంలో తెర మీద చలనచిత్రంతోబాటు శబ్దంకూడా జతపర్చటానికి ప్రథమ ప్రయత్నం జరిగింది. ఒక గ్రామఫోన్ రికార్డు చలనచిత్రంతో కలిపి ఒకేసారి ప్రారంభించడంద్వారా ఈ వింత సాధించారు. ఆ యంత్రం పేరు 'క్రోనో - మెగఫోన్'; నిర్మాతలు గామంట్ అండ్ కంపెనీ. వెంకయ్యగారు ఆ యంత్రాన్ని 30,000 రూపాయలకు కొన్నారు; 300 - 400 అడుగుల పొడవు గల చిన్న చలనచిత్రాలు ఒక డజను తెప్పించి ప్రస్తుతం విక్టోరియా పబ్లిక్ హాల్ అనబడే భవనంలో (అప్పు డది టౌన్‌హాల్) ప్రథమ ప్రదర్శనం జరిపారు. ఆ తరువాత వెంకయ్యగారు ఈ యంత్రంతో దక్షిణ భారతదేశం, బర్మా, సింహళం పర్యటించివచ్చారు.


చిత్రము 290
రఘుపతి వెంకయ్య

1910 వ సంవత్సరంలో వీరు ఒక టూరింగు టెంట్ తెప్పించి బెంగుళూరు, బొంబాయి నగరాల చుట్టుప్రక్కల ఆంధ్రజిల్లాలలో, ఆంగ్ల చిత్రాలు ప్రదర్శిస్తూ పర్యటించారు; ఆ అనుభవాన్ని పురస్కరించుకొని 1912లో గెయిటీ థియేటర్ నిర్మించారు. మూకచిత్రాల ప్రదర్శనం మద్రాసులో ప్రారంభించినవారు వీరే. తరువాత 1914 - 17 సంవత్సరాలమధ్య వీరు క్రౌన్ టాకీసు, గ్లోబ్ (ఇప్పుడు రాక్సీ అనబడే థియేటర్) నిర్మించారు.

ఆ తరువాత చలన చిత్రాల డిస్ట్రిబ్యూషన్‌లో అనుభవం సంపాదించారు. ఈ పరిశ్రమయొక్క లోతుపాతులు బాగా తెలుసుకున్న తరువాత తన కుమారుడైన రఘుపతి ప్రకాష్‌గారిని చలనచిత్రనిర్మాణంలో తరిఫీదుకోసం ఇంగ్లండు, అమెరికా పంపారు; వారు తిరిగివచ్చినతరువాత గ్లోబ్ థియేటర్ వెనుకభాగంలో 'స్టార్ ఆఫ్ ఈస్ట్ ఫిలిమ్స్', అనేపేరుతో ఒక స్టూడియో నిర్మించారు. ఆ స్టూడియోలో 'గజేంద్రమోక్షం', 'మత్స్యావతారం', 'భీష్మప్రతిజ్ఞ', 'నందనారు' వంటి మూక చిత్రాల నిర్మాణం జరిగింది. 1929 వ సంవత్సరంవరకు చలన చిత్ర పరిశ్రమలో కృషిచేసి, తరువాత వీరు ఆ వ్యాపారాన్ని కుమారునికి వదలి పెట్టినారు. పా. ప.

**వెంగమాంబ, తరిగొండ** : ఈమె తెలుగు వాఙ్మయమున పూర్వపరిచితురాలై, సుప్రసిద్ధురాలైన తాత్త్విక గ్రంథ రచయిత్రి; కడప మండలమందలి తరిగొండ గ్రామ వాస్తవ్యురాలు; గొప్ప యోగిని; తండ్రి కానాలి కృష్ణార్యుడు; తల్లి మంగమాంబ. ఈమెకు వివాహమైనది. కాని బాల్యముననే ఈమె వితంతువైనది. ఈమె జీవితచరిత్రయు, అక్క మహాదేవి జీవిత చరిత్ర వలెనే చాల విచిత్రమైనది. బాలవితంతువైన ఈమె యోగినిగా నుండుట కపటవర్తనమని ఆగ్రామ వాస్తవ్యులామెపై నెన్నోవిధముల నిందలు మోపి హింసింపగా నట నిలువనేరక, తిరుపతికి చేరి అచట శ్రీ శేషశైల వేంకటపతిని కీర్తించుచు, కావ్యములు వ్రాసికొనుచు జీవిత శేషమును గడపిన పూతచరిత. శ్రీ వేంకటేశ్వర భక్తి విజయమున ఈమె చరిత్రము సంపూర్ణముగ కలదు. బ్రౌణ్య నిఘంటువునుబట్టి ఈమె కాలము క్రీ. శ. 19 వ శతాబ్ది మధ్యభాగమని తెలియవచ్చుచున్నది.

ఈమె బహు గ్రంథకర్త్రి. ఈమె రచించిన గ్రంథము లన్నియు తన ద్విపదభాగవతమున పేర్కొని యున్నది. కాని వానిలో రాజయోగసారము, వేంకటాచల మాహాత్మ్యము, భాగవతమునందలి కొన్ని భాగములు మాత్రమే కనబడుచున్నవి. ఈమె రచనా పద్ధతిని చూడ గురు శిక్షణపొందిన ట్లంతగా కానరాదు. కవిత్వమున అటనట దోషములు కన్పట్టును. రాజయోగసారము కేవల తత్త్వ గ్రంథము. ఇందలి శైలినిబట్టి ఇది యీమె ప్రాథమిక రచన మనిపించును. శైలియందు రాజయోగ సారముకంటె భాగవతము చాల మేలుగ నున్నది. ఈ రెండింటి కంటెను వేంకటాచల మాహాత్మ్య మన్నివిధముల నుత్తమముగ నున్నది. తిరుపతి వేంకటేశ్వరుని మహిమాకథానకముల సంపుటియే యిది. ఇందును దోషములు కలవు. కాని, ప్రకృతి వర్ణనలేమి, అలంకారము లేమి కావ్యధోరణినుండి ఈమె సర్వతోముఖ ప్రతిభను చాటుచున్నవి. తిరుపతీశ్వరుని గూర్చి ఎన్నో పాటలను కూడ నీమె విరచించినది.

ఏతత్కర్తృకములుగ తెలియవచ్చు గ్రంథముల నన్నిటిని బట్టి చూచినచో తెలుగు సారస్వతమున వికాసమందిన కావ్య పద్ధతుల నన్నింటిని ఈమె రచించి మెరసినట్లు చెప్ప వలసియుండును. ద్విపద, యక్షగానము, శతకము, కావ్యము, నాటకము, ప్రబంధము, పాట-అను వివిధ శాఖలలో బహుళసంఖ్యాకగ్రంథ సముత్పాదనము కావించిన స్త్రీ ఇంతవర కీమెయే. ఊ. ల. కాం.

**వేంకటమఖి :** ఇతడు రఘునాథ నాయకుని మంత్రియైన గోవింద దీక్షితుని రెండవ కుమారుడు; బహు గ్రంథకర్త; తండ్రివలెనే బహు యజ్ఞకర్త. సాహిత్య సామ్రాజ్యము (కావ్యము), శుల్బమీమాంస, కర్మాంత వార్త్తికము, వార్త్తికాభరణము, చతుర్దండి ప్రకాశిక (సంగీత ప్రకాశిక) అను గ్రంథముల నితడు రచించెను. రఘునాథుని కుమారుడగు విజయరాఘవుని రాజ్యమున ప్రతిష్ఠించిన దీతడే. వే. తి.

**వేమన :** ఆంధ్రశతక వాఙ్మయమునకు కవితా ప్రామాణ్యమును, చారిత్రక పరిపుష్టిని గలిగించిన రచనలలో వేమన పద్యసముచ్చయము ప్రముఖపాత్ర వహించు ననుట అతిశయోక్తి కాదు. వేమన 'కులగోత్రదేశకాల' ములు బహువివాద గ్రస్తములు. చారిత్రకు లితని కాలమును క్రీ. శ. 15 వ శతాబ్దమునుండి 18 వ శతాబ్ద పూర్వభాగము వరకు నెట్టుచున్నారు. కొండవీటి రెడ్లతో సంబంధమున్నను లేకున్నను ఇతడు రెడ్డికులజుడని యెల్ల రంగీకరించిరి. కొండవీటి సీమయందు జన్మించి యోగియై పశ్చిమాంధ్రములో చాలకాలము ప్రచారముచేసి యవసానమున పామూరువద్ద కొండగుహలో ప్రవేశించి సిద్ధిపొందెనని కొందరును, ఒంగోలు తాలూకా మూగచింతపల్లి యతని జన్మస్థానమని, తరువాత నతడు కొండవీటికి నివాసము మార్చెనని మరికొందరును, దత్తమండలముల లోని కదిరిచెంతగల కటారు పల్లెలో బుట్టి యత డచటనే సిద్ధిపొందెనని, వేమన సంతతివారు నేటికిని కదిరితాలూకాలోని నల్లచెరువు కటారుపల్లె గ్రామములలో అతని సమాధికి పూజాపురస్కారములు నడపుచు ధర్మ కర్తలై యున్నారని వేరొకకొందరును నుడువుచున్నారు.

ఇతని పద్యములను నిదానముగ పరిశీలించి చూచిన యెడల సంపన్నమైన రెడ్డి కాపుకులమున జన్మించి సంసారమునం దనేకములగు నొడుదుడుకులకు లోనై దేశమునం దస్తవ్యస్తముగానున్న వివిధ మత సాంఘికాది విషమ పరిస్థితులకు సంక్షుభిత మనస్కుడై కాలక్రమమున విరక్త చిత్తుడై సంసారము నుజ్జగించి యోగియై తత్త్వజ్ఞానమును బడసినట్లు గ్రహింపనగును. తత్త్వజ్ఞానము నొందిన తరువాత దేశము నలుమూలల సంచారము చేసి తన యనుభవమును, నమ్మికను మోమోటమిలేక సూటిగ తేట తెనుగుమాటలలో బోధించి యుండును. ఆతని బోధనలు ఆటవెలదులై, తేటగీతలై ఆంధ్రసరస్వతి కాణిముత్తెముల హారములై యలరారినవి.

ఇప్పటికి ముద్రిత ప్రతులనుబట్టి వేమన పద్యములు సుమారు 4 వేల పైచిలుకు కన్పట్టు చున్నవి. ఇందు కొన్ని ప్రక్షిప్తములు కలవనియు, వీనిలో చేరని ఇతరపద్యములు మరికొన్ని వ్రాతప్రతులలో కలవనియు కొంద రందురు. ఐనగావచ్చును. ఇవి తన అనుభవమునకు లోకము తీరు జోడించి యప్పటప్పట చెప్పినవి; ఏకకాలమున ననుస్యూతముగా వ్రాసినవి కాక పోవుటచే వీనిలో వస్త్వైక్యము లేక పోవుటయే కాక భావపునరావృత్తము, వైరుధ్యము కూడ గొన్నిట గోచరించును. ఇందలి విషయములను సంఘ విమర్శనము, మతాచారఖండనము, సామాన్యనీతి ప్రబోధము అని స్థూలముగా విభజింప వచ్చును.

ఆచారమును, తత్త్వమునుబట్టి చూచినచో వేమన కే జాతియు లేదు. జాతిమత సాంఘికాది భేదముల నితడు తీవ్రముగా ఖండించెను. అన్యాయమును, మోసమును ఇంచుకయు సహింపని చిత్తవృత్తిగలవాడు వేమన. ఇతడు తాను చెప్పునది ఎదిరి మనసునకు హత్తునట్లు చిన్నచిన్న లోకోక్తులగూర్చి చెప్పును; అది యాహ్లాదముగా నుండుటకై హాస్యోక్తియో చతురోక్తియో జోడించును. కనుకనే ఇతని పద్యములు పండిత, పామరజన రంజకములై యలరారినవి. పెద్ద పెద్ద విషయములను చిన్న సూక్తు

లలో నావిష్కరించుట యందు వేమనతో సాటివచ్చు ఆంధ్రకవి నభూతో నభవిష్యతి. కొ. జో. శ.

**వేములవాడ చాళుక్యులు :** రాష్ట్రకూటుల యాధిపత్యమున వర్ధిల్లిన చాళుక్యుల సంస్థానములలో ముఖ్యమైనది తెలంగాణములోని వేములవాడ యొకటి. వీరి మూలపురుషుడు బాదామి సత్యాశ్రయ పులకేశి వల్లభుడు. ఈ వంశమున పదితరములవారు వేములవాడలో రాచరికము నెరపిరి. వీరిలో క్రీ. శ. 8 వ శతాబ్ద మధ్యమున వెలసిన వినయాదిత్య యుద్ధమల్లుడు ప్రథముడు. ఇతని నెలవీడు కరీంనగర మండలములోని బోధను పట్టణము. దీనిని సామాన్యముగా 'నిందూరు బోధ' నని చెప్పుదురు. ఇతని సంతతివా రీ యుద్ధమల్లుడు పెక్కు దేశములను జయించినట్లును, చిత్రకూట దుర్గమును సాధించి సపాద లక్ష దేశము నేలినట్లును చెప్పుదురు. ఇతని కుమారుడు రాష్ట్రకూట నిరుపమ ధ్రువచక్రవర్తి సామంతుడైన మొదటి అరికేసరి. ధ్రువుని యాజ్ఞ చొప్పున నితడు దండెత్తిపోయి వేంగీ, త్రికళింగ దేశములను జయించి యా దేశాధిపతులను తన ప్రభువున కరిగాపులుగా జేసెను. ఇతని యనంతరము పేరెన్నిక కెక్కిన యాతడు 'సోలద గండ' బిరుదము గల బిద్దెగడు. రాష్ట్రకూట రెండవ కృష్ణరాజున కాశ్రితుడు; రాష్ట్రకూట, పూర్వచాళుక్య సంగ్రామములలో పాల్గొని పేరు ప్రఖ్యాతు లందెను. ఇతడు మొదట గుణగ విజయాదిత్యునిచే పరాభూతుడై యభయ ప్రదానమును బడసినను తరువాత కృష్ణరాజుతో గూడ వేంగిపై దండయాత్ర నడిపి యొకానొక యుద్ధమున మొదట చాళుక్య భీముని బాదుదల బట్టెను. ఇతని కుమారు డగు ఇమ్మడి నరసింహుడు ఇంద్రరాజు పక్షమున ఉత్తర దేశముపై దండెత్తి లాట, సప్త మాళవములను జయించి, కాలప్రియ ప్రాంగణమున నడచిన మహా సంగరమున గూర్జర - ప్రతీహార మహీపాలు నోడించి దిశాపట్టుని జేసెను; తన సైన్యమును యమునానదిని దాటించుకొని కన్యాకుబ్జ పట్టణము చేరి తురంగములను గంగలో నీరు ద్రావించి మరలి వచ్చెను. ఇతడు ముమ్మడి ఇంద్రరాజు సోదరి జాకవ్వ నుద్వాహము చేసికొనెను. ఆమె యం దతనికి ఇమ్మడి అరికేసరి యను పుత్రుడు పుట్టెను. ఇతడు తండ్రికి ధైర్య శౌర్య పరాక్రమముల దీసిపోవువాడు కాడు; రాజ్యతంత్ర మర్మజ్ఞుడు; మేనమామ యగు ముమ్మడి ఇంద్రరాజ దుహిత రేవక నిమ్మడిని, లోకాంబిక యను మరియొక రాష్ట్రకూట రాజకన్యను వరించెను. ఇట్లు రాజకుటుంబముతో సన్నిహిత సంబంధము కలవాడైనను ఇతని కేలనో నాల్మడి గోవిందరాజుతో వైరము పొసగెను. అరికేసరి యుద్ధమున నతని నిర్జించుటేకాక యతని దాయాదులగు బద్దెగ, కృష్ణరాజులతో మంతనములు సాగించి యతని రాజ్యభ్రష్టుని గావించెను; బద్దెగనికి సింహాసనముపై సుప్రతిష్ఠితుని జేయుటకు తోడ్పడెను. ఇమ్మడి అరికేసరి కర్ణాటభాషా పోషకుడు; పంపడను జైన మహాకవికి తన కొలువులో నుద్యోగమిచ్చి యతనిని గ్రంథ రచనకు పురికొల్పెను. పంపకవి మహాభారత కథతో అరికేసరి చరిత్రను జోడించి 'విక్రమార్జున విజయ'మను మహాకావ్యమును నిర్మించి అతని కమరత్వము ప్రసాదించెను. ఈ వంశములో గడపటివాడు ముమ్మడి కృష్ణరాజునకు సమకాలికుడగు మూడవ అరికేసరి. సుప్రసిద్ధ జైన సమయాచార్యుడును, యశస్తిలక చంపూకావ్యాది బహుళసంస్కృతగ్రంథనిర్మాతయునైన సోమదేవ సూరి ఈతని యాస్థానమున వెలసెను. నే. వెం. ర.

**వేషభూషణాలంకరణములు :** ఆంధ్రుల చరిత్ర నన్నయ రాజరాజనరేంద్రులకు పూర్వపుది, తరువాతిది అని రెండు విశిష్ట భాగములుగా నున్నది. పూర్వభాగమునకు చరిత్ర చాల తక్కువ. పరభాగమునకు తగినంత చరిత్ర లభ్యమగుచున్నది. నన్నయకు పూర్వ మాంధ్ర స్త్రీపురుషుల వేషభూషలకు సంబంధించి మనకు చీనా యాత్రికులు వ్రాసిపెట్టిన విషయలేశములు, శిథిలముకాగా మిగిలిన అమరావత్యాది స్థలములలోని బౌద్ధ, జైన, హిందూ శిల్ప శకలములు తప్ప మరెట్టి యాధారములును కానరావు. నన్నయ, రాజరాజ నరేంద్రుల తరువాతి యుగమున ఆంధ్రుల వేషభూషలను నిరూపించు శిల్పములలో శ్రీశైలము, రామప్ప గుడులు, విజయనగరము (హంపి), లేపాక్షి ముఖ్యమైనవి. నన్నయ తరువాతి వాఙ్మయములో గూడ మనకు ఈ విషయమున విపులముగా ఆధారములు దొరుకుచున్నవి.

మనకు క్రీ. పూ. 300 కు ముందటి ఆంధ్రులనుగురించి తెలిసికొనదగిన విషయములు లభించుట లేదు. క్రీస్తు శకము ప్రథమ ద్వితీయ శతక ప్రాంతమం దుండిన సాతవాహనాంధ్ర రాజులలో హాల చక్రవర్తి సమకూర్చిన 'గాథా సప్తశతి' యందలి గాథలలో గోదావరీ ప్రాంత స్త్రీపురుషుల శృంగారము వర్ణింపబడినది. ఈ ప్రాంత వర్ణనలాంధ్రులకు సంబంధించినవి కనుక వాటినుండి మన కీ క్రింది విషయములు లభ్య మగుచున్నవి.

స్త్రీలు స్నానము చేయునపుడు పసుపు రుద్దుకొనుచుండిరి. పసుపు క్రిమిసంహారి యనియు, రోమహరి యనియు, శరీరమునకు మెరుగు నిచ్చునట్టి దనియు ప్రాచీనులు గుర్తించిరి. ఇంటనేకాక నదీస్నానార్థము వెళ్లినప్పుడును



1134 అ

చిత్రము 290 క. స్త్రీ, పురుషుల వేషభూషణాలంకరణములు, అమరావతి శిల్పము



1134 అ

చిత్రము 290 చ. స్త్రీ, పురుషుల వేషభూషణాలంకరణములు, అమరావతి శిల్పము

పసుపు రాచికొని స్నానముచేయుచుండిరి. కన్యకలకు తొలిసమర్తకాలములో పసుపులో నెయ్యి కలిపి ముఖమునకు బాగుగా పూయుచుండిరి. చేతులకును, కాళ్లకును అటులే పూసెడివారు. 'వర్ణఘృత లిప్తముఖ' అను పద్యముపై మధురానాథ శాస్త్రిగారి వ్యాఖ్య ఇట్లున్నది: 'హరిద్రావర్ణ మిశ్రం ఘృతం వర్ణఘృతం, దేశ విశేషే రజస్వలాముఖం వర్ణఘృతేన లిప్యత ఇతి కాచి త్ప్రథా'. ఉత్తరహిందూస్థానమం దీయాచారము లేదనియు, ఒకానొక దేశవిశేషమం దీయాచార మున్న ట్లున్న దనియు పై వ్యాఖ్యాత యభిప్రాయము. నేటికిని ఆంధ్రులలో నీ యాచార ముండుటచే దేశవిశేష మాంధ్రమే యనుట స్పష్టము. యువతులు కాళ్లకు లక్కరంగు పూసికొనుచుండిరి. బుక్కపిండిని (కర్పూరాది గంధద్రవ్యకృత వర్ణధూళి) ప్రియులు ప్రియురాండ్రు నొండొరులపై చల్లుకొనుచుండిరి; మరియు గంధోదకమును(కలపమును)పూసికొనుచుండిరి. విలాసినుల ప్రసాధనసాధనములలో అద్దము, దువ్వెన ముఖ్యమైనవి. నాట్యమాడు స్త్రీలు ముఖములకు హరిదళము రంగు (అర్దళము, 'హరితాలమండితముఖి') పూసికొనెడివారు. మరువము స్త్రీలకు ప్రీతిపాత్రమైనట్టిది. ముత్తైదువులు కొప్పు ముడిని జడను వేసికొనుచుండిరి. ధనికయువతులు మరకతమణి పద్మరాగ సంకలితములైన (పచ్చల కెంపుల) కంకెలను ధరించుచుండిరి. మట్టి గాజులను తొడుగుకొను నాచారము తెలుగు ముత్తైదువులలో నప్పటికే రూఢమైపోయెను. స్త్రీలు గాజులను తొడిగించుకొనుట ప్రధానముగా దాక్షిణాత్యాచారము.

స్త్రీలకు చీర, రవిక ప్రధాన వస్త్రములు. రంగు వస్త్రములపై వారికి ప్రీతి యెక్కువ. వారి దృష్టిలో కుసుమ వన్నె యుత్తమమైన వర్ణము. నీలివన్నె సాధారణమైనది. రవికలు విశేషముగా 'కుసుంభ రంజితములు'. కుసుమ వన్నె (చెంగావి) చీర యువతులకు ప్రీతి పాత్రము. ఆనాటి స్త్రీల భావములో పట్టు వస్త్రమైన భేషట!

ఉత్తర హిందూస్తానమందు స్త్రీల రవికకట్టు వీపున నుండెడిది. నేటికిని గుజరాతి, లంబాడీ రాజపుత్ర స్త్రీల రవికముడులు వీపుననే కలవు. కాని దక్షిణాపథమం దా ముడులు ముందే యుండెను. ఎదపై రెండు ప్రక్కలందు కొంత సందు గలిగి పొట్టపై రవిక రెండుకొనలు ముడివేయు దక్షిణాద్యాచారమును గాథాసప్తశతి తెలిపినది.

సాతవాహన చక్రవర్తుల యనంతరము తెనుగు దేశములో, అందు ముఖ్యముగా ప్రాక్తీర మండలములలోను, గుంటూరు మండలములోను బౌద్ధమతము విశేషముగా వ్యాపించి జనుల యాచార, వ్యవహారములలో కొంత మార్పును కలిగించెను. అమరావతీ శిల్పములవలన మన ప్రాచీనుల వేష, భూషలు కొన్ని తెలియవచ్చును. అమరావతీ స్తూపము క్రీ. పూ. 100 నుండి క్రీ. శ. 300 వరకు నిర్మాణమైనదని చరిత్రకారుల యభిప్రాయము. కావున నాకాలమున ఆంధ్ర స్త్రీ పురుషుల వేషభూషాదికము లెట్లుండెనో మనకు తెలియవచ్చినంతవరకు తెలిసికొందము.

సింధునదీప్రాంత శిల్పమందు స్త్రీ పురుషులకు రుమాల వంటి శిరోవేష్టనములు కానవచ్చును. దక్కనులో కొన్ని యల్పవిషయములలో తప్ప తక్కిన వాటిలో నంతగా భేదము కానరాదు. స్త్రీలు పాపట తీసి మెడవెనుక వెండ్రుకలను ముడివేసి కొప్పు పెట్టుకొనుచుండిరి. ఆ ముడినుండి నాలుగు వెండ్రుకల వరుసలు కాని, బట్టకట్టు వరుసలు కాని దిగజార్చుచుండిరి. కొందరు స్త్రీలు వంక కొప్పులు పెట్టుకొనుచుండిరి. దక్కను స్త్రీలు కొందరు నెత్తిపై ముసుగు వేసికొనుచుండిరి. కొందరు నెత్తి కొక బట్టను కట్టుకొనుచుండిరి. పురుషు లెత్తైన రుమాలను చుట్టుకొనుచుండిరి. వెండ్రుకలను తల ముందుభాగమున కెత్తి ముడి కట్టి దాని చుట్టును రుమాలను చుట్టుచుండిరి. రుమాలపై ముందుభాగమందు చైత్యముల కమానువలె, లేక గుర్రపు లాడమువలె నుండు ఆభరణము నలంకరించుకొనుచుండిరి. అమరావతి, నాగార్జునకొండ, శిల్పముల లోని కొందరు పురుషుల కట్టి యాభరణము లేకుండెను. భిక్షుకులును, సేవకులును వెండ్రుకలు ముడివేసికొనుచుండిరి. ఒక గుర్రపు సైసు తన వెండ్రుకలను రెండు బుజాలపై జారవిడిచినాడు.

పురుషులకును, స్త్రీలకును వస్త్రములు చాల తక్కువ. కటిభాగమున వస్త్రమును రెండు మూడు చుట్లు త్రిప్పి కుడిప్రక్క వ్రేలాడు ముడివేయుచుండిరి. స్త్రీల వస్త్రాలంకార మంతే! పురుషులు దోవతి కట్టుచుండిరి. పై శిల్పములలో ఒకే యొకస్త్రీ తన స్తనమండలమును కప్పుకొనుట కాననగును. సాధారణ జనులు, భిక్షుకులు మోకాటివరకు దోవతులుగా కొంత వస్త్రమును కట్టి శేషమును వల్లెవాటుగా బుజముపై వేసికొనుచుండిరి. బ్రాహ్మణుల దోవతులు మీగాళ్లవరకు నున్నవి. కొందరు పురుషులు ప్రత్యేక వస్త్రములను మెలిపెట్టి మెడపై వేసికొన్నారు. పై శిల్పములలో షేర్వానీలు, లాగులు ధరించిన పురుషులును కానవత్తురు; కాని వారు శకులై యుండవచ్చును.

స్త్రీలును, పురుషులును కొన్ని సమానాభరణములను ధరించిరి. వారిలో కొందరు చెవులలో బరువైన పోగులను, మరికొందరు ఒకొక్క చెవికి రెండు పోగులను, వేరొక

కొందరు పూసల వరుసలు జోడించిన పోగులనుకూడ ధరించు చుండిరి. రాజులును కర్ణాభరణములను ధరించిరి. వాసిష్ఠీ పుత్ర. శ్రీశాతకర్ణి, యజ్ఞశ్రీ శాతకర్ణి నాణెములపై వారి పోగులు, పోగుల సందులు బాగుగ కానవచ్చును. వారి నాణెములపై వారి శిరోవేష్టనములును కానవచ్చును. యజ్ఞశ్రీ నొసటి కడ్డముగ నొకపట్టి కలదు. ఆ పట్టిపైనుండి కణతలందు వెండ్రుకలు బయటికి కానవచ్చును. తల వెనుకటి భాగమున సిగ కానవచ్చును. వాసిష్ఠీపుత్రునికి ఉంగరాల కురుచ వెండ్రుకలు కలవు. స్త్రీ పురుషు లుభయులు దండకడెములను, కంకణములను ధరించువారు. స్త్రీలకు మాత్రము దండకడెములు మోచేతి నుండి చంకవరకు నిండి యున్నవి. అదేవిధముగా స్త్రీలకు కంకణములు మణికట్టునుండి మోచేతి వరకు నిండియున్నవి. పురుషులకు కాలి కడెములు లేవు కాని, స్త్రీలందరికి నవి కలవు. అవి బరువైన ఉంగరాలవంటి తీగలవిగానో, కడ్డీలవంటి చుట్లు కలవిగానో యుండెను. అవి రెండేసిగా నొక్కొక్క కాలికున్నవి. స్త్రీ పురుషులును, సేవకులును హారములు వేసికొనువారు. అవి పూసలవిగానో, బిళ్లలవిగానో యున్నవి. స్త్రీలకు నాసికాభూషణము లేవియును లేవు. భట్టిప్రోలు శిల్పములను పరిశీలించిన 'రీ' దొర ఇట్లు తెలిపి యున్నాడు: 'హారములు ముత్తెపు చిప్పలవి, ఊదారంగు పూసలవి, వేరు రకముల పూసలవి, పెద్ద రంధ్రాలుగల పూసలవి, ముత్యాలవి, బంగారు గుండ్లవి, బంగారు పూలవి, ఇంకను నానావిధములైనవి ఉన్నవి.'



చిత్రము 291. గుమ్మడిదుర్రులో బయల్పడిన స్వర్ణాభరణము

సైనిక శిల్పచిత్రములలో గుర్రపు రౌతులకును, మావటీలకును, తలపాగ లుండుటయు, కాళ్ళులమున కవి లేకుండుటయు కానవచ్చును. దీనినిబట్టి గుర్రపు రౌతుల యొక్కయు, మావటీల యొక్కయు దర్జా ఎక్కువ యనియు, తక్కువ దళలోని వారికి శిరోవేష్టనములు తక్కువ యనియు ఊహింపవచ్చునేమో!

సాతవాహనుల శాసనములలో నానావృత్తులవారు పేర్కొనబడి యున్నారు. అందు మాలాకారులు, కోలికులు (సాలెవారు), గాంధికులు (గంధకారులు), సువర్ణకారులు, మణికారులును గలరు. ఈ వృత్తులు సంఘజీవనముపై నాధారపడిన వగుటవలన అప్పటి జనసామాన్యపు నాగరికతా స్వరూపము కొంత గోచరించుచున్నది.

'అమరావతీ శిల్పములలోని పురుషుల శిరోవేష్టనములు, బరువైన పెద్ద కుండలములు, పెద్ద హారములు, చుంగులు తీర్చి కట్టిన దోవతులు మున్నగునవి యానాటి జనుల వేషమును దెల్పును; వానిని శిల్పకారుల కల్పనలనరాదు.' అని 'బర్గెసు' దొర వ్రాసెను. పసుల కాపరులగు పురుషులకును, బాలురకును చిట్టి చల్లాడము లుండెను. స్త్రీ పురుషాభరణములను వెండి బంగారులతో చాల సుందరముగా సిద్ధము చేయుచుండిరి. అమరావతిలోను, నాగార్జున కొండలోను, గుమ్మడిదుర్రులోను, రామిరెడ్డిపల్లెలోను లభించిన హారములను జూచిన ఆనాటి యాభరణముల యొక్క సౌందర్యాధిక్యము విశదమగును. ఆనాటి శిల్పములందు స్త్రీ, పురుష ప్రతిమలలో నంగవస్త్రధారణము లరుదుగ గాన్పించును; స్త్రీలు సన్నని చీరలను గట్టుచుండినట్లు విదితమగును. చుంగులువార విరివిగా గట్టిన పావడలును, మోకాటిబంటి లాగులును, అంతస్తునకు దగినట్లు పరిమాణ విభేదము గల భూషణ సహిత, విరహిత శిరోవేష్టనములును ఈ శిల్పములందు కానవచ్చును.

స్త్రీల కందరికిని కంకణములు, దండకడెములు చేతుల నిండుగా నుండెడివి. నాసికాభరణములును, రవికలును ఏ శిల్పచిత్రములందును కానరావు. రాజుల శిరోవేష్టనము



తెలుగు దేశపు ప్రాచీనాభరణములు

లకు ఆభరణము లుండెను. బ్రాహ్మణు లీనాటివలె పింజెపోసి దోవతులు కట్టి అంగవస్త్రమును కప్పుకొను చుండిరి. పురుషులు వెంద్రుకలను సాధారణముగా గొరిగించినట్లు కాని, కత్తిరించినట్లు కాని కానరాదు. అందరును నెత్తినిండుగా శిరోజములను పెంచి వేరు వేరు రీతుల ముడివేయుచుండిరి. స్త్రీలు జడలు వేసి, కొప్పు పెట్టి నానా ఆభరణములతో శిరస్సు నలంకరించుకొనుచుండిరి.

అమరావతీ శిల్పములలో స్త్రీల కొడలియొక్క పై భాగమున వస్త్రములు కాని, రవికలు కాని కానరాకుం డుటచే నాటి స్త్రీలు కటి వస్త్రమాత్రలై తిరిగిరని భావింపరాదు. అమరావతీ శిల్పములలో కొన్ని స్త్రీ ప్రతిమలకు రవిక యుండినట్లు శిల్పవిమర్శకులు వచించియున్నారు. ఇది హోలుని సప్తశతివల్ల రూఢ మగుచున్నది. అమరావతీ శిల్పములపై గ్రీకు శిల్ప ప్రభావమే కాక అస్సీరియా శిల్ప ప్రభావముకూడ సోకినందున వారు ఆయా సంప్రదాయములను ఈ విషయమునను అనుకరించుచుండిరని భావింపవలెను.



చిత్రము 292. నాగార్జునకొండలో బయల్పడిన స్వర్ణాభరణములు

క్రీస్తు పూర్వమునుండి క్రీ. శ. 650 వరకు గల సాతవాహన, ఇక్ష్వాకు, పల్లవ, శాలంకాయనాది రాజుల కాలములో ఆంధ్రదేశమందు సన్నని నూలు వడకుట, సన్నని వస్త్రములు నేయుట, రంగులు వేయుట గొప్ప పరిశ్రమగా నుండెను.

అమరావతి, నాగార్జునకొండ శిల్పములను జూచిన క్రీస్తుశక ప్రారంభమునుండి పదవశతకమువరకును జనులలో వాడుకయం దుండిన వేషభూషలును, వినోదములును కొన్ని సువ్యక్త మగును. కాని యానాటి పురుష శిరోవేష్టన మిట్టిదని తెల్పుట సులభము గాదు. దానిని శిల్పములందే చూచి గ్రహించవలెను. తర్వాతికాలపు గుండు రుమాల కది నాంది. మరియు జనసామాన్యము మోకాళ్ల వరకు గావంచాను ధరించి నడుమునకు ముందుభాగమందు దానినే ముడివేయుచుండిరి. పురుషులుకూడ అయిదారు వరుసల హారములను, పెద్ద చెవిపోగులను, మణికంకణములను, దండకడెములను ధరించువారు. స్త్రీల ఆభరణములలో డావు (వడ్డాణము) ఇంకను వాడుకలోనికి వచ్చినట్లు లేదు. ముక్కుపుడకలు, నత్తు, ముక్కర మొదలగు నాసికాభరణము లేవియు గానరావు.

క్రీ.శ. 600 నుండి నన్నయ కాలము వరకు గల ఆంధ్రుల సాంఘిక చరిత్రకు తగిన యాధారములు కానరావు. కావున నాకాలమందలిస్థితినిగురించి వ్రాయుటకు వీలులేదు.

నన్నయకాలమునుండి తిక్కనకాలము వరకు ఆచారములను తెలిసికొనుటకు భారతములో నన్నయ, తిక్కన్నలు వర్ణించిన పట్టు లాధారభూతము లగుచున్నవి. స్త్రీలు మట్టెలను ధరించినట్లు మొట్టమొదటిసారి తిక్కన విరాటపర్వములో గానగును.

'లలితంబులగు మటియల
చప్పుడింపార
నంచకైవడి వలనల్ల వచ్చి'

యని తిక్కన వర్ణించెను. ఇది సంస్కృత భారతమందు కానరాని ముచ్చట. ఇం కొకచిత్ర మేమనగా, నన్నయ తిక్కనల కాలమందు మట్టెలను పురుషులు కూడ కాలి వ్రేళ్లకు ధరించుచుండిరి. కీచకుడు సుధేష్ణ మందిరమున నొంటిగా నున్న సైరంధ్రిని చూచిన సందర్భమున,

'మట్టియ లొండొంటి బిట్టు దాకగ నేల
నందంద మునిగాళ్ల నప్పళించు'

చు నామెను చేరబోయెను. నేటికిని సకృత్తుగా కొందరు పురుషులు మట్టెలు ధరించుట కానవచ్చుచున్నది. తాళిబొట్టు వివాహమందు స్త్రీకి పురుషుడు కట్టుట కేవలము దాక్షిణాత్య ద్రావిడాచారమే. మొదట తాటియాకును కంఠమందు కట్టుచుండిరని 'తాళి' పదము తెలుపుచున్నది. తర్వాత దాని పేరుతో దాని రూపముగా బంగారుతో రేకులను చేసి కట్టుచుండి రనవలెను. అదే విధముగా 'తాటంకములు' అను శబ్దము కూడ 'తాటాకు' నుండి

యేర్పడిన దనవలెను. ద్రావిడులు చెవులలో రంధ్రములు చేసి యందు తాటియాకును పెట్టుకొనుచుండిరి. ఇప్పటికిని క్రింది కులముల ముత్తైదువలు చెవ్వాకులు ధరింతురు. అది యైదువ లక్షణములలో నొక్కటి. క్రమముగా అది కమ్మ అను ఆభరణమై తాటంక మన జెల్లెను.

నన్నయ, తిక్కనల కాలమందు రాజులును, ధనికులును ననుభవించు భోగములను గురించి సోమేశ్వరుడు తన 'అభిలషితార్థ చింతామణి' యను గ్రంథమునం దిట్లు వ్రాసెను: 'స్నానగృహము ప్రకాశించు స్తంభాలతోను, స్ఫటిక వేదికతోను, కాచకుట్టిమములతోను, చిత్రములతోను శోభించునదిగా నుండవలెను. దినము మార్చి దినము అభ్యంగస్నానము చేయవలెను. గేదంగి, జాజికాయ, పున్నాగము, చంపకము తైలమునందు కాచి శిరస్స్నానమునకు వాడవలెను. నలుగులో కోష్ఠము, తక్కోలము, ముస్త, మాచిపత్రి, నందివర్ధనము, జటామాంసి, వాయింట, మెట్టతామర మొదలైనవాని గడ్డలను తీసికొని, నీడలో నెండించి నిమ్మ, తులసి, ఆర్జకముల ఆకులనుగలిపి, ఏలకి, జాజి, సర్షపము, తిల, కొత్తిమిరి, తగిరస, లవంగము, లోధ్ర, శ్రీగంధము, అగరు మొదలైనవానిని కలిపి సిద్ధము చేయవలెను.'

ఆ కాలమందు వస్త్రములకు వేయు రంగులలో మంజిష్ఠ, లాక్ష, కౌసుంభ, సిందూర, హరిద్ర, నీలి వర్ణములు ముఖ్యమైనవి. చీరలు, ఘట్టకములు, సెల్లాలు, దుప్పట్లు, అంగీలు (అంగికాః), ఉష్ణీషములు (తల రుమాలలు), టోపీలు (టోపికాః) వాడుకలో నుండెను. అంగికాః, టోపికాః అని మొట్టమొదటిసారి సోమేశ్వరుని (క్రీ. శ. 1150) గ్రంథముననే కానవచ్చుచున్నది. టోపీలు రాజులు దర్బారువేళలందు కాక సాధారణ కాలములందు ధరించుచుండినట్లు అతడు తెలిపినాడు. అంగీలు బొందులు గలవై యుండవలెను. అవే తరువాతి మొగలాయి కాలపు 'బారాబందీలు'; గుండీ లిటీవల వాడుకలోనికి వచ్చినవి.

కాకతీయుల కాలములో స్త్రీల యలంకరణము లెట్టివో మనకు బాగుగా తెలియవచ్చినది. భారతదేశ మందొక్కొక్క ప్రాంతములో స్త్రీల సిగలు, ఆభరణములు, చీరకట్టు, రవికలు అన్నియు భిన్న భిన్నముగా నేటికిని కానవచ్చుచున్నవి. ఆంధ్రులలోను ప్రత్యేకత కానవచ్చును. వారు ఈ కాలమున ముక్కర, నెత్తిబిళ్లలు, దండకడెములు, వంకీలు, కాలివ్రేళ్ల మట్టెలు, బొబ్బిలికాయలు, పిల్లాండ్లు, జోమాల దండలు విరివిగా ధరింప మొదలిడిరి. నాటికిని నేటికిని పసుపు ముత్తైదువుల మైపూతలలో చేరినట్టిది. ఈనాడు తగ్గినది గాని ఆనాడు స్త్రీలు విశేషముగా గోళ్లకు గోరంట రంగు వేసికొనుచుండిరి (గోళ్ల కంటుకొను రంగగుటచేతనే దానికి గోరంట యని పేరు వచ్చిన ట్లున్నది). ధనికులలో కొందరైనను పెదవులకు లక్కరంగును పూసికొనుచుండిరి. కాళ్లకు పారాణియే కాక లక్కరంగుకూడ పూసికొనుచుండిరి. దండికృత దశకుమార చరిత్రను తెనిగించిన కేతన (క్రీ. శ. 1250) మూలమందు లేని స్త్రీల యాభరణములను పేర్కొనెను. మూలమందు 'మణి నూపుర మేఖలా కంకణ కటక తాటంక హార' మనిమాత్రమే యుండగా కేతన హెచ్చుగా మట్టియలు, కన్నవడములు (దీని కర్థము నిఘంటువులలో లేదు), గట్టి నూళ్లు, సుద్దసరితీగె, మినుకులు, సందిదండ, అంగుళీయకములు, చేకట్టు పాశెలు, సరిపెణలు, ఆలక్తము, పూతకాటుక మున్నగునవి వర్ణించినాడు. ఆనాడు ఓరుగంటి స్త్రీలు తాటంకములు, ముత్యాల కమ్మలు, కాంచీ నూపుర కంకణములు, త్రిసరములు, మొరవంక కడియములు మున్నగునవి ధరించుచుండిరి. స్త్రీల నూలు, పట్టు చీరలకు చిత్రవిచిత్రములగు అంచు లుండెను. వీనిలో కరకంచులు, బొమ్మంచులు, ముయ్యంచులు, చిలుకచాళ్లు, ఉడుతచారలు, పుప్పొడివన్నెలు, రుద్రాక్షవన్నెలు, హంసావళులు మొదలైన వధికము. సర్వ సాధారణముగ పురుషులు కాసెదట్టీని నడుమున బిగించుచుండిరి.

శ్రీనాథుడు తన చాటువులందు స్త్రీ, పురుషుల వేషభూషలను విరివిగా వర్ణించెను. గోలకొండ వ్యాపారుల నీర్కావి దోవతులు, గడ్డములు, జెట్టీల చుంగు రుమాలలు, కుచ్చుల యద్దాల కిర్రుచెప్పులు, స్త్రీల ముక్కు నత్తు, హురుమంజి ముత్యాలముంగర, కమ్మలు, పచ్చపూసలు శ్రీనాథుడు వర్ణించిన వర్ణనలోనివి.

విజయనగర సామ్రాజ్య కాలమందలి ప్రజాజీవనము మనకు బాగుగా తెలియవచ్చినది. సుగంధ ద్రవ్యములను సిద్ధముచేసి యమ్ముచుండిన గంధకారులు 'చెవుల సంకులు.... కొండసిగలుగా, గావి దుప్పటులు నొప్ప గంధకలనా కుసుమ స్రగ్గ్రథనాదుల నాంధ్యంబులే కలరు నాంధ్రదేశీయులై' యుండిరి. మంజిష్ఠ, ఇంగలీకము, కరక్కాయ, నీలి వస్త్రములకు రంగువేయుటకు వాడుచుండిరి; రాచవారు పన్నీటితో కలిపిన కస్తూరిని పూసికొను చుండిరి. పొడవైన కుచ్చుటోపీలు ధరించిరి; ముత్యాల పెద్ద పోగులను, ముత్యాల హారములను ధరించి కావియంచు తెల్లని వస్త్రములను గట్టిరి. మరియు పెద్ద జుట్టును లోపలికి జొనిపి పైని చుంగు పాగ జుట్టి, చల్లాడములపై నడుమున కాసెచుట్టి, యందు పిడికత్తులను దోపి తిరుగుచుండిరి. మరి



తెలుగువారి స్త్రీ ఆభరణములు



తెలుగుదేశపు ప్రాచీనాభరణములు

కొందరు సన్నని నూలు లేక పట్టు అంగీలను తొడిగిరి. కాళ్ళకు చెప్పులుకాని, ముచ్చెలుకాని తొడుగుచుండిరి (ముచ్చెలు ముసల్మానుల నుండి గ్రహించినవై యుండును); మెడపై పెద్ద సెల్లాలును వేసికొనిరి. వారి స్త్రీలు చాల సన్నని నూలు లేక పట్టుచీరలను అయిదు గజముల పొడువైన వాటిని గట్టిరి. పట్టుతో, జలతారుతో కప్పిన ముచ్చెలను తొడిగిరని యూరోపియను రాయబారులు వ్రాసిరి. పలువురు రెడ్లు పసుపు చుంగుల తలపాగ కట్టి మాధవళి (కపిల వర్ణపు) పచ్చడము వేసికొని, వంకు టుంగరము, డొల్లు పోగులు ధరించెడివారు. మాల దాసరులు తోలు కుప్పసములు, టోపి ధరించి తోలుతిత్తి, మొగలియాకు గొడుగు, గుర్రపు వెండ్రుకల దండె, చిటితాళము, చంకబుట్ట, తులసిపేరులు మున్నగు పరికరాలతో తిరిగెడివారు.

విజయనగర రాజ్యకాలములోను, తరువాతను సర్వసాధారణముగా పురుషులు గుండు రుమాలను, లేక చుంగు విడిచిన పాగాను కట్టుకొను చుండిరి; బొందుల అంగీ తొడిగికొను చుండిరి. చాలమంది అంగీ తొడుగక దుప్పటిని మాత్రమే మెడపై వేసికొనుచుండిరి. బ్రాహ్మణులు, కోమట్లు పలువురు ధనికులు, రాచవారు దోవతులు కట్టుచుండిరి. కాని జనసామాన్యము మోకాళ్ళకు పైనుండు చల్లాడమును తొడిగి నాలుగువ్రేళ్ళ వెడల్పుకల కాసెదట్టిని నడుముచుట్టు బిగించుచుండిరి. స్త్రీలు తొడుగకున్నను చాలమంది పురుషులు కాలి బొటనవ్రేలునకు సరిపోవు తోలుంగరమును, వ్రేళ్ళకు తగుల్కొను వార్లును కల కిర్రు చెప్పులను వేసికొను చుండిరి. ధనికులు, రాజులు ముచ్చెలను కూడ ధరించిరి. పురుషులు సాధారణముగా చెవులక్రింది కొనలందు పోగులను, కమ్మలను, ఒక చెవి పైభాగమందు ముత్యాలపోగును, దండ కడెములను, వ్రేలి యుంగరములను ధరించిరి. హిందువు లందరును జుట్లను, కొందరు జులుపాలను పెంచుచుండిరి; మరియు కులములను తెలుపు నామములు, విభూతి, తిలకము మున్నగునవి ధరించెడివారు. అదే కాలమందు స్త్రీలు వివిధములగు రంగులును అంచులును గల చీరలను గట్టి రవికలను తొడుగుకొను చుండిరి. వారికి ముఖ్యాభరణములు నత్తు, ముక్కర, వంకి, కమ్మలు, నెత్తి బిళ్ళలు, హారములు, దండకడెములు, కంకణములు, ఒడ్డాణములు, కాలికడెములు. కాలి వ్రేళ్ళకు మట్టెలు, బొబ్బిలికాయలు, ముసల్మానుల ననుకరించి పాంజేబులను కొందరు ధరించు చుండిరి. కొందరు బోగపు సానులు మాత్రమే రంగు పావడలు కట్టుకొను చుండిరి. బ్రాహ్మణ స్త్రీలు వెనుక కొప్పు కలిగి పసుపుబొట్టు పెట్టి చీరె కాసెకట్టు కట్టి చెవులలో లక్కాకులను పెట్టుకొను చుండిరి. రెడ్డి మున్నగు మధ్యతరగతి స్త్రీలు గొంటుపూసలు, రెండు గుండ్ల ముంగరలు, మైజారు చీరలు, తూలెడు కొంగులు, బలుచెంప కొప్పులు, అంచుకమ్మలు, సన్నకాటుక రేకలు, నాభి నామము (శైవులైన విభూతిరేకలు, పత్తిబొట్లు), పసుపు పూతలు కలిగి యుండెడివారు.

క్రీ. శ. 1600 - 1650 ప్రాంతమం దుండిన శుకసప్తతి కారుడగు కదిరీపతి తననాటి వివిధజాతి స్త్రీ పురుషుల వేషములను సహజోక్తులతో పద్యములందు చిత్రించెను. దాసరిసాని, కరణము, మాదిగ, జోగురాలు, రెడ్డి, పురోహితుడు, వాని భార్య, ఎరుకల, రాజులు, జెట్టీలు, బ్రాహ్మణి, జంగమురాలు, బోగముది, కోమట్లు, వైష్ణవులు, నంబులు మున్నగువా రందరిని కదిరీపతి వర్ణించినది వివరించుట విషయ విస్తరహేతు వగును.

క్రీ. శ. 1650 - 1800 వర కాంధ్రదేశ మరాజక స్థితిలో నుండి నవాబులకు లోబడినదై యుండెను. అప్పుడు వారికి తురకల యాచారములు కొన్ని సంక్రమించెను. దొరలు షేర్వానులు, వంకర పాగాలు, లాగులు ధరింప మొదలిడిరి. కొందరు దొరలు దాడీలుకూడ పెంచిరి. వంపు ముచ్చెలజోళ్లు తొడిగిరి. చేతి రుమాళ్లు బుజములపై వేసికొనిరి. గ్రామాధికారులు మున్నగు ధనికులు, అంగరకాలు, చొక్కాలు తొడిగిరి. స్త్రీల యాభరణాలలో కొన్ని ముసల్మాను స్త్రీలు ధరించు సొమ్ములు చేరియుండినట్లు సొమ్ముల పేరులే తెలుపు చున్నవి. పాంజే బనునది పాయ్‌జేబు (కాలధరించు గొలుసు) నుండి వచ్చినది. అందందు బులాకి యను తురకస్త్రీల నాసికాభరణము వాడుకలోనికి వచ్చెను. అది బులాఖ్ అను పదమే. బావిలీలు, బుగడలు, చెవుల పైభాగమందు పెట్టుకొను కర్ణభూషణములును తురకలనుండి గ్రహించినవే కావచ్చును.

క్రీ. శ. 1600 లో ఇంగ్లీషువారు వచ్చినను క్రీ. శ. 1800 తరువాతనే వారి ప్రభావము మన దేశీయులపై ప్రసరింప సాగెను. మొగలాయి కాలపు వేషములు తగ్గెనని గువ్వల చెన్న డిట్లు విచారపడెను.

'పాగా లంగరకాలును
మీగ శ్మశ్రులార బంచె మేలిమి కట్టుల్
సాగించు కండువాల్ వలు
కోగా మిఁక కాన మెన్న గువ్వలచెన్నా.'

అంగీలు, పచ్చడములు, శాలువలు, మున్నగునవి యాచారములోనికి వచ్చినను, అవి గొంగడితో సరిపోలవని యత డనెను. జనులలో పలువురు టోపీలు ధరింప

మొదలిడిరని అయ్యలరాజు నారాయణామాత్యుడు తన 'హంసవింశతి'లో తెలిపినాడు.

చొక్కాలు అంగీలవంటివే కాని షేర్వానీవలె పొడువైనవి ('చోగా' అను ఫార్సీ పదమునుండి చొక్కాయేర్పడినది). దాని నింకను రెడ్లు, కరణాలు తొడుగుచుండిరి. 'తెలి తలపాగ, చొక్క, మొలతిత్తి, భుజంబున చల్వపచ్చడంబు, కావి దోవతి, ముచ్చె' లొక గ్రామకరణము తొడిగెనని అయ్యలరాజు నారాయణకవి తన హంసవింశతి (1800 - 1850) లో వర్ణించెను. ఆనాటి స్త్రీల సొమ్ములు :

'కుప్పె, రాగడిబిళ్ల, కుంకుమరేఖ, పా
పటబొట్టు, కమ్మలు, బావిలీలు,
లలి సూర్య చంద్రవంకలు, సూసకము, కెంపు
రవల పల్లెరుబూవు, రావిరేక,
బుగడలు, నాన్‌దీగె, సొగసైన మెడనూలు,
కుతికంట్లు, సరిపెణ, గుండ్లపేరు,
సరిగె, ముక్కర, బన్నసరము, ఉత్తండాలు,
కంకణంబులు, తట్లు కడియములును
సంది దండలు, నొడ్డాణ, మందమైన
ముద్రికలు, హంసకంబులు, మ్రోయుగజ్జె,
లలరు బొబ్బిలికాయలు, గిలుకు మెట్టె
లాదియగు సొమ్ము దాల్చి య య్యబల మెరయ '
(హం. విం. 2—191)

ఏనుగుల వీరాస్వామయ్యా రైళ్లులేని కాలమున 1830 - 1831 లో పల్లకిలో మదరాసునుండి కాశికి కడప, కర్నూలు, తెలంగాణా మీదుగా వెళ్లి ఉత్తరసర్కారులమీదుగా తిరిగి వచ్చెను. అప్పు డత డొక ఇంగ్లీషు ఉద్యోగి సలహా ప్రకారము తన దినచర్యను డైరీలో వ్రాసెను. అతడు చూచిన విశేషముల నన్నిటిని చక్కగా వ్రాసియుంచెను. అతడిట్లు తెనుగుదేశమును గూర్చి వ్రాసెను.

మచిలీబందరు 'స్త్రీలు అలంకార పురస్సరముగా శోభాయమానులై వున్నారు. చెవులకు నిడువు గొలుసులు వేసుకొని పాపటకు చేర్చి చెక్కుతారు. స్త్రీ పురుషులు చాయవేసిన వస్త్రప్రియులై యున్నారు.' 'కృష్ణానదికి ఉత్తరము తూర్పు సముద్ర పర్యంతము....స్త్రీలు నోటిని ఆవరించేపాటి ముక్కరలు చాల లావుగా చేసి ధరించుతారు.' 'చిన్నగంజాం మొదలుగా సముద్రతీరమందు ఉప్పు పైరు చేయడము విస్తారము కనుక వుప్పరజాతి స్త్రీలు దోటిముక్కరలు ధరింతురు.' విశాఖపట్టణ మండల 'స్త్రీలు జాఫరావిత్తుల వర్ణము వేసిన బట్టలు వుపపన్నులు కట్టుతారు. కాళ్లకు పాడగాలు వెయ్యడం కలిగివున్నది'. గంజాం జిల్లాలో 'ప్రతిస్త్రీలు బులాకులు ముక్కర ధరించి వున్నారు'.

ఇదే కాలములో (1800 - 1850) నూలు పట్టు కలిపి నేసిన మష్రూ అను బట్టలను హైదరాబాదులో గద్వాలులో నేసిరి. దాసూరి (టస్సర్) పట్టు బట్టలను వరంగల్లు, నారాయణపేట (పాలమూరు జిల్లా), మట్టివాడ, హసన్‌పర్తి, కరీంనగరు జిల్లాలోని మాధాపురములలో నేయుచుండిరి. దీనినిబట్టి హైదరాబాదురాజ్యములోని ధనికులు కట్టు బట్ట లెట్టివో తెలియును.

మనదేశములో వస్త్రములకు రంగులు సిద్ధము చేయుచుండిరి. మద్ది, మంజిష్ఠ, కరక్కాయ, నీలి, పసుపు, లక్క మున్నగువాటినుండి రంగులు చేయుచుండిరి. కాని 1880 తరువాత జర్మనీవారు రాసాయనికపు రంగుల నగ్గువగా, మేలైనవిగా సిద్ధముచేసి పంపుటచేత దేశీయపు రంగులు మూలబడెను. ఆ విద్య లన్నియు నించుమించుగా నశించిపోయినవి. హైదరాబాదులో ముసల్మాను లెక్కువగా మైకాపొడి నతికించిన చీరలను కట్టిరి. బందరు, మరియు ఉత్తరసర్కారు ప్రాంతము లన్నియు 'కలంకారీ' అద్దకమునకు ప్రసిద్ధిపొందియుండెను.

1850 నుండి క్రమక్రమముగా ఆధునిక యంత్రయుగములోనికి వచ్చినాము. ఈ నూరేండ్లలో మనము గుర్తుపట్టరాని విధమున మారిపోయినాము. మన జుట్లు ఎగిరిపోయినవి. కొంతకాలము ఇంగ్లీషు క్రాపులను, జుట్లను, రెంటిని సమానాదరముతో ఎక్కువగా ఉత్తరసర్కార్లవారు పోషించిరి. ఇతరుల జుట్లు సన్నగిలసాగెను. తుదకు నిర్భయముగా ఎగురగొట్టబడెను. బొందుల యంగీలు 1900 ల వర కుండెను. అవి క్రమముగా పోయెను. ఇప్పుడవి కానరావు. అందరును నానావిధములగు అంగీలను షర్టులను తొడిగికొందురు. కోట్లు ఇంగ్లీషువారినుండి మనకు వచ్చినట్టివి. అంతకు పూర్వము ఫార్సీ షేర్వానీలను, జమీన్‌దారులు, పెద్ద యుద్యోగులు, తురకలు వేయుచుండిరి. ఇంగ్లీషు సంపర్కమువల్ల షేర్వానీల రూపము మారి యప్పటి హైదరాబాదీ హిందూస్తానీ షేర్వానులుగా ఏర్పడెను. ఫెల్టు టోపీలు విరివియయ్యెను. తుదకు పూర్తిగా ఇంగ్లీషువేషమే పసందనియు, మర్యాదహేతు వనియు పలువు రింగ్లీషు విద్యావంతులు సూటు, కోటు, బూటు, టై, కాలరులను ధరించిరి.

స్త్రీల యాభరణములలో కూడ మార్పులు వచ్చెను. నత్తు, ముక్కర, వంకి, పగడాల దండలు, కాలి కడెములు, చెంపబిళ్లలు, నెత్తి కొప్పుబిళ్లలు, జడకుచ్చులు, బులాకులు బావిలీలు, బొబ్బిలికాయలు మోటయ్యెను. అవి యించుమించుగా నంతరించిపోయినవి. గొలుసు (చైన్ - చీనా గొలుసు), పతకము, బంగారు గాజులు మున్నగునవి



తెలుగుదేశపు ప్రాచీనాభరణములు



తెలుగుదేశపు ప్రాచీనాభరణములు

ప్రచారములోనికి వచ్చినవి. రవికలలో చిల్లర మార్పులు, చీరకట్టులో నాజూకుతనము వ్యాపించినవి. సు. ప్ర. రె.

**వ్యాకరణములు - ఆంధ్రశబ్ద చింతామణి:** తెనుగు వ్యాకరణములలో మొట్టమొదట పేర్కొనదగినది ఆంధ్ర శబ్దచింతామణి. దీనిని రచించిన యాతడు నన్నయ భట్టారకుడు (క్రీ. శ. 11 శతాబ్దము). ఇతడు రాజరాజ నరేంద్రుని కోరిక ననుసరించి వ్యాస మహాభారతమును ఆంధ్రీకరించువాడై అప్పటికే ప్రబలియున్న కన్నడ గ్రంథములను, మనదేశమందు వ్యాప్తిలోనున్న పాటలను, పదములను, శాసనాదులలోని పద్యములను ఆధారముగా గైకొని శిష్టవ్యవహారమందును, పండిత ప్రసంగములందును రూఢములై యున్న తెనుగు మాటలను, వానికి తోడుగా నుపయోగింపబడుచున్న సంస్కృత పదజాలమును కావ్య రచనానుకూలముగా గైకొని, వానికి కొన్ని నియమములను, సంస్కారములను చేసెను. ఆనాటి వ్యావహారికాంధ్రమును, తత్సమ భాషయు గ్రాంథికతా ముద్ర కర్హముగా నన్నయ చేతిలో పొందిన సంస్కారమే ఆంధ్ర శబ్ద చింతామణిగా అవతరించినది.

ఇది సుమారు ఎనుబది ఆర్యావృత్తములలో సంస్కృతమున రచింపబడినది. నన్నయ అంతకు పూర్వమునం దున్న సంస్కృత వ్యాకరణముల ఫక్కిని మనసులో నిడుకొని దీనిని రచించి యుండును. శాస్త్రీయ గ్రంథ మగుట వలనను, అతని కది చిరకాలాభ్యస్తమగుట వలనను చింతామణిని సంస్కృతములో రచించియుండును. ఇందు కన్పట్టు సమాసము, విభక్తి, క్రియ, అచ్చు, హల్లు, అన్వయము మున్నగు సంజ్ఞలను కొన్నిటిని సంస్కృత వ్యాకరణముల నుండి గ్రహించియు, ద్రుతము మున్నగు సంజ్ఞలు కొన్ని తాను కల్పించియు రచనము సాగించినట్లు తోచుచున్నది.

ఈ విధమగు నియమములతో రూపనిష్పాదన ప్రక్రియను సంగ్రహముగా బోధించుచు, పాఠకుల సౌకర్యమునకై తన రచనను కారికలుగా గావించెను. చింతామణియందు రసము, గుణదోషములు, యతి, ప్రాస మున్నగు కావ్య సామాన్య లక్షణములను స్పృశించి నన్నయ భట్టారకుడు అప్పటి కత్యంతావశ్యకమని తనకు తోచిన వ్యాకరణాంశములనే విశేషముగా కూర్చెను. మొత్తముపై నీ వ్యాకరణమున సంధి, అజంత, హలంత, క్రియాపదముల ప్రక్రియ స్థూలముగా నిరూపింప బడినది.

అథర్వణకారికావళి: చింతామణి ఆంధ్ర వ్యాకరణములలో మొట్టమొదటి దగుటచే నం దెన్నియో విషయములు కొరవడినవి. అట్లుండుటయు అనివార్యము. వానిని కొంతవరకు పూరించినవాడు అథర్వణాచార్యులు (క్రీ. శ. 13 వ శతాబ్దము). ఇతడు చింతామణి సూత్రములకు వివరణలు, సవరణలు చూపుచు వార్తికములు వ్రాసెను. ఇవి 'అథర్వణ కారికావళి', 'వికృతి వివేకము' అను పేరులతో పండిత లోకమున ప్రచారములో నున్నవి. చింతామణి వలెనే యిదియు సంస్కృతమున రచింపబడినది. ఈ కారికలను అహోబల పండితుడు చింతామణి వ్యాఖ్యలో సందర్భోచితములని తనకు తోచిన తావులందు కూర్చి వివరించియున్నాడు. ఈతని వ్యాఖ్యనుండి సంగ్రహింపబడినవేగాని, యీ కారికలకు ప్రాచీన తాళపత్ర మాతృకలు లభింపవు. ఇవి ద్వితింత్రిణీ సీతారామ కవి టీకతో నిటీవల ప్రకటింప బడినవి.

అహోబల పండితీయమున తప్ప అథర్వణ కారికలకు వేరుగా మాతృక లభింపకుండుటచే వానిని అహోబల పండితుడే రచించి ప్రసిద్ధికై యథర్వణుని పేరిడె ననియు, అట్లే బాలసరస్వతి తెలుగున టీక రచించువరకు చింతామణి ప్రచారము లోనికి రాకుండుటచే బాలసరస్వతియే దానిని రచించి గ్రంథ గౌరవమునకై నన్నయపేర వెలయించె ననియు నిటీవల కొందరు విమర్శకు లొకవాదమును లేవనెత్తిరి. తమ వాదము స్థిరపడుటకై వారు మరికొన్ని ఉపపత్తులను గూడ చూపి యుండిరి. కాని యవి పరిశోధక పండితులలో పెక్కుమందికి సమ్మతములు కావు. నన్నయ చింతామణి రచించినట్లు ప్రబలములగు నాధారములు గలవు. అంతియే కాక చింతామణి కర్త నన్నయయే యనియు, దానివలననే యతనికి 'వాగనుశాసన' బిరుదము కలిగిన దనియు ఎంతోకాలము నుండి పరంపరాగతముగా పండిత లోకమున ప్రసిద్ధి నాటుకొని యున్నది.

చింతామణికి శేషగ్రంథమే కారికావళి. దీనిని రచించిన యాత డథర్వణాచార్యులే. ఇందులకు ప్రాచీన లక్షణ గ్రంథములందు ప్రబలములగు నిదర్శనము లున్నవి. ఇది సిద్ధాంతిత విషయము.

ఆంధ్రభాషాభూషణము: పై రెండు గ్రంథములును సంస్కృతములో సూత్రప్రాయముగా వ్రాయబడినవి. అందు లక్షణములేగాని లక్ష్యములు లేవు. రూప నిష్పాదన ప్రక్రియయు చాలవరకు వ్యాఖ్యానములమీద నే ఆధారపడి యుండును. లక్షణములతోపాటు లక్ష్యములను కూడ జోడించి తెనుగు మాటలకు తెనుగుభాషలో వ్రాయబడిన మొదటి వ్యాకరణ గ్రంథము 'ఆంధ్రభాషా భూషణము'; ఇది పద్యరూపము. దీని రచయిత 'దశకుమార చరిత్ర' వ్రాసిన మూలఘటికము కేతన (క్రీ. శ. 13 వ శతాబ్దము).

'మున్ను తెనుఁగునకు లక్షణ
మెన్నఁడు నెవ్వరును జెప్ప రేఁ జెప్పెద వి

> ద్వన్నికరము మది మెచ్చఁగ
> నన్నయ భట్టాది కవిజనంబుల కరుణన్.'

> 'సంస్కృత ప్రాకృతాది లక్షణము చెప్పి
> తెనుఁగునకు లక్షణము చెప్పకునికి యెల్ల
> కవి జనంబుల నేరమి గాదు నన్ను
> ధన్యుఁగావింపఁ దలఁచిన తలఁపుగాని.'

అను నిందలి పీఠికలోని పద్యములకు, నన్నయాథర్వణులు సంస్కృత ప్రాకృతములకు సంబంధించిన తత్సమ భాషకు లక్షణము వివరించి రనియు, అందు కొరవడిన దేశ్యపదములకు తా నిపుడు లక్షణములు చూపుచున్నా ననియు కేతన యాశయముగా గ్రహించుట సరసమైనపద్ధతి.

ఆంధ్రభాషా భూషణము అల్పమును, అసంపూర్ణము నయ్యు ఆచ్ఛిక పద స్వరూపమును నిరూపించుచు తెనుగు వ్యాకరణము యొక్క వివిధ విషయములను స్పృశించు చున్నది. ఇందు తెనుగున గల భేదములు, సంస్కృతపద జాలము తెనుగున ప్రవేశించు రీతులు, సంధులు, విభక్తులు, సమాసములును చిన్నచిన్న పద్యములలో నుదాహరణము లతో నిరూపింప బడినవి. లక్షణ విరుద్ధములై ప్రయోగార్హత లేని పదముల స్వరూపముకూడ కొంతవరకు చూపబడినది.

కావ్యాలంకార చూడామణి: పై గ్రంథములు కేవలము వ్యాకరణాంశములను మాత్రము నిరూపించు నవి. ఇంతవరకును ఛందోలంకార రూపములగు కావ్య లక్షణములను వివరించు గ్రంథములు ఆంధ్రమున లేవు. ఆ లోపమును కొంతవరకు తీర్చినవారిలో మొదటివాడు విన్నకోట పెద్దన (క్రీ.శ. 15వ శతాబ్దము). ఇతడు ప్రాచీన సంస్కృతాలంకార గ్రంథముల ననుసరించి కావ్యాలంకార చూడామణిని పద్యరూపమున రచించెను. ఇందు తొమ్మిది ఉల్లాసములు కలవు. మొదటి యెనిమిది ఉల్లాసములలో ఛందోలంకారాది కావ్య లక్షణములను వివరించి నవమోల్లాసములో వ్యాకరణాంశములను నిరూపించెను. ఇందు సంజ్ఞ, తత్సమ, సంధి, విభక్తి, తద్ధిత, క్రియాస్వరూపములు వివరింపబడినవి. ప్రాచీన వ్యాకరణములందు సంగ్రహముగా నున్న విషయములను ఇతడు విపులీకరించుటయే గాక, వానిలో కొరవడినతద్ధితాదిప్రక్రియలనుకూడ ప్రదర్శించెను.

కవిలోక చింతామణి: విన్నకోట పెద్దనవలె వెల్లంకి తాతంభట్టు (15వ శతాబ్దము)ను వ్యాకరణాంశములలో కావ్య లక్షణములను జోడించి కవిలోకచింతామణిని రచించెను. ఇదియు పద్యరచనయే. ఇందు భాషాలక్షణము, వర్ణ నిర్ణయము, వళి ప్రాసాది స్వరూపము, దోషాధికారము అను నాలుగు భాగములు కలవు. వీనిలో గల లక్ష్యలక్షణములు చాలవర కతనివే. పూర్వాంధ్ర కవుల రచనలనుండి కూడ కొన్ని లక్ష్యము లచ్చటచ్చట కూర్పబడినవి. కావ్య లక్షణములు ముఖ్యముగను, వ్యాకరణాంశము లప్రధానముగను ఇందు నిరూపితములు.

కవిజన సంజీవని: ముద్దరాజు రామన (16వ శతాబ్దము) కవిజన సంజీవనియు పై కవిలోక చింతామణి వంటిదే. దీనికి కవి సంజీవని యనియు, కవిలోకసంజీవని యనియు నామాంతరములు. ఏతత్కృతికర్తను రామభద్ర కవియనియు వ్యవహరింతురు. ఇతడు చాల వరకు ప్రాచీన లాక్షణికులు నిర్దేశించిన లక్షణములనే లక్ష్యములతో వివరించెను. వానిలోలేని కొన్ని శబ్దముల సాధుత్వమును గూడ ప్రాచీన ప్రయోగములు ప్రమాణములుగా చూపుచు నిరూపించెను. రచనయంతయు పద్యరూపమున సాగించియు స్పష్టతకై తన భావములను అచ్చటచ్చట వచనములతో వివరించెను. ఇందు యతిప్రాస ప్రకరణము, శబ్దప్రకరణము, సమాస ప్రకరణము, సంధిప్రకరణము అను నాలుగు ప్రకరణములు కలవు. వ్యాకరణాంశములను నిరూపించుటలో నీ గ్రంథము పై వానికన్న కొంతమేలు.

బాల సరస్వతీయము: బాల సరస్వతి (17వ శతాబ్దము) నన్నయ కృతమగు ఆంధ్రశబ్ద చింతామణికి తెనుగున టీక వ్రాసెను. పాణినీయము వలె చింతామణియు ఆంధ్ర విద్యార్థులు గురువులకడ పాఠములు చెప్పుకొనుచుండిరని విమర్శకుల యూహ. చింతామణిని శిష్యులకు పాఠములు చెప్పువారిలో ఎలకూచి బాలసరస్వతి యొకడు. ఇతడు మహోపాధ్యాయుడు, బహుశాస్త్ర పారంగతుడును. ప్రాచీనాంధ్ర లక్షణ గ్రంథమగు చింతామణిని శిష్యులకు బోధించుచు, ఆ యభ్యాసము ననుసరించి యితడు టీక వ్రాసెను. అందలి యార్యావృత్తములను సూత్రములుగా విభజించి, వాని భావమును వివరించుచు, అక్కడక్కడ ప్రాచీన కావ్యములనుండి లక్ష్యములను కూడ ప్రదర్శించెను. ఈ బాల సరస్వతీయము వలననే నన్నయ చింతామణి ప్రచారము లోనికి వచ్చినది.

అప్పకవీయము: కాకునూరి అప్పకవి (17వ శతాబ్దము) ఆంధ్రశబ్ద చింతామణిని తెనిగించెను; అనగా ఉన్నదున్నట్లు కాక ఇతర లక్షణ గ్రంథములు పరిశోధించి లక్ష్యములు శోధించి, క్రొత్త విషయములు పెక్కులు చేర్చి, ప్రామాణిక లక్ష్య ప్రదర్శనముతో గ్రంథమును విపులీకరించెను. వ్యాకరణ గ్రంథమును తెనిగింప బూనినవాడయినను, చింతామణిలో బీజప్రాయముగా నున్న కావ్యలక్షణాంశములను, ఛందో విషయములను విపులముగా వివరించుచు నాలుగాశ్వాసముల గ్రంథము సాగించి, ఐదవ యాశ్వాసములో వ్యాకరణము నారంభించెను. ఇందు

సంధి ప్రకరణము మాత్రమే కలదు. ఇక చింతామణిలో కొరవడిన అజంత, హలంత, క్రియా ప్రకరణములు మూడింటికిని మూడాశ్వాసములు రచింప సంకల్పించినట్లు తన పీఠికలోనే వ్రాసికొని యున్నాడు. ఎందువల్లనో ఆ మూడాశ్వాసముల రచనము సాగలేదు. ఉన్నంతవరకును అప్పకవీయము నేటికి బయల్వెడలిన సమగ్ర లక్షణ గ్రంథములలో నొకటి. 'ఇది చదివిన పిమ్మట' యను పద్యము వలన అప్పకవి తన గ్రంథమున నెందును కొరత లేకుండ కావ్య వ్యాకరణాంశముల నన్నిటిని సమగ్రముగా నిరూపించు దృక్పథము కలవాడని స్పష్టమగును.

కవిశిరోభూషణము : అహోబల పండితుడు (17 వ శతాబ్దము) బాల సరస్వతీయ మాధారముగా ఆంధ్ర శబ్ద చింతామణి తత్త్వమును గ్రహించి, అథర్వణ కారికల తాత్పర్యము నాకళించుకొని, అప్పకవీయాది లక్షణ గ్రంథములు పరిశోధించి బహులక్ష్య ప్రదర్శనపూర్వకముగా అథర్వణకారికలను తగిన తావుల చింతామణి సూత్రములతో జోడించి చింతామణికి సంస్కృతములో విపులమగు వ్యాఖ్యానమును వ్రాసెను. దీనికి కవి శిరోభూషణమని యాతడు పెట్టిన పేరు. అహోబల పండితీయ మనియు పండితుల వ్యవహారము.

బాలసరస్వతికిని, అప్పకవికిని చింతామణి ప్రతులు వేర్వేరుగా లభించినట్లును, అం దనేక పాఠభేదములు గోచరించినట్లును, ఆ రెంటిలో బాలసరస్వతి పాఠమునే తాను గ్రహించినట్లును గ్రంథాది పీఠికా శ్లోకములలో అహోబలపతి వివరించెను. అందు పూర్వ వ్యాఖ్యానముల లోపములను తెల్పి తన వ్యాఖ్య కవసరమును స్థాపించెను.

ఈత డనేక శాస్త్ర సంప్రదాయముల నెరిగినవాడు. కనుకనే ఆ యా చోట్ల తర్క వ్యాకరణాలంకార మీమాంసాది సంప్రదాయములను యథావసరముగా తన వ్యాఖ్యలో చూపి సిద్ధాంతములను సమన్వయము చేసినాడు. అక్కడక్కడ నన్నయను ప్రథమాచార్యు డనియు, అథర్వణుని ద్వితీయాచార్యు డనియు పేర్కొనినాడు. అందుచే వా రిర్వురును సంస్కృతములో వ్యాకరణ సూత్రములు రచించిన పాణిని స్థానమును, వార్తికములు కూర్చిన వరరుచి స్థానమును అధిష్ఠించుట కర్హులనియు, తాను ఆ రెంటిని జోడించి వ్యాఖ్య వ్రాయుటచే మహాభాష్య నిర్మాతయగు పతంజలితో సమానుడైనట్లును, తన వ్యాఖ్య మహాభాష్య సదృశమైనట్లును స్ఫురింపచేయుట అతని యభిప్రాయముగా తోచును.

ఇతడు వ్యాఖ్యానమునందు విచారణ చేయునపుడు మూలసిద్ధాంతముల యొక్క స్వరూప, స్వభావములను కూలంకషముగా చర్చించి అర్థనిరూపణ మొనర్చెను. పూర్వ ప్రయోగములు పెక్కులు చూపి వాని సాధుత్వాసాధుత్వములు చర్చించెను. చింతామణి యభిప్రాయము లను పూరించుచు సవరించుచున్న యథర్వణ కారికలను ఆ యా సందర్భములం దుదాహరించుచు, వానికి లక్ష్యములుగా నక్కడక్కడ పూర్వకవుల ప్రయోగములు చూపుచు వచ్చెను. నన్నయాథర్వణగ్రంథములను జోడించి వివరించు వ్యాఖ్యాగ్రంథ మగుటనే అహోబల పండితీయము పఠన పాఠనాదులలో మిక్కిలి ప్రసిద్ధి చెందినది.

ఆంధ్రకౌముది : పాణినీయము ననుకరించు ముచ్చటచే కాకోలు మండ నరసింహకవి (17 వ శతాబ్దము) సంస్కృత సూత్రములలో దీనిని రచించెను. ఇందలి యనేక సూత్రములు చింతామణిని, కారికావళి ననుసరించి వ్రాయబడినవే. సూత్ర వివరణము సంస్కృతములో నున్నను ఉదాహరణములు తెనుగులో నీయబడినవి. సిద్ధాంత కౌముదిలోవలె నక్కడక్కడ రూపనిష్పాదన ప్రక్రియయు చూపబడినది. ఈ గ్రంథమునందు పరిభాష, సంధి, అజంతము, హలంతము, కారకము, క్రియ అను పరిచ్ఛేదములు కలవు.

సర్వలక్షణసారసంగ్రహము : ఈ యాంధ్ర లక్షణ గ్రంథకర్త గణపవరపు వేంకటకవి (క్రీ. శ. 17 వ శతాబ్దము). ఈ గ్రంథమందలి యొక్కొక్క యుల్లాస మొక్కొక్క గ్రంథముగా వెలసినది. ఆంధ్ర నిఘంటువు, గణ యతి ప్రాస లక్షణము, రేఫ ఱకార నిర్ణయ పద్ధతి, షట్ప్రత్యయ ప్రస్తారము, అలంకారములు, కావ్యలక్షణములు, రసవిచారము మొదలగునవి యిందు నిరూపింపబడినవి. ఇందలి వ్యాకరణ భాగము 'ఆంధ్రకౌముది' యను పేర ప్రకటితమైనది. ఇది రమారమి వేయి పాదములు గల సీసమాలిక. పూర్వకవులును, లక్షణకర్తలును ఉదాహరించిన అనేక వ్యాకరణాంశము లిందు కూర్చబడినవి.

సర్వలక్షణసారసంగ్రహము : పై లక్షణ గ్రంథములను, అప్పటికి బయలువెడలిన ఆంధ్ర కావ్యములను ఆధారముగా చేసికొని కూచిమంచి తిమ్మకవి (క్రీ. శ. 18 వ శతాబ్దము) ఈ గ్రంథమును రచించెను. ఇది మూడాశ్వాసముల పద్య గ్రంథము. మొదటి యాశ్వాసములో తెనుగుభాషా స్వరూపము, వర్ణము, సంధి, విభక్తి అను భాగములు కలవు. రెండవ యాశ్వాసములో ప్రాస, వళి నిర్ణయము, శబ్దప్రకరణము నున్నవి. మూడవది రేఫ, 'ఱ' కార నిర్ణయ ప్రకరణము. వీనియందు ఆ యా విషయములు లక్ష్యలక్షణసమన్వయపూర్వకముగా వివరింపబడినవి. ఉదాహరణములు ప్రాచీన రచనలనుండి గైకొనబడినవి.

ఇంతకు మున్ను బయలువెడలిన లక్షణ గ్రంథములకన్న నిందు వ్యాకరణ విశేషము అధికము.

మన లాక్షణికులలో యతిప్రాసములయందు రేఫ, శకటరేఫ మైత్రిని నిషేధించినవా రధిక సంఖ్యాకులు; ఆమోదించినవారును లేకపోలేదు. ఈ విషయమును తిమ్మకవి కొంత చర్చించి, పోతన ప్రయోగముల నాక్షేపించిన అప్పకవి నెదుర్కొని రేఫ, శకటరేఫ మైత్రిని సమర్థించుట చూడగా నితడు లక్షణ సంస్కార ప్రియుడని తోచుచున్నది.

ఆనందరంగరాట్ఛందము : ఛందోవిషయ ప్రధాన మగు దీనిని కస్తూరి రంగకవి (క్రీ. శ. 18 వ శతాబ్దము) రచించెను. ఇందలి లక్ష్య లక్షణము లన్నియు ప్రాచీన లక్షణ గ్రంథములనుండి యుదాహృతములు. నాల్గవ యాశ్వాసమున సంధి విశేషములు, శబ్దస్వరూపము మొదలగు వ్యాకరణ విషయములు కొన్ని మాత్రము ఇందు నిరూపింపబడినవి.

కవిసంశయ విచ్ఛేదము : దీనిని అడిదము సూరకవి (క్రీ. శ. 18, 19 శతాబ్దములు) రచించెను. ఇది వ్యాకరణ విషయములను ప్రధానముగా నిరూపించు పద్య గ్రంథము. ఇందు మూడు తరంగములు కలవు. ప్రథమ, ద్వితీయ తరంగములలో శబ్దలక్షణ విశేషములనే చాలవరకు నిరూపించి పూర్వ కవుల గ్రంథములనుండి యుదాహరణముల నొసంగెను. తృతీయ తరంగ మంతయు తద్భవ ప్రకరణము.తద్భవముల యొక్కయు, వాని ప్రకృతుల యొక్కయు పట్టిక యిందు చూపబడినది. వ్యాకరణ విషయ నిరూపణమునందు ఈ గ్రంథము అప్పకవీయము కంటె కొంతవరకు మిన్న యని చెప్పవచ్చును. అనేక ప్రాచీనగ్రంథములనుండి ప్రయోగముల సాధుత్వా సాధుత్వములు ఇందు చర్చింపబడినవి.

బాలవ్యాకరణము : పై వ్యాకరణముల తత్త్వమును పరిశీలించినచో చింతామణి, వికృతి వివేకము, అహోబల పండితీయము మున్నగు ప్రధాన వ్యాకరణములు సంస్కృత భాషలో రచింపబడుటవలన అవి పండితులకు మాత్రమే ఉపయోగించునవని తోపకపోదు. అంతేగాక అవి చాలవరకు తత్సమ శబ్ద స్వరూపమును మాత్రమే హెచ్చుగా నిరూపించుచున్నవి. తెనుగు పద్యములలో వ్రాయబడిన ఆంధ్రభాషా భూషణాదులు తెలుగుమాత్రము తెలిసిన వారికిగూడ పఠన యోగ్యములుగా నున్నను, అవి వ్యాకరణాంశములలో ముఖ్యమైనవానిని నిరూపించునవిగా లేవు. ఇక కేవలము కావ్య లక్షణములనే నిరూపించు కావ్యాలంకార చూడామణి, అప్పకవీయము మున్నగువానిలో వ్యాకరణాంశములు అత్యల్పముగా వివరింపబడినవి. రానురాను కావ్యవాఙ్మయము బహుముఖములుగా విస్తరిల్లుటయు, వానిని చదువు పాఠకులును ప్రబలుటయు సంభవించినది. కాని సంస్కృతభాషకు సిద్ధాంతకౌముది వలె ఆంధ్రభాషకు తగిన వ్యాకరణగ్రంథము వెలువడలేదు. అట్టి కొరతను వారింపబూని పరవస్తు చిన్నయసూరి (క్రీ. శ. 19 వ శతాబ్ది) బాల వ్యాకరణమును రచించెను.

చిన్నయసూరి బహుభాషాకోవిదుడు; వివిధ శాస్త్ర నిపుణుడు. విశేషించి సంస్కృతాంధ్రములందు అపార పరిజ్ఞానము సంపాదించినవాడు. ఇతడు ప్రాచీన లక్షణ గ్రంథ విధానమును, భారతాది గ్రంథ ప్రయోగములను సూక్ష్మముగా పరిశీలించి, దానికి తన యనుభవమును జోడించి, క్రమపద్ధతిలో సులభశైలి గల తెనుగుసూత్రములతో వివరణ సహితముగా నుదాహరణములు చూపుచు, సక్రమమగు ప్రక్రియామార్గమున బాలవ్యాకరణమును రచించినాడు. భాష అనంతమగుటచేతను, వ్రాయునది లక్షణగ్రంథ మగుటవలనను ఎవేని చిన్న చిన్న లోపము లుండవచ్చునేమో కాని సూత్ర రచనా విధానములోను, శబ్ద స్వరూప నిర్ణయములోను ఇంతవరకు బయలువెడలిన వ్యాకరణములలో ఇది అగ్రగణ్య మనుటకు సందియము లేదు. ఒక్కమాటలో చెప్పవలయునన్నచో సంస్కృత వాఙ్మయమునకు సిద్ధాంతకౌముది యెట్టిదో ఆంధ్రవాఙ్మయమునకు బాలవ్యాకరణ మట్టిది. ఇది రచించుటకు పూర్వము చిన్నయసూరి సూత్రాంధ్రవ్యాకరణము, ఆంధ్ర శబ్దానుశాసనము, పద్యాంధ్రవ్యాకరణము మున్నగు పేరులతో తెనుగు వ్యాకరణ రచనమును వివిధ రూపముల సాగించి, తద్రచనాసారమునే బాలుర కత్యంతోపయుక్త మగునట్లు బాలవ్యాకరణ రూపమున ఆవిర్భవింపజేసెను.

హరికారికలు : చిన్నయసూరి కాలముననే శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి ఈ వ్యాకరణ గ్రంథమును సంస్కృత సూత్రములలో వ్రాసెను. దానికి వ్యాఖ్యయు అతని చేతనే రచింపబడినది. ఈ కారికలు మాత్రము కల్లూరి వెంకటరామశాస్త్రిగారు బాలవ్యాకరణ గుప్తార్థ ప్రకాశికానుబంధముగా ఇటీవల ప్రకటించినారు. హరికారికలు ప్రకటితములైన తరువాత వీని యాంధ్రీకరణమే బాల వ్యాకరణమని కొంతమందికి భ్రాంతి కలిగినది. కాని ఆ రెండింటిలో బాల వ్యాకరణమే మొదటిది. దాని యనువాద గ్రంథమే కారికావళి. ఈ యంశమును స్థిరపరుపగల ప్రబలాధారములు ఆ యుభయగ్రంథములందే గలవు.

త్రిలింగలక్షణశేషము : చిన్నయ సూరికి సమకాలము వారగు బహుజనపల్లి సీతారామాచార్యులు ఆ కాలములో మదరాసు నగరమునందు గవర్నమెంటు నార్మలు స్కూలులో ఆంధ్రోపాధ్యాయులుగా నుండిన

వారు. వీరును భారతాది బహుగ్రంథములను పరిశోధించియు, తన కాలమున భాషా పరిశోధనలో అగ్రగణ్యుడగు చిన్నయసూరి వలన వివిధ విషయములు సంగ్రహించుకొనియు 'ప్రౌఢ వ్యాకరణము' రచించెను. దీనికి త్రిలింగ లక్షణశేష మనియు నామాంతరము. వీరి వ్యాకరణ రచనా విధానమును జాగరూకతతో పరికించినచో ఆచార్యులుగారు భారతాది గ్రంథ పరిశోధనచే లభించిన విశేష ప్రయోగముల నన్నిటిని కూర్చి పూర్వ వ్యాకరణములచే గతార్థములు కావని తా మనుకొన్న విశేషములను ఇందు నిరూపింపదలచినట్లు పొడగట్టక మానదు. పూర్వ వ్యాకరణములలో లేని స్వరూపముకూడ ఇందు వివరింపబడినది. కాగా, ఇది పూర్వాంధ్ర వ్యాకరణములకు చాల వరకు శేషగ్రంథమని చెప్పవచ్చును. వీ రిందు నిరూపించిన విషయములు కొత్తలు కొన్ని కలవు కాని, అన్నియు నూతనాంశములు మాత్రము కావు.

ఆధునిక వ్యాకరణములు : వీని ననుసరించి బడి పిల్లల కుపయోగించు విధముగా ఆంగ్ల వ్యాకరణ రీతుల సమ్మేళనముతో వెంకయ వ్యాకరణము, శేషయ వ్యాకరణము, సంగ్రహ వ్యాకరణము, సులభ వ్యాకరణము, సరళ వ్యాకరణము మున్నగు పేరులతో పెక్కులు బయలు వెడలినవి; నేటికిని బయలు వెడలుచున్నవి. చర్ల నారాయణ శాస్త్రిగారు నన్నయ చింతామణి సూత్రములతో అథర్వణ కారికలను తగిన తావుల జోడించి, వాని భావమును తెనుగున పద్యములలో వివరించిరి. వీనిని సమన్వయించుచు వీరి కుమారులగు గణపతిశాస్త్రిగారు సూత్ర రచనా పూర్వకముగా, ప్రాచీనాంధ్ర గ్రంథముల నుండి యుదాహరణములను జూపుచు తెనుగులో వ్యాఖ్య రచించిరి. ఈ రచన యంతయు బాలవ్యాకరణమును బోలి యుండును. ఇందు సంజ్ఞా సంధి తత్సమ అచ్చిక కారక సమాస తద్ధిత క్రియా కృదంత ప్రకీర్ణ పరిచ్ఛేదములు గలవు.

ఇంత వరకును కవులదృష్టి చాల వరకు పద్యరచనము నందే నిమగ్నమై యుండుటచే వ్యాకరణములు కూడ ఆ పద్యకావ్య భాషనే అనుశాసించున వగుచున్నవి. కాని కాలక్రమమున ఆంధ్రవాఙ్మయము బహుముఖముగా వ్యాపింప జొచ్చినది. అందు నవలలు నాటకములు వ్యాసములు మొదలుగా ననేకశాఖలు బయలు వెడలినవి. కేవల రచనము నందే కాక భాషయందు కూడ నొక కొత్తదనమును, ప్రయోగ స్వాతంత్ర్యమును రచయితలలో పొడచూపినది. భారతాది ప్రాచీనగ్రంథ ప్రయోగములే కాక తదర్వాచీనులయు అధునాతనులయు ప్రయోగములు కూడ గ్రహింపదగినవే యనియు, శిష్ట వ్యవహారభాషయు రచనలయం దుపయోగింప దగిన దనియు, అట్టి భాషకును ప్రత్యేకముగా లక్షణము నిరూపించుట ఆవశ్యక మనియు నొక వ్యావహారికభాషావాదము బయలువెడలినది. ఈ యుద్యమమునకు ప్రథమ ప్రధాన ప్రవర్తకులు గిడుగు వెంకట రామమూర్తి పంతులుగారు.

వీరు 'కవి ప్రయోగము లక్షణము కంటె బలవత్తర మైన' దనియు, 'కవులు ప్రయోగించిన రూపములు లక్షణములో చెప్పకపోయినచో లక్షణమే అసమగ్రమగును కాని ప్రయోగములు నింద్యములు కా' వనియు తలచి అట్టి రూపములకు ప్రాచీనాంధ్ర కావ్యములనుండి ప్రయోగములు చూపుచు, 'బాలకవి శరణ్య' మను గ్రంథమును రచించిరి. సూత్ర రూపమున లేకున్నను ఇది యొక విధముగా వ్యాకరణ గ్రంథమే యనదగి యున్నది.

మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు పై ప్రయోగములవంటి వానిని పెక్కింటిని సంగ్రహించియు, పూర్వ వ్యాకరణముల ననుసరించి సూత్ర ఫక్కిలో 'ఆంధ్ర భాషాను శాసన'మను వ్యాకరణ గ్రంథమును రచించిరి.

ప్రాచీనాంధ్ర వ్యాకరణములందు విశేష పరిశ్రమ యొనర్చిన అద్యతనాంధ్ర పండితులలో కళాప్రపూర్ణ వజ్ఝల చిన సీతారామశాస్త్రిగారు ముఖ్యముగా పేర్కొనదగిన వారు. వీరి పరిశోధనానుభవములకు ప్రతిఫలముగా 'చింతామణీ విషయ పరిశోధనము', 'బాలసరస్వతీయాథర్వణ కారికావళీ పీఠికలు', 'వైయాకరణ పారిజాతము' మున్నగు వ్యాకరణ విమర్శన గ్రంథములు వెలసినవి. శాస్త్రులుగారు నిరంతరము వాఙ్మయమును, వ్యాకరణములను పరిశీలించుచు, చిరకాలార్జితమగు తమ యనుభవము నంతను క్రోడీకరించి, ఆంధ్ర విశ్వకళా పరిషత్తువారి ప్రోత్సాహముచే 'ఆంధ్ర వ్యాకరణ సంహితా సర్వస్వ' మను పేర నొక విపుల వ్యాకరణ గ్రంథమును వెలయింప జేసిరి. నిదానముగా పరిశీలించినచో ఇది నిజముగా ఆంధ్ర వ్యాకరణసర్వస్వ మనియే చెప్పవచ్చును. ఇందలి విషయములను సాకల్యముగా ఆకళింప గలిగిన వారికి ఇతర వ్యాకరణములు చూడ పనిలేదు.

ఇంతవరకును బయలు వెడలిన ఆంధ్ర వ్యాకరణములు ప్రాయికముగా సంస్కృత వ్యాకరణ రీతుల ననుసరించి వ్రాయబడిన వగుటచే అవి తెనుగు భాషలోని సాధు రూపములను, వాని ప్రక్రియలను నిరూపించునవే కాని వాని చారిత్రకాంశములను గాని, తక్కిన సోదర భాషలతో ఆంధ్రమునకుగల సంబంధమునుగాని తెలియజేయవు. ఇట్టి చారిత్రక వ్యాకరణములలో మొదటిది రెవరెండు కాల్డ్వెల్ పండితుడు రచించిన 'కంపేరిటివ్ గ్రామర్ టు ది

ద్రవిడియన్ లాంగ్వేజెస్'. ఇందు తెలుగు ద్రావిడభాషలలో నొకటి యని, ద్రవిడ భాషలకు పరస్పరము గల సామరస్యమును, అందలి వ్యాకరణ విశేషములును, ఆయాభాషల ప్రత్యేకతయు ప్రధానముగా నిరూపింప బడినది.

ఈతని మార్గము ననుసరించి ఆంధ్ర భాషా తత్త్వమును చారిత్రకముగా పరిశీలించి సజాతీయములగు నితర భాషలతో దీనికి గల సంబంధమును నిరూపింప వలయు నను కుతూహలము దేశభాషా పండితులకును గలిగినది. అట్టి వారిలో డాక్టరు చిలుకూరి నారాయణరావుగా రొకరు. వీరు ఆంధ్ర విశ్వకళాపరిషత్తువారి ప్రోత్సాహముచే 'ఆంధ్రభాషాచరిత్రము'ను రచించిరి. వీరు కాల్డ్వెల్ అభిప్రాయము నంగీకరింపక తెలుగు సంస్కృతముతోపాటు ఆర్యభాషా కుటుంబములోనిదే యని సిద్ధాంతీకరించిరి.

ఆంధ్ర భాషా తత్త్వ పరిశోధకులలో చెప్పుకోదగిన మరియొకరు కోరాడ రామకృష్ణయ్యగారు. వీరు భాషా విషయకముగా బహు పరిశోధనము లొనర్చిరి. వీరి రచనలలో వ్యాకరణాంశములకు విశేషముగా సంబంధించినది 'సంధి' యను గ్రంథము. ఇందు తెనుగు శబ్దముల సహజమగు స్వరూపమును నిరూపించుటకు తోడ్పడు సంధి విషయములు చారిత్రక పద్ధతి ననుసరించి యితరములగు సన్నిహితములైన ద్రావిడ భాషల లక్షణములతో సరిపోల్చి యందలి విశేషములు సహేతుకముగా సమన్వయింపబడినవి. తెలుగు ద్రవిడభాషా కుటుంబములోనిదని వీరి నిశ్చయము. భాషాతత్త్వ చరిత్రాంశములను వివరించు వ్యాసములు పెక్కింటిని వీరు ప్రకటించిరి.

ఇంతవరకు బయలు వెడలిన ఆంధ్రభాషా తత్త్వమును తెలియజేయు గ్రంథముల నెల్ల పరిశోధించి, ప్రొఫెసర్ విద్వాన్ గంటి జోగిసోమయాజిగారు ఆంధ్రభాషా వికాసమనెడి ఆంధ్రభాషా తత్త్వశాస్త్ర గ్రంథమును రచించిరి. ఆంధ్రభాషా స్వరూపము కాలక్రమమున నెట్లు పరిణతమయి నేడెట్టి స్థితికి వచ్చినదియో నిరూపించుట దీని ముఖ్యోద్దేశము. ఈ భాష అరవము, కన్నడము, మలయాళము మొదలైన ద్రావిడభాషలతో అభిన్నమయి ఏక రూపమున నుండియు, కాలక్రమమున వానినుండి విడి నేడీరీతి నెట్లు స్వతంత్ర భాష యయినదో ఉపపత్తులతో ఉదాహరణములతో సమగ్రముగా సుస్పష్టముగా నిందు సిద్ధాంతము చేయబడినది. దు. వెం. శా.

**వ్యాసమూర్తిశాస్త్రి, ఆకొండి** (క్రీ. శ. 1860 - 1916) : పశ్చిమగోదావరిజిల్లా, తణుకు తాలూకా కాకరపర్రు వీరి నివాసస్థానము. వేంకటాంబా వేంకటశాస్త్రులు వీరి తలిదండ్రులు. వీరు వేదుల సోమనాథశాస్త్రిగారికడ తర్కాలంకారశాస్త్రములను, ఆదిభట్ల రామమూర్తిగారియొద్ద ఉపనిషద్వేదాంతశాస్త్రములను అధ్యయనము చేసిరి. సంస్కృతాంధ్రములందు వీరి పాండిత్య మఖండమైనది. వీరు ప్రతిభాసంపన్ను లగుటచే ఇతర శాస్త్రముల పరిచయము నలవరచుకొనిరి. వీరు శబ్దార్థముల విషయమున గాని, ప్రమాణముల ప్రయోగముల విషయమున గాని ఎవరైన నేవేని సందేహముల నడిగినపుడు తడవు కొనక వానిని తీర్పగలిగి యుండెడివారు.



చిత్రము 298.
ఆకొండి వ్యాసమూర్తిశాస్త్రి

వీరు ఖండవిల్లి, కొత్తపేట పాఠశాలలలో తొలుత నధ్యాపకులై యుండిరి; అనంతరము 1880 మొదలు 1916 వరకు రాజమహేంద్రవరమునందలి బోధనాభ్యసన పాఠశాలయందును, కళాశాలయందును సంస్కృత భాషా బోధకులై యుండిరి.

వీ రనేక గ్రంథములను రచించిరి. అనర్ఘరాఘవ, ప్రబోధ చంద్రోదయ, సూర్యశతకముల యనువాదరచనములు వీరి ప్రతిభా పాండిత్యములను వెల్లడించుచుండును. భారత ఫక్కి యనుపేరుతో భారత విమర్శగ్రంథము నొకదానిని వీరు రచించిరి. వీరు సంస్కృతభారతమును 'మహాభారతనవనీత' మనుపేర తెనుగున రచింప మొదలిడి ఆది నుండి పదమూడు పర్వములు రచించిరి. వీరి రచనములలో నిది విశిష్టమైన గ్రంథము. మహాభారతమునందలి సారతర పదార్థము నుద్ధరించి వెలిపరచుటకే యీ రచన యుద్దిష్టమైనట్లు దీని నామమువలన విశదమగుచున్నది. ఋతుసంహారము (శుద్ధాంధ్రము), భామినీ విలాసము, అధ్యాత్మ రామాయణము, పరాశరస్మృతి (తెనుగు వచనము) మున్నగునవి వీరి యన్యరచనములు. వీరి కవిత్వము సలక్షణమయినది. అందు పాండిత్యముపా లధికము ; వ్యర్థ పదము లుండవు. సుప్రసిద్ధ శతావధానులగు వెంకట రామకృష్ణకవులలో (వేదుల) రామకృష్ణశాస్త్రి వీరి జామాత. గ. సు.

**శతక వాఙ్మయము :** శతక కృతులు మకుటము, ప్రత్యేకభావము, సంఖ్యానియమము అని ముఖ్యముగ మూడు లక్షణములు గలవని స్థూలదృష్టిం బరికించుచో విదితమగును. కాని ఆంధ్రమున కవులచే స్వతంత్రముగ

విరచితములైన ఈ తెగ గ్రంథము లేయొకటి రెండో తప్ప సర్వసాధారణముగ మిగిలిన వన్నియు నీ మూడు లక్షణ ములను విధిగ పాటించినవి.

దేవభాషలో శతకములు చాల నరుదుగ నున్నవి. అమరుకము, భర్తృహరిత్రిశతి, మూక పంచాశతి, కుట్టి కవి మహిష శతకము - ఇట్టివి కొన్ని. గీర్వాణశతక కవులు మకుటనియమము పాటించినవారు కారు.

ఒక్కశతకమే కవి వ్రాయుచో, నందలి శ్లోకములెల్ల నొక్క విషయమునకే సంబంధించి యుండును. కాని ప్రతి శ్లోకభావమును భిన్నమయినదే. భర్తృహరి సుభాషిత త్రిశతిలోని మూడు శతకములును గ్రమముగ నీతి, శృంగార, వైరాగ్య విషయకములు. కేవలము దేవీస్తోత్ర పర్యాయశ్లోక సముపేతమగు మూకపంచాశతిలోను పాదారవింద, కటాక్షాదిక భిన్నాంశములను ఒక్కొక్క శతకము ప్రత్యేకముగ వర్ణించును.

ఆంధ్రీకృత శతకములు : మరి తెలుగు శతకము లను బరిశీలించుచో, పై జెప్పిన శతక లక్షణత్రయమును దత్కర్తలెల్ల విధిగ ననుసరించినట్లు కనబడుచున్నది. కాని ఆంధ్రీకృతులలో మాత్రము ఈ నియతిని వారు పెట్టుకొన నట్లు తోచుచున్నది. అందులకు కారణము వా రనుసరించిన మూలములే. సౌందర్యలహరి, శివానందలహరులను దాదాపు పదుగురేసి, యమరుకమును బండ్రెండుగురు, భర్తృహరి సుభాషిత త్రిశతి నేడుగురు, మూకపంచాశతి నిరుగురు, (నీలకంఠ, దీక్షిత విరచిత) నీతిశాస్త్రరత్నావళి (త్రిశతి)ని, మహిషశతకమును, సూర్యశతకమును ఒక్కొక్కరు అనువదించిరి. వీ రందరు మకుట విరహిత ములుగనే తమ రచనమును సాగించిరి. భర్తృహరిని దెలిగించినవారిలో బాలసరస్వతి మాత్రము తన పోషక ప్రభుని పేర 'సురభిమల్లా, నీతివాచస్పతీ', 'సురభిమల్లా; మానినీ మన్మథా' యని మకుట కల్పన మొనర్చెను. ఈ హేతువున, మత్తేభ శార్దూలవృత్తములలోనే యితని యాంధ్రీకృతి సాగవలసిన యవసర మేర్పడి, మూలము లోని యనుష్టుప్పులకు సహితము వ్యర్థపదములతో బెద్ద పద్దెము లల్లవలసి వచ్చినది. ఇదేవిధముగ గడచిన శతాబ్ది వాడగు వెల్లాల నరసింగకవి యేకదీక్షతో భర్తృహరి సుభాషిత త్రిశతిని గంధపద్యములలో జెప్పెను. దీనిచే పెద్ద శ్లోకభావముల కాయువుప ట్లనదగు పెక్కు శబ్దములను విడుచుట యనివార్యమయినది.

ఆంధ్ర స్వతంత్ర శతకములు : తొలుదొల్త మకుట కల్పనములో సొంపు ఆంధ్రులకు రుచి చూపినవాడు నన్నయభట్టారకుడు. 'మాకు బ్రసన్నుడయ్యెడున్' అను మకుటముతోడి పద్యములు నాల్గింటి నత డొకపట్టున రచించియున్నాడు. ఇది కేవలము నన్నయభట్టారకుని సృష్టియే. అతని కాలమున సంఖ్యాపరిగణన విధాన మాచరణమునకు రానట్లున్నది. పండ్రెండవ శతాబ్దము ఉత్తరార్ధమున నుండిన మల్లికార్జున పండితారాధ్యుడే శతక లక్షణమును గొంతవరకు పాటించి 'శివతత్త్వసార' శతక మును తొలుదొలుత రచించిన మహాకవి. సంస్కృత శతక కారులవలెగాక యితడు తన శతకమునకు మకుట మేర్పరచుకొనెను. కాని యంత్యమున శివపర్యాయ నామము లతో దనయిచ్చ వచ్చినవానిని 'రుద్రా, హరా, శివా' - అని ఈ రీతిగ నుపయోగించెను.

శైవమతావలంబకులైన కాకతీయుల పరిపాలన కాల మున దన్మత వ్యాప్తికై సాహిత్య మనేక రూపములలో వెలసినది. నాడు శతకము 'మార్గ' కవితలో కొనసాగి నది. సంక్షేపముగ బాఠకులకు శైవతత్త్వము బోధించుట యందు శతకములు కడుంగడు సమర్థములు. స్వానుభవ మున శైవ కవు లనేకు లీ శతకరచనము జేపట్టిరి.

పండ్రెండ్రవ శతాబ్ద ప్రారంభమునుండి నేటివర కాంధ్ర మున నుప్పతిల్లిన స్వతంత్ర శతకములు వేయింటికిని మించియే యున్నవి. క్రీ. శ. 1800 వరకు శతకములు చాల తక్కువ. కారణ మేమన తెలుగు కవులలో ప్రబంధ రచనముమీద గల యభిమానము గొరతవడకుండెను. ఆవల, అనగా క్రీ. శ. 1800 నుండి - నేటివరకు అట్టి ప్రబంధ రచనాకాంక్ష క్రమముగ సన్నగిల్లి దాని స్థాన మును జాలవరకు శతకము లాక్రమించుకొనుట సంభ వించుచున్నది.

స్వతంత్రముగ నాంధ్రమున నుడువబడిన శతక మకుట ములను గూర్చి యొక్క మాట: ఆయా శతక స్వభావ ములను బట్టి ఏకశబ్ద మకుటములు, అర్థపాదమకుటములు, ఏకపాదమకుటములు, ద్విపాదమకుటములు అని యవి పెక్కు తెరగులు. మకుటమున బేర్కొనబడినవారే ఆ శతకమును అంకితముగా బరిగ్రహించినవారు. 'విశ్వదాభిరామ వినురవేమ' అనుచో వేమన పద్యములు ఆత్మాంకితములని గ్రహింపదగును.

తెలుగులోని స్వతంత్ర శతకములు విషయ విభాగముల ననుసరించి దశవిధము లగును; జ్ఞాన, భక్తి, శృంగార, నైతిక, వైరాగ్య, రాజకీయ, సాంఘిక, దృష్టాంత, నిందా, సంకీర్ణములు: ఇట్టివి వేయింటికిపైగా నున్నను, బ్రచారమున నుండునవి ప్రఖ్యాతములైనవి కొన్ని మాత్రమే. సుమతీ, వేమన, కృష్ణ, నరసింహ, దాశరథీ శతకముల కాంధ్రమున నున్న యాదరము నిరుపమానము;

పూర్వకవి విరచితములలో లెక్కకు మిక్కిలిగా అముద్రిత ములు, అజ్ఞాతములును.

ప్రప్రథమమున కవులు కవితాధార నలవరచుకొన శతకరచనమునకు బూనుకొనువారని యొక ప్రతీతి విమర్శకలోకమున వ్యాపించిపోయినది. అందువలననేకాబోలు వారు తక్కినవారివలె మహాకవులుగ బరిగణింపబడలేదు. కవి జీవితములు వ్రాసిన వీరేశలింగం పంతులు, గురుజాడ రామమూర్తిగారు ఒక్క శతక కవిని గూర్చియైన దమ గ్రంథములలో దడవలేదు. ఆంధ్రమున ప్రామాణికముగ నంగీకరింపబడిన శబ్దరత్నాకరకారుడగు బహుజనపల్లి సీతారామాచార్యులును ఒక్క శతకకవి ప్రయోగము నైనను దన నిఘంటువున నుదాహరింపలేదు. సంస్కృతమున శతకములు రచించిన భర్తృహరి, శంకరులు, మూకకవి, కుట్టికవి, నీలకంఠ దీక్షితులు మొదలగువారును, దెలుగున వ్రాసిన తిక్కన, ధూర్జటి, కూచిమంచి తిమ్మన మున్నగు వారును కవితాభ్యాసమునకు శతకములు వ్రాసినారనుట పరిహాసాస్పదము; ఒకవిధముగ వారి పాండితీ కవితా ప్రాగల్భ్యములకు న్యూనతాపాదకము. సవిమర్శగ వారి శతకములు పరిశీలించుచో జక్కగా జేయి తిరిగిన కవులు గాని శతకరచనము చేయలేరని స్పష్టమగును. వశ్యావాక్కు, ధారాపాటవము, గ్రథనశక్తి, లోకానుభవము, సూక్ష్మ బుద్ధి, విమర్శనాదక్షత యుండిననేతప్ప శతకకవి కాలేడు. పైవానియం దేరెండు లోపించినను, వారి భావనాబల సముచిత పద్యముల కంత బాధకములు కానేరవు; అయిన 'సామాన్య కవు లట్టి శతక నిర్మాణము చేయలేరా?' యన్న నది విషయాంతరము.

ఉద్దండ పాండితీ మండితులయిన కవులు చాలమంది శతకములు రచించినను కొందరు మాత్రము శ్రుతపాండి త్యమువలన గలిగిన భాషా పరిచయముతోనే శతకములు వ్రాసినారు. అట్టివా రేదియో యొక విధముగ దమ కిచ్చవచ్చిన పద్యధోరణి నలవరచుకొన్నవారుగా పరి శోధనములవలన అభిజ్ఞులు గ్రహించగలరు.

శతక కవులలో గొందర కాజన్మసిద్ధమైన కవితా బీజము, నిరంతర శ్రవణ దోహదముచే మొలకెత్తి, కొనలు సాగినది. అట్టివారికి సాహిత్య మన్ననేమో, వ్యాకరణ మన్ననేమో - అవగాహనము చేసికొనదగినంత సంస్కృతి లేకపోవచ్చును. వారి కవితలో 'పక్కా' పాండిత్యము కన బడకపోవచ్చును. అంతమాత్రమున వారి విషయ వ్యక్తీకరణ మునకు వచ్చిన లోటిసుమంతయు నుండదు. శాబ్దికులు గాక పోవుటచే, శబ్దసాధుత్వాసాధుత్వాలమీద దృష్టిపోనీయక, సరళమయిన భాషలో మృదుమధురముగ వారు కవిత్వము చెప్ప నేర్పు గడించినవారు. స్వారస్యమును పోషించు విషయమున పెటపెటలాడు సాంస్కృతిక జటిల దీర్ఘ సమాసాలతో సాముచేయుచు కూర్చుండువారు కారు. ప్రాపంచికానుభవాలకు దాము వ్రాయు విషయము లెంత సన్నిహితములుగ నుండదగు నను నూహతో వ్యాకరణ విరుద్ధగ్రామ్య శబ్దములయినను బ్రయోగించుటలో వారు జంకినవారు కారు. వ్యవహారమున విశేషముగ బ్రచార మందున్న జాతీయములు, సాంకేతికములు, నానుడులు, సామెతలు మున్నగునవి వెదకికొను నవసరము లేకయే వారి కవిత్వమున దొర్లుచుండెడివి. తెలుగువారి జాతీయ తను, సాంఘిక జీవితమును గ్రహించుటకు వారి శతకము లత్యంతోపకారకములు.

వేమనయోగి, కవిచౌడప్ప, గువ్వలచెన్నుడు-మొదలగు శతకకారులు ఆజన్మకవుల వర్గమునకు చెందినవారే. ఈ తెగలోజేరిన కవులకు ఛందోలక్షణాదులు కూడ సమగ్ర ముగా దెలియవని చెప్పుట సాహసము కానేరదు. వినికిడి వలనను, నిరంతర మననము వలనను ఏదో యొకరకము పద్యము చెప్పుటకలవాటుపడి తదనుగుణముగా శతకము లొనర్చుచుండిరి.

సాధారణముగ పాండితిలేని సామాన్య శతకకవులకు అచ్చివచ్చిన పద్యములు - కంద, సీసములు. వేమనయోగి మాత్ర మాటవెలదిని వరించెను. అసంఖ్యాకములయిన యితని పద్యములలో నటనట కందములు, చంపకాది వృత్తములు కనబడుచున్నవి. కాని యవి వేమనవే యనుట కనువగు నాధారములు లేవు. ఏమయినను సామాన్యభాషా జ్ఞానముతో శతకములు వ్రాసినవారిలో వృత్తములు చేపట్టినవా రరుదుగ గన్పట్టుచున్నారు. మహా కవులయిన తిక్కన, ధూర్జటి, తిమ్మన, జగ్గనాదులు వృత్తాల తోనే శతకరచన చేసిరి. తేటగీతలలో వెలువడిన శతక ములు ఇంతవరకు రెంటి, మూటికంటె నెక్కుడుగ లేవు. కవితా విపణిలో 'తేటగీతము' చౌకబారు సరుకేమో. కాని యీ యిరువదియవ శతాబ్దమున 'తేటగీతము' ప్రతి కవికి అపరంజివంటిదైనది. తక్కిన పద్యములకంటె ఇది సులభముగ దొరలుటయే కారణము కావచ్చును.

సాధారణముగ కవు లేవేని యుద్గ్రంథములు వ్రాయు సందర్భములలో ఏ మాత్రమయిన మనస్సునకు జిరాకు గల్గి విసుగు తోచినప్పుడు ఏ మకుటమునో యాధారముగ జేసికొని మధ్యమధ్య కొన్ని పద్యములను జెప్పువారు. అట్లు భావపరివర్తనముకొర కప్పుడప్పుడు పలికిన పద్య ములే శతకములుగ రూపొందినవి. లేదా ఏదో యొక విష యమును గూర్చి - అనగా సంఘములోని పరిస్థితులను

గూర్చి, మతవిప్లవమును గూర్చి ప్రబోధింపదలచినప్పుడు శతకరచనము సాగుచుండినది. రాజాస్థానములలో కవుల మధ్య పోటీ లేర్పడినప్పుడు శతకరచన మనివార్యముగ జేయబడినది. ఒక్కొక్కప్పుడు పోషక ప్రభు ప్రోత్సాహము వలన గూడ గవులు శతకరచన మొనర్చువారు.

పూర్వము సర్వసాధారణముగ మన దేశమున నాబాల వృద్ధము, ఆయా యవస్థల కనుగుణములైన శతకములను చదివి యానందించుటయగాక, యందలి రసవంతములగు పద్యములలో గొన్నిటినేని కంఠస్థములు జేసికొనెడివారు. పిల్లలకు పసితనము నుండియే సుమతి, వేమన, భాస్కర, జగన్నాయక, కృష్ణ, నరసింహాది శతకపద్యము లింటను, బడులలోను నేర్పువారు. పైన పేర్కొన్న శతకములలో మొదటి రెండును సామాన్య నీతులు, తరువాతి రెండును దృష్టాంతపూర్వ క్రమవర్తన విధానములు, ఆ వెనుకటి రెండును భగవద్భక్తి వైరాగ్యములు బోధించునవి. కావున విద్యార్థిదశలోనే ఆంధ్ర కుమారునికి నీతి, సత్ప్రవర్తనము, ఆస్తికత అలవడుటకు పునాదులు శతకముల మూలమున వేయబడెడివి. భావావబోధనమున అందలి పద్యము లంత కష్టమయినవి కావు; శబ్దములును బహు లలితములు, నిత్యవ్యవహార పరినిష్ఠితములు.

ఇక ప్రౌఢములగు మరికొన్ని శతకములు నిందాస్తుత్యాదులకు సంబంధించినవి సహితము లేకపోలేదు. కాసుల పురుషోత్తమకవి రచించిన 'ఆంధ్రనాయక శతక' మిందుల కుదాహరణముగ గ్రహింపదగును. దుష్టశిక్షణ, శిష్టరక్షణము లొనర్ప నవతరించిన రామకృష్ణాద్యవతార మూర్తుల లీలలను నిందారూపముగ నుపాలంభించుటలో గవి భావనాబలము ఎంతటిదో గ్రహించుట కిట్టి శతకము లాధారము లగుచున్నవి.

దాయభాగసందర్భమున శ్రీకృష్ణు డన్నయగు బలభద్రుని గికురించున ట్లధిక్షేపించుచు పురుషోత్తమకవి చెప్పిన పద్యము గమనింపుడు :

'నాగలి రోకలన్నకు నిచ్చి, శంఖాది
పంచాయుధము లీవు పట్టినావు,
తాటి టెక్కెంబు గోల్లలఁ బెద్ద కెత్తించి
గరుడధ్వజం బీవు గట్టినావు,
తెలరాని, కఱవోని వలువ జ్యేష్ఠున కిచ్చి,
కనకాంబరం బీవు గట్టినావు,
మద్య మగ్రజునకు మత్తిలఁ ద్రావించి,
జున్నుపా ల్వెరు గీవు జుఱ్ఱినావు,
తగవరివె యన్నదమ్ముల ధర్మ మీవె
తీర్పవలెఁగాని మఱియొండు తీర్పఁగలడె?
చిత్ర చిత్ర స్వభావ! దాక్షిణ్యభావ!
హతవిమతజీవ! శ్రీకాకుళాంధ్రదేవ!'

'నీకు వచ్చిన పేరుప్రతిష్ఠలు కేవల మాంధ్రచేతను, బిడ్డల చేతనేగాని, స్వయముగ నీవు యశస్వివికావ'ని విష్ణువు నీకవి నిందించు టెంత సమంజస మనిపించుచున్నదో చూడుడు :

'అలు నిర్వాహకురాలు భూదేవియై
యఖిల భారకుఁడను నాఖ్యఁ దెచ్చెఁ
నిష్టసంపన్నురా లిందిర భార్యయై
కామితార్థదుఁ డన్న ఘనతఁ దెచ్చెఁ
గమల గర్భుఁడు సృష్టికర్త తనూజుఁడై
బహుకుటుంబకుఁడన్న బలిమిఁ దెచ్చెఁ
గలుష విధ్వంసియౌ గంగ కుమారియై
పతితపావనుఁడన్న ప్రతిభఁ దెచ్చె
నాంధ్రు బిడ్డలఁ దెచ్చు ప్రఖ్యాతిగాని,
మొదలనుండియు నీవు దామోదరుఁడవె...'

'దామోదర' శబ్దము ఆంధ్రదేశమున నిందార్థమున వాడబడు టెల్లరకు దెలిసినదే. 'విష్ణు' పర్యాయమయిన 'దామోదర' శబ్దము ఇట వ్యంగ్యముగ బ్రయోగింపబడుట కవి సమయోచిత ప్రతిభకు జక్కని తార్కాణము.

కవితాలతాంగి గోగులపాటి కూర్మనాథకవికి కైవసమైనట్లు తక్కిన శతకకవులకే కాదు, ప్రబంధ కవులకుగూడ గాలేదనుట సత్యదూరముగాదు. ఇతడు శృంగార రస భూయిష్ఠమగు సుందరీమణి శతక మొకటి, చారిత్రక శతకము సింహాద్రి నారసింహశతక మొకటి రచించెను. ఇతని కృతులలోని యొక్కొక్క పద్య మొకరస గుళికయే. శృంగారరస భూయిష్ఠమగు సుందరీమణి శతకములోని యీ క్రింది పద్యము (విప్రలంభ శృంగారము) కనుడు:

'మదనుఁడు డాసెఁ బూవిలుతు మర్మము లంటఁగ నేసె నక్కటా!
హృదయము దూసె, దానిపయి నిందుడు వెన్నెలఁగాసె గోకిలల్
చెదరక కూసెఁ జిల్క రొదచేసె, నళుల్ వడిమ్రోసె నెట్టులో
వ్రైద, విధి నిన్ను నన్నెడలఁజేసె దురాత్మత సుందరీమణీ!'

ఉదాహరింపనెంచుచో శతకపద్యము లన్నియు మరల నెత్తి వ్రాయవలసినవే. మొత్తముమీద మహాకవియగు కూర్మనాథుని పద్యము లన్నియు గలకండ పలుకులు; పేరిన తేనె తునుకలు; ముదురబండిన ద్రాక్షఫలములు. ఏ పద్యమున కాపద్యమే ఒక విచిత్ర వినూత్న భావ సమంచితమయి, చదువ జదువ జవులూరించుచు, పాఠకుల నానంద సుధాలహరిలో ముంచెత్తు పాటవముతో నీటు గులుకుచుండును.

ఈ కోవకు చెందినవారే ధూర్జటి, తిమ్మన, సూరన, వేంకటరాయ (పోలిపెద్ది) కవీంద్రులు. వీరి శతకపద్యములలో నొక్కటేని తెలుగునాట నోట వెలువడని యక్షరాస్యు డుండడు. పై బేర్కొన్న కవు లాకాల మందలి ప్రభువుల యవినయమును, రాచరికమునందలి లోటు

పాటులను నిర్భయముగ, నిర్దాక్షిణ్యముగ, నిష్పక్షపాతముగ విమర్శించిరి.

ఆంధ్రమున హాస్యరస పుష్టములగు శతకములును బెక్కులు వెలసినవి. అందు ముఖ్యముగ బేర్కొనదగినది 'చంద్రశేఖర శతకము'. పామరుల యవివేకమునుగూర్చి ఈ శతకకర్తకంటె దీవ్రముగ వారి గ్రామ్యములోనే వ్రాసిన తెలుగుకవి యరుదు. మచ్చునకు ఒక్క పద్యము :

'సంగితకాఁడ, పాడకిక, సాలిచు, నీవది పాడినందుకున్
ఇంగితమెర్గి నేను మరి యున్నదుకున్ సరిపోయె యింటివా
అంగున నే తలూపినటి యప్పుకు తమ్మొర యీడ మెట్టి పో
బంగుడు బావనాడ, యని వల్కును మూర్ఖుడు చంద్రశేఖరా!'

ఆధునిక శతకములలోను రసవంతములు, ప్రౌఢములు నగునవి పెక్కు లుప్పతిల్లినవి - దాసు శ్రీరామకవి 'చక్కట్ల దండ శతకము', తిరుపతి వేంకటకవుల 'కామేశ్వరీ శతకము', మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రి 'మృత్యుంజయ శతకము' వంటివి.

ఇందు మొదటిది కేవల మాచ్ఛిక శబ్దములతో నైతిక ప్రబోధ మొనర్చునది. కవి ప్రజాసాహిత్యమును చక్కగా ఆకళించుకొన్నవాడు. ఇందు మంచి చణుకు లందందు గడు మనోహరముగ గన్పట్టును. చూడు డీ పద్యము :

'అచ్చిఁ రచ్చల కెక్కునని బుచ్చిఁ బెండ్లాడ
బుచ్చి మిండలవెంటఁ బోవ మఱగు
కోడూరు బురదని మేడూరు పోయిన
మేడూరిలో జాస్తి మెట్ట శిస్తు
జక్కిదాణా కోడి స్వారెక్కఁ బూనిన
బోయిబత్తెములకే పోవు గడన
తోఁటాకు పసరంచు దోసకాయను దిన్న
దోసకా యది జల్బుచేసి విడుచుఁ
గొంచె మిబ్బంది కలదని క్రొత్తఁ బూని,
ప్రాఁత విడచిన నది దాని తాత యగును
అని పలుకు దాసు శ్రీరాముఁ డచ్చ తెనుఁగుఁ
గబ్బ మందము నిండఁ జక్కట్ల దండ.'

19 - 20 శతాబ్దుల సంధికాలమున దమ కవితా రసాస్వాదనానంద పారవశ్యమున నాంధ్రలోకము నుఱ్ఱూతలూగించిన తిరుపతి వేంకటకవులలో వెంకటశాస్త్రిగారి చేతనే చెప్పబడినట్లు ప్రసిద్ధిగన్న కామేశ్వరీశతకము రసవంతమైనది ; ఇందు సమకాలికాచార వ్యవహారములు విమర్శింపబడినవి చూడుడు :

'సకలమ్ముం గొఱిగించుకొందు రకటా! సన్న్యాసులా? కారు; బొట్టొకయింతేని మొగమ్మునందిడ రదేమో! ముండలా? కారు ; విప్రకులోత్తంసుల కిట్టి పాటు గలిగెన్ బైవారిమాటేల? యెందుకు లోకం బిటు మారె? నీ కెఱుఁగరాదో దేవి, కామేశ్వరీ!'

మాధవపెద్దిశాస్త్రి హాస్యకవితలో ఆరితేరిన దిట్ట. ఈయన 'పంచవటి', 'శబరి', 'చాటువులు' - ఒక యెత్తు; 'మృత్యుంజయ శతకము' మాత్ర మొక యెత్తు. నూత్న భావములతో, ఛలోక్తులతో గడుపు చెక్క లగునట్లు నవ్వింపగల పద్యము లల్లుటలో నిత డద్వితీయుడు ; సమయస్ఫూర్తి ననుసరించి, సమంజసమని తోచునేని, వ్యావహారికమైనను, అన్యదేశ్యమయినను, తుదకు లక్షణ విరుద్ధమైనను దోచిన శబ్దమును బద్యమున బ్రయోగించి సరసుల హృదయముల రంజింపజేయగల నిరంకుశ ప్రతిభావంతుడు. ఏ పద్యము దీసికొన్నను హాస్యరస మించుక తొంగిచూచుచునే యుండును. కను డీ పద్యములు :

'ఒక లంబోదరుడైన పుత్రకుడు మున్నున్నట్టిడే, నీకుఁ జాలక కాఁబోలును సృష్టిఁజేసితివి యీ లంబోదరుంగూడఁ, దీ
గకు గాయ ల్బరువౌన ?కాని, కుడుము ల్గల్పించి యవ్వాని, కే
లొకొయివ్వానికి నొక్కమైని యిడుము ల్మొల్పింతు
మృత్యుంజయా!'

'ఏదో నీ కొకదేవిగాని, యిక నేవేవో సవాలక్ష లా
వాదేవీ లయిపోయె మాకు, జరుగుంబా చెట్టు, లే కొండనో
లేదా యే గుహలోనొ వట్ట, కొక జోలేడాగియుండంగ, మే
మే దేవుళ్లమొ, విశ్వమూర్తులమొ నీవే తెల్పు మృత్యుంజయా'

'తిన్నం డంత తెగింపకున్న యెడ నీ తీరేగదా, యాతఁ డా
కన్నాడం బెటుకంగనే కుదిరె రోగం బంతయున్ నీ, కదే
వన్నెన్ నన్నునుదేక యే విడుతువా? వాఁడే నయంబన్న దాఁ
క న్నిన్నేనియుఁదేక యే విడుతునా? కానిమ్ము
మృత్యుంజయా!'

ఆంధ్రశతక వాఙ్మయ మపారమయినది. అందు దెలుగు జాతీయతాస్ఫోరకములగు పెక్కు విశేషము లున్నవి.

శతకములు కేవలము కవితాభ్యాసమునకే కవులు చేపట్టుచుండిరనుట పొరపాటనియు, ఉద్గ్రంథ రచయిత లయిన - తిక్కన, ధూర్జటి, తిమ్మన మున్నగు ప్రాచీన కవులేకాక వడ్డాది, వావిలికొలను, కూచి, చెళ్లపిళ్ల - లోనుగాగల యాధునిక కవులు వ్రాసిన శతకములు అట్టి అపోహ కెడమిచ్చుట లేదనియు, ఇతిహాసముల కంటె శతకములే తత్కర్తల హృదయగత భావావిష్కరణమునకు, స్వానుభవ ప్రకటనమునకు నెక్కుడుగ నుపయోగించు ననియు తుదకు దేలిన సారాంశము.

సంఘములోని మేలుకీళ్లును, దేశకాల పరిస్థితులును, రాజకీయ విషయములును, వాఙ్మయ పరివర్తనములును, కవితా రీతులును, నూతన సంస్కృతులును, నానావిధ కళాభ్యుదయములును అద్దమునందువలె శతకములలోనే ఝుణ్ణముగా స్పష్టపడుననుట అతిశయోక్తి కాదు.

కవితా ప్రావీణ్య మాకళించుకొని, ఆయా కవుల కీ దగిన స్థానములను నిర్ణయించుటకు శతకములే యొర

పిడి రాళ్ల వంటివి. అల్పిష్ఠములని యలవోకగా చూడ దగినవి కా వీ శతకరత్నములు. వే. వెం. శ.

**శారదకాండ్రు:** వీరు మున్నూరు, ముతరాసి మున్నగు తెలగ కులములనుండి పుట్టినవారు. తెలంగాణ మునగల భిక్షుక జాతులందు వీరే యధిక సంఖ్యాకులు. మన పూర్వ సాహిత్యమున నీపేరు కానరాదు. కనుక నీ పేరు ఇటీవలిదై యుండును. శారద వరుస పదములు వీరు ముఖ్యముగా పాడెదరు. ఈ పదములం దంత్యప్రాసనియమ ముండును. సాహిత్యభాగము కొంత యధికముగా నుండును. 'ఓ భారతి కరుణామతి, భళి శారద కరుణా నిధి' యనునది వంతపాట. వీ రుపయోగించెడు వాద్య ములం దొక దానికి శారద యని పేరు. పురుషుడు ఎడమచేతితో మీటుచుండును. దీనినే శారద యందురు. శారదా దేవి స్తోత్ర మొనర్చి గీత మారంభింతురు కనుక శారదవారన బరగి యుందురని యూహింప వచ్చును. పురుషుడు గీతము పాడుచుండగా ప్రక్కనుండు నాతని యింటిది వంత పాడుచు 'డిమ్కి' (బుర్ర) గొట్టుచుండును. నేటి రాజకీయపక్షములవారి బుర్రకథలు శారద కాండ్ర వేషములకు, గానములకు, వాద్యములకు అనుకరణములు.



చిత్రము 294.
శారదకాండ్రు

వీరు శారద వరుసలోనున్న పాటలే కాక వీరావేశ ముతో నితర చారిత్రక గేయములనుగూడ పాడెదరు. తెలంగాణమందు ప్రచారముననున్న సర్వాయిపాపడు, సదాశివరెడ్డి మున్నగు కథలు వీరే యధికముగా వినిపింతురు. ఒక్కొక్కకథ మూడు నాలుగు దినములు వినిపింతురు. ఇరువురు పురుషులు ఒక స్త్రీగాని, ఇరువురు స్త్రీలు ఒక పురుషుడుగాని దీర్ఘ కథా కాలక్షేప మొనర్తురు.

శారదకాండ్రు సాధారణముగా నందరును శైవులే. కొందరీజాతి మాంసాహారులగు జంగముల వలన కలిగిన దని చెప్పెదరు. పోచమ్మ, ఎల్లమ్మ వీరి ముఖ్య దేవతలు.

వీరు కల్లు, మాంసము లారగింతురు. వీరిలో తపలి మారుమనువు వంటి యాచారము లున్నవి; బహు భార్యాత్వ మధికము. మొండి దేవర, గంగిరెద్దులవారు వీరి నడిగి తినెదరు. వీరి కూడు మాలమాదిగలు ఓప్ప, ఇతరు లొల్లరు. వీరిలో లింగధారులు మద్యమాంసములు ముట్టరు. గురువులు, పురోహితులు, జంగములు, లింగ ధారులు కాని వారియిండ్ల పౌరోహిత్యము 'కులపెద్ద'లు నిర్వహింతురు. బి. రా. రా.

**శివశంకరశాస్త్రి, కస్తూరి:** ఈయన గోదావరి మండల నివాసి; రాజమహేంద్ర వరమునందలి ప్రభుత్వ కళాశాలలో కొంతకాలము సంస్కృత పండితుడుగా నుండెను. శివానందలహరి, శివపాదస్తుతి, స్తోత్రకదంబము, ద్వాదశమంజరి, సముద్రాష్టకము, శూలపాణిశతకము, నృసింహ స్తోత్రము మున్నగు స్తోత్రములను, కొన్ని వేదాంత గ్రంథములను ఈయన రచించెను. ప. రా. స్వా.

**శీనయ్య, ఘనం:** వీరు తెనుగున అనేక కీర్తనలను, పదములను రచించిరి. వీరు వైష్ణవులు; ఆత్రేయ సగోత్రులు; ఆపస్తంబ సూత్రులు; సంగీతములోను, సంస్కృతములోను పాండిత్యమును సంపాదించినవారు: విజయరంగ చొక్కనాథుని మంత్రిగా ఉండిరి; 'సుసుంగ విజయ' మను ప్రబంధమును రచించిరి. వీరి ముద్ర 'మన్నారురంగ'. వీరు తానములేక మధ్యమకాలము పాడుటలో గొప్ప ప్రవీణులు. కాబట్టి వీరికి 'ఘనం శీనయ్య' అను బిరుదు వచ్చినది. వీరి 'శివదీక్షా పరురాలను రా' అను పదము చాల ప్రసిద్ధమైనది. ద్వా. పా.

**శేషకృష్ణశాస్త్రి:** శాస్త్ర విద్యాభ్యాసార్థము కాశీకి వెళ్లిన ఆంధ్రులలో వీరొకరు; విద్యాభ్యాసానంతరము కాశీలో వీరు స్థిరనివాస మేర్పరుచుకొనిరి. వీరి సంతతివారు అచ్చట నివసించుచున్న మహారాష్ట్ర కుటుంబములతో సంబంధ బాంధవ్యములు జరుపుకొనిరి. వీరి తనయులలో ఒకరయిన శేష వీరేశ్వరశాస్త్రి గారు జగన్నాథ పండిత రాయల తండ్రి పేరంభట్టుగారి గురువు. గు. వెం. రా.

**శేషగిరిరావు, చల్లా (క్రీ. శ. 1886 - 1934):** గుంటూరు వీరి జన్మస్థలము. తండ్రిగారు వీ ఫిడేలు వాద్యంలో ప్రవీణులైన కృష్ణయ్యగారు; తల్లి బ్రహ్మేశ్వ రమ్మగారు.

వీరు బి. ఎల్. పరీక్షలో ఉత్తీర్ణులై న్యాయవాదిగా గుంటూరులోనే ప్రాక్టీసు ప్రారంభించినా, విద్యార్థిదశ నుంచి పత్రికా రచనపై, ప్రజాహితోద్యమాలపై వీరికి గల అభిమానం వీరి న్యాయవాద వృత్తిని దీర్ఘకాలం సాగనివ్వలేదు. అచిరకాలంలోనే (గాంధి మహాత్ముడు కాంగ్రెసు నాయకత్వాన్ని చేపట్టక పూర్వమే) వీరు ఆంధ్ర పత్రికాధిపతి, శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు గారిదృష్టి నాకర్షించి ఆంధ్రపత్రికకు ప్రధాన సంపాదకులుగా నియమించబడినారు.

జాతీయ, అంతర్జాతీయ విషయాలను, వాని వివిధ పరిణామాలను తమ సంపాదకీయ వ్యాసాల ద్వారా తెనుగు పఠితలకు సరళశైలిలో శ్రుతపరచ గల్గినవారే కాకుండా వీరు గాంధిమహాత్ముని పట్ల, ఆయన సిద్ధాంతాల పట్ల అచంచల భక్తి విశ్వాసాలు కలవారు. అందు చేతనే ఆంధ్రపత్రికకు శ్రీ నాగేశ్వరరావు పంతులు గారు సర్వాధికారులైనా, పత్రిక సంపాదకీయ విధాన నిర్ణయంలో వీరికి స్వేచ్ఛాస్వాతంత్ర్యాల నిచ్చివేశారు. భారత స్వాతంత్ర్యం, భాషాప్రయుక్తరాష్ట్ర నిర్మాణం, సహాయ నిరాకరణం, నిర్మాణ కార్యక్రమం వీరికి అభిమాన విషయాలు.


చిత్రము 295.
చల్లా శేషగిరిరావు

ఆంగ్లభాషా పరిచయంగల కొద్దిమంది 'విద్యాధికుల'ను మినహాయిస్తే గాంధిమహాత్ముని స్వాతంత్ర్య సందేశాన్ని' కాంగ్రెసు మహాసభ ఆదేశాలను, సాంఘిక, రాజకీయ, సాంస్కృతిక రంగాలలోని దైనందిన పరివర్తనలను గ్రహించేందుకు యావదాంధ్రదేశ ప్రజలకు ఆ రోజులలో 'ఆంధ్రపత్రిక' ఒక్కటే సాధనం. జాతీయోద్యమానికి ఆంధ్రదేశం పట్టుకొమ్మ కావడానికేమి, కాంగ్రెసు సందేశం తెలుగునాట వాడవాడలకు వ్యాపించడానికేమి, త్రివిధ బహిష్కారం, నిర్మాణకార్యక్రమం, శాసనోల్లంఘనోద్యమాలలో ఆంధ్రులు అహమహమికతో పురోగమించడానికేమి, భారతస్వాతంత్ర్యంతో పాటు ఆంధ్రరాష్ట్ర నిర్మాణం ఆంధ్రులకు ప్రధానలక్ష్యం కావడానికేమి తీవ్రజాతీయవాద పత్రికగా ఆనాడు అశేషాంధ్రావనిలో 'ఆంధ్ర పత్రిక' కావించిన ప్రచార ప్రబోధాలు, సంపాదకీయ వ్యాసాలద్వారా తెనుగు ప్రజానీకంలో అది కలిగించిన ఉత్తేజనము చాలవరకు కారణమని చెప్పవచ్చు. పై సందర్భంలో ప్రధాన సంపాదకులుగా వీరు చేసిన సేవ ప్రశంసాపాత్రం.

వీరు తమవ్రాతలలో స్వయంగా తమకు నమ్మకమున్నా లేకున్నా, ఉద్యోగధర్మాన్ని బట్టి మాత్రమే స్వాతంత్ర్యోద్యమాన్ని, సహాయ నిరాకరణ కార్యక్రమాన్ని బలపరచిన కేవల పత్రికా రచయితలుకారు. వీరి చిత్తశుద్ధివల్లనే వీరి సంపాదకీయ వ్యాసాలకు దేశంలో అంతటి విపుల ప్రచారం ఏర్పడింది.

అప్పటిలో మొత్తం ఆంధ్రదేశంలో ఏకైక దినపత్రికకు ప్రధాన సంపాదకులైనా వీరు గర్వమన్న నేమో ఎరుగని వినయ విభూషితులు; అత్యంత నిరాడంబరులు; సహృదయులు; స్నేహపాత్రులు; అల్పప్రాణికైనా అపకారం తలపెట్టలేని అహింసావ్రతులు; మంచిమాటలతో సలహా చెప్పడమే తప్ప ఎట్టి పరిస్థితులలో కూడా తన సహోద్యోగులను పల్లెత్తు పరుషవాక్కులనాడని సరళ హృదయులు; జీవితాంతం వరకు పత్రికా రచనను పవిత్రధర్మంగా, ఆంధ్రపత్రికా కార్యాలయాన్ని యజ్ఞవాటికగా పాటించిన కర్మవీరులు. కమ్మని సంగీతం విన్నా, చక్కని టెన్నిస్ ఆట చూచినా వీరి కళ్ళవెంట అప్రయత్నంగా ఆనందాశ్రువులు రాలేవి. నంజువ్యాధిచే అశక్తులై కార్యాలయానికి రాజాలని పరిస్థితి ఏర్పడేవరకు కేవలం జీవికకొరకు కాక, దేశంకోసం, ప్రజలకోసం తన విధ్యుక్త ధర్మాన్ని నిర్వర్తించిన కర్తవ్యతా పరాయణులు వీరు. సీ. శే.

**శేషయ్య, పల్లవి :** వీరు సేలం జిల్లాలో నేయకారంపట్టి అను గ్రామమునకు చెందినవారు; ములికినాటి బ్రాహ్మణులు; తెలుగులో చక్కని పాండిత్యము గడించినవారు; సంగీతలక్ష్య లక్షణములందు గొప్ప విద్వత్తుగలవారు. వీరికి నేయకారంపట్టి శేషయ్యర్ అని కూడ పేరు. ఎటువంటి కష్టమైనపల్లవినిగాని చాల తేలికగాను, మనోహరముగాను పాడి పండితులను, పామరులను, వీరు తన్మయమొందించేవారు. వీరు అనేక కృతులు, వర్ణములు, తిల్లానలు, మొదలైన రచనలు చేసిరి; ఇదియునుగాక అనేక అపూర్వ రాగములలో కృతులను రచించిరి; చాల సంస్థానములకు వెళ్ళి తమ విద్వత్తును జూపి సన్మానములను పొందిరి. వీరి అంత్యదశ చెన్నపట్టణములో గడచినది. వీరి ముఖ్యశిష్యులు మణత్తట్టై దొరసామయ్యా. వీరు పల్లవి, అందులోను సావేరి రాగము పాడుటలో గొప్ప ప్రవీణులు. ద్వా. పా.

**శేషశాస్త్రి, నిట్టల :** వీరికి శేషభట్ట అగ్నిహోత్రి అని నామాంతరము. వీరు గౌతమ గోత్రులు. తండ్రి సుబ్బా

దీక్షితులుగారు. వీరు తూర్పుగోదావరి జిల్లాలో స్వగ్రామమున వేదాధ్యయనము పూర్తిచేసి పూనాలోని పేష్వా రెండవ బాజీరావుగారి దర్బారుకు వెళ్లిరి. ఇక్కడ ఆయన వేద, శాస్త్ర వైదుష్యమునకు గొప్ప గౌరవము జరిగినది. వీరిని పూనాలో నుండ నభ్యర్థనము జరిగెను; కాని అందుకు వీరు సమ్మతింపలేదు. పేష్వా వద్ద శలవు తీసికొని వెళ్లునపుడు వీరికి చాల గొప్ప సత్కారము జరిగినది. ప్రతివత్సరము దర్బారుకు రావలసినదని పేష్వా వీరిని కోరెను. వీరు స్వగృహమునకు మరలి వచ్చిన పిదప వివాహము చేసికొని చాలకాలము గృహస్థజీవనము గడపుచు ప్రతిసంవత్సరము పేష్వా దర్బారుకు పోవుచువచ్చిరి. వీరి యేకైక పుత్రిక వెంకమ్మ. ఆమెను అమలాపురము తాలూకా ఇందుపల్లిలోని భమిడిపాటి విశ్వనాథశాస్త్రి కిచ్చి పెండ్లిచేసిరి. వార్ధక్యదశలో వీరు ఉత్తరహిందూ దేశములోని పుణ్యక్షేత్రములను సందర్శింప నిశ్చయించుకొనగా పేష్వా తనతో సంబంధముగల రాజులకు పరిచయము చేయుచు వీరికి కావలసిన సాయము చేయవలసిన దనియు, మజిలిమజిలీవరకు దిగబెట్టుటకు మందిని పంపు డనియు వారి కుత్తరములు వ్రాసి యిచ్చెను. ఈ యాత్రా సందర్భములో వీరికి ఝాన్సీరాజుకు ఎక్కువ సన్నిహితత్వము కలిగినది. వీరియొక్క వైదుష్యమును, సంస్కారమును రాజుకు బాగుగ నచ్చినవి. తిరుగు ప్రయాణములో ఝాన్సీకి వచ్చినపుడు ఝాన్సీరాజు వీరిని ఆయనజీవితావశేషమును గంగాతీరమున గడపవలసినదని వేడుకొనెను. వీ రందుల కంగీకరించి బిథూరు (బ్రహ్మావర్తము)లో నివసింప నిశ్చయించుకొనిరి. అందు కనువుగ ఝాన్సీరాజు, శ్రీరావు రామచంద్రరావు వీరికి సంవత్ 1874 లో అచట గృహమును నిర్మించి యిచ్చుటే కాక ఆ గ్రామమున పౌష శుద్ధ షష్ఠినాడు కొంత భూమిని దానముచేసి దానపట్టా నిచ్చిరి. వీరు తన యల్లుని, కూతురిని తనతో నచట నివసింప రావలసినదని కబురంపిరి. ఆయన దౌహిత్రుడు భమిడిపాటి శేషనారాయణశాస్త్రి.

ఈలోగా పేష్వా రెండవ బాజీరావు కుంపిణీవారితో యుద్ధములో ఓడిపోయి స్వదేశము విడిచి శేషశాస్త్రిగారు బిథూరులో నుండుటచేకాబోలు, వీరి యింటి యెదుటనే తాను నివసింప నిశ్చయించుకొనెను. వీ రగ్నిహోత్రములు చేయుకాలమునకు బాజీరావు ప్రతిదినము వీ రింటి కరుగుచుండువాడు. బాజీరావు ఆదరించుటవల్ల దాదాపు ఉత్తర హిందూదేశములోని రాజు లందరు వీరిని దర్శించి వినయ విధేయతలతో రజత, సువర్ణదానములు చేసి వీరిని సత్కరించుచుండిరి. 1851 లో ఇంచుమించు పేష్వా బాజీరావు గతించిన కాలమందే వీరును పరలోకగతులైరి. గు.వెం.రా.

శేషాచార్లు, గట్టుపల్లి (1860 - 1930) : వీరు చెన్నపురి వాస్తవ్యులు; 'శశిలేఖ' యను వారపత్రికను నడుపుచుండెడివారు. ఈ పత్రిక యందు సాహిత్యమునకు సంబంధించిన విషయము లెక్కువగా ప్రకటితములగుచుండెడివి. ఆ కాలమున జరిగిన వాగ్యుద్ధములలో కూడ నీ పత్రికకు కొంత స్థానముగలదు. ఈ పత్రికలలో కొంత మంది కవి పండితుల చరిత్రలు ప్రకటితములైనవి.

వీరు భారత రత్నములు, భాగవత సారము అను గ్రంథములు కాక శ్రీ వాల్మీకి రామాయణము సుందర కాండమునకు చక్కని వచనమును రచియించియున్నారు. పారాయణకు కూడ అనుకూలమగునట్లుగా దానిలో ఒక వైపున తెలుగు లిపిలో సుందరకాండ మూలమును, రెండవ వైపున దాని కెదురుగా వచనమును ముద్రింపబడినది. మూలమునందలి రచన యెంత మాధుర్యము గలదో యా తెలుగు వచన రచనకూడ అంత మధురమైనది. ఇది తెలుగునాట చాలప్రచారము నందినది. వీరు వ్రాసిన వైష్ణవ గ్రంథములు: ఆళ్వారుల చరిత్ర, ముముక్షుప్పడి. పత్రికా ప్రవర్తక, విలేఖకులుగనే గాక, వచన రచయితలుగా కూడ వీరికి సముచిత గౌరవస్థానము గలదు. ని. వెం. రా.

శేషాద్రిశర్మ, జనమంచి (క్రీ. శ. 1882 - 1950): వీరు తెలగాణ్యులను వైదిక బ్రాహ్మణశాఖకు చెందినవారు; కాశ్యప సగోత్రులు; అపస్తంబ సూత్రులు. వీరి తండ్రి సుబ్రహ్మణ్యావధాని; తల్లి కామాక్షమ్మ. వీరి ప్రపితామహుడు అగ్నిష్టోమయాజిసూర్యనారాయణ సోమయాజి. వీరి పితామహుడు వేదాధ్యేత వేంకటావధాని. వీరి తండ్రియు వేదాధ్యయన పరుడు. వీరి జన్మస్థానము నెల్లూరు జిల్లా కలువాయ గ్రామము. పెద్దలనాటినుండి నివాసస్థానము కడపజిల్లా బద్వేలు తాలూకా వెంకటరామపుర మను నగ్రహారము. వీరు ఉద్యోగ జీవనముతో కడపలో స్థిరపడి పోయిరి.



చిత్రము ౨౮౬.
జనమంచి శేషాద్రిశర్మ

వీరి బాల్య విద్యాభ్యాసము కడపలోనే ఆరంభము. వీరు పదునొకండవ యేటనే కడప వదలి బైరాగులతో కాశి

నడకను కాశికి పోయి అట నాలుగేండ్లు విద్యాభ్యాసంగము చేసిరి. తరువాత విజయనగరములో కొన్నాళ్ళు, ఆ తరువాత అనకాపల్లి దగ్గర ఖసింకోటలో చాలకాలము విద్యా తపస్వియై యుండిరి. ఆ దినములలోనే వీరు యోగాభ్యాస పరులైరి. సుబ్బమాంబిక వీరి సతీమణి. అక్కడనే వీరు మొదట సి. యస్. బి. హైస్కూలులో, పండిత పదవినుండి, అటనుండి కర్నూలు కోల్సు మెమోరియల్ హైస్కూలులో అల్పకాలము, ఆవల 1901 నుండి కడప మునిసిపల్ హైస్కూలులో ప్రధానాంధ్ర పండితులుగనుండి 1937 లో అటనుండి గజోత్సవముతో వీడ్కోలు వడసిరి.

పదునైదవ యేటనే కవితాకళ వీరిని ప్రేమించినది. దానితో వీరు కొంత అవధాన పరిశ్రమకు అలవాటు పడిరి; శతావధానములు గూడ జేసిరి. కందుకూరి వీరేశలింగము పంతులుగారి వంటి శ్రేయస్కాముల యుపదేశమువలన దానికి స్వస్తి చెప్పి కావ్యరచనా కార్యక్రమమునకు దీక్షాకంకణము కట్టి కలమునకు కావలసినంత పనిని గల్పించిరి.

జీవితాంతము వీరు విద్యార్థులుగనే కృషిచేయుచుండిరి. గురుకులవాసముతో నేమి, స్వయంకృషితోనేమి వీరు నాటకాంత సాహిత్యము, అలంకారశాస్త్రము, వ్యాకరణ శాస్త్రము, స్కంధత్రయ జ్యోతిషము-అందులో విశేషించి సిద్ధాంత భాగము, యోగశాస్త్రము, మంత్రశాస్త్రము, ధర్మశాస్త్రము మున్నగు వానియందు మంచి పరిశ్రమ కావించిరి. వీరు ఆయుర్వేదములో నిదానము దెలియగల చక్కని నాడీ జ్ఞానము గడించిరి. జ్ఞానకాండమున భాష్యత్రయ శాంతి కావించిరి. వీరికి సాహిత్యగురువులు బ్రహ్మశ్రీ రఘుపతిశాస్త్రి; ఛందో వ్యాకరణ గురువులు శ్రీమాన్ దాసాచార్యులు; జ్యోతిశ్శాస్త్ర గురువులు బ్రహ్మశ్రీ తోపల్లి వెంకటరామసిద్ధాంతి; మంత్రశాస్త్ర గురువులు, బ్రహ్మశ్రీ రాణీ నరసింహ చయనులు.

విద్యా తపోనిధులై మంత్ర తీర్థ ప్రసాదములతోపాటక్షర దానము చేసి పెక్కండ్ర శిష్యుల నాత్మ సాత్కృతుల జేసికొని గురు పదము నధికరించిన విద్యాదాతలు వీరు; పాదుకాంత దీక్షాపరులు; శ్రీ విద్యోపాసకులు. పరదేవతోపాస్తికిని, పరోపకార పరాయణతకును, సారస్వతోపాసనకును జీవితము నంకితము జేసిన పరమపావన మూర్తులు వీరు.

కలము పట్టనేర్చినది మొదలు కాటి కెక్కువరకు వీరు వ్రాసిన గ్రంథములను బీరువోకుండ లెక్కించి చెప్పవలెనన్నచో కొన్ని దశకములకు తగ్గవు. అవియైనను చిన్నవి పొన్నవిగాక వేలాది పద్యములతో వెలసినవి.

వీరు వ్రాసిన గ్రంథములలో హాలాస్య మాహాత్మ్యము, లలితోపాఖ్యనము, బ్రహ్మాండ పురాణము, ఆంధ్ర శ్రీమద్రామాయణము. బ్రహ్మపురాణము, తాండవ కృష్ణ భాగవతము (దశమస్కంధము), హనుమద్విజయము, సర్వమంగళా పరిణయము, ధర్మసార రామాయణము, కవి విలాసము (ప్రథమభాగము), కౌమారికా ఖండము, సంగ్రహభారత భాగవత రామాయణములు, శ్రీకృష్ణావతార తత్త్వము, శ్రీరామావతార తత్త్వము, పాండవాజ్ఞాతవాసాది నాటకములు, అరుణాచల ఖండము అనునవి 26 ను ముద్రితములు; కేదారఖండము, గిరీశవిజయము, హృదయానందము (అసంపూర్ణము), శ్రీకృష్ణరాయబార చరిత్రము (అసంపూర్ణము), శ్రీ శంకరాచార్య చరిత్రము (అసంపూర్ణము), కలివిలాసము (ద్వితీయ భాగము), నీటుకత్తె, వైజయంతి, నవరత్నహారము, శ్రీ రామావతారతత్త్వము (12వ సంపుటము), దుష్ప్రభుత్వము మొదలైనవి అముద్రితములు.

బాలసరస్వతి, అభినవ నన్నపాచార్య, అభినవ వాల్మీకి, ఆంధ్రవ్యాస, సంస్కృత సూరి, మహాకవి, కళాప్రపూర్ణ, కావ్యతీర్థ, స్మృతితీర్థ అనునవి వీరి బిరుదములు. ఇవి వీరి పాండిత్య ప్రకర్షకు నిదర్శనములు. **మ. వెం. సు. శ.**

**శైవ వాఙ్మయము:** మతాచార సంప్రదాయములందు శైవులు తదితరులగు భవులకంటె విలక్షణములు గల్గియున్నట్లే యాంధ్ర వాఙ్మయమున శివకవుల రచనలందు విశిష్టతయున్నది. వీరి శబ్దప్రయోగములు, ఛందస్సంప్రదాయములు మార్గపద్ధతి ననుసరించు లాక్షణికుల నియమములకు బద్ధముగాక, దేశిపద్ధతికి సంబంధించి స్వతంత్రములై, శైవేతరుల నిందలకు గురియైనవి. కాని శివకవుల సంఖ్య యధికమగుటచేతను, వా రందరు ప్రత్యేక భాషా లక్షణ సంప్రదాయములు గలవారగుటచేతను వారు వివిధ వాఙ్మయ శాఖలలో బహుగ్రంథరచనచేసి, వాఙ్మయాభివృద్ధికిని, భాషాభివృద్ధికిని తోడ్పడుటచేత నితరులు వారి సంప్రదాయముల నామోదించినను లేకున్నను, విశాలాంధ్ర వాఙ్మయమున వా రొక ప్రత్యేకస్థానమును సంపాదించుకొనిరి.

వీరశైవులగు కవులు రచించిన గ్రంథములును, శైవ భక్తులను గూర్చి రచించిన గ్రంథములును శైవవాఙ్మయమున చేరుచున్నవి. ఇట్టి కవులు శివకవు లనియు, వారి రచనలు శైవ వాఙ్మయ మనియు రూఢియైనది. ఇతర భాషావాఙ్మయములవలెనే యాంధ్ర శైవ వాఙ్మయమును మతాచార సంప్రదాయ సిద్ధాంత గ్రంథములు, పురాణ మాహాత్మ్యములు, ప్రబంధ నాటకములు, చరిత్రలు, కథలు,

శతకములు, యక్షగానములు, దండకములు, స్తుతులు, గేయములు, వచనములు మొదలైన వివిధశాఖలతో బహుళమై విశాలముగా నున్నది.

ఆంధ్ర శైవవాఙ్మయమునకు మల్లికార్జున పండితారాధ్యులు బ్రహ్మవంటివాడు. ఈత డాంధ్రదేశమందలి దాక్షారామమున శివభక్తుడై విలసిల్లి శివమత ప్రచారము చేయుచు ననేక గ్రంథములను రచించెను. ఈతడు రచించిన యాంధ్రగ్రంథములలో శివతత్త్వసార మొక్కటే యింత వరకు లభించినది. ఇందు పరమతములైన బౌద్ధ, జైన, అద్వైతాది మతములు నిర్దాక్షిణ్యముగ ఖండింపబడి శైవ మత ప్రాశస్త్యము, శివభక్తులయొక్కయు గణములయొక్కయు మహిమలు వర్ణింపబడుటయే కాని వేరు వస్తువేమియు లేదు. ఇందలి కవితాశైలి నన్నయ కవితాశైలి వలె సంస్కృతపద జటిలమై, భావగాంభీర్యమునకు దగిన శబ్దాడంబరము గల్గి, పామరులకు గ్రాహ్యాము కాకపోయినను, సామాన్యపండితులకు సుబోధకముగ నున్నది. ఈతడు మల్లికార్జున శతకమునుగూడ రచించి నట్లు గొన్ని పద్యముల వలన గ్రహింపనగుచున్నది. ఇవి కాక యీతడు సంస్కృత కర్ణాట భాషలయందుగూడ మరికొన్ని గ్రంథములను రచించినట్లు తెలియుచున్నది.

శైవాంధ్ర వాఙ్మయమునకు పండితారాధ్యుడు బ్రహ్మ వంటివా డగుచో పాల్కురికి సోమనాథుడు విష్ణువువంటి వాడని చెప్పవలయును. ఈతడు క్రీ. శ. 1250 - 1320 మధ్యకాలమువాడు. సోమన ఆంధ్ర శివకవులలో నగ్రేసరుడు ; సంస్కృతాంధ్ర కర్ణాట భాషానిష్ణాతుడు ; మహా ప్రతిభావంతుడు. ఈతని వైదుష్యమును, కవితాశక్తియు నిరుపమానములు. పరమతములను ఖండించి స్వమతము నుద్ధరించుటకు ప్రమాణపూర్వక గ్రంథములగు సోమనాథ భాష్యము, రుద్రభాష్యము (సంస్కృతము), చతుర్వేద సారము, ననుభవసారము మొదలైనవాని నితడు రచించెను. బసవేశ్వరునిపై భక్తితో బసవస్తోత్రములను, వృషాధిప శతకము, చెన్నమల్లు సీసములు, బసవోదాహరణము, పంచ ప్రకార గద్యాదికములు, అష్టకములు మొదలగు లఘు కృతులను మొదట గావించెను; తరువాత జనసామాన్యమునకు సులభగ్రాహ్యామై, మతప్రచారము బాహాటముగా సాగుట కుపయోగించి, జనవశీకరణమునకు తోడ్పడుటకు లఘువును జాతీయమునగు ద్విపదచ్ఛందమున బసవ పురాణ, పండితారాధ్య చరిత్రలను, మల్లదేవీ పురాణమును రచించెను. కర్ణాటులలో గూడ ప్రచారము గల్గుటకై కన్నడ భాషలో కొన్ని గ్రంథములను వ్రాసెను. బసవపురాణ, పండితారాధ్య చరిత్రములు రెండును సంస్కృత కర్ణాటక భాషలలోని కనువదింపబడినవి. పాల్కురికి సోమనాథుని కవిత ప్రారంభమున వృత్తరచనతో నన్నయశైలి ననుకరించుచు వచ్చి చివరకు దేశి సంప్రదాయానుగుణముగ ద్విపదలో జానుతెలుగులో పరిణమించినది. శైలి కథాసందర్భమును బట్టి బహురీతుల నడచినది.

పాల్కురికి సోమనాథుని తర్వాత పేర్కొనదగినవారు పిడపర్తికవులు. సోమనాథుని ప్రేరణమున, మంత్రియగు ఇందులూరి అన్నయ మూలమున కాకతి ప్రతాపరుద్రునిచే డోకిపఱ్ఱగ్రహారము బడసిన శివరాత్రి కొప్పయ్య సంతతి వారు వీరు. కాన వీరు సోమనాథుని శిష్యపరంపర లోనివారై యాతని గ్రంథములను ప్రచారములోనికి దీసికొని వచ్చుటయేకాక, శైవగ్రంథము లనేకము రచించి, తన్మతమునకు గురుపీఠ మలంకరించిరి. ఈ కొప్పయ్యకు నాల్గవ తరమువాడైన పిడుపర్తి బసవన క్రీ. శ. 1475 - 1500 మధ్యకాలమున పిల్లనయనారు కథ, బ్రహ్మోత్తర ఖండము, వీరశైవ దీక్షాబోధ అను మూడు ద్విపదకృతులను రచించెను. ఇందు మొదటిదగు పిల్లనయనారు చరిత్ర ప్రస్తుతము గానరాదు. ఈ కథ బసవ పురాణ షష్ఠాశ్వాసమున క్లుప్తముగ వర్ణింపబడినది. బసవన దీనినే ప్రపంచించి ప్రత్యేక కావ్యముగ వ్రాసియుండును. రెండవదగు బ్రహ్మోత్తరఖండము స్కాందపురాణాంతర్గత ఖండములలో నొకటి. మూడవదగు వీరశైవ దీక్షాబోధము సంస్కృత గ్రంథము ననుసరించి కన్నడ భాషలో క్రీ. శ. 1170 ప్రాంతమున కెరయ పద్మరసు అను కవి రగడలలో రచించిన దీక్షాబోధమను గ్రంథమునకు మూడాశ్వాసముల తెలుగు అనువాదము. సూర్యవంశక్షత్రియుడును, భారద్వాజ గోత్రుడును, వీరశైవాచారధౌరేయుడునైన వీర భూవరుడు ప్రార్థింపగా కవి దీనిని రచించి యాతని కంకిత మిచ్చెను. ఇది గురుశిష్య సంవాదరూపమున వీరశైవ మత తత్త్వమును, గురుశిష్యలక్షణమును దీక్షావిధానాదికమును దెలుపు నుత్తమ గ్రంథము. వీరభూపాలుని కాలముగాని, యాతడు పాలించిన దేశముగాని గ్రంథమువలన దెలియ రావు. తత్కాలపు వీరశైవ మతస్వరూపమును దెలుపు గ్రంథములలో నిది ప్రధానమైనది. దీనివలన వీరశైవ సంప్రదాయము లెల్ల విశదము కాగలవు.

పిడుపర్తి బసవని ప్రేరణమున నాతని జ్యేష్ఠపుత్రుడగు సోమనాథుడు, పాల్కురికి సోమనాథుని ద్విపద బసవ పురాణమును పద్యరూపముగ రచించి యాతనికే యంకిత మిచ్చెను. ఈతడు పాల్కురికి సోమనాథుని ద్విపదలనే పద్యములలో గూర్చి మూలమున కన్యూనాతిరిక్తముగ వ్రాసెను. పిడుపర్తి సోమనాథుని ద్వితీయకృతి ప్రభులింగ

లీలలు. ఇది కన్నడ భాషలో 1450 ప్రాంతమున చామరసు అనుకవి రచించిన వచనములనుబట్టి ద్విపదలలో తెలుగున నీతడు గూర్చిన యుత్తమ కావ్యము. బసవేశ్వరుని కాలమున మైసూరు ప్రాంతమున వనవాసి పరిసరములందు అల్లమప్రభువను విరక్త శరణమూర్తి యవతరించెను. కన్నడభాషలో అల్ల, ఇల్ల పదములు శూన్యార్థబోధకములు. ఈ యల్లమప్రభుని లీలలను ప్రధానముగ జేసి, యితర శైవభక్తుల కథలుగూడ ప్రాసంగికములుగ కలిపి కవి దీనిని రచించెను. ఇది యిరువదియైదు గతులు గల్గి యైదాశ్వాసములలో నున్నది. దీనిని సోమనాథకవి నెల్లూరి రామలింగయ్యయను వైశ్యశిఖామణి ప్రేరణమున, నాతని గురువగు సిద్ధేశ్వరుని స్తుతిపూర్వకముగ తెలుగున రచించెను. ఈతని రచన తేటతెలుగు పదములతో మృదుమధురముగా నున్నది. పిడుపర్తి సోమన రచించిన ద్విపద ప్రభులింగ లీలల నతని సోదరుడగు పారనార్యుని పుత్రుడగు బసవప్ప యనునాతడు పద్యరూపమున గూర్చెను. ఇది చల్లపల్లి శాసనుడగు చల్లపల్లి మల్లనార్యున కంకితము సేయబడినది. ద్విపద పద్య బసవపురాణముల సాదృశ్యమే ఈ ద్విపద, పద్య ప్రభులింగ లీలలకును గలదు.

శివకవులు కానివారుకూడ కొందరు ప్రభులింగ లీలలను పద్యరూపమున వ్రాసిరి. వారిలో కొచ్చెర్లకోట రామయ్య యొకడు. ఈతడు పదునారవ శతాబ్దము తర్వాతివాడు. ఈ కవి తనకృతిని గోదావరీ మండలమందలి పాలకొలని గ్రామమున వెలసిన రామేశ్వరస్వామి కంకితమిచ్చెను. ఈతని కవిత్వశైలి సామాన్యముగ నుండును. ఈ గ్రంథ మముద్రితము. ఈ కథనే చంపువుగా రచించిన మరియొక స్మార్త కవి నడకుదుటి రామయ్య. (క్రీ. శ. 1821 - 1887). ఈత డార్వేల నియోగి. ఈతడు గోదావరిమండలమున రామచంద్రపురం తాలూకాయందలి శహాపురమునకు కరణముగా నుండి 1885 లో నీ కృతిని రచించెను. ఈతని కవిత్వమున నక్కడక్కడ దోషము లున్నను శైలి రసవంతముగ నున్నది. ప్రభులింగలీలలందలి యేకదేశ కథను 'మాయా విలాస' మనుపేర గంజాము జిల్లా యందలి తులగాన గ్రామనివాసి తులగాన నీలకంఠ కవి 1700 ప్రాంతమున నాలుగాశ్వాసముల చంపువుగా రచించినాడు. ఇందు కొన్ని దోషము లున్నను శైలి రసవంతముగ నున్నది.

పాల్కురికి సోమనాథుని ద్విపద బసవపురాణమునే మహాదేవుడను మరొకకవి చంపువుగా రచించినాడు. దొరికిన దీని ప్రతి యసంపూర్ణముగ నున్నది. ఇందు కృత్యాది పద్యములు లేవు. ప్రథమాశ్వాసమున కొంతభాగమునుండి సప్తమాశ్వాసము చివరవరకుమాత్ర మున్నది. ఇది బెజవాడయందలి మల్లికార్జునస్వామి కంకితమీయబడినది. గ్రంథాంత్యగద్యయం దీతడు శ్రీపతి పండితారాధ్య సింహాసనారూఢుడని తెల్పుకొనుటచే నాతని వంశము వాడని యెన్నదగును. ఈతని కవిత్వము మనోజ్ఞముగ నున్నది. ఈ విధముగనే పాల్కురికి సోమనాథుని పండితారాధ్య చరిత్రమును గూడ చంపువుగా శ్రీనాథుడు రచించెనని పిడుపర్తి సోమనాథుని బసవ పురాణమునుబట్టి తెలియుచున్నది. కాని యది యింతవరకు గానరాదు. ఇవిగాక ఇగడూరు రుద్రకవియు, పుల్లకవియు పండితారాధ్య చరిత్రములను రచించినట్లు తెలియుచున్నది. బసవపురాణకథనే క్లుప్తముగా బసవవిజయ మనుపేర చంపూ ప్రబంధరూపమున క్రీ. శ. 1750 ప్రాంతమున తుమ్మలపల్లి నాగభూషణుడను కవి మూడాశ్వాసములలో వ్రాసినాడు. ఈ గ్రంథ కథా విషయమును ప్రతాపరుద్రునకు తన్మంత్రి యగు శివదేవయ్య చెప్పినట్లుగా నున్నది. ప్రతాపరుద్రుడు సోమనాథుని తన యాస్థానమునకు బిలిపించి సత్కరించినట్లిందుగలదు. ఈతని కవిత్వ ముత్తమమైనదికాక, వ్యాకరణ విరుద్ధములైన ప్రయోగములతో నున్నది. బసవ విజయమందలి కథనే ద్విపదరూపమున మూడాశ్వాసములలో నల్లనగండ్ల నాగనారాధ్యుడను కవి బసవ విజయమను పేరుతోడనే వెలువరించెను. వీ రిరువురిలో నొక రింకొకరికి మార్గదర్శకులై యుండవచ్చును. ప్రఖ్యాత బసవేశ్వరునివలెనే వీరశైవ మతప్రచార మొనర్చిన భక్తిపరుడు మరియొకడు బసవేశ్వరు డనువాడు గలడు. కన్నడ వాఙ్మయములో 'మల(లె) బసవపురాణ' మను గ్రంథమును, 'మలెయ బసవరాజ'నే వ్యక్తియు నుండుటచే నతడే తెలుగున 'మలిబసవన'గా వ్యవహరింపబడినాడు. ఈతని చరిత్రను బచ్చు సిద్ధకవి ద్విపదలో నేడాశ్వాసముల కావ్యముగా రచించినాడు. ఇం దితర భక్తుల కథలుగూడ ప్రాసంగికముగా చేర్పబడినవి. బసవేశ్వరుని సోదరియైన నాగాంబకు కుమారస్వామి యంశమున చెన్న బసవేశ్వరుడు పుట్టి వీరశైవ మతోద్ధరణ విషయమున మేనమామకు బాసటగా నుండెడివాడు. ఈతనిపేర క్రీ.శ. 1580 ప్రాంతమున విరూపాక్ష పండితుడు కన్నడమున చెన్న బసవపురాణమును రచించెను. రేణుకు డగస్త్యున కీ పురాణమును చెప్పినట్లు దీన నున్నది. దీనిని క్రీ.శ. 1650-1700 మధ్య కన్నడకృతి ననుసరించి అత్తలూరి పాపయకవి తెలుగున వ్రాసెను. ఇది యైదాశ్వాసముల కావ్యము. ఈ కవి రచన మనోహరముగ నున్నది.

పైన వివరించిన పురాణములుగాక మాహాత్మ్యములు: కొన్ని స్థలములయు, వస్తువులయు మాహాత్మ్యములను

దెలుపునవి - యీ వాఙ్మయమున నున్నవి. శైవులకు విభూతి, రుద్రాక్ష, పంచాక్షరీమంత్రము, గురువు, లింగము, జంగమము, పాదతీర్థము, ప్రసాదము అను నష్టావరణ ములు విశిష్టములు. వాని మాహాత్మ్య వర్ణనాదికములు సాధారణముగ శైవవాఙ్మయమం దంతట నుండును. అమలాపురపు సన్యాసియను కవి క్రీ. శ. 1700 - 1760 మధ్యకాలమున రుద్రాక్షఫల మాహాత్మ్యమును మూడా శ్వాసములలో పద్యకావ్యముగ రచించినాడు. ఈతనిది విశాఖమండలములోని పాలతేరు గ్రామము. కులమున కీతడు కుమ్మరియైనను మంచి పండితుడై, వేదాంత జ్ఞానియై, పలువురు బ్రాహ్మణులు తనకు శిష్యులుకాగ చక్కని ధారాశుద్ధితో కవిత్వమును చెప్పినవాడు. ఈతని కవిత్వ ముత్తమ లక్షణములతో నొప్పుచున్నది. క్రీ. శ. 1775 - 1800 ప్రాంతమున కొలుకలూరి వీరన యనుకవి బ్రహ్మోత్తర ఖండమునగల విభూతి, రుద్రాక్ష మాహాత్మ్య ములను ద్విపదరూపమున నాంధ్రీకరించి, బెజవాడలో నద్భుత మహిమలు జూపిన శ్రీపతి పండితారాధ్యుల కంకిత మిచ్చెను. ఈ గ్రంథ మసంపూర్తిగ నున్నది. ఈతడు తాను శ్రీపతి పండితవంశ్యుడనని తెలుపుకొనెను. క్రీ. శ. 1750 ప్రాంతమున రెంటాల వీరనారాధ్యుడను కవి పంచాక్షరీ మాహాత్మ్యమును రచించి కందుకూరి వీరేశలింగమున కంకిత మిచ్చెను. ఇది యైదాశ్వాసముల గ్రంథము. ప్రారంభ మున గొంతభాగము పోయినది. కవిత్వము సామాన్య ముగా నుండును. కవి పట్టిసక్షేత్రమందలి వీరభద్రస్వామి భక్తుడు. అక్కనార్యుడను విశ్వబ్రాహ్మణకులజుడు ఈశానసంహిత ననుసరించి శ్రీనాథుని వలెనే శివరాత్రి మాహాత్మ్యము నైదాశ్వాసముల గ్రంథముగ రచించెను. ఈతని కవితాశైలి సరసముగా నుండును. మాధ్వుల కేకాదశీవ్రత మెట్లు ముఖ్యమైనదో శైవులకు సోమవార వ్రత మంత ప్రాధాన్యమైనది. తుమ్మలపల్లి నాగభూషణ కవి సోమవార మాహాత్మ్యమును చంపువుగా నేకాదశా శ్వాసములలో రచించెను. ఈ విషయమునే శ్రీగిరి మల్లికా ర్జునుడను కవి ద్విపదలో వ్రాసి, మాఘసోమవార మితర సోమవారములకంటె శ్రేష్ఠమైనదని ప్రతిపాదించినాడు. ఇక బ్రహ్మోత్తర ఖండమునందలి సోమవార మాహాత్మ్య విషయమును సీమంతినీకథ యను పేరుతో ఈమని వీర భద్ర కవియు, కొలనుపాక మాహాత్మ్యమును చితారు గంగాధరకవియు ద్విపదలో రచించిరి.

శ్రీకృష్ణదేవరాయల కాలమందలి యాంధ్రకవులు, పురాణాంతర్గతములైన యుపాఖ్యానములను, కథలను గ్రహించి, వానిని ప్రపంచించి ప్రబంధములుగా రచించి నట్లుగ బసవపురాణాది శైవపురాణాంతర్గత కథలను గైకొని తర్వాతి శివకవులు కొందరు మూలకథను విపులీ కరించి వర్ణనలు చేర్చి చంపూ, ద్విపద రూపములలో ప్రబంధ ములుగ రచించిరి. అట్టి కథలలో ముఖ్యముగ రసవంతము లైనవి శివలీలలైన గంగావివాహము, భల్లాణచరిత్ర, సిరియాళచరిత్ర మొదలైనవి. శివభక్తుడైన యుద్భటుడు సుప్రసిద్ధ సంస్కృతకవియు, కవిపోషకుడును, ధారానగరా ధీశ్వరుడు నగు ముంజభోజుని దీక్షాగురువట. ఈతని చరిత్రము పాల్కురికి సోమనాథుని పండితారాధ్యచరిత్ర మున సంగ్రహముగ గలదు. దీనినే 16 వ శతాబ్దమున తెనాలిరామకృష్ణకవి యను నామాంతరము గల సుప్రసిద్ధ రామలింగకవి విపులీకరించి చంపూప్రబంధముగ రచించి నాడు. ఇందలి రచన ప్రౌఢముగనే యున్నది. క్రీ. శ. 15 వ శతాబ్దమున శివలెంక కొమ్మన యను కవి శివలీలా విలాస మను కావ్యమున శివలీలలను హృద్యముగ వర్ణించి నాడు. నిశ్శంక కొమ్మన యని ఈతని నింతవరకు వ్యవహ రించుచు వచ్చిరి. నిశ్శంకయ్య ఈతని తాత. ఈతని కవితా శైలి సరసముగ నుండును. ఈ కావ్యమున మూడా శ్వాసములు మాత్రమే లభించినవి. క్రీ. శ. 1756 ప్రాంత మున కూచిమంచి తిమ్మకవి కూడ మరియొక శివలీలా విలాసమును పద్యకావ్యముగ రెండాశ్వాసములలో రచిం చెను. ఇందలి కథావృత్తము గంగావివాహము. గంగ యొక పల్లెవానికి దత్త పుత్రియై పెరిగి శివుని వివాహ మాడిన ట్లిందు వర్ణింపబడినది. ఈ కావ్యము శృంగార రసపూరితమై, చతుర సంభాషణయుతమై, రసవంతముగ నుండి ఈ కవి కావ్యము లన్నింట రచనలో శ్రేష్ఠముగ నున్నది. ఈ కవియే రాజశేఖరవిలాసమను పేరితో భల్లాణరాజు చరిత్రను మూడాశ్వాసములలో చంపూ కావ్యముగా రచించినాడు. ఇది ఈతని కవిత్వ ప్రారంభ స్థితిలో రచింపబడుటచే గాబోలు గొన్ని కవిత్రయేతర ప్రయోగములును, పూర్వకవుల యనుకరణములు నందందు గనుపడుచున్నవి. ఈ కథనే గ్రహించి మల్లవరపు వాతే శ్వరు డను కవి 1700 ప్రాంతమున నైదాశ్వాసముల పద్య కావ్యముగ రచించి కృష్ణామండల మందలి మల్లవరము లోని నాగేశ్వరస్వామికి అంకిత మిచ్చెను. కవి ఈ కావ్య మున శైవమత ప్రధానములైన విభూతిధారణ ఫలాది విషయములను గూర్చి కొన్ని చమత్కార కల్పనలు గల ఘట్టములను జొనిపినాడు. ఈతని కవితాశైలి రసవంతమై ధారాశుద్ధి గలిగియుండుటచే వివిధ కవులు రచించిన భల్లాణ చరిత్రములలో నిది యుత్తమ మైనదని చెప్ప వచ్చును. ఈ చరిత్రమునే కొలకలూరి వీరన యను కవి

గూడ క్రీ. శ. 1775-1800 మధ్యకాలమున మూఁడాశ్వాసములలో పద్యకృతిగ రచించి ఈశ్వరాంకిత మొనర్చినాడు. ఈ కవినే పోచిరాజు వీరన యని గూడ వ్యవహరింతురు. ఈత డనేక కావ్యములు రచించినట్లు గనబడుచున్నది. కాని యవి ప్రస్తుతము గానరావు. ఈతని కవిత సరసముగా నుండును. భల్లాణుని కథనే ద్విపదరూపమున బసవన్న యను నతడును, నింబాద్రిదా సనునతడును రచించినట్లు తెలియుచున్నది. వీని ప్రతులు కాకినాడ యందలి యాంధ్రసాహిత్య పరిషత్పుస్తకభాండాగారమందు మాత్రమే యున్నవి. మఱియొక ద్విపదరూప భల్లాణచరిత్రకర్త జాలరికులజుఁడైన చిత్తారు గంగాధరుడు. ఈతనిని పెనువెల్ల గంగాధరు డని గూడ నందురు. పెనువెల్ల యీతని నివాసస్థలమై యుండును. ఈతని రచన చాల పేలవముగను, నీరసముగను నున్నది. ఇతడు గంగావివాహమును, సిరియాళ చరిత్రనుగూడ ద్విపదలలో రచించినాడు. హరవిలాసములో ప్రథమాశ్వాసమున రసవంతముగా శ్రీనాథుడు రచించినది సిరియాళ చరిత్రమే. ఈ కథ పాల్కురికి సోమనాథుని బసవపురాణములో గలదు. దీనినే ప్రత్యేక పద్యప్రబంధముగా గరికిపాటి తమ్మయ్య మూఁడాశ్వాసములలో రచించెను. ఈతని కవిత్వము సామాన్యముగా నున్నది. పోలిసెట్టి లింగన యను కుమ్మరకులజుడు నవచోళ చరిత్ర నైదాశ్వాసములలో ద్విపదగా వ్రాసి కరికాలాది నవచోళుల శైవాచారధౌరేయత నందు వర్ణించినాడు. మరింగంటి వెంకటార్యుడు మల్లారిచరిత్ర మను పేరితో కర్ణభక్తుల కథను స్కాంద పురాణమునుండి గ్రహించి ద్విపదలో రచించెను. ఎడపాటి యెఱ్ఱన రచించిన మల్హణచరిత్ర మూఁడాశ్వాసముల పద్యకావ్యము; పండితారాధ్యచరిత్ర దీనికి మూలము. ఇందు సంస్కృత కవియగు మల్హణ కవికిని, పుష్పగంధి యను వేశ్యకును గల ప్రణయగాథ వర్ణితము. ప్రాసంగికముగ శ్వేతిని కథకూడ గలదు. ఇందు శృంగార మతిగా వర్ణింపబడినను కవియొక్క భావనాశక్తిని, కల్పనాచాతుర్యమును ఈ కావ్యము చాటుచున్నది; రచన సామాన్యము. భక్తి మహత్త్వమును చాటుటకు, అజ్జరపు పేరయలింగ మను కవి యొడయనంబి విలాసము నారాశ్వాసముల పద్యకావ్యముగ రచించెను. ఇందు ఒడయనంబి యను శైవునియు, పరమనాచి యను వేశ్యయు చరిత్రలు గలవు. పార్వతీపరమేశ్వరులే యొడయనంబి పరమనాచులుగ నవతరించిరట. సురాభాండేశ్వర మను నేకాశ్వాస ప్రబంధము గట్టుప్రభుకృతము (1800 ప్రాంతము). ఇదియు శృంగారరస ప్రధానమైనదే. ఇది కాశీక్షేత్ర మాహాత్మ్యమును దెల్పును. దీనికి స్కాందము నందలి కాశీఖండాంతర్గత సురాభాండేశ్వరోపాఖ్యానము మూలము. గట్టుప్రభువు కవనశైలి ద్రాక్షాపాకమున నుండి లోకోక్తులతో గూడి యుండును. ఈ కథనే మేడూరి అప్పనకవి వరుణాత్మజా కుంభేశ్వర మను పేరితో రెండాశ్వాసముల పద్యకావ్యముగా రచించెను. దీనినే ద్విపదలలో రావులపురము గురవయ్యయు, పులిగడ్డ నారనమంత్రియు సురాభాండేశ్వర మను పేరుతోడనే రెండు కావ్యములు ప్రత్యేకముగ రచించిరి. సిద్ధనాథకృత సంస్కృత రేణుక విజయమును దేవిడి సంస్థానకవి యగు నేమాని సూర్యప్రకాశ కవి ప్రౌఢశైలిలో నాంధ్రీకరించెను. ఇందు శైవమతాచారపరుడైన రేణుకుడు వివిధ కాలములలో వేర్వేరు రూపములతో నవతరించి శ్రీరామరావణాదులకు గూడ శైవభక్తి నుద్బోధించినట్లును, కలియుగంబున కొలని పాకయం దుద్భవించినట్లును గలదు. సంస్కృతమునందలి వీరశైవమత సిద్ధాంతాచార ప్రతిపాదక గ్రంథములను వీరశైవమునను సరించి కొందరాంధ్రమున రచించిరి. నీలకంఠనాథ విరచిత సంస్కృత వీరమాహేశ్వరాచార సంగ్రహమును పర్వతమంత్రి లింగన పది యాశ్వాసముల ద్విపద గ్రంథములో విభూతి, రుద్రాక్ష, పంచాక్షరీ, హరనామ, శివరాత్రిమహిమ, శంఖచక్రోత్పత్తి, మార్కండేయచరిత్ర, విష్ణుశాపమోచన, శరభేంద్రమహిమ, వ్యాసశిక్షాది విషయముల నాంధ్రీకరించెను. సంస్కృతమున శివాగమముల ననుసరించి శివాచారసంగ్రహ మనుదానిని కుంటముక్కల తిరుమలనాథుడు మూఁడాశ్వాసముల పద్యగ్రంథముగ శివపూజా విధానాద్యాచారములనుగూర్చి రచించెను. ఇందు గురుశిష్య లక్షణము, నైవేద్య కర్పూర తాంబూల ప్రదక్షిణ సమర్పణమును, లింగార్చనాకాలవిశేషము, లింగోదక, పాదోదక, ప్రసాదోదక మాహాత్మ్యములు, ప్రసాద సేవార్హానర్హ లక్షణము, షట్స్థల ప్రకారము, సంసార హేయస్థలము మొదలైనవి వివరింపబడినవి. క్రీ. శ. 1723 ప్రాంతమున గోకర్ణమఠాధిపతి శిష్యుడగు శివరామలింగకవి వీరశైవాచార సంగ్రహమును స్కాందపురాణాంతర్గత శంకరసంహిత ననుసరించి మూఁడాశ్వాసముల పద్యకృతిగా రచించినాడు. శివయోగి శివాచార్యుని సంస్కృతకృతి కనువాదముగా చెన్నాప్రెగడ నాగేశ్వర కవి శైవసిద్ధాంతశిఖామణి యనుదానిని నాల్గాశ్వాసముల ద్విపదగ్రంథముగ రచించెను. ఇందు దీక్షాప్రకారము, లింగధారణ మహత్త్వము, భూతిధారణము, రుద్రాక్షధారణము, శైవ పంచాక్షరీమహిమ భక్తిప్రియాచరణము, గురులింగపూజ, జంగమపూజ, ప్రసాదలక్షణము, మహే

శ్వరస్థలము, ప్రసాదస్థలము, ప్రాణలింగస్థలము, శరణస్థలము మొదలైనవి వివరింపబడినవి. శివలెంక కొమ్మన వీరశైవాచార మను గ్రంథమును రచించెనుగాని యది ప్రస్తుతము గానరాదు. శివాగమ విషయముల ననుసరించి నెప్పల్లె అప్పనార్యుడు శైవాగమ శిఖామణి యను దానిని నైదాశ్వాసముల పద్యకృతిగా వ్రాసెను. ఇందు భస్మ, రుద్రాక్ష, శివలింగ మాహాత్మ్యములును, తద్ధారణమువలన గలుగు ఫలములును, శివపూజాదుల మాహాత్మ్యములును చెప్పబడినవి. క్రీ. శ. 1390 ప్రాంతమున శైవమత రహస్యములను దెలుపుచు కొలని గణపతిదేవుడు శివయోగసార మను పద్యకృతిని రచించినాడు. ఇట్టిదే సోమనరచిత గురుబోధ యను ద్విపదకృతి. సిద్ధనాథు డను కవి షట్స్థల దర్పణ మను గ్రంథమును 26 సీసపద్యములలో తారావళిగ వ్రాసి యందు శైవసిద్ధాంతమును ప్రతిపాదించినాడు. రేవణ, సిద్ధన లనువారు ప్రభుదేవర వాక్యమను పేరితో అల్లమ ప్రభువును, సిద్ధరామయయు శిష్యులకు చేసిన తత్త్వోపదేశము నాంధ్రీకరించిరి. సిద్ధేంద్రయోగి విరచిత యోగీశ్వరవిలాస మను ద్విపదకృతిలో అల్లమప్రభువు అక్కమహాదేవి కుపదేశించినట్లుగా వీరశైవ సిద్ధాంతములు వర్ణింపబడినవి. గణపనారాధ్యుడు శైవవేదాంతమును మనోబోధ యను మంజరీ ద్విపదకృతిలో వ్రాసెను. షట్చక్ర నిర్ణయము, షడ్విధలింగవివరణము, షట్స్థల నిర్ణయము, షట్స్థల జ్ఞానము మొదలైనవి యత్కర్తృకములో తెలియని గ్రంథములు ప్రాచ్యలిఖిత గ్రంథాలయములో గనబడును.

ఆంధ్రమున క్రీ. శ. 12 వ శతాబ్దికి పూర్వము శతకము లున్నట్లు గానరావు. మల్లికార్జున పండితారాధ్యుడే ప్రథమాంధ్ర శతకకర్త యని చెప్పవలయును. క్రీ. శ. 1242 వ సంవత్సరమున యథావాక్కుల అన్నమయ్య సర్వేశ్వర శతకమును శైవమత సంప్రదాయానుగుణముగ, భక్తిభావ ప్రధానముగ వృత్తములలో రచించెను. ఈతని కవిత ధారాశుద్ధి గలిగి హృద్యమై నిర్దుష్టముగ నున్నది. ఇందు కవి మహిమ్న, మల్హణ, అనామయ, హలాయుధ స్తవములనుండియు భావములను గ్రహించెను. కాలక్రమము ననుసరించి దీని తరువాతి శతకము పాల్కురికి సోమనాథుని వృషాధిప శతకము. ఇందలి కొన్ని పద్యములు వివిధ భాషలలోను, మణిప్రవాళ శైలిలోను వ్రాయబడినవి. క్రీ. శ. 1750 ప్రాంతమున గోదావరి మండలము వాడైన చెన్నాప్రెగ్గడ నాగరాజు మల్లంపల్లి రామలింగ గురువుచే దీక్షను స్వీకరించి, లింగధారియై గణసౌజవ్యాఖ్యాన శతకమును రచించెను. ఈతని కవితా శైలి సాధారణముగ నున్నది. ఇతని తర్వాత దెందులూరి పద్మనాభుని అల్లమప్రభు శతకమును, శివరామకవికృత సోమేశ్వర శతకమును, శ్రీగిరి విరూపాక్షుడు రచించిన శ్రీ కాళహస్తి లింగ శతకమును, గంగాధరకవి చెప్పిన చెన్నమల్లేశ్వర శతకమును, పూదోట సోమనారాధ్యుల బసవలింగ శతకమును, గ్రంధి రామలింగకవికృత చోడలింగ శతకమును శైవ వాఙ్మయమున పరిగణనీయములు.

శివకవులు దేశిసంప్రదాయము ననుసరించి, సంగీత సాహిత్య మిశ్రమముగ యక్షగానములనుకూడ రచించిరి. అట్టివానిలో మొదట పేర్కొనదగినవి రెగళిగ నిమ్మనాథుడు రచించిన గురునంబి చరిత్ర, నిజలింగ చిక్కయ కథలు. గురునంబిచరిత్ర ఒడయనంబి యను నామాంతరముగల సుందరమూర్తినయనా రను భక్తుని చరిత్రము (ఒడయనంబి విలాసమే). సిరియాళ చరిత్రమును చిరుతొండ భక్తికథానిధాన మను పేరితో వాలె కోటయ్య యక్షగానముగా రచించి యేకామ్రేశ్వరున కంకితమిచ్చెను. అనుమోద సన్యాసి యను నతడు బసవకల్యాణము నేకాశ్వాసములో యక్షగానముగ రచించెను. బసవ మహిమామృత మను పేరితో కానూరి వీరభద్రకవి యక్షగానమును వ్రాసి సోమేశ్వరస్వామి కర్పించెను. బాలపాపాంబ యను కవయిత్రి అల్లమప్రభులింగలీలలనుండి గ్రహించి శివభక్తురాలైన అక్కమహాదేవి చరిత్రను యక్షగానముగ రచించి కాశీవిశ్వనాథున కంకిత మిచ్చెను. లింగమూర్తి యను కవి శివపారిజాత మను యక్షగానమును రచించెను. శివుడు గంగను వివాహమాడుట, గంగాగౌరుల సాపత్న్య వివాద విషయము లిందు గలవు. రుక్మిణీ సత్యభామల సాపత్న్య వివాద కథయే పారిజాతాపహరణ కథ యైనట్లుగ నిది శివపారిజాతమైనది. ఈ కథనే పెదకెంపరాయడను కవిగూడ గంగాగౌరీవిలాస మనుపేర నొక యక్షగానముగ వ్రాసినాడు. భల్లాణ కథను బుక్కమ సాంబయ, కుమ్మరి అలపాక పెద్ది యనువారలు యక్షగానములుగ వ్రాసిరి. గుబ్బిము చినకపోతయ్యకృత వీర చోడవ్వచరిత్ర, శివలెంక మల్లనారాధ్యకృత వీరభద్ర విజయములును పేర్కొనదగిన యక్షగానములు.

ఇవికాక ఈ వాఙ్మయమున గేయములు, దండకములు, స్తుతులు మొదలైన లఘుకృతు లనేకము గలవు. శంకర వచనములకు కర్త ఎవరో తెలియదు. గార్లపాటి లక్ష్మయ్య రచించిన ఏగంటివారి వచనములు, తన గురువగు ఏగంటి నంజయ్య పేరితో నున్నవి. గుబ్బిము కపోతయ్య దారుకావనక్రీడను సువాలపాటగ రచించి రొంపిచర్ల శంకరేశ్వరున కర్పించినాడు.

శి. రా. శా.

**శ్యామశాస్త్రి,** (క్రీ. శ. 1763 - 1823) : వీరు తంజావూరు జిల్లాలో తిరువారూరు అను గ్రామమున జన్మించిరి. వీరి తండ్రి విశ్వనాథయ్యరుగారు. వీరిని తల్లిదండ్రులు ముద్దుగా 'శ్యామకృష్ణా' అని పిలుచుచుండిరి. అందువలననే వీరు తమ కృతులకు 'శ్యామకృష్ణ' ముద్ర నిడిరి. వీరు తెలుగునందును, సంస్కృతమునందును పండితులు. తమ మేనమామయొద్ద సంగీతమున ఆరంభ పాఠముల నభ్యసించిరి; పదునెనిమిదవయేట వీరు తలిదండ్రులతో తంజావూరు చేరుకొనిరి; అచట ఆంధ్ర పండితులైన సంగీత స్వామి అను సన్యాసి కాశినుండి దక్షిణ హిందూదేశ యాత్రకు వచ్చి, అది చాతుర్మాస్యము గాన తంజావూరిలోనే ఆ నాలుగు నెలలు ఉండిపోయిరి. అప్పుడు ఒక దినమున శ్యామశాస్త్రిగారి యింటిలో వారికి భిక్ష జరిగెను. భిక్ష జరిగిన వెనుక శాస్త్రిగారి తండ్రి తన కుమారుని ఆ సన్యాసికి చూపి ఆశీర్వదింప గోరెను. శ్యామశాస్త్రిని చూచిన వెంటనే ఇతడు గొప్ప పండితుడు కాగలడని సంగీత స్వామి తెలిసికొనెను. అప్పటి నుండి శ్యామశాస్త్రి తాళశాస్త్రములోను, రాగశాస్త్రములోను, అఖండ పండితులై సంగీతస్వామి యొద్ద సంగీతవిద్య నభ్యసించెను. చాతుర్మాస్యము కాగానే సంగీత స్వామి కాశికి వెళ్ళునపుడు గాంధర్వవిద్యా గ్రంథముల నిచ్చి, 'నీవు సంగీత శాస్త్రమును సమగ్రముగా నభ్యసించితివి. తంజావూరు ఆస్థాన విద్వాంసుడైన పచ్చి మిరియము ఆది అప్పయ్యగారి సంగీతమును తరచు వినుచుండుము' అనిచెప్పి వెడలిపోయెను. గురువునాజ్ఞ ప్రకారమే శాస్త్రిగారు ఆది అప్పయ్యగారితో స్నేహము చేసికొని వారి గానమును తరచు వినుచుండిరి. ఆది అప్పయ్యగారికి శాస్త్రిగారనిన అమితప్రేమ, భక్తియు నుండెడిది. ప్రేమతో 'కామాక్షి' అని పిలుచుటయు కలదట.



చిత్రము 297. శ్యామశాస్త్రి

వీరు మధురకు వెళ్ళినప్పుడు మీనాక్షిదేవిని స్తుతించుచు తొమ్మిది కృతులు పాడిరి. వీరి రచనలు కదళీపాకములు. వీరికి ఆనందభైరవి రాగముపై అనురాగ మెక్కువ యున్నట్లు కాన్పించును. ఆనందభైరవిలో చాల కృతులను వీరు రచించిరి. సాధారణముగ చాపు తాళములోనే కృతులకు స్వరజతులను వీరు రచించినట్లు తెలియుచున్నది. వీరికి శిష్యులు చాల తక్కువ. కనుకనే వీరి కృతులు ఎక్కువగా ప్రచారము కాలేదు. ద్వా. పా.

**శ్రీనాథుడు :** భారత మహాకవుల తరువాత ఆంధ్ర కవితాప్రపంచములో నొకవెలుగు వెలిగినవాడు శ్రీనాథ కవి. రామరాజభూషణు డెంత శ్లేషకవితాప్రియుడైనను అక్షరాక్షర సత్యమునే ఉగ్గడించినా డనిపించును. 'బహుళాంధ్రోక్తిమయప్రపంచమును వాగనుశాసనుడు సృజియించి' నాడట; శ్రీనాథుడు ప్రోచినాడట. ఎంతదూర మాలోచించియన్నమాట యిది!

లౌకికముగ చూచినను, కవితాపరముగ చూచినను అంత విచిత్ర జీవితాంచలముల తాకిన మూర్తి ఆంధ్ర కవితాప్రపంచమున వేరొకడు లేడు. యావదాంధ్ర దేశమును నసివారుగా తిరిగి చూచినవాడు; కర్ణాట సౌభాగ్యమును తన కవితాసౌరభముతో మెదిచి బుగబుగ లెత్తించినవాడు; ఆంధ్రము పట్టని అఖండ సంస్కృత పండితుడయ్యును తన ఉద్దండ పాండిత్యమును తల్లికవితకు చెలిమికత్తెగా చేసినవాడుగాని సంస్కృతపీఠమునకు తెనుగును పరిచారిక నొనరించినవాడు కాదు; నిలువున తెనుగువాడు; తిరిగిన తెనుగునేలలో ప్రత్యణువును ప్రేమించి తన సుధాపరిషేచనముతో కవితామార్గము పట్టించినవాడు. ఈతని అగస్త్యలోపాముద్రలు, శివపార్వతులు వ్యాస నారదులు అచ్చపు తెనుగువారే యనిపించును.

భరద్వాజు విందునకు ప్రతిగా కండగల తెనుగు విందులో పారాశర్యుని మున్నూర్గురు శిష్యులను ఇతడు తలమున్కలు చేసినాడు.

ఈతడు గాలికిపోవు సొగసైన తెనుగు పలుకుబళ్లను, నుడికారములను కావ్యములలో కూడగట్టి చూపించినాడు. ఆ కాలమున నీత డవతరింపలే దనుము. అపుడు మనకు మనుచరిత్ర లేదు; పాండురంగవిభుని పదగుంభనమును లేదు. 'దేశ భాషలందు తెనుగు లెస్స!' యను రాయల వారి మాటయే లేదు. ఇట్లీతడు నిజముగ శ్రీనాథుడై

బహుళాంధ్రోక్తిని ప్రోచి ఆంధ్ర కవితా గౌరవమునకు చేవగల జీవగఱ్ఱగా నిలిచినా డనుటలో నావంతయు నతిశయోక్తి కాన్పింపదు.

ఈ మహాకవి పదునాలుగవ శతాబ్ది తుదిభాగమున జన్మించినాడని చరిత్రకారుల మతము. కొంద రీతడు సకల సంపత్సమృద్ధమైన మధ్యాంధ్రదేశములో కాళిపట్టణ మునరో, కలపటమునరో పుట్టెనందురు; మరికొందరు పినాకినీ నదీతీరమున నెల్లూరిలో జన్మించె నందురు. ఇతని వంగడము కవిత్వమునకు, విద్వత్తుకును పుట్టినిల్లయినది. 'సరస సాహిత్య సామ్రాజ్య చక్రవర్తి'యగు కమలనాభా మాత్యుడు ఈతని తాత; 'విద్యారాజీవభవుడు' మారయ తండ్రి; పుణ్యాచార భీమాంబ తల్లి.

కుశాగ్రబుద్ధి, ఆజన్మప్రతిభ తోడుగా ఘోడెరాయాంక గురురాయ భీమేశ్వరస్వామి చరణసన్నిధిని ఈతడు విద్యావంతుడై మంత్రోపదేశముల నంది తమ్మిపూవువంటి తనప్రజ్ఞను వికసింపజేయ దొరకొనినాడు. ఈతనికి పరిచిత మైన కృష్ణయజుర్వేదము, న్యాయవైశేషికములు, మహా భాష్యము, ప్రాకృతభాషాపరిజ్ఞానము 'బ్రాహ్మీదత్త వర ప్రసాదము'లని యభిజ్ఞులు భావించిరి. కూలంకషమైన ఈ పాండిత్యబలముననే యీతడు కొండవీటి రెడ్డిరాజు పెదకోమటి వేమారెడ్డి (1404 - 1420) యాస్థానమున విద్యాధికారియై 'బహుదేశబుధులతో భాషించి' విద్యా పరీక్షణములు చేసినాడు; ప్రౌఢదేవరాయల యాస్థానమున గౌడడిండిమభట్టు కంచుఢక్కను పగులగొట్టించి స్వర్ణస్నాన పరిశుద్ధుడై కవిసార్వభౌమబిరుదమును ఒడిచి పుచ్చు కొన్నాడు; బిరుదమాత్రముతోనే కవిసార్వభౌముడు కాక- తాతలనాటినుండి తన యింట నుగ్గుపాలతో త్రావి త్రేచిన కవితా మాధుర్యము తోడుగా ప్రౌఢ కవితాపట్టభద్రుడై విశదకీర్తి స్ఫూర్తి కర్పూరములు దిశాంగణములందు వెదచల్లినాడు.

కొండవీటిరాజ్యము విచ్ఛిన్నమైనపిదప తగిన యాశ్ర యము లేక యేయెడను కాలు నిలువద్రొక్కుకొనలేక తిరిగి తిరిగి ఈతడు రాజమహేంద్రవరపు రెడ్డిరాజుల యాశ్రయమున నిలిచినాడు. అచటి బెండపూడి అన్నయ మంత్రి 'పాకనాటింటివాడవు బాంధవుడవు' అని ఈతని నాదరించినాడు. మరల తెనుగు కవిత్వపు బావుటా యెగిరి నది. తనకీర్తి పతాక లనదగిన రెండుకావ్యముల నిత డిచటినుండియే వ్రాసినాడు. ఆడిన దాటగా పాడినది పాటగా రెడ్డిప్రభువు లీతనిమాట చెల్లించినారు. ఇతని జీవితములోని ప్రతిపొరయు హిమాంబుపూర, ఘనసార, గంధసారములతో పరిమళించినది. ఇతడు గుప్పిళ్లకొలది తాను సంపాదించిన కస్తూరిని 'దక్షారామ చళుక్య భీమవర గంధర్వాప్సరోభామినీ వక్షోజద్వయ కుంభికుంభములపై' సద్వినియోగము జేసినాడు; అంతియేనా - 'ద్రాక్షాపానక ఖండశర్కరలతో, రంభాఫలశ్రేణితో, గోక్షీరంబులతో' తాను భుజించినాడు; అర్థుల కింత పెట్టినాడు. ఏమి వంటలు! ఏమి రుచులు! ఏమి విందులు! ఆ వేళలు కలకల లాడిపోయినవి. అన్నిట నా రెడ్డి రాజులకును ఇతనికిని సరిపోయినది. వారు షట్కాల శివపూజాధురంధరులు. తానును 'ఈశ్వరార్చన కళాశీలుడు'. అయినను వెఱ్ఱి ముదిరిన వీరశైవుడు కాడు. 'వేదాద్రినరసింహ విపుల వక్షస్థలీ కల్హారమాలికాగంధలహరి'ని గూడ కన్నుల కద్దుకొని మన్నించును. ఇతడు 'ఆవగింజంతబూది మైనలఁ దెనేని వెలఁది గుమ్మడికాయంత వెట్టి పుట్టు'నని వెఱ్ఱిశైవ మును ప్రియముగనే - పరియాచకమాడుటకును వెరవడు. ఈ ప్రవృత్తిలో నీతడు కాళిదాసునకు చుట్ట మనిపించును.

పాపము! కాల మొక్కరీతిగా సాగిపోలేదు. ఈ బంగరు కలకూడ కరగిపోయినది. రెడ్డిరాజు లంతరించిరి. ఇతని భోగములు, హోదా కథామాత్రములైనవి. గౌడరాజుల పెత్తనము వచ్చినది. ఆంధ్ర కవితాప్రతిభ ముక్కుమొగ మెరుగని యొడ్డెరాజు లీదొడ్డకవి నెట్లాదరింతురు? తుద కితడు కృష్ణయొద్దున వ్యవసాయమునకు దిగినాడు. బ్రాహ్మణ వ్యవసాయమైనది. పండిన పంటనంతయు కృష్ణ వేణమ్మ గొనిపోయినను మహాకవి యశ్రువులనుండి ఆణి ముత్యమువంటి పద్య మొకటి శాశ్వతముగా పండినది. 'కవిరాజు కంఠమ్ము కౌఁగలించెనుగదా పురవీథి నెదురెండ పొగడదండ....'. శ్రీనాథమహాకవి తన యపూర్వ జీవితయా త్రలో సహస్రమాసజీవియై యమృతభాండములవంటి కావ్యములను మనకు వదలి 'దివిజకవివరుగుండియల్ దిగ్గురనగ' అమరపురి కరిగినాడు.

తన యనుగు తెనుగుసంతతికి ఇత డిచ్చిపోయిన బహు కావ్యములలో ప్రముఖముగ కాన్పించునట్టివి - కాశీ ఖండము, భీమఖండము, శృంగారనైషధము, హరవిలా సము. తక్కిన మరుత్తరాట్చరిత్ర, శాలివాహన సప్తశతి మున్నగునవి కథాశేషములు మాత్రమే. పల్నాటి వీర చరిత్ర, శివరాత్రి మాహాత్మ్యములు దొరకినను మొదట పేర్కొనినవాని యంతటి నిండుజీవముతో కూడు కొన్నవి కావు.

శ్రీనాథకవి యవతరించి తన కవితావిరవిహారములు సల్పిన దివ్యకాలము రెడ్డిరాజ్యయుగము. ఆంధ్ర నాగరి కతను, వాఙ్మయవిభవమును రెండుచేతుల పైకెత్తిన సువర్ణ యుగములు రెండే రెండు. అవి రెడ్డియుగము, రాయల

యుగము. పరరాజపదకళంకితమైన ఆంధ్రభూమి నవసి నవసి తన శక్తిని కూడగట్టుకొని ప్రజోద్యమముతో తల యెత్తి ఆంధ్రపతాకను పునఃప్రతిష్ఠించిన రేఖలోనే రెడ్డి రాజ్యము వర్ధిల్లినది. హైందవసంస్కృతికి సింహాసనము దొరకినది. వేదశాస్త్రము లూపిరిపోసికొన్నవి. సంస్కృత సాహిత్యము మెరుగెక్కి రాణింపదొడగినది. సంస్కృత సాహిత్యములో స్వయముగ పండితులైన రెడ్డిరాజులు ఆ భాషలో శక్తిమంతములైన రచనలు చేసిరి; స్వాస్థానము లందు కొమ్ములు తిరిగిన పండితులను నిలిపి పోషించు చుండిరి. ఈ సమయమున శ్రీనాథుడు రెడ్డిరాజసభలో ప్రవేశించినాడు. 'శాస్త్ర మాచార్యుసన్నిధిఁ జదువని' వారికి, 'ఇద్ధబోధంబు మది సంగ్రహింపని' వారికి ఆనాటి రాజసభలో కాలు కదలదు. 'పండితమన్యులైన వైతండికుల' ముఖపిధానము చేయనిదే ఆనాడు బిచ్చము పుట్టదు. అప్పు డీతడు పండితులను డీకొని గెలిచి సభలలో నిలిచినాడు.

ఇతడు 'పూర్వకవిముఖ్య విరచితాపూర్వ కావ్య భావ రస సుధాచర్వణప్రౌఢత'తో నాంధ్రసాహిత్యమునకు గీర్వాణసాహితిసరసను సింహాసనము ప్రతిష్ఠించుటకు పథకములు పన్నినాడు; కల్పనములు చేసినాడు; చేతికి దొరకిన కావ్యములపై తెనుగుజీవము క్రుమ్మరించినాడు. ఈ యుద్యమములోనే సంస్కృత పండితులు శిరసావహించు కాశీఖండ, నైషధములను చేపట్టి ప్రతిభాముద్రతో నిర్వహించినాడు; కాసట బీసటగానున్న యచ్చపు తెనుగు జోదుల కతలకు కావ్యగౌరవము ప్రసాదించినాడు.

ఈతడు తన కవితాప్రస్థానములో సంపాదించిన గెలుపు విశ్వతోముఖమైనది. కవితాబాహ్యస్వరూపమైన పద్య రచనము, పదగుంఫనము, నుడికారపు సొంపు, భావశిల్పములలో ఈతని మార్గ మొక యనన్య సాధారణ మైనది. వేయి తెనుగు పద్యములు రాసివోసినచో ఇది శ్రీనాథుని పద్యమని యెత్తి చూపవచ్చును. ఒక మహాప్రతిభావంతుడు తనవెనుక నెందరు శక్తిమంతు లున్నను ముం దెంతటివా రుండబోయినను తా నొక 'తృతీయపంథ'ను సృష్టించి 'తన తన' మొకటి నిర్మించి రాణించును. అట్టిదే ఇత డొక 'శ్రీనాథుని తనము'ను బలిష్ఠముగ స్థాపించినాడు.

ఇతనికి వెనుక రెండు పెద్ద ఆంధ్రకవితా పీఠము లున్నవి. ఒకటి నన్నయది, రెండవది తిక్కనది. పద్యశిల్పములో, భాషాబంధములో, నాదసౌష్ఠవములో నితనిని నన్నయపీఠ మాకర్షించినది. తిక్కన సంస్కృతబంధము, పద్యముల పనితనము ఈతని కాపోవలే దనిపించును. కాని తిక్కనయందు గౌరవము లేకపోలేదు. అతని రసాభ్యుచితబంధమునకు మాత్ర మితడు జోహారు లిడును; ఎఱ్ఱన సూక్తివైచిత్రి నగ్గించును.

పద్యరచనములో నన్నయకోవవాడు శ్రీనాథుడు. ఆతని మార్గముల నీతడు విశాలపరచి ఘంటాపథములు చేసినాడు; క్రొత్తనడకల సాధించి వాని కొకవింత 'దర్జా' నెలకొల్పినాడు. ఒక్కొక్క భావమును పద్యములో నెత్తుకొనుతీరునే ఇతడు సృష్టించినాడు. ఒక ఉదాత్త సౌందర్యమును చిత్రింపదలచెనా ఒరనుండి దూసిన కత్తివలె సమాసముతో పద్యము నెత్తును. ఒక సత్యమును, సందేశమును ప్రవచింపదలచెనా స్తిమితముగ పద్యమును నడపును. అది 'శ్రీనాథునితన' మైనది.

అజగరమువంటి దీర్ఘకాయముతో పడియుండు సీస పద్యమును నన్నయగారు విషయవిస్తరణమునకు వాహనముచేసినారు. ఆసీసమునకు పడగలెత్తించి ఫణాదండమున మణులు మెరపించి శ్రీనాథుడు నాగస్వరమూది ఇచ్చ వచ్చిన ఆట లాడించినాడు.

మొదట సమాపకక్రియ. వెంట ననసమాపకము :

'ముడువంగనేర్తురు మూల గమ్మనితావి
గలుగుక్రొవ్విరులు లోఁ గందకుండ...' (భీ.ఖం.)

పుంఖానుపుంఖములుగ రెండు సమాపకములతో నొక క్రొత్తనడక :

'పరివచ్చు ననవచ్చు శతమన్యుపీటికి
వివిధదేవాగార విభ్రమమున...' (భీ.ఖం.)

చర్రున సాగి, క్త్వార్థకముతో నాగి యొక్కచో రంగుల జల్లులు :

'మలయాచలంబుపైఁ జిలువయిల్లాండ్రుల
ఫణరత్నములయందుఁ బ్రతిఫలించి...' (కా.ఖం.)

ఒక యుపమానము. వెంటనే దాని రద్దుచేయుచు దాని యుపమేయము :

'మధుకరంబులు పుట్టె మధుకరంబులు గావు
రమణీయవేణీభరములుగాని...' (హ.వి.)

ధాతుజవిశేషణముతో త్రుంచి, దానితోనే మరల పెంచి ఇతడు అచ్చెరువున ముంచును :

'దుర్భిక్షదోషంబు దొరకొన్నఁ గడపని
కడపని గృహసూతకమ్మునందు...' (కా.ఖం)

రాజమార్గమున పొగరుగ, శుండాదండ మూపుకొనుచు బోవు మత్తమాతంగవిభ్రమ మొకచోట :

'కాలకంఠ కఠోరకంఠ హుంకారమ్ము
చెవుల సోకనినాటి చిత్తభవుఁడు...' (శృం.నై.)

ఇట్లు సీసము మూసలో బంగారము పోసి శ్రీనాథుడు చిరస్మరణీయు డైనాడు.

'సరభస పరిచలితమహా
శరభ ద్విపరిపువరాహశార్దూలమద
ద్విరదాదిప్రకరభయం
కరవనమధ్యమున......'

అను నన్నయగారి కందపద్యపు నాదసౌష్ఠవము ఈ శ్రీనాథుని కందముల వేయిపడగలెత్తినది. ఈతని సంగీతశ్రుతి విశిష్టమైనదని ఈతని హిందోళరాగప్రియత్వము చమత్కారముగా వెల్లడించినది (చూ: భీ. ఖం; హ. వి.).

'రేవాతరంగశీకర
సేవాహేవాకపాకశిశిరమరుత్ ప్ర
స్తావపరికంప్యమానజ
టావలియగు చత(డు వింధ్య మల్లన( జేరెన్'.

'దరవికచ వకుళ కురవక
పరిమళ సంభారలోల బంభరమాలా
పరిష ఝ్ఝంకారధ్వని
తెరువరులకు మన్మథప్రదీపన మొన(గున్' (కా.ఖం.)

ఈ శిల్పసౌందర్యమునే పెద్దన 'మృగమద సౌరభ విభవ', 'ఉల్లలదల కాజలకణ' మున్నగు కందములలో పుడికిపుచ్చుకొన్నాడు.

వృత్తరచనలో నీతని ప్రజ్ఞ పారంగతమైనది. ఈతని కొన్ని వృత్తములు విద్యుచ్ఛకటములవలె ప్రారంభము నుండియే వేగ మందుకొని పరుగెత్తును.

'శ్రీస్తన గంధసార పరిషేకసమంచిత సాయకప్రయో
గాస్త మహాపురత్రయు( డహార్యధనుర్ధరు( డర్కకోటిదీ
ప్తిస్తవనీయ విగ్రహు(డు భీమయదేవు(డు ...' (భీ.ఖం.)

'గిరిశస్థూల భుజాపరీతవిభవక్రీడాసమాస్ఫాలిత
స్థిరశాతాసనగూఢపార్గుణలతా దీర్ఘోగ్రఘోషంబునన్
ధరణీచక్రము దిర్దిరన్ దిరిగె( బాతాళంబు ఘూర్ణిల్లె...'(భీ.ఖం.)

అని ఈతడు ఉత్తరార్ధములో విరిచి సొగసులుచేయును. కొండొకచో తొలుత విరుపులు పెట్టి ఉత్తరార్ధమున ఇంద్ర ధనువువంటి సమాసము మెరపించును.

'బలభిద్వహ్నిపరేతరాజవరుణుల్ పర్యుత్సుకత్వంబునం
ధిల( గూర్చుండిరి యొండొరుం గదిసి యర్థిం దత్ప్రదేశంబునన్
నలనాళీకమృణాళనాళలతికానవ్యప్రణాళీ మిళ
ల్లలనాలాపకథా సుధానుభవ లీలాలోలచేతస్కులై' (శృం.నై.)

తెలుగు సంస్కృతముల గిలుకరించి విడుచు నీయందమిం కొకటి:

'బాలికచెక్కుటద్దములపజ్జల( గోమల మందహాసరే
ఖాలవ మంకురింపదు వికాసము చాలదు నెమ్మనంబునన్
వాలికమించు కన్గొనలవాకిట నల్లన సంచరింపనుం
జాలక చాలకుంటువడె( జారునిరీక్షణఖంజరీటముల్.'(శృం.నై.)

ఇట్లే గీతాది పద్యము లన్నింటిలో నీతని విశిష్టముద్ర కాన్పించుచుండును.

ఓజోరీతితో ఉద్దండసమాసకల్పనము చేసి పాండిత్యము క్రుమ్మరించు నీ కవి రసవత్సన్నివేశము రూపించునపుడు ఏకవికిని సాధ్యముకాని మార్దవ మాధుర్యములతో సహృదయ హృదయముల గరగించును. హంస నలరాజు చేజిక్కినది. వలవల వాపోవుచు నిట్లన్నది.

'ఇెక్కలకొనలం గలిగిన
యిక్కాంచన మాసపడియెదే నృప? నీ కే
యక్కఱ దీనం దీరెదు?...'

చక్కని తెనుగుమాటలతో నెంత ఎత్తిపొడుపు!

'తల్లి మదేకపుత్రక పెద్ద కన్నులు
గాన దిప్పుడు మూ(డుకాళ్లముసలి
కానకగన్న సంతానమ్ము శిశువులు
జీవనస్థితి కేన తావలమ్ము...
కృప దలంప(గదయ్య యోనృపవరేణ్య!' (శృం.నై.)

ఈదీనాలాపములకు ఏకన్ను చెమరింపదు?

వింధ్యాచలగర్వ మణచుటకు అగస్త్యమహర్షి కాశిని విడిచిపోవ నిశ్చయమైనది. అంతటి సర్వసంగపరిత్యాగి యును 'అపస్మారం బెత్తినపగిది అన్నుకొన్న విధంబున' నిట్లు దురపిల్లినాడు.

'పరమకళ్యాణి ఓభాగీరథీగంగ,
వార్ధిభామిని పోయివత్తునమ్మ!
అమరేంద్రులార, లోలార్కకేశవులార,
వనజసంభవ! పోయివత్తునయ్య...!'

అని వీడుకో లిచ్చియును,

'కలహంసి రారాదె కదలి నాతో(గూడి,
నీవేల వత్తమ్మ నెమ్మినుండి!
కదలికా కాంతార కదలిరా నను(గూడి,
నీవేల వత్తమ్మ నెమ్మినుండి' (కా.ఖం.)

అని నిస్పృహ చెంది నిట్టూర్చును. అచ్చమైన ఈ మానవ హృదయచిత్రణములోనే మహాకవి దర్శన మిచ్చును. కొండవీడో మరి యేనాడో విడచి రావలసివచ్చినప్పుడు కవియును నింత పరితాప మందినవాడుగావలయు!

గుణనిధి బ్రాహ్మణబ్రువుడు. అతని తండ్రి అతని దుర్వ్యసనములకు రోసి ఇల్లు వెడలనడచినాడు. వాడు పాపము మాతృమూర్తిని తలచుకొని దుఃఖించును.

'అరుణగభస్తిబింబ ముదయాద్రిపయిం బొడతేర గిన్నెలో(
బెరుగును వంటకంబు వడపిం దెలునుం గుడువంగ(బెట్టు ని
ర్భరకరుణాధురీణయగు ప్రాణము ప్రాణము తల్లి యున్నదే
హరహర! యెవ్వ రింక( గడు పారసిపెట్టెద రీప్సితార్థముల్'
(కా. ఖం.)

ఇచట 'కడు పారసి' యన్నమాట తెనుగుకవితకు మూట! ఈ గుణనిధికి సోదరుడుగనే రామకృష్ణుని నిగమ శర్మ యుద్భవించినాడు.

తన శత్రువు మేరువునుగూర్చి విన్న వింధ్యాద్రి రౌద్రముతో నిట్లు చెలరేగును.

'ఒక్కఁడు మాకులమ్మున సముద్ధతిఁ జూపినఁ జాతరోషుఁడై
ఱెక్కలు ద్రెంచి వేలుపులఱేఁ డటు పావము సేసెఁగాక యా
ఱెక్కలు నేఁడు గల్గినఁ బెఱింగి జవమ్మునఁ బాఱుతెంచి బి
ట్టెక్కనె కూటకోటితటు లెల్లను నుగ్గులుగాఁగ మేరువున్ ?'

'అడుసులోపలఁ దాటిపం డదిమినట్లు
అదుముదునెకాని పాతాళ మంటికొనఁగ
వేల్పు లెల్లను విభ్రాంతి విహ్వలింపఁ
బాదముల మెట్టి నాదాయఁ బసిఁడికొండ'  (కా.ఖం.)

మొదటి పద్యములోని 'క్క' ప్రాసయును, రెండవ పద్యములోని యుపమానమును, నెంత రసస్ఫోరకములుగా పడినవి! ఈ రచనము నెత్తుకొనునప్పుడు గౌడడిండిముడో, రాజమహేంద్రపుర తార్కికులో కవికి జ్ఞాపకము వచ్చి యుందురు.

వ్యాసుడు, శిష్యులును ఏడుదినముల యుపవాసము తరువాత భోజనాయత్తులైనారు. విస్తళ్లు వేసిరి. వడ్డనము మాత్రము చేయరు. వారి మనసున సందేహము పీకుచున్నది.

'చల్లని సౌమ్యదృష్టియుఁ బ్రసాదము మాధురియున్ వివేకమున్
గల్ల యొకింతయేని పొడగానఁగరా దరఁటాకుఁ జూచినన్,
జల్లను గుండె, యోగిరము శాకములుం బొడగానరామికిన్'
...............  (భీ. ఖం.)

పాపము వారిపై నెంత సానుభూతియున్నను ఫక్కున నవ్వుమాత్రము రాకతప్పదు.

దేవదానవులను దిగ్భ్రాంతిలో ముంచిన జగన్మోహిని శృంగారలీల యిది :

'పాకశాసనునకుఁ బరిహాసవచనంబు,
గాలకేయునకు శృంగారలీల,
వైవస్వతునకు భ్రూవల్లరీనటనంబు,
కరటిదానవునకుఁ గలికిచూపు,
పాశపాణికిఁ గుచప్రాంతోరుదర్శనం
బంధకాసురునకు నలఁతినగవు...'  (హ. వి.)

ఈ రససృష్టి సందర్భమున తిక్కయజ్వ ఈతని మనసులో మెదలి బలము నిచ్చిన ట్లనిపించును,

ఈత డొక యంశమును వర్ణింపదలచెనా మూడవకన్ను తెరచి దాని తీక్ష్ణకాంతితో మూలమూలల గాలించివైచును; గుప్పిళ్లకొలది భాషా భావబంధముల గుప్పి లీలాఖేలనము లొనరించును. వేమభూపాల సైన్యధూళి వింధ్యపార్శ్వభూముల నెగసి యేమైనదో చూడుడు :

'సప్తమాడియరాయచంద్రబింబాననా
చికురవల్లరులపైఁ జిన్నిపువ్వు,
ఝూడె జంతుర్నాటి జననాథశుద్ధాంత
కుచకుంభములమీఁది కుంకుమమ్ము'  (కా.ఖం.)

ఇందరు రాజుల నాక్రమించినాఁ డను వ్యంగ్యమే కాదు శ్రీనాథునిచేతిలో గాలికి పోవు ధూళి గమగమ వలచినది! ఎత్తుగీతిలో నాతని భాష ఒక్కటే సమాసమై దండు సాగినది.

తరపివెన్నెలధావళ్యము సుధాకర్దమముగా, చిరుత చీకటిచాయ మషీరసముగా, నెత్తమ్మిమొగడల పుప్పొళ్లు హరిదళముగ, తొలుసంజకెంజాయ ధాతురాగముగా నూనూగు కొదమయెండ కుంచెతో నీతడు చిత్రకారుడై రూపించిన జగము అపూర్వసుందరము.

దారుకావనమున మునికన్యలు తండ్రు లింట లేనపుడు తల్లులయెదుట చెంచెతల వేషములు వేసికొని నాటకము లాడుదురట - ఏమి విచిత్రభావన!

'సెలయేటి తెలినీటఁ జిఱుబంతిపసుపాడి
సేసక్రుమ్మళ్ల పిచ్చియలు తురిమిఁ
గురువిందపేరులు గుబ్బచన్నులఁ దాల్చి
నెమలిపింఛంపుఁ బుట్టములు గట్టి...
చెంచు చివురాకుఁబోణుల చేఁతలెల్ల
నభినయింతురు పర్ణశాలాంతరముల....'  (హ.వి.)

సిరియాలుని జంపి వంట వండునపుడు ఆనంజుళ్ల పరిపాకమును ఈబాపఁ డెప్పుడు పరిశీలించెనాయని ముక్కుపై వ్రేలు వేసికొందుము.

కథానిర్వహణములో మాత్రము పూర్వకవులలో చాల మందికి వలెనే శ్రీనాథునకును శ్రద్ధ లేదు. కాశీఖండమున దేవతలు వింధ్యవిజృంభణమును అడపుమని అగస్త్యు నడుగవచ్చినపుడు వాచస్పతి లోపాముద్రకు జేసిన ధర్మోపదేశము కథౌచిత్యమునకు భంగకరమని చెప్పక తప్పదు. భీమఖండమున ఒకకథ యనియే లేదు. స్థలపురాణమును కవితాసౌందర్యములో నోలలాడించుటయే యిందు ప్రముఖముగ కాన్పించును. తాను మోజుపడి చెప్పుకొను నైషధములోకూడ తక్కిన కవితాగుణముల గాఢపాకము మాట య ట్లుంచిన కథ సుడితిరిగి మందగమనము చూపును. అయినను ఈతని సమ్మోహనమైన ప్రతిభ యెన్ని లోపములనైనను సురక్షితముగ మ్రింగివేయును. కాశీఖండములోని కొన్ని ధర్మరహస్యములును, నలుని పెండ్లివిందులోని చమత్కారము పేరిటి అనుచిత ప్రసంగములును నిందులోనే చేరును.

ఈతని ఉభయభాషాప్రభుత్వము వర్ణనాతీతమైనది. ఎంతటి విశిష్ట సంస్కృతరూపమునైన నితడు సామాన్యముగ వాడివేయును. పతయాళువు, కిసలయరసజిఘ్రహిష, అస్వీ

తము, వాగ్వివాదము, మృషాభీమభపీభవంతి, భుజిక్రియ, ఙిశిభాత్వర్థము - ఇత్యాదులు కొన్ని మచ్చులు.

ఇతడు వింత తెనుగు పలుకుబళ్లను, నుడికారములను చూరలెత్తి మురిపించును: 'ఎఱ్ఱచిచ్చుఅకంట జుట్టినాఁడు', 'కెందమ్మి విరివోలె గిల్లినాఁడు', 'మగవాఁడో మానో', 'చంకదుడ్డు శరణార్థి', 'జాదుర జాదురము', 'చీకటి తప్పు', 'కన్గొనలవాకిలి', 'మంచుగొండ యనుంగు పెండ్లికొడుకు', 'వడకుగుబ్బలి రాచవారి ముద్దులబిడ్డ' - ఇట్లెన్నని? పదులు, వందలు భావుకులు చూడవచ్చును. ఆంధ్ర సాహితి సుకృతము వెల్లివిరిసి, తగిన సమయమున కీతని ప్రాపు దొరకి గీర్వాణ సారస్వతము ప్రక్క ప్రక్కల దానికి తలయెత్తుకొని తిరుగు భాగ్య మబ్బినది. ఇం.హ.శా.

**శ్రీనివాసరావు, కోలాచలము** (క్రీ.శ. 1854-1919): ఆంధ్రనాటక పరిణామ చరిత్రలో బళ్ళారి కొక ప్రముఖ స్థాన మున్నది. అచ్చటి నాటక రచయితలలో ధర్మవరము కృష్ణమాచార్యులుగారు, కోలాచలము శ్రీనివాసరావు గారు ప్రముఖులు. శ్రీనివాసరావుగారు వకీలు వృత్తి నుండువారు. అయినను నాటకకళయన్న వీరి కత్యంతాభిమానము. వీరు భారతదేశములోనే కాక ప్రపంచము లోని నాటకముల చరిత్ర పరిశోధించి ప్రపంచ నాటక చరిత్ర (ది డ్రమెటిక్ హిస్టరి ఆఫ్ ది వరల్డ్)ను ఆంగ్లేయ భాషలో వ్రాసిరి. తెలుగున వీరు సునందనీ పరిణయము, సుఖమంజరీ పరిణయము మున్నగు నాటకములు వ్రాసిరి. తెలుగులో మొదట చారిత్రక నాటకము వ్రాసినది వీరే. రామరాజు, విజయనగర సామ్రాజ్య పతనము, చాందుబీబి, ప్రతాపాక్బరీయము మొదలగునవి వీరి రచనలు. వీరు గొప్ప విద్వాంసులు; కడపలో ఆంధ్ర సాహిత్య పరిషత్తునకు అధ్యక్షత వహించిరి; భగవద్గీత 18 అధ్యాయములు సవిమర్శముగా బఠించి ప్రతి అధ్యాయమును వచనముగా ప్రకటించిరి. ని. వెం. రా.



చిత్రము 298.
కోలాచలము శ్రీనివాసరావు

**శ్రీనివాసాచార్యులు, తిరుమల బుక్కపట్టణము** (క్రీ. శ. 1862 - 1920): వీరు బుచ్చి వెంకటాచార్యుల వారి ప్రథమ పుత్రులు. వీరు తమకు పదునొకండేండ్లు నిండులోపలనే తమ తండ్రిగారియొద్ద సాహిత్యాలంకార శాస్త్రముల నభ్యసించి చక్కని కవిత నలవరచుకొనిరి; తరువాత, వారి దగ్గరనే వ్యాకరణ జ్యోతిశ్శాస్త్రముల నభ్యసించి పదునారవ సంవత్సరమున తర్కశాస్త్రాభ్యాసమునకుగాను మైసూరుచేరి అచ్చట నున్న సాహిత్యాలంకార పండితులను మెప్పించి మైసూరు మహారాజాస్థానమున బాలసరస్వతియను బిరుదమును సంపాదించిరి; సుప్రసిద్ధ తర్కవేదాంత పండితులై రీవా సంస్థానాస్థాన పండితులుగా నుండిన మైసూరు రాజగురువులును, పరకాలమఠాధీశులును నైన రంగనాథ బ్రహ్మతంత్ర పరకాలస్వాములవారి సన్నిధానమున తర్కవేదాంత శాస్త్రముల నభ్యసించి పిదప మైసూరు మహారాజావారి గౌరవ వేతనముతో కాశికి వెళ్ళి అచట శంకర భాష్యాదులగు అద్వైత వేదాంత గ్రంథముల నన్నింటిని సాంగముగా నభ్యసించి అచటినుండి నవద్వీపముచేరి అచ్చటకూడ మీమాంసాది శాస్త్రగ్రంథముల నభ్యసించుచు అచ్చటి పండితులను మెప్పించి 'తర్కతీర్థ' అను బిరుదమును సంపాదించినారు. ఇట్లు చతుశ్శాస్త్రములందును పరినిష్ఠిత పాండిత్యమును సంపాదించి వీరు స్వభావ సిద్ధముగా నలవడిన సరసకవితతో విద్వత్కవులై, గంటకు నూరు శ్లోకములను రచించుచు బళ్ళారి, కడప, మద్రాసు, బనగానిపల్లె మొదలగు స్థలములలో అడిగిన విషయములలో ఘంటా శతకములను చెప్పుచు, అచ్చటి ప్రభుత్వోన్నతోద్యోగులు మొదలగువారిని మెప్పించి స్వర్ణపతకములను, సువర్ణ కంకణములను, శ్వేతచ్ఛత్ర చామరాదులను సంపాదించిరి; సంస్కృతము, ప్రాకృతము, తెలుగు మొదలగు నష్టభాషలలో ఆశుకవిత్వముచేయుచు, అన్నిస్థలములలో నందరి చేతను మెప్పువడయుచు నఖండకీర్తిని సంపాదించినారు; పిమ్మట చాలకాలము ఆత్మకూరు, అమరచింత సంస్థానములలో ఆస్థానపండితులుగా నుండి అచ్చటికి వచ్చిన తిరుపతి వేంకట కవులతో వాదించి సభాసదుల నందరిని మెప్పించినారు.

వీరు 'బ్రహ్మామృత వర్షిణి'యను వేదాంత సభ నొకదానిని స్థాపించి దేశదేశములనుండి అన్ని వైదిక మతముల పండితులను రావించి సభలు జరిపి వారి వారి ప్రతిభా పాండిత్యానుగుణముగ సంభావనాది గౌరవములను జరుపుచు కాలము గడపుచుండిరి. వీరు నంజరాజ చంపువు, దుర్మద నిర్మథనము, జాంబవతీ పరిణయము, తత్త్వమార్తాండ ప్రభామండలము, రాజశేఖర చరిత్రము, సురపురము వేంకటగురు చరిత్రము మొదలగు నెన్నియో గ్రంథములను వ్రాసిరి. బు. అ.

**శ్రీనివాసాచార్యులు, పరవస్తు** (క్రీ. శ. 1767 - 1835) : వీరు వెంకటగిరి పట్టణమున జన్మించిరి. వీరి తండ్రిగారు వెంకటగిరి కాపురస్థులు. వారికి వెంకటగిరి సంస్థానమున అగ్రహారము లుండినవి. తండ్రిగారు వీరు జన్మించిన కొద్దికాలములోనే పరమపదించిరి. వీరి తల్లి, నాయనమ్మగారును, మేనత్తగారును వీరిని పెంచిరి. అగ్రహారములలో వచ్చు ఆదాయమే వారికి ఆధారముగా నుండెను.

1760-70 సంవత్సరముల మధ్యను ఆంగ్లేయవర్తక సంఘమువారికిని, హైదరలీకిని స్పర్ధలేర్పడి అతడు కర్నాటకము మీదికి దండెత్తి వచ్చునపుడు దారిలోని గ్రామములను దోచుకొనుచుండెను. అందుచే గ్రామస్థులు తమకు వీలగు సామగ్రులను తీసికొని దగ్గర అరణ్యములలో దాగుకొనుచు గ్రామములోని కాపలావాడు దండుపోయినట్లు వర్తమానముతేగా మరల గ్రామములోనికి తిరిగి వచ్చుచుండిరి. ఈ విధముగా వీరిని తీసికొని సంరక్షకులగు ముగ్గురు వితంతువులును అనేక పర్యాయములు గ్రామమును విడిచి యరణ్యవాసము చేయవలసి వచ్చెను. ఈ బాధలను భరించలేక వారు తమతో స్వల్పద్రవ్యమును తీసికొని వారి బంధువు లప్పుడు విజయనగరమున నున్నందున కాలినడకను అనేక దినములు ప్రయాణముచేసి అచటికి చేరి దాసన్నపేటలో నివసించుచుండిరి. ఆ బంధువు - మేనమామ కావలయును - పిల్లవానికి విజయనగరములోని పాఠశాలలో విద్య నభ్యసించుటకు చేర్చెను.

సుమారు పదహారు సంవత్సరములవయస్సున వీరు స్వదేశమునకు పోయి వివాహము చేసికొనివచ్చి విజయనగరములో విద్యాభ్యాసమును పూర్తిచేసికొనిరి. వీరికి వ్యాకరణ శాస్త్రముననను, వేదాంత శాస్త్రముననను మంచి పాండిత్య మలవడెను. ఆంధ్ర గీర్వాణములలో నసమానమైన వైదుష్యమును వీరు సంపాదించిరి.

వీరు పిదప స్వదేశమునకు పోవ నుద్యోగించి విశాఖపట్టణము రాగా నచ్చటనున్న గోడేవంశమునకు చెందిన జమీన్‌దారులు వీరి పాండిత్యమునకు ముగ్ధులై వీరి కుపాధి కల్పించి వీరి నచ్చటనే నిలిపివైచిరి.

అచట నుండగా వీరికి భార్యావియోగము సంప్రాప్తించినది. అప్పుడు వీరు పోషకులగు గోడే జమీన్‌దారులకు చెప్పి స్వదేశమునకు బయలుదేరి వెళ్లి నెల్లూరు చేరుసరికి మరల వెంకటగిరి ప్రాంతము దండయాత్ర బాధ ననుభవించుచున్నదని విని అచ్చటనే వివాహము చేసికొని వసించుచుండిరి. మీరు స్వగ్రామమునకు వెళ్లినచో వెళ్లవచ్చును; లేనిచో విశాఖపట్టణములోనే యుండవచ్చును కాని అన్య గ్రామమున నుండుట న్యాయము కాదని గోడే జమీన్‌దారులు వీరికి వర్తమానము చేసిరట. అందుకు సంతసించి వీరు తమ స్వగ్రామమును, భూములను విడచి తిరిగి విశాఖపట్టణము వచ్చి స్థిరపడిరి. జమీన్‌దారుగారు వీరికి నెలకు రు. 30 ల వేతనమును, గృహమును కల్పించిరి. వీరి పెద్ద కుమారునిపేరు రామానుజాచార్యులుగారు ; రెండవ కుమారునిపేరు వెంకటరంగాచార్యులుగారు. వీరి రెండవ కుమార్తెపేరు రంగనాయకమ్మ. ఈమె సంస్కృతాంధ్రములందు మంచి పాండిత్యము సంపాదించి స్త్రీ విద్యా సమర్థనము మొదలగు గ్రంథములను రచించెను. శ్రీనివాసాచార్యులుగారికి విజయనగరము మహారాజావారు పెదగాడి గ్రామములో మాన్యము లిచ్చిరి.

వీరు వ్రాసిన గ్రంథములలో ముఖ్యమయినది సర్వశబ్ద సంబోధినియను అకారాది పదక్రమ సంస్కృతాంధ్ర నిఘంటువు. ఆంధ్రదేశముననేకాక భారతదేశమునందే అకారాది సంస్కృత నిఘంటువులలో నిదియే మొదటిది. దీనిని గోడేవా రచ్చువేయించిరి. ఇందు సంస్కృతపదములకు సంస్కృతమునను, తెనుగునను అర్థములు కలవు. ఇదికాక వీరు విశ్వగుణాదర్శమును తెనుగున ననువదించిరి; హయలక్షణసారమను నశ్వశాస్త్రమును తెనుగున రచించిరి ; ప్రశ్నోత్తరరూపమగు వేదాంత గ్రంథమునుగూడ నొకదానిని రచించిరి.

ప. రా. స్వా.

**శ్రీరామశాస్త్రి, వేమూరి** : ఈయన నెల్లూరి మండలమున జన్మించెను ; వేదమును, వ్యాకరణాది శాస్త్రములను, జ్యోతిషమును చదివెను. ఈయన శతావధాని. గ్రైవేయక బంధము, శల్లిప్రభ, అవధాన విధానము, గురుకల్పము, నూతనోద్యానము అను గ్రంథములను రచించెను.

ప. రా. స్వా.

**శ్రీరాములు, దాసు** (క్రీ. శ. 1846 - 1908): కృష్ణాజిల్లా కూరాడయందు ఒక నియోగి బ్రాహ్మణ కుటుంబమున ఈయన జన్మించెను. ఈయన తండ్రి కన్నయ్య; తల్లి కామమ్మ. ఈయన పదేండ్ల ప్రాయముననే సంస్కృతాంధ్రముల పఠించి జ్యోతిశ్శాస్త్రమున గూడ కొంత పరిచయమును సంపాదించెను; తన పంద్రెండవయేట నూజివీడు సంస్థానమున అష్టావధాన మొనర్చి సంస్థాన ప్రభువు వలన బహుమతుల నందెను ; ఇరువదేండ్ల వయసు వచ్చునప్పటికి తర్క, వ్యాకరణ, సంగీత, సాహిత్య, వేదాంతములయందు పాండిత్యము నార్జించెను ; దోకిపర్రునం దొక విద్యాశాలను స్థాపించెను.

తరువాత ఆంగ్లభాషయం దీయన కాసక్తి కలిగి తగు కృషిచేసి దానిలో కృతార్థుడై 1878 లో సెకండు గ్రేడు ప్లీడరై మచిలీపట్టణమున ప్రాక్టీసు మొదలిడెను; 1884 లో

క్రమముగ ఫస్టుగ్రేడు ప్లీడరై ఏలూరులో న్యాయవాదిగా పది యేండ్లుండి ఆ వృత్తిని విరమించి జీవిత శేషమును సాహిత్య సేవకై వినియోగించెను. ఈయన కవులను, పండితులను తరచు సన్మానించువాడు.

ఈయన రచించిన గ్రంథము లనేకము: అనువాదములు, స్వతంత్రములు. దేవీభాగవతము, శాకుంతలము, (అచ్చ తెనుగున) ఉత్తర రామ చరితము, ముద్రా రాక్షసము మున్నగునవి అను వాదములు. స్వతంత్రము లగు నాటకాదిరచనములు, నాట్య, సంగీత, తర్క శాస్త్రాది విషయకములగు నవి చాల గలవు. ఈ యెల్ల రచనములకు తలమానిక మయి, ఈయనకు గౌరవ ప్రతిష్ఠలను సమకూర్చినది దేవీ భాగవతము. ఆ పెద్ద గ్రంథము నీయన ఆఱువుగా నారునెలలో రచింపగలిగెనట. ఈయన కవిత్వము సరసము, స్వతంత్రము, హృదయంగమమునై యుండును. ఈయన స్వతంత్రరచనములలో 'తెలుగునాడు' అనునది స్వభావ రమణీయమైనది.



చిత్రము 299.
దాసు శ్రీరాములు

చీ. శే.

**శ్రీరాములు, పొట్టి** (క్రీ. శ. 1901 - 1952) : ఆంధ్రరాష్ట్ర సిద్ధికై అచంచల దీక్షతో అనన్యసాధ్యమైన నిరశన వ్రతం సాగించి, తుదకు ఆత్మార్పణం కావించిన త్యాగధనులు పొట్టి శ్రీరాములు.

వీరు వైశ్యులు. వీరి పూర్వులు నెల్లూరు జిల్లాలోని పడమటపల్లె గ్రామంలో నివసిస్తూ ఉండేవారు. వీరి తండ్రి గురవయ్య; తల్లి మహాలక్ష్మమ్మ. వీరి బంధువుల కుటుంబములు చెన్నపట్టణములో ఎన్నో ఉన్నవి. శ్రీరాములు పుట్టినది కూడా మద్రాసులోనే. వీరు ఇరవైఏళ్ల వయస్సు వచ్చేవరకు అక్కడనే ఉండి విద్యాభ్యాసం సాగించినారు; తర్వాత శానిటరీ ఇంజనీరింగు విద్యను అభ్యసించుటకు బొంబాయి వెళ్లి అందు కృతార్థులైనారు; అప్పటి గ్రేట్ ఇండియన్ పెనిన్సులా రైల్వేలో నెలకు రు. 250 లు జీతము గల ఉద్యోగాన్ని సంపాదించారు. ఇరవైయైదవ ఏటనే వీరికి భార్యావియోగం కలిగినది. దానివల్ల వీరికి ఐహిక భోగములపై విరక్తి కలిగినది. వీరి హృదయంలో గొప్ప పరిణామం ఏర్పడినది. వీరికి తమ జీవితమును దేశాభ్యున్నతికయి అంకితము చేయవలెననే దృఢ నిశ్చయము కల్గినది.

ఆ సమయమున గాంధీమహాత్ముడు సబర్మతీ ఆశ్రమం నుంచి జాతీయోద్యమానికై చేసిన శంఖారావం విని వీరు 1927 లో తమ ఉద్యోగమునకు రాజీనామా నిచ్చి, తమ ఆస్తిపాస్తులను తల్లికిని, అన్నదమ్ములకును అప్పగించి సబర్మతి ఆశ్రమమునకు వెళ్లినారు. అక్కడ వీరు గాంధీ గురునికి అన్ని ఉద్యమాలలోను ప్రధానాంతేవాసి అయినారు. నాటినుండి అవసానంవరకు వీరు మానవ సేవయే తమ జీవిత పరమావధిగా, నిరాడంబరంగా జీవయాత్ర సాగించినారు; మూడు సారులు రాజకీయ నిర్బంధితులుగా చెరసాలకు పోయినారు. సత్యాగ్రహ, సహాయ నిరాకరణోద్యమములలో వీరి సాహసోత్సాహములు గాంధీమహాత్మునే చకితు నొనర్చినవి. వీరి మహత్తర శక్తులను గ్రహించి మహాత్ముడు 'శ్రీరాముల వంటి కార్యదీక్షాపరులు పదిమంది ఉన్నయెడల సంవత్సర కాలములో స్వరాజ్యమును సంపాదించగలను' అని చెప్పియున్నాడు.

వీరు గ్రామజనుల యుద్ధరణకయి కొమరువోలునందలి గాంధీ ఆశ్రమములోను, గుజరాతునందలి రాజకోటలోను గొప్ప సేవ చేసిరి; చాలాకాలము వివిధ ప్రాంతములందు జాతీయోద్యమాలలో పాల్గొనిరి; 1938 లోను, 1942 లోను సత్యాగ్రహమున పాల్గొని కారాగారవాసము ననుభవించిరి. వీరు 1944 వ సంవత్సరము మొదలుకొని నెల్లూరు కేంద్రముగా చేసికొని ఖద్దరు ప్రచారము కావించిరి. ఆవల వీరు అచటి మూలపేట శ్రీ వేణుగోపాల స్వామివారి దేవాలయములో హరిజనులకు ప్రవేశం లభించుటకై 1946 లో తొలిసారిగా నిరశన వ్రతమును ప్రారంభించి ప్రవేశం లభింపజేసిరి. ఆ సంవత్సరంలోనే మద్రాసు ప్రభుత్వం వారిచే రెండు హరిజనోద్ధరణ శాసనాలను ఆమోదింప జేయుటకై వీరు రెండవసారి 23 దినములు నిరశన దీక్షను సాగించి తమ సంకల్పము నెరవేర్చుకొనిరి; మూడవసారి నిరశనవ్రతదీక్ష 1948 లో వార్ధానగరములో 29 దినములపాటు జరిగినది.



చిత్రము 300.
పొట్టి శ్రీరాములు

పేరు ప్రతిష్ఠలకొరకు వీ రే యుద్యమమును ప్రారంభించలేదు. మహాత్ముడు బోధించిన సత్యము, అహింస, హరిజనోద్ధరణము అనే ప్రధానాశయాలకొరకే వీరు

నిరంతర కృషి చేస్తూ వుండిరి. అందువల్లనే రాష్ట్రసిద్ధికై నిరశన వ్రతమును గ్రహించినవరకూ వీరి పేరు తెలుగు దేశంలో చాలమందికి తెలియనే తెలియదు. వీరు నిర్బంధముపైని ఆంధ్రరాష్ట్రములోని గాంధీ స్మారక నిధికి కార్యదర్శిగా పనిచేసిరి.

వీరు తమ జీవితము కడపటి సంవత్సరములో నెల్లూరిలోనే నివసించుచు హరిజనోద్ధరణకై నిరంతర కృషి చేయుచుండిరి. నెల్లూరిలోను, తత్ప్రాంతములలోను హరిజనోద్ధరణకు అనుకూలములైన ప్రబోధములను వ్రాసిన అట్టలను ముందు వెనుకలకు కనబడునట్లుగా మెడకు తగిలించుకొని, ఎవ్వరైన దయతలచి అన్నము పెట్టిన తినుచు, లేనియెడల పస్తు లుండుచు, ముతక ఖద్దరు దుస్తులతో కాళ్ళకు చెప్పులుగాని, తలపై గొడుగుగాని లేక మండుటెండలలో తిరుగుచూ ఉన్న వీరిని చూచి కొందరు ఉన్మత్తునిగా భావించుచు వచ్చిరి.

ప్రత్యేకాంధ్రరాష్ట్రమును, మద్రాసుపయిని ఆంధ్రులకు అరవలకు ఉమ్మడి హక్కును సాధింపదలచి నాల్గవమారు చెన్నపురియందలి మైలాపూరులో బులుసు సాంబమూర్తి గారి బసలో వీరు 1952 అక్టోబరు 19 వ తేదీని నిరశన దీక్షకు పూనుకొనిరి. 58 దినములు ఈదీక్ష అవిచ్ఛిన్నంగా సాగినది. ఇన్ని దినము లీవ్రతము సాగినను, రాష్ట్ర ప్రభుత్వమునగాని, భారత ప్రభుత్వమునగాని కొంచెమైనను సంచలనము కలుగలేదు. తనకు స్మృతి తప్పిన సమయములలో వ్రతభంగము కలిగించు ఎట్టి ప్రయత్నములను చేయరాదని వీరు గట్టిగా శాసించుటచే, ఆంధ్ర నాయకులేమి చేయుటకును సాధ్యము కాకపోయెను. తుదకు వీరా దీక్షయందే డిసెంబరు 15 వ తేదీని ప్రాణత్యాగము చేసిరి.

వీరి మరణవార్త మెరుపుతీగవలె ఒక్కసారిగా దేశమంతటను వ్యాపించినంతనే ఉద్రేకపూరితమగు ప్రజానీకము విశృంఖలమై దౌర్జన్యమునకు పూనుకొనెను. ఈ ప్రమాదమును భారత ప్రభుత్వము వెంటనే గుర్తించినది. అంత ఆంధ్ర రాష్ట్ర మేర్పడినది. బు. వెం.

షియా : 'షియా' అనగా 'అనుయాయులు' అని అర్థము. శ్రీ మొహమ్మద్ ప్రవక్త అల్లుడగు హజరత్ అలీ అనుయాయులను 'షియా' లందురు.

శ్రీ మొహమ్మద్ ప్రవక్తకు పురుషసంతతి లేకుండెను. పుట్టిన మగపిల్లలు చిన్నప్పుడే గతించిరి. ఫాతిమా అను ఒక కూతురు మాత్ర ముండెను. ఆమె భర్త అలీ.

శ్రీ మొహమ్మద్ ప్రవక్త మరణానంతరము ఆయన స్థానమున ఎవరిని నియమింపవలెనను ప్రశ్న వచ్చెను. ఆయనకు పురుష సంతతి లేకపోవుటచే ఆయన వంశము వాడును, అల్లుడును అగు అలీ ఆయన ప్రతినిధి (ఖలీఫా) కావలెనని ఒక పక్షమువారును, ఖలీఫా ప్రవక్త వంశము వాడే కానక్కరలే దనియు ఖలీఫాను ఎన్నుకొన వలెననియు మరొక పక్షమువారును వాదించిరి. ఈ రెండవ పక్షమువారే అధికసంఖ్యాకులగుటచే ప్రవక్త ముఖ్య శిష్యులలో వృద్ధుడగు అబూబకర్ సిద్దీఖ్ ఖలీఫాగా ఎన్నుకొనబడెను. ఆయన పిదప ఉమర్ ఫారూఖ్‌ను, ఆయన తర్వాత ఉస్మాన్‌ను ఖలీఫాలుగా ఎన్నుకొనబడిరి. అలీ వంతు నాల్గవ ఖలీఫాగా వచ్చెను. షియాలు అలీని మొదటి ఖలీఫాగా భావించి మొదటి ముగ్గురు ఖలీఫాలను అంగీకరింపరు.

శ్రీ మొహమ్మద్ ప్రవక్త ఒక ఆధ్యాత్మిక సామ్రాజ్యమునకే కాక ఒక విశాల ఐహిక సామ్రాజ్యమునకు అధిపతియై ఉండెను. అందుచే ఖలీఫా పదవి ఒక చక్రవర్తి పదము వంటిది.

శ్రీ మొహమ్మద్ ప్రవక్తయే అలీని తన వారసునిగ నియమించె ననియు, ఆయన శిష్యులు కొందరు కుట్రపన్ని ఖలీఫా పదవి అలీకి చెందకుండచేసి రనియు షియాలు అందురు. ప్రవక్త తన వారసుని నియమించనే లేదని రెండవ పక్షమువా రందురు. నలుగురు ఎవరిని ఎన్నుకొందురో వారే ఖలీఫాపదవికి అర్హులు కాని తండ్రి పదవి కొడుకునకు వచ్చు పద్ధతిని ఈ పక్షమువా రంగీకరింపరైరి. ఎన్నికల పద్ధతి ననుసరించినవారు సున్నీలనియు, వారసత్వపద్ధతి కావలెనని కోరిన వారు షియాలనియు పిలువబడిరి. అలీయే స్వయముగ ఎన్నికల పద్ధతి నామోదించె ననియు, ఖలీఫా పదవి ఆనువంశికముగ రావలెనని ఎన్నడును వాదించలే దనియు సున్నీ లందురు. అలీ పైకి ఎక్కువ చెప్పకపోయినను లోలోపల కోపమున క్రుగ్గుచుండె ననియు షియాలు అందురు.

శ్రీ మొహమ్మద్ ప్రవక్త తర్వాత అలీయే మహాపురుషుడని షియాలు అందురు. సున్నీలు ప్రవక్త ముఖ్య శిష్యు లందరితోపాటు అలీని ఒకనిగా పరిగణించి అందరికిని సమాన గౌరవ మిత్తురు. షియాలు అలీకి ప్రవక్తతో సమాన గౌరవమిచ్చి, మొదటి ముగ్గురు ఖలీఫాలను ద్రోహులని నిందింతురు. ఈ నిందను సున్నీలు సహింపరు. సున్నీలకును, షియాలకును నేటికిని ముఖ్య వైషమ్య కారణ మిదియే.

అలీ పిదప ఆయన ఇద్దరు కుమారులలో పెద్దవాడగు హసన్‌ను ఖలీఫాగా ఎన్నుకొనిరి. కాని సిరియాకు మండలాధిపతిగా ఉండిన ముఆవియా ఆ పదవి తనకు కావలెనని పట్టుపట్టెను. హసన్ దానికి ఒప్పుకొని తాను ఖలీఫా పదవి

నుండి తప్పుకొనెను. ముఆవియా తర్వాత హసన్ ఖలీఫాగా ఏర్పాటు కావలెనని పెద్దలు అతనిపై షరతు విధించిరి. అతడు దాని కొప్పుకొనెను. ముఆవియా ఇరువదేండ్ల కాలము పరిపాలించి మృతినొందెను. అతని కుమారుడు యజీద్ ఖలీఫా పదవి నాక్రమించెను. నాటినుండియు ఎన్నికల పద్ధతి అంతమొందెను. నేటివరకు ముస్లిమ్ సంఘమును విభజించి ఉంచిన షియా ఉద్యమము తీవ్రముగ ప్రారంభమాయెను. షియాలు ఖలీఫాలను అంగీకరించుట మానిరి. ఈ క్రింది పండ్రెండుగురు ఇమాము(ఆచార్యులు లేక పీఠాధిపతులు)లను షియాలు నిజమైన ఖలీఫాలుగా భావింతురు.

1. హజరత్ అలీ; 2. ఆయన పెద్ద కుమారుడు ఇమామ్ హసన్ ; 3. ఆయన తమ్ముడు ఇమామ్ హుసైన్; 4. హుసైన్ కుమారుడు జైనుల్ ఆబెదీన్ ; 5. ఆయన కుమారుడగు మొహమ్మద్ బాఖర్; 6. ఆయన కుమారుడు జాఫర్ అస్సాదిఖ్; 7. ఆయన కుమారుడు మూసా అల్ కాజిమ్ ; 8. ఆయన కుమారుడు రజా; 9. ఆయన కుమారుడు మొహమ్మద్ తఖీ ; 10. ఆయన కుమారుడు అలీనఖీ; 11. ఆయన కుమారుడు హసన్ అస్కరీ ; 12. ఆయన కుమారుడు మొహమ్మద్ మహదీ.

తుది ఇమామగు మహదీ ఇంకను బ్రతికియే ఉన్నాడనియు ఆయన ఎప్పుడో ఒకప్పుడు ప్రత్యక్షమగుననియు షియాల విశ్వాసము. మహదీ తర్వాత ఇమాములు లేకపోవుటచే ముజ్తహెదీన్ అనబడు ప్రముఖ పండితులను షియాలు అనుసరింతురు. వారు చేసెడి శాసనములు షియాలకు ప్రమాణమై యుండును.

కొన్నాళ్లకు షియాలలో కూడా పెక్కు శాఖ లేర్పడెను. వీటిలో ముఖ్యమైనవి రెండు: జైదియాలు, ఇస్మాయీలీయులు. నాల్గవ ఇమామగు జైనుల్ ఆబెదీన్ మరణానంతరము ఆయన అనుయాయులలో కొందరు ఆయన చిన్నకుమారుడగు జైద్‌ను ఇమాముగా ప్రకటించిరి. అధిక సంఖ్యాకులు ఆయన పెద్దకుమారుడగు మొహమ్మద్ బాఖర్‌ను ఇమాముగా అంగీకరించిరి. జైద్‌ను అనుసరించినవారు జైదియా లనబడుచున్నారు.

ఆరవ ఇమామగు జాఫర్‌అస్సాదిఖ్ మరణానంతరము కూడ ఇట్టి చిక్కే వచ్చెను. ఆయన తన పెద్ద కుమారుడగు ఇస్మాయీలును విడిచిపెట్టి, రెండవవాడగు మూసాకాజిమ్ ఇమామ్ కావలెనని ప్రకటించెను. కొందరు ఆయన ఆజ్ఞను ధిక్కరించి ఇస్మాయీలునే ఇమాముగా అంగీకరించి ఆయననే అనుసరించినవారయిరి. అట్టివా రందరు ఇస్మాయీలీయు లనబడుచున్నారు.

ప్రపంచమందలి ముస్లిమ్ జనసంఖ్యలో షియాలు అత్యల్ప సంఖ్యాకులై యున్నారు. ముప్పదికోట్ల ముస్లిములలో వీరి సంఖ్య రెండున్నర కోట్లకు మించియుండలేదు. ఇరాన్ (పర్షియా) వీరి ఆటపట్టు. ఇరాఖ్‌లోను భారతదేశమునను షియాలు కొద్దిగా కలరు. మన దేశమున ఉత్తర ప్రదేశమున షియాలు ఎక్కువగ ఉన్నారు. అందునను లక్నో పట్టణమున వారి సంఖ్య అధికము. ఆంధ్ర ప్రాంతమున హైదరాబాదు నగరమునను, గోదావరీ మండలమునను షియాలు ఎక్కువగ కలరు. ఆంధ్రదేశమును పాలించిన కుతుబ్ షాహీ సుల్తానులు షియా మతస్థులు. గోల్కొండ రాజ్యపతనమునకు ఆ రాజుల షియామత మొక కారణము. మతోద్రేకపరుడగు ఔరంగజేబు దక్కను ప్రాంతమందలి షియా రాజ్యములను పెక్కు యుద్ధములుచేసి అంత మొందించెను. అ యుద్ధములకు బలియైన రాజ్యములలో కుతుబ్‌షాహీల గోల్కొండ రాజ్య మొకటి.

ఆంధ్రదేశమున విరివిగా ఉన్న పీర్ల మాన్యములు ఎక్కువగా కుతుబ్ షాహీ రాజు లిచ్చినవే (చూ: మొహర్రమ్). **మొ. ఖా. ఖా.**

## సంగమేశ్వర శాస్త్రి, గుమ్మలూరి (క్రీ. శ. 1863 - 1918):

అపరగౌతమ బిరుదము వహించిన వీరు ప్రస్తుత శ్రీకాకుళ మండలమందలి బొబ్బిలి తాలూకాలోని గంగన్నపాడు గ్రామమున జన్మించిరి. వీరి తండ్రి లక్ష్మీనారాయణ పండితుడు ; తల్లి వెంకమాంబ.

వీరు నాడు బొబ్బిలి ఆస్థానమున వెలుగొందుచుండిన మండపాక పార్వతీశ్వర విద్వత్కవులయొద్ద సంస్కృత కావ్యములను, సుసర్ల సీతారామశాస్త్రిగారివద్ద తర్కప్రకరణములను చదివి గుమ్మలూరి కేగి యట శ్రీపాద రామశాస్త్రిగారివద్ద న్యాయశాస్త్రమును సమగ్రముగా నధ్యయనము చేసిరి. అప్పటికే వీరి వైదుష్యము ఘనముగా ఖ్యాతిచెందినను వీరు విజయనగరములోని భీమాచార్యులుగారి వద్దను, కాశీలోని ప్రఖ్యాత పండితులవద్దను తమ పాండిత్యమునకు పదనుపెట్టికొని స్వదేశమునకు తిరిగి వచ్చిరి. అప్పటికి వీరి నామము సువిశ్రుతమగుటచేత శిష్యులు డెబ్బది యెనుబదిమంది వారిచుట్టు చేరిరి. అంతమంది విద్యార్థులకు భోజనము పెట్టగల బ్రాహ్మణగ్రామమునకై వీరు చూచుచుండగా పశ్చిమగోదావరి జిల్లా కాకరపర్రు వాసులు శిష్యసహితముగా తమ గ్రామము దయచేయ వలసినదని వారి నాహ్వానించిరి. మూడున్నర సంవత్సరములు వీరు శిష్యులకు పాఠములను బోధించుచు కాకరపర్రులో నుండిరి.

1893 లో వీరు విజయనగరాధీశులైన ఆనందగజపతి మహారాజుగారిచేత నాహూతులై వారి సంస్కృత కళాశాలలో అధ్యాపకులుగా నియమింపబడిరి.

వాదనయందు వీరి కసాధారణశక్తి యుండెను. 1912లో శ్రీ మధ్వస్వాములు జరిపించిన నైయాయిక మహాసభలో వీరు చూపిన వాదనైపుణి నిరుపమానముగా నున్నందున స్వాములవారు వీరిని బహువిధముల సమ్మానించిరి. వంగదేశములో తర్కశాస్త్రమునకు ప్రసిద్ధిచెందిన నవద్వీప మండలి పండితులుకూడ వీరిని మెచ్చి ప్రశంసాపత్రములు సమర్పించిరి. జాన్సన్ అను జర్మనీ పండితుడు వీరివద్ద శాస్త్ర రహస్యములను గ్రహించుచుండెడివాడు. అట్టి పాశ్చాత్యశిష్యులవలన వీరి కీర్తి పాశ్చాత్యదేశములయందు వ్యాపించుటయు, నచటినుండి వీరికి 'డాక్టరు' బిరుదము వచ్చుటయు సంభవించెను. వీరు చాలకాలము పిఠాపురము, ఉర్లాము ఆస్థానములలో జరుగుచుండిన శాస్త్రపరీక్షలలో తర్కశాస్త్రమునకు పరీక్షాధికారిగా నుండిరి.

వీరిపేరు చెప్పినంతనే నేటికిని పండితులకు 'సంగమేశ్వర క్రోడపత్రములు' జ్ఞప్తికివచ్చును. క్రోడపత్రము లనగా శాస్త్రముమీద సంగ్రహవిమర్శలు. వీరు రచించిన మాధురీ పంచలక్షణీ క్రోడపత్రములను మైసూరు ప్రభుత్వమును, జగదీశ సిద్ధాంత లక్షణ క్రోడపత్రమును ఆంధ్ర విశ్వవిద్యాలయము 1933 లోను ప్రకటించెను. మన దేశములో తర్కశాస్త్రము పూర్తియైన దనిపించుకొనదలచువారు సంగమేశ్వర క్రోడపత్రముల నవశ్యము పఠింతురు. వీరికి ముగ్గురు కుమారులు, ముగ్గురు కుమార్తెలు జనించిరి. జ. పు.

**సంగమేశ్వరశాస్త్రి, తుమురాడ** (క్రీ. శ. 1874 - 1932) : ఆంధ్రదేశమునం దవతరించి వీణాగానవైదగ్ధ్య పరసీమను ముట్టినవారలలో వీరు నిరుపమానులు. వీరు పాలకొండ తాలూకా బిటువాడ అగ్రహారమునందు వెలనాటి ఆంధ్ర బ్రాహ్మణ కుటుంబమున జన్మించిరి. వీరి తల్లిపేరు గున్నమ్మ; తండ్రిపేరు సోమయాజి. వీరి యెనిమిదవయేటనే సుప్రసిద్ధ ఆంధ్రగాయకులును, వీరి బావగారును అగు నందిగానం వెంకయ్యగారివద్ద సంగీతవిద్య నభ్యసించుటకు వీరు స్వగ్రామమునుండి బొబ్బిలి చేరిరి; నాలుగేండ్లు గాత్రసంగీతము నభ్యసించిన తరువాత వీణావాదనమును నేర్చుకొనుటకు ఆరంభించిరి; వీణయందు గురువుగారి శిక్షణలో అనితరసాధారణమైన ప్రజ్ఞను సంపాదించిరి.

వెంకయ్యగారివద్ద శిక్షణ పూర్తియైన దినములలో విశాఖపట్టణవాసులు, మహామహోపాధ్యాయ బిరుదాంకితులు అగు పరవస్తు వెంకట రంగాచార్యులుగారు వీరి వీణావాదనను విని అచ్చెరువొంది, వీరిని విశాఖపట్టణము తీసికొనివెళ్లి గోడేవారి ఆస్థానములో కచ్చేరి చేయించి వీరిని ఉచితరీతిని సత్కరింపజేసిరి.

ఇంతలో వీరు గురువుగారితోకూడ 1893 ప్రాంతములో విశాఖపట్టణము జిల్లా అనకాపల్లివద్దనున్న కసింకోటకు ప్రభువులైన జమీన్దారుగారి ఆదరమునకు పాత్రులై



చిత్రము 301.
తుమురాడ సంగమేశ్వరశాస్త్రి

ఆగ్రామము చేరుకొన్నారు. అక్కడ నుండగనే దాక్షిణాత్య సంగీత విద్వాంసు లగు తచ్చూరు సింగరాచార్యుల వారు వీరి ప్రతిభను విని వీరిని మద్రాసుకు రప్పించినారు. వీ రక్కడ ఒక సంవత్సరముండి తమ గానవిద్యా వైదుష్యమును ప్రదర్శించిరి. అక్కడనుండిన కాలముననే మద్రాసు గోవిందప్పనాయకుని వీథిలోనున్న శ్రీకృష్ణగానసభ వారు సువర్ణకంకణము నిచ్చి వీరిని బహూకరించిరి.

తరువాత వీరి కీర్తి విన్న శ్రీ పిఠాపురము మహారాజావారు వీరిని తమ యాస్థాన వైణికులుగా నియమించి గౌరవించిరి. వీరి జీవితములో పిఠాపుర నివాస మొక ప్రధాన ఘట్టమయినది. వీరి కీర్తి మహారాజావారి ప్రాపున గాయకలోకములో విస్తరించినది. పిఠాపురము మహారాజావారు తమకు పరమ మిత్రులైన రవీంద్రనాథ టాగూరుగారితో వీరికి పరిచయము చేసిరి. టాగూరు వీరిని తమతో కలకత్తాకు తీసికొనివెళ్లి రెండు మాసములపాటు వీరి గానరసామృతమును గ్రోలిరి. అటు తరువాతనుంచి అప్పుడపుడు వీరు టాగూరుగారితో కలిసి కలకత్తాలో నివసించుచు వచ్చిరి. వీరిని, వీరికళానైపుణ్యమును పాశ్చాత్యదేశములకు పరిచయము కల్పించవలెనను కుతూహలముతో టాగూరుగారు తమవెంబడి పరదేశములకు రావలసినదని వీరి నాహ్వానించిరి; కాని వీరి పూర్వాచారసంప్రదాయనిరతి వీరి విదేశయాత్రకు అడ్డు తగిలినది.

వీరి వీణాసాధన అపూర్వమైనది; మామూలు త్రిస్థాయిని నాలుగవ కాలములో వెయ్యి ఆవృతులు వీణను దించకుండ వాయించుటయేకాక నాగబంధసాధనమను ఇంకొకవిధానమును వీ రభ్యసించిరి. అలంకారములలో నున్న స్వరగ్రామములను ముందునకు, వెనుకకు పాము

మెలికలు తిరుగులాగున వేదపాఠకులు ఘనము వల్లెవేసి నట్లు చేయుసాధనకు నాగబంధమని పేరు.

ఇట్టి సాధనచేయుటవల్లనే వీరి వ్రేళ్లకు బలము, వేగము, మాధుర్యమును అద్భుతముగా అబ్బినవి. తానము, ఘనము, మీటులలో కత్తెరమీటు వీరి సొమ్ము. వీరు స్వరవిన్యాస మునకు తమకు సప్తస్వరస్థానములు అక్కరలేనట్లు ఒక్క స్వరస్థానములోనే స్వరలోకము తాము సృజించుచు వీణను వాయించువారు.

వీరి జీవితమంతయు నాదబ్రహ్మోపాసనయందే లగ్న మగుటచేత అర్థోపార్జనయందు వీరి కాశయుండెడిదికాదు. వీరు నిరాడంబరజీవులు ; సాత్విక సంపన్నులు. వీరు 'గణ నాయకం శుభదాయకం' అను నొక కీర్తనమట్టుకు కల్యాణిరాగమున సంగమేశ్వరముద్రలో రచించినారు.

వీరి ఉపాస్యదేవత విశ్వశక్తి, విశ్వజననియగు లలి తాంబ. అంబయొక్క ఐహికమూర్తియే వీణ అని వీరి భావన. వీరు మరణశయ్యపై నుండగా దగ్గరనున్నవారిని 'మా అంబ నొకసారి ఇలా ఇయ్యండి 'అని అడిగితీసికొని మహత్తరశ్రుతితో ఆనందభైరవి రాగము నాలాపించుచు తమ యాత్మను నాదబ్రహ్మమం దైక్యము గావించు కొనిరి.
మే. వ. న.

**సంస్థానములు (ఆంధ్ర) - సాహిత్యసేవ :** ఆంధ్ర సాహిత్య చరిత్రమున స్వదేశ సంస్థానాధిపతులు కావించిన సారస్వత సేవ వాఙ్మయ ప్రపంచమునం దాచంద్రార్కము నిలువ దగినది. ఆంధ్ర దేశము తాళికోట (రక్షసి-తంగడి ; క్రీ. శ. 1565) యుద్ధానంతరమున పూర్తిగ మహమ్మ దీయుల పరిపాలన క్రిందకు వచ్చినది. గోల్కొండ నవా బులు ఆంధ్ర దేశాధీశులైరి. వారు తమకాలమున ప్రసిద్ధులై, అంతకుముం దాయా ప్రదేశములలో స్థిరవసతి గలిగిన క్షత్రియ కుటుంబములవారికి, వెలమవారికి, కమ్మ వారికి కొన్ని ప్రదేశముల నొసగి, వారిని పాలకులుగ నేర్పరచి తమ శిస్తు వసూలుచేయుటకు ఫర్మానాల నొస గిరి. నేడాంధ్ర దేశమున ప్రసిద్ధిగన్న విజయనగరము, బొబ్బిలి, పిఠాపురము మొదలైన సంస్థానము లన్నియు నా కాలమున నేర్పడినవియే. క్రీ. శ. 1802 వ సంవత్సర మున బ్రిటిషు ప్రభుత్వమువారు శాశ్వత శిస్తు నిర్ణయము (పెర్మనెంటు రెవిన్యూ సెటిల్‌మెంటు) చేసిన తరువాత ఈ సంస్థానములను, వారి వారికి గల హక్కులను స్థిరపరచి పేష్కషు నిర్ణయించి సంస్థాన పాలనాధికార స్వాతంత్ర్యము వారికే యప్పజెప్పిరి.

ఈ సంస్థాన ప్రభువు లందరును ప్రాయికముగ ప్రాచీ నాంధ్ర సాహిత్యమును - ముఖ్యముగ ప్రబంధ సాహిత్య మును - పోషించిరి. కొందరు సంస్థానాధీశులు అచ్చు వచ్చిన తరువాత మాస పత్రికల మూలమున చాల ప్రబంధములను వెలుగులోనికి తెచ్చిరి ; తమ తమ యాస్థాన కవుల గ్రంథ ములను ముద్రింపించిరి ; తమకు సంబంధింపక పోయినను ధనైక సాధ్యములగు రామాయణాది మహోద్గ్రంథముల ముద్రణమునకు నమితముగా సహాయము చేసిరి,

పిఠాపురము: ఇది తూర్పు గోదావరి మండలమున నొక ప్రసిద్ధ వెలమ సంస్థానము. ఈ సంస్థానమును క్రీ. శ. 1679 - 1704 వరకు పాలించిన మాధవరాయనింగారు వక్కలంక వీరభద్రకవి రచించిన 'వాసవదత్తా పరిణయము' అను ప్రశస్త ప్రబంధమును కృతినందిరి. వీరి మనుమలగు చిన మాధవ రాయనింగారు (క్రీ.శ. 1759-1762) సుప్రసిద్ధాంధ్ర కవియగు కూచిమంచి తిమ్మకవికి కవిసార్వభౌమ బిరుదము నిచ్చి యఖండముగా సన్మానించిరి. ఆ వెనుక క్రీ. శ. 1862 నుండి 1890 వరకు పాలించిన రావు గంగాధర రామారావుగారి కాలమున చాల సాహిత్యాభివృద్ధి యైనది. వేదార్థము చెప్పుటయందు విశ్వ విఖ్యాతిగాంచిన బులుసు పాపయ్య శాస్త్రులుగా రీయాస్థాన విద్వాంసులు. బహు సంస్థాన సమ్మానితుడగు అల్లంరాజు సుబ్రహ్మణ్య కవి భద్రాపరిణయమను కృతి నీరాజున కొసగెను. వీరి యాస్థాన కవులు దేవులపల్లి సుబ్బారాయ శాస్త్రిగారు, దేవులపల్లి వెంకటకృష్ణ శాస్త్రిగారు అను కవి సోదరులు. వీ రిరువురు సంస్కృతాంధ్రములలో రావువంశ ముక్తావళి అను రావు వంశచరిత్రమును రచించిరి.

వీరి కుమారులగు శ్రీరావు వెంకట కుమార మహీపతి సూర్యారావు బహద్దరువా రాంధ్రభాషకై యసంఖ్యాక మైన ద్రవ్యము వెచ్చించి, శాశ్వత సంస్థలను స్థాపించిరి. ఆంధ్ర సాహిత్య పరిషత్తు, శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటు వులు వీరి కీర్తి నా చంద్రార్కము నిలుపగలవు. వీరు ఆంధ్ర వాల్మీకి వావిలికొలనువారి రామాయణము మొదలగు నాంధ్ర గ్రంథముల నచ్చువేయించిరి. సాహిత్య సంస్థలు పెక్కింటికి సహాయము చేసిరి.

పెద్దాపురము (తూర్పు గోదావరి జిల్లా): పెద్దాపుర సంస్థాన పరిపాలకులు వత్సవాయివారను క్షత్రియులు. ఈ పరిపాలకులలో ప్రసిద్ధికెక్కినవాడు తిమ్మజగపతి బహద్దరు. ఈతడు 1750 ప్రాంతమున నుండెను. సంస్కృతాంధ్రముల నీతడు చక్కని కవి. వీరి యాస్థాన కవులు సుప్రసిద్ధులగు ఏనుగువారు. వీరి యింటిపేరు తొలుత పైడిపాటివారు. ఈ సంస్థాన పాలకులలో పూర్వులు పైడిపాటివారిలో జల పాలామాత్యునికి ఏనుగును బహుమాన మొసగుటచే వీ రేనుగువారైరి. భర్తృహరి సుభాషితము నాంధ్రీకరించిన

యేనుగు లక్ష్మణకవి తాత పెద లక్ష్మణకవి తుల్యామాహాత్మ్యము, ధ్రువ చరిత్రము మున్నగు ప్రబంధములను రచించెను. ఏనుగు లక్ష్మణకవి భర్తృహరి సుభాషితములను రసవత్తరముగా నాంధ్రీకరించుటయే గాక, రామేశ్వర మాహాత్మ్యము, జాహ్నవీ మాహాత్మ్యము మొదలగు ప్రబంధములను రచియించియున్నాడు. వెణుతురుబల్లి విశ్వనాథకవి కిరాతార్జునీయమును తెలిగించినాడు.

బొబ్బిలి (విశాఖ జిల్లా): ఇదియును నొక వెలమ సంస్థానమే. ఈ వంశీయులలో క్రీ. శ. 1800 నుండి పాలించిన రాయడప్ప రంగారావుగారి వద్దనుండి సాహిత్య పోషణ ప్రారంభమైనది. రాయడప్ప రంగారావుగారు 'సంకల్ప సూర్యోదయము' అను ప్రబంధమును రచియించుటయే గాక ఆస్థాన జ్యోతిష్కుడును, ఆంధ్ర విద్వన్మహాకవియునగు కొటికలపూడి వెంకట కృష్ణ సోమయాజికి (క్రీ. శ. 1764 - 1864) రెండగ్రహారముల నిచ్చి సన్మానించి యున్నాడు. దిలీప చరిత్ర, విఘ్నేశ్వరము, ప్రబోధ చంద్రోదయము మొదలగునవి యీ సోమయాజి కృతులు. రాయడప్ప రంగారావు కుమారుడు జనార్దన రంగారావు. ఈతడు మిత్రవిందాపరిణయమను ప్రబంధమును, బొబ్బిలి వేణుగోపాల శతకమును రచించెను. ఆ వెనుక శ్వేతాచలపతి రంగారావుగారి కాలమున వెంకట కృష్ణ సోమయాజి తనయుడును, జ్యోతిశ్శాస్త్రవేత్త సంస్కృతాంధ్ర భాషా విశారదుడునగు కోదండరామకవి యాస్థాన విద్వాంసుడై పది శతకములను, నరసింహ పురాణాది గ్రంథములను రచించెను. మండపాకవారిలో అభినవాంధ్ర కవితా పితామహులు అని పేరువడసిన మండపాక పార్వతీశ్వర శాస్త్రిగారు (క్రీ.శ. 1833 - 1897) శతకములు హెచ్చుగా శతాధిక గ్రంథములు రచించిరి. ఇట్లు కవులను పోషించుటయే గాక శ్వేతాచలపతి రంగారావుగారు తమ వంశ చరిత్ర వ్రాసి, అనేక గ్రంథములను ముద్రించుటకు ధన సహాయము మొనర్చిరి.

విజయనగరము (విశాఖ జిల్లా): ఈ సంస్థాన పరిపాలకులు పూసపాటి వారను క్షత్రియులు. ఈ వంశీయులలో పూర్వుడైన పూసపాటి రాచిరాజు 'నవభారతము' అను కావ్యమును రచించెను. అతని వెనుక పూసపాటి తమ్మ భూపాలుడు 'శ్రీకృష్ణ విజయము' అను ప్రబంధమును రచియించుటయేగాక 'సీమంతినీ పరిణయము'ను రచించిన పెనుమళ్ల సోమయామాత్యుని పోషించెను. తమ్మభూపతి కుమారుడు వెంకటపతిరాజు ఉషాభ్యుదయము అను ప్రబంధమును రచించెను. క్రీ.శ. 1757 లో బొబ్బిలి యుద్ధమున మరణించిన పెద విజయరామరాజు, కవియై 'ఆంధ్రపారాశరీ హోర' అను గ్రంథమును రచించెను. ఈయన తరువాతచిన విజయరామరాజు, చాటరాతి లక్ష్మీనరసకవిని పోషించి అతనివలన 'పద్మనాభయుద్ధము' అను కావ్యమును కృతి నందెను.

ఈ సంస్థానము సాహిత్య రంగమున నత్యున్నత స్థితి వహించినది శ్రీ ఆనంగజపతి మహారాజు(క్రీ.శ. 1879 - 1897) కాలమున నని చెప్పవచ్చును. వీరి యాస్థానమున సంజ్ఞా రామాయణాది బహు గ్రంథకర్త ముడుంబై నరసింహాచార్యస్వామి, మత్స్య కూర్మ మార్కండేయాది పురాణాంధ్రీకర్త మండ చిట్టి కామశాస్త్రి, ఆంధ్ర ధర్మసింధు గ్రంథకర్త కొల్లూరి కామశాస్త్రి, సంగీత సాహిత్య విద్యా విశారదుడు సంస్కృతాంధ్ర హూణ భాషా విశారదుడు అగు అజ్జాడాదిభట్ట నారాయణదాసు, కన్యాశుల్క గ్రంథకర్త గురుజాడ అప్పరాయ కవిశేఖరుడు, కవి జీవిత గ్రంథకర్త గురుజాడ శ్రీరామమూర్తి, కర్నూలు నరహరి రాజా మణిశెట్టి విలసిల్లియుండిరి. ఈ మహారాజు వెనుక నీ సంస్థానమున ఆంధ్ర సాహిత్యము వృద్ధిగాంచలేదు. ప్రశస్త కవులు భోగరాజు నారాయణమూర్తిగారు కొంతకాలము విజయనగరాస్థానకవిగా నుండిరి.

వెంకటగిరి (నెల్లూరు జిల్లా): వెలమవారి సంస్థానముల లోనికెల్ల ప్రాచీనమైన దీ సంస్థానము. వెంకటగిరి రాజులు వెలుగోటివారు. తొలుత తెలంగాణాలో రాచకొండయందుండెడివారు. శ్రీ కృష్ణదేవరాయల కాలమున నీ వంశీయులు తెలుగుదేశమున వెలుగోడు(నెల్లూరు మండలము) నందు స్థిరనివాస మేర్పరచుకొనిరి. అప్పటినుండి వారింటి పేరది యయ్యెను. క్రీ.శ. 1600 ప్రాంతమున రాయడప్ప నాయనింగారు రెంటూరి రంగరాజ కవి వలన భానుమతీ పరిణయము అను ప్రబంధము నంకితము గొనిరి. వీరి కాలముననే వెలుగోడు విడిచిపెట్టి యీ రాజవంశీయులు వెంకటగిరి రాజధానిగా జేసికొనిరి. ఈ రాజులలో కుమార యాచమ నాయనింగారు ముడుంబి అప్పయ్యా దీక్షితుల వారి చేత విష్ణుపురాణమును తెనిగింపజేసిరి. వీరి కుమారులు (ఆ పేరింటివారే) నరకూరి నారాయణప్ప యను కవీశ్వరునిచే పారిజాతాపహరణము యక్షగానముగా రచియింపజేసిరి. ఈ వెంకటగిరి రాజులలో ఆంధ్రభాషను పోషించి ప్రసిద్ధికెక్కిన రాజు కుమార యాచమనాయని వారు. విద్వత్కుమార యాచమనాయడని యీతని నామాంతరము. ఈతడు 1848 - 1892 వరకు వెంకటగిరిని పాలించెను. ఈతని కాలమునం దుండిన గోపీనాథ వెంకట కవి (1820 - 1892) శ్రీమద్రామాయణము, బ్రహ్మకైవర్త పురాణములోని శ్రీకృష్ణ జన్మఖండము, శిశుపాలవధ

(మాఘకావ్యము) మొదలగు మహాకావ్యములను రచించి ప్రఖ్యాతి వహించెను. వెంకటకవిగారికి పెరుగుపల్లి యను నగ్రహారము నొసంగి యాచమనాయనివారు గౌరవించిరి.

కుమార యాచమనాయనివారు సంగీత వేదాంత శాస్త్రములందు పరిశ్రమ చేసినవారు; సభారంజని, మన స్సాక్ష్యము మొదలగు గ్రంథములను తెలుగున రచించిరి; 'మనస్సాక్ష్యకూటము' అను నొక శాల కట్టించి దానికి పదునైదువేల రూపాయ లిచ్చిరి; గోపీనాథ వెంకటకవి గారి గ్రంథములనే కాక మండపాక పార్వతీశ్వర శాస్త్రి గారి రాధాకృష్ణ సంవాదము, చిలకపాటి వెంకట రామానుజ శర్మగారి గోపికథా సుధాలహరి, వినోద కథాకల్పవల్లి గ్రంథములను ముద్రించిరి; హాలాస్య మాహాత్మ్య కృతికర్త తిరుమలశెట్టి జగన్నాథ కవిని, శివరాత్రి మాహాత్మ్య కృతికర్త ఒడయరు వీరనాగయ కవిని బోషించిరి.

కార్వేటినగరము (చిత్తూరు జిల్లా): సాళ్వ వంశీయు లగు మాకరాజు వా రీసంస్థాన పాలకులు. వీరిలో, క్రీ. శ. 1540 ప్రాంతముల పరిపాలించిన తిరుమలరాజునకు భారత కవిత్రయములో నెర్రాప్రెగడ వంశీయుడగు చదలువాడ మల్లన విప్రనారాయణ చరిత్రమను కృతి నంకితము నొసగి యున్నాడు. తరువాత నీ వంశమువారు కారు వేడు అను ప్రదేశమున కోట నిర్మించుకొనుటచే కార్వేటి నగరము సంస్థానాధిపతులైరి. కార్వేటి నగరము సంస్థానాధిపతులలో క్రీ. శ. 1700 ప్రాంతముల బరిపాలించిన వెల్లంటి కసవరాజు సంగీత సాహిత్య విద్యాపోషకుడు. ఋగ్వేదికవి వెంకటాచల కవి చంపూరామాయణము నాంధ్రీకరించి కసవరాజునకు కృతి యొసగెను. ఋగ్వేది వెంకట నారాయణకవి సంగీత సాహితీవేత్త. జయదేవ కవి కృతమగు గీతగోవిందకావ్యము నాంధ్రీకరించిన మహాకవి, ప్రసిద్ధ పదరచయిత సారంగపాణి యీ కాలముననే విలసిల్లెను.

శ్రీ కాళహస్తి (చిత్తూరు జిల్లా): ఇది యొక ప్రాచీన సంస్థానము; పరిపాలకులు దామెరవారు. ధూర్జటి కవి మనుమడు కుమార ధూర్జటి కృష్ణరాయవిజయము, ఇందుమతీ పరిణయము అను ప్రబంధములు రచించెను; ముని మనుమడు లింగరాజకవి శ్రీకాళహస్తి మాహాత్మ్యమును విపులముగా రచించెను.

ఈ సంస్థాన పరిపాలకులు మంచి కవులు. వీరిలో దామెరల వెంగళ భూపాలుడు బహుళాశ్వ చరిత్రము అను ప్రశస్త ప్రబంధమును రచించెను. ఈతని తమ్ముని కుమారుడగు అంకభూపాలుడు ఉషాపరిణయ మను ప్రబంధమును రచించెను. ఇందులో తన తండ్రియైన చెన్ననృపతి పేరనే నేటి చెన్నపట్టణము (మద్రాసు) కట్టబడినదని వ్రాసియున్నాడు. ఈ గ్రంథ మముద్రితము. ఈ యంక భూపాలునకు కృతిగా నడిమింటి వెకటపతి కవి అభిషిక్తరాఘవము (భోజ చంపూ రామాయణాంధ్రీకరణము) రచియించి యున్నాడు. అందును దామెరవారి వంశ వృత్తాంతము సమగ్రముగా నున్నది. రావు కొండల రాయడను కవీశ్వరుడు చిత్రకవిత్వ దర్పణము అను గ్రంథమును నడిమింటి వెంకటపతి కవి సహాయమున రచించెను. వీ రందరు క్రీ. శ. 1700 - 1750 ప్రాంతమున విలసిల్లిన వారు. క్రీ. శ. 1860 - 80 ప్రాంతమున నుండిన దామెర వెంకటపతినాయనింగారు ఉద్దండ పండితులు; శిష్టు కృష్ణమూర్తి శాస్త్రిగారిని తమ యాస్థానమున పదునారేండ్లు పోషించిరి. ఈయన కుమారుడు సర్వశాస్త్రి దామెరవారి యాస్థానకవియై అమరుకము, జ్ఞానప్రసూనాంబికాశతకము రచించిరి. మహామహోపాధ్యాయ కొక్కొండ వెంకట రత్నము పంతులుగారికి విద్వత్కవీశ్వర పట్టము నొసంగి రెండు సంవత్సరములకాలము తమ యాస్థానమున నిలిపిరి.

నూజివీడు (కృష్ణాజిల్లా): ఇదియొక వెలమ సంస్థానమే. ఈ సంస్థానాధీశులు సంస్కృత సాహిత్యమును హెచ్చుగా పోషించిరి. వీరి పూర్వులలో నొకరికి కుమార ధూర్జటి తన 'యిందుమతీ పరిణయము' అను కృతి నంకిత మొనర్చెను. 1860 - 80 ప్రాంతమున శోభనాద్ర్యప్పారావుగారి పాలనలో భాషాపోషణ బాగుగా జరిగినది. వారు విద్వాన్ అభినవ పండితరాయ మాడభూషి వెంకటాచార్యుల వారిని ప్రతి వర్షము నాహ్వానించి శతావధానము చేయించువారు. మొట్టమొదట ఆంధ్రదేశ చరిత్రమును వ్రాసిన బుక్కపట్టణము రాఘవాచార్యులవారు అవధానము చేయుటయేగాక కువలయాశ్వ చరిత్రము అను నొకప్రశస్తప్రబంధమును రచించిరి.

ఈ సంస్థానములు కాక ఆంధ్ర భాషా పోషణ చేసిన మరికొన్ని చిన్న సంస్థానములు కలవు. వీనిలో నరసారావుపేట, అమరావతి (గుంటూరు జిల్లా), పోలవరము, లక్కవరము (పడమటి గోదావరి జిల్లా), మునగాల, వుయ్యూరు (కృష్ణా జిల్లా), జయపురము, పాచిపెంట, పాలకొండ, పార్వతీపురము, సంగమవలస (విశాఖపట్టణము జిల్లా) పేర్కొనదగినవి.

నరసారావుపేట (గుంటూరు జిల్లా): ఈ సంస్థానము మల్రాజు వారిది. వీరు వెలమలు. మల్రాజు గుండారాయనింగారు భాషాపోషకులు. వీరిపై చాటుపద్యములు చాల గలవు. రఘుపతి శతకము (రఘుపతీ శరణాగత వజ్ర

పంజరా ! అను మకుటము గలది - అప్పకవి యుదాహరించి నది), కవిమూషిక మార్జాలము మొదలగు గ్రంథములను రచించిన పట్టాభిరామకవి వీరి యాస్థానమున నుండెను. ఆ వెనుక దిట్టకవి వంశీయు లాస్థాన కవులైరి. 1757 లో బొబ్బిలి యుద్ధమును వర్ణించుచు, దిట్టకవి నారాయణ కవి రంగారాయ చరిత్రమను వీరరసప్రధాన ప్రబంధమును రచించెను. నారాయణకవి కుమారుడు రామచంద్రకవి ఉద్దండ గోపాలరాయ శతకము, రఘుకుల తిలక శతకము రచించెను. రామచంద్రకవి ఆ వెనుక తురీయాశ్రమము స్వీకరించి రామయోగియై, కాంచీ నగరమున శాస్త్ర వాదము చేసి జయమును గాంచెను.

అమరావతి (గుంటూరు జిల్లా): ఇది కమ్మవారి సంస్థానము. శ్రీ రాజా వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు గారి కాలమున (1716 - 1770) ఇది చాల ప్రసిద్ధిలోనికి వచ్చినది. వీరి యాస్థాన కవులు ములుగు పాపయారాధ్యుల వారు. వీరు దేవీభాగవతము, అహల్యాసంక్రందనము, సర్వమధురము (అచ్చతెనుగు) మొదలగు నాంధ్ర గ్రంథములే కాక కల్యాణ చంపువు మొదలగు సంస్కృత గ్రంథములను రచించిన విద్వన్మహాకవులు. వెంకటాద్రి నాయని వారి వెనుక రామనాథబాబు పాలనమున నీ సంస్థాన మంతరించినది.

పోలవరము : ఇది బ్రాహ్మణ సంస్థానము. దీని పాలకులు కొచ్చెర్లకోట రామచంద్ర వెంకట కృష్ణారావు బహద్దరు జమీన్‌దారువారు (క్రీ. శ. 1872 - 1919). వీరు పట్టభద్రులై సంస్కృతాంధ్రములలో చక్కని వైదుష్యము గడించి మిల్లరు దొరవారి జీవితము, అపవాద తరంగిణి, రాజతరంగిణి మున్నగు గ్రంథములను రచించిరి; శతావధానులగు తిరుపతి వేంకటకవులను చాలకాలము పోషించిరి; వారివలన బుద్ధచరిత్రమును కృతినందిరి. 'సరస్వతి' అను నొక మాస పత్రికను పండ్రెండేండ్లు నడపి, అందులో పెక్కు ప్రాచీనాంధ్ర ప్రబంధములను ప్రకటించిరి. వీరి మాతామహుడు పెద్దాడ నాగరాజామాత్యకవి శకుంతలా పరిణయమును రచించెను.

లక్కవరము : ఇదియు బ్రాహ్మణ సంస్థానమే. దీని యధిపతులు రాజా మంత్రిప్రెగడ భుజంగరావుగారు (1872 - 1948). వీరు సంస్కృతాంధ్ర భాషా పండితులు; కవులు, దర్శనాచార్యులు; ఆంధ్ర భాషయందు 'కథాసరిత్సాగరము' అను మహా గ్రంథమును పదివేలకు మించిన పద్యకృతిగా రచించి యున్నారు; ఇంకను ననేక గ్రంథములు రచించిరి. వీరు కృతికర్తలు, కృతి భర్తలు, 'మంజువాణి' అను మాసపత్రికను పెట్టి అందు పెక్కు ప్రాచీన పద్యకృతులను ప్రకటించిరి. వీరు క్రైస్తవ మతమునం దభినివేశము గలవారై క్రైస్తవమత వేద గ్రంథమగు బైబిలు నంతయు పద్యకావ్యముగా రచించి, పంచమ జార్జి చక్రవర్తిచేతను, రోమునందలి క్రైస్తవ మతాచార్యుల చేతను ప్రశంసల నందిరి.

మునగాల: మునగాల జమీన్‌దారులగు రాజా నాయని వెంకట రంగారాయనింగారు ఆంధ్ర భాషా పోషణ కావించి యున్నారు; వరదరాజు నందికేశ్వరశాస్త్రియను నొక యారాధ్య విద్వాంసునిచేత, 'శివతత్త్వ సుధానిధి' యను నాంధ్ర ప్రబంధమును రచియింపజేసిరి. ఇందు నాయని వారి వంశావళి వర్ణితమైనది. నందికేశ్వర శాస్త్రిగారు సేతుమాహాత్మ్యము అను మరియొక ప్రబంధము రచించిరి.

వుయ్యూరు : నూజివీడు సంస్థానములో నొకభాగ మగు వుయ్యూరు రాజావారు రాజా వేంకటాద్రి అప్పారావుగారు గీతగోవిందము మొదలగు కృతులు రచించిరి.

జయపురము : (ఇది ప్రస్తుతము ఒరిస్సా కోరాపుట్టి జిల్లాలోనిది ; పూర్వమునందు విశాఖజిల్లాలోనిది). ఈ సంస్థానాధీశులు నందాపురమున నున్నప్పుడు పెనుమళ్ల సోమకవి మొదలగు కొంద రాంధ్రకవులను పోషించిరి. తరువాత సంస్థానాధీశులైన విక్రమదేవవర్మ మహారాజుగారు సంస్కృతాంధ్ర ఉత్కళ భాషా ప్రవీణులై యాంధ్ర గ్రంథములు చాల రచించియు, కవులను పోషించియు, గ్రంథ ముద్రణమునకు ద్రవ్యసహాయము చేసియు ఆంధ్ర భాషా సాహిత్య వికాసమున కెంతయు దోడ్పడిరి.

పాచిపెంట : ఇది యొక మన్య సంస్థానము. పూసపాటి వంశీయులలో నొకరు దీని నేలుచుండిరి. పూసపాటి వీరపరాజనునాత డాంధ్ర భాషా పాండిత్యము గలవాడు, అచ్చతెనుగునందున పరిశ్రమ చేసినవాడు ; ఆంధ్ర పదాకరము అను ప్రశస్త నిఘంటువును రచించెను.

పాలకొండ : దీనిని 18 వ శతాబ్దిని పాలించిన రామభద్రరాజు భాషాపోషకుడు. పులిజాల లక్ష్మీనారాయణకవి పారిజాతాపహరణమను ప్రశస్త యక్షగానము రచించి యాతని కంకితము చేసెను.

పార్వతీపురము : ఇది మన్య సంస్థానము. ఇచ్చటి పాలకునికి ధనంజయ భూపాలుని అని పేరు. కవిసార్వభౌముడని ప్రసిద్ధి వహించిన పంతుల బ్రహ్మదేవ కవియు (ఇందుమతీ పరిణయ ప్రబంధ కర్త), విచిత్ర రామాయణము అను గ్రంథము నిరువది నాల్గాశ్వాసములుగా రచించిన కొమ్మోజు సోమనాథ శిల్పాచార్యుడును నీతని యాస్థానము నలంకరించిన విద్వత్కవులు.

సంగమ వలస: ఇది యొక చిన్న సంస్థానము, దీని యధిపతి మృత్యుంజయ నిశ్శంక భూపాలుడు సంస్కృతాంధ్రములయం దసమాన పాండిత్యము గలిగి దేవరాజు వెంకటరాయమంత్రి, తణికెళ్ల ప్రకాశశాస్త్రి మొదలగు కవులను పోషించెను; తాను కాళిదాస నాటకత్రయమునకు వ్యాఖ్యానము వ్రాసెను. అరసవల్లి సూర్యనారాయణస్వామి చరిత్రము, గుంప సోమేశ్వర చరిత్రము, భల్లాణ చరిత్రము మొదలగు గ్రంథములు రచించెను. ఈ రాజన్యుని జీవితమును శ్రీ మహామహోపాధ్యాయ పరవస్తు రంగాచార్యులవారు పద్య కృతిగా 'నిశ్శంక చరిత్రము' అని వ్రాసినారన్నచో నింక నీతని వైదుష్యమును గూర్చి వేరే ప్రశంసింప నవసరము లేదు.

పూర్వోక్త సంస్థానాధీశ్వరులే కాక కోటరామచంద్రపురము (తూర్పుగోదావరి జిల్లా) కాకర్లపూడివారును, విశాఖపట్టణము గోడేవారును, చుండి కామినేనివారును, తోటవల్లూరు (నెల్లూరు జిల్లా) జమీన్‌దారులు బొమ్మదేవరవారును, కపిలేశ్వరపురము (తూర్పు గోదావరి జిల్లా) బలుసువారును, రేపల్లె జమీన్‌దారులును యథాశక్తిగ భాషాపోషణ కావించినవారే. కాకర్లపూడి రామచంద్రరాజుగారు శిష్టు కృష్ణమూర్తి శాస్త్రిగారిని ఆస్థానకవిగా జేసికొని సమ్మానించిరి. కాకరపర్తివారు గోడేవారి ఆస్థాన కవులు. కాకరపర్తి బుచ్చిపాత్రకవి సత్యవతీపరిణయ ప్రబంధకర్త, కాకరపర్తి కృష్ణకవి సత్యభామాకృష్ణ సంవాద కృతికర్త, కాకరపర్తి సీతారామశాస్త్రి చిత్రవతీ పరిణయ ప్రబంధకర్త మొదలగుకవు లీ సంస్థాన పోషితులు. గోడే వారిలో ప్రసిద్ధులు గోడే నారాయణ గజపతిరాజుగారు. వీరి సోదరులు జగన్నాథరాజుగారు యోగులై 'జ్ఞానభోగి, గోడే జగన్నాథయోగి' అను వేదాంతపరముగ సీసపద్య శతకమును రచించిరి. నారాయణ గజపతిరాజుగారు శ్రీ మహామహోపాధ్యాయ పరవస్తు రంగాచార్యులవారి శిష్యులై, హిందూ శాస్త్రము అను గ్రంథమును రచించిరి. ఆంధ్ర విద్వాంసుల కమితోపయుక్తమగు సర్వశబ్ద సంబోధిని అను నిఘంటువును శ్రీ పరవస్తు శ్రీనివాసాచార్యుల వారిచేత నిర్మింపజేసిరి. చుండి సంస్థానాధిపతి కామినేని బంగారంకభూపాలుడు చిత్రకవి సింగరాచార్యుని పోషించి అతనివలన 'రాఘవ వాసుదేవీయము' అను ద్వ్యర్థి కావ్యము నంకితము గొనెను. బొమ్మదేవరవారి యాస్థానకవి మతుకుమల్లి నృసింహ విద్వత్కవి. ఇతడు అజచరిత్ర, చెన్నపురీ విలాసము అను ప్రబంధములు రచించెను. చెన్నపురీ విలాసము 1860 లోని చెన్నపురి(మద్రాసు)ని వర్ణించుచు వ్రాసిన కృతి. శ్రీ బలుసు బుచ్చి సర్వారాయుడుగారు చింతలపూడి యెల్లకవి కృతమైన రాధామాధవ కావ్యమును, కందుకూరి రుద్రకవి సుగ్రీవ విజయమును ముద్రింపించి విద్వల్లోకమున కొనసగిన భాషాభిమానులు. రేపల్లె జమీన్‌దారులు జంగన్నామాణిక్యా రావుగారు అకలంకము కృష్ణమాచార్యులను విద్వత్కవిని పోషించిరి. ఈతని శకుంతలా పరిణయము కృష్ణకవి పేరున కవిచరిత్రకు నెక్కినది. ధనుర్విద్యా విలాసమనునది ఈతని మరియొక కృతి. ని. వెం. రా.

**సంస్థానములు (తెలంగాణా) - సాహిత్యసేవ:** పెక్కు శతాబ్దములకుమున్నే రెడ్డి, వెలమవీరులు తమ బాహు బలముచే సంపాదించుకొన్న చిన్నచిన్న స్వతంత్ర రాజ్యములు కొండొక కాలమున ఓరుగల్లు, విజయనగరము, బహమనీ సుల్తానులు మున్నగువారికి లొంగిపోయి, మొన్నటివరకును నిజాం ఆసఫ్‌జాహీల పరిపాలనమున నణగి, తమ పూర్వవైభవమును గోలుపోయినవైనను వాని కొక చిరస్మరణీయమైన చరిత్ర కలదు. అట్టివానిలో భారత స్వాతంత్ర్య సిద్ధివరకు నిలిచిన సంస్థానములు - గద్వాల, ఆత్మకూరు (అమరచింత), వనపర్తి, జటప్రోలు (కొల్లాపురము), పాల్వంచ, పాపన్నపేట, దోమకొండ, ఆనెగొంది, గోపాలపేటలు. ఇవిగాక సిర్నపల్లి, చించోడు, దుబ్బాకుల మొదలగు చిన్న సంస్థానము లున్నవి. వీనిలో ప్రముఖముగ సాహిత్యసేవ, కళాసేవ కావించినవి గద్వాల, ఆత్మకూరు, వనపర్తి, జటప్రోలు, దోమకొండ, గోపాలపేటలు; సంస్థానము నశించినను సంస్థానాధిపతి రచించిన కావ్యములు మిగిలి యున్నట్టిది అలంపురము.

గద్వాల: పూర్వోక్త సంస్థానము లన్నింటిలోను పూర్వమునుండియు వితరణగుణ, విద్వత్పోషణములకు బ్రసిద్ధి కెక్కినట్టిది గద్వాల సంస్థానము.

ఈ సంస్థానాధీశులలో సోమనాద్రి (శోభనాద్రి) మిక్కిలి పరాక్రమవంతుడు. అనేక యుద్ధములందు నిత్య జయలక్ష్మీ పరిరంభణము నందుచు నిప్పు దున్న గద్వాల కోటను గట్టించిన శూరుడు; గద్వాల నగరాభివృద్ధిని గావించి యచ్చట గొప్ప దేవాలయములను గట్టించెను. ప్రతి సంవత్సరమునను గద్వాలలో రెండు పర్యాయములు విద్వత్కవిగాయక సత్కారములు జరుగుచుండెడివి-ఒకటి కార్తిక పూర్ణిమకు. రెండవది మాఘ పూర్ణిమకు. కార్తిక మాసమున జరుగు సభలలో తర్క వ్యాకరణ జ్యోతిష వేదాంతాది శాస్త్రములందును, వేదవేదాంగము లందును విద్వాంసులు పరీక్షింపబడి, సత్కరింపబడుచుండెడివారు. పారితోషిక ద్రవ్యముకన్నను పాండితీ వైభవము జగద్విఖ్యాతము గావలయు నన్నచో నే మూలనున్న పండితు

డైనను గద్వాలకు వచ్చి తీరెడువాడు. కనుకనే దానికి 'విద్వద్గద్వాల'యను ప్రశస్తి కలిగెను. ఈ యాస్థానమునం దుండిన కాణాదము పెద్దన అధ్యాత్మ రామాయణము, ముకుందవిలాసము, మత్స్యపురాణము, శేష శైలేశలీల, యథాశ్లోక తాత్పర్య రామాయణము (బాలకాండ మాత్రము), రామాయణ చంపూ వ్యాఖ్య మున్నగు గ్రంథములను రచించెను. ఇతడు నందవరీక బ్రాహ్మణుడు; ప్రౌఢకవి. ఇతడు గద్వాల సంస్థానస్థ బోరవెల్లి గ్రామవాసి.

సోమనాద్రి మనుమడు చిన సోమనాద్రి లేక చిన్న సోమ భూపాలుడు. ఇతడు స్వయముగా కవి. 'రతి రహస్యము' అను మనోహర ప్రబంధమును రచించెను. ఇతడు 'అష్ట పదులు సైతము' రచించెను. చిన సోమభూపాలుని కాల మున సారస్వతసేవ చక్కగా జరిగిన దనుటకు పెక్కు నిదర్శనములు గలవు.

బోరవెల్లి శేషాచార్యులు యథాశ్లోకతాత్పర్య రామా యణము (యుద్ధకాండమున నాలు గాశ్వాసములు) రచిం చెను. ఈ కృతి గద్వాల కేశవస్వామి కంకితము చేయబడి నది. విద్వత్కవికుంజర బిరుదాంకితుడైన కామసముద్రము అప్పలాచార్యులు, ఆంధ్రాష్టపది లేక కృష్ణలీలాతరంగిణి, యథాశ్లోక తాత్పర్య రామాయణము (కిష్కింధా కాం డము) మున్నగు గ్రంథములను రచించెను. తిరుమల కృష్ణమాచార్యులు యథాశ్లోక తాత్పర్య రామాయణము (సుందరకాండము మూడాశ్వాసములు) రచించెను. తిరు మల బుక్కపట్టణము బుచ్చి వెంకటాచార్యులు వేదాంత కారికావళి (ముద్రితము), అభినవ శృంగార రసమంజరీ భాణము, కల్యాణ పురంజనము, శృంగార సర్వస్వము మున్నగు గ్రంథములను రచించెను. అచలాత్మజా పరిణయ కర్త కీకవి తమ్ముడు. ధర్మవరము రామకవి సోమ నృపాలుని యాజ్ఞచే ముకుంద విలాసమును వ్రాసెను. క్రొత్తపల్లి రామాచార్యులు యథాశ్లోక తాత్పర్య రామాయణము (అయోధ్యాకాండము అయిదాశ్వాస ములు) రచించెను. నరసింగమయ్య (కాణాదమువారికి బావమరది వరుసగల కుటుంబమువాడు) నృసింహ విలాస కృతికర్త. కొటికలపూడి వీరరాఘవాచార్యులు యథా శ్లోక తాత్పర్య భారతము(ఉద్యోగపర్వము)ను రచించెను. ఇది పూడూరు కేశవస్వామి కంకితము చేయబడినది. ఇట్లు చినసోమభూపాలునికి గొంచెము పూర్వముగను, గొంచెము తర్వాతను, సమకాలికముగను గల కవి పండిత లోకము గద్వాల సంస్థానము నాశ్రయించి సారస్వతసేవగావించెను.

తరువాత బేర్కొనదగిన సంస్థానాధీశుడు ముష్టిపల్లి రామ భూపాలుడు (గద్వాలరాజుల వంశ నామము ముష్టిపల్లి వారు). సుమారు నూటపది సంవత్సరముల క్రింద నుండిన ఈ రాజకవి 'ఛందోముకుర' మను సంస్కృత గ్రంథము (ముద్రితము) రచించెను. పురాణము దీక్షాచార్యులవా రీ కవికి విద్యాగురువు. సుమారు డెబ్బది సంవత్సరములకు పూర్వమున గద్వాల నాశ్రయించిన కవులలో బైరంపల్లి తిరుమలరాయ కవి సంస్కృతాంధ్రములలో నాశుకవితను జెప్పిన దిట్ట. ఈ కవి తరువాత పేర్కొన దగినవాడు పుల్లగుమ్మి నివాసియైన పురాణము దీక్షాచార్యులు. ఛందో ముకురము, రామచంపువు, రామనృపకర్ణపూరము, కేశవ సుప్రభాతము, కావ్యోత్కర్ష మున్నగునవి ఈయన రచ నలు. ఇంచుమించుగా నీ కాలమున సంస్థానమునందు పరీ క్షాధికారిగా నుండిన చెట్లూరి నారాయణాచార్యులు ప్రతాపరుద్రీయము (అముద్రితము)ను రచించెను.

ఈ రామభూపాలుని యాస్థాన మంటపమునందే తిరుపతి వేంకటకవులు శతావధాన, చాటుకవితా ప్రదర్శనములు గావించినది. గద్వాల సంస్థానమునందు జరుగుచుండిన విద్వత్సభలకు కాశీ, మైసూరులనుండియు, కృష్ణా గోదావరిజిల్లాల (ముఖ్యముగ కోనసీమ) నుండియు, ఆంధ్రమునందలి ఇతర ప్రాంతములనుండియు వేదశాస్త్ర సంపన్నులగు విద్వాంసులును, కవి గాయకాది కళాకో విదులును గద్వాలకు వచ్చి రామభూపాలునిచే సత్కృతులై వెళ్లుచుండెడివారు.

రామభూపాలుని కుమారుడు సీతారామ భూపాలుడు. ఈయనన్య సామాన్య దాన ధురీణునిచే సత్కృతులైన వారిలో వేదము వెంకటరాయశాస్త్రి, గాడేపల్లి వీర రాఘవశాస్త్రి, అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి మున్నగు వారు కలరు. ఆశుకవిత్వము, సమస్యాపూరణము, శతా వధానాష్టావధానములు ఈ రాజన్యుని కత్యంత ప్రీతికరము లట. ఎచ్చటికి వెళ్లినను, ఎంత దూరదేశము వెళ్లినను విద్వత్కవి గాయకులను తనవెంట దీసికొనిపోవుట ఈయన కలవాటు. త్యాగభోగములలో నీ రాజునకు సమానులుగాని, యధికులుగాని 20 వ శతాబ్ది పూర్వభాగ మున నాంధ్రదేశమునం దెవ్వరును లేకుండి రనుట సత్య దూరముకాదు. ఈయన యాస్థానకవి ఆదిపూడి ప్రభాకర రావుగారు సీతారామభూపాలుని పులివేటను వర్ణించుచు 'పౌండరీకము' అను కావ్యమును వ్రాసిరి.

సాహితీ కవిత్వములందువలెనే సంగీతాది కళల యందును సీతారామనృపతి కాదరము మెండు. ఈయన సంగీత విద్వాంసులను వరుసగా గూర్చుండబెట్టి పల్లవిని బాడించి, వారి తారతమ్యమును గుర్తించి సత్కరించెడి వాడట. మైసూరునుండి వచ్చిన బిడారు క్రిష్టప్పగారిని

వేయినూట పదునార్లును, రత్న కంకణములును ఇచ్చి బహూకరించెను.

సీతారామభూపాలుని యనంతర మాయన ధర్మపత్ని రాణీ ఆదిలక్ష్మీదేవమ్మ సయితము ప్రాచీన సంప్రదాయ మును విడువక, భర్త సంపాదించిన కీర్తికి లోపము గలుగ నీయక కవి పండిత గాయకాదులను సత్కరించుచు వచ్చి నది. పోకూరి కాశీపతికవి త్ర్యర్థిప్రబంధము, పుల్లగుమ్మి వారి సంస్కృత రచనలు, గాడేపల్లి వీరరాఘవశాస్త్రి చాటు ప్రబంధములు మున్నగున వెన్నియో ఈయన కాలమున ముద్రితము లయినవి.

ఆత్మకూరు (అమరచింత) : ఈ సంస్థానము మహ బూబు నగరం జిల్లాలోనిది. దీనికి మూలపురుషుడు గోపాలరెడ్డి. ఈతని సంతతివారు బహ్మనీ సుల్తానులకు, పేష్వాలకు, ఆసఫ్ జాహీ వంశజులకు సహాయ మొనర్చుచు వారి వారి యనుగ్రహములకు పాత్రులై సంస్థానమును విస్తృతము కావించుకొనిరి.

ఇచ్చట ఫాల్గున శుక్లపక్షమున విద్వత్సభలు, కవిగాయక సమావేశములు, నృత్యనాట్యములును జరుపబడుచుండెను. గద్వాలయందువలెనే యిచ్చటను కవులు, పండితులు మున్నగువా రర్హసత్కారములను బడయుచుండిరి. గద్వాల రాజులతో నీ రాజులు దానధురీణతయందు పోటీ పడు చుండిరట. గద్వాలలో సీతారామ భూపాలుడును, ఆత్మ కూరునందు శ్రీరామ భూపాలరావును బరిపాలించుచుండిన 20వ శతాబ్ది ప్రారంభ కాలమున నిట్టి వదాన్యతాస్పర్ధ యెక్కువగా నుండినదని చెప్పుదురు. అది సంస్కృతాంధ్ర కవితాస్రవంతు లొడ్డు లొరసి ప్రవహించిన శుభకాలమని పేర్కొనవచ్చును.

ఈ సంస్థానమున సుమారు 200 సంవత్సరములకు బూర్వ ముండిన సురపురము కేశవయ్య యను కవి నిరోష్ఠ్య రామాయణమును (అముద్రితము) రచించి ఈ సంస్థానపు పూర్వప్రభువైన రాజా సోమభూపాలున కంకితము చేసెను. తిరుమల బుక్కపట్టణము రంగాచార్యులు గుణరత్నాకర, పద్మినీ పరిణయ చంపువులను (అముద్రితములు) రచించెను. ఈ కవి బాలసరస్వతి శ్రీనివాసాచార్యులుగారికి బినతండ్రి. అరిశాణపాలము వెంకటాధ్వరి లక్ష్మీ సహస్ర వ్యాఖ్యను రచించెను.

బుక్కపట్టణము శ్రీనివాసాచార్యులుగారు 'తర్కతీర్థ', 'బాలసరస్వతీ' బిరుదములు వహించి సంస్కృతమున శతఘంటాకవనము జెప్పినవారు. ఎనిమిది తరములుగా నీ వంశమువారు కవులు. సుప్రసిద్ధులైన కిరీటి వెంకటా చార్యులుగారు వీరి సంతతివారిలో నొకరు. శ్రీనివాసా చార్యులుగారు దర్భాంగ, జోధ్‌పూరు, బుందీదత్తియా, గ్వాలియర్, జ్యోతిపురము, కోటాంజరి, ఇందూరు, ధారా నగరు, జమ్మూ మున్నగు సంస్థానములందే కాక బనగాని పల్లె, పెనుగొండ, సురపురము, ఆనెగొంది మున్నగు ప్రదేశముల యందును తమ పాండితీ ప్రకర్షను చూపి ఆశుకవితా ప్రదర్శనములును, అవధానములును గావిం చిరి. వీరి రచనలు విశేషించి గీర్వాణ భాషయందే యున్నవి. శ్రీనివాస విలాసము, వీరశైవ శిరస్తాడనము, దుర్విగ్రహ నిగ్రహము, నంజరాజ పరిణయ చంపువు, తత్త్వమార్తాండ ప్రభాపటలము, కిరీటి వెంకటాచార్య విజయ వైజయంతీ నాటకము, రాజవంశ రత్నావళి, లక్ష్మీ సరస్వతీ దండకములు మున్నగు గ్రంథములు వీరి రచనలు. తిరుపతి వేంకట కవులకు గజోత్సవమును, రత్న కంకణ భూదాన పూర్వకముగా వేయినూట పదారులును అర్పించినవాడు ఆత్మకూరు సంస్థానాధిపతి శ్రీరామభూపా లుడే. ఈ కవులీ సత్కారము లంది శ్రీనివాస విలాసమును రచించి కీర్తి ధ్వజమును బ్రతిష్ఠించిరి (చూ: శ్రీనివాసా చార్యులు, తిరుమలబుక్కపట్టణము)

దీక్షితుల నరసింహశాస్త్రిగారు లక్ష్మణ పరిణయము, తెనుగు సత్యనారాయణ వ్రతకల్పము, విదురాశ్వత్థ మాహాత్మ్యము, శ్రీరంగ మహోత్సవ వర్ణమాలిక, పారు వేటపద్యములు మున్నగునవి రచించిరి. వీరికి సంస్థానము వారు 'మహాకవి' యను బిరుదము నొసగి యుండిరి. హారతి దీక్షాచార్యులుగారు మహాంతర్లాపమాల, అలంకరణ మణిమాల, ఆచార్య వింశతి మున్నగు గ్రంథములను వ్రాసిరి. తిరుమల బుక్కపట్టణం రంగాచార్యులుగారు బంధకవిత్వమును జెప్పగలిగి యుండి, రంభోర్వశీయము మున్నగు గ్రంథములను రచించిరి. వీరుగాక యితర కవు లెందరో యుండిరి.

శ్రీరామభూపాలరావు తరువాత వారి ధర్మపత్ని యగు సర్వై రాణి భాగ్యలక్ష్మమ్మగారు సంస్థాన ముండునంతవర కును ప్రాచీన సంప్రదాయమును విడువక విద్వత్కవి గాయక సత్కారములు జరిపించుచునే యుండిరి.

వనపర్తి : ఈ సంస్థాన రాజులకు మూలపురుషుడన దగినవాడు వీరకృష్ణారెడ్డి. ఇతని సంతతివారిలో 'అష్ట భాషా గోపాలరాయడు' తిరుపతి, కంచి మున్నగు క్షేత్రములను సందర్శించి తిరిగి వచ్చుచు బెక్కండ్రు పండితులను వెంటనిడుకొని వచ్చెను. తన సంస్థానమున శ్రీరంగపురమను పురమును (ఇప్పటి శ్రీరంగాపురము), దివ్యమగు దేవాలయమును, రంగసముద్ర మను పేరుగల గొప్ప తటాకమును నిర్మించెను. ఇతడు మహాశూరుడై

'బహిరీ' బిరుదమును, గ్రామములను, అధికారములను సంపాదించుటయేకాక రామచంద్రోదయ మను శ్లేష కావ్యము, శృంగారమంజరీ భాణము మున్నగు సంస్కృత గ్రంథములను రచించెను; షడ్దర్శనీవల్లభుడని బిరుదము నందెను. ఇతని దత్తపుత్రుడు సవై వెంకటరెడ్డి.

సవై వెంకటరెడ్డి న్యాయదీక్ష కలవాడు. తండ్రి పేరున గోపాలపేట యను గ్రామమును నిర్మించెను (ఇది మొన్నటి వరకు నొక చిన్న సంస్థానముగా నుండినది). ఇతని కుమారుడు గోపాలరావు. రాజధాని సూగూరు. గోపాలరావు సంతతివాడైన ప్రథమ రామకృష్ణారావు రాజధానిని సూగూరునుండి యిప్పటి వనపర్తికి మార్చెను. ఈ రామకృష్ణారావు గొప్ప పండితుడు; గొప్ప భక్తుడు; జ్యోతిషమునందు ప్రజ్ఞ గలవాడు. ఇతని యనంతర మీ సంస్థానమునకు వరుసగా అధిపతులైన ప్రథమ రామేశ్వర, ద్వితీయ రామకృష్ణ, ద్వితీయ రామేశ్వర రాయలు దత్తులు. వీరిలో ద్వితీయ రామేశ్వర రాయలకాలమునందే తిరుపతి వేంకటకవులు వనపర్తి సంస్థానమునకు వచ్చిరి.

సుమారు 130 సంవత్సరముల క్రిందట వనపర్తి ప్రాంతమున నుండిన అయ్యమాచార్యులు చెన్నకేశవ విలాసము, రామేశ్వర విజయము నను గ్రంథములను రచించెను. ఈ సంస్థానమున 230 సంవత్సరములక్రింద నుండిన చెన్నకృష్ణ కవి (నందవరీకి) యాదవ భారతీయమును (ద్వ్యర్థి ప్రబంధము) రచించి జనుంపల్లి వల్లభరాయని కంకితము చేసెను. సుమారు 180 సంవత్సరముల క్రిందట వీరరాఘవాచార్యులు సంస్కృత భాగవతమునకు 'వీరరాఘవీయ' మనుపేర నొక వ్యాఖ్యను రచించెను. ఇది విశిష్టాద్వైత వ్యాఖ్య. ఈ సంస్థానమునందలి వేపర్లగ్రామ నివాసులైన అక్షింతల సుబ్బాశాస్త్రిగారు, హొసదుర్గం కృష్ణమాచార్యులవారు, శ్రీకృష్ణ బ్రహ్మతంత్ర పరకాలయతీంద్ర మహాదేశికులవారును మహాపండితులు. ఈ సంస్థానమున ధర్మాధికారిగా నుండిన కృష్ణమాచార్యులవారి కుమారుడు హొసదుర్గం శ్రీనివాసరాఘవాచార్యులు వీరరాఘవీయ భూమిక, ఆచార్య వైభవము, స్వభావ పద్ధతి అనునవి రచించెను. ఈ సంస్థానమునందలి కడకుంట్ల గ్రామనివాసియగు పాపాశాస్త్రి భారత సంగ్రహమును, భ్రమరాంబికా సంవాదమును వ్రాసెను. ఈయనకు 'కవికరి' యను బిరుద ముండెను.

ద్వితీయ రామేశ్వరరావు కాలమున పూర్వము నుండియు, ముఖ్యముగా తన తల్లి రాణీ శంకరమ్మనాటి నుండియు జరుగుచుండిన విద్వత్సభా సత్కారములు చక్కగా నిర్వహింపబడెను. ఈ సంస్థానమువారు రాజానగరము(వనపర్తికి సమీపమున నున్న గ్రామము)న కార్తిక మాసమున జరుగు బ్రహ్మోత్సవ సమయమున వేదవేదాంగ పారీణులను, ఫాల్గున పూర్ణిమకు జరుగు శ్రీరంగాపుర రంగనాయక మహోత్సవ (తిరునాళ్ళ) సమయమున కవి గాయకులను సత్కరించుచుండెడివారు. ఆ సభా సత్కారములు మొన్నటివరకు నవిచ్ఛిన్నముగా సాగినవి. రామేశ్వరరావుగారు విద్వాంసులను, కవులను ప్రేమపూర్వకముగా గౌరవించిన యుదార స్వభావులు. నెమలూరి వెంకటశాస్త్రి శతావధానిగారిని దమ సంస్థానమున నుంచుకొని, వారికి భూదాన గృహదానము లొనర్చి, వారిచేత వనపర్తి సంస్థాన చరిత్రను పద్యరూపమున రచింపించిరి; సుప్రసిద్ధ విద్వాంసులయిన శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారి కాశ్రయ మిచ్చి వారిద్వారా గ్రంథ పరిశోధన ముద్రణాదులు గావింపించిరి.

శేత్తలూరు శేషాచార్యులు, కాశీనగరమున తర్కశాస్త్రాధ్యయనము చేసివచ్చిన నంబాకం రాఘవాచార్యులు మున్నగు విద్వాంసు లనేకులు వనపర్తివారే.

ఈ సంస్థానమునందలి రాజానగర గ్రామవాసులు (ఈ రాజా నగరముననే సంస్థానమువారు కార్తీకమాసమున విద్వత్సభలు జరుపుచుండెడివారు), ఆధునికులు అని చెప్ప దగిన విక్రాల నరసింహాచార్యులుగారు సంస్కృతాంధ్రములందు పండితులై యుండుటయేగాక ఆంగ్లమును, ఉర్దూను సైతము నేర్చియుండిరి. వీరు ఆశుకవిత్వమును జెప్పుటయే గాక శతావధాన మొనర్చిన ప్రజ్ఞాధురీణులు. సంస్కృతాంధ్ర భాషలలో సరసకవిత్వమును జెప్పిన వనపర్తి ప్రాంతీయులలో వీ రగ్రగణ్యులు. భారతీ స్తుతి, కళ్యాణి (ముద్రితములు), మాలతీ మాధవము (ఆంధ్రీకృతము), కురు సంధానము, దూతాంగదము, జగన్మోహన భాణము (అముద్రితములు) మున్నగునవి వీరి రచనలు.

జటప్రోలు (కొల్లాపురము): ఈ సంస్థానము మహబూబునగరం జిల్లాలోనిది. ఈ సంస్థానాధీశులు వెలమవారు, సురభి వంశీయులు. వీరి మూలపురుషుడు బేతాళనాయడు. ఈ వంశమునందలి మల్లానాయని కంకితముచేసి, ఎలకూచి బాలసరస్వతి 'సురభిమల్లా! నీతివాచస్పతీ!' అను మకుటముతో మల్లభూపాలీయమను పేర భర్తృహరి సుభాషితత్రయి ననువదించెను. సురభి మాధవరాయలు స్వయముగా గవియై 'చంద్రికా పరిణయ'మను ప్రౌఢ ప్రబంధమును రచించెను. ఈ వంశమువారిలో సుమారు 120 సంవత్సరములక్రింద రాజ్యము చేసిన లక్ష్మారావు వరకు వీరికి జటప్రోలును, అటుతరువాత కొల్లాపురమును రాజధానులుగ నుండెను.

లక్ష్మారాయ పౌత్రులైన వెంకట లక్ష్మారావుగారి కాలమునుండి యిప్పటివరకును ఈ సంస్థానమున సారస్వత సేవ జరిగినది. వీరి కాలమునందే వెల్లాల సదాశివశాస్త్రి గారును, అవధానము శేషశాస్త్రిగారును కలసి చంద్రికా పరిణయమునకు విపులమైన తెలుగు వ్యాఖ్యానమును రచించిరి. శాస్త్రజ్ఞులైన పండితు లెందరో వీరి సత్కార ముల నందిరి. వీరు తమ గ్రామీణులలో గొందరిని దేశాంతరములకు బంపి సంగీతము, శాస్త్రములు, వైద్యము, శిల్పము మున్నగువానియందు వారిని నిపుణులగునట్లు చేసిరి. వీరి యనంతరము వీరి ధర్మపత్ని రాణి వెంకట రత్నమాంబగారు ప్రాచీన మర్యాద లన్నింటిని గాపాడుచు గవి పండిత పోషణము గావించిరి.

వైయాకరణ గజకంఠీరవ యుణయవల్లి కృష్ణమాచార్యులు సంస్థాన విద్వాంసులై సంస్కృతమున 'అష్ట ప్రాస రామశతకము, శ్రీకృష్ణ చంపువు, నిరోష్ఠ్య కృష్ణ శతకము, రసజ్ఞానానందము, జాతక చంద్రిక వ్యాఖ్య అను గ్రంథములను రచించెను. సుమారు 80 సంవత్సరముల క్రింద నుండిన కృష్ణమాచార్యులు 'నృసింహ విలాస'మను తెలుగు కావ్యమును రచించి తనకు సమకాలిక ప్రభువైన జగన్నాథరావుగారి కంకితము చేసెను. కవికంఠీరవ కృష్ణమాచార్యులు సుమారు 120 సంవత్సరములక్రిందట సంస్కృతమున నిరోష్ఠ్య రామాయణమును రచించెను.

కవితార్కికసింహ మంచాలకట్ట గోవిందాచార్యులు గారు (నెల్లూరు సంస్కృత కళాశాలయందు బహుకాల ముపాధ్యాయులుగా నుండి యలంకార శాస్త్రమును బోధించిరి. చిత్ర మీమాంసను పాఠము చెప్పుటయందు వీరద్వితీయులు), మంచాలకట్ట గోపాలాచార్యులు మహావిద్వాంసులు జటప్రోలు సంస్థానమునకు సంబంధించిన వారు. నియతముగా గద్వాలాది సంస్థానములందువలె ప్రతి సంవత్సరమునందును విద్వత్సభలు జరుగకపోయినను ఈ సంస్థానమున దైనందినముగా బండితగోష్ఠులు, అప్పుడప్పుడు కవి సత్కారములు, గ్రంథ ముద్రణములు జరుగుచునే యుండినవి.

దోమకొండ : పురాతన సంస్థానములలో నిది యొకటి. దీని యధిపతులకు మూలపురుషుడు కామినేడు. ఇతడు మెదకు జిల్లా వాడు. బిక్కనవోలు ఇతని రాజధాని. ఇతని కయిదవ తరమువాడైన కాచరెడ్డి మనుమడు మల్లారెడ్డి ఈ వంశమున కపారమైన కీర్తిని జేకూర్చెను. రెడ్డికవులలో నితడు ప్రాచీనుడు; షట్చక్రవర్తి చరిత్రము. పద్మపురాణము, శివధర్మోత్తర ఖండము మున్నగు ప్రబంధములను రచించెను. ఇతడు కుతుబ్‌షాహి వంశజుడైన సుల్తాన్ ముహమ్మదు పాదుషా సమకాలీనుడు. మల్లారెడ్డి వంశీయుడైన రాజన్నచౌదరి కాలమున బిక్కనవోలునకు మూడు క్రోసుల దూరమున నున్న దోమకొండకు రాజధాని మారుటచేత నాటినుండియు వీరు దోమకొండ రాజులైరి.

ఈ సంస్థానమునకు సంబంధించిన కవులలో మల్లారెడ్డికి తరువాత పేర్కొనదగినవాడు కామినేని ఎల్లారెడ్డి (బిక్కనవోలు). ఇతడు మల్లారెడ్డికి సోదరుడు. వాసిష్ఠము, లైంగ్యము ఇతని రచనలు. కాని గ్రంథములు లభింపలేదు. మల్లినాథసూరి వంశీయుడగు కొలచెలమ నారాయణ పండితుడు (కొలచెలమ, మెదకుజిల్లా) చంపూరామాయణ వ్యాఖ్యను రచించెను.

దోమకొండకంటెను ప్రాచీనములయిన పాల్వంచ, పాపన్నపేట సంస్థానములరాజులు మహాశూరులు. వారి యాశ్రయమున నా యా ప్రాంతములందు కవు లెందరో వెలసిరి. మెదకు మండల కవులు పాపన్నపేటకో, దోమకొండకో సంబంధించి యుందురు.

గోపాలపేట : ఇది వనపర్తినుండి విడిపోయిన యొక చిన్న సంస్థానము. వనపర్తి, గద్వాల మున్నగు సంస్థానముల గాలి కొంత వీచుటచే నీ సంస్థానమువారును కేశంపేట యను గ్రామమున నుత్సవమును గావించి కొద్దిపాటి పండిత సత్కారములు గావించుచుండెడివారు. పూర్వపు రాజైన జగ్గాపలరావు పండితాదరణము గల ప్రభువు. వీరి ధర్మపత్ని రాణి రంగనాయకమ్మగారు సైతము కవిపండిత సత్కారములు, సప్తాహాది పుణ్యకార్యములు గావించుచుండెడివారు.

గోపాలపేటయందు వర్తమాన శతాబ్ద పండిత కవి శ్రేణిలో పేర్కొనదగినవారు బుక్కపట్టణము రాఘవాచార్యులుగారు. వీరు వారణాసియందు వ్యాకరణశాస్త్రమును సమగ్రముగా నభ్యసించి దేశమున మహావైయాకరణులుగా కీర్తిని గడించిరి.

అలంపురము : రెడ్డిరాజులయిన బిజ్జలవారీ యలంపురమును రాజధానిగా జేసికొని యీ ప్రాంతమును బాలించిరి. బిజ్జల తిమ్మభూపాలుడు వనపర్తి రాజగు అష్టభాషా గోపాలరాయని మేనల్లుడు; కవిపండిత సత్కారములు జరుపుటలో తన ధనాగారమును శూన్యము గావించిన దానగుణశాలి; స్వయముగా రసవత్కవిత్వమును జెప్పగలిగిన రాజకవి. ఈయన తెలుగున అనర్ఘరాఘవమను కావ్యమును రచించెను. కే. న.

**సత్యనారాయణ, నరసింహదేవర** (క్రీ. శ. 1894 - 1955) : వీరి జన్మస్థలము ఆలమూరు ; తండ్రి పేరిశాస్త్రి

గారు; తల్లి జగ్గమ్మగారు. వీరి కుటుంబము సాహిత్య, శాస్త్ర పాండిత్యములకును, నిరతాన్నదానమునకును ప్రసిద్ధిచెందినది. ఏడుగు రన్నదమ్ములలో వీరు అగ్రజులు. వీరు ఆలమూరు హోర్డింజి మిడిల్ స్కూలులోను, కొత్త పేట హైస్కూలులోను, రాజమహేంద్రవరము వీరేశ లింగము హైస్కూలులోను చదివి, తరువాత కాకినాడ పిఠాపురం మహారాజావారి కళాశాలలో ఉన్నతవిద్య నభ్యసించి ఇంటర్మీడియటు పరీక్ష ప్యాసయి విజయనగరం మహారాజావారి కళాశాలలో బి. ఏ. పరీక్షకు చదువుటకు విజయనగరం వెళ్లిరి; కాని 1920 నాటి గాంధి మహాత్ముని సహాయనిరాకరణోద్యమ సందర్భమున తమ చదువుకు స్వస్తిచెప్పి కాంగ్రెసు ఉద్యమములో ప్రవేశించి ఆలమూరు పరిసరప్రాంతముల పర్యటించి ప్రచార, ప్రబోధములు సలుపుచు వచ్చిరి. ప్రజాసేవకు తమ జీవితము నంకితము చేసికొని ముఖ్యముగా వీరు కృషిసలిపిన కార్యరంగములు మూడు: (1) సహకారోద్యమము; (2) గ్రామ పంచాయతీ ఉద్యమము; (3) గ్రంథాలయోద్యమము.



చిత్రము 302.
నరసింహదేవర సత్యనారాయణ

సహకారోద్యమమునకు వీరు ఆలమూరు (తూర్పు గోదావరి జిల్లా)ను కేంద్రముగా జేసికొని అచట సహకార యూనియన్ సంఘమును స్థాపించి 1923 నుండి కృషి నారంభించిరి. 1924 లో వీరు ఆలమూరు సహకార పరపతి సంఘమున కధ్యక్షులైరి; సహకారోద్యమవ్యాప్తికి తెలుగున సహకారపత్రికను నడపి దానికి సంపాదకులుగ నుండిరి. వీరు ఆలమూరులో 1928 లో దీర్ఘ కాలపు వాయిదాలమీద అప్పులిచ్చుటకు సహకారభూమి తనఖా బ్యాంకు (కో ఆపరేటివ్ ల్యాండ్ మార్ట్ గేజి బ్యాంకు)ను స్థాపించిరి. ఈ విధముగా స్థాపింపబడిన భూమి తనఖా బ్యాంకులలో ఇది మొదటిదై ఇట్టి బ్యాంకుల స్థాపనకు మార్గదర్శకమైనది. వీరి కృషివలనను, ఇతర సహకారోద్యమ నాయకుల కృషివలనను, పరిమితిలేని పూచీపై (అన్ లిమిటెడ్ లయబిలిటీ) నడిపింపబడు విధానము మారి 'పరిమితపూచీ' గల విధానముపై రూరల్ బ్యాంకులు స్థాపింపబడుట సంభవించెను. 1938 లో వీరు ఆలమూరులో ఈ పద్ధతిని కో ఆపరేటివ్ రూరల్ బ్యాంకు స్థాపించి నడపజొచ్చిరి. అది యా రోజులలో వినూతనమైనది. పలువు రానాడు నిలుచునా నిలువదా యని శంకించిన ఈ సంస్థ పునాది కట్టుదిట్టముకలదై నేడు రూరల్ క్రెడిట్ సర్వేవారి ప్రశంసలనుగూడ అందుకొన్నది. ప్రభుత్వమువారు దీని యుపయోగమును, ప్రజలకు దీనియందుగల విశ్వాసమును చూచి ఎన్నియో రూరల్ బ్యాంకులు స్థాపించియున్నారు. వీరు మద్రాసు రాష్ట్రపు అఖిల భారత సహకారోద్యమ పాలన సంఘమున 1939 నుండి సభ్యులుగా నుండిరి; 1940 నుండి 1952 వరకు ఆ లిండియా కో ఆపరేటివ్ యూనియనుకు కార్యదర్శిగ పనిచేసిరి; 1952 లో ఆ యూనియనుకు ఉపాధ్యక్షులుగ ఎన్నుకొనబడి జీవితాంతమువరకు ఆ పదవి నలంకరించిరి. మద్రాసు ప్రభుత్వమువారు వీరి సేవను గుర్తించి మద్రాసు లెజిస్లెటివ్ కౌన్సిలుకు వీరిని నామినేట్ చేసిరి. 1952 లో వీరు ఆంధ్రప్రదేశ్-భారత సేవక్ సమాజ్‌కు కన్వీనరుగా నియమింపబడిరి.

గ్రామ పునరుద్ధరణకు గ్రామ పంచాయతీలు ముఖ్య సాధనములని విశ్వసించి తదుద్యమవ్యాప్తికై వీరు విశేష కృషి కావించిరి. వీరు చాలకాలము ఆంధ్రరాష్ట్ర పంచాయతీ సంఘమునకు కార్యదర్శిగా నుండిరి; 1954 లో స్టేటు పంచాయతీ యూనియనుకు అధ్యక్షులుగా ఎన్నికైరి.

కో ఆపరేటివు ఉద్యమములో వీరికి గల ప్రజ్ఞా పాటవములను గుర్తించి భారత ప్రభుత్వమువారు వీరిని 1955 లో 'స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా' డైరెక్టర్ల బోర్డులో ఒక డైరెక్టరుగా నియమించిరి.

వీరు గ్రంథాలయోద్యమమునందు పాల్గొని వయోజన విద్యా వ్యాప్తి కెక్కువ కృషిచేసిరి.

వీరు సాహిత్యాభిమానులు; కవిసార్వభౌమ శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు రచించిన 'జగద్గురు చరిత్ర'ను అంకితము పొందిరి; వీరు కార్యదీక్షాపరులు; సౌమ్యులు.

వీరు బొంబాయికి స్టేట్ బ్యాంక్ డైరెక్టరుల మీటింగుకు వెళ్లి అక్కడనే కాలధర్మము నొందిరి. **న. జ. శా.**

**సత్యలింగ నాయకర్, మల్లాది** (క్రీ. శ. 1848 - 1915): గోదావరి జిల్లాలో కోరింగయందు ఇతడు ఒక సాధారణ కుటుంబమున జన్మించెను. హిందూదేశ సముద్ర తీరమునను, కోస్తానుండి బర్మా సింహళములయందలి రేవులకును ప్రయాణముచేయు నాటి ఓడలలో పనివాడుగ నితడు తన చిన్నతనమున పనిచేసి, 1868 నాటికి రంగూన్‌లో స్వంత వ్యాపారము మొదలిడెను. మూడేండ్లు శ్రమించి ఒక పడవనుకొని, దాని యాధారమున నార్జించిన ధనముతో 1892 వ సంవత్సరమున రు. 83,000 ల విలువచేయు రెండు స్టీములాంచీలను, ఆరు పడవలను

కొనగలిగెను. ఇందునకు తోడుగ అదృష్టముకూడ కలిసి వచ్చుటచే క్రమేణ అత్యధికముగ నార్జించి స్థిరచరరూప మున 15 లక్షల రూపాయల ఆస్తి నేర్పరచెను.

ఈతనికి పుత్రులు లేకపోవుటచే, సుబ్రహ్మణ్యా నాయకరు అను నతనిని దత్తుచేసికొని, అతనికి కొంత ఆస్తి నిచ్చి, మిగిలిన యెనిమిది లక్షల రూపాయలను ధర్మనిధిగా నేర్పరచెను. ఈతని విల్లునామా ననుసరించి యీ యెనిమిది లక్షలలోను ఒక లక్షరూపాయలు వెచ్చించి జగన్నాయక పురమున నొక పాఠశాలయును, ధర్మసత్రమును, చొల్లంగి యం దొక దేవళమును ధర్మ కర్తలు కట్టించిరి. కడమ ఏడు లక్షలును 'మల్లాది సత్యలింగనాయకర్ చారి టీస్' అను పేరున భూముల రూపమున కొంత, బ్యాంకుల యందు కొంతయు నిలువ యుంచబడినవి. వీనివలన వచ్చు ఆదాయముచే పై ధర్మసంస్థల నిర్వహణ జరుపు టయేగాక మదరాసు రాష్ట్ర మునుండి విదేశములకు ఉన్నత విద్యాభ్యాసమునకై వెళ్లు హిందూ విద్యార్థులకు ఉచితవేతనములనుగూడ నిచ్చుచున్నారు.



చిత్రము 303.
మల్లాది సత్యలింగ నాయకర్

తాను ఉన్నతవిద్యను పొందక పోయినను, కష్టపడి సంపాదించిన ధనము నీ విధముగ ధర్మకార్యములకు వెచ్చించి సత్యలింగనాయకర్ ఒక ఆదర్శపురుషు డైనాడు.

చీ. శే.

**సదాశివబ్రహ్మేంద్రయతి :** దక్షిణ భారతమున, ముఖ్యముగా తమిళదేశమున సదాశివబ్రహ్మేంద్రుల నంద రెరుగుదురు. అనేక సంస్కృత గ్రంథములు రచించిన ఈ తపస్విని అద్వైతులును, సన్న్యాసులును అధికముగ గౌర వింతురు. నారాయణతీర్థ, జయదేవాదులవలె ఈయనయు శ్రుతిసుభగములు, భావభరితములునగు ననేక సుందర గీతములను రచించెను.

సన్న్యాసాశ్రమమును స్వీకరింపక పూర్వ మీయన పేరు శివరామకృష్ణుడు. ఈయన కావేరియొడ్డున తిరువిశ నల్లూరు అను నామాంతరముగల శాహజీపురము అను గ్రామమున జన్మించెను. ఈయన తండ్రి మోక్షం సోమ సుందరం అవధాని. ప్రసిద్ధవైయాకరణుడగు రామభద్ర దీక్షితులు, పూజ్యపాదులగు 'అయ్యావాళ్' (శ్రీధర వెంకటేశయ్య), మరియొక వైయాకరణుడగు గోపాల కృష్ణశాస్త్రి - వీ రీయన సహాధ్యాయులు.

శివరామకృష్ణుడు గురుకులమున నుండగా నొకనా డీయన భార్య పుష్పవతియైనదని గురుసన్నిధికి వార్త వచ్చెను. గురు వీయనను శ్వశురగృహమున కంపెను. అచట నీయనరాక నెవరును గమనించలేదు. ఎవరి పను లలో వా రుండిరి. దారి నడచుటచే గలిగిన క్షుధా యాసము లాయనకు భరింపరాని వయ్యెను. ఆక్షణ ముననే శివరామకృష్ణునకు సంసారముపై విరక్తి జనించి సన్యసించెను. తురీయాశ్రమము పుచ్చుకొన్న పిదప నీయనకు సదాశివబ్రహ్మేంద్రుడని పేరు కలిగెను.

ఆ కాలమున కామకోటి పీఠాధిపతిగ నుండిన పరమ శివేంద్రసరస్వతి గురుత్వము నర్థించి యాయనకడ ఈయన వైదిక విజ్ఞానగ్రంథము లన్నియు జదివెను. పూర్వ జన్మ మున జేసిన పుణ్యమువలనను, అవిచలితమగు నిశ్చయ బుద్ధివలనను, పరిణత మేధాసంపత్తి వలనను ఈయన యోగశక్తులను బడసి పరిపూర్ణుడగు సిద్ధుడయ్యెను. ఈయన జడభరతునివలె నవధూతయై తిరుగుచుండెడివాడు.

ఈయన తన గురువువద్దకు వచ్చుచుండిన విద్వాంసు లంద రితో వాదించి యోడించుచుండువాడు. వారిలో మత్సరు లగు కొంద రీవిషయమును గురువున కెరింగించిరి. ఇది విని గురు వీయనను మందలించి వాఙ్నియమ మొనర్చెను. నాటినుండి ఈయన మౌని యయ్యెను.

ఒకనా డీయన యొకపొలమున తన చేయి తలాడగ జేసికొని నిదిరించుచుండ నొకరైతు 'సర్వమును త్యజించిన సన్న్యాసికిని తలగడ కావలసివచ్చిన' దనెను. ఇది విని ఈయన రైతునకు దన యోగశక్తి జూపించుటకై మరునా డాస్థలముననే గాలిలో దేలుచు నిద్రించెను. ఆనాడుగూడ ఆరైతే ఈ దృశ్యమునుజూచి 'ఒక్కొక్కడు యోగియై నను అహంకారము పో' దనెను. ఇది విని ఈయన భగ వంతుడే తన యహంకారమును దొలగించి తన్ను అనుగ్ర హించుట కావిధముగ వచ్చెనని తలంచెను.

ఈయన యేది దొరకిన నది తినుచు పరిణతజ్ఞానియై పిచ్చివానివలె పర్యటించుచుండెను. ఈయన గురువుకూడ తాను తన శిష్యుడు పొందిన యున్నతావస్థను పొందలేక పోయితినని చింతించువాడు. పుదుక్కోట సమీపమునగల తిరుగోకర్ణమున ఈయన శిలావిగ్రహ మున్నది.

చివరినాళ్లలో ఈయన నేరూరున నివసించెను. ఒకనా డీయన తాను మిథునమాసమున శుద్ధదశమినాడు ముక్తి బొందుదు ననియు, ఆనాడు కాశినుండి బ్రాహ్మణు డొక బాణలింగమును తనతో దెచ్చుననియు, దానిని తన సమాధి

వద్ద ప్రతిష్ఠింపవలె ననియు తన భక్తులకు చెప్పెను. ఆయన కోరినట్లే జరుపబడెను. నేటికిని నేరూరిలోనున్న ఈయన సమాధికడ ప్రతిసంవత్సరము నుత్సవము జరుగును.

అద్వైతమునుగూర్చి ఈయన వ్రాసిన గ్రంథములలో చెప్పుకోదగినది బ్రహ్మసూత్రములపై 'బ్రహ్మతత్త్వ ప్రకాశిక' యను వ్యాఖ్యానము. ఈయన ఇతర గ్రంథము లివి: 'యోగసుధాకరము'. ఇది పతంజలి యోగసూత్రములకు వ్యాఖ్యానము. 'సిద్ధాంతవల్లి', 'కేసరవల్లి' - ఇవి రెండును అప్పయ్యదీక్షితుల సిద్ధాంతలేశసంగ్రహ పరమహంసాచార్య గ్రంథములకు సంగ్రహరూపములు. ఇవికాక 'నవమణి మాల', 'ఆత్మానుసంధానము', 'స్వప్నోదితము', 'స్వానుభూతి ప్రకాశిక', 'ఆత్మవిద్యావిలాసము' అనునవియే కాక ద్వాదశోపనిషత్తులపై వ్యాఖ్యానములును గలవు. పురాణముల నన్నింటినుండి ఈయన యద్వైత వేదాంత విషయము నెంతో సేకరించి కూర్చెను. రాముని, కృష్ణుని, గంగను కీర్తించు ననేక సుందరగీతములను, భజనలలో గానసభలలో పాడబడుచున్న యద్వైతవేదాంత విషయక ములగు కొన్ని పాటలను రచించెను. ఈయన దాదాపు పదునెనిమిదవశతాబ్ద మధ్యభాగమున వెలసెను. **వి. రా.**

## సదాశివశాస్త్రి, వెల్లాల (క్రీ. శ. 1861 - 1925):

వీరు జటప్రోలు సంస్థానము, అయ్యవారిపల్లె గ్రామములో వెల్లాల వంశమున శంకరజోస్యులు, వెంకటసుబ్బమ్మ దంపతులకు, నాల్గవ కుమారులుగ జన్మించిరి. వీరిది ములికినాటి శాఖ; భారద్వాజ సగోత్రము; ఆశ్వలాయన సూత్రము.

వీరు తమ అన్నగారగు, రాఘవశాస్త్రిగారి కడ నాటకాంత సాహిత్యమును, అలంపురమున మల్హారి శాస్త్రిగారిచెంత వ్యాకరణ మూలమును, మేనమామ గారగు అఖింతల సీతారామశాస్త్రిగారిచెంత తర్కమును, పేపలి గ్రామమున కొండమాచార్యుల వారిచెంత శేఖర శబ్దరత్నములను చదివిరి; అటు తరువాత కాశి కేగి మానవల్లి గంగాధరశాస్త్రిగారి కడ అలంకార ధర్మశాస్త్రములను, దండిభట్ట విశ్వనాథశాస్త్రిగారి చెంత భాష్యాంత వ్యాకరణమును చదివిరి; అప్పుడే గురువుగారి 'పరిభాషేందు చంద్రికా' రచనమునకు తోడ్పడిరి.



చిత్రము 304.
వెల్లాల సదాశివశాస్త్రి

సదాశివశాస్త్రిగారు బాల్యమునందే సతీర్థులతో మాట పట్టింపు వచ్చి 'కన్యకాంబాచంపూ' గ్రంథమును, ఉద్వాహాభాస నిరాసమను గ్రంథమును ప్రకటించిరి. జటప్రోలు రాజాగారు వీరిని తమ ఆస్థాన విద్వాంసులుగా నియమించిరి. వీరు వెంకటగిరి సంస్థానమునకేగి అచట కావ్యాలంకార సంగ్రహ విమర్శనమును, వెలుగోటివారి వంశ చరిత్రమును రచించిరి; జటప్రోలు రాజుల చరిత్ర త్రవ్వి, సురభివంశ చరిత్రమును, జటప్రోలు పూర్వ ప్రభువగు సురభి మాధవరాయలు రచించిన చంద్రికా పరిణయమునకు వ్యాఖ్యానమును రచించి జటప్రోలు రాజాగారిచే బహూకరింపబడిరి.

వీరు రచించిన పరివ్రాజ్య చంద్రిక, కంఠీరవ విజయము, రామానుజ గోపాల విజయము, ఆంధ్ర దశరూపక విమర్శనము, వీరభద్రీయ ఖండనము, చిలుకూరి వీరభద్రరావు గారి ఆంధ్రుల చరిత్రపై విమర్శ 'ఖండనాభాసనిరాసము' (మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారి విమర్శఖండనమునకు ప్రతివిమర్శ), నామిరెడ్డి చరిత్రము మొదలైనవి విమర్శనములు - తత్ప్రీతి విమర్శనములునై యున్నవి. వీరి యముద్రిత రచనలుకూడ పెక్కులు కలవు. **బి.రా.రా.**

## సర్వమంగళేశ్వరశాస్త్రి, నడిమింటి (క్రీ.శ. 1759 - 1839):

వీరు తూర్పుగోదావరిజిల్లా గన్నవరములో జన్మించిరి; వేగినాటి బ్రాహ్మణులు; కౌండిన్యసగోత్రులు. వీరి తండ్రి చయనులుగారు; తల్లి శ్యామల సోదెమ్మగారు.

వీరు ఋగ్వేదమును, యజుర్వేదమునుగూడ అధ్యయనము చేసిరి; భాష్యాంత వ్యాకరణమును కాశిలో అభ్యసించిరి; తర్కమునను, పూర్వ మీమాంసలోను గూడ పరిపూర్ణ పాండిత్యము సంపాదించిరి; మంత్ర శాస్త్రములో విశేష ప్రజ్ఞా సామర్థ్యములు గల్గి సమకాలికుల కనేక మహిమలను చూపించినారు. సరసముగాను, చమత్కారముగాను, ఆశువుగాను కవిత్వము చెప్పుటలో వీరు విశేష ఖ్యాతి నొందిరి. శత్రువులపై దూషణ కవిత్వమును విసురుట వీరి కలవాటు.

వీరు గ్రథనముచేసిన శబ్దమంజరిని, సమాసకుసుమావళిని సంస్కృతభాషను నేర్చుకొనువారెల్లరు నేటికిని ప్రారంభములో చదువుదురు. విభక్తి విలాస మను గ్రంథమును కూడ వీరు రచియించిరి. ఇందు విభక్తిచమత్కృతులు చూపబడినవి. సర్వమంగళీయమను మరొక వ్యాకరణ గ్రంథమును కూడ వీరు రచియించినారు.

వేదసార మను గ్రంథమును వీరు రచియించిరి. శాస్త్ర పండితులలో అరుదయిన వైదిక వైదుష్యము వీరి కెంతగా కలదో ఈ గ్రంథమును, కర్మజ్ఞాన వివరణమను మీమాంసా

శాస్త్రసార గ్రంథమును తెలుపుచున్నవి. వీరు భగవద్గీతకు భాష్యమును రచియించిరి; పార్థవిజయ మను కావ్యమును, సునితీ సన్నుతీయ మను ఖండన గ్రంథమును వ్రాసిరి.

వీరు శ్రీ విద్యోపాసనా ధురంధరులు; శ్రీలలితా పంచదశీ మంత్ర వర్ణమాలా స్తోత్రమును పదునైదు శ్లోకములుగా రచియించిరి. 'జగన్నాథస్వామీ నయన పథగామీ భవతు మే' అను మకుటమును గలిగి యావద్భారత దేశములోను ప్రచారములో నున్న జగన్నాథాష్టకము వీరిచేతనే రచియింపబడినట్లు తెలియుచున్నది. ఇందలి శ్లోకములు భక్తిరస ప్రపూర్ణములై కర్ణపేయములై యొప్పుచున్నవి. ఒకప్పుడు కడుపులో శూల బయలుదేరగా వీరు తన్నివారణోద్దేశముతో సూర్యాష్టకమును రచించి రనియు వెంటనే శూలనుండి విముక్తులై రనియు చెప్పుదురు.

బహుశాస్త్ర పాండిత్యమునకు సమయస్ఫూర్తియు, సాహసమును తోడుకాగా వీరు పండితులచేత పూజింపబడుచు రాజులచేతను ధనికులచేతను సత్కరింప బడుచు సకల జనుల హృదయములను ఆకర్షించుచు విపులముగా దేశాటనము గావించిరి. వీరు ఆజానుబాహులు, విశాల నేత్రులు. స్వర్ణచ్ఛాయయు సౌష్ఠవమును గల వీరి శరీరము ఆకర్షకముగా నుండెను. ఆంధ్ర దేశములోనేకాక ఉత్కళాదిదేశములలోకూడ వీరు సంచారము చేసి పూరీ, కాశీ, మున్నగు పండిత నిలయములలో జయభేరిని మ్రోగించినారు. కాశీ విద్వాంసులును, నవద్వీప పండితులునుగూడ వీరికి 'అభినవ కాళిదాస' బిరుదము నిచ్చి సత్కరించిరి. కాశ్మీరము, హైదరాబాదు, మైసూరు మున్నగు సంస్థానములలో వీరు సమ్మానముల నందుకొనిరి.

విజయనగర సంస్థానాధీశ్వరులైన శ్రీ విజయరామ గజపతిగారివద్దను, వారి యనంతరము క్రీ. శ. 1794 లో రాజ్యమునకు వచ్చిన శ్రీ నారాయణగజపతిగారివద్దను వీరు ఆస్థాన విద్వాంసులుగా నుండిరి. వీరి పాండిత్యమునకును, చమత్కారసంభాషణమునకును నారాయణ గజపతిగా రెంతయు ఆనందించుచుండిరి. ఒకనాడు రాజుగారు నడిమింటి అను వీరి ఇంటిపేరు అంతబాగుగాలేదనిరి. వెంటనే వీరు అది 'పూస పాటి చేయలేదా' యని రాజుగారి ఇంటిపేరును చమత్కారముగా విమర్శించిరి. వీరి ఉక్తి చమత్కార చాతుర్యము బహు ప్రసిద్ధము. దానిని కథలుగా చెప్పుచుందురు. జ. పు.

**సాంబమూర్తి, బులుసు** (క్రీ. శ. 1886 - 1958): తూర్పు గోదావరిజిల్లా దుళ్ళగ్రామములో ఈయన జననమందెను. మదరాసు యూనివర్సిటీ బి. ఏ. పరీక్షలో ఉత్తీర్ణుడై విజయనగరం మహారాజా కళాశాలలో కొంత కాలము భౌతికశాస్త్రాధ్యాపకుడై యుండెను; తరువాత బి. ఎల్. పరీక్షలో కృతార్థుడై 1911 లో కాకినాడయందు న్యాయవాద వృత్తి నారంభించెను; క్రమముగా పేరు ప్రఖ్యాతులును, ధనార్జనమును పెంపొందుచుండగా ఈయన 1919 లో 'హోమ్ రూలు' ఉద్యమములో ప్రవేశించెను. ఆ మరు సంవత్సరమున గాంధిమహాత్ముని ఆదేశానుసారము న్యాయవాది వృత్తిని పరిత్యజించి సహాయనిరాకరణోద్యమములో చేరెను; 1927 లో నాగపూరు పతాక సత్యాగ్రహ దళమునకు నాయకుడును,1928 లో హిందూస్తానీ సేవాదళమునకు అధ్యక్షుడును అయ్యెను; తరువాత తూర్పు గోదావరి జిల్లా కాంగ్రెసు కమిటీకి అధ్యక్షుడును, 1929 లో అఖిలభారత కాంగ్రెసు కమిటీలో సభ్యుడును, 1935 - 37లో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కమిటీకి కార్యదర్శియు నయ్యెను.



చిత్రము 305.
బులుసు సాంబమూర్తి

1929 లో సైమన్ కమిషను బహిష్కరణోద్యమమునను, 1930 లో ఉప్పు సత్యాగ్రహమునను, 1932 లోను, 1942 లోను శాసనోల్లంఘనోద్యమమునను, మదరాసులో నీలు సత్యాగ్రహమునను పాల్గొని ఈయన కారాగారశిక్ష ననుభవించెను. ఒకమారు శాసనోల్లంఘనముచేసి కాకినాడలో బ్రహ్మాండమైన సభ జరుపుచుండగా పోలీసు లీయనను స్పృహ తప్పి పడిపోవునంత వరకు లాఠీలతో కొట్టిరి.

ఈయన 1923 లో కాకినాడలో జరిగిన అఖిలభారత జాతీయమహాసభ యొక్క ఆహ్వానసంఘమునకు కార్యదర్శి యయ్యెను; ఆ సమయముననే తన ఏకైక పుత్రుడు మరణించినను కంట తడియైనను పెట్టక దుఃఖమును నిగ్రహించుకొని ఈయన మహాసభ కార్యక్రమమును చక్కగా సాగించెను. అప్పటి ఈయన మనోనిగ్రహమునకు సరోజినీదేవి విషాదాశ్చర్యములను మహాసభలో ప్రకటించినది. ఈయన కార్యనిర్వహణ సామర్థ్యమున కగ్రనాయకు లీయనను పదింబదిగ ప్రశంసించిరి.

ఆంధ్రదేశమున మూల మూలలకు సంచారముచేసి ఈయన కాంగ్రెసు తత్త్వమును ప్రచారముచేసెను. అసంఖ్యాకులగు ఆంధ్రయువకులను దేశభక్తి తత్పరులను

గావించి స్వాతంత్ర్యోద్యమములోనికి దింపిన మహా నాయకు డీయన.

1936 లో కాంగ్రెసు మంత్రివర్గ పరిపాలనమున ఈయన మదరాసురాష్ట్ర శాసనసభకు సభాపతియై, సమర్థ్యము లగు తద్విధులను సంప్రదాయానుగుణముగా, సమర్యాదముగా, అద్వితీయముగా నిర్వహించి సభకు గౌరవ ప్రతిష్ఠలను సమకూర్చెను. ప్రజాసేవ కుపకరించు ఎల్ల యుద్యమములందును ఈయన యెల్లప్పుడు నగ్రనాయకుడై వానిని సక్రమముగా సాగించుచుండెను. స్త్రీలయు, హరిజనులయు సముద్ధరణమున కీయన తన జీవితమును, శక్తిని విరివిగా వినియోగించెను.

ఈయన త్యాగము సాటిలేనిది. కాంగ్రెసులో చేరిన నాటనుండియు ఆకర్షకమైన న్యాయవాది వృత్తినేకాక సముజ్జ్వల వేషమును, భోగానుభవమును త్యజించి ఈయన గాంధిమహాత్మునివలెనే మొల నొక కొల్లాయిని, మీద నొక యుత్తరీయమును ధరించుచు ఆమరణదారిద్ర్యమును వరించిన స్వార్థరహితుడు. భయరాహిత్యము, ధైర్యము, ప్రతిపక్షప్రతిఘటన పటిష్ఠత, సక్రమ కార్యనిర్వహణ సామర్థ్యము ఈయనకుగల ముఖ్యలక్షణములలో కొన్ని. ఈయన దేశభక్తి అచంచలము ; అనుపమానము. భారత సంపూర్ణ స్వాతంత్ర్యము, ప్రత్యేకాంధ్రరాష్ట్రము, విశాలాంధ్రము అను పరమ లక్ష్యముల సాధనమునకై నిరంతరము కృషిచేసిన కార్యశూరుడు ఈయన. తన సర్వస్వమును దేశోద్ధరణమునకై సమర్పించినధన్యజీవి సాంబమూర్తి సార్థకముగా 'మహర్షి' యయ్యెను. గ. సు.

## సాంస్కృతిక పునరుజ్జీవనము (ఆంధ్ర) :

విజయనగర సామ్రాజ్య పతనానంతరము కళావిహీనమై పురోగమన లక్షణమును కోల్పోయిన ఆంధ్ర సంస్కృతి ఒక శతాబ్దమునుండి చైతన్యము గలదియై అనేక ముఖముల నభివృద్ధిగాంచుచున్నది. ప్రజల ఆదర్శములు, మనోభావములు, దృక్పథములు సంస్కృతికి ఆంతరంగిక లక్షణములు. వారి ఆచారములు, సంప్రదాయములు, వారు అభిమానించు తత్త్వ గ్రంథములు, సాహిత్యము, వారి గౌరవమునకు పాత్రములైన లలితకళలు సంస్కృతికి బాహ్యచిహ్నములు. ఈ రెండింటి యందును ఇటీవలి కాలమున ప్రశంసింపదగినట్టియు, గుర్తించదగినట్టియు మార్పు లనేకములు కలిగెను. ఈ మార్పులే సాంస్కృతిక పునరుజ్జీవనము. దీనిని వివరించుటలో నిట్టి మార్పులకు కారణములు, మార్పులు సంభవించుటయందు తోడ్పడిన సాధనములు, మార్పుల స్వభావము మొదలైన విషయములను తెలిసికొనుట అవసరము.

బ్రిటిషు పరిపాలన కాలమున పాశ్చాత్య విజ్ఞాన సంస్కృతులతో ఆంధ్ర ప్రజలకు కలిగిన సంబంధము వారి సాంస్కృతిక పునరుజ్జీవనమునకు ప్రధాన కారణమని చెప్పవచ్చును. దీనిమూలమున విద్యావంతుల యొక్కయు జన సామాన్యము యొక్కయు జీవితాశయములయందును, మనోభావములందును మార్పు లనేకములు కలిగెను (చూ: పు. 453-460). పాశ్చాత్య సంస్కృతిలో విశిష్ట లక్షణములు కొన్ని యున్న వనియు, వాని ననుసరించి జీవిత విధానమును మార్చుకొనుట వాంఛనీయ మనియు అనేకులు భావించిరి. వ్యక్తి స్వేచ్ఛ, సమానత్వము, సామాన్య ప్రజలయెడల గౌరవాభిమానములు, ప్రజాస్వామ్యము పట్ల సుముఖత్వము, ప్రాచీనకాలపు ఆచార సంప్రదాయములను విమర్శించు ధోరణి - ఈ లాటి లక్షణములు వీరిలో వ్యాప్తిగాంచ సాగెను. వీని కనుగుణముగ సాంఘిక వ్యవస్థలను, రాజకీయ ఆర్థిక విధానములను, ఆధ్యాత్మిక తత్త్వములను సంస్కరించుకొనుట అవసరమన్న భావము అట్టివారిలో ఉదయించెను. మరికొందరు పాశ్చాత్య సంస్కృతికంటె ఆంధ్రుల యొక్కయు, భారతీయుల యొక్కయు ప్రాచీన సంస్కృతి ఉత్కృష్టమైనదనియు, దానిని విస్మరించిన కారణముననే జాతికి పతనము సంభవించెననియు, ప్రాచీన చరిత్రను పరిశోధనగావించి ఆ కాలపు సంస్కృతి స్వరూపమును తెలిసికొని, దాని ననుసరించి ప్రస్తుతకాలపు జీవిత విధానమును మార్చుకొనుటయే కర్తవ్య మనియు అభిప్రాయపడిరి. ఆంధ్రుల చరిత్రను గురించి అనేక పరిశోధనలు జరుగుచుండుటకును, అనేక గ్రంథములు బయలుదేరుటకును ఇదియే కారణము. ప్రజలలో జాత్యభిమానము, స్వాతంత్ర్యపిపాస, స్వరాజ్యమం దాసక్తి ఈ మనోభావముయొక్క ఫలితములే. రాజకీయ స్వాతంత్ర్య మొక్కటే పరమార్థము కాదనియు, యుగయుగములనుండి ధనికుల దరిద్రుల మధ్య నేర్పడిన తరతమ భేదములను నిర్మూలము గావించి వర్గరాహిత్యమైన సమాజమును నిర్మాణము చేయుటయే సాధించదగిన పరమార్థ మనియు మరికొందరు భావించిరి. ఈ విధముగ కాలక్రమమున గత వంద సంవత్సరముల నుండి భిన్నభిన్న భావములు ఆంధ్రులలో వ్యాపించెను. సంస్కృతియొక్క ఆంతరంగిక లక్షణములును, బాహ్య స్వరూపమును మారుచుండుట కీ భావ సంచలనము కారణ మయ్యెను. సాంస్కృతిక పునరుజ్జీవనము దీని ఫలితము.

దీనిని సాధించుటలో రకరకములైన సంస్థలు, ఉద్యమములు సాధనములై తోడ్పడెను. వార్తాపత్రికలు, విశ్వ

విద్యాలయాది విద్యాలయములు, గ్రంథాలయములు, పఠన మందిరములు, మహిళా సమాజములు, సాహిత్య పరిషత్తులు, సారస్వత సమితులు, సంఘ సంస్కరణ సభలు మత సంస్థలు, ఆశ్రమములు, రైతు సంఘములు, కార్మిక సంఘములు, రాజకీయ పక్షములు మొదలైన సంస్థలు నూతన భావములు ప్రజలలో వ్యాపించుటకై చేసిన కృషి అమోఘము. సంస్థలతోపాటు వివిధ రంగములందును ప్రఖ్యాతి గాంచిన మహనీయు లనేకులు గ్రంథములు వ్రాసియు, ప్రచారము గావించియు సాంస్కృతిక పునరుజ్జీవనమున కమూల్యమైన సహాయము గావించిరి.

పునరుద్ధరింపబడుచుండు ఆంధ్ర సంస్కృతియొక్క స్వరూపము ఇటీవల బయలుదేరిన సాహిత్యమందు విస్పష్టముగ ప్రతిబింబితమయ్యెను. సాహిత్యమే దాని బాహ్య స్వరూపమని చెప్పుటలో అతిశయోక్తి యుండజాలదు. ఈ సాహిత్యమునకును, ఇంతకు పూర్వము వృద్ధిగాంచిన సాహిత్యమునకును గల భేదములను గుర్తించినయెడల ప్రస్తుతకాలపు సంస్కృతిలోని విశేషములు కొన్ని స్పష్టము కాగలవు. పూర్వకాలపు సాహిత్యములో చాల భాగము పండితులచే పండితులకొరకు రచింపబడినది. అందులో వాడబడిన భాష సులభగ్రాహ్యము కాని గ్రాంథికము. సామాన్య మానవులకు ప్రాధాన్యముండవలెనను భావ మాధారమైన సంస్కృతిని ఉద్ధరించుటలో సాహిత్యమునకు గ్రాంథిక భాషకంటె వ్యవహారభాష ఉత్తమ సాధనమన్న అభిప్రాయము ప్రాబల్యముగలదయ్యెను (చూ : పు. 54-57). దీని ఫలితముగ నీ కాలమందు గ్రంథములను వ్యవహారభాషలో వ్రాయువారి సంఖ్య అధికమయ్యెను. సమాజములో శిష్టు లనియు, ప్రముఖు లనియు పేరుగాంచిన వారే గాక సామాన్య ప్రజలుకూడ సంస్కృతి లాభము ననుభవింపదగినవారన్న సిద్ధాంత మాచరణయోగ్య మగుటలో ఇది పటిష్ఠ సాధన మగుచున్నది.

పూర్వకాలములో గ్రంథములలో అత్యధిక భాగము పద్యరూపమం దుండెను. ఇటీవలి కాలమున వచన గ్రంథములు విరివిగ రచింపబడుచున్నవి. రస పోషణము, భావ ప్రకటనము ప్రధానోద్దేశములుగ నెంచబడిన కాలములో కావ్యాది పద్యరచనలకు ప్రాధాన్య ముండుట సహజమే. కాని ప్రస్తుతము ప్రజల మనోభావములు మార్పుగాంచి జ్ఞాన సంపాదనమునం దభిలాష వృద్ధి గాంచుచున్నది. సృష్టిక్రమమును గురించియు, ప్రకృతిని గురించియు, మానవుని గురించియు, మానవుల సంఘములను గురించియు వాస్తవ జ్ఞానము ప్రజలలో వ్యాప్తిగాంచవలసియున్నదని గ్రంథకర్తలు గుర్తించి, దానిని తీర్చుటలో పద్యముకంటె వచనము ఉత్తమ సాధనమన్న కారణమున వచన గ్రంథముల నెక్కువగ వ్రాయుచున్నారు. విజ్ఞానకోశములు, చరిత్ర, రాజకీయ ఆర్థిక సాంఘిక శాస్త్రములు, విజ్ఞాన శాస్త్రములు మొదలగు జ్ఞానదాయకములగు గ్రంథములు ప్రచారములోనికి వచ్చుచుండుట ఈ సందర్భమున గుర్తించ దగియున్నది (చూ : పు. 629-635).

పునరుజ్జీవితమగు సంస్కృతి పద్యరచన రీతులలో కలిగిన మార్పులలో ప్రతిబింబిత మగుచున్నది. స్వేచ్ఛ, స్వాతంత్ర్యము, సమానత్వము, వర్గరాహిత్యము మొదలగువానికి సంబంధించిన నూతన భావ తరంగములను చిత్రించుటకు కవులు నూతన పద్ధతుల ననుసరించుచున్నారు. గేయ కవిత్వమునకును, భావకవిత్వమునకును, అభ్యుదయ సాహిత్యమునకును ఇటీవల కలిగిన ప్రాధాన్యము దీనికి తార్కాణము (చూ : పు. 620-629). స్వాతంత్ర్యమునకై జనసామాన్యము పోరాడుచుండిన కాలమందు వారిని దేశాభిమాన పూరితులుగ చేయ నుద్దేశించి మహాకవు లనేకులు గేయ రూపముగ గీతములను, ఖండ కావ్యములను రచించిరి. దారిద్ర్యము ననుభవించు కార్మిక వర్గమువారి ఆవేదనను వ్యక్తపరచుటలో అభ్యుదయ కవులు ప్రఖ్యాతి గాంచిరి. పాశ్చాత్య సంస్కృతి ననుకరించుట ప్రమాదకర మనియు, ప్రాచీన భారతీయ సంస్కృతి యొక్కటే మనకు శరణ్య మనియు బోధించు నుద్దేశముతో ననేక కవులు క్రొత్త రచనలను గావించిరి. క్రొత్త, పాతల మధ్య నేర్పడిన సంఘర్షణ మంతయు నిప్పటి పద్య సాహిత్యమందును, నవలలు మొదలయిన రచనలందును చిత్రింపబడి యున్నది. సాహిత్యమునకు ప్రజా జీవితముతో సన్నిహిత సంబంధ ముండవలెనను సిద్ధాంతము యొక్క ప్రభావము ఈనాటి సాహిత్యములో వ్యక్తమగుచున్నది. జానపద సాహిత్యముపట్ల శిష్టు లీకాలమున చూపుచుండు గౌరవాభిమానములుకూడ నీ సందర్భమున గుర్తింపదగియున్నవి.

సంస్కృతి సాహిత్యమందే గాక లలితకళలయందుకూడ ప్రతిబింబిత మగుచుండును. ఇటీవలి కాలమున శిల్పము తక్క తక్కిన లలితకళలయందు ఆంధ్రదేశములోని ప్రజలు విశేషమగు ఆదరాసక్తులను చూపుట జరుగుచున్నది. సంగీతము వినుటకును, కూచిపూడి నాట్యాది ప్రదర్శనములను చూచుటకును సభలను సమావేశపరచుటయు, ప్రత్యేక సంస్థలను స్థాపించుటయు మామూలగుచున్నది. ఏబది, అరువది సంవత్సరముల క్రిందట నాట్య ప్రదర్శనములు అవినీతికి దారితీయునవి అను అభిప్రాయము

సంఘ సంస్కర్తలలో వ్యాపించి యుండెను. క్రమక్రమముగ నీ యభిప్రాయము మారి నాట్యకళకు సమాజములో గౌరవ స్థానము లభించెను. ఇంతకంటె ప్రాధాన్యము వహించిన లలితకళలలో చిత్రలేఖనము గుర్తింపదగియున్నది. దామెర్ల రామారావుగారి కాలమందుండి ఆంధ్ర చిత్రలేఖనములో నూతన శకము ప్రారంభమయ్యెనని విజ్ఞులందరు గుర్తించియున్నారు (చూ : పు. 681-682).

ఈ విధముగ శతాబ్దికి పూర్వము ప్రారంభమైన సాంస్కృతిక పునరుజ్జీవనము సర్వతోముఖమై వివిధ రంగములలో గుర్తింపదగిన అభ్యుదయమును సాధించగలిగి యున్నది. మా. వెం. రం.

సాంస్కృతిక పునరుజ్జీవనము (తెలంగాణా) : తెలంగాణములో సాంస్కృతిక పునరుజ్జీవనమునకు పునాదులు వేసినవారు కొమర్రాజు వెంకట లక్ష్మణరావుగారు. వారు గ్రంథాలయోద్యమమే హైద్రాబాదు ఆంధ్రులకు తరణోపాయమని నిర్ణయించి 1901 వ సంవత్సరమున హైద్రాబాదు నగరమున శ్రీ కృష్ణదేవరాయాంధ్రభాషా నిలయమును స్థాపించిరి. ఈ యాంధ్రభాషానిలయము హైద్రాబాదులో ఆంధ్ర సారస్వత సంస్కృతుల వ్యాప్తికి అపారమైనసేవ గావించి ఆంధ్రత్వానికి కేంద్రమైనది. అటుతర్వాత అనేక గ్రంథాలయములు తెలంగాణములో స్థాపితమై ఆంధ్ర సంస్కృతి పునరుజ్జీవనమునకు దోహదము గావించినవి. ఈ గ్రంథాలయాల వార్షికోత్సవాలు, సారస్వత సభలు నిద్దురపోయిన తెలుగువారిని మేల్కొల్పి అనేకమంది యువకులలో భాషాభిమానమును రేకెత్తించి మినుకు మినుకు మనుచున్న సంస్కృతీ దీపమును ప్రకాశవంతము గావించినవి. ఈ గ్రంథాలయోద్యమ వ్యాప్తికి కారణభూతులైనవారిలో కొమర్రాజు లక్ష్మణరావుగారితోపాటు రావిచెట్టు రంగారావుగారు, రాజా నాయని వెంకట రంగారావుగారు ముఖ్యులు. ఈ గ్రంథాలయాలు పుస్తకాలద్వారా, పత్రికలద్వారా తెలంగాణమున మంచి ప్రబోధము గావించినవి.

1921 లో స్థాపితమైన ఆంధ్ర జనసంఘము తెలంగాణమున ఆంధ్ర సంస్కృతి వ్యాప్తికై మంచి కృషి గావించినది. తెలంగాణములోని పల్లెలలో శిథిలమై జీర్ణించుచున్న శాసనాల ప్రతిబింబాలను, తాళపత్ర గ్రంథములను సేకరించుటకొరకు ఆంధ్ర జనసంఘమునకు అనుబంధముగా ఆంధ్ర పరిశోధక మండలి స్థాపితమైనది. ఈ పరిశోధక మండలి లక్ష్మణరావుగారి మరణానంతరము లక్ష్మణరాయ పరిశోధక మండలిగా రూపొందినది. ఆంధ్ర జనసంఘములు క్రమక్రమముగా వ్యాపించి ఆంధ్రోద్యమము రాజకీయ ఉద్యమముగా అవతరించక తప్పనప్పుడు యీ పరిశోధక మండలి ఆంధ్రమహాసభతో అనుబంధము తెంచుకొని స్వతంత్ర సంస్థయైనది. లక్ష్మణరాయ పరిశోధక మండలి తెలంగాణమున మంచి కృషిచేసినది. ఈ సంస్థ పక్షాన తెలంగాణ శాసనములసంపుట మొకటి ప్రకటింపబడినది. ఇంకను ఈ మండలియందు ప్రకటితము కావలసిన శాసనములు శతాధికములుగ కలవు. ఈ పరిశోధకమండలి తాళపత్ర గ్రంథాలను కూడ చాల సేకరించి కాపాడుచున్నది.

1921 నుండి ఏటేట జరుగుచుండిన ఆంధ్రమహాసభా సమావేశములతోపాటు అంధ్ర మహిళాసభలు కూడ జరుగసాగెను. ఈ సభలు తెలంగాణ సోదరీమణులలో మంచి ప్రబోధము, చైతన్యము కలుగజేసినవి. ఈ మహిళా సభలు స్త్రీల సమస్యలనుగూర్చి తీర్మానించుచు, సోదరీమణులలో జాగృతి కలిగించినవి. నగరములోని స్త్రీల కొరకై హైద్రాబాదు నగరమునందలి ఆంధ్ర యువతీ మండలి మంచి కృషిచేసినది.

ఇంచుమించుగా ఆంధ్రమహాసభలో అభివృద్ధి పక్షస్థాపన కాలముననే హైద్రాబాదులో సారస్వత ప్రియులైన యువకులు వైతాళిక సమితియను నొక సంస్థను స్థాపించిరి. సాహిత్యము, కళలు - వీని ప్రచారము ఈ సంస్థ ముఖ్యోద్దేశము. ఈ సంస్థ కొంత మంచి కృషి గావించినది. ఈ కాలముననే మరిరెండు సంస్థలు బయలుదేరినవి. ఒకటి నిజాంకళాశాల విద్యార్థులు కొందరు స్థాపించిన సాధన సమితి. ఈ సమితి సాంస్కృతిక పునరుజ్జీవన దృక్పథముతో రాష్ట్రమునందలి విద్యావంతులైన రచయితలను కూడగట్టుకొని నవ్యసాహిత్య నిర్మాణానికి తోడ్పడినది. ఈ సంస్థ యిప్పటివరకు మంచి సేవచేయుచున్నది. ఈకాలముననే నల్లగొండ జిల్లా చండూరు ప్రాంతమున సాహితీ మేఖలయను సంస్థ స్థాపితమై ఆ ప్రాంతమందలి అనేక యువకులను ఆకర్షించి, కొన్ని ఉత్తమ కావ్యాలను ప్రకటించినది.

ఈ పరిస్థితులలో తెలంగాణమందలి ఆంధ్రు లందరికిని ఒక సారస్వత సంస్థయొక్క ఆవశ్యకత, స్పష్టముగా కనపడినది. ఈ ఆవశ్యకతయే ఆంధ్ర సారస్వత పరిషత్తు స్థాపనకు కారణభూతమైనది. ఈ సంస్థ 1943 మే 16 వ తేదీని రెడ్డి విద్యార్థి వసతి గృహమున జరిగిన దశమాంధ్ర మహాసభ సందర్భమున స్థాపితమైనది. ఈ సంస్థ ఆదర్శాలు: రాష్ట్రాంధ్రులలో మాతృభాషాభిమానమును పెంపొందించుట, ఆంధ్రభాషాభివృద్ధికై సర్వవిధముల కృషిచేయుట. ఇందుకొరకు సంస్థ నిర్ణయించుకొనిన సాధనాలు: రాష్ట్ర మందలి వివిధ ప్రాంతాలలో వివిధ వాఙ్మయశాఖలతో కూడిన, సమావేశాలు జరిపి ప్రబోధము కలిగించుట;

పాఠ్యప్రణాళికను సిద్ధపరచి పరీక్షలను నిర్వహించుట; రాష్ట్రమందుగల సారస్వత సంస్థలను, సారస్వత సేవకులను ప్రోత్సహించుట; ఉత్తమ గ్రంథములకు పారితోషికముల నిచ్చియు, రచయితలకు సన్మానములను జరిపియు వారిని ప్రోత్సహించుట.

ఈనాడు ఆంధ్ర సారస్వత పరిషత్తుకు తెలంగాణములో రెండువందలకు పైగా శాఖలు కలవు. పరిషత్తు కృషి బొంబాయి నగరానికి, ఆంధ్ర ప్రాంతమందలి బాపట్ల, విద్యావనము, కర్నూలు, నంద్యాల మొదలైన ప్రాంతాలకు వ్యాపించినది. పరిషత్తు ప్రాథమిక, మాధ్యమిక, ప్రవేశ, విశారద పరీక్షలను నిర్వహించుచున్నది. ఇందులో ప్రవేశ, విశారద పరీక్షలు హైదరాబాదు ప్రభుత్వము గుర్తించి యంగీకరించినది. ఈ పరీక్షలలో ప్రతి సంవత్సరము వేలకొద్ది విద్యార్థులు పాల్గొనుచున్నారు. ఉస్మానియా విద్యాలయములో తెలుగుభాషను నిర్బంధపఠనీయముగా జేయుటకు పరిషత్తు కృషియే ప్రధానకారణము. గ్రంథాలయోద్యమము పరిషత్తు కార్యక్రమములో ముఖ్యమైనది. కార్యకర్తలలో సాంస్కృతికాభిరుచిని కలిగించుటకు పరిషత్తు శిక్షణ శిబిరాలను నిర్వహించినది. ఉత్తమ గ్రంథప్రకటనము పరిషత్తు ఆశయాలలో ప్రధానమైనది. పరిషత్తు ప్రకటించిన గ్రంథాలలో బాలవాఙ్మయము, సారస్వతము, చరిత్ర, జానపద వాఙ్మయాదులకు సంబంధించిన ఉత్తమ గ్రంథాలనేకము కలవు. తెలంగాణములో గడచిన దశాబ్దమునందు సాంస్కృతిక పునరుజ్జీవనమునకై ఆంధ్ర సారస్వత పరిషత్తు చేసినసేవ ప్రశంసనీయమైనది.

విజ్ఞానవర్ధనీ పరిషత్తు, స్త్రీల ఆరోగ్య విద్యాపరిషత్తు అను రెండు సంస్థలు పోలీసుచర్యకు చాలకాలము ముందే స్థాపితమై స్త్రీల ఆరోగ్యమునకు, మరియు వయోజన విజ్ఞానానికి అవసరమైన మంచి గ్రంథాలను ప్రకటించినవి.

గడచిన అయిదు సంవత్సరాలలో స్థాపితమై కృషి చేయుచున్న సారస్వతసంస్థలలో తెలంగాణ రచయితల సంఘము ఎన్నదగినది. ఇది యువరచయితలచే నిర్వహింపబడుచు కవి సమ్మేళనాలద్వారా చక్కని ప్రబోధము కలుగజేయుచున్నది. కవిత్వమును ఉద్యమముగా ప్రచారము చేయవలెనని రచయితల సంఘ ఉద్దేశము. ఈ ఉద్దేశముతో వీరు ప్రశంసనీయముగా పనిచేయుచున్నారు.

నవ్యసాహితీ సమితి యువకుల కథానికలను, ఏకాంకికలను ప్రకటించుచు మంచి సేవచేయుచున్నది.

హైదరాబాదు కళాశాలలలోను, పాఠశాలలలోను గూడ ఆంధ్ర సారస్వత సంస్కృతుల వ్యాప్తికి స్మరణీయమైన గొప్ప కృషి జరిగినది.

హైదరాబాదు రాష్ట్రములో ఆంధ్ర సాంస్కృతిక పునరుజ్జీవనానికి పత్రికలుచేసిన సేవ మిక్కిలి గొప్పది. తెలంగాణములో మొదటి తెనుగు పత్రిక 'హితబోధిని'. ఇది మాసపత్రిక. 1913 వ సంవత్సరములో మహబూబు నగరము నుండి ప్రారంభమై, ఒక సంవత్సరములోనే అంతరించినది. తరువాత అయిదేండ్లవరకు తెలంగాణములో ఒక పత్రికయైనను రాలేదు. 1920 వ సంవత్సరమున రెండు వార పత్రికలు ఒక్కమారే ప్రారంభమయ్యెను. వరంగలు జిల్లా మానుకోట తాలూకాలోని ఇనుగుర్తి యను గ్రామము నుండి తెలుగు పత్రిక వారపత్రికగా ప్రారంభమయ్యెను. నీలగిరి అను పత్రిక ఇదే సమయమున ఒకనాటి భేదముతో నల్లగొండనుండి వెలువడినది. తరువాత అయిదు సంవత్సరాలకు, అనగా 1925వ సంవత్సరమున గోలకొండ అర్ధవార పత్రిక ప్రసిద్ధ విద్వాంసులు, నాయకులునగు సురవరము ప్రతాపరెడ్డిగారి సంపాదకత్వాన వెలువడినది. గోలకొండ ప్రారంభమైన రెండు సంవత్సరాలకు పి. యస్. శర్మగారి సంపాదకత్వమున సుజాత యను (1927) మాసపత్రిక వెలువడినది. ఇది ఉత్తమ తరగతికి చెందిన సారస్వత మాసపత్రిక. తెనుగు, నీలగిరి పత్రికలకాలమునందే, ఓరుగల్లు నుండి ఆంధ్రాభ్యుదయము అను సారస్వత మాసపత్రిక కోకల సీతారామశర్మగారి సంపాదకత్వమున కొంతకాలము నడచినది. సుజాత ఆగిపోయిన పది సంవత్సరాలకు సికింద్రాబాదునుండి ఆంధ్రశ్రీ అను మాస పత్రిక వెలువడి ఒక సంచికతో ఆగిపోయినది. శుక్లసంవత్సరమందు అశ్రాఫ్ బల్దా తూపురాన్ గ్రామమునుండి దేశబంధు అను మాసపత్రిక ప్రకటితమై మూడేండ్లు నడచినది. 1934 సికింద్రాబాదునుండి అడుసుమిల్లి దత్తాత్రేయశర్మగారు దక్కన్ కేసరి అను ఆంగ్ల-ఆంధ్ర మాస పత్రికను సుమారొక సంవత్సరము నడపిరి. ఈ కాలముననే గుండవరము హనుమంతరావుగారి సంపాదకత్వమున ఆంధ్రకేసరి అను మాస పత్రిక ముఖ్యముగా యువకుల ప్రోత్సాహమున కొంతకాలము నడిచెను. 1938 లో తెలుగు తల్లి అను మాస పత్రిక సికింద్రాబాదునుండి రాచమళ్ల సత్యవతీదేవి గారి సంపాదకత్వమున వెలువడెను. తరువాత సుప్రసిద్ధ విద్వాంసులు పండితచిదిరమఠము వీరభద్రశర్మగారు విభూతి అను మాసపత్రికను కొంతకాలము నడిపిరి. వారు కాశిలోని శైవపీఠమునకు అధిపతులుగా వెళ్లవలసి వచ్చినందున పత్రిక ఆగిపోయినది. 1937 నుండి సికింద్రాబాదు నుండి దివ్యవాణి అను వార పత్రిక శ్రీ చివుకుల అప్పయ్యశాస్త్రిగారు నడిపించుచున్నారు. హైద్రాబాదు హరిజన నాయకులు భాగ్యరెడ్డివర్మగారు కొంతకాలము భాగ్య

నగర్ అను వారపత్రికను నడిపిరి. 1937-38 సంవత్సరమున హైద్రాబాదు రాష్ట్రములో మొదటిసారి సత్యాగ్రహవ్య ప్రకటనకలైన శ్రీ బి. యన్. శర్మగారు బెజవాడ వెళ్లి అక్కడినుంచి ఆంధ్రవాణి అను వార పత్రికను ఒక సంవత్సరము నడిపిరి. 1945 సంవత్సరమున హైద్రాబాదు నగరమునుండి తెలంగాణ, మీజాన్ అను రెండు దినపత్రికలు ప్రారంభమై రెండు సంవత్సరాలు నడిచినవి. తెలంగాణ పత్రిక ఆంధ్రోద్యమానికి గొప్ప అండగా నుండెను. దీని సంపాదకులు సుప్రసిద్ధ ఆంగ్ల పత్రికా రచయితలైన బుక్కపట్నం రామానుజాచార్యులు గారు. మీజాన్ పత్రికకు అడవి బాపిరాజుగారు సంపాదకులుగా నుండిరి. 1947 లో శోభ అను సాహిత్య మాస పత్రిక దేవులపల్లి రామానుజరావుగారి సంపాదకత్వమున వెలువడి వరంగలునుండి ఒక సంవత్సరము నడిచి, అప్పటి రజాకారు ప్రభుత్వకాలమునందలి పరిస్థితులవలన ఆగిపోయినది. తరువాత నది 1950 లో పునరుద్ధరింపబడి సుమారు రెండు సంవత్సరాలు నడచి ఆగిపోయినది. 1947 లో అప్పటివరకు అర్ధవార పత్రికగా నుండిన గోలకొండ పత్రిక దినపత్రిక యైనది. ఇందుకు కారణభూతులు గోలకొండ పత్రిక ప్రస్తుత సంపాదకులు శ్రీ నరోత్తమ రెడ్డిగారు. గోలకొండ పత్రిక నాటినుండి నేటివరకు సక్రమముగా వెలువడుచున్నది. ఇంకను అనేక పత్రికలు వెలువడినవి కాని మొత్తముమీద తెలంగాణములో పత్రికల జీవనము మిక్కిలి ఒడుదుడుకులతోకూడి యుండెనని స్పష్టముకాగలదు. మూడు సంవత్సరాలకన్న ఎక్కువ జీవించిన పత్రికలు స్వల్పము. ఈ పత్రిక లన్నియును తెలంగాణములో సాంస్కృతిక పునరుజ్జీవనానికి బలమైన ఊత నిచ్చినవి.

తెలంగాణములో రచయితలను ప్రోత్సహించి, పుస్తకాలను ప్రకటించు ఉద్దేశముతో కొన్ని గ్రంథమాలలు వెలువడినవి. ఆ గ్రంథమాలలు విజ్ఞానదాయకములగు పుస్తకాలను ప్రకటించినవి. ఈ గ్రంథమాలలుకూడ ఒక్కొక్కటి రెండు మూడు సంవత్సరాలకన్న యెక్కువ జీవించలేదు. ఈ సందర్భమున బూరుగంపాడు ఆంధ్ర వాఙ్మయ సేవాసమితి కొన్ని మంచి సంచికలను ప్రకటించినది. ఉస్మానియా విశ్వవిద్యాలయమునందలి తెలుగు అధ్యాపకులు శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనముగారు తెలుగులో సంగ్రహ విజ్ఞానకోశమును ప్రకటింప ప్రారంభించిరి.

ఈవిధముగా గ్రంథాలయోద్యమము, ఆంధ్రోద్యమము, పత్రికలు, గ్రంథమాలలు మొదలైనవి తెలంగాణములో సాంస్కృతిక పునరుజ్జీవనానికి చక్కని వాతావరణము కల్పించినవి. తత్ఫలితముగా ఆధునిక పద్ధతుల ప్రకారము రచనలు చేయుటకు తెలంగాణ క్షేత్రమున బీజావాపమైనది; ఎన్నియో పాదులు కల్పించబడినవి. ఈ పాదులలో ప్రభవించిన సాహిత్యవల్లి క్రొత్త క్రొత్త పూవులనేకములు విరియబూచి కమ్మతావులను వెదజల్లుచున్నది.

హైద్రాబాదు రాష్ట్రములో తందాన కథలు, యక్షగానాలు ఇటీవలవరకు వ్యాప్తిలో నుండెను. ఇప్పు డవి సరియైన ఆదరణ లేక అంతరించిపోవుచున్నవి. తోలుబొమ్మలాట, భాగవతాలుకూడ ఇరువది సంవత్సరాల క్రిందటివరకు పల్లెలలో విశేష వ్యాప్తిలో నుండెను. ఇప్పుడు వాని సంఖ్యకూడ తక్కువై వెదకిననే కానవచ్చుట జరుగుచున్నది. హైద్రాబాదు రాష్ట్రములో కాలక్షేపాలు, హరికథలు యీ శతాబ్దారంభమున, గడచిన శతాబ్దమందు మిక్కిలి ప్రచారములో నుండెను. ఆదిభట్ట నారాయణదాసుగారు, బాలాజి దాసుగారు ఈ ప్రాంతాలకు వచ్చి హరికథలు చెప్పిరి. ఇక్కడ ఆ కాలమున హరికథలు చెప్పువారు చాలమంది ఉండువారు. ఓరుగల్లులోని చందాల కేశవదాసు అనువారు ఈ హరికథలు చెప్పుటలో ప్రఖ్యాతులు. ఓరుగల్లు ప్రక్కనేయున్న మడికొండ అను గ్రామములోని బక్కయ్య శాస్త్రులు అనువారు ఆకాలమున కాలక్షేపాలు చేయుటలో ప్రసిద్ధులు. ఇంకను తెలంగాణము జిల్లాలలో ఈ విధముగా హరికథలు, కాలక్షేపాలు చేయువారిలో శ్రీవైష్ణవులు యెక్కువగా నుండిరి. దేవాలయాలలో ఉత్సవాలు జరిగినప్పుడు ఈ హరికథల, కాలక్షేపాల కార్యక్రమము విధిగా జరుగుచుండెను. గడచిన నూటయేబది సంవత్సరాలలో జనులలో తెలుగు సంస్కృతిని రక్షించిన గౌరవము దేవాలయాలకు, హరికథలకు, కాలక్షేపాలకు, తోలుబొమ్మలాటలకు, భాగవతాలకు, తందనాన కథలకు చెందుచున్నది. సాంస్కృతిక పునరుజ్జీవనమునకు వీని దోహదము మిక్కిలి గొప్పది.

తెలంగాణములో మైలవరము, సురభి కంపెనీలు నాటకాభిరుచిని కలుగజేసినవి. తెలంగాణములోని ముఖ్య కేంద్రా లన్నిటిలోను ఈ కంపెనీలు తమ ప్రదర్శనాలు ఇచ్చినవి. ఇవిగాక ఆంధ్ర దేశమునుండి ఇతర నాటక సమాజాలుకూడ ఈ శతాబ్దారంభమున గడచిన ఇరువది యేండ్ల క్రిందటివరకు పల్లె పల్లెలో తిరిగి నాటకాలు వేసినవి. ఈ నాటక ప్రదర్శనాలు జనులను ఆబాలగోపాలము ఆకర్షించి సాహిత్యాభిరుచిని, ఆంధ్ర సంస్కృతిపై అభిమానమును కలుగజేసినవి. లక్ష్మణరావుగారి విజ్ఞాన చంద్రికా మండలి తరువాత ఆంధ్ర రాష్ట్రానికి తెలంగాణమునకు మధ్య మంచి బలమైన వంతెన కట్టిన గౌరవము ఈ నాటక సమాజాల కీయవలసి యున్నది. ఈ పరిస్థితు

లలో స్థానికముగా కూడ కొన్ని నాటక సమాజాలు, నటకులు బయలుదేరి, నాటకకళ ప్రచారానికి తోడ్పడిరి. సినిమాలు వచ్చిన తరువాత నాటకముపై మోజు తగ్గినది. నాటక సమాజాలు చాల అంతరించినవి.

చిత్రకళను గూర్చి నాలుగు మాటలు: కుతుబ్‌షాహీల కాలములో ఇక్కడి చిత్రకళమీద మొగలాయి చిత్రకళా ప్రభావము బాగుగా పడినది. స్థానిక చిత్రకళపైన మొగలాయి చిత్రకళా ప్రభావ ఫలితముగా ఇక్కడ ఆసఫ్ జాహీల పరిపాలనలో దక్కను చిత్రకళ అనునది అవతరించెను. నిజాం అలీఖాన్ దర్బారులోని ఆస్థాన చిత్రకారుడు వెంకటాచలం అనునతడు ఈ దక్కన్ చిత్రకళా సంప్రదాయ స్థాపకుడు; ఇందులో ప్రవీణుడు. నిజాం ఆలీఖాను వెంకటాచలమునకు ప్రతి సంవత్సరము పన్నెండు వేల ఆదాయము గల జాగీరు నిచ్చెను. వెంకటాచలము శిష్యులీ దక్కను చిత్రకళా సంప్రదాయమునే పాటించిరి.

నిర్మలలో రంగులువేయుట, చిత్రాలు వేయుట ఒక పరిశ్రమగా అభివృద్ధిపొందినది. ఇచ్చటిది దక్కన్ చిత్రకళా సంప్రదాయమే. నిర్మల చిత్రకారులు వేములవాడకు వెళ్లి అక్కడకూడ ఈ సంప్రదాయమును నెలకొల్పిరి. గద్వాల, వనపర్తి సంస్థానాలలో ఈ రంగులువేయుట ఒక పరిశ్రమగా వ్యాప్తిచెందినది. భారత రామాయణ లిఖిత ప్రతులలో చిత్రాలు వేయువారుకూడ కొందరు బయలుదేరిరి. ఇట్టి చిత్రాలతోకూడిన వ్రాత పుస్తకాలు రెడ్డి విద్యార్థి వసతి గృహమునందును, ఉస్మానియా విశ్వవిద్యాలయమునందును, సాలార్‌జంగ్ మ్యూజియములోను ఉన్నవి. బట్టలమీద అద్దకపు పనికూడ ఈ దక్కన్ చిత్రకళా సంప్రదాయమును తెలంగాణాలో వ్యాపింపజేసినది. ఇది మూడువిధాలుగా వ్యాపించినది: (1) బట్టలమీద చిత్రాలు వేసి అద్దకము చేయువారు, కుట్టువారు కొందరు; (2) భారత రామాయణ కథలను తెరలమీద చిత్రించువారు కొందరు. ఈ తెరలు వీథులలో కథలు చెప్పువారికి ఉపయోగపడుచుండెను. ఈ తెరలను ఉపయోగించుచు కాటమరాజు కథ చెప్పువారు, ఇప్పుడు జనగామ తాలూకాలోని చేర్యాల గ్రామములో నున్నారు. వీరిని కాకిపడగలవా రనెదరు. ఇంకను తెలంగాణమునందలి ఇతర జిల్లాలలోకూడ వీరు కలరు. జంతువుల వేషాలు వేయువారికి ముసుగులు అద్దకము చేసి యిచ్చువారు కొందరు. భువనేశ్వరము నెత్తిమీద పెట్టుకొని, అందులోనుండి వివిధ చిత్రాలుతీసి, ఊరూరు తిరిగి ప్రదర్శించువారు కొందరు; (3) వ్రాతప్రతులను చిత్రపటములతో అలంకరించువారు మరికొందరు. ముఖ్యముగా రామాయణ, భారతాది కథలకు ఇట్టి చిత్రాలు వేయబడుచుండెను. ఇట్టివారిలో గణుతికెక్కిన వారు వెంకటరామయ్య, బాణయ్యగార్లు. వీరి చిత్రాలు ఢిల్లీ మొదలైన చోటులలో ప్రదర్శనాలయందు ప్రశస్తి గాంచినవి.

తరువాత ఇచ్చటి చిత్రకళమీద పాశ్చాత్య చిత్రకళా ప్రభావము కనపడుచున్నది. ఇక్కడి నవాబులు, జాగీర్దారులు పాశ్చాత్య చిత్రాలను కొనితెచ్చి తమ భవనాలకు అలంకరించుకొనుటలో ఈ చిత్రకళా సంప్రదాయము మీద ఆదరము హెచ్చినది. ఇంగ్లీషు ఉన్నతాధికారుల ద్వారా విదేశ చిత్రకారులు ఇక్కడకు వచ్చి పోషణ పొందిరి. ఇందువల్ల స్థానిక చిత్రకారులపైన పాశ్చాత్య చిత్రకళా ప్రభావము పడినది. తత్ఫలితముగా దక్కన్ చిత్ర కళలో పాశ్చాత్య చిత్రకళ సమ్మిశ్రితమై మరొక క్రొత్త కళా సంప్రదాయ ముద్భవించినది. నగ్న చిత్రాలు మొదలైన చెత్తరకపు చిత్రకళ కొంత ప్రచారములోనికి వచ్చినది. ఖయ్యూం అను చిత్రకారుడు పాశ్చాత్య చిత్రకళా సంప్రదాయములో ప్రవీణుడు. తెరలపై చిత్రాలు వేయుటలో ఇతడు భారతదేశమున అద్వితీయుడని చెప్పెదరు. దీన్‌దయాళ్ అను మరొకరు కూడ ఇట్టి చిత్రకారుడే. ఈయనకు ఆసఫ్‌జాహి పరిపాలకుల పోషణ లభించినది.

పత్రికలు, కళాప్రదర్శనాలద్వారా బెంగాల్ చిత్రకళా సంప్రదాయము హైద్రాబాదులో అడుగుపెట్టినది. జాతీయ భావాలు ఈ చిత్రకళను ప్రోత్సహించినవి. కొంతమంది చిత్రకారులు ఇటువైపు ఆకర్షితులైరి. హైద్రాబాదులో 'స్కూల్ ఆఫ్ ఆర్ట్స్' సుమారు 15 సంవత్సరాలక్రింద స్థాపితమైనది. దీనిలో వంగ సంప్రదాయము బొంబాయి సంప్రదాయము మిళితమై, ఇప్పుడు వంగసంప్రదాయము ప్రాధాన్యము వహించుచున్నది.

1920 నాటికి నేటికిని పరిస్థితులు మారినవి. ఎన్నడును అనుకొనని రీతిగా, అనుకొననంత వేగముగా ఆర్థిక, సామాజిక పరిస్థితులు మారినవి. భారత స్వాతంత్ర్యము, హైద్రాబాదు పోలీసుచర్య, బాధ్యతాయుత ప్రభుత్వ స్థాపన అను చరిత్రాత్మకములగు సంఘటనలు జరిగినవి. ఆంధ్ర సంస్కృతిదీపము ప్రకాశవంతముగా వెలుగుచున్నది. ఈ సాంస్కృతిక పునరుజ్జీవనము సంగీతము, చిత్రకళ, నృత్యము, నాటకము మొదలైన వివిధ కళా రంగాలలోగూడ కనబడుచున్నది. దే. రా. రా.

**సాయణాచార్యుడు:** ఇతడు మాధవుని (విద్యారణ్యుని) తమ్ముడు; భోగనాథుని అన్న; శ్రీమతీ మాయణుల పుత్రుడు; భారద్వాజసగోత్రుడు; కృష్ణయజుర్వేద

తైత్తిరీయ శాఖాధ్యాయి. ఇత్యాది విశేషము లన్నియు సాయణుని గ్రంథము లందే విశదముగా నున్నవి. సాయణుడు రెండవ సంగమరాజునకు సకలరాజ్య ధురంధరు డయిన మంత్రిపుంగవుడు. నెల్లూరు పరిసరము పాలించిన మొదటి కంపణ ప్రభువు (ప్రథమ హరిహరరాయ సోదరుడు) మొదట సాయణున కాశ్రయ మిచ్చెను; కంపణ గతింపగా బాలుడయిన (రెండవ) సంగమ రాజునకు గురువై సర్వవిద్యలు నేర్పెను; సకల రాజ్యకార్య పర్యవేక్షణము చేసెను; మహామంత్రి యయ్యెను. ఆ సమయమునసే తమ్ము డగు భోగనాథుడు సంగమ ప్రభువునకు నర్మసచివు డయ్యెను; అనంతరము మొదటి బుక్కభూపతి మంత్రి (1344-1379) యయ్యెను; పిమ్మట రెండవ హరిహరునకు సాచివ్యము వహించెను; కృపాణము పట్టి శత్రువులను జయించెను; అసాధారణముగ పాండిత్య, వీరత్వముల కేకాశ్రయ డయ్యెను. సాయణుడు మంత్రియై పాలించునపుడు సకల ప్రజలు 'సంప్రాప్త భోగ సుఖులు'. విద్యాతీర్థ, భారతీ తీర్థ, శ్రీకంఠులు సాయణుని విద్యాగురువులు. కంపణ, మాయణ, సింగణలను మూవురు సాయణుని పుత్రులు. సాయణుడు బుక్కరాయలకు (క్రీ. శ. 1344-1379), రెండవ హరిహరరాయలకు (క్రీ. శ. 1379-1404) సమకాలికుడు. 1387 లో సాయణుడు గతించెనని జనశ్రుతి యున్నది. అసాధారణ మయిన వైదికత్వ మీమాంసయు, రాజనీతి నిపుణత్వమును సాయణు నాశ్రయించినవి. అందునసే సాయణునకు పరమార్థ విషయమున జాగరూకతతో బాటు లౌకిక వ్యవహార చాతుర్యమును గలిగినది.

సాయణు డనేక శాస్త్రములం దసమాన ప్రావీణ్యము కల యసాధారణ వ్యక్తి; అనేక గ్రంథములను వ్రాసెను. వానియన్నిట వేదభాష్యములు మూర్ధన్యములు. ఆయా శాస్త్రములకు సంబంధించిన యితర గ్రంథములు నత్యంత ముపకారకములు. కాలక్రమము ననుసరించి వాని నిట్లు గుర్తింపవచ్చును: (1) సుభాషిత సుధానిధి - కవుల సుభాషితములు, సమకాలిక కవుల సూక్తులు నిందు గలవు; (2) ప్రాయశ్చిత్త సుధానిధి - ఇది ధర్మశాస్త్రము; కర్మ విపాకమని దీని నామాంతరము; (3) అలంకార సుధానిధి - ఇది సాహిత్యశాస్త్రము. ఉదాహరణముల నీతడు భోగనాథ గ్రంథములనుండి తీసికొనెను. తానును గొన్ని వ్రాసెను. అన్నియు సాయణ జీవిత విశేషములను సూచించును; (4) ధాతువృత్తి - వ్యాకరణము. మాధవీయ ధాతువృత్తి యని దీనికి నామాంతరము; (5) పురుషార్థ సుధానిధి - పురుషార్థముల నుద్దేశించిన సర్వపురాణ వాక్య సంగ్రహ మిది; (6) వేదార్థ ప్రకాశిక - వేదభాష్యములు; (7) ఆయుర్వేద సుధానిధి - ఇది వైద్యశాస్త్రము; (8) యజ్ఞతంత్ర సుధానిధి - యాగ విశేషములు తెలుపు గ్రంథము.

సాయణ గ్రంథములం దన్నిటను సామాన్యముగ 'మాధవీయ' మను పద మున్నది. మాధవుడే వీనిని రచించెనని కొందరు, మాధవ సాయణు లిద్దరు రచించిరని వేరొక కొందరు నందురు. మాధవ ప్రేరితుడై సాయణుడే వీనిని రచించి యన్నగారిని గౌరవించుటకట్లుల్లేఖించి యుండును. సాయణుడు రూపరసికుడు; 'అవిస్మితానన సరోరుహుడు; ఆయతాక్షుడు; ఆజానులంబభుజుడు; అప్రతిమాన రూపుడు. సాయణుడు ప్రతిదినము దేవ పితృ గోపూజ చేసెడివాడు.

సాయణుని వేదభాష్యములు విశ్వవిఖ్యాతము లయినవి. క్రమముగా కృష్ణయజుర్వేదము, ఋగ్వేదము, సామవేదము, కాణ్వసంహిత, అథర్వ వేదములకు ఈయన భాష్యములు వ్రాసెను; సంహితలకే కాక బ్రాహ్మణములకును భాష్యము రచించెను. బుక్కభూపతి పరిపాలన సమయమున సాయణు డీ భాష్యములను రచించినట్లు 'భాష్య పుష్పిక'ల వలన స్పష్టమగుచున్నది. మహారాజ హరిహ రాంగీకారమున నితడు శతపథబ్రాహ్మణమునకును భాష్యము వ్రాసెను.

భాష్యరచనమున ఈయనకు నారాయణ, 'నరహరి, పండరి' యను వేదార్థ విదులు సహాయ మొనరించిరి. భాష్యరచన యంతయు నఖండ తాత్పర్యముతో నున్నది. సాయణాచార్యుని వివిధ శాస్త్ర సార్వభౌమత, ధర్మ ప్రచారదీక్ష దేదీప్యమానముగా, శాశ్వత విజయస్తంభముగా నిందు గోచరించును. సాయణుడు 'భగవద్వ్యాసావతారః స్వయం'. సాయణునకు పూర్వము వేదమున కొన్ని వ్యాఖ్య లున్నను సాయణ భాష్యమువలె పరిపూర్ణములు కావు. పాశ్చాత్యులును వేదార్థమును తెలిసికొనుట కీభాష్యమునే యనుసరించిరి. వేదతత్త్వ జిజ్ఞాసకై సాయణభాష్యమునే సమాశ్రయింపవలయునని భారతీయుల యఖండ విశ్వాసము. జ. మా. శ.

**సాలిహుండము** : బంగాళాఖాతమునకు మూడుమైళ్లగువ, వంశధారానదీ తీరమున సాలిహుండమను నున్నతమైన కొండ కలదు. దీని శిఖరముమీద కొండకు మకుటాయమానమై ఎత్తైన ఒక గజపృష్ఠాకార చైత్యమును, దీని వెనుక ఆంధ్రస్తూపములందు కానవచ్చు ఆకులు, కుండగల చక్రాకారనిర్మాణ పద్ధతికి భిన్నముగా అంతటను పూర్తిగా ఇటికలతో కట్టబడిన వర్తులాకార మహాచైత్యమును, యథాక్రమమైన విహారమును, చిన్న చైత్యములను

(వీనిలో రెండు బౌద్ధ చైత్యములు), కొండవాలుల నందందు చెదరియుండు మ్రొక్కుబడి స్తూపములును కల అద్భుతావహమును, హృదయాకర్షకమునునైన బౌద్ధ సంఘారామవిన్యాస మొకటి కనుగొనబడినది. స్వర్ణపుష్ప గర్భితములైన స్తూపాకార స్ఫటికపాత్రములు ఈ కొండ కొమ్ము మీది గజపృష్ఠాకార చైత్యమునకు వెనుకనున్న మహాచైత్యమున నుపలబ్ధములగుట మిక్కిలి పరిగణింప దగిన విషయము.

చైత్యము : కొండకొమ్ముమీది చైత్యము పూర్తిగా శిథిలమైపోయియున్నను, దాని శిథిలావశేషములనుబట్టి అది యత్యున్నతముగా నుండియుండునని ఊహింపదగి యున్నది. కొండ కొమ్ముమీద అత్యున్నతస్థానమున - ఎట్టయెదుట - నుండుటవలన అది అచటికి మూడుమైళ్ల దూరముననున్న కళింగపట్టణపు నౌకాశ్రయమునకు స్పష్ట ముగా కానవచ్చుచుండి యుండును. సముద్రమార్గమున వచ్చు బౌద్ధయాత్రికులు వంశధారానది మీదుగా నిక్క డకు వచ్చి యుపహారములను సమర్పించుచుండువారనుట విదితమే. నేడు పూసినదానివలె సూర్యకిరణ ప్రసారమున మెరసిపోవుచున్న గచ్చుపూత ఇంకను గజపృష్ఠాకార చైత్యమున నిలిచియున్నది. దీని మధ్యను సున్నపురాతితో కట్టబడిన స్తూపమున నిక్షేపములను వెదకుటకని, ఇండ్లు కట్టుకొనుటకని కుళ్లగించి అపహరించుకొని పోబడిన వను కొనదగిన భాగములు పోగా దాని మూలాధిష్ఠానము మాత్ర మిపుడు శేషించియున్నది.

మహాచైత్యము : గజపృష్ఠాకార చైత్యమునకు వెనుక ప్రకృతమున్న మహాచైత్యముయొక్క శిథిలావశేషముల యౌన్నత్యమునుబట్టి చూడగా అది ప్రదేశ మంతటను పూర్తిగా ఇటికలు పేర్చి కట్టబడినట్లు తోచుచున్నది. నేడు మిగిలియుండున దంతయు నీమహాచైత్యముయొక్క అట్ట యడుగుభాగమున కభిముఖముగా నున్న యధిష్ఠానభాగ మునకు సంబంధించిన వక్రాకారములగు ఇటిక ముక్కలు కొన్నిమాత్రమే. ఆ ముక్కలు అమరావతి శాసనములలో పేర్కొనబడిన 'అబతమాల' (ఆబద్ధమాల)తో వాస్తు ధర్మమున చక్కగా పోలియున్నవి. ఈ పేరు అమరావతి స్తూపప్రాకారపు రాళ్లలో దిగువను కొద్దిగ ముందుకు పొడుచుకు వచ్చిన భాగమునకు చెల్లుచున్నది. వెలుపలి రూపము చక్రాకృతినే యుంచినను లోపలమాత్రము ఆంధ్రస్తూప సాధారణమగు ఆకులు, కుండ రూపమున నుండు ఇటికకట్టు పద్ధతి లేనందువల్లనే కాక మూడు రాతి కరండములు, మూడు స్ఫటికధాత్వవశేష పాత్రలు దీని యందు లభించి యుండుటచేతను ఈ చైత్యము సాలిహుండం కొండమీదనే కాక, కళింగదేశమునందలి యీ ప్రాంత ముననే మిక్కిలి ముఖ్యమైనదిగా తోచుచున్నది. స్ఫటిక ముతో చేయబడిన ఈ ధాత్వవశేషపాత్రములు మూడును స్తూపాకృతి నున్నవి. అవి యొక్కొక్కటి యొక్కొక్క శిలాకరండమున నుండినవి. ఆకారమున గుంటూరుజిల్లా రేపల్లె తాలూకా భట్టిప్రోలు చైత్యమున లభించిన మూడు శిలాకరండములను జ్ఞప్తికి తెచ్చుచున్న ఈ మూడు శిలా కరండముల నుంచిన పద్ధతి ఆంధ్ర స్తూపపు పద్ధతికి చాల భిన్నమైనది. భట్టిప్రోలులో అవి సరిగా మధ్య ఒకదాని కొకటి సమదూరమున ప్రక్కప్రక్కల నిలువుగానుండ ఇచట సాలిహుండములో చక్రాకార మహాచైత్య వ్యాసము పొడుగున ఒకదాని కొకటి సమదూరమున అడ్డముగ నున్నవి. ఒక్కొక్క కరండమునకు అడుగు బరిణయు, పైమూతయు నున్నవి. వానిలో రెండు చతురస్రా కారములు. నట్టనడుమ నున్న మూడవది గుండ్రముగా పెద్దదిగా నున్నది. మధ్యకరండముయొక్క అడుగు బరిణ స్తూపవేదికను, మూత స్తూపపు హర్మికతోగూడిన అండ భాగమును బోలియున్నవి. ఇది ఆకారమును బట్టి చూడగా మహాచైత్యమును పోలియుండునట్లు చేయబడినదా యని పించుచున్నది.

ఈ కరండములలోని అవశేషవస్తువుల ప్రాముఖ్యము బౌద్ధ ప్రపంచమున కింతింత యనరానిది. ఈ ధాత్వవశేష పాత్రలు కూడ భట్టిప్రోలుస్తూపమునందలి వానివలెనే స్ఫటికముతో చేయబడినవి. ఒక్కొక్క శిలాకరండమున నొక్కొక్కటి చొప్పున ఈ మూడును భారతీయ ప్రాచీన వాస్తు శాస్త్రజ్ఞులకు తెలిసిన మూడు విభిన్న స్తూపాకృతు లను స్మరణకు తెచ్చుచున్నవి. ఈ కారణమున నవి యిట సంగ్రహముగా వివరింపబడుచున్నవి. చతురస్రకరండము లలో నొకదానియందుండిన స్ఫటికధాత్వవశేష పాత్రము స్తూప సామాన్యరూపమును తలపునకు తెచ్చుచున్నది. ఈ స్తూపరూపము అర్ధగోళాండాకారముగ గాక గుండ్రనై పైకిపోయిన కొలది శిఖరము తేలి రెండు భాగములుగ నున్నది. అంతయు నిదియే యనిపించు పెద్దభాగ మొకటి. రెండవది దీని యడుగుభాగముననుండు గుండ్రని చిన్న బిళ్ల. ఈ బిళ్ల పూర్తిగా లోపల ఇమిడిపోయి యుండుట వలన ఇది యంతయు నేకాండముగా నొక్కటియే యను భ్రమ కలిగించును. కలియజేర్చిన ఈ రెండు భాగములను పైనుండి పరిశీలించినచో ఇవి గాలి లోనికి చొరకుండ గట్టిగా తాపటమై యుండుటచే చికిలి బంగారమువలె తళ తళ మెరయు బంగారుపూ వున్న కొలదిపాటి ఛిద్ర మీ స్ఫటికపాత్ర గర్భమున కానవచ్చును.

రెండవ చతురస్ర శిలాకరండమున నుండిన స్ఫటిక ధాత్వవశేషపాత్ర రెండు భాగములు గలది. చుట్టు అంచు ఎత్తుగను, నడుమ పల్లముగను నున్న గుండ్రమును, విశాలమును నైన అడుగు భాగము; దానిలోపలి అడుగు పల్లపు తలమునందు ఆరు బంగారు పూవులు - అయిదు నిండుపూవులు, ఒకటి మూడు తునుకలైనది - ఉండినవి. దాని పైమూత అండాకారమున నున్నది. దానిపైన ఛత్రదండాధిష్ఠితమగు చతురస్రహర్మిక కలదు.

మూడవ కరండములోని స్ఫటిక పాత్రము చాల చిత్రమైనది. ఇది అమరావతి, గోలి, నాగార్జునకొండలలో తెలియవచ్చిన స్తూప నిర్మాణ రూపమునకు చక్కని సరియైన సూక్ష్మ ప్రతిరూపము. ఇందులో నాలుగు భాగములు కలవు: (1) చుట్టు ఎత్తు నడుమ పల్లము గల విశాలమునైన గుండ్రని వేదిక(అడుగుభాగము); ఈపల్లమునందు అయిదేసి తునుకలై యుండిన రెండు బంగారు పూవులు కనబడినవి; (2) అండము; (3) ఘనాకృతి నున్న హర్మిక. సూచులు, ఊర్ధ్వపటములు, ఉష్ణీషము - వీనితో స్తూప ప్రాకారమును బోలియుండునట్లు హర్మిక ప్రతిపైపునను నాలుగు గుండ్రని రంధ్రములు; (4) హర్మిక మీద ఛత్రదండమును బోలియున్న వర్తులాకారభాగము.



చిత్రము 306.
పడిపోయిన స్తంభములు, గదులు, సాలిహుండము.

ఇతర స్థలములందు దొరకిన ఇటువంటి బంగారుపూవులు నక్షత్రాకృతులని వర్ణింపబడియున్నను అవి పుష్పాకృతులని చెప్పనొప్పును. వాస్తవమున కవి స్వర్ణపుష్పములే. భారతీయుల కనేకులకు ప్రతిదినము స్వర్ణపుష్పములతోడి పూజావిధానము పరిచితమైనదే. స్వర్ణాభావమున యజమానుడు పురోహితునకు దానికి ప్రత్యామ్నాయముగ ధనమును సమర్పించును.

స్తూపచైత్యములు : మహాచైత్యమును, ఉన్నతచైత్యమును కానవచ్చిన కొండ మీదిప్రదేశమునకు ఎక్కు మార్గములో కొండవాలున గజపృష్ఠాకార స్తూపచైత్యములు రెండున్నవి. వానిలో శిథిలాతిశిథిలమైన స్తూపచైత్యమునందు ఆసీన బుద్ధ విగ్రహము కలదు. శేషించియున్న విగ్రహమున కానవచ్చునది నడుము, తొడలు, పద్మాసనము వేసికొనియున్న కాళ్లుగల రొమ్ము క్రింది బుద్ధుని అధఃకాయము మాత్రమే. ఇది ఇటికతో నిర్మించి పైన చక్కని దళమైన గచ్చు చేసినదిగా కానవచ్చుచున్నది. తక్షశిలయందు గచ్చుపని సర్వసాధారణమైనను అది దక్షిణహిందూదేశమున చాల అరుదుగా చూపట్టుచున్నది. సాలిహుండములో ఇట్టి గచ్చుపని యుండుట వలన ఇది అపూర్వప్రాముఖ్యము గల స్థలమని చెప్పవలసినదిగా కానవచ్చుచున్నది.

రెండవ చైత్యమునందలి గజపృష్ఠాకార ప్రదేశమున సంపూర్ణముగా ఇటికలతో కట్టబడిన పెద్ద పీఠమొకటి నిలిచియున్నది. ప్రాయశః ఇటికలతో కట్టి గచ్చుపూతయే పూసిన ఆసీనబుద్ధవిగ్రహ మొకప్పుడు దానిమీద నెలకొలుపబడి యుండవలెను. పద్మాసనమువేసికొని కూర్చుండియున్న బుద్ధ విగ్రహముయొక్క కాళ్లుమాత్రము మన కిపుడు కానవచ్చుచున్నవి. పీఠమునకు శిల్పముగల ఫలకము లయిదు కలవు. వానిలో రెండింట ఆ పీఠమొక సింహాసనమనియు, తదధిష్ఠాత శాక్యసింహుడేకాని యన్యుడు

కాడనియు సూచించునట్లు సింహశిరములు - ఇటికతో నిర్మించినవే - స్పష్టముగా కానవచ్చుచున్నవి. నలందలోను, తక్షశిలలోనుకూడ నిట్టి పద్ధతియే కానవచ్చుచున్నది. ఈ బుద్ధచైత్యము చాల ముఖ్యమైనది; ఏలనగా దీనిలోను, ఇంచుమించుగా ఈ పీఠము నానుకొని ముందుభాగమునను త్రవ్వగా చక్కగా మెరుగుపెట్టిన ఎర్రని కుండ సామగ్రి లభించినది. దీనిలో నొకటి చైత్యోపరిభాగము నలంకరించిన శిఖరము. చైత్యములోని ఉపరిభాగమును, పై కట్టడమును పడిపోయి నవు డది యచట పడి పూడిపోయి యుండును. తక్కినవి రెండును శ్రమణులు నీరు త్రాగు కుండికలు. వీనిలో నొకటి మెడ పూర్తిగా గలిగి చెక్కుచెదరక మెరుగుమాయక మంచి స్థితిలో నున్నది. రెండవదియు దానివలెనే యున్నది కాని మెడక్రిందిభాగమున దానిమీద నొకశాసన ముండుటచేత దాని కింతింత యనరాని విలువ కలిగినది. శాసనాక్షరములు లోతుగా గాక పైపైని సున్నితముగా కుండయొక్క వర్తులాకారమున కనుగుణముగా దాని అందము చెడకుండ నీటుగా చెక్కబడినవి. కుండ మూతి, శాసనము, కుండవెలుపలియంచు అన్నియు వృత్తాకారమున నున్నవి. శాసనభాష ప్రాకృతము; లిపి క్రీ.శ. రెండవ శతాబ్దినాటి బ్రాహ్మి. ఇది కుషాణరాజు హువిష్కుని క్రీ. శ. 106 నాటి మధుర శాసనలిపిని బోలి యున్నది. ఇది క్రీ. శ. రెండవశతాబ్ది ఆదిమ కాలము నాటికి చెందినదగు శకశాసన లిపి; శాతవాహన శాసన లిపియే.

శాసనమూలపాఠ మిది: 'హంకుడ(? డె)యిక రాట్ట వాలక వొచ్చియాన[ం] కట్టహారామ'

'హంకుడెయిక' అను పేరుగల రాష్ట్రపాలకుని యొక్క కొడుకు (కొడుకులచేత నొసగబడిన - కట్టించిన) కట్టహారామ(కట్టహార ఆరామ)ము అని అర్థము చెప్పకొనవచ్చును.

ఈ పానపాత్రము ఏ సంఘారామమునకు సంబంధించినదో ఆయారామము కట్టహారామమని పేర్కొనబడినది. ప్రాయశః ఈ పాత్రము దొరకిన ప్రదేశమందలి చైత్యము కట్టహారామములోనిది కావచ్చును. సాలిహుండం కొండవాలులో నుండిన ఇతర చైత్యములును, కొండమీది మహాచైత్యమును, గజపృష్ఠాకార చైత్యమును కూడ ఈ కట్టహారామ విహారమునకు చెందినవే కావచ్చును. ఏడవ శతాబ్దము పూర్వార్ధమున హిందూదేశమునకు వచ్చి కళింగ దేశముగుండ సంచారముచేసిన చైనా యాత్రికుడు యువాన్‌చ్వాంగ్ దానిని గురించి ఈ క్రింది రీతిని చెప్పియున్నాడు:

"చుట్టుపట్టుల దేశములవారు కావలెనని మిక్కిలి అభిలషించు నల్లని అడవి యేనుగులు ఈ దేశమున పుట్టుచున్నవి. ఇచటి శీతోష్ణస్థితి వేడి అయినది. ఇక్కడి ప్రజలనాగరికులు; గర్విష్ఠులు; విశ్వాస్యులు; న్యాయబుద్ధిగలవారు; మాటయందు వడి, విస్పష్టత గలవారు, సంభాషణమునందును, ప్రవర్తనయందును మధ్యహిందూదేశము వారికంటె నించుక భిన్నముగ నుందురు. ప్రజలలో బౌద్ధుల సంఖ్య యల్పము. అన్యమతానుయాయుల సంఖ్య బహుళము. పదింటి కెక్కువగా బౌద్ధారామములు కలవు. వానిలో మహాయాన స్థవిర సంప్రదాయమునకు చెందిన శ్రమణు లైదువందలమంది గలరు. వందకధికముగా ఇతర దేవాలయము లుండినవి. వేర్వేరు సమయముల ననుసరించినవా రసంఖ్యాకులు. వారిలో నధికాంశము నిర్గ్రంథులు.

*　　　*　　　*

"నగరము(రాజధాని కావచ్చును)యొక్క దక్షిణ ప్రాకారకుడ్య సమీపమున అశోకస్తూపము కలదు. దాని నానుకొని నలుగురు ప్రాచీన బుద్ధుల విశ్రామ వ్యాయామ స్థానములు కలవు. ఈ దేశమునకు ఉత్తరముగ నుండు నొక పర్వతముయొక్క కటక ప్రదేశమున నూరడుగుల కంటె ఎత్తుగల శిలాస్తూప మొకటి యుండెను. అది మానవు లసంఖ్యాకవత్సరములు జీవించుచుండిన వర్తమాన కల్పాదికాలమున ఒకానొక ప్రత్యేకబుద్ధుడు నిర్యాణము చెందిన చోటు."

ఆ రాజధాని సముద్రతీరమునందలి నేటి కళింగపట్టణము నానుకొనియో, దాని కించుక దూరముననో యుండి యుండునని ఫెర్గుసన్ గుర్తించుట చాల సమంజసముగా నున్నది. ఆర్. డి. బెనర్జియు, ఇదానీంతనులగు చరిత్రకారులును దాని నంగీకరించిరి. వంశధారానదీ తీరమునందలి ఈ సాలిహుండము కళింగపట్టణము ఓడరేవునకు మూడుమైళ్ల దూరముననే యుండుట గమనింపదగ్గ విషయముగ నున్నది. శాసనమున పేర్కొనబడిన కట్టహారామ నామక బౌద్ధాశ్రమము కొండమీద నున్నది. క్రీ. శ. రెండవశతాబ్దమంత ప్రాచీనమై నేటికిని చెక్కుచెదరని గచ్చుపూత గల గజపృష్ఠాకార చైత్యము, దాని వెనుక మూడు ధాత్వవశేషస్ఫటికపాత్ర లుండిన మహాచైత్యము - రెండును కొండ యుపరితలభాగమున, యువాన్‌చ్వాంగ్ చెప్పినట్లు నూరడుగుల యెత్తున నుండి సముద్రతీరమునకు స్పష్టముగా కానవచ్చుచున్నవి. వంశధారా నదీ జలతరంగములు సాలిహుండము కొండ చరులను తాకుచుండును. కొండ ఉత్తరపు ఏటవాలు ప్రదేశమున మహాచైత్యమునకు సరిగా నూరు గజములు

దిగువగా నట్టనడుమ క్రమ్మొక్కబడి స్తూపముతోడి గజ పృష్ఠాకార చైత్యమును, కుండ, ఆకులు గలిగి సాధారణ పద్ధతి నున్న మరియొక స్తూపమును బయలుపడినవి. ఇటికలకొరకు చిరకాలమునుండి అవి పాడుచేయబడి చెదరగొట్టబడి యుండుటచేత ముఖ్యమైన వస్తు వొక్కటియు వానియందు లభింపలేదు. టి. యన్. రా.

**సింగభూపాలుడు** (క్రీ. శ. 1383 - 1399): ఇతడు రేచర్ల అనపోతనాయకుని పుత్రుడు. ఈతడు సంస్కృతమున గొప్ప విద్వాంసుడు; విశేషించి నాట్యాలంకార శాస్త్రములందు నిష్ణాత. ఈతడు 'రసార్ణవ సుధాకరము' అను అలంకార శాస్త్ర గ్రంథమును, 'సంగీత సుధాకరము' అను నాట్య గ్రంథమును, 'కందర్ప సంభవ' మను భాణమును, 'కువలయావళి' అను నాటికను రచించినట్లు తెలియుచున్నది. ఈతని యాస్థానమున విశ్వేశ్వర పండితుడు, బొమ్మకంటి అప్పయార్యుడు మున్నగు గొప్ప విద్వాంసు లుండిరి. శ్రీనాథకవిసార్వభౌముడు ప్రశంసించిన సింగభూపాలు డీతడే యని కొందరును, భిన్న వ్యక్తి యని కొందరును అభిప్రాయ పడుచున్నారు. అట్లే యీతనికి 'సర్వజ్ఞ' బిరుద మున్నదని కొందరును, లేదని కొందరును తలచు చున్నారు.

సింగభూపాలుని గ్రంథములలో 'కందర్ప సంభవము. ఇంతవరకు లభ్యము కాలేదు. తక్కినవి ముద్రితములు'. రసార్ణవ సుధాకరము మూడు విలాసములు (భాగములు) గల నాట్యాలంకార శాస్త్ర గ్రంథము. ఈ మూడు భాగము లందును వరుసగ రస-భావ-నాట్య విషయములు లక్షణోదాహరణములతో గూడ వివరింపబడినవి. పెక్కు కావ్య నాటకములనుండి ఉదాహరణము లిందు సంగ్రహింప బడినవి. రూపకముల గూర్చి యిందు వివరించిన రీతిని విపులముగ చూపు గ్రంథములు అలంకార వాఙ్మయమున అత్యల్పములు.

'కువల యావళి' నాటికకు 'రత్నపాంచాలిక' అను నామాంతరము కలదు. ఇందు నాలు గంకములలో శ్రీకృష్ణునకు 'కువలయావళి' తోడి వివాహము వర్ణితము. 'సంగీతసుధాకరము' శార్ఙ్గదేవుని 'సంగీత రత్నాకరము'నకు వ్యాఖ్యానము. నామమును బట్టి 'కందర్పసంభవము' మన్మథుని పుట్టుకను వర్ణించు గ్రంథమయి యుండవలెను. బి. వెం.

**సింగరశాస్త్రి, అక్షింతల**: వీరు అపర గౌతములని పేరెన్నికగన్న అక్షింతల సుబ్బాశాస్త్రిగారి రెండవ కుమారులు. వీరి తల్లి సుబ్బమ్మ. జటప్రోలు సంస్థానముననున్న అయ్యవారిపల్లె వీరి గ్రామము. వీరిది ముశికినాటి శాఖ; కాశ్యప గోత్రము; ఆపస్తంబ సూత్రము. వీరు తమ తండ్రిగారి చెంతనే తర్క-వేదాంత శాస్త్రములపార మందిరి; తండ్రిగారి యనంతరము గద్వాల, వనపర్తి, జటప్రోలు, గోపాలపేట, ఆత్మకూరు సంస్థానములందు ఆస్థానపండితులుగా నుండిరి; కడపలోని వేదాంతసభలో పరీక్షాధికారిగా కొన్నియేం డ్లుండిరి. వీరు వెంకటగిరి యాస్థానమున కేగి వేదాంతశాస్త్రోపన్యాసములచే నాటి ప్రభువులగు బంగారు యాచమ నాయనింగారిని మెప్పించి అనేక బహుమతు లందిరి; వీరు అన్నపూర్ణాష్టకమువంటి స్తోత్రము లనేకము రచియించిరి; వీరి శ్రీశైల మల్లికార్జున రత్న పంచకము ముద్రితము. భాస్కరఖండము, ద్వాదశమంజరి స్తోత్రములవంటివి అముద్రితములు. వీరు క్రీ. శ. 1906 లో పరమపదించిరి. బి. రా. రా.

**సింగరాచార్యులు, తచ్చూరు**: వీరు ఆంధ్ర వైష్ణవ బ్రాహ్మణులు; శ్యామశాస్త్రిల కుమారుడైన సుబ్బరాయ శాస్త్రియొక్క శిష్యులు; సంగీత సంస్కృతాంధ్రములలో గొప్ప పండితులు; ఫిడేలు వాద్యములో అతి సమర్థులు. తచ్చూరు చినసింగరాచార్యులు, సింగరాచార్యులును కలిసి 'స్వరమంజరి', 'గాయక పారిజాతము', 'సంగీతకళానిధి', 'గాయకలోచనము', 'గాయక సిద్ధాంజనము' అను అయిదు పుస్తకములు వ్రాసిరి. సాంకేతికములో రచనలను వ్రాసినవారిలో వీరే ప్రథములు. ద్వా. పా.

**సిద్దప్ప**: 'బ్రహ్మముగా రంతటి గురువు, సిద్దప్ప యంతటి శిష్యుడు, వేమన యంతటి యోగి లే'డని తెలుగునాట నానుడి గలదు. ఈయన అష్టకష్టముల కోర్చి వీరబ్రహ్మగురుని పదిరెండేండ్లు శుశ్రూషించినాడు. సర్వస్వమును, చివరకు తల్లిదండ్రులనుగూడ పరిత్యజించి అధ్యాత్మ విద్యను సాధించి దానిని సంఘ, దేశశ్రేయములకు ఉపయోగించి కృతార్థుడయినాడు. గురుపుత్రులు తన్ను మతేతరు డనియు, కులములేనివా డనియు దూషించుచున్నను, మహమ్మదీయులు హిందువయిపోయి నాడని పలుబాధలపాలు చేసి దుయ్యబట్టుచున్నను సరకుగొనక సంఘమున కెదురీది తన లక్ష్యమును సిద్ధింపజేసి కొన్నా డీ ఘనుడు.

కడపజిల్లాలోని బ్రహ్మముగారి నివాసస్థలమగు కందిమల్లయపల్లికి ఆరేడుమైళ్ళ దూరములోనున్న 'ముడుమాల' ఈయన జన్మస్థలము. దూదేకుల పీరుసాహేబు, ఆదంబీబి యను దంపతుల కీయన యొక హైందవ సిద్ధుని ప్రసాదమువలన కలిగినాడు. కావుననే ఈయన సిద్దప్పయై, హైందవ తత్త్వమార్గమున నభిరుచికలవాడైనాడు.

ఈయన బ్రహ్మముగారివంటి కులమత విద్వేష రహితు నకు శిష్యుడైనను నాటి సమాజములో కులాధిక్య వాదు లచే నెన్ని యాఘాత ప్రఘాతములనో పొందినట్లు కన పించుచున్నది. తన కులమును గూర్చి చర్చించు లోకమునకు

'ఏకులమని నను వివరము లడిగితే, ఏమని దెల్పుదు లోకులకు
లోకులకు పలుగాకులకు, దుష్టులకు దుర్మార్గులకు'

అను తత్త్వములో సమాధానము చెప్పినాడు. వీరబ్రహ్మము తన కుమారులకుగూడ చెప్పని యోగ వేదాంత రహస్య ముల నీయనకు బోధించువాడు. అందుచేతగూడ నీతడు గురుపుత్రులు చేయు ననేకాగ్నిపరీక్షలలో నెగ్గవలసి వచ్చెడిది. గురుడు సమాధి కాబోవునప్పుడుకూడ గురు పుత్రులు, కొందరు శిష్యులు ఈయనను దూరదేశమున కంపి యుపదేశ భాగ్యము కలుగకుండ చేయజూచిరట. అయినను ప్రగాఢమగు గురుభక్తిచే ఆ కష్టముల నెల్ల ధిక్కరించి ఈయన గురుప్రసాదమునంది గెలుపొందినాడు.

పలుగురాళ్ళపల్లె కరణము గోవిందయ్య తా నగ్రజాతి వాడ నను అభిమానమును వీడి, వీరగురు సంప్రదాయ మహిమను గుర్తించి సిద్దప్పకు శిష్యుడై గురుమార్గమును ప్రచారము చేయ, గురువగు సిద్దయ్యకు దోడుపడినాడు.

బ్రహ్మముగారివలె సిద్దప్పగూడ కొంత కాలజ్ఞానమును వ్రాసినాడు; తత్త్వములు, ఏలలు, పాటలు, పద్యములు మున్నగునవి వ్రాసి తత్త్వ సాహిత్య సేవకూడ చేసినాడు. వీరి తత్త్వ సాహిత్యము సంఘములోని కుళ్ళును, లోటు పాట్లను నిరూపించి వలసిన సంస్కారమును సూచించు చుండుటచే నాడు జనాదరపాత్రమై యిటీవలివరకు బ్రతుకజాలినది. కాళికాంబ శతక మొకటి బ్రహ్మముగారు వ్రాసినట్లు ప్రచారములో నున్నది. మద్రాసు ప్రాచ్య లిఖిత పుస్తకాగారమున 'సిద్దప్ప వచనాలు' అను నొక పుస్తక మున్నది. అందు 'కాళికాంబ హంస కాళికాంబ' అను మకుటముతో దరిదాపు నాలుగువందల పద్యము లున్నవి. ఉత్తమాంధ్ర యోగి యగు నీ సిద్దప్ప తన జీవి తాంతమువరకును గురుమార్గమును బ్రచారముచేసి తుట్ట తుదకు గురుదేవునివలెనే జీవత్సమాధినిష్ఠు డయినాడు. ఇప్పుడా సిద్దప్ప సమాధియు, మఠమును సుస్థితిలో లేవు.

సిద్దయోగి బాల్యమునుండియు మద్య మాంసముల నంటెడివాడు కాడు. గృహస్థుడైన పిమ్మటగూడ తన కుటుంబవృత్తియగు బట్టలు నేయు పనిలోనే నిమగ్నుడయి సాధు జీవనము చేసినాడు. అసంఖ్యాకములగు నీ తత్త్వ కవీంద్రుని తత్త్వములలో

'పూజకు నే నొస్తి - బ్రహ్మము పూజకు నేనొస్తి'
'మాయను నరికినవాడు - గురు - రాయనిలో జతగూడు'
'నే జూచినానే బ్రహ్మము - నాలో - నే జూచినానే'
'ఏకులమని నను వివరమడిగితే - ఏమని తెల్పుదు లోకులకూ'

మున్నగునవి తలమానికములు. కొం. వీ. రా.

'సినీమా': ఇది చలనచిత్ర నిర్మాణకళ - అధునాతన కళ; కొంచెము ఇంచుమించుగా ఈ శతాబ్దంలోనే పుట్టి పెరి గింది. కదలుతున్న ఒక వస్తువును కదలికలేని కొన్ని ఛాయా చిత్రాలు (ఫొటోగ్రాఫ్స్)గా తీసి ఆ చిత్రాలను వేగముగా ఒక తెరమీద ప్రదర్శించినట్టయితే వస్తువు కదులుతున్న భ్రాంతిని కలిగించ వచ్చును - అన్నది చలనచిత్ర నిర్మాణ ములో ప్రధాన సూత్రం. ఈ సూత్రాన్ని కనిపెట్టి, అనేక కష్టాల కోర్చి, ఇది సాధ్యమని లోకానికి నిరూపించి, ఈ కళకు ఆదిపురుషుడయినవాడు ఇంగ్లండు దేశస్థుడయిన ఫ్రీజ్‌గ్రీన్. 1887 సంవత్సరములో ఇతడు వేగముగా ఛాయాచిత్రాలు తీయగల ఒక కెమేరాను నిర్మించాడు. ఇదే నేటి సినీ కెమేరాకు ప్రథమరూపం. తరువాత రెండు సంవత్సరాలకు ప్రఖ్యాత అమెరికన్ వైజ్ఞానికుడు ఎడిసన్ కినీటోస్కోప్ అనే ఒక యంత్రాన్ని సృష్టించాడు. ఆ యంత్రము నేటి సినీ ప్రొజెక్టరుకు ప్రథమ స్వరూపము.

ఫ్రీజ్‌గ్రీన్ జీవితకాలములోనే చలనచిత్ర నిర్మాణము విశ్వరూపం దాల్చి, ప్రపంచంలో కంతకీ ప్రధాన మయిన వ్యాపారాలలో ఒకటిగా స్థిరపడింది; కొందరు వ్యక్తులకు, కొన్ని సంస్థలకు లక్షలు ఆర్జించి పెట్టినది. అయితే ఆదిపురుషుడయిన ఫ్రీజ్‌గ్రీన్ పేదవాడుగానే చనిపోయాడు. ఈనాడు చలన చిత్రకళ వేలాది జనులకు కీర్తి ప్రతిష్ఠలతోబాటు అపారధనాన్ని ఆర్జించి పెడు తున్నది. కోట్లకొలది జనానికి ప్రధాన వినోదంగా అయి పోయింది. మొదట మూక చిత్రంగా వెలసిన చలన చిత్రం శబ్దయుతం కావడమేగాక, ప్రకృతిని యథా తథంగా తెరమీద పునస్సృష్టి చెయ్యడానికి వివిధ మార్గాలు సారిస్తోంది. త్రివర్ణ చిత్రాలు, 'త్రీ డి', 'సినీమా స్కోప్', సినీరమా, విస్టావిజన్ వంటి క్రొత్త పద్ధతులెన్నో కనిపెట్టారు. వీటిలో కొన్ని స్థిరపడ్డాయికూడా. అయితే భారతదేశం చిత్రనిర్మాణ పరికరాల విషయాలలో చాలా వెనకబడే ఉంది. అయినా, ప్రజా వినోదం కోసం కృషిచేసే పరిశ్రమ కావడముచేత, వ్యాపారంగానూ, కళగానూ త్వరలోనే ఒక స్థితికి వచ్చింది; ఈ పరిశ్రమ పురోభివృద్ధి పెట్టుబడి, ప్రభుత్వ సహకారం మొదలయిన వాటిమీద ఆధారపడి ఉంటుంది.

భారతదేశంలో మొదటి చలన చిత్రాన్ని నిర్మించిన వాడు మహారాష్ట్ర దేశస్థుడయిన దాదాబాయి ఫాల్కే. ఆయన 1912 లో 'హరిశ్చంద్ర' అనే మూక చిత్రాన్ని

నిర్మించారు. ఒకరకంగా వీరు ఈ దేశంలో చలన చిత్ర కళకు ఆదిపురుషులనవచ్చు. ఇంకొక రకంగా, తెలుగు వారయిన రఘుపతి వెంకయ్యానాయుడుగారు కూడా ఆ గౌరవానికి అర్హులు. వారు 1910 లోనే క్రోనో మెగఫోన్ అనే ఒక యంత్రాన్ని పాశ్చాత్యదేశాలనుంచి తెప్పించి, తెరమీద బొమ్మలు కదలడము, మాట్లాడడము వంటి వింతలు ప్రతిపట్టణములోనూ ప్రదర్శిస్తూ భారతదేశము, బర్మా, సిలన్‌లలో పర్యటించారు. దక్షిణభారతములో మట్టుకు చలనచిత్ర పరిశ్రమకు వీరే పితామహులు. మద్రాసులో వీరు 1912 లో ఇప్పటి గెయిటీ థియేటర్, 1914 లో మింట్ స్ట్రీట్‌లోని క్రౌన్, 1917 లో పరసు వాకములో నేడు రాక్సీగా ప్రసిద్ధికెక్కిన గ్లోబ్ నిర్మించారు. సినీమా ప్రదర్శనంలో గట్టి అనుభవము గడించిన తరువాత (1918), వీరు తమ కుమారుడయిన రఘుపతి ప్రకాశ్‌గారిని చిత్రనిర్మాణంలో తరిఫీదు పొందడానికి ఇంగ్లండు అమెరికా దేశాలకు పంపారు. ప్రకాశ్‌గారు తిరిగివచ్చిన తరువాత 1920 లో 'ది స్టార్ ఆఫ్ ఈస్ట్ కంపెనీ' అన్న పేరున ఒక సంస్థ స్థాపించి, ఎన్నో మూక చిత్రాలు తీశారు. అవన్నీ కూడా విజయవంత మయాయి. ఆ సంస్థ తీసిన చిత్రాలు : 'భీష్మప్రతిజ్ఞ', 'నందనార్', 'గజేంద్రమోక్షం'. అనంతరము ప్రకాశ్‌గారు నాటక ప్రదర్శనాలలో మంచి అనుభవమున్న ఏలూరు జమీన్ దారు మోతే నారాయణరావుగారితో కలిసి 1925 లో మూకచిత్ర నిర్మాణానికి 'గారంటీడ్ పిక్చర్ కార్పొరేషన్' అనే పేరున ఒక స్టూడియో స్థాపించారు. కాని ఈ స్టూడియో అనేక కారణాలవల్ల విజయవంతముగ సాగలేదు.

ఆనాటికే ఫాల్కే, బాబూరావ్ పెయింటర్ వంటి ప్రముఖుల ఆధ్వర్యాన ఎన్నో మూక చిత్రాలు బొంబాయి కొల్హాపూరు, కలకత్తా నగరాలనుంచి వెలువడుతున్నాయి. పెట్టుబడి బలము, అనుభవము విషయంలో వాటితో తూగలేని ప్రాంతీయ చిత్రాల నిర్మాణం ఆ పోటీకి ఆగలేక అడుగంటి పోయేది. కాని ఇంతలో విప్లవాత్మక మయిన మార్పు ఈ పరిశ్రమలో వచ్చింది. 'టాకీ' యుగము ప్రారంభమయింది. దానివల్ల భాషకు ప్రాధాన్యము వచ్చి, తెలుగులో చిత్రాలు నిర్మించడానికీ, ప్రదర్శించడానికీ అనుకూలాలు ఏర్పడ్డాయి.

తెలుగుదేశంలో టాకీయుగం 1931 లో ప్రారంభ మయిందని చెప్పవచ్చును. ఆ సంవత్సరంలో ఇంపీరియల్ ఫిలిం కంపెనీ ఆధ్వర్యాన శ్రీ హెచ్. ఎమ్. రెడ్డిగారి దర్శకత్వం క్రింద మొదటి తెలుగుటాకీ 'భక్తప్రహ్లాద' వెలువడింది. పెట్టుబడి, నిర్మాణము అంతా బొంబాయి వారిదయినా అదే మొదటి తెలుగుటాకీ. తరువాత 1934 సంవత్సరములో ఈస్ట్ ఇండియా ఫిలిం కంపెనీ ఆధ్వర్యంలో శ్రీ సి. పుల్లయ్యగారి దర్శకత్వము క్రింద మొదట 'సావిత్రి', తరువాత 'లవకుశ' వెలువడి తెలుగులో అఖండ విజయయాత్ర సాగించాయి.

1934 లోనే నిజమయిన తెలుగు కృషి చలనచిత్ర రంగములో ప్రారంభమయినది. బందరు వాస్తవ్యులు కీ. శే. పి. వి. దాసుగారు మద్రాసులో 'వేల్ పిక్చర్స్ లిమిటెడ్' అనే కంపెనీ ఆధ్వర్యాన స్టూడియో స్థాపించి వివిధ నిర్మాణ రంగాలలో తెలుగువారికి తరిఫీదు ఇప్పించి అన్ని విధాల తెలుగు చలనచిత్ర పరిశ్రమకు అపారసేవ చేసి మార్గదర్శకు లయినారు. ఆనాడు మద్రాసు రాష్ట్రంలో చెప్పుకోదగ్గ పెద్ద స్టూడియో అదొకటే. వారు 'సీతా కళ్యాణం', 'కృష్ణలీల', 'మాయాబజారు' వంటి అపార విజయాన్ని సాధించిన చిత్రాలను నిర్మించారు. వారి అకాల మరణం నిజముగా ఆంధ్రుల దురదృష్టం. వారు మరికొంతకాలం జీవించివుంటే తెలుగు చలనచిత్ర పరిశ్రమ ఈనాడు ఎంతో ఉన్నతస్థితిలో ఉండేది.

ఆ రోజులలో పౌరాణిక, జానపదగాథలే తీసుకుని తెలుగుతో చిత్రాలు నిర్మించడము జరిగినది. వాటిలో కూడా చాలభాగం రంగస్థలముమీద ఎక్కువ ప్రజామోదాన్ని పొందిన నాటకాలే చలన చిత్రాలకు కూడా ఇతివృత్తాలయినాయి.

ఆ తరువాత ఈ పరిశ్రమ అనేక రకాలుగా అభివృద్ధి చెందింది. 1937 లో 'గృహలక్ష్మి' చిత్రంతో తెలుగులో సాంఘిక చిత్రాల యుగము ప్రారంభమయింది. 1936 లోనే 'ప్రేమ విజయం' అనే సాంఘిక చిత్రం వచ్చినా అది అంతగా ప్రజామోదాన్ని పొందలేదు. 'రోహిణీ పిక్చర్స్' అనే సంస్థ శ్రీ హెచ్. ఎమ్. రెడ్డిగారి ఆధ్వర్యాన వెలిసింది. దానిలో ఈనాడు చలనచిత్ర పరిశ్రమకు మూలపురుషు లనదగిన పలువురు - బి. యన్. రెడ్డి, కె. వి. రెడ్డి, నాగయ్య, కన్నాంబ, నాగిరెడ్డి, సముద్రాల, నాగభూషణం వంటి ప్రముఖులు సహకరించి, 'గృహలక్ష్మి' చిత్రాన్ని నిర్మించారు. ఆ చిత్రం అఖండ విజయాన్ని సాధించడంతో సాంఘిక చిత్ర నిర్మాణము ఉత్సాహంగా ప్రారంభమయింది, కొద్ది రోజుల అనంతరం తెలుగువారు గర్వంగా చెప్పుకోదగ్గ సంస్థలు రెండు రూపొందాయి : ఒకటి బి. యన్. రెడ్డిగారి ఆధ్వర్యాన 'వాహినీ పిక్చర్స్ లిమిటెడ్', రెండు కీ. శే. జి. రామబ్రహ్మంగారి ఆధ్వర్యాన 'సారథి ఫిలిమ్స్'. రామబ్రహ్మం

గారు రచయిత, పత్రికా నిర్వాహకుడు; తన సహజ సంస్కృతి, లక్ష్యశుద్ధి చిత్రనిర్మాణంలోనికి తెచ్చి, 'మాలపిల్ల', 'రైతుబిడ్డ' వంటి ఉత్తమ చిత్రాలు నిర్మించి తెలుగువారికి స్మరణీయులయినారు. వారి అకాలమరణము తెలుగు చిత్రపరిశ్రమకు తీరనిలోపము. వాహినీసంస్థ 'వందేమాతరం', 'సుమంగళి', 'దేవత', 'స్వర్గసీమ', 'పోతన' 'వేమన', 'మల్లీశ్వరి' వంటి అపురూపమయిన చిత్రాలను నిర్మించడమే కాక, నేటికీ ఉత్తమ లక్ష్యాలకు గీటురాయిగా నిలిచి, వ్యాపారదృష్టినే ప్రధానముగా పెట్టుకోక కళాసేవ చేస్తున్నది.

ఆ దినాలలోనే మీర్జాపురపు రాజావారు శోభనాచల స్టూడియో స్థాపించి ఎన్నో పౌరాణిక చిత్రాలు తీశారు. వీరుగాక నాటినుండి నేటివరకు చిత్రనిర్మాణము చేస్తూ, స్థిరపడిన సంస్థ రాజరాజేశ్వరీ ఫిలిమ్స్. శ్రీమతి కన్నాంబ, శ్రీ నాగభూషణంగార్లు ఈ సంస్థకు వ్యవస్థాపకులు. 'తల్లిప్రేమ', 'సుమతి', 'హరిశ్చంద్ర', 'పాదుక' వంటి చిత్రాలు వీరు తీశారు. కొంచెం ఇంచుమించుగా ఈ సమయంలోనే ఘంటసాల బలరామయ్యగారు 'ప్రతిభా పిక్చర్స్' స్థాపించి 'పార్వతీ కళ్యాణం', 'సీతారామ జననం' వంటి చిత్రాలు నిర్మించారు.

ఆ నాటికీ ఈ నాటికీ కూడా సాంఘిక చిత్రాలకంటె పౌరాణిక చిత్రాలకే ఎక్కువగా ప్రజాదరము లభిస్తున్నది. అయినప్పటికీ సాంఘిక చిత్రాలకు కూడా తగినంత ప్రజాదరము ఏర్పడింది.

చిత్రనిర్మాతలు, చిత్రాలు తక్కువగా ఉన్న మొదటి రోజుల్లో నిర్మాతలే ప్రదర్శకులకు స్వయముగా చిత్రాలు ఇస్తూండేవారు. కాని చిత్రాలసంఖ్య పెరిగిన తరువాత, వాటిని విడుదలచెయ్యడానికి డిస్ట్రిబ్యూటర్స్ వచ్చారు. అంతకుముందే చాలాకాలంగా చమ్రియా టాకీ డిస్ట్రిబ్యూటర్స్ తెలుగుదేశంలో కొన్ని చిత్రాల విడుదల పర్యవేక్షిస్తూ ఉండేవారు. కాని తెలుగులో సాంఘిక చిత్రాల యుగం ప్రారంభమయిన తర్వాత యెన్నో డిస్ట్రిబ్యూషన్ సంస్థలు వెలిశాయి. ఈ రంగంలో ప్రప్రథములు కీ. శే. పారుపల్లి శేషయ్యగారు సరస్వతీ టాకీ డిస్ట్రిబ్యూటర్స్ అనే పేరున, శ్రీ జి. కె. మంగరాజుగారు పూర్ణా టాకీ డిస్ట్రిబ్యూటర్స్ అనే పేరున రెండు సంస్థలు స్థాపించారు. ఇటీవల వాహినీ పిక్చర్స్ లిమిటెడ్ డిస్ట్రిబ్యూషన్ సంస్థగా మారింది. నవయుగ, విజయ మొదలయిన డిస్ట్రిబ్యూషన్ సంస్థ లెన్నో వెలిశాయి. నేడు ప్రతి నిర్మాత ఈ సంస్థలద్వారానే చిత్రాలను విడుదల చేస్తున్నాడు.

1943 వరకు చిత్రాలకయ్యే కర్చు పరిమితంగా ఉండేది. అమితలాభాలు ఆర్జించిన చిత్రాలు ఒకటి రెండున్నా మొత్తముమీద లాభముకాని, నష్టముకాని అంత ఎక్కువ ఉండేదికాదు. ఆ తరువాత ద్రవ్యోల్బణము, యుద్ధపరిస్థితులు అన్ని రంగాల్లోలాగే చలన చిత్ర రంగంలో కూడా పెద్ద మార్పులు తెచ్చాయి. కర్చు, దానితోపాటు ఆదాయము అమితముగా పెరిగాయి. పరదేశాలనుంచి ఫిల్ము, ఇతర సాధన సామగ్రి రావడానికి ప్రతిబంధకాలు ఏర్పడ్డాయి. చిత్రనిర్మాణము కొంత వెనకపడింది. ధన వ్యామోహము వ్యాపారదృష్టినీ, కళాదృష్టినీ బొత్తిగా మరుగు పరిచింది. ఎన్ని చిక్కులున్నా చిత్రమంటూ తీయగలిగితే అమితంగా లాభాలు ఆర్జించవచ్చునన్న ఆశ అనేకులను ఈ పరిశ్రమలోకి దింపింది. కొత్త నిర్మాతలు, కొత్త చిత్రాలు మితిమీరి పెరిగాయి. నటీనటులు, నిపుణులు, దర్శకులు - అందరికీ ఆదాయాలు పెరిగాయి. చిత్రనిర్మాణ వ్యయం పూర్వంకన్న మూడింతలయి పోయింది. యుద్ధసమాప్తి అయిన తరువాత పరిస్థితి మరీ క్లిష్టమయిపోయింది. 1946 మొదలు 1950 వరకు ఎందరో కొత్తనిర్మాతలు రంగంలో ప్రవేశించారు. ఎన్నో చిత్రాలు తీశారు. ఈ పందెపు పోటీ వాతావరణంలో లాభించినవారు కొద్దిమంది ఉన్నా, చతికిలపడిపోయినవారు అనేకులు.

ఈ దినాలలో చెప్పుకోదగ్గ సంఘటన 1947 లో వాహినీ స్టూడియో నిర్మాణము. వాహినీ పిక్చర్స్ చైర్మెన్ అయిన కీ. శే. మూలా నారాయణస్వామిగారు దీనిని నిర్మించారు. ప్రఖ్యాత దర్శకుడయిన శ్రీ బి. యన్. రెడ్డిగారి పర్యవేక్షణ క్రింద నిర్మాణము జరిగింది. ఇప్పుడు వాహినీ స్టూడియో హిందూదేశములోనేగాక ఆసియాలో కంతకీ గొప్ప స్టూడియోగా పేరు పొందింది. అంతక్రితమే ఆంధ్రదేశంలో రెండు స్టూడియోలు వెలసి, కారణాంతరాలవల్ల మాసిపోయాయి: ఒకటి విశాఖపట్నంలో 'ది ఆంధ్ర సినీటోన్', రెండు రాజమహేంద్రవరంలోని 'దుర్గా సినీటోన్'. వాహినీ స్టూడియో నిర్మాణము అయిన కొద్ది రోజులకే శ్రీ మూలా నారాయణస్వామిగారి మరణానికి కొంచెం పూర్వం దానిని 'విజయా ప్రొడక్షన్సు లిమిటెడ్' అనే సంస్థ అద్దెకు తీసుకుని నిర్వహిస్తున్నది. ఈ సంస్థను స్థాపించినవారు ఆంధ్రలోకానికి పరిచితులయిన శ్రీ నాగిరెడ్డి, చక్రపాణి గార్లు. తెలుగుసంస్థ లన్నిటిలోకి బహుకొద్ది కాలములోనే స్థిరత్వాన్ని సంపాదించి, అగ్రగణ్యంగా అయిన సంస్థ 'విజయ'. వీరు 'షావుకారు', 'పెళ్లిచేసి చూడు', 'పాతాళభైరవి', 'చంద్రహారం' వంటి చిత్రాలను ఒక్క

తెలుగులోనే గాక తమిళంలోకూడా నిర్మించారు. అంతే గాక వీరు తమ ఆధ్వర్యాన వాహినీ స్టూడియోను ఎన్నో విధాల అభివృద్ధి చేశారు.

ఇవిగాక తెలుగువారు నిర్మించిన ఇతర స్టూడియోలు - శ్రీమతి భానుమతిగారి 'భరణి', శ్రీమతి వరలక్ష్మి, ప్రకాశ రావుగార్ల 'ప్రకాశ్', శ్రీ హెచ్. ఎమ్. రెడ్డిగారి 'రోహిణి'. విజయావారు తెలుగుతోపాటు తమిళ భాషలో చిత్రాలు తీస్తున్నట్టుగానే, తమిళ చిత్ర నిర్మాత లెందరో తమిళముతోబాటు తెలుగులో కూడా చిత్రాలు నిర్మించారు. జెమిని, ఎ. వి. యమ్., పక్షిరాజా వంటి సంస్థలు తెలుగుదేశంలో దిగ్విజయ యాత్రలు సాగించిన 'జీవితం', 'అగ్గిరాముడు', 'మనోహర' మొదలయిన చిత్రాలు నిర్మించారు. రెండు మూడు భాషలలో ఒకే కథను చిత్రంగా నిర్మించడము ఈ పదిసంవత్సరాలమధ్య అమలులోకి వచ్చింది.

ఇప్పుడు సంవత్సరానికి 25 మొదలు 30 చిత్రాల వరకు తెలుగుదేశములో విడుదల అవుతున్నాయి. రాబడి విష యంలో తమిళ చిత్రాలకంటె తెలుగు చిత్రాలు తీసి కట్టయినా, తెలుగు చలనచిత్రకళ నిర్మాణ కౌశలములో, కథాసంవిధానములో, నటనాచాతుర్యంలో తమిళచిత్రాల కంటె ఉన్నతస్థాయికి వచ్చింది. నటీనటులలో శ్రీయుతులు నాగయ్య, రామారావు, నాగేశ్వరరావు, రంగారావు, శ్రీమతులు కన్నాంబ, అంజలీదేవి, సావిత్రి, జి. వరలక్ష్మి, సూర్యకుమారి, భానుమతి, శ్రీరంజనివంటివారు తమిళ నాడులోకూడా ఎంతో ప్రఖ్యాతి గడించారు. దర్శకులలో శ్రీయుతులు హెచ్. ఎమ్. రెడ్డి, సి. పుల్లయ్య, బి.యన్. రెడ్డి, కె. వి. రెడ్డి, ప్రసాద్, పి. పుల్లయ్య వంటి అనుభ వజ్ఞు లున్నారు. వీరి తరువాతతరంవారిలో కూడా ఎందరో సమర్థులయిన యువకు లున్నారు. సంగీత దర్శకు లలో తెలుగు, తమిళ భేదము లేకుండా అందరికీ అభి మాన పాత్రులయిన శ్రీయుతులు నాగయ్య, రాజేశ్వర రావు, ఘంటసాల వెంకటేశ్వరరావుగార్లు తెలుగువారు. తెలుగు ఫిలిం పరిశ్రమ సాహితీ రంగంలో ప్రసిద్ధులయిన కీ. శే. బలిజేపల్లి లక్ష్మీకాంతం, దేవులపల్లి కృష్ణశాస్త్రి, తాపీ ధర్మారావు, శ్రీ. శ్రీ వంటి వారి నెందరినో ఆకర్షించింది.

సాహిత్యం, సంగీతం, చిత్రకళలవంటి అనేక కళల సమ్మేళనం చలనచిత్రకళ. సమాజముమీద తక్కినవాటి యొక్క ప్రభావం పరిమితమైనది. ఆయాకళలయందు అభిరుచి ఉన్నవారికి మాత్రం అవి అందుబాటులో ఉంటాయి. చలనచిత్రకళ సార్వజనీనమైనది. సాంస్కృతి కంగా దీని ప్రభావం అపరిమితమైందని మేధావు లందరూ అంగీకరించిన విషయము. ఉత్తమ సంస్కృతికి ఒరవడిగా నిలిచే చిత్రాలు ఈనాడు బహుకొద్దిగానే వెలువడు తున్నాయి. అయితే ఈ చలనచిత్ర కళను శక్తివంతమైన కళాసాధనగా చేయాలంటే ఒకప్రక్క విద్యావంతుల సానుభూతి సహకారాలు, మరొకప్రక్క కళలను ఆరా ధించే ప్రముఖుల విశ్వాసబలం ఎంతైనా అవసరం. ఈనాడు ప్రసిద్ధ నటీనటులలో ఎందరో విద్యా, సంస్కృతుల విశిష్టస్థానాన్ని గుర్తించినవా రున్నారు. విశ్వవిద్యాల యాలకు, కళాశాలలకు, ఉన్నతపాఠశాలలకు భూరి విరాళాలను ఇచ్చిన శ్రీయుతులు నాగేశ్వరరావు, శ్రీమతులు అంజలీదేవి, భానుమతి మొదలైనవారు మార్గ దర్శకులైనారు.

కెమేరా, శబ్దగ్రాహక యంత్రాలు మొదలయిన వాటిలో అపూర్వమయిన అభివృద్ధి పాశ్చాత్యులు సాధిం చారు. ఆ పరికరాల ఉపయోగంవల్ల చిత్రాలు నిర్దుష్టంగా నిర్మించడానికి ఈనాడు అవకాశాలు ఏర్పడ్డాయి. ప్రకృతిని యథాతథంగా పునస్సృష్టి చెయ్యగల స్థితికి వచ్చింది చిత్రకళ.

చలనచిత్ర నిర్మాణం ఒక దృష్టిలో వ్యాపారమూ, ఒక దృష్టిలో కళ. ఈ పరిశ్రమకు సమర్థులయిన నిపు ణులూ కావాలి, భావనా బలముగల కళాకారులూ కావాలి. ఇద్దరి సహకారము ఉన్నప్పుడే నిజముగా గొప్ప చిత్రాలు నిర్మించడానికి వీలవుతుంది. ఎంత రసవంత మయిన సన్నివేశమయినా నిపుణులు సమర్థులు కాకపోతే చప్పబడుతుంది. అలాగే నిపుణులు ఎంతటి సమర్థులయినా వారి నేర్పు కథాకల్పన, పాత్ర పోషణలపై ఆధారపడి ఉంటుంది. దీనిలో జీవము లోపిస్తే చిత్రములోనూ జీవము లోపిస్తుంది. తెలుగు చిత్ర జగత్తులో సమర్థులయిన నిపుణులూ ఉన్నారు; భావనాబలము గల కళాకారులూ ఉన్నారు. అందుచేతే కళాదృష్ట్యా గొప్పవని చెప్పదగిన రైతుబిడ్డ, పోతన, మల్లీశ్వరి, షావుకారు వంటి చిత్రాలు తెలుగులో వచ్చాయి. అయితే తెలుగు చలనచిత్రాలలో పదుగురు ప్రముఖులు అన్ని రంగాలవారు సహకరించి చిత్రాలను నిర్మించడము జరగలేదు. వ్యక్తుల ప్రతిభనుబట్టి ఒక్కొక్క చిత్రము, ఒక్కొక్క దృష్టినుంచి బాగున్నా సర్వాంగ సుందరమయిన చిత్రాలు విరివిగా రావడములేదు. **పా. ప.**

**సీతమ్మ, కొటికలపూడి** (క్రీ. శ. 1874 - 1936): ఈమె అబ్బూరి సుబ్బారావుగారి పుత్రిక; కొటికలపూడి రామారావుగారి ధర్మపత్ని. రామారావుగారు ఉద్యోగ ధర్మమున రాజమహేంద్రవరములో ఉండుటచేత ఈమె నివాసము భర్త ఉండిన కాలమందును, ఆ తర్వాతను

కూడ రాజమహేంద్రవరములోనే కడచినది. ఈ కాలములో ఈమె కందుకూరి వీరేశలింగముగారికి శుశ్రూష చేయుచు వారి వద్దనే తెలుగు విద్యను అలవరచుకొని కవయిత్రి యైనది. చరమ దశలో ఈమె శ్రీ పిఠాపురము మహారాణియైన చిన్నమాంబగారికి విద్య అలవరచుచు గురుపదము నధిష్ఠించి యుండినది. ఈమె రచించిన గ్రంథములలో వీరేశలింగముగారి జీవితచరిత్ర కథావస్తువుగా గల పద్యకావ్యము ఉత్తమ మయినది. అహల్యాబాయి చరితము ఇతివృత్తముగా గల కావ్యము కూడా ఎన్న దగిన కావ్యము. ఈమె సాధురక్షక శతకము, 'ఒక మహమ్మదీయ వనిత 'యను కరుణరస భరితములయిన పద్యములు, 'లేడీ జేన్ గ్రే' మొదలయిన చిన్న కావ్యములు కూడా పెక్కు రచించెను. ఈమె తన ఉపన్యాసము లన్నీ ఒక వచన గ్రంథ సంపుటిగా ప్రకటించినది. 1913 లో బాపట్లలో జరిగిన మొదటి ఆంధ్ర మహాసభ యందలి మహిళా సభకు అధ్యక్షురాలుగా ప్రఖ్యాతి చెందినది; శ్రీ వీరేశలింగము గారికి చేదోడువాదోడుగా ఉండి 'స్త్రీ విద్య' విషయములో తోడ్పడినది. గి. వెం. సీ.


చిత్రము 807.
కొటికలపూడి సీతమ్మ

సీతమ్మ, డొక్కా (క్రీ. శ. 1841 - 1909): ఈమె నివాసగ్రామము తూర్పు గోదావరి జిల్లా లంకల గన్నవరము. ఈమె తండ్రి అనప్పిండి భవానీశంకరుడు; తల్లి నరసమ్మ. ఈమె భర్త డొక్కా జోగన్నగారు. ఈ పుణ్య దంపతుల పుత్ర, పౌత్రాదులు నేటికిని లంకల గన్నవరములో గలరు.

సీతమ్మ బాల్యమునుండియు వితరణస్వభావముగలది; పుట్టినింటివారు అంత సంపన్నులు గాకపోయినను ఉన్నంతలోనే పేదసాదలకు బెట్టుచుండెడిది; పెండ్లియైన తరువాత, అత్తవారు సంపన్నులగుటచే భర్త యనుమతి ననుసరించి దానధర్మములు చేయుచుండెడిది. అన్నదానము చేయుటలో నీమె యెక్కుడు పేరువడెను; జాతి మత విచక్షణలేక, యేవేళ నెంద రతిథులు వచ్చినను లేదనక విసుగుకొనక యాదరముతో నన్నము పెట్టి వారలకు తృప్తి గలిగించెడిది. ఈ విషయమున నీమెకు భర్తయు ననేకవిధముల సాయపడుచుండెను.

ఈమె యన్నదానమునుగూర్చి లోకము చెప్పుకొనెడి కథలు, గాథలు నెన్నెని గలవు. ఏడవ ఎడ్వర్డు చక్రవర్తి యీమెదాతృత్వమును మెచ్చుకొనుచు 1903 లో నొక యోగ్యతాపత్ర మంపిరట. అంతియే గాదు, ఆకాలమున ప్రతివర్షమును జరుగుచుండిన పట్టాభిషేక సమయములందు ఈమె ఛాయాచిత్రమును దర్బారు హాలులో నుంచున ట్లేర్పాటుగావించిరట.

ఈ విధముగా సీతమ్మ సుమారు డెబ్బదివర్షములు జీవించి, ఆజీవితాంతమును అతిథిసత్కార మొనర్చి అన్నదానము సేయుటలో మహారాజులకు లేని ప్రఖ్యాతిని గడించినది. మి. సీ. చ.

సీతారామరాజు, అల్లూరి (క్రీ. శ. 1897-1923): ఈయన పశ్చిమగోదావరిజిల్లా భీమవరం తాలూకా లోని మొగల్లు గ్రామమునందు జన్మించెను. ఈయన సత్ క్షత్రియ వంశ్యుడగు వెంకట రామరాజుగారి కనిష్ఠ పుత్రుడు; తండ్రియొద్ద రాజమహేంద్రవరమున కొన్నాళ్లును, తరువాత విశాఖపట్టణమునందు ఏ. వి. యన్. కళాశాలలోను, పిమ్మట నరసాపురమునందలి టైలరు హైస్కూలులోను ఆంగ్లవిద్య నభ్యసించుటకు ప్రయత్నించియు కృతార్థుడు కాలేక ప్రకృతి సిద్ధముగ ధైర్యశాలి, సాహసోపేతుడు నగుటచేత వనచరుల, గిరిజనుల సాహసకార్యములందును, విలువిద్య, గుర్రపుస్వారి మొదలగు సాంగ్రామిక కార్యములయందును ఉత్సాహము చూపుచు వచ్చెను. ఈయన కౌమారము నీరీతిని గడుపుచుండ ఈయన పినతండ్రి, అచట డెప్యూటి తహసీల్దారుగా నుండిన రామకృష్ణరాజుగారు తునికి మార్పబడుటతో ఆయనవెంట ఈయనయు నచటికేగి చదువు సాగించుచుండెను. ఇంగ్లీషుచదు వంటలేదు కాని ఈయనకు పెక్కుభాషలు వచ్చును; సాముద్రికము తెలియును. ఈయన ధర్మాధర్మముల నెరిగినవాడు; మంత్ర తంత్ర కుశలుడు; పెక్కు ఓషధులను గుర్తించి వైద్యము చేయువాడు; భూతభవిష్యత్తులు చెప్పగలడని ప్రతీతి; వశీకరణశక్తి కలవాడు; దృఢశరీరుడు; బంగారమువంటి దేహచ్ఛాయగలవాడు; ఋజుస్వభావము, స్నేహానుకంపాభరములై ఉజ్జ్వలకాంతు లీనునేత్రములుగలవాడు; దీనుల యెడ కనికరము గలవాడు. దుష్టులకైన మేలొనరించు నంతటి మృదు హృదయ మీయనది. అడవులతో నిండిన నరిసీపట్నము తాలూకాలో (విశాఖపట్టణము జిల్లా) కొండలమధ్యనున్న కృష్ణదేవిపేట గ్రామములో ఈయన 1921-22 లో శ్రీరామమందిరమును నిర్మించి అందు నివసించుచుండెను. మొదట ఈయన దినమున కొకమారు

భుజించుచు, తరువాత భోజనమును మాని వేపాకు తినుచు కఠిన తపశ్చర్య నవలంబించి అద్భుతశక్తిని సంపాదించెను; ఆ గ్రామవాసు లొసగుచుండిన పాలు పండ్లు గైకొనుచు వచ్చెను. అచటి కోయ లందరకు ఈయన యొక దివ్య పురుషుడను నమ్మకము కుదిరి వారు ఈయన యాజ్ఞలను శంకముగా భక్తితో పాలించుచుండిరి.

గాంధిమహాత్ముని సహాయనిరాకరణోద్యమము తీవ్రముగ సాగుచుండిన కాల మది. ఈయన ఆ దినములలో ప్రజలు ప్రభుత్వన్యాయస్థానములకు పోగూడదను నిర్ణయముచేసి ఆ జిల్లాయందలి గూడెం తాలూకాలోని అంటాడ, రంప, పెదవలస గ్రామములలో పంచాయతీ న్యాయస్థానములను నెలకొల్పెను. ఈయన యాదేశము ననుసరించి స్థానికప్రజలు కోర్టులు బహిష్కరించి తమ వివాదములను తమలో తాము మాధ్యస్థ్యము ద్వారా పరిష్కరించుకొన దొడగిరి. కోర్టుల బహిష్కారమును సహింపజాలక ప్రభుత్వోద్యోగులు ఈయనకు రాజద్రోహము నంటగట్టి నిర్బంధించి కారాగారమునందుంచిరి.


చిత్రము 308.
అల్లూరి సీతారామరాజు

ఈయనకు విరుద్ధముగా సాక్ష్యముచెప్పువారు లేకపోవుటచే శిక్షవిధించుటకు వీలు పడక వారు ఆరు వారములకు తరువాత ఈయనను విడిచిపెట్టిరి; కాని ఈయన చర్యలను కనిపెట్టి తమకు తెలుపుటకై గూఢచారులను నియమించిరి. ఈ గూఢచారులబాధ సహింపలేక ఈయన పోలీసువారు తన్నొకదొంగవలె చూచుచుండిరనియు, అది తనకు దుర్భరముగా నున్నదనియు పోలవరం మేజిస్ట్రేటుకు అర్జీ పెట్టుకొనెను. గూడెం తాలూకా ప్రజలకు ఈసంగతి తెలిసి వారు ఈయన నాయకత్వమున ప్రభుత్వముపై తిరుగుబాటు జరిగించుటకై రహస్యముగ చర్చింప మొదలిడిరి. ఈ సంగతి ప్రభుత్వమువారికి తెలిసి వారీయనను పైడిపుట్ట యను గ్రామమునందే యుండవలెనని నిర్బంధావాసము విధించి నివాసమున కొకయింటిని, వ్యవసాయమునకు ముప్పది యెకరముల భూమిని ఇచ్చిరి. అప్పటికిని గూఢచారులబాధ వదలకపోవుటచేత తన నివాసమును తునికి మార్చుకొనుటకు సమ్మతింపవలసినదిగా ఈయన ప్రభుత్వమునకు మరియొక అర్జీ పెట్టుకొనెను. తాను స్వేచ్ఛగా నుండగలచోట నివసింపవచ్చునని పోలవరం మేజిస్ట్రేటు ఈయనకు తెలిపెను. తరువాత ఒక యాగమును చేయనెంచి ఈయన సంబారములను సేకరించుకొనుచుండిన కాలమున ప్రభుత్వాధికారుల వలన ప్రజలకు కలుగుచుండిన బాధలను తొలగించుటకు ఈయన జోక్యము కలిగించుకొనవలసిన పరిస్థితి యేర్పడినది.

గూడెం కొండలమధ్య సాంద్రాటవిలో నున్న గానాల పాలెం గ్రామవాసులు గాము మల్లుదొర, గంటందొరలు సోదరులు. వీరు యువకులు, ముఠాదారులు, విలువిద్యలో సిద్ధహస్తులు. వీరిలో గంటందొర బాతపణుకుల గ్రామమునకు మునసబు. వీరు నడిమిపాలెము, శరభన్నపాలెము చుట్టుపట్టులగల ఇతర గ్రామములందును గొప్పపలుకుబడి గలవారు. వీరు ప్రభుత్వమునకు ప్రతికూలముగ ప్రవర్తించిరని చెప్పి గూడెం తహసీల్దారు బాస్టియన్ అను దేశీయక్రైస్తవుడు వీరి నుద్యోగమునుండి తీసివేసి వీరి భూములను కూడ లాగుకొనెను. పితూరికారణ మిదేయని కొంద రందురు. గాము సోదరులకు జరిగిన అన్యాయము తెలిసి గూడెం నివాసి మొట్టదం వీరయ్య, పెద్దవలసనివాసి నాయడు బాలయ్య అను పలుకుబడిగల ముఠాదారులుకూడ వారితో చేరి అరణ్యప్రాంతమునకు ఆధిపత్యమువహింప సీతారామరాజుగారి సాయము నభ్యర్థించిరి. ఈ తరుణముననే లమ్మసింగువద్ద రోడ్డువేయుటకు గవర్న్మెంటు కంట్రాక్టరుగ కూడ నుండిన గూడెం తహసీల్దారు బాస్టియన్ గూడెం కూలీలకు మొదట ఖరారుచేసిన రోజు కూలి నీయక, కూలి సరిగా యిచ్చుట లేదని వారు పనికిరాక సమ్మె చేసినప్పుడు ఆయనయు, ఓవర్సీరు సంతానం పిళ్ళెయు వారిని స్త్రీ పురుష వివక్ష లేక చెప్పరాని హింసల పాలుచేయగా వా రందరు వచ్చి తమ పాట్లను సీతారామరాజుగారితో మొరవెట్టుకొన్న మీదట ఈయన వారిపక్షము వహించి ప్రభుత్వముపై తిరుగుబాటు లేవదీసెను. అప్పు డీయన కుండిన యనుచరులు మూడువందలమంది. వారికి నవీనాయుధ సామగ్రి యేదియు లేదు; వారికుండినవి విండ్లు, అమ్ములు, గండ్రగొడ్డళ్ళు, గదలు మొదలైన పురాతనాయుధములు మాత్రమే. ఈ యాయుధములు ధరించి 250 మంది కూలీలు వెంటరాగ, ధనుర్బాణధారులై గాము సోదరులిరుపార్శ్వముల నడచిరాగ ఈయన 1922 ఆగస్టు 12 గంటలప్పుడు చింతపల్లి పోలీసుస్టేషను ముట్టడించెను. ఆయన పోలీసు జవానులపై విక్రమించి అక్కడనుండి 1390 తోటాలను, 14 సన్నీలను, కొన్ని సంచుల తుపాకిమందును, పదకొండు తుపాకులను తీసికొని ఆ యాయుధములను

తనవారి కందరకు సమముగా పంచిపెట్టి ఆ యూరివారికెట్టి చెరుపుచేయక వెళ్ళిపోయెను. ఈ గుంపు కృష్ణదేవిపేటకు పోవుచుండగా త్రోవలో నిద్దరు పోలీసు కాన్‌స్టేబిల్‌లు ఎదురుపడగా వారిని పట్టుకొని తన్ని వారివద్దనున్న 5 తుపాకులను, కొన్ని తోటాలను దీసికొనినది. ఆగస్టు 24 తేదిని అది కృష్ణదేవిపేట పోలీసుస్టేషనును ముట్టడించెను. అప్పుడక్కడ సబ్ ఇన్‌స్పెక్టరు లేడు. అక్కడి కాన్‌స్టేబులుల కెట్టి హాని చేయక అక్కడ నుండిన 5 కత్తులను, 6 తుపాకులను, 14 సన్నీలను, 25 తోటాలను స్వాధీనపరచుకొని అటుతరువాత తిరుగబాటుదారులు రాజవొమ్మంగికి బైలుదేరి పోయిరి. వారు వచ్చుచుండినవార్త ముందుగా తెలిసి పోలీసులు తుపాకులు తీసికొని పోరాడుటకు సిద్ధమైరి. గాము సోదరుల నాయకత్వమున తిరుగబాటుదారులు పోలీసులతో పోరాటము సాగించి స్టేషను వశపరచుకొని అక్కడ నుండిన యుద్ధసామగ్రిని - తోటాలు, తుపాకి మందు - తీసికొని అడవులలోనికి వెళ్లిపోయిరి.

ఈ తిరుగబాటువార్తలు తెలిసి విశాఖపట్టణము జిల్లా కలెక్టరు, పోలీసు సూపరింటెండెంటు పోలీసు సిబ్బందితో చింతపల్లి మొదలైన గ్రామములకు 35 మైళ్ళదూరములోనున్న నరిసీపట్నమునకు వచ్చి చేరి తిరుగబాటుదారుల జాడలు తీయుటకై ఏజెన్సీ అసిస్టెంటు కమీషనరు నాయకత్వమున పోలీసు దళములను చుట్టుపట్టుల గ్రామములకు పంపిరి. ఒంజేరి గ్రామము సమీపమున కోయ నాయకులు వారికి కానవచ్చిరి. అక్కడ ఉభయపక్షములకు గొప్ప పోరాటము జరిగెను. అసిస్టెంటు కమీషనరుకు గట్టి గాయము తగిలినది. కూలీలను హింసించిన బాస్టియను అదృష్టవశమున బాణము గురి తప్పుటచేత బ్రతికిపోయెను. పోలీసుదళములు పారిపోయి లమ్మసింగు గ్రామములో తలదాచుకొన్నవి; సీతారామరాజు దానిమీద సైతము దాడిచేయునని భీతిలి అక్కడనుండి నరిసీపట్నమునకు పోయి చేరుకొన్నవి. సెప్టెంబరు 24వ తేదిని ఇద్దరు ఇంగ్లీషు ఉద్యోగులు - స్కాట్ కవర్డ్, హెయిటర్‌లు - పోలీసు దళములతో పితూరీదారుల రాకకై వేచియుండిరి గాము సోదరుల కది తెలిసి వారు ఆకస్మికముగా వారిపై బడిరి; ఇంగ్లీషు ఉద్యోగుల నిద్దరను వెంటనే కాల్చి చంపివేసిరి. ధైర్యముతో పోరాడినను శత్రువును నిగ్రహింపలేక పోలీసులు తుదకు పారిపోయిరి. పితూరిదారులు మరలిపోయిన తరువాత వారు హతులైన దొరల శవములను నరిసీపట్నమునకు తీసికొని పోయిరి.

తరువాత అక్టోబరు 15వ తేదిని అడ్డతీగెల పోలీసు స్టేషనుమీద దాడి చేయుదుమని సీతారామరాజు గోదావరి జిల్లా కలెక్టరుకు వార్త నంపెనట. అక్కడికి మూడు మైళ్ల దూరములోనున్న తిమ్మాపుర గ్రామమున కలెక్టరు మకాముచేసి మత్రిపీడు మునసబును ఆయనకడకు పంపెను. తాను సాయంకాలము వరకు అడ్డతీగెలలో నుందుననియు, పోరాడుటకు కాని సంధిమాటలకుకాని కలెక్టరు రావచ్చుననియు ఆయన ప్రత్యుత్తర మంపెను. కాని కలెక్టరు ఆ దినమున నక్కడకు వెళ్లనేలేదు. సీతారామరాజు చెప్పిన ప్రకారము అడ్డతీగెలకు వెళ్ళి అక్కడనుండిన తుపాకిమందు మాత్రము తీసికొని స్టేషనులో కత్తులు తుపాకులు లేక పోవుటచేత తుపాకిమందును మాత్రమే తీసికొంటినని స్టేషను డైరీలో వ్రాసి సంతకముచేసి వెళ్లి పోయెను. కలెక్టరు ఈ సంగతి యంతయు తెలిసికొనెను కాని ఆయనకు పితూరిదారు లెట్లు పోయినది తెలుపువారే లేక పోయిరి.

సీతారామరాజు చోడవరం డెప్యూటి తహసీల్దారుతో తిరుగుబాటునకు కారణములు వివరించి చెప్పెననియు, కాని ఆయన రూపమునకును, ఆకర్షకమగు వైఖరికిని ముగ్ధుడై తహసీలుదారు ఆయన నేమియు చేయజాలక పోయెననియు చెప్పుదురు. ఈ విధముగా కొంద రుద్యోగులు ఆయన యెదుట నున్నప్పు డేమియు చేయక కనుమరుగైన వెంటనే ఆయనకు విరోధులవలె ప్రవర్తించుచు వచ్చిరి.

అది వర్షాకాలము. వానలలో పోరాటము సాగించుట కుభయపక్షములకు కష్టమయ్యెను. పోలీసు లనేకులు మన్యపు జ్వరమువల్ల చనిపోయిరి; కొందరు జ్వరపీడితులైరి; ఇంక ననేకులు ఆస్పత్రులలో చేరిరి. పితూరిదారుల జాడలు తెలియరాకపోవుటతో గవర్నమెంటు ఉద్యోగుల కష్టములు మరింత అధికమైనవి. వాయు విమానములు, మర ఫిరంగులు, విషవాయు వికిరణయంత్రములు - అన్నియు పట్టపగలే దారులు కానరాని సాంద్రారణ్యములలో నిరర్థకములైనవి. ఆ ప్రదేశము బాగుగా తెలిసిన అబ్దుల్ అజీజ్, అగ్గిదొర అని వ్యవహరింపబడు నందకిశోరు, బాస్టియను కాక ఆర్మిటేజ్, కీన్, హాప్పెల్, నాప్, స్పార్క్స్ మొదలైన ఇంగ్లీషువారును అస్సాము, మలబారులనుండి సైన్యములను రప్పించి విరతి విశ్రాంతులు లేకుండ రేయింబవళ్లు యుద్ధము సాగించిరి. గుంటూరు జిల్లాలో సహాయ నిరాకరణోద్యమమును అణచివేయుటలో పేరుపడ్డ రూథర్‌ఫర్డు వీరికి అధిపతిగ నియమితుడయ్యెను. ఆధిపత్యము వహించిన వెంటనే అతడు తిరుగబాటునాయకులను పట్టియిచ్చినవారికి రు. 1,500లును, అందు సీతారామరాజును పట్టి యిచ్చినవారికి రు. 10,000లును బహు

మతిగా నివ్వబడునని ప్రకటన చేయించెను; ఇవికాక ప్రాముఖ్యము ననుసరించి యితర విధములను బహుమా నింపబడుదురనియు, సీతారామరాజును పట్టి యిచ్చిన ఏ పితూరిదారయినను గూడ తప్పక క్షమింపబడుననియు ప్రకటితమైనది.

అక్టోబరు 28వ తేదిని సాండర్సు నాయకత్వమున మలబారు పోలీసుదళము పితూరిదారులను వెదకుచు రామవరమునకు వెళ్ళెను. వారి రాక కెదురుచూచుచు పొదలలో దాగియుండిన పితూరిదారులు వారు కనబడిన వెంటనే వారిమీద కురికిరి. మలబారు పోలీసుదళములు పిరుతివియక వారితో గొప్పగ పోరాడినవి; కాని వారి బాణ వర్షమునకు తట్టుకొనలేక చెల్లాచెదరుగ పారిపోయినవి. ఇట్లే డిసెంబరు 6వ తేదిని పెదగొడ్డపాలెంవద్ద పోలీసులకు, పితూరి దారులకు గొప్ప యుద్ధము జరిగినది. దీనిలో పలువురు పితూరిదారులు హతులైరి; కొందరు పట్టుబడిరి. తక్కినవా రడవులలో అంతర్ధానమైరి. ఈ యుద్ధమున సీతారామరాజు లేనందున అతడు మరణించి యుండునని తలంపబడెను.

పితూరిదారులకు రహస్యముగ ఆహారపదార్థములు సరఫరా చేయుచుండిరను నమ్మకమున సీతారామరాజు పట్టుబడువరకు కొయ్యూరు మొదలైన గ్రామములలోని వారిమీద ప్రభుత్వమువారు అపరాధపుపన్ను (ప్యూనిటివ్ టాక్స్) విధించిరి. పోలీసులతో ఈ పన్ను వసూలుచేయుటకు గూడెం తహసీలుదారు కొయ్యూరికి వచ్చినట్లుతెలిసి పితూరిదారులు అచ్చటి కరిగి అతనిని కట్టి కొట్టి అచట విడిసియున్న తమ నాయకుడు గంటందొర వద్దకు తీసికొనిపోగా అతడు చాల విచారించి తహసీల్దారుకు బుద్ధిచెప్పి పంపివేసెను; ఆ సమయముననే పితూరిదారులకు పోలీసు ఇన్‌స్పెక్టరొకడెదురుపడ అతనిని గట్టిగా మర్దించి గ్రామము చొరకుండ జేసిరి. సీతారామరాజునకు తమతోడి సోదరులను హింసించుట కిట్టెడిదికాదు. భీమవరం తాలూకా కుమరవిల్లి వాస్తవ్యుడు వేగిరాజు నారాయణ రాజును అగ్గిరాజు కొయ్యూరు మునాదారుడొకడు ప్రభుత్వమువారికి రహస్యముగ పితూరి దారుల సమాచారము తెలుపుచుండినట్లు తెలిసి అతని ముక్కు, చెవులు కోయించి, అతని కుమారుని కాలు విరుగగొట్టించెను. సీతారామరాజున కీ విషయము తెలిసి ఆయన తన సోదరులలో నొకనికి జరిగిన ఈ యమానుషకార్యమున కాగ్రహోదగ్రుడయ్యెను. పితూరిదారులు పోలీసు స్టేషనులపై దాడి చేయుట, పితూరి నణచివేయుటకు వచ్చిన రిజర్వుపోలీసుల నిమిత్త మాహార పదార్థములను గొనిపోవు బండ్ల నడ్డగించి ఆ పదార్థములను వశపరచుకొనుట మొదలైనవి సాగించుచునే యుండిరి.

పోలీసుదళము పితూరిదారులను వెదకుటకై బయలు దేరి పోయెను. వెదురుమూడివద్ద జరిగిన పోరాటములో గాముదొర హతుడయ్యెను. మల్లుదొర - మరొక తిరుగబాటు నాయకుడు - అతని ఉంపుడుకత్తె ఇంటిలో ఖైదీగా పట్టుబడి అండమాను దీవులకు ప్రవాసమంపబడెను. గొప్ప యుద్ధము జరిగిన పిదప అందు ఇరువదిమంది పితూరిదారులతో అగ్గిరాజు పట్టుపడిపోయెను. యుద్ధరంగమునుండి సీతారామరాజు మరలిపోయె నందురు. పితూరిదారులు, ఇతరులు కష్టములపాలై శిక్షితులైరి.

అస్సాము సోల్జరొకడు ఒకనాడు కొయ్యూరు సమీపమునందలి అడవిలో సీతారామరాజును అనుమానముమీద ఒక గడ్డమున్న వ్యక్తిని పట్టుకొని తన యధికారివద్దకు గొనిపోయెనట. ప్రశ్నలు వేసినమీదట ఆ వ్యక్తి తాను సీతారామరాజునే యని అంగీకరించెనట. నిర్బంధమున నుండిన అతడు తప్పించుకొని పారిపోవుటకు ప్రయత్నించుచుండ పోలీసులు అతనిని తుపాకి గురిపెట్టి రొమ్ముమీదను, మొగముమీదను కాల్చివేసిరి; వెంటనే అతడు మృతి నొందెను. సీతారామరాజును కలిసికొని అతనితో మాటాడిన తహసీల్దారును, అతనితో పరిచయముగల ఇతరులును ఆ శవమును గుర్తుపట్టి అతడు సీతారామరాజే యని చెప్పిరట. పదివేల రూపాయల బహుమతి అస్సాము సోల్జరు కీయబడినది. గ. సు.

**సుందరమ్మ, దార్ల** (క్రీ. శ. 1830 ప్రాంతము): ఈమె భావలింగ శతకరచయిత్రిగా కన్పడుచున్నది. గుంటూరు మండలమునందలి చెర్లగుడిపాడు ఈమె నివాసస్థానము. ఈమెది పద్మసాలి వంశము. గంజి శ్రీరాములు ఈమె తండ్రి; నాగమాంబ తల్లి. ఈమె రామచంద్రపుర నివాసియగు దార్ల శేషయ్య ధర్మపత్ని.

వేమనవలె మూఢాచారములపై నిశ్శంకముగా దాడి తీయుచు చక్కని ఆటవెలదులతో రక్తి కట్టింపబడిన దీమె రచనము; ధోరణి తాత్త్వికమైనది. ధారాశుద్ధికల శైలి ఈ గ్రంథమున కొక పెట్టని తొడవు. ముప్పదేండ్లు నిండని చిరుతప్రాయముననే ఒక అబల, అందును గృహిణి, సంఘ దురాచారములపై తనకు గల నిశితమగు ప్రౌఢభావములను శంకా రహితముగ కావ్యరూపమున వెల్లడింపబూనుట మిక్కిలి ప్రశంసింపదగిన అంశము. ఊ. ఎ. కాం.

**సుందరమ్మ, నడింపల్లి** (క్రీ. శ. 1885 - 1948): ఈమె ఆరువేలనియోగి బ్రాహ్మణశాఖకు చెందినది. గోదావరీ మండలమునందలి అమలాపురము ఈమె నివాస

స్థలము. ఈమె భర్త నడింపల్లి జానకిరామయ్యగారుద్యోగ మునకై హైదరాబాదు వచ్చి యచ్చట పెక్కేండ్లు పని చేసిరి. ఈమె సాధారణ విజ్ఞానవతియైనను, ప్రజాహిత కార్యములందును, మహిళాభ్యుదయము కొరకును పాటు పడిన పరోపకార పారీణ.

హైదరాబాదులో ఆంధ్రోద్యమము ఆరంభింపబడక పూర్వమే ఈమె ప్రజాసేవకు పూనుకొని క్రీ. శ. 1910 లో స్త్రీ సమాజాభివృద్ధి కార్యము లారంభించినది; 1915 ప్రాంతమున ఆంధ్ర సోదరీ సమాజమును స్థాపించి హైదరా బాదు నగరములోని ఆంధ్ర స్త్రీలయందు విజ్ఞాన ప్రచార మొనర్చినది; గ్రామములందును, తాలూకాల యందును, జిల్లాలయందును జరిగిన ప్రతిసభకును పోయి సోదరీ సమాజమును అభివృద్ధిమార్గమున నడపించినది. జిల్లాల నుండి, గ్రామములనుండి హైదరాబాదు నగరమున కేదేని పనిమీద వచ్చెడు మహిళామణులకు వీరి ఇల్లు అతిథి గృహముగా నుండెడిది. ఆంధ్ర బాలికల ఉన్నత పాఠశాల ప్రారంభమైనప్పటినుండియు ఈమె పండ్రెండు సంవత్సర ములు ప్రతిఫల మేమియు గ్రహింపకయే, గౌరవోపా ధ్యాయిగా నుండెను. ఈ విధముగా ఏబదిరెండేండ్లు వచ్చు వరకును తెలంగాణా మహిళాభ్యుదయమున కపారమగు సేవచేసిన యీమె, భర్త యుపకారవేతనము పడసి స్వస్థాన మునకు పోయిన తరువాత, పది యేండ్లు బ్రదికి పరమ పదించెను.

**బి. రా. రా.**

**సుందరరామశాస్త్రి, చదలువాడ** (క్రీ. శ. 1849 - 1925): వీరు శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులవారి అల్లురు; సంస్కృతాంధ్రములయందు, శంకరాద్వైతమత శాస్త్రమునందు నిష్ణాతులు; శ్రీ రామాయణమునకు ప్రతి పద టీకా సహితాంధ్ర వ్యాఖ్య 15 సంపుటములలో వ్రాసిరి; మరియు భగవ ద్గీతా భాష్యము లన్నియు పరిశోధించి 'ఆనంద చం ద్రిక' యను వ్యాఖ్యతో నారు సంపుటములు ప్రక టించిరి; సంస్కృతమున స్రగ్ధరావృత్తములలో ఆది త్యస్తవమనుపేర సూర్య స్తుతి పరముగ నొక శత కము రచియించిరి. అది మయూరుని సూర్యశతకముతో తులతూగును. వీరు వావిళ్ల రామస్వామిశాస్త్రులవారు చనిపోయిన వెనుక కొన్నియేం డ్లాసంస్థను నిలువ బెట్టిరి. వీరు పందొమ్మిదవ శతాబ్దపు ప్రసిద్ధ పండితులలో నొకరు.



చిత్రము 309.
చదలువాడ సుందరరామశాస్త్రి

**ని. వెం. రా.**

**సున్నీ**: 'సున్నీ' అనగా '(ప్రవక్త) పథానుసారి'; ప్రవక్త చూపిన మార్గమున నడచువాడు అని అర్థము. సున్నాః అనగా మార్గము. శ్రీ మొహమ్మద్ ప్రవక్త మరణా నంతరము ఆయనకు ప్రతినిధులు (ఖలీఫాలు) ఒకరి పిదప ఒకరుగా ఎన్నుకొనబడిన అబూబకర్, ఉమర్, ఉస్మానులను అంగీకరించి వారిని గౌరవించిన వారిని సున్నీ లందురు. వీరికి వ్యతిరేకముగ 'షియా'లు పై ముగ్గురు ఖలీఫాలను అంగీకరింపక నాల్గవ ఖలీఫా యగు అలీని మొదటి ఖలీ ఫాగా పరిగణింతురు (చూ : షియా).

'సిహాహుస్సిత్తా' (ఆరు గ్రంథములు) అనబడు శ్రీ మొహమ్మద్ ప్రవక్త ఉపదేశ గ్రంథములను సున్నీలు ప్రామాణిక గ్రంథములుగ భావింతురు. ప్రవక్త ఉపదేశ ములు దాదాపు ఒకటిన్నర శతాబ్దమువరకు గ్రంథస్థము కాలేదు. ఇమామె మాలిక్ (హి. శ. 94 - 179) మొట్ట మొదట మొఅత్తా అను పేర తనకు లభించిన ఉపదేశము లను సంకలన పరచెను. దీని తర్వాత బొఖారీ (హి. శ. 194 - 256), ముస్లిమ్ (హి. శ. 204 - 261), తిర్మిజీ (హి. శ. 209 - 279), అబూదావూద్ (హి. శ. 202 - 274), నసాయీ (హి. శ. 215 - 303), ఇబ్నెమాజా (హి. శ. 209 - 273) అనువారు ప్రవక్త ఉపదేశములను సంకలన పరచి గ్రంథములను ప్రకటించిరి. వీరి గ్రంథములనే సిహా హుస్సిత్తా అందురు.

సున్నీలలో హనఫీ, షాఫియీ, మాలికీ, హంబలీ అను నాల్గుశాఖలు కలవు. ఇమామ్ అబూహనీఫా (హి. శ. 80 - 150) రచించిన ధర్మశాస్త్రము ననుసరించువారిని హనఫీ లనియు, ఇమామ్ షాఫియీ (హి. శ. 150 - 204) రచిం చిన ధర్మశాస్త్రము ననుసరించువారిని షాఫియీ లనియు, ఇమామ్ మాలిక్ (హి. శ. 94 - 179) రచించిన ధర్మ శాస్త్రము ననుసరించువారిని మాలికీ లనియు, ఇమామ్ అహమద్ ఇబ్నె హంబల్ (హి. శ. 164 - 241) ధర్మశాస్త్ర మును అనుసరించువారిని హంబలీ లనియు అందురు. శాస్త్ర విషయమున వీరిలో కొన్ని భేదాభిప్రాయము లున్నను ఇవి సున్నీలు పరస్పరము అంగీకరించిన శాఖలే. అందుచే ఈ శాఖలందు పరస్పర వైషమ్యము లేదు. సున్నీలలో తక్కిన శాఖలవారి కంటె అధిక సంఖ్యాకులు హనఫీ శాఖకు చెందినవారు. ఆంధ్రదేశములో హంబలీ శాఖకు చెందినవారు విశాఖపట్టణము జిల్లాలో తునియందు కలరు.

**మొ. ఖా. ఖా.**

**సుబ్బరాయశాస్త్రి** (క్రీ. శ. 1803 - 1863) : వీరు శ్యామశాస్త్రిగారి తృతీయపుత్రులు; తెలుగు, సంస్కృతము, అరవము, సంగీతములలో ఉద్దండ పాండిత్యము కలవారు; తండ్రియొద్దను, తిరువాయూర్ త్యాగయ్యగారి దగ్గరను సంగీతము నభ్యసించిరి. వీరు ఫిడేలు వాద్యములోకూడ అఖండులు. వీరు స్వరజతులను కృతులను రచించిరి; అపూర్వ రాగములలో అతి రమ్యమైన రచనలను చేసిరి. రచనలు రాగభావముతో తూగుచుండును. దాదాపు అన్ని కృతులు స్వరసాహిత్యము, మధ్యమ కాలసాహిత్యము కలవి. వీరు దేవీ భక్తులు. ముద్ర 'కుమార'. ఒడయార్ పాలెములో వీరు పరమపదించిరి.

ద్వా. పా.

**సుబ్బరాయశాస్త్రి, తాతా** (క్రీ. శ. 1867 - 1944): వీరు విజయనగరమునకు రెండుమైళ్లదూరమున ఒంటితాడి అగ్రహారమున జన్మించిరి. తండ్రి సూర్యనారాయణావధాని; తల్లి సోమిదమ్మ. ఈమెకు తన కుమారుని చదివించి శాస్త్రపండితుని జేయవలెనని ఎనిమిదేళ్ల చిన్న వయసున ఈయనను ఎత్తుకొని మైలుదూరము విజయనగరమునకు వెళ్లి విడిచివచ్చెడిది. శాస్త్రిగారు విజయనగరము చేరి బులుసు సుబ్రహ్మణ్యశాస్త్రిగారివద్ద సంస్కృత సాహిత్యపాఠములు చదువుకొని సంస్కృత సాహిత్యమున ప్రావీణ్యము సంపాదించిరి.

వీరు గొప్ప మేధావియని పరంపరగా విని రుద్రాభట్ల రామశాస్త్రి, లక్ష్మణశాస్త్రి సోదరులు ఈయనను చేరబిలిచి కొలదికాలముననే వ్యాకరణాలంకార శాస్త్రములందు పాండిత్యము గలిగించిరి. ఆ పిమ్మట శాస్త్రిగారికి తర్కశాస్త్ర గురువులు గుమ్మలూరు సంగమేశ్వరశాస్త్రిగారు, వేదాంతగురువులు కొల్లూరు కామశాస్త్రిగారు, సంగీత గురువులు కట్టు సూర్యనారాయణగారు అయిరి.



చిత్రము 310.
తాతా సుబ్బరాయశాస్త్రి

25 - 30 పండ్ల వయస్సునకే శాస్త్రిగారికి పండిత చక్రవర్తియను ప్రఖ్యాతి యేర్పడినది. ఏ శాస్త్రమునందు సందేహములు కలిగినను, వాదోపవాదములు సాగినను శాస్త్రిగారు చెప్పినదే తీర్పు; అదే ప్రామాణికము అను విశ్వాసగౌరవములు పండితలోకమున నాటుకొన్నవి.

వీరి హృదయము మిక్కిలి గంభీరమయినది. వీరు తొట్రుపాటులేని ప్రశాంతమూర్తి, వీరిది రుచికరమైన రూపము. పండితులలో వీరు నాగరకులు; లౌకిక వ్యవహారజ్ఞులు; కావుననే విజయనగరమున పురపాలకసంఘము, సహకారసంఘము మున్నగు స్థానిక సంస్థలందు ప్రధాన సభ్యులుగ పలుమారు ఎన్నుకొనబడెడివారు.

వీరు విజయనగరమహారాజ సంస్కృత కళాశాలలో రమారమి నలువది వత్సరములు ప్రధానాచార్యులుగా శాస్త్రాధ్యాపనము సాగించినారు.

భారతదేశ మంతటను వ్యాకరణశాస్త్ర పఠనీయములలో ఉత్తమ గ్రంథముగా పేరు పొందిన నాగేశభట్ట విరచితమగు శబ్దేందుశేఖరము నుత్తరదేశ పండితులు పెక్కుమంది ఖండించుచు కొన్ని విమర్శగ్రంథములు రచించిరి. శాస్త్రిగారు ఆ ఖండనము లన్నింటిని విమర్శించి త్రోసిపుచ్చి నాగేశభట్ట మతమును స్థాపించుచు 'గురుప్రసాదము' అను గొప్ప గ్రంథము రచించినారు. దీనిని ఆంధ్ర విశ్వకళాపరిషత్తు కోరి ప్రకటించినది. శాస్త్రిగారీగ్రంథమును స్వరసంధితుదిదాక రచించి విడువగా వారి ప్రియశిష్యులు పేరి వెంకటేశ్వర శాస్త్రిగారు అదే ధోరణితో దానిని కారకాంతమువరకు పూర్తిచేసినారు. దానినిగూడ 'గురుప్రసాదశేషము' అను పేరితో ఆంధ్ర విశ్వకళాపరిషత్తే ప్రకటించినది. శాస్త్రిగారు తమంతటి సమర్థులగు శిష్యులను నెలకొల్పిన ధన్యజీవులనుటకు ఇది యొక ప్రబల ప్రత్యక్ష నిదర్శనము. వీరు హరిశాస్త్రి విరచితమగు చిత్రప్రభయను శబ్దరత్నవ్యాఖ్యను పరిశోధించి సవిమర్శమగు టీక వ్రాసి పరిష్కరించినారు. అదిగూడ ఆంధ్ర విశ్వకళాపరిషత్ప్రకాశితము.

1912 లో వీరికి 'మహామహోపాధ్యాయ' బిరుదము నొసంగి ప్రభుత్వము వీరిని గౌరవించినది. ఇట్టి గౌరవము నొందిన వారిలో వీరే మొదటివారు.

'ప్రిన్స్ ఆఫ్ వేల్సు' మన దేశమునకు వచ్చినపుడు వీరిని మద్రాసు రప్పించుకొని తన పేరు చెక్కిన సువర్ణ కంకణమును శాస్త్రిగారిచేతికి దొడిగి బహూకరించినాడు.

ఉర్లాం, పిఠాపురం సంస్థాన పండిత పరీక్షలలో ఎల్లపుడును వీరు ప్రధాన పరీక్షకులు.

సాధారణముగ సంస్కృత పండితులందు అరుదగు మరి కొన్ని విశేషములు వీరియందు గన్పట్టును: (1) సంఘసంస్కరణప్రీతి; (2) దేశీయోద్యమాసక్తి; (3) మాతృభాషానురక్తి.

సదాచారములని గతానుగతికముగ భ్రాంతిపడుచు శిష్టుల మనుకొనువారు అవలంబించు దురాచారములను ఉద్ఘాటించి వానిని శాస్త్రసమ్మతములుగా కాలానుగుణ ముగా మార్చుకొనుట సంఘమునకు శ్రేయమని వీరు బోధించుచుండువారు.

మహాత్ముడు మనదేశమున ఖద్దరు ప్రబోధము నారంభించుటకు పది పదునేనేండ్లకు పూర్వమునుండియు వీరు ఖద్దరు నియమము నవలంబించి సన్నని పొందూరు వస్త్రములు తెప్పించి జీవితాంతము ఉపయోగించుచుండువారు.

వీరు ఒక సంవత్సరము ఆంధ్ర సాహిత్య పరిషత్సమావేశమునకు అధ్యక్షులై ఆంధ్ర భాషోన్నతి మార్గములు సూచించుచు మహోపన్యాసము నొసంగిరి.

రాజమహేంద్రవర శ్రౌత మహాసభలందును, విశాఖపట్టణ జ్యోతిశ్శాస్త్ర సభలందును పండితులు గావించిన చర్చలలో తీర్పరిగా ఉభయపక్షములవారును వీరిని ఏక గ్రీవముగా ఎన్నుకొనుటయే వీరి సర్వతోముఖ ప్రతిభకు నిదర్శనము.

వీరు కాశీ, దర్భంగ, పుదుక్కోట సంస్థానములందు పాల్గొని పండితుల నోడింప, వారు జయపత్రములు సమర్పించిరి. జరిగిన పండిత సభలలో శాస్త్రవాదములందు కాశీ పండితులలో అగ్రగణ్యుడయిన జయదేవమిశ్ర పండితుడు వీరిపేరు విన్నంతనే చేతులు జోడించెడివాడని ప్రతీతి.

ఈ మహామహోపాధ్యాయులకు 68 వ సంవత్సరమున శిష్యప్రశిష్యులును, ఇతర పండితవర్యులును మహా వైభవముతో గురుపూజా మహోత్సవముగావించి కృతకృత్యులయినారు. దు. వెం. శా.

**సుబ్బారాయుడు, వడ్డాది** (క్రీ. శ. 1855 - 1938): వీరు తూర్పు గోదావరిజిల్లా, పాశర్లపూడిలంక యందు బంధుగుల యింట జన్మించిరి. వీరి తండ్రి సూరపరాజు గారు పండితులు. ఆరవ యేటికే తండ్రి వీరిచే ఆంధ్రశబ్ద చింతామణిని చదివించెను. వీరి విద్యాగురువులు శ్రీ భాగవతి వాసుదేవ దీక్షితులుగారు.

వీరు రాజమహేంద్రవరమున దొరతనమువారి కళాశాలయందు ప్రధాన ఆంధ్ర పండితులుగ చాలకాలము పనిచేసిరి. తెలుగు మరుగులు ఎంతేని వీ రెరిగినట్లు ఒరు లెరుగరు. వీరి కాశు కవిత్వము కిట్టదు. వీరు 'కబ్బం బల్లుదునైన నాశురచనోగ్ర వ్యాఘ్ర దంష్ట్రాళికే, నబ్బబ్బా కవితాలతాంగి నెఱసేయంజాల' నన్నారు. వీరికి చాటు రచన అన్న మిక్కిలి గౌరవము, ప్రీతి.

వీ రయిదుసారులు కళత్రవియోగమును పొందిరి. కళాశాల తరగతులలో చదువుచుండిన వీరి ఏకైక పుత్రుడు 1907 లో పరమపదించెను. జీవితములో కలిగిన సుఖదుఃఖానుభవములు గాఢముగా హృదయమున నాటి భగవత్కీర్తనలు, భక్తజన చింతామణి, సుతస్మృతి, సూక్తివసు ప్రకాశములకు ఆకరములైనవి.

శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణగారి అధ్యక్షతను రాజమహేంద్రవరమున కావింపబడిన పెద్ద పండిత సభయందు



చిత్రము 311.
వడ్డాది సుబ్బారాయుడు

పౌరులు వీరికి 'సూక్తిసుధానిధి' యను బిరుదము నొసంగి సువర్ణకంకణములను బహూకరించిరి. వీరికి సహస్ర మాసములు నిండగా రాజమహేంద్రవర పండిత పౌరులు సహస్ర మాసోత్సవము జరిపిరి. తరువాత పక్షవాతము వాతబడి వీరు రాజమహేంద్రవరమునందే కాలధర్మము నొందిరి. రాజమహేంద్రవరమున ఆధునిక కవిత్రయ మని పేరుగాంచిన వారిలో వీ రొకరు.

వీరు శాకుంతలము, మల్లికామారుతము, చండ కౌశికము, ప్రబోధచంద్రోదయము, కుందమాల, మేఘ సందేశము, భామినీ విలాసము, సూర్యశతకము, వేణీ సంహారము తెనిగించిరి. పై నుడివిన భక్త చింతామణి, సూక్తి వసుప్రకాశము మొదలైనవి స్వతంత్ర రచనలు. వీనిలో వేణీ సంహారము, భక్త చింతామణి, సూక్తివసు ప్రకాశము మిక్కిలి పేరు గాంచినవి.

వీరు నాటక ప్రదర్శనములందు పాత్రలు గైకొని నటించిన నటులు కూడ. వీరు వేణీ సంహార నాటకమున ధర్మరాజు, అశ్వత్థామ పాత్రలను ధరించిరి.

వీరు సంస్కృతమున గూడ కవిత్వము చెప్పిరి. వీరికి వ. సు. రాయకవి యనియు వ్యవహార ముండెను. బో. శి.

**సుబ్బారావు, న్యాపతి** (క్రీ. శ. 1858 - 1941): ఆంధ్రదేశ రాజకీయాలలో వీరిది గురుస్థానము. 'ఆంధ్ర భీష్మ' అని వీరికి బిరుద మొసగి ఆంధ్ర దేశము తన్ను తాను గౌరవించుకొన్నది. వీరు మొదట నెల్లూరు నివాసులు; మాధ్వపండిత వంశములో జన్మించిరి. వీరి తండ్రి వీరరాఘవరావుగారు; సాల్ట్ ఉద్యోగశాఖలో ఉద్యోగిగ నుండిరి; తల్లి రంగమ్మగారు.

వీరు ప్రవేశ పరీక్షయందు మొదటి తరగతిలో కృతార్థులై విద్యార్థివేతనము గడించి ఉన్నత విద్యాభ్యాసము

నకై చెన్నపురి క్రిస్టియన్ కళాశాలలో చేరి చదివి 1876 లో పట్టపరీక్ష యందును, 1878 లో యఫ్. యల్. పరీక్షయందు మొదటివారుగను, 1879 లో బి. యల్. పరీక్ష యందును ఉత్తీర్ణులైరి. వీరు 1880 లో న్యాయ వాదిగా పనిచేయుటకు రాజమహేంద్రవరమునకు వచ్చి అప్పటినుండి యచ్చటనే స్థిరముగ నివాస ముండిరి.

న్యాయవాది వృత్తిలో శీఘ్రకాలములోనే గొప్ప వ్యాజ్యములలో పనిచేసి వీరు పేరు ప్రఖ్యాతులు గడించి విశేష ధన మార్జించిరి. వీరి జీవితములో న్యాయవాది వృత్తితోపాటు దేశసేవా వృత్తియు ఒకటే కాలమున నారంభమైనది. వీరు రాజమహేంద్రవరములో మ్యునిసిపల్ సంఘ సభ్యులుగను, లోకల్ బోర్డు మెంబరుగను, మ్యునిసిపల్ చైర్మనుగను, తాలూకాబోర్డు మెంబరుగను పనిచేసి తమ విద్యుక్తధర్మములను కడు సమర్థతతో నిర్వహించిరి. ఉద్యోగ వ్యామోహము, ధనాశ వీరికి తక్కువ. 1892 లో వీరు ఉత్తరప్రాంతపు జిల్లాల తరపున చెన్నపురి శాసనసభలో సభ్యులైరి. 1894 లో జరిగిన కృష్ణామండల సభకు వీరధ్యక్షులుగ నుండిరి. వీరే గోదావరి మండల సంఘమును స్థాపించిరి. 1907 లో విశాఖపట్టణమున జరిగిన రాజధాని రాజకీయ సభకు వీరధ్యక్షులుగ నెన్నుకొనబడిరి. తరువాత వీరు 1910లో ఇంపీరియల్ లెజిస్లేటివ్ కౌన్సిలులో మెంబరుగా ఎన్నుకొనబడిరి. వీరు తమ శక్తిసామర్థ్యములను శాసనసభల లోపలను, వెలుపలను ఉపయోగించి ప్రజాసేవ చేసిరి. వీరు 1911 లో ఆ కౌన్సిలులో ప్రతిపాదించిన తీర్మానమువలననే రాయల్ పబ్లిక్ సర్వీసెస్ కమీషన్ ఏర్పడి మన దేశమునకు వచ్చి విచారణ ప్రారంభించెను.


చిత్రము 312.
న్యాపతి సుబ్బారావు

1885 లో కాంగ్రెస్ స్థాపింపబడినప్పటినుండి వీరు కాంగ్రెసు మహాసభలందు చాల ఉత్సాహముతోను, పట్టుదలతోను పాల్గొనుచుండిరి. 1898 లో చెన్నపురిలో జరిగిన కాంగ్రెసు మహాసభ ఆహ్వానసంఘమునకు వీరధ్యక్షులుగ నెన్నుకొనబడిరి. 1914 లో వీరు అఖిలభారత కాంగ్రెసుకు కార్యదర్శిగా ఎన్నుకొనబడిరి. అటనుండి నాలుగు సంవత్సరములు వీరు ఆ పదవిలోనుండి కాంగ్రెసు సందేశమును వ్యాపింపజేయుటకు దేశము నలుమూలల పర్యటించిరి.

1907 లో బిపిన్ చంద్రపాలు రాజమహేంద్రవరము వచ్చినప్పుడు వీరితరులను తోడుచేసికొని జాతీయ పాఠశాలను స్థాపించి కొంతకాలము దానిని సమర్థతతో నిర్వహించిరి. వీరు వీరేశలింగం పంతులకు చేదోడు వాదోడుగ నుండి సాంఘిక సంస్కరణలయందు కొంతకాలము పనిచేసిరి. క్రమక్రమముగ సంఘ సంస్కరణము జాతీయ సంప్రదాయానుసరణముగ నుండవలెనను భావము వీరికి తట్టి ఆనుష్ఠానిక బ్రాహ్మ పద్ధతులనుండి దూరస్థులై రాజమహేంద్రవరమున హిందూమత సమాజమును స్థాపించి నిర్వహించిరి. పోలవరం జమీన్‌దారుగారితో కలిసి చింతామణి యను మాసపత్రికను స్థాపించి వీరు భాషాసేవ చేసియున్నారు.

ఆ కాలమున రాజకీయ ప్రచారమునకు, ప్రజలు కష్టములను ఆంగ్ల ప్రభుత్వపు దృష్టికి తెచ్చుటకు ఆంగ్ల దినపత్రిక అవసర మను నిర్ణయమునకు వచ్చిన మదరాసు ప్రముఖులలో ఈయన యొకడు. వీరి కృషి మూలముననే హిందూ పత్రిక సంస్థ స్థాపింపబడినది. వీరు 'ఇండియన్ ప్రోగ్రెస్' అను వార పత్రికను స్థాపించి కొంతకాలము నడపిరి. వార్ధక్యదశయందు సైతము విశ్రమించక వీరు తమ రాజకీయానుభవమును తరువాతి తరములవారికి లభ్యమగునటుల జేయుటకు అనేక రాజకీయ సమావేశములలో పాల్గొనెడివారు. స్వయంకృషివల్లను, గాఢ పరిశ్రమవల్లను పైకివచ్చిన ఆంధ్ర మహాపురుషులలో వీరొకరు. **భో.వ.సీ.**

## సుబ్బారావు, యల్లాప్రగడ (క్రీ. శ. 1886-1948) :

'కాల మమూల్యము; వలయునంతకాలము మన కెప్పుడును చిక్కదు. నేడనేకులు రుజాపీడితులై మడియుచున్నారు; రేపు మడియనున్నారు. వారలను నీరుజులనుగా జేయుట మన ప్రధాన కర్తవ్యము'. డాక్టరు సుబ్బారావుగారి ఈ నుడి ఆయన జీవిత లక్ష్యమును వెల్లడి చేయుచున్నది. ఈ లక్ష్యశుద్ధి వారి జీవిత మంతను ప్రకాశింపచేసినది.. దీనికి కారణము వారి సత్యసంపద; ఆధ్యాత్మిక నిష్ఠయును. సత్యసంపద సత్య సమీక్ష కెట్టి సమర్థ సాధనమో పాశ్చాత్య దేశములకు జెప్పు నిమిత్తము ఔపనిషద భూమియగు భారతదేశము పరదేశములకు బంపిన యుపదేశకులలో ఈయన యొకడు.

ఈయన గోదావరి జిల్లాలో జన్మించెను. ఆంగ్లసర్కారు గుమాస్తాగా పనిచేసిన ఈయన తండ్రి ఈయన పసితనముననే దివంగతు డయ్యెను. మద్రాసులో చదువుకొనుచుండిన రోజులనుండియు ఈయనకు మత విషయక వ్యాసంగమందు

ఆశ యెక్కువ. ఉపనిషత్తులు, గీత, కొరాన్, బైబిలు ఈయన పారాయణ గ్రంథములు. ఈయన మద్రాసు మెడికలు కాలేజినుండి పట్టభద్రుడై కొద్దిరోజు లచ్చటనే శరీర శాస్త్ర నిర్దేశకుడై లండను ట్రాపికల్ స్కూల్ ఆఫ్ మెడిసిన్‌లో డిప్లొమా తీసికొని 1923 లో మల్లాది సత్యలింగ నాయకర్ ధర్మసంస్థా సహాయమున అమెరికాకు పయన మాయెను. అచ్చట న్యూయార్కు నందు హార్వర్డు స్కూల్ ఆఫ్ ట్రాపికల్ మెడిసిన్‌లో ఈయన గ్రంథాలయ పాలకుడుగా నున్న రోజులలో జీవ, రసాయన శాస్త్రానుశీలనయం దీయన కుత్సాహము జనించెను. ఆవల ఈయన రెండేండ్లు డాక్టరు ఓటోఫోలిన్ అను ఆచార్యుని శిక్షణమున గణ్యమగు పరిశోధనలను కావించి హార్వర్డ్ యూనివర్సిటీ పిహెచ్. డి. డిగ్రీని సంపాదించెను. అచ్చటనే ఫిస్కే అను పరిశోధకునికి అండగా జీవ రాసాయనిక శాస్త్రమందీయన గావించిన నూతనావిష్కరణల మూలమున ఆ శాస్త్రములం దితడు జగత్ప్రఖ్యాతిని గాంచెను. ఈ దినములలో వైటమిన్ బి. 12 అను ఆహార పోషక ద్రవ్యమును గురించి ఈయన నిర్వహించిన పరిశోధన పద్ధతులు నేటి పరిశీలకులకు మార్గదర్శకములుగా గోచరించుచున్నవి. 1940లో ఈయన లెడర్లే శోధనాగారమను ప్రసిద్ధ ఔషధసంస్థను చేరి 1942 లో దానికి దర్శకుడుగా నియమింపబడెను. ఈ సంస్థలోనున్న కాలమున ఈయన సంపాదించిన సర్వతోముఖ శరీర శాస్త్ర జ్ఞానము కారణముగా ప్రపంచమందలి రక్త విజ్ఞాన నిష్ణాతులగు పండితులలో ఈయన ఒకడుగా ఎన్నుకొనబడినాడు.



చిత్రము 313.
యల్లాప్రగడ సుబ్బారావు

ఈయన మానవ రోగ నివారణకై కనిపెట్టిన మందులలో బోదకాలునకు మందగు హెట్రాజాన్, టైఫాయిడ్ క్రిములవంటి సూక్ష్మ జీవులను సమయజేయు ఆరియోమైసిన్, పాండురోగ నివారకమగు ఫోలికామ్లము, క్షయ రోగ శామకమగు ఐసోనికోటినికాసిడ్ హైడ్రాజైడ్ నేడు సర్వలోక విదితములు.

రుజాపీడితమగు లోకమును నీరుజము గావింప సమర్థుడగు ఈ ప్రతిభావంతుని మృతివలన శాస్త్ర లోకము ఆదర్శపురుషు నొకని కోలుపోయినది. మే. వ. న.

**సుబ్బారావు, వంగూరి** (క్రీ. శ. 1886 - 1923): వీరు పశ్చిమగోదావరిజిల్లా తణుకుతాలూకా యందలి సిద్ధాంతము గ్రామమున జన్మించిరి. వీరి తండ్రి ఆరువేల నియోగి శాఖీయులైన నరసయామాత్యులు; తల్లి ముత్యమాంబ. ఈ దంపతులకు కలిగిన మువ్వురు పుత్రులలో వీరు మూడవవారు. తణుకు ఉన్నత పాఠశాలలో వీరు విద్యాభ్యాస మొనర్చినారు. స్వదేశీ ఉద్యమకాలములో అపుడు నరసాపురములో కలెక్టరుగానుండిన జే.యన్. రాయిగారి ప్రోత్సాహమున వీరు ఇరువది సంవత్సరములు నిండకమునుపే కలకత్తాకు వెళ్ళి సబ్బులు క్రొవ్వువత్తులు మొదలైన కుటీర పరిశ్రమలు చేయుట నేర్చుకొనివచ్చి 'ది గోదావరి సోప్స్ అండ్ క్యాండిల్స్ మాన్యుఫాక్చరింగ్ కంపెనీ' అను పేరుతో ఒక సంస్థను నెలకొల్పిరి. అటు తరువాత మచిలీపట్టణమునకు వెళ్ళి అచట 'నౌరోజీ కంపెనీ' అను పేరుతో ఒక వ్యాపార సంస్థను స్థాపించిరి. ఇందు తలనూనెలు, సెంటులు, టూత్‌పౌడర్లు, ఫేస్‌పౌడర్లు మొదలగునవి తయారగుచుండెడివి. సైకిళ్ళు, గడియారములు వగైరాలలో వ్యాపారము చేయు శాఖలు వేరు. ఇవి కాక ఈ సంస్థలో 'కమలకుటీరము' అనునది యొక పుస్తక ప్రచురణ శాఖ. వీరు వసుంధర అను పత్రికనుకూడ కొంతకాలము నడపిరి. ఈకాలములోనే వీరు వ్యవహార చంద్రిక అను గ్రంథమును రచించిరి. ఏ కారణముననో ఈ కంపెనీకూడ 1912 ప్రాంతమునాటికి విరమింపబడినది.



చిత్రము 314.
వంగూరి సుబ్బారావు

1913 ప్రాంతమున వీరు రాజమహేంద్రవరములో కొంతకాల ముండి లలితకుమారి, ఈసబు నీతికథలు, అరేబియన్‌నైట్సు కథలు రచించిరి. తరువాత 1914 లో చిత్రాడ శ్రీ చెలికాని లచ్చారావుగారి ఆహ్వానముపై పిఠాపురము చేరి అచటనే 1920 వరకు ఉండి ప్రాచీన తాళపత్ర గ్రంథములను పరిశోధించుచుండిరి. ఈ గ్రంథములన్నియు శ్రీ లచ్చారావుగారు వీరి ప్రోత్సాహమున స్థాపించిన ఆంధ్ర పరిశోధక మహామండలివి. వీరి ప్రోత్సాహమువలన సుబ్బారావుగారు శ్రీరామవిలాస ముద్రాక్షరశాల స్థాపించి అముద్రితాంధ్రగ్రంథ సర్వస్వమను పేరుతో అముద్రితములైన తాళపత్ర గ్రంథములను శ్రీరామవిలాస

గ్రంథమాలయందు ప్రకటించిరి. వీరికి 1920లో సతీ వియోగము కలిగినది. తరువాత చెన్నపురి కేగి మూడేండ్లచట నివసించి వాఙ్మయకృషి సాగించిరి; 1923 లో స్వగ్రామమగు సిద్ధాంతము వచ్చి యచటనే దివంగతులైరి.

వీరి రచనలలో ప్రధానము లయినవి ఆంధ్ర వాఙ్మయ చరిత్ర, శతకకవుల చరిత్ర. ఇవికాక వీరు ప్రభాతము, కాంచనమాల, రాయల రాజనీతి, వేమన జీవిత చరిత్రము, పన్నుల పద్ధతులు, ఆంధ్ర క్షత్రియులు మొదలైన గ్రంథము లనేకము రచించిరి. కడపటి గ్రంథము క్షత్రియ పత్రికలో పడిన వ్యాసములకు పునర్ముద్రణము. ఆంధ్ర పత్రికకు వీరు వసంతలేఖ లను పేరుతో వ్యాసములు కొన్ని వ్రాసిరి. తెలుగుభాషలో ప్రకటితమైన మొట్ట మొదటి ఆంధ్ర వాఙ్మయ చరిత్రము వీరిదే. **వం.న.రా.**

**సుబ్బారావు, వావిలికొలను** (క్రీ.శ. 1863-1939): ఆంధ్ర వాల్మీకి యని ప్రసిద్ధినందిన సుబ్బారావుగారు ప్రథమమున రైవిన్యాసక శాఖయందు ఉద్యోగిగా పదకొండేండ్లు (1893 - 1904) వ్యవహరించిరి; ఆవెనుక పదునారేండ్లు (1904 - 1920) చెన్నపురి రాజధాని సర్వ కళాశాలలో, వీరేశలింగము పంతులుగారి యనంతర మాంధ్ర పండిత పదవి నధిష్ఠించిరి. కళాశాలకు రాక పూర్వమే పంతులుగారు శ్రీ కుమారాభ్యుదయము అను ప్రబంధము రచియించి యా కాలము నాటి కవిపండితలోకము నాశ్చర్యమగ్నుల నుకావించినారు. ఆ ప్రబంధమునకు వ్యాఖ్యకూడ సమకాలముననే రచితమగుటచే, నా గ్రంథ ప్రశస్తినిగూర్చి చెప్పబనిలేదు.



చిత్రము 316.
వావిలికొలను సుబ్బారావు

సుబ్బారావు పంతులవారి కీర్తి కాలవాలమైనది వారి ఆంధ్ర వాల్మీకి రామాయణము. వీరు బాల్యమునుండియు పరమ భక్తులు; విశేషించి రామభజన పరాయణులు. అంతకుముం దాంధ్ర భాషలో యథామూలములు లేవని, వీ రెనిమిదేండ్లలో రామాయణమును నిర్వచనముగా నాంధ్రీకరించి కడప మండలములోని ఒంటిమెట్ట కోదండ రామస్వామివారి కంకితము గావించిరి. వీరి రామాయణము వీరి జీవితకాలముననందే నాలుగు ముద్రణములు పడయుటయే దాని వ్యాప్తికి నిదర్శనము. దానికి వీరు స్వయముగ 'మంధరము' అను గొప్ప వ్యాఖ్యానము రచించిరి. ఇది యొక ఉద్గ్రంథము; చిన్న విజ్ఞాన సర్వస్వము వంటిది.

సుబ్బారావు పండిత పదవీ విరమణానంతరము తమ కాల మంతయును భక్తిమార్గముననే గడపి 'భక్తి సంజీవనీ' పత్రికాధిపులై, వాసుదాసులై ముక్తులైరి. రామాయణ రచనమే కాక ఒంటిమెట్ట కోదండరామ స్వామి యాలయమును పునరుద్ధరణము గావించి నేటికిని అది దర్శనీయమగునట్లు, శాశ్వత కైంకర్యమును చేసిన యీ వాసుదాసులు వాఙ్మయ ప్రపంచమున భక్తకవులలో ప్రత్యేకస్థాన మలంకరింపదగినవారు.

వీరు కౌసల్యా పరిణయము అను ప్రబంధమును, సుభద్రా విజయము అను నాటకమును రచించిరి. అన్నింటి కన్న ఆర్యకథానిధి అనుపేర వీరు వ్రాసిన సులభ వచన గ్రంథములు తెనుగువారి కాదరణ పాత్రములై విలసిల్లినవి. వీరి సులభ వ్యాకరణము వాస్తవముగా దుర్గమమగు తెలుగు వ్యాకరణమును సుగమము నొనరించినది. వీరి కృష్ణావతార తత్త్వము ప్రశస్తకృతి. పాండిత్యముచేతనే కాక పవిత్రమగు నాధ్యాత్మిక భావనచే, విషయరక్తు లగువారిని పరమభక్తులుగా నొనరించుటయే కాక ఆంధ్ర భాషాభిమానము వారిలో నుద్దీపింపజేసి, తాను తరించి, యితరులను తరింపజేసిన ధన్యాత్ములు వీరు. **ని. వెం. రా.**

**సుబ్బాశాస్త్రి, అకింతల** (క్రీ. శ. 1807 - 1871): అపర గౌతములని యావద్భారత ప్రశస్తిగాంచిన వీరు జటప్రోలు సంస్థానమందలి అయ్యవారి పల్లె గ్రామ వాస్తవ్యులు. వీరిది ములికినాటి శాఖ; కాశ్యప సగోత్రము; అపస్తంబ సూత్రము.

వీరు తమ తండ్రి సింగరశాస్త్రిగారికడనే కావ్యనాటకాదులు చదివి, తర్కశాస్త్ర మారంభించి, ముక్తావళి చదువుచుండగనే తండ్రిగారు చనిపోయిరి. వీరు ముదుసలి తల్లికిని, పసిపిల్లలగు తమ్ములకును, గర్భవతియగు భార్యకును ఎవరికిని చెప్పక, కాశికి ప్రయాణమైపోయి అచట ఒక సత్రముననుండి ఉద్దండ పండితు లగు చంద్రనారాయణ భట్టాచార్యులవారికి శిష్యులైరి. పుస్తకములు లేకుండ విన్నంత మాత్రముననే జ్ఞాపకము పెట్టుకొన గలిగిన వీరి యవధానసామర్థ్యమున కాశ్చర్యపడి భట్టాచార్యుల వారు అత్యంత వాత్సల్యముతో తమ మేనల్లునకు సహాధ్యాయిగా నొనర్చి, న్యాయ వేదాంత మీమాంసాది శాస్త్రములయందును, సాహిత్యాలంకార శాస్త్రములందును ఎనిమిది వత్సరములలో వీరిని ప్రవీణులను గావించిరి.

వీ రిట్లు విద్యాభ్యాసము ముగించి స్వదేశమునకు బయలుదేరి వచ్చి గద్వాలలో మైసూరు ఆస్థాన విద్వన్మణి యగు రామశాస్త్రులవారి ముఖ్యశిష్యులగు ప్రతివాది భయంకర అనంతాచార్యులవారితో మూడు దినములు వాదము సల్పి జయించి నిండు సభలో ఆస్థానాధీశ్వరులచే కంఠీ చంద్రహారము, శాలువలజోడు, మరియు నూట పదారుల బహుమానము నందుకొనిరి. ఆనాటినుండి వీరు గద్వాల, వనపర్తి, ఆత్మకూరు, జటప్రోలు మున్నగు ఆస్థానములందు విద్వదగ్రగణులై ఆసేతు హిమాచలము అపరగౌతము లని ప్రసిద్ధి వహించిరి.

వీరు బ్రహ్మసూత్రములకు శ్రీ జగద్గురు శంకరాచార్యుల వారు వ్రాసిన భాష్యమున కర్థము స్పష్టమగునటుల నార్యా వృత్తములలో 'భాష్యార్థ రత్నమాల' యను గొప్ప గ్రంథమును రచించిరి. ఇదియే వీరు వ్రాసిన గ్రంథములం దన్నిట మిన్న. ఇది ముద్రితమైనది.

ఆంధ్రరాష్ట్ర మంతటను ప్రసిద్ధి గాంచిన సుబ్బాత్రయములో వీరొకరు. మిగిలినవారు తనిఘెళ్ళ సుబ్బాశాస్త్రి, సువర్ణ సుబ్బాశాస్త్రిగారలు. న్యాయశాస్త్రమున వీరికి వీరే సాటి. **బి. రా. రా.**

**సుబ్బుకృష్ణరావు, అమంచర్ల** (క్రీ. శ. 1880 - 1942): ఈయన నెల్లూరిలో జన్మించెను. నెల్లూరు వి.ఆర్. హైస్కూలులోనే ఈయన తొలి విద్యార్థి జీవితము గడచినది. ఈయన పంద్రెండవయేట మెట్రిక్యులేషన్ పరీక్షలోను, పదునారవయేట బి. ఏ. పరీక్షలోను కృతార్థు డయ్యెను; బి. ఎల్. పరీక్షలో ఉత్తీర్ణుడై 1901 వ సంవత్సరమున నెల్లూరులో న్యాయవాది వృత్తి నారంభించి 1910 నాటికి ప్రముఖ న్యాయవాదులలో నొకడయ్యెను.

ఈయనకు చిన్నతనమున నుండి రాజకీయములలో అభిరుచి మెండుగ నుండెను. ఈయన నెల్లూరు జిల్లా బోర్డుకు ఉపాధ్యక్షుడుగ నియమింపబడెను. కొంత కాలము జిల్లాబోర్డు నిర్వహణాధికారముకూడ ఈయన కొసగబడెను. ఎన్నికల పద్ధతి అమలుకు రాగానే మొదటి నాలుగైదుమార్లు వరుసగా ఈయన జిల్లాబోర్డుకు అధ్యక్షుడుగా ఎన్నుకొనబడెను. నెల్లూరు మునిసిపాలిటీలో ఈయన సభ్యుడుగా నుండెను; ఎన్నికల పద్ధతి రాగా దానికిని అధ్యక్షుడుగా ఎన్నుకొనబడెను. శాసనసభకు మూడు జిల్లాలకు ప్రతినిధిగా ఒక సభ్యుని ఎన్నుకొను దినములలో ముప్పది రెండేండ్ల ప్రాయమున నున్న ఈయన నెల్లూరు, కడప, చిత్తూరు జిల్లాల ప్రముఖ న్యాయవాదులు పోటీ చేసినను ఎన్నికలలో గెలిచి సభ్యుడయ్యెను. మాంటేగ్యూ చెంసుఫర్డు సంస్కరణలకు పూర్వము ఈయన మద్రాసు శాసన నిర్మాణ సభకు రెండు మారులు వరుసగా ఎన్నుకొనబడెను; సంస్కరణములకు తరువాత నెల్లూరుజిల్లాకు ప్రతినిధిగా రెండుమారు లెన్నుకొనబడెను. శాసన సభలో చర్చలయందు మిక్కిలి సమర్థుడని ఈయన పేరుగాంచెను. బడ్జెటు చర్చల సమయమున నిర్మాణాత్మకములగు సూచన లిచ్చుచువచ్చినవారిలో నీయన యొకడు. యూనాని, ఆయుర్వేద వైద్యముల పునరుజ్జీవనమునకై శాసనసభలో వాదించి దేశీయ పాఠశాలలు నెలకొల్పబడుట కీయన కారణభూతు డయ్యెను.

నెల్లూరుజిల్లాబోర్డు అధ్యక్షుడుగా నున్న కాలమున ఈయన కావలి, బుచ్చిరెడ్డిపాళెం, గూడూరు, కందుకూరు, ఆత్మకూరు గ్రామములలో ఉన్నత పాఠశాలలను నెలకొల్పెను. ఈయన సాహాయ్యముతో 1927 లో గాలివానకు తరువాత తలిదండ్రులను గోల్పోయిన పిల్లలకొక శరణాలయము నెల్లూరిలో స్థాపితమైనది. 'నెల్లూరు పర్మనెంటు ఫండు' వ్యవహార నిర్వహణముతో ఈయనకు సంబంధ ముండినది. పాములూరు ఎస్టేటు దావా వ్యవహారములో నొకమా రీయన ప్రివీ కౌన్సిలుకును పోయి వాదించెను. నెల్లూరులో టౌన్‌హాలును కట్టించుటకును, అందులో ప్రోగ్రెసివ్ యూనియన్ లైబ్రరీకి కొంత భాగము నిప్పించుటకును ఈయన ముఖ్యకారకు డయ్యెను; వి. ఆర్. హైస్కూలు కమిటీలో సభ్యుడయి హైస్కూలును రెండవ తరగతి కళాశాలగా పెంపొందించుటకు ఎక్కువ శ్రద్ధ వహించెను. నెల్లూరులో ఈయన సంబంధము లేని ప్రజాహిత సంస్థలుగాని, కార్యములుగాని లేవు. నెల్లూరి ప్రజల కీయనయెడ గొప్ప గౌరవ ముండెడిది. ఈయన చేసిన వివిధ ప్రజాహిత కార్యములకు మెచ్చుకొని ఈయనకు ప్రభుత్వము రావుబహదూరు బిరుదు నొసగెను. **మా. వెం. రం.**

**సుబ్రహ్మణ్యం, బ్రహ్మజోస్యుల** (క్రీ. శ. 1891 - 1936): వీరు సుప్రసిద్ధులైన ఆంధ్రకాంగ్రెసు నాయకులు; సీతానగరం సత్యాగ్రహాశ్రమ స్థాపకులు. వీరు గుంటూరు జిల్లా ఫిరంగిపురంలో జన్మించారు; రామశాస్త్రిగారి ద్వితీయపుత్రులు; వీరి తల్లి లక్ష్మీ నరసమ్మగారు. వీరు బెజవాడలో మెట్రిక్యులేషను వరకు చదివి పిమ్మట కలకత్తాలోని నేషనల్ మెడికల్ కాలేజిలో డాక్టరు మల్లిక్‌వద్ద నాలుగు సంవత్సరములపాటు విద్య నభ్యసించి అక్కడే కొంతకాలం హౌస్ సర్జన్‌గా పనిచేశారు; 1916 సం॥లో రాజమహేంద్రవరం చేరి కంభంవారిసత్రం వీథిలో తమ గురువు పేరిట తమ వైద్యాలయమునకు మల్లిక్ ఫార్మసీ అనే పేరుపెట్టి వైద్యవృత్తిని ప్రారంభించారు. అనతి

కాలంలో ఘనవైద్యులుగా మంచి పేరు ప్రఖ్యాతులను, ధనాన్నికూడ వీరు గడించారు. అప్పట్లో వీరికి సంవత్సరానికి పదివేల రూపాయల వరకూ ఆదాయం వచ్చేది.

కలకత్తాలో జాతీయ వైద్యకళాశాలలో నున్నప్పుడు వీరికి వంగదేశ విప్లవకారులతో స్నేహం కలిగింది; జాతీయ భావాలతోపాటు తీవ్రమైన అతివాద భావాలుకూడా సంక్రమించాయి. ఆ రోజులలో రాజమహేంద్రవరంలోనూ, గోదావరి జిల్లాలోనూ తలెత్తిన అన్ని సాంఘిక, రాజకీయ, సాహిత్య ఉద్యమాలలోను వీరు ఎక్కువగా పాల్గొనేవారు. విద్యార్థి ఉద్యమాలంటే వీరికి మరీ అభిమానం. అందుచేతనే వీరు ఎందరినో యువకులను కాంగ్రెసులోని కాకర్షింప కలిగినారు. 1921 లో రాజమహేంద్రవరమున జరిగిన ఆంధ్రవిద్యార్థి మహాసభ ఫలితంగా చాలామంది కళాశాలలను బహిష్కరించుటకు వీరు ప్రధాన కారకులు. వీరు ఆటపాటలలో కూడా ప్రతిభ కలవారు; టెన్నీసు ఆటలో కడు నేర్పరి.



చిత్రము 316.
బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యం

1920 వ సంవత్సరంలో సహాయ నిరాకరణానికి తొలిమెట్టుగా ప్రారంభింపబడిన శాసన సభా బహిష్కారానికి వీరు ఉభయ గోదావరి జిల్లాలలోను విశేషంగా కృషిచేశారు. అంతకుపూర్వం బహిరంగ సభల్లో ఉపన్యసించడానికి తొట్రుపాటుపడే వీరు అత్యద్భుతమైన ప్రతిభతో పంజాబు దురంతాలను గురించి ఉపన్యసిస్తుంటే ప్రజ లుద్వేగ మొంది కన్నీరు కారుస్తూ ఉండేవారు.

1921 లో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘమునకు వీరు సంయుక్త కార్యదర్శిగా ఉండిరి. ఆ సంవత్సరం డిశంబరు నెలలో 107 వ సెక్షన్ క్రింద గోదావరిజిల్లా కలెక్టరు వీరికి సంవత్సరం కఠినశిక్ష విధించారు. అప్పుడే వీరు సీతానగరం ఫిర్కాలోని గ్రామోద్యోగులచేత రాజీనామాలనిప్పించి ప్రభుత్వాన్ని స్తంభింపచేయాలని ప్రయత్నించారు. అప్పుడు వీరిని, వీరి సహాయులను సీతానగరంలో బంధించుటకు ఆనాటి ప్రభుత్వాధికారులు జంకినారు. పోలీసు ఇన్‌స్పెక్టరు వీరిమీద పరిపూర్ణమైన విశ్వాసముంచగా వీరు 20 మైళ్ళ దూరం కాలినడకను ఊరేగింపుతో వచ్చి అందరిని పోలీసుల కప్పచెప్పినారు. రాజమహేంద్రవరం, కడలూరు జైళ్ళల్లో సంవత్సరం గడిపిన పిమ్మట గయ కాంగ్రెసుకు ముందు డిశంబరు (1922) లో వీరు విడుదలైనారు. వీరు గయ కాంగ్రెసుకు వెళ్లి తిరిగి వచ్చిన మీదట వీరిపై తిరిగి 107 క్రింద కేసు పెట్టినారుకాని శిక్షపడలేదు. అటుపిమ్మట వీరు కాకినాడ కాంగ్రెసు కార్యనిర్వహణములో నిమగ్నులైనారు. 1924 లో గాంధీజీ కారాగారంనుంచి విడుదలైన తర్వాత వీరు సీతానగరం చేరి గ్రామీణసేవకు పూనుకున్నారు. వీరికి శాసన సభా కార్యక్రమమందు విశ్వాసం లేదు. 1925 లో వీరక్కడనే గౌతమీ సత్యాగ్రహాశ్రమమును స్థాపించారు; అక్కడ నిర్మాణ కార్యక్రమము - అనగా ఖద్దరు ఉత్పత్తి, విక్రయం, అస్పృశ్యతా నివారణ, జాతీయవిద్య మొదలైన గాంధేయ కార్యక్రమాలను నిర్వహించారు. 1930 లో ఉప్పుసత్యాగ్రహోద్యమంలో ఈ యాశ్రమం ప్రధానరంగమైనది. తూర్పుగోదావరి సత్యాగ్రహ ప్రస్థానం సాంబమూర్తి, సుబ్రహ్మణ్యంగార్ల నాయకత్వాన ఈ యాశ్రమమునుండే బయలుదేరింది. ఈ సందర్భంలోనే సుబ్రహ్మణ్యంగారి కొక సంవత్సరం శిక్ష పడింది. కడలూరు జైలులో శిక్ష గడిపి వచ్చేసరికి వీరి జీవితాని కనేక విధాలుగా శ్రీరామ రక్ష పెట్టిన తల్లి లక్ష్మినరసమ్మగారు స్వర్గస్థురాలైనది. ఇంతలో గాంధీ - ఇర్విన్ సంధికూడా అయినది. ఈ సంధి కాలంలో సుబ్రహ్మణ్యంగారు రాజమహేంద్రవరంలో శాంతియుతమైన పికెటింగును ఏర్పాటు చేసినారు. ఇంతలో గాంధీజీ రౌండుటేబిల్ సమావేశం నుంచి తిరిగి రాగానే 1932 లో మరల శాంతి సమరం ప్రారంభమైనది. ఆ సంవత్సరం జనవరి మొదటి వారంలోనే వీరిని రాజమండ్రి నడివీథిలో పోలీసులు లాటీలతో మోదినారు. అప్పుడు వీరి ప్రక్క ఎముక విరిగినది. ఆ పిమ్మట వీరిపై పోలీసులు ఒక అబద్ధపు కేసును బనాయించినారు కాని అది నిలువలేదు. అమలాపురం డెప్యూటి కలెక్టరు వీరిపై మరొక కేసుపెట్టి ఆరు నెలలు శిక్ష విధించి వీరిని కడలూరు జైలుకు పంపినారు. శిక్షాకాలమును ఆరోగ్యముగనే గడిపినారు, కాని విరిగిన ఎముక లోలోపలనే వీరి ఆరోగ్యమును భంగపరచినది. వీరు విడుదల యగుసరికి శాసనోల్లంఘనోద్యమం చల్లబడినది. గాంధీజీ నిరాహార దీక్ష ఫలితముగా అస్పృశ్యతా నివారణోద్యమం దేశవ్యాప్తముగా సాగింది. వీరు మరల ఈ యుద్యమంలో నిమగ్నులై గొప్ప కృషిచేసినారు. అప్పుడు వీరు సీతానగరంలో హరిజనాశ్రమమును స్థాపించి నిర్వహించినారు. 1934 లో వీరు తీవ్రమైన క్షయవ్యాధికి గురియైనారు. 1935, 1936 లలో తాత్కాలికంగా ఆ రోగం

ఉపశమించినా, ఆయన ప్రాణం తీసేవరకు అది వదలలేదు.

వీరు గాంధీజీ కత్యంత సన్నిహితులు. ఫయిజ్‌పూరు కాంగ్రెసులో వీరి మరణవార్త విన్నంతనే గాంధీజీ రెండు నిమిషములపాటు కన్నీరు కారుస్తూ నిశ్చేష్టుడైనాడు. స్వాతంత్ర్యోద్యమాలలో ఆంధ్రదేశంలో ప్రథమ శ్రేణిలో చెప్పుకొనవలసిన దేశభక్తుడు, ఉదారుడు, త్యాగి, కార్య దీక్షాపరుడు సుబ్రహ్మణ్యంగారు. అన్నిటికన్న వీరి నెరిగిన వా రందరికీ పరమాప్తుడు, మిత్రుడు.

ఆంధ్రదేశంలో కుటుంబం మొత్తంమీద స్వాతంత్ర్యోద్య మాలలో పాల్గొన్నవారిలో వీరి కుటుంబ మొకటి. వీరి తల్లి లక్ష్మీనరసమ్మగారు గొప్ప నిర్మాణకృషి చేసిన దేశ భక్తురాలు. ఎన్నోసార్లు శాసన ధిక్కారం చేసిందికాని ఈమె నెవ్వరూ నిర్బంధించలేదు. ఈమె ప్రథమ పుత్రుడు సీతారామయ్యగారు స్కూళ్ల డెప్యూటి ఇన్‌స్పెక్టర్ ఉద్యో గం చేస్తూ 1921 లో ఉద్యోగానికి రాజీనామా నిచ్చి ఉద్య మంలో చేరినారు ; జాతీయ విద్యావిషయంలో చాల కృషి చేశారు. క్రొ. లిం. రా.

**సుబ్రహ్మణ్యశాస్త్రి, అవ్వారి** (క్రీ. శ. 1884 - 1955) : వీరు వైదిక బ్రాహ్మణులు. వీరిది భారద్వాజ సగోత్రము; ఆపస్తంబ సూత్రము. తండ్రి రామయ్య, తల్లి మహా లక్ష్మమ్మ. నివాసము కొమ్మూరు. వీరు న్యాయశాస్త్ర మును అద్దేపల్లి సోమనాథ శాస్త్రిగారివద్దను, శ్రీ కాశీ కృష్ణాచార్యులుగారి వద్దను, వేదాంత ప్రస్థానత్రయమును బ్రహ్మానంద తీర్థులవారియొద్దను అభ్యసించి వేదాంత విశేషములను ప్రకాశానందనాథులవారి యొద్దను, వెంకట రమణశాస్త్రిగారి యొద్దను తెలిసికొనిరి.

వీరు తర్క వ్యాకరణాది శాస్త్రజ్ఞానముతో గూడిన సంస్కృత సాహిత్యము, అలంకార వేదాంత శాస్త్ర నిష్ణాతృత్వము, సవిమర్శమైన జ్యోతిష ధర్మశాస్త్రాది జ్ఞానము, అనుపమమైన యాంధ్ర సాహిత్యము, ఉభయ భాషాకవితారచనా పాటవము, అష్టశతావధానాశు కవి త్వాది విశేషములతో గూడిన ప్రబంధ రచనాశక్తి కలవారు.

వీరి కృతులు : దైవబలము, కావ్యనాటకాది పరిశీల నము, మేఘుడు, సీత జీవితము, ఆంధ్రభాషా విలాపము, దుష్యంత చరితము. శ్రీరామ మహాసామ్రాజ్య పట్టాభి షేకము, గౌతమీ పుష్కర మహిమ, తెలుగు కావ్యా దర్శము, ఆంధ్ర ధ్వని, ఆలోకము, సగుణోపాసన - నిర్గుణో పాసన, జీవన్ముక్తి - విదేహముక్తి, తెలుగు రసగంగా ధరము. ఇవికాక వీరు రచించిన గద్యపద్య వ్యాసములు, సంస్కృత నాటకములు మొదలైనవి గలవు. పెక్కు శతావ ధానములను కావించి వీరు కీర్తి గడించిరి. ఆ. వా. శా.

**సుబ్రహ్మణ్యశాస్త్రి, నోరి** : వీరు జగత్ప్రసిద్ధులయిన దండిభట్ల విశ్వనాథశాస్త్రిగారి శిష్యులు; వెలనాటి బ్రాహ్మణులు ; గోదావరీ తీరస్థులు ; పదునేను సంవత్సర ములు కాశీలో విశ్వనాథశాస్త్రిగారి శుశ్రూష చేసి వ్యాకరణ శాస్త్రమును, న్యాయ మీమాంసలను అధ్యయ నము చేసిరి. వ్యాకరణమును ప్రత్యేకాభిమానముతో చదివి సునిశితమైన పాండిత్యమును, ప్రతిపక్ష భయంకర మైన శాస్త్రార్థ ధోరణిని సంపాదించి వీ రాంధ్ర దేశము నకు తిరిగివచ్చి యెల్ల యెడలను శాస్త్రార్థములను చేయుచు గెలుపొందుచు త్వరలోనే యఖండ ఖ్యాతిని సంపాదించిరి. ఒక్కచోట మాత్రము - విజయనగరములో భీమాచా ర్యులుగారివద్ద - పరాజయము గల్గుటచే వీరు తిరిగి కాశీ కేగి పట్టుదలతో తమ పాండిత్యమునకును, వాద కౌశలమున కును పదను పెట్టుకొని యాంధ్ర దేశమునకు మరలి వచ్చిరి. ఈసారి వీరికి పరాజయమే లేదు. సభలో శాస్త్రా ర్థము చేయుటలో వీరు అసమాన ఖ్యాతిని సంపాదించిరి. పిమ్మట వీరు తమిళదేశమున కేగి వేదాంత శాస్త్రమును కూడ నధ్యయనము చేసిరి,

అప్పుడు కాకినాడలోని వదాన్యులు, ముఖ్యముగా వైశ్యులు, వీరిని కాకినాడలో నుండగోరిరి. వీ రందుల కంగీకరించి పౌరుల సత్కారముల నందుచు, వ్యాకరణ శాస్త్రాధ్యాపనము విరివిగా గావించుచు తమ షష్ట్యుత్తర వయస్సులో 1927 ప్రాంతమున దేహారోగ్యము చెడువరకు కాకినాడనే ముఖ్య నివాసముగా జేసికొని యుండిరి. మధ్యకాలమున (1912-20) వీరు తెనాలిలో సంస్కృత కళాశాలకు ప్రిన్సిపల్‌గా నుండి శిరోమణి తరగతుల కుద్గ్రంథములను పాఠము చెప్పుచుండిరి. ఆ సమయమున వీరు వేదాంత శిరోమణి విద్యార్థులకు వేదాంత శాస్త్ర మునుకూడ బోధించుచుండిరి. లోకమాన్య బాలగంగాధర తిలకుగారు మహారాష్ట్ర భాషలో గీతారహస్య మను బృహద్గ్రంథమును రచించి దానిని వివిధ దేశభాషల లోనికివలెనే తెలుగులోనికిని పరివర్తింపచేయదలచి సమర్థు డైన భాషాంతరీకర్తకై యన్వేషించుచుండగా వీరిని గురించి వినిరి. వేదాంత శాస్త్ర నిష్ణాతృత్వము, మహా రాష్ట్ర భాషాపాండిత్యము మున్నగు సమస్తార్హతలును వీరి కుండుటచే తిలకుగారు వీరి నాహ్వానించి వీరితో సంభాషణ జరిపి వీరి పాండిత్యమున కక్కజ మంది గీతారహస్య భాషాంతరీకరణమునకు పూనుకొనవలసినదిగా కోరిరి. వీ రాప్రకారమే దాని నాంధ్రీకరించిరి. వీరు దానికి విపుల

మైన పీఠికనుకూడ రచించి యందు శంకరాచార్యులకును, తిలకుకును నడుమ భాసించు అభిప్రాయ భేదములను సవిమర్శముగా చర్చించి తుదకు వాస్తవిక భేద మత్యల్ప మని తేల్చినారు. జ. పు.

**సూరన, పింగళి:** పింగళి సూరనార్యుడు పదునారవ శతాబ్ద ఉత్తరార్ధమున నుండెనని ప్రామాణికులైన చరిత్ర కారులు ఇదివరలో నిర్ణయించిరి. కాని ఇటీవల ఈ కవి పదునేడవశతాబ్ది పూర్వభాగమున నుండెనని ఒకవాదము బయలుదేరెను. శిలా శాసనాది చరిత్రాధారములదాక పోకుండగనే ఈ నూత్న సిద్ధాంతమును సులువుగా పూర్వ పక్షము చేయవచ్చును. ఎట్లనగా - రామరాజభూషణుడు వసుచరిత్రలో 'కేవల కల్పనాకథలు కృత్రిమరత్నములు' అని నిరసించుట కళాపూర్ణోదయమును గూర్చియే. కళా పూర్ణోదయమునకు పూర్వము అట్టి నిరసన భాజనములు కాదగిన కల్పనాప్రబంధములు మన వాఙ్మయమున లేవు. ఏవేని అప్రసిద్ధము లున్నవేమోగాని రామరాజభూషణుని బ్రహ్మాస్త్రము ఆ పిచ్చుకలపై వేసినదికాదు. మరియు రామరాజభూషణుడు పింగళి సూరనార్యుని రాఘవ పాండవీయము తరువాతనే హరిశ్చంద్ర నలోపాఖ్యానము వ్రాసెననుట నిర్వివాదము. ఈ రెండు నిదర్శనములను బట్టి సూరన రామరాజ భూషణునకు పూర్వుడు.

రామరాజభూషణుని వసుచరిత్రము విజయనగర రాజ్యము తల్లికోట యుద్ధములో దెబ్బతిని, పూర్వ వైభ వము గోల్పోయి, పెనుగొండ రాజధానిగా బ్రతుకు చుండిన దినములలో, సింహాసన మధిష్ఠించియున్న తిరుమల రాయల కాలములో, అనగా క్రీ. శ. 1565 - 1570 మధ్య, రచింపబడినది. విజయనగరమునుండి చావుబ్రతుకులతో పారిపోయివచ్చిన ఆ రాజవంశము పెనుగొండలో తన స్థితిని కొంత చక్కబెట్టుకొనిన పిమ్మటనే తిరుమలదేవ రాయలు వసుచరిత్ర కృతిస్వీకారమునకు ఉత్సాహపడుట సహజము గావున, ఆ గ్రంథము క్రీ. శ. 1570 ప్రాంతమున పుట్టియుండె ననుట సమంజసము.

కళాపూర్ణోదయము వసుచరిత్రమునకు పది సంవత్సర ములకు పూర్వము రచింపబడియుండును (క్రీ. శ. 1560). దీనికి పూర్వరచనమైన రాఘవపాండవీయము క్రీ. శ. 1550 ప్రాంతమునను, దానికి పూర్వరచనమైన గరుడపురాణము క్రీ. శ. 1540 ప్రాంతమునను, కళాపూర్ణోదయమునకు పిమ్మటి రచనమైన ప్రభావతీప్రద్యుమ్నము వసుచరిత్ర మునకు సమకాలికమై క్రీ. శ. 1570 ప్రాంతమునను రచింప బడి యుండవచ్చును. ఈ నిర్ణయమునుబట్టి పింగళి సూర నార్యుడు ఇంచుమించు క్రీ. శ. 1540 మొదలు 1570 వరకు ముప్పది సంవత్సరములు గ్రంథరచనా నిమగ్నుడై యుండునని నా యూహ. పైని పేర్కొన్న గ్రంథరచనా కాలములకు ఐదేసి సంవత్సరములు అటుగాని, ఇటుగాని చేర్చినను తప్పులేదు.

సూరన శిష్టాచార సంపత్తిగల పండిత వంశములో జనించిన అదృష్టవంతుడు. వీరి వంశమునకు మూలపురుషు డైన గోకనమంత్రి నాటినుండియు వీరియింట లక్ష్మీ సర స్వతులు తాండవించుచుండిరి. పాండిత్యముతోపాటు కవి త్వముగూడ ఆ వంశములో పెక్కురకు అనూచానముగా లభించెను. సూరకవి వంశపరంపరాగతములైన విద్యలను, సిరులను, సదాచారములను అలవరచుకొని సుఖముగా కాలక్షేపము చేసియుండును.

సూరన కృతములైన గ్రంథములలో పోయినవి పోగా మిగిలియున్న మూడింటిలో మొదటిదియైన రాఘవపాండ వీయమును పంపావిరూపాక్ష దేవునకును, మూడవదియైన ప్రభావతీప్రద్యుమ్నమును పితృదేవునకును అర్పించి దేవతా పితృభక్తిగల తన జీవితమును చరితార్థ మొనర్చుకొనెను.

రాఘవపాండవీయ ముపలబ్ధమైన ఆంధ్ర ద్వ్యర్థికావ్య ప్రపంచమున మొదటిది. మన భాషలో తరువాత అచ్చ టచ్చట సకృత్తుగా పొడచూపుచు వచ్చిన శ్లేష పద్యము లకు ఈ గ్రంథము పరిణామ రూపము. పూర్వకాలమున నన్నెచోడుని కుమారసంభవములోను, నాచనసోముని ఉత్తర హరివంశములోను, తరువాత మను చరిత్రాదుల లోను కొద్దిపాటి శ్లేష పద్యములు గలవు. అవన్నియు శ్లేషాలంకార కుతూహలముచే సకృత్తుగా వ్రాయబడిన చమత్కారపద్యములు. శ్రీనాథుని శృంగార నైషధమున పంచనళీ వృత్తాంతము మాత్రము ఊరక చమత్కారార్థము కాక సందర్భావశ్యకతను బట్టి ప్రస్తుతోభయ శ్లేషాత్మక మైన ఘట్టముగా రచింపబడినది. అంతియగాని రెండు కథలను జోడించి కావ్యమంతయు ద్వ్యర్థిగా రచింపబడిన గ్రంథము రాఘవ పాండవీయము నాటికి మనభాషలో నెద్దియు నిలిచియుండలేదు. వేములవాడ భీమకవి ఇట్టి గ్రంథమును చెప్పెననెడివాడుక కలదుగాని దానిజాడ ఎందును గానరాదు. రాఘవ పాండవీయము తరువాత వెలసిన ద్వ్యర్థి, త్ర్యర్థి కావ్యము లన్నియు ఆ మాతృ స్తన్యమును గ్రోలిన పిల్లలే.

ఈ రాఘవపాండవీయమునకు మాతృకకాదగినట్టి గాని, మార్గదర్శకము కాదగినట్టిగాని సంస్కృత గ్రంథమై నను లేదు. ఇటీవల ఒక సంస్కృత రాఘవపాండవీయము దొరకెనుగాని దానికిని, మన తెనుగు రాఘవపాండవీయ మునకును జన్యజనక సంబంధము బొత్తిగాలేదు. ఆ సంస్కృత

గ్రంథము ప్రసిద్ధికెక్కినది కాకపోవుటచే సూరనయు దాని నెరుగక పోవచ్చును. అదిగాక అనేకార్థక శబ్దమయమైన సంస్కృతభాషలో రెండర్థములు సంపాదించుట సుకర మగునుగాని, తెనుగున మాత్రము అది దుర్ఘటము. అందును రెండు మహాకథలను జోడించుట దుష్కరము; మరియు అద్భుతావహము.

'రెండర్థంబులవద్య మొక్కటియు నిర్మింపంగ శక్యంబు గా
కుండుం దద్గతిఁ గావ్యమెల్ల నగునే యోహోయనం జేయదే
పాండిత్యంబును నందునుం దెనుఁగుకబ్బం బద్భుతం బంద్రు ద
కుండెవ్వాఁడిల రామభారతకథల్ జోడింప భాషాకృతిన్.

రాఘవపాండవీయకథ రమ్యముగా నొకకావ్యసృష్టి నా
హా ఘటియింపఁగా వశమె యాంధ్రకవీంద్రులకు'

అనిన సూరన వాక్యములలో ఆ దుష్కరత్వ మంతయు నిరూపింపబడినది.

ఈ దుష్కర కార్యమును సాధించుటకై ఆయన ఆత్మ వ్యవస్థానార్థము కొన్ని నియమములను కల్పించు కొనెను. ఆ నియమములే ఇతర ద్వ్యర్థికావ్య కర్తలకు లక్షణ సంపుటి యయ్యెను. కాని వారు ఆ లక్షణమునే పాటించినను రాఘవ పాండవీయములోని అర్థసౌలభ్యము మాత్రము తమ కావ్యములలో సాధింపలేక పోయిరి.

ఈ రాఘవ పాండవీయమున ఇంచుమించు ఆరు వందల పద్యములు గలవు. వానిలో భారత, రామాయణ సమానార్థకములైనవి తరిమి లెక్కించినను ఏబది అరువది కంటె ఎక్కువ పొడకట్టవు. తక్కిన పద్యము లన్నియు ముఖ్యముగా (1) సంస్కృత భాషా సభంగ శబ్దశ్లేష, (2) ఆంధ్రభాషా సభంగ శబ్దశ్లేష, (3) ఉభయభాషా సభంగ శబ్దశ్లేష, (4) సంస్కృత భాషా అభంగ శబ్దశ్లేష, (5) ఆంధ్రభాషా అభంగ శబ్దశ్లేష, (6) ఉభయభాషా అభంగ శబ్దశ్లేష, (7) శబ్దాన్వయ విభేదము, (8) అర్థాన్వయ విభేదము, (9) వృత్తిశ్లేష అనెడి తొమ్మిది విధములైన శ్లేషభంగులలో ఏదే నొక దానికిగాని పెక్కింటికిగాని ఉదాహరణము లగుచునే యుండును. కావున పదింట తొమ్మిది పాళ్ళు రాఘవ పాండవీయము చిత్రవిచిత్ర శ్లేష మయముగా నున్నది.

రాఘవ పాండవీయములో సమగ్రముగాగాని, సంగ్రహముగాగాని రామాయణ భారత కథలు రెండును చెప్ప వలెనని కవి తలపెట్టలేదు. యథాస్థితముగా ఆ రెండు కథలకును ఆద్యంతము పొత్తు కుదురదు. రెంటిని సంగ్రహపరచినను కథల విస్తృతి తగ్గునేకాని వానికి సహజముగా లేని పొత్తు మాత్రము కల్పింపబడదు. ఈ క్లేశమును అతిక్రమించుటకై ఆయన ఒక కథాప్రణాళికను ఏర్పరచుకొన్నట్లు కన్పట్టుచున్నది. దాని స్వరూప మిది: రామాయణ కథను చేపట్టి, వివరముల జోలికి పోకుండ దాని స్థూల రూపావయవములను రేఖామాత్రముగ ఊహించి, భారత మహాకథలో ఆ రామాయణ రేఖావయవచ్ఛాయలుగల అవయవములను మాత్రమే గైకొని రామాయణ స్థూల మూర్తికి అనురూపమైన భారత స్థూలమూర్తిని నిర్మించి, ఆరెండు రూపములును సదృశములుగా గోచరించిన పిమ్మట జోడించి కవిత్వ రచన కుపక్రమించెను. ఈ ప్రణాళికలో రామాయణము ప్రకృతిగా, భారతము ప్రతికృతిగా స్థూలదృష్టికి గోచరించునుగాని ఉభయ ప్రాధాన్యము చెడకుండ రచనా నిర్వహణము కొనసాగినదని చెప్పుటలో అత్యుక్తి ఏమాత్రము లేదు. ఇతర ద్వ్యర్థికావ్యములు అర్థద్వయ ఘటనా చమత్కారముగల పద్యరచనలో ఈ గ్రంథమును అనుకరింపగల్గినను, ఇట్టి కథాద్వయ ఘటనా ప్రజ్ఞలో దీనికి దీటు కాజాలవు. ఈ దుర్ఘట కృత్యము ఆయనబుద్ధి విశేషమునకు, పాండితీ మహత్త్వమునకు నిదర్శనమగునే కాని కవితా ప్రతిభకు, శిల్పరచనా కౌశలమునకు నిదర్శనము కాజాలదు. ఆ కౌశలము, ఆ ప్రతిభ వెలుగొందు గ్రంథరాజము కళాపూర్ణోదయము.

పురాణేతిహాస ప్రసిద్ధములైన ఉపాఖ్యానములను ఇతివృత్తముగా గైకొని, రసబంధురములైన ప్రబంధములను రచించుట ఆంధ్ర ప్రబంధ కర్తల సాధారణాచారము. ప్రబంధశిల్ప నిర్మాణ ద్వారముననే వారు ఆంధ్రసారస్వతమునకు విశిష్టయశమును సంపాదించిరి. ఆ ప్రబంధ కీర్తి సంపద యనెడి ఉమ్మడి సొత్తులో ప్రభావతీ ప్రద్యుమ్న రచన వలన సూరనయు ఒక భాగస్వామియే యగును. ఆయన ప్రత్యేకము స్వార్జితముగా సంపాదించుకొన్న కీర్తి ధనమునకు కళాపూర్ణోదయము నిధానము.

ఆంధ్ర ప్రబంధ సరస్వతి కైసేసికొన్న ఆభరణములలో కళాపూర్ణోదయము అపూర్వదీప్తిగల రత్నాభరణము. ఈ యాభరణమునందలి రత్నములు పురాణ ఖనులనుండి త్రవ్వి యెత్తినవి కావు. రామరాజ భూషణుడనుకొన్నట్లు కృత్రిమ రత్నములును గావు. అవి ఈ కవిబ్రహ్మ తన భావనా సముద్రమునుండి ఎత్తిన నిక్కపు రత్నములు. సూరన ఈ మహాకావ్యమున వ్యంగ్యముగా ప్రతిపాదింప నెంచిన ప్రణయధర్మ స్వరూపమును వ్యక్తీకరించుటకు పురాణేతిహాసము లన్నియు గాలించినను ఏ యుపాఖ్యానమును ఆయనకు ప్రయోజనకారి కాదు. కళాపూర్ణోదయ మనగా ప్రణయదేవతా విశ్వరూప ప్రదర్శనము. జగజ్జీలకు ఆదికారణమగు తృతీయ పురుషార్థము జీవుల తారతమ్యమునుబట్టి ఎన్ని విధముల వర్తించుచుండునో ధ్యానించి,

సాక్షాత్కరింప జేసికొని వానికి రూపకల్పనము చేయుట బ్రహ్మసంకల్పమునకు అర్థము చెప్పుట.

కావ్య మహత్త్వము రెండంశములపై ఆధారపడి యుండును. మొదటిది రచనాశిల్పసౌందర్యము, రెండవది అందలి ధ్వని. ధర్మమనగా నీతికి పర్యాయపదము కాదు. నీతి సాంఘికాచార సంబంధి; ధర్మము తాత్త్విక సత్యము. ధర్మార్థ కామములనెడి మూడు పురుషార్థముల సంపుటీకరణమైన మానవుని జీవితములో మైమెయి తేల్చరాని సమస్య లనేకములు సంఘటిల్లుచుండును. లోక సామాన్యమునకు దురవగాహమైన ఆ సమస్యలను గోచరింపజేసికొని, దానిని తన కావ్యవస్తువులో గర్భీకరించి, శిల్ప మర్యాదలకు భంజకముగాని రీతిని కవి పరిష్కరించు వ్యంగ్య విధానమే కావ్యములోని ధర్మధ్వని. ఇట్టి ధర్మధ్వని అన్ని కావ్యములలోను ఉండదు. లేనంతమాత్రమున వాని కావ్యత్వమునకు భంగ మేమియు రాదు. కాని ఆ ధర్మధ్వనికూడ నున్న కావ్యములు ఉత్తమము లనక తప్పదు. ఈ ధర్మధ్వని నేటి విమర్శ పరిభాషలో జీవిత సమస్యా పరిష్కారమని, కవి సందేశమని అనుచున్నారు.

పూర్వకాలమున పింగళి సూరనను రాఘవ పాండవీయ కర్తగానే లోకము కొనియాడెను గాని కళా పూర్ణోదయ కర్తగా మెచ్చలేదు. మెచ్చకపోవుట అటుండ మీదుమిక్కిలి నిరసనకును దొరకొనెనని యూహింపవచ్చును. అప్పటి వారికి పద్యరచనా చమత్కారమునం దున్న గౌరవము తక్కిన శిల్ప ధర్మములయందు లేదు. అపూర్వకథా కల్పనమునుగాని కథాకథన ప్రౌఢినిగాని, పాత్ర చిత్రణ కౌశలమునుగాని ఆమోదించు సరస విమర్శ జ్ఞానము వారికి లేదు. మరియు వారికి ఆలంకారిక నిర్దేశములు పరమ ప్రమాణములై, ఆ నియమానుసారముగా లేని గ్రంథములను తిరస్కరింపజొచ్చిరి. ఈ గ్రంథములో ఆనాటి విద్వాంసుల అనాదరమునకు, నిరసనకు పాత్రమైన లక్షణములు రెండు మూడు కలవు. ఆధునిక విమర్శలో ఈ గ్రంథమునకు అగ్రస్థాన మిచ్చినవియు ఆ లక్షణములే. వానిలో మొదటిది కథాకల్పనలోని వక్రత. ఈ వంకరతనమే కళాపూర్ణోదయ కథాకథన మహత్త్వ మని శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి తన కవిత్వ తత్త్వ విచారమున సర్వసంశయ విచ్ఛేదకమైన నిరూపణము చేసెను. నాకు తోచిన ఇంకొక విశేషము : మానవ శరీర నిర్మాణములో బ్రహ్మ నాభిస్థానమును భార కేంద్రమును (సెంటర్ ఆఫ్ గ్రావిటీ) చేసినట్లే ఈ కావ్య శరీరబంధములో గ్రంథకర్త సరస్వతీ చతుర్ముఖుల ప్రణయ కలహ వృత్తాంతమును భార కేంద్రముగా నెలకొల్పెను. అదియే ఈ కథకు మూలబీజము. కథా బంధనమున గర్భస్థాన మధిష్ఠించి యున్న ఆ బీజము శాఖోపశాఖలైన కథా వలయములుగా విస్తరిల్లి పూర్వోత్తర భాగముల నావరించి దృఢ మూలమును, విశాలాభోగమును గల మహావృక్షముగా పరిణమించెను. ఆ బీజము కథారంభముననే ఆరోపితమై యున్నచో కళాపూర్ణోదయ కథ సుగమమే అయ్యు ప్రరోచనా విహీనమై కథాసరిత్సాగర ధోరణిలో నడచెడిది. కావ్య శిల్పములో కథా ప్రరోచనము ముఖ్యముగా పాటింపవలసిన ధర్మములలో నొకటి. ఈ ధర్మమును గుర్తెరిగి నిర్వహించిన ప్రథమ ఆంధ్ర కవి పింగళి సూరన. రెండవది: కులీనత లేని కలభాషిణి నాయిక. ఈమె ప్రణయ వృత్తాంతమే ఆ భాగములోని వస్తువు. ఆ యువతి తన సహపాఠియైన మణికంధరుని మనసార ప్రేమించి, గురుశాప భయమువలన మనసు మరలించుకొని, ఒకింత మణికంధరుని రూపురేఖలు గల నలకూబరుని దెసకు తన ప్రణయ వీక్షణమును ప్రసరింపజేసెను. ఈ వీక్షణమే ఈ కథలోని రంభా నలకూబర వృత్తాంతమును, కలభాషిణీ మణికంధర వృత్తాంతమును జోడించి బంధించిన సూత్రము. ఈ యుభయ వృత్తాంత సంఘటనావశ్యకత కథా బీజముననే ఇమిడి యున్నది. అట్టి సంఘటనకు కారణము కాదగిన కలభాషిణి వేశ్యయైననేగాని తన ప్రణయ దృష్టిని ఒక దెసనుండి ఇంకొక దెసకు మరల్చుటకు వీలులేదు. ఈ నాయిక కులీనయే యగుచో ఈ కథయే యుండదు. కావుననే సరస్వతీ శాపమున కలభాషిణి వేశ్యల యింట పుట్టెను. వేశ్యయయ్యు ఈ నాయిక మన వాఙ్మయమున గల ఉత్తమ పాత్రలలో ఒకటి. ఉత్తమత్వమునకు కులీనతయే ముఖ్యకారణము గాదు. దానికి ఉదార సుందరమైన తచ్చరితము కారణము.

ఆ యా యీ కారణములచేత ఈ గ్రంథము చిర కాలము ప్రసిద్ధికెక్కి యుండలేదు. దీనిని అవగాహనము చేసికొనదగిన యోగ్యత ఆంగ్లభాషా సంపర్కమువల్ల ఈ కాలమువారికి మాత్రమే కల్గినది. ఏ పద్యమున కా పద్యమునే అలంకార లక్షణానుసారముగ పరీక్షించి, గుణ దోష నిర్ణయము చేయు నీరస, సంకుచిత దృష్టి పోయి అఖండ కావ్యశిల్ప సౌందర్యాస్వాద యోగ్యమైన సరస దృష్టి గల విమర్శకులు బయలుదేరిన ఆధునిక కాలములోనే ఈ కావ్యయశము వ్యాపింప మొదలిడెను.

ఈకావ్యమున వెల్లివిరియు శృంగారరసప్రవాహము సత్యలోకమం దుద్భవించి గంధర్వలోకముగుండ మర్త్యలోకమున కవతరించుచున్నది. భూస్వభావమునుబట్టి భూమిపై ప్రవహించు జలముల గుణము మారునట్లే ఆ శృంగారము మూడు లోకములలో మూడురూపములు తాల్చెను.

అందు ప్రథమ రంగస్థలమైన సత్యలోకమున దాని స్వరూపము కామవాసన లేని దివ్యలీల, సరస్వతీ చతుర్ముఖుల విలాస లీలయే ఈ విశ్వ సృష్టికి ప్రభవ కారణము. సత్యలోకమునుండి ప్రవహించు ఆ రస ప్రవాహము మధ్యే మార్గమున రెండవ రంగస్థలమైన గంధర్వ లోకమున తాల్చు రూపమునకు గాంధర్వ ప్రణయమని పేరు. ఈ కథలో కలభాషిణీ మణికంధరుల శృంగారము ఏ తత్ప్రణయ స్వరూపము. గంధర్వ లోకమునుండి మర్త్యలోకమునకు అవతరించునప్పటికి ఆ రసవాహిని సహధర్మచర్యము అనెడి రూపము తాల్చును. ఇదియే ఈ కావ్యములోని సుగాత్రీ శాలీనుల దాంపత్య శృంగారము. ఈయెడ 'ప్రజాయై గృహమేధినః' అన్న సూక్తి తప్ప మరేమియు వర్తింపదు. గార్హస్థ్య నిర్వహణమునకు, దాంపత్య సిద్ధికి పాతివ్రత్యము ఆధారము. మూర్తిమంతమైన ఆ పాతివ్రత్యమే ఈ కథలోని సుగాత్రి.

ఆ ప్రవాహము అంతతో నాగక మానవలోకమునుండి అధోలోకమునగూడ ప్రవహించి కామము అను పేరు తాల్చును. దానిని కామమనుటకంటె తుచ్ఛకామ మనుట మరియు మంచిది. అననురక్తయైన యువతిని బలాత్కరింపనెంచు రాక్షస స్వభావుడు దానికి ఆలంబనము. ఈ కథలో అభినవ కౌముదిని బలాత్కరింపనెంచి వెంటబడిన శల్యాసురుని వృత్తాంతము ఇందుకు నిదర్శనము.

ఈ నాల్గు శృంగార గతులను క్రమముగా బ్రాహ్మము, గాంధర్వము, ప్రాజాపత్యము, రాక్షసము అని పేర్కొనవచ్చును. ఈ పేర్లు అష్టవిధ వివాహములలో నున్నవి గాని ఆ నిర్వచనము వేరు; ఈ నిర్వచనము వేరు. లేదా వీనికి దివ్యము, గాంధర్వము, మానవము, రాక్షసము అని పేర్లు పెట్టవచ్చును.

ఈ నాల్గు తరగతులును, పైని వివరింపబడినట్లు ప్రత్యేకముగా ఆ నాల్గు లోకములలోనే గాక, ఈ మన మానవ లోకములోనే ఆలంబన భేదములనుబట్టి నాల్గు విధముల వర్తించుచుండును. ఆధ్యాత్మికముగా సప్త లోకములు మానవుని అంతరమున నున్నట్లే భౌతికముగా అన్ని లోకములును ఈ భూమిమీదనే కలవు. బ్రాహ్మమైన సరస్వతీ చతుర్ముఖుల దివ్యలీల ఈ లోకమున అపురూపముగా అపుడపుడు ఆవిర్భవించుచుండును. సీతారాముల యొక్కయు, రాధాకృష్ణులయొక్కయు శృంగారము ఈ బ్రాహ్మమునకు ఉదాహరణము కాదగును.

రెండవదియైన గాంధర్వ ప్రణయము మన సాంఘిక మర్యాదలకు దూరమై తిరస్కరింపబడుచున్నది. ఆ ప్రణయములో పాపము లేదుగాని అపాయ మున్నది. ఈ ప్రణయమునకు కులభేదములు, జాతిభేదములు లేవు. సాంఘిక బంధములనుగూడ విచ్ఛేదనము చేసి ఆ ప్రణయి హృదయములు పరస్పరాభిముఖములై పరువు లెత్తును. దాని యావేగమునకు సంఘ వ్యవస్థ కూలిపోగూడదు. అది లోక శ్రేయస్సు గాదు. కలభాషిణి ఉత్తమ కులీనయేయై ఈ గాంధర్వ ప్రణయమునకు ఆలంబనమే యైనచో, సంప్రదాయ విధేయమైన మన జాతి కళాపూర్ణోదయమును నేడును సహింపదు. కనుకనే ఆమె వేశ్యయైనది. సూరన ఈ నాయికను కులీనగా చేయకుండుటకు హేతు విదియే కాని గురుజన శాపమునకో, సంఘదూషణమునకో వెరచి, ఆ ప్రణయజీవులు తమ హృదయావేగమును కొంత కాలము నిగ్రహించుకొన్నను అది ద్విగుణీకృత వేగముతో జన్మాంతరమందైనను ఫలించి తీరును. ఆ సఫలత దాంపత్య రూపముననే సిద్ధి పొందుట లోకమునకును, ఆ జంటకును శ్రేయము. కలభాషిణీ మణికంధరులు మధుర లాలసా కళాపూర్ణులుగా మారుజన్మలో దంపతులగుటలోని అర్థ మిదియే. వారి దాంపత్యములో జాతి స్మరత్వమువలన జన్మాంతర సౌహృదము గోచరించుచుండునేని వారు పొందు ఆత్మానందమునకు మేరయే ఉండదు. పూర్వజన్మలో మణికంధరునకు శ్రీకృష్ణు డనుగ్రహించి యిచ్చిన మణిహారములోని నాయకమణియొక్క మహిమవలన వారి కట్టి జాతిస్మరణము కలిగి, వారి జీవితానందమును ఇనుమడింపజేసెను. ఇక నాల్గవదియైన రాక్షసము పాప భూయిష్ఠము; ఇహపరముల రెండింటను శిక్షార్హము; ఇదియే ఈ కావ్యమున గల శృంగార ధర్మధ్వని.

కళాపూర్ణోదయ మనగా కవిత్వ కళయొక్క పరిపూర్ణమైన ఉదయము.

అద్వితీయమైన ఇట్టి కావ్య సృష్టి చేసియు, సమకాలికుల ఆదరము లభింపక అప్పటి ప్రబంధ కవుల ఆచారమునుబట్టి పురాణోపాఖ్యానమునే ప్రబంధీకరించుటకు ఈ కవి పూనుకొనెను. అదియే ప్రభావతీ ప్రద్యుమ్నము. 'ఏగతి రచియించిరేని సమకాలమువారలు మెచ్చరే గదా' అని చేమకూరి వెంకనవలె పింగళి సూరనయు చిడిముడిపడెనేమో.

ప్రభావతీ ప్రద్యుమ్నము సానలదీరిన నిక్కపుజాతి రత్నము. సూరన హరివంశపు గనిని త్రవ్వి ఆ రత్నము నెత్తెను. పారిజాతాపహరణ కథారత్నము నంది తిమ్మనకు ఆ గనిలోనే లభించెను.

ప్రాయికముగా పురాణగాథలు విషయప్రధానమగుట చేత వానియందు కావ్యతాగుణము కొంతవరకు కొరవడి యుండుట సహజము. ఆ కథలయందు ముఖ్యముగా

సందర్భశుద్ధి యుండదు. కావ్యవిమర్శ సూత్రములను పురస్కరించుకొని, ఆ గాథలను పరామర్శింప జూచుట వ్యర్థ ప్రయత్నము. కాని ఆ గాథలను ప్రబంధీకరించిన ఆంధ్రకవులు మూలకథలలో ఏయే సంస్కారములు చేసి, తమ కావ్యములో వస్తు సన్నివేశమున అసంగతత్వము, అనౌచిత్యము తొలగించుకొనిరో నిరూపింపవలసి వచ్చినప్పుడు ఆ మూలకథలను తడవక తప్పదు. సంస్కృత హరివంశమునందలి వజ్రనాభవధ యనెడి ఈ కథలో పొడకట్టు అసంగతములను సంస్కరించుటలో సూరన చూపిన చాతురిని మరి యే ప్రబంధకర్తయు చూపలేదు. ఈ కథనే పండ్రెండవ శతాబ్దిని రవివర్మభూపుడను నొక రాజకవి ప్రద్యుమ్నాభ్యుదయము అను నొక సంస్కృత నాటకము రచించెను. సూరన ప్రబంధమునకు ఆ నాటకముగూడ మూలము కావచ్చును.

హరివంశ కథలో ప్రథమ సందేహపదము వజ్రనాభ వధకును, ప్రభావతీ ప్రద్యుమ్నుల వివాహమునకును కార్యకారణ సంబంధము లేక పోవుట; రెండవది గద సాంబులకు చంద్రవతీ గుణవతులతోడి వివాహము పూర్వ రాగ విహీనమై హఠాత్సంభవ మగుట; మూడవది శ్రీ కృష్ణుడంతటి రాజనీతి దురంధరుడు భద్రుడను తేలిక మానిసికి, ఉపధాశుద్ధుడు కానివానికి శత్రురాజ్యమును అస్తమింపజేయు తన కార్యతంత్రము నెరిగించి వానిభుజమున తత్కార్యసాధక భారము పెట్టుట.

ఈ కథను నాటకీ కరణ మొనర్చిన రవివర్మ తన రచనలో చేసిన ప్రధాన సంస్కారము శుచిముఖి పాత్రను తొలగించుట. తిర్యగ్జంతువు మానుష వ్యాపారము చేయుట రంగౌచిత్యమునకు భంగకరమని అతడు శుచిముఖిని తొలగించి, ఆ దౌత్యభారము భద్రనటుని మీద పెట్టెను. అట్లు చేయుటచే ప్రదర్శనానుకూల్యము జరిగిన మాట నిజమేకాని భద్రుడు శ్రీకృష్ణునకు మరింత ఆంతరంగికమంత్రి యైనాడు. అదిగాక, మగవాడు శృంగార వ్యాపారమున దౌత్యము చేయుటవలన ఇంకొక అనౌచిత్యము దొరలెను. కావున నాటకమున జరిగిన మార్పుముల్లు దీసి కొర్రడచినచంద మయ్యెను.

ఆ రెండు మూల గ్రంథములతో మన తెనుగు ప్రబంధమును పోల్చి చూచితిమేని సూరనార్యుడు ఆ యాలోపముల నెట్లు పవరించెనో, అసంగత భాగములను ఎట్లు గాఢ సంగతములుచేసెనో, అనుపపత్తికములకు ఎట్లు ఉపపత్తి కల్పించెనో విదితమగును. అది అద్భుతావహమైన కార్యము.

ప్రబంధ కల్పనను అనుసరించి వజ్రనాభుని వధకు ప్రభావతీ ప్రద్యుమ్నుల పరిణయము కారణము. 'ఆ దంపతులకు జనించిన పుత్రుడు వజ్రపురమును ఏలును' అని పరమేశ్వరి యాదేశము. 'దనుజవిరోధి పుత్రుడైన ప్రద్యుమ్నునకు వజ్రనాభుడు తనంత పుత్రికను ఒసంగడు. ప్రద్యుమ్నుడు ప్రభావతి పతి యగుటకు ఆ దానవునితో పోరు తప్పదు. వజ్రపురమును ప్రభావతి కొడు కేలుట ఆ దానవపతికి జయమైన పొసగదు అని కార్యకారణ యోగముతో రెండు ప్రధానాంశములను సంఘటించి, కవి వస్తు సన్నివేశమున వెలితిలేకుండ నిబంధించెను.

చంద్రవతీ గుణవతుల వివాహములోని ఆకస్మికతను పరిహరించుటకై ఆయన చేసిన కల్పన చిలుక రాయబారము. ప్రభావతికి ప్రద్యుమ్నునితోడి వివాహము పరమేశ్వరి యాదేశించినట్లే, చంద్రవతీ గుణవతులకు గద, సాంబులతోడి వివాహములు నారదు డాదేశించెను. అక్కపెండ్లికి హంస దౌత్యము నడుపుచుండ చెల్లెండ్ర పెండ్లికి చిలుక రాయబారము చేయుచుండెను. ఈ రెండు కార్యములును కుడి, యెడమలుగా మొదటినుండియు జరుగుచునే ఉన్నవి. మాతృనది పుట్టినచోటనే ఉపనదియు పుట్టినది. అవి సంగమించు ప్రదేశము తీర్థభూతమైనది. వేర్వేరు ముఖముల నడచుచున్న ఆ యక్క సెల్లెండ్ర వివాహ యత్నములు శుచిముఖి పోగునకు తగుల్పడి ఏక ముఖము లయ్యెను.

మరియు ఈ ప్రబంధమున భద్రనటునకు కార్యరంగ ప్రవేశమే లేదు. ఆ నటునకును, వటువులకును జరిగిన సంవాదమున శ్రీకృష్ణుడు వటువచనంబులు ఉపశ్రుతిగా చేకొని, ప్రద్యుమ్నుని భద్ర నట వ్యాజమున వజ్రపురమునకు సుకరముగా పంపవచ్చునని మనమున నిశ్చయించుకొనెను. అంతమాత్రమే భద్రుని నామమాత్ర ప్రయోజనము. ఇవి సూరన చేసిన ప్రధాన సంస్కారములు. మరి కొన్ని అప్రధానములును కలవుగాని, వానిని విడిచి ఈ కావ్యమునకు వన్నె తెచ్చిన ఆయన పాత్ర నిర్మాణ శక్తికి ఉత్తమోత్తమ నిదర్శనమైన శుచిముఖిని గూర్చి కొంత ప్రసంగింప దగును.

హరివంశమున ఈ శుచిముఖపాత్ర గలదుకాని ఆ హంసికి ఆ కథలో వ్యక్తిత్వమే లేదు. ఈ ప్రబంధమునందో కథ యంతయు శుచిముఖి ముఖముననే నడచెను. వజ్రనాభ వధోపాయము గానక తదన్వేషణ తత్పరులై యున్న ఇంద్ర కేశవులకు ఈ హంసీమతల్లి ఉపాయములు బోధించి గురుత్వము నెరపెను; వారి కార్యము సాధించిపెట్టి మంత్రిత్వము చేసెను; ప్రభావతీ ప్రద్యుమ్నుల పరస్పరానురాగ వర్ధనమునకు దూతియై, వారి గాంధర్వ వివాహమున పౌరోహిత్యము జరపెను.

శ్రీ కృష్ణుడు సతీ సమేతుడై వినోదించు సమయమున ఆతనిని చేరజని 'నీ కొక్కమాట దెల్ప నన్నమర విభుడు పనిచె' అని తన్నెరింగించుకొన్న శుచిముఖి దిట్టతనము అవరోధజనమునకే కాక వాసుదేవునకును అరుదయ్యెను. దాని వాక్యములు అతి నిపుణములే కాదు, మాధుర్యభరితములును. మాటనేర్పులేని బుద్ధికుశలత వ్యర్థము. సంస్కారపూతముగాని మాటనేర్పుగూడ వ్యర్థమే. సంస్కారపూతమయ్యు కటుత్వదూషితమగునేని అదియు వ్యర్థమే. బుద్ధికుశలతయు, సంస్కారపూతమగు వాక్కును, ఆ వాక్కు నుపయోగించు నేర్పును, తదనురూపమగు సుస్వరసంపన్నతయు ఒక్కచో కూడి యుండుట సృష్టికి అలంకారభూతము. శుచిముఖికి ఈ గుణసంపద సంపూర్ణముగా కలదు. ఆ హంసి పెదవి కదల్చిన సమ్మోహనాస్త్రమగుటకు ఈ గుణసంపదయే కారణము. అంతమాత్రమే కాదు. శుచిముఖి కాలు కదల్చినను, కన్ను త్రిప్పినను అమోఘాస్త్ర పాతములే యగును. ఈ పాత్రయొక్క ఆకారేంగితచేష్టాదు లన్నియు మహాప్రౌఢములును, అతి సుందరములును అని చూపుటకోయన సూరనార్యుడు దాని చేష్టల సొంపునుగూడ ఒక సందర్భమున వ్యక్తము చేసెను. అసలు ఈ శుచిముఖి పాత్ర నిర్మాణము కొరకే ప్రభావతీ ప్రద్యుమ్నము రచింపబడెనాయని తోచును. ఈ శుచిముఖికి ఎనయగు స్త్రీ పాత్ర మన వాఙ్మయమున లేదు.

అసలు సూరనవలె స్త్రీ ప్రకృతిని ఇంత కూలంకషముగ భావించి చూచిన తెలుగుకవి ఇంకొకరు కలరా యను ప్రశ్నకు వెంటనే సమాధానము చెప్పుట సుకరము గాదు. ఈ రెండు గ్రంథములలో సృజింపబడిన నానావిధ స్త్రీ పాత్రలు భిన్నభిన్న ప్రకృతులతో, భిన్నభిన్న మూర్తులతో ప్రాణవంతములై వెలుగొందుచుండుటయే కాక, విశ్వ ప్రవృత్తికివలె ఈ కావ్య ప్రవృత్తికిని స్త్రీ ప్రాణియే చోదకశక్తి యని నిరూపించుచుండును. స్త్రీ పాత్ర నిర్మాణములో ఈ కవికి సాటిరాగల తెలుగుకవి లేదు.

ఈయన సృష్టించిన స్త్రీ పాత్ర సమూహము నంతను సూక్ష్మముగా పరిశీలించినచో వానిలో కొన్ని ప్రేమ మూర్తులుగా, కొన్ని ప్రజ్ఞామూర్తులుగా స్థూలముగా వర్గీకరింప దగియుండును. కలభాషిణి, సుగాత్రి, మధురలాలస మొదటివర్గమునకు నిదర్శన పాత్రలు. సరస్వతి, అభినవ కౌముది, శుచిముఖి, రాగవల్లరి రెండవవర్గమునకు దృష్టాంతము. ఇట్లనుట ఆ ప్రేమమూర్తులు ప్రజ్ఞాశూన్యలని కాని, ఈ ప్రజ్ఞామూర్తులు ప్రేమశూన్యలని కాని నిర్ణయించుటకాదు. గుణప్రాధాన్యమునుబట్టి రెండు విభాగములు అని అంగీకరించుట. ప్రతియోగ ఘటనచే పాత్రల గుణస్వభావ తారతమ్యమును ప్రస్ఫుటమొనర్చుట కృతహస్తులైన మహాకవులు పాటించు కళాధర్మములలో నొకటి.

ఈయన రెండు కావ్యములలో ఇంచుమించు ప్రధాన పాత్రల కన్నింటికి ప్రతియోగ పాత్రలు కలవు. కలభాషిణికి రంభయు, మణికంధరునకు నలకూబరుడును, నారదునకు తుంబురుడును, అభినవ కౌముదికి మధురలాలసయు, శుచిముఖికి రాగవల్లరియు ప్రతియోగ సన్నివేశములైన పాత్రలు. ఈ జంటలలో ఒకటి రెండవదానిని అతిక్రమింప జూచుస్పర్ధ వాని తారతమ్యము ప్రస్ఫుటమొనర్చుటయే కాక కథా గమనమునకు వేగమును, బలమును చేకూర్చుచుండును. సూరన ఈ శిల్ప సూత్రమును పాత్ర చిత్రణము నందేకాక, రూప చిత్రణమునందును కొనియాడెను.

ఈ రెండు కావ్యములును పేరునకు మాత్రమే ప్రబంధములుగాని, రచనా విశేషముచే నాటకీయ లక్షణముల నన్నింటిని సంతరించుకొన్న మహాకావ్యములు. అందును ప్రభావతీ ప్రద్యుమ్నకథ ఉపక్రమణమునుండియు రంగమున ప్రదర్శింపబడు నాటకమువలెనే గోచరించుచుండును. ఆంధ్రప్రబంధ కర్తలలో ఒక్కొక్క కవి ఒక్కొక్కచో ఏదో కొంత నాటక వైఖరి చూపగల్గి యుండవచ్చును గాని సూరనవలె సమగ్ర నాటక పద్ధతిని రచన చేసిన కవి ఇంకొకడు లేడు. అందును పాత్రోచిత సంభాషణమునం దాయన అద్వితీయుడు.

నాటకీయ సంవాదాత్మకముగ నడచిన కావ్యముల నుండి శైలీ నిదర్శనముగా పద్యములను ఎత్తి చూపుట దుష్కరము. అట్టి నిదర్శనమే కావలసినచో ఆ సంవాదము నడచిన ప్రకరణ మంతయు ఉదాహరింపవలసి వచ్చును. అట్టి ప్రకరణోదాహరణము ప్రస్తుతము అనపేక్షణీయము.

**పిం. ల.**

**సూరన్న, వెన్నెలకంటి:** ఈతడు విష్ణుపురాణము నాంధ్రీకరించి రావూరి బసవ రెడ్డి కుమారుడు రాఘవ రెడ్డికి కృతి యిచ్చెను. నెల్లూరు మండలములోని గుడ్లూరికి రాఘవ రెడ్డి ప్రభువు. ఈతని శాసనములు క్రీ. శ. 1526 - 69 ప్రాంతములలో నెల్లూరు మండలమున గానబడుచున్నవి. రాఘవ రెడ్డి తండ్రి బసవ రెడ్డి ఉదయగిరి రాజ్యమును పరిపాలించుచు, కటకప్రభువులైన గజపతుల వలనను, విజయనగర ప్రభువులవలనను గౌరవ చిహ్నములు పడసెను. కృతిపతి రాఘవ రెడ్డి పంటరెడ్డి వంశోద్భవుడు. సూరన కవి క్రీ. శ. 16 వ శతాబ్దిలో నున్నట్లు తేలుచున్నది.

సూరన ఆపస్తంబ సూత్రుడు; హరిత సగోత్రుడు; అమరమంత్రి పుత్రుడు; సూరనార్యుని మనుమడు. చెరు

కూరి అమరమంత్రి పుత్రుడ నని యితడు చెప్పుకొన్నాడు. చెరుకూరు ఇతని నివాసగ్రామము కానోపును. ఎఱ్ఱాప్రెగడ నివాసస్థానము గుడ్లూరు. ఆయన యింటిపేరు చెదలువాడ. చెదలువాడ గ్రామము విష్ణుపురాణములో పేర్కొనబడినది. సూరన పూర్వులు ప్రోలయ వేమారెడ్డి, అనపోతారెడ్డి ప్రభువులవద్ద కవులుగా గౌరవము పొందినవారు. విక్రమార్కచరిత్ర కావ్యము రచించిన జక్కన కవి వెన్నెలకంటి సూరనార్యుని పేర్కొనెను.

సూరన పురాణయుగ కవులలోనివాడు. సంస్కృత పురాణముల నాంధ్రీకరించుట, మితవర్ణనము చేయుట, సరళశైలి మొదలగునవి పురాణయుగ లక్షణములు. ప్రౌఢశైలి, వర్ణన బాహుళ్యము, స్వతంత్ర కావ్యరచన ప్రబంధ యుగ చిహ్నములు. ధర్మప్రతిపాదకమైన విష్ణుపురాణము నితడు సుబోధక మగు సరళరీతిలో ఆంధ్రీకరించినాడు.

సంస్కృత పురాణములలో విష్ణుపురాణము ప్రాచీనమని వాడుక. పరాశర వ్యాసుడు తత్కర్త. ప్రారంభమున మైత్రేయుడు పరాశరుని కొన్నిప్రశ్నము లడుగును. మైత్రేయునకు సమాధానముగా పరాశరుడు విష్ణుపురాణము వివరించినాడు.

ఇందు ఏడు, ఎనిమిది ఆశ్వాసములలో శ్రీకృష్ణచరిత్ర వర్ణింపబడినది. కృష్ణుని చరిత్రము సహజముగా అద్భుతోక్తులు, అతిశయోక్తులు లేకుండ మనోహరముగా నున్నది. కృష్ణుని అవతారపురుషునిగా నెంచినను విష్ణుపురాణము మానవసహజములైన గుణములను గూడ చిత్రించినది. సత్రాజిత్తుతెచ్చిన శమంతకమణికై కృష్ణుడు బలరాముడును ఆశపడిరట. చివరలో కృష్ణనిర్యాణము కూడ చెప్పబడినది.

ఇందు కొన్ని శృంగారరస భరితములైన కథ లున్నను సూరన విశేషముగా వర్ణింపక, జుగుప్స కలుగనీయక, సభ్యతకు లోటు రానీయక ఔచిత్యమును పాటించి రచించినాడు. మారిషకథ, తారాశశాంకులకథ, ఉపానిరుద్ధులకథ సరసముగా నుండును.

విష్ణుపురాణములోని కథ లనేకము భాగవతములో ప్రవేశించినవి. వీనికిని, వానికిని కొంత భేదము గోచరించును. ధ్రువచరిత్రము, ప్రహ్లాదచరిత్రము సంగ్రహముగా కనబడును. పురాణమున ప్రహ్లాదుడు తన భక్తి ప్రభావముచే హిరణ్యకశిపుని విష్ణుభక్తునిగా చేసినట్లు కనబడుచున్నది. జడభరతోపాఖ్యానము, మాంధాతృ చరిత్రము మనోహరముగా రచింపబడినవి.

ఆముక్తమాల్యదలోని ఖాండిక్య, కేశిధ్వజ సంవాదమునకు మాతృక విష్ణుపురాణములోనిదే. ఈ పురాణమునందు విష్ణుని అవతార కథలు, ధర్మములు, వ్రతములు జ్యౌతిషము, వేదాంతము విస్తరింపబడినవి.

సూరన విష్ణుపురాణమును పూర్ణముగా నాంధ్రీకరింపక రసవంతములగు భాగములనే రమ్యముగా రచించినాడు; కమనీయము కాక, కావ్యపాకమున కందని శుష్కభాగములను ముట్టుకొనలేదు. ఈ కవి భావములలోను, భాషలోను, శైలిలోను, సారళ్యము జాలువారుచుండును. శుష్కవిషయములందును సారము సంక్రమింపజేయుశక్తి యీయనకు గలదు. శి. శం. స్వా.

**సూర్యనారాయణ, యడవల్లి** (క్రీ. శ. 1888 - 1939): వీరు సుప్రసిద్ధ ఆంధ్ర నటులు; వీరికి విద్యార్థిదశలో పదహారవయేటినుంచీ నాటకరంగ ప్రవేశము గలిగినది. వీ రానాటినుంచి ముప్పదిఅయిదు సంవత్సరములు నిర్విరామముగ నాటకనటన యందు కృషిచేసి ఎన్నికగల అనుభవము నార్జించిరి.

వీరి జన్మస్థానము ఆంధ్రరాష్ట్రమందలి గుంటూరు. వీరు ఒకపాటి ఆగర్భ శ్రీమంతులు; పూర్వాచార పరాయణులైన పండిత వంశములోని వారయ్యు ఉన్నత పాఠశాలలలో జదివి ఆంగ్లేయ భాషలో మెట్రిక్యులేషన్ పరీక్షయందు తీర్ణులైనారు; అవసరమైనంతవరకు సంస్కృతాంధ్ర కావ్య పరిచయముకూడ కలిగించుకొన్నారు. మంచి ఆరోగ్యము, అనుభవము, అవయవాకర్షణ, ఠీవి, గాంభీర్యము ఏకమై వీరి మహారాజ పాత్రము రంగస్థలమున కొకయంద మలవరిచినది.


చిత్రము 317.
యడవల్లి సూర్యనారాయణ

వీరి నాటకరంగ విహార మెంత యుదాత్తమో వీరి బాహ్య జీవితరంగ మంత ఉత్తమమైనది. అది సాటి నటలోకమున కాదర్శప్రాయమైనది; అంతేకాదు, అనుకరణ యోగ్యమై గౌరవానందకరముగూడ నైనది.

వీరు సంగీత ప్రియులు. వీరి గానకళారస పిపాస భారతవర్షమందలి ప్రసిద్ధగాయకుల గానసభలకు సయితము వీరిని నడిపించి, వారి శ్రావ్యాలాపన విధానములను గొన్నింటి నలవర్చుకొనునట్లు చేసినది.

వీరు మంచి సరసులు; సాహిత్య ప్రియులు; వ్యంగ్య భావ వాక్చతురులు. వీరి సహజ నాటక శక్తికి నిత్య

సాధనాసక్తిగూడ ఎంతో తోడ్పడి, నాటకరంగమందు వీరి నొక ఉత్తమ నాయక నటునిగ సమర్థించినది. పద్య గద్య పఠనమందు వీరి కొకప్రత్యేకత యున్నది. పద్య గద్యముల లోని ఎంతటి సమాసములనైనను చక్కగా విడమర్చి వీరు చదువగలరు; నాటక సమాజమును గౌరవ ప్రదముగా నడిపింపగల దక్షులు; నాటక ప్రయోగ విధానమందు కూడ ప్రసిద్ధిగన్న దర్శకులు.

బాల్యదశయందు గుంటూరు విద్యార్థి సంఘమందును, ప్రౌఢ యౌవనదశలందు బెజవాడలోని మైలవరము బాల భారతీ నాటక సమాజమందును, అతరువాత ఏలూరులో సీతారామాంజనేయ నాటక సమాజమందును నాయక పాత్రములను ధరించి ఆంధ్రదేశ మంతయు పర్యటించి ప్రదర్శనముల నిచ్చి విఖ్యాత నట కీర్తి నార్జించిరి.

వీరు 'సావిత్రి' యందు సత్యవంతుడుగాను, 'పాదుక' యందు శ్రీరాముడుగాను, 'శాకుంతల'మందు దుష్యం తుడుగాను, 'సారంగధర' యందు సారంగధరుడుగాను, 'గయోపాఖ్యాన'మందు అర్జునుడుగాను, 'చిత్రనళీయ' మందు నల బాహుకులుగాను, 'వేణీసంహారము', 'ద్రౌపదీ వస్త్రాపహరణము', 'పాండవోద్యోగవిజయము' లందు దుర్యోధనుడుగాను నటించి ప్రసిద్ధికెక్కిరి. స్థా. న. రా.

**సూర్యనారాయణతీర్థులు, పురాణం** (క్రీ. శ. 1876 - 1946): ఆంధ్రదేశమున సుప్రసిద్ధులగు తెనుగు పండితులలో వీ రొకరు. వీరు విశాఖపట్టణంజిల్లా గవరవరం గ్రామవాసులు, వెలనాటి శాఖీయులు. కౌండిన్య సగో త్రులు. వీరి తండ్రి రామస్వామి, తల్లి మంగమ్మ.

వీరు బాల్యములో గవరవరమందు దువ్వూరి సత్య నారాయణశాస్త్రిగారి యొద్ద కావ్యము లభ్యసించిరి; తరువాత విజయనగరము చేరి రుద్రాభట్ల రామశాస్త్రి గారియొద్ద సాహిత్య గ్రంథములను, పేరి కాశినాథశాస్త్రి గారియొద్దను, తాతా సుబ్బరాయశాస్త్రిగారియొద్దను భాష్యాంతము వ్యాకరణమును బఠించిరి; అష్టాదశ పురా ణములందును అసమానమగు విజ్ఞతను గడించి కాశిలో కావ్యతీర్థ, పురాణతీర్థ యను బిరుదముల నందిరి.

వీరు మద్రాసు చేరి 1906లో కామేశ్వరి యను పత్రికను వెలువరించిరి; 1916 లో ఆంధ్ర చంద్రికా గ్రంథమాలను నెలకొల్పి 'లావణ్యమయి' మున్నగు గ్రంథములను బ్రక టించిరి; వావిళ్ళవారి ముద్రణాలయమున పండితులై యుండి యనేక ప్రాచీనాంధ్ర గ్రంథములను బరిష్కరిం చిరి; అటుపై కొంతకాలము ఆంధ్రపత్రికా కార్యాలయ మున పండితులుగా పనిచేసిరి. వీరు రత్నకవి బిరుదాం కితులు; రసికావతంసులు; చక్కని పాండిత్యముతోపాటు సమయస్ఫూర్తియు గలవారు; కొంతకాలము శ్రీ తిరుపతి వేంకటకవుల వెంటనుండి వారి యవధానముల గాంచి కొంత యనుభవము గడించి తాముసు అవధానములు కొన్ని గావించిరి. కా. జో. శ.

**సూర్యనారాయణమూర్తినాయుడు, కొమ్మిరెడ్డి** (క్రీ. శ. 1873 - 1953): వీరు యానాంలో జన్మించారు. వీరి తండ్రి నరసింగరావుగారు యానాం గ్రామమునుండి కాకినాడ వచ్చి 'లేనారస్' అనే పాశ్చాత్య వ్యాపారస్తు నితో భాగస్వామిగా చేరి విదేశ వ్యాపారం చేశారు. అతడు తన మేనల్లుడు ఇనిస్ అనేవానిని వ్యాపారంలో దింపి, అతనిపేరున 'ఇనిస్' కంపెనీ పెట్టాడు. 1895 లో నరసింగరావుగారు మరణించిన తర్వాత సూర్యనారాయణ మూర్తిగారు ఇనిస్ కంపెనీకి భాగస్వామి అయి దానిని వారు జీవించినంతకాలము వృద్ధిలోకి తీసికొనివచ్చారు.

నరసింగరావుగారికి ఫ్రెంచి, ఇంగ్లీషు, తెలుగు, సంస్కృత భాషలలో మంచి ప్రవేశం ఉంది. ఇదిగాక ఆయుర్వేదం, జ్యోతిషం, మంత్రశాస్త్రం, సంగీతం అంటే అభిమానం. వారినుండి ఈ యభిరుచులన్నీ వీరు అల వరచుకొనిరి. సంవత్సరా నికి రు. 5000ల రాబడి వచ్చే వ్యాపారాన్ని వీరు తమ చాకచక్యంవల్ల అంతకు నూరు రెట్లు రాబడి వచ్చేటట్టుఅభివృద్ధి చేశారు; యాభై అరవై సంవత్సరాలు నిరాఘా టంగా వర్తకం సాగించి 2000 ఎకరాలకు పైగా భూవసతి సంపాదించి ఎన్నో కంపెనీలు, ఫ్యాక్టరీలు మొదలయినవి స్థాపించారు.



చిత్రము 318. కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి నాయుడు

వీరు కాకినాడ పురపాలక సంఘానికి వరుసగా నాలుగు సారులు అధ్యక్షులై, పదమూడేండ్లు ఆ పదవి నిర్వహిం చారు. కాకినాడ అందమైన నగరంగా రూపొంది అన్ని పౌర సౌకర్యాలు పొందగల్గడానికి వీరు కారకులని చెప్పక తప్పదు. వీరు పురపాలక సంఘాధ్యక్షులుగా ఉన్న కాలము లోనే (1923 లో) కాకినాడలో జాతీయ కాంగ్రెసు మహా సభ జరిగింది. వీరు కాకినాడలోని అన్నదాన సమాజం, అనాథ శరణాలయం, కళాశాల పాలక సంఘం, ఆంధ్ర సాహిత్య పరిషత్తు గ్రంథాలయము, సరస్వతీగానసభ మొదలయిన ఎన్నో సంస్థల నభివృద్ధి చేసినారు.

1916 లో మద్రాసు శాసనసభకు వీరు పరిశ్రమల ప్రతినిధి సభ్యులుగా నియమింపబడిరి. వీరు 1920 నుండి 1926 వరకు మద్రాసు లెజిస్లేటివు కౌన్సిలు సభ్యులుగా పని చేశారు; ఇంగ్లీషు చేంబరు ఆఫ్ కామర్సులో సభ్యులు. 1928 లో ఆంధ్ర చేంబర్ ఆఫ్ కామర్సు స్థాపించినపుడు దానికి వీరు ప్రథమ అధ్యక్షులు.

వీరు చేసిన దేశసేవ గుర్తించి ప్రభుత్వం వీరికి రావు బహద్దర్, దివాన్ బహద్దర్ బిరుదు లిచ్చి గౌరవించింది. వీరు అజాత శత్రువు; ఆశ్రితజన పక్షపాతి; ఆనాటి మహనీయు లందరికి తలలోని నాలుక. ఎంతోమంది పేద లకు, విద్యార్థులకు వీరు గుప్తదానాలు చేశారు, ముఖ్యంగా బలిజ జాతివారికి కల్పతరువనే బిరుదం పొందారు. వీరు మంచిస్ఫురద్రూపి; మితభాషి; సాధువు; వైష్ణవభక్తులు. ఆయుర్వేదమంటే వీరికి అభిమానం. ఎంతో విలువగల మందులు వండించి, అడిగినవారికి ఉచితంగా ఇచ్చేవారు.

సంగీతపోషణకోసం తమ జీవితం అంకితం చేసినవారిలో అగ్రగణ్యులు వీరు. యాభై అరవై సంవత్సరాల క్రితం కాకినాడలో సరస్వతీగానసభ పెట్టి దసరాలో శారద నవరాత్రులకు గానసభలు జరిపి, ప్రసిద్ధులయిన దక్షిణాది గాయకులను రప్పించి వారిచేత కచ్చేరీలు చేయించేవారు. పుష్పవనం అయ్యరు, రామ్నాడు శ్రీనివాసయ్యంగారు, కోనేరి రాజపురం వైద్యనాథయ్యరు, తిరుక్కొడకావల్ కృష్ణయ్యరు, నైనాపిళ్లె, గోవిందస్వామిపిళ్ళె, అలహ నంబిపిళ్ళె, దక్షిణామూర్తిపిళ్లె, ఘటం సుందరయ్యరు మున్నగు మహావిద్వాంసు లందరు సరస్వతీ గానసభా వేదికపైన గానం చేసి సన్మానాలు పొందినవారే. సరస్వతీ గానసభలకు రజతోత్సవం జరిగినపుడు 1930 లో వీరు గోవిందస్వామి పిళ్ళెకు సువర్ణ ఘంటాకంకణ మిచ్చి బహూకరించారు; ఇటువంటి సన్మానం ఏటేటా ఒక విద్వాంసునికి చేసేవారు. అలాగ సన్మానం పొందినవారిలో అశ్వథాటి రామమూర్తి, ద్వారం వెంకటస్వామినాయుడు మున్నగు తెలుగువా రున్నారు. ప్రతియేడు ఆదిభట్ల నారాయణదాసుగారి హరికథతో సభలు ప్రారంభమయ్యేవి. పారుపల్లి రామ కృష్ణయ్యపంతులు, తుమురాడ సంగమేశ్వరశాస్త్రి, ద్వారం వెంకటస్వామినాయుడు, అశ్వథాటిరామమూర్తి, కోలంక వెంకటరాజు మొదలయిన తెనుగు సంగీత వాద్య విద్వాంసు లందరూ వీరి ఆదరణ, అభిమానము పొందిన వారే. వీరి ఇల్లు కళలకు ఆటపట్టు; విద్వాంసులకునిలయము.

వీరు చదివినది మెట్రిక్యులేషన్ వరకే కాని ఏ విద్యా వంతుడూ పొందలేని విజ్ఞానము సముపార్జించారు. వీరు జన్మించినది చిన్న బలిజకుటుంబములోనే. కాని మహా రాజులు పొందలేని ఐశ్వర్యములతో తులతూగి గొప్ప ఖ్యాతి సంపాదించారు.

వీరిది నిండుజీవితం; సదా ఆనందమయమైనది. సహస్రమాస జీవియై వీరు ఆంధ్రరాష్ట్రసిద్ధి చూచి భౌతిక శరీరం చాలించారు. యం. స. నా.

**సూర్యారావు, క్రొత్తపల్లి :** పిఠికాపుర సంస్థానము లోని చెందుర్తి గ్రామము వీరి జన్మస్థానము. ఎనమండు గురు అన్నదమ్ములలో వీరు ఆరవవారు. వీరి యన్నగా రగు లచ్చన్నగారి దాశరథివిలాసము మేలితరమైన యాంధ్ర ప్రబంధము. వీరు తమ యూరి సావడి బడిలో తెనుగు నేర్చిరి; పదునారేండ్లు వచ్చువరకు చెందుర్తిలో అన్నలకడనే పురాణముల సారమును గ్రోలిరి. తరువాత వీరు రాజయోగి పత్రికా ముద్రణ కార్యాలయమున జేరిరి. ఇట వీరు ముద్రాక్షర సంకలనము, ముద్రిత పత్ర పరిశీల నము మున్నగు ముద్రణ కార్యముల నలవరచుకొని పత్రికా నిర్వహణమున నారితేరిరి; దీనితోపాటు ముద్రణాలయ స్థాపకులగు శ్రీ గురజాడ రామమూర్తిగారివద్ద నాంధ్ర ప్రబంధములను జక్కగ జదివి యాకళించుకొనిరి. 1885 లో రాజయోగి కార్యాలయము మూత పడిన పిదప వీరి యోగ్యతను విని పోలవరము జమీన్‌దారులు కొచ్చెర్ల కోట వెంకటకృష్ణారావు బహద్దరువారు వీరిని తమ సరస్వతీ ముద్రణాలయ మునకు పిలిపించుకొనిరి. అట వీరు చిలకమర్తి లక్ష్మీనరసింహముగారికి సహాయ కార్యదర్శిగా బనిచేయుచు వారివద్దనే కవనమల్లుటను నేర్చు కొనిరి; ఆస్థాన పండితు లగు దివాకర్ల తిరుపతి శాస్త్రిగారి సహవాస మున సంస్కృత సాహిత్య మున గడతేరిరి; క్రమముగా కవన, వ్యాసరచనల చాల వన్నెకెక్కిరి.



చిత్రము 319.
క్రొత్తపల్లి సూర్యారావు

వీరు పోలవరము జమీన్‌దారువారి తోడ్పాటుతో గ్రంథ ముల నెన్నిటినో ప్రచురించిరి; సరస్వతీ పత్రికాలయమున పదునేడేండ్లు సాహిత్య సేవా కార్యదీక్షల వెళ్లబుచ్చిరి. 1911 లో ఆంధ్ర సాహిత్య పరిషత్తు స్థాపితమైనప్పుడు వీ రా కార్యస్థానమున చేరి పరిషత్కార్య వ్యవస్థాపకులుగా

పంద్రెండేండ్లు పనిచేసిరి. పిదప పరిషత్తు మద్రాసునుండి కాకినాడకు మారినపుడు వీరు కూడ అచటికి వెళ్లి యావన్మరణము నచటనే యుండిరి. ఆంధ్ర సాహిత్య పరిషద్భాండాగారములో నున్న ఐదు వేల తాళపత్ర గ్రంథముల కొక రూప మున్నదన్న నది వీరి నిరంతర కృషి ఫలితమే. వీరు ఎన్నియో యమూల్య తాళపత్ర మాతృకలకు కాగితములపై ప్రతులు వ్రాసి భద్రపరచిరి. ప్రాచీన పురాణ కావ్యములలోని యెన్నియో యపూర్వ ప్రయోగములు వీరెత్తి సేకరించిరి.

వీరు బహుభాషా వేత్తలు. సంస్కృతాంధ్రములు నరేసరి. అవి వీరి కిల్లరికములు; ఆంగ్లము, అరవము, కన్నడము, హిందీ, మహారాష్ట్రము, ఉరుదు భాషలలో వీరికి ప్రవేశమున్నది. అన్నిటికంటె వినయము వీరి విద్య కలంకారము. వీరు ముప్పది తొమ్మిది గ్రంథముల రచించిరి. అందు ఇరువదొక్క గ్రంథములు ముద్రితములు. పదునెనిమిది యముద్రితములు. వ. చ. రా.

**సోమన, నాచన :** నాచన సోమన ప్రతిష్ఠ ఉత్తర హరివంశ మన్న యొక్క గ్రంథముమీద నిలిచియున్నది. ఆ ప్రతిష్ఠ చాల గొప్పది. ఈ గ్రంథము చిన్నది. కొందరీయనను కవిత్రయముతో సమానుడని చెప్పుదురు. మరి కొందరు తిక్కనగారికంటె గొప్పవాడని యందురు. ఈ కవి తన గద్యలో నిట్లు వ్రాసికొనెను : 'శ్రీమ దుభయ కవిమిత్ర కొమ్మనామాత్య పుత్ర బుధారాధన విరాజి తిక్కన సోమయాజి ప్రణీతంబైన శ్రీ మహాభారత కథానంతరమున శ్రీ మత్సకల భాషాభూషణ సాహిత్య రస పోషణ సంవిధాన చక్రవర్తి సంపూర్ణకీర్తి నవీనగుణసనాథ నాచన సోమనాథ ప్రణీతంబైన యుత్తర హరివంశంబు నందు' నని. ఈ గద్యలో కంఠోక్తిగా తిక్కన్నగారియందు గౌరవము కలదు. మరియు నాయనయొక్క కవితా శక్తులను గూర్చిన బిరుదులు గలవు. ఈ బిరుదులలో మూడు ప్రధానమైనవి. ఒకటి సాహిత్య రసపోషణ, రెండు సంవిధాన చక్రవర్తి, మూడు నవీన గుణసనాథ. ఈ బిరుదులకు తగిన రచనా సౌభాగ్యము తాను తన గ్రంథమునందు చూపి యుండవలయును.

తొలుత నీయన తిక్కనవలెనే తన కావ్యము హరిహర నాథున కంకితము చేసెను. ఇదికూడ తిక్కనగారియందు గల గౌరవమునే వెల్లడించుచున్నది.

ఈ కావ్యములో క్రొత్త విషయ మేమనగా గ్రంథమున కవతారిక లేదు. సామాన్యముగా నందరు కవులును తామేసందర్భములందు తమ కావ్యములను ప్రారంభించిరో, యది భగవదాదేశమో రాజాదేశమో చెప్పి తమ కవితాతిశయము రా జుగ్గడించినట్లో, తమంతట తాము చెప్పినట్లో వ్రాయుదురు. కొందరు తమ వంశమునుగూర్చి కూడ వ్రాయుదురు. ఈ యుత్తర హరివంశమున నట్టివేవియు లేవు. ఈ కారణముచేత గొంద రుత్తర హరివంశము సంపూర్ణమైన కావ్యము కాదనియు, కొంత యుత్పన్నమైన దనియు తలచుట కలదు. కావ్యములో కొంత నష్టమైన దనుటకు నవతారిక లేకపోవుటయే కారణముగా చెప్పవలయును. కాని మరియొక కారణము కనుపించుట లేదు. కావ్యాది కావ్యాదిగానే కనుపించుచున్నది. ఈ కావ్యాది యాశ్వాసాదిగా కూడ కానవచ్చును. కాని కొంత వివేకించి చూచినచో రచనాపద్ధతి చేత కావ్యారంభత గోచరింపక మానదు. ఈ యవతారిక లేకపోవుటకు గద్యలో నీయన చెప్పికొనిన సంపూర్ణకీర్తి యన్న తన బిరుదము కారణమేమో; ఆయన తాను బ్రదికిన రోజులలో గొప్ప కీర్తిశాలియై సకలభాషా భూషణు డగుటవలన నంద రెరిగినవాడై యుండవలయును. అపుడు తన వంశముకాని, తన్నుగూర్చిన యితర విషయములనుగాని వ్రాసికొనుట యప్రస్తుత మని విడిచి యుండనోపు. సంస్కృత కవులలో తరచుగా నందరును తమ వంశాది వర్ణనములు, నాత్మ ప్రశంసలు చేసికోనివారే; అట్లే కావ్యములోని గుణగ్రామమువలన కావ్యము నిలువ వలయునన్న యహంకారము కానోపు.

ఈ కావ్యములో కొంత భాగ ముత్పన్నము కాలేదనుటకు వేరొక ప్రబల కారణము కలదు. కవి తన కావ్యమును వ్రాయునపుడు ప్రధానముగా చూడవలసినది యధికరణ చతుష్టయము. వానిలో మిక్కిలి ప్రధానమైనది కావ్య ప్రయోజనము. కావ్య మెందుకు వ్రాయుచున్నాడు, ఏ మహా ప్రయోజనము నర్థించి కవి తన కావ్యమునందు ప్రవర్తించుచున్నాడు - ఈ విషయము మిగుల ముఖ్యము. సామాన్యముగా నందరు కవుల కావ్యములయందు నీ ప్రయోజన మస్తినాస్తి విచికిత్సా హేతువుగా నుండును. ఒక నాయకునియొక్క ప్రాశస్త్యము వర్ణించబడిన కావ్యమును కవి తన శక్తిచేత రసపేశలముగా జేయవచ్చును. అది కావ్యముయొక్క మహా ప్రయోజనము కానేరదు. ఏదో యొక ప్రయోజనము కాకపోనేరదు. రామాయణ మహాగ్రంథమున వేదధర్మము మూర్తిమంతమైన శ్రీరామచంద్రుని గుణగణాదివర్ణనము చేయుట కావ్యముయొక్క పరమ ప్రయోజనము. అట్లే వ్యాసకృత మహాభారతమునకూడ వేదాత్మతయే పరమ ప్రయోజనము. కావ్యమునం దిట్టి మహా ప్రయోజనము మహాకవులయందు మహాకవియైనవాడు కాని తీర్చి దిద్దు

కొనడు. నాచన సోమన్న తన కావ్యమునం దిట్టి మహా ప్రయోజనమును నిర్ణయించి వ్రాసికొనెను. ఈ యుత్తర హరివంశములో మొదటి కథ నరకాసుర కథ. రెండవ కథ తన కుమారుడు చనిపోగా నొక బ్రాహ్మణుడు శ్రీకృష్ణుని తన కుమారుని బ్రతికించుమని యడిగిన కథ. మూడవది శ్రీకృష్ణుడు సంతానార్థము శివునికొరకు తపస్సు చేయబోవుచుండగా దారిలో నిద్దరు పిశాచములు కలసికొనిన కథ. ఇవి మొదటి రెండాశ్వాసములలోని కథలు. మూడు నాలుగాశ్వాసములలో పౌండ్రక వాసుదేవ, హంస డిభకాదుల వధలు; పంచమ షష్ఠాశ్వాసముల యందు బాణాసుర కథ — ఇవి యైదు కథలు. మొదటి మూడు కథలు మొదటి రెండాశ్వాసములయందే యిమిడి యున్నవి. తక్కినవానికొరకు నాల్గాశ్వాసములు వ్రాసెను. ఈ కథలు వ్రాయుటలో నాచన సోమన్న తన కావ్యమున కొక మహాప్రయోజన మభిలషించెను. ఇట్టిదానికి ప్రబంధ ధ్వని యని పేరు. ఈ ప్రబంధ ధ్వని విషయము మహోత్తాలమైన కొలది ప్రధానముగా కవి మహాకవి యగుచున్నాడు. ఈ యైదు కథలలోని రహస్యము విచారించినచో నుత్తర హరివంశ కావ్యముయొక్క మహా ప్రబంధ ధ్వని యేదియో తెలియగలదు.

'త్వష్టకు నుదాహరకుఁ జతుర్దశి యనంగ
నొక్క కూఁతురు గలిగిన నుక్కు వెఱిగి
గంధ గజ రూపమునను నక్కన్యఁ దెచ్చి
కవసి నరకాసురుండు సౌఖ్యములఁ దేలె.'

త్వష్ట ప్రజాపతికి నుదాహరకు చతుర్దశి యను కూతురు కలిగెనట. శ్రీకృష్ణదేవుడు నరకాసురుని వధించినది చతుర్దశినాడు. అతని భార్య చతుర్దశి. దీని సంబంధ మేమి? నరకుడు భూదేవి కొడుకు; విష్ణువు పోత్రియై భూమిని ప్రళయ సముద్రమునుండి సముద్ధరించినపుడు పుట్టినవాడని యైతిహ్యము. పురాణ కథలు గర్భిత మహార్థములు. అతడు కట్టిన ప్రాగ్జ్యోతిషము జ్యోతిస్సునకు ప్రాగ్భాగమున నున్నదని యర్థము. ఈ కథప్రకారము నరకుడు పుట్టిన కాలమునకు, శ్రీకృష్ణునిచేత వధింపబడిన కాలమునకు నడుమ నూట తొంబదియైదుకోట్ల సంవత్సరము లుజ్జాయింపుగా గడిచి యుండును. సృష్టి ప్రారంభించిన దప్పుడు. శ్రీకృష్ణుడు నరకుని వధించినది మొన్నటి ద్వాపరాంతమున, ననగా నైదువేల యేండ్ల క్రింద. ఇన్ని కోట్ల సంవత్సరము లీ నరకు డేమైనాడు? ఈ నరకు డెవడు? అతనిని చతుర్దశినాడే వధించుట యేమి? అతని భార్య పేరు చతుర్దశియే యగుటయేల? ఇట్టి ప్రశ్నలకు సమాధాన మొకరీతిగా కుదురవచ్చును. ప్రళయ సముద్రము నుండి ధాత్రి సముద్ధరింపబడినపుడు భూమిలోనుండి యొక పెద్ద మట్టిపెళ్ళ యొకయల్పగ్రహ పరిమాణము కలది విడిలిపోయి యంతరిక్ష ప్రదేశము దాటిపోయి యుండవచ్చును. అంతరిక్ష మనగా వాయువు వ్యాపించియున్నంత మేరలోని యాకాశము. ఈ మట్టిపెళ్ళ సూర్య మండలమునకు ప్రాగ్దిశగా మింటిలోనికి పోయి పూర్తిగా నంతరిక్షమును దాటిపోక, భూమిచేత నాకర్షింపనుబడక యన్ని కోట్ల సంవత్సరము లూగాడుచుండి యది గగనమున నున్న స్వర్గలోకసన్నికర్ష కలుగుచుండి విడివడి ద్వాపరాంతమున భూగోళముతోడి సన్నికర్ష పొందుటకు రాబోవుచుండెను. కొన్ని యాకాశమునందలి గోళములు పట్టు తప్పి పడిపోవుట కలదుకదా! ఈ నరకు డట్టి గోళము. ఇదియు మట్టిపెళ్ళ యగుటచేత నంతరిక్ష మార్గమున వ్యాపించినచో భూమితోడి సంఘర్షణము మిక్కిలి యుత్పాత హేతువగును. ఈ యుత్పాతము నివారించగలవా డెవడు? శ్రీకృష్ణదేవు డొక్కడే. ఆయనయే సాక్షాద్విష్ణుమూర్తి; అండపిండ బ్రహ్మాండముల కధినేత. ఆయన ప్రాగ్జ్యోతిషమున కరిగి యా మట్టిపెళ్ళను చిద్రుపలు చిద్రుపలుగా జేసెను. ప్రాగ్జ్యోతిషమున కరుగుట యనగా నాకాశయానమున నంతరిక్షములోనికి పోవుట. ఈ కథ ఖగోళజ్ఞులు విచారింపవలయును.

మరి రెండవ కథ మృతులయిన బ్రాహ్మణ బాలకులను బ్రతికించుట. కృష్ణు డేక దిన దీక్షితుడయి యుండగా విప్రుడు వచ్చి యర్థించెను. అర్జునుడు మృత్యువును శిక్షింతునని పోయి సమర్థుడు కాక తిరిగివచ్చెను. మరునాడు కృష్ణార్జునులు రథముమీద బయలుదేరిరి. మేరువు వర్షాచలమును దాటి సముద్రుడు మార్గ మీయగా నడచి బహు పర్వతము లతిక్రమించి యచ్చట 'నత్యంత భయంకర కర్దమ సంతమసంబున' రథంబు పోనిచ్చెను. ఆ చీకటి దాటినతరువాత నద్భుతాకారుడైన పురుషు డొకడు తోచెను. కృష్ణు డా తేజము లోనికి పోయెను. బ్రాహ్మణుని చనిపోయిన నలుగురు కొడుకులను దెచ్చెను. పోవుట కొక పూట పట్టినది. 'వచ్చితిమి క్షణమ్మున ద్వారవతికి మేము.' క్షణములో దిరిగి వచ్చిరి. అప్పు డర్జునుడు మహాద్భుత చిత్తుడై యీ యాశ్చర్య మేమి యని శ్రీకృష్ణు నడిగెను. ఇది కృష్ణుడు చెప్పిన సమాధానము: ఆ తేజోమయమైన రూపము శ్రీకృష్ణదేవునియొక్క ప్రకృతియందు జరాచరంబు భాసించు నొక చెరువు. దారిలో నున్న యంధతమసము పరమేశ్వరుడు. భేదకుడును తానే. సర్వంబు నుచిత గమ్యము. ఇది రహస్యము. ప్రణవము తన మూర్తి. 'అత్యంత నియతమతికి తప్ప నీ మంత్ర మొరులకు

తగదు తెలుప'. దీనివలన నేమి తెలిసినది? ఇది యోగ మూలము. యోగీశ్వరేశ్వరుడైన శ్రీకృష్ణదేవుడే చేయ గలడు. ఇది ప్రణవ విద్యోపాసకులకు మాత్రమే తెలియ గలదనుటచేత నీ రహస్య మంతయు ప్రణవములో నున్న దని యర్థము గదా! ప్రణవముయొక్క రహస్య మేమి? ప్రణవ మక్షరము. ఓమ్మయము. అనక్షరమైనది పరమే శ్వర స్వరూపము. అశబ్దము సశబ్దము సంధి ఓంకా రము. ఓంకార పరిజ్ఞానముచేత నశబ్దమైనదానిని తెలిసి కొనవచ్చును. నిర్వికారమై నిర్గుణమైన పరమేశ్వర భావము సవికారమై సగుణమైన లోకముగా మారినది. ఈ మారుట యొక ద్వారమున జరిగినది. ఆ ద్వారము పేరే యోంకారము. ఉపనిషత్తులలోకూడ ప్రణవోపాసన ముత్తమోత్తమముగా ప్రథమమునందే చెప్పబడును. తదు పాసన బ్రహ్మభూతుడు చేయదగినది. కృష్ణదేవున కీ ద్వారము సుపరిచితము. దానిద్వారా వెళ్ళి బ్రాహ్మణ బాలకుల దెచ్చెను. 'వచ్చితిమి క్షణమ్మున ద్వారవతికి మేము' అన్న మాటలో, సర్వమ్మును నుచిత గమ్యము నన్న మాటలో నవికారమైన పరమేశ్వర భావము సవికారమైన సృష్టి — వీనిలో నొకదానినుండి మరియొక దానికి యాతాయాతక్రియ యెట్టిదో నిరూపింపబడినది. భగవంతుడుకూడ మానుషాకృతి వహించినచో నచటికి పోవుటకు ప్రయత్నము కావలయును. తిరిగి వచ్చుట చాల తేలిక. యోగానుసంధానము చేయుటకు ప్రయత్నము కావలయును. యోగి సమాధిలోనికి పోవుటకు ప్రయత్నము చేయవలయును. సమాధిస్థితుడైన యోగి కింద్రియజ్ఞానము కలుగుట లిప్తమాత్రములో జరుగును. ఇది రెండవ కథ.

మూడవకథ శ్రీకృష్ణుడు పుత్రార్థియై శివుని కొరకు తపస్సు చేయుటకై వెడలుట. విష్ణువుయొక్క కుమా రుడు మన్మథుడు. ఆ మన్మథుని శివుడు నేత్రాగ్ని చేత దహించెను. తనకు మరల కొడుకు కావలయుననగా శివునియొక్క యనుమతి సంపాదించవలయు ననుట లోక మర్యాదగా కనిపించుచున్నది. తాను శివుడును మిత్రులు. అతనితో చెప్పియే యీ పని చేసినచో బాగుండునన్న ట్లున్నది. అన్నట్లు సామాన్యముగా కనిపించుచున్నది. ఈ కథలో శివకేశవు లిద్దరు సమావేశ పడిరి. ఈయన తన కావ్యమును హరిహరనాథున కంకితము చేసినవాడు; హరి హరులయొక్క తత్త్వ మెరిగినవాడు కావలయును. ఐదారాశ్వాసములలో బాణాసుర కథ వ్రాసెను. తత్క థాంతమున శివునకును కృష్ణునకును యుద్ధము జరుగును. అచ్చటకూడ శివ కేశవులయొక్క తత్త్వము యొక్క స్వరూపము ఇది యిట్టిదని నిర్ణయించు చున్నట్లుగా వ్రాసెను. దీని నట్లుంచి శివుని కొరకు తపస్సుచేయబోవు దారిలో శ్రీకృష్ణునకు నిద్దరు పిశాచములు కన్పించిరి. వారిద్దరును వికృతవేషులు. వారు మాంసమును తిని దాని రుచి హరికి సమర్పితమయ్యెనని తలంచిరి. వారు శ్రీకృష్ణు నితో చమత్కారముగా మాటాడిరి. అందులో పెద్దవాడు ఘంటాకర్ణుడు. అతనికి శ్రీకృష్ణుడు మహేంద్రపదవి నిచ్చెను.

నరకాసురుని కథచేత శ్రీకృష్ణుడు సర్వఖగోళ సర్వ గ్రహాధికారియై యనంతాకాశము నందలి గోళ సంచార మునకు తానే యధిపతియగుట నిరూపింప బడినది. రెండవ కథయందు శ్రీకృష్ణుడు తాను పరమాత్మయై మృత్యు వున కధిపతియని నిరూపింపబడినది. ప్రణవ స్వరూపము శ్రీకృష్ణుడే యని నిరూపింపబడినది. ఈ పిశాచ కథయందు దేవేంద్రాది పదవు లిచ్చు మహాధికారి శ్రీకృష్ణుడని నిరూ పింపబడినది. మూడు, నాలుగాశ్వాసములలోని పౌండ్రక వాసుదేవాది దైత్యమథనము దుష్టశిక్షకుడని నిరూపింప బడినది. పంచమ షష్ఠాశ్వాసములలోని బాణాసుర కథలో శివతత్త్వముకంటె విష్ణుతత్త్వ మధికమని నిరూపింపబడి నది. మాయావిహితమైన లోకప్రవర్తనయందు లోకపా లనయందు శివకేశవుల తత్త్వములకు సమాన ప్రతిపత్తి యున్నను పరమేశ్వర భావమైన యాత్మలక్షణమున విష్ణుతత్త్వ మధికమని నిరూపింపబడినది.

ఈ రీతిగా నాచన సోమన తన కావ్యమునందు పంచ కథలే తీసుకొని వ్రాసెను. ఐదు కథలయందు శ్రీకృష్ణ దేవుడు సాక్షాద్విష్ణువని, విష్ణువు పరమదైవమని నిరూపిం చెను. సర్వఖగోళమునకు మాయకు దేవేంద్రాది పదవీ దానమునకు దుష్టశిక్షణమునకు సూక్ష్మతః శివతత్త్వాధిక్య మునకు నధినేతయైన శ్రీకృష్ణునియందు సర్వోత్కృష్టత నిరూపింపబడి యీ కావ్యము విష్ణుపారమ్య బోధకమైన కావ్యముగా భాసించుచున్నది. హరివంశముగాని భార తముగాని యింత విష్ణుపారమ్య బోధకములు కాకపో వచ్చును. వానియం దీదృష్టి లేదు. ఈయుత్తర హరివంశము నందు నాచన సోమనయే తత్పంచమహాకార్యనిర్ణాయ కములైన కథలే తీసికొని వ్రాయుట విష్ణుపారమ్య బోధకత్వము తన కావ్యమునందలి మహాప్రబంధ ధ్వనిగా నిరూపించుట నుద్దేశించినాడని స్పష్ట మగుచున్నది. అట్టి యుద్దేశమే, యా యుద్దేశ్యమును కార్యరూపముగ ధ్వని తము చేయుటయే మహాకవియొక్క—మహాకవి లక్షణము.

ఈయన తాను సాహిత్యరసపోషణుడనని, సంవిధాన చక్రవర్తినని చెప్పికొనినాడు. ఈయన సంవిధాన చక్రవర్తిత్వ మెటువంటిదో ఈ ఘట్టమువలన తెలియగలదు. నరకుడు స్వర్గమును జయించి యూర్వశిమీది కోరికతో నామెను

పిలువనంపెను. ఆమె తప్పించుకొనుటకు వీలులేక నరకుని సభకు వచ్చెను. ఆమె భయముతోనే వచ్చెను. ఆమె కన్నులయందు కలికిచూపులు లేవు. చిగురు మోవియందు చిరునగవులేదు. ఈ రెండు లక్షణము లామె మనస్సులోని భయమును తెలుపుచున్నవి. ఆమెను చూచినంతనే నరకుడు ఆమెను స్పృశించ వలయునన్న కోరిక చూపించెను. ఆ సంగతి యూర్వశికి తెలిసెను. తాను సిగ్గుపడెను. ఆమె సభలో నొక స్తంభము నానుకొని కదలక మెదలక బొమ్మవలె నిలుచుండెను. నరకు డామెతో నిట్లనెను:

'దిగధిపతులు నాకు భయపడి పారిపోయిరి. పొత్తుల దానవు నీవేల తొలగితివి. ఇంత స్వర్గరాజ్యము గెలిచిన నాకు నీవు కనిపించక పోయినచో సుఖముండునా? నా గెలిచిన గెలుపంతయు నీది.'

అనగా నామె చింతాక్రాంతయై యొక్కింత తెలిసి వానితో 'చతురవచో విలాస గుణసాగర.... యొకనా డయిన న్నను గారవించితే' అన్నది. ఆమె తనయందు ప్రేమతో నరకుడు పిలిపించినా డనుకొనలేదు. తనయందు నరకునకు ప్రేమ యసంబద్ధమని యామె యూహ. అతని యం దామెకు కోరికయే లేదు. లేదు సరికదా; వాడన్నచో జుగుప్స కూడ కలదు. తాను నిస్సహాయురాలు. తన కప్పుడు కోపము వచ్చినచో లాభములేదు. అందుచేత సిగ్గు నభినయించినది. సహజమైన స్త్రీ లక్షణము కూడ నదియే కదా! అతని యీ యొత్తిడినుండి తానెట్లు తప్పించుకొనవలయునో, తానెట్లు బయట పడవలయునో యామె విచారించ నారంభించినది. అతడు తన కోరిక వెళ్లబెట్టినాడు. అప్పు డామె చింతాక్రాంతయైనది. వట్టి చింతవలన ప్రయోజన మేమియున్నది? అతడే మాటలు ప్రారంభించినాడు. ఆ ప్రసంగము పెంచి వానిని మోసము చేయవలెను. ఇది యామె యెత్తుగడ. ఆమె యతనిని చతురవచోవిలాస గుణసాగర యని సంబోధించినది. ఈ సంబోధనచేత తన మాట నేర్పు దేవతాంగన మెచ్చుకొనినదని వాడు మోహపడుట కొరకై. ఆతలి వాడు మంచి నేర్పుగా మాటలాడుననగా వాడు సంతోషించును. అందులో స్త్రీ యన్నచో పురుషు డెక్కువ సంతోషించును. ఏ స్త్రీని తాను కామించుచున్నాడో యా స్త్రీ తన వాక్చాతుర్యమును మెచ్చుకొన్నచో పురుషుడు తన కోర్కి సఫలమైనట్లే భావించును. 'సరే నీవు నన్ను కోరుట నా భాగ్యమే కాని పూర్వమెప్పుడైన ఒకనాడైన వచ్చి గౌరవించినావా' యనెను. నరకునివాక్య మిది ప్రత్యాఖ్యానము చేయుట, తన ప్రేమలేమి చెప్పుట. కాని కాముకున కది తెలియదు కద!

ఈ ప్రసంగము పెంచి నాచన సోమన యె ట్లూర్వశి వానిని మోసపుచ్చినదో పరమమైన గడుసుదనముతో వ్రాసినాడు. అపుడు నరకు డి ట్లనెను: నీవు నిందించుట చేతనైనదానవు కనుక నిందించుచున్నావు. కాని నేను మిండరికపు చేతకై స్వర్గమునకు వత్తునా? వచ్చినచో నాపద కలుగదా? — ఇది నరకుని సమాధానము. నరకుడు మాటాడినకొలది తనజు ట్టూర్వశి కందించు చున్నాడు. మిండరికమ్ము చేతకై యని వా డనిన వెంటనే నరకునియొక్క ప్రేమ తగ్గిపోయినది. ప్రేమభావము పోయి జారభావ మేర్పడినది. మొదట 'నా సభన్ నీ కనుదోయి వెన్నెలలు నిండక కోర్కులు నాకు నిండునే' యనెను. 'నీ లోగిట చేర్పనే యుభయలోక సుఖమ్ములు నన్ను పొందినన్' అన్నాడు. ఆ మాటలకు మిండరిక మన్న మాటలకు సంబంధము లేదు. మరియు తానొక్కడు వచ్చినచో తన కాపద యనినాడు. ఇది తన శౌర్యమును తక్కువచేయు మాట; తన సాహసమును భంగపరచు మాట; తన ప్రేమ తక్కువజాతి దని చెప్పెడు మాట. నరకు డిట్లు మాటాడినంతనే యూర్వశి మొగము వికసించినది. ఆమె పూర్ణ చంద్రముఖ యైనది. అదివరకు దిగులుతో నున్నది. నాచన సోమన్న పూర్వమునం దామెకు వేసిన విశేషణములచేత పూర్ణచంద్రముఖ కీ యర్థము వచ్చుచున్నది. మొదట నజ్జోటి దిట్ట గావున నన్నాడు. రెండవసారి యక్కాంత చింతాక్రాంతయై యన్నాడు. ఇచ్చట పూర్ణచంద్రముఖ యన్నాడు. ఈ మాటతో నరకుడు తన చేతిలో చిక్కినాడు. ఆమె యింక తన గడుసుదనము చూప నారంభించినది. 'సరే నీ కటువంటి యనుమాన మున్నచో నిన్నిచ్చటికి రమ్మనుట కుదురదు. ఒకనాడైన నన్నచ్చటికి పిలిపించరాదా? ఆ మాత్రము చనవు నాకు చెల్లదా?' యన్నది. వాక్యానుపాతముగా 'నీవు వచ్చుటకు వీలు లేనిచో సరే! నన్ను పిలిపించరాదా?' యని చెప్పవలయును. కాని 'నిన్ను రమ్మనుట పొసంగద'నుట యేమి? ఈ మాటలో నా గడుసుదన మంతయు నున్నది. తాను మాటకు మాట చెప్పుట వట్టి వాదనకోసము చేయుచున్నదే కాని వాని యందు తనకు ప్రేమ లేదనుట తెల్లము చేయుచున్నది. ఈ రహస్యము వాగ్వాద నైపుణ్య మెరిగినవారికి దెలియును. ఈ వాక్యము ఖండించుటకు నొకానొక వాక్యము ననువదించుట వంటిది. ఈ మాటలోని యర్థము కప్పిపుచ్చుటకు నా కింత చనవు చెల్లదా యనినది. నాయందు నీ వింత చనవు తీసికోలేవా యని యర్థము. ఇదివర కామెను ఎరుగనే యెరుగడు. ఈ చన వన్నమాట వాడుట

యతని కోరికకు మూల విఘాతముగ నున్నది. చన వన్నది పరిచయమున్నతరువాత నెరవునది. ప్రేమ లేని కాలమునందు పరిచయముకూడ లేనప్పుడు చనవు నెరవుమనుట వెక్కిరించుట. దీని కతడు సమాధానము చెప్పెను. 'పగవాడట దేవేంద్రుడు....యిట్టి లంజమాటలు గలవే' యన్నాడు. తాను చేసిన యాక్షేపణ నరకునకు తెలియలేదు. అతడు సునిశితమైనబుద్ధి కలవాడు కాడు. పూర్వము ప్రకటించిన కోరికలోని సౌకుమార్యము పోయినది. మిండరికమ్ము సేత యని వాడినప్పుడే వాడు లోకువైనాడు. ఇప్పుడు లంజమాట లనినవెంటనే వాని బెట్టే పోయినది. ఇంక వానిని ప్రతారించుట యెట్లని విచారించుటయే మిగిలినది. వానిని తాను ప్రేమించకపోయినను వానికి తనయందున్నదన్న జాలికూడ పోయినది. తాను లంజ. వానియందు మెత్తగా ప్రవర్తించవలసిన యవసరము లేదు. వాడు కాముకుడు; వానిని మోసము చేయుట తేలిక. 'అనుటయు నచ్చెలువ విచారించి', 'నేను లంజనే. నేను విన్నట్లుగా నీ వింద్రుని గెలిచి నన్ను చెరపట్టి తెమ్మని వినోదము చేసితివి. కాని మనసంతయు చెడియుండగా వట్టి శరీరముతో సుఖమేమి? చిలుక పోగా పంజర మేమి చేయును? సంగమములో రసభంగము మెచ్చుదురా?' యన్నది. నేను విన్నట్లుగా నీ వింద్రుని గెలిచితి వనుటలో నీ వింద్రుని గెలిచెడునంత బలశాలివి కావని వ్యంగ్యము. మనసు చెడియున్న దెవరికి? తనకా నరకునికా? చిల్కపోయిన పంజరము తన శరీరమైనచో. నరకునియందు తన కేమియు ప్రేమలేదని చెప్పుటయే కదా! అంత నూర్వశి నరకుని యాజకులు యజ్ఞభాగ భ్రాజిష్ణుని జేసిరేని వానిని పొందుదు ననెను. ఈ సన్నివేశ మిట్లు కల్పించి ప్రసంగ ధారా నైపుణిచేత యొక సన్నివేశమును సమర్థించుట యాశ్చర్యకరమైన విషయము. యజ్ఞభాగము పొందినగాని నరకుని తాను పొందదు. ఈ వంకతో వాడు ఋషులను బాధించినగాని కృష్ణుని చేతిలో వానికి చావు రాదు. తన్ను ప్రేమించుచున్న వానిని తాను మోసము చేయరాదు. వాని ప్రేమ జారలక్షణము కాని ప్రేమ కాదని వాని నోటివెంటనే రావలయును. లంజయైనను నీవు లంజయని యన్నచో కోపము వచ్చును. ఇట్టి మాటనేర్పుమీద, మానవ ప్రకృతిమీద, గడుసుదనముమీద నీ సంవిధాన సౌధమును నాచన సోమన నిర్మించినాడు. ఇంత గడుసుగా సంవిధాన నిర్వహణము చేసిన తెలుగు కవులు లేనేలేరని చెప్పవచ్చును. నన్నయ్యగారొండు రెండుచోట్ల చేసెను. పెద్దన్నగారు చేసిరి.

రెండవది సాహిత్య రసపోషణ యన్న బిరుదు. సాహిత్యరసమని యొకటి లేదు. కావ్యమునందు రసముండును. అందుచేత సాహిత్యముయొక్కయు, రసముయొక్కయు పోషణచేయువాడని చెప్పుకొనవలయును. రసపోషణ సర్వకవులు చేయుదురు. చేయుటలో శక్తి తారతమ్యములు భాసించుచుండును. ఇతడు రసపోషణ చేసెడు పద్ధతి వేరు. ఇది చాల గడుసుగా నుండును.

'శూలి విలోకనానలము సోఁకు రతీశుఁ డెఱుంగుఁ గాన య
బ్బాలమనంబులో విరహ పావక దాహము నోర్చెనన్న న
ల్లేల పొసంగు దేహము దహించిన యంతటితో మనోజుఁడై
గాలియ చిక్కెఁ గానఁ జెడఁగాలఁడువో యెటువంటిమంటలన్'.

శివునియొక్క మంటలు మన్మథు డెరుగు గావున మన్మథు డామె మనసులోని విరహాగ్ని సహించెను అనుటకు వీలులేదు. అతని దేహము తగులబడినంతనే యతడు మనోజుడైపోయెను. తరువాత శివుని కంటి మంటలకు గాలి యావిరులు వెళ్లినవి. యడవి చెడినది. ఆ మన్మథు డెటువంటి మంటలకు కాలడు. ఇది ఉషాకన్యయొక్క విరహ వర్ణనము. ఆ విరహ మతిశయముగా నున్నదని వర్ణించుట. మన్మథుడు శివునికంట మండినప్పటికంటె నెక్కువ విరహాగ్ని సముద్భూతమైనదని యర్థము. ఇట్లొక భావమును లోకోత్తరముగా వర్ణించి కవి రసభావములను పరిపోషణమును చేయును. మరియు ;

'ఎసఁగు సంతాప భరమున నిట్టునట్టు
పొరలు శయ్యాతలమ్మున పువ్వుఁబోఁడి
తివురు విరహానలంబున దివ్వెలెత్తఁ
జిత్తజాతుండు వత్తి దాల్చిన విధమున'.

ఇదియు లోకోత్తరమైన యుత్ప్రేక్ష. అలంకారములందు లోకోత్తరత్వసంపాదనము, భావములయందు లోకోత్తరత్వ సంపాదనము రసభావములయొక్క వ్యంజకత్వము నుండి సమృద్ధిమత్త కలిగించుట.

మునులు నరకుని యాగడములు శ్రీకృష్ణునకు విన్నవించిరి. అంత

'అరుణాంభోరుహపత్ర నేత్రుఁడు సముద్యద్భ్రూకుటీ భంగ భా
సుర ఫాలస్థలుఁడుం జలాచలమనశ్శూలాయమాన వ్యథా
పరివేషానన భానుమండలుఁడునై ప్రత్యక్ష రౌద్రంబనన్
నరకాలంభవిజృంభణంబు నెఱపెన్ నారాయణుం డా కృతిన్'.

అప్పుడత్తాపసోత్తము లంబుజాక్షుని గొనియాడి వందన మాచరించిరి.

'ఇట్లు మ్రొక్కిన ముని యాదవేంద్ర సమితి
సంతసము నొంద నరకునిఁ జంపువాఁడ
నందఱును జూడ నని పంతమాడు హరికి
మఱియు మ్రొక్కుచు సంయము ల్మగిడి సనిరి'

నరకుని చంపుటకు యాదవుడైన కృష్ణుడు చాలడు. సాక్షాన్నారాయణుడే కావలెను, ఇది భూలోక సంబంధము

దాటిన వ్యవహారము కనుక. అప్పుడు శ్రీకృష్ణుడు - నారాయణుం డాకృతిన్ - ఆకృతిచేత నారాయణుడై నాడు; ఆననభానుమండలుడై నాడు. ఈ రీతిగా కృష్ణుడు కృష్ణుడుగా నుండి రౌద్రావేశ సంరంభమున సాక్షాన్నా రాయణు డయ్యెను. శ్రీ కృష్ణుడు తాను సాక్షాద్విష్ణు రూపమే పొందగా సభకంతకును విష్ణురూపమే భాసించెను. అందరు తన్మయత్వమే భజించిరి. అప్పుడందరును సంతో షింపగా పంతములాడెను; అనగా కృష్ణుడు మరల తన కృష్ణాకృతి నవలంబించెనన్నమాట. ఈ రీతిగా నిగూఢార్థ ములు పొసగి సాహిత్య పోషణ చేయును. నరకుని, బాణుని సంహరించుట సామాన్య రాజులను సంహరించుట వంటిదికాదు. నరకుని చంపుటకు మాహిష్మతీ ప్రాగ్జ్యోతిష ములకు పోవలయును. బాణుని చంపుటకు గిరివ్రజమునకు పోవలయును. ఈ పట్టణములు భూలోకమునకు సంబం ధించినవికావు. అందుకనియే కృష్ణుడు బాణుని మీదికి బోవబోయినపుడు నారదు డిట్లనెను.

'...అసుర యిచ్చటికిం బదు నాల్గువేల యో
జనముల నున్నవాఁ డరుగఁ జాలునె మానవలోకయానముల్
గరుడనిఁ దలఁపుము పగఱం
బొరిగొని కీర్తియును విజయముం గొనుము'

కనుక కవి ఈ గ్రంథమున శ్రీ కృష్ణుడు మహావిష్ణువనుట వ్యంగ్య భూతముగనే గాకుండ వాచ్యముగగూడ జెప్పి నాడు. తన గ్రంథము విష్ణుపారమ్య బోధకము. అందు చేత విష్ణు పారమ్య లక్షణము పౌనఃపున్యముతో గూడిన నిగరణముచేత గూడ జెప్పును. అట్లే చెప్పవలయును.

ఇతని సాహిత్యపోషణము, నవీనగుణ సనాథ లక్షణము రెండును చాలవరకు గలిసి యుండును. తొలుత శివకేశవ తత్త్వనిరూపణ మెట్టిదో నిరూపితము కావలయును. శ్రీకృష్ణుడు పుత్రార్థియై శివునికొరకు తపస్సుచేయగా శివుడు ప్రత్యక్షమయ్యెను. కృష్ణుడు శివుని స్తోత్రము చేసెను. తరువాత శివు డిట్టు లనియెను.

'ప్రమథులు సప్తమాతృకలు పార్వతియున్ మురవైరి తాపసో
త్తములు నుతింప నయ్యెడ సుధాకరఖండవతంసుఁ డిట్లనున్
దమతమలోనిచూడ్కిఁ దముఁబార కనుంగొను మాడ్కి నింతగా
లము నిను నీవ చూచితి తలంపున నీవును నేన కావునన్'.

'యదువంశాంబుధిచంద్ర నీమదిఁ గుమారాపేక్ష నాలో నెఱుం
గుదు నా కీచన వీఁ దలంచియ తపోఘోరక్రియ న్మెచ్చఁగాఁ
బిదపం జెప్పెడివాఁడవై తగుఁదగున్ బృందారక శ్రేణికిన్
హృదయాహ్లాదముగా మదీయమకుటం బెక్కె న్భవత్పాదముల్'.

నీవును నేన కావుటన్ అనుటలో నభేదప్రతిపత్తి; 'నా కీచన వీ తలంచియ' యనుటలో దనకన్న విష్ణు వధికుడని యొప్పుకొనుటయే. అంతియే కాదు. విష్ణ్వాధిక్యము వాచ్యములోనే యొప్పుకొన్నాడు. మరియు శివుడే కర ములు మోగిచి విష్ణువును కొనియాడెను. ద్వితీయాశ్వాస మున విష్ణువుయొక్క పరమోత్తమ దైవత్వ లక్షణములే చెప్పబడినవి. కారణము ప్రధానము సత్త్వరజస్తమో జాతము. మహదహంకారములు, పంచభూతములు, శబ్ద స్పర్శగంధరూపరసంబులు, ఇంద్రియములు, తద్వర్తనములు -వీని యన్నింటికి కృష్ణుడే మూలవస్తువు. కృష్ణుడు సాత్త్విక మున విష్ణువైనాడు, రాజసమున బ్రహ్మయైనాడు, తామస మున రుద్రుడైనాడు. ఆతడే విరాణ్మూర్తి. సర్వ వేదాంత వేద్యు డతడే. 'ఏకపదంబున బ్రహ్మయు నీ, శివదంబున నేనుఁ బరఁగి జన్మింపఁగ నీ, కుపగతము కేశవత్వము' అని నాడు. ఈ రీతిగా శివకేశవుల సమాగమంబునందుగూడ శివునికంటె విష్ణువే యధికుడు. ఈ విషయము బాణాసుర కథయందు మరియు వివరింపబడినది. రుద్రస్వరూప మేమో విష్ణుస్వరూపమేమో వివిచ్యమానముగా వేదార్థ సముపేత ముగా నిర్ణయింపబడినది. ప్రధానముగా సత్త్వరజస్తమో గుణములయందు విష్ణువు సత్త్వగుణము, బ్రహ్మ రజో గుణము, శివుడు తమోగుణము. రజస్తమోగుణముల కంటె సత్త్వగుణ మధికమైనది. రజస్తమోగుణములు లోకోత్పత్తి వినాశకములు. సత్త్వగుణము లోకమునం దభివ్యాపించి యుండియు లోకాతీతమైన మహావస్తువు. అందుచేత విష్ణ్వా ధిక్యము సునిరూపితము. మరియు రుద్రస్వరూపమును నిర్ణ యించుటలో నాచన సోమన యిట్లు తీర్మానించియున్నాడు. రుద్రుడు మహాగ్నిరూపుడు. వేదమునందు రుద్రు డగ్నిగా వర్ణింపబడెను. ఏకాదశరుద్రు లనగా నేకాదశ మహా గ్నులు. అందుకనియే బాణుని పురమైన గిరివ్రజము చుట్టును శివుడు రక్షించుచుండె ననగా పురారి యనుచ రాగ్నులు రక్షించుచున్నారనుట. వారు కల్మాష, కుసుమ, దహన, తృషిత, మహాబల, తపసులు, స్వధాకారాశ్ర యులు, స్వాహాకారాశ్రయులు కొందరు; జ్యోతిష్టోమ, హవిర్భాగములు రెండు మంటలు; అంగిరసు డను మహాగ్ని యొకడు. వీరందరు కృష్ణు నడ్డగించిరి. మరియు శివ, విష్ణుతత్త్వ విస్పష్ట విభేదము శివజ్వర, విష్ణుజ్వర వర్ణన ములచేత జరుగుచున్నది. ఈ బాణాసుర కథ తెలుగులో నాల్గుచోట్ల నున్నది. ఉత్తర హరివంశము, హరివంశము, భాగవతము, శివపురాణము. ఆంధ్రశివపురాణము ఆధుని కము. శివపురాణమునందు శైవజ్వరముముందు వైష్ణవ జ్వర మోడిపోయినట్లు వ్రాయబడినది. శివపురాణము శివపారమ్య బోధకమైన గ్రంథము. హరివం శోత్తరహరి వంశ భాగవతములు విష్ణుపారమ్య బోధకములు. అందు చేత వీనిలో విష్ణుజ్వరమే గెలుచును. శివజ్వరము వచ్చి

కృష్ణుని తాకెను. ఆ జ్వరుని చంపితి ననుకొన్నాడు కృష్ణుడు. వాడు కృష్ణుని హృదయములో ప్రవేశించెను. ఆ జ్వరము తనలో ప్రవేశించినంతనే —

'గడగడ వడఁకెడు మేనన్
నిడువెంద్రుక వెట్ట నెదురు నిదుర చలింపన్
మెడ మడఁచు నావులించుం
దడఁబడుఁ బడఁబోవు నిలుచు ధరఁ గూర్చుండున్'.

ఇది తమోగుణ లక్షణము. తమోగుణము తన్ను దాను మరచినపుడు సత్త్వగుణము నావరించును. కృష్ణుడు వైష్ణవ జ్వరమును ప్రయోగించెను. సత్త్వగుణ సనాథుడు సత్త్వగుణాను సంధానము చేసినచో తమోగుణము బహిర్గతమగును - యోగాగ్నిచేత నింద్రియ మోహము వాసినట్లు, ఆత్మానుసంధానముచేత మాయ వెలివడునట్లు. మరి యోగి మాయను దూరమునకు తోలుటకును, వైష్ణవ జ్వరము శైవజ్వరమును తోలుటకును భేద మేమి? యోగి మానవుడు, యోగాను సంధానము చేయువాడు. కృష్ణుడును శివుడును పరమేశ్వరులు. వారు యోగీశ్వరేశ్వరులై లోక ప్రవర్తన హేతువులుగా సత్త్వ, తమోగుణముల నాశ్రయించి యుందురు. ఇది సూక్ష్మభేదము. జీవుడు వ్యాపారాశ్రయుడు. ఈశ్వరుడు ఫలాశ్రయుడు. ఈశ్వరుడు ఫలదాత. అందుచేత జీవుల లక్షణములు గౌణముగా నీశ్వరు నాశ్రయించి యుండును. వారికి మూల భూతములైన సత్త్వ తమోగుణములతోడి సంబంధము. జీవులకు తద్వికారములతోడి సంబంధము.

తరువాత శివకేశవు లిద్దరికి యుద్ధము జరిగెను. శివుడు కొన్ని యస్త్రములను ప్రయోగించెను. వానిని కృష్ణుడు నివారించెను. మహాస్త్రము లన్నియు వితథములు కాగా శివుడు పాశుపతాస్త్రమును ప్రయోగించెను. కృష్ణుడు కూడ పాశుపతాస్త్రమును ప్రయోగించెను. కృష్ణుని వద్దకూడ పాశుపతాస్త్రమున్నదన్నమాట. ఆ రెండస్త్రము లొకదాని నొకటి గెలువలేకపోవుటచేత వారు వారే తమ తమ యస్త్రములను ఉపసంహరించుకొనిరి. అపుడు శివుడు త్రిపుర మథనాస్త్రము కృష్ణునిపై ప్రయోగించెను.

'ఔన్నత్య స్ఫుర దంశు దీప్తమగు నాయస్త్రంబు వీక్షించుచున్
వెన్నుం డాత్మఁ దలంచె నీ శరముచే విశ్వేశుఁ డుత్కోపుఁడై
తన్నుం జంపఁదలంచెనంచు మహితౌదార్యం బవార్యంబుగా
నున్నిద్రాబ్జదశాక్షుఁ డుండె సమరోద్యోగానవద్యాకృతిన్'.

ఆ త్రిపుర మథనాస్త్ర మేయగా గృష్ణుడు విశ్వేశుడుత్కోపుడై తన్ను జంపదలంచె ననుకొన్నాడు. ఇది యాశ్చర్యముగా నున్నది. అంతటి యుద్ధములో శివ కేశవుల చెలిమికి భంగములేదు. శివుని తాను నాశనము చేయడు. తన్ను శివుడు నాశనము చేయడు. త్రిపురమథనాస్త్ర ప్రయోగకాలమున శ్రీకృష్ణదేవుని కీ భయము కలిగినది. ఆ యస్త్ర మెట్టిది? దహనానిల విధుమాధవ మహస్సముద్భవము. అగ్ని, వాయువు, చంద్రుడు, వసంతుడు — వీరి యొక్క తేజస్సులనుండి పుట్టినది. మండించు నెగురదోలును మోహింపజేయును - ఈ లక్షణములు గలది. ఇది తమోగుణము యొక్క పరమ రహస్యము. సత్త్వగుణమును మూలముట్టుగా పెల్లగించును. అప్పుడు కృష్ణుడు జృంభణాస్త్రము నేసెను. జృంభణ మనగా నావులింత. జృంభణాస్త్రము వేయకమునుపు కృష్ణుడు మహితౌదార్యం బవార్యంబుగా నున్నిద్రాబ్జదళాక్షు డుండెను. అంతటి మహాతమోగుణము స్వయంవ్యక్తి భాసించిన సత్త్వగుణము నేమియు చేయలేదన్నమాట. జృంభణాస్త్రము ప్రయోగించినంత శివుడు ;

'తడబడుచు నొడలు నులుచుచు
వడిఁ దూఁగుచు నావులింత వచ్చిన సొలయున్
బుడివడుఁ గాళులు నిలువక
పడఁబోవుం బడగ కామపైఁ బడి యొఱఁగున్'.

తమోగుణమునకు నిదుర యెక్కువ. ఆవులింత లెక్కువ. శివుడు తమోగుణ ప్రధానుడైన యీశ్వరుడు కనుక యాయన యందలి తమోగుణమును కృష్ణుడు జృంభకాస్త్రము చేతను విజృంభింప జేసెను. తుట్టతుదకు శ్రీకృష్ణదేవుడు బాణాసురుని సంహరించుటకు సుదర్శనాయుధము ప్రయోగింపబోవుచుండగా శివుడు కృష్ణునిచేయి పట్టుకొని బాణుని రక్షించుమని కృష్ణునితో చెప్పెను.

'అనుడు మురాంతకుండు ప్రమథాధిప బాణ సురారి నీవు గాచిన క్రియ నేనుఁ గాచితిని......
....మీఁదటి ప్రధానవుఁ గార్యము దీర్ప నీ యనుజ్ఞను విలసిల్లఁబోయెద విశంకట సత్కరుణార్ద్రి శంకరా!'

అపుడు కృష్ణుడు నీవు వానిని రక్షించునట్లు నేను రక్షించితిని. దాని కింత చెప్పనక్కరలేదు. తరువాతి పని నీ యనుజ్ఞతో చేసెద ననినాడు.

ఇంతకు పూర్వము శివుడు జృంభకాస్త్ర ప్రయోగము చేత నోడి వెళ్ళి పోయినట్లేకదా? మరల శివుని యీ యాచనవేమిటి? కృష్ణుని యీ వినయమేమిటి? సృష్టిరహస్యమంతయు నిం దున్నది. సత్త్వగుణము యొక్క లోకస్థితి యట్టిది. తమోగుణముయొక్క లోకస్థితి యట్టిది - లోకము నేది పాలించుచున్నది? సత్త్వగుణము మూలవస్తువై లోకముయొక్క సుస్థితిని పాలించుచుండగా కామక్రోధాది సర్వమును తమోగుణము పాలించుచున్నది.

లోకము శివాజ్ఞ లేకుండ ప్రవర్తించదు. లోక ప్రవర్తన మున విష్ణువునకైనను శివాజ్ఞ యవసరము. విష్ణువు యొక్క యాధిక్యము తమోగుణముకంటె సత్త్వగుణ మధికమన్నమాట వరకే. లోకవర్తమానమున తమో గుణమే పాలించును. తమోగుణము లేనిచో లోకమే లేదు. కనుక లోకేశ్వరుడు శివుడు. సర్వమును విష్ణువు నుండి వినిర్గమించినది. నాచన సోమన్న యీ మహాసిద్ధాంత ప్రవర్తకుడు. వేదవేదాంగముల తాత్పర్యము నాచన సోమన యిట్లు నిర్ణయించుకొనెను. తరువాత బాణుడు శివుని ముందర నృత్యము చేయబొచ్చెను. శివతాండవ మనగా లోక నటనము.

సాహిత్యరసపోషణ మనగా సాహిత్యము యొక్కయు రసము యొక్కయు పోషణముగద. సాహిత్యమనగా నిది - సహితముల యొక్క భావము సాహిత్యము. సహిత మనగా హితమైన దానితో గూడుకొనినది. హితమనగా తత్కాలమునం దనిష్టమై యనంతరకాలమునం దిష్టాపత్తి హేతువు; అనగా పారలౌకిక విషయము. అందుచేత పార లౌకికవిషయ మనగా వేదవేదాంగముల యందలి మహార్థ ములు. తత్ప్రతిపాదకమైనది సాహిత్యము. అట్లైనచో నాచన సోమన్నకు సాహిత్యపోషణయన్న బిరుదము మహార్థవంతము. కొందరు సాహిత్య శబ్దమున కింకొక రీతిగా నర్థము చెప్పుదురు. సహితముల యొక్క భావము సాహిత్యమని యొప్పుకొని, సహితములనగా కూడుకొని యున్నవని సమూహార్థము చెప్పి వేనితో కూడుకొని యున్నవి యన్న ప్రశ్న పుట్టినపుడు సర్వశాస్త్రార్థములతో, సర్వకళలతో నని యందురు. అట్లైనను నాచనసోమన్న సాహిత్యపోషణు డనుటకు లోపములేదు.

ఈ కావ్యమునందు లోకజ్ఞత్వము సమృద్ధిగా నున్నది. లోకోక్తులు సమృద్ధిగా నున్నవి. ఇన్ని లోకోక్తులు సంత రించినకవి తెలుగుభాషలో మరియొకడు లేడనవచ్చును.

కావ్యమునందు రసదృష్టి వేరు; కథాదృష్టివేరు. ఒక్కటే కథ వ్రాయు కావ్యమున రసదృష్టి ప్రధానముగా నుండును. బహు కథలు వ్రాయుకావ్యమున కథాదృష్టి యెక్కువగా నుండును. ఈ కథాదృష్టితో వ్రాయు కావ్య మున వస్తుగతశిల్ప మధికము. వీనియందు కూడ రసాధా నము లేకున్నచో కావ్యమునకు శోభలేదు. ఏకవస్తు కావ్య మునకు, బహుకథా కావ్యమునకు నీభేద మున్నది. రస సృష్టి చేయుటలో పలుమార్గము లున్నవి. శృంగారరసము తీసికొని విచారించినచో నాయికా నాయకులు, అనుభావ సంచారి సాత్త్వికములు—వీనియొక్క పరిపుష్ట స్వరూపము ప్రపంచించి రసాధానము చేయుట సుకరము. బహుకథలు వ్రాయునపుడు దీనిని చేయుట కష్టము. కాని రసము ఒక్క సంచారి భావముచేతనే, యొక అనుభావ విశేషముచేతనే వ్యంజితము కావచ్చును. నాచన సోమన్న తన బహుకథా కావ్యమున నీమార్గము నవలంబించినాడు. ఇది చాల కష్టమైనది. సంచారి సామర్థ్యముచేత విభావాదు లన్నియు పొడకట్టి రసస్ఫూర్తి కలుగవలయును. అన్నయైన హంసుడు యమునా జలంబుల మునిగి చనిపోగా డిభకుడు విలాపించెను.

'నా యెల్లి నీడన నరలోక మేలుదు
 నను లావు వజీతి పాలయ్యె నన్న
దేవేంద్రునకు నైనఁ దేటి చూడఁగరాని
 గౌరవోన్నతి నీటఁ గలసె నన్న
పార్వతీపతిచేతఁ బడసిన దివ్యాస్త్ర
 భూరి సంపద వెల్లిఁ బోయె నన్న
వలరాజునకునైన వర్ణింపఁగాఁ దగుఁ
 దను విలాసం బేటి గొనియె నన్న...'

ఇచట శోకరసము సంపూర్ణముగా మూర్తి కట్టినది. డిభకుడు తన యన్నగారి మరణమును జూచి తానును మరణించినవాడు. జలముల మునిగి చనిపోయిన యన్న వైభవము వజీతి పాలగుట, నీట గలయుట, వెల్లిగల యుట, ఏరుగొనుట మొదలగు జలపర్యాయక శబ్దముల ప్రయోగించి తాత్పర్యముచేత, పైయర్థము చూపించుచు చేసిన మెలకువచేత, నా యెల్లి నీడన యన్న శబ్దస్వారస్యము చేత శోకరసము మూర్తి కట్టినది.

శృంగార రసమును కూడ నిట్లే సంచారి భావముచేత ఉషాకన్యకయందు చిత్రముగా మూర్తి కట్టించును.

'కిసలయ పత్రికన్ మకరకేతన నూతన వార్త లన్నియుం
బొసఁగ లిఖించి యంద తలపూవులఁ దమ్మయు నాససేయు నా
కొనరు తెఱంగెఱింగి కుచకుంభములం బతి చాల్పు నన్ను నం
తనమున వ్రాసి యిచ్చినఁగదా చెలికత్తెల కేను మ్రొక్కుదున్'

ఇచ్చట శృంగారరస మట్లే మూర్తి కట్టుచున్నది. నాచన సోమన్న కవితలో క్లిష్టత యున్నది. ఆ క్లిష్టత్వములో నగ మాతని భావములు దలలోనికి తొందరగా బొందమి కారణము. ఇచట 'మకర కేతన నూతనవార్త లన్నియుం బొసఁగ లిఖించి' యనగా కలలో తనయు ననిరుద్ధునియు సమాగమ వృత్తాంతము చిత్రపట లిఖితమగుట. ఆ పరి స్థితిలో ననిరుద్ధుడు తన తలపూవులును తమ్మయు నాస చేసెను. దాని కుషాకన్య సిగ్గుపడి భర్త నెదురొమ్మున కత్తుకొనెను. దీనిని చిత్రపటమునందు వ్రాసి చెలులు తనకు చూపించనలయు ననుట. తలపూవులు తమ్మయు నాస చేయుట భర్తయొక్క సంభోగవాంఛా సూచనము, ఆమెయొక్క లజ్జ. ఇట్లొకపద్యముతో నేయేరస

మెందెందు, నేయే భావ మెందెందు మూర్తికట్టించ వలయునో తెలిసి సమృద్ధిగా తన్నిర్మాణ కౌశల మెరింగిన నెరజోదు నాచన సోమన్న.

ఇంక నితనియొక్క నవీన గుణ సనాథత్వము విచారించుటకు మొదలిడిన నీయన క్రీస్తుశకము 1344 లో నున్నట్లు తెలియుచున్నది. ఈయన ఎర్రన్న కర్వాచీను డనియే నిరూపితమగుచున్నది. శ్రీనాథాదులకంటె గొంచెము పూర్వుడు; అనగా ఆ నాటికి ప్రబంధకవులు పుట్టలేదు. భారత గ్రంథములు మూడు నున్నవి. కవిత్రయముయొక్క కవితా పరిశీలనము చేసి చూచినచో వారి పద్యరచనకు,నితని పద్య రచనకు గల భేదము సులభముగా తెలియగలదు. తరువాతి ప్రబంధ కవు లందరు సోమన్న మార్గము నవలంబించిరి. మరియు శ్రీనాథుడు నిస్సందేహముగా నితని మార్గము నవలంబించినవాడే యనవచ్చును. సీసపద్యము వ్రాయుటలో సోమన్న క్రొత్త త్రోవ త్రొక్కెను.

'ఉజ్జ్వాతలూగెడు నుదయాస్త గిరులతో
నాకాశలక్ష్మి కోలాట మాడ'

కోలాటమాడుట యను దేశిక్రీడా బోధక ధాతువు సీస చరణాంతమున వాడి యొక క్రొత్తదనము కలిగించును. ఇట్టి విచ్ఛిత్తి విశేషమే శ్రీనాథుని కవితయందు బహుధా కనిపించుచుండును.

'సుభట భుజోద్భట చ్ఛురికా ప్రభా భంగి
మండు వేసవితోడ మాటలాడ'

ఇదియు నటువంటిదే. 'వటితిపా లాయెనన్న', 'యేఱు గలిసెనన్న' మొదలైన పూర్వ పద్యములోని సీస చరణాంతములయందు నొక విలక్షణమయిన శబ్దముల కూర్చుచు నొక ప్రక్రమము సంధించి సీసపద్యమును మెరుగెక్కించుట యితని కవితా నవీన గుణములలో నొకటి. ఇతని బహు సీసపద్యము లిట్లుండును. కవిత్రయము సర్వథా భావ ప్రధానముగా దదనుకూల శబ్ద ప్రయోగము చేయుదురు కాని శబ్దమునందలి సొగసుచేత భావమునకు దీప్తి కలిగించు ప్రయత్నము చేయరు.

'ఉరము కౌస్తుభరత్న ముదయాద్రి తటమునఁ
పొడతెంచు కలువల బోటు బోటు
శిరము కిరీటమ్ము సురగిరి నెత్తాన
రాజిల్లు పగలింటి రాజురాజు...'

ఇది లాటానుప్రాస భ్రాంతి కలిగించు యమకము. ఇందు స్ఫురించు నర్థములోని చమత్కృతి తద్భ్రాంతితో కూడిన యమకమునుండే పుట్టుచున్నది. ఇదియు రచనలో నానాటి కొక్క క్రొత్తగుణము.

'నాదెస కామునమ్ములకు నాడుట వైశమ సిగ్గుచిత్తమున్ వాదులు పెట్టుకొన్నయవి' సిగ్గును-కోరికయు నొకదాని నొకటి యతిక్రమించుచున్నట్లున్నవని చెప్పుటకు 'వాదులు పెట్టు'కొన్నయవి యనుట. ఇది ఉక్తి వైచిత్ర్యము. సిగ్గును, కోరికయు భావములు. వానియందు పురుషత్వారోపణము చేసిన ట్లగుచున్నది.

'గెలిచినవాఁడు నేఁడు రణకేళిఁ బురందరుఁ దర్గజేంద్రమున్
వెలిచినవాఁడు దేవతల వెట్టికిఁ బట్టినవాఁడు ధూర్జటిన్
విలిచినవాడు భక్తిమయ విత్తమునన్ ధర నేకవీరుఁడై
నిలిచినవాఁడు శౌర్యమున నీ జనకుండు భయం బిదేటికే'.

మరియొక పద్యము.

కొలువగ నేర నిన్ను; పిలువగ నేర నిన్ను; విలువగ నేరనిన్ను; నిలువగదయ్య-పద్యముయొక్క నాల్గు చరణాదులు నిట్లు. ఒరసిరి, యరసిరి, బెరసిరి, నెఱసిరి-ఇవి పద్యచరణాదులు. ఎద్రిచిన, బద్రిచిన, విద్రుపగ, చిద్రుపలు-ఇట్టి సమాన రూపముగల శబ్దములు పద్య చరణాదుల యందు జొనుపుటచేత పద్యరచనయందొక క్రొత్త విచ్ఛిత్తి కలుగుచున్నది.

ఇతని లోకోక్తులు హృదయంగమములును, గడుసు పలుకుబళ్ళును:

'అంజెదవు గాక నను౯ జెం
తం జేఱఁగనీక యెంతఁ దరిగిన మిరియా
లుం జొన్నలు సరిపోవే'
'కనికని కొ త్తివ్వ రింటి కంబము నేసెన్'
'శిరసుండగ మోకాలను నేసలు వెట్టుట'
'కుమ్మరావమున రాగి ముంత లేరంగఁ గలవె'
'జీలుగు వెఱిగిన మాలెకుఁ గంబంబు కాదు'
'వరుగుతో దాగరయు నెండవలసినట్లు'
'తెఱఁగు మాలి తవుడు తిని చచ్చువానికి
విసము పెట్టువాఁడు వెఱ్ఱివాఁడు'
'దాగంబోయి తలారివానియెదుటం దాగంగ నీకేటికిన్'
'దువ్వఁ జూచి నక్క యొడలు గాల్చుకొన్న వడువున'
'అలిగి తన్నిన పఱుపుపయిం బడినయట్లు'

ఇట్టి లోకోక్తులు మరియు నెన్నో పరమౌచిత్య లక్షణ సంపాదిగా నీతడు ప్రయోగించును. మరియు నీతని గడుసుదనపు బలుకుబళ్ళు చాల క్రొత్తగా నుండును.

'బడుగులు మీరు చూడ హరిపాపటపై నడిదంబు వెట్టెదన్'
'అనుచుం బరిఘము వైచిన
దనుజాంతకుఁ డొడిసి పట్టి తనఘన హేతిన్
తునుకలుగ నఱికి నీ పొం
గిన పుడిసెఁడు పోయె ననుచు గేలి యొనర్చెన్'

వాని 'పొంగిన పుడిసెడుపోయె'నట. ఇంతకంటె గడుసుగా మాటాడుట యెట్లు!

'నిను రప్పింపఁగ మున్న వేగపడి పూనెన్ శార్ఙ్గ కౌమోదకీ
వనమాలాంబుజచక్ర భూమికలు గైవారంబు చేయించె నే
లిన నాగారుల చేత యాదవుల నోలింగూర్చి కూర్చుండఁగాఁ
బనిచెన్ కేశవుఁ డైంద్రజాలికు గతిం బ్రాంతయ్యె నీ కంతటన్'.

జనార్దనుడన్న బ్రాహ్మణుడైన తమసఖుని హంసడిభకులు తమ తండ్రి రాజసూయ యాగము సేయునని, కప్పముగా యాదవులు ఉప్పియవలయునని రాయబారము పంపించిరి. జనార్దనుడు శ్రీకృష్ణ భక్తుడు. అతడు వచ్చి శ్రీకృష్ణుని మహత్తు పొగడ మొదలిడెను. అప్పుడు జనార్దనునితో హంసుడన్న మాట లివి - 'బైరాగులు బిచ్చమునకు రాక ముందు చెరువునొడ్డున గూర్చుండి వేసము వేసికొనినట్లు శార్ఙ్గాదులు ధరించెనట కృష్ణుడు'. నాగారులన్న బహువచనము పరమనిందా వ్యంజకము. 'బ్రాంతయ్యె నీ కంతటన్' అన్నది లోకమునందలి యెంత ఆక్షేపాతిప్తి! తెలుగు కవులలో నింతటి గడుసుదనపు పలుకుపసకలవా డింకొకడు లేడు.

ఇతడు సీసపద్యములలో పలుచమత్కారములు చేయును.

'అభ్రంకషంబైన యాలపోతు నితండు
త్రుంచినాఁ డీతండు పెంచినాఁడు'

మొదలైన సీస పద్యములు. శివుడు కృష్ణు డేకత్ర స్థితులైనపుడు దేవతలు చేసిన వర్ణనగా వ్రాసి

'నేఁడు నాఁడును నాఁడును నేఁడు మనకుఁ
జూపఁ జెప్పంగఁ జెప్పంగఁ జూపఁ గలిగె'.

వృషభాసుర మర్దనము కృష్ణుడు చేసెను. ఇది నేడు. నందీశ్వరుని శివుడు పెంచెను. అది నాడు

'సాధుసమ్మతముగా సామజంబు నితండు
గాచినాఁ డీతండు ద్రోచినాఁడు'

కృష్ణుడు నాడు గజేంద్రమును రక్షించెను. శివుడు గజాసురుని శిక్షించెను. ఇది నేడు. గజేంద్ర రక్షణము ఉత్తమ మన్వంతరములో జరిగినది. కృష్ణుడు వృషభాసురుని చంపుట చూపవచ్చును. శివుడు నందిని పోషించుట చెప్పదగినది. ఇట్లే

'సారసమ్మున లేవ నీరసమ్మునఁ జావ
బద్మాసనుఁడు వీరి పాలఁగనియె'

మొదలైన పద్యముకూడ 'మనుపఁ జెరుపంగఁ జెరుపంగ మనుపనేర్తు' రన్న శబ్దముల యర్థములలో జొనిపినాడు. ఇట్టి చమత్కారములు గల పద్యము లనేకములు. ఇది యంతయు నితని పద్యరచనాగతమైన నవీనగుణ సనాథత్వము. కథాగతమైకూడ నీతని నవీన గుణసనాథత్వమున్నది. అది పరమ రహస్యభూతముగా నుండును.

రుక్మిణి తనకు పుత్రు నిమ్మని భర్తయైన భగవంతుని ప్రార్థించెను; వర మడిగెను. కొడుకు నిమ్మని భార్య భర్తను వరమడుగుట యేమి? 'పాద ప్రణామక్రియా ప్రారంభం బగు భక్తిఁ గుట్మలిత హస్తాంభోజయై' యడిగెను. ఇట్లు పుత్రార్థినియై స్త్రీ పురుషుని ప్రార్థించుట వేదకాల ధర్మము. శృంగారరసము రసచూడామణిగా స్త్రీ పురుష సంగమము కామ భావ మధురముగా మానవుడు తీర్చి దిద్దుకొననినాటి ధర్మము. తరువాత నీ రస విషయము పెరిగినది. ప్రేమ మాధుర్యము పెరిగినది. ఈ ప్రార్థనకు శ్రీకృష్ణు డిచ్చిన సమాధానము ప్రేమ మార్గమున నున్నది; రసమార్గమున నున్నది. సంభోగ శృంగార వ్యంజకముగా నున్నది.

'వనజదళాక్షి నీకు తగవా యిటులాడఁగ'
'తన వలచు కాంత యేపని
మనమునఁ దలఁచినను జేయు మగవానికి న
వ్వనిత బిగియారు కౌఁగిలి
దినదినమును మదనకామధేనువు కాదే!'

ఈ రీతిగా లక్ష్మీనారాయణులైన రుక్మిణీ కృష్ణుల యందు వేదకాలపు ధర్మమును, లీలామానుష మూర్తులైన వారియందు రసధర్మమును కలిపి చేయుట నాచనసోముని యొక్క నవీనగుణ సనాథ లక్షణమునకు శేఖరీభూతమైన విషయము. వి. స.

**సోమనాథరావు, ఆదిపూడి** (క్రీ. శ. 1867-1941): ఆధునికాంధ్ర రచయితలలో ఆదిపూడి సోమనాథరావుగా రొక ప్రత్యేక విశిష్టత గలవారు. వీరు పుట్టుకచే నార్వేల నియోగి శాఖకు చెందినవారు; శాండిల్య గోత్రులు; ప్రప్రథమమున ప్రాచీన వైదిక మతావలంబకులు - అనగా ఆర్యసమాజమతస్థులు; స్త్రీ పునర్వివాహ పక్షమువారు; ఆ పైని కొంత కాలము వెనుక బ్రాహ్మ మతము నవలంబించిరి; పీఠికాపుర సంస్థానమున చాలకాలము ఉద్యోగము నిర్వహించిన వారు. వీరికి సంస్కృతము, కన్నడము, హింది, తమిళము, బెంగాలి భాషల యందు మంచి పరిచయము కలదు. వీరు కవితా వ్యాసంగమున, గ్రంథ రచన యందు జీవిత కాలము గడిపిరి.



చిత్రము 320.
ఆదిపూడి సోమనాథరావు

మొట్ట మొదట తెలుగువారికి రవీంద్రుని రచనా ప్రతిభను తెలిపినవారు సోమనాథరావుగారే. తమిళ భాషా

సరస్వతికి కమనీయ భూషణమగు కంబరామాయణమును తొలుత నాంధ్రభాషలోని కనువదించినది వీరే. వీరి రచనలు: జపానుదేశ చరిత్ర, దయానంద సరస్వతి చరిత్ర, సత్యార్థ ప్రకాశిక (ఇది దయానంద స్వామి కృతము; ఆర్య సమాజ మతస్థుల కాధార గ్రంథము) వచనములు; ఆంధ్ర రఘువంశము, ఆంధ్రకుమార సంభవము, విజయేంద్ర విజయము, శ్రీకృష్ణదేవరాయ చరిత్ర, కేనోపనిషత్తు, కంబరామాయణము, రవీంద్రనాథుని గీతాంజలి, కిన్నరీవిజయము, బుధభూషణము — ఇవి పద్య కృతులు. శ్రీకృష్ణదేవరాయ చరిత్రము మునగాల జమీన్ దారుగారగు నాయని వెంకట రంగారావుగారి కంకిత మీయబడినది. ఇవికాక వీరు సర్వమాన్యశతకము, ప్రబోధ శతకము, లోకపావనశతకము, రామమోహన నాటకమునుగూడ రచించిరి. ని. వెం. రా.

**సోమనాథుడు, పాల్కురికి:** సోమనాథుని దేశకాలములు, కులగోత్రములు రమారమి ఒక అర్ధ శతాబ్ది నుండి పరిశోధకులకు చర్చావిషయములుగ నున్నవి - హాల్కురికియా? పాల్కురికియా? కన్నడదేశమా? తెలంగాణమా? పదుమూడవ శతాబ్దియా? పదునాలుగవ శతాబ్దియా? తిక్కనకు ముందా? వెనుకా? ఆరాధ్యుడా? జంగమమా? అని. ఈ చర్చలను పురస్కరించుకొని పలువురు పరిశోధకులు పెక్కు గ్రంథములను రచించిరి. ఆ గ్రంథములలో అంతరంగ సాక్ష్యములు, బహిరంగ సాక్ష్యములు క్రోడీకరింప బడినవి. కర్ణాటాంధ్ర దేశచరిత్రములు, వాఙ్మయ చరిత్రములు నవలోడింపబడినవి. పూర్వసిద్ధాంతములు నిరస్తములై, నూత్న సిద్ధాంతములు నెలకొల్పబడుచున్నవి. పరిశోధించినకొలది సాధన సామగ్రియు, సామగ్రి దొరకినకొలది పరిశోధనయు నవిరతముగ గొనసాగుచునే యున్నది. ఈ పరిశోధకులు రెండు తెగలు; చరిత్ర పరిశోధకులు, వాఙ్మయ పరిశోధకులు. చరిత్ర పరిశోధకు లనుటచే వాఙ్మయాధారమును విడుతురనిగాని, వాఙ్మయ పరిశోధకు లనుటచే శాసనాధారమును నిరసింతురనిగాని తలంప వలనుపడదు. చరిత్ర పరిశోధకులు సోమనాథుని పదునాలుగవ శతాబ్దిలోని వానినిగను, వాఙ్మయ పరిశోధకులు పదుమూడవశతాబ్దిలోని వానినిగను నిర్ణయించుచున్నారు. సోమనాథుని గ్రంథములు తెనుగునుండి కన్నడమునకు సంస్కృతమునకు అనువదింపబడియుండుటను, తెలంగాణములో పాలకుర్తి గ్రామముండుటను సోమనాథుని పేర్కొనిన యేకవియు 'హాల్కురికి' యని పేర్కొనకుండుటనుబట్టి సోమనాథునిది ఆంధ్రదేశమే యనియు, నతడు తెలంగాణమువాడనియును, జంగమ శబ్దము నాటికి జాతివాచకముగాకుండుటను అప్పటికి బ్రాహ్మణేతరుల కందుబాటులో లేని వేదవేదాంగ పారగత్వము సోమనాథుని కృతులలో ప్రవ్యక్తమగుచుండుటను బట్టి సోమనాథుడు బ్రాహ్మణుడేయనియును పలువురు పరిశోధకులు నిర్ణయించిరి.

శ్రీయుత కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు సోమనాథుని గ్రంథములను ప్రకటించునంతవరకును శైవేతర ప్రపంచమునకు సోమనాథుని ప్రసక్తి పట్టినట్లుతోచదు. వారు తొలుత ప్రకటించిన బసవపురాణము పరిశోధకుల దృష్టిని సోమనాథుని దెసకు మరల్చినది. అంతవరకు శైవులలోగూడ పఠన పాఠనాదులనుండి యంతర్హితములై పొనుగుపడియున్న సోమనాథుని లఘుకృతులు పెక్కులు పరిశోధకుల కృషి ఫలములుగ వెలువడినవి. సోమనాథుని దేశకాలాదిక చర్చ పరిశోధనయం దొకప్రధానశాఖయై వెలసినది. భాషాపరిశోధకులకు, వాఙ్మయపరిశోధకులకు, చరిత్రపరిశోధకులకు సోమనాథుని కృతులు కొన్ని దశాబ్దముల పరిశ్రమ కవకాశమిచ్చు పెన్నిధులవలె గోచరించినవి. 'జానుతెనుగు' యొక్క స్వరూపాన్వేషణము, నిఘంటువుల కెక్కని పెక్కుపదముల అర్థనిరూపణము, అందు సదృశేతర ద్రవిడభాషాపద సాదృశ్యానుసంధానము, శివకవి వ్యవహారైక నియతములగు పెక్కు సంస్కృతాంధ్ర పదప్రయోగములు, సంధివిశేషములు, కారక విశేషములు, క్రియావిశేషములు, ఛందోవిశేషములు - నిరాదృతమై, విస్మృతమైన యొక మహాకవితా సంప్రదాయముయొక్క శిథిలావశేషములుగ నిలిచి పలువురు బుద్ధిమంతులను అన్వేషణ నిమగ్నులుగ నొనర్చినవి.

ఉదాహరణమను అపూర్వకావ్యప్రక్రియకు సంస్కృతాంధ్రములలో ప్రథమోదాహరణములుగ సోమనాథుని బసవోదాహరణములు వెలువడినవి. సోమనాథుని బహుభాషా పాండిత్యమునకు నిదర్శకమై సంస్కృత, ద్రవిడ, కర్ణాట, మహారాష్ట్రములను మణిప్రవాళశైలిని, జానుతెనుగునను గూర్చబడి పద్యమున కొక్కటిగ పురాతన భక్త చరిత్రములను గీర్తించుచున్న వృషాధిప శతకము నేటికి దొరకిన మకుట సంఖ్యానియతములగు శతకములలో మొదటిదిగ నెన్నబడుచున్నది. అక్షరాంక గద్యమును, అక్షరాంక పద్యములును, నమస్కార గద్యయును, పంచప్రకార గద్యయును, అష్టోత్తరశతనామ గద్యయును, శరణుబసవ గద్యయును, పంచరత్నములును, బసవాష్టకమును సోమనాథుడు బసవేశ్వరునిపై జెప్పిన స్తుతి ప్రబంధములు. మరియు నితడు సద్గురు రగడను కన్నడ భాషలో రచించెనట. సోమనాథుడు తన సంగీతశాస్త్ర వైదుష్య

మునకు నిదర్శకముగ రచించిన గంగోత్పత్తిరగడ నేటివర కెచ్చటను లభించుటలేదని పరిశోధకులు తెలుపుచున్నారు. ఇవికాక అనుభవసార, చతుర్వేదసారములను కృతులను, భక్తిసమయమును సవైదికముగ ప్రతిష్ఠించుచు సోమ నాథుడు రచించెను. సంస్కృతమున సోమనాథభాష్య మను శ్రుతిస్మృతి ప్రమాణ సంయుతముగ శివపారమ్య మును నిరూపించు నిరువదియైదు ప్రకరణముల మహా గ్రంథమును రచించెను. దీనికి వీరమాహేశ్వర సారోద్ధార మనియును పేరు. దీనికి మనోహరుడను నతడు రచించిన వ్యావహారికాంధ్రటీకయు గలదు. ఈ వివరణముతో బదియవప్రకరణము వరకే ఈ గ్రంథ ముపలబ్ధమగు చున్నది. రుద్రభాష్యమనుపేర యజుర్వేదమునందలి రుద్రాధ్యాయమునకు సోమనాథుడు వ్రాసిన భాష్య మిప్ప టికి దొరకలేదు. మీద పేర్కొనిన బసవాష్టకముగాక సోమనాథుడు సంస్కృతమున నింకొక వృషభాష్టకమును రచించెను. సోమనాథుని కృతులలో జిన్నదియయ్యు విషయమహిమచే గడుంగడు నుదాత్తమగు 'చెన్నమల్లు సీసములు'ను ముప్పదిరెండుపద్యముల కృతిలో షట్ స్థలానుభావ రహస్యములు వర్ణింపబడినవి.

బసవేశ్వరోపజ్ఞమైన భక్తిసమయమను మహాప్రాసాద మునకు మూలస్తంభములై నిలచిన మహాకావ్యములు సోమనాథుని బసవపురాణమును, పండితారాధ్య చరిత్ర మును నేడు దేశి కవితాసౌధమునకును మూలస్తంభము లుగ నెన్నబడుచున్నవి. తెనుగులో మొదటి ద్విపద కావ్యము బసవపురాణము. సంస్కృతమున కనుష్టుప్ఛంద మెట్టిదో తెనుగునకు ద్విపద యట్టిది. అనంతర లాక్షణికులు నిషేధించినను సోమనాథుడు ద్విపదలలో ప్రాసయతులను వాడెను. ద్విపదచ్ఛందముపై అవజ్ఞకలవారి నుద్దేశించి

'ఉరుతరగద్య పద్యోక్తులకంటె
సరసమై పరగిన జానుతెనుంగు
చర్చింపఁగా సర్వసామాన్యమగుటఁ
గూర్చెద ద్విపదలు కోర్కెదైవార
తెలుఁగుమాట లనంగవలదు వేదముల
కొలఁదియకాఁ జూడుఁడు'

అని బసవపురాణమునను,

'ఒప్పదు ద్విపద గావ్యోక్తినావలవ
దారూఢ గద్యపద్యాది ప్రబంధ
పూరిత సంస్కృత భూయిష్ఠరచన
మానుగా సర్వసామాన్యంబుగామి
జానుదెనుఁగు విశేషము ప్రసన్నతకు
నట్టులుగాక కావ్యప్రౌఢిపేర్మి
నెట్టన రచియింపనేర్చినఁ జాలు
నుపమింప గద్యపద్యోదాత్త కృతులు
ద్విపదయు సమము'

అని పండితారాధ్యచరిత్రమునందును సోమనాథుడు హెచ్చరించి యున్నాడు. ప్రతిపాద్య విషయనిష్ఠమెయి మహాసముద్రమువలె పొంగివచ్చుచున్న భావనతో రెక్కలు సాచి యంతరిక్షమున కెగురుచున్నట్లుతోచు సోమనాథుని భాషానిగుంభనములు ద్విపదచ్ఛందోనిబద్ధము లనుమాట తత్కాలమునందు మరపునబడును. బసవవిన్యస్తమనః ప్రాణ పరతంత్రుడయి తన్ను మరచి సోమనాథుడు కావ్య మును జెప్పువేళ నాతని కా మార్గములో ఇది యేరు ఇది పల్లము, ఇది చెట్టు ఇది గట్టు, ఇది తెరువు ఇది యడవి యనుతలం పుండదు. అవి యన్నియును తమంతట తామే తొలగి యతనికి తెరువిచ్చుచుండగా నతనివెంట మనము గూడ పయనించుచున్నట్లు తోచును. బసవని భక్తిరస సముద్రము దిగ్దిగంతములకు వెల్లివిరిసి నిట్టవొడువగా నా సముద్రమునందలి తరంగ పరంపరలవలె ద్విపదపరంపర లును, తత్పరంపరానీయమానమైన నౌకవలె సోమ నాథుడును గోచరింతురు. బసవని వీక్షించువేళ సోమన కొడలెల్ల గన్నులు. బసవని గీర్తించువేళ సోమన కొడలెల్ల జిహ్వలు. అనవధికమైన బసవని మహిమను దాను వర్ణింప దొరకొనుట-'ఇదియుఁ గోటికిఁ బడగెత్తిన వానిఁ బదివేల కాపనై బ్రదుకుమన్నట్టు' అని - ఆ పరంజ్యోతి స్స్వరూపం బునకును దీపకంభంబులెత్తించిన యట్టు' అని సోమ నాథుడు చెప్పెను. 'పొదలునెవ్వని యాత్మ నుదితసద్భక్తి యదియు బసవని మహత్త్వంబ' అనియును, 'మదిలోన నెవ్వండు మముఁ దలపోయు నదియెల్ల బసవని యంశంబ' అనియును పరమేశ్వరోక్తి! భక్తైకదేహుడు పరమే శ్వరుడు. భక్తజనప్రాణి బసవడు. శివుని యస్తిత్వమునకు బసవ డనాదియైన యేకసాక్షి!

'కాలకూటము కుత్తుకకు రాకమున్న
క్రాలుపురంబులు కాలకమున్న
గౌరివివాహంబు గాకటమున్న
యార నజాండంబు లలరకమున్న
తివిరిమూర్తులు నెన్మిదియు లేకమున్న
భువి హరిబ్రహ్మలు పుట్టకమున్న
యటమున్న యటమున్న యట మున్నమున్న
యిట నీవు నాస్వామి నేను నీ బంట' (బ.పు.)

అట్టి బసవని తత్త్వమునకు గాయకుడు సోమనాథుడు; బసవన్న బొగడ శాల్పడు కవీంద్రుండు. గురు, లింగ, జంగమ స్థానములలో గురుస్థానము బసవేశ్వరునిది; లింగ స్థానము పరమేశ్వరునిది; జంగమస్థానము సోమనాథునిది. శైవ సమయమునుబట్టి లింగముకన్న గురువు, గురువుకన్న

జంగమము అభ్యర్హితములు. ఈ సాధన జగత్తును శివమయ మొనర్చు రసవాదము. ఈ దర్శనము జగద్భావనా విలయ మొనరించి భవదృష్టిని తొలగించి శివదృష్టి నొసగు మహాదర్శనము.

బసవేశ్వరుడు కర్మమార్గమును నిరసించి వర్ణాశ్రమ ధర్మములను బ్రతిఘటించెను. 'వేదంబు లాదియో విధి కల్పితంబు లాదియో' అని యుపక్రమించి వర్ణాదికము విధి కల్పిత మనియును, వేదచోదితములైన జాతులు ప్రవర్తకము నివర్తకము ననునవి రెండే కలవనియును, అందు భవకర్మ సంస్కారి ప్రవర్తకు డనియును, శివకర్మ సంస్కారి నివర్తకు డనియును, గావున గర్మవాదు లెల్ల రొక జాతి, భక్తు లెల్ల రొక జాతి యనియును బసవన మంత్రి సిద్ధాంతీకరించెను.

ఈ నూత్న సమయము సంఘ విప్లవ హేతువయ్యెను. బసవేశ్వరోపదిష్టమైన మతమునందలి ప్రపత్తి ప్రలోభకము కాగా సంస్కారులతో నసంస్కారులును, అధికారులతో ననధికారులును వేలకొలది బసవని మతమునందు జేరిరి. బసవని ధర్మము అసిధారావ్రతముచే నిర్వహింప దగినది. అది బసవేశ్వరునివంటి మహా వ్యక్తులచేత మాత్రమే ఆచరణీయమైనది. అది సంఘధర్మ మెప్పుడైనదో అప్పటినుండి కలుషితమై క్రమక్రమముగ పూర్వప్రాభవమును గోలుపోయి పరిక్షీణము కాజొచ్చెను. యథార్థమునకు బసవని అభినివేశము భక్త్యుద్ధరణమునందుకాని సంఘోద్ధరణమునందు కాదు. అతని మహావ్యక్తివిశేషముచే సమకాలిక సంఘము ఉత్తేజితమై యుండవచ్చును. బసవ పురాణములో వివిధ వర్ణములకు జెందిన భక్తుల కథ లున్నవి. పురాతన భక్తుల యందును వివిధ వర్ణములవారు గలరు. వీరి నెల్లర నేకీభవింప జేయు సూత్రము భక్తియే కాని వేరొకటి కాదు. ఈభక్తి వ్యక్తినిష్ఠము. ఇది యొక రాజకీయవాదము వంటిది కాదు. 'భక్తిమీది వలపు బ్రాహ్మ్యంబుతో పొత్తు పాయలేను నేను బసవలింగ!' అని మల్లికార్జున పండితునకు ద్వైధీభావము కలుగుటకును, అనుభవసార చతుర్వేద సార రచనచే సోమనాథునకు వీరభక్తి సవైదికమని ప్రతిష్ఠింపవలసి వచ్చుటకును నిదియే హేతువు.

బసవపురాణమునందు పురాతన భక్తులవియును, నూతన భక్తులవియును చరిత్రములు పెక్కు గలవు. వీనిలో ముగ్ధ భక్తుల కథలు సార్వజనీన ప్రతిపత్తి కలవి. కన్నప్ప, గొడగూచి, బెజ్జమహాదేవి మున్నగువారి కథలు అన్యమతస్థుల హృదయములనైన ద్రవింపజేయును. ముగ్ధసంగయ్య కథ విశిష్టమైనది. వీరభక్తులలో రెండు తెగ లెన్నవచ్చును. తాము పట్టిన వ్రతమునకు విఘ్నము లెన్ని వచ్చినను సర్వధనములను, దారసుతాదులను, దుదకు దమ్మైన నొడ్డి వ్రతమును దుదముట్టించుకొనుటకు బ్రదర్శించు వీరభావ మొకవిధము. సిరియాళాదు లిట్టివారు. జైనాది మతములతో సంఘర్షణములు కలిగినపుడు స్వమత ప్రతిష్ఠాపనకయి సిద్ధాంతానభిజ్ఞులైన ప్రాకృతజనుల ప్రత్యయసిద్ధికై మహిమా ప్రదర్శనపూర్వకముగ సాహసము లొనర్చు ప్రదర్శించు వీరభావ మొకటి. తిరునావకరసి, పిళ్లనైనారు, మడివాలు మాచయ్య మొదలగువార లిట్టివారు. ఇట్టి మహిమా ప్రదర్శనము బసవేశ్వరుడు కూడ పెక్కు సందర్భములలో జేయవలసి వచ్చెను. ప్రధానముగ నాతని విషభోజన మిట్టిదే. ఈ మహిమ లనేకములు. బసవన గొల్లతచల్లకడవ పడకుండ బట్టుట మున్నగునవి యాతని సర్వగతత్వమునకు నిదర్శకములు. జొన్నలు ముత్తెము లగుట మున్నగునవి బసవని ప్రతిజ్ఞాసిద్ధికి నిదర్శకములు. వంగకాయలు ప్రాణలింగము లగుట మున్నగునవి బసవని భావసంసిద్ధికి నిదర్శకములు.

ఒక విధముగ బసవపురాణము ప్రాకృతభక్త కథల సంకలన గ్రంథము. ఒక్కొక్క భక్తుని దొక్కొక్క లోకము. ఏ భక్తుని వైశిష్ట్య మా భక్తునిదే. వీరెల్లరు తమతమ సంస్కారానురూపముగ దమతమ యారాధన మార్గములను నిర్మించుకొని సాయుజ్యాభిముఖముగ నడచిరి. ఆజానజమైన భక్తి వీరిది. పాండిత్యమునకును, వీరి భక్తికిని జాలదవ్వు. సూత్రమునందు మణులవలె బసవచరిత్రమునందీ కథలు గుంఫితములైనవి. 'పురాతన భక్తగీతార్థ సమితి' బసవపురాణమునకు మాతృకయని సోమనాథుడు చెప్పినాడు. మత చర్యాదికము నట్లు విడిచి యిట్టి భక్త కథాను వర్ణనముచే సోమనాథుని కవిత చరితార్థమైనది.

'వాయార భక్తుల వర్ణింపఁగంటి;
పాయక నాజిహ్వ పావనంబయ్యె'

అని సోమనాథుడే చెప్పికొనెను. ఇతివృత్తముల యందలి దేశీయత, ప్రకృతిసిద్ధమైన భక్తియందలి స్వచ్ఛందత, భాషాచ్ఛందములు, అన్యోన్య సంవాదమునంది బసవపురాణమునకు నాన్యతోదర్శనీయమైన అనిర్వచనీయ మాధుర్యమును, మహిష్ఠతను గల్పించుచున్నవి. ఈతని కవితా ప్రస్థానమునకు 'దేశికవిత' అని వ్యవహారరూఢి కలుగుటలో నాంతరహేతు విదియే; దేశీయ మగు ద్విపదచ్ఛందమును గావ్యమునందు వాడుటవలన గాదు. బసవపురాణ ప్రతిభను భావించినకొలది కైలాసము కైలాసమెల్ల నీ యనంతకాలమున నొక ముహూర్తము వినోదార్థమై భూమికి వలసవచ్చినట్లు గోచరించును. భక్తి సంకేతమైన ఆదివృషభేంద్రము మర్త్యమున కవతరింపగా ప్రమథు

లెల్లరు భక్తగణ స్వరూపమున నవతరించి యతనిని బరివేష్టించినట్లు తోచును.

'యే రుద్రలోకా దవతీర్య రుద్రా
మానుష్య మాశ్రిత్య జగద్ధితాయ
చరంతి నానావిధ చారుచేష్టా
స్తేభ్యో నమ శ్శంకర కింకరేభ్యః.'

బసవేశ్వరుని అనుభావ విశేషము స్పర్శవేది వంటిది. మర్త్యమునకు దాని స్పర్శ సోకినన్నాళ్లు సృష్టి శివమయ మయ్యెను. వాదప్రతిపాద్యము కావలసిన యవసరము దానికి తత్కాలమునందు కలుగలేదు ; పిమ్మట గలిగినది.

భక్తి సమయమున కట్టి వాద ద్రఢిమను గల్పించిన మహావ్యక్తి మల్లికార్జున పండితుడు. భక్తుల యనుభూతి విశేషమే యేకమానముగ రూపొందిన మతమునకు శ్రుతి స్మృతి పురాణాగమ ప్రామాణ్యమును మల్లికార్జున పండితుడు ప్రతిష్ఠించెను. ఈ రహస్యము నెరిగియుండుటచేతనే బాల్యమునందు పరవశుడై బసవని యనుభావమును గానము చేసిన సోమనాథుడు చతుర్వేదపారగుడై చరమ వయస్సున పండితారాధ్య చరిత్రమును నిర్మించెను.

బసవపురాణము కావ్యమువలె నుండును. పండితారాధ్య చరిత్రము శాస్త్రమువలె నుండును. యథార్థమునకు పండితారాధ్యచరిత్రముకూడ గావ్యమే. బసవపురాణముకన్న ప్రౌఢతరమైన కావ్యము. ఉద్దిష్ట ప్రయోజన సిద్ధికై సోమనాథ భాష్యమును, రుద్ర భాష్యమును సోమనాథుడు రచించియే యున్నాడు. బసవేశ్వర, మల్లికార్జున పండితుల వ్యక్తిత్వములలో గలభేదమే బసవపురాణ, పండితారాధ్య చరిత్రములయందు ప్రతిఫలించినది. వీనియందలి కావ్యత్వ సిద్ధివలననే కొన్ని శతాబ్దముల ప్రబల ప్రతికూల వాతాహతికి దట్టుకొని యవి నిలువ గలిగినవి.

బసవపురాణమును గంగానది యందుమేని ఆరాధ్య చరిత్రమును సముద్ర మనవలయును. దీక్షా, పురాతన, వాద, మహిమ, పర్వత ప్రకరణము లనుపేర నింౘైదు ప్రకరణములు గలవు. దీక్షాప్రకరణములో భస్మ, రుద్రాక్ష, లింగధారణములకు శ్రుతి స్మృతి పురాణాగమ ప్రమాణ వాక్యములును, పండితుని శివపూజాప్రకారమును, జంగమ తత్త్వ స్వరూపమును వర్ణింప బడినవి. బసవపురాణమున వర్ణింపబడని పరిశిష్టపురాతన భక్తకథలు పురాతన ప్రకరణములో వర్ణింప బడినవి. వాదప్రకరణములో వేద వాద, కర్మవాద, కాలవాద, అద్వైతవాద, సాంఖ్యవాద, యోగవాద, చార్వాకవాద, బౌద్ధవాద, జైనవాదములు ఖండింపబడినవి. మరియును ఇందుధారణ, భిక్షాటన, గంగావతరణాదిక హేతువులును, పంచవింశతిలీలలును, హరిహర తారతమ్యమును, రుద్రాధికత్వము, ప్రళయలీల, మహాతాండవలీల మున్నగునవి వర్ణింపబడినవి. మహిమ ప్రకరణములో పండితుని నయన శిక్షయును, నయనలాభమును, చోళవంశ క్షయకథనమును, గణమాలిక, రుద్రగణ కీర్తనము, యోగాచార్యగణ సంకీర్తనము, షోడశగణ సంకీర్తనము, దశక్షేత్రయోదశగణ సంకీర్తనములును, పండితునకు, నూర్ధ్వనేత్ర లాభమును, కతిపయభక్త కథలును, బసవని శివైక్యమును, పండితుని విలాపమును వర్ణింపబడినవి. పర్వత ప్రకరణమున శ్రీ పర్వతదర్శన తన్మాహాత్మ్య వైభవస్తుతి కథనము, శ్రీగిరి దివ్యస్థాన కథనము, శివరాత్రి వైభవము మున్నగునవి వర్ణింపబడినవి.

పండితారాధ్యచరిత్రము కావ్యరూపము నందిన శైవ దర్శన మనవచ్చును. బసవని తత్త్వమునకు భాష్యకర్త పండితుడు. వివిధ వాదోపబృంహితమైన ఆరాధ్య చరిత్రము 'దండనాయక బసవాంకన ఖ్యాతగుణగణాయతము,' భక్తి సమయమునకు బెట్టనికోట, పాండిత్య పీరమునకు పరమావధి. వాద ప్రకరణాంతమున పండితుని ప్రతిజ్ఞ ఇట్టిది.

'గౌరీశుమీద దైవంబులేడని, తల యిచ్చి పడయుదు మంట బట్టుదును, శివునిమీద నొకడు కలడన్న నాయరకాలెత్తి వాని నడుదల దన్నుదు, నాదు ప్రతిజ్ఞయెడపక నేను గాలెత్తితిని'

ఇది మతాభినివేశ జనిత దురభిమానోక్తియని, ఔద్ధత్యమని - వాదసమయానభిజ్ఞులైన నేటి విమర్శకులు ఆరాధ్యచరిత్ర పీఠికయందు వ్రాసిరి. నిగ్రహస్థానగతులైన ప్రతివాదుల దెస జయిష్ణువులైన పండితుల వాగ్వ్యవహార మిట్టిదగుట సర్వదర్శనములయందును బ్రసిద్ధమైన విషయము - 'ప్రతివాదిమస్తకతటీ విన్యస్త వామాంఘ్రిణా శ్రీహర్షేణ'. వివిధవాదములను ఖండించిన పిమ్మట ప్రకరణాంతోప నిబద్ధమైన యీ ప్రతిజ్ఞ మతదృష్టిచే నితరులకు గొంత బాధాకరమైనను కావ్యదృష్టిచే పాండితీపీరము యొక్క పరాకాష్ఠకు వ్యంజకమగుటచేత పరమరమణీయముగ నున్నదని యంగీకరింపక తప్పదు. శ్రుతి స్మృతి పురాణాగమప్రమాణ బాహుళ్యమువలన స్వసమయమునం దేర్పడిన గాఢవిశ్వాసము, భక్తిదూరములైన యన్య సమయములను వాదములయందు ఖండించునప్పటి వీరావేశము, శివైకతానమగు భక్త్యుద్రేకము కారణములుగ సోమనాథుని కృతులయందు పెక్కుచోట్ల తీవ్రధోరణిలో నన్యమత నింద కాననగును. ఎవరి విశ్వాసము వారిది. ఎవరి యుపపత్తులు వారి కుండును. స్వమతస్థులకు భక్తిగా తోచినది పరమతస్థుల కౌద్ధత్యముగ దోచి యీ గ్రంథముల

యందు వైముఖ్యమును గల్పించుటలో నాశ్చర్యములేదు. సోమనాథుని కృతుల విషయమున జరిగిన దిదియే.

అంతఃప్రవాహినియైన సరస్వతీ జలములవలె కొన్ని శతాబ్దములనుండి శైవేతర ప్రపంచమునకు అనుపభోగ్యములుగనున్న సోమనాథుని కృతులు నేటి కుపాదేయములగుచున్నవన్నచో - ఇప్పుడు మత మనుదానియందు నెవ్వరికి నభినివేశము లేకపోవుట యొకటి; ఈ కాలమునకు సహజమైన భాషా, చరిత్ర పరిశోధనాసక్తి యొకటి. మరి నన్నయనాటినుండి ప్రవర్ధమానమగుచు వచ్చిన వాఙ్మయములో వెలిపెట్టబడినట్లు సోమనాథుని ప్రసక్తి యెచ్చటను గనరాదు. ఈ మతముయొక్క వెలి వాఙ్మయమునకును, భాషకును, ఛందమునకునుగూడ దగులక మానలేదు. ఆరాధ్య చరిత్రమును శ్రీనాథుడు పద్యకావ్యముగ రచించెనందురు. శ్రీనాథుడు తన ప్రతి కావ్యమునందును పూర్వాంధ్ర కవిస్తుతి చేసెను. అం దెందును సోమనాథుని పేరు కనుపడదు. పోతనాదులయందు సోమనాథుని రచనానుసరణములను పరిశోధకులు నిరూపించిరి. వా రెవ్వరుగాని సోమనాథుని స్మరించిన పాపమున బోలేదు. శ్రీనాథునివంటి స్వతంత్రులకే సంఘస్థితి యింత జంకు కల్పించినదన్నచో - సోమనాథుని కృతులయందలి అన్యమత విషయకమైన యూష్మలతకు నాటి సంఘ మెంత వైముఖ్యము నందియుండునో చెప్పనక్కరలేదు. కాగా ఇవి మత గ్రంథములయి శిష్యపరంపరాభిరక్షితములు కావలసివచ్చెను. ఈ ధన్యత పిడుపర్తి కవులకు దక్కినది.

'భవికృతారంభ సంభవధాన్యనిచయ
భవినిరీక్షణరసపాకవితాన
భవిహస్తగత ఫలపత్రశాకాది
భవిగృహక్షేత్రాంఘ్రిపథనవర్జితుండ
భవిజనదర్శన స్పర్శనాలాప
వివిధ దానాదానవిషయ దూరగుండ
శుద్ధభక్తి స్థలశ్రుతి మతాచార
సిద్ధ వీరవ్రత శీలాన్వితుండ'

అని తన నియమములనుగూర్చి సోమనాథుడు ఆరాధ్య చరిత్రమునందు జెప్పికొనెను. ఆ దేశకాలములును, వ్రతాభినివేశములు నట్టివి. సార్వజనీనములైన భారతాది మహేతిహాసములచేత సంపన్నమైన తెనుగు వాఙ్మయమునకు సోమనాథుని కావ్యసంచయము కాణాచియై వెలువడినది. తెనుగు భాషయొక్క అకృతకమైన మాధుర్యము తెలియవలయునన్నచో సోమనాథుని కావ్యసంచయమును జదువకతీరదు. కర్మ జ్ఞాన మార్గ నియంత్రితమై, జాతి భవితవ్యము నాస్తిక్యమునకు దారితీయనిచో- దానియందు భక్తి ప్రబోధము కలిగినచో - సోమనాథుని కావ్యమహిష్ఠత యవగతము కాగలదు. మ. శ. శ.

**సోమయ్యశాస్త్రి, గొర్తి:** వీరిది తూర్పుగోదావరి జిల్లా, అమలాపురము తాలూకా, ఇందుపల్లి గ్రామము. వీరు శాస్త్రవిద్యాభ్యాసార్థము కాశికి వెళ్లి జ్యోతిశ్శాస్త్రము నభ్యసించిరి. వీరు ఆ శాస్త్రము నభ్యసించుచుండిన కాలమున ప్రయాగలోని హరి భైరవశాస్త్రిగారు తమ మూడవ కుమార్తె కాశీఅమ్మకు వరుని వెదకుచు కాశికి వచ్చి ఆయన కామె నిచ్చి ప్రయాగలో పెండ్లిచేసిరి. వివాహమయిన నాటి నుండి సోమయ్యశాస్త్రి మామగారియింట ప్రయాగలోనే యుండిపోయిరి. వీరి సోదరులు గొర్తి సుబ్బరాయశాస్త్రి కూడ తదుపరి కాశికి వెళ్లి (1869) వ్యాకరణ శాస్త్రాభ్యాసము చేసిరి. వీరు కాశికి వచ్చినట్లు తెలిసి తన యల్లుని సోదరులని వీరినికూడ హరి భైరవ శాస్త్రిగారు ప్రయాగకు గొనిపోయి తమ యింట నుంచుకొని విద్య చెప్పించిరి; విద్య పరిపూర్తియైన తరువాత వారికిని, శ్రీరంగమునుండి యాత్రార్థము వచ్చిన పెనుమర్తి వెంకట రామయ్యగారి యేకైక పుత్రికకును వివాహము జరిపిరి. వీరి సంతతివారు ఇంకను అలహాబాదులో నివసించు చున్నారు. గు. వెం. రా.

**హంపీ శిథిలములు:** తుంగభద్ర దక్షిణ తీరముననున్న హంపి బళ్లారి జిల్లా హాస్పేట తాలూకాలోనున్నది. దీని చుట్టు చెల్లాచెదరుగనున్న విజయనగర శిథిలావశేషము లీ గ్రామము పేరనే పేరొందినవి. స్థానిక గాథలును, పరంపరాగత వృత్తమును ఇది రామాయణమునందలి కిష్కింధ యని తెలుపుచున్నవి. ఇది సత్యమనుకొనదగినట్లు నేటికిని ఇచటి కొన్ని స్థలములు మతంగ పర్వతము, ఋష్యమూకము, మాల్యవంతము మొదలైన పురాణ నామములతో వ్యవహరింపబడుచున్నవి. కాని ఈ స్థలమును పదునాలుగవ శతాబ్దమున విజయనగర రాజ్యస్థాపకులు తమ రాజధానిని గావించుకొన్నప్పటి నుండి మాత్రమే దీనికి చారిత్రక ప్రాముఖ్యము కలిగినది.

విజయనగరరాజ్య స్థాపనముతో దక్కను, దక్షిణ హిందూదేశ చరిత్రలలో ఒక నూతనయుగ మారంభమైనది, దక్షిణదేశమున తమ యధికారమును, మతమును వ్యాపింపజేసికొనుటకు ఔత్తరాహులైన ముస్లిములు చేసిన అవిరళ ప్రయత్నముల ఫలిత మది. హిందూ స్వాతంత్ర్య పతాక నెత్తిన విజయనగరాధీశ్వరులు తమ రాజ్యమును స్థాపించుటతో మాత్రమేకాక దాదాపు రెండున్నర శతాబ్దులకాలము దక్షిణ హిందూదేశము నంతను ముస్లిము ప్రభుత్వమునకు లోబడకుండ రక్షించిరి.

సంగమ వంశజుడైన హరిహరరాయలచే స్థాపితమై అతని గురువైన విద్యారణ్యులవారి పేరు పెట్టబడిన విజయనగరము వరుసగ దానిని పరిపాలించిన సాళువ, తుళువ వంశజులచే చాల పరివర్ధితమై తుళువ వంశ్యుడగు కృష్ణదేవరాయల కాలమున మహావైభవోపేతమై యల రారినది. విజయనగర సామ్రాజ్యము నాశముకాక పూర్వము ఆ నగరమునకు వచ్చి అచట నివసించిన విదేశ యాత్రికులు ఆ నగర భాగ్యవైభవోన్నతులను సవిస్తర ముగ కనులకు గట్టినట్లు వర్ణించియున్నారు. రెండవ దేవ రాయలు రాజ్యము చేయుచుండగా వచ్చి క్రీ.శ. 1443 లో ఏప్రిలు మాసము చివరినుండి డిసెంబరు 5వ తేదీ వరకు అచట నివసించిన అబ్దుల్ రజాకు ఇంతటి మహానగరము నెన్నడును కంటితో చూచియుండలే దనియు, ఇట్టి నగర మునకు సాటివచ్చు మరియొక నగరము ప్రపంచమున మరొకచోట నున్నట్లు విననైన వినియుండలే దనియు వ్రాసియున్నాడు. ఇంతేకాక యందు సప్తప్రాకార పరి వృతమైన ఏడు దుర్గములు కలవనియు, ఉత్తరముననున్న ఏడవదుర్గము మహారాజాంతఃపురమనియు తెలుపు చున్నాడు. కృష్ణరాయల రాజ్యకాలమున వచ్చి యీ మహానగరమును దర్శించిన డామింగో పేయస్ దాని వైభవమున కచ్చెరువొంది అప్పు డది యేవిధమున నుండె డిదో కడు విస్తృతముగ నిట్లు వర్ణించియున్నాడు.

'ఈ నగర వైశాల్యమును గురించి నేనిక్కడ వ్రాయను; ఎందుచేతననగా దానిని ఏయొక్క స్థలమునుండి పూర్తిగ చూచుటకును సాధ్యముకాదు. కాని నే నొక కొండ నెక్కుటచేత ఈ నగరములో చాలభాగము చూడగలిగితిని. కాని యది వేరువేరు కొండల వరుసలమధ్య నుండుటచేత దాని నెప్పటికిని పూర్తిగ చూడలేకపోతిని. అక్కడినుండి చూడగా కనపడినదే నాకు రోమునగరమంత పెద్దదిగ కానవచ్చి చూచుటకు చాల దర్శనీయముగ నున్నది. చాల మందము కలిగి దృఢమైన ప్రాకారములచేత ఆవృత మగుటవలన ఈ నగరములోనికి భద్రముగా పరిరక్షితము లైన ద్వారములగుండ మాత్రమే పోవలయును. నగరము లోపల ప్రవేశింపగనే రెండు చిన్న దేవళములు కనబడును. వీనిలో నొకదాని ప్రాకారములోపల ననేక వృక్షములు కలవు. రెండవ దేవళము ప్రాకారము లోపల భవనము లున్నవి. మొదటి ద్వారమున్న ఈ ప్రాకారపుగోడ నగరమునంతను చుట్టియున్నది. అచటినుండి యింకను ముందుకు సాగిపోయినచో లోపలనున్న నగరభాగము నంతను చుట్టియున్న మరియొక ప్రాకారపుగోడ వచ్చును. ఇక్కడినుండి మొదలు మహారాజాంతఃపురము వరకు అన్నియు వీథులు. వరుసలు తీర్చియున్న యిండ్లు, సేనా నుల, సంపన్నుల, దొరల, గౌరవనీయుల భవనములే; చాల సుందరములైనవి. ప్రధానమైన రాజవీథిగుండ పోయి నచో ముఖ్యసింహద్వారములలో నొకదాని దగ్గరకు వచ్చును. ఇది దాటిపోయినచో మహారాజాంతఃపురమున కెదుటనుండు గొప్ప మైదానము వచ్చును. దీని కెదురుగ మరియొకమార్గ మున్నది. దానిగుండ బోయినచో నగ రము రెండవప్రక్కకు వెళ్లును. ఈ మైదానముగుండనే సరకులు మొదలైనవానిని గొనిపోవుబండ్లు, ఇతర వాహన ములు పోవుచుండును. నగర మధ్యముగ పోవుటచే నీరథ్య మిక్కిలి యుపయోగము గలది. కొన్ని యితర భవన ములలో కొన్నిటికివలెనే మహారాజాంతఃపురమునకును చుట్టు మిక్కిలి బలిష్ఠమైన గోడ యున్నది. ఈ ప్రహరిగోడ లోపల లిస్బనునగర (పోర్చుగల్ దేశపు రాజధాని) మంత ప్రదేశమున్నది....ప్రతి వీథిలోను దేవాలయము లున్నవి.... కాని ముఖ్యమైనవి, గొప్పవి నగరము వెలుపలనే యున్నవి.'

మిక్కిలి మందములు, బలిష్ఠములు అయిన దుర్గముల, దుర్గప్రాకారాదుల నిర్మాణము దండెత్తివచ్చు ముస్లిము ఆశ్వికదళముల నెదుర్కొనుటకు ఉత్తర హిందూస్తాన భూవరుల అనుభవమునుండి విజయనగర చక్రవర్తులు నేర్చుకొన్న గుణపాఠము.

కాని క్రీ. శ. 1565 లో జరిగిన రక్షసి తంగడి మహా సంగ్రామమువల్ల విజయనగరమునకు, తత్సామ్రాజ్య మునకు వినాశము కలిగినది విజయోద్ధతములైన ముస ల్మాను సైన్యములు ఆ మహానగరమును పూర్తిగ విధ్వం సము కావింపవలెనను కృతనిశ్చయముతో అందు ప్రవే శించినవి; తమ సంకల్పమును నిర్దాక్షిణ్యముగ, మహా క్రూరముగ నెరవేర్చుకొన్నవి. సూయెల్ చెప్పినట్లు 'అవి దయాదాక్షిణ్యములులేక ప్రజాసంహారము కావించినవి; సౌధములను, దేవాలయములను కాల్చి పడగొట్టి భగ్న మొనర్చినవి. అవి ఏవో కొద్ది శిలానిర్మిత దేవాలయములు, గోడలుతక్క తక్కిన వేవియు శేషించనంతగ రాక్షసి పగతో మహారాజ నివాసభవనములను విధ్వంసముచేసినవి. ఒకప్పుడు బ్రహ్మాండమైన దివ్య భవనములున్న స్థలములని సూచించుచు ప్రతిచోట శిథిలావశేషములు గుట్టలుగ పడి యున్నవి. 'భాగ్యవంతమై, కష్టించి పాటుపడు జనసం ఖ్యతో కిటకిటలాడు అంతటి మహావైభవోపేతమైన నగరరాజము అంతటి ఆకస్మికముగా ఈ దినమున సర్వ సంపదలతో తులతూగుచు మరుసటి దినమున ముట్టడికి లోనై దోచుకొనబడి వర్ణించుటకుకూడ శక్యముకాని

మహాక్రూర విలయసంహార, భయవిహ్వల దృశ్యముల మధ్య శిథిలము కావింపబడుట ప్రాయికముగ మానవ జాతి చరిత్రలోనే ఎప్పుడును జరిగియుండలేదు ' ఆ వైభవో పేతమైన నగరమునకు పట్టినగతి యటువంటిది. ముట్టడి సాగుచుండిన కాలమున నగరమునుండి పారిపోయి పెను గొండను రాజధాని కావించుకొన్న సదాశివరాయలు, ఆ ప్రాచీన మహా నగరమున నేడు శేషించియున్న దెల్ల ఇప్పటికిని మంచి స్థితిలోనున్న అంతరాంతరములందలి తుట్టతుది కోటగోడయు, ఇతర ప్రాకారముల, దేవాలయ ముల, భవనముల శిథిలములును మాత్రమే. ఈ శిథిలములు బళ్లారి జిల్లాలోని హాస్పేటనుండి దాని కేడుమైళ్ల దూర మునమున్న ఇప్పటి కమలాపుర గ్రామము దగ్గర వరకు




తిరుమలదేవరాయలు ఆ నగరమును మరల జనముతో నింపుటకును, దానిని మరల దాని పూర్వ వైభవస్థితికి తెచ్చుటకును కావించిన ప్రయత్నములు తగినంతగ ఫలించి నవి కావు. ఆ నగరము మరల తన యథాస్థితికి రానే లేదు. అది నిర్జనమై పాడుపడి శాశ్వతముగ వినాశన దేవతకు నిలయమైన రంగముగనే నిలిచిపోయినది. సప్త ప్రాకారావృతమును, దుర్గాంచితమును అయిన ఇంచుమించుగా నాలుగు చదరపుమైళ్ల మేర వ్యాపించి యున్నవి.

మొగలాయి యుగమున నగర నిర్మాణమునకు సూచనగనున్న ఆగ్రా సమీపస్థ నగరము ఫతేపూరు సిక్రీ వలె, దానిలోని భవనములు వినాశనమైనప్పటికి నగర విన్యాసము, రేఖామాత్ర రూపము సూచించు మధ్య యుగమునాటి ఏకైక హిందూనగరము విజయనగరమే.

లోపలి ఏడవప్రాకారము స్వాభావిక రక్షణ నిమిత్తము కొండల నాధారముచేసికొని కట్టబడినది. అందువల్ల నిది సరాసరిగ సరళరేఖగ లేదు. దీనిలోపలి ఆవరణలో విజయనగర సామ్రాజ్య చరిత్రను పునర్నిర్మించుకొనుటలో ఎక్కువగా తోడ్పడునట్టి శాసనములుగల దేవాలయములు అనేకము లున్నవి. చూచీ చూడగనే ఆకాలమునాటివని తెలియునట్టి అనేకద్వారములు ఈ నగరములో నున్నవి. ప్రాకారపు గోడలలోని పెక్కు సింహద్వారములు చాల చిన్నవి. వీటిపై ద్వారబంధపు గొడుగుబల్లలు శిలామయములు. ఇవి మామూలు హిందూపద్ధతి నిర్మాణములోవలె దిగువ బోదెలమీద ఆధారపడి యున్నవి. ఇండో - సారసనిక్ పద్ధతిని ఈ సింహద్వారములమీద కావలికాంద్రుండు గదితోకూడిన బురుజులు ఇటిక, సున్నముతో కట్టినవికూడ అక్కడక్కడ లేకపోలేదు. గానుగిత్తిజైన దేవాలయము వద్ద సుందరమైన భీమ విగ్రహ శిల్పముతో నున్న ద్వారము నగరమునందలి కట్టుదిట్టమై దృఢమైన సింహద్వారములలోనికెల్ల ఉత్తమోదాహరణము. భీముని విగ్రహమువలన దీనికి భీముని ద్వారమని పేరు కలిగినది.

విజయనగరాధీశ్వరులు దృఢమైన దుర్గప్రాకారాదులను నిర్మించుటయేకాక నగరవాసులకు ఆహారసమృద్ధికికూడ కొరతలేకుండ చేసియున్నారు. విజయనగరము సందర్శించిన మొదటి యాత్రికులందరు నగరమునందలి అద్భుతమైన నీటి పారుదల పద్ధతినిచూచి ఆశ్చర్యపడినారు. గోవా పోర్చుగీసు గవర్నరు నడిగి రప్పించుకొని పోర్చుగీసు ఇంజనీరు జోవో డెల్లా పాంటి సహాయముతో కృష్ణదేవరాయలు ఎత్తైన కొండలమధ్యనుంచి నీటి నిమిత్తము ఒక జలాశయమును నిర్మించినట్లు న్యూనిజ్ చెప్పుచున్నాడు. ఆ జలాశయము హొస్పేటవద్ద పూర్తిగ ఎండిపోయి విశాలముగనున్న పల్లపు ప్రదేశమేయని చెప్పుదురు. రాజప్రాసాదములలోనికి, దుర్గములలోనికి మంచినీరు నగరమునకు ఈశాన్యదిశనున్న సరస్సునుండి సరఫరా యగుచుండినట్లు చెప్పబడుచున్నది. ఈ సరస్సు నిప్పుడు గుర్తింపగుదురుటలేదు. కోటలో ఇప్పుడు కానవచ్చునట్టి రాతితో కట్టిన నీటి కాలువల, కుండతూముల శిథిలములు రాజప్రాసాదములోపలి చిన్న స్నానవాటికలకు, రాతినీటిగాబులకు నీరు కొనిపోబడుచు వచ్చిన పద్ధతిని స్పష్టముగ తెలుపుచున్నవి. విజయనగరమున కుత్తరపువైపున ఎగునను తుంగభద్రానదికి సేతువు కట్టి దానినుండి వచ్చు తురుత్తు, బసవన్న అను నీటికాలువలగుండ నీరు లభించు చుండెడిది.

ప్రాచీన విజయనగరములో ఇప్పటికిని కాననగు శిథిలావశేషములలో ఈ క్రిందివి ఎక్కువ ముఖ్యమైనవి.

రాజభవనములు : మహర్నవమిదిబ్బ, పద్మమహలు, హజారరామస్వామి ఆలయము, అవరోధ ప్రాకారము, శిలావేదికలు, గజశాలలు మొదలయినవి కోటలోపల మహారాజ ప్రాసాదము దగ్గరనున్న శిథిల సంచయములో ముఖ్యమైనవి.

మహర్నవమిదిబ్బ (సింహాసనవేదిక): ఇది ఒక బ్రహ్మాండమయిన కట్టడము - చక్కగా చెక్కిన నల్లరాతి దిమ్మలతోను, పలకలతోను కూర్పబడినది. తరువాత ముదురు ఆకుపచ్చరాతితో కప్పబడినది. ఈ సింహాసన వేదికమీద చక్రవర్తి ఆసీనుడై దసరా వేడుకలు తిలకించుచుండెడివాడు. శాసనముల మూలమునను, విదేశ చరిత్రకారుల వ్రాతల మూలమునను ఈ విషయము తెలియుచున్నది. ఈ యుత్సవము సెప్టెంబరు (ఆశ్వయుజ) మాసములో తొమ్మిది దినములపాటు జరుగుచుండెడిదనియు, ప్రభువులు, సామంతులు, దండనాయకులు ఈ వేడుకలు చూచుటకు వచ్చుచుండెడివారనియు న్యూనిజ్ అను విదేశ యాత్రికుడు తెలుపుచున్నాడు. న్యూనిజ్ వర్ణించిన దృశ్యములు వేదికాకుడ్యములపై ఉబ్బెత్తు చిత్రములలో రచింపబడియున్నవి. కృష్ణరాయలు తన చైత్ర యాత్రనుండి తిరిగి వచ్చిన పిమ్మట 1513 లో దీనిని నిర్మించెను. శిలాధిష్ఠానముపై మిగిలియున్న శిథిలములనుబట్టి ఉపరినిర్మాణమున ఇటికయు, సున్నమును ఉపయోగింపబడెననియు, కొయ్యస్తంభములకు మీదుగా, రాగిరేకులతో కప్పబడిన కర్రకప్పు ఉండెననియు తెలియుచున్నది.

రాజప్రాసాదపు అధిష్ఠానము : సింహాసన వేదికకు కొద్ది దూరములో ఒక భవనమునకు సంబంధించిన అడుగుమట్ట మున్నది. ఈ భవనము మహారాజ నివాసముగా గుర్తింపబడినది. ఈ యడుగుమట్టము దాదాపు ఐదడుగుల యెత్తున్నది. ప్రధానద్వారము ఉత్తరాభిముఖమై యున్నది. ఈ అడుగు మట్టము పొడవైన చట్రములుగా విభజింపబడియున్నది. వీనిపై పద్మపత్రము, విచిత్రాలంకరణములు రమణీయముగ చెక్కబడియున్నవి.

రాజుదర్బారు మండపము : ప్రాసాదవేదికలకు ఉత్తరమువైపు కొద్ది దూరములో రాజుదర్బారు మండపమున్నది. ఈ శిథిలములలోని భవనములు అడుగుమట్టములన్నింటిలోను ఇదే మిక్కిలి పెద్దది. ఇది చాల ముఖ్యమైన కట్టడమై యుండవలెను. సింహద్వారము ఉత్తరమున కుండెను. భవనముముందు విశాలమైన ఆవరణముండెను. వేదికలో దిగబడియున్న రాతి పీఠములనుబట్టి ఒక్కొక్క వరుసలో పది స్తంభముల చొప్పున అధమపక్షము ఆరు వరుసల స్తంభము లుండెనని తెలియుచున్నది. కోటలోని

తక్కిన భవనము లన్నింటికంటె దర్బారు మండపము ఎత్తుగ నుండెనని అబ్దుల్ రజాక్ కథనము.

హజార రామాలయము : ఇది సాధారణముగ మహా రాజుల ఆంతరంగిక పూజాలయమని భావింపబడుచున్నది. కృష్ణదేవరాయలు దీనిని 1513 లో కట్టించెనని చెప్పుదురు. దేవీమందిరముతో కలుపుకొని రామాలయము 200 అడుగుల పొడవు, 100 అడుగుల వెడల్పు ఉన్నది. ఈ రెండు గుళ్ల గోడలమీదను, స్తంభములమీదను, ఆవరణములోని గోడల స్తంభములమీదను రామాయణ, మహాభారత గాథలు గండరింపబడి యున్నవి. ఆలయమునందు ఒక సుందరమైన హజార మున్నది. దానిలోపలినుండి పోయిన, నడిమి కూటము వచ్చును. దీని కప్పు దాదాపుగా మిక్కిలి రమ్యమైన నాలుగు నల్లరాతి స్తంభములమీద ఆధారపడి యున్నది. ఈ స్తంభములు చాల ఎక్కువగా నునుపుచేయబడి, మనోహరమైన చెక్కడములతో ఇండో-కరింథియన్ పద్ధతిని నిర్మితములైన ఊతచూళికలతో (బ్రాకెట్ కాపిటల్స్) ఒప్పారుచున్నవి. ప్రాకారమునకు ఈశాన్యదిశను స్వామి ఉత్సవ సమయములలో ఉపయోగపడు కల్యాణ మంటపమున్నది. ఆలయము వెలుపలివైపు గోడలు రామాయణ, మహాభారత, కిరాతార్జునీయాది గాథలకు సంబంధించిన చిత్రములతో మనోహరముగ నలంకృతమై యున్నవి. ఆలయావరణ చుట్టునున్న గోడ వెలుపలివైపు విలాసినీ, గాయనీ చిత్రములును, రాజగజాశ్వ ప్రతిమలును రమణీయముగ చెక్కబడియున్నవి. విజయనగర చక్రవర్తుల సంస్కారాభిరుచులకు ఇది చిహ్నముగా ఉన్నది.

శుద్ధాంత ప్రాకారము: హజార రామాలయమునకు ఉత్తరముగా, ఎత్తయిన ప్రహరి గోడలుగల ఒక పెద్ద ఆవరణమున్నది. దీనిలోపల అంతఃపురకాంతల భవనము లుండెను. ఈ ప్రహరిగోడల మందము మదురువైపునకు పోవుకొలది క్రమముగా తగ్గియున్నది. శత్రువులదాడి నుండి రక్షించుకొనుటకు కాక ఏకాంతముకొరకుమాత్రమే ఈ గోడలు కట్టినట్లు తోచుచున్నది. సింహద్వారము పశ్చిమాభిముఖమై యున్నది. ఆవరణ మధ్యమున శిథిలమై పోయిన ప్రాసాదాధిష్ఠాన మున్నది. ఆ ప్రాసాదము మహారాజ్ఞిదై యుండవచ్చును.

పద్మమహలు : ఇది సుందరమైన ఒక చిన్న కేళీమందిరము. దీనిపైని ఒక అంతస్తున్నది. దీనిలో ప్రశస్తమైన సన్నగారతో కల్పించిన అలంకరణము లున్నవి. మామూలు మాదిరిగనే ఎత్తయి, అలంకృతమయిన రాతిమట్టముపై నేల యెత్తుచేసి పద్మభ్రాంతిని కలిగించునట్లు కోణములు తీర్చి ఇది కట్టబడినది. అన్నివైపుల తెరపగానుండిన ఈ గృహము పైఅంతస్తు కాధారభూతములైన స్థూల స్తంభములతో, కమానులతో దర్శనీయముగా ఉన్నది.

గజశాలలు : ఇవి అవరోధావరణమునకు తూర్పు దిక్కున ఉన్నవి. మొత్తముమీద ఇవి ఉన్నతమైన అండాకారపటలములతోనున్న విశాలములైన పదునొకండు శాలలు. నడుమనున్న శాల పెద్దది, గంభీరమైనది. బహుశః ఇది పట్టపుటేనుగది కావచ్చును.

గజశాలలకు సమీపమున దక్షిణాభిముఖమై రక్షకాగార మున్నది. దీని చుట్టును వసారా ఉన్నది. ఇప్పుడు దీనిపై కప్పులేదు. దీని ఆకృతి దీర్ఘచతురస్రము. దీనికి ఒకటే ద్వారమున్నది. గోడలచుట్టును ఎత్తుగా కట్టిన ఒక వేదిక ఉన్నది. దీనిలో వంపుగానున్న పైకప్పునకు ఆధారముగా మధ్య మధ్య స్తంభములు సమవిభాగములుగ చాల నున్నవి. హజార రామాలయమునకు పశ్చిమభాగమున మరియొక యావరణ మున్నది. దీనిలోపల సైన్యాధిపతి, సైనికులు నివసించుచుండిన కట్టడములు, కావలిబురుజులు, మసీదులు ఉన్నవి. మసీదులు విజయనగరరాజుల పరమత సహనమునకు తార్కాణ. ఈ యావరణమునకు దరిదాపుననే, విరూపాక్షాలయమునకు పోవుదారిలో భూగర్భమున నున్నదేవళము, ఉద్దాన వీరభద్రుని మందిరము, 22 అడుగుల ఎత్తయిన ఏకాండపురాతి నరసింహా విగ్రహము, పెద్ద శివలింగము, కృష్ణాలయము, కడలైకల్, సాసివికాళు గణేశ్వరాలయములు, జైనదేవాలయాదులు ఉన్నవి. ఇవి దక్షిణభారతములో దేవాలయవాస్తు పరిణామమందలి చరమదశకు ప్రతీకములుగా నిలిచియున్నవి.

విరూపాక్షాలయము: దీనికి పంపాపతి ఆలయమనియు పేరు. ఇది ఇచటి ఆలయము లన్నిటిలోను మిక్కిలి పురాతనమైనది, అతి పవిత్రమైనది. ఈ ఆలయములోని భాగములు కొన్ని విజయనగర రాజ్యస్థాపనమునకు పూర్వపువి. అటుపిదప విజయనగరరాజ్య సంస్థాపకులైన మొదటి హరిహరరాయలు దానిని మరింత వృద్ధిచేసి తన గురువు మాధవ విద్యారణ్యులకు సమర్పించెను. దీనిలోని రంగ మండపమును, గొప్ప తూర్పు ఉత్తరద్వార గోపురములును కృష్ణరాయలు కట్టించినట్లు ఇచ్చటి ఒక శాసనము వలన తెలియుచున్నది. భువనేశ్వరీ దేవి గుడిలో చాళుక్య రీతిని నిర్మితమైన ద్వారమును, అనేకములు నల్లరాతి స్తంభములును ఉన్నవి. పోర్చుగీసు యాత్రికుడు పేయస్ కృష్ణరాయల కాలములో విరూపాక్షాలయము దర్శించి, దానిని విపుల ముగా వర్ణించియున్నాడు.

హంపీ బజారు: ప్రతి సంవత్సరమును మహాశివరాత్రి నాడు విరూపాక్షుని రథోత్సవము ఊరేగింపు జరుగు

విపణిమార్గము 35 గజముల వెడల్పు, 800 గజముల నిడివి కలిగియున్నది. విజయనగర విపణివీథులు నాల్గింటిలోను ఇది ప్రశస్తతమ మయినది. ఈ రాజమార్గమునుబట్టి విజయ నగరాధీశ్వరుల నగరనిర్మాణ కౌశలము నూహించుకొన వచ్చును.

కోదండరామాలయము : ఈ యాలయము నది యొడ్డున నున్నది. ఇది ప్రధానమైన యాత్రాస్థలము. నేటికిని ఇచ్చట పూజాపురస్కారములు జరుగుచున్నవి.

శూలై (శూల-సూళెయ) బజారు : కోదండరామాల యమునకు ఈశాన్యమున శిథిలావస్థలోనున్న మరియొక పెద్ద వీథి యున్నది. ఇది వేశ్య (శూల) వాటికయని చెప్పుదురు.

అచ్యుతరాయమందిరము : పెద్ద ఆలయములలో ఇది ఒకటి. జమిలి ప్రహరిగోడలచేత ఆవృతమైన ఆవర ణలో ఇది ఉన్నతమైన ద్వారగోపురములతో, అమ్మవారి గుడితో, అనేక మండపములతో ఒప్పుచున్నది. దీనిని 1539 లో అచ్యుతరాయలు కట్టించినట్లు శాసనములవలన తెలియుచున్నది. దీనిలో సుందరమైన స్తంభములున్నవి. ఈ స్తంభముల చదరపు అడుగుభాగమున ఏనుగులు ఊరేగు చున్నట్లున్న చిత్రములు కలవు. ఆవరణములో విష్ణ్వవ తారములు, వైష్ణవ చిహ్నములుగల శిల్పశిలాఖండములు ఉన్నవి. వెలుపలి ఆవరణలో వాయవ్యపుమూలను అందమైన శిల్ప చిత్రములుగల ఒక పెద్ద కల్యాణమండప మున్నది.

అనంతశయనాలయము : శూలైబజారు ఉత్తరపు కొన తూర్పుప్రక్కను ఎత్తయిన అధిష్ఠానముమీద అనంత శయనాలయమున్నది.

గానిగిత్తి జైనమందిరము : కమలాపురము విశ్రాంతి గృహమునకు అరమైలు దూరమున గానిగిత్తి జైనదేవా లయ మున్నది. ఈ యాలయ ముఖద్వారమున కెదురుగ నున్న ఒక ఏకాండ శిలాస్తంభముమీది శాసనమువలన ఈ యాలయమును జైనుడైన ఇరుగప్ప అను విజయనగర సేనాని క్రీ. శ. 1385 లో రెండవ హరిహరరాయల పరి పాలన కాలమున నిర్మించినట్లు తెలియుచున్నది. ముఖ ద్వారపు ద్వారాగ్రశిలాఫలకముమీద ఛత్రత్రయాచ్ఛాదితు డైన ఆసీన జైనతీర్థంకరుని విగ్రహము కలదు. హిందూ శిల్పచిత్రము లేవియు కానరాని ఈ యాలయము ఇచ్చటి శిథిలములలో అత్యంతామూల్యమైన జైనమందిరము.

విఠ్ఠలాలయము : ఇది నగరములోని నిర్మాణము లన్నిటిలో అత్యంతోజ్జ్వలమయినది. విఠ్ఠలస్వామి యను పేర విష్ణువు ఇందు ప్రతిష్ఠితుడైనాడు. ఈ యాలయా వరణమున నేలయంతయు రాలుపరచి యున్నది; చుట్టును ఎత్తయిన ప్రహరిగోడ కలదు. ఉత్తరమున, దక్షిణమున, తూర్పున సింహద్వారము లున్నవి. ఇటిక, సున్నముతో నిర్మించిన ఒక స్తూపితో చదునుగనున్న కప్పు అలంకృతమై యున్నది. కప్పుమీది పిట్టగోడ గూళ్లలో గారవిగ్రహము లున్నవి. విధ్వంసకులు సుందరములైన స్తంభములను పాడుచేసిననుకూడ, దక్షిణ భారతమంతటిలో ఈ యాల యము ఈనాటికిని అతిరమణీయమయినదిగా నున్నది. ఫెర్గూసన్ చెప్పినట్లు అభివృద్ధిచెందిన విజయనగర రీతిలోని అలంకార ప్రాధాన్య విభవమున కిది చరమసీమావధి. స్థానికులు సంగీతస్తంభములని వ్యవహరించు వివిక్తాల్ప కాండ గుచ్ఛములతోను, రౌతులెక్కిన శిల్ప సంప్రదాయ సిద్ధజంతువులతోను కూడిన శృంగారాంచిత సావయవ స్తంభ రీతి ఈ యాలయములోని అత్యంతాద్భుత లక్షణము. ఊత కమ్ముల (బ్రాకెట్లు)ను, పీఠచూళికలను (బేస్ క్యాపి టల్స్) మనోజ్ఞములైన శిల్పరచనలతో, చిన్న అర్ధశిల్ప చిత్రములతో నింపివేసినారు. ప్రతిస్తంభము ఏకాండపు నల్లరాతిని మలచి నిర్మించినదే. ప్రక్కలనున్న నాలుగు కూటములతోను, ప్రబలములైన దూలములతోను, పైని రామాయణగాథా చిత్రముల దరుజులతోను ఆ మండపము శిలువ ఆకృతి నున్నది. ఉత్సవరథము చాల సుందరమైన చిన్న శిలానిర్మిత కళాఖండమే. అతుకులు కానరాకుండ ఇది ఏకాండపురాతిని మలచిచేసినదా యని చూచువా రలకు భ్రమ కలిగించునంత చాల సున్నితముగా ఇందలి శిలలు ఒండొంటితో జోడింపబడినవి.

పట్టాభిరామాలయము : శిథిలములలోని ఆలయము లన్నిటిలో ఇది మిక్కిలి పెద్దది. ఇది కమలాపురమునకు తూర్పుగ అరమైలు దూరమున ఉన్నది. ఇచ్చటి యొక శాసనమువలన దీనిని అచ్యుతరాయలు (క్రీ. శ. 1530 - 1542) కట్టించినట్లు తెలియుచున్నది. తూర్పుదిశ కభి ముఖమై యున్న గుడికెదుట నొక బ్రహ్మాండమైన మంటప మున్నది. పైని చెప్పినవికాక ఇంకను నిర్మాణ శిథిలావ శేషము లనేకమున్నవి.

ఈ చారిత్రక శిథిలావశేషములకు కొద్ది సంవత్సరముల క్రిందట తలవని తలపుగా ఒక ప్రమాదము సంభవించినది. తుంగభద్రానది కడ్డముగా నిర్మించిన సేతువు (డాము) దురదృష్టవశమున ఈ శిథిలావశేషములకు కొంత హాని కలిగించినది. పట్టాభిరామాలయమున కెదురుగానున్న యావరణము 'ఫోర్ బే' కును, పరిశిష్ట విద్యుదుత్పత్తి కేంద్రమునకును (సెకండరీ పవర్ హౌస్) కేటాయింప బడుటవలన జమిలి ప్రాకారపుగోడలలో చాల భాగమును, సారసనిక్ రీతికి చక్కని యుదాహరణముగ చెప్పదగిన యొక అండాలంకృత సింహద్వారమును దెబ్బతిన్నవి.

హిందూధర్మ సంరక్షణమునకును, సంస్కృతి పరిరక్షణమునకును అవతరించి రక్షసితంగడి సంగ్రామమువరకు రమారమి 250 సంవత్సరములపాటు తన విధ్యుక్త ధర్మమును నెరవేర్చి ఒకప్పుడు దర్శనీయమై మహావైభవము ననుభవించిన విజయనగర నగరరాజము నేడు చూచినంతనే హృదయమును ద్రవింపజేసి కనులు చెమ్మగిల జేయు అత్యంత శిథిల నిర్మాణ శిలామహా సంచయముగ మారుట దైవదుర్విధి. రా. సు.

**హనుమంతరావు, కోపల్లె** (క్రీ. శ. 1880 - 1922): నలువదిరెండేండ్ల ప్రాయముననే భౌతికశరీరమును త్యజించి కీర్తిశరీరమును బందరులో జాతీయ కళాశాలా రూపమున చిరస్థాయిగా నెలకొనజేసిన హనుమంతరావు చల్లపల్లె సంస్థానమున దివానుగానుండిన కృష్ణారావుగారికి జ్యేష్ఠపుత్రులు. వీరు మాధ్వమత బ్రాహ్మణ శాఖకు చెందినవారు. ఎం.ఏ., బి.ఎల్., పరీక్షలలో నుత్తీర్ణులై వీరు తొలుత బందరులో న్యాయవాది వృత్తి నారంభించిరి. తండ్రి తదనంతరము తమకు లభింపనున్న దివాన్ పదవిని స్వీకరింప నొల్లక తమ జీవితమును ప్రజాహిత కార్యాచరణకై అంకితము కావింప వీరు నిశ్చయించిరి.



చిత్రము 321.
కోపల్లె హనుమంతరావు

1906 వ సంవత్సరమున జరిగిన కాంగ్రెసు మహాసభ స్వరాజ్య సంపాదనకు జాతీయ విద్యావిధానమే సాధనముగా నిర్ణయించుటను పురస్కరించుకొని వీరు 1907 లో బందరు పురమున జాతీయ విద్యాసంస్థ నారంభించిరి. ఆ సంవత్సరము చివర వీరు తమ న్యాయవాది పట్టాను చించి పారవైచి తాము స్థాపించిన విద్యాసంస్థ యభివృద్ధి కోసము నిరంతరము కృషిచేయ మొదలిడిరి.

వీరు కేవలము స్వశక్తితో, ఆత్మైక సహాయులై పదునైదు సంవత్సరములకాలము ఎడతెగక బహుముఖముల ప్రయత్నించి వేలకొలదిగా అయిదారు లక్షలవరకు ధనమును, ముప్పది యెకరములవరకు తోటల పొలమును సేకరించి ఆ విద్యాసంస్థను కళాశాల రూపమునకు కొనివచ్చి సర్వాంగీణముగా జాతీయ విద్యాభ్యుదయ వికాసముల కావశ్యకములగు సాధన సామగ్రులను సమృద్ధిగా సమకూర్చి తత్పరిపాలన పోషణములను సాగించుచువచ్చిరి.

న్యాయవాదివృత్తి జీవితపరమార్థముగా భావింపబడుచుండిన యీ శతాబ్ది ప్రారంభదినములలో మెరుగెక్కుచుండిన యీ వృత్తిని తృణప్రాయముగా పరిత్యజించి జాతీయవిద్యాభివృద్ధినే ఏకైకలక్ష్యముగా నిశ్చయించి తత్సాధనకై ఆంధ్ర జాతీయ కళాశాలను నెలకొలిపి ఆంధ్రజాతి కర్పించిన యుదార హృదయులు వీరు. ప్రతి సంవత్సరమును గ్రాంటు రూపమున విజాతీయ ప్రభుత్వమువలన లభించు పదివేలు రొక్కమును తిరస్కరించి జాతీయ విధానమును, ఆ కళాశాలయందలి యుపాధ్యాయుల వ్యక్తి స్వాతంత్ర్యమును సంరక్షించిన ధీర పురుషులు. ప్రజాహితైకజీవనులగు వీరికి సౌజన్యసౌహార్దములు పెట్టని సొమ్ములు. గ. సు.

**హనుమచ్ఛాస్త్రి, గాజులపల్లి** (క్రీ.శ. 1893-1956): నెల్లూరు మండలమునందలి వేగూరను గ్రామము వీరి జన్మస్థానము. వీరి తండ్రి సీతారామశాస్త్రి; తల్లి వెంకమ్మ. వీరి మేనమామ పుష్పగిరి లక్ష్మీపతి సమీరకుమార విజయాది గ్రంథములను రచించిన పుష్పగిరి తిమ్మకవి సంతతికి చెందినవాడు.

బాల్యముననే పితృ మాతృ వియోగము సంభవించినను వీరు చుట్టుపట్టుల గ్రామములందలి పండితులయొద్ద విద్యాభ్యాసము కావించుచు కాళిదాసు సుబ్బాశాస్త్రుల గారికడ సంస్కృత కావ్యములను చదివిరి; తరువాత తిరుపతి శ్రీ వేంకటేశ్వర కళాశాలలో ప్రవేశించి సాహిత్య గ్రంథములను పఠించిరి; అనారోగ్యము కారణముగా మరల స్వగ్రామమును జేరి కొంతకాలముండి ఆరోగ్యమును పొంది, శాస్త్రాధ్యయనాభిలాషతో గోదావరి మండలమునకు పోయి అచ్చట అనంతవరమను గ్రామమున మంగిపూడి వెంకటశాస్త్రిగారిని శుశ్రూషించి వారి మెప్పుగాంచి వారికడ మహాభాష్యాంతము వ్యాకరణ శాస్త్రమును పండ్రెండు సంవత్సరములు పఠించిరి. కొంతకాల మచ్చటనే విద్యాబోధ కావించుచు నుండి స్వగ్రామమునకు వచ్చి వీరు వివాహితులైరి; క్రీ. శ. 1914 వ సంవత్సరమున తెనాలి సంస్కృత కళాశాలలో నుపాధ్యాయ పదవి నధిష్ఠించిరి. క్రీ. శ. 1922 లో కళత్ర వియోగము కలుగగా వీరు స్వగ్రామమును చేరి పునర్వివాహితులైరి; ఆ ప్రాంతమునే నెల్లూరియందలి అన్నవరపు రాఘవ శాస్త్రిగారియొద్ద వేదాంతశాస్త్రము నధ్యయనము చేసిరి; మంత్ర శాస్త్రమును అభ్యసించి పాదుకాంతదీక్షాపరులైరి; ఆవల కొన్నాళ్ళకు, నెల్లూరిలోనే సంస్కృత పాఠశాలకు తదధికారుల కోరికపై ప్రధానోపాధ్యాయులైరి. ఆ పాఠశాలను కళాశాలగా మార్చుటకై మూలధనము కావలసి

రాగా వీరుదారభావముతో తమ కరణముగా లభించిన రెండెకరముల భూమిని దానముగా ఇచ్చివేసిరి. వీరి ననుసరించి పలువురు భూరిధనము నొసంగగా పాఠశాల వేద సంస్కృత కళాశాల మైనది. వీరి యాధిపత్యమున నా కళాశాల అభ్యున్నతి గాంచినది. వీరి యధ్యాపన శక్తి ప్రశస్తమైనది. వీరికి కాశీ, మద్రాసు, ఆంధ్ర, అణ్ణామలై విశ్వవిద్యాలయములతో సంబంధ మేర్పడుటచేత వీరి ప్రశస్తి చాల దూరము వ్యాపించినది. వీరు తమకు గల యెల్ల యాస్తి పండ్రెండెకరములలో నాలుగు ఎకరముల సుక్షేత్రమును కళాశాలకు దానము చేసిరి. గ. సు.

**హరిజనోద్యమము :** 'హరిజను'లనగా ఆంధ్రదేశములో అంటరానివారు (అస్పృశ్యులు), చెప్పరానివారు, మాలలు, మాదిగలు, పెద్దింటివారు అని వ్యవహరింపబడుచు వచ్చినవారు. ఈ పదములు నీచముగా, అవమానకరముగా తోచుటచే వీరు తాము ఆది ఆంధ్రులమని చెప్పుకొనుచుండెడివారు. వీరిని మొట్టమొదట 'హరిజను'లని వ్యవహరించినది గాంధిమహాత్ముడే.

ఇప్పుడు 'హరిజన' పదము గవర్నమెంటు రికార్డులలోనే గాక, భారతదేశమంతట జనబాహుళ్యములోకూడ శాశ్వత ప్రచారములోనికి వచ్చియున్నది. మిగిలిన పదములు వెనుకబడి పోయినవి.

అస్పృశ్యత (అంటరానితనము) అను ఆచారము మన దేశములో ఎప్పుడు ఎట్లు వచ్చినదో తెలియదు. అదియెట్లు వచ్చినను దీని ఫలితముగా హరిజనులు గ్రామమునకు కొంత దూరమున ఎడముగా నివసింపవలసి వచ్చుటయే కాక వారు సవర్ణులు నివసించే వీథులవెంట స్వేచ్ఛగా పోవుటకును, ఊరి బావులనుండి నీళ్లు చేదుకొనుటకును, గ్రామ పాఠశాలలలో తమ బిడ్డలు చదువుకొనుటకును కూడ వీలులేకుండ పోయినది. అది యటుండ మాలలు మాదిగల యెడలకూడ అస్పృశ్యత పాటించి, తాము మాదిగలకంటె గొప్పవారమని చెప్పుకొనెదరు; తమ బావులనుండి వారిని నీరు చేదుకొననీయరు. అస్పృశ్యులలో చాలమంది కల్లు త్రాగుదురు. మాదిగలనువారు చచ్చిన గొడ్డుమాంసమును తినెదరు; చెప్పులు కుట్టుదురు.

దేశములో అంటరానితనము నిర్మూలించుటకు పూనుకొన్న సంఘసంస్కర్తలు, నాయకులు చాలమంది పూర్వమునుండి లేకపోలేదు. 1831 లో రాజా రామమోహనరాయలు అంటరానితనమును, జాతి కుల మత భేదములను పాటింపని బ్రహ్మసమాజ మతమును స్థాపించెను. ఇట్లే దయానంద సరస్వతీస్వామి ఆర్యసమాజమును స్థాపించి పూర్వకాలమునుండి ప్రబలియున్న మూఢాచార సంప్రదాయములను, విశ్వాసములను, వానితోపాటు అస్పృశ్యతను నిర్మూలించుటకు కృషిచేసెను. ఈ సమాజమునకు చెందిన ఆశ్రమములలోను, గురుకులములలోను, పాఠశాలలలోను అస్పృశ్యులను విరివిగా చేర్చుకొనుచు వచ్చుటయేగాక హిందూమతమును విడనాడి క్రైస్తవాది ఇతర మతములలో చేరిపోయిన వేనవేలు హరిజనులను 'శుద్ధి' ఉద్యమముద్వారా ఆర్యసమాజ మతస్థుడైన శ్రద్ధానందస్వామి తిరిగి హిందూమతములో చేర్చుకొని వారికి అస్పృశ్యతను తొలగించి కాపాడినాడు.

ఆర్యసమాజము తరువాత హరిజనాభ్యున్నతికి, అస్పృశ్యతా దోష నివారణకొరకు తీవ్రమైన కృషిచేసిన మహనీయుడు శ్రీ వివేకానందస్వామి. ఇప్పుడు మన దేశములో కృషిసల్పుచున్న వివిధ సంస్థలతోపాటు, వివేకానంద స్వామిచే స్థాపించబడిన 'రామకృష్ణ మిషన్' వారుకూడ దేశములో నలుమూలల గల తమ సంఘములద్వారా అస్పృశ్యతా నివారణముకొరకు, హరిజనోద్ధరణము కొరకు నిర్విరామమైన కృషిసలిపినారు. దివ్యజ్ఞాన సమాజమువారుకూడ అస్పృశ్యతా నివారణముకొరకు కొంత కృషిచేసిరి. గోపాలకృష్ణగోఖ్లే స్థాపించిన 'సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీ' వారిలో కొందరు హరిజనోద్ధరణకై తమ సర్వస్వమును ధారపోసినారు. ఇక నెందరో కష్టనష్టముల కోర్చి అస్పృశ్యతా నిర్మూలనమునకు కృషిచేసినారు.

1916 లో ఇంపీరియల్ లెజిస్లేటివ్ కౌన్సిలులో పురోభివృద్ధిలో వెనుకబడిన వర్గముల అభివృద్ధికొరకు శ్రీ దాదాభాయి ప్రతిపాదించిన తీర్మానము ఆమోదింపబడినది. దానిని మద్రాసు ప్రభుత్వము మొదట అమలుపరచినది. ఇందు నిమిత్తము 1919 లో సర్ జార్జి పాడిసన్, ఐ.సి.ఎస్., ప్రత్యేకోద్యోగిగా నియమింపబడిరి. 1920 లో ఆయన లేబరు కమిషనరుగా నియమింపబడిరి. అప్పటినుండి ప్రభుత్వము హరిజన సంక్షేమము నిమిత్తము అనేకవిధముల కృషిచేయుచున్నది.

అస్పృశ్యతా నివారణకృషిలో ఇతర రాష్ట్రములకు ఆంధ్రదేశ మెంతమాత్రము వెనుకబడలేదు. ఈ కృషిలో మార్గదర్శకులు బ్రాహ్మమతావలంబకులైన కందుకూరి వీరేశలింగం పంతులుగారు. వీరు తమ రచనలవల్ల తీవ్రమైన ప్రబోధము కావించిరి. ఈ మహనీయులు వేసిన పునాదుల మీద శాశ్వతసౌధము నిర్మించి హరిజనులకు అపూర్వమైన సేవచేసిన ఉదారహృదయులలో మొదటివారు పీఠికాపుర సంస్థానాధీశులును, రఘుపతి వెంకటరత్నము నాయుడు గారును (చూ : వెంకటరత్నం నాయుడు, రఘుపతి). వీరు

హరిజన బాల బాలికలను చేరదీసి పెంచి పెద్దవారిని చేసి, ఉద్ధరించినారు; వసతి గృహములు నిర్మించినారు. ఇంకను సుప్రసిద్ధ కవులు చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు రాజమహేంద్రవరములో హరిజనులకొరకు పాఠశాలలు పెట్టి చిరకాలము అనన్యమైన కృషి సల్పిరి (చూ: లక్ష్మీనరసింహము, చిలకమర్తి). ఏలూరులో ఆది ఆంధ్ర మహాసభ యొకటి చాలకాలము క్రిందటనే స్థాపితమై అస్పృశ్యతా నివారణమునకు గొప్ప కృషిచేసినది. ఆంధ్రదేశములో అస్పృశ్యతా నివారణకొరకై ఎక్కువగా పాటుపడిన వారిలో ముఖ్యముగా పేర్కొనదగినవారు గుడివాడ వాస్తవ్యులు గూడూరి రామచంద్రరావు, ఏలూరు నివాసులు వెల్లంకి కృష్ణమూర్తి, నెల్లూరు జిల్లా పల్లెపాడు ఆశ్రమ స్థాపకులైన దిగుమర్తి హనుమంతరావు ప్రభృతులు. ఆ రోజులలో వీరు సంఘ బహిష్కారమున కెంత మాత్రము భీతిచెందక, విశేష కష్టనష్టముల కోర్చి ధీరులై హరిజనాభ్యున్నతికి అపూర్వమైన సేవచేసి యున్నారు.

ఆంధ్రదేశమున అస్పృశ్యతా నివారణోద్యమము కేవలము బాల్యదశలోనుండిన రోజులలోనే మంగిపూడి వెంకటశర్మగారు హరిజనుల స్థితినిగూర్చి హృదయమును ద్రవింపజేయు 'నిరుద్ధ భారత 'మను పద్యకృతిని రచించి యున్నారు.

వీరుగాక, హరిజనులయిన నరాలశెట్టి దేవేంద్రుడు, చంద్రు వెంకయ్య, రాయుడు గంగయ్య మొదలయిన హరిజన ప్రముఖులు తమ సంఘములోగల దురాచారములను పారద్రోలుటకు నిర్విరామకృషి సల్పి, ఈ యుద్యమమునకు ఎంతయో తోడ్పడినారు. హైదరాబాదు పట్టణమున భాగ్యరెడ్డివర్మగారు ఆది హిందూసేవా సంఘమను నొక సంఘమును స్థాపించి దాని కనుబంధముగ నగరములో పెక్కు పాఠశాలలు నిర్మించి, హరిజనులలో విద్యావ్యాప్తి గావించియున్నారు (చూ: భాగ్యరెడ్డివర్మ).

హరిజనోద్ధరణకై, అస్పృశ్యతా నివారణకై చిరకాలమునుండి కొంత కృషి జరుగుచుండినను గాంధి మహాత్ముడు కాంగ్రెసుకు నాయకత్వము వహించి, సహాయనిరాకరణోద్యమము తలపెట్టినప్పటి నుండియే దేశములో అస్పృశ్యతా నివారణమున కెక్కువ ప్రాముఖ్యము చేకూరినది. దీనికి కారణము ఆయన తన రాజకీయోద్యమములో, ఖద్దరు, హిందూ ముస్లిము మైత్రి, మద్య నిషేధములతోపాటు అస్పృశ్యతా నివారణము కూడ ప్రధానాంశముగ గ్రహించుటే:

సవర్ణులతోపాటు సమానముగా పాఠశాలలలోను, కళాశాలలలోను ప్రవేశించి విద్య నేర్చుకొనుటకును, మంచి నీళ్ల బావులలోను చెరువులలోను సవర్ణులతో సమానముగా నీరు తీసికొనుటకును, సత్రములలోను ఆస్పత్రులలోను నిరాక్షేపముగ ప్రవేశించుటకును, రోడ్లమీదను వీథులలోను నిరాటంకముగ సంచరించుటకును, దేవాలయములవంటి ఇతర పౌరసంస్థలయందు ప్రవేశించుటకును, దేవాలయములలో పూజాదికములలో పాల్గొనుటకును హరిజనులకు హక్కు కలదనియు, వారికిగల హక్కును వారు అనుభవించుకొనుటలో సవర్ణులందరు వారికి తోడ్పడవలెననియు గాంధిమహాత్ముడు ఉద్బోధ చేసెను. ఇతర హక్కుల విషయమెట్లున్నను హరిజనులను దేవాలయములందు ప్రవేశింపజేయు ప్రయత్నము మాత్రము ఆసేతు హిమాచల పర్యంతము దేశములో బ్రహ్మాండమైన అలజడిని కలుగజేసినది.

అటుతర్వాత, ఈ యుద్యమ సందర్భములో ముఖ్యముగ పేర్కొనదగిన ఘట్టము 1932 వ సంవత్సరములో మహాత్ముడు సాగించిన ఆమరణ ఉపవాసదీక్ష. దీనికి కారణము బ్రిటిషుప్రభుత్వమువారి కమ్యూనల్ అవార్డు తీర్మానము. 1932 వ సంవత్సరమున లండన్‌లో బ్రిటిషు ప్రభుత్వము యాజమాన్యమున జరిగిన రెండవ రౌండు టేబిలు సమావేశములో నిమ్నజాతుల ప్రాతినిధ్యము విషయమై వివిధనాయకులలో సమాధానము కుదరనందున బ్రిటిషు ప్రధాని రామ్సే మాక్డొనాల్డు హరిజనులకు ప్రత్యేక నియోజకవర్గము లుండవలెనని తుదిమాటగ తీర్మానించెను. ముస్లిములకుకూడ ప్రత్యేక నియోజకవర్గము లుండరాదని వాదించిన మహాత్మునకు హరిజనులకు ప్రత్యేక నియోజక వర్గము లేర్పాటుచేయుట చాల ఖేదము కలిగించినది. ఈ తీర్పును ప్రతిఘటించుటకు ఆయన ఆమరణాంత నిరశనవ్రతము ప్రారంభించెను. మహాత్ముని ఈ ప్రాయోపవేశ దీక్షవల్ల బ్రిటిష్, భారతదేశములే గాక యావత్తు ప్రపంచము దద్దరిల్లిపోయినది. వెంటనే బ్రిటిషు ప్రభుత్వమువారు తగు సమాలోచనలు జరిపి హరిజనులకు ప్రత్యేక నియోజక వర్గములు రద్దుచేసి తమ నిర్ణయమును సవరించుకొని మహాత్ముని ఉపవాసదీక్షను విరమింపజేసిరి.

మహాత్ముని ప్రాయోపవేశ దీక్షవలన హరిజనోద్యమమునకు పూర్వముకన్న నధిక ప్రాముఖ్యము కలిగినది. అస్పృశ్యతా నిర్మూలనము, హరిజన దేవాలయ ప్రవేశ కృషి ఆంధ్రదేశమున పూర్వముకంటె చురుకుగా కొనసాగినవి.

హరిజనుల దేవాలయ ప్రవేశమునకు ఆదిలో కొన్ని ఆటంకములు కలిగి వేరువేరు చోట్ల సత్యాగ్రహము సాగింపవలసి వచ్చినను కాలక్రమమున ఆ యాటంకములు తొలగి

పోయినవి. యావద్భారత దేశములోను హరిజన దేవాలయ ప్రవేశము నిరాఘాటముగా జరుగుచువచ్చినది. నేటికి ఆంధ్ర దేశములో హరిజనులు ప్రవేశింపని దేవాలయము లించుమించుగ లేవనియే చెప్పవచ్చును.

హరిజనోద్యమము కేవలము సాంఘిక సమస్యయే యైనను, అస్పృశ్యతా నివారణముతోపాటు హరిజనులకు రాజకీయము లైన హక్కులు చేకూర్పవలసిన సమస్యకును ప్రాముఖ్యము కలిగినది. ఈ కారణమున 1919 వ సంవత్సరములో రాష్ట్రములలో ప్రవేశపెట్టబడిన రాజకీయ సంస్కరణములలో రాష్ట్ర శాసన సభలయందు హరిజనుల నిమిత్తము కొన్ని స్థానములు ప్రత్యేకింపబడినవి. అప్పటి ఉమ్మడి మద్రాసు రాష్ట్ర శాసనసభయందు హరిజనులకు పది స్థానములు కేటాయింపబడి, ఆ స్థానములకు హరిజన సభ్యులను నియామకము చేయుటకు రాష్ట్రము గవర్నరుకు అధికార మియ్యబడినది.

స్థానిక సంస్థలలోను, రాష్ట్రీయ కేంద్ర శాసన సభల లోను హరిజనులు 'నామినేట్' చేయబడుచుండిరి. 1937 లో ఏర్పడిన తాత్కాలిక (ఇన్‌టెరిమ్) ప్రభుత్వములో శ్రీ ఎమ్. సి. రాజా మొదటి హరిజన మంత్రిగా నియమింపబడిరి. ఆ సంవత్సరమునందే యేర్పడిన కాంగ్రెస్ మంత్రివర్గములో నొకరుగ హరిజన నాయకులు శ్రీ వి. ఐ. మునిస్వామి పిళ్లై నియమితులైరి. పిమ్మట శ్రీ వేముల కూర్మయ్య, శ్రీ బి. పరమేశ్వరన్, శ్రీ దామోదరము సంజీవయ్య మంత్రి పదవులు వహించిరి.

1938 లో మద్రాసు రాష్ట్రములో కాంగ్రెసు ప్రభుత్వము సివిలు హక్కుల ఆటంకాలను తొలగించు చట్టమును (రిమూవల్ ఆఫ్ సివిల్ డిజెబిలిటీస్ ఆక్ట్) అమలులోనికి తీసికొనివచ్చి సమస్త పౌరసంస్థలలోను ప్రవేశించుటకు హరిజనులకు ఎట్టి ఆటంకములు కలుగకుండునట్లు శాసించినది. దీనివల్ల భోజన కాఫీ హోటళ్లలోగాని, మంచినీళ్ల బావులలోను చెరువులలోనుగాని, పాఠశాలలలో గాని, అగ్రహారపు వీథులలోగాని, శ్మశాన భూములలోగాని, మరియే యితర పౌరస్థలములలోగాని, హరిజనులు ప్రవేశింపరాదని హరిజనేతరులు ఆటంకపరచుటకు అవకాశము లేకుండ పోవుటయేగాక అట్లు ఆటంకపరచువారు ఈ చట్టముక్రింద శిక్షాపాత్రులుకూడ అయినారు. మదరాసు రాష్ట్రమునందలి దేవాలయములలో చట్టముద్వారా 1939 లో మొదటిమారు హరిజనులు ప్రవేశించుటకు అవకాశము కల్పింపబడినది. పిదప 1947 లో అన్ని దేవాలయములలోనికి వారికి ప్రవేశము కలిగించుటకు ఒక సమగ్ర శాసనము చేయబడినది.

సాంఘికముగా అస్పృశ్యత తొలగిపోవుటకు ఇన్ని విధములయిన చర్యలు, ఉద్యమములు కొనసాగింపబడుచు వచ్చినను, ఆర్థికముగా కూడ హరిజనులను వృద్ధిలోనికి తీసికొని వచ్చుటకు తగిన చర్యలు ప్రభుత్వము తీసికొనకుండ ఉండలేదు. బ్రిటిషు పాలనలోకూడ ఉమ్మడి మద్రాసు రాష్ట్రములో హరిజన సంక్షేమ కార్యకలాపము లన్నియు కమిషనర్ ఆఫ్ లేబర్ అను ఒక ఐ. సి. యస్. ఉద్యోగస్థుని యాజమాన్యమున కొనసాగింపబడు చుండెడివి. ఈ యుద్యోగి, రెవిన్యూ బోర్డు సభ్యులలో ఒకడుగా ఉండెడివాడు. అప్పుడు ప్రభుత్వము ముఖ్యముగా తీసికొనిన చర్యలలో పేర్కొనదగినవి హరిజనులకు ఉచిత విద్యాసౌకర్యములు కలుగజేయుట, విద్యార్థివేతనములు, భోజన వసతిగృహములు ఏర్పాటుచేయుట మొదలైనవి. ఇవికాక హరిజనులకు ప్రభుత్వపు బంజరు భూములు ఉచితముగా పట్టాలమీద మంజూరుచేయునట్లు ప్రభుత్వము ఉత్తరువు చేసినది. ఈ యేర్పాటు ప్రకారము ప్రతి గ్రామములోను ప్రభుత్వమునకు సంబంధించిన ఖాళీ బంజరు భూములు సాగుచేసికొనుటకు హరిజనులకే మంజూరు చేయుటకై ప్రత్యేకింపబడినవి. వానిలోనుండి హరిజనులు కోరుకొన్న భూములు ప్రభుత్వము పట్టాలమీద మంజూరు చేయుచు వచ్చినది. ఇదిగాక నివసించుటకు గృహవసతులు లేని హరిజనులకు ప్రభుత్వము తన ఖాళీభూములను ఉచితముగా మంజూరు చేయుచు వచ్చినది. ప్రభుత్వపు ఖాళీ భూములు లేని గ్రామములలో రైతుల ప్రయివేటు పట్టా భూములను భూసంపాదన చట్టము (ల్యాండ్ అక్విజిషన్ ఆక్టు) క్రింద వశముచేసికొని ఇండ్లు కట్టుకొనుటకు నివేశన స్థలములు ప్రభుత్వమువారు మంజూరు చేసినారు. ఈ ప్రయివేటు భూములు సంపాదించుటకగు ఖర్చులో ప్రభుత్వము సగము ఖర్చు భరించి మిగిలిన సగము హరిజనుల నుండి వసూలుచేయుచుండెడిది.

1945లో ప్రజాప్రభుత్వము ఏర్పడిన వెంటనే హరిజనాభివృద్ధికి ఒకకోటి రూపాయలు ఆదాయ, వ్యయముల పట్టికలో కేటాయించి, ఒక ప్రణాళికను రూపొందించినది. దీని ప్రకారము అదివరలో చేయుచుండిన పనులకు తోడు ప్రభుత్వ మీ క్రింది విధములకూడ హరిజనులకు తోడ్పడుటకు నిశ్చయింపబడినది: (1) సహకార పరపతి సంఘములు స్థాపించి వానిద్వారా హరిజనులు ఇండ్లు కట్టుకొనుటకు తగిన ధనసహాయముచేయుట; (2) హరిజనుల పల్లెలలో మంచినీటి సదుపాయములు, వైద్య సహాయము ఏర్పాటు చేయుట; (3) కుటీరపరిశ్రమాభి వృద్ధికి తగిన ద్రవ్య సహాయము చేయుట మొదలగునవి. 1947 లో భారత

దేశమునకు సంపూర్ణ స్వాతంత్ర్యము లభించిన తర్వాత ప్రభుత్వము హరిజనాభ్యున్నతికి సర్వతోముఖమైన చర్యలు తీసికొనుట కారంభించినది. హరిజనాభివృద్ధికి ప్రతి రాష్ట్ర ప్రభుత్వములోను ప్రత్యేకముగా ఒక మంత్రిస్థాన మేర్పడినది.

మద్రాసు ప్రభుత్వము 1949 లో హరిజన సంక్షేమ కార్యకలాపశాఖను లేబరు కమీషనరు కార్యాలయము నుండి విడదీసి ప్రత్యేకముగా హరిజనసంక్షేమశాఖ నొకదానిని నిర్మించి ఈ కార్యకలాపమంతయు ఆ శాఖ స్వాధీనము చేసినది. ఈ శాఖకు మొట్టమొదటి డైరెక్టరు హైకోర్టు జడ్జి పదవినుండి రిటైరయిన వి. భాష్యం అయ్యంగారు. వీరు వేతనము తీసికొనకుండ ఉచితముగానే కార్యకలాపము నిర్వహించుట కంగీకరించిరి. రెండు సంవత్సరములు వీరి అధికారము క్రింద ఈ శాఖ కార్యనిర్వహణము చేసినతర్వాత 1951 జూలై నెలలో, వీరి స్థానమున ప్రభుత్వము జిల్లా కలెక్టరు హోదాలోని ఒక ప్రభుత్వోద్యోగిని డైరెక్టరుగా నియమించి ఈ శాఖను అతని వశము చేసినది. ఈ డైరెక్టరుకు సహాయకులుగా డిప్యూటీ కలెక్టరు హోదాలోని ఇద్దరు డిప్యూటీ డైరెక్టర్లను ప్రభుత్వము నియమించినది. ఉమ్మడి మద్రాసు రాష్ట్రములోని తెలుగు జిల్లా లన్నిటికి డిప్యూటీ డైరెక్టరు, దక్షిణ జిల్లాలకు మరొక డిప్యూటీ డైరెక్టరు - ఈ ఇద్దరును డైరెక్టరుకు సహాయులుగా ఉండెడివారు.

1953 లో ఆంధ్రరాష్ట్ర మేర్పడినపిదప ఆంధ్ర ప్రభుత్వముకూడ హరిజన సంక్షేమశాఖ నేర్పరచి జిల్లా కలెక్టరు హోదాకు చెందిన ఆఫీసరును డైరెక్టరుగా నియమించి అంతకుముందుండిన డిప్యూటీ డైరెక్టరు పదవులను రద్దుచేసి, వాని స్థానమున డైరెక్టరుకు సహాయకారిగా పనిచేయుటకు డిప్యూటీ డైరెక్టరు హోదాలో ఒక 'పెర్సనల్ అసిస్టెంటు'ను నియమించి తత్కార్యక్రమమును కొనసాగించుచు వచ్చినది.

ఈ సంక్షేమ కార్యాచరణములో ప్రభుత్వమునకు సలహాసంఘముగా పనిచేయుటకు ఆంధ్ర ప్రభుత్వము రాష్ట్రీయ హరిజన సంక్షేమ సంఘము నొకదానిని స్థాపించినది. రాష్ట్రమున కంతకు ఏర్పడిన ఈ సంఘముగాక, ప్రతి జిల్లాకును ఒక హరిజన సంక్షేమ సమితిని ప్రభుత్వము ఏర్పాటుచేసినది. జిల్లా స్థాయిలో జరుగవలసిన కార్యాచరణలో ఈ సమితులు జిల్లా కలెక్టర్లకు సలహా సంఘములుగా పనిచేయుచుండును. హరిజన సంక్షేమశాఖ కొనసాగించవలసిన కార్యకలాపములు యావత్తు జిల్లాలలో కలెక్టర్లద్వారా అమలు జరుగుచుండును. ప్రభుత్వము కొనసాగించు హరిజనోద్ధరణ కార్యకలాపములు నాలుగు విధములైనవి: (1) విద్యాసౌకర్యములు; (2) ఆరోగ్యాభివృద్ధి; (3) సాంఘికాభివృద్ధి; (4) ఆర్థికాభివృద్ధి.

ఈ శాఖ ప్రారంభములో విద్యావిషయికముగా పెక్కు ప్రాథమిక పాఠశాలలను, కొన్ని ఉన్నత పాఠశాలలను స్థాపించినది. కొన్ని ప్రధానమైన కేంద్రములలో ప్రభుత్వమువారు విద్యార్థులకు ఉచితముగ భోజనముపెట్టుచు వసతి గృహములు నడపుచున్నారు. ఇదిగాక, ప్రయివేటు సంస్థలు నడపుచుండు భోజనవసతి గృహములలో చేరి చదువుకొను హరిజన విద్యార్థులు బాలబాలికలకు ఒక్కొక్కరికి ప్రభుత్వము సంవత్సరమునకు ఎంతో కొంత నియతముగ ద్రవ్యసహాయము చేయుచున్నది; పుస్తకములు, బట్టలు వగైరా కొనుటకును ధన మిచ్చుచు వారి పరీక్షారుసుములు చెల్లించుచున్నది. మధ్యాహ్న భోజనము ఉచితముగా పెట్టునట్లు ఏర్పాటుచేసి పాఠశాలా గృహనిర్మాణమున కగు ఖర్చుకూడ ప్రభుత్వమే భరించుచున్నది.

హరిజనుల ఆరోగ్యాభివృద్ధికిగాను ఇంటి నివేశన స్థలములు, మంచినీటి బావులు, మరుగుదొడ్లు, శ్మశాన భూములు వగైరా ప్రభుత్వమే ఏర్పాటుచేయుచున్నది. అంటరాని తనమును నిర్మూలించుటకై రాష్ట్ర ప్రభుత్వము తీసికొను చర్యలకగు ఖర్చులకు సహాయముగా ఇండియా ప్రభుత్వము కూడ కొంత ద్రవ్యసహాయము చేయుచున్నది.

అంటరానితనమును నిర్మూలించుటకు ప్రచారము చేయుటకై ప్రతినెల 30 వ తేదీని ప్రతి గ్రామములోను హరిజన దివసోత్సవములు జరిపించవలసినట్లు జిల్లా కలెక్టర్ల కందరికి ప్రభుత్వము ఉత్తరువులు జారీచేసినది. ఈ యుత్తర్వుల ననుసరించి ప్రతినెల గ్రామములలో అన్ని కులాలవారు కలిసి ఉత్సవములు చేయుచు, అంటరానితనము తొలగించవలసినదని ప్రచారముచేయుట, గ్రామ దేవాలయములో హరిజనులను ప్రవేశింపజేయుట, బావుల వద్దకు, చెరువులలోనికి హరిజనులను తీసికొని పోవుట మొదలగు కార్యక్రమములు జరుపుచున్నారు. కం.అ.

అభివృద్ధిలో వెనుకబడిన వర్గములవారి కందరికి వర్తించునట్లు 1955 లో ఈ శాఖపేరు 'సాంఘిక సంక్షేమశాఖ' అని మార్చబడినది. హరిజనులు (షెడ్యూల్డు జాతులు), తక్కిన వెనుకబడిన వర్గములు, పూర్వము 'నేరస్థజాతులు'గా పరిగణింప బడుచుండిన జాతులవారు (వీరి కిపుడు విముక్త జాతులవారని పేరు) షెడ్యూల్డ్ తెగలవారు. వీరందరి సంక్షేమము కొరకు ఈశాఖ కృషిచేయుచున్నది.

1956 లో ఆంధ్రప్రదేశ్ ఏర్పడినది. పూర్వపు 'హైదరాబాదు' రాష్ట్రములో సాంఘిక సేవాశాఖ (సోషల్ సర్వీస్ డిపార్టుమెంటు) ఒకటి ఉండెడిది. ఆ శాఖ నిర్వ

హించుచుండిన కార్యక్రమములు కూడ ఇప్పుడు సాంఘిక శాఖకు సంక్రమించినవి.

**హరిశాస్త్రి, భాగవతుల** (క్రీ. శ. 1811 - 1893): వీరు తూర్పుగోదావరిజిల్లా దాక్షారామమునకు సమీపమున భీమక్రోశపాలె మను గ్రామమున తెలగాణ్య బ్రాహ్మణ కుటుంబమున జన్మించిరి. వీరు స్వయంపాకుల లక్ష్మీనారాయణ శాస్త్రిగారివద్ద పదునాలుగేండ్ల వయసు నాటికే కృష్ణ యజుర్వేదాధ్యయనము పూర్తి చేసిరి. 19 వ శతాబ్దిలోని శాస్త్ర పండితులలో వీరివలె వేదాధ్యయనము గావించినవారు మిక్కిలి అరుదు. పిమ్మట వీరు కోటిపల్లి సమీపమున గల కోటగ్రామములో కైప నరసింహశాస్త్రిగారివద్ద సంస్కృత కావ్యములను చదివి శాస్త్ర విద్యకై కాశి కేగిరి. వీరు కాశిలో కాశీనాథ శాస్త్రిగారివద్ద పదునాలుగు సంవత్సరములు వ్యాకరణ శాస్త్రాధ్యయనము చేసిరి. వీరు గురువుగారిమీద తమకు గల భక్తిని తమ గ్రంథములలో వెల్లడించుకొనిరి. అంతే కాక తమ కుమారుని గురునామధేయాంచితుని చేసిరి. వీరికి సుప్రసిద్ధులయిన రాజారామశాస్త్రిగారును, యాగేశ పండిజ్జీగారును సహాధ్యాయులు. శాస్త్రిగారు కాశిలో నుండగా వీరి భార్య మరణించెను. అయినను వీరు విద్యాకృషిని మానక మరికొంతకాలము కాశిలో నుండిరి.

ఆ దినములలో విజయనగరం మహారాజు సర్ విజయరామ గజపతిమహారాజుగారు కాశిలో జరిపిన విద్వత్సభలో వీరు కనబరచిన పాండిత్యమును, శాస్త్రార్థ సామర్థ్యమును చూచి ఆంధ్రుడు సమర్థుడై ఔత్తరాహ పండితులకంటె మిన్నగా నుండుటకు ఆనందించి వీరిని తమ యాస్థాన పండిత పదవి స్వీకరింపగోరిరి. కాని వీరు తా మింకను చదువుకొనవలయు నని చెప్పి సగౌరవముగా వారి కోరికను నిరాకరించిరి. అంతట మహారాజుగారు నెలకు 25 రూపాయలచొప్పున రెండు సంవత్సరములు వీరికి విద్యార్థి వేతన మిచ్చి పిమ్మట వీరిని తమ యాస్థానములోనికి తీసికొని వీరియెడ విశేషాదరము చూపిరి. తమకు మహారాజువలన కావలసినంత యైశ్వర్యము లభించెనని వీరు తమ 'వాక్యార్థచంద్రిక'లో చెప్పుకొనిరి ('తదీయాగణ్య కారుణ్య ప్రాప్తాభీష్టశ్రియా మయా....'). విజయరామ గజపతి మహారాజుగారి కుమారులును, సుప్రసిద్ధ విద్వత్పోషకులును అయిన ఆనందగజపతి మహారాజుగారు బాల్యమున వీరివద్ద విద్యాభ్యాసము చేసిరి. వీరు రచించిన వాక్యార్థ చంద్రికను 1887 లో ముద్రితము గావించి ఆనంద గజపతి మహారాజుగారు తమ గురుభక్తిని వెల్లడించుకొనిరి.

సుమా రిరువది సంవత్సరములు వీరు విజయనగరములో నుండి పిమ్మట ప్రశాంత స్థలములో కాలము గడపదలచి మహారాజుగారి యనుమతితో గోదావరీ తీరమున నున్న కోటిపల్లి గ్రామము చేరిరి. అచ్చట వందలకొలది విద్యార్థులు వీరివద్ద వ్యాకరణశాస్త్ర మధ్యయనము చేసిరి. వీరు కోటిపల్లిలోనే పరమపదించిరి.

వీరు విజయరామగజపతిగారి కాలములో 'వాక్యార్థ చంద్రిక'ను, ఆనందగజపతిగారి కాలములో 'చిత్రప్రభ'ను రచించిరి. వీరు నాగేశభట్ట విరచితమైన 'లఘు శబ్దేందుశేఖరము'పై రత్నాపణమను వ్యాఖ్యనుకూడ రచించినారు. కాని యిది అముద్రితము. 'చిత్రప్రభ'ను ఆంధ్ర విశ్వవిద్యాలయమువారు 1932 లో ముద్రించిరి. సిద్ధాంతకౌముదిమీద గల ప్రౌఢ మనోరమ యను వ్యాఖ్యానముపై గల 'శబ్దరత్న'మను వ్యాఖ్యానమునకే 'చిత్రప్రభ' వ్యాఖ్యా గ్రంథము. 'శబ్దరత్నము'లోని కొంత భాగమే ఇందు వ్యాఖ్యాతము. జ. పు.



# సహజ సంపద

## స్థాన నిర్దేశము, విస్తీర్ణము

భారతదేశములోని కేరళ, పశ్చిమ బెంగాలు, రాజస్థానము మొదలగు రాష్ట్రములలో ప్రాంతీయ అనుసంధానము అనగా ప్రకృతి, శీతోష్ణస్థితి, పంటలు, సంస్కృతి ఇత్యాది విషయములలో ఒక క్రమ పద్ధతి స్పష్టముగ గోచరమగును. ఆంధ్రప్రదేశ్‌లో అడుగడుగున ప్రాంతీయ భిన్నత్వము ప్రత్యక్షమగును.

ఆంధ్రప్రదేశ్ 7° 10′ అక్షాంశముల నిడివి గలిగి, 12° 40′ ఉ. - 19° 50′ ఉ. అక్షాంశముల మధ్యను 8° 5′ రేఖాంశముల విశాలము గలిగి 76° 45′ తూ. 84° 50′ తూ. రేఖాంశముల మధ్యను వ్యాపించి యున్నది. ఇందు ఏడు కోస్తా జిల్లాలు : శ్రీకాకుళము, విశాఖపట్టణము, తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు; పదమూడు పీఠభూమి జిల్లాలు : చిత్తూరు, కడప, అనంతపురము, కర్నూలు, మహబూబ్ నగర్, హైదరాబాదు, మెదకు, నిజామాబాదు, ఆదిలాబాదు, కరీంనగర్, వరంగల్, ఖమ్మం, నల్గొండ గలవు. సువిశాలమైన ఈ భూభాగమంతయు ఒకటిగాచేరి యుండుటచే ఆంధ్రప్రదేశ్ యొక్క రాజకీయపుటునికికి మరింత పటుత్వము చేకూరినది. వైశాల్యమున ఇది భారతదేశ రాష్ట్రములలో ఐదవ స్థానము నాక్రమించు చున్నది.

| | |
|---|---|
| మధ్యప్రదేశ్ | 1,71,210 చ. మైళ్లు. |
| రాజస్థానము | 1,32,150 ,, |
| మహారాష్ట్రము | 1,18,883 ,, |
| ఉత్తర ప్రదేశ్ | 1,13,454 ,, |
| ఆంధ్ర ప్రదేశ్ | 1,06,052 ,, |

జనాభానుబట్టి చూచిన ఆంధ్రప్రదేశ్ నాల్గవ స్థానము నాక్రమించును.

| | |
|---|---|
| ఉత్తర ప్రదేశ్ | 737.52 లక్షలు |
| బీహారు | 464.57 ,, |
| మహారాష్ట్రము | 395.04 ,, |
| ఆంధ్ర ప్రదేశ్ | 359.77 ,, |

ఆంధ్రప్రదేశపు టాకారమున సౌష్ఠవములేదు. ఇది కొంచము ముందుకు పొడుచుకొని వచ్చినట్లుండును. ఈ ముందుకు పొడుచుకొని వచ్చిన భాగము తూర్పు కనుమల కడ్డముగా దక్కనులోని వర్షపాత ప్రదేశమువరకు వ్యాపించినది. ఈ భాగము ముందుకు నడుచునట్టి ఎద్దు కాలువలె నుండునని యొక గ్రంథకర్త వ్రాసియున్నాడు.

ఆంధ్రప్రదేశ్‌ను భూగర్భశాస్త్రరీత్యా పరిశీలించినచో ఇది భారతద్వీపకల్ప భూగర్భశాస్త్రలక్షణములనుసంపూర్ణముగ వ్యక్తీకరించు భూతత్త్వమని చెప్పనొప్పును. సి. పా.

## భూగర్భ చరిత్ర

భారతదేశము సాంస్కృతికముగ చాల ప్రాచీనమైనదని పేరుపడి యున్నది. ఈ ప్రాచీనతను మానవుని చరిత్ర పరిధులలో కొలిచెదరు. భూమి చరిత్ర విషయములో ఆ కొలతబద్ద పనిచేయదు. భూమి చరిత్రలో కొన్నిలక్షల సంవత్సరముల కాలము మానవజీవితములో కొన్నిక్షణముల వంటిది. అట్టి కాలమానములో సుమారు 400 కోట్ల (4000 మిలియన్ల) సంవత్సరములకు పూర్వము భూమి సూర్యమండలమునుండి వేరు పడినది. నాటినుండి నేటి వరకు మన మెరిగిన ప్రపంచపు టుపరితలములలో పెద్ద మార్పులు ఏమియు లేకుండనున్న భూభాగములలో ఒకటి వింధ్య పర్వత శ్రేణికిని కన్యాకుమారికిని మధ్యగల ప్రదేశము ; ఆంధ్రప్రదేశ్ ఇందులోని ఒక భాగము.

ఆంధ్ర ప్రదేశ్ నైసర్గిక లక్షణములు తెలిసికొన్నగాని ఈ రాష్ట్ర ప్రజల జీవనసరళి, ఈ రాష్ట్రపు వాతావరణము, పాడిపంటల తీరు సరిగా అర్థముకావు. అట్టి నైసర్గిక లక్షణములు భౌగోళిక వివరములపై ఆధారపడి యుండుటచేత ఆ వివరములు తెలిసికొనుటయు, భౌగోళిక నిసర్గము భూగర్భముమీద ఆధారపడి యుండుటచేత ఆ భూగర్భ విషయికమైన సంగతులు తెలిసికొనుటయు అవసరము.

ఆంధ్రప్రదేశమునధార్వాడ యుగపు రాళ్ళు (ధార్వార్ రాక్స్) అతిప్రాచీనములు. ఇవి రెండు వందల ముప్పది కోట్ల (2300 మిలియన్ల) సంవత్సరములకు పూర్వము భూగర్భ అంతరాళమునుండి బయటకువచ్చి ఏర్పడినరాళ్లు.

ఇవి ఏర్పడిన తరువాత ఉష్ణోగ్రత, పీడనశక్తుల ప్రభావముచేత మార్పుచెంది నెల్లూరు, గూడూరు ప్రాంతములో అభ్రకము దొరకు శిలలుగాను, తూర్పుకనుమ లనబడు పర్వతములుగాను, చిత్తూరు, కుప్పం పరిసరములలో బంగారము దొరకు శిలలుగాను ఏర్పడినవి. ఇంతవరకు గల భూమి చరిత్రను వేదకాల మందురు.

ధార్వాడవర్గ శిలాసముదాయము ఏర్పడుట "భూమి తల్లికి పురిటి నొప్పులు" వచ్చుటవంటి సంఘటన. తరువాత అనిశ్చితమైన కొంతకాలము గడచిపోయినది. ఈ కాలములో ప్రశాంతత నెలకొన్నది. కాని విసుగు విశ్రాంతిలేని ప్రకృతి శక్తులు మాత్రము భూమి ఉపరితలముపై తమ విధ్యుక్త ధర్మములు నెరవేర్చుచునే యుండెను. కాలక్రమేణ పర్వతములు చిన్న గుట్టలయినవి. నేలమట్టమున గల రాళ్ళు శిథిలములైనవి. అట్లు శిథిలమయిన శిలాపదార్థము గాలికి కొట్టుకొనిపోయి జలప్రవాహములో చేరిపోయి క్రమముగా ప్రవాహముతోబాటు నాటి సముద్రమున ప్రవేశించెను. అందు నిక్షిప్తమైన శిలామయ పదార్థము కొన్నివేల అడుగుల మందమున తయారయి కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురము జిల్లాలలో విరివిగ కనుపించు రాళ్లుగ మారినది. వీనిని భూగర్భశాస్త్రజ్ఞులు కడప వర్గపు రాళ్లు అందురు. ఈ రాళ్లు ఏర్పడి కనీసము 50 కోట్ల (500 మిలియన్ల) సంవత్సరము లయినది.

వాని తరువాత అదే పరిస్థితులలో కర్నూలు వర్గపు రాళ్ళు అని చెప్పబడు శిలలు ఏర్పడినవి.

కడప జిల్లాలో దొరకు రాతినార, బెరైట్స్, స్టియోటైట్ మొదలగు ఖనిజములు కడపవర్గపు రాళ్లలోనే దొరకును. సిమెంటు పరిశ్రమకు ఆంధ్రప్రదేశ్‌లో ఉపయోగించు సున్నపురాయి కర్నూలు వర్గపు రాళ్లలో దొరకును.

భూమి చరిత్రలోని ఈ రెండవ అధ్యాయమును పురాణయుగమందురు.

పురాణ యుగమునకు తరువాత ఆంధ్ర ప్రాంతమునందు సుమారు 30 కోట్ల (300 మిలియన్ల) సంవత్సరముల కాలము నూతన శిలానిక్షేపము లేవియు ఏర్పడకయే గడచినది. అంతట భూకంపమువంటి వైపరీత్యములు సంభవించి ప్రస్తుతము గోదావరినది, మహానది, దామోదరనదీ ప్రవాహ మార్గముల సమీపమున కడుదీర్ఘములైన బీటలు ఏర్పడి ఆయా ప్రాంతములలో భూమి క్రిందికి క్రుంగిపోయినది. తత్ఫలితముగ చాల పొడవైన తొట్లవంటి పల్లములు ఏర్పడినవి. తరువాత ఈ ప్రాంతములలో మహావృక్షములతోడి అరణ్యములు పెరుగుటకు వీలయిన వాతావరణము సంభవించెను. ఆ వృక్షజాల మంతయు ప్రకృతి శక్తుల ప్రభావము ప్రబలముగ నుండిన సమయమునందు ఒండ్రుమట్టి, ఇసుకలతో కలసి కొట్టుకొనిపోయి తొట్లవంటి ఆ పల్లపు ప్రాంతములలో నిక్షిప్తమయ్యెను. కాలక్రమమున అచటి నేల ఈ వృక్ష శిలా పదార్థ సంబంధమైన పొరలతోగూడ గట్టిపడి రాయిగా మారినది. వృక్ష సంబంధమైన ఆపదార్థము శిలాభూతము కాగా నేలబొగ్గు తయారయినది. సింగరేణి (బొగ్గు) నిధులు ఈ విధముగ తయారయినవే.

ఈ విధముగ కొంతకాలము గడచిన తరువాత వాతావరణ పరిస్థితులు మరల మారి అరణ్యములు నాశనమయినవి. చెట్టు చేమలు లేని ఎడారివంటి స్థితి ఏర్పడినది. ఆ పరిస్థితులలో ఎర్రని ఇసుకరాళ్ళు ఏర్పడినవి. ఈ కాలమున ఏర్పడిన శిలలను బస్తరు ప్రాంతములోని గోండు తెగ పేరిట 'గోండ్వానా' వర్గపు రాళ్ళు అని వ్యవహరింతురు.

ఈ విభాగపు టంతిమ ఘట్టములలో సముద్రము పొంగి తత్పూర్వము భూమిగానున్న కొంతమేర నాక్రమించెను. అట్టిప్రాంతములలో ఆక్రమిత ప్రాంతములలో ఏర్పడునట్టి శిలలు రూపొందెను.

గోండ్వానా యుగపు కడపటి దశలకు చెందినరాళ్ళు 11 కోట్ల (110 మిలియన్ల) సంవత్సరములకు ముందు నాటివి.

అప్పుడు మరియొక ప్రళయము సంభవించినట్లు భూమి అంతర్భాగము నందలి కడు తీవ్రమైన వేడిమికి బీటలు పారి ఆ పగుళ్ళనుండి భూగర్భము నందలి మట్టిరాళ్లు మొదలైనవి కరగి ఆ శిలాద్రవము చిమ్మన గొట్టములలోవలె పైకి చిమ్ముకొనివచ్చి ప్రవహించెను. ఇట్టి శిలాద్రవ పదార్థము 5, 6 వేల అడుగుల మందము గలిగి పొరలు పొరలుగ ఏర్పడినది. ఘనీభవించి శిలాభూతమైన దీనినే దక్కను లావారాళ్లందురు. ప్రత్తి పంటకు ప్రసిద్ధి చెందిన నల్లరేగడి అనబడు మట్టి యంతయు ఈ రాళ్ళనుండి ఉత్పన్నమయినది. ఈ ప్రాంతములోని వికారాబాదు ప్రాంతములోను, పశ్చిమ గోదావరి, తూర్పు గోదావరి జిల్లాలలోను ఈ రాళ్ళు గలవు. వీనికి దక్కను నాపలని పేరు.

దక్కను నాపలు ఏర్పడిన తరువాత భూగర్భమున కొంత ప్రశాంతత నెలకొనెను. సుమారు 4 కోట్ల (40 మిలియన్ల) సంవత్సరములకు పూర్వము తిరిగి తూర్పుతీర ప్రాంతములో సముద్రము విజృంభించి కొంత భూభాగము నాక్రమించెను. అట్టి ప్రాంతములలో ఇసుక సుద్దమట్టి నిక్షిప్తమై కాలక్రమమున అది రాయిగా మారెను. అట్టి శిలలు ఆంధ్రప్రదేశ్ తీరపు ప్రాంతములో, ముఖ్యముగా

తుని, రాజమండ్రి, తాడేపల్లిగూడెము, నూజివీడు, సంగంజాగర్లమూడి, కావలి సమీప ప్రాంతములలో కనిపించును.

భూమి చరిత్రలోని ఈ కాలపు రాళ్ళలో పెట్రోలియం సమృద్ధిగ దొరకుచున్నది. ఈ దృష్టితో చూచినచో ఈ రాళ్లు చాల విలువయినవి. వీనిని ఆంధ్ర ప్రాంతములో రాజమండ్రి ఇసుకరాళ్ళందురు. రాజమండ్రి రాళ్ళ అనంతరము ప్రస్తుత సముద్రపు లోతులలోను, సరస్సులలోను, డెల్టాలలోను ఏర్పడుచున్న శిథిల శిలాపదార్థపు మేటలు తప్ప వేరురకపు రాళ్ళులేవు? బ్ర. బా. గం. శా.

# శీతోష్ణస్థితి

భారతదేశమున ఇతర ప్రాంతముల వలెనే ఆంధ్రప్రదేశ్ కూడ ఉష్ణమండల ఋతుపవన శీతోష్ణస్థితి (ట్రాపికల్ మాన్‌సూన్ క్లైమేట్)కి చెందినది. ఇందు శీతోష్ణ పరిమాణములలోని వ్యత్యాసము కంటె ప్రాంతీయము, ఋతు సంబంధము అయిన వర్షపాతములోని వ్యత్యాసము నిశ్చితమైనది. ఎందువల్ల ననగా, శీతోష్ణ పరిమాణములో స్పష్టమైన వ్యత్యాసము కలిగించుటకు, దేశమందలి ఉత్తర అక్షాంశ భేద మంత గొప్పది కాదు.

ఉష్ణోగ్రత : శీతోష్ణ పరిమాణములో వివిధ ప్రాంతములకు గల కొద్దిపాటి వ్యత్యాసములు తీరభూమి, లోపలి ప్రదేశముల ఉనికి, ఎత్తులను బట్టి కలిగినవి. ఆంధ్రప్రదేశ మంతటిలోను ఉష్ణోగ్రత మే నెలలో అత్యధికముగను, డిసెంబరు నెలలో అత్యల్పముగను ఉండునట్లు కనుగొనబడినది. ఆంధ్రప్రదేశ్‌లో వేడిమి మిక్కుటముగ నుండు స్థలములు సముద్ర తీరమునకు దూరముగ చాల లోపల, దక్కను పీఠభూమి మీదను ఉన్నవి. ఎత్తున ఉన్న మదనపల్లి (చిత్తూరు జిల్లా), చింతపల్లి (విశాఖపట్టణము జిల్లా) కొండల వంటి స్థలములలో తక్క ఇతరత్రా మార్చి, ఏప్రిల్ మాసములలోను, ఎక్కువగా మే నెలలోను పగటిపూట వేడిగాడ్పులు ఎక్కువగ నుండును. ఇతర స్థలములలో కంటె గాలిలో తేమ ఎక్కువగనుండు విశాఖపట్టణము వంటి సముద్ర తీర స్థలములలోకూడ ముఖ్యముగ రాత్రులు గాలి బిగబట్టి ఉక్కపోయుచుండును. ఇందుకు భిన్నముగ తూర్పు పంజాబు, గంగాతీరపు పల్లపు ప్రదేశములలో కాననగు శీతలము ఆంధ్రప్రదేశములో లేదు. అట్టివి ఎక్కడైనను అరకులోయ (విశాఖపట్టణము జిల్లా) వంటి ప్రదేశములందున్నను అవి అరుదు. అరకులోయలో మే నెల కనిష్ఠ ఉష్ణోగ్రత 60° ఫా., గరిష్ఠ ఉష్ణోగ్రత 102° ఫా. డిసెంబరు గరిష్ఠ ఉష్ణోగ్రత 79° ఫా. కనిష్ఠ ఉష్ణోగ్రత 41° ఫా. అని కనుగొనబడినది. సముద్రతీరముననున్న విశాఖపట్టణము, కాకినాడ, మచిలీపట్టణముల వంటి స్థలములలో మే నెలలో దైనిక ఉష్ణోగ్రత 92° ఫా. నుండి 100° ఫా. వరకు మారుచుండును. కనీసపు ఉష్ణోగ్రత ఇంచుమించు 81° ఫా. ప్రాంతమున నుండును. డిసెంబరు నెలలో ఈస్థలములోని దైనిక గరిష్ఠ ఉష్ణోగ్రత 81° ఫా., 83° ఫా. మధ్యను, దైనిక కనిష్ఠ ఉష్ణోగ్రత దాదాపు 66° ఫా. ఉండును.

రెంటచింతల (గుంటూరు జిల్లా), కడపలవంటి స్థలములలో మే మాసమున దైనిక గరిష్ఠ ఉష్ణోగ్రత 106°ఫా., 107° ఫా. వరకు పెరుగును; దైనిక కనిష్ఠ ఉష్ణోగ్రత 83°ఫా., 84° ఫా. డిసెంబరు మాసములో దైనిక గరిష్ఠ ఉష్ణోగ్రత 88° ఫా. కనిష్ఠ ఉష్ణోగ్రత 62° ఫా. నుండి 66° ఫా. వరకు మారుచుండును. తెలంగాణాలో రామగుండమువద్ద మే, డిసెంబరు మాసములలో సాధారణ గరిష్ఠ ఉష్ణోగ్రత వరుసగ 110° ఫా., 86.1° ఫా. ఉండగా ఖమ్మమునందు డిసెంబరులో కూడ 92.7° ఫా. ఉండునట్లు కనుగొనబడినది. సముద్ర తీర ప్రదేశమునందును, పీఠభూమి మీదను దైనిక ఉష్ణోగ్రతావధి (డయర్నల్ రేంజ్ ఆఫ్ టెంపరేచర్) చాల మారుచుండును. ఎట్లన సముద్ర తీరము (విశాఖపట్టణము)న 11° ఫా. ఉండిన, నైరృతి పీఠభూఖండమున (కడప) 20°ఫా. లును, తెలంగాణా ఈశాన్యదిశా ప్రాంతమున (సిర్పూరు) 30° ఫా.లును ఉండును.

వర్షపాతము : ఆంధ్రప్రదేశములో నూటికి అరవై వంతుల కంటె ఎక్కువ ప్రదేశమున వర్షము 35″ ల కంటె తక్కువగనే కురియును. వర్షపాతములో గల అస్థిరత్వము చాల ఎక్కువ. ఇటువంటి అస్థిర వర్షపాతము మీద జనుల జీవనోపాధియైన వ్యవసాయ మాధారపడి యున్నది. ఈ అసమవృష్టి ఆంధ్రప్రదేశములోని ఇతర భాగములలో నున్నంత ఎక్కువగా గోదావరి, కృష్ణా డెల్టాలలోను ఉన్నది. ఐనప్పటికి ఇచ్చటి రైతుకు తన పంట పండునని ఇంచుమించుగ నమ్మకమే. ఇందుకు కారణము కాలువ నీటి పారుదలే.

వేరు వేరు ప్రాంతములలో కురియు వర్షములోని తేడాలనింక చూతము. సీలేరు, శబరి లోయలలో 55″ మొదలు 60″ వర్షము కురియుచుండ హాగరి నదిలోయలో 20″ కంటె తక్కువగనే వర్షము పడును. ఆంధ్రప్రదేశ మంతటిలోను అత్యధిక వర్షపాతము, అత్యల్పవర్షపాతముగల స్థలము లివి.

గోదావరిలోయలోని తూర్పుకనుమలలో వర్షము 50″కు పైననే కురియుమండ నెల్లూరు, కడప కొండలలో 30″కు తక్కువ వర్షించును. ఇందుకు ముఖ్య కారణములు రెండు: కడపకొండలు ఎత్తయినవి కాకపోవుట ఒకటి, ఋతు పవనములు వాటి దరికి వచ్చునప్పటికి వాటిలోని ఆర్ద్రిత అదివరకే ఆరిపోవుట రెండు. రాయలసీమ మధ్య భాగములో కురియు వర్షము 25″ కంటెను తక్కువ. ఇది క్షామ మండలమని పేరు పడిన ప్రదేశము. ఇక్కడ ప్రతి ఐదు సంవత్సరములకు ఒక క్షామము సంభవించుట పరిపాటి.

సముద్ర తీరము నుండి పీఠభూమి ప్రదేశములకు వెళ్లునప్పటికి వర్షపాతము సన్నగిల్లును. సముద్రతీర ప్రదేశములలో 40″ మొదలు 45″ వరకు, అంతకు మించియు వర్షించును. పీఠభూమి మీద వర్షపాతము 30″ ఉండును. కాని గోదావరినదికి ఉత్తరమున గల తీర ప్రదేశమున వర్షపాతము అధికము: అనగా 45″ నుండి 50″ వరకు ఉండును. ఇది క్రమముగ తూర్పుకనుమల దగ్గరకు వెళ్లునప్పటికి 40″ నుండి 42″ వరకు తగ్గును. అక్కడినుండి మరల 50″ కంటెను హెచ్చును. ఈ విధముగ వర్షపాతము నందలి తారతమ్యములను బట్టి చూచినచో అధిక వర్షపాతముగల రెండు ప్రదేశములకు నడుమ తక్కువ వర్షపాతముగల మండలము ఉన్నది. సముద్ర తీరము పొడుగునను అధిక వర్షపాతము కలుగుటకు రెండు ఋతుపవనములును కారణము. వీటిలో వెనుకకు మరలు ఋతు పవనము వలన ముఖ్యముగ గోదావరి డెల్టాలో వర్షము హెచ్చుగ కురియును. తీరమునకు దూరముగ లోపలనున్న ప్రదేశములో అధిక వర్షపాతమునకు కారణము తూర్పు కనుమల ప్రభావమే. పై నుడివిన తక్కువ వర్షపాతము గల మధ్య మండలములో ఋతు పవనములు రెండును దుర్బలము లగును. అందువల్ల ఇందలి వర్షపాతము తక్కువ. అనగా 38″, 45″ల మధ్య ఉండును. తూర్పు కనుమలు నైరృతి ఋతు పవనమునకు అడ్డంకుగనుండి సముద్ర తీరపు మైదానములలో వలసినంత వర్షము కురియకుండ చేయుటయేకాక వెనుకకు మరలిపోవు ఋతు పవనమును పీఠభూమిని చేరనీయకుండ సైతము చేయును. అందువలన వెనుకకు మరలిపోవు ఈ వర్షవాయువులు కృష్ణానది లోయ గుండను, కొంతవరకు పెన్ననది లోయగుండను చొచ్చుకొని పోవును. పీఠభూమి మీది జిల్లాలలోని కొన్ని ప్రదేశములలో ఈ ఋతుపవన కాలములో వర్షము కురియుట కిదియే కారణము. గోదావరినది పాపికొండలను భేదించుకొని వచ్చుచోట గోదావరిలోయ ఈ ఋతు పవనములు ధారాళముగ పోవుటకు వీలు లేనంత ఇరుకుగ నున్నది. తెలంగాణాలో చాలభాగమున వర్షపాతము 25″ మొదలు 40″ మధ్యనుండును. తుంగభద్ర లోయ పొడుగునను కురియు వర్షము 25″ కంటెను తక్కువ.

భారత ప్రభుత్వ వాతావరణ శాఖవారు సంవత్సరమును శీతకాలము (జనవరి, ఫిబ్రవరులు), వేసవి కాలము (మార్చి మొదలు జూన్ వరకు), వర్షకాలము (జూన్ మొదలు సెప్టెంబరు వరకు), వెనుక పట్టు వర్షకాలము - నైరృతి ఋతు పవనము మరలిపోవు కాలము (అక్టోబరు మొదలు డిసెంబరు వరకు) అను నాలుగు విభాగములు చేసిరి. ఈ విభాగములు భారతదేశమున కంతకు వర్తించునపుడు ఆంధ్ర ప్రదేశమునకు కూడ వర్తించునని వేరుగ చెప్పనక్కరలేదు. మొత్తముమీద భారతదేశ కాలమాన పరిస్థితుల ననుసరించియే ఆంధ్రప్రదేశపు కాలమాన పరిస్థితులును ఉండును.

ఈశాన్య ఋతుపవనము జనవరినెల ఆరంభమునకు భారతభూమిమీద సముద్ర ప్రదేశముల మీదను బాగుగ వర్షించుచుండును. గాలిలో తక్కువ తేమ, తేలికైన ఉత్తరపు ఈదరగాలి - ఇవి ఆంధ్రప్రదేశమునకే గాక భారత దేశ మందంతటను ఈ కాలమున కానవచ్చు సహజ లక్షణములు. ఈ కాలములో ఉత్తరభారత దేశములోని శీతకాలపు వర్షములకు భిన్నముగ ఆంధ్రప్రదేశములో వాతావరణము పొడిగా నుండును. ఇది డిసెంబరు మాసము నుండియే ఆరంభమగుననియు చెప్పవచ్చును.

వేసవి కాలములో అవిచ్ఛిన్నముగ వేడిమి దినదినము హెచ్చును. వేడిమి హెచ్చినకొలది గాలి ఒత్తిడి క్షీణించును. ఆంధ్రప్రదేశములోనే కాదు, భారతదేశమంతటిలోను ఉష్ణాధిక్యముగల మాసము 'మే'. భారతదేశ మంతటిలోను అత్యంత ఉష్ణప్రదేశము వాయవ్య దిశనున్న ఎడారి. అక్కడి పగటి గరిష్ఠ ఉష్ణోగ్రత 120° ఫా. లును అంతకంటె ఎక్కువ కూడ ఉండును. ఆంధ్రప్రదేశములోని అత్యుష్ణ ప్రదేశము కడప, గుంటూరు ప్రాంతము. వేసవికాలములో స్థానికముగ మామిడి జల్లు లనబడు కొద్ది వాన జల్లులు పడును. వీనికి స్థానిక వాయుగుండము (నిమ్నము)లతోను, ఎక్కువ తక్కువలు సరిదిద్దు వాయు సంచలనములతోను సంబంధ మున్నది.

నెల్లూరు ఉత్తరప్రాంతములకు తప్ప ఆంధ్రప్రదేశ మంతటికిని నైరృతిఋతుపవన కాలము చాల ముఖ్యమైనది. నెల్లూరు ఉత్తర ప్రాంతములమీద వెనుకకు మరలు నైరృతి ఋతుపవనముల ప్రభావము ఎక్కువ. మే నెల చివరినుండి భారతదేశము మీద వాయుప్రవాహ భ్రమణము (సర్క్యులేషన్) అంతకంతకు ప్రబలమగును. ఈ ప్రాబల్యము




ఆంధ్ర ప్రదేశ్ - సాంవత్సరిక సగటు వర్షపాతము

## ఆంధ్ర-ప్రదేశ్ సాంవత్సరిక సగటు వర్షపాతము

(1949 - 50 నుండి 1955 - 56)

వర్షపాతము అంగుళములలో

| జిల్లా | 1949 - 50 | 1950 - 51 | 1951 - 52 | 1952 - 53 | 1953 - 54 | 1954 - 55 | 1955 - 53 |
|---|---|---|---|---|---|---|---|
| 1. శ్రీకాకుళము .... | — | 33.70 | 41.80 | 39.20 | 46.90 | 46.30 | 58.80 |
| 2. విశాఖపట్టణము .... | 48.50 | 35.10 | 41.50 | 38.10 | 37.10 | 59.00 | 48.70 |
| 3. తూర్పు గోదావరి .... | 53.90 | 50.80 | 45.20 | 30.10 | 35.20 | 52.40 | 42.40 |
| 4. పశ్చిమ గోదావరి .... | 53.70 | 46.90 | 41.50 | 28.60 | 41.20 | 53.60 | 46.50 |
| 5. కృష్ణా .... | 45.70 | 34.20 | 35.20 | 24.00 | 33.70 | 46.70 | 45.10 |
| 6. గుంటూరు .... | 41.50 | 27.00 | 26.80 | 20.60 | 31.10 | 38.60 | 33.70 |
| 7. నెల్లూరు .... | 32.10 | 32.50 | 32.60 | 24.10 | 38.30 | 44.70 | 21.60 |
| 8. చిత్తూరు .... | 33.00 | 29.20 | 24.60 | 29.50 | 37.00 | 41.50 | 28.00 |
| 9. కడప .... | 28.10 | 19.70 | 21.00 | 20.00 | 29.80 | 35.20 | 30.60 |
| 10. అనంతపురము .... | 24.80 | 21.70 | 15.00 | 15.80 | 28.10 | 21.10 | 24.90 |
| 11. కర్నూలు .... | 33.70 | 22.70 | 31.60 | 14.70 | 20.70 | 25.20 | 31.60 |
| 12. మహబూబునగరము .... | 33.65 | 27.22 | 30.22 | 19.47 | 32.76 | 30.92 | 57.60 |
| 13. హైదరాబాదు .... | 24.83 | 33.88 | 26.95 | 16.77 | 31.43 | 27.23 | 43.70 |
| 14. మెదకు .... | 37.65 | 29.18 | 29.92 | 23.02 | 39.92 | 36.52 | 60.60 |
| 15. నిజామాబాదు .... | 45.14 | 31.22 | 40.14 | 24.44 | 54.91 | 36.79 | 41.00 |
| 16. ఆదిలాబాదు .... | 53.45 | 26.54 | 33.52 | 25.64 | 53.83 | 39.81 | 31.90 |
| 17. కరీంనగరము .... | 37.31 | 29.35 | 32.05 | 26.35 | 45.29 | 32.27 | 40.90 |
| 18. వరంగల్లు .... | 41.25 | 35.37 | 36.32 | 25.90 | 45.15 | 37.57 | 53.90 |
| 19. ఖమ్మం .... | — | — | — | — | 6.67 | 40.75 | 45.80 |
| 20. నల్గొండ .... | 28.12 | 26.99 | 23.41 | 19.16 | 31.17 | 32.46 | 50.10 |

స్టేటిస్టికల్ ఎబ్స్ట్రాక్టు - ఆంధ్ర ప్రదేశ్ (1958)

## ఋతువుల ననుసరించి వర్షపాతము (ఆంధ్రప్రదేశ్ జిల్లాలవారీ 1955 - 56)

| జిల్లా | నైఋతి ఋతు పవనములు జూన్-సెప్టంబరు 1955 అంగుళములలో | ఈశాన్య ఋతుపవనములు అక్టోబరు-డిశంబరు 1955 అంగుళములలో | శీతకాలము జనవరి, ఫిబ్రవరి 1956 అంగుళములలో | వేసవికాలము మార్చి, మే 1956 అంగుళములలో | మొత్తము వర్షపాతము జూన్ 1955 మే 1956 అంగుళములలో | సాధారణ వర్షపాతము అంగుళములలో |
|---|---|---|---|---|---|---|
| 1. శ్రీకాకుళము | 3.40 | 21.2 | 0.4 | 3.2 | 58.8 | 42.7 |
| 2. విశాఖపట్టణము | 25.6 | 16.9 | 0.5 | 5.5 | 48.7 | 39.0 |
| 3. తూర్పు గోదావరి | 21.5 | 14.4 | 0.4 | 6.1 | 42.4 | 41.8 |
| 4. పశ్చిమ గోదావరి | 27.2 | 14.1 | 0.1 | 5 1 | 46.5 | 40.7 |
| 5. కృష్ణా | 25.9 | 15.0 | | 4.2 | 45.1 | 37.0 |
| 6. గుంటూరు | 16.9 | 14.0 | 0.1 | 2.7 | 33.7 | 32.4 |
| 7. నెల్లూరు | 11.9 | 4.6 | 0.8 | 4.3 | 21.6 | 35.5 |
| 8. చిత్తూరు | 15.1 | 8.0 | 0.2 | 4.7 | 28.0 | 33.7 |
| 9. కడప | 15.6 | 8.5 | 0.6 | 5.9 | 30.6 | 27.1 |
| 10. అనంతపురము | 14.0 | 5.2 | 0.1 | 5.6 | 24.9 | 22.4 |
| 11. కర్నూలు | 23.5 | 5.2 | 0.1 | 2.8 | 31.6 | 24.2 |
| 12. మహబూబునగరము | 34.3 | 3.5 | — | 3.2 | 41.0 | 28.4 |
| 13. హైదరాబాదు | 37.3 | 2.5 | — | 3.9 | 43.7 | 30.4 |
| 14. మెదకు | 43.5 | 3.2 | — | 3.4 | 50.1 | 36.3 |
| 15. నిజామాబాదు | 52.9 | 1.5 | 0.1 | 3.1 | 57.6 | 41.5 |
| 16. ఆదిలాబాదు | 50.4 | 6.4 | 0.5 | 3.3 | 60.6 | 41.7 |
| 17. కరింనగరము | 40.0 | 3.9 | 1.0 | 9.0 | 53.9 | 35.0 |
| 18. వరంగల్లు | 32.2 | 6.0 | 0.2 | 7.4 | 45.8 | 38.2 |
| 19. ఖమ్మం | 32.6 | 5.1 | — | 3.2 | 40.9 | 37.9 |
| 20. నల్గొండ | 13.5 | 7.0 | 0.3 | 11.1 | 31.9 | 26.8 |

స్టేటిస్టికల్ ఏబస్ట్రాక్టు - ఆంధ్ర ప్రదేశ్ (1958)


స్కేలు
0 50 100 150
మైళ్లు
ఆదిలాబాదు
నిజామాబాదు
కరీంనగరము
మెదకు
వరంగల్లు
హైదరాబాదు
నల్గొండ
మహబూబునగరము
శ్రీకాకుళము
విశాఖపట్టణము
తూర్పుగోదావరి
పశ్చిమగోదావరి
కృష్ణా
గుంటూరు
కర్నూలు
నెల్లూరు
కడప
అనంతపురము
చిత్తూరు
మద్రాసు రాష్ట్రము
ఎఱ్ఱనేల
నల్లరేగడనేల
ఒండ్రునేల
ఔగురు (తువ్వ) నేల
ఇసుకనేల
76
78
80
82
84
18
16
14

ఆంధ్ర ప్రదేశ్ - నేలలు

భూమధ్యరేఖకు దక్షిణమునుండి ఆగ్నేయ వ్యాపార పవనములు ఉత్తర దిశగా అరేబియా సముద్రములోనికిని, బంగాళాఖాతములోనికిని ఇంచుమించుగా ఆకస్మికముగ వీచ మొదలిడి భారత దేశ వాతావరణ భ్రమణమున చిక్కుకొను వరకు నుండును. ఈ విధముగ నైఋతి వర్షములు మలబారు తీరములోను, ఆంధ్రప్రదేశములోను కూడ జూన్ నెల మొదటి ఐదు దినములలో ఆరంభ మగును. ప్రాయికముగ ఒక్క విశాఖపట్టణము, శ్రీకాకుళము ప్రాంతములలో మాత్రము ఆ నెల పదవ తేదీకి గాని వర్షము పడదు. వర్షము లెంత శీఘ్రముగ కురిసిన కర్షకునికి అంత మంచిది; అతడు వ్యవసాయపు పనులు శీఘ్రముగ ప్రారంభించ గలడు. ఋతు పవనముల సంచారదిశ, వేరు వేరు ప్రాంతములలో వీని ప్రభావమున పడు వర్షము యొక్క పంపకము వర్షవాయువులు వీచు దిశలో నుండు పర్వత శ్రేణి వ్యాపనము ననుసరించి వాని ఎత్తు ఉండును. అరేబియా సముద్రము మీదుగ వచ్చు ఋతు పవన ప్రవాహము పడమటి కనుమలను దాటినప్పుడు అక్కడ కుంభవృష్టిగ కురిసి, పిదప దక్కను మీదుగ బంగాళాఖాతము లోనికి వచ్చును. ఈ వాయు ప్రవాహమును, బంగాళాఖాతము మీదుగ వచ్చు వాయు ప్రవాహమును సాధారణముగ ఒరిస్సావద్ద కలియును. ఈ కాలములో ఉష్ణమండల గుండము లనబడు నిమ్నములు (ట్రాపికల్ డిప్రెషన్స్) ఉత్తరమునను, బంగాళాఖాతము మధ్య ప్రదేశమునను అప్పుడప్పుడు ఏర్పడుటవలన తీరస్థ ఆంధ్రప్రదేశములో ముఖ్యముగా ఉత్తరపు జిల్లాలలో బాగుగా వర్షము కురియును.

సెప్టెంబరు నెలలో నైఋతి ఋతుపవనము ఉత్తర భారతదేశమునుండి వెనుకకు మరలిపోవ ప్రారంభించును. అక్టోబరులో ఋతు సంబంధమైన అల్పప్రేష మండలము (సీజనల్ లో ప్రెషర్ ఏరియా) ఉత్తర భారతదేశము నుండి బంగాళా ఖాతమున దక్షిణపు వైపునకు మారును. ఆంధ్రప్రదేశములో, ప్రధానముగ సముద్ర తీరము పొడుగునను అక్టోబరు, నవంబరు మాసములలో తూర్పు వానలు కురియును. ఇది ఒక విధముగ వాతావరణము పొడిగా నుండు శీతకాలపు పరిస్థితులు కుదురుకొను వరకు మార్పు కాలముగ ఏర్పడుచున్నది. ఈకాలములో దక్షిణ బంగాళాఖాతమునకు అడ్డముగ తూర్పునుండి పడమటికి కదలిపోవు వాయు తరంగములు, అల్ప ప్రేష మండలముల కారణముగ ఒక క్రమాంతరము లేకుండ, నడుమ నడుమ వర్షములు పడుచుండును. ఈ అల్ప ప్రేషమండలములలో కొన్ని ఉష్ణమండల గుండములు (ట్రాపికల్ డిప్రెషన్స్) గా గాని తుపానులుగా గాని మారి ప్రబలవర్షములకు కారణమై ప్రజలకును, పైరు పంటలకును ఉపద్రవకారు లగును. ఇటువంటి ప్రతి ఎనిమిది తుపానులలోను ఆరు మచిలీపట్టణము, కాకినాడల మధ్య తీరమును దాటుచుండును (చూ: ఉప్పెనలు). ఈ వాయు తరంగములు కాని, అల్ప ప్రేషములు (లోప్రెషర్స్) కాని దీర్ఘకాలము వరకు లేకపోయిన యెడల అనావృష్టి కలిగి కరవులు సంభవించును. ఈ ఋతువులోని వర్షములు చెరువులక్రింద సాగుచేయు కర్షకులకు సహాయకారులు. ఎందువల్ల ననగా ఈ వర్షముల వలన చెరువులకు రెండవసారి నీరు వచ్చి నిండును. కాని వర్షపాతము అధికమైనచో తుపానులలోని వర్షములవలన సంభవించునట్లు, వానికి తరచుగ గండ్లుపడి వాని దిగువ నుండు పొలములను ముంచివేయును.

వర్షపాతము తక్కువగుట ఎంత అనర్థకమో ఎక్కువగా కురియుటయు అంతే అనర్థకము. వరదలు, కరవులు రెండును అనర్థకములే. 1870-1954 సంవత్సరముల మధ్య సముద్ర తీరస్థాంధ్ర దేశములో తొమ్మిది మారులు వరదల వల్ల నష్టము కలిగినది. మూడు కరవులు సంభవించినవి. అదే కాలములో అటువంటివి ఎనిమిది వరదలు, తొమ్మిది కరవులు రాయలసీమలో సంభవించినవి. వీనిలో కరవుల వలన నష్టము అపారము (చూ: కరవులు). వి.ఎల్.ఎస్.ప్ర

# నేలలు

శిలలు శీతవాతాతపముల వలన శిథిలములగుట వలన నేలలు ఏర్పడినవి. స్థూలముగ నాలోచించిన ఆంధ్రప్రదేశ భూభాగము మిక్కిలి పురాతనమగు భూగర్భనిర్మాణమునకు చెందినది. దీనిలో 'నైస్' లేక 'గ్రానిటాయిడ్ నైస్' శిలలుండును. వీనికి పిమ్మట నుద్భవించిన శిలా జాతులు కడప, కర్నూలు జిల్లాలయందును, కృష్ణా గోదావరుల డెల్టాలయందును, తూర్పు తీరమునను గలవు. నేలలు రెండు విధములుగ ఏర్పడును. (1) భూమిలోనున్న రాళ్లు వానిపైనున్న వాతావరణ ప్రభావముచే శిథిలమై తుట్టతుదకు మెత్తని మన్నుగా మారును. వీనిని నిలకడ (సెడెంటరీ) నేల లందురు. దీనికి ఉదాహరణము నల్ల నేలలు, ఎర్ర నేలలు, జేగురు నేలలు; (2) నేలలోనున్న రాళ్లు వాతావరణ ప్రభావముచే మెత్తని మన్నుగా మారి నీటిలో కలిసి కొట్టుకొని వచ్చి మరొకచోట మేటవేసి నేలగా

మారును. వీనిని కొట్టుకొనివచ్చిన 'ట్రాన్స్‌పోర్టెడ్' నేల అందురు - ఉదా: డెల్టా భూములు. ఈ రెండు రకముల నేలలును ఆంధ్ర ప్రదేశములో కాననగును.

**నేలల విభజన :** ఆంధ్రప్రదేశ్‌లోని నేలలు ఆధునిక శాస్త్రీయ పద్ధతుల ప్రకారము ఇంతవరకు తరగతి వారిగ విభజింపబడలేదు. సుమారు 40 లేక 50 సంవత్సరముల క్రిందట భూమిశిస్తు నిర్ధారణ చేయుటకై రెవిన్యూశాఖ వారు పలురకముల నేలలను వాని రంగునుబట్టి, వానిలో నుండు ఇసుకపాళ్లను, బంకమన్ను పాళ్లను బట్టి నల్ల నేలలు, ఎఱ్ఱ నేలలు, ఇసుక నేలలు, డెల్టాభూములుగ విభజించిరి. ఇప్పటికిని ఆ విభజనయే అమలులో నున్నది*. ఈ వివిధ ములగు నేలల గుణములు, వివరములు క్రింద పేర్కొన బడినవి. ఈ విభజన ప్రకారము ఆంధ్రప్రదేశ్‌లో 8.6% డెల్టా నేలలు, 50.5% నల్ల నేలలు, 31.4% ఎఱ్ఱ నేలలు, 4.9% ఇసుక నేలలు ఉన్నవి. దీనినిబట్టి చూచిన యెడల ఆంధ్రప్రదేశ్‌లో సగమునకు సగము నల్ల నేలలు. ఇవి ముఖ్యముగ గుంటూరు, కర్నూలు జిల్లాలలో మెండు.

**వండలి నేలలు :** ఇవి నదుల వలన ఏర్పడిన డెల్టా భూములై యుండును. క్షేత్ర రూపము (సాయిల్ ప్రొఫైల్) నందు వండలి, ఇసుక పొర విడచి పొరగా ఏర్పడును. ఈ రెండు పొరలు నదులలో మన్ను కొట్టుకొని వచ్చి ఏర్పడినవే. ఈ పొరలు సంఘట్టనము నదులనుండి లభించు వండలిని బట్టియు, నదులు ప్రవహించెడి భూభాగ మును బట్టియు మారుచుండును. ఈ కారణములనుబట్టియే గోదావరి డెల్టా భూములకును, కృష్ణా డెల్టా భూముల కును చాల తారతమ్యము గలదు. గోదావరినది 'ట్రాప్ రాక్' అను ప్రదేశముద్వారా ప్రవహించి నల్లని సార వంతమగు బంకమన్నును తీసికొని వచ్చును. ఈ నేలలలో ఎక్కువ సున్నమును, స్ఫురత్పంచామ్లజనిదమును, పొటాష్ యును ఉండును. ఇట్టి నేలలయందు లభ్యమగు పొటాష్, స్ఫురత్పంచామ్ల జనిదములు కూడ హెచ్చు. అందు ముఖ్యముగ పెరుగు పైరులు వరి, చెఱకు. ఈ నేలలు అరటి, అపరాలు మున్నగు పంటలకు కూడ అనుగుణముగ నుండును.

**నల్ల నేలలు :** నల్ల నేలలు లేదా ప్రత్తి పండించెడి నల్ల నేలలయొక్క క్షేత్ర రూపములు లోతుగానో, మెరక గానో ఉండును. ఇందులో కొన్నింటి యందు జిప్సమ్ ఉండును ; మరి కొన్నింటియందు ఉండదు. ఈ వివిధ భేద ములనుబట్టి నల్ల నేలలు నాలుగు రకములుగ విభజింప బడుచున్నవి. 1. జిప్సమ్ గల మెరక నేల, 2. జిప్సమ్ లేని మెరక నేల, 3. జిప్సమ్ గల లోతు నేల, 4. జిప్సమ్ లేని లోతు నేల.

ఈ రకపు నేలలు సంవత్సరమునకు 20″ లేదా 30″లకు తక్కువగ వర్షపాతముగల రాయలసీమలో మాత్రమేగాక 40″లకు మించిన వర్షపాతము గల గుంటూరు జిల్లా యందును తెలంగాణా పశ్చిమ ప్రాంతములందును కూడ హెచ్చుగ కలవు. మెరక నేలల లోతు 3 లేదా 4 అడు గులకంటె హెచ్చుగ నుండదు. కొన్నిచోట్ల శిథిలముకాని శిలలు అడుగున్నర లేదా రెండు అడుగుల లోపలనే తగు లును. లోతైన నేలలు 9 అడుగులు, అంతకంటె లోతు కూడ ఉండును. వీని లోపలి భాగమున శిథిలమైన శిలా పదార్థములు (వెదర్ రాక్ మెటీరియల్) ఉండును. దీనికి ప్రాంతీయముగ 'గరసు' అను పేరు కలదు. ఈ నేల లన్నింటిలో సున్నము ఉండవచ్చును - ఉండక పోవచ్చును. జిప్సమ్ ఉండిన పక్షమున అది మూడడుగుల లోతున తగులును.

జిప్సమ్ ఉన్న నేలలో 1.0% లేదా 1.5% సోడియమ్ లవణములు కూడ ఉండును. ఇట్టి నేలలకు ప్రత్యేకమగు భౌతిక ధర్మములును, రసాయన సంఘట్టనమును గలవు. ఇట్టి నేలలను దున్నుట కష్టము. వీనిలో 65% నుండి 80% వరకు బంకమన్ను, వండలి మన్ను ఉండును. కొన్ని సమయ ములలో నింతకంటె హెచ్చుగ కూడ నుండవచ్చును. ఈ నేలలు క్షారస్వభావము కలవి. ఇందు 7% వరకు సున్నము ఉండును. త్వరగా నీరు లోనికి చొరకుండుట, హెచ్చుగా నీరుపీల్చుట, హెచ్చుగ కణముల మధ్య ఖాళీ స్థలముండుట, హెచ్చు గరిష్ఠజలవాహక శక్తి, అధిక విశిష్ట గురుత్వము - ఇవి వీని విశిష్ట ధర్మములు. వీనియందు నత్రజని లోపించి నను పొటాషు, స్ఫురత్పంచామ్ల జనిదముల పాళ్ళు తగు మాత్రము ఉండును. వీనిలో క్షారములు ఎక్కువగ నుండును. ఈ నేలలు వేసవి కాలములో తీవ్రముగ బీటలు వారును. కనుక 'నల్ల నేల తనను తనే దున్ను కొను'నని లోకోక్తి గలదు. అన్ని విధముల స్వభావమందు ఈ నేలలు ఎఱ్ఱనేలలకు వ్యతిరేకములు. క్షార స్వభావము కలిగి యున్నను పంటల దిగుబడి సామాన్యముగనే ఉండును. ఈ నేలలు అనేక రకములైన శిలలనుండి ఏర్పడినవి. ఇందులో కొన్ని ముఖ్యమైన శిలలు నల్లశాణపురాయి (గ్రానైట్), నైస్, ట్రాప్‌రాక్. కొన్ని పరిశోధనలనుబట్టి ఈ నల్ల నేలలు సున్నము, సోడా హెచ్చుగా గల 'లైమ్ ఫెల్‌స్పార్స్' నుండి ఏర్పడినవని ఊహించు చున్నారు.

* నేలల ధర్మములను గమనించుటకు అడుగున గల రాతి వరకు గల పొరల కూటమి లేక క్షేత్రరూపము చాల ఉపయో గించును.

తుంగభద్ర ఆనకట్ట నిర్మాణమునకు పూర్వము (1947) జరిపిన నేలసర్వేలలో ఈ నేలల లక్షణములు పూర్తిగ పరిశోధింప బడినవి. తుంగభద్రనది నీటిచే తడిసిన యెడల ఈ నేలలు చౌడెక్కునాయని పరీక్షించుటకు ఈ పరిశోధన జరుపబడినది. దీని ఫలితముగ శ్రేష్ఠమగు తుంగభద్రా జలము వీనికి యోగ్యమనియు, నేలలోపలి భాగమున లవణములున్నను, జాగ్రత్తతో నీరుపెట్టి పైరులను పెంచిన యెడల నేలలు చౌడెక్కునను భయములేదనియు నిర్ధారణ యైనది. ఈ పరిశోధనలు పూర్తిచేసి, శిఫారసులు చేసిన పిదపనే తుంగభద్ర ప్రాజెక్టు నిర్మాణము జరిగినది. ఈ నేలలలో జొన్న, సజ్జ, కొర్ర, చామ, పొగాకు, మిరప, పసుపు పైరగును. నీటి పారుదలగల చోట్ల వరి, చెఱకు పైరగును. ఈ నేలలో ముఖ్యమగు పంట ప్రత్తి యగుటచే వీనిని నల్లప్రత్తినేలలనికూడ అందురు.

**ఎర్రనేలలు :** దక్షిణ భారతదేశమున ఆంధ్ర ప్రదేశ్‌లో తప్ప ఇతర రాష్ట్రములన్నిటిలోను ఎర్రనేలల భాగము ఎక్కువ. విభజన కాక పూర్వము (1953) మద్రాసు రాష్ట్రమున సాగులోనున్న మూడు కోట్ల ఎకరముల భూమిలో 66% ఎర్ర నేలలే. మైసూరు రాష్ట్రమున 66% ఎర్ర నేలలు. కేరళ అంతయు ఎర్ర నేలయే. విభజనానంతరము ఆంధ్రరాష్ట్రము (1953)న మాత్రము 50% నల్ల నేలలు, 31% మాత్రము ఎర్ర నేలలు గలవు. తెలంగాణా, నల్గొండ, వరంగల్లు, మెదక్, కరీంనగర్, హైదరాబాదు ప్రాంతములు విస్తారముగ ఎర్ర నేలలు. మహబూబ్‌నగర్, ఆదిలాబాద్ జిల్లాల తూర్పు ప్రాంతములు ఎర్రనేలలు.

ఎర్రనేలల యొక్క క్షేత్రరూపము మెరకయై ఎక్కువ లోతు ఉండదు. ఇందలి ప్రతి లక్షణముకూడ నల్లనేలలకు వ్యతిరేకమైనది. అడుగుననుండు శిలలనుండు పంచీకరణము వలన ఇవి ఏర్పడినవని ఊహించు చున్నారు. ఇట్టి నేలలు అభ్రకము హెచ్చుగాగల అమ్ల శిలలగు ఎర్ర గ్రానైట్ల నుండి జనించి యుండును.

ఈ నేలలు నల్ల నేలలంత లోతుండవు. వానికంటె పదునై, క్షారగుణము తక్కువగా ఉండి ఇసుకపాలు ఎక్కువైన గరువుడు (గరప) నేలలుగా నుండును. వీనిలో బంకమన్ను గల నేలలు కొద్ది. నీటిలో కరగు లవణములు 0·25% కు మించవు. వీనియందు సేంద్రియ పదార్థములు, వృక్షాహార ద్రవ్యములు లోపించి యుండును. తరచుగా ఇటువంటి నేలలలో ఉలవలు మొదలైన పప్పు దినుసులు, వేరుశనగ పైరు చేయుదురు. వర్షాధారమున పండ్ల తోటలు పెరుగును. నీటి వసతులున్న చోట ఎక్కువగా లాభించు ప్రత్తి, పొగాకు, చెఱకు పైరు చేయుదురు. ఈ నేలలలో లవణముల పరిమితి తక్కువగుటచే భూములకు నీరు పెట్టినను చౌడెక్కునను భయములేదు.

**జేగురు నేలలు (లాటిరైట్ సాయిల్స్) :** ఈ నేలలు ప్రత్యేకముగా భారతదేశముననే కలవు. కొన్ని విశిష్టములగు శిలలనుండి ప్రత్యేకమగు శీతోష్ణస్థితి పరిస్థితుల యందు ఇవి ఏర్పడును. ఇవి అడుగునగల రాళ్ళ నుండియు, నిక్షిప్తములుగను కూడ ఏర్పడును. భారత దేశము పడమటి తీరమంతటను, తూర్పు తీరమున కొన్ని చోట్లను ఇవి కలవు. ఈ నేలలు ముఖ్యముగ వాతావరణ ప్రభావము వలన జనించును. శిలాధర్మము లంతముఖ్యములు కావు. ఈ నేలలు వర్షపాతము పుష్కలముగ నున్న చోట్లను తేమ, వేడిమి హెచ్చుగనున్న చోట్లను ఉండును. ఈ రకపు నేలలు కేరళ రాష్ట్రములో మెండు. ఇవి విశాఖపట్టణము, నెల్లూరు, చిత్తూరు జిల్లాలయందున్నవి; ఆంధ్రప్రదేశమున మొత్తముమీద ఇవి చాల తక్కువ. ఈ నేలలు ముదురుతోపువర్ణము గలిగి యుండును. వీనియందు నత్రజని హెచ్చుగ నుండును. క్షారములు చాల తక్కువ; స్ఫురత్వంచామ్లజనిదము మొత్తము మీద హెచ్చుగ నున్నను లభ్యమగు ద్రవ్యము చాల తక్కువ; పొటాషు కూడ మొత్తముమీద 0·1% నుండి 0·2% వరకు ఉన్నను లభ్యమగు ద్రవ్యము తక్కువే; సున్నము పాళ్లు కూడ చాల లోపించియుండును; ఇనుము, అల్యూమినియమ్ ఆక్సైడులు 30% నుండి 35% వరకు ఉండును; ఇవి చాల హెచ్చు. ఈ నేలలలో వరి, కొబ్బరి, పోక, పండ్లు, పప్పు దినుసులు పైరగును.

**కొండభూములు - అడవి నేలలు :** ఇవి ఆంధ్రప్రదేశము మొత్తముమీద చాల తక్కువ. ఇవి ఇంచుమించు జేగురు నేలలను పోలియుండును. వీటిలో సేంద్రియ పదార్థము హెచ్చుగ నుండును. ఇట్టి నేలలయందు కాఫీ, టీ, రబ్బరు - బంగాళా దుంపలు, కాబేజి మొదలగు కూరలు పైరగును. సరుగుడు (చవుక), జీడిమామిడి తోటలు పెంచుటకును, పూలు, పండ్లు పండించుటకును వీలుండును. ఈ నేలలందు క్షారగుణము బహు తక్కువ.

**నేలల సర్వేలు :** క్షేత్ర రూపము ననుసరించియు, నేలపై పొరలను వేరుపరచి వృక్షాహార పరిమితులకై శోధించియు ఆంధ్రప్రదేశమంతటను నేల సర్వేలు జరిగినవి. వరిపైరుకు వేయ వలసిన ఎరువులను గురించి గోదావరి, కృష్ణా డెల్టాలలో నేల సర్వేలను జరుపగా వానియందు నత్రజని, స్ఫురత్వంచామ్లజనిదములు తక్కువయని తెలియవచ్చినది. వృక్షాహారపదార్థములలో మూడవ స్థానము నాక్రమించిన పొటాష్ మాత్రము పుష్కలముగా

గలదు. కాబట్టి ఈ నేలలకు నత్రజని, భాస్వరపు ఎరువులను వేయుట యోగ్యమని నిర్ధారణ చేయబడెను. సగటున భారత దేశము యొక్క నేలలలో పొటాష్ పరిమితి చాలినంత యున్నది. వరి ధాన్యాది మామూలు పైరులు పెంచినపుడు దీనిని ఎరువు రూపమున వేయుట అనవసరము. పొగాకు, బంగాళా దుంపలు, అరటి మున్నగు పైరులు వేసినప్పుడు మాత్రము పొటాష్ ఎరువులను ఉపయోగించవలెను. అనంతపురము జిల్లాలో పండ్ల తోటలను విస్తరింప జేయుటకు నేల సర్వేలు జరిగి తగు సిఫారసులు చేయబడినవి. ఉప్పెన దెబ్బతగిలి పాడైన భూములను కూడ సర్వేచేసి బాగు చేయుటకు తగు సలహాలిచ్చిరి.

**తెలంగానా క్షేత్ర లక్షణములు :** తెలంగానాలో నేలల విభజన ఆంధ్రప్రదేశ్ నందలి ఇతర భాగముల నేలల విభజనతో సమన్వయించుట మిక్కిలి అవసరము. ఆంధ్రరాష్ట్రపు నేలలను గురించి తెలిసినంత వివరముగ తెలంగానా నేలలను గురించి తెలియదు. ఐనను ఆంధ్ర ప్రదేశ్‌లో అంతర్భాగమగు తెలంగానా నేలలను గురించి దొరికినంత వరకు వివరము ఈక్రింద చేర్చబడినవి. ఈ ప్రాంతపు నేలలు ఇంచుమించు ఆంధ్రప్రదేశపు ఇతర ప్రాంతముల నేలలను పోలియుండును.*

తెలంగానా నేలలను నలుపు, ఎరుపు, ఇసుక నేలలని మూడు తరగతులుగ విభజింప వచ్చును. ఎత్తగు ప్రదేశము లందలి నేలలు ఎక్కువ జిగురుగా ఉండును. వీటియందు అల్యూమినియం పాలు ఎక్కువ. చదును ప్రదేశములో జిగురు తక్కువయగు గరివిడి నేలలు గలవు. స్థూలముగ చూచిన బసాల్టు అమిగ్డలాయిడ్ రాళ్ళజాతుల నుండి ఈ రెండు ఏర్పడియుండవచ్చునని తోచును. ఇందు మొదటి జాతి శిలలు నల్ల నేలలను, రెండవజాతి శిలలు గరివిడి నేలలను జనింపజేసి యుండవలెను. ఈ నేలలందు భూసారము, జలబంధకశక్తి హెచ్చు. వేసవిలో కొన్ని నల్ల నేలలలో నీరు ఇగిరిపోవుటచే అవి సంకోచము పొంది కొన్ని అడుగుల లోతువరకు బీటలువడి పగులును. ఇట్టి నేలలు పైన చెప్పినట్లు నల్ల నేల తనను తానే దున్నుకొనునని చెప్పుదురు.

ప్రాంతీయముగ నేలలో నున్న సున్నపు పాళ్లనుబట్టి తెలంగానా నేలలు ఈ విధమున విభజింప బడినవి. ఉదా రేగర్ (రేగడబ్లాక్ - సాయిల్ - నల్ల రేగడ నేల) అను నేల ముదురు నలుపు రంగు కలిగి తడిసినప్పుడు మెత్తగనుండు వండలినేల. దీనియందు సున్నపు పాలు ఎక్కువ, ఇసుక తక్కువ. 'కఠోరేగర్' అనునది జిగురు గరివిడి నేల. దీనియందు సున్నము తక్కువ. 'మోరా' యను నేలయందు 7% సున్నముండును. ఇది మంచి పదునుగల తోటభూమి. 'రంతీజమీన్' అనునది 5% సున్నముగల తోటభూమి. 'చూనాకా రేగార్' అనునది అల్యూమినియం హెచ్చుగాగల నేల. దీనియందు 12% వరకు సున్నము గలదు. ఇది జొన్న, పప్పు దినుసులు మొదలగు పంటలకు మిక్కిలి యోగ్యమైనది. పి. స.; బి. అ. రా.

* 1922 ప్రభుత్వపు నివేదికలో హైదరాబాదు రాష్ట్రములోని పలు రకముల నేలలు వర్ణించ బడినవి.

# ఖనిజ సంపద

భారతదేశములోకెల్ల ఆంధ్రప్రదేశ్ ప్రకృతి సంపద దృష్ట్యా ఐశ్వర్యవంతమైన ప్రాంతములలో ముఖ్యమైనది. ఏ ఖనిజమైనను, ఒక ప్రత్యేక రకపు రాతితో కలసి యుండుట ప్రకృతిసిద్ధమైన విషయము. అందుచేత, ఏ ప్రాంతపు ఖనిజ సంపదనుగూర్చియైన సరిగా అవగాహము చేసికొనవలయునన్నచో ఆ ప్రాంతపు భూతత్త్వశాస్త్ర పరిశీలన చాల అవసరము. భూతత్త్వశాస్త్రరీత్యా ఆంధ్ర పదేశ్ శిలా వర్గీకరణము దిగువ చర్చింపబడినది.

**ధార్వాడ శిలలు (ధార్వార్స్):** మైసూరు రాష్ట్రములోని ధార్వాడలో మొదటిసారిగ గుర్తింపబడిన ధార్వాడ రకపు రాళ్ళు ఆంధ్రప్రదేశ్‌లో అతిపురాతనమైనవి. ఈ ధార్వాడ వర్గము నిజముగ ఆర్థిక ఖనిజములకు నిధియని పేరుపడినది. ఆంధ్రప్రదేశమందంతటను, అచ్చటచ్చట ఈ రకపు రాళ్ళు కనిపించుచున్నవి. ప్రపంచఖ్యాతి నందిన కోలారు బంగారు గనులు (మైసూరు) ఈ జాతికే చెందియున్నవి. ఈశాన్య దిక్కుగ కుప్పం ఉత్తర భాగము లోను, చిత్తూరు జిల్లాలోను ఇట్టి రాళ్లున్నవి. ధార్వాడ రాళ్ళ యొక్క మరియొక శాఖ గూడూరు (నెల్లూరుజిల్లా) ప్రాంతములోను, దానికి ఆగ్నేయ, వాయవ్య దిక్కుల లోను వ్యాపించియున్నది. నెల్లూరుజిల్లాయందలి అభ్రకపు గనులు, గరిమినిపెంట (నెల్లూరుజిల్లా) లోని రాగి గనులు ఇట్టి శిలలలోనే నెలకొని యున్నవి. హట్టి, మస్కి, తోపల్, దొడ్డి, గద్వాల ప్రాంతముల బంగారుగనులు ధార్వాడ శిలలలోనే దొరకినవి. కరీంనగర్ జిల్లాలోకూడ ధార్వాడ శిలలు ఉన్నట్లు కనుగొనబడినవి. అనంతపురములో ఈ రాయి చాల ప్రముఖస్థానము ఆక్రమించియున్నది. కొంత కాలము క్రిందట ఒక విదేశపు కంపెనీ అనంతపురములోని ఈరాళ్ళనుండి బంగారము తీయుటకు ప్రయత్నము చేసినది.




ఆంధ్రప్రదేశ్ - ఖనిజసంపద

## ఆంధ్రప్రదేశ్ - ఖనిజోత్పత్తి

(టన్నులలో)

| ఖనిజము | 1958 - 59 | 1959 - 60 | 1960 - 61 |
|---|---|---|---|
| 1. అపటైటు | 150 | 455 | 937 |
| 2. ఆస్బెస్టాస్ | 15 | 313 | 901 |
| 3. బెరైటిస్ | 21,729 | 36,676 | 21,992 |
| 4. కేల్సైట్ | .... | 807 | 3,477 |
| 5. చైనా బంకమన్ను | 570 | 5,228 | 7,087 |
| 6. నేలబొగ్గు | 21,70,841 | 22,59,989 | 5,52,040 |
| 7. ఫెల్స్పార్ | 307 | 445 | 1,319 |
| 8. ఫైర్క్లే | 2,793 | 5,186 | 2 860 |
| 9. గ్రాఫైటు | 344 | 217 | 511 |
| 10. ముడి ఇనుము | 1,97,844 | 1,99,860 | 2,36,379 |
| 11. సున్నపురాయి | 5,56,031 | 7,66,688 | 10,11,289 |
| 12. మాంగనీసు | 8,533 | 16,219 | 23,731 |
| 13. అభ్రకము (మైకా) | 48,065 | 3,049 | 3,304 |
| 14. వెర్మిక్యూలేట్ అభ్రకము | — | — | 320 |
| 15. గోపీచందు (ఎరుపు) | 842 | 41 | 44 |
| 16. గోపీచందు (పసుపు) | 220 | 666 | 2,769 |
| 17. క్వార్ట్జ | 6,495 | 5,045 | 10,444 |
| 18. పలకరాయి | 5,708 | 914 | 17,296 |
| 19. స్టీటైట్ | 4,690 | 4,560 | 16,322 |
| 20. తెల్లమన్ను (వెట్ షేల్) | — | 3,817 | 3,254 |
| మొత్తము | 30,25 177 | 33,09,919 | 19,16,296 |

మొదటి ప్రపంచ యుద్ధానంతరము (1919) బంగారము ధర అంత విపరీతముగ పడిపోక యుండిన యెడల ఈ గనులు ఇంకను అభివృద్ధి చెందియుండెడివి. ఇనుము, మాంగనీసు ఖనిజములుకూడ పైచెప్పిన జిల్లాలలో దొరకుచున్నవి.

కోస్తా జిల్లాలలోని తూర్పుకనుమలుగ ఏర్పడిన ఖాండ లైటు లనబడు శిలలును, ధార్వాడ శిలలును ఒకే యుగమునకు చెందినవిగ ఇప్పుడు శాస్త్రరీత్యా గుర్తించబడినవి. ఈ ఖాండలైటు శిలలలో మాంగనీసు, ఇనుము, అభ్రకము, గ్రాఫైటు, సిల్లిమెనైటు, గార్నెటులు, కొన్ని రేడియో ఆక్టివ్ ఖనిజముల వంటి ఆర్థికముగ లాభకరము లైన పలు రకములగు ఖనిజములు చాల ఉన్నవి.

గ్రానైటు (నల్లశాణపు)శిలలు : గ్రానైటు అనబడు రాళ్ళు ఆంధ్రప్రదేశ్‌లో ఎక్కువ విస్తీర్ణము నాక్రమించి యున్నవి. వీటిలో విలువగల ఖనిజములున్నట్లు తెలియదు. కాని, రాతి కట్టడములకు, శిల్పములు మలుచుటకు గ్రానైటు చాల ప్రసిద్ధికెక్కియున్నది. గ్రానైటు రాతికి ఒక ప్రత్యేకమైన సహజ సౌందర్య ముండుటయే దీనికి కారణము. హైదరాబాదు నగరములోని ఉస్మానియా విశ్వవిద్యాలయము, న్యాయస్థానముల వంటి ఇతర సుందర భవనములు అనేకములు ఈ రాతితో కట్టినవే. విశ్వవిద్యాలయములోని నునుపైన ఎరుపు ఛాయ గల శిలాస్తంభములు తమ చక్కదనమును ప్రపంచమునకు చాటుచున్నవి.

పురాణశిలలు (పురాణాస్): గ్రానైటు శిలల తరువాత కొంతకాలమునకు సముద్రములో మెరక స్థలము లందు కల్కశిలలు (సెడిమెంటరి రాక్స్) అను ఒక రకము రాళ్లుఏర్పడినవి. ఇటువంటి రాళ్లు ఏర్పడుట భూగోళముపై జీవోత్పత్తి కాకపూర్వమే జరిగినది. వీటికి సర్ థామస్ హాలెండ్ 'పురాణశిల'లని పేరుపెట్టెను. వీటిని వివిధ ప్రాంతములలో వేర్వేరు పేర్లతో వ్యవహరించుచున్నారు. రాయలసీమలో కడప, కర్నూలు రాళ్ళని; గుంటూరు, తెలంగానా దక్షిణ ప్రాంతములలో పల్నాడు రాళ్ళని; వరంగల్లులో పాకాల రాళ్ళని; సూలవాయి రాళ్ళని; తెలంగానా ఈశాన్య భాగములో పెన్‌గంగ, పాకాల రాళ్ళని వ్యవహరించుచున్నారు. ఈ రాళ్ళన్నియు కల్కశిలా (సెడిమెంటరీ) వర్గమునకు చెందినవే. అనగా వర్ష, వాతాది విజృంభణమువలన భూపటలము నుండి కొట్టుకొని పోవు మన్ను మశాణములు నీటిలో పొరలు పొరలుగా నిక్షేపింపబడి పై ఒత్తిడిచే గండశిలలుగా ఏర్పడినవి. వీనిలో పలకరాళ్ళు, ఇసుకరాళ్ళు, పొరలరాళ్ళు, సున్నపు రాళ్లు కలవు. విశ్వ విఖ్యాతి నందిన గోల్కొండ వజ్రములు బంగనపల్లి పలకరాళ్ళలోను, కర్నూలురాళ్ళ యడుగు భాగములోను దొరకినవే. సిమెంటు పరిశ్రమలో ఉపయోగపడు సున్నపురాయి, ఇంటి కప్పులకు, నేల చప్టాలకు విరివిగా వాడబడుచున్న కడప నాపరాళ్లు ఈ రకమునకు చెందినవే.

పై రాతికి, భూగర్భమునుండి చొచ్చుకొని వచ్చిన మరొక రాతికి రాయలసీమలో సంఘర్షణ ఏర్పడినది. తత్ఫలితముగ ముగ్గురాయి (బెరైటిస్), రాతినార (ఆస్బెస్టాస్), స్టీయటైట్ మొదలగు విలువైన ఖనిజములు ఉద్భవించినవి.

గోండ్వానారాళ్ళు (గోండ్వానాస్) ప్రాణహిత, గోదావరి నదీలోయలలో ఏబది మైళ్ళ వెడల్పున కొన్ని వందల మైళ్ళ పొడవున ఈ రాళ్లు దొరకుచున్నవి. తెలంగానాలోను, మధ్యప్రదేశ్ రాష్ట్రములోను నేలబొగ్గు గనులన్నియు ఈ రాళ్ళలోనే నెలకొనియున్నవి. ప్రస్తుతము కొత్తగూడెము (వరంగల్లు జిల్లా) ప్రాంతములో మాత్రమే నేలబొగ్గు త్రవ్వి తీయబడుచున్నప్పటికి తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాలలో అనేక ప్రాంతములలో కూడ నేలబొగ్గు గుప్తముగ నున్నట్లు రూఢిగ తెలిసిన విషయము.

దక్కను నల్లరాళ్లు (దక్కన్ ట్రాప్స్) : రాజమండ్రి (తూ. గో. జిల్లా), పశ్చిమగోదావరి జిల్లాలోని కొవ్వూరుకు ఉత్తరమున నున్న పంగిడి ప్రాంతములలో నల్లరాయి దొరకును. కొంతమూరు, దుద్దుకూరు ప్రాంతములలో లభించు ఈ రాతిలో సున్నపురాయి కూడ దొరకుచున్నది.

టెర్షియరీరాళ్లు (టెర్షియరీరాక్స్) : ఆంధ్రప్రదేశ్‌లోని డెల్టాప్రాంతములలో ఇటీవల ఏర్పడిన తృతీయ యుగమునకు చెందిన రకపు రాయి విరివిగ నున్నది. ఈ రాయి మద్రాసు రాష్ట్రములోని కడలూరు (దక్షిణ ఆర్కాటు జిల్లా) ఇసుకరాయివంటిదే. ఆంధ్రప్రదేశ్ డెల్టా ప్రాంతములో (దక్షిణ ఆర్కాటులో వలెనే) లిగ్నైటు బొగ్గు దొరకునని ఆశించవచ్చును. చమురు వాయువు (నేచురల్ గేస్)ను బియ్యపు మరలను త్రిప్పుటకుగాను వినియోగించుటకు పశ్చిమగోదావరి జిల్లాలో ప్రయత్నములు సాగినవి. పాతాళ జలాధారములు ఈ రాళ్ళలో విరివిగ నుండుట చెప్పుకొనదగిన విషయము.

దక్షిణ భారతములో ఏయే రకపు రాళ్ళలో ఆర్థికముగ విలువ కలిగిన ఖనిజములు దొరకుచున్నవో, ఆయా రకపు రాళ్ళన్నియు ఆంధ్ర ప్రదేశ్‌లో నున్నవి. అట్టి ఖనిజము లనుగురించి ఈ క్రింద సంగ్రహముగ వివరింపబడినది :

రాతినార (ఆస్బెస్టాస్) : రాయలసీమలో అనేక ప్రాంతములలో రాతినార దొరకుచున్నది. వీనిలో కడప

జిల్లాలో చిన్నకూడాల, పులివెందల, బ్రాహ్మణపల్లి, లోపటనూతల చెప్పుకొనదగిన స్థలములు. కర్నూలు అనంతపురము జిల్లాలలోకూడ రాతినార దొరకును.

రాతినార నిప్పంటుకొన్నను కాలదు. దీనిని వస్త్రము గాను, త్రాళ్ళుగాను నేయవచ్చును. అగ్నినిరోధక సౌలభ్యమును బట్టియే ఈ ఖనిజము యొక్క విలువ. యుద్ధ సమయములో సైనిక పరికరములలో రాతినార ఉపయోగము ఎక్కువ. ఆస్బెస్టాస్ సిమెంటు రేకులు, గొట్టములు మొదలగునవి గృహ నిర్మాణములో ప్రస్తుతము చాల ప్రాముఖ్యము వహించుచున్నవి.

ముగ్గురాయి (బెరైటీస్) : కడప, కర్నూలు, అనంతపురము జిల్లాలలో పెక్కు తావులందు ముగ్గురాయి బహుళముగ ఉన్నట్లు తెలియవచ్చినది. వానిలో ముచ్చుకోట, సంజీవపురము, ఇప్పట్ల, వేంపల్లి ముఖ్యమైన కేంద్రములు.

బేరియము రసాయనిక ద్రవ్యములను చేయుటలో ముగ్గురాయి ముడిద్రవ్యముగ ఉపయోగపడును. పింగాణి, ఉక్కు, పూతరంగులు, రబ్బరు, ప్లాస్టిక్కు పరిశ్రమలలో ఈ ఖనిజమును ఉపయోగింతురు. నూనె గనులలోకూడ ముగ్గురాయి ఉపయోగ పడుచున్నది. కొన్ని ప్రత్యేకమైన ధాతు మిశ్రమములు తయారుచేయుటకు ముగ్గు రాయి అవసరము.

బాక్సైటు : ఆంధ్ర ప్రదేశ్‌లో విశాఖపట్టణము, గోదావరి జిల్లాలయందలి తూర్పు కనుమలలో బాక్సైటు దొరకును.

బాక్సైటు అనగా అల్యూమినియం ఆక్సైడు ; చాల ముఖ్యమైన పారిశ్రామిక ఖనిజము. పలురకములైన రాళ్లు ఆయా ప్రాంతముల ఎత్తు,వర్షపాతము మొదలగు పరిస్థితుల పైన ఆధారపడి బాక్సైటుగ దొరకుచుండును. ప్రపంచములో భూగర్భము నుండి పైకి తీయు బాక్సైటులో సగము పైగా అల్యూమినియము తయారుచేయుటకే. అల్యూమినియము యొక్క ఇతర లవణములు పెట్రోలియము శోధన, అద్దకము, రంగు పరిశ్రమలలో చాల ముఖ్యము.

గృహ నిర్మాణమునకు కట్టడపు రాళ్ళు (బిల్డింగ్ స్టోన్స్) : ఈ రకపు రాయికి కావలసిన లక్షణములు- మన్నిక, చెక్కుటకు సులభముగ నుండుట, నునుపుచేయుటకు వీలు, చక్కని ఆకారము. ఆంధ్రప్రదేశ్ అన్ని ప్రాంతములలోను ముఖ్యముగా పల్నాడులోని రెంటచింతలవద్ద (గుంటూరు జిల్లా) అందమైనరాళ్ళు అనాదిగ ప్రసిద్ధి కెక్కియున్నది.

బెరిల్ : ఆంధ్రప్రదేశ్‌లో బెరిల్ ఖనిజము విస్తారముగ నున్నది. ఉపయోగమునకు వలయునంత పరిమాణములలో బెరిల్ గూడూరు (నెల్లూరుజిల్లా) అభ్రకపు గనుల ప్రాంతములలో దొరకుచున్నది. కృష్ణాజిల్లా తిరువూరు పరిసరములలోను, కురుపాం (విశాఖపట్టణం జిల్లా) వద్దను శ్రేష్ఠమైన అభ్రకముతో బాటు బెరిల్ దొరకును. కురుపాంలోని కొన్ని బెరిల్ రాళ్లు పగులగొట్టగా లోపల మరకతము (ఎమరాల్డు) వంటి స్ఫటికములు దొరకెను. విశాఖపట్టణము జిల్లా ఇతర ప్రాంతములలో కూడ ఈ పచ్చలు దొరకు అవకాశమున్నది.

బెరిల్ చాల విలువగల ఖనిజము. ఇది బెరిలియం ధాతువుయొక్క అతి క్లిష్టమైన సిలికేటు. ఈ ధాతువు రాగి, నికెలు, ఇనుము, అల్యూమినియము ఇత్యాది ధాతువులతో కలసి మిశ్రమములుగ ఏర్పడును. బెరిల్‌కు అతి సున్నితమైన పారిశ్రామికోపయోగములు చాల ఉన్నవి. యుద్ధకాలమున బెరిలియం ధాతు మిశ్రమములు విమానములు, ఓడలు, టాంకులు, తుపాకులు, విద్యుచ్ఛక్తి పరికరములలో కొన్ని భాగములు చేయుట కుపయోగింతురు. పింగాణి పరిశ్రమలో కొన్ని ప్రత్యేక వస్తువులకును ట్యూబులైట్లలోను బెరిల్‌నుండి తయారైన ద్రవ్యములను ఉపయోగించుచున్నారు. పరమాణు శక్త్యుత్పాదనయందు బెరిల్ నుండి లభ్యమగు బెరిలియం ధాతువు ముఖ్య ద్రవ్యము.

క్రోమైటు : డాక్టర్ ఎం. ఎస్. కృష్ణన్ కొండపల్లి (కృష్ణాజిల్లా) వద్ద నిక్షిప్తమై యున్న క్రోమైటును పరిశీలించిరి. ఫలితములు ఉత్సాహ జనకములుగ నున్నట్లు ప్రకటించిరి. 1940 నుండి కొండపల్లి చుట్టుప్రక్కల కొన్ని ప్రాంతములలో కూడ క్రోమైటు త్రవ్వి తీయుచున్నారు. కాని తీసినదంతయు ఎగుమతి యగుచున్నది. తెలంగాణాలోని మధిర వద్ద కూడ ఈ ఖనిజము దొరకును.

క్రోమైటు లేకున్న పారిశ్రామికాభివృద్ధికి విపరీతమైన అవరోధము కలుగును. బహువిధములుగ ఈ ఖనిజము వాడుకలో నున్నది. కగ్గని ఉక్కు (స్టెయిన్‌లెస్ స్టీల్) అను పేరుతో చలామణి యగుచున్న పాత్ర సామగ్రిని తయారుచేయుటకు క్రోమైటు నుండి లభ్యమగు క్రోమియము ధాతువు అత్యవసరము. ఎక్కువ వేడిమి సహించెడు ద్రవ్యములు వలసిన పరిశ్రమలలో తక్కువ రకము ఖనిజమును ఉపయోగింతురు. అనేక ముఖ్యమైన రసాయనిక ద్రవ్యములు చేయుటలోను, రంగు పరిశ్రమల లోను క్రోమైటు అవసరము.

బంకమన్ను (క్లే) : ఆంధ్రప్రదేశ్‌లో బంకమన్ను చాల సమృద్ధిగ దొరకును. విశాఖపట్టణము జిల్లా కురుపాం, గరివిడిలలోను, తూర్పుగోదావరి, పశ్చిమ గోదావరి జిల్లాలలోను, తెలంగాణాలోని చిత్ర్యాల (నల్గొండ జిల్లా),

కోనసముద్రము (నిజామాబాదుజిల్లా) ప్రాంతములలోను విరివిగ బంకమన్ను లభ్యమగుచున్నది.

పరిశ్రమలలో బంకమన్ను ఉపయోగము దాని మెత్తదనము, తాప సహనశక్తి వంటి భౌతిక లక్షణములను బట్టి యుండును. బాగుగ-తెలుపుగ నున్నప్పుడు దీనిని చైనా మన్నుయని వ్యవహరింతురు. ఇది పింగాణీ పరిశ్రమలలో బాగుగ ఉపయోగపడును. అంతేగాక కాగితము, నూలు, రబ్బరు, పెంకు పరిశ్రమలలో కూడ బంకమన్ను ఉపయోగ మెక్కువ.

రాగి : ఆంధ్రప్రదేశ్‌నందు చాల ప్రాంతములలో రాగి యున్నట్లు తెలియుచున్నది. చరిత్ర కాలములో కూడ భూగర్భము నుండి రాగిని బయటికి తీసినట్లు నిరూపించెడి ఆధారములున్నవి. నెల్లూరుజిల్లా గరిమినిపెంట ప్రాంతములో రాగిని తీయుటకై పరిశీలన జరుగుచున్నది. కడప జిల్లా జంగంరాజుపల్లి, అనంతపురము జిల్లా ముడిగుబ్బ, గుంటూరుజిల్లా అగ్నిగుండాల, కర్నూలుజిల్లా గని, గజ్జల కొండ పరిసరములలో పరిశీలించినయెడల మంచి ఫలితములు కనుపించు అవకాశ మున్నది. నల్గొండ జిల్లా చిత్ర్యాలలో రాగి లభించును. వరంగల్లుజిల్లా పాల్వంచ తాలూకాలో యల్లంబైలు, మైలారములవద్ద పూర్వులు పనిచేసిన రాగి గనులు *బయల్పడినవి.

ఆధునిక ప్రపంచములో ఇనుము, అల్యూమినియముల తరువాత రాగిదే ప్రముఖ స్థానము. రాగి ఉపయోగములు అసంఖ్యాకములు. నిత్య జీవితములో సామాన్య మానవునికి పరిచితములగు ఇత్తడి, కంచువంటి ధాతుమిశ్రమములలో రాగిపాలు చాల ముఖ్యము. విద్యుద్వాహనమునకు రాగి తీగలు ముఖ్యము. తుపాకి తూటాలకు రాగి గొట్టము లవసరము.

నేలబొగ్గు (కోల్) : నేలబొగ్గు విషయములో ఆంధ్రప్రదేశ్ స్థానము చాల సుస్థిరమైనది. తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాలు, తెలంగాణా ఈ ముఖ్య ఖనిజమునకు నిలయము. ప్రస్తుతము తాండూరు, కొత్తగూడెము (తెలంగానా) ప్రాంతములలో నేల బొగ్గును త్రవ్వి తీయుచున్నారు. తూర్పుగోదావరిజిల్లా, విశాఖపట్టణము జిల్లా, పశ్చిమ గోదావరి జిల్లా బెడదనూరు, కొయ్యల గూడెము, వెంకటపాలెములలో నేలబొగ్గు నిక్షేపము లున్నట్లు తేలినది.

నేటి పారిశ్రామికయుగమునకు బొగ్గుయుగమని వ్యవహారము. జల విద్యుచ్ఛక్తిలేని ప్రాంతముల పరిశ్రమలకు బొగ్గులేకున్న పనిజరగదు.

*ప్రస్తుత వ్యాసకర్త డా॥ సి. మహాదేవన్ చేసిన పరిశోధనల ఫలితము.

కురువిందము (కోరన్‌డమ్) : ఇది అనంతపురం జిల్లా ఆత్మకూరు, దండువారిపల్లి ప్రాంతములలో దొరకుచున్నది. వరంగల్లు జిల్లా రంగాపురము, గోలుగూరు, బూంజూరు పరిసరములలోను, విశాఖపట్టణము జిల్లా కొండ ప్రాంతములలోను కూడ కురువిందము ఉన్నది.

ఇది పరిశుద్ధమైన అల్యూమినియం ఆక్సైడు ఖనిజము. అప్పుడప్పుడిది మేలిమి జాతి రాయిగ దొరకును. కాని సాధారణముగ చాల రంగులలో చిన్న, లావుపాటి రాళ్లుగ దొరకును. మంచి తరగతి సానపెట్టు ద్రవ్యముగ కురువిందము పరిశ్రమలలో చాల ఉపయోగించును. అపరిశుద్ధమైన ఒక రకము కురువిందమును 'ఎమెరీ' అందురు.

డోలమైటు (సున్నపురాయి) : కర్నూలు, కడప రకము రాళ్లయందు ఈ సున్నపురాయి చాల ఎక్కువగ దొరకుచున్నది. ఖాండలైటు రాయి దొరకు ప్రాంతములలో కూడ ముఖ్యముగ బొర్రా, అనంతగిరి (విశాఖ పట్టణము జిల్లా) వద్ద సున్నపురాయి కలదు. ఈ ఖనిజములు రసాయనిక, ధాతు సాధన (మెటలర్జీ) పరిశ్రమలలో చాల పనికి వచ్చును. తెలంగానాలోని పాఖాల రాళ్ళలో సున్నపురాయి సమృద్ధిగ దొరకుచున్నది.

ఫెల్‌స్పారు : కృష్ణా, విశాఖపట్టణము, వరంగల్లు జిల్లాలలోను; నెల్లూరు, అభ్రకము గని ప్రాంతములలో ఇంచుమించుగ ఫెల్‌స్పారు అపరిమితముగ దొరకుచున్నది.

పింగాణీ, గాజు పరిశ్రమలలో ఫెల్‌స్పారు ఉపయోగము ఎక్కువ. గత యుద్ధ సమయమున (1939-45) తుపాకి గుండ్లనుండి రక్షించుకొనుటకైన ధాతు కవచమునకు బదులు ఫెల్‌స్పారుతో చేసిన గాజు కవచమును ఉపయోగించిరి.

ఆర్థోక్లిన్, మైక్రోక్లిన్ అని ఫెల్‌స్పారు రెండు రకములు.

గార్నెట్లు : గార్నెట్లు తెలంగానా లోని గరీబుపేట, కొత్తగూడెము ప్రాంతములలో దొరకును. సానపెట్టుటకు పనికి వచ్చు రకము కోస్తా జిల్లాల సముద్రపు టిసుకలో ఇల్మనైటు, జిర్కాను, మోనజైటు ఖనిజములతో కలిసి లభించుచున్నది. మెరుగు పెట్టుటకు ఉపయోగించు ద్రవ్యములలో గార్నెట్లు చాల ముఖ్యము. నిర్మలముగ నుండు గార్నెట్ స్ఫటికములు విలువగల జాతి రాళ్ళుగ ఉపయోగపడును. వీటిని ఆధారము చేసికొని తూర్పు గోదావరి జిల్లా గొల్లల మామిడాడలో మెరుగు కాగితములను (సాండ్ పేపర్స్) తయారుచేయు ఒక కుటీర పరిశ్రమను నెలకొల్పిరి.

వజ్రములు : కృష్ణానది లోయలోను, రాయలసీమలో అనేక ప్రాంతములలోను ఒక శతాబ్దము క్రిందటి వరకు

భూగర్భమునుండి వజ్రములు తీయు పరిశ్రమ వ్యాప్తములో నుండెడిది. ప్రపంచమునకు కోహినూరు, రీజెంటు, పిట్టు, నైజాము మొదలగు ఉత్కృష్టమైన అనేక మణులను ప్రసాదించిన గోల్కొండ వజ్రముల గను లన్నియు ఇచ్చటివే. ఈ నాటికి కూడ తెలంగానాలోని వజ్రకరూరు, కొల్లూరు, నందికొండ ప్రాంతములలో వర్షము కురిసి వెలసిన తరువాత వెదకినచో అప్పుడప్పుడు వజ్రములు దొరకునని ప్రతీతి. ఆయా ప్రాంతముల వజ్రపు నిధులు తరిగి పోలేదనియు, వివరముగ పరిశీలించినచో ఫలితము కలుగ గలదనియు నిపుణులు భావించు చున్నారు.

బంగారము : మహబూబ్‌నగరం జిల్లా గద్వాల సంస్థానములో పూర్వము పని చేసిన బంగారు గనుల చిహ్నములు కనుపించు చున్నవి. వరంగల్లు, పాల్వంచ సంస్థానములలోని కిన్నెరసాని నదీ సైకతములలో బంగారము కలిసి యున్నది. ఈ పై ప్రదేశములోను, కూనవరము సమీపమున శబరీ, గోదావరి నదీ సంగమ ప్రాంతములోను గల ఇసుకను గాలింపగా* బరువైన బంగారపు పలుకులు దొరకెను. అనంతపురము బంగారు గనులు కొంత కాలము పని చేసిన పిమ్మట ధర కిట్టుబాటుకాక మూసి వేయ బడినవి. సర్కారు జిల్లాల మన్య ప్రాంతములో బంగారము దొరకు అవకాశము లున్నవి.

గ్రాఫైటు : విశాఖపట్టణము, తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి జిల్లాలు, కురుపాం, అండ్ర, విజయనగరము, జంగారెడ్డి గూడెము, దొరమామిడి ప్రాంతములలో గ్రాఫైటు దొరకు చున్నది. వరంగల్లు జిల్లాలోని బైసన్ పర్వత పంక్తిలో గ్రాఫైటు ఖనిజము ఎక్కువగ లభించును. రాజమండ్రిలో మూసల తయారీ కుటీర పరిశ్రమగ అభివృద్ధి చెందుచున్నది. ఇచటికి కావలసిన ముడి ద్రవ్యమంతయు బైసన్ పర్వతములలోని గుండ్ల మడుగు గని సరఫరా చేయు చున్నది. రాజమండ్రి మూసలు భారత దేశము నలుమూలలకు ఎగుమతి యగుచున్నవి. గొల్లల మామిడాడ (తూ. గో. జిల్లా)లో మూసలను అనేక సైజులలో తయారు చేయుచున్నారు. విశాఖ పట్టణము జిల్లా నరిసీ పట్టణము వద్ద కూడ గ్రాఫైటు దొరకును. ఆంధ్రప్రదేశ్‌లో గుప్తమై యున్న ఈ ఖనిజము చాల కలదు.

పెనసళ్లు, మూసలు, రంగులు ఇత్యాది పరిశ్రమలలో గ్రాఫైటు చాల ముఖ్యమైన ఖనిజము. గత యుద్ధ కాలము (1939-45)లలో ఆటంబాంబు తయారు చేయుటకు యురేనియము పరమాణు విచ్ఛేదన వేగమును తగ్గించుటకు గ్రాఫైటు ఉపయోగించుమని కనిపెట్ట బడెను.

*డా. సి. మవదేవన్ ఆధ్వర్యమున

జిప్సమ్ : పులికాటు (నెల్లూరుజిల్లా) సరస్సులో లాభకరముగ పని చేయుటకు వీలైనంత జిప్సమ్ ఖనిజము కలదు. డా॥ బి. సి. రాయ్ ఇచట కొన్ని లక్షల టన్నుల జిప్స మున్నదని అంచనా వేసిరి.

పరిశ్రమలలో జిప్సమ్ అనేక విధములుగ ఉపయోగ పడును. రాసాయనిక ఎరువులు, సిమెంటు, రసాయనిక ద్రవ్యముల తయారీలోను, 'ప్లాస్టర్ ఆఫ్ పారిస్' అను ద్రవ్యము తయారు చేయుటకును జిప్సమ్ చాల ముఖ్యమైన ముడి ద్రవ్యము.

ఇనుము (ఐరన్) : కడప, కర్నూలు, గుంటూరు, నెల్లూరు, నిజామాబాదు జిల్లాలలో అనేక ప్రాంతములలో ఇనుము దొరకు చున్నది. ఆయా ప్రాంతములలో ఈ ఖనిజము చెప్పుకొన దగినంత పరిమాణములలో లేకున్నప్పటికిని, తక్కువ తరగతి ఖనిజమును బాగు పరచు శాస్త్రీయ పద్ధతులను అవలంబించిన అనేక గృహ పరిశ్రమలను నెలకొల్ప వచ్చును.

ఇనుము, నేలబొగ్గు ఉపయోగించని పరిశ్రమ ప్రపంచములో లేదన్న అతిశయోక్తి కాదు. బ్రిటను, రష్యా, అమెరికా దేశములలో పారిశ్రామిక విప్లవమునకు దారి తీసినవి ఈ రెండు ఖనిజములే. ఈ నాడు ఆ దేశములు అంతర్జాతీయ రంగములో నాక్రమించియున్న అగ్రస్థానమునకు కూడ అవియే కారణము.

ప్రసిద్ధికెక్కిన డమాస్కసు కత్తులు నిజామాబాదు జిల్లా కోన సముద్రప్రాంతములో తయారైన ఉక్కుతో చేసినవే. భారతదేశమునకు, యూరపు మధ్య ధరా సముద్ర ప్రాంతపు దేశములకు మధ్యచరిత్ర కాలములో జరిగిన వాణిజ్య వ్యాపారములో తెలంగానా ఉక్కు ఒక ముఖ్య వాణిజ్య ద్రవ్యము. ఇనుము కరగగా మిగిలిన మలిన ద్రవ్యముల కుప్పలు ఆంధ్రప్రదేశ్ నందంతటను కనుపించును. అవియే పూర్వపు ఇనుప పరిశ్రమ వ్యాప్తికి తార్కాణములు.

కైనైటు : గూడూరు (నెల్లూరు జిల్లా) అభ్రకము గనుల ప్రాంతములలో ముఖ్యముగ సైదాపురము, చుండి సత్రము వద్ద కైనైటు దొరకును. వరంగల్లు జిల్లాలో కొత్తగూడెమునకు దక్షిణముగ గరీబుపేట వద్దను, కనిగిరి కొండలలోను, గార్నెట్లతో కలిసి కైనైటు విరివిగ దొరకును. అండలు సైటు, స్టారలైటు, సిల్లిమనైటు కూడ ఈ జాతికి చెందిన ఖనిజములే. ఎల్లాందు తాలూకాలోని అండలుసైటు, స్టారలైటు విశాఖ పట్టణము జిల్లా తూర్పు కనుమలలోని సిల్లిమనైటు ఎన్నటికైన పనికి వచ్చు నిక్షేపములు.

ఇది పరిశ్రమల కత్యవసరమై 3000° ఫా. వరకు వేడిమిని సహించ గల ఖనిజము. ఒక రకము గాజుకు కావలసిన

అల్యూమినియమును అంద జేయుటకు కైనైటు చాల ఉపయోగ పడుచున్నది.

సీసము (లెడ్): ఉపయోగమునకు వీలైనంత పరిమాణములో సీసము ఆంధ్రప్రదేశ్‌లో దొరకుటలేదు. కాని గుంటూరు లోని కారెంపూడి, రాయలసీమ లోని జంగం రాజుపల్లె, బసవాపురం, కోయిలకుంట్ల ప్రాంతములలో పూర్వులు సీసము తీయుటకు ప్రయత్నము చేసినట్లు నిరూపించగల చిహ్నములు కనుపించుచున్నవి. నల్గొండ జిల్లాలోని దేవరకొండ ప్రాంతములో అన్వేషణ జరిగిన సీసము దొరకవచ్చును.

అభ్రకము (మైకా): ఆంధ్ర ప్రదేశ్‌లో నున్న అభ్రకపు గనులు భారతదేశమునకు ఒక ఉత్కృష్టమైన స్థానమును సంపాదించి పెట్టినవి. గూడూరు (నెల్లూరు జిల్లా) అభ్రకము అంతర్జాతీయ వ్యాపార వీధులలో చలామణి యగుచున్నది. ఖమ్మం మెట్టు (ఖమ్మం) వద్ద చాల గనులలో మస్కొవైటు అభ్రకము కొరకై పనిచేయుచున్నారు. విశాఖపట్టణము జిల్లాలోని అనేక ప్రాంతములలోను, తూర్పు గోదావరి జిల్లాలోను, కృష్ణాజిల్లా తిరువూరు తాలూకాలోను అభ్రకము దొరకు స్థలములు చాల ఉన్నట్లు ఇటీవలనే స్పష్టపడినది. కురుపాం (విశాఖపట్నం జిల్లా)లో అతిశుద్ధమైన మస్కొవైటు దొరకుచున్నది. విశాఖపట్టణము జిల్లాలో ఫ్లోగోవైటు అను విలువయైన అభ్రకము దొరకును. కొన్ని సంవత్సరముల క్రితము వరంగల్లు, తూర్పు గోదావరి జిల్లాలలోనున్న బైసన్ పర్వత పంక్తిలో మస్కొవైటు, ఫ్లోగావైటు కంటె విలక్షణమై, మధ్యరకము గుణములు కలిగిన 'మహాదేవైట్' అనెడు అభ్రకము కనుగొనబడినది. మహాదేవైట్ లక్షణములు పైని చెప్పిన మస్కొవైటు, ఫ్లోగోవైటు అభ్రకము లక్షణములకు మధ్యస్థముగ నుండును.

మాగ్నసైటు: ఈ ఖనిజము కర్నూలు జిల్లాలో దొరకును. కాని ఇంకను వివరముగ పరిశీలన జరుపవలసి యున్నది.

మాంగనీసు: విశాఖపట్టణము జిల్లాలో భారీ ఎత్తున మాంగనీసుకై పనిచేయు గనులు చాల ఉన్నవి. గరివిడి, కోడూరు, దేవాడ, సదానందపురము, గర్భాం ఈ కాలపు మాంగనీసు చరిత్రలో ప్రసిద్ధి కెక్కిన పేర్లు. ప్రతి సంవత్సరము మాంగనీసు దొరకునట్టి క్రొత్త ప్రాంతములు బయట పడుచునే ఉన్నవి. తెలంగాణాలో కూడ కొన్ని ప్రాంతములలో మాంగనీసు లభించు చున్నది.

గనిలో నుండి తీసిన ఖనిజ మంతయు విదేశములకు ఎగుమతి యగుచున్నది. ఇనుము, నేలబొగ్గు తరువాత మాంగనీసు కీలక ఖనిజములలో ఒకటి. ఉక్కుపరిశ్రమలో మాంగనీసు స్థానము నాక్రమించగల పదార్థ మింకేదియు లేదు. అనేక రసాయనిక ద్రవ్యముల పరిశ్రమలలోకూడ మాంగనీసు స్థానము చెప్పుకొనదగినది.

చమురు వాయువు (నేచురల్‌గాస్): కృష్ణా, గోదావరి డెల్టాలలో కొన్ని చోట్ల జ్వలన స్వభావము గల స్వతస్సిద్ధముగ జ్వలన వాయువు భూగర్భము నుండి బయటికి వచ్చుచుండును. దీనినే చమురు వాయువు (నేచురల్ గాస్) అందురు. తూర్పు గోదావరి జిల్లాలో తాటిపాక, కృష్ణా జిల్లాలో కోన అను ప్రాంతములలో దీనిని ప్రస్తుతము చిన్న తరగతి మిల్లులు నడుపుటకు ఉపయోగించు చున్నారు. ఆయా ప్రాంతములలో ఈ వాయువు ఇంకను ఎక్కువగ కానవచ్చు అవకాశము లున్నవి.

భాస్వర ఖనిజములు (ఫాస్ఫేట్స్): మాంగనీసుతో కలిపి విశాఖపట్టణము జిల్లాలో దొరకెడు అపటైటు అను ఖనిజమును జాగ్రత్తగ వేరి వేరు పరచినచో సారపు ఎరువుల పరిశ్రమలలో ఉపయోగ పడును.

ఇసుకలు: సిలికా, మోనజైటు, జిర్కాను, గార్నెటు, సిల్లిమనైటు, ఇల్మనైటులు ఇసుకలోని రకములు.

తూర్పుగోదావరి, విశాఖపట్టణము జిల్లాల కోస్తా వెంబడి స్థానికముగ నల్లటి ఇసుక సమాహారమై కనిపించుచున్నది. దీనిలో పైన పేర్కొనబడిన ఖనిజములు వివిధములైన పాళ్ళలో నున్నవి. విశాఖపట్టణము జిల్లా సముద్ర తీరము వెంట ఒక నూరుమైళ్ళ పొడవున ఈ నల్లని ఇసుకలో ఆయా ఖనిజము లన్నియు లాభకరముగ పనిచేయుటకు వీలగునంతటి పరిమాణములలో నున్నవని ఆంధ్ర విశ్వవిద్యాలయ భూతత్త్వశాస్త్ర శాఖ రుజువు చేసినది.

బాపట్ల వద్ద గాజు పరిశ్రమకు ఉపయోగించు సిలికా ఇసుక దొరకును. గత యుద్ధ కాలమున (1939-45) మోనజైటు ప్రాముఖ్యము ఇంకను హెచ్చయినది. పరమాణు శక్తి పరిశ్రమలోను 'ట్రేసర్ బుల్లెట్స్' తయారీలోను దీనిని ఉపయోగించిరి. సాధారణముగ నేడు ఇది పెట్రొమాక్సు దీపముల వత్తులను తయారు చేయుటకు ఉపయోగ పడుచున్నది.

ఇల్మనైటు కూడ ఉక్కు, రంగు పరిశ్రమలలో ఉపయోగపడు చాల ముఖ్యమైన ఖనిజము. ఈ ఖనిజము లన్నిటి ముడి ద్రవ్యములు భారతీయ అవసరములు తీర్చుటకు మాత్రమేకాక ఇంకను మిగిలి విదేశములకు ఎగుమతి చేయుటకు తగినంత పరిమాణములో నున్నవి.

లవణములు : ఆంధ్రప్రదేశ్ యొక్క విస్తీర్ణ సముద్ర తీరభూమి ప్రస్తుతమున్న లవణ పరిశ్రమను బాగుగ అభివృద్ధి చేయుటకు సాటిలేని అవకాశము కనిపించుచున్నది. సోడియమునకు సంబంధించిన పరిశ్రమలు ఆంధ్ర ప్రదేశ్‌లో సర్వతోముఖముగ అభివృద్ధి చెందిన నాడు ఈ లవణముల అవసరము ఇనుమడించ గలదు.

గంధకము పైరిటస్ (సల్ఫర్ పైరిటస్) : ఆంధ్ర ప్రదేశ్‌లో మచిలీపట్టణము తీరప్రాంతములోని కోన వద్ద మాత్రమే గంధకము దొరకును. ఇటీవల భారత భూతత్త్వశాఖవారు ఇక్కడి ఖనిజమును పరిశీలించి ఆర్థిక దృష్ట్యా లాభదాయకముగ పని చేయుటకు వీలులేదని ప్రకటించిరి.

కడప, కర్నూలు జిల్లాలలోని జమ్ములమడుగు రాళ్లలో గంధకము ఇనుముతో రసాయనిక సంయోగము చెంది పైరిటస్ అను ఖనిజముగ దొరకుచున్నది. తెలంగానా లోని తాండూరు, కొత్తగూడెము బొగ్గుగనులలో నూరు టన్నులకు పైగా పైరిటస్ దొరకుచున్నది.

గంధకము గంధకి కామ్లము చేయుటకు ముఖ్యముగ కావలయును. అనేకములగు ఇతర రసాయనిక ద్రవ్యములు, ప్రేలుడు మందులు, కాగితము, రబ్బరు, క్రిమి నాశకములు మొదలగు పరిశ్రమలలో గంధకము ప్రముఖ స్థానము వహించును. గంధకి క్లామపు ఉత్పత్తి పరిమాణము ఆ దేశపు పారిశ్రామిక పురోగమన వేగమును సూచించునని లోకోక్తి.

పై జాబితాలో ఆర్థికముగ లాభకరముగ నుండు ఖనిజముల నిక్షేపములును, గుప్తముగ నున్నప్పటికి ఎప్పటికైన నుపయోగించునని రూఢిగ ఋజువైన నిక్షేపములు మాత్రమే పేర్కొనబడినవి. వానిని ఒకసారి పరిశీలించినచో ఆంధ్రప్రదేశ్ ఖనిజ సంపత్తి ఎంత సుస్థిరమైనదో స్పష్టము కాగలదు. సి. మ.

# ఉద్భిజ్జములు

ఒక ప్రదేశములోని తరు లతా గుల్మముల యొక్కయు, మూలికల యొక్కయు ఉనికి, వ్యాప్తి, విరివి, వాని సముదాయముల లక్షణములు ఆ ప్రదేశము యొక్క నైసర్గిక స్వరూపము, శీతోష్ణస్థితి, వర్షపాతము, ఋతువులు, పర్వతములు మున్నగు పరిస్థితులపై ఆధార పడి యుండును. 1904 లో ప్రసిద్ధ వృక్షశాస్త్రజ్ఞులైన సర్ జె. డి. హుకర్ ప్రస్తుత భారతదేశము, పాకిస్తాన్, ఆఫ్‌గన్‌స్థాన్, బర్మా, సిలోన్, మలయా ద్వీపములలోని భూభాగమును పైన చెప్పబడిన పరిస్థితుల నాధారము చేసికొని తొమ్మిది వృక్ష మండలములుగ విభజించిరి. ఆంధ్రప్రదేశ్ భూభాగము వీనిలో నొకటియైన 'దక్కను మండలము' లో ఇమిడి యున్నది. ఆంధ్రప్రదేశ్‌ను మరల గోదావరి నదికుత్తరభాగము, గోదావరి కృష్ణానదుల మధ్యనున్న భాగము, కృష్ణానదికి దిగువనున్న భాగములుగ ఆయా భాగములలో గల ఉద్భిజ్జ వర్గముల స్వరూప లక్షణములను బట్టి గుర్తింప వచ్చును. ఆంధ్ర ప్రదేశమందలి ఈ మూడు ఉపమండలములలోను తీర ప్రదేశము, సమ ప్రదేశము, పర్వత ప్రదేశము అను ప్రాంతములందలి ఉద్భిజ్జములు వేరుగ నున్నవి.

తీరస్థ ప్రదేశములో రెండు రకముల ప్రదేశములు కలవు. ఒకటి నదీ ముఖముల యందుండు ఉప్పుపట్ల. ఇచ్చట పెరుగు జాతులు, ఉప్పుపొన్న, దుడ్డుపొన్న, పురడ, గాతరు, తెల్లమడ, మడ, గుండుమడ, కడివి, టిల్ల మున్నగునవి. వీనికి బురద నేలలో పెరుగుట కనుకూలమైన ప్రత్యేక లక్షణములు కలవు. రెండవది ఇసుక ప్రదేశము. ఇచ్చట రావణాసురుని మీసాలు, బాలబంది తీగె, ఒక రకపు తుంగ, 'పత్రి' అనబడు చామంతి జాతి మొక్క, మొగలి మున్నగునవి పెరుగును. సముద్రపు టంచున ఉండి పాటు, పోటులవలన గలుగు ఉప్పు నీటి ప్రభావమునకు గురియైన శిలల మీద పుష్ప రహితమైన నీటిపాచి రకములు పెరుగును. సముద్ర తీర ప్రదేశమునకును, పర్వత ప్రదేశమునకును మధ్యగల సమ ప్రదేశము మిక్కిలి సారవంతమైనది. పలువిధములైన ఫలపుష్ప జాతులు ఈ ప్రదేశమున విరివిగా కలవు. పర్వత ప్రదేశమునందు తూర్పు కనుమలు ఉత్తరము నుండి దక్షిణమునకు వ్యాపించి యున్నవి. ఉత్తరపు జిల్లాలలో ఈ కనుమలు సముద్రమునకు దగ్గరగా ఇరువదిమైళ్ల సామీప్యముననే ఉన్నవి. అనంతగిరి, మాడుగుల, పాపి కొండలు, రంప, పలేశ్వరము మున్నగు ప్రాంతములలోని పర్వత శ్రేణులందు గల శిఖరములు 3000′ మొదలు 5000′ ఎత్తు గలవి. వర్షము కూడ 50″ మొదలు 80″ వరకు కురియును. గోదావరి నదికి ఉత్తరమున నున్న ఉప మండలములో సాలవృక్షము విరివిగ పెరుగును. కాని గోదావరి నదికి దక్షిణ తీరమునను దానికి దిగువను ఈ వృక్షము

కనుపించదు. అందువలననే ఉత్తరమున ఉన్న ఉప మండలమునకు సాల వృక్షమండల మని పేరిడిరి. ఈ ఉపమండలములో సాలవృక్షముతోపాటు కొండ తంగేడు, బిల్లు, కరక, నల్లమద్ది, ఏగిస, చిరిమాను మొదలుగా గల వృక్షములు కూడ పెరుగును. ఈ సాలవృక్ష మండలపు కొండ ప్రాంతములో ఇచటికంటె శీతలము, తేమ, వర్షపాతము, ఎత్తయిన పర్వతములు గల బర్మా, అస్సాము, పడమటి కనుమల యందలి అడవులలో కనబడు కొన్ని రకముల వృక్షములు కొద్దిగా కనుపించును. అందువలన ఒకానొకప్పుడు సాలవృక్ష మండలపు వాతావరణము శీతోష్ణస్థితి వేరువిధముగ నుండి యుండవచ్చునను అభిప్రాయము కలుగును. ఈ ప్రాంతపు కొండలలోని నీటి వాగుల తీరముననను, లోయల లోను రెండు రకముల వెదురు విరివిగా పెరుగును. పెద్ద చెట్లమీద అడ్డాకు తీగె, బొడ్డు తీగె విస్తారముగ పొడకట్టును. ఈ ప్రాంతములో నీటి వాగుల సమీపమున బీజసహితమయ్యు ఫలరహితమైన 'జిమ్నోస్పెరమ్' అనబడు ప్రత్యేక జాతికి చెందిన 'నీటమ్' అనబడు మొక్క కలదు. ఇదికూడ ఇతర వృక్షములపైకి ఎగబ్రాకును. ఇదికాక పుష్పరహిత జాతికి చెందిన వర్ణము లనబడెడి రకములు కూడ కలవు. వీనిలో ప్రత్యేక జాతియైన వృక్ష వర్ణపు రకము ఒకటి ఈ ప్రదేశమునందు కలదు. నీడయు, నీటి తేమయు ఎక్కువగా నున్న చోట్లలో 'లివరువోర్టు'లు, నాచుజాతి రకములు కూడ కలవు. ఇవికూడ పుష్ప రహితములే. మొత్తము మీద ఉత్తర ప్రాంతపు టడవులలో నిత్యము పచ్చగ నుండు మొక్కలు కలవు. విస్తారము ఎత్తులేని కొండలమీద దూదిగ, గుట్టి, అరివిటి, కొరివి, పాల, అల్లి మున్నగునవి కలవు. ముషిణి, తుమ్మికి మొదలగు చిన్న చెట్లుకూడ విరివిగ కలవు. ఈ ఉత్తరపు జిల్లాలలో కూడ తేమ, నీటి వసతి గల ఎత్తు తక్కువ కొండలమీద ములుగోరింట, వెలుతురు, కొనరేగు, మంగ, బలుసు, కలివి, వాక, పరికి, గొట్టి, ఆరుదొండ, కొంకి, పిల్లితేగలు మున్నగు ముండ్ల మొక్కలు గలవు. దక్షిణపు జిల్లాల లోనికి పోవు కొలది తూర్పు కనుమలు సముద్ర తీరమునుండి 100 మొదలు 150 మైళ్ళవరకు దూరమగు చున్నవి. వీనికి కర్నూలు జిల్లాలో నల్లమల కొండలు, ఎర్రమల కొండలనియు, కడప జిల్లాలో పాలకొండలు, శేషాచలం కొండలనియు, చిత్తూరు జిల్లాలో నగరి కొండలనియు పేర్లు. గోదావరి, కృష్ణానదుల మధ్య నున్న ఉపమండలములోని ఉద్భిజ్జ జాతులు ఉత్తరమున సాలమండలములోని వృక్షజాలమును పోలి యుండును. కాని దక్షిణమునకు పోవు కొలది క్రమక్రమముగ ఉత్తరమున నుండు కొన్ని రకములు అదృశ్యమగును. కృష్ణానది దక్షిణతీరమును సమీపించి దక్కను పీఠభూమి చేరుసరికి దక్కను ఉపమండలమునందు గల అడవులు ఆకురాలు చెట్లు కలవిగా మారును. గోదావరి ప్రాంతములోను, అక్కడక్కడ దక్కను ప్రాంతపు టడవులలోను టేకు పెరుగును. దక్కను ఉపమండలములోని అడవులలో నల్లమద్ది, తెల్లమద్ది, నిమిరి లేదా పులిమద్ది, తాని, చిరిమాను, బిల్లు, నంది, కొండవేప, ఏగిస, ఏపి, చేవమాను, జిట్రేగి, బూరుగ మున్నగు వృక్షములు కలవు. ఇవిగాక ఎర్ర చందనము, తెల్లకరక, నల్లడామరు, మంచి మోయడి అను జాతులు కేవలము కడప, కర్నూలు, నెల్లూరు, చిత్తూరు జిల్లాలలోని వెలిగొండ, లంకమల, పాలకొండ, శేషాచలం, కంబక్కము, కొండలపై మాత్రము కానవచ్చును. ఉన్నత పర్వత ప్రదేశము కాని పీఠభూమి అడవులలో మోదుగ, ములుమోదుగ మున్నగునవియు, నిర్జలమైన మెట్ట ప్రదేశములందు వివిధములై ముళ్లమొక్కలు, పొదలు గల చిట్టడవులు విస్తారముగ నుండును. మొత్తము దక్కను ఉపమండలములో ఆకురాలు చెట్ల అడవులును, కంటక జాతులు గల చిట్టడవులును కాననగును.

ఆంధ్రప్రదేశ్‌లో సుమారు 2,500 జాతుల మొక్కలు గలవు. వీనిలో చిక్కుడు, తంగేడు, తుమ్మ సంబంధమైన జాతులతో కూడిన 'లెగుమినేసి' అను కుటుంబము, తృణ కుటుంబములకు చెందిన జాతులు పైని పేర్కొనబడిన క్రమములలో విరివిగా గలవు.

ఆంధ్రప్రదేశ్‌లోని వృక్ష సంపద రెండు విధములు : ఒకటి అటవీ సంపద; రెండవది వ్యవసాయ సంపద. అటవీ సంపద వ్యవసాయ సంపదకంటె తక్కువ. అడవులలోని ముఖ్య ఫలసాయము కలప. ఇండ్లు కట్టుటకును, రైలు పట్టాలక్రింద వేయు అడ్డు దూలములకును ఉపయుక్తమైనట్టియు, కర్రసామగ్రి, పరికరములు, బొమ్మలు, ఆట వస్తువులు మున్నగునవి తయారుచేయుటకు పనికివచ్చునట్టి పలురకముల కలపయును; కాగితపు పరిశ్రమలో కావలసిన గుజ్జు, అగ్గిపుల్ల, కర్రబొగ్గు తయారుచేయుటకు అనువైన చెట్ల రకములును; సరకులు రవాణా చేయుటకు తగిన తేలిక కర్ర రకములును; వంట చెఱకు ఆంధ్రప్రదేశ్‌లోని అడవులలో దొరకును. పైన చెప్పినవానిలో ముఖ్యమైనవి దిగువ నుదాహరింపబడినవి :

వేర్వేరు రకముల కలపయొక్క విలువ దాని పరిమాణము, క్రిమి కీటకములవలన కలుగు హానిని నిరోధించు గుణము గలిగిన మన్నికయు, లభ్యతలను బట్టి

యుండును. ఈ యంశముల నాధారము చేసికొని కలపను ఐదు ముఖ్యమైన తరగతులుగ విభజింపవచ్చును. ఇందులో మొదటి తరగతికి చెందిన టేకు, జిట్టెగి, కొండతంగేడు, ఏపి, పుసక, నంది, మయూరము, ఇప్పయును; రెండవ తరగతికి చెందిన బిళ్ళ, సాల, ఎఱ్ఱచందనము, తెల్ల మోదుగ, ఏగిస, నల్లమద్ది, తెల్లమద్ది, నేరేడు, చింత, నల్ల ఊది, చిరిమాను, చేవమాను, కొండవేప, చిన్నంగి, వెంటేకు, వేప, బండారు, పనస మన్నగునవి ముప్పది ఏడు రకములును; మూడవ తరగతికి చెందిన మామిడి, గుంపెన, ఏడాకుల పొన్న, తడ, తొగరు మున్నగునవి ఎనుబది యైదు రకములును; నాల్గవతరగతికి చెందిన కాగు లేదా కానుగ, పొణుకు లేదా తణుకు, అంకుడు తెల్లపాల, తెల్లపొణుకు, గోడనెల్లి మున్నుగునవి ఏబదియైదు రకములును; ఐదవ తరగతికి చెందిన కొండగోగు, కొండ మామిడి మున్నగు నవియును ఆంధ్రప్రదేశపు టడవులలో దొరకును.

కాగితపు పరిశ్రమకు కావలసిన గుజ్జు చేయుటకు పనికి వచ్చు వెదురు, మెత్తని కఱ్ఱగల అందుగ, కొండగోగు, గుజ్జుకు పనికివచ్చు సాగ, కేసరిగడ్డియు దొరకును. వంట చెరకుగా నుపయోగపడు సరుగుడు (చౌక), మడ చెట్లు ఆంధ్రప్రదేశపు సముద్ర తీరమున పెరుగును. చింత, తుమ్మ, శమి, రేగి, గాడనెల్లి మున్నగు మంచిరకము కఱ్ఱ బొగ్గు నిచ్చునవి కూడ ఆంధ్రప్రదేశపు టడవులలో గలవు. తోలు పరిశ్రమలో కావలసిన 'టేనిన్'ను కలిగిన 'రెల్ల', తంగేడు బెరడులున్ను, కరక్కాయ, డివి, డివి (దిమిదిమి) కాయలు కూడ దొరకును. ఇవికాక కుంకుడు, చింత మొదలైనవి కూడ కలవు. ఔషధముల లోనికి పనికి వచ్చు గింజలు, సప్తవర్ణి బెరడు, కొడిశెపాలచెక్క, సుగంధి, అడ్డసరము, నక్క ఉల్లిగడ్డలు కూడ ఆంధ్రప్రదేశ్‌లో దొరకును.

ఆంధ్రప్రదేశ్‌లో వ్యవసాయము ముఖ్య పరిశ్రమ. సాగుచేయబడు వరిపంట ముఖ్యమైనది. ఉభయ పంటలలో గోదావరి, కృష్ణ, నెల్లూరుజిల్లాలలో వరి ఉత్పత్తి ఎక్కువ. బసంగి, అక్కుళ్లు, కృష్ణకాటుకలు, ఆర్టగడ, కొణామణి రకములు తూర్పు, పశ్చిమ గోదావరిజిల్లాలలోను; కుసుమ రకములు, పెద్ద ఆర్టగడ, ఢిల్లీభోగములు కృష్ణజిలాలోను ముఖ్యముగ పండును. జొన్నలు, సజ్జలు, చోళ్ళు, వరగులు, చేమలు, అరికలు మున్నగునవి మెట్టభూములలో పండు చున్నవి. ఇందులో జొన్నలు ముఖ్యమైనవి. ఇవి విశేష ముగ రాయలసీమ జిల్లాలలో పండును. ఇవిగాక పెసలు; మినుములు, శనగలు, కందులు కూడ వివిధ జిల్లాలలో తగుమాత్రముగ పండింతురు. బంగాళాదుంపలు కొద్దిగ అరకులోయలో ఇటీవల పండించుచున్నారు. మిరప కాయలు విశాఖపట్టణము, గోదావరి, కృష్ణ, గుంటూరు, కర్నూలు, నెల్లూరుజిల్లాలలోను; ఉల్లిపాయలు గోదావరి, అనంతపురం, కడపజిల్లాలలోను పండును. విశాఖపట్టణము జిల్లా కొండలలో కాఫీతోటలుకూడ కొలదిగ గలవు.

ఈ పైని చెప్పినవి గాక పంచదార పరిశ్రమకు కావలసిన చెఱకు; సిగరెట్లు తయారుచేయుటకు పనికివచ్చు మేలురకము పొగాకు; వస్త్ర పరిశ్రమకుతగిన ప్రత్తికూడ ఉత్పత్తి యగును. భారతదేశములో ఉత్పత్తియగు పొగాకులో అత్యధిక భాగము ఆంధ్రప్రదేశ్‌లోని గోదావరి, కృష్ణ, గుంటూరు జిల్లాలలో పండుచున్నది. ఆంధ్రుల వ్యవసాయ సంపదలో పొగాకు అగ్రశ్రేణికి చెందియున్నది. ఆంధ్రప్రదేశ్‌లో ప్రత్తి పెరుగు భూమియందు 85% రాయలసీమ జిల్లాలలో కలదు. గోనెసంచుల పరిశ్రమకు పనికివచ్చు (నారదినుసు) గోగు, జనుము కూడ గుంటూరు, కృష్ణ, విశాఖపట్టణము జిల్లాలలో సాగగుచున్నవి. ఇవిగాక కొంత వరకు పీచుపరిశ్రమకు వలసిన తాటిపీచు, కొబ్బరి పీచు కూడ ఉత్పత్తి యగుచున్నవి. ఆంధ్రప్రదేశ్‌లో పండు నూనెగింజలలో వేరుశనగ, నువ్వులు, ఆవాలు, ఆముదము, కొబ్బరి ముఖ్యమైనవి. వేరుశనగ విశాఖపట్టణము, కృష్ణ, గుంటూరు, కర్నూలు, బళ్ళారి, అనంతపురము జిల్లాలలోను; నువ్వులు విశాఖపట్టణము, ఉభయగోదావరి జిల్లాలలోను; ఆముదములు కర్నూలు, అనంతపురము జిల్లాలలోను; కొబ్బరి ఉభయ గోదావరిజిల్లాలోను పండును. ఇవిగాక వలిసెలనబడు నూనె గింజలు విశాఖపట్టణముజిల్లా కొండప్రాంతములో సాగుచేయుచున్నారు. జె. వెం.

# అడవులు

అటవీ సంపద వ్యవసాయాభివృద్ధికి, పరిశ్రమాభివృద్ధికి అత్యవసరము. అడవులయొక్క ప్రాముఖ్యమును నేటి నవనాగరిక దేశములన్నియు గుర్తించినవి. మధ్యప్రాచ్యములో అటవీ వినాశము వలననే ఎడారు లేర్పడినట్లు శాస్త్రజ్ఞులు చెప్పుదురు. పారిశ్రామిక రంగములో ముందంజ వేసిన జర్మనీ, జపాను మొదలైన దేశములు, వ్యవసాయ రంగములో అత్యున్నతి గాంచిన అమెరికా, ఆస్ట్రేలియా దేశములు అటవీ సంరక్షణములో చాల శ్రద్ధను చూపుచున్నవి

ఆంధ్రప్రదేశ్‌లోని జనులకు వ్యవసాయము ప్రధాన వృత్తి. వ్యవసాయమునకు ఇతోధికముగ దోహద మిచ్చునవి అడవులు. ఆంధ్రప్రదేశ్‌లోని అడవుల విస్తీర్ణము సుమారు 24,700 చ.మైళ్లు. రాష్ట్రపు మొత్తము విస్తీర్ణములో అటవీ విస్తీర్ణము 23%. జాతీయ అటవీ విధానము ప్రకారము ప్రజా శ్రేయస్సు దృష్టితో చూచిన యెడల భూవైశాల్యములో 33⅓% అడవు లుండ వలయునని భారత ప్రభుత్వ మంగీకరించినది. కావున అరణ్య ప్రాంతము లెక్కువగ నున్నను ఆంధ్రప్రదేశ్‌లోని అటవీ ప్రాంతము నింకను సాధ్యమైనంతగ విస్తరింప జేయవలసి యున్నది.

పౌరాణికముగ పరిశీలించినను, చారిత్రక నిదర్శనములను పరికించినను, ఆంధ్రప్రదేశ్‌లో పూర్వము దట్టమైన అడవు లుండినట్లు తెలియుచున్నది. సీతారాములు వనవాస మొనర్చిన దండకారణ్యము చాలవరకు ఆంధ్రప్రదేశ్ లోనిదే అని ప్రతీతి. క్రీ. శ. 1652 లో జీన్‌బాప్టిస్టు టవర్నియర్ అను ఫ్రెంచి దేశీయుడు చిత్తూరు జిల్లాలోని చంద్రగిరి రాజు దర్శనార్థమై వచ్చినపుడు దగ్గరనున్న శేషాచలము కొండలలో అడవి ఏనుగులను చూచినట్లు వ్రాసెను. అనగా మూడువందల సంవత్సరములకు పూర్వము ప్రస్తుతము కరవు కాటకముల కాటపట్టయిన కడప, చిత్తూరు జిల్లాలలో గజ నివాసమున కనువైన కీకారణ్యము లుండినట్లు తెలిసికొన వచ్చును. శాంతి భద్రతలు నెలకొన్న తర్వాత, జన సంఖ్య విపరీతముగ పెరిగిన కారణముగ అడవులు సమసిపోజొచ్చినవి. బాధ్యతా రహితమైన విధ్వంసక చర్యల వలనను, ఉద్దేశపూర్వకముగ రగిల్చెడి కార్చిచ్చుల వలనను అటవీ సంపద క్షీణించుచు వచ్చినది. క్రీ. శ. 1881 వ సంవత్సరము నుండి అరణ్య రక్షణము, పోషణము ప్రభుత్వ కర్తవ్యముగ పరిగణింప బడినది. ప్రభుత్వ వశములోని అడవులను ' రిజర్వు ' అడవులుగ ప్రకటించిరి. ఈ అడవుల పరిపాలన కొరకు అటవీ శాఖ స్థాపించబడినది. అటవీ శాఖ వారు విస్తారమైన, అమూల్యమైన అడవుల రక్షణ భారమును వహించు చున్నారు. పరిపాలనా సౌలభ్యము కొరకు, ఆంధ్రప్రదేశ్‌లోని అడవుల విస్తీర్ణమును క్రింది విధముగ విభాగించ వచ్చును :

| | చ. మైళ్లు |
|---|---|
| 1. ' రిజర్వు ' అడవులు | 14,600 |
| 2. గ్రామ పంచాయతీల నుండి తిరిగి అటవీశాఖ తీసికొన్న అడవులు | 2,000 |
| 3. జమీన్‌దారీ, జాగీర్దారీ అడవులు | 6,200 |
| 4. ఇతరములైన అటవీ ప్రదేశములు | 1,900 |
| మొత్తము అడవులు | 24,700 |

' రిజర్వు ' అడవి కొన్ని శతాబ్దముల నుండి శాస్త్రీయ పద్ధతులపై నిర్వహింప బడుచున్నది. 1922-26 సం॥రముల మధ్య స్వపరిపాలన స్థాపనకొరకు గ్రామ పంచాయతీల హస్తగతము చేయబడిన అడవులు సరిగ పరిపాలింప బడలేదు. అందుచే 1948 లో వీటిని తిరిగి అటవీ శాఖకు ఒప్పగించినారు. జమీన్‌దారీ, జాగీర్దారీ రద్దు చట్టములక్రింద జమీన్‌దారుల వశములోను, జాగీర్దారుల వశములోను ఉండిన అడవులను 1950వ సం॥ర ప్రాంతములో ప్రభుత్వము వశపరచుకొన్నది. ఇవి కాక ఇంకను ' అన్ రిజర్వుడు ' (రిజర్వుకాని) ' ప్రయివేటు ' అడవులు కొన్ని ఉన్నవి. సరియైన రక్షణ లేని కారణముచేత పంచాయతీల అధీనములో నుండిన అడవులు; ఒకప్పుడు జమీన్‌దారుల, జాగీర్దారుల పాలనలో నుండిన అడవులు క్షీణదశలో ఉన్నవి. వీటిని ' రిజర్వు ' అడవుల స్థాయికి తెచ్చుటకు చాలకాలము పట్టవచ్చును. వీటి అభివృద్ధి కొరకు కావలసిన ప్రణాళికలు పంచవర్ష ప్రణాళికల క్రింద అమలలో పెట్టబడుచున్నవి.

ఆంధ్రప్రదేశ్‌లోని అడవుల విస్తీర్ణము జిల్లాల వారిగ క్రింది పట్టికలో చూపబడినది.

| జిల్లా | అడవి విస్తీర్ణము (చ.మై.) | జిల్లా మొత్తం విస్తీర్ణము (చ.మై.) | జిల్లా మొత్తం లో అడవి యొక్క శాతం |
|---|---|---|---|
| 1. శ్రీకాకుళము | 646.55 | 3,892.29 | 17 |
| 2. విశాఖపట్టణము | 1,510.62 | 5,022.55 | 30 |
| 3. తూర్పు గోదావరి | 2,101.85 | 5,682.81 | 37 |
| 4. పశ్చిమ గోదావరి | 309.24 | 3,018.48 | 10 |
| 5. కృష్ణా | 349.83 | 3,495.01 | 10 |
| 6. గుంటూరు | 732.06 | 5,635.40 | 10 |
| 7. నెల్లూరు | 1,436.63 | 7,959.68 | 18 |
| 8. చిత్తూరు | 1,762.53 | 5,889 52 | 30 |
| 9. కడప | 1,844.06 | 5,935.19 | 31 |
| 10. అనంతపురము | 745.28 | 7,388.14 | 10 |
| 11. కర్నూలు | 2,676.96 | 9,219.34 | 29 |
| 12. మహబూబునగరు | 1,172.65 | 7,125.10 | 10 |
| 13. హైదరాబాదు | 442.72 | 2,917.39 | 15 |
| 14. మెదకు | 463 98 | 2,914.53 | 16 |
| 15. నిజామాబాదు | 571.49 | 2,981.07 | 19 |
| 16. ఆదిలాబాదు | 2,974.31 | 5,593.88 | 53 |
| 17. కరీంనగరము | 1,127.98 | 4,575.58 | 25 |
| 18. వరంగల్లు | 1,306.59 | 3,871.89 | 34 |
| 19. ఖమ్మము | 1,754.25 | 4,342.13 | 40 |
| 20. నల్గొండ | 449.91 | 5,345.66 | 8 |

హిమాలయ పర్వత సానువులలో పెరుగు 'కోనిఫరసు' అడవులు; అతివృష్టి ప్రాంతములైన అస్సాము, పశ్చిమ తీరములలో పెరుగు హరితారణ్యములు (నిత్యశ్యామలాడవులు) తప్ప భారత దేశములో ఉన్న భిన్న రకముల అడవులన్నియు ఆంధ్రప్రదేశ్‌లో కూడ ఉన్నట్లు చెప్పవచ్చును. ఆంధ్రప్రదేశ్‌లోని అడవులను శాస్త్రీయముగ ఆరు తరగతులుగ విభజింపవచ్చును :

1. అధిక వర్షప్రాంతపు ఆకురాల్చు అడవులు : విశాఖపట్టణము, తూర్పు గోదావరి జిల్లాలలోని పర్వత ప్రదేశములలో ఈ రకము అడవులున్నవి. ఇచట ముఖ్యముగ వేగి, ఏగిస, మద్ది, బ్రటగణప, జిట్టెగి మొదలైన వృక్షములు బాగుగ ఏపుగ పెరుగును. వివిధములైన కలప ఈ యడవుల నుండియే లభ్యమగుచున్నది.

2. అల్పవర్ష ప్రాంతపు ఆకురాల్చు అడవులు : సుమారు 30″ నుండి 40″ వరకు వర్షము కురియు స్థలములలో ఈ విధమైన అడవులు వృద్ధియగును. కర్నూలు, కడప, ఆదిలాబాదు, వరంగల్లు, ఖమ్మము, నిజామాబాదు, కరీంనగరం మొదలగు జిల్లాలలో ఈ ఆకు రాల్చు అడవులు విస్తారముగ నున్నవి. ఈ యడవులలో మద్ది, టేకు, బూరుగు, వెలగ, దిరిసెనము, చిగిరె, భిల్లు వేప, వెదురు మొదలగు వృక్ష జాతు లుండును. వీటినుండి కూడ ఉపయోగకరమైన మంచి రకము కలప ఉత్పత్తియగును.

3. ముండ్ల చెట్లతో కూడిన కుబ్జాటవులు : వర్షపాతము చాల తక్కువగనున్న చోటులందు ముండ్లచెట్లతో కూడిన బొడ్డు అడవులున్నవి. ఇవి చిత్తూరు, అనంతపురము, కడప, కర్నూలు, నల్గొండ మొదలగు జిల్లాలలో కాననగును. తుమ్మ, చండ్ర, రేగు, బలుసు మొదలగు చిన్న రకము చెట్లు ఈ అడవులలో పెరుగును. ముఖ్యముగ ఇవి యన్నియు, వ్యవసాయ పరికరములకును, వంట చెరకుగను పనికి వచ్చును.

4. వర్షాభావ సతత హరితాటవులు : సతత హరితాటవులు మామూలుగ అత్యధిక వర్షపాత ప్రాంతముల యందు వృద్ధియగును. కాని ఇంకొక విధమైన చిన్నరకపు సతత హరితాటవులు వర్షము చాల తక్కువగ నున్న ప్రదేశములందు వృద్ధి యగును. ఇట్టి అడవులు నెల్లూరు, చిత్తూరు జిల్లాలలో కాననగును. చెట్లు చాల పొట్టిగ నున్నను, నిత్య శ్యామలములుగ నుండుటచేత వీటికి సతత హరితాటవులని పేరు వచ్చినది.

5. సముద్ర సైకత తీరపు టడవులు : సముద్ర తీర ప్రాంతములోని ఇసుకలో నిత్య శ్యామలమైన చిన్నచిన్న పొదలు, సరుగుడు (చవుకు) చెట్లు పెరుగు చుండును. సరుగుడుచెట్లు మొదట చాలవరకు అటవీశాఖవారు పెంచినవియే.

6. పోటు అడవులు లేదా మడ అడవులు : ఈ అడవులు చాలవరకు నిత్యశ్యామలములుగనే ఉండును. నదీముఖద్వారములందు, నదీసాగర సంగమ ప్రదేశములలో నదులలోని తేటనీరు, సముద్రములోని ఉప్పునీరు మిశ్రితమగును. కెరటము లువ్వెత్తుగ లేచినపుడు నదీముఖద్వారమంతయు ఉప్పునీటి మయమగును. కెరటములు తగ్గినప్పుడు నదిలోని తేటనీరు సముద్రములో కొంతవరకు ఉప్పదనమును తగ్గించును. ఇట్టి స్థిరములేని మట్టిపై ఏ విత్తనము పడినను మొలవదు. కాని ప్రకృతి ఇచట వృద్ధినొందు వృక్షములకు, వాటి విత్తులకు ఒక అపూర్వమైన ప్రత్యేకతను చేకూర్చినది. విత్తులు చెట్లమీదనే మొలకలెత్తి, మొలకకు బాగుగ పొడుగగు వ్రేళ్ళు వచ్చును. ఈ మొలకలు చూచుటకు ముల్లంగి గడ్డలవలె నుండును. ఇవి బురద నీటిలో పడగనే అందులో నాటుకొని వృద్ధి చెందును. అట్టి వృక్షజాతులలో మడ లేదా మద అను జాతిచెట్టు ఎక్కువగ నుండుటచే ఈ అడవులకు మద లేదా మడ అడవులనియు, సముద్రపుపోటు ఫలితముగ కలిగిన అడవులు కావున పోటు అడవులనియు పేరు. ఇవి గోదావరి, కృష్ణా నదీ ముఖ ద్వారములలో విస్తారముగ ఉన్నవి. తత్పరిసర ప్రాంతస్థ పట్టణములకు కావలసిన వంటచెరకు ఈ అడవులనుండియే లభ్యమగు చున్నది.

అడవుల రకములను గూర్చి చర్చించునపుడే ప్రత్యేకత గల కొన్ని వృక్షజాతులను గూర్చి చర్చించుట అవసరము. ప్రపంచములో మరొకచోట పెరుగని, భారతదేశములో కూడ మరెచ్చట అభివృద్ధి చెందని ఎఱ్ఱ చందనము లేదా రక్తచందనము ఆంధ్రప్రదేశ్‌లో కడప, చిత్తూరు, నెల్లూరు జిల్లాల కూడలి స్థలములో విరివిగ పెరుగుచున్నది. పూర్వము దీనినుండి తీయు ఎఱ్ఱరంగును సిల్కు, క్యాలికో వస్త్రములకు రంగు వేయుటకు ఉపయోగించెడివారు. కడపలో ఈ కలపను వంటచెరకుగను, వ్యవసాయపు పనిముట్లకును ఉపయోగింతురు. ఇటీవల అటవీశాఖవారు జరిపిన పరిశీలన ఫలితముగ ఈ కలప జంత్ర వాద్యములను తయారు చేయుటకై జర్మనీ, జపాను దేశములకు ఎగుమతి చేయబడు చున్నదని తెలియవచ్చినది. విదేశములలో ఈ కలపకు టన్ను 1-కి రు. 500 నుండి రు. 5,000ల వరకు ధరయున్నది (1960). దీని ఎగుమతిపై ప్రభుత్వము కొన్ని ఆంక్షలు విధించి ప్రభుత్వపు అడవుల నుండియే కావలసిన కలపను సరఫరా చేయుటకు ఏర్పాట్లు చేయుచున్నారు. ఎఱ్ఱచందనపు అడవులను విరివిగ అటవీశాఖవారు పెంచుచున్నారు.

విలువ గలిగిన వృక్షములలో శ్రీగంధ మొకటి. ఆంధ్ర ప్రదేశ్‌లో చిత్తూరుజిల్లాలోని పలమనేరు పీఠభూమి యందును, మదనపల్లి పరిసరములలోను, అనంతపురము, హైదరాబాదు, మెదకు జిల్లాలలోను శ్రీగంధపు చెట్లు వృద్ధియగును. శ్రీగంధ తైలమును తయారుచేయు మూడు ఖాదీ పరిశ్రమలు చిత్తూరుజిల్లాలో కుప్పము పట్టణములో నెలకొల్పబడినవి. మందులకును, పరిమళ వస్తువులలోను శ్రీగంధతైలమును వాడుదురు. ఆంధ్రప్రదేశ్‌లో తయారగు తైలము ఎక్కువగ అమెరికా దేశమునకు ఎగుమతి అగుచున్నది. శ్రీగంధము చెక్క టన్ను ఒకటికి రు. 6,000 ల చొప్పున (1960) ఎగుమతి ఖరీదు ఉన్నది. అమూల్యమైన ఈ వృక్షమును సంరక్షించుటకు అటవీశాఖవారు కృషి చేయుచున్నారు.

వెదురు ఆదిలాబాదు, ఖమ్మము, కర్నూలు, తూర్పు గోదావరి, విశాఖపట్టణముజిల్లాల అడవులలో విరివిగ అభివృద్ధి చెందును. వెదురును పేదల కలప అందురు. పూరిల్లు కట్టుకొనుటకు ముఖ్యముగ కావలసినది వెదురు. వెదురునుండి కాగితముకూడ తయారగుచున్నది. వెదురును ముడిపదార్థముగ ఉపయోగించి కాగితము తయారు చేయు గొప్ప పరిశ్రమలు రెండు ఆంధ్రప్రదేశ్‌లో రాజమండ్రి (తూర్పుగోదావరిజిల్లా) లోను, సిర్పూరు (ఆదిలాబాదుజిల్లా) కాగజ్ నగరులోను ఉన్నవి. అటవీశాఖవారు ఈ మిల్లులకు వలసిన ముడి సరకును సరఫరా చేయుచున్నారు.

తూర్పుతీర ప్రాంతమున సముద్రతీరములో రేగెడు ఇసుక దుమారమును అరికట్టుటకును, కోస్తా జిల్లాలలోని వంటచెరకు కొరతను తీర్చుటకును అటవీశాఖవారు విస్తారమైన సరుగుడు (చవుకు) అడవులను పెంచుచున్నారు. ప్రస్తుతము సుమారు పదునాలుగు వేల ఎకరములలో సరుగుడు వనములు పెంచబడుచున్నవి. సరుగుడు కఱ్ఱ ఇసుకలో రవాణా చేయుట కష్టమగుటచేత ప్రత్యేకమైన ట్రాము లైనులను వేసి వంట చెరకుకై రవాణా చేయుచున్నారు. శ్రీహరికోట (నెల్లూరుజిల్లా) దీవిలో ట్రాములైనుల రవాణా సౌకర్యము బాగుగ అభివృద్ధి చెందియున్నది.

వంట చెరకు కొరతను తీర్చుటకు అనతి కాలములో పెరిగి పెద్దవి కాగల వృక్ష జాతులను గూర్చి అటవీశాఖవారు చాల కాలమునుండి పరిశోధనలు జరుపుచున్నారు. తత్ఫలితముగ ఒక జాతి యూకలిప్టసు వృక్షము ఆంధ్ర ప్రదేశ్‌లో పెరుగునని తేలినది. ఇది 10 సంవత్సరములలోనే సుమారు 60 అడుగుల ఎత్తు పెరుగ గలదు. దీనిని చిత్తూరు, నెల్లూరు, హైదరాబాదు జిల్లాలలో విస్తారముగ నాటుచున్నారు.

భూసార సంరక్షణమునకును, జలసంరక్షణమునకును, వరదలను వెల్లువలను అరికట్టుటకును వృక్ష సంపద సహాయకారి యగుచున్నది. వృక్షములులేని పర్వత సానువులు కోరబడి రాయి, మట్టి యంతయు నదుల లోనికి కొట్టుకొనివచ్చి తుదకు సాగర గర్భములోనికి చేరుచున్నది. పర్వత ప్రాంతముల వసించు కోయజాతివారు చేయు 'పోడు' వ్యవసాయము అటవీ సంపదకు, రాష్ట్ర సౌభాగ్యమునకు కూడ పరమశత్రువు. కొండ జాతుల వారి స్వాతంత్ర్యము అను పేర జరుగు ఈ పోడు వ్యవసాయ పద్ధతిని నివారించు ప్రయత్నములు ఇంకను సఫలము కాలేదు. నదీజన్మ ప్రాంతములలోను, ప్రాజెక్టుల పరిసరపు టడవులలోను వలసిన వృక్ష సంపద ఉండిననాడే పెద్దనదుల కడ్డముగ నిర్మింపబడిన, ఇకముందు నిర్మింపబోవు మహత్తర జలాశయములు ప్రజలకు కొన్నివందల సంవత్సరముల వరకు ఉపయోగపడును. అటవీసంపద నాశనమైనచో వర్ష, జలపాత కారణముగ నేల కోరుకొనిపోయి జలాశయము లన్నియు కొద్ది కాలములోనే పూడిపోవును.

అరణ్యములని నంతనే, వృక్షములు, కుంజ నికుంజములే గాక అడవి జంతువులు కూడ మన మానస ఫలకమున గోచరించును. వ్యాఘ్ర గర్జనము, కోకిల కూజితము, మయూర నాట్యము, లేడి గంతులు లేని వనమునందు రమ్యత ఉండదు. ఆంధ్రప్రదేశ్ అడవులలో పులి, చిరుత పులి, దుప్పి, జింక, పైసను (అడవి ఎనుబోతు), ఎలుగుబంటి, నీలగాయి మొదలగు జంతువులు అనేకములున్నవి. ఇవి ప్రకృతి వ్యవస్థను పరిరక్షించు చున్నవి. విచక్షణ లేకుండ షికారీలు, వేటగాండ్రు జంతువులను నాశనము చేయుచుండుటచూచి అటవీశాఖవారు ఆంధ్రప్రదేశ్‌లో మూడు జంతు రక్షణారణ్యము (సేంక్ట్యుయరీ) లనే నెలకొల్పి వన్య మృగములకు శరణ్యము కల్పించిరి. ఈ అడవులను సక్రమ పద్ధతిలో నడిపినచో మృగయా విహారార్థము విదేశీ యాత్రికుల నాహ్వానింప గలవు. వీటి వలన కూడ దేశమునకు కావలసిన విదేశీ మారకము కొంత లభ్యము కాగలదు. కట్టుబాట్ల ననుసరించి షికారీలు చేయు మృగయా వినోదము ద్వారా కూడ అటవీశాఖకు కొంత ఆదాయము వచ్చు చున్నది.

అడవులనుండి కలప, వంటచెరకునకే కాక, వివిధములైన ఓషధులు, రసాయన సత్తులు, ధాతువులు, ఇతర చిల్లర ఫలసాయములు లభ్యమగు చున్నవి. అత్తరులకు, సబ్బులకు, ఇతర పరిమళ ద్రవ్యములకు వలసిన సుగంధ తైలములు అడవులలోని వివిధ గ్రాసముల నుండియే తీయబడుచున్నవి. చర్మములను పదును చేయుటకు పనికి

వచ్చు చెక్క, కరక్కాయలు; బీడి పరిశ్రమ కవసరమైన తునికి ఆకులు ఆంధ్రప్రదేశ్ అడవుల నుండియే సరఫరా అగుచున్నవి.

ఆంధ్రప్రదేశ్‌లోని అడవులనుండి సాలీనా వచ్చు ఆదాయము సుమారు మూడు కోట్ల రూపాయలు. ఈ ఆదాయము కూపులను అమ్ముట ద్వారా వచ్చుచున్నది. ఆదాయమును పెంచుట కొరకు కూపులను కంట్రాక్టర్లకు అమ్మకుండ అటవీశాఖవారే స్వయముగ నరికించి, రంపపు మిల్లులను స్థాపించి, డిపోలను పెట్టించి కలపను అమ్ముచున్నారు. ఇందువలన ఆయా చోట్లలో ఇంతకు ముందు వచ్చు ఆదాయమునకు రెట్టింపు ఆదాయము లభ్యమగుచున్నది. రాజమండ్రి, మంచిరియాల రెండును ప్రసిద్ధి కెక్కిన కలప మార్కెట్లు.

ఆదాయమును పెంచుటకు అటవీశాఖవారు వ్యాపార సరళిలో కొన్ని వనములను పెంచుచున్నారు. భారతదేశములో సంవత్సరమునకు 60,000 టన్నుల ముంతమామిడి పప్పు (జీడిపప్పు) పండింప బడుచున్నది. విదేశములకు ముఖ్యముగ అమెరికాకు జీడిపప్పు ఎగుమతి చేయుట ద్వారా సాలీనా భారతదేశమునకు రు. 13 కోట్లు లభించుచున్నది. ఆంధ్రప్రదేశ్‌లో సంవత్సరమునకు 1,000 టన్నుల పప్పు కంటె ఎక్కువ ఉత్పత్తి యగుటలేదు. జీడిపప్పు ఉత్పత్తి ఎక్కువచేసి, డాలరు మారకమును సంపాదించుటకై ఆంధ్రప్రదేశ్ రాష్ట్రములో ముంతమామిడి తోటలను విస్తారముగ పెంచుటకు అటవీశాఖ నిర్ణయించినది. కోస్తా జిల్లాలలో ఇప్పటికే సుమారు ఐదు వేల ఎకరములలో ముంతమామిడి చెట్లను నాటియున్నారు. సి.వి.కె.రె.

**•ఆంధ్ర ప్రదేశ్ వృక్షసంపద - శాస్త్రీయ నామము**

| | |
|---|---|
| అంకుడు | *Wrightia tinctoria R. Br.* |
| అందుగ | *Boswellia Serrata Roxb.* |
| అడ్డసరము | *Adhatoda Vasica Ness* |
| అడ్డాకు తీగె | *Bauhinia Vahlii W & A* |
| అరివిటి | *Eugenia bracteata Roxb* |
| అల్లి | *Memecylon edule Roxb* |
| ఆకురాలు అడవులు | *Deciduous forests* |
| ఆరుదొండ | *Capparis zeylannica Linn* |
| ఉప్పు పొన్న | *Rhizophora mucronata Lamk* |
| ఎర్రచందనము | *Pterocarpus santalinus L. F.* |
| ఏగిస | *Pterocarpus marsupium Roxb* |
| ఏడాకుల పొన్న | *Alstonia scholaris R. Br.* |
| ఏపి | *Hardwickia binata Roxb* |
| కడివి | *Lumnitlzera racemosa Willd* |
| కరక్కాయ చెట్టు | *Terminalia chebula Retz.* |
| కలివి | *Carissa spinarum A. D. C.* |
| కాగు లేక గానుగ | *Pongamia glabra vent* |
| కానరేగు | *Flacourtia ramontchii L'Herit and F. Cataphracta Roxb,* |
| కుంకుడు | *Spindus emarginatus Vahl.* |
| కేసరిగడ్డి | *Heteropogon contortus Beauv.* |
| కొంకి | *Pisonia aculeata Linn.* |
| కొండగోగు | *Cochlospermum gossypium D. C.* |
| కొండ తంగేడు | *Xylia xylocarpa Taub.* |
| కొండ మామిడి | *Spondias mangifera Willd.* |
| కొండవేప | *Chukrassia tabularis A. Juss.* |
| కొడిశపాల | *Kurchi bark* |
| కొరివి | *Ixora parviflora vahl* |
| గాతరు | *Ceriops roxburghiana Arn.* |
| గుండుమడ | *Aviscennia alba Linn* |
| గుంపెన | *Odina wodier Roxb.* |
| గుట్టి | *Polyalthia ceraseoides Bth.* |
| గొట్టి | *Zizyphus xylopyrus Willd.* |
| చింత | *Tamarindus indica L,* |
| చిట్టడవులు | *Scrub Jungles* |
| చిన్నంగి | *Lagerstroemia parviflora Roxb.* |
| చిరిమాను | *Anogcissus latifolia Wall*<br>*Anogeissus acuminata Wall* |
| చేవమాను | *Soymida febrifuga Adr. Juss.* |
| జిట్టెగి | *Dalbergia latifolia Roxb.* |
| టిల్ల | *Excecaria agallocha Linn.* |
| టేకు | *Tectona grandis Loinn* |
| టేనిన్ | *Tannis* |
| డివిడివి | *Caesalpinia coriaria Willd* |
| డుడిగ | *Polyalthia suberosa Hk. f&T. Bth.* |
| తంగేడు | *Cassia auriculata Linn* |
| తడ | *Pterospermum heyneanum Wall* |
| తాని | *Terminalia coriacea W&A* |
| తుంగ కుటుంబము | *Cyperaceae* |
| తుమ్మ | *Acacia arabica Willd.* |
| తుమ్మిక | *Diospyros peregrina Gurke.* |
| తృణ కుటుంబము | *Gramineae* |
| తెల్లకరక | *Terminalia pallida Brand* |
| తెల్లపాల | *Wrightia tomentosa R & S.* |
| తెల్లపొణుకు | *Givotia rottleriformis Griff* |
| తెల్లమడ | *Avicennia officinalis Linn* |
| తెల్లమద్ది | *Terminalis arjuna Bed* |
| తెల్ల మోతుక | *Ougeinia dalbergioides Bth* |
| తొగరు | *Morinda tinctoria Roxb* |
| దుడ్డుపొన్న | *Bruguira conjngata Merr* |

| | |
|---|---|
| నంది | *Cedrela toona Roxb* |
| నక్క ఉల్లిగడ్డలు | *Indian squill* |
| నల్లడామరు | *Shorea tumbaggaria Roxb* |
| నల్లమద్ది | *Terminalia tomentosa Bed* |
| నల్లపూటి | *Diospyros ebenum Koem* |
| నాచుజాతి | *Mosses* |
| నిమిరిలేక పులిమద్ది | *Terminalia paniculata Roth.* |
| నీటమ్ | *Gnetum ula brogn.* |
| నెల్లి, గొడనెల్లి | *Trema orientalis Bl.* |
| నేరేడు | *Eugenia jambolana lamk* |
| 'పత్రి' అనబడు చామంతి జాతి మొక్క | *Launaea pinnatifida* |
| పనస | *Artocarpus integrifolia L.* |
| పరికి | *Zizyphus oenoplia Mill* |
| పాల | *Mimusops Hexandra Roxb* |
| పిల్లితేగలు | *Asparagus racemosus willd.* |
| పుసక | *Schleichera trijuga willd.* |
| పొణుకు లేక తణుకు | *Gyrocarpus americanus Jacq.* |
| బందారు | *Adina cordifolia Hk.f.* |
| బలుసు | *Plectronia parviflora Bedd.* |
| బాలబంది తీగె | *Ipomoea pes-caprae Sweet.* |
| బిల్లు | *Chloroxylon swietenia D.C.* |
| బూరుగ | *Bombax malabaricum D.C.* |
| బొద్దుతీగె | *Combretum decandrum Roxb* |
| మంగ | *Randia dumetorum Lamk* |
| మంచి మోయిడి | *Syzigium alternifolium valp* |
| మడ | *Avicennia marina Vierh (typica Loim)* |
| మడచెట్లు | *Avicennia sps.* |
| మయూరము | *Vitex altissima L. f.* |
| మామిడి | *Mangifera indica L.* |
| ముల్లు గోరింట | *Barleria prionitis L.* |
| ముల్లు మోదుగ | *Erythrina suberosa Roxb.* |
| ముషిణి | *Strychnos nuxvomica L.* |
| మొగలి | *Pandanns sps. (odoratissinous)* |
| మోదుగ | *Butea frondosa Roab.* |
| యిప్ప | *Bassia latifolia Roxb.* |
| రావణాసురుని మీసాలు | *Spinifex squarroous Linn.* |
| రేల్ల | *Cassia fistula L.* |
| రేగి | *Zizyphus jujuba Lamk.* |
| లివరు వోర్టులు | *Liverworts* |
| 'లెగుమినేసి' కుటుంబము | *Leguminosae* |
| వాక | *Carissa carandas L.* |
| వురడ | *Bruguiera parvillora* |
| వృక్షపర్ణపురకము | *Tree fern.* |
| వెంశేకు | *Lagerstroemia lanceolata wall* |
| వెదురులు | *Dendrocalmus strictus Nees.* |
| వెలుతురు | *Dichrostachys cinerca W & A.* |
| వేప | *Azadirachta indica Juss.* |
| శమి | *Prosopis spicigera L.* |
| సప్తవర్ణి బెరడు | *Dita bark* |
| సరుగుడు | *Casuarinae equiestifolia Forst.* |
| సాగ | *Sanseviera roxburghii shult. f.* |
| సాల | *Shorea robusta Gareertn.* |
| సుగంధి | *Indian Sarasaparilla.* |

# జంతుసముదాయములు

జీవశాస్త్ర దృష్టిలో భరతఖండ ద్వీపకల్ప భాగము ప్రాచ్యఖండ మందలి మహాప్రాచీన ప్రాణి నివాసక్షేత్రము. భరతఖండ మందలి అష్ట మండలములలో దక్కను ఒకటి. భూతత్త్వశాస్త్రము ప్రకారము దక్కను పీఠభూమి సముద్రముచే ఎన్నడును ముంపువడని అత్యంత పురాతన భూఖండము. తూర్పు కనుమలు ఆరావళి పర్వత పంక్తియంత పురాతన మైనవి. కడప, కర్నూలు జిల్లాలు ప్రస్తర శిలావర్గము వల్ల ఏర్పడినవి. కాని పర్వతములు, పీఠ భూములు, బయళ్ళు, నదులు, సరస్సులు, లవణోదక తటాకములు, సముద్రము గల ఈ ప్రదేశమునందు ఉన్న జంతు సంపదలోఎట్టి ప్రాదేశిక విశిష్టతయును కనబడదు.

వెన్నెముక లేని జంతువులు వేల కొలది రకములు ఆంధ్ర ప్రదేశ్‌నందు అంతటను విరివిగా వ్యాపించి ఉన్నవి. ముఖ్యముగ సూక్ష్మజీవులు, కీటకములు మున్నగు చలనము కల ప్రాణికోటి ఈ వర్గములో చేరియున్నది. నవీన పరిశోధనల ఫలితముగ మానవ జీవితముపై ఈ వర్గముయొక్క ప్రభావము హెచ్చుగ ఉన్నట్లు గుర్తింపబడినది.

స్థూలదృష్టిలో ఒక దేశముయొక్క జంతు సముదాయముల వ్యాప్తిని వర్ణించుటకు వెన్నెముక గల జంతువులు ముఖ్యము. కాని ఆంధ్రప్రదేశ్‌లో కనబడు ముఖ్యమైన వెన్నెముక గల జంతువులలో దేశజములై దేశమునకు విశేషమని భావింపదగినవి ఏవియును లేవు.

చేపలు : ఆంధ్రప్రదేశ్ తీర సముద్రమందును, తటాకములలోను, నదీముఖద్వారము లందును నివసించు చేపలలో 506 ఉపజాతులకు చెందినవి మాత్రము శాస్త్రరీత్యాగుర్తింపబడినవి. వీనిలో చాల రకములు భోజ్యములు. చేపలలో రెండు ముఖ్యజాతు లున్నవి: 1. ఎముక గల చేపలు (టెలియాస్టులు); 2. ఉపాస్థి చేపలు. ఇందు ఎముక గల

వాని శరీరమునందు అస్థిపంజరము ఎముకలతో ఏర్పడి యుండును. ఇవి ఉప్పునీటియందును మంచి నీటియందును కూడ ఉండును. ఉల్లాకుచేపలు (ఇండియన్ హెర్రింగ్), పాలబొంత, ముల్లువలస, సవల్లు, గుర్రపుమూతి చేప, పైజారుకట్టు, ఈసపట్టి, చొంకావు, జెర్రిపోతు చేప, ఆకు చేప, కవల్లు చేప మొదలగునవి సముద్రములో దొరకును. పక్కెచేపలు, పరిగెలు, జల్లలు, బేడిసెలు, వాలుగలు, పెద పొలికలు మొదలగునవి నదులలోను, చెరువులలోను సాధారణముగ దొరకును. అందులో పొలికలు (మాసర్) కృష్ణా, గోదావరి నదులలో విరివిగా దొరకును. పక్కె (కార్కులు), గండుమీనులు (లేబెస్) పోలవరము వద్ద గోదావరి నదిలో దొరకును. ఈ జాతికి చెందిన పండుగొప్ప అను చేప సముద్రమును అంటియుండు చిన్నచిన్న జలాశయములలో నుండును. ఇందొక్కొక్కటి నూరు పౌనుల బరువుండును. నల్లజల్లలందు ఆడుచేప గుడ్లను పెట్టినతరువాత మగచేప వానిని తన నోటిలో పొదుగునంతవరకు నుంచుకొనును. పెక్కు రకముల మలుగు చేపలు (ఈల్స్) మంచి నీటిలో దొరకును. ఇవి సముద్రమునకు పోయి గ్రుడ్లు పెట్టును. నెత్తికండ్ల ముప్పె బురదనీటిలో నుండు రకము. ఇసుక దొందు చెరువులలో నుండు చేప. చెరువులందుండు చేపలలో కొన్నింటికి నీటిబయటి గాలిని పీల్చు సదుపాయము లున్నవి.

ఉపాస్థి చేప (కార్టిలేజి)ల శరీరమునందు అస్థిపంజరము ఉపాస్థియను మెత్తని పదార్థముతో ఏర్పడియున్నది. ఈ రకము చేపలన్నియు సముద్రములో నుండునవి. ఉపాస్థి మీనములు సొర, ఏకి (saw fish) అను రెండు రకములు. సొరచేపల దేహము పొడవుగను గుండ్రముగను ఉండును. నోటి వెనుకగా శరీరమున కిరుప్రక్కలయందు మొప్పలలో రంధ్రములు కలవు. కొన్ని సొరచేపలు గుడ్లు పెట్టక పిల్లల నీనును. చప్పసొర, పులిసొర, ఏలాచేప, చొక్కసొర, కొమ్ముసొర, రాగిసొర-ఇవి సాధారణముగ ఆంధ్ర ప్రదేశ్‌లో కనపడు సొర చేపలు. పులి సొరకు శరీరమున చారలుండును. ఏలాచేప మూతి రంపమువలె నుండును. చప్పసొర తల సుత్తి తలకాయ వలె శరీరమునకు అడ్డముగ వ్యాపించి యుండును.

ఏకి చేపల శరీరము పలుచగా నుండును. దీనికి మొప్పల యందలి రంధ్రములు శరీరమునకు అడుగు భాగమున నుండును. వీనిలో వాలుగ ఏకి, తిమిరిఏకి, ఆంధ్ర ప్రదేశములో దొరకు ముఖ్యమైన ఏకి చేపలు. తిమిరిచేప తన కండరములందు విద్యుచ్ఛక్తి జనింపజేసి ఇతర చిన్న జంతువులను చంపుట కుపయోగించును.

ఉభయచరములు : ఆంధ్రప్రదేశమందుండు ఉభయ చరములలో విశేష మేమియు లేదు. భారతదేశమందుండు ఏడుజాతుల కప్పలు ఆంధ్రప్రదేశ్‌లోను కానవచ్చును. ఇవి సాధారణముగ నీటికి సమీపమున నుండు తేమనేలలందును, చెరువు లందును, బావులందును అగపడును. గోదురు కప్ప నేలమీద సంచరించును; ఇండ్లలోనికి కూడ వచ్చుచుండును. చిరుకప్ప గోడలమీదను, అరటిచెట్ల యందును ఉండును. నేలలో పూడుకొని పోయి యుండు కప్పకూడ ఆంధ్రప్రదేశ్‌లో కనబడును.

సరీసృపములు (రెప్టైల్సు) : ఈ సముదాయములో పాములు, బల్లులు, తొండలు, ఊసరవిల్లులు, నలికీచు (నాలుగు కాళ్ళ పాము), తాబేళ్ళు, మొసళ్ళు చేరును. ఆంధ్రప్రదేశ్ నందలి పర్వత ప్రదేశమునందలి పాములు విషము గలవి, విషము లేనివి పలు జాతులు కలవు. నీటి పాము తటాకములందును, ప్రవాహము లందును మెండుగా నుండును. సెర్బిరసు అను చక్కని చారలుగల పాము ఉప్పుటేళ్ళవద్ద నివసించును. శిఖండి (రెండు తలల పాము - ఎరిక్సు), జెర్రిపోతు, గాజుతుట్ట-ఇవి విషములేని పాములు సాధారణముగ కనబడును. అడవులందు కొండచిలువ (python) విశేషముగ నుండును. పసిరిక పాము కూడ సాధారణమైన పాము. నాగుపాములు, రక్తపరుగుడులు, కట్లపాములు, ఎలుకలను పట్టు దాసరిపాములు ఆంధ్ర ప్రదేశ్‌నందు మెండుగ కలవు. నేడు ఆంధ్ర వైద్య కళాశాల, మిసెస్ ఎ. వి. యన్. కళాశాలను ఆక్రమించియున్న ఇసుకదిబ్బ ఒకప్పుడు రక్త పరుగుడు పాములకు విడిది పట్టుగ నుండెడిదని ప్రతీతి. చారల కట్ల పాములు అప్పుడప్పుడు ఇండ్లలోనికి కూడ చొరబడును. నాగసర్పము కొండ అడవులలోనే కానబడును. ఇవికాక అప్పుడప్పుడు వలలో తగుల్కొని ఒడ్డునకు వచ్చు పాము రకములనేకము సముద్రమునందు కూడ గలవు.

బల్లులు, తొండలు, ఊసరవిల్లులు వంటి వాటిని ఇంటి బల్లి ప్రతి ఇంటి గోడలపైన సాధారణముగ కాననగును. మాలబల్లికూడ ఈ బల్లిని పోలియుండును. 'చుక్కలబల్లి' నెల్లూరు, కృష్ణాజిల్లాలలో గానబడును. ఉడుము, తొండ అన్ని ప్రదేశములలోను గానవచ్చును. సన్నతొండ పొద లందు నివసించుచున్నది. కొంచె మెర్రగనుండు తోకయు, మిగుల పొట్టికాళ్ళును గలిగిన ఒక చిన్న నల్లికీచు ముఖ్యముగ కొండలుండు చోట్ల కనబడును. అచ్చటచ్చట దొడ్లలోకూడ ఈ నల్లికీచు కాననగును. ఊసరవిల్లి సాధారణముగ అన్ని అడవి ప్రదేశములలోను కనబడును. శరీరమునకు ఇరుప్రక్కలను పొడుగైన చార కలిగిన ఒక

విధమైన బల్లి గోదావరిజిల్లా లోను, తిరుపతి కొండయందును కనబడుచున్నది.

పెద్ద మొసళ్లు ఆంధ్ర ప్రదేశ్‌నందు పెక్కునదులలోను, ఉప్పుటేళ్లలోను, పెద్ద తటాకములలోను, నదీ ముఖ ద్వారములందును కనబడును. గోదావరినదిలో రాజమండ్రి వరకు కనబడుచుండును. తుంగభద్రలో కూడ మొసళ్లు గలవు. నదులలో నుండు మొసలి కొంచెము పొట్టిగను, వెడల్పుగను ఉండు మూతి కలిగియున్నవి. ఉప్పుటేళ్లయందును, నదీ ముఖద్వారము లందును ఉండు మొసలి పొడవైన మూతి కలిగినది. ఇది ముప్పది యడుగుల పొడుగు వరకు కూడ ఎదుగును.

మెట్ట తాబేలు సాధారణముగ ప్రతిచోట కనబడును; ఎమీడా, గామీడా రకములు కూడ సాధారణములే. మంచినీటి తాబేళ్లు (కచుబా) గోదావరి, కృష్ణా నదులలో కలవు. దాని ఉపరి చర్మము గట్టిగ ఉండి పలకలుగ నుండును. మెత్తని శరీరము గల కూర్మమొకటి ముఖ్యముగ చెరువులలో నుండును. మెత్తని ఉపరిచర్మము గల తాబేళ్లు కృష్ణానది లోను, దాని యుప నదులలోను ఉన్నవి. ఇవిగాక సముద్రములో హాక్సుబిల్, లాగర్ హెడ్, లెదర్ టర్టిల్ అను పెద్ద తాబేళ్లున్నవి. ఈ తాబేళ్ల చిప్పలతో మన్ను ఇతర వస్తువులు మోయుదురు; వీనిని పాత్రలు కూడ వాడుదురు.

పక్షులు : ఆంధ్రప్రదేశ్‌లో కానవచ్చు పక్షులను జాగ్రత్తతో పరిశీలించిన గోదావరి జిల్లాలలో అగపడు చక్రవర్తి పావురము (ఇంపిరియల్ పిజియన్) విశేషమైనది. గోదావరి లోయలనుండి మద్రాసు వరకు నుండు చిట్టడవులలో కనబడు ఒక రకపు కోర్సర్ అను పేరుగల పావురమును ఆంధ్రప్రదేశ్‌లో తప్ప మరెచ్చటను లేనట్లు తెలియుచున్నది. ఇవి తప్ప దేశజములని చెప్పదగు పక్షులు ఆంధ్రప్రదేశ్‌లో లేవు.

నివాస స్థలములనుబట్టి పక్షులను వర్గీకరించిన ఈ క్రింది రకములు ఆయా ప్రదేశములలో కనబడును.

సమతల ప్రదేశవాసు లనబడు కాకి, అడవి కాకి, పై, తెల్లకండ్ల టిట్, ఆకుపచ్చ బుల్‌బుల్, ఇతర రకముల పిగిలి పిట్టలు, పలురకముల పిట్టలు, కొత్వాలు పక్షులు (కింగ్ క్రో), ఈల పిట్టలు, దర్జీ పిట్టలు, ఈగలను పట్టు పిట్టలు, మైరికులు, పసుపు పొత్తులు (గోల్డెన్ ఓరియోల్), ఇండియన్ రాబిన్, షామా, బంగారు పిచ్చుక, మునియాలు, పచ్చమెడ పిచ్చుక, ఊరు పిచ్చుక, పింఛముగల బంటింగ్, ఇసుక పిచ్చుకలు, తోకాడించు పిట్టలు, భరద్వాజ పిట్ట, నలుపు తెలుపు లేదా పంచరంగుల కంసాలి పిట్ట, బార్బెట్లు (ముఖ్యముగ కాపర్‌స్మిత్‌లు), రోలర్లు, తేనెటీగలను తిను పిట్టలు, జాలరి పిట్టలు, లకుముకి పిట్టలు, హార్న్‌బిల్లులు, హూపోలు, స్విఫ్టులు, నత్తృకములు (నైట్ జార్స్), కోయిల, డేగకోయిల (హాక్ కుకూ), జీవం జీవములు (ఫీజెంట్స్), రోజారంగు వలయ చిహ్నములు గల పారకీట్లు, బండి పులుగు, గుడ్లగూబ, మచ్చల గూబ, పొడవు ముక్కు రాబందు, తెల్లవీపు రాబందు, చిన్నగద్ద, మచ్చలగద్ద, బుర్రకుచ్చుగద్ద, సామాన్యపు గద్ద, షిక్రా, లాగర్ డేగ, ఎర్రతల మెర్లిన్, ఆకుపచ్చ పావురములు, నీలిరంగు పావురములు, కొండ పావురములు, డోపర్లు, నెమలిపిట్టలు, లావుకపిట్టలు(క్వెయిల్స్), సామాన్యమైన బూడిదరంగు కౌజు పిట్టలు, నీటికోళ్లు, సారస కొంగలు, సారంగములు (బస్టర్డ్స్), ఫ్లారికన్లు, క్రౌంచములు (కర్‌ల్యూ), కత్తెర పిట్టలు (ప్రాటింతలు - స్వాల్లోస్), కంచురెక్కల జకానా, అలుగుపిట్ట (డార్టర్), లాప్ పింగులు, సాండ్ పైపర్లు.

నదులలో తటాకములలో ఉండు పిట్టలలో స్టోన్ ప్లవర్, కురరి పక్షులు, లకుముకి నదీతీరములలోను, నీళ్లలోను ఉండును. ఇవిగాక పెలికన్లు, కార్మొరాంట్లు తటాకములలోను, పెద్ద సరస్సులలో నివసించియుండును. బురద ప్రదేశము (మార్షస్) లందు నీలిరంగు గుండె గల లావు పిట్టలుండును.

కొండలలో లాఫింగ్‌త్రష్, విజిలింగ్‌త్రష్, బాబ్లర్లు, నల్లపిగిలి పిట్టలు, మినివెట్లు, మాటలాడు మైనాలు లేదా కొండ మైనాలు, నల్లపిట్టలు, రాతి మార్టిన్లు, సాలి పురుగులను తిను పిట్టలు, ఎర్రకొమ్ముల గుడ్లగూబ, గోదావరి జిల్లా ఉత్తర భాగములందు ఎర్ర అడవి కోళ్లు ఉండును.

అడవులలో సాల్పోర్నిప్ అను వృక్ష సర్పిక (ట్రీక్రీపర్) గోదావరి జిల్లా ఉత్తరభాగమందు డేగ, గద్ద, అడవి పావురములు, డెండ్రా క్రెరానులు, అల్సోకోమస్సులు, బూడిదరంగు అడవి కోడి ఉన్నవి.

ప్రవాసేయ పక్షు (మైగ్రేటరీ బరడ్స్)లలో చాల రకములు ఇతర రాష్ట్రములనుండి ఆంధ్రప్రదేశ్‌కు శీతకాలములో చేరుకొనును. ఈ రకమునకు చెందినవి ఇండియన్ రెడ్-స్టార్ట్, కార్న్ బంటింగ్, ఐరోపా స్వాలో, ఐరోపా స్విఫ్టు, అస్ప్రే, క్రిప్రశ్యేనములు, డేగలు సుమారు ఆరు రకముల హారియర్లులు (చిన్న డేగలు), కెస్ట్రెల్ డేగలు, ఉత్తరాంధ్ర మందుండు ఖరక్రౌంచములు (డిమోసిల్ క్రేన్స్), కర్ కర్ అని అనేక స్వరములలో అరచు కొంగలు, బూడిదరంగు లావుకలు, స్నైపులు (కునాల పక్షులు), ఈస్టర్న్ గోల్డుఫ్లవర్, గ్రేప్లవర్, కెంటిష్ ప్లవర్, అవో

సెట్, పట్టీల తల గలబాతు (బార్ డ్ హెడ్‌గూస్), బ్రాహ్మనీ బాతులు, పిన్ టెయిలులు, మామూలు లేదా నీలిరెక్కల తోకగల (నీటి బాతులు).

సస్తనములు (మేమల్స్): ఈ జంతువులకు శరీరము వెంట్రుకలతో కప్పబడియుండుట, పిల్లల నీనుట, పిల్లలకు పాలిచ్చుట ముఖ్యమైన లక్షణములు. ఈ సస్తనముల జాతులు అన్ని రకములును ఆంధ్రప్రదేశ్‌లో కానవగును.

ఆంధ్రప్రదేశపు సముద్రతీరమునకు అరుదుగ తిమింగిలములు కొట్టుకొని వచ్చుట కలదు. తిమింగిలముల ఉపజాతిలో శఫరములు (డోల్ఫిన్స్), శిశుకములు (పోర్‌పోటుసెస్), తిమింగిలములు (హ్వేల్స్) చేరియున్నవి. విశాఖపట్టణపు సముద్రతీరమున శఫరములు, తిమింగిలములు పూర్వము కానబడుచుండెడివని ప్రతీతి.

ఆంధ్రప్రదేశ్‌లో ఈ శతాబ్దములో ఏనుగు ఎచటను కానరాదు. కాని ప్రాచీనకాలమున కళింగాటవులు ఏనుగులకు ప్రసిద్ధినొందినవని చెప్పుదురు. గిట్టలుగల జంతువులలో పెక్కురకములు ఆంధ్ర ప్రదేశ్‌లో కానబడుచున్నవి. అడవిపంది, కణతి, దుప్పి, కొండగొర్రె సాధారణముగ చిట్టడవులలో కనబడు జంతువులు. ఎనుబోతు (బైసన్) అనునది ఒక అడవి దున్నపోతు. ఇది గోదావరికి ఉత్తరమున పర్వతారణ్య ప్రదేశములందు, విశాఖపట్టణముజిల్లా కొండలలోను, ఆదిలాబాదుజిల్లా, వరంగల్లు జిల్లాలలోను మాత్రమే కనబడుచున్నది. నీల్‌గాయ్ కొండలలోను, అడవులలోను నివసించును. కారెనుము (వైల్డు బఫెలో) ఉత్తరసర్కారు జిల్లాల అడవులలో దొరకును. ఇది ప్రపంచమున ప్రస్తుతముండు పశువు లన్నిటిలోను పెద్దదని చెప్పవచ్చును. నాలుగు కొమ్ములు గల కొండగొర్రె రాయలసీమ జిల్లాలలో కనపడుచున్నది. జింకలు దాదాపు అన్ని యడవులలోను కనబడును. బురుడుజింక అనంతపురము, కర్నూలు జిల్లాల అడవులలో మాత్రము కానవచ్చును.

సర్కారు జిల్లాలలో ఆవులకు, ఎద్దులకు ఒంగోలు, నెల్లూరులు ప్రసిద్ధి. మాంసాహారి జంతువులు పెక్కురకములు ఆంధ్రప్రదేశ్‌లో కానవచ్చును.

వేట జంతువులు : కడప, నెల్లూరు జిల్లాలలోని వెలుగోడు పర్వత ప్రాంతములందును, కర్నూలు జిల్లాలోని నల్లమల అడవులలోను, తెలంగానా యందలి పెక్కుజిల్లాలలోని రక్షితాటవులలోను పెద్దపులులు, చిరుతపులులు కలవు. గోదావరి జిల్లా దక్షిణభాగ మందున్న అడవులలో కణుజు, నీలి కణుజు, పొడలలేడి, మామూలులేడి కలవు. చిరుతపులి, పెద్దపులి, సివంగి, చారల సివంగి, వివిధ రకముల పిలులు, ముంగిస, నక్క, గుంటనక్క, రేచుకుక్క, ఎలుగు మొదలగునవి సాధారణముగ ఆంధ్రప్రదేశ్ కొండలలోను, అడవుల లోను కానవచ్చుచున్నవి.

పెద్దపులి నీటి వసతిగల అడవుల లోను, పొడవుగా గడ్డి పెరుగు ప్రదేశములలోను నివసించును. చిరుతలు, కళింగోరలు, యెర్ర చిందువులు కొండలలో విస్తారముగ నున్నవి. మానుపిల్లి అటవీ ప్రదేశములలో ఉండుటయే గాక పట్టణమందలి ఇండ్లలో కూడ సంచరించు చుండును. దేవాంగ పిల్లి కృష్ణా నదికి దక్షిణమున నుండు జిల్లాలలోని కొండలందును, అడవులందును కనబడుచున్నది.

ఉడుతలు, ఎలుకలు, చుంచులు, పందికొక్కు, ముండ్లపంది, కుందేలు ఆంధ్రప్రదేశ్‌లో కానవచ్చు మూషికాదుల జాతిలో చేరిన జంతువులు. గబ్బిలములలో 'తలక్రిందుగా వ్రేలాడు పక్షి' ఆంధ్రప్రదేశ్ మందంతటను కనపడును. ఇది పండ్లు, కాయలు తినును.

కోతులు, గోలాంగూలములు, హనుమాన్ కోతులు, స్లెండర్ లోరిస్ అను చిన్న కోతులు ఆంధ్రప్రదేశ్‌లో మెండుగ కలవు. ఇవి ముఖ్యముగా తిరుపతి కొండల మీదను, శ్రీకాకుళము జిల్లా సోంపేట, మందసా ప్రాంతములలోను ఎక్కువగా నున్నవి. ఎస్. ఆర్. ర.



# నదీసంపద

## జల నిర్గమనము

ఆంధ్రప్రదేశ్ నందలి గోదావరి, కృష్ణా నదులు భారీ నదుల శ్రేణికి చెందినవి. తరువాత చెప్పదగిన నదులు పెన్న, నాగావళి, వంశధార. ఇవిగాక ఆంధ్రప్రదేశ్‌నందు 29 చిన్న నదులు ప్రవహించుచున్నవి. ఒక్క బ్రహ్మపుత్రా నదిని మినహాయించినచో భారతదేశమున సముద్రములో కలియుచున్న నదీ జలములలో 15% (150 కోట్ల ఘ. అ.) ఆంధ్ర ప్రదేశ్ నదుల ద్వారా సముద్రమున చేరుచున్నది. 1953లో వరదల కాలమున మాత్రము గోదావరి నది 31·20 లక్షల *క్యూసెక్కుల నీటిని సముద్రమున చేర్చి సమగ్ర భారతదేశమున మరి ఏ ఇతర నదికిని లభించని అగ్రస్థానమును పొందినది.

గోదావరి నది : గొప్పనదుల కోవకు చెందిన దీనిని 'దక్షిణ గంగ' అనియు నందురు. దీని మొత్తము పొడవు 937 మైళ్ళు. ఇది మహారాష్ట్రములోని నాసిక్‌కు 16 మైళ్ళ దూరమున, అరేబియా సముద్ర తీరమునకు 50 మైళ్ళ దూరమున నుండు త్ర్యంబక మనుచోట సముద్రపు మట్టమునకు 2000′ ఎత్తున పుట్టుచున్నది. తరువాత పడమటి కనుమలను దిగి ద్వీపకల్పమునం దడ్డముగ ఆగ్నేయ ముఖముగ ప్రవహించి నిజామాబాద్ జిల్లాలో 'బసర్' అనుచోట ఆంధ్రప్రదేశ్‌లో ప్రవేశించు చున్నది. ఇచ్చటి నుండి సముద్రమును చేరువరకు దీని పొడవు 450 మైళ్ళు. ఇది పాపికొండ లనబడు (2000′-3000′ ఎత్తు) తూర్పు కనుమలను ఛేదించుకొని ఇరుకైన గండి గుండ పోయి పోలవరము వద్ద సమతలమును చేరును. ఈ ప్రదేశమందు గోదావరి వెడల్పు 600′ మొదలు 900′ వరకు మాత్రముండును. వరదల సమయమందు గాక ఇతర సమయములందు ఇచ్చటి లోతు 100′ మొదలు 200′ వరకు ఉండును. ఈ ప్రాంతము ప్రశాంతతకు, గంభీరతకు, మనోహర ప్రకృతి దృశ్యములకు ఆటపట్టు. రాజమండ్రి దిగువ ధవళేశ్వరమువద్ద గోదావరి వశిష్ఠ, గౌతమి అను రెండు పాయలుగ చీలుచున్నది. గౌతమీ గోదావరి తూర్పు దిక్కుగ పోయి రామచంద్రపురము, కాకినాడ తాలూకాలను రాజోలు, అమలాపురము తాలూకాల నుండి వేరుచేయుచు 'యానాం' వద్ద సముద్రమున కలియుచున్నది. వశిష్ఠ గోదావరి దక్షిణ దిక్కుగపోయి రాజోలు తాలూకాకు పడమటి సరిహద్దుగ ప్రవహించి నరసాపురమునకు ఆరుమైళ్ల దూరముననున్న 'అంతర్వేది' వద్ద సముద్రమున కలియుచున్నది. ఇదిగాక వైనతేయము అను వేరొకశాఖ రాజోలు తాలూకా దక్షిణ భాగమును ఒక ద్వీపముగ చేయుచు సముద్రమున సంగమించు చున్నది. 'లంక' లనబడు ద్వీపములు చిన్న చిన్నవి గోదావరి ముఖద్వారమునందనేకములు గలవు. ఇవి స్థిరముగ ఉండక గోదావరి వరదల తీరు ననుసరించి మారుచుండును.

గోదావరికి మంజీర, మానేరు, ప్రాణహిత, ఇంద్రావతి, శబరి అనునవి ఐదు ముఖ్య ఉపనదులు. ఇందు మంజీర బాలాఘాటు పర్వతశ్రేణిలో పుట్టి నాందేడుజిల్లా (మహారాష్ట్రము) లోని 'కొండల వాడి' వద్ద గోదావరిలో కలియుచున్నది. మానేరు కరీంనగరం జిల్లాలోని సిరిసిల్లా కొండలలో పుట్టి మహాదేవపురమువద్ద గోదావరిలోకలియు చున్నది. గోదావరి ఉపనదులలో ముఖ్యమైన ప్రాణహిత ధర్మసాగరము (ఆదిలాబాదు జిల్లా) వద్ద పెన్‌గంగ, వార్ధా, వైన్ గంగ అను మూడు చిన్న నదుల కలయికచే ఏర్పడి ఆదిలాబాదు జిల్లాలో 'చిన్నూరు' వద్ద గోదావరి నదిలో కలియుచున్నది. చిన్నూరుకు దిగువగా సుమారు 30 మైళ్ళ దూరమున ఇంద్రావతీ గోదావరుల సంగమ స్థానము కలదు. ఇంకను దిగువను శబరి గోదావరిలో కలియుచున్నది. ఇవిగాక గోదావరినది ఆంధ్రప్రదేశ్‌లో ప్రవేశించక ముందే దార్న, కాద్ర, ప్రవర, మూల, పూర్ణ అను ఉపనదులు దీనిలో కలియుచున్నవి.

గోదావరి నది వెడల్పు ఆరంభమునందు తక్కువైనను పోను పోను ఎక్కువ. దీని వెడల్పు రాజమండ్రి వద్ద రెండు మైళ్లు; ధవళేశ్వరమువద్ద నాలుగు మైళ్ళు. ఈ నది మొత్తము 1,21,500 చ. మైళ్ళ విస్తీర్ణము నుండి నీటిని గ్రహించు చున్నది-ఇందు మహారాష్ట్రమునందు 56,500 చ. మైళ్లు; ఆంధ్రప్రదేశ్‌నందు 30,500 చ. మై; మధ్యప్రదేశ్‌నందు 20,600 చ. మై.; మైసూరునందు 6,800 చ. మై.; ఒరిస్సాయందు 2000 చ. మై. వరదల కాలమున 10 మొదలు 20 లక్షల వరకు క్యూసెక్కుల నీరు ఈ నదినుండి

* క్యూసెక్కు అనగా ఒక సెకనులో ప్రవహించు ఒక ఘనపు టడుగు ప్రవాహము.

సముద్రమున చేరుచున్నది. కాని 1953లో వచ్చిన వరదలలో 31·20 లక్షల క్యూసెక్కుల నీరు సముద్రమున చేరినది. ఇది రికార్డుగ ఎన్నబడుచున్నది. ఈ క్రింది పట్టిక వలన ఆంధ్రప్రదేశ్‌లోని గోదావరి ఉపనదులను గూర్చిన వివరములు తెలియగలవు:

| ఉపనది | కలయిక (కుడివైపు, ఎడమవైపు) | పొడవు–పుట్టిన చోటినుండి నదీ సంగమ స్థానమునకు (మైళ్ళలో) | ఆరగాణి లేదా జలగ్రహణ వైశాల్యము (చ. మై.) | నీటి గరిష్ఠ ప్రమాణము (క్యూసెక్కులు) |
|---|---|---|---|---|
| 1. మంజీర | కుడివైపు | 330 | 12,570 | 6,00,000 |
| 2. పెద్దవాగు | కుడివైపు | 70 | 900 | 1,88,000 |
| 3. కడం | ఎడమవైపు | 56 | 920 | 2,50,000 |
| 4. మానేరు | కుడివైపు | 156 | 4,980 | 4,42,000 |
| 5. ప్రాణహిత | ఎడమవైపు | 400 | 43,000 | 9,60,000 |
| 6. ఇంద్రావతి | ఎడమవైపు | 300 | 16,000 | 6,80,000 |
| 7. శబరి | ఎడమవైపు | 148 | 7,800 | 5,40,000 |
| 8. ఇతరములు | ఎడమవైపు | — | 9,100 | — |
| | | | 92,700 | |

కృష్ణానది: ఆంధ్రప్రదేశ్‌లో కృష్ణానది రెండవముఖ్య నది. ఇదికూడ మహారాష్ట్రములో అరేబియా సముద్ర తీరమునకు 40 మైళ్ళ దూరముననున్న సముద్ర మట్టమునకు 4,714′ ఎత్తున మహాబలేశ్వరమువద్ద పడమటి కనుమలలో పుట్టుచున్నది. మహారాష్ట్రము, మైసూరు రాష్ట్రములందు 350 మైళ్ళు ప్రవహించి మహబూబ్‌నగరం జిల్లాలోని అలంపురం వద్ద ఆంధ్రప్రదేశ్‌లో ప్రవేశించి అచ్చటినుండి ఆగ్నేయ దిశగ 450 మైళ్ళు ప్రవహించి సముద్రమున కలియుచున్నది.

కృష్ణానది మొత్తము పొడవు 775 మైళ్ళు. సముద్రపు మట్టమునకు 4714′ ఎత్తున పుట్టినను 80 మైళ్లు ప్రవహించులోపుగ, అనగా కారాడ్ (సతారా జిల్లా) సమీపించుసరికి ఎత్తు 1900′ అగుచున్నది. కారాడ్ నుండి 300 మైళ్ళు ప్రవహించిన తరువాత ప్రత్యేకించి షోలాపూరు, రాయచూరు ప్రాంతములలోని అంతర్వేదులలో ప్రవేశించుచున్నది. ఇక్కడ కేవలము 3 మైళ్ళు ప్రవహించుసరికి ఇది 408′ క్రిందికి దిగుచున్నది. ఇచ్చట ఏర్పడు జలపాతమునకు 'జలదుర్గ' యందురు. ఇంతవరకు రాతి మయమగు పీఠభూమి ప్రాంతములందే కృష్ణ ప్రవహించు చున్నది. అందు నదీ గమనవేగము చాల అధికము. సిద్ధేశ్వరమునుండి నందికొండవరకు 180 మైళ్ల దూరము. ఇంకను 35 మైళ్ళ దిగువ పులిచింతల వద్ద కృష్ణానది సమతలమునకు దిగు చున్నది. నల్లమలకొండలయందిది ఈశాన్యముఖముగపోయి తూర్పు కనుమలను దాటినంతనే ఆగ్నేయ ముఖమై కృష్ణా, గుంటూరు జిల్లాల మధ్యగ ప్రవహించు చున్నది. విజయవాడ వరకు ఈ నది కిరువైపుల అచ్చటచ్చట కొండలు, రాతి ప్రదేశములు కానవచ్చు చుండును. విజయవాడకు 40 మైళ్ళ దిగువ పులిగడ్డ వద్ద కృష్ణానది రెండు పాయలుగ చీలుచున్నది. ఈ పాయల నడుమ 'దివిలంక' ప్రదేశము గలదు. ఇక్కడి నుండి కృష్ణానది 15 మైళ్ళు ప్రవహించి మూడు పాయలై సముద్రములో సంగమించు చున్నది.

దిండి, మూసి, పాలేరు, మున్నేరు, తుంగభద్ర అనునవి కృష్ణానది ముఖ్య ఉపనదులు. దిండి మహబూబునగరం జిల్లాలోని 'మహాబాదు' కొండలలో పుట్టి అమరాబాదు, నందికొండ గ్రామములమీదుగ ప్రవహించి ఏలేశ్వరమువద్దను; మూసి అనంతగిరి కొండలలో పుట్టి నల్గొండ జిల్లాలోని వజీరాబాదు వద్దను కృష్ణానదిలో కలియును. పాలేరు, మున్నేరు వరుసగా నల్గొండ జిల్లా గణపురమువద్దను, వరంగలుజిల్లా పార్కల్ వద్దను పుట్టి కృష్ణానదిలో కలియుచున్నవి. మైసూరు రాష్ట్రమున పడమటి కనుమలలో గంగమూల యనుచోట పుట్టిన తుంగ, భద్ర అను రెండుప్రవాహములును షిమోగా జిల్లాలోని 'కూడలి' అను ప్రదేశము వద్ద ఏకమై తుంగభద్రగా ఏర్పడి చాలవరకు ఆంధ్ర, మైసూరు ప్రాంతములకు సరిహద్దుగ ఈశాన్య ముఖమై ప్రవహించి అలంపురమునకు దిగువ కృష్ణానదిలో కలియుచున్నది. ఇక్కడ కృష్ణలోయ చాల విశాలముగ నున్నది. కుముద్వతి, వరద, హరిద్ర, వేదవతి తుంగభద్ర ఉపనదులు. ఇవికాక కొయినా, వర్ణా, పంచగంగ, ఘటప్రభ, మలప్రభ, భీమ అనునవికూడ కృష్ణానదికి ఉపనదులు.




గోదావరి నది - అరగాణి




గోదావరి డెల్టా

కృష్ణా నదికి పడమటి కనుమలందు వలసినంత జలము లభించుచున్నది. ముఖ్యముగ మహారాష్ట్రము, మైసూరు రాష్ట్రములలో పుట్టు కోయినా, భీమ, తుంగభద్ర, ఘట ప్రభ, మలప్రభలు అత్యధిక జలమును తెచ్చుచున్నవి. దీనికి కారణము ఈ నదులు పుట్టు ప్రదేశములు నైరృతి ఋతుపవనముల మూలమున అత్యధిక వర్షమును పొందు ప్రాంతము లగుటయే. కావున అనావృష్టి సమయము లందుగూడ కృష్ణానదిలో వలసినంత నీరు దొరకుచున్నది. ఇది మొత్తము 97,050 చ. మై. విస్తీర్ణము గల (ఆరగాణి) ప్రదేశములో కురిసిన వర్షజలమును గ్రహించుచున్నది. ఆంధ్రప్రదేశ్‌నందు మాత్రము ఈ విస్తీర్ణము 47,600 చ.మై. కాని తుంగభద్ర ఆరగాణి విస్తీర్ణమును గూడ కలుపు కొన్నచో ఆంధ్రప్రదేశ్‌లోనికి ప్రవేశించునప్పటికి కృష్ణా నది మొత్తము ఆరగాణి విస్తీర్ణము 74,600 చ. మై. అగు చున్నది; అనగా రాష్ట్రమునందు ప్రవేశించునప్పటికి కృష్ణా నదికి మొత్తము జలములో 83% జలము గలదు. మిగిలిన 17% జలము మాత్రము ఆంధ్రప్రదేశ్‌లో కృష్ణానది సమ కూర్చు కొనుచున్నది. వరదలకాలమున కృష్ణానది నుండి సెకనుకు 7,61,000 ఘ.అ. నీరు సముద్రమును చేరుచున్నట్లు అంచనా వేయబడినది. కాని వేసవిలో కొన్ని సమయము లందు సెకనుకు 100 ఘ. అ. నీరుమాత్రమే సముద్రగత మగుచున్నది. విజయవాడవద్ద సేకరించిన లెక్కలనుబట్టి 1903వ సంవత్సరములో 11,94,000 క్యూసెక్కుల నీరు సముద్ర గతమైనట్లు తెలిసినది. ఇది ఈ నదియొక్క రికా ర్డుగ పరిగణింప బడుచున్నది.

పెన్ననది: మధ్యరకమునకు చెందిన నదులలో పెన్న ముఖ్యమైనది. ఇది మైసూరు రాష్ట్రమున నందిదుర్గమను స్థలమునకు వాయవ్య దిశయందు చెన్నకేశవ పర్వత ములయందు పుట్టినది. మైసూరు రాష్ట్రమున 25 మైళ్ళు ప్రవహించిన పిదప అనంతపురం జిల్లా యందు ఆంధ్ర ప్రదేశ్‌లో ప్రవేశించి అటువెనుక కడప, నెల్లూరు జిల్లాల గుండ పోయి నెల్లూరుకు 18 మైళ్ళ దూరమున ఉన్న ఊటుకూరువద్ద సముద్రమున గలియు చున్నది. దీని ఉప నదులు జయమంగళ, చిత్రావతి, కుందేరు, పాపఘ్ని, సగి లేరు. ఇవిగాక నెల్లూరు జిల్లాలోని 'బొగ్గేరు' కోయిల కుంట్ల, 'బిరపేరు' సంగం వద్దను పెన్నలో కలియుచున్నవి.

ఆంధ్రప్రదేశ్ ప్రవేశించుసరికి పెన్ననది సముద్ర మట్టమునకు 2,000' ఎత్తున ఉండును. కాని ఇందు సమృ ద్ధిగ జలము లేనందున పీఠభూమి ప్రదేశములకు దీనివలన ఉపయోగము లేదు. ఈశాన్య ఋతుపవనముల వలన లభించు వర్షము మాత్రము దీని కాధారము. ఈ నది యొక్క నీటిగ్రహణశక్తి శ్రేష్ఠమైనది గాదు. దీనియొక్క ఆరగాణి విస్తీర్ణము చాల తక్కువ.

వంశధార నది: వంశధార ఒరిస్సా రాష్ట్రములోని జయపురము కొండలలో పుట్టి ఒరిస్సా రాష్ట్రమునందు 60 మైళ్ళు ప్రవహించిన పిదప ఆంధ్రప్రదేశ్‌లో ప్రవేశించును. దీని పొడవు 140 మైళ్ళు. తూర్పు కనుమలందు జన్మించి సముద్ర సంగమము నొందు నదులలోనికెల్ల ఇది పొడవైన నది. మంచి వర్షపాతముగల ప్రాంతములందు ప్రవహించుట చేత సంవత్సరము పొడవునను నీరు గలిగి ఇది జీవనదిగ పరిణమించినది. దీని ఆరగాణి విస్తీర్ణము 4,400 చ. మైళ్లు.

నాగావళి నది: ఈ నదికి లాంగుల్య యను మరొక పేరు కూడ కలదు. దీని జన్మస్థానము ఒరిస్సారాష్ట్రము లోని రాయఘడ కొండలలో నున్నది. దీని మొత్తము పొడవు 130 మైళ్ళు. అందు ఒరిస్సా రాష్ట్రమునందు 60 మైళ్లు మాత్రము ప్రవహించి శ్రీకాకుళము జిల్లాయందు ఆంధ్రప్రదేశ్‌లో ప్రవేశించి యా జిల్లాలోని ముఫజ్‌బందరు (మోపసు) వద్ద బంగాళాఖాతములో కలియుచున్నది. సంవత్సరము పొడవునను ఇందు 20 మొదలు 30 లక్షల ఘనపు టడుగుల నీరు ప్రవహించును. దీని మొత్తము ఆర గాణి విస్తీర్ణము 3461 చ. మైళ్లు.

మచ్‌ఖండ్ నది: గూడెం తాలూకాలోని మాడుగుల కొండలలో పుట్టుచున్నది. ప్రథమమున ఇది ఉత్తరదిశగ ప్రవహించి తరువాత తూర్పుదిశగ పోయి ఒరిస్సాలో ప్రవే శించుచున్నది. మచ్‌ఖండ్ నది మీదనే 'డుడుమా' జల పాతమున్నది.

పైన పేర్కొన్నవిగాక అనేకములగు చిన్ననదులు తూర్పు కనుమలలో పుట్టి బంగాళాఖాతమునందు కలియు చున్నవి. వీటికి కేవలము ఋతుపవన సమయములందు మాత్రము నీరు లభ్యమగుచున్నది. ఇతర సమయము లందు వీటిలో నీరు చాల తక్కువ. కొన్ని నదులందు నీరు ఉండదు. వీటిలో ముఖ్యముగ చంపావతి గాలికొండ లలో పుట్టి శృంగవరపుకోట, విజయనగరము, భీముని పట్టణము తాలూకాలయందు ప్రవహించి సముద్రములో కలియుచున్నది. శారదానది మాడుగుల కొండలలో పుట్టి వాతాడవద్ద సముద్రములో కలియుచున్నది. గుండ్లకమ్మ, కర్నూలుజిల్లాలోని నల్లమల కొండలలో పుట్టి కంభం, మార్కాపురం తాలూకాలగుండ ప్రవహించుచున్నది. స్వర్ణముఖి చిత్తూరుజిల్లాలోని చంద్రగిరి కొండలలో పుట్టి గూడూరు తాలూకాలోని సిద్ధవరం సమీపమున సముద్ర మున కలియుచున్నది. చిత్రావతి కర్ణాటక రాష్ట్రమందలి హరిహరేశ్వర కొండలలో పుట్టి హిందూపురం తాలూకా

అనంతపురం జిల్లా(లో) ప్రవేశించుచున్నది. దీనివల్ల బుక్కపట్టణము చెరువునకు, ధర్మవరము చెరువునకు నీరు వలసినంత లభ్యమగుచున్నది.

ఇవిగాక చిత్తూరుజిల్లాలోని అశ్వ హార్స్(లే) కొండలలో పుట్టు బాహుద, ఆవులపల్లి (పుంగనూరు తాలూకా) అడవులలో పుట్టు పించానది, తూర్పుగోదావరి జిల్లాలోని ఏలేరు, శ్రీకాకుళము జిల్లాలోని బాహుద, మహేంద్రతనయ, వేగవతి, స్వర్ణముఖ తాండవ నదులు, పశ్చిమ గోదావరి జిల్లాలోని తమ్మిలేరు, గుండేరు, గుంటూరు జిల్లాలోని గుండ్లకమ్మ* చంద్రవంక, వరంగల్లు జిల్లాలోని పాలేరు, పైరా నదులు, ఖమ్మం జిల్లాలోని కిన్నెరసాని నది ఎన్నతగ్గవి. ఇవిగాక అనేకములైన పెద్దవి చిన్నవి వాగులు రాష్ట్రమునందు వ్యవసాయమునకు తోడ్పడునవి గలవు. సి. పా.

# నీటి వనరులు

నదీజల సంపద సమృద్ధిగ నున్న ఆంధ్రప్రదేశ్‌నందు 2,78,98,623 ఎకరముల భూమి సాగగుచున్నది. ప్రస్తుతము నదుల వలన లభించుచున్న 10 కోట్ల ఎకరపు టడుగుల జలములో 2,60 లక్షల ఎకరపు టడుగుల నీరు మాత్రము వినియోగమగుచున్నది మిగిలిన జలమును కూడ వినియోగించుకొనిన అదనముగా 16,00,000 ల ఎకరముల మెట్ట భూమిని సాగు క్రిందికి తీసికొని రావచ్చును. ప్రస్తుతము ఆంధ్రప్రదేశ్‌నందు కాలువలు, చెరువులు, బావులు మున్నగునవన్నియు కలిసి 67,87,940 ఎకరముల నేలకు (ఆంధ్ర ప్రాంతమున 50,64,000 ఎకరములు తెలంగానాలో 17,23,000 ఎకరములు) జలసమృద్ధి లభించుచున్నది.

మొదటి పంచవర్ష ప్రణాళిక (1951 - 56) లో నీటి పారుదలకు ప్రముఖస్థాన మీయబడినది. ఇందు నిమిత్తము చేసిన ఖర్చు రు. 42·93 కోట్లు. ఆంధ్రప్రాంతమున 7 పెద్ద పథకములు, 17 మధ్యతరగతి పథకములును; తెలంగానా ప్రాంతమున 2 పెద్ద పథకములు, 5 మధ్యతరగతి పథకములును ప్రారంభింపబడినవి. కాని మొదటి ప్రణాళిక అంత్యమునకు పూర్తియైనవి రొంపేరు, తుంగభద్ర దిగువ కాలువ పథకములు మాత్రమే. రెండవ పంచవర్ష ప్రణాళిక (1956 - 61) లో పెద్ద, చిన్న పథకముల నిమిత్తము కేటాయించబడిన మొత్తము రు. 16·34 కోట్లు. ఇది కాక నాగార్జునసాగర్ ప్రాజెక్టు నిమిత్తము కేటాయింపబడినది రు. 32·23 కోట్లు. రెండవ ప్రణాళికలో ప్రారంభింపబడిన ముఖ్య పథకము తుంగభద్ర ఎగువ కాలువ నిర్మాణము. మొత్తము మీద రెండవ ప్రణాళిక అంత్యమునకు పెద్ద, చిన్న పథకముల క్రింద ఆంధ్ర ప్రదేశ్‌లో సాగగుచున్న భూమి 11,77,771 ఎకరములు.

## అమలులో ఉన్న నీటి వనరులు

గోదావరి డెల్టా మండలము : ఈ మండలమున 1857 లో గోదావరి నదికి ధవళేశ్వరము (రాజమండ్రికి దిగువ) వద్ద కట్టిన ఆనకట్టయు, దానికి సంబంధించిన మూడు ముఖ్యమైన కాలువలును గలవు. ఈ కాలువలు 8,20,000 ఎకరముల భూమికి జలసమృద్ధిని చేకూర్చుచున్నవి. రెండవ పంటను కూడ లెక్కకు తీసికొన్నచో మొత్తము సాగగుచున్న భూమి సుమారు 10 లక్షల ఎకరములు.

నీటి ఎద్దడి ఎక్కువగ నుండుటచే ప్రస్తుతము ఈ ఆనకట్టకు 3′ ఎత్తు తలుపులకు బదులు 6′ ఎత్తు తలుపులను బిగించుటకు పథకము తయారు చేయబడుచున్నది. ఈ పథకము వలన డెల్టా ప్రాంతములో అదనముగ 1,10,000 ఎకరములకు ఆయకట్టు లభించును. ఈ నూతన పథకమున కగు ఖర్చు రు. 2·5 కోట్లు.

కృష్ణాడెల్టా మండలము : ఈ మండలమునకు జలవసతి కల్పించు నిమిత్తము 1852 లో కృష్ణానదిపై ఆనకట్ట నిర్మించబడినది; తూర్పు, పడమర డెల్టా ప్రాంతములకు నీటిని సరఫరా చేయు రెండు కాలువలు గలవు. 7 ఫర్లాంగుల పొడవు గల ఈ కృష్ణ ఆనకట్టకు అవసరము ననుసరించి ఎత్తుటకు, దింపుటకు వీలగు 6′ ల ఎత్తుగల తలుపులు గలవు. ఇటీవల (1957) 12′ ల ఎత్తు తలుపులను మార్చి కృష్ణా ఆనకట్టను బ్యారేజిగా మార్చిరి. దీనికే కృష్ణా బ్యారేజి లేదా ప్రకాశం బ్యారేజీయని పేరిడిరి. ఏలూరు, కొమ్మమూరు, బకింగ్‌హాం కాలువలు, తక్కిన కాలువలు డెల్టా మండలమున నీటి పారుదల వసతులను, రవాణా సౌకర్యములను చేకూర్చుచున్నవి. పంపుల మూలముగ నీటి సరఫరా చేయబడుచుండిన దివి లంకకు 1935 లో పులిగడ్డ వద్ద కాంప్‌బెల్ అక్విడక్టు నిర్మింపబడినది. దీని మూలముగ కృష్ణా తూర్పువైపు కాలువ నీరు కృష్ణానది కడ్డముగ దివి లంకకు తీసికొని పోబడుచున్నది. ఈ అక్విడక్టుపై 16′ ల వెడల్పు గల రోడ్డు, 4′ ల వెడల్పుగల కాలిబాటయు గలవు. వరదల సమయ

* కర్నూలు జిల్లాలో నల్లమల కొండలలో పుట్టిన గుండ్లకమ్మ ఇది ఒకటేనని గమనించనగును.

మున ఈ ఆక్ట్వేడక్టు పూర్తిగ మునిగిపోవును. పోలంపల్లి, మునియేరు ఆనకట్టల వలన అదనముగ 26,000 ఎకరముల భూమి సాగగుచున్నది. మొత్తము మీద ఈ నీటి పారుదల వసతుల మూలమున ఈ మండలములో 12,00,000 ఎకరముల భూమి సాగగుచున్నది.

పెన్నడెల్టా మండలము : కావేరి నదికన్నను ఆరగాణి విస్తీర్ణము, గరిష్ఠ జలనిర్గమనము గలిగియున్నప్పటికిని పెన్ననది అత్యల్ప వర్షపాతముగల ప్రదేశములో పుట్టుట వలన కేవలము 36 లక్షల 80 వేల ఎకరపు టడుగుల నీటి నిచ్చుచున్నది. దీనిపై రెండు ఆనకట్టలు-ఒకటి సంగం వద్దను, దానికి దిగువ 20 మైళ్ళ దూరములో మరి యొకటి నెల్లూరు వద్దను గలవు. వీటికి 2′ ఎత్తుగల తలుపు లమర్చబడినవి. సంగం ఆనకట్ట వలన దువ్వూరి చెరువునకును, పెద్ద కనిగిరి చెరువునకును; రెండవ ఆనకట్ట వలన సర్వేపల్లి తాలూకాలోని చెరువులకును నీరు లభించుచున్నది. మొత్తము ఈ మండలములో సాగగుచున్న భూమి విస్తీర్ణము 1,67,500 ఎకరములు.

నిజాం సాగర్ : గోదావరి ఉపనది యైన మంజీరపై 1930 లో కట్టిన ఆనకట్ట వల్ల నిజాం సాగర్ రిజర్వాయరు ఏర్పడినది. 96 మైళ్ళ పొడవు గల కాలువ ద్వారా 2,20,000 ఎకరముల భూమి సాగగునని అంచనా. కాని లెక్కల ననుసరించి 5 లక్షల 50 వేల ఘ. అ. నీటివలన 1,79,000 ఎకరములు మాత్రము సాగగుచున్నది. రిజర్వాయరును, కాలువలను అభివృద్ధి పరచినచో అదనముగ 71,000 ఎకరముల భూమిని సాగు క్రిందికి తీసికొని రావచ్చునని అంచనా వేయబడినది. అప్పుడు ఈ పథకము క్రింద మొత్తము 2,50,000 ఎకరముల భూమి సాగగును.

కడప - కర్నూలు కాలువ : కర్నూలులోని తుంగభద్ర నది నుండి ఈ కాలువ బయలుదేరుచున్నది. దీని వలన కర్నూలు - కడప మండలములందు సాగగుచున్న నేల రమారమి లక్ష ఎకరములు గలదు. ఈ ప్రాంతమందు వర్షమల్ప మగుటచే ఇచటి నీటి ఎద్దడిని ఇది కొంత వరకు తగ్గించుచున్నది. కృష్ణా నదికిని, పెన్న నదికి మధ్య గల ప్రదేశమున కిది నీటి వసతి కల్పించుచున్నది. 1956-57 లో ఈ పథకము క్రింద 87,156 ఎకరములలో మొదటి పంటకు నీటి సాగు లభించినది. 1957-58 లో 1,11,067 ఎకరములలో, అనగా ఆ క్రిందటి సంవత్సరమున కంటె 23,911 ఎకరములకు అదనముగ నీటి సాగు జరిగినది. ఈ కాలువ రెండవ పంచవర్ష ప్రణాళిక (1956-61) అభివృద్ధి పథకముల క్రింద మరి 2 లక్షల ఎకరముల భూమి సాగులోనికి తెచ్చుటకు ప్రయత్నములు జరగెను.

## నిర్మాణములో నున్న పథకములు :

తుంగభద్ర ప్రాజెక్టు : ఈజిప్టు దేశమునకు నైలునది వలె రాయలసీమకు తుంగభద్ర ప్రాణము వంటిది. దీనిపై కట్టిన డాము పొడవు 5,957′, ఎత్తు పునాది నుండి 160′, జలాశయములో సుమారు 30,50,000 ఘ. అ. నీరు నిలువ యుండును. ఈ డాము నీటి పారుదల మూడు దశలుగ విభజింపవచ్చును :

1. కుడివైపున 7,000 క్యూసెక్కుల పరిమాణము గల కాలువ. దీని వలన మైసూరులోని రాయచూరు ప్రాంతమునకును, ఆంధ్ర ప్రదేశ్‌లో మహబూబు నగరం జిల్లాలోని గద్వాల, అలంపూరు తాలూకాలకును నీటి పారుదల వసతులు గలుగును.

2. 2,500 క్యూసెక్కుల నీరు ప్రవహించు కుడివైపున గల కాలువ మైసూరు రాష్ట్రమున 92,000 ఎకరములను; ఆంధ్ర ప్రదేశ్‌లోని కర్నూలు జిల్లాలో 1,58,000 ఎకరములును సాగగును.

3. 4,000 క్యూసెక్కుల నీరు ప్రవహించు పరిమాణము గల ఎగువ కాలువ మూలమున మైసూరు రాష్ట్రములో 1·36 లక్షల ఎకరములును, ఆంధ్ర ప్రదేశ్‌లో 2·5 లక్షల ఎకరములును పాగగును.

తుంగభద్ర దిగువ కాలువ పని 1956-57 నాటికి పూర్తియైనది. దీని మూలమున ఆయకట్టు (సాగగు భూమి) 32% అభివృద్ధి చెందినది. ప్రారంభమున 100 వ మైలు వరకు నీరు వదలు నపుడు 76,912 ఎకరములకు నీరు లభించెను. కాని 1956-57 నుండి 190 వ మైలు తరువాత కూడ నీరు వదలుటచే ఆయకట్టు కంతకు నీరు లభ్యమగుచున్నది.

తుంగభద్ర ఎగువ కాలువలో ప్రవహించు 4000 క్యూసెక్కుల నీటిలో 35% మైసూరు రాష్ట్రమును, 65% ఆంధ్ర ప్రదేశ్‌ను వినియోగించుకొనును. ఈ కాలువలో 116 వ మైలువద్ద 1,584 క్యూసెక్కుల నీరు పెన్ననది లోనికి వదలబడును. దీనివలన అనంతపురము, కడప జిల్లాలకు నీటి వసతి లభించును. ఈ కాలువ మూలముగ మైసూరు రాష్ట్రమున 1,36,000 ఎకరములు, ఆంధ్రప్రదేశ్‌లోని కడప, అనంతపురము జిల్లాలలో 2,51,676 ఎకరముల నేలయును సాగగును.

నాగార్జున సాగరము : నిర్మాణము పూర్తియైనప్పుడు దీని ఎత్తు నదీగర్భమునుండి 370′. జలాశయమునందు 91·8 లక్షల ఎకరపు టడుగుల నీరు ఉండును. కుడివైపు కాలువ 21,000 క్యూసెక్కుల నీటిని గ్రహించి 276 మైళ్లు ప్రవహించి పెన్న నదిలో పడును. దీనివల్ల గుంటూరు,

నెల్లూరు, కర్నూలు జిల్లాలలో మొత్తము 21 లక్షల ఎకరములు సాగగును. ఎడమవైపు కాలువ పొడవు 205 మైళ్లు. ఇందు 15,000 క్యూసెక్కుల నీరుండును. దీని వలన నల్గొండ, ఖమ్మము, కృష్ణా, పశ్చిమగోదావరి జిల్లాలలో 13.50 లక్షల ఎకరములు సాగగును. ఈ ప్రాజెక్టు మొదటి దశలో కుడి, ఎడమవైపు కాలువలు వరుసగ 135 మైళ్లు, 108 మైళ్లు పొడవు గలిగి 20 లక్షల ఎకరములను సాగునకు తెచ్చును.

కడం ప్రాజెక్టు : ఆదిలాబాదు జిల్లాలో కడం నదికి అడ్డుగా ఈ ఆనకట్ట కట్టబడును. దీని మూలమున 47 మైళ్ల పొడవు గల కాలువ వలన 65,000 ఎకరములకు నీటి సౌకర్యము గలుగును.

రాజోలి బండ మళ్లింపు పథకము : తుంగభద్ర ఆనకట్టకు 80 మై. దిగువ రాజోలిబండ గ్రామమువద్ద ఒక ఆనకట్ట నిర్మింపబడుచున్నది. ఎడమవైపునుండి బయలుదేరు 85 మైళ్లు పొడవుగల కాలువ మూలమున 1.14 లక్షల ఎకరములు సాగగును. ఈ కాలువ మొదటి 27 మైళ్ల వరకును మైసూరు రాష్ట్రమునందు గలదు. 27 వ మైలు నుండి 85 మైళ్ల వరకు ఆంధ్రప్రదేశ్ నందుండి సుమారు 87,000 ఎకరములకు ఆయకట్టు లభింపజేయును. 1960 సం॥ మార్చి నాటికి 66 వ మైలు వరకు పని పూర్తియైనది. 45,144 ఎకరముల ప్రాంతమునకు నీటి సౌకర్యము లభించినది.

మూసి ప్రాజెక్టు : నల్గొండ జిల్లాలో మూసి నదికి అడ్డముగ ఒక ఆనకట్టయు, దానికి రెండు కాలువలును నిర్మింపబడుచున్నవి (1961). ఈ జిల్లాలోని నల్గొండ, సూర్యాపేట తాలూకాలలో ఈ ప్రాజెక్టువలన 36,000 ఎకరములు సాగగును.

## క్రొత్త పథకములు :

పోచంపాడు : నిజామాబాదు జిల్లాలో సోన్ బ్రిడ్జి కెగువ 3 మైళ్ల దూరములోని పోచంపాడు గ్రామమువద్ద గోదావరిపై సేతువు (weir) నిర్మించుట. 68 మైళ్ల పొడవు గల కాలువను కుడివైపున నిర్మించి దాని మూలమున కరీంనగరం జిల్లాలోను, నిజామాబాదు జిల్లాలోని ఆరుమూరు తాలూకాలోను 3.6 లక్షల ఎకరముల భూమిని సాగుకు తెచ్చుట; దీని కగు ఖర్చు సుమారు రు. 15.25 కోట్లు.

వంశధార ప్రాజెక్టు : తరచు సంభవించు కరవు, కాటకముల నుండి శ్రీకాకుళముజిల్లాను రక్షించు నిమిత్తము ఈ ప్రాజెక్టు ఉద్దేశించబడినది. వంశధార నదిపై సింగిడి వద్ద బ్యారేజి నిర్మించి కుడివైపు నుండి కాలువ ద్వారా ఎగువ భూములకు నీటిని గొంపోవుట; సింగిడికి 10 మైళ్లు దిగువ గొట్టవద్ద సేతువు కట్టుట - ఈ ప్రాజెక్టు ముఖ్యోద్దేశములు. ఈ ప్రాజెక్టు వరిసాగునకు మొదటి పంట కాలములో 2,24,750 ఎకరములకును, రెండవ పంట క్రింద 50,000 ఎకరములకును; జనపనార సాగునకు 36,000 ఎకరములకును నీటిని అందించును. మొత్తము ఖర్చు సుమారు రు. 14.67 కోట్లు. ఇది ఆంధ్రప్రదేశ్, ఒరిస్సా రాష్ట్రప్రభుత్వములు ఏకమై కొనసాగించు నిర్మాణము. ఫలితములను రెండు రాష్ట్ర ప్రభుత్వములును సమానముగ పంచుకొనును.

పెన్న డాము : నెల్లూరు డెల్టాకు నీటివసతి స్థిరముగ కల్పించుటకు నెల్లూరుకు దక్షిణమున నున్న భూములకు ఆయకట్టు కల్పించు నిమిత్తము పెన్ననది కడ్డముగ సోమశిలవద్ద డాము కట్టబడును. ఇచ్చటి జలాశయమునందు 1,187.67 లక్షల ఘ. అ. నీరుండును. దీనివలన నెల్లూరు జిల్లాలో క్రొత్తగా 5.43 లక్షల ఎకరములకు ఆయకట్టు లభించును.

శ్రీశైలం ప్రాజెక్టు : కృష్ణానదిపై శ్రీశైలము వద్ద నీటి పారుదల, విద్యుదుత్పత్తుల నిమిత్తము ఒక ఆనకట్ట నిర్మించబడును. జలాశయము నుండి ఒక కాలువ 15,000 క్యూసెక్కుల నీటిని తీసికొని కర్నూలు, కడప జిల్లాలలో 2.31 లక్షల ఎకరములను సాగు క్రిందికి తెచ్చును.

చిన్ననీటి పథకములు : చిన్న నీటి పథకముల నిమిత్తము రెండవ పంచవర్ష ప్రణాళిక (1956 - 61) లో కేటాయింపబడిన రు. 563.62 లక్షలకు మరికొంత కలిపి రు. 663.62 లక్షలుగా మార్చబడినది. ఈ పని యంతయు భారతసేవక సమాజమునకు, ఆయా ఆయకట్టుదార్లకును, కూలీల సహకార సంస్థలకును అప్పగింపబడినది. దీనివలన నీరు లభించి సుమారు 3 లక్షల ఎకరములు సాగులోనికి వచ్చును. ఈ ప్రణాళిక క్రింద చెరువుల, బావుల మరమ్మతులు, నిర్మాణము, చిన్న ఆనకట్టలు, గొట్టపు బావులు, మళ్లింపు పథకములు మున్నగునవి వచ్చును. చిన్ననీటి పథకములకు పెరుగుచున్న ప్రాముఖ్యమును గ్రహించి మూడవ పంచవర్ష ప్రణాళికలో ఇందు నిమిత్తము కేటాయింపబడిన సొమ్ము రు. 18.63 కోట్లు. దీనివలన అదనముగ 5.84 లక్షల ఎకరములకు ఆయకట్టు లభించును. సి. పా.

## జలశక్తి, రక్షణ, వినియోగము

నదీ సంపదలో ఆంధ్రప్రదేశ్ భారతదేశములోని ఇతర రాష్ట్రములను పెక్కింటిని మించినది. ఇందువల్ల ఆంధ్రప్రదేశ్‌ను 'నదీ రాష్ట్రము' అనుట సముచితముగ నుండును. ఆంధ్రప్రదేశ్‌లో సంవత్సరమునకు నూరు లక్షల



కృష్ణానది - ఆరగాణి




కృష్ణా డెల్టా

ఎకరపు టడుగు (కోటి ఘనపుటడుగు) లకు పైగా జల ప్రవాహము గల రెండు గొప్ప (గోదావరి, కృష్ణా) నదులును; పది లక్షలు మొదలు నూరు లక్షల ఎకరపు టడుగుల జలప్రవాహము గల మూడు చిన్న (పెన్న, నాగావళి, వంశధార) నదులును; సుమారు ఒకటి మొదలు పది లక్షల ఎకరపుటడుగుల జలప్రవాహము గల 29 చిన్న ఏళ్ళును, వాగులును ఉన్నవి. ఇవి అన్నియు ఏటేట బంగాళాఖాతములోనికి 150 కోట్ల ఘనపుటడుగుల నీటిని గొనిపోవు చున్నవి. (చూ. పట్టిక - 1 పుట : 1278)

ఈ పెద్ద, చిన్న నదులును, ఏళ్ళును కలిసి ఆంధ్రప్రదేశ్‌కు సహజ జలాధారములుగ నున్నవి. ఆంధ్రప్రదేశ్‌లో ప్రస్తుత మున్న ఈ నీటి వనరులవల్ల నీరు ప్రవహించు భూమి వైశాల్యము 2వ పట్టిక (చూ. పుట : 1281) వల్ల తెలియగలదు.

ఇంతవరకు లభ్యమగుచున్న ఆధారములను బట్టి చూడగా 185 లక్షల ఎకరముల భూమి, అనగా ఆంధ్రప్రదేశ్‌లోని మొత్తపు భూమి పరిమితిలో దాదాపు 45.72% వివిధ పంటలకుగాను సాగులో ఉన్నది. దీనిలో 49 లక్షల ఎకరముల భూమికి మాత్రమే, అనగా రాష్ట్రములోని మొత్తము భూమిలో 12.25% కిని సాగులో నున్న మొత్తము భూమిలో 25% కిని మాత్రమే నీటి పారుదల సౌకర్యము లున్నవి (1960). ఇంకను 42,13,000 ఎకరముల ప్రదేశము బీడుగనో, బంజరుగనో ఉన్నది. లభ్యమైన లెక్కల ననుసరించి తెలంగానాలోని దాదాపు 250 లక్షల ఎకరముల విస్తీర్ణములో 60 లక్షల ఎకరముల భూమి సాగులో నున్నది. దీనిలో 14% భూమికి మాత్రమే నీటి పారుదల సౌకర్యములు కలవు (1960). ఇంకను 30 లక్షల ఎకరముల ప్రదేశము బీడుగనో, బంజరుగనో ఉన్నది.

ఆంధ్ర ప్రదేశ్‌లోని సాలుసరి వర్షపాతము ఒక్కరీతిని ఉండదు. అది ఉత్తరపు కొననున్న శ్రీకాకుళము జిల్లాలో 45″ నుండి 55″ వరకును; అనంతపురము జిల్లాలో 20″లును; తెలంగానాలో సగటున 32″ లును ఉండును. నీటి పారుదల సౌకర్యములు లేని భూమి చాలవరకు అనిశ్చితమైన ఋతుపవనముల మీదనే ఆధారపడి యున్నది.

ఆంధ్రప్రదేశ్‌లో సుమారుగ 28,945 గ్రామములున్నవి. వీనిలో 3,239 గ్రామములకును, పట్టణములకును మాత్రమే విద్యుచ్ఛక్తి సరఫరా యగుచున్నది (1960). అనగా 12% కంటె తక్కువ. ఆంధ్ర ప్రదేశ్‌లో ఇంతవరకు ఉత్పన్నమై విరివిగా వాడుకలోనికి వచ్చిన జలవిద్యుచ్ఛక్తి లేదు. మత్స్యకుండము (మచ్‌ఖండ్), నిజాంసాగరమువద్ద జలవిద్యుచ్ఛక్తి ప్రాజెక్టులపని చాల వరకు పూర్తియైనది (1960). ప్రస్తుతము ఆంధ్రప్రదేశ్‌లో అవసరమైన విద్యుచ్ఛక్తిని 25,950 కిలోవాట్ల మొత్తము శక్తిగల విజయవాడ, విశాఖపట్టణము, నెల్లూరులలోని మూడు థెర్మల్ స్టేషనులును, దాదాపు 6600 కిలోవాట్ల మొత్తపు స్థాపితశక్తితో కూడిన 13 చిన్న డీసెల్ స్టేషనులును, దాదాపు 5400 కిలోవాట్ల విద్యుచ్ఛక్తి సరఫరా చేయు జోగ్, శివసముద్రము (మైసూరు రాష్ట్రము), మెట్టూరు (మద్రాసు రాష్ట్రము) జలవిద్యుత్ కేంద్రములును సమకూర్చుచున్నవి. ఉపలబ్ధమైన లెక్కలనుబట్టి 2,28,470 కిలోవాట్ల విద్యుచ్ఛక్తి ఉత్పన్నమైనట్లు తెలియవచ్చు చున్నది (1961) (చూ. విద్యుచ్ఛక్తి - పుట : 1286)

అదృష్టవశమున కృష్ణా, గోదావరులవంటి పెద్ద నదులకు వరదలవల్ల ఉపద్రవకరమైన విపత్తు తరచుగా కలుగదు. కాని చిన్నఏళ్లు - అందు ముఖ్యముగా ఏలేరు, ఎఱ్ఱకాలువ, తాండవ, శారదా నదులు; తమ్మిలేరు, బుడమేరుల - వరదలవల్ల తరచుగా అపారమైన నష్టము కలుగుచుండును. ఈ నదులలోని నీరు వృథా కాకుండ పొదుపు చేయుటకును, అందువల్ల మెట్ట ప్రదేశములను మాగాణి భూములుగా మార్చుటకే కాక వరదల వలన కలుగు నష్టమును నివారించుటకును వీలుగా ప్రాజెక్టులను నిర్మించుటకు ప్రభుత్వమువారు యోజించుచున్నారు. రాష్ట్రములో విద్యుచ్ఛక్తిని, నీటి పారుదల సౌకర్యములను అభివృద్ధి చేయుట, నదుల కడ్డముగ బహూళార్థ సాధకములైన ప్రాజెక్టులు నిర్మించి నీరు నిలువచేయుట - ఇదొక్కటియే పరిష్కార మార్గము. మొత్తము మీద 200 కోట్ల రూపాయల కంటెను ఎక్కువ వ్యయమగునని అంచనావేయబడిన ప్రాజెక్టు లనేకములను ఇటీవల ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము పరిశీలించుచున్నది.

తుంగభద్ర ప్రాజెక్టులో ప్రధానముగ తుంగభద్ర నదికి అడ్డముగ బళ్ళారి జిల్లా (మైసూరు రాష్ట్రము) లోని మల్లాపురము వద్ద నిర్మించిన డామును, నదికి ఉభయపార్శ్వములందును ఏడు లక్షల ఎకరముల భూమికి నీరు అందించుటకు అంచనా వేయబడినట్టి కాలువలును గలవు. ఈ ప్రాజెక్టు 75 వేల కిలోవాట్ల నికరమైన విద్యుచ్ఛక్తిని ఉత్పత్తిచేయును. కృష్ణానది కడ్డముగ నిర్మింప సంకల్పింపబడిన పులిచింతల, నాగార్జున సాగరము, శ్రీశైలము డాములు కూడ నీటిపారుదల, జల విద్యుచ్ఛక్తులు రెండిటి నిమిత్తము వేసిన పథకములే. ఆంధ్రప్రదేశ్‌లోని జల విద్యుత్ పథకములలోనికెల్ల ఆంధ్రప్రదేశ్ - ఒరిస్సా రాష్ట్రముల సరిహద్దున ఉన్న మత్స్యకుండము (మచ్‌ఖండ్) ప్రాజెక్టు చాల ముఖ్యమైనది. ఈప్రాజెక్టు మత్స్యకుండము నదిలోని నీటిని డుడుమా జలపాతము వద్ద ప్రయోజన

కారి యగునట్లు చేయును. ఈ మత్స్యకుండము నదికే దిగువ భాగములో సీలేరు అని పేరు. ఈ సీలేరు మీద కూడ మరొక జల విద్యుచ్ఛక్తి నిర్మాణ పథకము ప్రభుత్వము వారి ఆలోచనలో నున్నది.

ఆంధ్రప్రదేశ్‌లోని నదీ ప్రణాళికలు పెద్దవి, చిన్నవి, వానివలన పల్లపు (మాగాణి) సాగు క్రిందికి రాగల క్రొత్త భూమి 3 వ, 4 వ (చూ. పుటలు: 1281, 1285) పట్టికల వలన తెలియగలదు.

ఆంధ్రప్రదేశ్‌నందలి నదుల నుండి సముద్రములోనికి పోవుచున్న 1300 లక్షల ఎకరపు టడుగుల మొత్తపు ప్రవాహములో గరిష్ఠ పరిమాణము 200 లక్షల ఎకరపు టడుగుల నీరు మాత్రము సాగుబడికి వినియోగపడుచున్నది. ఈ నదుల ఎగువ భాగములో ఆంధ్రప్రదేశ్ సరిహద్దులో నున్న మైసూరు, మహారాష్ట్రముల వినియోగము నిమిత్తము దాదాపు 350 లక్షల ఎకరపు టడుగుల నీరు తీసివేసినను మిగిలిన 950 లక్షల ఎకరపు టడుగుల నీటిని ఆంధ్రప్రదేశ్ నభివృద్ధి నొందించుటకును, ధన సమృద్ధము చేయుటకును తగిన విధమున సరియైన వినియోగమునకు తీసికొని రావలసియున్నది.

ఈ విధముగ ఆంధ్రప్రదేశ్‌లోని నదీ సైకత ప్రాంతముల (రివర్ బేసిన్స్) వల్లను ప్రభుత్వము వారి ఆలోచనలో నున్న ప్రాజెక్టుల వల్లను ఆంధ్రప్రదేశ్‌లోని నీటి పారుదల యగు నేల విస్తీర్ణము మరొక 125 లక్షల ఎకరములు అధికమగుటకును, 12,00,000 కిలోవాట్ల విద్యుచ్ఛక్తి సరఫరా యగుటకును వీలు కలదు.

విద్యుచ్ఛక్తి చౌకగ లభింపచేసిన పరిశ్రమాభివృద్ధికి అవకాశము కలదు. దేశములోని జలాధారములను కాపాడి అభివృద్ధిచేసి లాభదాయకములైన పథకములు వేసి వాని వలన విస్తృత జాతీయార్థిక వ్యవస్థను నిర్మించుకొన వచ్చును. కొ.ల. రా.

పట్టిక—1

ఆంధ్రప్రదేశ్‌లోని నదులు-ఆరగాణి, సాలీన జలప్రవాహ రాశి

| వరుస సంఖ్య | నది పేరు | నది పొడవు (మైళ్ళలో) | ఆరగాణి విస్తీర్ణము (కాచ్ మెంట్ ఏరియా) (చ. మైళ్ళలో) | సాలీన వర్షపాతము (అంగుళములలో) | సాలీన జల ప్రవాహ రాశి (పదిలక్షల ఎకరపు టడుగులలో) | నదినుండి సముద్రములో కలియు గరిష్ఠ జలప్రమాణము (క్యూసెక్కులలో) | రిమార్కు |
|---|---|---|---|---|---|---|---|
| | అ. విశాఖపట్టణము జిల్లా : | | | | | | |
| 1 | బాహుదానది .... | 65 | 1494 | | 0.33 | 73190 | |
| 2 | ఉత్తర మహేంద్రతనయ .... | 25 | 273 | | 0.18 | 24500 | |
| 3 | బెండిగెడ్డ .... | 15 | 174 | | 0.10 | 18300 | |
| 4 | వరహాలగెడ్డ .... | 15 | 124 | | 0.08 | 13500 | |
| 5 | గరిబుల గెడ్డ .... | 14 | 249 | | 0.16 | 22500 | |
| 6 | వంశధార (ఉ. న. మహేంద్ర తనయ) .... | 140 | 4362 | 40″ నుండి 50″ వరకు | 3.68 | 220000 | స్థిరమైనది 330 లక్షల ఎకరపు అడుగులు |
| 7 | నాగావళి, లాంగుల్య (ఉ. న.) ఒట్టిగెడ్డ, జంఝావతి, సువర్ణముఖి, వేగవతి. .... | 90 | 3461 | | 2.24 | 128100 | |
| 8 | పెద్దగెడ్డ .... | 22 | 199 | | 0.16 | 16500 | |
| 9 | కందివలస .... | 23 | 100 | | 0.10 | 11000 | |
| 10 | నెల్లిమర్లగెడ్డ (ఉ.న.) చంపావతి | 65 | 2037 | | 0.83 | 89990 | |
| 11 | గోస్తనీనది (చంపావతి) .... | 60 | 647 | | 0.35 | 32350 | |
| 12 | గంభీరం గెడ్డ .... | 15 | 112 | | 0.08 | 16000 | |
| 13 | సరవగెడ్డ .... | 24 | 273 | | 0.10 | 24500 | |

పట్టిక—1 (తరువాయి)

| వరుస సంఖ్య | నది పేరు | నది పొడవు (మైళ్ళలో) | ఆరగాణి విస్తీర్ణము (కాచ్‌మెంట్ ఏరియా) (చ. మైళ్ళలో) | సాలీన వర్షపాతము (అంగుళములలో) | సాలీన జల ప్రవాహ రాశి (పది లక్షల ఎకరపు టడుగులలో) | నదినుండి సముద్రములో కలియు గరిష్ఠ జలప్రమాణము (క్యూసెక్కులలో) | రిమార్కు |
|---|---|---|---|---|---|---|---|
| 14 | కజ్జారపుగెడ్డ .... | 14 | 100 | | 0·17 | 11000 | |
| 15 | శారదానది .... | 60 | 872 | | 0·38 | 51100 | |
| 16 | వరాహ .... | 44 | 436 | | 0·18 | 32200 | |
| 17 | తాండవయేరు .... | 46 | 647 | | 0·34 | 32350 | |
| | (ఉ.న.) మత్స్యకుండము | | | | | | |
| | ,, గోదావరి | | | | | | |
| | ఆ. తూర్పు గోదావరి జిల్లా : | | | | | | |
| 18 | పంపానది .... | 32 | 348 | | 0·09 | 20000 | |
| 19 | ఏలేరు .... | 65 | 1070 | | 0·34 | 49000 | స్థిరమైనది |
| 20 | గోదావరి .... | 937 | 121500 | 35″ నుండి 40″ వరకు | 85·00 | 2107660 | 580 లక్షల |
| | (ఉ.న) శబరి, సీలేరు | | | | | | ఎ. అ. |
| | ఇ. పశ్చిమ గోదావరి జిల్లా : | | | | | | |
| 21 | ఎర్రకాలువ .... | 60 | 677 | | 0·36 | 36000 | |
| | (ఉ.న.) బైనేరు | | | | | | |
| | ,, పులివాగు | | | | | | |
| | ,, జల్లేరు | | | | | | |
| | ఈ. కృష్ణా జిల్లా : | | | | | | |
| 22 | ఉప్పుటేరు .... | 30 | ... | | .... | .... | |
| | (క) తమ్మిలేరు .... | 68 | 463 | | 0·18 | 32000 | |
| | (ఖ) బుడమేరు .... | 73 | 319 | | 0·14 | 27760 | |
| 23 | కృష్ణానది .... | 775 | 97050 | | 45·1 | 1194000 | స్థిరమైనది |
| | (ఉ.న.) మునేరు | | | | | | 400 లక్షల |
| 24 | నక్కవాగు .... | 52 | 495 | | 0·10 | 9400 | ఎ. అ. |
| 25 | వోగేరువాగు .... | 65 | 515 | | 0·10 | 8700 | |
| | (క) రొంపేరు .... | 55 | 498 | | 0·32 | 16300 | |
| | ఉ. గుంటూరు జిల్లా : | | | | | | |
| 26 | గుండ్లకమ్మ .... | 145 | 3336 | | 1·42 | 120000 | |
| 27 | మూసి .... | 70 | 912 | | 0·30 | 52050 | |
| | ఊ. నెల్లూరు జిల్లా : | | | 25″ నుండి 30″ వరకు | | | |
| 28 | పాలేరు .... | 68 | 996 | | 0·06 | 55850 | |
| 29 | మన్నేరు .... | 75 | 1394 | | 0·44 | 69880 | |
| 30 | పిల్లివాగు .... | 26 | 183 | | 0·08 | 12400 | |
| | (క) పైడేరు .... | 20 | 137 | | 0·06 | 11000 | |

పట్టిక 1 (తరువాయి)

| వరుస సంఖ్య | నది పేరు | నది పొడవు (మైళ్ళలో) | ఆరగాణి విస్తీర్ణము (కాచ్ మెంట్ ఏరియా) (చ. మైళ్ళలో) | సగటు వర్షపాతము (అంగుళాలలో) | సాలీన జల ప్రవాహ రాశి (పది లక్షల ఎకరపు టడుగులలో) | నదినుండి సముద్రములో కలియు గరిష్ఠ జలప్రమాణము (క్యూసెక్కులలో) | రిమార్కు |
|---|---|---|---|---|---|---|---|
| 31 | పెన్నానది .... | 370 | 26266 | | 3·68 | 447000 | స్థిరమైనది |
| 32 | ఉప్పుటేరు .... | 55 | 1345 | | 0·24 | 16000 | 2060 వేలు |
| 33 | స్వర్ణముఖి .... | 99 | 2415 | | 0·48 | 27000 | 26 లక్షల |
| 34 | కాళంగి .... | 40 | 1230 | | 0·18 | 11600 | ఎ. అ. |
| | ఎ. చిత్తూరు జిల్లా : | | | | | | |
| 35 | ఆరణి .... | | | | | | |
| 36 | కొర్తాలియారు .... | | | | | | |
| 37 | పొయిని (పాలారు ఉపనది) | | | | | | |
| | ఏ. అనంతపురము జిల్లా : | | | | | | |
| 38 | మరవంక .... | | | | | | |
| 39 | చిత్రావతి .... | | | | | | |
| | ఐ. కడప జిల్లా : | | | | | | |
| 40 | చెయ్యేరు : (క) పులంగేరు, (ఖ) పుంచు, (గ) బాహుద, (ఘ) మాండవి, (చ) పాపఘ్ని, (ఛ) సగిలేరు, (జ) కుందేరు — చెయ్యేటి ఉపనదులు | | | 15" నుండి 25" వరకు | | | |
| | ఒ. కర్నూలు జిల్లా : | | | | | | |
| 41 | కుందేరు .... | | | | | | |
| 42 | తుంగభద్ర .... | | | | | | |

పట్టిక—2

## ఆంధ్రప్రదేశ్ - నదులవల్ల నీరు ప్రవహించు నేల వైశాల్యము

| జిల్లా | నీటిపారుదల మండలము | సాగులోనున్న భూమి వైశాల్యము (ఎకరములలో) | రిమార్కు |
|---|---|---|---|
| శ్రీకాకుళము | నాగావళి | 280,000 | |
| విశాఖపట్టణము | వంశధార, లాంగుల్య, గరిబుల గెడ్డ నదులతో కూడిన చిన్న నదీ మండలము | 67,000 | |
| తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి, కృష్ణ | గోదావరి డెల్టామండలము | 820,000 | రెండవ పంటతో సహా సాగైన భూమి 10 లక్షల ఎకరములు (1960) |
| తూర్పు గోదావరి | పోలవరము లంక | 17,500 | |
| పశ్చిమ గోదావరి, కృష్ణా, గుంటూరు | కృష్ణా డెల్టా మండలము | 930,000 | |
| కృష్ణా .... | మునేరు మండలము | 59,000 | |
| నెల్లూరు .... | పెన్నానదీ కాలువ - మండలము | 167,500 | |
| నెల్లూరు .... | మోపాడు జలాశయ మండలము | 12,500 | |
| కర్నూలు .... | కర్నూలు-కడప కాలువ మండలము | 1,00,000 | |
| నిజామాబాదు | నిజామసాగర మండలము | 275,000 | |
| వరంగల్లు .... | పాలేరు మండలము | 19,650 | |
| వరంగల్లు .... | వైరా మండలము | 17,390 | |
| మెదకు .... | పోచారము మండలము | 13,069 | |
| మెదకు .... | మహబూబ్ నగర మండలము | 8,504 | |
| మెదకు .... | ఫతేనహర్ మండలము | 5,200 | |

పట్టిక—3

## ఆంధ్రప్రదేశ్‌లోని నదులపై ప్రణాళికల వివరములు

### (క) మొదటి విభాగము—పదికోట్ల రూపాయలకు పైన ఖర్చగు ప్రణాళికలు

| వరుస సంఖ్య | పేరు | జిల్లా | క్రొత్తగ సాగగు భూమి(వేలఎకరములలో) | ఇప్పుడున్న సాగుబడి ప్రదేశమునకు స్థిరమైన నీటిపారుదల (వేల ఎకరములలో) | రిమార్కు |
|---|---|---|---|---|---|
| 1 | రామపాదసాగర డాము | | 8.00 | | |
| | ఇంచంపల్లి ,, | గోదావరి | 2,000 - 3,000 | .... | |
| 2 | పులిచింతల ,, | కృష్ణ, గుంటూరు | 8,000* | .... | *రెండవపంటతో సహా |
| 3 | నందికొండ ,, | గోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు, కర్నూలు | 26.00 | | |

పట్టిక 3 మొదటి విభాగము (తరువాయి)

| వరుస సంఖ్య | పేరు | జిల్లా | క్రొత్తగ సాగగు భూమి (వేల ఎకరములలో) | ఇప్పుడున్న సాగుబడి ప్రదేశమునకు స్థిరమైన నీటిపారుదల (వేల ఎకరములలో) | రిమార్కు |
|---|---|---|---|---|---|
| 4 | శ్రీశైలము ,, | తెలంగాణాలో కొంతభాగము | .... | .... | 4,40,000 కి. వా. విద్యుచ్ఛక్తి. భవిష్యత్తులో 3,30,000 కి. వా. విద్యుచ్ఛక్తి పథకమునకు అవకాశము కలదు. |
| 5 | పోచంపాడు ,, | నిజామాబాదు కరీంనగరం | 360 | .... | భవిష్యత్తులో అభివృద్ధి చెందగలదు. |
| 6 | భీమ ,, | మహబూబ్ నగరం | 400 | .... | |
| 7 | దిగువ కృష్ణా ,, | నల్గొండ | 1,000 | .... | |

(చ) పట్టిక-3 రెండవ విభాగము—5 - 10 కోట్ల రూపాయలకు మధ్య ఖర్చగు ప్రణాళికలు

| వరుస సంఖ్య | పేరు | జిల్లా | క్రొత్తగ సాగగు భూమి (వేల ఎకరములలో) | ఇప్పుడున్న సాగుబడి ప్రదేశమునకు స్థిరమైన నీటిపారుదల (వేల ఎకరములలో) | రిమార్కు |
|---|---|---|---|---|---|
| 8 | వంశధార | శ్రీకాకుళము | 250 (1వ పంట) 50 (2వ పంట) | 50 | ఎకరం ఒకటికి ఖర్చు రు. 300 లు. |
| 9 | చిత్తూరు డాము (శబరినది) | తూర్పు, పశ్చిమ గోదావరిజిల్లాలు | 500 | 300 | ఎకరం ఒకటికి ఖర్చు రు. 150 లు. |
| 10 | సోమశిల డాము | నెల్లూరు | 200 (2వ పంట) | .... | |
| 11 | తుంగభద్ర ప్రాజెక్టు ఎగువకాలువ | కడప, కర్నూలు, అనంతపురము | 300 | 300 | ఖర్చు ఎకరం ఒకటికి రు. 300 లు. |
| | మొత్తం | ... | 1,300 | 650 | |

(ట) పట్టిక-3 మూడవ విభాగము—ఒకటి నుండి ఐదు కోట్ల రూపాయలవరకు ఖర్చగు ప్రణాళికలు.

| వరుస సంఖ్య | పేరు | జిల్లా | క్రొత్తగ సాగగు భూమి (వేల ఎకరములలో) | ఇప్పుడున్న సాగుబడి ప్రదేశమునకు స్థిరమైన నీటిపారుదల (వేల ఎకరములలో) | రిమార్కు |
|---|---|---|---|---|---|
| 12 | ఏలేరు జలాశయము | తూర్పు, పశ్చిమ గోదావరిజిల్లాలు | 36 (2వ పంట) | 80 | ఖర్చు మొత్తము రు. 3 కోట్లు (2వ పంట 15 వేల ఎకరములతో సహా) |
| 13 | అప్పలరాయగూడెం దగ్గర, ఎర్రకాలువకు అడ్డముగాకట్టే జలాశయము | ,, | 46 | 8 | ఎకరమునకు ఖర్చు రు. 300 |
| 14 | కృష్ణా రెగ్యులేటర్ బ్రిడ్జి | కృష్ణా | 50 | .... | |
| 15 | తంగిరాలవద్ద గుండ్లకమ్మ జలాశయం | గుంటూరు | 30 | .... | |
| 16 | కడప-కర్నూలు కాలువ కాలువ వ్యవస్థ, పునర్నిర్మాణము | కర్నూలు, కడప | 150 | 100 | |
| 17 | గండికోట (మొదటి దశ) | కడప | 50 | .... | ఎకరమునకు ఖర్చు రు. 800 |
| | మొత్తం | .... | 362 | 188 | |

(త) పట్టిక-3—నాలుగవ విభాగము పదిలక్షల నుండి ఒక కోటి రూపాయల వరకు ఖర్చగు ప్రణాళికలు

| వరుస సంఖ్య | పేరు | జిల్లా | క్రొత్తగ సాగగు భూమి (వేల ఎకరములలో) | ఇప్పుడున్న సాగుబడి ప్రదేశమునకు స్థిరమైన నీటిపారుదల (వేల ఎకరములలో) | రిమార్కు |
|---|---|---|---|---|---|
| 18 | వనస నందిహాడ దగ్గర నాగావళిపై ఆనకట్ట | శ్రీకాకుళము | 14 | 6 | |
| 19 | తోటపల్లి దగ్గర నాగావళి కుడివైపు కాలువ | ,, | 6 | — | ఈ ప్రణాళికలకు ఎకరమునకు రు. 250లక్షల నుండి రు. 350 లక్షల వరకు ఖర్చగును. ప్రస్తుతపు ఆయకట్టు సగముగ తీసికొని క్రొత్తగ సాగగు ఆయకట్టుకు చేర్చి అంచనా వేయడమైనది. |
| 20 | ఒట్టిగడ్డ కడ్డముగా జలాశయము | విశాఖపట్టణం శ్రీకాకుళం | 7 | 3 | |
| 21 | జంఝావతి కడ్డముగా జలాశయము | ,, | 14 | 15 | |
| 22 | కందివలస దగ్గర వేగవతికి ఆనకట్ట | ,, | 1·5 | 4 | |
| 23 | మామిడిపల్లి గడ్డకు ఆనకట్ట | ,, | 5 | 2 | |

పట్టిక - 3—నాలుగవ విభాగము (తరువాయి)

| వరుస సంఖ్య | పేరు | జిల్లా | క్రొత్తగ సాగగు భూమి (వేలు ఎకరములలో) | ఇప్పుడున్న సాగుబడి ప్రదేశమునకు స్థిరమైన నీటిపారుదల (వేలు ఎకరములలో) | రిమార్కు |
|---|---|---|---|---|---|
| 24 | తాతపూడి దగ్గర (విజయనగరమునకు ఎగువ గోధార రోడ్డు) జలాశయము (గోస్తని) | ,, | 7 | 6 | ఎకరమునకు రు. 1000 నుండి రు. 1200 వరకు ఖర్చగును. |
| 25 | బోయపాలెం రిజర్వాయరు | ,, | 1 | 0.4 | |
| 26 | గోడిగుమ్మి దగ్గర జలాశయము (తాండవ నది) | ,, | 3 | 0.7 | |
| 27 | గంతవారి జలాశయము (తాండవ నది) | ,, | 4.5 | .... | |
| 28 | తుని రైలు బ్రిడ్జిదగ్గర జలాయము (తాండవ నది) | ,, | 10 | 15 | |
| 29 | రాయవాడ దగ్గర జలాశయము (శారద నది) | ,, | 6 | 6 | |
| 30 | సురపాడు దగ్గర అడ్డవారి గెడ్డకు ఆనకట్ట (నాగావళి స్వర్ణముఖ నదులు) | ,, | 1.5 | 0.3 | |
| 31 | సీతానగరం ఆనకట్ట (నాగావళి - స్వర్ణముఖి) | ,, | 2.3 | 1.7 | |
| 32 | పైనేరుకు ఆనకట్ట | తూర్పు, పశ్చిమ గోదావరిజిల్లాలు | 7.7 | .... | వీటికి ఎకరమునకు ఖర్చు రు. 400 నుండి రు. 600ల వరకు అగును. (ప్రస్తుతపు ఆయకట్టు సగముగ తీసికొని వీనికి ఎకరమునకు ఖర్చు రు. 150 లు చేర్చబడినది. |
| 33 | రాజవరం దగ్గర ఎర్రకాలువకు ఆనకట్ట | ,, | 3 | .... | |
| 34 | పంప జలాశయము | ,, | 2 (మొ.పంట)<br>1 (2వ పంట) | 8 | |
| 35 | తుని రైలు బ్రిడ్జికి ఎగువ తాండవ జలాశయం | ,, | 10 (1వ పంట)<br>3 (2వ పంట) | 15 | |
| 36 | తొర్రిగడ్డ పంపింగు ప్రణాళిక | ,, | 13 | .... | |
| 37 | ఆనకట్ట పట్టర్లను 3'-0 నుండి 5'-0 వరకు పెంచుట | ,, | 75 | .... | |
| 38 | బుడమేరు ప్రాజెక్టు | కృష్ణా జిల్లా | 15 | .... | వరదల నాపును. |
| 39 | ఉప్పుటేరు అభివృద్ధి | ,, | 25 | .... | డెల్టాభూములముంపు |
| 40 | తమ్మిలేరు ప్రాజెక్టు | ,, | 10 నుండి<br>20 వరకు | ....<br>.... | నివారించును. |

పట్టిక - 3—నాలుగవ విభాగము (తరువాయి)

| వరుస సంఖ్య | పేరు | జిల్లా | క్రొత్తగ సాగగు భూమి (వేలు ఎకరములలో) | ఇప్పుడున్న సాగుబడి ప్రదేశమునకు స్థిరమైన నీటిపారుదల (వేలు ఎకరములలో) | రిమార్కు |
|---|---|---|---|---|---|
| 41 | గాజులదిన్నె ప్రాజెక్టు | కర్నూలు | 5 (1వ పంట)<br>3 (2వ పంట) | .... | |
| 42 | దిగువ సగిలేరు ప్రాజెక్టు | కడప | 3 | | |
| 43 | కల్యాణి జలాశయము (కల్యాణి నది) | చిత్తూరు | 0.2 (1వ పంట)<br>0.8 (2వ పంట) | | |
| 44 | చెన్నరాయునిగుడి జలాశయము (పాపఘ్ని నది) (దోరిగపల్లి ప్రాజెక్టు) | అనంతపురము | 1.2 (1వ పంట)<br>0.4 (2వ పంట)<br>1 | | ఈ ప్రాజెక్టులకు ఖర్చు ఎకరమునకు రు. 1000 ల నుండి రు. 1400 వరకు అగును. |
| 45 | ఎగువ పెన్నారు | ,, | 6 | | |
| 46 | భైరవాని తిప్ప | ,, | 8.0 | | |
| 47 | మన్నేరు | కరీం నగరం | 10 | | |
| 48 | కొరడం | ఆదిలాబాదు | 20 | | |
| 49 | బందుపల్లి | మహబూబ్ నగరం | 10 | | |

పట్టిక—4

## ఆంధ్రప్రదేశ్ జలవిద్యుచ్ఛక్తికి మూలాధారములు

| వరుస సంఖ్య | ప్రణాళిక పేరు | ఉత్పత్తిచేయు విద్యుచ్ఛక్తి ప్రమాణము (10లక్షల వాట్లలో) |
|---|---|---|
| 1 | మత్స్యకుండము (మచ్ ఖండ్) .... .... | 102 |
| 2 | సీలేరు .... .... | 166 |
| 3 | ఇంచంపల్లి .... .... | 260 |
| 4 | తుంగభద్ర ప్రాజెక్టు (ఎగువ) .... .... | 44 |
| 5 | శ్రీశైలము .... .... | 440 |
| 6 | దిగువకృష్ణా .... .... | 70 |
| 7 | తుంగభద్ర ప్రాజెక్టు .... .... | 38 |
| 8 | గోదావరి .... .... | 65 |
| 9 | కడం, నిజాంసాగర్, మద్రై .... .... | 10 |
| | మొత్తం .... | 1195 |

# విద్యుచ్ఛక్తి

ఆంధ్రప్రదేశ్‌నందు ఖనిజ సంపద, జలసంపద ఉన్నప్పటికిని తగిన విద్యుచ్ఛక్తి ఉత్పత్తి, సరఫరా లేనందున పారిశ్రామికముగ చాల వెనుకబడి యున్నది. విద్యుద్వినియోగము భారతదేశమునందు సగటున మనిషికి 35 యూనిట్లు ఉండగా ఆంధ్రప్రదేశ్‌నందు 15 యూనిట్లు మాత్రమే (1960) ఉన్నది. ఆంధ్రప్రదేశ్‌నందు మొత్తము 30 లక్షల కిలోవాట్ల జలశక్తి ; 40,000 లక్షల టన్నుల నేల బొగ్గు లభించు అవకాశము లున్నవి. ఈ అవకాశములను పూర్తిగా వినియోగించుటకు వీలు కూడ కలదు.

1929 లో మొట్టమొదట ఒక వైయక్తిక సంస్థచే ఆంధ్ర ప్రాంతమున రాజమండ్రిలో విద్యుచ్ఛక్తి సరఫరా ఒక చిన్న డీసల్ యంత్రము సహాయముతో జరిగెను. అప్పటికే ఇతర రాష్ట్రములందు విద్యుదుత్పత్తి, సరఫరా అభివృద్ధి నొందుచుండెను. రాజమండ్రి వలెనే కాకినాడ, గుంటూరు, హిందూపురము, కర్నూలులందు డీసల్‌యంత్ర స్థాపన ద్వారా విద్యుచ్ఛక్తి సరఫరా ప్రారంభమయ్యెను. ప్రభుత్వము 1938-39 లలో విజయవాడ, విశాఖపట్టణము లందు రెండు థెర్మల్ స్టేషనులను స్థాపించువరకు ఈ విషయమున చెప్పుకొనతగిన అభివృద్ధి జరగలేదు. భవిష్యత్తున అభివృద్ధినొందు జల విద్యుచ్ఛక్తి పథకములను దృష్టియందుంచుకొని ఈ థెర్మల్ స్టేషనుల స్థాపన జరిగెను. విజయవాడయందు 1,500 ల కిలోవాట్లు శక్తిగల రెండు టర్బోజనరేటర్లును, విశాఖపట్టణమందు 750 కిలోవాట్లు, 1,500 కిలోవాట్లు శక్తిగల రెండు టర్బోజన రేటర్లును నెలకొల్పబడెను. ఈ రెండు స్థలములనుండి విద్యుచ్ఛక్తి పారప్రేషణ తంతుల (ట్రాన్స్‌మిషన్ లైన్స్) ద్వారా సమీప స్థలములగు పట్టణములకును, కోడూరు, గర్భాము గనులకును ; ఆంధ్ర సిమెంటు కర్మాగారమునకును అందజేయబడెను. క్రమక్రమముగా ఈ విద్యుత్కేంద్రములనుండి ఆంధ్రప్రదేశ్‌లోని మిగత భాగములకు పారప్రేషణ తంతి మూలముగనో లేదా వేరు డీసెల్ కేంద్రముల నుండియో విద్యుచ్ఛక్తి సరఫరా మొదలుపెట్టబడెను. ఈ విద్యుదభివృద్ధి ప్రణాళికలు రెండవ ప్రపంచ యుద్ధ మారంభమగుటంజేసి భారతదేశములోని ఇతర ప్రాంతములలోవలెనే దేశమునందున 1939-45 ల మధ్య కొంతకాలము ఆగిపోయెను. సంగ్రామానంతరము 1945 లో విద్యుచ్ఛక్తి ఉపయోగములు ద్విగుణీకృతమై మూలపడిన ప్రణాళికలపై తిరిగి ప్రభుత్వ దృష్టి మరలినది. స్వాతంత్ర్యసిద్ధి తరువాత విద్యుత్పురోభివృద్ధిని ఆంధ్రప్రదేశ్ అతిశీఘ్రముగ సాధించెను.

విజయవాడ, విశాఖపట్టణము, రాజమండ్రి విద్యుత్కేంద్రములందు ఉత్పాదక శక్తి నూతన యంత్రస్థాపనములద్వారా పెంపొందింపబడెను. 1950 లో నెల్లూరులో 5000 కిలోవాట్ల శక్తిగల కేంద్రము స్థాపితమైనది. ఇక్కడ ఉత్పత్తియగు శక్తిలో అత్యధిక భాగము ఈ జిల్లాలోని అభ్రకపు గనులు వినియోగించుకొనుచున్నవి.

రాయలసీమ జిల్లాలలోని డీసెల్ ఉత్పాదక కేంద్రములను 1946 నుండి ప్రభుత్వము స్వాధీనపరచుకొని క్రొత్త ఉత్పాదక యంత్రములను అదనముగా స్థాపించి, వాటిశక్తి నభివృద్ధి చేసెను. తాడిపత్రి, మదనపల్లి, నంద్యాలయందు మూడు క్రొత్త డీసెల్ కేంద్రములు నిర్మింపబడెను. 'దత్త మండల పథకము', క్రింద 1950 లో మైసూరునుండి జోగ్ జలశక్తిని కొని ఆదోని, గుంతకల్లులకు అందజేసిరి. చిత్తూరుజిల్లాలోని కొన్ని భాగములకు మెట్టూరు జలశక్తి సమకూర్చబడెను.

తెలంగాణాలో విద్యుచ్ఛక్తి విస్తృతి 1909 లో ఆరంభమైనది. హుస్సేన్‌సాగర్ విద్యుత్కేంద్రమునుండి 10 కిలోవాట్ల యంత్రముద్వారా హైదరాబాదు నగరమునకు విద్యుచ్ఛక్తి సరఫరా యయ్యెను. 1922 లో 3,000 కిలోవాట్ల శక్తిగల రెండు టర్బోజనరేటర్లు స్థాపితమైనవి; 1932 లో మరొక 30,750 కిలోవాట్ల శక్తిగల యంత్రము కూడ చేర్చబడిన మీదట శక్త్యుత్పాదన మిగుల అభివృద్ధి గాంచెను. పెరుగుచున్న వినియోగమును గమనించి 1000 కిలోవాట్లు శక్తికలదొకటి, 924 కిలోవాట్లు శక్తిగలది మరొకటి - మరి రెండు డీసెల్ యంత్రములు కూడ ప్రతిష్ఠితములైనవి. 1942 లో మరియొక 7,500 కిలోవాట్ల శక్తిగల టర్బోజనరేటరును, 1951 లో 5,000 కిలోవాట్ల శక్తిగల ఇంకొక యంత్రమును పైన చెప్పబడినవాటికి అదనముగ చేర్చబడినవి. ఈ శక్తి హైదరాబాదు, సికింద్రాబాదు నగరములకు మాత్రమే పరిమితమైనది.

మొదటి పంచవర్ష ప్రణాళిక - ఆంధ్రప్రాంతము : నూతనముగ ఏర్పడిన (1953) ఆంధ్రరాష్ట్ర అవసరముల కొరకు అదివరకున్న ప్రణాళికను మార్పుచేసి రు. 25.53 లక్షలు విద్యుచ్ఛక్తి అభివృద్ధికి కేటాయింపబడెను.

మొదటి పంచవర్ష ప్రణాళిక ఆరంభమునాటికి ఆంధ్ర ప్రాంతము (1953) లోని విద్యుదుత్పత్తి శక్తి- అందు ఆవిరి, నూనె సహాయమున ఉత్పత్తి యగుచుండిన 16,250 కిలోవాట్లతో కలిపి 21,400 కిలోవాట్లు. ఇందు విజయవాడ 6,000 కిలోవాట్లు, విశాఖపట్టణము 5,250 కిలోవాట్లు, నెల్లూరు

## ఆంధ్రప్రదేశ్ విద్యుచ్ఛక్తి సరఫరా

జిల్లాలవారీ

పట్టణములు - గ్రామములు

| జిల్లా | మొత్తము 1959 - 60 అంతమునకు | 1960 - 61 సంవత్సరములలో | మొత్తము 1960 - 61 అంతమునకు |
|---|---|---|---|
| 1. శ్రీకాకుళము | 115 | 37 | 152 |
| 2. విశాఖపట్టణము | 154 | 37 | 191 |
| 3. తూర్పు గోదావరి | 358 | 51 | 409 |
| 4. పశ్చిమ గోదావరి | 223 | 51 | 274 |
| 5. కృష్ణా | 265 | 38 | 303 |
| 6. గుంటూరు | 189 | 55 | 245 |
| 7. నెల్లూరు | 122 | 33 | 155 |
| 8. చిత్తూరు | 321 | 104 | 425 |
| 9. కడప | 92 | 61 | 153 |
| 10. అనంతపురము | 162 | 62 | 224 |
| 11. కర్నూలు | 117 | 40 | 157 |
| 12. మహబూబునగరము | 44 | 21 | 65 |
| 13. హైదరాబాదు | 58 | 30 | 88 |
| 14. మెదకు | 44 | 19 | 63 |
| 15. నిజామాబాదు | 42 | 14 | 56 |
| 16. ఆదిలాబాదు | 34 | 16 | 50 |
| 17. కరీంనగరము | 57 | 18 | 75 |
| 18. వరంగల్లు | 36 | 29 | 65 |
| 19. ఖమ్మం | 18 | 11 | 29 |
| 20. నల్గొండ | 43 | 18 | 61 |
| మొత్తము | 2,494 | 745 | 3,239 |

5,000 కిలోవాట్లు, ఇతరములు 5,150 కిలోవాట్లు. జోగ్ (మైసూరు) జలవిద్యుచ్ఛక్తినుండి 2,700 కిలోవాట్లున్ను, మెట్టూరు (మద్రాసు) జల విద్యుత్కేంద్రమునుండి 3,400 కిలోవాట్లున్ను లభించు చుండెను. విద్యుచ్ఛక్తి వసతి పొందిన పట్టణములు, గ్రామములు మొత్తము 205.

మొదటిప్రణాళిక (1951-56) ఆరంభ కాలములో విజయ వాడలో రెండు 3,000 కిలోవాట్ల విద్యుదుత్పత్తి యంత్రములును, విశాఖపట్టణమున 1,500 కిలోవాట్ల యంత్రమును విద్యుత్సరఫరా నభివృద్ధి పరచుటకు నెలకొల్పబడెను. ఆంధ్రరాష్ట్ర అవతరణానంతరము (1953) మచ్‌ఖండ్ జల విద్యుత్ప్రణాళికవలన చాల అభివృద్ధి జరిగెను. ఈ ప్రణాళికను రెండు దశలుగ విభజించిరి. అందు మొదటి దశ ముగియునాటికి ఒక్కొక్కటి 17,000 కిలోవాట్లు శక్తిగల మూడు యంత్రములును, ఒక్కొక్కటి 21,250 కిలోవాట్లు శక్తిగల రెండు యంత్రములును; రెండవ దశలో 21,250 కిలోవాట్ల శక్తిగల మరొక యంత్రమును పనిలోనికి వచ్చెను. ఈ ప్రణాళికవలన తయారగు మొత్తము విద్యుచ్ఛక్తి 1,14,750 కిలోవాట్లు. మచ్‌ఖండ్, తుంగభద్ర జల విద్యుత్కేంద్రములందు చక్కని అభివృద్ధి జరిగెను. మొదటి ప్రణాళిక అంత్యమునకు (1956) ఆంధ్రరాష్ట్రము (తెలంగాణా మినహాయించి) విద్యుచ్ఛక్తి ఉత్పత్తి 21,400 కిలోవాట్లనుండి 62,200 కిలోవాట్లవరకు పెరిగెను. విద్యుచ్ఛక్తి పొందిన పట్టణములు, గ్రామముల మొత్తముసంఖ్య 205 నుండి 681 వరకు పెరిగెను. విద్యుద్వినియోగము కూడ సగటున మనిషికి ఒక్కరికి 2·5 యూనిట్లునుండి 8 యూనిట్లవరకు పెరిగెను.

తెలంగాణా ప్రాంతము : తెలంగాణాలో విద్యుత్తు సరఫరా మొదట హైదరాబాదు, సికింద్రాబాదులకే ఎక్కువగ పరిమితమై యుండెను. తెలంగాణా ప్రాంతము 1956 లో అప్పటి ఆంధ్రరాష్ట్రములో చేర్చివేయబడి ఆంధ్రప్రదేశ్‌గా రూపొందెను. రెండు పెద్ద పథకములకొరకు నాటి (1953 నకు పూర్వపు) హైదరాబాదు ప్రభుత్వము (1951-56) ప్రణాళికా కాలమున తెలంగాణాలోని నిజామ్ సాగర్ జల విద్యుత్కేంద్రము, రామగుండము థెర్మల్ కేంద్రములకు రు. 272·6 లక్షలు కేటాయించెను. మొదటి ప్రణాళికా కాలములో. పై పథకములకు రు. 236·11 లక్షలు ఖర్చుపెట్టబడెను. నిజాంసాగర్ జలవిద్యుత్కేంద్రము ఒక్కొక్కటి 5,000 కిలోవాట్ల శక్తిగల మూడు యంత్రములతో పనిచేయ నారంభించెను. ఈ ప్రణాళికాకాల మంత మగునాటికి (1956) తెలంగాణాలో 19 గ్రామములకు మాత్రము విద్యుచ్ఛక్తి వసతి లభించెను.

రెండవ పంచవర్ష ప్రణాళిక : ప్రణాళిక ప్రారంభము నాటికే ఆంధ్రప్రదేశ్ (నవంబరు 1956) అవతరించెను. ఈ ప్రణాళికలో విద్యుచ్ఛక్తి పథకములకు కేటాయించబడిన మొత్తము రు. 27·31 కోట్లు; ఇందు ఆంధ్రప్రాంతమునకు రు. 21·66, తెలంగాణాకు రు. 6.15 కోట్లు. విద్యుచ్ఛక్తికి ఉన్న గిరాకీని ఎదుర్కొనుటకు ఈ ధనము చాలమిచే ఇతర విషయములలోని పొదుపు మొత్తములందు కొద్ది మార్పులు చేసి కేటాయింపు మొత్తము రు. 32·31 కోట్లకు హెచ్చు చేసిరి. ఇందు రు. 23·90 ఆంధ్రప్రాంతమునకు, రు. 8.41 తెలంగాణా ప్రాంతమునకు ప్రత్యేకింపబడెను.

ఆంధ్ర ప్రాంతము : 1956-57 లో మచ్‌ఖండ్ జల విద్యుత్కేంద్రమునందు ఒక 17,000 కిలోవాట్ల శక్తిగల మూడవ యంత్రము నెలకొల్పబడెను. 1958-59 లో 21,500 కిలోవాట్ల శక్తిగల నాల్గవ యంత్రముకూడ పని చేయ ప్రారంభించెను. 1959-60 లో అంతే శక్తిగల 5వ, 6వ యంత్రములు పనిచేయుట ప్రారంభించుటతో మచ్‌ఖండ్ పూర్తి విద్యుదుత్పాదక శక్తిగల కేంద్ర మైనది. తుంగభద్రా జలవిద్యుత్పథకముక్రింద ఒక్కొకటి 900 కిలోవాట్ల శక్తిగల నాల్గు యంత్రములు - రెండు ఆనకట్టవద్దను, మరి రెండు హంపి విద్యుత్కేంద్రమునందును నెలకొల్పుటతో మొదటిదశ పని పూర్తియైనది.

1959-60 నాటికి 1,350 గ్రామములకు విద్యుచ్ఛక్తి లభించెను. రెండవ ప్రణాళిక (1956-61) కాలములో మొదట అనుకొన్న 340 గ్రామములకు బదులుగా 1,700 గ్రామములకు విద్యుచ్ఛక్తి లభించునని యూహింప బడుచున్నది. ఇప్పుడు సంవత్సరమునకు 400 గ్రామముల చొప్పున ఆంధ్రప్రదేశమున విద్యుచ్ఛక్తి లభించుచున్నది. రెండవ ప్రణాళికా కాలములో అత్యధికముగా విశాఖపట్టణము లోని కాల్టెక్స్ నూనె శుద్ధి కర్మాగారమునకును; గరివిడి (శ్రీకాకుళముజిల్లా) లోని ఫెర్రో మాంగనీసు కర్మాగారమునకును; నాగార్జునసాగర్ (గుంటూరుజిల్లా) పనులకును విద్యుచ్ఛక్తి సరఫరా చేయబడెను. శ్రీశైలము జల విద్యుత్పథకమును గూర్చిన తొలిపనులు 1960-61లో ప్రారంభమయినవి.

తెలంగాణా ప్రాంతము : రామగుండము థెర్మల్ స్టేషన్‌నందు ఉత్పాదక శక్తి 1957-58 లో 37,500 కిలోవాట్లకు హెచ్చింపబడెను. రెండవ ప్రణాళికా కాలములో ఎక్కువ మొత్తము విద్యుచ్ఛక్తి సిర్పూర్ (ఆదిలాబాదు జిల్లా) కాగితము పరిశ్రమకును, బెల్లంపల్లి (వరంగల్లు జిల్లా) గనులకును అందజేయబడెను. 1959-60 చివరకు మొత్తము 383 గ్రామములకు, పట్టణములకు విద్యుచ్ఛక్తి

సదుపాయములు కలుగజేయబడెను. ఈ సంఖ్య ప్రణాళికలో మొదట అనుకొన్న 77 గ్రామములకు ఐదురెట్లు. తెలంగానాలో సంవత్సరమునకు 100 గ్రామముల చొప్పున విద్యుచ్ఛక్తి లభించుచున్నది.

మూడవ పంచవర్ష ప్రణాళిక (1961 - 66): ఇంత వరకు అనగా ద్వితీయ పంచవర్ష ప్రణాళిక కాలము నాటికి జరిగిన అభివృద్ధి మెచ్చదగినదైనను దానికి గల గిరాకీ లభించుచున్న శక్తికంటెను ఎక్కువగ నున్నది. ఈ శక్తి కొరతను తగ్గించుటకు ఎగువ సీలేరు జల విద్యుత్ప్రణాళిక మొదటి దశ పని ప్రారంభింపబడినది. దీనివలన 1,20,000 కిలోవాట్ల శక్తి లభించును. ఇంకను పారిశ్రామికముగ ఆంధ్రప్రదేశ్ వెనుకబడి యున్నది. చౌకగ చాలినంత విద్యుచ్ఛక్తి లభింపకపోవుటయే ఇందుకు కారణము. ఈ కొరతను తగినంతగ తీర్చుటకు కొన్ని నూతన ప్రణాళిక లనుగూర్చి ప్రభుత్వము ఆలోచించి, అంగీకరించినది. ఇందు నాలుగు పథకములు రెండవ ప్రణాళికలోనే ప్రారంభింప బడినవి.

1. తుంగభద్ర జలవిద్యుచ్ఛక్తి పథకము: ఈ పథకము మొదటి పంచవర్ష ప్రణాళికలోనే ప్రారంభింపబడినది. ఇది ఆంధ్రప్రదేశ్ - మైసూరు రాష్ట్రములు రెండింటిచే ఉమ్మడిగా నిర్వహింప బడుచున్నది. రెండవ ప్రణాళికలో పూర్తికావలసిన ఈ పథకము విదేశీ మారకము లభింపమిచే పూర్తికాలేదు. కావున బకాయి పనిక్రింద మూడవ ప్రణాళికలో దీనికి 35 లక్షల రూపాయలు కేటాయింపబడినవి. ఈ పనులు పూర్తి అయినచో 9,000 కిలోవాట్ల శక్తి అదనముగా లభించును. ఇందు ఆంధ్రప్రదేశ్ వాటా 7,200 కిలోవాట్ల శక్తి.

2. తుంగభద్ర - నెల్లూరు జలవిద్యుత్పథకము: ఈ పథకము క్రింద 9,000 కిలోవాట్ల శక్తిగల మూడు యంత్రముల స్థాపన ఆనకట్టవద్దను, మరొకటి హంపి విద్యుత్కేంద్రము వద్దను జరుగును. దీనిక్రింద నెల్లూరు థెర్మల్ కేంద్రము శక్తి 30,000 కిలోవాట్లకు పెంపుచేయుటకు ప్రయత్నములు జరుగును. రెండవ ప్రణాళికలో విదేశీ మారకము లభింపమిచే ఇది పూర్తియగుట దుర్లభమైనది. దీని కగు ఖర్చు రు. 769·90 లక్షలు. ఐతే మూడవ ప్రణాళికలో దీనికి రు. 619·90 లక్షలు మాత్రమే కేటాయించబడినది.

3. ఎగువ సీలేరు జలవిద్యుత్పథకము - మొదటిదశ: ఆంధ్రప్రదేశ్‌లోని పథకము లన్నింటిలోను ఇది మిగుల చౌకయైనది. దీనికగు ఖర్చు రు. 927 లక్షలు. మచ్‌ఖండ్ విద్యుత్కేంద్రము వదలిపెట్టిన నీటిని ఇది వినియోగించుకొనును. మొదటి దశలో ఇక్కడ ఉత్పత్తి యగు శక్తి 120,000 కిలోవాట్లు. దీని కగు ఖర్చు రు. 608 లక్షలు.

4. తెలంగానా విద్యుచ్ఛక్తి పథకము: ఇందు నిజాం సాగర్ విద్యుత్పథకము, రామగుండము థెర్మల్ పథకము, నగర పునర్నిర్మాణ పథకము కలిసియున్నవి. వీనితోపాటు ఇందలి విద్యుదుత్పాదక కేంద్రములను ఒకదానితో నొకటి కలిపి తెలంగానా ప్రాంతమునందొక విద్యుచ్ఛక్తి వ్యూహము (గ్రిడ్) ను నెలకొల్పవలెనను తలంపుతో ఈ పథకమునందు కొన్ని పారప్రేషక తంతి పంక్తులును, ఉపస్థానములును (సబ్‌స్టేషనులు) ఏర్పాటుచేయుట కుద్దేశింపబడినది. దీనికగు ఖర్చు రు. 18·57 కోట్లు. ఇందు మొదటి ప్రణాళికా కాలమున రు. 6·84 కోట్లు ఖర్చు చేయబడినది. రెండవ ప్రణాళిక అంతమునకు మొత్తము రు. 6 కోట్లు ఖర్చగునని అంచనా. బకాయి పనులకుగాను మూడవ ప్రణాళికలో ఖర్చగు మొత్తము రు. 5·72 కోట్లు.

## నూతన పథకములు

నాగార్జున సాగర్ జల విద్యుత్కేంద్రము: ఈ పథకమునకగు ఖర్చు రు. 49·77 కోట్లు. దీని మూలమున లభించు విద్యుచ్ఛక్తి 4,30,000 కిలోవాట్లు. దీనినుండి రాయలసీమ, తెలంగానా, కోస్తా ప్రాంతపు జిల్లాలకు విద్యుచ్ఛక్తి వలసినంత లభించును. 1965 - 66 లో 50,000 కిలోవాట్ల శక్తిగల రెండు యంత్రములు నాగార్జునసాగర్ పవర్ హౌసువద్ద పనిచేయుట ఆరంభించి నప్పటినుండి ఈ పథకమువలన లాభము చేకూరగలదు.

శ్రీశైలము జల విద్యుత్కేంద్రము: ఈ పథకము నాల్గవ ప్రణాళికా కాలములో పూర్తియగుచు 3 × 110,000 కిలోవాట్ల శక్తిని లభింపజేయును. కృష్ణానది మీద కర్నూలు జిల్లా నందికొట్కూరు తాలూకాలో డాము నిర్మాణము జరుగును. ఇది కూడ రాయలసీమ తెలంగానా, కోస్తా ప్రాంతపు జిల్లాలకు విద్యుత్ లభింపజేయును.

కొత్తగూడెము థెర్మల్ పథకము: దీనికగు ఖర్చు రు. 12·39 కోట్లు. మూడవ ప్రణాళికలో వ్యయపరుప నుద్దేశింపబడిన మొత్తము రు. 954·5 లక్షలు. దీనిమూలమున 1963 - 64 నాటికి 2 × 60,000 కిలోవాట్ల శక్తి లభించును.

రామగుండము థెర్మల్ కేంద్రము - అదనపు యంత్రస్థాపన: 1965 - 66 నాటికి తెలంగానా జలవిద్యుత్ప్రణాళిక క్రింద లభించునని అంచనావేయబడిన 65,000 కిలోవాట్లకు బదులుగ 56,000 కిలోవాట్ల శక్తిమాత్రము లభించును. కావున విద్యుచ్ఛక్తికి పెరుగుచున్న గిరాకీ నెదు

ర్చొనుటకు ఈ పథకము క్రింద రామగుండము థెర్మల్ స్టేషను శక్తి అదనముగా 30,000 కిలోవాట్లకు పెంచబడును. ఇందుకు రు. 1,500 లక్షలు వ్యయమగును. మూడవ ప్రణాళికలో కేటాయించబడిన సొమ్ము రు. 485·5 లక్షలు.

గ్రామీణ విద్యుచ్ఛక్తి పథకము : మూడవ ప్రణాళికా కాలములో గ్రామములకు విద్యుచ్ఛక్తి సరఫరా చేయుటకు ప్రభుత్వముచే రు. 925 లక్షలు కేటాయించబడినది. ఇందువలన విద్యుచ్ఛక్తి 925 గ్రామములకు అదనముగా లభింప గలదు.

ఆంధ్రప్రదేశ్‌ను విద్యుచ్ఛక్తియందు స్వయం సమృద్ధి చేయుటకు ఒక ఉత్తమ పథకము (మాస్టర్ ప్లాన్) తల పెట్టబడినది. ఇందుకుగాను మూడవ ప్రణాళికయందు రు. 50 లక్షలు కేటాయించబడినది.

క్రింది పట్టిక ఆంధ్రప్రదేశ్‌నందు విద్యుచ్ఛక్తి అభివృద్ధి సూచించును:

| వివరములు | మొదటి ప్రణాళిక ఆరంభమున | మొ. ప్రణాళిక అంత్యమునకు (1951 – 56) | రెం. ప్రణాళిక అంత్యమునకు (1956 – 61) | మూ. ప్రణాళిక అంత్యమునకు (1961 – 66) |
|---|---|---|---|---|
| 1. మొత్తము ఉత్పాదకశక్తి (కి. వా.) | 43,100 | 98,900 | 2,28,470 | 6,89,470 |
| 2. సగటు వినియోగము (కి. వా.) | 22,600 | 54,600 | 1,70,000 | 4,89,000 |
| 3. పారప్రేషణ, సరఫరా తీగెల పొడవు (మైళ్ళలో) | 2,900 | 5,700 | 15,850 | 24,000 |
| 4. ఉపయోగించువారి సంఖ్య | 30,300 | 1,49,000 | 2,91,000 | 5,41,000 |
| 5. వ్యావసాయిక వినియోగదార్ల సంఖ్య | 620 | 4,300 | 15,000 | 32,500 |
| 6. విద్యుత్సరఫరాగల పట్టణములు, గ్రామములు | 212 | 700 | 2,800 | 3,725 |
| 7. మొత్తము ఖర్చు (కోట్ల రూ॥లలో) | 5·83 | 38·37 | 70·68 | 136·87 |
| 8. మొత్తము రాబడి సంవత్సరమునకు (కోట్ల రూ॥లలో) | 0·70 | 2·48 | 7·00 | 13·02 |
| 9. మనిషికి సగటు వినియోగము (కి.వా.) | 2·5 | 7·00 | 15·00 | 40·00 |

ఎస్. ఎ. ఖా.



# జిల్లాలు*

## శ్రీకాకుళము జిల్లా

ఉనికి - విస్తీర్ణము : పూర్వపు విశాఖపట్టణము జిల్లాను 1950 లో రెండుగా విభజించగా ఏర్పడిన జిల్లాలలో ఒకటి శ్రీకాకుళము జిల్లా. ఆంధ్రప్రదేశ్‌కు ఉత్తరపు దిక్కున ఈ జిల్లా ఉన్నది. ఉత్తర అక్షాంశము 18° 20′ నుండి ఉ. అ. 19° 10′ వరకు, తూ. రేఖాంశము 83° 5′ నుండి 84° 50′ వరకును ఈ జిల్లా వ్యాపించి ఉన్నది. దీనికి సరిహద్దులుగ తూర్పున బంగాళాఖాతమును, దక్షిణమున విశాఖపట్టణము జిల్లాయును, ఉత్తర పడమరలయందు ఒరిస్సా రాష్ట్రమును కలవు. జిల్లా విస్తీర్ణము 3,901 చ. మైళ్లు.

నైసర్గిక స్వరూపము : పర్వత ప్రదేశములు, మైదానములు అని ఈ జిల్లాను రెండు సహజ భాగములుగ విభజింప వచ్చును. పార్వతీపురము, పాలకొండ, సాలూరు తాలూకాలలోని ఏజన్సీ భాగములున్ను, పాతపట్టణము, సోంపేట తాలూకాలలో కొన్ని భాగములున్ను పర్వత ప్రదేశములుగ ఉన్నవి. తక్కిన జిల్లా యంతయు చాల వరకు మైదానమే. సముద్రతీరమున మాత్రము ఇసుక పర్రలు ఉన్నవి.

నదులు : తీరరేఖకు సమానాంతరముగ ఈశాన్యము నుండి నైరృతికి, జిల్లా లోపలి భాగమున తూర్పు కనుమలు వ్యాపించి ఉన్నవి. జిల్లాలో జలనిర్గమనము కనుమల వైపు నుండి సముద్రమునకు ఉన్నది. నాగావళి, వంశధార అనునవి జిల్లాలో ముఖ్యమైన నదులు. ఒరిస్సా రాష్ట్రమున తూర్పు కనుమలలో జన్మించిన వంశధార, పాతపట్టణము తాలూకా యందు ఈ జిల్లాలో ప్రవేశించి నరసన్నపేట, శ్రీకాకుళము, తాలూకాల మధ్యగా ప్రవహించి కళింగపట్టణము వద్ద సముద్రమున చేరుచున్నది. నాగావళి నదియు ఒరిస్సాలోనే తూర్పు కనుమలలో జన్మించి పార్వతీపురము తాలూకా యందు ఈ జిల్లాలో ప్రవేశించి పార్వతీపురము, పాలకొండ తాలూకాలలోను, చీపురుపల్లి, శ్రీకాకుళము తాలూకాలకు సరిహద్దుగను ప్రవహించి సముద్రమును చేరుచున్నది. ఈ నదినే, దిగువ తాలూకాలలో 'లాంగుల్య' అందురు. బొబ్బిలి తాలూకాలో పుట్టి ప్రవహించు స్వర్ణముఖ నాగావళికి ఉపనదిగా చేరుచున్నది. ఈ నదులు కాక ఇచ్ఛాపురము తాలూకాలో బాహుద; సోంపేట, పాతపట్టణము తాలూకాలలో మహేంద్రతనయ; సాలూరు తాలూకాలో వేగవతి అను చిన్న నదులు ప్రవహించు చున్నవి.

శీతోష్ణస్థితి : జిల్లాయందు ఏప్రిల్ నుండి జూన్ వరకు ఎండ లెక్కువగ కాయును. సోంపేట, ఇచ్ఛాపురము, శ్రీకాకుళము తాలూకాలు సమశీతోష్ణముగ ఉండును. తక్కిన తాలూకాలలో వేసవికాలమున ఎండ లెక్కువగను, శీతాకాలమున చలి ఎక్కువగను ఉండును. దైనిక సరాసరి గరిష్ఠ ఉష్ణోగ్రత 87.3° ఫా. కనిష్ఠ ఉష్ణోగ్రత 73.9° ఫా. సంవత్సరములో అత్యధిక ఉష్ణోగ్రత 101° ఫా. అత్యల్ప ఉష్ణోగ్రత 57° ఫా.

వర్షపాతము : ఈశాన్య, నైరృతి ఋతుపవనముల వలన ఈ జిల్లాలో వర్షము కురియును. సరాసరి సంవత్సరమున వర్షము కురియు రోజులు 70.5. సంవత్సరమునకు సరాసరి వర్షపాతము 44″. తాలూకాల వారీగా చూచినచో సరాసరి వర్షపాతము పాతపట్టణము తాలూకాలో 49.93″ - అన్నిటికన్న ఎక్కువ; నరసన్నపేట తాలూకాలో 39.34″ - అన్నిటికన్న తక్కువ.

అడవులు : జిల్లా మొత్తమున 238.93 చదరపు మైళ్ల విస్తీర్ణము గల అడవి కలదు. ఇందులో ఎక్కువ భాగము పాలకొండ తాలూకాలో కలదు. టెక్కలి తాలూకాలో చెదరుగా ఉన్న అడవులలో వంటచెరకు తప్ప విలువగల జాతి వృక్షములు ఏవియు లేవు. సోంపేట తాలూకాలో కొండల నావరించి ఉన్న అడవులలో ఆకురాల్చు చెట్లు కలవు. పార్వతీపురము, పాలకొండ తాలూకాలలో కూడ ఇట్టివే కలవు. వీనియం దక్కడక్కడ సాల వృక్షములు సైతము కన్పడుచున్నవి. సాలూరు అడవులలో మంచి కలప నిచ్చు వృక్షములు కలవు. బొబ్బిలి అడవులలో కూడ కొంతవరకు మంచి వృక్ష జాతులు కలవు. చీపురుపల్లి తాలూకాలో చెదరు చెదరుగా కొండలపై ఉన్న అడవులలో పొదలు మాత్రమే సాధారణముగ కన్పడును. కొండపై భాగములకు పోయిన కొలది మాత్రము అక్కడక్కడ కొన్ని చెట్లు కనపడును.

ఖనిజ సంపద : చీపురుపల్లి తాలూకాలోని గర్భాం, గరివిడి, పెరిపి, శివరం గ్రామ ప్రాంతములందు మాంగనీసు గనులు కలవు. సాలూరు తాలూకా యందలి దిగువ

* జిల్లా పటములకు "జిల్లాలు" శీర్షిక చివర చూడుడు.

## శ్రీకాకుళము జిల్లా—తాలూకా వివరములు

| వరుస సంఖ్య | తాలూకా పేరు | తాలూకా కేంద్రము | గ్రామముల సంఖ్య | గ్రామీణ జనాభా | *పట్టణములు | పట్టణ జనాభా | విస్తీర్ణము చదరపు మైళ్ళలో | 1958–59 మొత్తము నీటి పారుదల వసతిగల నేల ఎ॥లలో | 1958–59 సాగుచేయబడిన నేల ఎకరములలో | 1958–59 ప్రస్తుతము సాగులో లేని బీడు నేల ఎకరములలో | 1958–59 మొత్తము సాగుకు తగిన నేల ఎ॥లలో | 1958–59 సాగుచేయ వీలగు బంజరు నేల ఎ॥ములలో |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. | బొబ్బిలి | బొబ్బిలి | 237 | 2,39,636 | 1 | 23,102 | 391 | 55,815 | 88,673 | 8,965 | 97,638 | 25,221 |
| 2. | చీపురుపల్లి | చీపురుపల్లి | 293 | 2,54,470 | 1 | 8,135 | 462 | 50,136 | 1,04,904 | 5,754 | 1,10,658 | 3,171 |
| 3. | ఇచ్చాపురము | ఇచ్చాపురము | 48 | 67,371 | 1 | 11,390 | 87 | 14,611 | 37,968 | 99 | 38,067 | 441 |
| 4. | నరసన్నపేట | నరసన్నపేట | 151 | 1,42,071 | 1 | 9,568 | 200 | 50,778 | 95,717 | 3,735 | 99,452 | 5,988 |
| 5. | పాలకొండ | పాలకొండ | 419 | 2,70,141 | 3 | 28,851 | 348 | 1,12,249 | 1,72,573 | 3,725 | 1,76,298 | 6,431 |
| 6. | పార్వతీపురము | పార్వతీపురము | 440 | 1,67,569 | 2 | 24,685 | 296 | 37,579 | 43,508 | 7,402 | 50,910 | 16,776 |
| 7. | పాతపట్టణము | పాతపట్టణము | 439 | 2,03,542 | — | — | 463 | 45,275 | 1,84,484 | 1,895 | 1,86,379 | 85,948 |
| 8. | సాలూరు | సాలూరు | 283 | 1,32,176 | 1 | 24,405 | 422 | 17,532 | 1,28,288 | 2,600 | 1,30,888 | 10,301 |
| 9. | సోంపేట | సోంపేట | 250 | 1,07,375 | 3 | 23,059 | 212 | 36,439 | 67,361 | 7,127 | 74,488 | 894 |
| 10. | శ్రీకాకుళము | శ్రీకాకుళము | 183 | 1,65,177 | 1 | 24,212 | 227 | 75,815 | 89,958 | 4,383 | 94,341 | 14,171 |
| 11. | టెక్కలి | టెక్కలి | 309 | 1,52,819 | 2 | 13,373 | 272 | 50,502 | 60,953 | 22,992 | 83,945 | 25,891 |
| | మొత్తము | — | 3,052 | 19,02,347 | 16 | 1,90,775 | 3,380 | 5,46,731 | 10,74,387 | 68,677 | 11,43,064 | 1,95,228 |

* 5,000కు పైగా జనసంఖ్యగల గ్రామములు పట్టణములుగా పరిగణింపబడినవి.

మేడంగి ఇత్యాది ప్రదేశములందును ఈ గనులు కలవని ఊహతో పరిశోధనలు జరుగుచున్నవి.

ఈ జిల్లా శ్రీకాకుళము, నరసన్నపేట, సోంపేట, పాత పట్నం, ఇచ్ఛాపురము, టెక్కలి, పార్వతీపురము, పాల కొండ, బొబ్బిలి, చీపురుపల్లి, సాలూరు అను పదునొకండు తాలూకాలుగ విభజింపబడి ఉన్నది. జిల్లాలో 3,052 గ్రామములు 16 పట్టణములును గలవు. పార్వతీపురము, పాలకొండ, సాలూరు తాలూకాలలో ఏజన్సీ ప్రదేశము కలదు. కొండ జాతుల వారెక్కువగ ఇందు నివసించు చున్నారు. ఇచ్ఛాపురము, సోంపేట, టెక్కలి, నరసన్న పేట, శ్రీకాకుళము, చీపురుపల్లి తాలూకాలు సముద్రతీర మును ఆనుకొని ఉన్నవి (చూ. తాలూకా వివరములు పుట : 1291).

పట్టణములు : జిల్లాయందలి 16 పట్టణములలో శ్రీకా కుళము, సాలూరు, బొబ్బిలి, పార్వతీపురము అను నాలు గింటికి మాత్రమే మ్యునిసిపాలిటీలు కలవు.

శ్రీకాకుళము : జనసంఖ్య 35,156; జిల్లా కేంద్రము. ఒకప్పుడు విలువైన వస్త్రములకు పేరు పొందినది. పూర్వ మిచట ఒక మిలిటరీ కంటోనుమెంటు కూడ ఉండెడిది.

సాలూరు : జనసంఖ్య 26,103; తాలుకా కేంద్రము.

బొబ్బిలి : జనసంఖ్య 25,582; తాలూకా కేంద్రము.

పార్వతీపురము : జనసంఖ్య 25,420; తాలూకా కేంద్రము.

ప్రజలు : జిల్లా జనసంఖ్య 23,42,291.* ఇందు పురు షులు 11,50,872; స్త్రీలు 11,91,419. జన సాంద్రత చ.మై.నకు 600. గత పది పండ్ల (1951 - 61) లో ఈ జిల్లా యందలి జనసంఖ్య 10.32% వృద్ధి అయినది.

మతములు : హిందువులు 21,04,904; ముస్లిములు 8,894; క్రైస్తవులు 9,210; యూదులు 29; శిక్కులు 13; జైనులు 2; ఇతరలు 24 కలరు (1951).

వృత్తులు : ప్రజలలో అధిక సంఖ్యాకుల వృత్తి వ్యవ సాయము. స్వంతముగ భూమిని సేద్యము చేసికొను రైతులు, కౌలుదారులు, వ్యవసాయ కూలీలు, భూస్వా ములు అను తరగతుల వారందరు వ్యవసాయము వలన జీవించువారే-వీరి యందరి సంఖ్య 16,36,451; వ్యాపారము వలన జీవించువారు 89,339; ఉత్పత్తి చేయు పరిశ్రమలవలన జీవించువారు 2,08,026; ఇతర వృత్తులు 1,89,320 (1951).

భాషలు : జిల్లాలో అత్యధిక సంఖ్యాకుల మాతృభాష తెలుగు. 1951 లెఖ్ఖలనుబట్టి వివిధ మాతృభాషలు కల వారి సంఖ్యా వివరములు దిగువ నీయబడినవి :

* 1961 లెక్కల ప్రకారము.

తెలుగు 18,95,114; ఒరియా 1,13,028; సవర 56,227; ఖండు 23,973; ఉర్దూ 11,935; గదబ 8,483; హిందీ 5,626; తమిళము 1,604; ఎరుకల 615; మలయాళము 387; కోయ 350; జాపానీస్ 220; బర్మీస్ 127; మరాఠీ 120; సౌరాష్ట్ర 115; బెంగాలి 111; గుజరాతి 33; నేపాలి 21; కన్నడ 19; ఇతరులు 15.

వ్యవసాయము : సేద్య రీత్యా నల్లనేల, ఎర్రనేల అని ఈ జిల్లాయందలి నేలను విభజింపవచ్చును. కాని ఈ విభజన నిశ్చితమని చెప్ప వీలులేదు. చాల ప్రదేశములందు నేల కలగలుపుగా ఉండి క్రమేణ మారుచుండును. కొండల వద్ద నేల సాధారణముగ ఎర్రనేలగా ఉండి, క్రమేణ దూరమగు కొలది రంగు మారి, నల్లనేలగ మారును. కొన్ని లోయలలో మాత్రము నల్లమట్టి అతి సారవంత మైనది కలదు. వేసవి కాలములో ఈ నేల బీటలుగ పగులును.

జిల్లా మొత్తమున సాగునకు తగిన భూమి 15,34,727 ఎకరములు. ఇందులో సాగులో ఉన్న భూమి 9,24,864 ఎకరములు. దీనిలో నీటి పారుదల వసతి గల భూమి 5,02,391 ఎకరములు మాత్రము.

జిల్లాలోని నీటి పారుదల వసతులలో ముఖ్యమైనవి నాగావళి, వంశధార, బాహుదా నదులు. పార్వతీపురము తాలూకాలో తోటపల్లి వద్ద నాగావళి నదికి ఒక ఆనకట్ట కట్టబడినది. ఇక్కడనుండి బయలుదేరిన నీటి కాలువల వలన పల్లపుసాగు ఆ ప్రాంతమున జరుగు చున్నది. నాగా వళి నది, దీని ఉపనది స్వర్ణముఖి అను వాని నీటివలన పాలకొండ, శ్రీకాకుళము తాలూకాలలో విస్తార భాగ మును, పార్వతీపురము తాలూకాలోని కొన్ని ప్రదేశము లును సాగగు చున్నవి. వంశధార నది నీరు పాతపట్టణము, శ్రీకాకుళము తాలూకాలలోని కొన్ని ప్రదేశములలో సాగునకు ఉపయోగ పడుచున్నది.

ప్రస్తుతము మంజూరై, అమలు కానున్న వంశధార రిజర్వాయరు స్కీము వలన దాదాపు 30,000 ఎకరము లకు పైగా నీటివసతి ఏర్పడగలదు. ఇచ్ఛాపురము తాలూ కాలో కొంత భాగము బాహుదా నది క్రింద సాగగు చున్నది.

మెట్ట ప్రదేశములలో పల్లపు సాగునకు ఉపయోగించు చెరువులు అనేకములు కలవు. ఇవి చాల వరకు మంచి స్థితిలోనే ఉన్నవి.

శ్రీకాకుళము జిల్లాలో పండు ఆహార ధాన్యపు పంట లలో వరియు, వ్యాపారపు పంటలలో వేరుశనగ, నువ్వు లును ముఖ్యమైనవి.

శ్రీకాకుళము జిల్లా - పంటల వివరములు
1955 - 1956

| | | |
|---|---|---|
| వరి | 5,41,756 | ఎకరములు |
| జొన్న | 13,574 | ,, |
| సజ్జ | 26,513 | ,, |
| మొక్కజొన్న | 1,051 | ,, |
| రాగి | 1,01,256 | ,, |
| కొర్ర | 1,768 | ,, |
| వరిగ | 6,625 | ,, |
| సామ | 9,812 | ,, |
| పెసర | 75,137 | ,, |
| కంది | 5,281 | ,, |
| మినుము | 15,540 | ,, |
| ఉలవలు | 39,850 | ,, |
| ఇతర పప్పు దినుసులు | 41,423 | ,, |
| చెఱకు | 24,487 | ,, |
| ఇతర ఆహార పైరులు | 62,822 | ,, |
| ప్రత్తి | 1,164 | ,, |
| జనుము | 90,180 | ,, |
| ఇతర నార పైరులు | 2,338 | ,, |
| వేరుశనగ | 80,386 | ,, |
| తక్కిన నూనె గింజలు | 50,581 | ,, |
| పొగాకు వగైరా పైరులు | 4,725 | ,, |
| పచ్చి ఎరువు పైరులు | 825 | ,, |
| మేత పైరులు | 242 | ,, |

జిల్లాలో పెక్కు ప్రదేశములలో మామిడి పండ్ల తోటలు కలవు.

వ్యవసాయము పూర్వకాలపు పద్ధతులలోనే సామాన్యముగ జరుగుచున్నది. ఇటీవల వ్యవసాయశాఖవారి ప్రోత్సాహముచే మరనాగళ్లు, బుల్‌డోజర్లు వాడుకలోనికి వచ్చినవి.

ఏజన్సీ ప్రాంతమున కొండ లోయలలో వ్యవసాయమును ప్రోత్సహించుటకు ప్రభుత్వము ప్రత్యేక కృషి చేయుచున్నది.

పశు సంపద: కుదుమట్టముగ నుండి బలిష్ఠము అగు పశుజాతి ఒకటి ఈ జిల్లాలో కలదు. బొబ్బిలి, పార్వతీపురము, టెక్కలి, శ్రీకాకుళములలో పశువైద్య కేంద్రములు కలవు. ఇచ్ఛాపురము, పాలకొండ, నరసన్నపేట, సోంపేట, సాలూరులలో పశువైద్య డిస్పెన్సరీలు కలవు.

గృహ పరిశ్రమలు: గృహ పరిశ్రమలలో చేనేత పరిశ్రమ ముఖ్యమైనది. దీనిని ఆశ్రయించి జిల్లా మొత్తమున 37,038 మంది జీవించుచున్నారు. పుందూరులో తయారగు వస్త్రములు ముఖ్యముగా ఖద్దరు వస్త్రములు చాల ప్రసిద్ధి గాంచినవి.

పరిశ్రమలు: చెప్పుకోతగిన పెద్ద పరిశ్రమ లేవియు అంతగా ఈ జిల్లాలో లేవు. గరివిడి, గర్భాం ప్రాంతముల గల మాంగనీసు గనుల వలన కొంతమంది కార్మికులకు జీవనోపాధి లభ్యమగుచున్నది. నౌపడాలో ఐదు ఉప్పు ఫ్యాక్టరీలు కలవు. బొబ్బిలిలో ఒక పంచదార ఫ్యాక్టరీయు, సీతానగరమున ఒక పంచదార ఫ్యాక్టరీ పనిచేయుచున్నవి. టెక్కలి తాలూకాలో జీడిపప్పుపరిశ్రమ సాగుచున్నది. బొబ్బిలి పట్టణములో నూనె ఫ్యాక్టరీ కలదు.

రోడ్లు: శ్రీకాకుళము జిల్లానుండి పోవు ముఖ్యమైన రోడ్లు విశాఖపట్టణము జిల్లాకు, ఒరిస్సా రాష్ట్రమునకు పోవుచున్నవి. అన్ని విధములగు రోడ్లును కలిపి ఈ జిల్లాలో 1,011 మైళ్ళ నిడివి గలవి కలవు. ఇందులో జాతీయ రహదార్లకును, రాష్ట్రీయ రహదారులకును చెందిన రోడ్డు పొడవు 553 మైళ్లు; జిల్లాలో తగినంతగ రోడ్డు వసతులు లేవు.

రైలు మార్గములు: ఈ జిల్లాలో ఆగ్నేయ రైల్వే (సౌత్ ఈస్టరన్ రైల్వే) వారికి చెందిన 147 మైళ్ల బ్రాడ్ గేజ్, 21 మైళ్ల నేరోగేజ్ రైలు మార్గములు కలవు. మద్రాసు నుండి కలకత్తాకు పోవు బ్రాడ్‌గేజ్ లైను చీపురుపల్లి, శ్రీకాకుళము నరసన్నపేట, టెక్కలి, సోంపేట, ఇచ్ఛాపురము తాలూకాల గుండ పోవుచున్నది. టెక్కలి తాలూకాలోని నౌపడా నుండి బయలుదేరిన నేరోగేజ్ లైను పాతపట్టణము గుండ ఒరిస్సా రాష్ట్రములోని పర్లాకిమిడి, గుణుపూరులకు పోవుచున్నది. విజయనగరము నుండి రాయపూరునకు పోవు బ్రాడ్‌గేజ్ లైను ఈ జిల్లాలో సాలూరు, బొబ్బిలి, పార్వతీపురము తాలూకాల గుండ పోవుచున్నది. సాలూరు పట్టణము రైల్వేలైను మీద లేకున్నను, బొబ్బిలి స్టేషనుకు సంబంధించిన రైల్వే ఔట్ ఏజన్సీ సాలూరులో ఉన్నందున పార్శిళ్లు వగైరా పంపుటకు వసతి కలదు - అటులనే శ్రీకాకుళమున కూడ శ్రీకాకుళము రోడ్డు స్టేషనుకు సంబంధించిన ఔట్ ఏజన్సీ కలదు; ఇచ్చట ప్రయాణీకులకు టిక్కెట్లు సైతము లభించును. నరసన్నపేటకు నాలుగు మైళ్ల దూరమున రైల్వేలైనుపై తిలారు స్టేషను కలదు. పాలకొండ, నరసన్నపేట పట్టణములకు రైల్వే వసతి లేదు.

విద్య: శ్రీకాకుళము జిల్లా యందంతటను, అందును ముఖ్యముగ ఏజన్సీ ప్రాంతములందును విద్యావ్యాప్తి చాల తక్కువ. జిల్లాయందలి అక్షరాస్యత 15.29%; పురుషులలో 2.425%, స్త్రీలలో 6.63% (1961). ఇటీవలి ప్రభుత్వ యాజమాన్యమున అమలు జరుగుచున్న అభివృద్ధి పథకములు విద్యాభివృద్ధికి ప్రోత్సాహము కలిగించుచున్నవి.

జిల్లాయందలి వివిధ వర్గముల విద్యా సంస్థల సంఖ్యా వివరములు దిగువ ఈయబడినవి (1956 - 57):

| విద్యాసంస్థల వివరము | సంఖ్య | ఉపాధ్యాయులు | విద్యార్థులు |
|---|---|---|---|
| ప్రాథమిక పాఠశాలలు | 2,295 | 5,833 | 1,94,622 |
| మాధ్యమిక పాఠశాలలు | 9 | 73 | 1,067 |
| ఉన్నత పాఠశాలలు | 45 | 821 | 16,525 |
| వయోజన విద్యాకేంద్రములు | 159 | 222 | 3,996 |
| ప్రత్యేక వృత్తిబోధక పాఠశాలలు | 8 | 31 | 559 |
| | 2,516 | 6,980 | 2,16,769 |

ఇవికాక శ్రీకాకుళములో 362 మంది విద్యార్థులకు వసతిగల ఆర్ట్స్ అండ్ సైన్సు కళాశాల రాష్ట్రప్రభుత్వముచే నిర్వహింపబడుచున్నది.

ఆరోగ్యము, వైద్యము: ఈ జిల్లాలో కొంతవరకు విరివిగ ఉన్న బోదకాళ్ల జ్వరమును నిర్మూలించుటకై ప్రభుత్వము విశేషముగ కృషి చేయుచున్నది. దీనికై ప్రత్యేకముగ ఒక హెల్తు ఆఫీసరు కలడు. వైద్య సహాయమునకై ప్రభుత్వము వారిచే నడుపబడు ఆసుపత్రులు పెక్కు ప్రదేశములలో కలవు.

ఈ జిల్లాలో ఆధునిక వైద్య చికిత్సాలయములు 8 ఉన్నవి. ఇందు రాష్ట్రప్రభుత్వ ఆధ్వర్యమున 4, లోకల్ ఫండు ఆసుపత్రులు 3, ప్రైవేటు ఆసుపత్రి 1, వీని యందు మొత్తము 148 మంచములు ఉన్నవి. జిల్లా అంతటా 19 డిస్పెన్సరీలు ఉన్నవి. జిల్లా కేంద్ర ఆసుపత్రిలో ఎక్సురే వసతికలదు. ఇవిగాక ఆయుర్వేదడిస్పెన్సరీలు 21 ఉన్నవి. సాలూరులో కుష్ఠురోగ చికిత్సకై ప్రత్యేక ఆసుపత్రి ఒకటి కలదు.

చూడదగిన స్థలములు: బౌద్ధ జైన కేంద్రముల శిథిలములు అనేకములు ఈ జిల్లాలో కనపడు చున్నవి. శ్రీకాకుళము తాలూకా లోని శాలిహుండము ఒకప్పుడొక గొప్ప బౌద్ధక్షేత్రము. నేటికిని అక్కడక్కడ శిథిల స్థూప చిహ్నములీ ప్రదేశమున కన్పట్టుచున్నవి.

ఈ జిల్లాయందు శ్రీకూర్మము, అరసవిల్లి అను పుణ్య క్షేత్రములు రెండు కలవు:

శ్రీకూర్మము: శ్రీకాకుళమునకు ఆగ్నేయమున ఆరు మైళ్ల దూరమున తూర్పుసముద్రపు తీరమున 'శ్రీ కూర్మ' మను పుణ్యక్షేత్రము కలదు. ఇందొక ఆలయము, పుష్కరిణియు కలవు. ఈ పుష్కరిణినే శ్వేతకుండ మనియు వ్యవహరింతురు. ఆలయమందు వెలసి ఉన్న కూర్మనాథస్వామి స్వయం వ్యక్తమూర్తి అనియు, స్వామి కంఠమున దీపించెడు గొప్ప సాలగ్రామ మాలికతోసహా శ్రీ మహావిష్ణువు కూర్మాకృతిని గొనెననియు భక్తుల విశ్వాసము.

ఇచట లభించు దాన శాసనములలో నెల్ల అత్యంత ప్రాచీనమైనది క్రీస్తు శకము పదునొకండవ శతాబ్దికి చెందిన ఒక శాసనము. కావున పదునొకండవ శతాబ్ది నాటికే శ్రీకూర్మ క్షేత్రము కొంత ప్రఖ్యాతి నార్జించిన దని ఊహింపనగును.

ఈ ఆలయపు నిర్మాణపు తీరును, శిల్ప వైఖరియు చక్కగ కుదిరి ఉండుటచే 'కుదురునకు కూర్మము' అను సామెత ఆ ప్రాంతమున వాడుకలోనికి వచ్చినది. క్రీ. శ. పదునారవ శతాబ్దియందు శ్రీకృష్ణ చైతన్యుడు ఈ క్షేత్రమును దర్శించెనని ఒక ఐతిహ్యము కలదు. ప్రతి వత్సరము చైత్రమాసమున జరుగు డోలోత్సవమున వేలకొలదిగ యాత్రికులు పాల్గొనుచు నుందురు.

అరసవిల్లి: శ్రీకాకుళమునకు ఉత్తరముగ ఒకటిన్నర మైలు దూరమున ఉన్న ఒక పుణ్యక్షేత్రము 'అరసవిల్లి'. ఇచ్చట సూర్యభగవానుని దేవాలయము కలదు. ప్రతి ఆదివారము రోజునను కొన్ని ప్రత్యేక దినములందును ఇచట ఉత్సవములు జరుగును.

జిల్లా సంక్షిప్త చరిత్ర: ఈ జిల్లాకు సంబంధించిన ప్రాంతము క్రీ. పూ. 600 కు పూర్వమున నుండియు మానవావాసమై ఉన్నటుల నిదర్శనములు కాన్పించు చున్నవి. గంగానదీ ముఖద్వారము వరకు గల రాష్ట్రము క్రమముగ ఉత్తరమున నుండి ఓఢ్ర, ఉత్కళ, కళింగములను మూడు దేశములుగ తొలుత వ్యవహరింప బడుచుండెడి దని తెలియ వచ్చు చున్నది. అందు దక్షిణమున ఉన్న కళింగమున శ్రీకాకుళము జిల్లా ఒక భాగము. కళింగమను ఈ రాష్ట్రమునకు చెంది నేటి శ్రీకాకుళము జిల్లాలో ఉన్న కళింగపట్టణము బౌద్ధ జాతకముల కాలముననే సుప్రసిద్ధమగు రేవు పట్టణమై ఉండెననియు, ఇచట నుండి వ్యాపార నౌకలు సింహళమునకును, ప్రాచ్యద్వీపములకును పోవు చుండెడివనియు తెలియవచ్చు చున్నది. ఆ యుగమున చైనా వ్యాపారులు భారతీయ వర్తకులను నావికులను క్లింగ్ (కళింగ్)లు అని వాడుటకు కారణము ఇదియే అనియు కొందరు విశ్వసించు చున్నారు. ఆనాడిట కొన్ని రాజవంశములు పరిపాలించినవనియు ఊహింప అవకాశము కలదు (చూ. తెలుగు సంస్కృతి - ౧; పుట 248).

అశోకునిచే జయింపబడి, మౌర్య రాజ్యాంతర్భాగముగ నుండిన ఈ కళింగము అశోకుని తరువాత స్వతంత్రమయ్యెను. ఆ తరువాత క్రీస్తు శకారంభము వరకు పరి

పాలించిన రాజవంశములలో 'చేతి వంశము' ప్రముఖము. ఈ వంశమునకు చెందిన ఖారవేలుడు మగధ రాజ్యమును, దక్షిణాపథమును జయించి కీర్తి పొందెను. ఈ వంశీయుల కాలమున జైన మత మిట విస్తరించెను. క్రీస్తు తరువాత మొదటి రెండు శతాబ్దములలో ఈ ప్రాంతమును పాలించిన రాజుల గురించి ఏ విషయము తెలియవచ్చుట లేదు. అచట దొరకు నాణెములను బట్టి ఆ ప్రాంతమును అపుడు కొందరు యవనులు పరిపాలించిరని కొందరందురు. ఈ యవనులను వారు గ్రెకో - పార్థియనులో కుషానులో అయి ఉందురనియు, ఇట్టి యవనులు సముద్ర మార్గమున ఇచ్చటకు వచ్చి రాజ్యమును స్థాపించిరని స్థానిక ప్రవాదమును కలదని వీరనెదరు. కాని, ఆ నాణెములు వ్యాపార వశమున అటకు చేరినవియే కాని, అట్టి రాజవంశము లేమియు పాలించి ఉండలేదనియు, అప్పటి రాజవంశముల గుర్తెరుగుటకు పరిశోధన ఇంకను సాగవలసి ఉన్నదని మరి కొందరు చరిత్ర రచయితల అభిప్రాయము. ఏది ఎటులున్నను, క్రీ. శ. నాలుగవ శతాబ్ది అంతమున సముద్రగుప్తుడు దిగ్విజయ యాత్రకై కళింగమును చేరునప్పటికి ఆ దేశము అల్పరాజ్యములుగ విభక్తమై, శ్రీకాకుళ ప్రాంతము పిరండపల్లి పాలకుల వశమున ఉండెను. ఈ పిరండపల్లియే నేటి శ్రీకాకుళము జిల్లా యందలి ఆముదాలవలస అని కొందరూహించుచున్నారు. సముద్రగుప్తుని దండయాత్ర తరువాత కళింగము యథాపూర్వముగ చిన్న చిన్న రాజ్యములుగ చీలెను. శ్రీకాకుళమునకు సమీపమున ఉన్న సింహపురము (నేటి సింగుపురము) రాజధాని. ఒక రాజ వంశము క్రీ. శ. నాలుగవ శతాబ్ది చివరపాదమునను, అయిదవ శతాబ్దము పూర్వార్థమునను ఈ ప్రాంతమును పాలించెను. అయిదవ శతాబ్ద చరమ భాగమున గాంగులను రాజవంశీయులు శ్రీకాకుళముజిల్లా యందొక రాజ్యమును స్థాపించి క్రమముగ దానిని విస్తరింపచేసి, కళింగమున కంతటికి ప్రభువులైరి. వీరి ముఖ్యనగరము కళింగపురము. ఈ జిల్లాలోని ముఖలింగమే ఆ కళింగ నగరమని కొందరి ఊహ. ఈ వంశీయులు క్రీ. శ. 1038 వరకు పాలించిరి. ఆ తరువాత గాంగ వంశమునకు చెందిన వేరొక కోవవారు క్రీ. శ. 1434 వరకు పాలించిరి. రెడ్డి రాజులు మొదలగు వారి దండయాత్రల ఫలితముగ వీరి ప్రతిభ సన్నగిలెను. అంతట ఆ శిథిలావశేషములపై నూతన కళింగ రాజ్యమును స్థాపించినవాడు సూర్యవంశీయుడగు కపిలేశ్వర గజపతి. ఈ వంశీయుల పాలనలో ఈ ప్రాంతము సువ్యవస్థిత మయ్యెను. ఈ కాలముననే శ్రీకాకుళము జిల్లా యందలి సవర లనేకులు మైదానమును వదలి, పర్వత ప్రాంతములకు పోయిరి. ఆనాటి సాంఘిక పరిస్థితులే అందులకు కారణమై ఉండును. క్రీ. శ. 1571 లో కులీకుతుబ్‌షా గజపతులను జయించి ఇతర ప్రాంతములతో పాటుగ చికాకోల్ (శ్రీకాకుళము) సర్కారును వశపరచుకొనెను. కుతుబ్‌షాహీల కాలమున శ్రీకాకుళమున పాలకుడుగ పనిచేసిన షేర్ మహమ్మద్‌ఖాను అచట ప్రప్రథమముగ మశీదును కట్టించెను. తరువాత గోల్కొండ రాజ్యముతో ఇదియు మొగలులకు వశమై, వారి ప్రతినిధులుగ అధికారమును గ్రహించిన నైజాము ప్రభువుల వశమయ్యెను. నైజాము వలన 1753 లో ఫ్రెంచి వారి కొసగబడిన ఉత్తర సర్కారులలో ఈ చికాకోల్ సర్కారు ఒకటి. అప్పుడిచట పన్నుల వసూళ్లు సరిగ జరుగక పోవుటచే ఫ్రెంచి సేనాని అగు బుస్సీ స్వయముగ ఈ ప్రాంతమునకు వచ్చెను. అప్పుడు విజయనగర రాజుల బోధనలకు బుస్సీ చెవియొగ్గి, బొబ్బిలి కోటపై దండెత్తుటయు, బొబ్బిలి వెలమ వీరులు ధైర్యముతో పోరాడి వీర మరణ మొందుటయు తెలుగు దేశమున బహుళ ప్రచారము కల ఉదంతము.

తరువాత ఫ్రెంచి వారిని పరాజితుల గావించిన ఆంగ్లేయులకు ఈ ఉత్తరసర్కారులు 1759 లో నైజాముచే ఈయబడుటచే ఈ ప్రాంతము ఆంగ్లేయుల అధీనమున చేరెను (చూ. తెలుగు సంస్కృతి - ౧, పుటలు 433, 434). 1789 నుండి 1792 వరకు ఈ జిల్లా విపరీతమగు కరవు బాధకు లోనయ్యెను.

ముస్లిము పరిపాలనా యుగమున చికాకోల్ సర్కారు ఇచ్ఛాపురం, చికాకోల్, కశింకోట అను మూడు భాగములుగ ఉండెడిది. ఇందులో మొదటి రెండును గంజాం జిల్లా యందును, మూడవది విశాఖపట్టణము జిల్లాయందును బ్రిటిషు పాలకులచే కలుప బడినది. 1936 లో ఒరిస్సా రాష్ట్రనిర్మాణము జరిగినపుడు గంజాం జిల్లాయందలి దక్షిణపు భాగమును విశాఖపట్టణము జిల్లాయందలి ఉత్తర భాగముతో కలిపిరి. తరువాత విశాఖపట్టణము జిల్లా నుండి విడివడి (1950) నేటి శ్రీకాకుళముజిల్లా రూపొందింపబడినది.

ఈ జిల్లాయందు తొలుత జమీందారీ ప్రాంతము విస్తారముగ ఉండెడిది. పెద్దవి యగు బొబ్బిలి, విజయనగరము; పర్లాకిమిడి జమీందారీలకు చెందిన గ్రామములే కాక, మందసా మొదలగు చిన్నజమీందారీల గ్రామములును ఉండెడివి. కాని భూస్వామ్య విధానమున వచ్చిన మార్పులను అనుసరించి ఇవి అన్నియును రద్దయి నేడు జిల్లా యంతటను రైతువారీ వ్యవస్థయే అమలులో ఉన్నది. చీ. శే. రా.

# విశాఖపట్టణము జిల్లా

**ఉనికి - విస్తీర్ణము :** పూర్వపు విశాఖపట్టణము జిల్లాను 1950 లో శ్రీకాకుళము, విశాఖపట్టణము అని రెండు జిల్లాలుగ విభజించుటచే నేటి విశాఖపట్టణముజిల్లా ఏర్పడినది. ఈ జిల్లా తూర్పు తీరమున ఉ. అక్షాంశము 17° 10′ నుండి 18° 25′ వరకును, తూర్పు రేఖాంశము 81° 50′ నుండి 83° 55′ వరకును విస్తరించి ఉన్నది. దీనికి సరిహద్దులుగ తూర్పున బంగాళాఖాతము, దక్షిణమున బంగాళాఖాతము, తూర్పు గోదావరి జిల్లా, పడమర ఒరిస్సా రాష్ట్రము, ఉత్తరమున శ్రీకాకుళముజిల్లా, ఒరిస్సారాష్ట్రములును కలవు. జిల్లా విస్తీర్ణము 5,179 చ. మైళ్ళు.

లోయలుకూడ కలవు. తీరమున చవిటి పఱ్ఱలు, రొంపి మడుగులు ఉన్నవి.

నదులు : గూడెము తాలూకాలోని మాడుగుల కొండలలో పుట్టిన మచ్ ఖండ్ నది ఉత్తరపు దిశగ ప్రవహించిన తరువాత పడమరకు తిరిగి ఒరిస్సా రాష్ట్రములోనికి పోవుచున్నది. డుడుమా అను ప్రదేశమువద్ద ఈ నదికి ఒక జలపాతము కలదు. జల విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేయుటకై ఈ జలపాతము నాధారముగ మచ్ ఖండ్ జలవిద్యుత్ప్రణాళిక అమలు జరుగుచున్నది (1961). గోస్తని అని పిలువబడు చంపావతి గాలి కొండలలో పుట్టి శృంగవరపుకోట, విజయ

విశాఖపట్టణము జిల్లా - తాలూకా వివరములు

| వరుస సంఖ్య | తాలూకా పేరు | తాలూకా కేంద్రము | విస్తీర్ణం చ. మై. లో | మొత్తము నీటి పారుదల వసతి గల నేలవిస్తీర్ణం ఎ॥లలో | సాగుచేయ బడిన నేల (1959) ఎ॥లలో | ప్రస్తుతం సాగులోలేని నేల (1959) ఎ॥లలో | మొ॥ సాగుకు లాయఖు అగు నేల (1959) ఎ॥లలో | సాగుచేయ వీలగు నేల ఎ॥లలో |
|---|---|---|---|---|---|---|---|---|
| 1. | అనకాపల్లి | అనకాపల్లి | 304 | 44,277 | 1,04,471 | 1,432 | 1,05,903 | 11,893 |
| 2. | భీమునిపట్టణము | భీమునిపట్టణము | 337 | 40,873 | 1,20,913 | 1,244 | 1,72,157 | 9,488 |
| 3. | నర్సీపట్టణము | నర్సీపట్టణము | 516 | 52,535 | 1,24,635 | 3,404 | 1,28,039 | 3,600 |
| 4. | గూడెము | చింతపల్లి | 1,869 | 2,432 | 15,812 | 1,802 | 17,624 | 5,458 |
| 5. | సర్వసిద్ధి | ఎలమంచిలి | 347 | 77,239 | 1,47,996 | 881 | 1,48,877 | 12,639 |
| 6. | శృంగవరపుకోట | శృంగవరపుకోట | 657 | 59,425 | 1,11,050 | 9,900 | 1,20,950 | 10,445 |
| 7. | వీరవల్లి | చోడవరము | 594 | 63,362 | 1,49,855 | 27,597 | 1,77,452 | 18,208 |
| 8. | విశాఖపట్టణము | విశాఖపట్టణము | 196 | 10,427 | 27,851 | 4,467 | 32,318 | 7,772 |
| 9. | విజయనగరము | విజయనగరము | 359 | 57,055 | 1,35,352 | 597 | 1,35,950 | 4,946 |

నైసర్గిక స్వరూపము: ఏజన్సీ, మైదానము అని ఈ జిల్లా రెండు భాగములుగ విభక్తమగుచున్నది. తీరమునకు సమానాంతరముగ జిల్లా లోపలివైపున, ఈశాన్యమునుండి నైరృతికి తూర్పుకనుమలు పోవుచు ఏజన్సీ ప్రాంతమును ఆవరించి ఉన్నవి. గూడెం తాలూకాయును, నర్సీపట్నం, శృంగవరపుకోట, వీరవల్లి తాలూకాలలో కొంత భాగమును ఈ ఏజన్సీయందు కలవు. తక్కిన జిల్లా యంతయు మైదానముగ ఉన్నది. ఈ జిల్లాలో తూర్పు కనుమలు సరాసరిన 3,000′ ఎత్తున ఉన్నవి. అక్కడక్కడ వీటిలో 4,000′ లకు మించిన ఎత్తుగల కొండలు కూడ కలవు. శృంగవరపుకోట తాలూకాలోని సింకరం కొండ ఎత్తు 5,300′. దిగువ మైదానమునకును, ఈ పెద్ద కొండకును మధ్య ఉన్న ప్రదేశమున చిన్న కొండలు, గుట్టలు కలవు. వీనిలో దుర్గమములగు

నగరము, భీమునిపట్టణము తాలూకాల గుండ ప్రవహించి కోనాడ ఉప్పు ఫ్యాక్టరీవద్ద సముద్రములో కలియుచున్నది. మాడుగుల కొండలలో జన్మించిన శారదానది వీరవల్లి, అనకాపల్లి, సర్వసిద్ధి తాలూకాలలో ప్రవహించి వాతాడ వద్ద సముద్రమున చేరుచున్నది. గాలికొండలలో పుట్టిన వరాహనది నర్సీపట్టణము, సర్వసిద్ధి తాలూకాలలో ప్రవహించి వాతాడ వద్దనే సముద్రమున చేరుచున్నది. ఇవికాక విశాఖపట్టణము తాలూకాలో మేఘాద్రిగెడ్డ అను నదియు, నర్సిపట్టణము తాలూకాలో సరుగుడు గెడ్డ, తాండవ నదులున్ను ప్రవహించుచున్నవి.

శీతోష్ణస్థితి : ఏప్రిల్, మే, జూన్ మాసములలో ఎండ లెక్కువగ కాయును. పర్వత ప్రదేశములు మైదానమునకన్న ఎక్కువ చల్లగ ఉండును. వేసవికాలమున దూర

చిత్రము 1. విశాఖపట్టణము నౌకాశ్రయము



చిత్రము 2. కాల్టెక్సు నూనె శుద్ధి కర్మాగారము, విశాఖపట్టణము



చిత్రము 3. వరాహ నరసింహస్వామి దేవాలయము, సింహాచలము



చిత్రము 1. దుడుమా జలపాతము



చిత్రము 2. మత్స్యకుండము (మచ్ ఖండ్) జలవిద్యుత్కేంద్రము - ముందుభాగము

ప్రదేశములనుండి పెక్కుమంది చల్లదనమునకై వాత్తేరున వచ్చి బసచేయుదురు. సంవత్సరము మొత్తముమీద సరాసరి దైనిక గరిష్ఠ ఉష్ణోగ్రత 86.9° ఫా., కనిష్ఠ ఉష్ణోగ్రత 75.5° ఫా.; సంవత్సరమున గరిష్ఠ ఉష్ణోగ్రత 111° ఫా., కనిష్ఠ ఉష్ణోగ్రత 58° ఫా.

నైరృతి, ఈశాన్య ఋతుపవనముల వలన వర్షము విశాఖపట్టణము జిల్లాలో కురియును. నైరృతి ఋతుపవనముల వలన లభించు వర్షము ఎక్కువ భాగము ఏజన్సీ ప్రదేశములలో కురియును. సరాసరి సంవత్సరమున వర్షము కురియు రోజులు 65.4". సరాసరి సంవత్సరమునకు వర్షపాతము 40.14"; తాలూకా లన్నిటిలో శృంగవరపుకోట తాలూకాలో వర్షపాతము (45.38") ఎక్కువ. సర్వసిద్ధి తాలూకాలో వర్షపాతము (34.91") అన్నింటిలో తక్కువ.

అడవులు : జిల్లాలో 763.14 చ. మైళ్ళ విస్తీర్ణము కల అడవి కలదు. ఇందులో మూడవవంతునకు పైగా గూడెము తాలూకాలోనే కలదు. ఇచ్చట అడవిలో కలప, వెదురు విస్తారముగ ఉన్నవి. నర్సీపట్నం తాలూకాలోని అడవియు కూడ ఇట్టిదే. తక్కిన తాలూకాలలోని అడవులలో పొద లెక్కువ; వంటచెరకుకు పనికివచ్చు కంప మాత్రమే పెరుగుచున్నది.

పట్టణములు ; పట్టణములలో విశాఖపట్టణము, విజయనగరము, అనకాపల్లి, భీమునిపట్టణము అను వానికి మాత్రమే మునిసిపాలిటీలు కలవు.

విశాఖపట్టణము: జనసంఖ్య 1,81,683; జిల్లా కేంద్రము.

విజయనగరము : జనసంఖ్య 76,903.

అనకాపల్లి : జనసంఖ్య 46,408 ; బెల్లమునకు ప్రసిద్ధి.

భీముని పట్టణము : జనసంఖ్య 9,871 ; రేవుపట్టణము; పూర్వపు డచ్చి కంపెనీ కట్టడముల శిథిలములు కలవు.

ప్రజలు : జిల్లా జనసంఖ్య* 22,88,976. పురుషులు 11,41,752 ; స్త్రీలు 11,47,224. జనసాంద్రత చ. మై॥నకు 440. 1951-61 మధ్య పది ఏండ్లలో ఈ జిల్లాయందు జనసంఖ్య 10.43% వృద్ధియైనది.

మతములు : 1951 లెక్కల ప్రకారము మతములవారీగా ఈ జిల్లా యందలి సంఖ్యా వివరములు దిగువ రీతిగ ఉన్నవి : హిందువులు 20,35,739 ; మహమ్మదీయులు 26,626 ; క్రైస్తవులు 10,095 ; శిక్కులు 110 ; జైనులు 103 ; యూదులు 19 ; ఇతరులు 6.

వృత్తులు : జిల్లా ప్రజలలో నాలుగింట మూడు వంతులు వ్యవసాయమువలన జీవించుచున్నారు. స్వతంత్రముగ సేద్యము చేయువారు, కౌలుదారులు, వ్యవసాయ కార్మికులు, భూస్వాములు అను తరగతుల వారందరు వ్యవసాయాధారముననే జీవించుచున్నారు. వీరందరి జనసంఖ్య 14,67,120. వస్తూత్పత్తిచేయు పరిశ్రమవలన జీవించువారు 2,47,872; వ్యాపారమువలన జీవించువారు 84,677 ; ఇతర ఉద్యోగములవలన జీవించువారు 2,73,029 (1951).

భాష : జిల్లాలో అధిక సంఖ్యాకుల మాతృభాష తెలుగు. 1951 లెక్కల ననుసరించి వివిధ మాతృభాషలు కలవారి సంఖ్యా వివరములు క్రింది విధముగ ఉన్నవి :

తెలుగు 19,91,689 ; ఒరియా 40,050 ; గదబ 12,886 ; ఉర్దూ 12,803 ; భోరండు 5,340 ; కోయ 1,351 ; హిందీ 2,602; తమిళము 1,727 ; మళయాళము 991; పంజాబి 582 ; మరాఠీ 533 ; గుజరాతి 483 ; కన్నడ 384 ; బెంగాలీ 367 ; ఎరుకుల 322 ; ఇంగ్లీషు 260 ; సింధి 123 ; మార్వారి 58 ; పార్సీ 35 ; సౌరాష్ట్ర 35 ; నేపాలీ 27 ; ఇతరులు 50.

వ్యవసాయము : సేద్యరీత్యా జిల్లాలోని నేలను నల్లనేల, ఎర్రనేల అని రెండు రకములుగ విభజింపవచ్చును. ఈ విభజన నిర్దిష్టమైనదని చెప్పవీలులేదు. అనేక ప్రదేశములు కలగలుపుగ ఉండి క్రమేణ ఒక రకపు నేల మరొకరకమునకు మారుచుండును. కొండలవద్ద ఎర్రనేల విస్తారముగ ఉండును. కాని క్రమేణ తీరమువైపునకు పోవుకొలది నాణ్య మెక్కువై, కొన్ని లోయలలో నల్లరేగడగ పరిణమించుచున్నది. ఈ నల్లరేగడ చాల సారవంతమైనది. వేసవికాలమున ఈ నేల బీటలు వారును.

జిల్లాలో సాగునకు అనుకూలమగు నేల 8,74,470 ఎకరములు కలదు. ఇందు సాగులో ఉన్న భూమి 7,84,457 ఎకరములు. సాగగు నేలలో నీటి పారుదల సౌకర్యము గల నేల 3,53,488 ఎకరములు.

పెద్ద నీటి పారుదల వసతు లేవియు ఈ జిల్లాలో లేవు. ఏటి కాలువలు, చెరువులక్రింద పల్లపుసాగు జరుగుచున్నది. తాలూకాలవారీగా వాని వివరములీ దిగువ నీయబడినవి.

గూడెం తాలూకా : ఈ తాలూకా కొండలమయము. సాధ్యమైనంతవరకు వర్షాధారపు చెరువుల, వాగుల సాయమున సేద్యము జరుగుచున్నది.

శృంగవరపుకోట తాలూకా : గోస్తనీ నది కాలువలును, వర్షాధారపు చెరువులును నీటిపారుదలకు ఆధారములు.

వీరవల్లి తాలూకా : శారదానది కాలువలును, చెరువులును నీటిపారుదల కాధారములు.

నర్సీపట్టణము తాలూకా : చెరువులు మాత్రమే ఆధారము.

* 1961 జనాభా లెక్కల ప్రకారము.

విజయనగరము తాలూకా : చంపావతీ నదికి నెల్లిమర్ల వద్ద ఆనకట్ట కట్టుటచే, దానిక్రింద కొంత భూమికి నీటి పారుదల జరుగుచున్నది. తక్కిన భూములకు చెరువులే ఆధారము.

భీమునిపట్టణము తాలూకా : గోస్తనీనది కిపుడు కట్టిన ఆనకట్టచే 1,068 ఎకరములకు నీటివసతి కలుగును. గోస్తనీ, చంపావతీ నదులనుండి వచ్చు కాలువలచే ఇంకను కొంత భూమి సాగగుచున్నది; పంట చెరువులు కలవు.

విశాఖపట్టణము తాలూకా : చెరువులే ఆధారము.

అనకాపల్లి తాలూకా : శారదానదికి కట్టిన ఆనకట్టల వలన నింపబడు చెరువులును, ఏటి కాలువలును సాగునకాధారములు.

సర్వసిద్ధి తాలూకా: వరాహ, శారదా నదుల నుండి సహజముగ తీయబడిన ఏటి కాలువలు ముఖ్యమైన జలాధారములు.

వీరవల్లి, భీమునిపట్టణము, అనకాపల్లి తాలూకాలలో పల్లపు సాగు ఎక్కువ.

ఏజన్సీ ప్రాంతములలో వ్యవసాయమును ప్రోత్సహించుటకై, అరకుకాలనీ అనునది ప్రభుత్వపు ఆదరణమున స్థాపింపబడినది.

ఈ జిల్లాలో ఆహారధాన్యములలో వరి, సజ్జయును; పప్పు ధాన్యములలో ఉలవలు, పెసలును; వాణిజ్య పంటలలో వేరుశనగ, చెఱకు, నూవులును ఎక్కువగ పండింపబడుచున్నవి.

విశాఖపట్టణము జిల్లా - పంటల వివరములు
1955 - 56

| | | |
|---|---|---|
| వరి | 2,81,580 | ఎకరములు |
| జొన్న | 33,353 | ,, |
| సజ్జ | 1,30,302 | ,, |
| మొక్కజొన్న | 593 | ,, |
| రాగి | 82,992 | ,, |
| కొఱ్ఱ | 12,187 | ,, |
| వరిగ | 5,077 | ,, |
| సామ | 10,925 | ,, |
| పెసర | 36,939 | ,, |
| కంది | 6,565 | ,, |
| మినుము | 10,888 | ,, |
| ఉలవ | 52,562 | ,, |
| చెఱకు | 21,677 | ,, |
| తక్కిన ఆహారపు పంటలు | 46,745 | ,, |
| ప్రత్తి | 2,480 | ,, |
| తక్కిన నార పంటలు | 12,112 | ,, |
| వేరుశెనగ | 79,397 | ,, |
| తక్కిన నూనె గింజలు | 76,483 | ఎకరములు |
| పొగాకు | 6,098 | ,, |
| పచ్చి ఎరువు పైరులు | 3,202 | ,, |
| తక్కిన చిల్లర పైరులు | 15,568 | ,, |

అనకాపల్లిలో ప్రభుత్వ వ్యవసాయ పరిశోధనా కేంద్రము కలదు. ముఖ్యముగ పంచదార చెఱకునకు సంబంధించిన పరిశోధనలు, వరి వంగడములకు సంబంధించిన పరిశోధనలు ఇక్కడ జరుగుచున్నవి. ఇచ్చట ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ చెఱకు ప్రవీణుడు కలడు.

పశు సంపద : శ్రేష్ఠమైన వంగడపు పశువు లీ జిల్లాలో లేవు. కురుమట్టముగ నుండి బలముగ నుండు కొన్ని రకము లీ జిల్లాలో సహజముగ కలవు. శ్రేష్ఠమైన వంగడపు పశువులను సాధారణముగ మధ్యప్రదేశ్, నెల్లూరుల నుండి దిగుమతి చేసికొందురు. ఈ జిల్లా అడవులలో కొన్ని ప్రాంతములు పశువుల మేతకై ప్రత్యేకింపబడి ఉన్నవి.

విశాఖపట్టణము సమీపమున హనుమంతవాక వద్ద ఉన్న మిలిటరీ డైరీ ఫారమును పశువైద్యశాఖవారు 1948 లో స్వాధీనపరచుకొని అప్పటినుండి అభివృద్ధిచేసి నడుపుచున్నారు. ఈ ఫారం విస్తీర్ణం 165 ఎకరములు. ఇందు ముర్రా, జఫరాబాడీ రకములకు చెందిన పాడి గేదెలు 500 కలవు. ఇక్కడ పెరిగిన మంచి పెయ్యలను, దున్నలను ప్రజలకు అమ్ముచున్నారు. విశాఖపట్టణము, అనకాపల్లి, విజయనగరములందు పశువైద్యశాలలు కలవు. చోడవరము, ఎలమంచిలి, నర్సీపట్టణము, భీమునిపట్టణము, శృంగవరపు కోటలలో పశువైద్య సౌకర్యమునకై చిన్న డిస్పెన్సరీలు కలవు.

గృహ పరిశ్రమలు : చేనేతపని ముఖ్యమైన గృహ పరిశ్రమ. దీనిని ఆశ్రయించి జిల్లా మొత్తము మీద 23,806 మంది జీవించు చున్నారు. సర్వసిద్ధి తాలూకాలో వీరి సంఖ్య ఎక్కువ. చక్కెర పర్భుతులు తయారుచేయుట ఒక గృహ పరిశ్రమగా ఉంచుకొని ఆ తాలూకాలోనే 2,296 మంది జీవించు చున్నారు. నువ్వుల నూనె తయారు చేయుట కూడ కొన్ని ప్రాంతములలో గృహ పరిశ్రమగా ఉన్నది. నక్కపల్లిలో కఱ్ఱతోను, రంగులతోను ఆటబొమ్మలను తయారుచేయు పరిశ్రమ కలదు.

పరిశ్రమలు : పెద్ద పరిశ్రమలు విజయనగరము, భీమునిపట్టణము, విశాఖపట్టణము, అనకాపల్లి తాలూకాలలో మాత్రమే కలవు. యావద్భారతదేశమున ఓడలు తయారు చేయు ఒకే ఒక కర్మాగారమగు హిందూస్థాన్ షిప్ యార్డు (నౌకా నిర్మాణ సంస్థ) విశాఖపట్టణములో ఉన్నది. అనకాపల్లిలో పంచదార ఫ్యాక్టరీ కలదు.

కాల్ టెక్స్ వారి పెట్రోలు రిఫైనరీ (నూనె శుద్ధి కర్మాగారము) ఒకటి ఇచట పనిచేయుచున్నది.

రోడ్లు : ఒరిస్సా రాష్ట్రమునకును, పరిసర జిల్లాలకును ఈ జిల్లా నుండి రోడ్లు పోవుచున్నవి. అన్ని విధములగు రోడ్ల మొత్తము నిడివి 1,158 మైళ్లు. ఇందులో జాతీయ రహదార్లకు చెందిన 149 మైళ్లును, రాష్ట్ర రహదారులకు చెందిన రోడ్డు 444 మైళ్లు మాత్రమే బాగుగ నుండును. తక్కిన రోడ్డు భాగము వేసవికాలమున మాత్రమే ఉపయోగపడును. గ్రామ సీమలకు రోడ్డు వసతులు చాల తక్కువ.

రైలు మార్గములు : దక్షిణ రైల్వేకు చెందిన బ్రాడ్ గేజ్ మార్గము 58½ మైళ్లును, ఆగ్నేయ రైల్వేకుచెందిన బ్రాడ్ గేజ్ మార్గము 69 మైళ్లును ఈ జిల్లాలో కలదు. మదరాసు - కలకత్తా మార్గము సర్వసిద్ధి, అనకాపల్లి, శృంగవరపుకోట, విజయనగరము, విశాఖపట్టణము, భీమునిపట్టణము తాలూకాల గుండ పోవుచున్నది. వాల్తేరు వద్ద చీలిన కొద్ది రైలు మార్గము విశాఖపట్టణమునకు పోవుచున్నది. విజయనగరము నుండి బయలుదేరిన మరొక శాఖా మార్గము శ్రీకాకుళము జిల్లాలోని బొబ్బిలి గుండ రాయపూరు పోవుచున్నది.

నౌకాశ్రయము (హార్బరు): విశాఖపట్టణమున గల నౌకాశ్రయము తూర్పు కోస్తాలోని ముఖ్యమైన హార్బరులలో నొకటి; ఇది ప్రకృతి సిద్ధముగ ఏర్పడినది. పెద్ద పెద్ద స్టీమర్లు సైతము ఇచ్చట నిలుచుటకు వసతి కలదు. ఈ హార్బరు నుండి బర్మా మొదలగు విదేశములకును, భారత దేశము నందలి వివిధ కోస్తా రేవులకును ఓడలలో వ్యాపారము, రాకపోకలు జరుగుచున్నవి. ఈ నౌకాశ్రయము ప్రభుత్వ సహాయముచే క్రమ క్రమముగ అభివృద్ధి గాంచు చున్నది.

విమానాశ్రయము : విశాఖపట్టణమున ఒక విమానాశ్రయము కలదు. మదరాసు - కలకత్తా; హైదరాబాదు - కలకత్తాల మధ్య తిరుగు ప్రయాణికుల విమానము లిట ఆగుచుండును. బొంబాయినుండి హైదరాబాదు మీదుగ విశాఖపట్టణమునకు వారమున 3 రోజులు విమానయాన సౌకర్యము కలదు.

విద్య : మైదానముతో పోల్చిన ఎడల ఏజన్సీ ప్రాంతమున విద్యా వ్యాప్తి చాల తక్కువ. ఇప్పుడిప్పుడే ప్రభుత్వము పూనుకొని కొండ జాతులలో విద్యావ్యాప్తి చేయుచున్నది. 1961 లెక్కల ప్రకారము ఈ జిల్లా యందలి అక్షరాస్యత 16·55%; పురుషులలో 24·73%, స్త్రీలలో 9·01%.

జిల్లా యందలి వివిధ వర్గముల విద్యా సంస్థల సంఖ్యా వివరములు దిగువ ఈయబడినవి (1956 - 57):

| వివరము | సంఖ్య | ఉపాధ్యాయులు | విద్యార్థులు |
|---|---|---|---|
| ప్రాథమిక పాఠశాలలు | 1,704 | 4,119 | 1,42,682 |
| మాధ్యమిక పాఠశాలలు | 6 | 49 | 1,277 |
| ఉన్నత పాఠశాలలు | 35 | 755 | 18,849 |
| వయోజన విద్యా కేంద్రములు | 95 | 111 | 1,925 |
| ప్రత్యేక వృత్తి బోధక పాఠశాలలు | 17 | 53 | 1,512 |
| | 1,857 | 5,087 | 1,66,245 |

విశాఖపట్టణము నందలి వాల్తేరు ఆంధ్ర విశ్వవిద్యాలయ కేంద్రము. విశ్వవిద్యాలయపు ప్రత్యక్ష నిర్వహణకులోనై వాల్తేరునందు ఒక ఆర్ట్సు కళాశాలయు, ఒక సైన్సు కళాశాలయు, ఒక ఇంజనీరింగ్ కళాశాలయు, ఒక న్యాయశాస్త్ర కళాశాలయు,ఒక ఉపాధ్యాయ శిక్షణ కళాశాలయు కలవు. ఇవికాక విశాఖపట్టణమున ఆర్ట్సు, సైన్సులకు చెందిన ఒక కళాశాలయు, విజయనగరమున రెండు కళాశాలలును, అనకాపల్లియందొక కళాశాలయు కలవు. వీని అన్నిటియందు విద్యార్థి సంఖ్య 3,860. ఇవికాక ప్రభుత్వ యాజమాన్యమున 497 మంది విద్యార్థులతో ఆధునిక వైద్యకళాశాలయు; ఇంజనీరింగ్ పాలీ టెక్నిక్ సంస్థయు నిర్వహింపబడుచున్నవి.

ఆరోగ్యము, వైద్యము : ఏజన్సీ యందు మలేరియా ఎక్కువగ ఉన్నను, ప్రభుత్వ కృషిచే చాల వరకు అరికట్టబడినది. విశాఖపట్టణమునందలి కింగ్ జార్జి ఆసుపత్రి ఆంధ్ర ప్రాంతము నందలి వైద్యశాలలయందన్నింటను పెద్దది. వాల్తేరునందు మానసిక చికిత్సాలయము కూడ ఒకటి కలదు.

చూడదగిన స్థలములు : ఈ జిల్లా యందలి యాత్రా స్థలములందెల్ల అత్యంత ఖ్యాతి వహించినది సింహాచలము.

సింహాచలము : విశాఖపట్టణమునుండి విజయనగరమునకు పోవు రైలు మార్గమున సింహాచలమను స్టేషనునకు రెండున్నర మైళ్ల దూరమున అడవివరమను గ్రామము సమీపమున గల సింహాచలముపై వరాహ లక్ష్మీ నృసింహస్వామి దేవాలయము కలదు. ఈ ఆలయము నిర్మింపబడిన కాలము ఇదమిత్థమని నిర్ధారణ చేయుటకు తగిన చారిత్రకాధారములు కనిపించుటలేదు. ఇక్కడ లభించు వేర్వేరు దాన శాసనములలో నెల్ల ప్రాచీనమైనది పదునొకండవ శతాబ్దినాటి ఒక శాసనము వలన అంతకు పూర్వమే ఈ దేవాలయము ఒక ప్రముఖ యాత్రా కేంద్రముగ పేరొందినటుల స్పష్టమగుచున్నది.

కొండ దిగువ నుండి దేవాలయము వరకు యాత్రికుల సౌకర్యార్థమై చక్కని మెట్లదారి నిర్మింపబడినది. ఈ దారికి ఉభయ పార్శ్వముల ఉన్న చరియలు ప్రకృతి రామణీయకతకు పేరెన్నిక కాంచినవి. ఈ ఆలయమునకు వంశపారంపర్యముగ ధర్మకర్తృత్వమును నిర్వహించుచున్న విజయనగర సంస్థానాధిపతులు 18 వ శతాబ్దిలో ఈ బాటకు ఇరువైపుల వేయించిన గులాబీ తోట ఈ రామణీయకతను అధికతర మొనర్చు చున్నది.

భక్తత్రాణ పరాయణుడగు శ్రీమహావిష్ణు విచట ప్రహ్లాదుని కటాక్షించెననియు, ప్రహ్లాదుడే ఈ దేవళమును నిర్మింపచేసెననియు భక్తుల విశ్వాసము.

పదునొకండవ శతాబ్ది ఉత్తరార్థమున శ్రీరామానుజాచార్యులు ఇచటకు వచ్చి, నూట ఎనిమిది దివ్య తిరుపతులలో ఒక దానిగ ఈ క్షేత్రమును మంగళాశాసన మొనర్చెను. అందుచే ఈ క్షేత్రము అఖిల భారత ఖ్యాతిని ఆర్జించి ఉత్తరదేశమున నుండి సైతము యాత్రికులను ఆకర్షించుచున్నది.

జిల్లా సంక్షిప్త చరిత్ర: ప్రాచీన కళింగ దేశాంతర్గతమగు ఈ మండలమున ఆదిమ కాలపు మానవావాస చిహ్నము లేవియు కాన వచ్చుట లేదు. చారిత్రకముగ కళింగదేశ చరిత్ర అశోకుని దండయాత్రతో ఆరంభమగుట నిజమే యైనను, ఆనాటి శాసనములు గంజాం జిల్లా పరిసరములకు చెందినవి మాత్రమే అగుటవలన ఈ మండలమున ఆనాడు వ్యాప్తియందుండిన సభ్యతను గురించిన విశేషము లేవియు తెలియవచ్చుట లేదు. మౌర్యసామ్రాజ్యము అంతరించిన తరువాత ఇచట చేతి వంశజుల పాలన సాగెనని భావింప నవకాశము కలదు. ఆ వంశమునకు చెందిన ఖారవేలుడు క్రీ. పూ. ఒకటవ శతాబ్దికి పూర్వుడనుటలో సందేహమున కెడముండదని చారిత్రికుల అభిప్రాయము. ప్రసిద్ధ విజేత అగు, అతని రాజ్యమున ఈ మండలము కొంతకాలముండి, అతని అనంతరము సాతవాహనులవశమై ఉండును. ఈ జిల్లాయందలి విజయనగరమునకు ఈశాన్యమున 8 మైళ్ల దూరమందున్న రామతీర్థమున జరిపిన త్రవ్వకములలో కనబడిన సీసపు నాణెముల పై ముద్రితమైన "సివమక విజయరాజ" నామము ఆంధ్ర సాతవాహన రాజులలో ఒకనిది అయి ఉండవచ్చునని చారిత్రకుల అభిప్రాయము. ఈ కాలమున ఈ మండలమున జైన, బౌద్ధ మతములు విరివిగ వ్యాప్తియందుండెనని రామతీర్థము నందలి జైన, బౌద్ధ మందిరపు విశేషములును, అనకాపల్లి దాపున గల సంకారము నందలి బౌద్ధమందిర శిథిలములును స్పష్టమొనర్చు చున్నవి.

సాతవాహన రాజ్యమస్తమించిన వెనుక ఈ మండలమున రాజకీయముగ జరిగిన మార్పులు, సముద్రగుప్తుని దక్షిణ దేశ దిగ్విజయకాలము (క్రీ. శ. 4 వ శతాబ్ది) వరకు ఏమియు తెలియవచ్చుట లేదు. ఈ జిల్లాలోని కొంత ప్రాంతమునకు ఆ కాలమున 'దేవరాష్ట్ర' మను పేరుండెడిది. దీనిని పాలించు కుబేరుని సముద్రగుప్తుడు జయించెనని సముద్రగుప్తుని ప్రశస్తివలన తెలియవచ్చు చున్నది. సంకారము వద్ద త్రవ్వకములలో దొరకిన సముద్రగుప్తుని నాణెములవలన, ఆనాడు ఈ ప్రాంతము గుప్తుల ఆర్థిక, సాంస్కృతిక ప్రభావమునకు లోనయ్యెనని విశదమగుచున్నది. సముద్రగుప్తుని దండయాత్ర తరువాత ఈ మండలమున దేవపురమను స్వతంత్రరాజ్యము సంస్థాపిత మయ్యెను. ఈ రాజ్యమునకు ముఖ్యనగరమగు దేవపురమును బట్టి ఆ రాజ్యమునకు ఆ పేరు కలిగినది. శృంగవరపుకోట తాలూకాలోని దేవాడయే ఈ దేవపురమని ఊహింపబడుచున్నది. ఈ రాజ్య పాలకుల వంశములో అనంతవర్మ అను వానికి కళింగాధిపతి అను బిరుదు ఉండుట వలనను, పిఠాపురం ప్రాంతమున కూడ ఇతని శాసనములు కనబడుట వలనను, ఇతని కాలమున ఆ రాజ్యము చాల విస్తృతి చెందెనని భావింప వచ్చును.

క్రీ. శ. 6 వ శతాబ్ది అంతమున ఈ మండలము పూర్వగాంగుల రాజ్యమున అంతర్భాగ మయ్యెను. క్రీ. శ. 624 వ సంవత్సరమున చాళుక్య పులకేశి ఈ ప్రాంతముపై దండెత్తి దీనిని వశపరచుకొనెను. తూర్పు చాళుక్య ప్రభువగు జయసింహుడు (క్రీ. శ. 641 - 673) విశాఖపట్టణము వరకు కల ప్రాంతమును పాలించెనని అతని శాసనముల వలన తెలియవచ్చు చున్నది. ఈ రాజునకు సర్వసిద్ధి అను బిరుదము కలదు. దానిని అనుసరించియే ఆ పేరిట సర్వసిద్ధి గ్రామము నిర్మితమైనది. వేంగీ రాజ్యమానాడు ఉత్తరమున విశాఖజిల్లా ఉత్తరభాగము వరకు విస్తరించెను. ఎలమంచిలి ప్రాంతమునకు మధ్య కళింగమను పేరుండినట్లు శాసనములవల్ల తెలియుచున్నది. కావున కళింగదేశమున చాల భాగము వేంగి రాజ్యాంతర్గమై యుండెనని తలచుట కవకాశము కలదు. పూర్వ చాళుక్యుల కాలముననే ఈ ప్రాంతము మరల గాంగుల వశమైనటుల కన్పట్టుచున్నది. అనంతవర్మ చోడగంగ (1078 - 1150) ఈ ప్రాంతమును పాలించు కాలమున మొదటి కులోత్తుంగ చోళుడు దీనిపై దండెత్తి జయించెనని సింహాచలమునందు ఆ ప్రభువు వేయించిన తమిళ శాసనము వలన తెలియవచ్చు చున్నది. చాళుక్య చోళుల అనంతరమున వెలనాటి చోళులు ఇచట ప్రభుత్వము నెరపిరి. ఆ వంశమునకు చెందిన మూడవ

గొంకరాజు యొక్క శాసనము సింహాచలమున కాన నగుచున్నది. పృథ్వీశ్వరుని శాసనములు ద్రాక్షారామమునను, విశాఖపట్టణములోను, శ్రీకూర్మమందును గలవు.

క్రీ. శ. 1213 లో ఈ ప్రాంతమును కాకతీయ గణపతి దేవుడు జయించెను. కాని సింహాచలము వరకు మాత్రమే వారి ప్రత్యక్షాధికారమునకు లోబడి ఉండెను. కడమ అంతయు వివిధ మాండలికుల నిరంకుశ పాలనలో ఉండెడిది. వీరిపై కాకతీయులకు గల అధికారము నామ మాత్రముగ ఉండెను. కాకతీయ రాజ్య మస్తమించిన వెనుక ప్రాచ్యాంధ్రమున తమ రాజ్యమును స్థాపించిన రెడ్డి రాజులలో ఒకడగు అనవేమారెడ్డి 1372 లో ఈ వివిధ మాండలికుల జయించి ఈ ప్రాంతము నంతటిని వశపరచుకొనెను.

కొండవీడు, రాజమహేంద్రవర రెడ్డిరాజ్యములు అస్తమించిన వెనుక కళింగ గజపతులు ఈ ప్రాంతమును ఆక్రమించిరి (క్రీ. శ. 1455). క్రీ. శ. 1515 లో విజయనగర సార్వభౌముడు కృష్ణదేవరాయలు కళింగ గజపతులపై దండెత్తి ఈ ప్రాంతమును వశపరచుకొని భీమునిపట్నము తాలూకా పొట్నూరిలో తన జయస్తంభమును నెలకొల్పెను. తరువాత రాయలకును గజపతులకును జరిగిన ఒడంబడికను అనుసరించి మరల ఈ ప్రాంతమంతయు గజపతుల వశమై క్రీ. శ. 1538 వరకు వారి అధీనముననే ఉండి, అంతట గోలకొండ కుతుబ్‌షాహీల వశమయ్యెను. ఈ కుతుబ్‌షాహీల కాలమున షేక్ మహమ్మద్ అను సేనాని పరివారమున పూసపాటి తమ్మిరాజు అను క్షత్రియ యోధుడు ఈ మండలమునకు వచ్చి, నేటి విజయనగరమునకు పదిమైళ్ల దూరమున ఉన్న కుమిలి, భోగాపురం పరగణాలను కౌలుకు పుచ్చుకొని ఇచ్చటనే స్థిరపడి, విజయనగర సంస్థాన రాజ వంశకులకు మూలపురుషుడయ్యెను. తమ్మిరాజు దత్తకుమారుడు ఆనందరాజు. (క్రీ. శ. 1699-1717) నాటికి గోలకొండ రాజ్యమస్తమించి, మొగలాయీ ప్రభుత్వ మిచట స్థాపింపబడెను. ఆ ప్రభుత్వమునకు లోబడి, ఆనందరాజు తన రాజ్యమును విస్తరింప చేసికొనెను. ఇతని కుమారుడగు విజయరామరాజు విజయనగరము కోటను 1713 లో కట్టించెను. ఇంతలో మొగలాయీ సామ్రాజ్య ప్రతిష్ఠ సన్నగిలి, వారి దక్షిణ రాజ్యము అసఫ్‌జాహీల వశమయ్యెను. ఆ రాజవంశపు కుటుంబ కలహములలో ఆంగ్ల, పరాసు కంపెనీ ప్రభుత్వములు జోక్యము కలిగించుకొనినందులకు ఫలితముగ పరాసు వారికి లభించిన సర్కారులలో ఈ మండలము చేరి ఉండెను. కాని శ్రీకాకుళము ఫౌజుదారగు జాఫర్ అలీ ఈ ప్రాంతమును పరాసువారికి స్వాధీనముచేయ నిరాకరించగ, విజయనగరం రాజు ఫ్రెంచివారికి, ఈ ప్రాంతమును వశపరచుకొనుటలో సాయపడెను. ఇటుల ఫ్రెంచి వారి మైత్రి సంపాదించి తన విరోధులగు బొబ్బిలివారిపై పగ సాధించుకొనవలయునని అప్పటి విజయనగరపు రాజు విజయరామరాజు సంకల్పించెను. ప్రస్తుతము శ్రీకాకుళం జిల్లాలో ఉన్న బొబ్బిలి రాజధానిగ ఆనాడు వెలమ ప్రభువులు పాలించు చుండిరి. ఆనాటి అరాజక పరిస్థితులలో తక్కిన కొందరు మాండలికులతోపాటు బొబ్బిలి ప్రభువగు రంగారావు సైతము పేష్కషు బకాయిపడి ఉండెను. విజయనగర ప్రభువు ప్రోత్సాహముచే ఫ్రెంచి సేనాని యగు బుస్సీ ఈ ప్రాంతమునకు వచ్చి బొబ్బిలి వెలమ వారిని ఒత్తిడి చేయసాగెను. కడకు బొబ్బిలివారు బకాయి చెల్లించుటకు ఇష్టపడినను, విజయరామరాజు చెడ్డ సలహాచే, బుస్సీ వారిని క్షమింపక కోటవదలి వేరుకడకు పోవలెనని శాసించెను. గత్యంతరములేక వెలమవీరులు పోరాటమునకు దిగిరి. 1757 జనవరి 24 తేదీన ఈ యుద్ధము జరిగెను. సంఖ్యలోను ఆయుధ సంపత్తిలోను ఎన్నియో రెట్లు తమకు మించి ఉన్న శత్రుసైన్యములతో బొబ్బిలి యోధులు ఎంత శౌర్యముతో పోరాడినను ప్రయోజనము లేక పోయెను. శత్రువులకు లొంగి బ్రతుకుటకు ఇష్టము లేక తమ స్త్రీలను, శిశువులను చేతులార చంపి దహన మొనర్చి, వెలమవీరులందరును యుద్ధరంగమున కడవరకు పోరాడి మరణించిరి. రెండు రోజుల తరువాత విజయరామరాజు తన డేరా యందు నిద్రించుచుండగ అర్ధరాత్రి వేళ ఒక వెలమ యోధుడు అతనిని చంపివేసెను. ఈ యోధుడు రాజంకోట రక్షణోద్యోగి తాండ్ర పాపయ్య అని తెలియవచ్చు చున్నది. విజయరామరాజు దత్తకుమారుడు ఆనందరాజు ఆంగ్లేయులతో మైత్రి కుదుర్చుకొని, ఆంధ్ర దేశమున ఫ్రెంచివారి పలుకుబడిని అంతరింప చేయుటలో ఆంగ్లేయులకు తోడ్పడెను. ఇతని దత్త పుత్రుడు రెండవ విజయరామరాజు బొబ్బిలి, పెద్దాపురం మొదలగు సంస్థానముల నెల్ల వశపరచుకొని, నిరంకుశ పాలనను నిర్వహించ సాగెను. ఈతని అదుపులో ఉంచదలచిన ఇంగ్లీషు కంపెనీ ప్రభుత్వము ఈతనిని సంస్థానము వదలి బందరున నివసించ వలసినదిగ కోరగ అతడు నిరాకరించి రాచవారి నందరను జతకూర్చుకొని పద్మనాభము వద్ద బ్రిటిష్ సేనలతో పోరాడి వీర మరణ మందెను. కంపెనీ వారితని కుమారుడగు నారాయణ బాబును జమీందారుగ గుర్తించి, వంశానుగతమగు జమీందారీని అతనికి కౌలు కిచ్చిరి. ఈ వంశమున జన్మించిన ఆనంద గజపతి కవి పండిత పోషకుడుగ పేరొందెను.

ఈ జిల్లాయందు బ్రిటిష్ ప్రభుత్వము స్థాపింపబడినది మొదలుగ అది అంతమగు వరకు సాయుధ తిరుగుబాటులు అనేకము జరిగినవి. 1857 లోని రంప పితూరీయును, 1886 లోని గూడెం తిరుగుబాటును, 1922 ఫిబ్రవరిలో సవరల తిరుగుబాటును, 1922 ఆగస్టులో అల్లూరి సీతారామరాజు నాయకత్వమున నడచిన మన్యం తిరుగుబాటును అందు ప్రముఖములు.

కంపెనీవారికి లభించినపుడు ఈ ప్రాంతము శ్రీకాకుళం సర్కారులో ఉండెడిది. దానిని మూడు డివిజనులుగ విభజించి, వాని నుండి తరువాత గంజాం, విశాఖపట్టణం జిల్లాలను రూపొందించిరి. 1936 లో ఒరిస్సా రాష్ట్రము నిర్మింపబడినపుడు గంజాం, విశాఖ జిల్లాలలో కొన్ని మార్పులు చేసి, గంజాము జిల్లాను ఒరిస్సాకు చేర్చిరి. తరువాత విశాఖపట్టణము జిల్లాలోని కొన్ని తాలూకాలను శ్రీకాకుళము జిల్లాగ 1950 లో రూపొందించి మిగత భాగమును నేటి విశాఖపట్టణము జిల్లాగ ఉంచిరి.

భారతదేశమునకు స్వాతంత్ర్యము సిద్ధించిన తరువాత ఈ జిల్లా యందు అత్యధిక భాగమును ఆక్రమించియున్న జమీందారీ విధానము రద్దొనరింపబడి జిల్లా యందంతట ఒకే విధపు భూస్వామ్య వ్యవస్థ నెలకొల్పబడినది. చీ.శే.రా.

# తూర్పు గోదావరి జిల్లా

ఉనికి - విస్తీర్ణము : తూర్పుతీరమున ఉ. అక్షాంశము 16° 30′ నుండి 18° 30′ వరకును, తూ. రేఖాంశము 81° 30′ నుండి 82° 35′ వరకును తూర్పుగోదావరి జిల్లా విస్తరించి ఉన్నది. 1959 లో ఈ జిల్లానుండి నూగూరు, భద్రాచలము తాలూకాలను విడదీసి ఖమ్మం జిల్లాలో కలిపిరి. *ఇప్పటి జిల్లా సరిహద్దులుగ తూర్పు దక్షిణముల బంగాళా ఖాతమును, పడమట పశ్చిమ గోదావరి జిల్లాయును, ఖమ్మం జిల్లాయును, ఉత్తరమున విశాఖపట్టణము జిల్లా, ఒరిస్సా రాష్ట్రములును కలవు. జిల్లా విస్తీర్ణము 4,264.26 చ. మైళ్ళు.

నైసర్గిక స్వరూపము : సహజ పరిస్థితిని అనుసరించి, ఏజన్సీ, పీఠభూమి, డెల్టా అని మూడు భాగములుగ తూర్పు గోదావరి జిల్లాను విభజింప వచ్చును. కొండలు కోస్తా ప్రాంతమున నుండి క్రమ క్రమముగ పెరుగును. జిల్లా ఉత్తర భాగమును చేరుకొను కొండలతో ఏజన్సీ ప్రాంతమంతయును ఆవరింపబడి ఉన్నది. తూర్పుకనుమల శాఖలే ఈ కొండలు; రమారమి జిల్లాలో సగ భాగమును కొండలు ఆక్రమించుకొన్నవి. పీఠభూమియందు తుని, పిఠాపురము, పెద్దాపురము తాలూకాలును, రాజమండ్రి, కాకినాడ, రామచంద్రపురము తాలూకాలలో కొన్ని భాగములును కలవు. డెల్టా భాగమున అమలాపురము, రాజోలు, కొత్తపేట తాలూకాలును కాకినాడ, రామచంద్రపురము, రాజమండ్రి తాలూకాలలో కొంతయును కలవు.

నదులు : తూర్పు గోదావరి జిల్లాలో ముఖ్యమైన నది గోదావరి. ఉత్తరమునుండి దక్షిణమునకు, జిల్లా పడమటి భాగము నంతటిని ఈ నది చుట్టివచ్చుచున్నది. బొంబాయికి ఈశాన్యమున 50 మైళ్ల దూరమున త్ర్యంబకమను గ్రామము వద్ద ఈ నది జన్మించి ఆగ్నేయముగా ప్రవహించి రంపచోడవరము తాలూకా పడమటి భాగమున ఈ జిల్లా చేరుచున్నది. అటనుండి పశ్చిమ గోదావరిజిల్లా ఏజన్సీలో కొంతదూరము ప్రవహించి, తూర్పు కనుమలను పాపికొండల గార్జివద్ద చీల్చుకొని, రాజమండ్రికి ఎగువను మైదానమును చేరుచున్నది. రాజమండ్రికి దిగువను ధవళేశ్వరము వద్ద ఈ నది రెండు పాయలుగ చీలుచున్నది. తూర్పు పాయకు గౌతమీ గోదావరి అనియు, పడమటి పాయకు వసిష్ఠ గోదావరి అనియు పేర్లు. రామచంద్రపురము, కాకినాడ తాలూకాలను రాజోలు, అమలాపురము, కొత్తపేట తాలూకాల నుండి వేరుచేయుచు గౌతమీ గోదావరి తూర్పుగా ప్రవహించి గోదావరీ పాయింటు అను చోట పెక్కు పాయలై సముద్రమున చేరుచున్నది. రాజోలు తాలూకా పడమటి సరిహద్దున దక్షిణముగ వసిష్ఠ గోదావరి నుండి వైనతేయ అను పాయ ఒకటి చీలి కొంతదూరము తూర్పునకు పోయి, తరువాత దక్షిణముగ రాజోలు తాలూకా దక్షిణ సరిహద్దున ప్రవహించి సముద్రమున చేరుచున్నది. ఈ విధముగ వసిష్ఠ, వైనతేయల మధ్య రాజోలు తాలూకా దక్షిణ భాగము ఒక లంకవలె అయినది.

మైదానమున ప్రవేశించినది మొదలు కొని గోదావరి క్రమేణ విస్తృతమై నదీ ప్రవాహమున అక్కడక్కడ

*జిల్లాను గురించి ఈయబడిన సంఖ్యా వివరములలో విస్తీర్ణము, జనసంఖ్య, విద్యావ్యాప్తి అను వాని విషయమున తప్ప తక్కిన వాని విషయమున నూగూరు, భద్రాచలము తాలూకాలతో కలిసి ఉండిన పూర్వపు తూర్పు గోదావరి జిల్లా సంఖ్యా వివరములే ఈయబడినవి. నూగూరు, భద్రాచలము తాలూకాల జనసంఖ్య అప్పటి జిల్లా జనసంఖ్యలో 4.3% మాత్రమే అను విషయమును ఇచట గుర్తించు కొనవలయును.

శాశ్వతముగ లంకలు ఏర్పరచినది. ఇవి గాకుండ ప్రవాహ వశమున అప్పుడప్పుడు తాత్కాలికముగ కొన్ని లంకలు ఏర్పడుటయు, ఉన్న లంకలకు కొన్ని మార్పులు రూపమున ఏర్పడుటయు, కొన్ని లంకలు కొట్టుకొని పోవుటయు జరుగు చుండును. ఏటేట గోదావరి తెచ్చిపెట్టు ఒండ్రు మట్టిచే ఈ లంకలు అతి సారవంతములను ఖ్యాతిని ఆర్జించుకొన్నవి.

ఈ జిల్లాలోని ఇంకొక నది ఏలేరు. ఎల్లవరము తాలూకా ఎల్లవరము గ్రామమునకు ఈశాన్యమున మూడు వాగులు కలియుటచే ఈ నది ఏర్పడినది. అటనుండి ఈ నది దక్షిణమునకు ప్రవహించి పెద్దాపురము తాలూకా ప్రవేశించి, వీరవరమున కెగువన చిన్న చిన్న వాగులుగ చీలి పోవుచున్నది. వీనిలో పడమటి చివర ఉన్న వాగు ఏలేరు అను పేరుతోనే ముందునకు సాగి పిఠాపురము తాలూకా పడమటి సరిహద్దున ప్రవహించి కాకినాడ తాలూకా లోనికి పోయి బిక్కవోలు మురుగు కాలువతో కలిసి, సముద్రమున చేరుచున్నది. తక్కిన రెండు వాగులు పిఠాపురము తాలూకాలో కొంతదూరము ప్రవహించి మరల కలిసికొని గోరిక నది అను పేరుతో ఉప్పాడవద్ద సముద్రమున చేరుచున్నది.

శీతోష్ణస్థితి : ఏప్రిల్, మేనెలలో ఎండలు కొంత ఎక్కువగ ఉన్నప్పటికి ఈ జిల్లా శీతోష్ణస్థితి రాష్ట్రమున తక్కిన జిల్లాలతో పోల్చినయెడల కొంత వరకు అనుకూలముగ ఉండునని చెప్పవచ్చును. దైనిక రోజువారీ గరిష్ఠోష్ణోగ్రత 89.5° ఫా., కనిష్ఠోష్ణోగ్రత 74.9° ఫా. సంవత్సరము మొత్తముమీద గరిష్ఠోష్ణోగ్రత 103° ఫా., కనిష్ఠోష్ణోగ్రత 61° ఫా. వర్షపాతము 45.24″. సరాసరి సంవత్సరమున వర్షము కురియు రోజులు 72. జనవరినుండి ఏప్రిల్ వరకు నాలుగు మాసములలో వర్షము లుండవు. మే మాసములో తొలకరించును. జూన్ నెల నుండి మూడు నెలల కాలము నైరృతి ఋతుపవనములవలన కురియు వర్షములలో ఎక్కువభాగము పడమటి భాగమునందు కురియును. కోస్తా ప్రదేశములందు, ఈశాన్య ఋతుపవనముల వలన కురియు వర్షము లెక్కువ.

అడవులు : ఈ జిల్లా విస్తీర్ణములో మూడవ వంతును మించి అనగా 1,989.11 చ. మైళ్ళు అడవి. పెద్దాపురము, తుని, కాకినాడ తాలూకాలలో ఉన్న అడవి అంతగ నాణ్యమైనదికాదు. వీనిలో వెదురు కొద్దిగను తక్కినచోట్ల పొదలును మాత్రమే కలవు. రాజమండ్రి, రంపచోడవరము, ఎల్లవరము తాలూకాలలోని అడవియందు ప్రసిద్ధి చెందిన కలపచెట్లు కలవు. ఇట్టి వృక్షములు గల అడవి విస్తీర్ణము 1,55,182 ఎకరములు. అమలాపురముతాలూకా లోని అడవులలో చవుకు తోపులు కలవు. ఏజన్సీ అడవులలో కొన్నిచోట్ల టేకు కలప సైతము లభించుచున్నది. మొత్తముమీద వెదురు, తాడి, జీడి, చవుకుచెట్లు ఎక్కువ. కుంకుళ్ళు, చింతపండు, వెదురు బియ్యము, తేనె, తేనెమైనము ఈ అడవులవలన లభించు ఫలసాయమున ముఖ్యమైనవి. కలప, వెదురు బొంగులను తెప్పలుగ కట్టి గోదావరి నదిమీద ఎగుమతి చేయుదురు.

ఖనిజ సంపద : గోదావరి నదికి ఉభయపార్శ్వము లందు నేలబొగ్గు పొరలు కలవని శాస్త్రజ్ఞుల ఊహ. కాని త్రవ్వకము మాత్రము జరుగుట లేదు. ఎల్లవరము డివిజన్ లోని జేడూరు మొదలగు గ్రామములవద్ద గ్రాఫైటు, సీసము (ప్లంబగో) కనుబడుచున్నవి.

ఈ జిల్లాయందు రంపచోడవరము, ఎల్లవరము, రాజమండ్రి, పెద్దాపురము, తుని, రామచంద్రపురము, కాకినాడ, రాజోలు, పిఠాపురము, అమలాపురము, ప్రత్తిపాడు, కొత్తపేట అను 12 తాలూకాలు కలవు. మొదటి రెంటిని కలిపి ఏజన్సీ అని వ్యవహరింతురు. ఈ జిల్లాలో పడమటి అంచున రంపచోడవరము తాలుకాయును, దానికి తూర్పున ఎల్లవరము తాలూకాయును కలవు. ఏజన్సీ అనబడు ఈ రెండు తాలూకాలలో ముఖ్యముగా కొండజాతులు నివసించు చున్నారు. రాజమండ్రి తాలూకా గోదావరి ఎడమ ఒడ్డున ఉన్నది. ఇటనుండియే డెల్టా మొదలిడు చున్నది. ఈ తాలూకాకు తూర్పున పెద్దాపురము తాలూకా కలదు. కోస్తా నానుకొని తుని, పిఠాపురము, కాకినాడ, అమలాపురము, రాజోలు, కొత్తపేట తాలూకాలు కలవు. కాకినాడ తాలూకాకు పడమరన రాజమండ్రి తాలూకాకు దక్షిణమున రామచంద్రపురము తాలూకా కలదు.

పట్టణములు : జిల్లాలో మునిసిపాలిటీలు గల పట్టణములు పదికలవు: రాజమండ్రి, కాకినాడ, అమలాపురము, రామచంద్రపురము, పెద్దాపురము, సామర్లకోట, ద్రాక్షారామము, పిఠాపురము, మండపేట, తుని.

రాజమండ్రి : జనసంఖ్య 1,30,030. చారిత్రాత్మకమైన పట్టణము ; కవిత్రయమున ప్రథముడగు నన్నయ భట్టారకుని నివాస భూమి ; గోదావరి నదికి ఇచ్చట పెద్ద రైల్వే వంతెన కలదు ; కొవ్వూరు, రాజమండ్రి స్టేషనులను కలుపు ఈ వంతెన పొడవు దాదాపు రెండు మైళ్లు.

కాకినాడ : జనసంఖ్య 1,22,655 ; జిల్లా కేంద్రము; సముద్రపు రేవు.

అమలాపురము : జన సంఖ్య 23,979 తాలూకా కేంద్రము ; ఈ ప్రాంతము కొబ్బరితోటలకు మిక్కిలి ప్రసిద్ధి.

# తూర్పు గోదావరి జిల్లా - తాలూకా వివరములు

| వరుస సంఖ్య | తాలూకా పేరు | తాలుకా కేంద్రము | గ్రామముల సంఖ్య (1951) | గ్రామీణ జనాభా 1951 | పట్టణములు (1951) | పట్టణ జనాభా | విస్తీర్ణము (చదరపు మైళ్ళలో) (1951) | మొత్తము నీటి పారుదల వసతిగల నేల విస్తీర్ణము (ఎకరములలో) (1959) | సాగుచేయబడిన నేల (ఎ॥ములలో) (1959) | ప్రస్తుతము సాగులోలేని బీడు నేల (ఎ॥ములలో) (1959) | మొత్తం సాగుకు తగిన నేల (ఎ॥ములలో) (1959) | సాగుచేయ వీలగు బంజరు నేల (ఎ॥లలో) (1959) |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | కాకినాడ | కాకినాడ | 100 | 2,27,370 | 2 | 1,28,132 | 384 | 1,29,664 | 1,35,408 | 783 | 1,36,191 | 8,682 |
| 2. | పెద్దాపురము | పెద్దాపురము } | 197 | 2,38,418 | 8 | 49,346 | 602 | 44,520 | 82,400 | 2,494 | 84,894 | 12,609 |
| 3. | ప్రత్తిపాడు | ప్రత్తిపాడు } | | | | | | 33,971 | 65,255 | 6,808 | 72,063 | 859 |
| 4. | రాజమండ్రి | రాజమండ్రి | 80 | 2,02,740 | 2 | 1,19,244 | 378 | 48,461 | 1,35,708 | 14,744 | 11,50,452 | 10,494 |
| 5. | రామచంద్రపురము | రామచంద్ర పురము | 109 | 2,89,192 | 5 | 56,864 | 289 | 1,21,299 | 1,40,727 | 1,558 | 1,42,285 | 805 |
| 6. | అమలాపురము | అమలాపురము | 102 | 2,75,819 | 8 | 41,448 | 358 | 93,878 | 1,30,888 | 900 | 1,31,788 | 31,619 |
| 7. | రాజోలు | రాజోలు | 103 | 3,02,348 | 2 | 12,562 | 291 | 37,423 | 62,096 | 184 | 62,280 | 4,525 |
| 8. | తుని | తుని | 48 | 98,595 | 1 | 16,376 | 183 | 37,381 | 66,530 | 1,579 | 68,109 | 13,359 |
| 9. | పిఠాపురము | పిఠాపురము | 46 | 1,12,896 | 2 | 34,174 | 138 | 45,687 | 61,121 | — | 61,121 | 8,639 |
| 10. | ఎల్లవరము | ఎల్లవరము | 323 | 54,525 | — | — | 350 | 6,610 | 27,277 | 560 | 27,837 | 2,30,388 |
| 11. | రంపచోడవరము | రంపచోడ వరము | 282 | 40,273 | — | — | 710 | 2,343 | 19,190 | 2,567 | 21,757 | 1,22,910 |
| 12. | కొత్తపేట* | కొత్తపేట | — | — | — | — | — | 44,658 | 68,530 | 1,837 | 70,367 | — |
| | | మొత్తం | 1,340 | 18,41,676 | 20 | 4,60,146 | 4,178 | 6,45,854 | 9,95,130 | 34,014 | 10,29,144 | 4,44,839 |

* కొత్తపేట, రంపచోడవరము, ఎల్లవరము, పిఠాపురములకు సంబంధించిన కొన్ని వివరములు లోపించినవి.

రామచంద్రపురము : జనసంఖ్య 18,824 ; తాలూకా కేంద్రము.

పెద్దాపురము : జనసంఖ్య 24,307 ; పట్టు పరిశ్రమకు ప్రసిద్ధి.

సామర్లకోట : జనసంఖ్య 31,662; ఇక్కడనుండి కాకినాడకు రైలుమార్గము చీలుచున్నది ; పప్పునూనె వ్యాపారమునకు ఈ పట్టణము ప్రసిద్ధి పొందినది.

ద్రాక్షారామము : జనసంఖ్య 16,458; పంచారామములలో ఒకటిగ ప్రసిద్ధికెక్కిన పుణ్యక్షేత్రము.

పిఠాపురము : జనసంఖ్య 27,918 ; పురాతన పట్టణము.

మండపేట : జనసంఖ్య 19,791.

తుని : జనసంఖ్య 22,463 ; తాలూకా కేంద్రము.

ప్రజలు : ఈ జిల్లాలో జనసంఖ్య* 26,09,311. పురుషులు 13,07,003, స్త్రీలు 13,02,308. జనసాంద్రత చ. మైలునకు 452. 1951 - 1931 మధ్య పది సంవత్సరములలో ఈ జిల్లా యందు జనసంఖ్య 13·36% వృద్ధి ఐనది.

మతములు : (భద్రాచలము, నూగూరు తాలూకాలు కలుపుకొని) హిందువులు 23,33,448 ; క్రైస్తవులు 47,390 ; ముస్లిములు 33,577 ; జైనులు 266 ; బౌద్ధులు 17 ; శిక్కులు 11 ; యూదులు 7 ; పార్శీలు 76 ; ఇతరులు 66 గురు (1951) కలరు. జిల్లా ప్రజలలో అయిదుగురిలో ఒకరు పట్టణవాసి.

వృత్తులు : ముఖ్యమైన వృత్తి వ్యవసాయము. వ్యవసాయము స్వంతముగ చేయువారు, కౌలుదారులు, వ్యవసాయ కార్మికులు, భూస్వాములు వీరందరును వ్యవసాయమువలన జీవించువారే ; ఇట్టివారి సంఖ్య 16,59,730. వ్యాపారము వలన జీవించువారు 1,56,223 ; పరిశ్రమల వలన జీవించువారు 2,76,033 ; ఇతర ఉద్యోగములవలన జీవించువారి సంఖ్య 3,22,817 (1951).

భాష : జిల్లాలో తెలుగు పెక్కురకు మాతృభాష. 1951 లెక్కల ప్రకారము వివిధ మాతృభాషలు కలవారి సంఖ్య : తెలుగు 23,38,459; కోయ44,749 ; ఉర్దు 21,870 ; తమిళము 2,877 ; ఒరియా 2,111 ; హిందీ 1,161 ; హిందుస్థానీ 658 ; ఇంగ్లీషు 617 ; మళయాళము 608; కన్నడము 435; మరాఠీ 366 ; మార్వారీ 245 ; సింధీ 239 ; గుజరాతి 167 ; తక్కిన భాషలు 188.

వ్యవసాయము : సేద్యరీత్యా ఈ జిల్లాలో ఒండ్రు, నల్లరేగడ, ఎర్రనేల, తువ్వనేల, అభివృద్ధిపరుపబడిన నేల అను అయిదు రకముల నేలలు కలవు. ఇందు ఒండ్రు నేల అన్నిటికన్న అధికముగ కనపడుచున్నది. జిల్లాలో డెల్టాభాగము ఎక్కువగా ఉండుటయే ఇందులకు కారణము. రామచంద్రపురము, కాకినాడ, రాజోలు, అమలాపురము తాలూకాలలో ఈ నేల విస్తారముగ ఉన్నది. జిల్లా మొత్తముమీద ఈ ఒండ్రునేల విస్తీర్ణము 3,61,000 ఎకరములు కలదు. తరువాత లెక్కలోనికి వచ్చునది ఎర్రనేల. రాజమండ్రి, పెద్దాపురము, తాలూకాలలో ఈ నేల విస్తారము. జిల్లా మొత్తమున దీని విస్తీర్ణము 2,72,000 ఎకరములు. నల్లరేగడ రాజమండ్రి, పెద్దాపురము తాలూకాలలోనే ఉన్నది ; దీని విస్తీర్ణము 63,000 ఎకరములు. అన్నిటిలో అధమమగు తువ్వనేల 46,000 ఎకరములు కలదు. ఇది ముఖ్యముగ రాజోలు, అమలాపురము తాలూకాలలో కోస్తా వెంబడి కనబడుచున్నది.

వ్యవసాయమునకు కల నీటిపారుదల వసతులలో ముఖ్యమైనవి నదులు, కాలువలు, చెరువులు, ఊటకాలువలు, మురుగు కాలువలు. రాజమండ్రి, పెద్దాపురము తాలూకాలలో కొన్ని చెరువులకు, వాగుల వలన నీరు వచ్చుచున్నది. కాని తక్కిన చెరువు లన్నింటికి వర్షములే ఆధారము. అందువలన వీనిక్రింద సాగును నమ్మి ఉండుటకు వీలు లేకున్నది. గోదావరికి ధవళేశ్వరమువద్ద కట్టబడిన ఆనకట్టద్వారా వచ్చు కాలువల వలన రాజోలు, కొత్తపేట, అమలాపురము, రామచంద్రపురము, కాకినాడ తాలూకాలును, రాజమండ్రి తాలూకాలో కొంత భాగమును సాగగుచున్నవి. రాజమండ్రి తాలూకాలో 534 ఎకరముల భూమి ఊటకాలువల క్రింద సాగగుచున్నది. పేరవరము పంపింగు స్కీముక్రింద రాజోలు తాలూకాలో కొంత భాగము, పోలవరము లంక ప్రాజెక్టు క్రింద అమలాపురము తాలూకాలో కొంత భాగమును సాగగుచున్నది. రాజమండ్రి తాలూకాలో అధిక భాగమును, పెద్దాపురము తాలూకాలోను పల్లపుసాగు పంటచెరువుల ఆధారమున జరుగుచున్నది. ఏలేరు నదినుండి కాలువలద్వారా వచ్చు నీటిచే పెద్దాపురము తాలూకాలో 17,211 ఎకరముల భూమి సాగగుచున్నది. పిఠాపురము, తుని తాలూకాలలో కొద్ది చిన్న చిన్న పంట చెరువులు తప్ప తగు నీటి వసతు లేమియు లేవు. తాండవ నదీ రిజర్వాయరును కట్టి ఈ తాలూకాలకు జలాధార మేర్పరుచుటకు ప్రభుత్వము ఆలోచించుచున్నది. అమలాపురము, రాజోలు, కొత్తపేట తాలూకాలలో పోక, కొబ్బరి తోటలకు బావులనీరు పారించుచున్నారు. మెట్ట భూములలో తోట పైరులు సాగు చేయుటకు కూడ కొన్నిచోట్ల బావులు కలవు.

జిల్లా మొత్తము మీద పల్లపుసాగు 6,15,816 ఎకరములలోను, మెట్టసాగు 5,00,593 ఎకరములలోను జరుగు

* 1961 జనాభా లెక్కల ప్రకారము.

చున్నది. పల్లపు సాగులో ముఖ్యమైన పంట వరి. మెట్ట పంటలలో ఆహార పదార్థములలో జొన్నయును, వాణిజ్య పంటలలో నూవులు, పొగాకును ముఖ్యమైనవి.

### తూర్పు గోదావరి జిల్లా - పంటల వివరములు 1959 - 1960

| | | | | | |
|---|---|---|---|---|---|
| వరి | 7,87,523 | ఎ. | ఇతర తాజాపండ్లు | 2,714 | ఎ. |
| గోధుమ | 2,182 | ,, | జీడిమామిడి | 7,976 | ,, |
| జొన్న | 25,013 | ,, | ఇతర ఎండుపండ్లు | 663 | ,, |
| సజ్జ | 41,198 | ,, | కూరలు | 60,826 | ,, |
| రాగి | 12,881 | ,, | పైలెక్కలలో చేరని | | |
| మొక్కజొన్న | 1,629 | ,, | ఆహారపుపంటలు | 741 | ,, |
| కొఱ్ఱ | 2,814 | ,, | ప్రత్తి | 1,290 | ,, |
| వరిగ | 647 | ,, | గోగు | 476 | ,, |
| సామ | 1,930 | ,, | జనుము | 6,779 | ,, |
| ఇతర పొట్టుధాన్య | | | పంట జనుము | 741 | ,, |
| ములు | 3,365 | ,, | ఇతర నారపైరులు | 596 | ,, |
| శనగ | 901 | ,, | వేరుశనగ | 7,002 | ,, |
| కంది | 7,007 | ,, | కొబ్బరితోటలు | 52,908 | ,, |
| పెసర | 25,448 | ,, | నువ్వులు | 43,140 | ,, |
| మినుము | 22,550 | ,, | ఇతర ఖాద్య తైల | | |
| ఉలవ | 43,406 | ,, | ముల పైరులు | 138 | ,, |
| ఇతర పప్పు | | | ఆముదములు | 310 | ,, |
| ధాన్యములు | 3,868 | ,, | రంగులకు పనికి | | |
| మిరప | 11,159 | ,, | వచ్చు పైరులు | 15 | ,, |
| ఉల్లి | 33 | ,, | పొగాకు | 25,403 | ,, |
| ధనియాలు | 1,513 | ,, | తమలపాకులు | 36 | ,, |
| పసుపు | 2,075 | ,, | ఇతర నిషాపైరులు | 24 | ,, |
| చింత | 1,305 | ,, | మేత పైరులు | 21,760 | ,, |
| ఇతర మసాలా | | | పచ్చిఎరువు పైరులు | 2,634 | ,, |
| పైరులు | 273 | ,, | తుమ్మ, చేవవగైరా | 16,251 | ,, |
| చెఱకు | 23,382 | ,, | పూలతోటలు | 19 | ,, |
| తాటిబెల్లము | 139 | ,, | పై లెక్కలలో | | |
| ఇతరవిధములైన | | | చేరని నానావిధ | | |
| చెఱకు పంటలు | 19 | ,, | మైన పైరులు | 1,675 | ,, |
| మామిడి | 26,519 | ,, | | | |
| అరటి | 44,485 | ,, | మొత్తము | 2,49,989 | ,, |
| నిమ్మజాతి | 4,608 | ,, | | | |

అనావృష్టి కాలమున మెట్ట తాలూకాలలో కొంత వరకు కరవు బాధ కలుగుచున్నను మొత్తము మీద ఈ జిల్లా ఆహార విషయమున అదనపు జిల్లాగా లెక్కింపబడు చున్నది. మెట్ట తాలూకాలో మామిడి తోటలు మెండుగ కలవు. మామిడిపండ్ల ఎగుమతి రాజమండ్రినుండి జరుగును.

డెల్టా భూమియందు ఉత్పత్తి యగు రుచికరమైన తెల్ల చక్కెరకేళి అరటిపండ్లు ఉత్తర భారత దేశమునకు ఎగుమతి యగుచున్నవి.

వ్యవసాయమున చాల వరకు పూర్వపు పద్ధతులే అమలులో ఉన్నను, ఇటీవల వ్యవసాయ శాఖవారి సలహాలను అనుసరించి యంత్ర సహాయమున సాగు చేయుట, సారవు ఎరువులు ఉపయోగించుట అమలు లోనికి వచ్చుచున్నవి.

సామర్లకోటలో ఒక వ్యవసాయ పరిశోధనా కేంద్రము కలదు. ఇచ్చట ప్రధానముగ వరి వంగడముల గురించి, సాగును గురించి పరిశోధనలు జరుపుచున్నారు. రాజమండ్రిలో భారత ప్రభుత్వ యాజమాన్యమున కేంద్ర పొగాకు పరిశోధన కేంద్రము కలదు. ఇచ్చట పొగాకుకు సంబంధించిన విత్తనములు, సాగు, పదును ఇత్యాది విషయములను గూర్చి మూల పరిశోధనలు జరుపుచున్నారు. అంబాజీపేట (అమలాపురము తాలూకా) లో కేంద్ర కొబ్బరి సంస్థ యాజమాన్యమున ప్రాంతీయ కొబ్బరి పరిశోధన కేంద్రము పని చేయుచున్నది. రాజోలులో కీటకములను ఉపయోగించి సస్యములను రక్షించుటకుగాను బయలాజికల్ బ్రీడింగ్ స్టేషను కలదు.

పశు సంపద: నాణ్యమైన పశువులు తక్కువ. ఎల్లవరము తాలూకాలో మంచి రకపు పశువులను అభివృద్ధి చేయుటకు జిల్లాలోని కొండజాతుల వారికి ఉత్తమ జాతి ఆబోతులను ప్రభుత్వము ఇచ్చి ప్రోత్సహించుచున్నది. జిల్లాలో పది పశు వైద్య కేంద్రములు కలవు.

గృహ పరిశ్రమలు: చేనేత పరిశ్రమ: ముఖ్యమైన గృహ పరిశ్రమ; 36,093 మంది చేనేత వృత్తివలన జీవించు చున్నారు. రైతులలో కొందరికి తేనె పరిశ్రమ అనుబంధ పరిశ్రమగ ఉన్నది. గృహ పరిశ్రమలను అభివృద్ధి చేయుటకు రాజమండ్రిలో ఒక ఇండస్ట్రియల్ మ్యూజియము కలదు.

పరిశ్రమలు: జిల్లాలో ముఖ్యమైన పరిశ్రమలు - 1. పంచదార పరిశ్రమ, 2. పొగాకు పరిశ్రమ, 3. ప్రత్తి, పట్టువస్త్ర పరిశ్రమ, 4. కాగితపు పరిశ్రమ, 5. పెంకుల పరిశ్రమ (సామర్లకోట), 6. ఇంజనీరింగు సామగ్రి తయారీ, 7. రవాణా సంస్థలు (కాకినాడ), 8. మూస తయారీ; 9. ఫౌంటెన్ పెన్ను తయారీ, 10. అల్యూమినియము సామగ్రి తయారీ.

ఆంధ్రప్రదేశ్ మొత్తము మీద ఉన్న రెండు పేపరు మిల్లులలో ఒకటి రాజమండ్రిలో ఉన్నది. ఇది ప్రభుత్వ యాజమాన్యమున ఉన్న "స్టేట్ ఇండస్ట్రియల్ డెవలప్మెంటు కార్పరేషన్"చే నిర్వహింపబడుచున్నది. జిల్లా మొత్తములో దాదాపు 100 బియ్యపు మిల్లులు కలవు. పెద్దాపురములో 6 సిల్కు మిల్లులును, పందలపాకలో 2 నూలు మిల్లులును పనిచేయు చున్నవి. రాజమండ్రిలో

పెన్నులపరిశ్రమ నిర్వహింపబడుచున్నది. సామర్లకోట, చెల్లూరు లలో పంచదార; ధవళేశ్వరములో తూకము తూయుయంత్రాసులు, పెద్ద కాటాలు, ఇనుప పెట్టెలు తయారీ; రాజమండ్రిలో అల్యూమినియము సామగ్రి, మూసలు తయారీ ఎన్నదగిన పరిశ్రమలు.

రోడ్లు : అన్ని విధములగు రోడ్లును కలిసి ఈ జిల్లాలో 1,936 మైళ్ల నిడివి కలవు. మదరాసు నుండి కలకత్తా పోవు గ్రాండ్ ట్రంక్ రోడ్డు రాజమండ్రి, రాజానగరము, జగ్గంపేట, అన్నవరము, తుని మీదుగా పోవు చున్నది. దీని ప్రయోజనము జిల్లాకు అంతగా లేనందున ఈ మార్గమును మరల్చి కత్తిపూడి, పిఠాపురము, సామర్లకోట, ద్వారపూడి, మండపేట, ఆలమూరు మీదుగా త్రిప్పుటకు భారత ప్రభుత్వము ఏర్పాట్లు చేసినది. ప్రక్క జిల్లాలకు, తాలూకా కేంద్రములకు బస్సు సౌకర్యము కలదు. కోనసీమలో రాకపోక సౌకర్యములు తక్కువ.

రైలు మార్గములు : మదరాసు నుండి కలకత్తా పోవు రైలు మార్గము ఈ జిల్లాలో రాజమండ్రి, రామచంద్రపురము, కాకినాడ, తుని తాలూకాల గుండ పోవు చున్నది. సామర్లకోట నుండి ఒక బ్రాంచి లైను కాకినాడకు పోవుచున్నది. మొత్తము రైలు మార్గము పొడవు 79½ మైళ్లు. తాలూకా కేంద్రములలో రాజమండ్రి, కాకినాడ, పిఠాపురము, తుని అను వానికి మాత్రమే రైలు వసతి కలదు. రాజోలు, అమలాపురములకు బోట్ ఏజన్సీ వసతి మాత్రము కలదు.

విద్య : 1961 జనాభా లెక్కల ప్రకారము ఈ జిల్లా యందలి ప్రజలలో అక్షరాస్యత 25.80%; పురుషులలో 33.08%, స్త్రీలలో 18.49% కలదు. ఏజన్సీ ప్రాంతమున తప్ప తక్కిన ప్రదేశములలో ఈ జిల్లాయందు విద్యావ్యాప్తి విశేషముగ కన్పట్టుచున్నది. జిల్లా యందు విద్యావ్యాప్తి విషయమున కృషిచేయుచున్న వివిధ వర్గములకు చెందిన విద్యాసంస్థల సంఖ్యా వివరములు దిగువ ఈయబడినవి (1956 - 57) :

| వివరము | సంఖ్య | ఉపాధ్యాయ సంఖ్య | విద్యార్థులు |
|---|---|---|---|
| ప్రాథమిక పాఠశాలలు | 2,323 | 6,754 | 2,30,412 |
| మాధ్యమిక ,, | 14 | 138 | 3,036 |
| ఉన్నత ,, | 66 | 1,600 | 38,790 |
| వయోజనవిద్య ,, | 135 | 163 | 3,259 |
| ప్రత్యేక, వృత్తిబోధన పాఠశాలలు | 37 | 116 | 2,210 |
| | 2,575 | 8,771 | 2,77,707 |

ఇవికాక రాజమండ్రి, కాకినాడ, అమలాపురములలో పట్టణమున కొకటి చొప్పున ఆర్ట్సు మరియు సైన్సు కళాశాలలు మూడు కలవు. వృత్తి విద్యకు సంబంధించిన కళాశాలలో ఇంజనీరింగు కళాశాల ఒకటియు, వైద్యకళాశాల ఒకటియు, ఇంజనీరింగు పాలిటెక్నిక్ సంస్థ ఒకటియు కాకినాడలో కలవు. రాజమండ్రిలో 101 మంది విద్యార్థులకు, 12 మంది విద్యార్థినులకు శిక్షణ ఒసగు బోధనాభ్యసన కళాశాల ప్రభుత్వ ఆధ్వర్యవమున పనిచేయుచున్నది.

ఆరోగ్యము, వైద్యము : రాష్ట్రమున తక్కిన జిల్లాలతో పోల్చిన యెడల ఈ జిల్లా ఆరోగ్యవంతమే అని చెప్ప తగినను ఏజన్సీ ప్రాంతములలో ఎక్కువగ మలేరియా కలదు. జిల్లా మొత్తము మీద ఆధునిక వైద్యవిధానము ననుసరించు జనరల్ ఆసుపత్రులు 12, డిస్పెన్సరీలు 22 కలవు. ఇవికాక రాజమండ్రిలో క్రైస్తవ మిషనరీలచే నడుపబడు ఘోషా ఆసుపత్రియు, క్షయ వైద్యశాలయు కలవు. వీనియందలి మంచముల సంఖ్య 1,304. రామచంద్రపురమున కుష్ఠు వైద్యశాల కలదు. ఇవికాక జిల్లా మొత్తము మీద యూనానీ చికిత్సశాల ఒకటియును, ఆయుర్వేద వైద్యశాలలు 12ను వైద్య సహాయ మొసగు చున్నవి. (1956 - 57).

చూడదగిన స్థలములు : సారవంతమగు ఈ జిల్లా తొలుత నుండియు వివిధ సంస్కృతులకు నిలయమైనది. ఇందలి గోదావరి డెల్టా సప్త గోదావరి అను పేరుతో భారతీయ సంస్కృతియందు ప్రసిద్ధి వహించినది. గోదావరి ఈ జిల్లాలోనికి చొచ్చిన వెంటనే తూర్పు కనుమలలో భాగమగు పాపికొండలను చీల్చుకొని ప్రవహించు దృశ్యము అత్యంత రమణీయము. ఇచ్చట కొండల మధ్య నది కొన్ని చోట్ల రెండు వందల గజములు మాత్రమే ఉండును; కాని లోతును, వేగమును అత్యధికము. నది ప్రవహించు ఈ ఇరుకుగా నుండు భాగమును 'కనుమ' (గార్జి) అని అందురు. ఈ కనుమ గుండ గోదావరి నది పదు మైళ్లు ప్రవహించును. రాజమండ్రికి నలుబది మైళ్లు ఎగువన ఈ కనుమ అంతమగును. గోదావరి డెల్టాకే 'కోనసీమ' అని మధ్య యుగముల నుండి వ్యవహారము కలదు. ఈ కోనసీమ సాంప్రదాయ విద్యా విషయికము గనే కాక, ప్రకృతి రామణీయకత విషయమున సైతము పూర్వము నుండియు పేరెన్నిక కాంచినది.

బౌద్ధుల పుణ్యక్షేత్రములు పూర్వము కోనసీమలో పెక్కు ఉండెడివి; కాని నేడు అవి అంతరించినవి. రాజోలు తాలూకాలోని ఆదుర్రునందు మాత్రము బౌద్ధనిర్మాణముల శిథిలావశేషములు కొన్ని కాననగు చున్నవి. గోదావరి నదీ తీరముననే హిందువుల పుణ్యక్షేత్రములగు పంచారామములు ఉండెడివని ప్రతీతి;

వానిలో ద్రాక్షారామము ఈ జిల్లాలోనిది. సామర్లకోట వద్ద ఉన్న భీమవరమే భీమారామమని కొందరనెదరు. కాని పశ్చిమ గోదావరి జిల్లాలోని భీమవరము వద్ద ఉన్న గునుపూడికే అది వర్తించునను వాదనయు కలదు. కుమారారామమును పిఠాపురమునకు సమీపముననే కల దని కొందరనెదరు.

ద్రాక్షారామ భీమేశ్వరుని గురించియు, గోదావరీ పరిసర స్థలములగు తక్కిన పుణ్యక్షేత్రములను గురించియు శ్రీనాథ కవి సార్వభౌముడు తన భీమేశ్వర పురాణమున పలురీతుల ప్రశంసించెను. ఇవికాక పేరొందిన ఇంకొక శైవ క్షేత్రము కోటిపల్లి. ఇది ద్రాక్షారామమునకు ఆరుమైళ్ళ దూరమున రామచంద్రపురము తాలూకాలో ఉన్నది. వైష్ణవుల పుణ్యక్షేత్రము అన్నవరము; ఇచ్చట సత్యనారాయణస్వామి ఆలయము ప్రసిద్ధి వహించినది. ఈ క్షేత్రము తుని, పిఠాపురముల మధ్య ఉన్నది. రాజమండ్రిలో కోటిలింగ క్షేత్రము దేశమున ప్రసిద్ధి గాంచినది. గోదావరి పుష్కర సమయమున రాజమండ్రిలో భారీ ఎత్తున తీర్థము జరుగును.

జిల్లా సంక్షిప్త చరిత్ర: ప్రాచీన కళింగ రాజ్యపు సరిహద్దు ప్రాంతముగ భావింపబడు ఈ మండలము చరిత్రకందని పూర్వ యుగముల నుండియు మానవావాసముగ ఉండినటుల ఈ జిల్లా యందలి మన్యప్రాంతములందు లభించు పూర్వ శిలా యుగ మానవుల శిలా పరికరములు రుజువొనర్చు చున్నవి. చారిత్రిక యుగమీ ప్రాంతమున, ఆంధ్రప్రదేశ్ నందలి తక్కిన ప్రాంతములందు వలెనే మౌర్యులతో మొదలిడుచున్నవి. మౌర్యుల పరిపాలనానంతరమున ఇయ్యది కళింగమును పాలించిన చేతి వంశజుల వశమున ఉండియుండును. ఎటులైనను తుదకిది సాతవాహనుల వశమయ్యెననుట గర్గ సంహితలోని యుగ పురాణము వలన తెలియనగుచున్నది. సాతవాహన యుగమున బౌద్ధమత మిట విరివిగ వ్యాప్తియందుండెననుట, ఈ జిల్లాలోని రాజోలు తాలూకా ఆదుర్రు నందలి బౌద్ధస్తూపావశేషముల వలనను, నాణెముల వలనను స్పష్టమగుచున్నది. సాతవాహన రాజ్య మస్తమించిన వెనుక ఇచట పాలించిన రాజ వంశముల వివరములు స్పష్టముగ తెలియవు. ఇక్ష్వాకుల రాజ్యము తూర్పు గోదావరి జిల్లాకు విస్తరించిన దనుటకు ఆధారములు లభించుట లేదు. సముద్రగుప్తుడు తూర్పు తీరమున దండయాత్రను సాగించిన కాలమున (క్రీ. శ. 4 వ శతాబ్ది) పిష్టపురమున (పిఠాపురమున) మహేంద్రుడను రాజు పాలించు చుండెననియు, అతనిని సముద్రగుప్తుడు జయించెననియు సముద్రగుప్త ప్రశస్తి వలన తెలియ వచ్చుచున్నదీ. ఆ కాలమున గోదావరి తటమున కొంత ప్రాంతమును పాలించు శాలంకాయనులకును, ఈ మహేంద్రునికిని సంబంధ మేదియైన కలదా అను విషయమును ఇదమిత్థమని చెప్ప వలను పడదు. సముద్రగుప్తుని దండయాత్ర అనంతరమున కళింగమున మరల కొన్ని స్వతంత్ర రాజ్యములు నెలకొని నపుడు కొంతకాలము ఈ మండలమును దేవపుర రాజన్యులును మాఠర వంశికులగు ప్రభువులును పాలించిరి. వీరి తరువాత వాసిష్ఠీ వంశజులు పిఠాపురము రాజధానిగ పాలించిరి. క్రీ. శ. 7 వ శతాబ్ది ప్రథమ పాదమున చాళుక్య పులకేశి సార్వభౌముని సోదరుడు కుబ్జ విష్ణు వర్ధనుడు తీరస్థాంధ్రముపై దండెత్తు నాటికి ఈ ప్రాంతము విష్ణుకుండినుల వశమై వారి సామంతుడగు పృథ్వీ మహారాజు పిఠాపురమును పాలించు చుండెను. ఈ పృథ్వీ మహారాజును జయించి కుబ్జ విష్ణు వర్ధనుడు పూర్వ చాళుక్య రాజ్య సంస్థాపనమునకు నాందీ ప్రస్తావన ఒనర్చెను. పూర్వ చాళుక్యుల వంశమునకు చెందిన అమ్మరాజ విష్ణు వర్ధనుని (క్రీ. శ. పదవశతాబ్ది) చే రాజమహేంద్రవర (ఇప్పటి రాజమండ్రి) పట్టణము నిర్మింపబడెను. ఆ మహారాజునకు గల ఒక బిరుదమును అనుసరించి ఆ పట్టణమునకు ఆ పేరిడబడినది. చాళుక్యుల కాలమున ఇచట బ్రాహ్మణ మతము పునరుద్ధరింపబడి బౌద్ధమత మంతరించి ద్రాక్షారామాది శైవారామములు రూపొందినవి. చాళుక్య రాజగు రాజరాజ నరేంద్రుని కాలమున ఆతని కుల బ్రాహ్మణుడగు నన్నయ భట్టారకుడు తెలుగున తొలి మహాకావ్యమగు ఆంధ్ర మహా భారత రచనమునకు పూనుకొని దాదాపు మూడు పర్వములను రచించెను. పూర్వ చాళుక్య, చోళవంశములు ఒకే రాజ కుటుంబముగ రూపొంది దక్షిణ దేశము నుండి రాజు పాలించునపుడు పశ్చిమ చాళుక్య దురాక్రమణ నణచుటకు చాళుక్య చోళులకు సాయ పడిన వెలనాటి చోడులు ఇచట రాజ ప్రతినిధులుగ 12 వ శతాబ్ది మధ్యమున అధికారము వహించిరి. కాని ప్రత్యక్షాధికారము మాత్రము ప్రబల మాండలికులగు కోనహైహయులయు, కొందరు పూర్వ చాళుక్య వంశీయులయు వశమున ఉండెను. ఇట్టి మాండలికుల నందరను నిర్జించి వెలనాటి రెండవ కులోత్తుంగ చోడదేవుడు ఈ ప్రాంతమునంతటిని వశపరచుకొనెను. కాని ఇంతలో క్రీ. శ. 1212 ప్రాంతమున కాకతీయ గణపతి దండయాత్ర ఫలితముగ ఈ మండలము కాకతీయ రాజ్యాంతర్గతమయ్యెను. కాకతీయ రాజ్యము తురుష్కుల ధాటికి ఆగజాలక అస్తమించిన తదుపరి ఈ ప్రాంతము తురుష్కుల

వశమయ్యెను. 1326 లో రాజమహేంద్రవరము పరిపాలన నిర్వహించిన అప్పటి సాలార్ ఉన్వీ అను సర్దార్ అచటి దేవాలయమును పడగొట్టించి మశీదును నిర్మింప చేసెను. ఆంధ్రప్రాంతమున నిర్మింపబడిన తొలుతటి మశీదు ఇదియే. కాని తురుష్కుల విజయము మూన్నాళ్ల పండుగయే యైనది. వారిని పారద్రోలుటకు తెలుగు నాయకులు ముసునూరి ప్రోలయ నాయకత్వమున కృషి యొనర్చి 1327 నాటికి ఈ ప్రాంతమును విముక్త మొనర్చిరి. పూర్వమీ జిల్లాలో కలిసి ఉండిన భద్రాచలము తాలూకాలోని రేకపల్లియే ముసునూరి నాయకుల రాజధాని. ముసునూరి వంశపు ప్రతిభ సన్నగిలిన వెంటనే ఇందు పెక్కుమాండలికులు స్వతంత్రులైరి. వీరి నందరిని అణచి కొండవీటి రెడ్డి రాజగు అనవేమారెడ్డి (1364 - 1386) ఈ ప్రాంతమును తన రాజ్యమున అంతర్లీనము కావించెను. ఈ రెడ్డి రాజులలో ఒకడగు కుమారగిరి విస్తృతమగు తన రాజ్యమున ప్రాచ్యభాగమును రాజమహేంద్రవరము ముఖ్యనగరముగ వేరుచేసి దానికి కాటయవేము డను తన బావమరదిని ప్రతినిధిగ నియమించెను. కుమారగిరి మరణానంతరము కాటయవేముడు (1395 - 1414) స్వతంత్రుడయ్యెను; ఈ కాటయవేముడు మహా పండితుడు. కాళిదాసు నాటకత్రయమునకు ఇతడు వ్యాఖ్యలు రచించెను. కాటయవేముని అనంతరమునను కొండవీడు, రాజమహేంద్రవరములకు కలతలు సమయక ఈ కుటుంబ కలహముల వలన ఈ రెండు రాజ్యములు బలహీనములయ్యెను. కడకు 1366-70 మధ్య రాజమహేంద్రవర రాజ్యప్రాంతమంతయు కళింగ గజపతుల వశమయ్యెను.

తరువాత క్రీ. శ. 1473 ప్రాంతమున గజపతుల సింహాసనమునకై బయలుదేరిన తగవులను అవకాశముగ గ్రహించి బహ్మనీ ప్రభువులు ఈ ప్రాంతమును వశపరచుకొనిరి. కాని 1484 లో గజపతులు ఈ మండలమును తిరుగ వశపరచుకొని పరిపాలించిరి. క్రీ. శ. 1515 లో కృష్ణదేవరాయలు ఈ ప్రాంతమును జయించినను గజపతులతో జరిగిన ఒడంబడిక వలన గజపతులకే ఇది దక్కి 1543 వరకు వారి అధీనముననే ఉండినది. ఆ సంవత్సరమున ఇది గోలకొండ కుతుబ్‌షాహీ సామ్రాజ్యాంతర్గత మయ్యెను. తరువాత ఇది మొగలుల వశమై, వారినుండి వారి ప్రతినిధులగు అసఫ్‌జాహీల వశమై, వారినుండి ఫ్రెంచివారికి 1753 లో దత్తమొనర్పబడినది. కాని బ్రిటిషువారు ఈ జిల్లా యందలి పిఠాపురమునకు సమీపమున గల చందుర్తి యందు 1758 సెప్టెంబరు 19 వ తేదీన ఫ్రెంచి వారిని ఓడించుటతో ఫ్రెంచి అధికారమిట అస్తమించినది. తరువాత 1766 లో అసఫ్‌జాహీ ప్రభువు బ్రిటీషు వారి కీ ప్రాంతమును దత్త మొనర్చి సంక్రమాధికారమును కలిగించెను.

బ్రిటిష్‌వారికి చేరునప్పటికి రాజమండ్రి సర్కారు అను ఈ ప్రాంతము కొన్ని మార్పులు చేర్పులతో 1802 లో రాజమండ్రి జిల్లాగా వ్యవస్థిత మొనర్పబడి, 1859 లో గోదావరి జిల్లాగా మారినది. అపుడు కార్యస్థానము కాకినాడకు మార్చబడినది. 1860 లో నైజాము బ్రిటిష్ వారి కొసగిన భద్రాచలము తాలూకాయు తరువాత ఈ జిల్లాకు చేర్చబడినది. 1904 నాటికి గోదావరి జిల్లా పెరిగి పోవుటచే గోదావరి నదికి తూర్పువైపు(పోలవరము డివిజను మినహా) తూర్పుగోదావరి జిల్లాగా రూపొందింపబడినది. తరువాత పోలవరము డివిజను కూడ పశ్చిమ గోదావరి జిల్లాకు చేర్చబడినది. ఆంధ్రప్రదేశ్ నిర్మాణానంతరము 1960 లో ఇందలి భద్రాచలము, నూగూరు తాలూకాలు ఖమ్మం జిల్లాలో చేర్చబడినవి.

చీ. శే. రా.

# పశ్చిమ గోదావరి జిల్లా

**ఉనికి - విస్తీర్ణము :** కృష్ణాజిల్లాను విభజించి (1925) పశ్చిమ గోదావరి జిల్లా ఏర్పాటు చేయడమైనది. తూర్పు గోదావరి జిల్లానుండి పోలవరము తాలూకాను విడదీసి (1942) పశ్చిమ గోదావరి జిల్లాకు కలిపిరి. ఈ జిల్లాకు సరిహద్దులుగ ఉత్తరమునను తూర్పునను తూర్పు గోదావరి జిల్లాయు, దక్షిణమున కృష్ణా జిల్లా, బంగాళా ఖాతములును, పడమట కృష్ణా, ఖమ్మం జిల్లాలును కలవు. జిల్లా మొత్తము విస్తీర్ణము 3,015 చ. మైళ్ళు.

**నైసర్గిక స్వరూపము :** భౌతిక పరిస్థితుల ననుసరించి ఈ జిల్లాను మూడు సహజ భాగములుగ విభజింపవచ్చును:

1. కొండ ప్రాంతము : దీనియందు ఏజన్సీ అని వ్యవహరింపబడు పోలవరము తాలూకా కలదు. ఈ కొండలు తూర్పు కనుమలలో ఒక భాగము. ఇందు నివసించువా రెక్కువగ కోయలనబడు కొండజాతులవారు.

2. మెట్ట ప్రదేశము : ఇందు చింతలపూడి తాలూకా, ఏలూరు, తాడేపల్లి గూడెము, కొవ్వూరు తాలూకాల లోని ఉత్తర భాగములును కలవు.

3. డెల్టా : నర్సాపురము, భీమవరము, తణుకు తాలూకాలు సమతలముగ ఉండి గోదావరి, కృష్ణానదుల నీటిచే సాగుచేయబడు చున్నవి.

దక్షిణమున నరసాపురము తాలూకాలో సాగుకు వీలుకాని బురదనేలలును, చిట్టడవులును కలవు. మెట్ట ప్రదేశమందు ముఖ్యముగా చింతలపూడి తాలూకాయందు నేల ఎగుడు దిగుడుగా ఉండి చిన్నచిన్న కొండలు, గుట్టలు కలవు. డెల్టా ప్రాంతమంతయు చదునుగా ఉండి, పైరు కాలమున చూచుట కతి మనోజ్ఞముగ ఉండును.

నదులు : పోలవరము తాలూకా ఈశాన్యభాగము మొదలుకొని నరసాపురము తాలూకా ఆగ్నేయపు మూలవరకు జిల్లా తూర్పు సరిహద్దును చుట్టి గోదావరి నది ప్రవహించు చున్నది. చిన్న నదులలో ముఖ్యమైనవి తమ్మిలేరు, ఎర్రకాలువ, బైనేరు, కొవ్వాడ కాలువ, జల్లేరు, రాళ్ళమడుగు, గుండేరు అనునవి; వీనివలన కొన్ని పంట చెరువులకు నీరు లభించుచున్నది.

ఏలూరు తాలూకాలో దక్షిణమున కొల్లేరు అను సరస్సు కలదు. గోదావరి, కృష్ణా నదులుతెచ్చిన ఒండ్రుతో పెరిగిన రెండు డెల్టాలమధ్య క్రమేణ ఏర్పడిన మడుగిది. పరిసర డెల్టా ప్రదేశముల మురుగు నీరు ఈ కొల్లేరులో పడును. ఈ సరస్సు నిండిన తరువాత నీరు సముద్రమునకు పోవుటకు ఈ సరస్సునుండి ఉప్పుటేరు అను కాలువ సముద్రమునకు పోవును. కాని కొల్లేరులో వచ్చి పడెడు నీరు ఈ ఉప్పుటేరునకు కూడ సాధారణముగ మిక్కుటముగ ఉండును. కావున కొల్లేరు వరద నీరు పరిసర ప్రాంతముల అన్నింటిని చాల కాలము ముంచుచుండును. దీనిని 'కొల్లేరు ముంపు' అందురు. ఈ ముంపును నివారించి, భూములను సేద్యమునకు తీసికొని వచ్చుటకు ఇంజనీర్లు పరిశోధించిరి. ఏటేట ఒండ్రు చేరుటతో కొల్లేరుకూడ క్రమేణ లోతు తగ్గుటతో వరదబాధ ఇంకను ఎక్కువగు చున్నది. ఉప్పుటేరున ఇంతకన్న 3 లేదా 4 రెట్లు ఎక్కువ నీరు పోవునట్లు చేసినచో ఈ వరదబాధ తగ్గి ఈ ప్రదేశము సాగునకు అనుకూలముగ మారగలదు. కాని ఉప్పుటేరు వెడల్పు పెంచుటకు విపరీతముగ వ్యయమగును.

శీతోష్ణస్థితి : జిల్లాయం దంతటను శీతోష్ణస్థితి చాలవరకు అనుకూలముగ ఉండును. పోలవరము తాలూకా కొండ భూములలో డిశంబరు, జనవరి నెలలలో కోస్తా ప్రాంతమునకన్న చలి చాల ఎక్కువగ ఉండును. సంవత్సరమున సరాసరి వర్షము కురియు రోజులు 54; సరాసరి వర్షపాతము 40.41".

అడవులు : 384.3 చ. మైళ్ళ విస్తీర్ణముగల అడవి ప్రదేశము ఈ జిల్లాలో ఉన్నది. ఇందులో 178.7 చ. మైళ్లు రిజర్వు అడవి. ఈ రిజర్వు ప్రాంతమంతయు పోలవరము ఏజన్సీలో ఉన్నది. వెదురు, కలప, కంప ఈ అడవియందు విశేషముగ కలవు. చింతలపూడి, కొవ్వూరు, ఏలూరు తాలూకాలలో ఉన్న అడవి చిట్టడవి. ఇది అంతయు పొదలతో నిండి ఉన్నది. భీమవరము తాలూకాలోని అడవియు అంత విలువైనది కాదు. అడవినుండి లభించు ముఖ్యమైన ఫలసాయము వెదురు, కలప. ఇది పోలవరము ఏజన్సీలో మాత్రమే దొరకుచున్నది. గోదావరి నది మీద ఈ కలపను ఎగుమతి చేయుదురు. అడవులలో పశువులను మేపుకొనుటకు ప్రభుత్వము రైతులకు వసతులు ఏర్పరచినది.

ఖనిజ సంపద : గోదావరి ప్రాంతమున నేలబొగ్గు పొరలు కలవు ; కాని త్రవ్వకపు పని జరుగుటలేదు.

పట్టణములు : ఈ జిల్లాలో ఏలూరు, భీమవరము, పాలకొల్లు, నరసాపురము, తాడేపల్లి గూడెము అను అయిదు పట్టణములకు మునిసిపాలిటీలు కలవు. ఇతర పట్టణములు తణుకు, కొవ్వూరు, పెనుగొండ.

ఏలూరు : జనసంఖ్య 1,08,367 ; జిల్లా కేంద్రము.

భీమవరము: జనసంఖ్య 43,846 ; తాలూకా కేంద్రము.

పాలకొల్లు : జనసంఖ్య 28,595; ప్రసిద్ధమైన వాణిజ్య కేంద్రము; ప్రతి శనివారము భారీ ఎత్తున సంత జరుగును.

నరసాపురము : జనసంఖ్య 29,971 ; తాలూకా కేంద్రము.

తాడేపల్లి గూడెము : జనసంఖ్య 27,121; తాలూకా కేంద్రము.

ప్రజలు : ఈ జిల్లా జనసంఖ్య 19,78,434 *. పురుషులు 9,92,889, స్త్రీలు 9,85,545. జిల్లా సగటు జన సాంద్రత చ. మైలునకు 662. 1951-1961 మధ్య పది సంవత్సరములలో ఈ జిల్లా జనసంఖ్య 16.53% వృద్ధి ఐనది. ఆంధ్రప్రదేశ్ మొత్తము మీద హైద్రాబాదు జిల్లా తరువాత అత్యధిక జనసాంద్రత కలిగిన జిల్లా ఇది. అయిదుగురిలో నలుగురు పల్లెలలోనివసించు చున్నట్లు తెలుచున్నది.

మతములు : హిందువులు 15,64,551 ; మహమ్మదీయులు 34,147 ; క్రైస్తవులు 99,005 ; యూదులు 12 ; జైనులు 4; ఇతరులు 8 కలరు.

వృత్తులు : ప్రజలలో ఎక్కువ మంది రైతులు స్వంతముగ వ్యవసాయము చేసికొనువారును, మక్తాలకు ఇచ్చి అందలి ఫలసాయమును అనుభవించు వారును, కౌలుకు చేసికొనువారును, వ్యవసాయ కార్మికులును – వీరందరు వ్యవసాయాదాయము వలననే జీవించు చున్నారు. 1951 లెక్కలను అనుసరించి వీరి సంఖ్య 12,44,876 ; వ్యాపారమువలన జీవించువారు 90,630 ; పరిశ్రమల వలన జీవించు

* 1961 జనాభా లెక్కల ప్రకారము.

## పశ్చిమ గోదావరి జిల్లా - తాలూకా వివరములు

| వరుస సంఖ్య | తాలూకా పేరు | తాలుకా కేంద్రము | గ్రామముల సంఖ్య | గ్రామీణ జనాభా | పట్టణములు | పట్టణ జనాభా | విస్తీర్ణము (చదరపు మైళ్లలో) | మొత్తము నీటి పారుదల వసతి గల నేల విస్తీర్ణము (ఎకరములలో) | సాగుచేయబడిన నేల (ఎ॥ములలో) | ప్రస్తుతము సాగులో లేని బీడు నేల (ఎ॥ములలో) | మొత్తము సాగుకు తగిన నేల (ఎ॥ములలో) | సాగుచేయ వీలగు బంజరు నేల (ఎ॥లలో) |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. | భీమవరము | భీమవరము | 85 | 1,78,834 | 4 | 57,258 | 292 | 1,32,653 | 1,35,792 | 514 | 1,36,306 | 7,053 |
| 2. | చింతలపూడి | చింతలపూడి | 84 | 1,00,187 | — | — | 418 | 47,230 | 1,01,279 | 5,844 | 1,07,123 | 1,03,348 |
| 3. | ఏలూరు | ఏలూరు | 126 | 1,73,386 | 1 | 87,213 | 510 | 1,41,842 | 1,62,150 | 53,296 | 2,15,446 | 20,994 |
| 4. | కొవ్వూరు | కొవ్వూరు | 92 | 1,90,587 | 2 | 23,033 | 391 | 34,561 | 1,21,443 | 1,449 | 1,22,892 | 8,785 |
| 5. | నర్సాపురము | నర్సాపురము | 65 | 2,27,186 | 4 | 66,587 | 279 | 98,889 | 1,23,976 | 8,463 | 1,32,439 | 4,959 |
| 6. | పోలవరము | పోలవరము | 128 | 97,245 | — | — | 551 | 22,758 | 78,645 | 248 | 78,893 | 38,016 |
| 7. | తాడేపల్లి గూడెము | తాడేపల్లి గూడెము | 98 | 1,95,046 | 2 | 22,077 | 360 | 1,20,672 | 1,45,556 | 8,940 | 1,54,496 | 20,803 |
| 8. | తణుకు | తణుకు | 91 | 2,03,987 | 7 | 74,119 | 214 | 91,894 | 1,08,461 | 14,576 | 1,23,037 | 4 |
| | | మొత్తము | 769 | 13,66,458 | 20 | 3,31,192 | 3,015 | 6,90,844 | 9,77,302 | 93,330 | 10,70,632 | 2,04,622 |

వారు 1,49,490; తక్కినవా రితర ఉద్యోగములలో జీవించు చున్నారు.

భాషలు : జిల్లాలోని ప్రజలలో అత్యధిక సంఖ్యాకుల మాతృభాష తెలుగు - 1951 లెక్కల ప్రకారము వీరి సంఖ్య 16,47,308; హిందుస్తానీ 22,979; కోయ 19,812; ఒరియా, లంబాడీ మొదలగు భాషలు మాట్లాడువారు అత్యల్ప సంఖ్యాకులు కలరు; అందరికిని తెలుగు బాగుగ తెలియును.

వ్యవసాయము: సేద్యరీత్యా జిల్లాలలోని భూమి ఒండ్రు, నల్లరేగడ, ఎర్రనేల అను మూడు రకములుగ కలదు; ఒండ్రు నేల ఎక్కువగా ఉన్నది. చింతలపూడి తాలూకాలో ఎర్రనేల మాత్రమే ఎక్కువగ కన్పట్టు చున్నది. నరసాపురము, తణుకు తాలూకాలలో ఒండ్రు నేల విస్తారముగ ఉన్నది. ఏలూరు తాలూకాయందు నల్ల రేగడ నేల అత్యధికము. ఒండ్రు నేల చింతలపూడి తాలూకాలో తప్ప తక్కిన అన్ని తాలూకాలలో కొద్దియో గొప్పయో కనబడుచున్నది.

నీటి పారుదలచే జరుగు వ్యవసాయము ముఖ్యముగ గోదావరి, కృష్ణా నదుల కాలువల సాయమున జరుగు చున్నది. మెట్ట తాలూకాలలో పల్లపు సాగు చెరువుల క్రింద కొంత గలదు. ఈ చెరువులలో కొన్నింటికి మాత్రము వాగులు, సెలయేళ్లవలన నీరు వచ్చుచున్నది. తక్కిన వన్నియు వర్షముమీదనే ఆధారపడవలసి ఉన్నది. ఏరులు, వాగులు ప్రక్కన భూములున్న కొందరు రైతులు పంపు లతోగాని, మోటలతోగాని నీరును పైకి తోడి సేద్యమునకు ఉపయోగించుకొను చున్నారు. మెట్టప్రదేశములలో తోట పైరుల సాగునకు స్వంత మోట బావులు గలవు. నీటి పారుదల కుపయోగింపబడు చెరువులు ఈ జిల్లాలో 976 కలవు; వాని క్రింద ఆయకట్టు 38,900 ఎకరములు. కృష్ణా, గోదావరి కాలువల వంటి మేజరు ఇరిగేషను ప్రాజెక్టుల క్రింద సాగగు భూమి 7,45,883 ఎకరములు.

జిల్లాలోని పంటలన్నిటిలో వరి పంట ముఖ్యమైనది. సాగు క్రింద ఉన్న 13,08,581 ఎకరములలో నీటి పారుదల గల భూమి 8,35,166 ఎకరములు.

పశ్చిమ గోదావరి జిల్లా - పంటల వివరములు

1955 - 56

| | | | | | |
|---|---|---|---|---|---|
| వరి | 8,01,046 | ఎ. | వరిగ | 2,554 | ఎ. |
| జొన్న | 49,697 | ,, | సామ | 3,306 | ,, |
| సజ్జ | 6,555 | ,, | ఇతర పొట్టు ధాన్యములు | 393 | ,, |
| మొక్కజొన్న | 1,614 | ,, | శనగలు | 2,508 | ,, |
| రాగి | 5,486 | ,, | పెసలు | 1,798 | ,, |
| కొఱ్ఱ | 803 | ,, | | | |
| కందులు | 5,551 | ఎ. | ప్రత్తి | 3 | ఎ |
| మినప | 2,219 | ,, | జనుము | 1,668 | ,, |
| ఉలవ | 59,714 | ,, | వేరుశనగ | 12,452 | ,, |
| ఇతర పప్పు ధాన్యములు | 3,211 | ,, | తక్కిన నూనె గింజలు | 66,750 | ,, |
| మిరప | 14,187 | ,, | పొగాకు | 39,193 | ,, |
| పసుపు | 3,915 | ,, | మేత పైరులు | 7,783 | ,, |
| ధనియాలు | 2,700 | ,, | పచ్చి ఎరువు పైరులు | 11,495 | ,, |
| చెఱకు | 17,541 | ,, | | | |
| కూరలు, పండ్లు, దుంపలు | 33,851 | ,, | | | |

పై లెక్కలో చేరని చిల్లర పైరులు 4,448 ఎకరములు.

వాణిజ్య పంటలలో ఈ జిల్లాలో పండునవి చెఱకు, వేరుశనగ, నువ్వులు, ప్రత్తి, పొగాకు. నువ్వులు మాగాణి భూములలో రెండవ కారున పండింతురు. వీనిని 'పైరు నువ్వులు' అందురు. మెట్ట ప్రదేశములలో మొదటి కారున పండించునవి 'పునాస' నువ్వులు. మాగాణిలో గాని, మెట్టలోగాని పెక్కు ప్రాంతములందును, అందును ముఖ్యముగ చింతలపూడి తాలూకాలోను, నరసాపురము తాలూకా పాలకొల్లునందును బత్తాయి నారింజ తోటలు కలవు. డెల్టా ప్రాంతములో నరసాపురము, తణుకు తాలూ కాలలో కొబ్బరి తోటలు విరివిగా కలవు. గోదావరి నదిలో అక్కడక్కడ 'లంకలు' కలవు; ఏటేట గోదావరి నది తెచ్చిపెట్టు ఒండ్రు మట్టిచే అతి సారవంతములని ఈ లంకలు పేరుపడ్డవి. అప్పుడప్పుడు కొన్ని లంకలు కొట్టు కొని పోవుటయు, కొన్నింటిలో ఇసుకమేట వేయుటయు కలదు. ఈ లంకలను పాటకు పెట్టి సాధారణముగా కౌలు కిచ్చెదరు; కాని ఇప్పుడిప్పుడు వ్యవసాయ సహకార సంఘములను ప్రోత్సహించుటకై ఒక నిర్ణీత కౌలు మొత్తమునకు ఆ సంఘములకు ఈ లంకలను ప్రభు త్వము కౌలు కిచ్చుచున్నది. ఈ లంకలలో ఎక్కువగా పండునవి జొన్న, పొగాకు. ఎక్కువ కాలము కౌలుకు తీసి కొన్న లంకలలో అరటి తోటలను కూడ వేయుట కద్దు.

వ్యవసాయము చేయు పద్ధతులలో ఎక్కువమంది రైతులు పూర్వ పద్ధతులలోనే వ్యవసాయము చేయు చున్నారు. కాని ప్రభుత్వమువారి ప్రోత్సాహ ఫలిత ముగ సారపు ఎరువులను, ఎముకల పొడిని ఎరువుగ ఉపయోగించుట క్రమేణ అమలులోనికి వచ్చుచున్నది. ప్రభుత్వమువారి ప్రోత్సాహ ఫలితముగ 'పేకేజి'*

* 'పేకేజి' పద్ధతి ఇటీవల భారత ప్రభుత్వము ఫోర్డు ఫౌండే షన్ అను అమెరికన్ ధార్మిక సంస్థ వారి ద్రవ్య సహాయ ముతో ప్రతి రాష్ట్రములోనూ ఒక్కొక్క జిల్లాలో ప్రవేశపెట్టి నది. ఈ అవకాశము ఆంధ్రప్రదేశ్‌లో పశ్చిమ గోదావరి జిల్లాకు లభించినది. 'పేకేజీ' కార్యక్రమము ప్రకారము వ్యవ

విధానము ప్రాయోగికముగ ప్రవేశపెట్టబడినది. ట్రాక్టర్లు, బుల్‌డోజర్లు కూడ అక్కడక్కడ ఉపయోగింపబడు చున్నవి. మారుటేరులో వ్యవసాయ పరిశోధనా కేంద్ర మొకటి కలదు; ఈ కేంద్రములో వరివంగడముల పరిశోధనకు తోడు ప్రత్తి, అరటి, చెఱకు పంటల విషయమై కూడ పరిశోధనలు జరుపుచున్నారు.

పశు సంపద: పశు సంపత్తి విస్తారముగ కలదు. మాగాణి యందు రెండవ పైరు జనుమును వేసి పశువులకు మేతగా ఉపయోగింతురు. లంకలలో కూడ పశువులను మేపుటకు వసతులు కలవు. పశు వైద్య కేంద్రములు ఏలూరు, పాలకొల్లు, తణుకు, తాడేపల్లి గూడెము, భీమవరము పోలవరములలో కలవు.

చేపల పరిశ్రమ: కొల్లేరు సరస్సుమీదను, నదీ పరిసరముల మీదను చాలవరకు ఆధారపడి చేపల పరిశ్రమవలన జీవించు వారు కొందరు కలరు. బెస్తల సంఘములు ఈ జిల్లాలో తొమ్మిది కలవు. కొల్లేరు సరస్సునందు పట్టిన చేపలు దూర ప్రాంతములు చేరుటకు ప్రభుత్వము తగు వసతు లేర్పరచినది.

గృహ పరిశ్రమలు: గృహ పరిశ్రమ లన్నిటిలోను ఈ జిల్లాలో ఎక్కువ వ్యాప్తియందున్నది చేనేత పరిశ్రమ. 18,783 మంది జిల్లా మొత్తము మీద ఈ వృత్తి మీద ఆధారపడి జీవించు చున్నారు. ఇంతకు మించి వ్యాప్తిలో ఉన్న గృహ పరిశ్రమ లేమియు లేవు. రైతులకు అనుబంధ పరిశ్రమగా ఉండుటకు తేనెపరిశ్రమను ప్రభుత్వము ప్రోత్సహించుచున్నది. ప్రభుత్వము వారిచే ఒక నమూనా గృహ పరిశ్రమల కేంద్రము గోపన్నపాలెములో నడప బడుచున్నది. పూర్వకాలము నుండియు ఏలూరు తివాచీ పరిశ్రమకు ప్రసిద్ధి వహించినది. తివాచీ పరిశ్రమను, నర్సాపురము లేసు అల్లిక పరిశ్రమను ప్రోత్సహించుటకు ప్రభుత్వము రీజనల్ అడ్వైజరీ బోర్డులను నియమించినది. ధర్మాజీగూడెము కంబళ్ల నేతకు ప్రశస్తి పొందినది.

పరిశ్రమలు: ఏలూరులో జూట్ మిల్లు, పెనుగొండలో చిన్న తరహా ఇనుప కార్ఖానాలు, తణుకులో నూలు మిల్లు, పంచదార మిల్లు; డెల్టాతాలుకాలలో బియ్యపు మిల్లులు కలవు.

---

సాయ పద్ధతిలో అధునాతనమైన మార్పులను ప్రవేశ పెట్టి తీవ్ర కృషి చేయుటకు ప్రయత్నము జరుగును. అనగా రైతుకు 'పెట్టుబడి, సాంకేతిక సలహా, యంత్ర సహాయము, మేలైన విత్తులు, సారపు ఎరువులు, ఉత్తమమైన అమ్మకపు పద్ధతులు' ఒక్కుమ్మడిగా లభించును. ఇదియే 'పేకేజి' పద్ధతి యందు ప్రత్యేకత.

రోడ్లు: జిల్లా యందలి అన్ని విధములగు రోడ్ల పొడవు 1,237 మైళ్లు. ఇందు 40 మైళ్లు జాతీయ రహదార్లకు చెందును; రాష్ట్రప్రభుత్వము వారిది 507 మైళ్లు. మిగిలిన రోడ్లు స్థానిక సంస్థల అధీనమున కలవు. గోదావరి, కృష్ణా నదుల కాలువలు కూడ రహదారులుగ ఉపయోగపడు చున్నవి. ఇందలి పడవలలో సరకులే కాకుండ ప్రయాణికులు కూడ జిల్లా లోపలి భాగమునకు చేర కలుగుచున్నారు. చింతలపూడి, కొవ్వూరు తాలూకాలలో గ్రామసీమలందు రాకపోకల వసతు లేమియు తగినన్ని లేవు.

రైలు మార్గములు: జిల్లాయందు బ్రాడ్‌గేజ్ రైలు మార్గము 107¾ మైళ్లు; మద్రాసు నుండి కలకత్తా పోవు మార్గము ఏలూరు, తాడేపల్లి గూడెము, కొవ్వూరు తాలూకాల ద్వారా పోవుచున్నది. నిడదవోలు నుండి ఒక బ్రాడ్‌గేజ్ శాఖా మార్గము తణుకు, భీమవరము తాలూకాల గుండ నరసాపురము పోవుచున్నది. మరొక బ్రాడ్‌గేజ్ శాఖ భీమవరము నుండి, కృష్ణా జిల్లాలోని గుడివాడకు పోవుచున్నది. చింతలపూడి, పోలవరము తప్ప తక్కిన తాలూకా కేంద్రము లన్నియు రైలుమార్గముమీదనే ఉన్నవి. చింతలపూడి, పోలవరము తాలూకాలలో రైలు ప్రయాణ వసతులు లేవు.

ఎగుమతులు: వైశాల్యమున చిన్నదైనను పంట విషయమున ఈ జిల్లా మిగులు జిల్లాగ పేరు పొంది దక్షిణాది ధాన్యాగారము అను ఖ్యాతిని ఆర్జించినది. వరి ధాన్యము, బియ్యము, కొబ్బరికాయలు, పండ్లు, జీడిపప్పు ఈ జిల్లా నుండి ముఖ్యముగ ఎగుమతి అగుచున్నవి. పాలకొల్లు, తాడేపల్లిగూడెము ప్రముఖ వాణిజ్య కేంద్రములు.

విద్య: 1961 లెక్కల ప్రకారము ఈ జిల్లా ప్రజలలో అక్షరాస్యత 30.29%; పురుషులలో 37.54%; స్త్రీలలో 22.99%. జిల్లా మొత్తము మీద పోలవరము, చింతలపూడి తాలూకాలలో విద్యావ్యాప్తి చాల తక్కువ. 1956-57 వ సంవత్సరమున ఈ జిల్లా యందున్న వివిధ వర్గములకు చెందిన విద్యాశాలల సంఖ్యా వివరములు దిగువ ఈయబడినవి:

| విద్యా సంస్థల వివరము | వాని సంఖ్య | ఉపాధ్యాయ సంఖ్య | విద్యార్థుల సంఖ్య |
|---|---|---|---|
| ప్రాథమిక పాఠశాలలు | 1,856 | 6,405 | 2,01,968 |
| మాధ్యమిక పాఠశాలలు | 11 | 69 | 1,458 |
| ఉన్నత పాఠశాలలు | 63 | 1,379 | 30,906 |
| వయోజన విద్యా కేంద్రములు | 64 | 84 | 1,659 |
| ప్రత్యేక, వృత్తి పాఠశాలలు | 30 | 85 | 1,931 |
| | 2,024 | 8,042 | 2,37,922 |

ఇవి కాక భీమవరములో ఒకటియు, నరసాపురములో ఒకటియు, ఏలూరులో రెండు*ను ఆర్ట్సు అండ్ సైన్సు కళాశాలలు కలవు. వీని అన్నింటి యందు కలిసి 3,692 మంది విద్యార్థులు, 168 మంది విద్యార్థినులు కలరు. కొవ్వూరులో గీర్వాణ విద్యాపీఠము కలదు. తణుకులో వైయక్తిక యాజమాన్యమున ఒక ఇంజనీరింగ్ పాలి టెక్నిక్ సంస్థ కలదు.

ఆరోగ్యము, వైద్యము : ఈ జిల్లాలోని పోలవరము తాలూకా యందు మలేరియా విపరీతముగ వ్యాప్తిలో ఉన్నది; భీమవరము ప్రాంతమున బోదకాలు జ్వరము కొంత వ్యాప్తిలో ఉన్నది. వీని నివారణకై ప్రభుత్వము ప్రత్యేక కృషి చేయుచున్నది. జిల్లా మొత్తము మీద ఆధునిక వైద్య విధానమును అనుసరించి వైద్యసహాయము చేయు 9 జనరల్ ఆసుపత్రులు, 9 డిస్పెన్సరీలు ఉన్నవి. వీని యందలి మంచముల సంఖ్య 778. ఇవికాక యూనానీ 1, ఆయుర్వేద వైద్యశాలలు 20 కలవు.

చూడవగిన స్థలములు : ఈ జిల్లాయందలి నరసాపురము చాల ప్రసిద్ధి పొందిన పురాతన స్థలము. దీనికి దగ్గరగ నున్న మాధవాయపాలెం ఒకప్పుడు పెద్ద రేవుగ ఉండి అంతర్జాతీయ ఖ్యాతిని ఆర్జించినది. ఆనాడిది విదేశ వ్యాపారముననే కాక, ఓడల నిర్మాణమున సైతము పేరు పొందినది. ఆ కాలమున విదేశముల నుండి ఓడలు సైతము మరమ్మతులకు ఈ రేవునకు వచ్చెడి వని చారిత్రకులు వ్రాసిఉన్నారు. ఏలూరునకు కొంత దూరమున ఉన్న పెదవేగి, చినవేగి గ్రామములందు పూర్వ చాళుక్యుల రాజధాని అగు వేంగీనగరపు శిథిలములు కొన్ని కాననగును.

ఈ జిల్లాయందలి పెనుగొండ, లంకలకోడేరు, బొండాడ అనునవి ఒకప్పుడు జైనులకు ముఖ్య కేంద్రములుగ ఉండెడివని ఈ ప్రాంతములో బయల్పడిన విగ్రహములు చాటుచున్నవి.

హిందువుల పుణ్యక్షేత్రములలో ఈ జిల్లాయందు పేర్కొనదగినవి భీమవరము, పాలకొల్లు, ద్వారకా తిరుమల.

భీమవరము : పంచారామములలో పేర్కొనబడు భీమారామము ఇదియే అని కొందరి విశ్వాసము. ఇచటికి సమీపమున ఉన్న గునుపూడిలోని సోమసుందర శివలింగ క్షేత్రమే భీమారామ మని యందురు.

పాలకొల్లు : పంచారామములలో క్షీరారామ మని పేర్కొనబడినది ఇదియే అని భక్తజనుల విశ్వాసము. ఇట రామలింగేశ్వర స్వామి దేవళమును, ఎత్తైన ఒక గోపురమును కలవు.

* ఒకటి మహిళలకు

జిల్లా సంక్షిప్త చరిత్ర : ఈ జిల్లా యందలి గోదావరి తటమున అటనట కన్పడు ప్రాచీన శిలాయుగ స్థలముల వలనను, రాక్షసి గుళ్లవలనను, ఈ ప్రాంతము పురాతన కాలము నుండియు మానవుని నివాస భూమిగ ఉండెనని తెలియ వచ్చుచున్నది. మౌర్యయుగమున వారి విశాల సామ్రాజ్యమున చేరి ఉండిన ఈ మండలము ఆ సామ్రాజ్య మస్తమించిన తరువాత ఆంధ్ర సాతవాహన రాజ్యాంతర్గత మైనది. ఆనాడిచట వైదిక మతముతో పాటుగ బౌద్ధ మతమునకు విశేషాదరణ ముండెను. ఈ జిల్లాలోని కామవరపు కోట (ఏలూరు తాలూకా)కు ఆరుమైళ్ల దూరమున ఉన్న గుంటుపల్లి గ్రామమున కన్పట్టు మలచిన స్తూప చైత్యము మున్నగు అచటి శాసనములను బట్టి క్రీ. పూ. రెండవ శతాబ్దికి చెందినవిగ నిర్ధారింప వీలగుచున్నది. ఈ ప్రాంతము నందు సాతవాహనుల కాలమున బౌద్ధ మతమునకు గల వ్యాప్తిని ఇవి విశదీకరించు చున్నవి. సాతవాహనుల వైభవము సన్నగిలిన వెనువెంటనే ఇచట రూపొందిన రాజ్య మేదియో విస్పష్టముగ తెలియవచ్చుట లేదు. ఆనాడు కృష్ణానదీ తటమున గల విజయపురి రాజధానిగ రాజ్యమేలిన ఇక్ష్వాకుల రాజ్యమున ఇదియు చేరి ఉండెనని కొందరు పేర్కొనిరి. కాని అందులకు తగు ఆధారములు ఏమియు కన్పట్టుటలేదు.

క్రీ. శ. మూడవ శతాబ్దియందు ఇచ్చట బృహత్ఫలాయనులనువారి శాసనము సమీపమున కృష్ణాజిల్లాయందు కన్పట్టుటచే ఈ ప్రాంతము కూడ వారి రాజ్యమున చేరి యుండెనని భావించుటకు కొంత అవకాశము కలదు. వారి తరువాత మూడవ శతాబ్ది అంతముననో, నాలుగవ శతాబ్ది మొదటి పాదముననో ఈ మండలము శాలంకాయను లను రాజవంశపు వారి వశమయ్యెనని తెలియ నగుచున్నది; వీరి రాజధాని వేంగి నగరము. ఏలూరునకు సమీపమున నేడు పెదవేగి అని పిలువబడు కుగ్రామమున్న చోటనే పూర్వపు వేంగీ నగరము ఉండెడిది. సముద్రగుప్తుడు ఈ ప్రాంతమున దండెత్తి వచ్చునాటికి (క్రీ. శ. 350) ఇచట హస్తివర్మ అను రాజు పాలించుచుండెననియు, సముద్రగుప్తు డాతనిని ఓడించెననియు, సముద్రగుప్త ప్రశస్తి వలన తెలియ నగుచున్నది; ఈ హస్తివర్మ శాలంకాయన వంశములోనివాడు. వీరి తరువాత విష్ణుకుండినులను రాజవంశము వారు అయిదవ శతాబ్ది ఉత్తరార్ధమున ఈ ప్రాంతమును వశపరచుకొని, వేంగియే రాజధానిగ 7వ శతాబ్ది ప్రథమపాదము వరకు పాలించిరి. వీరి కాలమున బౌద్ధమతమునకు ఆదరణ లభించు చుండెననియు సుప్రసిద్ధ బౌద్ధ తార్కికుడు దిఙ్నాగుడు ఆ కాలమున











చిత్రము 1. నరసాపురము లేసు, 2. పశ్చిమ గోదావరి జిల్లాలో ప్రత్యేకంగా పండించబడిన కొబ్బరి,
3. భద్రాచలము దేవాలయము, 4. గోదావరి రైలు బ్రిడ్జి, రాజమండ్రి 5. కొల్లేరు సరస్సు - పెదసాగు నిమిత్తం జీలుగ కోత



చిత్రము 1. ఆంధ్రా సిమెంట్ ఫాక్టరీ, విజయవాడ



చిత్రము 2. కొండపల్లి కోట, కృష్ణా జిల్లా

వేంగికి సమీపమున వసించుచుండెననియు తెలియ వచ్చు చున్నది.

7వ శతాబ్ది ప్రథమ పాదమున ఈ రాజ్యము చాళుక్యుల వశమయ్యెను. అంతట వేంగీ నగరము రాజధానిగ పూర్వ చాళుక్య వంశము ఈ ప్రాంతము నంతర్భాగముగ గల విస్తృత రాజ్యమును విశేష కాలము పరిపాలించిరి. క్రీ. శ. 10 వ శతాబ్దిలో వీరు తమ రాజధానిని రాజ మహేంద్రవరము (ఇప్పటి రాజమండ్రి) నకు మార్చు కొనిరి. ఈ వంశము నందలి మొదటి చాళుక్య భీముడు పాలకొల్లు మొదలగు స్థలములందు శివాలయములను నెల కొల్పెను. చాళుక్యుల కాలమున ఏలూరు నిర్మితమయ్యెను.

ఈ జిల్లా యందలి పెనుగొండ ఆ కాలమున ప్రముఖ వాణిజ్య కేంద్రముగ ఉండెను. వైశ్యుల కులదేవతగ వాసి కెక్కిన వాసవీకన్య ఈ పెనుగొండలో జన్మించె ననియు, ఒక చాళుక్య చక్రవర్తి దురాగతము వలన ఆమెయు ఆమెతో పాటు 102 గోత్రముల వైశ్యులును అగ్నిప్రవేశ మొనర్చిరను సాంప్రదాయికముగ నుడువబడు చున్నది. ఇందలి చారిత్రకాంశముల గురించిన ఆధారము లేవియు ఇప్పటికి కన్పట్టలేదు.

చాళుక్య చోళ రాజ్య ప్రతిభ సన్నగిలిన వెనుక ఈ ప్రాంతపు చరిత్ర తూర్పు గోదావరి జిల్లా చరిత్రతో లీనమైనది. కాకతీయ రాజ్య మంతరించిన వెనుక ఈ జిల్లా యందు కొంత భాగమును కోరుకొండ నాయకులును, సూర్యవంశపు రాజులు కొందరు కొంత భాగమును స్వతంత్రముగ పాలించుటకు యత్నించినను త్వరలోనే రెడ్డి రాజులు వారి నణచి తమ రాజ్యమున ఈ ప్రాంతమును అంతర్భాగము కావించుకొనిరి. రెడ్డి రాజుల అనంతరము కళింగ గజపతు లిట కొంతకాలము ప్రభుత్వము నెరపిరి. అనంతరమున కుతుబ్‌షాహీలు ఈ ప్రాంతమును వశపరచు కొనిరి. తరువాత వారి తక్కిన రాజ్యముతోపాటిది మొగ లుల వశమై, వారినుండి ఆసఫ్‌జాహీలకు సంక్రమించెను. వీరి కాలమున ఈ ప్రాంతమంతయు ఏలూరు సర్కారున చేరి ఉండెను. ఈ జిల్లా యందలి మాధవాయపాలెం ఆ కాలమున ఒక ప్రసిద్ధ ఓడరేవుగ పేరు పొందినది. ఈ మాధ వాయపాలెం నరసాపురమునకు సమీపమున ఉన్నది. 1623 లో డచ్చివారు తొలుతగ నరసాపురమున ఒక ఇనుప కార్ఖానాను పెట్టుకొనిరి. మాధవాయపాలెమున ఇంగ్లీషు వారు 1677 లో ఒక ఫ్యాక్టరీ పెట్టుకొనిరి. ఈ రేవునందు ఆ కాలమున పెద్ద ఓడలు సైతము మరమ్మతు చేయ బడు చుండెడివి.

తక్కిన సర్కారులతోపాటు ఏలూరు సర్కారును ఈస్టు ఇండియా కంపెనీ వారికి 1766 లో ఈయబడినది. ఇది తొలుత కృష్ణా జిల్లాలో చేర్పబడి, తరువాత 1925లో వేరు చేయబడి పశ్చిమ గోదావరి జిల్లాగా రూపొందినది. ఆ తరువాత పోలవరము డివిజన్ మాత్రము తూర్పుగోదావరి జిల్లానుండి ఈ జిల్లాకు చేర్చబడినది (1942). చీ. శే. రా.

# కృష్ణా జిల్లా

**ఉనికి - విస్తీర్ణము :** తూర్పు కోస్తాన, ఉ. అక్షాంశము 15° 48′ నుండి 17° 10′ వరకును, తూ. రేఖాంశములు 80° నుండి 81° 33′ వరకును కృష్ణా జిల్లా విస్తరించి ఉన్నది. 1950 ప్రాంతమున ఈ జిల్లా సరిహద్దులలో చిన్న మార్పులు జరిగినవి. ఇదివరకు ఈ జిల్లాలో ఉన్న లింగ గిరి, సర్వవరము, కాలువపల్లి, లక్కవరము, అమర వరము, గనకలంద, మొలుగుమాడ్, రోంపిమల్ల, మల్ల వరము గ్రామములను పరిపాలన సౌకర్యము నిమిత్తము నల్గొండ జిల్లాలో చేర్చిరి. ఇందుకు బదులుగా ఇదివరకు నల్గొండజిల్లా పరిపాలనలో ఉన్న కొడవటి కల్లు, ఉస్తే పల్లి, వరటాల, గని ఆత్కూరు, మొగుల్లూరు, బత్తిన పాడు, గనుగుపాడు, బోరవంచ, మల్లాపల్లి, పుల్లపాడు అను గ్రామములు కృష్ణా జిల్లాలో చేర్చబడినవి. ఈ జిల్లాకు సరిహద్దులుగ తూర్పున పశ్చిమ గోదావరి జిల్లా, బంగాళా ఖాతములును; దక్షిణమున బంగాళాఖాతమును; పడమర గుంటూరు జిల్లాయును; ఉత్తరమున వరంగల్లు జిల్లా, పశ్చిమ గోదావరి జిల్లాను కలవు. జిల్లా మొత్తము విస్తీర్ణము 3,499 చ. మైళ్లు.

**నైసర్గిక స్వరూపము :** భౌతిక పరిస్థితులను అనుసరించి ఈ జిల్లాను 1. డెల్టా, 2. పీఠభూమి అని రెండు భాగములుగ విభజింప వచ్చును. బందరు, దివి, గుడివాడ, గన్నవరము, కైకలూరు, విజయవాడ తాలూకాలు డెల్టా భాగమున ఉన్నవి. జగ్గయ్యపేట, నందిగామ, తిరువూరు, నూజివీడు తాలూకాలు పీఠభూమి భాగమున ఉన్నవి. ఈ పీఠభూమి భాగము దక్కను పీఠభూమిలోనిదే అగు ఓచే తూర్పు కనుమలు ఈ ప్రాంతమున విస్తరించి అక్క డక్కడ చిన్న కొండలుగను, తిప్పలుగను కనబడుచున్నవి. పీఠభూమి భాగమున నేల హెచ్చు తగ్గులుగ ఉన్నది.

విజయవాడ తాలూకాకు పడమటను, నందిగామ తాలూకాకు తూర్పు సరిహద్దునను గల కొండపల్లి కొండయు, తిరువూరు తాలూకాలో దక్షిణమున ఉన్న జమ్ములవాయి దుర్గము కొండయును ఇందలి కొండలలో ముఖ్యమైనవి. నూజివీడు తాలూకాలోను, నందిగామ, గన్నవరము తాలూకాలలో కొన్ని భాగములలోను అచ్చటచ్చట కొన్ని తిప్పలు కలవు.

కైకలూరు తాలూకా ఉత్తరభాగమున కొల్లేరు సరస్సు కలదు. ఈ సరస్సు విస్తీర్ణము 150 చ. మైళ్లు. ఈ సరస్సులో కొంత భాగము పశ్చిమ గోదావరి జిల్లా ఏలూరు తాలూకాలోను, కొంత కైకలూరు తాలూకాలోను కలదు. డెల్టాయందలి మురుగునీరు ఈ సరస్సును చేరుచున్నది (చూ. పశ్చిమ గోదావరి జిల్లా, పుట : 1310).

డెల్టా ప్రదేశమంతయు సమతలముగా నుండును. సముద్రము దగ్గర మాత్రము కొంత బురదనేల కలదు. పైరుల కాలమున ఈ డెల్టా అంతయు వరిపైరుతో నిండి, అక్కడక్కడ చుక్కలు పెట్టినటులున్న గ్రామములతో చాల రమ్యముగ ఉండును. సముద్ర తీరమున ఇసుకపఱ్ఱ కలదు; కొన్నిచోట్ల ఈ ఇసుక ఒక మైలు వరకు విస్తరించి ఉన్నది. ఇసుకతిన్నె లొక్కొక్కచోట 30 అడుగుల నుండి 50′ ఎత్తు వరకు ఉండును.

నదులు : ఈ జిల్లాకు జీవనాధారమగు కృష్ణానది ఈ జిల్లా వాయవ్య దిక్కున ఈ జిల్లాను చొచ్చి అట నుండి జిల్లా పడమటి సరిహద్దును చుట్టి ప్రవహించుచున్నది. మునియేరు అను ఉపనది నందిగామ తాలూకాలో ఉత్తరమునుండి దక్షిణమునకు ప్రవహించి కృష్ణా నది చేరుచున్నది. కృష్ణానది విజయవాడవద్ద రెండు కొండలమధ్య 3,900′ వెడల్పుగల లోయలో ప్రవహించుచోట ఈ నదికి ఆనకట్ట కట్టబడినది. ఆ తరువాత 47 మైళ్ళ దూరము ఈ నది ప్రవహించి, మచిలీపట్టణమునకు దక్షిణమున సముద్రమున చేరుచున్నది. వరదల కాలమున ఈ నది తెచ్చు ఒండ్రుమట్టి 5 చ. మైళ్ళు ప్రదేశమున రోజున కొక అడుగు చొప్పున మేటవేయు చుండునని లెక్కవేసి ఉన్నారు. ఇట్టి ఒండ్రుమట్టి యుగయుగములుగా నిలిచి పోవుటచే ఏర్పడినదే కృష్ణా డెల్టా. ఈ ఒండ్రుమట్టిచే నదీ ప్రవాహములో అక్కడక్కడ లంకలు కూడ ఏర్పడినవి. ఈ లంకలు మిగుల సారవంతములని ప్రఖ్యాతి గాంచినవి.

బుడమేరు అను చిన్న నది విజయవాడ, గన్నవరము, గుడివాడ, కైకలూరు తాలూకాలలో ప్రవహించి కొల్లేరు సరస్సులో పడుచున్నది. బుడమేరు వరదలు ప్రభుత్వమున కొక సమస్యగ పరిణమించినవి. ఈ వరదల వలన ఏటేట చాల పంట నష్టమగు చున్నది. దీని నరికట్టుటకై కోటి రూపాయలు ఖర్చుతో ప్రభుత్వము తలపెట్టిన ఒక పథకము పూర్తి యగుచున్నది (1961).

శీతోష్ణస్థితి : ఇచట ఏప్రిల్ నుండి జూన్ వరకు ఎండలు ఎక్కువగా కాయును. జూన్ నుండి వర్షములు ఆరంభమై అడప, దడప నవంబరు వరకు కురియును. నవంబరు నుండి ఫిబ్రవరివరకు శీతకాలము. సంవత్సరము సరాసరి మొత్తము మీద దైనిక గరిష్ఠ ఉష్ణోగ్రత 88.9° ఫా., కనిష్ఠ ఉష్ణోగ్రత 75.1° ఫా. సంవత్సరమున గరిష్ఠ ఉష్ణోగ్రత 104° ఫా., కనిష్ఠ ఉష్ణోగ్రత 62° ఫా. తీర ప్రాంతమున ఎప్పుడో కొద్ది దినములు తప్ప తక్కిన సంవత్సర మంతయు శీతోష్ణ పరిస్థితి అనుకూలముగ ఉండును. నైరృతి ఋతు పవనముల వలనను, ఈశాన్య ఋతుపవనముల వలనను కూడ ఈ జిల్లాలో వర్షములు కురియును. సంవత్సరము మొత్తము మీద సరాసరి వర్షము కురియు రోజులు 49.6; సంవత్సరమునకు సరాసరి వర్షపాతము 37.1″. తక్కిన తాలూకాలకంటె నందిగామ తాలూకాలో వర్షపాతము తక్కువ (32.02″).

అడవులు : జిల్లా అంతటను గల రిజర్వు అడవుల విస్తీర్ణము 295.15 చ. మైళ్లు. ఇవి అంతగా విలువగలవి కావు. మేకలు తప్ప తక్కిన పశువులను ఈ అడవులలో మేపుకొనుటకు ప్రభుత్వమువారు అనుమతించుచున్నారు.

ఖనిజ సంపద : విజయవాడ తాలూకాలోని కొండపల్లివద్ద క్రోమైటు గనులు ఉన్నవి. జగ్గయ్యపేటవద్ద ఇనుము లభించు కాకిరాయి దొరకుచున్నది. దీనిని ముడిపదార్థములుగనే ఎగుమతి చేయుచున్నారు. పరిటాలవద్ద వజ్రపు గనులు పూర్వము ఉండెడివని తెలియుచున్నది. లోక ప్రసిద్ధమగు 'పిట్టు' వజ్రము ఇక్కడనే దొరికినదని ప్రతీతి. కాని ఇప్పుడు ఇక్కడ వజ్రము లేవియు లభించుట లేదు.

పట్టణములు : విజయవాడ, మచిలీపట్టణము, గుడివాడ అను పట్టణములకు మాత్రమే మునిసిపాలిటీలు కలవు.

విజయవాడ : జన సంఖ్య 2,33,634; ప్రసిద్ధి చెందిన వ్యాపార కేంద్రము. బ్రిటిష్ పరిపాలనలో ఇది బెజవాడ అని వ్యవహారము. ఇచ్చటనే కృష్ణానదికి ఆనకట్ట కట్టబడినది. ఇటీవల (1958) ఈ ఆనకట్టకు దగ్గరగనే రెగ్యులేటరు రోడ్డు బ్రిడ్జిని నిర్మించిరి. విజయవాడ ప్రత్యేక శ్రేణి మునిసిపాలిటీలకు చెందినది.

మచిలీ పట్టణము : జనసంఖ్య 1,01,396; జిల్లా కేంద్రము. చిన్న తరహా రేవుపట్టణము. మచిలీపట్టణమును బందరు అనికూడ వ్యవహరింతురు.

## కృష్ణా జిల్లా - తాలుకా వివరములు

| వరుస సంఖ్య | తాలూకా పేరు | తాలుకా కేంద్రము | గ్రామముల సంఖ్య | గ్రామీణ జనాభా (1951) | పట్టణములు | పట్టణ జనాభా | విస్తీర్ణము (చదరపు మైళ్ళలో) | మొత్తము నీటి పారుదల వసతి గల నేల విస్తీర్ణం (ఎకరములలో) | సాగుచేయ బడిన నేల (ఎ॥ములలో) | ప్రస్తుతము సాగులోలేని బీడు నేల (ఎ॥ములలో) | మొత్తము సాగుకు తగిన నేల (ఎ॥ములలో) | సాగుచేయ వీలగు బంజరు నేల (ఎ॥లలో) |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. | బందరు (మచిలీపటణము) | మచిలీపట్టణము | 118 | 1,29,898 | 2 | 89,589 | 848 | 1,02,484.00 | 1,02,484 | 26,458 | 1,28,942 | 5,850 |
| 2. | దివి | అవనిగడ్డ | 96 | 2,01,621 | 2 | 16,468 | 465 | 1,88,895.00 | 1,59,170 | 6,964 | 1,66,184 | 446 |
| 3. | గన్నవరము | గన్నవరము | 117 | 84,152 | 1 | 14,428 | 295 | 18,204.59 | 1,42,974 | 1,122 | 1,44,096 | 2,578.40 |
| 4. | గుడివాడ | గుడివాడ | 108 | 1,56,892 | 2 | 42,048 | 280 | 1,21,998.00 | 1,25,271 | 2,894 | 1,27,665 | 140 |
| 5. | కైకలూరు | కైకలూరు | 97 | 1,19,596 | — | — | 286 | 1,14,714.74 | 1,16,872 | 4,002 | 1,20,894 | 5,200 |
| 6. | నూజివీడు | నూజివీడు | 76 | 90,828 | 1 | 6,904 | 885 | 76,878.00 | 95,861 | 4,751 | 1,00,612 | — |
| 7. | విజయవాడ | విజయవాడ | 105 | 1,78,747 | 8 | 1,77,825 | 486 | 81,261.00 | 1,47,261 | — | 1,47,261 | 19,748 |
| 8. | నందిగామ | నందిగామ | 164 | 2,26,808 | 1 | 12,881 | 679 | 41,440.72 | 1,84,354 | 40,545 | 1,74,899 | 20,166 |
| 9. | తిరువూరు | తిరువూరు | 86 | 1,21,860 | — | — | 480 | 18,204.59 | 1,06,391 | 8,879 | 1,10,270 | 2,060 |
| 10. | జగయ్యాపేట | జగ్గయ్యాపేట | — | — | — | — | — | — | — | 29,481 | 29,481 | 14,581.67 |
| | | మొత్తము | 962 | 18,09,892 | 12 | 8,60,098 | 8,499 | 6,59,075.64 | 11,80,638 | 1,19,546 | 12,49,604 | 70,215.07 |

గుడివాడ : జనసంఖ్య 44,820; తాలూకా కేంద్రము. ధాన్యము ఎగుమతి కేంద్రము.

ప్రజలు : *ఈ జిల్లా జనసంఖ్య 20,76,103; పురుషులు సంఖ్య 10,58,113; స్త్రీలు సంఖ్య 10,17,990. జిల్లా మొత్తము మీద జనసాంద్రత చ.మై. కు 662. 1951 - 1961 మధ్య జనసంఖ్య 19.56% వృద్ధి అయినది. తిరువూరు తాలూకా యందు జనసాంద్రత చాల తక్కువ; విజయవాడ తాలూకా జనసాంద్రత అన్నిటికంటె అధికము.

మతములు : 1951 లో ఈ జిల్లాయందు హిందువులు 15,03,472; ముస్లిములు 97,992; క్రైస్తవులు 1,77,607; జైనులు 335; ఇతరులు 78.

వృత్తులు : జిల్లా ప్రజలలో వ్యవసాయమే ముఖ్య జీవనాధారము. భూఖామందులు, రైతులు, వ్యవసాయ కూలీలు వీరందరు వ్యవసాయము మీద ఆధార పడువారే; ఇట్టివారి సంఖ్య 11,56,215; వ్యాపారము వలన జీవించు వారు 1,17,648; పరిశ్రమల వలన 1,65,146; వివిధ ఉద్యోగములవలన 3,40,445 జీవించు చున్నారు (1951).

భాషలు : జిల్లా యందలి అత్యధిక సంఖ్యాకుల మాతృభాష తెలుగు. ఆయా మాతృ భాషలు గలవారి సంఖ్యా వివరములు : తెలుగు 16,79,629; ఉర్దూ 76,655; లంబాడి 8,705; ఎరుకల 1,342; తక్కిన భారతీయ భాషలు 13,252. ప్రజలందరికిని తెలుగు బాగుగ తెలియును (1951).

వ్యవసాయము : జిల్లాలో సాగునకు తగిన భూమి 16,52,789 ఎకరములు. ఇందులో సాగుచేయబడు నేల 11,51,173 ఎకరములు మాత్రమే. ఎక్కువ భాగము పల్లపు సాగున ఉన్నది. పల్లపు సాగునకు ముఖ్యాధారము కృష్ణా ఆనకట్టవద్ద నుండి బయలుదేరు కాలువలు. గుడివాడ, బందరు, కైకలూరు తాలూకాలును, విజయవాడ, దివి, గన్నవరము తాలూకాలలో ఎక్కువ భాగమును కృష్ణా కాలువలవలననే సాగగుచున్నది. విజయవాడ తాలూకాలో కొంత భాగమునకు గుంటుపల్లివద్ద పంపింగు నిర్మాణమువలన కృష్ణానది నీరు పారుచున్నది. దివి తాలూకాలో కూడ కొన్ని భాగములకు పంపులవలననే కృష్ణానది నీరు వచ్చుచున్నది. దివి లంకకు కృష్ణా తూర్పు కాలువ నీటిని పులిగడ్డ అక్విడక్టు ద్వారా పారించుచున్నారు. ముఖ్యముగ రెండవ కారున కొల్లేరు, ఉప్పుటేరుల యందలి నీరు కైకలూరు తాలూకాలో కొంత భాగమునకు పారించుచున్నారు. నూజివీడు తాలూకాలోని కొన్ని గ్రామములకు ఏలూరు కాలువలోని నీటిని పంపుల ద్వారా పారించు చున్నారు. తక్కిన మెట్ట ప్రదేశములలో అక్కడక్కడ పంట చెరువులు కలవు. ఇవి చాల వరకు వర్షాధారములు. నూజివీడు తాలూకాలోని కొన్ని పంట చెరువులకు తమ్మిలేరువలన నీరు వచ్చుచున్నది. మెట్ట భూములలో కొన్ని చోట్ల స్వంత బావులు కలవు. సముద్ర తీరమున దొరువుల సహాయమున రాగి మొదలగు పైరులు సాగగుచున్నవి.

* 1961 జనాభా లెక్కల ప్రకారము.

కృష్ణా జిల్లా - పంటల వివరములు
1955 - 56

| | | | |
|---|---|---|---|
| వరి | 7,91,240 ఎ. | ఇతర పప్పు ధాన్యములు | 799 ఎ. |
| జొన్న | 2,54,671 ,, | మిరప | 10,714 ,, |
| సజ్జ | 12,442 ,, | పొగాకు | 28,306 ,, |
| మొక్కజొన్న | 5,327 ,, | పసుపు | 5,445 ,, |
| రాగి | 2,456 ,, | ధనియాలు | 1,522 ,, |
| కొఱ్ర | 1,191 ,, | చెఱకు | 8,625 ,, |
| వరిగ | 1,836 ,, | పండ్లు, కూరలు, దుంపలు | 34,159 ,, |
| ఇతర పొట్టు ధాన్యములు | 3,841 ,, | ప్రత్తి | 1,926 ,, |
| శనగలు | 2,305 ,, | జనుము | 17,725 ,, |
| పెసర | 1,04,455 ,, | వేరుశనగ | 1,22,710 ,, |
| కంది | 6,840 ,, | ఇతర నూనె గింజలు | 5,465 ,, |
| మినప | 35,762 ,, | మేత పైరులు | 69,102 ,, |
| ఉలవ | 25,409 ,, | | |

పై లెక్కలలో చేరని పైరులు 3,403 ఎకరములు.

పశు సంపద : పశువులు విస్తారముగ ఉన్నవి. కాని, ఇవి చాల తక్కువ తరగతికి చెందినవి. ఒంగోలు, విశాఖ పట్టణములనుండి మంచి రకపు పశువులను కొని తెచ్చి కొందరు మేపుచున్నారు. పశువులకు ముఖ్యాహారము మెట్ట ప్రాంతములలో జొన్న, చొప్ప, రాగి, దంటు, మాగాణి ప్రాంతముల వరిగడ్డియు, జనుము వాడుచున్నారు. వ్యవసాయపు దినములలో ఎద్దులకు ఉలవలు పెట్టుటయు కలదు.

పశు వైద్యశాలలు బందరు, విజయవాడ, గుడివాడ, నూజివీడు, కైకలూరు, ఉయ్యూరు, జగ్గయ్య పేటలలోను; చిన్న తరగతి డిస్పెన్సరీలు, నందిగామ, గుడ్లవల్లేరు, తిరువూరులలోను కలవు.

గృహ పరిశ్రమలు : జిల్లాలో పేరుపొందిన గృహ పరిశ్రమ చేనేత; దీనిమీద ఆధారపడి 22,091 మంది జీవించు చున్నారు (1951). పెడన చీరలకు చాల ప్రసిద్ధి కాంచినది. కలంకారీ అద్దకపు పరిశ్రమ పెడన, బందరులలో కలదు. బందరునుండి ఎగుమతి అయిన మజిలునులు, చీటీలు విదేశ

ములలో పూర్వ మెంతో పేరుకాంచినవి. ఇప్పుడు ఈ పరిశ్రమ అట్టి స్థాయిలో లేకున్నను, చాలమందికి జీవనాధారముగ ఉన్నది. కర్ర బొమ్మల పరిశ్రమకు కొండపల్లి పేరు పొందినది ; ఇక్కడ పూర్వము కాగితము తయారుచేయు చుండెడివారు - కాని ఇప్పుడా పరిశ్రమ నశించినది. జగ్గయ్యపేటలోను, షేరుమహమ్మదుపేటలోను పట్టునేత కొంతవరకు ఈనాటికిని సాగుచున్నను తగు ప్రోత్సాహము లేక క్రమముగ నశించుచున్నది.

పరిశ్రమలు : విజయవాడలో సిమెంటు పరిశ్రమ ; ఉయ్యూరులో పంచదార ఫ్యాక్టరీ ; మచిలీపట్టణములో శాస్త్ర పరికరముల తయారీ; డెల్టా ప్రాంతములలో బియ్యపు మిల్లులు కలవు.

రోడ్లు : ఈ జిల్లానుండి ముఖ్యమైన రోడ్డు చుట్టుప్రక్కల నున్న అన్ని జిల్లాలకును, ఆంధ్రప్రదేశ్ రాజధాని నగరము హైదరాబాదునకును పోవుచున్నవి. జిల్లా మొత్తముమీద జాతీయ రహదార్లకు సంబంధించిన రోడ్డు 94 మైళ్ళు, రాష్ట్ర ప్రభుత్వపు పాలనలోని రోడ్లు 324 మైళ్ళు, స్థానిక సంస్థల అధీనమున ఉన్న రోడ్లు 1231 మైళ్ళు కలవు. జిల్లాలోని వ్యాపారముతోను, జనసమ్మర్దముతోను పోల్చి చూచినయెడల రోడ్లు చాల తక్కువ అని చెప్పవచ్చును. జిల్లాలోని బస్సు రవాణా ప్రభుత్వ యాజమాన్యమున నడుపబడుచున్నది. సరకుల ఎగుమతికై లారీ సౌకర్యములు కలవు. తాలూకా కేంద్రము లన్నిటికి బస్సు సౌకర్యము కలదు.

రైలు మార్గములు : విజయవాడ రైల్వేస్టేషను కలకత్తా - మద్రాసు, మద్రాసు - ఢిల్లీ, మచిలీపట్టణము - మార్మగోవా మార్గములకు కూడలి. స్టేషను ప్లాటుఫారము నిడివికి ఎన్నతగినది. జిల్లా మొత్తమున 55 మైళ్ల బ్రాడ్ గేజ్, 77¼ మైళ్ల మీటర్ గేజ్ రైలు మార్గము లున్నవి. మద్రాసునుండి ఢిల్లీకి పోవు రైలుమార్గము మద్రాసు - కలకత్తా మార్గమునుండి విజయవాడవద్ద చీలుచున్నది. మచిలీపట్టణమునుండి మార్మగోవాకు పోవు మీటర్ గేజ్ మార్గము విజయవాడ మీదుగా పోవుచున్నది. గుడివాడ నుండి ఒక బ్రాడ్ గేజ్ శాఖ పశ్చిమ గోదావరి జిల్లాలోని భీమవరమునకు పోవుచున్నది. దివి, తిరువూరు, నందిగామ తాలూకాలలో రైలు వసతి లేదు. సదరన్ రైల్వేవారి డివిజనల్ సూపరింటెండెంటు కార్యాలయము విజయవాడలో కలదు.

వ్యాపారము : రాకపోకలకును, సరకుల రవాణాకును నీటిదారులు (కాలువలు) కూడ ఎక్కువగ ఉపయోగపడుచున్నవి. జిల్లాలోపల జరుగు వ్యాపారమున చాల భాగము ఈ కాలువలలో పోవు పడవలమీదనే జరుగుచున్నది. విజయవాడనుండి దక్షిణ దేశమునకు వ్యాపార సామగ్రులు బకింగ్‌హామ్ కాలువ మీద పడవలలో పోవుచున్నవి. విజయవాడ సమీపమున ఉన్న గన్నవరమువద్ద విమానాశ్రయము కలదు. మచిలీపట్టణము ప్రస్తుత మొక చిన్న తరహా రేవు. తీరప్రాంత వ్యాపారము మాత్రము ఇక్కడనుండి పడవలద్వారా సాగుచున్నది. విజయవాడ ఆంధ్రప్రదేశ్‌లో ముఖ్యమైన వ్యాపార కేంద్రము.

ఎగుమతులు : ఈ జిల్లానుండి చుట్టుప్రక్కల రాష్ట్రములకు ఎగుమతి అగువానిలో ముఖ్యమైనవి వరి ధాన్యము, బియ్యము. కొండపల్లి, జగ్గయ్యపేట పరిసరములనుండి క్రోమైటు, ముడి ఇనపరాయి విదేశములకు ఎగుమతి చేయబడుచున్నది.

విద్య : 1961 లెక్కల ప్రకారము జిల్లాలో అక్షరాస్యత 30.29% ; పురుషులు 37.54%, స్త్రీలు 22.99%. విజయవాడ, మచిలీపట్టణములు ముఖ్య విద్యా కేంద్రములు.

జిల్లాయందలి వివిధ వర్గముల విద్యాశాలలును, వాని సంఖ్యా వివరములును దిగువ ఈయబడినవి (1956 - 57) :

| సంస్థల వివరము | సంఖ్య | ఉపాధ్యాయ సంఖ్య | విద్యార్థి సంఖ్య |
|---|---|---|---|
| ప్రాథమిక పాఠశాలలు | 2,032 | 6,095 | 2,10,603 |
| మాధ్యమిక పాఠశాలలు | 8 | 79 | 1,624 |
| ఉన్నత పాఠశాలలు | 95 | 1,918 | 43,253 |
| వయోజన విద్యా కేంద్రములు | 94 | 149 | 2,589 |
| ప్రత్యేక, వృత్తి బోధక పాఠశాలలు | 34 | 91 | 2,109 |
| | 2,263 | 8,332 | 2,60,178 |

ఇవి కాక విజయవాడలో రెండు, గుడివాడలో ఒకటి, మచిలీపట్టణములో రెండు ఆర్ట్సు అండ్ సైన్సు కళాశాలలు కలవు. వీనిలో మొత్తము విద్యార్థి సంఖ్య 5,875 (1956 - 57). ఉయ్యూరులో ఉండిన ఇంజనీరింగ్ పాలీటెక్నిక్ సంస్థ 1961 లో విజయవాడకు మార్చబడినది. బందరు తాలూకా చిట్టిగూడూరులో సంస్కృత కళాశాల ఒకటి నడుపబడుచున్నది.

విజయవాడ తెలుగువారికి సాంస్కృతికముగ ముఖ్య కేంద్రము. తెలుగున మూడు దిన పత్రికలు, ఇంగ్లీషుభాష యందు ఒక దిన పత్రిక ఇచటనుండి వెలువడుచున్నవి.

ఆరోగ్యము, వైద్యము : ఈ జిల్లా చాలవరకు ఆరోగ్యవంతమైన దనియే చెప్పవచ్చును. ప్రభుత్వమువలనను, స్థానిక సంస్థలవలన నడపబడు వైద్యశాలలు పలు ప్రదేశములందు కలవు.

జిల్లా మొత్తముమీద ఆధునిక వైద్య విధానము ననుసరించు జనరల్ ఆసుపత్రులు 5, లోకల్ ఫండు ఆసుపత్రులు 3, డిస్పెన్సరీలు 8 కలవు. వీనిలో మొత్తము మంచముల సంఖ్య 1,204. ఇవికాక యూనానీ చికిత్సా శాలలు 2, ఆయుర్వేద వైద్యశాలలు 100 కలవు (1956-57).

చూడదగిన స్థలములు : జిల్లాయందు ప్రముఖ నగరమగు విజయవాడ చరిత్రయందు ప్రఖ్యాతిని గడించినది. వివిధ సంస్కృతులకు, వివిధ మతములకు వివిధ కాలములందు ముఖ్య కేంద్రముగ ఈ ప్రదేశము వర్ధిల్లినది. జైనుల, బౌద్ధుల ఆలయ, విగ్రహ శిథిలములు ఈ పట్టణమున అచ్చటచ్చట కానవచ్చుచున్నవి. విజయవాడ ప్రక్క నున్న మొగల్‌రాజపురములో చాళుక్యుల కాలమున నిర్మితములైన హిందూ గుహాలయములు కలవు. కృష్ణానది ప్రక్కనే కొండపై దేవళమున ఉన్న కనకదుర్గను సేవించుటకు యాత్రికులు పలు ప్రదేశములనుండి సంవత్సరము పొడగునను వచ్చుచుందురు. గుడివాడ, జగ్గయ్యపేట, విజయవాడలలోను, దివి తాలూకాలలోని ఘంటసాలయందును బౌద్ధ నిర్మాణ శిథిలములు కలవు.

విజయవాడవద్ద రెండు కొండల మధ్య కృష్ణ కడ్డముగ నిర్మింపబడిన ఆనకట్టయు, కృష్ణా బ్యారేజ్ (ప్రకాశం బ్యారేజ్) అనబడు రోడ్డువంతెనయు, ప్రక్కనే నిర్మింపబడిన రైలు వంతెనయు దర్శనీయములు.

ఈ జిల్లాలోని మచిలీపట్టణమునకు నైరృతి మూలగ 30 మైళ్ళ దూరమున ఉన్న శ్రీకాకుళము ఆంధ్ర చక్రవర్తుల రాజధాని యని పురాణములందు చెప్పబడి ఉన్నది. ఇచటి ఆలయమున పూజింపబడు విష్ణువును ఆంధ్ర విష్ణువనియును అందురు. విజయనగర సార్వభౌముడు శ్రీకృష్ణదేవరాయలు ఈ క్షేత్రమును దర్శించి, సేవించి ఆ స్వామి ఆజ్ఞచే 'ఆముక్తమాల్యద' ను రచింపబూనె నని ఆ గ్రంథ పీఠికయందు తెలుపబడినది. కూచిపూడి భరతనాట్యమునకు ప్రసిద్ధి.

కృష్ణానదికి పన్నెండు సంవత్సరములకు ఒకసారి వచ్చు 'కృష్ణా పుష్కర' సమయమున విజయవాడ వద్ద భారీ ఎత్తున తీర్థము జరుగును. భారతదేశము నలుమూలల నుండి యాత్రికులు వత్తురు.

జిల్లా సంక్షిప్త చరిత్ర : అత్యంత సారవంతమగు ఈ జిల్లా భౌగోళిక పరిస్థితిని బట్టి ఇది ప్రాచీన కాలమునుండియు మానవావాసముగ నుండెనని విశ్వసించుట కవకాశము లున్నను ఆ పురాణ చరిత్రకు సంబంధించిన విషయములను ఇదమిత్థమని నిర్ణయించుటకు తగు ఆధారము లిట లభించుట లేదు. మౌర్య చక్రవర్తుల కాలమున ఈ ప్రాంతము జనావాసమై ఉండెనని మాత్రము తెలియవచ్చుచున్నది.

అశోకుని కాలమునకు పూర్వముననే ఇచ్చట బౌద్ధమతము వ్యాపించినది. పడమట నున్న జగ్గయ్యపేట మొదలుకొని తూర్పున ఘంటసాల వరకు కృష్ణానది నానుకొని వివిధప్రదేశములందు బౌద్ధ సంస్కృతి చిహ్నములు విరివిగ కాననగుచున్నవి. ఘంటసాల ఆనాడు 'కంటకసెల' అని వ్యవహరింపబడెడి రేవుపట్టణము. కళింగమునుండి సింహళమున కేగు బౌద్ధ ప్రచారకులకును, వర్తకులకును ఇది ఒక మజిలీగ ఉండెడిది. క్రీస్తు శకారంభ కాలమున ఈ జిల్లాయందలి తూర్పు తీరపు రేవులతో రోమక సామ్రాజ్యమునకు పరిచయమేర్పడెను. టాలెమీ అను నాటి భూగోళశాస్త్ర రచయిత ఈ ప్రాంతమును గురించి ప్రస్తావించెను.

ఆంధ్ర సాతవాహన సామ్రాజ్యమున అంతర్భాగముగ ఉండిన ఈ ప్రాంతమున వారి అనంతరమున బృహత్పలాయనులను వారు ఇట పాలించినటుల కొండమూడి శాసనము వలన తెలియుచున్నది. పిదప వేంగీ పరిపాలకులగు శాలంకాయనుల రాజ్యమున అంతర్భాగముగనుండి క్రీ. శ. ఆరవ శతాబ్దమున విష్ణు కుండినుల వశమయ్యెను. కాని వీరిని జయించి దుర్జయులను రాజవంశము వారు కొంత కాలము పాలించినటుల తెలియవచ్చుచున్నది. ఈ దుర్జయ వంశీకులనే జయించి కుబ్జ విష్ణువర్ధనుడు తూర్పు చాళుక్య రాజ్య పరిపాలనను ఇచట క్రీ. శ. 624 లో నెలకొల్పెను.

క్రీ. శ. పదునొకండవ శతాబ్దము కడపటి వరకును చాళుక్యు లిట పాలించిరి. తదనంతరమున వారి ప్రతినిధులుగ వెలనాటి చోళు లిచట ప్రభుత్వమును నెరపిరి. వారిని జయించి క్రీ. శ. 1200 లో ఈ ప్రాంతమును కాకతీయ గణపతి తన సామ్రాజ్యమున అంతర్భాగ మొనర్చుకొనెను. కాకతీయ సామ్రాజ్యము అస్తమించిన వెనుక అత్యల్ప కాలము తురుష్కుల వశముననుండి ఆ తరువాత కొండవీడు రాజమహేంద్రవరము (ఇప్పటి రాజమండ్రి) రెడ్డి రాజుల అధీనమున ఉండి క్రీ. శ. 1448 నాటికి కళింగ గజపతుల వశమయ్యెను. బహ్మనీ ప్రభువులు కళింగ గజపతులను ఓడించి 1478 లో ఈ జిల్లాను ఆక్రమించుకొనినను మరల క్రీ. శ. 1484 లో గజపతులు వశపరచుకొనిరి. క్రీ. శ. 1543 వరకును ఈజిల్లా యందలి కొండపల్లి దుర్గము కళింగ రాజ్యమునకు దక్షిణపు సరిహద్దు కోటగ ఉండెను. విజయనగర సామ్రాజ్యాధినేత శ్రీకృష్ణదేవరాయలు గజపతుల నోడించి ఈ సీమను వశపరచుకొనినను మరల వారికే ఒసగెను.

ఇటుల క్రీ. శ. 1543 వరకును గజపతుల వశముననే ఉండిన ఈ జిల్లా ఆ పిదప గోల్కొండ రాజ్యమున అంతర్భాగమయ్యెను. మచిలీపట్టణము ఆ ప్రభువుల ఆదరణ

మున గొప్ప రేవుపట్టణముగ ఖ్యాతి నార్జించెను. క్రీ. శ. 1678 లో ఆ సామ్రాజ్య మస్తమించిన వెనుక మొగలు సామ్రాజ్యమున ఒక భాగముగ ఉండి ఈ జిల్లా అసఫ్ జాహీ నిజాములచే పాలింప బడెను. క్రీ. శ. 1671 లో ఇచటి మచిలీపట్టణము రేవునకు పాశ్చాత్య వ్యాపారులు తొలుతగ ఏతెంచి అచ్చట కార్ఖానాలను స్థాపించిరి. నిజాముచే తొలుత ఫ్రెంచి వారి కొసగబడి, తరువాత వారి నణచిన ఆంగ్లేయులకు స్వాధీనము చేయబడిన ఉత్తర సర్కారులలో ఇది ఒకటి. ఈ విధముగ 1765 నాటికి ఇచట బ్రిటిష్ పరిపాలన స్థిరపడెను.

నిజాముల కాలమున కృష్ణా జిల్లా రాజమండ్రి సర్కారులో ఉండెను. తరువాత ఆంగ్లేయుల పరిపాలకులు ఆ సర్కారును విభజించి మచిలీపట్టణము జిల్లాను ఏర్పరచిరి. 1859 లో గుంటూరు, మచిలీపట్టణము జిల్లాలను కలిపి కృష్ణా జిల్లాను నిర్మించిరి. కాని పరిపాలనా సౌకర్యము కొరకై 1906 లో కృష్ణా దిగువ తాలుకాలను వేరు పరచి, మిగిలిన వానినే కృష్ణా జిల్లాగ ఏర్పరచిరి.

మచిలీపట్టణము పూర్వమొక మిలిటరీ స్థావరముగ ఉండెడిది. కాని 1-11-1864 వ తేదీన ఈ పట్టణము కని విని ఎరుగని బీభత్సమునకు లోనయ్యెను. దానినే 'బందరు తుఫాను' అని ఆ ప్రాంతీయు లనెదరు. రేవు నగరముగ ఆ పట్టణమునకు కల ప్రాశస్త్య మంతటితో అంతరించెను. మిలిటరీ స్థావరము కూడ ఎత్తి వేయబడెను.

1855 లో కృష్ణానదికి ఆనకట్ట కట్టబడిన తరువాత ఈ జిల్లా యందలి తూర్పు భాగమునకు నీటి పారుదల వసతు లేర్పడినవి. కాని జిల్లా పశ్చిమ భాగము ఇప్పటికిని వర్షాధారముననే సాగగుచున్నది.

బ్రిటిష్ పరిపాలనా కాలమున ఈ జిల్లా యందు కొన్ని జమీందారీ లుండెడివి. వీనియందు చల్లపల్లి, దేవరకోట, నూజివీడు సంస్థానములు ముఖ్యములైనవి. కాని భారత స్వాతంత్ర్యానంతరము (1947) భూస్వామ్య వ్యవస్థలో కలిగిన మార్పుల వలన ఈ జమీందారీ లన్నియు 1951 లో అంతరించి జిల్లాయం దంతటను ఒకేవిధమైన రైతువారీ విధానము ఈ నాడు అమలులోనున్నది. చీ. శే. రా.

# గుంటూరు జిల్లా

**ఉనికి - విస్తీర్ణము :** తూర్పు తీరమున ఉ. అక్షాంశము 15° 18′ నుండి 16° 55′ వరకును, తూ. రేఖాంశము 79° 10′ నుండి 80° 55′ వరకును గుంటూరు జిల్లా విస్తరించి ఉన్నది. దీనికి సరిహద్దులుగ తూర్పు బంగాళా ఖాతము, కృష్ణా జిల్లా; దక్షిణము నెల్లూరు జిల్లా; పడమర నెల్లూరు, కర్నూలు జిల్లాలు; ఉత్తరము కృష్ణా, నల్గొండ, ఖమ్మంజిల్లాలు కలవు. ఒంగోలు, నరసారావుపేట, వినుకొండ, పల్నాడు, సత్తెనపల్లి, గుంటూరు, తెనాలి, రేపల్లె, బాపట్ల అను 9 తాలూకాలుగా ఈ జిల్లా విభజింప బడినది. జిల్లా విస్తీర్ణము 5,771 చ. మైళ్ళు.

ఒంగోలు, బాపట్ల, రేపల్లె తాలూకాలు దక్షిణము నుండి ఉత్తరమునకు సముద్ర తీరమును అనుకొని ఉన్నవి. పల్నాడు తాలూకా జిల్లాలో వాయవ్య దిక్కున ఉన్నది. రేపల్లె తాలూకాకు పడమట తెనాలి తాలూకా కలదు. పల్నాడు తాలూకాకు తూర్పున పడమర నుండి తూర్పునకు సత్తెనపల్లి, గుంటూరు తాలూకాలు కలవు. పల్నాడుకు దక్షిణమున వినుకొండ తాలూకా, తూర్పున నరసారావుపేట తాలూకా లున్నవి.

నైసర్గిక స్వరూపము : సహజ స్వరూపమును బట్టి డెల్టా, పర్వతమయ పీఠభూమి, నల్ల రేగడ మైదానము అని కృష్ణా జిల్లాను మూడు భాగములుగ విభజింపవచ్చును. తెనాలి, రేపల్లె తాలూకాలును, బాపట్ల తాలూకాలో కొంత భాగమును డెల్టా భాగమందు ఉన్నవి. తూర్పు కనుమలశాఖ ఆవరించిన పల్నాడు తాలూకా దక్షిణ పశ్చిమ భాగములును, చిన్న చిన్న గుట్టలతో నిండి ఉండు సత్తెనపల్లి తాలూకా పడమటి భాగమును, గుంటూరు తాలూకాలో చెల్లాచెదురుగ గుట్టలచే నావరింప బడిన ప్రదేశములును, కొండవీటి పర్వత శ్రేణితోను, గుట్టలతోను నిండిన నరసరావుపేట తాలూకాలోని పడమటి భాగమును ఒంగోలు తాలూకాలో చీమకుర్తి కొండలు నావరించిన ప్రదేశమును, వినుకొండ తాలూకాలో చిన్న గుట్టలు గల భాగమును పర్వతమయ పీఠభూమి యగుచున్నది. జిల్లా యందు మిగిలిన భాగమంతయు నల్ల రేగడ మైదానము. కోస్తా తీరమున ఇసుక పర్రలు కొన్ని మైళ్ల వెడల్పున బారుగా ఉన్నవి. బాపట్ల తాలూకాలో ఈ ఇసుక పర్ర యందు విస్తారముగ కుంకుడు చెట్లు కలవు.

నదులు : మహారాష్ట్రమున మహాబలేశ్వరము ప్రాంతమున జన్మించిన కృష్ణానది పల్నాడు తాలూకాలో గనికొండలవద్ద గుంటూరు జిల్లాలో ప్రవేశించుచున్నది. అచటనుండి ఈనది ఈ జిల్లా ఉత్తరము, తూర్పు సరిహద్దులను చుట్టుచు 80 మైళ్లు ప్రవహించి దివి తాలూకాలో సముద్రమున చేరుచున్నది.

కర్నూలు జిల్లాలోని కంభము చెరువునుండి బయలు దేరిన గుండ్లకమ్మ నది ఈ జిల్లాలో వినుకొండ, ఒంగోలు తాలుకాలలో ప్రవహించి సముద్రమున చేరుచున్నది. నెల్లూరు జిల్లాలో పుట్టిన మూసినది ఒంగోలు తాలూకా దక్షిణమున ప్రవహించుచున్నది. వినుకొండ తాలూకా లోని కొండలలో పుట్టిన నాగులేరు ఉత్తరముగ పల్నాడు తాలూకా గుండ ప్రవహించి కృష్ణానదిని చేరుచున్నది. చంద్రవంక నది కూడ పల్నాడు తాలూకాలోనే ఉత్తరముగ ప్రవహించి కృష్ణా నదిలో పడుచున్నది.

శీతోష్ణస్థితి : డెల్టా తాలూకాలలో తప్ప తక్కిన ప్రదేశములందు వేసవి కాలమున విపరీతముగ ఎండలు కాయును. సరాసరి దైనిక గరిష్ఠ ఉష్ణోగ్రత 95.9° ఫా., కనిష్ఠ ఉష్ణోగ్రత 74° ఫా. సంవత్సరములో అత్యధిక ఉష్ణోగ్రత 112° ఫా. అత్యల్ప ఉష్ణోగ్రత 53° ఫా. ఆంధ్ర ప్రాంతమున అత్యధిక ఉష్ణోగ్రతకు పల్నాడు తాలూకాలోని రెంటచింతల పేర్కొనదగినది.

వర్షపాతము : నైరృతి ఋతుపవనముల వలన జిల్లాలో వర్షములు కురియును. ఈశాన్య ఋతుపవనముల వలన ఈ జిల్లాలోని డెల్టా భాగములందు అప్పుడప్పుడు తుఫాను కొట్టుటయు కలదు. సరాసరి సంవత్సరమునకు వర్షము కురియు దినములు 52.4; సంవత్సరమునకు సరాసరి వర్షపాతము 32.1". తాలూకాల వారీగా చూచినచో రేపల్లె తాలూకాలో వర్షపాతము 38.16" - అన్నింటికన్న ఎక్కువ; పల్నాడులో 26.3" - అన్నింటికన్న తక్కువ.

అడవులు : జిల్లా మొత్తమున 780.97 చదరపు మైళ్ళ విస్తీర్ణముగల అడవి కలదు. ఇందు దాదాపు సగము భాగము పల్నాడు తాలూకాలో కలదు. తెనాలి తాలూకాలో అడవి ప్రదేశములేదు. ఈ జిల్లాలోని అడవులు పేరునకు అడవులే కాని, వీనియందు చెప్పుకొనదగిన ఆర్థిక ప్రయోజనము లేదు. దాదాపు అన్నింటను పొదలును, చిన్న చిన్న చెట్లును కలవు. పశువుల బీడులుగ ఉపయోగపడు ప్రదేశములు కొన్ని ఉన్నవి.

పట్టణములు : గుంటూరు జిల్లా యందు ఏడు మునిసిపాలిటీ గల పట్టణములు కలవు.

గుంటూరు : జనసంఖ్య 1,87,068 : జిల్లా కేంద్రము ; పొగాకు ఉత్పత్తి, వ్యాపార కేంద్రము.

తెనాలి : జనసంఖ్య 78,490 ; తాలూకా కేంద్రము.

### గుంటూరు జిల్లా - తాలూకా వివరములు

| వరుస సంఖ్య | తాలూకా పేరు | తాలూకా కేంద్రము | విస్తీర్ణము చ. మై॥లో | మొత్తము నీటి పారుదల వసతిగల నేల విస్తీర్ణము ఎ॥ములలో | సాగుచేయబడిన నేల ఎకరములలో | ప్రస్తుతము సాగులోలేని బీడు నేల ఎకరములలో | మొత్తము సాగుకు తగిన నేల ఎకరములలో | సాగుచేయ వీలగు బంజరు నేల ఎకరములలో |
|---|---|---|---|---|---|---|---|---|
| 1. | బాపట్ల | బాపట్ల | 670 | 1,68,079 | 2,86,825 | 6,182 | 2,93,207 | 18,142 |
| 2. | గుంటూరు | గుంటూరు | 541 | 60,942 | 2,72,233 | 42,136 | 3,14,369 | 6,585 |
| 3. | నరసరావుపేట | నరసారావు పేట | 716 | 8,376 | 2,71,300 | 15,974 | 2,87,274 | 20,176 |
| 4. | ఒంగోలు | ఒంగోలు | 820 | 8,376 | 3,24,452 | 18,707 | 3,43,159 | 49,286 |
| 5. | పల్నాడు | మాచర్ల | 1,041 | 4,900 | 2,91,244 | 3,827 | 2,95,071 | 7,864 |
| 6. | రేపల్లె | రేపల్లె | 297 | 1,14,298 | 1,22,750 | 16,369 | 1,39,119 | 11,968 |
| 7. | సత్తెనపల్లి | సత్తెనపల్లి | 718 | 3,164 | 2,35,530 | 51,124 | 2,86,644 | 17,934 |
| 8. | తెనాలి | తెనాలి | 324 | 1,55,134 | 1,69,728 | 542 | 1,70,270 | 111 |
| 9. | వినుకొండ | వినుకొండ | 644 | 6,768 | 1,82,434 | 11,779 | 1,94,213 | — |
| | | మొత్తము | 5,771 | 5,30,037 | 21,56,496 | 1,66,640 | 23,23,326 | 1,32,066 |

బాపట్ల : జనసంఖ్య 33,724 ; తాలూకా కేంద్రము.

రేపల్లె : జనసంఖ్య 21,932 ; తాలూకా కేంద్రము.

చీరాల : జనసంఖ్య 45,367 ; తాలూకా కేంద్రము.

ఒంగోలు : జనసంఖ్య 35,948 ; తాలూకా కేంద్రము.

నరసరావుపేట : జనసంఖ్య 29,750 ; తాలూకా కేంద్రము.

ప్రజలు : ఈ జిల్లాలోని జనసంఖ్య * 30,09,997; రాష్ట్రపు మొత్తమున ఎక్కువ జనసంఖ్య గల జిల్లా ఇది. ఈ జిల్లాలో పురుషులు 15,22,881, స్త్రీలు 14,87,116 ; జనసాంద్రత చ. మైలుకు 519. 1951 - 1961 సం॥ల మధ్య ఈ జిల్లా జనసంఖ్య 17·58% వృద్ధి అయినది.

మతములు : 1951 లెక్కల ప్రకారము హిందువులు 19,84,375 ; క్రైస్తవులు 3,56,039 ; ముస్లిములు 2,09,276 ; జైనులు 273 ; ఇతరులు 10.

వృత్తులు : జిల్లాలో మూడింట రెండువంతులు ప్రజలు వ్యవసాయము వలన జీవించు చున్నారు. స్వంతముగ సేద్యము చేసికొను రైతులు, కౌలుదారులు, వ్యవసాయ కార్మికులు, భూస్వాములు ఈ రకముల వారందరు వ్యవసాయము వలన జీవించువారు - జిల్లాలో ఇట్టి వారందరి సంఖ్య 17,72,833; వస్తూత్పత్తి పరిశ్రమల వలన జీవించు వారు 2,58,893 ; వ్యాపారము వలన జీవించువారు 1,51,122 ; ఇతర వృత్తులవారు 3,67,148.

భాషలు : అత్యధిక సంఖ్యాకుల మాతృభాష తెలుగు; వివిధ మాతృభాషలు కలవారి సంఖ్యా వివరములు దిగువ నీయబడినవి: తెలుగు 23,59,100 ; ఉర్దు 1,64,474 ; లంబాడి 7,510 ; తమిళము 6,145, హిందీ 3,804 ; ఎరుకుల 2,829 ; హిందూస్థానీ 1,952 ; మలయాళము 1,664 ; మరాఠీ 715; ఒరియా 658; కన్నడ 397; గుజరాతీ 505; సింధి 22 ; ఇతరులు 50 (1951).

వ్యవసాయము : సేద్యరీత్యా గుంటూరు జిల్లాలోని భూమిని నల్లనేల, ఎర్రనేల, ఒండ్రుమట్టి నేల అని మూడు విధములుగ విభజింప నగును. దాదాపు 85% నల్లనేల ; ఇది చాల సారవంతమైనది. గుంటూరు - గుంతకల్లు రైలు మార్గమునకు ఇరు పార్శ్వముల కొంత దూరము వరకు ఎర్రనేల కనబడుచున్నది. కృష్ణానది ఒడ్డున కొంతదూరము ఒండ్రునేల కలదు. ఇవికాక తువ్వనేల, ఇసుక పొరనేలలు సముద్ర తీరమున కలవు. జిల్లా మొత్తమున సాగునకు తగిన నేల 24,14,119 ఎకరములు ; ఇందు 21,60,712 ఎకరములు మాత్రము సాగున ఉన్నది. దీనిలో 5,13,955 ఎకరములకు మాత్రము నీటి పారుదల వసతి కలదు.

* 1961 జనాభా లెక్కల ప్రకారము.

నీటి పారుదల వసతులు : ముఖ్యమైన పెద్ద నీటివసతి కృష్ణానది ; ఈ నదికి సీతానగరము, విజయవాడ కొండల మధ్య ఆనకట్ట (విజయవాడ పట్టణమునకు చేరి ఉన్నది) కట్టబడినది. సీతానగరము వద్ద కృష్ణానది నుండి వచ్చు పెద్దకాలువ దుగ్గిరాలవద్ద బ్యాంకు కాలువ, నిజాం పట్టణము కాలువ, కొమ్మమూరు కాలువ అని మూడు కాలువలుగ చీలి డెల్టా తాలూకాలకు నీరు సరఫరా చేయు చున్నది. జాగర్లమూడి లాకునకు ఎగువ కొమ్మమూరు కాలువ నుండి విడిపోయిన అప్పాపురము కాలువవలనను, హై లెవల్ కాలువవలన కూడ కొన్నిభూములు సాగగు చున్నవి. తాలూకా వారిగా నీటి వసతి సదుపాయములు దిగువ ఈయబడినవి.

తెనాలి, రేపల్లె తాలూకాలు: సంపూర్తిగ కృష్ణానది నీటి పారుదలచే సాగగు చున్నవి.

బాపట్ల తాలూకా : కృష్ణా ఆనకట్ట నుండి వచ్చు కాలువల సాయముచే చాల భాగము సాగగుచున్నది. ఇటీవలనే పూర్తి అయిన రొంపేరు ప్రాజెక్టు వలన అదనముగ కొన్ని భూములు సాగు అగుచున్నవి. సముద్ర తీరమున దొరువులక్రింద, ఊట కాలువల క్రింద సాగు జరుగుచున్నది.

ఒంగోలు తాలూకా : తీరమున దొరువుల సాయమునను, కొద్దిభాగము కృష్ణానది నీటి వలనను సాగగు చున్నది, పంట చెరువులు విశేషముగ కలవు ; ఇవి వర్షాధారములు సముద్రతీరమున కొండల ప్రాంతమునను ఊట కాలువల క్రింద కొంత సాగగుచున్నది. అద్దంకి, భవనాశి చెరువు మాత్రము నమ్మదగిన నీటి వసతి; దీనిక్రింద సుమారు 1,000 ఎకరములు నేల సాగగుచున్నది.

నరసరావుపేట తాలూకా : చెరువుల వలన కొద్ది భాగము మాత్రమే సాగగుచున్నది.

వినుకొండ తాలూకా : గుండ్లకమ్మ నది నుండి నీరు పారించి చాల కొద్దిగా సేద్యము చేయుదురు. తక్కిన నీటి వసతులు వర్షాధారపు చెరువులు.

పల్నాడు తాలూకా : నాగులేటికి దాచేపల్లి వద్ద కట్టిన అడ్డుకట్ట వలన కొంత పల్లపు సాగు జరుగుచున్నది. వాగులు వర్షాధారపు చెరువులు కొలదిగ సాయబడు చున్నవి.

సత్తెనపల్లి తాలూకా: వర్షాధారపు చెరువులే పల్లపు సాగునకు శరణ్యము.

గుంటూరు తాలూకా : కృష్ణా హై లెవల్ కాలువ క్రింద కొంత భాగము పారుదల అగుచున్నది. వర్షాధారపు చెరువులును కలవు. అనావృష్టి కాలమున పల్నాడు,

సత్తెనపల్లి, నరసరావుపేట, వినుకొండ, ఒంగోలు తాలూకాలు కరవు బాధకు గురి అగుచుండును.

గుంటూరు జిల్లాలో పండు ఆహార పంటలలో వరి; వాణిజ్య పంటలలో మిరప, వేరుశనగ, పొగాకు ముఖ్యము.

గుంటూరు జిల్లా - పంటల వివరములు

1955 - 1956

| | | | |
|---|---|---|---|
| వరి | 5,00,797 ఎ. | ఇతర పప్పు ధాన్యములు | 686 ,, |
| గోధుమ | 1,413 ,, | మిరప | 86,466 ,, |
| జొన్న | 4,82,168 ,, | పసుపు | 1,062 ,, |
| సజ్జ | 1,50,762 ,, | ధనియాలు | 3,599 ,, |
| బార్లీ | 403 ,, | చెఱకు | 819 ,, |
| మొక్కజొన్న | 6,986 ,, | పండ్లు, కూరలు, దుంపలు | 15,622 ,, |
| రాగి | 9,351 ,: | ప్రత్తి | 37,976 ,, |
| కొర్ర | 63,170 ,, | జనుము | 13,968 ,, |
| వరిగ | 1,690 ,, | తక్కిన నార పైరులు | 3,064 ,, |
| సామ | 1,444 ,, | వేరు శనగ | 1,45,362 ,, |
| ఇతర పొట్టు ధాన్యములు | 3,56,111 ,, | తక్కిన నూనె గింజలు | 21,587 ,, |
| శనగ | 14,541 ,, | పొగాకు | 2,16,734 ,, |
| పెసర | 56,653 ,, | మేతపైరులు | 1,44,649 ,, |
| కంది | 27,524 ,, | పచ్చి ఎరువులు | 9,151 ,, |
| మినప | 54,105 ,, | | |
| ఉలవ | 15,061 ,, | | |

పై లెక్కలలో చేరని ఇతర పైరులు 27,227 ఎకరములు.

సముద్రతీరమున దొరువుల సాయమునను, తెనాలి తాలూకాలో కృష్ణా కాలువ, బావుల సాయమునను, మెట్ట ప్రదేశములలో కొన్నిచోట్ల బావుల సాయమునను పండ్ల తోటలు, తమలపాకుల తోటలు పెంచబడుచున్నవి. తెనాలి తాలూకా పెదవడ్లపూడి నారింజకాయలకు ప్రసిద్ధి. దుగ్గిరాల పసుపు పైరుకు పేరు పొందినది. ఇక్కడనుండి పసుపు ఉత్తర భారతదేశమునకు ఎగుమతి చేయబడుచున్నది. సముద్రతీరమున, ముఖ్యముగ వేటపాలెము ప్రాంతములందు జీడిమామిడి తోటలు విరివిగ ఉండుటచే జీడిపప్పు తయారు చేయబడుచున్నది. వర్జీనియా పొగాకును పండించుటయందు ఈ జిల్లా అఖిలభారత ఖ్యాతిని ఆర్జించుకొన్నది. పొగాకు పరిశోధనకు, అభివృద్ధికి గుంటూరువద్ద ఒక వ్యవసాయ పరిశోధన కేంద్రము కలదు. బాపట్ల తాలూకా ఇసుకనేలలందు వర్జీనియా పొగాకు నారుమళ్లు పెంచి ఇతర చోట్లకు నారును సరఫరా చేయుదురు.

జిల్లా ఎక్కువ భాగము మెట్ట ప్రదేశము అగుటచే, డెల్టాయందు పండు ఆహారధాన్యములు ఈ జిల్లా అవసరమునకు మాత్రము సరిపోవుచున్నవి. పొగాకు, వేరుశనగ, మిరప, పసుపు, తమలపాకులు, జీడిపప్పు ఎగుమతియగు ముఖ్య వస్తువులు.

గుంటూరువద్ద లాములో ఒక వ్యవసాయ పరిశోధన కేంద్రము కలదు. ఇచ్చట ముఖ్యముగ మిరప పైరును గురించి పరిశోధనలు జరుగుచున్నవి. ఒంగోలులో జొన్న పరిశోధన కేంద్రము కలదు. బాపట్లలో వ్యవసాయ కళాశాలకు అనుబంధముగ ఒక పరిశోధన క్షేత్రము (ఫారము) కలదు; ఇందు అనేక విధములగు క్షేత్రములను గురించి, పైరులను గురించి పరిశోధనలు జరుగు చున్నవి. రైతులకు ట్రాక్టర్లును, నీటి పంపులును ఇచట అద్దెకు ఇచ్చుచుందురు. పెదపాలెమున పసుపు పరిశోధన కేంద్రముకూడ కలదు.

పశు సంపద: ఈ జిల్లాలోని ఒంగోలు తాలూకా పశువులు మంచి వంగడమునకు చెందినవని పేరుకాంచినవి. ఇదివరలో ఈ పశువులు విదేశములకు విరివిగ ఎగుమతి అగుచుండెడివి. పశు సంపదను ప్రోత్సహించుటకై ఒంగోలులో ఏటేట భారీఎత్తున పశువుల సంత జరుగును. గుంటూరు, ఒంగోలు, తెనాలి, గురజాల, నరసారావుపేటలలో పశు వైద్య కేంద్రములు కలవు.

గృహ పరిశ్రమలు: చేనేత ముఖ్యమైన గృహ పరిశ్రమ. ఈ పరిశ్రమను ఆశ్రయించుకొని 57,779 మంది జీవించుచున్నారు. చీరాల, మంగళగిరి, ఈతముక్కల, భట్టిప్రోలు, ఐలవరము, చీమకుర్తి, పేటేరు మొదలగునవి చేనేతకు పేరు పొందినవి. ఇందు చీరాల వస్త్ర వ్యాపారమున 'చిన్న బొంబాయి' అని ఈ ప్రాంతమున పేరుపొందినది. పొగాకు వ్యాపార మధిక మగుటచే పెక్కు గ్రామములందు బ్యారనులు (పొగాకును పదనుచేయు ప్రదేశములు) అనేకములు కలవు. వీనిలో ఆయా అదనులందు కొందరు జీవించ కలుగుచున్నారు. మెట్ట తాలూకాలలో రాతి గనులయందు పనిచేసి చాల మంది జీవించుచున్నారు. సముద్ర తీరమున కొంతవరకు చేపల పరిశ్రమ కలదు.

పరిశ్రమలు: జిల్లాలో ఒక వినుకొండ తాలూకాలో తప్ప తక్కిన తాలూకాలు అన్నింటిలో, పెద్దవో, చిన్నవో పరిశ్రమలు కలవు. ముఖ్యమైన పరిశ్రమ పొగాకు పరిశ్రమ; చీరాలలో 'ఇండియన్ లీఫ్ టొబాకో డెవలప్మెంటు కంపెనీ' వారి ముఖ్యకేంద్రము కలదు - జిల్లాలో వివిధ భాగములందు చిన్న కేంద్రములు కలవు; వీనిలో దాదాపు ఇరువదివేల మందికి పని లభించుచున్నది.

మంగళగిరి, మాచర్లవద్ద సిమెంటు ఫ్యాక్టరీలు కలవు. నాగార్జునసాగరము అను బహుళార్థ సాధక ప్రణాళిక మాచర్లకు సమీపముననే అమలు జరుగుచున్నది; డాము నిర్మాణమునకు సంబంధించిన ఇంజనీరింగు పరిశ్రమ కలదు.

రోడ్లు : జిల్లా మొత్తమున 1,864 మైళ్ల నిడివిగల రోడ్లు కలవు. ఇందులో జాతీయ రహదారులు 99 మైళ్ళు; రాష్ట్ర రహదారులకు చెందినవి 701 మైళ్ళు; మునిసిపాలిటీలకు 229 మైళ్ళు, స్థానిక సంస్థలకు 835 మైళ్ళు చెందును. గ్రాండ్ ట్రంకురోడ్డు ఈ జిల్లాలో ఒంగోలు, నరసరావుపేట, గుంటూరు తాలూకాల గుండ పోవుచున్నది. ఈ జిల్లా నుండి కర్నూలుకును, హైదరాబాదుకును, విజయవాడకును పోవు రోడ్లు బాగుగ అభివృద్ధి పరుపబడినవి. నాగార్జున సాగరము దిగువను, విజయవాడ వద్దను కృష్ణానది మీద నూతనముగ నిర్మింపబడిన వంతెనల వలన గుంటూరు, నల్గొండ, కృష్ణా జిల్లాల మధ్య సరాసరి రాకపోకల సంబంధము ఏర్పరుప బడినవి. కాని పెద్దరోడ్లయందు సైతము వాగులు దాటుటకు తగినన్ని వంతెనలు లేకుండ చప్టాలు (causeways) మాత్రమే ఉండుటచే వర్షకాలమున రాకపోకలకు కష్టమెక్కువ. డెల్టా భాగమున రోడ్లు విరివిగా ఉన్నను, మెట్టప్రాంతములందు గ్రామసీమలకు రోడ్లవసతి చాల తక్కువ.

రైలు మార్గములు : జిల్లా యందు 133¼ మైళ్ళు బ్రాడ్ గేజ్ రైలు మార్గమును, 162 మైళ్ళ మీటర్ గేజ్ రైలు మార్గమును కలదు. మద్రాసు నుండి కలకత్తాకు పోవు రైలుమార్గము ఒంగోలు, బాపట్ల, రేపల్లె, తెనాలి, గుంటూరు తాలూకాల గుండ పోవుచున్నది. గుంటూరు నుండి రేపల్లెకు పోవు బ్రాడ్ గేజ్ శాఖామార్గము తెనాలి వద్ద చీలిపోవుచున్నది. విజయవాడనుండి గుంతకల్లుకు పోవు మీటర్ గేజ్ రైలుమార్గము గుంటూరు, సత్తెనపల్లి, నరసారావుపేట, వినుకొండ తాలూకాలగుండ పోవుచున్నది. గుంటూరునుండి మాచర్లకు పోవు మీటర్ గేజ్ శాఖా మార్గము సత్తెనపల్లి, పల్నాడు తాలూకాలగుండ పోవుచున్నది. తాలూకా కేంద్రము లన్నియు రైలు మార్గము మీదనే కలవు.

నీటి దారులు : కృష్ణానది నుండి బయలుదేరు కాలువలలో పడవల వలన రాకపోకలు జరుగుచున్నవి. పెదగంజామువద్ద, కొమ్మమూరు కాలువ బకింగుహాము కాలువలను చేరుటచే విజయవాడనుండి మద్రాసు వరకు పడవలమీద వ్యాపారము బాహుళ్యముగ సాగుచున్నది.

విద్య : ఆంధ్రప్రదేశ్‌నందు విద్యావ్యాప్తి ఎక్కువ గల జిల్లాలలో గుంటూరు ఒకటి. ఈ జిల్లాయందు అక్షరాస్యులు 27·38% ; పురుషులు 37%, స్త్రీలు 17·52% (1961). జిల్లాలో విద్యాసక్తియు, అందుకు తగిన ప్రోత్సాహము విరివిగ ఉండుటచే కాలేజీల సంఖ్యయు, ఉన్నత పాఠశాలల సంఖ్యయు ప్రతి సంవత్సరము వృద్ధియగుచున్నది.

ఈ జిల్లాయందు గల విద్యా సంస్థలు, ఉపాధ్యాయులు, విద్యార్థి సంఖ్యా వివరములు దిగువ తెలుపబడినవి(1956-57):

| విద్యాసంస్థ | సంస్థ సంఖ్య | ఉపాధ్యాయులు | విద్యార్థులు. |
|---|---|---|---|
| ప్రాథమిక పాఠశాలలు | 2,962 | 9,956 | 3,39,165 |
| మాధ్యమిక పాఠశాలలు | 20 | 157 | 2,987 |
| ఉన్నత పాఠశాలలు | 127 | 2,194 | 50,969 |
| వయోజన విద్యాకేంద్రములు | 332 | 524 | 10,885 |
| ప్రత్యేక, వృత్తిబోధక పాఠశాలలు | 45 | 220 | 3,684 |

ఇవిగాక జిల్లా మొత్తముమీద ఎనిమిది సామాన్య కళాశాలలు - గుంటూరు పట్టణమున రెండు, తెనాలి, నిడుబ్రోలు, చీరాల, ఒంగోలు, నర్సరావుపేట అను పట్టణములలో ఒక్కొక్కటివంతునను; మహిళలకు ప్రత్యేకముగ ఒక కళాశాల (గుంటూరు) ప్రభుత్వయాజమాన్యమునను కలవు. వృత్తి విద్యాకళాశాలలు - వైద్య కళాశాల (గుంటూరు), వ్యవసాయ కళాశాల (బాపట్ల), ఉపాధ్యాయ కళాశాల (గుంటూరు) కలవు. వీనిలో సామాన్య కళాశాలలందు 7,631 మంది, వృత్తి విద్యా కళాశాలలందు 635 మంది విద్యార్థులు కలరు.

ఆరోగ్యము, వైద్యము : మలేరియా తప్ప పేర్కొనదగిన అంటు రోగము లేవియు ఈ జిల్లాయందు విరివిగ లేవు. ప్రభుత్వకృషి ఫలితముగ మలేరియా వ్యాప్తియు చాల వరకు తగ్గినది. ప్రభుత్వమువారి చేతను, మిషనరీవారి చేతను నడుపబడు వైద్యశాలలు విరివిగ జిల్లాయందు కలవు. గుంటూరు పట్టణములో సర్వ పరికర సమన్వితమైన ఆసుపత్రి వైద్యకళాశాలలకు అనుబంధముగా కలదు. జిల్లా మొత్తమున 8 ఆసుపత్రులు, 28 డిస్పెన్సరీలు కలవు ; వీనియందు పనిచేయు డాక్టర్ల సంఖ్య 73. జిల్లా మొత్తమున 774 మంచములు కలవు. ఇవిగాక యునాని వైద్యశాలలు 2, ఆయుర్వేద వైద్యశాలలు 44 కలవు (1956-57).

చూడదగిన స్థలములు : ఈ జిల్లాయందు పలు ప్రదేశములలో పురాతన బౌద్ధ సంస్కృతికి సంబంధించిన శిథిలావశేషములు కాననగుచున్నవి. అట్టి ప్రదేశములలో పేర్కొనదగినవి సత్తెనపల్లి తాలూకాలో కృష్ణానది ఒడ్డున ఉన్న అమరావతి; రేపల్లె తాలూకాలోని భట్టిప్రోలు ; పల్నాడు తాలూకా యందలి నాగార్జునకొండ. ఇవిగాక ప్రాచీన గుహాలయములు కొన్ని కృష్ణానది దక్షిణపు ఒడ్డునఉన్న ఉండవల్లియందు కలవు. పుణ్యక్షేత్రములలో అమరావతి యందు విష్ణు దేవాలయము కలదు. కోటప్పకొండ శివరాత్రి ఉత్సవములకు పేర్కొనదగినది.

అమరావతి : ఇచ్చటి అమరేశ్వరాలయము పదవ శతాబ్దినుండియు కలదను విషయము ఇచ్చట దొరికిన ఒక శాసనము వలన తెలియనగు చున్నది. పంచారామము లందలి 'అమరారామము' ఇదియే. చింతపల్లి జమీం దారగు వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు క్రీ. శ. 1796లో అమరావతిని తన నివాసస్థలముగ చేసికొని దానిని అభి వృద్ధి పరచెను. ఆయన కృషి ఫలితముగ దేవాలయము పునరుద్ధిత మయ్యెను. శివరాత్రికి ఇచట జరుగు మహో త్సవమునకు అనేక ప్రాంతములనుండి యాత్రికులువచ్చి ఉత్సవమునందు పాల్గొందురు.

మంగళగిరి : గుంటూరునుండి విజయవాడకు పోవు రోడ్డు ప్రక్కన గుంటూరునకు పదిమైళ్ల దూరమున ఈ క్షేత్రము ఉన్నది. ఇచ్చటఉన్న కొండపైన వెలసి ఉండి పానకాలస్వామి అను ప్రసిద్ధనామముతో వ్యవహరింపబడు నృసింహస్వామి ఇచటి ఆరాధ్య దైవము. శ్రీకృష్ణ చైతన్యుడు 16వ శతాబ్ది ఆరంభ దశలో యాత్రా సందర్భ మున ఈ క్షేత్రమును దర్శించెను. ఏటేట ఫాల్గుణ శుద్ధ పూర్ణిమకు ఇచట కల్యాణోత్సవము జరుగును. మాఘ పూర్ణిమకు విజయవాడ వద్ద కృష్ణానదిపై ఈ స్వామికి తెప్ప ఉత్సవము జరుగును.

నాగార్జునకొండ : సుప్రసిద్ధ బౌద్ధ క్షేత్రము. మాచ ర్లకు 14 మైళ్ళ దూరము. శిథిలావశేషముల త్రవ్వకము ఇటీవల (1961)నే పూర్తియైనది. కొండపై మ్యూజియము నిర్మాణము జరుగుచున్నది. కృష్ణానదిపై ఈ కొండ దిగువన బహుళార్థసాధక పథకము అమలు జరుగుచున్నది.

జిల్లా సంక్షిప్త చరిత్ర : కృష్ణా నది దక్షిణ తీరమున ఉన్న ఈ జిల్లా క్రీస్తుపూర్వము అనేక శతాబ్దములనుండియు మానవావాసమై ఉండి నటుల చారిత్రికాధారములు కలవు. కృష్ణానది తీరమున పల్నాడు మొదలుకొని గుంటూరు వరకును దక్షిణమున వినుకొండ తాలూకా యందును ఆదిమ మానవుల సమాధులు అచ్చటచ్చట కననగు చున్నవి. ఈ జిల్లాయందు కృష్ణా తటమున నివసించిన నాగుల యందు బౌద్ధ మతము అశోకుని కాలమునకు పూర్వముననే వ్యాప్తమైనటుల కొందరు చరిత్రకారులు భావించుచున్నారు. ధాన్య కటకము (నేటి అమరావతి), ప్రతిపాలపురము (భట్టిప్రోలు) అనునవి ఆనాడీ జిల్లా యందు బౌద్ధమత వ్యాప్తికేకాక సాంస్కృతిక, రాజకీయ విషయములందు సైతము పేరుకాంచినటుల అచటి స్తూపముల అవశేషములందు లభ్యమగు సామగ్రి వలన రుజువగు చున్నది. ఆంధ్రుల పరిపాలనా కాలమున ఇచటి తూర్పుతీరపు రేవులలో విదేశ వ్యాపారము విరివిగ జరుగు చెండెడిదని తెలియ వచ్చుచున్నది. క్రీ. శ. మొదటి శతాబ్దమున శ్రీపర్వతమందలి బౌద్ధ విహారముల ప్రశస్తి సింహళాది దేశములకు సైతము ప్రాకెనని అచటి శాసన ముల వలన విదితము. ఆ శ్రీపర్వతమే నేటి నాగార్జున కొండ. ఆంధ్ర సామ్రాజ్యము పతనమైన తరువాత శ్రీపర్వత సమీపమున ఉన్న విజయపురి అను నగరము రాజ ధానిగ ఇక్ష్వాకు రాజులు క్రీస్తు తరువాత నాలుగవ శతా బ్దము వరకును ఈ జిల్లాను, తత్పరిసర ప్రాంతములను పరిపాలించి బౌద్ధ, వైదిక మతములను సమానముగ ఆదరించిరి. ఆ తరువాత ఈ జిల్లాలో అత్యధిక భాగమును ఆనందగోత్రులనబడు రాజులును, వారి తరువాత పల్లవులు పరిపాలించిరి. క్రీస్తుశకము ఏడవ శతాబ్ది ప్రథమ పాదములో తక్కిన తీరాంధ్రముతో పాటుగ ఈ జిల్లాకూడ తూర్పు చాళుక్యుల వశమయ్యెను. అప్పటి నుండి 1070 వరకు చాళుక్య ప్రభువుల పాలనలో ఉండి ఈ జిల్లా తదనంతరమున చాళుక్య చోళ సామంతుల వశమయ్యెను, అట్టి సామంత వంశములలో ప్రముఖమైనది వెలనాటి దుర్జయ వంశము. ఆనాడు ఈ జిల్లాయందలి తూర్పు భాగము వెలనాడు అని పిలువ బడెడిది. ఈ దుర్జయుల రాజధాని ధనదపురము ; అదియే నేటి చందవోలు. వారికి సమకాలీనులును, బంధువులు నగు హైహయులు పడమటి వైపున ఉన్న పల్నాడును పాలించిరి. 13 వ శతాబ్దమున కాకతీయగణపతి దేవుడు సామంత వంశములను జయించి ఈ జిల్లాను తన రాజ్యమున చేర్చుకొనెను. ఈతని పరి పాలన కాలమున ఈ జిల్లా యందలి తూర్పు తీరమున ఉన్న మోటుపల్లి రేవు పునరుద్ధరితమై విదేశ వ్యాపార మునకు ప్రోత్సాహము లభించెను. ఆ కాలమున ఈ జిల్లా యందలి ధరణికోట రాజధానిగ కోట వంశీయులు ఈ ప్రాంతములను కాకతీయులకు సామంతులుగ పాలించిరి. కోట బేతరాజు గణపతి కుమార్తెయగు గుణపాంబను వివాహమాడెను. భర్త అనంతర మామెయే ధరణికోట రాజ్యమును పాలించెను ; ఈమె కాలమున తూర్పు సముద్ర తీరముల పర్యటించిన మార్కొపోలో గుణపాంబ ప్రతిభా విశేషములను ప్రస్తుతించెను. ఢిల్లీ సుల్తానుల దండయాత్రల మూలమున కాకతీయ సామ్రాజ్యము 1323 లో అస్తమిం చెను. దేశము ముస్లిముల అధికారము క్రిందికి వచ్చెను. అచిరకాలముననే సునారి ప్రోలయ కాపయ నాయకుల యాజమాన్యము వలన తక్కిన తీరాంధ్ర దేశపు ప్రాంత ములవలెనే ఈ ప్రాంతమును ముస్లిము పరిపాలనమున నుండి విముక్తియై స్వతంత్రమయ్యెను. స్వాతంత్ర్య సమర మున ప్రోలయ నాయకునితో సహకరించిన ప్రోలయ

వేమారెడ్డి కొద్దికాలమైన పిదప రెడ్డి రాజ్యమును స్థాపించెను. ఇతని రాజధాని మొదట అద్దంకి. ఇతని కుమారుడు అనవోతా రెడ్డి కాలమునుండి రెడ్డి రాజులకు కొండవీడు రాజధాని అయినది. ఈ కొండవీటి రాజుల పాలన క్రీ. శ. 1424 వరకు సాగెను. తరువాత ఈ ప్రాంతమంతయు విజయనగరాధీశ్వరుల వశమయ్యెను. తరువాత పది ఏండ్లకు విజయనగర ప్రభువగు ఇమ్మడి దేవరాయలు ఈ ప్రాంతముపై దండెత్తి కళింగుల నోడించి ఈ సీమను ఆక్రమించెను. కాని 1455 లో కపిలేశ్వర గజపతి ఈ ప్రాంతము నంతటిని తన సామ్రాజ్యమున కలుపుకొన కలిగెను. కట్టకడకు 1515 లో శ్రీకృష్ణదేవరాయలు గజపతుల నోడించి ఈ ప్రాంతము నంతను తన రాజ్యమున కలుపుకొనెను. విజయనగర సామ్రాజ్యము రక్కసి తంగడి యుద్ధముతో క్షీణస్థితి నొందినపుడు గోల్కొండ ప్రభువులు చెలరేగి ప్రాచ్యాంధ్రమును జయించగ కొండవీటి సీమకూడ 1571 లో వారి వశమయ్యెను. అటనుండి వారి పరిపాలన లోనే యుండి 1687 లో ఆ రాజ్యము నంతమొందించిన మొగలులకు వశమయ్యెను. 1748 వరకును మొగలాయీ ప్రభువుల పేరనే ఈ ప్రాంతమును అసఫ్‌జాహీలు పాలించిరి. వీరు 1752 లో ఫ్రెంచి వారికి దత్తమొనర్చిన నాలుగు సర్కారులలో గుంటూరు జిల్లా ఒకటి. కాని అనతి కాలముననే ఆంగ్లేయులు ఫ్రెంచి వారిని లోగొనుటచే అసఫ్‌జాహీ వంశీకులు వారితో మైత్రి నర్థించి కొన్ని తక్కిన ప్రాంతములతో పాటుగ ఈ జిల్లాయందలి నిజాం పట్టణ సర్కారును 1768 లో ఆంగ్లేయులకు ఇచ్చిరి. గుంటూరు సర్కారు మాత్రము అప్పటి సంధి నియమముల ప్రకారము అసఫ్‌జాహీ ప్రభువునకు సహోదరుడగు బసాలత్ జీవిత కాలము వరకును అతని స్వాధీనములోనే ఉండి, కడకు 1788 లో ఆంగ్లేయుల వశమయ్యెను.

బ్రిటిష్ పరిపాలన 1801 నుండియు ఈ జిల్లాలో సుస్థిరత నొందెనని చెప్పవచ్చును. అప్పటి వరకును విచ్చల విడిగ నిరంకుశముగ విహరించిన జమీందారులు కొందరు కొంత ప్రతిరోధము చూపినను మొత్తము మీద తక్కిన ఆంధ్ర దేశముతో పోల్చినపుడు అట్టి తిరుగుబాటు ఇచట చాల తక్కువగ నుండినదనియే చెప్పవచ్చును. చింతపల్లి జమీందారగు రాజా వాసిరెడ్డి వెంకటాద్రి నాయుని చర్యలు కొంత ఆందోళనము కలిగించగ బ్రిటిష్ ప్రభుత్వము అతని ముఖ్య నగరమగు చింతపల్లియందు తమ సైన్యమును కొంతయుంచిరి. దాని వలన నతడు తన ముఖ్య నగరమును అమరావతికి మార్చుకొని అంతటనుండి బ్రిటిష్ ప్రభుత్వముతో సహకరించెను.

1832 లో అంతకు ముందెన్నడు కని విని ఎరుగని కరవునకు గుంటూరు జిల్లా గురి యయ్యెను. దానిని నందన సంవత్సరపు కరవని ఈ ప్రాంతీయులనెదరు. ఇట్టి కరవుల బాధనుండి విముక్తి కలిగించుటకే 1853 లో బెజవాడ (ఇప్పటి విజయవాడ) వద్ద కృష్ణకు ఆనకట్ట కట్టబడినప్పుడు ఈ జిల్లా తూర్పు భాగమున నీటి పారుదల వసతి ఏర్పడెను. 1859 లో పరిపాలనా సౌకర్యముకొరకై గుంటూరు, మచిలీపట్టణము సర్కారులు కలిపివేయబడి కృష్ణా జిల్లా నిర్మింపబడెను. కాని, 1906 లో ఈ ఏర్పాటు రద్దొనర్పబడి, ఆ జిల్లా విభక్తమై అందలి కృష్ణ దిగువ తాలూకాలు నెల్లూరు జిల్లానుండి చీల్చిన ఒంగోలు తాలూకాతో కలుపబడి నేటి గుంటూరుజిల్లాగా ఏర్పరుపబడెను.

చీ. శే. రా.

# నెల్లూరు జిల్లా

**ఉనికి - విస్తీర్ణము:** తూర్పు తీరమున ఉ. అక్షాంశము 13° 30′ నుండి 16° వరకును, తూ. రేఖాంశము 79° 5′ నుండి 80° 15′ వరకును నెల్లూరు జిల్లా విస్తరించి యున్నది. దీనికి సరిహద్దులుగ ఉత్తరము గుంటూరు జిల్లా తూర్పు బంగాళా ఖాతము; దక్షిణము చిత్తూరు జిల్లా: పడమర కడప, కర్నూలు జిల్లాలు కలవు. ఈజిల్లాయందు కందుకూరు, కనిగిరి, పొదిలి, దర్శి, ఆత్మకూరు, కావలి, కోవూరు, ఉదయగిరి, గూడూరు, రాపూరు, సూళ్లూరుపేట, వెంకటగిరి, నెల్లూరు అను 13 తాలూకాలు కలవు. జిల్లా విస్తీర్ణము 7,960 చ. మైళ్లు. కోస్తా పొడుగున 150 మైళ్ల పొడవు, సుమారు 60 మైళ్ల వెడల్పున ఈ జిల్లా వ్యాపించి ఉన్నది.

నైసర్గిక స్వరూపము: పడమటి వైపున వెలిగొండల ప్రాంతమున తప్ప తక్కిన జిల్లా అంతయు సమతలముగా ఉన్నది. కోస్తా వెంబడి కందుకూరు, కావలి, కోవూరు, నెల్లూరు, గూడూరు, సూళ్లూరుపేట తాలూకాలు ఉత్తరమునుండి దక్షిణమునకు వ్యాపించి ఉన్నవి. ఈ తాలూకాలకు పడమట దర్శి, పొదిలి, కనిగిరి, ఉదయగిరి, ఆత్మకూరు, రాపూరు, వెంకటగిరి తాలూకాలు ఉన్నవి. కోస్తా ప్రాంతమున ఇసుక పర్రలును, అందచ్చటచ్చట పొదలు, తాటిచెట్లు, కొబ్బరిచెట్లు, చవుకుచెట్లు, తోటలును కలవు. జిల్లాకు ఆగ్నేయ మూలన 'శ్రీహరికోట' అను దీవి కలదు; దీని పొడవు 35 మైళ్లు, వెడల్పు 16 మైళ్లు-

ఈ దీవి యంతయు ఇసుకపఱ్ఱ. సముద్రపు పోటువలన ఏర్పడిన ఉప్పు సరస్సులు అనేకములు తీరము వెంబడి కలవు. అట్టి వానిలో పులికాటు సరస్సు ముఖ్యమైనది.

తూర్పు కనుమలలో ఒక భాగమగు వెలిగొండలు వెంకటగిరి తాలూకా నైరృతి మూలనుండి కనిగిరి తాలూకా ఉత్తరమునకు జిల్లా పడమటి సరిహద్దున వ్యాపించి ఉన్నవి. ఈ కొండలలో అత్యున్నతమైన శిఖరము సముద్రపు మట్టమునకు 3,000′ ఎత్తున ఉన్నది. ఉదయగిరి తాలూకాలోని ఉదయగిరి దుర్గము కొండకు, ఈ కొండలతో ఎట్టి సంబంధము లేదు. ఎత్తు 3079′. పొదిలి, దర్శి, కందుకూరు తాలూకాలలో అక్కడక్కడ కొండలు, తిప్పలు కలవు.

నదులు: ఈ జిల్లాలో పెన్న, కండ్లేరు, స్వర్ణముఖి మూసీ, పాలేరు, మన్నేరు అనునవి కలవు; ఇవికాక కొన్ని చిన్న వాగులు కూడ కలవు. కాని, వీనియందు సంవత్సరమున ఎక్కువ కాలము నీరు ఉండదు.

పెన్న నది: మైసూరులోని నందిదుర్గము అను కొండలలో పుట్టి, వెలిగొండలలోని ఒక లోయగుండ సోమశిలవద్ద నెల్లూరు జిల్లాలో ప్రవేశించుచున్నది; తూర్పు దిశగా ఆత్మకూరు తాలూకాలోను నెల్లూరు, కోవూరు తాలూకాలకు సరిహద్దుగను ఈ జిల్లాలో 70 మైళ్లు ప్రవహించి నెల్లూరు పట్టణమునకు 18 మైళ్ళ దిగువ, ఊటుకూరువద్ద బంగాళాఖాతము చేరుచున్నది. వెలిగొండలలో పుట్టిన బొగ్గేరు అను ఏరు ఆత్మకూరు తాలూకా కొలగుంట్లవద్ద పెన్నలో చేరుచున్నది. బిరపేరు అను ఉపనది కోవూరు తాలూకా సంగం వద్ద పెన్నలో కలియుచున్నది.

స్వర్ణముఖి: చిత్తూరు జిల్లా చంద్రగిరి కొండలలో జన్మించి, ఈ జిల్లాలో వెంకటగిరి, సూళ్లూరుపేట తాలూకాల సరిహద్దునను, గూడూరు తాలూకాలోను మొత్తము జిల్లాలో 21 మైళ్ళు ప్రవహించి, సిద్దవరము (గూడూరు తాలూకా) వద్ద సముద్రమున చేరుచున్నది.

చిన్ననదులు: కండ్లేరు అను చిన్ననది రాపూరు తాలూకాలోను, గూడూరు, నెల్లూరు తాలూకాల సరిహద్దునను ప్రవహించుచున్నది. కనిగిరి, కందుకూరు తాలూకాలలో మన్నేరు పారుచున్నది. కావలి, కందుకూరు తాలూకాలనుండి వచ్చు ఉప్పుటేరు, ఉదయగిరి తాలూకాలో పారుచున్న పిల్లఏరు మన్నేరు నదిలో కలియుచున్నవి. కనిగిరి, కందుకూరు తాలూకాలకు అడ్డముగ పాలేరు ప్రవహించుచున్నది. దర్శి తాలూకా దక్షిణ సరిహద్దునుండి పొదిలి, కందుకూరు తాలూకాల గుండ మూసీనది పారుచున్నది. గుండ్లకమ్మ, పొదిలి, దర్శి తాలూకాల మధ్యగా కొంతదూరము ఈ జిల్లాలో ప్రవహించుచున్నది. వెంకటగిరి తాలూకాలోని వెంకటగిరి వాగును, రాపూరు తాలూకా దక్షిణపు సరిహద్దున ఉన్న కొల్లేరు, ఆత్మకూరు తాలూకాలోని కేతమన్నేరు పేర్కొనదగిన వాగులు.

శీతోష్ణస్థితి: జిల్లా మొత్తము మీద శీతోష్ణస్థితి ఆరోగ్యదాయకముగ ఉండును. ఏప్రిల్ నుండి జూన్ వరకు వేసవి కాలము; ఎండలెక్కువగ కాయును. సరాసరి దైనిక గరిష్ఠోష్ణోగ్రత 94° ఫా., కనిష్ఠోష్ణోగ్రత 75.2° ఫా. సంవత్సరము మీద అత్యధిక ఉష్ణోగ్రత 109° ఫా. అత్యల్ప ఉష్ణోగ్రత 62° ఫా.

వర్షపాతము: ఈ జిల్లాలో వర్షపాతము చాల అనిశ్చితముగ ఉన్నది. జూన్ మధ్య నుండియే నైరృతి ఋతుపవనములు సాగినను వర్షములు తక్కువగను గాలి ఎక్కువగను ఉండును. కురిసిన కొద్ది వర్షమున ఎక్కువ భాగము జిల్లాలో ఉత్తర ప్రదేశమున పడుచున్నది. ఈశాన్య ఋతుపవనములు సాధారణముగ అక్టోబరులో మొదలిడి డిశెంబరు, జనవరి నెలల వరకు వర్షములు కురియుచున్నవి. సరాసరిన సంవత్సరమున వర్షము కురియు రోజులు 41.5; సరాసరి సాంవత్సరిక వర్ష పాతము 39″. సూళ్లూరుపేట తాలూకాలో వర్ష పాతము 44.67″ - తక్కిన వాని కన్న ఎక్కువ; దర్శి తాలూకాలో వర్ష పాతము 25.12″ - తక్కినవానికన్న తక్కువ.

అడవులు: జిల్లాలో 4,07,536 ఎకరముల విస్తీర్ణము కల అడవి కలదు. ఉదయగిరి, రాపూరు తాలూకాలలోని అడివి పొదలమయము. అందు విలువగల చెట్లు ఏమియు లేవు. కనిగిరి తాలూకాలోని అడవులలో కొంత భాగమునను,వెలిగొండలలోని అడవులయందును విలువగల చెట్లును, మంచి గడ్డి బీళ్లును కలవు. తీరమున ఉన్న కావలి, కోవూరు తాలూకాలలోని అడవులలో చవుకు తోపులున్నవి. ఆత్మకూరు, వెంకటగిరి తాలూకాలలోని అడవి చిట్టడవి. సూళ్లూరుపేట తాలూకాలోని అడవులు ఆకుపచ్చని పొదలతో నిండి ఉన్నవి. అడవులనుండి లభించు ఫలసాయమున కుంకుళ్లు ముఖ్యమైనవి. పరిసరముల ఉన్న గ్రామముల పశువుల మేపుటకు బీళ్లుగా కూడ ఈ అడవులు కొన్ని ఉపయోగ పడుచున్నవి.

ఖనిజ సంపద: నెల్లూరు జిల్లా అభ్రకపు (మైకా) గనులు ప్రపంచమందంతట ప్రసిద్ధి గాంచినవి. గూడూరు, రాపూరు తాలూకాలయందును, కావలి తాలూకాయందు దుండిగం, గుడ్లదొన గ్రామములందును మైకా గనులు కలవు పొదిలి తాలూకా రాయవరము, కేతగుడిపి అగ్రహారము

లలో పలక రాతి గనులు కలవు. ఈ రాయి మార్కాపురమునకు ఎగుమతి చేయబడి, అక్కడబడి పిల్లలకు పనికివచ్చు పలకలుగా తయారగుచున్నది. కనిగిరి నల్లరాయి చాల నాణ్యమైన దగుటచే రోడ్డురోలర్ల తయారీకి ఉపయోగపడుచున్నది. సూళ్లూరుపేట తాలూకా పులికాటు సరస్సు నుండి గుల్లరాయి సున్నము తయారీకి మద్రాసుకు ఎగుమతి చేయబడు చున్నది. సూళ్లూరుపేట తాలూకా రోశనూరు గ్రామమువద్ద వేణుంబాక కొండలలో విరివిగ ఇనుప గనులును, కందుకూరు తాలూకా చుండి ప్రాంతము నందలి గుట్టలలో కైనైటు (అల్యూమినియంసిలికేటు) గనులును కలవని విజ్ఞులందురు. సూళ్లూరుపేట తాలూకాలో తీర ప్రాంత గ్రామములందు జిప్సము లవణము దొరకు చున్నది.

పట్టణములు : జిల్లాలో మునిసిపాలిటీలు కల పట్టణములు నెల్లూరు, గూడూరు అనునవి రెండు మాత్రము.

నెల్లూరు : జనసంఖ్య 1,06,797; జిల్లా కేంద్రము.

గూడూరు : జన సంఖ్య 25,627 ; రైల్వే కూడలి.

ప్రజలు : ఈ జిల్లా జనసంఖ్య* 20,33,963 ; పురుషులు 10,18,504, స్త్రీలు 10,15,459 - జన సాంద్రత చ మైలునకు 256. 1951 - 61 మధ్య పదేండ్లలో జిల్లాయందలి జనసంఖ్య 13.34% వృద్ధియైనది. జిల్లాయందలి ప్రజలలో 10 మందిలో ఒకరు పట్టణములలో నివసించుచున్నారు.

మతములు : హిందువులు 15,46,946 ; ముస్లిములు 1,43,866 ; క్రైస్తవులు 1,04,750 ; ఇతరులు 70 (1951).

భాషలు : జిల్లాలోని అధిక సంఖ్యాకుల మాతృభాష తెలుగు. 1951 లెక్కల ప్రకారము తెలుగు మాతృభాషగ కలవారు 16,41,350, ఉర్దు 1,08,934, తమిళము 33,119, హిందీ 6,320, ఎరుకల 1,955 - తక్కిన భాషలవారు 3,954.

వృత్తులు : వ్యవసాయము ముఖ్య వృత్తి. భూస్వాములు, వ్యవసాయము స్వంతముగ చేయువారు, వ్యవసాయ కార్మికులు వీరందరిని వ్యవసాయ వృత్తిచే జీవించువారుగ లెక్కించినచో వీరి సంఖ్య 13,02,784. వ్యాపారము వలన జీవించువారు 85,046 ; పరిశ్రమల మూలమున జీవించువారు 2,24,226 ; ఇతర ఉద్యోగముల వలన జీవించువారు 1,83,576 (1951).

వ్యవసాయము : జిల్లాలోని తూర్పు భాగము, పడమటి భాగముతో పోల్చి చూచిన కొంతవరకు సారవంతమే అని చెప్పవచ్చును. పడమటి భాగము చెట్లు చేమలు లేని నిస్సారమగు విశాల భూమి. కోస్తా ప్రాంతమున 3, 4 మైళ్ల వెడల్పు గల ఇసుక పఱ్ఱ ఉన్నది. సేద్యరీత్యా ఈ జిల్లాలో నాలుగు రకముల నేల కలదు. 1. నల్లనేల, 2. ఎఱ్ఱనేల, 3. కలగలపు, 4. ఇసుకనేల. సూళ్లూరుపేట, కనిగిరి తాలూకాలలో ఇసుక నేలయు ; నెల్లూరు తాలూకాలో నల్ల నేలయు ; ఆత్మకూరు, కావలి తాలూకాలలో ఎఱ్ఱ నేలయు ; ఉదయగిరి, కోవూరు తాలూకాలలో కలగలపు నేలయు విస్తారము.

నెల్లూరు జిల్లాలో 3,538 చ. మైళ్లు. అనగా సుమారు సగము భాగము ఇదివరలో జమీందారుల స్వాధీనమున ఉండి రాష్ట్ర ప్రభుత్వ వశమైనది (1949). నీటి పారుదల వసతుల గురించి జమీందారు లెక్కువ శ్రద్ధ వహింపక పోవుటచే అక్కడ ఉన్న పంట చెరువులలో చాల భాగము శిథిలావస్థలో ఉన్నవి. ప్రభుత్వ వశమైన తరువాత వీనిలో చాలభాగము పెక్కు అభివృద్ధి పథకములద్వారా ఇప్పుడిప్పుడే బాగుపడుచున్నవి.

జిల్లాలో వ్యవసాయమునకు ఉపయోగించు నీటి పారుదల వసతులను ఏడు విధములుగ విభజింపవచ్చును, 1. నదులు, 2. నదుల నీటిచే నింపబడు చెరువులు, జలాశయములు, రిజర్వాయరులు, 3. వర్షాధారపు చెరువులు, 4. నదీ కాలువలు, 5. ఊట కాలువలు, 6. దొరువులు, 7. బావులు.

ముఖ్యమైన నీటివసతి పెన్ననది ; దీనికి అడ్డముగ సంగము వద్దను, నెల్లూరు వద్దను ఆనకట్టలు కట్టబడినవి. ఇక్కడనుండి పోవు కాలువల వలన నెల్లూరు, కోవూరు తాలూకాలకు నీరు లభించు చున్నది. నదుల నీటి వలన నింపబడు చెరువులు, రిజర్వాయరులు కనిగిరి, కందుకూరు ఆత్మకూరు, నెల్లూరు, గూడూరు తాలూకాలలో కలవు. వీనిలో మన్నేరుచే నింపబడు మోపాడు రిజర్వాయరు పెద్దది. ఇవి కాక అన్ని తాలూకాలలో వర్షాధారపు చెరువులు కలవు ; కాని ఇవి అంతగా విశ్వసింపదగిన ఆధారములుకావు. నదుల యొడ్డున ఉన్న భూములలో కొన్నింటికి మోట వలన నది నీటిని పారించుటయు కలదు. ఇట్టి వ్యవసాయము ముఖ్యముగ ఉదయగిరి తాలూకాలో నదుల వెంబడి సాగుచున్నది. దొరువుల వలన, ఊట కాలువలవలన వ్యవసాయము తీర ప్రాంతమునందు విస్తారముగ జరుగు చున్నది. మెట్ట భూములలో కొన్ని చోట్ల బావులు కలవు. వీటినుండి సజ్జ, రాగి మొదలగు పైరుల నీరు పారించు చున్నారు.

నెల్లూరు జిల్లాలో సాగునకు తగిన భూమి 26,14,288 ఎకరములు కలదు. ఇందు సాగగుచున్న భూమి 16,06,863 ఎకరములలో 6,44,218 ఎకరములకు నీటి పారుదల వసతి కలదు. తక్కిన దంతయు వర్షము మీద ఆధారపడి సాగగుచున్నది. పల్లపు సాగులో సుమారు అయిదింట రెండు భాగములు నెల్లూరు, కోవూరు తాలూకాలలోనే ఉన్నది.

* 1961 జనాభా లెక్కల ప్రకారము.

## నెల్లూరు జిల్లా - పంటల వివరములు
## 1955 - 56

| | | | |
|---|---|---|---|
| వరి | 467,925 ఎ. | మిరప | 16,440 ఎ. |
| జొన్న | 463,180 ,, | పసుపు | 502 ,, |
| సజ్జ | 120,112 ,, | ధనియాలు | 1,255 ,, |
| రాగి | 83,288 ,, | చెఱకు | 32 ,, |
| కొఱ్ఱ | 75,669 ,, | పండ్లు, కూరలు, | |
| వరిగ | 1,42,578 ,, | దుంపలు | 13,227 ,, |
| సామ | 11,568 ,, | ప్రత్తి | 34, 514 ,, |
| ఇతర పొట్టు | | జనుము | 2,813 ,, |
| ధాన్యములు | 29,214 ,, | వేరుశనగ | 12,507 ,, |
| శనగ | 1,276 ,, | తక్కిననూనె | |
| పెసర | 21,000 ,, | గింజలు | 57,874 ,, |
| కంది | 7,761 ,, | పొగాకు | 6,410 ,, |
| మినప | 1,656 ,, | మేతపైరులు | 41,480 ,, |
| ఉలవ | 85,417 ,, | పచ్చి ఎరువు | |
| ఇతర పప్పుగింజలు | 1,265 ,, | పైరులు | 8,492 ,, |

పై లెక్కలలో చేరని పైరులు 99,136 ఎకరములు.

ఈ జిల్లాలో పొదిలి, కనిగిరి, ఉదయగిరి, రాపూరు, వెంకటగిరి, సూళ్ళూరుపేట తాలూకాలును, ఆత్మకూరు తాలూకాలో మెట్ట భాగమును సాధారణముగ కరవునకు గురి అగుచున్నవి. గూడూరు, కావలి తాలూకాలు కరవు బాధకు లోనగుచున్నవి.

బుచ్చిరెడ్డిపాలెములో వ్యవసాయ పరిశోధనా కేంద్రము కలదు. ఇచ్చటి వరిపైరు మీదనే కాకుండ ప్రత్తి, నూనె విత్తనములను గురించి, అపరాల విత్తనములను గురించి పరిశోధనలు జరుపబడుచున్నవి. వ్యవసాయశాఖ వారి కృషి ఫలితముగా యంత్రముల సహాయమున జరుగు వ్యవసాయ పద్ధతు లక్కడక్కడ ప్రవేశపెట్ట బడినవి.

పశు సంపద: నెల్లూరు పశువులు చాల పేరు పొందినవి. ప్రస్తుతము ఒంగోలు తాలూకా ఈ జిల్లాలో లేకున్నను ఈ జిల్లా ఉత్తర భాగమున మంచి వంగడపు పశువులెప్పుడును దొరకుచున్నవి. వెంకటగిరి, కావలి, నెల్లూరులలో పశువైద్య కేంద్రములు కలవు. ఏనాదుల ఆర్థిక పరిస్థితిని అభివృద్ధి పరుచుటకై వారిలో కోళ్ళ పెంపకమును ప్రోత్సహించుటకు ప్రభుత్వ మొక కేంద్రమును నిర్వహించు చున్నది.

గృహ పరిశ్రమలు: ఉన్న గృహ పరిశ్రమలలో చేనేత పరిశ్రమ ముఖ్యమైనది. ఈ వృత్తిని అనుసరించి జిల్లా మొత్తముమీద 34,749 మంది జీవించు చున్నారు. వెంకటగిరి నేత చీరలకు ప్రసిద్ధి పొందినది. శ్రీహరి కోటలో లభించు పేముతో కుర్చీలు, మంచములు అల్లుట ఇప్పుడిప్పుడు వ్యాప్తి చెందుచున్నది.

పరిశ్రమలు: అభ్రకమును గనుల నుండి త్రవ్వుట జిల్లా యందలి పెద్ద పరిశ్రమ. గూడూరు పింగాణి ఫ్యాక్టరీ ప్రభుత్వ యాజమాన్యమున పని చేయుచున్నది.

రోడ్లు: ఈ జిల్లానుండి పోవు పెద్ద రోడ్లు మద్రాసునకును, చిత్తూరు జిల్లాలోని చంద్రగిరికిని, కడప జిల్లాలోని బద్వేలునకును, కర్నూలు జిల్లాలోని కంభమునకును, గుంటూరు జిల్లాలోని ఒంగోలునకును పోవుచున్నవి. జిల్లా మొత్తముమీద 1,653 మైళ్ళు నిడివి కల రోడ్లు కలవు. ఇందులో జాతీయ రహదార్లకు సంబంధించినవి 136 మైళ్ళు; రాష్ట్ర ప్రభుత్వము వారివి 504 మైళ్ళు; మునిసిపాలిటీవి 61 మైళ్ళు; స్థానిక సంస్థలకు చెందినవి 952 మైళ్ళు; ఆత్మకూరు, ఉదయగిరి తాలూకాలలో రోడ్డు వసతి తక్కువ.

రైలుమార్గములు: జిల్లాయందు 151¼ మై. పొడవు గల బ్రాడ్ గేజ్, 30 మైళ్ళు పొడవుగల మీటర్ గేజ్ రైలు మార్గములు కలవు. మద్రాసునుండి కలకత్తాకు పోవు బ్రాడ్ గేజ్ రైలు మార్గము ఈ జిల్లాలో సూళ్లూరుపేట, గూడూరు, నెల్లూరు, కోవూరు, కావలి, కందుకూరు తాలూకాలగుండ పోవుచున్నది. గూడూరు వద్ద చీలిన బ్రాడ్ గేజ్ మార్గము గూడూరు, వెంకటగిరి తాలూకాల గుండ రేణిగుంటకు పోవుచున్నది. విజయవాడనుండి గుంతకల్లునకు పోవు మీటర్ గేజ్ మార్గము ఈ జిల్లా ఉత్తరపు అంచున పొదిలి, దర్శి తాలూకాలలో 30 మైళ్ళు పోవుచున్నది.

నీటిదారులు: జిల్లాలో ఉత్తరమునుండి దక్షిణమున కోస్తా వెంబడినేపోవు బకింగ్‌హామ్ కాలువలో నడచు పడవల వలన కూడ ప్రయాణికుల రాకపోకలు, సరకుల ఎగుమతి దిగుమతులు జరుగుచున్నవి. జిల్లా కేంద్రమగు నెల్లూరునుండి వివిధ తాలూకా కేంద్రములకును, మద్రాసు, కడప, చిత్తూరు, తిరుపతులకు సరాసరి బస్సుసర్వీసు ఉన్నది.

విద్య: 1961 లెక్కల ప్రకారము జిల్లాలోని ప్రజల యందు అక్షరాస్యత 20.63%; పురుషులు 29.44%, స్త్రీలు 11.79%. జిల్లాయందలి వివిధవర్గముల విద్యా సంస్థల సంఖ్యావివరములు దిగువ ఈయబడినవి (1956-57).

| విద్యా సంస్థల వివరములు | సంఖ్య | ఉపాధ్యాయులు | విద్యార్థులు |
|---|---|---|---|
| ప్రాథమిక పాఠశాలలు | 1,921 | 5,217 | 1,72,226 |
| మాధ్యమిక పాఠశాలలు | 9 | 112 | 2,371 |
| ఉన్నత పాఠశాలలు | 49 | 961 | 21,909 |
| వయోజన విద్యా కేంద్రములు | 67 | 73 | 1,219 |
| ప్రత్యేక వృత్తి బోధక పాఠశాలలు | 12 | 54 | 1,052 |
| మొత్తము | 2,058 | 6,417 | 1,98,777 |

ఇవిగాక నెల్లూరులో ఒక ఆర్ట్సు అండ్ సైన్సు కాలేజియు, కావలిలో ఒక ఆర్ట్సుకాలేజియు శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయమునకు అనుబంధింపబడి కలవు. వీని రెండింటిలోను కలిసి 2,023 విద్యార్థులు, 143 విద్యార్థినులు కలరు. నెల్లూరులో 102 మంది ఉపాధ్యాయులకు శిక్షణ నిచ్చు బోధనా కళాశాల కలదు. మొత్తముమీద పడమటి తాలూకాలలోను, అందు ముఖ్యముగ పల్లెలందును విద్యా వ్యాప్తి చాల తక్కువ. ఉన్న విద్యాసంస్థలలో ఎక్కువ భాగము ఒక్క నెల్లూరు పట్టణమున మాత్రమే కలవు.

ఆరోగ్యము, వైద్యము: ఆరోగ్య విషయమున ఈ జిల్లా కొంత అనుకూల మైనదనియే చెప్పవచ్చును. ఉత్తరము, పడమటి తాలూకాలలో నారికురుపు బాధ ఇది వరకుండెడిది. కాని ఇప్పుడు చాలవరకు తగ్గిపోయినది. మైకా గనుల ప్రాంతములలో మలేరియా నివారణకై ప్రభుత్వము ప్రత్యేకముగ మలేరియా నిరోధక సిబ్బందిని నియమించినది. జిల్లా మొత్తముమీద ఆధునిక వైద్య విధానమును అనుసరించు జనరల్ ఆసుపత్రులు 9, డిస్పెన్సరీలు 14 కలవు. జిల్లా మొత్తముమీద 826 మంచములు కలవు. ఇంకను యూనానీ చికిత్సాలయము, ఆయుర్వేద వైద్యశాలలు 25 జిల్లాలో వైద్యసహాయమునకు ఉపకరించు చున్నవి (1956-57). ఇవిగాక నెల్లూరులో క్షయ ఆసుపత్రి ఒకటి పని చేయుచున్నది.

చూడదగిన స్థలములు: ఈ జిల్లాలో కావలి రైల్వే స్టేషనుకు పడమటి దిక్కున 50 మైళ్ళ దూరమున ఉదయగిరి వద్ద అదే పేరుగల ఒక శిథిల దుర్గము కొంత చారిత్రక ప్రశస్తిని గడించి ఉన్నది. ప్రసిద్ధ విజయనగర ప్రభువు శ్రీకృష్ణదేవరాయలు క్రీ. శ. 1514 ప్రతాపరుద్ర గజపతిని జయించి ఉదయగిరిని స్వాధీనపరచు కొనినట్లు ఇచటి శాసనములు పేర్కొనుచున్నవి. పట్టణములోని తత్ప్రాంతములందును శిథిలములై యున్న దేవాలయాది నిర్మాణములలో రఘునాయక దేవాలయము, కృష్ణదేవాలయము పేర్కొన దగినవి. వాస్తు సంవిధానము ననుసరించి వీని నిర్మాణకాలము క్రీ. శ. 16వ శతాబ్దికి పూర్వ కాలమునకు పోజాలదు. ఈ రెండు దేవళములందును గర్భగృహములు శూన్యములు. శ్రీకృష్ణదేవరాయలు విజయానంతరము ఉదయగిరినుండి బాలకృష్ణ విగ్రహమును ఒక దానిని తన వెంట విజయనగరమునకు కొనిపోయినటుల విజయనగరము నందలి రెండు శాసనములు పేర్కొనుచున్నవి. కావున శ్రీకృష్ణదేవరాయలు కొనిపోయిన విగ్రహము, ఉదయగిరిలో నేడు శూన్యముగ ఉన్న కృష్ణాలయములోని విగ్రహమే అని కొందరు భావించు చున్నారు.

జిల్లా నెల్లూరు సైతము చారిత్రక ప్రశస్తిని పొందిన పురాతన పట్టణము. తిక్కనకవి ఇచటనే వసించి మహా భారత మందలి సుమారు 15 పర్వములు తెనిగించెను.

నెల్లూరువద్ద పెన్ననది ఒడ్డునగల రంగనాయక దేవళము ఒక ప్రసిద్ధ యాత్రా స్థలముగ పేరొందినది.

కందుకూరు తాలూకాలో పాలేరునది యొడ్డున ప్రతి ఏట వైశాఖ శుద్ధ పూర్ణిమకు జరుగు 'గంగజాతర' ఈ ప్రాంతీయ జనులను ఎక్కువగ ఆకర్షించుచున్నది. ఈ ప్రాంతపు స్థానిక చరిత్రలో ప్రసిద్ధిని పొందిన కాటమరాజు చరిత్రతో ఈజాతరకుగల సంబంధమే అందులకు కారణము.

కందుకూరు తాలూకాలోని సింగరాయ కొండ పైన ఉన్న నరసింహస్వామి దేవళము ఒక ప్రసిద్ధ క్షేత్రముగ పేరు పొంది యాత్రికులను ఆకర్షించు చున్నది.

జిల్లా సంక్షిప్త చరిత్ర: ఆంధ్ర ప్రదేశ్ ఆగ్నేయ ప్రాంతమున ఉన్న ఈ మండలము నందు ప్రాచీన శిలా యుగ పరికరములు విరివిగ లభించు చుండుటచే నదీ పరిసరముల నానుకొని ప్రాచీన కాలమున మానవులు వసించిన లక్షణములు కన్పట్టుచున్నను, చారిత్రక యుగము మాత్రము ఆంధ్ర సాతవాహన యుగమున చరమ భాగము నుండి మాత్రమే మొదలిడినదని భావింపవచ్చును. ఆంధ్ర రాజన్యులలో కడపటి వాడగు నాలుగవ పులోమావి కాలమున అతని సేనాని స్కందనాగుడను వాని పాలనమున ఈ ప్రాంతము ఉండెను. ఆ రాజు మరణానంతరము ఈ స్కందనాగుడు స్వతంత్రుడయ్యెను. క్రీ. శ. 174 తరువాత ఈతని అల్లుడగు పల్లవ వీరకూర్చవర్మ ఈ ప్రాంతమున కధిపతి అయ్యెను. చారిత్రక ప్రశస్తి వహించిన పల్లవ రాజ వంశమునకు మూల పురుషుడు ఈ వీరకూర్చ వర్మయే. ఈ రాజవంశము కాంచీనగరము రాజధానిగ పరిపాలన నెరపెను. కాని వారి కాలమునను, వారికి లోబడియో, వీరులైనపుడు స్వతంత్రులుగనో, కొందరు మాండలికులు ఈ ప్రాంతమును పరిపాలించుచుండినటుల తెలియవచ్చుచున్నది. నేటి ఆత్మకూరు, ఉదయగిరి, కనిగిరి తాలూకాలపుడు బోయ విషారము (బోయకొట్టము) అని వ్యవహరింప బడుచుండెడివి. ఆ ప్రాంతమున నిషాద ప్రభువులు దాదాపు పదకొండవ శతాబ్ది వరకు స్వతంత్రులుగనో, సామంతులుగనో ఆధిపత్యము నిర్వహించిరి. సముద్రగుప్తుని దండయాత్రాకాలమున ఇట 'పాలక' అను రాజ్యముండెడిదనియు, దానినేలు చుండిన ఉగ్రసేనుని సముద్ర గుప్తుడు జయించెననియు సముద్రగుప్తుని ప్రశస్తివలన తెలియ వచ్చుచున్నది. పాలక అను నది పలిక్కడకు సంస్కృత రూపమనియు, అదియే నేటి 'పులికాట'

నియు కొందరు చారిత్రకుల అభిప్రాయము. సముద్ర గుప్తుని దండయాత్రా ప్రమాదము కడచిన వెనుక ఈ మండలమునే కాక పల్లవ రాజ్యము నంతటిని సువ్యవస్థిత మొనర్చినవాడు ముక్కంటి కాడువెట్టి అను పల్లవ రాజు. ఈతనిని గురించి కట్టు కథలు అనేకములు ఉన్నను ఈతడు ఐతిహాసిక పురుషుడే అని నిర్ద్వంద్వముగ చెప్పవచ్చును. శ్రీశైలమునకు ఆగ్నేయమున గల అరణ్యముల ఛేదించి జనావాసముల నెలకొల్పినవా డితడే అని తరువాతి శాసనములందు పేర్కొన బడి ఉన్నది. ఈ మండలము శ్రీశైలమునకు ఆగ్నేయ దిశయందే ఉండుటచే ఇందును ముక్కంటి పల్లవుని కృషి వలన జనావాసములు ఏర్పడెనని భావింప దగును. ఈతని రాజ్య కాలమున (క్రీ. శ. నాలుగవ శతాబ్ది అంతమున) కరికాల చోళుడు ఈ ప్రాంతమునకు దండెత్తి వచ్చి పశ్చిమ, దక్షిణాంధ్రములందలి తక్కిన ప్రాంతములతో పాటు ఈ మండలమును జయించెను. మహా పల్లవులని వ్యవహరింపబడు పల్లవ రాజులు మరల ఈ ప్రాంతమును వశపరచుకొని, కంచి రాజధానిగ తిరుగ పాలించినను, చోళ కుటుంబములు కొన్ని ఈ మండలమున నిలబడి పోయి, వేరువేరు ప్రదేశములందు మాండలికులుగ ఉండిరి. మహా పల్లవులలో నరసింహవర్మ (క్రీ. శ. 630-668) విజేతగనే కాక కళోపాసకుడుగ సైతము చారిత్రక ప్రశస్తి వహించెను. ఉదయగిరి తాలూకా భైరవుని కోన లోని గుహాలయము ఈ ప్రభువు నిర్మింప చేసినదియే. బాదామి చాళుక్యుల ధాటి కాగలేక మహా పల్లవ రాజ్యము క్రీ. శ. 733 లో అస్తమించినను తరువాత మరియొక పల్లవ వంశము వారు ఈ ప్రాంతమును క్రీ. శ. 848 వరకు పాలించిరి. ఆ పరిపాలనా కాలమున నైనను, ఈ మండల మున ఉత్తర భాగము పూర్వ చాళుక్యుల వశముననే ఉండెను. క్రీ. శ. 888 నాటికి ఈ మండల మంతయు గుణగ విజయాదిత్యుని కృషి ఫలితముగ పూర్వ చాళుక్య రాజ్యాంతర్గత మయ్యెను. క్రీ. శ. 1070 లో చాళుక్య చోళ రాజ్యములు ఏక మగుటతో ఇది చాళుక్య చోళ ప్రభువుల పాలనమున చేరెను. కాని ఈ చోళ ప్రభువులకు లోబడియో లోబడకనో ఇట 11, 12, 13 శతాబ్దులలో పరిపాలన నెరపి నది తెలుగు చోళులు; వీరిలో ప్రముఖులు నెల్లూరి చోళులు. ఈ వంశమున ప్రముఖులు తిక్కరాజు, అతని కుమారుడు మనుమసిద్ధి అనువారలు. ఈ చోళుల కాలమున ఈ మండల మున సువ్యవస్థిత పరిపాలన సాగెనని చెప్ప వచ్చును. ఆనాడు ఈ తీరమున ప్రముఖమగు రేవు పట్టణముగ పేరొందిన 'కృష్ణాపట్టణము' దేశీయ, విదేశీయ వ్యాపారు లను విరివిగ ఆకర్షించినది. ఈ రేవునకే కొల్లిత్తురై, గండ గోపాలపురము అను పేరులుండెడివి. మనుమసిద్ధికి మంత్రిగను, గురువుగను వ్యవహరించిన తిక్కన సోమ యాజి మహా భారతమున పదునైదు పర్వముల తెనిగించి దానిని పూర్తి చేసి, ఆంధ్ర సాహితికి నిరుపమ సేవ ఒన ర్చెను. ఈ మనుమసిద్ధి పరిపాలనలో జరిగినదియే సాంప్ర దాయికముగ ఆంధ్ర దేశమున వాడుకలో ఉన్న కాటమ రాజు కథ. పశువుల పుల్లరిపై బయలుదేరిన ఆ పోరాట మున ఉభయ పార్శ్వములు ప్రదర్శించిన శౌర్య ధైర్య ములు, ఖడ్గతిక్కన వీరమరణము ఆంధ్ర జానపద సాహిత్యమున అమరత్వమును ఆర్జించినవి. ఈ యుద్ధ మును గురించిన ఐతిహాసిక విషయములు అంతగ లభ్య ములు కాకున్నను ఈ పోరాటము క్రీ. శ. 1261 ప్రాంత మున జరిగి ఉండునని ఐతిహాసికులలో కొందరి అభిప్రా యము. ఈ మనుమసిద్ధికి శత్రుభీతిని నివారించుటకై కాకతీయ గణపతి క్రీ. శ. 1210 ప్రాంతమున ఆతనికి సాయపడి అతని కొరకై కొంత రాజ్యమును సైతము జయించి ఇచ్చెను. కాని మనుమసిద్ధి అనంతరము నెల్లూరు చోళుల ప్రతిష్ఠ సన్నగిలి, ఈ ప్రాంతము కాకతీయ రాజ్యాం తర్గత మయ్యెను. కాకతీయ రాజ్యమస్తమించిన తరు వాత, పెక్కురు మాండలికులు స్వతంత్రులైరి. వీరినందరను జయించి కొండవీటి రెడ్డి రాజులు ఈ మండలమున ఉత్తర భాగమును వశపరచుకొనిరి. రెడ్డి రాజులకు నెల్లూరు జిల్లాయే మాతృభూమి ఐనను, వారు కొండవీడు, రాజమండ్రి ప్రాంతములనే తమ ముఖ్య కార్యక్షేత్ర ములుగ గ్రహించిరి. వారి ప్రతినిధిగా ప్రోలయ వేమా రెడ్డి సోదరుడు మల్లారెడ్డి నెల్లూరు మండలమున ఉత్తర ప్రాంతమగు కందుకూరు సీమకు రాజ ప్రతినిధిగ నియమింప బడెను. ఈతని వంశీకులు కందుకూరు రాజ ధానిగ రాచరికము నెరపిరి. ఈ కాలమున నెల్లూరు మండలమున దక్షిణ భాగము (ఉదయగిరి సీమ) విజయ నగర రాజుల వశమందుండెను. కడకు క్రీ. శ. 15 వ శతాబ్ది ఆరంభమున ఈ మండల మంతయు విజయనగర ప్రభువుల వశమయ్యెను. కాని కళింగ గజపతులు ప్రబలి నెల్లూరు వరకు గల తీరాంధ్ర భూమి నాక్రమించుకొని క్రీ. శ. 1460 మొదలు 1513 వరకు నెల్లూరు మండలము వారి స్వాధీన మందుండెను. తరువాత శ్రీకృష్ణదేవరాయలు గజపతుల నోడించి మరల ఈ మండలమును వశపరచు కొనెను. రక్కసి తంగడి యుద్ధానంతరమునను చంద్రగిరిని రాజధానిగ పాలించిన విజయనగర ప్రభువుల అధీనముననే ఇది క్రీ. శ. 1640 వరకు ఉండి అంతట గోల్కొండ ప్రభువు లకు వశమై, వారినుండి మొగలులకు సంక్రమించెను.

## నెల్లూరు జిల్లా - తాలూకా వివరములు

| వరుస సంఖ్య | తాలూకా పేరు | తాలుకా కేంద్రము | గ్రామముల సంఖ్య (1951) | గ్రామీణ జనాభా 1951 | పట్టణములు (1951) | పట్టణ జనాభా | విస్తీర్ణము (చదరపు మైళ్ళలో) (1951) | మొత్తము నీటి పారుదల వసతిగల నేల విస్తీర్ణము (ఎకరములలో) (1959) | సాగుచేయబడిన నేల (ఎ॥ములలో) (1959) | ప్రస్తుతము సాగులోలేని బీడు నేల (ఎ॥ములలో) (1959) | మొత్తం సాగుకు తగిన నేల (ఎ॥ములలో) (1959) | సాగుచేయ వీలగు బంజరునేల (ఎ॥లలో) (1959) |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. | ఆత్మకూరు | ఆత్మకూరు | 114 | 1,31,845 | — | — | 639 | 41,304 | 1,41,624 | 24,806 | 1,66,430 | 58,842 |
| 2. | దర్శి | దర్శి | 75 | 1,18,826 | — | — | 591 | 12,386 | 1,58,633 | 40,003 | 2,08,636 | 58,901 |
| 3. | గూడూరు | గూడూరు | 110 | 92,281 | 1 | 20,056 | 463 | 4,969 | 71,533 | 7,384 | 78,917 | 20,849 |
| 4. | కందుకూరు | కందుకూరు | 160 | 1,89,409 | 1 | 11,907 | 801 | 42,771 | 2,20,239 | 37,188 | 2,57,427 | 84,447 |
| 5. | కనిగిరి | కనిగిరి | 183 | 1,55,637 | 1 | 8,321 | 1,000 | 28,456 | 1,77,228 | 1,736 | 1,79,064 | 67,422 |
| 6. | కావలి | కావలి | 78 | 1,20,846 | 1 | 15,516 | 548 | 50,744 | 1,13,070 | — | 1,13,070 | 62,391 |
| 7. | కోవూరు | కోవూరు | 87 | 1,60,306 | 3 | 28,529 | 385 | 98,971 | 1,03,079 | 4,320 | 1,07,399 | 4,015 |
| 8. | నెల్లూరు | నెల్లూరు | 118 | 1,79,778 | 1 | 81,480 | 504 | 1,06,777 | 1,18,114 | 5,214 | 1,23,328 | 12,218 |
| 9. | పొదిలి | పొదిలి | 110 | 96,000 | — | — | 564 | 19,501 | 1,47,802 | 11,697 | 1,52,499 | 34,404 |
| 10. | రాపూరు | రాపూరు | 108 | 88,512 | — | — | 594 | 13,266 | 82,149 | 61,616 | 1,43,765 | 61,349 |
| 11. | సూళ్లూరుపేట | సూళ్లూరుపేట | 141 | 79,659 | 2 | 16,059 | 573 | 54,357 | 66,761 | 9,605 | 76,366 | 11,600 |
| 12. | ఉదయగిరి | ఉదయగిరి | 131 | 1,14,290 | 1 | 4,395 | 871 | 23,969 | 86,437 | 28,659 | 1,15,096 | 66,341 |
| 13. | వెంకటగిరి | వెంకటగిరి | 161 | 64,604 | 1 | 17,376 | 427 | 30,640 | 48,465 | 92,416 | 1,40,881 | 1,841 |
| | | మొత్తము | 1,571 | 15,91,993 | 12 | 2,03,639 | 7,960 | 5,28,111 | 15,35,134 | 3,24,644 | 18,62,878 | 5,44,620 |

గోల్కొండ ప్రభువుల కాలమున యూరపియన్ వ్యాపార సంఘము లీ మండలమున కార్యాలయముల నెలకొల్పుకొనుటకై యత్నించెను. ఆ ప్రభువుల అనుమతితో ఆంగ్లేయులు క్రీ. శ. 1625 లో దుర్గరాజ పట్టణమున తమ ఫ్యాక్టరీని నెలకొల్పు కొనిరి; ఈ రేవు ఇప్పటికి గూడూరు తాలూకాలో ఉన్నది. అక్కడ ఆంగ్లేయులకు సాయపడిన గ్రామాధిపతి ఆర్ముగ మొదలియారు పేర ఆంగ్లేయులీ రేవునకు 'ఆర్ముగన్' అని పేరిడిరి. అదియే క్రమముగ 'ఆర్మిగాన్' అని పరిణమించెను. కాని ఇంతలోనే ఇంత కన్న వసతిగ ఉన్న స్థలమును చంద్రగిరి ప్రభువుల వద్ద ఆంగ్లేయులు సంపాదించి అచ్చట ఫోర్టుసెంటు జార్జి (నేటి మద్రాసు) నిర్మించుటచే దుర్గరాజు పట్టణముయొక్క ప్రాముఖ్యత అంతరించినది.

మొగలుల అధికారము సన్నగిలిన తరువాత ఆర్కాటు నవాబుల రాజ్యమున ఈ జిల్లా చేరెను. ఆ నవాబుల కుటుంబ కలహము మూలమున వారిలో ఒక ప్రభువుచే 1781 లో ఈ ప్రాంతము ఇంగ్లీషు వారికి దత్తమొనర్పబడెను. 1801 లో ఇంగ్లీషువారి కిచట సర్వాధికారములు కలిగెను. బ్రిటిషు వారి వశమగు నాటికి ఈ జిల్లా యందధిక భాగము జమీందారుల వశమందుండెను. 1892 లో బ్రిటిషువారు ఈ జమీందారులను గుర్తించి వీరికి రివెన్యూ వసూలు అధికారము నొసగి పేష్కషు నిర్ణయించిరి. ఈ జిల్లాయందలి జమీందారీలలో ముఖ్యముగ పేర్కొనదగినది వెంకటగిరి.

తొలుత ఈ జిల్లా ఉత్తరమున గుండ్లకమ్మ వరకు విస్తరించి ఉండెను; కాని 20 శతాబ్ది ప్రథమ దశకమున గుంటూరు జిల్లా నిర్మింప బడినపుడు ఇందలి ఒంగోలు తాలుకా ఆ జిల్లాకు కలుపబడినది. స్వాతంత్ర్య సిద్ధి అనంతరము తక్కిన రాష్ట్రమున జరిగినటులనే ఈ జిల్లాయందును జమీందారీ విధానము రద్దయినది. చీ. శే. రా.

# చిత్తూరు జిల్లా

**ఉనికి - విస్తీర్ణము :** చిత్తూరు జిల్లా* ఉ. అక్షాంశము 12° 37′ నుండి 14° 8′ వరకును, తూ. రేఖాంశము 78° 3′ నుండి 79° 55′ వరకును విస్తరించి ఉన్నది. ఈ జిల్లాకు సరిహద్దుగ తూర్పు, దక్షిణములలో మద్రాసు రాష్ట్రము; పడమర మైసూరు రాష్ట్రము; ఉత్తరము అనంతపురము, కడప, నెల్లూరు జిల్లాలు కలవు. ఈ జిల్లా యందు చంద్రగిరి, చిత్తూరు, కాళహస్తి, మదనపల్లి, పలమనేరు, పుంగనూరు, పుత్తూరు, సత్యవీడు, వాయలపాడు అను తొమ్మిది తాలూకాలు కలవు. జిల్లా విస్తీర్ణము 5,931 చ. మైళ్ళు.

**నైసర్గిక స్వరూపము :** ఈ జిల్లాను, భౌతిక స్వరూపము ననుసరించి, పర్వతమయ పీఠభూములు, మైదానములు అని రెండు ప్రదేశములుగ విభజింపవచ్చును. ఈ జిల్లాలో నైరృతి మూలనుండి ఈశాన్యమునకు తూర్పు కనుమలు వ్యాపించి ఉన్నవి. నైరృతి దిశయందు కరిగుండి అను ప్రదేశమున బయలుదేరిన ఈ కనుమలు పలమనేరు తాలూకాలోను, పుంగనూరు తాలూకా తూర్పు భాగముననుకొంత దూరము పోయి అటనుండి తూర్పునకు మరలి చిత్తూరు, చంద్రగిరి తాలూకాల గుండ తిరుపతి వరకు సాగిపోవును. తిరుపతి దాటిన తరువాత ఈ కనుమలు రెండు శాఖలుగ చీలును. ఈ శాఖల మధ్య ఉన్న లోయను 'మామండూరు' లోయ అందురు. ఈ లోయకు తూర్పు వైపున నుండి ఈశాన్యముగ కాళహస్తి తాలూకానానుకొని పోయి ఈ కనుమలు నెల్లూరు జిల్లాలో చొచ్చుకున్నవి. ఈ కనుమలకు పడమర పలమనేరు, పుంగనూరు,

* భాషా సాన్నిహిత్యమున ననుసరించి ఆంధ్ర ప్రదేశ్ రూపురేఖల సవరించుటలో విపరీతముగ మార్పులు పొందినది. ఈ జిల్లా 1953 లో ఆంధ్ర రాష్ట్రము ఏర్పడినపుడు అప్పటికే సమష్టి మద్రాసు రాష్ట్రమున ఉన్న చిత్తూరు జిల్లా యంతయు యథాతథముగ ఆంధ్ర రాష్ట్రమున చేరెను. తరువాత ఇందు కొన్ని తమిళ ప్రాంతములు కలవని తమిళులును, చిత్తూరు జిల్లాను ఆనుకొని ఆంధ్ర ప్రదేశ్‌న చేరతగిన భూభాగము కొంత ఇంకను మద్రాసు రాష్ట్రమున కలదని ఆంధ్రులును ఆందోళన చేయగ, ఆ సమస్యను పరిష్కరించుటకై ఉభయ ప్రభుత్వముల సమ్మతితో కేంద్ర ప్రభుత్వము 'శ్రీ పటస్కరు' అను పరిష్కర్తను నియమించెను. ఆ పరిష్కర్త ఒసగిన తీర్పు ననుసరించి చిత్తూరు జిల్లాయందలి తిరుత్తని తాలూకాయందలి అత్యధిక భాగము మద్రాసురాష్ట్రమునకు పోయినది. మద్రాసులోని చెంగల్పట్టు జిల్లాయందలి పొన్నేరి తాలూకానుండి కొన్ని గ్రామములును, తిరువెళ్ళూరు తాలూకా నుండి కొన్ని గ్రామములును ఆంధ్ర ప్రదేశ్‌నందలి చిత్తూరు జిల్లాకు చేర్చబడినవి. చెంగల్పట్టు జిల్లానుండి వచ్చిన గ్రామములకు పూర్వపు తిరుత్తని తాలూకాలో మిగిలిన కొన్ని గ్రామములు కలిపి సత్యవీడు తాలూకా క్రొత్తగ ఏర్పరుప బడినది. ఈ క్రొత్త ఏర్పాటునకు అనుగుణముగ పరిపాలనా సౌకర్యము నిమిత్తము పుత్తూరు తాలూకానుండి కొన్ని గ్రామములు సత్యవీడుకు కలుపబడి, తిరుత్తని తాలూకాలో ఇంకను శేషించిన గ్రామములు పుత్తూరు తాలూకాకు చేర్చబడినవి. ఈ ఏర్పాటులన్నియు 1959 అక్టోబరు 1 వ తేదీనుండి అమలులోనికి వచ్చినవి.

మదనపల్లి, వాయల్పాడు తాలూకాలలోని నేల పీఠభూమిగా ఉన్నది; ఈ పీఠభూమి మైసూరు పీఠభూమిలోని భాగము. సుమారు 2,000′ నుండి 2,500′ వరకు ఎత్తు కలిగి ఎత్తుపల్లములతో ఉన్నది. పీఠభూమిలోని మదనపల్లి, పుంగనూరు, వాయల్పాడు తాలూకాల యందును, తూర్పునఉన్న పుత్తూరు, కాళహస్తి తాలూకాల యందును పెక్కు కొండ గుట్టలు కలవు - మదనపల్లి తాలూకాలోని హార్స్లీ కొండ (4,100′); పుత్తూరు తాలూకాలోని నగరి కొండ ఇందు ముఖ్యమైనవి.

నదులు : జిల్లాలో ఉత్తర భాగమున ఉన్న నదులు ఉత్తర దిశకును, దక్షిణమున ఉన్న నదులు దక్షిణ, తూర్పు దిశలకును ప్రవహించుచున్నవి; జిల్లాలోని వర్షపు నీరంతయు వీనిలోనికి చేరుచున్నది. మైసూరు రాష్ట్రమున జన్మించిన పాపఘ్నినది ఈ జిల్లాలోని మదనపల్లి తాలూకాలో పడమటి భాగమున ప్రవహించి అనంతపురము జిల్లాలోనికి పోవుచున్నది. హార్స్లీ కొండలలో పుట్టిన బాహుదా నది ఉత్తరముగ వాయల్పాడు తాలూకాలో ప్రవహించి కడప జిల్లాలోనికి పోయి పెన్న నదిలో చేరుచున్నది. మదనపల్లి తాలూకాలోనే పెద్దేరు, చిన్నేరు అను రెండు చిన్న నదులుకూడ కలవు. పుంగనూరు తాలూకాలో ఆవులపల్లి అడవిలో జన్మించిన పింఛానది, ఉత్తరముగ పుంగనూరు, వాయల్పాడు తాలూకాలలో ప్రవహించి, కడప జిల్లాలోనికి పోయి బాహుదా నదిలో కలియుచున్నది. కౌండిన్యనది దక్షిణముగ పలమనేరు తాలూకా ఈశాన్య భాగమున ప్రవహించి మద్రాసు రాష్ట్రమున ప్రవేశించును. మైసూరు రాష్ట్రమునుండి వచ్చు పాలారునది పలమనేరు తాలూకా దక్షిణ భాగమున ప్రవహించి మద్రాసు రాష్ట్రములోనికి పోవును. తూర్పు కనుమలలో జన్మించిన పొయినినది దక్షిణ దిశగ చిత్తూరు తాలూకాలో ప్రవహించి పాలారు (ఉత్తర ఆర్కాటు జిల్లా) లో చేరుచున్నది. చిత్తూరునది, బాహుదానది, గొడ్డువంకనది అను మూడు ఉపనదులు చిత్తూరు తాలూకాలో పొయినినదిలో చేరుచున్నవి. పుత్తూరు తాలూకాలో తూర్పు దిశగ ప్రవహించు ఆరణినది సత్యవీడు తాలూకాలోనికి పోవుచున్నది. పుత్తూరు తాలూకాలో ప్రవహించుచున్న నగరి నది కూడ మద్రాసు రాష్ట్రములోనికే పోవుచున్నది. చంద్రగిరి తాలూకా ఆదెనపల్లె వద్ద జన్మించిన స్వర్ణముఖి, చంద్రగిరి, కాళహస్తి తాలూకాలలో ప్రవహించి నెల్లూరు జిల్లాలోనికి పోవుచున్నది. దీని ఉపనది అగు కళ్యాణి చంద్రగిరి తాలూకాలో ప్రవహించుచున్నది. ఈ నదులలో అన్నింటియందును సంవత్సరమున విశేషకాలము నీరే ఉండదు. అయినను ఈ నదీ శయ్యలలో ఊట నీరు విశేషముగ లభించుచున్నది.

శీతోష్ణస్థితి : చంద్రగిరి, సత్యవీడు, పుత్తూరు, కాళహస్తి తాలూకాలలో తక్కినచోట్లకన్న వేసవికాలమున ఎండ లెక్కువగా ఉన్నను దుర్భరముగా ఉండవు. పీఠభూమి అగు వాయల్పాడు, మదనపల్లి, పలమనేరు, పుంగనూరు తాలూకాలలో అంతకన్న చల్లగా ఉండును. ఇచ్చట ఉష్ణోగ్రత 95° ఫా. మించి ఏనాడును ఉండదు. చిత్తూరు తాలూకా సమశీతోష్ణముగా ఉండును. జిల్లా మొత్తముమీద సరాసరి దైనిక గరిష్ఠ ఉష్ణోగ్రత 87.2° ఫా., కనిష్ఠ ఉష్ణోగ్రత 68° ఫా. సంవత్సరము మొత్తముమీద అత్యధికోష్ణోగ్రత 100° ఫా., అత్యల్పోష్ణోగ్రత 58° ఫా.

వర్షపాతము : నైరృతి, ఈశాన్య ఋతుపవనముల రెండింటివలన ఈ జిల్లాయందు వర్షము కురియుచున్నది. జూన్ నుండి సెప్టెంబరువరకు నైరృతి ఋతుపవనములవలన కురియు వర్షములో ఎక్కువ భాగము పీఠభూమి తాలూకాలలో పడుచున్నది. ఈ జిల్లా దేశాంతర్భాగమున ఉండుటచే వర్షవాయువులు ఇచ్చటికి చేరునప్పటికి వాని లోని తేమ తగ్గుచున్నది. జిల్లాలో సంవత్సరము మొత్తము సగటున వర్షము కురియు రోజులు 51.9; సరాసరి సాంవత్సరిక వర్షపాతము 33.59″; తాలూకాలవారీగా చూచినచో కాళహస్తి తాలూకాలో సరాసరి వర్షపాతము 43.13″ - తక్కినవానికన్న ఎక్కువ, మదనపల్లి తాలూకాలో 23.32″- తక్కినవానికన్న తక్కువ.

అడవులు : జిల్లా విస్తీర్ణములో మూడవ వంతునకు మించి అడవులు ఉన్నవి. మదనపల్లి తాలూకాలోని అడవులు కొంత నాణ్యమైనవి. మంచి కలప నిచ్చు చెట్లు, ఫలవృక్షములు విరివిగ కలవు. హార్స్లీ కొండలయందు విశేషముగను, పలమనేరు తాలూకాలోని అక్కడక్కడను ఆర్థిక విలువగల శ్రీగంధము చెట్లు కలవు. పుంగనూరు, చంద్రగిరి, కాళహస్తి, చిత్తూరు, సత్యవీడు తాలూకాలలో ఆర్థిక విలువలేని అడవులలో పొదలు ఎక్కువ.

పట్టణములు : జిల్లాయందలి పట్టణములలో చిత్తూరు, తిరుపతి, కాళహస్తి, మదనపల్లి అనువానికి మాత్రమే మునిసిపాలిటీలు కలవు.

చిత్తూరు : జనసంఖ్య 47,884; జిల్లా కేంద్రము. వార్తా దినపత్రిక కార్యాలయము కలదు.

తిరుపతి : జన సంఖ్య 35,836; ఎగువ తిరుపతి హిందువులకు ప్రసిద్ధ పుణ్యక్షేత్రము; విశ్వవిద్యాలయ కేంద్రము.

కాళహస్తి : జనసంఖ్య 26,468; తాలూకా కేంద్రము; శైవ క్షేత్రము.

## చిత్తూరు జిల్లా - తాలూకా వివరములు

| వరుస సంఖ్య | తాలూకా పేరు | తాలూకా కేంద్రము | గ్రామముల సంఖ్య (1951) | గ్రామీణ జనాభా (1951) | పట్టణములు (1951) | పట్టణ జనాభా (1951) | విస్తీర్ణము చ. మై. లో (1951) | మొత్తము నీటి పారుదల వసతి గల నేల విస్తీర్ణము ఎ॥లలో (1959-60) | సాగుచేయబడిన నేల ఎ॥లలో (1959-60) | ప్రస్తుతం సాగులో లేని బీడు నేల ఎ॥లలో (1959-60) | మొ॥ సాగుకు తగిన నేల ఎ॥లలో (1959-60) | సాగుచేయ వీలగు బంజరు నేల ఎ॥లలో (1959-60) |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. | చిత్తూరు | చిత్తూరు | 374 | 3,01,823 | 1 | 38,894 | 778 | 30,772 | 77,081 | 27,668 | 1,04,699 | 24,999 |
| 2. | చంద్రగిరి | చంద్రగిరి | 265 | 1,32,238 | 3 | 32,960 | 548 | 23,025 | 59,981 | 16,120 | 76,101 | 347 |
| 3. | పుత్తూరు | పుత్తూరు | 176 | 2,15,532 | 2 | 14,556 | 564 | 49,624 | 76,731 | 12,141 | 88,872 | 7,477 |
| 4. | కాళహస్తి | కాళహస్తి | 383 | 1,18,989 | 1 | 17,921 | 615 | 54,633 | 69,047 | 7,196 | 76,243 | 8,771 |
| 5. | సత్యవీడు* | సత్యవీడు | | | | | | 52,903 | 68,284 | 14,596 | 82,880 | 27,295 |
| 6. | పలమనేరు | పలమనేరు | 324 | 1,58,339 | 2 | 13,400 | 720 | 30,537 | 2,01,772 | 61,277 | 2,63,024 | 32,344 |
| 7. | పుంగనూరు | పుంగనూరు | 105 | 1,36,114 | 1 | 11,284 | 648 | 21,924 | 1,08,037 | 3,183 | 1,11,220 | 6,211 |
| 8. | మదనపల్లి | మదనపల్లి | 113 | 1,81,147 | 1 | 16,142 | 836 | 26,454 | 1,77,912 | 59,568 | 2,37,480 | 83,858 |
| 9. | వాయలపాడు | వాయలపాడు | 126 | 1,84,049 | 1 | 6,048 | 802 | 36,900 | 1,52,008 | 1,19,183 | 2,71,191 | 81,601 |
| | | మొత్తము | 1,866 | 14,28,231 | 12 | 1,51,205 | 5,511 | 3,26,772 | 9,90,803 | 3,20,912 | 13,11,715 | 2,72,903 |

* శ్రీ పటస్కరు నిర్ణయము (1959) ప్రకారము ఏర్పడినది.

మదనపల్లి : తాలూకా కేంద్రము; ఆరోగ్య కేంద్రము.

ప్రజలు : ఈ జిల్లా జన సంఖ్య* 19,13,169 ; పురుషులు 9,77,809; స్త్రీలు 9,35,360. జన సాంద్రత చ. మైలునకు 333. 1951 - 6 మధ్య పది సంవత్సరములలో జన సంఖ్య 14.82% వృద్ధి యైనది.

మతములు: ఇచట 93% హిందువులు, 6% ముస్లిములు, తక్కిన మతములవారు 1% కలరని స్థూలముగ చెప్ప వచ్చును.

వృత్తులు : జిల్లాలో అధిక సంఖ్యాకుల వృత్తి వ్యవసాయము. స్వంతముగ వ్యవసాయము చేయువారు, కౌలు దారులు, వ్యవసాయ కార్మికులు, భూస్వాములు-వీరందరు వ్యవసాయ వృత్తిని ఆధారముగ ఉంచుకొని జీవించువారే - ఇట్టివారి సంఖ్య 75.2% ; వ్యవసాయేతర వస్తూత్పత్తివలన జీవించువారు 6.4%; వ్యాపారమువలన జీవించువారు 4.1%; ఇతర వృత్తుల వలన జీవించువారు 14.3% కలరు (1951).

భాషలు : జిల్లాలో అత్యధిక సంఖ్యాకుల మాతృభాష తెలుగు. వివిధ మాతృభాషలవారి సంఖ్యా వివరములు నిర్దిష్టముగ తెలియకున్నను, ఆయా ప్రాంతములందలి 1951వ లెక్కల ననుసరించి ఇచటి ప్రజలలో తెలుగు 79% ; తమిళము 12%; ఇతర భాషలు 9%.

వ్యవసాయము : ఈ జిల్లాలోని నేల నల్లనేల, ఎర్ర నేల, కలగలుపునేల అని మూడు రకములు. జిల్లాలో సాగునకు అనుకూలమగు భూమి 13,11,715 ఎకరములు. ఇందు ప్రస్తుతము సాగున ఉన్న భూమి 9,90,803 ఎకరములు. సాగులో ఉన్న భూమిలో 3,26,772 ఎకర ములకు నీటి పారుదల వసతి కలదు.

ఈ జిల్లాలో ఒక తాలూకాయొక్కగాని, తాలూకాలో అత్యధిక భాగముయొక్కగాని సాగునకు చాలిన పెద్ద నీటి వసతి ఒకటికూడ లేదు. వర్షాధారపు చెరువులు, ఏటి కాలువలు, ఊట కాలువలు, బావులు మాత్రమే కలవు. తాలూకాల వారీగా వివరములు దిగువ ఈయబడినవి.

మదనపల్లి తాలూకా : పెదతిప్ప సముద్రము చెరువు, రంగసముద్రము చెరువు, కందుకూరు చెరువు, చినతిప్ప సముద్రము చెరువు అను నాలుగు పెద్ద పంట చెరువులు కలవు. వీనికి మంచి వరవలు ఉండుటచే వీనిక్రింద సాగు నమ్మదగి ఉన్నది. తాలూకాలోని తక్కిన చెరువులు పూర్తిగా వర్షముమీదనే ఆధారపడి ఉన్నందున వీని క్రింద నీటి పారుదల నమ్మ వీలులేకున్నది. బావుల నీటిని కొంతకాలము ఉపయోగించుటయు కలదు.

పుంగనూరు తాలూకా : వర్షాధారపు చెరువులు, కొన్ని బావులు మాత్రమే కలవు.

పలమనేరు తాలూకా : తూర్పు భాగమున కొన్ని ప్రదేశములు కౌండిన్యనదిక్రింద సాగగుచున్నవి. తక్కిన నీటి వసతులు వర్షాధారపు చెరువులు, బావులు మాత్రమే.

వాయల్పాడు తాలూకా : వర్షాధారపు చెరువులు, బావులు మాత్రమే కలవు.

చంద్రగిరి తాలూకా : స్వర్ణముఖి, కళ్యాణి నదుల నుండి వచ్చు ఊట కాలువలవలన చక్కటి నీటి వసతులు కలవు. వీనిలో నీరు తగ్గినపుడు బావులు, చెరువులు సాయ పడును.

కాళహస్తి తాలూకా : స్వర్ణముఖి, ఊటకాలువల వలన కొన్ని చెరువులకు నీరు లభించుచున్నది.

పుత్తూరు తాలూకా : తాలూకాలోని కొన్ని ప్రదేశ ములను ఆరణి, నగరి నదుల నీటి సాయమున సాగుచేయు చున్నారు. వర్షాధారపు చెరువులు, బావులు పెక్కు కలవు.

సత్యవీడు తాలూకా : తాలూకా యందలి కొలది భాగము ఆరణి నదిక్రింద సాగగుచున్నది.

చిత్తూరు తాలూకా: వర్షాధారపు చెరువులు, బావులు ఈ తాలూకాలో సేద్యమునకు ఆధారము.

మొత్తముమీద అనావృష్టి సంవత్సరములందు మదనపల్లి, పుంగనూరు, వాయల్పాడు, సత్యవీడు తాలూకాలు కరవు బాధకు విశేషముగను; పలమనేరు, కాళహస్తి, చిత్తూరు తాలూకాలు కొంతవరకును లోనగును. పల్లపు సాగు అగు పొలముకూడ అనావృష్టి సంవత్సరమున మెట్ట భూములుగ సాగగును. ఆహార ధాన్యములలో వరి, రాగి ; పప్పు ధాన్యములలో ఉలవలు ; వాణిజ్య పంటలలో వేరుశనగ ఈ జిల్లాలో ముఖ్యమైన పంటలు.

చిత్తూరు జిల్లా - పంటల వివరములు

1959 - 1960

| | | | |
|---|---|---|---|
| వరి | 2,77,240 ఎ. | కంది | 6,052 ఎ. |
| గోధుమ | 561 ,, | పెసర | 439 ,, |
| జొన్న | 52,213 ,, | మినుము | 806 ,, |
| సజ్జ | 1,42,584 ,, | ఉలవ | 54,567 ,, |
| రాగి | 1,60,489 ,, | ఇతర పప్పు ధాన్యములు | 8,026 ,, |
| మొక్కజొన్న | 43 ,, | పొగాకు | 9 ,, |
| కొర్ర | 1,816 ,, | మిరప | 9,660 ,, |
| వరిగ | 9,949 ,, | ఉల్లి | 17 ,, |
| సామలు | 31,056 ,, | అల్లము | 7 ,, |
| ఇతర పొట్టు ధాన్యములు | 156 ,, | ధనియాలు | 1,156 ,, |
| శనగ | 26 ,, | పసుపు | 107 ,, |

*1961 జనాభా లెక్కల ప్రకారము.

| | | | |
|---|---|---|---|
| చింతతోటలు | 4,561 ఎ. | ఆవాలు | 498 ఎ. |
| ఇతర మసాలా | | ఇతర ఖాద్య | |
| వస్తువులు | 248 ,, | తైలపు పంటలు | 1,117 ,, |
| చెఱకు | 22,492 ,, | అవిసె | 43 ,, |
| తాటి బెల్లము | 796 ,, | ఆముదము | 1,456 ,, |
| ఇతర చెఱకు | | ఇతర ఖాద్యేతర | |
| పంటలు | 46 ,, | తైలపు పంటలు | 1,257 ,, |
| మామిడిపండ్లు | 84,851 ,, | రంగు పంటలు | 1 ,, |
| తక్కిన పండ్లు | 2,910 ,, | పొగాకు | 183 ,, |
| ఎండుపండ్లు | 349 ,, | ఆకుతోటలు | 91 ,, |
| కూరలు | 4,104 ,, | మేత జనుము | 899 ,, |
| పైలెక్కలో చేరని | | మేత పైరులు | 746 ,, |
| ఆహార పైరులు | 322 ,, | ఎరువు పైరులు | 3,897 ,, |
| ప్రత్తి | 67 ,, | పైలెక్కలో చేరని | |
| జనుము | 70 ,, | తుమ్మ, చవుకు | 8,963 ,, |
| వేరుశనగ | 2,57,039 ,, | పూలతోటలు | 470 ,, |
| కొబ్బరి | 1,884 ,, | ఇతర ఖాద్యేతర | |
| నువ్వులు | 5,744 ,, | పంటలు | 1,466 ,, |

జిల్లాలో ముఖ్యమైన ఫల వృక్షములు చింత, మామిడి. ఈ తోటలు చిత్తూరు తాలూకాలో విస్తారముగ కలవు. ఈ జిల్లాలో పండు ఆహార ధాన్యములు ఈ జిల్లా అవసరములకు చాలవు. ముఖ్యముగా వరి ఈ జిల్లాకు విశేషముగ దిగుమతి అగుచున్నది. ఇటనుండి ఎగుమతి అగు వానిలో ముఖ్యమైనవి వేరుశనగ, మామిడిపండ్లు, బెల్లము, చింతపండు. కాళహస్తిలో ఒక వ్యవసాయ పరిశోధన కేంద్రము కలదు. వరి విత్తనములు, కూరగాయ విత్తనములు ఈ కేంద్రమునందు తయారుచేసి రైతులకు సరఫరాచేయుచుండును; చవిటి భూమిని సాగులోనికి తెచ్చుటలో కూడ ఇట పరిశోధన సాగుచున్నది.

పశు సంపద: ఈ జిల్లాలోని పశువులు మంచి వంగడమునకు చెందినవి కావు. ఒకప్పుడు పుంగనూరు పశువులకు ప్రసిద్ధి వహించినది. కాని ఆ వంగడ మిప్పుడు నశించినది. జిల్లాలో చిత్తూరు, మదనపల్లి, పీలేరు అను మూడు చోట్ల పశు వైద్య కేంద్రములు కలవు.

గృహ పరిశ్రమలు: చేనేత ముఖ్యమైన గృహ పరిశ్రమ. కాళహస్తిలో కలంకారీ అద్దకము, కంచు పరిశ్రమలు కలవు. బెల్లముకూడ గృహ పరిశ్రమగా తయారు అగుచున్నది. తిరుపతి పరిసరములలో లక్క బొమ్మల పరిశ్రమ కలదు. లోహ పాత్రల పరిశ్రమ చంద్రగిరి తాలూకాలో విరివిగ సాగుచున్నది.

పరిశ్రమలు: చందన తైలమును తయారుచేయు పరిశ్రమ కుప్పము నందు కలదు స్ట్రాబోర్డు పరిశ్రమ తిరుపతి పట్టణమున కలదు.

రోడ్లు: జిల్లానుండి రోడ్లు ప్రక్క జిల్లాలకును, పరిసర రాష్ట్రములకును పోవుచున్నవి. రాష్ట్రమున తక్కిన ప్రాంతములతో పోల్చిన యెడల రోడ్ల వసతియందును, మంచి తరగతి రోడ్లు కలిగి ఉండుటయందును ఈ జిల్లాయే మెరుగనవచ్చును. తిరుపతి కొండపైకి 16 మైళ్ళ పొడవుగల కనుమదారి (ఘాట్‌రోడ్డు) కలదు.

రైలు మార్గములు: ఈ జిల్లాలో 68¼ మైళ్ళ బ్రాడ్‌గేజ్ రైలు మార్గమును, 165½ మైళ్ళు మీటర్ గేజ్ రైలు మార్గమును కలవు. మద్రాసు నుండి బొంబాయి పోవు బ్రాడ్‌గేజ్ మార్గము సత్యవీడు, పుత్తూరు, చంద్రగిరి, తాలూకాలగుండ పోవుచున్నది. మద్రాసు నుండి బెంగుళూరు పోవు బ్రాడ్‌గేజ్ మార్గము పలమనేరు తాలూకా దక్షిణ భాగమున పోవుచున్నది. మద్రాసు - బెంగుళూరు మార్గమునఉన్న కాట్పాడిని మద్రాసు కలకత్తా మార్గమున ఉన్న గూడూరుతో కలుపు మీటర్ గేజ్ మార్గము, బ్రాడ్‌గేజ్ మార్గముగా మార్చబడుచున్నది (1960-61). ఈ మార్గము చిత్తూరు, చంద్రగిరి, కాళహస్తి తాలూకాలగుండ పోవుచున్నది. కాట్పాడి - గూడూరు మార్గమునుండి పాకాలవద్ద చీలెడి మరొక మీటర్ గేజ్ మార్గము ఈ జిల్లాలోని చంద్రగిరి, పుంగనూరు, వాయల్పాడు, మదనపల్లి తాలూకాలగుండ పోయి బెంగుళూరు - గుంతకల్లు మార్గమున ఉన్న ధర్మవరము చేరుచున్నది. చిత్తూరు పట్టణమును, తాలూకా కేంద్రములగు వాయల్పాడు, చంద్రగిరి, కాళహస్తి, పుత్తూరు రైలు మార్గమున ఉన్నవి. సత్యవీడు రైలు మార్గమునకు చేరువలో ఉన్నది. రైలుమార్గపు వసతులందు కూడ ఈ జిల్లా రాష్ట్రమునందలి తక్కిన జిల్లాలకన్న మేలని చెప్పవచ్చును.

విద్య: ఈ జిల్లాలోని విద్యావ్యాప్తి ఇదివరలో తక్కువగ ఉన్నను, గత దశాబ్దమున (1951-1961) కొంత అభివృద్ధి సాధింపబడినది. 1961 లెక్కలననుసరించి ఈ జిల్లాయందలి ప్రజలలో అక్షరాస్యులు 20.58%. పురుషులు 31·1%; స్త్రీలు 9.57%. తిరుపతియందు స్త్రీలకొక ప్రత్యేక కళాశాలయు, పురుషులకు రెండును, మదనపల్లిలో ఒక ఆర్ట్సు అండ్ సైన్సు కళాశాలలు కలవు. చిత్తూరులో కూడ ఒక ఆర్ట్సు అండ్ సైన్సు కళాశాల 1961లో నెలకొల్పబడినది. వీటి అన్నింటనుకలిసి ఆర్ట్సు విషయముల నభ్యసించు విద్యార్థులు 1,177, విద్యార్థినులు 80 మంది కలరు. శాస్త్ర విషయములను అభ్యసించు వారిలో 1,064 విద్యార్థులు, 149 విద్యార్థినులు గలరు. విశ్వవిద్యాలయాధ్వర్యవమున నే ఇంజనీరింగు కళాశాల యొకటి తిరుపతిలో కలదు. ఇవిగాక తిరుపతి దేవస్థానము యాజమాన్యమున ప్రాచ్య



బంగారు విమానము
శ్రీ వేంకటేశ్వరస్వామి దేవాలయము: తిరుమల - తిరుపతి

విద్యా కళాశాల ఒకటి కలదు. ప్రభుత్వ యాజమాన్యమున పశువైద్య కళాశాల, ఆధునిక వైద్య కళాశాల, ఇంజనీరింగ్ పాలీ టెక్నిక్ సంస్థ నిర్వహింపబడుచున్నవి. శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయమునకు తిరుపతి కేంద్రము. (చూ. విద్య : విశ్వవిద్యాలయ విద్య) ఈ జిల్లా యందలి తిరుపతి పట్టణము అక్షరాస్యత (55.32%) విషయమున రాష్ట్రమున గల పట్టణములందు ప్రథమస్థాన మాక్రమించినది.

ఆరోగ్యము, వైద్యము : ఈ జిల్లా ఆంధ్రప్రదేశ్ నందలి జిల్లాలన్నింట ఆరోగ్యవంతమని పేరు పొందినది. మదనపల్లి తాలూకాలోని హార్స్లీ కొండ ఆంధ్రప్రదేశ్ గవర్నరుకును, ప్రభుత్వోన్నతోద్యోగులకును వేసవి విడిది. సామాన్యులును ఇచటికి వేసవిలో వచ్చి వసించుటకు అనువగు భవనములు ఇచట ప్రభుత్వము వారిచే నిర్మింప బడు చున్నవి. ఈ జిల్లాయందలి పడమటి భాగమంత పీఠ భూమి యందుండుటచే వేసవి కాలమున చక్కని సమ శీతోష్ణస్థితిని కలిగి ఉండును. బొంబాయి నగరవాసియగు ఒక భక్తుని ధన సహాయముచే నిర్మింప బడిన 200 పడకలు కలిగిన రూయా వైద్యాలయము తిరుపతిలో ఇటీవలనే స్థాపింపబడి, సర్వపరికర సమన్వితమై వైద్య కళాశాల లోని విద్యార్థుల శిక్షణకు సహాయకారిగ వినియోగింప బడుచున్నది. చిత్తూరులోని జనరల్ ఆసుపత్రియు సర్వ పరికర సమన్వితమై ఉన్నది. మదనపల్లిలోని క్షయరోగ ఆరోగ్యాశ్రమము చాల ప్రసిద్ధి పొందిన వైద్యశాల. తిరుపతి దేవస్థానము వారిచే పేదల కొరకై కుష్ఠురోగుల ఆసుపత్రి ఒకటి నడుపబడు చున్నది. పైవికాక జిల్లా మొత్తమున ఆయుర్వేద వైద్యశాలలు కూడ కలవు. పుత్తూరు నాటుపద్ధతిని అస్థి చికిత్సకు ప్రసిద్ధి.

చూడ దగిన స్థలములు : ఈ జిల్లాలోని చంద్రగిరికి ఆంధ్రప్రదేశ్ చరిత్రలో ప్రముఖ స్థానము కలదు (చూ. జిల్లా సంక్షిప్త చరిత్ర పుట. 1340). చంద్రగిరి రాజభవనముల అవశేషములు నేడును అచటకాననగు చున్నవి. ద్రావిడశిల్ప పరిణామ చరిత్రను పఠించు వారికి తిరుపతి, శ్రీ కాళహస్తి అను ప్రసిద్ధ క్షేత్రములందలి దేవాలయములు చాల సహాయకారులు.

తిరుపతి : యావద్భారత ప్రఖ్యాతి నందిన పుణ్య క్షేత్రము. తిరుపతి కొండల యందలి ప్రకృతి దృశ్యములు అత్యంత రమణీయములు. ఈ పట్టణము సాంస్కృతికముగ ఆంధ్రులకొక ముఖ్య కేంద్రము. రేణిగుంట జంక్షన్ నుండి పోయెడు శాఖామార్గముపై ఈ క్షేత్రము ఉన్నది. ఇచట కొండలపై వెలసి ఉన్న శ్రీ శ్రీ వేంకటేశ్వరస్వామి హిందువుల కందరకును, అందును ఆంధ్ర దేశీయులకు ఇలవేల్పు. ఉత్తర భారతీయులు ఈ స్వామిని 'బాలాజీ' అని వ్యవహరింతురు. ఈ తిరుపతి స్వయంవ్యక్త క్షేత్రములలో ఒకటి అని భక్తజనుల విశ్వాసము. క్రీ. శ. 10 వ శతాబ్దము నుండియు ఈ దేవాలయము విశేష ప్రశస్తిని ఆర్జించినటుల కన్పట్టుచున్నది. విజయనగర సార్వభౌములు శ్రీకృష్ణదేవ రాయలు ఈ దేవాలయాభివృద్ధికి ఎంతయో తోడ్పడిరి. ఆంధ్ర ప్రదేశ్ నందలి దేవాలయములం దన్నింటికంటె ఎక్కువ సాంవత్సరి కాదాయము ఈ దేవాలయమునకు భక్త జనుల వలన లభించు చున్నది. ఈ దేవాలయమును ఆశ్రయించియే దిగువ తిరుపతి పట్టణము అభివృద్ధి పొందినది. ప్రభుత్వముచే నియమితమగు దేవస్థాన కమిటి ఈ దేవాలయ వ్యవహారములను నిర్వహించు చున్నది.

దేవాలయాదాయము ఏటేట అమితముగ పెరిగిపోవు చున్నది. భక్తజనుల వలన వచ్చు ఈ ఆదాయముతో ఇటీవల స్వామివారి గర్భగుడిపైన బంగారు విమానమును (చూ. చిత్రము), స్వామికి వజ్రఖచితమైన వైర్ ముడిని భుజకీర్తులను, శంఖుచక్రములను చేయించిరి. శేషించిన ధనమును మత, సాంస్కృతిక, విద్యా రంగములందు సద్వినియోగము చేయుచున్నారు. ఎగువ తిరుపతి కొండయందే పాపనాశము అను పేరుగల జలపాతము ఒక పుణ్య తీర్థముగ సేవింప బడుచున్నది. ఇదిగాక ఆకాశగంగ, గోగర్భము, పాండవతీర్థము మొదలగు మరి పది చిన్న జల పాతములు కొండమీద ఆలయసమీపమున గలవు. ఈ తీర్థములలో క్రుంకిన పాపనిష్కృతి కలిగి పరిపూతులగుదురని హిందువుల విశ్వాసము. దిగువ తిరుపతియందుగల గోవిందరాజస్వామి దేవళము కూడ పేరొందినది. శ్రీ కోదండరామస్వామివారి ఆలయ మొకటి, శ్రీ కపాలేశ్వరస్వామి ఆలయ మొకటి కూడ దిగువ తిరుపతిలో గలవు. దిగువ తిరుపతి సమీపమున ఉన్న తిరుచానూరు (అలిమేలు మంగాపురము) నందు పద్మావతి ఆలయము కలదు.

శ్రీకాళహస్తి : ఈ జిల్లాలోనే ప్రసిద్ధ శైవ క్షేత్రమగు శ్రీకాళహస్తియు ఉన్నది. పంచలింగములలో ఒకటియగు వాయులింగము ఇచ్చట కలదని జనశ్రుతి. ఇందలి కాళహస్తీశ్వరుడు శివభక్తులకు పరమ దైవము. విజయనగర సార్వభౌముడు శ్రీకృష్ణదేవరాయని ఆస్థాన కవులలో ఒకడగు ధూర్జటి ఈ దేవుని మాహాత్మ్యమును కీర్తించుచు "కాళహస్తీశ్వర శతకమును" రచించెను. తమిళ కవులగు అప్పర్, సంబందర్ మొదలగు వారును ఈ దేవుని కీర్తించి యున్నారు. శ్రీ శంకర భగవత్పాదులు ఈ క్షేత్రమును

దర్శించి శ్రీ చక్రమును ఇచట ప్రతిష్ఠించిరని పెద్దలందురు. ప్రతి సంవత్సరము మహాశివరాత్రికి ఉత్సవము జరుగును.

జిల్లా సంక్షిప్త చరిత్ర: మద్రాసు రాష్ట్రము నానుకొని సరిహద్దున ఆంధ్రప్రదేశ్ నందున్న ఈ జిల్లాయందు అచటచట లభించు పాండవగుళ్ళవల్ల ఇందు నవీన శిలాయుగము నుండియు మానవులు వసించుచుండినటుల విశ్వసింపదగి ఉన్నది. ఇందు సత్యవీడు తాలూకా దక్షిణపు సరిహద్దు మొదలుకొని తిరుపతి కొండలవరకు గల ప్రాంతము షడారణ్య సీమకు చెందినదని కొందరి అభిప్రాయము. ఆర్కాటు అను ద్రవిడ పదమునకు సంస్కృతి రూపమే షడారణ్యము. పాలారు నది ఉభయ తటముల బహు విస్తృతికల ఆరు అడవులు పూర్వ ముండెననియు, 'ఆరు + కాడు' అనునదియే ఆర్కాటు అయ్యెననియు చారిత్రకుల అభిప్రాయము. ఈ ప్రాంతమంతయు తొలుత కురుంబులను అనాగరిక జాతుల వశమున ఉండెననియు, వారిని అందొండై అను చోళ చక్రవర్తి జయించెననియు తమిళ పూర్వగాథలు చెప్పుచున్నవి. టాలెమీ, ప్లినీ మొదలగు వారి వ్రాతలను బట్టియు కోరమాండల్ (చోళమండలము)న చేరిన ఈ ప్రాంతము క్రీ. శ. 1వ శతాబ్దికి జనావాసితమై ఉండినటుల తెలియవచ్చు చున్నది.

చారిత్రక యుగమున తొలుత పల్లవుల వంశమందుండిన ఈ ప్రాంతమును ఆదిత్యుడు అను చోళ చక్రవర్తి వశపరచు కొనెను (క్రీ. శ. 883). ఆనాడు ఉత్తర ప్రాచ్యాంధ్రమును పూర్వ చాళుక్యులు పాలించుచుండిరి. ఈ చోళ చాళుక్య రాజ్యముల సరిహద్దు ఇదమిత్థమని నిరూపించుటకు తగిన బలవత్తరాధారములు లేకున్నను చిత్తూరు జిల్లాలోనే ఈ సరిహద్దు ఉండెనని విశ్వసించుటకు కొంత అవకాశము కలదు. చంద్రగిరి తాలూకా దామల చెరువు వద్ద గల ఎత్తగు మట్టికట్టను ఒక దానిని ప్రజలు చోళుల రాజ్యమునకు సరిహద్దనియు, అటనుండి వడుగరుల (ఔత్తరాహువుల) రాజ్యము మొదలిడుననియు సాంప్రదాయికముగ చెప్పుదురు. ఆ మట్టికట్ట ఇపుడు త్రవ్వివేయబడినది. కాని క్రీ.శ. 1804 వరకును అది అచట నుండెనని మాత్రము స్పష్టముగ తెలియవచ్చు చున్నది. పూర్వచాళుక్య చోళరాజ కుటుంబములు ఏకమైన తరువాత ఇది చాళుక్య చోళుల వశమున ఉండెను. క్రీ.శ. 12వ శతాబ్దిలో రాజేంద్రచోళుడని చోళరాజు కాళహస్తిదేవళమును నిర్మింప చేసెను. ఈ చాళుక్య చోళులకు సామంతులుగ యాదవరాజులు కొందరు ఈ జిల్లాలోని చంద్రగిరి ప్రాంతమును పాలించిరి. యాదవ రాజైన ఇమ్మడి నరసింహుడు పదవ శతాబ్దిలో చంద్రగిరి కోటను కట్టించెను. చాళుక్య చోళుల ప్రతిభ సన్నగిల్లిన తరువాత ఈయాదవులు స్వతంత్రులై పరిపాలన నడపిరి. వారి పరిపాలనా కేంద్రము ఈ జిల్లాలోని నారాయణవనము. క్రీ. శ. 13 వ శతాబ్ది ఆరంభములో కాకతీయ గణపతి ఈ జిల్లా యందలి కొంత భాగమును జయించెను. మొత్తముమీద ఈ జిల్లాలో ఎక్కువ భాగము ఆనాడు కాకతీయ రాజ్యమున చేరకనే ఉండెనని అనవచ్చును. 13వ శతాబ్ది యందు దక్షిణ దేశముపై దండయాత్ర సలిపిన తురుష్కులు ఈ ప్రాంతమును కూడ ఆక్రమించిరి. కాని త్వరలోనే బల్లాలరాజులు ఈ ప్రాంతమును విముక్తము కావించిరి. కాని వారి స్వాధీనమున ఉండినది అత్యల్ప కాలము మాత్రమే. తరువాత శంబువరాయలు బిరుదాంకితులైన ప్రభువులు క్రీ. శ. 1320 మొదలు 1360 వరకును నలువది ఏండ్ల కాలము పాలించిరి; తుదకీ మండలము క్రీ. శ. 1366 నాటికి విజయనగర రాజ్యాంతర్గత మయ్యెను.

క్రీ. శ. 10వ శతాబ్ది నుండియు తిరుపతి దివ్యక్షేత్రము పేరెన్నికకాంచి, భారతదేశపు నలు మూలల నుండియు యాత్రికులను ఆకర్షింప మొదలిడెను. విజయనగర రాజన్యుల కాలమున ఈ క్షేత్రము పూర్వముకన్న మిన్నగ ప్రశస్తిని ఆర్జించెను. తిరుపతి శ్రీ వేంకటేశ్వరుని సేవించిన శ్రీకృష్ణదేవరాయలయు, వెంకటపతి రాయలయు విగ్రహములును, వారి రాణుల విగ్రహములు ఈ దేవాలయ ప్రాంగణమున ఆయా రాజుల కాలమున నెల కొల్పబడి నేటికిని కాననగుచున్నవి. విజయనగర రాజ్యము ఉచ్ఛస్థితి యందుకొన్న కాలమున కట్టింపబడినదియే గుర్రంకొండలోని కోట. రక్కసి తంగడి యుద్ధానంతరము, విజయనగర ప్రభువులు తొలుత తమ రాజధానిని పెనుకొండకు తరలించి, అట సైతము భద్రత లేకుండుటచే తుదకీ జిల్లా యందలి చంద్రగిరి దుర్గమును తమ రాజధానిగ చేసికొనిరి (చూ, తెలుగు సంస్కృతి-౧ పుట 410, 412). క్రీ. శ. 1656 నాటికి చంద్రగిరి సీమ గోల్కొండ ప్రభువుల వశమయ్యెను. కాని గోల్కొండ రాజులను అంతరింపచేసిన మొగలుల ఆధీనమై అనతి కాలముననే ఈ ప్రాంతమున కొంతభాగము కడప నవాబుల పరిపాలన లోనికిని, మరి కొంత భాగము ఆర్కాటు నవాబుల పాలనములోనికిని పోయినది. 17వ శతాబ్ది ప్రథమ పాదమున మరాఠు లీ ప్రాంతముపై దండెత్తి వశపరచు కొనిరి. కాని ఆర్కాటు ప్రభువులు వారితో ఒక ఒడంబడిక కుదుర్చుకొని మరల ఈ సీమను పరిపాలించిరి. 1781 ప్రాంతమున హైదరాలీ ఈ ప్రాంతము నంతటిని లోగొనెను. కడప, ఆర్కాటు నవాబు లతనికి లొంగిరి. 1782లో ఈ జిల్లాలోనే హైదరాలీ

చనిపోయెను. చిత్తూరు సమీపమున నరసింగరాయని పేటయందు అతడు మరణించిన స్థలమున ఒక స్మారక చిహ్నము కననగు చున్నది. హైదరాలీ మరణానంతరము అతని కుమారుడు టిప్పూను ఓడించి విజేతలు 1792లో భూ విభజన మొనర్చుకొని నపుడు మదనపల్లి, వాయల్పాడు, చంద్రగిరి తాలూకాలు నైజాము వంతునకు వచ్చి అతని వలన 1801లో బ్రిటిషు వారికి, తక్కిన రాయలసీమ సర్కారులతో పాటుగ దత్తములైనవి. ఆర్కాటు నవాబులు బలహీనులై, కుటుంబ కలహములకు లోనై, అందు కొందరు ఆంగ్లేయుల సాయమర్థించిన ఫలితముగ ఆంగ్లేయుల పలుకుబడి తక్కిన ప్రాంతమునను అధికమయ్యెను. క్రమముగ ఆర్కాటు నవాబులు ఋణగ్రస్తులగుట వలన వారి రాజ్యమును 1801లో బ్రిటిషువారు వశపరచు కొనిరి.

బ్రిటిషు వారికి వశమగు నప్పటికి దాదాపుగ ఈ జిల్లా యంతయు జమీందారుల వశమందుండెను. కొందరు జమీందారులు బ్రిటిషువారి నెదిరించి తిరుగుబాటుల లేవదీసిరి. వీరిని అడచి జమీందారీలు వశపరచుకొన బడెను. తక్కిన జమీందారీలకు పేష్కషు నిర్ణయము జరిగెను; ఇట్టి జమీందారీలలో కాళహస్తి, కార్వేటి నగరము ప్రముఖములు. కాళహస్తి, కార్వేటినగర జమీందారీలు నిర్వహణ సరిగ జరుగక, ఋణగ్రస్తములై త్వరలోనే అంతరించెను. స్వాతంత్ర్యసిద్ధి (1947) అనంతరము తగిన పరిహార మొసగబడి తక్కిన జమీందారీలు కూడ రద్దు ఒనర్పబడినవి.

కడప జిల్లానుండి మదనపల్లి, వాయల్పాడు తాలూకాలు; మైసూరునుండి పుంగనూరు, కుప్పం తాలూకాలు; చెంగల్పట్టు జిల్లానుండి తిరుత్తని; తక్కిన తాలూకాలను ఉత్తర ఆర్కాటు జిల్లానుండి గ్రహించి ఈ జిల్లా తొలుతగ 1911లో నిర్మింప బడినది. తరువాత సరిహద్దు తాలూకాల విషయమున మాత్రమే కొలదిగ మార్పులు జరిగి 1959 వరకు ఈ జిల్లా యథాతథముగ ఉండినది; కాని భాషా ప్రయుక్త రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ తరువాత శ్రీ పటస్కరు పరిష్కారము ప్రకారము నేటి చిత్తూరు జిల్లా రూపొందింపబడినది, చీ. శే. రా.

# కడప జిల్లా

**ఉనికి - విస్తీర్ణము :** ఈ జిల్లా ఉ. అక్షాంశము 13° 40′ నుండి 15° 15′ వరకును, తూర్పు రేఖాంశము 77° 55′ నుండి 79° 30′ వరకును వ్యాపించి ఉన్నది. జిల్లాకు సరిహద్దులుగ తూర్పు నెల్లూరు జిల్లా; దక్షిణము చిత్తూరు జిల్లా; పడమర అనంతపురము జిల్లా; ఉత్తరము కర్నూలు జిల్లా కలవు. ఈ జిల్లాలో జమ్మలమడుగు, ప్రొద్దుటూరు, పులివెందల, కమలాపురము, కడప, రాయచోటి, సిద్ధవటము, రాజంపేట, బద్వేలు అను తొమ్మిది తాలూకాలు కలవు. జిల్లావిస్తీర్ణము 5,929 చ. మైళ్ళు.

**నైసర్గిక స్వరూపము :** ఈ జిల్లా 1. ప్రత్తిపండు నల్లనేల, 2. పీఠభూమి, 3. లోయ అని మూడు రకములుగ ఉన్నది. జమ్మలమడుగు, పొద్దుటూరు, పులివెందల, కమలాపురము, కడప తాలూకాలు ప్రత్తి పండు నల్లనేల యందున్నవి. రాయచోటి తాలూకా, ఎత్తు పల్లములుగల పీఠభూమి యందున్నది. బద్వేలు, సిద్ధవటం, రాజంపేట తాలూకాలు కొండలచే చుట్ట బడిన లోయలో ఉన్నవి.

జిల్లాకు దక్షిణమున తిరుపతి కొండలనుండి వెలిగొండలు, పాల కొండలు అనబడు రెండు కనుమలు బయలుదేరి ఈ జిల్లా గుండ పోవుచున్నవి. వెలిగొండలు ఈ జిల్లాకు, నెల్లూరు జిల్లాకు సరిహద్దు ప్రాంతమున పోవుచున్నవి. పాల కొండలు (శేషాచలము కొండలు), పశ్చిమోత్తరముగ వ్యాపించి, కడప పట్టణమునకు కొంచెము తూర్పున రెండు చీలికలుగ చీలుచున్నవి. ఇందు పడమరగా చీలిన శేషాచలము కనుమలు, ఇంకొక చీలిక లంకమల కొండలు, నల్లమల కొండలు అనుపేర్లతో ఉత్తర దిశగా వెలిగొండలకు సరాసరి ప్రక్కగా కర్నూలు సరిహద్దు వరకు వ్యాపించినవి. జమ్మలమడుగుకు పశ్చిమమున గండికోట కొండల చాలు వున్నది. ఈ కొండలే కాక రాయచోటి, పులివెందల, కమలాపురము జమ్మలమడుగు తాలూకాలలో కొన్ని చిన్న కొండలు గుట్టలు కలవు.

**నదులు :** జిల్లాలోని వర్షపు నీరంతయు పెన్ననది లోనికి, దాని ఉపనదుల లోనికి చేరుచున్నది. పెన్ననది ఈ జిల్లా గుండ పడమరనుండి తూర్పుగ ప్రవహించి వెలిగొండల కొండల కనుమలలోనుండి సోమశిలవద్ద నెల్లూరు జిల్లాలోనికి ప్రవేశించుచున్నది. పెన్నలో ఉత్తర దిశనుండి ఈ జిల్లాలో కలియు ఉపనదులు కుందేరు, సగిలేరు; దక్షిణ దిశనుండి కలియునవి చిత్రావతి, పాపఘ్ని, చెయ్యేరు. పెన్ననది వలెనే ఈ ఉపనదులు సైతము జిల్లా వెలుపలనే పుట్టి ఈ జిల్లాలో ప్రవహించుచున్నవి.

చిత్రావతినది అనంతపురముజిల్లా ధర్మవరము తాలూకాలో పుట్టి ఈ జిల్లాలో ప్రవహించి, జమ్మలమడుగు తాలూకాలో పెన్ననదియందు కలియుచున్నది. పాపఘ్ని

మైసూరు రాష్ట్రమున పుట్టి, రాయచోటి తాలూకా పడమటి వైపున, పులివెందల తాలూకాలో, కమలాపురము, కడప తాలూకాల సరిహద్దుగ ఈ జిల్లాలో ప్రవహించి కమలాపురమునకు ఈశాన్యమున రెండు మైళ్ళ దూరమున పెన్న నదిని చేరుచున్నది. చెయ్యేరునే బాహుదానది అందురు; ఈ నది చిత్తూరు జిల్లాలో జన్మించి రాయచోటి, రాజంపేట తాలూకాలలో ప్రవహించి సిద్ధవటము తాలూకాలో పెన్ననదియందు పడుచున్నది. పింఛనది, మాండవ్యనది అను చిన్న ఏరులు ఈ బాహుదానదిలో కలియుచున్నవి. కుందేరు కర్నూలు జిల్లానుండి ఈ జిల్లాలోనికి వచ్చి, ప్రొద్దుటూరు తాలూకాలో ప్రవహించి, పాపఘ్నినది పడు ప్రదేశమునకు ఎగువగా పెన్ననదిలో పడుచున్నది. కర్నూలు జిల్లా నల్లమలలో పుట్టిన సగిలేరు బద్వేలు, సిద్ధవటము తాలూకాల గుండ దక్షిణమునకు ప్రవహించి చెయ్యేరునకు ఎగువన పెన్నలో పడుచున్నది. పెన్నలో పడు ఈ ఉపనదులలో ఏదియు జీవనది కాదు. వర్షములు కురిసినప్పుడు మాత్రము వెల్లువలుగ నీరు వచ్చి వానిలో పడునే కాని, తక్కిన సమయములలో అవి పంట కాలువల కన్న హీనముగా ఉండును.

శీతోష్ణస్థితి: సంవత్సరములో నాలుగు నెలల కాలము ఎండలు విపరీతముగ నుండును. మార్చి, ఏప్రిల్, మే మాసములు భరించ వీలు లేనంత ఉష్ణముగ ఉండును. తక్కిన ప్రాంతముల కన్న కడప తాలూకాలో ఎండలు చాల ఎక్కువ. రాయచోటి తాలూకా 1000′ నుండి 1500′ ఎత్తు గల పీఠభూమి మీద ఉండుటచే తక్కిన ప్రాంతముల కన్న 5° లేదా 6° ఫా. వేడిమి తక్కువగ ఉండును; మొత్తము మీద జిల్లా తూర్పు భాగములో ఉష్ణోగ్రత తక్కువ అని చెప్పవచ్చును. ప్రొద్దుటూరు, జమ్మలమడుగు తాలూకాలు వేడిగా ఉన్నను ఆరోగ్య కరములగు ప్రదేశములు జిల్లాలో సరాసరి దైనిక గరిష్ఠ ఉష్ణోగ్రత 95·2° ఫా., కనిష్ఠ ఉష్ణోగ్రత 75·7° ఫా. సంవత్సరమున అత్యధిక ఉష్ణోగ్రత 109° ఫా., అత్యల్ప ఉష్ణోగ్రత 60° ఫా.

వర్షపాతము: జిల్లా సమీపమున సముద్రము లేనందున నైరృతి ఋతు పవనముల వలన కాని, ఈశాన్య ఋతు పవనముల వలన కాని ఈ జిల్లాకు అంతగా లాభము కనపడుటలేదు. నైరృతి ఋతు పవనములు జూన్ మధ్యమున వీచుటకు ఆరంభించుటతో వర్షకాలము మొదలిడి దేశము చల్లబడును. ఈ జిల్లాలో కురియు వర్షము ఎక్కువ భాగము సాధారణముగ నైరృతి ఋతుపవనములవలననే కురియుచున్నది. అక్టోబరు, నవంబరు నెలలలో ఈశాన్య ఋతు పవనముల వలన కూడ కొంత వర్షము పడును. సంవత్సరమున సరాసరి వర్షము కురియు రోజులు 41·3. సరాసరి సంవత్సర వర్ష పాతము 26·91″. తాలూకాల వారీగా చూచుచో జమ్మలమడుగు తాలూకాలో సరాసరి వర్షపాతము 20·50″ తక్కిన ప్రాంతముల కన్న చాల తక్కువ; జిల్లాలో సిద్ధవటము తాలూకా యందు సరాసరి వర్షపాతము 32·47″-తక్కిన తాలూకాల కన్న ఎక్కువ.

కాని ఈ వర్ష పాతము నిశ్చితమని చెప్పుటకు వీలు లేకున్నది. అప్పుడప్పుడు అతివృష్టి, అనావృష్టి కలుగుచుండును. ఉదాహరణకు 1876 అనావృష్టిలో వర్షపాతము 6·84″ మాత్రమే. 1874లో అతివృష్టి 47·91″ వర్షపాతము కలిగినప్పుడు ఏరులు పొంగి వరదలు వాని దరులందు పండు పంటలన్నిటిని నాశనము చేసియున్నవి.

అడవులు: జిల్లాలో చాల భాగము అడవులతో నిండి ఉన్నది. అడవుల మొత్తము విస్తీర్ణము 1,838 చ. మైళ్ళు. ఈ అడవులలో మిక్కిలి విలువగలవి వెలిగొండలు, పాలకొండలు వేరై చీలిపోవు స్థలమునకు దక్షిణ భాగమున ఉన్నవి. ఇచ్చట కొండల పొడవును, సుమారు 15 లేదా 20 మైళ్ళు వెడల్పున అడవులు వ్యాపించి ఉన్నవి. లంకమల, నల్లమలకొండలలో కూడ మంచి అడవులు కలవు. ఈ అడవులన్నింటిలో నల్లచేవ, ఎర్రచేవ, ఏపి మొదలగు విలువైన కలపజాతులు లభ్యమగుచున్నవి. పులివెందల తాలూకాలోని అడవి చిట్టడవి.

ఖనిజ సంపద: పులివెందల తాలూకాలో పైరటిస్ గనుల పరిశ్రమ ఇప్పుడిప్పుడే అభివృద్ధి యగుచున్నది. రాజంపేట తాలూకాలో సుద్ద మట్టిని త్రవ్వి ఎగుమతి చేయుచున్నారు. కమలాపురము తాలూకా నిడుజువ్వి గనులనుండి తీయబడిన కడప నాపరాళ్లు రాష్ట్రమందలి అన్ని ప్రాంతములకు ఎగుమతి అగుచున్నవి.

పట్టణములు: మునిసిపాలిటీలు గల పట్టణములు జిల్లాలో రెండు మాత్రమే కలవు; అవి కడప, ప్రొద్దుటూరు.

కడప: జనసంఖ్య 49,028; జిల్లా కేంద్రము.

ప్రొద్దుటూరు: జనసంఖ్య 50,614.; తాలూకా కేంద్రము; వ్యాపార కేంద్రముగ పేరొందినది.

ప్రజలు: ఈ జిల్లా జనసంఖ్య* 13,42,140; పురుషులు 6,85,986, స్త్రీలు 6,56,154; జిల్లా జనసాంద్రత చదరపు మైలుకు 227. ఈ జిల్లాలో 1951-1961 మధ్య 15·41% జనసంఖ్య వృద్ధి అయినది. ప్రజలలో 10 మందిలో ఒకరు పట్టణములలో నివసించు చున్నారు.

---

* 1961 జనాభా లెక్కల ప్రకారము.

## కడప జిల్లా - తాలూకా వివరములు

| వరుస సంఖ్య | తాలూకా పేరు | తాలూకా కేంద్రము | గ్రామముల సంఖ్య (1951) | గ్రామీణ జనాభా (1951) | పట్టణములు (1951) | పట్టణ జనాభా (1951) | విస్తీర్ణము చదరపు మైళ్ళలో (1951) | మొత్తము నీటి పారుదల వసతిగల నేల ఎ॥లలో (1959) | సాగుచేయబడిన నేల ఎకరములలో (1959) | ప్రస్తుతము సాగులోలేని బీడు నేల ఎకరములలో (1959) | మొత్తము సాగుకు తగిన నేల ఎ॥లలో (1959) | సాగుచేయ వీలగు బంజరు నేల ఎ॥ములలో (1959) |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. | బద్వేలు | బద్వేలు | 140 | 1,01,626 | 1 | 7,085 | 757 | 30,674 | 78,150 | 8,628 | 86,778 | 1,88,815 |
| 2. | కడప | కడప | 108 | 1,09,951 | 1 | 37,488 | 510 | 37,524 | 29,054 | 18,201 | 1,10,255 | 84,282 |
| 3. | జమ్మలమడుగు | జమ్మలమడుగు | 124 | 1,09,758 | 1 | 12,524 | 618 | 9,168 | 1,78,578 | 8,470 | 1,82,048 | 1,25,600 |
| 4. | కమలాపురము | కమలాపురము | 64 | 68,938 | 1 | 6,658 | 308 | 10,269 | 1,04,886 | 16,801 | 1,21,187 | 29,082 |
| 5. | ప్రొద్దుటూరు | ప్రొద్దుటూరు | 77 | 1,08,580 | 1 | 36,624 | 480 | 33,922 | 1,38,164 | 7,952 | 1,46,116 | 30,976 |
| 6. | పులివెందల | పులివెందల | 92 | 1,03,196 | 1 | 7,598 | 569 | 8,391 | 1,72,889 | 55,685 | 2,28,524 | 28,715 |
| 7. | రాజంపేట | రాజంపేట | 126 | 1,70,290 | 2 | 15,652 | 1,088 | 51,015 | 67,270 | 30,088 | 97,308 | 1,64,865 |
| 8. | రాయచోటి | రాయచోటి | 118 | 1,79,517 | 1 | 10,655 | 1,103 | 32,829 | 1,80,528 | 1,72,897 | 3,53,425 | 50,150 |
| 9. | సిద్ధవటము | సిద్ధవటము | 80 | 75,704 | — | — | 606 | 22,025 | 82,540 | 58,370 | 90,910 | 68,505 |
| | మొత్తము | — | 929 | 10,27,505 | 9 | 1,34,229 | 5,929 | 2,35,887 | 10,40,059 | 3,76,492 | 14,16,551 | 6,59,770 |

మతములు : ఈ జిల్లాలో హిందువులు 9,50,047; ముస్లిములు 1,55,408; క్రైస్తవులు 56,227; జైనులు 47; సిక్కులు 2 కలరు (1951).

వృత్తులు : వ్యవసాయము ముఖ్యమైన వృత్తి. స్వంతముగ సేద్యము చేయువారు, వ్యవసాయ కార్మికులు, భూస్వాములు - వీరందరును వ్యవసాయము మీద ఆధారపడి జీవించుచున్నారు. జిల్లాలో ఇట్టి వారి సంఖ్య 7,52,795; వ్యాపారముచే జీవించువారు 56,167; పరిశ్రమలచే జీవించువారు 1,20,609; ఇతర ఉద్యోగములచే జీవించువారు 2,32,160 (1951).

భాషలు : జిల్లాలో అధిక సంఖ్యాకుల మాతృభాష తెలుగు. వివిధ మాతృభాషలు కలవారి సంఖ్య ఈ విధముగ ఉన్నది: తెలుగు 10,06,250; హిందుస్థానీ 1,26,983; కన్నడము 11,368; మరాఠీ 4,662; హిందీ 3,472; తమిళము 3,149; లంబాడి 2,692; ఎరుకల 2,397; ఇతర భాషలు 757 (1951).

వ్యవసాయము: జిల్లాలో సాగుకు తగిన భూమి 15,21,247 ఎకరములు కలదు. ఇందు ప్రస్తుతము సాగులో ఉన్న భూమి 10,52,066 ఎకరములు. కాని 2,28,324 ఎకరముల భూమికి మాత్రము నీటి పారుదల వసతి కలదు. జిల్లా నీటి వనరులలో ముఖ్యమైనది కర్నూలు-కడప కాలువ; ఇది తుంగభద్రా నది నుండి సుంకేసులవద్ద బయలుదేరి 190 మైళ్ళ 14 గొలుసుల దూరము పారుచున్నది. 137వ మైలు వద్ద ఈ కాలువ కడప జిల్లాలో ప్రవేశించు చున్నది. దీని నుండి అనేకములైన కాలువ శాఖలు బయలుదేరుచున్నవి; వీనిలో ఈ క్రిందివి ముఖ్యమైనవి: 1. చాపాడు కాలువ - దీనిక్రింద సుమారు 10,000 ఎ. ఆయకట్టుకలదు; 2. ఏలూరు కాలువ - దీనిక్రింద సుమారు 3,500 ఎ. ఆయకట్టు కలదు; 3. మైదుకూరు కాలువ - దీని క్రింద సుమారు 6,000 ఎ. ఆయకట్టు కలదు; 4. ఉక్కాయపల్లి కాలువ - ఇదిపాత కడప చెరువు గుండ పారుచున్నది; దీనినుండి కడప చుట్టు ప్రక్కల ప్రాంతమునకు నీరు పారుదల అగుచున్నది.

కర్నూలు - కడప కాలువ పెన్ననది మీదుగా ఒక అక్విడక్టు మూలమున అవతలి ఒడ్డునకు పోవుచున్నది. ఈ కాలువ చివరకు పాత కడప చెరువులో కలిసిపోవుచున్నది. కడప జిల్లాలో కర్నూలు - కడప కాలువ క్రింద సాగగు భూమి సుమారు 40,000 ఎకరములు కలదు. ఇటీవల మరమ్మతులు చేయుటచే ఇంకను 50,000 ఎకరములకు నీటిని సరఫరా చేయుటకు వీలు కలదు.

జిల్లాలో పేరు పొందిన మరొక నీటి వనరు సగిలేరు; ఈ నదికి గల ఆనకట్టనుండి ఒక కాలువ చీలి పంట చెరువులు పెక్కింటికి నీటిని ఇచ్చుచున్నది. ఈ చెరువులలో ముఖ్యమైనది పోరుమామిళ్ల చెరువు. కాని, కర్నూలు జిల్లాలో కురియు వర్షముల మీద ఈ సగిలేరు ఆధారపడి ఉండుటచే నీరు సరియగు అదనులో లభించ కుండుట కూడ పరిపాటి.

ఇవికాకుండ బావులు, చెరువులు, ఏటి కాలువలు, ఊట కాలువలు మొదలగువానివలన కూడ కొన్ని భూములకు నీరు పారుచున్నది. చెరువులు చాల వరకు వర్షముల మీద ఆధారపడి ఉన్నవి. వర్షములు సరిగా పడిన సంవత్సరమున చెరువులు జూలై, ఆగస్టు మాసములలో నిండి మార్చి, ఏప్రిల్ నెలల వరకు నీటిని ఇచ్చుచుండును. ఏటి కాలువలు (అనగా ఏరులకు ఆనకట్టలు)గాని, వేరు నిర్మాణములు కాని లేకుండ సహజ రీతిలో రైతులు త్రవ్వుకొను కొన్ని కాలువలు క్రింద కూడ ఈ జిల్లాలో సాగుబడి ఎక్కువగ అగుచున్నది.

మెట్ట భూములలో అక్కడక్కడ బావులు వలన తోట పైరులు సాగు చేయుచున్నను, అత్యధిక భాగమునకు వర్షముల మీదనే ఆధారపడవలసి ఉన్నది. ఈశాన్య, నైరృతి ఋతుపవనములు బాగుగ వర్షించుచో మెట్ట పైరులు సమృద్ధిగ పండును.

కడప జిల్లా - పంటల వివరములు

1955 - 56

| | | | |
|---|---|---|---|
| వరి | 136,824 ఎ. | ధనియాలు | 6,769 ఎ. |
| గోధుమ | 622 ,, | చెఱకు | 748 ,, |
| జొన్న | 256,282 ,, | పండ్లు, కూరలు, దుంపలు | 40,948 ,, |
| సజ్జ | 106,761 ,, | | |
| రాగి | 49,649 ,, | ప్రత్తి | 71,006 ,, |
| కొర్ర | 131,243 ,, | వేరుశనగ | 210,930 ,, |
| వరిగ | 35,002 ,, | తక్కిన నూనె గింజలు | 9,013 ,, |
| సామ | 2,968 ,, | | |
| శనగ | 3,858 ,, | పొగాకు | 822 ,, |
| పెసర | 4,184 ,, | మేతపైరులు | 268 ,, |
| కంది | 6,752 ,, | పచ్చి ఎరువు పైరులు | 746 ,, |
| మినప | 138 ,, | | |
| ఉలవ | 39,616 ,, | పై లెక్కలో చేరని పైరులు | 11,188 ,, |
| మిరప | 6,700 ,, | | |
| పసుపు | 9,677 ,, | | |

వ్యవసాయపు పద్ధతు లన్నియు పూర్వకాల పద్ధతులైనను వ్యవసాయ శాఖవారి ప్రోత్సాహమున సారపు ఎరువులను వాడుట ఎక్కువగ ప్రచారములోనికి వచ్చినది.

చీనినారింజ, మామిడిపండ్లు, అరటిపండ్లు, తియ్యదోస పండ్లు ఈ జిల్లాలో పండింపబడు ప్రధాన ఫల జాతులు.

చీనినారింజ, నిమ్మ తోటలకు కోడూరు చాల ప్రసిద్ధి వహించినది. పరిసర రాష్ట్రములకును, రాష్ట్రమునందలి తక్కిన ప్రాంతములకును పండ్లు ఇచట నుండి విరివిగ ఎగుమతి చేయబడుచున్నవి.

పెన్న, బుగ్గ నదుల నదీ శయ్యలందు తియ్యదోస డిశంబరు నుండి మార్చి వరకు పండింప బడును. ముఖ్యముగ సిద్ధవటం తాలూకాలో వీనిని పండించుట విరివిగ సాగుచున్నది. భారత దేశము నందలి వివిధ ప్రాంతములకు ఈ పండ్లు ఎగుమతి అగుచున్నవి. కోడూరులో ప్రభుత్వ ఫల పరిశోధన కేంద్రము కలదు. గండికోట తోటలకు ప్రసిద్ధి పొందినది.

వర్షాధారములగు భూములు ఎక్కువగా ఉండుటచే ఈ జిల్లాలో అధిక భాగము రాయలసీమలోని తక్కిన ప్రాంతముల వలెనే కరవు బాధకు లోనగుచున్నది. ప్రభుత్వము నిర్మింప తలపెట్టిన ప్రాజెక్టులు, అందును ముఖ్యముగ గండికోట ప్రాజెక్టు నిర్మింపబడు నెడల ఈ జిల్లాకు శాశ్వతముగ కరవు బాధ తొలగి పోవును.

పశు సంపద : ఈ జిల్లాలోని పశువులు నాణ్యమైనవి కావు. మంచి రకపు పశువులు కావలసిన వారు నెల్లూరు, చిత్తూరు, మైసూరుల నుండి కొని తెచ్చుకొందురు. ఈ జిల్లాలో పశు వైద్య కేంద్రములు కడప, ప్రొద్దుటూరు, పులివెందల, రాజంపేటలలో కలవు.

గృహ పరిశ్రమలు : ముఖ్యమైనది చేనేత పరిశ్రమ ; దీనిమీద ఆధారపడి 26,435 మంది జీవించు చున్నారు. జమ్మలమడుగు తలపాగాలు ప్రక్క రాష్ట్రములకు ఎగుమతి యగు చుండెడివి. కాని ప్రస్తుతము ఈ వ్యాపారము తగ్గి చేనేత చీరల ఎగుమతి ఎక్కువైనది; పుల్లంపేట జరీ అంచు చీరలకు ప్రసిద్ధి. మాధవరం, మూలపల్లె, కురుగుంట పల్లెలలో కూడ సన్న నూలు నేత విరివిగ సాగుచున్నది.

పరిశ్రమలు : చెప్ప దగిన పరిశ్రమ లేవియు ఈ జిల్లాలో లేవు. కడప, రాజంపేట తాలుకాల యందు పసుపు ఫ్యాక్టరీలు కొన్ని పని చేయుచున్నవి. కడప, ప్రొద్దుటూరులలో సంవత్సరము పొడుగున పని చేయు వేరుశనగ ఫ్యాక్టరీలు కొన్ని కలవు. కడప, పులివెందల, రాయచోటి తాలూకాలలో తోళ్ళు పదును చేయు కార్ఖానాలు కలవు.

రోడ్లు : జిల్లా మొత్తము మీద 1,409 మైళ్ళు పొడవు కలిగిన అనేక విధములైన రోడ్లు కలవు. ఇందు రాష్ట్ర రహదారులకు చెందినది 470 మైళ్ళు; స్థానిక సంస్థలకు చెందినది 49 మైళ్ళు; బద్వేలు తాలూకాలో రోడ్ల వసతులు చాల తక్కువ. జిల్లాలో ప్రొద్దుటూరు, రాజంపేట, కడప, పుల్లంపేట, కోడూరు, పులివెందల, వేంపల్లి మొదలైన ప్రధాన వ్యాపార కేంద్రముల మధ్య బస్సుసర్వీసు కలదు. కడప పట్టణమునుండి నేరుగ చిత్తూరు, నెల్లూరు, కర్నూలు పట్టణములకు బస్సులు పోవుచున్నవి. ఈ జిల్లానుండి ఇతర జిల్లాలకు మిర్చి, పసుపు, వేరుశనగ, చీనినారింజ వంటి సరకులు కొంతవరకు లారీల ద్వారా రవాణా యగుచున్నవి.

రైలు మార్గములు : మద్రాసు నుండి బొంబాయికి పోవు బ్రాడ్ గేజ్ రైలు మార్గము ఈ జిల్లాను దాదాపుగ రెండు సమ భాగములుగ చేయుచు, దక్షిణమునుండి ఉత్తరమునకు 121¼ మైళ్ళు దూరము ఈ జిల్లాలోని రాజంపేట, సిద్ధవటము, కడప, కమలాపురము, జమ్మలమడుగు తాలూకాల గుండ పోవుచున్నది. రాయచోటి, బద్వేలు, పులివెందల తాలూకాలకు రైలు మార్గముతో ఎట్టి సంబంధమును లేదు. ఈ తాలూకాల కేంద్రములు సైతము రైలు మార్గమునకు చాల దూరమున ఉన్నవి. రాయచోటి చేరుటకు పాకాల - ధర్మవరము మార్గము మీది కనిగిరిలో దిగిన 29 మైళ్ళు ప్రయాణము చేయవలెను. బ్రాడ్ గేజ్ మార్గమున కడపలో దిగిన 32 మైళ్ళు పోవలసి ఉండును. బద్వేలుకు అతి సమీపమున ఉన్న రైలు స్టేషను కడప ; ఇది బద్వేలుకు 32 మైళ్ళు దూరమున ఉన్నది.

విద్య : సెకండరీ విద్య వరకు బోధన ప్రాంతీయ భాషలోనే జరుగుచున్నది. విద్యా విషయమున ఈ జిల్లా చాల వెనుక బడి ఉన్నది. జిల్లాలో అక్షరాస్యత 21.6% ; పురుషులు 33·42%, స్త్రీలు 9·42%.

జిల్లాయందలి వివిధ వర్గముల విద్యాశాలల సంఖ్యా వివరములు దిగువ ఈయబడినవి :

| వివరము | సంఖ్య | ఉపాధ్యాయులు | విద్యార్థులు |
|---|---|---|---|
| ప్రాథమిక పాఠశాలలు | 1,534 | 3,459 | 1,14,788 |
| మాధ్యమిక పాఠశాలలు | 4 | 29 | 504 |
| ఉన్నత పాఠశాలలు | 31 | 674 | 15,385 |
| వయోజన విద్యా కేంద్రములు | 49 | 51 | 1,119 |
| ప్రత్యేక, వృత్తి బోధన విద్యాశాలలు | 10 | 41 | 771 |
| | 1,628 | 4,254 | 1,32,567 |

పైవి కాక 1,104 మంది విద్యార్థులు గల ఆర్ట్సు అండ్ సైన్సు కళాశాల ఒకటి కడపలో కలదు. ప్రొద్దుటూరులో వైయక్తిక యాజమాన్యమున గల ఒక ఇంజనీరింగ్ పాలిటెక్నిక్ సంస్థయు కలదు.

ఆరోగ్యము, వైద్యము: కడప ప్రాంతములోను, కొండల ప్రాంతములోను శీతకాలమున మలేరియా జ్వరము వ్యాపించుచుండును. పులివెందల తాలూకా చాల అనారోగ్య కరమైన ప్రదేశము. మలేరియా, నారికురుపు మొదలగు వాని నిరోధము విషయమై ప్రభుత్వము ప్రత్యేక కృషి జరుపుచున్నది. అచ్చటచ్చట కలరా వ్యాప్తియు ఈ జిల్లాలో అధికముగ కన్పట్టుచున్నది. 1942-'43, 1950లలో ఈ జిల్లాయందు కలరా విరివిగ వ్యాపించినది. జిల్లాలోని ప్రతి తాలూకాయందును ప్రభుత్వపు వైద్య శాలలు కలవు. కడప పట్టణమందు సకల పరికర సమన్వితమైన ఆసుపత్రి కలదు. జిల్లా మొత్తము మీద ఆధునిక వైద్య విధానము ననుసరించి జనరల్ ఆసుపత్రులు 6; డిస్పెన్సరీలు 6 ఉన్నవి. వీనియందు పడకల సంఖ్య 226. ఇవి కాక యూనాని చికిత్సాశాల 1, ఆయుర్వేద వైద్యశాలలు 39 నడుప బడుచున్నవి (1956-57).

చూడదగిన స్థలములు: కడప జిల్లాలో పలుతావులందు మఠములు అనేకములు కలవు; వీనిలో పేరెన్నిక గనినది పుష్పగిరి మఠము. పుణ్య క్షేత్రములలో ప్రసిద్ధి చెందినది ఒంటిమిట్ట. సిద్ధవటము శ్రీశైల దక్షిణ ద్వారమని ప్రసిద్ధి కెక్కినది. సిద్ధవటము తాలూకాలోని జ్యోతియు, రాజంపేట తాలూకాలోని అత్తిరాలయు పూర్వము యాత్రా స్థలములుగ ఉండినవి. పులివెందల తాలూకాలోని మోపూరునందు భైరవ స్థానము కలదు. దేవగుడిలోని తల్లకంటీశ్వర దేవాలయము ప్రాచీనమైనది. ప్రొద్దుటూరు సమీపము నందలి రామేశ్వరము ఒకప్పుడు యాత్రికులను ఆకర్షించుచుండెను.

పుష్పగిరి: మద్రాసు నుండి బొంబాయికి పోవు రైలు మార్గమున ఉన్న కమలాపురము స్టేషనుకు అయిదు మైళ్ళ దూరమున ఈ పుష్పగిరి మఠము కలదు. అద్వైత మత ప్రవర్తకుడగు ఆది శంకరునిచే భారత దేశమున వివిధ ప్రాంతములందు ధర్మ ప్రచారమునకై స్థాపింప బడిన మఠములలో ఇది ఒకటి అని తన్మతానుయాయుల విశ్వాసము. పుష్పగిరి పూర్వము శైవ మతానుయాయులకు ముఖ్య స్థానము. అఘోర శివాచార్యులిచటి మఠమున నివసించు చుండిరి.

ఒంటిమిట్ట: కడప నుండి పదునాలుగు మైళ్ళు దూరమున ఈ పుణ్య క్షేత్రము కలదు. ఇట కొండపై ఉన్న శ్రీరామాలయము అత్యంత పురాతన మని తత్ప్రాంతీయుల విశ్వాసము. ఒంటడు, మిట్టడు అనువారు దీనిని నిర్మించిరని ఒక గాథ కలదు. ఒంటిమిట్ట అనగా ఒకే రాయి అను అర్థమునకు తావుండుటచే ఇదియే శ్రీమద్భాగవత రచయిత అగు బమ్మెర పోతనామాత్యుని ఏకశిలా నగరమని కొందరు కొంత కాలము వాదించిరి. అట్టి వారిలో ప్రముఖులు శ్రీ వావిలకొలను సుబ్బారావు; వీరి కృషి ఫలితముగ ఈ దేవాలయము పునరుద్ధరితమై ప్రశస్తి నార్జించినది.

జిల్లా సంక్షిప్త చరిత్ర: భారత దేశపు ప్రాచీన సంప్రదాయి కేతిహాసముల ననుసరించి దండకారణ్య సీమకు చెందినదని చెప్పనగు ఈ జిల్లా ప్రాంతమందు పురాణ శిలాయుగ, శిలా యుగములకు చెందిన వారలు పురాతన కాలమున వసించి ఉండినటుల నిదర్శనములు కలవు. రాయచోటి, పులివెందల తాలూకాలోని వేమల, కడప తాలూకాలోని ఎల్లటూరు మొదలగు కొన్ని ప్రదేశములందు పాండవ గుళ్లు అనబడు పురాతన మానవ సమాధులు కనబడు చున్నవి. ఎర్రగుంట్ల ప్రాంతమున పురాతన శిలా పరికరములు లభ్యము లగుచున్నవి. కాని ఈ ఆదిమ మానవ జాతికిని, చారిత్రిక యుగమున ఇట వసించిన జాతికిని కల సంబంధము మాత్రము తెలియదు.

ప్రక్కనున్న కర్నూలు జిల్లా యందు లభ్యములగు అశోకుని శాసనములను బట్టియు, జిల్లాకు పశ్చిమమున బ్రహ్మగిరి మొదలగు చోట్లను అట్టివి లభ్యములగుటచేతను, ఈ జిల్లా అశోకుని కాలమున మౌర్య రాజ్య అంతర్భాగముగ ఉండెనని విశ్వసింప వీలగుచున్నది. సాతవాహన రాష్ట్రి మనునది ఈ సమీపముననే ఉండిన దని మేకాదోని శాసనము వలన వేద్య మగుట వలనను, జమ్మలమడుగు తాలూకా పెదముడియమునందు లభించిన సాతవాహన కాలపు నాణెముల వలనను, ఈ జిల్లా ప్రాంతము సాతవాహన రాజ్యమున యుండెననియు విశ్వసింప దగి ఉన్నది.

సాతవాహన రాజ్య విచ్ఛిత్తి జరిగిన అనంతరము క్రీ.శ. రెండవ శతాబ్దిలో ఈ ప్రాంతమున పల్లవుల పరిపాలన నెలకొల్ప బడెను. సిద్ధవటం తాలూకాలోని గంగపేరూరు సమీపమున లబ్ధములయిన రోమక నాణెముల వలన క్రీ.శ. మూడవ, నాల్గవ శతాబ్దములందు (పల్లవుల కాలమున) ఈ జిల్లా ప్రాంతము సుభిక్షముగ ఉండి వర్తక వ్యాపారములకు ప్రోత్సాహము లభించు చుండెనని విదిత మగుచున్నది. సముద్రగుప్తుని దక్షిణ దేశ దిగ్విజయ యాత్రతో పల్లవ రాజ్యపు శక్తి సన్నగిల్లెను. కరికాలుని నాయకత్వమున విజృంభించిన చోళులు పల్లవ రాజ్యము నిట అంతరింప చేసిరి. ఆనాటి నుండి చోళరాజు లిట పాలించిరి. వీరినే రేనాటి చోళులని అందురు. క్రీ.శ. 6 వ శతాబ్ది

ఆరంభమున కళభ్రు లను ఒక జాతి వారు దండెత్తివచ్చి దక్షిణదేశము లందలి రాజ్య వ్యవస్థల తారుమారొనర్చిరి. కాని త్వరలోనే పల్లవులు కళభ్రుల నంత మొందించుటచే, వారి సర్వాధిపత్యమునకు లోనైన రేనాటి చోళవంశము ఇట పాలించెను. ఇంతలో చాళుక్యులు పల్లవుల నోడించిరి. ఈ అదను చూచుకొని రేనాటి చోళులు ఏడవ శతాబ్ద మున స్వతంత్రులై పాలనము నిర్వహించిరి. ఈ చోళు లలో పుణ్యకుమారుడు హిరణ్య రాష్ట్రమును (కడప, సిద్ధ వటం తాలూకాలు) జయించి పొత్తపి రాజ్యమును విస్తృత మొనర్చెను. 7వ శతాబ్దమున భారతదేశమున పర్యటించిన చైనా యాత్రికుడు హ్యుయెన్ త్సాంగ్ దర్శించిన చులియ ఈ రేనాటి చోళ రాజ్యమే. అనంతర మున కొలది కాలముననే చాళుక్య ప్రభువులు ఈ సీమను ఆక్రమించిరి.

చాళుక్యులకును ఈ జిల్లా ప్రాంతమునకును ఒక ప్రత్యేక సంబంధము కలదు. చాళుక్యు లెటనుండి దక్షిణా పథము నకు వచ్చిరను విషయ మిప్పటికిని వివాదగ్రస్తమే అయి యున్నను సుప్రసిద్ధుడగు తమ వంశకర్త ముదివేమునందు జన్మించెనని చాళుక్యులు తమ శాసనములందు పేర్కొని ఉండి రనుట స్పష్టము. నేటి కడప జిల్లాలో జమ్మలమడుగు తాలూకాలో ఉన్న పెదముడియమే ఆ ముదివేము. చాళుక్యరాజ్య మనంతరము రేనాటి చోళులు స్వతంత్రులై ఈ ప్రాంతమును పదవ శతాబ్ది అంతము వరకు పాలించిరి. క్రీ. శ. 915 ప్రాంతమున రాష్ట్రకూట భూపతి మూడవ ఇంద్రవర్మ ఈ సీమను జయించినటుల తెలియుచున్నది.

ఇంతలో దక్షిణదేశ చోళులు సామ్రాజ్యాధిపతులై విజృంభించిరి. మొదటి రాజరాజు 11వ శతాబ్దమున ఈ ప్రాంతము నంతటిని జయించెను. కాని చోళ చాళుక్యుల పోరాటముల ఫలితముల ననుసరించి ఈ సీమ ఆనాడు పలుమార్లు చేతులు మారి కడకు చోళులకే వశమై క్రీ. శ. 1160 వరకు వారి పాలనలో ఉండెను. అయినను చోళులు సామ్రాజ్యాధి కారులుగా మాత్రమే ఉండి పాలనను సామంతలకు వదలి పెట్టిరి.

చోళరాజ్యపు శక్తి ఉడిగినంతనే ఈ సామంతులు 1. నెల్లూరు తెలుగు చోళులు, 2. కలకడపురము వైదుంబులు తగవులాడికొని దేశమును అరాజకము పాలు చేసిరి. ఈ సమయముననే ఈ జిల్లాయందలి రాజంపేట తాలూకా ప్రాంతము మధుర పాండ్యుల వశమయ్యెను. ఈ అరాచకస్థితిని అణచి కాకతీయ గణపతి ఈ ప్రాంత మును తొలుత చోళుల కొరకై 13వ శతాబ్దపు అపరార్ధ మున జయించి తుదకు తన రాజ్యమున అంతర్భాగము కావించుకొని తన సేనాధిపతియు కాయస్థ వంశస్థాప కుడునైన గంగయ సాహిణిని పాలకునిగ నియమించెను. తరువాత జరిగిన కాయస్థుల తిరుగుబాటును అణచి కాకతీయ పరిపాలనను ప్రతాపరుద్రుడు సుప్రతిష్ఠిత మొన ర్చెను. కాని కాకతీయ రాజ్య మస్తమించిన వెనుక ఒకటవ హరిహరుని కాలమున ఇది విజయనగర రాజ్యాంతర్గత మయ్యెను. ఆ కాలమున ఈ జిల్లా ప్రాంతము గండికోట సీమ, సిద్ధవటం సీమలకు చెంది ఉదయగిరి మండలమున అంతర్భాగమై హరిహర రాయల తమ్ములలో ఒక్కడైన మొదటి కంపరాయల పాలనక్రింద ఉండెను. క్రీ. శ. 17వ శతాబ్ది మధ్య భాగము వరకు విజయనగర చక్రవర్తుల ఏలుబడిలోనే ఉండి ఆ తరువాత కొలది కాలము గోల్కొండ ప్రభువుల వశమై కడకు ఈ ప్రాంతము 17వ శతాబ్దాంతమున మొగలాయీ రాజ్యమున చేరెను.

మొగలుల కాలమున ఇట సామంతులుగ కడప నవా బులు పాలించిరి; వీరినే మయాణా లనెదరు (చూడు: కడప నవాబులు; పు. 742); వీరిని 1779లో అంత మొందించి హైదరాలీ ఈ ప్రాంతమును వశపరచుకొనెను. అతని కుమారుడు టిప్పూ పరాజితుడై మరణించిన వెనుక జరిగిన రాజ్య విభజనలో నైజాము వంతున కిది వచ్చి, తరువాత 1800 లో అతనిచే బ్రిటిష్ వారికి దత్తమొనర్చ బడిన 'దత్తమండల జిల్లా' లనబడు రాయలసీమలో చేరి యుండెను.

రక్కసి తంగడి యుద్ధ కాలమున నుండియు పేరున కిచట కొందరు పరిపాలకు లున్నను దేశమంతయు అరాజ కముగ ఉండెను. తమ ఇచ్చ వచ్చిన రీతిగ పాళెగారులు ప్రజలను దోచుకొను చుండిరి. ఇచట నియమితుడైన మొదటి బ్రిటిష్ పాలకుడు సర్ థామస్ మన్రో ఈ పాళె గాళ్ళను అణచి, క్రమవ్యవస్థను ఏర్పరచి రైతువారీ భూ స్వామ్యమును స్థాపించెను. రాయలసీమతోబాటు 1953 వరకు ఈ జిల్లా మద్రాసు రాష్ట్రమున చేరియుండి ఆంధ్ర రాష్ట్రము మేర్పడినప్పుడు (1953) అందలి ఒక భాగమై యుండెను. భాషా ప్రయుక్త రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ ప్రకారం ఆంధ్రప్రదేశ్ (1956) ఏర్పడినప్పుడు కడపజిల్లా అందలి ఒక భాగమయ్యెను. కడపజిల్లా ఆర్థికముగా వెనుకబడిన జిల్లాగా గుర్తింపబడి ఆంధ్రరాష్ట్ర మేర్పడి నప్పటినుండియు రాయలసీమ అభివృద్ధి బోర్డు ఆధ్వర్య వమున ప్రత్యేక అభివృద్ధి సౌకర్యములను పొందు చుండెను. రాష్ట్రమందలి, ఇతర జిల్లాలలోవలెనే కడప జిల్లాలోనూ జమీందారీ నిర్మూలన చట్టము క్రింద జమీం దారీలన్నియు రద్దయినవి. చి. శే. రా.

# అనంతపురము జిల్లా

ఉనికి - విస్తీర్ణము : ఈ జిల్లా* ఉ. అక్షాంశము 13° 40′ నుండి 15° 15′ వరకును, తూ. రేఖాంశము 76° 50′ నుండి 78° 30′ వరకును వ్యాపించి ఉన్నది. దీనికి సరిహద్దులుగ తూర్పు కడప జిల్లా; దక్షిణము మైసూరు రాష్ట్రము, చిత్తూరు జిల్లా ; పడమర మైసూరు రాష్ట్రము ; ఉత్తరము కర్నూలు జిల్లా, మైసూరు రాష్ట్రము కలవు. ఈ జిల్లా లోని మడకశిర తాలూకాకు చెంది మైసూరు రాష్ట్రమున 'లంకలుగ' ఉన్న కవజనహల్లి, సరజమ్మనహల్లి, కాటగ రాలహల్లియును, హిందూపురము తాలూకాకు చెందిన చంటికుంట పల్లియు మైసూరు రాష్ట్రములో (1950) చేర్చ బడినవి. ఈ జిల్లాలో అనంతపురము, గుత్తి, తాడిపత్రి, కళ్యాణదుర్గము, పెనుకొండ, ధర్మవరము, కదిరి, హిందూపురము, మడకశిర, రాయదుర్గము, ఉరవకొండ అను పదకొండు తాలూకాలు కలవు. జిల్లా విస్తీర్ణము 7,388 చ. మైళ్ళు.

నైసర్గిక స్వరూపము : ఈ జిల్లాను మూడు సహజ భాగ ములుగ విభజింప వచ్చును: ఉత్తరమున నున్న గుత్తి, తాడిపత్రి, రాయదుర్గము తాలూకాలందు ప్రత్తిపండు నల్లరేగడ భూమి విశేషముగ గలదు. మధ్య భాగమున కల కల్యాణదుర్గము, అనంతపురము, ధర్మవరము, పెనుకొండ, కదిరి తాలూకాలు; ఇది చెట్లు చేమలు లేని విశాలమగు ఎర్రనేల. మడకశిర, హిందూపురము తాలూకాలున్న ఉన్నత పీఠభూమితో సంబంధించి తక్కిన తాలూకాల కన్న ఎత్తుగ ఉన్నది. జిల్లాలో పడమటి భాగ మున కల గుత్తి, కల్యాణదుర్గము తాలూకాల యందలి కొన్ని ప్రదేశములు పడమటి వైపునకు వాలిపోవు చున్నవి. గుత్తి, తాడిపత్రి తాలూకాలలోని ఉత్తర భాగములు దక్షిణమునకు వాలి దిగిపోవుటచే అక్కడ కురియు వర్షపు నీరు పెన్ననది లోనికి పోవుచున్నది. జిల్లా అంతయు దక్షిణమునుండి ఉత్తరమునకు ఏటవాలుగ ఉన్నది.

గుత్తికి ఉత్తరమునుండి తాడిపత్రి తాలూకా దక్షిణపు కొన వరకు దాదాపు 35 మైళ్ళ పొడవున కొన్ని చోట్ల 7 మైళ్ళ సైతము వెడల్పు కలిగి మంచుకోట కొండలు వ్యాపించి ఉన్నవి. తాడిపత్రి తాలూకా పడమటి సరిహద్దు నను, గుత్తి, అనంతపురము తాలూకాల తూర్పు సరిహద్దు లను ఈ కొండలు చాలు సాగి పోవుచున్నవి. తాడిపత్రి తాలూకా నైరృతి భాగమున ఈ కొండల శ్రేణిని ఛేదించి చిత్రావతి నది ప్రవహించుచున్నది.

నాగసముద్రము కొండలను పేరు గల మరొక పర్వత శ్రేణి గుత్తి తాలూకా పడమటి భాగము నుండి ఆ తాలూకా మధ్యగా వచ్చి అనంతపురము తాలూకాలోనికి చొచ్చుకొనిపోయినది; దీని పొడవు దాదాపు 50 మైళ్ళు - ధర్మవరము దక్షిణమునకు పోయిన కొలది ఈ పర్వత శ్రేణి ఎత్తు తగ్గిపోయి చాల చోట్ల తెగిపోవుచున్నది. ధర్మ వరము వద్ద బయలు దేరిన మల్లప్ప కొండల వరుస మైసూరు రాష్ట్రము లోనికి పోవుచున్నది. ఇవిగాక ధర్మవరము తాలూకాలో బయలుదేరిన పెనుకొండలు కూడ పెను కొండ, హిందూపురము తాలూకాల గుండ మైసూరు రాష్ట్రము లోనికి పోవుచున్నవి, మడకశిర కొండలు మడకశిర తాలూకాను ఉత్తర దక్షిణ భాగములుగ విభ జించుచున్నవి. ఇవికాక, దక్కను పీఠభూమి యందలి ఇతర ప్రదేశములందు వలెనే ఈ జిల్లాయందును అచ్చటచ్చట చెదరుగ ఉన్న కొన్ని కొండలు, గుట్టలు కలవు. గుత్తి కొండయు, అనంతపురము తాలూకాలోని సింగమలయు ఇట్టివే. కర్నూలు జిల్లాలోని ఎర్రమల కొండల వరుస తాడిపత్రి తాలూకా తూర్పు భాగమున ఉన్నది.

హిందూపురము, మడకశిర తాలూకాలు సహజముగ సస్యశ్యామలమై ఉండును. తక్కిన భాగము ఎక్కడనో సారవంతములగు లోయలందు తప్ప, ఏ చెట్లు చేమలు లేక నిమ్నోన్నతముగ ఉన్నది. రాయదుర్గము తాలూకా చెట్టు చేమలు లేని చదునైన నేల, అక్కడక్కడ ఒక గుట్ట మాత్రము కనబడును.

నదులు : ఈ జిల్లాలోని నదులలో ముఖ్యమైనది పెన్న నది; ఈ నది మైసూరు రాష్ట్రమున నందిదుర్గమునకు వాయవ్యమున చెన్న కేశవ కొండలలో జన్మించి ఈజిల్లాలో హిందూపురము తాలూకాలో ప్రవేశించి ఉత్తరమునకు హిందూపురము, పెనుకొండ, ధర్మవరము తాలూకాల పడమటి భాగములలోను, కల్యాణదుర్గము తాలూకా తూర్పు భాగమునను పోవుచున్నది. అటనుండి అనంత పురము తాలూకా పడమటి సరిహద్దున ప్రవహించి, తూర్పునకు తిరిగి గుత్తి, అనంతపురము తాలూకాల మధ్యగ పోయి, తాడిపత్రి తాలూకా గుండ ప్రవహించు చున్నది. ఆ తరువాత కడప జిల్లా ద్వారా నెల్లూరు జిల్లా లోనికి పోయి సముద్రమున చేరుచున్నది.

*రాయలసీమ అని పిలువబడు నాలుగు జిల్లాలలో అనంత పురము జిల్లా ఒకటి. సమష్టి మద్రాసు రాష్ట్రమునుండి ఆంధ్ర రాష్ట్రమును (1953) వేరుచేసినపుడు బళ్లారి జిల్లాయందలి రాయ దుర్గము తాలూకా అనంతపురము జిల్లాలో కలుపబడినది.

పెన్న తరువాత ముఖ్యమైన నది చిత్రావతి; ఇదికూడ మైసూరు రాష్ట్రమున నందిదుర్గమునకు ఉత్తరమున హరిహరేశ్వర కొండలలో జన్మించి హిందూపురము తాలూకా తూర్పు భాగమున అనంతపురము జిల్లాలో ప్రవేశించి, ఉత్తరముగ ప్రవహించి, హిందూపురము తాలూకా గుండ పోయి బుక్కపట్టణము చెరువులో చేరుచున్నది. అటనుండి ఆ చెరువు అలుగునుండి వెలుపలికి వచ్చి ఉత్తరముగ ధర్మవరము తాలూకాలో ప్రవహించి ధర్మవరము చెరువున చేరుచున్నది. మరల ఈ చెరువు అలుగునుండి వెలుపలికి వచ్చి ఈశాన్యమునకు తిరిగి ప్రవహించుచు, ధర్మవరము తాలూకాలోను, తాడిపత్రి తాలూకా దక్షిణ భాగమునను పోయి జిల్లాను వదలి కడప జిల్లాలో పెన్ననదిలో కలియు చున్నది. హిందూపురము తాలూకాలోని కుశావతి చిత్రావతిలో పడుచున్నది. నాగసముద్రము కొండలలో దక్షిణపు కొనను పుట్టిన తడకలేరు అనంతపురము తాలూకా సంగనమల చెరువులో చేరి అటనుండి అలుగు గుండ వెలుపలికి వచ్చి పెన్ననదిలో పడుచున్నది. మడకశిర తాలూకాలోని స్వర్ణముఖి మైసూరు రాష్ట్రములోని హాగరి నదిలో పడుచున్నది. అనంతపురము చెరువునకు వరవగా ఉన్న పండమేరు అలుగు వెంట వెలుపలికి వచ్చి క్రమేణ తడకలేరులో చేరుచున్నది. మద్దలేరు, పాపఘ్ని అనునవి కదిరి తాలూకాలో ప్రవహించు వాగులు.

శీతోష్ణస్థితి : మార్చి, ఏప్రిల్, మే నెలలలో భరింపవీలులేని ఎండలు కాయును. తరువాత వర్ష కాలమునను శీత కాలమునను చల్లగనుండును. ఈ జిల్లాలో గల వేర్వేరు ప్రదేశములందు శీతోష్ణస్థితిలో భేదము అంతగా లేవు. కాని, ఎత్తున నుండుటచే మడకశిర, హిందూపురము, పెనుకొండ తాలూకాలు తక్కిన వానికంటె కొంత చల్లగా ఉండును. సరాసరి దైనిక గరిష్ఠోష్ణోగ్రత 92.5° ఫా., కనిష్ఠోష్ణోగ్రత 70.7° ఫా. సంవత్సరములో అత్యధిక ఉష్ణోగ్రత 105° ఫా., అత్యల్ప ఉష్ణోగ్రత 54° ఫా.

వర్షపాతము : ఈ జిల్లా సముద్రమునకు అతి దూరమున ఉండుటచే ఏ ఋతుపవనముల వలనను ఎక్కువగ వర్షము పడుట లేదు. పడినంతలో నైరృతి ఋతుపవనముల వలననే ఎక్కువగ వర్షము లభించుచున్నది. సంవత్సరమునకు సరాసరి వర్షము కురియు రోజులు 39.9; సంవత్సరమున సరాసరి వర్షపాతము 22.3". పెనుకొండ తాలూకాలో వర్షపాతము (24.5") - తక్కిన వానికంటె ఎక్కువ; కల్యాణదుర్గము తాలూకాలో వర్షపాతము (20.17") - తక్కిన వానికంటె తక్కువ. ఆంధ్రప్రదేశ్ మొత్తము మీద వర్షపాతము అత్యల్పముగ ఉన్న జిల్లా ఇది.

అడవులు : జిల్లాలోని అడవుల మొత్తము విస్తీర్ణము 754.37 చ. మైళ్ళు. హిందూపురము తాలూకాలోని అడవులు తక్కిన వానికన్న నాణ్యమైనవి. ఇచ్చట కలప సామగ్రికి పనికి వచ్చు చెట్లు కలవు. పెనుకొండ తాలూకాలోని అడవులలో వంటచెరకునకు ఉపయోగించు కంప వెదురు లభించుచున్నది. కదిరి తాలూకాలోని అడవులలో కంప పొదలు మాత్రమే కలవు.

పట్టణములు : జిల్లా మొత్తముమీద పట్టణములలో అనంతపురము, గుంతకల్లు, హిందూపురము, తాడిపత్రి అను వాటికి మాత్రము మునిసిపాలిటీలు కలవు. జిల్లాలో పట్టణములలో నివసించువారి సంఖ్య 2,41,296.

అనంతపురము : జనసంఖ్య 52,278; జిల్లా కేంద్రము.

గుంతకల్లు : జనసంఖ్య 48,087; రైల్వే కూడలి.

హిందూపురము : జనసంఖ్య 32,452; తాలూకా కేంద్రము.

తాడిపత్రి : జనసంఖ్య 23,135; తాలూకా కేంద్రము.

ప్రజలు : ఈ జిల్లా జనసంఖ్య* 17,64,223; పురుషులు 9,06,655; స్త్రీలు 8,57,568; జన సాంద్రత చ. మైలునకు 239. జిల్లాలో 1951-1961 మధ్య 18.92% జనసంఖ్యావృద్ధిఅయినది.

వృత్తులు : జిల్లాలో అధిక సంఖ్యాకుల వృత్తి వ్యవసాయము. స్వంతముగ తమ భూమిని తామే చేసికొను రైతులు, కౌలుదారులు, వ్యవసాయ కార్మికులు, భూస్వాములు వీరందరు వ్యవసాయమును ఆశ్రయించి జీవించువారే - జిల్లాలో వీరి సంఖ్య 10,63,512; ఉత్పత్తి చేయు పరిశ్రమల వలన జీవించువారు 1,25,803; వ్యాపారము వలన జీవించువారు 80,134; ఇతర ఉద్యోగముల వలన జీవించువారు 2,14,142 (1951).

వ్యవసాయము : ఈ జిల్లాలోని వ్యవసాయపు నేల 1. నల్లనేల, 2. నల్లరేగడ నేల, 3. నల్ల ఇసుక, 4. ఎర్రనేల, 5. ఎర్రరేగడి నేల, 6. ఎర్ర ఇసుక అని ఆరు విధములు. నల్లనేల గుత్తి తాలూకాలో విశేషముగ కలదు. ఎర్ర రేగడ నేల అన్ని తాలూకాలలో కలదు. గుత్తి, అనంతపురము, ధర్మవరము, పెనుకొండ తాలూకాలలో ఎర్ర ఇసుకయు విశేషముగ కలదు. కల్యాణదుర్గము తాలూకాలో దాదాపుగ ఒక భాగము ఎర్ర రేగడియున్ను, రెండు భాగములు ఎర్ర ఇసుక కలదు.

సాగునకు తగినభూమి జిల్లాలో 29,92,381 ఎకరములు; వీనిలో 25,70,862 ఎకరములు మాత్రమే సేద్యమున ఉన్నది. ఇందు 3,08,872 ఎకరములకు మాత్రమే ఏదో విధమగు నీటి పారుదల వసతి కలదు.

* 1961 జనాభా లెక్కల ప్రకారము.

## అనంతపురము జిల్లా - తాలుకా వివరములు

| వరుస సంఖ్య | తాలూకా పేరు | తాలుకా కేంద్రము | గ్రామముల సంఖ్య (1951) | గ్రామీణ జనాభా (1951) | *పట్టణములు (1951) | పట్టణ జనాభా (1951) | విస్తీర్ణము (చదరపు మైళ్ళలో) (1951) | మొత్తము నీటి పారుదల వసతి గల నేల విస్తీర్ణము (ఎకరములలో) (1959) | సాగుచేయబడిన నేల (ఎ॥ములలో) (1959) | ప్రస్తుతము సాగులోలేని బీడు నేల (ఎ॥ములలో) (1959) | మొత్తము సాగుకు తగిన నేల (ఎ॥ములలో) (1959) | సాగుచేయ వీలగు బంజరు నేల ఎ॥ములలో (1959) |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. | అనంతపురము | అనంతపురము | 114 | 1,32,751 | 1 | 31,952 | 926 | 22,088 | 3,22,109 | 22,635 | 3,44,762 | 41,907 |
| 2. | ధర్మవరము | ధర్మవరము. | 65 | 1,00,109 | 1 | 14,703 | 736 | 30,896 | 2,17,683 | 29,161 | 2,46,844 | 1,62,508 |
| 3. | గుత్తి | గుత్తి | 137 | 1,44,988 | 4 | 69,918 | 896 | 8,176 | 1,96,005 | 8,328 | 2,04,333 | 16,875 |
| 4. | హిందూపురము | హిందూపురము | 76 | 1,28,894 | 1 | 24,438 | 430 | 27,512 | 1,33,584 | 8,779 | 1,42,411 | 24,411 |
| 5. | కదిరి | కదిరి | 140 | 1,98,758 | 1 | 20,854 | 1.157 | 34,565 | 2,99,768 | 25,390 | 3,25,158 | 54,321 |
| 6. | కళ్యాణదుర్గము | కళ్యాణదుర్గము | 74 | 1,10,281 | 1 | 8,168 | 821 | 16,708 | 3,11,313 | 29,976 | 3,41,289 | 50,579 |
| 7. | మడకశిర | మడకశిర | 55 | 1,13,641 | 1 | 6,568 | 417 | 21,285 | 1,42,411 | — | 1,42,411 | 10,416 |
| 8. | పెనుకొండ | పెనుకొండ | 99 | 1,05,245 | 2 | 18,104 | 682 | 22,415 | 1,55,310 | 10,055 | 1,65,365 | 29,893 |
| 9. | రాయదుర్గ | రాయదుర్గ | 74 | 1,02,297 | 1 | 19,738 | 682 | 1,14,941 | 3,02,340 | 37,429 | 3,39,769 | 18,260 |
| 10. | తాడిపత్రి | తాడిపత్రి | 98 | 1,05,431 | 2 | 27,868 | 640 | 16,158 | 2,60,145 | 10,390 | 2,70,535 | 13,124 |
| 11. | ఉరవకొండ | ఉరవకొండ | — | — | — | — | — | 1,220 | 2,04,897 | 5,567 | 2,10,464 | 7,462 |
| | | మొత్తము | 932 | 12,42,295 | 15 | 2,41,296 | 7,387 | 2,65,964 | 25,45,560 | 1,87,728 | 27,33,288 | 4,29,256 |

* 5,000 లకు మించి జనసంఖ్య గల గ్రామములు పట్టణములుగా పరిగణింపబడినవి.

నీటి పారుదల వసతులు : తాడిపత్రి తాలూకాలోని ఎల్లినూరు చెరువు ఒకటి తప్ప చెప్పదగిన పెద్ద నీటివసతి ఏదియు అనంతపురము జిల్లాలో లేదనియే చెప్పవచ్చును. జిల్లాలోని నదులలో వర్షము కురిసినప్పుడు తప్ప నీరే ఉండదు. సంవత్సరమున ఎక్కువకాలము అవి ఎండిపోయి ఉండును. వీటికి ఆనకట్టలు ఎక్కడను లేవు. పంట చెరువులు కొన్ని కలవు. కాని, ఒక్క పంటను పండించవలెనన్న ఈ చెరువులు మూడు సారులు నిండవలెను. అడవి వాగుల నుండియు, చెరువు గర్భముల నుండియు, నదీశయ్యల నుండియు తీయబడిన ఊటకాలువల క్రింద కొంతసాగు జరుగును ; కాని ఇది లెక్కలోనిది కాదు. చెరువులు కదిరి తాలూకాలో ఎక్కువ. నదులచే నింపబడు చెరువులు చాల కొలదిగ కలవు. రాయదుర్గము తాలూకా యందు చెరువులు అధికముగ ఉన్నవి. వీనికి తోడుగ ఊట కాలువల క్రిందను, బావుల క్రిందను పారుదల కొంతవరకు సహాయపడు చున్నది. హగరినది ప్రక్కన ఉండు ఊట కాలువలక్రింద కొన్ని గ్రామములలో మాగాణిసాగు జరుగుచున్నది. రాయదుర్గము తాలూకాలో కనికల్లు చెరువు అన్నింటిలోను పెద్దది. హగరి నదినుండి వచ్చు కాలువ వలన ఈ చెరువుకు నీరు లభించు చున్నది. అనంతపురము తాలూకాలో తడకలేరుచే నింపబడు సింగనమల చెరువు, చిత్రావతి నదిచే నింపబడు బుక్కపట్టణము, ధర్మవరము చెరువులును, అనంతపురము చెరువున్ను ఇట్టివే. చెరువులు పెక్కింట ఒండ్రుచేరుటచే అవి చాల వరకు పూడిపోయినవి. బావులు కలవు కాని, బెట్ట దినములలో వానిలో నీరు ఉండదు.

భౌగోళికముగ ఋతు పవనము ఏదియు అనుకూలముగ ఉండక పోవుటచేతను, నీటి పారుదల వసతులు తగినవి ఏమియు లేకపోవుట చేతను ఈ జిల్లా సాధారణముగ కరవు బాధకు లోనగుచున్నది. ప్రభుత్వము భైరవాని తిప్ప ప్రాజెక్టు మొదలగు వానిచే ఈ సమస్యను పరిష్కరింప యత్నించు చున్నది (1961).

ఈ జిల్లాలో పండు ఆహార ధాన్యములలో ముఖ్యమైనవి జొన్న, వరి, కొర్ర; పప్పు దినుసులలో ఉలవలు ; వాణిజ్య పంటలలో ముఖ్యమైనది వేరుశనగ.

అనంతపురము జిల్లా - పంటల వివరము

1955 - 1956

| | | | |
|---|---|---|---|
| వరి | 1,64,824 ఎ. | రాగి | 1,03,232 ఎ. |
| గోధుమ | 3,206 ,, | కొర్ర | 4,61,534 ,, |
| జొన్న | 3,57,318 ,, | వరిగ | 41,426 ,, |
| సజ్జ | 219,397 ,, | సామ | 1,06,797 ,, |
| శనగ | 9,249 ఎ. | చెఱకు | 8,981 ఎ. |
| పెసర | 10,780 ,, | పండ్లు, కూరలు, | |
| కంది | 62,094 ,, | దుంపలు | 16,258 ,, |
| మినప | 262 ,, | ప్రత్తి | 1,83,184 ,, |
| ఉలవ | 2,08,300 ,, | వేరుశనగ | 5,65,512 ,, |
| ఇతర పప్పు | | ఇతర నూనె | |
| దినుసులు | 6,232 ,, | గింజలు | 75,155 ,, |
| మిరప | 15,962 ,, | పొగాకు | 3,209 ,, |
| ధనియాలు | 18,453 ,, | మేత పైరులు | 2,175 ,, |

పై లెక్కలలో చేరని పైరులు 17,809 ఎకరములు

పెనుకొండ దానిమ్మ, ద్రాక్ష తోటలకును ; హిందూపురము జామ తోటలకును పేరుపొందినవి.

పశు సంపద : సహజముగ ఇచట మంచి వంగడపు పశువులు కలవు. నెల్లూరు, మైసూరులనుండి కూడ మంచి వానిని కొని తెత్తురు. అనంతపురము, హిందూపురము, తాడిపత్రులలో పశువైద్య కేంద్రములు కలవు.

గృహ పరిశ్రమలు : చేనేత ముఖ్యమైన గృహ పరిశ్రమ. చేనేత పని వలన 19,550 మంది జీవించుచున్నారు. ఉరవకొండ చేనేత పరిశ్రమలకు ప్రసిద్ధి కాంచినది. తాడిపత్రిలో కూడ పట్టు, నూలు నేత పరిశ్రమ కలదు. ధర్మవరము పట్టు చీరలకు రాష్ట్రమందంతటను గిరాకీ కలదు. కంబళీలు చాల ప్రదేశములలో నేయబడు చున్నను చక్కని కంబళీలు కళ్యాణదుర్గము తాలూకా బెళుగుప్ప, తనగల్లులో నేయబడును.

రోడ్లు : ఈ జిల్లానుండి ప్రక్కనున్న కడప, కర్నూలు, చిత్తూరు జిల్లాలకును, మైసూరు రాష్ట్రమునకును రోడ్లు పోవుచున్నవి. వీనిలో జాతీయ రహదారులు, రాష్ట్రీయ రహదారులకు చెందినవి 359 మైళ్ళు, మునిసిపాలిటీలకు చెందినవి 66 మైళ్ళు, స్థానిక సంస్థలకు చెందినవి 1,152 మైళ్ళు కలవు.

రైలు మార్గములు : 67 మైళ్ళ పొడవు గల బ్రాడ్ గేజ్, 191¼ మైళ్ళు పొడవుగల మీటర్ గేజ్ రైలు మార్గములు ఈ జిల్లాలో కలవు. మద్రాసు నుండి బొంబాయికి పోవు బ్రాడ్ గేజ్ మార్గము తాడిపత్రి, గుత్తి తాలూకాల గుండ పోవుచున్నది. గుత్తి తాలూకాలోని గుంతకల్లు నుండి దక్షిణముగ బెంగుళూరునకు పోవు మీటర్ గేజ్ మార్గము గుత్తి, అనంతపురము, ధర్మవరము, పెనుకొండ, హిందూపురము తాలూకాల గుండ పోవుచున్నది. ధర్మవరమువద్ద దీనినుండి చీలిన ఇంకొక మీటర్ గేజ్ మార్గము ఆగ్నేయముగ కదిరి తాలూకా గుండ చిత్తూరు జిల్లాలోనికి పోవు చున్నది. తాలూకా కేంద్రములలో కళ్యాణదుర్గము, రాయదుర్గము, మడకశిరలకు రైలు వసతిలేదు.

విద్య : 1961 జనాభా లెక్కల ప్రకారము ఈ జిల్లాలో అక్షరాస్యత 20.8%; పురుషులలో 31.04%, స్త్రీలలో 8.5% అక్షరాస్యత కలదు. అనంతపురము ఒక ప్రముఖ విద్యాకేంద్రము. జిల్లాయందలి వివిధవర్గముల విద్యాశాలల సంఖ్యయు, విద్యార్థుల సంఖ్యయు దిగువ ఈయబడినవి (1956-57):

| సంస్థల వివరము | సంస్థ సంఖ్య | ఉపాధ్యాయ సంఖ్య | విద్యార్థి సంఖ్య |
|---|---|---|---|
| ప్రాథమిక పాఠశాలలు | 1,283 | 2,855 | 1,03,812 |
| మాధ్యమిక పాఠశాలలు | 11 | 71 | 1,336 |
| ఉన్నత పాఠశాలలు | 36 | 782 | 18,957 |
| వయోజన విద్యా కేంద్రములు | 121 | 126 | 2,439 |
| ప్రత్యేకవృత్తి బోధన పాఠశాలలు | 13 | 50 | 897 |
| | 1,464 | 3,884 | 17,441 |

ఇవిగాక అనంతపురమున 1,725 మంది విద్యార్థులు కల ఆర్ట్సు అండ్ సైన్సు కళాశాల; 318 విద్యార్థులుకల ఇంజనీరింగు కళాశాలయు ప్రభుత్వ యాజమాన్యమున నిర్వహింపబడుచున్నవి (1956-57). రాష్ట్రప్రభుత్వ యాజమాన్యమున ఆయిల్ టెక్నలాజికల్ రిసెర్చి ఇన్‌స్టిట్యూట్ (నూనెగింజల పరిశోధన కేంద్రము) ఒకటి పనిచేయుచున్నది.

ఆరోగ్యము, వైద్యము: ఈ జిల్లాలోని కొన్నిభాగములలో ప్లేగు తరచుగ వచ్చుచుండును. మైసూరు రాష్ట్ర సరిహద్దున గల తాలూకాల ద్వారా ఇది వ్యాపించు చున్నది. అటువైపు నుండియే మశూచి, కలరా వ్యాపించుచున్నవి. ఈ జాడ్యమును నిరోధించుటకై ప్రభుత్వము శ్రద్ధ వహించుచున్నది. ప్లేగుబాధ చాల వరకు నివారింపబడిన దనియే భావింపదగును. ఉరవకొండ, గుత్తి, తాడిపత్రి తాలూకాలలో నారికురుపు బాధ కలదు. ప్రభుత్వము వారి నిరోధక కార్యక్రమముల మూలమున ఇది క్రమముగ తగ్గుచున్నది.

జిల్లా మొత్తముమీద ఆధునిక వైద్య విధానము ననుసరించు జనరల్ ఆసుపత్రులు 9, డిస్పెన్సరీలు 9 ఉన్నవి. వీటియందు మంచముల సంఖ్య 355. అనంతపురము నందలి జిల్లా ఆసుపత్రి ఇటీవల అభివృద్ధి పరుప బడినది. ఇవికాక ఆయుర్వేద చికిత్సా శాలలు 38 ఉన్నవి (1956-57).

చూడదగిన స్థలములు: ఈ జిల్లాయందలి గుత్తికోట చారిత్రికముగ ప్రసిద్ధి వహించినది. ఇచటి బలిష్ఠమగు దుర్గము 18వ శతాబ్దమున మురారిరావు అను మరాటా సర్దారునకు రాజధానిగ ఉండెను. పెనుకొండ కోట కూడ విజయనగరరాజుల కాలమున మహావైభవమును అనుభవించిన ఒక దుర్గము.

హిందూపురము తాలూకాలోని లేపాక్షి దేవాలయ శిల్పావశేషములును, చిత్ర లేఖనములును పలు ప్రాంతముల నుండి కళారాధకులను ఆకర్షించుచున్నవి. కదిరి తాలూకా కటారుపల్లెలో వేమనయోగి సమాధి కలదు.

గుత్తి తాలూకా యందలి వజ్రకరూరు వజ్రపు గనులకు పూర్వ కాలమున ప్రసిద్ధి వహించినది. ఇపుడును కదాచిత్తుగ వజ్రములు దొరుకుట కలదు.

జిల్లా సంక్షిప్త చరిత్ర: పూర్వ శిలాయుగము నుండియు ఈ జిల్లా ప్రాంతము మానవుల నివాస భూమిగ నుండినటుల నిదర్శనములిందు పెక్కు లభ్యము లగుచున్నవి. 'రాకాసి గుళ్లు' అని నేడు వ్యవహరింపబడు ఆనాటి మానవుల సమాధులు జిల్లాయందలి వివిధ ప్రాంతములలో, అందును ముఖ్యముగ కళ్యాణ దుర్గము, అనంతపురము, హిందూపురము, రాయదుర్గము తాలూకాలలో కలవు. నవ్య శిలాయుగమునకు చెందిన మానవులు తమ శిలా పరికరములచే తొలచిన కొండగుహలు కొన్ని గుత్తి తాలూకా యందు కాన నగుచున్నవి.

తరువాత చారిత్రక యుగ మేతెంచువరకు జరిగిన విశేషములను గురించి ఏమియు తెలియకున్నను, గుత్తికి సమీపమున ఉన్న ఎర్రగుడియందు లభ్యమయిన అశోకుని శిలా శాసనము ననుసరించి, ఈ ప్రాంతము క్రీ. పూ. 3వ శతాబ్దమున మౌర్య రాజ్యమున నంతర్భాగముగ ఉండెనని చెప్ప వీలగుచున్నది. వారి అనంతరము ఈ ప్రాంతము దాదాపు నాలుగు వందల సంవత్సరముల కాలము సాతవాహనుల పరిపాలనలో నుండినది. సాతవాహన సామ్రాజ్యమంతరించిన పిమ్మట ఈ ప్రాంతమున వచ్చిన మౌర్యులను గురించి వివరము లేమియు తెలియదు. కాని, క్రీ. శ. ఏడవ శతాబ్దినాటి బాదామి చాళుక్య ప్రభువగు మొదటి విక్రమాదిత్యుని శాసన మొకటి గుత్తి తాలూకా యందు కనబడుట వలన బాదామి చాళుక్యు లీ ప్రాంతము నపుడు పాలించినటుల చరిత్రకారులు నిర్ణయించిరి. తెలుగున ఉన్న శాసనములలో మొదటిది ఇది యగునని కొందరి అభిప్రాయము. ఈ చాళుక్యులకు పూర్వమున పశ్చిమ గాంగులును, నలులను బాణ వంశజులును ఈ ప్రాంతమున ఆధిపత్యము వహించినటుల కొందరు చారిత్రకులు అభిప్రాయపడిరి.

బాదామి చాళుక్యులు ఈ ప్రాంతమునకు ప్రభువులుగ నున్నను వారి పక్షమున అపుడిట ప్రభుత్వమును నిర్వహించినది వారి సామంతులు బాణ వంశీకులు. హిందూపురము నందలి 'పరిగి' వారి తొలి రాజధాని. ఆనాడది పరివిపుర

మని వ్యవహరింపబడినది. బాదామి చాళుక్యులకు సామంతు లైన తరువాత వీరు తురమర విషయ మని ఆనాడు వ్యవ హరింపబడిన గుత్తి తాలూకాను కూడ పాలించిరి.

బాదామి చాళుక్యుల రాజ్య మస్తమించిన అనంతరము మరల ఈప్రాంత మంతయు పశ్చిమ గాంగుల వశమయ్యెను. తొలుత వారికి సామంతులుగ నోలంబులను రాజ వంశీకులు ఈ ప్రాంతమును పాలించి క్రమముగ స్వతంత్రులై రాయ దుర్గము, కళ్యాణ దుర్గము, మడకశిర, హిందూపురము ప్రాంతములను క్రీ. శ. 8 వ శతాబ్ది మొదలుగ దాదాపు రెండు శతాబ్దముల కాలము పరిపాలించిరి. వారిపేర ఈ ప్రాంతమున ఆనాడు నోలంబవాడి అను పేరు కలిగినది. ఇంతలో పశ్చిమ గాంగులు మరల విజృంభించి నోలంబ వాడిని జయింపగలిగిరి. అయినను అనతి కాలముననే రాష్ట్రకూటులు ఈ గాంగుల నణచి ఈ ప్రాంతమును తమ రాజ్యమున కలుపుకొనిరి. రాష్ట్రకూట రాజ్య మస్తమించిన పిదప నిది పశ్చిమ చాళుక్యుల వశమయ్యెను. కాని అప్పు డప్పుడు చెలరేగిన పశ్చిమ చాళుక్య, చోళ సంగ్రామముల వలన ఈ ప్రాంత మొకప్పుడు చాళుక్యుల యధీనమునను, మరొకప్పుడు చోళుల వశమునను ఉండినది. కాని, సార్వ భౌమాధికార మెవరిదైనను, ఆనాడిట పరిపాలన నెరపినది తెలుగు చోళులు. ప్రధాన రాజవంశము బలముగ ఉన్నపుడు వీరు వారికి సామంతులుగ ఉండెడివారు ; అటుల కాకున్న స్వతంత్రులుగ నుండెడివారు. ఈ తెలుగు చోళులు పరి పాలన సాగించిన ప్రాంతము నిడుగల్లు రాజ్యమని వ్యవహ రింపబడినది. ఈ జిల్లాయందలి 'నిడుగల్లు' గ్రామము పేర ఇట్టి వ్యవహారము కలిగి ఉండెను. కాని వారి రాజధాని హేమావది, హెంజెరు అని దీనికి నామాంతరము కలదు; అదియే నేటి 'హెంజేరు' గ్రామ మని భావింపబడు చున్నది. ఆ తెలుగు చోళులు క్రీ. శ. 11వ శతాబ్ది మొదలుగ 13వ శతాబ్ది అంతమువరకు ఈ ప్రాంతమును పరిపాలించి నట్లు వారి శాసనముల వలన తెలియుచున్నది.

పశ్చిమ చాళుక్యుల యధికారము క్షీణించిన తరువాత దేవగిరి యాదవులును, ద్వార సముద్రపు హొయిసలలును ఎవరు బలవంతులైనపుడు వారు ఈప్రాంతమును వశపరచు కొని పాలింపదొడగిరి. కాని ముస్లిము దండయాత్రల ఫలిత ముగ పదునాలుగవ శతాబ్ది ఆరంభమున దేవగిరి రాజ్యము అంతరించినది. ఆ తరువాత కొంత కాలమువరకు ఈ జిల్లా యందలి దక్షిణ ప్రాంతము మాత్రము హొయిసలుల అధీ నముననే నిలచి యుండెను.

14వ శతాబ్ది మధ్యమున నుండియు ఈ ప్రాంతము విజయనగర రాజ్యమున నంతర్భాగమైనది. ఆనాడీ జిల్లా యందలి గుత్తి, పెనుకొండ దుర్గములు బలవత్తరము లొనర్పబడి దుర్గాధీశులు నియమింపబడిరి. విజయనగర రాజైన ప్రథమ బుక్కరాయల మంత్రి చిక్కప్ప ఉదయర్ అను నతడు తన పేర 'అనంతసాగర' మను చెరువును త్రవ్వించెను. ఆ చెరువు నాశ్రయించి యభివృద్ధి యైనదే నేటి అనంతపురము. 'రక్కసి తంగిడి' యుద్ధానంతరము విజయనగర రాజులు తమ రాజధానిని క్రీ. శ. 1571 లో ఈ జిల్లాయందలి పెనుకొండ దుర్గమునకు మార్చిరి. తరు వాత క్రమముగ వారు బలహీను లగుటచే ఈ పెనుకొండ దుర్గమును కూడ త్యజించి నేటి చిత్తూరు జిల్లాలోని చంద్ర గిరికి పోయిరి. కడకు క్రీ. శ. 1652 నాటికి పెనుకొండ, గుత్తి దుర్గములు రెండును తురుష్కుల వశమైనవి. తరు వాత వారి వద్దనుండి మురారిరావు అను మరాటా సర్దారు గుత్తి దుర్గమును వశపరచుకొనెను. కాని ఈ ప్రాంతమున ఆనాడు వ్యవస్థిత పరిపాలన మృగ్య మయ్యెను. పాళె గాండ్రు అనేకులు బయలుదేరి పాలకుల మను పేరున దేశ మును కొల్లగొట్ట నారంభించిరి. తరువాత ఈ ప్రాంత మును మైసూరు పాలకు డగు హైదరాలీ జయించెను.

హైదరాలీ అనంతర మతని కుమారుడు టిప్పుసుల్తాను నోడించి మహారాష్ట్రులును, నైజామును, బ్రిటిషువారును విజిత భూమిని పంచుకొనినపుడు ఈ జిల్లాయందలి నేటి తాడిపత్రి తాలూకా ప్రాంతము నైజామునకు లభించెను. టిప్పు మరణానంతరము జరిగిన పంపకముల వలన కడప 1799 లో నైజామునకు దక్కెను. కాని క్రీ. శ. 1800 లో అతనికి ఇంగ్లీషువారికి మధ్య జరిగిన యొడంబడిక ననుసరించి వారికి లభింపచేసిన దత్తమండలములలో ఈ జిల్లా ప్రాంతమును కూడ కలిపి యుండుటవలన ఆంగ్లే యుల కిది వశమైనది.

దత్త మండలములు అన్నియు మొదట ఒక జిల్లా కలెక్టరు అధికారముననే ఉండెను. అప్పు డచటి కలెక్టరు సర్ థామస్ మన్రో. ఇత డానాటి ఈ ప్రాంతమున నములు నందున్న పాళెగాండ్ర జులుము నంతరింపజేసి రైతువారీ పద్ధతి నమలు పరచెను. తరువాత బళ్ళారి, కర్నూలు అను రెండు జిల్లాలుగ దత్త మండలములు విభజింపబడెను; అపుడు బళ్ళారి జిల్లాలో చేరి ఈ ప్రాంత ముండెను. 1882 లో బళ్ళారి జిల్లానుండి కొంత భాగమును చీల్చి అనంతపురము జిల్లాగ నిర్మించిరి. ఆ తరువాత కడపజిల్లా నుండి చీల్చబడిన కదిరి తాలూకా కూడ ఇందు చేర్చబడినది. ఆంధ్రరాష్ట్ర నిర్మాణ (1953) సమయమున, భాషా సాన్నిహిత్యము ననుసరించి బళ్ళారి జిల్లానుండి విడదీయబడిన రాయదుర్గము తాలూకాను ఈ జిల్లాకు కలిపిరి. చీ. శే. రా.

# కర్నూలు జిల్లా

ఉనికి - విస్తీర్ణము : రాయలసీమ అని పిలువబడు నాలుగు జిల్లాలలో ఉత్తరమున ఈ జిల్లా కలదు. మొదటి నుండియు అత్యంత విశాల మని పేరు పొందిన ఈ జిల్లాకు ఆంధ్ర రాష్ట్రము ఏర్పడినపుడు (1953) బళ్లారి జిల్లానుండి చీలిన ఆదోని, ఆలూరు తాలూకాలు చేర్చబడినవి. ఇటుల ఏర్పడిన ఈ జిల్లా ఉ. అక్షాంశము 14° 55′ నుండి 16° 20′ వరకును, తూ. రేఖాంశము 76° 20′ నుండి 79° 36′ వరకు వ్యాపించి ఉన్నది. ఈ జిల్లాకు తూర్పు గుంటూరు; నెల్లూరు జిల్లాలు; దక్షిణము అనంతపురము, కడప జిల్లాలు; పడమర మైసూరు రాష్ట్రము; ఉత్తరము మైసూరు రాష్ట్రము, మహబూబు నగరము, గుంటూరు జిల్లాలు కలవు. ఈ జిల్లా యందు కర్నూలు, ప్రత్తికొండ, నంది కొట్కూరు, దోను (ద్రోణాచలము), నంద్యాల, కోయిల కుంట్ల, బనగానపల్లె, శిరివేలు, కంభము, మార్కాపురము, ఆదోని, ఆలూరు అను పండ్రెండు తాలూకాలు కలవు. జిల్లా విస్తీర్ణము 9,215 చ. మైళ్ళు.

నైసర్గిక స్వరూపము : పడమర, మధ్య, తూర్పు ప్రాంతములని ఈ జిల్లాను మూడు సహజ భాగములుగ విభజింప వచ్చును. ఎర్రమల కొండలకు పడమర ప్రత్తికొండ, కర్నూలు, దోను (ద్రోణాచలము), ఆదోని, ఆలూరు తాలూకాలున్న ప్రాంతము పడమర ప్రాంతము. ఇందచ్చటచ్చట చెదరుగ కొండ గుట్టలును, ఎక్కడనో ఒక చోట పర్వతశ్రేణులును కలవు. ఈ ప్రదేశము దక్షిణము నుండి ఉత్తరమునకు ఏటవాలుగ దిగుచున్నది. ఆలూరు, ఆదోని తాలూకాలలో తూర్పున కొద్ది ప్రదేశము పడమరనుండి తూర్పునకు దిగి పోవుచున్నది. ఎర్రమల, నల్లమల కొండల మధ్య గలది మధ్య ప్రాంతము. ఇందు నందికొట్కూరు, నంద్యాల, బనగానపల్లె, కోయిలకుంట్ల, శిరివేలు తాలూకాలు కలవు. సముద్ర మట్టమునకు 600′ - 800′ ఎత్తున ఉన్న ఈ ప్రాంతమును, అందు ప్రవహించు కుందునది పేర, 'కుందులోయ' అని యందురు. కుందు, పెన్నానదుల వైపునకు, అనగా దక్షిణమునకు ఈ ప్రదేశము ఏటవాలుగ దిగుచున్నది. నందికొట్కూరు తాలూకాలో ఉత్తరమున కొలది ప్రదేశము మాత్రము దక్షిణమునుండి ఉత్తరమునకు దిగి పోవుచున్నది. అక్కడక్కడ అరుదుగ కనబడు చిన్న కొండలను మినహాయించు నెడల ఈ ప్రాంతము అంతయు సమతలముగ ఉన్న దని చెప్పవచ్చును. మూడవదగు తూర్పు ప్రాంతము నల్లమల, వెలిగొండల మధ్య ఉన్నది. దీనినే 'కంభము లోయ' అనుట కద్దు. దాదాపు 85 మైళ్ళ పొడవు, 25 మైళ్ళ వెడల్పు గల ఈ ప్రాంతమున కంభము, మార్కాపురము తాలూకా లున్నవి. కంభమునకు దక్షిణముననున్న భూమి సగిలేరు, పెన్నా నదుల వైపు దక్షిణముగ దిగిపోవుచున్నది. కంభమునకు ఉత్తరముననున్న భూమి తూర్పు వైపునకు దిగిపోవుచున్నది.

నల్లమలలు, ఎర్రమలలు, వెలిగొండలు అనునవి ఈ జిల్లాలో ముఖ్యమైన కొండలు. నల్లమలలు శిరివేలు, నంద్యాల, నందికొట్కూరు తాలూకాల తూర్పు భాగమునను, కంభము, మార్కాపురము తాలూకాలలో పడమటి భాగమునను పోవుచు ఈ జిల్లాలో దక్షిణమునుండి ఉత్తరమునకు దాదాపు 70 మైళ్ళ పొడవున వ్యాపించి ఉన్నవి. వీనిలో కొన్ని చోట్ల 3,000′ ఎత్తుకు మించిన శిఖరములును, అనేకములగు కనుమలును కలవు. దక్షిణమున శిరివేలు తాలూకా ఉత్తర సరిహద్దున గల నంది కనుమయును, ఉత్తరమున నందికొట్కూరు తాలూకాలో మంత్రాల కనుమయు ముఖ్యమైన కనుమలు. ఉత్తరమున మహబూబునగరము జిల్లాలోనికిని, దక్షిణమున కడప జిల్లాలోనికిని ఈ నల్లమలలు వ్యాపించి ఉన్నవి.

కడప జిల్లా జమ్మలమడుగు తాలూకాలో బయలుదేరిన ఎర్రమల కొండల శ్రేణి ఉత్తరమునకు సాగి కర్నూలునకు 8 మైళ్ళ దూరము వరకు వ్యాపించి ఉన్నది. దోను (ద్రోణాచలము), కర్నూలు తాలూకాల తూర్పు భాగముల యందును, కోయిల కుంట్ల, బనగాన పల్లె, నంద్యాల తాలూకాల పడమటి భాగముల యందును ఈ కొండలు పోవుచున్నవి. ఈ కొండలలో ఉత్తరమున తామరాజుపల్లి కనుమ, దక్షిణమున రాంపూరు కనుమయు కలవు.

కడప, నెల్లూరు జిల్లాల సరిహద్దుగా వ్యాపించిన వెలిగొండలు, ఈ జిల్లాలో కంభము తాలూకా తూర్పు అంచున వ్యాపించి మార్కాపురమునకు తూర్పున పది మైళ్ళ దూరమున ఆగిపోవుచున్నవి. ఐనను ఇటనుండి చిన్న గుట్టల వరుసగ మారి, ఈ కొండలు ఎర్రకొండలు అను పేరుతో ఉత్తరపు దిశగ మార్కాపురము తాలూకా తూర్పు భాగమున పోవుచున్నవి. ఆదోని, ఆలూరు తాలూకాలయందు భూమి చదునుగనుండి అక్కడక్కడ గుట్టలు కలవు. కోసిగ నుండి బయలుదేరిన పలుచని గుట్టల శ్రేణి ఆలూరు తాలూకాలో వ్యాపించి ఉన్నది; ఇవి కాక అచ్చటచ్చట చిన్న కొండలు కొన్ని కలవు.

నదులు : తుంగభద్ర, కృష్ణా, హంద్రి, కుందు, గుండ్లకమ్మ, సగిలేరు అనునవి ఈ జిల్లాలో ప్రవహించు ముఖ్య

మైన నదులు. పడమటి కనుమలలో జన్మించిన తుంగభద్రా నది కర్నూలు తాలూకా ఈశాన్య భాగమున ఈ జిల్లాలో ప్రవేశించి, ఆ తాలూకా ఉత్తరపు సరిహద్దున ప్రవహించి నందికొట్కూరు తాలూకా ఉత్తరపు సరిహద్దువద్ద కృష్ణా నదిలో పడుచున్నది. పడమటి కనుమలలోనే మహాబలేశ్వరము వద్ద జన్మించిన కృష్ణానది మైసూరు రాష్ట్రమున కొంత దూరము ప్రవహించి నందికొట్కూరు, మార్కాపురము తాలూకాల ఉత్తర సరిహద్దున పోవుచు గుంటూరు జిల్లాలోనికి సాగుచున్నది. నందికొట్కూరు తాలూకాలో పారు భవనాశి కృష్ణానదిలో పడుచున్నది. ప్రత్తికొండ తాలూకాలో జన్మించిన హంద్రి నది ప్రత్తికొండ, కర్నూలు తాలూకాలలో ప్రవహించుచున్నది. ఎర్రమలలో కురియు వర్షపు నీరు ఈ నదిలో వచ్చి పడుచున్నది. దోను (ద్రోణాచలము) తాలూకా ఉత్తర భాగమున కూడ ఈ నది ప్రవహించి, కడకు కర్నూలు పట్టణము దిగువను తుంగభద్ర నదిలో చేరుచున్నది. ఎర్రమల కొండల పడమటి వైపు జన్మించిన కుందునది ఈశాన్య మూలగ నంద్యాల తాలూకాలో ప్రవహించి అచ్చటనుండి దక్షిణమునకు మరలి నంద్యాల, కోయిలకుంట్ల తాలూకాలలోను, శిరివేలు తాలూకాలో వాయవ్య భాగమునను ప్రవహించి తుదకు కడప జిల్లా ప్రవేశించి పెన్నానదిలో పడుచున్నది. నందికొట్కూరు తాలూకా నుండి దక్షిణముగ ప్రవహించు పాలేరు నంద్యాల తాలూకాలో కుందు నదిలో పడుచున్నది. శిరివేలు తాలూకాలో దక్షిణముగ పారు వక్కిలేరు కడప జిల్లాలోనికి పోవుచున్నది. నల్లమలలలో జన్మించిన గుండ్లకమ్మ తూర్పు దిశగ కంభము తాలూకాలోను, అటనుండి ఈశాన్యముగ మార్కాపురము తాలూకా తూర్పు భాగమునను ప్రవహించి మార్కాపురము తాలూకా ముమ్మిడివరము వద్ద గుంటూరు జిల్లాలో ప్రవేశించుచున్నది. ఆదోని, ఆలూరు తాలూకాల మధ్య ప్రవహించు హరివనం వాగు మైసూరు రాష్ట్రము పోవుచున్నది.

నల్లమల, ఎర్రమల కొండలలో అచ్చటచ్చటను, జిల్లాలో ఇతర ప్రదేశములందు కొన్నింటను ఉష్ణ గుండములు గలవు. వీని నీటిలో కొన్ని ఖనిజ సంబంధమైన రాసాయనిక ద్రవ్యములు కలవు.

శీతోష్ణస్థితి : ఏప్రిల్, మే నెలలలో ఎండలు ఎక్కువగ కాయును. దోను (ద్రోణాచలము) తాలూకా దక్షిణ భాగమునను, నందికొట్కూరు తాలూకాలో ఈశాన్యభాగమున, నల్లమల కొండలలో అత్యున్నత ప్రదేశములందు వేసవి కాలమున సైతము తక్కిన ప్రాంతమునకన్న చల్లగ ఉండును. సరాసరి దైనిక గరిష్ఠోష్ణోగ్రత 93.3° ఫా., కనిష్ఠోష్ణోగ్రత 71.0° ఫా. అత్యధిక ఉష్ణోగ్రత 109° ఫా., అత్యల్ప ఉష్ణోగ్రత 51° ఫా.

వర్షపాతము : ఈశాన్య, నైరృతి పవనముల వలన ఈ జిల్లాలో వర్షములు కురియును. నల్లమలలకు పశ్చిమమున ఉన్న ప్రదేశమున నైరృతి ఋతు పవనముల కాలమునను, నల్లమలలకు తూర్పున ఉన్న ప్రదేశమున ఈశాన్య ఋతు పవనముల కాలమునను వర్షములు ఎక్కువగ కురియును. నైరృతి ఋతు పవనముల వలన లభించు వర్షమే ఎక్కువగ ఈ జిల్లాలో పడుచున్నది. సంవత్సరమున సరాసరి వర్షము కురియు రోజులు 48; సరాసరి వర్ష పాతము 25". తాలూకాలవారీగా చూచినచో నంద్యాల తాలూకాలో వర్ష పాతము (31.34") - అన్నింటికన్న ఎక్కువ ; కోయిలకుంట్లలో వర్ష పాతము (21.6") - అన్నింటికన్న తక్కువ.

అడవులు : జిల్లా మొత్తపు విస్తీర్ణమున దాదాపు మూడవ వంతు అడవులు కలవు ; విస్తీర్ణము 2,647.5 చ. మైళ్ళు. కంభము, మార్కాపురము, నందికొట్కూరు తాలూకాలలో అడవు లెక్కువగ కలవు. పర్వతపాదముల వద్ద ఉన్న అడవులలో కంప పొదలు మాత్రమే కలవు. పైకిపోవుకొలది ఆకురాల్చు జాతి చెట్లు కనబడును. పీఠభూమి యందలి అడవుల యందు మంచి రకపు చెట్లు కలవు. పర్వతోపరి భాగములందు గల మంచి అడవులలో కలప సామగ్రికి ఉపయోగించు చెట్లు కలవు. మార్కాపురము అడవులలో శ్రీగంధపు చెట్లు కలవు. కొండల యందలి అడవులలో పశువుల బీడులు మంచివి ఉన్నవి. బనగానపల్లె అడవులలో కంప పొదలు తప్ప వేరేమియు లేవు.

ఖనిజ సంపద : ఈ జిల్లాలో బంగారము, ఇనుము, బెరైటీస్ గనులు కలవు. జొన్నపురి ప్రాంతమున వజ్రపు గనులు పూర్వముండెడివి. కాని ఈ గనులందు త్రవ్వకపుపని జరుగుట లేదు.

పట్టణములు : పట్టణములలో కర్నూలు, నంద్యాల, ఆదోని అనువానికి మాత్రమే మునిసిపాలిటీలు కలవు.

కర్నూలు : జనసంఖ్య 1,00,849 ; జిల్లా కేంద్రము. ఆంధ్రరాష్ట్రి మేర్పడినప్పుడు (1953) తాత్కాలిక రాజధాని.

నంద్యాల : జన సంఖ్య 42,941 ; తాలూకా కేంద్రము.

ఆదోని : జనసంఖ్య 69,936 ; తాలూకా కేంద్రము.

ప్రజలు : ఈ జిల్లా జన సంఖ్య* 19,09,644 పురుషులు 9,65,131, స్త్రీలు 9,44,513. జన సాంద్రత చ. మైలునకు 206.

* 1961 జనాభా లెక్కల ప్రకారము

## కర్నూలు జిల్లా - తాలూకా వివరములు

| వరుస సంఖ్య | తాలూకా పేరు | తాలుకా కేంద్రము | గ్రామముల సంఖ్య | గ్రామీణ జనాభా | పట్టణములు | పట్టణ జనాభా | విస్తీర్ణము (చదరపు మైళ్లలో) | మొత్తము నీటి పారుదల వసతి గల నేల విస్తీర్ణము (ఎకరములలో) | సాగుచేయబడిన నేల (ఎ॥ములలో) | ప్రస్తుతము సాగులో లేని బీడు నేల (ఎ॥ములలో) | మొత్తము సాగుకు తగిన నేల (ఎ॥ములలో) | సాగుచేయ వీలగు బంజరు నేల (ఎ॥లలో) |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. | ఆదోని | ఆదోని | 147 | 1,44,732 | 3 | 80,488 | 766 | 18,207 | 3,47,245 | — | 3,47,245 | 55,250 |
| 2. | ఆలూరు | ఆలూరు | 80 | 1,22,558 | — | — | 618 | 4,933 | 3,21,661 | 25,765 | 3,47,426 | 11,287 |
| 3. | బనగానపల్లె | బనగానపల్లె | 140 | 86,515 | 1 | 6,392 | 256 | 2,657 | 1,05,164 | 5,227 | 1,10,391 | 5,097 |
| 4. | కోయిలకుంట్ల | కోయిలకుంట్ల | 140 | 86,374 | 1 | 6,758 | 573 | 5,482 | 2,12,621 | 5,292 | 2,17,913 | 48,342 |
| 5. | కంభం | గిద్దలూరు | 95 | 1,46,242 | 2 | 17,568 | 1,048 | 23,537 | 1,52,515 | 11,365 | 1,63,880 | 2,345 |
| 6. | ద్రోణాచలము (డోను) | డోను | 75 | 1,19,367 | 1 | 7,871 | 836 | 5,922 | 2,54,518 | 71,595 | 3,26,113 | 34,370 |
| 7. | కర్నూలు | కర్నూలు | 91 | 1,21,641 | 3 | 76,647 | 641 | 16,022 | 3,41,509 | 3,907 | 3,45,416 | 8,044 |
| 8. | మార్కాపురము | మార్కాపురము | 99 | 1,26,326 | 1 | 11,794 | 1,366 | 32,339 | 1,86,248 | 37,212 | 2,23,460 | 1,07,612 |
| 9. | నందికొట్కూరు | నంది కొట్కూరు | 103 | 1,28,642 | 2 | 21,056 | 1,092 | 18,777 | 1,55,411 | 12,619 | 1,68,030 | 22,713 |
| 10. | నంద్యాల | నంద్యాల | 76 | 92,049 | 1 | 33,344 | 664 | 18,712 | 1.64,351 | 11,853 | 1,76,204 | 12,812 |
| 11. | ప్రత్తికొండ | ప్రత్తికొండ | 69 | 1,08,669 | 2 | 18,253 | 747 | 4,384 | 3,15,313 | 49,012 | 3,64,325 | 2,456 |
| 12. | శిరివేలు | ఆల్లగడ్డ | 91 | 1,04,724 | — | — | 618 | 23,421 | 1,75,750 | 26,618 | 2,02,368 | 35,596 |
| | | మొత్తము | 1,066 | 13,87,839 | 17 | 2,80,706 | 9,215 | 1,74,393 | 27,32,306 | 2,60,465 | 29,92,771 | 3,45,924 |

మతములు : హిందువులు 80%; ముస్లిములు 14%; క్రైస్తవులు 5%; తక్కిన మతముల వారు 1% కలరు.

వృత్తులు : అధిక సంఖ్యాకుల వృత్తి వ్యవసాయము వ్యవసాయము స్వంతముగ చేసికొను రైతులు, కౌలుదారులు, వ్యవసాయ కూలీలు, భూస్వాములు - వీరందరు వ్యవసాయమును ఆశ్రయించి జీవించువారే - వీరి జన సంఖ్య 10,63,702; ఉత్పత్తికర పరిశ్రమలవలన జీవించువారు 1,49,907 : వ్యాపారమువలన జీవించువారు 87.855; ఇతర ఉద్యోగములవలన జీవించువారు 3,17,157 (1951).

భాషలు : జిల్లాలోని అధిక సంఖ్యాకులకు అనగా 85% మాతృభాష తెలుగు. ఉర్దూ, హిందూస్తానీ మాతృభాషగ గలవారు 14% ఉన్నారు. తమిళము, కన్నడము మాట్లాడువారు అత్యల్ప సంఖ్యాకులుగ అటనట నున్నారు.

వ్యవసాయము : సేద్యరీత్యా ఈ జిల్లాయందలి నేల రేగడ, ఎర్రనేల అని విభజింపవచ్చును. వీనిలో నొక్కొక్కటియు, మరల పాడు, బంక, తువ్వ అని ఉప భాగములుగ చేయవచ్చును. తూర్పు ప్రాంతమున చాల బీదరకపు ఎర్రనేల విశేషముగ గలదు. మధ్య ప్రాంతమున సారవంతమగు రేగడ కలదు. ఇక పశ్చిమ ప్రాంతమున ప్రత్తికొండ, ద్రోణాచలము తాలూకాలలో విపరీతముగ ఊసర భూములును; కర్నూలు, ఆదోని, ఆలూరు తాలూకాలలో రేగడ భూమియును కలవు. ప్రత్తికొండ తాలూకాలో సైతము కొన్ని ప్రాంతములలో సారవంతము లగు రేగడ భూములు కలవు. భవనాశి, కృష్ణా కలియుచోట మాత్రమే కొలదిగ ఒండ్రు నేల కనబడుచున్నది. ఒండ్రు నేలయందు మినుము, గోధుమ పైరగుచున్నవి. అచ్చమైన రేగడ అతిసారవంతమును, చెమ్మదనము ఎక్కువ కాలము నిలుపుకొన గలిగియున్నది. తక్కిన కలగలుపు నేల అంతగ సారవంతము కాకపోయినను ఎరువులును, తగు నీటి వసతియు ఉండు నెడల రేగడకన్న ఎక్కువగ పంట ఇచ్చుచున్నది. జొన్న, ప్రత్తి, నీలి, కొర్ర, శనగలు సాధారణముగ రేగడ భూములందు పైరగును.

జిల్లా మొత్తమున వ్యవసాయమునకు తగిన భూమి 37,69,828 ఎకరములు కలదు. ఇందు 29,25,781 ఎకరములకు సేద్యము కలదు. దీనిలో 1,54,322 ఎకరములకు నీటి పారుదల వసతి కలదు.

కర్నూలు - కడప కాలువ ఈ జిల్లాలో ముఖ్యమైన నీటి వసతి. కర్నూలుకు పడమటగ 17 మైళ్ళ దూరమున సుంకేశులవద్ద తుంగభద్ర నుండి ఈ కాలువ చీలి కర్నూలు, నందికొట్కూరు, నంద్యాల, శిరివేలు తాలూకాలలో విస్తార ప్రదేశములకు నీటిని ఒసగుచున్నది. ఒకటిన్నర లక్ష ఎకరములకు నీటి వసతి కలిగించుటకు ఈ కాలువ ఉద్దేశింపబడినను, సాధారణముగ సుమారు 30,000 ఎకరములకు, బెట్ట రోజులలో సుమారు 70,000 ఎకరములకు మాత్రమే ఉపయోగ పడుచున్నది. ఇటీవల ప్రభుత్వము ఈ కాలువకు చేయించిన అభివృద్ధికరములగు మరమ్మతులవలన దీని ఉపయోగము ఎక్కువ కాగలదు. ఈ కాలువ క్రింద ఇపుడు కర్నూలు తాలూకాలోని కొన్ని ప్రదేశములును; నందికొట్కూరు, నంద్యాల తాలూకాలలో కొంత విస్తీర్ణమును, కోయిలకుంట్ల తాలూకాలో 11 గ్రామములలోని నేలయు మాత్రమే సాగగు చున్నది. ఆదోని తాలూకాయందు కొంత ప్రదేశము తుంగభద్ర కాలువ క్రింద సాగగుచున్నది. ఇంకను ఎక్కువ విస్తీర్ణమును సాగునకు తెచ్చుటకు అవకాశములు కలవు. ఆలూరు తాలూకాయందు వర్షాధారము లగు 14 పంట చెరువులు కలవు.

అనావృష్టి సంవత్సరమున ప్రత్తికొండ, ద్రోణాచలము, బనగానపల్లె, ఆదోని, ఆలూరు తాలూకాలును, కర్నూలు, కోయిలకుంట్ల తాలూకాలలో నీటి వనరులు లేని ప్రదేశములును కరవునకు తప్పక గురి అగుచుండును. శిరివేలు, కోయిలకుంట్ల, నంద్యాల, కంభము తాలూకాలలో పంట చెరువుల క్రింద కొన్ని ప్రదేశములు సాగగుచున్నవి; కంభము చెరువు పేరు పొందిన నీటి వసతి.

ఈ జిల్లా పంటలలో ఆహార ధాన్యములందు జొన్న, కొర్రలును; పప్పు దినుసులందు ఉలవలును; వాణిజ్య పంటలందు వేరుశనగ, ప్రత్తి, చెఱకు ముఖ్యమైనవి.

కర్నూలు జిల్లా - పంటల వివరములు

1955 - 56

| | | | |
|---|---|---|---|
| వరి | 108,045 ఎ. | ఇతర పప్పు | |
| గోధుమ | 9,302 ,, | ధాన్యములు | 2,101 ఎ. |
| జొన్న | 868,924 ,, | మిరప | 56,198 ,, |
| సజ్జ | 107,008 ,, | పసుపు | 1,802 ,, |
| రాగి | 21,794 ,, | ధనియాలు | 18,453 ,, |
| కొర్ర | 626,778 ,, | చెఱకు | 749 ,, |
| వరిగ | 122,337 ,, | పండ్లు, కూరలు, | |
| సామ | 1,529 ,, | దుంపలు | 11,953 ,, |
| ఇతర పొట్టు | | ప్రత్తి | 412,673 ,, |
| ధాన్యములు | 4,318 ,, | వేరుశనగ | 491,094 ,, |
| శనగ | 29,970 ,, | తక్కిన నూనె | |
| పెసర | 9,209 ,, | గింజలు | 31,288 ,, |
| కంది | 51,434 ,, | పొగాకు | 9,029 ,, |
| మినప | 900 ,, | మేతపైరులు | 3,240 ,, |
| ఉలవ | 61,659 ,, | పచ్చిఎరువుపైరు | 2,652 ,, |

పై లెక్కలలో చేరని చిల్లర పైరులు 18,175 ఎ. లు

నంద్యాలలో మెట్ట సాగుకు చెందిన వ్యవసాయ పరిశోధన కేంద్ర మొకటి కలదు. పరిశోధనా ఫలితముల ద్వారా లభించిన మంచి రకపు విత్తనములను ఈ కేంద్రము రైతులకు సరఫరా చేయుచున్నది. బనగానపల్లె మామిడి తోటలకు ప్రసిద్ధి.

పశు సంపద: మంచిరకపు పశువు లంతగా లేవు. సర్కారు జిల్లాలలోని పశువులను ఇక్కడి బీళ్ళలో మేపుటకై తోలు కొని వత్తురు; సుగాలీ లనువారు ఈ వృత్తివలన జీవించు చున్నారు. కర్నూలు, నంద్యాల, నందికొట్కూరు, కోయిల కుంట్ల, బనగానపల్లెలో పశువైద్య కేంద్రములు గలవు.

గృహ పరిశ్రమలు: చేనేత పరిశ్రమ ముఖ్యమైనది. దీనివలన జిల్లా మొత్తమున 26,903 మంది జీవించుచున్నారు. ఎర్రగొండపాలెములో ఖాదీ కేంద్రము గలదు. ఆదోని తాలూకా ఎమ్మిగనూరు చేనేతకు ప్రసిద్ధి. మార్కాపుర మున పలకల పరిశ్రమ కలదు.

పరిశ్రమలు: కర్నూలు నందలి వనస్పతి ఫ్యాక్టరీ, పాణ్యమునందు సిమెంటు ఫ్యాక్టరీ పేర్కొనదగినవి. కర్నూలు, నంద్యాల, ప్రత్తికొండ, ద్రోణాచలములలో నూనె మిల్లులు కలవు. ఆదోని, ఆలూరులలో ప్రత్తి మరలు కలవు.

రోడ్లు: ప్రక్క జిల్లాలకును, మైసూరు రాష్ట్రమునకును ఈ జిల్లానుండి రోడ్లు పోవుచున్నవి. ఆంధ్ర రాష్ట్రము (1953)నకు కర్నూలు తాత్కాలిక రాజధానిగ ఉండిన కాలమున కర్నూలునుండి వివిధ ప్రాంతములకు పోవు రోడ్లను అభివృద్ధి చేయుటలో ప్రత్యేక కృషి జరిగినది. ఈ జిల్లా మొత్తముమీద రోడ్ల నిడివి 1,738 మైళ్ళు ఇందు జాతీయ రహదారులకును, రాష్ట్ర రహదారులకును చెంది నవి 846 మైళ్ళు. తక్కిన రోడ్లు స్థానిక సంస్థలకు చెంది యున్నవి.

రైలు మార్గములు: 45 మైళ్ళు నిడివి గల బ్రాడ్‌గేజ్ రైలు మార్గమును, 170 మైళ్ళ నిడివిగల మీటర్‌గేజ్ రైలు మార్గమును ఈ జిల్లాలో గలదు. మద్రాసునుండి బొంబాయి పోవు బ్రాడ్‌గేజ్ రైలు మార్గము ప్రత్తికొండ తాలూకాలో నైరృతి మూలగను, ఆలూరు, ఆదోని తాలూకాలలో తూర్పు భాగమున పోవుచున్నది. మచిలీపట్టణమునుండి హుబ్లీకి పోవు మీటర్‌గేజ్ మార్గము మార్కాపురము, కంభము, నంద్యాల, ద్రోణాచలము, ప్రత్తికొండ తాలూ కాలగుండ పోవుచున్నది. ఈ మార్గము నుండి ద్రోణా చలమువద్ద చీలిన శాఖామార్గము కర్నూలు గుండ సికిందరాబాదునకు పోవుచున్నది. గుంతకల్లునుండి హోస్పేటకు పోవు మీటర్‌గేజ్ మార్గము జిల్లాలోని ఆలూరు తాలూకాలో పది మైళ్ళు పోవుచున్నది. నంది కొట్కూరు, కోయిలకుంట్ల, శిరివేలు, బనగానపల్లె తాలూకాలకు రైల్వే వసతులు లేవు.

విద్య: ఈ జిల్లాలో అక్షరాస్యత 21.12%; పురుషులలో 32.6%, స్త్రీలలో 9.38% (1961). జిల్లాయందున్న వివిధ వర్గముల విద్యా సంస్థల సంఖ్యా వివరములు దిగువ ఈయబడినవి (1956-57).

| విద్యా సంస్థలు | సంఖ్య | ఉపాధ్యాయులు | విద్యార్థులు |
|---|---|---|---|
| ప్రాథమిక పాఠశాలలు | 1,650 | 4,459 | 1,44,514 |
| మాధ్యమిక పాఠశాలలు | 5 | 59 | 1,031 |
| ఉన్నత పాఠశాలలు | 44 | 981 | 23,109 |
| వయోజన విద్యాకేంద్రములు | 130 | 211 | 4,656 |
| ప్రత్యేక, వృత్తి బోధక పాఠశాలలు | 16 | 60 | 1,354 |
| | 1,845 | 5,770 | 1,74,664 |

ఇవి కాక కర్నూలు నగరమున ఒక ఆర్ట్సు అండ్ సైన్సు కళాశాల, 105 మందికి శిక్షణనిచ్చు ఉపాధ్యాయ శిక్షణా కళాశాలయు కలవు. ఒక ఆధునిక వైద్య కళాశాల ప్రభుత్వముచే నడుపబడుచున్నది.

ఆరోగ్యము, వైద్యము: కరవు, కాటకములకు సాధా రణముగ గురియగు ఈ జిల్లాయందు అప్పుడప్పుడు కలరా మొదలగు అంటు వ్యాధులుకూడ వ్యాపించు చుండును; మలేరియా బాధ ఎక్కువ. నారి కురుపుల జాడ్యము పూర్వము విరివిగా ఉండెడిది. ప్రభుత్వము చేయు కృషి ఫలితముగ నారికురుపు, మలేరియాల వ్యాప్తి చాలవరకు తగ్గినది. జిల్లా విస్తీర్ణమునకు తగినంతగా వైద్య సదుపాయములు లేవు. కర్నూలు నగరమున మాత్రము సర్వ పరికర సమన్వితమగు ఆసుపత్రియు; నంద్యాలలో మిషనరీ వైద్యశాలయు కలవు. జిల్లా మొత్తముమీద ఆధు నిక వైద్య విధానము ననుసరించు జనరల్ ఆసుపత్రులు 9, డిస్పెన్సరీలు 22 కలవు; వీనిలో పడకల సంఖ్య 579. ఇవికాక యూనానీ చికిత్సా శాలలు 2; ఆయుర్వేద వైద్యశాలలు 37 జిల్లాలో పనిచేయు చున్నవి (1956-57).

చూడదగిన స్థలములు: ఈ జిల్లా యందు శైవ, వైష్ణవ మతముల ప్రచారము తొలుతనుండియు విరివిగ జరిగి యుండుటచే ఆయా మతముల వారిచే సేవింపబడు పుణ్యక్షేత్రములు పెక్కు కలవు. శైవ క్షేత్రములలో పేర్కొనదగినవి శ్రీశైలము, మహానంది; వైష్ణవుల పుణ్య క్షేత్రములలో పేరు గాంచినవి అహోబలము, మంత్రా లయము.

శ్రీశైలము : నందికొట్కూరు తాలూకాలో కృష్ణా నది ఒడ్డున శ్రీశైల పుణ్యక్షేత్ర మున్నది. ఇచటి పర్వతముపై వెలసియున్న శ్రీ మల్లికార్జున శివలింగము ద్వాదశ తేజోలింగములలో ఒకటి అనియు, ఇచటి భ్రమరాంబా శక్తి పీఠము అష్టాదశ శక్తి పీఠములలో నొకటి యనియు పేర్కొనబడినది. శ్రీశైల శిఖర సందర్శన మాత్రమున జన్మరాహిత్యము లభించునని భక్త జనుల విశ్వాసము. దుర్గమ మగు అరణ్యమున శిథిలావస్థలో ఉన్న ఈ దేవళము ఇటీవల పునర్నిర్మింప బడినది. యాత్రికుల సౌకర్యము కొరకై రోడ్డు వసతులు కల్పింపబడినవి. పూర్వము నుండియు ఆంధ్రదేశ వాసులేకాక భారతదేశపు వివిధ ప్రాంతములనుండి సైతము యాత్రికులు ఈ క్షేత్రమును సేవించు చుండిరని ఇచటి శాసనముల వలన స్పష్ట మగు చున్నది. మహారాష్ట్రరాజ్య సంస్థాపకు డగు ఛత్రపతి శివాజీ ఈ క్షేత్రమును దర్శించె నని ఐతిహ్యము కలదు.

మహానంది : నంద్యాల పట్టణమునకు ఆగ్నేయముగ పదిమైళ్ళ దూరమున గాజులపల్లి అను రైల్వేస్టేషనునుండి మూడుమైళ్ళ దూరమున అరణ్య మధ్యమున మహానంది పుణ్యక్షేత్రము వెలసియున్నది; ఇచటి దేవళమందలి శివలింగము శ్రీశైల మల్లికార్జున శివలింగమును చుట్టిన ఉపలింగములలో ఒకటి అని చెప్పబడుచున్నది. ఇచట నొక జలధార శివలింగము క్రిందుగ ప్రవహించి, అచటనే జలకుండమున గల నంది ముఖమునుండి వెలువడును. జలకుండమునందలి నీరు సదా నిర్మలముగ ఉండును.

అహోబలము : శిరివేలు తాలూకాలోని నల్లమల కొండలలో ఈ క్షేత్రము కలదు. ఇందు కొండ దిగువను ఒక నరసింహ దేవాలయమును, ఎగువను అహోబలస్వామి ఆలయమును, కొండ చివరను లక్ష్మీదేవి ఆలయమును కలవు. కొండ దిగువ ఆలయమున గల శిల్ప సంపద ప్రశంసార్హమైనది. సహజముగ ఏర్పడిన ఒక గుహ తగు రీతిగ మలచి నిర్మింపబడినది. కొండపై నున్న అహోబలాలయ క్షేత్రముననే శ్రీ మహావిష్ణువు నరసింహ రూపమున హిరణ్యకశిపుని వధించి ప్రహ్లాదుని రక్షించెనని భక్త జనుల విశ్వాసము. విశిష్టాద్వైత మత ప్రవక్త యగు రామానుజాచార్యులు మంగళాశాసనము చేసిన నూట ఎనుబది దివ్య తిరుపతులలో అహోబలము ఒకటి. ఏటేట ఫాల్గుణ మాసమున ఇచట బ్రహ్మోత్సవము జరుగును.

మంత్రాలయము : ఆదోని తాలూకాలో మద్రాసు-బొంబాయి రైలుమార్గమున తుంగభద్ర స్టేషనునకు 9 మైళ్ళ దూరమున ఈ క్షేత్రముకలదు. ఇచట ఉన్న రాఘవేంద్రస్వామి అను మధ్వ మత యతి సమాధినే 'మంత్రాలయ' మని అందురు. ఏటేట శ్రావణ మాసమున జరుగు ఉత్సవములకు యాత్రికులు పలు ప్రాంతములనుండి వత్తురు.

పైన పేర్కొనిన వానివలె ప్రశస్తిని గడింపక పోయినను, ఈ జిల్లాలోని ఓంకారము, సంగమేశ్వరము, త్రిపురాంతకము అనునవికూడ యాత్రా స్థలములుగ సేవింపబడుచున్నవి.

జిల్లాలో ఎక్కువ భాగమును ఆక్రమించి యున్న నల్లమల, కర్నూలు కొండల యందలి లోయలు ప్రకృతి దృశ్యముల రామణీయతకు పేరు పొందినవి.

జిల్లా సంక్షిప్త చరిత్ర: కర్నూలుజిల్లా ప్రాంతము భూపృష్ఠపరితలము క్రమ దశలలో రూపొందినపుడు ప్రప్రథమముగ వెలసిన పురాణ భూభాగమునకు చెందినదని శాస్త్రజ్ఞుల అభిప్రాయము. బేతంచర్లకు సమీపమున కుందు నది లోయలో బిల్లసుర్గం వద్ద త్రవ్వకములనుండి వెలువడిన అవశేషములు ఈ వాదమును బలపరచు చున్నవి. అందు అనేక విధములగు జంతువుల శిథిలాస్థులే కాక, ఆనాటి మానవుడు ఉపయోగించిన ఎముక పనిముట్లు విరివిగ లభించినవి. కొలదిగ రాతి పనిముట్లు కూడ లభించినవి. అందలి జంతువుల శిథిలాస్థులను పరిశీలించి చూడ ఆనాటి ప్రాంతమున ఖడ్గమృగములు కూడ వసించుచుండె నని తెలియుచున్నది. ఇవి అన్నియు పురాణ శిలాయుగపు పూర్వభాగమునకుగాని, మధ్య భాగమునకుగాని చెందియుండు నని చరిత్రకారు లభిప్రాయ పడిరి. నూతన శిలాయుగమునకు చెందిన పరికరములు అనేకములు గిద్దలూరు గ్రామ సమీపమున లభ్యములైనవి. తరువాత ఇనుపయుగమునకు చెందిన మట్టి శవ పేటికలు ఈ జిల్లాలో కొన్నిచోట్ల లభించుచున్నవి.

అశోకుని పరిపాలనతో, తెలియవచ్చునంత దనుక, ఈ జిల్లా విషయమున చారిత్రక యుగము ప్రారంభమగుచున్నది. అశోకుని శాసనములందు అతని ప్రతినిధికి రాజధానిగ ప్రస్తావింపబడిన సువర్ణగిరి ఈ జిల్లాలోనిదే యని కొందరు ఐతిహాసికుల అభిప్రాయము. ఈ జిల్లాలోని రాజుల మందగిరి, యర్రగుడులలోని అశోకుని శాసనముల ననుసరించి చూడ ఆనాడీ ప్రాంతము జనావాసముగ ఖ్యాతి పొందియే యుండునని విశ్వసింప వీలగుచున్నది. సాతవాహనుల కాలమునను ఈ ప్రాంతము కొంత ప్రశస్తిని ఆర్జించి ఉండుననుటకు మేకాదోని శాసనము ప్రబలాధారముగ ఉన్నది. ఈ శాసనము పల్లవుల కాలము నాటిదే అయినను, ఆదోని పరిసర భూమికి శాతాహానిరాఠమను పేరు కల దను విషయ మిందువలన స్పష్ట మగుచున్నది. ఇదియేకాక, సాతానికోట మొదలగు

స్థలములును కొన్ని కనబడుటచే వీనికిని సాతవాహనులకును గల సంబంధమెట్టిదో స్పష్టముగ నిర్ణయింప బడక పోయినను, ఆ యుగమున ఈ ప్రాంతము కొంత ప్రాముఖ్యమును ఆర్జించెనని మాత్రము చెప్పవీలగుచున్నది. గౌతమీ పుత్ర శాతకర్ణి శాసనమున పేర్కొనబడిన శ్రీ స్థానము, ఈ జిల్లాయందలి శ్రీశైలమే యగునని ఒక ఐతిహాసికుడు అనెను; అది ఇంకను పరిశోధింప వలసిన విషయము.

సాతవాహన సామ్రాజ్య మంతరించిన పిదప ఈ జిల్లా యందలి తూర్పు భాగము ఇక్ష్వాకుల పాలనమున కొంత కాలముండెను. క్రీ. శ. 290 ప్రాంతమున పల్లవ రాజులు ఇక్ష్వాకుల నోడించి ఈ ప్రాంతమును వశపరచుకొనిరి. త్రిలోచన పల్లవుడు (ముక్కంటికాడు వెట్టి) శ్రీశైల పర్వతమునకు ఆగ్నేయమున బలసియుండిన అడవిని కొట్టించి వాస యోగ్యము కావించి బ్రాహ్మణాగ్రహారములను నెలకొల్పెను. ఇంతలో చోళులు కరికాలచోళుని నాయకత్వమున విజృంభించి పల్లవుల నణచి ఈ ప్రాంతమును ఆక్రమించిరి.

చోళుల పరిపాలనలో ఈ ప్రాంతము కొలది కాలము మాత్రమే ఉండి తరువాత మరల క్రీ. శ. 7వ శతాబ్దిలో పల్లవుల వశమయ్యెను. కాని చోళవంశీయులు అనేకులు ఈ ప్రాంతమున స్థిరపడిపోయి పల్లవులకు సామంతులుగ ఇట ఆ కాలమున పాలించిరి. కాని ఇంతలో బాదామి చాళుక్యులు బలవంతులై పల్లవుల నోడించి ఈ ప్రాంతమును ఆక్రమించిరి. అయినను ఈ మండలము ఆ దినములలో సుస్థిరముగ ఒక రాజ్యమున నుండిన దనుటకన్న, పల్లవ బాదామి చాళుక్యుల పోరాటములలో బలవంతుని సొమ్ముగ చేతులు మారుచుండె నని చెప్పుటయే సముచితము. కడ కిది రాష్ట్రకూటులకు క్రీ. శ. 9వ శతాబ్దమున వశమై, వారి పరిపాలనలో కొంత కాలముండి తుదకు వారిని జయించిన కళ్యాణి చాళుక్యుల రాజ్యమున అంతర్భాగమయ్యెను. 12వ శతాబ్ది ద్వితీయార్ధమున కల్యాణి చాళుక్యుల వైభవము సన్నగిలినంతనే తెలుగుచోళ సామంతులు ఇట స్వతంత్రులైరి. వారిని జయించి కాకతీయ రుద్రదేవుడు శ్రీశైలము వరకు ఈ మండలమును ఆక్రమించెను. గణపతి దేవుని కాలమున కడమయు కాకతీయ రాజ్యాంతర్భాగ మయ్యెను.

కాకతీయ రాజ్యమస్తమించిన తరువాత ముస్లిములు ఈ మండలమును ఆక్రమించినను త్వరలో ఆర్వేటి సోమ దేవరాజు మొదలగు వారి నాయకత్వమున జరిగిన తిరుగుబాటు వలన ఈ ప్రాంతము విముక్త మయ్యెను. అంతట జిల్లా యందలి పశ్చిమభాగము విజయనగర రాజ్యమునను, శ్రీశైలము మొదలుకొని తూర్పున గల రాజ్యము రెడ్డి రాజుల అధీనమునను చేరెను. శ్రీశైల క్షేత్రమున రెడ్డి రాజులెన్నో వసతులను కల్పించిరి. అనవేమారెడ్డి 1378లో శ్రీశైలమును దర్శించి వీర శిరోమంటపమును కట్టించెను. క్రీ. శ. 1414 ప్రాంతమున రెడ్డి రాజ్య మంతరించి, ఈ జిల్లా యందలి తూర్పు భాగము సైతము విజయనగర రాజ్యమున కలిసెను. రక్కసి తంగడి యుద్ధమున విజయనగర సైన్య మోటమి చెందిన అనంతరమున ఆ సామ్రాజ్యము పటిష్ఠతను కోలుపోవుటచే ముస్లిము సేనలు యథేచ్ఛగ ఈ ప్రాంతమును కొల్లగొట్ట సాగినవి. మరల వెంకటపతి రాయని కాలమున ఈ ప్రాంతము విజయనగర రాజ్యమున చేర గలిగెను. కాని 1644 ప్రాంతమున గోల్కొండ ప్రభువు ఈ జిల్లాలోని తూర్పు భాగమును, బీజపూర్ రాజు ఇందలి పడమటి భాగమును వశపరచుకొనిరి. క్రీ. శ. 1687 నాటికి గోల్కొండ, బీజపూర్ రెండును అంతరించి ఈ ప్రాంత మంతయు మొగలాయీ రాజ్యమున అంతర్భాగ మయ్యెను. మొగలులచే ఈ ప్రాంత మంతయు జాగీరుగ పఠాను దావూద్ ఖాను అను వానికి ఈయబడెను. ఇతని సోదరుడగు ఇబ్రహిమ్‌ఖానుని వంశీయులే కర్నూలు నవాబులు (చూ. పుట 747). మొదట సామ్రాజ్యమునకు ప్రతినిధులుగ వచ్చిన అసఫ్‌జాహీ నిజాముల ఆధిపత్యమునకు లోనై ఈ కర్నూలు నవాబులు జాగీర్దారులుగ కర్నూలు మండలమును పాలించిరి. కాని కర్నూలు మండలముపై మైసూరు పాలకుడగు హైదరాలీ 1775లో దండెత్తి వచ్చినప్పుడు నైజాము దానిని రక్షింప జాలక పోయెను. అప్పటి కర్నూలు నవాబు హైదరాలీకి కొంత ధనమిచ్చి సాగనంపెను. తుదకు 1799 లో టిప్పుసుల్తాను మరణానంతరము జరిగిన రాజ్య విభజనలో తక్కిన కొన్ని ప్రాంతములతో సహా కర్నూలు మండలము నైజాము వంతునకు వచ్చెను. కాని ఆంగ్లేయుల కతడు 1800 లో దత్త మొనర్చిన భూభాగమున ఇది చేరెను. 1839లో కర్నూలు జాగీరును రద్దుచేసి బ్రిటిషువారు ఈ ప్రాంతమున తమ పరిపాలనను స్థాపించిరి. తొలుత పాళెగారులు తిరుగుబాటులు చేసినను, వారిని నిర్దాక్షిణ్యముగ అణచి, అచట సక్రమ పరిపాలనా వ్యవస్థను స్థాపించిన బ్రిటిష్ అధికారి సర్ థామస్ మన్రో ప్రోత్సాహమునకు ఫలితముగ ఈ జిల్లాయందు అంతటను రైతువారీ భూస్వామ్య వ్యవస్థ ఏర్పరుపబడినది.

బ్రిటిష్ పరిపాలనాకాలమున బనగానపల్లె అనబడుచున్న సంస్థాన మొకటి ఇచట ఉండెడిది. కాని స్వాతంత్ర్యానంతరము (1947) ఆ సంస్థానము తక్కిన జిల్లాలో కలిపి వేయబడి పాలకునకు పరిహార మీయబడినది. చి. శే. రా.

# మహబూబునగరము జిల్లా

ఉనికి - విస్తీర్ణము : ఈ జిల్లా ఉ. అక్షాంశము 15° 55′ నుండి 17° 20′ వరకును, తూర్పు రేఖాంశము 77° నుండి 79° 12′ వరకును విస్తరించి ఉన్నది. తొలుత నుండియు అతి విస్తృతముగ ఉన్న ఈ జిల్లాకు రాష్ట్ర పునర్వ్యవస్థీకరణము (1956) సందర్భమున రాయచూరు జిల్లాలోని గద్వాల, అలంపురము తాలూకాలు అదనముగ కలుపబడినవి. ఈ జిల్లాకు ఉత్తరము హైదరాబాదు, నల్గొండ జిల్లాలు; తూర్పు నల్గొండ, గుంటూరు జిల్లాలు; దక్షిణము ఈ జిల్లాకును కర్నూలు జిల్లాకును మధ్య ప్రవహించు కృష్ణానదియును; పడమర మైసూరు రాష్ట్రము కలవు. ఈ జిల్లా యందు మహబూబునగరము, కల్వకుర్తి, షాద్‌నగరు, నాగర్ కర్నూలు, అచ్చంపేట, కొల్హాపూరు, కొడంగల్, ఆత్మకూరు; మఖ్తల్, అలంపురము, గద్వాల, వనపర్తి అను 12 తాలూకాలు ఉన్నవి. జిల్లా మొత్తము విస్తీర్ణము 6,833 చ. మైళ్ళు.

నైసర్గిక స్వరూపము : జిల్లా భూమ్యుపరిభాగము ఉత్తరము, పడమర ఎత్తుగ ఉన్నది. వాయవ్య దిశనుండి ఆగ్నేయ దిశకు క్రమముగ భూమి దిగుచున్నది. జిల్లా ఆగ్నేయ భాగమున ఉత్తరము నుండి దక్షిణమునకు వ్యాపించిన ఒక గుట్టల వరుస కలదు. ఈ గుట్టలు ఒక దానిపై ఇంకొకటి ఉన్నట్లుగ ఉండును. గుట్టల పై భాగము విశాలమగు పీఠభూమిగ ఉన్నది.

నదులు : ఈ జిల్లా పశ్చిమ దిశయందు దక్షిణమున కృష్ణా, భీమా నదులు ప్రవహించు చున్నవి. దిండి నది కల్వకుర్తి, అచ్చంపేట తాలూకాలలో ప్రవహించి, చంద్రగిరికి తూర్పున 18 మైళ్ళలో కృష్ణానది యందు కలియును.

శీతోష్ణస్థితి : జిల్లా పశ్చిమ భాగమునందు వేసవికాలము ఎండ, చలికాలము చలి ఎక్కువ. తక్కిన ప్రాంతము సమశీతోష్ణముగ ఉండును. సంవత్సరము మొత్తము మీద అత్యధిక ఉష్ణోగ్రత 91° ఫా., అత్యల్ప ఉష్ణోగ్రత 74° ఫా.

వర్షపాతము : ఈశాన్య, నైరృతి ఋతు పవనముల వలన ఇచ్చట వర్షము కురియుచున్నది. ఐనను మూడింట రెండు వంతుల వర్షము నైరృతి ఋతుపవనముల వలన మాత్రమే లభించుచున్నది. సంవత్సరమున సగటు వర్షపాతము 28.4″.

అడవులు : ఈ జిల్లా యందు అరణ్య ప్రాంతము విస్తారముగ కలదు. అడవుల మొత్తము విస్తీర్ణము 7,85,929 ఎకరములు. ఈ అడవులయందు సాల, తుమికి, నల్లమద్ది, ఇప్ప, టేకు, తుమ్మ, మామిడి, చింత, వెదురు వృక్షజాతులు కలవు. వంటచెరకు సమృద్ధిగ లభించును. అమరాబాదు, కొయ్యలకొండలలోని అరణ్యములు శ్రేష్ఠములైనవి. అచటి వృక్షములు మంచి పరిమాణములను కలిగి ఉన్నవి.

ఖనిజములు : మంచి రకపు శిలలకు ఈ జిల్లా పేరు పొందినది. అమరాబాదు (అచ్చంపేట తాలూకా)లో కురువింద శిలను పోలు దృఢమైన శిల దొరకును; దీనిని ఖల్వములు చేయుటకు వినియోగింతురు. కృష్ణానది అమరాబాదు పీఠభూమిలో ఉన్న కొండలను చీల్చిన ప్రాంతము 100 మైళ్ళు పొడవు గల లోయగా తయారైనది. ఈ లోయలో పెక్కు పొరల రాళ్ళు ఉన్నవి. వీటికి దిగువన నదీగర్భములో మణులను త్రవ్వెడు ప్రదేశములు ఉన్నవి.

పట్టణములు : మహబూబునగరము, గద్వాల, నారాయణపేట అనువానికిమాత్రమే మునిసిపాలిటీలు కలవు.

మహబూబునగరము : జనసంఖ్య 35,586; జిల్లా కేంద్రము.

గద్వాల : జనసంఖ్య 16,390; తాలూకా కేంద్రము.

నారాయణపేట : జనసంఖ్య 20,515.

ప్రజలు : ఈ జిల్లా జనసంఖ్య* 15,90,689. ఇందు పురుషులు 7,94,054; స్త్రీలు 7,96,635. జనసాంద్రత చ. మైలు నకు 233.

1951 - 61 మధ్య పది ఏండ్లలో ఈ జిల్లా యందలి జనసంఖ్య 9.92% వృద్ధి అయినది. జనాభా లెక్కల కాలమున కూలి జనము ఎక్కువగ ఈ జిల్లా నుండి రాయచూరు, కర్నూలు జిల్లాలకు పంట నూర్పిళ్ళ అదనున కూలికై పోయి ఉండుట వలన లెక్కలలో ఇంత తక్కువ అభివృద్ధి కనబడుటకు కారణ మని సాధికారిక నివేదిక తెలుపు చున్నది.

మతములు : హిందువులు 92%; ముస్లిములు 7.3%; కలరు. అచ్చంపేట తాలూకా నల్లమల గుట్టల యందు చెంచులు అను కొండజాతి సంఖ్య ఎక్కువ.

వృత్తులు : ఈ జిల్లాలో వ్యవసాయమే ముఖ్య వృత్తి. వ్యవసాయ ఆదాయము మీద ఆధారపడి ఉన్న వివిధ వర్గములకు చెందిన వారి సంఖ్య 10,22,548; ఉత్పత్తికర పరిశ్రమల వలన జీవించు వారి సంఖ్య 2,21,462; వాణిజ్యము వలన జీవించు వారు 64,242; తక్కిన వారందరును వివిధ వృత్తుల వలన జీవించుచున్నారు (1951).

భాషలు : జిల్లాలోని అత్యధిక సంఖ్యాకుల మాతృభాష తెలుగు; దాదాపు 91% తెలుగును, 7% ఉర్దును

---

* 1961 వ సంవత్సరపు జనాభా లెక్కల ప్రకారము.

## మహబూబునగరము జిల్లా - తాలూకా వివరములు

| వరుస సంఖ్య | తాలూకా పేరు | తాలూకా కేంద్రము | గ్రామముల సంఖ్య (1951) | గ్రామీణ జనాభా (1951) | పట్టణములు (1951) | పట్టణ జనాభా (1951) | విస్తీర్ణము (చదరపు మైళ్ళలో) (1951) | మొత్తము నీటి పారుదల వసతి గల నేల విస్తీర్ణం (ఎకరములలో) (1959) | సాగుచేయబడిన నేల (ఎ॥ములలో) (1959) | ప్రస్తుతము సాగులోలేని బీడు నేల (ఎ॥ములలో) (1959) | మొత్తము సాగుకు తగిన నేల (ఎ॥ములలో) (1959) | సాగుచేయ వీలగు బంజరునేల (ఎ॥లలో) (1959) |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. | అచ్చంపేట | అచ్చంపేట | 88 | 68,481 | 1 | 8,188 | 1,126 | 8,478 | 1,15,686 | 69,157 | 1,84,798 | 5,496 |
| 2. | అలంపురము | అలంపురము | 98 | 75,541 | 1 | 6,789 | 435 | 3,518 | 2,21,404 | 15,729 | 2,37,148 | 4,246 |
| 3. | ఆత్మకూరు | ఆత్మకూరు | 118 | 94,448 | 1 | 8,887 | 447 | 20,284 | 1,71,400 | 42,899 | 2,14,299 | 5,442 |
| 4. | గద్వాల | గద్వాల | 96 | 94,269 | 2 | 22,748 | 518 | 17,576 | 2,60,789 | 5,366 | 2,66,105 | 5,966 |
| 5. | కల్వకుర్తి | కల్వకుర్తి | 148 | 1,40,522 | 2 | 11,687 | 785 | 17,251 | 2,56,307 | 1,28,260 | 3,84,567 | 25,952 |
| 6. | కొడంగల్ | కొడంగల్ | 152 | 1,35,870 | 2 | 15,624 | 461 | 26,258 | 1,83,602 | 72,507 | 2,56,109 | 7,665 |
| 7. | కొల్హాపూరు | కొల్హాపూరు | 107 | 95,592 | 1 | 6,167 | 661 | 12,957 | 1,70,038 | 84,915 | 2,54,953 | 10,499 |
| 8. | మహబూబునగరము | మహబూబు నగరము | 130 | 1,22,329 | 2 | 30,422 | 460 | 24,557 | 1,30,287 | 67,993 | 1,98,280 | 3,592 |
| 9. | మక్తల్ | మక్తల్ | 118 | 1,01,188 | 3 | 33,586 | 532 | 18,013 | 2,17,623 | 29,433 | 2,47,056 | 9,651 |
| 10. | నాగర్ కర్నూలు | నాగర్ కర్నూలు | 130 | 1,82,450 | 1 | 4,927 | 561 | 21,864 | 2,14,778 | 83,636 | 2,98,414 | 8,089 |
| 11. | షాద్‌నగరు | షాద్‌నగరు | 131 | 1,10,500 | 1 | 7,233 | 459 | 18,297 | 1,42,092 | 82,885 | 2,24,427 | 6,162 |
| 12. | వనపర్తి | వనపర్తి | 139 | 1,11,539 | 1 | 9,957 | 536 | 34,806 | 1,69,087 | 66,284 | 2,35,321 | 5,455 |
| | | మొత్తము | 1,435 | 12,82,719 | 18 | 1,56,160 | 6,981 | 2,23,804 | 22,52,993 | 7,48,474 | 30,01,467 | 88,185 |

మాతృభాషలుగా కలిగి యున్నారు. లంబాడీ, కన్నడము, మరాఠి, ఎరుకల, తమిళము మొదలగు భాషలు మాట్లాడు వారందరు అత్యల్ప సంఖ్యాకులు (2%).

వ్యవసాయము: జిల్లా మొత్తముమీద సాగునకు తగిన భూమి 33,89,072 ఎకరములు; ఇందు ప్రస్తుతము సాగున ఉన్న భూమి 24,95,961 ఎకరములు; సాగనుభూమిలో నీటి పారుదల వసతికల భూమి 2,30,672 ఎకరములు.

మహబూబునగరము, అలంపురము, గద్వాల ప్రాంతములు రేగడ నేలలు; మక్తలు, నాగర్ కర్నూలు ప్రాంతములు గరప నేలలు; అచ్చంపేట తాలూకా నేలలు శిలా సంబంధములైనను వృక్ష సంబంధ మగు సేంద్రియ పదార్థములతో ఎక్కువగ మిశ్రితములై ఉండును. జలాధార వసతులలో పేర్కొనదగినవి కోయిలసాగరు, సరళా సాగరు, ఇందు ఎక్కువ ప్రయోజనకారి కోయిలసాగరు. దీనిక్రింద దాదాపు పదివేల ఎకరముల పల్లపు సాగు జరుగుచున్నది. మాగాణి సాగునకు ముఖ్యాధారములు పంట చెరువులు. బావుల క్రిందకూడ దాదాపు 50 వేల ఎకరముల నేల సాగగుచున్నది.

ఇచట పండింపబడు వానిలో జొన్న, వరి, సజ్జ ముఖ్య ఆహార ధాన్యములు, వేరుశనగ, ఆముదము ముఖ్య వాణిజ్య పంటలు.

మహబూబునగరము జిల్లా - పంటల వివరములు
1955 - 56

| | | | |
|---|---|---|---|
| వరి | 2,64,656 ఎ. | ధనియాలు | 2,988 ఎ. |
| గోధుమ | 5,559 ,, | పండ్లు, కూరలు, దుంపలు | 6,335 ,, |
| జొన్న | 7,06,760 ,, | ప్రత్తి | 5,210 ,, |
| సజ్జ | 1,24,141 ,, | జనుము | 646 ,, |
| బార్లీ | 787 ,, | వేరుశనగ | 4,71,370 ,, |
| రాగి | 92,959 ,, | నువ్వులు | 17,197 ,, |
| కొర్ర | 65,482 ,, | కుసుమ | 20,000 ,, |
| వరిగ | 1,43,794 ,, | అవిసె | 2,108 ,, |
| సామ | 29,212 ,, | ఆముదము | 2,22,703 ,, |
| శనగ | 18,864 ,, | పొగాకు | 4,509 ,, |
| పెసర | 12,142 ,, | పశుగ్రాసము | 2,409 ,, |
| కంది | 36,171 ,, | పై లెక్కలలో చేరని పైరులు | 32,037 ,, |
| మినుము | 4,979 ,, | | |
| ఉలవ | 1,53,428 ,, | | |
| మిరప | 41,621 ,, | | |

ఇచటనుండి ఎగుమతి అగువానిలో ముఖ్యములైనవి ఆహార ధాన్యములు, ప్రత్తి, ఆముదములు.

పశు సంపద: ఈ జిల్లాయందు పేర్కొనదగిన పశుజాతి ఏదియును లేదు. అచ్చంపేట తాలూకా యందలి ఎద్దులు పరిమాణమున చిన్నవి యైనను అందమునందును, నడక వేగమునందును కొంత ప్రశస్తమైనవి. రాష్ట్రములోని తక్కిన ప్రాంతములవారు సైతము ఈ ఎద్దులను ఇచట నుండి కొనుగోలు చేసికొని పోవుచుందురు. గొర్రెలు, మేకలు విశేషముగ ఉన్నవి.

గృహ పరిశ్రమలు: ఈ జిల్లాయందలి అన్ని ప్రాంతములందును చేనేత పరిశ్రమ ముఖ్యమైనది. గొంగళ్ళ నేత కూడ కొన్ని ప్రాంతములందు వికివిగ సాగుచున్నది. నారాయణపేట పట్టు చీరెలు దూర ప్రాంతములకు కూడ ఎగుమతి అగుచున్నవి.

రోడ్లు: ఈ జిల్లాలో ఉత్తరపు కొననుండి దక్షిణపు కొనవరకు, పూర్వు కొననుండి పడమటి కొనవరకు రోడ్డు కలవు. ఈ రెండు మార్గములు జిల్లాకు మధ్య భాగమునందున్న జడచర్లలో కలియుచున్నవి. ఈ ముఖ్య మార్గముల నుండి బయలుదేరిన శాఖా మార్గములు జిల్లాలోని మారుమూలలకు పోవుచున్నవి. జిల్లా మొత్తమున రోడ్ల నిడివి 779 మైళ్ళు; వీనిలో రాష్ట్ర రహదారులకు చెందినవి 700 మైళ్ళు. తక్కినవి వివిధ స్థానిక సంస్థల అధీనమున కలవు.

రైలు మార్గములు: సికింద్రాబాదునుండి కర్నూలునకు పోవు మీటర్ గేజ్ రైలుదారి ఈ జిల్లాలో ఉత్తరమున నుండి దక్షిణమునకు పోవుచున్నది; జడచెర్ల, మహబూబునగరము అనునవి ముఖ్యమైన స్టేషనులు.

విద్య: 1961 లెక్కలను అనుసరించి ఈ జిల్లాయందు అక్షరాస్యత 13·2%; పురుషులలో 21·39%, స్త్రీలలో 5.28%. జిల్లా మొత్తమున అక్షరాస్యుల సంఖ్య 97,382 (1951). తెలుగు భాషను పోషించుటయందు గద్వాల, వనపర్తి సంస్థానములు పూర్వమునుండియు పేరుగాంచి యుండినవి. ఉన్నత విద్యా సంస్థలు ఇదివరలో లేకున్నను ఇప్పుడిప్పుడు అచ్చటచ్చట స్థాపింప బడుచున్నవి. మొత్తముమీద పల్లెపట్టులందు విద్యా వ్యాప్తి చాల తక్కువ.

జిల్లా మొత్తముమీద ఉన్న వివిధ వర్గముల విద్యాశాలల సంఖ్యా వివరములు దిగువ ఈయబడినవి (1956-57).

| విద్యా సంస్థల వివరము | సంఖ్య | ఉపాధ్యాయ సంఖ్య | విద్యార్థి సంఖ్య |
|---|---|---|---|
| ప్రాథమిక పాఠశాలలు | 1,116 | 2,350 | 73,165 |
| మాధ్యమిక పాఠశాలలు | 20 | 405 | 7,899 |
| ఉన్నత పాఠశాలలు | 7 | 176 | 4,562 |
| ప్రత్యేక వృత్తిబోధక పాఠశాలలు | 6 | 24 | 697 |
| మొత్తము | 1,149 | 2,955 | 86,323 |

ఇవి కాక, గద్వాలలో ఒక కళాశాల 1959 లో స్థాపింపబడినది. వనపర్తిలో ఇంజనీరింగ్ పాలిటెక్నిక్ సంస్థ కలదు.

**ఆరోగ్యము, వైద్యము:** జిల్లాయందలి పశ్చిమ భాగములు ఆరోగ్యకరములుగ ఉన్నవి. తూర్పు భాగము అంతగ ఆరోగ్యవంతము కాదు. అచ్చంపేట తాలూకా యందు మలేరియా ఎక్కువగ వ్యాప్తియందున్నది. వైద్య వసతులు పల్లెలందు చాల తక్కువ. దేశీయ వైద్యశాలలు కొన్ని ప్రాంతములందు పని చేయుచున్నవి. జిల్లా మొత్తము మీద ఆధునిక వైద్య విధానమును అనుసరించు జనరల్ ఆసుపత్రులు 18, డిస్పెన్సరీలు 3 పని చేయుచున్నవి. వీనిలో పడకల సంఖ్య 323. ఇవి కాక జిల్లాలో యూనానీ చికిత్సా శాలలు 4, ఆయుర్వేద వైద్యశాలలు 5 కలవు. ఆ. వీ. రా.

**చూడదగిన స్థలములు:** ఈ జిల్లాలోని కొయ్యలకొండ, పానుగల్లు చారిత్రక ప్రశస్తిని కాంచినవి. కొయ్యల కొండను కులీ కుతుబ్‌షాహి సాధించిన విషయమును, అద్దంకి గంగాధరకవి తన 'తపతీ సంవరణోపాఖ్యానము'లో తెలిపెను. ఆంధ్ర రాజుల కాలము నుండియు ఈ కోయిల కొండకు ప్రాధాన్యము ఉన్నటుల కన్పట్టుచున్నది. ఆంధ్ర సార్వభౌముల నాణెములు ఇచట ముద్రింప బడినటుల భావించుటకు ఇచట కనబడు ఒక టంకశాల అవశేషములు తావొసగుచున్నవి. ఇబ్రహీం కుతుబ్‌షాహి కాలమున ఇచటి కోట పునర్నిర్మితమైనది. అదియు, అందలి భవనములును ఇపుడు శిథిలావస్థలో ఉన్నవి.

పానుగల్లు నాగర్‌కర్నూలు తాలూకాలో ఉన్నది. సముద్ర మట్టమునకు 1800′ ఎత్తున ఉన్న ప్రదేశమున ఈ కోట నిర్మింప బడినది. కోట పొడవు 1½ మైలు, వెడల్పు 1 మైలు. దీనికి ఏడు ప్రాకారములును, మధ్య యందు బాలాహిస్సారును కలవు. విజయ నగర రాజ్యమునకును బహ్మనీ రాజులకు మధ్య ఇచట 1513లో యుద్ధము జరిగెను. 1418 లో బహ్మనీ రాజగు ఫిరోజ్ షాహను ఓరుగల్లు, విజయనగర సైన్యములు ఇచటనే ఓడించినవి.

అచ్చంపేట తాలూకాలో ప్రతాపరుద్రకోట అను పేరుతో ఒకకోట కలదు. అమరాబాదుకు 32 మైళ్ళ దూరమున చంద్రగుప్తుని కోట అను పురాతన శిథిలములు కలవు.

ఈ జిల్లాలోని పుణ్య క్షేత్రములలో అలంపురము, ఉమామహేశ్వరము పేర్కొన దగినవి.

**అలంపురము:** శ్రీశైలమునకు పశ్చిమ ద్వారమని పేరు గాంచిన ఈ క్షేత్రము జిల్లాలో దక్షిణ భాగమున తుంగభద్రానదీ తీరమున ఉన్నది. ఇచ్చట తుంగభద్ర ఉత్తర వాహిని అగుటచే గొప్ప పుణ్య-తీర్థముగ భావింపబడి, దక్షిణ కాశి అను పేరు పొందినది. ఇచట తుంగభద్రానదీ తీరమున దేవద్రోణి అను స్థలమున ఉన్న క్రీ. శ. 704 నాటి విజయాదిత్యుని శాసనమువలన ఈ స్థలమునకు పురాతన కాలము నుండియు ప్రాముఖ్యము ఉండెనని స్పష్టమగుచున్నది. ఎల్లోరా వాస్తు రీతికిని ఈ దేవాలయ వాస్తు రీతికిని గల సన్నిహిత సంబంధమును బట్టి ఇచ్చట దేవాలయ నిర్మాణము ఆ విజయాదిత్యుని కాలమునందే ప్రారంభింప బడెననుటకు ఎక్కువ అవకాశము కలదు.

ఇచ్చట ఈశ్వరుడు ప్రధాన దైవమైనను ఇచటి నవ బ్రహ్మాలయములలో బ్రహ్మకు ఒక ప్రాధాన్యము ఏర్పడినది. ఈ నవ బ్రహ్మాలయముల పేర్లు కూడ ఏ సంప్రదాయమును అనుసరించి ఏర్పడినవో తెలియదు: బాలబ్రహ్మ, గరుడబ్రహ్మ, స్వర్గబ్రహ్మ, పద్మబ్రహ్మ, తారకబ్రహ్మ, అర్కబ్రహ్మ, కుమారబ్రహ్మ, వీరబ్రహ్మ, విశ్వబ్రహ్మ అను ఈ నవ బ్రహ్మల పేరులు ఏ పురాణమునందును, ప్రాచీన గ్రంథములందును కానరావు. ఈ నవ బ్రహ్మాలయములలో బాలబ్రహ్మాలయమునకు మాత్రమే ఎక్కువ ప్రాధాన్యము ఏల కలిగెనో తెలియదు. ఈ బాల బ్రహ్మేశ్వరునకు జోగుళాంబ ఏ విధముగ శక్తి ఆయెనో నిర్ణయించుటకు వీలు కాదు. జోగుళాంబ అను పేరు జోగేశ్వరి, అంబాజోగేశ్వరి అను నామములతో మహారాష్ట్ర ప్రాంతమునందు కల దేవతా మూర్తికి నామాంతర మని తోచుచున్నది.

ఇది శైవ క్షేత్రమే కాక ఇచట సుప్రసిద్ధమైన నరసింహస్వామి దేవాలయము కూడ ఉన్నందున వైష్ణవులకును యాత్రా స్థలమై ఉన్నది. ప్రతి సంవత్సరము మహా శివరాత్రి ఉత్సవ సందర్భములో వేల కొలది యాత్రికులు స్వామిని సేవింతురు.

అలంపురమున దొరకిన శిల్పములలో నకులీశ, లకులీశ, లకులేశ నామములతో పరగు శైవమూర్తి ఒకటి కలదు. ఇది పశుపత మత స్థాపకుడగు లకులేశుని విగ్రహమని కొందరు భావించుచున్నారు.

ఇచట అసమాన వాస్తు శిల్ప వైభవమును బట్టి ఇది ఒక మహత్తర కళా కేంద్రముగ పరిగణింప బడి, పురాతన వస్తు పరిశోధన శాఖవారిచే ఇచట ఒక వస్తు ప్రదర్శన శాల ఏర్పాటు చేయబడినది.

ఇది పూర్వము శైవులకు, బౌద్ధులకు కూడ విహారస్థానమైనటుల ఇచట తన్మతాలయములను బట్టి తెలియును. దీనికి భాస్కర క్షేత్ర మనియు నామాంతరము కలదు.

**ఉమామహేశ్వరము:** అచ్చంపేటకు ఆరుమైళ్ళ దూరమున ఉన్న రంగాపురమునకు సమీపమున ఒక చిన్న గుట్టపై ఈ ఉమామహేశ్వర దేవాలయము ఉన్నది. ఈ దివ్య క్షేత్రము శ్రీశైలమునకు ఉత్తర ద్వారమని ప్రసిద్ధిని పొంది ఉన్నది.

నేడు ఉమామహేశ్వరమున కాన్పించు దేవాలయము బహుశః మధ్య యుగము నాటి కల్యాణీ చాళుక్య వంశజుల పరిపాలన యందు నిర్మింప బడెనేమో అనుటకు ఎక్కువ ఆధారమున్నను ఈ ప్రదేశమున కనిపించు కొన్ని శిల్ప శకలములను బట్టియు, భూగర్భమున దాగియుండి అప్పుడప్పుడు బయట పడు కుండపెంకులు, ఇటుకలు మున్నగు పురాతన వస్తు సామాగ్రిని బట్టియు, ఈ ప్రాంతము బహుశః క్రీ.శ. ఏడవ శతాబ్ది నాటికే హిందూ క్షేత్రముగ పరిణామ మందెనని చెప్ప వచ్చును. ఇచట కనిపించు శాసనములలో ఎల్ల పురాతనమైనది తెలుగు భాషలో ఉన్న 12వ శతాబ్దపు శాసనము. క. ల. శా.

జిల్లా సంక్షిప్త చరిత్ర : ప్రాచీనకాలములో మహబూబు నగరము జిల్లాకును, తత్పరిసరములకును "చోళవాడి" అని పేరుండెడిది. చోళుల కాలము క్రీ. శ. 480 లో ప్రారంభ మైనది. అనేక ఆంధ్రరాజ వంశములు అనాటి చరిత్రలో ఏ విధముగా దైనిక సంఘటనలకు లోనగుచు వచ్చెనో అదే విధముగా ఈ జిల్లాలోను పెక్కు మార్పులు సంభవించినవి. చివరకు ఓరుగల్లు రాజుల పాలనములో ఈభాగ ముండెను. తరువాత ఇది బహ్మనీ నవాబుల వశ మయ్యెను. బహ్మనీ వంశము పతనానంతరము ఇందలి కొంత భాగము కుతుబ్‌షాహీల రాజ్యములో చేరెను. మిగతభాగము బీజపూరు రాజ్యములోచేరెను. 1686లో ఔరంగజేబు చక్రవర్తి సికందర్ ఆదిల్‌షహను ఓడించిన తరువాత బీజపూరు రాజ్యము ఢిల్లీ సామ్రాజ్యములో కలిపి వేయబడెను. 1706లో కాంబఖు అను రాకుమారుడు బీజాపూరు, హైదరాబాదులకు సుబేదారుగా నియమితుడయ్యెను. పదునెనిమిదవ శతాబ్ద ప్రారంభములో హైదరాబాదు రాష్ట్రము స్థాపితము కాగా ఈ జిల్లా నిజాంసంస్థానములో విభాగమయ్యెను.

1512 మొదలు 1543 వరకు గోల్కొండ నేలిన కులీ కుతుబ్‌షాహ తూర్పు తెలుగు నాడంతయు నాక్రమించుకొనెను. ఈ కుతుబ్‌షాహ ఈ జిల్లాలోని పానగల్లు, కొయ్యలకొండ మొదలగు దుర్గము లనేకములను సాధించెను (1534). కొయ్యలకొండను సాధించిన విషయము అద్దంకి గంగాధర కవి తన 'తపతీ సంవరణోపాఖ్యానము'లో ఇట్లు వర్ణించియున్నాడు :

> "పడమటను సవాయి బసవనిగాజేసి
> యచట గొయ్యలకొండ నావరించె."

దీనినిబట్టి పూర్వకాలములో కొయ్యలకొండ ఆంధ్ర రాజుల రాజధానియై బలీయమగు దుర్గము కలదియై విలసిల్లె నని తోచుచున్నది. కొయ్యలకొండలో ఒక టంకసాల కూడ నెలకొని యుండె ననియు, అచ్చట ఆంధ్ర నాణెములు ముద్రితములగు చుండెననియు తెలియు చున్నది. కొయ్యలకొండ కోటను ఇబ్రహీమ్ కుతుబ్‌షా పునర్నిర్మాణము చేసెను. ఆ కోట అందలి భవనములు శిథిలావస్థలో నున్నవి.

పానుగల్లు గ్రామము సముద్రమట్టమునకు 1800′ ఎత్తున నున్నది. ఇచ్చటకోట ప్రసిద్ధమైనది. ఈ కోట పొడవు 1½ మైలు, వెడల్పు ఒక మైలు. దీనికి ఏడు ప్రాకారములు గలవు. మధ్యభాగమున బాలాహిస్సారు గలదు. ఈ కోట నాగర్ కర్నూలు తాలూకాలో నున్నది. 1417లో ఓరుగల్లు, విజయనగర రాజులు బహ్మనీ నవాబయిన ఫిరోజు షాహతో ఇచ్చట యుద్ధము చేసిరి. ఫిరోజుషాహ ఓడిపోయెను. 1513లో సుల్తాన్ కులీ కుతుబ్‌షాహ విజయనగరరాజును ఇచ్చటనే ఓడించెను. 1604లో రాజమాత ఈ కోటలో నివసించి యుండినట్లు ఇచ్చటి బాలాహిస్సారు మీది తెలుగు శాసనము తెలుపుచున్నది. అప్పుడు ఖిల్లేదారుగా ఖైరాత్‌ఖాను అను వాడుండెను. నవాబు నిజామలీఖాన్ బహాద్దరు నిజాము 1786 నుండి 1789 వరకు ఈ కోటలోని భవనములో నివసించియుండిరి.

అచ్చంపేట తాలూకాలో "ప్రతాపరుద్రకోట" అను పేరుతో ఒకకోట కలదు. అమరాబాదుకు 32 మైళ్ళలో కృష్ణానదీ తీరమున "చంద్రగుప్త" పురాతనపట్టణ శిథిలములు కలవు. అ. వీ. రా.

# హైదరాబాదు జిల్లా *

**ఉనికి - విస్తీర్ణము :** ఆంధ్ర ప్రదేశ్ పడమటి భాగమున సరిహద్దు నానుకొని ఉన్న ఈ జిల్లా ఉ. అక్షాంశము 17° మొదలు 17° 50′ వరకు, తూర్పు రేఖాంశము 77°30′ నుండి 79° 5′ వరకు విస్తరించి ఉన్నది.

* 1949 లో ఈజిల్లా మొదట ఏర్పరుపబడినది. అంతకు ముందు హైదరాబాదు నగరము ప్రత్యేక పరిపాలనాధికారమున ఉండెను. ఈ నగరము చుట్టు నుండు భాగము 'అత్రాఫ్ - ఇ - బల్దా' పట్టణ పరిసర ప్రాంతము) అను పేరుతో ఒక జిల్లాగ ఉండెను. నగరమునకు ఉత్తర భాగమందు 'బాగాల్' (తోట) అనబడు చిన్న జిల్లా ఉండెను. అత్రాఫ్-ఇ-బల్దా, బాగాల్ అను ఈ రెండు జిల్లాలును చాలవరకు నిజాము ప్రభువు స్వంత జాగీరు భూములు (క్రౌన్ ల్యాండ్స్) గా ఉండినవి. ఈ ప్రాంతము నంతను కలిపి

ఈ జిల్లాకు ఉత్తరము మెదకు జిల్లా; తూర్పు నల్గొండ జిల్లా; దక్షిణము మహబూబునగరము జిల్లా; పడమర మైసూరు రాష్ట్రము సరిహద్దులుగ ఉన్నవి. ఈ జిల్లాలో హైదరాబాదు తూర్పు, హైదరాబాదు పడమర, ఇబ్రహీమ్ పట్టణము, మేడిచలము (మేడిచల్), పర్గి, షహబాదు, తాండూరు, వికారాబాదు అను ఎనిమిది తాలూకాలు కలవు. జిల్లా మొత్తము విస్తీర్ణము 4,504 చ.మైళ్ళు.

నైసర్గిక స్వరూపము: ఈ జిల్లా అంతయును గుట్టల మయము. గుట్టల నిండ దట్టపు టడవులు కల రాచకొండ పర్వతశ్రేణి అంబరుపేట ప్రాంతములోని పిపలపాడునుండి ప్రారంభమై, ఆగ్నేయ దిశగ సాగిపోయి నల్గొండ జిల్లాలో ప్రవేశించును. అనంతగిరి గుట్టల వరుస మహబూబునగరము జిల్లాలో ప్రారంభమై ఈ జిల్లాయందలి తాండూరు, వికారాబాదు తాలూకాలలో వ్యాపించి ఉత్తరముగ సాగిపోవుచున్నది. విడివిడిగ నల్లరాళ్ళ గుట్టలు అంతటను కనబడుచుండును. ఇట్టి గుట్టల చేతనే హైదరాబాదు నగరము చుట్టుకొనబడి ఉన్నది. వీటిలో మౌలాలీ గోల్కొండ, తిరుమలగిరి లోని నల్లకొండ అనునవి ముఖ్యములు. ఈ జిల్లాయందలి నేల పరపు పడమటినుండి తూర్పునకును, ఆగ్నేయ దిశకును దిగుచున్నది.

నదులు: ఈ జిల్లాలో ముఖ్యమైనది మూసీ (ముచుకుండ) నది. ఇది అనంతగిరి గుట్టలలో శివారెడ్డిపేట దగ్గర జన్మించి, సరిగా తూర్పునకు సాగుచు హైదరాబాదు నగరము మధ్యగ ప్రవహించి నల్గొండ జిల్లాలో ప్రవేశించును. మంజీరానది హైదరాబాదు పడమర తాలూకాలోని రెండు గ్రామములను మాత్రమే తాకి ఈ జిల్లాను వీడును. శాకలవాణి (ఈసీ), హల్దీ (పసుపుశేరు) అనునవి చిన్న నదులు. శాకలవాణి అనునది మూసీకి ఉపనది; హల్దీ అనునది మంజీరకు ఉపనది.

శీతోష్ణస్థితి: ఈ జిల్లాలో సంవత్సరపు మొత్తమున అత్యధిక ఉష్ణోగ్రత 107.6° ఫా. అత్యల్ప ఉష్ణోగ్రత 48.20° ఫా.

వర్షపాతము: ఈ జిల్లాయందు సాంవత్సరిక సగటు వర్షపాతము 35.64"; దీనిలో నాల్గింట మూడు వంతుల వర్షము నైరృతి ఋతుపవనము వలన లభించు చున్నది.

అడవులు: ఈ జిల్లాలో షహబాదు తాలూకాలోను, గుట్టలయందును అడవులు కలవు. అరణ్యప్రాంత విస్తీర్ణము 1,70,049 ఎకరములు; అడవులయందు టేకు, తుమికి, నల్లమద్ది మొదలగు వృక్షజాతులు కలవు. వాసములకు, వంటచెరకునకు పనికివచ్చు సామాన్యపు కఱ్ఱ అన్ని అడవులందును కలదు.

పట్టణములు: జిల్లా ముఖ్యనగరమగు హైదరాబాదు ఆంధ్ర ప్రదేశ్‌నకు రాజధాని. ఇదివరలో హైదరాబాదు, సికిందరాబాదు నగరములకు వేర్వేరు కార్పొరేషనులు ఉండెడివి; కాని ఇపుడు రెండు నగరములకు ఒకే ఒక స్థానిక సంస్థ (కార్పొరేషను) ఏర్పాటు బడినది. తాండూరుకు మునిసిపాలిటీ కలదు.

హైదరాబాదు: జనసంఖ్య* 12,52,337; ఆంధ్ర ప్రదేశ్ రాజధాని. ఇండియాలో జనసంఖ్య అధికముగల నగరముల శ్రేణిలో ఐదవ స్థానమునాక్రమించినది.

సికిందరాబాదు: హైదరాబాదును చేరిఉన్న పట్టణము.

తాండూరు: జనసంఖ్య 16,741; తాలూకా కేంద్రము.

ప్రజలు: ఈ జిల్లాలో జనసంఖ్య† 20,63,601; పురుషులు 10,67,662; స్త్రీలు 9,95,939. జనసాంద్రత చ.మైలునకు 711. ఆంధ్రప్రదేశ్ మొత్తము మీద అత్యధిక జనసాంద్రత గలది ఈ జిల్లా. 1951-61 మధ్య ఈ జిల్లా జనసంఖ్య 13.25% వృద్ధియైనది.

మతములు: ఈ జిల్లా యందలి ప్రజలలో 62.6% హిందువులు, ముస్లిములు 34.6%, తక్కిన మతముల వారు 2.8% (1951). ఆ తరువాత జిల్లాలో మూడు తాలూకాలు అదనముగ చేరుటయే కాక హైదరాబాదు ఆంధ్ర ప్రదేశ్‌నకు రాజధాని అగుటలో కోస్తా, రాయలసీమ ప్రాంతముల వారును కొంతమంది అదనముగ చేరినందున ఈ నిష్పత్తి కొలదిగ మారి హిందువుల నిష్పత్తి కొంత హెచ్చి ఉండును.

వృత్తులు: ఈ జిల్లాలోని ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు హైదరాబాదు నగరమున వసించు చుండుటచే వ్యవసాయము ముఖ్య వృత్తిగ కల ప్రజలు తక్కువ. జిల్లాలో

ఆనాడు సర్ఫ్-ఎ-ఖాస్ (స్వంత భూమి) అను పేర వ్యవహరించెడివారు. ఈ ప్రాంతమునందలి పరిపాలనా వ్యవహార మంతయు నిజాము స్వయముగ చూచుకొనెడివాడు. ఆనాటి హైదరాబాదు ప్రభుత్వమునకు ఆ పరిపాలనా వ్యవహారమున ఎట్టి అధికారమును లేకుండెను.

1948లో జరిగిన పోలీసు చర్య తరువాత నిజాము ప్రభువు తనకు సర్ఫ్-ఎ-ఖాస్‌పై కల యావదధికారములను వదలుకొని ప్రభుత్వమునకు స్వాధీనమొనర్చెను. అంతట ఈ ప్రాంతమునకు మరికొన్ని పరిసర జిల్లాలలోని ప్రాంతములను హైదరాబాదు నగరమున చేర్చి అయిదు తాలూకాలతో హైదరాబాదు జిల్లాగా 1949లో రూపొందింప బడినది. తరువాత రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ (1956) సందర్భమున గుల్బర్గ జిల్లాలోని తాండూరు తాలూకా ఈ జిల్లాలో కలుప బడినది. పరిపాలనా సౌకర్యము కొరకై మెదకు జిల్లాలోని వికారాబాదును, మహబూబునగరము జిల్లాలోని పర్గి తాలూకాయును ఆ సమయముననే ఇందు చేర్పబడినవి.

* సికిందరాబాదు జనసంఖ్యకూడ కలిసినది.

† 1961 జనాభా లెక్కల ప్రకారము.


చిత్రము 1. గోల్కొండ దుర్గము, హైదరాబాదు


చిత్రము 2. చార్మినారు, హైదరాబాదు


చిత్రము 3. ఉస్మాన్ సాగరము, హైదరాబాదు


చిత్రము 4. అసెంబ్లీ భవనము, హైదరాబాదు

# హైదరాబాదు సుందర దృశ్యములు



చిత్రము 1. రాష్ట్రపతి నిలయము, హైదరాబాదు



చిత్రము 2. రాష్ట్ర కేంద్ర గ్రంథాలయము, హైదరాబాదు



చిత్రము 3. ఉస్మానియా ఆసుపత్రి, హైదరాబాదు



చిత్రము 4. మక్కా మసీదు, హైదరాబాదు

## హైదరాబాదు జిల్లా - తాలూకా వివరములు

| వరుస సంఖ్య | తాలూకా పేరు | తాలూకా కేంద్రము | గ్రామముల సంఖ్య (1951) | గ్రామీణ జనాభా (1951) | పట్టణములు (1951) | పట్టణ జనాభా | విస్తీర్ణము చ. మై॥లో (1951) | మొత్తము నీటి పారుదల వసతిగల నేల విస్తీర్ణము ఎ॥ములలో (1959) | సాగుచేయబడిన నేల ఎకరములలో (1959) | ప్రస్తుతము సాగులోలేని బీడు నేల ఎకరములలో (1959) | మొత్తము సాగుకు తగిన నేల ఎకరములలో (1959) | సాగుచేయ వీలగు బంజరు నేల ఎకరములలో (1959) |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. | హైదరాబాదు తూర్పు | హైదరాబాదు | 88 | 71,399 | 1 | 12,376 | 269 | 14,561 | 48,796 | 17,415 | 66,211 | 9,871 |
| 2. | హైదరాబాదు పడమర | | 81 | 49,119 | 14 | 11,17,741 | 277 | 13,365 | 33,888 | 18,993 | 52,881 | 5,650 |
| 3. | ఇబ్రహీం పట్నము | ఇబ్రహీం పట్నము | 117 | 97,439 | 1 | 6,636 | 525 | 15,743 | 1,42,067 | 38,465 | 1,80,532 | 10,705 |
| 4. | మేడిచలము | మేడిచలము | 92 | 67,226 | 4 | 11,620 | 307 | 21,970 | 52,308 | 10,513 | 62,821 | 5,816 |
| 5. | పర్గి | పర్గి | 141 | 97,935 | 1 | 4,523 | 390 | 13,266 | 1,22,881 | 29,969 | 1,52,850 | 6,846 |
| 6. | షహాబాదు | షహాబాదు | 107 | 70,951 | 1 | 6,824 | 342 | 14,761 | 1,14,598 | 49,298 | 1,63,896 | 2,453 |
| 7. | తాండూరు | తాండూరు | 122 | 66,810 | 2 | 18,604 | 371 | 7,825 | 1,41,395 | — | 1,41,395 | 8,806 |
| 8. | వికారాబాదు | వికారాబాదు | 184 | 1,15,952 | 1 | 6,874 | 506 | 7,882 | 1,75,533 | 22,657 | 1,98,190 | 16,954 |
| | | మొత్తము | 932 | 6,36,831 | 25 | 11,85,198 | 2,987 | 1,09,373 | 8,30,966 | 1,87,310 | 10,18,276 | 65,801 |

17.0% వ్యవసాయము వలనను; 16.1% వ్యాపారము వలనను, వ్యవసాయేతర ఉత్పత్తి వలన 19.0% ను, ఉద్యోగములలో 47.9% యును జీవించు చున్నటుల తెలియుచున్నది (1951). కాని 1961 నాటికి ఈ జిల్లా విస్తీర్ణము పెరుగుట వలనను, ప్రజలు వలస వచ్చుట వలనను ఈ నిష్పత్తి కొలదిగ ఉద్యోగ, వ్యాపార వృత్తుల వలన జీవించువారికి అనుకూలముగ మారి ఉండును.

భాషలు : ఈ జిల్లాలో 77 మాతృ భాషలు మాట్లాడు జనులు వసించుచున్నారు. ఇందు తెలుగు 53%, ; ఉర్దూ 35.1%, ; హిందీ 3.0%; తక్కిన 74 భాషలు మాటాడువారు 8.9%; ఆంధ్రేతరులలో తెలుగు తెలిసినవారు దాదాపు ఒక లక్ష మంది ఉన్నారు.

వ్యవసాయము : జిల్లా మొత్తము సేద్యమునకు తగిన భూమి 14,44,993 ఎకరములు ఇందు ప్రస్తుతము సాగగుచున్న భూమి 8,93,420 ఎకరములు. దీనియందు 1,37,370 ఎకరములకు మాత్రమే నీటి పారుదల వసతి కలదు.

ఈ జిల్లాలో మూసీ, ఈసీ నదులను అరికట్టి ఉస్మాన్ సాగరు, హిమాయత్‌సాగరు అను పేరులు కల రెండు గొప్ప సరస్సులు నిర్మాణములైనవి.

ఉస్మాన్ సాగరు : 1918 లో నిర్మాణము అయినది ; ఆనకట్ట పొడవు 4,160′ ; వరద తూములు 16 కలవు. ఇందు నిలువయున్న 320 కోట్ల ఘన అడుగుల నీటిలో కొంత భాగము హైదరాబాదు నగరమునకు త్రాగు నీరుగను, కొంత భాగము భూముల సాగునకును వినియోగింప బడుచున్నది.

హిమాయత్ సాగరు : నిర్మాణము 1926లో పూర్తి అయినది. ఆనకట్ట పొడవు 7,400′ ; వరద తూములు 17 కలవు ; దీని ఎత్తు నదీగర్భమునకు పైగా 93′ ఉన్నది. ఇందలి నీటియందు కొంత భాగము సేద్యమునకును, కొంత అనావృష్టి రక్షణకును ఉపయోగ పడుచున్నది.

పైన పేర్కొనబడిన సరస్సులే కాక హుస్సేన్ సాగరు, మీరాలం చెరువు, ఉందాసాగరు, ఇబ్రహీం పట్టణము తటాకము మొదలగు మరికొన్ని జలాశయముల వలనను సేద్యపు భూములకు నీటి పారుదల జరుగుచున్నది. ఇవియే కాక మూసీనది నుండి త్రవ్వబడిన అసిఫ్ నహరు అను పేరుగల 57 మైళ్ళ పొడవు గల కాలువయు, ఇంకను కొన్ని చిన్న తటాకములును నీటి పారుదలకు ఉపయోగపడుచున్నవి.

ఇచ్చట భూములలో చెలక భూములు ఎక్కువ. అచ్చటచ్చట కొలదిగ రేగడ భూములు కలవు. గుట్టల దరులు సారవంతములు. నీటి పారుదల కల ఎర్రనేలలు తోటలకు అనుకూలములు.

## హైదరాబాదు జిల్లా - పంటల వివరములు

1955 - 56

| | | | |
|---|---|---|---|
| వరి | 1,13,000 ఎ. | నిలవ చేయదగు ఫలజాతులు | 36 ఎ. |
| గోధుమ | 2,783 ,, | ఇతర ఫలజాతులు | 171 ,, |
| జొన్న | 2,28,821 ,, | బంగాళాదుంపలు | 197 ,, |
| సజ్జ | 23,869 ,, | ఉల్లి | 7,345 ,, |
| బార్లీ | 5,700 ,, | ఇతర దుంప పైరులు | 264 ,, |
| మొక్క జొన్న | 15,462 ,, | తక్కిన కూరల పైరులు | 10,159 ,, |
| రాగి | 22,120 ,, | పైలెక్కలలో చేరని ఆహార పైరులు | 2,184 ,, |
| కొఱ్ఱ | 22,249 ,, | ప్రత్తి | 7,539 ,, |
| వరిగ | 10,322 ,, | జనుము | 6,513 ,, |
| సామ | 22,423 ,, | వేరుశనగ | 19,936 ,, |
| ఇతర పొట్టు ధాన్యములు | 789 ,, | నువ్వులు | 20,724 ,, |
| శనగ | 37,535 ,, | తక్కిన ఖాద్య తైలముల పైరులు | 34,508 ,, |
| పెసర | 9,957 ,, | ఆముదములు | 86,561 ,, |
| కంది | 18,571 ,, | అవిసె | 8,670 ,, |
| మినుములు | 20,452 ,, | ఖాద్యములు కాని తక్కిన నూనె పైరులు | 8,079 ,, |
| ఉలవలు | 35,205 ,, | తమలపాకులు | 62 ,, |
| ఇతరపప్పు ధాన్యములు | 2,835 ,, | పొగాకు | 1,243 ,, |
| మిరప | 20,627 ,, | ఇతర మత్తు పైరులు | 1 ,, |
| అల్లము | 203 ,, | మేత పైరులు | 2,857 ,, |
| పసుపు | 1,311 ,, | పైలెక్కలలో చేరని ఖాద్యేతర సస్యములు | 652 ,, |
| వెల్లుల్లి | 2,890 ,, | | |
| ధనియాలు | 23,998 ,, | | |
| ఇతర మసాలా పైరులు | 15,096 ,, | | |
| చెఱకు | 1,591 ,, | | |
| అరటి | 234 ,, | | |
| నిమ్మ | 105 ,, | | |
| మామిడి | 1,387 ,, | | |

పశు సంపద : ఈ జిల్లాలో స్థానికమని పేర్కొనదగిన ప్రసిద్ధ పశుజాతి ఏదియు లేదు.

గృహ పరిశ్రమలు : అసిఫ్‌నగరులో రాగితోను, ఇత్తడితోను శ్రేష్ఠమైన పాత్రలు చేయుదురు. హైదరాబాదు నగరమున ఆధునిక పరికరములతో పెక్కు గృహ పరిశ్రమలను నిర్వహించు రీతిని ప్రభుత్వము ప్రోత్సహించుచున్నది. స్త్రీలు తీరిక సమయములందు శిశువుల దుస్తులు, బుటేదారీపని, డబ్బు సంచులు మొదలగు వానిని తయారుచేయుచుందురు. చేతితో కాగితమును తయారుచేయుట కూడ కొంత వరకు గృహ పరిశ్రమగ నిర్వహింప బడుచున్నది. చేనేత పరిశ్రమయు విరివిగ వ్యాప్తిలో ఉన్నది. గుండీల పరిశ్రమవలనను కొందరికి పని

దొరకుచున్నది. దంతముతోను, కొమ్ముతోను కత్తిపిడులు, కలములు, చెంచాలు, దువ్వెనలు మొదలగునవి ఇచటి కర్మాగారములలో తయారగుచున్నవి. బీడీ, హిమ్రూ పరిశ్రమలు ఈ నగరమున సహకారసంఘముల మూలమున నిర్వహింపబడుచున్నవి. పేము బెత్తముతో కుర్చీలు, మేజాలు, ఫలహారముల బుట్టలు, పూల తట్టలు వివిధ వర్ణములతో తయారగును. కఱ్ఱతోను, మట్టితోను ఇనుప రేకులతోను పెక్కు విధములయిన బొమ్మలు జిల్లాలో కొన్ని చోట్ల తయారగును. మైనము, లక్క, గుడ్డ, కాగితములతో కృత్రిమపు పుష్పములు కళాశోభితముగా నిర్మాణ మగు చున్నవి. గాజుల నిర్మాణము మరియొక ముఖ్య పరిశ్రమ.

పరిశ్రమలు : హైదరాబాదు నగరమున తొలుత నుండియు కొన్ని మధ్య తరగతి పరిశ్రమలు నిర్వహింప బడుచున్నవి. ముషీరాబాదులో తోళ్ల కార్ఖానాలు కొన్ని పనిచేయుచున్నవి. అగ్గిపెట్టెల కర్మాగారములు 18 కలవు. గాజు కర్మాగారములు రెండు కలవు. యంత్ర పరికరములను నిర్మించు ప్రాగాటూల్స్ ఫ్యాక్టరీ కేంద్ర ప్రభుత్వ యాజమాన్యమున నిర్వహింపబడుచున్నది. లాలాగూడా రైల్వే వర్క్‌షాపునందు రైల్వే పరికరముల తయారీ, మరమ్మతులు జరుగుచున్నవి. కేంద్రప్రభుత్వ టంకసాల హైదరాబాదు నగరమున ఒకటి కలదు; ఇందు ప్రస్తుతము రాగితో ఒక నయాపైస నాణెములు మాత్రమే ముద్రింపబడుచున్నవి. ఫ్యాక్టరీల సంఖ్యలోను, కార్మికుల సంఖ్యలోను రాష్ట్రపు మొత్తమున ఈ జిల్లా అగ్రస్థానము వహించినది. సనత్‌నగరున పారిశ్రామిక క్షేత్రము (Industrial Estate) ఒకటి పని చేయుచున్నది. తక్కిన ఫ్యాక్టరీలలో బట్టలమిల్లు, చార్‌మినార్ సిగరెట్ల ఫ్యాక్టరీ, హైదరాబాదు టిన్ ప్రాడక్ట్స్ లిమిటెడ్ సంస్థ, ఆల్విన్ మెటల్ వర్క్స్ పేర్కొన తగినవి.

రోడ్లు : రహదారుల విషయమున హైదరాబాదు కూడలి స్థానము; ఇచ్చటనుండి రాష్ట్రములోని అన్ని దిక్కులకు రోడ్లు పోవుచున్నవి. ఈ జిల్లాయందలి రోడ్ల మొత్తము నిడివి 720 మైళ్ళు. ఇందులో జాతీయ రహదారులకు, రాష్ట్రీయ రహదారులకు చెందినది 376 మైళ్ళు; మునిసిపాలిటీలకు చెందినది 282 మైళ్ళు; స్థానిక సంస్థలకు చెందినది 62 మైళ్ళు. మొత్తము రోడ్ల నిడివిలో 158 మైళ్ళు సిమెంటు రోడ్డు, 100 మైళ్ళు తారురోడ్డు కలదు. హైదరాబాదు, సికిందరాబాదు నగరములందు స్థానికముగ సిటీ బస్సు సౌకర్యము కలదు.

రైలుమార్గములు : ఈ జిల్లాయందలి సికిందరాబాదు నగరము ఒక ముఖ్యమగు రైల్వే కూడలి. ఇచటినుండి విజయవాడకును, వాడికిని బ్రాడ్‌గేజ్ రైలు మార్గములు పోవుచున్నవి. ఇచటినుండి బయలుదేరిన మీటర్‌గేజ్ మార్గము ఒకటి కర్నూలు ద్వారా ముందునకుసాగి, మచిలీపట్టణము - మార్మగోవా మార్గమును ద్రోణాచలము (డోన్) వద్ద కలియుచున్నది. సికింద్రాబాదు నుండి వాయవ్యదిశగా పోవు ఒక మీటర్‌గేజ్ మార్గము నిజామాబాదు జిల్లా ద్వారా ముందునకు సాగి మన్మాడునకు పోవుచున్నది. సికిందరాబాదుస్టేషను తరువాత ఈ జిల్లాయందు లెక్కకు వచ్చునవి కాచిగూడా, హైదరాబాదుస్టేషనులు. ఇవి రెండును హైదరాబాదు నగరముననే - మొదటిది మీటర్‌గేజ్ మార్గము మీదను, రెండవది బ్రాడ్‌గేజ్ మార్గము మీదను ఉన్నవి.

విమానాశ్రయము : హైదరాబాదు నగరమునకు సమీపమున బేగంపేట యందు ఒక విమానాశ్రయము కలదు. ఇచ్చటనుండి ప్రతిదినము మద్రాసు, బెంగుళూరు, బొంబాయి, ఢిల్లీ, కలకత్తా, విశాఖపట్టణములకు విమానములు ప్రయాణికులను, సరకులను కొనిపోవుచున్నవి.

విద్య : ఆంధ్ర ప్రదేశ్‌లో విద్యా విషయమున అన్ని విధముల హైదరాబాదు జిల్లా ప్రథమ స్థాన మాక్రమించి ఉన్నది. 1961 లెక్కలను అనుసరించి ఈ జిల్లాయందు అక్షరాస్యత 34·10%; పురుషులు 44·30%; స్త్రీలు 23·17%. జిల్లా మొత్తమున గల వివిధ వర్గముల విద్యా సంస్థల సంఖ్యా వివరములు దిగువ ఈయబడినవి (1956-57).

| విద్యాసంస్థల వివరము | సంఖ్య | ఉపాధ్యాయుల సంఖ్య | విద్యార్థి సంఖ్య |
|---|---|---|---|
| ప్రాథమిక పాఠశాలలు | 1,033 | 3,754 | 1,08,166 |
| మాధ్యమిక పాఠశాలలు | 68 | 1,072 | 25,902 |
| ఉన్నత పాఠశాలలు | 67 | 2,207 | 53,189 |
| ప్రత్యేక వృత్తి పాఠశాలలు | 10 | 65 | 1,131 |
| | 1,178 | 7,098 | 1,88,388 |

వీనిలో అత్యధిక భాగము హైదరాబాదు - సికిందరాబాదు నగరముననే ఉన్నవి. ఉస్మానియా విశ్వ విద్యాలయము ఈ నగరమున 1918 లో స్థాపితమైనది. ఆ విశ్వ విద్యాలయమునకు తెలంగాణా జిల్లాలందలి వివిధ కళాశాలలు అనుబద్ధితములై ఉన్నవి. హైదరాబాదు, సికిందరాబాదు నగరములలో ఆర్ట్సు కళాశాలలు 6, శాస్త్ర కళాశాలలు 5, ఆర్ట్సు మరియు సైన్సు కళాశాలలు 4, వృత్తి విద్యా కళాశాలలు 9 ఉన్నవి. వీనిలో ఒక ఉపాధ్యాయ శిక్షణ కళాశాల తప్ప తక్కిన వన్నియు యూనివర్సిటీ ప్రత్యక్ష నిర్వహణలో ఉన్నవి. కళాశాలలందు శాస్త్రీయవిషయముల పఠించు విద్యార్థులు 3,752, విద్యార్థి

నులు 240 కలరు; సామాన్య కళాపతన మొనర్చు విద్యార్థులు 3,957, విద్యార్థినులు 212 ఉన్నారు. వృత్తి విద్యా కళాశాలలలో ఆయా శాఖల కళాశాలల సంఖ్యా వివరములును, విద్యార్థినీ, విద్యార్థుల సంఖ్యా వివరములును దిగువ ఈయబడినవి.

| వివరము | సంఖ్య | విద్యార్థులు | విద్యార్థినులు |
|---|---|---|---|
| ఇంజినీరింగు అండ్ | | | |
| టెక్నాలజీ కళాశాల | 1 | 444 | ... |
| వైద్య కళాశాలలు | 2 | 593 | 192 |
| పశువైద్య కళాశాల | 1 | 316 | .... |
| వ్యవసాయ కళాశాల | 1 | 107 | 6 |
| న్యాయశాస్త్ర కళాశాల | 1 | 930 | 9 |
| వాణిజ్య కళాశాల | 1 | 378 | 2 |
| ఉపాధ్యాయ శిక్షణ కళాశాలలు | 2 | 147 | 53 |
| | 9 | 2,915 | 262 |

పైవి కాక ఆయుర్వేద వైద్య కళాశాల ఒకటి, యూనానీ కళాశాల ఒకటియు ప్రభుత్వ యాజమాన్యమున నిర్వహింపబడుచున్నవి. ఇటీవల ప్రభుత్వమువారిచే దంతవైద్య కళాశాల ఒకటి నిర్వహింపబడుచున్నది. మరియు ఒక ఇండస్ట్రియల్ ట్రైనింగు ఇన్‌స్టిట్యూట్‌ను, స్త్రీల కొరకు పాలిటెక్నిక్ శిక్షణాలయమును హైదరాబాదు నగరమున నూతనముగ స్థాపింపబడినవి. హైదరాబాదున సంగీత, నృత్య, చిత్రకళలకు సంబంధించిన పాఠశాలలు కలవు.

**ఆరోగ్యము - వైద్యము :** ఈ జిల్లాయందు గాలి చాల వరకు తేమగ ఉండును. వర్ష కాలమున మన్యపు జ్వరములు సర్వ సాధారణముగ ప్రబలును. అక్టోబరునుండి మార్చినెల చివరివరకు ఈ జిల్లాయందలి శీతోష్ణపరిస్థితి ఆరోగ్యదాయకముగ ఉండును. జిల్లా మొత్తము మీద ఆధునిక చికిత్స నవలంబించిన జనరల్ ఆసుపత్రులు 13, డిస్పెన్సరీలు 11, క్షయ ఆసుపత్రులు 3, కన్ను, చెవి, గొంతుక ఆసుపత్రి 1, ఉన్నత చికిత్సశాల 1, పురాణ రోగముల ఆసుపత్రి 1, స్త్రీ-శిశువుల ఆసుపత్రులు 2 ఉన్నవి. ఈ పై ఆసుపత్రులం దన్నింటను కలిసి 2,051 పడకలు పురుషులకును, 1,859 పడకలు స్త్రీలకును కలవు. యూనానీ చికిత్సా విధానమునకు చెందిన ఆసుపత్రి ఒకటియు, ఆయుర్వేద ఆసుపత్రి ఒకటియు నగరమున కలవు. ఇవిగాక యూనానీ చికిత్సాశాలలు 16, ఆయుర్వేద వైద్యశాలలు 15 కలవు.

**చూడదగిన స్థలములు :** హైదరాబాదు నగరము వైశాల్యము 96 చ. మైళ్ళు. ఈ నగరము మధ్య హుస్సేన్ సాగరు అను గొప్ప తటాకము కలదు. ఈ నగరమును 1589లో గోల్కొండ సుల్తానులలో అయిదవ వాడగు సుల్తాన్‌కులీ కుతుబ్‌షా నిర్మించెను. దీని మొదటి పేరు 'భాగ్య నగరము'. ఈ నగరమందలి సికిందరాబాదు భాగము మూడవ నిజామగు సికందరు జాహా పేరకట్టబడినది. హైదరాబాదు ఇండియాలో జనసంఖ్యను బట్టి అయిదవ నగరము. ఈ నగరమందలి గోల్కొండ కోట, చారుమినారు, మక్కామసీదు, చారుకమాన్ దర్వాజాలు, సాలారుజంగు మ్యూజియం, షామంజిల్, ఉస్మానియా ఆసుపత్రి, ఉస్మాన్‌సాగరు, హిమాయత్ సాగరు, మీరాలం చెరువు, హుస్సేను సాగర్, యూనివర్సిటీ భవనములు దర్శనీయములు. వీనిలో మొదటి నాలుగును చారిత్రకముగ నైతము ప్రసిద్ధి వహించినవి. ఈ జిల్లా యందు హిందువుల పుణ్య స్థలములలో ముఖ్యముగ పేర్కొన తగినది సీతారాంబాగు తరువాత లెక్కకు వచ్చునది అల్వాల, మేడిచలము, ఏదిలాబాదు, చేవెళ్లలలోని ఆలయములు; ముస్లిముల పుణ్య స్థలములలో మౌలాలీ బాబా షరీఫుద్దీన్ పహాడ్ పేర్కొనదగినవి.

**సాలార్‌జంగ్, మ్యూజియము :** హైదరాబాదు నగరమున కలదు. నైజాము రాజకుటుంబమునకు చెందిన సాలార్‌జంగ్ దీనిని వ్యవస్థాపించెను. ఇచ్చట విలువ కల పెక్కు విధములైన కళాఖండములు కలవు. ఇండియాలోని మ్యూజియములలో ఎన్నదగినది.

**జిల్లా సంక్షిప్త చరిత్ర :** ఈ జిల్లా తెలంగాణాలోని తక్కిన భాగములవలె క్రీ. శ. 14వ శతాబ్ద మధ్య కాలమున వరుసగా సాతవాహన, బాదామి, చాళుక్య, రాష్ట్రకూట, కల్యాణి చాళుక్య, కాకతీయ వంశముల పాలన క్రింద నుండెను. కాకతీయులు గోల్కొండ కోటను నిర్మించిరి. గోల్కొండకు అప్పుడు మానుగల్లు అను పేరుండెను. మానుగల్లు మట్టికోటను ఓరుగల్లు రాజగు కాపయనాయకుడు 1360 ప్రాంతమున బహ్మనీ రాజులకు దత్తము చేసెను. బహ్మనీ నవాబుల పక్షమున కుతుబుల్ ముల్క్ సుబేదారుగా తెలంగాణాను ఏలెను. ఇతడు 1512 లో స్వాతంత్ర్యము ప్రకటించి గోల్కొండలో సుల్తాన్‌కులీ కుతుబుషా అను బిరుద నామముతో క్రొత్త రాజవంశమునకు మూలపురుషుడయ్యెను. గోల్కొండ కుతుబుషాహి రాజన్యులలో ఐదవ వాడగు సుల్తాన్ మహమ్మదు కులీకుతుబుషా 1589 లో మూసీనదీ దక్షిణ తీరమున తన భోగకాంతయగు భాగ్యమతి పేరిట భాగ్యనగరము కట్టించెను. ఈ భాగ్యనగరమునకే తరువాత హైదరాబాదు అను పేరు వచ్చినది. తెలంగాణాకు రాజధానిగా ఉన్న గోల్కొండ పట్టణ ప్రాధాన్యము తగ్గి

హైదరాబాదునకు హెచ్చసాగెను. గోల్కొండ కుతుబు షాహీలు, నిజాము ప్రభువులు, హైదరాబాదు పట్టణమును శోభావంతము చేయుటలో ఎక్కువగ శ్రద్ధ చూపిరనుటకు చారిత్రకావశేషములు ఇప్పటికిని నిలచియున్నవి. 1688 లో హైదరాబాదును మొగలులు జయించిరి. మొగలు సామ్రాజ్య పక్షమున తెలంగానాకు సుబేదారుగా నిజాముల్ ముల్క్ నియమితుడయ్యెను. ఈ నిజాముల్ ముల్క్ 1724 లో స్వాతంత్ర్యము ప్రకటించి హైదరాబాదు అసఫ్ జాహి వంశమునకు మూలపురుషుడయ్యెను. అప్పుడు హైదరాబాదు రాజధానిఅయ్యెను. ఈ అసఫ్ జాహీ నిజాముల్ వంశములో ఏడవవాడగు హెచ్. ఇ. హెచ్. సర్ మీరు ఉస్మాన్ అలీఖాన్ బహద్దర్ పరిపాలకులుగా 1948 వరకు ఉండిరి. ఈ చరిత్రోదంతములో 1948 సెప్టెంబరు 18 వ తారీఖు పేర్కొనదగినది; ఈ తారీఖున 'పోలీసు చర్య' ఫలితముగ పూర్వపు హైదరాబాదు రాష్ట్రము ఇండియన్ యూనియన్‌లో విలీనమైనది. 1956 వరకు 'బి' తరగతిగా వ్యవహరింపబడి హైదరాబాదు రాష్ట్రమునకు హైదరాబాదు నగరము రాజధానియై, రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ సందర్భములో (1956) ఆంధ్రప్రదేశ్‌లో అంతర్భాగముగ విలసిల్లుచున్నది. అ. వీ. రా.

# మెదకు జిల్లా

ఉనికి-విస్తీర్ణము : మెదకుజిల్లా* ఆంధ్రప్రదేశ్ పడమటి సరిహద్దున ఉన్నది. ఈ జిల్లా ఉ. అక్షాంశము 17° 15′ నుండి 18°-15′ వరకు, తూ. రేఖాంశము 77° 20′ నుండి 79°-10′ వరకు విస్తరించి ఉన్నది. ఈ జిల్లాకు ఉత్తరము నిజామాబాదు కరీంనగరము జిల్లాలు; తూర్పు నల్గొండ జిల్లా దక్షిణము హైదరాబాదు జిల్లా; పడమట మైసూరు రాష్ట్రమునందలి బీదరు జిల్లా కలవు. ఈ జిల్లాయందు ఆందోలు, గజవేలు, మెదకు, నారాయణఖేడె, నర్సపూర్, సంగారెడ్డి, సిద్దిపేట, జహీరాబాదు అను 8 తాలూకాలు ఉన్నవి. వీనిలో నారాయణఖేడే, జహీరాబాదు తాలూకాలు పూర్వపు హైదరాబాదు రాష్ట్రమున బీదరు జిల్లాయందుండెడివి. కాని రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ (1956) సందర్భమున బీదర్ జిల్లా మైసూరు రాష్ట్రమున చేర్పబడుటచే, భాషా సాన్నిహిత్యము ననుసరించి అందలి నారాయణఖేడె, జహీరాబాదు తాలూకాలు ఆంధ్రప్రదేశ్‌నకు లభ్యమై మెదకు జిల్లాలో చేర్చబడినవి. 1956 కు ముందు మెదకు జిల్లాలో ఉన్న వికారాబాదు తాలూకా పరిపాలనా సౌకర్యమునకై హైదరాబాదు జిల్లాలో చేర్పబడినది. 1956 కు ముందు మెదకు జిల్లాలో ఉన్న వికారాబాదు తాలూకా పరిపాలనా సౌకర్యమునకై హైదరాబాదు జిల్లాలో చేర్చబడినది. జిల్లా మొత్తము విస్తీర్ణము 3,304 చ. మైళ్ళు. పేరునకు ఇది మెదకు జిల్లా అని వ్యవహరింపబడుచున్నను జిల్లా కేంద్రము మెదకు కాదు; సంగారెడ్డి అను పట్టణము జిల్లా కేంద్రముగ వ్యవహరింపబడు చున్నది. మెదకు ఒక తాలూకా కేంద్రముగ మాత్రమే ఉన్నది.

*దీనికి పూర్వము అసఫ్ జాహీల కాలమున మెదకు - గుల్షానాబాదు అనియు వ్యవహారిక నామము ఉండెడిది.

నైసర్గిక స్వరూపము : బాలాఘాటు పర్వత శ్రేణికి చెందిన కొన్ని గుట్టల వరుసలు ఈ జిల్లాయందు వ్యాపించి ఉన్నవి; అవి అంతగ పెద్దవి కావు. రామాయంపేట నుండి బయలుదేరిన ఇట్టి గుట్టల వరుస ఒకటి ఉత్తరముగ నిజామాబాదు దక్షిణపు సరిహద్దు వరకును పోయి, అట నుండి నిజామాబాదు జిల్లాలోనికి సాగి, మలుపు తిరిగి, మరల మెదకు జిల్లాలోనికి వ్యాపించి దక్షిణమునకు సాగిపోయినది. మరియొక వరుస వాయవ్య మూలనుండి తూర్పునకు వ్యాపించి ఉన్నది. ఈ శ్రేణియందే ఒక గుట్టపై మెదకు కోట కట్టబడి ఉన్నది.

నదులు : ఈ జిల్లాలోని ముఖ్యమైన నది మంజీరా నది. దీనిని బట్టియే ఈ ప్రాంతమునకు ఒకప్పుడు మంజీరదేశమని పేరుండినటుల తెలియవచ్చుచున్నది. ఈ నది మైసూరు రాష్ట్రమునందలి బీదరు జిల్లాలో జన్మించి ఈ జిల్లాలో ప్రవేశించి ఉత్తరముగ దాదాపు 60 మైళ్లు ప్రవహించి, నిజామాబాదు జిల్లాలోనికి పోవుచున్నది. మంజీరానదికి ఉపనది అగు 'హల్దీ' (పసుపులేరు) ఈ జిల్లాలో ఉత్తరమున నుండి ప్రవేశించి పదిమైళ్లు ప్రవహించుచున్నది.

శీతోష్ణస్థితి : ఈ జిల్లాలో వేసవికాలమున ఎండలు ఎక్కువగను; శీతకాలమున చలి ఎక్కువగను ఉండును - కాని ఎండ కాలమున సైతము ఉష్ణోగ్రత 100° ఫా. మించదు; చలికాలమున ఉష్ణోగ్రత 45° కు తగ్గిపోవును.

వర్షపాతము : జిల్లాలో సంవత్సరమునకు సగటు వర్షపాతము 33·22″. ఇందు నైరృతి ఋతుపవనముల వలన 23·02″ వర్షము పడుచున్నది.

అడవులు : ఈ జిల్లాయందలి అరణ్యభూమి విస్తీర్ణము 2,20,998 ఎకరములు. కాని ఇందలి అరణ్యములలో ఏదియు మొదటి తరగతి అడవిగ పేర్కొనతగినది కాదు. వీని

## మెదకు జిల్లా - తాలూకా వివరములు

| వరుస సంఖ్య | తాలూకా పేరు | తాలుకా కేంద్రము | గ్రామముల సంఖ్య (1951) | గ్రామీణ జనాభా 1951 | పట్టణములు (1951) | పట్టణ జనాభా | విస్తీర్ణము (చదరపు మైళ్ళలో) (1951) | మొత్తము నీటి పారుదల వసతిగల నేల విస్తీర్ణము (ఎకరములలో) (1959) | సాగుచేయబడిన నేల (ఎ॥ములలో) (1959) | ప్రస్తుతము సాగులోలేని బీడు నేల (ఎ॥ములలో) (1959) | మొత్తం సాగుకు తగిన నేల (ఎ॥ములలో) (1959) | సాగుచేయ వీలగు బంజరునేల (ఎ॥లలో) (1959) |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. | ఆందోలు | ఆందోలు | 167 | 1,38,801 | 2 | 14,227 | 470 | 33,084 | 1,86,468 | 18,190 | 2,04,658 | 5,865 |
| 2. | గజవేలు | గజవేలు | 158 | 1,43,699 | 1 | 4,554 | 386 | 28,516 | 1,12,308 | 52,991 | 1,65,299 | 9,960 |
| 3. | మెదకు | మెదకు | 148 | 1,32,688 | 2 | 19,863 | 520 | 46,037 | 97,135 | 27,479 | 1,24,614 | 16,155 |
| 4. | నారాయణఖేడ | నారాయణ ఖేడ | 131 | 79,159 | 1 | 5,528 | 178 | 8,426 | 16,016 | 77,813 | 93,829 | 7,040 |
| 5. | నర్సాపూర్ | నర్సాపూర్ | 157 | 1,03,961 | — | — | 426 | 37,938 | 86,195 | 34,986 | 1,21,181 | 11,229 |
| 6. | సంగారెడి | సంగారెడ్డి | 154 | 1,27,397 | 2 | 18,847 | 474 | 19,660 | 1,95,810 | 34,644 | 2,30,454 | 8,594 |
| 7. | సిద్దిపేట | సిద్దిపేట | 145 | 1,84,776 | 2 | 22,967 | 619 | 41,109 | 1,32,502 | 61,522 | 1,94,024 | 25,666 |
| 8. | జహీరాబాదు | జహీరాబాదు | 148 | 1,12,945 | 2 | 20,340 | 505 | 6.899 | 1.47.775 | 55.959 | 2.03.734 | 8.489 |
| | | మొత్తము | 1,208 | 10,23,376 | 12 | 1,06,326 | 3,578 | 2,21,669 | 9,74,209 | 3,63,534 | 13,37,743 | 92,998 |

యందు ఎక్కువ భాగము చిట్టడవులు. కాని మెదకు, ఎల్లారెడ్డి, నర్సపూర్ అరణ్యములలో టేకు, సాల, నల్లమద్ది, ఇప్ప, మామిడి, చింత మొదలగు వృక్ష జాతులు గుట్టలనిండ బలసి యుండును. పెద్దపులి, చిరుతపులి మొదలగు వన్య మృగములకు స్థావరములై ఈ అరణ్యములు మృగయా విహారములకు అనువుగ ఉన్నవి.

ఖనిజ సంపద : ఈ జిల్లాలో అంతగ విలువగల ఖనిజములు లేవు. కాని లింగంపేట గుట్టలలో దొరకు గుండ్రని ఇనుపరాళ్ళకు (nodular iron stones) కొంత స్థానిక ప్రాముఖ్యము గలదు. స్థానికముగ వ్యవసాయ పరికరముల తయారీ కొరకై ఈ ఇనుప రాళ్ళను కరగించి ఇనుము తయారు చేయుచుందురు. కాని, ఈ పరిశ్రమ నేడు చాల హీనస్థితిలో ఉండి, అంతరించుచున్నది.

పట్టణములు : జిల్లా యందలి 12 పట్టణములలో మెదకు, సిద్ధిపేట అను రెంటికి మాత్రమే సిటీ మునిసిపాలిటీలు కలవు.

మెదకు : జనసంఖ్య 15,889 ; తాలూకా కేంద్రము.

సిద్ధిపేట : జనసంఖ్య 18,729 ; తాలూకా కేంద్రము.

ప్రజలు : ఈ జిల్లా జనసంఖ్య* 12,26,465 ; పురుషులు 6,14,779, స్త్రీలు 6,11,686; జనసాంద్రత చ. మైలునకు 322. 1951 - 61 సం॥ల మధ్య ఈ జిల్లా జనసంఖ్య 10·52% వృద్ధి ఐనది.

మతములు : ఈ జిల్లాలో హిందువులు 87·8%; ముస్లిములు 9·54%; క్రైస్తవులు 2·18%, తక్కిన మతముల వారు 0·48% కలరు (1951).

వృత్తులు : ఈ జిల్లాలో వ్యవసాయమే ముఖ్య జీవనాధారము. వ్యవసాయము ఆధారముగ కలవారు 76·3%, వ్యాపారము వలన జీవించువారు 4·4%; ఇతర ఉత్పత్తికర వృత్తుల వలన జీవించువారు 14·7% ; ఉద్యోగములవలన జీవించువారు 4·6% ను కలరు (1951).

భాషలు : ఈ జిల్లా యందలి ప్రజలలో 29 మాతృ భాషలు కలవారు ఉన్నారు. అత్యధిక సంఖ్యాకుల మాతృ భాష తెలుగు 88.2%, ఉర్దూ 9.6% తక్కినవారు మిగిలిన 27 మాతృభాషలకు చెంది ఉన్నారు. ఆంధ్రేతరులలో పెక్కుమంది తెలుగు మాట్లాడ గలరు (1951).

వ్యవసాయము : జిల్లా మొత్తమున వ్యవసాయమునకు తగిన భూమి 18,86,392 ఎకరములు. ఇందు ప్రస్తుతము సాగగుచున్న భూమి 11,86,055 ఎకరములు ; సాగు భూమిలో నీటి పారుదల వసతి గల భూమి 1,88,433 ఎకరములు (1956 - 57).

ఈ జిల్లాలో చిన్నవి, పెద్దవి అగు చెరువులు సుమారు 2,500 కలవు. పోచారం జలాశయము ఆలేరు నదికి అడ్డు కట్ట కట్టుటచే నిర్మిత మైనది. దీనిక్రింద 25 మైళ్ళు పొడవు గల కాలువ త్రవ్వబడినది. దీనివలన 12,049 ఎకరముల భూమికి నీటిపారుదల లభించి వరిపంట సాగగుచున్నది. మల్కాపురము చెరువు 12 గ్రామముల భూములకు నీటి నొసగు చున్నది. మంజీరానది నుండి మహబూబునగరము కాలువ రు. 10 లక్షల వ్యయముతో త్రవ్వబడినది ఫత్తేనహర్ అను కాలువ మంజీరా నది ఎడమ గట్టున నుండి 6 లక్షల రూపాయల వ్యయముతో త్రవ్వబడినది. ఈ రెండు కాలువల వలనను దాదాపు 12,000 ఎకరముల భూమిసాగగు చున్నది. రాయనపల్లి జలాశయము పుష్పల వాగునకు అడ్డముగ (1926) నిర్మింప బడినది. ఇందలి ఆయకట్టు ప్రాంతమును 50,000 ఎకరముల వరకు విస్తరించుటకు అవకాశము కలదు. అందోలు తాలూకాలోని దేవనూరు ప్రాజెక్టు మంజీరా నదికి సంబంధించిన నిర్మాణము. ఇందలి నీరు సేద్యమునకును, జల విద్యుదుత్పత్తికి, బస్తీలకు పరిశుద్ధ పానీయ జలముగను వినియోగింపబడుచున్నది. ఈ విధముగ నీరు సమృద్ధిగ ఉండుట వలన ఈ జిల్లాలో కరవు భయము లేదు.

ఇచ్చట పీఠభూమినందలి నేలలు చాల వరకు ఇసుక, గరప మయములు. పల్లపు ప్రాంతములలో అచ్చటచ్చట నల్ల రేగడ భూమి కనిపించును. ఇచ్చటి ముఖ్యమైన పంట వరి. ఈ జిల్లాలో పండిన ధాన్యము మేలిరకములు ఐనవిగ ఉండి, ఇతర ప్రదేశములలోని మేలి ధాన్యమునకు ఎంత మాత్రమును తీసిపోవు. ఈ వరిపంటను బట్టియే కాబోలు ఈ ప్రాంతమును ' మెతుకు సీమ ' అని ఆంధ్ర కవులు వ్యవహరించిరి.

### మెదకు జిల్లా - పంటల వివరములు
### 1955 - 56

| | | | |
|---|---|---|---|
| వరి | 2,37,270 ఎ. | కంది | 16,288 ఎ. |
| గోధుమ | 13,557 ,, | మినుములు | 32,846 ,, |
| జొన్న | 2,85,304 ,, | ఉలవలు | 19,784 ,, |
| సజ్జ | 9,943 ,, | ఇతర పప్పు | |
| శార్లీ | 1,456 ,, | ధాన్యములు | 52,483 ,, |
| మొక్క జొన్న | 98,607 ,, | మిరప | 23,944 ,, |
| రాగి | 27,814 ,, | అల్లము | 1,032 ,, |
| కొర్ర | 17,087 ,, | పసుపు | 492 ,, |
| వరిగ | 3,944 ,, | వెల్లుల్లి | 573 ,, |
| సామలు | 22,528 ,, | ధనియాలు | 25,893 ,, |
| శనగ | 84,408 ,, | ఇతర మసాలా | |
| పెసర | 27,566 ,, | పైరులు | 615 ,, |

* 1961 జనాభా లెక్కల ప్రకారము.

| | | | |
|---|---|---|---|
| చెఱకు | 6,608 ఎ. | ప్రత్తి | 7,831 ఎ. |
| అరటి | 154 ,, | జనుము | 8,759 ,, |
| నిమ్మజాతి | 85 ,, | వేరుశనగ | 14,201 ,, |
| మామిడి | 1,218 ,, | నువ్వులు | 21,429 ,, |
| నిలవ చేయదగు ఫల జాతులు | 29 ,, | తక్కిన ఖాద్య తైల ముల పైరులు | 37,781 ,, |
| ఇతర ఫలజాతులు | 391 ,, | ఆముదములు | 25,666 ,, |
| బంగాళా దుంపలు | 358 ,, | అవిసె | 18,049 ,, |
| ఉల్లి | 2,899 ,, | ఖాద్యములు కాని నూనె పైరులు | 5,466 ,, |
| ఇతర దుంప పైరులు | 35 ,, | రంగుపదార్థ ములపైరులు | 11 ,, |
| తక్కిన కూరల పైరులు | 1,515 ,, | తమలపాకులు | 154 ,, |
| పై లెక్కలో చేరని చిల్లర ఆహారపు పైరులు | 95 ,, | పొగాకు | 1,389 ,, |
| | | మేత పైరులు | 9,662 ,, |

పై లెక్కలలో చేరని ఖాద్యేతర పైరులు 379 ఎకరములు.

పశు సంపద: ఇచ్చటి పశువులు సామాన్య తరగతికి చెందినవి. మాగాణి సేద్యమునకు చాల వరకు దున్నలనే వాడు చుందురు.

గృహ పరిశ్రమలు: చేనేత పరిశ్రమ, అద్దకపు పరిశ్రమ ప్రముఖములు. నూలుతోను, పట్టుతోను నాణ్యమైన ముతుక గుడ్డలు నేయబడుచున్నవి; ఇవి కోట్లకును, చీరెలకును పనికివచ్చుచున్నవి. లింగంపేటలో, రామాయంపేటలోను ఇత్తడి పాత్రలు తయారగును. శివనగరులోను, జోగిపేటలలోను తోళ్ల కార్ఖానాలు ఉన్నవి. ఇచట ఊనబడిన చర్మములు హైదరాబాదు, బొంబాయి, మద్రాసులకు ఎగుమతి అగు చున్నవి. ఈ జిల్లా యందు పేర్కొనతగిన పెద్ద పరిశ్రమలు లేవు.

రోడ్లు: జాతీయ రహదారులలో 1. హైదరాబాదు-షోలాపూర్, 2. హైదరాబాదు-కరీం నగరము రోడ్డు, 3. హైదరాబాదు-నిజామాబాదు రోడ్డు, 4. హైదరాబాదు-చాందా రోడ్డు అనునవి ఈ జిల్లాగుండ పోవుచున్నవి. జిల్లా రహదార్ల నిడివి 444 మైళ్ళు. వీనిలో స్థానిక సంస్థలకు చెందినది 58 మైళ్ళు మాత్రము. తక్కినదిఅంతయు జాతీయ రహదారులకును, రాష్ట్ర రహదారులకును చెంది ఉన్నది.

రైలు మార్గములు: హైదరాబాదు నుండి వాడికి పోవు బ్రాడ్‌గేజ్ రైలు మార్గము ఈ జిల్లా గుండ పోవుచున్నది.

విద్య: 1961 లెక్కల ప్రకారము ఈ జిల్లా యందు అక్షరాస్యత 13·74%. పురుషులు 22·90%. స్త్రీలు 4·53%. జిల్లా యందలి వివిధ వర్గముల విద్యా సంస్థలు వాని సంఖ్యా వివరములు ప్రక్క కాలములో ఈయబడినవి. (1956-57).

| విద్యాసంస్థల వివరము | సంఖ్య | ఉపాధ్యాయ సంఖ్య | విద్యార్థి సంఖ్య |
|---|---|---|---|
| ప్రాథమిక పాఠశాలలు | 829 | 1,585 | 42,085 |
| మాధ్యమిక పాఠశాలలు | 10 | 176 | 3,660 |
| ఉన్నత పాఠశాలలు | 4 | 124 | 3,580 |
| ప్రత్యేక వృత్తిబోధక పాఠశాలలు | 1 | 8 | 93 |
| | 844 | 1,893 | 49,368 |

ఆరోగ్యము, వైద్యము: మెదకు జిల్లాలో సెప్టెంబరు నుండి జూన్ వరకు శీతోష్ణస్థితి ఆరోగ్యప్రదముగ ఉండును. కాని వర్ష ఋతువులో చలిజ్వరములు, విషజ్వరములు మిక్కుటము. జిల్లా మొత్తము మీద ఆధునిక వైద్య విధానము ననుసరించి చికిత్సచేయు 11 జనరల్ ఆసుపత్రులు, 4 డిస్పెన్సరీలు కలవు; వీని అన్నింటను కలిసి 112 పడకలు ఉన్నవి. ఇవి కాక జిల్లా మొత్తమున 5 యూనానీ చికిత్సాశాలలు, 11 ఆయుర్వేద వైద్యశాలలు వైద్య సహాయమునకు ఉపకరించు చున్నవి.

చూడదగిన స్థలములు: ఈ జిల్లా యందు చారిత్రిక ప్రాముఖ్యము కల వానిలో ప్రముఖమైనది మెదకు కోట. ఇది నేటి మెదకు పట్టణ సమీపమున ఒక గుట్టమీద 300′ ఎత్తున ఉన్నది. ఈ కోటలో ఒక ఇత్తడి ఫిరంగి కలదు; దీని పొడవు 10′; 1620 లో వచ్చివారి కొరకు రాటరు డామ్ పట్టణములో ఇది పోత పోయబడినది. కోటలోని 'ముబారక్ మహల్' అను రాజమందిరము సింహద్వారముపై ద్విముఖాత్మకమగు గండభేరుండము ముక్కునందును, గోళ్లయందును ఏనుగులను పట్టుకొని ఉన్నటుల చిత్రమొకటి చెక్కబడి ఉన్నది. ఈ చిత్రము హిందూ పౌరాణిక గాథలకు సంబంధించినది. ఇచ్చట స్థానికముగ పేరొందిన పుణ్యక్షేత్రములు కొన్ని కలవు; వీనిలో ఏడు పాయలు అనునది ప్రముఖము. ఇది మెదకు నగరమునకు ఆగ్నేయ దిశన ఉన్నది. ఇచట మంజీరా నదికి చెందిన ఏడు పాయలు కలియు చున్నవి.

జిల్లా సంక్షిప్త చరిత్ర: చరిత్ర కందని ప్రాచీన కాలములో ఈ జిల్లా ప్రాంతమునకు ఎట్టి ప్రాధాన్యము ఉండెనో చెప్ప వలనుపడదు. కాని సాతవాహనులు (క్రీ. పూ. 78 - క్రీ. శ. 218) ఈ ప్రాంతమును ఏలుచుండినట్లు భూగర్భము నుండి బయలుపడి కొండాపుర నగరమున దొరకిన ప్రాచీన వస్తుసంపద విశేషించి గౌతమీపుత్రశాతకర్ణి, వాశిష్ఠీపుత్ర పులుమావి నాణెములు వెల్లడి చేయుచున్నవి. ఈ కొండాపురమును దక్షిణాపథ తక్షశిలా నగరమని చరిత్రకారులు నుడువుచున్నారు. తరు

వాత తెలంగానా యందలి ఇతర ప్రాంతములవలె ఇదియు బాదామి, చాళుక్య, రాష్ట్రకూట, కల్యాణి చాళుక్య రాజ వంశముల ఏలుబడిలో ఉండెను. పిమ్మట ఈ జిల్లా ప్రాంతము ఓరుగల్లు కాకతీయ సామ్రాజ్య అంతర్భాగముగ ఉండినట్లు చరిత్ర విశదపరచు చున్నది. క్రీ. శ. 1309 లో అల్లాఉద్దీన్ ఖిల్జీ సేనాపతి అగు మాలిక్ కాఫర్ అనువాడు ఓరుగల్లుపై గొప్ప సేనానివహముతో దండెత్తి మార్గములో మెదకును పట్టుకొనెను. మెదకు అప్పటికే బలిష్ఠమగు గిరిదుర్గముగ ఉండి ప్రధాన నగరముగ ఉండినదని గ్రహింపవలెను. తరువాత మెదకు వెలమ రాజుల క్రిందను, వారి వెనుక బహ్మనీ సుల్తానుల అధీనము నను ఉండెను. పదునారవ శతాబ్దిలో ఇది గోల్కొండ కుతుబ్‌షాహీల వశమయ్యెను. అద్దంకి గంగాధర కవి తన 'తపతీ సంవరణోపాఖ్యానము'న 'ఉత్తరంబున బరీదోడిపారగ(ద్రోలి మెతుకుదుర్గం బాక్రమించి మించె' అని కులీ కుతుబ్‌షాహీ (1512 - 1543) ని వర్ణించి ఉన్నాడు. గోల్కొండ పతనానంతరము మొగలాయి సామ్రాజ్యమున ఇది చేరి, పదునెనిమిదవ శతాబ్దపు తొలి పాదమున నిజాం రాజ్య భాగ మయ్యెను. 1948 లో జరిగిన 'పోలీసు చర్య'కు పర్యవసానముగా నిజాము రాజ్య పతనానంతరమున భారత ప్రభుత్వమున కలిసిన హైదరాబాదు రాష్ట్రభాగమై, తరువాత జరిగిన భాషాప్రయుక్త రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ (1956) మూలమున ఆంధ్రప్రదేశ్‌లో అంతర్గత మయ్యెను.

ఆ. వీ. రా.

# నిజామాబాదు జిల్లా

**ఉనికి - విస్తీర్ణము :** నిజామాబాదు జిల్లా[1] ఉ. అక్షాంశము 18° 5′ నుండి 18° 55′ వరకును, తూర్పు రేఖాంశము 77° 40′ నుండి 78° 40′ వరకును విస్తరించి ఉన్నది. ఈ జిల్లాకు ఉత్తరము ఆదిలాబాదు జిల్లా; తూర్పు కరీంనగరము జిల్లా; దక్షిణము మెదకు జిల్లా; పడమర మహారాష్ట్రము కలవు. ఈ జిల్లాయందు నిజామాబాదు, ఆర్మూరు, కామారెడ్డి, ఎల్లారెడ్డి, బోధన్, బన్సవాడ, ముద్దునూరు అను ఏడు తాలూకాలు ఉన్నవి. జిల్లా విస్తీర్ణము 3,203 చ. మైళ్ళు.

నైసర్గిక స్వరూపము : నాందేడు నుండి కరీంనగరమునకు ఒకగుట్టల వరుస జిల్లాకు ఉత్తరమున పోవుచున్నది. జిల్లాకు పడమటను, తూర్పునను చిన్న గుట్టలు కలవు. తక్కిన భూభాగమంతయు చాలవరకు చదునుగనే ఉన్నది.

నదులు : ఈ జిల్లాలో పెద్ద నది గోదావరి; ఈ నది జిల్లాకు పడమట నున్న మహారాష్ట్రములోని నాందేడు జిల్లానుండి ఈ జిల్లాలోనికి ప్రవేశించి ఉత్తర భాగమున సుమారు 70 మైళ్ళు ప్రవహించి కరీంనగరము జిల్లాలో ప్రవేశించును. మంజీరా నది గోదావరికి ముఖ్యమైన ఉపనది. ఇది నైరృతి దిక్కున నుండి ఈ జిల్లాలో ప్రవేశించి, జిల్లాయందు 62 మైళ్ళు ప్రవహించి బోధన్ తాలూకాలోని కుందుర్తివద్ద గోదావరిలో సంగమించును. ఎడ్లకట్టవాగు కామారెడ్డి తాలూకాలో నిత్యము ప్రవహించుచుండు చిన్న నది.

శీతోష్ణస్థితి: ఫిబ్రవరినుండి మే అంతము వరకు వాతావరణము పొడిగను, ఆరోగ్యకరముగను ఉండును. శీతకాలమునను, వర్షాకాలమునను గాలిలో చెమ్మదనము ఎక్కువగ ఉండును. సంవత్సరమున అత్యధిక ఉష్ణోగ్రత 110° ఫా., అత్యల్ప ఉష్ణోగ్రత 45° ఫా.

వర్షపాతము : ఈశాన్య, నైరృతి ఋతుపవనములవలన ఈ జిల్లాయందు వర్షములు కురియుచున్నవి. కాని 83% వర్షము నైరృతి ఋతుపవనముల వలన మాత్రమే లభించుచున్నది. సంవత్సరమునకు సగటు వర్షపాతము 41.5″.

అడవులు : అన్ని తాలూకాల యందును కొద్దిగనో, గొప్పగనో అరణ్యములు కలవు. అరణ్య ప్రాంత వైశాల్యము 3,59,746 ఎకరములు. టేకు, విరుగుడు మాను, తుమికి, ఇప్ప, బీజసాలము మొదలగు వృక్ష జాతులు ఈ అడవులలో కన్పడుచున్నవి. విస్తారముగ కలప, వంటచెరకు ఈ అడవులవలన లభించుచున్నది.

పట్టణములు : జిల్లా మొత్తమున పట్టణములలో నిజామాబాదు, బోధన్ అను వానికి మాత్రమే మునిసిపాలిటీలు కలవు.

నిజామాబాదు : జనసంఖ్య 79,027 ; జిల్లా కేంద్రము.

బోధన్ : జనసంఖ్య 31,134 ; తాలూకా కేంద్రము.

ప్రజలు : ఈ జిల్లా యందలి జనసంఖ్య[2] 10,21,503 : పురుషులు 5,09,485; స్త్రీలు 5,12,018 ; జనసాంద్రత

[1] ఈ జిల్లాకు పూర్వము ఇందూరు జిల్లా అని పేరుండెను. 1905 లో ఇందూరు జిల్లాలో కొన్ని మార్పులు, కూర్పులు చేసి నిజామాబాదు జిల్లాగా నిర్మాణము కావింపబడినది. రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ (1956) సందర్భమున కొన్ని చేర్పులు జరిగినవి.

[2] 1961 జనాభా లెక్కల ప్రకారము.

## నిజామాబాదు జిల్లా - తాలూకా వివరములు

| వరుస సంఖ్య | తాలూకా పేరు | తాలూకా కేంద్రము | గ్రామముల సంఖ్య (1951) | గ్రామీణ జనాభా (1951) | పట్టణములు (1951) | పట్టణ జనాభా (1951) | విస్తీర్ణము చదరపు మైళ్ళలో (1951) | మొత్తము నీటిపారుదల వసతిగల నేల ఎ॥లలో (1959) | సాగుచేయబడిన నేల ఎకరములలో (1959) | ప్రస్తుతము సాగులోలేని బీడునేల ఎకరములలో (1959) | మొత్తము సాగుకు తగిన నేల ఎ॥లలో (1959) | సాగుచేయ వీలగు బంజరు నేల ఎ॥ములలో (1959) |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. | ఆర్మూరు | ఆర్మూరు | 177 | 1,65,498 | 2 | 17,409 | 748 | 55,419 | 1,50,695 | 54,423 | 2,05,118 | 24,635 |
| 2. | బన్సువాడ | బన్సువాడ | 110 | 79,985 | 1 | 6,816 | 315 | 40,903 | 95,420 | 7,517 | 1,02,937 | 9,260 |
| 3. | బోధన్ | బోధన్ | 102 | 90,115 | 3 | 35,941 | 291 | 56,888 | 1,03,010 | 30,718 | 1,33,728 | 6,053 |
| 4. | కామారెడ్డి | కామారెడ్డి | 128 | 1,23,080 | 2 | 18,218 | 483 | 28,846 | 1,00,644 | 34,991 | 1,35,635 | 20,413 |
| 5. | నిజామాబాదు | నిజామాబాదు | 131 | 1,14,526 | 1 | 55,195 | 506 | 66,833 | 1,10,779 | 17,124 | 1,27,903 | 18,109 |
| 6. | ఎల్లారెడ్డి | ఎల్లారెడ్డి | 106 | 66,556 | 1 | 4,783 | 438 | 25,590 | 69,931 | 25,670 | 95,601 | 5,952 |
| 7. | ముద్దునూరు* | ముద్దునూరు | — | — | — | — | — | 4,122 | 1,03,741 | 5,875 | 1,09,616 | 8,895 |
| | | మొత్తము | 754 | 6,39,760 | 10 | 1,33,862 | 2,781 | 2,77,101 | 7,84,220 | 1,76,318 | 9,10,538 | 93,317 |

* ముద్దునూరుకు సంబంధించిన వివరములు లభించలేదు.

చ. మైలునకు 328. 1951 - 61 మధ్య పది ఏండ్లలో 22.3% జనసంఖ్య వృద్ధి ఐనది.

మతములు : 1951 లెక్కల ప్రకారము ఈ జిల్లాలో హిందువులు 87%; మహమ్మదీయులు 10.4%; క్రైస్తవులు 1.9%; ఇతరులు 0.7% కలరు.

వృత్తులు : ఈ జిల్లాలో వ్యవసాయమే ముఖ్యమైన వృత్తి. వ్యవసాయాదాయముమీద ఆధారపడి ఉన్న వివిధ వర్గముల వారి మొత్తము సంఖ్య 5,71,671 ; ఉత్పత్తి కరములగు తక్కిన పరిశ్రమలవలన జీవించువారు 1,32,633; వాణిజ్యమువలన జీవించువారు 39,123 ; మిగిలినవారు వివిధ వృత్తులవలన జీవించుచున్నారు (1951).

భాషలు : నిజామాబాదు జిల్లాలో 37 భాషలు మాట్లాడు వారు ఉన్నారు. కాని అత్యధిక సంఖ్యాకుల మాతృ భాష తెలుగు - తెలుగు 82%; ఉర్దూ 10.4%; లంబాడి 3.1%; తక్కిన వివిధ భాషలు మాట్లాడువారు అత్యల్ప సంఖ్యాకులు.

వ్యవసాయము : జిల్లా మొత్తముమీద వ్యవసాయము నకు అనువుగ ఉండు భూమి 12,21,405 ఎకరములు. ఇందు ప్రస్తుతము సాగులో ఉన్న భూమి 6,95,617 ఎకర ములు. సాగు భూమిలో నీటి పారుదల వసతి గల భూమి 2,54,382 ఎకరములు.

ఇచటి నేలలు మాసాబు, ఖరాబు, చెలక అను తర గతులకు చెందినవి. చాలవరకు ఇసుక, కంకర కలిగి తేలిక రంగు కలవిగా ఉన్నవి. పర్వత పాదముల చెంతను, లోయల లోను గల నేల సారవంత మైనది. చెరువులు అధిక సంఖ్యలో ఉండుట ఈ జిల్లా విశిష్టత.

ఈ జిల్లాలో మంజీరా ఉపనదికి 1931 లో ఆనకట్ట నిర్మింప బడినది. ఇటుల ఏర్పడిన జలాశయమునే నిజాం సాగరము అందురు. దీని విస్తీర్ణము15 చ. మైళ్ళు; అడ్డుకట్ట పొడవు 2 మైళ్ళు; ముఖ్యమగు కాలువ పొడవు 100 మైళ్ళు. కట్టవద్ద నీటి లోతు 160′. ఈ ప్రాజెక్టు క్రింద దాదాపు 20,000 ఎకరములు చెఱకు సాగగు చున్నది. ఈ చెఱకు పంటపై ఆధారపడి ఆసియాలో మిక్కిలి పెద్దదగు పంచదార ఫ్యాక్టరీ బోధన్‌లో పనిచేయుచున్నది. ఈ ప్రాజెక్టు మూలమున నిజామాబాదు తెలంగానా ధాన్యాగారముగా పేరొందినది.

నిజామాబాదు జిల్లా - పంటల వివరములు

1955 - 56

| | | | |
|---|---|---|---|
| వరి | 2,57,419 ఎ. | మిరప | 11,900 ఎ. |
| గోధుమ | 6,618 ,, | పసుపు | 3,905 ,, |
| జొన్న | 1,46,117 ,, | చెఱకు | 43,330 ,, |
| మొక్కజొన్న | 48,280 ఎ. | పండ్లు, కూరలు, | |
| రాగి | 7,369 ,, | దుంపలు | 3,480 ఎ. |
| కొఱ్ఱ | 1,398 ,, | ప్రత్తి | 10,032 ,, |
| వరిగ | 5,811 ,, | జనుము | 399 ,, |
| సామ | 13,181 ,, | వేరుశనగ | 23,710 ,, |
| శనగ | 38,104 ,, | నువ్వులు | 18,806 ,, |
| పెసర | 19,712 ,, | అవిసె గింజలు | 10,463 ,, |
| కంది | 4,685 ,, | ఆముదములు | 1,696 ,, |
| మినప | 24,449 ,, | పొగాకు | 315 ,, |
| ఉలవ | 14,128 ,, | మేతపైరులు | 2,020 ,, |

పై లెక్కలలో చేరని ఇతర పైరులు 28,166 ఎకరములు.

ఆధునిక పద్ధతుల మీద వ్యవసాయము సాగించుటను ప్రవేశపెట్టుటకు రుద్రూరు నందు ఒక ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రము ఏర్పాటు చేయబడినది.

ఈ జిల్లానుండి ఎగుమతి చేయబడు ఆహార ధాన్యము లలో ముఖ్యమైనవి వరి, శనగలు; వాణిజ్య పంటలలో ముఖ్యమైనవి ప్రత్తి, మిర్చి, చింతపండు.

పశు సంపద : ఈ జిల్లాలోని పశువులు సామాన్య రక మువి. పొట్టి గుఱ్ఱములు, గొఱ్ఱెలు, మేకలు జిల్లా అంత టను కలవు. మైదానమున పెరిగిన వాని కంటె పర్వత ప్రాంతములలో పెరిగిన పశువులు దృఢముగ ఉండును. కాని ఈ రెండును ఇచట చిన్నవియే.

గృహపరిశ్రమలు : జిల్లా అంతటను ముతక నూలు వస్త్ర ములు నేయబడు చున్నవి. ఆర్మూరులో ఖత్రీలు, పెక్కు విధములైన పట్టుచీరెలు నేయబడుచున్నవి. కృత్రిమ పట్టు పరిశ్రమ కూడ ఇచట అభివృద్ధిలో ఉన్నది. బీనుగల్లులో చక్కని కొయ్య బొమ్మలు చేయబడును. ఇత్తడి, రాగి పాత్రల తయారీలో లింగంపేట పేరు పొందినది. నిజామా బాదులో రంగు అద్దకము పరిశ్రమ విరివిగ సాగుచున్నది.

పరిశ్రమలు : బోధన్‌లోని పంచదార ఫ్యాక్టరీ ఆసియా ఖండమందలి పెద్ద ఫ్యాక్టరీలలో ఒకటి. ఈ ఫ్యాక్టరీ యందు దినమునకు 3,500 టన్నుల చెఱకుగడ వినియో గింపబడుచున్నది. ఈ పట్టణమున పవర్ ఆల్కహాలు ఫ్యాక్టరీ కూడ ఒకటి ఉన్నది.

రోడ్లు : ఈ జిల్లా యందు రోడ్ల సదుపాయము కొంత బాగుగనే కలదు. జిల్లా మొత్తమున రోడ్ల నిడివి 607 మైళ్ళు. ఇందు జాతీయ రహదారులకును, రాష్ట్ర రహదారులకును చెందినవి 332 మైళ్ళు. తక్కినది వివిధ స్థానిక సంస్థల అధీనమున ఉన్నది.

రైలు మార్గములు : సికింద్రాబాదు నుండి మన్మాడునకు పోవు గోదావరి లోయ రైలుమార్గము (మీటర్ గేజ్) ఈ జిల్లాలో దక్షిణమున నుండి వాయవ్యదిశకు పోవుచున్నది.

ఈ జిల్లా సరిహద్దుల లోపల ఈ మార్గమున 10 రైలు స్టేషనులు కలవు.

విద్య : 1961 లెక్కల ప్రకారము ఈ జిల్లా యందలి ప్రజలలో అక్షరాస్యత 14.13%; ఇందుకు గాను అక్షరాస్యత పురుషులలో 22.69%, స్త్రీలలో 5.62%. పల్లెలలో విద్యా వ్యాప్తి చాల తక్కువ. జిల్లా యందలి వివిధ వర్గముల విద్యా సంస్థల సంఖ్యా వివరములు (1956-57) దిగువ ఈయబడినవి.

| విద్యాసంస్థల వివరము | సంఖ్య | ఉపాధ్యాయ సంఖ్య | విద్యార్థి సంఖ్య |
|---|---|---|---|
| ప్రాథమిక పాఠశాలలు | 642 | 1,594 | 33,613 |
| మాధ్యమిక ,, | 10 | 181 | 4,196 |
| ఉన్నత ,, | 3 | 88 | 2,354 |
| ప్రత్యేక, వృత్తి, బోధన పాఠశాలలు | 2 | 11 | 207 |
| | 657 | 1,874 | 40,370 |

ఇవి కాక నిజామాబాదులో ఆర్ట్సు అండ్ సైన్సు కాలేజీ ఒకటి కలదు.

ఆరోగ్యము, వైద్యము ; కుష్ఠు వ్యాధి కొంత ఎక్కువగ వ్యాప్తి ఉన్న జిల్లాలలో ఇది ఒకటి. దీనిని నివారించుటకై దాచేపల్లిలో క్రైస్తవ మిషనరీలచే నడుప బడు వైద్యశాల కలదు. సంవత్సరమున అధిక భాగము ఈ జిల్లా యందు వాతావరణము ఆరోగ్య కరముగనే ఉండును కాని వర్షాకాలమునను, శీతకాలమున మలేరియా వ్యాప్తి ఎక్కువ. వైద్య వసతులు పట్టణములలో మాత్రమే కలవు.

జిల్లా యందు ఆధునిక విధానమున నడుప బడుచున్న జనరల్ ఆసుపత్రులు 2, డిస్పెన్సరీలు 10 ఉన్నవి. వీనియందలి పడకల సంఖ్య 170. ఇవి కాక జిల్లాలో యూనాని చికిత్సాశాలలు 8, ఆయుర్వేద వైద్యశాలలు 7 వైద్య సహాయమునకు ఉపకరించు చున్నవి.

జిల్లా సంక్షిప్త చరిత్ర: నిజామాబాదు జిల్లాకు పూర్వపు పేరు ఇందూరు జిల్లా. ఇంటూరు అనునది ఇంద్రపురి అను పేరునకు అపభ్రంశము. ఒక రాజు పేర ఇంద్రపురి కట్టబడి ఉండెను. ఈ రాజు నర్మదా, తపతీ నదుల దిగువ ప్రదేశము నేలిన రాష్ట్రకూట చక్రవర్తియైన ముమ్మడి ఇంద్రనరేంద్రుడు కావచ్చును. ఈ జిల్లా తత్పరిసర ప్రాంతముల వలె మొదట సాతవాహనుల ఏలు బడి క్రిందను, వారి అనంతరము బాదామి చాళుక్యుల పాలన మందును ఉండెను. రాష్ట్రకూట యుగమున ఈ ప్రాంత దేశ మంతయు ఒక చాళుక్యసామంత రాజ కుటుంబమున కధీనమై ఉండెను. కరీంనగరము జిల్లాలోని వేములవాడ రాజధాని అగుట చేత వీరికి వేములవాడ చాళుక్యులను పేరు కలిగెను. రాష్ట్రకూటులతో పాటు ఈ చాళుక్య వంశము కూడ అంతరించెను. తరువాత కల్యాణి చాళుక్యులును, వారి పిమ్మట కాకతీయులును ఈ మండలమునకు అధిపతులైరి. కాకతీయులలో కడపటివాడైన ప్రతాప రుద్ర మహారాజు రాజ్యముచేయు చుండగా ఢిల్లీ మహమ్మదీయ సుల్తానులు దండెత్తి వచ్చి క్రీ. శ. 1323 లో కాకతీయ సామ్రాజ్యమును కూలద్రోసిరి. వారి తరువాత ఈ జిల్లా బహ్మనీ రాజ్యములోను, పిమ్మట కుతుబ్ షాహీ రాజ్యములోను, అనంతరము మొగలు సామ్రాజ్యములోను చేరి ఉండెను. చివరకు నిజాము సంస్థానము లోనికి వచ్చెను. పోలీసు చర్య (1948) తరువాత భారత ప్రభుత్వమున అంతర్భాగమైన హైదరాబాదు రాష్ట్రమున ఒక భాగమై రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ సందర్భమున (1956) ఆంధ్ర ప్రదేశ్‌లో అంతర్గత మయ్యెను. ఆ. వీ. రా.

# ఆదిలాబాదు జిల్లా

ఉనికి - విస్తీర్ణము: ఆదిలాబాదు* జిల్లా ఆంధ్ర ప్రదేశ్‌కు వాయవ్య సరిహద్దు నానుకొని ఉ. అక్షాంశము 18° 40′ నుండి 19° 45′ వరకును, తూర్పు రేఖాంశము 78° 5′ మొదలుకొని 80° 5′ వరకును విస్తరించి ఉన్నది.

ఈ జిల్లాకు ఎల్లలుగ తూర్పు, ఉత్తర దిశలందు మధ్య ప్రదేశ్; దక్షిణము కరీంనగరము నిజామాబాదు జిల్లాలు ; పడమర మహారాష్ట్రము ఉన్నవి. ఈ జిల్లా ఆదిలాబాదు, అసిఫాబాదు, బోధ్, చిన్నూరు, ఖానాపూర్, లక్సెట్టిపేట,

* దీనికి పూర్వపు పేరు సిర్పూరు - తాండూరు అమల్దారి. ఆనాడిది బీదర్ డివిజనులో భాగముగ ఉండెడిది. 1905 లో ఈ అమల్దారీని విస్తృత మొనర్చి, ఆనాటి నిజామాబాదు, కరీంనగరము జిల్లాలనుండి కొన్ని తాలూకాలను కలిపి ఆదిలాబాదు జిల్లాగ ఏర్పరుపబడినది. తరువాత ఎడనెడ కొన్ని మార్పులు, చేర్పులు జరిగి 1951 నాటికి ఈ జిల్లా 11 తాలూకాలతో రూపొందినది. కాని రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ (1956) సందర్భమున ఈ జిల్లాలోని రాజూరా, కిన్వటు తాలూకాలును, బోధ్ తాలూకాలోని ఇస్లాపూర్ సర్కిలును మహారాష్ట్రమున చేర్పబడినవి. నాందేడ్ జిల్లా యందలి ముధోల్, భైంసా, కుబ్బీరు సర్కిలు, ఆదిలాబాదు జిల్లాలో చేర్చబడి, ముధోల్ తాలూకాగా ఏర్పడినది.

ముథోల్, నిర్మల్, సిర్పూరు, ఉట్నూరు అను పది తాలూకాలుగ విభక్తమై ఉన్నది. జిల్లా మొత్తము విస్తీర్ణము 6,242 చ. మైళ్ళు.

నైసర్గిక స్వరూపము: సహ్యా పర్వతశ్రేణి (సాత్మలా గుట్టల వరుస) ఈ జిల్లా యందు వాయవ్య దిశనుండి ఆగ్నేయ దిశకు సుమారు 175 మైళ్ళు పొడవున వ్యాపించి ఉన్నది. చిన్న చిన్న గుట్టలు మరికొన్ని కలవు. కొన్ని చోట్ల ఈ పర్వత శిఖరముల ఎత్తు 2,000′ వరకు ఉన్నది.

నదులు: ఈ జిల్లా దక్షిణ భాగమున ప్రవహించెడు గోదావరి ముఖ్యమైన నది. ఈ నది దక్షిణమున నిజామాబాదు జిల్లాను, కరీంనగరము జిల్లాలో కొంత భాగమును ఈ జిల్లా నుండి విడదీయును. వార్ధా, ప్రాణహిత అనునవి ఇతర ముఖ్య నదులు. ఇవి ఈశాన్యమున, తూర్పున దిగ్భాగముల సరిహద్దుల వెంబడి ప్రవహించును. పెద్ద వాగు అను నది ఒక చిన్న నది; ఇది వార్ధానదికి ఉపనది. ఇది ఈ జిల్లాలో దాదాపు నూరు మైళ్ళు ప్రవహించు చున్నది.

శీతోష్ణ స్థితి: ఈ జిల్లాలో వేసవికాలమున ఉష్ణోగ్రత 105° ఫా., వరకు పోవును. శీతకాలమున రాత్రులందు ఉష్ణోగ్రత 60° ఫా. వరకు పడిపోవును.

వర్షపాతము: ఈ జిల్లా యందలి పడమటి భాగము కన్న తూర్పు భాగమున వర్షపాత మెక్కువ. సగటున సంవత్సరమునకు వర్షపాతము 41·27″. రాష్ట్ర మొత్తమున అధిక వర్షపాతము కల జిల్లాలలో ఆదిలాబాదు ఒకటి. ఇందలి వర్షమున మూడింట రెండు వంతులు నైరృతి ఋతుపవనముల వలన లభించును.

అడవులు: జిల్లా విస్తీర్ణమున 28·7% అరణ్యభూమి. ఈ అడవుల మొత్తపు విస్తీర్ణము 10,31,722 ఎకరములు. సిర్పూరు తాలూకా యందలి బీజూరు అడవులలో పెద్దపులి వేటకు అవకాశములు కలవు. టేకు, తుమికి, బిల్లుగు, జిట్టెగు, మామిడి, చింత, బీజనాలము, చందనము, వేప, ముసిడి వృక్షజాతులు మెండుగ ఉన్నవి. ఇవి అన్నియు మిగుల ఎత్తుగ ఇట ఎదుగు చున్నవి. చిట్టడవులుకూడ కలవు. పెద్ద పెద్ద అరణ్యముల వల్లను, సంచారమునకు వీలుకాని లోయల వల్లను ఈ జిల్లా ప్రకృతి సంపదకు పేరొందినను దీనిని ఉపయోగమునకు తెచ్చి అభివృద్ధి పరచుటకు ప్రయత్నము అనుకొన దగినంతగ జరుగుట లేదు. ఇప్పుడిప్పుడు కొన్ని వలస లేర్పడి అట్టి కార్యక్రమమునకు అంకురార్పణ జరిగినది.

ఖనిజ సంపద: బలపపురాయి, సున్నపురాయి, పొరల రాయి, ఎర్ర లోహమగు చల్ప ఆదిలాబాదు తాలూకాలో కలవు. సిర్పూరు తాలూకాలోని రాజుల గుట్ట కొండలలో ఇనుము, సుద్దరాయి గనులు కలవు. అసిఫాబాదు తాలూకాలో బెల్లంపల్లి రైలు స్టేషనుకు సమీపమున తాండూరు పరిసరములందు నేలబొగ్గు గనులు కలవు.

పట్టణములు: ఆదిలాబాదు జిల్లా యందలి పట్టణములలో ఆదిలాబాదు, బెల్లంపల్లి, కాగజ్‌నగర్, మంచిర్యాల నిర్మల్ అనువానికి మాత్రమే మునిసిపాలిటీలు కలవు.

ఆదిలాబాదు: జనసంఖ్య 20,984; జిల్లా కేంద్రము.

బెల్లంపల్లి: జనసంఖ్య 29,095; గని కేంద్రము.

మంచిర్యాల: జనసంఖ్య 13,818.

కాగజ్‌నగర్: జనసంఖ్య 30,640; పారిశ్రామిక కేంద్రము.

నిర్మల్: జనసంఖ్య 19,916; తాలూకా కేంద్రము.

ప్రజలు. ఈ జిల్లా యందలి జనసంఖ్య * 10,09,301. ఇందు పురుషులు 5,09,697, స్త్రీలు 4,99,604; జనసాంద్రత చ. మైలునకు 162. ఆంధ్ర ప్రదేశ్ నందలి అన్ని జిల్లాలలో జనసంఖ్యలోను, జనసాంద్రత విషయమునను కనిష్ఠ స్థానమున ఉన్నది. 1951-61 మధ్య పది ఏండ్లలో ఈ జిల్లా యందలి జనసంఖ్య 21·37% వృద్ధి యైనది.

మతములు: ఈ జిల్లా యందలి జనులలో హిందువులు 88·8%; ముస్లిములు 5·55%; తక్కిన మతముల వారు 5·65% (1951). ఉట్నూరు, అసిఫాబాదు తాలూకాలలో విరివిగ గోండ్లు, కోయలు అను ఆదిమవాసులు కలరు.

వృత్తులు: ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు వ్యవసాయమును ఆశ్రయించుకొని జీవించుచున్నారు - ఇట్టి వారందరి సంఖ్య 5,72,670 (68·9%); ఇతర ఉత్పత్తికర పరిశ్రమలలో జీవించువారు 1,28,208 (15·4%); వ్యాపారము వలన జీవించువారు 26,171 (3·1%); రహదారి ఉద్యోగముల వలన జీవించువారు - 10,779 (1·3%); ఇతర వృత్తుల వలన జీవించువారు 93,772 (11·2%) [1951].

భాషలు: ఈ జిల్లా యందు 64 విధములగు మాతృభాషలు మాట్లాడువారు కలరు. అయినను తెలుగు మాతృ భాషగ కలవారి సంఖ్య అత్యధికము - 55·6% ఉండిరి (1951). కాని రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ (1956) సందర్భమున ఈ జిల్లా యందలి మరాఠీ ప్రాంతములు మహారాష్ట్రమున చేర్పబడుటచే ఈనాడు తెలుగు మాతృభాషగ కలవారి శాతము హెచ్చియుండును. తెలుగు తరువాత ఇచట లెక్కకు వచ్చునది గోండ్ భాష - గోండ్ భాష మాట్లాడువారు ఈ జిల్లాలో ఒక లక్ష ఉండిరి (1951).

వ్యవసాయము: జిల్లా మొత్తమున సేద్యమునకు తగిన భూమి 19,40,689 ఎకరములు; ఇందు సాగున ఉన్న

* 1961 జనాభా లెక్కల ప్రకారము.

## ఆదిలాబాదు జిల్లా - తాలూకా వివరములు

| వరుస సంఖ్య | తాలూకా పేరు | తాలూకా కేంద్రము | గ్రామముల సంఖ్య | గ్రామీణ జనాభా | పట్టణములు | పట్టణ జనాభా | విస్తీర్ణము చ. మై. లో | మొత్తము నీటి పారుదల వసతి గల నేల విస్తీర్ణము ఎ॥లలో | సాగుచేయబడిన నేల ఎ॥లలో | ప్రస్తుతం సాగులో లేని బీడు నేల ఎ॥లలో | మొ॥ సాగుకు తగిన నేల ఎ॥లలో | సాగుచేయవీలగు బంజరు నేల ఎ॥లలో |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. | ఆదిలాబాదు | ఆదిలాబాదు | 180 | 84,415 | 1 | 17,196 | 580 | 1,310 | 1,73,541 | 52,574 | 2,26,115 | 31,542 |
| 2. | అసిఫాబాదు | అసిఫాబాదు | 218 | 70,787 | 2 | 21,458 | 834 | 2,867 | 1,51,578 | 28,877 | 1,80,455 | 64,616 |
| 3. | బోథ్ | బోథ్ | 168 | 67,766 | 1 | 4,606 | 708 | 108 | 1,23,933 | 8,404 | 1,32,337 | 8,299 |
| 4. | చిన్నూరు | చిన్నూరు | 151 | 77,141 | 1 | 8,976 | 689 | 7,886 | 1,22,570 | 18,552 | 1,41,122 | 6,048 |
| 5. | ఖానాపూరు | ఖానాపూరు | 72 | 40,922 | 1 | 2,444 | 313 | 15,426 | 44,042 | 5,549 | 49,591 | 3,052 |
| 6. | లక్సెట్టి పేట | లక్సెట్టి పేట | 120 | 86,058 | 2 | 12,754 | 734 | 11,651 | 1,26,374 | 4,258 | 1,30,632 | 6,073 |
| 7. | ముథోల్ | ముథోల్ | 181 | 99,391 | 3 | 27,652 | 541 | 5,771 | 1,75,324 | 1,827 | 1,77,151 | 6,228 |
| 8. | నిర్మల్ | నిర్మల్ | 169 | 1,03,082 | 1 | 17,947 | 566 | 19,676 | 1,24,762 | 15,165 | 1,39,927 | 16,318 |
| 9. | సిర్పూరు | సిర్పూరు | 184 | 85,380 | 2 | 18,731 | 856 | 3,871 | 1,56,803 | 7,486 | 1,64,289 | 17,615 |
| 10. | ఉట్నూరు | ఉట్నూరు | 148 | 84,404 | — | — | 726 | 577 | 71,498 | 26,470 | 97,968 | 10,987 |
| | | మొత్తము | 1,591 | 7,49,346 | 14 | 1,31,764 | 6,547 | 69,149 | 12,70,425 | 1,69,162 | 14,39,587 | 1,65,778 |

భూమి 13,35,880 ఎకరములు ; ఈ విస్తీర్ణమున 72,813 ఎకరములకు మాత్రము నీటి పారుదల వసతి కలదు (1955 - 56). జిల్లా యందలి భూములలో గరప భూములు విస్తారముగ ఉన్నవి. అందును సిర్పూరు తాలూకాలో ఇట్టి నేలలు అత్యధికము. ఆదిలాబాదు తాలూకాలో మధ్య తరగతి భూమి కలదు. పర్వత పాదముల ప్రాంత భూమి, నదీ తీరములందలి నేల చాల సారవంతమైనది. ఇట్టి సారవంతమైన నేలయందు గోధుమ, ప్రత్తి, శనగలు పండింతురు. సిర్పూరు తాలూకాలో చెరువులు, నూతులు ముఖ్య జలాధారములు. వీని సాయమున అట వరి సాగు చేయబడుచున్నది.

ఆదిలాబాదు జిల్లా - పంటల వివరములు (1955 - 1956)

| | | | |
|---|---|---|---|
| వరి | 104,339 ఎ. | మిరప | 21,163 ,, |
| గోధుమ | 18,176 ,, | పసుపు | 877 ,, |
| జొన్న | 493,528 ,, | ధనియాలు | 4,184 ,, |
| మొక్కజొన్న | 42,501 ,, | పండ్లు, కూరలు, | |
| కొఱ్ఱ | 758 ,, | దుంపలు | 3,109 ,, |
| వరిగ | 1,756 ,, | ప్రత్తి | 202,485 ,, |
| సామ | 2,292 ,, | జనుము | 2,966 ,, |
| శనగ | 37,465 ,, | వేరుశనగ | 18,311 ,, |
| పెసర | 71,876 ,, | నువ్వులు | 76,298 ,, |
| కంది | 46,897 ,, | అవిసెగింజలు | 33,032 ,, |
| మినుము | 16,386 ,, | ఆముదములు | 11,594 ,, |
| ఉలవ | 26,021 ,, | పొగాకు | 833 ,, |

పై లెక్కలలో చేరని పైరులు 44,352 ఎకరములు.

ఈ జిల్లా నుండి ప్రత్తి, అవిసె గింజలు, నువ్వులు ఎగుమతి అగుచున్నవి. మంచిర్యాల, ఆదిలాబాదు పట్టణములు ముఖ్య వర్తక కేంద్రములు.

పశు సంపద : స్థానికముగ ఇచట పుట్టి పెరిగెడి పశువులు చాల బలమైన జాతికి చెందినవి. ఆదిలాబాదు తాలూకాలోని బర్రెలు క్షీర సమృద్ధికల మొదటి తరగతి పశువులు. చిన్న పరిమాణము కలిగిన వృషభజాతియు ఈ జిల్లాయందు కలదు ; ఈ వృషభములు త్వరిత గమనమునకు ప్రసిద్ధి.

గృహపరిశ్రమలు : ఈ జిల్లాలో చెప్పుకొనదగిన చేతి పరిశ్రమలు ఏవియు విరివిగ లేవు. ఇచ్చట స్థానికుల ఉపయోగమునకై ముతక నూలుతో ధోవతులు, చీరెలు నేయుదురు. సిర్పూరులో చర్మముతో నీళ్ళతిత్తులు (ఛాగలులు) తయారగును. సిర్పూరు, చెన్నూరులలో టస్సులు వస్త్రము తయారు అగును. కొయ్యతో చేసిన ఆట బొమ్మలకు, ఇనుప కత్తులకు నిర్మల్ ప్రసిద్ధి వహించినది. ఈ నిర్మల్ బొమ్మల పరిశ్రమను ఇపుడు ప్రభుత్వము సహాయ మొనర్చి పోషించు చున్నది.

పరిశ్రమలు : ఈ జిల్లాలోని పెద్ద పరిశ్రమలకు సిర్పూరును, బెల్లంపల్లియు ముఖ్య కేంద్రములు. 1939 లో స్థాపింప బడిన కాగితపు మిల్లు ఒకటి సిర్పూరు వద్ద పని చేయుచున్నది. ప్రతి ఏట ఆరువేల టన్నుల కాగితము ఇందు తయారగుచున్నది; ఈ పారిశ్రామిక ప్రాంతము కాగజ్ నగర్ అను పట్టణముగ రూపొందినది. బెల్లంపల్లివద్ద తాండూరు గనులలో నేలబొగ్గు త్రవ్వకము జరుగుచున్నది. బెల్లంపల్లిలో రాసాయనిక ద్రవ్యములు తయారుచేయు కెమికల్ కంపెనీ ఒకటి పని చేయుచున్నది.

రోడ్లు : జిల్లాలో రవాణా సౌకర్యములు చాల తక్కువ. నిర్మల్ నుండి ఆదిలాబాదునకు పోవు 50 మైళ్ళ రోడ్డు ఒకటియే జిల్లా కేంద్రమునకు రహదారి. మహారాష్ట్రము లోని రాజూరా ఈ జిల్లాలోని అసిఫాబాదునకు వచ్చెడి రోడ్డు ముందునకుసాగి బెల్లంపల్లి గుండ మంచిర్యాలకు పోవుచు, చిన్నూరు నుండి నిర్మల్‌కు పోవు రోడ్డులో కలియుచున్నది. జిల్లా మొత్తమున రోడ్ల నిడివి 624 మైళ్ళు. దీనిలో స్థానిక సంస్థలకు చెందినది 307 మైళ్ళు; తక్కినది జాతీయ రహదారులకును, రాష్ట్ర రహదారులకును చెంది ఉన్నది.

రైలు మార్గములు : ఖాజీపేట నుండి బలహరుషాకు పోవు బ్రాడ్ గేజ్ రైలు మార్గము ఈ జిల్లా గుండ తూర్పు వైపున పారిశ్రామిక ప్రాంతములలో పోవుచున్నది. పారిశ్రామిక కేంద్రములగు సిర్పూరు, బెల్లంపల్లి అనునవి ఈ మార్గముననే కలవు. మహారాష్ట్రము లోని ముడ్‌ఖెడ్ నుండి ఆదిలాబాదుకు వచ్చెడి మీటర్ గేజ్ రైలు మార్గము ఈ జిల్లాలో 50 మైళ్ళు మాత్రమే పోవుచున్నది.

విద్య : 1961 లెక్కలను అనుసరించి ఈ జిల్లా యందలి ప్రజలలో అక్షరాస్యులు 11·47% ; ఇందులకు గాను పురుషులలో అక్షరాస్యులు 18·40%, స్త్రీలలో అక్షరాస్యులు 4·40%. ఆంధ్రప్రదేశ్‌లో విద్యావ్యాప్తి విషయమున ఈ జిల్లా చివర స్థానమున ఉన్నది. ఈ జిల్లా యందలి వివిధ వర్గముల విద్యాసంస్థలకు సంబంధించిన సంఖ్యా వివరములు దిగువ ఈయబడినవి.

| విద్యా సంస్థల వివరము | సంఖ్య | ఉపాధ్యాయ సంఖ్య | విద్యార్థి సంఖ్య |
|---|---|---|---|
| ప్రాథమిక పాఠశాలలు | 597 | 1,051 | 27,751 |
| మాధ్యమిక పాఠశాలలు | 10 | 185 | 3,701 |
| ఉన్నత పాఠశాలలు | 3 | 92 | 2,109 |
| ప్రత్యేక, వృత్తి పాఠశాలలు | 1 | 8 | 81 |
| | 611 | 1,336 | 33,642 |

ఆరోగ్యము, వైద్యము : ఈ జిల్లా అంతగ ఆరోగ్యవంత మైనది కాదు ; మలేరియా వ్యాప్తి ఎక్కువ. కాని తక్కిన తాలూకాలతో పోల్చినపుడు ఆదిలాబాదు, సిర్పూరు తాలూకాలలో మలేరియా వ్యాప్తి తక్కువ అని చెప్ప వచ్చును. ఆధునిక వైద్య విధానము ననుసరించు జనరల్ ఆసుపత్రి 1, డిస్పెన్సరీలు 15 ఈ జిల్లాలో ఉన్నవి ; వీని యందలి పడకల సంఖ్య 79 ; ఇవికాక ఈ జిల్లాలో యూనానీ చికిత్సాశాలలు 3, ఆయుర్వేద వైద్యశాలలు 6 పని చేయుచున్నవి.

చూడదగిన స్థలములు : ప్రకృతి దృశ్యములకు ఈ జిల్లా పేరొందినది. బోథ్ తాలూకాలో కుంతల, పోచర అను రెండు జలపాతములు ఉన్నవి ; వీనిలో మొదటిది అతి రమణీయము. సరియగు రాక పోకల వసతులు లేకపోవు టచే ఇవి ప్రజలను ప్రస్తుత మెక్కువగ ఆకర్షింప జాలకున్నవి. జలవిద్యుదుత్పత్తికి కూడ ఈ జలపాతములు ఉపకరింప గలవు. ఆదిలాబాదు తాలూకాలోని కమలాపురమున ఏడాది కొకసారి జాతర జరుగును. గోండులు ఈ జాతరకు విరివిగ వచ్చుచుందురు.

జిల్లా సంక్షిప్త చరిత్ర : ఆదిలాబాదు జిల్లా చారిత్రక ముగా ప్రసిద్ధి చెందినది కాదు. ఈ ప్రాంతము పూర్వము నుండియు గోండురాజుల వశమున ఉండె నని తెలియవచ్చు చున్నది. సిర్పూరు తాలూకాలోని మానిక్ గఢ్ కోటను ఈ గోండు ప్రభువులే నిర్మించి ఉందు రని చారిత్రకుల అభిప్రాయము. తరువాత ఇది కొంతకాలము వెలమ ప్రభువుల వశమున ఉండి తరువాత ముస్లిముల వశమయ్యెను. ధంసా అను పేరు కల మీర్జా ఇబ్రహీం నుండి గుజఫరుద్దౌలా క్రీ. శ. 18వ శతాబ్ది ఉత్తరార్ధమున నిర్మల్‌ను స్వాధీనము చేసి కొని కోట నిర్మించెను. తరువాత ఇది తక్కిన అసఫ్ జాహీల రాజ్యముతో పాటు కాలము మార్పులకు లోనై కడకు (1956) ఆంధ్రప్రదేశ్‌లో అంతర్గత మయ్యెను. అ. వీ. రా.

# కరీంనగరము జిల్లా

ఉనికి, విస్తీర్ణము : కరీంనగరము జిల్లా ఉ. అక్షాం శము 17° 55′ నుండి 19° వరకును, తూ. రేఖాంశము 78° 30′ నుండి 80° 20′ వరకును విస్తరించి ఉన్నది. ఈ జిల్లాకు ఉత్తరము ఆదిలాబాదు జిల్లా ; తూర్పు మధ్య ప్రదేశ్‌లోని బస్తరు; దక్షిణము వరంగల్లు జిల్లా ; పడమర మెదకు, నిజామాబాదు జిల్లాలు కలవు. ఈ జిల్లాయందు కరీంనగరము, సిరిసిల్ల, మెట్టపల్లి, జగత్యాల, సుల్తానా బాదు, మహదేవపూరు, హుజూరాబాదు అను ఏడు తాలూకాలు ఉన్నవి. జిల్లా మొత్తపు విస్తీర్ణము 4,504 చ. మైళ్ళు.

నైసర్గిక స్వరూపము : ఈ జిల్లాయందు బాలాఘాటు పర్వతముల వరుసకు చెందిన మూడు పర్వత శ్రేణులు వ్యాపించి ఉన్నవి. ఒక శ్రేణి గుర్రపల్లి, జగత్యాల మధ్యగ ఈశాన్య దిక్కునకు సాగి గోదావరి యొడ్డున వేములకుర్తి వద్ద ఆగుచున్నది. మరియొక వరుస పై వరుసకు సమా నాంతరముగ పోవుచు 'సుని' అను గ్రామమునుండి మల్లంగూరు వరకు వ్యాపించి ఉన్నది. ఈ శ్రేణిపై ఉన్న కంచెర్ల, మార్మ్యాలగుట్ట గ్రామములు సముద్ర మట్టమునకు 2,200′ నుండి 2,3000′ ఎత్తున ఉన్నవి. మూడవ శ్రేణి ఈ జిల్లాయొక్క నైరృతి దిక్కునను, మానేరు నది లోయలో మొదలిడి ఈశాన్య దిక్కుగ సాగి రెండవ శ్రేణితో కలియుచు రామగిరిని దాటిపోయి గోదావరి ఒడ్డున అంతమగు చున్నది.

నదులు : ఈ జిల్లాయందు ముఖ్యమైన నది గోదావరి నది. ఇది ఉత్తర దిశనుండి ప్రవహించి ఉత్తరమున, తూర్పున సరిహద్దులుగ ఏర్పడి ఉన్నది. దీని తరువాత లెక్కకు వచ్చు నది మానేరు; ఇది గోదావరికి ఉపనది. పడమరనుండి తూర్పునకు కార్లగుంట వరకు ప్రవహించిన తరువాత మానేరు నది సరిగా ఉత్తరమునకు తిరిగి కొంత దూరము పోయి చివరకు గోదావరిలో కలియును. పెద్దవాగు, చెట్ల వాగు అనునవి గోదావరిలోనే చేరు చిన్న ఉపనదులు.

శీతోష్ణస్థితి : ఈ జిల్లాలో కరీంనగరము, హుజూరా బాదులలో తక్కిన ప్రాంతములయందు కన్న వేసవి కాలమున ఉష్ణోగ్రత హెచ్చుగ ఉండును. సంవత్సరము మొత్తము మీద అత్యధిక ఉష్ణోగ్రత 111° ఫా., అత్యల్ప ఉష్ణోగ్రత 56° ఫా.

వర్షపాతము : ఈశాన్య, నైరృతి ఋతుపవనముల వల నను ఈ జిల్లాలో వర్షములు కురియుచున్నను, అత్యధిక భాగము నైరృతి ఋతుపవనముల వలన మాత్రమే లభించు చున్నది ; సంవత్సరమునందు సరాసరి వర్ష పాతము 33.3″.

కరీంనగరము జిల్లాకు పూర్వ నామము ఎల్గందల [వెలి గందల]. ఆ జిల్లాకు క్రీ. శ. 1905 న కొన్ని మార్పులను చేసి కరీంనగరము జిల్లా ఏర్పరుపబడినది. ఆ తరువాత 1953 లో పరిపాలనా సౌకర్యము కొరకై ఇందలి పరఖాల తాలూకా వరంగల్లు జిల్లాకు మార్చబడినది.

# కరీంనగరము జిల్లా - తాలుకా వివరములు

| వరుస సంఖ్య | తాలూకా పేరు | తాలుకా కేంద్రము | గ్రామముల సంఖ్య (1951) | గ్రామీణ జనాభా (1951) | పట్టణములు (1951) | పట్టణ జనాభా (1951) | విస్తీర్ణము (చదరపు మైళ్ళలో) (1951) | మొత్తము నీటి పారుదల వసతి గల నేల విస్తీర్ణము (ఎకరములలో) (1959) | సాగుచేయ బడిన నేల (ఎ॥ములలో) (1959) | ప్రస్తుతము సాగులోలేని బీడు నేల (ఎ॥ములలో) (1959) | మొత్తము సాగుకు తగిన నేల (ఎ॥ములలో) (1959) | సాగుచేయ వీలగు బంజరు నేల ఎ॥ములలో (1959) |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. | హుజూరాబాదు | హుజూరాబాదు | 132 | 2,33,709 | 2 | 8,292 | 560 | 56,016 | 1,64,168 | 66,144 | 2,30,312 | 8,633 |
| 2. | జగత్యాల | జగత్యాల | 154 | 1,78,258 | 2 | 25,612 | 678 | 32,454 | 1,87,154 | 31,807 | 2,18,961 | 1,918 |
| 3. | కరీంనగరము | కరీంనగరము | 176 | 2,66,599 | 3 | 35,578 | 720 | 62,135 | 1,97,412 | 1,37,402 | 3,34,814 | 9,390 |
| 4. | మహాదేవపూరు (మంథెని) | మహాదేవపూరు | 138 | 78,145 | 1 | 8,701 | 835 | 16,495 | 94,482 | 24,800 | 1,19,282 | 14,247 |
| 5. | మెట్టపల్లి | మెట్టపల్లి | 93 | 1,05,552 | 2 | 15,083 | 368 | 26,386 | 1,35,722 | 23,345 | 1,59,067 | 9,788 |
| 6. | సిరిసిల్ల | సిరిసిల్ల | 165 | 2,05,476 | 3 | 23,871 | 722 | 59,834 | 1,70,001 | 72,303 | 2,42,304 | 11,155 |
| 7. | సుల్తానాబాదు | సుల్తానాబాదు | 184 | 2,32,284 | 1 | 11,518 | 707 | 44,754 | 2,23,523 | 66,300 | 2,89,823 | 16,359 |
| | | మొత్తము | 1,042 | 13,00,018 | 14 | 1,28,150 | 4,590 | 2,98,074 | 11,72,462 | 4,22,101 | 15,94,563 | 71,490 |

అడవులు : ఈ జిల్లాలోని అరణ్య ప్రాంతపు విస్తీర్ణము 6,44,263 ఎకరములు. టేకు, తుమికి, నూకమాను, బిల్లు, సోమి, చిరుమాను, చంద్రకొడిశ, ఇప్ప, నల్లమద్ది, చిన్నంగి మున్నగు వృక్ష జాతులు గలవు. వీనినుండి శ్రేష్ఠమైన కలప లభించును. మామిడి, సీతాఫలము, చింత, విరుగుడు, తంగేడు, తుమ్మ మున్నగునవి ఇతర వృక్ష జాతులు. గోదావరినదీ తీరప్రాంత మంతయు సాంద్రారణ్యమయము; పెద్దపులులు, చిరుతపులులు ఈ అడవులలో విరివిగ కాన నగుటచే వేట కనువగు ప్రదేశము.

ఖనిజ సంపద: కరీంనగరము జిల్లాలో శ్రేష్ఠమైన ఇనుపరాయి ప్రతిచోటను దొరకును. దీనిని పురాణ పద్ధతి ప్రకారము కరగించి నాగలికర్రు మొదలగు వ్యవసాయ పరికరములను తయారు చేయుదురు. ఈ ఇనుము నుండియే కోన సముద్రములో ఇబ్రహీమ్‌పట్టణములో వెనుకటి రోజులలో కత్తులు చేయు చుండెడివారు. ఈ ఉక్కుకత్తులు నిశిత ధారలకు ప్రసిద్ధి. స్టీటైటు, టాల్కు అను ఖనిజములు ఇనుప గనుల పరిసరములందు జిల్లా అంతటను దొరకును.

పట్టణములు : జిల్లా మొత్తముమీద పట్టణములలో ఈ జిల్లా యందు పెద్ద మునిసిపాలిటీలుగ కరీంనగరము, జగత్యాల అనునవి మాత్రమే పరిగణింపబడినవి.

కరీం నగరము : జనసంఖ్య 31,491 ; జిల్లా కేంద్రము.

జగత్యాల : జనసంఖ్య 20,942 ; తాలూకా కేంద్రము.

ప్రజలు : ఈ జిల్లా జనసంఖ్య* 16,20,417. ఇందు పురుషులు 8,12,377 ; స్త్రీలు 8,08,040 ; జన సాంద్రత చ. మైలునకు 360. 1951 - 61 మధ్య పది పండ్లలో ఈ జిల్లా యందలి జనసంఖ్య 13.46% వృద్ధి యైనది.

వృత్తులు : ఈ జిల్లాలో వ్యవసాయమే ముఖ్య వృత్తి ఏదో విధముగ వ్యవసాయముమీదనే ఆధారపడి ఉన్న వివిధ వర్గములవారి సంఖ్య ; 8,26,907 ; ఉత్పత్తికర పరిశ్రమల వలన జీవించువారు 3,91,002 ; వాణిజ్యము వలన జీవించువారు 47,525 ; తక్కిన వివిధ వృత్తులవలన జీవించు వారు 1,62,734.

భాషలు : జిల్లాలో అధిక సంఖ్యాకులకు అనగా దాదాపు 95% మందికి మాతృభాష తెలుగు. మిగిలిన అల్ప సంఖ్యాకులలో ఉర్దూ మాట్లాడు వారెక్కువ.

వ్యవసాయము : జిల్లా మొత్తముమీద వ్యవసాయము నకు అనుకూలమగు నేల 18,98,734 ఎకరములు మాత్రమే కలదు. ఇందు ప్రస్తుతము సాగగుచున్న భూమి విస్తీర్ణము 12,87,870 ఎకరములు. సాగగు భూమిలో 2,82,035 ఎకరములకు మాత్రమే నీటిపారుదల వసతి కలదు.

* 1961 జనాభా లెక్కల ప్రకారము.

భూసారమునుబట్టి ఇచటి నేలను చెలక, మాసాబు, రేగడ అని మూడు ముఖ్య విభాగములుగ విభజింపవచ్చును. అచ్చటచ్చట, ముఖ్యముగ నదీ లోయలో సారవంత మగు ఒండ్రునేలయు గలదు. చెలక నేలయందు తొలికారు సస్యములును, మాసాబు, రేగడ నేలలందు పైరు పంటలును పండింపబడుచున్నవి. మాసాబు నేల తోట సేద్యమునకు కూడ ఉపయోగింపబడుచున్నది.

ఈ జిల్లాయందు మెట్టభూమి ఎక్కువ. అందువలన ఎక్కువ విస్తీర్ణమున జొన్న పండింపబడుచున్నది. ఆ తరువాత లెక్కలోనికి వచ్చునది వరి. ప్రభుత్వపు కాలువలు, చెరువులు, బావులు మొదలగు నీటి వసతుల సాయమున ఈ పంట పండింపబడుచున్నది. క్రమముగ లెక్కలోనికి వచ్చునవి నువ్వు, మొక్కజొన్న, వేరుశనగ. మానేరు నదిమీద నిర్మింపబడిన ప్రాజెక్టు నుండి వచ్చు కాలువలును, పంట చెరువులును ఇచటి మాగాణి వ్యవసాయమునకు ముఖ్యాధారములు.

కరీంనగరము జిల్లా - పంటల వివరములు

1955 - 1956

| | | | |
|---|---|---|---|
| వరి | 2,82,940 ఎ. | మిరప | 20,306 ఎ. |
| గోధుమ | 1,569 ,, | పసుపు | 1,381 ,, |
| జొన్న | 3,08,474 ,, | ధనియాలు | 988 ,, |
| సజ్జ | 700 ,, | పండ్లు, కూరలు, దుంపలు | 5,195 ,, |
| మొక్కజొన్న | 1,42,494 ,, | | |
| వరిగ | 1,439 ,, | ప్రత్తి | 12,086 ,, |
| సామ | 2,703 ,, | జనుము | 2,209 ,, |
| శనగ | 19,065 ,, | వేరుశనగ | 1,24,909 ,, |
| పెసర | 1,22,059 ,, | నూవులు | 1,63,568 ,, |
| కంది | 18,002 ,, | ఆముదములు | 21,812 ,, |
| మినుము | 177 ,, | పొగాకు | 2,336 ,, |
| ఉలవ | 33,141 ,, | | |

పై లెక్కలలో చేరని ఇతర పైరులు 45,223 ఎ॥ములు.

కరీంనగరమున నున్న వ్యవసాయ పరిశోధన స్థానములో మొక్కజొన్న గురించి పరిశోధనలు సాగించు చున్నారు.

పశు సంపద : ఈ జిల్లాయందు మంచిజాతికి చెందిన పశువులు తక్కువ. ఉన్న పశువులు హీన జాతికి చెందినవి. చెలక భూములలో దున్నుటకు చిన్న పశువులు మాత్రమే ఎక్కువగ పనికి వచ్చుటచే ఇచటి ప్రజలు వీనినే అభిమానింతురు.

గృహపరిశ్రమలు : చేనేత పరిశ్రమ ఈ జిల్లా యందలి ముఖ్య గృహ పరిశ్రమ. జగత్యాలలో పట్టు చీరలు, రుమాళ్ళు నేయబడి హైదరాబాదునకు ఎగుమతి అగు చున్నవి. ముతక నూలు నేత జిల్లాయంతటను వివిధ కేంద్ర

ములందు సాగుచున్నది. జగత్యాల తాలూకా కోరట్లలో ముతక కాగితము తయారు చేయబడుచున్నది. కరీంనగరము మానుకొండలందు చక్కని వెండితీగతో వివిధ వస్తువుల అల్లకపు పని (ఫిలిగ్రీ పని) ని వృత్తిగా అవలంబించి కొందరు జీవించుచున్నారు.

రోడ్లు: ప్రక్క జిల్లాలకును, రాష్ట్ర రాజధాని అగు హైదరాబాదునకును ఈ జిల్లానుండి రోడ్లు పోవుచున్నవి. జిల్లాలోని రోడ్ల మొత్తపు నిడివి 375 మైళ్ళు; ఇందు రాష్ట్ర రహదారులకు చెందినవి 322 మైళ్ళు. స్థానిక సంస్థలకు చెందిన రోడ్ల నిడివి 53 మైళ్ళు. పల్లెపట్టులందు సరియైన రహదారుల వసతులు లేవు.

రైలు మార్గములు: మద్రాసునుండి ఢిల్లీకి పోవు బ్రాడ్ గేజ్ రైలుమార్గము ఈ జిల్లాలో దక్షిణమునుండి ఉత్తరమునకు ఒక పార్శ్వమున పోవుచున్నది. దగ్గర రైల్వే స్టేషను పెద్దపల్లి జిల్లా కేంద్ర మగు కరీంనగరమునకు 26 మైళ్ళ దూరమున కలదు.

విద్య: 1961 లెక్కల ప్రకారము ఈ జిల్లాలో అక్షరాస్యత 12.58%; పురుషులలో 20.69%, స్త్రీలలో 4.43%. జిల్లా యందలి వివిధ వర్గముల విద్యా సంస్థల సంఖ్యా వివరములు దిగువ ఈయబడినవి (1956-57).

| విద్యా సంస్థల వివరము | సంఖ్య | ఉపాధ్యాయ సంఖ్య | విద్యార్థుల సంఖ్య |
|---|---|---|---|
| ప్రాథమిక పాఠశాలలు | 1,004 | 2,134 | 58,506 |
| మాధ్యమిక పాఠశాలలు | 17 | 297 | 7,312 |
| ఉన్నత పాఠశాలలు | 4 | 134 | 4,004 |
| ప్రత్యేక, వృత్తి బోధన పాఠశాలలు | 1 | 8 | 99 |
| | 1,026 | 2,573 | 69,921 |

ఇవికాక కరీంనగరములో ఆర్ట్సు అండ్ సైన్సు కళాశాల ఒకటి ప్రభుత్వ యాజమాన్యమున నిర్వహింపబడుచున్నది. ఇందు 150 విద్యార్థులును, 5 విద్యార్థినులును ఉన్నారు.

ఆరోగ్యము, వైద్యము: జిల్లా వాతావరణము చక్కగా ఉన్నను, గోదావరీ పరిసర ప్రాంతములు మన్యపు భూములగుటచే మలేరియా బాధ హెచ్చుగ ఉన్నది; వైద్య సదుపాయములు తక్కువ. జిల్లా మొత్తము మీద జనరల్ ఆసుపత్రి 1, డిస్పెన్సరీలు 12 ఆధునిక విధానమున వైద్య సహాయము చేయుచున్నవి. వీని యందలి పడకల సంఖ్య 186. ఇవి కాక యూనానీ చికిత్సాశాలలు 9, ఆయుర్వేద వైద్యశాలలు 10 జిల్లా మొత్తమున కలవు (1956-57). ఆ. వీ. రా.

చూడదగిన స్థలములు: ఈ జిల్లాలో పెక్కు కోటలు, దేవాలయములు, మసీదులు, పూరాతత్త్వశాఖ దృష్టిలో గణనీయములైనవి ఉన్నవి. ఎల్లందల కోట చాల పూరాతనమగు కట్టడము; ఇది కరీంనగరమునకు 8 మైళ్ళ దూరమున ఉన్నది. బాజూగూరు, మలంగూరు, గురుశాల అను ప్రదేశములందును పూర్వ కాలమున నిర్మింప బడిన కోటలు కలవు. క్రీ. శ. 1747 న జఫరుద్దౌలా కట్టించిన కోట ఒకటి జగత్యాలలో ఉన్నది.

ఈ జిల్లాలో హిందువుల పుణ్య క్షేత్రములు 73 కలవని అందురు. వానిలో పేర్కొన తగినవి వేములవాడ, కాళేశ్వరము, ధర్మపురి, మహదేవపూరు.

వేములవాడ: ఇది పూర్వమున చాళుక్య వంశజులలో ఒకకోవ వారికి రాజధానియై ఉండెను. ఆ కాలమునకు చెందిన చక్కని దేవాలయములు మున్నగు వాస్తునిర్మాణములు నేటికిని నిలచి ఉన్నవి; దీనికి వేములవాడ, లేములవాడ అనునవి ప్రాచీన నామములు. ఈ గ్రామము కరీంనగరమునకు ఇరువది మైళ్ళు దూరమున కలదు. ఇచట రాజేశ్వరాలయము, బద్దెగేశ్వరాలయము అను దేవాలయములు నేటికిని యాత్రికులను ఆకర్షించుచున్నవి. చాళుక్య వంశజుడగు రాజాదిత్యుడు, బద్దెగరాజు అను వారికి క్రమమున ఈ దేవాలయముల నిర్మాణ విషయమున సంబంధము కలదని భావింప బడుచున్నది. ఈ దేవాలయములందు చాళుక్య రాజులనాటి పెక్కు శాసనములు కాన వచ్చుచున్నవి. ఇటీవల ఇచట కాన్పించిన ముద్దు లొలుకు సూర్య విగ్రహమును బట్టి పూర్వ మిచట సూర్యోపాసన కూడ ఉండె నని తోచుచున్నది.

మహాశివరాత్రి సందర్భమున 15 దినముల వరకు ఇచట ఉత్సవములు జరుగును. యాత్రికుల వసతికై తగు సౌకర్యములు ఇచట ఏర్పరుప బడినవి.

కాళేశ్వరము: మహదేవపూరు సమీపమున గోదావరి తీరమున ఉన్న ఒక పురాతన క్షేత్రము. త్రిలింగమను దేశనామపు వ్యుత్పత్తిని సూచించు మూడు లింగములలో ఇచటి లింగము ఒకటి అని కొందరి ఉద్దేశము. ఈ క్షేత్రపు ప్రస్తావన బ్రహ్మాండ పురాణము నందును, ప్రతాపరుద్ర యశో భూషణము నందును కలదు. క. ల. శా.

ధర్మపురి: గోదావరి నది దక్షిణ తీరమున గల సుప్రసిద్ధ వైష్ణవ క్షేత్రములలో ఇది ఒకటి. ఇది ఈ జిల్లాలోని జగత్యాల తాలూకాలో ఉన్నది. ఇచ్చటి నరసింహాలయము కడు విఖ్యాతి కెక్కినది. ఈ గ్రామములో అందము తొలుకాడు శిల్పముతో నొప్పారు కాకతీయయుగము నాటి దేవాలయము లున్నవి. నేటికిని ప్రసిద్ధి గాంచిన వైష్ణవ

పండితులకు నిలయమిది. "భూషణ వికాస శ్రీధర్మపుర నివాస దుష్ట సంహార నరసింహ దురితదూర" అను మకుటముతో రచింప బడిన ప్రసిద్ధ నరసింహాశతకము ఈ ధర్మపురి నరసింహస్వామి మీద చెప్పినదే. మ. సో. శ.

మంథెని : కరీంనగరము నుండి 42 మైళ్ళు దూరమున ఉన్న ఈ తాలూకా కేంద్రమున గల గౌతమేశ్వరుని ఆలయము అతి ప్రాచీనము. ఈ గ్రామము పూర్వ కాలమున కాశికి సమానమగు విద్యాకేంద్రముగ ప్రశస్తిని వహించినది. ఇప్పటికిని ఈ గ్రామము సంస్కృత పండితులకును వేద విదులకును పేరు గాంచి ఉన్నది.

జిల్లా సంక్షిప్త చరిత్ర : ఈ జిల్లా ప్రాచీన చరిత్ర అంతగా తెలియరాదు. అయినను ఇది ఓరుగల్లు రాజ్య భాగముగా ఉండె ననుట నిక్కము. ముసల్మానులు తెలంగాణాను జయించిన తరువాత, కాకతీయ రాజ్య పతనానంతరము బహ్మనీ నవాబులు, గోల్కొండ కుతుబ్‌షాహీలు దీనిపై అధిపత్యమును వహించిరి. గోల్కొండ పతనానంతరము ఇది మొగలు సామ్రాజ్యములో చేరిపోయెను. పదునెనిమిదవ శతాబ్ద ప్రారంభములో మొగలు సామ్రాజ్యమునుండి విడిపోయి, హైదరాబాదు రాజ్య స్థాపకుడగు అసఫ్‌జాహి యొక్క నిజాం రాజ్యములోనికి వచ్చెను.

ఎల్లందలకోట అత్యంత పురాతన కట్టడము, ఈ కోటలో 1754 లో కట్టబడిన మసీదు గోపురమును కదలించినచో ఊగులాడుచుండునట. బాజుగూరు (బిజగిరి) కోట 750 సంవత్సరముల క్రిందట, మలంగూరు కోట సుమారు 1100 సంవత్సరముల క్రిందట నిర్మింపబడినవి. గురుశాలలోని దేవాలయము 1229 సంవత్సర ప్రాంతమున కట్టబడినది. జగత్యాలలో ఒక కోట ఉన్నది. దీనిని జఫరుద్దౌలా కట్టించెను (1747). ఆ తరువాత నిజాం సంస్థాన అంతర్భాగమై 'పోలీసు చర్య' అనంతరము (1948) భారత దేశమున విలీనమైన హైదరాబాదు రాష్ట్ర భాగముగా 1956 వరకు ఉండెను. రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ సందర్భమున (1956) ఆంధ్రప్రదేశ్‌లో అంతర్గతమయ్యెను. ఆ. వీ. రా.

# వరంగల్లు జిల్లా

ఉనికి - విస్తీర్ణము : వరంగల్లు జిల్లా ఉ. అక్షాంశము 16°50′ నుండి 18°30′ వరకును, తూ. రేఖాంశము 79°10′ నుండి 81′ వరకును విస్తరించి ఉన్నది. ఈ జిల్లాకు సరిహద్దులుగ ఉత్తరము కరీంనగరము జిల్లా ; తూర్పు ఖమ్మం జిల్లా; దక్షిణము ఖమ్మం జిల్లా; పడమర నల్గొండ, మెదకు జిల్లాలు కలవు.

ఈ జిల్లాయందు జనగామ, మహబూబాబాదు, ములుగు, పాఖాల, పరకాల, వరంగల్లు అను ఆరు తాలూకాలు ఉన్నవి. జిల్లా వైశాల్యము 5,320 చ. మైళ్ళు.

నైసర్గిక స్వరూపము : జిల్లాయందు అంతటను అచ్చటచ్చట చిన్న గుట్టలు విరివిగ గలవు. వరంగల్లునకు వాయవ్యమున పదిమైళ్ళ దూరమున ఉన్న చంద్రగిరి గుట్టల వరుసయు, దానికి పడమరగ పదునాలుగుమైళ్ళ దూరమున హసన్‌పర్తి ఇనుప గుట్టలును ముఖ్యముగ పేర్కొనతగిన గుట్టలు. వరంగల్లునకు అతి సమీపమున ఉన్న హనుమకొండ సముద్ర మట్టమునకు 1,700′ ఎత్తున ఉన్నది. జిల్లా యొక్క సగటు ఎత్తు 870′.

నదులు : ఈ జిల్లాలోని ముఖ్యమైన నది గోదావరి. జిల్లా ఉత్తరమునుండి ఆగ్నేయ దిశగా 40 మైళ్ళు ఈ నది ప్రవహించుచున్నది. మున్నేరు, పాలేరు, కిన్నెరసాని ముఖ్యమైనవి. మున్నేరు పాఖాల చెరువునుండి బయలుదేరి, వైరాతో కలిసి 96 మైళ్ళు ప్రవహించి కృష్ణలో సంగమించును. పాలేరు నది వరంగల్లు తాలూకాలో జన్మించి మున్నేరుతో సమానాంతరముగ ప్రవహించుచు, జగ్గయ్యపేటకు దక్షిణమున కృష్ణానదిలో పడుచున్నది. కిన్నెరసాని నది పాఖాల తాలూకాలో ప్రవేశించి ఖమ్మం జిల్లాలోనికి పోవును.

శీతోష్ణస్థితి : ఈ జిల్లాలోని అన్ని ప్రాంతములందును వేసవికాలమున ఎండలును, చలికాలమున చలియు ఎక్కువ; అత్యధిక ఉష్ణోగ్రత 109° ఫా., అత్యల్ప ఉష్ణోగ్రత 48° ఫా.

వర్షపాతము : ఈశాన్య, నైరృతి ఋతుపవనముల వలన ఈ జిల్లాకు వర్షము లభించుచున్నది. అయినను 80% వర్షము నైరృతి ఋతుపవనమువలన మాత్రమే లభించుచున్నది. సంవత్సరమున సరాసరి వర్ష పాతము 38.2″.

అడవులు : ఈ జిల్లాలో అరణ్య ప్రాంతము విస్తారముగ ఉన్నది. అడవుల మొత్తపు విస్తీర్ణము 3,25,387 ఎకరములు. ఈ అడవులయందు టేకు, శ్రీగంధం, చంద్ర, బండారు, ఇప్ప, చిన్నంగి, కొడిశ, నల్లమద్ది, వెదురు వృక్ష జాతులు విరివిగ కలవు. ములుగు, పాఖాల ప్రాంతపు అడవులు అతి సాంద్రములు.

ఖనిజ సంపద : ఈ జిల్లాలో ఖనిజ సంపత్తి పేర్కొనదగినది. నేలబొగ్గు, కెంపురాయి, ఇనుము, కట్టడపురాయి ముఖ్యములు. పరిటాలలో వజ్రము గనులు కలవు ; ఇప్పుడు

## వరంగల్లు జిల్లా - తాలూకా వివరణములు

| వరుస సంఖ్య | తాలూకా పేరు | తాలుకా కేంద్రము | గ్రామముల సంఖ్య (1951) | గ్రామీణ జనాభా (1951) | పట్టణములు (1951) | పట్టణ జనాభా (1951) | విస్తీర్ణము (చదరపు మైళ్ళలో) (1951) | మొత్తము నీటి పారుదల వసతి గల నేల విస్తీర్ణము (ఎకరములలో) (1959) | సాగుచేయబడిన నేల (ఎ॥ములలో) (1959) | ప్రస్తుతము సాగులో లేని బీడు నేల (ఎ॥ములలో) (1959) | మొత్తము సాగుకు తగిన నేల (ఎ॥ములలో) (1959) | సాగుచేయ వీలగు బంజరు నేల (ఎ॥లలో) (1959) |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. | జనగామ | జనగామ | 1 | 2,74,531 | 2 | 16,634 | 372 | 42,954 | 2,46,148 | 1,46,893 | 3,93,041 | 22,253 |
| 2. | మహబూబాబాదు | మహబూబాబాదు | 144 | 2,17,747 | 2 | 18,221 | 779 | 51,610 | 2,36,991 | 92,827 | 3,29,818 | 8,960 |
| 3. | ములుగు | ములుగు | 101 | 62,406 | 1 | 3,886 | 1,347 | 30,242 | 66,618 | 56,240 | 1,22,858 | 20,303 |
| 4. | పాఖాల (నరసంపేట) | నరసంపేట | 96 | 1,01,002 | 1 | 5,751 | 745 | 39,796 | 1,14,625 | 21,137 | 1,35,762 | 9,050 |
| 5. | పరకాల | పరకాల | 123 | 1,47,326 | 1 | 6,173 | 556 | 36,726 | 1,16,238 | 74,269 | 1,90,507 | 13,500 |
| 6. | వరంగల్లు | వరంగల్లు | 199 | 2,320,16 | 2 | 1,40,291 | 786 | 78,902 | 2,50,119 | 1,31,871 | 3,81,990 | 14,004 |
| | | మొత్తము | 847 | 10,35,028 | 9 | 1,90,956 | 4,585 | 2,80,230 | 10,30,739 | 5,23,237 | 15,53,976 | 88,070 |

పని జరుగుట లేదు. పాపటపల్లి సమీపమున నున్న జస్తిపల్లిలో 1928 లో పాలరాళ్ళ గనులు కనిపెట్ట బడినవి. ఈ రాయి సున్నము చేయుటకు ఉపయోగింప బడుచున్నది.

పట్టణములు : జిల్లా మొత్తముమీద పట్టణములలో వరంగల్లు నగరమునకు మాత్రమే మునిసిపాలిటీ గలదు.

వరంగల్లు : జనసంఖ్య 1,56,163 ; జిల్లా కేంద్రము, వ్యాపార కేంద్రము.

ప్రజలు : ఈ జిల్లాయందలి జనసంఖ్య* 15,45,750 ; వీరిలో పురుషులు 7,91,156 ; స్త్రీలు 7,54.594 ; జన సాంద్రత చ. మైలునకు 290. 1951 - 61 మధ్య పది ఏండ్లలో ఈ జిల్లా జనసంఖ్య 16·24% హెచ్చినది.

వృత్తులు : ఈ జిల్లాలో వ్యవసాయమే ముఖ్య వృత్తి. ఏదోవిధముగ వ్యవసాయము మీదనే ఆధారపడి ఉన్న వివిధ వర్గములవారి సంఖ్య 8,22,875 ; ఉత్పత్తికరము లగు పరిశ్రమలవలన జీవించువారు 2,92,213 ; వాణిజ్యమువలన జీవించువారు 56,990, వివిధ వృత్తుల వలన జీవించువారు 1,53,906 (1951).

భాషలు : ఈ జిల్లాలో అత్యధిక సంఖ్యాకుల మాతృ భాష తెలుగు. ఆ తరువాత లంబాడి, ఉర్దూ భాషలు క్రమముగ పరిగణింప దగినవి.

వ్యవసాయము : జిల్లా మొత్తముమీద వ్యవసాయమునకు అనుకూల మగు నేల 17,90,914 ఎకరములు. ఇందు ప్రస్తుతము సాగగుచున్న భూమి 11,20,304 ఎకరములు. సాగు భూమియందు 2,59,403 ఎకరములకు మాత్రమే నీటి పారుదల వసతి గలదు.

ఈ జిల్లాయందు పంట చెరువుల సంఖ్య అత్యధికము. పూర్వము వరంగల్లు రాజధానిగా కాకతీయ సామ్రాజ్యమును పాలించిన ప్రభువులచే ఇందు అనేక తటాకములు నిర్మితము లైనవి. వీనిలో పాఖాల, రామప్ప, లక్నవరము, ఘనపురము చెరువులు చాల ప్రసిద్ధి చెందినవి. రామప్ప చెరువు, లక్నవరము చెరువు అనునవి రామ లక్ష్మణుల పేరున నిర్మితములై తోడ బుట్టినవారివలె దగ్గర దగ్గరగా ఉన్నవి. రామప్ప చెరువు నీటి పరపు వైశాల్యము 82 చ. మైళ్ళు; లక్నవరము చెరువు నీటి పరపు 75 చ. మైళ్ళు. పాఖాల చెరువు 13 చ. మైళ్ళు. ఈ చెరువుల సాయమున పల్లపుసాగు ఈ జిల్లాలో విరివిగ జరుగుచున్నది. మహబూబాబాదు, పాఖాల తాలూకాలలో రేగడ నేలయు, వరంగల్లు, ములుగు తాలూకాలలో చెలక భూములును విస్తారముగ గలవు.

* 1961 వ సంవత్సరము జనాభా లెక్కల ప్రకారము

వరంగల్లు జిల్లా - పంటల వివరములు
(1955 - 1956)

| | | | |
|---|---|---|---|
| వరి | 2,64,488 ఎ. | మిరప | 18,618 ఎ. |
| జొన్న | 5,29,706 ,, | ధనియాలు | 4,141 ,, |
| సజ్జ | 43,327 ,, | పండ్లు, కూరలు, | |
| మొక్కజొన్న | 81,766 ,, | దుంపలు | 6,238 ,, |
| కొఱ్ఱ | 1,870 ,, | ప్రత్తి | 3,844 ,, |
| వరిగ | 2,281 ,, | జనుము | 2,140 ,, |
| సామ | 6,428 ,, | వేరుశనగ | 1,61,903 ,, |
| శనగ | 7,892 ,, | నువ్వులు | 29,578 ,, |
| పెసర | 1,27,569 ,, | ఆముదాలు | 41,316 ,, |
| కంది | 20,289 ,, | పొగాకు | 6,868 ,, |
| మినప | 395 ,, | పశుగ్రాసము | 343 ,, |
| ఉలవ | 19,191 ,, | | |

పై లెక్కలలో చేరని ఇతర పైరులు 6,490 ఎకరములు.

ఆహార ధాన్యముల విషయమున ఈ జిల్లా అదనపు ఉత్పత్తిచేయు జిల్లాగ పరిగణింప బడుచున్నది. ఇచటనుండి ఎగుమతి అగు ఆహార ధాన్యములలో వరి బియ్యము, జొన్నలు ముఖ్యములు.

ఈ జిల్లాలోని చెల్వాయియందు వ్యవసాయ పరిశోధన కేంద్రము ఒకటి కలదు. ఫల జాతులకు కావలసిన ఎరువులను గురించి ఇచట పరిశోధనలు జరుగుచున్నవి.

పశు సంపద : ఈ జిల్లాలోని పశువులు తెలంగానాలో సామాన్యముగ ఉండు కుదుపుట్టపు జాతికి చెందినవి. ఇవి ఆకారమున చిన్నవిగ ఉన్నను దృఢముగ ఉండును. వీనిని ఎక్కువగ లంబాడీలు అభిమానింతురు.

గృహ పరిశ్రమలు : వరంగల్లు జిల్లా చేతి పనులకు ప్రసిద్ధి చెందినది. తివాచీలు, చొక్కాలకు, కోట్లకు పనికి వచ్చెడు రంగు పట్టు వస్త్రములు, నూలు వస్త్రములు ఇచట తయారగుచున్నవి. మురెవాడ, కరీమాబాదులలో తయారగు పట్టు, నూలు, ఉన్ని, జంపకానాలు చాల నాణ్యమైనవి అగుటచే యూరపునకు సైతము ఎగుమతి అగుచున్నవి. పాఖాలలో కూడ చత్రంజీలు, తివాచీలు తయారగుచున్నవి. టస్సారా పట్టు గుడ్డలకు హసన్‌పర్తి ప్రసిద్ధి వహించినది. సామాన్యపు నేత గుడ్డలు ఈ జిల్లా యంతటను పలు కేంద్రములలో తయారగుచున్నవి.

రోడ్లు : జిల్లా ప్రధాన స్థలమగు హనుమకొండ నుండి అన్ని తాలూకా కేంద్రములకును రోడ్ల వసతి కలదు. వీని నుండి పోవు శాఖా మార్గములును కలవు. మొత్తము మీద రోడ్ల నిడివి 518 మైళ్ళు. ఇందులో రాష్ట్ర రహదారులకు చెందినది 407 మైళ్ళు; వివిధ స్థానిక సంస్థలకు చెందినది 111 మైళ్ళు.

రైలు మార్గము: హైదరాబాదు నుండి విజయవాడకు పోవు రైలు మార్గము ఈ జిల్లాగుండ పోవుచున్నది. కాజీపేట పెద్ద రైల్వే జంక్షన్.

విద్య: 1961 లెక్కల ప్రకారము ఈ జిల్లాలో అక్షరాస్యత 15.17%; పురుషులలో 23.43%, స్త్రీలలో 6.52% కలదు. ఉన్నత విద్యా సంస్థలు వరంగల్లు నందు మాత్రమే కలవు. పల్లెపట్టులందు విద్యా బోధన వసతులు తక్కిన తెలంగాణా జిల్లాల కన్న కొంత వరకు మెరుగుగ ఉన్నవి. జిల్లా యందలి వివిధ వర్గముల విద్యాశాలల సంఖ్యా వివరములు దిగువ ఈయబడినవి (1956 - 57).

| విద్యా సంస్థల వివరము | సంఖ్య | ఉపాధ్యాయ సంఖ్య | విద్యార్థి సంఖ్య |
|---|---|---|---|
| ప్రాథమిక పాఠశాలలు | 968 | 2,361 | 66,646 |
| మాధ్యమిక పాఠశాలలు | 19 | 373 | 7,878 |
| ఉన్నత పాఠశాలలు | 10 | 256 | 6,308 |
| ప్రత్యేక వృత్తి బోధన పాఠశాలలు | 3 | 13 | 207 |
| | 1,000 | 3,003 | 81,039 |

ఇవికాక వరంగల్లులో ఆర్ట్సు అండ్ సైన్సు కళాశాల ఒకటి కలదు. ఇందు 421 విద్యార్థులును, 19 విద్యార్థినులు కలరు. ఉపాధ్యాయులకు శిక్షణ నిచ్చుటకు బోధనాభ్యాసన కళాశాల ఒకటి కలదు. వైద్య కళాశాల ఒకటియు, ఇంజనీరింగు కళాశాల ఒకటియు ఇటీవల అట స్థాపింపబడినవి.

ఆరోగ్యము, వైద్యము: జిల్లాలో ఎక్కువభాగము మన్య ప్రాంతము. జూను నుండి జనవరి వరకు మలేరియాయును, శ్వాసకోశ జ్వరముల వ్యాప్తియును ఎక్కువ. వైద్య వసతులు జిల్లా విస్తీర్ణమునకును, అవసరములకును తగినన్ని లేవు. జిల్లా మొత్తమున ఆధునిక వైద్య విధానము ననుసరించు జనరల్ ఆసుపత్రులు 6, డిస్పెన్సరీలు 6 కలవు. వీనియందలి పడకల సంఖ్య 283; ఇవికాక జిల్లా యందు యూనానీ చికిత్సా శాలలు 4, ఆయుర్వేద వైద్యశాలలు 5 వైద్య సహాయమునకు ఉపకరించు చున్నవి.

చూడదగిన స్థలములు: వరంగల్లు జిల్లా చారిత్రక ప్రసిద్ధి కలది. కాకతీయ రాజులకు రాజధాని నగరముగ విలసిల్లిన ఓరుగల్లే నేటి వరంగల్లు. మాధవ వర్మ మొదలు ప్రతాపరుద్ర చక్రవర్తి వరకు వేయి సంవత్సరములు ఆంధ్రుల చరిత్ర ఈ నగర గర్భమున కలదు. కాకతీయ రాజ్యము అంతరించిన తరువాత ఈ కోట బహ్మనీ నవాబుల వశమయ్యెను. బహ్మనీ వంశ పతనానంతరము కుతుబ్ షాహీలు ఈ ప్రాంతమునకు ప్రభువులైరి. పదునారవ శతాబ్ద ప్రారంభమున షితాబ్ ఖాన్ అను బిరుదు గల సీతాపతి ఓరుగల్లును పరిపాలించెను. ఓరుగల్లు కోటలో నేడు కనబడు దర్బారుహాలు ఈ షితాబ్ ఖాన్ కట్టించినదే.

ప్రాచీన వస్తు శేషములలో ముఖ్యముగ పేర్కొనతగినది హనుమకొండలోని వేయి స్తంభముల గుడి. దీనిని క్రీ. శ. 1164 లో చాళుక్య శిల్పము ననుసరించి కాకతీయ రాజులు నిర్మింప చేసిరి.

ములుగు తాలూకాలోని రామప్ప దేవాలయము మరియొక సుందరమందిరము. కాకతీయయుగపు ఆంధ్రశిల్పుల కళా చాతుర్యము ఇందు పరాకాష్ఠను అందు కొనినది.

జీడికల్లు, అయినవోలు, కొలనుపాక అనునవి ఈ జిల్లా యందలి ముఖ్య పుణ్య క్షేత్రములు.

జీడికల్లు: ఆలేరు స్టేషనుకు సమీపమున ఈ పుణ్య క్షేత్రము కలదు. మాయామృగ వేషమును పొందిన మారీచుని శ్రీరామమూర్తి ఇచట వధించెనని ఇచటి వారి సాంప్రదాయిక విశ్వాసము. కొన్ని పదాంకములను సైతము ఇందులకు నిదర్శనముగ వారు చూపింతురు. ఆ. వీ. రా.

అయినవోలు: వరంగల్లునకు దక్షిణముగ పది మైళ్ళ దూరమున ఉన్న ఈ క్షేత్రమందు మైలారు దేవుని ఆలయము ఉన్నది. ఇందలి విగ్రహము చూచుటకు చాల భయంకరముగ ఉండును. కాకతీయ ప్రభువుల కాలమున ఈ ఆలయ నిర్మాణము జరిగి ఉండును. మైలారు దేవుని గురించియు, అచట జరుగు జాతరను గురించియు ప్రస్తావన 'క్రీడాభి రామము' న కలదు.

కొలనుపాక: ఈ జిల్లాలోని ఆలేరు రైలు స్టేషనుకు 2 మైళ్ళ దూరమున ఉన్న ఈ క్షేత్రము నేడు కేవలము జైనులకు మాత్రమే యాత్రా స్థలముగ ఉన్నది. జైన తీర్థంకరులలో నొకడగు ఋషభ దేవుని ఆకుపచ్చ రాతి విగ్రహ మిచట జైనులచే సేవింపబడుచున్నది. కాకతీయుల కాలము వరకును జైన క్షేత్రముగ మాత్రమే విలసిల్లిన ఈ క్షేత్రము, ఆ ప్రభువుల కాలమున శైవ క్షేత్రముగ మారెను. ఇచట కనబడు వీర నారాయణస్వామి దేవాలయము మాత్రము అంత ప్రాచీనతమము కాదు.

ఈ గ్రామ నామమును కూర్చి స్థానిక వృత్తాంతము లెన్నియో కలవు. ప్రతాపరుద్ర చక్రవర్తి 'కొలను' అనెడి గ్రామమును దానము చేసినందున ఈ గ్రామము 'కొలనుపాక' అయ్యెనని కొందరు చెప్పుదరు. కొలనుపాకకు ఇందు 'బింబావతీపురము' అని నామాంతరము కల దనియు, ఈ నామధేయము కాకతీయ రుద్రమదేవి భర్తయైన వీరేంద్ర శేఖరుని వలన ఏర్పడె ననియు మరియొక గాథ కలదు. కాకతీయుల శాసనములందు వీరేంద్ర శేఖరుని పుట్టు

పూర్వోత్తరములను కూర్చి విశదముగ తెలుపబడి ఉండినందున బహుశః రుద్రమదేవి కాలమున ఈ గ్రామమునకు కొంత రాజకీయ ప్రాధాన్యము కూడ ఉండెనేమో అని తోచుచున్నది. క. ల. శా.

జిల్లా సంక్షిప్త చరిత్ర: వరంగల్లు జిల్లా చారిత్రక ప్రసిద్ధి కలదిగా నున్నది. ఆంధ్రుల వీరవిహారమునకును, ఆంధ్రభాషా వికాసమునకును ప్రధాన రంగముగా వెలసియుండును. విశాల కాకతీయ సామ్రాజ్యమునకు ఆటపట్టయినట్టిది ఈ ప్రాంతమే. కాకతీయ రాజులకు ఓరుగల్లు రాజధాని నగరముగా నుండెను. మాధవ వర్మ మొదలుకొని ప్రతాపరుద్ర చక్రవర్తి వరకు వేయి సంవత్సరముల ఆంధ్ర చరిత్ర వరంగల్లు గర్భమున గలదు. 12వ శతాబ్దములో ప్రోలరాజు చాళుక్య రాజగు మూడవ తైలపదేవుని ఓడించి యుండెను. ఈతని కొడుకు రుద్రదేవుడు రాజ్యమును విస్తరింపచేసెను. రుద్రదేవుని కొడుకు గణపతిదేవుడు కళింగరాజును నిర్జించెను. ఈతనికి గుజరాతు, బెంగాలు రాజులు సామంతులయిరి. దక్షిణమున నెల్లూరు వరకు ఈతని సామ్రాజ్యము వ్యాపించి యుండెను. గణపతిదేవుని కూతురు రుద్రమదేవి 1260 లో చక్రవర్తిని అయ్యెను. 1296 లో ప్రతాపరుద్రుడు చక్రవర్తి అయ్యెను. 1303 లో మహమ్మదీయులు ఈ రాజ్యమును జయింప ప్రయత్నించి విఫల మనోరథులయిరి. 1310 లో మాలిక్ కాఫర్ మరల దండయాత్ర చేసెను. అప్పుడు ప్రతాపరుద్ర చక్రవర్తి లొంగి పోయెను. 1321 లో మహమ్మదుబిన్ తుగ్లకు కాకతీయ సామ్రాజ్యమును పూర్తిగ స్వాధీనము చేసికొనెను. ప్రతాపరుద్రుడు బంధితుడాయెను. కాకతీయ రాజులలో వీరభద్రుడు కడపటివాడుగ కనబడుచున్నాడు. ఇతడు 1325 లో కొండవీడుకు పారిపోయెను. ఇంతటితో కాకతీయ వంశపు సమాచారము పూర్తి అగుచున్నది. తరువాత ఓరుగల్లుకోట బహ్మనీ నవాబుల వశమయ్యెను. బహ్మనీ వంశ పతనానంతరము గోల్కొండ కుతుబుషాహీలు రాజులయిరి. తరువాత నిది అసఫ్ జాహీ నవాబులకు సంక్రమించెను. పదునారవ శతాబ్ద ప్రారంభమున షితాబుఖాను బిరుదాంకితుడగు సీతాపతిరాజు ఓరుగల్లు నేలియుండెను. ఓరుగల్లు కోటలోని దర్బారు హాలుఈ షితాబుఖాను కట్టించినదే. ఈ షితాబుఖాను స్వాధీనములో ఖమ్మముమెట్టు కోటయును చాలాకాలముండెను.

1948 వరకు నిజామ్ సంస్థాన అంతర్భాగమైయున్న ఈ జిల్లా రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ (1956) సందర్భమున ఆంధ్రప్రదేశ్‌లో అంతర్గత మయ్యెను.

ప్రాచీన వస్తు అశేషములలో హనుమకొండలోని వేయి స్తంభముల గుడి పేర్కొనదగినది. దీనిని 1164 లో చాళుక్య శిల్పము ననుసరించి కాకతీయ వంశమువారు నిర్మించి యుండిరి. మరియొక సుందరమైన కట్టడము ములుగు తాలూకాలోని రామప్ప దేవాలయము (1204). ఖమ్మముమెట్టులోని కోట సుమారు 1000 సంవత్సరముల క్రిందట నిర్మాణమైనట్లు చెప్పబడుచున్నది. జఫర్‌గడ్ (వేల్పుగొండ) దుర్గము రెండు రాతి ప్రాకారములు, 7 బురుజులు గల బలీయమైన దుర్గము. ఆ. వీ. రా.

# ఖమ్మం జిల్లా

ఉనికి - విస్తీర్ణము : ఆంధ్రప్రదేశపు ఉత్తరపు సరిహద్దును ఆనుకొని ఉన్న ఖమ్మం* జిల్లా ఉ. అక్షాంశము 16° 40′ మొదలు 18° 50′ వరకును, తూర్పు రేఖాంశము 80° మొదలుకొని 81° 20′ వరకును విస్తరించి ఉన్నది. ఈ జిల్లాకు తూర్పు తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి, కృష్ణా జిల్లాలు; దక్షిణము కృష్ణా, నల్గొండ జిల్లాలు; పడమర వరంగల్లు జిల్లా; ఉత్తరము మధ్యప్రదేశ్ రాష్ట్రము హద్దులుగ ఉన్నవి. జిల్లాయందు, ఖమ్మం, ఇల్లందు, బూర్గంపాడు మధిర, పాల్వంచ, నూగూరు, భద్రాచలము అను ఏడు తాలూకాలు కలవు. నూగూరు, భద్రాచలము తాలూకాలను సమష్టిగ ఏజన్సీ ప్రాంతమని వ్యవహరింతురు. ఈ జిల్లా విస్తీర్ణము 5,736 చ. మైళ్ళు.

నైసర్గిక స్వరూపము : ఈ జిల్లాయందు భూమి పడమర నుండి తూర్పునకు వాలి ఉన్నది. సింగరేణి నుండి బయలుదేరిన చిన్న గుట్టల వరుస ఆగ్నేయ దిశగా ముందునకు సాగి అశ్వారావుపేట వరకు పోయి దిగువ గోదావరి లోయకు సరిహద్దుగా ఏర్పడినది. జిల్లా మధ్య భాగమునను, తూర్పుభాగము నను చిన్న చిన్న కొండల పంక్తులు కలవు. వీనిలో మ్రిరిగుట్ట, రాజగుట్ట, ఎర్రగుట్ట అనునవి పేర్కొన తగినవి.

నదులు : ఈ జిల్లాయందు ఉత్తరమున ఉన్న నూగూరు, భద్రాచలము తాలూకాలను తక్కిన తాలూకాల నుండి

*1953 వ సం॥ అక్టోబరు 1వ తేదీన వరంగల్లుజిల్లా నుండి కొంత భాగము వేరుపరుపబడి ఈ జిల్లాగా రూపొందింపబడినది. తరువాత పరిపాలనా సౌకర్యమును ఉద్దేశించి, తూర్పు గోదావరి జిల్లాలోని నూగూరు, భద్రాచలము తాలూకాలు ఈ జిల్లాకు కలుపబడినవి.

## ఖమ్మం జిల్లా - తాలూకా వివరములు

| వరుస సంఖ్య | తాలూకా పేరు | తాలూకా కేంద్రము | గ్రామముల సంఖ్య (1951) | గ్రామీణ జనాభా (1951) | పట్టణములు (1951) | పట్టణ జనాభా (1951) | విస్తీర్ణము చ. మైళ్లలో (1951) | మొత్తము నీటి పారుదల వసతిగల నేల విస్తీర్ణము ఎ॥ములలో (1959) | సాగుచేయబడిన నేల ఎకరములలో (1959) | ప్రస్తుతము సాగులోలేని బీడు నేల ఎకరములలో (1959) | మొత్తము సాగుకు తగిన నేల ఎకరములలో (1959) | సాగుచేయ వీలగు బంజరు నేల ఎకరములలో (1959) |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. | ఖమ్మం | ఖమ్మం | 156 | 2,06,827 | 1 | 28,251 | 591 | 60,181 | 1,93,515 | 1,20,078 | 3,13,588 | 4,879 |
| 2. | మధిర | మధిర | 157 | 1,60,732 | 2 | 9,929 | 772 | 42,191 | 1,87,519 | 67,303 | 2,54,822 | 5,964 |
| 3. | కొత్తగూడెము (పాల్వంచ) | కొత్తగూడెము | 69 | 81,115 | 1 | 50,195 | 1,295 | 23,059 | 1,24,805 | 54,057 | 1,78,862 | 24,459 |
| 4. | ఇల్లందు | ఇల్లందు | 49 | 91,254 | 3 | 28,118 | 755 | 24,842 | 1,57,850 | 43,859 | 2,00,709 | 16,861 |
| 5. | బూర్గంపాడు | బూర్గంపాడు | 42 | 39,832 | 1 | 8,758 | 539 | 14,871 | 67,496 | 26,578 | 94,069 | 14,985 |
| 6. | భద్రాచలము | భద్రాచలము | 327 | 77,620 | — | — | 911 | 4,901 | 63,394 | 8,840 | 72,234 | — |
| 7. | నూగూరు | వెంకటాపురము | 146 | 35,866 | — | — | 598 | 3,893 | 37,653 | 854 | 38,507 | — |
| | | మొత్తము | 946 | 6,92,746 | 8 | 1,20,246 | 5,456 | 1,73,888 | 8,31,732 | 3,21,059 | 11,52,791 | 66,648 |

వేరు పరచుచు గోదావరినది ప్రవహించు చున్నది. ఈ జిల్లా యందు ఈ నది పొడవు 113 మైళ్ళు. పశ్చిమోత్తర భాగమున జన్మించిన కిన్నెరసాని అను ఏరు గోదావరి నదిలో కలియుచున్నది. జిల్లా పడమటి భాగమున మున్నేరు నది ప్రవహించి కృష్ణానదిలో పడుచున్నది. కట్టలేరు, వైరా, పాలేరు అనునవి ఈ జిల్లాలోని చిన్న నదులు.

శీతోష్ణస్థితి : తెలంగానా యందలి మిక్కిలి వేడి ప్రదేశము లందు ఖమ్మం జిల్లా ఒకటి. సంవత్సరమున అత్యధిక ఉష్ణోగ్రత 109.4° ఫా., అత్యల్ప ఉష్ణోగ్రత 55.4° ఫా. ఉండును.

వర్షపాతము : ఆరింట అయిదు వంతుల వర్షము నైరృతి ఋతుపవనముల వలన లభించు చున్నది. సంవత్సరమున సగటు వర్షపాతము 35.54″.

అడవులు : జిల్లా యందలి తూర్పు భాగమునను, ఉత్తరమున ఏజన్సీలోను దట్టమైన అడవులు కలవు. టేకు, చందనము, చండ్ర, ఇప్ప, బండారు, చిన్నంగి, కొడిశ, నల్లమద్ది, వెదురు మున్నగు వృక్షజాతులు ఈ అరణ్యము లందు కాన నగుచున్నవి. దట్టములగు కొన్ని అడవులందు పెద్ద పులులు, భల్లూకములు, చిరుత పులులు మున్నగు క్రూర మృగములు నివసించు చున్నవి.

ఖనిజ సంపద : ఈ జిల్లా యందలి ఖనిజములలో నేల బొగ్గు, ఇనుము, సున్నపురాయి ముఖ్యములు. ఇల్లందు తాలూకా యందలి బయ్యారం ప్రాంతమున ఇనుపరాయి త్రవ్వబడుచున్నది. ఈ ఇనుపరాయి జపాను మున్నగు విదేశములకు విరివిగ ఎగుమతి చేయబడుచున్నది. కల్లూరు, బేతపల్లి పరిసరములందు అభ్రకపు (మైకా) గనులు కనుగొనబడినవి. మధిర తాలూకా యందలి దెందుకూరు ప్రాంతమునను, పాల్వంచ తాలూకాలోని ఏనుకూరు పరిసరములందును క్రోమైటు గనులు ఉన్నట్లుల శాస్త్రజ్ఞులు తెలుపుచున్నారు. ఖమ్మం సమీపమున మూడు మైళ్ళ దూరమున ఉన్న కుండ్రపోడు పరిసరములందు బేరియం సల్ఫేట్ గనులు కలవు. పాల్వంచ ప్రాంతములో గ్రాఫైటును, వెంసూరువద్ద కండ్ల అద్దములకు పనికి వచ్చు ఒక రకపు రాయి లభించు చున్నది. పై వాని అన్నింటినిమించి ఈ జిల్లాకు ప్రశస్తి కల్పించినవి నేలబొగ్గు గనులు. సింగరేణి, కొత్తగూడెము ప్రాంతములందు ఈ గనులు ఉన్నవి. గరీబ్ పేట ప్రాంతమునందు కెంపురాళ్ళు లభించు చున్నవి.

పట్టణములు : జిల్లా యందలి పట్టణ ములలో ఖమ్మం, కొత్తగూడెము అనునవి మాత్రమే మునిసిపాలిటీలు కల పట్టణములు.

ఖమ్మం : జనసంఖ్య 35,887 జిల్లా కేంద్రము ; దీనికి ఖమ్మంమెట్టు అని కూడ వ్యవహారము కలదు.

కొత్తగూడెము : జనసంఖ్య 69,721 ; నేలబొగ్గు గని త్రవ్వకపు కేంద్రము.

ప్రజలు: ఈ జిల్లా యందలి జనసంఖ్య* 10,57,225. ఇందు పురుషులు 5,40,312, స్త్రీలు 5,16,913 ; జనసాంద్రత చ. మైలునకు 184. 1951 - 61 మధ్య పది సంవత్సరములలో ఈ జిల్లా యందలి జనసంఖ్య 30.84% వృద్ధి యైనది. రాష్ట్రము న జనసంఖ్య ప్రతిశాత వృద్ధిలో ఈ జిల్లాదే అగ్రస్థానము.

మతములు : ఈ జిల్లా యందు ప్రస్తుతము ఉన్న తాలూకాలకు సంబంధించిన 1951 వ సంవత్సరము నాటి లెక్కలను బట్టి ఇచటి ప్రజలలో హిందువులు 89% ; ముస్లిములు 6% ; తక్కిన మతముల వారు 5% ఉన్నటుల భావించ దగి ఉన్నది.

వృత్తులు : ఈ జిల్లాలో వ్యవసాయము ముఖ్య జీవనాధారము. ఈ జిల్లాలో 65.3% ప్రజలు వ్యవసాయము వలన ; 4.1% వ్యాపారము వలన ; 19.1% వ్యవసాయేతర ఉత్పత్తుల వలన; 11.5% ఉద్యోగముల వలన జీవించు చున్నారు (1951).

భాషలు : ఈ జిల్లా యందలి అధిక సంఖ్యాకుల మాతృభాష తెలుగు. 1951 లో తేల్చబడిన సంఖ్యల ననుసరించి ఇచటి ప్రజలలో 82% తెలుగు మాతృభాషగ కలవారు కలరని భావించ వచ్చును. తెలుగు తరువాత లెక్కకు వచ్చునది లంబాడి భాష; దానిని మాతృభాషగ కలవారు 8% మంది కలరు.

వ్యవసాయము : జిల్లా మొత్తమున సేద్యమునకు ఉచిత మగు భూమి 3,13,588 ఎకరములు. ఇందు 1,93,515 ఎకరములు మాత్రమే సాగగు చున్నవి. సాగు భూమిలో 60,131 ఎకరములకు మాత్రమే నీటి పారుదల వసతి కలదు. ఈ జిల్లా లోని నీటి పారుదల వసతులలో ముఖ్యములైనవి 1. వైరా ప్రాజెక్టు, 2. పాలేరు ప్రాజెక్టు, 3. బేతపల్లి ప్రాజెక్టు. ఖమ్మం పట్టణమునకు 16 మైళ్ళ దూరమున వైరానదికి అడ్డుకట్ట కట్టుటచే వైరా ప్రాజెక్టు నిర్మింప బడినది. దీని క్రింద సుమారు 50 వేల ఎకరముల ఆయకట్టు కలదు. పాలేరు ప్రాజెక్టు క్రింద 18,000 ఎకరముల నీటి పారుదలకు అవకాశము కలదు. తమ్మిలేరునకు బేతపల్లి వద్ద కట్టిన ఆనకట్ట వలన బేతపల్లి ప్రాజెక్టు నిర్మితమైనది. దీని క్రింద 5,000 ఎకరములకు నీటి పారుదల జరుగుచున్నది. పై మూడును కాక ప్రస్తుతము కిన్నెరసాని ప్రాజెక్టు నిర్మాణమున ఉన్నది. దీనివలన 30 వేల ఎకరములకు నీటి పారుదల జరుగ గలదు. ఇల్లందు తాలూకాలోని సింగభూపాలం ప్రాజెక్టు వలనను, గార్ల స్టేషనునకు సమీపమున

*1961 జనాభా లెక్కల ప్రకారము.

ఉన్న బయ్యారం చెరువు వలనను కూడ కొంత భూమికి నీటి పారుదల జరుగుచున్నది. నూగూరు, భద్రాచలము తాలూకాలలో పేర్కొన దగిన నీటి పారుదల వసతులు లేవు.

ఖమ్మం, మధిర, ఇల్లందు, పాల్వంచ తాలూకాలలో రేగడ నేలలు విస్తారముగ కలవు. మాసాబు, ఖరాబు నేలలు జిల్లాలో అచటచట కలవు. ఏజన్సీ ప్రాంతమున అరణ్యముల మధ్య సారవంతములైన ప్రదేశములు కొన్ని కలవు.

ఖమ్మం జిల్లా - పంటల వివరములు

1959 - 1960

| | | | |
|---|---|---|---|
| వరి | 2,09,787 ఎ. | మామిడి | 4,417 ఎ. |
| గోధుమ | 86 ,, | అరటి | 8 ,, |
| బార్లి | 330 ,, | నిమ్మజాతి | 374 ,, |
| జొన్న | 3,68,030 ,, | జీడిమామిడి | 1 ,, |
| సజ్జ | 1,02,268 ,, | ఇతర పండ్ల | |
| రాగి | 892 ,, | పైరులు | 133 ,, |
| మొక్కజొన్న | 15,127 ,, | కూరలు | 2,718 ,, |
| కొఱ్ర | 1,230 ,, | ప్రత్తి | ,, |
| వరిగ | 506 ,, | గోగులు | 886 ,, |
| సాములు | 4,945 ,, | నార జనుము | 1,189 ,, |
| ఇతర పొట్టుధాన్య | | పంట జనుము | 615 ,, |
| ములు | 1,159 ,, | ఇతర నార | |
| శనగ | 9,779 ,, | పైరులు | 251 ,, |
| కంది | 7,000 ,, | వేరుశనగ | 12,128 ,, |
| పెసర | 79,064 ,, | కొబ్బరి | 151 ,, |
| మినుము | 4,306 ,, | నువ్వులు | 24,009 ,, |
| ఉలవ | 29,616 ,, | ఆవాలు | 62 ,, |
| ఇతర పప్పు | | ఇతర ఖాద్య తైల | |
| ధాన్యములు | 8,964 ,, | పైరులు | 9 ,, |
| మిరప | 5,468 ,, | ఆముదములు | 2,075 ,, |
| ధనియాలు | 871 ,, | ఇతరఖాద్యేతర తైల | |
| ఇతర మసాలా | | ముల పంటలు | 226 ,, |
| పంటలు | 172 ,, | పొగాకు | 16,685 ,, |
| చెఱకు | 6 ,, | మేత పైరులు | 12,759 ,, |
| తాటిబెల్లము | 3 ,, | పచ్చిఎరువు పైరులు | 477 ,, |

పశు సంపద: ఖమ్మం, మధిర ప్రాంతాలలోని పశుజాతి మైసూరు జాతిని ఎక్కువగ పోలి ఉండును. ఇవి ఉత్తమ జాతివై ఎత్తుగ ఉండి, చూచుట కందముగ ఉండుటయే కాక కష్టమున కోర్చునవి సైతము అగుటచే చాల విలువ కలిగి ఉన్నవి. మధిర తాలూకాలోని ఎర్రనిఛాయ, పెద్ద ఆకారము కల గొర్రె జాతి రాష్ట్రమునందలి తక్కిన గొర్రెల జాతులకన్న భిన్నమై, కొంత విశిష్టతను కలిగి ఉన్నది.

గృహ పరిశ్రమలు: ఈ జిల్లా యందలి గృహ పరిశ్రమలలో ముఖ్యమైనది చేనేత పరిశ్రమ.

పరిశ్రమలు: కొత్తగూడెము నేలబొగ్గు గని పరిశ్రమ ఈ జిల్లా యందు ప్రముఖ పరిశ్రమ అగుటయే కాక, ఆంధ్రప్రదేశ్ నందలి పరిశ్రమలం దన్నింట ప్రముఖముగ పేరొందినది. సింగరేణి కాలరీస్ అను ప్రభుత్వ సంస్థ దీనిని నిర్వహించు చున్నది. దాదాపు 12 వేల మంది గని కార్మికులు ఇచట పని చేయుచున్నారు. ఈ పరిశ్రమను ఆశ్రయించుకొనియే ఇచట కొత్తగూడెము అను పట్టణము రూపొంది దినదినాభి వృద్ధి పొందుచున్నది. 1951 - 61 మధ్య పట్టణపు జనసంఖ్య వృద్ధి అగుట ఈ విషయమును ఋజువు చేయుచున్నది. కుంద్రపోడు వద్ద బేరియం సల్ఫేటు గనుల త్రవ్వకము వలనను, పాల్వంచ ప్రాంతపు గ్రాఫైటు గనుల త్రవ్వకము వలనను, బేతపల్లి, కల్లూరులో అభ్రకము గనుల పని వలనను కొందరు కార్మికులు జీవించ కలుగుచున్నారు.

రోడ్లు: జిల్లా యందలి మొత్తము రోడ్ల నిడివి 241 మైళ్ళు. ఇందు చాల భాగము జాతీయ, రాష్ట్రి రహదారులకు చెందినది.

రైలు మార్గములు: విజయవాడనుండి హైదరాబాదునకు పోవు బ్రాడ్‌గేజ్ రైలు మార్గము ఈ జిల్లా గుండ పోవుచున్నది. డోర్నకల్లు వద్ద ఈ మార్గము నుండి చీలిన బ్రాడ్‌గేజ్ శాఖా మార్గము సింగరేణికి, కొత్తగూడెముకు పోవుచున్నది.

విద్య: విద్యా విషయమున ఈ జిల్లాను వెనుక బడిన ప్రాంతముగనే భావింప వలసి ఉన్నది. ఏజన్సీ ప్రాంతమున విద్యా బోధనకు కల వసతులు చాల తక్కువ. 1961 లెక్కల ననుసరించి ఈ జిల్లా ప్రజలలో అక్షరాస్యులు 15.05%; ఇందు పురుషులలో అక్షరాస్యులు 21.76%, స్త్రీలలో 8.04%. 1955 - 56 లో ఈ జిల్లాయందు గల వివిధ వర్గముల విద్యా సంస్థల వివరములు దిగువ ఈయబడినవి:

| విద్యా సంస్థల వివరము | సంఖ్య | ఉపాధ్యాయ సంఖ్య | విద్యార్థి సంఖ్య |
|---|---|---|---|
| ప్రాథమిక పాఠశాలలు | 524 | 1.245 | 36,993 |
| మాధ్యమిక పాఠశాలలు | 7 | 139 | 3,043 |
| ఉన్నత పాఠశాలలు | 3 | 73 | 1,877 |
| వయోజన విద్యాకేంద్రములు | 56 | 59 | 1,672 |
| ప్రత్యేక వృత్తిబోధక పాఠశాలలు | 59 | — | — |
| | 649 | 1,516 | 43,585 |

ఖమ్మం పట్టణమున ఆర్ట్సు అండ్ సైన్సు కళాశాల ఒకటి నిర్వహింపబడుచున్నది. కొత్తగూడెములో మైనింగ్ శిక్షణ కేంద్రము కలదు.

ఆరోగ్యము, వైద్యము : జిల్లా యందలి ఏజన్సీ ప్రాంతమున మన్య జ్వరములు ఎక్కువ. తక్కిన ప్రాంతమున సైతము మన్య జ్వరముల వ్యాప్తి కొంత కలదు. జూన్ నుండి జనవరి వరకు చలి జ్వరములు, శ్వాస కోశపు జాడ్యములు ప్రబలి ఉండును. జిల్లాలో ఆధునిక వైద్య విధానము ననుసరించు ఆసుపత్రులు 7, డిస్పెన్సరీలు 11, ప్రత్యేక చికిత్సాశాలలు 8 కలవు (1955-56).

చూడదగిన స్థలములు : జిల్లా కేంద్రమగు ఖమ్మం ప్రాచీన కాలము నుండియు ప్రసిద్ధి వహించిన నగరము. ఈ పట్టణమునకు ప్రాచీన కాలమున 'స్తంభగిరి' అని పేరుండెడి దని కొంద రనెదరు. నగరమునకు ఈశాన్య దిక్కున కొండపై ఒక నృసింహాలయము కలదు. స్తంభమును చీల్చుకొని నరసింహమూర్తి ఇట వెలువడె నని ఇచటి భక్త జనుల విశ్వాసము. ఇక్కడ ఉన్న కోట 900 ఏండ్ల క్రిందట నిర్మితమైనది. దుర్గ ప్రాకారము నందున్న మసీదు జఫరుద్దౌలా కాలమున నిర్మితమైనది. జిల్లాలోని బావియు, భవనమును, సింహద్వారమును, సోపాన విధానమును, శతఘ్నులును దర్శనీయములు. అశ్వారావుపేటయందును బౌద్ధ నిర్మాణముల అవశేషములు కానవచ్చు చున్నవి.

కోర్కొండ : అతి ప్రాచీన స్థలములలో కోర్కొండ ఒకటి. బౌద్ధులచే నిర్మింప బడిన చైత్యములును, గుహలును ఇచట కొన్ని కనబడుచున్నవి. ఇవి మహాయాన బౌద్ధ మతమునకు చెందిన వనియు, క్రీస్తు తరువాత మొదటి లేదా రెండవ శతాబ్దులలో నిర్మింపబడి ఉండు ననియు అభిజ్ఞుల అభిప్రాయము.

భద్రాచలము : హిందువుల పవిత్ర క్షేత్రములలో ఒకటి అగు భద్రాచలము ఈ జిల్లాలో ఒక తాలూకా కేంద్రము. ఇచట గోదావరి ఒడ్డున భద్రగిరి కొండపై ఉన్న శ్రీరామాలయము నందలి విగ్రహము సనాతనమైన దనియు, శ్రీరాముడు స్వయముగ అటుల రూపొందె ననియు భక్త జనుల విశ్వాసము. ప్రతి సంవత్సరము చైత్ర శుద్ధమున శ్రీరామనవమి సందర్భమున ఇట జరుగు కల్యాణ మహోత్సవము భారత దేశమున పలుతావుల నుండి యాత్రికులను ఆకర్షించును. ఇచటకి సమీపముననే కల పర్ణశాల, ఉష్ణగుండము కూడ పుణ్యక్షేత్రములుగ సేవింప బడుచున్నవి. గోదావరి పడమటి గట్టున నుండి తూర్పు గట్టున భద్రాచలము చేరుటకు వీలుగా గోదావరిపై నూతనముగ ఒక వంతెన నిర్మింప బడినది. భద్రాచలము నందలి దేవళమును నిర్మించినది రామదాసు అను ప్రతి నామము కల కంచర్ల గోపన్న అను భక్తు డని చెప్ప బడుచున్నది. ఈ రామదాసు చరిత్ర ఆంధ్ర జనుల కందరకు సువిదితము. ఈ రామదాసు జన్మస్థల మని చెప్పబడు నేలకొండ పల్లె కూడ ఈ జిల్లాలోనే ఉన్నది. ఇక్కడ ఒక స్థలమును రామదాసు గృహముండిన తావని స్థానికులు చూపింతురు. ఈ గ్రామమున బౌద్ధ నిర్మాణ శిథిలావశేషములు కొన్ని కనుగొన బడుటచే ప్రాచీన కాలమున ఈ నేలకొండ పల్లెకు కొంత ప్రాముఖ్యము ఉండినటుల తోచుచున్నది. (చూ. ఫలకము 79)

జిల్లా సంక్షిప్త చరిత్ర: మధిర జిల్లాలో అచటచట కనబడు పాండవులగుళ్ళు (కెయిరనులు)వలన ఈప్రాంతము ప్రాచీన కాలమున నుండియు మానవా వాసముగ ఉండె నని స్పష్టమగుచున్నది. గోదావరికి పడమటను, దక్షిణమునను గల ఈ జిల్లా ప్రాంతపు చరిత్ర యంతయు వరంగల్లు జిల్లా చరిత్రతోడను గోదావరికి ఆవల ఉన్న భాగపు చరిత్ర, తూర్పు గోదావరి జిల్లా చరిత్రతోడను ముడివడి ఉండుటచే ఆ విశేషములను వాని యందు కాన నగును (చూ. జిల్లా సంక్షిప్త చరిత్రలు తూర్పు గోదావరి జిల్లా (పుట : 1302); పశ్చిమ గోదావరి జిల్లా (పుట : 1309); వరంగల్లు జిల్లా (పుట : 1384) ఆ. వీ. రా.

# నల్గొండ జిల్లా

ఉనికి - విస్తీర్ణము : ఈ జిల్లా ఉ. అక్షాంశము 16° 2′ నుండి 18° వరకును, తూ. రేఖాంశము 78° 35′ నుండి 80° 5′ వరకును విస్తరించి ఉన్నది. కృష్ణా జిల్లాకు చెంది ఈ జిల్లాలో లంకలుగ ఉన్న లింగగిరి, సూరవరము, కల్వపల్లి, లక్కవరము, అమరవరము, గానుగబండ అనుగ్రామములు 1949 లో ఈ జిల్లాయందు చేర్చబడినవి. పరిపాలనా సౌకర్యమునకై ఈ జిల్లాయందలి జనగామ తాలూకా వరంగల్లు జిల్లాకు మార్చబడినది (1953). ఈ జిల్లాకు ఉత్తరము మెదకు, కరీంనగరము జిల్లాలు; తూర్పు వరంగల్లు జిల్లా; దక్షిణము గుంటూరు, మహబూబునగరము జిల్లాలు; పడమర మహబూబునగరము జిల్లా; కలవు. ఈ జిల్లాయందు భువనగిరి, దేవరకొండ, హుజూరు నగరు, మిర్యాలగూడెము, నల్గొండ, రామన్నపేట, సూర్యాపేట అను ఏడు తాలూకాలు ఉన్నవి. జిల్లా విస్తీర్ణము 5,385 చ. మైళ్ళు.

## నల్గొండ జిల్లా - తాలూకా వివరములు

| వరుస సంఖ్య | తాలూకా పేరు | తాలూకా కేంద్రము | గ్రామముల సంఖ్య (1951) | గ్రామీణ జనాభా (1951) | పట్టణములు (1951) | పట్టణ జనాభా (1951) | విస్తీర్ణము (చదరపు మైళ్ళలో) (1951) | మొత్తము నీటి పారుదల వసతిగల నేల విస్తీర్ణము (ఎకరములలో) (1959) | సాగుచేయబడిన నేల (ఎ॥ములలో) (1959) | ప్రస్తుతము సాగులో లేని బీడు నేల (ఎ॥ములలో) (1959) | మొత్తం సాగుకు తగిన నేల (ఎ॥ములలో) (1959) | సాగుచేయ వీలగు బంజరు నేల (ఎ॥లలో) (1959) |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. | భువనగిరి | భువనగిరి | 161 | 1,56,494 | 3 | 29,970 | 614 | 33,334 | 1,77,164 | 81,189 | 2,58,353 | 18,918 |
| 2. | దేవరకొండ | దేవరకొండ | 180 | 1,56,814 | 1 | 6,628 | 1,041 | 27,919 | 3,32,069 | 66,632 | 3,98,701 | 22,012 |
| 3. | హుజూరు నగరు | హుజూరు నగరు | 88 | 1,18,998 | 1 | 6,821 | 532 | 17,288 | 2,11,059 | 17,018 | 2,28,077 | 5,049 |
| 4. | మిర్యాలగూడెము | మిర్యాల గూడెము | 142 | 1,19,423 | 1 | 8,801 | 751 | 21,250 | 2,31,810 | 24,922 | 2,56,732 | 18,405 |
| 5. | నల్గొండ | నల్గొండ | 201 | 2,26,538 | 3 | 29,615 | 954 | 41,595 | 3,35,793 | 93,901 | 4,29,694 | 14,635 |
| 6. | రామన్నపేట | రామన్నపేట | 142 | 1,67,294 | 1 | 3,615 | 684 | 33,802 | 2,05,854 | 1,21,450 | 3,27,304 | 2,789 |
| 7. | సూర్యాపేట | సూర్యాపేట | 148 | 2,04,019 | 2 | 17,785 | 803 | 48,302 | 2,27,368 | 42,377 | 2,69,745 | 11,467 |
| | | మొత్తము | 1,062 | 11,49,575 | 12 | 1,03,235 | 5,379 | 2,23,490 | 17,21,117 | 4,47,489 | 21,68,606 | 93,225 |

నైసర్గిక స్వరూపము: ఈ జిల్లాలోని భూమి పశ్చిమ, వాయవ్య దిశలనుండి ఆగ్నేయ దిశవైపునకు దిగిపోవు చున్నది. నల్గొండ, దేవరకొండ తాలూకాలగుండ ఒక గుట్టల వరుస వ్యాపించి దక్షిణమున మహబూబునగరము జిల్లాలో ప్రవేశించుచున్నది. జిల్లాలో నైరృతి మూలన బయలుదేరిన మరియొక గుట్టల వరుస దిండినది నానుకొని ఈశాన్య దిక్కునకు వ్యాపించి, వరంగల్లు జిల్లాను తాకు చున్నది. నల్లపహాడు అను మూడవ వరుస దిండి, పెద్ద వాగులను సమీపించి రెండుగ చీలినది. వీనిలో ఒక చీలిక ఉత్తరముగ వ్యాపించు చున్నది. రెండవ చీలిక పైన పేర్కొనబడిన రెండవ గుట్టల వరుసలో కలియుచున్నది. జిల్లాలో వాయవ్య దిశయందు బయలుదేరిన నాలుగవ గుట్టల వరుస పొన్నూరు పడమటి దిశనుండి బయలుదేరి సురికొండ వరకు వాయవ్య దిశగ సాగి అచటనుండి గిరుక్కున మరలి నారాయణపురము, ఇబ్రహీమ్‌పట్టణముల మధ్యనుండి ముందునకు సాగి వేములకొండవైపు మరల వంగును. ఈ గుట్టల వరుస పూర్తిగ ఈ జిల్లాయందే ఉన్నది; దీని నిడివి సుమారు 60 మైళ్ళు. ఇవి కాక సుమారు మరొక 100 వరకు విడివిడి గుట్టలు గలవు.

నదులు: ఈ జిల్లాలో ముఖ్యమైన నది కృష్ణానది; ఈ నది జిల్లాకు దక్షిణ సరిహద్దు నుండి ఈ జిల్లాను గుంటూరు జిల్లానుండి వేరుచేయుచున్నది. దేవరకొండ తాలూకా ఏలేశ్వరమువద్ద తొలుతగ ఈ జిల్లాను ఈ నది తాకు చున్నది. ఈ జిల్లాయందు కృష్ణానది పొడవు 53 మైళ్ళు. కృష్ణానదికి ఉపనది అగు మూసీ నది వాయవ్య దిశనుండి ఈ జిల్లాలో ప్రవేశించి తూర్పుగ 40 మైళ్ళు ప్రవహించిన తరువాత ఆలేరు నదిని కలుపుకొని ఆగ్నేయ దిశగా ప్రవహించి వజీరాబాదు (వాడపల్లి) దగ్గర కృష్ణలో పడుచున్నది. ఈ జిల్లాలో మూసీనది పొడవు 95 మైళ్ళు. పెద్దవాగు, దిండి అనునవి దేవరకొండ తాలూకాలోని ఇతర నదులు. నారాయణపురమునకు పడమరగా నున్న గుట్టలలో అహల్యానది ఉద్భవించి ఆగ్నేయ దిశగా 45 మైళ్ళు ప్రవహించి కొంగల్ గ్రామము వద్ద కొంగల్ నదితో కలిసి, అదే దిశగా ప్రవహించు కృష్ణానదితో సంగ మించు చున్నది; దీని పొడవు 82 మైళ్ళు.

శీతోష్ణస్థితి: ఈ జిల్లాలో అత్యధికోష్ణోగ్రత 107° ఫా. అత్యల్పోష్ణోగ్రత 50° ఫా.

వర్షపాతము: ఈశాన్య, నైరృతి ఋతుపవనముల వలనను, ఈ జిల్లాలో వర్షము పడుచున్నది. కాని మూడింట రెండు భాగములు నైరృతి ఋతుపవనము వలననే లభించు చున్నది. సంవత్సరమునకు సరాసరి వర్షపాతము 26.90″.

అడవులు: ఈ జిల్లాలోని అరణ్య ప్రాంతపు విస్తీర్ణము 2,36,116 ఎకరములు. అన్ని తాలూకాలయందును కొలది కొలదిగ అడవులు కలవు. సర్వ సామాన్యముగ ఈ అడవు లందు టేకు, తుమికి, ఇప్ప, నల్లమద్ది, చండ్ర, తుమ్మ, మామిడి, చింత, తంగేడు, మర్రి మొదలగు వృక్షములు కనబడుచున్నవి. కృష్ణానది తీరమును ఆనుకొని యున్న మిరియాలగూడెము, దేవరకొండ తాలూకాలలోని పర్వతారణ్యములందు ఇప్ప, చండ్ర వృక్ష జాతులు ఎక్కువగా వ్యాపించి యున్నవి.

ఖనిజ సంపద: మిర్యాలగూడెము తాలూకాలో పొరలు పొరలుగా నుండు సున్నపురాయి దొరకును. దీనిని ఇండ్లు కట్టుటకే గాక సున్నము తయారు చేయుటకును ఉపయోగించెదరు. ఈ తాలూకాలో వ్రాత పలకలుగూడ లభించును. కృష్ణానది యొక్క వామభాగ తీరమున నందికొండ, తత్పరిసర గ్రామములందు వజ్రములు దొరకు నని చెప్పుదురు.

పట్టణములు: జిల్లాలోని పట్టణములలో నల్గొండ, భువనగిరి, విజయపురి, సూర్యాపేట అనువానికి మాత్రమే మునిసిపాలిటీలు కలవు.

నల్గొండ: జనసంఖ్య 24,443; జిల్లా కేంద్రము.

భువనగిరి: జనసంఖ్య 17,558; తాలూకా కేంద్రము.

విజయపురి: జనసంఖ్య 55,384; నాగార్జున సాగరము నిర్మాణ కేంద్రము.

సూర్యాపేట: జనసంఖ్య 16,159; తాలూకా కేంద్రము.

ప్రజలు: ఈ జిల్లాలో జనసంఖ్య* 15,74,797; ఇందు పురుషులు 8,08,232; స్త్రీలు 7,66,565; జన సాంద్రత చ. మైలునకు 294. 1951-61 మధ్య పది ఏండ్లలో జిల్లా జనసంఖ్య 22.35% పెరిగినది.

మతములు: ఈ జిల్లాలో జనగామ తాలూకా కలుపుకొని హిందువులు 14,34,760; ముస్లిములు 72,818; క్రైస్తవులు 36,229; సిక్కులు 101; జైనులు 23; ఇతర మతముల వారు 44.

వృత్తులు: ఈ జిల్లాలో వ్యవసాయమే ముఖ్య వృత్తి. ఏదోవిధముగ వ్యవసాయము మీదనే ఆధారపడి ఉన్న వివిధ వర్గముల వారి సంఖ్య 8,80,526; ఉత్పత్తికర పరిశ్రమలవలన జీవించువారు 2,18,134; వాణిజ్యము వలన జీవించువారు 53,983; తక్కిన వివిధ వృత్తులవలన జీవించు వారు 1,00,217.

* 1961 జనాభా లెక్కల ప్రకారము.

భాషలు: తెలుగు మాతృభాషగ గల వారి సంఖ్య ఈ జిల్లా యందు అత్యధికము. వివిధ భాషలు మాట్లాడు వారి సంఖ్య వివరములు: తెలుగు 13,81,079; లంబాడి 84,268; ఉర్దు 65,643; మరాఠి 4,336; ఎరుకల 3,415; హింది 2,635; తమిళము 692; కన్నడము 317; ఇతర భాషలు 3,190 (1951).

వ్యవసాయము: జిల్లా మొత్తము మీద వ్యవసాయమునకు అనుకూలమగు నేల 12,01,892 ఎకరములు. సాగు అగు నేలలో 2,03,933 ఎకరములకు మాత్రమే నీటి పారుదల వసతి కలదు. నీటి పారుదలకు ముఖ్యాధారములు పంట చెరువులు. దిండివద్ద 1940 లో నిర్మింపబడిన ప్రాజెక్టు వలన సుమారు 39,000 ఎకరముల నేల సాగగుచున్నది.

జిల్లాలో నల్లరాతి ప్రదేశము ఎక్కువ. సేద్యమునకు అనువైన భూమిని ఇసుక చెలక, మాసాబు భూమి అని రెండు రకములుగ విభజింప వీలగుచున్నది. కృష్ణానది తీరమున మిరియాలగూడెము ప్రాంతమునందు ఒండ్రు కలగలుపు నేలయు నల్లరేగడయు ఎక్కువగ కలదు. ఈ రెండు విధములైన భూములు పైరు (రాబి) పంటలకు ఎక్కువగ ఉపయోగపడు చున్నవి. రేగడ భూములు ఇతర తాలూకాల యందు పరిమితముగ కలవు. కాని వీనిలో కొంతవరకు ఇసుక కలిసి ఉండును. చెలక, మాసాబు నేలలో జొన్నలు, సజ్జలు, ప్రత్తి, పసుపు, ఆముదములు మొదలగు పూర్వ సస్యములు (ఖారిఫ్ పంటలు) పండింపబడుచున్నవి. ఆముదపు పంటయందు రాష్ట్రమున అగ్రస్థానమును నల్గొండ జిల్లా ఆక్రమించి యున్నది.

నల్గొండ జిల్లా - పంటల వివరములు

(1955 - 1956)

| | | | |
|---|---|---|---|
| వరి | 2,85,044 ఎ. | మిరప | 22,816 ఎ. |
| గోధుమ | 100 ,, | ధనియాలు | 2,441 ,, |
| జొన్న | 5,29,706 ,, | పండ్లు, కూరలు, | |
| సజ్జ | 3,14,795 ,, | దుంపలు | 4,241 ,, |
| బార్లీ | 116 ,, | ప్రత్తి | 8,918 ,, |
| మొక్కజొన్న | 4,215 ,, | జనుము | 3,405 ,, |
| రాగి | 562 ,, | వేరుశనగ | 1,62,504 ,, |
| కొఱ్ఱ | 49,290 ,, | నువ్వులు | 12,046 ,, |
| శనగ | 8,341 ,, | కుసుములు | 3,312 ,, |
| పెసర | 1,03,203 ,, | ఆముదములు | 3,12,694 ,, |
| కంది | 24,858 ,, | పొగాకు | 6,519 ,, |
| ఉలవ | 71,050 ,, | మేత పైరులు | 1,796 ,, |

పై లెక్కలలో చేరని చిల్లర పైరులు 16,248 ఎకరములు.

ఈ జిల్లాలోని దిండివద్ద వ్యవసాయ పరిశోధనా కేంద్రము కలదు. వరి, చమురు గింజల విషయమున పరిశోధన ఇచటి ముఖ్య కార్యక్రమము.

పశు సంపద: ఈ జిల్లాలోని దేవర కొండ తాలూకాలో ఒక ప్రత్యేకమైన పశుజాతి కలదు. ఇవి నల్లగగాని, ఎర్రగగాని రంగు కలిగి దృఢకాయములుగ ఉన్నవి. వ్యవసాయమునకు ఇవి మిగుల ఉపయుక్తములు. ఈ పశువులు మైసూరు జాతి పశువుల కోవలోనివిగ పరిగణింప బడుచున్నవి. ఈ పశువులు కష్టమునకు బాగుగ ఓర్చునవి అగుటచే దూర ప్రాంతముల నుండియు పలువురు వీనిని కొని పోవుచుందురు. సూర్యాపేట, మిర్యాలగూడెము తాలూకాలలోని తెల్ల పశువుల జాతి చాల అందమైనది. ఇతర ప్రదేశము లందలి పశువులు సామాన్యపు జాతికి చెందినవి. దేవరకొండ, మిర్యాలగూడెము, సూర్యాపేట తాలూకాలలో పర్వతారణ్యములందు మేత సమృద్ధిగ ఉండుటచే మేకలు అధిక సంఖ్యలో పెంపక మగుచున్నవి.

గృహపరిశ్రమలు: గృహ పరిశ్రమలలో ముఖ్యమైనది నేతవృత్తి. నల్గొండ తాలూకాలోని చర్లపల్లి, పానుగల్లు గ్రామములందు వివిధములయిన రూపములలో రంగులలో పట్టు రుమాళ్ళు, చీరెలు నేయబడి ఎగుమతి అగుచున్నవి. ఇవి చాల కాలము మను నట్టివి. ధనికులు సాధారణముగ వీనిని కొనుగోలు చేయుదురు. ముతకరకపు వస్త్రములు జిల్లా యంతటను వివిధ కేంద్రములందు నేయబడుచున్నవి.

రోడ్లు: జిల్లా మొత్తము మీద 591 మైళ్ళ నిడివి గల రోడ్లు కలవు. ఇందులో 474 మైళ్ళు రాష్ట్ర రహదారులకు చెందినవి. కడమ స్థానిక సంస్థల ఆధిపత్యమున ఉన్నవి. హైదరాబాదు నుండి మచిలీపట్టణము పోవు దండు బాటయే ఈ జిల్లా యందలి ముఖ్యమైన రోడ్డు; ఇది 1832లో సైనికుల ఉపయోగము నిమిత్తమై నిర్మింప బడినది. సూర్యాపేట తాలూకాలోని గుంపాల వరకు ఈ జిల్లాలో ఈ రోడ్డు పొడవు 71 మైళ్ళు. ఈ రోడ్డునుండి నకరకల్లు సమీపమున మద్రాసునకు పోవు శాఖా మార్గము చీలుచున్నది. దీని పొడవు ఈ జిల్లాలో 40 మైళ్ళు. ఈ రోడ్డు కూడ పూర్వము సైనికుల వలననే నిర్మింప బడినది. హైదరాబాదునుండి వరంగల్లు పోవు రోడ్డు ఈ జిల్లాలో 44 మైళ్ళ దూరము వ్యాపించి ఉన్నది. దీనినుండి ఖమ్మంమెట్టునకు పోవు శాఖా మార్గము ఈజిల్లాలో 21 మైళ్ళు పోవుచున్నది. మిగిలిన రోడ్లు సాధారణముగా జిల్లాలోని ఇతర కేంద్రములను పరిసరముల నున్న రైల్వే స్టేషనులను కలుపుటకై నిర్మింపబడినవి.

విద్య: 1961 జనాభా లెక్కల ప్రకారము ఈ జిల్లాలోని ప్రజలందు అక్షరాస్యులు 12.80%; పురుషులలో 20.11%;

స్త్రీలలో 5·27% కలరు. ఉన్నత విద్యావంతుల సంఖ్య చాల స్వల్పము. 1956-57 సంవత్సరమున ఈ జిల్లాలోగల వివిధ వర్గముల విద్యా సంస్థల వివరములు దిగువ ఈయబడినవి:

| విద్యా సంస్థల వివరము | సంఖ్య | ఉపాధ్యాయ సంఖ్య | విద్యార్థి సంఖ్య |
|---|---|---|---|
| ప్రాథమిక పాఠశాలలు | 880 | 2,055 | 51,767 |
| మాధ్యమిక పాఠశాలలు | 8 | 147 | 3,438 |
| ఉన్నత పాఠశాలలు | 4 | 147 | 4,105 |
| ప్రత్యేక, వృత్తిబోధక పాఠశాలలు | 1 | 7 | 104 |
| | 893 | 2,356 | 59,414 |

ఇవికాక నల్గొండలో ఆర్ట్సు అండ్ సైన్సు కళాశాల ఒకటి కలదు.

ఆరోగ్యము, వైద్యము: ఆగస్టు నెల నుండి అక్టోబరు వరకు ఈ జిల్లా యందు మన్యపు జ్వరము విపరీతముగ చెలరేగు చున్నది. వైద్య వసతులు చాల తక్కువ. జిల్లా మొత్తము మీద ఆధునిక వైద్య విధానము ననుసరించు జనరల్ ఆసుపత్రి 1, డిస్పెన్సరీలు 12 కలవు. వీనిలో పడకల సంఖ్య 149. ఇవికాక యూనానీ చికిత్సాశాలలు 4, ఆయుర్వేద వైద్యశాలలు 5 కలవు (1956-57).

చూడదగిన స్థలములు: ఈ జిల్లాలో ప్రఖ్యాతి చెందిన ప్రాచీన వస్తు పరిశిష్టములు పెక్కు కలవు. వీనిలో నల్గొండ, దేవరకొండ, ఉండ్రుకొండ, భోనగిరి కోటలు ముఖ్యమైనవి.

దేవరకొండ: దేవరకొండ కోట ఏడు కొండలచే చుట్టబడి ఉన్నది. పానుగల్లు, నాగులపాడు, పిల్లలమర్రి దేవాలయములు, హిందూ మత శిల్ప నైపుణ్యమును చాటెడు కట్టడములు. నందికొండవద్ద నిర్మింప బడుచున్న నాగార్జునసాగరమువలన మునిగి పోవుటకు ముందే ఏలేశ్వరము వద్ద చారిత్రక శిథిలములను ప్రభుత్వము త్రవ్వించి భద్రపరచినది.

ఈ జిల్లా యందు హిందు, మహమ్మదీయ పుణ్యక్షేత్రములు పెక్కు కలవు. కాని, అవి అన్నియు స్థానికమగు ప్రశస్తిని మాత్రమే పొంది ఉన్నవి. హిందువుల పుణ్యక్షేత్రములలో పెల్ల పేరు గాంచినది యాదగిరి. ఆ. వీ. రా.

యాదగిరి: హైదరాబాదు - విజయవాడ రైలు మార్గమున ఉన్న రాయగిరి స్టేషనుకు మూడు మైళ్ళ దూరమున యాదగిరి క్షేత్రము కలదు. ఇచట ఒక చిన్న గుట్టపైన శ్రీ లక్ష్మీనృసింహస్వామి దేవాలయము కలదు. పదునారవ శతాబ్ది ఆరంభమున విజయనగర చక్రవర్తిగ ఉన్న శ్రీకృష్ణదేవరాయల సేనాని ఒకడు ఈ దేవళమును నిర్మింపచేసె నని స్థానికులు పేర్కొందురు. కాని దీనిని ధ్రువ పరచు చారిత్రకాధారములు లేవు. యాదర్షి అను ఒక భక్తునికి నృసింహస్వామి ఇచట ప్రత్యక్షమై ఆ భక్తుని కోరికను అనుసరించి ఇచటనే జ్వాలా నృసింహ, యోగానంద నృసింహ, గండ భేరుండ నృసింహ అను మూడు ప్రత్యేక రూపములను ధరించి ఇచట విగ్రహ రూపముగ వెలసె నని భక్త జనుల సాంప్రదాయిక విశ్వాసము. ఈ క్షేత్రమాహాత్మ్యము స్కాంద పురాణమున ప్రసక్తింప బడినది. ఇచట ప్రతి సంవత్సరము మార్గశీర్ష శుక్లపక్షమున పూర్ణిమాంతముగ పది దినములు బ్రహ్మోత్సవము జరుగును. ఉత్సవ సమయము అందు యాత్రికుల సంఖ్య అత్యధికము; దూర ప్రాంతముల నుండియు యాత్రికులు అనేకులు అనుదినమును ఇచటకు వచ్చుచుందురు. క. ల. శా.

జిల్లా సంక్షిప్త చరిత్ర: ఈ జిల్లా ప్రాంతము ఓరుగల్లు రాజుల రాజ్యములో నుండెను. ఓరుగల్లు రాజొకడు నల్గొండ పురమునకు రెండు మైళ్ళ మీదనున్న పానుగల్లు గట్టించి తన రాజధానిగా చేసికొనెను. తరువాత రాజధాని నల్గొండకు మారెను. నల్గొండకు మొట్టమొదట నీలగిరి యను పేరుండెను. బహ్మనీ నవాబు అహమదుషావల్లీ యనువాడు పానుగల్లును జయించెను (1424). బహ్మనీ వంశ పతనానంతరము ఈ జిల్లా గోల్కొండ కుతుబ్ షాహీల రాజ్యములోనికి వచ్చెను. ఓరుగల్లు రాజు దీనిని తిరిగి జయించినను కులీ కుతుబుషా (1512-1543) మరల తన వశము చేసికొనెను. గోల్కొండ రాజ వంశ పతనానంతరము ఈ జిల్లాను దక్కను సుబాలతోపాటు ఔరంగజేబు తన సామ్రాజ్యమున చేర్చెను. హైదరాబాదులో అసఫ్ జాహి వంశము నెలకొన్న తరువాత ఈ ప్రాంతము ఢిల్లీ సామ్రాజ్యమునుండి విడిపోయి నిజాంరాష్ట్ర భూభాగ మయ్యెను (1724). అప్పటినుండి 1948 వరకు నిజాం సంస్థానమున అంతర్భాగమై 'పోలీసు చర్య' అనంతరము హైదరాబాదు రాష్ట్రమున చేరి ఉండెను. భాషా ప్రయుక్త రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ (1956) సందర్భమున ఏర్పడిన ఆంధ్రప్రదేశ్‌లో అంతర్గత మయ్యెను. ఆ.వీ.రా.





శ్రీకాకుళము జిల్లా
జిల్లా కేంద్రము
తాలూకా కేంద్రము
మునిసిపాలిటీ
ముఖ్యగ్రామము
రాష్ట్ర సరిహద్దు
జిల్లా సరిహద్దు
తాలూకా సరిహద్దు
జాతీయ రహదారి
రాష్ట్రీయ రహదారి
ముఖ్యమైన రోడ్డు
బ్రాడ్ గేజ్ రైలు మార్గము
నేరోగేజ్ రైలుమార్గము
నది
సరస్సు, చెరువు
స్కేలు
0 6 12 24 మైళ్లు
శ్రీకాకుళము
పలాస
పాతపట్టణము
హిరమండలం
వీరఘట్టం
పాలకొండ
పార్వతీపురము
రాజాం
గరివిడి
పొందూరు
చీపురుపల్లి
పోలాకి
కళింగపట్నం
శ్రీకూర్మం
నరసన్నపేట
టెక్కలి
ఆముదాలవలస
సాలూరు
విజయనగరము నుండి
విశాఖపట్టణము నుండి
కలకత్తాకు
కటకమునకు
80°
84°
19°
18°

## తూర్పు గోదావరి జిల్లా

బ్రాడ్ గేజ్ రైలు మార్గము
నది
సరస్సు, చెరువు
కాలువ
జిల్లా కేంద్రము
తాలూకా కేంద్రము
మునిసిపాలిటీ
ముఖ్యగ్రామము
రాష్ట్ర సరిహద్దు
జిల్లా సరిహద్దు
తాలూకా సరిహద్దు
జాతీయ రహదారి
రాష్ట్రీయ రహదారి
ముఖ్యమైన రోడ్డు

0 6 12 24 మైళ్లు

పటములోని అంకెలకు సూచి:

1. గౌతమీ గోదావరి; 2. వైనతేయం; 3. సామర్లకోట కాలువ; 4. కాకినాడ కాలువ; 5. కోరింగ కాలువ; 6. బ్యాంకు కాలువ; 7. రాజోలు కాలువ; 8. అమలాపురము కాలువ.

# పశ్చిమగోదావరి జిల్లా

స్కేలు

0 5 10 20 మైళ్లు

జిల్లా కేంద్రము
తాలూకా కేంద్రము
భీమవరము మునిసిపాలిటీ
ముఖ్య గ్రామము
జిల్లా సరిహద్దు
తాలూకా సరిహద్దు
జాతీయ రహదారి
రాష్ట్రీయ రహదారి
ముఖ్యమైన రోడ్డు
బ్రాడ్ గేజ్ రైలు మార్గము
నది
కాలువ
సరస్సు, చెరువు

పటములోని అంకెలకు సూచి:

1. ఏలూరు కాలువ; 2. వెంకయ్య కాలువ; 3. ఉండి కాలువ; 4. అత్తిలి కాలువ; 5. వేల్పూరు కాలువ; 6. నర్సాపురము కాలువ; 7. బ్యాంకు కాలువ




పటములోని అంకెలకు సూచి: 1. తూర్పు బ్యాంకు కాలువ; 2. బందరు కాలువ; 3. కాంబెల్ కాలువ


స్కేలు
0
8
16
32
మైళ్లు

# నెల్లూరు జిల్లా

జిల్లా కేంద్రము
తాలూకా కేంద్రము
గూడూరు మునిసిపాలిటీ
ముఖ్యగ్రామము
రాష్ట్ర సరిహద్దు
జిల్లా సరిహద్దు
తాలూకా సరిహద్దు
జాతీయ రహదారి
రాష్ట్రీయ రహదారి
ముఖ్యమైన రోడ్డు
బ్రాడ్ గేజ్ రైలు మార్గము
నది
కాలువ
సరస్సు, చెరువు


చిత్తూరు జిల్లా
స్కేలు
మైళ్ళు
అనంతపురము
జిల్లా కేంద్రము
తాలూకా కేంద్రము
మునిసిపాలిటీ
ముఖ్యగ్రామము
రాష్ట్ర సరిహద్దు
జిల్లా సరిహద్దు
తాలూకా సరిహద్దు
జాతీయ రహదారి
రాష్ట్రీయ రహదారి
ముఖ్యమైన రోడ్డు
బ్రాడ్ గేజ్ రైలు మార్గము
మీటర్ గేజ్ రైలుమార్గము
నది
సరస్సు, చెరువు
చిత్తూరు
పలమనేరు
పుంగనూరు
తిరుమల
తిరుపతి
చంద్రగిరి
రేణిగుంట
పుత్తూరు
నగరి
వేంకటగిరికోట
కుప్పం
జోలారుపేటకు
కొత్తకోట
గుర్రంకొండ
వాయలపాడు
వీరేలు
కందూరు
సోమాల
పూతలపట్టు
మొగరాలు
కార్వేటినగరము
నాగలాపురము
వరదాయపాలెము
సత్యవీడు
నాయుడుపేటకు
బెంగుళూరు నుండి
కోలారు నుండి
గుడియాత్తముకు
రాణిపేటకు
కాట్పాడికి
వేలూరుకు
రాయచోటి నుండి
కదిరి నుండి
గూడూరు నుండి
వెంకటగిరి నుండి
రాజంపేట నుండి
గుంతకల్లు నుండి



కడప జిల్లా
స్కేలు
0 6 12 24 మైళ్లు
జిల్లా కేంద్రము
తాలూకా కేంద్రము
ప్రొద్దుటూరు మునిసిపాలిటి
ముఖ్యగ్రామము
జిల్లా సరిహద్దు
తాలూకా సరిహద్దు
రాష్ట్రీయ రహదారి
ముఖ్యమైన రోడ్డు
బ్రాడ్ గేజ్ రైలు మార్గము
నది
కాలువ
కొత్తకోట
వెంకటాపురం
దాసరిపల్లి
వనిపెంట
బ్రహ్మంగారిమఠం
మైదుకూరు
ఖాజీపేట
అర్కటవేముల
జమ్మలమడుగు
రాజుపాలెం
గండికోట
సింహాద్రిపురం
చెన్నూరు
కమలాపురము
పులివెందుల
వేంపల్లి
కడప
అంబవరం
ఒంటిమిట్ట
నందలూరు
రాజంపేట
చిట్వేలు
రాయచోటి
లక్కిరెడ్డిపల్లి
చిన్నమండెం
సుద్దమల్ల
గాదెల
కోడూరు



అనంతపురముజిల్లా
జిల్లా కేంద్రము
తాలూకా కేంద్రము
తాడిపత్రి మునిసిపాలిటీ
ముఖ్యగ్రామము
రాష్ట్ర సరిహద్దు
జిల్లా సరిహద్దు
తాలూకా సరిహద్దు
జాతీయ రహదారి
రాష్ట్రీయ రహదారి
ముఖ్యమైన రోడ్డు
బ్రాడ్ గేజ్ రైలు మార్గము
మీటర్ గేజ్ రైలుమార్గము
నది
సరస్సు, చెరువు
కర్నూలు
కర్నూలుకు
గుత్తి
యాడికి
కోయిలకుంట్లకు
తాడిపత్రి
కడపకు
పామిడి
కల్లూరు
శింగనమల
అనంతపురము
ధర్మవరము
రాయదుర్గము
కళ్యాణదుర్గము
ఉరవకొండ
వజ్రకరూరు
కొనకొండ్ల
పెన్నాహోబిలం
పెన్నానది
పులివెందలకు
కదిరి
గండ్లపేట
పెనుకొండ
సోమందేపల్లి
అమరపురం
ముదకశిర
హిందూపురం
లేపాక్షి
పరిగి
చిలమత్తూరు
బుక్కపట్నం
బెంగుళూరు నుండి
స్కేలు
0 8 16 32 మైళ్లు
77° 0'
78° 0'
15° 0'
14° 0'

# మహబూబునగరము జిల్లా



| | |
|---|---|
| ■ | జిల్లా కేంద్రము |
| ◎ | తాలూకా కేంద్రము |
| అలంపురము | మునిసిపాలిటీ |
| • | ముఖ్యగ్రామము |
| ------ | రాష్ట్ర సరిహద్దు |
| -·-·- | జిల్లా సరిహద్దు |
| ······ | తాలూకా సరిహద్దు |
| ━━ | జాతీయ రహదారి |
| ━·━ | రాష్ట్రీయ రహదారి |
| ━━ | ముఖ్యమైన రోడ్డు |
| ┿┿┿ | బ్రాడ్ గేజ్ రైలు మార్గము |
| ┼┼┼ | మీటర్ గేజ్ రైలుమార్గము |
| 〰 | నది |
| ⬭ | సరస్సు, చెరువు |




మెదకు జిల్లా
జిల్లా కేంద్రము
తాలూకా కేంద్రము
మునిసిపాలిటి
ముఖ్యగ్రామము
రాష్ట్ర సరిహద్దు
జిల్లా సరిహద్దు
తాలూకా సరిహద్దు
జాతీయ రహదారి
రాష్ట్రీయ రహదారి
ముఖ్యమైన రోడ్డు
బ్రాడ్ గేజ్ రైలు మార్గము
మీటర్ గేజ్ రైలుమార్గము
నది
సరస్సు, చెరువు
స్కేలు
0 8 16 32
మైళ్ళు
సంగారెడ్డి
మెదక
సిద్దిపేట
తిమ్మాపురము
రామగంపేట
నర్సింగి
చందరుపేట
మాసైపేట
హత్నూరు
పెద్దాపూర్
టెక్మల్
పాపన్నపేట
మార్కరాజుపేట
పూరాద
గజ్వేలు
మార్కుక్
నారాయణఖేడ
జహీరాబాద్
సదాశివపేట
మంజీరానది
బీదరు నుండి
కరీంనగరముకు
కరీంనగర్
నల్గొండ
వరంగల్లు
హైదరాబాదు
రంగారెడ్డి
నిజామాబాదు
18°
17°
0'
30'
78°
79°
80'


నిజామాబాదు జిల్లా
జిల్లా కేంద్రము
తాలూకా కేంద్రము
మునిసిపాలిటీ
ముఖ్యగ్రామము
రాష్ట్ర సరిహద్దు
జిల్లా సరిహద్దు
తాలూకా సరిహద్దు
జాతీయ రహదారి
రాష్ట్రీయ రహదారి
ముఖ్యమైన రోడ్డు
మీటర్ గేజ్ రైలుమార్గము
నది
సరస్సు, చెరువు
ఆదిలాబాదు జిల్లా
గోదావరినది
నిజామాబాదు
బోధన్
కామారెడ్డి
ఎల్లారెడ్డి
నిజాంసాగర్
నిజాంపేట
ఆర్మూరు
బాల్కొండ
కరీంనగరముకు
స్కేలు
0 8 16 32
మైళ్లు



ఆదిలాబాదుజిల్లా
జిల్లా కేంద్రము
తాలూకా కేంద్రము
మునిసిపాలిటి
ముఖ్యగ్రామము
రాష్ట్ర సరిహద్దు
జిల్లా సరిహద్దు
తాలూకా సరిహద్దు
జాతీయ రహదారి
రాష్ట్రీయ రహదారి
ముఖ్యమైన రోడ్డు
బ్రాడ్ గేజ్ రైలు మార్గము
మీటర్ గేజ్ రైలుమార్గము
నది
మహారాష్ట్రము
నిజామాబాదు జిల్లా
కరీంనగరము జిల్లా
మధ్యప్రదేశ్
ఆదిలాబాదు
నిర్మల్
లక్సెట్టిపేట
ఉట్నూరు
కాగజ్‌నగర్
స్కేలు
0 8 16 32 మైళ్లు

# కరీంనగరముజిల్లా





నది
సరస్సు, చెరువు



జిల్లా కేంద్రము
తాలూకా కేంద్రము
మునిసిపాలిటీ
ముఖ్యగ్రామము
రాష్ట్ర సరిహద్దు
జిల్లా సరిహద్దు
తాలూకా సరిహద్దు
జాతీయ రహదారి
రాష్ట్రీయ రహదారి
ముఖ్యమైన రోడ్డు
బ్రాడ్ గేజ్ రైలు మార్గము
మహారాష్ట్ర
మధ్య ప్రదేశ్
తూర్పు గోదావరి జిల్లా
ఆదిలాబాదు జిల్లా
వరంగల్లు జిల్లా
మెదకు జిల్లా
నిజామాబాదు జిల్లా
కరీంనగరము
తెలుపులగుట్ట
మల్లాపూరం
ఇబ్రహింపట్నం
మెట్టుపల్లి
వెలిగొండ
జగిత్యాల
మల్యాల
ధాగాం
రామగుండం
కమ్మానుపురం
మంథెని
మహాదేవపురం
కాళేశ్వరం
సిరొంచ
అత్మకూరు
కొడిమెల్ల
రుద్రాంగి
రామ్మడుగు
పెద్దపల్లి
లాడ్నాపురం
రామగిరి
ముత్తవరం
కమలాపురం
చింతకాని
రామాపురం
వలమాల
కనకనూరు
జంగిడి
పోతకపల్లి
మల్లారాడు
కొత్తపల్లి
ఎలగండ్ల
సిరిసిల్ల
చెర్లవంచ
ఎల్లారెడ్డి
గంభీరావుపేట
అనంతవరం
మనకొండూరు
తాడికల్లు
ములకనూరు
సిరిసేడు
పరకాలకు
ఉప్పాల
హసనాబాద్
నరసింగపురం
హైదరాబాదు నుండి
గోదావరి
స్కేలు
0
8
16
32
మైళ్ళు






వరంగల్లు జిల్లా
జిల్లా కేంద్రము
తాలూకా కేంద్రము
మునిసిపాలిటీ
ముఖ్యగ్రామము
జిల్లా సరిహద్దు
తాలూకా సరిహద్దు
రాష్ట్రీయ రహదారి
ముఖ్యమైన రోడ్డు
బ్రాడ్ గేజ్ రైలు మార్గము
నది
సరస్సు, చెరువు
వరంగల్లు
హసన్ పర్తి
ములుగు
మల్లంపల్లి
మంగపేట
నాగారం
నాగూరుకు
సలపాక
పాలంపేట
కాటపురము
పాఖాల
నర్సంపేట
మట్టెవాడ
ధర్మసాగరం
పెండ్యాల
మద్దూరు
సలాకపూరు
ఘనపురం
కోనూరు
పాపూర్
రఘునాధపల్లి
జఫర్ ఘర్
వర్ధన్న పేట
పంథాని
నెక్కొండ
కేసముద్రం
ఇనుగుర్తి
కొండాపురం
కొండూరు
నల్లికోదూరు
నవాబ్ పేట
విస్సూరు
జిడికల్లు
పెంబర్తి
చేరియల్
తిరుమలగిరి
ఘూదుడు
మల్యాల
మహబూబాబాదు
డోర్నకల్లు
భద్రాచలము రోడ్డుకు
హైదరాబాదు నుండి
స్కేలు
0
8
16
32 మైళ్లు
79° 0'
80° 0'
18°
30'

# రాష్ట్ర పరిపాలనా విధానము

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర పరిపాలనము 1. గవర్నరు; 2. మంత్రివర్గము (కేబినెట్); 3. శాసన సభ - (a) విధాన సభ, (b) శాసన పరిషత్తు; 4. ఉన్నత న్యాయస్థానము (హైకోర్టు) ల ద్వారా జరుగుచున్నది.

## గవర్నరు

రాష్ట్ర గవర్నరును కేంద్ర ప్రభుత్వ అధినేతయగు రాష్ట్రపతి (ప్రెసిడెంటు) నియమించును. ఇతనికి గల అధికారములలో అనేకములు మంత్రి వర్గముయొక్క సలహాల ననుసరించి చలాయింప బడవలసిన వగుటచేత అత్యంత వ్యయప్రయాసలతో కూడిన ఎన్నికల ద్వారా ఇతనిని కోరుకొనుట అవసరము కాదని రాజ్యాంగ సంవిధానమును (కాన్‌స్టిట్యూషన్) రూపొందించిన 'రాజ్యాంగ పరిషత్తు' సభ్యులు భావించిరి. దీనికి తోడు ఇతడు రాష్ట్రమును పాలించుటయే గాక రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వముల మధ్య ఒక కొలికిగ (లింక్) ఉండి, రాష్ట్ర వ్యవహారముల గురించి అప్పుడప్పుడు రహస్యముగ కేంద్ర ప్రభుత్వమునకు నివేదికలను సమర్పించు చుండును. అందుచేత గవర్నరు నియామకమును రాష్ట్రపతి చేయుట ఉచిత మని భావింప బడెను. గవర్నరును నియమించుటలో సాధారణముగ రాష్ట్రపతి రెండు సంప్రదాయములను అనుసరించు చుండును: అయా రాష్ట్రములలోని మంత్రివర్గములతో సంప్రతించి, వారికి ఇష్టమైన వారినే గవర్నరుగ నియమించుట మొదటి సంప్రదాయము - రాష్ట్ర పరిపాలనము సౌష్ఠవముగ జరుగుటకు గవర్నరు మంత్రివర్గముల మధ్య సౌహార్ద ముండుట అవసర మగుటచేత ఈ సంప్రదాయము దానిని తీర్చుచున్నది. సాధారణముగ రాష్ట్రేతరవ్యక్తిని గవర్నరుగ నియమించుట రెండవ సంప్రదాయము - రాష్ట్ర రాజకీయములతో సంబంధము లేకపోవుటచే నిష్పక్షపాతముగ పరిపాలనమును సాగించుటకు వీలుండుటయే దీనికి కారణమని భావింపనగును.

భారత పౌరసత్వము గలిగి 35 సంవత్సరములకు పైగా గల వ్యక్తి రాష్ట్ర గవర్నరుగ నియమింప బడవచ్చును; గవర్నరుగ నియమింపబడుటకు ప్రత్యేక అర్హతలు ఉండవలసినట్లు రాజ్యాంగ సంవిధానము విధించియుండలేదు. కాని రాజకీయములలో గాని, పరిపాలన కార్యనిర్వహణ మందు గాని అనుభవమును గడించిన వ్యక్తిని గవర్నరుగ నియమించుట ఆచారముగ నున్నది. ఉద్యోగములో ప్రవేశించిన తరువాత రాష్ట్రపతి ఆమోదము ఉన్నంతకాలము అట్టి వ్యక్తి గవర్నరు పదవిలో ఉండవచ్చును. కాని సాధారణముగ ఐదు సంవత్సరముల కంటె ఎక్కువ కాలము ఎవరుకూడ గవర్నరు పదవిలో ఉండుట లేదు. గవర్నరుగ నుండు వ్యక్తికి శాసనసభలో సభ్యత్వ ముండరాదు; జీతముతో కూడిన మరి ఏ ఇతర ఉద్యోగమునందు ఆ వ్యక్తి ఉండరాదు.

ఆంధ్రప్రదేశ్ గవర్నరుకు అనేక సదుపాయములతో కూడిన 'రాజ భవనము' నివాస స్థానము హైదరాబాదు రాజధానిలో కలదు. నెలజీతము రు. 5,500 లు; ఇదిగాక కొన్ని అలవెన్సులు కూడ ఇతనికి లభించు చున్నవి.

గవర్నరు అధికారములు: గవర్నరుకు 1. శాసన నిర్మాణము; 2. పరిపాలన కార్య నిర్వహణము; 3. ఆర్థిక వ్యవహారములు; 4. న్యాయ పరిపాలనములకు సంబంధించిన అధికారము లనేకము లున్నవి.

ఇతడు రాష్ట్రములోని శాసన పరిషత్తు (ఎగువ సభ)కు పంద్రెండుగురు సభ్యులను పేర్కొనును. శాసన సభ్యులలో ఎవరిని గురించి గాని రాజ్యాంగ సంవిధానము విధించిన అనర్హతలను కలిగియున్నట్లు ఆరోపణము గావించినపుడు ఎన్నికల సంఘముయొక్క సలహాతో దానిని ఇతడు పరిష్కరించును. ఇతని ఆమోదమున్న గాని శాసన సభ ఆమోదించిన బిల్లులు చట్టములు కాజాలవు. చట్టము లగుటకు పూర్వము కొన్ని బిల్లులను ఇతడు రాష్ట్రపతి ఆమోదమునకు పంపించ వచ్చును. శాసనసభ సమావేశములో లేనప్పుడు ఏదైన ఒక అత్యవసర చట్టమును ప్రవేశపెట్టవలసి వచ్చిన ఎడల గవర్నరు అలాటి తాత్కాలిక చట్టమును (ఆర్డినెన్సు) ప్రకటించి, అమలులో పెట్టవచ్చును.

రాష్ట్ర పరిపాలన మంతయు గవర్నరుయొక్క అధీనమందుండవలెననియు, కార్య నిర్వహణ మంతయు ఇతని పేర జరుగవలె ననియు రాజ్యాంగ సంవిధానము విధించినది; దీనిని స్వయముగ గాని, అధికారము పొందిన ఉద్యోగస్థుల ద్వారా గాని గవర్నరు అమలు జరిపించును. రాష్ట్ర ముఖ్యమంత్రిని, ఇతర మంత్రులను, అడ్వకేట్ జనరలును, రాష్ట్ర పబ్లిక్ సర్వీసు కమీషన్ సభ్యులను, ఇతర ఉన్నతోద్యోగులు మరికొందరిని నియమించును. మంత్రివర్గము, ప్రభుత్వ శాఖలు తీసికొనిన నిర్ణయములను గురించి పూర్తి సమాచారమును తనకు అందజేయవలె నని కోరుటకును,

మంత్రుల మధ్య పరిపాలన శాఖలను పంచిపెట్టుటకును, ప్రభుత్వ కార్యనిర్వహణ క్రమమును గురించి నిబంధనలను చేయుటకు గవర్నరుకు అధికారము కలదు; ఇట్టి అధికారములు కార్యనిర్వహణము (ఎగ్జిక్యూటివ్) నకు సంబంధించినవి. ప్రభుత్వము విధించదలచిన పన్నులకు, చేయదలచిన ఖర్చులకు సంబంధించిన బిల్లులను శాసన సభలో ప్రవేశపెట్టుటకు పూర్వము వాటికి 'గవర్నరు ఆమోద' ముండవలెను. న్యాయమూర్తులు విధించు శిక్షలను రద్దు చేయుటకును, తగ్గించుటకును, నేరము చేసిన వారిని క్షమించుటకును గవర్నరు కధికారము కలదు.

అధికారముల విభాగము: గవర్నరుకు గల అధికారములు రెండు రకములు: వాటిలో అత్యధికము - నూటికి తొంభై తొమ్మిది పాళ్లు - మంత్రివర్గ సలహాల ననుసరించి చలాయింప వలసినవి; ఇవి మొదటి రకములో చేరినవి. ఇట్టి వాటికి నామమాత్రాధికారము అని పేరు. అనగా వాస్తవముగ అవి మంత్రుల అధికారము అని యర్థము. మంత్రివర్గము యొక్క సలహాతో నిమిత్తము లేక గవర్నరుకు తోచినట్లు స్వతంత్రముగ చలాయించదగ్గ అధికారములు రెండవ రకమునకు చెందును. ఇట్టి విభాగము బాధ్యతాయుత ప్రజాస్వామ్యము గల ఇంగ్లండు, కెనడా, ఆస్ట్రేలియా మొదలైన దేశము లన్నిటి యందు ఉన్నది; రాజ్యాంగ సంవిధానము ఆంధ్రప్రదేశ్‌లో ప్రవేశ పెట్టిన ప్రజాస్వామ్యము ఇట్టిది. శాసన సభకు బాధ్యత వహించి, దాని విశ్వాసమునకు పాత్రమైన వారు పరిపాలనాధికారము వహించుట దీనికి ప్రధాన లక్షణము. ఇట్లుగాక గవర్నరు రాష్ట్రపతికి బాధ్యుడు గాని రాష్ట్రములోని శాసన సభకు బాధ్యుడు కాదు. శాసన సభ విశ్వాసమునకు పాత్రుడైనను కాకపోయినను రాష్ట్రపతి ఆమోదము ఉన్నంత కాలము అధికారములో ఉండును. మంత్రులు ఈలాటివారు కారు; శాసన సభలో అధిక సంఖ్యాకులు (మెజారిటి) ఎంతకాలము వీరియందు విశ్వాసము కలవారుగ నుందురో అంతకాలము మాత్రమే మంత్రివర్గము అధికారములో ఉండును. బాధ్యతాయుత ప్రజాస్వామ్య ప్రభుత్వ సంప్రదాయానుసారముగనే ఆంధ్రప్రదేశ్‌లో కూడ గవర్నరు అధికారము అనేక విషయములలో నామమాత్రముగ నున్నది; వాస్తవాధికారము మంత్రులది.

మంత్రుల సలహాతో నిమిత్తము లేకుండ స్వతంత్రముగ గవర్నరు చలాయించ తగిన అధికారములలో ముఖ్యములైనవి: పరిపాలన గురించి సమాచారమును కోరుట; మంత్రులలో ఒకరు చేసిన నిర్ణయమును మంత్రివర్గము సమష్టిగ పునరాలోచింపవలె నని ఆదేశించుట; శాసన సభ ఆమోదించిన బిల్లులను తాను ఆమోదించుటకు పూర్వము శాసనసభ వాటిని పునరాలోచించ వలసినట్లు సందేశము పంపుట; శాసన సభ ఆమోదమును కోల్పోయిన మంత్రివర్గమును పదవి నుండి తొలగించుట; ప్రజామోదమును శాసన సభ కోల్పోయెనని తోచినపుడు దానిని రద్దుచేసి తిరిగి ఎన్నికలు జరిపించుట; రాష్ట్రములో ప్రమాద పరిస్థితులు ఏర్పడినట్లు తాను భావించినపుడు తన అభిప్రాయమును రాష్ట్రపతికి తెలిపి ప్రజాస్వామ్యము బదులు "అధ్యక్ష పరిపాలనము" తాత్కాలికముగ ప్రవేశపెట్ట తగినదని సూచించుట మొదలైనవి ఇట్టి స్వతంత్రాధికారములు.

## మంత్రివర్గము

రాష్ట్రప్రభుత్వములో రెండవ అంగము మంత్రివర్గము (కేబినెట్). రాజ్యాంగ సంవిధానములోని 163 వ నిబంధన గవర్నరుకు సలహా ఇచ్చుటకును, సహాయము చేయుటకును ముఖ్యమంత్రి నాయకత్వమున మంత్రివర్గము తప్పక ఉండవలెనని విధించినది. కనుక, మంత్రివర్గము లేకుండ గవర్నరు పరిపాలనను సాగించుట సాధారణ పరిస్థితులలో చట్ట విరుద్ధము.

మంత్రివర్గమున ఒక ముఖ్యమంత్రి నాయకత్వమున సాధారణ మంత్రులు ఉందురు. వీరి సంఖ్యకు నిర్ణీతమైన పరిమితి లేదు; రాజకీయావసరముల బట్టి ఇది పెరుగుచు, తరుగుచు ఉండును. ఇతరుల సలహాతో నిమిత్తము లేకుండ గవర్నరు ముఖ్యమంత్రిని నియమించును; కాని ఈ విషయములో తనకు ఇష్టము వచ్చిన వానిని నియమించుటకు వీలులేదు. 164 వ నిబంధనలోని రెండవ భాగము మంత్రివర్గము శాసన సభకు సమష్టి 'బాధ్యతను' వహించవలెనని విధించు చున్నది. శాసన సభలో అధిక సంఖ్యాక బలమును సంపాదించి, దాని విశ్వాసమునకు పాత్రమైన మంత్రివర్గము మాత్రమే ఇట్టి బాధ్యతను వహించ గలిగినది. అందుచేత శాసన సభలో అధిక సంఖ్యాకులకు విశ్వాస పాత్రమైన వానినే గవర్నరు 'ముఖ్యమంత్రి'గ నియమించవలసి ఉన్నది. ఏదో ఒక రాజకీయ పక్షమునకు ఇట్టి అధిక సంఖ్యాకబలము ఉన్నప్పుడు ఆ పక్షమునకు నాయకుడైన వానిని గవర్నరు తప్పనిసరిగ ముఖ్యమంత్రిగ నియమించుట తప్పదు. అందుచేత ముఖ్యమంత్రిని పేర్కొనుటలో గవర్నరుకు గల స్వాతంత్ర్యము విస్తారముగ లేదని గుర్తించ నగును.

ముఖ్యమంత్రి సూచించిన వారినే గవర్నరు సాధారణ మంత్రులుగ నియమించవలెనని రాజ్యాంగ సంవిధానము విధించు చున్నది; వీరి నియామకములో గవర్నరుకు స్వాతంత్ర్యము లేదు. ఏదైన స్వాతంత్ర్యము ఉండిన అది

ముఖ్యమంత్రికి మాత్రము ఉన్నది; అతని ఆమోదము ఉన్నవారు మంత్రు లగుట, అతని విశ్వాసమును కోల్పోయినవారు మంత్రిపదవులనుండి తొలగిపోవుట బాధ్యతాయుత ప్రజాస్వామ్యమునకు లక్షణము. మంత్రు లందరు అతని నాయకత్వమునకు లోబడి ప్రవర్తించ వలసిన కారణమున మంత్రివర్గముయొక్క సమష్టి బాధ్యత సులభసాధ్య మగుచున్నది. సాధారణ మంత్రు లను నియమించుటలో అధమపక్షము ఒక మహమ్మదీయ మంత్రిని, ఒక హరిజన మంత్రిని, తెలంగానా, రాయలసీమ, సర్కారు ప్రాంతములలో ఒక్కొక్కదానికి చెందిన మంత్రు లను కొందరిని పేర్కొనుట ఆంధ్రప్రదేశ్ సంప్రదాయము.

శాసన సభలో సభ్యులుగ ఉండిన గాని ఆరు మాసముల కంటె ఎక్కువ కాలము మంత్రిపదవులలో ఉండుటకు వీలు లేదు. అందుచేత సాధారణముగ మంత్రులందరు శాసన సభ్యులుగ ఉందురు. ఒక్కొక్కప్పుడు తన పార్టీలో ప్రముఖుడై మంత్రిపదవికి అర్హుడైనవాడు శాసన సభలో సభ్యుడు కానప్పుడు ముఖ్యమంత్రి అట్టి వానిని మంత్రిగా నియమింప వచ్చును; అట్టి వ్యక్తి ఆరు నెలలు పూర్తికాక పూర్వమే శాసన సభ్యుడుగ ఎన్నిక కావలెను. ఇది సాధ్యము కానప్పుడు అతనిని శాసన పరిషత్తు (ఎగువ సభ) కు గవర్నరు నియమించునట్లు చేయవచ్చును.

ఒక రాజకీయ పక్షమునకు శాసన సభలో అధిక సంఖ్యాక బలము ఉన్నప్పుడు ముఖ్యమంత్రి, సాధారణ మంత్రులు దానికి చెందినవారుగనే ఉందురు; ఇది కూడ సమష్టి బాధ్యతను సాధ్యము చేయుచున్నది. ఏ పక్షము నకు అధిక సంఖ్యాక బలము లేకుండ రెండు మూడు పక్షములు కలిసి మంత్రివర్గ నిర్మాణము జరగవలసినప్పుడు మంత్రులు వివిధ పక్షములకు సంబంధించినవారుగ ఉందురు. విధాన సభ (దిగువ సభ) కు మాత్రమే మంత్రులు బాధ్యు లగుటచేత వారిలో ఎక్కువ మంది విధాన సభలో సభ్యులుగ ఉందురు. శాసనపరిషత్తు (ఎగువ సభ) కు చెందిన మంత్రుల సంఖ్య సాధారణముగ తక్కువ. కాని ఏ సభలో సభ్యత్వము ఉన్నప్పటికీ, మంత్రులు రెండు సభలలోను ప్రసంగించ వచ్చును.

మంత్రివర్గము పదవీ కాలమునకు నిర్ణీతమైన పరిమితి లేదు. శాసన సభలో ఎంత కాలము వారికి సంఖ్యాబలము ఉండునో అంతకాలము వారు పదవిలో ఉండవచ్చును. కాని సాధారణముగ ప్రతి ఐదు సంవత్సరముల కొక పర్యాయము ఎన్నికలు జరుగుటచేత మంత్రివర్గము గరిష్ఠ కాలపరిమితి ఐదు సంవత్సరములని చెప్పవచ్చును; ఇది గరిష్ఠ కాలపరిమితి మాత్రమే. ఈ మధ్య కాలములో విధాన సభ విశ్వాసమును కోల్పోయినగాని, ముఖ్యమంత్రిపదవిలో మార్పులు కలిగిన గాని ఒక మంత్రివర్గము మారి మరొక మంత్రివర్గము అధికారము లోనికి రావచ్చును.

అనుభవములో పరిపాలన విధానములో మంత్రివర్గము నకు కీలక స్థానము కలదు; ఇది సమష్టిగ చేయవలసిన పనులు అనేకములు: 1. ప్రభుత్వ కర్తవ్యనిర్ణయము (పాలిసీ మేకింగ్) ప్రధానమైనది - ప్రభుత్వాధికారమును ఏయే ప్రయోజనములను సాధించుటకు వినియోగింపవలసినదీ, ఎన్నికల కాలములో పార్టీ నాయకులు ప్రజలకు చేసిన వాగ్దానములను ఎంతవరకు చెల్లించవలసినదీ నిర్ణయించ డమే ఇందులోని ప్రధానమైన అంశము; 2. చేసిన నిర్ణయ ములను విధానసభ, శాసన పరిషత్తులలో సమర్థించుచు వాటిని అమలు జరుపుటకు కావలసిన చట్టములను చేయిం చుట, అవసరమగు ద్రవ్యమును మంజూరు చేయించు కొనుట; 3. మంత్రులు పాలించే వివిధ శాఖల మధ్య వివాద ములు ఏర్పడినప్పుడు వాటిని పరిష్కరించుట; 4. మొత్తము మీద రాష్ట్ర పరిపాలనము సాఫీగా జరుగుచున్నదీ లేనిదీ, ఉన్నతోద్యోగులు వారి వారి పనులను చక్కగా నిర్వర్తించుచున్నదీ లేనిదీ పర్యవేక్షించుట; పని, పరిపాలన ములో ఎక్కడ ఏ లోపము కనుపించినను దానికి బాధ్యత వహించవలసిన సంస్థ మంత్రివర్గము. సమష్టిగ చేయవలసిన పనుల నన్నిటినీ చేయించు మంత్రులు వారి వారి అధీన ములో నుండు శాఖలను పరిపాలింతురు.

మంత్రివర్గమునకు విధానసభ, శాసన పరిషత్తులతో సన్ని హిత సంబంధ మున్నది; అది ఆ సభలలో ఒక భాగము. అది విధానసభ, శాసన పరిషత్తులపై నాయకత్వము వహించు సంస్థ. అందులో జరుగవలసిన కార్యక్రమమును నిర్ణయిం చుట; అధికార బిల్లుల ప్రవేశపెట్టి గెలిపించుట; పరిపాలన లోని లోపముల విషయమై సభ్యులు వేయు ప్రశ్నలకు, వారు చేయు విమర్శలకు జవాబులు చెప్పుట మొదలైన పనులలో ఈ నాయకత్వము వినియోగ మగుచున్నది.

## శాసన సభ

రాష్ట్ర ప్రభుత్వములో మూడవ అంగము శాసనసభ (లెజిస్లేచరు) పూర్వ కాలములో సంఘము ఆచారబద్ధమై యుండిన కారణమున క్రొత్త శాసనములను చేయవలసిన అవసరము చాల తక్కువగ నుండెను. ప్రస్తుత కాలమున సాంఘిక జీవిత మంతయు క్రొత్త శాసనములద్వారా మార్పును పొందుచున్నది. అందుచేత శాసన నిర్మాణము నకు పూర్వకాలములో లేని ప్రాధాన్యము ఈ కాలమున లభించి యున్నది. ఇదిగాక ప్రజాస్వామ్య విధానములో శాసన నిర్మాణ మంతయు ప్రజలు ఎన్నుకొన్న ప్రతినిధుల

సాధనమున జరుగవలసి యుండుటచేత శాసనసభకు ప్రత్యేక ప్రాధాన్యము లభించియున్నది.

ఆంధ్ర ప్రదేశ్‌లోని శాసనసభ రెండు శాఖలతో కూడినది; ఇందు మొదటిది విధాన సభ (దిగువ సభ); రెండవది శాసన పరిషత్తు (ఎగువ సభ). సభ్యత్వమందును అధికారమునందును ఈ రెండిటికి అనేక భేదములున్నవి.

విధాన సభ (లెజిస్లేటివ్ అసెంబ్లీ): ఇందులో 302 మంది సభ్యులు గలరు; వీరిలో ఆంగ్లో ఇండియన్ సభ్యుని ఒకనిని మాత్రము గవర్నరు నియమించును. తక్కిన 301 మందిని ప్రజలే ఎన్నుకొందురు. 301 స్థానములలో 43 స్థానములు హరిజనులకు; 11 స్థానములు గిరిజనులకును కేటాయింపబడినవి. సుమారు ప్రతి డెబ్బదివేల జనాభాకు ఒక సభ్యుడు ఎన్నుకొనబడును. ఎన్నికలకై 52 ద్విసభ్య నియోజక వర్గములు, 197 ఏకసభ్య నియోజక వర్గములు కలవు. వయస్సులో 25 సంవత్సరములకు తక్కువ కానివారు సభ్యత్వమునకు అర్హులు. సభ్యులను ఎన్నుకొను హక్కు 21 సంవత్సరముల వయస్సుకు తక్కువకాని స్త్రీ, పురుష వయోజను లందరికి కలదు. ఎన్నికలు రహస్య పద్ధతిని, అభ్యర్థులలో ఎక్కువ వోట్లు వచ్చిన వారు గెలుచు పద్ధతిని జరుగుచున్నవి.

సభయొక్క కార్యక్రమమును నిబంధనల ననుసరించి నడుపుటకు సభవారే ఒక సభాపతి (స్పీకరు)ని, ఒక ఉపసభాపతి (డిప్యూటి స్పీకరు)ని ఎన్నుకొనుచున్నారు. అధిక సంఖ్యాకుల (మెజారిటీ) వోటుతో వారు వారిద్దరిని అధికారమునుండి తొలగించవచ్చును. సభాపతి సభకు అధ్యక్షుడై సభలో జరుగు చర్చలు పూర్తిగను, స్వేచ్ఛగను, సకాలములో పూర్తి యగునట్లును జరుగునట్లు చేయును. సంఖ్యాబలము కల అధికార పక్షమునకే గాక ప్రతిపక్షమునకుగూడ చర్చలలో పాల్గొను అవకాశము కలుగునట్లు చేయుట అతని బాధ్యత. సభయొక్క గౌరవ ప్రతిష్ఠలకు లోపము లేకుండ సభ్యులు ప్రసంగములను సాగించునట్లు చూచుచు అధికారుల వలనగాని అనధికారుల వలనగాని సభ్యుల కార్యనిర్వహణ స్వేచ్ఛకు భంగము వాటిల్లనట్లు వారి హక్కులను, మర్యాదలను ఇతడు కాపాడును.

విధాన సభ చేయవలసిన పనులలో శాసన నిర్మాణము, పన్నులను విధించుట, ప్రభుత్వము వసూలు చేసిన ద్రవ్యమును ఖర్చుపెట్టవలసిన విధానమును నిర్ణయించుట, ప్రశ్నల సాధనమునను తీర్మానముల మూలమునను మంత్రుల పరిపాలనమును విమర్శించుట, ప్రజల కష్టసుఖములను మంత్రుల దృష్టిలోనికి తెచ్చుట ప్రధానములైనవి. మంత్రివర్గముయొక్క పరిపాలనము తృప్తికరముగ లేనప్పుడు వారిపై విశ్వాసరాహిత్య తీర్మానమును గావించి అధికారమునుండి తొలగించు అధికారము విధాన సభకు గలదు.

సాధారణ పరిస్థితులలో విధానసభ గరిష్ఠ కాలపరిమితి ఐదు సంవత్సరములు. కాని అంతకు లోపలనే గవర్నరు మంత్రివర్గము కోరికపైన గాని స్వతంత్రముగగాని దానిని రద్దుచేసి క్రొత్త ఎన్నికలు జరిపించవచ్చును. మంత్రులపై విశ్వాసరాహిత్య తీర్మానము గావించి, వారిని అధికారమునుండి తొలగించు హక్కు విధానసభకు ఉన్నట్లే విధానసభను రద్దుచేయు హక్కు మంత్రులసభకు గలదు. బాధ్యతాయుత విధానములో ఈ హక్కు గొప్ప ప్రాధాన్యమును వహించియున్నది. ఏదియో ఒక ప్రబల కారణమున్నప్పుడు తప్ప మంత్రులపై విధానసభ విశ్వాసరాహిత్య తీర్మానము చేయకుండుటలో ఇది ముఖ్యమైన సాధనము. మంత్రివర్గము, విధానసభ ఈ రెండును సహకరించి పరస్పరాశ్రయముగ ప్రవర్తించుటలో ఇది తోడ్పడు చున్నది.

శాసన పరిషత్తు (లెజిస్లేటివ్ కౌన్సిల్): శాసన పరిషత్తులోని సభ్యుల సంఖ్య విధాన సభ్యుల సంఖ్యలో మూడవ వంతుకంటె మించకూడదను రాజ్యాంగ సంవిధానమునందలి ఏర్పాటు ననుసరించి ఇందు సభ్యుల సంఖ్య 90 గా నిర్ణయమై యున్నది. వీరిలో 31 మందిని విధాన సభయు, 31 మందిని రాష్ట్రములోని స్థానిక సంస్థలును, 8 మందిని ఉపాధ్యాయ నియోజక వర్గమును, 8 మందిని పట్టభద్ర నియోజక వర్గమును ఎన్నుకొనును. తక్కిన 12 మంది సారస్వతము, విజ్ఞానశాస్త్రము, కళలు, సహకారము, సంఘ సేవలందు ప్రఖ్యాతి గాంచిన వ్యక్తులు గవర్నరుచే నియమింపబడు చున్నారు. ఈ విధముగ సభ్యత్వ సంపాదనములో పరిషత్తుకు, విధాన సభకు చాల భేదమున్నది. శాసన పరిషత్తు ఒక అధ్యక్షు (ఛైయిర్మన్) ని, ఒక ఉపాధ్యక్షు (డిప్యూటీ ఛైయిర్మన్) ని ఎన్నుకొనును.

శాసన పరిషత్తు కాల పరిమితి లేని శాశ్వత సభ; కాని ఇందులోని సభ్యుల గరిష్ఠ సభ్యత్వ కాలపరిమితి ఆరు సంవత్సరములు. వీరిలో రెండు సంవత్సరముల కొకపర్యాయము మూడవ వంతు సభ్యులు సభ్యత్వమును కోల్పోవుదురు. దాని ఫలితముగ ఏర్పడిన ఖాళీలకు మాత్రమే సభ్యులను ఎన్నుకొనుట జరుగుచున్నది. సభ్యులందరు ఏక కాలమున సాధారణ ఎన్నికల ద్వారా సభ్యులగుట, ఏక కాలమున సభ్యత్వమును కోల్పోవుట విధాన సభకు లక్షణము. ఈ విషయములో కూడ శాసన పరిషత్తుకు విధాన సభకు చాల భేద మున్నది.

అధికారములలో కూడ రెండు సభల మధ్య భేదము కలదు. మంత్రులను తొలగించి క్రొత్త మంత్రివర్గమును

నిర్మాణము చేయు అధికారము పరిషత్తుకు లేదు. మంత్రులు విధాన సభకు మాత్రమే బాధ్యులు; విధాన సభను ప్రత్యక్షముగ ప్రజలు ఎన్నుకొనుటయే దీనికి కారణము. పన్నులను విధించుట, వసూలు అయిన ద్రవ్యమును ఖర్చుపెట్టుట మొదలగు వాటికి సంబంధించిన ఆర్థిక బిల్లులు (మనీ బిల్సు) చట్టమగుటకు శాసనపరిషత్తుయొక్క ఆమోదము అవసరము లేదు. తక్కిన బిల్లులు కూడ కొన్ని షరతులకు లోబడి పరిషత్తుయొక్క ఆమోదము లేకపోయినను విధాన సభయొక్క ఆమోదముతో చట్టము అగుచున్నవి. అన్ని విషయముల గురించి చర్చలు సాగించుటకును, మంత్రులను ప్రశ్నించుటకును పరిషత్తుకు అధికారమున్నను అది విధాన సభ అధికారము వంటిది కాదు. అందుచేతనే పరిషత్తు అవసరమా అను ప్రశ్న కలుగుచున్నది.

విధాన సభయొక్క ఆమోదము లేనిదే శాసన నిర్మాణముగాని, పన్నులను విధించుటగాని, ప్రభుత్వ ద్రవ్యమును ఖర్చుపెట్టుటగాని సాధ్యముకాని కారణమునను, విశ్వాస రాహిత్యమును ప్రకటించి మంత్రివర్గమును రద్దు చేయగల శక్తి విధాన సభకు ఉండు కారణమునను మంత్రివర్గము నిరంకుశముగ ప్రవర్తించుటకు వీలులేదు.

## ఉన్నత న్యాయస్థానము

ప్రభుత్వమునకు నాలుగవ అంగము ఉన్నత న్యాయస్థానము (హైకోర్టు). వివాదములను అభిమాన దురభిమానములు లేకుండ నిష్పక్షపాతముగను నిర్భయముగను శాసనానుసారముగను పరిష్కరించు న్యాయ స్థానము రాష్ట్రమం దుండుట అత్యవసరము. రాజ్యాంగ సంవిధానములో పేర్కొనబడిన 'ఉన్నత న్యాయస్థానము' ఇట్టిదని చెప్పవచ్చును.

ఇందులో ఒక ప్రధాన న్యాయమూర్తి (చీఫ్ జస్టిస్), కొందరు సాధారణ న్యాయమూర్తులు ఉందురు. కార్యభారమును బట్టి రాష్ట్రపతి వీరి సంఖ్యను నిర్ణయించును. 1960 లో ఆంధ్రప్రదేశ్ హైకోర్టు న్యాయమూర్తుల సంఖ్య 13; వీరి నందరిని రాష్ట్రపతి నియమించును. ప్రధాన న్యాయమూర్తిని నియమించుటలో మహోన్నత న్యాయస్థానము (సుప్రీమ్ కోర్టు)లోని ప్రధాన న్యాయమూర్తి యొక్కయు, రాష్ట్ర గవర్నరు యొక్కయు అభిప్రాయములను; తక్కిన న్యాయాధీశులను నియమించుటలో వీరి అభిప్రాయములతోపాటు రాష్ట్ర ప్రధాన న్యాయమూర్తి అభిప్రాయమును అనుసరించును. వీరు అరవై సంవత్సరముల వయస్సు పూర్తియగువరకు ఉద్యోగములో ఉందురు. వీరి జీతములు రాజ్యాంగ సంవిధానము నిర్ణయించి యున్నది. వాటిని మార్చుటకు ఎవరికిని అధికారము లేదు. రాజ్యాంగ సంవిధానము మార్చినగాని ఇవి మారజాలవు. వివాదములను తీర్పు గావించుటలో వీరు నిర్భయముగను స్వతంత్రులుగను ప్రవర్తించుటకు ఈ రెండు షరతులు తోడ్పడుచున్నవి. ప్రభుత్వమునకు ఇష్టము లేని తీర్పులను చేసినప్పుడు తమ ఉద్యోగమునకు, జీతమునకు భంగము కలుగు నను భయము వీరికిలేదు. ప్రభుత్వమునకు ప్రజలకు మధ్య సంభవించు వివాదములను నిష్పక్షపాతముగ పరిష్కరించుట దీని మూలమున సాధ్య మగుచున్నది. కొన్ని దేశములలో ప్రభుత్వోద్యోగులను విచారణ చేయుటకు ప్రత్యేక చట్టములు, ప్రత్యేక న్యాయస్థానములు కలవు. భారత దేశములో అటువంటి విచక్షణ లేకుండ ఉద్యోగులు, సామాన్య పౌరులు - అందరు - ఒకే చట్టములకు ఒకే విధమయిన న్యాయస్థానములకు లోబడి ఉన్నారు. క్రింది కోర్టులలో న్యాయాధీశులుగ నుండి అనుభవము గడించినవారు, అధమపక్షము పది సంవత్సరముల కాలము న్యాయవాదులుగ నుండినవారు మాత్రమే ఉన్నత న్యాయాధీశు లగుటకు అర్హు లగుటచేత న్యాయశాస్త్ర జ్ఞానమును పూర్తిగ సంపాదించినవారే న్యాయాధీశు లగుట జరుగుచున్నది. రాష్ట్రములోని తక్కిన న్యాయస్థానములపై (జిల్లాకోర్టులు మొదలైన వాటిపై) అజమాయిషీ చేయు అధికారము ఉన్నత న్యాయ స్థానమునకు కలదు. అందుచేత న్యాయ పరిపాలన మంతయు ఒకే పద్ధతి ననుసరించి జరుగుట కవకాశ మేర్పడుచున్నది.

## ఉద్యోగ శాఖ (సివిల్ సర్వీసు)

పరిపాలనమునకు సంబంధించిన దైనందిన వ్యవహారములను ఉద్యోగ శాఖవారు సాగించుచున్నారు. 'సెక్రటేరియట్' లోను 'రెవిన్యూ బోర్డు' లోను పనిచేయు ఉన్నతోద్యోగులు, జిల్లా కలెక్టరులు, డిప్యూటీ కలెక్టరులు, తహసీలుదారులు, వ్యవసాయము, విద్య మొదలగు శాఖలలో పనిచేయు డైరెక్టరులు ఈ శాఖకు చెందిన వారు. వీరు చట్టములను నిష్పక్షపాతముగ అమలులో పెట్టవలసిన వారు. అందుచేత ఎన్నికల ద్వారా వీరిని నియమించుటలేదు. వీరు కేంద్ర పబ్లిక్ సర్వీసు కమిషన్, రాష్ట్ర పబ్లిక్ సర్వీసు కమిషన్ వారు చేయు సిఫారసుల ననుసరించి ప్రభుత్వముచే నియమింప బడుదురు. ఇందుకు గాను 'పబ్లిక్ సర్వీసు కమిషన్' పోటీపరీక్షలు జరుపును. కొన్ని సందర్భములలో మార్గాంతరమున అభ్యర్థుల అర్హతానర్హతలను వారు నిర్ణయించుచున్నారు. వారు చేయవలసిన పనులకు కావలసిన విద్య, నైపుణ్యము, శక్తి సామర్థ్యములు ఉన్నట్లు తెలిసికొనుటకు పరీక్షలు ఉపయోగ పడుచున్నవి. ఉద్యోగమందు ప్రవేశించిన తరువాత 55 సంవత్సరముల వయస్సు పూర్తి

యగు వరకు వీరు ఉద్యోగములో నుందురు. దీనిమూలమున విద్యతో పాటుకాలము గడుచు కొద్ది వీరు అనుభవమును సంపాదించి వారి వారి పనులను చక్కగ నిర్వహింతురు.

ఎన్నికల సాధనమున అధికారములోనికి వచ్చు మంత్రులకు పరిపాలనానుభవము ఎక్కువగ ఉండుటకు అవకాశములేదు. వారు తలపెట్టు సంస్కరణములు, చేయదలచు మార్పులు, అనుసరించ గోరు కార్యక్రమములు ఒక్కొక్కప్పుడు ఆచరణ యోగ్యములు కాకపోవచ్చును. అట్టి సందర్భములలో అనుభవ వేత్తలగువారు వారికి సలహాల నీయవలసిన అవసరము ఎంతైన ఉన్నది. 'సెక్రటేరియట్' లో ఉన్నతోద్యోగులు ఈ అవసరమును తీర్చుచున్నారు. అనుభవము గడించిన ఉద్యోగశాఖ సహాయ మున్నప్పుడే మంత్రివర్గము వారి పనులను సౌష్ఠవముగ నిర్వహించువారగుచున్నారు. ఉద్యోగశాఖ దైనందిన వ్యవహారములను సాగించు వారే గాక మంత్రులకు సలహాలనిచ్చు వారని కూడ గుర్తించుట అవసరము.

రాష్ట్ర పరిపాలనము, రాష్ట్రములోని పరిపాలనము: భారత దేశము అనుసరించు చుండునది-సమాఖ్య(ఫెడరల్) పరిపాలన విధానము. ఇందు ప్రభుత్వము చేయవలసిన పనులలో కొన్నిటిని కేంద్రప్రభుత్వము, మరికొన్నిటిని రాష్ట్ర ప్రభుత్వము చేయవలసి యున్నది. పరిపాలనము ద్వారా ప్రజలకు లభించవలసిన ప్రయోజనములు కొన్ని కేంద్ర ప్రభుత్వ సాధనమునను, మరికొన్ని రాష్ట్ర ప్రభుత్వ సాధనమునను లభించుచున్నవి. రాష్ట్రమును పాలించుటకై ఏర్పడిన గవర్నరు, మంత్రివర్గము, శాసన సభలు రాష్ట్ర వ్యవహారముల పైన మాత్రమే అధికారము వహింతురు. కేంద్ర ప్రభుత్వము రాష్ట్రములో చేయవలసిన పనులమీద గాని, అందజేయవలసిన ప్రయోజనముల విషయమున గాని రాష్ట్ర ప్రభుత్వమునకు స్వతంత్రమగు ప్రత్యక్ష సంబంధము లేదు. ఆ పనులలో అనేకములను కేంద్ర ప్రభుత్వము నియమించు ఉద్యోగులు చేయుచున్నారు. ప్రతి రాష్ట్రమందును ఇట్టి ఉద్యోగులు, కేంద్ర ప్రభుత్వపు అధీనములో ఉండు ఇతర సంస్థలలో ఉండుట గమనించవలసి ఉన్నది. దీని మూలముగ రాష్ట్ర పరిపాలనమునకు (రాష్ట్ర ప్రభుత్వము ద్వారా జరుగు పరిపాలనమునకు), రాష్ట్రములోని పరిపాలనమునకు భేద మేర్పడుచున్నది. రాష్ట్రములోని పరిపాలనము రాష్ట్ర పరిపాలనముకంటె విశాలతరమైనది.

దేశరక్షణ, విదేశ వ్యవహారములు, రేడియో, రైల్వేలు, జాతీయ రహదారులు, తంతి - తపాలా ఉత్పత్తి పన్ను (ఎక్సైజు) మొదలైనవి కేంద్ర ప్రభుత్వాధీనములో నుండును. ఆదాయపు పన్నులు, సుంకములు మొదలైనవి కేంద్ర ప్రభుత్వము విధించు పన్నులు; వీటిని వసూలు చేయుటకు కేంద్ర ప్రభుత్వ ఉద్యోగులు కలరు.

సాధారణ, అసాధారణ పరిస్థితులు : రాష్ట్ర పరిపాలనములో ఇంకొక భేదమును గూడ గమనింప వలసియున్నది. పైన వివరింపబడిన బాధ్యతాయుత విధానము సాధారణ పరిస్థితులందు మాత్రమే ఆచరణ యందుండునది. అసాధారణ పరిస్థితు లేర్పడి, ప్రజాస్వామ్య విధానమున పరిపాలనమును సాగించుట ప్రమాద కరమైనప్పుడు ఆ విధానము తాత్కాలికముగ రద్దగుటయు, అధ్యక్ష పరిపాలనము (ప్రెసిడెంట్స్ రూల్) స్థాపింపబడుటయు జరుగును. విదేశీయుల దండయాత్ర మూలమున గాని, యుద్ధము మూలమున గాని, దౌర్జన్యము లోనికి దిగిన అంతః శత్రువుల మూలమున గాని, రాష్ట్ర శాసన సభలో ఏరాజకీయ పక్షమునకు సంఖ్యా బలము లేకుండ సుస్థిరమైన మంత్రివర్గ నిర్మాణము సాధ్యము కాకపోవుట మూలమున గాని అసాధారణ పరిస్థితి ఏర్పడవచ్చును. అట్టి అసాధారణ పరిస్థితి ఏర్పడినట్లు నిర్ణయించు అధికారము రాష్ట్రపతికి మాత్రము కలదు. అతడట్టి నిర్ణయము చేసినప్పుడు రాష్ట్రమును పాలించు అధికారము అతని వశ మగును. దాని ఫలితముగ రాష్ట్రములోని శాసన సభ, మంత్రివర్గము రద్దగును. రాష్ట్రపతి ఆదేశములకు లోబడి పరిపాలన మంతయు గవర్నరు సాగించును.

ఇట్టి అసాధారణ పరిస్థితి 1953 లో ఆంధ్ర రాష్ట్ర నిర్మాణము జరిగిన రెండు నెలల తరువాత ఏర్పడెను. అప్పుడు అధికారమం దుండిన శ్రీ టంగుటూరు ప్రకాశం మంత్రివర్గముపై శాసన సభ విశ్వాస రాహిత్యమును ప్రకటించెను. దాని ఫలితముగ ఆ మంత్రివర్గము రాజీనామా చేసెను. దాని స్థానమున సుస్థిరమైన మంత్రివర్గ మింకొకటి దానిని నిర్మాణము చేయుట సాధ్యము కాదయ్యెను. అప్పుడు రాష్ట్రపతి రాష్ట్రములో అసాధారణ పరిస్థితి ఏర్పడినట్లు ప్రకటించి, పరిపాలనమును తన వశము చేసికొని, శాసన సభను రద్దు చేసి, తిరిగి ఎన్నికలు జరిపి, క్రొత్త మంత్రివర్గము నిర్మాణ మగు వరకు రాష్ట్రమును గవర్నరు ద్వారా పరిపాలించెను. యుద్ధాది కారణాంతరముల వలన విపరీత పరిస్థితులు ఏర్పడినపుడు కూడ ఇట్టి పరిపాలన విధానము అమలులోనికి రాగలదు.

## స్థానిక స్వపరిపాలనము

స్థానిక పరిపాలనము యొక్క ప్రధాన లక్షణములు 'తెలుగు సంస్కృతి - ౧' సంపుటములోని 515-18 పుటలలో వివరింప బడియున్నవి. ఇప్పటికి కూడ పట్టణములలో అట్టి

పరిపాలన విధానమే అమలులో ఉన్నది. గ్రామీణ ప్రాంతములలో మాత్రము, 1959 లో గావింపబడిన 'పంచాయతి సమితులు - జిల్లా పరిషత్తుల' చట్టము మూలమున గొప్ప మార్పులు కొన్ని సంభవించినవి. వాటి స్వరూపము దిగువ వివరింప బడినది.

ప్రస్తుతము గ్రామీణ ప్రాంతములలోని స్థానిక స్వపరిపాలనము మూడు అంతస్థులతో కూడిన విధానము. వీటిలో క్రింది అంతస్థున గ్రామ పంచాయతీలును, మధ్య అంతస్థున పంచాయతీ సమితులును, పై అంతస్థున జిల్లా పరిషత్తులును, ఉన్నవి. గ్రామ పంచాయతీలు 1959 పూర్వము ఎట్టి స్వరూపము కలవిగ నుండినవో ఇప్పుడు కూడ అట్టి స్వరూపము కలవిగనే ఉన్నవి. కనుక వాటిని గురించిన వివరణ మిచ్చుట లేదు.

పంచాయతీ సమితులు : ఇవి 1959 లో గావింపబడిన చట్టము ననుసరించి క్రొత్తగ స్థాపింపబడిన సంస్థలు, పంచవర్ష ప్రణాళికల ఫలితముగ రాష్ట్రములోని ఒక్కొక్క జిల్లా కొన్ని సమాజ వికాస క్షేత్రములు (కమ్యూనిటీ డెవలప్ మెంటు బ్లాక్స్)గ విభాగము చేయబడి యున్నది. ఒక్కొక్క క్షేత్రములో సుమారు నూరు గ్రామములు ఉన్నవి. వీటియొక్క సర్వతోముఖాభివృద్ధియే ఈ విధానముయొక్క ఉద్దేశము. దీనిని కొన సాగించుటకు ఒక్కొక క్షేత్రమందు ఒక పంచాయతీ సమితి ఏర్పాటు చేయబడి ఉన్నది. ఒక్కొక గ్రామమునకు సంబంధించిన స్థానిక వ్యవహారములను సాగించుటకు గ్రామ పంచాయతి ఉన్నట్లు అనేక గ్రామములతో కూడిన సమాజ వికాస క్షేత్రమునకు సంబంధించిన స్థానిక వ్యవహారములను సాగించుటకు పంచాయతి సమితి నెలకొల్ప బడియున్నది.

ఒక్కొక సమితిలో మూడు రకముల సభ్యు లున్నారు. వారి వారి ఉద్యోగ ధర్మముచే 'ఎక్స్ అఫీషియో' సభ్యత్వమును వహించిన వారు మొదటి రకమునకు చెందిన వారు. క్షేత్రములోని గ్రామ పంచాయతీల అధ్యక్షు లందరు ఈ విధముగ సభ్యులైన వారు; జిల్లా కలెక్టరుచేత నియమింపబడిన వారు రెండవ రకమునకు చెందిన వారు. క్షేత్ర హద్దులలో పంచాయతీలు లేని గ్రామములలో ఒక్కొక దానికి ఒక్కొక ప్రతినిధిని కలెక్టరు పేర్కొనును. ఈ రెండు రకముల సభ్యులు కలిసి ఒక స్త్రీని, ఒక హరిజనుని, (కొన్ని పరిస్థితులలో) షెడ్యూల్డు తరగతులకు చెందిన ఒక సభ్యుని, ప్రజా సేవయందు ప్రఖ్యాతి గాంచిన వారిని ఇద్దరిని, ఒక సహకార సంఘ సభ్యుని ఎన్నుకొందురు. ఇట్టి ఎన్నిక వలన సభ్యులైన వారు మూడవ రకములోని వారు. ఈ మూడు రకముల సభ్యులలో ఎవరును కూడ ప్రజలచే ప్రత్యక్షముగ ఎన్నుకొనబడిన వారు కారను విషయము గుర్తించ వలసి యున్నది. ఎన్నుకొనబడిన వారు మొదటి రకములోను, మూడవ రకములోను చేరిన సభ్యులు పరోక్ష ఎన్నికల (ఇన్ డైరెక్టు ఎలక్షను) ద్వారా సభ్యులైన వారు. ప్రస్తుతము దేశములో పరోక్ష ఎన్నికల విధానము కొంత ప్రాధాన్యము వహించుచున్న దని దీనిని బట్టి చెప్పవచ్చును. క్షేత్రమునకు సంబంధించిన రాష్ట్రశాసన సభలోని దిగువ సభ్యులు, జిల్లా కలెక్టరు సమితి సమావేశములలోను స్థాయి సంఘముల సమావేశములలోను పాల్గొన వచ్చును. కాని వాటిలో వోటు చేయు అధికారము వీరికి లేదు. రెండవ, మూడవ రకముల సభ్యుల పదవీకాలపరిమితి మూడు సంవత్సరములు. మొదటి రకములోని వారు వారి వారి గ్రామ పంచాయతీల అధ్యక్షతను ఎంత కాలము అనుభవించుచుందురో అంతకాలము సమితిలో సభ్యులుగ నుందురు. ప్రతి సమితికి ఒక అధ్యక్షుడు, ఒక ఉపాధ్యక్షుడు ఉన్నారు; వీరిని సమితి సభ్యులు ఎన్నుకొందురు. వీరి పదవీ కాలము మూడు సంవత్సరములు. కాని, ఇది పూర్తి కాకముందే సమితి సభ్యులు వీరిపై విశ్వాసరాహిత్య తీర్మానముగావించి వీరిని ఉద్యోగమునుండి తొలగించు అవకాశమున్నది. కొన్ని సందర్భములలో రాష్ట్ర ప్రభుత్వము కూడ వీరిని ఉద్యోగము నుండి తొలగించ వచ్చును.

సమితి చేయవలసిన పనులు సౌష్ఠవముగ జరుగుటకు ఐదు స్థాయీ సంఘములు ఏర్పడి యున్నవి. ఇది కూడ క్రొత్తగ నిర్మింపబడిన స్థానిక పరిపాలన విధానము లోని విశేషములలో నొకటి. సమితి అధ్యక్షుడు ప్రతి స్థాయీ సంఘమునకు అధ్యక్షుడు. తక్కిన సభ్యులను సమితి సభ్యులు ఎన్నుకొనుచున్నారు. ఎన్నుకొనబడువారిలో ఒక రిద్దరు సమితి సభ్యత్వము లేని వారుగ గూడ ఉండవచ్చును.

జిల్లా పరిషత్తులు : ఒక్కొక్క జిల్లాకు ఒక పరిషత్తు కలదు. ఇదివరకు ఉండిన జిల్లా బోర్డుల స్థానమున ఇవి స్థాపింపబడినవి. పరిషత్తులోని సభ్యులు కూడ అనేక రకములుగ ఉన్నారు. జిల్లాలోని పంచాయితీ సమితుల అధ్యక్షులు మొదటి రకములో చేరిన సభ్యులు. వీరుగాక జిల్లా కలెక్టరు, జిల్లానుండి రాష్ట్ర శాసన సభలోని దిగువ సభకు ఎన్నుకొనబడిన ప్రతినిధులు, లోక్ సభకు ఎన్నుకొనబడిన వారు ఇంకొక రకపు సభ్యులు. రాష్ట్ర విధాన సభ సభ్యులను కొందరిని; రాజ్యసభ సభ్యులను కొందరిని పరిషత్సభ్యులుగ రాష్ట్ర ప్రభుత్వము నియమించును. పంచాయతీ సమితులు లేని ఒక్కొక్క వికాస క్షేత్రమునుండి అందులోని గ్రామ పంచాయితీల అధ్యక్షులు ఒక్కొక్క ప్రతి

నిధిని ఎన్నుకొందురు. వీరుకూడ సమితి సభ్యులగుదురు. పలు రకములకు చెందిన ఈ సభ్యులందరు ఇద్దరు స్త్రీలను, హరిజన ప్రతినిధి నొకరిని, (కొన్ని పరిస్థితులలో) షెడ్యూల్డు తరగతులకు చెందిన ప్రతినిధి నొకరిని ఎన్నుకొందురు. ఎన్నుకొనబడు సభ్యుల పదవీకాలము మూడు సంవత్సరములు. సమితి సభ్యులవలెనే పరిషత్సభ్యులు కూడ పరోక్ష ఎన్నికల విధాన సభ్యత్వమును సంపాదింతురు.

ఒక్కొక్క పరిషత్తుకు పరిషత్సభ్యులు ఒక అధ్యక్షుని ఒక ఉపాధ్యక్షుని ఎన్నుకొను చున్నారు. పదవీ కాల పరిమితి విషయములోను, ఇతర విషయములలోను వీరు సమితి అధ్యక్షులను పోలియున్నారు. పరిషత్తు చేయవలసిన పనులు సౌష్ఠవముగ జరుగుటకు కూడ ఐదు స్థాయీ సంఘములు ఏర్పడినవి.

పరిపాలన కార్య నిర్వహణము: ప్రతి పరిపాలన విధానమందు రెండు మెట్లు (దశలు) ఉన్నవి. మొదటి మెట్టు చేయవలసిన కర్తవ్య నిర్ణయము (పాలసీ మేకింగ్); రెండవది కార్యనిర్వహణము లేదా నిర్ణయింపబడిన కార్యమును ఆచరణలో పెట్టుట. సమితులలోను, పరిషత్తులలోను ఈ రెండు పనులను చేయువారు వేరువేరుగ ఉన్నారు. సమితి సభ్యులు, పరిషత్సభ్యులు కర్తవ్య నిర్ణయమును చేయువారు. చేయవలసిన కార్య కలాపముల గురించి ఆలోచించుట, తీర్మానములను చేయుట, పన్నులను విధించుట, ఆదాయములో ఎంత మొత్తమును ఏయే పనులకు కేటాయింప వలెనో నిర్ణయించుట మొదలైన పను లన్నియు కర్తవ్య నిర్ణయము (డెలిబరేటివ్ ఫంక్షన్)నకు సంబంధించినవి. చేసిన తీర్మానములను అమలులో నుంచుట, పన్నులు వసూలు చేయుట, కేటాయించిన ఆదాయమును ఖర్చుపెట్టుట మొదలైనవి కార్య నిర్వహణమునకు సంబంధించినవి. వీటిని చేయుటకు ప్రభుత్వము నియమించిన ప్రత్యేక అధికారులు (ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్స్) ఉన్నారు. ప్రతి సమితిలోను ఒక బ్లాక్ డెవలప్‌మెంటు ఆఫీసరు, ప్రతి పరిషత్తులో ఒక కార్యదర్శి ఇట్టివారుగా ఉన్నారు. కర్తవ్య నిర్ణయమును చేయు ప్రజా ప్రతినిధులకును కార్యనిర్వహణ బాధ్యతగల ప్రభుత్వోద్యోగులకును గల ఈ భేదము గుర్తించ వలసి యున్నది. పరిపాలన విధానమందలి ఈ విభాగము స్థానిక పరిపాలన లక్షణములలో ఒకటి.

స్థానిక సంస్థల పనులు: 1959 చట్టము ప్రకారము ఏర్పడిన పంచాయతీ సమితులు, జిల్లా పరిషత్తులు పలురకములైన పనులను నిర్వహించవలసి ఉన్నది. ఇందుకు పూర్వము స్థానిక సంస్థలు ప్రధానముగ ఆరోగ్యము, రోడ్లు మొదలైన రవాణా సౌకర్యములు, విద్యలకు సంబంధించిన పనులను మాత్రమే ఎక్కువగ చేయు చుండెడివి. ఇప్పుడివి ఈ పనులనే గాక పంచవర్ష ప్రణాళికలలోని అభివృద్ధి పథకములకు సంబంధించిన వ్యవసాయము, పశు సంపద, చిన్న జలాధారములు, కుటీర పరిశ్రమలు, సహకారము, స్త్రీ సంక్షేమము, సాంఘిక విద్య, సాంఘిక సంక్షేమము మొదలైన వాటి విషయమై బాధ్యత వహించ వలసి యున్నది. అభివృద్ధి కార్యక్రమములు విజయవంతముగ కొనసాగుటకు ప్రజల సహకారము ప్రధాన సాధన మనియు, ప్రజా ప్రతినిధులతో కూడిన స్థానిక సంస్థల ద్వారా ఆ సహకారమును సంపాదించుట సులభ మనియు ప్రభుత్వము భావించిన కారణమున సమితులకు పరిషత్తులకు ఈ కార్యక్రమము లన్నియు స్వాధీనము చేయబడెను. ఈ విధానమునకే పంచాయతీరాజ్య మని పేరు, ప్రజాస్వామ్య వికేంద్రీకరణ (డెమాక్రాటిక్ డీసెంట్రలైజేషన్)మనుపేరు ప్రచారములోనికి వచ్చియున్నది. ఇదివరకు ప్రభుత్వోద్యోగులు చేయుచున్న పను లనేకము ప్రజా ప్రతినిధులతో కూడిన సమితులు, పరిషత్తులు ప్రస్తుతము చేయుచుండుట గుర్తింప తగిన విశేషములలో ఒకటి.

సోపాన విధానము: ఇప్పటి గ్రామీణ మూడంతస్థుల స్థానిక పరిపాలనలో విశిష్ట లక్షణము. క్రింది అంతస్థులోని గ్రామ పంచాయతీలపై పెత్తనముచేయు అధికారము పంచాయతీ సమితులకును ఇదే విధముగ పంచాయతీ సమితులపై పెత్తనముచేయు అధికారము జిల్లా పరిషత్తులకు గమనించనగును. ఇట్టి పెత్తన విధానమునకు సోపాన విధాన మని (హైరార్కికల్ సిస్టమ్) పేరు. ఒక అంతస్థులోని ప్రజా ప్రతినిధులు ఇంకొక అంతస్థులోని ప్రజాప్రతినిధులపై పెత్తనము వహించుట ప్రజాస్వామ్యమునకు ఎక్కువ అనుగుణమైన పద్ధతి అను భావమే ఈ విధాన సంస్థాపనమునకు కారణము. పూర్వము ఇట్టి పెత్తనమును ప్రభుత్వోద్యోగులు చలాయించెడివారు; ఇప్పుడది చాల వరకు తగ్గినది.

ఈ విధానములో ఇంకొక విశేషము కూడ గుర్తింప తగియున్నది. మూడు అంతస్థులలోని స్థానిక సంస్థలు పరస్పరాశ్రయము (ఇంటర్ డిపెండెంటు) లగుటయే ఈ విశేషము. సమితిలోని సభ్యులనేకులు గ్రామ పంచాయతీల అధ్యక్షులగుట, పరిషత్తులోని సభ్యులనేకులు సమితి అధ్యక్షులగుట ఈ పరస్పరాశ్రయమునకు హేతువగు చున్నది. ఈ వివరణము వలన క్రొత్తగ ఏర్పడిన పంచాయతీ సమితులకు జిల్లాపరిషత్తులకు ఇదివరలో ఉండిన తాలూకా బోర్డులకు జిల్లా బోర్డులకు లేని లక్షణము లనేకములు ఉన్నవని స్పష్ట మగు చున్నది.

మా. వెం. రం.

---

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 13. | పబ్లిక్ వర్క్సు | చీఫ్ ఇంజనీరు | సూపరింటెండింగ్ ఇంజనీరు | — | ఎక్సిక్యూటివ్ ఇంజనీరు | అసిస్టెంట్ ఇంజనీరు (సబ్ డివిజనల్) ఆఫీసరు | ఒవర్‌సీర్ సూపర్‌వైజర్ | — | |
| 14. | విద్యుత్తుశాఖ | చీఫ్ ఇంజనీరు | సూపరింటెండింగ్ ఇంజనీరు | — | డివిజనల్ ఇంజనీరు | అసిస్టెంటు ఇంజనీరు | జూనియర్ ఇంజనీరు | — | జూనియర్ ఇంజనీరుకు తక్కువ స్థాయిలో లైన్‌మెన్ |
| 15. | హైవేసు | చీఫ్ ఇంజనీరు | సూపరింటెండింగ్ ఇంజనీరు | — | డివిజనల్ ఇంజనీరు | అసిస్టెంట్ ఇంజనీరు | జూనియర్ ఇంజనీరు | — | |
| 16. | బ్రాడ్‌కాస్టింగ్ | రేడియో ఇంజనీరు | అసిస్టెంటు రేడియో ఇంజనీరు | — | రేడియో సూపర్‌వైజర్ | — | — | — | |
| 17. | రవాణా | కమీషనర్ ఫర్ ట్రాన్స్‌పోర్టు | రీజినల్ ట్రాన్సుపోరు అథారిటీ | ట్రాన్స్‌పోర్టు ఆఫీసరు | అసిస్టెంటు మోటార్ వెహికల్స్ ఇన్‌స్పెక్టరు | — | — | — | |
| 18. | విద్య | డైరెక్టర్ ఆఫ్ పబ్లిక్ ఇన్‌స్పెక్షన్ | డివిజనల్ ఇన్‌స్పెక్టర్ ఆఫ్ స్కూల్స్ | డిస్ట్రిక్ట్ ఎడ్యుకేషనల్ ఆఫీసరు | — | సీనియర్ ఇన్‌స్పెక్టరు ఆఫ్ స్కూల్స్ | జూనియర్ ఇన్‌స్పెక్టర్ ఆఫ్ స్కూల్స్ | — | * |
| 19. | వ్యవసాయశాఖ | డైరెక్టరు | డిప్యూటీ డైరెక్టరు | జిల్లా వ్యవసాయ శాఖాధికారి | — | వ్యవసాయ డిమాన్‌స్ట్రేటరు | ఫీల్డ్‌మేన్ | డిమాన్‌స్ట్రేషన్ మేస్త్రీ | |
| 20. | పశుపాలన, మత్స్యశాఖ | డైరెక్టరు | — | జిల్లా వెటర్నరీ ఆఫీసరు | — | వెటర్నరీ అసిస్టెంటు సర్జన్ | టూరింగ్ వెటర్నరీ అసిస్టెంటు సర్జన్ | — | |
| 21. | హిందూ దేవాలయ ధర్మాదాయ | కమీషనర్ | డిప్యూటీ కమీషనర్ | అసిస్టెంట్ కమీషనర్ | — | — | — | — | |
| 22. | సహకారము | రిజిస్ట్రార్ | — | డిప్యూటి రిజిస్ట్రార్ | సబ్ రిజిస్ట్రార్ | — | — | — | |
| 23. | అటవీ | చీఫ్ కన్సర్వేటర్ ఆఫ్ ఫారెస్ట్సు | కన్సర్వేటర్ | జిల్లా అటవీ శాఖాధికారి | — | రేంజర్ | — | — | |
| 24. | అభివృద్ధి | కమీషనర్ | — | జిల్లా ప్లానింగ్ ఆఫీసరు | — | బ్లాక్ డెవలప్‌మెంటు అఫీసరు | — | — | |

1. సాంకేతిక విద్య రాష్ట్రస్థాయిలో డైరక్టరు ప్రత్యక్ష నిర్వహణ క్రింద నుండును.
2. రాష్ట్రస్థాయిలో రేవు పట్టణములను పాలించుటకు "స్టేట్‌పోర్టు" ఆఫీసర్ కలదు.
* తూ. గో., ప. గో. గుంటూరు వంటి కొన్ని జిల్లాలలో జిల్లాస్థాయి కార్యాలయములు అవసరమును బట్టి రెండు, మూడు కలవు.

# రాష్ట్ర పరిపాలనా వ్యవస్థ

| వరుస సంఖ్య | శాఖ | రాష్ట్రస్థాయి | ప్రాంతీయ స్థాయి సర్కిలు | జిల్లా స్థాయి | డివిజన్ స్థాయి | తాలూకా స్థాయి | సబ్ తాలూకా స్థాయి | గ్రామ స్థాయి | విశేష వివరములు |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. | రెవిన్యూ | బోర్డ్ ఆఫ్ రెవిన్యూ | — | కలెక్టరు | రెవిన్యూ డివిజనల్ ఆఫీసరు (సబ్ కలెక్టరు) | తహసిల్‌దారు | 1. డిప్యూటీ తహసిల్‌దారు; 2. రెవిన్యూ ఇన్‌స్పెక్టరు | గ్రామ కరణము; హెడ్మన్ | |
| 2. | మేజిస్ట్రీరియల్ (న్యాయం) నేరశాఖ | హైకోర్టు | — | సెషన్స్ జడ్జి, జిల్లా మేజిస్ట్రేట్ | సబ్ డివిజనల్ మేజిస్ట్రేట్ | సబ్ మేజిస్ట్రేట్ | — | గ్రామ హెడ్‌మన్ పంచాయతీ కోర్టు | |
| 3. | పోలీసు | ఇనస్పెక్టరు జనరల్ | డిప్యూటీ ఇన్‌స్పెక్టరు జనరల్ | సూపరింటెండెంటు | అసిస్టెంటు లేదా డిప్యూటీ సూపరింటెండెంటు | ఇనస్పెక్టరు | సబ్ ఇనస్పెక్టరు | తలారి | |
| 4. | జైలు | ఇనస్పెక్టరు జనరల్ | — | సూపరింటెండెంటు | — | సూపరింటెండెంటు సబ్ జెయిల్ | — | — | |
| 5. | పౌరన్యాయం సివిల్ జ్యూడిషియల్ | హైకోర్టు | — | జిల్లా జడ్జి | సబ్ జడ్జి జిల్లా మునసబు | — | — | గ్రామ మునసబు, పంచాయతీ కోర్టు | |
| 6. | మద్యనిషేధము ఎక్సైజు | బోర్డ్ ఆఫ్ రెవిన్యూ | డిప్యూటీ/అసిస్టెంటు కమీషనర్ | — | ఇన్‌స్పెక్టరు | సబ్ ఇన్‌స్పెక్టరు | — | — | ఆంధ్ర ప్రాంతములో ఈశాఖ పోలీసు శాఖతో విలీనమై యున్నది. |
| 7. | రిజిస్ట్రేషను | ఇనస్పెక్టరు జనరల్ | — | జిల్లా రిజిస్ట్రార్ | — | సబ్ రిజిస్ట్రార్ | — | — | |
| 8. | సర్వే | బోర్డ్ ఆఫ్ రెవిన్యూ | రేంజి ఆఫీసరు | జిల్లా సర్వేయర్లు సర్కిల్ ఆఫీసర్లు | — | తాలూకా సర్వేయర్లు | — | — | |
| 9. | వైద్యము | డైరక్టరు ఆఫ్ మెడికల్ సర్వీసెస్ | — | జిల్లా వైద్యశాఖాధికారి (సివిల్ సర్జన్) | — | సివిల్ అసిస్టెంట్ సర్జన్ | — | — | |
| 10. | ఆరోగ్యము | డైరక్టరు ఆఫ్ పబ్లిక్ హెల్త్ | అసిస్టెంటు డైరక్టరు ఆఫ్ పబ్లిక్ హెల్త్ | జిల్లా ఆరోగ్య శాఖాధికారి | — | హెల్త్ ఇనస్పెక్టరు | వేక్సినేటరు | — | |
| 11. | పారిశ్రామిక | డైరక్టరు ఆఫ్ ఇండస్ట్రీస్ | — | అసిస్టెంటు డైరక్టరు | ఇనస్పెక్టర్ ఆఫ్ ఇండస్ట్రీస్ | — | — | — | |
| 12. | కార్మిక | కమీషనర్ | — | అసిస్టెంటు | — | లేబరు ఇన్‌స్పెక్టరు | — | — | |

# విద్య

## విద్యా విధానము (1813 - 1953)

ఆంధ్ర ప్రాంతము : భారతదేశము తూర్పు ఇండియా కంపెనీ వారి అధికారము క్రిందికి వచ్చిన తరువాత విద్యా విధానములో చాల మార్పు వచ్చినది. క్రీ. శ. 1813 లో కంపెనీవారు బ్రిటిషు ప్రభుత్వము వద్ద అధికార పత్రము (ఛార్టరు ఆక్టు) ను పొందిన తరువాత భారత దేశమునందు విద్యా విధానములో నవీనయుగము ఆరంభ మైనది. ఈ చట్టము ననుసరించి తూర్పు ఇండియా వర్తక సంఘమువారు 1822-27 మధ్య మద్రాసు రాష్ట్రము నకు గవర్నరుగ నుండిన సర్ థామస్ మన్రో ప్రత్యేక కృషివలన మాతృభాషలోనే విద్య గరపుటకు ప్రతి జిల్లాకు ఒక హిందూ పాఠశాల, ఒక మహమ్మదీయ పాఠశాల ఏర్పాటు చేసిరి. కాని, స్థానిక అధికారుల సానుభూతి లేమిచే విద్యావ్యాప్తి లేకపోయినది. ఈ కాల ములో (1813-33) బ్రిటిషు మిషనరీలు సామాన్య ప్రజలలో విద్య వ్యాపింప జేయుటకు పూనుకొనిరి. 1833 లో కంపెనీ వారు విద్యా విధానమునకు సంబం ధించిన మరియొక అధికార పత్రమును పొందిరి. ఈ పత్రము వలన యూరపు, అమెరికా ఖండములకు చెందిన క్రైస్తవ మిషనరీలు ఇండియాలో విద్యాసంస్థలను స్థాపించుటకు అవకాశము కలిగినది. భారత దేశమున ఈ సంస్థలలో చదివిన విద్యావంతులకు నిరాఘాటముగ కంపెనీ ఇలాకా ఉద్యోగములను ఇవ్వవచ్చునని కూడ నిర్ణయమైనది. అంతటి నుండి ఇటువంటి విద్యాసంస్థలో విద్యను మాతృభాషలో బోధింపవలెనా, ఇంగ్లీషులో చెప్పవలెనా అను వివాదము వచ్చినది. 1834 లో ఇంగ్లండు నుండి కలకత్తాకు వచ్చిన థామస్ బేబింగ్టన్ మెకాలే ప్రోద్బలము వలన విద్య ఇంగ్లీషులో చెప్పవలెననియు, మాతృభాషలో చెప్పకూడదనియు, ప్రాచ్య విద్యలు సార హీనము లనియు, పాశ్చాత్య విజ్ఞానము పురోభివృద్ధికర మనియు కంపెనీ అధికారులు తీర్మానించిరి. అంతటితో ప్రాచ్య విద్యాసంస్థలకు తీరనిదెబ్బ తగిలినది. అదివరలో మన్రో కాలమున ఏర్పడిన జిల్లా పాఠశాలలు పోయినవి. నాడు మద్రాసులో (నేటి 'ప్రెసిడెన్సీ కళాశాల') "హైస్కూలు" అను పేరుతో 1841 లో అవతరించినది. 1853 లో ఎఫ్.ఏ., బి.ఏ. తరగతులు ప్రారంభింప బడినవి. కంపెనీవారు రాజమండ్రిలో ప్రావిన్షియల్ స్కూలును నెల కొల్పిరి (1853); అదే నేడు ప్రభుత్వ కళాశాలగా పరిణ మించినది. ఈ కాలములో మిషనరీలు విద్య వ్యాపింప జేయుటకు ఎక్కువ శ్రద్ధ వహించిరి. నెల్లూరులో 'ఫ్రీ చర్చి మిషన్' 1840 లో ఒక స్కూలును స్థాపించిరి. మద్రాసున స్కాచ్ మిషన్‌వారు 1837 లో మిల్లర్ స్కూలును (నేటి క్రిస్టియన్ కాలేజి) ప్రారంభించిరి. బందరులో రాబర్ట్ నోబుల్ 1841 లో (తరువాత ఇది నోబుల్ కాలేజిగ మారినది) హైస్కూలును స్థాపించెను ; ఈ మిష నరీలకు కంపెనీ వారు అధిక ప్రోత్సాహము నిచ్చిరి. మిషనరీల తీవ్రకృషివల్ల 1854 లో కంపెనీ వారు 'వుడ్స్ ఎడ్యుకేషనల్ డిస్పాచ్' అను ఉత్తరువు జారీ చేసిరి; ఇది జారీ చేయుటలో గల ముఖ్య ఉద్దేశములలో ఇండియా పరిపాలనకు అవసరమైన సిబ్బందిని తయారు చేయుట ఒకటి. దీని ఫలితముగ విద్యా విధానములో పెక్కు మార్పులు కలిగినవి. అందు ముఖ్యమైనవి - 1. మద్రాసు రాజధానిలో ప్రభుత్వ విద్యాశాఖ (డిపార్ట్ మెంట్ ఆఫ్ ఎడ్యుకేషన్) స్థాపితమైనది ; దానికి ఒక అధికారియు (డి.పి.ఐ.) అతని క్రింద ఇన్‌స్పెక్టర్లును ఇతర తాబేదార్లును ఏర్పాటైరి ; 2. మద్రాసు విశ్వవిద్యా లయము స్థాపింపబడినది ; 3. లా, ఇంజనీరింగు శాఖలు ప్రారంభింప బడినవి. సంస్కృతము, అరబిక్, పర్షియన్ భాషలలో ఆచార్యులను నియమించి, ఆ భాషలను వృద్ధి పరచుటకు ఏర్పాట్లు జరిగినవి ; 4. ఇంగ్లీషులోను, మాతృ భాషలోను విద్యగరపునట్టి మాధ్యమిక పాఠశాలలును, మూడవ ఫారము వరకు మాతృభాషలోనే విద్య చెప్పు మిడిల్ స్కూళ్ళును స్థాపింప బడినవి ; 5. మిషనరీలు, అనధికారులు స్థాపించిన పాఠశాలలకు వాని యోగ్యత ను బట్టి 'గ్రాంట్-ఇన్-ఎయిడ్' అను ద్రవ్య సహాయ పద్ధతి ఏర్పాటైనది. ఎక్కువ విద్యాసంస్థలు స్థాపించిన వారు మిషనరీ లగుటచేత ఇది వారికి మిక్కిలి అనుకూ లించినది. మతబోధ ప్రభుత్వ పాఠశాలలలో నిషేధింప బడినను మిషనరీ పాఠశాలలలో నిరాఘాటముగ సాగు చుండెను. దానితో నిమిత్తము లేకుండ గ్రాంటును మంజూరు చేయవచ్చునని ఉత్తరువులుండుట వలన విద్యా విధానములో మిషనరీల పలుకుబడి పెరిగి పోయినది ; 6. తగురీతిని విద్యను బోధించు మార్గములను నేర్పుటకై

వేరు వేరు తరగతుల ఉపాధ్యాయుల నిమిత్తము శిక్షణ పాఠశాలలు (నార్మల్ స్కూల్సు) ఏర్పాటైనవి; 7. స్త్రీ విద్యను విస్తరింపజేయుటకు తగు చర్యలు తీసికొనబడినవి.

'వుడ్స్ డిస్పాచ్' అమలులోనికి వచ్చు సమయములో, అనగా 1857 లో ప్రథమ భారతీయ స్వాతంత్ర్య సంగ్రామము జరిగినది. కంపెనీ వారి అధికారము అంతమై 1858 లో పరిపాలనాధికారమును బ్రిటిష్ రాణి స్వీకరించెను. మతబోధ పాఠశాలలలో కూడదని నిర్ణయింపబడుటవల్ల మిషనరీల ఉద్యమమునకు గొప్ప ఆటంకము కలిగినది. తరువాత ప్రభుత్వమువారే అన్ని తరగతుల విద్యా సంస్థలను నిర్వహించుటకు పూనుకొనిరి.

ప్రాథమిక విద్య: దేశీయ ప్రాథమిక పాఠశాలల అభివృద్ధికి 'గ్రాంట్-ఇన్-ఎయిడ్' విధానము సహాయకారి కాక పోవుటవలన పాఠశాలలలో విద్యార్థులు పరీక్షా ఫలితములను బట్టి గ్రాంటు నిచ్చు పద్ధతి 1868 లో అమలులోనికి వచ్చెను. ఇందువలన కొంత ప్రోత్సాహము కలిగి పాఠశాలలు హెచ్చుగ పట్టణముల యందు ఏర్పాటై మునిసిపాలిటీల చేతను, జిల్లాబోర్డులచేతను నడుపబడుచుండెను; కాని పల్లెలలో మాత్రము పాఠశాలలు ఏర్పాటు కాలేదు. అప్పటి నుండి 1904-05 వరకు గవర్నమెంటు వారు విరివిగ ధనమును వెచ్చింపని కారణముననను, పాఠశాలలకు పిల్లలను పంపి తీరవలెనను నిర్బంధము లేకపోవుట వలనను విద్య ఎక్కువగ వ్యాప్తి కాలేదు. ప్రాథమిక విద్యను నిర్బంధముగా ప్రవేశ పెట్టవలెనని కేంద్ర స్థానమున ప్రభుత్వము వారు ఒక విద్యా శాఖను నియమించ వలెనని, సామ్రాజ్య శాసన నిర్మాణ సభలో గోఖలే మహాశయుడు వాదించిన ఫలితముగ కేంద్రమున ఒక విద్యాశాఖ ఏర్పాటై ప్రాథమిక విద్యా వ్యాప్తిని ద్విగుణీకృతము చేయుటకు ప్రయత్నము జరిగినది. కొన్ని షరతుల మీద మునిసిపాలిటీలకు నిర్బంధ విద్యా విధానమును ప్రవేశ పెట్టుటకు అనుమతి నిచ్చుచు మద్రాసు ప్రాథమిక విద్యా శాసనము 1920 నాటికి అమలులోనికి వచ్చినది. కాని ఉపాధ్యాయులకు తగిన జీతములు లేకపోవుటచేతను, ప్రాథమిక పాఠశాలలలోని విద్యార్థులకు పాఠములు చెప్పగల సమర్థత ఉపాధ్యాయులకు లేకపోవుటచేతను, ద్రవ్యాభావము వలనను ప్రాథమిక విద్యలో ఎట్టి అభివృద్ధియు లేకుండెను. 'మాంటెగ్యు-చెమ్స్‌ఫర్డ్' రాజ్యాంగ సంస్కరణ శాసనము (1919) ననుసరించి ద్వంద్వ ప్రభుత్వము అమలులోనికివచ్చి కొన్ని మినహాయింపులతో రాష్ట్రీయ విద్యాశాఖా నిర్వహణము దేశీయులైన మంత్రులకు అప్పగింపబడినది. 1920 లో మంజూరైన ప్రాథమిక విద్యాచట్టమును ద్వంద్వ ప్రభుత్వములోని మంత్రులు కొన్ని మార్పులతో అమలు జరిపిరి. వీరు జిల్లా విద్యా సంఘములను (డిస్ట్రిక్టు ఎడ్యుకేషనల్ కౌన్సిల్స్) ఏర్పాటు చేసిరి; ప్రాథమిక విద్యను వ్యాపింపజేయు బాధ్యత ఈ సంఘముల మీద పడినది. 500 జనసంఖ్యకు మించిన ప్రతి గ్రామములోను ఒక పాఠశాలను నిర్మించుటకును, నిర్బంధముగ పిల్లలను పాఠశాలలకు పంపుటకును ఏర్పాట్లు జరిగినవి. కాని, 1927-1937 మధ్య పదేండ్ల కాలములో ఆర్థిక మాంద్యముచేత ప్రాథమిక విద్యాభివృద్ధికి ఆటంకము కలిగినది. 1927 లో కట్టుదిట్టమైన పద్ధతిని విద్యా విధానమును అమలు జరిపి విద్యా వ్యాప్తిని పెంపొందించుటకు విద్యా విధాన పరిశీలనము నకై హార్టాగ్ కమిటీ ఏర్పడినది. ఈ కమిటీ ప్రాథమిక పాఠశాలల సంఖ్య పెంచుట కంటె మేలురకము విద్య నేర్పించవలె ననియు, ఉపాధ్యాయుల జీతములను, నైపుణ్యమును పెంపు చేయవలె ననియు, విద్యార్థులకు నేర్పు విషయములు వారి జీవితమునకు ఉపయోగపడునట్టివియు, వారి పరిసరములకు సంబంధించు నట్టివియు అయి యుండవలెననియు, వయోజనులకు విద్య నేర్పవలెననియు సిఫార్సులు చేసిరి. అనధికారులకు వీరి నివేదికలోని విషయములు రుచింప లేదు. మొత్తము మీద ఏమైన నేమి, ప్రాథమిక విద్య నేర్చిన వారి సంఖ్యగాని, విద్యయొక్క సాయిగాని పెరుగలేదు. ఇందుకు ఇంత కాలము నుండి వచ్చుచున్న విద్యా విధానములో ఏదో లోపమున్నదనియు, ఈ విద్యా విధానమునే మార్చివేయవలెననియు గాంధీ మహాత్ముడు తీవ్రమైన ఆలోచనలుచేసి తుదకు 1937 లో బేసిక్ విద్యా విధానమును ప్రతిపాదించెను. ఇందు నిమిత్తమై డాక్టర్ జకీర్ హుస్సేన్ అధ్యక్షతను ఒక సంఘ మేర్పడెను. ఈ సంఘము వారు 1938 లో ఆ పథకమును గురించి విపులమైన చర్చచేసి పెద్ద నివేదికను ప్రచురించిరి. ఈ నివేదికను సెంట్రల్ అడ్వయిజరీ బోర్డ్ ఆఫ్ ఎడ్యుకేషన్ ఆమోదించెను. ఈ నివేదికలోని ముఖ్య విషయములు: 1. ఏడేండ్లనుండి పదునాలుగేండ్ల వరకు పిల్లలకు నిర్బంధముగ ఉచిత ప్రాథమిక విద్య మాతృభాషలో గరపవలెను. ఈ విధానము చేతి పనులను ఆధారము చేసికొని నడుపవలెను. విద్యార్థికి జీవితములో చేతి పరిశ్రమను వృత్తిగా ఏర్పాటు చేసికొని జీవింప గలిగినంత నేర్పు కలుగవలయును. భవనములు, బల్లలు, కుర్చీలు, పుస్తకములు, పరిశ్రమకు కావలసిన పనిముట్లు రాష్ట్రప్రభుత్వ

పాఠశాలలకు ఈయవలెను. ఈ ప్రణాళికను దేశ మంతటను అమలు జరపుటకు పూర్వము వివిధ రాష్ట్రములలో ఒక్కొక్కచోట దీనిని అమలు జరిపి పరీక్షించిరి. ఈ విధానములోని లోటుపాట్లను, కనుగొనుటకు 1943 లో ఒక అధికార వర్గము ఏర్పాటైనది. వారు దీనిని పరిశీలించి యది అంతకు పూర్వ విధానము కంటె బాగున్న దనియు దేశమంతటను దీనిని అమలులోనికి తేవచ్చు ననియు అభిప్రాయ మిచ్చిరి. 1945 లో ఏర్పాటైన సార్జెంటు కమిటీ కూడ దీనిని ఆమోదించెను. ఇది మద్రాసు రాష్ట్రములో 1946 లో ప్రవేశ పెట్టబడినది. ఈ విధానము ప్రకారము విద్య నేర్పునట్టి ఉపాధ్యాయులకు తగిన శిక్షణ ఇచ్చుటకై ప్రథమమున వార్ధాలోను, తరువాత అచ్చట శిక్షణపొంది వచ్చినవారు ఇతరులను తరిఫీదు చేయుటకై గుంటూరు జిల్లా రేపల్లె తాలూకాలోని కోవూరు దగ్గర వినయాశ్రమములోను, పశ్చిమ గోదావరి జిల్లా తాడేపల్లిగూడెము దగ్గర పెంటపాడులోను కేంద్రములు ఏర్పాటు చేయబడినవి. సెకండరీ శిక్షణ పాఠశాలలలో కొన్నిటిని క్రమముగ ఈ శిక్షణ కేంద్రములుగ మార్చిరి. ఏలూరు, విశాఖపట్టణము, భీమునిపట్టణము, రాయచోటి మొదలగు చోట్ల పదునైదు కేంద్రములు ఏర్పాటు చేయబడినవి. ఈ విధానములో శిక్షణ పొందిన ఉపాధ్యాయులతో ప్రాథమిక పాఠశాలలను బేసిక్ పాఠశాలలుగా మార్చి నూతన విద్యా విధానమును అమలుపరుప ప్రయత్నించిరి. ఇంతలో మద్రాసు ప్రభుత్వము వారు దీనిలో నొక చిన్న మార్పు చేసిరి. విద్యార్థులు ఇప్పటివలె రెండు పూటలును బడికి పోక ఒక పూటపోయి విద్యాభ్యాసము చేయునట్లును, రెండవ పూటయందు తమ తలిదండ్రులకడనే యుండి వారే వృత్తి మూలమున జీవనమును సాగించుచున్నారో ఆ వృత్తిని వారి కడనుండి నేర్చుకొనునట్లును ఏర్పాటు గావించిరి. ఈ ఏర్పాటున కనుగుణముగ బడి ఒక్కపూట మాత్రమే ఉండునట్లు నియమించిరి.

1953 అక్టోబరు 1 వ తేదీన ఆంధ్రరాష్ట్ర మేర్పడిన పిదప విద్యా విధానములో మరికొన్ని మార్పులు జరిగెను (చూ. పుట 1415).

మాధ్యమిక విద్య : 'వుడ్స్ డిస్పాచ్' తరువాత మాధ్యమిక పాఠశాలలు బాగుగా వృద్ధియైనవి. ఇంగ్లీషు చదివినచో బ్రతుకుతెరువు కలుగునను అభిప్రాయము ఒకటి, సంఘములో గౌరవమునకును, ప్రభుత్వములో ఉద్యోగమునకును, కళాశాలలలో ప్రవేశమునకును అవకాశ మిచ్చు ప్రథమ సోపాన మగుట ఒకటి - వీనివల్ల విద్యార్థులు అందరు మెట్రిక్యులేషన్ పరీక్షకు సిద్ధపడిరి. పాఠశాలలో ఇంగ్లీషునకు ప్రాధాన్యము హెచ్చినది. మాతృభాషకు, దేశీయ సంస్కృతికి విద్యా విధానములో స్థానము మృగ్యమైనది. 1882 లో ఏర్పడిన ఇండియన్ ఎడ్యుకేషనల్ కమిషన్‌వారి సిఫార్సులకు ఫలితముగ మాధ్యమిక విద్య ఎక్కువగా వైయక్తిక యాజమాన్యములోనికి వచ్చెను. స్థానిక సంస్థల యాజమాన్యమున మిడిల్ స్కూళ్ళు ఏర్పాటైనవి. లోయర్ సెకండరీ పరీక్ష ఏర్పాటైనది. దీనికి పైని వృత్తి విషయములలో బోధన ఉండు అప్పర్ సెకండరీ పరీక్ష వచ్చినది. ఇది చదివిన వారికి న్యాయవాది (ప్లీడరీ) మొదలగు కొన్ని వృత్తులలో ప్రవేశింప వీలు కలిగినది. కాని, అది జనామోదమును అంతగా పొందలేదు. మాధ్యమిక పాఠశాల ఉపాధ్యాయుల శిక్షణ కేంద్రము (టీచర్స్ ట్రైనింగ్ కాలేజి) మద్రాసుకు చేరువగ సైదాపేటలో ఒక్కచోటనే నెలకొల్పబడుటచే శిక్షణ పొందిన ఉపాధ్యాయులు అరుదైరి. 1888 లో జిల్లా బోర్డువారు రాజమండ్రిలో ప్రాథమిక ఉపాధ్యాయ శిక్షణ శాలను (నార్మల్ స్కూలు) స్థాపించిరి. దానిని ప్రభుత్వము స్వాధీనపరచుకొని 1892 లో మాధ్యమిక తరగతి శిక్షణ శాలగా వృద్ధిచేసెను. ఇదే 1894 లో పట్టభద్రులైన ఉపాధ్యాయుల శిక్షణ కళాశాల (ట్రైనింగ్ కాలేజి)గా మార్చబడినది. పై తరగతి శిక్షణను ఇచ్చుటకు వీలుగ మోడల్ హైస్కూలును ఒకదానిని దీనికి అనుబంధముగ పెట్టిరి. ఈ హైస్కూలులో ఆదర్శప్రాయముగా మాధ్యమిక విద్యను ఎట్లు బోధింపవలెనో ఇతరులకు తెల్పుటకు ఏర్పాటు జరిగినది. మాతృభాషలో విద్యగరపు మాధ్యమిక పాఠశాలలు (వర్నాక్యులర్ మిడిల్ స్కూల్సు) క్రమముగ అంతరించినవి.

1902 - 1921 మధ్య మాధ్యమిక విద్యలో చాల మార్పులు కలిగెను. ప్రభుత్వ విద్యాశాఖవారి ఆమోదమును పొందని మాధ్యమిక పాఠశాలలలో విద్యా బోధనము బాగుగ లేకుండుటచేత వానికి స్వస్తి చెప్పబడెను. విద్యాశాఖయొక్క ఆమోదమును పొందుటకు షరతులు, నిబంధనలు కట్టుదిట్టములు చేయబడెను. విద్యకు సంబంధించిన క్రొత్త నిబంధనలు ఏర్పాటైనవి. ప్రభుత్వ పాఠశాలలలోని విద్యార్థులకున్న సౌకర్యములు ప్రభుత్వామోదము పొందని పాఠశాలలు లోపించుట వలన అట్టి పాఠశాలలు అంతమొందినవి. ప్రభుత్వము మోడల్ పాఠశాలలలో శిక్షణ పొందిన చురుకైన ఉపాధ్యాయులను నియమించి వారికి మంచి జీతముల నిచ్చెను. విద్యార్థులకు చేతి పనులలో శిక్షణ నిచ్చుటకై వడ్రంగము మొదలైనవి నేర్పుటకును, సైన్సును సుబోధము చేయుటకును తగిన

ఏర్పాట్లు జరిగినవి. మేలు తరగతి ఉపాధ్యాయులను తయారుచేయుటకై రాజమండ్రిలో ఏర్పాటైన బోధన కళాశాలలో శిక్షణకు వచ్చు ఉపాధ్యాయుల సంఖ్య క్రమముగ క్షీణించెను. అందుచే 1910 లో ఈ కళాశాలను తీసివేసిరి. పట్టభద్రులు తిరిగి సైదాపేటకు వెళ్ళి శిక్షణ పొందవలసిన ఆవశ్యకత కలిగెను. కాని, 1916లో మరల రాజమండ్రిలో నేటి బోధన కళాశాల ప్రత్యేక సంస్థగా ప్రధానాచార్యుని అధికారము క్రింద ఏర్పాటాయెను. దీనితోపాటు, ఎఫ్. ఏ., మెట్రిక్యులేషన్ పరీక్షలలో ఉత్తీర్ణులైన ఉపాధ్యాయులకు శిక్షణ నిచ్చు సెకండరీ ట్రైనింగు పాఠశాలలు కొన్ని తలయెత్తినవి. ఈ కాలములోనే అప్పర్ సెకండరీ పరీక్ష అంతరించినది. అందుచేత మాధ్యమిక తరగతులలో వృత్తి విద్యకు స్థానము కల్పించవలె నను ఉద్దేశముతో మెట్రిక్యులేషన్‌కు మారుగా సెకండరీ స్కూలు లీవింగ్ సర్టిఫికెట్ (S. S. L. C.) పరీక్షను 1910 లో మద్రాసు రాష్ట్రములో ప్రభుత్వము ఏర్పాటు చేసెను. దానితో యూనివర్సిటీ ఏర్పాటు చేసిన మెట్రిక్యులేషన్ పరీక్షయొక్క ప్రాధాన్యమును ఆ పరీక్షకు చదువువారి సంఖ్యయు క్రమముగ తగ్గిపోయినది. క్రొత్తగా ప్రవేశపెట్టిన నూతన విద్యా విధానము (యస్. యస్. యల్. సి.) బాగుగ జనామోదమును పొందినది.

విద్యా విధానము సులభమైనను, వృత్తి విద్యకు స్థానమును కల్పింపబడినను, వృత్తులకై చదువు విద్యార్థుల సంఖ్య ఏమియు పెరుగలేదు. అందరును ఉద్యోగముల కొరకు పై చదువులకై కళాశాలలకు పోవుచు వచ్చిరి. మొత్తముమీద ఎస్. ఎస్. ఎల్. సి. యోగ్యతా పత్రము సంపాదించినవారి విద్య పూర్వపు మెట్రిక్యులేషన్ పరీక్షలో ఉత్తీర్ణులైనవారి విద్యకంటె ఏవిధముగను బాగు పడినదని చెప్ప వీలులేదు. ప్రభుత్వమువారును, విశ్వకళా పరిషత్తువారును ఇంగ్లీషునకు ప్రాధాన్య మీయవలెనని ఎంత ప్రయత్నము చేసినను పూర్వ మెట్రిక్యులేషన్ పద్ధతి కంటె ఇంగ్లీషు ఈ నూతన విధానముతో చక్కగ అభ్యసింపబడలేదు సరికదా ఇంగ్లీషులో వ్రాసిన పాఠ్య విషయిక పుస్తకములు అంతగా బోధపడక విద్యార్థులు వానిని కంఠస్థము చేసి ఉత్తీర్ణులు అగుచుండుటచే ఇంగ్లీషు భాషాజ్ఞానమును, దానితోపాటు విషయ విజ్ఞానమును సన్నగిలినది; అందుచేత మాతృభాషలో విద్య బోధింపవలెనను అభిప్రాయము తలయెత్తెను. మాధ్యమిక పాఠశాలలోను, మూడవ ఫారము దాటువరకును విద్యార్థులకు పాఠములు మాతృభాషలో చెప్పుట ప్రారంభమయ్యెను. క్రొత్తగా ప్రవేశపెట్టిన విద్యా విధానములో అనుభవము గడించినకొద్ది విద్యాశాఖవారు పాఠ్య ప్రణాళిక విషయములలో అప్పుడప్పుడు మార్పులు చేసిరి. విద్యార్థులకు విద్య మాతృభాషలోనే గరపవలెనని శాసన సభలోను, ప్రత్యేకముగ ఏర్పడిన కమిటీలలోను చర్చలు సాగినవి. కాని, వెంటనే ఫలితము కాన్పించలేదు. అయినను 1902 - 1921 మధ్య గల ఇరువదేండ్లలోను దేశములో సాంఘిక, రాజకీయ చైతన్యము పెరిగి మాధ్యమిక పాఠశాలలు పూర్వముకంటె నాలుగైదు రెట్లు వృద్ధియైనవి. 1921 - 37 మధ్య ఈ పాఠశాలల సంఖ్య ఇంకను పెరిగిపోయినది. పట్టణములలోనే కాక మారుమూల గ్రామాదులయందును వైయక్తిక రంగమందు ఈ పాఠశాలలను స్థాపించిరి. వీనిలో కొన్ని నిమ్నజాతులకును, మరికొన్ని స్త్రీల ప్రత్యేకోపయోగమునకును స్థాపితమైనవి. 1925 లో 4, 5, 6 ఫారములలోకూడ విద్యను మాతృభాషలోనే బోధించుటకు మద్రాసు ప్రభుత్వము అంగీకరించినది. కాని, ఈ మార్పు సత్వరముగ సాగలేదు. 1937 నాటికి 50% పాఠశాలలలో మాత్రమే ఈ మార్పు వచ్చినది.

పాఠశాలల సంఖ్య వృద్ధి కాగానే బాలుర పాఠశాలలకు శిక్షణ పొందిన ఉపాధ్యాయులును. బాలిక పాఠశాలలకు శిక్షణ పొందిన ఉపాధ్యాయురాండ్రును అనేకులు కావలసివచ్చిరి. ద్రవ్య సహాయమును పొందు వైయక్తిక పాఠశాలోపాధ్యాయుల ఆర్థిక వృద్ధిని వృద్ధిచేయుటకై మద్రాసు రాష్ట్రమువారు ఏటేట లక్ష రూపాయలు మంజూరుచేసి పంచిపెట్టజొచ్చిరి. 1923 లో ఉపాధ్యాయులకు ప్రావిడెంట్ ఫండ్ ఏర్పాటు చేయబడినది.

1937 - 53 మధ్య మాతృభాషను ప్రధాన భాషగాను, సంస్కృతము, అరబ్బీ మొదలగు భాషలలో నొకదానిని రెండవ భాషగాను రెండవ ఫారమునుండి ప్రారంభించి చెప్పుటకును, ఇంగ్లీషును మూడవ భాషగాను పాఠశాలలో నేర్పుటకును ప్రభుత్వమువారు ఏర్పాటుచేసిరి.

భారతదేశమునకు స్వాతంత్ర్యము వచ్చిన (1947)పిదప నూతన విద్యా విధానములోని పాఠ్య విషయిక ప్రణాళికలో ఇంకను మార్పులు వచ్చినవి. సివిక్సును, భూగోళమును, చరిత్రను విద్యార్థులకు వేరువేరుగా బోధించుటను మాని వానికి గల అన్యోన్య సంబంధమును గుర్తించి జీవితమునందు వానిని ఎట్లన్వయింపవలెనో తెలుపుచు బోధించుటకై వానిని మూటిని కలిపి సాంఘిక విజ్ఞానమను (సోషల్ స్టడీస్) పేరుతో బోధించుట ఆరంభమయ్యెను. ఈ నూతన విషయమును సుబోధమొనర్చుటకై ఉపాధ్యాయులకు తద్విధానమున శిక్షణము నిచ్చుచుండిరి. పాఠ

ధర్మములను (సిటిజెన్ షిప్) నేర్పుటకు విద్యా ప్రణాళికలు ఏర్పరచిరి. ఒక్కొక్క ఉపాధ్యాయునకు పదునైదు దినములపాటు ఈ విషయమున శిక్షణ నిచ్చుటకై వేసవి దినములలోను, ఇతర సెలవు దినములలోను ఒక జట్టు తరువాత మరొక జట్టుకు సైదాపేట, నెల్లూరు, కడప, బళ్ళారి, విజయవాడ మొదలగు చోట్ల శిక్షణ కేంద్రము లేర్పాటు చేసిరి. ఇట్లు శిక్షణ పొందిన ఉపాధ్యాయులు విద్యార్థులకు పౌర విధులను, హక్కులను బోధింప సాగిరి. బాలికలకు గృహ నిర్వహణము, శిశుపోషణము మొదలగునవి నేర్పుటకై పాఠ్య ప్రణాళికల నేర్పరచిరి. కళాశాలలలో వివిధ వృత్తుల కుపయోగపడునట్టి సెక్రటేరియల్, ఇంజనీరింగ్, డ్రాయింగు, వ్యవసాయ, గృహ విజ్ఞాన, చిత్రలేఖన, సంగీత, నాట్యములు మొదలగు విషయములకు పాఠ్య ప్రణాళికలు తయారుచేసి వానిని 5, 6 ఫారములలో బోధించుటకు ఏర్పాట్లు చేసిరి. ఇట్టి విద్యార్థులను నాలుగవ ఫారమునుండి విడదీసి వారికి ప్రత్యేకపు తరగతులు పెట్టి వానిని బోధించుటకు ఏర్పాటు జరిగెను. కాని, ఇట్టి శిక్షణనిచ్చు పాఠశాలల సంఖ్య 1950 మార్చి నాటికి ఆంధ్రతో కూడిన మద్రాసు రాష్ట్రములో 12 మాత్రమే ఉండెను. 1950 మార్చి నెలాఖరుకు పూర్వోక్త రాష్ట్రములో బాలుర మాధ్యమిక పాఠశాలలు 997. బాలికల పాఠశాలలు 250 ఉండెను. వీనిలో ఆంగ్లో ఇండియనులకై బాలురకు 23, బాలికలకు 30 కలవు. రమారమి పాఠశాల లన్నిటిలోను ఇంగ్లీషు, దేశభాషలు తప్ప తక్కిన విషయము లన్నియు మాతృభాషలోనే బోధించుచుండిరి.

నలుబది ఏబది ఏండ్లనుండి మాధ్యమిక విద్యావిధానములో మార్పులు అనేకము పరంపరగా వచ్చుచున్నను సంతృప్తి కలుగుటలేదు. జీవితములో ఉపకరించి, జ్ఞాన సంపదతోపాటు బ్రతుకు తెరువునకు దారిచూప గలవను నట్టి కీలక విషయములు ఇదమిత్థమని నిరూపణ కాక పోవుటచేత మాధ్యమిక విద్యకు చెందిన విషయములను తిరిగి పరిశీలించి కర్తవ్యమును నిర్ణయించుటకై కేంద్ర ప్రభుత్వము ఒక కమీషను (సెకండరీ ఎడ్యుకేషన్ కమీషన్) ఏర్పాటుచేసి వారి నివేదిక ననుసరించి క్రమక్రమముగ కొన్ని మార్పులు చేయబడెను.

కళాశాల విద్య : 1854-82 మధ్య ఆంధ్ర ప్రాంతములో కళాశాలలు నాలుగు మాత్రమే యుండెను: రాజమండ్రి గవర్నమెంటు కళాశాల, బందరులోని నోబుల్ కళాశాల, విజయనగరములోని మహారాజావారి కళాశాల, విశాఖ పట్టణములోని ఎ. వి. యన్. కళాశాల.

1882-1902 మధ్య పెద్ద మార్పు లేవియును రాలేదు. ఉన్నతవిద్య నభివృద్ధి చేయుటకు ప్రభుత్వము స్వయముగ ధనము వెచ్చింపక ఆ కార్యమును నిర్వహించుటకు వైయక్తిక రంగములో ప్రోత్సహించెను. కాకినాడలో 1884 లో పిఠాపురము రాజా, మరుసటియేట గుంటూరులో అమెరికన్ ఎవాంజెలికల్ లూథరిన్ మిషన్ రెండవ తరగతి కళాశాలలను స్థాపించిరి. కళాశాలలోని విద్యవలన పాశ్చాత్య నాగరికతా విశేషములు విద్యార్థిలోకమునకు కరతలామలకములై, వారి మానసిక వికాసమునకు తోడ్పడి, అజ్ఞానము కలిగిన దురభిప్రాయములు తొలగి దేశాభివృద్ధికి పునాదు లేర్పడెను.

కళాశాలలోని విద్యను పెంపొందించుటకై ఇండియన్ యూనివర్సిటీస్ కమీషను ఒకటి 1902లో ఏర్పాటైనది. దీని నివేదిక ఫలితముగ విశ్వకళా పరిషత్తు చట్టము 1904లో అమలులోనికి వచ్చెను - అందలి ముఖ్య విషయములు : 1. విశ్వకళాపరిషత్తులు కేవలము పరీక్షలు చేయుటయే గాక బోధన కేంద్రములుగ (సెంటర్స్ ఆఫ్ టీచింగ్) కూడ ఉండవలెను. అందులకు కావలసిన ఆచార్యులను, ప్రయోగ శాలలను, కర్మాగారములను, గ్రంథాలయములను ఏర్పాటు చేసికొనవలెను. అందులకై ఉచితమగు రీతిని ప్రభుత్వము ధనసహాయము చేయవలెను; 2. మద్రాసు విశ్వవిద్యాలయము సెనేటు సభ్యుల సంఖ్య తగ్గింపబడెను. అందు విద్యావేత్తలగు ఉపాధ్యాయులను కొద్దిమందిని ఎన్నుకొనుటకు ఏర్పాటు చేయబడినది. ఈ ఎన్నికలకు ఒక నియోజకవర్గ మేర్పాటుచేయబడి ఎన్నికకు నిబంధనలు చేయబడినవి; 3. చట్టములో సెనేటు, కార్యనిర్వాహక వర్గమైన సిండికేటు విశ్వవిద్యాలయ ముఖ్యాంగములలో నొకటిగ గుర్తింపబడినది; 4. విశ్వకళాపరిషత్తుయొక్క ఆమోదమును పొందుటకు ముందు కళాశాలలోని పరిస్థితులు తృప్తికరముగ ఉన్నవని నిర్ధారణ చేయుటకై ఏర్పాటైన నిబంధనలు బహుళము గావింపబడి కట్టుదిట్టము చేయబడెను. ఈచట్టము సదుద్దేశముతో ప్రవేశపెట్టబడ లేదనియు, పాశ్చాత్య విద్యాధికారులయొక్కయు, విద్యావేత్తల యొక్కయు అధికారమును నెలకొల్పుటకై ఏర్పాటు చేయబడినదనియు అనేకులు విమర్శించిరి. ఇట్లు తీవ్రముగ ఖండింపబడిన ఈ 1904 సం॥ చట్టములో చేయవలసిన మార్పులను సూచించుటకై కలకత్తా విశ్వకళా పరిషత్తువారు ఏర్పరచిన సాడ్లరు కమీషను 1917-18లలో దేశమునంతటను పర్యటించి విపులమైన నివేదికను 1919లో వెలువరించెను. విశ్వకళాపరిషత్తుల విద్యావిధానములో నూతనమును, దేశాభ్యుదయ

మునకు కారణమును నగు అధ్యాయము దీనితో ప్రారంభ మైనది. దేశమందు విశ్వకళాపరిషత్తుల సంఖ్యను పెంచుట కును, వానిని విద్యాబోధనాలయములుగ జేయుటకును ఈ నివేదికయే పునాది.

1921 - 37 మధ్య మద్రాసు రాష్ట్రములో ద్వంద్వ ప్రభుత్వము ప్రారంభమైన కాలమున ప్రభుత్వము విద్యా శాఖను మంత్రివర్గమునకు అప్పగించిరి. కాని కొన్ని కొన్ని విషయములయందు వారికి పూర్ణ స్వాతంత్ర్యము లేకుండెను. విద్యాశాఖలోని అగ్రశ్రేణి ఉద్యోగులును, ఉపా ధ్యాయులును, ఇండియన్ ఎడ్యుకేషనల్ సర్వీసు (ఐ. యి. యస్.)కు చెందియుండిరి. ఐ. సి. యస్., ఐ. యమ్. ఎస్. ఉద్యోగుల వలెనే వీరు కేంద్ర ప్రభుత్వాధికారమునకు మాత్రమే లోబడినవారు. విద్యావిధానములను ఏర్పాటు చేయుటలోను, వానిని సాగించుటలోను ఈ ఉద్యోగుల కును మంత్రులకును పొత్తు కుదరలేదు. ఈ చిక్కులను తొలగించుటకై 'లీ' కమీషను ఏర్పాటైనది. 1924 నుండి ఈ కమీషను వారి అభిప్రాయాను సారముగ ఐ. యి. యస్. లో నూతనముగ రాష్ట్రములలో ఉద్యోగులను నియమింప నక్కరలేదనియు, మద్రాసు ఎడుక్యేషనల్ సర్వీసు అను దానిలోనే కావలసిన వారినందరును రాష్ట్రమువారు నియమించుకొన వలెననియు తీర్మానింప బడినది. నాటినుండి మంత్రి వర్గమునకు సర్వాధికార మేర్పడెను. 1926 లో ఆంధ్ర విశ్వకళాపరిషత్తు చట్టము నిర్మింపబడినది. కాకినాడలో, గుంటూరులలో కళాశాలలు మొదటి తరగతిలోనికి మార్చబడినవి. గుంటూరు, బంద రులో నూతనముగ కళాశాలలు స్థాపింపబడెను. నెల్లూరు, విజయవాడలో రెండవ తరగతి కళాశాలలు నెలకొల్ప బడెను. రాజకీయ చైతన్యము వలన ప్రజలలో కలిగిన ఉద్బోధనము, ఉత్సాహము ఈ విద్యావ్యాపనమునకు కారణములు. 1926నాటి చట్టములో ఆంధ్రవిశ్వకళా పరి షత్తులకు విజయవాడ పరిపాలన కేంద్రముగను, విశాఖపట్ట ణము, రాజమండ్రి, అనంతపురము విద్యా కేంద్రములుగను ఏర్పాటు చేయబడినవి.

మొదటి మూడేండ్లలోను విజయవాడను విద్యాకేంద్ర ముగ చేయుటకై విశ్వకళా పరిషత్తు ప్రభుత్వమువారిని సెనేటు తీర్మానముల ద్వారా ఒత్తిడి చేసినది. కాని ఇతర మగు ప్రబల కారణములచేత విశ్వకళా పరిషత్తులో ఒక్కటే కేంద్రము నేర్పరచి, దానిని విశాఖపట్టణములో నెలకొల్పి నెల్లూరు, రాయలసీమ జిల్లాలను మద్రాసు విశ్వ కళా పరిషత్తు పర్యవేక్షణలో చేర్చి 1929 లో ప్రభుత్వము శాసనసభ తీర్మానమును అమలు జరిపినది.

1937 - 53 మధ్య శాస్త్ర శిక్షణను నూతన విధానము లలో, ఉన్నతస్థాయిలో గరపుటకును, పరిశోధనలు సలిపి నూతనశాస్త్ర విషయములను కనిపెట్టుటకును ప్రత్యేక మైన ఏర్పాట్లు చేయుట, ఈశాఖలపై సమర్థులైన విద్యార్థి కులను ఆచార్యులుగాను, రీడర్లుగాను ఏర్పాటుచేయుట మొదలగు ఆశయములతో ప్రారంభమైన విశ్వకళాపరి షత్తు వానిని నెరవేర్చుటకై సర్వ ప్రయత్నములు చేసినది; చాల వరకు సాధించినది. ఇచ్చటి శాస్త్ర శాఖలలో ఎమ్. యస్‌సి., డి. యస్‌సి. డిగ్రీలను పొందిన యువకులు భారత దేశమంతటను పేరు ప్రతిష్ఠలు గడించుచున్నారు. విశ్వ కళాపరిషత్తు ఏర్పాటుచేయుచున్న నూతనశాస్త్ర శాఖ లను కేంద్రప్రభుత్వము ప్రోత్సహించి విరాళముల నొసగు చున్నది. ఇతర రాష్ట్రములనుండి నియమితసంఖ్య గల విద్యార్థులకు ఇచ్చట విద్య నేర్పుటకు ఏర్పాటు కలదు. చాలమంది విద్యార్థులు విశ్వకళాపరిషత్తు ఆవరణలోని వసతి గృహములలో నివసించుచున్నారు; ఆ యావరణ లోను, పరిసరములలోను ఉపాధ్యాయులు, ప్రధానాచా చార్యుడు, రిజిస్ట్రారు, వార్డను, అధ్యాపకులు నివసించు చున్నారు.

1955లో చిత్తూరు జిల్లాలోని తిరుపతియందు శ్రీ వేంక టేశ్వర విశ్వవిద్యాలయమను పేర నొక నూతన విశ్వకళా పరిషత్తు స్థాపింపబడినది. ఇది రాయలసీమ, నెల్లూరు జిల్లా లోని విద్యార్థుల సౌకర్యార్థమేర్పాటు చేయబడినది. (చూ. విద్యావిధానము : తెలంగానా - ఆంధ్ర విశ్వవిద్యాల యము, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము, ఉస్మా నియా విశ్వవిద్యాలయము). వి. అ. రా.

తెలంగానా : భారతదేశమునందు స్వయముగ ఆంగ్లే యులు పరిపాలించిన ప్రాంతములలో ప్రారంభము నుండియు ఏవో కొన్ని పాఠశాలలు స్థాపించబడినట్లును, దేశీయులు స్వయముగ కొన్ని విద్యాశాలలు నడుపుచుండి నట్లు చరిత్రాధారములు ఉన్నవి.

ఆకాలములో అక్కడక్కడ ముఖ్యముగ హిందువులే అత్యధికముగ ఉండిన ప్రాంతములయందు అనాదిగ, సంప్ర దాయ సిద్ధముగ వచ్చుచుండిన వీధిబడులు మొదలయినవి తప్ప వేరేమియు లేకుండెను. ప్రభుత్వోద్యోగులకును, విద్యకును ఎక్కువ సంబంధము ఏమియు లేకుండుటనుబట్టి ఒక ప్రత్యేక పద్ధతిని అనుసరించిన విద్యావిధానమేదియు లేకుండెను.

పూర్వాచారము ననుసరించి వచ్చుచుండిన పాఠశా లలో కొద్దిగ వ్రాయుట, కొద్దిగ చదువుట, కొద్దిగ లెక్కలు చేయుట మాత్రము నేర్పబడుచుండెను. ఉపా

ధ్యాయునకు జీతమనునది లేకుండెను. జీవనోపాధికై వలయు వస్తుసామగ్రి బియ్యము, పప్పు, ఉప్పు మొదలగు నవి గ్రామ ప్రజ లతనికి ఇచ్చుచుండిరి.

కాని 19వ శతాబ్దారంభమునకు దేశమునందు పరిస్థితులు కొంచము సుస్థు పడినవి. పరిపాలకులకు కొంచము స్థిరత్వము, మనస్థిమితము కలిగినవి. బ్రిటిషువారు పాలించిన ప్రాంతములందే కాక బరోడా, మైసూరు, తిరువాన్కూరు మొదలగు దేశీయ సంస్థానములయందు కూడ విద్యా సంస్థలు ఏర్పడుచుండుట చూచి ఇక్కడ కూడ విద్యావిషయకముగ కొంత కృషి యారంభమైనది. హైదరాబాదులో మొట్టమొదటి ఇంగ్లీషు పాఠశాల 1834 లో చర్చ్ ఆఫ్ ఇంగ్లండ్‌కు చెందిన ఒక ఫాదరీచే నెలకొల్పబడెను. దీని తర్వాత అనతికాలములోనే ఒక రోమన్ కాథలిక్ పాఠశాల స్థాపింపబడెను. ఇదే కాలములో రాష్ట్రమునందు అగ్రగణ్యుడుగా గౌరవింపబడి మొదటి అమీర్ - ఒ - కబీర్ (ప్రముఖ సంస్థానాధీశుడు) అనే బిరుదమును అప్పటి నిజామునుండి వడసిన ఫక్రుద్దీన్ ఖాన్ అను ఆయన పర్షియన్ అరబ్బీ భాషల నేర్చుకొనుటకై ఒక పాఠశాలను స్థాపించెను. ఈయన గొప్ప మేధావి యనిన్నీ, అనేకశాస్త్రములయందు ప్రవీణుడనిన్నీ ప్రసిద్ధి.

హైదరాబాదునందు మొదటి ప్రభుత్వ విద్యాసంస్థ 1854 లో స్థాపింపబడెను. దానిపేరు దారుల్ - ఉలూం (విద్యలకు నిలయము). ఇందుకూడ పర్షియన్, అరబ్బీ భాషలనే నేర్పుచుండిరి. చాల మార్పులు చెందుచు వచ్చి ఈ సంస్థ నేటికిని నిలచి ఉన్నది. కాని 35 సం॥ములకుపై నుండి ఇది యొక సాధారణ సెంకడరీ పాఠశాలగా మాత్రమే పనిచేయు చున్నది. పాత పేరు మాత్రము నిలచి ఉన్నది.

1859 లో ప్రతి తాలూకాయందును ప్రతి జిల్లా కేంద్రమునందు ఒక పర్షియన్ పాఠశాల, ఒక దేశభాషా పాఠశాల (ఉర్దూకూడ దేశభాషగనే పరిగణింపబడి ఎక్కువ ప్రాముఖ్యము కలిగి ఉండెను) స్థాపింపవలయునని ప్రభుత్వము నిర్ణయించెను. ఇందు నామకార్థము తెలుగుఉండినప్పటికిని అత్యధిక సంఖ్యాకులు ఉర్దూ, పర్షియన్ భాషలనే అభ్యసించు చుండిరి, ఎందువల్ల ననగా, వాటిలో ప్రవేశముండుట వల్లనే ఏదైన ఉద్యోగముకాని, పొట్ట పోషించుకొను ఉపాయముకాని ఉండెడిది. రాజ్యతంత్రము ఎక్కువగా పర్షియన్ భాషయందే నడచుచుండెడిది. దాని తరువాత ఉర్దూ, తెలుగు భాషలకు ప్రాముఖ్యము యెంత మాత్రమును లేకుండెను. కావుననే నేటికిని తెలంగాణమునందు ఉర్దూ భాషయందేగాక, పర్షియన్ భాషయందు కూడ మంచి ప్రవేశముకలవారు హిందువులలో అనేకులున్నారు. ఈ పై పాఠశాలలయొక్క పర్యవేక్షణకై కమిటీలు ఉండెడివి. తాలూకా పాఠశాల కమిటీకి తహసీల్దారు అధ్యక్షుడు; ఇద్దరు పటేళ్ళు, ఇద్దరు పట్వారీలు సభ్యులు. జిల్లా పాఠశాల కమిటీకి మూడవ తాలూక్దారు (డిప్యూటీ కలెక్టరు) అధ్యక్షుడు, పోలీసు ఇన్‌స్పెక్టరు, తహసీల్దారు, ఒక పటేలు, ఒక పట్వారీ సభ్యులు. ఈ మూడవ తాలూకాదారు జిల్లా పాఠశాలల ఇన్‌స్పెక్టరు, (పదవిరీత్యా)గా కూడ ఉండెను. అతడు జిల్లా పర్యటన చేయునప్పుడు పాఠశాలలయొక్క పర్యవేక్షణ కూడ చేయుచుండెను. ఈ ప్రకారముగ విద్యావిధాన మంతయు రెవిన్యూ ఉద్యోగస్తుల అధీనమై ఉండుటను బట్టి ఎవరికిని దీనియందు ఎక్కువ శ్రద్ధ లేకుండెను. అందులో పటేల్, పట్వారీలు తప్ప సర్వసాధారణముగ అందరు ఉద్యోగులును మహమ్మదీయులే. వీరును ఎక్కువ విద్యాధికులు కారు. దేశభాషయందు అభిమానము తక్కువ. అందుచే అప్పుడు ఈ పాఠశాలలు నామమాత్రావశిష్టములై నిలచి ఉండెను.

1868 లో విద్యాశాఖ ఆనాడు నానావిధ వ్యవహారములశాఖ (మిసలేనియస్ డిపార్ట్‌మెంటు) అని వ్యవహరింపబడు చుండిన ప్రభుత్వ శాఖకు చెందిన సహాయ మంత్రియొక్క పర్యవేక్షణక్రింద నుండెను. ఉపాధ్యాయులుగ నియమింపబడగోరు వారందరును దారుల్ - ఉలూంనందు ఉపాధ్యాయ శిక్షణ పొంది యోగ్యతా పత్రములను పొందవలయు నను నియమ ముండెను. మరియొక రెండు సంవత్సరముల తరువాత విద్యాశాఖపై అధికారము అప్పటి ఇంజనీరింగు కాలేజీ ప్రిన్సిపాలుగా ఉండిన ఒక ఆంగ్లేయుని అధీనము చేయబడెను. అయినను దీనివల్ల ఎక్కువ ప్రయోజనమేమియు లేకపోయెను. తరువాత దారుల్ - ఉలూం 5 శాఖలుగా విభజింపబడెను. ఒక ఆంగ్ల దేశభాషా పాఠశాల (ఆంగ్లో - వర్నాక్యులర్ స్కూలు) కూడ స్థాపింపబడెను. 1871 లో దేశభాషా పాఠశాలల మీద అధికారి (డైరెక్టర్ ఆఫ్ వర్నాక్యులర్ ఎడ్యుకేషన్) ఒకరు నియమింపబడిరి. అప్పటికిని పాఠశాలల నిర్వహణ రివిన్యూ అధికారుల అధీనమునందే ఉండుటను బట్టి వాటి విషయమై ఉత్తర్వులు ఒక్కొక్క అధికారి నుండి ఇంకొక అధికారికి పోవుచు చివరకు పాఠశాలలకు చేరునప్పటికి ఎంతయో కాలవిలంబ మగుచుండుట వల్ల ఆ పాఠశాలల యందలి పరిస్థితు లెట్లుండునో పాఠకులే యోచించుకొన గలరు. ఆ రోజు లట్టివి, ఉద్యోగస్థు లట్టివారు.

1872 లో హైదరాబాదు నగరమందును, పరిసరము లందును 16 పాఠశాలలు ఉండెను. ఇందు ఒకదానియందు మాత్రమే ఇంగ్లీషుభాష నేర్పబడు చుండెను. తెలుగు జిల్లాలయందు దాదాపు 75 పాఠశాలలు ఉండెను.

1871 - 1880 దశాబ్దియందు విద్యావిషయమున కొంత అభివృద్ధి కనిపించు చున్నది. 1875లో జిల్లా పాఠశాల పర్యవేక్షణకై ముగ్గురు డిప్యూటి ఇనస్పెక్టర్లు నియమింప బడిరి. ఈ శాఖ అధికారము రెవిన్యూ అధికారుల నుండి తీసివేయబడెను. ఇంకొక రెండు సంవత్సరముల తరువాత, నగరము నందలి ఆంగ్లభాషా పాఠశాల మూసి వేయబడినది. అందలి విద్యార్థులను చాదర్ఘాటు (మూసీ నదికి ఈవలి ప్రాంతము) నందు స్థాపింపబడిన యొకపాఠశా లకు మార్చిరి. 1878 లో జిల్లా పాఠశాలలయందు విద్యార్థుల నుండి జీతములను వసూలు చేయవలయునను ఉత్తర్వు వచ్చినది. 1880 ఈ చాదర్ఘాటు పాఠశాల రెండవ తరగతి కళాశాలగా మారి మద్రాసు విశ్వవిద్యాలయము యొక్క పర్యవేక్షణ క్రిందికి వచ్చెను. ఆ మరుసటి సంవత్సరము ఇది మొదటి తరగతి కళాశాలగా మార్చబడెను; అదే నేటి నిజాం కాలేజి. దీనికి మొట్టమొదటి ప్రిన్సిపాలు కీ. శే. శ్రీమతి సరోజినీనాయుడు తండ్రియైన అఘోరనాథ చటోపాధ్యాయ. ఈ దశాబ్దిలో మరిరెండు పాఠశాలలు స్థాపింపబడెను. మొదటిది 'మద్రసా ఆలియా' (అనగా ఉన్నత వర్గములకు చెందినవారి పాఠశాల); ఇది ప్రభుత్వ పాఠశాల. సర్ సాలార్ జంగ్ యొక్క బంధువర్గములో వారి పిల్లల కొరకును, ఇతర సంపన్న నవాబు కుటుంబ ముల వారి పిల్లల కొరకును ఉద్దేశింపబడిన సంస్థ (అనగా 1925 ప్రాంతములో స్థాపింపబడిన జాగీర్దారు పాఠశాల వంటిది). మద్రసా ఆలియా నేటికిని ఉన్నది, కాని అందిప్పుడు అన్ని వర్గములను తీసికొనుచున్నారు.

రెండవ పాఠశాల మద్రసా ఐజా; ఇది వైయక్తిక సంస్థ; ఇందు జీతములు తక్కువ. ఇది ఆలియా కుటుంబము వారికన్న ఒకమెట్టు తక్కువ వారి నిమిత్తము ఏర్పాటై నది; ఇదియు నేటికిని ఉన్నది. మొత్తము మీద ఇందు అత్యధిక సంఖ్య విద్యార్థులు మహమ్మదీయులే. యాజ మాన్యముకూడ మహమ్మదీయులదే. మద్రసా ఆలియా యందు కూడ మొన్న మొన్నటి వరకు మహమ్మదీయు లదే ప్రాతినిధ్యము ఎక్కువ.

1883వరకు రాష్ట్రములో నాలుగు ప్రైవేటు ఇంగ్లీషు పాఠశాలలు మాత్రమే ఉండెను. ఇవి 1. సెయింట్ జార్జెస్ గ్రామర్ పాఠశాల(చర్చ్ ఆఫ్ ఇంగ్లండు) 2. ఆల్ సెయింట్స్ హైస్కూలు (రోమన్ కాథలిక్), 3. మద్రసా ఐజా; 4. మహబూబు కాలేజి: మొదటి నుండియు ఇది హైస్కూలు మాత్రమే కాని పేరుకు మాత్రము కాలేజి అని పిలువబడు చుండెను. ఇవికాక కొద్దిగ అక్కడక్కడ బాలికలకై ఇంగ్లీషు మాధ్యమిక పాఠశాలలు కూడ ఉండెను.

1883లో ప్రత్యేక విద్యాశాఖ ఒకటి స్థాపింప బడెను. సం॥కు 2½ లక్షల రూపాయల బడ్జెటు గ్రాంటుతో ఇది ప్రారంభమయ్యెను; నేడు ఇది కోటి రూపాయలకు మించిపోయినది. ఉన్నత పాఠశాలలు రెండును, మాధ్య మిక పాఠశాలలు అనేకములు స్థాపింపబడెను. ప్రైమరీ పాఠశాలలు కూడ నాలుగైదు సంవత్సరముల కాలములో మూడున్నర రెట్లు అధిక మయ్యెను.

1891లో మిడిల్‌స్కూలు పరీక్ష ప్రభుత్వ పరీక్షగా చేయబడెను. ఆ రోజులలో ప్రభుత్వపు మిడిల్‌స్కూలు పరీక్షయందు కృతార్థత చెందుట ఎంతో ఘనముగా పాటింపబడుచు వచ్చెను. ఇందు కృతార్థులైన వారిని అప్పటి మెడికల్ పాఠశాల యందుకూడ చేర్చుకొను చుండిరి; తహసీల్దారు పదవులకు కూడ నియమించు చుండిరి. వీరు కాలక్రమమున తాలూకాదారులు (కలె క్టర్లు) కూడ అగుచుండిరి.

1891లోనే ఒక పాఠ్య గ్రంథ నిర్ణాయక సంఘము (టెక్స్టు బుక్ కమిటి), ఒక విద్యా విషయకపు బోర్డు (ఎడ్యుకేషన్ బోర్డు) ఏర్పడినవి. అంతకు ముందు కొన్ని సంవత్సరములు ఏదో ఒక రీతిగా పని చేయుచుండిన ఉపాధ్యాయ శిక్షణ పాఠశాల (టీచర్స్ ట్రెయినింగ్ స్కూల్) క్రమ స్థితి లోనికి తేబడెను. మరియొక 20 సంవ త్సరములకు తర్వాత సాంకేతిక పాఠశాలలు (టెక్నికల్ స్కూల్సు), వృత్తి పాఠశాలలు (ప్రొఫెషనల్ స్కూల్సు) అనగా కార్మిక పాఠశాలలు, ఇంజనీరింగ్, వైద్యము, న్యాయశాస్త్రము మొదలగు వాటికి సంబంధించినవి కొంతవరకు విద్యాశాఖ అధీనమునకు తేబడెను. 1908-1909 లో బాలికల ఉన్నత పాఠశాలలు రెండు స్థాపింప బడెను. వీటిలో ప్రధానోపాధ్యాయినులు, కొందరు సహోపాధ్యాయినులు ఆంగ్లేయులు. 1910లో సెకండరీ స్కూలు లీవింగ్ సర్టిఫికెట్ బోర్డు స్థాపింపబడెను.

కాల క్రమమున రాష్ట్రము నందలి నాలుగు సుబాల (పరగణాల) హైదరాబాదునందు ఐదుగురు చీఫ్ ఇన్స్పె క్టర్లు నియమింపబడిరి. ప్రతి జిల్లాకు ఒక జిల్లా ఇన్స్పెక్టరు నియమితు డయ్యెను. వీరిక్రింద జిల్లాకు ముగ్గురు, నలుగురు చొప్పున నాజర్లు (డిప్యూటీ ఇన్స్పెక్టర్స్) ఉండెడివారు.

1883 లో 90 ప్రాథమిక పాఠశాలలు మాత్రమే ఉండెను. ఇందలి విద్యార్థుల సంఖ్య విద్యోచిత వయస్సు గలవారిలో 0.5%; 1901 లో ఈ పాఠశాలల సంఖ్య 500 విద్యార్థుల సంఖ్య 2.4% వరకు పెరిగెను.

1901 లో రమారమి 10 ఉన్నత పాఠశాలలును, 30 మాధ్యమిక పాఠశాలలును ఉండెను. నేడు ఒక్క హైదరాబాదు నగరమునందే రమారమి దాదాపు 50 ఉన్నత పాఠశాలలును, 80 మాధ్యమిక పాఠశాలలును ఉన్నవి. ఈ పాఠశాలలలో శిక్షణ పొందుచుండిన విద్యార్థుల సంఖ్య విద్యోచిత వయస్సు గలవారిలో 1.5%.

బాలికల విద్య మిక్కిలి హీన స్థితిలో నుండెను. స్త్రీ విద్యయెడల ఉండిన సహజ వైముఖ్యత, శిక్షణ పొందిన ఉపాధ్యాయినుల కొరత దీనికి ముఖ్య కారణములు. మహమ్మదీయులయందు పరదా పద్ధతి ఆ రోజులలో మిక్కుటముగా ఉండినప్పటికి వారి బాలికలకై విద్యా సౌకర్యములు ఎక్కువగా ఉండెడివి. పరదా బాలికలకై పాఠశాలలకు పోను రాను బండ్లు మొన్న మొన్నటివరకు ఉండెడివి. మిషన్ పాఠశాలలు కూడ ఈ రోజులలో స్థాపింపబడి, సక్రమమైన పద్ధతులపై విద్యా ప్రదానము చేయుచుండెను.

యూరపియనుల, యురేషియనుల కొరకై ఆ రోజులలో 8 పాఠశాలలు ఉండెను. ఈ పాఠశాలలకు బ్రిటిషు పరిపాలకులే కాక, నిజాం ప్రభుత్వముకూడ విరివిగా విరాళములను ఇచ్చుచుండిరి. ఇందు చదువుకొనిన విద్యార్థులు అధికముగ నిజాం సేనలయందు ఉద్యోగములలో ప్రవేశించుచుండిరి.

మహమ్మదీయులు మొత్తము జనాభాలో 10.4% మాత్రమే ఉండినను, కళాశాలలయందు 83%; ఉన్నత పాఠశాలయందు 45%, ప్రైమరీ పాఠశాలలయందు 42% ఉండెడివారు. దీనికి కారణము రాష్ట్ర పాలకుడు, పాలక వర్గము మహమ్మదీయ లగుటయే. సంఖ్యలో మహమ్మదీయులు ఎక్కువ అయినప్పటికి పరీక్షలయందు ఉత్తీర్ణులగువారి సంఖ్యలో ప్రతిశాతము హిందువులదే ఎక్కువగా ఉండెడిది. ఆదిమ నివాసులకొరకు కూడ ఏర్పాట్లు చేయబడినప్పటికిని ఏవో క్రైస్తవ మిషన్ పాఠశాలలకు తప్ప, ఇతర పాఠశాలలకు వీరు పోవుట అరుదుగా నుండెను. నైజాము నందలి అంతర్భాగమైన తెలంగాణాలో అక్షరాస్యతను గురించిన సంఖ్యలు గమనించదగినవి: క్రైస్తవులలో వెయ్యింటికి 443 గురు మహమ్మదీయులలో 54 గురు, హిందువులలో 25 గురు అక్షరాస్యులుగ ఉండెడివారు. తెలంగాణా పరిపాలన చాలకాలము నవాబు ఆధీనమున నుండుటయే హిందువులలో ఇంత తక్కువ విద్యావ్యాప్తికి కారణముగ ఊహించనగును.

1911 లో తెలుగుభాష అభ్యసించుచుండెడివారి సంఖ్య 15,597; 1921 లో 85,135; ఉర్దూ భాష అభ్యసించుచుండెడి వారి సంఖ్య 1911 లో 27,232; 1921 లో 1,20,113. జనాభాలో 90% హిందువులు, 10% మహమ్మదీయులు. అయినను వారివారి భాషల నభ్యసించువారి సంఖ్యలో ఎంత వ్యత్యాసముండెడిదో గమనింపదగు విషయము. దీనికి ముఖ్య కారణము ఉర్దూ రాజభాష అగుటవల్లను, దానిని అభ్యసించుటవలననే పొట్ట పోసికొనుట సాధ్యమగుటవల్ల అనేకులు తెలుగు భాషను ఉదాసీన భావముతో చూచుచుండిరి. ఈ పరిస్థితులు 1950 వరకును సాగుచునే ఉండెను.

క్రమముగా పాఠశాలల సంఖ్య అధికమయ్యెను; విద్యార్థుల సంఖ్యకూడ సహజముగ అధికమయ్యెను. కాని ఉస్మానియా విశ్వవిద్యాలయ స్థాపనతో ఉర్దూ భాషకు ప్రాధాన్యము అధిక మయ్యెను. ఉన్నత పాఠశాలలు అన్నిటికి 'ఉస్మానియా ఉన్నత పాఠశాల' అను నామ మీయబడెను. వీటియందు విద్యా బోధన భాష ఉర్దూ. అక్కడక్కడ ఇంగ్లీషు మీడియమ్ (ఇంగ్లీషులో విద్య బోధించు) పాఠశాలలు ఉన్నప్పటికి మొత్తముమీద ఉస్మానియా పాఠశాలలయందే అత్యధిక సంఖ్యలో విద్యార్థులు చేరుచుండిరి. ఇంగ్లీషు మీడియమ్ విద్యార్థులకు ఉద్యోగములు లభించుటకు ఎక్కువ అవకాశములు ఉండుటచే పెద్ద కుటుంబములకు చెందిన విద్యార్థులు వాటియందే చేరుచుండిరి. కొంతకాలమైన తర్వాత ఉస్మానియా విద్యార్థులకు కూడ ఉద్యోగ సౌకర్యములు కలుగచేయబడెను. కనుక ఉర్దూ భాషకు కలిగిన ప్రాభవము అత్యధికముగ ఉండెను.

కాని భారత దేశముయొక్క స్వాతంత్ర్య సిద్ధితో నిజాం రాష్ట్రము విచ్ఛిన్నమై తెలంగాణాకు ప్రాముఖ్యము చేకూరిన తర్వాత విద్యా బోధన భాష మాతృ భాషగా నుండవలెనన్న సూత్రము ప్రవేశ పెట్టబడెను. కాని తెలుగు మాతృభాషగ నుండియు తెలుగునందు మంచి ప్రవేశము కల ఉపాధ్యాయులు ఎక్కువగ లేకపోవుటచే ప్రారంభమునందు పరిస్థితు లంత సంతుష్టికరములుగ లేకుండెను. ఇటీవల చాల మెరుగు కన్పించు చున్నది. ఉర్దూ మీడియమ్‌లో చదువుకొనువారి సంఖ్య మహమ్మదీయులదే ఎక్కువ. వీరును క్రమక్రమముగ ఇంగ్లీషు మీడియమ్ పాఠశాలలకు పోవుచున్నారు.

ఇటీవల తిరిగి ఒక మార్పు కన్పించుచున్నది. స్వాతంత్ర్య ప్రారంభ దశలో మాతృభాష మీడియమ్ నిర్బంధము

చేయబడినను, క్రమముగ ఈ సూత్రము సడలింపబడినది. ఎవరు ఏ మీడియమ్‌లో ఇష్టపడిన ఆ మీడియమ్‌లో చదువు కొనుట కవకాశ మొసగబడినది. తద్వారా ఇంగ్లీషు మీడియమ్ పాఠశాలలు విద్యార్థులతో క్రిక్కిరిసిపోవుచున్నవి. తెలుగు మీడియమ్ విద్య, రెండవ తరగతి విద్యగా పరిగణింపబడుచున్నది.

కొన్ని ముఖ్య విషయములు: రమారమి 15 సంవత్సరముల క్రింద ప్రభుత్వ పాఠశాలలలో ప్రైమరీ విద్య ఉచితము చేయబడినది. కొంత కాలమునుండి మధ్య (మిడిల్) తరగతి విద్య కూడ ఉచితము చేయబడినది. అంతకు ముందు రాష్ట్రమునందు పాఠశాలలు అధికముగ ప్రభుత్వము యాజమాన్యము క్రిందనే ఉండెను. వైయక్తిక పాఠశాలలు చాల తక్కువ. ప్రజా సంస్థలు పాఠశాలలను తెరచినచో వాటి విషయమై ప్రభుత్వము అనుమానముతో చూచుచుండెడిది. ఈ విషయమున ఇచటి ఆంధ్ర మహాసభ ఎన్నియో ఆక్షేపణలు చేసినను ప్రభుత్వము వాటిని పెడ చెవిని పెట్టుచు వచ్చినది. ఉపాధ్యాయుల శిక్షణ విషయమున కూడ చాల సంకుచితములైన ఏర్పాట్లు ఉండెడివి. మధ్య పరీక్షలో కృతార్థులైన ఉపాధ్యాయులకు తప్ప మిగిలినవా రందరికినీ ఉర్దూ భాషలోనే శిక్షణ ఒసగబడుచుండెను. సున్ని మహమ్మదీయులకు వారి మత విద్య నిర్బంధము చేయబడెను. షియా మహమ్మదీయులకును, హిందువులు మొదలైన వారికిని నీతిశాస్త్రము పేరిట మత పాఠములు చెప్పుచుండిరి; ఇవి ఇప్పుడు తీసివేయబడినవి.

పూర్వము వైయక్తిక పాఠశాలలకు వాటి వాటి పలుకుబడిని బట్టి, ప్రభుత్వసాహాయ్యము (గ్రాంట్స్-ఇన్-ఎయిడ్) దొరకు చుండెను. కాని రమారమి 15 సంవత్సరముల నుండి ఈ సహాయము సక్రమ మయిన నిబంధనలను, అర్హతను అనుసరించి విరివిగా ఈయబడుచున్నది. నిర్బంధ ప్రారంభ (ప్రైమరి) విద్య 1947 సంవత్సరాంతమున ప్రవేశపెట్టబడెను. ఇది ప్రారంభములో పది కేంద్రములందు మాత్రమే ఉండెను; అదియు అంత సంతుష్టికరముగా లేకుండెను. ఇందుకై ఒక సంవత్సరము మూడు నెలల కొరకై ఒక ప్రత్యేకాధికారి (స్పెషల్ ఆఫీసరు) నియమింపబడెను. నిమ్న జాతులవారి కొరకు ప్రత్యేక పాఠశాలలు నిర్మింపబడెను. వాటికై ప్రత్యేకము ఒక ఇన్‌స్పెక్టరు నియమింపబడెను. వయోజన విద్య కూడ ఇదే సమయములో ప్రవేశపెట్టబడెను. దీనికొరకు ప్రత్యేకము ఇన్‌స్పెక్టరు ఉండెను. ఇప్పుడును ఈ ఏర్పాట్లున్నవి కాని, వాటి స్వరూపము మారినది. సైన్సు, ఇంగ్లీషు, విద్యా ప్రదానమును పర్యవేక్షించుటకై కొంత కాలము స్పెషల్ ఇన్‌స్పెక్టర్లు ఉండిరి. బాల భటోద్యమమునకు, గరల్ గైడ్ ఉద్యమమునకు ప్రత్యేక అధికారులు, శరీర వ్యాయామ కళాశాల ఇట్లెన్నియో పదవులు, సంస్థలు పెరిగిపోయి అనేక లక్షల రూప్యములు వ్యయమగుచుండెను.

1948 లో పోలీసు చర్య జరిగి, హైదరాబాదు సంస్థానము భారతదేశములో ఒక రాష్ట్రముగా చేరిన తర్వాత విద్యాశాఖలో మార్పు లనేకములు చేయబడినవి. పాఠ్య ప్రణాళికల విషయములోను ఉపాధ్యాయుల శిక్షణ విషయములోను చాల మార్పులు ప్రవేశపెట్టబడినవి. బేసిక్ విద్యా విధానముపై ఆధారపడిన పాఠశాలలును అట్టి పాఠశాలలో పనిచేయుటకు శిక్షణ ఇచ్చు శిక్షణ పాఠశాలలును చాల స్థాపింపబడినవి. ఈ మార్పులన్నియు ప్రజా స్వామ్య సూత్రముల ననుసరించి జరిగినవి. 15 ఏండ్ల క్రిందటి ఇచటి విద్యా పద్ధతులను చూచి, తిరిగి ఇప్పటి పరిస్థితులను చూచెడువారు దిగ్భ్రమ చెందునట్టి మార్పులు అనేకము వచ్చినవి.

జి. ఎస్. ప్ర. రా.

# విద్యా విధానము (1953 - 60)

ప్రాథమిక విద్య: భారత రాజ్యాంగములోని 45 వ నిబంధన కనుకూలముగ, ఎక్కువ వ్యయం లేకుండ, ఆ రాష్ట్రంలోని పిల్లలందరిని పాఠశాలలలో చేర్పించ డానికొక మార్గంగా 'ఒంటిపూట' బడులు ఉమ్మడి మద్రాసు రాష్ట్రములో 1953-54లో ప్రవేశ పెట్టారు. ఆంధ్రరాష్ట్రావతరణ మప్పుడు ఈ ఒంటిపూట విధానము అమలులో ఉంది. ఈ విధానములో ప్రాథమిక విద్యకై ఉన్న అవకాశాలను పురస్కరించుకొని అప్పటికి బడులలో ఉండిన పిల్లల సంఖ్యను రెట్టింపు చేయడానికి ఒక విధంగా ప్రయత్నం జరిగింది. బళ్ళో పిల్లలను రెండు భాగాలుగా చేసి ఒక భాగం బళ్ళో ఉన్నట్లయిన మరొకొటి ఊళ్ళో - కుటీర పరిశ్రమలో, వ్యవసాయమో, చేతిపనులో, చేయడం గమనించేవారు. జనసామాన్యంలో ఈ విధానం గణనకెక్కక పోవడం, ప్రతికూలాభిప్రాయం ప్రబలం కావడం మూలంగా త్వరలోనే ఒంటిపూట బడులను ఉపసంహరించు కోవలసి వచ్చింది. 1954 లో కుప్పుస్వామి కమిటీ నియమించబడింది. పాఠశాల నిర్వహణలో సమర్థతను వృద్ధిచేయుటకు కుప్పుస్వామి కమిటీ సిఫారసుల

ననుసరించి ప్రత్యేక సంస్థలు, వ్యక్తులక్రింద నుండిన పాఠశాలల నన్నిటిని ప్రభుత్వము తీసికొనేందుకు 1953 నుండి తీవ్ర ప్రయత్నాలు జరిగాయి. ప్రథమంగా ఈ పాఠశాలలను ప్రభుత్వం తీసికొని తర్వాత మునిసిపాలిటీలు, జిల్లా బోర్డులు మున్నగు స్థానిక స్వపరిపాలనా సంస్థల కివ్వబడినాయి. 1959 లో పంచాయితీసమితి, జిల్లా పరిషత్తు చట్టరీత్యా ఏర్పడిన పంచాయితీ సమితులు, జిల్లా పరిషత్తులకు ఈ పాఠశాలలు అప్పగింపబడినాయి.

ప్రాథమిక విద్యారంగములో స్వతంత్ర భారతదేశంలో జరిగిన విద్యాభివృద్ధినే ఆంధ్రావని గూడా ఇంచుమించు అనుసరించింది. ప్రాథమిక పాఠశాలలో 54·2% ప్రత్యేక సంస్థలవి, 38·5% స్థానిక సంస్థలవి, తక్కిన 7·2% ప్రభుత్వాధికారంలో నుండినవి. ప్రత్యేక సంస్థల క్రింద నుండిన గ్రాంటు బడుల కగు ఉపాధ్యాయ వేతనాలే గాక సాలు కగు మొత్తము గ్రాంటు మీద 15% చొప్పున పాఠశాలలు నడిపేటందు కగు ఖర్చుల నిమిత్తం, అదనంగా కొంత ధన సహాయము ప్రభుత్వం ముట్టచెప్పేది.

తెలంగానాలో ప్రాథమిక విద్యకై ప్రత్యేక పాఠశాలలే గాక, కొన్ని సెకండరీ పాఠశాలలో గూడ ప్రాథమిక తరగతులు నడుపబడుతూ వచ్చేవి. కొన్ని పాఠశాలలు ప్రభుత్వము వారివి; కొన్ని ప్రత్యేక సంస్థలవి. ఇందు కొన్నిటికి ప్రభుత్వ సహాయం లభించేది. ప్రభుత్వము వారి రికగ్నిషన్ పొందని బడులు గూడా కొన్ని ఉండేవి. ఎక్కువగా ప్రాథమిక పాఠశాలలు ప్రభుత్వ నిర్వహణ క్రిందనే ఉండేవి. ప్రాంతీయ భాషా జ్ఞానము గలిగిన ఉపాధ్యాయులు చాల తక్కువగ నుండిరి. అట్టి వారు తప్పని సరిగా ప్రాంతీయ భాషా పరిజ్ఞానము పొందవలయు నని నిర్బంధము చేయబడినది. 1953-54 నాటికి ఉన్న బడులలో సగానికి పైగా ఒకే ఉపాధ్యాయునిచే నడుపబడునట్టివై యుండెను. బేసిక్ విద్యావిధానంలో ఉత్తీర్ణులైన ఉపాధ్యాయులుగూడ చాల తక్కువ మందే యుండిరి. తెలంగానాలో కొన్ని జిల్లాలలో అక్కడక్కడ కొన్ని చోట్లలోను, హైదరాబాదు, సికిందరాబాదు నగరాలలోను నిర్బంధ ప్రాథమిక విద్య ప్రవేశ పెట్టబడింది. 1956 నాటికి 500 జనాభాగల ప్రతి గ్రామములోను పాఠశాలలు స్థాపించబడ్డాయి. ప్రథమపంచవర్ష ప్రణాళికా కాలంలో ఇద్దరు ఉపాధ్యాయులుండిన బడులన్నింటిలోను మూడవ ఉపాధ్యాయుడు నియమింపబడినాడు. 700 జనాభా గలిగి యుండిన గ్రామాలలోని ప్రత్యేక సంస్థల నిర్వహణలోనుండిన బడులన్ని ప్రాథమిక పాఠశాలలుగా మార్చబడ్డాయి. పరిశ్రమాభివృద్ధి గల స్థలములను, కార్మిక కేంద్రాలలోను కిండరుగార్టెను బడులు స్థాపించారు.

1956 నవంబరు మొదటి తేదినాడు ప్రస్తుత ఆంధ్రప్రదేశ్ నిర్మాణం జరిగింది. 1953 అక్టోబరు వరకు ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో నుండిన పదకొండు ఆంధ్ర జిల్లాలలో మద్రాసు రాష్ట్ర విద్యావిధానం అనుసరింప బడింది. 1956 నవంబరు వరకు హైదరాబాదు రాష్ట్రములో నుండిన భాగంగా ఉండిన తొమ్మిది జిల్లాలలోను పూర్వపు హైదరాబాదు సంస్థానంలో నుండిన విద్యావిధానము అనుసరింప బడింది. ఆయా జిల్లాలకు సంబంధించిన విద్యాభివృద్ధి తాలూకు భోగట్టా పూర్తిగా లభించలేదు. ఆంధ్రప్రదేశ్ నిర్మాణానంతరం రాష్ట్రంలోని అన్ని జిల్లాలలో ఒకే విధమైన విద్యావిధానం ప్రవేశ పెట్టడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి.

కుప్పుస్వామి కమిటీ సూచనలలో ప్రాథమిక తరగతుల పాఠ్యగ్రంథాలను ప్రచురించడం జాతీయం చేయడం గూడ ఒకటి. 1957-58 నాటికి రాష్ట్రంలో ఈ సూచన అనుసరించబడింది. 1, 2, 3, 4, తరగతులకు తెలుగు, 5 వ తరగతికి మాత్రం లెక్కలు, ప్రకృతి శాస్త్రము, సాంఘిక శాస్త్రము ఇప్పటికి (1960 నాటికి) జాతీయం చేయబడినాయి. తక్కిన తరగతుల పాఠ్యగ్రంథాలు సహితం త్వరలోనే రాష్ట్ర ప్రభుత్వమే ప్రచురిస్తుంది.

1955-56 లో ప్రాథమిక విద్యావ్యాప్తికి అవసరమైన పాఠశాలల స్థాపన నిమిత్తమై రాష్ట్రమంతా సర్వే చేయబడింది. 1961-62 నుండి తృతీయ పంచవర్ష ప్రణాళికా కాలంలో 6 నుండి 11 సంవత్సరముల వయస్సు గల ప్రతి బాలబాలికకు ప్రాథమిక విద్య నిర్బంధంగా గరపుటకు రాష్ట్ర ప్రభుత్వం నిర్ణయించింది. దీనికి తగిన సన్నాహం అన్ని విధాలా చేస్తుంది. పాఠశాల భవనాల నిర్మాణం, బీద విద్యార్థులకు మధ్యాహ్నవేళ భోజన సదుపాయం, కొంతమందికి ఉచితంగా పుస్తకాలు, బీద బాలికలకు బట్టలు, సక్రమంగా హాజరైన వారికి ఉచిత వేతనాలు మున్నగునవన్నీ కలుగజేసి బడి ఈడు పిల్లలందరు పాఠశాలలోకి వచ్చేటట్లు చేయాలని ప్రభుత్వం ప్రయత్నిస్తూంది. ప్రాథమిక విద్యాలయాల్లో ప్రకృతి శాస్త్రబోధన నిమిత్తం కర్నూలు, హైదరాబాదు నగరాలలో ట్రైనింగు కళాశాల కనుబంధంగా ఒక కన్సల్టెంటు కాలేజికి నూరు మైళ్ళ ప్రాంతంలో పుగా నుండు ప్రాథమిక పాఠశాలల్లో ప్రకృతి శాస్త్ర బోధన విషయమై సలహాలనివ్వడం, శాస్త్ర ప్రయోగాలకు తగిన పరికరాలను ప్రదర్శించడం బడి పంతుళ్ళకు సమయానుకూలంగా బోధనావసరములగు విషయాలను గూర్చి చర్చించడం లాంటి క్రియలద్వారా సాయపడుతూ ఉంటారు. ఒకటి నుండి 8 తరగతులవరకు ఉన్న ప్రాథమిక విద్యా కాలపరిమితిని ఏడు సంవత్సరాలకు కుదించి పాఠ్య ప్రణా

శిక తయారు చేయబడింది. ఈ ప్రణాళిక 1959-60నుండి మొదటి తరగతిలో ప్రవేశ పెట్టబడింది.

బేసిక్ విద్యావిధానం దేశమంతటా అనుసరించడానికి ప్రభుత్వం ఆమోదించిం దని ఇదివరకే చెప్పబడింది. కాబట్టి క్రమంగా రాష్ట్రింలో ప్రాథమిక విద్యాలయాలు, ట్రైనింగు స్కూళ్ళు, బేసిక్ విధానం క్రింద మార్చబడి నాయి. 1953-54 నుండి 1960-61 వరకు రాష్ట్రింలోని బేసిక్ విద్యాభివృద్ధి క్రింది పట్టికవల్ల తెలియనగును :

(రెసిడెన్షియల్ స్కూళ్ళు) ఉన్నవి. ఆంధ్రలో చాలవ రకు సెకండరీ పాఠశాలలు జిల్లా బోర్డుల యాజమాన్యమునను, తెలంగానాలో ప్రభుత్వ యాజమాన్యమునను నడుప బడుచున్నవి. 1959 లో జిల్లా పరిషత్తులు, పంచాయతీ సమితుల చట్టము అమలులోనికి వచ్చినది లగాయతు ఆంధ్ర ప్రదేశ్ అంతట (మునిసిపాలిటీలు తప్ప) సెకండరీ పాఠ శాలలు పరిషత్తుల పరిపాలన క్రిందికి తేబడినాయి. ఎనిమి దవ తరగతి వరకు అన్ని పాఠశాలలో (కొన్ని ప్రత్యేక

| వివరములు | 1953-54 | 1954-55 | 1955-56 | 1956-57 | 1957-58 | 1958-59 | 1959-60 | 1960-61 |
|---|---|---|---|---|---|---|---|---|
| బేసిక్ పాఠశాలలు : | | | | | | | | |
| 1. జూనియర్ | 454 | 501 | 638 | 1045 | 1866 | 2391 | 2614 | 2615 |
| 2. సీనియర్ | — | — | 44 | 56 | 198 | 277 | 277 | 277 |
| 3. ట్రైనింగ్ స్కూళ్ళు | — | — | 37 | 37 | 36 | 47 | 60 | 78 |
| 4. కాలేజీ [ట్రైనింగ్] | — | — | 1 | 1 | 1 | 1 | 1 | 1 |
| జూనియర్ పాఠశాలలోని విద్యార్థులు | 47,265 | — | — | — | 2,85 | 445 | — | — |
| తల ఒక్కంటికి సగటు ఖర్చు | 24.00 | — | — | — | 26.22 | 29.60 | — | — |

1961-62 నాటికి ఆంధ్రప్రదేశ్‌లోని అన్ని పాఠశాలలు బేసిక్ పాఠశాలలుగా మార్చబడుతాయి.

సెకండరీ విద్య : భారతదేశము స్వతంత్రసిద్ధిని పొందిన తర్వాత సెకండరీ విద్యావిధానంలో కలిగిన మార్పులు లోగడ సూచింప బడినవి. 'సెకండరీ ఎడ్యుకేషన్ కమిషన్' సిఫారసులు రాష్ట్రిమంతటా సెకండరీ విద్యావ్యాప్తికి ఎంతో దోహద మిచ్చాయి. హయ్యరు సెకండరీ విధానము ఆదర్శంగా రాష్ట్రములోని సెకండరీవిద్య రూపొందించాలని ప్రభుత్వం ఆమోదించింది. 1960-61 నాటికి, 54 పాఠ శాలలు హయ్యరు సెకండరీ స్కూళ్ళుగాను 48 స్కూళ్ళు బహుళార్థసాధక పాఠశాలలుగాను మార్చబడినాయి. 1955-56 నుండి 1960-61 వరకు రాష్ట్రింలోని సెకండరీ విద్యాలయాల అభివృద్ధి క్రింద సూచించ బడింది.

బడులలో తప్ప) బాలబాలికలకు విద్య ఉచితము.

సెకండరీ పాఠశాలలకు ఉపాధ్యాయులను సరవరా చేయుటకై బి. ఇడి., డిగ్రీ ట్రైనింగు కళాశాలలు రాష్ట్రములో ఆరు ఉన్నవి. మొత్తము మీద సాలుకు 700 మంది ఉపాధ్యాయులు ఈ కళాశాలలలో తర్ఫీదు పొందుతున్నారు. ఇవిగాక, హిందీ, తెలుగు, ఉర్దూ, సంస్కృతభాషలలో పండితులు శిక్షణకు ప్రత్యేక వసతులు గూడ ఉన్నవి. హయ్యరు సెకండరీ పాఠశాలలు అవసర నిమిత్తము రాష్ట్రంలో మూడు యూనివర్సిటీలు, 'మూడు మాసముల' సర్టిఫికేటు కోర్సు బి. ఇడి. ఉపాధ్యాయుల కోసము నడుపుతున్నారు.

రాష్ట్రములో నాలుగు ట్రైనింగు కళాశాలలో ఎక్స్ టెన్షన్ సర్వీసు శాఖలు తరచు సెమినార్లు, "ఇన్-సర్వీస్

| వివరములు | | 1955 - 56 | 1958 - 59 | 1959 - 60 [అంచనా] | 1960 - 61 [అంచనా] |
|---|---|---|---|---|---|
| హైస్కూళ్ళు | .... | 687 | 915 | 945 | 959 |
| హయ్యరు సెకండరీ స్కూళ్ళు | .... | — | 33 | 46 | 54 |
| మల్టిపర్పస్ స్కూళ్ళు | .... | 39 | 44 | 48 | 48 |
| చదివిన విద్యార్థులు | .... | 4,90,258 | 5,19,941 | 5,47,751 | 5,66,285 |
| వెచ్చించిన డబ్బు [సుమారు] | .... | — | 2,30,56,500 | 2,63,24,100 | 3,30,78,300 |

ఇవిగాక హైదరాబాదు పబ్లిక్ స్కూలు, చిత్తూరు జిల్లాలో ఋషివాలీ స్కూలు అను రెండు గురుకులాలు

ట్రైనింగు" వారాంతపు శిక్షణ తరగతులు, ప్రదర్శన మూలంగా ఉపాధ్యాయులు వారి అనుభవాన్ని వృద్ధి చేసి

కోవడానికి ఉపకరిస్తున్నాయి. హైస్కూళ్ళలో గైడెన్సు మేష్టర్లను తర్ఫీదు చేసేందుకు రాష్ట్ర "ఎడ్యుకేషనల్ ఒకేషనల్ గైడెన్సు బ్యూరో" ఒకటి స్థాపితమైంది. ఈ సంస్థ అనేక విధాలుగా ఆధునిక పద్ధతులతో హయ్యరు సెకండరీ, మల్టిపర్పసు హైస్కూళ్ళ విద్యార్థులకు చక్కని సలహాల నిచ్చుటకు, మానసిక శిక్షణాను సరముగ కొన్ని పరీక్ష లను నిర్మించుట మున్నగు సహాయముల నొనర్చుచున్నది.

రాష్ట్రములోని హెచ్చుస్థాయి హైస్కూళ్ళలోని అన్ని పాఠ్య విషయబోధన పర్యవేక్షణకు ప్రత్యేకంగా ఒక అధి కార వర్గము నియమించబడినది. వీరు హెచ్చుస్థాయి పాఠశాలలన్నిటిని దర్శించి, ఒక్కొక్క విషయములోను పాఠములను చెప్పి ఉపాధ్యాయులకు కావలసిన సలహా నిచ్చి ఆధునిక బోధనా పద్ధతులను ఆచరణలో పెట్టు నట్లు చూచుట వీరిపని. విశ్వవిద్యాలయాలలో విద్యార్థుల సంఖ్య తగ్గించడానికి వివిధ విద్యార్థుల అభిరుచులు, అభి మాన విషయాలు ఆకళింపు చేసికొని వారివారి శక్తి సామర్థ్యాని కనుగుణంగా ఉండగల సాంకేతిక విజ్ఞానమున కనువగు వృత్తిని స్వీకరించుట కుపరికరించునట్లు బహు ళార్థ సాధక విద్యాలయాలు పనికొస్తాయని ఆశిస్తున్నారు.

## విశ్వవిద్యాలయములు

ఆంధ్రప్రదేశ్‌లో మూడు విశ్వవిద్యాలయా లున్నాయి. ఉస్మానియా విశ్వవిద్యాలయము 1917లో స్థాపితమైంది. ఇందు అన్ని శాఖలలోను ఉర్దూభాషద్వారా 1950 వరకు బోధన జరుగుతూండినది; అటుపైని ఇంగ్లీషుభాషకు మార్చబడింది. వాల్తేరులో ఆంధ్ర విశ్వవిద్యాలయము 1926లో స్థాపించబడింది. 1954లో శ్రీ వెంకటేశ్వర విశ్వ విద్యాలయం తిరుపతిలో నెలకొల్పబడింది.

ఉస్మానియా విశ్వవిద్యాలయానికి 1959-60 లెక్కల ప్రకారం అన్ని విధములైన కళాశాలలు 39 సంబంధింప బడియున్నవి. తెలంగానా జిల్లాలు, హైదరాబాదు, సికిం దరాబాదు నగరాలు ఈ యూనివర్సిటీకి చేరియున్నవి. ఆంధ్రప్రదేశ్ నిర్మాణానికి పూర్వము ఇందు పదకొండు వందలమంది ఉపాధ్యాయులు, 21, 930 మంది విద్యార్థులు ఉండిరి. ఇప్పుడు పదమూడు వందలమంది ఉపాధ్యా యులతోను, 25,050 మంది విద్యార్థులతోను, వివిధ శాఖల తోను అలరారుచున్నది. వైద్యవిజ్ఞానమునందన్ని విధము లైన డిగ్రీలకు, డిప్లమోలకు; టెలికమ్యూనికేషన్, గ్రంథా లయ శాస్త్రము, అర్థ గణాంకము మున్నగునవన్ని శాఖలు కలవు. ఈ విశ్వవిద్యాలయములో మామూలు బి. ఏ., బి. ఎస్‌సి., ఎం. ఏ., ఎం. ఎస్‌సి., ఇత్యాది డిగ్రీలతోబాటు చదవడాని కిప్పుడు వసతులు గలవు.

ఆంధ్రవిశ్వవిద్యాలయం 1926 లో స్థాపితమైనప్పటి నుండి ఇంతవరకు దినదినాభి వృద్ధిచెందుతూ ఉన్నది. 1947 తర్వాత 12 డిగ్రీ కళాశాలలు, ఒక వైద్యకళాశాల ఈ విశ్వవిద్యాలయానికి అనుబంధంగా చేర్చబడ్డాయి. జియో ఫిజిక్స్, అణుశాస్త్రం, సంస్కృతం మున్నగు వాటిని చదవడానికి వసతులు కల్పింపబడ్డాయి.

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయమునకు సంబంధించిన కళాశాలలు 22 కలవు. మూడేండ్ల డిగ్రీతో కూడ, రెండేండ్లు పోస్టుగ్రాడ్యుయేటు కోర్సులు కూడా ఈ యూని వర్సిటీలో ఉన్నాయి. దీనికి సంబంధించిన కళాశాలలలో 799 ఉపాధ్యాయులు పని చేస్తున్నారు; 1959-60 లో చదువుతున్న విద్యార్థులసంఖ్య 9,149.

"ఇంజనీరింగు" కళాశాలలు, "పాలీ టెక్నిక్స్", "ఇండస్ట్రియల్ ట్రైనింగ్ ఇన్‌స్టిట్యూట్సు" రూపంగా సాంకేతిక విద్య చాలా అభివృద్ధికరంగా ఉందని చెప్ప వచ్చును. పూర్వము ఆంధ్రరాష్ట్రంలో ఈ మూడు విధము లైన సాంకేతిక విద్యాలయాలు మూడు వివిధ డిపార్టు మెంటుల అధికారంక్రింద ఉంటూ ఉండేవి. ఆంధ్రప్రదేశ్ అవతరణానంతరం ఇవన్నీ ఒకే "టెక్నికల్ ఎడ్యుకేషన్ డైరెక్టరు" (చూ. వృత్తి విద్య-సాంకేతిక విద్య) అధికారం క్రిందికి తేబడ్డాయి. మొత్తంమీద అన్ని విధములైన సాంకే తిక విద్యాలయాలు కలిసి 74 కలవు. ఇందు 39 ప్రభుత్వము నిర్వహిస్తూంది. ఇందు రెండు ఇంజినీరింగు కళాశాలలు, పదమూడు పాలీటెక్నిక్‌లు, రెండు మైనింగు ఇన్‌స్టిట్యూ టులు, ఒక సిరామిక్ ఇన్‌స్టిట్యూట్. తక్కినవన్నీ లలిత కళలకు, వృత్తివిద్యలకు ఉద్దేశింపబడిన సంస్థలు. ఇచ్చట తర్ఫీదు పొందినవారు చాలవరకు పరిశ్రమాభివృద్ధి గల చోట్లకు వలస పోవుచున్నారు. తక్కినవారు ఎక్కడివారు అక్కడే వివిధ వృత్తులలో జీవనోపాధి చూచుకొను చున్నారు.

మెడికల్ సర్వీసెస్ డైరెక్టరు క్రింద వైద్యవిద్యా కళాశాలలు కలవు. ఐదు వైద్య కళాశాలలు ప్రభుత్వము వారిచేతను, రెండు ప్రత్యేక యాజమాన్యముక్రింద నడుప బడుతున్నాయి. అన్ని కళాశాలలలోను ప్రతి సంవత్సరము 850 మందికి ప్రవేశము సాధ్యమగుచున్నది. ఎం. బి. బి. ఎస్. డిగ్రీలకేగాక, వైద్య విద్యకు సంబంధంగా - కంపవుండర్లు, నర్సులు; ఆరోగ్యశాఖకు కావలసిన శానిటరీ ఇన్‌స్పెక్టర్లు మున్నగు పండ్రెండు విధములైన ట్రైనింగు కోర్సులు ఈ వైద్య కళాశాలల్లో ఉన్నవి (చూ. వృత్తి విద్య-వైద్యవిద్య).

వ్యవసాయ కళాశాలలు ఆంధ్రప్రదేశ్‌లో రెండు ఉన్నవి; బాపట్లలో ఒకటి, ఉస్మానియా యూనివర్సిటీలో

మరొకటి (హైదరాబాదు); రెండిటిలోను కలిసి సుమారు ఆరు వందలమంది తర్ఫీదు పొందుతున్నారు.

పశువైద్య కళాశాల నొకదానిని బాపట్లనుండి తిరుపతికి 1957 లో తరలించినారు. 1959 నాటికి అందు చదువు చుండిన విద్యార్థులసంఖ్య 325. పశువైద్య కళాశాలకాక రెండు స్కూళ్ళుకూడ నడుపబడినాయి. విశాఖపట్టణములో స్థాపించిన స్కూలులో 230 మంది తర్ఫీదు పొందినారు. ఈ బడులలో రెండు సంవత్సరములు ట్రైనింగు పొందిన తర్వాత లైవ్‌స్టాక్ ఇన్‌స్పెక్టర్లుగ పనిచేయగల అర్హతను వీరు పొందగలరు. కేంద్రప్రభుత్వము, "ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ అగ్రికల్చరల్ రీసర్చి" వారు కలుగజేయు అవకాశాలను పురస్కరించుకొని అర్హతగల అభ్యర్థులను విదేశాలకు, మన దేశములోనే ఇతర ప్రాంతములకు ప్రత్యేక ప్రావీణ్యతను పొందుటకు పంపుతున్నారు.

కమ్యూనిటీ డెవలప్‌మెంటు శాఖవారితోకలిసి విద్యాశాఖ సాంఘిక విద్యాభివృద్ధికి సాయపడుతూంది. నిరక్షరాస్యతను నిర్మూలించడం, వయోజనులలో ఈ వరకే ఉన్న విజ్ఞానాన్ని పెంపొందించడం అనునవి రెండు సాంఘిక విద్యావిధానానికి ప్రధాన లక్ష్యాలు. వయోజనులకు రాత్రి బడులు, గ్రంథాలయాలు, సినిమాలు మున్నగునవి ముఖ్య సాధనాలుగాను, ఈ విద్య గరపడంలో ప్రత్యేక తర్ఫీదు పొందిన ఉపాధ్యాయులద్వారా ఈ లక్ష్యాలు సాధించబడుతున్నాయి.

పంచాయతీ సమితులలో సోషల్ ఎడ్యుకేషన్ ఆర్గనైజర్లద్వారా వయోజన విద్యాకేంద్రాలు, యువజన సంఘాలు, మహిళా మండలులు, ఆటపాటల సంఘాలు మున్నగు వాని ద్వారా సాంఘిక విద్యావ్యాప్తి జరుగుతూంది. 1958 లో 754 మంది యూనివర్సిటీ విద్యార్థులకు సంఘసేవలో ప్రత్యేక తర్ఫీదు ఇవ్వబడింది. హైదరాబాదులో ఆరు సంస్థలచేత పబది సాంఘిక సేవాకేంద్రాలు నడుపబడుతున్నాయి.

దోమకొండలో ఒక జనతాకాలేజి గలదు. సాంఘిక విద్యలో యువజనులకిచ్చట తర్ఫీదు యివ్వబడుతూంది. ఇప్పటివరకు 184 మంది ఇచ్చట తర్ఫీదు పొందినారు.

1959 లో వయోజన విద్యాకేంద్రాలు 1,765 ఉన్నాయి. 35,541 మంది వయోజనులు ఈ విద్యాకేంద్రాలలో చదువుకున్నారు. వయోజనులకు ప్రత్యేకంగా కొన్ని పుస్తకాలు తయారు చేయబడినాయి.

ప్రత్యేకముగా గ్రంథాలయ నిర్వహణశాఖ గ్రంథాలయాల శాసనముక్రింద ఇటీవలనే రూపొందింపబడింది. ఈ శాఖ నిర్వహణాధికారం ప్రస్తుతం విద్యాశాఖ డైరెక్టరు చేతుల్లోనే ఉంది. ప్రతి జిల్లాలో ఒక జిల్లా కేంద్ర గ్రంథాలయం, జిల్లాలో ప్రతి తాలూకాగాని పెద్ద పంచాయితీలుగాని గలచోట్ల దీనికి కొన్ని శాఖలు, రాష్ట్రమంతటికి ఒక కేంద్ర గ్రంథాలయము, గుంటూరులో ప్రాంతీయ గ్రంథాలయము ప్రస్తుతము పనిచేస్తున్నాయి. అన్ని జిల్లా కేంద్ర గ్రంథాలయాల్లో ఉన్న గ్రంథముల సంఖ్య సుమారు 8 లక్షలు. (చూ. గ్రంథాలయోద్యమము)

స్త్రీ విద్య చాల అభివృద్ధి దాయకంగానే ఉన్నది. స్త్రీ విద్యను మరింతగ ప్రోత్సాహించుటకు కేవలం చిన్నప్పుడే చదువు మానివేసి జీవనోపాధి లేకుండా నిరాధారులైన యువతీమణుల కోసం ఆరు ప్రత్యేకమైన ట్రైనింగ్ పాఠశాలలు స్థాపించబడ్డాయి. మూడేండ్లు వారిని ఈ పాఠశాలలో ఉంచి ఉపాధ్యాయినులుగ తయారు చేస్తున్నారు. ప్రతి తాలూకా కేంద్రంలో ఒక ప్రత్యేక బాలికా పాఠశాలను స్థాపించాలన్న యత్నం సాగుతూంది. స్త్రీ విద్యకు ఇంతకు పూర్వము ఉండినంత సంఘ నిరోధం ఇప్పుడు ఉండుటలేదు. 1955-56 లోను, 1960-61 లోను ప్రాథమిక, మాధ్యమిక, ఉన్నత తరగతులలో ఉండిన బాలికల సంఖ్య ఈ క్రింది పట్టిక సూచించును :

| తరగతులు | 1955 – 56 | 1960 – 61 |
|---|---|---|
| 1 నుండి 5 వరకు | 8,54,669 | 10,79,458 |
| 6 నుండి 8 వరకు | 61,152 | 81,523 |
| 9 నుండి 11 వరకు | 21,055 | 28,150 |

ప్రాథమిక పాఠశాలలలో ఉపాధ్యాయినుల నియామకముతోను, తాలూకా కేంద్రాల్లో బాలికా పాఠశాలల స్థాపనతో బాలికలసంఖ్య ఇంకను అధికము కాగలదను సూచనలున్నవి.

ప్రత్యేకంగా వెనుకబడ్డ జాతులవారికి సాలీనా సుమారు పదునైదు లక్షల రూపాయలు ఉపకార వేతనాలు (స్కాలర్‌షిప్పులు) క్రింద ఖర్చవుతూంది. దీనివల్ల సుమారు 750 మంది చదువుకోవడానికి అవకాశాలు ఏర్పడుతున్నాయి.

హరిజనులకు, గిరిజనులకు, విముక్త జాతులకు, తదితర వెనుకబడ్డ జాతులవారికి, ప్రభుత్వయాజమాన్యమునగాని ప్రత్యేకసంస్థల యాజమాన్యమునగాని, అన్నీకలిపి 527 విద్యార్థివసతి గృహములున్నవి. వీనిక్రింద సంవత్సరమునకు సుమారు 26,60,000 రూపాయలు వ్యయమవుతున్నది. అభివృద్ధి ప్రణాళికలద్వారా ఈ విద్యాభివృద్ధి పథకములు అమలు జరుగుచున్నవి.

మన్య ప్రాంతాల్లో విద్యాభివృద్ధి చాల అభివృద్ధికరంగా ఉంటూంది. ఈ ప్రాంతాల్లో పిల్లలకు పుస్తకాలు, పలకలు, బట్టలకు మాత్రం 1959-60 లో 1,70,000 రూపాయలు వెచ్చించబడింది.

వికలాంగుల విద్యాపోషణగూడ ఆంధ్రప్రదేశ్‌లో తగు మాత్రం జరిగింది. చెవిటి-గ్రుడ్డి వారికి మలకపేటలో ఒక పాఠశాలను, గ్రుడ్డివారికి కడపలోను, మూగ-చెవిటి వారికి కాకినాడలోను, గ్రుడ్డివారికి రెంటచింతలలోను, వికలాంగులకు గుంటూరులోను పాఠశాలలు గలవు. వీరిలో కొందరు యూనివర్సిటీ విద్యవరకు చదివి డిగ్రీపరీక్షలలో ఉత్తీర్ణులైనవారు కూడా కలరు.

హిందీభాష రాష్ట్రంలో తగినంత ప్రోత్సాహం పొందుతూ ఉంది. రాష్ట్రంలో ఉచిత హిందీశిక్షణ కేంద్రాలు డెబ్బది గలవు.

సంస్కృత పాఠశాలలుగూడా ప్రోత్సాహింపబడుతున్నవి. సంస్కృత కళాశాలలు 15, ఉన్నత పాఠశాలలు 13, సంస్కృతం ప్రధానంగాగల సెకండరీ పాఠశాలలు 32 గలవు (చూ. ప్రాచ్య విద్య; పుట 1428). ఇవికాక హైదరాబాదులో సంస్కృత విద్యాకౌన్సిలువారిచే తెలంగాణాలో 25 పాఠశాలలు నడుపబడుతున్నాయి. సంవత్సరమునకు సుమారు 1,10,000 రూపాయలు గ్రాంటు క్రింద ఈ సంఘానికి ప్రభుత్వం ముట్టజెపుతూంది. ఎస్. ఎం. వే. నా.

# వృత్తి విద్య

## సాంకేతిక విద్య

ఆంధ్రప్రదేశ్‌నందు మొదటి పంచవర్ష ప్రణాళిక కాలము నాటికి రెండు ఇంజనీరింగు కళాశాలలు, నాలుగు పాలీ టెక్నిక్‌లు, ఐదు పారిశ్రామిక శిక్షణా కేంద్రములు కలవు. వీటియందు మొత్తము 1,762 మందికి ప్రవేశము లభించినది.

ఆరంభమునందు ప్రత్యేక శాఖల పర్యవేక్షణ క్రింద యుండిన ఇంజనీరింగ్ కళాశాలలు, పారిశ్రామిక శిక్షణా కేంద్రములు తే. 5-6-1957 నాటినుండి 'సాంకేతిక విద్య-శిక్షణశాఖ' (డిపార్టుమెంట్ ఆఫ్ టెక్నికల్ ఎడ్యుకేషన్ అండ్ ట్రైనింగ్) అను ప్రత్యేక శాఖ అధీనము క్రిందకు తీసికొని రాబడెను. ఈ శాఖ 'అఖిల భారత సాంకేతిక విద్యాసంఘము' (ఆల్ ఇండియా కౌన్సిల్ ఫర్ టెక్నికల్ ఎడ్యుకేషన్) వారి సలహాల కనుగుణ్యముగ నూతన మార్పులు, అభివృద్ధి పథకములను సాంకేతిక విద్యావిధానములో ప్రవేశ పెట్టుచుండును. ఇది 'రాష్ట్ర సాంకేతిక విద్య శిక్షణ బోర్డు' (స్టేట్ బోర్డ్ ఆఫ్ టెక్నికల్ ఎడ్యుకేషన్) సలహాలను పరిశీలించి కొంతవరకు వాటిని కూడ అనుసరించుచుండును.

ఇంజనీరింగు కళాశాలలు: రాష్ట్రమునందు మొత్తము ఆరు ఇంజనీరింగు కళాశాలలు (వాల్తేరు, కాకినాడ; అనంతపురము, తిరుపతి; వరంగల్లు, హైదరాబాదు) గలవు. ఇవి వరుసగా ఆంధ్ర, వేంకటేశ్వర, ఉస్మానియా విశ్వవిద్యాలయముల యాజమాన్యమున నున్నవి. వీటియందు సివిల్, మెకానికల్, ఎలక్ట్రికల్, టెలి కమ్యూనికేషన్, ఇంజనీరింగు శాఖల యందు శిక్షణ ఇవ్వబడుచున్నవి.

పాలిటెక్నిక్ సంస్థలు: ఆంధ్రప్రదేశ్ నందు సాంకేతిక విద్యాశాఖ పర్యవేక్షణయందు 13 ప్రభుత్వ పాలిటెక్నిక్ సంస్థలు గలవు. వీటియందు సివిల్, మెకానికల్, ఎలక్ట్రికల్, ఆటోమొబైల్, రేడియో, టెలి కమ్యూనికేషన్, ఇంజనీరింగులందు శిక్షణ ఇవ్వబడుచున్నది. ఇవిగాక తణుకు, ప్రొద్దుటూరు, వనపర్తిలో మరి మూడు పాలిటెక్నిక్‌లు వైయక్తిక సంస్థల అధీనమున నుండి ప్రభుత్వ సహాయముతో శిక్షణ నిచ్చుచున్నవి.

మైనింగ్ కేంద్రములు: గనులకు వలయు సాంకేతిక నిపుణులను తయారు చేయు నిమిత్తము రెండు మైనింగ్ శిక్షణా కేంద్రములు స్థాపింపబడినవి: ఇవి కొత్తగూడెము, గూడూరు లందు గలవు. ప్రభుత్వ సహాయముగల ఈ కేంద్రములు 'సాంకేతిక విద్యాశాఖ' పర్యవేక్షణ క్రింద గలవు.

జూనియర్ సాంకేతిక పాఠశాలలు: కేంద్ర ప్రభుత్వ సాంకేతిక విద్యావిధానము ననుసరించి ఆంధ్రప్రదేశ్ నందు మూడు ప్రాథమిక (జూనియర్) సాంకేతిక పాఠశాలలు నెలకొల్పబడినవి. మాధ్యమిక విద్యానంతరము సాంకేతిక శిక్షణ లభింపజేసి పరిశ్రమలయందు నిపుణ కార్మికులుగాను, అప్రెంటిస్‌లుగాను చేరుటకు వీలుగలుగ జేయుటయే వీని ముఖ్యోద్దేశము. ఈ పాఠశాలలయందు శిక్షణాకాలము 3 సంవత్సరములు. ప్రవేశార్హత 8 వ తరగతియందు ఉత్తీర్ణులగుట. ఈ మూడు పాఠశాలలును 1960 లో సికిందరాబాదు, కాకినాడ, తిరుపతియందు నెలకొల్పబడినవి. వీటియందు ఉత్తీర్ణులైన విద్యార్థులకు నేరుగా పాలిటెక్నిక్‌లందు ప్రవేశము లభించును లేదా ఆయా పరిశ్రమలందు నిపుణ కార్మికులుగా ప్రవేశించవచ్చును.

వృత్తివిద్యా శిక్షణ (ఒకేషనల్ ట్రైనింగ్): సాంకేతిక విద్యాశాఖ అధీనమున తొమ్మిది పారిశ్రామిక శిక్షణా కేంద్రములు గలవు; ఈ కేంద్రములలో క్రిందిశాఖలయందు శిక్షణ లభించును.

1. ఇంజనీరింగ్ వృత్తులు: డ్రాఫ్ట్స్‌మాన్ (సివిల్, మెకానికల్), ఎలక్ట్రీషియన్స్, ఇన్‌స్ట్రుమెంట్ మెకానిక్, రేడియో మెకానిక్, సర్వేయింగ్, కమ్మరము, భవన నిర్మాణము, వడ్రంగము, ఎలెక్ట్రో ప్లేటింగ్, ఫిట్టింగ్, మౌల్డర్, వైర్‌మన్, లైన్‌మన్, పేటర్న్‌మేకర, షీట్ మెటల్ వర్కర్, ప్లంబర్, టర్నర్, వెల్డర్.

2. ఇతర వృత్తులు: కట్టింగ్ - టైలరింగ్ దర్జీపని, పాదరక్షలు చేయుట, పేము అల్లుట, వస్త్రములు నేయుట.

శిక్షణ పథకములు (అప్రెంటిస్‌షిప్): పారిశ్రామిక శిక్షణ కేంద్రములనుండి శిక్షణ నొందినవారి సంఖ్య మిగుల తక్కువగుటచే పరిశ్రమలకు కావలసిన అదనపు సాంకేతిక వర్గమును తయారు చేయుటకుగాను ఈ పథకములు ప్రవేశ పెట్టబడినవి. తొమ్మిదవ తరగతియందు ఉత్తీర్ణ లయిన విద్యార్థులకు ఈ పథకము క్రింద హిందుస్థాన్ షిప్‌యార్డ్ (విశాఖపట్టణము) నందు రెండు మొదలు, మూడు సంవత్సరములవరకు శిక్షణ ఇవ్వబడును. ఈ విధముగ పారిశ్రామిక సంస్థలకు కావలసిన అదనపు సాంకేతిక వర్గము చేకూర్చబడుచున్నది.

పైన పేర్కొన్నవిగాక టైప్‌రైటింగ్ (ఇంగ్లీషు, తెలుగు), షార్ట్‌హాండ్ (ఇంగ్లీషు, తెలుగు), అకౌంటెన్సీ, కమర్షియల్ ప్రాక్టీస్, బ్యాంకింగ్ మున్నగువాటిని గరపు 175 సంస్థలు రాష్ట్రమునందు గలవు. ఇవిగాక ప్రభుత్వామోదమును పొందని సంస్థ లనేకములు కలవు.

సాంకేతిక విద్యాశాఖ - నూతన పథకములు: ఆంధ్ర, తెలంగానా ప్రాంతములందు సాంకేతిక విద్యాభి వృద్ధికి ఈ క్రింది నూతన పథకములు వేయబడినవి:

## ఆంధ్రప్రాంతము

1. కాకినాడ, అనంతపురము ఇంజనీరింగు కళాశాలలందు పోస్ట్‌గ్రాడ్యుయేట్ కోర్సులు ప్రవేశ పెట్టుట;
2. శ్రీకాకుళము నందొక పాలిటెక్నిక్ నెలకొల్పుట;
3. ప్రాథమిక సాంకేతిక పాఠశాలలు నెలకొల్పుట;
4. ఐదు పారిశ్రామిక శిక్షణ కేంద్రములను వరుసగా - గుంటూరు, చిత్తూరు, ఏలూరు, కడప, శ్రీకాకుళము యందు నెలకొల్పుట;
5. పారిశ్రామిక శిక్షణ కేంద్రములకు వసతి గృహములు కట్టించుట;
6. బాలికలకై రెండు పాలిటెక్నిక్‌లు నెలకొల్పుట;

## తెలంగానా

1. బాలికలకై రెండు పాలిటెక్నిక్‌లు నెలకొల్పుట;
2. ప్రభుత్వ వాస్తు శిల్పవిద్యా పాఠశాలలను నెలకొల్పుట;
3. ప్రాథమిక సాంకేతిక పాఠశాలలను నెలకొల్పుట;
4. మూడు పారిశ్రామిక శిక్షణకేంద్రములను కరీంనగరము, ఖమ్మం, మహబూబునగరములందు నిర్మించుట;
5. హైదరాబాదు 'గృహ నిర్వహణ విజ్ఞాన శిక్షణ కళాశాల' (డొమెస్టిక్ సైన్సు ట్రైనింగ్ కళాశాల)ను డిగ్రీ కళాశాలగ మార్చుట;
6. హైదరాబాదు నందుగల ప్రభుత్వ సంగీత, నాట్య పాఠశాలను కళాశాలగ చేయుట;
7. పారిశ్రామిక శిక్షణకేంద్ర విద్యార్థులకు వసతి గృహముల నిర్మించుట.

మూడవ పంచవర్ష ప్రణాళికయందు ఇంజనీరింగు కళాశాల ఒకటి, 4 పాలిటెక్నిక్‌లు, 4 పారిశ్రామిక శిక్షణ కేంద్రములు నెలకొల్పబడును.

మొదటి పంచవర్ష ప్రణాళిక (1951-56) అంత్యమునకు ఆంధ్ర, తెలంగానా ప్రాంతములలో నెలకొల్పబడిన సంస్థల వివరములు క్రింద ఇవ్వబడినవి:

| | ఆంధ్ర | | తెలంగానా | | మొత్తము | |
|---|---|---|---|---|---|---|
| | సంస్థలు | సీట్లు | సంస్థలు | సీట్లు | సంస్థలు | సీట్లు |
| ఇంజనీరింగు డిగ్రీ కళాశాలలు | 2 | 190 | — | — | 2 | 190 |
| పాలిటెక్నిక్‌లు [డిప్లొమా] | 2 | 260 | 2 | 200 | 4 | 460 |
| పారిశ్రామిక శిక్షణ కేంద్రములు [సర్టిఫికేట్] | 3 | 664 | 2 | 448 | 5 | 1112 |

రెండవ పంచవర్ష ప్రణాళికా (1956-61) కాలములో సంస్థల సంఖ్య యందు సీట్ల సంఖ్యయందు (ఇన్‌టేక్ కేపాసిటీ) జరిగిన విస్తృతి దిగువ తీరున నున్నది:

| | ఆంధ్ర | | తెలంగానా | | మొత్తము | |
|---|---|---|---|---|---|---|
| | సంస్థలు | సీట్లు | సంస్థలు | సీట్లు | సంస్థలు | సీట్లు |
| డిగ్రీ; | | | | | | |
| 1. ఇంజనీరింగు కళాశాలలు | — | — | 1 | 250 | 1 | 250 |
| 2. ఉన్నత కళాశాల లందు విస్తృతి-క్రొత్తకోర్సులు | 2 | 80 | — | — | 2 | 80 |

| | ఆంధ్ర | | తెలంగాణా | | మొత్తము | |
|---|---|---|---|---|---|---|
| | సంస్థలు | సీట్లు | సంస్థలు | సీట్లు | సంస్థలు | సీట్లు |
| అ. డిప్లొమా : | | | | | | |
| 1. పాలిటెక్నిక్‌లు | 8 | 960 | 4 | 480 | 12 | 1440 |
| 2. మైనింగ్ సంస్థలు | 1 | 40 | 1 | 40 | 2 | 80 |
| 3. పాలిటెక్నిక్‌ల విస్తృతి | 2 | 140 | 2 | 190 | 4 | 330 |
| ఆ. సర్టిఫికేటు కోర్సులు : | | | | | | |
| 1. పారిశ్రామిక శిక్షణ కేంద్రములు | 2 | 480 | 1 | 248 | 3 | 728 |
| 2. ఉన్నత కేంద్రము లందు విస్తృతి | 4 | 660 | 3 | 624 | 7 | 1284 |
| | | | | | | 4,192 |

పైన పేర్కొన్నవిగాక రెండు సంగీత, నాట్య పాఠశాలలు సికిందరాబాదు, విజయవాడలయందు ప్రారంభింపబడినవి.

పై పట్టికను నిశితముగ పరీక్షించిన మొత్తము 1 ఇంజనీరింగ్ కళాశాల, 12 పాలిటెక్నిక్‌లు, 2 మైనింగ్ సంస్థలు, 3 పారిశ్రామిక శిక్షణ కేంద్రములు, 2 సంగీత నాట్య పాఠశాలలు సాంకేతిక విద్యాశాఖచే రెండవ పంచవర్ష ప్రణాళిక కాలములో నెలకొల్పబడినట్లు తెలియుచున్నది.

మొదటి ప్రణాళిక కాలముననున్న సీట్లకంటెను రెండవ ప్రణాళికా కాలములో సీట్లసంఖ్య అదనముగ డిగ్రీ కోర్సులందు 330, డిప్లొమాస్థాయిలో 1,850, సర్టిఫికేట్ స్థాయిలో 2,012 వరకు పెరిగినవి.

రెండవ పంచవర్ష ప్రణాళికా కాలములో సాంకేతిక విద్యకై కేటాయించబడిన మొత్తము రు. 216·32 లక్షలు. ఇందు కేంద్రప్రభుత్వ సహాయము, ప్రణాళికలు చేర్చబడలేదు. అవికూడ చేర్చిన రెండవ ప్రణాళికా కాలములో సాంకేతిక విద్య నిమిత్తము వెచ్చింపబడిన మొత్తము రు. 365·25 లక్షలు. సి. వి. డి. మూ.

## వైద్య విద్య

**ఆధునిక వైద్య విద్యావ్యాప్తి :** ఈస్టిండియా కంపెనీ వారు పాశ్చాత్య వైద్యములో భారతీయులను తర్ఫీదుచేయుటకు 1835 లో మద్రాసులో ఒక వైద్య పాఠశాలను స్థాపించిరి. అది క్రమముగా 1850 నాటికి వైద్య కళాశాలగా అభివృద్ధి పొందెను. అందు సక్రమ శిక్షణ నొందిన వైద్యులే ఆంధ్ర దేశము నందు జిల్లా ఆసుపత్రులలో సహాయ వైద్యులుగాను, తాలూకా ఆసుపత్రులలో వైద్యులుగాను ఉద్యోగములను పొందు చుండిరి. 1870 ప్రాంతములో ధాతు కరువు, తరువాత వెల్లువలు, మశూచి, మహామారి మొదలగు సాంక్రామిక రోగములు ప్రకోపించి, ఆరోగ్య క్షీణము, ప్రాణ నష్టము కలిగించు చుండగా దక్షిణ భారత దేశమున అక్కడక్కడ అవసరము కొద్ది కొన్ని ముఖ్య కేంద్రములలో వైద్యపాఠశాలలు నెలకొల్పబడెను. అట్టి వానిలో ఆంధ్ర దేశమున నెల్లూరులో ఒకటి స్థాపింపబడెను. ఆ వైద్యశాలలో శిక్షణనొంది ఆంధ్ర దేశమంతటను చాల ఆసుపత్రులలో డ్రెస్సర్ ఉద్యోగము చేసి పేరుప్రతిష్ఠలు సంపాదించిన వారనేకులు కలరు. కొన్ని సంవత్సరముల తరువాత ఆ పాఠశాలను మూసివేసిరి. మద్రాసు వైద్యశాలలో మాత్రము అన్ని తరగతుల వైద్యులు తరిఫీదు పొందు చుండిరి. ఈ శతాబ్దారంభమున మరల వైద్యుల అవసరము రాగా అట్టి వైద్య పాఠశాల ఒకటి 1902 లో విశాఖపట్టణమున స్థాపింప బడెను. అయితే 1922 వరకు, ఆంధ్ర దేశమున ఉన్నత వైద్య విద్యనొసగు వైద్య కళాశాలయే లేకుండెను. ఆంధ్ర యువకులు మద్రాసుకు వెళ్ళి అచ్చటి వైద్య కళాశాలలో వైద్యము అభ్యసింప వలసి ఉండెను. ఆంధ్ర యువకులు ఉన్నత విద్య అభ్యసింపలేక యుండిరి. ఇందలి కష్ట నష్టములను గమనించి మాంట్‌ఫార్డ్ సంస్కరణలు అమలులోనికి వచ్చినప్పుడు మొదటి మంత్రి వర్గములో మద్రాసు ప్రభుత్వము ప్రధాన మంత్రిగా నుండిన రాజా పానుగంటి రామారాయణింగారు ఆంధ్రులగుట వలన, విశాఖపట్టణమున 1922 లో అచ్చటి వైద్య పాఠశాలను కళాశాలగా మార్చుటకు వలయు అనుమతులను, ఆజ్ఞలను, ఒసగి ఆంధ్రులకొక వైద్య కళాశాలను, దానికి వలయు జనరల్ ఆసుపత్రి మొదలగు వసతులను వ్యవస్థాపించిరి. మొదట 50 మందిని చేర్చుకొనుటకు ఏర్పాటు చేయబడెను. అప్పటి నుండి ఆంధ్ర దేశమున అన్ని మండలములలోను, అన్ని వర్ణములలోను ఉత్తమ వైద్య విద్య నార్జించుటకు యువకులలో, యువతులలో అభిలాష హెచ్చినది; ఇప్పుడు ఆంధ్ర దేశమున పల్లె పల్లెల నుండు వైద్యులు, వైద్య సౌకర్యములు ఈ విశాఖపట్టణ వైద్య కళాశాల ఫలితములే. 1930 ప్రాంతములో మరల పానుగంటి రామారాయణిం గారి దూరదృష్టి వలన గుంటూరులో స్త్రీలకు ప్రత్యేకముగ ఒక వైద్య పాఠశాల పెట్ట వలెనని నిర్ణయింపబడి అందుకు తగిన ఆసుపత్రి, పాఠశాల భవనములు కట్టబడెను. ఇంతలో రాజకీయ వాతావరణమున మార్పు కలిగినందున పాఠశాలా స్థాపన ఆగిపోయెను. 1939 లో ఒకే తరగతి వైద్య విద్య, వైద్యులు ఉండవలెనని మధ్య తరగతి వైద్య పాఠశాలలే పనికి రావన్న అభిప్రాయములు దేశములో పొడసూపినందున ఉన్న వైద్య పాఠశాలలను

మూసి వేసిరి. గుంటూరు భవనములు ఇతర ప్రభుత్వ కార్యాలయములకు ఇవ్వబడెను.

యుద్ధానంతరము 1945 మద్రాసు రాష్ట్రములో కాంగ్రెసు పక్షము ప్రభుత్వాధ్వర్యవమున ఆంధ్ర దేశములో రెండవ వైద్య కళాశాల స్థాపితమయ్యెను. అప్పటి నుండి, ప్రతి సంవత్సరము విశాఖపట్టణములో 55 మంది, గుంటూరులో 50 మందియు వైద్య విద్యార్థులు చేర్చుకొనబడుచుండిరి. ఇందు 20% విద్యార్థినులకు స్థానములు కలవు.

1956 లో ఆంధ్ర ప్రదేశ్ స్థాపనతో హైదరాబాదులోని ఉస్మానియా మెడికల్ కాలేజీ, గాంధి మెడికల్ కాలేజీ కలిసి నాలుగు వైద్య కళాశాల లయ్యెను. తరువాత ఆంధ్ర ప్రభుత్వము వారు కర్నూలులో ఒక వైద్య కళాశాలను, తిరుపతిలో ఒక వైద్య కళాశాలను స్థాపించిరి. ఇంతేకాక వైయక్తిక సంస్థలచే కాకినాడలో ఒకటియు వరంగల్లులో ఒకటియును స్థాపింపబడెను. ఇప్పుడు ఆంధ్ర ప్రదేశ్‌లో మొత్తము మీద 8 వైద్య కళాశాలలు కలవు.

ఇటీవల వైద్య కళాశాలలయు, వానికి అనుబంధితములగు వైద్యశాలలయు అభివృద్ధి కార్యక్రమము నిరాటంకముగ పురోగమించినది. అదివరకే స్థాపితములై పని చేయుచున్న వైద్య కళాశాలల యందు విద్యార్థుల ప్రవేశము 260 నుండి 340 వరకు పెంచబడినవి. ఈ విధముగ రాష్ట్రమున ఉన్న 8 వైద్య కళాశాలలలోను 840 మంది విద్యార్థులకు ప్రవేశ వసతులు (సీట్లు) కలవు; వాని వివరములు దిగువ ఈయబడినవి.

| ప్రభుత్వ వైద్యకళాశాలలు | సీట్లు |
|---|---|
| 1. ఉస్మానియా వైద్య కళాశాల, హైదరాబాదు | 125 |
| 2. గాంధి ,, ,, | 90 |
| 3. ఆంధ్రవైద్య కళాశాల, విశాఖపట్టణము | 125 |
| 4. కర్నూలు ,, కర్నూలు | 100 |
| 5. గుంటూరు ,, గుంటూరు | 150 |
| 6. శ్రీ వేంకటేశ్వర ,, తిరుపతి | 50 |
| వైయక్తిక సంస్థల వైద్య కళాశాలలు | |
| 7. యస్. ఆర్. యం. వైద్యకళాశాల, కాకినాడ | 100 |
| 8. ప్రాదేశిక (రీజినల్) వైద్యకళాశాల, వరంగల్లు | 100 |
| మొత్తము | 840 |

భౌగోళిక రీత్యా చూచినను ఆంధ్రప్రదేశ్‌నందలి ఈ ఎనిమిది వైద్య కళాశాలలును తగు రీతిగ ఆయా ప్రాంతముల కనుకూలముగ కుదిరి ఉన్నవి. విశాఖపట్టణము నందలి ఆంధ్ర వైద్య కళాశాలయందలి రోగ నిదాన శాఖయు, ఉస్మానియా వైద్య కళాశాలయందలి వైద్యక చారిత్ర శాఖయు ఉత్తమ శ్రేణివిగా పరిగణింపబడినవి. ఆయా వైద్యకళాశాల లందు బోధన, పరిశోధనలను అభివృద్ధి చేయు ఉద్దేశముతో చికిత్స శల్యచికిత్స, రోగనిదాన, మర్మేంద్రియ చికిత్స, ప్రసూతి చికిత్స విజ్ఞానములందు సార్వసమయిక అధ్యాపక వర్గమును నియమించుటకు ప్రభుత్వమువారు తమ ఆమోదము నొసగిరి. డి. వి. సు. రె.

# విశ్వ విద్యాలయ విద్య

## ఆంధ్ర విశ్వ విద్యాలయము

ప్రత్యేక రాష్ట్రము కొరకు కాందోళనము చేయుచుండిన ఆంధ్రుల ఆశయ సిద్ధికి నాందిగ 1920 లో మద్రాసు విశ్వ విద్యాలయము సెనేటు సభ మద్రాసు రాజధానిలోని ప్రతి భాషా ప్రాంతమునకు ఒక విశ్వవిద్యాలయము యొక్క ఆవశ్యకము నుద్ఘాటించుచు, ప్రత్యేకముగ ఆంధ్ర ప్రాంతమునకు విశ్వవిద్యాలయము సత్వరముగ స్థాపింపవలెనని తీర్మానించెను. కొన్ని సంఘము లేర్పడి ఈ విషయమును గురించి చర్చించి శ్రీ సి. ఆర్. రెడ్డి, ఆర్. ఎమ్. స్టాథమ్ నివేదికలు సమర్పించిన పిదప మద్రాసు శాసనసభలో ఆనాటి విద్యా మంత్రి సర్ ఏ. పి పాత్రో ప్రవేశపెట్టిన ఆంధ్ర విశ్వవిద్యాలయపుబిల్లు చట్టమై, 1926 జనవరి 26 వ తేదిని అమలులోనికి వచ్చి ఆంధ్ర విశ్వ విద్యాలయము ఏర్పాటు చేయబడెను. దీనికి మొదటి ఛాన్సెలరు గోషన్ ప్రభువు; ప్రో-ఛాన్సెలరు బొబ్బిలి మహారాజా, మొదటి వైస్ ఛాన్సెలరు (ఉపాధ్యక్షులు) శ్రీ సి. ఆర్. రెడ్డి. గంజాము, విశాఖపట్టణము, తూర్పుగోదావరి, పడమటి గోదావరి, కృష్ణ, గుంటూరు, నెల్లూరు, బళ్ళారి, అనంతపురము, కడప, కర్నూలు, చిత్తూరు జిల్లాలు ఈ చట్టము క్రిందికి వచ్చినవి. ఎన్నికలైన పిదప మొదటి సెనేటు సమావేశము విజయవాడ మ్యూజియము హాలులో 1926 లో జరిగెను. క్రొత్త విశ్వవిద్యాలయ స్నాతకోత్సవము 1927 డిసెంబరులో జరిగినది. డా॥ సర్వేపల్లి రాధాకృష్ణ మొట్ట మొదటి స్నాతకోపన్యాసము నిచ్చిరి.

బి. ఏ. ఆనర్సు, పోస్ట్ గ్రాడ్యుయేట్ బోధన తరగతులు విశ్వవిద్యాలయ కేంద్రమునందును, ఇంటర్మీడియేట్, మిగిలిన డిగ్రి తరగతులు అనుబంధ కళాశాలలలోను ఉండునట్లు

1929 లో నిర్ణయింపబడినది. ఆ నిర్ణయముతో పాటు విశాఖ పట్టణమును విశ్వవిద్యాలయ ప్రధాన కార్యస్థానముగకూడ నిశ్చయింపబడెను. విశ్వవిద్యాలయపు సవరణ చట్టము 1929 లో గవర్నరు జనరలు ఆమోదమును పొందిన పిదప విశ్వవిద్యాలయ కార్యాలయము 1930 నుండి విశాఖ పట్టణము దగ్గరి వాల్తేరులో పని ప్రారంభించెను. మద్రాసు ప్రభుత్వము మరొక చట్టము క్రింద ఈ విశ్వవిద్యాలయమునకు రు. 27 లక్షల నాన్-రికరింగ్ గ్రాంటును, రు. $7\frac{1}{2}$ లక్షలు భవన నిర్మాణ మునకును, సాధారణ వ్యయము నిమిత్తము సంవత్సరమునకు ఒక లక్ష ఏబది వేలు విరాళములను ఇచ్చి ఆర్థిక బలమును చేకూర్చెను.

సహాయ నిరాకరణోద్యమ దినములలో, శ్రీ సి. ఆర్. రెడ్డి ప్రభుత్వ నిర్బంధ విధానమునకు అసమ్మతి సూచకముగ మొదటినుండి యున్న తమ ఉపాధ్యక్ష పదవికి రాజీనామా నొసగిరి. వారి స్థానమున ఆచార్య సర్వేపల్లి రాధాకృష్ణ నియమితులై 1931 మేలో తమ పదవి నలంకరించిరి. జూలైనుండి తెలుగు, చరిత్ర, ఆర్థికశాస్త్రము, రాజకీయ శాస్త్రము ఆనర్సు తరగతులలో విశ్వవిద్యాలయపు ఆర్ట్సు కళాశాల ప్రారంభమైనది. 1932 లో సైన్సు, టెక్నాలజీ కళాశాల నెలకొల్పబడినది. ఆర్ట్సు కళాశాలలో తత్త్వశాస్త్ర, గణిత శాస్త్రపు తరగతులారంభ మైనవి. 1932-34 లో భౌతిక, రసాయన శాస్త్రములలోను, వాణిజ్యములోను ఆనర్సు తరగతులారంభమయ్యెను. 1933-34 ఆర్ట్సు కళాశాల, సైన్సు, టెక్నాలజీ కళాశాల, విద్యార్థుల వసతి గృహములు, పవర్ హౌసు మొదలగు భవనముల నిర్మాణము పూర్తియైనది. 1933-34 లో జయపురము మహారాజు శ్రీ విక్రమదేవవర్మ విశ్వవిద్యాలయమునకు రు. 50 వేలును, 1934-35 లో రు. 75 వేలును, ఆ తరువాతి నుండి సంవత్సరమున కొక లక్ష చొప్పునను విరాళ మిచ్చుచు వచ్చిరి. ఇందుకు కృతజ్ఞతా సూచకముగ విశ్వవిద్యాలయము వారు శాస్త్ర (సైన్సు) కళాశాలకు జయపురము విక్రమదేవవర్మ శాస్త్ర కళాశాలయని పునర్నామకరణము కావించిరి. 1933 లో టెక్నాలజీ బి. యస్. సి. ఆనర్సు తరగతులును, బి.కామ్., బి.కామ్. (ఆనర్సు) తరగతులును ప్రారంభమైనవి. 1934 లో లైబ్రేరియన్ పదవికి డిప్లొమా కోర్సు కూడ ప్రారంభమైనది.

శ్రీ రాధాకృష్ణ 1936 లో తమ ఉపాధ్యక్ష పదవికి రాజీనామా నీయగా ఆ పదవికి శ్రీ కట్టమంచి రామలింగా రెడ్డి మరల నెన్నుకొనబడిరి. 1937 లో జయపురము మహారాజా ప్రో-ఛాన్సెలరు పదవి నలంకరించిరి. వీ రిరువురి పరిపాలన కాలము 12 సం॥ల లోను విశ్వవిద్యాలయము చాల అభివృద్ధిని గాంచినది. కాని ఈ కాలమున అనంతపురము, బళ్ళారి, కడప, కర్నూలు, చిత్తూరులలోని కళాశాలలు ఈ విశ్వవిద్యాలయమునుండి విడిపోవుట చేత కొంత నష్టపడెను. ఐనను ఆంధ్ర దేశములో కొన్ని క్రొత్త కళాశాలలు స్థాపితమై దీని కనుబంధములుగ చేరుటచేతను, అదివరకున్న కళాశాలలు కొన్ని ప్రథమ శ్రేణి కళాశాలలుగా పెంపొందుట చేతను, మరి కొన్నిటిలో క్రొత్త పాఠ్య విషయములను బోధించు తరగతు లేర్పడుట వలనను ఆ నష్టము చాల వరకు భర్తీయైనట్లు చెప్పవచ్చును. దేశములో ఆంధ్ర విశ్వవిద్యాలయము ఎడ శ్రద్ధాసక్తులు హెచ్చినవి. ప్రభుత్వ మొసగిన విరాళముతో 'ఎర్స్కిన్ కాలేజి ఆఫ్ నాచురల్ సయన్సెస్' (ఎరిస్కిన్ ప్రకృతి శాస్త్ర కళాశాల) 1941 లో స్థాపితమైనది. ప్రారంభమున భూతత్త్వ శాస్త్రములో 'ప్యాస్' డిగ్రీ తరగతులను పెట్టిరి.

ద్వితీయ ప్రపంచ సంగ్రామ కాలము విశ్వవిద్యాలయమునకు చాల కష్ట సమయమైనది. 1942 ఏప్రిల్ 6 వ తేదీని జపాను కాకినాడ, విశాఖపట్టణములపై విమానదాడులు జరిపిన కారణమున విశ్వవిద్యాలయము గుంటూరుకు తరలిపోవలసివచ్చినది. మద్రాసు విశ్వవిద్యాలయము ప్రెసిడెన్సీ కాలేజి వారి సహకారముచే ఆంధ్ర విశ్వవిద్యాలయ రసాయన శాస్త్ర శాఖ మద్రాసులోనే కార్య కలాపములను సాగించెను. అట్టి యసాధారణ క్లిష్ట పరిస్థితులలో కూడ విశ్వవిద్యాలయ పురోగతికి కుంటుపడ లేదు. 1943-44 లో ఈ క్రొత్త తరగతుల (కోర్సుల) లో శిక్షణ నారంభించిరి: (1) ఆర్థిక శాస్త్రమున ప్రత్యేకపు ఆనర్స్ తరగతులు; (2) గణిత-భౌతిక శాస్త్రమున (మేథమేటికల్ ఫిజిక్స్) ఆనర్స్, ఎమ్. ఎస్‌సి. కోర్సులు; (3) సాంకేతిక శాస్త్రము (టెక్నాలజీ) న కెమికల్ ఇంజనీరింగు కోర్సు; (4) ఎమ్. ఏ. (ఆనర్స్), ఎమ్.కామ్. పట్టములకు సంబంధించిన తరగతులు. 1945 జూలై నుండి ఈ క్రింది తరగతులు ప్రారంభింపబడినవి: (1) ఆంగ్ల భాషా సారస్వతమున బి. ఏ. (ఆనర్స్); (2) వృక్ష శాస్త్రము (బాటనీ) బి. ఎస్‌సి., (ఆనర్స్); (3) *న్యాయశాస్త్రము (లా)న ప్రిలిమినరీ, ఎఫ్. ఎల్., బి. ఎల్., కోర్సులు.

ప్రపంచ సంగ్రామము 1945 తో సమాప్తి నొందినమీదట తిరిగి విశ్వవిద్యాలయ కేంద్రమును వాల్తేరుకు 1946 లో మార్చిరి. విశ్వవిద్యాలయ ఆవరణ (కాంపస్) లో యుద్ధ

*లా కాలేజి [న్యాయశాస్త్ర కళాశాల] తాత్కాలికముగ మచిలీపట్టణమున నెలకొల్పబడినది.

శాఖవారు నిర్మించుకొన్న కొన్ని కట్టడములను విశ్వవిద్యాలయము వారు తమ విద్యార్థుల, ఆచార్యుల వసతి గృహములుగ (హాస్టల్సు) మార్చిరి. క్రమముగా పట్టభద్రుల సంఖ్య పెరుగుచుండుటచేత 'కాన్వొకేషన్ థియేటర్' (స్నాతక పట్టప్రదానోత్సవ మందిరము) అత్యవసరమైనది. 'ఉత్సవ రంగ' మను పేరిట అట్టి థియేటరును నిర్మించుటకు గవర్నమెంటువారు రు. 2½ లక్షలును, హైదరాబాదు నిజాముబారు రెండు లక్షలును మంజూరు చేసిరి.

1949 వ సంవత్సరాంత మందు డాక్టర్ కట్టమంచి రామలింగారెడ్డి మైసూరు విశ్వవిద్యాలయపు ప్రో-ఛాన్సెలర్ పదవిని స్వీకరించుటకై ఆంధ్ర విశ్వవిద్యాలయోపాధ్యక్ష పదవికి రాజీనామా నిచ్చిరి. వారికి బదులుగ డాక్టర్ వాసిరెడ్డి శ్రీకృష్ణ 1949 లో ఆ పదవికి అక్టోబరులో ఎన్నుకొనబడి డిసెంబరులో పదవీ స్వీకారమును కావించిరి. ప్రో-ఛాన్సెలర్ శ్రీ జయపురము మహారాజు 1951 లో దివంగతు లగుటవలన ఆ పదవికి డాక్టరు బెజవాడ గోపాలరెడ్డి నియమితులైరి.

డాక్టర్ వి. యస్. కృష్ణ పరిపాలనమునందు విశ్వవిద్యాలయ మింకను సర్వతోముఖాభివృద్ధి నొందినది. 1950 లో ప్రభుత్వము విశ్వవిద్యాలయమున వాతావరణ శాస్త్ర శాఖ నెలకొల్పుటకు భవనము, పరికరముల నిమిత్తము 8 లక్షల రూపాయలు 'నాన్-రికరింగు' విరాళమును, సంవత్సరమునకు రు. 42,400 'రికరింగ్' విరాళమును ఇచ్చిరి. కేంద్ర ప్రభుత్వము ఫార్మసీ శాఖకు రు. 3,10,000 లు 'కెమికల్ టెక్నాలజీ' శాఖకు రు. 4,60,000 లు విరాళముగ ఇచ్చెను. ఇవి కాక 'జియో-ఫిజిక్సు' (భూ-భౌతిక శాస్త్రము) లో పరిశోధనకు రు. 3 లక్షలును, భౌతిక, రసాయన, భూతత్త్వ శాస్త్రశాఖల విషయములో విశ్వవిద్యాలయము వారి ప్రణాళికలు అమలు జరపుటకై రు. 2 లక్షలును, టెక్నాలజీ (సాంకేతిక శాస్త్ర)శాఖకు 40,000 లు 'రికరింగ్' విరాళమును, మరియు వివిధ శాస్త్రశాఖలకు పది 'రీసర్చి స్కాలరుషిప్పు' లును మంజూరు చేసెను. అమిత వ్యయముతో గూడిన తరగతులు వాతావరణ శాస్త్రము (మీటియరాలజీ), సముద్ర గర్భవిషయకశాస్త్రము (ఓషియానోగ్రఫీ), వాయుతత్త్వ శాస్త్రము (అట్మాస్ఫెరిక్స్) లను 1948 జూలైనుండి శాస్త్ర కళాశాలలో ప్రారంభించిరి.

1951 నాటికి విశ్వ విద్యాలయము ఇరువదియైదు సంవత్సరముల జీవితమును గడపుటచేత నది రజతోత్సవము జరుపుకొన దలచినది. ఈ యుత్సవము జరుగుటలో కొంత యాలస్యమైనను 1953 లో అది వైభవముగ జరగినది. ఈ విశ్వవిద్యాలయము రజతోత్సవము జరపుకొనిన కొలది కాలముననే రెండు మహాత్కార్యములు జరిగినవి: 1. ఆంధ్రుల చిరకాల వాంఛితమైన ఆంధ్ర రాష్ట్రము 1953 నవంబరు 1 వ తేదిని అవతరించుట; 2. విశ్వ విద్యాలయపు గ్రాంట్స్ కమీషను ఏర్పడుట. ఈ రెండు సంస్థల ధర్మమా యని ఆంధ్ర విశ్వ విద్యాలయపు రాబడి పెరుగుటంజేసి అభివృద్ధికి పెక్కు పథకములకు వీలు కలిగెను.

1955-56 లో ప్రొఫెసర్ ఐ. సి. లాఫాండ్ అను అమెరికన్ సముద్ర గర్భ విషయిక శాస్త్ర వేత్త 'ఫుల్ బ్రైట్' ప్రొఫెసర్‌గా ఈ విశ్వ విద్యాలయమునకు విచ్చేసి 'జియో ఫిజిక్స్' శాఖలో పరిశోధనలు ప్రారంభించెను. ఆయన నాయకత్త్వమున తూర్పు తీరము వెంబడి సముద్ర గర్భమును శోధించి, దానికి సంబంధించిన జంతు, భూతత్త్వ, భౌతిక శాస్త్ర విషయములందు పరిశోధనలు జరగుచున్నవి. ఆయన ప్రారంభించిన పరిశోధనల నిప్పుడు ఆయా సంబంధ శాఖలు చురుకుగ కొనసాగించుచున్నవి. ఇదిగాక విశ్వవిద్యాలయ ముఖ్య ప్రణాళికలలో నొకమైన అణు భౌతిక శాస్త్రము (న్యూక్లియర్ ఫిజిక్స్) నందు పరిశోధన ఆచార్య జ్ఞానానంద స్వామి వారి పర్యవేక్షణను ప్రారంభమై 1956-57 లో అది యొక ప్రత్యేక బోధన శాఖగా ఏర్పడినది. ఇప్పుడు అణు భౌతిక శాస్త్రము నందు ఎమ్. ఎస్. సి. డిగ్రీ కోర్సు నడుపబడు చున్నది.

1955-56 లలో ఈ విశ్వ విద్యాలయమున క్రొత్తగా ఇంజనీరింగ్ శాఖ ఏర్పాటయినది. ఇందు సివిల్, మెకానికల్, ఎలెక్ట్రికల్ కోర్సులు ఏర్పాటైనవి. 1956-57 లో క్రొతగా సంస్కృతమున ఆనర్స్, పోస్ట్ గ్రాడ్యుయేట్ కోర్సులు ప్రారంభింప బడినవి.

1956-57 నుండి ఆంధ్ర విశ్వ విద్యాలయమున ఒక సరిక్రొత్త ఆరబయలు రంగస్థలము (ఓపెన్ ఎయిర్ థియేటర్) నిర్మితమైనది. దీనికి కారకులు, నిర్మాత విశ్వ విద్యాలయపు రిజిస్ట్రారైన శ్రీ కూర్మా వేణుగోపాల స్వామి. ఇది వీరు నాటక కళయందు చేసిన ప్రత్యేక కృషి ఫలితము. ఇందలి కళానైపుణి చూపరులకు కనుల పండువు చేయును.

యూనివర్సిటీ గ్రాంట్స్ కమీషన్ యూనివర్సిటీకి మంజూరు చేసిన విరాళముతో ఆంధ్ర విశ్వవిద్యాలయాధికారులు 1957 లో వేసవి కాలమున శాస్త్రములందును, లలిత కళలయందును పలువురు విశ్వవిద్యాలయ పట్టభద్రులచే అనకాపల్లి, భీమవరము, నిడుబ్రోలు కేంద్రములలో







1. ఆంధ్ర విశ్వవిద్యాలయము, వాల్తేరు

2. శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము, తిరుపతి

3. ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు









1. వ్యవసాయ కళాశాల, బాపట్ల
2. ఇంజనీరింగు కళాశాల, అనంతపురము
3. ఇంజనీరింగు కళాశాల, కాకినాడ
4. వైద్య కళాశాల, కర్నూలు

ఒక్కొక్క చోట మూడేసి యుపన్యాసముల చొప్పున జన సామాన్యమున కర్థమగు తేలికైన తెలుగు భాషలో నిప్పించిరి. ఈ యుపన్యాసములు ప్రజాదరమును చూరగొనెన నుటకు సందియము లేదు. ఇట్టి ఉపన్యాస కార్యక్రమమే 1959 వేసవియందు మరికొన్ని ముఖ్య కేంద్రములందు జరుపబడెను.

ఇంజనీరింగ్ కళాశాలకు ప్రత్యేకించిన భవనముల నిర్మాణము 1959 సంవత్సరాంతమునకు పూర్తియైనది. 1960 సంవత్సరము జూలై నుండి ఇప్పుడు కళాశాల ఆ నూతన భవనములయందే నిర్వహింపబడుచున్నది. ఇది గాక లైబ్రరీకి నాలుగంతస్థుల పెద్ద భవనము, ఆర్ట్సు కళాశాల కొక ప్రత్యేక విశాలభవనము, కామర్సు కళాశాల కింకొక ప్రత్యేక భవనము నిర్మింపబడుచున్నవి. వీటిలో మొదటి రెండు భవనముల నిర్మాణము దాదాపుగ పూర్తియైనది. ఇప్పుడున్నవి గాక ఉపాధ్యాయులకు వసతి గృహములు నిర్మింపబడినవి ; ఇంకను నిర్మింపబడుచున్నవి.

ఇటీవల క్రొత్త పాఠ్యవిషయములు (కోర్సులు) ప్రారంభింప బడినవి. 1957 - 58 నుండి సోషల్ వర్కు, బిజినెస్ ఎడ్మినిస్ట్రేషను లందు మాస్టరేట్ కోర్సులు, 1959 - 60 నుండి కో-ఆపరేషన్, రూరల్ స్టడీస్ లందు పోస్ట్ గ్రాడ్యుయేట్ డిప్లొమా కోర్సులు నెలకొల్పబడినవి. అన్ని ఆర్ట్సు పాఠ్య విషయములందును ఎమ్.ఏ. కోర్సులు 1960 - 61 నుండి ప్రారంభింపబడినవి.

అ. ల. రావు.

## ఉస్మానియా విశ్వ విద్యాలయము

ఈ పేరు దీనికి 1917 లో రాజ శాసనము ద్వారా స్థాపించిన హిజ్ ఎగ్జాల్టెడ్ హైనెస్ సర్ మీర్ ఉస్మాన్ ఆలిఖాన్ మూలమున లభించెను ; ఇతడు పూర్వపు హైదరాబాదు సంస్థానమును పాలించెను. కాని, హైదరాబాదుకు ప్రత్యేక విశ్వవిద్యాలయము ఉండవలెనను ఉద్దేశము మొట్టమొదట కలిగినది సర్ అక్బరు హైదరీకి. ఇతడు విశాల దృక్పథముకల రాజకీయవేత్త. తర్వాత హైదరాబాదుకు ప్రధాన మంత్రి అయ్యెను. 1917 కు పూర్వము సంస్థానము లోని ప్రజలు వారి ఉన్నత విద్యకు మద్రాసు, ఆలిఘర్ మొదలైన విశ్వవిద్యాలయములపై ఆధారపడి ఉండెడి వారు. ఉస్మానియా విశ్వవిద్యాలయ స్థాపనమువలన ఈ పరిస్థితి తొలగుటయే గాక, విద్యా స్థాయీ లన్నిటిలో ఇంగ్లీషుకు బదులు భారతీయ భాషలలో ఒకటియగు ఉర్దూను విద్యా బోధక భాషగ సాహసించి ఉపయోగించు ప్రయత్నము ప్రారంభమయ్యెను. సిద్ధాంత దృష్ట్యా ఇది యొక ఉత్తమమైన విధానము, చాల కాలమువరకు విశ్వ విద్యాలయమునకిది ప్రధాన లక్షణముగనుండెను.

ప్రారంభదశలో 16 సంవత్సరములు విశ్వవిద్యాలయము స్వంత భవనము లేక హైదరాబాదు నగరములో వేర్వేరు అద్దె ఇండ్లలో నెలకొల్పబడెను. 1937 లో ఇప్పటి ప్రదేశములో తాత్కాలికముగ కట్టబడిన ఇండ్లలోనికి అది మార్చబడెను. కాలక్రమమున శాశ్వత భవనములకై ఒక పథకము తయారుకావింప బడెను. దాని ననుసరించి భవన నిర్మాణము కొనసాగెను. ఈ విధముగ నిర్మింప బడిన వానిలో మొట్టమొదటివి ఆర్ట్సు కళాశాల, విద్యార్థి వసతి గృహములు. 1939 లో ఆర్ట్సు కళాశాలకు ప్రారంభోత్సవము జరిగెను. ఆ భవనములో ఆర్ట్సు (సాహిత్యాది కళలు), వాణిజ్య శాఖలు, విశ్వవిద్యాలయ గ్రంథాలయము, పరిపాలక కార్యస్థానములు నెలకొల్పబడెను. తర్వాత కొలది సంవత్సరములలో భౌతిక శాస్త్రము, రసాయన శాస్త్రము, జీవశాస్త్రములు బోధించుటకై నిర్మింప బడిన మూడు ప్రత్యేక ఖండములతో కూడిన సైన్సు కళాశాల, ఇంజనీరింగు కళాశాల మొదలైన భవనముల నిర్మాణము జరిగెను. అంతకు పూర్వము సైన్సు బోధనకై వినియోగింప బడుచుండిన కట్టడములు విద్యార్థి వసతి గృహములుగను, వైద్య శాఖ, సాంకేతిక శాస్త్రశాఖ మొదలైన శాఖల నిమిత్తముగను ఉపయోగింపబడ సాగెను.

విశ్వవిద్యాలయమును స్థాపించినవారు అది కళాశాలలు గ్రంథాలయములు, వసతి గృహములు, అధ్యాపకుల గృహములు, ఆట స్థలములు, సభాగారములు మొదలగు వానితో కూడిన ఏక కేంద్ర వసతి (రెసిడెన్షియల్) విశ్వవిద్యాలయముగ నుండవలెనని ఆశించిరి. కాని ఆచరణలో ఇది కొన్ని మార్పులను పొందెను. ఉస్మానియా విశ్వవిద్యాలయము బోధన విద్యాలయమగుటయే (టీచింగ్) గాక అనుబంధ కళాశాలలతో కూడుకొన్నట్టిదిగను, హైదరాబాదు నగరమందే గాక తక్కిన జిల్లాలలో స్థాపితమైన కళాశాలలతో కూడుకొన్నట్టిదిగను రూపొందెను. ఒక హైదరాబాదు నిజాం కళాశాల మాత్రము 1946 వరకు మద్రాసు విశ్వవిద్యాలయ అనుబంధ కళాశాలగ నుండెను.

దేశమునకు స్వాతంత్ర్యము వచ్చి, హైదరాబాదు రాష్ట్రము భారత దేశములో విలీనమైన కారణమున జాతీయ, సాంఘిక, రాజకీయ జీవితమున కనుగుణముగ విశ్వవిద్యాలయములో గొప్ప మార్పు లనేకములు జరిగెను. వీటిలో ముఖ్యముగ పేర్కొన దగినవి మూడు : 1. ఉర్దూ భాషకు బదులు ఇంగ్లీషు భాష విద్యా బోధనాభాష యగుట ; 2. విశ్వవిద్యాలయ పరిపాలన విధానము ప్రజాస్వామ్య సూత్రముల కనుగుణముగ సవరింప బడుట ; 3. విశ్వవిద్యాలయపు ఖర్చులకై ప్రభుత్వముపైన ఆధార

పడవలసినను విద్యకు సంబంధించినంత వరకు అన్నిటిలోను ప్రభుత్వ శాఖలలో నొకటిగ నుండుటకు బదులు స్వతంత్ర సంస్థగ మారిపోవుట.

1948 నుండి ప్రసిద్ధిగాంచిన ఉపాధ్యాయుల యాజమాన్య మున విశ్వవిద్యాలయము సత్వరాభివృద్ధిని గాంచ దొడ గెను. 1956 లో జరిగిన భాషా ప్రయుక్త రాష్ట్రపునర్వ్యవ స్థీకరణ ఫలితముగ మరాట్వాడా, కర్ణాటక ప్రాంతముల లోని కళాశాలలు ఉస్మానియా విశ్వవిద్యాలయము నుండి విడిపోయెను. దాని మూలమున విశ్వవిద్యాలయము తెలంగానాకు మాత్రమే పరిమితమై, అక్కడి ప్రజల అవస రములను తీర్చు ప్రాంతీయ విశ్వవిద్యాలయమయ్యెను. కాని మొదటి నుండియు దానికి ప్రత్యేక లక్షణమని చెప్పదగిన సార్వజనిక దృష్టిలో మాత్రము ఎట్టి మార్పు సంభవింప లేదు. డాక్టరు రాధాకృష్ణన్ కమీషన్ "యూనివర్శిటీ విద్య", మూడు సంవత్సరముల "డిగ్రీ", సామాన్య విద్యా ప్రణాళిక మొదలగు వానిని గురించి చేసిన సిఫారసులను అమలులో ప్రప్రథమముగ అమలుపరచిన భారతీయ విశ్వ విద్యాలయము ఉస్మానియా విశ్వవిద్యాలయము. ఉత్కృష్ట మగు విద్యాబోధన, పరిశోధన సౌకర్యములను కల్పించు టయేగాక ఈ విశ్వవిద్యాలయము జర్మన్, ఫ్రెంచి, ఇటాలి యన్, రష్యన్ మొదలైన విదేశభాషలను, పత్రికా రచన (జర్నలిజం), పరిపాలన, గ్రంథాలయ (లైబ్రెరి) శాస్త్రములు నేర్చుకొనుటకు ప్రత్యేక ఏర్పాటులు గలవు.

ఆంధ్రప్రదేశ్ లోని తక్కిన విద్యాలయముల పరిపాల నము వంటి పరిపాలనను ఇందులో కూడ ప్రవేశ పెట్టుటకై ఒక శాసనము చేయబడి 1959 ఫిబ్రవరి 2 వ తేదీన అమలు లోనికి తేబడెను. ఉస్మానియా విశ్వవిద్యాలయము వసతి విశ్వవిద్యాలయ మనియు, బోధక విశ్వవిద్యాలయ మనియు, అనుబంధ విశ్వవిద్యాలయ మనియు ఇది సాటించుచున్నది.

ఈ విశ్వవిద్యాలయమునగల బోధన శాఖలు (ఫాకల్టీస్) 1. వ్యవసాయము; 2. చరిత్ర, రాజనీతి, భాషా, సాహిత్యాది కళలు; 3. వాణిజ్యము; 4. విద్యాబోధన; 5. వాస్తు నిర్మాణము; 6. న్యాయ శాస్త్రము; 7. వైద్య శాస్త్రము; 8. భౌతిక రసాయన శాస్త్రాది శాస్త్రములు; 9. సాంకేతిక శాస్త్రము; 10. పశుపాలన, పశువైద్యము మున్నగునవి గలవు.

ఈ విశ్వవిద్యాలయమునకు అనుబంధముగ ఎనిమిది మొదటి తరగతి కళాశాలలును, మూడు పి.యు.సి. కళా శాలలును, ఐదు వృత్తివిద్య కళాశాలలును గలవు. మొత్తము ఈ విశ్వవిద్యాలయమునకు గల అనుబంధ కళాశాలలు 23 లోను 19 మొదటి తరగతివి. వీటిలో 7 వృత్తి విద్యా కళాశాలలు. ఈ విశ్వవిద్యాలయములో మొత్తము 18,800 విద్యార్థులు చదువుచున్నారు; ఇందు 2,800 మంది విద్యార్థి నులు. విశ్వవిద్యాల యావరణలోగల విద్యార్థుల సంఖ్య 3,700, అనుబంధ కళాశాలలోని విద్యార్థుల సంఖ్య 8,500. ఈ విశ్వవిద్యాలయ వార్షిక వ్యయము 82 లక్షల రూపాయలు. ఎస్. వి. కె. మూర్తి

## శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము

తిరుపతిలో విశ్వవిద్యాలయ స్థాపన ఏభై యేళ్ళ స్వప్నం. 1954 ఆగష్టు 5 వ తేదీన ఆంధ్రరాష్ట్ర గవర్నరు చేసిన ప్రత్యేక ప్రకటన ప్రకారం శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యా లయపు చట్టంలోని అవసరమైన నిబంధనలు అమలులోనికి వచ్చినవి. తత్ఫలితంగా 1954 సెప్టెంబరు 2 వ తేదిని శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము స్థాపింపబడినది.

చట్టప్రకారము మొదట ఈ విశ్వవిద్యాలయము నివాస యుతమైనదిగాను బోధనా యుతమైనదిగాను కళాశాల లకు మాతృ సంస్థగాను ఉండి తరువాత 1956 నుంచి చిత్తూరు, కడప, కర్నూలు, అనంతపురము, నెల్లూరుజిల్లాల కళాశాలలను చేర్చుకొని సంపూర్ణ స్వరూపం పొందినది.

ఆంధ్ర హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి ఈ విశ్వ విద్యాలయానికి ఛాన్సలరుగాను, రాష్ట్ర విద్యామంత్రి ప్రో-ఛాన్సలరుగాను ఉండిరి.

ఆచార్య శ్రీ ఎస్. గోవిందరాజులునాయుడు వైస్ ఛాన్సలరుగా నియమితులైరి.

తిరుపతి - చంద్రగిరిరోడ్డు ప్రక్కన 1½ మైళ్ళ పొడవున ఉన్న సుమారు 1,000 ఎకరముల ప్రాంతములో విశ్వ విద్యాలయము నిర్మింపబడినది.

ప్రారంభములో శ్రీ వేంకటేశ్వర కళాశాలకు చెందిన 5 బృహత్ భవంతులు విశ్వవిద్యాలయమునకు సంక్రమిం చెను. కేంద్రంలో రెండు అంతస్థులుగల ముఖ్య కళా శాల ఉన్నది; దీనిలోనే ఆనర్సుకోర్సులు ప్రారంభమైనవి. ఈ భవనమునకు తూర్పున విద్యార్థులకు కేటాయించిన రెండు హాస్టలు బ్లాకులున్నవి. పడమట విద్యార్థినుల కేర్పాటుచేసిన హాస్టలున్నది. దానికి చేరువగానే రెండవ కళాశాల కట్టబడినది. దీనికి ప్రారంభోత్సవము జరిపిన వారు ఆంధ్రరాష్ట్ర ముఖ్యమంత్రిగా నుండిన టి. ప్రకాశం పంతులు.

శ్రీ వేంకటేశ్వర కళాశాల శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యా లయ కళాశాలగా మారెను.

పెట్టుబడి ఖర్చు రు. 161.43 లక్షలు కాగలదని అంచనా వేసిరి. మే 17, 18, 1955 తేదీలలో విశ్వవిద్యాలయ విరా

శాల కమీషను తరపున ఆరు సభ్యులుగల ఒక విజిటింగ్ టీము తిరుపతికివచ్చి ఖర్చుల అంచనాలన్నిటికి తనిఖీచేసి మొత్తం రు. 38-55 లక్షల విరాళమునకు తమ సమ్మతిని తెలియజేసెను. ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వము విశ్వవిద్యాలయ స్థాపన సమయముననే రు. 7.5 లక్షల మొత్తాన్ని మంజూరు చేసినది.

విశ్వవిద్యాలయపు చట్టప్రకారము దేవస్థానము సాలీనా రు. 2.5 లక్షల మొత్తమును శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ నిర్వహణకై కేటాయింపు చేయవలసియున్నది. మొదటి సంవత్సరములో అదనముగా ఒకసారి ఖర్చుకోసం రు. 6.5 లక్షల మొత్తమును ఇవ్వడానికి ఒప్పుకొనెను. ఈ విధంగా భవన నిర్మాణమునకు శాశ్వతమైన పునాదితో బాటు పెట్టుబడికి, నిత్య ఖర్చుకు నిధులు ఏర్పడినవి.

ప్రారంభము నుంచియు బోధన పరిశోధనలు కూడ ఈ విశ్వవిద్యాలయములో సమగ్రంగా జరుగవలెననియే అధికారులయొక్క సంకల్పము. మొదటి సంవత్సరము 1954 - 55 లో 30 మంది విద్యార్థులతో 6 బి. ఏ., బి.ఎస్‌సి., ఆనర్సు కోర్సులు ప్రారంభించిరి. సైన్సులలో ఫిజిక్సు, కెమిస్ట్రీ, జూ ఆలజీయును, హ్యుమానిటీస్‌లో గణితము, అర్థికశాస్త్రము, తత్త్వమున్ను.

1959 - 60 సంవత్సరములో మొదట పెట్టిన ఆరు ఆనర్సు కోర్సులకు బదులుగా రెండేండ్ల ఎమ్. ఏ., ఎమ్. ఎస్‌సి, డిగ్రీకోర్సులు ప్రారంభించిరి. ఎమ్. యల్. డిగ్రీకి బదులుగా పరిశోధనచేత పి హెచ్. డి. కోర్సున్ను ప్రారంభించారు. దేశమంతట అన్ని విశ్వవిద్యాలయాలతోపాటు ఇచట కూడా ఆనర్సుకోర్సులకు 1958 - 59 సం॥ నుంచి స్వస్తి చెప్పిరి.

క్రొత్తగా ఎమ్. ఎ., ఎమ్. ఎస్‌సి., డిగ్రీకోర్సులు మొదలు పెట్టిన విద్యాశాఖలు - బోటనీ, జియాలజీ, సైకాలజీ, చరిత్ర, సంస్కృతము, తెలుగు, ఇంగ్లీషు, హిందీ, ఉర్దు. ఈ విధముగా 5 ఏండ్లలో 6 నుంచి 15 వరకు పోస్టు గ్రాడ్యుయేటు, రిసెర్చికోర్సులు పెరిగెను. విద్యాశాఖల విస్తరణ వేగముగాను ధారాళముగాను జరిగెను.

ఉర్దు మినహాయించి మిగత 14 విద్యాశాఖలలోను 1959 - 60 లో పి హెచ్. డి. డిగ్రీకి పరిశోధన చేస్తున్నవారు 35 గురు అధ్యాపకులున్ను 12 విదార్థులున్ను గలరు.

జూలై 1955 నుండి విశ్వవిద్యాలయ కళాశాల గ్రంథాలయము ప్రారంభమయ్యెను. అప్పటికి దానిలో 6,723 గ్రంథము లుండెను. జూన్ 30, 1960 తేదీనాటికి విశ్వవిద్యాలయ గ్రంథాలయములో మొత్తము 27,798 పుస్తకములు, 293 పత్రికలు ఉండెను.

దేశమందలి ఇతర విశ్వ విద్యాలయములలో వలెనే ఇచటకూడ విద్యార్థులసంఖ్య బహుళముగా నానాటికి పెరిగిపోవుచున్నది. 1955 - 56 సంవత్సరము ఆరంభములో విశ్వవిద్యాలయ కళాశాలలో మొత్తము 407గురు మాత్రమే యుండిరి. 1959 - 60 లో వారి సంఖ్య 607 వరకు పెరిగెను; దీనికి అదనంగా 47 గురు పరిశోధనచేయు విద్యార్థు లుండిరి.

1959 - 60 లో శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయ అనుబంధ కళాశాలల సంఖ్య 14; వీటిలో రాయలసీమలోని కళాశాలలు, కావలి, నెల్లూరులలోని కళాశాలలు గలవు. వీటిలోని విద్యార్థుల మొత్తము సంఖ్య 7,466 గురు మాత్రమే. వీరుగాక 4 ప్రాచ్యకళాశాలలలో 176 విద్యార్థులు ఉండిరి.

ఈ విశ్వవిద్యాలయము మొదటి సాంవత్సరిక స్నాతకోత్సవము ఫిబ్రవరి 14, 1958 లో జరిగెను. దానిలో 560 మంది పట్టభద్రులు పట్టములు పొందిరి. ఫిబ్రవరి 6, 1960 లో జరిగిన మూడవ స్నాతకోత్సవమున 1,169 గురు పట్టభద్రులైరి. వారిలో 89 గురు స్త్రీలు.

విశ్వవిద్యాలయ కళాశాలకు ఆరంభమున రెండు హాస్టల్సు కలవు. జూలై 1961 నుండి విద్యార్థులకు ప్రత్యేకముగా హాస్టలు నిర్మితమైనది.

1959 - 60లో మరిరెండు భారీ ఎత్తు హాస్టలు బ్లాకులు కట్టబడినవి. వీటిలో ఇంజనీరింగు కాలేజీ విద్యార్థులకు వసతి ఏర్పాటైనది. ఇట్టివే ఇంకను రెండు భారీ బ్లాకులు కట్టబడుచున్నవి.

హాస్టల్సుయొక్క పరిపాలన కంతకు మొత్తముమీద (వార్డెను) పై యధికారి విశ్వవిద్యాలయము ప్రిన్సిపాలు. వారికీ సందర్భములో సహాయము చేయుటకు ముగ్గురధ్యాపక సభ్యులతోకూడిన ఉపసంఘ మున్నది.

మొదట రెండు భవంతులు 2 హాస్టళ్ళతో ఆరంభమైన ఈ విశ్వవిద్యాలయ ప్రాంతము దినదినాభి వద్ధినొందుచు ఇప్పుడు ఒకానొక విశాలమైన విశ్వవిద్యాలయముగా పెరిగిపోవుచున్నది. నవంబరు 12, 1955 తేదీన రాష్ట్రపతి డాక్టరు రాజేంద్రప్రసాద్ ఫిజికల్ సైన్సు, నాచురల్ సైన్సు లెబోరెటరీ భవనములకు, గ్రంథాలయ భవనమునకు శంఖుస్థాపన చేసిరి. 1930 లో ఈ భవనములలో నొకటిపూర్తి అగుటయు దానిలోనికి జూ ఆలజీ, జియాలజీ, బోటనీ విద్యాశాఖలు ప్రవేశించుటయు జరిగినది.

1955 - 56 లోనే ప్రొఫెసర్ల నివాసమునకై 6 భవంతులు కట్టియున్నారు. వీటిలో ఒకటి రిజిస్ట్రారు నివసించుటకున్ను మరియొకటి విడిది గృహముగా నుండుటకున్ను ఏర్పాటు చేసిరి.

1956 - 57 లో ఇండియా ప్రభుత్వము వినోదములకు, సభలకు భవనమొకటి నిర్మించుటకై రు. 35,000 మంజూరు చేసిరి. 1960 లో ఈ నిర్మాణము పూర్తి అగుటయు దానిలో తాత్కాలికముగా దేవస్థానము నెలకొల్పిన నాట్య సంగీత కళాశాల ఏర్పాటు అయినది.

1957 - 58 లో గ్రంథాలయ భవన నిర్మాణము ఆరంభ మయ్యెను. విశ్వవిద్యాలయ ఉపాధ్యాయుల కొరకై కొన్ని వసతి గృహములు నిర్మింపబడినవి; మరికొన్ని నిర్మింప బడుచున్నవి.

ఇవిగాక ప్రత్యేకముగా ఆర్ట్సు భవనమున్ను ఇంజనీరింగు కాలేజీయును, సభాభవనమున్ను నిర్మించుటకు ఏర్పాటు జరిగినది.

1959 లో శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ చట్టమును సవరించిరి. ఈ సవరణ చట్టము ప్రకారము వైస్ ఛాన్స లరును సెనేటు ఎన్నుకొను పద్ధతికి బదులుగా ఛాన్సలరు నియమించు పద్ధతి అమలులోనికి వచ్చినది. ఈ కొత్త చట్టముప్రకారము శ్రీ ఎస్. గోవిందరాజులు నాయుడు 1959 నుండి మరి అయిదేండ్లవరకు వైస్‌ఛాన్సలరుగా నియమితులైరి. సవరణ చట్టము మూలముగా సిండికేటు సభ్యుల సంఖ్య 13 నుండి 16 కు పెరిగినది. ఎకాడెమిక్ కౌన్సిలులో స్టేటు సాహిత్య, నాటక, లలితకళా అకాడమీల అధ్యక్షులకు చేర్చిన కళాశాలలోని ఉపాధ్యా యులలో 5 గురికి స్థానమివ్వబడెను.

ప్రథమమున వేసియున్న 5 ఏండ్ల మాస్టరు ప్లాను ప్రకా రము శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము శీఘ్రకాలంలోనే పలుముఖాలుగా అభివృద్ధి చెందినది. నవంబరు 1, 1956 తేదీన దేవస్థానము అధీనములో ఉంటూ ఉన్న ప్రాచ్య పరిశోధన సంస్థను విశ్వవిద్యాలయము వారు తమ యాజ మాన్యములోనికి తీసికొనిరి. 1957 - 58 నుండి ప్రీ యూని వర్సిటీ కోర్సులున్ను, 1958 - 59 నుండి 3 సంవత్సరముల డిగ్రీ కోర్సులున్ను ప్రవేశ పెట్టబడినవి. ఈ విధంగా విద్యా రంగంలో అధునాతన సంస్కరణము లన్నింటిని ఈ విశ్వ విద్యాలయాధికారులు ఉత్సాహముతో ఆమోదిస్తున్నారు; ఆచరణలో పెడుతున్నారు. 1957 - 58 నుండి వెటరినరీ, మెడికల్, ఇంజనీరింగ్ కోర్సులు ప్రారంభమైనవి. 1959 నుండి సాధారణ విద్య (general education) అనే శాఖను ప్రవేశపెట్టి అభిమానముతో దాన్ని పోషించు చున్నారు.

1955 లో ఆరుగురు అధ్యాపకులను ఎన్నుకొన్నారు. అందులో 4 రు ప్రొఫెసర్లు. 1960 సం॥ నాటికి ఉపాధ్యా యుల సంఖ్య 150 వరకు పెరిగిపోయినది. వారిలో 9 మంది ప్రొఫెసర్లు. మ. సూ. ప్ర.

# ప్రాచ్య విద్య

విజయనగర మహారాజ ప్రభుత్వ సంస్కృత కళాశాల : ఈ కళాశాల 1860 లో విజయనగర మహారాజు శ్రీ విజయ రామ గజపతిచే స్థాపింపబడెను. వారు కాశీలో తాము చూచిన పాఠశాలల పద్ధతిలో పాఠశాలను నడుప నెంచి మహా పండితుల నధ్యాపకులుగ నియమించిరి. వీరు పాఠములను బోధించుటయే కాక ఒక ధర్మ సంస్థగా నేర్పడి ధర్మ శాస్త్ర చర్చలను జరిపెడి వారు.

శ్రీ ఆనంద గజపతి మహారాజు కాలమున ఈ కళాశాల బహు విధముల విస్తృతి చెందెను. ఆంగ్ల కళాశాలకు ప్రిన్సిపాల్‌గా నుండిన శ్రీ కిళాంబి రామానుజాచార్యులు సంస్కృత పాఠశాలకు కూడ ప్రధానాచార్యులుగ నియ మింపబడిరి. కళాశాల కొంతకాలము కాశీ సంస్కృత పరి షత్తుకు అనుబంధ సంస్థగ వ్యవహరించెను; కాశీ పరీక్షలకు కేంద్రముగ అంగీకరింపబడెను.

ఆ తరువాత మద్రాసు ప్రభుత్వము ప్రాచ్య పాఠశాలల కొక ప్రత్యేక పరీక్షాధికారిని నియమించెను. నాటి ఎస్టేట్ కలెక్టరు గిల్‌మన్ ఆ యుద్యోగితో సంప్రదించి విజయ నగర సంస్కృత కళాశాలకు అనుబంధ ప్రాథమిక పాఠ శాలలుగా సింహాచలము, పద్మనాభము, రామతీర్థము, శ్రీకూర్మము, జామి, ఇత్యాది గ్రామములలో సంస్కృత విద్యాలయములను స్థాపించెను.

1911 లో మద్రాసు విశ్వ విద్యాలయము వారు సంస్కృతములో న్యాయ, వ్యాకరణ, శిరోమణి పరీక్ష లను, తెలుగులో విద్వాన్ పరీక్షను ఏర్పరచి ఈ కళా శాలను ఆ పరీక్షలకు శిక్షణము నొసగుటకు తగిన దానినిగా అంగీకరించిరి. సంస్కృత భాషలోను, శాస్త్రములలోను ప్రాథమిక స్థితిని దాటిన విద్యార్థులు రెండు సంవత్సరములు చదివి ప్రిలిమినరీ పరీక్షకును, మరి రెండు సంవత్సరములు చదివి ఫైనలు పరీక్షకును వెళ్ళి శిరోమణి, విద్వాన్ ప్రాచ్య బిరుదములను పొందుటకు అవకాశము కల్పింపబడెను. మీమాంస, సాహిత్యము, వ్యాకరణము, న్యాయము అభిమాన విషయములుగ గల శిరోమణి పాఠ్యక్రమ మీ కళాశాలలో నెలకొల్పబడెను. తరువాత బి.ఓ.ఎల్., కోర్సు కూడ ప్రవేశ పెట్టబడెను. 1926లో ఆంధ్ర విశ్వ విద్యా

లయము నెలకొల్పబడి నప్పటి నుండియు నీ కళాశాల ఆంధ్ర విశ్వ విద్యాలయ సంబంధిగా మారెను. ఇటీవల కళాశాలకు అనుబంధముగ ఓరియంటల్ హైస్కూలు కూడ స్థాపింపబడినది.

విజయనగరమునకు దక్షిణ దిగ్భాగమున ప్రశాంత వాతావరణములో ఈ కళాశాలా భవనము నిర్మింపబడి యున్నది. నేటి వరకు కళాశాలావరణములో విద్యార్థులకు ఉచిత నివాస సౌకర్యము కల్పింపబడుచున్నది. విజయనగరములోనే నెలకొల్పబడియున్న సింహాచల దేవాస్థాన భోజన శాలలో సంస్కృత కళాశాల విద్యార్థులకు ఉచిత భోజన సౌకర్యములు చిరకాలముగ సాగుచున్నవి. ఇతర సంస్కృత విద్యాలయములలో వలెనే ఈ కళాశాలలో కూడ విద్య యుచితముగ గరప బడు చున్నది.

కళాశాలా గ్రంథాలయములో సుమారు 8,000 ల గ్రంథములు కలవు. అందు సగము సంస్కృత గ్రంథములు; మిగిలిన వానిలో సగము తెలుగులోను, సగము ఆంగ్లము లోను కలవు.

మొదటినుండియు విజయనగర సంస్థాన పరిపాలనము క్రింద నడచు చుండిన ఈ కళాశాల 1949 లో ప్రభుత్వ పరిపాలనము క్రిందికి వచ్చెను. ఇంతవరకు బహుశత సంఖ్యాకు లీ కళాశాలలో విద్యాభ్యాసము చేసి సంస్కృత, ఆంధ్ర విద్వాంసులుగా విఖ్యాతులైనారు. శ్రీ తాతా సుబ్బారాయ శాస్త్రి, శ్రీ వఝల చిన సీతారామస్వామి శాస్త్రి మున్నగు మహా విద్వాంసు లీ కళాశాలలో అధ్యాపకులుగ నుండిరి.

**ఆంధ్ర గీర్వాణ విద్యాపీఠము:** ఈ సంస్థ 1912 లో విజయదశమినాడు కొవ్వూరు (పశ్చిమ గోదావరి జిల్లా)లో స్థాపింపబడెను. స్థాపకులైన శ్రీ తల్లాప్రగడ సూర్యనారాయణరావు గట్టి పునాదులపై ఈ సంస్థను నడుపుటకై బహువ్యయప్రయాసల కోర్చి తమ న్యాయ వాది వృత్తిని కూడ విడనాడి దేశ సంచారము చేసి కొంత భూమిని, భవనములను, ఐదు ఎకరముల స్థలమును సంపాదించిరి. ఈ స్థలములో కళాశాలా భవనములు, విద్యార్థి వసతిగృహము, దేవాలయములు నిర్మింపబడియున్నవి.

ఈ విద్యాపీఠ పాలక వర్గము నిర్వహించుచున్న శాఖలలో శ్రీ వాడ్రేవు జోగయమ్మ వేద సంస్కృత కళాశాల యొకటి. ఇందు విద్యార్థులకు సాహిత్య విద్యా ప్రవీణ, భాషాప్రవీణ, పి. ఓ. ఎల్. పరీక్షలకు శిక్షణ యొసగబడు చున్నది. ఇట్టి శిక్షణము నిచ్చుటకు ఆంధ్ర విశ్వవిద్యాలయమే కళాశాల కనుమతి నిచ్చి యున్నది. ఈ కళాశాలలో ప్రభుత్వమువారి సంస్కృత ప్రవేశ పరీక్షకును, విశ్వవిద్యాలయము వారి భాషాప్రవీణ ప్రవేశ పరీక్షకును శిక్షణ యొసగ బడుచున్నది. కొన్ని సంవత్సరము లీ కళాశాలలో ఆయుర్వేదము, స్మార్తము, హిందీ అభిమాన విషయములుగ బోధింపబడుచుండెను. ఒకప్పుడు వేదము కూడ అధ్యాపనము గావింపబడు చుండినను, తరువాత అది యాజ్ఞిక మంత్రములకు మాత్రము పరిమితమయ్యెను.

ఆరుగురు అధ్యాపకులతోను, నలువది మంది విద్యార్థులతోను నడచుచున్న ఈ కళాశాలకు అనుబంధముగ ప్రభుత్వ విధానము ననుసరించి ఓరియంటల్ హైస్కూలు కూడ నిర్వహింప బడుచున్నది. దీనికి భూరి విరాళ మొసగిన శ్రీ మావులేటి సోమరాజు పేర ఈ పాఠశాల నెలకొల్పబడినది. ఇందు సుమారు వందమంది విద్యార్థులు, పదకొండుగురు ఉపాధ్యాయులు కలరు; ఈ విద్యార్థులలో మూడవ వంతు బాలికలు.

విద్యాపీఠ గ్రంథాలయములో సుమారు 4,000 గ్రంథములు కలవు. కళాశాలావరణములోనే విద్యార్థి వసతి గృహము కూడ కలదు. శ్రీ భోగరాజు కోదండ రామయ్య మున్నగు వారి వసతి గృహమును నిర్మించుటకు తోడ్పడుటయే కాక దీనిని శాశ్వతముగ నడపుటకు కొంత భూమిని కూడ సంపాదించిరి. విద్యాపీఠావరణములో గోప్పదేశ్వరాలయము, శ్రీ లలితాంబాలయము నిర్మింపబడినవి. అందు శాశ్వతముగ ధూప దీప నైవేద్యాదులు సాగుట కేర్పాటు కూడ గావింప బడెను.

కొంత కాల మీ విద్యాపీఠమునకు కార్యదర్శిగా నుండిన శ్రీ వల్లూరి సూర్యనారాయణరావు సుమారు 70 వేల రూపాయలును, ఒక భవనమును విద్యాపీఠమున కొసగి యా ధనముపై వచ్చు వడ్డీతో తెలుగులో సర్వ జనోపయోగకరములైన గ్రంథములను ప్రకటించి గ్రంథాలయముల కుచితముగ నొసగవలయునని తమ వీలునామాలో వ్రాసిరి. ఇప్పటికి 16 గ్రంథములు ఆ ధర్మనిధినుండి వెలువడినవి.

శ్రీమత్తిరుమల గుదిమెళ్ల వరదాచార్యులు, శ్రీ జటావల్లభుల పురుషోత్తము మున్నగువారీ విద్యాపీఠమునకు ప్రధానాచార్యులుగ నుండిరి. శ్రీ అవ్వారి సుబ్రహ్మణ్య శాస్త్రి, శ్రీ వేదుల రామశాస్త్రి మున్నగు మహాపండితు లధ్యాపకులుగ నుండిరి. ఇచట విద్యాభ్యాసము చేసి విశ్వవిద్యాలయ ప్రాచ్య బిరుదములను పొంది యున్నత పాఠశాలలలో అధ్యాపకులుగ పనిచేయుచున్న వారు శతాధికులుగ నున్నారు. ఈ విద్యాపీఠమునకు బహుముఖ సేవ చేసిన వారిలో శ్రీ కేశిరాజు వేంకట నృసింహ అప్పారావు ఒకరు.

కోట లక్ష్మయ్యనాయుడు సంస్కృత కళాశాల, తెనాలి: కొల్లూరులో నడచుచుండిన సంస్కృత పాఠశాల 1910 లో తెనాలికి మార్చబడినది. అది కళాశాలగా మారి 1912 లో మద్రాసు విశ్వవిద్యాలయముచే గుర్తింప బడినది. అప్పటి నుండియు విద్వాన్, సాహిత్య శిరోమణి, వేదాన్త శిరోమణి పరీక్షలకై విద్యార్థులకు శిక్షణము నిచ్చుచు 1926 లో ఆంధ్ర విశ్వ విద్యాలయ కార్యక్షేత్రము లోనికి వచ్చి యప్పటినుండి తత్పరీక్షలకు శిక్షణ మొసగుచున్నది.

శ్రీ పి. ఆంజనేయులు, శ్రీ. ఎం. రఘూత్తమరాయ శాస్త్రి మొదలగువారీ కళాశాల అభివృద్ధికై తోడ్పడిరి. కీ. శే. ముదిగొండ చంద్రమౌళి శాస్త్రి తమ ధర్మ శాలలో నొక వీలునామా ద్వారా దీనికి స్థిరనివాసము కల్పించిరి. 1938 లో శ్రీ కోట లక్ష్మయ్య నాయుడు సంవత్సరమునకు 1,200 రూపాయలు ఆదాయము గల 7 ఎకరముల భూమిని, ఒక భవనమును ఈ కళాశాలకు విరాళముగా నొసగిరి. శ్రీ రూపాకుల వెంకటప్పయ్య తెనాలి బజారులో సంవత్సరమునకు 660 రూపాయల ఆదాయము వచ్చు నొక కొట్టును దాన మొసగిరి. ఈ కళాశాలకు ప్రభుత్వమువారే యేటేట కొంత ధన సహాయము చేయుచున్నారు.

1912 నుండి 1960 వరకు నీ కళాశాలలో 1,020 మంది విద్యార్థులు విద్యాభ్యాసము గావించిరి. వారిలో 450 మంది విద్యాప్రవీణ, భాషాప్రవీణ (శిరోమణి విద్వాన్) పరీక్షలలో నుత్తీర్ణులై యనేక విద్యా సంస్థల యందు ఉపాధ్యాయులుగ పని చేయుచున్నారు. విశ్వవిద్యాలయ పరీక్షలలో ప్రథములుగా నుత్తీర్ణులై సువర్ణ పతకములను బహుమతిగ పొందినవారును కొందరు కలరు.

ప్రధానాచార్యులుగ కళాశాలను సేవించిన వారిలో సుప్రసిద్ధులైన శ్రీ నోరి సుబ్రహ్మణ్యశాస్త్రి ముఖ్యముగ పేర్కొనదగి యున్నారు. శ్రీ త్రిపురారిభట్ల వీరరాఘవ స్వామి, శ్రీ జమ్ములమడక మాధవరామశర్మ, శ్రీ చింతల పాటి దక్షిణామూర్తి, శ్రీ కొవ్వూరి సుబ్బరామయ్య ఈ సంస్థకు ప్రధానాచార్యులుగ నుండిరి.

శ్రీ భావనారాయణస్వామి సంస్కృత కళాశాల, పొన్నూరు (గుంటూరు): శ్రీ భావనారాయణ స్వామి దేవస్థాన ధర్మకర్త(?) యగు శ్రీ రాజా వాసిరెడ్డి లక్ష్మీనరస మాంబా బహద్దర్ మన్నె సుల్తాన్‌వారి సంకల్పము నను సరించి వారి మేనేజరగు శ్రీ చిరుమామిళ్ళ భానుప్రసాద రాయుడు 1922 వ సంవత్సరమునందు పొన్నూరు దేవస్థానమున వేదసంస్కృత పాఠశాలను స్థాపించిరి. ప్రారంభమున కొంతకాలము వరకు వేదము నభ్యసించు వారు పదిమందియు, సంస్కృతము నభ్యసించువారు ఇరువది మందియు నుండిరి. సమర్థులగు పండితు లధ్యాపకులుగ నియమింపబడిరి. క్రమముగ నీ పాఠశాల ప్రభుత్వాను మతిని పొందినది. విద్యార్థులును, విద్యార్థినులును ప్రభుత్వమువారి సంస్కృత ప్రవేశ పరీక్షకు పంపబడు చుండిరి.

సంస్కృతాంధ్రములలో ఉన్నత విద్యను పొందదలచిన విద్యార్థులు దూరప్రదేశముల కేగవలసి యున్నందున పొన్నూరులోనే యొక సంస్కృత కళాశాలను స్థాపింప దగునని దేవస్థాన ధర్మకర్తలు శ్రీ రాజా వాసిరెడ్డి హరిహర ప్రసాద్ బహద్దర్, శ్రీ కాట్రగడ్డ అనంతపద్మనాభ చౌదరి ఆలోచించి 1949 లో పాఠశాలను కళాశాలగా నభివృద్ధిపరచి కళాశాలకు వలయు సామగ్రి సౌకర్యముల నేర్పరచి, ఆంధ్ర విశ్వ విద్యాలయము వారిచే రికగ్నైజ్ చేయించి విద్యాప్రవీణ, భాషాప్రవీణ, భాషాప్రవీణ అడ్మిషన్ టెస్టు తరగతులను నెలకొల్పిరి. కళాశాలలో చదువుచున్న ప్రతి విద్యార్థికిని నెలకు రు. 15 ల ఉచిత విద్యార్థివేతన మీయబడుచున్నది.

ఈ కళాశాల కనుబంధముగ 1953 లో ఓరియంటల్ హైస్కూలుకూడ స్థాపింపబడినది. అందు 200 మంది విద్యార్థులు కలరు. కళాశాలకును, ఉన్నత పాఠశాలకును గూడ స్వంత భవనములు కలవు.

సాంగవేద పాఠశాల, మచిలీపట్టణము: ఈ విద్యాలయము 1928 లో స్థాపింపబడినది. పూర్వాశ్రమములో శ్రీ రాళ్ళబండి సీతారామశాస్త్రి నామవిశ్రుతులైన శ్రీ గాయత్రీ పీఠాధిపతులగు శ్రీ శ్రీ శ్రీ విద్యాశంకర భారతీ స్వాముల వారీ పాఠశాలను స్థాపించుటలోను, పోషించుట లోను ప్రముఖ పాత్రను నిర్వహించిరి. శ్రీ నాదెళ్ళ పురుషోత్తమశాస్త్రి, శ్రీ పురాణం కృష్ణమూర్తి, శ్రీ తెంజర్ల వెంకటేశ్వరులు మరి కొందరును శ్రీవారికి సహాయ భూతులుగ నుండిరి. ఆదిలో వేదము మాత్రమే బోధింప బడుచుండిన ఈ పాఠశాల 16-7-1929 నుండి సాంగవేద పాఠ శాలగా మారినది. తరువాతకూడ శ్రీ గోరంట్ల వెంకన్న మున్నగువారు ఈ సంస్థకు బహువిధముల సహాయపడిరి.

ఇందలి విద్యావిధానము కేవలము ప్రాచీన పద్ధతిలోనే సాగుచున్నది. ఒకప్పుడు విద్యార్థులసంఖ్య 51 వరకు పెరిగెను. ఋగ్వేదము, యజుర్వేదము, స్మార్తము, శ్రౌతము, సాహిత్యము, శాస్త్రములు అను ఆరు శాఖలలో నిట శిక్షణ నిచ్చుచున్నారు. ఈ విద్యాలయములో ప్రధాన అధ్యాపకులుగ శ్రీ కంభంపాటి రామమూర్తి శాస్త్రి, శ్రీ మండలీక వెంకటశాస్త్రి మున్నగు మహా పండితు లుండుటకూడ నీ విద్యాలయముయొక్క ప్రతిష్ఠకు

కారణమైనది. ఈ పాఠశాలలో విద్యార్థులలో కొందరు వేదమును, వ్యాకరణ, వేదాంత శాస్త్రములను అధ్యయనము చేసి అందు నిష్ణాతులైరి. పట్టణములోని సత్రములలోను, ఉదారుల గృహములలోను విద్యార్థులకు ఉచిత భోజన వసతి చాల కాలమునుండి సాగుచున్నది.

ఈ విద్యాలయమునకు స్వంత భవనముండుటయే కాక తదావరణములో శంకర మఠము, గాయత్రీ దత్తాత్రేయ మందిరము మున్నగు మందిరములు కలవు. అనేక సంస్కృత పాఠశాలలలో వలెనే యిచ్చటను విద్యార్థులకే కాక పౌరులకెల్లరకు విజ్ఞానమును కలిగించు కాలక్షేపములు జరుగుచుండును.

ఆంధ్ర యువతీ సంస్కృత కళాశాల, రాజమండ్రి: కాకినాడ వాస్తవ్యులు శ్రీ నాళం రామలింగయ్య అసహాయురాండ్రగు వైశ్యస్త్రీల నుద్ధరించుటకు 1920 లో రాజమండ్రిలో వైశ్య సేవా సదనము అనునొక సంస్థను స్థాపించిరి. దీని కనుబంధముగ 1931 లో ఆంధ్ర యువతీ సంస్కృత కళాశాల నెలకొల్పబడెను. అది ఆంధ్ర విశ్వ విద్యాలయము చేతను, ప్రభుత్వము చేతను గుర్తింపబడెను.

ఈ కళాశాలలో ఆంధ్ర విశ్వవిద్యాలయము వారి భాషాప్రవీణ ప్రిలిమినరీ పరీక్షకు రెండేండ్లును, ఫైనలు పరీక్షకు రెండేండ్లును శిక్షణ మొసగ బడుచున్నది. భాషా ప్రవీణ ప్రవేశ పరీక్షకును విద్యార్థిను లిచట శిక్షణ పొందుచున్నారు. ప్రభుత్వము వారేర్పరచిన 6 సంవత్సరముల ఓరియంటల్ హైస్కూలు కోర్సు మొదటి ఐదు తరగతులును ఈ కళాశాలలో నడుచుచున్నవి. జాతి, మత, వర్ణభేదము లేకుండ ఎవరికైనను ఇందు ప్రవేశము గలదు. ఈ సంస్థలో మొత్తము 400 మంది విద్యార్థినులు, 20 మంది అధ్యాపకులు గలరు. ప్రాథమిక కక్ష్యలకును, హైస్కూలు కక్ష్యలకును చెందిన విద్యార్థినులే హెచ్చు మంది కలరు. కళాశాల స్థాపింపబడినది మొదలు నేటి వరకు శ్రీమతి బత్తుల కామాక్షమ్మ ప్రిన్సిపాల్‌గా నున్నారు.

వైశ్య సేవాసదనమునకు చెందిన భవనములలోనే కళాశాలయు, విద్యార్థినీ వసతి గృహమును నెలకొని యున్నవి. వసతి గృహములో 60 విద్యార్థిను లుందురు. భోజనపదార్థముల వెల హెచ్చుగా నున్నప్పుడు కూడ వారికి నెలకు 20 రూపాయిలకే భోజనము పెట్టుచున్నారు. 20 మందికి ఉచితముగనే భోజనము పెట్టబడుచున్నది.

హేలాపురీ సంస్కృత పాఠశాల, ఏలూరు: 1943 లో ఈ పాఠశాల స్థాపింపబడినది. 'శబ్ద మంజరి', 'రఘు వంశము' మొదలు కావ్యనాటకాలంకారాది సాహిత్య గ్రంథములను, 'కౌముది' మొదలు మహాభాష్యము వరకు వ్యాకరణ శాస్త్రమును ప్రాచీనపద్ధతిలో బోధించు నీ విద్యాలయము పూర్వకాలపు సంస్కృత పాఠశాలలను తలపించుచున్నది. ఆంధ్రప్రదేశ్‌లో నిట్టి పాఠశాలలు అరుదు. రెండుమూడు శాస్త్రములలో కూలంకష పాండిత్యముగల శ్రీ కప్పగంతుల సుబ్రహ్మణ్యశాస్త్రి ఈ పాఠశాలకు ప్రధానాధ్యాపకులు. ఇంతవరకు నిచట ఆరుగురు భాష్యాంత వ్యాకరణ గ్రంథముల నధ్యయనము చేసిరి; అయిదుగురు శేఖరాంత గ్రంథములను పఠించిరి; శత సంఖ్యాకులు సాహిత్య గ్రంథాధ్యయనము చేసిరి. ఏతత్పాఠశాలావరణములో తరచుగా జరుగు పురాణోపన్యాస కాలక్షేపములకు గ్రామస్థులు విశేష సంఖ్యలో విచ్చేయు చుందురు. దీనివలన వయోజనులలో సంస్కృత వాఙ్మయ పరిచయ మేర్పడుటయేకాక, పాఠశాలపట్ల గ్రామస్థులకు శ్రద్ధ ఏర్పడినది. శ్రీ సోమంచి లింగయ్య, శ్రీ ఈదర వెంకట రావు పంతులు, శ్రీ భోగరాజు బుచ్చిరామయ్య, శ్రీ కప్పగంతుల సుబ్రహ్మణ్య శాస్త్రి ఈ పాఠశాలను స్థాపించుటలోను, వృద్ధికి తెచ్చుటలోను విశేషకృషి గావించిరి. శ్రీ కందుకూరి అంబికానాథ వరప్రసాద రావు యొక్కయు, చెరుకువాడ బాలాత్రిపుర సుందరమ్మ యొక్కయు ఔదార్యముచే పాఠశాలకు స్వంత భవనము, విద్యార్థులకు వసతిగృహము ఏర్పడినవి.

గౌతమీ విద్యాపీఠము, రాజమండ్రి: తెలుగు దేశమున క్రమముగ సంస్కృతభాష, వేద శాస్త్రములు లోపించు చుండుటను గమనించి శ్రీ రాజా కాండ్రేగుల శ్రీనివాస జగన్నాథరావు పంతులును, వారి కుమారులును ఈ విద్యాపీఠమును 1944 లో స్థాపించిరి; ఇందు వేదవేదాంగములను బోధించు ప్రాచీన పద్ధతి మహావిద్యాలయము, ప్రాచ్య విద్యాపరీక్షా కేంద్రము, విశ్వవిద్యాలయానుమత విద్యా ప్రవీణ, భాషాప్రవీణాది పరీక్షలకు బోధించు సంస్కృత కళాశాల, ఓరియంటల్ హైస్కూలు, విమర్శశాఖ, ఆంధ్ర గాన కళాపరిషత్తు, సరస్వతీ భవన గ్రంథాలయము మొదలగు సంస్థలు కలవు. ఇచటి ఓరియంటల్ హైస్కూలులో హెచ్చుమంది విద్యార్థు లున్నారు. అన్ని సంస్థలలోను కలిపి సుమారు 350 మంది విద్యార్థు లున్నారు; సుమారు 20 మంది అధ్యాపకులు గలరు. ప్రాచీన పద్ధతిని తర్క వ్యాకరణాది శాస్త్రములను చదువువారు కూడ విశ్వ విద్యాలయ ప్రాచ్య బిరుద పట్ట పరీక్షలకేగి యుత్తీర్ణు లగుచున్నారు. ప్రతి సంవత్సరము శ్రావణ బహుళాష్టమినాడు ప్రాచీన విద్యల నభ్యసించిన విద్యార్థుల కిచట పరీక్షలు జరిపి ఉత్తీర్ణులకు బహుమానము

లీయబడును. విద్యార్థులకే కాక దేశములోని పండితులకు కూడ నిచట వార్షిక సత్కారములు జరుగుచున్నవి.

ఈ విద్యా పీఠమునకు శ్రీ రాజా కాంద్రేగుల జమీన్ దారు 50 ఎకరముల మాగాణి భూమి నిచ్చి పోషించు చున్నారు; 20 మంది విద్యార్థులకు ఉచిత భోజన సౌకర్యమును కలిగించిరి; ఇంతేకాక ఎనమండ్రు విద్యార్థులకు స్వల్పముగ విద్యార్థి వేతనములను గూడ నిచ్చుచున్నారు. ఇందలి 16 గురు విద్యార్థులకు పందిరి మహాదేవుని కోటి లింగాల సత్రమునందు ఉచిత భోజన సౌకర్యము కలిగింప బడుచున్నది. శ్రీ కాంద్రేగుల జగన్నాథ గోపాలరావు విద్యాపీఠాభివృద్ధికి విశేషముగ కృషిచేసి యున్నారు.

సంస్కృత ప్రచారిణీ సభ, చిత్తూరు: ఈ సంస్థ చిత్తూరు జిల్లా కాళహస్తి తాలూకా ఏర్పేడు సమీపమున గల అమందూరు గ్రామములో తొలుత నుద్భవించెను. ఏర్పేడు లోని శ్రీ వేంకటేశ్వర మాధ్యమిక సంస్కృత పాఠశాలలో సంస్కృతోపాధ్యాయులుగ నుండిన శ్రీయుతులు తి. కం. తిరువేంగడాచార్యులు, కే. శ్రీనివాసాచార్యులు, బి. శేషాచార్యులు, నేలభొట్ల కోటయ్యశాస్త్రి, టి. శివచరణం, వి. బాలకృష్ణశాస్త్రి యనువారు ఒకనాడు సమావేశమై సంస్కృతములో ప్రవేశ పరీక్షకు పూర్వము భాషా జ్ఞానమునకు కొలతబద్దయు, పరిగణనమును లేనందున ఆలోటును తీర్చుటకై పరీక్షల నేర్పరచుచో, ఆ పరీక్షలపై ఆసక్తిచే ననేకులు సంస్కృతమును నేర్చుకొను నవకాశ మేర్పడునని తలంచి యొక పాఠ్య క్రమము నేర్పరచి పరిచయ, అభిజ్ఞ, సమర్థ, కోవిద అను పరీక్షలను జరుపుటకు నిశ్చయించిరి. ఇందు నిమిత్తము వారు 1945 లో సంస్కృత భాషా ప్రచారిణీ సభను స్థాపించిరి. వీరు ఆ సంస్థయొక్క కార్యభారమును వహించుటయే కాక ఆర్థికముగ కూడ సంస్థ ప్రాతిపదిక పుష్టిని గల్గించిరి.

గద్యపద్యాత్మక పాఠ్య గ్రంథముల పట్టికయు, పరీక్షల నియమావళియు దేశములోని పండితులకు పంపబడెను. అనేకులు పండితులు తమ శిష్యుల నీ పరీక్షలకు పంపసాగిరి. తొలిసారిగ 1946 జనవరిలో ఈ పరీక్షలు జరిగెను. తొమ్మిది కేంద్రములలో మొత్తము 90 మంది విద్యార్థు లీ పరీక్షలకు వచ్చిరి.

1948 లో సంస్థ చిత్తూరునకు మార్చబడెను; శ్రీ కోటం రాజు సత్యనారాయణ శర్మ మున్నగువారి సాయమున ఈ సంస్థ రిజిష్టరు చేయబడెను. శ్రీ మాడభూషి అనంత శయనం అయ్యంగారు అధ్యక్షులుగాను, శ్రీ ఎం. రామనాథ అయ్యరు కార్యదర్శిగాను, శ్రీ తి. కం. తిరువేంగడా చార్యులు సహాయ కార్యదర్శిగాను ఎన్నుకొన బడిరి. పరీక్షార్థుల సంఖ్య క్రమముగ పెరుగసాగెను. పరీక్షలు సామాన్యముగ ఆగస్టు, మార్చి మాసములలో జరుగును. ఇపుడు సంవత్సరమునకు దాదాపు రెండువేల మంది ఈ సంస్థ జరుపు పరీక్షలకు వచ్చుచున్నారు. కేంద్రములు హెచ్చుగా ఆంధ్రప్రదేశములోనే యున్నను, ఇతర ప్రాంతములలో కూడ నీ పరీక్షలు జరుగుచున్నవి.

పాఠ్యగ్రంథ ప్రచురణము వలన సభకు చక్కని యాదాయము రాసాగెను. ఈ సంస్థ సంస్కృత భాషాబోధిని, ప్రథమ, ద్వితీయ, తృతీయ వాచకములు, రఘువంశము, కుమారసంభవములోని కొన్ని సర్గలును (సులభ వ్యాఖ్యా సహితముగ), రామకథ, శబ్దమంజరి, సమాసకుసుమావళి మున్నగు పుస్తకములను ప్రచురించెను.

ఈ సభ చిత్తూరులో సంస్కృత పాఠశాలను నిర్వహించు చున్నది. అందు నూర్గురు విద్యార్థులును, ముగ్గురు ఉపాధ్యాయులును కలరు. ఈ సభకు సుమారు పదివేల రూపాయల విలువగల యొక భవనమును, అయిదు వేల రూపాయలు విలువగల గ్రంథాలయమును గలవు.

ఓరియంటల్ కళాశాల, విజయవాడ: ఈ కళాశాల హైదరాబాదు హిందీ ప్రచార సభ వారిచే 1954 లో ప్రారంభింపబడినది. నాలుగు సంవత్సరముల యనంతరము ఆర్థిక కారణములచే సభవారు ఈ కళాశాలను మూసివేయ దలంపగా దానిని విజయవాడ మునిసిపల్ కౌన్సిలు నిర్వహింపనెంచెను. ప్రభుత్వానుమతితో 1960 జనవరిలో కళాశాల మునిసిపాలిటీ పరిపాలనములోనికి వచ్చెను. ఆంధ్ర ప్రదేశ్‌లో మున్సిపాలిటీ ప్రాచ్య కళాశాలను నిర్వహించుట కిదియే ప్రథమము.

ఈ కళాశాలకు శ్రీ పేరి సర్వేశ్వర శర్మ మొదటి ప్రిన్సిపాల్‌గా పనిచేసిరి. తరువాత తాత్కాలికముగ శ్రీ వడ్లమూడి గోపాలకృష్ణయ్య ప్రిన్సిపల్‌గా వ్యవహరించిరి. 1955 లో శ్రీ వి. వి. ఆర్. సోమయాజి ప్రిన్సిపాల్‌గా నియుక్తులైనారు; ఇపుడు వీరితో కలిపి ఐదు గురు అధ్యాపకులు కలరు. ఈ కళాశాలలో భాషా ప్రవీణ (తెలుగు, సంస్కృతము; 2 హిందీ; సంస్కృతము) తరగతులు నడుపబడుచున్నవి. ఈ కళాశాల ఆంధ్ర విశ్వవిద్యాలయమునకు అనుబంధ సంస్థగా నున్నది. భాషా ప్రవీణ ప్రవేశ పరీక్షకును ఇందు శిక్షణ మొసగబడు చున్నది. ఈ కళాశాలలో మొత్తము నలువది మంది విద్య నభ్యసించు చున్నారు. వీరిలో విద్యార్థినులే అధిక సంఖ్యాకులు.

శ్రీ శోభనాద్రి లక్ష్మీనృసింహస్వామి వార్ల వేదశాస్త్ర పాఠశాల, ఆగిరిపల్లి: ఈ పాఠశాల 1908 లో శ్రీ మల్లాది సుబ్బా

రాయహరిదాసు యొక్కయు, శ్రీ బొడ్డుపల్లి వెంకట శివయ్య యొక్కయు ప్రోత్సాహమున శ్రీ సూరి మార్కండేయ శాస్త్రిచే స్థాపింపబడెను. దీనికి భూవసతి నొసగిన వారిలో శ్రీ మార్కండేయ శాస్త్రి, శ్రీ వావిలాల వెంకట శివావధానులు, శ్రీ రాయప్రోలు సీతారామయ్య, శ్రీ అమరవాది నీలకంఠ సోమయాజులు, శ్రీ బొద్దనపల్లి వెంకట శివయ్య కలరు. శ్రీ ఉయ్యూరు జమీన్‌దారులు, శ్రీ సూరి భగవంతం, శ్రీ వేలూరి శివరామ శాస్త్రి కూడ ఈ సంస్థ యభివృద్ధికి కారకులలో పేర్కొనదగి యున్నారు. ఈ పాఠశాల ఒక రిజిష్టర్డు సంస్థచే పాలింప బడుచున్నది. 1912 లో ఉప్పులూరి పున్నమ్మ యౌదార్యముచే పాఠశాలకు స్వంత భవనము నిర్మింపబడెను.

ఆదినుండియు ఈ పాఠశాలలో వేదము, స్మార్తము, కావ్యపాఠములు బోధింపబడుచుండెను. శ్రీజయంతి భగీరథ శాస్త్రి వ్యాకరణ శాస్త్రాధ్యాపకులుగ దయ చేయుటతో నీ పాఠశాల నలుదిక్కుల నుండియు విద్యార్థుల నాకర్షించెను. వా రిచ్చుటకు వచ్చునప్పుడే 15 గురు విద్యార్థులతో వచ్చిరి. కంభంపాటి రామమూర్తి శాస్త్రి, చిలుకూరి వరదయ్య శాస్త్రి, ఉప్పులూరి దక్షిణామూర్తిశాస్త్రి, గొడవర్తి యతిరాజ సంపత్కుమారాచార్యులు, ఖండ్రిక శేషావధానులు వ్యాకరణ శాస్త్రమునకును, శ్రీ వేమూరి రామబ్రహ్మ శాస్త్రి మున్నగువారు తర్క, వేదాంతములకును, పురిఘళ్ల వేంకటాచలపత్యవధానులు, ఖండ్రిక శేషావధానులు మున్నగు వారు వేదశాఖకును అధ్యాపకులుగ నుండిరి. వారివద్ద వేదశాస్త్ర విద్యలనభ్యసించి గొప్ప విద్వాంసులైనవారు అనేకులున్నారు. ఈ పాఠశాలనుండి వచ్చినంతమంది ప్రాచీన పద్ధతి మహా పండితులు మరి యే పాఠశాలనుండియు రాలేదని తోచును.

ఇటీవల, 1952 లో ఆంధ్ర విశ్వవిద్యాలయమువారి అనుమతిని పొందిన ఓరియంటల్ కళాశాలా కక్ష్యలు భాషా ప్రవీణ, విద్యాప్రవీణ కూడ ఈ విద్యాలయములో ఏర్పాటైనవి. ఈ కళాశాలా కక్ష్యలకు ప్రత్యేకముగ భవనము గలదు. శ్రీ పేరి వేంకటేశ్వర శాస్త్రి ప్రధానాచార్యులుగ నున్నారు.

సంస్కృత ప్రచారక సమితి, భీమవరము (పశ్చిమ గోదావరి జిల్లా) : ఇదియొక రిజిష్టర్డు సంస్థ. ఈ సంస్థ రెండు విద్యాలయములను నిర్వహించు చున్నది. అందొకటి 1959 లో స్థాపితమైనది. ఇది ఆంధ్ర విశ్వ విద్యాలయము యొక్క అనుమతి పొందిన ప్రాచ్య కళాశాల. ఇందు సాహిత్య విద్యా ప్రవీణ, భాషాప్రవీణ పరీక్షలకై విద్యార్థులకు శిక్షణ మొసగ బడుచున్నది. శ్రీ దర్భా సర్వేశ్వర శాస్త్రి మొదటి ప్రిన్సిపాల్‌గా నియమింపబడిరి. రెండవది దాని తోపాటే శ్రీ పాలూరి గంగమ్మ పేర స్థాపింపబడిన ఓరియంటల్ మిడిల్ స్కూలు. కళాశాల విద్యార్థులకు ఉచిత గ్రాస వాస సౌకర్యములు కలవు.

ఈ సంస్థకు శ్రీ కురిశేటి నాగభూషణము అధ్యక్షులు గాను; శ్రీ నిమ్మల సంగయ్యానాయుడు, శ్రీ దోనేపూడి విశ్వనాథ శాస్త్రి కార్యదర్శులుగను ఉన్నారు.

డి. కె. వి. కె. సంస్కృత కళాశాల, గుంటూరు : ఈ కళాశాల 1958 లో స్థాపింపబడినది. ఇది ఆంధ్ర విశ్వవిద్యాలయానుమతి పొందిన ప్రాచ్య కళాశాల. ఇందు భాషాప్రవీణ, సాహిత్య విద్యాప్రవీణ కక్ష్యలు కలవు. ప్రవేశ పరీక్షకును శిక్షణ మొసగబడుచున్నది. కళాశాలా కక్ష్యలలో 20 మంది విద్యార్థులు గలరు. వారికి ఉచిత భోజన వసతులు కల్పింపబడి యున్నవి. ఈ సంస్థకు సంవత్సరమునకు సుమారు రు. 7,500 లు వ్యయమగును. సుమారు 50 వేల రూపాయల చరస్థిరాస్తులు కలవు. అమరావతి జమీన్‌దార్లచే నెలకొల్పబడిన రామచంద్ర పురాగ్రహార సభవారును, శ్రీ తాడేపల్లి పరమానందము, శ్రీ కొలచిన వెంకటకృష్ణమూర్తి ఈ సంస్థ దాతలలో పేర్కొనదగిన వారు.

శ్రీ రామ సాంగవేద పాఠశాల, విజయవాడ : ఏడెనిమిది సంవత్సరములు అవనిగడ్డలో నుండిన ఈ వేద పాఠశాల 1952లో విజయవాడకు మార్చబడి ఇపుడు శ్రీ రామ సాంగ వేదపాఠశాల యను పేర గవర్నరుపేటలో శ్రీ తంగిరాల రాఘవయ్య కల్యాణ మంటపములో సాగుచున్నది. దీని కగు సమస్త వ్యయమును రాఘవయ్య భరించు చున్నారు. శ్రీ తంగిరాల ఆంజనేయయజ్వ వేదాధ్యాపకులుగాను, సాంగ వేదభాస్కర కుప్పాలలక్ష్మావధాని వేదాంగ, షడ్దర్శన, వేదభాషాధ్యాపకులుగాను గల ఈ పాఠశాలలో వేదాధ్యేతలే కాక విద్యారణ్య భాష్యములో పరీక్షనిచ్చి యుత్తీర్ణులైన వేదార్థ ప్రవచన ప్రవీణులు కూడ నల్గురయిదుగురు తయారైనారు. ఈ పాఠశాలలో ప్రస్థానత్రయాత్మక వేదాంత పాఠ ప్రవచనము కూడ ప్రాచీన పద్ధతిని సాగుచున్నది.

ఆంధ్ర నలంద, గుడివాడ : ప్రాచ్య విద్యాభివృద్ధి కొరకు, ముఖ్యముగ, సంస్కృత భాషావ్యాప్తి కొరకు ఈ సంస్థ 1956 లో స్థాపింపబడినది. ఈ సంస్థ ఆంధ్ర విశ్వవిద్యాలయానుమతి పొందిన ప్రాచ్య కళాశాలను విద్యాలయమును శ్రీ అడుసుమిల్లి గోపాలకృష్ణయ్య 1957 లో స్థాపించెను. అందు భాషాప్రవీణ, విద్యాప్రవీణ కక్ష్యలలోని విద్యార్థులకు ఉచిత భోజన వసతులుకూడ కల్పింప

బడెను. కాని ఆంధ్ర నలంద వారీ కళాశాలను మూండేండ్లు నిర్వహించి యా పిమ్మట దీని భారమును వహింపవలసినదిగ గుడివాడ పురపాలక సంఘమును కోరిరి. పురపాలక సంఘము దాని కంగీకారము తెలిపినది కాని, ఇంకను దానిని చేపట్టలేదు. 1958 నుండి చంద్రమదన మోహన స్మారక చిహ్నముగ సెకండరీ సంస్కృత పాఠశాల యొకటి ఆంధ్ర నలందచే నడుపబడుచున్నది.

శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య కళాశాల, ప్రాచ్య పరిశోధన సంస్థ, తిరుపతి : అప్పటి తిరుమల తిరుపతి దేవస్థానముల కార్య నిర్వహణాధికారి యగు శ్రీ మహంతు 1884 లో తిరుపతి పురములో వేదపాఠశాలను స్థాపించిరి. అందు యజుర్వేదము, వైఖాన సాగమములు, ద్రావిడవేదము అనబడు నాలాయిర దివ్యప్రబంధములను నేర్పుచుండిరి. అప్పటి నుండి శతాధికులైన విద్యార్థులకు అన్నవస్త్ర వసతులు ఉచితముగ కల్పించి విద్య గరపుచు వచ్చిరి. తరువాత సంస్కృత విద్యాభ్యాసమునకు ప్రాధాన్యమిచ్చు కొన్ని తరగతులు ప్రారంభింప బడెను. 1920 లో ఈ విద్యాలయమున మద్రాసు విశ్వవిద్యాలయపు ప్రాచ్య బిరుద పరీక్షాప్రణాళిక ప్రవేశ పెట్టబడెను. ఈ ప్రాచ్య కళాశాల విభాగము చిరకాలము మద్రాసు విశ్వవిద్యాలయమునకు సంబంధించి యుండెను. తరువాత ఇది శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయానుమత ప్రాచ్య కళాశాలగ నున్నది. ఇచ్చట చదివి న్యాయ వ్యాకరణ మీమాంసా వేదాంత సాహిత్యములలో శిరోమణి బిరుద పట్టములను పొందిన వారు శతసంఖ్యాకులు కలరు ; విద్వాన్ పరీక్షలో నుత్తీర్ణులైనవారు కూడ పలువురు కలరు. ప్రాచ్య విద్యాప్రవేశ పరీక్షకును ఇచ్చట శిక్షణ మొసగబడును.

1940 నుండి ఈ సంస్కృత పాఠశాలలో తెలుగులోనే కాక తమిళము, హిందీ భాషలలో కూడ విద్వాన్ తరగతు లేర్పాటయినవి. అప్పటి నుండియు ఈ సంస్కృత విద్యాలయము యొక్క పేరు శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య కళాశాల (ఓరియంటల్ కాలేజి) యని మార్చబడినది.

సంస్కృతము, ఆంధ్రము, తమిళము, పాళీ, సంగీతము, ఆగమములు - అను విషయములలో పరిశోధన జరిపించుటకై శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యవిద్యా గవేషణ సంస్థ (శ్రీ వేంకటేశ్వర ఓరియంటల్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్) స్థాపింపబడినది. ఈ సంస్థ 1956 లో శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయమునకు స్వాధీనపరుపబడినది. ఈ సంస్థ కనుబంధముగ ముద్రితాముద్రిత గ్రంథములతో కూడిన గ్రంథాలయము కలదు. శ్రీ మానవల్లి రామకృష్ణకవి, శ్రీ కోరాడ రామకృష్ణయ్య, శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రి మున్నగు విద్వద్రత్నకాండు లీ సంస్థలో పరిశోధన సాగించి యుండిరి.

పైన తెలిపిన పాచ్యకళాశాల నేటికిని శ్రీ తిరుపతి తిరుమల దేవస్థాన పరిపాలనము క్రిందనే యున్నది. ఈ కళాశాలలో ఆచార్యపీఠము నలంకరించినవారిలో శ్రీ డి. టి. తాతాచార్యులు, శ్రీ వేంకటేశ్వర దీక్షితర్ మున్నగు మహాపండితులు కలరు. శ్రీ పరవస్తు వేంకటరామానుజ స్వామి కళాశాలకును, సంస్థకును కూడ చాలకాలము అధ్యక్షులుగ పనిచేసిరి.

శ్రీ శారదా నికేతనము, గుంటూరు : 1922 లో శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ, వారి ధర్మపత్ని శ్రీమతి లక్ష్మీబాయమ్మ ఈ సంస్థను స్థాపించిరి. జాతీయ సంప్రదాయానుసారము మహిళలకు శిక్షణ నిచ్చుట ; గురుకుల విధానముచే బాలికలకు ఉన్నతాశయములను గలిగించుట ఈ సంస్థయొక్క ఉద్దేశములు. సంస్కృతాంధ్రములతోపాటు చిత్రలేఖనాది లలిత కళలే కాక ప్రేమ, అల్లిక, కుట్టుపని మొదలగు చేతి పరిశ్రమలతో సహా అనేక విద్యలు ఇచ్చట చాలకాలము గరుపబడు చుండెడివి. ప్రభుత్వము వారి లోయరు, హయ్యరు సంగీత పరీక్షలకు విద్యార్థినులు హాజరగుచుండిరి. క్రమముగ ఈ సంస్థ ఆంధ్ర విశ్వవిద్యాలయానుమతమైన ప్రాచ్య కళాశాలయై భాషాప్రవీణ పరీక్షలకు విద్యార్థినులను పంపుచున్నది. కర్ణాటక గాత్ర సంగీతమున ఆంధ్ర విశ్వవిద్యాలయమువారి డిప్లమా పరీక్షకు కూడ విద్యార్థినులు శిక్షణ పొందుచున్నారు; ఇచట ప్రవేశ పరీక్షకును శిక్షణ మొసగ బడుచున్నది. హిందీ విశారద, ప్రవీణ కక్ష్యలును ఇచట గలవు.

ఈ సంస్థ రిజిష్టరు చేయించబడినది. ఈ సంస్థకు సంబంధించిన విద్యార్థినీ వసతి గృహములలో ప్రతిసంవత్సరము సుమారు 55 మంది విద్యార్థిను లుందురు. పట్టణములో ఇతరత్ర నివసించుచు ఇచట విద్యాభ్యాసము చేయువారు సుమారు 125 మంది యుందురు. బ్రాడీపేటలో రెండు ఎకరముల స్థలములో నీ సంస్థ భవనములు కలవు. భూములు, స్థలములు, బాండ్లు మున్నగు రూపములలో నీ సంస్థకు సుమారు 5 లక్షల రూపాయల విలువగల ఆస్తి కలదు. శ్రీ మునగాల రాజా, శ్రీ కోట లక్ష్మయ్యా నాయుడు, శ్రీ దేశభక్త కొండా వెంకటప్పయ్యా, శ్రీ మంత్రి ప్రగడ నరసింహము, శ్రీ వేటూరి శివసుబ్బారావు ఈ సంస్థకు భూరి విరాళము లిచ్చిన వారిలో కలరు.

శ్రీ నారసింహ సంస్కృత కళాశాల, చిట్టిగూడూరు (కృష్ణాజిల్లా): ఈ కళాశాల శ్రీమాన్ తిరుమల గుదిమెళ్ల వరదాచార్యులచే తమ తండ్రి పేరున 1923 లో

స్థాపితమైనది. ఇది మొదట మద్రాసు విశ్వ విద్యాలయమునకు అనుబంధ కళాశాలగ నుండెను. తరువాత 1926 లో ఆంధ్ర విశ్వ విద్యాలయమునకు అనుబంధముగ చేయబడినది. ఈ కళాశాల ప్రభుత్వము వారిచే గుర్తింపబడి, తన్మూలమున రాగల సహాయమును కూడ పొందుచున్నది. సంస్థాపకులే స్వయముగ కొంత మూల ధనమును ఈ కళాశాలకు నిచ్చిరి. మరికొంత విరాళముల రూపమున సంపాదింప బడినది. ఈ సంస్థకు ఇప్పుడు 32 ఎకరముల సాగు భూమియు, 8 గదులు గల భవనమును, 2,300 గ్రంథములును గలవు.

ఈ కళాశాల యందు విద్యా ప్రవీణలో వ్యాకరణ, సాహిత్య శాఖలు గలవు. భాషాప్రవీణ లో తెలుగు, సంస్కృత శాఖలు నిర్వహింప బడుచున్నవి. ప్రస్తుతము 6 గురు పండితులు గలరు. శ్రీ దువ్వూరి వెంకటరమణశాస్త్రి, శ్రీ కొల్లూరి సోమశేఖర శాస్త్రి మున్నగు మహాపండితులిచ్చట కొంతకాల మాచార్యులుగా నుండిరి. ఇచ్చట విద్యాభ్యాసముచేసి యాంధ్రదేశమునం దంతటను పలు ప్రదేశములలో ఉన్నత పాఠశాలలలోను, కళాశాలలోను, సంస్కృతాంధ్రాధ్యాపకులుగాను, కవులు గాను, విమర్శకులుగాను విఖ్యాతులైనవారు అనేకులు గలరు.

స్థాపకులుగా, ప్రిన్సిపాల్ గా, దాతగా ఈ కళాశాలకు సుస్థితిని, ప్రతిష్ఠను గలిగించిన శ్రీ వరదాచార్యులు పరిపాలక సంఘమునకు కార్యదర్శిగ నున్నారు. పరిపాలక సంఘ నియమావళి ననుసరించి వీరి తరువాత వీరి కుమారుడీ పదవిని పొందవలసియున్నది.

శ్రీ చల్లపల్లి వారి పాఠశాల, మోడేకుర్రు (తూర్పు గోదావరి జిల్లా): ఈ విద్యాలయము 1896 లో శ్రీ చల్లపల్లి రంగయ్యపంతులుచే స్థాపింపబడెను. ఇక్కడ వేదము, సాహిత్యము, తర్క, వ్యాకరణ శాస్త్రములు నేర్చినవారు బహుశత సంఖ్యాకులు గలరు. శ్రీ కందుకూరి కృష్ణశాస్త్రి వంటి మహాపండితు లిచట ఆచార్యులుగ నుండిరి,

ప్రాచీన పద్ధతిని చిరకాలము నడచిన ఈ పాఠశాలలో 1954 లో ఆంధ్ర విశ్వవిద్యాలయము తన అనుమత సంస్థలలో నొకటిగ చేర్చుకొన్నది. నాటినుండి ఇచ్చట భాషాప్రవీణ, విద్యాప్రవీణ తరగతులు ప్రారంభింపబడినవి. కళాశాల కక్ష్యలకు ఐదుగురు అధ్యాపకులు, 30 మంది విద్యార్థులు కలరు. మోడేకుర్రు గ్రామములో నున్న సత్రములో విద్యార్థులకు భోజన వసతి గలదు. ఈ కళాశాలకు సుమారు 20 ఎకరముల భూమి కలదు. పాఠశాలా భవనము బొబ్బర్లంక - అమలాపురము కాలువ నానుకొని యున్నది. ఒక రిజిష్టర్డు సంఘము ఈ కళాశాలను పాలించుచున్నది.

వేద సంస్కృత పాఠశాల, నెల్లూరు: దాదాపు ఎనుబది సంవత్సరముల క్రిందట ఈ పాఠశాలను శ్రీ కుప్పచ్చి లక్ష్మయ్య స్థాపించిరి. పిదప ఇది శ్రీ ఆయలూరి వెంకయ్య పంతులుచే పోషింపబడుచు మేడం బ్లావట్స్కి, కర్నల్ ఆల్కాట్ అను జగత్ప్రసిద్ధ దివ్యజ్ఞాన సమాజ ప్రముఖుల ప్రోత్సాహమున దినదినాభివృద్ధి నొందెను. శ్రీ బోడిరెడ్డి రంగారెడ్డి, కాసుభేల సీతాపతిరావు పంతులు మున్నగు సంస్కృతాభిమానుల నిరంతర కృషిచే నీ పాఠశాలా పాలక సంఘము రిజిష్టరు చేయించబడెను. నెల్లూరు జిల్లాలోని యుదారు లనేకు లీ సంస్థ యభివృద్ధికి తోడ్పడిరి.

ఇది కళాశాలగా మారి ప్రథమమున మద్రాసు విశ్వవిద్యాలయమునకును, తరువాత ఆంధ్ర విశ్వవిద్యాలయమునకును, ప్రస్తుతము శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయమునకును అనుబంధింపబడియున్నది. సాహిత్యశిరోమణి, వ్యాకరణ శిరోమణి, విద్వాన్, ప్రవేశ పరీక్షల కిచట చాల కాలమునుండి శిక్షణ మొసగబడుచున్నది. కళాశాలా కక్ష్యలలో 29 మందియు, ప్రవేశ కక్ష్యలలో 25 మందియు విద్యార్థులు కలరు. ప్రత్యేకముగ వేదమునే అభ్యసించువారు ఇద్దరే యున్నారు. సంస్కృతముతోపాటు వేదము నభ్యసించువారు కొందరు కలరు. ఇటీవల ఈ సంస్థ ఓరియంటల్ ఉన్నత పాఠశాలనుకూడ నెలకొల్పినది. అందు సుమారు 120 మంది విద్యార్థులు కలరు. ఈ కళాశాలలో ఆయుర్వేద బోధన కూడ కలదు; అఖిల భారతాయుర్వేద మహామండలి పరీక్షలకు శిక్షణ మొసగ బడుచున్నది.

కళాశాలావరణము సుమారు 2 ఎకరముల వైశాల్యము గల స్థలము. ఉపాధ్యాయులలో కొందరకును, విద్యార్థులలో కొందరుకును ఇచ్చటనే నివాస వసతులు గలవు. ఇచట సరస్వతీదేవి యాలయముకూడ కలదు. కళాశాలా గ్రంథాలయములో వేదవేదాఙ్గములకును, సంస్కృతాంధ్రాంగ్ల సాహిత్యములకును సంబంధించిన గ్రంథములు రెండువేలకు పైగా కలవు. సుప్రసిద్ధ విద్వాంసులైన గాజులపల్లి హనుమచ్ఛాస్త్రి కళాశాలకు చాల కాలము ప్రధానాచార్యులుగ నుండిరి.

మున్నాలాల్ సంస్కృత పాఠశాల, సికిందరాబాద్: ఈ పాఠశాల 1930 లో శ్రీ మున్నాలాల్ లక్ష రూపాయల విరాళముతో స్థాపితమైనది. ఈ పాఠశాలయు, నొక శివాలయమును రెండు ఎకరముల స్థలములో నిర్మింపబడియున్నవి. మున్నాలాల్ ధర్మనిధి సంఘమువారే ఈ

సంస్థను పరిపాలించుచున్నారు. శ్రీ బారుగు మహాదేవ శ్రేష్ఠి, శ్రీ దండు వెంటయ్య కూడ ఈ సంస్థకు ఆర్థికముగ తోడ్పడిరి. ఇప్పటికి పాఠశాలలో సుమారు 120 మంది వేదాధ్యయనమును, సంస్కృత భాషాభ్యాసమును గావించి పండితులైరి. ఇచట బి. ఓ. ఎల్., డిప్. ఓ. ఎల్., పరీక్షలకు శిక్షణ మొసగబడుచున్నది. 20 మంది విద్యార్థులు కలరు. విద్యార్థుల కుచిత భోజన వసతి కలదు. విద్యార్థుల వసతి నిమిత్తము ముక్త్యాల రాజావారు 20 వేల రూపాయల విలువగల భవనము నిచ్చియున్నారు. కేంద్ర విద్యా సంఘమువారు ఈ సంస్థకు ప్రతి సంవత్సరము ఆరు వేల రూపాయలు విరాళముగ నిచ్చుచున్నారు. శ్రీ చివుకుల అప్పయ్య శాస్త్రి, శ్రీ అనుముల రాఘవశర్మ కూడ ఈ సంస్థకు గొప్ప సేవ చేసిరి.

ఇంద్రగంటివారి పాఠశాల, కర్నూలు : సదాచార సంపన్నులు, వదాన్యశేఖరులు నైన శ్రీ ఇంద్రగంటి శేషావధానులు ఈ పాఠశాలను 1912లో స్థాపించిరి. ఎంతమంది విద్యార్థులు వచ్చినను లేదనకుండ భోజనము పెట్టుచుండిరి. తరువాత వారి సంస్థ శాశ్వతముగ నడచుటకు తగిన ధనమును స్వహస్త పరహస్తములచే చేకూర్చిరి. శ్రీ వెల్లాల రాఘవ శాస్త్రి, శ్రీ వెల్లాల శంకర శాస్త్రి పాఠశాలలో నధ్యాపకులుగ నుండి బహు విద్యార్థులకు సాహిత్యమును, శాస్త్ర పాఠములను బోధించిరి. ఇచట వేదము కూడ నధ్యాపనము గావింపబడు చుండెను. ఇట్లు సుమారు నలుబది సంవత్సరములు నడచిన పిమ్మట ఈ పాఠశాలలో ప్రాచ్య విద్యోన్నత పాఠ్య ప్రణాళిక ప్రవేశపెట్టబడినది.

సుబ్రహ్మణ్య భారతీ భవన కళాశాల, నరేంద్రపురము (తూర్పు గోదావరి జిల్లా): శ్రీ చల్లా సుబ్రహ్మణ్యము ఏర్పరచిన ధర్మనిధిచే ఈ పాఠశాల 1915 ప్రాంతమున నెలకొల్పబడినది. దీనిలో శ్రీ పుల్య ఉమామహేశ్వర శాస్త్రి మున్నగు మహాపండితు లధ్యాపకులుగ నుండిరి. ఇంతవరకు ఈ పాఠశాలలో తర్క, వ్యాకరణ, సాహిత్యములందు విశారదులైనవారు శతాధికులు ; వేదవేత్తలుకూడ సుమారిరువది మంది కలరు. ఇందలి విద్యార్థులు కొందరు చల్లావారి సత్రములోను, మరి కొందరు వారముల పద్ధతిని భోజనమును నిర్వహించుకొను చుందురు. ఇచట ప్రాచీన పద్ధతిలో చదువుకొన్న విద్యార్థులుకూడ చాలమంది ప్రభుత్వమువారును, విశ్వ విద్యాలయము వారును నెలకొల్పిన పరీక్షల కేగి యుత్తీర్ణులగుచున్నారు.

విశ్వేశ్వర సంస్కృతాంధ్ర కళాశాల, ఓరుగల్లు : శ్రీ ఆకారపు నరసింగము గుప్తచే ఈ కళాశాల 1950 లో స్థాపింపబడినది. ఒక రిజిష్టర్డు సంఘము ఈ కళాశాలను నిర్వహించుచున్నది. ఇది విశ్వవిద్యాలయానుమత కళాశాలయై విద్యార్థులకు సంస్కృతాంధ్రములలో ప్రవేశ పరీక్షకును, డిప్. ఓ. ఎల్., బి. ఓ. ఎల్, పరీక్షలకును శిక్షణ మొసగుచున్నది. ఇచట సుమారు 50 మంది విద్యార్థులును, ఆర్గురు ఉపాధ్యాయులును కలరు. శ్రీ ముదిగొండ వీరేశలింగ శాస్త్రి మొదటి నుండియు ఈ కళాశాలకు ప్రధానాచార్యులుగ నుండుటయే కాక దీని యభివృద్ధికి బహువిధముల కృషిచేయుచుండిరి. ఈ కళాశాల కేటేట అగు పదివేల రూపాయల వ్యయములో సగము ఆకారపు వారును, సగము ప్రభుత్వమువారును భరించుచున్నారు. ఈ కళాశాలలో ఆయుర్వేదము కూడ బోధింపబడుచున్నది. అఖిల భారతాయుర్వేద విద్యాపీఠ సంబంధమైన ఆచార్య, విశారద, భిషక్ పరీక్షలకును, వైద్య విద్వాన్ పరీక్షకును విద్యార్థులు పంపబడుచున్నారు. ఈ సంస్థచే నొక ఆయుర్వేద చికిత్సాలయము కూడ నిర్వహింపబడుచున్నది.

వేదాంత వర్ధనీ మహావిద్యాలయము, ఆల్వాల (హైదరాబాదు జిల్లా): ఈ మహా విద్యాలయమును 1929 లో హైదరాబాదు సీతారాం బాగ్ దేవస్థానములో స్థానిక విద్యార్థులతో శ్రీ కో. కం. అ. శఠకోప రామానుజస్వామి ప్రారంభించి నడుపుచుండిరి. విద్యార్థులు ఐదారు సంవత్సరములలో ప్రకరణాంత తర్కమును, సిద్ధాంత కౌముదిని, కువలయానందాది సాహిత్య గ్రంథములను పూర్తిచేయ గలుగు చుండిరి.

క్రమముగ పలు ప్రాంతములనుండి విద్యార్థులు చేర సాగిరి. మద్రాసు విశ్వవిద్యాలయమువారి శిరోమణి పరీక్షకు హైదరాబాదులో కేంద్ర మేర్పడెను. అనేకులు ఈ విద్యాలయములో చదివి న్యాయ, వ్యాకరణ, వేదాంత, సాహిత్య శిరోమణి, విద్వాన్ పరీక్షలకును వెళ్ళుచుండిరి.

యువ సంవత్సరములో శ్రీ గొబ్బూరి నరసింహాచార్యుల కృషివలన విద్యార్థులకు శాశ్వత భోజనవసతికి కావలసిన ధనము సంపాదింపబడెను. శ్రీ పన్నాలాల్ సేట్ ఖజాంచి, గనేరివాలా, వనపర్తి మున్నగు సంస్థానాధిపతులు, యాదగిరి మున్నగు దేవస్థానములవారు ధాన్య వస్తు ధన రూపముల గొప్ప సహాయము చేసిరి. ఆ పిమ్మట శ్రీ గనేరివాలా, శ్రీ లక్ష్మీనివాస్ ఔదార్యము వలన విద్యార్థులకు ఉచిత వసతి కూడ కల్పింపబడెను.

ఇంతలో శ్రీ నాగులంపల్లి కోదండరామయ్య, శ్రీ సురవరం ప్రతాపరెడ్డి ఈ పాఠశాలను సందర్శించి ఇచ్చట యధ్యాపకుల యోగ్యతలను, వారి తక్కువ జీతమును గమనించి నిజాంప్రభుత్వమునుండి నెలకు 500 రూపాయల

సహాయము వచ్చునట్లు చేసిరి. విద్యార్థుల సంఖ్య క్రమముగ 60 వరకు హెచ్చెను. కొంతకాలమునకు తరువాత ఈ సహాయము వేయి రూపాయలకు వృద్ధిచెందినది.

సంస్కృత విద్యాభిమానులైన శ్రీ సూరి భగవంతము ఉస్మానియా విశ్వవిద్యాలయోపాధ్యాయులుగ నున్న దినములలో ఆ విశ్వవిద్యాలయములో బి. ఓ. ఎల్., డిప్.ఓ.ఎల్, పరీక్షలు నెలకొల్పబడెను. ఈ వేదాంత వర్ధనీ మహావిద్యాలయము విశ్వవిద్యాలయానుమత సంస్థ యాయెను. ఇది నూర్గురు విద్యార్థులతోను, 15 గురు అధ్యాపకులతోను విరాజిల్లు చుండెను. శ్రీ వేదాల తిరువేంగళాచార్యుల వంటి విద్వాంసు లందు పనిచేయు చున్నారు. దీనిని కొలదికాలము తిరుపతి దేవస్థానము వారు నడపి తిరిగి విడచి పెట్టిరి. 1958 లో ఈ విద్యాలయము ఆల్వాలలోని మహారాజ కిషన్ ప్రసాద్‌గారి భవనములోనికి మార్చబడెను. వారి దౌహిత్రుడు రతన్ గోపాల్ రాష్ట్రపతి రాజేంద్ర ప్రసాదుగారి సమక్షమున సంస్థకు భూరి విరాళ మొసగిరి. ఆ పిమ్మట ఈ సంస్థకు కేంద్ర ప్రభుత్వము సహాయము గూడ లభించుచున్నది.

కేంద్రీయ సంస్కృత విద్యాపీఠము: ప్రాచ్య విద్యకు నిలయమైన తిరుపతి (చిత్తూరు జిల్లా) పట్టణమున కేంద్ర ప్రభుత్వాధ్వర్యవమున విశ్వ విద్యాలయ స్థాయిలో సంస్కృత భాషా పరిశోధనాది కార్యక్రమమును కొనసాగించుటకు కేంద్ర సంస్థ యొక దానిని ఇటీవలనే (1961) నెలకొల్పిరి. జ. పు.

# గ్రంథాలయోద్యమము

సార్వజనిక గ్రంథాలయముల పుట్టుకకు, పెంపునకు విజ్ఞాన శాస్త్రాభివృద్ధియు అచ్చు యంత్రముల వ్యాప్తియు హెచ్చుగ తోడ్పడినవి. 1806 వ సంవత్సర ప్రాంతమున తెలుగు లిపికి అచ్చు అక్షరములు తయారైనను, 1830 వరకు తెలుగులో అచ్చు పుస్తకములు అంతగా బయలు దేరలేదు. 1835 లో కొన్ని తెలుగు కావ్యములు మద్రాసులో అచ్చయినట్లు 1852 నాటికి మద్రాసులో తెలుగు ముద్రణాలయములు ఎనిమిది వరకు ఉన్నట్లు బ్రౌను దొర తెలిపినాడు. ఆనాటికి వార్తా పత్రికలు కొలదిగా వెలువడుచున్నను వాని కంతగా వ్యాప్తి లేనట్లు ఆయన వ్రాసెను. బ్రిటిష్ వారి ఏలుబడి క్రింద జమీందారులలో విద్యాప్రియులైన వారును, కొందరు పండితులును, భాషాభిమానులును గ్రంథ సామగ్రిని సేకరించి గ్రంథాలయములను నెలకొల్పినారు. ఈ విధముగా బయలు దేరిన గ్రంథాలయములు 1868 నాటికి ఒక్క విశాఖ పట్టణము జిల్లాలోనే ముప్పది వరకు లెక్కకు వచ్చినవి. కాని, వీనిని పూర్తిగా సార్వజనిక గ్రంథాలయములుగ లెక్కపెట్టుటకు వీలు లేదు.

తెలుగు దేశములో మొట్టమొదట స్థాపింపబడిన సార్వజనిక గ్రంథాలయము ఇప్పటికి తెలిసినంత వరకు 1886 లో విశాఖపట్టణములో స్థాపింపబడిన శ్రీ సరస్వతీ నిలయము. ఇది తెలుగునాట మొదటి గ్రంథాలయముగ లెక్కకు వచ్చుచున్నది. ఆంగ్లభాషతోగాని ఆంగ్లసంప్రదాయముతో గాని సంపర్కము లేని ఒక ప్రాథమిక పాఠశాలలో ఉపాధ్యాయుడు దీనిని ప్రారంభించెను; ఈ మహనీయుడు కీ. శే. మంతిన ఆదినారాయణ మూర్తి, ఈయన ఈ గ్రంథాలయమును ఇరువదేండ్లు ఏకదీక్షగా నడపినాడు. దీనికి తర్వాత వెలసినవి: 1889 లో కడప జిల్లా పులివెందలలో శ్రీ సరస్వతీ విలాసమందిరము, 1890 లో ఒంగోలున సి.ఏ.యస్. గ్రంథాలయము, 1895 లో భీమవరంతాలూకా, ఉండిలో నౌరోజీ క్లబ్బు, 1897 లో శ్రీ వీరేశలింగకవి సమాజము. ఆ వరుసలో బయలుదేరిన ముఖ్య గ్రంథాలయములలో పేర్కొనదగినవి: ' యంగ్ మెన్స్ అసోసియేషన్, గుంటూరు (1900), శ్రీ వీరేశలింగ పుస్తక భాండాగారము, రాజమండ్రి (1900), శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయము, హైదరాబాదు (1901), హిందూ యువజన గ్రంథాలయము, ఏలూరు (1904), రాజరాజ నరేంద్ర భాషా నిలయము, హనుమకొండ (1904), ఆర్యబాల సమాజము, పెదపాలెము, తెనాలి తాలూకా (1905).

ఇతరుల ప్రేరేపణ ప్రోత్సాహముల వలన గాక సంఘ సేవాప్రియులగు యువకుల వ్యగ్రోత్సాహ ఫలితముగ బయలుదేరిన ఈ ఉద్యమము నెమ్మదిగ వృద్ధి చెందినది. తాము బాగై, తోడివారిని బాగుచేయవలెనను వాంఛ వీరి నీ పనికి పురికొల్పినది. తమకును, తమతోడి వారికిని జ్ఞానాభివృద్ధి కలిగి దీని మూలముగ ఆనందము ననుభవించుటయే ఈ యుద్యమకర్తల సంకల్పము. ఇట్లు ఆదర్శ ప్రాయమైన ఆశయముతో బయలుదేరినది ఆంధ్ర గ్రంథాలయోద్యమము. దీనిని దేశవ్యాప్తము చేయదలచి విజయవాడలోనే శ్రీ రామమోహన ధర్మ పుస్తక భాండాగార నిర్వాహకులు విజయవాడలో ఆంధ్రదేశ గ్రంథాలయ ప్రతినిధుల మహాసభను జరిపిరి. 1914 లో ఏప్రిలు 10 వ తేదిన జరిగిన ఈ సభకు కీ. శే. చిలకమర్తి లక్ష్మీ

నరసింహము పంతులు అధ్యక్షత వహించిరి. విశాలాంధ్రము లోని వివిధ ప్రదేశముల కార్యకర్త లీ సభలో పాల్గొనిరి. వీ రాంధ్రదేశములో గ్రంథాలయోద్యమమును వ్యాప్తి చేయు నిమిత్తమొక సంఘము నేర్పాటు చేసిరి; ఇదే 'ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము'. దీనికి మొదటి అధ్యక్షులు కీ. శే. మోచర్ల రామచంద్రరావు పంతులు; ఉపాధ్యక్షులు కీ. శే. సూరి వేంకట నరసింహశాస్త్రి, కార్యదర్శులు శ్రీ అయ్యంకి వెంకటరమణయ్య, శ్రీ నాళం కృష్ణరావు.

కార్యకర్తల ఉత్సాహముతోపాటు తెలుగు దేశములోని గ్రంథాలయముల స్థాపనకు, అభివృద్ధికి క్రీ. శ. 1905 లో బయలుదేరిన 'వందేమాతరమ్' ఉద్యమము, 1913 లో బాపట్లలో జరిగిన ఆంధ్ర మహాసభతో ప్రారంభమైన ఆంధ్రోద్యమము, కీ. శే. దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు 'ఆంధ్రపత్రిక' కొంత దోహదము నిచ్చినవి. పంతులుగారి యుద్యమమున కొనర్చిన సేవలో చిరస్మరణీయ మైనది 'ఆంధ్ర వాఙ్మయ సూచి' (ముద్రితాముద్రిత గ్రంథముల పట్టిక) ప్రచురణము.

ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము కృషి మూలమున గ్రంథాలయ సందేశము తెలుగుదేశములో మూలమూలలకు ప్రాకినది. దీని మూలమున క్రీ. శ. 1913 లో 123 మాత్రమే ఉండిన గ్రంథాలయముల సంఖ్య క్రీ. శ. 1920 నాటికి 600 కు పైగా పెరిగినవి. విశాలాంధ్ర మందంతటను చేరి నేడివి దాదాపు 3,000 వరకు నున్నవి.

పై జెప్పిన రీతిగా బయలుదేరిన గ్రంథాలయములు ప్రజానీకములో విజ్ఞానవ్యాప్తి కొరకనేక విధములుగ పని చేయుచున్నవి. ఇవి అక్షరములయినను చదువను వ్రాయను నేర్వనివారి నిమిత్తము రాత్రి పాఠశాలలు పెట్టి, స్త్రీలు చదువుటకు పుస్తకముల నిండ్లకు పంపి, సామాన్య ప్రజల కొరకు బహిరంగ సభలు, హరికథా కాలక్షేపములు ఏర్పాటుచేసి, పుస్తకములు, పత్రికలు ప్రజలకు చదివి వినిపించి, వైజ్ఞానిక విషయములలోను, ఆటలలోను పోటీలు జరిపి బహుమతుల నిచ్చి పుస్తకప్రియులనే కాక పఠన వాంఛ లేనివారిని సైత మాకర్షించుచున్నవి.

వ్యక్తిగతముగ ఒక్కొక్క గ్రంథాలయము ఈ విధముగ పని చేయుచుండగా సమష్టి ఉద్యమ వ్యాప్తికై ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము తన విధిని విడువకుండా నెరవేర్చుచు వచ్చినది. విశాలాంధ్రములోని వివిధ ప్రాంతములలో నేఁటేట ఆంధ్ర దేశ గ్రంథాలయ మహాసభలను గ్రంథాలయ ప్రదర్శనములను జరుపుట; తాలూకా, జిల్లా, నగర గ్రంథాలయ సంఘములను నెలకొల్పుట; 'గ్రంథాలయ సర్వస్వము' అనుపేర ఒక పత్రికను నిర్వహించుట; గ్రంథాలయ వయోజనవిద్యల కార్యకర్తలకు శిక్షణ నిచ్చుటకై ప్రత్యేక పాఠశాలలను నడపుట; గ్రంథాలయ యాత్రలు, వసంతోత్సవముల ద్వారా గ్రంథాలయ సందేశములను వాడవాడలను చాటుట; దాతల అభీష్టానుసారము ఉచిత గ్రంథములను గ్రంథాలయముల కందజేయుట; కోరిన వారికి గ్రంథాలయముల రిజిస్ట్రేషను, ప్రభుత్వ విరాళములు, గ్రంథవరణము, పుస్తకముల భోగట్టా, గ్రంథాలయ పట్టికలు మున్నగు నిర్వహణ సమస్యలను గూర్చిన సమాచారమును తెలియజేయుట; గ్రంథాలయములకు, వయోజన విద్యకు సంబంధించిన వాఙ్మయమును గ్రంథాలయముల పట్టికలను, ఉత్తమ గ్రంథముల జాబితాలను ప్రచురించుట; ప్రత్యేక వయోజన విద్యాశాఖ ఏర్పాటు - ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘ ముఖ్యకార్యకలాపములు.

బ్రిటిషువారి ఏలుబడిలోనే ఈ సంఘము ప్రభుత్వము ద్వారా ఈ ఉద్యమ వికాసమునకు తోడ్పడు కొన్ని సౌకర్యములను సంపాదించినది. వీనిలో ముఖ్యమైనవి: సొసైటీల రిజిస్ట్రేషను చట్టముక్రింద గ్రంథాలయములను తక్కువ రుసుముతో రిజిస్టరు చేసికొనుట కవకాశము కల్పించుట; గ్రంథాలయములకు ప్రభుత్వ విరాళముల నిచ్చు విధానము నేర్పరచుట; జిల్లాబోర్డులు, మునిసిపాలిటీలు, గ్రామ పంచాయతీలు తమతమ అధికార క్షేత్రములలోని గ్రంథాలయములకు సహాయపడునట్లు చేయుట; తాము స్వయముగ గ్రంథాలయములను స్థాపించి పోషించుట; ఆంధ్రరాష్ట్రములోని స్థానిక సంస్థలన్నియు ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘములో సభ్యత్వము నొందుట కవకాశము కలిగించుట. ఇంతేకాక, ఈ సంఘము గ్రంథాలయములు ప్రభుత్వ విరాళమును పొందుటలో పడుచున్న ఇబ్బందులను ప్రభుత్వము దృష్టికితెచ్చి వీనిలో కొన్నిటిని తొలిగింప గలిగినవి. కమ్యూనిజము సాకుచెప్పి మద్రాసు, ఆంధ్రరాష్ట్రములు విడిపోక పూర్వ మొకప్పుడు మద్రాసు ప్రభుత్వము వయోజన విద్యాలయములపై ఆంక్షను విధింపగా దానిని రద్దుచేయుట కీ సంఘము గట్టిగా కృషి చేసినది. భారతదేశములో ముందుగా బయలుదేరిన ఈ ఉద్యమము అఖిలభారత గ్రంథాలయ నాయకత్వము కూడ వహించినది. ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘస్థాపకులే అఖిల భారత గ్రంథాలయ సంఘమునుగూడ స్థాపించి చాల కాలము దానిని నిర్వహించిరి. దాని పక్షమున ఎనిమిది అఖిలభారత గ్రంథాలయ మహాసభలు, కొన్ని ప్రదర్శనములు జరుపబడినవి. ఇంగ్లీషులో 'ఇండియన్ లైబ్రరీ

జర్నల్ ' అను పత్రికకూడ నడుపబడినది. ఈ సంఘము కృషి మూలకముగ బెంగాలు, పంజాబు, మద్రాసు మున్నగు రాష్ట్రములలో రాష్ట్రీయ గ్రంథాలయ సంఘము లవతరించినవి.

మొదటి ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభలోనే తెలంగానా ప్రతినిధులును ఉండిరి. తెలంగానా గ్రంథాలయోద్యమ మూలపురుషులు ఆంధ్రపితామహ శ్రీ మాడపాటి హనుమంతరావు, మిగిలిన పెద్దలు ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘములో ఆదినుండియు కార్యవర్గసభ్యులుగా నున్నారు. 1944 లో సింగరేణి కాలరీస్‌లో శ్రీ బూరుగుల రామకృష్ణ రావు ఆధిపత్యమున జరిగిన 25 వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభతో కలుపుకొని 1960 జూలైనాటికి ఐదు మహాసభలు తెలంగానాలో జరిగినవి. ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘపు తెలంగానా శాఖా కార్యాలయ మొకటి 1945 ఏప్రిలు 13 వ తేదీన ఖమ్మంలో ఏర్పాటు చేయబడినది.

దేశ స్వాతంత్ర్య సిద్ధి (1947)కి పిమ్మట గ్రంథాలయోద్యమ విషయమై ప్రభుత్వము కొంత శ్రద్ధ వహించినది. గ్రామ పంచాయతీలు గ్రంథాలయములను స్థాపించి నిర్వహించుటలో గల ప్రతిబంధకములు ఇటీవల తొలగింపబడి ఈ విషయమై వీని కెక్కువ స్వేచ్ఛ ఇవ్వబడినది. ఇంతకు పూర్వము ఫిర్కా డెవలెప్‌మెంటు డిపార్టుమెంటువారి యాజమాన్యమున పనిజరుగు ఫిర్కాలలో కేంద్రగ్రంథాలయముల నేర్పాటుచేసి వీనిలోని గ్రంథములను ఆయా ఫిర్కాలయందలి గ్రామాలలోని పిల్లలకు, పెద్దలకు అందజేయుటకు సంకల్పించి పనిని సాగించుచుండిరి. నేడు 'బ్లాకు ఏరియా' లలో గ్రంథాలయాలకు ప్రత్యేక విరాళము లివ్వబడుచున్నవి. అప్పటి మద్రాసు ప్రభుత్వము 1948 లో గ్రంథాలయ చట్టము నొకదానిని నిర్మించినది. దీని ననుసరించి హైదరాబాదు రాష్ట్రములోను 1955 లో నొక శాసన మేర్పాటు చేయబడినది. ఆంధ్రప్రదేశ్ అవతరణకు(1956) పిమ్మట ఈ రెండు శాసనములను సమన్వయము చేసి 1959 చివరలో ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయముల చట్టము ఏర్పడినది; ఇది 1960 ఏప్రెల్ 1 వ తేదీనుండి అమలులోనికి వచ్చినది.

ఆంధ్ర గ్రంథాలయోద్యమము సాధించిన పనులలో ఆంధ్ర గ్రంథాలయ ట్రస్టు నిర్మాణము ముఖ్యమైనది. పటమటలంక వాస్తవ్యులు శ్రీ కొమ్మూ సీతారామయ్య వితరణ మూలముగ ఇది ఏర్పడినది. ఈ సంస్థ కృషిద్వారా ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమువారు 1930 పటమట లంకలో సంపాదించిన ఎకరము స్థలములో 1949లో దాదాపు రు. 28,000 లు వెచ్చించి 'శ్రీ సర్వోత్తమ భవనము'ను నిర్మించిరి. 1957 లో దీనిపైన సుమారు రు. 22,000 లు ఖర్చుతో 'బాపూజీ మందిర' మను పేరిట నొక హాలును కట్టిరి. ట్రస్టు పక్షమున తెలుగులోని ఉత్తమ గ్రంథముల ప్రచారము నిమిత్తము గ్రంథాలయ పుస్తకశాల నిర్వహింప బడుచున్నది. వయోజన విద్యాగ్రంథములు, కీ. శే. గోటేటి జోగిరాజు వ్యవసాయ విజ్ఞాన సంపుటము లాదిగా గల ఉత్తమ గ్రంథములు ప్రచురింపబడుచున్నవి.

ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము హైదరాబాదు గ్రంథాలయ సంఘమును తనలో కలుపుకొని 1957 మార్చి 19 వ తేదీనుండి ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘముగ వ్యవహరింప బడుచున్నది; దీని ప్రధాన కార్యస్థానము హైదరాబాదులో నెలకొల్పబడినది. 1960 ఆగస్టునుండి హైదరాబాదులోని శ్రీ బాలసరస్వతీ ఆంధ్రభాషా నిలయములో దీనికి స్థిరనివాసము లభించినది. లోగడ హైదరాబాదు సంఘ పరముగ నడచిన 'ఇన్‌స్టిట్యూట్ అఫ్ లైబ్రరీ సైన్సు' ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయసంఘ యాజమాన్యమున నిర్వహింపబడుచున్నది.

పటమటలంకలోని శ్రీ సర్వోత్తమ భవనములో గాంధి స్మారకనిధివారి సహాయముతో ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘ పక్షము 1957 అక్టోబరులో ఆంధ్రప్రదేశ్ గాంధి సాహిత్య నికేతన మేర్పడినది. దీనిద్వారా గాంధీసాహిత్య సృష్టి, సేకరణ, వ్యాప్తి సాగించుటకు సంఘమువారు సంకల్పించిరి. తెలుగు, హిందీ, ఆంగ్లభాషలలోని గాంధీ సాహిత్యమును విరివిగ సంపాదించి కోరినవారికి అరువిచ్చుటకై వీరు ప్రయత్నించుచున్నారు. దీనికి తోడుగ గాంధీ స్మారక నిధివారి యాజమాన్యమున విజయవాడలో ప్రారంభింపబడిన గాంధీతత్త్వ ప్రచార కేంద్రముకూడ బాపూజీ మందిరములో కార్యస్థానము నేర్పరచుకొన్నది. దీనికొరకు 1960 లో శ్రీ సర్వోత్తమ భవనమునకు ప్రక్కగ చిన్నభవన మొకటి నిర్మింపబడినది. ఈ భవన నిర్మాణమునకు రు. 10,000 లకు పైగా ఖర్చు ఐనది. పా. నా.



# క్రీడలు

అచ్చనగండ్లు : ఈ యాట తెలుగువారి జాతీయ క్రీడలలో ఒకటిగా పురాతన కాలమునుండి కావ్యప్రశస్తి నొందుచు నేటి వరకు ప్రసిద్ధమైయున్నది.

ఈ యాటను ఐదు గచ్చకాయలతో ఎండరైనను ఆడవచ్చును. ఐదు గచ్చకాయలను చేతితో పట్టుకొని అందుండి ఒక కాయను మాత్రము పైకెగురవేసి ఆ కాయ మరల క్రిందికి దిగు వ్యవధిలో చేతిలోని నాలుగు కాయలు నేలపై విడిచి క్రిందికి వచ్చిన కాయను పట్టుకొని ఆ కాయనే మరల నెగురవేసి క్రింది కాయలను ఒక్కొక్క పర్యాయము నాలుగు కాయలను, ఒక్కొక్క పర్యాయము మూడు కాయలను, ఒక్కొక్క పర్యాయము రెండేసి చొప్పున రెండు మార్లుగ నాలుగు కాయలను, ఒక్కొక్క మారు ఒక్కొక్కటి చొప్పున విడివిడిగా నాలుగు కాయలను చేతిలోనికి జరుపుకొని పై కెగురవేసిన కాయనందు కొందురు. నిర్ణీతమైన ఒక సంఖ్యను నియమించుకొని ఆ సంఖ్య వరకు మొందెవరాడెదరో వారు గెలిచినట్లు నిర్ణయించుకొందురు. ఆడునప్పుడు కాయలను ఎగురవేసి పట్టుటయందుగాని, జరుపుటయందు గాని తప్పిపోయినచో ఆట తప్పినట్లు భావించి తోడి బాలికలు 'చెంగనాలో చెంగనాలు' అని యరచుచు ఆటను ప్రక్కవారాడెదరు. ఈ ఐదు కాయలతో ఆడు ఆటలో అనేక భేదములను చూపుచు ఆడుదురు. కుప్పీలు, పువ్వీలు, రెండు గాయలు, ఒక్కం గాయ, మూగ కుప్పీలు, సీతమ్మవారి పువ్వీలు, అద్దుడు కుప్పీలు, కుంకుమ భరిణెలు ఇట్లా నామభేదములతో ఆడుదురు. "ఒక్కా ఓచెలియా, రెండూ రేవన్నా, మూడు ముచ్చిలుకా, నాలుగూ నందన్నా, అయిదుం చిటిగొలుసూ, ఆరుంజవ్వాదీ, ఏడుం బేడీలూ, ఎనిమిది ఎలమంధా, తొమ్మిది తోకుచ్చూ, పదీ పట్టెడా" అనే పాటను, ఇట్లే ఒక్కొక్క విధమైన ఆటనుబట్టి 'ఒకరులు హారికరులు', 'పట్టూరాయని కుచ్చూ బంగారు కుచ్చూ, నాతో నాడేది సంగాతి పడుచు', 'కొండామీది గుండుదొర్లే, కోకిలమ్మ కాలు విరిగె, ఏమేమి మందు, వేపాకు చేదు' మొదలైన పాటలను కూడ ఈ యాట నాడునప్పుడు పాడుదురు. ఈ యాట ప్రసక్తి హంసవింశతి, కళాపూర్ణోదయ, భోజరాజీయాది అనేక కావ్యములందు కలదు. ఊ. ల. కాం.

అష్టాచెమ్మా : ఈ యాటను ఆడవారు మగవారుకూడా గవ్వలతో ఆడుకొంటారు. పెద్ద అష్టాచెమ్మా, చిన్న అష్టాచెమ్మా అని ఈ ఆట రెండు రకాలు. కాని సాధారణంగా అష్టాచెమ్మా అంటే చిన్న అష్టాచెమ్మా అనే భావన. చిన్న అష్టాచెమ్మాలో నాలుగు గవ్వలతో ఆడేది, ఐదు గవ్వలతో ఆడేది అని రెండు రకాలు. పందెం వేసేటందుకుపయోగించే గవ్వలను పందెపుగవ్వ లంటారు. పటంలో చూపినట్లు గీతలు గీసి ఆట ఆడుదురు. పటములో "X" గుర్తు ఉన్న స్థలాలలో మధ్యనున్న దానిని పంటగడి అనీ, నాలుగు వైపులా ఉన్న వాటిని 'ఆటగళ్ళు' అనీ, చుక్కలు ఉన్న వాటిని 'కుస్తాలు' లేక 'కిస్తాలు' అనీ తక్కినవాటిని 'గళ్ళు' అనీ అంటారు. ఈ యాట సాధారణంగా నలుగురు ఆడుదురు. ఎక్కువమంది ఉన్నప్పుడు ఇద్దరేసి ఉజ్జీలుగా ఉండి ఎనమండుగురు కూడా ఆడవచ్చును. నాలుగు వైపుల ఉన్న ఆటగాళ్ళలో ఒక్కొక్కరు నాలుగేసి చొప్పున నలుగురు నాలుగు రకాలు చింతపిక్కలుగాని, గవ్వలుగాని, రాళ్ళుగాని ఆటకాయలుగా పెట్టుకొందురు.

పందెపు గవ్వల్ని గిలకరించి నేలపైన విసరి పందెము వేసినప్పుడు అందులో ఒక గవ్వ తిరగబడి మూడు బోర్ల పడితే 'కన్ను' అనీ, రెండు తిరగబడి రెండు బోర్లపడితే 'రెండు' అనీ, మూడు తిరగబడి ఒకటి బోర్లపడితే 'మూడు' అనీ, నాలుగూ తిరగబడితే 'చెమ్మా' అనీ, నాలుగూ బోర్ల పడితే 'అష్టా' అనీ పేర్లు. కన్నుకి ఒకటి, రెండుకి రెండు, మూడుకి మూడు, చెమ్మాకి నాలుగు, అష్టాకి ఎనిమిది గళ్ళ చొప్పున ఆటకాయలను నడుపుదురు. కాయలను నడపుటను 'నప్పుట' అని వ్యవహరిస్తారు. ఐదు గవ్వలతో పందెం వేసినప్పుడు ఐదూ తిరగబడితే 'ఐదు' అనీ, ఐదూ బోర్ల పడితే 'అష్టా' అనీ అందురు. కొందరు మాత్రం నాలుగు తిరగబడితే 'నాలుగు' అనీ, ఐదు తిరగబడితే 'చెమ్మా అని అందురు. ఐదు గవ్వలతో ఆడేటప్పుడు 'అష్టా'కి పది, ఐదుకి ఐదూ, మిగతా వాటికి ముందు చెప్పిన విధంగానే గళ్ళునప్పుదురు.

సాధారణంగా 'అష్టా' గాని, 'చెమ్మా' గాని పడితే గాని ఆటకాయను నప్పకూడదు, చంపు దొరకనిదే (లోపలికి) దిగకూడదు అనే నియమాలతో ఆటమొదలు పెడుదురు. కొందరు గళ్ళు, కిస్తా లుండకూడదనే నియమం కూడా పెట్టుకొందురు. ఈ మూడు నియమాలతో ఆడే ఆటను 'కట్టాట' అందురు. కాయ నప్పడానికి వీలైనప్పుడే 'చెయ్యి విడింది' లేక 'కాయ విడింది' అందురు.

పటంలో 'క' అనే వాని కాయ విడి బాణపు గుర్తుల ప్రకారం నడిచి చుట్టుతిరిగి వెళ్ళి చంపు దొరకగానే లోపలి

గళ్ళలోకి దిగి, మళ్ళీ బాణపు గుర్తుల ప్రకారం చుట్టు తిరిగిన తరువాత పండుతుంది. ఇలాగే తక్కిన గళ్ళలో ఉన్న కాయలును ఆయా గళ్ళ ప్రకారం లోపలికి దిగి పండును.

ఎదుటి వారి కాయను చంపనిదే లోపలికి దిగకూడదు కాబట్టి కాయలు విడిన తరువాత జాగ్రత్తగా నడుపుదురు.

పందెం వేసినప్పుడు చెమ్మా పడితే ఒక కాయ, అష్టా పడితే రెండు కాయలు విడుతాయి. కాని చంపు దొరక నిదే లోపలికి కాయ దిగకూడదు గనుక అష్టా పడినప్పుడు సామాన్యంగా చెమ్మాకి ఒక కాయను విప్పుకొని నప్పుకొం దురు. అష్టా, చెమ్మా పందెములు పడినప్పుడు మాత్రం మళ్ళీ మరొకసారి పందెము వేయుదురు. ఈ పందెమును పై పందెము అందురు. పై పందెము వేసినప్పుడు రెండు పందెములకు కలిపి కాయను నప్పుకొందురు. పై పందెము వేసినప్పుడు అష్టాగాని, చెమ్మాగాని పడితే కన్ను, రెండు, మూడులలో ఏదో ఒకటి పడేవరకు ఎన్ని సార్లయినా పై పందెము వేస్తూనే ఉండాలి. వరుసగా మూడు అష్టాలుగాని మూడు చెమ్మాలుగాని పడినప్పుడు మరల నాలుగో పందెం అదే పందెం పడితేనే లెక్క పెట్టుదురు; లేకపోతే లెక్క పెట్టరు. ఇట్లు లెక్కపెట్టని పందెములను 'మురిగిళ్ళు' 'మురిగీసు' అని అందురు. మూడు పందెములు మురిగి పోయినవని వాటి అర్థము.

ఆటగళ్ళలోగాని, కుస్తాలలోగాని ఉన్న పిక్కలను చంప కూడదు. అందువల్ల, ఆ స్థలాలలో కాకుండా బయటి గళ్ళలో రెండో మనిషి కాయ ఉన్నట్లయితే, తాను వేసిన పందెముతో తన కాయ అక్కడికి వచ్చేట్టుగా నప్పించి అక్కడున్న బయటివారి కాయను తీసివేయుదురు. దీనినే చంపడం అందురు. పెద్ద పందెములు వేసినప్పుడు ఒకరు ఒక పందెముతోనే వీలునుబట్టి ఎన్ని కాయలనైనా ఎందరి కాయలనైనా చంపవచ్చును. ఎవరి కాయలైనా చంప బడి ఉన్నప్పుడు వారు పందెం వేసే సమయంలో అష్టా-చెమ్మాలలో ఏదైనా పడితే చెమ్మాకి ఒకటి, అష్టాకి రెండు చచ్చిన కాయలను విడిపించుకొన వచ్చును. ఈ విడిపించు కొన్న కాయలను తిరిగి వారి గళ్ళలో పెట్టుకొని యథా పూర్వకముగా నప్పుకొందురు.

పచ్చీసుపాళీ ఆటలో వలె ఒకరి కాయలున్న గడిలో ఇంకొకరికాయ లుండకూడదనే నియమం ఈ ఆటకి లేదు. అందుచేత నప్పుడులో వచ్చినపుడు ఒక గడిలో ఎవరికాయ లైనా ఎన్ని కాయలైనా ఉండవచ్చును. ఎవరైనా తమ కాయలలో మూడు కాయలు పండిపోయి ఒక కాయ మిగిలి ఉండగా పందెం వేసినపుడు అష్టా పడితే, ఆ కాయ ఉన్న గడినుండి పంటగడి ఎనిమిదవ గడి అయినచో ఆ కాయను పంట గడిలో వేసి ఇక పైపందెము వేయరు. అలాగే చెమ్మా పందెము విషయంలో కూడ. దీనికే 'పంటకు పై పందెము లేదు' అని చెప్పుదురు. కాయ ఎనిమిది గళ్ళలోపుగా ఉండి అష్టా పడినపుడుగాని, నాలుగు గళ్ళలోపుగా ఉండి చెమ్మా పడినపుడుగాని 'పందెము నప్పదు' అందురు. ఎవరివైన నాలుగు కాయలూ పండి మిగిలినవారి కాయలలో ఒక్కటైనా పండనప్పుడు 'పుట్టుచింత' అయినదనీ, ఒకటి పండినప్పుడు 'ఆటపెట్టా' మని చెప్పుదురు. ఒకేసారి అందరి కాయలూ పండినప్పుడు ఆట సమం అయిందని అందురు. అంటే ఎవరూ ఎవరినీ ఓడించ లేదని భావము; కాని మొదట పండిన వాళ్ళు మాత్రం తక్కిన అందరినీ ఓడించినట్లే. ఈ యాటనే మరొక విధంగా ఒక జోడి, రెండు విడి కాయలతో ఆడుట కూడ కలదు. భా. సూ. శా.

ఉప్పన పట్టీ: ఈ ఆటను రెండు జట్లుగా ఎందరైనను ఆడవచ్చును. కాని సాధారణముగ జట్టుకు ఐదుగురు చొప్పున పదిమంది ఆడుదురు. జట్టులలోనున్న మనుష్యు లనుబట్టి గళ్ళు పెరుగును. ఈ ఆట ఆడు రంగమునకు కొలత నియమములు లేవు; దానిని సుమారుగా నిర్మింప వచ్చును.

ఈ ఆటలో ఒక జట్టులో ఒకడు 'చర్ పట్టి' దగ్గర నిలు చుండి ఉండగా మిగిలినవారు లోపలనున్న అడ్డుబద్దెల దగ్గర ఉందురు. రెండవజట్టులోవారు నిలువు బద్దెల వద్ద ఉందురు. చర్ పట్టి దగ్గరగా నున్నవారు ఉప్పు పట్టుకొని ఒక్కొక్క గదిలో కూత (చూ. చెడుగుడు, పుట 1446) పెడుతూ ఉప్పు చేరుస్తూ ఉందురు. మధ్యలో కూత ఆగిపోయినను, రెండవ జట్టువారికి పట్టుబడినను 'అవు' టయినట్లే. ఈ ఉప్పు లోపల నున్న తన జట్టువారికి అందింపబడును. ఆ ఉప్పు అందు కొన్నవారు కూత పెడుతూ వెంటనే బయల్దేరి మొదటి ఆటగాని వలనే తన జట్టువారికి అందించెదరు. ఇలా ఉప్పు గళ్ళలోనుంచి చేరుస్తూ ఉప్పుపట్టిని చేరగానే 'ఉప్పో' అని కేక పెడుదురు, అక్కడినుండి మరల బయలుదేరి చర్ పట్టీ దాటి రావలెను. ఇలా ఉప్పుకలిపే జట్టును రెండోజట్టు వారు ఉప్పు తీసుకొని తిరిగి 'చర్ పట్టి' ని దాటనీయ కుండ సర్వశక్తులా ప్రయత్నిస్తారు. అనగా ఆటగాండ్రు నడుము వంచకుండా చేతులు సాచి లోనికి దూరువారిని తాకుటకు యత్నింతురు. అన్ని గళ్ళకు ఉప్పు కలుపుకొని చివరికి 'చర్ పట్టీ' ని దాటి 'చర్' అని కేక పెట్టుదురు. అప్పుడు ఆ జట్టు గెలిచినట్లు భాయపడును. ఒక్క గడి కైన ఉప్పు కలుపకపోయినను, మధ్యలో అవతలిజట్టుకు పట్టుబడిపోయినను ఓడిపోయినట్లే.

కొద్దిపాటి స్వల్ప భేదాలున్నప్పటికీ సర్వసాధారణంగా అన్ని ప్రాంతాలలోనూ ఈ విధంగానే ఆడుతారు. అంతే కాకుండా ఈ ఆటనే కొద్ది నిబంధనలు తగ్గించి ' చిన్న ఉప్పట్టె ' అనికూడ ఆడుతారు. భా. సూ. శా.

ఒప్పులకుప్ప : ఈ యాట తెలుగు బాలికల ఆటలలో చాల ప్రసిద్ధమైనది. దీని నాడుట కిద్దరుగాని, నలుగురు కాని బాలికలు కావలయును. ఇద్దరు ఆడుట సులభము. ఇరువురు బాలికలు ఎదురెదురుగ నిలుచొని పరస్పరము కుడిచేతితో కుడిచేతిని, ఎడమచేతితో ఎడమచేతిని పట్టుకొని ఈ క్రింది పాటపాడుచు చుట్టు తిరగవలెను.

"ఒప్పులకుప్ప, ఒయ్యారి భామ,
వాలుమొగ్గ – కీలు గంటు
వాలు జడలు – కీలు కుచ్చు
గూట్లో రూపాయి – నీ మొగుడు సిపాయి"

ఈ పాటనే వేరు విధముగకూడ పాడుదురు.

"ఒప్పుల కుప్ప – ఒయ్యారి భామ
సన్నబియ్యం, చాయపప్పు
చిన్నముప్వ – సన్నగాజు,
కొబ్బరికోరు, బెల్లపచ్చు
గూట్లో రూపాయి – నీ మొగుడు సిపాయి.
[రోట్లో తవుడు – నీ మొగుడెవడు ?]

కొందరు ఈ క్రింది విధంగాకూడా పాడుదురు.

"చెన్నపట్నం, చెరుకు ముక్క
నీకో ముక్క, నాకోముక్క
భీముడి పట్న, బిందెలజోడు,
నీకో బిందె, నాకో బిందె,
కాశీపట్నం, కాసుల జోడు,
నీకో కాసు, నాకో కాసు."

ఈ ఆటనే బాలికలు తమ చేతుల నెదుటి బాలిక యర చేతిలో తమ వ్రేళ్ళ గోళ్ళు ఆనునట్లు పట్టుకొని (దీనికి పై ఆటవలె అడ్డముగా చేతులు పెట్టనవసరము లేదు) క్రింది పాటపాడుచు తిరుగుదురు.

"చిప్ప చిప్ప గోళ్ళు – సింగరాజు గోళ్ళు
మా తాత గోళ్ళు – మండావ రాళ్ళు
చుక్క చుక్కల గోళ్ళు – సుందరమ్మ గోళ్ళు."

ఊ. ల. కాం.

ఓమన గుంటలు : దీనిని కళాపూర్ణోదయ, హంసవింశతి కారులు పేర్కొని యుండిరి. ఇది ఇంటిలో కూర్చొని ఆడు కొందురు. దీని నాడుటకు మరబందుపెట్టి చేప ఆకార ముతో చేయబడిన రెండు పలకల కొయ్యసాధనము ఒకటి కావలెను. ఇది తెరచుటకు మూయుటకు వీలుగనుండును. దీని లోపల ఒక్కొక్క పలకకు ఏడు గుంటలుగా రెండు పలకలకు కలిసి పదునాలుగు గుంటలు తొలిచియుండును. ఒక్కొక్క గుంటలో పదమూడేసి గవ్వలనుగాని, చింత గింజలనుగాని, కుంకుడు గింజలనుగాని పోయుదురు.

దీనిని మధ్య నుంచుకొని ఇరుప్రక్కల ఒక్కొక్కరు కూర్చొని ముందు ఒకరు తమ వైపున ఉన్న గుంటల వరు సలో ఒక గుంటలోని కాయలనుతీసి ఆ గుంటనుండి కుడి వైపుకు వరుసగా ఒక్కొక్క గుంటలో ఒక్కొక్క కాయను వేయుచు పదమూడు గుంటలను పూర్తి చేయు దురు. ఇట్లు పూర్తిచేయగా తాము మొదట కాయలు తీసిన ఖాళీగుంటకు తప్ప మిగతా గుంటలన్నిటిలో ఒక్కొక్క కాయ హెచ్చుగా పడును. అప్పుడు ఖాళీగుంట తట్టి దాని ప్రక్కన ఉన్న ఎదురెదురు రెండు గుంటలలోని కాయ లను తమ గెలుపుగా తీసుకొందురు. తరువాత ఎదుటి పక్షమువారు ఇట్లే మరల ఆడి తమకుకూడ ఖాళీగుంట తటస్థ పడినచో దానిని తట్టి దానిప్రక్క గుంటలలోని కాయలను గెలుచుకొందురు. ఇట్లు ఆ గుంటలలోని కాయ లన్నియు పూర్తి యగువరకు ఆడి చివరికెవరెన్ని కాయ లను హెచ్చుగా గెలుచుకొన్నదీ నిర్ణయించుకొందురు. ఆ తరువాత రెండవ ఆటకు ఎవరియొద్ద కాయలు వారు తమ ప్రక్కలనున్న గుంటలలో తిరిగి వేసికొని గుంటలకు కాయలు తక్కువ యైనవారు ఎన్నిగుంటలు తగ్గినదీ లెక్కించుకొనుచు తిరిగి అట్లే ఆడెదరు. ఈ విధముగా పధ్నాలుగు గుంటలు తక్కువ పడినవారు ఓడినట్లు నిర్ణ యము. అంతేకాక ఖాళీగుంటలలో కాయలు పడినపుడు అవి నాలుగుకాయలు కాగానే ' ఆవు ' అని తీసికొందురు. అట్లు తీసుకొనక పోయినచో అవి మురిగిపోయినట్లే. మరల ఎనిమిది కాయలు కూడిన తరువాత కాని వానిని తీసికొనరాదు.

ఈ యాటను ముగ్గురుకూడా ఆడుదురు. అపుడు దీనిని ' అత్తకోడళ్ళ ' ఆట అందురు. దానిలో గుంటల విభజనలో తేడాయేకాని ఆటలో తేడాలేదు. ఒకరి యోటమి పూర్తిగ సంభవించు వరకు ఆడవలెనన్న చాలసేపు పట్టును. ఊ. ల. కాం.

కంబాలాట : ఈ ఆటకు ఐదుగురు పిల్లలు కావలెను. వీరిలో ఒకరిని చీటీలు వేసుకొని దొంగగ నిర్ణయించు కొందురు ; లేదా ముగ్గురుముగ్గురు కలిసి తమతమ చేతు లను తిరగమరగ తట్టుచు తుదకు ఓడినవారిని దొంగగా నిర్ణయించుకొనవలెను. తరువాత సుమారు నాలుగు చద రపు గజముల సమతలమును చూచుకొని నాలుగు కోణ ములయందును నలుగురు బరులు తీసికొని నిల్చుండవలెను. మధ్య బరి తీసికొని దొంగ నిలువవలెను, ఆ వెనుక ఈ క్రింది పాటపాడుచు మూలల నిలుచున్నవారు ఒకరి బరి

నుండి ఇంకొకరి బరిలోనికి పోవుచు స్థలములు మార్చుకొనుచుండ వలయును. ఇట్లు వారివారి స్థలములు మార్చుకొను సమయమున అదనుకు వేచియుండి మధ్యనున్న దొంగ ఏదైన బరి ఖాళీకాగానే తాను పోయి ఆ బరిని ఆక్రమించుకొనవలెను. ఇట్లు దొంగ మూలబరిని ఆక్రమించి నపుడు మూలలోనున్న పిల్లలలో ఎవరికి బరి దొరకదో వారు దొంగ యగుచుందురు. ఇట్లే ఆడుచుండు నపుడు బరులు మార్చుకొనువారు చుట్టు తిరుగుచు బరులు మార్చు కొనవలెనే గాని మధ్యనుండి ఐమూలగ తిరుగరాదు.

"నాలుగు కంబాలాట
నడిమికి తొడిమికి నడవని ఆట
గిర గిర తిరుగుచు బరులు తిరిగే ఆట
దొంగోయమ్మ దొంగ
వచ్చేనమ్మ, వచ్చె కాచుకో." ఊ. ల. కాం.

కొక్కొట: ఈ యాటయందు రెండు జట్టు లుండును. ఒక్కొక్క జట్టుసంఖ్య తొమ్మిది. ఒక జట్టు తరిమేవారు 'ఛేజర్సు' అయిన రెండవ జట్టువారు పరుగిడు వారు 'రన్నర్సు' అగుదురు. ఆట ప్రారంభమునందు ఛేజర్సు 8 అడ్డుగీతల మీద ఎనిమిదిమంది కూర్చుందురు (ఒకరు ఒక వైపునకు తిరిగిన మరియొకరు మరియొక వైపునకు) తొమ్మిదవవాడు పరుగెత్తుచు కోకొట్టుచుండును. కోకొట్టు వాడు 'కోర్టు' (క్రీడారంగము) లో పరుగెత్తు చుండును. కోకొట్టబడినవారు కోర్టులో పరుగెత్తుచు ఎదుటి జట్టు వానిని తాకుటకు ప్రయత్నింతురు. కోకొట్టబడిన వాని స్థలములో కోకొట్టినవాడు కూర్చుండును. 'రన్నర్సు' ముగ్గురు మాత్రమే 'కోర్టు' లోనికి వచ్చు చుందురు. మొదటి ముగ్గురు అయిన తరువాత, రెండవ ముగ్గురి జట్టు, రెండవముగ్గురి జట్టు తరువాత మూడవ ముగ్గురి జట్టు వచ్చును. ఈ మూడవ జట్టు అయిన తదుపరి వ్యవధి యున్న మొదటిముగ్గురి జట్టు వచ్చును. ఈ విధముగ ఆట ఆడబడును. 'అవు' టయిన వారినిబట్టి ఓటమి, గెలుపులు నిర్ధారణ చేయవచ్చును. ఆటకాలము రెండు సగములు చేయబడును. మొదటి భాగమున ప్రతిజట్టుకును ఏడు నిమిషములు, రెండవభాగమున ప్రతిజట్టుకును ఐదు నిమిషములు ఆట కీయబడును. గొ. వెం. సు.

కోతికొమ్మచ్చి: ఈ యాట సర్వసాధారణముగ చెట్ల యొద్ద ఆడుదురు. దీనిలో జట్టు లుండవు. చీట్లు వేసుకొనగా చివరికి మిగులువారు దొంగ అగుదురు. పండిన వారిలో ఒకరువచ్చి ఒక పుల్లను (సుమారు రెండడుగులు) కాలిక్రిందుగా విసరును. అప్పుడు పండిన వారందరును చెట్టు లెక్కుదురు. విసరిన పుల్లకోసము దొంగవెళ్ళి తీసుకు వచ్చి నియమితమైన అంకెలను చదివి, చెట్టుక్రింద నియమితమైన స్థలమువద్దపెట్టి చెట్టుపై నున్నవారి నంటుకొనుటకు ప్రయత్నించును. ఈలోగా చెట్టుపై నున్నవారు క్రిందికి దుమికి పుల్ల నంటుకొనవచ్చును. మరల కాలు క్రిందుగా పుల్లను విసరవచ్చును. ఈ దొంగ యథాప్రకారముగా ఆట నాడవచ్చును. గొ. వెం. సు.

గుజ్జెనగూళ్ళు: ఇది కేవలము సంసారపు శిక్షణనిచ్చే యాట అని చెప్పవచ్చును. ఈ యాటలలో ఎందరైనను పాల్గొందురు. ఇందులో పిల్లలు తమతమ పెద్దలనడిగి బియ్యము, ఉప్పు, పప్పు మిగత వంటసామానులు, చిన్న చిన్న పాత్రలు చిన్నపొయ్యి మొదలైనవి తెచ్చుకొని వారికి తోచిన వంట వండుకొని ఇష్టాలాపములతో తినుచుందురు. ఒక్కొక్కప్పుడు చాల చిన్నవయస్సుగల బాలబాలికలు పప్పులు, బెల్లాలు, మరమరాలు (బొరుగులు) మొదలైన తినుబండరాలు సమకూర్చుకొని తాము ఆడుకొను లక్కపిడతలలో పోసి వాటిని పొయ్యిమీద పెట్టినట్టు, దించినట్లు నటించుచు కొంతసేపటికి అందరుకలసి వాటిని తినివేయుదురు. ఈ యాట ఆడునపుడు ఏవో బొమ్మలపెండ్లిండ్లుచేసి రెండు జట్లుగా చీలి వియ్యాల వారికి విందు పెట్టుటకై గుజ్జెనగూళ్ళు పెట్టుదురు. బాగుగా పండిన చింతకాయలనుతెచ్చి నేర్పుతో దానిలోని చింతపండు గుజ్జును గుల్ల చెడకుండునట్లు పూర్తిగా తీసివేసి ఆ గుల్లలో బియ్యముపోసి మండుచున్న పొయ్యిలోని కుమ్ములోపెట్టి అవి ఉడికిన తరువాత ఆ పిల్లలు గుజ్జెనగూళ్ళు అని వేడుకగా తిందురు. ఈ గుజ్జెనగూళ్ళ ఆటను రుక్మిణియు, గిరికయు ఆడినట్లు భాగవతమందును, వసుచరిత్ర యందును వర్ణితమైనది. ఊ. ల. కాం.

గోళీలాట: పిండికాయ, రాతిపింజా, సీసము, బొండు మొదలగునవి గోళీలలో రకములు. ఆటలలో కంచాలాట, బచ్రాట, పెద బచ్రాటలు కొన్ని రకములు. బచ్రాట యందు కాయ పెచ్చుచచ్చులనుబట్టి యాడుచుందురు. ఎవరికాయ హెచ్చయినచో వారు ముందర కొట్టుచుందురు. కంచాలాటయందు, ఈ క్రిందివరుస ప్రకారముగ నాడుచుందురు. ఒకటి ఒండు, రెండోయి రోలు, మూడోయి ముత్తి, నాలుగోయి నవ్వ, ఐదు బండు, ఆరొక దార, ఏడి చారబొద్దు, ఎనమదల కన్ను, తొమ్మదల మొగ్గ, తొట్టికి లగ్గం. ఇట్లు పదిసార్లు కాయని ఎవరయితే ముందర కొట్టెదరో వారు పండినట్లు; అనగా వా డికను ఆడవలసిన పనిలేదు. ఆఖరుకు మిగిలినవానిచే ఈ పండిన వారందరు దేకుళ్ళు పెట్టించెదరు. దేకుళ్ళు అనగా గోళీకాయను మోచేతితో నెట్టుట. గొ. వెం. సు.

చదరంగము : ఇది కేవలం ఇద్దరు మాత్రమే ఆడే ఆట. పటములో చూపినట్లుగా 64 గళ్ళు గల ఒక చదరపు పలకకి ఎదురెదురుగా ఇద్దరు కూర్చుని రెండు వేర్వేరు రంగులలో పావులను పేర్చుకుంటారు. ఈ ఆటలో నడిపే పావులను (కాయల్ని) ప్రక్కసైన్యముగా భావించి 'బలము' అంటారు. ప్రతిప్రక్కబలంలో రెండేసి ఏనుగులు, రెండేసి గుర్రాలు, రెండేసి శకటులు, రాజు, మంత్రి, ఎనిమిదేసి బంట్లు వుంటాయి. మొదటి వరుసలో రెండు చివరలను రెండు ఏనుగులు, ఏనుగుల ప్రక్కని రెండు గుర్రములు, వాటికి రెండు ప్రక్కలను శకటులు, శకటుల మధ్యనున్న రెండు గళ్ళలో కుడివైపున రాజు, ఎడమ వైపున మంత్రి, రెండవ వరుసలో 8 బంట్లు ఉండును. ఈ ప్రకారం రెండు బలాలు పేర్చిన వెనుక ఆట ప్రారంభము అవుతుంది. ఆట మొదలు పెట్టినప్పుడు మాత్రం మూడు ఎత్తులు వేయాలి. ఈ ఆటలో జంతువుల్ని నడపడానికి 'ఎత్తు వేయడం' అంటారు.

ఈ ఆటలో ఏనుగు ముందుకు గాని, వెనుకకు గాని నిలువుగాను, ఈ ప్రక్కకిగాని, ఆ ప్రక్కకిగాని అడ్డుగాను ఆటంకము కలిగేదాకా నడుస్తుంది. అదే ప్రకారంగా శకటు అయిమూలగా నడుస్తుంది. ఏనుగులాగ బారుగాను, శకటులాగ అయిమూలగాను మంత్రి నడుస్తుంది. ముందుకి గాని ప్రక్కకిగాని, వెనుకకుగాని, అయిమూలలుగాగాని, ఒక్కగడి మాత్రమే నడుస్తుంది రాజు. కాని ఎదుటి బలం నుంచి పగచూపి 'రాజు' అని చెప్పక పూర్వం రాజుకి ఒకే ఒకసారి గుర్రపు నడక నడిచే వీలుంది. రెండు గళ్ళు ముందుకు నడిచి ఒక గడి ప్రక్కకుగాని, ఒక గడి ముందుకు నడిచి రెండు గళ్ళు ప్రక్కకిగాని, అదే ప్రకారంగా రెండు గళ్ళు వెనుకకు నడిచి ఒక గడి ప్రక్కకుగాని, ఒక గడి వెనుకకు నడిచి రెండు గళ్ళు ప్రక్కకుగాని గుర్రం నడుస్తుంది. ముందుకు ఒక గడి మాత్రమే బంటు నడుస్తుంది. కాని చంపునప్పుడు మాత్రం అయిమూలగా ఉన్న ఎదిరి పక్షపు జంతువుని చంపి ఆ గడిలోనికి వెళ్ళుతుంది.

అంతేకాకుండా, బంటు ఏ గడిలోనిదైనా ఎదుటి పక్షం వైపు చివరి గడిని చేరుకున్నట్లయితే అది ఏ జంతువుకి చెందిన గడి అయితే ఆ జంతువుగా మారుతుంది. అలాగే రాజు గడికి గాని, మంత్రి గడికి గాని చేరుకొన్న బంటు మంత్రిగా మారుతుంది. కాని ఒక విషయం–ఏదైన ఒక జంతువు ఉండగా ఆ జంతువు గడిలోనికి వెళ్ళిన బంటు మాత్రం తిరిగి జంతువుగా మారదు. గుర్రపు గడికి వెళ్ళిన బంటు, గుర్రం లేనప్పుడు గుర్రంగా మారి వెంటనే నడుస్తుంది. కాని తక్కిన జంతువులు మాత్రం వెంటనే నడవవు. అందుచేత ఆ గడికి పగ లేకుండా చూచి చేరుకోవలెను. పగ వున్నప్పుడు చేరుకున్నట్లయితే జంతువుగా మారిన వెంటనే చస్తుంది. ఏ జంతువైనా తన నడకలో అడ్డుగా వున్న ఎదిరి పక్షపు జంతువుని కాపుదల లేని పరిస్థితిలోనే చంపుతుంది.

పై విధంగా జంతువుల్ని నడుపుతూ ఒకరి జంతువుల్ని ఇంకొకరు చంపుతూ ఎదిరి పక్షపు రాజును కట్టుటకు ప్రయత్నిస్తారు. ఎవరి రాజు కదలడానికి వీలు లేక కట్టు అయితే వాళ్ళు ఓడిపోయినట్లు భావిస్తారు. కాని ఎదుటి వాని ఎత్తులో రాజు అనకుండా జంతువుని నడిపినప్పుడు తన బలంచేత గాని, ఎదుటి బలంచేతగాని రాజు అడ్డగించబడి కదలడానికి వీలులేనప్పుడు దానిని 'తట్టు' అంటారు. అలాంటి సమయంలో ఎవరి రాజు కదలడానికి వీలు లేకపోయిందో వాళ్ళు ఎదిరి పక్షంలో ఒక జంతువుని తీసివేసి రాజు కదలడానికి వీలు కలిపించి ఆడుతారు. అలా చేయడానికి ఎదిరి పక్షపు ఆటగాడు ఒప్పుకోకపోతే ఆట 'సమం' అయింది అంటారు.

'మస్తు' 'నిర్మస్తు' అని యీ ఆటని రెండు విధాలుగా ఆడుతారు. ఎదుటివానికి జంతువులు మిగలకుండా చేసి ఒక బంటుతో రాజుని ఉంచి ఆ రాజుని కదలనీయకుండా కట్టుటకు 'నిర్మస్తు' అంటారు. ఎదుటి వానికి ఒక్క జంతువైనా వుంచి ఆ రాజుని తన బలంతో కదలనీయకుండా కట్టుటకు 'మస్తు' అంటారు. సాధారణంగా 'నిర్మస్తు' ఆటనే ఆడుతారుగాని, గోదావరి, కృష్ణా ప్రాంతాల లోనూ, మరికొన్ని ఇతర ప్రాంతాలలోనూ 'మస్తు' ఆట ఆడుతారు.

ఆట కట్టు అవక ఒక వైపున బంటు, రాజునూ, మరొక వైపున రాజు, శకటుగాని, రాజు గుర్రము గాని మిగిలినచో ఆ ఆటను 'సమం' అయిందంటారు.

భారత దేశంలో వేదకాలం నుంచీ ఉన్న అక్షక్రీడే చతురంగానికి ప్రాతిపదిక అని చెప్పవచ్చును. దీనిని మొట్ట మొదట కనిపెట్టినవారు హిందువులు. వీరిదగ్గర అరబ్బులు నేర్చుకున్నారు. అరబ్బుల సైన్యంలో రథాలు లేవు, కనుక ఈ యాటలో రథాలు (శకటులు)కు మారుగా ఒంటెలు పెట్టుకొని ఆడుతుండేవారు. ఆ తర్వాత ఈ ఆటను ఐరోపా వాసులు నేర్చుకుని వారికి ఏనుగులు లేని కారణంచేత వాటికి బదులుగా కోటలు ఏర్పాటు చేసుకొని ఆడుతున్నారు.

మోసిస్ పుట్టక ముందే ఈ ఆటను హిందువులు కని పెట్టినట్టున్ను, నౌషీర్వాన్ అను పారశీక చక్రవర్తి అదే

పనిగా హిందూస్థానమునుండి చదరంగపు పలకలు, కాయలు, ఆ యాటను నేర్పు గురువును పిలిపించుకునే వాడనిన్నీ సురవరం ప్రతాప రెడ్డిగారు ఆంధ్రుల సాంఘిక చరిత్రలో తెలిపిరి. ఈ ఆటను బాణుడు, రుద్రటుడు తమ గ్రంథాలలో వర్ణించారు. అంతే కాకుండా,

శత సంఖ్యు లొక్కటైనను
సతతము శ్రీ కృష్ణ రాజ జగతీపతితో
చతురంగమాడి గెలుచును
ధృతిమంతుడు బొడ్డుచెర్ల తిమ్మన భళిరే.

అన్న చాటువునుబట్టి కృష్ణదేవరాయలతో బొడ్డుచెర్ల తిమ్మన చదరంగం ఆడేవాడనీ, వెయ్యార్లు పందెం వేసి ఆట గెలిచేవాడనీ, ఈయన ఆటకి మెచ్చి రాయలవారు అగ్రహారాలు యిచ్చారనీ ప్రతీతి.

ఈ ఆటని పురస్కరించుకుని భారత దేశంలో 1948 లో 'ఆల్ ఇండియా కరెస్పాండెన్స్ చెస్ అసోసియేషన్' ఉద్భవించింది. మరు సంవత్సరం 'ఆల్ ఇండియా చెస్ ఫెడరేషన్' అవతరించింది. దరిమిలా రాష్ట్రీయ సంఘాలు ఏర్పడ్డవి. భా. సూ. నా.

చింతపిక్కలాట: ఇది ఆడపిల్లలు ఆడుకొందురు. ఎందరైనను ఈ ఆట నాడవచ్చును. ఆట ప్రారంభించే ముందు ఆడేవారందరూ గుండ్రముగా కూర్చుని మధ్యను చింతపిక్కలు గుట్టగా పోసుకొని పంటలు వేసుకొని ఆట ప్రారంభించేవారిని నిర్ణయించుకొందురు. ఈ పంట వేసుకొనుట అనేకవిధాలు. ఒక్కొక్కరు ఐదేసి చింతపిక్కలు పట్టుకొని వాటిని ఎగురవేసి, మండ*తో ఆచుకుందురు. మండమీదనున్న పిక్కల్ని తిరుగ ఎగురవేసిఅరచేతితో పట్టుకొందురు. ఈ విధముగా చేయునపుడు ఒక్కపిక్క తప్పిపోయినప్పటికీ పండనట్టే; లేకపోతే పండినట్టు. ఒక్కొక్కప్పుడు ఇద్దరుగాని అంతకంటె ఎక్కువ మందిగాని పండినప్పుడు పండినవారందరూ తిరుగ పంటలు వేసుకొందురు. ఇద్దరు పండినప్పుడు వారిలో ఒకరు తన చేతిలోనున్న పిక్కలు రెండు చేతులతో గిలుకరించి రెండు పిడికెళ్ళతో పట్టుకొని గాని, కుడిచేతిని మాత్రం నేలకానించిగాని ఎన్ని పిక్కలున్నవో చెప్పమని ఎదుటివారి నడుగగా వారు సరిగా చెప్పిన పండినట్లు, లేనిచో ఓడినట్లు భావియ పరుచబడును. లేదా ఒకరు తన చేతిలో నున్న పిక్కలు ఐదింటిని ఎగురవేసి మండతో ఆచుకోవాలి. రెండవవారు ఆ మండమీది పిక్కలలో ఏదో ఒకపిక్క నిర్దేశించి చెప్పగా, అది దిగువ పడకుండ తక్కిన నాలుగింటిని క్రిందికి వదలి వేసినట్లయితే పండినట్లు, లేనిచో ఓడినట్లు. పంటలు వేసుకొనడము ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కొక్క విధము. సాధారణంగా పంటలు వేసుకోకుండానే ఒక్కొక్క ప్రాంతములో పెద్దవారైనవారు ఆటమొదలు పెట్టుటకూడ కలదు.

ఆట మొదలు పెట్టేవారు ఎడమచేతితో గుప్పెడు పిక్కలను పట్టుకొని, కుడిచేతితో ఒక పిక్క ఎగురవేసి మండతో ఆచుకొంటూ ఎడమచేతిలోని పిక్కలుకూడ మండమీద ఉంచి నిదానంగా వాటిని ఎగురవేసి నేర్పుగా ఒక్కటి కూడ క్రిందపడకుండ అరచెయ్యిపట్టి అందుకోవాలి. దీనినే 'పట్టుపట్టడం' అందురు. పట్టు సరిగా పట్టలేకపోయిన ఆ పిక్కలను తనకు కుడివైపున ఉన్నవారికి ఇచ్చివేయవలెను. ఆ తీసుకొన్నవారు నాలుగేసి చొప్పున ఎగురవేస్తూ రెండవచేతితో అందుకోవాలి. పట్టుపట్టిన పిక్కలు మరీ ఎక్కువై వారిచేయి చిన్నదైనప్పుడు వాటిని దోసిట్లో పోసుకొని వ్రేళ్ళతో నాలుగేసి పిక్కలుచొప్పున వేళ్ళను కదిలించి నేర్పుగా ఎగురవేసి దిగువవెయ్యాలి, ఇలా నాలుగుపిక్కల చొప్పున తీసుకోవడంలో ప్రమాదవశాత్తు మూడుగాని, ఐదుగాని పిక్కలు రెండవ చేతిలోకి వచ్చినప్పుడు తన ఎడమచేతివైపు వారిని 'ఆటా నూటా' అని అడగాలి. ఆట కావాలి అంటే పట్టుపట్టిన పిక్కలు ఇవ్వాలి. నూట కావాలి అంటే రెండో చేతిలోని పిక్కలు ఇవ్వాలి. 'ఆట నూట' అడిగినప్పుడు ఏ చేతిలో ఎక్కువ పిక్కలున్నవో గమనించి ఏది లాభదాయకమో అది అడిగెదరు. పట్టుపట్టిన పిక్కలన్నీ నాలుగేసి తియ్యడం అయిపోగానే ఆఖరున నాలుగుకి తక్కువగా ఉన్న పిక్కలతో ఆట ప్రారంభించాలి.

ఆట ప్రారంభించేముందు ఆడటానికి మధ్యని పోసుకున్న పిక్కల్ని విరజిమ్మినట్లుగా చేతితో చెదర్చాలి: పిక్కలు మరీ ఎక్కువగా ఉన్నప్పుడు మధ్య కుప్పగా ఉంచి చుట్టూ నెరిపి ఆడుదురు. ఆట ఆడేవారు చేతిలో ఉన్న పిక్కలు ఎగురవేసి క్రిందికి నెరిపిన పిక్కలలో ఒక్కొక్కటి చొప్పున తీసుకుంటూ ఎగురవేసిన పిక్కలను అందుకోవాలి. అలా అందుకోలేకపోతే ప్రక్కనున్న వారికి ఆట ఇచ్చివేయాలి. క్రింద నెరపిన పిక్కలలో నొకదానిని తీసుకొంటూ ఉండగా మరొకటి కదిలినా ఆట పోయినట్లే. ఇలా కదలుటను 'కంగడం' అందురు. ఐదు పిక్కలు కుడిచేతిలోకి చేరగానే నాలుగింటిని ఎడమచేతిలోకి మార్చుకొని ఒక 'ఆట' పిక్కను కుడిచేతిలో ఉంచుకొందురు. ఈ ఆటపిక్క చివరివరకు చేతిలో ఉండును. ఈ అటలో నాలుగు పిక్కలయితే 'పుంజీ'; రెండు పుంజీలయితే 'కచ్చటం' అని లెక్క. ఐదు కచ్చటాలు ఒక

* 'మండ' అనగా వేళ్ళ కొననుండి చీలమండ వరకుకాదు, వ్రేళ్ళపై పిక్కలు నిలిచే స్థలమును మండ అందురు.

'గుఱ్ఱం'; పదిగుఱ్ఱాలు ఒక 'ఏనుగ'. కొంతమంది పది గుఱ్ఱాలను కుప్పగా పోసుకొందురు; కొంతమంది మిఠాయి పొట్లంలాగా గుఱ్ఱాలను అమర్చుకొందురు.

మొదటి ఆటకుపోసిన పిక్కలు అయిపోయినప్పుడు ఆఖరువారిది 'చేతిపట్టు' అవును. మరల మనిషికొక 'గుఱ్ఱం' చొప్పున పోసి మళ్ళీ ఆట మొదలు పెట్టుదురు. 'చేతిపట్టు' వచ్చినవారు గుఱ్ఱంపైన ఒక పుంజీ ఎక్కువ పోయ వలెను. ఎవరివద్దనైనా గుఱ్ఱానికి తక్కువ పిక్కలుంటే మిగత వారందరుకూడ అన్నే పోయుదురు. చేతిపట్టు వారు పైగా పుంజీ పోయవలెను. ఈ విధంగా ఆటను మరలమరల ఆడుదురు. గుఱ్ఱాలు పోతలు పోసుకొని ఆడునప్పుడు ఎవరి గుఱ్ఱంలోనైన తక్కువ ఎక్కువ లున్నప్పుడు వారు మిగతవారికి 'పదహారు పుంజీలపిక్కలు' అచ్చుకోవాలి. పిక్కలు అయిపోయినవారికి మిగిలిన వారు తలొక మూడుపుంజీలు అప్పు ఇచ్చెదరు. వీటిని 'గొడ్డిపుంజీ', 'గోకుడుపుంజీ', 'నీపుంజీ' అందురు. ఈపిక్క లను తీర్చలేనివారు ఆటలో ఓడినట్లు భావించబడును. ఓడించడానికి 'గొడ్డిపెట్టుట' అందురు. భా. సూ. శా.

చిల్లగఱ్ఱ : ఈ ఆట గోణీ బిళ్ళ, గూటీ బిళ్ళ, బిళ్ళకఱ్ఱ, చిల్లంగోడు, కోడింబిళ్ళ, చిల్లగోల, బిల్లంగోడు అనే రక రకాల పేర్లతో ప్రచారంలో ఉంది. బెత్తెడు కంటె ఎక్కువ, జానకి తక్కువ (సుమారు 4 అం.) ఉన్న కఱ్ఱముక్క, ఒక మూర (ఇంచుమించు ఒకటిన్నర అడుగు) పొడవుగల కఱ్ఱ ఒకటి ఈ ఆటకు ఉపయోగింతురు. వీటిలో చిన్నదానిని 'బిళ్ళ' అనీ, పెద్దదానిని 'కఱ్ఱ' అని అందురు. అందు వల్లనే ఈ ఆటకు 'బిళ్ళకఱ్ఱ' అని పేరు. నేలమీద చిన్న 'కంచా' (గుంట) త్రవ్వి ఈ కంచామీద 'బిళ్ళ' ను ఉంచి కఱ్ఱతో ఎగుర కొట్టుదురు. దీనిని 'గూటుట' అందురు.

సాధారణంగా ఈ ఆటను ఇద్దరు ఆడుదురు. ఒకరు బిళ్ళను గూటునప్పుడు రెండవవారు కంచాకు కొంత దూరంలో నిలబడి బిళ్ళ క్రింద పడకుండా పట్టుకోవలెను. అలా పట్టుకోగలిగినచో బిళ్ళను గూటినవాడు ఓడినట్టు. అలా పట్టుకో లేకపోతే బిళ్ళ పడిన స్థలందగ్గర నుంచి దానిని తిరిగి కంచా దగ్గరకు విసరును. విసరినప్పుడు కంచా నుంచి బిళ్ళ ఉన్న స్థలాన్ని కఱ్ఱతో కొలవగా ఆ దూరం ఒక కఱ్ఱకంటె ఎక్కువ దూరం ఉంటే ఆట సాగించవచ్చు, తక్కువ ఉంటే గూటినవాడు ఓడిపోయినట్లే. ఒక కఱ్ఱ పొడవు కంటె ఎక్కువ ఉన్నప్పుడు గూటినవాడు ఆ బిళ్ళ చివరను కఱ్ఱతో కొట్టి అది పైకి లేచినపుడు దూరమునకు పోవునట్లు దానిని కఱ్ఱతో కొట్టి, విసరును. ఈ విధముగ మూడు పర్యాయములు కఱ్ఱతో బిళ్ళను కొట్టి మూడవ సారి కొట్టినప్పుడు బిళ్ళపడిన స్థలంనుంచి కంచావరకు గల దూరమును కొలువ వలెను. పది కఱ్ఱల పొడవును 'లాల' అందురు. ముందు నుండి కొలుచుట, వెనుకనుండి కొలుచుట అని లాలలు కొల్చుట రెండు విధములు. కంచాకి ఎదురు వైపుగనున్న కొన ముందరికొన అనీ, రెండవది వెనక కొన అని భావన. ఏకొననుండి కొలుచుట అన్నది వారి ఇద్దరి అంగీకారముపై ఆధారపడును. గూటినవాడు కొలిచే ముందు ఆ దూరము అంచనాగా ఎన్ని లాల లుండునో చెప్పును. అంతకంటె ఎక్కువ దూరమున్న అతడు ఓడినట్లు, లేక తక్కువ ఉన్న రెండవవాడు ఓడినట్లు గణింపబడును. 'లాల' లు లెక్క పెట్టుట ఒకటి, రెండు, మూడు అని కాక కన్ను, రేరెళ్ళ, మూముళ్ళ అనిగాని, కండి, రెళ్ళ, ముళ్ళ అనిగాని, అనేక రకాలుగా, ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కొక్క రీతిగ, లెక్కపెట్టుదురు. అలా లెక్క పెట్టి నప్పుడు ఎన్ని లాలలుంటే అన్ని సార్లు ఓడిపోయినవారు ఒంటికాలితో గెంతుతూ కూత పెడుతూ బిళ్ళపడిన స్థలం నుంచి కంచావరకు, కంచానుంచి బిళ్ళవరకు పోవలెను. ఈ కూత (చూ. చెడుగుడు) అనేక రకాలుగా ఉండును. కూత మధ్యలో ఆపినచో, ఆపిన స్థలం దగ్గిరనుండి బిళ్ళను వెనుకకు కొట్టుదురు. ఇలా వెనుకకు బిళ్ళను కొట్టుటను 'చెప్పుదెబ్బ కొట్టుట' అందురు. తిరిగి బిళ్ళ పడిన దగ్గరనుంచి గెంతడం మొదలు పెట్టవలెను. ఈ ఆటను పర్లాకిమిడి, బరంపురం ప్రాంతాలలో 'గిల్లీదండి' అందురు. గిల్లి అనగా బిళ్ళ అని, దండి అనగా కఱ్ఱ అని అర్థం. కృష్ణా జిల్లా ప్రాంతంలో 'గోడీబిళ్ళ' అందురు. ఉత్తరదేశంలో 'గూలిదండా' అందురు. భా. సూ. శా.

చెండాట : ఈ ఆటయందు పార్టీలుండవు. ఆడేవారు అందరు గుండ్రముగ కళ్ళుమూసుకొని కూర్చొని యుందురు. వారిలో ఒకడు మాత్రము చేతిలో గుడ్డచెండు నుంచుకొని కూర్చున్నవారి చుట్టూ తిరుగుచుండును. తిరుగుచూ, తిరు గుచూ ఒకని వెనుక గుడ్డచెండును జార విడుచును. జార విడిచిన తరువాత ఒకసారి తిరుగును. ఇట్లు తిరిగి వచ్చే లోపల ఎవరివద్ద చెండు పెట్టబడిందో వారు కనిపెట్టలేక కూర్చొని యున్నచో గుండ్రముగ తిరిగి వచ్చిన వాడు కూర్చున్నవారిని చెండుతో కొట్టుట ప్రారంభించును. ఇట్లు అతడు రెండు సార్లు చుట్టి తన స్థలము చేరువరకును దెబ్బలు తినవలసి వచ్చును. తరువాత దెబ్బలు తిన్నవాడు చెండు పుచ్చుకొని తిరిగి పై విధముగనే ఆటను సాగింతురు. ఈ ఆట ఆడునప్పు డందరును కళ్ళు మూసుకొందురు. గొ. వెం. సు.

చెడుగుడు : ఇది మగవారు ఆడే ఆట. ఇందు రెండు జట్లుండును. జట్టుకు ఎందరైన ఉందురు. కాని రెండు

జట్లలో మనుష్యులు సమముగా ఉండవలెను. ఒక మనిషి మిగిలి ఉన్నచో ఏ జట్టు బలహీనమైతే ఆ జట్టుకి ఆ మనిషిని ఇవ్వడం జరుగుతుంది; దీనిని 'జీరకాయ' ఇవ్వడం అందురు. ఒకరికి బదులు వచ్చిన మరొక మనిషిని 'సత్తరకాయ' (సత్రకాయ) అందురు.

ఒక గీతగీసి దానికి సమానదూరంలో రెండు జట్లవారు నిలుచుందురు. మొదట ఒక జట్టులోని వారిలో నొకడు కూత పెట్టుచు గీత దాటి అవతలి జట్టులో మనిషిని తాకుటకు ప్రయత్నించును. ఇతడు తాకిన వారందరు ఓడినట్లగును. ఎవరిని తాకుటకును వీలుచిక్కకపోయినచో అతడు కూత ఆపకుండ తిరిగి తన జట్టులో వచ్చి చేరును. రెండవ జట్టులోనుండి వేరొకరు మొదటి జట్టులోనికి కూతకు వచ్చును. ఈ విధముగా కూతకు వచ్చినవారు అవతలి జట్టువారికి దొరకకుండ గీత దాటవలెను. పట్టుబడినప్పటికి, కూత ఆపకుండ వచ్చి గీత తాకిన చాలును. కూత ఆపినచో ఓడినట్లే. కూతకు వచ్చిన వారిని రెండవ జట్టువారు పట్టుకొని ఓడించుటకు ప్రయత్నింతురు. కాని కూత ఆపకుండ అతడు గీతవరకు పోయి గీతను తాక గలిగినప్పుడు అతనిని పట్టుకొని ఉన్న వారందరు ఓడినట్లు భావించబడును. ఏ జట్టులోనైన నలుగురుగాని, ఐదుగురు కాని ఓడినప్పుడు ఆ జట్టు ఓడినట్లుగా భావింతురు. కాని కొంతమంది రెండు జట్టులలోను ఒక్కొక్కరు మిగిలినప్పటికి చివరివరకు ఆట ఆడుదురు. కూత పట్టుట ఒక్కొక్క ప్రాంతములో ఒక్కొక్క విధముగా ఉండును. విశాఖ పట్టణము జిల్లావారు 'అంటాకు-అలమండ-దానికి దీనికి జువ్వాకు' అనిన్నీ 'అచ్చి-దూచ్చి-అంబటిదాక పేర్చి'; 'ఉరుములు మెరుపులు-ఉటారు తీగెలు-గాలీవానలు - గంధపు చెక్కలు - కడెమ్మ కడి కడి కడి' అనిన్నీ, తెలంగానా ప్రాంతంవారు "చోర్ ఆయా, చోరీ కియా - కొత్వాల్ ఆయా - పకడ్ లియా" అనిన్నీ కూత పెట్టుదురు. "అంచి .... బూంచి చందన .... కటాంచి," అత్తాకు .... ఆరాకు సన్న .... బీరాకు", "ఓరోరి .... వెంకన్నా పరిగెత్తిరార .... బంకన్నా", "ఉచ్చు .... ఉరితాడు చెన్నాపట్నం.... చాంతాడు", "పందిటి మీద .... పూలకోడి పదారుగ్రుడ్లు .... మ్రింగిన కోడి" అని కూడ కూత పెట్టుదుదు. చిల్లగర్ర, ఉప్పనపట్టి, వెన్నెలపట్టి, చెడుగుడు ఈ ఆటలన్నింటికి కూత పెట్టుటకు ఇటువంటి పదాలనే వాడుదురు.

కొన్ని ప్రాంతాలలో ఎదుటి పక్షపు ఆటగాళ్ళు అవుటయినప్పుడు తమ పక్షంలో అది వరకు అవుటయినవాళ్ళు బ్రతికి మళ్ళీ ఆటలో చేరుతారు. అందుచేత దీనికి 'చావుబ్రతుకుల ఆట' అని కూడా పేరు.

అంతే కాకుండా, వెన్నెల రాత్రులలో రోడ్డు మీద నీళ్ళతో పట్టీలుగా ఏర్పాటు చేసి ఆడుదురు కాబట్టి "వెన్నెల పట్టి" అందురు. కొన్ని ప్రాంతములలో ఆ పట్టీల మీద మట్టి కుప్పలు పెట్టి ఆడుదురు. అందుచేత దీనిని "కుప్పల చెడుగుడు" అందురు. పేరేదైనా మొత్తం మీద ఆడే విధానం మాత్రం ఒక్కటే.

ఈ చెడుగుడు ఆటని మధ్యప్రదేశ్‌లో 'హు - తు - తు' అని, పంజాబ్‌లో 'కొడ్డి - కొడ్డి' అని, బెంగాల్, బీహార్ లలో 'డు - డు - డు' అని వ్యవహరింతురు.

ఇటీవల ఈ చెడుగుడు ఆట నియమములలో అనేక మార్పులు చేసి 'కబడ్డి' అనే పేరుతో ఆడుతున్నారు. నేలపై పొడవు 11 గజములు, వెడల్పు 7 గజములు ఉంచి సరిగ్గా మధ్యకి మధ్య గీత నేర్పరచి, మధ్య గీతకి ఈ వైపు ఆ వైపు 4 అడుగుల దూరంలో డెడ్ లైన్సు అనే పేరుతో అడ్డుబద్దెలు గీసి క్రీడారంగముగా ఏర్పాటు చేసి 'కబడ్డి' ఆడుదురు. చెడుగుడులో ఇటీవల చేసిన మార్పులలో ఈ విధంగా కొలతలు ఏర్పరచడం ఒకటి ముఖ్యమైనది. ఇప్పుడు 'కబడ్డి' భారత దేశమంతటా గుర్తించబడి, జాతీయ అధికార పోటీలు కూడ ఆ పేరున జరుగుచున్నవి.

చెడుగుడు - కబడ్డి ఆటలలో గల ముఖ్య భేదములు : 1. కబడ్డిలో అవుటయిన వారు కూర్చుంటారు. ఎదుటి పక్షం వారికి పాయింటు వస్తుంది; చెడుగుడులో అవుటయినవాళ్ళు కూర్చోనక్కర లేదు. కూర్చున్నా ఎదుటి పక్షమునకు పాయింటు రాదు. 2. కబడ్డిలో ఎదుటి పక్షపువారిచే పట్టుకోబడిన ఆటగాడు కూతతో మధ్య గీతని ముట్టుకుంటే అతన్ని పట్టుకున్న వారందరూ అవుటయినట్లు. చెడుగుడులో మొదట పట్టుకున్న వాడే అవుటయినట్లు. భా. సూ. శా.

చెమ్మచెక్క : ఈ ఆట ఆడుటకు ఇద్దరు కాని ముగ్గురు కాని పిల్లలు కావలెను. ఒక్కొక్కప్పుడు నలుగురుకూడ ఆడుటకద్దు. ఇది ముఖ్యముగ ఆడపిల్లలు మాత్రమే ఆడుకొను ఆట. ఇద్దరు బాలికలు చదునైన చోట ఎదురెదురుగ నిలుచుండి చేతులను తట్టుచు; బారలు చాచుచు ఈ క్రింది పాట పాడుచు, పాట లయ కనుగుణముగ అడుగులు వేయుచు, చిందులు త్రొక్కుచు ఆడుచుందురు.

చెమ్మ చెక్క, చేరడేసి మొగ్గ
అట్లు పోయంగ, ఆరగించంగ
రత్నాల చెమ్మ చెక్క రంగులేయంగ
ముత్యాల చెమ్మ చెక్క ముగ్గులేయంగ
పగడాల చెమ్మ చెక్క పందిరేయంగ
పందిట్లో మాయన్న పెళ్ళి చేయంగ

సుబ్బారాయుడి పెండ్లి, చూచి వత్తాము రండి
అమ్మల్లారా, అక్కల్లారా పోయివత్తాము రారండి
[మా వాళ్ళింట్లో పెండ్లి, మళ్ళీ వద్దాం రండి,
దొరగారింట్లో పెండ్లి, దోచుకువద్దాం రండి].

అని కూడ పాడుతారు సర్కారు జిల్లాలలో. రాయల సీమలో పాడే పాట దీనికి కొంచెము భిన్నముగా ఉండును.

మొదటి చరణమైన 'చెమ్మచెక్క' అనునపుడు బాలికలు దగ్గరగ ఎదురెదురుగ నిల్చుండి ఒకళ్ళొకళ్ళు చేతులు తట్టుకొనవలెను. 'చేరడేసి మొగ్గ' అనునపుడు కాళ్ళతో వెనుకకు ఒక చిందు వేయుచు అదే సమయమున చేతులు బారలు చాపవలెను. ఇట్లే మరల ఇంకొక చరణము పాడుచు మరల బాలికలు దగ్గరకు చిందు వేసి ఒకళ్ళొకళ్ళు చేతులు తట్టుకొనవలెను. మరల ఇంకొక చరణము పాడుచు దూరము వెళ్ళి బారలు చాపవలెను. బాలికలు వేయు చిందులు పాటయొక్క లయ ననుసరించి యుండవలెను. తెలుగు దేశమునందంతటను ఈ యాటకు ఈ పాటనే పాడుదురు. ఈ యాటకు పాట ప్రాణము. ముగ్గురైనను, నలుగురైనను ఇట్లే ఆడవలయును. ఊ. ల. కాం.

దొంగాట: ఈ యాటయందు జట్టులుండవు. ఆడేవారి సంఖ్య నియమబద్ధముగ నుండదు. మొదట ఆటగాండ్రందరు చీట్లు వేసుకొని చివరకు ఒకనిని దొంగ చేయుదురు. ఆ దొంగను 'నిలపబడినవారిని అంటుకొనెదవా లేక కూర్చున్నవారి నంటుకొనెదవా' యని ప్రశ్నించెదరు. ఆ దొంగ నిలబడిన వారి నంటుకొనెదనన్న కూర్చున్న ఆటగాండ్ర నంటుకొనుటకు వీలు లేదు. ఆటగాండ్రలో ఒకడు కూర్చొనియున్నచో, వాడు లే లెమ్మని మరియొకరు దగ్గరకు వచ్చి తాకి చెప్పేవరకు, లేచి పరుగెత్తుటకు వీలు లేదు. దొంగ కూర్చున్నవారి నంటుకొనెదనని చెప్పినచో నిలబడిన ఆటగాండ్రను అంటుకొన్నను ప్రయోజనము లేదు. పై విధముగ 'లే లెమ్మని', 'తూతుమ్మడి' నుపయోగించుచు ఆటనాడుకొందురు. గొ. వెం. సు.

పచ్చీసుపాళీ: ఇది గవ్వలతో ఆడుకునే ఆట. ఈ ఆట ఇద్దరుగాని, ముగ్గురుగాని, నలుగురుగాని ఆడుదురు. ఇద్దరేసి ఉజ్జీలుగా ఎనమండుగురుకూడ ఆడవచ్చును. సాధారణముగ నలుగురు మాత్రము ఆడుదురు. అదే కట్టాట. పటంలో చూపిన విధముగా గీతలు గీసి నాలుగు మూలల్లోను ఒక్కొక్కరు ఒక్కొక్కరకం గవ్వలు ఎనిమిదేసి చొప్పున ఆటకు పెట్టుకొని నలుగురు కూర్చుందురు. ఆటకు పెట్టుకొన్న గవ్వలను 'పావు' లందురు. పందెము వేయుటకు 7 గవ్వలు వాడుదురు. వీటిని 'పందెపు గవ్వ' లందురు. ఇవి పావులకంటె కొంచెము పెద్దవిగ ఉండును. పందెములో ఒకగవ్వ తిరగబడి తక్కినవి బోర్లపడిన 'దస్' అందురు. రెండు తిరగబడిన 'రెండు' మూడు తిరగబడిన 'మూడు' నాలుగు తిరుగబడిన 'నాలుగు' ఐదు తిరుగబడిన 'పచ్చీసు' ఆరు తిరుగబడిన 'త్రీసు' ఏడూ తిరుగబడిన 'బారా' ఏడూ బోర్ల పడిన 'చెక్కా' అని పందెములకు పేర్లు. ఈ పందెములలో దస్‌కు పది, పైన ఒక పావు; పచ్చీసునకు 25, పైన ఒక పావు (కొందరు 24, పైన 2 పావులు); త్రీసుకు 30, పైన రెండుపావులు (కొందరు మూడు పావులు, కొన్ని చోట్ల పావులే లేవు); బారాకి పన్నెండు, చెక్కాకి 7, రెండు, మూడు, నాలుగు పందెములకు రెండూ, మూడూ, నాలుగూ అని లెక్కిస్తారు. బారా, చెక్కాలకి పావులు లేవు, వాటిని గొడ్డు పందెము లందురు.

మొదటి పందెములో దస్, పచ్చీసు, త్రీసులలో ఏది పడినను పావులు విడివడి ఆడుటకు వీలగును. మొత్తం 8 పావులు విడివడేవరకు దస్, పచ్చీసు, త్రీసు పందెములకు ఎన్ని పావులో అన్ని పావులు విడును. తరువాత పందెములో పావుకి బదులు గడి నప్పుదురు. రెండు, మూడు, నాలుగు తప్ప మిగత పెద్ద పందెములకు పై పందెము వేయవలెను. పెద్ద పందెములలో ఏ పందెమైన మూడుసార్లు ఒకే విధముగా పడి నాలుగవ పందెము మళ్ళీ అదే పడినప్పుడు లెక్కపెట్టుదురు; లేకపోయిన లెక్కపెట్టరు. లెక్కపెట్టని పందెములను 'మురిగిళ్ళు' అందురు. బారా పందెము పడినప్పుడు ఆడే నలుగురిలో ఎవరైన పందెపు గవ్వలను దూసుకుందురు. దూసుకొన్నవారికి పందెము దక్కును. పందెము వేసుకున్నవారే దూసుకొన్నచో వారికే ఆ పందెము దక్కును. అందరి పావులు విడివడేవరకు చంపకూడదు. ఆఖరున ఎవరిపావులు విడునో వారిచేతితో మరల ఆట చుట్టు తిరిగి పందెము వచ్చిన తరువాత చంపుళ్ళు మొదలు పెట్టవలెను. ఆ వెంటనే తక్కిన వారుకూడ చంపవచ్చును. కాని ఎవరిపావు అయినా చచ్చి ఉన్నప్పుడు ఆ చచ్చిన పావులను విడిపించుకొని మరల పందెము చుట్టు తిరిగి వచ్చినప్పుడే చంపవలెను. ఈ లోగా మరెవరిచేతనైనా ఆ పావు చంపబడినచో అవి విడిపించుకొనేవరకు చంపరాదు.

అంతే కాకుండ, పందెము వేసినప్పుడు గొడ్డు పందెములైన బారా, చెక్కాలు పడితే (మళ్ళీ చుట్టు తిరిగి పందెం వచ్చే వరకు) చంపకూడదు, అయితే, బారా పందెం పడినప్పుడు 'బారా' ఎవరు దూసుకుంటారో వారికి ఆ పందెం చెందుతుంది కాబట్టి బారా పందెం చెందిన వాళ్ళు చంపకూడదు.



1



2



3



4



1. చెడుగుడు
2. ఓమన గుంటలు
3. పులిజూదము-3
4. పులిజూదము-1
5. పులిజూదము-2















ఏనుగు



గుఱ్ఱం



శకటు



రాజు



మంత్రి



బంటు

1. చదరంగము ; 2. అష్టా చెమ్మా ; 3. పెద్ద అష్టా చెమ్మా ; 4. పచ్చీసుపాళీ

ఈ ఆటలో ప్రతివారికి పంటగడి, చేర్పుగడి, పచ్చీసు గడి, త్రీసుగడి అని ఉండును. పంటలో 1 దగ్గర కూర్చున్న వారికి 'క' పంటగడి, 'గ' చేర్పుగడి, 'చ' పచ్చీసుగడి, 'జ' త్రీసుగడి, 'ట' త్రీసు చెక్కాగడి, 'డ' దోదస్ చెక్కా గడి 'త' దోదస్ గడి, 'ద' దస్ గడి. ఇదే విధముగా మిగత వారివి కూడ. ఒకటి దగ్గరనున్న వారు 'న' దగ్గర నుంచి పావులు నడపుట ప్రారంభించి చుట్టు తిరిగివచ్చి పంటగడిని చేరుదురు; చంపుడు దొరక నిదే పంటగడి దాటరాదు; చంపుడు దొరికినమీదట పంట గడి దాటి 'ఞ' మీదుగ 'న' ను చేరి పండుదురు. ఆటలో ప్రతిఒక్కరు తమతమ పంటగడి, చేర్పుగడి, పచ్చీస్‌గళ్ళలో తమ పావులు పెట్టుకొనుటకై ప్రయత్నింతురు. దీనికి 'గడి కట్టుట' అందురు. ఒకరి పావులున్న గడిలోని కింకొకరి పావులు రాకూడదు. అందువల్ల గడిమీదకుగాని, పావు మీదకుగాని రాకుండ చూచి ఏపావు నప్పిన దానిని నడప వలెను. 1 దగ్గరున్నవారు పచ్చీసు, త్రీసుగళ్ళు కట్టి వేసినట్లు అనుకొందము. ఇవి 4 దగ్గరున్నవారి పంట, చేర్పుగళ్ళుకదా! అప్పుడు 4 తన పచ్చీసు, త్రీసుగళ్ళు కట్టు కొనుటకు ప్రయత్నించును. కాని ఇవి 3 దగ్గరున్నవారికి పెద్దపందెములు పడినమూలముగ పంటగడి, చేర్పుగడి కట్టుకొనుట సంభవించినచో 4 దగ్గరనున్నవారికి గడి లేకుండ పావులు పైననే ఉండవలసివచ్చును. అందువల్ల మిగిలిన ముగ్గురికి ఆ కాయలు సులువుగ చంపుళ్ళకు దొర కును. ఈ విధముగా కాయలకు గళ్ళు దొరకకుండ చేయు టను 'కాయ నట్టడబెట్టుట' అందురు. ఇంకొకరికి పావులను నట్టడబెట్టి తమకు సులువుగ చంపుడుదొరికి తొందరగా పండుటకు వీలుగ నప్పుటయే ఈ ఆటలోని ప్రత్యేకత. 1 దగ్గర ఉన్నవారికి చంపుడు దొరికిన తరువాత 'క' ను దాటిన పావులు 'ఞ' మీదుగ 'న' ను చేరి పండును. కనుక 'ఞ' ను చేరినపుడు పావును వెల్లకిల ఉంచెదరు. 'న' నుండి 'ఞ' వరకు ఉన్నగళ్ళలో కాయ బోర్లపడి ఉన్నచో అది పచ్చికాయ; వెల్లకిలా పడిఉంటె పంటకాయ అనిగుర్తు. ఈ ఆటలో ఒక్క తొలిచంపుడు చంపుటకుతప్ప చంపుడు దొరికిన వాళ్ళకాయను పదేపదే చంపరాదు. ఎవరిపావులు ముందు పండిన వారు గెలిచినట్లు. చంపుడు దొరికిన వారు పండిపోయి, చంపుడు దొరకనివారు మిగిలిపోయిన 'పుట్టు చింత' అయినదందురు. నాలుగవ వారికికూడ చంపుడు దొరికిన ఆట ఎత్తివేసి మరల క్రొత్త ఆట వేయుదురు.

ఈ ఆట ఒక్కొక్క ప్రాంతములో ఒక్కొక్క విధ ముగ ప్రచారమున నున్నది. గుంటూరు, తెనాలి ప్రాంత ములో చంపుడుపందెము లేదు. ఒకేపావు ఉన్నప్పుడు త్రీసు పచ్చీసు పందెములతో పండకూడదు. మురిగిళ్ళను మురిగీసు లందురు. దస్, పచ్చీసు పందెములకు ఒక్కొక్క పావే వాడుదురు. బారాకి బదులు చౌదా అని 14 గళ్ళు నప్పుదురు. అందుచేత చౌదాకు దూపుడులేదు. గోదావరి కృష్ణా ప్రాంతములలో చెల్లాచెదురుగ విశాఖపద్ధతినే ఆడు దురు. నెల్లూరు, రాయలసీమలలో పందెపుగవ్వలకుబదులు పాచికలతో ఆడుదురు. ఒక్కొక్క ప్రాంతమున 8 గడు లకు బదులు 6 గడులు గీయుదురు; కాబట్టి దీనిని ఆ ప్రాంతంవారు 'దాయకట్టు', లేక 'దాయకర' అందురు. తెలంగాణాలో రెండుకి 'దోరీ', మూడుకు 'తీనీ' నాలుగుకు 'చారీ' అనిన్నీ, మిగత పందెములకు మామూలు పేర్లనే వాడుదురు. ఆ ప్రాంతములో చెక్కా, చౌదా పందెములలో కూడ చంపుడు ఉండును. మురి గిళ్ళకు బదులు 'బుడ్డీస్' అందురు. భా. సూ. శా.

పులి జూదము: ఈ యాటకు 'పులి మేక' అనికూడ పేరు. దీనినిగూర్చి సింహాసన ద్వాత్రింశతికారుడు ప్రస్తా వించియుండెను. ఇందు రెండు విధములు తెలియును.

నేలపై బొమ్మలో చూపినట్లు గడులు గీయవలెను. పులి కాయలను నడుపువాడు, మేక కాయలను నడుపు వాడు - ఇద్దరును ఈ ఆట నాడుదురు. మూడు సంఖ్య వరకుగల 'పాచిక' దీనికి ముఖ్యము. పులులకు పెద్ద గులక రాతి ముక్కలను, మేకలకు చిన్నరాతి ముక్కలను వాడుదురు. పులిని మూడు మేకలతో కట్టివేయుటయో, లేక పులి మూడు మేకలను చంపుటయో ఈ ఆటయొక్క పర్యవసానము.

పులిని మొదట పై శిఖర కోణమునం దుంచెదరు. మేకను దాని సమీపమందలి యింటనుపెట్టి పాచికతో పందెమువేయుచు పావును నడిపెదరు. మేకపైనుండి పులి దాటి తన యింటిలో మేక లేకుండిన అవతలి ఇంటిపై పులి వ్రాలుచుండును. అట్లు మేకలు తప్పించు కొనుచుండ వచ్చును. లేదా మేకలు గల వారు పులికి మూడవయింట మేకలు వచ్చునట్లు నేర్పుగ పాచికవేసి మేకలతో పులిని చుట్టుముట్టి గడులు లేకుండ చేసి పులిని కట్టినచో మేకలు గలవారు గెలిచినట్లు. అట్లుగాక పులియే మేకల గదుల లోనికి జొరబడి మూడు మేకలను చంప గలిగినచో పులిని నడుపువారు గెలిచినట్లు.

రెండవ పద్ధతి: దీనినికూడ పాచికతోనే ఆడుదురు. పులికిని, మేకలకును సంకేతములలో మార్పులేదు. దీనిని పాచిక లేకుండకూడ ఆడవచ్చును; ఎట్లన్న నాలుగు పులులతోను, పదునారు మేకలతోను దీని నాడెదరు. నాలుగు పులులను నిలువు త్రికోణమందలి మధ్య రేఖపై

వరుసగ నుంతురు. మేకలవాడు పులులకు ప్రక్కయింటిలో మేకను కట్టక ఒక యిల్లు ఎడముగ ఒక మేకను ఉంచును. పులులవాడు ఒక పులిని ఒక యిల్లు జరుపును. మేకలవాడు రెండవమేకను ఉంచును. పులిప్రక్క నదే పంక్తిలో మేక ప్రక్కని యిల్లు, ఖాళీగానుండిన పులి మేకను దాటి దానిని చంపును. ఈ విధముగా 16 మేకలను పెట్టినతరువాత మధ్యపులులు చంపగా మిగిలిన మేకలను పులులను కట్టి వేయు ఎత్తులతో జరుపుదురు. మేకలు విరివిగా చచ్చి ఇక పులులను కట్టలేమనుకొని ఓటమి నంగీకరించిన ఆట ముగియును. అటులే పులులు కదలకుండ వాటిప్రక్కని ఇండ్లు మేక లాక్రమించుకొనిన మేకలవారు గెలిచినట్లు. ఈ రెండు పద్ధతులేకాక, కొన్ని ప్రాంతాలలో 3 పులులు, 16 మేకలతో 3 వ పద్ధతిలో కూడా ఇంచుమించు 2 వ పద్ధతివలెనే ఆడుదురు. ఊ. ల. కాం.

పెద్ద అష్టా చెమ్మా : ఇదికూడ చిన్న అష్టాచెమ్మ మాదిరి మగవారు, ఆడవారు ఆడుదురు. కాని ఎక్కువమంది ఉన్నప్పుడు ఉజ్జీలుగా ఆడుకోవచ్చును. పటములో చూపినట్లుగ గీతలు గీయవలెను. పటంలో 'X' మార్కు ఉన్న చోట్లలో క, చ, ట, త లు ఆటగళ్ళు, మధ్యనున్నది పంటగడి. మిగిలిన నాలుగూ మూలగళ్ళు అందురు. చుక్కలున్న గళ్ళకు కుస్తాలని పేరు, మిగిలినవి మామూలుగళ్ళే. ఒంటిగీతగళ్ళు లోపలికి దిగేటందుకు సూచనగా ఏర్పరచినవి; వాటిని కూడ మామూలు గళ్ళుగా భావించవలెను. ఒక్కొక్కరు ఎనమిది చొప్పున ఆటకాయలను పెట్టుకొని నలుగురు నాలుగు గళ్ళదగ్గర కూర్చుందురు. ఈ ఆటకు పందెపు గవ్వలు ఎనిమిది ఉండును. పందెము వేసినపుడు ఒకగవ్వ తిరుగబడి తక్కిన ఏడుగవ్వలు బోర్లపడిన 'పదకొండు', రెండు తిరుగబడి ఆరు బోర్లపడిన 'రెండు', మూడుకు 'మూడు', నాలుగుకు 'నాలుగు', ఐదుకు 'ఐదు', ఆరుకు 'ఆరు', ఏడుకు 'ఏడు', ఎనిమిది తిరగబడిన 'చెమ్మా' అనీ, ఎనిమిది బోర్లపడిన 'అష్టా' అనీ అంటారు. 'అష్టా' కి పదహారు, చెమ్మాకి ఎనిమిది నప్పుతారు. అష్టా, చెమ్మాలుగాని, పదకొండుగాని పడినప్పుడు మళ్ళీ పై పందెము వేయవలెను. రెండు, మూడు వంటివి పడేవరకు పై పందెము వేస్తూనే ఉండాలి. ఈ నియమం అష్టా చెమ్మాలో చెప్పిన విధంగానే ఈ ఆటకు కూడ.

అష్టా, చెమ్మా, నాలుగు పందెములలో ఏ ఒక్కటైనా మొట్టమొదటి పందెముగా పడినట్లయిన కాయ విడి, ఆడటానికి వీలుగా ఉండును. కాయవిడడం ఒక్కటి తప్పిస్తే, చంపుడు దొరకనిదే దిగకూడదు, కుస్తాలు ఉండకూడదు అనే నియమాలు ఈ ఆటలోలేవు. బొమ్మలో బాణపు గుర్తులు చూపిన విధముగా విడినకాయలు కుడినుంచి ఎడమకు నడుచును. ఆటగళ్ళు, మూలగళ్ళు, కుస్తాలు తప్పించి బయటిగళ్ళలో ఎక్కడైన ఇంకొకరి కాయ ఉన్నచో చంపవచ్చును. పటంలో ఒంటిగీత గళ్ళలో ఉన్నప్పటికీ చంపవచ్చును. అందువల్ల కాయలు బయట ఉండకుండా గళ్ళలో ఉండునట్లుగ నప్పించుటయే ఈ ఆటలోని నేర్పరితనము.

ఎవరివైన కాయలు చచ్చినప్పుడు అష్టా, చెమ్మా, నాలుగు పందెములలో ఏదైన పడినచో నాలుగుకు ఒక కాయ, చెమ్మాకు రెండు, అష్టాకు 4 కాయలు విడిపించుకోవచ్చును. ఒక్కకాయ మాత్రమే చచ్చినప్పుడు చెమ్మా పడినచో ఒక నాలుగుకు కాయ పెట్టుకొని రెండవ నాలుగు నప్పుకొనవచ్చును. ఆలాగుననే అష్టాకుకూడ. ఈ ఆటకూడ ఉజ్జీలుగ ఉండి ఆడుదురు; కాని చిన్న అష్టా చెమ్మా మాదిరి జోడీలు పెట్టుకొని ఆడరు. భా. సూ. శా.

బొంగరాల ఆట : ఈ యాట నాడుటకు కర్రతో చేసినట్టి గోపురమును పోలిన ఒక ఆటవస్తువు ముఖ్యము. దీనిలో రెండుభాగము లుండును. పై భాగము గోళమువలె గుండ్రముగ, నున్నగా నుండును, ఆ భాగమునకు ఏదో ఒకరంగు పూయుదురు. క్రిందిభాగము క్రమ క్రమముగ సన్నగిల్లుచు చుట్టు నరవలుగ గాట్లు వేయబడియుండును. క్రింది భాగమున సన్నని ఉక్కుముల్లు నాటబడియుండును. ఈ ఆటను మగపిల్లలు ఆడుదురు. తరచుగ వీథులలో నడచుచుకూడ బొంగరములను వదలుచుందురు.

బొంగరమునకు క్రింది భాగమున ఉన్న నరవలలో త్రాడుచుట్టి ఆ త్రాటియొక్క రెండవకొనను చూపుడు వ్రేలికి, నడిమివ్రేలికి నడుమ అదిమిపట్టి. త్రాడుచుట్టిన బొంగరమును కుడిచేతితో పొదివిపట్టుకొని ఊతముకొలది నేలపైకి విసరివేయుదురు, అపుడది నేలపై తిరుగును. ఈ బొంగరము లాటను పందెము పెట్టికూడ ఆడుదురు. ఆడునపుడు ఒకరు బొంగరమును నేలపై విడిచిన వెనుక వేరొకరు వాటము చూచుకొని తమ బొంగరమును ముందు విడువబడిన బొంగరమును పడగొట్టునట్లు వదలెదరు. ఈ విధముగ పడగొట్టినవారు గెలిచి నట్లెంచుకొందురు. ఊ. ల. కాం.

బొమ్మల పెండ్లి : బొమ్మలపెండ్లి చాల సులభముగ అర్థము చేసికొనదగిన ఆట. ఇదికూడ గుజ్జెనగూళ్ళవలె సంసారశిక్షణ ఇచ్చు క్రీడా విశేషము. కొందరు బాలబాలికలు రెండుజట్లుగ చీలి ఒకరు ఆడపెండ్లివారుగను, ఇంకొకరు మగపెండ్లివారుగను ఏర్పడెదరు. రెండు బొమ్మలను తెచ్చి వానిని పెండ్లికూతురు, పెండ్లికొడుకుగ

చేయుదురు. తరువాత ఇరువాగులవారు తమతమ శక్తి కొలది మామూలు పెండ్లిండ్లలోవలె అన్ని విధములైన వ్యవహారములు జరుపుకొందురు. కట్నములు, కానుకలు, లాంఛనములు, వియ్యాలవారి కయ్యాలు, అలకల పానుపులు, కడకు తిట్లాటలూ, కొట్లాటలుకూడ సాగించుచుందురు. బాగుగ డబ్బుగలవారి పిల్లలైనచో ఇష్ట బంధు జనులను పిలుచుట, మేళతాళములతో బొమ్మలను చిన్న పల్లకీలలో పెట్టి ఊరేగించుట, విందుభోజనములు పెట్టుట మొదలైనవికూడ చేయుదురు. ఊ. ల. కాం.

వెన్నెల వత్తి: ఈ ఆటను పలుప్రాంతములలో పలువిధములగు పేర్లతో పేర్కొందురు, పూర్వ గ్రంథములలోని కొన్ని వర్ణనలనుబట్టి దీనిని 'వెన్నెల దీవాట', 'పిల్లదీవాట' అనికూడ వ్యవహరింతురు. సాధారణముగ దీనిని ఇప్పటి వారు 'చుక్కచుక్కపుల్లి', 'దూదుంబుల్ల' అనికూడ అందురు. దీనిని ప్రధానముగ వెన్నెల రాత్రులలోనే ఆడవలయును. అందుచేతనే ఈ ఆటకు 'వెన్నెలవత్తి' అని, 'వెన్నెలపట్టి' అని పేరులు. ఈ యాట ఆడుటకు ఇద్దరు పిల్లలు, ఇసుక ప్రదేశము చాల అనుకూలము.

ఇద్దరు పిల్లలు ఇసుక ప్రదేశమున చేరి ఒక పుల్లముక్కనుగాని చిన్న రాతిముక్కనుగాని గురుతుగ తీసుకొందురు. ఒకరు కొంత ఇసుకను నిడుపుగ పోగుచేసి ఆ పోగులో ఈ ముక్కనుగ్రుచ్చి అది పైకి కనబడకుండునట్లుగ ఉంచెదరు. అటుపిమ్మట, రెండవవారు ఆ రాశిపై ఏదో ఒక స్థలమున తమ చేతులనుంచి కొంతమేర ఇసుకను అదిమిపెట్టి ఉంచుకొందురు. అంతవరకు అది రెండవవారి సరిహద్దులోని-ఇసుకగా భావించబడును. మిగత ఇసుక మొదటివారిదే. అప్పుడు ఇరువురు తమతమ భాగములలో మొదట గుర్తుపెట్టిన పుల్లముక్క కొరకు వెదుకుదురు. అది ఎవరిభాగము ఇసుకలో దొరికిన వారు గెలిచినట్లు భావింతురు, ఈ విధముగ ఐదుగాని, ఏడుగాని, తొమ్మిదిగాని ఆటలు ఎవరు ముందుగెలిచిన వారు పూర్తిగ గెలిచిన వారగుదురు. ఒక్కొక్క ఆటలో గెలిచినపుడెల్ల గెలుపునకు గుర్తుగ తమప్రక్క ఇసుకలో ఒక ముగ్గువేసి ఆ ముగ్గులో చిన్నచిన్న ఇసుక పోగులు పోయుదురు. ఆ విధముగ మొదట నిర్ణయించుకొన్న ఆటలన్నియు ముందుగ గెలచినవారు తమగెలుపు చిహ్నముగ పోసిన ఇసుకపోగుల నన్నిటిని కలిపి ఓడినవారి దోసిటపోయించి ఆటకు సంకేతముగ పెట్టుకొనిన పుల్లముక్కను వారి దోసిలిలోని ఇసుకపై నిలిపి వారికండ్లకు గుడ్డకట్టి (లేక తమ చేతులతో వారికండ్లు మూసి) వారిని ఆటఆడిన స్థలమునుండి దూరముగా తీసికొనిపోయి ఎచ్చటనో ఒక చోట ఆ దోసిలిలోని ఇసుకను పుల్లముక్కతోసహా క్రింద పోయించివేసి, కండ్లుమూసి ఉంచియే మరల ఆటఆడిన స్థలమునకు తీసికొనివచ్చి కండ్లగంతలు విప్పుదురు. ఇట్లు కండ్లుమూసి తీసుకొని వెళ్ళినపుడు వారిని ఒక త్రోవను తీసికొని వెళ్లక అటు, ఇటు వెనుక ముందులుగ త్రిప్పుదురు. తరువాత కండ్లగంతలు విప్పిన తరువాత ఓడినవ్యక్తి మరలవెళ్ళి, వెదకి, తానుపోసిన ఇసుకను, పుల్లను గుర్తుబట్టి తీసుకొని రావలెను. అట్లు తీసుకొని రాలేకపోయినచో ఆ ఓడిపోయిన వ్యక్తికి ఇంకను అది అవమానముగ ఎంచబడును.

వెన్నెలలో ఆడబడుట చేతను, ఒక స్థలమునుండి ఇంకొక స్థలము (దీవికి) నకు తీసికొనిపోయి ఓడినవారిచే ఇసుక పోయించి వెదకించుటచేతను, దీనికి 'వెన్నెలదీవి' ఆట అనియు, వెన్నెలలో ఒక పుల్లను (వత్తిని) గుర్తుగ ఉంచుకొని ఆడు ఆట అగుటచే 'వెన్నెలవత్తి' అనియు, పిల్లలు ఒక దీవినుండి మరొకదీవికి ప్రయాణము చేసినట్లుగ ఓడిపోయినవారిని దూరస్థలమునకు తీసికొనిపోయి అక్కడ వారిచే ఇసుక పోయించి మరల వారిచేతనే వెదకించు శిక్ష కూడ విధించు ఆట అగుటచే ఓడిన పిల్లలకు ద్వీపాంతర వాస శిక్ష విధించు ఆటఅను నర్థముతో 'పిల్లదీవాట' అనియు దీనిని పిలుచుచుందురు. 'చుక్కచుక్క ఆట' అను పేరుకూడ వెన్నెలలో ఆకాశముపై చుక్కలను సూచించు పేరుగనే కనబడును. ఊ. ల. కాం.

వైకుంఠపాళీ: అనాదినుంచి వస్తున్న అక్షక్రీడల్ని ఆధారం చేసుకొని 'పునరపి జననం, పునరపి మరణం....' అన్న సత్యాన్ని చాటుతూ జీవికిచెందిన ప్రారాబ్ధకర్మానుభవాన్ని తెలియజేస్తూ దైవచింతనవైపు జనులదృష్టిని మరల్చే సాధనగా ఈ ఆటను ఏర్పరచినట్లు తెలుస్తుంది. ఈ వైకుంఠపాళీ ఆట, 'సిరిసింగణాలవత్తి' సందర్భంలో ఒక్క ఆంధ్రవాచస్పత్యంలో తప్ప ఇంచుమించుగా ఏ నిఘంటువులోనూ కనబడదు.

ఈ ఆటను ఎందరైనా ఆడవచ్చు కాని ఆడేవాళ్ళు మాత్రం ఒక్కొక్కరు ఒక్కొక్క రకం ఆటకాయను గుర్తుగా నిర్ణయించుకొని ఏర్పరచుకోవాలి. ఆట ప్రారంభించడానికి ఆటగాళ్ళందరూ పరమపద సోపానపటము ముందుంచుకొని నాలుగు పందెపు గవ్వలతో పందెంవేస్తూ ఆడుతారు. పటంలో 1 నుంచి 132 వరకు (చూ. వైకుంఠపాళీ పటము, పుట 1452)అంకెలుగల గళ్ళు రకరకాలైన బొమ్మలతోకూడి ఉంటాయి. ఆ అంకెలకు దిగువ నాలుగు పాములు, ఏనుగులు వుంటాయి. అది పాతాళమనీ ఆ ఏనుగులను అష్ట దిగ్గజాలనీ, పైనున్న భూమిని (అంకెలున్న

గళ్ళని) ఆ అష్ట దిగ్గజాలూ మోస్తున్నాయనీ అంటారు. ఆట ప్రారంభించేముందు ఆటగాళ్ళు తమ కాయలను పాతాళంలో ఉంచి పందెంవేస్తూ, పందెమునుబట్టి కాయను నడుపుతూ వుంటారు. అష్టా, చెమ్మా ఆట (చూ. పుట 1440) లో లాగే కన్ను, రెండూ, మూడు, అష్టా, చెమ్మా పందేలు ఈ ఆటలో కూడ చలామణిలో ఉన్నాయి. అందులో వలెనే అష్టా, చెమ్మా పందెములకు ఇందులో కూడ పైపందెం వేస్తారు.

పటంలో 16, 18, 30, 41, 52, 63, 65, 74, 79, 87 సంఖ్యలుగల గళ్ళలో నిచ్చెన లున్నాయి. ఏ పందెమున కైనా ఆటకాయ ఆ గళ్ళలోనికి వచ్చినప్పుడు అక్కడున్న నిచ్చెనసాయంతో పై గడికి చేరుకోవచ్చు: అంటే ఉదాహరణకు 16 గడిలో ఉన్న నిచ్చెన దగ్గరకు ఆటకాయ వచ్చినప్పుడు ఆ నిచ్చెనసాయంతో 28 వ గడికి చేరుకుంటుంది. అలా చేరుకోవడానికి 'నిచ్చెన ఎక్కడం' అంటారు. పుణ్యఫలంవల్ల నిచ్చెన ఎక్కడం అవుతుందని చెప్తూ అప్పుడు మళ్ళీ పై పందెం వేసుకొనే అవకాశం ఇస్తారు. పై పందెంవల్ల మళ్ళీ నిచ్చెన ఎక్కినట్లయితే మళ్ళీ మరో పందెం....ఇల్లా ఒకేసారి ఎన్ని నిచ్చెనలైనా పందెం నేర్పుతో ఎక్కవచ్చును.

పటంలో నిచ్చెన లున్నట్లుగానే అక్కడక్కడ పాములు కూడా వున్నాయి. ఆటకాయ నిచ్చెన దగ్గరకి వచ్చినప్పుడు పైకి వెళ్ళినట్లే పాము తలదగ్గరకి వచ్చినప్పుడు పాముకరచి అది పాముతోక చివరివరకూ క్రిందికి దిగిపోతుంది. అయితే ఒకటి; 26 వ గడిలో ఉన్నపాము కరచినప్పుడు దానితోక ఉన్న మూడవ గడికివచ్చి అక్కడ ఉన్న చిన్నపాము మూలంగా ఆటకాయ పాతాళం చేరుకొంటుంది. ఇలా పాముతోక దగ్గరకు రావడానికి 'పాము మింగడం' అంటారు. 106 వ గడిలో ఉన్న పెద్దపాము మింగిందంటే 1 వ గడికి ఆటకాయ చేరుకుంటుంది.

చివరకు 121 లో ఉన్న పాముని తప్పించుకుని 122 కి ఆటకాయ చేరుకొన్నట్లయితే పుణ్యపథంలో పడ్డట్టే; ఆ తరువాతనున్న 132 వ గడిని దాటి పైనున్న స్వర్గాన్ని ఆటకాయ చేరుకొంటుంది. అక్కడినుంచి చివరివరకూ వెళ్ళి తిరుగుముఖంపట్టి మధ్యనున్న 'విరాట్' స్వరూపాన్ని చేరుకోవాలి. తిరుగుముఖం పట్టి, వచ్చేటప్పుడు ఏ పందెంతో సరిగ్గా విరాట్ స్వరూపాన్ని చేరుతుందో ఆ పందెం పడినప్పుడే ఆటకాయ పండినట్లు. అంతవరకూ ఆ వరుసలో ముందరికీ వెనుకకూ కాయను నడుపుతూ ఉండవలసిందే. విరాట్రూపానికి ఈ వైపూ, ఆ వైపూ ఉన్న బొమ్మలను ద్వారపాలకులనీ, ఆ ద్వారపాలకులు విరాట్దర్శనం కాకుండా అడ్డగిస్తూంటారనీ, అందువల్ల వాళ్ళచుట్టూ తిరిగినతర్వాత ఆఖరికి విరాట్దర్శనం అవుతుందనీ అంటారు.

ప్రారబ్ధకర్మలు అనుభవించి, పుణ్యలోకాలు చరించి స్వర్గప్రాకారాలు ప్రదక్షిణం చేసినపిదప విరాట్రూపమును దర్శించుకొన్న జీవి బ్రహ్మైక్యమును పొందుతుందని, అందుకు సూచనే ఈ ఆట అనీ చెపుతూ వుంటారు. వైకుంఠ ఏకాదశి రోజున రాత్రి జాగరణచేసే సందర్భంలో దక్షిణాదివారు ముఖ్యంగా ఈ ఆట ఆడుతూ ఉంటారు.

ఆంధ్ర ప్రదేశ్‌లో ఇట్టి జాతీయ క్రీడలు ఎన్నో ఉన్నాయి.

భా. సూ. శా.



# ఆరోగ్యము, వైద్యము

చరిత్ర: ఆంధ్రులు మౌర్యుల కాలము నాటికే ప్రసిద్ధి చెంది ఉండిరని ప్రతిష్ఠాన నగరమునకు సంబంధించిన గాథల వలన తెలియుచున్నది. అంత నాగరికులై పెద్ద సామ్రాజ్యమును స్థాపించిన ఆంధ్రులలో ఆరోగ్య రక్షణకు వలయు ఆచారములే కాక వైద్యులు, వైద్య వసతులు, చికిత్సా విధానములు ఉండియుండ వలయును. వాని గురించి సూచించునట్టి, తెలుపునట్టి శాసన, చిత్రపుస్తక ఆధారములు దొరకనంత మాత్రమున అట్టివి లేవని చెప్పజాలము. క్రీ. శ. మొదటి శతాబ్దమున నుండిన నాగార్జునుడు సాతవాహనుల గౌరవ మర్యాదలను పొంది కృష్ణానదీతీరమున వసించు చుండెనని తెలియుచున్నది. నాగార్జునుడు, సుశ్రుత సంహితను సంస్కరించి దానికొక అనుబంధమును చేర్చినాడని ప్రతీతి. అట్టి నాగార్జునుడు ఆంధ్ర చక్రవర్తుల ఆస్థానమున ఉండినప్పుడు ఆంధ్ర రాజ్యమునందలి నగరములలో, పండిత వైద్యులు, వైద్య వసతులు లేకుండుట ఊహింపజాలము. అటు పిమ్మట వేంగి మొదలగు రాజ్యములనాటి పరిస్థితి మనకేమియు తెలియదు. పదునొకండవ శతాబ్దము నాటికి చాళుక్య రాజరాజు కాలమున తాతలగు తంజావూరు చోళ రాజులు వైద్యులకు, వైద్యశాలలకు భూదానములు ఇచ్చి ఉండగా, తాను తన బంధువులు, తన రాజ్యమందలి సంపన్నులు అట్టి ధర్మకార్యములు చేయక ఉండియుందురా? క్రమముగా బయటపడుచుండు శాసనములలో కొన్ని ఆధారములు దొరకినవి. మొదటి కుళోత్తుంగ చోళుని కొడుకైన వేంగి రాజ ప్రతినిధి వీరచోళ రాజు కుమారుడు ఇచ్చిన అగ్రహార దాన శాసనములో శస్త్ర వైద్యునికి, విష వైద్యునికి వృత్తులు కలవు. కాకతీయ రాజకుటుంబము వారు ఇచ్చిన అగ్రహారము వలన వచ్చు రాబడిలో కొంత ప్రసూతి వైద్యాలయమును నిర్మించుటకు వినియోగపడెను. అట్టి వైద్యశాల ఆ రాజ్యమున ఒక్కటియే ఉండెనని చెప్పుట కన్న అట్టి సంగతిని తెలుపు శాసన మొక్కటియే లభించినదని చెప్పుట సమంజసముగా ఉండును. కాకతీయుల అనంతరము ఆంధ్ర దేశములో రాజ్య మేలిన రెడ్డిరాజులు, పండితులు, పండిత కవి పోషకులు మాత్రమే కాక పండిత వైద్యులను, అట్టి కుటుంబములను సత్కరించి పోషించినారనుటకు ఆధారములుగా కొన్ని శాసనములు, పుస్తకములు కూడ లభించి ఉన్నవి. ఇందుకు ఉదాహరణము సుప్రసిద్ధ వైద్య కుటుంబము, పరహిత వంశము, పరహిత సంహిత. వారి తదనంతరము దేశమును మరల ఏకఛత్రాధిపత్యముగా పరిపాలించిన విజయనగర ప్రభువుల కాలమునకు సంబంధించిన వైద్య విజ్ఞానము, వైద్య గ్రంథములు ఉన్నను, తద్విషయమును తెలుపు శాసనములు, చిత్రములు, ప్రసిద్ధ వైద్యుల పేర్లు ఒకటి, రెండు తప్ప దొరకలేదు. అంత మాత్రమున వైద్యులు, వైద్య వసతులు లేవనుట సాహసము. విజయనగర సామ్రాజ్యము విచ్ఛిన్నమైన తరువాత గోల్కొండ, పెనుకొండ, చంద్రగిరి, తంజావూరు, మధుర, వెంకటగిరి, కాళహస్తి, విజయనగరము, బొబ్బిలి, పెద్దాపురము, కర్నూలు, ఉదయగిరి మొదలగు చిన్న చిన్న ఆస్థానములలోను ఇతర ఆంధ్ర నగరములలోను ఆయుర్వేదము, యూనాని వైద్యము పోషణ పొందు చుండెను. ఇందుకు ఆధారముగ ఆంధ్ర వాఙ్మయమున అనేక వైద్య గ్రంథములు, వైద్య ప్రస్తావనలు, వైద్యుల కథలు, సంప్రదాయములు నిలచియున్నవి.

డి. వి. సు. రె.

# దేశీయ వైద్యము - ఆయుర్వేదము

ఆర్య విజ్ఞానము దక్షిణా పథమున ఆంధ్ర దేశ మార్గముననే వ్యాపించవలసి యుండుటచే ఆర్య సంప్రదాయములు ఆంధ్ర దేశమున అధికముగ కన్పట్టును. ఇట్టి అవకాశమునకు కారణము ఆంధ్రదేశము ఉత్తర, దక్షిణ భారత దేశములకు మధ్యను సంధి స్థానముగ ఉండుటయే. ఆయుర్వేద వ్యాప్తికి పూర్వముకూడ ఈ దేశములో వైద్య వాఙ్మయము ఉండెననియు, అది దేశీయ సంప్రదాయ సమ్మిళితమైన దనియు గుర్తించుటకు కొన్ని అవకాశములు కలవు. అందుకు తార్కాణము మన దేశమున సంప్రదాయ సిద్ధముగ ఉపయోగింపబడు కొన్ని రోగ నిదానాంశములు, చికిత్స విధానములు ఆయుర్వేద సంప్రదాయమునకు భిన్నముగ కనిపించుటయే. మేహము, వాతము, శీతలము అను పదములు రోగములకు ఉపయోగించుట, ఆయుర్వేదమున ఇంత వరకు గుర్తింపని,

మయూరశిఖ, పొడపత్రి, రాతిపువ్వు, రాతిచెట్టు మున్నగు ద్రవ్యములు ఔషధములందు ఉపయోగించుట ఇందులకు ఉదాహరణములుగ గ్రహింపవచ్చును. కాని ఈ ప్రాచీన పద్ధతులు కొంతవరకు దక్షిణ ప్రాంతమునందు ప్రచారమున ఉన్న సిద్ధవైద్య సంప్రదాయమునకు అనుగుణములుగ కనబడుచుండుటచే ఈ ఆంధ్రదేశ వైద్యము ఆర్య ద్రావిడ విజ్ఞాన సమ్మేళనము, లేదా ఆయుర్వేద సిద్ధ సంప్రదాయ సమ్మేళనము అనదగును. ఈ సంప్రదాయమే ఆంధ్ర వైద్యులచే రక్షింపబడి ప్రచారమున ఉన్న వైద్య 'చింతామణి', 'బసవరాజీయము' మున్నగు ఆయుర్వేద గ్రంథము లందు కాననగును. అదియే ఆంధ్ర వైద్య విజ్ఞాన విశిష్టత.

త్రిలిఙ్గ దేశమున వైద్య వాఙ్మయము ఎప్పటినుండి ఏర్పడినదో చెప్పజాలము. కాని ఆంధ్ర వైద్యక చరిత్రాంశ ములు సుమారు క్రీ. శ. 900 నుండి సువ్యక్తములుగ ఉన్నవి. ఆంధ్ర దేశమున వైద్యవిద్యయందు పేరెన్నిక పొందిన వారిలో సిద్ధ నాగార్జునుడు చారిత్రికాధారము లనుబట్టి మొదటివాడు. ఈతడు రస శాస్త్రమున ఘనత వహించెను. ఈతని తరువాత ఈ సంప్రదాయమును అనుస రించి రస వైద్యమును ప్రచారము చేసి, గ్రంథమును రచించిన పండితుడు నిత్యనాథ సిద్ధుడు. ఈతడు 'రసరత్నా కరము' అను గ్రంథమును రచించెను. వీరిరువురు సిద్ధ సంప్ర దాయమునకు చెందినవారు. సిద్ధులు రససిద్ధిని, దాని మూలమున దేహ లోహ సిద్ధికిని ప్రయత్నించువారు. సిద్ధ సంప్రదాయము ప్రబలుటకు పూర్వము కేవలము మూలికా వైద్యము ప్రధానముగ ఉండెను. అందులకే ఆయుర్వేద చికిత్సయందు మూలికల ఉపయోగమే ఉండెను. దీనికి బ్రాహ్మి సంప్రదాయము అనియు పేరు. సిద్ధులు ముఖ్య ముగ శైవోపాసకులు. వీరు దేహసిద్ధి నొందుటకు రసాది ఖనిజ ద్రవ్యములను, అందును ముఖ్యముగ రసోపయోగ మును అభివృద్ధి పరచిరి. ఈ సిద్ధ రసోపయోగము వలన రోగ నిరోధము, ఆయుర్వృద్ధి కలుగుట ముఖ్యములు. ఈ సంప్రదాయమునకు శైవీ సంప్రదాయమని కూడ పేరు. ఈ సిద్ధులు పాదరసమును 'శివవీర్యము' అని అందురు; రసబంధ కారకమగు గంధకమును 'పార్వతీ రజస్సు' అనిరి. ఇట్లు రస, గంధకములను దైవ స్వరూపముగనెంచి పూజించి వివిధ ద్రవ్యముల నుండి అనేక ఔషధములను తయారు చేసిరి. సిద్ధు లకు రస సిద్ధి వలన దేవ సిద్ధియు, అనగా మోక్షము ఎట్లు పరమావధియో, అట్లే లోహ సిద్ధియు అనగా నీచలోహము లను ఉత్తమ లోహములుగ చేయుట - తగరము, రాగి మున్నగు వానిని వెండి, బంగారములుగ తయారు చేయుట, కూడ కేవలము ఐహికోపయోగమునకు కాక మోక్ష సిద్ధికి సాధనముగ ఎంచబడెను. అప్పటి నుండి క్రమముగ రసౌషధములు ఆయుర్వేద చికిత్స లోనికి చొప్పించబడెను. ఈ మూలికా రస వైద్య సమ్మేళనము ఉత్తర, దక్షిణ భారత సిద్ధి స్థానమగు ఆంధ్ర దేశముననే మొదలిడెను.

పూర్వము ఆంధ్రప్రాంతమును పాలించిన చాళుక్యులు, కాకతీయులు, రెడ్లు ఆయుర్వేదమును ఆదరించి ఆయు ర్వేద వైద్యులను పోషించినను, ఆ నాటి వైద్య గ్రంథములు ఒకటో రెండో తక్క ఇతరములు లభించుట లేదు. నిత్యానాథ సిద్ధ కృతమగు 'రసరత్నాకరము' తెలుగు దేశమున రచింపబడిన సంస్కృత గ్రంథము. తరువాత రచింపబడిన వైద్య 'చింతామణి', 'బసవ రాజీయము' అను గ్రంథములును, భాషా పాటవము లేకున్నను సంస్కృతముననే వ్రాయబడినవి.

విజయనగరయుగమున శ్రీకృష్ణదేవరాయాది ప్రభువులు ఆంధ్ర భాషాభిమానులై తత్సాహిత్యమును అభివృద్ధిపర చిన తరువాత ఆంధ్రభాషకు గౌరవ ప్రతిపత్తులు అధిక మగుట వలన ప్రజా సామాన్యమునకు దేశభాషాజ్ఞానము అభివృద్ధియైనందున వైద్య గ్రంథములు ఆంధ్ర భాషయం దును, పద్య రూపమున వ్రాయబడుచు వచ్చినవి. ఈ కాల మున పూర్వము సంస్కృతమున వ్రాయబడిన 'అష్టాంగ హృదయము', 'వైద్య చింతామణి', 'సుశ్రుతము' నందలి శారీరాది భాగములు పద్య రూపమున ఆంధ్రీకరింప బడినవి. చారుచర్య, శరభరాజీయము, వైద్య సారము, రసప్రదీపిక, ఆంధ్ర వైద్య చింతామణి మున్నగునవి తెలు గులో వచ్చిన స్వతంత్ర వైద్య గ్రంథములు.

ఆంధ్రప్రదేశ్‌లో రచింపబడిన ఈ వైద్య గ్రంథములు సంస్కృతమున ఉన్నను, ఆంధ్రమున ఉన్నను ఉత్తరదేశీయ వైద్య గ్రంథములకంటె విశిష్టములైనవి. ఆ విశిష్టత రోగ నిదాన పద్ధతులందు ఆంధ్ర వైద్యులు ప్రత్యేకముగ అభి వృద్ధి పరచిన అష్టస్థాన పరీక్ష అనునది; ఇందు నాడీపరీక్ష ముఖ్యమైనది. చరక, సుశ్రుతాది ప్రాచీన ఆయుర్వేద గ్రంథములందు నాడీ పరీక్ష వర్ణింపబడలేదు. అనగా అది ఒక రోగ నిదానోపాయముగ గుర్తింపబడి ఉండలేదు. మధ్య యుగమున ఆయుర్వేదమున చేర్పబడినటులనే యోగుల నుండి నాడీ విజ్ఞాన శాస్త్రమును గ్రహింప బడి, త్రిదోష వికృత నిర్ణయానుకూలముగ ఆయుర్వేదమున జొప్పింపబడినవి. ఆంధ్ర వైద్యులే వైద్య శాస్త్రమున చేర్చి నట్లు తలంప బడుచున్నది. ఇందులకు తార్కాణము ఆంధ్ర వైద్య గ్రంథములందు మొదట అగుపడుటయే. ఇటుల నాడీ విజ్ఞానము ప్రధానముగ గల అష్టస్థాన పరీక్షను రోగ నిదానోపాయములలోను, చికిత్సయందు రస వైద్యమును

చేర్చి ఆయుర్వేద విజ్ఞానాభివృద్ధికి ఆంధ్ర వైద్యు లెంతయు దోహదమొసగిరి. ఔత్తరాహమైనఆయుర్వేదమును దక్షిణ దేశమున ప్రవర్తింపచేయుటకును, దాక్షిణాత్యమైన రస సంప్రదాయమును ఉత్తరదేశమున వ్యాపింప చేయుటకును భారత భూమికి బొడ్డువలె ఉన్న ఆంధ్రదేశము కారణమై తోడ్పడినది అనుట నిశ్చయము. ఆరోగ్య రక్షణము, వ్యాధి శమనము అనబడు రెండు ముఖ్య ప్రయోజనములు కలిగి కాయ, బాల, గృహ, ఊర్ధ్వాంగ, శల్య, విష, రసాయన, వాజీకరణము అనబడు ఎనిమిది అంగములు కలిగిన ఈ అష్టాంగ ఆయుర్వేదము దేశీయుల ఆరోగ్యాభివృద్ధికి అన్ని విధముల తోడ్పడుచు వచ్చెను.

1700 నుండి 1900 వరకు పాశ్చాత్య ప్రభుత్వ పరిపాలనమున ఆయుర్వేదము క్రమముగ క్షీణించి ఆంధ్ర ప్రదేశ్ నందలి విజయనగరము, పెద్దాపురము, పిఠాపురము, నూజివీడు, వెంకటగిరి, కాళహస్తి, గద్వాల, వనపర్తి మొదలగు సంస్థానములందు కొంచెము ఆశ్రయము కలిగి ఉండెను. కాయ చికిత్సా మాత్రముగ ప్రవర్తించుచున్నప్పటికిని ప్రజలకు ముఖ్యముగ గ్రామవాసులకు ఇది ఒక్కటియే అందుబాటు గల చికిత్సా విధానము ఐనది. పాశ్చాత్య పాలకులు ఆయుర్వేదజ్ఞులను, వారి పద్ధతులను నిరాదరించుట, పాశ్చాత్య దేశములనుండి వచ్చిన వైద్యులకును, వారి పద్ధతులకును, వారి వలన తయారైన వైద్యులకు మాత్రమే సహాయము, సౌకర్యము ప్రోత్సాహము ఇచ్చుచు వచ్చిరి. ఈ పాశ్చాత్య వైద్య సహాయము కేవలము పట్టణ వాసులకును, ధనవంతులకును మాత్రమే అందుబాటులో ఉండగలిగెను. అందువలన గ్రామములు అధికముగ గల ఆంధ్రప్రదేశ్ దేశమున నూటికి తొంబది మంది దేశీయ వైద్యము పైననే ఆధారపడవలసిన వారైరి.

**ఆయుర్వేద పునరుద్ధరణోద్యమము :** పరిస్థితు లిట్లుండ పండిత డి. గోపాలాచార్యులు 1901 లో మద్రాసు చేరి ఆయుర్వేదోద్ధరణోద్యమమును ప్రారంభించిరి. వారు మొండి వ్యాధులకు స్వయముగ చికిత్సలు చేసి తమ నైపుణ్యమును, ఆయుర్వేద చికిత్సా ప్రాశస్త్యమును నిరూపించిరి (చూ. గోపాలాచార్యులు, పుట 791). ఇట్టి వారి ప్రబోధమువలన దేశాభిమానులగు శ్రీ ఏ. యస్. కృష్ణారావు, రాజా పానుగంటి రామారాయణింగారును దేశీయ వైద్య విషయమున శ్రద్ధ వహించి శాసన సభలందు ఈ విషయమును చర్చించి దేశీయ వైద్యమును ప్రభుత్వము వారిచే గుర్తింపచేయ ప్రయత్నించిరి.

మద్రాసు ప్రభుత్వము 1919 లో దేశీయ వైద్యోపయోగమును విచారించుటకు డాక్టరు కోమను నాయర్ ను నియమించెను. వారు వివిధ ప్రాంతముల దేశీయ వైద్యులను విచారించియు, కొన్ని దేశీయ ఔషధములను మద్రాసు జనరల్ ఆసుపత్రిలో ఉపయోగించియు 1920 - 21 లో తమ నివేదికను ప్రభుత్వమునకు సమర్పించిరి. అందు దేశీయౌషధములు కొన్ని ఉపయోగకరములే కాని ఆయుర్వేదము శాస్త్రబద్ధముకాదని నిర్ణయించిరి. అందుపై దేశాభిమానులగు శాసన సభ్యులు ఆ నివేదికను త్రోసిపుచ్చి తిరిగి వేరొక కమిటిని 1921 లో నియమించిరి. వైద్య కుటుంబమునకు చెందిన సర్ ఉస్మాన్ ఈ కమిటికి అధ్యక్షులు, ఆంగ్ల వైద్యమున ఆరితేరిన, సంస్కృతము నెరిగి దేశీయ వాఙ్మయమున అభిమానము గల శ్రీ కెప్టన్ జి. శ్రీనివాసమూర్తి కార్యదర్శి. శ్రీ గోపాలాచార్యుల వారి అనంతరము ఆయుర్వేద ఉద్యమ నాయకత్వము వహించి శ్రీ ఆచార్యుల వారిచే స్థాపింపబడిన ఆయుర్వేద కళాశాలను నడుపుచు ఆయుర్వేదాభివృద్ధికై పాటు పడుచున్న వారిలో ప్రథములుగ ఉండిన డాక్టరు ఆచంట లక్ష్మీపతి సభ్యులు. ఈ ముగ్గురితో కూడిన విచారణ సంఘము భారత దేశము నందలి అన్ని భాగములకును, ఉత్తమ వైద్య సంస్థలకును వెళ్ళి అచ్చట జరుగుచున్న పనిచూచి, దేశీయ వైద్యుల నుండి కైఫీయతులు తీసికొని 1924 వ సంవత్సరాంతమున ఒక నివేదికను ప్రభుత్వమునకు సమర్పించిరి.

ఉస్మాన్ కమిటీ నివేదిక అన్ని ప్రాంతముల నుండియు హర్షింపబడినది. వారు చేసిన సిఫారసులలో దేశీయ వైద్యమును ప్రోత్సహించినచో దేశీయులకు ముఖ్యముగ గ్రామస్థులకు ఉపయోగకారి కాగలదు; వైద్యులకు రిజిస్ట్రేషన్ ఇచ్చి వారికి గౌరవ ప్రతిపత్తులు కలిగించవలయును; దేశీయ వైద్య కళాశాల నొకదానిని స్థాపించి అందు ఆయుర్వేదము, సిద్ధవైద్యము, యూనాని వైద్యము అను మూడు శాఖలను స్థాపించి ఆయా వైద్య భాగములందు తరిఫీదు ఇచ్చుచు ఆయుర్వేద వైద్యులుప్త భాగములకు శరీరము, శస్త్ర, ప్రసూతి చికిత్సలు, వ్యవహార వైద్య భాగములు అల్లోపతి వైద్యము నుండి నేర్పవలయును అనునవి ముఖ్యమైనవి.

ఇదే సమయమున మద్రాసు శాసన సభలో గ్రామములలో వైద్య సహాయమును గూర్చి ఆందోళన సాగినది. గ్రామ వైద్య సహాయోద్యమము దేశీయ వైద్యమునకు కొంత ప్రోత్సాహమిచ్చి దేశీయ వైద్య పాఠశాలా స్థాపనమునకు కారణమైనది. 1924 లో మద్రాసు గవర్నరుచే దేశీయ వైద్య కళాశాల తెరువబడెను. ప్రభుత్వము వారి ఆ పాఠశాలకు, తరువాత 1926 లో స్థాపింపబడిన వైద్యశాలకు కెప్టన్ శ్రీ జి. శ్రీనివాసమూర్తి అధిపతులుగ నియ

మిత్తులై తమ సర్వ శక్తుల దేశీయ వైద్యాభివృద్ధికి ప్రయత్నించిరి.

1933 లో దేశీయ వైద్యుల రిజిస్ట్రేషను ప్రవేశ పెట్ట బడెను. అందు దేశీయ వైద్య పాఠశాల నుండి ఉత్తీర్ణు లైనవారు, అనగా ఆయుర్వేద, సిద్ధ, యునాని వైద్య సిద్ధాంతములతోపాటు అల్లోపతి, శస్త్ర, ప్రసూతి వ్యవహార వైద్యములందు తరిఫీదు ఐనవారు 'ఏ' తరగతి యందును, ఇతరులు-కేవలము దేశీయ వైద్యములందు తరిఫీదు పొందిన వారు 'బి' తరగతి యందును రిజిష్టరు చేయబడిరి. అప్పటి ప్రభుత్వోద్యోగము నందున్న వారు తప్ప తరువాత వచ్చు ఉద్యోగములు అన్నిటికి 'ఏ' తరగతి యందు ఉత్తీర్ణులైన వారే అర్హులని నిర్ణయించిరి. దేశీయ వైద్య పాఠశాల యందు ఉత్తీర్ణులైన వారికి 'ఎల్.ఐ.ఎమ్.' తదుపరి 'జి.సి. ఐ.ఎమ్.' అను పట్టాలు ఇచ్చుచుండిరి.

శ్రీమతి రుక్మిణి లక్ష్మీపతి మంత్రిత్వ కాలమున ప్రభుత్వము వారు 'గ్రామ వైద్య శిక్షణ' ఒక దానిని ఏర్పరచిరి. దీనికి గ్రామములందు పది సంవత్సరములనుండి వైద్యము చేయుచున్న వారికి ఆధునిక ఆరోగ్య విధాన ములను ప్రథమ చికిత్స విధానము మున్నగు వానిని ఆరు మాసముల కాలము ఏలూరు, మద్రాసు మున్నగు కేంద్ర ములందు శిక్షణము ఇచ్చుటకు ఏర్పాటు చేసిరి. ఇందు ఉత్తీర్ణులైన వారికి గ్రామ వైద్య పట్టములు ఇచ్చిరి.

తెలంగాణాలో ఆయుర్వేద ప్రచారము కొంతవరకు జరిగినది. ప్రాచీన కాలమున అన్ని ప్రాంతములందు వలెనే ఇచటను ఆయుర్వేద సంప్రదాయము అభ్యాసమున ఉండి తదుపరి అనుభవ మాత్ర వైద్యముగ ఏర్పడెను. తెలం గానామహమ్మదీయ ప్రభువులవశమైన పిమ్మట ఆయుర్వేద వైద్యమునకు ప్రోత్సాహము తగ్గి యునాని, యవన వైద్య ములకు ప్రాముఖ్యము, ప్రోత్సాహము హెచ్చెను. యునాని వైద్యులు రాజ వైద్యులుగను, గౌరవార్హులుగను ఉండిరి. పాశ్చాత్య వైద్యము ప్రబలు వరకును హైదరా బాదు సంస్థానమున యూనానీ వైద్యులే సంస్థాన వైద్యు లుగ ఉండిరి. ఈ కాలమున 'డాక్టరు' అను పదము వైద్యు లకు ఎంత గౌరవముగ నెంచబడుచున్నదో ఆ కాలమున ఆ సంస్థానమున 'హకీమ్' అను పదము అంత గౌరవ ప్రదముగ ఉండెను. అచట ఆయుర్వేద వైద్యులు కూడ హకీమ్ బిరుదాంకితులే. హకీమ్ హరి గోవిందు, మున్నగువారు ఆయుర్వేద వైద్యులుగ ప్రసిద్ధి నొంది నను వారికి హకీమ్ అనునదియే గౌరవ వైద్య బిరుదముగ ఉండెను. హైదరాబాదు సంస్థానములో సుమారు 1900 నుండి 1922-23 వరకు హకీమ్ హరిగోవిందు అనువారు ప్రముఖాయుర్వేద వైద్యులుగ ప్రసిద్ధి నొందిరి. వీరు ఆయుర్వేదమున గొప్ప పాండిత్యము, అనుభవముగల వారై ఉండిరి. వీరు హైదరాబాదు సంస్థాన ఆయుర్వేద వైద్యులుగ కూడ గ్రహింపబడిరి. గురుకుల పద్ధతిపై వీరొక ఆయుర్వేద పాఠశాలను నడిపి ఆయుర్వేద ప్రచార మునకు చాల కృషి చేసిరి. 1922 లో అఖిల భారత ఆయు ర్వేద, యూనానీ సమ్మేళనము హకీమ్ హరిగోవిందు యాజమాన్యమున జయప్రదముగ జరిగినది. 1951 లో అఖిల హైదరాబాదు ఆయుర్వేద వైద్య సమ్మేళనము జరిగెను. సికింద్రాబాదులో సుమారు 1860 నుండి 1900 వరకును ములుగు సుబ్బరాయ శాస్త్రి ఆయుర్వేద వైద్య ప్రముఖులుగ ప్రసిద్ధి నొంది ఉండిరి. వీరు నాడి పరీక్షయం దును, రోగ సాధ్యాసాధ్య వివక్షతయందును ప్రవీణులు అగు పండితులని పేరు వడసిరి. వీరి అనంతరము శ్రీ పండితా రాధ్యుల మార్కండేశ్వర శాస్త్రి 1949 వరకును గొప్ప ఆయుర్వేద వైద్యులుగ ప్రసిద్ధి గాంచిరి. 1920-24 లలో శ్రీ పండిత్ హెచ్. సుబ్బరాయ శాస్త్రి ఆయుర్వేద పాఠ శాలలను నడిపి కొంత ఆయుర్వేద ప్రచారము చేసిరి. ఆంధ్రప్రదేశ్‌లో దేశీయ వైద్యమునకు సంబంధించిన వివరములు దిగువ ఇవ్వబడినవి:

| | ఆంధ్ర | తెలంగానా | ఆంధ్రప్రదేశ్ |
|---|---|---|---|
| **ఆయుర్వేదము** | | | |
| ఆసుపత్రులు | — | 1 | 1 |
| డిస్పెన్సరీలు | 683 | 65 | 748 |
| వైద్యులు | 683 | 72 | 755 |
| **యూనాని** | | | |
| ఆసుపత్రులు | — | 1 | 1 |
| డిస్పెన్సరీలు | 8 | 60 | 68 |
| వైద్యులు | 8 | 83 | 91 |

ఆయుర్వేద కళాశాల, హైదరాబాదు: ఇది 1934 లో వైయక్తిక సంస్థగా స్థాపింపబడి 1941 లో నాటి హైదరా బాదు ప్రభుత్వ యాజమాన్యము క్రిందికి వచ్చి 1951 లో కళాశాల గుర్తించబడినది. కళాశాలలోని విద్యార్థుల సంఖ్య 1951 లో 43. ఇది క్రమముగా వృద్ధియై ప్రస్తుతము 400 వరకు పెరిగినది. ఇందులో 55 గురు విద్యార్థినులు కూడ ఉన్నారు. ఇచ్చట ఆయుర్వేద శిక్షణతోబాటు ఆధునిక వైద్యమునుకూడ ఒక పాఠ్య విషయముగ నేర్పుదురు. 1957 లో తెలుగు భాషలో కూడ వైద్యమును నేర్పుటకు ఒక శాఖ ప్రారంభింప బడినది. 1958 లో ఆంగ్లములో విద్యను గరపుటకు మరొక శాఖకూడ ఏర్పాటు చేయబడెను. ఈ కళాశాలకు అను బంధముగా 108 పడకలు గల వైద్యశాల ఆయుర్వేద

విధానము క్రిందనే నడుపబడు చున్నది. ఇచ్చట విద్యార్థులకు ఆయుర్వేద వైద్యచికిత్సలో ప్రత్యేక శిక్షణ ఇత్తురు. కళాశాల ప్రధానాచార్యుడు ఈ వైద్యశాలకు సూపరింటెండెంటుగా ఉండి వైద్యశాలను తన ఆధ్వర్యవమున నడుపును. ఈ కళాశాలలో 12 మంది ఆయుర్వేదాచార్యులు, 5 గురు ఆధునిక వైద్యాచార్యులు, 3 గురు సహాయకులు ఉన్నారు.

హైదరాబాదు ప్రభుత్వము కొన్ని ఆయుర్వేద వైద్యశాలలను గ్రామములలోను, చిన్న పట్టణములలోను నెలకొల్పి ఉన్నారు. ఇందు వైద్యులుగ హైదరాబాదు ఆయుర్వేద కళాశాలనుండి ఉత్తీర్ణులైన వారినేకాక, ఇతర రాష్ట్రములలోని కాలేజీలలోనుండి పట్టముల నందినవారిని అనేకులను వైద్యులుగ నియమించుచున్నారు. మద్రాసు దేశీయ వైద్య కళాశాలనుండి ఉత్తీర్ణులైన యల్. ఐ. యం., జి. సి. ఐ. యం. పట్టముల నందినవారు అనేకులు ప్రభుత్వ ఆరోగ్య వైద్యశాలలందు వైద్యులుగ నియమింపబడి ఆ ప్రాంతములందు స్వతంత్ర వైద్యులుగను, ప్రసిద్ధి నొంది ఉన్నారు. 'గ్రామ వైద్య' పద్ధతిలో రిజిష్టరైన వైద్యుల కృషి గ్రామసీమలలో ప్రశంసనీయముగ నున్నది.

ఈ గ్రామవైద్య పరీక్షలో ఉత్తీర్ణులైన వారిని 'సి' తరగతియందు రిజిష్టరు చేయుటకు ఉత్తర్వు చేయబడెను. తిరిగి 'ఏ' తరగతియందలి మొదటి భాగమునందు 'జి. సి. ఐ. ఎమ్.' పట్టభద్రులును, రెండవ భాగమునందు 'ఎల్. ఐ. ఎమ్.' పట్టభద్రులును రిజిష్టరు చేయబడిరి. 'బి' తరగతి యందుకూడ ప్రభుత్వ గౌరవబిరుదములు గలవారిని ప్రభుత్వాంగీకృతములైన వైద్య పాఠశాలల యందు ఉత్తీర్ణులైన వారిని పది సంవత్సరములకు తక్కువ కాని కాలము వైద్యానుభవము గలవారిని వేరు వేరు విభాగములందు రిజిష్టరు చేసిరి.

ఆంధ్రప్రదేశ్‌లో ఇంతవరకు ఆయా విభాగములందు రిజిష్టరైన వారిసంఖ్య దిగువ చూపబడినది.

| ఏ. 1 | ఏ. 2 | బి. 1 | బి. 2 | సి. |
|---|---|---|---|---|
| 25 | 500 | 346 | 3,789 | 155 |

వీరిలో 'ఏ' తరగతివారు 'బి' తరగతివారు 'సి' తరగతివారు స్థానిక వైద్య శాలలందు మున్సిపల్ వైద్యశాలలు, లోకల్‌ఫండు వైద్యశాలలు, గ్రామవైద్య శాలలలో పని చేయుచున్నారు. ఇటుల ప్రస్తుతము ఆంధ్రప్రదేశ్‌లో ఉన్న దేశీయవైద్యుల సంఖ్య 4,815. అచ్చటచ్చట ఉన్న గురుకులములు కాక, ఆయుర్వేద కళాశాలలు రెండు కలవు. అందొకటి విజయవాడ యందును, రెండవది గుంటూరు నందును కలవు. మూడవది: ఆయుర్వేద కళాశాల, వరంగల్లు. వీనిలో విజయవాడ యందలి వైద్య పాఠశాలకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము గ్రాంటు ఇచ్చు చున్నది. ఆంధ్రప్రదేశ్‌లో ఆయుర్వేదౌషధములు తయారుచేయు ఫార్మశీలు అనేకములు కలవు.

యునానీ వైద్యకళాశాల, యునానీ వైద్యము : హైదరాబాదులో గత శతాబ్దమున స్థాపింపబడిన యునానీ పాఠశాలయే క్రమవృద్ధి నొంది నేటి యునానీ కళాశాలగను, ఆసుపత్రిగను రూపొందినది. ప్రప్రథమమున ఆ పాఠశాలకు తోడుగ చిన్నవి అగు రెండు డిస్పెన్సరీలు మాత్రమే ఉండినవి. కాని, ప్రజాభీష్టమును అనుసరించి క్రమముగ నగరమున వానిసంఖ్య 1930 నాటికి ఎనిమిదింటికి పెరిగినది.

1941 లో జరిగిన పునర్వ్యవస్థీకరణను అనుసరించి, చారిత్ర్యాత్మమగు చార్మినారునకు అభిముఖముగ నేడు కన్పట్టుచున్న మహాసౌధమున ఈ కళాశాలయు, ఆసుపత్రియు నెలకొల్పబడినవి. పూర్వపు పాఠశాలస్థాయి కళాశాలస్థాయికి పెంచబడి, విద్యార్థులకు శిక్షణ నొసగుటకై 50 పడకలు కల వైద్యశాల ఒకటి స్థాపింపబడినది. తరువాత కొలది సంవత్సరములలో ఈ పడకల సంఖ్య 150 కి అభివృద్ధి యైనది. శిశువ్యాధుల చికిత్స, స్త్రీ వ్యాధుల చికిత్స, ప్రసూతి, గర్భాశయవ్యాధి చికిత్సలకు సంబంధించిన వార్డులు ఏర్పరుప బడుటయే కాక, శస్త్ర చికిత్సలో శిక్షణ నొసంగుటకు సదుపాయములు కలుగ చేయబడినవి. ప్రతిదినము నగరమునుండి సుమారు 500 మంది రోగులువచ్చి చికిత్సపొందు చున్నారు. సాంక్రామికవ్యాధి చికిత్స, నిదాన విజ్ఞానము, శౌచవిజ్ఞానము మొదలగు నవ్య శాస్త్రీయ విషయములుకూడ కళాశాలా పాఠ్య విషయములందు చేర్చబడినవి. ఈ శిక్షణ విధానము సమగ్రమని తలచబడెను. తొలుతగ 20 మంది విద్యార్థులకు మాత్రమే ప్రవేశానుమతి ఉండెడిది. కాని అది క్రమముగ 75 నకు పెంచబడినది. వైద్యశాలకు పాఠశాలకు అనుబంధముగా మందులు తయారుచేయు ఔషధశాల (ఫార్మశి) ఏర్పాటు చేయబడినది. ఇటీవలనే మేల్కొటే కమీషను సిఫారసులను అనుసరించి ఆ విధానము మార్చబడి స్వచ్ఛమగు యునానీ సంప్రదాయ శిక్షణయే ఈ కళాశాలయందు ప్రవేశపెట్ట బడినది. శిక్షణ కాలము పూర్వము నాలుగేండ్లు; ఇప్పుడు అయిదు సంవత్సరములకు పెంచబడినది. ఇందువలన ఒక సంవత్సరము ప్రీ-ప్రొఫెషనల్ (వృత్త్యారంభ విద్య) యునానీయందు శిక్షణయు కనీస మొక ఆరు నెలలకాలము ఆసుపత్రి యందు వైద్యశిక్షణయు పొంద వీలు లభించినది.

స్వాతంత్ర్యము సిద్ధించినది మొదలుగ కళాశాలయు, ఆసుపత్రియు పై స్థాయికి క్రమముగ కొనిపోబడినవి. ఒక పరిశోధనా శాఖయు, టర్కిష్‌స్నానాగారమును, మాలీషువార్డును, ఛాయాచిత్ర శోధనశాలయు, ఇంకను మరికొన్ని సదుపాయములును స్థాపింపబడినవి. ఈ కళాశాల గ్రంథాలయము 4,000 గ్రంథములును, అపూర్వములగు 500 వ్రాతప్రతులును కలిగి ఉండి ప్రపంచమునగల యునానీ గ్రంథాలయములందు అత్యుత్తమములగు వానిలో ఒకటిగ పేరొందినది.

ఆంధ్ర ప్రదేశ్‌లో కొన్ని ఇతర ప్రాంతములలో కూడ ఈ యునానీ వైద్యము ప్రజల ఆదరమును పొంది ఉన్నది. ము. వి.

# ఆధునిక వైద్యము

17 వ శతాబ్ది నుండి పాశ్చాత్య వాణిజ్య సంఘములు, వాని వెనువెంట సైన్యము, వారికై వైద్యులు ఆంధ్ర దేశమున ప్రవేశించి స్థిరపడి, వ్యాపించిరి. తుదకు ఆంగ్లేయులు రాజ్య పరిపాలనాధికారమును సంపాదించుకొనిరి. ఫ్రెంచి, డచ్చి, ఇంగ్లీషు వైద్యులు తూర్పు తీరమందలి రేవు పట్టణములలోను, గోల్కొండ నవాబుల కొలువులోను పాశ్చాత్య వైద్య పద్ధతుల ననుసరించి, వాటిని వ్యాపకము చేయు చుండిరి. 18 వ శతాబ్దాంతమున మచిలీపట్టణము, విశాఖపట్టణము నందును, విజయవాడ, ఏలూరు నందు సైనిక శిబిరములు, వారికై విదేశీయ ఆంగ్ల వైద్యము మాత్రమే కాక దేశీయ సైనికులకు చికిత్స చేయుటకు ప్రాంతీయ వైద్యులును కావలసి వచ్చెను. తర్వాత మండలాధికారులు, కలెక్టర్లు, జడ్జీలు మొదలగు వారు ఆంగ్లేయులైనందున వారందరు ఉండు పట్టణములలో వారి ఆరోగ్య రక్షణకై ఆంగ్ల దేశీయ వైద్యులు నియమింప బడిరి. ఆసుపత్రులు, ఆంగ్లచికిత్స విధానములు, మందులు, పరికరములు ప్రచారము లోనికి వచ్చెను. ఈ ఆంగ్ల వైద్యుల క్రింద వారి ఉత్తర్వులను అనుసరించుచు సహాయముగా పని చేయుటకు స్వదేశ వైద్యులు అవసరమైరి. 19 వ శతాబ్ది మధ్యమున ఈస్టు ఇండియా కంపెనీ బళ్ళారి, కడప, కర్నూలు, గుంటూరు, నెల్లూరు, శ్రీకాకుళము, రాజమండ్రి మొదలగు జిల్లా కేంద్రములలో ఔషధశాలలు, ఆసుపత్రులు ఏర్పాటు చేసిరి. ఈ జిల్లా ఆసుపత్రులలో విదేశీయుడగు ఆంగ్ల వైద్యుడు ప్రధాన వైద్యుడుగాను, అతనికి సహాయుడుగా మద్రాసు వైద్య కళాశాలలో ఉత్తీర్ణుడైన ఒక ఆంగ్లో-ఇండియన్ వైద్యుడును, సామాన్య రోగుల చికిత్సకు కొందరు స్వదేశీయులు డ్రెస్సర్లును ఉండెడివారు. ఇంతేకాక, ఇతర పెద్ద పట్టణములలో కూడ వైద్యశాలలు స్థాపింపబడెను. అందు వలన ప్రభుత్వోద్యోగులు, జమీందారులు, నాగరికులు, ధనికులు మాత్రమే ఆంగ్ల వైద్య వసతులను పొంద గలుగుచుండిరి. క్రమ క్రమముగా ఆంగ్ల వైద్యము మీద, ఇతర పౌరులలో కూడ నమ్మకము హెచ్చుటచేత బ్రిటిష్ ప్రభుత్వము తాలూకాలలో కూడ ఆసుపత్రులు, ఔషధశాలలును పెంచిరి. ఇంతలో స్థానిక స్వపరిపాలనా పద్ధతి ప్రవేశ పెట్ట బడినందున, మునిసిపాలిటీలు, డిస్ట్రిక్టు బోర్డులు ఆధునిక వైద్య ఔషధశాలలును, ఆసుపత్రులను స్థాపించసాగిరి. అందు వైద్యులుగా మద్రాసు, రాయపురములలోను, విశాఖపట్టణములోను ఉండిన వైద్య పాఠశాలలో తరిఫీదు పొందిన యల్. యం. పి. డాక్టర్లను చికిత్సకులుగా నియమించుచుండిరి. 1920 ప్రాంతములో పానగల్ రాజా మంత్రివర్గము గ్రామీణ ప్రాంతములో ఆంగ్ల వైద్య వసతులు చాలకుండినవని గమనించి గ్రామములలో వైద్యులుగనుండి ప్రజలకు వైద్య సహాయమిచ్చువారికి కొంత ధన సహాయము, మందులు ఇచ్చు ఏర్పాట్లు చేసిరి. ఈ విధముగా దేశము నలుప్రాంతములకు ఆంగ్ల వైద్య సౌకర్యము వ్యాపించెను. భారత దేశ స్వాతంత్ర్యము (1947) వచ్చిన తరువాత మొదట రెండు ప్రణాళికల కాలములో ప్రైమరీ హెల్తు సెంటర్లు వందల కొలది స్థాపించిరి. జిల్లా ఆసుపత్రులలో పడకల సంఖ్య పెంచబడెను. ప్రత్యేక శాఖలలో నిపుణులు చికిత్సకులుగా నియమింప బడిరి. పరిశోధనాగారములు మొదలగు ఆధునిక వైద్య వసతులు ఏర్పరుపబడెను. విశాఖపట్టణములోను, గుంటూరులోను, కర్నూలులోను గవర్నమెంటు వైద్య కళాశాలలు స్థాపింప బడుట వలన అచ్చట ఆసుపత్రులు విరివిగా పెంచబడెను.

పూర్వపు నైజాముపరిపాలనాకాలమున హైదరాబాదు నగరమున 1866 ప్రాంతములో అఫ్‌జల్‌గంజి ఆసుపత్రి స్థాపింపబడెను. 1908 లో అదియు విక్టోరియా జనానా ఆసుపత్రి, మూసినది వెల్లువలలో చాల నష్టపడెను. తరువాత 1925 లో ఉస్మానియా జనరలు ఆసుపత్రి నెలకొల్ప బడెను. ఇది ఉస్మానియా వైద్య కళాశాలకు అనుబంధముగా వైద్య శిక్షణకు ఉపయోగింప బడుచున్నది. బ్రిటిష్ రెసిడెన్సీకి సమీపమున 1846 నుండి ఒక ఆసుపత్రియు, వైద్య పాఠశాలయు, రెసిడెన్సీ వైద్యాధికారి,

ఆధిపత్యమున నడుచుచుండెను. ఇది ఇప్పుడు సుల్తాన్ బజార్ ఆసుపత్రిగ యున్నది. సికింద్రాబాదులో 1852 ప్రాంతమున స్థాపింపబడిన పౌర వైద్యశాల క్రమముగా పెరిగి 1917 లో కింగ్ ఎడ్వర్డు మెమోరియల్ ఆసుపత్రిగా మారెను. గాంధి మెడికల్ కాలేజీని ప్రభుత్వము స్వాధీన పర్చుకున్న తరువాత, ఈ ఆసుపత్రి వైద్య విద్యార్థుల శిక్షణకు కూడ ఉపయోగ పడుచు గాంధీ ఆసుపత్రి అని క్రొత్త పేరు పొందినది.

నైజాముసంస్థానమందలి జిల్లాలలోనున్న గ్రామములలో వైద్య వసతులు చాల తక్కువగా ఉండెడివి. ఆంధ్రప్రదేశ్ అవతరణానంతరము (1956) ప్రతి జిల్లా కేంద్రమందలి ఆసుపత్రులలో వైద్య వసతులు, పడకల సంఖ్య వైద్యుల సంఖ్య పెంచబడినది. ఇంతేకాక, వరంగల్లు పట్టణమందలి ఆసుపత్రిని అభివృద్ధి చేసి, అచ్చట స్థాపింపబడిన వైద్య కళాశాల విద్యార్థుల శిక్షణకు అనువగు రీతిని పెంచబడెను.

## ఆధునిక శాస్త్రీయ వైద్యము, ప్రస్తుత పరిస్థితులు

(వైద్య శాలలు, ఔషధ శాలలు)

ఆంధ్రప్రదేశ్ జనసంఖ్య 360 లక్షలు. రాష్ట్రమున ఉన్న 20 జిల్లాలలోని 293 పట్టణములందును, దాదాపు 26,450 గ్రామములందు, ఈ జన సముదాయము విస్తృతమై ఉన్నది. 17.4% మంది జనాభా మాత్రమే వసించు పట్టణవాసములందు ఆసుపత్రుల సంఖ్య 240; 86.4% ప్రజలు వసించు పల్లెపట్టులందు వైద్యశాలలును, ఔషధ శాలలును కలిసి 604 మాత్రమే కలవు. పట్టణప్రాంతములందుగల ఆసుపత్రులలోని పడకల సంఖ్య 14,300; పల్లెపట్టుల వానియందలి పడకల సంఖ్య 3,034. జిల్లా, తాలూకా కేంద్రమైన పట్టణములందలి ఆసుపత్రులందును, క్షయ చికిత్సాలయములందు గ్రామీణ ఆరోగ్యాశ్రమములందును గల పడకలు వెరసి 17,334.

ప్రాథమిక ఆరోగ్య కేంద్రములు: ఆరోగ్య దళములు (గ్రామీణ ఆరోగ్య సేవా కేంద్రములు) పల్లెపట్టులందు వైద్య సదుపాయములు చాలకొరత ఉండు విషయమును గమనించి ఒక్కొక్క కమ్యూనిటి డెవలప్‌మెంటు బ్లాకు (సామాజిక వికాస మండలము) నకు ఒకటి చొప్పున, ఆయా ప్రదేశముల ప్రజలు 10,000 రూపాయలను, అందులకై ప్రోగుచేసి భవన నిర్మాణమునకు అవసరమగు భూమిని ఈయగలిగిన చోట్లనెల్ల, ప్రాథమిక ఆరోగ్య కేంద్రములు స్థాపింపబడినవి. సర్వ సామాన్యముగ 60,000 జనసంఖ్యగల 100 గ్రామములకు ఒక ప్రాథమిక ఆరోగ్య కేంద్రము ఉపయోగించును. ఆసుపత్రివలె కాక, ఈ ప్రాథమికఆరోగ్య కేంద్రము రోగ చికిత్సకు మాత్రమేగాక రోగ నిరోధమునకును ఉపయోగపడుచున్నది. సామాన్య జాడ్యముల చికిత్సకై ప్రతి ప్రాథమిక ఆరోగ్యకేంద్రమున ఆరు పడకలు ఉండును. క్లిష్టములును, తీవ్రములు నగు రోగముల విషయము, అట్టి రోగుల చికిత్సయు, ఆయా సందర్భముల ననుసరించి జిల్లా, తాలూకా కేంద్రములందలి ఆసుపత్రులకు అప్పగింప బడుచున్నది. ప్రసూతి చికిత్సకై మూడు ఉపకేంద్రములు ప్రతి ప్రాథమిక ఆరోగ్య కేంద్రమునకును జత కూర్చబడినవి. ఇప్పటికిరాష్ట్రపు మొత్తము రమారమి 200 ప్రాథమిక ఆరోగ్యకేంద్రములు స్థాపింపబడినవి.

క్షయరోగ చికిత్స - నివారణ: ఆంధ్రప్రదేశ్ మొత్తపు జనాభా 360 లక్షలలో దాదాపు ఒక లక్షమంది ప్రజలు క్షయవలన బాధ నొందుచున్నారు. ప్రాదేశిక రీతిలో క్షయ నివారక దళములను ఏర్పరచి, వానిద్వారా (చెస్టు క్లినిక్కులు) ఆయా సంస్థలకు అనువగు రీతిగ పడకలు వసతులను పెంచుటకు ఆయా జిల్లాలయందలి ఏర్పాట్లు చేసిరి. అన్ని జిల్లాలలోను కలిసి ఇప్పటికి 25 క్షయ చికిత్సాశాలలు (క్లినిక్కులు) సంస్థాపింప బడినవి. గుండెజబ్బు చికిత్సాశాలలు ఏడు ముఖ్య కేంద్రములందు స్థాపింపబడినవి. అట్టివి విశాఖపట్టణము, గుంటూరు, కర్నూలు వైద్య కళాశాలలకు అనుబంధములుగా ఉండి, ప్రత్యేక ప్రావీణ్యముగల చికిత్సకుల పర్యవేక్షణ క్రింద ఏర్పాటు చేయబడి ఉన్నవి.

ఇర్రంనుమా (హైదరాబాదు) యందలి క్షయ ఆసుపత్రిలోని పడకల సంఖ్య 500 నుండి 600 వరకును, వికారాబాదులోని క్షయ ఆసుపత్రి యందలి పడకల సంఖ్య 200 నుండి 300 వరకును పెంచబడినది. మంగళగిరివద్ద 180 పడకల సంఖ్యతో పని చేయుచున్న క్షయ ఆసుపత్రిని ప్రభుత్వము, ద్వితీయ ప్రణాళికా కాలమున తన ఆధిపత్యము క్రిందికి తీసికొనినది. నెల్లూరునందలి క్షయ ఆసుపత్రి ఉన్నతస్థాయికి మార్చబడి, అందలి పడకల సంఖ్య 222 కు హెచ్చింప బడినది. విశాఖపట్టణమునందలి కింగ్‌జార్జి వైద్యశాల యందలి క్షయశాఖను 75 పడకలతో నిర్మించుటకు ప్రభుత్వామోదము లభించుటయే కాక, ప్రత్యేక క్షయ ఆసుపత్రి నిర్మాణము సైతము దాదాపుగ పూర్తి కావచ్చినది.

ఆంధ్రప్రదేశ్‌లో వైయక్తిక సంస్థలుగ క్రైస్తవ మిషనరీలచే స్థాపింపబడిన ఆరోగ్యాశ్రమములు రెండు కలవు. అందులో నాలుగు దశాబ్దములుగ విశ్వవిఖ్యాతి గాంచినది ఒకటి 317 పడకల సంఖ్య కలిగి మదనపల్లెయందు

గలదు. రెండవది 176 పడకల సంఖ్యతో రాజమండ్రిలో ఉన్నది.

ఉరః కుహర శస్త్ర చికిత్సా కేంద్రములు : మందులతో మానని క్షయ, ఇతర ఉరః రోగముల శస్త్ర చికిత్సచే కుదుర్చుటకు ఏర్పాటు చేయబడినది. శ్వాస విషయిక క్షయ రోగములను శస్త్ర చికిత్స మూలమున నివారించుటకై, ఇర్రంనుమా యందలి క్షయ ఆసుపత్రియందును, హైదరాబాదులోని ఉస్మానియా జనరల్ ఆసుపత్రియందును, విశాఖపట్టణమునందలి కింగ్ జార్జి ఆసుపత్రియందును ఉరః కుహర శస్త్ర చికిత్సాకేంద్రములు స్థాపింప బడినవి. గుంటూరు, కర్నూలు లందున్న గవర్నమెంటు జనరల్ ఆసుపత్రులందు కూడ ఇట్టి కేంద్రములు ఇపుడు పని చేయుచున్నవి.

కుష్ఠు రోగము : జాతీయ కార్యక్రమము క్రింద దేశములో కుష్ఠు రోగమును పూర్తిగా నిర్మూలించుటకు అవసరమగు చర్యలు తీసికొనుటకుగాను ప్రతి రాష్ట్రములోను సర్వే దళములను నియమించి, వాటిద్వారా విషయ సేకరణకు నిర్ణయము జరిగినది. ఈ సర్వే దళములు రోగులను, రోగము హెచ్చుగా ఉన్న ప్రాంతములను సర్వే చేసి, ఆయా ప్రాంతములలో రోగ నిరోధక చర్యలుకూడ తీసికొందురు. కుష్ఠురోగుల సర్వే కొరకున్నూ, వారికి ఇవ్వవలసిన ప్రత్యేక చికిత్సకును మొత్తము ఆంధ్రప్రదేశ్‌లో 11 చిన్న కేంద్రస్థానములు: రామచంద్రపురము (తూ.గో.), తిరుపతి, కర్నూలు, కేసరిపల్లి, కొడంగలు, అనంతరాజుపేట, తణుకు, ఎల్లారెడ్డి, హీరమండలము, సిద్దిపేట, హిందూపురములలో నెలకొల్పిరి. ప్రతి కేంద్రములోను ఒక పెద్ద డాక్టరు స్థావరముగా ఉండును. అతని పర్యవేక్షణక్రింద కుష్ఠురోగ చికిత్సలో తరిఫీదు పొంది కొంత మంది అసిస్టెంట్లు పని చేయుదురు. వారు గ్రామాదులలో తిరిగి కుష్ఠురోగులపట్టీ తయారు చేయుదురు. రోగ నివారణకు చికిత్సచేయుదురు. ఈ కుష్ఠురోగ కేంద్రములలో పని చేయుటకు ప్రత్యేకశిక్షణ ఇచ్చు నిమిత్తము తిరుపతిలోను, అక్కరాపల్లిలోను శిక్షణ కేంద్రములు పని చేయుచున్నవి. ఇందులో పనిచేయు డాక్టర్లకు కూడ ప్రత్యేక శిక్షణ నిత్తురు. ఈ కుష్ఠురోగ నివారణకు పనిచేయు వైయక్తిక సంస్థలకు ప్రభుత్వము గ్రాంట్లు ఇచ్చి ప్రోత్సహించుచున్నది.

సుఖరోగ చికిత్సా శాలలు : ఆంధ్రప్రదేశ్‌లో రమారమి మూడు లక్షల మంది సుఖరోగములతో బాధ పడుచున్నారు. వీరి చికిత్సకు ఇప్పటివరకు 13 సుఖరోగ చికిత్సా కేంద్రములు స్థాపింపబడినవి. హైదరాబాదు నగరమున ఉస్మానియా ఆసుపత్రి, కర్నూలునందలి ప్రభుత్వ ఆసుపత్రి, విశాఖపట్టణమునందలి కింగ్ జార్జి ఆసుపత్రి, వరంగల్లులోని యం. జి. యం. ఆసుపత్రి, నెల్లూరు, నిజామాబాదు, ఏలూరు, కడప, కరీంనగరము, గుంటూరు, మచిలీపట్టణము, కాకినాడ, మహబూబునగరము అందలి జిల్లా కేంద్రముల ఆసుపత్రులు ఈ సుఖరోగ చికిత్సాశాఖలను కలిగి ఉన్నవి.

ఆరోగ్య రక్షణ పరీక్షా సౌకర్యములు : శరీర శోధనా (లేబరీటరీ) వసతులు ప్రజల శరీరమందలి వివిధాంగ ధాతువులు, శరీర ద్రవములు, రక్షక శక్తులు, రోగాంకుర లక్షణములు పరీక్షచేయుటకు కేంద్ర రోగ నివారక వైద్య సంస్థయందు ఈ క్రింది నాలుగు విభాగములు కూడ కలవు :

1. ఆహార, ఔషధి విశ్లేషణా విభాగము ; ఆహారములు, ఔషధములు సరిగా ఉన్నవా ? అని పరీక్షించుట ;

2. జల విశ్లేషణా విభాగము : త్రాగుడు నీరు శుభ్రముగ ఆరోగ్యకరముగ ఉన్నదా ? అని పరీక్ష ;

3. సీర విజ్ఞాన విభాగము : టైఫాయిడ్ రోగములు రాకుండుటకు దేహశక్తులను పెంచుచు సూది మందుల తయారు చేయుట ;

4. టీకా లసీక విభాగము : మశూచి రాకుండుటకు బిడ్డలకు టీకాల వేయుటకు మందు తయారు చేయుట.

స్థానిక శోధనశాలలు గుంటూరు, కర్నూలు, వరంగల్లు లందు స్థాపింప బడినవి.

జిల్లా శోధనాగారములు : ఏలూరు, మహబూబునగరము, కరీంనగరము, కాకినాడ, అనంతపురము, మచిలీపట్టణము, నిజామాబాదు, ఖమ్మం లందు శోధనాగారములు కలవు. నెల్లూరు, చిత్తూరు, నల్గొండ, ఆదిలాబాదులందు జిల్లా శోధనాగారములు క్రొత్తగా స్థాపింప బడినవి.

హైదరాబాదునందలి రసాయనిక పరీక్షా కేంద్రము: ఆంధ్రప్రదేశ్‌లో న్యాయ నిర్వహణ (జ్యూరి స్ప్రూడెన్సు) కు సంబంధించిన వైద్య విభాగపు పని నంతటిని 1959 నుండి ఈ లేబరేటరీ నిర్వహించుచున్నది. మొదటిలో పూర్వ హైదరాబాదు రాష్ట్రమునందలి తెలంగానా జిల్లాల పని మాత్రమే ఈ లేబరేటరీ నిర్వహించు చుండెడిది. 1959 నుండి అఖిల ఆంధ్రప్రదేశ్ న్యాయ నిర్వహణకు సంబంధించిన వైద్య విభాగపు పని నంతటిని నిర్వహించుచున్నది. ఈ శాఖయందు ఈ క్రింది నాలుగు ముఖ్య విభాగములు కలవు:

1. విషవస్తు విజ్ఞాన విభాగము - విషప్రయోగము చేయబడిన అంశము నిర్ణయము ;

2. సీర విజ్ఞాన విభాగము ;

3. అభియోగిక రసాయనిక విభాగము ;
4. నానావిధ అభియోగిక వైద్యక విజ్ఞాన విభాగము.

పరిశోధన - సంఖ్యా సేకరణ: వైద్యకళా, విజ్ఞానము లందు పరిశోధనను ప్రోత్సహించుటకై రాష్ట్రవైద్యక పరిశోధక సమితి ఒకటి వ్యవస్థితమైనది; ఇందు 11 గురు సభ్యులు కలరు. ఆంధ్రప్రదేశ్ అవతరణానంతరము ఈ సమితి పునర్వ్యవస్థితమైనది.

ఆంధ్రప్రదేశ్‌లో పుట్టకురుపు (కేన్సరు) నియమనము: హైదరాబాదు రాష్ట్రములో 1955లో భారత ప్రధాని శ్రీ జవహరులాల్ నెహ్రూచే 'రేడియమ్ సంస్థ'యు, పుట్టకురుపు ఆసుపత్రియు ఆవిష్కృతమైనవి. పుట్ట కురుపు వ్యాధుల విషయమున జరుగదగు అత్యంత నవీన చికిత్సా విధానములకు సంబంధించిన శస్త్రచికిత్స, X - కిరణ, రేడియమ్ పరికరముల వసతులు ఈ ఆసుపత్రియందు కలవు. ఆసుపత్రియందు మాత్రమే చికిత్స పొందదగువారిని వసతి రోగులు (ఇన్ - పేషెంట్లు)గ ఇచట చేర్చుకొందురు. వ్యయం ఏమియు రోగికి తగులకుండ చికిత్స ఉచితముగ నిర్వహింపబడును. ఆసుపత్రియందలి ప్రస్తుతపు పడకలసంఖ్య 125.

ఆంధ్రప్రదేశ్‌లో కార్మిక వైద్య సౌకర్య భీమా పథకము: పనివారలు జబ్బు పడినప్పుడు వారికి వైద్య వసతులకు భీమా సౌకర్య పథకము 1955 లో ప్రవేశ పెట్టబడినది. 20 మందికన్న ఎక్కువ పనివారు పని చేయుచు, ఆవిరి, విద్యుచ్ఛక్తి మొదలగువాని సహాయమున నిరంతరము పని చేయుచున్న ప్రతి కర్మాగారములో పనిచేయు కార్మికులకు ఈ వైద్య సౌకర్య భీమా పథకము వర్తించును. ఈ పద్ధతి నిర్బంధముగా ఏర్పాటు చేయబడెను. సంవత్సరమున కొన్ని అదనులందే పనిచేయు పంచదార మిల్లులు, బియ్యపు మిల్లులు మొదలగువానిలో పని చేయువారికి ఈ పథకము వర్తించదు. ఈ పథకము గనులలో పని చేయువారికి కూడ వర్తించదు. డి. వి. సు. రె.

# ఆరోగ్య రక్షణ - వ్యాధినిరోధము

వ్యవస్థావిధానము: 1859 ప్రాంతమున బ్రిటిష్ ప్రభుత్వముచే నియమింపబడిన రాయల్ కమిషన్ ఇండియాలోని సైన్య సిబిరములు సైనికుల ఆరోగ్యము పరిశీలించి, దేశమందలి సైన్యముల ఆరోగ్య రక్షణకు శిబిరముల ఆరోగ్యము, సైనికుల ఆరోగ్యము మాత్రమే కాక సామాన్య జనుల ఆరోగ్యము అభివృద్ధియు అవసరమని ఎంచి, అందుకు వలయు వివిధ సూత్రములు, సలహాలు సూచించెను. ఆ నివేదిక ప్రకారము 1864 లో మద్రాసు రాష్ట్రములో ఆరోగ్య రక్షక వర్గము (పబ్లిక్ హెల్తు కమిషన్) ఏర్పాటయ్యెను. ఈ సంస్థ చాల ఉపయోగకరములైన కార్యక్రమముల తలపెట్టెను. కాని, వానిని అమలులో పెట్టలేక పోయెను. ఇట్లుండగా 1896 లో రాష్ట్రమున ప్లేగువ్యాధి ప్రబలెను. కలరా, మశూచి మొదలగునవి కూడ అతి వ్యాప్తిగా ఉండెను. అప్పటికి ఆరోగ్య శాఖ కార్యక్రమము యొక్క ఆవశ్యకము గుర్తించబడెను. అందువల్ల ఈ శతాబ్దారంభమున వైద్య శాఖ నుండి ఆరోగ్య శాఖ ప్రత్యేకింప బడెను. కొంత కాలము జిల్లా వైద్యాధికారులు ఆరోగ్య శాఖాధి కారులుగా కూడ ఉండిరి. మాంటుఫర్డు సంస్కరణలు అమలులోనికి వచ్చిన తరువాత ఆరోగ్య రక్షక శాఖ ప్రత్యేకింపబడి అభివృద్ధి చేయబడెను. రాష్ట్రమున కొక రాష్ట్రారోగ్య శాఖాధికారి డైరెక్టరుగాను, ప్రతి జిల్లాకు, ప్రతి మునిసిపాలిటికీ స్థానిక ఆరోగ్య శాఖాధికారులు వారికి కావలసినంత ఆరోగ్య రక్షక సిబ్బందితో ఆరోగ్య రక్షణకు ఏర్పాటు చేయబడెను. ఈ సిబ్బందికి వలయు ప్రత్యేక శిక్షణ ఒసగుటకు ఏర్పాట్లు కూడ మద్రాసు వైద్య కళాశాలలలో చేయబడెను. మద్రాసు రాష్ట్రము నుండి ఆంధ్రరాష్ట్రము (1953) విడివడినపుడు వైద్య శాఖయు, ఆరోగ్య శాఖయు ప్రత్యేక వ్యవస్థలుగ పెంచబడెను. పూర్వపు నైజాము రాష్ట్రములో ఈ రెండుశాఖలు వేర్వేరుగ లేకుండెను. ఆంధ్రప్రదేశావతరణము (1956) నుండి తెలంగాణాలోకూడ ఆరోగ్య రక్షక శాఖ, ఉద్యోగులు సంస్థలు కార్య కలాపములు పెరిగినవి.

ఆంధ్ర ప్రదేశ్‌లో ప్రజారోగ్య సేవా సంస్థయందు రెండు ముఖ్య విభాగములు కలవు. అందు మొదటిది, పరిపాలనా సాంకేతిక సేవాశాఖ; రెండవది, స్వాస్థ్య విషయిక కార్యక్రమ శాఖ. మొదటి శాఖలో వివిధ విషయములకు చెందిన ప్రజారోగ్యశాఖ అసిస్టెంటు డైరెక్టర్లును చేరి ఉన్నారు. హైదరాబాదు నందలి ప్రజారోగ్య శాఖా కేంద్ర కార్యాలయమున నుండి ఈ ఉద్యోగులు తమ విధులను నిర్వహింతురు. రెండవది అగు స్వాస్థ్య విషయిక కార్యక్రమ శాఖ యందలి ఉద్యోగులు జిల్లా, మునిసిపాలిటీ, రేంజి, బ్లాకు, పంచాయతీ రంగములందు వివిధ స్థాయిలలో పని చేయుచు తమ తమ కార్యరంగములందలి ప్రజానీకమునకు ఉపయోగ పడుదురు. పంచాయితీల యందు చేయుపని హెల్తు అసిస్టెంటులు, టీకాల ఉద్యోగులును, బ్లాకు కేంద్రమున రేంజి కేంద్రమున పనిచేయు హెల్తు ఇన్‌స్పెక్టర్లు,

హెల్తు విజిటర్లును ఈ శాఖ యందలి ప్రాతిపదిక సోపానమునకు చెందిన ప్రతి జిల్లా యందును పెద్ద మునిసిపాలిటీల లోను అవసరమైన వెంటనే పర్యవేక్షణ విధిని నిర్వహించుటకు హెల్తు ఆఫీసర్లు కలరు. పై వారు కాక నాలుగు జిల్లాల కొకరు చొప్పున ప్రజారోగ్య సేవా శాఖకు చెందిన రీజినల్ అసిస్టెంటు డైరెక్టర్లు పనిచేయుచున్నారు. ఆరోగ్య శాఖా డైరెక్టరు సర్వాధిపత్యమునకు లోబడి వీరు పరిపాలనా నియమమున విధి నంతటి అవాంతర స్థాయీ రంగములందు నిర్వహించుచున్నారు.

జనన మరణాది ఆరోగ్య వివరముల సంఖ్యా సేకరణ : జనన మరణాది సంఖ్యా వివరములు రాష్ట్రపు ఆరోగ్య పరిస్థితిని గురించిన సమగ్ర చిత్రణము నొసంగ జాలక పోయినను, ప్రాతిపదికగ స్వీకరింప బడుటకు మాత్రము తగి ఉన్నది. జనన మరణాది సంఖ్యా సేకరణను తొలుతగ పూనుకొనిన కొలది రాష్ట్రములలో ఆంధ్రప్రదేశ్ ఒకటి.

మశూచి: సామాన్యముగా ఈ వ్యాధి ఎక్కడెక్కడ పొడ సూపునో అచ్చటను, ఆ పరిసరములలోను టీకాలు వేయుదురు. ఈ పనికి ప్రభుత్వ ఆరోగ్య శాఖ పురపాలక సంఘములకు, స్వపరిపాలనా శాఖకు ప్రత్యేకముగా వేక్సినేటర్లు వగైరా సిబ్బంది ఈ జాడ్యములను అరికట్టుటకు పని చేయుదురు. ప్రతి జిల్లాలోను, అప్పుడప్పుడు, ఎక్కడో ఒక చోట ఈ వ్యాధి కనబడుచునే ఉండును. తెలంగాణా ప్రాంతములో ఈ వ్యాధి మిగత ఆంధ్ర ప్రాంతము కంటె తక్కువ. మశూచి రోగ నిరోధమునకు, ఈ రోగ నిర్మూలమునకు తోడ్పడు నట్టి కార్యక్రమము అనుసరణలో పెట్టుటకు వలయు నూతన శాస్త్రీయ విజ్ఞానము నలుమూలల వ్యాపించుటకు ప్రయత్నములు జరుగుచున్నవి. అందుకు కావలసిన పరిపాలనా సౌకర్యములు, సిబ్బంది ఏర్పాటు చేయబడినవి. కేంద్ర ప్రభుత్వ ప్రవీణ వర్గము సిఫారసు ప్రకారము మునిసిపాలిటీ, పంచాయతీ సమితులలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రములలోను మశూచి నిరోధమునకై ప్రజారోగ్య శాఖవారు విరివిగా టీకాల కార్యక్రమము కొనసాగించుచున్నారు. పశ్చిమ గోదావరి జిల్లాలో ఈ జబ్బును అరికట్టుటకు ప్రత్యేక దళములను ఏర్పాటు చేసిరి. దీనికి కేంద్ర ప్రభుత్వము ధన సహాయము ఒసగుచున్నది. మశూచి మొదలగు రోగములు సోకినంతనే ఈ విషయము ఆరోగ్య శాఖాధికారులకు తెలుపుట ప్రజల విధి. అట్టి రోగులను ప్రత్యేక వైద్య శాలలలోగాని, ప్రత్యేక వసతులలోగాని జన సామాన్యమునకు దూరముగా ఉంచి, తగు చికిత్స, ఉపచారము రోగికి ఇత్తురు. అందు వలన రోగ వ్యాప్తి అరికట్టబడును. రోగి సన్నిహితు లందరికి టీకాలు వేయుదురు.

కలరా: గోదావరి, కృష్ణ వంటి మహా నదులును, విస్తృతములగు తటాకములును, అల్లిబిల్లిగ పెనగొని ఉన్న కాలువలును కలిగిన ఆంధ్ర ప్రదేశ్ సాంక్రామికములగు కలరా వ్యాప్తికి, ముఖ్యముగ, వరదల కాలమున లోనగు చున్నది. ఊడ్పులు, కోతలు మొదలగు వ్యావసాయిక విధుల సందర్భమున, ముఖ్యముగ డెల్టా ప్రాంతములందు పని పాటుల కొరకై వివిధ ప్రదేశములలో పర్యటించు వ్యవసాయ కూలీల వలన ఈ జాడ్యము వ్యాపించు చుండుటచే దీనిని ఒక సాంక్రామిక శీలమగు వ్యాధిగ ఈ శాస్త్రమున పరిగణించదగును. సాంక్రామిక వ్యాధి నివారక సంచారక దళము ఒకటి ఏర్పాటై ఉన్నది. కలరా నిరోధక టీకాలు వేయు ఉద్యమము తీవ్రతర మొనర్చుటయు, ఆరోగ్య వసతుల చక్క చేయు కృషిని గాఢతర మొనర్చుటయు, అవసరమైన చోటుల నెల్ల నిర్వహింప బడుచున్నవి. ఇందువలన సాంక్రామిక వ్యాధులు పొడ సూపిన వెంటనే వీలైనంత స్వల్ప కాలమున అదుపు లోనికి కొని రాబడుచున్నవి.

ప్లేగు : ఒకప్పుడిది హైదరాబాదు నందును, తత్పరిసరము లందును ఒక క్లిష్ట సమస్యగ ఉండెడిది. కాని ప్లేగు జాడ్యము ఆంధ్రప్రదేశ్ నుండి అంతర్హితమైనది. ప్రజా ఆరోగ్య శాఖ ఇందులకై ప్రత్యేక సంరంభములు, తగినంత పెద్ద ఎత్తున ఈ రోగ నిర్మూలనకై సాగించినది. అయినను, మైసూరు మొదలగు పరిసర రాష్ట్రములనుండి ఈ రాష్ట్రము లోనికి ఇది కొని రాబడ గలదను భయమున తగు జాగ్రత్తలు తీసికొనబడుచున్నవి. సరిహద్దు జిల్లాల యందును, ప్లేగు వ్యాప్తికి ఒకపుడు లోనగుచుండిన ప్రదేశములందు భద్రతా చర్యలు, ప్లేగు నిరోధక విధులును నిర్వహింప బడుచునే ఉన్నవి.

మలేరియా : ఆంధ్రప్రదేశ్‌లో విశేషముగా అనారోగ్యములు కలిగించు కారణములలో ముఖ్యమగునది మలేరియా. సర్వ కాలమున శాశ్వతముగ మలేరియాకు ఆట పట్టువులు కొన్ని ఆంధ్రప్రదేశ్‌లో పల్లపు భూములలోను, కొండ చరియలలోను, మన్య ప్రాంతములలోను కలవు. ఇంతేకాక ఇతర జిల్లాలలో అప్పుడప్పుడు కొన్ని ఋతువులలో మలేరియా జ్వరము సాంక్రామిక రోగముగ వ్యాపించి ప్రబలుచున్నది.

మొట్ట మొదట రోగులకు చికిత్స చేయుటయే వైద్యుల బాధ్యతగ ఎంచబడెను. తరువాత మలేరియా వ్యాధి ప్రజలలో హెచ్చుగ వ్యాపింపకుండ అరికట్టు ప్రయత్నములు ఆరోగ్య శాఖ వారు తలపెట్టిరి. దోమలు పుట్టి పెరుగు జల కూపములను తొలగించుట లేదా వాటిపై మందులు

జల్లుట వలన రోగ కారకములగు దోమలను తగ్గించి వ్యాధిని అరికట్టు చుండిరి. ఈ కార్యక్రమము క్రింద 1959 - 60 రాష్ట్రములో ప్రతి ఇంటికి ఈ మందులు జల్లబడినవి.

ఇటీవల ఈ కార్యక్రమముతో తృప్తి పడక మలేరియా వ్యాధిని నిర్మూలము చేయు తీవ్ర కార్యక్రమము నిర్వహణలోనికి తేబడినది. ఇందు కొరకు విషయ సేకరణ దళము ఏర్పాటు చేయబడినది. ప్రతి దళమునకు ఒక అధికారి కలడు. ఇతని క్రింద నూరుగురు సర్వైలెన్సు పని వారు పని చేయుదురు. ప్రతి పనివారు సుమారు 10 వేలు జనాభా గల 2,000 ఇండ్లు తణికీ చేయవలెను. పనివారు ఇంటి ఇంటికి పోయి, ఇతః పూర్వము మలేరియా జ్వర పీడితుని కనుగొని, వానికి తిరిగి జ్వరము రాకుండ మందు ఇచ్చుట, ఇదికాక ఇతడు రోగి రక్తములో మలేరియా పేరసైటు కొరకు పరీక్షించు నిమిత్తము రక్తపు చుక్కలు తీయును. రోగి రక్తములో మ. క్రి. ఉన్న యెడల దాని నిర్మూలనకు కావలసిన మందు ఇత్తురు. ఈ విధముగా నాగార్జునసాగరము, తుంగభద్ర, మచ్ ఖండులలో జరుగు చర్యలు కాక 34 యూనిట్లు రాష్ట్రములో పనిచేయుచున్నవి.

బోదకాలి (శ్లీపద) వ్యాధి: ఈ వ్యాధి దోమ మొదలగు రక్తమును పీల్చే కీటకముల ద్వారా కలుగును. ప్రపంచమందలి బోదకాలి జబ్బు ఆరు రకములుగా ఉన్నది. భారత దేశములో రెండు రకముల జబ్బు కాన వచ్చుచున్నది. శరీరములోని ఏదైన భాగము బాగుగా వాచి అప్పుడప్పుడు ఎక్కువగా జ్వరము వచ్చును. ఈ రోగ నిరోధమునకు ప్రస్తుతము తీసికొనిన ముఖ్య చర్య: ఈ రోగ క్రియలు ఒకరి నుండి మరొకరికి వ్యాపింపచేయు క్రిములను నిర్మూలించుటయే. దానివల్ల ఈ వ్యాధి క్రొత్త పరిధులు త్రొక్కదు. ఈ కీటక నిర్మూలమునకు ఆయా ప్రాంతములలో మందులు పెద్ద ఎత్తున జల్లుచున్నారు.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రమందు శ్లీపద నివారణా జాతీయ కార్యక్రమము యొక్క సర్వే దళములలో రెండు ఆంధ్ర ప్రాంతమునను, ఒకటి తెలంగానాలోను పని చేయుచున్నవి. నియమన దళములలో ఒకటి మండపేట (తూర్పుగోదావరి జిల్లా) యందును, రెండవది కామారెడ్డి (నిజామాబాదు జిల్లా) యందును పని చేయుచున్నవి.

బి.సి.జి. టీకాల ఉద్యమము: క్షయ (టి. బి.) వ్యాధిని నిరోధించుటకు బి. సి. జి. ఉద్యమము ప్రారంభమయ్యెను. 150 లక్షల ప్రజలను పరీక్షించుటతో సార్వజనిక బి. సి. జి. టీకాల కార్యక్రమమున మొదటి దశ పూర్తి అయినది (1959). ఈ సార్వజనిక బి. సి. జి. ఉద్యమమున రెండవ దశ రాష్ట్రమంతటను 1960 లో ప్రారంభింపబడి కొనసాగు చున్నది. ఈ కార్యక్రమమున పని చేయు వివిధ దళముల కార్య విధానములను ప్రాదేశిక రీతిగ పునర్వ్యవస్థీకరించి విశాఖపట్టణము, గుంటూరు, అనంతపురము, వరంగల్లు, హైదరాబాదులలో ఆయా ప్రదేశముల కేంద్ర కార్యాలయములు నెలకొల్పి పుట్టిన తోడనే శిశువులకు బి. సి. జి. టీకాల నొసగి, దాని ఫలితములను పరీక్షించుట ద్వారా నీలోఫర్ ఆసుపత్రి (హైదరాబాదు) యందు ప్రత్యేక బి. సి. జి. సర్వే వ్యవహారములు నిర్వర్తింప బడుచున్నవి.

ఆహార పోషణ: నేడు అమలులో ఉన్న ఆహార రీతులను సమగ్రముగ శోధించుట. పోషక పదార్థముల లోటులను లెక్క గట్టుట, రోగ నిరోధక శక్తిలేని వారియందు కననగు పోషకాహార వైషమ్యమును (పోషణ లోపములు) ఎదుర్కొనుట, పోషణ యందలి లోపముల పూరింప కలుగు వానిని చేకూర్చుట, ఆహార పోషణ విషయమున వివిధ విషయములను ప్రజలు గుర్తెరుగు నటుల చేయుట అను విధుల నిర్వహించుటకై విశాఖపట్టణము వద్ద ప్రాంతీయ పోషణ దళము నొక దానిని స్థాపించుట ద్వారా పోషణ విధుల పరిశోధనకై ఒక ప్రణాళిక అమలులోనికి కొనిరాబడినది. 1956లో ఈ దళపు కార్యాలయము గుంటూరునకు తరలించబడినది. 1957 నుండి కర్నూలు నందును ఇట్టిదే ప్రాంతీయ దళ మొకటి పని మొదలిడినది. వరంగల్లు వద్ద 1958 నుండి మరియొక దళము పనిచేయుచున్నది.

పథ్యాహార, పోషణములకు సంబంధించిన పరిశీలనలను గ్రామీణ ప్రదేశములందును, పట్టణవాసము లందును తమ తమ అధికార పరిధులలో ఈ దళములు నిర్వర్తించుచున్నవి. ఆహారము, పోషణ అను విషయములకు సంబంధించిన ఆరోగ్య విషయిక విజ్ఞానము ప్రదర్శనలు, ప్రసంగములు, ఉపన్యాసములు మొదలగు వాని ద్వారా పరివ్యాప్తమొనర్ప బడుచున్నది.

విద్యాశాలలందు ఆరోగ్య సేవావిధులు: జిల్లా కేంద్రమందలి పాఠశాలలలోని విద్యార్థులను సంవత్సరమున రెండు పర్యాయములు అచటి ఆసుపత్రుల యందలి మెడికల్ ఆఫీసరులే పరీక్ష చేయుచున్నారు. పట్టణములలోను, ఇటీవల గ్రామసీమలందును, పరీక్షా సౌకర్యములు చేకూర్చు తలంపుతో జిల్లా కేంద్రములందు సర్వకాలిక మెడికల్ ఆఫీసరులు కలిగిన పాఠశాలా స్వాస్థ్య శాలలను సంస్థాపింప ఏర్పాటు చేయబడినవి. ఇప్పటి వరకు రాష్ట్రము నందలి 20 జిల్లాలలో 13 జిల్లాలందు జిల్లాకొకటి చొప్పున 13 స్వాస్థ్య పాఠశాలలు నెలకొల్ప బడినవి. ఈ పద్ధతిని ఆంధ్ర ప్రాంతమున తక్కిన 7 జిల్లాలకు మూడవ ప్రణాళికా (1961-66) కాలమున విస్తరింపచేయ సంకల్పింప బడినది.

**ప్రసూతి, శిశు స్వాస్థ్య రక్షణ శాఖ:** గర్భిణీ స్త్రీల, శిశువుల ఆరోగ్య రక్షణకొరకు ఈ శాఖ పని చేయును. స్త్రీ గర్భవతి అని తెలిసినప్పటినుండి ఆ ప్రాంతమునకు సంబంధించిన వైద్యోద్యోగిగాని, హెల్తు విజిటరుగాని ఏడవ మాసము వచ్చు వరకు మాసమున కొక సారి వచ్చి పరీక్ష చేయును. తదుపరి 9 వ మాసము వరకు ప్రతి పక్షము, తరువాత ప్రతి వారము వచ్చి తణికీ చేసి ఆమెకు ఆరోగ్యము - ఆహారము, నిద్ర, వ్యాయామము - విషయములలో సలహాల నిచ్చును. ముందుగానే సుఖ ప్రసవమునకు కావలసిన సదుపాయములను చేయుదురు. ఆరోగ్యకరమైన స్థలములలో ప్రసవించుటకును, అనుభవము కలిగి, నేర్పుగా పురుడు పోయగల మంత్రసానిని ఏర్పాటు చేయుట, మొదలగు పనులకు సహాయ పడుదురు. ఇది పురుడురాక ముందు చర్యలు ప్రసవించిన పిదప మాతాశిశువుల సంరక్షణ సక్రమముగా జరుగునట్లు చూతురు.

ఆంధ్రప్రదేశ్ మొత్తము మీద మాతా శిశు స్వాస్థ్య కేంద్రములు 834 కలవు. ఇందు 216 కేంద్రములందలి పడకలసంఖ్య 529; మొత్తము కేంద్రములలో 506 ప్రభుత్వ పోషణలోను, 211 స్థానికసంస్థల అజమాయిషీలోను, 117 స్వచ్ఛంద పౌర సంస్థల అధీనమునను కలవు. తెలంగానాయందలి వెనుక బడిన గ్రామీణ ప్రాంతముల కొరకై 6 మాతా శిశు స్వాస్థ్యకేంద్రముల స్థాపన జరిగినది (1960). ఈ కేంద్రములలో ప్రతి ఒక్కొక్క కేంద్రమునకును మూడు ఉపకేంద్రము లుండును. ఈ కేంద్రములు మెదకు, నల్గొండ, మహబూబు నగరము, ఆదిలాబాదు జిల్లాలలో పని చేయుచున్నవి. ప్రభుత్వాధ్వర్యవమున మూడు ప్రసూతి కేంద్రములును, వైయక్తిక సంస్థ నిర్వహణమున ఒక ప్రసూతి కేంద్రము రాష్ట్రమున కలవు.

ఆరోగ్య పర్యవేక్షణ శిక్షణాలయములు రెండు పట్టణమున కొక్కొక్కటి చొప్పున హైదరాబాదు, విశాఖపట్టణము లందున్నవి. ఇచ్చట ఆరోగ్య పర్యవేక్షకులకు అవసరములగు శిక్షణ ఒసంగ బడుచున్నది. రెండవ పంచవర్ష ప్రణాళిక (1956-61) కాలమున ఈ శిక్షణాలయములు విస్తృతీకరింప బడినవి. తత్ఫలితముగ ఒక్కొక్క దానియందును 120 మంది విద్యార్థులు ప్రసూతి స్వాస్థ్య, సామాన్య స్వాస్థ్యముల పర్యవేక్షకులుగ సమగ్ర శిక్షణ బొందుటకు వసతి చేకూర్ప వీలైనది. ఈ శిక్షణాకాలము 2½ సంవత్సరములు, ఇదియేగాక స్వాస్థ్యపర్యవేక్షక శిక్షణకాలమున కడపటి సంవత్సరమున అరువది మంది సహాయక మంత్రసాని, దాదులకు శిక్షణ నొసగుటకు కూడ అవకాశ మొసగు ప్రణాళిక అమలులో పెట్టబడినది. ప్రపంచారోగ్య సంస్థ (WHO), మాతా శిశు స్వాస్థ్యసంస్థల సంయుక్త యాజమాన్యమున పని చేయుచు హైదరాబాదున సాగుచున్న ధాత్రీ (nurse) సేవా కార్యక్రమము 1957 లో ప్రాథమిక దశను పూర్తి యొనర్చి, తక్కిన కార్యక్రమము జయప్రదముగ నిర్వర్తించు చున్నవి. ప్రపంచారోగ్య సంస్థ, మాతా శిశు స్వాస్థ్య సంస్థల సంయుక్త యాజమాన్యమున అంతర్జాతీయ ప్రఖ్యాతిగల శిక్షకులచేత విశాఖపట్టణమున నడుపబడు ధాత్రీశిక్షణ కార్యక్రమము కొనసాగింప బడుచున్నది.

**కుటుంబ నియంత్రణము:** దీనినే కుటుంబ విస్తృతి నియమన మనియు అనవచ్చును. మాతా శిశువుల ఆరోగ్య పరిరక్షణ కొరకును, కుటుంబపు ఆర్థికస్థాయికి భంగము రాకుండా జాగ్రత్త వహించుటకును దేశాభి వృద్ధికిని ఇట్టి నియంత్రణము అత్యావశ్యకము. కుటుంబ నియంత్రణము వలన లభించు లాభములను సామాన్య పౌరుడు గుర్తింప గలుగునటుల చేయుట ఈ ఉద్యమమున ప్రప్రథమ సోపానము. ఇందులకై ప్రకటనలు, కరపత్రములు, సినిమాలు మొదలగు వివిధ ప్రచార సాధనములును ఉపయోగింప బడుచున్నవి. ఇంతయే కాక ప్రభుత్వము నిర్వహించెడు కుటుంబ సంక్షేమ కేంద్రముల వద్ద ఉచితముగ నిర్వీర్యతా కరణనకు శస్త్రచికిత్స (vasectomy) సదుపాయములు సమకూర్చబడినవి. ఇచ్చట కుటుంబ నియంత్రణకు వీలగు వివిధ మార్గముల గురించి ఉచితసలహాలు ఈయబడుటయే కాక సంతాన నిరోధమునకు అవసరమగు మందులు, పరికరములు ఉచితముగ ఈయబడుచున్నవి.

ద్వితీయ ప్రణాళికా కాలమున రాష్ట్రపు మొత్తము మీద 176 గ్రామీణ కుటుంబ సంక్షేమ కేంద్రములు 44 పట్టణ కుటుంబ సంక్షేమ కేంద్రములు స్థాపింప బడినవి. వైద్య విద్యార్థులకును, వైద్య సహాయకులకును కుటుంబ సంక్షేమమున శిక్షణ ఏర్పాటులు చేయబడినవి.

**ఆరోగ్య విద్య:** వివిధ స్థలములందు జరుగు ప్రదర్శనములందు ఆయా సందర్భములకు తగురీతిగ ఆరోగ్యవిద్యా మండలి పాల్గొనుచున్నది. ఇట్టి ప్రదర్శనములలో ముఖ్యమైనది హైదరాబాదున ప్రతిఏటను జరుగు అఖిలభారత పారిశ్రామిక ప్రదర్శనము; ఇచట ఒక ప్రత్యేకశాలను నిర్మించి, విపులముగ ప్రచార కార్యమును నిర్వర్తించుచు ఈ మండలి పాల్గొనుచున్నది. ప్రపంచారోగ్య సంస్థా పర్వదినము లన్నియు రాష్ట్రమంతట ప్రతి ఏటను సముచితోత్సాహముతో కొనసాగింప బడుచున్నవి. హైదరాబాదు నగరమున ఆరోగ్య విజ్ఞాన బోధనకు ఒక మ్యూజియము ఏర్పాటై యున్నది.

డి. వి. సు. రె.

# పండుగలు

ఉగాది : తెలుగు పండుగలలో మొట్టమొదటిది ఉగాది. ఇది యుగాది అనే మాటకు వికృతి. యుగం అంటే ఒక కాల విభాగం. దానికి ఆది యుగాది. చాంద్రమానం అనుసరించి చైత్ర శుద్ధ పాడ్యమి నూతన సంవత్సరాది. నూతన సంవత్సరమంటే నూతన కాలమే గదా! (దాని ఆదిని) నూతన సంవత్సర-ఆదిని యుగాది (ఉగాది) అంటున్నాము.

చైత్రశుద్ధ పాడ్యమే సంవత్సరాది ఎందుకు? అన్న జిజ్ఞాస తప్పదు. జనవరితోనే నూతన సంవత్సరారంభం ఎందుకు? అని రోమను కవి ఓవిడ్ జ్యోతిర్వేత్త అయిన జానుస్‌ను ప్రశ్నించాడట. "సూర్యుడు జనవరినాటికి మకర రాశిలో ప్రవేశించడంతో ప్రకృతి మంచు ముసుగు తొలగించుకొని అతనిని చూస్తుంది. దానితో రాగోదయం ఏర్పడుతుంది. నూతన జీవితం జనవరినుండి ప్రారంభ మౌతుంది; గనుక మూతన సంవత్సరారంభమూ, దానితోనే" అని—జానుస్ సమాధాన మిచ్చాడట. మన పూర్వులుకూడా చైత్రశుద్ధ పాడ్యమే సంవత్సరాది అన డానికి కూడ ఉపపత్తి చెప్పారు:

'చతుర్వర్గ చింతామణి' కారుడైన హేమాద్రి బ్రహ్మ చైత్రశుద్ధ పాడ్యమినాడే సృష్టి ప్రారంభించాడని చెప్పాడు. కాని హేతువాదులు నమ్మరు. కాని, వసంత ఋతువును దృష్టిలో ఉంచుకొని ఈ నిర్ణయం చేశారు మన పెద్దలు అని అనడం సమంజసం.

సంవత్సరాది నిర్ణయంలోను పెక్కు మార్పు లున్నట్టు పరిశీలించగా తెలుస్తుంది. ఒకప్పుడు వేదాంగ జ్యోతిష కాలంలో ధనిష్ఠాకార్తితో సంవత్సరాది ఆరంభమయ్యేది. అంటే శిశిర ఋతువుతో రామాయణ కాలంలో వైశాఖంతో సంవత్సరారంభం. హేమంతంతో వత్సరారంభ మని కాత్యాని మతం. అమరసింహుడు తన అమర కోశములోని కాల వర్గంలో మార్గశిర-హేమంతాలను వత్సరాదిగా పేర్కొన్నాడు. విషువత్కాలాన్ని బట్టి కూడా వత్సరారంభం లెక్కకట్టేవారు. మేష విషువత్తు నుండి (ఉత్తరాయణం) దేవతల దినము, తులా విషువత్తు నుండి (దక్షిణాయణం) రాత్రి ఆరంభమయ్యేవని, నేడు మకర కటకాలకు మారాయని శ్రీపత్యాచార్యుడు అన్నాడు. ఆశ్వయుజ పూర్ణిమ, మాఘ పూర్ణిమ, మాఘాష్టమి గూడ సంవత్సరాదిగా ఉండేవి. ఇలా సంవత్సరాది ఆశ్వయుజ, కార్తీక, మార్గశిర, పుష్య, మాఘ, ఫాల్గుణ, చైత్ర, వైశాఖ మాసాలలో మారుతూ వచ్చింది.

ఇట్లు మారడానికి కారణం ఉంది. వైదిక కాలంలో నాలుగు నెలలు ఒక్క ఋతువుగా మూడే ఋతువు లున్నట్టు శతపథ బ్రాహ్మణం తెలుపుతున్నది. ఈ ఋతువులలో ప్రత్యేక కర్మలు జరిపేవారు. నాలుగు నెలలపాటూ ఈ కర్మలు జరిగేవి. కనుకనే వీటికి 'చాతుర్మాస్యం' అనే సంకేతం ఏర్పడింది. నేటికీ ఈ వ్రతాలను సన్యాసులు మొదలయినవారు జ్యేష్ఠమాసంనుంచి నాలుగు నెలలపాటు నడుపుతారు. ఆశ్వయుజ, కార్తీక, మార్గశిర, పుష్యాలు ఒక ఋతువు (శిశిరం); మాఘ, ఫాల్గుణ, చైత్ర, వైశాఖాలు మరొక ఋతువు (వసంతం); జ్యేష్ఠ, అషాఢ, శ్రావణ, భాద్రపదాలు (వర్ష ఋతువు) ఇంకొక ఋతువు. కనుకనే శిశిరాదినుండి సంవత్సరాది మారుతూ వచ్చింది.

ఈ మార్పును క్రీ. శ. ఐదవ శతాబ్ది వాడయిన వరాహమిహిరుడు గుర్తించినాడు. రామాయణ కాలంలో వైశాఖ, జ్యేష్ఠ మాసాల మధ్య ఉన్న విషువత్కాలం భారత కాలానికి చైత్ర, వైశాఖ మాసాల మధ్యకు వెనుకకు కదిలింది. భారత కాలం తర్వాత కొన్ని శతాబ్దాలకు అశ్విన్యాదికి చలించింది. వరాహమిహిరుడు బ్రాహ్మణముల కాలంలో విషువత్కాలం కృత్తికా నక్షత్రంలో సంభవించడం పరిశీలించి, అది ప్రాచీన దేవమాన దిన ప్రారంభమైన ఉత్తరాయణ పుణ్యకాలాది అనే సంప్రదాయానుసారం నూతన సంవత్సరారంభం వసంత విషువత్తు (సమ రాత్రిం దివ కాలం)తోనే అని చైత్రమాసమని నిర్ణయించి మాస, ఋతు సామరస్యం కల్పించాడు. అప్పటినుండి సంవత్సరాది మాసం ఇదే.

కాని, విషువత్తు, పాడ్యమి ఏకకాలంలో రావు. శుద్ధ పాడ్యమే ఎలా మాసారంభం? అనే ప్రశ్న ఉంది. దీనిని నిర్ణయ సింధుకారుడు దీర్ఘంగా చర్చించాడు. అమావాస్యతో ముగిసే నెలలూ, పూర్ణిమతో ముగిసే నెలలూ రెండు దేశంలో వ్యవహారంలో ఉండేవి. వింధ్యకు ఇవతలి ప్రాంతంలో శుక్లపక్షంతో ఆరంభమయి, అమావాస్యతో ముగిసే నెలకే ప్రాధాన్యం. చంద్రహీనమైన దినంనుంచి చంద్రుని క్రమ వృద్ధిని బట్టి పరిగణితమైన నెల జనుల లెక్కకు సులభమైన కారణంతో శుక్లాది మాసమే అలవాటయిపోయిందని భావించవచ్చు. కనుకనే మనం చాలా

కాలంనుంచి వసంత విషువత్తుగల చైత్రమాసంలోని శుద్ధ పాడ్యమినే ఉగాది పండుగగా పరిగణిస్తున్నాము. చైత్ర శుక్లపక్ష పాడ్యమినాటి సూర్యోదయముతో నూతనవర్ష నూతన మాస నూతన దినారంభ మన్నాడు భాస్కరాచార్యుడు 'సిద్ధాంత శిరోమణి'లో.

ఈ చాంద్రమాన సంవత్సరాది అతి ప్రాచీనమని ధర్మ శాస్త్రాలు తెలుపుతున్నాయి. చాంద్ర సౌర సావన బార్హస్పత్య నాక్షత్రమానాలు ఐదూ ఉన్నా వైదిక కర్మలకు చాంద్రమానమే ఉత్తమమన్నారు.

ఉగాది చాంద్రమానం అనుసరించే కన్నడ, మహారాష్ట్ర, మాలవీ యాదులకూ పండుగే. కర్నాటకులు, మహారాష్ట్రులు 'యుగాది' అనే వ్యవహరించడం విశేషం. ఇప్పుడు సౌరమానాన్ని తమిళ, కేరళ, వంగ, పంజాబు, సింధువాసులు, అస్సామీయులు పాటిస్తారు. వారి ఉగాదిపండుగ మేష విషువత్తును అనుసరించిందే. బార్హస్పత్యమానాన్ని గుజరాతీలు, మార్వాడీలు అనుసరిస్తారు.

ఈ పండుగనాడు ఉషఃకాలంలోనే లేచి తలంటుకొని స్నానంచేసి, కొత్తబట్టలు ధరిస్తారు. ఇంటిని, ఇంటి ముంగిలిని మామిడాకుల తోరణాలు మొదలైన వాటితో అలంకరిస్తారు. ఇంటి భవంతిలో మండపంకట్టి నూతనవర్ష పంచాంగాన్ని, ఆ సంవత్సరాది దేవతను పూజిస్తారు. పిదప 'ఉగాది పచ్చడి'ని ఆరగిస్తారు. దీనిని 'గొజ్జు' అని కూడ కొన్ని ప్రాంతాలలో అంటారు. ఈ పచ్చడిలో ఆ ఋతువులో పండిన వస్తువులు: ముఖ్యంగా కొత్తబెల్లం, చింతపండు, మామిడి పిందెలముక్కలు, వేపపూవు, ఉప్పు, పచ్చిమిర్చి ముక్కలు, గసగసాలు మొదలయినవి చేరుస్తారు. చెరుకుపాలు కలిపి ఆవునేతితో తిరుగబోయుట కూడకద్దు. ఈ షడ్రసోపేతమయిన పచ్చడి సుఖదుఃఖ సమ్మిళితమయిన జీవితానికి ఉపలక్షణం. దీనిని ఆరగించిన పిదప పిండివంటలతో మధ్యాహ్నం ఆరగించి, మూడు జాములు గడచిన పిదప తమ ఇంట్లోనో, దేవాలయంలోనో, చావడిలోనోచేరి పంచాంగశ్రవణం జరిపిస్తారు. తమ ఆయవ్యయాలు, కందాయాలు, రాజపూజ్య రాజావమానాలు మొదలయినవి విని, భావిజీవితాన్ని ఒక విధంగా నిర్ణయించుకుంటారు. కొన్ని ప్రాంతాలలో సాయంకాలం వినోదాలు, క్రీడలు జరుపుతారు. ఎడ్లను అలంకరించి బండ్లకు కట్టి పరుగెత్తిస్తారు. రైతులు ఉదయం ఏరువాక సాగుటకూడ కొన్నిప్రాంతాల ఆచారం.

భవిష్య పురాణంలోను, ధర్మశాస్త్ర గ్రంథాలలోను ఈ పండుగ నాటి విధులలో వేపాకు తినడం ప్రత్యేకంగా చెప్పారు. ధర్మ సింధుకారుడు, 'తైలాభ్యంగం సంకల్పాదౌ నూతన వత్సర నామకీర్తనాద్యారంభం ప్రతి గృహ ధ్వజారోహణం నింబపత్రాశనం వత్సరాది ఫలశ్రవణం' అన్నాడు.

శ్రీరామనవమి: శ్రీరామచంద్రుడు తెలుగువారికి ఇష్ట దైవాలలో మొట్టమొదటి వాడు. దీనికి తార్కాణాలు తెలుగుదేశంలోని రామక్షేత్రాలు, గ్రామగ్రామాన వెలసిన ఆంజనేయాలయాలు. ఇంతకూ రామునివంటి గుణసంపన్నుడు ఎవరికి ఆరాధ్యదైవతం కాడు? అతని చరితమే భారతీయ సాహిత్యానికి ఆదికావ్య మయింది.

రామ లక్ష్మణ సీతలను ఆదర్శంగా భావించడం వేల సంవత్సరాలుగా ఆచారంలో ఉంది. రెండు వేలనాటి హాల సాతవాహనుని "గాథాసప్తశతి" లో గుట్టుగా కాపురం చేస్తున్న ఒక ఇల్లాలు, దుర్బుద్ధితో తనవెంట పడిన మరది మనసు మరలించడానికి గోడమీద వ్రాసిన రామానులగ్న సౌమిత్రి చరితం చెబుతున్నది దినమూ" అనే వర్ణన (శతకం-1, ఆ.25) ఉంది. దక్షిణ అమెరికాలోని ఆదిమ వాసు లయిన 'రెడ్ ఇండియనులు' ప్రతి ఏటా సీతా రామోత్సవం జరుపుకొనడంకూడ దీని ప్రాచీనతకు నిదర్శనం.

శ్రీరాముడు చైత్రశుద్ధ నవమినాడు పునర్వసు నక్షత్రంలో జన్మించాడని వాల్మీకి రామాయణం (బాల - సర్గ 18), అగస్త్య సంహిత, చతుర్వర్గ చింతామణి మొదలయిన వ్రతగ్రంథాలు తెలుపుతున్నాయి. వైష్ణవ మతానుయాయులు రామాయణాన్ని శరణాగతి ప్రధానంగా గ్రహించారు. రామకృష్ణులను సంపూర్ణవిష్ణ్వవతారాలుగా పరిగణించారు. సంపూర్ణావతారుడైన రాముడు అవతరించినందునే ఈ నవమికి ప్రాధాన్యం వచ్చింది.

ఈ రాముడు 'దశవర్ష సహస్రాణి దశవర్ష శతానిచ' (బాల 1-97; యుద్ధ, 131-10) రాజ్యం చేశాడని చెబుతారు. ఒక మానవమాత్రుడు పదకొండువేల సంవత్సరాలు రాజ్యమేలడం సంభవమా అన్న సందేహం పలువురికి కలుగుతుంది. 'తృతీయం శత మిత్యాహుః, చతుర్థం తు సహస్రకం' అని సంఖ్యాశాస్త్ర పరిభాష. అంటే శత మంటే మూడు, సహస్రమంటే నాలుగు. కనుక దశవర్ష సహస్రమనగా 40, దశవర్ష శతమనగా 30, మొత్తం 70. పట్టాభిషేకానికి పూర్వం 38 సంవత్సరాలు గడిచాయి. మొత్తం 108 ఏండ్లు మానవుడు జీవించడం ఆశ్చర్యం కాదు అని పండితులు సమన్వయ పరిచారు.

రాముడు ఇతిహాస పురుషుడు కాడు. వేదంలోని రామ సీతా జనకాది నామాలుచేర్చి నీతి బోధకమైన

కథను వ్యాసుడు, వాల్మీకి అల్లారని కొందరన్నారు. పునర్వసు సూర్యదేవతాకమైన నక్షత్రం. ధనురాకారం పంచ - అని ధనురాకారమైన పునర్వసుకు, దాని దేవతకు ఉపలక్షణంగా సూర్యవంశంలో ధనుర్ధారి అయిన ఒకని కథను ప్రచారం చేశారని మరికొందరన్నారు. ఒకప్పుడు వసంత విషువత్తు పునర్వసులో నిలచిన దానికి చిహ్నమే శ్రీరామనవమి అని, ఇది సంవత్సరాది వసంత పూజనమే నని మరికొందరు విమర్శకులన్నారు. ఏమైన వీటన్నిటి సమన్వయమే ఈ పండుగ కావచ్చును.

శ్రీరామ నవమినాడు ఉపవసించి రామ పూజాదులు జరిపి, రాత్రి జాగరణం చేయాలని వ్రతగ్రంథాలు తెలుపుతున్నాయి. రామనవమి సర్వకామప్రద. ఆ నాడు ఉపవసించి రాత్రి రామసన్నిధిలో జాగారంచేసి, దశమినాడు ఉదయం నిత్యకర్మలు ముగించుకొని రామపూజలు చేయాలి. రామభక్తులకు రామప్రతిమాదులు దాన మీయవలెనని అగస్త్య సంహితాదుల వాక్యం.

చైత్రశుద్ధ పాడ్యమి మొదలు రామనవరాత్రోత్సవం జరుపుతారు. ఆ నాటినుండి తొమ్మిది దినాలు పగలు రామాయణం పారాయణం, రాత్రిళ్ళు రామకథా కాలక్షేపాలు చేస్తారు. నవమినాడు రామజననఘట్టం పఠించి పూజలు చేస్తారు. పానకం, మామిడిపిండెల ముక్కలు మొదలయిన వసంత ఋతువుపండ్లు కలిపిన పద్యారం (వడపప్పు) ప్రసాదంగా పంచుతారు. దశమినాడు పట్టాభిషేకఘట్టం పఠించి ఉత్సవం చేస్తారు. రామనవమి నుంచి రామకోటి వ్రాయడం ప్రారంభించి మరుసటి రామ నవమికి ముగించి ఉత్సవం జరపడంకూడ ఉంది.

శ్రీరామోత్సవం దేశమంతా జరుగుతుంది. దేశాన్ని సహస్రాబ్దాలనుంచి ఒక్కటిగా బంధించినది రామచరిత్రమే నంటే ఆశ్చర్యమేమీ లేదు.

ఏరువాక పున్నమ: జ్యేష్ఠశుద్ధ పున్నమను ఏరువాక పున్నమ అంటారు. ఏరువాక అంటే దుక్కి ప్రారంభ దినమన్నమాట. ఇది దేశమంతటను కృషీవలులు జరుపుకొనే గొప్ప పండుగ.

ఇది ప్రాచీన కాలమునుంచీ ఆచరణలో ఉన్నట్లు నిదర్శనాలున్నాయి. వర్షర్తువు ఆరంభం కాగానే వైదిక కాలంలో దుక్కి ఆరంభమయ్యేదని ఋగ్వేదంలో ఉంది (6-32). రైతులు క్షేత్రపాలకుని సంబోధించి మంత్రాలు పఠిస్తూ, దుక్కి ప్రారంభించే వారట. విష్ణుపురాణంలో దీనిని 'సీతాయజ్ఞ' మన్నారు (2-16-9). పాలీ ప్రాకృత సాహిత్యంలో దీనిని 'వప్పమంగల దివస' అనేవారని జాతక కథలు చెబుతున్నాయి. వప్పమంగల మనగా బీజావాప మంగళ దినమన్న మాట. పత్తిచేను విత్తేటప్పుడు నాగలిని పూజించినట్టు గాథాసప్తశతిలో ఉంది (2.65). జైమిని న్యాయమాల జ్యేష్ఠ పూర్ణిమనాడు ఎద్దులను పూజించి పందేలలో పరుగెత్తించేవారని, దీనిని 'ఉద్వృషభయజ్ఞము' అని తెలుపుతున్నది. ఇతర వ్రతగ్రంథాలలో ఇది లేదు. కాని ఈనాడు పుత్రకామవ్రతం, వటసావిత్రీవ్రతం చేయాలని ఉంది. పుత్రకామవ్రతం ఏరువాకకు ఉపలక్షణమేమో; ఏమైనా ఇది ప్రజాసామాన్యంలో వ్యాపించిన పిదప శాస్త్రకారులు ఉద్వృషభయజ్ఞమని ముద్ర వేశారేమో!

ఈ నాడు రైతులు ఉదయాననే ఎడ్లనుకడిగి, కొమ్ములకు రంగులుపూసి, గంటలు, గజ్జెలు మొదలైన నగలు వేసి, ధూపదీప నైవేద్యాలతో పూజించి, పొంగలి పెడతారు. సాయంకాలము నాగలికి, గొర్రుకు రంగులుపూసి అలంకరించి, భుజాలపై పెట్టుకొని మంగళ వాద్యాలతో ఎడ్లను ఊరేగించుకొంటూ తమ పొలాలకు వెళ్ళి, అక్కడ నాగలిని పూజించి దుక్కి ప్రారంభిస్తారు. కొన్ని ప్రాంతాలలో గోగునారతో తోరణంగట్టి, దానిని చేరుకోలలుతో కొట్టి ఎవరికి చిక్కిన పీచు వారు తీసికునిపోవడం ఆచారం. దీనివల్ల పనులు నిర్విఘ్నంగా సాగుతాయని నమ్మకం.

నాగుల చవితి-నాగ పంచమి: నాగపూజ భారత దేశంలో అనాదిగా జరుగుతున్న విషయం. ఈ పూజ సంవత్సరానికి ఎన్నోసార్లు జరుపుతారు. వైశాఖ శుద్ధ చవితినాడు నాగ చతుర్థి; శ్రావణ పౌర్ణమినాడు సర్పబలి; భాద్రపద శుద్ధ పంచమినాడు నాగదష్టోద్ధరణ పంచమి; మార్గశిర శుద్ధ పంచమినాడు నాగపూజ; ఫాల్గుణ శుద్ధ పంచమినాడు అనంత పంచమీవ్రతం. కాని తెలుగువారు రెండుసార్లు మాత్రమే ఈ పండుగ చేస్తారు; శ్రావణ శుద్ధపంచమి నాగపంచమి; కార్తిక శుద్ధచవితి - నాగుల చవితి.

వాన చినుకులు పడగానే విషజంతువులు తమ బొరియలనుంచి వెలుపలకి వస్తాయి, వానకాలంలో వాని భయం అమితం. కనుక శ్రావణ మాసములో ఈ పూజ ప్రధానమయి వుంటుంది. పాములు పంటలను అభివృద్ధి చేస్తా యని, సంతాన ప్రదాయకా లని ప్రజలకు అనాదిగా విశ్వాసం. పాములు బొరియలలో ఉండడము వలన నీటిని ప్రసాదిస్తా యని, పంటలకు అధిష్ఠాన దైవతాలని ప్రజలు నమ్మేవారు. క్రమంగా భూమిలోని నిధులను కాచేవనే నమ్మకం కూడా కలిగింది. పంటలు కలిగించే దేవత సంతానదాయిని కాకపోతుందా? ఈ భావంతో మహామాయా మతానుయాయు లందరూ దేవీ పూజతోపాటు నాగపూజ కూడా చేయడం ప్రారంభించారు.

ఋగ్వేదంలో నాగపూజ కనిపించదని, సంహితాకాలం తరువాత బ్రాహ్మణముల కాలంలో ఈ పూజలు కనిపించ డముబట్టి క్రమంగా వైదికాచారంలో మిళితమై పోయిం దని పరిశోధకులు తెలుపు తున్నారు.

ఈ నాగులు సర్పాలు కావనీ, ఒక తెగ మానవజాతి అని, నాగ గరుడ జాతులకు, నాగులకు తర్వాత ఆర్యు లకూ కలిగిన పోరాటాలే పురాణాలలో పెక్కు కథలుగా చేరాయని పరిశోధకుల నమ్మకం. జనమేజయుడు నాగ జాతిని ధ్వంసం చేయకుండా అస్తీకుడు రక్షించడం, శ్రీ హర్షుడు నాగానందము వ్రాయడం మొదలయినవన్నీ ఆర్యనాగ సంస్కృతుల సమ్మేళన ప్రయత్నమే.

నాగపంచమినాడు (శ్రావణశుద్ధ పంచమినాడు) ప్రజలు శిరస్స్నానంచేసి, సర్ప విగ్రహాలను పూజించి పాలు, కొబ్బెర, అన్నం, పాయసము ఆరగింపు పెడ తారు. తర్వాత పుట్టలవద్దకు పోయి ప్రత్తితో గుడ్డలవంటివి, యజ్ఞోపవీతాల వంటివిచేసి పుట్టలను అలంకరించి, పూజ చేసి పాలుపోసి ప్రదక్షిణ నమస్కారాలు చేస్తారు. ప్రతి గ్రామంలోను చెట్ల మొదళ్ళలో ఉన్న నాగ విగ్రహాలకు ఈనాడు పూజ జరుగుతుంది. బాలబాలికలు కొబ్బరి గిన్నె లను చిత్రవిచిత్రంగా చెక్కి, మధ్యన రెండు దారాలు కట్టి తిప్పడం కొన్ని ప్రాంతాల ఆచారము. సాయం కాలము ఊరి బయట అడవులకు వెళ్ళి చెట్ల కొమ్మలకు త్రాళ్ళు వ్రేలాడగట్టి ఊయల లూగడం మరికొన్ని ప్రాంతాల ఆచారం. ఈ నాడు పొలాలు దున్నడము, కూరగాయలు తరగడం, వంటలు వార్పులు చేయరు.

సర్ప భయము, నాగజాతి విమోచనము మొదలయిన వాటికి తోడు ఋతు పరివర్తన సూచకముగా వైద్యుల సలహాలు కూడా చేరాయి. శ్రావణ మాసంలో దోష ప్రకోపం జరగకుండా పాలు, పేలాలవంటి ఫలహారం సేవించాలనే నియమానికి గుర్తే నాగులకు పాలు పేలాలు ఆరగింపు పెట్టడం.

ఈ నాగపంచమినే వైష్ణవులు గరుడ పంచమి అని అన్నారు. వారి అభిప్రాయం ప్రకారము చవితి నాగుల చవితి, పంచమి గరుడ పంచమి. కార్తిక మాసంలో వచ్చే నాగుల చవితినాడు చలిప్రవేశించు నన్నాడు శ్రీనాథుడు.

శ్రీకృష్ణ జయంతి (కృష్ణాష్టమి): కృష్ణచరిత్రం ఆబాల గోపాలం ఎరిగినదే. కృష్ణుడు దివ్యసుందర మూర్తిగను, మహాపరాక్రమ శాలిగను, రాజనీతి నిపుణుడుగను, తత్త్వ వేత్తగను వర్ణితుడయాడు. ఇతడు భారతీయ తత్త్వభావ నకు ప్రసాదించిన గొప్ప గ్రంథం గీత (భగవద్గీత). బహు రాజకంగా, అరాజకంగా ఉన్న భారతదేశాన్ని మొట్ట మొదటి సారిగా కేంద్ర ప్రభుత్వంతో వ్యవస్థ చేసినవాడు కృష్ణుడే.

ఈ మహాపురుషుని జన్మదినోత్సవం శ్రావణ బహుళాష్టమి రాత్రి రోహిణి నక్షత్రంలో జరుపుతారు. కొందరు నక్షత్రా నికి ప్రాధాన్యమిస్తారు. కొందరు తిథికి ప్రాధాన్యమిస్తారు కనుక రోహిణీయుతమైన అష్టమి శ్రావణ భాద్రపద మాసాలలో ఎప్పుడు వస్తే అప్పుడు ఈ ఉత్సవం జరుపు తారు. జయంతి అనేది జ్యోతిశ్శాస్త్ర పరిభాష. కృష్ణాష్టమి నాడు రోహిణి నక్షత్రం వస్తే 'జయంతి' అని వ్యవహా రము. అదే క్రమంగా కృష్ణ జన్మదినానికి పిదప మహా పురుషుల సామాన్య జన్మ దినానికి వ్యవహృతమయింది. ఇతడు పూర్ణాయుస్సుతో 125 సంవత్సరాలు జీవించా డని హరివంశ, విష్ణుపురాణ, భాగవతాలు తెలుపు తున్నాయి. ఛాందోగ్యోపనిషత్తునుబట్టి 116 సంవత్సరాలు జీవించాడని పరిశోధకులంటున్నారు. ఛాందోగ్యంలో పురుష యజ్ఞమనే యజ్ఞం చేసినవాడు 116 సంవత్సరాలు జీవిస్తాడని కలదు. పురుష యజ్ఞమంటే మృత్యువును ఎదిరించి, తపోదానార్జవాహింసా సత్య వచనాలు అల వరచుకొనడం (ఛాందోగ్యంలో 3-6-7, 3-17-6, 3-7-4). ఇది దేవకీ పుత్రుడయిన కృష్ణుడు చేశాడట (ఛాందో. 3-17-6). ఇతని చరిత్రలో పెక్కుజ్యోతిశ్శాస్త్ర రహ స్యాలు కూడ ఇమిడించారని కొందరంటున్నారు.

శ్రీకృష్ణుడు వైదిక కాలపు మహావ్యక్తి అనీ, కృష్ణ, అర్జున, రాధ మున్నగు పదాల అర్థం వేరని, వాటిశబ్ద సామ్యంతో పెక్కు కథలు కల్పించారని, వ్యాసుడు కూడ అలాటి గాథనే అల్లాడని పరిశోధకులంటారు. ఏది ఎలావున్నా కృష్ణుని చరితం మన జాతిలో జీర్ణించుకొని పోయింది.

కృష్ణుడు కల్యబ్దాలు 28లో భాద్రపద బహుళాష్టమి నాడు దేవకీ గర్భంలో జనించినట్లు వ్రత గ్రంథాలు తెలుపుతున్నాయి. అష్టమినాడు పగలంతా ఉపవాసంచేసి సాయంకాలము కృష్ణ పూజలు చేస్తారు. విగ్రహాన్ని ఊరే గిస్తారు. కృష్ణుడు పుట్టినట్లు భావించి ఉయ్యాలలు కట్టి ఆడిస్తారు. కృష్ణుడు బాల్యంలోనే రేపల్లెలో చేసిన దుండ గాలకు తార్కాణంగా వీథులలో ఉట్లు కట్టి నవమినాడు ఉట్లు కొడుతారు. ఈ వినోదం దేశమంతా జరుగుతుంది. తక్కిన సమయాలలోని చేష్టలకన్నా బాల్య చేష్టలు ప్రజల మనస్సులను హెచ్చుగా ఆకర్షిస్తాయి గనుక ప్రజలు అనాదిగా వాటినే ఉత్సవాలతో జ్ఞాపకం పెట్టుకున్నారు.

కృష్ణాష్టమి - జయంతి సకలాభీష్టత గనుక చంద్రునికి అర్ఘ్యమివ్వాలని బంగరు, వెండి చంద్రబింబాలుచేసి వాటిని

పూజించాలని పురాణాలలో ఉంది. తర్వాత కృష్ణుడిపూజ చేయాలట. మొదట చంద్రుని పూజ ప్రధానంగా వుండి, తర్వాత కృష్ణాష్టమిని దానికి జోడించారని తోస్తున్నది.

శ్రావణ పూర్ణిమ: ఋతువులను అనుసరించి ప్రతికార్యమును ప్రారంభించడము మన పూర్వుల ఆచారం. విద్యారంభానికి కూడ ఒక కాలనిర్ణయం ఉండేది. అదే శ్రావణ పూర్ణిమ. ఈనాడు ద్విజులు (బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు) అధ్యాయోపాకర్మ జరిపేవారు. అధ్యాయోపాకర్మ అంటే వేద ప్రారంభం. అధ్యాయం అంటే వేదం దాని ఉపాకర్మ ఉపక్రమం (ఆరంభం) అన్నమాట; దీని సంగ్రహరూపమే ఉపాకర్మ.

వేద ప్రారంభమంటే విద్యా ప్రారంభం. అది ఈనాడే ఎందుకు ? వర్ష ఋతువునుంచి చాతుర్మాస్య వ్రతం ఆరంభమవుతుంది. పారస్కర గృహ్యా సూత్రంలో 'అథాతో అధ్యాయోపకర్మ, ఓషధీనాం ప్రాదుర్భావే, శ్రవణేన శ్రావణ్యాం పౌర్ణమాస్యాం శ్రావణస్య పంచమ్యాం హస్తేనవా' అని ఉంది. అంటే, ఓషధులు మొలకెత్తిన తర్వాత, శ్రవణ నక్షత్రయుక్త శ్రావణపూర్ణిమనాడుగాని, శ్రావణ పంచమినాడుగాని, హస్తా నక్షత్రముగల (శ్రావణమాసములో) నాడు కొన్ని వేదాధ్యయనారంభం చేయాలని ఉంది. శ్రావణ భాద్రపద మాసాలలో విధ్యుక్తంగా అధ్యయనం ప్రారంభించి పుష్యమాసంలో గాని, మాఘశుక్ల పాడ్యమినాడుగాని అధ్యయనం చాలించాలని, మొత్తం నాలుగున్నర నెలలు జరపాలని మనువు తెలిపినాడు. నూతన అధ్యయనమే కాక ధారణకోసం కూడ ఈనాడే ఇన్ని నెలలు జరపాలని గోభిలుడన్నాడు.

శ్రావణ భాద్రపద మాసాలలో జరపా లనడాన్నిబట్టి, కొందరు హస్తా నక్షత్రానికి ప్రాధాన్యమిచ్చి హస్తానక్షత్ర సహిత భాద్రపద చతుర్థినాడు ఉపాకర్మ జరుపుతారు. ఈ విధంగా వినాయకుడు విద్యాధిదేవత కూడ అయాడు. సామవేదులు వినాయక చవితినాడే ఉపాకర్మ జరుపుకుంటారు. పైన పేర్కొన్న దానినిబట్టి బ్రాహ్మణాది ద్విజులు నూతన యజ్ఞోపవీతాలు ధరించి, అజినాదులు కట్టుకుని నాలుగైదు నెలలపాటు నిరంతరం వేదాలు ఆవృత్తి చేసేవారని తోస్తుంది. అది క్రమంగా లాంఛనప్రాయంగా మిగిలింది. బ్రాహ్మణులు మాత్రమే జరిపే ఆచారం కూడ ప్రబలింది.

ఈ నాడు నిత్య కర్మానుష్ఠానం తర్వాత అధ్యాయోపాకరణోత్సర్జనాంగ భూతమైన 'కామోకార్షీత్' జపం చేస్తారు. అధ్యాయోపాకరణోత్సర్జన మంటే, వేదాధ్యయనం చేయడంలో విచ్ఛేదం కలుగడం. తత్పరిహారార్థం ఈ 'కామోకార్షీత్' జపం. 'కామోకార్షీత్', మన్యురకార్షీత్, కామః కరోతి, నాహం కరోమి, కామః కర్తా నాహం కర్తా, కామః కారయితా నాహం కారయితా, ఏష తే కామకామాయ స్వాహా' అనేది కామోకార్షీజపం. ఈ మంత్రాన్ని 108 మార్లు జపించిన తర్వాత అందరూ నదికో, చెరువుకో పోయి నూతన యజ్ఞోపవీత ముంజ్యాజినాదులుధరిస్తారు. తరువాత కాండ ఋషి తర్పణం చేస్తారు. పిదప వేదాధ్యయనోపక్రమణ చిహ్నంగా ప్రతి వేదంలోని ఆద్యంత ఋక్కులు, ఉపనిషత్తుల ఆద్యంత వాక్యాలు పఠిస్తారు. అనంతరం అధ్యయన హోమం జరుపుతారు. మరునటి రోజు 1008 మార్లు గాయత్రీ జపం చేస్తారు. గాయత్రీ హోమం కూడా చేయడం కద్దు.

ఈ శ్రావణ పూర్ణిమను పాల్కురికి సోమనాథుడు పండితారాధ్య చరిత్రలో 'నూలి పున్నమ' అన్నాడు. నూలి (పూనూల్-తమిళ్) పున్నమ అంటే జందేల పున్నమ.

ఈ శ్రావణ పూర్ణిమనాడు అన్న వరుసల వారికి స్త్రీలు రక్షాబంధనం (రాఖీ కట్టడం) జరిపే ఆచారం కొన్ని ప్రాంతాలలో ఉంది. హేమాద్రి రక్షాబంధనం ఆచారంగా అంతకుముందే ఉన్నట్లు తెలుపడం వల్ల మొగలాయి నవాబుల కాలంలో రాజపుత్ర స్త్రీల రక్షణ కోసం ఏర్పడి వ్యాపించినట్టు కనిపించదు. దానవ పరాజితుడైన ఇంద్రునికి శచీదేవి విజయంకోసం ఈనాడు రక్షా పోటలి బంధించినట్టు భవిష్య పురాణం చెబుతున్నది. ధర్మ శాస్త్రకారులందరూ దీనిని తెలిపారు. మొదట ఇది విజయ కారకమని మాత్రమే వ్యవహారంలో ఉండి తర్వాత భాతృపూజగా మారినట్లు తోస్తుంది. యజ్ఞోపవీత ధారణం వంటి ఆచారమే ద్విజేతరులలో రక్షాబంధన కర్మగా రూఢమయిందని, తర్వాత దానికి పెక్కు కథలు చేరాయని నా ఊహ.

వినాయకచవితి: భారత దేశంలో శివకేశవుల తర్వాత విశేషంగా పూజలందుకొనే దైవం వినాయకుడు. ప్రతి కార్యమూ నిర్విఘ్నంగా సాగడానికి వినాయక పూజ తప్పక జరుపుతారు. ఈ దైవాన్ని ప్రత్యేకంగా పూజించే దినం వినాయక చవితి - భాద్రపద శుద్ధ చవితి.

వినాయకుడు గజాననుడు, ఏకదంతుడు, మూషిక వాహనుడు, లంబోదరుడు, బ్రహ్మచారి. పరశురామునితో పోరులో ఇతని దంత మొకటి ఊడి పోయినదట. వినాయకుడు విఘ్న నియంతగానే కాక, విద్యాధిదైవతంగాను, లేఖన సంప్రదాయ ప్రవర్తకుడుగాను, బ్రహ్మచర్యదీక్షా స్వరూపుడుగాను పూజలు పొందుతున్నాడు. వేదనిఘంటువైన నిరుక్తంలో గణ శబ్దం వాక్కులకు పర్యాయమని, దాని కధిపతి గణపతి అని, కనుక గణపతిని

వాగధిష్ఠాన దేవతగా భావిస్తున్నారనీ పరిశోధకులంటున్నారు. వేదవ్యాసునికి గణపతి భారత లేఖకుడుగా ఉండినాడనే గాథ ఉంది.

వినాయకుని ఏనుగుతల బుద్ధికి, ఎలుకవాహనం శ్రద్ధకు, విజయానికి చిహ్నమని, మొదట ఈ దేవుడు, అనార్యజాతి దేవుడై క్రమంగా వైదిక దైవతంగా పరిగణితుడయ్యాడని మరి కొందరంటారు. వినాయకుడు పంటల దేవుడని, ఆయన కాయం గాదెకు, చెవులు తూర్పెత్తే చేటలకూ, ఎలుక వాహనం ఎలుకలు బాధించకుండా జయించామని చెప్పడానికి ఉపలక్షణాలని మరి కొందరన్నారు. ఏకదంతం నాగలికి, పొట్టకు పామును బిగించడం ఎలుకల సంహారానికి సూచనలని మరి కొందరున్నారు. గణపతి పూజా ద్రవ్యాలు చూస్తే ఇది కేవలం ప్రకృత్యారాధనం గానే తోస్తుందని కొందరు పండితు లంటారు.

భాద్రపద శుద్ధచతుర్థి నాడు మంగళ స్నానాదులాచరించి, మట్టితో వినాయకుని విగ్రహం చేసి, ఇంటి భవంతి మధ్యన అరుగు వేసి దానిపై వడ్లు కాని, బియ్యం కాని పోసి వినాయక విగ్రహాన్ని దానిపై స్థాపించి ఇరవై ఒక్క పత్రులతోను, పూవులతోను పూజలు చేస్తారు. కుడుములు, ఉండ్రాళ్ళు 21 విధాలు నేతితో చేసి నైవేద్య మిస్తారు. పిదప వినాయక విగ్రహం సన్నిధిలో అఖండ దీపం పెడుతారు. ఈ దీపం మరుసటిరోజు సాయంకాలం వరకు ఉండాలి. మరునాటి సాయంకాలం వినాయక విగ్రహాన్ని బావిలోనో, చెరువులోనో, నదిలోనో విసర్జిస్తారు. కొన్ని ప్రాంతాలలో ఈ విగ్రహం ధాన్యపు గాదెలలో ఉంచడం, గోడలలోని గూళ్ళలో పెట్టి అడ్డం వేసి మెత్తి వేయడం కద్దు. విసర్జన చేసిన చోటి మట్టిని యింటికి తెచ్చి, ధాన్యాగారాలలో చల్లుతారు. దీనివల్ల ధాన్యం అక్షయమవుతుందని నమ్మకం.

వినాయక చవితినాడు చంద్రుణ్ణి చూస్తే లేనిపోని అపవాదులు వస్తాయని పురాణాలు తెలుపుతున్నాయి. దాని పరిహారార్థం శ్యమంతకోపాఖ్యానం జ్ఞాపకం చేసుకొనడం ఆచారం. ఈ శ్యమంతక మణి వృత్తాంతము జ్యోతిర్విషయమని, ఈ కథలోని సింహము సింహరాశి, శ్యమంతకమణి సూర్యుడు, జాంబవంతుడు సప్తర్షి మండలమని పరిశోధకులు తెలుపుతున్నారు. సూర్యోదయాత్పూర్వం ఏ నక్షత్రం ఉదయిస్తుందో, ఆ నక్షత్ర దేవతను ఆ నాడు పూజించాలని ఋగ్వేదంలో ఉంది. వినాయక చవితినాడు సూర్యోదయాత్పూర్వం వినాయక నక్షత్రం ఉదయిస్తుంది, మర్నాడు (పంచమినాడు) సప్తర్షి మండలంలోని పడమటి భాగం సూర్యోదయాత్పూర్వం ఉదయిస్తుంది. ఆ నాడు ఋషి పంచమి వ్రతం. ఈ విఘ్నేశ్వరనక్షత్రం ఉదయించిన నాడు హస్తా నక్షత్రం కావడంవల్ల వినాయకుడు హస్తి అయినాడు (హస్తం కలవాడు).

ఈ గణపతి పూజ ఆసియా అంతటా నాల్గవ శతాబ్ది ముందునుంచే ప్రాకిందని కాబూల్‌లో దొరకిన నాల్గవ శతాబ్దపు విగ్రహాలనుబట్టి ఇటీవల శ్రీ టి.ఎన్. రామచంద్రన్ తెలిపారు. తాంత్రిక, వామాచారాల ప్రకారం లక్ష్మీ గణపతి, చిక్షిప్రగణపతి, సిద్ధ గణపతి, చింతామణి గణపతి, శక్తి గణపతి, ఉచ్ఛిష్ట గణపతి, ఏకాక్షర గణపతి, కుమార గణపతి అనే పెక్కు సంప్రదాయాలు ఏర్పడ్డాయి.

అట్లతదియ: 'అష్టాదశ వర్ణాలకూ అట్లతద్ది' అనే సామెత ఉంది. ఈ సామెతను బట్టే ఇది అందరూ సర్వ సామాన్యంగా చేసే పండుగ అనడం స్పష్టం. ఈ పండుగ భాద్రపద బహుళ తదియ నాడు చేస్తారు.

వ్రత గ్రంథాలలో శ్రావణ భాద్రపద మాసాలలో స్త్రీలు సౌభాగ్యాభివృద్ధి కోసం జరుపు కొనే అవిధవా నవమి మొదలయిన వ్రతాలను వ్రత గ్రంథకారులు తెలిపారు. కాని, అట్లతద్ది సంగతి లేదు. భాద్రపద తృతీయనాడు గుడాపూపాలు దేవికి అర్పించాలనే ఒక వ్రతముంది. అది క్రమంగా అట్లతద్ది అయిందేమో! భాద్రపద మాసంలో వర్షాలతో ఏర్లు పొంగినప్పుడు ఊరి బయటికి వెళ్ళి తోటలలో గడపడం వినోదానందాలు చెప్పనక్కరలేదు.

ఈ పండుగ నాడు స్త్రీలు తెల్లవారు జాముననే లేచి తలంటి పోసికొని వేళ్ళకు గోరింటాకు పెట్టుకుంటారు. తర్వాత గవ్వలాట ఆడుతారు. ఊరిబైటి తోటలకు అట్లు, బెల్లపట్లు, పెరుగన్నం తీసుకు వెళ్ళి, అందరూ కలిసి తిని, ఊయెల లూగుతారు. రాత్రి గౌరీ పూజ చేస్తారు.

ఈ పండుగ నాడు మాలలు గొంతెమ్మ (కుంతి) పూజ చేస్తారు. వీరు వేషాలు వేసుకొని ముందుగానే ప్రతి యింటికి వెళ్ళి బియ్యం అడుక్కొని వస్తారు. అట్ల తదియనాడు గొంతెమ్మను ఊరేగిస్తారు. దీనికి ఒక జనశ్రుతి ఉంది. భారత యుద్ధం తర్వాత ధర్మరాజు తర్పణాలు చేస్తుండగా, మధ్య కర్ణుడు చేయి చాచాడట. ధర్మరాజు దిగ్భ్రమతో 'ఇదేమిటి?' అని వ్యాస మహర్షిని అడిగాడు. 'కర్ణుడు మీ పెద్దన్నయ్య, వాడికి తర్పణం చేయి' అని వ్యాసమహర్షి అన్నాడట. ధర్మరాజు వ్యాసుని మాట ప్రకారమే చేసి, తర్వాత నిజమేమని కుంతీదేవిని అడిగాడట. ఆమెతన చిన్ననాటి కథను దుఃఖంతో చెప్పిందట. "ఈ సంగతి ముందే చెప్పిఉంటే ఇంత రథసే జరిగేది కాదు గదా!" అని ధర్మరాజు కోపంతో అనెను. "నీవు మాలలకు దేవత కావాలి" అని శపించాడట.

భాద్రపదం మహాలయ మాసం. ఈ కథలోని తర్పణాలు ఊరిబయటకి వెళ్ళి విందారగించడం మొదలైనవి చూడగా ఈ పండుగ మహాలయ మాసానికి, వర్షాధిదేవత పూజకు సంబంధించిన దని తోస్తుంది. మహాలయ మాసంలోని పూర్ణిమ మాల పున్నమ అయినట్టు మహాలయ పక్ష తృతీయ మాల తృతీయ అయి, మాలవారి పండుగ దినమైనదేమో! (చూ. నోములు అద్దెపండుగలు : పుట 907)

మహాలయామావాస్య : భాద్రపద బహుళ పక్షాన్ని మహాలయపక్ష మంటారు. ఈ అమావాస్యను మహాలయ అమావాస్య అంటారు. దీనిని పితృపక్ష మని కూడా అంటారు. ఈ పక్షంలో అన్ని వర్ణాలవారూ (మంత్ర పూర్వకంగాను, అమంత్రకంగాను) పితృ తృప్తికి శ్రాద్ధ తర్పణాదులు చేస్తారు.

మహాలయ మంటే మహా నాశం. ఉత్తరాయణము దేవతల కాలం గనుక ఉత్తమ కాలమని, దక్షిణాయనం పితృకాలం గనుక అశుభ కాలమని మన సంప్రదాయము. భాద్రపదమాసంలో అంతా జలమయంగా ఉండడంవల్ల, ముసురు మబ్బులవల్ల, చిమ్మ చీకటిగా కనిపించడంవల్ల, వానలవల్ల, బురదలవల్ల వచ్చే రోగాలవల్ల దుఃఖమయమని పూర్వులు భావించడంలో ఆశ్చర్యం లేదు. ఆషాఢ మాసం రెండవ పక్షం మొదలు ఐదవ పక్షంవరకు పితరులు చాలా కష్టపడుతూ అన్నోదకాలకోసం అంగలార్చుతారని, ఈ పక్షంలో ప్రతివారూ శ్రాద్ధం చేయాలని స్మృతులు తెలుపుతున్నాయి.

ఈ శ్రాద్ధాలు చేయడానికి మరొక కథగూడ ఉంది. అగస్త్య మహాముని విష్ణువును చూడడానికి వెళ్ళుతుండగ సముద్రం దారిలో అడ్డం వచ్చింది. దారి ఇమ్మన్నాడు ఋషి. సముద్రం తొలగలేదు. దానికి కోపంవచ్చి త్రాగివేశాడు. అది చూచి దేవతలు తహతహపడి ప్రార్థించగా మరల వదిలాడు. అందువల్ల అపవిత్రమైంది సముద్రం. నదీసాగర సంగమాలలోను, పర్వాలలోను మాత్రమే సాగర స్నానం చేయాలని నిర్ణయించారు. అగస్త్యుడు సముద్రాన్ని పాడు చేశాడని నారదుడు విష్ణువుకు తెలిపాడు. విష్ణువు మాయ నంపి అతనిని చంపమన్నాడు. అది వచ్చి అగస్త్యుని, ఆతని సహచరులైన కుశ, తిల, మధు, యవ, ఖడ్గాది మునులను మొక్కలై పొండని శపించింది. ఇంతలో వాతాపి ఇల్వలులు అందరి అన్నాలలోను కలిసిపోయి అందరినీ చంపడం ప్రారంభించారు. పితృ కర్మలు మంట గలిసిపోయాయి. పితృదేవతలు త్రిమూర్తులకు మొరపెట్టుకుంటే, వారు యాజ్ఞవల్క్య మునిని ప్రార్థించమన్నారు. యాజ్ఞవల్క్యుడు వారి మొర విని అగస్త్యాశ్రమంలో మొక్కలయి ఉన్న మునులను ప్రార్థించమన్నాడు. వారి ప్రార్థనతో మొక్కలను విష్ణువు శాపం నుంచి విముక్తి చేయించాడు. తర్వాత అగస్త్యుడు వాతాపి ఇల్వలులను చంపివేశాడు. వీరిద్దరినీ అగస్త్యుడు జీర్ణం చేయడం మహాలయ పక్షంలో జరిగింది. పితరులకు ఈ కాలంలో తృప్తి అయింది గనుక మనముకూడా పితృ తృప్తి చేయాలి.

ఈ కథలోని అగస్త్యుడు అగస్త్య నక్షత్రం. ఇది భాద్రపదంలో ఉదయిస్తుంది. ఉదయించగానే మేఘాలు తొలగి నీరు తేరుకుంటుంది. విష్ణువు సూర్యుడు. వర్షాకాలంలో జబ్బులు రావడం, తరవాత అగస్త్యోదయమైన పిదప నీరు తేరి, వ్యవసాయ యోగ్య పరిస్థితి ఏర్పడి, అందరికి కుశ, యవ, తిలాదుల నాట్లు మొదలైన పూర్వపు వ్యవసాయ గాథ, పితరుల గాథ కలిసి ఈ విధంగా కథ రూపొందియుండవచ్చును.

హస్తా నక్షత్రయుక్తమైన భాద్రపదామావాస్యను గజచ్ఛాయ అంటారు. ఇది సంవత్సరానికొకమారు భాద్రపద మాసంలో బహుళ త్రయోదశి మొదలు అమావాస్య వరకు సంభవిస్తున్నది. ఇది చిమ్మచీకటికి (మహాలయాంధకారానికి) గుర్తు అయి ఉంటుంది.

భాద్రపద పూర్ణిమను మాల పున్నమ అంటారు. మాల పున్నమ అంటే మహాలయ పున్నమ. ఈనాడుకూడ పితృ పూజ చేయాలని స్మృతులు తెలుపుతున్నాయి. జోకరయ్య అనే తెలగ యువకుడు మాల పిల్లను ప్రేమించిన కథ ఒకటి కొన్ని ప్రాంతాలలో వాడుకలో ఉంది. జోకరయ్య దేవలోకానికి వెళ్ళి వానలు కురిపించినందున జోకరయ్య పండుగ చేస్తారు. జోకరయ్య మరెవరో కాదు, శక్రయ్య, ఇంద్రుడే. శ్రావణ, భాద్రపద మాసాలలోను, ఆశ్వయుజ మాసంలోను ఇంద్రోత్సవాలు పెక్కు చేయాలని స్మృతి గ్రంథాలలో ఉంది. ఈ ఇంద్రోత్సవం, ఇంద్రధ్వజోత్సవం, ప్రతిరూపమే 'మేపోల్' అని విదేశాలలో ఉందని పరిశోధకు లంటున్నారు. ఇంద్రునికి వర్షాలు కురిపించినందుకు కృతజ్ఞతగాను, ఆ సందర్భంలో పితరుల స్మృతిగాను, ఈ మహాలయం ఆచార మయింది.

నవరాత్రం : నవరాత్ర మంటే తొమ్మిది రాత్రులు. తొమ్మిది రాత్రులు జరిపే పూజను నవరాత్ర పూజ అంటారు. ఈ నవరాత్రోత్సవాలు నాలుగున్నాయి. చైత్ర మాసంలో రామ నవరాత్రి, ఈ మాసంలోనే కొన్ని ప్రాంతాలలో దేవీ నవరాత్రి కూడా జరుపుతారు. భాద్రపద మాసంలో వినాయక నవరాత్రి (గణపతి నవ రాత్రులు), ఆశ్వయుజ శుద్ధంలో దేవీ నవరాత్రి.

దుర్గాదేవి పూజను తొమ్మిది రాత్రులు జరపాలని, ఓపిక లేనివారు ఏడు రాత్రులు, ఐదు రాత్రులు, మూడు రాత్రులు, ఒక రాత్రి జరపాలని పురాణాదులు, వ్రత గ్రంథాలు తెలుపుతున్నాయి. దేవీ పూజ తొమ్మిదినాళ్ళూ జరపడానికి గల కారణాలను, కథలను పురాణాలలో చూడవచ్చును. నవరాత్రు లన్నిటిలోను నవమి ముఖ్యమైనది. మూలనక్షత్రయుక్తమయిన అష్టమిని మహానవమి అంటారని భవిష్యోత్తర పురాణం చెబుతున్నది. ఇదే క్రమంగా 'మహర్నవమి' అయింది.

దేవ్యవతార కథలను పరిశీలింపగా మురికిని ఈతి బాధలను జయించడానికి ఇది పూర్వులు చేసిన కృషిగా తోస్తుంది. శరద్వసంతాలలో నానా రోగాలూ కలుగుతాయి. వీటికి యమదంష్ట్రికలని పేరు కనుక రెండు ఋతువుల ప్రారంభంలో నవరాత్రి వ్రతం చేయాలని దేవీ భాగవతంలో ఉంది.

ఈ దేవ్యారాధన - ప్రకృతిని (రక్షను, సృష్టిని) దేవిగా భావించడం అనాదిగా ఉందని దీనికి రుజువు మహంజోదారో బొమ్మలే నని పరిశోధకు లంటున్నారు. స్త్రీ సృష్టికి మూలమనే భావమే శాక్త మతానికి కారణం.

దేవ్యారాధకులు తమ సంప్రదాయమునసరించి పాడ్యమి నాడు కలశ స్థాపన చేసి దేవీ మూర్తిని ఆవాహన చేసి, నవమి వరకు పూజలు జరుపుతారు. ఈ పూజలో శ్రీచక్ర పూజ ప్రధానం. హోమాదులు జరుపుతారు. దశమినాడు ఉదయం దేవీ ప్రస్థానం జరుపుతారు. తొమ్మిది రోజులు కన్యకా పూజలు, సుమంగళీ పూజలు జరుగుతాయి. ఈ పూజలలో సాత్త్వికా, రాజస, తామస పూజ లున్నాయి. చివరి రెండింటిలో పశుబలులు మొదలైనవి ఉన్నాయి. సాత్విక పూజలో బలికి బదులు గుమ్మడికాయలు, బెంకాయలు పగులకొడతారు. మూల నక్షత్రంనాడు సరస్వతీ పూజ, అష్టమినాడు దుర్గాపూజ (దుర్గాష్టమి), నవమినాడు చండీపూజ, ఆయుధపూజ చేస్తారు. దశమినాడు విసర్జనము; కనుకనే కొన్ని ప్రాంతాలలో నవమికే ప్రాధాన్యమిచ్చి ఆయుధపూజ జరుపుతారు. కొన్ని ప్రాంతాలలో బొమ్మల కొలువు తీరుస్తారు. మరికొన్ని ప్రాంతాలలో నల్లటి రంగు పూసుకొని యుద్ధ భటుల వేషాలు వేస్తారు. విల్లంబులతో పిల్లలు ముచ్చటగా వేషాలు వేసుకొని తిరుగుతారు. దేవి రాక్షసులతో పోరాడినందుకు చిహ్నంగా జరుపుకొనే పండుగ కనుకనే యుద్ధ వేషాలు, బలులు, బొమ్మలకొలువులూను. వర్షకాలం తర్వాత శరత్తులో దండయాత్రలకు అనువయిన కాలం కనుక నే ఆయుధపూజ, ఎల్లలు దాటి పయనం మొదలయినవి ఆచారమయింది.

విజయదశమి: నవరాత్ర పూజ జరిగిన వెంటనే వచ్చే పండుగ విజయదశమి. ఇది ఆశ్వయుజ శుద్ధ దశమినాడు జరుపుతారు. దీనిని దసరా, దశరా అనికూడ వ్యవహరిస్తారు. ఈ దశమికి విజయదశమి అని వ్యవహారం రావడానికి రాముడు మహా నవమినాడు దేవిని పూజించి రావణుని వధించాడని, దానికి దేవతలు సంతృప్తి పడి దేవీ పూజ జరిపి, దశమినాడు వీడ్కొలిపారని, కనుక ఇది విజయదశమి అయిందని కాళికా పురాణం తెలుపుచున్నది. వాల్మీకి రామాయణా న్ననుసరించి రావణ వధకు కారణం రాముని ఆదిత్య హృదయ పఠనం. రాముడు రావణునిపై దండు వెడలిన దినం గనుక ఇది విజయదశమి అని మరి కొందరన్నారు. జగదంబ మహిషాసురుని వధించిన దినం కనుక విజయదశమి అని ఇంకా కొందరంటారు. రావణ వధానంతరం ఇంద్రుడు దేవసేనకు నీరాజనం చేశాడు కనుక ఈ దినం విజయదశమి అయిందని కూడా కాళికా పురాణం తెలుపుతున్నది. రఘు మహారాజు ఈనాడే కుబేరుని ధనాగారంనుంచి ధన విజయం సాధించినాడనే మరొక కథ కూడా ఉంది. విజయుడు అజ్ఞాతవాసం పూర్తయిన పిదప జమ్మిచెట్టులో దాచిన ఆయుధాలను తీసుకొని శత్రువులను ఓడించిన దినం ఇదేనని కొందరి వాదం. 'శమీ శమయతే పాపం, శమీ శత్రువినాశినీ. అర్జునస్య ధనుర్ధారీ రామస్య ప్రియ దర్శినీ' అన్న జమ్మిచెట్టు పూజా స్తోత్రంలో రామాయణ భారత గాథలు రెండింటికీ సంబంధం వుంది.

ఉత్తర భారత ప్రాంతంలో విజయదశమి నాడు రావణ, కుంభకర్ణుల బుట్టబొమ్మలు తగులబెడుతారు. దీనిని రామలీలోత్సవం అంటారు. దీనిలో కొందరు కాళికా వేషాలు కూడా వేస్తారు. కాని రాముడు ఆశ్వయుజ మాసంలో రావణ వధార్థం దండు వెడలాడని, ఫాల్గునామావాస్య నాడు రావణుని వధించాడని, చైత్ర శుద్ధ షష్ఠినాడు అయోధ్య చేరాడని రామాయణ వ్యాఖ్యాతలు తెలిపారు. ఉత్తర గోగ్రహణం కృష్ణపక్ష సప్తమినాడు జరిగినట్టు వ్యాస భారతంలో ఉంది, గనుక భారతంలోని ఉత్తర గోగ్రహణ గాథ ఈనాటి దనే జనశ్రుతి కూడా నిరాధారం. శమీ పూజకు కూడా భారతంలో ఆధారంలేదు.

అయితే ఇంత బలమైన సంబంధం విజయదశమితో భారత రామాయణాలకు ఉండడానికి కారణం ఉంది. ఆశ్వయుజమాసం శుద్ధ దశమినాటి సాయంకాలం విజయ కాలమని, ఆనాడు అపరాజితా దేవిని పూజింపవలెనని వ్రత గ్రంథాలు, పురాణాలు తెలుపుతున్నాయి. జమ్మికి అపరాజితా అనే పేరు కూడా ఉంది. 'అపరాజిత' అనే

ఓషధిని పూర్వం రక్షగా కట్టేవారని 'శాకుంతలంవల్ల' తెలుస్తున్నది. 'అపరాజిత' అనే దేవి ఋగ్వేదకాలంలో ఆర్యులకు ముఖ్య దేవతగా ఉండేది. ఈ దేవీపూజ క్రమంగా శాక్తుల కాలపు దేవీ పూజతోను, రాజుల దండ యాత్రతోను, జ్యోతిశ్శాస్త్ర పరిభాషతోను కలిసిపోయి రకరకాల గాథలకు కారణమైంది. ఈ ఉత్సవంలోని ప్రధానాంశాలు : అపరాజితా పూజనం, సీమోల్లంఘనం, శమీ పూజనం అని ధర్మశాస్త్రకారులు తెలిపారు. వీటన్నింటినీ బట్టి ఇది మొదట రాజుల యుద్ధ విజయ యాత్రోత్సవంగా ఉండి, క్రమంగా కార్య విజయోత్సవంగా సర్వసామాన్యముగా ప్రజలలో వాడుకయిపోయింది.

విజయదశమినాడు ప్రజలు తమతమ ఇండ్లలో తలంటు పోసుకొని, నూతన వస్త్రాలు ధరించి, ఇష్ట దేవతలను పూజించి మృష్టాన్న భోజనాలు చేస్తారు. సాయంకాలము మేళతాళాలతో ఊరేగుతూ ఊరి వెలుపల పొలిమేర దాటి వెళ్ళుతారు. దేవాలయాలున్న చోట్ల అయితే ఉత్సవ విగ్రహాలను ఊరేగించి ఊరిబయటికి వెళ్ళుతారు. పొలిమేర దాటివెళ్ళి అక్కడ దేవిని దేవతను పూజించి మల్లయుద్ధాది ప్రదర్శనాలు జరుపుతారు. ఏదయినా జంతువును పరుగెత్తించి పారు వేటాడుతారు. పిదప శమీవృక్ష పూజచేసి దాని పత్రిని తీసుకొని ఇంటికి వచ్చిన పిదప పెద్దలకిచ్చి నమస్కరిస్తారు. బంధుమిత్రుల కిచ్చి అభినందిస్తారు, "శమీ శమయతే" శ్లోకం చదువుతారు. ఇలాగే పరస్పరం జరుగుతుంది. పొలిమేర దాటడమే సీమోల్లంఘనము. ఇది భ్రష్టమై "సిలంగన్" అని కొన్ని ప్రాంతాలలో వ్యవహారమయింది.

దీపావళి : దీపావళంత ముచ్చటైన పండుగ మరొకటి లేదు. ఇది ఆశ్వయుజ బహుళ అమావాస్యనాడు వచ్చే పండుగ. కాని దీనిని దక్షిణ భారతమంతటా చతుర్దశి, అమావాస్య, కార్తీక శుద్ధ పాడ్యమి మూడునాళ్ళు జరుపుతారు. మొదటిది నరక చతుర్దశి, రెండవది దీపావళి అమావాస్య, మూడవది బలి పాడ్యమి, ఉత్తర భారతంలో ఐదునాళ్ళు ఆశ్వయుజ బహుళ త్రయోదశి ధన త్రయోదశి (ధన తేరన్), నరక చతుర్దశి, దీపావళి అమావాస్య, బలి పాడ్యమి, భ్రాతృ ద్వితీయ లేక యమ ద్వితీయ అని జరుపుతారు. దీనిని తెలుగు దేశములో దివ్వెల పండుగ, దివిలి పండుగ అని అన్నారు.

ఈ పండుగ జరిపే పద్ధతిని వ్రత గ్రంథాలలో వివరంగా చూడవచ్చును. త్రయోదశినాడు రాత్రి అపమృత్యు నివారణార్థం దీపం వెలిగించి ఇంటి ముంగిట పెట్టాలి. దీనిని యమదీపం అంటారు. చతుర్దశినాడు నరకభయ నివారణార్థం తృతీయ యామానంతరం అభ్యంగ మంగళ స్నానం చేయాలి. యమునికి తర్పణంచేసి, నాలుగు వత్తులతో దీపం వెలిగించాలి. సాయంకాలం దేవాలయాలలో మఠాలలో దీపాలు వెలిగించాలి. మరునాటి ఉదయం కూడా తెల్లవారు జామునసే మంగళ స్నానం పంచత్వక్కుల (ఐదు చెట్టు పట్టల) నీటితో చేయాలి. ప్రదోష కాలంలో దీపదానం చేయాలి. ఉల్కలను (కొరువులను) తిప్పాలి; పిదప లక్ష్మీపూజ చేయాలి. దేవాలయాలలో చతుష్పథాలలో; శ్మశానాలలో, కొండలమీద, వృక్షాల మొదళ్ళలోను దీపాలు పెట్టాలి. దొన్నెలలో దీపాలు పెట్టి నదులలో వదలాలి. అర్ధరాత్రి వేళ స్త్రీలు చేటలు తప్పెటలూ వాయిస్తూ, అలక్ష్మిని (జ్యేష్ఠాదేవిని) తరిమి వేయాలి. బలి పాడ్యమినాడు జూదమాడాలి. ఆనాడు బలిచక్రవర్తిని పూజించాలి. తరువాత గోవర్ధనపూజ చేయాలి. ద్వితీయనాడు యముని, చిత్రగుప్తుని పూజించాలి. చెల్లెలియింట భోజనం చేయాలి. ఆమె గౌరవము పొందాలి. మనవ్రత గ్రంథాలలోను, పురాణలలోను ఈ పండుగ ఆచరణ విధానం ఇంత ఉన్నప్పటికి గాథలు మాత్రము వింతగా, విరుద్ధంగా ఉన్నాయి. వాటిలో ముఖ్యమైన గాథ లివి : 1. సత్యభామా ద్వితీయుడైన కృష్ణుడు నరకాసురుణ్ణి ఈనాడు సంహరించాడు గనుక నరకచతుర్దశి.పండుగ టపాకాయలు కాల్చడం ఆచరణలోకి వచ్చాయి ; 2. బలిచక్రవర్తి గర్వాంధుడై దేవతలను పీడించగా విష్ణువు వామనావతారమెత్తి అతని రాజ్యమంతా దానం పొందాడు - కనుక ఈ పండుగకు ప్రాముఖ్యం కలిగింది; 3. రామచంద్రుడు రావణవధానంతరము ఈ అమావాస్యనాడే అయోధ్యకు తిరిగివచ్చి భరతుని కలుసుకున్నాడు - కనుక గొప్ప పండుగ దినమయింది ; 4. విక్రమార్కుడు ఈ దినం పట్టాభిషేకం చేసుకున్నాడు. అప్పటినుండి ఇది పండుగ అయింది; 5. నరకబాధ తొలగడానికి యముణ్ణి ప్రార్థించే దినము గనుక నరక చతుర్దశి. ఈ కథలలో బలిచక్రవర్తి కథ, నరకబాధా నివృత్తికై యముని పూజించడం తప్ప మరేదీ వ్రతగ్రంథాలలో లేదు.

త్రయోదశి ప్రదోష సమయంలో యమదీపం పెట్టాలని, చతుర్దశినాడు యమతర్పణం, దీపోత్సవం చేయాలని, సూర్యుడు తులారాశికి రాగానే త్రయోదశి చతుర్దశ్యమావాస్యలలో ప్రదోష సమయాలలో ప్రజలు ఉల్కాహస్తులై (కొరువులు చేతులలో పట్టుకొని) పితృదేవతలకు దారి చూపాలని, త్రయోదశి చతుర్దశ్యమావాస్యలలో విష్ణువు మూడడుగులు దానమడిగి భూమిని ఆక్రమించి బలిని

పాతాళానికి పంపినా, తన స్మరణ జరగాలని బలి కోరాడు గనుక బలిపూజ చేయాలని వివిధ పురాణ ధర్మశాస్త్రాలలో స్పష్టంగా ఉండడంవల్ల ఈ నరకాసురుడు నరకమే కాని, పురాణాలలోని నరకాసురుడు గాదని స్పష్టం.

బలి పూజ యమ పూజ పాడ్యమి నాడు మార్గపాలీ బంధనం కూడా ఉండడం మొదలయినవి చూడగా ఇది పితరులను నరక విముక్తులను చేయడానికి జరిపే పండుగే నని స్పష్ట మవుతుంది. అమావాస్యనాడు రాముని అయోధ్యాగమనవార్త మొదలైనవి దీపావళి గాథలలో తర్వాత చేరి ఉంటాయి.

దేవతలకు తులా సంక్రమణం (తులావిషువత్తు) నుంచి రాత్రి (దేవమానం ప్రకారం) ప్రారంభ మవుతుంది. ఈ రాత్రిలో చీకటి, చలి ఉంటాయి. కనుక పితృదేవతలకు సద్గతికోసం (దారి చూపడంకోసం) కొరువులు తిప్పడం, దీపాలు పెట్టడం, మార్గపాలిని కట్టడం మొదలయిన ఆచారాలు. దీపాలు కార్తిక మాసమంతా, పెట్టే ఆచారమూ దాని అంగమే. కొరువులు తిప్పడానికి మారుగా వచ్చినవే ఉప్పు పొట్లాలు తిప్పడం, టపాకాయలు పేల్చడం మొదలయినవి.

అయితే నరకవధ గాథ ఇంత ప్రచురంగా ఉండడానికి జ్యోతిశ్శాస్త్ర రహస్యం దీనిలో ఇమిడి ఉండడం కారణమని తోస్తుంది. నరక చతుర్దశినాటి గ్రహరాశి స్థితికూడా కొంత ఈ కథకు కారణం. తులారాశి తూర్పుదిక్కున ఉదయిస్తుంటే మేషరాశి అస్తమిస్తూ ఉంటుంది. మేషరాశి అంటే భౌమరాశి. నరకాసురుడు భూమిపుత్రుడు సూర్యోదయ సమయంలో మేషరాశి అస్తమిస్తుంది. గనుక మేషరాశి అస్తమించేవరకు అంధకారమే. నరకుని పాలన కూడ అందరికీ కష్టాలు కలిగించే అంధకార సదృశం. అతడు పదహారువేల కన్యలను చెరపట్టినాడు. తులారాశి ఉదయంకాగానే స్వాతీ నక్షత్రంలో నరకుని మీదికి యుద్ధానికి బయలుదేరిన కృష్ణుడు (విష్ణువు) సూర్యుడు. సత్యభామ చంద్రుడు. మేషరాశి అస్తమించగా (నరకుడు పడిపోగా) ఆశ్చర్యంతో వెలవెలబోయె రాశి కన్యారాశి. అదే పదహారువేల కన్నెల గుంపు. ఇదే క్రమంగా పురాణాలలో నరకాసుర గాథగా ఎక్కింది.

దీపావళికి కౌముదీ మహోత్సవమనే పేరు ప్రాచీన కావ్య నాటకాలలోను, జైన, బౌద్ధ మత గ్రంథాలలోను ఉన్నది. కార్తిక శుద్ధ పాడ్యమినాడు దీప ప్రతిపదుత్సవమనే పండుగ చేసేవారని, ఈ నాడు పిల్లలను, అల్లుండ్రను పిలిపించి మర్యాద చేయడంకూడ ఆచార ముండేదని నాగానంద నాటకం తెలుపుతున్నది. జైనమత ప్రవర్తకు డైన మహావీరుడు దీపావళ్యమావాస్యనాడు నిర్యాణం చెందాడని, దేవతలు ఆయనను పూజించి దీపాలు వెలిగించారని, అప్పటినుంచి దీపావళి పండుగ ఆచారమాయెనని జైనులు అంటున్నారు.

తెలుగువారు నరక చతుర్దశినాడు గడ్డితో, కాగితాలతో నరకాసురుని స్వరూపంచేసి ఊరేగిస్తూ ఊరి బయటికి తీసుకొనివెళ్ళి, దానిని తగులబెట్టి తిరిగివచ్చి అభ్యంగ స్నానం చేస్తారు; తర్వాత మతాబాలు, టపాకాయలు కాలుస్తారు. మరుసటిరోజు అమావాస్యనాడు సాయంకాలం దీపాలు ప్రమిదెలలో వెలిగిస్తారు. చిన్న పిల్లలచేత దివిటీలు కొట్టిస్తారు, అప్పుడు—

"దిబ్బు దిబ్బు దీపావళి
మళ్ళీ వచ్చే నాగుల చవితి
పుట్టమీద పొట్టకర్ర
దిబ్బు దిబ్బు దీపావళి."
'బలుసు చెట్టు మీద పెద్దల్లారా దిగిరండి'

అని పాట పాడుతారు. తర్వాత తీపి పదార్థాలు తిని భోజనానంతరం టపాకాయలు మొదలయినవి కాలుస్తారు. పాడ్యమినాడు రైతులు కేదారగౌరీ వ్రతం, గౌరమ్మ పూజ, గో పూజలు చేస్తారు. కేదార గౌరీవ్రతం తమిళనాడులో చాల ప్రచురంగా ఉంది. వ్యవసాయదారులు, స్త్రీలు గౌరీపూజ చేస్తారు (కేదార గౌరీ అంటే సస్యలక్ష్మి). కార్తిక మాసానికి ఒక పంట పండుతుంది గనుక ఇదికూడ పంటల పండుగే; గనుకనే కృతజ్ఞతా సూచకంగా గో పూజాదులు కొన్ని ప్రాంతాలలో. ఇది(మార్వాడీలకు ముఖ్యంగా) ఆర్థిక సంవత్సరారంభం. ఈ నాటి నుంచే కొత్త ఖాతాపుస్తకాలు ప్రారంభిస్తారు. ఇలా దీపావళి పెక్కు సంప్రదాయాలు, ప్రకృత్యనుగ్రహాలు, గ్రహరాశి సన్నివేశాలు మొదలయిన వెన్నో కలిసి రూపొందింది.

సంక్రాంతి: సంక్రాంతిపండుగ మార్గశిర పుష్య మాసాలలో వచ్చేపండుగ. ఇది మనకు పెద్దపండుగ. శ్రీనాథుడు దీనిని (శివరాత్రి మహాత్మ్యంలో)—

'ఇండ్ల మొదలను నీరెండ నీడికలను
నను గు దమ్ముడు నన్నయు నాటలాడు
అత్తయును కోడలును గుమ్ములాడు కుమ్ము
గాచు చోటికి మకర సంక్రాంతి వేళ'

అని కడు చక్కగా వర్ణించాడు. ఇది పెద్ద పండుగ కావడానికి కారణం పంటలు పండి ప్రజలలో పెను ఉత్సాహం ఉండడమే.

సూర్యుడు ఒక రాశినుంచి మరొక రాశికి చేరడం సంక్రాంతి అనీ, సంక్రమణం అనీ అంటారు. ఇలాటి సంక్రాంతులు సూర్యుడు మరొకరాశికి వచ్చినప్పుడల్లా (సంవత్సరంలో పన్నెండుమార్లు) సంభవిస్తాయి. అయితే ఈ సంక్రాంతిపండుగ వచ్చే మకర సంక్రాంతికి ప్రాధాన్య మెందుకంటే, తొలకరిలో వేసిన పైర్లన్నీ పంటకువచ్చి ప్రకృతి రమణీయమై ఉండడంవల్లనే. ఈ మాస సమాప్తి నుంచి సూర్యునియాత్రలో రెండవ ఘట్టమయిన ఉత్తరాయణం ప్రారంభ మవుతుంది. కటక సంక్రమణంనుంచి మకరంవరకు దక్షిణాయణం. ఉత్తరాయణం (దేవతల పగలు) ముఖ్యకాలం గనుకనే ఈ కాలంలో మరణించడం ఉత్తమలోక ప్రాపకమని మన పూర్వుల నమ్మకం. భీష్ముడు దక్షిణాయనంలో యుద్ధరంగంలో పడిపోయినా ఉత్తరాయణం వరకు ప్రాణాలు బిగబట్టుకుని ఉత్తరాయణం వచ్చిన తర్వాతనే మరణించాడు. ఈ ఉత్తరాయణ పుణ్యకాలం గొప్పదనాన్ని గురించి ఇతిహాస పురాణ ధర్మశాస్త్ర గ్రంథాలలో పెక్కు వర్ణనలున్నాయి.

మకర సంక్రాంతినాడు తిలదానం, ఘృతదానం, వస్త్ర దానం మొదలయిన దానాలు, నూవులతో, ఆవు ఎడ్ల ఆకారంచేసి దానం చేయాలని, మీగడతో పాటు మజ్జిగ దానంచేయడం అసవరమని వ్రతగ్రంథాలు తెలుపుతున్నాయి. సంక్రాంతి పండుగ మంచి చలికాలంలో వచ్చే పండుగ. నేయి, నూనె, తిలలు మొదలయినవన్నీ శీతహర మయినవి. ఈ పండుగలో ఎడ్లను అలంకరించడం, పేడతో గొబ్బెమ్మలు పెట్టడం, గుమ్మడిపూలు అలంకరించడం మొదలయినవన్నీ ఈ కాలపు ఋతు లక్ష్మిని, పంట సిరిని ఆరాధించడమే.

సంక్రాంతిపండుగ మూడు దినాలు. మొదటిది భోగి పండుగ. మకర సంక్రమణానికి వెనుకటి ముప్పైరోజులూ ధనుర్మాసం. సూర్యుడు ధనూరాశిలో ఉంటాడు. ఈ ముప్పయి నాళ్ళూ పండుగనాళ్ళే. భక్తులు తెల్లవారజాముననే లేచి స్నానాదికాలు ముగించి భజనలు గ్రామ ప్రదక్షిణాలు చేస్తారు. ఈ రోజుల్లో గ్రామీణులు తమ ఇండ్ల గోడలు, గాదెలు బాగు చేసుకుంటారు. కణజాలు మొదలయిన వాటికి పూతలు పూసుకుని చక్కబరచుకుంటారు. ఇల్లాండ్రు, బాలికలు ఉదయాన్నే లేచి ఇండ్ల ముంగిళ్ళను పేడ కలయంపితో శుభ్రపరచి, వింతవింత రంగుముగ్గులు పెడతారు. ద్వారాలకు రెండువైపులా, ఎదుట పేడముద్దలు పెట్టి వాటికి పసుపు కుంకుమలుపెట్టి గుమ్మిడి, బంతి, చేమంతి మొదలైనపూలు గుచ్చుతారు. వీటిని 'గొబ్బెమ్మ' లంటారు. వీటి చుట్టూ తిరుగుతూ చేతులు తడుతూ పాటలు పాడుతారు. వీటిని గొబ్బిపాట లంటారు. ఇది 'గోపి' అనే సంస్కృత పదంనుంచి పుట్టింది. గోపికలు కృష్ణుని చుట్టుచేరి ఆనందం పట్టలేక పాడిన పాటలివి. గోపిక, గోపియ, గోబియ, గొబ్బియ, గొబ్బి అనే వికృతి చెందింది. ఈ నెలంతా దాసర్లు, జంగం దేవర్లు, గంగిరెడ్లవారు, అడవిచెంచులు, ఆబోతుల సంబరాలవారు, బుడబుడుక్కలవారు మొదలయిన యాచక జనం హడావిడి మరింత అందంగా ఉంటుంది. పంటనెల గనుక ఇదే వారికి అదనైనకాలం. ఈ నెలంతా దేవాలయాలలో తెల్లవారుజామున నే పూజలు, పొంగలి నైవేద్య వినియోగాలు జరుగుతాయి.

మొదటిరోజు భోగిపండుగనాడు తెల్లవారుజామున స్నానానంతరం ప్రతి యింటిముందు మంటలు వేస్తారు. ఈ మంటలో అదివరకు తయారుచేసిన భోగి పిడకలు, నిరుపయోగమయిన వస్తువులువేసి భోగిపీడ విరుగడయినదని సంతోషిస్తారు. ఊరికంతా ఒకేచోటకూడా ఈ భోగిమంట వేసే ఆచారమూ ఉంది. ఈ నాటి ముఖ్యమైన పిండివంట పొంగలి (పులగము) పాలుపోసి వండుతారు. దీనిని ఇంద్రుని పొంగలి అనడమూకద్దు. ఈ నాటి సాయంకాలం పిల్లలకు పేరంటంచేసి పండ్లు, చెరకు ముక్కలు తలపై పోస్తారు, దీనిని పండ్లు పోయడమని, పోణిగలు పోయడమని వ్యవహరిస్తారు. భోగిఅంటే పోగు, పొంగుఅనే మాటల నుంచి వచ్చి సంస్కృతీకరించబడిన తెలుగుమాట అయి ఉండవచ్చును.

రెండవ నాడు మకర సంక్రాంతి పండుగ. ఈ నాడు నూనె మొదలయినవి వాతహరమైన గుమ్మడి మొదలయిన కూరగాయలూ భుజించాలి, దానం చేయాలి. తెలక పిండితో ఒళ్ళు రుద్దుకొని స్నానం చేయాలి. పితృ పుణ్యలోక ప్రాప్తికోసం తర్పణం చేయాలి. ఈ నాడు నాస్తి అనే మాట లేకుండ దానం చేయాలి. స్త్రీలు తమ ముత్తైదువ తనం కోసం సుగంధ ద్రవ్యాలు దానంచేస్తారు. సజ్జలు పండే ప్రాంతమయితే నూవులు అద్దిన సజ్జ రొట్టెలు చేసి ఆరగిస్తారు. శని మకర రాశ్యధిపతి; వాతప్రధాన గ్రహం. వాత నివారణార్థమై ఇవన్నీను. ఈ నాటి సాయంకాలం చిన్నవారు పెద్దవారికి నమస్కారాలు చేసి ఆశీర్వాదాలు పొందుతారు. అందువల్ల దీనిని మొక్కుళ్ళ పండుగ అనడం కూడా కద్దు. కొన్ని ప్రాంతాలలో నూవులను చక్కెర పాకంలో కలిపి పూవులవలె తీర్చి స్త్రీలు పంచి పెట్టడం కూడ కద్దు.

మూడవ నాటి పండుగ కనుము. ఇది పూర్తిగా కర్షకుల పండుగ. ఈ రోజు రైతులు ఉదయమే లేచి, పశువుల

కొట్టాలు అలికి ముగ్గులు పెట్టి వాటి ముందు పాలతో పొంగలి వండుతారు. దీనిని పాన పొంగలి, పసుల పొంగలి, అంటారు. పని ముట్లనూ పూజిస్తారు. పశువులను కడిగి కుంకుమాదులతో అలంకరిస్తారు. పొంగలిని నైవేద్యం పెట్టిన మీదట ఆ మెతుకులను పసుపు కుంకుమలతో పొలాలలో చల్లుతారు. దీనిని 'పొలిచల్లడం' అంటారు. ఇది పూర్వపు రక్తసిక్తాన్న బలిహారణానికి సంకేతం. ఈ పొలి చల్లడమే మొసర్లు (మొసర్లంటే మెతుకులు) పండుగ. ఇదే మొసళ్ళ పండుగ, ముసళ్ళ పండుగ అయింది. పొలి చల్లడం తర్వాత దిష్టి తీసి గుమ్మడికాయ పగులగొడుతారు. ఇది కూడా బలికి ప్రత్యామ్నాయమే. తర్వాత పశువులకు పొంగలి పెడతారు. సాయంకాలం పశువులను మేళతాళాలతో ఊరేగిస్తారు. ఊరి బయట ఎడ్ల పోటీలు, కోడి పందేలు, గొర్రె పొట్టేళ్ళ పందేలు మొదలయిన ఎన్నో వినోదాలు జరుగుతాయి. ఈ కనుమ తర్వాతి రోజును ముక్కనుమ అంటారు. ఈనాడు కూడా పశువుల సంబరం చేయడం ఉంది. కనుమ నాడు కొన్ని ప్రాంతాలలో స్త్రీలు పుట్టింటి క్షేమంకోసం 'కాకి పిడచలు' అనే వ్రతం చేస్తారు. అంటే స్త్రీలు మంత్రరహితంగా తమ పితృదేవతల సంతృప్తికి చేసే శ్రాద్ధం వంటిదే యిది.

ఈ పండుగ రోజుల్లో స్త్రీలు చేసే వ్రతాలలో 'గొబ్బి గౌరీవ్రతం' ముఖ్యమైంది. ఈ వ్రతం భోగి పండుగనాడు ప్రారంభ మవుతుంది. భోగినాటి సాయంకాలం ఇంటి భవంతిలో మంటపం కట్టి, దానిని ఆ ఋతువులో దొరికే ఫల పుష్పాలతో అలంకరిస్తారు. మంటపం మధ్య బియ్యం పోసి బంకమట్టితో చేసిన గౌరీ విగ్రహం స్థాపించి పూజలు చేసి, పాటలుపాడి, రాత్రినిద్ర పుచ్చుతారు. మూడు సాయంకాలాలు పేరంటం చేస్తారు. గొబ్బిళ్ళు తటతారు. నాల్గవ నాడు ఉద్వాసన చేస్తారు. ఆ నాడు మంటపాన్ని అలంకరించిన కూరగాయలే వేసి, కూర వండుతారు. దీనిని గొబ్బికూర అంటారు. దానిని, పొంగలిని ఆరగింపు పెడుతారు. సాయంకాలం ముత్తైదువులు, బాలికలు గౌరిని గొబ్బిదేవిని ఊరేగింపుగా తీసుకొని వెళ్ళి చెరువులోనో, నదిలోనో కలుపుతారు. దీనిని ఓలాడింపు, వాలాడింపు అంటారు. కొన్నిచోట్ల దీనిని ఆరు దినాలు, మరి కొన్నిచోట్ల కనుమనుండి తొమ్మిది దినాలు చేస్తారు. కొన్ని ప్రాంతాలలో భోగి మొదలు పది దినాలు బొమ్మల కొలువు పెడుతారు. దీనిని సంక్రాంతి కొలువు అంటారు.

సంక్రాంతి పండుగలోను, దానికి ముందు ధనుర్మాసమంతా పొంగలి వండుకొనడానికి కారణం ఉంది. చలికాలంలో రాత్రులు పెద్దవి,పగళ్ళు చిన్నవి గనుక తెల్లవారుజామునే ముద్గాన్నం (పులగం) తినాలని ఆయుర్వేదం ఆదేశించింది. ముద్గాన్నం నేయి ఒడుస్తూ ఉండగా తినగలగడం సామాన్యులకు సాధ్యం కాదు. ఊరికంతా సమష్టి కేంద్రమైన దేవాలయంలో ఈ ఏర్పాటు చేస్తే ఊరందరికీ ఫలితం దక్కుతుందనే దృష్టితో గుడులలో పొంగలి ప్రసాద విని యోగం ఏర్పాటయింది.

నిజానికి సంక్రాంతే సంవత్సరాది పండుగ. ఎందుకంటే పంటలు పండి జీవితంలోనే కొత్త మార్పు ఏర్పడుతుంది. అప్పటినుంచి చలి తొలగడం ప్రారంభ మవుతుంది. ఆకులు రాలి నూతన సృష్టి మొదలవుతుంది. సృష్టికే విమోచన దినమది. కనుకనే 'సంక్రాంతికి సంకెళ్ళలో ఉన్న వారికి కూడా విముక్తి' అనే సామెత ఏర్పడింది.

ఏకాదశి - ముక్కోటి ఏకాదశి: ఏకాదశికి మన పండుగలలో చాల ప్రాధాన్యముంది. ఏకాదశి అంటే పక్షంలోని పదకొండవ దినం. మనకు నెలకు రెండు చొప్పున ఇరవై నాలుగు ఏకాదశులున్నాయి. ఇవన్నీ సంప్రదాయంపై నమ్మకం గల వారంతా పాటిస్తారు. దశమినాటి రాత్రి భోజనం చేయక, అంటే నిరాహారంతో ఉండి ఏకాదశి పూర్తిగా ఉపవసించి, ద్వాదశినాడు ఉదయం పారణ చేసి, ద్వాదశినాటి రాత్రి కూడా భుజించక ఉండడం ఏకాదశీ వ్రతం పూర్తిగా పాటించడం.

ఏకాదశిని గురించి 'రుక్మాంగద చరిత్ర' మొదలైన ఇతిహాస పురాణాల గాథలు అసంఖ్యాకంగా ఉన్నాయి. దీనికి హరివాసరమని కూడా పేరుంది. హరివాసర మంటే, విష్ణువాసరం. ఏకాదశి పుట్టుకను గురించిన గాథ భవిష్యోత్తర పురాణంలో ఉంది.

కృతయుగంలో మురుడనే దానవునిచే బాధితులైన దేవాదులు విష్ణువును శరణు పొందారు. విష్ణువు వారికి అభయమిచ్చి, మురాసురునితో వెయ్యేండ్లు యుద్ధం చేశాడట. అయినా వాడు లొంగలేదు. విష్ణువు అలిసి పోయి, సింహవతి అనే గుహలో దాగుకున్నాడట. మురుడు వెదుక్కుంటూ వచ్చి, ఆ గుహను సమీపించాడట. విష్ణువు సంకల్ప మాత్రంతోనే ఆయన శరీరంనుంచి ఒక కన్యక ఉద్భవించి, ఆ రాక్షసునితో యుద్ధం చేసి వానిని సంహరించింది. విష్ణువు సంతోషించి వర మడుగ మనగా సర్వకాలం హరికి ప్రియంగా వుండాలని, సర్వతిథులలోను తనకు ప్రాధాన్యం ఉండాలని, ఆ తిథిలో భక్తితో ఉపవాసం చేసే వారికి మోక్షం లభించాలని ఆ కన్య వరం కోరిందట. అప్పటి నుంచి ఈ వ్రతం ఆచరణలో ఉందట. ఈ గాథలోని విష్ణువు సూర్యుడేనని, సింహవతి అనే గుహ సింహరాసి అని కొంత పరిశీలిస్తే తెలుస్తుంది. కన్యక పుట్టడం అంటే కన్యా

రాశి ఉదయంతో మురాసుర వధ, ఏకాదశి సూర్యుని చారానికి సంబంధించిన లెక్కలాగ కనిపిస్తుంది. సూర్యుడు మురుడనే (మేఘ) అసురునికి లొంగి పోయి వర్షర్తువులో సింహ రాశికి వస్తాడు. అప్పుడు పదకొండోనాడు కొంత మార్పు కలిగి ఉంటుంది. ఆలాటి పదకొండవనాళ్ళు సూర్యుని గతిలో మార్పు తెలుసుకొనడానికి కారణమై తర్వాత సూర్యుడు విష్ణువుగా వ్యవహారానికి వచ్చిన తర్వాత కేవలం లాంఛనమైన వాసరంగా మారి ఉంటుంది. ఈ మార్పును కొన్ని ఏకాదశులు మనకు స్పష్టంగా తెలుపుతున్నాయి. శయనైకాదశి, పరివర్తనైకాదశి, ఉత్థానైకాదశి, వైకుంఠైకాదశి వంటివి స్పష్టంగా సూర్యగతిని తెలిపేవి. వీటి ప్రాధాన్యాన్నిబట్టి తక్కిన పక్షాలలోని పదకొండవ నాళ్ళు (ఏకాదశులు)కూడ ప్రాముఖ్యం పొంది ఉంటాయి, గతానుగతికంగా, అనుకుంటాను. అందుకే ఏకాదశి హరివాసరం ముఖ్యం. ప్రతి ఏకాదశికి వేరువేరు పేర్లున్నాయి.

రథసప్తమి: మాఘశుద్ధ సప్తమి రథ సప్తమి. దీనిని గురించి భవిష్యాది పురాణాలలో పెక్కువర్ణనలున్నాయి. ఇది సూర్యగ్రహణ తుల్యమని, ఈనాడు అరుణోదయ వేళలలో స్నానం చేయడం మహాపుణ్యప్రదమని పురాణాదులు తెలుపుతున్నాయి. స్నానం చేసేటప్పుడు చదివే మంత్రమును బట్టి ఇది సూర్యారాధన అని తెలుస్తున్నది. వ్రతగ్రంథాలలో పెక్కుసప్తమీవ్రతా లున్నాయి. అవన్నీ సూర్యారాధనకు సంబంధించినవే. సూర్యారాధన మనకు వేదకాలంనుంచి ఉన్నదే. సూర్యుని పేరు సప్తి మి-ఏడు గుర్రాలు కలవాడు; అతని రథానికి ఏడు గుర్రాలున్నాయట. అతడు సప్తలోక ప్రదీపనుడు. ఈ మాటలలోని సప్తసంఖ్య, సూర్య కిరణాలలోని ఏడు రంగులకు తార్కాణమని, రథసప్తమినాడు ఉదయం ఆకాశంలో గ్రహనక్షత్ర సన్నివేశం రథాకారంగా ఉండడాన్ని బట్టి ఈ సప్తమికి రథసప్తమి అని పేరు వచ్చిందని పరిశోధకులు అంటున్నారు. ఇది ప్రధానంగా సూర్యగతిని, సూర్యారాధన ప్రాబల్యాన్ని తెలిపే పండుగ.

ఈనాడు అరుణోదయంతోనే లేచి ఏటికో చెరువుకో వెళ్ళి, చెరుకు గడతో నీటిని కదిపి, ఏడు జిల్లేడాకులో ఏడు రేగాకులో తలమీద పెట్టుకుని తెలకపిండి రుద్దుకొని స్నానం చేస్తారు. తరువాత సూర్యునికి అర్ఘ్యమిచ్చి చిక్కుడుకాయతో రథం తయారుచేసి, పిడకల నిప్పుమీద పాలతో పొంగలి వండి సూర్యునికి నైవేద్యం పెడతారు. ఇది సూర్యసావర్ణి అనే మనువు పరిపాలనకు ఆది దినం. ఇతడు ఎనిమిదవ మనువు.

ఈ ఆచారం కొంత పరిశీలిస్తే ఈ పండుగ రహస్యము తేటతెల్లమవుతుంది. జిల్లేడాకులు తలపై పెట్టుకొనడం నూవుల పిండితో రుద్దుకోవడం ఇదంతా వాతశీతహర క్రియలు. సూర్య జనని అని రథ సప్తమిని స్తోత్రం చేయడము కూడ దక్షిణాయనం నుంచి విముక్తుడైన సూర్యుని తెలుపుతుంది. రథ సప్తమినాటికి పూర్తిగా చలి తొలగుతుంది. ఒకప్పుడు ఉత్తరాయణ పుణ్యకాలం ఈ నాటి నుంచే ఆరంభమయి ఉంటుంది. పొంగలి నివేదన కూడా ఇది సంక్రాంతి పండుగ వంటిదని తెలుపుతున్నది.

చలి తొలగించి వెలుగు ప్రసాదించిన సూర్యదేవుని యెడ కృతజ్ఞతా సూచకంగా చేసే పండుగ ఇది. తర్వాత జ్యోతిశ్శాస్త్ర విషయాలు ఏడు రంగులు మొదలైనవి చేరి ఉంటాయి.

మహాశివరాత్రి: శివరాత్రి మాఘ బహుళ చతుర్దశి నాడు జరిపే పండుగ. శివభక్తులే దీన్ని ప్రధానంగా చేస్తారు. ఈనాడు శివభక్తులు తెల్లవారుజామున నే లేచి, స్నానాద్యనుష్ఠానాలు జరిపిన తరువాత, పూజలుచేసి ఉపవసించి రాత్రంతా జాగరణం చేస్తారు. శివపూజలు, అభిషేకాలు, అర్చనలు, శివలీలా కథలు జరుపుతారు. రాత్రి నాలుగు జాములలోను జరిపే పూజా విధులు శైవగ్రంథాలలో విపులంగా వర్ణించారు. శివక్షేత్రాలలో ఈ ఉత్సవం గొప్పగా జరుగుతుంది.

రాక్షస బాధతో హడలిపోతున్న దేవతల ప్రార్థనల మన్నించి ఈ చతుర్దశినాటి అర్ధరాత్రి శివుడు లింగం నుండి వెలుపలికి వచ్చి, రాక్షసులను సంహరించాడని, కనుక ఈ నాటి అర్ధరాత్రి లింగోద్భవకాలమని శైవసంప్రదాయజ్ఞులు అంటారు. శివరాత్ర్యుపవాస జాగరణాదులు జరిపే వారు సర్వపాప విముక్తులై అంతంలో శివసాయుజ్యం పొందుతారని చెప్పే కథలు స్కాంద, లింగ, భవిష్యత్పురాణాలలో చాల ఉన్నాయి. లింగపూజ చాల ప్రాచీనమైనది. శివ, స్కంద, వాసుదేవ విగ్రహాలు అమ్ముతుండేవని క్రీస్తుకు ఎనిమిదివందలఏండ్లకు ముందున్న పాణిని అష్టాధ్యాయిలోని 'జీవికార్థేచాపణ్యే' (-3-99) అనే సూత్రంవల్ల తెలుస్తున్నది.

శివరాత్రి వసంతఋతు ప్రారంభమున వచ్చును. మాఘ శుద్ధ పంచమి వసంత పంచమి; మాఘ పూర్ణిమ ద్వాపర యుగాది: మాఘామావాస్య ఒక యుగాది; ఫాల్గుణ పూర్ణిమ వసంతోత్సవం - ఈ కారణాలవల్ల వీటి మధ్యన ఉన్న శివరాత్రికూడ వసంతకాల సూచకంగా, కొంత ఆనందంతో విచ్చలవిడిగా నడిపే పండుగ అయి, తర్వాత దీనిలో లుబ్ధక, లింగోద్భవాది కథలు (మృగశిరాది కథలు

అరుంధతీ నక్షత్రాదులకు చేరినట్లే) చేరి ఉండి యుండ వచ్చును.

ఇది ఉగాది వంటిదనే అనడానికి ప్రబలమయిన కారణం మరొకటి ఉంది. తైత్తిరీయ సంహితా కాలంలో కృత్తిక, ఐతరేయ బ్రాహ్మణాలకాలంలో కృత్తికా రోహిణులు, వేదాంగ జ్యోతిషకాలంలో ధనిష్ఠ, భారత కాలంలో శ్రవణం మొదటి నక్షత్రాలుగా పరిగణించబడేవి. ఐతరేయ బ్రాహ్మణంలో ఒక కథ ఉంది. ప్రజాపతికి తన కూతురు మీద వలపు కలిగిందట. అతడు లేడి అయాడు. ఆమె లేడి అయింది. అతడు పాడుపనిచేస్తున్నాడని దేవతలు కోపించి ఒక భూతాన్ని కల్పించి, అతనిని శిక్షించ మన్నారు. అతడు ప్రజాపతిపై బాణం విసిరాడు. ఆ బాణంతోపాటు జింక రూపంలో ఉన్న ప్రజాపతి పైకి ఎగిరాడు. దానినే మృగవ్యాధ మంటారు. కూతురు రోహిణి (ఐతరేయ 2, పంచిక 3, మంత్రం 33). ప్రజాపతి అంటే యజ్ఞము, సంవత్సరం. రోహిణి నక్షత్రంలో వత్సరారంభం; అంటే వసంత విషువత్తు రోహిణిలో కలిగేది. వేదకాలంలో మరొక నక్షత్రంలో వసంత విషువత్తు రావడం తెలుసును. బ్రాహ్మణముల కాలంలో ఋషులకు రోహిణిలో విష్ణువన్నిర్ణయం వ్యభిచారంగా, అకృత్యంగా కనిపించింది. కనుక మృగశిరంలో వసంత విషువత్తు నిర్ణయించారు. ఈ కథనుబట్టి విషువత్తు మారడం (వెనకకు వెళ్ళడం) నిశ్చితమయింది గనుక శివరాత్రి ఒకానొక నాటి వసంత విషువత్సూచకమేనని, ఉగాది పండుగ వంటిదేనని భావిస్తున్నాను.

హోలీ (ఫాల్గునోత్సవం): ఈ హోలీ పండుగ ఆంధ్ర దేశంలో తెలంగాణాలోను, రాయలసీమలోను విశేషంగా జరుపుతారు. ఫాల్గున పూర్ణిమనాడు ఈ పండుగ చేసికొంటారు. కనుక ఇది ప్రాచీన సాహిత్యంలో ఫాల్గునోత్సవమనే వ్యవహృతమైంది. వైదికకాలంలో వసంత విషువత్కాలం ఈనాడే సంభవించడంచేత క్రొత్త సంవత్సరం ఈనాటినుంచే ఆరంభ మయేది. కనుక దీనికి వసంతోత్సవమని, మదనోత్సవమని కూడ సాహిత్యంలో వ్యవహారం ఉంది. ఋతు పరివర్తనంవల్ల కలిగింది. ఈ కాలానికి గోధుమ మొదలైన పంటలు కోతకు వస్తాయి. ఆ కోతల కోలాహలంలోని "హోహో కారాలే" హోలీ అయిందని కొందరు పరిశోధకులు అంటున్నారు. హోలిక అనే పుత్రఘాతిని అయిన రాక్షసిని (రఘుమహారాజు) చంపిన దినం గనుక 'హోలి' అయిందని కొందరంటారు. ఈ హోలికను చంపిన కథకూడా పలు విధాలుగా ఉంది. ఈ హోలిక శిశుఘాతిని. రోజుకొకరి యింటి శిశువు చొప్పున తినేదట. ఒకనాడు ఒక వృద్ధురాలి వంతు వచ్చింది. ఆమె తన ఏకైక పౌత్రుని రాక్షసివద్దకు పంపలేక ఒక యోగిని సలహా అడిగిందట. ఆ రాక్షసి అసభ్య వాక్కులను, తిట్లను వింటే వెంటనే చస్తుందని అన్నాడట. ఆ ముసలిది అతడు చెప్పిన ప్రకారం ఊరిలోని చిన్న పిల్లలందరినీ గుమికూర్చి, రాక్షసి రాగానే అసభ్యమయిన మాటలతో, కేకలతో తరుమసాగిందట. ఆ మాటలు విని భరించలేక రాక్షసి అక్కడే పడి చచ్చిందట. పిల్లలందరూ దానికి నిప్పు పెట్టి కాల్చివేశారట. కొన్ని ప్రాంతాలలో దీనిని 'కాముని పున్నమ' అంటారు. కామ దహనమో, కామోజ్జీవనమో జరిగిననాడిది అని కొంద రంటారు.

ఈ పూర్ణిమనాడు ప్రతి ఇంటి ముందూ గుంట తవ్వి, దానిలో ఆముదపు కొమ్మ నాటి, గడ్డి, గాదం, పిడకలు పోగుచేసి, హోలి అనే దేవతను పూజించి, అరచేతి వెనుక భాగంతో నోరు కొట్టుకొని, గడ్డి గాదముకు నిప్పంటించి ఉదయమూ, వెన్నెలలో రాత్రంతాను వసంతాలు ఆడుతారు. బుక్కాపిండి చల్లుకుంటారు. మర్నా డుదయం కాలిపోయిన గుంటలోని బూడిదను, దుమ్మును, బురదను ఒకరిపై ఒకరు చల్లుకొని అసభ్యవాక్కులతో తిట్టుకుంటూ వినోదిస్తారు. దీనిని ఉత్తరాన 'ధూల్‌వాడ్', 'ధులండీ' అంటారు. అంటే ధూళిలో ఆడుట అన్నమాట. పూర్ణిమ నాటి ప్రధానమైన పిండివంట బొబ్బట్లు. మహారాష్ట్రులు హోలీ మంటల చుట్టూ నాట్యం చేస్తారు. ఆ మంటలో కాగిన నీటితో స్నానంచేసి, బొబ్బట్లను హోలికాగ్నిలో హోమంచేస్తారు. వంగ ప్రాంతంలో కృష్ణునికి డోలోత్సవం చేసి బొబ్బట్లు నైవేద్యం పెడుతారు. కొన్ని ప్రాంతాలలో ఈ పండుగ పూర్ణిమకు నాలుగైదునాళ్ళు ముందుగనే, ఊరిలోని కొన్ని చోట్ల జండాలు నాటుతారు. వీనిని కామధ్వజా లంటారు. ఒక కాగితంమీద గాని, గుడ్డమీద గాని, శివునిపై మన్మథుడు విల్లు ఎక్కుపెట్టినట్లు బొమ్మగీసి ఊరేగించి, వాటిని ఆ కామధ్వజాలతోపాటు రాత్రి కాల్చివేస్తారు. మర్నాటి ఉదయం వసంత పూజ చేసి, మామిడి పూతను నివేదన మిచ్చి చందనంతోపాటు తినవలెనని ధర్మశాస్త్రాలు చెబుతున్నాయి.

ఈ హోలీ కథవంటి బూతు కథలు రెండు భూత మహోత్సవ, భూతమాతృ ఉత్సవాలనేవి భవిష్యోత్తర పురాణంలో ఉన్నవి. ఒకప్పుడు పార్వతీదేవికి పిల్లలు లేరనే చింత ప్రబలమయిందట. ఆ చింతాగ్నిలో పంకలిప్త శరీర అయిన ఒక నల్లటి కన్య పుట్టిందట. ఇంతలో శంకరునికి పార్వతిపై ఘోరమైన కామవాంఛ కలిగి ఆ వేడికి భైరవుడనేవాడు పుట్టాడట. వాడు ఆ కన్యను పెండ్లాడా

డట. వారు ప్రవేశించిన ప్రాంతంలోని జనమంతా వావి వరసలు పాటించక వెర్రివాళ్ళవలె ప్రవర్తించి బండ బూతులు మాట్లాడుతారని శివుడు శాసించాడు. జనమంత అలా కేకలు వేస్తూ, 'భైరవుడు మమ్మల్ని వదలిపెడుతున్నాడు' అని నదిలోనో చెరువులోనో పడి, స్నానంచేసి, ఇండ్లకు పోతారట. దీనిని భూతమహోత్సవ మంటారు. భూతమహోత్సవం వైశాఖశుద్ధంలో చేయాలని స్కాంధ పురాణం చెబుతున్నది.

భూతమాతృ ఉత్సవం జ్యేష్ఠ శుద్ధ పాడ్యమినాడు చేయాలి. వింత వింత చేష్టలు, వికార దృశ్యాలు చూపాలి. నవమినాడుగాని, ఏకాదశినాడుగాని కుండలో దీపం వెలిగించి, దేవీమందిరానికి తీసుకొని వెళ్ళి పూర్ణిమ వరకు ఇలా చేసి పూర్ణిమనాడు భూతమాతృ మహోత్సవం చేయాలి. ఈ భూతమాతృమహోత్సవాన్ని కాకతీయుల కాలంలో కల్యాణ కటకంలో చేసేవారట.

కామోత్సవాలు పెక్కు ఇంకా వ్రత గ్రంథాలలో ఉన్నాయి. మార్గశిర శుద్ధ త్రయోదశి నుంచి అనంగవ్రతం చేయాలని, చైత్రశుక్ల త్రయోదశినాడు అనంగవ్రతం జరపాలని, చైత్ర శుక్ల త్రయోదశి మొదలు వైశాఖం వరకు అనంగవ్రతం చేయాలని భవిష్యోత్తర, విష్ణు, ధర్మ పురాణాదులు చెబుతున్నాయి. మార్గశిర శుద్ధ త్రయోదశి మొదలు జ్యేష్ఠ పూర్ణిమ వరకు ఈలాటి మహోత్సవాలు జరుపాలని పురాణాలు అనడం బట్టి హోలీ కూడా వసంత ఋతువు సూచకంగా స్వేచ్ఛగా మైమరచి చేసుకుంటున్న పండుగే అనడంలో సందేహం లేదు. గోధుమ పిండి వంట చేయడం అప్పటి పంటకు చిహ్నమే.

హోలీ పద నిర్వచనం పురాణాలలో స్పష్టంగా లేక పోయినా నిఘంటువులలోను, వైద్య గ్రంథాలలోను గడ్డి మంటలో సగం కాలిన ధాన్యం హోలికమని నిర్వచించబడింది. హోలిక మంటే పిసికిళ్ళు అన్నమాట. దీనినిబట్టి ఇప్పుడు వేరుసెనగలు, జొన్నలు, సెనగలు మొదలయిన వాటిని నిప్పుపై మాడ్చి కాల్చుకుని తింటున్నట్టే పూర్వులు రాత్రి నెగళ్ళు వేసుకుని తమ పంటలను కాచుకుంటూ, పంటలు పండినందుకు సంతోషం ప్రకటనగా కేకలు వేస్తూ, వినోదంతో ఆ మంటల ఎదుటే ఎగురుతూ గడిపేవారని, అప్పటి ధ్వన్యనుకరణంగానే ఈ హోలీ, హోలాకాది పదాలు పుట్టి తర్వాత అవి పండుగకు పర్యాయమై, వసంత ఋతువు అందచందాలనూ సంతరించుకున్నవని, అనంతరం పురాణ కథలు పుట్టి ఉంటాయి.

ఈ ఉత్సవం అతి ప్రాచీనంగా ఆచరణలో ఉంది. ఉత్తర భారతంలో సర్గూజా జిల్లా రామగఢ్ కొండలలోని సీతా వేంగా గుహలోని శాసనంలో దీనిని 'ధులే వసంతియా' అని పేర్కొన్నారు. ఈ శాసనం 2300 ఏళ్ళ నాటిది. ఈ పండుగలో మొల్ల దండలధరించి వీథులలో గీత నృత్యాలతో ఆనందించేవారని ఈ శాసనంలో ఉంది. రెండువేల ఏండ్లనాటి 'గాథాసప్తశతి'లో ఈ ఫాల్గునోత్సవం వర్ణనలు కొల్లలు. వాత్స్యాయనుని కామసూత్రాలలో "హోలాకా" అని ఈ పండుగ ఉంది. అల్ బెరూనీ అనే ఆరబ్ యాత్రికుడు (11వ శతాబ్ది) ఈ పండుగ చేసే పద్ధతిని తెలిపాడు. విజయనగర చక్రవర్తుల కాలంలో మహా కోలాహలంగా ఈ పండుగ జరిగేదని, నికలో కాంటీ అనే పాశ్చాత్యుడు కడురమ్యంగా వర్ణించాడు. మొగల్ రాజుల కాలంలో దర్బారులలో ఇది జరిపేవారు. ఋతు పరివర్తన సూచకమైన కోలాహలానికి ప్రతి రూపమైన ఈ బూతు పండుగ దాదాపు ఈ ఋతువులోనే ప్రపంచమంతా కనిపిస్తుంది. ఇంత ముఖ్యంగా జరిగే ఆదిమానవుని ఆనంద వసంతోత్సవాన్ని తర్వాత తర్వాత మన పెద్దలు శాస్త్రీయం చేశారు. కర్మప్రధానులయిన పూర్వమీమాంసకులు దీని పరిపాటినే మరికొన్ని ఉత్సవాలను కూడా "హోలాకాధికరణన్యాయ మూలసిద్ధ" మని గ్రహించి వైదికముద్ర వేశారు. తి. రా.



# ఆర్థిక వ్యవస్థ

## జనసాంద్రత - జనాభా వ్యాప్తి

భారతదేశములోని ఇతర రాష్ట్రములతో పోల్చిచూచిన, ఆంధ్రప్రదేశ్ వైశాల్యమునుబట్టి ఐదవ స్థానమును, జనసంఖ్యనుబట్టి నాల్గవ స్థానమును ఆక్రమించుచున్నది. దీని †జనసంఖ్య 3,12,60,133. ఇందు పురుషులు 1,54.22,329, స్త్రీలు 1,51,93,245. అనగా ప్రతి వేయిమంది పురుషులకు 987 మంది స్త్రీల చొప్పున ఉన్నారు (1951). ఆంధ్రప్రదేశ్ మొత్తముమీద చదరపు మైలునకు సగటు జనసంఖ్య 295. పరిశిష్ట మద్రాసు రాష్ట్రమందు జనసాంద్రత ఇంతకంటె రెండింతలును, పశ్చిమ బెంగాలున ఇంచుమించు మూడింతలును అధికము. ఒరిస్సాలో ఇంతకంటె కొంచెము తక్కువ.

ఈ క్రింది పట్టికవల్ల ఇండియన్ యూనియన్‌లోని కొన్ని రాష్ట్రముల జనసాంద్రతను, ఆంధ్రప్రదేశ్ జనసాంద్రతతో పోల్చి చూడవచ్చును (1961) :

| రాష్ట్రము | వైశాల్యము (చదరపు మైళ్ళు) | జనభా (1961 సెన్ససు) | చదరపు మైలుకు జనసాంద్రత |
|---|---|---|---|
| 1. ఆంధ్రప్రదేశ్ | 1,06,052 | 3,59,77,999 | 339 |
| 2. మద్రాసు | 50,132 | 33,650,917 | 671 |
| 3. మధ్యప్రదేశ్ | 1,71,210 | 3,23,94,375 | 189 |
| 4. మహారాష్ట్రము | 1,18,883 | 3,95,04,294 | 332 |
| 5. ఉత్తరప్రదేశ్ | 1,13,454 | 7,37,52,914 | 650 |
| 6. పశ్చిమ బెంగాలు | 33,928 | 3,49,67,634 | 1,031 |
| 7. ఒరిస్సా | 60,162 | 1,75,65,645 | 292 |
| 8. ఇండియన్ యూనియన్ | 11,27,345 | 43,64,24,429 | 384 |

ఆంధ్రప్రదేశ్‌లో జనసాంద్రత ఎక్కువ అని చెప్పుటకు వీలు లేదు. కాని, సాగగుచున్న భూమిలోని జనసంఖ్య మాత్రము లెక్కలోనికి తీసికొని చూచినట్లయినజనసాంద్రత ఎక్కువ అనియే చెప్పవలెను : ఎందువల్ల ననగా సాగులో నున్న ప్రదేశమును అంతటిని లెక్కలోనికి తీసికొని చూచి నట్లయిన సగటున చదరపు మైలుకు 730 మంది చొప్పున కలరు. భారతదేశము మొత్తము జనాభాను తీసికొని లెక్కకట్టినచో ఒక్కొక్క మనుష్యునివంతుకు వచ్చు సాగు భూమి 50 సెంట్లు మాత్రమే. డెల్టా ప్రదేశములలో ఇంతకంటెను తక్కువ. గ్రామములలోని జనసంఖ్యను మాత్రమే లెక్కలోనికి తీసికొన్నచో తల యొకటికి ఎకరము చొప్పున ఉన్నది. కాని, సగటున ఒక్కొక్కనికి కనీసము అవసరమైన భూమి పరిమితి 2.5 ఎకరము లుండవలెనందురు. దీనినిబట్టి చూచినచో ఆంధ్రప్రదేశ్‌లో భూమి అవసరమైన దానికంటె చాల కొరవడియున్నట్లు తెలుచున్నది.

పై పట్టికను బట్టి చూడ భారత దేశము యొక్క మొత్తము వైశాల్యములో ఆంధ్రప్రదేశ్ వైశాల్యము 8.5% వంతు లై యున్నదనియు, మొత్తము జనాభాలో 8.4% అనియు స్పష్టమగుచున్నది.

కృష్ణా, గోదావరీ డెల్టాలవంటి ఏకజాతి నైసర్గిక పరిస్థితులు గల మండలములలో కొన్ని చోట్ల జనసాంద్రత అధికముగ గల ప్రదేశములున్నవి. ఎట్లన ఒక్కొక చదరపు మైలుకు వేయింటి కెక్కువ జనసంఖ్య గలిగిన గోదావరి డెల్టాలోనే కొన్ని చోట్ల చ. మైలుకు 2,000 లకు మించిన జనసంఖ్య గల స్థలములును గలవు. పర్వత ప్రాంతములలో సాధారణముగ జనసాంద్రత తక్కువ. కాని ఆయా ప్రాంతములలో క్రొత్తగా కాఫీ, తేయాకులవంటి వ్యవసాయపరిశ్రమలు నెలకొల్ప బడినప్పుడు ఆ ప్రదేశములలో జనసాంద్రత ఎక్కువగును. నిస్సార ప్రదేశము మధ్య నగరము లున్నప్పుడు కూడ జన సాంద్రతలోగల భేదము స్పష్టముగ గానవచ్చును. ఇందుకు హైదరాబాదు - సికింద్రాబాదు నగరములు ఉదాహరణములు. జనులు ఎక్కువగ పట్టణములలో నివసించుటవలన జనాభా వ్యాప్తిలో ప్రాంతీయ వ్యత్యాసములు ఇంకను ఎక్కువ కనిపించును. ఈ శతాబ్దమందు జనాభా వృద్ధి యొక్క ప్రధాన లక్షణములలో నేదో యొక కారణముచేత జనులు విశేషముగ గ్రామములను వదలిపెట్టి పట్టణములను చేరుట ఒకటి. ఈ లక్షణము ఆంధ్రప్రదేశ్ నందుకూడ గాన వచ్చుచున్నది.

ఆంధ్రప్రదేశ్‌లో మొత్తము 53.35 లక్షల సంఖ్య గల పట్టణములు 292 ను, 2,52,80,000 జనసంఖ్య గల గ్రామములు 26,318 ను గలవు (1951). పట్టణములలోని జనసంఖ్య 21% అగుచున్నది. మొత్తము భారత దేశములోని పట్టణ

† 1961 జనాభా లెక్కల ప్రకారం ఆంధ్రప్రదేశ్ జనసంఖ్య 3,59,77,999. పురుషులు 1,81,75,349 ; స్త్రీలు 1,78,02,650 ప్రతి 1000 మంది పురుషులకు 980 స్త్రీలు గలరు. జనసాంద్రత చదరపు మైలుకు 339. 1951-61 మధ్య జనసంఖ్యలో వృద్ధి 15.69%.


సూచి
100
100 -200
200 -300
300 -400
400 -600
600 -800
80 -100
1000 -1300
4000 -4500
జిల్లా సరిహద్దు
తాలూకా సరిహద్దు
1 శ్రీకాకుళము
2 విశాఖపట్టణము
3 తూర్పుగోదావరి
4 పశ్చిమగోదావరి
5 కృష్ణా
6 గుంటూరు
7 నెల్లూరు
8 చిత్తూరు
9 కడప
10 అనంతపురము
11 కర్నూలు
12 మహబూబునగరము
13 హైదరాబాదు
14 మెదకు
15 నిజామాబాదు
16 ఆదిలాబాదు
17 కరీంనగరము
18 వరంగల్లు
19 ఖమ్మం
20 నల్గొండ
స్కేలు
మైళ్లు

జనాభా సగటుసంఖ్య 17% కాన ఆంధ్రప్రదేశ్ నందలి పట్టణ జనసంఖ్య అంతకంటె ఎక్కువ. రాష్ట్రమునకు పది లక్షల జనాభాగల మహానగర మొకటి రాజధానిగ ఉండవలె నన్న ఆంధ్రప్రదేశ్ నందు అది హైదరాబాదు. హైదరాబాదు జనాభా 12,52,337 (1961). కాని భారత దేశములో పది లక్షలకు పైబడిన జనసంఖ్య గలిగినట్టి ఐదు మహానగరములలోను (కలకత్తా, బొంబాయి, మద్రాసు, ఢిల్లీ, హైదరాబాదు) జనాభా ననుసరించి ఇది కడపటిది అగును.

సాధారణముగ లక్ష, అంతకంటె ఎక్కువ జనాభాగల ప్రదేశము నగరము అనబడుచున్నది. 1961 జనాభా లెక్కల ప్రకారము ఆంధ్రప్రదేశ్‌లో అట్టి నగరములు పది ఉన్నవి. 1. విజయవాడ (2,33,634), 2. వరంగల్లు (1,56,163), 3. గుంటూరు (1,87,068), 4. విశాఖపట్టణము (1,81,683), 5. రాజమండ్రి (1,30,030), 6. కాకినాడ (1,22,655), 7. ఏలూరు (1,03,367), 8. నెల్లూరు (1,06,797), 9. మచిలీపట్టణము (1,01,396), 10. కర్నూలు (1,00,849).

పట్టణములు, గ్రామములు కూడ వానిలో నివసించు జనమువలెనే దేశమంతటను ఒకేరీతిని వ్యాప్తమైయుండ లేదు. అన్ని జిల్లాలలో కంటె హైదరాబాదు జిల్లాలోని పట్టణముల సంఖ్య ఎక్కువ (21); అనగా 78 చదరపుమైళ్ళ ప్రదేశమునకు ఒక్క పట్టణమున్నదన్నమాట. అన్ని జిల్లాలలోనికి శ్రీకాకుళము జిల్లాలోని గ్రామముల సంఖ్య ఎక్కువ. (3,502). అనగా ఒక్కొక్క చదరపు మైలునకు ఒక్కొక్క గ్రామము చొప్పున ఉన్నది. ఎక్కువ సారవంతములైన ప్రదేశములలోను, నిస్సారములైన ప్రదేశములలోను ఉన్న పట్టణములలో జనసాంద్రత ఎక్కువే. కాని గ్రామములలో ఎక్కువ జనసాంద్రత కల వన్నియు బహుళముగ పంట పండు ప్రదేశములలోనున్నవి. భారతదేశము వంటి ప్రాచీన దేశములో జనము ఎక్కువగాను, తక్కువగాను ఉండుట భూసంపద మీదను, దాని నుపయోగించుకొను పద్ధతుల మీదను ఆధారపడి యుండును. ఎక్కువ పంట పండునటువంటి, కాలువ నీటిపారుదల వలన జల సౌకర్యములు తప్పక ఉండునటువంటి డెల్టా ప్రదేశములలో జనులు తేనెటీగల వలె గుమికూడుదురు. కృష్ణా, గోదావరి డెల్టాలు మాత్రమే కాదు, ప్రపంచములోని నైలు, మిసిసిపి, గంగ, సింధు మొదలైన డెల్టాలన్నియును చీమలవలె జనులతో నిండి యుండును. ఈ విధముగ కొన్ని ప్రదేశములలో మాత్రమే జనసంఖ్య అత్యధికమగుటవలన భూమి మీద జనుల ఒత్తిడి ఎక్కువైనది. అందువల్ల ఈ యొత్తిడి తగ్గించుట కొరకు జనులు ఇతర ప్రాంతములకు వలసపోవుట అవశ్యమగుచున్నది.

ఆంధ్రప్రదేశ్‌లో కొంచెము ఇంచుమించుగ పడమటి కొనయందు జనసాంద్రత అధికముగగల చిన్నప్రదేశ మొకటి జలరాశిలోని లంకవలె గానవచ్చును; ఇది హైదరాబాదు నగరముతో కూడిన హైదరాబాదు తాలూకా. ఇది చదరపు మైలునకు 4,000 ల మందికంటె ఎక్కువ జనముగల ప్రదేశము. పరికించి చూచినయెడల ఇచ్చటి గ్రామములలోని జనసాంద్రత చదరపు మైలునకు 300 మందికంటె తక్కువగనే ఉండును. హైదరాబాదు నగరము నిస్సార పాషాణ భూమధ్యమున ఉన్నది. సుమారు పన్నెండు లక్షల జనసంఖ్యగల ఈ నగర కంఠమునతప్ప తక్కిన ప్రదేశము నందంతయు జన సాంద్రత చాల తక్కువ అని చెప్ప వచ్చును.

ఎక్కువ జన సాంద్రతగల చాల విస్తృతమైన మండలము ఈశాన్యముననుు, సముద్రతలపు మైదాన దేశ మధ్యమునందును ఉన్నది. డెల్టాప్రదేశమును విడిచిపెట్టినచో చదరపు మైలునకు 500 ల నుంచి 700 ల వరకును అధిక జనసాంద్రతగల మండలములు నాగావళి, వంశధారలవంటి నదులు పారు మైదానములందును, తీరమైదాన భూములలో చెరువు నీటి పారుదల గలిగిన ఫలవంతమైన ప్రదేశములందును గానవచ్చుచున్నది. నెల్లూరు సమతల దేశమున జనసాంద్రత చదరపు మైలునకు 250 కంటె తక్కువ. కాని పెన్ననది డెల్టాలో మాత్రము జనసాంద్రత 350 కి కొంచెము ఎక్కువయే. సీతభూమి ప్రాంతములందువలె నెల్లూరు మైదానములో జనసమ్మర్దము చెదరి చాల పలుచన ఐనది. కాని పీఠభూమి మీద, రాయలసీమలో గాని, తెలంగాణాయందు గాని, జనాభా వ్యాప్తి అడవులచేతను, సారహీనమైన కొండప్రదేశముల చేతను, విభక్తమై ఎడనెడ మాసికలు మాసికలుగ గానవచ్చుచున్నది. ఈ మాసికలు దీర్ఘమైన ఇరుకైన సమతల ప్రదేశములలో విడుదలగుచున్నవి. చుట్టుప్రక్కల ప్రదేశములతో పోల్చిచూచినచో కుందేరు, పాపఘ్ని, చిత్రావతి, సగిలేరులవంటి ఏటి లోయలలో జనసాంద్రత చాల తక్కువ. ఇవి చుట్టుపట్ల భూములకంటె సారవంతమై కొంతవరకు నీటిపారుదల సౌకర్యములుగల ప్రదేశములు. సముద్రపు మట్టమునకంటె ఏడెనిమిది వందల అడుగుల ఎత్తుగల కుందేరు లోయలోని భూమి నల్లరేగడ మట్టి

* రాష్ట్ర పునర్విభజన సంఘమువారి అనుబంధమున శ్రీ బి. జె. నాయుడు 1769 పల్లెలు, 32.0 ఆ జనసంఖ్య అనియు; డాక్టరు కె. యల్. రావు 26,318 పల్లెలు 2.50 అని వ్రాసియున్నారు.

తోడను, సున్నపు శిలలతోడను సులభముగ పేలెత్తిపోవు షేల్ రాళ్ళతోడను ఏర్పడి యుండుటవలన వర్షము ఎల్లెడలను సమానముగ కురిసినప్పుడు పంటలు అచ్చట పుష్కలముగ పండును. ఈ ప్రదేశములోని జనసాంద్రత చదరపుమైలుకు 150-200 ల మధ్య ఉండును. రాయల సీమలోను, తెలంగానాలోనుగల పీఠభూమి ప్రదేశము లలో నిస్సారపు టిసుక భూములును, భూమ్యుపరితల ముపై బోటుగ పొడుచుకొని వచ్చిన గులకరాతి నేల లును, శైలపాదములలోని బొంతరాతి ప్రదేశములును ఎడనెడగల తావులందు జనసంఖ్య తక్కువ. ఇటువంటి ప్రదేశములలో పల్లెలు చెల్లాచెదరై అక్కడక్కడను, ఇంచుక నీటి వసతిగల ప్రదేశములను ఆశ్రయించు కొని, అంగకొకటి ఆమడకొకటి కానవచ్చును. ఇవి గాక, ప్రస్తుతము శిథిలావస్థలో నున్న గండికోట, గుత్తి, ఉదయగిరి, కందనవోలు, దేవరకొండలవంటి బలిష్ఠము లైన ప్రాచీన దుర్గములను ఆశ్రయించుకొని చుట్టును వెలసిన పల్లెలును చాల గలవు. పూర్వ మొకప్పుడీ ప్రాంత ములు కలహములకు స్థానములై యుండెనని సూచించును.

ఆంధ్రప్రదేశ్‌లో త్రవ్వితీయబడిన ఖనిజములు చాల కొద్ది. సింగరేణిలోని నేలబొగ్గు, గూడూరులోని అభ్రకము (మైకా), చీపురుపల్లివద్ద మాంగనీసు గనులవలన ఆయా ప్రదేశములలోని జనసంఖ్య ఏ మాత్రమును అభివృద్ధి పొందలేదు. జనాభా వ్యాప్తియందు మార్పును కలుగలేదు. కాని సింగరేణి నేలబొగ్గు గనివలన తత్ప్రదేశమందలి జన సంఖ్య నిలుకడగను, క్రమముగను అభివృద్ధి చెందెనని చెప్పవలసి యున్నది. తుంగభద్ర, కృష్ణ, గోదావరీ నదులు ప్రవహించెడు లోయలలో సర్వసాధారణముగ ఫలసా యము తక్కువ. ఈ లోయలలో జనసంఖ్య చదరపు మైలుకు 150 కంటెను తక్కువ. దీనికి ముఖ్యముగ రెండు కారణములు గలవు: ఒకటి అవి దుర్గమములగుట; రెండు ఇరకటము లగుటవలన బహుజనావాసమునకు అవ కాశము లేకపోవుట.

కృష్ణ, గోదావరీ డెల్టాలలోను, వానిని అంటియుండు తీరమైదానములలోను గ్రామములందు జనసంఖ్య కేంద్రీ కృతమై కానవచ్చుచున్నది. కాని ఈ రెండు డెల్టాల కును మధ్యనుండు కొల్లేరు ప్రదేశమును, చుట్టుపట్ల ప్రదేశములతో పోల్చి చూచినచో అందు జనసాంద్రత తక్కువయని తెలియవచ్చును. చదరపు మైలునకు 400 లేక 500 చొప్పున ఉండును. కొల్లేరు భూమి చాల పల్లమైనది. నీరు వెలువడి పోవుటకు అవకాశము లేక పోవుటచే మునుకవడి యుండును. వర్షకాలములో జనుల నిత్యజీవిత వ్యవహారములకు అభ్యంతరము కలిగించుచు ఈ ప్రదేశమంతయు ఎటు చూచినను జలమయమై పొడకట్టును. ఇక్కడ నివసించు జనుల జీవన విధాన మంతయు కొల్లేరు స్థితి ననుసరించి యుండును.

కృష్ణ, గోదావరి డెల్టాలలోని పట్టణములలోకూడ జనులు నిబిడీకృతమై యున్నారు; ఆంధ్రప్రదేశ్‌లోని సుమారు పది నగరములలో ఆరును, పట్టణములలో 50%ను ఇక్కడ ఉన్నవి. డెల్టా వండలివల్ల సారవంతములైన భూములును, పంటకాలువల నీటిపారుదల సౌకర్యము లునుగల గ్రామములలో జనసాంద్రత చదరపుమైలునకు 1000 మందియును, రామచంద్రపురము (తూర్పుగోదా వరి జిల్లా), తణుకు (పశ్చిమ గోదావరి జిల్లా)ల వంటి కొన్ని తాలూకాలలో చదరపుమైలునకు 1,100 కంటె హెచ్చుగను ఉండుట సాధారణము. అత్యధికముగ పంట పండగల వగుటచేత ఎకరమునకు రు. 9 లు మొదలు, రు. 10 ల వరకు అత్యధికపు శిస్తురేట్లు గల ప్రదేశము లివియే కావున ఈ డెల్టాలు ఆంధ్రప్రదేశ్ యొక్క జనసంఖ్యకును, వరి పంటకును కేంద్రస్థానములని చెప్ప వచ్చును. గ్రామములతోను పట్టణములతోను క్రిక్కిరిసి యుండు ఈ డెల్టాలలోని జనావాస విధానము దానికొక విశిష్టతను కలిగించుచున్నది.

క్షార వృక్షముల (మడచెట్ల) తోను, బురద బాడవ భూములతోను, ఇసుకతిప్పల పరంపరలతోను, సరుగుడు (చవుకు) తోపులతోను నిండియుండు గోదావరి, కృష్ణా డెల్టాలలోని దృశ్యము లోపలి ప్రదేశములకంటె వేరుగ గనపడును; వాని స్వభావమే వేరు. ఎడనెడ కొంచెము ఇంచుమించుగ జలవృత పరిసరములలోని జాలరి జనులు నివసించెడి సీమ ఇది. ఈ కృష్ణా, గోదావరి డెల్టాలలో జనులు పెరలోని తేనెటీగలవలె నిబిడ ముగ ముసురుకొని యుందురు; కాని ఆ పెరను విడిచి ఒక్కరైన పోవునట్లు కానరాదు. గుంటూరు - విజయ వాడ - తెనాలి త్రిభుజము ఈ యుత్కట జనసాంద్రత గల ప్రదేశమందు ఇమిడియున్నది. ఇది అన్ని వైపులకు చేరికయై ఆంధ్రప్రదేశ్‌నకు ముఖ్యకేంద్రమగుటకు వలసిన సౌకర్యములను కలిగియున్నది.

తూర్పుకనుమలలో 2,000′ మొదలు 4,000′ ఎత్తుగల అరణ్య భూయిష్ఠమైన నిస్సార శైలభూములలో జనసాం ద్రత చ. మైలుకు ఏబదికంటెను కూడ తక్కువ. ఇక్కడి భూమి సుగమము గాదు; మరియు జ్వరములకు ఇరవు. కావున, గ్రామములు ఇమిడిక కలవైనను చిన్నచిన్నవై చెదరి యున్నవి. ఇది వన్యజనుల కాటపట్టు; కేవలము

పశుపాలనము వలన జీవయాత్ర సాగించెడి కోయ, చెంచు మున్నగు అదిమవాసు లిచట నివసింతురు. ఐదారు గుడిసెల పరిమితిగల నీ యాదిమజాతివారి గూడెములు ఒక చోట స్థిరముగ నుండక ఒకచోటినుండి మరియొక చోటికి మారుచుండును. కొంతకాలము ఒక స్థలములో వ్యవసాయముచేసి, దానిని వదలిపెట్టి మరొక స్థలములో వ్యవసాయము చేయనట్టి వీరి పోడు వ్యవసాయపుపద్ధతి దీనికి ముఖ్యకారణము. ఇది కొండ ప్రదేశములవారి వాడుకలో ఉన్న వ్యవసాయపు పద్ధతి. స్థలము ఎట్టిదైనను, రాకపోకల సౌకర్యములు ఉన్నను, లేకపోయినను వానితో నిమిత్తము లేకుండ ఊటబుగ్గల చెంతనో, ఏటియొడ్డుననో ఆదిమ వాసులు తమ గూడెములను నెలకొల్పుదురు.

ఆంధ్రప్రదేశ్ జనాభా పెరుగుదలను గురించి ఆలోచించినచో ముఖ్యముగ ఈ శతాబ్దారంభమునుండి 50% చొప్పునకంటె ఎక్కువ పెరుగుదల ఉన్నట్లు చెప్పవచ్చును. కాని ఇది కేరళవంటి ఇతర ప్రాంతములనేకముకంటె స్పష్టముగ తక్కువయే. భారతదేశములోని ఇతర రాష్ట్రములలోవలె ఆంధ్రప్రదేశ్‌లోను మరణ సంఖ్యకంటె జనన సంఖ్యయే అధికము. వీని నిష్పత్తి 16 : 28. జనాభా లెక్కలను పరిశీలించి చూచినచో 1. డెల్టాలలో అధికమైన సహజాభివృద్ధి; 2. విశాఖపట్టణము, శ్రీకాకుళము ప్రాంతములలో హెచ్చుతగ్గులులేని నిలుకడ; 3. తెలంగానాలో నిలుకడలేని అభివృద్ధియు కనిపించును. పైనుడివిన మొదటి రెండు విధముల మధ్య రాయలసీమ వచ్చును. తరతరము పెరిగిపోవుచున్న జనసంఖ్యకు గోదావరి డెల్టాలో స్థలము చాలదు. గుంటూరు, విజయవాడ ప్రాంతమున జనసంఖ్య వేగముగ పెరుగుటకు అచటి సత్వర పరిశ్రమ, వ్యాపారాభివృద్ధి కారణములు.

1951 వ జనాభా లెక్కలనుబట్టి భారతదేశ మంతటిలోను తెలుగువారు 3,72,00,000 మంది ఉన్నట్లు తేలినది. అనగా, ఇతర రాష్ట్రములలో తెలుగువారు 66 లక్షల వరకు ఉన్నారన్నమాట. ఈ క్రింది పట్టికవల్ల భారత దేశములోని వివిధ రాష్ట్రములలో ఉన్న తెలుగువారి సంఖ్య తెలియగలదు :

భారత దేశములోని ఆంధ్రేతర రాష్ట్రములందలి తెలుగువారి జనాభా (1951).

| | | |
|---|---|---|
| 1. | మద్రాసు, కూర్గు .... | 33,27,269 |
| 2. | హైదరాబాదు (తెలంగానా జిల్లాలలో కాక) | 9,28,384 |
| 3. | మైసూరు ... .... | 13,75,732 |
| 4. | మధ్యప్రదేశ్ ... ... | 1,72,557 |
| 5. | మధ్యప్రదేశ్‌లో తెలంగి ... ... | 2,309 |
| 6. | ఒరిస్సా ... ... | 3,42,523 |
| 7. | పశ్చిమబెంగాల్, చంద్రనగరము, సిక్కిము | 49,544 |
| 8. | బిహారు ... ... | 16,979 |
| 9. | ఉత్తరప్రదేశ్ ... ... | 2,145 |
| 10. | అస్సాము ... ... | 17 |
| 11. | బొంబాయి, సౌరాష్ట్రము, కచ్చి ... | 3,06,949 |
| 12. | కేరళ [తిరువాన్‌కూర్, కొచ్చి] ... | 23,742 |
| 13. | మధ్యభారత్ ... ... | 644 |
| 14. | పంజాబు, పెప్సు, ఢిల్లీ, హిమాచలప్రదేశ్, బిలాస్‌పూర్ ... ... | 10,070 |
| 15. | రాజస్థాన్, అజ్మీర్ ... ... | 441 |
| 16. | వింధ్యప్రదేశ్ ... ... | 78 |
| 17. | అండమాన్, నికోబారు దీవులు .... | 1,044 |
| | మొత్తము | 65,57,827 |

ఈ పట్టికవలన తెలుగువారు భారతదేశములో ఆసేతుహిమాచలము ఉన్నట్లు తెలియవచ్చుచున్నది. దక్షిణ భారతమందలి ద్రావిడ, కర్ణాట, మలయాళ దేశములోని తెలుగువారును, ఒరిస్సా, మధ్య ప్రదేశములందలి తెలుగువారును విజయనగర రాయల పలుబడి క్రిందను, తత్పూర్వమును రాజకీయ కారణములవలన ఆయా దేశములకు పోయి అచ్చట స్థిరవాసములు పర్పరచుకొని నిలచిపోయిరి. మరియు చారిత్రక కారణములవలన తెలుగుదేశములో కొంతభాగము మైసూరు, మధ్యప్రదేశ్, ఒరిస్సాలలో కలిసిపోయినది. కావున తెలుగువారి జనసంఖ్య మద్రాసు, కూర్గు రాష్ట్రములలోను, మైసూరు, మధ్యప్రదేశ్, ఒరిస్సాలలోను ఎక్కువగా ఉన్నది. మిగిలినవారిలో అధిక సంఖ్యాకులు పనిపాటులు చేసికొని జీవించు కార్మిక జనమై ఉండవచ్చును. వీరు వేరువేరు నగరములకు పారిశ్రామిక కేంద్రములకు తెలుగుదేశపు గడిప్రాంత మండలముల నుండి వెళ్ళియుండ వలెను. తెలుగువారు తమ మాతృదేశము సకల సంపన్న మగుటవలన దూర ప్రాంతములకు వెళ్ళుట కంతగ ఉత్సహింపరు. పనిపాటలు, ఉద్యోగావకాశములు ఉన్న స్థలములు దూరమైన కొలదియు తెలుగువారి సంఖ్య సన్నగిల్లుట కనబడు చున్నది. అస్సాము, రాజస్థాన్, పంజాబు చివరకు అండమాను, నికోబారు ద్వీపములవంటి సుదూర ప్రాంతములలోకూడ చిలుకరించినట్లు తెలుగువారు కొలదిపాటుగ కనబడుదురు. ప్రాయికముగ వీరు వ్యాపారమే వృత్తిగగల జాతులలోనివారై యుందురు.

జనసంఖ్యా బాహుళ్యమును, దేశ వైశాల్యమునుబట్టి భారతదేశమున తెలుగుజాతి సంస్కృతి సంపన్నమగు విశిష్ట సంఘమని చెప్పనగును. వి. ఎల్. ఎస్. ప్ర.

# జనసంఖ్య - వృత్తిస్థితి

ఏ దేశమున కైనను ఆర్థిక స్తోమతు ఎంత అవసరమో, అంగబలము కూడ అంత యవసరమే. ఈ యంగబలము కూడ పని చేయువారి సంఖ్య, సామర్థ్యతలమీద ఆధార పడియున్నది. ఇది చాలవరకు జనాభా వలన నిర్ణయింప బడు చున్నది. దీనినే అర్థశాస్త్ర పరిభాషలో దేశము యొక్క 'మనుజబలము' (man power) అని చెప్పుదురు. సాధారణముగ విదేశములందు మనుజబలము 40% నున్నట్లు కనబడుచున్నది. 1951 లో అది భారతీయ జనాభాలో 39.6% నుండెను.

ఈ మనుజ బలములో, ఆర్థికశాస్త్రరీత్యా కూలి, జీతము, బత్తెము మొదలైన ద్రవ్యరూపముగ ప్రతిఫలము పొంది పని చేయువారే లెక్కకు వత్తురు. వీరు ఏదైన నొకవృత్తికి చెందియుందురు; అది వారియొక్క జీవనోపాధి. సర్వ సాధారణముగ వృత్తిలో నియుక్తులై యుందురు, లేదా తాత్కాలికముగ నిరుద్యోగులై యుండ వచ్చును. ఇట్టి వారిని శాస్త్రములో సమష్ఠిగా 'శ్రామికుల బలము' (labour force) అని గణింతురు.

జనసంఖ్యను పరిమాణముగ తీసికొని దేశముల యొక్క కొద్ది, గొప్పలను నిర్ణయించు ఆచారము వాడుక యందు కలదు. 1950 లో ఐక్యరాజ్యసమితి అంచనా ప్రకారము మొత్తము ప్రపంచము యొక్క జనసంఖ్య 240.6 కోట్లు యున్నది. 1950-51 లో భారతీయ జనసంఖ్య (జమ్ము, కాశ్మీర రాజ్యము మినహాయింపగ) 35.68 కోట్లు* అనగా ప్రపంచమందలి ప్రతి ఏడుగురు మనుష్యులలోను ఒకడు భారతీయు డగుచున్నాడు. ఇది గర్వింప దగిన విషయము. కాని దేశము పెద్దది యగుటచేత, దాని సమస్యలును పెద్దవి యగునని గుర్తింపవలసి యున్నది.

1950-51 జనాభాలెక్కల ప్రకారము భారతీయులు 35,68,79,394 గురు అని తేలినది. వీరిలో మూడింట రెండు వంతులు అనగా 24 కోట్ల 25 లక్షలు ఉత్తరప్రదేశ్, మద్రాసు, బీహారు, బొంబాయి, పశ్చిమ బంగాళ, మధ్య ప్రదేశమను ఆరు రాష్ట్రములలో నివసించు చున్నారనియు 2 కోట్లకు పైబడిన జనసంఖ్య కలిగి యున్నవగుటచేత ఈ యారు రాష్ట్రములు పెద్దరాష్ట్రములుగ పరిగణింప బడుచున్నవి. మద్రాసు నుండి ఆంధ్రరాష్ట్రము విడివడి (1953) ప్రత్యేక రాష్ట్రముగ అవతరించెను. ఆంధ్రరాష్ట్రమందలి జనసంఖ్య 1953 లో 2,05,07,801 కనుక ఆంధ్ర రాష్ట్రముకూడ దేశములోని అగ్రరాష్ట్రముల క్రింద గణనకు వచ్చెను.

1956 లో భారతీయ సమాఖ్యయందలి రాష్ట్రముల పునర్వ్యవస్థీకరణ జరిగెను. అప్పుడు ఆంధ్ర రాష్ట్రము తెలంగానా కలియుటచేత ఆంధ్రప్రదేశ్‌గ విస్తరించెను. దాని జనసంఖ్య 3,12,60,133 వరకు పెరిగెను. 'మనుజబలము'లో నాలుగవ రాష్ట్రముగ వృద్ధినొందెను. ప్రతి 12 మంది భారతీయులలో ఒక ఆంధ్రు డగును. ఈ విశాల రాష్ట్రమును భారతదేశ మంతటితో పోల్చిచూచిన వైశాల్యము నందును, జనాభాలోను కూడ ఇది 8% పైబడియే యున్నదని స్పష్టమగును.

| | జనసంఖ్య | వైశాల్యము |
|---|---|---|
| మొత్తము భారతదేశము | 35,68,79,394 | 11,76,864 చ. మై. |
| 1956 లోని ఆంధ్రప్రదేశ్ | 3,12,60,133 | 1,05,700 ,, |

1953 లో మద్రాసునుండి విడివడి నపుడు 52.7% భూభాగమును, 51.0% నీటి పారుదల గల నేలయు, 40% ఆటవికప్రాంతమును, 35.2% జనమును ఆంధ్రరాష్ట్రమునకు చేకూరినవి. కనుక ఆంధ్రప్రదేశ్ యొక్క ఆర్థిక వ్యవస్థలో వ్యవసాయారణ్య సంపదలు ప్రథమ, ద్వితీయాంశములుగ తేలినవి. తెలంగానా పట్లకూడ ఈ సిద్ధాంతమే సత్యమగును.

1951 జనాభా లెక్కలప్రకారము ఇండియా మొత్తము మీద తల యొకటికి భూమి 2.25 ఎకరములు వచ్చును. ఆంధ్రరాష్ట్రములో తలయొకటికి భూమివంతు 1.42 ఎకరములున్ను, తెలంగానాలో 3.54 ఎకరములును వచ్చును. దీనినిబట్టి ఆంధ్రప్రాంతమున భూవసతి తక్కువ యనియు, తెలంగానములో భూసంపద హెచ్చనియు భావింపరాదు. ఈ భేదమునకు చాలవరకు జనసాంద్రత యందలి తారతమ్యములు కారణము. ఆంధ్రప్రాంతమున చ. మైలునకు 322 మంది జనులున్ను, తెలంగానాలో 253 మంది జనులున్ను ఉన్నారు. ఇండియా మొత్తముమీద చ. మైలునకు సగటున 281 మంది జనులున్ను, ఆంధ్ర ప్రదేశ్‌లో సగటున 295 మంది జనులును ఉన్నారు.

ఆంధ్రప్రదేశ్‌లో భూములు నీటిపారుదల గలిగి, ఫలవంతములై సస్యశ్యామలములుగ నుండును. అనాయాస

* 1961 జనాభా లెక్కల ప్రకారము ఇండియన్ యూనియన్ జనసంఖ్య 43,64,24,429; ఇందు 8.8% ఆంధ్రప్రదేశ్‌లో నివసించుచున్నారు.

† బొంబాయి రాష్ట్రము 1960లో మహారాష్ట్రము, గుజరాత్ రాష్ట్రములుగ విభజింపబడినవి.

వలయములలో
పూర్ణోద్యోగిత
అసంపూర్ణోద్యోగిత
నిరుద్యోగిత

ఒక్కొక్క బొమ్మ లక్ష పూర్ణోద్యోగులు
ఒక్కొక్క బొమ్మ లక్ష అసంపూర్ణోద్యోగులు.
ఒక్కొక్క బొమ్మ లక్ష నిరుద్యోగులు

రాష్ట్ర సరిహద్దు

స్కేలు
0 35 70 140 మైళ్లు

1 ఆదిలాబాదు
2 కరీంనగరము
3 నిజామాబాదు
4 మెదకు
5 వరంగల్లు
6 ఖమ్మం
7 నల్గొండ
8 హైదరాబాదు
9 మహబూబునగరము
10 కర్నూలు
11 అనంతపురము
12 కడప
13 చిత్తూరు
14 నెల్లూరు
15 గుంటూరు
16 కృష్ణా
17 పశ్చిమగోదావరి
18 తూర్పుగోదావరి
19 విశాఖపట్టణము
20 శ్రీకాకుళము

ఆంధ్రప్రదేశ్ - జనసంఖ్య : వృత్తి స్థితి.

ముగ నిచట ఆహారము లభింపక పోయినను, భారతదేశ మంతటిలోను ఆహార సమృద్ధిగల రాష్ట్రములలో ఆంధ్ర ప్రదేశ్ ఒకటి. దీనిని కేవలము వ్యవసాయక రాష్ట్ర మనవచ్చును; అధిక సంఖ్యాకు లిచట భూమిపై నాధారపడి యుండుటయే దీనికి కారణము. ఇచటి ప్రజలలో 67.3% మంది వ్యవసాయిక వృత్తులచేతను, 32.17% మంది ఇతర వృత్తులచేతను జీవించుచున్నారు (1953). ఇండియా మొత్తముమీద 69.8% మంది భూమి నాధారము చేసికొనియు, 30.2% ఇతర వృత్తులవలనను జీవించుచున్నారు. భారత దేశమునకంతకు వ్యవసాయమే ప్రధానవృత్తి.

ఆంధ్రప్రదేశ్‌లో మొత్తముమీద 26,450 గ్రామములును 293 పట్టణములును గలవు (1951). గ్రామములలో 2,58,21,679 జనులున్ను, పట్టణములలో 54,38,454 జనులున్ను నివసించు చున్నారు. ఈ రాష్ట్రమందు మొత్తము జనాభాలో 83% గ్రామములలోను, 17% పట్టణములలోను నివసించు చున్నారు. బహు సంఖ్యాకులు గ్రామీణులుగ నుండుట ఈ రాష్ట్రమున వ్యవసాయము ముఖ్యవృత్తి యగుటకు కారణము. పట్టణములు కొలదిగ నుండుటయు, అచటికి జనులు చాల తక్కువ చేరుటయు ఇతరవృత్తులు పెరగక పోవుటకు బలమైన కారణములు. భారతదేశ మంతటిలోను జనుల ఉనికి, వారి వృత్తిస్థితులున్ను ఇట్లే యున్నవి. ఆంధ్రప్రదేశ్ ఆర్థికస్థితిలో ఇండియా కంతటికి చక్కని దృష్టాంతము. భారతదేశము వలెనే ఈ రాష్ట్రము కూడ చాల వెనుకబడి యున్నది.

మొత్తము ఆంధ్రప్రదేశ్‌లోని 'వృత్తి' యొక్క వివరములు దిగువ నీయబడినవి :

| వృత్తిపేరు | నియోగులైనవారి సంఖ్య |
|---|---|
| 1. వ్యసాయిక తరగతుల మొత్తము | 2,10,40,323 |
| (అ) స్వంత వ్యవసాయదారులు | 1,22,38,122 |
| (ఆ) కౌలుకు వ్యవసాయముచేయువారు | 24,12,581 |
| (ఇ) సేద్యముచేయు కూలివారు | 57,55,285 |
| (ఈ) భూకామందులు | 6,34,335 |
| 2. ఇతర వృత్తులవారి మొత్తము | 1,02,19,810 |
| (క) సేద్యమున కన్యమగు వృత్తులు | 39,74,240 |
| (ఖ) వ్యాపారము | 16,94,760 |
| (గ) రవాణా | 4,47,705 |
| (ఘ) ఉద్యోగములు వగైరా | 41,03,105 |

ఒక దేశముయొక్క ఆర్థికాభ్యుదయము అచటి సహజ సంపదను పనిచేయు జనము వినియోగించుటచేత చేకూరు చున్నది. అంతేగాక ఆర్థికాభ్యుదయము ముఖ్యముగ 'వృత్తిస్థితి' చేత నిర్ణయింపబడు చున్నది. దేశమందలి 'మనుజబలము' వివిధ వృత్తులలో ఏయే పాళ్ళలో నియుక్తమై యున్నదో తెలుపునది 'వృత్తిస్థితి'. స్థూలముగ జూచినయెడల, వ్యవసాయమే ముఖ్యవృత్తిగ గల దేశము వెనుకబడు చున్నదనియు, పరిశ్రమాభివృద్ధిగల దేశము పురోగమించుచున్న దనియు సిద్ధాంతము చేయుటకు అవకాశమున్నది. భూవసతిపైన జనసమ్మర్ద మెక్కువై, తలయొకటి పంట తగ్గుటయు, హెచ్చురాబడి సంపాదింప వీలుగల పరిశ్రమలలో స్వల్ప సంఖ్యాకులు నియుక్తులై యుండుటయును ఇందులకు కారణములు.

'వృత్తిస్థితి' రీత్యా భారతదేశమును ఇతర వృద్ధినొందిన దేశములతో పోల్చి చూచిన యెడల ఆంధ్రప్రదేశ్ ఆర్థిక పరిస్థితి బొత్తిగ వెనుకబడియున్నట్లు స్పష్టము కాకమానదు. మొత్తము ఆర్థిక వ్యవస్థను మూడు భాగములుగ విభజించుట ఆచారమైనది. ప్రథమభాగములో వ్యవసాయాది వృత్తులు, రెండవదానిలో పరిశ్రమాది వృత్తులు, మూడవ దానిలో ఉద్యోగాది ఇతర వృత్తులున్ను కూర్చబడు చున్నవి. ఈ మూడు భాగములలో ఏయే పాళ్ళలో ఒక దేశముయొక్క పనిచేయు ప్రజలు నియుక్తులై యున్నారో కనుగొనుట అవసరము. ఈ 'వృత్తిస్థితి'ని జూచి ఆ దేశముయొక్క ఉచ్చ, నీచస్థితులను నిర్ణయింప వచ్చును. స్వతంత్ర జీవనముచేయు ప్రతి వేయిమంది వ్యక్తులలో ఈ మూడు ఆర్థిక విభాగములలో నియుక్తులై యున్న వారిని వివరించుచు, 1951 జనాభా లెక్కలు ఈ క్రింది ఉదాహరణ మిచ్చుచున్నవి :

| ఆర్థిక భాగము | ఇండియా | యునైటెడ్ స్టేట్సు | గ్రేట్ బ్రిటన్ |
|---|---|---|---|
| 1. వ్యవసాయము, పశుపాలన, బెస్త, ఆటవిక వృత్తులు | 706 | 128 | 50 |
| 2. గనులు త్రవ్వుట, వస్తూత్పత్తి, వ్యాపారము | 153 | 456 | 555 |
| 3. ఇతరసేవలు, ఉద్యోగములు | 141 | 416 | 325 |
| మొత్తము | 1000 | 1000 | 930 |

ఈ లెక్కలను పోల్చి చూచినచో భారతదేశమున 706 మంది ఆహారములను సేకరించు వృత్తిలోనే కేటాయింపు బడినట్లును, సమృద్ధిగ నాహారమును సంపాదించుటకు అమెరికాలో వేయిమందికి 125 మంది చాలియున్నట్లు

కన్పట్టు చున్నది. ఆహారము నెక్కువగ దిగుమతిచేసి కొను గ్రేట్‌బ్రిటన్‌లో ఈ వృత్తిలో వెయ్యిమందికి 50 మంది పనిచేయుచున్నారు. 2, 3 ఆర్థిక విభాగముల పోలికలను పరీక్షించిన యెడల ఇండియాకును మిగిలిన రెండు దేశములకు మధ్యగల విస్తారమగు తారతమ్యము ఆశ్చర్యము గొలుపును. ఆయా విదేశములందలి భాగ్యమునకును భారతదేశమందలి ఇదియే కొలతబద్ద.

'వృత్తిస్థితి'లో భారతదేశమంతకును, ఆంధ్రప్రదేశ్‌కును వ్యత్యాసము కానరాదు. ఇండియా యొక్క ఆర్థిక వ్యవస్థకు ఆంధ్రప్రదేశ్ మచ్చుతునక. వ్యవసాయ విభాగములో అనేకులును, వ్యవసాయేతర విభాగములో స్వల్ప సంఖ్యాకులున్ను జీవనోపాధి కలిగి యుండుటచే, దేశపు ఆర్థిక నిర్మాణము కుంటువడి, స్తోమతు కోల్పోయి యున్నది. కనుకనే 1949-50 సం॥ 'ఫిస్కల్' కమీషన్ వారు హెచ్చరించి యున్నట్లు ఈ 'వృత్తిస్థితి'లో గొప్ప పరివర్తనము సంభవింప వలసి యున్నది. అనగా, పనిచేయు వారిలో చాలమంది వ్యవసాయము నుండి వైదొలగి పరిశ్రమాది, ఇతర వృత్తులలోను నియుక్తులు కావలసి యున్నది. దీనికై ఆంధ్రప్రదేశ్ యందు పరిశ్రమలు, వర్తక వ్యాపారము అభివృద్ధి నొందవలసి యున్నది.

ప్రభుత్వము పంచవర్ష ప్రణాళికల మూలముగా ఇండియా యొక్క ఆర్థికాభ్యుదయమును చేకూర్ప దలచి యున్నది. 1951 మొదలు 1976 వరకు ఐదు ప్రణాళికలు అమలులోనికి వచ్చును. ఇప్పటికి (1961) రెండు పూర్తి గావింపబడినవి. 'వృత్తిస్థితి'లో 1976 నాటికి 40% మాత్రమే వ్యవసాయాది వృత్తులలోను, 60% ఇతర వృత్తులలోను పనిచేయు బలగము నియుక్తము కాగల గొప్ప పరివర్తనమును యోజనసమితి (ప్లానింగ్ కమీషన్) అభివృద్ధి ప్రణాళికలద్వారా కొని తెచ్చుటకు సంకల్పించియున్నారు. ఇట్టి మార్పు ఆంధ్రప్రదేశ్ యొక్క పురోగమనమున కత్యంతావశ్యకము.

మ. సూ. ప్ర.

# పట్టణ, గ్రామ అభివృద్ధి

పారిశ్రామికాభ్యున్నతి, వస్తూత్పత్తి పరిమాణమందు దినదినాభివృద్ధి, అడుగడుగునకు వినూత్న ప్రయాణ సాధనములను కనుగొనుటవలన మనుజుల రాకపోకలును వస్తువుల రవాణాయును సుకరముగను సత్వరముగను సాగుట, పట్టణముల సంఖ్య హెచ్చుట, జనసంఖ్య యను దినము పెంపొందుట యనునవి ఆధునిక పారిశ్రామిక నాగరికత ముఖ్య లక్షణములలో కొన్ని. తొలుదొల్త పారిశ్రామిక విప్లవము సంభవించిన బ్రిటన్ దేశములో కానవచ్చిన ఈ లక్షణములు పారిశ్రామికాభ్యున్నతికి జెందుచున్న దేశము లన్నిటియందు వానివాని పారిశ్రామికాభివృద్ధి ప్రమాణమును బట్టి గోచర మగుచున్నవి. పారిశ్రామికముగ మిక్కిలి అభివృద్ధి చెందిన బ్రిటన్, అమెరికా, మొదలగు దేశములందు ఈ చిహ్నములు ప్రస్ఫుటముగ ద్యోతక మగుచున్నవి. పారిశ్రామికాభివృద్ధియందు వెనుకబడి యున్న చీనా, భారతదేశములందు ఇవి అస్పష్టముగ మాత్రమే కానవచ్చును.

భారతదేశమును అందు అంతర్భాగ మగు ఆంధ్రప్రదేశ్ యును, ఆదిమ కాలమునుండియు నాగరికతకు నిలయములే యైనను వాని నాగరికత ఆధునిక పారిశ్రామిక నాగరికత గాక, ప్రాచీన జానపద నాగరికత యగుటవలన పై లక్షణములు ద్యోతక మగుటకు అవకాశము లేదు. ప్రాచీన భారత దేశార్థిక వ్యవస్థకు గ్రామ స్వయం సమృద్ధి మూలకందము. ప్రతి గ్రామమునందును ఆ గ్రామస్థుల నిత్య జీవనావశ్యక వస్తువులను మాత్రమే కాక, తదితర విలాస, భోగ్య వస్తువులను సైతము, వీలైనంతవరకును ఉత్పత్తి కావలయు ననియే ప్రాచీనుల అభిమతము. అందువలననే ఆ కాలమున పారిశ్రామికాభ్యున్నతి, వస్తూత్పత్తి, పరిణామాభివృద్ధి, శీఘ్రగమనాగమనోపయుక్త వాహన నిర్మాణము, పట్టణ సంఖ్యాభివృద్ధి మున్నగునవి జరుగలేదు.

అట్లనుటవలన ప్రాచీనకాలమున భారతదేశమున పట్టణములు లేవని చెప్పుటకాదు. ఆ కాలమున ఇప్పుడు ఉన్నన్ని పట్టణములుగాని, ఇంతటి పెద్దవిగాని లేవనుట సముచితము. ప్రాచీనకాలపు పట్టణములు రాజధానులుగనో, రాకపోకల కూడలి స్థానములుగనో, వర్తక కేంద్రములుగనో ఉండెడివి. పూర్వము పట్టణములు నిర్మితమైన స్థలముల నైసర్గిక స్వభావములను ఆ పట్టణముల ప్రాముఖ్యమును పరిశీలించిన వాని నిర్మాతలు ఆయా స్థలముల నెందు కేర్పరచుకొనిరో, యచటి పట్టణముల యభివృద్ధి క్షయములకు కారణము లేవో గ్రహింపగలము. ఉదాహరణకు విజయనగరము (హంపి) ఒక రాజ్యమునకు రాజధాని నగరముగ నిర్మితమైనది. ఆ కాలమున మహమ్మదీయ సుల్తానులు దక్షిణ హిందూదేశపు హిందూ రాజ్యములపై తరచు దండయాత్రలు జరుపుచుండెడివారు. ఆ

దండయాత్రలనుండి రాజ్యమునకు ఆయువుపట్టయిన రాజధాని నగరమును రక్షించు కొనలేకపోయినచో రాజ్యము నాశమొందును. శత్రువుల బారి పడనీయక దుర్గమును సంరక్షించుటకు నైసర్గిక జల ప్రవాహములు, పర్వతములు మిక్కిలి అనుకూలములు. ముఖ్యముగ ఈ కారణము వలననే రాజధానీ నగర నిర్మాణమునకు తుంగభద్రా నది యొక్క దక్షిణపు టొడ్డున, కొండల మధ్యనున్న ప్రదేశము తగినదని ఎంచబడినది. ఇట్లు నైసర్గిక రక్షణ గలిగి బలిష్ఠమైన దగుటవలననే దానిని విధివశాత్తుగ పట్టుకొన్న మహమ్మదీయులు పట్టుదలతో సర్వనాశనమొనర్చిరి. జల ప్రవాహములు, పర్వతములు మున్నగు నైసర్గిక రక్షణలు లేకపోయినను వేగిపట్టణము వేంగి రాజ్యమునకు నట్ట నడుమ నుండుటవలన రాజధానిగా నేర్పరచుకొనబడినప్పటికిని త్వరలోనే నేలమట్ట మయ్యెను. ఓరుగల్లు పట్టణము కూడ విజయనగర సామ్రాజ్యమంతటి బలవత్తమ రాజ్యమునకు రాజధానియే ఐనను, నైసర్గికముగ రక్షణ లేని ప్రాంతమున నిర్మింపబడుటవలన అనేక పర్యాయములు మహమ్మదీయుల వశమై రాజ్య క్షీణదశకు కారణ భూతమైనది.

ఆయా ప్రాంతముల రక్షణకు ప్రాచీనులు దుర్గములు నిర్మించుచుండెడివారు. అవి ఆయా ప్రాంతముల నైసర్గిక స్వభావములను బట్టి రక్షించుటకు మిక్కిలి అనువగు స్థలముల నిర్మింపబడుచుండెడివి. ఒక మైదానపు ప్రాంతమునకు కాపుదలగా నుండుటకు పర్వతముపై దుర్గము నిర్మించినచో రక్షణ సుకరము, బలవత్తమము అగును. అందువలననే కొండపల్లి, కొండవీడు మొదలగు దుర్గములు కొండలపై నిర్మితములైనవి. ఆ దుర్గముల ఉనికిని బట్టి, ఆ ప్రాంతమున కొద్దిపాటి పట్టణము లేర్పడి, ఆ దుర్గములు బలిష్టములుగ నున్నంతకాల మభివృద్ధి చెంది యవి నశింపగనే క్షీణించినవి.

ముఖ్యమైన పెద్ద జల ప్రవాహములను తేలికగా దాటుటకు వీలగు ప్రాంతములందు కూడ రక్షణ దుర్గములు ఏర్పరచుట ఆవశ్యకము. అంతేగాక ఇవి వ్యాపార కేంద్రములుగను, బాటసారుల రాకపోకలకు కూడలి స్థానములుగను ఉపయోగపడి వివిధ ప్రాంతములందలి ప్రజలు కలిసికొనుటకును, తన్మూలమున సంస్కృతి, నాగరికత అభివృద్ధి చెందుటకును అనువగు స్థలములై ఉన్నతమైన పట్టణములుగ పెంపొందినవి. అందువలన ఇవి రాజకీయ పరిస్థితులపై నాధారపడక చిరకాలము వర్ధిల్లుటకు అవకాశము గలదు. విజయవాడ, రాజమండ్రి, నెల్లూరు మొదలగు ప్రాచీన పట్టణములు ఇందుకు నిదర్శనములు.

ముఖ్య యాత్రా స్థలములు దేశమునందలి వివిధ ప్రాంతములనుండి ప్రజల నాకర్షించుటవలన, యాత్రికుల వసతి సౌకర్యములకు వలసినట్లు ఇవి పెద్ద పట్టణములుగ అభివృద్ధి చెంది వర్థిల్లును. తిరుపతి, కాళహస్తి, ద్రాక్షారామము, శ్రీకాకుళము, సింహాచలము, మంగళగిరి మొదలగు పట్టణములు ప్రాచీన కాలమునుండియు ఒకే ప్రమాణపు పట్టణములుగ వెలయుట కిది ముఖ్య కారణము. సముద్రతీర ప్రాంతములందు ఋతుపవనముల అనుకూల్యము ననుసరించి విదేశములతో వ్యాపారమునకును, చేపల పరిశ్రమలు సాగుటకును గల అవకాశములను బట్టియు పట్టణము లభివృద్ధి చెందెను. ఆంధ్రప్రదేశ్ తీరమున ఇట్టి పట్టణము లనేకము లున్నవి. వానిలో భీమునిపట్టణము, విశాఖపట్టణము, మచిలీపట్టణము, కాకినాడ ముఖ్యమైనవి.

ఆధునిక పారిశ్రామిక నాగరికత ప్రభావము భారతదేశమునను, ఆంధ్ర ప్రదేశ్‌నను వ్యాపించిన కొలది ఆ నాగరికత లక్షణములు క్రమముగ ప్రస్ఫుటము కాజొచ్చినవి. తత్ఫలితముముగ ఆంధ్రప్రదేశ్‌లో పట్టణముల సంఖ్యయు, జనాభాయు వృద్ధి యయ్యెను.

ఆధునిక పాశ్చాత్య నాగరికత భారతదేశమున తొలు దొల్త రాకపోకల సౌకర్యములకొరకు ముఖ్యముగ రైల్వేల రూపమున ఆవిర్భవించెను. రైలు మార్గములు దేశ రక్షణ దృష్ట్యా నిర్మింపబడినను, వాని నిర్మాణము దేశము యొక్క వర్తక వ్యాపారముల నభివృద్ధి చేసి, మారుమూలల నుండు స్థలములను సీమలను ప్రాముఖ్యములోనికి తెచ్చి, పట్టణాభివృద్ధికి తోడ్పడిన వనుటకు సందేహము లేదు. ఐతే భారతదేశములో రైలు మార్గములను దేశ ఆర్థికాభివృద్ధికి అనువుగ ఇతర విధములగు రాకపోకల మార్గములతో గూర్చి సమన్వయపరచి వానిని చక్కగ పరిశీలించి నిర్ణయించిన పథకము ప్రకారము నిర్మించి యున్నచో పట్టణముల అభివృద్ధికిని వర్తక వ్యాపారముల పెంపునకును ఇతోధికముగ నవి తోడ్పడి యుండెడివని కూడ చెప్పక తప్పదు. మార్గముల సంధి ప్రదేశములలో నిర్మింపబడిన పట్టణములు అభివృద్ధి చెందుట సహజము. ఆధునికాంధ్ర ప్రదేశమున గుంతకల్లు, కాజీపేట మొదలగునవి కేవలము ఇట్టి పట్టణములు. ఆంధ్రప్రదేశ్‌లోని పట్టణములలో గాని, గ్రామములలోగాని నాలుగు వీథులు కలియుచోటు ఎట్లు ముఖ్యస్థల మగుచున్నదో అట్లే రైలు మార్గములుగాని, రైలు-జల మార్గములు గాని, రైలు-రస్తా మార్గములు గాని, రైలు-సముద్ర మార్గములు గాని కలియు చోట్లు ముఖ్యస్థలము లగుట

సహజమే. ఇట్టి స్థలములకు వివిధ దూర ప్రాంతములనుండి జనులు వచ్చుచుందురు. సరకుల ఎగుమతి దిగుమతులు జరుగుచుండును. అందువలన ఇతర పరిశ్రమలు కూడ స్థాపితమై పట్టణ మభివృద్ధి చెందును. ఆంధ్రప్రదేశ్‌లో ముఖ్యములగు పట్టణము లన్నిటి యభివృద్ధికి ఇది కొంత వరకైనను కారణమని చెప్పవచ్చును. విజయవాడ, రాజమండ్రి, విశాఖపట్టణము, కాకినాడ మొదలగు పట్టణముల అభివృద్ధి యవి రాకపోకలకు కూడలి స్థానములైన తర్వాతనే జరిగినది. కర్నూలు, మహబూబునగరము పట్టణముల అభివృద్ధి ఆలస్యముగ ప్రారంభమగుటకు వానిగుండ రైలుమార్గము ఆలస్యముగ నిర్మింపబడుటయే కారణము. విజయనగరము నుండి నాగపూరుకు రైలు మార్గము నిర్మించి, విజయనగరమును కూడలిస్థానమొనర్చిన తర్వాతనే ఆ పట్టణ జనసంఖ్య అభివృద్ధి చెందినది. 50, 60 పండ్ల క్రిందట కుగ్రామములుగ ఉన్న తెనాలి, భీమవరము పట్టణములు రైల్వేలకు కాలువ మార్గములకు రోడ్లకు కూడలి స్థానములైన తరువాత సుమారు పదిరెట్లు పెరిగినవి. రైల్వేల తర్వాత రోడ్లు విస్తృతములై మారు మూలల గ్రామములను కూడ అభివృద్ధిలోనికి తెచ్చినవి.

పట్టణముల అభివృద్ధి కేవలము రాకపోకల సౌకర్యములపైననే ఆధారపడి యున్నదని భావింపరాదు. ఆయా పట్టణముల చుట్టుప్రక్కల నుండు భూములు, వ్యవసాయపు పద్ధతులు, పంటలు, ఖనిజ సంపద, వృక్ష సంపద, ప్రజల సిరి సంపదలు, జీవన పద్ధతులు మొదలగునాని ప్రభావములుగూడ గమనింపవలెను. ఆంధ్ర ప్రదేశ్‌లో కోస్తా ప్రాంతమునం దున్నన్ని పట్టణములు మెట్ట ప్రాంతములు అగు రాయలసీమ, తెలంగానాలయందు లేవు. కోస్తా, డెల్టా భూములు మిక్కిలి సారవంతములై, సాగుబడికి వసతిగలిగి, ఒక్కొక్క ఎకరము ఇతర ప్రాంతములకంటె నెక్కువ పంట పండించుటకు వీలగుటయు దానిమూలమున ప్రజలు సిరిసంపదలు గలిగి యుండుటయు ఇందుకు కారణము. సిరిసంపదలు గలిగినను, రాకపోకల సౌకర్యములు చక్కగా నేర్పడని ప్రాంతములలోని ప్రజలు ఇతర ప్రాంతముల వారితో సంబంధము లేర్పరచుకొనుటకుగాని జీవనమును ఆధునిక పద్ధతుల ప్రకారము నడపుకొనుటకు గాని అవకాశ ముండదు. కాబట్టి పట్టణములు అభివృద్ధి చెందవు. తెలంగానాలో నిజాంసాగరము ప్రాంతమును పరిశీలించినచో ఈ సంగతి సుబోధమగును. జనసాంద్రత ఎక్కువగా నున్న ప్రాంతములు సారవంతములైనప్పుడు పట్టణముల అభివృద్ధి రాకపోకల సౌకర్యములపై నెట్లు ఆధారపడి యుండునో గుంటూరు, విజయవాడ, రాజమండ్రిల చరిత్రను పరిశీలించిన విశద మగును.

రాజమండ్రి గోదావరి డెల్టా ముఖ ద్వారమున సారవంతమైన ప్రాంతముల మధ్య నున్న పరిపాలనా కేంద్రము. ఈ పట్టణమునుండి జిల్లాలోని ఇతర ప్రాంతములకు రోడ్లు, కాలువ మార్గములున్నవి; కాని రైల్వే కూడలిస్థానము కాదు. గోదావరినది జీవనదియై, దానిపై రోడ్డువంతెన లేకపోవుటనలన ఒక యొడ్డునుండి మరొక యొడ్డునకు రాకపోకలు చాలకష్టము. మరియు సారవంతమైన కోనసీమ నదీ పరివృతమై యుండుటవలన రాకపోకలు సులభముగ లేవు. ఈ లోపములు లేకున్నచో రాజమండ్రి జనసంఖ్య మరింత త్వరితముగ వృద్ధిజెంది యుండెడిది.

గుంటూరు పట్టణము మెట్ట, మాగాణి ప్రాంతముల కలయిక ప్రాంతములనుండి, రోడ్డు రైలుమార్గములకు కూడలిస్థానమైన పరిపాలనా కేంద్రము. కాలువ మార్గములు లేకపోవుటయేకాక, నీటి పారుదల వసతిలేని యత్యుష్ణప్రాంత మగుటవలన దీని అభివృద్ధి కొంతవరకు కుంటుపడినది.

విజయవాడ ఆంధ్రప్రదేశ్‌లో ముఖ్యమైన రైల్వే కూడలిస్థానము. కృష్ణానది డెల్టా ముఖద్వారము చెంతనుండుటయేగాక జిల్లాలోని ఇతర ప్రాంతములతోను, ఇతరజిల్లా కేంద్రములతో కాలువ, రోడ్లు మార్గముల ద్వారాకూడి రాకపోకల సౌకర్యము లుండుటవలన అభివృద్ధికి మిక్కిలి యనుకూలముగ నున్నది. అందువలననే పట్టణమునకాక ప్రక్కకొండలు, కొండభూమి యున్నను దీని అభివృద్ధి కుంటు పడలేదు.

పరిశ్రమలు స్థాపించుటకు, గనులు త్రవ్వుటకు, ప్రత్యేకావకాశము లుండుటవలన కొన్ని ప్రాంతములందు పట్టణములు వృద్ధిజెందును. ఆంధ్రప్రదేశ్‌లో సింగరేణి నేల బొగ్గు గనుల ప్రాంతమును ఇందుకు ఉదాహరణముగ తీసికొనవచ్చును. నూతన నౌకాశ్రయ నిర్మాణము, విశ్వవిద్యాలయ స్థాపనము, కాల్టెక్సు నూనెశుద్ధి కర్మాగార నిర్మాణము అయిన తర్వాత విశాఖపట్టణముకూడ ఇట్లే అభివృద్ధి చెందినది. నౌకానిర్మాణకేంద్ర మేర్పరచిన తరువాత ఈ యభివృద్ధి ఇతోధికమైనది. మరికొన్ని పరిశ్రమలు స్థాపించుటకు అవకాశముగల ఈ పట్టణమునకు ఉజ్జ్వల భవిష్యత్తు గలదు. ఉయ్యూరు, బోదన్, అనకాపల్లి, గూడూరు, ఎమ్మిగనూరు మొదలగు పట్టణములు ఆయా ప్రాంత పరిశ్రమల కేంద్రస్థానములగుట వలననే అభివృద్ధి చెందుచున్నవి. రాయలసీమ యందును పరిశ్రమ అభివృద్ధి

చెందినకొలది అచ్చట పట్టణముల సంఖ్యయు, జనాభాయు వృద్ధి కాగలవనుట నిస్సందేహము.

ప్రజలకు ఆరోగ్యమగు వాతావరణమును, జలప్రవాహములునుగల ప్రాంతములందు పట్టణము లభివృద్ధి చెందును. ప్రజల నుల్లాసపరచు ప్రాంతములకుకూడ జనులాకర్షింపబడుదురు; ఆంధ్రప్రదేశ్‌లో మదనపల్లి ఇట్టి వానిలో ముఖ్యమైనది.

ఆంధ్రప్రదేశ్‌నందలి పట్టణముల జనాభా గత 50 సంవత్సరముల లెక్కలను పరిశీలించిన కొన్ని పట్టణములు అభివృద్ధి చెందుటలేదని స్పష్టమగుచున్నది. మచిలీపట్టణము, నూజివీడు, తణుకు, నారాయణపేట, నిర్మల్, గద్వాల ఇందుకు ఉదాహరణములు. ఈ పట్టణములన్నియు ఒకానొకప్పుడు ప్రత్యేక కారణములవలన ఉచ్చదశనొంది ప్రస్తుతము ఆ ప్రత్యేక కారణముల ప్రాముఖ్యము తగ్గిపోవుటవల్ల అభివృద్ధిలేకుండ స్థంభించియున్నవి. ఇవిగాక కొండపల్లి, అత్తిలి, జగ్గయ్యపేట, రాజంపేట మొదలైన కొన్ని పట్టణములు గత 50 సంవత్సరములలో వాస్తవముగ క్షీణించెను. ఆంధ్రప్రదేశ్‌న తొలుదొలుత ఆంగ్లేయులు అడుగిడిన పెద్దపల్లి రేవు ఈనాడు ఒక గ్రామముగ మాత్రమే నిలిచియున్నది. వీనిలో ప్రతి పట్టణము క్షీణించుటకుగల కారణములు వివరముగ పరిశీలించుటకు ఇది తావుకాదు. కాని ఆధునికాభివృద్ధి జరుగుచున్న విధానములకును, మార్గములకును, పద్ధతులకును ఈ పట్టణములు ఏ విధముగను తోడ్పడక పోవుటవల్లనే ఇవి క్షీణించుచున్నవని చెప్పవచ్చును.

వ్యవసాయము, కుటీర పరిశ్రమలు భారీ పరిశ్రమలు దేశ ఆర్థికాభివృద్ధికి ముఖ్యాంగములు. ఇవి సమంజసముగ సమన్వయమై, సమగ్రముగ నభివృద్ధి చెందిననే దేశమున కార్థికముగ సౌష్ఠవము కలుగును. ఒకదాని అభివృద్ధి కుంటుపడి రెండవదాని అభివృద్ధి మిక్కిలిగ మించిన దేశము ఆర్థికముగ నభివృద్ధి చెందినను, సౌష్ఠవముగ నుండజాలదు. పారిశ్రామికముగ మిక్కిలి అభివృద్ధి చెంది వ్యవసాయ విషయములో వెనుకబడి యుండు బ్రిటన్ దేశమున జనాభాయందత్యధిక భాగము పట్టణ పరిశ్రమలలో పనిచేయుట వలన అందు కేంద్రీకృతమై యున్నది. పారిశ్రామికముగా వెనుకబడియున్న చీనా, భారతదేశములందు జనాభా విశేషభాగము గ్రామసీమ లందు కేంద్రీకృతమై యున్నది. కావున అటు పరిశ్రమ లభివృద్ధి చెందక, ఇటు వ్యవసాయముపై ఆధారపడి యున్న జనసామాన్యమునకు తగినంత భూవసతి లేక పోవుట వలన నవీన పద్ధతుల ప్రకారము వ్యవసాయమును నడిపించుటకు అవకాశములేక, దేశ సహజసంపదలు సక్రమముగ ఉపయోగింప బడక సర్వసంపదల కాకరమైన భారతదేశమున జనులు నిరుపేదలుగ జీవించ వలసిన గతి పట్టినది. భారతదేశముననేమి, ఆంధ్రప్రదేశ్ అననేమి పరిశ్రమలు ప్రజల యవసరములకు తగినంతగా ఇంతవరకు యభివృద్ధి చెందలేదు. మరియు పూర్వకాలపు కుటీర పరిశ్రమలు కూడ నాశనమైనవి. కాబట్టి ప్రజలందరును గత్యంతరములేక వ్యవసాయముపైననే ఆధారపడుట వలన దేశము, ప్రజలు కూడ బీదరికము ననుభవింప వలసి వచ్చినది. సర్వతోముఖ దేశాభివృద్ధికి తగినట్లుగా జనాభా పల్లెపట్టణప్రాంతములకు విభక్తమగుట అవసరము.

తెలుగు ప్రజలు గ్రామవాసులు; రాయలసీమ, తెలంగానాలలో రాకపోకల సౌకర్యములు వలసినట్లు లేక పోవుట వలనను, రాకపోకలు అభివృద్ధి చెందిన కోస్తా ప్రాంతభూమి కష్టపడక జీవనమును సాగించుట కనుకూలపడుటచే అందలి ప్రజలు సుఖలాలసు లగుటచేతను దేశమంతటను ప్రజలలో అక్షరాస్యత అల్పమై పరిశ్రమలు స్థాపించవలెననిగాని, ఇతర ప్రాంతములకుపోయి భృతి సంపాదించుకొన వలెనను ఆసక్తిగాని లేకపోవుట ఇత్యాది కారణముల వలన భారతదేశములోని ఇతర ప్రాంతముల కంటె ఆంధ్రప్రదేశ్‌లో పట్టణముల అభివృద్ధి గత 50 సం॥లోను సన్నగిలినది. ఆంధ్రప్రదేశ్‌కు దక్షిణమున నున్న తమిళులు తెలుగువారికంటె ఎక్కువగ పట్టణవాసులగుటకు కారణము వారి ప్రాంతములకు పైన చెప్పిన అంశములు వర్తింపక పోవుటయే.

భారతదేశము నందలి ఇతర ప్రాంతములకంటె మద్రాసు రాష్ట్రమందు పట్టణవాసులు ఎక్కువ మంది యనియు, సగటున పట్టణములందువలె గ్రామ జనాభా కూడ మద్రాసు రాష్ట్రముననే ఎక్కువయనియు జనాభా లెక్కల వలన తెలియుచున్నది. అయితే మద్రాసు రాష్ట్రములోని పట్టణవాసులందు తెలుగువారి కంటె తమిళుల సంఖ్యయే ఎక్కువ. అందువలననే ఉద్యోగములలోను, పరిశ్రమలలోను, రాజకీయరంగమునను వారు ముందడుగు వేసి యున్నారు. ఆంధ్రప్రదేశ్‌లోని కోస్తా ప్రాంతమున పట్టణముల సంఖ్య సగటున వాని జనాభా, పల్లెల సగటు జనాభా ఇతర ప్రాంతములందు కంటె హెచ్చుగ నున్నది. ఆయా ప్రాంతముల రాజకీయ చైతన్యము కూడ నట్లే యున్నట్లు విశదమగును. ఆంధ్రప్రదేశ్‌లోని తెలంగానా ఈ విషయమున ఇంకను వెనుకబడి వున్నది. ఇందుకు ముఖ్యకారణము తెలంగానాలో రాకపోకల సౌకర్యములు మిక్కిలి తక్కువగ నుండుటయే.

ఆంధ్రప్రదేశ్‌లోని కోస్తాప్రాంతమునందలి గ్రామములు కూడ సగటున ఆంధ్రప్రదేశ్‌లో ఇతర ప్రాంతమునందలి గ్రామములకంటె పెద్దవని కూడ తెలియు చున్నది. గ్రామము పెద్దదైన కొలది సాంఘిక జీవన పద్ధతులు, సాంఘిక చైతన్యము, విద్య, పారిశుధ్యము, వైద్య సౌకర్యములు, రాకపోకల యానుకూల్యములు వృద్ధిచెంది గ్రామ జీవనము ఎక్కువ సౌఖ్యప్రద మగును.

ఆధునిక పట్టణములందు జీవన సమస్యలు చాల జటిలములు. పట్టణములు ఒక నిర్ణీతమైన నమూనా ప్రకారము కట్టబడినవికావు. కాబట్టి వీథుల యునికియు, పారిశుద్ధ్యాది ముఖ్యాంశములును శోచనీయ స్థితియందున్నవి. కొన్ని పట్టణములలో పట్టణముల మధ్యనే ఫ్యాక్టరీలు నిర్మింపబడును. వాటిలో పనిచేయుటకు వివిధ ప్రాంతములనుండి వచ్చిన కార్మికుల నివాసములకు గుడిసెలు ఆ ఫ్యాక్టరీ చుట్టును కట్టబడుట వలన ఫ్యాక్టరీ పొగ, ధ్వని మొదలగువాని వలనను ఆ చుట్టు ప్రక్కల అనారోగ్య పరిస్థితులు కలుగుచున్నవి. పట్టణములలో కార్మికులు పల్లెలందలి రైతులకంటే బీదలుగను, అనారోగ్యవంతులుగను నుండుటచే అంటువ్యాధులు ప్రబలుటకు అవకాశము కలుగుచున్నది. ఇందువలన పట్టణ జీవనము కష్టదాయక మగుచున్నది. ఈ పరిస్థితులకు వెరచి ధనవంతులును విద్యాధికులును నగు పట్టణవాసులు జనసమ్మర్దమైన చోటులను విడచి, పట్టణ బహిర్భాగములందు క్రొత్త పేటలను విశాలముగను, ఆరోగ్యవంతముగను నిర్మించుకొని నివసించు చున్నారు. పట్టణ పరిపాలన సంస్థలలో వీటికి మిక్కిలి పలుకుబడి యుండుట వలన వీరు నివసించు క్రొత్త పేటలకే సౌకర్యము లధికముగ లభించి అభివృద్ధి యావశ్యకమైన భాగము లుపేక్షింప బడుచున్నవి. ఇంతేగాక పురపాలక సంఘములకు వాని పరిపాలన క్రింద నున్న పట్టణములను సర్వతోముఖముగ అభివృద్ధి చేయదగిన ఏర్పాట్లు గావించుటకు వలసిన ధన సంపత్తిగాని అధికారముగాని లేవు.

పాశ్చాత్య దేశములందు పట్టణముల అభివృద్ధి ఇటీవల ఒక నూతన మార్గము ననుసరించి నడచుచున్నది. శాసన రీత్యా క్రొత్త ఫ్యాక్టరీలు పట్టణము మధ్యగాక పట్టణ పరిసరములలో విశాలమైన స్థలములయందును నిర్మింపబడుచున్నవి. వాని సమీపముననే కార్మికుల నివాసమునకు వలసిన ఇండ్లు విశాలముగ కట్టబడుచున్నవి. ఇందు మూలమున పట్టణములు పరిశుద్ధములై ఆరోగ్యవంతము లగును. పట్టణము వెలుపల భూముల ఖరీదు కూడ తక్కువగ నుండును. కాబట్టి పరిశ్రమలకు పెట్టుబడి కూడ తగ్గును. ఆంధ్రప్రదేశ్‌లో కూడ పట్టణము లీ విధముగనే అభివృద్ధి చెందుచున్నవి. పట్టణములలో దారిద్ర్యమును, నేరములును, మరణములును చాల ఎక్కువ. విద్యాధికులేకాక కేవల విద్యాశూన్యులుకూడ పట్టణములందే కనిపింతురు. గ్రామ జీవనము సమష్టి కుటుంబమువంటిది. గ్రామస్థులు ఒకరితో నొకరు కలిసిమెలిసియుండి ఒకరి సమస్యల నొకరు గ్రహించి యొండొరులకు సహాయపడు చుందురు. వారు తమతమ పొలములలో దవ్వులనున్నను వారి మనస్సులు ఏకోన్ముఖముగనే ఉండును. గ్రామస్థుల మనస్సులవలెనే వారి ఉద్దేశమును కూడ ఏకోన్ముఖముగనే యుండును. గ్రామములో క్రొత్తరోడ్లుగాని, కాలువగాని, గ్రంథాలయముగాని నిర్మింపబడినది గ్రామస్థులందరికి సమానముగ హర్షదాయకమే యగును. సమానముగ ఉపయోగపడును; కాని పట్టణములలో అట్లుకాదు. బీదల పిల్లల సౌకర్యము కొరకు ఒక క్రొత్త పాఠశాల పెట్టవలెనన్న దానికి కావలసిన ధనము భాగ్యవంతులు పన్నులరూపమున చెల్లింపవలసి యున్నది. కాబట్టి వారికి కష్టము కలిగించును. గ్రామములలో అతిథులకు సర్వదా స్వాగతమే. పట్టణములలో సర్వమును తద్వ్యతిరేకమే. పట్టణముల జనులొకరి నొకరిని నొరసికొని సదా తిరుగులాడుచున్నను వారి మనస్సులు కలయిక మైళ్ళకొలది దూరమున నుండును.

గ్రామములకు పట్టణముల వలెనే స్థానిక స్వపరిపాలన సంస్థలున్నను, పట్టణములకే ఎక్కువ స్వపరిపాలనాధికారము లున్నవి. ప్రతి మునిసిపాలిటీయును ప్రజల నిత్య జీవనమునకు కావలసిన సదుపాయములు చేయవలెను. ప్రజల ఆస్తి, ప్రాణరక్షణలకు, పోలీసు, అగ్నిమాపకదళములు, ఆరోగ్యము కాపాడుటకు ఆరోగ్యశాఖ, విద్యాభివృద్ధికి విద్యాశాఖ, పట్టణాభివృద్ధికి ప్లాను వేయుటకు, రోడ్లు పారిశుధ్యము, మంచినీటి సరఫరా మొదలగువాని ఏర్పాట్లకు ఇంజనీరింగుశాఖ మొదలైనవి ఉండవలెను. కొన్ని పట్టణములలో గృహ నిర్మాణమునకు ధనసహాయము చేయుటకును, పట్టణవాసుల రాకపోకలకు ట్రాము, మోటారు మొదలగు రాకపోకల సౌకర్యముల నేర్పాటు చేయుటకును, అంగళ్ళను, హోటళ్ళను పెట్టవలసిన వస్తు సామగ్రులను సరఫరాచేసి భోజన వసతులను గలిగించుటకు కూడ మునిసిపాలిటీలు పూనుకొను చున్నవి. ఇట్టి మునిసిపాలిటీలు ఆంధ్రప్రదేశ్ మొత్తమున 65 కలవు. ఇందు జనాభాను, ఆదాయమును బట్టి 1, 2, 3 తరగతు లుండును. ఇవిగాక తెలంగాణాలో టౌన్ మునిసిపాలిటీ లనబడునవి సుమారు 60 కలవు.

సీ. సు. శ.

# రేవు పట్టణములు

ఆంధ్రప్రదేశ్ యొక్క సముద్రతీరము పొడవు సుమారు ఆరు వందల మైళ్ళు. ఇది శ్రీకాకుళము జిల్లాలోని ఇచ్ఛాపురము నుండి నెల్లూరు జిల్లాలోని సూళ్ళూరుపేట వరకు వ్యాపించి యున్నది. భారత దేశములోని రాష్ట్రము లన్నింటికిని సముద్ర తీరములేదు. సముద్ర తీరము గల ఆంధ్రప్రదేశ్ వంటి రాష్ట్రములకు ఒక ప్రత్యేకార్థిక బాధ్యత గలదు. మిగత రాష్ట్రములయొక్క విదేశ వ్యాపారమును కూడ ఇట్టి రాష్ట్రముల రేవు పట్టణముల ద్వారానే నిర్వహించవలసి యుండును. ఇదియొక విధముగా చూచినచో బాధ్యతగా కనిపించినను మరొకవిధముగా చూచినచో ఇదియొక ఆర్థికావకాశముగా చెప్పవచ్చును. రేవు పట్టణముల ద్వారా జరుగు వ్యాపారము వలన కొన్ని కొన్ని పన్నులు రాష్ట్ర ప్రభుత్వమునకు రావచ్చును. అంతేకాక ఇట్టి వ్యాపారమును పురస్కరించుకొని స్థాపింపబడు ఆర్థిక, పారిశ్రామిక, వాణిజ్య సంస్థల మూలముగా ఆంధ్రప్రదేశ్ ప్రజలకు ఆదాయము కూడ వచ్చును. ఈ విధముగా రాష్ట్రపు మొత్తము ఆదాయము వృద్ధి కాగలదు.

ఇంతేగాక సముద్ర తీరము కలిగియుండుటచే ఆంధ్ర ప్రదేశ్ మిగత రాష్ట్రములతో తీరయానము ద్వారా సరకులను రవాణా చేయగలదు. అనగా రైల్వేలు గాని మోటారు బస్సులకుగాని బదులుగా నౌకలను వినియోగించి కొంతవరకు అంతరరాష్ట్ర వ్యాపారమును నిర్వహించు అవకాశము గలదు. సాధారణముగా నీటిపై రవాణా, నేలపై రవాణా కన్న అల్ప వ్యయకారకముగా ఉండును. ప్రస్తుత పరిస్థితులలో ఈ అంశము అవాస్తవికమైనను, ఈ ప్రయోజకత సహజముగా సముద్రయానములో నున్నది. అందువలన కాలక్రమమున దూరయానావకాశములను ఆంధ్ర ప్రదేశ్ పూర్తిగా ఉపయోగించుకొన వచ్చును.

ఒకప్పుడు ఆంధ్రతీర మంతయు ప్రసిద్ధమైన రేవుపట్టణములతో విలసిల్లు చుండెడిది. ఉత్తరమున గంజాము జిల్లా† లోని బారువనుండి బర్మాతో రాకపోకలు సాగుచుండెడివి. బరంపురము సమీపముననున్న గోపాలపురము పెద్దరేవు పట్టణములలో నొకటిగా నుండెడిది. శ్రీకాకుళమునకు 17 మైళ్ళ దూరమున వంశధార నదీ ముఖమున నున్న కళింగపట్టణమున కొండగుట్టల పరిసరములలో నావలకు సహజ భద్రత యుండెడిది. విశాఖపట్టణము జిల్లాలోని భీమునిపట్టణమున తొలుదొల్త విశాఖపట్టణపు రేవు కన్న ఎక్కువ వాణిజ్యము జరుగుచుండెడిది. ఆ రేవు విజయనగరమునకు, పార్వతీపురమునకు, జయపురము మన్య ప్రాంతములకు దగ్గరగా నుండుటయే ఇందుకు కారణము. తూర్పు గోదావరి జిల్లాలోని కాకినాడవద్ద ధవళేశ్వరము నుండి ఒక కాలువయు, సామర్లకోట నుండి మరొక కాలువయు వచ్చి కలియుటచేత ఆ రేవు ప్రయోజనము మరింత హెచ్చినది. గోదావరి ముఖముననున్న కోరంగిరేవు వద్ద "రాయల్ నేవీ" నౌకలను మరమ్మత్తు చేయు నిమిత్తము 1802లో ఒక "వెట్ డాక్" నిర్మింపబడెను. బొంబాయినుండి కలకత్తా వరకు ఇచ్చట నున్నంతగా నైసర్గికానుకూలము లేకుండుటచే "వెట్ డాక్" ఇచ్చటనే నిర్మించబడినది. ఇచ్చట పూర్వము నౌకా నిర్మాణము కూడ జరుగుచుండెడిది.

కృష్ణా జిల్లాలోని మచిలీపట్టణము వృత్తాంతము ఆంధ్ర నౌకాయాన చరిత్రలో ఒక ప్రధానాధ్యాయము. 1672లో తూర్పు ఇండియా కంపెనీవారి "గ్లోబ్" నావ ఇచ్చటికి ప్రథమముగా వచ్చిన పాశ్చాత్యనౌక. 1870లో ఒక డొమినికన్ వర్తకుడు "ఇది కోరమాండల్ తీరమునకెల్ల ప్రసిద్ధమైన రేవు పట్టణ" మని వర్ణించినాడు. 1864లో బ్రహ్మాండమగు ఉప్పెన (చూ. ఉప్పెనలు) రేగి ఈ పట్టణమును చాల వరకు సముద్రము పాలుచేసినది. అప్పటినుండి ఇప్పటివరకు ఈ రేవు పట్టణము తిరిగి కోలుకొనలేదు.

ఇంగ్లీషువారు భారతదేశము తూర్పు సముద్రతీరమున ప్రప్రథమముగా 1611లో వర్తక వ్యాపార మారంభించిన మొట్ట మొదటిరేవు పట్టణము గుంటూరు జిల్లా తెనాలి తాలూకాలోని నిజాముపట్టణము. ఆనాడు ఇంగ్లీషువారు దీనిని "పెద్దపల్లి" అని వ్యవహరించు చుండిరి. ఒంగోలు సమీపమున నున్న కొత్తపట్టణము కూడ ప్రసిద్ధిలో నుండెడిది.

1903 - 4 లో ఈ పట్టణముల ఎగుమతి దిగుమతులీ విధముగా నుండెడివి :

| రేవులు | ఎగుమతులు (రూ.) | దిగుమతులు (రూ.) |
|---|---|---|
| బారువ | 13,000 | — |
| గోపాలపురము | 14,32,000 | 2,57,000 |
| కళింగపట్టణము | 6,00,000 | 12,000 |

† ఆకాలమున గంజాము జిల్లా తెలుగు ప్రాంతమున చేరి యుండెడిది.

| రేవులు | ఎగుమతులు (రూ.) | దిగుమతులు (రూ) |
|---|---|---|
| భీమునిపట్టణము | 32,17,000 | 9,79,000 |
| విశాఖపట్టణము | 17,00,000 | 5,00,000 |
| కాకినాడ | 1,67,31,000 | 38,73,000 |
| కోరంగి | — | — |
| మచిలీపట్టణము | 10,31,000 | 7,11,000 |
| కొత్తపట్టణము | — | — |
| నిజాముపట్టణము | 5,300 | 230 |

క్రమముగా ఈ రేవు పట్టణములు చాల క్షీణించినవి. కారణములు : 1. తుపానులు, సముద్రపు కల్లోలముల వల్ల నౌకాశ్రయములు, పట్టణములు నష్టపడుట. ఉదా : మచిలీపట్టణము, కోరంగి; 2. ఈస్టుకోస్టు రైల్వే నిర్మించిన పిదప సముద్రము మీదుగా జరుగు తీర ప్రాంత వ్యాపారము (coastal trade) తగ్గిపోవుట. ఉదా : భీమునిపట్టణము, కళింగపట్టణము ; 3. బకింగ్‌హాము కాలువ త్రవ్వుటవలన. ఉదా : కొత్త పట్టణము.

**విశాఖపట్టణము** : ఆంధ్రప్రదేశ్ యొక్క ప్రధాన రేవు పట్టణము విశాఖపట్టణము. ఇది ఆంధ్ర జిల్లాల కన్న మధ్యప్రదేశ్‌నకు ఎక్కువ ఉపయోగకరముగా నున్నది. అచటి నుండి వచ్చు మాంగనీసు ఖనిజము ఈ రేవు పట్టణము ద్వారా ఎగుమతి యగును. ఈ రేవుపట్టణము నుండి సాధారణముగా ఎగుమతి యగు వస్తువులు మాంగనీసు, నౌకల కొరకు నేలబొగ్గు, ముడి ఇనుము, బొగ్గు, పొగాకు, మిగతా బొగ్గు, నూనె గింజలు, నూనెలు, బెల్లము, జనపనార, పంచదార, ఎముకలు, జీడిపప్పు. ఈ ఎగుమతులలో మాంగనీసు, ఇనుము, పొగాకు మాత్రము సాధారణముగా విదేశములు చేరును. విశాఖపట్టణములో దిగుమతి యగు సరకులలో ప్రధానమైనవి గోధుమ, యంత్రముల ఇనుప పనిముట్లు, మొత్తము మీద దిగుమతుల కన్నను ఎగుమతులు చాల రెట్లుగా నున్నవి. ఈ రేవు పట్టణము ఇటీవలనే ప్రాముఖ్యము లోనికి వచ్చినది. విజయనగరము నుండి రాయపూరు రైలు మార్గము ఇటీవలనే వేయబడినది. ఈ రేవు పట్టణము ఇటీవల వరకును రైల్వే ఆధ్వర్యవమున నుండెను. ఇది యొక విధముగా దీని యభివృద్ధికి కారణభూత మాయెను. ఏలయన ఈ రేవు పట్టణపు వ్యాపారము కూడ హెచ్చు అయిన కొలది ఆ ప్రాంతపు రైల్వేయొక్క వ్యాపారము కూడ హెచ్చగును. ఇక ముందు విశాఖపట్టణము యొక్క ప్రాధాన్యము ఎక్కువ అగుటకు కొన్ని ముఖ్య కారణములను పేర్కొన వచ్చును - మధ్యప్రదేశ్, ఒరిస్సాలోని దక్షిణ ప్రాంతములలో పంచవర్ష ప్రణాళికల క్రింద ఇనుము వంటి పరిశ్రమలు అభివృద్ధి నందుచున్నవి. ఇందు మూలముగా ఈ రేవు పట్టణమునకు ఇకమీద దిగుమతి వ్యాపారములు ఎక్కువ కాగలవు.

మచ్‌ఖండ్, హీరాకుడ్ ప్రాజెక్టుల వలన ఈ ప్రాంతమునకు చౌకగా విద్యుచ్ఛక్తి లభించ గలదు. ఆ విధముగా విశాఖపట్టణము చుట్టు ప్రక్కల క్రొత్త పరిశ్రమలకు దోహదము కలుగును. విశాఖపట్టణమునందు కాల్టెక్సు ఆయిల్ రిఫైనరీ మొదలగు నూతన పరిశ్రమలు స్థాపింపబడుటచే ఈ రేవుపట్టణముయొక్క వ్యాపార ప్రాధాన్యము హెచ్చు కాగలదు.

**కాకినాడ** : ఆంధ్రప్రదేశ్‌లో విశాఖపట్టణము తర్వాత పేర్కొనదగిన రేవు పట్టణము కాకినాడ : ఇచ్చటి నుండి జరుగు ఎగుమతులు ముఖ్యముగా ముడి ఇనుము, తాటి యాకులు, ఎముకలు, పొగాకు, వేరుశనగ, పంచదార, బియ్యము మొదలగునవి. ముఖ్యముగా జరుగు దిగుమతి రసాయన ఎరువులు.

గత 5 సంవత్సరములలో జరిగిన ఎగుమతి దిగుమతుల పట్టిక దిగువ నీయబడినది : విశాఖపట్టణము.

| సంవత్సరము | దిగుమతులు టన్నులలో | ఎగుమతులు టన్నులలో | దిగుమతి సరకు విలువ రూపాయలలో | ఎగుమతి సరకు విలువ రూపాయలలో |
|---|---|---|---|---|
| 1955—56 | 1,682 | 3,62,530 | 8,770 | 1,03,70,738 |
| 1956—57 | 2,800 | 3,77,054 | 5,700 | 1,07,52,680 |
| 1957—58 | 34,929 | 3,10,638 | 58,80,000 | 5,55,76,000 |
| 1958—59 | 27,561 | 1,46,962 | 1,05,15,009 | 6,93,45,000 |
| 1959—60 | 44,367 | 1,37,534 | 79,02,515 | 5,86,54,299 |

గత 5 సం॥లలో రేవును ప్రవేశించిన నౌకలు, రేవునువదలిన నౌకలు క్రిందపట్టికలో ఇవ్వబడినది: విశాఖపట్టణము

| సంవత్సరము | ప్రవేశించినవి | | వదలినవి | |
|---|---|---|---|---|
| | నౌకలు | టన్నేజి | నౌకలు | టన్నేజి |
| 1955—56 | 156 | 5,00,206 | 175 | 4,87,932 |
| 1956—57 | 124 | 3,60,159 | 119 | 3,52,206 |
| 1957—58 | 121 | 4,47,802 | 135 | 4,53,280 |
| 1958—59 | 133 | 4,80,190 | 132 | 4,74,871 |
| 1959—60 | 141 | 4,33,627 | 118 | 4,37,388 |

ఈ రేవు అభివృద్ధి నిమిత్తము మొదటి పంచవర్ష ప్రణాళికలో ఖర్చుచేయబడినది రూ. 5,60,000. రెండవ ప్రణాళికలో జరిగిన అభివృద్ధి పథకముల క్రింద ఖర్చు రూ. 1,40,000. మూడవ ప్రణాళికలో కేటాయింపబడిన సొమ్ము రూ. 29,90,000.

మచిలీపట్టణము: స్థానిక ప్రాధాన్య మెక్కువగా నున్నను, కాలక్రమమున దాని వ్యాపారము తగ్గిపోయినది. ఇటీవల ముడి ఇనుము ఎగుమతి తీరయానపు ధాన్య వ్యాపారము తప్ప ఇచట ఎక్కువగా వాణిజ్యము జరుగుచుండుట అరుదు. మచిలీపట్టణము తరువాత దక్షిణముగా నున్న మద్రాసు రేవు పట్టణమునకు చాల దూరము కలదు. అందువలన ఇప్పటి కన్నను ఎక్కువగా ప్రాంతమునకు అందుబాటులో నుండుటయు, దీని విశిష్టత. నాగార్జునసాగరము ప్రాజెక్టు వలన ఈ రేవు పట్టణము యొక్క పోషకప్రాంతము (hinter land) ఇంకను యభివృద్ధి నందగలదు. మద్రాసులో దిగుమతియగు వస్తువులలో కొన్ని ఆంధ్రప్రదేశ్‌నకు చెందినవి. అనగా ముందు మద్రాసు రేవు పట్టణములో దిగుమతియై అవి క్రమముగా ఆంధ్రప్రదేశ్‌లోని అనేక ప్రాంతములకు రైల్వే పై రవాణా యగును. ఈ పరిస్థితిని మార్చవలయునన్నచో మచిలీపట్టణము వంటి రేవు పట్టణములను అభివృద్ధి చేయవలసి యుండును.

భీమునిపట్టణము*: ఆంధ్రప్రదేశ్‌లోని తర్వాత రేవు పట్టణము భీమునిపట్టణము. సాధారణముగా ఇచ్చట

గత 5 సంవత్సరములలో జరిగిన ఎగుమతి దిగుమతుల పట్టిక దిగువ నివ్వబడినది : మచిలీపట్టణము

| సంవత్సరము | ఎగుమతులు టన్నులలో | విలువ రూపాయలలో | దిగుమతులు టన్నులలో | విలువ రూపాయలలో |
|---|---|---|---|---|
| 1955—56 | 2,26,066 | 1,10,37,736 | — | — |
| 1956—57 | 2,70,817 | 1,51,66,752 | — | — |
| 1957—58 | 2,39,302 | 1,47,66,112 | 7,561 | 31,62,579 |
| 1958—59 | 1,55,832 | 83,11,040 | — | — |
| 1960—61 (ఫిబ్రవరి వరకు) | 80,437 | 87,11,478 | — | — |

ఎగుమతి - దిగుమతి వ్యాపారములు మచిలీపట్టణములో జరుగుటకు భౌతికముగా అవకాశము కలదు. ఇది ఆంధ్ర పాంతములో మధ్యగా నుండుటయు, తెలంగానా నుండి ఎగుమతియగు సరకు జనపనార (hemp) మొదలగు

* ఈ రేవు అభివృద్ధికిగాను ఇంతవరకు ఎట్టి పథకములును వేయబడలేదు.

రేవును ప్రవేశించిన నౌకలు, రేవునుండి వెడలిన నౌకలు : మచిలీపట్టణము.

| సంవత్సరము | వదలినవి | | ప్రవేశించినవి | |
|---|---|---|---|---|
| | నౌకలు | టన్నేజి | నౌకలు | టన్నేజి |
| 1955—56 | 31 | 1,05,957 | 32 | 1,10,191 |
| 1956—57 | 35 | 1,10,532 | 35 | 85,096 |
| 1957—58 | 40 | 1,49,209 | 39 | 1,46,321 |
| 1958—59 | 25 | 1,11,514 | 24 | 1,06,338 |
| 1959—60 | 32 | 1,21,462 | 33 | 1,26,136 |
| 1960—61 (ఫిబ్రవరి వరకు) | 33 | 1,22,577·80 | 33 | 1,29,492·27 |

నవి. దిగుమతులు చాల అప్రధానములు. 1955 నుండి ఇచ్చట దిగుమతులే లేవు.

గత 5 సం॥లలో జరిగిన దిగుమతుల పట్టిక భీమునిపట్టణము.

| సంవత్సరము | టన్నులలో | జనుపనార టన్నులలో | మొత్తము టన్నులలో | విలువ రూ॥లో |
|---|---|---|---|---|
| 1955-56 | 368 | 428 | 796 | 7,17,600 |
| 1956-57 | 232 | — | 232 | 2,10,958 |
| 1957-58 | 236 | 4,226 | 4,462 | 27,27,981 |
| 1959-60 | — | — | — | — |
| 1960-61 | — | — | — | — |

గత 5 సం॥లలో భీమునిపట్టణము రేవును ప్రవేశించిన నౌకలు

| సంవత్సరము | విదేశ నౌకలు | టన్నేజి | దేశీయ నౌకలు | టన్నేజి | మొత్తము టన్నేజి |
|---|---|---|---|---|---|
| 1955-56 | 2 | 7098 | 2 | 2455 | 9553 |
| 1956-57 | 1 | 4375 | — | — | 4375 |
| 1957-58 | 2 | 6812 | 5 | 14136 | 20948 |
| 1958-59 | — | — | 2 | 7188 | 7188 |
| 1959-60 | — | — | — | — | — |
| 1960-61 | — | — | — | — | — |

**కళింగపట్టణము :** ఇది శ్రీకాకుళము జిల్లాలో వంశధారానది ముఖద్వారమున గలదు. ఒకప్పుడు ఉచ్ఛదశయందుండిన ఈ రేవు ప్రాముఖ్యత నేడు మిక్కిలిగ క్షీణించి పోయినది. 1952 నుండి ఎటువంటి ఎగుమతులు గాని దిగుమతులుగాని ఇచ్చట జరుగలేదు. కేవలము రెండవ ప్రణాళికలో మాత్రము ఈ రేవు అభివృద్ధి నిమిత్తము రూ. 26,940 లు ఖర్చుపెట్టబడినది. ముఖ్యముగా సమీపమున నున్న విశాఖ రేవుపట్టణమువలన ఈ రేవు ప్రయోజనము గుర్తింపబడలేదు. అభివృద్ధికి ముఖ్యమగు పోషక ప్రాంతము (hinter land) గాని రైల్వే వసతి గాని ఈ రేవునకు లేవు.

ఆంధ్రప్రదేశ్ యొక్క రేవుపట్టణము లన్నింటి వ్యాపారమును పరిశీలించినచో వీటి దిగుమతుల కన్న ఎగుమతులే యధికముగా నున్నట్లు తోచును ; ఈ ఎగుమతులు ముడి సరకులకు సంబంధించినవిగా నున్నవి. ముందు ముందు ఇట్టి ఎగుమతులు తగ్గి ముడి సరకులు భారతదేశము లోనే పరిశ్రమలకు ఉపయోగించు అవకాశములు ఏర్పడ గలవు. మొత్తము మీద ఎగుమతి - దిగుమతుల మధ్య ఎక్కువ వ్యత్యాసము ఉండుటచే ఎగుమతులకు గాను ఎక్కువ నౌకలు కావలసి వచ్చుటచే ఆ నౌకలకు దిగుమతులను మోయు అవకాశము తక్కువ యగు చున్నది. దీని ఫలితముగా ఎగుమతులను తీసికొని పోవలసిన నౌకలు ఖాళీగా రేవు పట్టణమునకు వచ్చుట సంభవించును. ఇందు వలన నౌకల రవాణా వ్యయములు ఎక్కువగా నుండును. కావున ఈ రేవు పట్టణములకు చెందిన ప్రభుత్వశాఖలు ఈ విషయమును గమనించి ఎగుమతి - దిగుమతుల మధ్య వీలైనంతవరకు సమత్వముండునట్లు ప్రణాళికలు ఏర్పరచవలెను. ప్రతి రేవు పట్టణములోను ఎగుమతులు - దిగుమతులు రెండును సరిగా తులతూగక పోవచ్చును.

అయినను ఎంతవరకు పోలిక సాధ్యమో అంతవరకు దాని నొనగూర్చ వలెను.

ఆంధ్రప్రదేశ్ ప్రధానమగు రేవుపట్టణ మగు విశాఖ పట్టణములో ఇండియాలోని ఒకే ఒక నౌకా నిర్మాణశాల యున్నది. ఇది తొలుదొలుత సింధియా కంపెనీ వారు స్థాపించిరి. ఇటీవలనే దీనిని భారత ప్రభుత్వముచే తీసికొనబడి 'హిందూస్థాన్ షిప్ యార్డు' అను ప్రజా సంస్థగా నిర్వహింపబడుచున్నది. ఇచట ప్రస్తుతము సాలునకు సగటున రెండున్నర నౌకలు మాత్రమే నిర్మింపబడుచున్నవి. ఈ నిర్మాణపు ఖర్చులు అధికముగా నున్నవి. కాలక్రమమున ఈ నౌకా నిర్మాణ శాల ఆర్థికముగా నభివృద్ధి చెందవచ్చును. వే. వేం. రా.

# వ్యవసాయము

నేటివలెనే తెలుగుదేశము పురాతన కాలమునుండియు ప్రధానముగ వ్యవసాయముమీద ఆధారపడి యుండిన దేశము. ఆంధ్రప్రదేశ్‌లోని అధిక సంఖ్యాకులకు వ్యవసాయమే ముఖ్యవృత్తి. పురాతనకాలము నుండియు వేరు వేరు యుగములలో వేరువేరు రాజవంశముల ప్రభువులు అడవులు నరికించి క్రమముగ విశాల ప్రదేశములను వ్యవసాయమున కనువైన భూములుగ జేయుచు వచ్చిరి. అట్లు చేయుచు వచ్చినందువలననే నేడు ఆంధ్రప్రదేశ్ భూమిలో నధిక భాగము సేద్యముక్రింద నున్నది.

ముస్లిము చరిత్రల వల్లను, స్థానిక చరిత్రల వల్లను పూర్వము ఆంధ్రప్రదేశ్‌లో అధిక భాగము అరణ్యాక్రాంతమై యుండెనని తెలియుచున్నది. కర్నూలు జిల్లాలోని శ్రీశైల ప్రాంతమునందలి యడవిని వ్యవసాయ యోగ్యముగ చేసినది పల్లవాన్వయుడైన త్రిలోచన పల్లవ నామాంతరము గల ముక్కంటికాడు వెట్టి యనియు, ఓరుగంటి కాకతీయు లనియు స్థానికచరిత్రలు తెలుపు చున్నవి. కృష్ణానదికి దక్షిణమున అనేక బ్రాహ్మణాగ్రహారములు నెలకొల్పిన వాడు ఈ త్రిలోచన పల్లవుడే అని పరంపరగ వచ్చు గాథలు గలవు. త్రిలోచన పల్లవుని వలెనే చోళ వంశజుడైన కరికాల భూపతికూడ రాయలసీమలోని చాల ప్రాంతమును జన నివాసమున కనువైనదిగ జేసి గ్రామములను నిర్మించెనని చెప్పు గాథలును కలవు. ఎట్లయిన నేమి, ఆంధ్రప్రదేశ్‌లోని వివిధ ప్రాంతములు పాలించిన భూవరులు కొంత - కొంత భూమిని సేద్యములోనికి తెచ్చుచు కృషి యోగ్యమైన భూమియొక్క విస్తీర్ణమును పెంపొందించుచు వచ్చిరి.

పూర్వము సేద్య భూమిని గడతో కొలుచుట వాడుక. వేరువేరు దేశములలోను ప్రాంతములలోను వేరువేరు గడలు వాడుకలో నుండెను. సాధారణముగ కాకతీయ యుగమునను రెడ్డిరాజ్య కాలమునను వాడుకలో నుండినది పదునారు మూరల గడ. దీనికి 'కేసరిపాటి' గడ యని పేరు.

మహమ్మదీయుల పాలనలో భూమి కొలతకు గడ పోయి 'పగ్గము' వచ్చినది. సాధారణముగ ఆంధ్రప్రదేశ్‌లో భూమి కొలుచుటకు వాడుకలో నుండినది పదునారు బారల పగ్గము. బ్రిటిషు పరిపాలనలో పగ్గము పోయి భూమిని కొలుచుటకు 'గొలుసు' వచ్చినది.

నేల సారమును బట్టియు, రకమును బట్టియు భూములకు పన్ను విధించుట పరిపాటి. తటాకాదులనుండి పారు నీటివలన సాగగు భూమికి 'నీరునేల' అనియు, వర్షాధారమున మెట్ట పంటలు పండు భూమికి 'వెలిచేను' అనియు పూర్వము పేర్లు. నీరు నేలకు, వెలిచేనుకు కొలతలోను, పన్ను విధించుటలోను వ్యత్యాస ముండెను.

సాధారణముగ వ్యవసాయము పూర్వకాలములో వర్షముమీదనే ఆధారపడి ఉండెను. ఎవరికైనను పూర్వపు రాజులు భూమిని దానము చేయునపుడు ఇన్ని నాగళ్ళ భూమి యనియు, ఇన్ని విత్తనములు పట్టు భూమి యనియు చెప్పి దానమిచ్చెడివారు. నదుల దగ్గరను, ఏళ్ళ దగ్గరనున్న భూమిని వానిలోనుంచి త్రవ్విన కాలువల నీటిచే పండించువారు. చెరువుల క్రిందను బావుల క్రిందను సేద్యము జరుగుచుండెను. సాగరములు సముద్రములు అనుపేర గొప్ప చెరువులను త్రవ్వించి తెలుగుదేశములో వ్యవసాయ మభివృద్ధి చేసినవారు ఓరుగల్లు రాజధానిగ పరిపాలించిన కాకతీయులును, విజయనగరము రాజధానిగ పరిపాలించిన విజయనగరాధీశ్వరులును. కాకతీయ భూవరులు పాలించిన తెలంగానాలో ఇట్టి తటాకములు పెద్దవిగాని, చిన్నవిగాని సహస్రములు కలవు. ఇందువల్ల అది తటాకమండల మని పేరుపడినది. కాకతీయుల ననుసరించి కొండవీటి రెడ్డిరాజులును, విజయనగరాధీశ్వరులును గూడ గొప్ప తటాకములను నిర్మించి వ్యవసాయము నభివృద్ధిజేసి తెలుగుదేశమును సుభిక్షము కావించిరి.

ఆంగ్ల ప్రభుత్వ కాలమున ముఖ్య నదులకు గొప్ప ఆనకట్టలు నిర్మింపబడి కోనసీమ ప్రాంతములందలి సైకత స్థలములు సైతము సస్యశ్యామలములుగ చేయబడినవి.

కాలక్రమమున ప్రభుత్వోద్యోగములందలి వ్యామోహము వలన ప్రజలు కృషి విషయమునను, గృహ పరిశ్రమల విషయమునను అశ్రద్ధవహించిరి. మొదటి ప్రపంచ యుద్ధానంతరము (1919) ఆంధ్రావనిలో అన్నవస్త్రాదులకు కరవైనది. వానికై విదేశములపై ఆధారపడవలసిన పరిస్థితు లేర్పడినవి. 'అధికాహారోత్పత్తి' యే ఇందుకు తరుణోపాయమని ప్రభుత్వోద్యోగులు, ప్రజలు ఏకాశయముతో సహకరించి ఆధునిక శాస్త్ర పద్ధతుల నవలంబించి కృషిచేసి క్లిష్ట పరిస్థితుల నధిగమింప గలిగిరి. భారత స్వాతంత్ర్యానంతరము (1947) దేశాభ్యుదయమునకై తయారైన ప్రథమ, ద్వితీయ, తృతీయ పంచవర్ష ప్రణాళికలలో వ్యవసాయోత్పత్తికి కూడ ప్రముఖ స్థాన మీయబడినది.

### ఆంధ్రప్రదేశ్‌లోని పంటలు

| | | |
|---|---|---|
| మొత్తము విస్తీర్ణము | 6,66,80,868 | ఎకరములు |
| సాగు విస్తీర్ణము | 3,03,98,501 | ,, |
| నీటిపారుదల సౌకర్యముగల భూమి | 79,07,157 | ,, |
| జనాభా | 35,97,999 | ,, |

వ్యవసాయము ముఖ్యవృత్తిగ గలవారు 80%.

ఆహారపు పంటలు: ఆంధ్రప్రదేశ్ నవధ్యానములను, పలువిధములైన ఫలశాకములను పండించి స్వయంపోషకముగ నుండగల పంటభూమి, పరులకుగూడ ఇంత పెట్టగల పుణ్య భూమి. 'అన్నపూర్ణ' అనబడు ఆంధ్రగడ్డ, వ్యవసాయ సౌభాగ్యము అపారము. ఏటేట సుమారు 3 కోట్ల 6 లక్షల ఎకరములలో 329 కోట్ల రూపాయల విలువగల 106 లక్షల టన్నుల ఫలసాయము పండించుచున్న భాగ్యసీమ ఆంధ్రప్రదేశ్.

ఆంధ్రప్రదేశ్‌లో వర్షాధారమున పండవలసిన విస్తీర్ణ మెక్కుడగుట వలన జొన్న, గంటి, రాగి, కొఱ్ఱ, వరిగ వంటి 'చిరుధాన్యములు' ప్రధానస్థానము నాక్రమించును. ఇవి సుమారు కోటి 15 లక్షల ఎకరములలో పైరగుచు, 21 లక్షల టన్నుల పంట నిచ్చుచున్నవి. వరి, గోధుమలవంటి 'తృణధాన్యములు' నీటి సౌకర్యములు గల ప్రాంతములలో 72 లక్షల 65 వేల ఎకరములలో సాగగుచున్నవి. 31 లక్షల 70 వేల టన్నుల ధాన్యముల నిచ్చుచున్నవి. ఆంధ్రప్రదేశ్ తిండిగింజల నెగుమతి చేయుచు అన్య రాష్ట్రములలో తన ఫలసాయమునకు గణన సంపాదించు కొన్నది. కాయధాన్యములు (పప్పు దినుసులు) 32 లక్షల 56 వేల ఎకరములనుండి 2 లక్షల 74 వేల టన్నులు లభించుచున్నవి. మిర్చి, పసుపువంటి 'మసాలా దినుసులు' 6 లక్షల, 59 వేల ఎకరములనుండి 4 లక్షల, 17 వేల టన్నులు ఉత్పత్తి యగుచున్నవి.

| ఆంధ్రప్రదేశ్‌లో ముఖ్యమైన పంటలు | విస్తీర్ణము (వేల ఎకరములలో) | పంట (వేల టన్నులు) | విలువ (లక్షల రూ॥లు) |
|---|---|---|---|
| 1. తృణధాన్యములు (వరి, గోధుమ, మొక్కజొన్న మొ॥) | 72,65 | 31,70 | 128,32 |
| 2. చిరుధాన్యములు (జొన్న, చోడి, గంటె, చామ మున్నగునవి) | 1,15,32 | 20,91 | 48,13 |
| 3. కాయధాన్యములు (పప్పు దినుసులు) | 32,56 | 2,74 | 8,78 |
| 4. మసాలాద్రవ్యములు (మిర్చి మున్నగునవి) | 6,59 | 4,17 | 28,94 |
| 5. చెఱకు | 1,75 | 5,18 | 15,68 |
| 6. పండ్లు | 2,82 | 9,62 | 7,04 |
| 7. కూరగాయలు | 2,15 | 3,28 | 3,96 |
| మొత్తము 'ఆహార పంటలు' | 2,35,84 | 77,60 | 240,85 |
| 8. నారపంటలు – ప్రత్తి | 10,05 | 21 | 3,01 |
| 9. నారపంటలు – ఇతరములు (గోగు, కాశిగోగు మొదలగునవి) | 2,10 | 57 | 2,92 |
| 10. నూనెదినుసులు – వేరుశనగ | 30,64 | 10,70 | 38,13 |
| 11. నూనెదినుసులు – ఇతరములు (నువ్వు, ఆముదము మొదలగునవి) | 18,63 | 1,74 | 9,69 |
| 12. మత్తు ద్రవ్యములు – పొగాకు | 3,95 | 1,31 | 23,61 |
| 13. ,, తమలపాకులు | 26 | 80 | 3,53 |
| 14. ఆహారేతరములు (పశుగ్రాసము, పచ్చిరొట్ట, పైరులు మొ॥) | 4,42 | 13,45 | 6,12 |
| మొత్తము 'వాణిజ్య పంటలు' | 70,50 | 28,78 | 87,01 |
| మొత్తము పంటలు | 3,05,89 | 1,06,38 | 3,27,86 |

# ఆంధ్రప్రదేశ్ - వ్యవసాయోత్పత్తి

| పంటల విస్తీర్ణము వేల ఎకరములు | పంట | దిగుబడి వేల టన్నులు | విలువ లక్షల రూపాయలు |
|---|---|---|---|
| 88 | ఇతర నార పంటలు | 10 | 15 |
| 1005 | ప్రత్తి (పింజదూది) | 21 | 301 |
| 251 | ఇతర నూనె గింజలు | 25 | 106 |
| 88 | కొబ్బరి | 34 | 288 |
| 201 | చిల్లర పంటలు | 40 | 43 |
| 122 | జనుము | 47 | 278 |
| 668 | నువ్వులు | 52 | 313 |
| 856 | ఆముదములు | 62 | 263 |
| 45 | పసుపు (పదును చేసిన) | 71 | 354 |
| 6 | తమల పాకులు | 80 | 353 |
| 436 | మిర్చి (ఎండు) | 111 | 1555 |
| 395 | పొగాకు (పదును చేసిన) | 131 | 2361 |
| 20 | అరటి | 160 | 50 |
| 46 | ఉల్లి | 169 | 228 |
| 34 | నిమ్మజాతి | 172 | 86 |
| 84 | ఇతర ఫలములు, కూరజాతులు | 188 | 212 |
| 178 | ఇతర మసాలా ద్రవ్యములు | 236 | 985 |
| 3256 | పప్పు దినుసులు | 274 | 878 |
| 175 | చెఱకు (గుర్) | 518 | 1568 |
| 194 | మామిడి | 581 | 484 |
| 3064 | వేరుశనగ (కాయలు) | 1070 | 3813 |
| 5755 | ఇతర ఆహార ధాన్యములు | 1081 | 2376 |
| 6314 | జొన్న | 1131 | 2784 |
| 359 | మేత, పచ్చి ఎరువు | 1325 | 609 |
| 6728 | వరి | 3050 | 12485 |

**ఆంధ్రప్రదేశ్‌లో మొత్తము**

3 03 69 వేల ఎకరములు    10 638 వేల టన్నులు    32 73 890 లక్షల రూపాయలు

ఆహారపంటలు 2,33,83,785 ఎక॥

ఆహారేతరపంటలు 69,85,405 ఎక॥

తృణధాన్యములు

వరి
67,28,400 ఎక॥

మొక్కజొన్న 4,67,800 ఎక

గోధుమ 60,000 ఎ

చిరుధాన్యములు

జొన్న
63,14,300 ఎక॥

సజ్జ
16,10,800 ఎక॥

ఇతర చిరుధాన్యములు
36,16,085 ఎక॥

కాయధాన్యములు

పప్పుదినుసులు
32,56,300 ఎక॥

ఇతర ఆహారపంటలు

మసాలాద్రవ్యములు
6,58,700 ఎక॥

చెఱకు 1,75,000

పళ్లు
2,81,300 ఎక॥

కూరగాయలు
2,15,100 ఎక॥

వాణిజ్యపంటలు

ప్రత్తి
10,05,400 ఎక॥

ఇతర నారపంటలు
2,10,005 ఎక॥

వేరుశెనగ
30,64,200 ఎక॥

ఇతర నూనెగింజలు
18,62,800 ఎక॥

పొగాకు
3,94,900 ఎక

ఇతర ఆహారేతర పంటలు
4,48,000 ఎక

ఆంధ్ర ప్రదేశ్‌లో పంటల పరస్పర ప్రమాణము

**పండ్లు, కూరగాయలు :** ఫలవృక్షములు, కూరగాయలు విడివిడి తోటలుగాను, చిన్న ఖండములుగాను ఉండుటచే వీని విస్తీర్ణపు లెక్కలు సరిగా లభింపకున్నవి. మామిడి, పనస, చీని, బత్తాయి నారింజ, అరటి, సపోటా, జామ, ద్రాక్షవంటి చాల రకముల పండ్లును, అన్ని రకముల (నాటు, విదేశీ) కూరగాయలును, దుంపలును ఆంధ్ర ప్రదేశ్‌లో పైరగుచున్నవి. వీని విస్తీర్ణము ఇంకను విరివిగా పెరుగుటకును, పర్యత్తులు మున్నగునవి చేయుటకును అవకాశము లున్నవి. విటమినులు, ఖనిజ ద్రవ్యములు మున్నగు ఆరోగ్యరక్షక పదార్థములు గల్గ ఈ పంటలు హెచ్చించుటలో ఆంధ్రులు మరింత శ్రద్ధ తీసికొనవలసి యున్నది. ప్రస్తుతము ఆంధ్రప్రదేశ్‌లో 2 లక్షల 82 వేల ఎకరములలో ఫలవృక్షములును, 2 లక్షల 15 వేల ఎకరములలో కూరగాయలును పైరగుచున్నట్లు తెలుచున్నది. వీని ఫలసాయము క్రమముగ 9 లక్షల 62 వేల టన్నులు, 3 లక్షల 96 వేల టన్నులని అంచన.

**వాణిజ్యపు పంటలు :** ఆహారపు పంటలతోబాటు ప్రత్తి, వేరుశనగ, పొగాకు మున్నగు వాణిజ్యపు పంటలుగూడ ఆంధ్రప్రదేశ్‌లో పండించుచున్నారు. ఇట్టి ఆహారేతరము లగు పంటలు సాలినా మొత్తముమీద సుమారు 70 లక్షల 50 వేల టన్నులు పండుచున్నవి. రాయలసీమ, తెలంగానా ప్రాంతముల నల్లనేలలును, ఎర్ర నేలలును, కోస్తాజిల్లాల ఒండ్రు నేలలును వీనికి చక్కగా అమరినవి. ఆంధ్ర ప్రదేశ్‌లో ప్రత్తిపంట విస్తీర్ణము 10 లక్షల 5 వేల ఎకరములు; పంట దిగుబడి 21 వేల టన్నులు. శ్రీకాకుళము, విశాఖపట్టణము ప్రాంతములలో జనపనారయు, గుంటూరు ప్రాంతములో గోగునారవంటి 'ఇతరములైన పంటలు' 2 లక్షల 10 వేల ఎకరములలో పైరగుచు, 57 వేల టన్నుల నారను ఉత్పత్తి చేయుచున్నవి. వేరుశనగ పంట విస్తీర్ణము 30 లక్షల 64 వేల ఎకరములు, పంట 10 లక్షల 70 వేల టన్నులు. ఆముదము, నువ్వులు, కొబ్బరి వంటి ఇతరములైన నూనెపంటల విస్తీర్ణము 18 లక్షల 63 వేల ఎకరములు; పంట 1 లక్ష 74 వేల టన్నులు. పొగాకు (నాటురకము, సిగరెట్టు పొగాకు రి) 3 లక్షల 95 వేల ఎకరములలో పైరగుచున్నది; పంట ఒకలక్ష 31 వేల టన్నులు.

**ఇతర ఆహారేతర పంటలు :** ఇవిగాక పశుగ్రాసము, తమలపాకులు, నీలిరంగు, పచ్చిరొట్టవంటి వివిధములగు పంటలు 4 లక్షల 68 వేల ఎకరములలో పైరగుచున్నవి.

ఆంధ్రప్రదేశ్‌లో ముఖ్యముగ ఐదు తరగతుల నేలలున్నవి. (చూడు : నేలలు, పుట 1251.)

**వ్యవసాయపు కార్తెలు :** ఆయా ప్రాంతములందలి శీతోష్ణ పరిస్థితులు, వర్షపాతములనుబట్టి పంటకాలము భేదమై యుండును. పంటకాలములు నాలుగు ముఖ్యమైనవి కలవు :

1. పొడి (జనవరి - మార్చి) నెలలు : ఈ కాలమున వర్షము లుండవు; ఉన్నను బహు స్వల్పముగానుండి పశువుల బీళ్ళలో పచ్చిక పట్టుటకును, ఎండిపోవు జలాశయములలో కొద్దిగ నీరు చేరుటకును ఉపకరించును.

2. వేసవి (ఏప్రిల్ - మే) నెలలు : వేసవిలో తొలకరి వానలు కురియును. ఇవి తగుమాత్రమున్నచో మెట్ట భూములు పదనుబడి దుక్కికు ఉపకరించును.

3. నైరృతి ఋతుపవనముల కాలము (జూన్ - సెప్టెంబరు) : ఆంధ్రప్రదేశ్‌లో విస్తార భాగమున వర్షములు హెచ్చుగా కురియును. పడమటి కనుమలలో కురియు వర్షముల వలన గోదావరి, కృష్ణా నదులు జలభరితములై ప్రవహించును.

4. ఈశాన్య ఋతుపవనముల కాలము (అక్టోబరు - డిసెంబరు) : ఇది ఆంధ్రప్రదేశ్ దక్షిణప్రాంతపు జిల్లాలకెక్కువ వర్షము నిచ్చుచు, అచ్చటి తటాకముల క్రింద భూములు సాగుకు తోడ్పడుచున్నది.

మొత్తముమీద వర్షపాతము తెలంగానా జిల్లాలలో, నల్గొండప్రాంతమున, సాలుకు 54 దుక్కులనుండి, ఆదిలాబాదు, వరంగల్లులలో 83 దుక్కులవరకు మారుచుండును. ఇచ్చట నైరృతి ఋతుపవనపు వర్షములే హెచ్చు. విశాఖపట్టణము, గోదావరి మన్యపుప్రాంతములలో సాలుకు సగటున నూరు దుక్కులుండును. గోదావరి, కృష్ణా డెల్టాలలో 75 - 85 దుక్కులును (ఇందు విస్తారముగ నైరృతి ఋతుపవనపు వర్షములు), గుంటూరు, కృష్ణా, కడప (రాజంపేట) మెట్ట ప్రాంతములలో 60 - 80 దుక్కులును, నెల్లూరు, చిత్తూరులలో 60 - 70 దుక్కులును (ఇందు సగముపాలు ఈశాన్య ఋతుపవనపు వర్షములు), అనంతపురము, కర్నూలు (ఆదోని, ప్రత్తికొండ ప్రాంతములు), కడప (పులివెందల, జమ్మలమడుగు, కోవెలకుంట్ల) ప్రాంతములలో 40-50 దుక్కులును ఉండును. ఈ వర్షపాతమును బట్టి, విశిష్టమగు పంటకార్తె లున్నవి. కోస్తా జిల్లాలలో (ఏప్రిల్ - మేల నుండి జూన్ - ఆగష్టుల వరకు) 'పునాస' పంటలు వేయుదురు. ఆగష్టునుండి డిసెంబరు వరకు 'పెద్దపంట' కాల మనియు, నవంబరునుండి మార్చి వరకు, 'పైరు' కాల మనియు అందురు. రాయలసీమలో జూన్ నుండి అక్టోబరువరకు ముందుకార్తిని 'ముంగారి' చల్లకములు జరుగును, ఆ వెనుక (సెప్టెంబరు - మార్చి) కాల

మును) 'హింగారి' అందురు. తెలంగానా ప్రాంతీయులు ఈ కార్తులను 'రాబీ' (వేసవి), 'కారిఫ్' (శీత) కాలము లని విభాగింతురు.

సాగు పద్ధతులు : ఏ ప్రాంతమందలి సాగుపద్ధతులైనను అచ్చటి భూములు, పంటలు, నీటి వసతులు, వర్ష పాతము, భూస్వామి తాహతులను బట్టి మారుచుండును. రాయలసీమ వంటి మెట్టప్రాంతపు రైతులు విస్తారముగ వర్షాధారమున పంటలు పండించవలెను గనుక, బహుశ్రద్ధతో పడిన వర్షపు నీటిని పంటలకొరకై భూమిలో నిలువ యుంచుటకై చక్కటి సాగుపద్ధతుల నవలంబింతురు. ఒక పంట పోయిన మరొక పంటయైనను ఫలించునని 2, 3 పంటలు మిశ్రమసేద్యముగ వరుసలలో విత్తుదురు. నీరు సమృద్ధిగా గల డెల్టాప్రాంతములలో జాగరూకత తక్కువ ఇసుక నేలలు నిస్సారము లగుటచే ఈ ప్రాంతపు రైతులు ఎరువులు చేర్చుట, నీరు పోయుటయందు చాలశ్రద్ధ తీసికొందురు. మరనాగళ్ళు ఇటీవల కొద్దికొద్దిగ ఉపయోగము లోనికి వచ్చుచున్నను, వ్యవసాయపు పనులకు పశువులే ఆధారము. మొత్తముపై ఆంధ్రప్రదేశ్ రైతులందరకు మిశ్రమ పంటల లాభములు, ఏకేట పంటలు మార్చుట యందలి అంతరార్థములు, ఆయా సాగుక్రియల ఫలితములు అనుశ్రుతముగా ఎరుకయే. అహోరాత్రములు కష్టించి కృషి పనులు సాగింతురు. ఐనను తమ అనుభవములను, ఆధునికశాస్త్ర పరిశోధనల సారాంశములను వినియోగించుకొని ఇంకను హెచ్చుపంటలు పండించుటకై ఉత్సాహముతో కృషిచేయుట కవకాశమున్నది.

వ్యవసాయపు పనిముట్లు: ఆయా సాగు క్రియల కనువగు పనిముట్లు సూక్ష్మములో మోక్షము నివ్వగలవి నిర్మించుటలో రాయలసీమ రైతులు సిద్ధహస్తులు. తెలంగానాయును, రాయలసీమ మండలములును తగినవర్షము, నీటి వనరులు విరివిగా లేమిచే వెనుకబడిన వందురుగాని వ్యవసాయములో మాత్ర మిచ్చటి రైతు అగ్రగామి. ఇచ్చట పంటలు వర్షాధారమున పండించవలెను. ఈ ప్రాంతములు తరచు కాటకములకు గురియగు చుండుటచే డబ్బున కిబ్బంది, కూలీలు దొరకుట కష్టము, పై నుండి వర్షము పడిన పడును లేదా లేదు దాని చిత్తము. అందు చేత ఇచ్చటి కర్షకులు దున్నుట, విత్తుట, నాటుట, కలుపు తీయుట మున్నగు పనులకై చక్కటి పనిముట్లు తయారు చేసికొనిరి. గుంటక (సాగు పనిముట్టు), గొర్రు, (విత్తుట కుపకరించునది), తొల్మిక, పాపటము, దంతి (కలుపుతీయుటకు పనిముట్లు) ఇట్టివి గొప్ప అనుభవముపై తయారు చేయబడినవి. 'గడ్డగడ్డకు ముంతెడు నీళ్ళు త్రాగియైనను రెడ్డియే సేద్యము చేయవలె'నను నానుడి ఇందు వలననే కలిగినది. డెల్టా ప్రాంతములలో దున్నుటకు విస్తారముగా కర్ర నాగలి నుపయోగింతురు. నీరుతోడు గిలక, మోటల పనికూర్పు, ఏ రకపు రవానాకైనను రమ్యముగ నమరు నాటుబళ్ళు, త్రవ్వుటకు త్రవ్వుకోల, చెక్కుటకు పార, కోతకు కొడవలి మున్నగు కర్షకుల పనిముట్లు విదేశయంత్ర పరికరములతో పోల్చి చూచినప్పుడు నిరాడంబరము లయ్యును, ఇప్పటికిని ఆయా పనులకు పెట్టినది పేరు.

ఎరువులు : అతి పురాతన కాలము నుండియు ఆంధ్రప్రదేశ్ రైతులకు తెలిసినది పశువుల ఎరువు. ఇది బిడ్డకు తల్లిపాలవలె సస్యములను పోషించును. ఐనను పేడతోపాటు అంతకంటెను సారవంతమగు మూత్రమును సేకరించుట యందు రైతులకు శ్రద్ధ తక్కువ. ఇంకను గొర్రెలపెంట, గానుగపిండ్లు, పాటిమన్ను, ఎముకలపొడి, పచ్చిరొట్ట మున్నగు ఎరువులు కూడ లభించినంత వరకు వారు సద్వినియోగ పరచుచున్నారు. ఇటీవల చెత్త చెదారములను చివుకబెట్టి చేయు కంపోష్టు (చీకుడు) ఎరువు కూడ ప్రాముఖ్యములోనికి వచ్చినది. ఇది పశువుల గెత్తము (ఎరువు)తో తుల్యమైనది. ఇంకను రాసాయనికపు ఎరువుల వాడుక వ్యవసాయశాఖ వారి ప్రచార ఫలితముగ ఏకేట ప్రబలు చున్నది. ఆహారములో రకరకముల పదార్థము లెట్లావశ్యకమో మొక్కలకును పలు రకముల ఆహార పదార్థములు కావలెను. ఇందు నీరు, హైడ్రోజని, ఆక్సిజని, కార్బన్ డైయాక్సైడ్, సున్నము, మగ్నీషియము, పొటాషువంటివి మొక్కకు సులువుగ దొరకునుగాని, తరచుగ నేలలో నైట్రోజని, భాస్వరము, హ్యూమస్ (సేంద్రియ పదార్థములసారము) లోపించును. ఇవన్నియు కలిసియున్నదే సమగ్రమైన ఎరువు. 'నైట్రోజని' ఆకు ఎదుగుటకు ఆవశ్యకము. 'భాస్వరము' గింజ కట్టుటకు పంట రాలుటకు తోడ్పడును. 'హ్యూమస్' నేలలో భౌతిక జీవ రాసాయనిక ప్రక్రియలను సవ్యముగ నుంచుటకును, (జంతువులకు విటమినులవలె) మొక్కలకు ఆగ్జిమోనులను సరఫరా చేయుటకును అత్యవసరము. అమ్మోనియ సల్ఫేటులో నత్రజని యున్నది. సూపరు ఫాస్ఫేటులో భాస్వరమున్నది. ఎముకలపొడి, గానుగపిండ్లలో ఈ రెండునుఉన్నవి. జంతు, వృక్ష సంబంధమైన పదార్థమేదైనను నేలకు చేర్చి చీకనిచ్చినచో అది చీకి పైన తెలిపిన 'హ్యూమస్' సరఫరా చేయగలదు. అందులకే పశువుల ఎరువు, పచ్చిరొట్ట, కంపోష్టులవంటి సేంద్రియపు ఎరువులతో చేర్చి కృత్రిమపు ఎరువులు వాడినప్పుడు మంచి

ఫలితములు లభించును. సాధారణముగ సహజమైన ఎరువులు పంటకు ముందు దుక్కిలో వేసి కలియదున్నుదురు. కృత్రిమపు ఎరువులు పంటలకాలములో వేయుదురు.

నీటి వనరులు: ఆంధ్రప్రదేశ్‌లో గల నీటి సౌకర్యములలో ప్రభుత్వపు పంట కాలువలే ప్రధానమైనవి. ఇవి గోదావరి, కృష్ణా, కడప, కర్నూలు మున్నగు ప్రాంతముల కుపకరించు చున్నవి. చిత్తూరు, అనంతపురము, నెల్లూరు జిల్లాలలోను, కొంతవరకు కడప, కర్నూలు జిల్లాలలోను, తెలంగాణాలోను తటాకముల క్రింద, నూతుల క్రింద కొంత సేద్యము జరుగుచున్నది. వాపీ, కూప, తటాకాదుల నిర్మాణములు, వృక్షములు నాటుట మున్నగు బహుజనోపయోగ కరమైన పనులను పూర్వులు అతిదూర దృష్టితో, 'సప్త సంతానము' లందుచేర్చి ప్రజాక్షేమంకరులైరి.

ప్రభుత్వకాలువలవల్ల 31,28,624 ఎకరములు

సొంతకాలువలవల్ల 63,571 ఎకరములు

చెరువులవల్ల 26,38,636 ఎకరములు

బావులవల్ల 7,02,915 ఎకరములు

ఇతర నీటివనరులవల్ల 2,54,194 ఎకరములు



ఆంధ్రప్రదేశ్–వివిధ రకముల నీటి వనరులక్రింద సాగగు విస్తీర్ణము

ఆంధ్రప్రదేశ్‌లో వివిధ నీటి వనరులక్రింద సాగగు భూమి విస్తీర్ణము క్రింద చూపబడినది:

| వివరము | | ఎకరములు |
|---|---|---|
| 1. ప్రభుత్వ కాలువలు | .... | 31,28,624 |
| 2. రైతుల స్వంతకాలువలు | .... | 63,571 |
| 3. చెరువులు | .... | 26,38,636 |
| 4. బావులు | .... | 7,02,915 |
| 5. ఇతర నీటి వనరులు | .... | 2,54,194 |
| మొత్తము నీటిపారుదల విస్తీర్ణము | | 67,87,940 |

మొత్తము సాగగుభూమి విస్తీర్ణములో (3,03,98,501 ఎకరములు) సుమారు నాలుగవ వంతునకు మాత్రమే నీటి పారుదల సౌకర్యమున్నది. మిగిలిన దంతయు వర్షాధారపు సాగు భూమియే. అందువల్లనే తరచుగ కాటకములు కలుగుచున్నవి. వాటి నివారణ కొరకే ప్రస్తుతపు ప్రాజెక్టులును, ప్లానులును తలపెట్ట బడినవి:

వ్యవసాయాభివృద్ధి: ఆంధ్రప్రదేశ్‌నందు ప్రజలకు వ్యవసాయము ముఖ్యవృత్తి. వ్యవసాయము సామాన్య కృషికాదు; పంచ భూతములతో పని; ఇది శాస్త్రపరిశోధనల సమ్మేళనము. శాస్త్రజ్ఞులు ఇందలి ప్రకృతి రహస్యములను సూక్ష్మముగ శోధించుట వలనను, కొంత వరకు సాధించుట వలనను ప్రపంచములోని దేశములు కొన్ని తమ వ్యవసాయమును అపూర్వముగ అభివృద్ధి చేసికొన్నవి. అదియే అనుసరించదగిన మార్గము.

1891 లో డాక్టరు వాల్కర్ అను వ్యవసాయ రసాయన శాస్త్రజ్ఞుడు వ్యవసాయాభివృద్ధికి సలహాలిచ్చుటకై భారతదేశ మంతటను పర్యటించెను. 1928 లో రాయల్ కమీషను ఈ విషయమును ఇంకను నిశితముగ పరీక్షించినది. 'రాయలసీమ రైతుకు కావలసిన నీరు, ఎరువులను సమకూర్చినచో ఇతడు తన కృషి నపూర్వముగ సాగింపగల నేర్పరి' అని రాయలసీమ రైతు ప్రశంస నందెను. ఇతని పద్ధతి, పనిముట్లను కమీషనువారు ప్రశంసించిరి. అయినను ప్రస్తుత కాలము శాస్త్రయుగము. శాస్త్రపరిశోధనల ఫలితముల నూతగగొని నూతన పద్ధతిని కృషిసల్పినచో అభివృద్ధి కెంతయో అవకాశమున్నది. ఇట్టి శాస్త్రపరిశోధనలకై భారతదేశములో 1905 లో బీహారులోని పూండిలో అమెరికా నివాసి, హెన్రీ ఫిప్సు విరాళముతో వ్యవసాయశాస్త్ర పరిశోధనాలయమును నిర్మించిరి. ఇది 1934 లో వచ్చిన భూకంపముల వలన చెడగా దీనిని న్యూఢిల్లీకి మార్చిరి. దేశములో అందందు అనేక ప్రాంతములలో ప్రాంతీయ పరిశోధనాలయములు, ఫారములు నెలకొల్పబడినవి. ఆంధ్రప్రదేశ్‌లో కూడ ఇట్టి పరిశోధనా క్షేత్రములు అనకాపల్లి, సామర్లకోట, మార్టేరు, నంద్యాల, కోడూరు, రాజేంద్రనగరులలో కలవు. ఈ పరిశోధనాలయములలో జరిగిన పరిశోధన ఫలితములను అనుభవములోనికి కొంత తెచ్చుకొనుట వలననే 'అధికాహారోత్పత్తి' ఉద్యమమును, పంచవర్ష ప్రణాళికలను అతి జయప్రదముగ సాగించి సాధింప గలిగితిమి. దుర్భిక్ష పరిస్థితులను సుభిక్ష పరిస్థితులుగ మార్చగలిగితిమి.

అభివృద్ధి పద్ధతులు: వివిధ పంటలలో ప్రవీణులైన శాస్త్రజ్ఞులు రాష్ట్రమందు అందందుగల ఫారములలో నున్నారు. వీరు వ్యవసాయాభివృద్ధికి నిరంతరము కృషి సలుపుచుందురు. వీరి పరిశోధనలలో తేలిన సారాంశములను రైతులకు తెలియ చెప్పుటకు ప్రత్యేక శిక్షణగల సిబ్బందిగలదు. తత్ఫలితముగ ముఖ్యముగ వరి, చెఱకు, జొన్న, ప్రత్తి, మిర్చి, వేరుశనగ, పండ్లు మున్నగు పైరు




1. వలయములు : ప్రతి పంటకు విస్తీర్ణత సూచించును ; 2. ఆహారపంటలు : అంకెలు జిల్లా మొత్తము సాగులో విస్తీర్ణ నిష్పత్తి సూచించును.

ఆంధ్ర ప్రదేశ్ – వ్యవసాయపు పంటల వ్యవస్థ.

పంటలలో వ్యవసాయదారు లిప్పుడు సాగుచేయుచున్న రకములను సాగు, ఎరువువేత, నీరుపోత, పురుగులు తెగుళ్ళ నివారణలో అవలంబింప వలసిన పద్ధతులను రైతులకు విశదపరుచ బడినవి, పడుచున్నవి. వ్యవసాయ శాస్త్రములలో శిక్షణ నిచ్చుటకు బాపట్లలో వ్యవసాయ కళాశాల కలదు. ఒక ప్రాంతపు రైతుల మంచి అనుభవములను మరొక ప్రాంతము వారికి తెలుపుటకును, శాస్త్ర పరిశోధనల సారాంశమును సామాన్య రైతులకు సుబోధకమగునట్లు తెలియజెప్పుటకును వ్యవసాయ విషయిక పత్రికలు కృషి సలుపుచున్నవి.

అనుగుణమైన ఇనుప నాగళ్ళు, పనిముట్లు, పరిశోధన జరిపి అభివృద్ధి చేసిన మేలురకపు విత్తనములు, హెచ్చు పంటలనిచ్చు ఎరువులు వీనితోబాటు ఏ ఎరువు ఏ పంటకు ఎంత, ఎప్పుడు, ఎట్లు వేసిన లాభదాయకము అను సలహాలును, పురుగులు, తెగుళ్ళ నివారణోపాయములతో పాటు మారణోపాయములు ఇటువంటి అమూల్యమైన సంగతులను రైతుల కందిచ్చుటకు వ్యవసాయశాఖవారు కృషి సలుపుచున్నారు. రైతుల పొలములలో కృషిచేసి చూపించుచున్నారు. 'జపాను వరి సాగు పద్ధతి', అమ్మోనియా సల్ఫేటు, సూపరు ఫాస్ఫేటు, యూరియావంటి రసాయనికపు ఎరువుల వాడుక, తెగుళ్ళ కీటముల బాధ నివారణ విధానములు తెలియుటచే తమ పొలముల నుండి రైతులిప్పుడు పంటలు ఇంతకు ముందుకంటె హెచ్చు దిగుబడిని పొందుచున్నారు. మరనాగళ్ళు, నీరు తోడు యంత్రములు అద్దెకిచ్చియు, వాయిదాలపై చెల్లించు పద్ధతిని సప్లయి చేసియు, వడ్డీలేని తక్కావి అప్పులు (విత్తులు, ఎరువులు కొనుటకై) ఇచ్చియు, వ్యవసాయ శాఖవారు రైతులకు సహాయము చేయుచున్నారు. ఇవి గాక ఇతర పరిశ్రమలగు తేనెటీగల పెంపకము, పండ్లు కూరగాయల సాగు, కోళ్ళ పెంపకము, పాడి పశువుల పెంపకము మున్నగు వానినిగూర్చి సలహాల నిచ్చుటకు ప్రత్యేక ప్రచారశాఖ ఒకటి కలదు. కె. భూ.

# ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రములు

రైతులు అభివృద్ధికరమైన పద్ధతులను అనుసరించి పంటలను అభివృద్ధి చెయుటకు అనువగు మార్గములను గూర్చియు, వ్యవసాయమునకు ఉపయోగించు ఇతర విషయములను గూర్చియు పరిశోధనలు జరుపుటకు ప్రభుత్వము ఆంధ్రప్రదేశ్‌నందు పలు స్థలములలో వ్యవసాయ పరిశోధక క్షేత్రములు, ప్రదర్శన కేంద్రములు స్థాపించిరి. అట్టివి సర్కారు, రాయలసీమ, తెలంగానా ప్రాంతములందు మొత్తము 58 వ్యవసాయ క్షేత్రములు కలవు.

వరి : వరిపంటకు సంబంధించిన విషయములను పరిశోధించుటకు అనకాపల్లి, పూళ్ళ, మార్టేరు, లాం, మచిలీపట్టణము, బాపట్ల, కాళహస్తి, సంగారెడ్డి, రాజేంద్రనగర్, వరంగల్లు, కమలాపురము, బుచ్చిరెడ్డి పాలెము, రుద్రూరులలో పరిశోధన క్షేత్రములు కలవు. ఈ క్షేత్రములలో మేలురకము వరి వంగడమును పరిశోధించి ఉత్పత్తి చేయుట, వరికి సంబంధించిన తెగుళ్ళనుగురించి పరిశోధించి నివారణోపాయములను కనుగొనుట మొదలుగాగల విషయములపై పరిశోధనలు జరుపుచున్నారు. సామర్లకోట, మార్టేరు కేంద్రములలో అభివృద్ధి పరచిన వరి వంగడములను ఆంధ్రప్రదేశ్ యంతటను, ముఖ్యముగ గోదావరి డెల్టాలో హెచ్చుగ పైరు చేయుచున్నారు. పూళ్ళ కేంద్రము కొల్లేరు ప్రాంతములోని మునకప్రదేశములలో పైరు చేయుటకు అనువగు వరి వంగడములను కనిపెట్టుటకు నెలకొల్పబడినది. నెల్లూరు, రాయలసీమ ప్రాంతములలో విశేషముగనుండు కాటుక తెగులుకు తట్టుకొనగల వరి వంగడములను ఉత్పత్తి చేయుటలో బుచ్చిరెడ్డిపాలెము కేంద్రము జయము సాధించినది. ఇచట తయారైన బి. సి. పి. 1, బి. సి. పి. 2 వరివంగడములను రైతులు విశేషముగ పైరు చేయుచున్నారు. మామూలు గాలిపాటునుబట్టి గాలిలోనుండు తేమనుబట్టి ఈ ప్రాంతములలో 5% నుండి 50% వరకు ఈ తెగుళ్ళకు లోనై మానుగాయగా నష్టమగుచున్నది. ఈ క్రొత్త వంగడములలో ఎట్టి పరిస్థితులలోను నష్టము 15% లకు మించదు. హిమాయత్‌సాగర్‌లో 'హెచ్. ఆర్. 12' అను వరివంగడము కనిపెట్టబడినది; చాలమంది రైతులు దీనిని విరివిగ వాడుచున్నారు.

ఫలజాతులు : ఫలజాతులకు సంబంధించిన పరిశోధన కొరకు కోడూరు, రంప చోడవరము, బాపట్ల, రుద్రూరు, గిద్దలూరు, సంగారెడ్డి, వరంగల్లులోని చెల్వాయ్, శ్రీకాకుళములందు పరిశోధన క్షేత్రములు గలవు. కడప జిల్లాలోనున్న కోడూరు క్షేత్రములో పండ్లతోటకు సంబంధించిన పరిశోధనలు జరుగుచున్నవి. ఇచట ఫలవృక్ష పరిశోధన క్షేత్రము, ఫలోత్పత్తి పరిశోధన స్థానము గూడ గలవు. ఇందు మొదటి దానిలో ఫలవృక్షములను పెంపొం

దించుట, ఎన్నికగన్న రకములను పరీక్షించుట మొగ్గంట్లు, కొమ్మంట్లు కట్టుట, మేలైన నారుమొక్కలను, తోటసాగు పద్ధతులను నిర్ణయించుట మున్నగు విషయములపై పరిశోధనలు జరుగుచున్నవి. రెండవ కేంద్రమగు ఫలోత్పత్తి క్షేత్రములలో పండ్లను వానినుండి తయారగు వివిధ పదార్థములను భద్రపరచుట, పర్బత్తును తయారుచేయుట, ఫలరసములను డబ్బాలలో నిలువచేయుట మొదలగు పెక్కు అంశములపై పరిశోధనలు జరుగుచున్నవి. దక్షిణ భారతములోనున్న ఫలక్షేత్రములలో ఇది పెద్దది కోడూరు వ్యవసాయ కేంద్రములో సాత్‌కుడి (బత్తాయి), నారింజ, మాపుడిపండ్ల తోటలకు సంబంధించిన పరిశోధనలుకూడ జరుగుచున్నవి. ఇప్పుడు ఆంధ్రప్రదేశ్ మొత్తము 15,000 ఎకరములలో బత్తాయి, నారింజ తోటలున్నవి. వాటిలో 9,000 ఎకరములు తోటలు ఒక్క కడప జిల్లాలోనే ఉన్నవి. ఈ నారింజలు, చీనీ, సాత్‌కుడి, బత్తాయి అను అనేక పేర్లతో రాష్ట్రమంతట ప్రసిద్ధి చెందినవి. సంగారెడ్డి వ్యవసాయ పరిశోధక క్షేత్రమందు సపోటా, దానిమ్మ, జామ, మామిడి మొదలగు ఫలజాతుల పెంపకమునుగూర్చి జయప్రదముగ పరిశోధనలు జరుపబడుచున్నవి. గిద్దలూరు నందుగల ఆదర్శఫలస్థానము నందు మామిడి, చీనీ, సపోటా, జీడిమామిడి, ద్రాక్ష, ఉసిరి మొదలగు ఫలవృక్షములను గురించి పరిశోధనలు జరుపుచున్నారు. బాపట్లలో జీడిమామిడి పరిశోధన కేంద్రము కలదు.

చెఱకు : అనకాపల్లి రుద్రూరు, బాపట్ల క్షేత్రములలో చెఱకుపంటకు సంబంధించిన పరిశోధనలు కొనసాగించుచున్నారు అనకాపల్లి క్షేత్రములలో రైతులు బాగుగా అభిమానించు పంచదార చెఱకు వంగడనులు కనిపెట్టబడినవి. ఆంధ్రప్రదేశ్ యంతటను ఈ రకములనే రైతులు పొలములలో నాటుటకు వాడుచున్నారు. రుద్రూరు గ్రామకేంద్రములో చెఱకుపంట అభివృద్ధినిగూర్చి పరిశోధనలు జరుపు చున్నారు. (సి. ఓ. 419) నంబరుగల దిండి చెఱకు ఉత్తమమని ఇచట అనుకొనబడి, ఆయా ప్రదేశములలో పైరు చేయబడుచున్నది. బోదన్‌లోగల వ్యవసాయ పరిశోధనా కేంద్రములలో చెఱకుతెగుళ్ళ నివారణగూర్చి, అట్టి పురుగుల సంహారమునుగూర్చి పరిశోధనల సాగించుచున్నారు.

జొన్న : జొన్నపంటను గురించి పరిశోధన చేయుటకు విజయనగరము, ఒంగోలు, లామ్ (గుంటూరు), ఎమ్మిగనూరు, నంద్యాలలలో క్షేత్రములు గలవు. వీటిలో చేర్చబడిన జొన్న వంగడములు, రాలికలోను, తెగుళ్ళను తట్టుకొనుటలోను, నాణ్యములోను ప్రసిద్ధి చెందినవి. హిమాయత్ సాగర్‌లో '35-1' వంగడము కనిపెట్టబడినది. ఇది చాల గణనీయమైనది.

ప్రత్తి : లామ్, నంద్యాల, నర్సారావుపేట, ఎమ్మిగనూరు, మధోల్, ఆదిలాబాదులలో ప్రత్తి పరిశోధన కేంద్రములు గలవు. ఆదోని కేంద్రమువారు ప్రవేశపెట్టిన 'లక్ష్మి' అను పేరుగల పొడుగు పింజప్రత్తి ప్రసిద్ధమైనది. కర్నూలు, కడప, అనంతపురము జిల్లాలలోని రైతులు ఈ లక్ష్మి ప్రత్తిని ఆదరించుచున్నారు. నర్సారావుపేట కేంద్రము ముఖ్యముగా కాకినాడ ప్రత్తి అనబడు రంగు ప్రత్తి పరిశోధనకు ఉద్దిష్టమైనది. మధోల్‌లో 'కాటన్ బ్రీడింగ్ స్టేషన్' గలదు. ప్రొద్దుటూరులో కాంబోడియా ప్రత్తినిగురించి పరిశోధనలు జరుగుచున్నవి. ఆదోని కేంద్రమున ముంగారిప్రత్తి మేలు గుణములనుగూర్చి పరిశోధనలు జరుగుచున్నవి.

నూనె గింజలు : నూనె గింజలకు సంబంధించిన పరిశోధన కేంద్రములు సంగారెడ్డి, దిండి, రాజేంద్రనగర్, వరంగల్లులలో గలవు. సంగారెడ్డి, హిమాయత్ సాగర్, దిండి కేంద్రములలోను, నూనెవిత్తులపై జరిగిన పరిశోధనల ఫలితము హెచ్. సి. 5 అను ఆముదపు విత్తులు మేలు రకములని నిర్ణయము జరిగి విరివిగ ప్రచారములో నున్నవి. మచిలీపట్టణము, రుద్రూరులందు వరి భూములకు అనువగు వేరుశనగ, వంగడములను గురించి పరిశీలన జరుగుచున్నది.

కాయ ధాన్యములు : వరంగల్లు, బాపట్ల, పెద్దాపురము, రాజేంద్రనగర్ కేంద్రములలో కందులు, ఉలవలుగూర్చి పరిశోధనలు జరుగుచున్నవి. ఇందు ముఖ్యముగ 33 నంబరు ఉలవలపై పరిశోధనలు జరుపుచున్నారు.

పొగాకు : పొగాకు పంటలకు సంబంధించిన విషయములపై మధిరలోను, హిమాయత్ సాగర్‌లోను గల వ్యవసాయ పరిశోధక క్షేత్రములలో పరిశోధన జరుగుచున్నది. వరంగల్లు, బూరుగంపాడు, అలంపూర్‌లలోను ఎక్స్‌ప్లోరేటరీ పొగాకు రిసర్చి స్టేషనులు క్రొత్తగా స్థాపించిరి.

మొక్కజొన్న : మొక్కజొన్నల విషయమై కరీంనగరము, అంబర్‌పేట, బోదన్‌లలోగల వ్యవసాయ పరిశోధన క్షేత్రములలో (హెచ్. ఎం. 1) మేలురకపు మొక్కజొన్న వంగడములని నిర్ణయించిరి. ఈ వంగడములు విరివిగ ప్రచారములో గలవు. అంబర్‌పేటలోని క్షేత్రములో సంకరజాతి (క్రాస్‌బ్రీడ్) మొక్కజొన్న గురించి విరివిగా పరిశోధన జరుగుచున్నది.

మిర్చి : వీటిని గురించి లామ్, సంగారెడ్డి, సిరిగుప్ప కేంద్రములలో పరిశోధన జరుగుచున్నది. లామ్ క్షేత్ర

మందు 398 నంబరు మిరపకాయలు కనుగొన బడినవి. ఇవి ఆంధ్రప్రదేశ్‌లో చాల ప్రసిద్ధి కెక్కినవి.

కూరగాయలు : బాపట్ల, అరకులోయ, సంగారెడ్డి, కాళహస్తి, సీతంపేట, శ్రీకాకుళము కేంద్రములలో కూరగాయలను గురించి పరిశోధనలు జరుపుచున్నారు. పెదపాలెము కేంద్రములలో పసుపుకు సంబంధించిన విషయమును గూర్చి పరిశోధనలు జరుపుచున్నారు.

చిరుధాన్యములు : శ్రీకాకుళము, అరకు లోయ, పెద్దాపురము, విజయనగరము, సిద్ధౌట్, ఒంగోలులలో చిరుధాన్యములకు సంబంధించిన పరిశోధన క్షేత్రములు గలవు.

భూసారములను గురించియు, వివిధ పైరులకు కావలసిన నత్రజని, పొటాష్ భాస్వరములు, వాటి నిష్పత్తి విషయములను గూర్చియు ఇతర యెరువులను గూర్చియు రాజేంద్ర నగర్ క్షేత్రములో పరిశోధన జరుగుచున్నది. మరియు సున్నపు భూములలో ప్రతి సంవత్సరము మార్చవలసిన పైరుల విషయమును గూర్చి కూడ ఈ క్షేత్రము నందు ప్రయోగములు చేయుచున్నారు.* సి. వెం. రా.

* అంబాజీ పేటలోని కొబ్బరి పరిశోధన కేంద్రము, రాజమండ్రి కేంద్ర పొగాకు పరిశోధన సంస్థ; రాజోలులోని జీవనిరోధక కేంద్రము.

# పశుసంపద

వ్యవసాయమునకు పశుపోషణ వెన్నెముక వంటిది. అందువల్లనే 1929 వ సంవత్సరమున రాయల్ కమిషన్ వారు తమ నివేదికలో ‘ఎడ్లులేనిదే సాగు సాధ్యపడదు; పంటల నింటికి చేర్చుట కూడ కష్టతర’ మని నుడివిరి. పశువులు పంటలకే గాక పాడికి కూడ ఉపయోగపడుచున్నవి. ‘కవ్వమాడినను కదురాడినను కరవుండ’ దను నానుడి ఇందువలనే కలిగినది.

మేలుజాతి పశువులకు తెలుగు దేశము ప్రసిద్ధి చెందినది. సుప్రసిద్ధ జాతులలో ‘ఒంగోలు’,‘మాల్వి’,‘కృష్ణలోయ’ జాతులు ముఖ్యమైనవి. ఆంధ్రప్రదేశ్‌లో 19,123 వేల పశువులున్నవి. వీనిలో 12,745 వేల పశువులు సర్కారు, రాయలసీమ జిల్లాలలోను, 63,70 వేలు తెలంగాణాలోను ఉన్నవి. ఇవిగాక ఈ సంఖ్యల వివరణలో 45 లక్షలు పని చేయు ఎద్దులు చేరియున్నవి. పై తెలిపిన వివరముల దృష్ట్యా పశుసంపద తెలుగు దేశములో చాల అధికమని తెలియుచున్నది. ఇవిగాక 111·2 లక్షల గొర్రెలు, 51·7 లక్షల మేకలు, 0·68 లక్షల గుర్రములు, 117·5 లక్షల కోళ్ళు గలవు. వీని ఆర్థికపు విలువ కనుగొనుట చాల కష్టము. కాని వీనినుండి తయారగు వివిధ వస్తువుల విలువను కనుగొనవచ్చును.

ఆంధ్రప్రదేశ్‌లో సాలీనా 11.637 లక్షల టన్నుల పాలు ఉత్పత్తి యగుచున్నవి. అందులో 10 లక్షల టన్నుల పాలు సర్కారు, రాయలసీమలలోను, 1·6 లక్షల టన్నులు తెలంగాణాలోను ఉత్పత్తి అగుచున్నవి. ఈ పాల యొక్క ఆర్థికపు విలువ రూపాయికి రెండు శేర్లు లేక నాలుగు పౌనుల ప్రకారము విలువ కట్టినను సుమారు 63 కోట్ల రూపాయలు ఆదాయము లభించును. ఆంధ్రలో ఉత్పత్తి యగు ధాన్యపు విలువకంటె పాల విలువ ఎక్కువగా ఉన్నది. ఇది గాక తోళ్ళు, కొమ్ములు, ఎముకలు, మాంసము మున్నగు వాటివల్ల కూడ ఆదాయము వచ్చుచున్నది. ఎక్కువగా ఆంధ్రప్రదేశ్ ముడి తోళ్ళు మద్రాసుకు కొనిపోబడి అచట పదును చేయబడి విదేశములకు ఎగుమతి యగుచున్నవి. ఇక తెలంగాణానుండియే సుమారు 27 లక్షల రూ॥ల విలువ గల తోళ్ళు ఎగుమతి అగుచున్నవి. తోళ్ళ పరిశ్రమ అభివృద్ధి పరచిన ఆంధ్రప్రదేశ్ ఆర్థికస్థితి బాగుపడును.

ఎద్దులు రైతులకు ప్రాణము వంటివి. ఆంధ్రప్రదేశ్‌లో పశువులు ఎక్కువగా వ్యవసాయపు పనుల కొరకు పోషింపబడుచున్నవి. కాని వీని పనిపాటల విలువ ఇంతయని ధన రూపములో నిర్ధారణగా చెప్పలేము. ఆంధ్రప్రదేశ్‌లో పని చేయు ఎడ్లు 45 లక్షలు కలవు. వీని కనీసమైన విలువ ఈ క్రింది విధముగ అంచనా వేయవచ్చును. ఒక జత ఎద్దులతో ఒక ఎకరమును దున్ని విత్తులు వేసి పంటను ఇల్లు చేర్చుటకు కనీస మిరువది రూపాయ లగుననుకొన్నను పది ఎకరముల పొలము గల రైతుకు ఈ జతవలన 200 రూపాయల విలువ గల పని జరుగుచున్నది. అగునేని 22½ లక్షల జతల ఎడ్ల విలువ 45 కోట్ల రూపాయలగు ననుటలో సందేహములేదు. భూసారమును పెంపొందించుటలో కూడ పశువులు చాల తోడ్పడుచున్నవి. సాలీనా ఒక్కొక్క పశువు 10 రూపాయల విలువగల మూడు టన్నుల ఎరువు నిచ్చునని యనుకొనినచో సుమారు 19 కోట్ల రూపాయలు విలువగల సత్తువ ఈ 19·123 వేల పశువులనుండి లభించును. కాని పేడ చాల వరకు ఆంధ్రప్రదేశ్‌లో పిడకలుగ వంటచేయుటకై ఉపయోగింపబడుచున్నది. కనుక దానివలన పూర్తి లాభమును పొందుట దుర్లభము.

పశువుల నుండియే కాక కోళ్లు, గొర్రెలు, మేకలనుండి లభించు మాంసము, గ్రుడ్లు, ఉన్ని, ఎరువు మొదలగు వస్తువులకు వెల కట్టి చూచిన వాని మూలమున కొన్ని కోట్ల రూపాయల ఆదాయము లభించునని అంచనా వేయ వచ్చును.

## పాలపరిశ్రమ

ఆంధ్రప్రదేశ్‌లో అనాదినుండి వచ్చుచున్న పరిశ్రమలలో పాల పరిశ్రమ ఒకటి. ఇది ముఖ్యముగా కుటీర పరిశ్రమగా పరిగణింప బడుచున్నది. ప్రస్తుతము ఈ పరిశ్రమ సక్రమ పద్ధతిని నడచుట లేదు. దీనిని అభివృద్ధి పరచుటకు గ్రామములలో పాలకు విక్రయ సౌకర్యములు లేవు. పట్టణ సమీపమందున్న గ్రామములనుండి, ఆయా పట్టణములకు వ్యాపారస్థులు పాలను గొనిపోయి విక్రయించుచున్నారు. సంపూర్ణాహార మనబడి దేహపుష్టిని పెంపొందించెడి ఈ పాలలో అధిక లాభము పొందు నుద్దేశముతో వ్యాపారస్థులు ఆరోగ్యమును భంగపరచు సోడాను, ఇతర పదార్థములను, నీటిని మిశితము చేసి అమ్ముచున్నారు. అందువలన ఈ పాలు పెక్కు రోగములకు కారణ మగుచున్నవి. అవినీతికరమైన ఈ వ్యాపారమును అరికట్టుటకు ఉన్న శాసనములను కూడ అమలు పరచుటకు తగిన సిబ్బంది లేనందున ఈ పరిశ్రమ దినదినము హీన స్థితికి వచ్చుచున్నది. ఇప్పుడు అమలులో నున్న శాసనము ప్రకారము ఆవు పాలలో 3.5% క్రొవ్వునూ, 8% క్రొవ్వుకాని ఇతర పదార్థములున్నూ, బర్రెపాలలో 5% క్రొవ్వున్నూ, 9% క్రొవ్వుకాని ఇతర పదార్థములున్నూ ఉండవలయును. ఇంత శాతములలో ఈ పదార్థములు తక్కువ ఉన్న యెడల పాలలో నీరు కలిపినట్లు భావించవలెను.

ఆరోగ్యకరమైన పాలు చౌక ధరలకు ప్రజల కందించుటకును, విక్రయ సౌకర్యములు కలిగించుటకును, పశుగ్రాసమును తక్కువ ధరలకు లభింపజేయుటకును, పాలిచ్చు పశువులను కొనగోరువారికి ధనసహాయము చేయుటకును పాల సహకార సంఘములను ప్రభుత్వమువా రేర్పరచియున్నారు. అట్టి సహకార సంఘములు రాజమండ్రి విజయవాడ, తాడేపల్లిగూడెము, తెనాలి, బందరు, కర్నూలు, హైదరాబాదు మున్నగు పెద్ద పట్టణములలో నెలకొల్పబడినవి. ఆంధ్రప్రదేశ్‌లో పాలనిచ్చు ఆవులు 11.5 లక్షలును, బర్రెలు 12.3 లక్షలును కలవు. వీనిలో 3.05 లక్షల ఆవులు, 3.39 లక్షల బర్రెలు తెలంగాణాలోను, 8.45 లక్షల ఆవులు, 8.91 లక్షల బర్రెలు సర్కారు, రాయలసీమలోను గలవు. ఒక్కొక్క ఆవు దినమునకు సరాసరి 1.75 శేర్ల చొప్పునను, బర్రె 2.5 శేర్ల చొప్పునను పాలనిచ్చుచున్నవి.

మొత్తము ఆంధ్రప్రదేశ్‌లో సంవత్సరమునకు 11.64 లక్షల టన్నుల పాలు ఉత్పత్తి యగుచున్నవి. 208 లక్షల ప్రజలుగల సర్కారు రాయలసీమలలో తల ఒకటికి దినమునకు 4.8 ఔన్సులు అనగా 2.5 చటాకులును, తెలంగాణాలో నివసించుచున్న 87 లక్షల ప్రజలకు తలకు 2.2 ఔన్సులు అనగా ఒక చటాకు పాలు మాత్రమే లభించుచున్నవి. ఈ ప్రమాణమును పంజాబు, ఉత్తర ప్రదేశము మున్నగు రాష్ట్రములలో తల ఒకటికి లభించు 12 నుండి 16 ఔన్సుల పాల ప్రమాణముతో పోల్చి చూచిన చాలతక్కువగనున్నది. అదియునుగాక శాస్త్రీయముగ మనిషికి దినమునకు 18 ఔన్సుల పాలు అవసరము. ఇంత తక్కువ పరిమాణముగల పాలుగూడ లభింప వలెనన్న సర్కారు, రాయలసీమ జిల్లాలలో ఆరు రెట్లు అధికముగ పాలను ఉత్పత్తి చేయవలెను.

ఆంధ్రప్రదేశ్‌లో పాలను అనేక విధములుగ ఉపయోగించుచున్నారు. పట్టణములలో హెచ్చుగ పాల రూపమునను, పల్లెలలో 30% మాత్రమే పాల రూపములోను ఉపయోగించుచున్నారు. మిలిగిన పాలను పెరుగు, వెన్న, నెయ్యి, కోవాలుగా చేసి వాడుచున్నారు. పట్టణములకు తీసికొనిపోయి విక్రయించు సౌకర్యములు పెక్కు పల్లెలకు లభించనందున అచటి వారికి లభింప వలసిన లాభములలో ¼వ వంతు మాత్రమే దక్కుచున్నది. తగిన వాణిజ్య సౌకర్యములు కల్పించినచో వారెక్కువ ఆదాయమును పొందగలరు.

క్షీరోత్పత్తిదారులకు ఇట్టి సౌకర్యములు కల్పించుటకును విజయవాడ, హైదరాబాదు, సికింద్రాబాదులో నివసించు పట్టణవాసులకు స్వచ్ఛమైన పాలు సరఫరా చేయు ఉద్దేశముతోను ప్రభుత్వాధ్వర్యవమున ఒక పథకము అమలు జరుపబడు చున్నది. ఈ పథకమునకు 3 కోట్ల రూపాయలు ఖర్చగును. ఈ పథకము ననుసరించి విజయవాడ సమీపములో పాలపొడి తయారుచేయు ఫ్యాక్టరీని, పాలు రెండు లేదా మూడు దినములవరకు నిలువయుండునట్లు చేయుటకు ఒక యంత్రము (పాస్చుర్)సు నెలకొల్పుచున్నారు. ఇవిగాక హైదరాబాదు చుట్టుపట్ల గ్రామములనుండి పాలను సేకరించి దానిని దాజ్‌గ్రా నగరములో శుద్ధి కర్మాగారములో శుభ్రపరచి పట్టణ ప్రజలకు అందజేయు చున్నారు. ఇది రాబోవు విజయవాడ నుండి హైదరాబాదుకు పాల సరఫరా పథకములోని భాగమే. ఈ పథకము పూర్తిగ అమలులోనికి వచ్చినపుడు 1,75,000 శేర్ల పాలు కృష్ణా, గోదావరి జిల్లాల్లో సేకరించబడి విజయవాడలో శుద్ధిచేసి హైదరాబాదు నగర ప్రజలకు

సరఫరా చేతురు. విజయవాడలో ఏర్పరుచనున్న శుద్ధి కర్మాగారము అంతర్జాతీయ సాంకేతిక సంస్థా సహాయముతో 3 కోట్ల ఖర్చుతో నిర్మింపబడు చున్నది. విజయవాడకు 20 మైళ్ళ పరిధిలోనున్న గ్రామములోనుండు ఉత్పత్తిదారుల దగ్గరనుండి ప్రభుత్వమువారు పాలను కొని విజయవాడ ఫ్యాక్టరిలో శుద్ధిపరచి, రైళ్ళలో హైదరాబాదు, సికింద్రాబాదులకు పంపుదురు.

ఆంధ్రప్రదేశ్‌లో పాడి పశువుల జాతులు పాలనిచ్చు శక్తి, కాలము, పాలలోనుండు క్రొవ్వు పదార్థము వీటిని సూచించు పట్టిక :

వీని లక్షణములు. ఈ జాతి పశువులకు బాగుగ పెరిగిన మూపురము గూడ యుండును. గంగడోలునందు చర్మము తక్కువై యొదుగుగనుండును. ఇట్టి పశువులు ఎక్కువగ సర్కార్లలో కానవచ్చును.

మాల్వీజాతి పశువులు : కుదిమట్టమైన కురుచ శరీరము, సమాంతరమైన నడుమును, బలిష్ఠములై పొట్టిగనుండు కాళ్ళను, విశాలమైన వక్షమును, బాగుగ పెరిగిన గంగడోలు, నిమ్నమధ్య ఫాలమును, కొద్దిగ పైకి తిరిగిన ముట్టె, వాడియై ముందుకు వంకర తిరిగియున్న కొమ్ములును, చిన్న చెవులును, తెల్లని శరీరమును ఈ జాతి పశువుల లక్షణములు. తెలంగానాలో ఈశాన్య మండలములలో నెక్కువగ ఈ జాతి పశువులు కాననగును.

| క్రమ సంఖ్య | జాతి | పాలనిచ్చు కాలము | దినమునకు లభించు పాలు పౌన్లలో | ఒక ఈతకు లభించు పాలు (పౌన్లలో) | క్రొవ్వు పదార్థము (శాతము) |
|---|---|---|---|---|---|
| 1. | ఒంగోలు | 270 రోజులు | 10 నుండి 12 | 3,000 | 5.1 |
| 2. | కృష్ణలోయ | 220 ,, | 8 ,, 10 | 2,500 | 4.5 |
| 3. | మాల్వీ | 289 ,, | 10 ,, 12 | 3,000 | 6.0 |
| 4. | గోదావరి బర్రెలు | 300 ,, | 8 ,, 10 | 3,000 | 7.5 |
| 5. | బొబ్బిలిజాతిబర్రెలు | 320 ,, | 10 ,, 12 | 3,500 | 7.5 |

## పశుగణాభివృద్ధి

ఆంధ్రప్రదేశ్‌లో మేలుజాతి పశువుల రకములలో ముఖ్యమైనవి మాల్వీ, కృష్ణలోయ, ఒంగోలు సంతతులు.

ఒంగోలుజాతి పశువులు : సాధారణముగా తెల్లని రంగు కలిగి మెడమీదను, భుజములమీదను, కన్నుల చుట్టును వైల లేక కారె దిరిగి యుండును. పొడవైన



ఒంగోలు ఆబోతు

శరీరము బలిష్ఠమైన చిన్న మెడ, సమతలమైన ఫాలము, చిన్నవై ప్రక్కకుపోయి వెనుకకు తిరిగియుండు కొమ్ములు



మాల్వీజాతి ఆబోతు

కృష్ణలోయ : దృఢమై పొడవుగనుండు శరీరమును, విశాలమైన వక్షమును, కురుచుగ నుండి బలిష్ఠమగు మెడయు, చిన్న ముఖమును, పైకి తేలియున్న ఫాలమును, మీదికిపోయి కొంచము లోనికి చొచ్చుకొని యుండు కొమ్ములును, బాగుగా పెరిగిన మూపురమును, తెల్లని దేహమును కలిగియుండుట ఈ జాతి లక్షణము.

ఇవిగాక గుంటూరు జాతి పశువులు విశాఖపట్టణ జిల్లాలోను, పుంగనూరుజాతి పశువులు చిత్తూరులోను, రాజమండ్రిజాతి బర్రెలు తూర్పు, పశ్చిమ గోదావరి

జిల్లాల్లోను, బొబ్బిలి జాతి బఱ్ఱెలు విశాఖపట్టణములోను హెచ్చుగ కాన నగును.

ఒకప్పుడు ప్రఖ్యాతి చెంది యుండిన ఈ మేలుజాతి పశువులు క్రమముగ హీన స్థితికి వచ్చుచున్నవి. పశుగణాభి



కృష్ణావాలీ ఆబోతు

వృద్ధియందు జనులు తగు శ్రద్ధ వహింపకపోవుటయే దీనికి కారణము. పూర్వము తెలుగు దేశములో మేలుజాతి ఆబోతులను గొప్పవారి స్మారకార్థము అచ్చువేసి విడుచు చుండిరి. అందువలన జాత్యుత్పత్తి ఉచ్చస్థితిలో నుండెను. కాని కాలక్రమమున ఆ యాచారము రూపుమాసి పోయి నది. తత్కారణమున నాసిరకపు ఆబోతులు విచ్చలవిడిగ గ్రామము లందు ఆవులను దాటుట వలన జాతి యుచిత రీతి నభివృద్ధిని బొందక మేలు జాతుల వినాశమునకు దారి తీయుచున్నది.

మేలుజాతి పశువుల నభివృద్ధి పొందించుటకై ప్రభుత్వము వారు అనేక పద్ధతులను అవలంబించుచున్నారు. అందులో మేలుజాతి పశువుల ఉత్పత్తికి సంబంధించిన పరిశోధనలు ముఖ్యమైనవి. ఇందుకొరకు కొన్ని ఆబోతుల ఉత్పత్తి కేంద్రములు నెలకొల్పబడినవి. ఒక్కొక్కజాతిని అభివృద్ధి పరచుటకు, ఆ జాతి ఏ ప్రదేశమున గలదో అచ్చట కేంద్రములు నెలకొల్పబడినవి. ఒంగోలు జాతి పశువులను అభివృద్ధి పరచుటకు గుంటూరువద్ద 'లామ్' అను ప్రదేశ ములో 300 ఎకరముల విస్తీర్ణముగలిగిన కేంద్రమును స్థాపించిరి. ఇందు 250 మేలుజాతి పశువులు గలవు. ఈ కేంద్రమునుండి ప్రతి సంవత్సరమును 30, 40 మేలు రకపు ఆబోతులు గ్రామములలోనికి పంపబడుచున్నవి. కృష్ణ లోయ పశువుల అభివృద్ధికై హైదరాబాదు జిల్లాలో హిమాయత్‌సాగరము అను ప్రదేశమున 250 ఎకరముల వైశాల్యము గల కేంద్రము ఒకటి కలదు. ఇందు 300 మేలు జాతి పశువులున్నవి. ఏటా 20 ఆబోతులు గ్రామములకు పంపబడుచున్నవి. ఇవిగాక తెలంగానాలో నున్న మాల్వీ జాతిని పెంపొందించుటకు గాను 1951 సంవత్సరమున కరీంనగరములో మరియొక కేంద్రమును ఏర్పరచిరి. ఇచట 151 పశువులు ఉండుటకు వసతి కలదు. ఇట్లే బఱ్ఱెల అభి వృద్ధికి గాను విశాఖపట్టణము సమీపమున హనుమంతవాక అను ప్రాంతమున 600 ముఱ్ఱాజాతి బఱ్ఱెలకు 400 ఎకర ముల విస్తీర్ణముగల కేంద్రమొకటి ఏర్పరుపబడినది. ఇందు మూలమున ఆ పరిసర ప్రాంతముల రైతులకు ఆ మేలు జాతి బఱ్ఱెలను సరఫరా చేయుటకు వలను కలిగినది.

1. గుంటూరు జిల్లాలో చింతలదీవి వద్ద ఒంగోలు పశు జాతి అభివృద్ధికొరకు 1918 లో ఒక పరిశోధన క్షేత్రమును స్థాపించిరి. తరువాత అది ఆర్థిక కారణమువలన మూసి వేయబడినది. తిరిగి 1954 లో పునః ప్రారంభింపబడినది. ప్రస్తుతము ఒంగోలుజాతి పశువులలో క్షీరోత్పత్తి అధికము చేయుటకు పరిశోధన జరుపబడుచున్నది. దీని విస్తీర్ణము 750 ఎకరములు. ఇందు 300 పశువులు, 60 పందులు, 50 మేకలు పెంచుటకు వసతులు కలవు.

2. పుంగనూరు జాతి పశువులను అభివృద్ధి చేయుటకు చిత్తూరు జిల్లాలోని పుంగనూరు అను చోట 1954 లో 1,056 ఎకరముల విస్తీర్ణముగల ఒక క్షేత్రమును స్థాపించిరి. ఇందు ప్రస్తుతము 206 పుంగనూరు జాతి పశువులు, 40 సింధీ ఆవులు, 173 మాండ్య నీలగిరి జాతి గొఱ్ఱెలు, 25 సీమ పందులు గలవు. దీనికి సమీపముననే మేకల అభివృద్ధి కేంద్రము కూడ గలదు. ఈ కేంద్రములో 75 మలబారు జాతి, 18 జమునుపారి, 24 విదేశ జాతులతో సంకరము చేయబడిన మేకలును గలవు.

3. ధూపాడు జాతి పశువులను పునః ప్రతిష్ఠించి, అభి వృద్ధి చేయుటకును, స్వచ్ఛమైన ఒంగోలు జాతి ఆబోతు లను ఉత్పత్తి చేసి రాయలసీమ రైతులకు సరఫరా చేయు ఉద్దేశ్యముతో ఒక క్షేత్రమును కర్నూలు జిల్లాలోని మహానంది దేవస్థానమునకు సమీపమున 1955 లో నిర్మింప బడినది. ఈ క్షేత్రము యొక్క వైశాల్యము 394 ఎకర ములు. ప్రస్తుతము దీనిలో 112 ధూపాడు జాతి, 93 ఒంగోలు జాతి 32 గిర్ జాతి పశువులు గలవు.

తుంగభద్రానదీ ప్రాంతములోని పశుగణాభివృద్ధికొరకు బనవాఖ వద్ద 1956 లో ఒక క్షేత్రము నెలకొల్పబడినది. దీనియందు హల్లికారు జాతి ఆబోతులు తయారుచేయ బడుచున్నవి. తుంగభద్ర పరిసర ప్రాంతమునందు ఎక్కువ పొలము సాగులోనికి తెచ్చుటకుగాను, అచటి రైతులకు పశుగణాభివృద్ధికొరకు హల్లికారు జాతి ఆబోతులు

## తెలుగు దేశములో వివిధ జిల్లాలలో గల పశువుల వివరములు
(1956 సం॥ పశు గణ సంఖ్యల ఆధారముగా)

| క్రమ సంఖ్య | జిల్లా పేర్లు | పశువులు | | | | ఎనుములు | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | | ఎద్దులు | ఆవులు | దూడలు 3 సం॥ లోపు | మొత్తము | దున్నపోతులు | బఱ్ఱెలు | దూడలు (3 సం॥లోపు) | మొత్తము |
| 1. | శ్రీకాకుళము | 2,88,691 | 2,42,463 | 1,33,859 | 6,14,023 | 1,81,983 | 75,900 | 41,026 | 2,98,909 |
| 2. | విశాఖపట్టణము | 2,80,462 | 1,56,539 | 90,210 | 5,27,211 | 1,36,069 | 1,44,600 | 79,181 | 3,59,850 |
| 3. | తూర్పు గోదావరి | 2,74,084 | 2,33,650 | 1,66,919 | 6,74,656 | 69,182 | 1,56,629 | 1,00,270 | 3,26,081 |
| 4. | పశ్చిమ గోదావరి | 2,07,548 | 1,81,586 | 1,14,579 | 5,03,704 | 61,714 | 1,88,607 | 1,17,515 | 3,67,836 |
| 5. | కృష్ణా | 1,71,584 | 1,50,552 | 97,813 | 4,19,949 | 53,162 | 3,01,109 | 1,98,061 | 6,52,332 |
| 6. | గుంటూరు | 2,04,629 | 1,15,529 | 79,743 | 3,99,901 | 79,870 | 4,22,809 | 3,25,058 | 8,27,737 |
| 7. | నెల్లూరు | 2,86,889 | 2,56,396 | 1,44,857 | 6,88,142 | 82,574 | 2,65,673 | 1,93,255 | 5,41,502 |
| 8. | కర్నూలు | 2,67,383 | 1,56,336 | 92,121 | 5,15,827 | 17,765 | 2,48,881 | 1,81,364 | 3,98,010 |
| 9. | అనంతపురము | 2,90,491 | 1,80,589 | 1,34,135 | 6,05,215 | 20,012 | 1,11,234 | 72,139 | 2,03,384 |
| 10. | కడప | 1,55,643 | 93,622 | 55,688 | 3,04,953 | 27,207 | 1,79,681 | 97,584 | 3,04,472 |
| 11. | చిత్తూరు | 3,27,694 | 3,48,794 | 2,15,618 | 8,92,106 | 14,257 | 87,719 | 48,892 | 1,50,858 |
| 12. | హైద్రాబాదు | 1,77,311 | 1,10,798 | 1,00,420 | 3,88,519 | 27,541 | 63,972 | 40,479 | 1,31,992 |
| 13. | మహబూబునగరము | 3,37,968 | 2,34,136 | 1,72,374 | 7,44,478 | 55,085 | 86,199 | 56,202 | 2,07,236 |
| 14. | నిజామాబాదు | 1,73,389 | 1,09,685 | 89,436 | 3,72,460 | 25,383 | 56,983 | 50,089 | 1,32,405 |
| 15. | మెదకు | 2,40,220 | 1,68,833 | 1,45,516 | 5,54,569 | 42,761 | 54,345 | 53,111 | 1,60,217 |
| 16. | కరీంనగరము | 3,30,274 | 1,90,888 | 1,50,869 | 6,72,031 | 44,575 | 77,724 | 65,393 | 1,37,695 |
| 17. | వరంగల్లు | 2,61,210 | 2,12,207 | 1,77,278 | 6,50,695 | 56,873 | 91,787 | 84,579 | 2,33,239 |
| 18. | నల్గొండ | 2,89,671 | 2,53,709 | 2,01,711 | 7,75,091 | 71,606 | 1,06,538 | 1,02,706 | 2,80,850 |
| 19. | ఖమ్మం | 1,25,018 | 1,67,434 | 1,39,695 | 4,52,145 | 27,609 | 91,579 | 82,059 | 2,01,247 |
| 20. | ఆదిలాబాదు | 2,32,255 | 1,98,487 | 1,70,128 | 6,00,870 | 6,597 | 53,846 | 41,339 | 1,01,781 |
| | మొత్తము | 48,42,417 | 37,62,117 | 26,71,960 | 1,12,76,545 | 11,01,718 | 28,75,815 | 19,90,100 | 59,57,633 |

## ఇతర జంతువులు

### 1956 వ సం॥ జంతు గణ సంఖ్య ఆధారముగా

| వరుస సంఖ్య | జిల్లా | గొర్రెలు | మేకలు | గుర్రములు | కోళ్ళు | పందులు | గాడిదలు | రిమార్కు |
|---|---|---|---|---|---|---|---|---|
| 1. | శ్రీకాకుళము | 8,88,834 | 1,85,825 | 779 | 11,18,888 | 58,348 | 731 | |
| 2. | విశాఖపట్టణము | 2,54,660 | 1,18,892 | 2,813 | 11,95,981 | 65,062 | 12,871 | |
| 3. | తూర్పు గోదావరి జిల్లా | 51,914 | 1,14,411 | 2,422 | 8,78,916 | 44,139 | 165 | |
| 4. | పశ్చిమ గోదావరి జిల్లా | 88,418 | 77,415 | 1,282 | 6,27,724 | 42,326 | 264 | |
| 5. | కృష్ణ | 1,55,085 | 89,587 | 607 | 10,46,227 | 48,838 | 540 | |
| 6. | గుంటూరు | 4,22,998 | 1,61,976 | 1,441 | 11,48,949 | 89,205 | 1,744 | |
| 7. | కర్నూలు | 5,48,482 | 2,40,949 | 4,000 | 5,99,098 | 12,815 | 12,668 | |
| 8. | అనంతపురము | 8,92,019 | 3,19,896 | 1,682 | 6,46,638 | 22,210 | 17,864 | |
| 9. | కడప | 4,88,898 | 2,73,852 | 404 | 8,27,020 | 11,801 | 9,837 | |
| 10. | నెల్లూరు | 8,26,776 | 8,86,884 | 700 | 11,88,256 | 27,082 | 5,277 | |
| 11. | చిత్తూరు | 8,35,877 | 8,58,581 | 480 | 10,91,017 | 48,949 | 5,950 | |
| 12. | హైదరాబాదు | 2,88,120 | 1,45,087 | 3,493 | 3,24,144 | 7,892 | 3,647 | |
| 13. | నిజామాబాదు | 1,96,676 | 1,94,688 | 842 | 2,42,582 | 7,089 | 3,557 | |
| 14. | మెదకు | 3,20,641 | 1,25,028 | 4,449 | 2,74,227 | 16,021 | 4,067 | |
| 15. | మహబూబునగరము | 5,68,998 | 1,86,372 | 8,516 | 5,31,606 | 12,868 | 3,916 | |
| 16. | నల్గొండ | 5,06,940 | 2,28,945 | 1,716 | 6,96,951 | 30,168 | 1,525 | |
| 17. | వరంగల్లు | 4,18,071 | 1,28,594 | 494 | 5,84,186 | 28,931 | 825 | |
| 18. | ఖమ్మం | 1,03,083 | 95,187 | 196 | 664,956 | 28,030 | 181 | |
| 19. | కరీంనగరము | 5,52,089 | 1,19,771 | 149 | 5,84,420 | 00,956 | 402 | |
| 20. | ఆదిలాబాదు | 1,08,791 | 1,26,576 | 649 | 3,50,622 | 00,542 | 903 | |
| | మొత్తము | 78,46,250 | 36,93,412 | 31,514 | 1,44,06,885 | 6,10,845 | 76,429 | |

సరఫరా చేయబడుచున్నవి. దీని విస్తీర్ణము 2,180 ఎకరములు. ప్రస్తుతము దీనిలో 204 హల్లికారుజాతి పశువులు, 138 ముర్రాజాతి పశువులు పెంచబడుచున్నవి.

విశాఖపట్టణము జిల్లాలోని చింతపల్లి అనుచోట కొండల మీద అడవులలోని కొండజాతులవారి పశుగణాభివృద్ధి కొరకు 1956 లో ఒక పశుపోషక క్షేత్రము నెలకొల్పబడినది. దీని ముఖ్య ఉద్దేశ్యము అచట అడవిజాతి పశువులను, సింధీ జాతి పశువులతో సంకర పద్ధతిని వృద్ధి పరచుట. అచటి ప్రజలకు పాలపరిశ్రమ, పశుపోషణ మొదలగు వాటిని గురించి శిక్షణనిచ్చుట, మాంసమునిచ్చు గొర్రెలను, కోళ్ళను పెంచు పద్ధతులను నేర్పుట. దీని విస్తీర్ణము 1,000 ఎకరములు. దీనిలో 60 సింధీజాతి పశువులు, 104 పందులు, 56 మేలురకపు మాంసపు గొర్రెలు (బన్నూరు), 80 ఉన్ని జాతి గొర్రెలు, 165 కోళ్ళు పెంచబడుచున్నవి.

కాకినాడ పట్టణమునకు పాలసరఫరా చేయుటకును, ముర్రాజాతి దున్నపోతులను పెంచి తూర్పు గోదావరి జిల్లా రైతులకు సరఫరా చేయుటకు ఒక పశుపోషణ కేంద్రము 1960 లో నెలకొల్పబడినది. విస్తీర్ణము 200 ఎకరములు.

ఈ కేంద్రము లన్నిటియందును పశువుల పాలనిచ్చే శక్తి అభివృద్ధి చేయువిధమెట్లు, సత్వరముగ చూలగుటకు తగిన ఆరోగ్య స్థితియందు వాని నుంచు టెట్లు? రోగముల బారి నుండి స్వయముగ రక్షించుకొనగలుగు శక్తి వానికి గలిగించుటెట్లు? వానిచేతగు విధముగ పనిపాటులు చేయించుటెట్లు? అను విషయములను గూర్చి పరిశోధలను కూడ జరుగుచున్నవి.

ఆంధ్రప్రదేశ్‌లో ఇప్పుడు మేలు రకపు ఆబోతులు కావలసినన్ని లభింపకపోవుట వలన ప్రస్తుతము ఉన్న ఆబోతులను వాని ప్రకృతిసిద్ధమైన శక్తి కంటె అధికముగ ఆవులకు ఉపయుక్తము అగునట్లు కృత్రిమ పద్ధతుల వలన చూలు (ఆర్టిఫిషల్ ఇన్సెమినేషన్) కలిగించుచున్నారు. అనగా సహజముగ ఒక ఆబోతు ఒక ఆవును దాటిన యెడల అది ఒక్కటియే గర్భము ధరించును. కాని ఈ కృత్రిమ పద్ధతిప్రకారము ఒకసారి దాటినప్పుడు స్ఖలితమగు వీర్యముతో పది ఆవులకు గర్భధారణ కల్పింప వీలగుచున్నది. ఇందుకుగాను కొన్ని గ్రామకీలక కేంద్రము లేర్పరుపబడినవి. ఆ గ్రామ కేంద్రములు ముఖ్యముగ మేలుజాతి ఆబోతుల వీర్యము వలన ఎక్కువ మంది రైతుల ఆవులకు గర్భధారణ కలిగించుట కొరకును, నాసిరకపు ఆబోతుల బీజ నిర్మూలనము చేయుటకును, పశువులకు మేత పుష్కలముగ లభించునట్లు చేయుటకును, జాడ్యములను అరికట్టుటకును నెలకొల్పబడినవి.

గొర్రెలలో ఉన్ని, మాంసము అభివృద్ధి చేయుటకు పరిశోధనలు చేయునిమిత్తము మహబూబునగరము జిల్లాలోను అనంతపురము జిల్లాలోను పెనుకొండ వద్దను పరిశోధన కేంద్రములు నెలకొల్పబడినవి. ఈ కేంద్రములందు బికనీరు జాతి పొట్టేళ్ళను పెంచి గొర్రెల కామందులకు సరఫరా చేయుచున్నారు. హైదరాబాదు సమీపములోనున్న రాజేంద్రనగరములో ఉన్న సాంకేతిక విషయముల పరిశోధన కొరకు ఒక ఉన్ని సాంకేతిక ప్రయోగశాల 1959 లో ఏర్పరుపబడినది (ఊల్ టెక్నలాజికల్ లేబొరేటరీ).

కోళ్ళలో గ్రుడ్లు పెట్టు శక్తిని పెంచుటకును, మాంసాభివృద్ధి కొరకును, పొదుగుడు లక్షణమును పోగొట్టుటకును రైతులకు మేలుజాతి కోడి పుంజులను సరఫరా చేయుటకు చిత్తూరు, కడప, హైదరాబాదు జిల్లాలలో కొన్ని కేంద్రములు ఏర్పరుచ బడినవి. వీటిలో 'వైట్ లెగ్‌హారన్స్', 'రోడ్ ఐలెండ్ రెడ్సు', 'బ్లాక్ మైనార్కా' మొదలగు విదేశీయ జాతులు కూడ పెంచబడుచున్నవి.

## పశుగ్రాసము

ఆంధ్రప్రదేశ్‌లో నేడు పశువులకు కావలసినంత ఆహార పదార్థములు లభింపకపోవుటవల్ల నొకప్పుడు చాలినంత మేతలేక బక్కచిక్కియుండు పశువులనేకములు కానవచ్చుచుండును. తత్ఫలితముగ అవి పెరిగి పెద్ద వగుటకును, చూలుగొనుటకును ఆలస్య మగుచున్నది. రెండు సంవత్సరముల కొకమారుగాని ఈనుట లేదు. పాలనిచ్చు శక్తి కూడ తగ్గుచున్నది. అమెరికా వంటి దేశములలో ఆవులు సాలీనా సరాసరి 6,000 పౌనుల పాల నిచ్చుచున్నవి. కాని ఆంధ్రప్రదేశ్‌లోని పశువులు 500 పౌనులు మాత్రమే ఇచ్చుచున్నవి.

ఒకానొకప్పుడు ఆంధ్రప్రదేశ్‌లో ప్రతి రైతును తన వ్యవసాయపు భూమిలో నాలుగవ వంతు పశువుల మేత కొరకు పచ్చిక బీడుగ విడుచు ఆచారము ఉండెడిది. కాని కాలగమనమును అనుసరించి మానవజాతి అభివృద్ధివలనను, ఆర్థికపు పంటలను హెచ్చుగ పండించుటవలనను పశువుల బీళ్ళుగూడ సాగునకు తేబడుచున్నవి. అంతియే కాక పశువుల సంఖ్య కూడ విపరీతముగ పెరిగినది. మేత తక్కువయైనది. భారతదేశమున ఎంత పశుగ్రాసము కలదో తెలిసికొనుటకు తగిన లెక్క లంతగ లేవు. కాని సర్కారు, రాయలసీమలలో కొంత వరకు పశుగ్రాస స్థితి తెలియుచున్నది. తెలంగానాలో కూడ అటులనే ఉండుననుటకు సందేహము లేదు. 1947 లో నియామకమైన మద్రాసు పశుగ్రాస పరిశీలన సంఘము వారు రాయలసీమ, సర్కారు జిల్లాలలోని పశుగ్రాస స్థితిని గూర్చి విచారణలు జరిపి ప్రభుత్వమునకు నివేదికను సమర్పించిరి.

పై నివేదిక ననుసరించి కృష్ణ, ఉభయగోదావరి జిల్లాలలో పశువులకు ఎక్కువగా వరిగడ్డి, బియ్యపు తవుడును, కడప,కర్నూలు, అనంతపురము మొదలగు మెట్ట జిల్లాలలో ఎక్కువగా ఎండు చొప్ప, ప్రత్తి విత్తులు, తెలగపిండి మొదలగు నవియు; నెల్లూరు, చిత్తూరు జిల్లాలలో బీటిగడ్డి వరిగడ్డి, సజ్జ, జొన్న చొప్పలు పశువుల మేతకు ఉపయుక్తములగుచున్నవని వ్యక్త మగుచున్నది. అడవులును, పచ్చిక బయళ్ళును ఎక్కువగా నుండుట వలన రాయలసీమలో పచ్చిక మేత అధికముగ దొరకుచున్నది. ఆంధ్రప్రదేశ్‌లో ప్రస్తుతము లభించుచున్న 11,005 వేల టన్నుల వరిగడ్డి, ఎండుచొప్ప, పచ్చిక సర్కార్లు, రాయలసీమలలో ఉన్న 12,750 వేల పశువులకును గ్రాసమని తెలియుచున్నది. అనగా దినమునకు పశువునకు 5 పౌన్ల మేత మాత్రమే లభించుచున్నది. చిన్న, పెద్ద పశువులకు సరాసరిని దినమునకు 10 పౌన్లు అవసరమని శాస్త్ర రీత్యా అంచనా వేయబడినది. ఐనచో ప్రస్తుతము లభ్యమగుచున్న ఆహారము 100 కి 50 పాళ్ళు మాత్రమే. కావున భారతదేశమందలి పశువు లెల్లప్పుడును అర్ధాకలితో నుండును.

తెలియవచ్చిన దాణా దినుసుల లెక్కల ప్రకారము క్రింది విషయములు గమనింప నగును. మొత్తము దాణా దినుసులు 7,90,000 టన్నులు. వానిలో ముఖ్యముగ లభించునది బియ్యపు తవుడు. ప్రత్తివిత్తులు, తెలగ పిండి సుమారు ఒకే పరిమితిలో దొరకుచున్నవి. దినమునకు ప్రతి పశువునకు కావలసిన ప్రమాణమగు రెండు పౌనులకు బదులు అరపౌను మాత్రమే లభించుచున్నది. కనుక దాణా దినుసులలో కూడ 75% కొరత కనబడుచున్నది.

పశువులు పుష్టిగ బలిసి బాగుగ పాలిచ్చుటకు మాంసకృత్తు లవసరము. ఇవికూడ తగినంతగ చిక్కుట లేదు. ఇప్పుడీ గ్రాసముల నభివృద్ధిచేయుటకై పరిశోధనలుజరుగుచున్నవి.

## పశు చికిత్స

ఆంధ్రప్రదేశ్ నందలి పశువులలో ముఖ్యముగ కానవచ్చు అంటువ్యాధులు చీడపారు, గురక, జబ్బవాపు, దొమ్మ, గాలికుంట్లు, గొరిసెగాలి. ఈ వ్యాధుల నివారణకై ప్రభుత్వమువా రనేక పద్ధతుల నవలంబించు చున్నారు. పశువైద్య శాలలను చాల తాలూకాలలో నేర్పరచి పశు చికిత్సయందు రైతులకు సహాయమును విరివిగా చేయుచున్నారు. అంటువ్యాధులను గ్రామములలో అరికట్టుటకు సంచార పశు వైద్యులను నియమించుచున్నారు. రోగ నిర్ణయము కొరకు హైదరాబాదులో పరిశోధన కేంద్రము లేర్పరుపబడినవి. వలయు టికాసూది మందులను సరఫరా చేయుటకుగాను టీకాల మందు ఉత్పత్తి కేంద్రము హైదరాబాదులో సైఫాబాదునందు (బీగంపేటవద్ద) నెలకొల్పబడి విస్తరింపబడినది. 1959-60 సం॥లలో చీడపారు జబ్బులు 49,000, గురక జబ్బులు 9,980, జబ్బవాపుకు 3,56,000, దొమ్మకు 8,700 మోతాదులు (డోస్) మందు తయారు చేయబడినది. ఈ మొత్తము మందుల విలువ 2,29,694 రూపాయలు. ఆంధ్రప్రదేశ్‌లో పశు వైద్యమునకై నియమితమైన చికిత్సాలయముల పట్టిక ప్రక్క పుటలో చూపబడినది :

ఈ పట్టికవలన ఆంధ్రప్రదేశ్‌లో 378 చికిత్సా కేంద్రములును, 36 సంచార వైద్యులును గలరని తెలియుచున్నది. వీరుకాక జిల్లాకొక ముఖ్యాధికారియు, వారిమీద నలుగురు అసిస్టెంటు డైరెక్టర్లును, నలుగురు డిప్యూటీ డైరెక్టర్లును ఒక డైరెక్టరును కూడ కలరు. ప్రస్తుతము ఆంధ్రప్రదేశ్‌లోగల 191 లక్షల పశువులకు వీరు చికిత్స చేయుచున్నారు. అనగా సుమారు ప్రతి లక్ష పశువులకొక వైద్యుడు కలడు. కాని 'రాయల్ కమిషన్' వారు ప్రతి 10,000 పశువుల కొక వైద్యుడుండ వలయునని సిఫార్సు చేసిరి. అనగా ఇప్పటి డాక్టర్ల సంఖ్య పదిరెట్లు హెచ్చినచో గ్రామసీమల అభివృద్ధికి కారణమగు పశుసంపద బాగుపడి దేశముయొక్క ఆర్థిక సంపత్తికి తోడ్పడును.

ఆంధ్రప్రదేశ్‌లోని పశువైద్య చరిత్ర 1870 వరకు వివరముగ తెలియదు. 1870 ప్రాంతమున ప్రథమముగ హైదరాబాదులోను, బళ్ళారిలోను యుద్ధావసరములకై అశ్వగణాభి వృద్ధికిగాను కేంద్రములు ఏర్పాటైనవి. తెలంగాణాలో సంగారెడ్డి ప్రాంతమున నెలకొల్పబడిన కేంద్రము 'ఆలిబన్ అబ్దుల్లా' యాజమాన్యమునను, బళ్ళారిలోని కేంద్రము 'కల్నల్ గన్' యాజమాన్యమునను నిర్వహింప బడుచుండెను. తరువాత కొన్ని జిల్లాలలో అశ్వచికిత్సకై శాలిహోత్రులని వ్యవహరింపబడువారు నియమితులైరి.

తొలిసారిగ 1900 ప్రాంతమున పశువ్యాధుల నివారణకై కొంతసిబ్బంది నియమింపబడెను. 1912 వరకు పోలీసు, ఆర్థికశాఖ లీ సంస్థను నడుపుచుండెను. కాని ఆ కాలమున మద్రాసు రాష్ట్రములో చేరియుండిన ఆంధ్రజిల్లాలలో 1903 వ సంవత్సరముననే పైసిబ్బంది ప్రత్యేకముగ పశువైద్య శాఖగా రూపొందినది. పశు చికిత్సా విధానములను బోధించుట కొరకు కళాశాలకూడ ఆ కాలముననే మద్రాసులో నెలకొల్పబడినది. నాటినుండి దినదినాభివృద్ధి నొందుచు వచ్చుచున్న ఈ శాఖకు 1933 లో వ్యవసాయ శాఖచే నిర్వహింపబడుచున్న పశు పోషణశాఖ అనుబంధింపబడినది. నలుగురైదుగురితో

## పశు వైద్య కేంద్రములు

| క్రమ సంఖ్య | జిల్లా పేరు | ఆసుపత్రులు | డిస్పెన్సరీలు | చిన్న డిస్పెన్సరీలు | సంచార వైద్యులు | ప్రథమ చికిత్సా కేంద్రములు |
|---|---|---|---|---|---|---|
| 1. | శ్రీకాకుళము | 1 | 4 | 8 | 5 | 2 |
| 2. | విశాఖపట్టణము | 2 | 2 | 5 | 3 | — |
| 3. | తూర్పు గోదావరి | 3 | 10 | 11 | — | — |
| 4. | పశ్చిమ గోదావరి | 1 | 5 | 9 | 2 | 7 |
| 5. | కృష్ణా | 2 | 11 | 12 | 5 | 15 |
| 6. | గుంటూరు | 2 | 8 | 8 | 5 | 10 |
| 7. | నెల్లూరు | 1 | 4 | 16 | 1 | 12 |
| 8. | కడప | 1 | 3 | 4 | 2 | — |
| 9. | కర్నూలు | 4 | 6 | 9 | 5 | 5 |
| 10. | అనంతపురము | 1 | 5 | 6 | 3 | — |
| 11. | చిత్తూరు | 2 | 4 | 9 | 5 | — |
| 12. | కరీంనగరము | 1 | 6 | 7 | — | 1 |
| 13. | ఖమ్మం | 1 | 3 | 8 | — | — |
| 14. | ఆదిలాబాదు | 1 | 3 | 12 | — | 2 |
| 15. | మహబూబునగరము | 2 | 6 | 13 | — | 1 |
| 16. | నిజామాబాదు | 1 | 4 | 20 | — | — |
| 17. | నల్గొండ | 2 | 2 | 10 | — | 2 |
| 18. | మెదకు | 3 | — | 7 | — | — |
| 19. | వరంగల్లు | 2 | — | 7 | — | — |
| 20. | హైదరాబాదు జిల్లా | — | 3 | 10 | — | 1 |
| 21. | హైదరాబాదు సిటీ | 5 | — | 2 | — | — |
| | మొత్తము | 38 | 89 | 193 | 36 | 58 |

ప్రారంభమైన ఈ శాఖలో నేడు ప్రతి తాలూకాకు ఒక అధికారి, జిల్లాకొక ముఖ్యాధికారి యుండుటయే కాక గ్రామ సంచార వైద్యదళము ఉండుట గమనింపదగిన విషయము. ఈ పశుచికిత్స చేయువైద్యుల కొరత తీర్చుటకు హైదరాబాదులోకూడ ఉస్మానియా విశ్వవిద్యాలయ పర్యవేక్షణక్రింద ఒక కళాశాల నెలకొల్పబడినది.

1947 లో జాతీయ ప్రభుత్వము ఏర్పడిన నాటి నుండి పశువైద్యమునకు కూడ మిక్కిలి ప్రోత్సాహము కలిగినది. అధికాహారోత్పత్తికి తోడ్పడు నిమిత్తము, పశువులను అభివృద్ధి పరచుటకు పంచవర్ష ప్రణాళికక్రింద కొన్ని కీలకగ్రామ కేంద్రములు ఏర్పరుప బడినవి. గుంటూరు, ఒంగోలు, నిడుబ్రోలు, విశాఖపట్టణము, హిమాయత్‌సాగరము, కరీంనగరము మున్నగు చోట్లగల ఈ కేంద్రములలో పశుగ్రాసమును పుష్కలముగ సరఫరా చేయుట మేలుజాతి వృషభవీర్యము ద్వారా కృత్రిమ గర్భధారణ చేయించుట, నాసిరకపు పశువుల బీజములను నిర్మూలించుట, అంటువ్యాధులను నివారించుట మొదలగు కార్యక్రమములు నిర్వర్తింపబడుచున్నవి. సి. వెం. రా.

# పారిశ్రామికాభ్యుదయము

భారతదేశములో పారిశ్రామికముగ వెనుకబడి వున్న ప్రాంతములలో ఆంధ్రప్రదేశ్ ఒకటి. భారతదేశ జనాభాలో ఆంధ్రప్రదేశ్ జనాభా సుమారు 8.24%; ఆంధ్రప్రదేశ్ వైశాల్యములో 8.4%. ఈ రాష్ట్రములో పనిచేయుచుండు పారిశ్రామిక సంస్థలలో పెట్టిన పెట్టుబడి మొత్తము భారతదేశము మొత్తముమీద పారిశ్రామిక సంస్థలు పెట్టిన పెట్టుబడి మొత్తములో 3.5% మాత్రమే యగుట శోచనీయము.

ప్రస్తుతము ఆంధ్రప్రదేశ్‌లో సుమారు 533 జాయింట్ స్టాక్ కంపెనీలు పనిచేయుచున్నవి. ఈ కంపెనీలలో వాటాదార్లచే చెల్లింపబడిన పెట్టుబడి (పెయిడ్ అప్ కాపిటల్) మొత్తము దాదాపు 21.87 కోట్ల రూపాయలు. మద్రాసు రాష్ట్రములోనున్న 2,329 కంపెనీలలో చెల్లింపబడిన పెట్టుబడి మొత్తముతోను, భారతదేశములో గల సుమారు 29,000 కంపెనీల తాలూకు చెల్లింపబడిన పెట్టుబడుల మొత్తము 1,160 కోట్ల రూపాయలతోను ఈ మొత్తములను పోల్చి చూచిన యెడల, ఆంధ్రప్రదేశ్ పారిశ్రామికముగ ఎంత వెనుకబడి యున్నదో బోధపడ గలదు. పైగా ఈ రాష్ట్రములో 1958 లో పనిచేయుచుండు జాయింట్ స్టాక్ కంపెనీలలో సుమారు రెండు వంతులు ప్రైవేట్ లిమిటెడ్ కంపెనీలు. ఈ ప్రైవేట్ లిమిటెడ్ కంపెనీలలో చెల్లింపబడిన పెట్టుబడి మొత్తము ఇపుడు ఆంధ్రప్రదేశ్‌లో వ్యాపారము నడుపుచుండు కంపెనీలన్నిటిలో చెల్లించబడిన పెట్టుబడి మొత్తములో 13%కు కొంచము హెచ్చుగ నుండును. పబ్లిక్ లిమిటెడ్ కంపెనీలలో కూడ కొన్ని ముఖ్యమైన కంపెనీల రిజిస్టర్ కార్యాలయములు కేంద్ర కార్యాలయములు ప్రస్తుతము ఆంధ్రప్రదేశ్‌నకు వెలుపల నున్నవి. కనుక ఆంధ్రప్రదేశ్‌లోని ప్రధాన పారిశ్రామిక సంస్థల పెట్టుబడులు ఇతర రాష్ట్రములలోని సంస్థల పెట్టుబడులతో పోల్చి చూచినప్పుడు అత్యల్పమని చెప్పవచ్చును (చూ. వర్తక వ్యాపారములు - పుట: 1539).

## భారీ పరిశ్రమలు

ఆంధ్రప్రదేశ్‌లో వైయక్తిక రంగములోనున్న భారీ పరిశ్రమలు రెండు. ఒకటి పంచదార, రెండవది సిమెంటు. పదకొండు పంచదార ఫ్యాక్టరీలు సాలు మొత్తముమీద 150,000 టన్నుల పంచదార ఉత్పత్తి చేయుచున్నవి. అయిదు సిమెంటు ఫ్యాక్టరీలు సాలుకు నాలుగు లక్షల తొంబది టన్నుల సిమెంటును తయారు చేయుచున్నవి. ఎరువుల ఫ్యాక్టరీలను స్థాపించుటకు ప్రయత్నములు సాగుచున్నవి. ఇవిగాక వనస్పతి తయారు చేయు ఫ్యాక్టరీలు ఏడు (ఇందు రెండు మాత్రమే పనిచేయుచున్నవి), సబ్బు కర్మాగారములు రెండు; జనుపనార మిల్లులు నాలుగు; నూలు మిల్లులు 16; సిగరెట్టు ఫ్యాక్టరీలు నాలుగు; పెక్కు బియ్యపు దంపుడు మిల్లులు; ప్రత్తిని బేళ్ళు కట్టు యంత్రములు; వేరుశనగ నుండి నూనె దీయు యంత్రములు; పొగాకు బేరన్లు, (పొగాకును ఎండబెట్టి పదను చేయు కర్మాగారములు) కూడ కలవు. ఇవిగాక ఫెర్రో-మాంగనీసు కర్మాగారము ఒకటి; రెండు పింగాణీ ఫ్యాక్టరీలు, గాజు ఫ్యాక్టరీలుకూడ రెండు గలవు. 'సెన్సస్ ఆఫ్ మాన్యుఫాక్చరర్స్' అను 1956 ప్రభుత్వ నివేదిక ననుసరించి పారిశ్రామిక చర్య వలన అదనముగ ఏర్పడిన మూల్యము 10.55 కోట్లు అని తెలియును. తయారు కాబడిన వస్తూత్పత్తి విలువ సుమారు రూ. 76 కోట్లు. ప్రక్క పుట (1518) లో పట్టికవలన ఆంధ్రప్రదేశ్‌లో జిల్లాలవారిగ ఉన్న జాయింట్ స్టాక్ కంపెనీలు తెలిసికొన వచ్చును.

పంచదార పరిశ్రమ: రోజుకు మొత్తము 11,750 టన్నుల చెఱకును గానుగ ఆడగల 11 కర్మాగారములు ఆంధ్ర

ప్రదేశ్‌లో నున్నవి. ఆయా ఫ్యాక్టరీల శక్తి సామర్థ్యములు దిగువ పట్టికలో వివరింపబడినవి :

| ఫ్యాక్టరీ పేరు | రోజుకు చెఱకు గానుగ ఆడగలశక్తి(టన్నులలో) |
|---|---|
| 1. బొబ్బిలి షుగర్ కంపెనీ | 450 |
| సీతానగరం షుగర్ కంపెనీ | 800 |
| 2. అనకాపల్లి, వైజాగ్ షుగర్ కంపెనీ | 600 |
| 3. పటికొప్పాక, దార్లపూడి షుగర్ ఫ్యాక్టరీ | 600 |
| 4. పిఠాపురం, కిర్లంపూడి షుగర్ కంపెనీ | 900 |
| 5. తణుకు, ఆంధ్ర షుగర్ కంపెనీ | 1,000 |
| 6. సామర్లకోట, దక్కన్ షుగర్ అండ్ అబ్కారి | 600 |
| 7. ఉయ్యూరు, కె. సి. పి. కంపెనీ | 2,500 |
| 8. రేపల్లె (గుంటూరు జిల్లా వి. వి. ఎస్. షుగర్ లిమిటెడ్) | 800 |
| 9. చల్లపల్లి, చల్లపల్లి షుగర్స్ లిమిటెడ్ | 800 |
| 10. షక్కర్ నగర్, (నిజామాబాదు జిల్లా) బోదన్ నిజాం షుగర్ లిమిటెడ్ లేదా బోదన్ ఫ్యాక్టరీ | 3,200 |
| మొత్తము | 11,750 |

ఆంధ్రప్రదేశ్‌లో పంచదార పరిశ్రమను అభివృద్ధి చేయుటకు ఎక్కువ అవకాశము లుండుట వలన, సహకార క్షేత్రములో ఆరు, వైయక్తిక రంగములో ఒకటి పంచదార ఫ్యాక్టరీలు ఏర్పరచు ప్రయత్నము కొనసాగు చున్నది. తూర్పు గోదావరి జిల్లా రామచంద్రపురములో సర్వరాయ పంచదార ఫ్యాక్టరీ (రోజుసరి గానుగ ఆడగల శక్తి 1,000 టన్నులు), పశ్చిమ గోదావరి జిల్లా కొవ్వూరువద్ద (గానుగ ఆడగలశక్తి 800 టన్నులు), శ్రీకాకుళము జిల్లాలో ఆమదాలవలసవద్ద (1,200 టన్నుల శక్తిగలది), చోడవరము, పాలకొల్లు, చిత్తూరు ప్రాంతములందు ఈ క్రొత్త ఫ్యాక్టరీలు నిర్మింపబడును. రోజుకు చెఱకును ఆడగలశక్తి సుమారు 6,000 టన్నులు అదనముగ వృద్ధి కావచ్చును. సహకార రంగములో స్థాపింపబడు పంచదార ఫ్యాక్టరీ లందు చెఱకును పండించు రైతులు అధిక భాగము వాటా ధనమును కూర్చుదురు. పంచదార ఉత్పత్తి సుమారు 2 లక్షల టన్నులవరకు హెచ్చును. దేశములో ఇతర ప్రాంతములకు, విదేశములకు లక్ష టన్నుల వరకు ఎగుమతి చేయు అవ

మార్చి 31, 1958 నాటికి వివిధ జిల్లాలలో నున్న ప్రైవేటు, పబ్లికు కంపెనీల వివరములు

| జిల్లా | | కంపెనీలు | | |
|---|---|---|---|---|
| | | ప్రైవేటు | పబ్లికు | మొత్తము |
| 1. శ్రీకాకుళము | — | 4 | 2 | 6 |
| 2. విశాఖపట్టణము | — | 27 | 12 | 39 |
| 3. తూర్పుగోదావరి | — | 28 | 9 | 37 |
| 4. పశ్చిమ గోదావరి | — | 20 | 15 | 35 |
| 5. కృష్ణ | — | 66 | 20 | 86 |
| 6. గుంటూరు | — | 44 | 29 | 73 |
| 7. నెల్లూరు | — | 30 | 4 | 34 |
| 8. చిత్తూరు | — | 16 | 9 | 25 |
| 9. కడప | — | 4 | 3 | 7 |
| 10. కర్నూలు | | 15 | 7 | 22 |
| 11. అనంతపురము | — | 14 | 7 | 21 |
| 12. ఆదిలాబాదు | — | 1 | — | 1 |
| 13. ఖమ్మం | — | — | 1 | 1 |
| 14. కరీంనగరము | — | 1 | — | 1 |
| 15. మెదకు | — | — | — | — |
| 16. మహబూబునగరము | — | 1 | — | 1 |
| 17. నల్గొండ | — | 1 | — | 1 |
| 18. నిజామాబాదు | — | — | 1 | 1 |
| 19. హైదరాబాదు | — | 67 | 68 | 135 |
| ఆంధ్రప్రదేశ్ మొత్తము | | 338 | 195 | 533 |

కాశము కలదు. ఆంధ్రప్రదేశ్‌లో 1957-58 లో గానుగ ఆడబడిన చెఱకు వివరములు దిగువ పట్టికయందీయ బడినవి:

| ఫ్యాక్టరీ పేరు | గానుగ ఆడిన చెఱకు (టన్నులలో) |
|---|---|
| 1. బొబ్బిలి పంచదార ఫ్యాక్టరీ | 79,400 |
| 2. సీతానగరము పంచదార ఫ్యాక్టరీ | 36,600 |
| 3. అనకాపల్లి వైజాగ్ పంచదార ఫ్యాక్టరీ | 69,500 |
| 4. పిటికొప్పాక పంచదార ఫ్యాక్టరీ | 79,400 |
| 5. పిఠాపురం కిర్లంపూడి పంచదార కంపెనీ | 1,47,400 |
| 6. తణుకు ఆంధ్ర షుగర్ కంపెనీ | 1,47,200 |
| 7. సామర్లకోట దక్కన్ షుగర్ అండ్ అబ్కారీ లిమిటెడ్ | 1,11,600 |
| 8. ఉయ్యూరు కె. సి. పి. లిమిటెడ్ | 2,73,300 |
| 9. రేపల్లె పంచదార ఫ్యాక్టరీ | 20,700 |
| 10. చల్లపల్లి పంచదార కంపెనీ | 49,900 |
| 11. బోదన్ పంచదార ఫ్యాక్టరీ | 5,50,000 |
| మొత్తము | 15,65,000 |

తెలంగాణా ప్రాంతము ఆంధ్రరాష్ట్రములో కలుపబడి ఆంధ్రప్రదేశ్ రూపొందుటవలన(1956) భారతదేశములోనే మిక్కిలి పెద్ద కర్మాగారములలో నెంచబడిన బోదన్‌వద్ద 'నైజాము పంచదార ఫ్యాక్టరీ' రాష్ట్రములో చేరెను. ఫలితమేమనగా పంచదార ఉత్పత్తిలో ఆంధ్రప్రదేశ్ భారతదేశములో ప్రముఖస్థానము పొందగలిగెను. ఉత్తర ప్రదేశ్, బీహారు, మహారాష్ట్రముల తరువాత ఆంధ్ర ప్రదేశ్‌లోనే పంచదార ఉత్పత్తి హెచ్చు.

సిమెంటు పరిశ్రమ: భారతదేశములో సిమెంటు తయారు చేయుటకు పనికివచ్చు సున్నపురాయి సుమారు 300 కోట్ల టన్నులవరకు దొరకునని అంచనా వేయబడినది. ఇందు 20 కోట్ల టన్నుల రాయి కర్నూలు ప్రాంతములోను, 42,50 లక్షల టన్నులరాయి బేతంచర్ల (కర్నూలు జిల్లా) ప్రాంతములోను దొరకునని కూడ ఈ అంచనా తెలుపుచున్నది. ఈ రెండు ప్రాంతములు కూడ రైలు మార్గమునకు బాగుగ అందుబాటులో నున్నవి. ఇవిగాక జమ్మలమడుగు, నందికొట్కూరు, బంగనపల్లి మొదలైన ఇతర ప్రదేశములలో కూడ సున్నపురాయి దొరకుచున్నది.

ఆంధ్రప్రదేశ్‌లో వివిధ తరహా పరిశ్రమలలో కంపెనీల సంఖ్య, పెట్టుబడుల వివరములు
(మార్చి 31, 1958 నాటికి)

| పారిశ్రామిక తరగతి | పబ్లిక్ కంపెనీల సంఖ్య | (లక్షల రూ॥లలో) | ఒప్పుదల మొత్తము (లక్షల రూ॥లలో) | చెల్లింపబడిన మూలధనము (లక్షల రూ॥లలో) | ప్రైవేటు కంపెనీలు | అధీకృతము | పెట్టుబడులు ఒప్పుదల మొత్తము | చెల్లింపబడిన మూలధనము |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 |
| 1. వ్యవసాయము సంబంధించిన చర్యలు | 8 | 18.50 | 4.63 | 3.53 | 5 | 12.00 | 1.02 | .41 |
| 2. గనులు, ఖననము | 4 | 185.71 | 126.56 | 126.26 | 20 | 97.60 | 40.17 | 33.02 |
| 3. ప్రాసెసింగ్ మాన్యుఫేక్చర్స్-ఆహార సామగ్రి, బట్టలు, తోలు, తోలు సామానులు | 47 | 2317.95 | 1006.89 | 988.27 | 21 | 105.63 | 57.61 | 54.99 |
| 4. ప్రాసెసింగ్ అండ్ మాన్యుఫాక్చర్స్. లోహములు, రసాయనములు వస్తూత్పత్తి | 23 | 680.59 | 179.88 | 176.90 | 32 | 87.66 | 33.36 | 32.54 |
| 5. ప్రాసెసింగ్ అండ్ మాన్యుఫాక్చర్స్ | 27 | 1295.11 | 407.27 | 391.22 | 17 | 37.39 | 13.39 | 13.15 |
| 6. నిర్మాణ ప్రజా సౌకర్య సంస్థలు | 15 | 204.94 | 54.11 | 49.12 | 22 | 96.95 | 17.72 | 18.51 |
| 7. వాణిజ్యము (వ్యాపారము ద్రవ్య సంబంధము) | 58 | 594.68 | 191.67 | 150.27 | 167 | 362.07 | 101.65 | 78.59 |
| 8. రవాణా, వార్తా సౌకర్యములు, స్టోరేజి | 3 | 10.29 | 2.98 | 2.96 | 21 | 64.38 | 33.47 | 29.84 |
| సమాజము, వ్యాపార సంస్థలు | 1 | 5.00 | .42 | .10 | 1 | .01 | .01 | .01 |
| వ్యక్తిగత తదితర సేవా సంస్థలు | 9 | 42.34 | 9.35 | 7.58 | 32 | 107.08 | 36.73 | 29.46 |
| మొత్తము | 195 | 5354.11 | 1983.76 | 1896.20 | 338 | 970.77 | 340.15 | 290.52 |



ఇంజనీరింగ్ పరిశ్రమ
జనపనార మిల్లు
ఇటుకలు, పెంకులు
నూనె శుద్ధిచేయుట
నౌకా నిర్మాణము
గాజు పరిశ్రమ
కాగితపు పరిశ్రమ
శాస్త్ర పరికరములు
సిమెంటు
పంచదార
పొగాకు
రేకు డబ్బాలు
చమురు గింజలు
ప్రత్తి మిల్లు
నూలు మిల్లు
మైకా
పింగాణి పరిశ్రమ
బియ్యపు మర
అగ్గిపుల్లలు
తోళ్ల పదును
స్కేలు
0 35 70 140 మైళ్లు
1 శ్రీకాకుళము
2 విశాఖపట్టణము
3 తూర్పుగోదావరి
4 పశ్చిమగోదావరి
5 కృష్ణా
6 గుంటూరు
7 నెల్లూరు
8 చిత్తూరు
9 కడప
10 అనంతపురము
11 కర్నూలు
12 మహబూబునగరము
13 హైదరాబాదు
14 మెదకు
15 నిజామాబాదు
16 ఆదిలాబాదు
17 కరీంనగరము
18 వరంగల్లు
19 ఖమ్మం
20 నల్గొండ
మహా రాష్ట్రము
మధ్య ప్రదేశ్
ఒరిస్సా
మద్రాసు రాష్ట్రము
మైసూరు
సిర్పూరు
బోధన్
నిజామాబాద్
సుల్తానాబాద్
జమ్మికుంట
వరంగల్లు
మహబూబాబాద్
హైదరాబాదు
షహబాద్
కర్నూలు
ఆదోని
నంద్యాల
గుంతకల్లు
రాయదుర్గము
ప్రొద్దుటూరు
నెల్లూరు
గూడూరు
కాళహస్తి
ఒంగోలు
చీరాల
మచిలీపట్టణము
తెనాలి
నర్సరావుపేట
గుంటూరు
మంగళగిరి
విజయవాడ
గుడివాడ
భీమవరము
ఏలూరు
తణుకు
రాజమండ్రి
సామర్లకోట
కాకినాడ
పిఠాపురము
అనకాపల్లి
విశాఖపట్టణము
చిట్టివలస
విజయనగరం
నెల్లిమర్ల
ఆముదాలవలస
శీతానగరం
76 78 80 82 84
18 16 14

పంచదార ఉత్పత్తికి సంబంధించిన మరికొన్ని ముఖ్య వివరము లీ దిగువ నీయబడినవి.

| | నైజాము ఫ్యాక్టరీలు మినహా | | | నైజాము ఫ్యాక్టరీలలో సహా | | |
|---|---|---|---|---|---|---|
| సీజను | 1952–53 | 1953–54 | 1954–55 | 1955–56 | 1956–57 | 1957–58 |
| గానుగ ఆడబడిన చెఱకు | 4,27,450 | 3,51,350 | 6,76,000 | 7,31,300 | 15,42,000 | 15,60,000 (సుమారు) |
| ఉత్పత్తియైన పంచదార | 41,316 | 33,134 | 64,856 | 67,800 | 1,41,885 | 1,52,000 |
| సరాసరి దిగుబడి (రికవరీ) శాతము | 9·66 | 9·43 | 9·59 | 9·27 | 9·20 | 9·74 |

కర్నూలు తాలూకాలో సుమారు 105 కోట్ల టన్నులు, ద్రోణాచలము తాలూకాలో 77 కోట్ల టన్నులు, బంగనపల్లి తాలూకాలో 66 కోట్ల టన్నులు సున్నపురాయి ఉండునట్లు అంచనా వేయబడినది. ఆదిలో సిమెంటు ఫ్యాక్టరీలు ఆంధ్రప్రాంతములో రెండే ఉన్నవి. విజయవాడ దగ్గర నున్న 'ఆంధ్ర సిమెంటు ఫ్యాక్టరీ' ఒకటి, రెండవది తాడేపల్లి వద్ద నున్న కృష్ణా సిమెంటు వర్క్సు (అసోసియేటెడ్ సిమెంటు కంపెనీ) వారిది. ఈ రెండు ఫ్యాక్టరీలు కలసి సాలుకు రెండు లక్షల టన్నులకు పైగా (1957) సిమెంటు ఉత్పత్తి చేయుచుండెను. ఈ రెండు గాక హైదరాబాదులో 'హైదరాబాదు ఆస్బెస్టాస్ సిమెంటు ప్రోడక్ట్సు కంపెనీ' 60 వేల టన్నుల ఆస్బెస్టాస్ షీట్లు, ఫిట్టింగులు ఉత్పత్తి చేయుచుండెను. రెండవ ప్రణాళిక గడువులో మాచెర్లవద్ద 'శ్రీ రామకృష్ణ సిమెంట్సు లిమిటెడ్' సంస్థవారు తొలిదశలో సంవత్సరమునకు 1.65 లక్షల టన్నుల ఉత్పత్తి కలిగి పనిచేయుటకు 1958లో ఉపక్రమించెను. పాణ్యాం (కర్నూలు జిల్లా), ఎర్రగుంట్ల వద్ద నూతన సంస్థలకు లైసెన్సు ఈయబడెను. 1960 లో 5 సిమెంటు కంపెనీలున్నవి. 1958 లో ఉత్పత్తి 3.77 లక్షల టన్నులు. 1961 నాటికి ప్రముఖమైన పాత్రవహించు నవకాశము కలదు.

వస్త్ర పరిశ్రమ: నూలు వడికి బట్టలు నేయగల మిల్లు ఆంధ్రప్రదేశ్‌లో ఒక్కటి కూడ లేదు. నూలు వడకు మిల్లులు 16 మాత్రము గలవు. కొన్ని సంస్థలు లైసెన్సులు పొందినను పని చేయగలుగుటకు కొంత కాలము పట్టును. ఇప్పటికి తెలియవచ్చు వివరములనుబట్టి చూడ ఆంధ్ర ప్రదేశ్‌లో నున్న నూలు వడుకుటకు మిల్లులలో మర కదుళ్ళ మొత్తము 1,56,892 అని అంచనా వేయబడెను. ఇందు గుంటూరులో 'హేమలత బట్టల మిల్లు'లలో 12,000, ఆదోని ప్రత్తి మిల్లులలో 12,000, రాయలసీమ మిల్లులు (ఆదోని) 15,000, గుంతకల్లులో 20,000 మర కదుళ్ళు ఉన్నవి. వివరములు ప్రక్క పుట 1522 లో ఇచ్చిన పట్టికనుబట్టి తెలియును.

ఆంధ్రప్రదేశ్‌లో 10.05 లక్షల ఎకరముల నేల ప్రత్తి పంటకుపయోగింపబడి సంవత్సరమునకు 1.36 లక్షలబేళ్ళ ప్రత్తి ఉత్పత్తి యగుచున్నది. అఖిల భారతదేశమందు ఉత్పత్తిలో సుమారు 2.9% ప్రత్తి ఇచ్చట దొరకినను వస్త్ర పరిశ్రమ ఈ ప్రాంతములో అభివృద్ధి కాకుండుట విచారమునకు తావు కలిగించును.

ఈ పట్టికలో ఇచ్చిన మిల్లులలో చాల భాగము సాధారణముగ 20 నెంబరు ముతక నూలు మాత్రమే తయారగుచున్నది. ఈ మిల్లు లన్నింటియొక్క సగటు ఉత్పత్తి శక్తి సాలుకు సుమారు 250 లక్షల పౌనులుండవచ్చును.

ఇతర పరిశ్రమలు: విజయవాడవద్ద 'వసంత్ సోప్ వర్క్సు' అను సబ్బు తయారుచేయు చిన్న ఫ్యాక్టరీ ఒకటి కలదు. ఈ మిల్లుకు రోజుకు 5 టన్నుల సబ్బు తయారుచేయు శక్తి గలదు. కాని ఇప్పుడు సుమారు ఒక టన్ను మాత్రమే ఉత్పత్తి చేయబడుచున్నది.

రాజమండ్రిలో 1920 లో 'రాజమండ్రి పేపరుమిల్లు' స్థాపించబడినది. ఈ ఫ్యాక్టరీ, చాలా ఒడుదొడుకులకు లోనై ప్రస్తుతము ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ యాజమాన్యము క్రింద నడుచుచున్నది. ఇప్పుడీ మిల్లులో రోజుకు 5 మొదలు 10 టన్నులవరకు ముతక కాగితము ఉత్పత్తియగుచున్నది. తెలంగాణా కలయికవలన రోజుకు 6,000 టన్నుల ఉత్పత్తి శక్తిగల సిర్‌పూర్ పేపరు మిల్లు ఆంధ్రప్రదేశ్‌లో చేరినది. ఇదిగాక తిరుపతిలో పేపర్ అండ్ స్ట్రాబోర్డ్సు మిల్లు (నెలకు 300 టన్నులు), విశాఖపట్టణములో అట్టలు (హార్డు బోర్డు) ఫ్యాక్టరీ (నెలకు 60,000 టన్నులు) నెలకొల్పుటకు లైసెన్సు ఈయబడినవి.

చిన్న యెత్తున పనిచేయు ఇంజనీరింగు పరిశ్రమలు సుమారు ముప్పది అక్కడక్కడ ఆంధ్రప్రదేశ్ అంతటను కలవు. వీనిలో చాల భాగము యుద్ధకాలమున ఉద్భ

## ఆంధ్రప్రదేశ్‌లో లైసెన్సు పొందిన నూలు మిల్లుల జాబితా

| | | | |
|---|---|---|---|
| 1. | హేమలత టెక్స్‌టైల్స్ లిమిటెడ్, పెదకాకాని | — | 12,000 మర కదుళ్ళు |
| 2. | రాయలసీమ టెక్స్‌టైల్స్ లిమిటెడ్, ఆదోని | — | 14,800 నుండి 21,200 మర కదుళ్ళ వరకు అనుమతి |
| 3. | ఆదోని నూలు మిల్లుల లిమిటెడ్, ఆదోని | — | 6,000 నుండి 12,000 మర కదుళ్ళ వరకు అనుమతి |
| 4. | ఆంధ్ర సహకార మిల్లు, గుంతకల్లు | — | 20,000 మర కదుళ్ళు |
| 5. | రామచంద్ర నూలు వడకు మిల్లులు, వందలపాక | — | 7,004 ,, |
| 6. | శ్రీ సూర్యనారాయణ నూలు వడకు మిల్లులు, వందలపాక | — | 5,584 ,, |
| 7. | శ్రీ సత్యనారాయణ నూలు వడకు మిల్లులు, రాజమండ్రి | — | 5,504 ,, |
| 8. | అజంజాహి మిల్సు లిమిటెడ్, వరంగల్లు | — | 35,000 ,, 700 మగ్గములు |
| 9. | ది డి. బి. ఆర్. మిల్స్ లిమిటెడ్, హైదరాబాదు | — | 26000 ,, 503 ,, |
| 10. | ది జయంతి రామచంద్రప్పచెట్టి మిల్స్, రాయదుర్గం (అనంతపురం జిల్లా) | | 150 మగ్గములు |
| 11. | నేత కో ఆపరేటివ్ స్పిన్నింగ్ మిల్స్ లిమిటెడ్, హైదరాబాదు | | 12,000 మర కదుళ్ళు |
| 12. | సిర్ సిల్క్ లిమిటెడ్, సిర్‌పూర్ | — | 468 (రేయన్) మగ్గములు |
| 13. | అక్కమాంబా టెక్స్‌టైల్స్ లిమిటెడ్, తణుకు | — | 17,280 మ. కదుళ్ళు |
| 14. | ఆదోని స్పిన్నింగ్ అండ్ వీవింగ్ కంపెనీ లిమిటెడ్, ఆదోని | — | 24,000 ,, |
| 15. | తిరుపతి నూలు మిల్లుల లిమిటెడ్, రేణిగుంట | — | 12,000 ,, |
| 16. | సర్వరాయ టెక్స్‌టైల్, లిమిటెడ్, కాకినాడ | — | 17,280 ,, |
| 17. | శ్రీ వేంకటచలపతి మిల్స్ లిమిటెడ్, తిరుపతి | — | 12,000 ,, |
| 18. | చీరాల కో-ఆపరేటివ్ స్పిన్నింగ్ మిల్స్, లిమిటెడ్, చీరాల | — | 12,000 ,, |
| 19. | జీవన్ టెక్స్‌టైల్స్ లిమిటెడ్, మీర్ ఆలం తాలూకా, హైదరాబాదు | | 1. నూలు మగ్గములు 56,<br>2. ఆర్ట్ సిల్క్ మగ్గములు 14.<br>3. వార్ప్ కట్టింగు మగ్గములు 2 |

(ఆధారము—ఇండస్ట్రీస్ డెవలప్‌మెంటు ఆక్టు, 1951 ననుసరించి మంజూరు చేయబడిన లైసెన్సులు).

వించినవి. ఇందు కొన్ని మరమ్మతు సంస్థలు, మరికొన్ని బొగ్గునుండి వాయువు ఉత్పత్తిచేయునవి, నూనె తీయునవి కొన్ని, యంత్ర భాగములను తయారుచేయునవి మరికొన్ని కలవు. ప్రభుత్వపు సరఫరాలశాఖకు ఇంజనీరింగు స్టోర్సు పరికరములను సప్లయి చేయు సంస్థలు కూడ ఒకటి రెండు కలవు. ఇందు వ్యవసాయ పనిముట్లను, యంత్ర పరికరములను తయారు చేయు సంస్థలు ఏడు కలవు; విజయవాడ, గుంటూరులలో ఇవి స్థాపింప బడియున్నవి. ఇవిగాక యంత్రపు పనిముట్లను (మెషీన్ టూల్సు), ఉక్కుసామగ్రులను తయారుచేయగల సంస్థలలో హైదరాబాదులో పని చేయుచున్న 'అల్విన్ మెటల్ వర్క్సు', 'ప్రాగా టూల్స్ కార్పొరేషన్', రామవరప్పాడు (విజయవాడ) లో పని చేయు 'కౌతా స్టీల్ ప్రోడక్ట్సు' మొదలగు సంస్థలు ముఖ్యమైనవి. విశాఖపట్టణములో ¼ అంగుళము వ్యాసముగల ఉక్కు కడ్డీలు ఏడాదికి 4,800 టన్నుల నుత్పత్తి చేయగల 'ఆంధ్ర స్టీల్ కార్పొరేషన్ లిమిటెడ్' అను 'రీ-రోలింగ్' మిల్లు స్థాపింపబడెను. కార్లకు, రైల్వేలకు కావలసిన స్ప్రింగులు, కాయిల్సు తయారుచేయగల సంస్థ ఒకటి హైదరాబాదులో స్థాపింపబడుటకు ప్రభుత్వపు లైసెన్సు పొందినది. హైదరాబాదు 'అల్విన్ మెటల్ వర్క్సు' ఇనుప బీరువాలు, బల్లలు, ఆసుపత్రి పరికరములతో మొదలిడి, తరువాత బస్సు బాడీని నిర్మించుట సాగించిరి. రిఫ్రిజిరేటర్లు, మెటల్ కట్టింగు మెషీనులు, వాషింగు మెషీనులు తయారుచేయుటకు కూడ లైసెన్సు పొందిరి. దేశములో భారీ పరిశ్రమల అభివృద్ధితోపాటు చిన్న ఎత్తు ఇంజనీరింగు పరిశ్రమలను స్థాపించుట అత్యావశ్యకము. ఈ రంగములో ఆంధ్రప్రదేశ్ వెనుకబడి యుండుటచే సక్రమమగు కృషి కావలసియున్నది.

ఆంధ్రప్రదేశ్‌లో పింగాణీ-గాజు వస్తువులను తయారు చేయుటకుగాను ప్రారంభించిన పది పండ్రెండు కంపెనీలలో రెండు మాత్రమే ఇప్పటివరకు నిలచి యున్నవి. గూడూరులో ఒకటి, నెల్లూరులో ఒకటి కలవు. మొదటిది ప్రభుత్వ సంస్థ; దీనిపేరు 'గవర్నమెంటు సిరమెక్సు ఫ్యాక్టరీ' గూడూరు; రెండవది వైయక్తిక రంగములో నున్నది: దీనిపేరు 'ఇండియా సీరమెక్సు' నెల్లూరు. ఈ ఫ్యాక్టరీలు జాడీలు, పెంకులు, పారిశుద్ధ్య పరికరములు (శానిటరీ వేర్), చౌకరకపు పింగాణి గిన్నెలు మాత్రమే తయారు చేయుచున్నవి. హైదరాబాదులో రెండు గాజు ఫ్యాక్టరీలు గలవు. ఇవిగాక చిన్నతరహా పరిశ్రమలను పోషించుటకు 'పారిశ్రామిక క్షేత్రములు' స్థాపితమైనవి.

ఆంధ్రప్రదేశ్‌లో రాసాయనిక పరిశ్రమకు వలసినబొగ్గు సున్నపురాయి, ఉప్పు మొదలగు పదార్థములు లభ్యమగు చున్నను సోడా ఏష్, కాస్టిక్ సోడా, సల్ఫ్యూరిక్, నైట్రిక్, హైడ్రోక్లోరిక్ మొదలగు ఆమ్లములను తయారు చేయు సాధన వెనుకబడెను. ఇట్లే ప్లాస్టిక్ వస్తువులకు 'పాలిస్టర్ రెజిన్' ఉత్పత్తి చేయు నవకాశము కలదు. ఆదిలాబాదు జిల్లాలో సిర్పూరువద్ద కాస్టిక్ సోడా, క్లోరీను ఉత్పత్తిచేయు సంస్థ కలదు. రాష్ట్ర ప్రభుత్వము వారు కొత్తగూడెమువద్ద రాసాయనిక ఎరువులను తయారు చేయు ఫ్యాక్టరీని నెలకొల్పుచున్నారు. ఇదిగాక మూడు, నాలుగు సంస్థలు ఏసిటిక్ ఏసిడ్, ఏసిటిక్ ఏన్‌హైడ్రైడ్ మొదలగు రాసాయనికముల ఉత్పత్తి చేయుటకు లైసెన్సు పొందియున్నది.

ఆంధ్ర కోస్తా జిల్లాలలో ముఖ్య పరిశ్రమలలో ఉప్పు పరిశ్రమ యొకటి. పూర్వమువలెనే ఇప్పుడును ఉత్తరమున నౌపడా మొదలుకొని దక్షిణమున తడ వరకును గల తీర ప్రదేశములో ఉప్పు ఉత్పత్తి చేయబడుచున్నది. ఈ తీర ప్రాంత మంతటిని ప్రభుత్వము రెండు ఉప్పు మండలము లుగ (సాల్ట్ సర్కిల్సు)గ ఏర్పాటు చేసినది. ఆంధ్ర ప్రదేశ్‌లో ఉప్పు ఉత్పత్తి యగు భూమియొక్క మొత్తము వైశాల్యము 7,500 ఎకరములు; మొత్తము 18 ఉప్పుగల్లీలు (ఉప్పలములు) కలవు. ఈ పద్దెనిమిదింటిలోను మొత్తము మీద 1,765 మంది లైసెన్సుదారులు ఉప్పును తయారు చేయుచున్నారు. ఉప్పలములలో సగటున ఎకరమునకు 31 టన్నుల ఉప్పు ఉత్పత్తి అగుచున్నది. ఉత్పత్తి మిక్కిలి తక్కువయైన పూండి ప్రాంతములో కనుబడి (దిగుబడి) ఎకరమునకు 10 టన్నులు మాత్రమే. అత్యధికముగ ఉత్పత్తి యగు పాఖాల ప్రాంతములో ఎకరమునకు 72 టన్నులు.

భారత దేశములో నుండు నౌకా నిర్మాణ కర్మాగారము ఒక్కటే. అది విశాఖపట్టణములో నుండుట ఆంధ్రుల యదృష్టము. విశాఖ నౌకా నిర్మాణ కేంద్రమునకు 1941 జూన్ 21న బాబూ రాజేంద్రప్రసాద్ శంకుస్థాపన చేసినారు. 1946లో ఈ కర్మాగార నిర్మాణము పూర్తి యైనది. ఈ కర్మాగారములో నిర్మితమైన ప్రప్రథమ నౌక 'ఎస్. ఎస్. జలఉష' కు 1948 లో పండిత జవహర్‌లాల్ సాగర ప్రవేశోత్సవము జరిపిరి. ఈ కర్మాగారము సాలుకు ప్రస్తుతము సగటున 8,000 టన్నుల భారవాహక శక్తి కలిగి డీసిలుతో నడుపబడు నాలుగు నౌకలను నిర్మింపగలుగుచున్నది. సంవత్సరమునకు ఆరు నౌకలను నిర్మించు శక్తి గలిగించుటకు కేంద్ర ప్రభుత్వము ఒక కోటి రూపాయలను నిర్దేశించింది.

సర్కారు జిల్లాలలో చిన్న పరిశ్రమలలో మరియొకటి చర్మ పరిశ్రమ. మద్రాసు రాష్ట్రములో 1953 వరకు నుత్పత్తి యగుచు వచ్చిన చర్మ పరిశ్రమకు అవసరమైన ముడి పదార్థములలో 50%; మొత్తము భారతదేశపు చర్మ వస్తూత్పత్తిలో సుమారు 8% ఆంధ్ర జిల్లాలలో ఉత్పత్తి యగుచున్నవి. ఆంధ్ర ప్రదేశ్‌లో పదను చేయని పచ్చి తోళ్ళను, ఊనిన చర్మముల మొత్తమును ఈ క్రింది విధముగ ఉత్పత్తి అగుచున్నట్లు అంచన వేయబడినది:

1. ఎద్దు చర్మములు 13 లక్షలు ;
2. దున్నపోతు చర్మములు 11 లక్షలు ;
3. మేక చర్మములు 11 లక్షలు ;
4. గొర్రె చర్మములు 25 లక్షలు.

ఈ తోళ్ళు, చర్మముల విలువ ఆరు కోట్ల రూపాయల పైచిలుకు కావచ్చును (1955). యంత్రములు లేకుండ తోళ్ళ నెగుమతికి తయారుచేయు ఫేనరీలు 52 ఆంధ్ర ప్రాంతమున నున్నవి. భారీ ఎత్తున యంత్రములతో పని చేయు ఫ్యాక్టరీ ఒకటి కూడ లేకుండుటచే చర్మములు, తోళ్ళు ఇతర రాష్ట్రములకు ఎగుమతి చేయబడుచున్నవి. తయారైన జోళ్ళు, తోలు సామగ్రి ఇతర ప్రాంతమున నుండి దిగుమతి యగుచున్నవి.

కోస్తా, ఆంధ్ర, రాయలసీమ జిల్లాలలో ఇప్పుడున్న పారిశ్రామిక సంస్థలను గురించిన వివరములను సంగ్రహముగ సమీక్షించిన మీదట, సహజ సంపద యధికముగ నున్నను పారిశ్రామికాభ్యుదయము మాత్రము తగినంత లేదని స్పష్టమగుచున్నది. గతములో పారిశ్రామిక సంస్థలు బహుళముగ భగ్నమై పోవుట, ప్రజలందరును చాలవరకు వ్యవసాయమందే దృష్టి గలవారగుట ఈ పారిశ్రామికాభ్యుదయ లోపమునకు హేతువులని విషయజ్ఞులు నొక్కి చెప్పుదురు. ఈ జిల్లాలలో పారిశ్రామికాభ్యుదయమునకు వలసిన సహజ సంపద అపారముగ నున్నది. ఈ క్రింది ప్రధాన సౌకర్యములును గలవు.

1. రెండు పెద్ద నదులు, మూడు మధ్యరకపు నదులు, ఇరువది తొమ్మిది చిన్న నదులు ఆంధ్రప్రదేశ్‌లో కలవు ;

2. సారవంతమైన భూమి ;

3. వ్యవసాయములో అభినివేశముగల ప్రజలు ;

4. పుష్కలముగ దొరకు అభ్రకము. మాంగనీసు, ఇనుము, బెరైటీస్, సున్నపు రాయి, మొదలయిన ఖనిజములు ;

5. ఐదువందల మైళ్ళకు మించిన సుదీర్ఘమైన సముద్ర తీరము ;

6. ఒక పెద్ద సహజ నౌకాశ్రయము, రెండు మూడు చిన్న రేవు పట్టణములు;

7. కోస్తా జిల్లాలలో అల్లిబిల్లిగ నల్లుకొనియుండు నీటి కాలువలు;

8. సమృద్ధియగు అటవీసంపద.

ఆంధ్రప్రదేశ్ ఆర్థిక స్థితి ప్రధానముగ వ్యవసాయము మీదను, పిమ్మట ఖనిజ, అటవీసంపద మీదను మితిమీరి నంతగ ఆధారపడి యున్నది. కనుక ఈ రాష్ట్రములో పరిశ్రమలను వృద్ధిచేయుటకు ఉద్దిష్టమైన ఏ ప్రణాళికలో గాని ప్రత్యక్షముగనో, పరోక్షముగనో వ్యవసాయ సంపత్తిని వృద్ధిచేయుట కుపకరించు పరిశ్రమలకును, ఆ వ్యవసాయోత్పత్తులను ముడి పదార్థములుగ వాడుకొను పరిశ్రమలకును ప్రాధాన్యము ఈయవలసి యుండును.

ప్రస్తుతము ఆంధ్రప్రదేశ్‌లో దిగువ వివరించిన కుటీర పరిశ్రమ లున్నవి. దంతముతోను, కర్రతోను చేయు చెక్కడపు సామానులు; గ్లాసు, గాజులు, నూలుకు బట్టలకు రంగులు వేయుట, అద్దకము; పీచుపరిశ్రమ; తాటినార వస్తువుల పరిశ్రమ; మడత మంచములకును మడతకుర్చీల కును కావలసిన జనపనార పట్టాలను, గోనెసంచులను నేయుట; చెఱకు బెల్లము చేయుట; తుంగ చాపలను, ఈత చాపలను, జమ్ముగడ్డి చాపలను అల్లుట; ఇత్తడి గిన్నెలు, అల్యూమినియము సామానులు, రాగి సామానులు, కంచు సామానులు, గంటల కుపయుక్తమైన కంచు సామానులు, ఉక్కు ట్రంకులు, బాల్చీలు, ఇనుపపెట్టెలు, నాటు మంగలికత్తులు, పెద్ద కత్తులు, బల్లెములు మున్నగు ఇనుప సామగ్రులను తయారుచేయుట; ధాతువులను కరగించు టకు ఉపయోగించు గ్రాఫైటు మూసలు చేయుట; చందన తైలము దించుట, చేతి కాగితములను చేయుట, లక్క వార్నీషు తయారుచేయుట, సబ్బురాతి (రాతిచిప్పల రాయి), చలువరాతి పరిశ్రమలు, కడపరాళ్ళు, చందనము తీయు సానలు, పలకలు, బలపములు; నూలు తీయుట, చేనేత మగ్గముమీద బట్టలు నేయుట, అల్లికపని, కుట్టుపని, నూలు జంపకానాలు, నూలు ఉేపులు (నవారు), దూది పరుపులు, కుట్టుడు దారము, పట్టునేత, కంబళ్ళు (రగ్గులు, శాలువలు), తివాచుల నేత, జీడిపప్పు చేయుట, ఆట వస్తువులు, మట్టిబొమ్మలు, కొయ్య బొమ్మలు, క్యాంపు కుర్చీలు, మంచములు వగైరా, పడవల నిర్మాణము, పేము పరిశ్రమ, కొయ్య దువ్వెనలు, వెదురు బుట్టలు మొదలైనవి. ఈ పరిశ్రమలను ఇంకను అభివృద్ధి చేయుటకు చాల అవకాశములు కలవు (చూ. పారిశ్రామిక కళలు పుట : 1525).

ఆంధ్రప్రదేశ్‌లోని తెలంగాణా జిల్లాలను ప్రత్యేకించి సమీక్షించినచో వాస్తవముగ ఆంధ్ర జిల్లాలకంటె పారి శ్రామికముగ ఇవి ఎక్కువ అభివృద్ధి చెందినవి. ఈ ప్రాంత ములో అనేక ఖనిజములు పుష్కలముగ దొరకుచున్నవి. నేలబొగ్గు, బంగారము, సున్నపురాయి, తెల్లమట్టి, గార్నెట్, సబ్బురాయి, కోరండము, ఇనుము, అభ్ర కము, పాలరాయి మొదలగునవి వీనిలో ముఖ్యముగ చెప్పదగినవి.

ఖమ్మం జిల్లాలో కొత్తగూడెము, సింగరేణి అనుచోట్ల రెండు నేల బొగ్గుగను లున్నవి. ఈ రెండిటియందును 'సింగరేణి కాలరీస్ లిమిటెడ్' అను సంస్థ యాజమాన్య మున త్రవ్వకపు కృషి నడచుచున్నది. ప్రస్తుతము యావత్తు భారతదేశ మంతటను లభించుచున్న నేల బొగ్గులో, 7% తెలంగాణాలో లభించు చున్నది. తెలంగాణాలో లభించు చున్న నేల బొగ్గులో 60% ఖమ్మం జిల్లాలోనే దొరకు చున్నది. తెలంగాణా జిల్లాలలోనున్న కర్మాగారములలో మొత్తము 43,928 మంది పనిచేయుచున్నారు.

ప్రధాన ఖనిజముల ఉత్పత్తి వివరములు 1957-58 లో ఈ క్రింది విధముగ నున్నవి:

| ఖనిజములు | | ఉత్పత్తి |
|---|---|---|
| 1. నేలబొగ్గు | — | 21,16,567 టన్నులు |
| 2. బంగారము | — | 9,476 ఔన్సులు |
| 3. తెల్లమట్టి (సుద్ద) | — | 1,640 టన్నులు |
| 4. అభ్రకము (మైకా) | — | 24,049 పౌన్లు |

తెలంగాణాలోని వస్తూత్పత్తి పరిశ్రమలలో ముఖ్య ముగా పేర్కొనదగినవి పంచదార, వస్త్రములు, సిగరెట్లు, పవర్ ఆల్కహాలు, నూలు. ఇందు పనిచేయుచున్న కార్మి కుల సంఖ్య, సాలుసరి ఉత్పత్తులు దిగువ చూపబడినవి:

వస్తూత్పత్తి పరిశ్రమలు

పనిచేయుచున్న కార్మికుల సంఖ్య 9,853 మందికి పైగా

| | | |
|---|---|---|
| 1. పంచదార | — | 25,000 టన్నులు |
| 2. వస్త్రములు | — | 2,72,00,000 గజములు |
| 3. పవర్ ఆల్కహాలు | — | 5,86,000 గాలనులు |
| 4. నూలు | — | 93,00,000 పౌనులు |
| 5. సిగరెట్లు | — | 50 లక్షల సిగరెట్లు గల 92 వేల పెట్టెలు |

తెలంగాణాలోని కుటీర పరిశ్రమలలో ఇత్తడి, ఇనుప సామానులు, కాగితము, వెండి జరీ, తివాచీలు, చర్మములు, కుండలు, గుండీలు, మేజోళ్ళు మొదలైన అల్లిక వస్తువులు, దంతపు పని, రేకు పెట్టెలు, వ్యవసాయోపకరణములు, లుంగీలు, గొంగళ్ళు, జంపకాణములు, సుగంధ ద్రవ్య

ఆంధ్రప్రదేశ్ పరిశ్రమలు



చిత్రము 1. ఆంధ్రా పేపర్ మిల్లు, రాజమండ్రి



చిత్రము 2. సింగరేణి నేలబొగ్గు గనులు



చిత్రము 3. రామకృష్ణ సిమెంట్ ఫ్యాక్టరీ, మాచెర్ల



చిత్రము 4. పంచదార ఫ్యాక్టరీ, బోధన్

## ఆంధ్ర ప్రదేశ్ - చేతిపనులు



చిత్రము 1. బిద్రీ వస్తువులు



చిత్రము 2. వెండి ఫిలిగ్రీ వస్తువులు



చిత్రము 3. నిర్మల్ వస్తువులు



చిత్రము 4. దంతము, కొమ్ము వస్తువులు

ములు, బీడీ సామానులు, రంగులు, అద్దకము ముఖ్యముగ పేర్కొనదగినవి.

గ్రామ పరిశ్రమలలో చేనేత, నూనెగానుగ పరిశ్రమలు చెప్పదగినవి. వివిధ జిల్లాలలో వాడుకలో నున్న చేమగ్గముల యొక్కయు, చెఱకు, నూనెగానుగల యొక్కయు సంఖ్యలు దిగువనీయబడినవి :

| జిల్లా | చేమగ్గములు | చెఱకు గానుగలు | నూనె గానుగలు |
|---|---|---|---|
| 1. వరంగల్లు | 9,032 | 66 | 181 |
| 2. నల్గొండ | 17,415 | 52 | 150 |
| 3. మహబూబునగరము | 14,791 | 79 | 224 |
| 4. హైదరాబాదు | 1,795 | 117 | 142 |
| 5. మెదకు | 12,750 | 629 | 489 |
| 6. కరీంనగరము | 23,348 | 31 | 816 |
| 7. నిజామాబాదు | 6,836 | 3,359 | 327 |

పూర్వపు హైదరాబాదు రాష్ట్రము చీఫ్ మార్కెటింగు ఆఫీసరు తయారుచేసిన లెక్కల ప్రకారము తెలంగానాలో రెగ్యులేటెడ్ మార్కెట్ల ద్వారా మొత్తము 16,21,00,000 రూపాయల (ఒ. ఏస్.) విలువగల వ్యవసాయపు ఫలసాయము విక్రయించబడినది. నాటి హైదరాబాదు రాష్ట్రమంతటిలో మొత్తము 43,71,00,000 రూపాయల (ఓ. ఎస్.) సరకు అమ్ముడుపోయినది. ఇట్టి రెగ్యులేటెడ్ మార్కెట్లు తెలంగానాలో మొత్తము 24 ఉన్నవి.

ఈ ప్రాంతములలో బ్యాంకులు, సహకార సంఘములు కూడ విశేషముగ గలవు. తెలంగానా ప్రాంతములో మొత్తము 7,114 సహకార సంఘములును, షెడ్యూల్డు బ్యాంకుల తాలూకు 48 బ్రాంచీలును పనిచేయుచున్నవి.

తెలంగానా ప్రాంతమున వ్యావసాయిక, ఖనిజ, అటవీ సంపదలు పుష్కలముగ నుండుటవలన పారిశ్రామికాభ్యుదయమునకు విశేషావకాశము లున్నవి. ఇక్కడ నూనె గింజలు విశేషముగ పండు చుండుటవలన కొన్ని వనస్పతి ఫ్యాక్టరీలు, నూనె శుద్ధిచేయు కర్మాగారములు స్థాపింపవచ్చును. అట్లే నూలుతీయు మరలు, సిమెంటు ఫ్యాక్టరీలు, రాతినార సిమెంటు, ఎరువుల ఉత్పత్తి కర్మాగారములు కూడ స్థాపింపవచ్చును. జె. వి. సో.

# పారిశ్రామిక కళలు

చారిత్రక రీత్యాయేగాక ఆంధ్రప్రదేశ్ నందలి జిల్లాలు పరిశ్రమలకును, కళలకునుకూడ పేరు పొందినవియై ఉన్నవి ; పారిశ్రామిక రంగములో ప్రత్యేకస్థానము ఆక్రమించిన చేతిపనులలో కొన్ని జగత్ప్రసిద్ధి వహించియు కలవు. ఈ ఉన్నతస్థితిని చేకూర్చుటకై ప్రజలు, ప్రభుత్వము శతాబ్దములద్వారా జరిపిన కృషి కొనియాడ తగినది. అందును గత పది సంవత్సరముల కాలములో ప్రణాళికల ద్వారా చేతి పరిశ్రమలకు, కళలకు చేయూత నొసంగి వాటి స్థిర సంపదకుగాను నిర్వహింపబడిన కార్యక్రమము అత్యంత ప్రశంసనీయము.

ఈ పారిశ్రామిక యుగములో గృహ పరిశ్రమలు చేతిపనులు నిలచి పురోగమించు చున్నందులకు ప్రత్యేక కారణములు గలవు. అందులో ముఖ్యమైనది పారిశ్రామికులు కేవలము వస్తువులను నిర్మించువారు మాత్రమే గాక ఉత్తమ కళాకారులు కూడ నగుట. ప్రజల అభిరుచులును, వారికి ఈ పారిశ్రామిక కళాకారుల యెడల గల సుహృద్భావమును దేశముయొక్క ఆర్థిక పరిస్థితులను అనుసరించి చేతి పనులను ప్రోత్సహించవలెనను ఆదరణ భావముకూడ చేతిపనుల పురోగమనమునకు కారణభూతములై ఉన్నవి.

కళాసమన్వితమైన చేతి పనులకు జాతీయ ఆర్థిక విధానమున ప్రత్యేకస్థానము కలదు. జనాభా పెరిగిపోవు చున్న భారతదేశమున ఉద్యోగావకాశములు కల్పించుటకు గాను దేశాభివృద్ధి ప్రణాళికలలో లఘు, కుటీర పరిశ్రమలకు అగ్రస్థాన మున్నదనుటలో అతిశయోక్తి లేదు. అందును వ్యవసాయముపై ప్రధానముగా ఆధారపడివున్న ఆంధ్రప్రదేశ్ చేతిపనులకుగల ప్రత్యేక స్థానమును గూర్చి వివరణ అనవసరము.

చారిత్రక దృష్ట్యా కళాత్మకమైన చేతిపనుల వస్తువులు ధనిక వర్గముల చేతనే ప్రోత్సహించబడు చుండెడివి. వాటి పనితనము, సౌందర్యము ధనికుల నెంతయో ఆకర్షించు చుండెడివి. ధనవంతులు వాటిని సేకరించుటకు వాటి సౌందర్యమే ప్రధాన కారణము. కాని నూతనముగ ఈ పరిశ్రమలకు చేకూరిన ఆర్థిక ప్రాముఖ్యము కారణముగ పారిశ్రామికులు కళా సమన్వితమైన వస్తువులనేకాక, సాధారణ ఉపయోగములకు వీలుపడునవియు, తక్కువ ధరలు కలవియు అగు వస్తువులను విరివిగా తయారుచేయుచు, తమ భవిష్యత్తుకు గట్టి పునాదులు వేయ పూనుకొన్నారు. చేతిపనులను సక్రమ మార్గముల విస్తరింపజేసి, దేశముయొక్క ఆర్థిక జీవిత

ములో వాటికి నిర్దిష్టమైన స్థానమునిచ్చి లక్షలాది ప్రజలకు జీవనము కల్పించుటకుగాను కేంద్ర ప్రభుత్వమును, రాష్ట్ర ప్రభుత్వమును సాగించుచున్న కృషి దేశమంతట శ్లాఘింప బడుచున్నది. రాష్ట్రమందలి చేతిపనులను మూడు ముఖ్యవర్గములుగా విభజింపవచ్చును. 1. చేనేత పరిశ్రమ; 2. చేతిపనులు; 3. ఇతర కుటీర పరిశ్రమలు.

చేనేత పరిశ్రమ: అందమునకు, డిజైనులకు, నాణ్యతకు ఆంధ్రప్రదేశ్ చేనేత వస్త్రములు భారత దేశమందంతటను ప్రసిద్ధిగాంచినవి. రాష్ట్ర ఆర్థిక జీవనమున చేనేత పరిశ్రమ రెండవ స్థానమును, పారిశ్రామిక రంగమున మొదటి స్థానమును ఆక్రమించియున్నది. రాష్ట్రములో ఉన్న నాలుగున్నర లక్షల మగ్గములలో సుమారు 50% సహకార పద్ధతిని పనిచేయుచున్నవి. ఈ సహకార సంఘముల సాహాయ్యార్థము కోటిరూపాయలకు పైగా ప్రభుత్వము వడ్డీలేని ఋణములక్రింద ఇచ్చియున్నది. చేనేత కార్మికులను సహకార పద్ధతిక్రిందకు రప్పించుటకు ప్రభుత్వమువారికి వాటాధన ఋణములను ఇచ్చియున్నది. ఇంతేకాక ఈ పరిశ్రమను ఆధునిక మార్గములయందు అభివృద్ధి చేయుటకు తగు పరికరములను కూడ ఈ సహకార సంఘములకు అందజేసి ఆయా సంఘముల ఉత్పత్తి పెరుగుదలకు ప్రభుత్వము తోడ్పడుచున్నది. తత్ఫలితముగా చేనేత రంగమున ఉత్పత్తి గతించిన ఐదారు సంవత్సరములలో రెట్టింపునకు పెరిగినది. ప్రభుత్వ సాహాయ్యముతో కొన్ని ప్రదేశములలో చేనేత కార్మికులకు కొద్ది ఖర్చుతోనే గృహ నిర్మాణ కార్యక్రమము కూడ కొనసాగింప బడుచున్నది.

భారత ప్రభుత్వము అఖిల భారత చేనేత సంఘమును స్థాపించి చేనేత పరిశ్రమకు చక్కని దోహదము కల్పించినది. ఆంధ్రప్రదేశ్‌లో పనిచేయుచున్న కేంద్ర చేనేత సహకార సంఘములు రెండును (1. ఆంధ్ర చేనేత సహకార సంఘము, విజయవాడ; 2. హైదరాబాదు చేనేత కేంద్ర సహకార సంఘము) నూతన పరికరములు,క్రొత్తనమూనా మగ్గములు పరిచయము చేయుటకు గాను నమూనా ఉత్పత్తి కేంద్రములను స్థాపించి పరిశ్రమాభివృద్ధికి తోడ్పడుచున్నవి. రాష్ట్రములోని ముఖ్య పట్టణములందును, గ్రామములలోను దేశమునందలి ఇతర ముఖ్యపట్టణములందును విక్రయ శాలలు నెలకొల్పి చేనేత బట్టల అమ్మకమునకు ఈ కేంద్ర సంఘములు తోడ్పడుచున్నవి.

మరియు రాష్ట్రములోని చేనేత మగ్గముల అవసరము తీర్చు నిమిత్తము అనంతపురము జిల్లాలోని గుంతకల్లు నందును, సికిందరాబాదు నగరము నందును రెండు నూలు వడకు మిల్లులు స్థాపించబడినవి. చీరాల (గుంటూరు జిల్లా) యందును త్వరలోనే మరియొక నూలు మిల్లు స్థాపింపబడనున్నది.

ఉన్ని పరిశ్రమ: ఉన్ని ఉత్పత్తియందు భారతదేశమున ప్రముఖస్థాన మాక్రమించు రాష్ట్రములలో ఆంధ్రప్రదేశ్ ఒకటి. రాష్ట్ర మంతట మొత్తము మీద 78,46,000 గొర్రెలు కలవని అంచనా వేయబడినది. సంవత్సరమునకు ఆంధ్రప్రదేశ్ నందలి ఉన్ని ఉత్పత్తి 54,61,000 పౌనులు. ఒక్కొక్క గొర్రె ½ పౌను నుండి 1 పౌను వరకు ఉన్ని నీయగలదు. 36 నుండి 40 మైక్రోముల వరకు వ్యాసము గల ముతక రకము ఉన్ని పెక్కు రంగులలో (దట్టమైన నలుపు నుండి తెల్లటి తెలుపు వరకు) లభించుచున్నది. ఆంధ్రప్రదేశ్‌నందు ఉత్పత్తియగుచున్న ఉన్నిలో దాదాపు 50% ఇతర రాష్ట్రములకు ఎగుమతి అగుటవలన రమారమి 27 లక్షల పౌనుల ఉన్ని మాత్రమే స్థానిక తివాచీల పరిశ్రమకై వినియోగ మగుచున్నది.

ఆంధ్రప్రదేశ్ నందలి ఉన్ని పరిశ్రమ ఒక కుటీర పరిశ్రమ. ఏ విధమైన యంత్ర పరికరములును ఉపయోగింపబడుటలేదు. కంబళ్ళు, తివాచీలు తయారు చేయుటకు ఈ ఉన్ని ఉపయోగింపబడుచున్నది. ఉన్ని పరిశ్రమయందలి వివిధ దశలలో అనగా చిక్కుతీసి పరిశుభ్రము చేయుట, వడకుట, నేయుట అను వానిలో పని చేయువారు 1,36,000 మంది కలరు.

కంబళ్ళ నేతలో రాష్ట్రమంతట 34,000 మగ్గములు కలవు. ఈ విషయమున భారత దేశమునందలి అన్ని రాష్ట్రములలోను ఆంధ్రప్రదేశ్ దే ప్రథమస్థానము. రాష్ట్రము నందలి గిరాకీని తట్టుకొనుటయేగాక సింహళము, అస్సాము, నీలగిరి వంటి ఇతర ప్రాంతములకును ఎగుమతి చేయబడుచున్నవి. రైల్వేలకుగాను కేంద్ర ప్రభుత్వము వీటిని కొనుచున్నది. ముతకవి అగుటచే రక్షణ శాఖ మాత్రము వీటిని క్రయము చేయుట లేదు. ముతకవియైన ఉన్ని శాలువలకు ఆంధ్రలో 'కంబ్లీ' అని కాని, 'కంబళ్' లేక 'కంబళి' అని కాని పేరు.

ఉన్ని పరిశ్రమ అభివృద్ధి చేయుటకు రాష్ట్రమున ఎంతయో అవకాశము కలదు.

నేడు ఉన్ని పరిశ్రమ నెదుర్కొనుచున్న సమస్యలను క్లుప్తముగా పరిశీలింతము.

1. ఆంధ్రప్రదేశ్‌లో ఉత్పత్తియగు ఉన్ని ముతక రకమునకు చెందినది. మేలుజాతి ఉన్నితో చేసిన వస్తువులు నున్నితముగను, అందముగను ఉండును. ఉత్తమ తరగతి వస్తువులను ఉత్పత్తి చేయుటకుగాను మేలుజాతి ఉన్నిని

కొనుట పొదుపుగా వ్యాపారము చేయుట కానేరదు; (శ్రీ తిమ్మారెడ్డి మంత్రిత్వము క్రింద) వ్యవసాయశాఖ రాష్ట్రమునందే మేలురకము ఉన్నిని ఉత్పత్తి చేయుటకు గాను తగినచర్యలను తీసికొన్నది. ఉత్తమజాతి గొర్రెల సంతతిని అభివృద్ధిచేయు క్షేత్రములు స్థాపించుట ఈ సందర్భమున పేర్కొనదగినది.

2. ఈ పరిశ్రమయందలి పనివాండ్రు ఉపయోగించు సాధనములు పురాతన కాలమునాటివి. శ్రామికులు సాంకేతిక విజ్ఞానమునందును చాలవెనుకబడి యున్నారు. పరిశ్రమనంతయు యంత్ర సాహాయ్యమున నడిపింపవలెనని ఎవ్వరును అనరు. ఏలనన దీనివలన నిరుద్యోగ మధిక మగును. సున్నితమైన వస్తువులను తయారు చేయుటకు కళాకారులకు ఏదో కొంత శిక్షణ మవసరము. పరిశ్రమల శాఖ యాజమాన్యమున శిక్షణకు గాను సౌకర్యములు కలవు.

3. చేనేత పద్ధతులపై సాగుచున్న ఈ ఉన్ని పరిశ్రమ మిల్లులలో తయారగు ఉన్ని వస్తువులతో పోటీకి నిలువ లేదు. దీనికి కారణములు చాల గలవు. మిల్లు వస్తువులు ఇంకను ఎక్కువ సున్నితముగా ఉండును. వాని ఖరీదు కూడ తక్కువ. మిల్లు వస్తువులకు విక్రయ శాలలు మెండుగా కలవు. వానికి గల పెట్టుబడి సౌకర్యములును ఎక్కువే.

ఈ పరిశ్రమ నిలదొక్కుకొని వేయిమందికి పైగా గల పారిశ్రామికులకు జీవనోపాధి కలిగించునటుల చూచుట సామ్యవాద సమాజమును నిర్మించదలచిన ప్రభుత్వము యొక్క విధి. పరిశ్రమాభివృద్ధికిగాను ఈ క్రింది చర్యలను తీసికొననగును :

1. మేలు రకము రంగులను మాత్రమే ఉపయోగించు కేంద్రమును స్థాపించి, ఉత్పత్తిదారులకు రంగువేసిన ఉన్ని దారమును సరఫరా చేయవచ్చును ;

2. తక్కువ రకము రంగులను వాడుట పూర్తిగా నిరోధించవలెను ;

3. భారతీయ ప్రమాణముల సంఘముచే ప్రమాణములను నిర్ణయింపజేసి అమలు జరుపవలెను ;

4. పారిశ్రామికులు ప్రామాణికమైన వస్తువులనే ఉత్పత్తి చేసినటుల ప్రమాణమును తెలుపు గుర్తును వస్తువులపై నుంచవలెను ;

5. విదేశములకు వస్తువులను ఎగుమతిచేయు సందర్భములలో ప్రభుత్వము ఆ వస్తువులను తణిఖీ చేయవలెను ;

6. విదేశములందు ఆంధ్రప్రదేశ్‌లో ఉత్పత్తి యగు ఉన్ని వస్తువులకు విపణుల నభివృద్ధి చేయుటకుగాను ప్రముఖములైన యూరోపియను దేశములలో ప్రదర్శన శాలలేగాక విక్రయశాలలు కూడ ప్రారంభింపవలెను ;

7. భారతీయ 'రాయబార కార్యాలయము' లకు చెందిన వ్యాపార శాఖలు ఈ సందర్భమున ఈయకలిగిన సహకారము, చేయగల ప్రచారము ఎంతేని ఉపకరించును;

8. విదేశ ద్రవ్యమును సంపాదించగల ఈ పరిశ్రమకు ప్రభుత్వము ప్రత్యేకించి (మంజూరు చేయవలసిన) ధన సహాయము చేయవలయును ;

9. ప్రభుత్వము స్థానికముగా గిరాకీని ఎక్కువ చేయుటకు తన శాఖల అవసరములకు కావలసిన వస్తువుల నెల్ల ఈ రంగమునుండియే కొనవలెను ;

10. మేలు రకము గొర్రెల సంతతి అభివృద్ధి చేయు క్షేత్రములను స్థాపించుట, వానిని సహకార మార్గమున అధికము చేయుట, గొర్రెలకు వచ్చు జబ్బులను నిరోధించుటకు వైద్య సాహాయ్యము శాస్త్రీయమైన పద్ధతులలో ఉన్నిని కత్తిరించుట మరియు తరగతుల ప్రకారము దానిని విభజించుట, పచ్చిక బీళ్ళను విస్తరింప జేయుట ఇవి ప్రభుత్వము తీసికొన దగిన కొన్ని ముఖ్యమైన చర్యలు.

ఉన్ని నేత పనివాండ్ర శిక్షణకును ఈ క్రింది సూచనలవసరము.

1. పంజాబులోని హిస్సారు ప్రభుత్వక్షేత్రమున, పూనాలోని గొర్రెల అభివృద్ధి క్షేత్రమున ఇట్టి శిక్షణ లభించగలదు ;

2. చిక్కు విడదీసి ఉన్ని శుభ్రము చేయుటకు, ఏకుటకు కేంద్రములను స్థాపించవలెను ;

3. 'ప్రెస్' చేయుటకు కూడ కేంద్రములు అవసరము;

4. సాంకేతిక శాస్త్రీయ శిక్షణకు సంబంధించిన విద్యయు నేర్పదగును ;

5. ఉన్ని పరిశ్రమాభివృద్ధి బోర్డును స్థాపించవచ్చును. ఇందు పారిశ్రామిక, సహకార, అటవీ, వ్యవసాయ శాఖలకు చెందిన ఉద్యోగులును, పరిశ్రమకు చెందిన అనేక రంగములనుండి ప్రతినిధులును సభ్యులుగా నుందురు. రాష్ట్ర వాణిజ్య పరిశ్రమల శాఖ పని వాండ్రకు సాంకేతిక శిక్షణ ఇచ్చుటయందును, ఉన్నిని ఏకుటకుగాను యంత్రములను ప్రవేశ పెట్టుటయందును ప్రగతి మార్గమును అనుసరించుచునే యున్నది. భారత దేశమున ఏయితర రాష్ట్రముకంటెను ఎక్కువ ఉన్ని చేనేత మగ్గములు ఉన్న ఆంధ్రప్రదేశ్‌లో ఈ పరిశ్రమ అభివృద్ధి చేయుటకు సరియైన కార్యక్రమము ఏర్పాటు కాగలదని భావింపవచ్చును.

చేతిపనులు : ఆంధ్రప్రదేశ్‌లో సంప్రదాయ సిద్ధమైన పలురకములైన చేతిపనులుండుటను బట్టియు, వాటి అభి

వృద్ధికి తోడ్పడు అవకాశముల నన్నిటిని వినియోగించి వాటి ఆర్థిక ప్రతిపత్తిని పెంపొందించుటకు రాష్ట్ర ప్రభుత్వము చేసిన ప్రయత్నములను బట్టియు, ఈ పరిశ్రమలు కడచిన పదెనిమిది సంవత్సరములలో ప్రశంసనీయమైన పురోభివృద్ధిని పొందిన వని చెప్పవలసియున్నది. ఈ ప్రగతి ప్రణాళికలకు సంబంధించిన ప్రత్యేకాంశము చేతి పరిశ్రమల నన్నిటిని సహకార పద్ధతిని నిర్మింపచేయుటయే. మన రాష్ట్రమున సౌందర్య నిలయములును, ప్రజల దైనందిన అవసరములకు ఉపయోగపడునవియునైన పారిశ్రామిక కళలను గూర్చి దిగువ సంక్షిప్తముగా వివరించడమైనది :

ఆంధ్రప్రదేశ్‌లో చేనేత పరిశ్రమ చాల విస్తృతమైనది; దాదాపు 3 లక్షల మగ్గములు గలవు. ఈ పరిశ్రమలో గుంటూరు జిల్లాది ప్రథమ స్థానము. ఆ జిల్లాలో మొత్తము 41,000 మగ్గములున్నవి. ద్వితీయ స్థానము 13,000 మగ్గములు గల కృష్ణా జిల్లాకు చేకూరుచున్నది.

ఇవిగాక ఇంకను చిన్నచిన్న కుటీరపరిశ్రమలు రాష్ట్రములో నంతటను వర్ధిల్లుచున్నవి. ఇప్పటి కుటీర పరిశ్రమలలో ముఖ్యమైన కొన్నింటిని గూర్చిన వివరములు క్రింది పట్టికలో వివరింపబడినవి :

| పరిశ్రమ | జిల్లా |
|---|---|
| 1. దంతము, కొయ్యబొమ్మలు. | విశాఖపట్టణము, శ్రీకాకుళము. |
| 2. గాజువస్తువులు, గాజులు. | తూర్పు గోదావరి, కర్నూలు, విశాఖపట్టణము, శ్రీకాకుళము, కడప, పశ్చిమ గోదావరి. అనంతపురము, చిత్తూరు, కృష్ణ, నెల్లూరు. |
| 3. వస్త్రములకును, నూలుకును రంగులు వేయుట, అద్దకము. | తూ. గోదావరి, ప. గోదావరి. గుంటూరు, కృష్ణ. |
| 4. పీచుపరిశ్రమ. | తూ. గోదావరి, ప. గోదావరి, చిత్తూరు, విశాఖ పట్టణము, శ్రీకాకుళము. |
| 5. తాటినార. దానితో తయారైన సరకులు. | పశ్చిమ గోదావరి, చిత్తూరు. |
| 6. జనపనార పట్టాలు, (మడత మంచము, కుర్చీలకు). | పశ్చిమ గోదావరి. |
| 7. గోనె సంచులు, ఐస్తాలు. | కడప, అనంతపురం, గుంటూరు నెల్లూరు, విశాఖపట్టణము, శ్రీకాకుళము. |
| 8. నవారు | పశ్చిమగోదావరి. |

కొయ్యబొమ్మల పరిశ్రమ : బొమ్మలు మానవ జాతి పుట్టిన నాటినుంచి ప్రారంభమైనవి. ఆయా ప్రదేశముల ప్రకృతిని అనుసరించి. సాంఘిక, ఆర్థిక జీవితమును బట్టి అచ్చట దొరకు ముడి పదార్థములను వినియోగించుకొని వివిధ ప్రదేశములలో వివిధములైన బొమ్మల పరిశ్రమలు స్థావర మేర్పరచుకొన్నవి. 20 వ శతాబ్దపు మొదటి అర్ధభాగము బొమ్మల పరిశ్రమకు సువర్ణయుగ మని చెప్పవచ్చును. ఈ కాలములో ఫ్రోబెల్, మాంటిస్సోరి వంటి ప్రముఖ విద్యావ్యాపకులు విద్యార్థుల ఆలోచనా జ్ఞాపకశక్తులను అభివృద్ధి చేయుటలో ఆటలు, బొమ్మలు ఎంతవరకు తోడ్పడగలవను అంశమును ప్రపంచమునకు తెలియచేయుటతో ప్రతి ఇంటిలోను, ప్రతి విద్యా సంస్థలోను బొమ్మలకు ప్రత్యేక స్థానము లభించినది.

ఆధునిక యుగములో బొమ్మలు ముఖ్యముగా కొయ్యతోను, బట్టతోను, కాగితపు గుజ్జుతోను, రబ్బరుతోను, కొన్ని తేలికయైన లోహములతోను చేయబడుచు పసిబిడ్డల ఆటలకు అనుగుణ్యములై వారి శరీరాభివృద్ధికి, మనోవికాసమునకు తోడ్పడుచున్నవి. ఇంతేగాక బొమ్మల సహాయముతో పిల్లలు ఉపయోగమైన పనులు కొన్నిటిని నేర్చుకొనుట, తెలివి తేటలు అభివృద్ధి చేసికొనుట, వాటి వలన ఆనందమును పొందుట జరుగుచున్నది.

ఆంధ్రప్రదేశ్ నందలి కొయ్య బొమ్మల పరిశ్రమ ప్రపంచ ప్రఖ్యాతి గాంచి ఉన్నది. ఈ పరిశ్రమ రాష్ట్రములో కనీసము నాలుగు ముఖ్య కేంద్రములందు కలదు; ఇవి కొండపల్లి, నిర్మల్, ఏటికొప్పాక, తిరుపతి అనునవి. కొండపల్లి, నిర్మల్ బొమ్మలు తేలిక అయిన తెల్లపొనికి కర్రతో చేయబడి గొప్ప కళా నైపుణ్యమును, సృజనాశక్తిని చాటుచున్నవి. పరిశ్రమలో తయారగు వస్తువులలో ముఖ్యమైనవి దేవతామూర్తులు, మానవు లవలంబించు అనేక వృత్తులను చూపు బొమ్మలు, పశువులు, జంతువులు, పండ్లు, కూరగాయలు - వీని ప్రతిరూపములు ; ఈ బొమ్మలలో నిరూపితములగు ఆకారములు, వాటికి వేయు శాశ్వతమైన ముదురు రంగు చిన్నపిల్లలకు అత్యుత్సాహమును కలిగించి వారి ఆలోచనా శక్తిని పెంపొందించుటకు సహాయపడుచున్నవి. ఆర్. వి. రా.

## కొండపల్లి బొమ్మలు

కొండపల్లి చరిత్ర ప్రసిద్ధమైన గ్రామము. ఇది విజయవాడకు తొమ్మిదిమైళ్ళ దూరమున నున్నది. ఇది కొండల మధ్యనుండి రమణీయమైన ప్రకృతి దృశ్యముతో అలరారుచున్నది. కొండపల్లి రంగు రంగుల కొయ్య బొమ్మలకు పేరు పొందినది.

ఈ గ్రామమునకు పూర్వము రాజపుత్ర స్థానమునుండి రమారమి రెండువందల క్షత్రియ కుటుంబములు వలస



కొండపల్లి బొమ్మలు - దశావతారములు

వచ్చినవని చెప్పుదురు. వారి సంతతివారే ఇచట రంగు రంగుల కొయ్యబొమ్మలను తయారు చేయుటయందును నిపుణులై తరతరములనుండి ఈ పరిశ్రమను కుటుంబ వృత్తిగ నవలంబించుచు దానిని అభివృద్ధిపరచుచు వచ్చిరి. కాని ఈ బొమ్మలపై ఆదరాభిమానములు గలిగి వీటిని ఉత్సాహముతో కొని తమ ఇండ్లలో నుంచుకొని ఆదరించు కళాభిమానులు క్రమక్రమముగా తగ్గిపోవుటవలన ఈ పరిశ్రమయందు పనిచేయు వ్యక్తులకు తగిన పోషణలేక సుమారు పదిహేను కుటుంబముల వారు మాత్రమే ఈ వృత్తి నిప్పటికి అవలంబించి యున్నారు. ఆయా కుటుంబములలోని స్త్రీలు, పురుషులు, పిల్లలుకూడ ఈ పనిలో ఆరితేరినవారు; వారందరు ఈ పరిశ్రమలలో పాల్గొందురు.

**బొమ్మలను తయారుచేయు పద్ధతి:** ఈ బొమ్మలను తయారుచేయు విధానము తిలకించుటకు చాల ముచ్చటగ నుండును. చిన్నవారికి శిక్షణ నిచ్చుటకు ఈ పనులలో నిపుణులైనవారు ఈ గ్రామములో నున్నారు. చిన్ననాటి నుండి ఈ పనులు చేయుచున్న 60, 70 ఏండ్ల వృద్ధుల సమక్షమున, వారి పర్యవేక్షణక్రింద ఈ బొమ్మలు తయారగుచున్నవి. వారు తయారు చేయదలచుకొన్న విగ్రహముల నమూనాలు పూర్వపు పాతపుస్తకములలో వ్రాసి యుండును. ఆ చిత్రములలోని రూపభాగములు, వాటి అలంకరణములు గుర్తుంచుకొని కాళ్ళు, మొండెము, చేతులు, తల విడిగా వీటితో చేర్చవలసిన ఇతర వస్తువుల భాగములు తయారుచేయుటకు వారు తమవద్ద పనిచేయు పనివాండ్రకు కాగితముమీద వాటి బొమ్మలు వ్రాసి ఇత్తురు.

కొండపల్లి లోయలో ఒక విధమగు తేలికైన - తెలుపు, పసుపు కలిసిన - గోపివర్ణపు కర్ర విస్తారముగా దొరకును. ఆ కర్రపేరు తెల్లపొణికి. ఆ కర్రలను తెచ్చి కావలసిన ప్రమాణమునకు నరికి "బావుదారు" అనే పనిముట్టుతో చెక్కి దానిని ఏ విగ్రహమును రూపొందింప దలచుకొందురో ఆ విగ్రహము భాగములకు అనువుగ తయారుచేసి వాటిని నిప్పుసెగ మాత్రము తగులునట్లు కుంపట్లపై అమర్తురు. ఇందువలన కర్రలోనుండు తేమపోయి అటుపైని అది వంగకుండ దానికి ఒక నిర్ణీతరూపము, బిరుసుదనము ఏర్పడును. ఒక్కొక్క బొమ్మలోని విడిభాగములు తయారుచేయు పనిలో ఆరితేరిన వారెవ్వరుందురో అట్టి నిపుణులను ఆ పనియందు పర్యవేక్షకుడు నియమించుచుండును. ఈ విధముగ ఒక బొమ్మలోని విడిభాగము లన్నియు తయారైన పిమ్మట పర్యవేక్షకుడు వాటిని కలియగూర్చును. ఇట్లు కూర్చుటలో బాగుగా ఉడికించిన చింతగింజల గుజ్జును, దానిలో కొంత కొయ్యగుజ్జు, జిగురు కలిపి ఉపయోగింతురు. దానితో ఆ విడిభాగములు ఒకదానితోనొకటి గట్టిగా బిగిసికొని పోవును. తరువాత తెల్లరంగు ఒక పూతపూసి అది ఆరిన తదుపరి ఆయా భాగములకు అవసరమైన రంగులు వేసి అలంకరణములు చేయుదురు. రంగులు వేయుటలో టెంపెరా రంగుల నుపయోగింతురు. సుద్దరంగులు, సింధూరము, మైలుతుత్తము మొదలైన రంగులను కూడ వాడుదురు. కొన్ని టెంపెరా రంగులపై వార్నీసు పూయుదురు. అట్లు పూసినచో వర్ణపు పైభాగము నిగనిగ లాడుచుండును; అట్టి బొమ్మలపై నీళ్ళు పడినను రంగు కరిగిపోదు. తయారయిన బొమ్మలందు రేఖల సొంపులు దిద్దుట ఆ పనియందు ఆరితేరిన మరొక వ్యక్తి చేయును.

**కొండపల్లి బొమ్మల ప్రసిద్ధి:** ఈ బొమ్మలు భారతదేశమందంతట ప్రసిద్ధి కెక్కినవి. ఆంధ్రప్రదేశ్‌లో విరివిగ కొనగలిగి ఉత్సాహవంతులైన ధనికుల ఇండ్లలో ఇవి కానవచ్చును. కొండపల్లి బొమ్మలన్నిటిలో "దశావతారములు" (చూ. త్రివర్ణ ఫలకము) ప్రశస్తి గాంచినవి; వీటిలో ఎక్కువ పనితనము కన్పట్టును. దశావతార వర్ణనలకు తగినట్లు ఒక్కొక్క అవతార రూపమును లావణ్యముతో రూపొందించుట గమనించదగినది. ఇవిగాక మావటీనితో నున్న ఏనుగు అనేక పరిమాణములలో బాగుగ అలంకృతమైనది - అద్దాల బీరువాలగాని, రచ్చసావడిలోగాని, అతిథి అభ్యాగతులు సమావేశమగు గదిలోగాని కొంత ఎత్తయిన బల్లమీద కొన్ని ఉంచినచో చూచుటకు ముచ్చటగనుండును. ఒంటెలు, రెండెడ్లబండ్లు, చాకలి, మంగలి మొదలైన పనివాండ్ర వ్యక్తిచిత్ర సంచయము, వివిధ జాతులవారి కుటుంబపు బొమ్మలు, గౌండ్లవాండ్రు తాటిచెట్టెక్కి కల్లు గీయుట, క్రింద పోలీసుల మద్యనిషేధపు చర్యలు, గుర్రము, లేగదూడతోనున్న ఆవు, గొల్లవాడు పాలు పితుకుట - ఇటువంటి మరపురాని సుందరములైన బొమ్మలెన్నో - చిన్నవి పెద్దవి వేరు వేరు పరిమాణములలో ఈ దారుచిత్ర సంచయమునందున్నవి.

అరంగుళము ప్రమాణము గలవి, అంతకంటెను చిన్నవి మనుష్యుల బొమ్మలు కొయ్యతోనే తయారుచేసి వర్ణములు పూసి బొమ్మల కొలువులలో వినోదానికి, వేడుకలకు, ఇంటిలో ప్రదర్శన యోగ్యస్థలములో నుంచుటకు, విదేశవాసులకు స్నేహితులకు కొని బహుమానముగ పంపుటకు రూపొందించి ప్రజాబాహుళ్యానికి అమ్ముచున్నారు.

**ప్రోత్సాహము:** నామమాత్రావశిష్టమైకొన యూపిరితో నున్న ఈ బొమ్మల పరిశ్రమకు భారతదేశ స్వాతంత్ర్య

సంపాదనానంతరము కొంత ప్రోత్సాహము లభించి పునరుజ్జీవము కలుగుచున్నది. చేతిపనులను, లఘుపరిశ్రమలను, కులవృత్తులను పునరుద్ధరించుటకును, ఆర్థికముగ సహాయపడుటకును జాతీయ ప్రణాళికలద్వారా ఇప్పుడిప్పుడు కేంద్రరాష్ట్ర ప్రభుత్వములు సహకరించుచున్నవి. ఈ పరిశ్రమాభివృద్ధికి ఇప్పుడు కేంద్రప్రభుత్వము కొంతధనము గ్రాంటును, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము కొంత ధన సహాయమును ఇచ్చినవి.

పరిశ్రమ భవిష్యత్తు ; ప్రస్తుతము ఈ బొమ్మల విక్రయములకు ఎక్కువ అవకాశము లున్నవి. ఈ బొమ్మలను చూచి ఆనందించి కొనుగోలుచేసి వీటిని ఖండాంతరములకు గొనిపోవు విదేశీయు లున్నారు. కొండపల్లిలో ఒక కొనుగోలు సహకారసంఘమును, ఈ పరిశ్రమలో తర్ఫీదు నిచ్చుటకు ఒక శిక్షణ శిబిరమును ఏర్పడినవి. సర్కారువారు ఇచ్చు వేతనముపై ఇతర జిల్లాలనుండి విద్యార్థులు వచ్చి ఈ విద్యను పురుషులు స్త్రీలు నేర్చుకొనుచున్నారు. ఈ పరిశ్రమకు కళారూపకమైన విశిష్టత చేకూరునట్టి భవిష్యత్తు కలదు. ఖండాంతరములలోగూడ ఈ విద్య ఆంధ్రప్రదేశ్ కేకాక భారతదేశానికి కూడ ముందు ముందు కీర్తి గడించుననుటలో అతిశయోక్తి లేదు. హెచ్. వి. రా. గో.

నిర్మల్ ఆట వస్తువులు : ఆదిలాబాదు జిల్లాలోని నిర్మల్ గ్రామమున చాల తరములుగా ఈ పరిశ్రమ నిర్వహింపబడుచున్నది. పరిసరారణ్యముల లభ్యమగు తేలికైన బూరుగు, పుణికి కర్రలతో సుందరములగు ఆట వస్తువులను, వివిధ రకముల పక్షులను, జంతువులను, ఫలములను, కూరగాయలను అనుకరించుచు చేయుదురు. అంతేకాక పల్లకీలు, పళ్ళెరములు, కుర్చీలు, బల్లలు, చదరంగపుసెట్లు కూడ ఆ కర్రలతో తయారగును. పారిశ్రామికులు ఈ బొమ్మలను తమ గృహములందే చేసి వాటికి రంగులు పట్టింతురు. ఇటీవల ప్రభుత్వము నిర్మల్ కళాకారులకు ఒక సహకార సంఘము నేర్పరచి వారి సాంకేతిక శిక్షణకు వసతులు కల్పించినది. ఈ పరిశ్రమాభివృద్ధికై ప్రభుత్వము ఒక కామన్ ఫెసిలిటీ సెంటరు కూడ నిర్మించినది. తత్ఫలితముగా ఈ నాడు నిర్మల్ బొమ్మల పారిశ్రామిక సహకార సంఘము ద్వారా 40 మంది పనివారలకు సంవత్సరము పొడుగునను పని కల్పించబడుచున్నది.

పారిశ్రామిక ధర్మకర్తృత్వ నిధినుండి ఈయబడిన సహాయముతో హైదరాబాదు నగరములో నిర్మల్ లక్క పరిశ్రమ ఇటీవలనే పునరుద్ధరింప బడినది. ఈ పరిశ్రమలో తయారగు పళ్ళెరములు, తెరలు, పైకప్పుగల దీపపు సెమ్మాలు, చుట్టల పెట్టెలు, సిగరెట్టు కేసులు, స్త్రీల పాదరక్షల తాలూకు మడమలు, భోజనపాత్రల సెట్లు, సొమ్ముల పెట్టెలు, వర్ణ చిత్రములు, అందమైన దారు సామగ్రి (ఫర్నిచరు) మున్నగున వన్నియు ఆకర్షణకు, మన్నికకు పేరుపొందినవి. మంచి పనితనమునకేగాక మూలికల సహాయమున బంగారు చార వచ్చునట్లుగా రంగు వేయుటయందును నిర్మల్ పనికి ప్రత్యేక విశిష్టత గలదు. కళా ప్రాశస్త్యమున నిర్మలు పనికి సాటియగు చేతపని ప్రపంచమున వేరులేదని వక్కాణించనగును.

తిరుచానూరు బొమ్మలు : తిరుపతి చందనపు బొమ్మలు ప్రత్యేక విశిష్టత కలిగినవి. దేవతామూర్తులు, పురాణ పురుషుల రూపములు, స్త్రీ పురుష విగ్రహములు తిరుపతి బొమ్మలలో విరివిగా కాననగును. పండుగల సందర్భములలో తిరుపతి బొమ్మలకు విస్తారమగు గిరాకీ లభించుటను బట్టి ఈ పరిశ్రమకు ఒక ప్రత్యేకస్థాయి ఏర్పడినది. ఈ బొమ్మలయొక్క సాంప్రదాయిక శైలిని నిలబెట్టి వాటి నాణ్యత అభివృద్ధిచేయు ఉద్దేశముతో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము ఒక ఉత్పత్తి శిక్షణకేంద్రమును స్థాపించినది. తిరుపతి బొమ్మలకు కెనడా, అమెరికా తదితర విదేశములందుకూడ మంచి గిరాకీ కలదు.

ఏటికొప్పాక లక్కబొమ్మలు : విశాఖపట్టణము జిల్లాలోని ఏటి కొప్పాక గ్రామము లక్కబొమ్మలకు చాల కాలమునుండి ప్రసిద్ధి కెక్కినది. ఈ పరిశ్రమయందు ఫల పుష్పముల ననుకరించి చేయబడు బొమ్మలు, పేటికలు, పళ్ళెరములు-రైల్వే ఇంజనులు మొదలగున వెన్నియో రకముల బొమ్మలు బాలుర వినోదవిజ్ఞానములకు తోడ్పడుచు చూపరుల దృష్టి నాకర్షించుచున్నవి. ఈ పరిశ్రమాభివృద్ధి నిమిత్తము ప్రభుత్వమువారి సహాయముతో ఒక పారిశ్రామిక సహకారసంస్థ నడుపబడుచున్నది.

ఇటీవల హైదరాబాదు నగరమునందును, మచిలీపట్టణ సమీప గ్రామములలోను మరియొక రకమైన బొమ్మల పరిశ్రమ ఆరంభమైనది. మట్టితోను కాగితపు గుజ్జుతోను చేయబడిన రంగురంగుల బొమ్మ లనేకము తయారగుచున్నవి. సింహపురి బొమ్మలు అని వ్యవహరింపబడెడి పింగాణీ బొమ్మలుకూడ నెల్లూరులో ఈ మధ్యనే తయారగుచున్నవి.

తివాసీలు : ఆంధ్రప్రదేశ్ చేనేత పరిశ్రమగూర్చి ముచ్చటించు సందర్భమున ఉన్ని పరిశ్రమను గురించి ప్రస్తావించి ఉంటిమి.

ఏలూరు, వరంగల్లు పట్టణములలో నేయబడు ఉన్ని తివాసీలు ఎన్నతగిన పనితనము కలిగి ఈ రాష్ట్రమున

కొక గర్వ కారణమై ఉన్నవి. ఈ తివాసీల పై నేయబడు పర్షియను డిజైనులు వీనికొక ప్రత్యేకమైన సొబగు. ఈ తివాసీలు 957 లండనులో జరిగిన వస్తు ప్రదర్శనమున ప్రశస్తమైనవిగా పరిగణింపబడుట ఎంతయు ముదావహము. నేలపై రత్న కంబళములు పరచుటవలన గదికి ఏర్పడు ప్రత్యేకశోభ ఇతర అలంకరణమువల్ల లభించదు.

ఏలూరు, వరంగల్లులలోగల తివాసీ, కంబళ్ళ పరిశ్రమల ఆర్థిక ప్రతిపత్తిని గూర్చి క్లుప్తముగా పరిశీలింతము. 1,000 మంది నిపుణులైన పనివాండ్రు 200 మగ్గములు పరిశ్రమయందు గలవు. పైన చెప్పబడిన రెండు పట్టణములయందు ఏలూరున ఒకటి, వరంగల్లున ఒకటి – ఈ పరిశ్రమకు సంబంధించిన రెండు సహకార సంఘములు గలవు. స్థానిక విపణులకుగాను సరసమైన ధరలకు ఈ సంఘములు తివాసీలు తయారు చేయుచుండగా వైయక్తిక పారిశ్రామికులు విదేశములకు ఎగుమతి చేయుటకు అవసరమైన స్థాయిలో ఉత్పత్తిని నిర్వహించుచున్నారు.

కంబళ్ళు : యంత్ర పరికరముల నేమియు వినియోగించక రాష్ట్రమున చేతి పనిగనే ఉన్ని వస్తువుల పరిశ్రమ నీనాడు కొన సాగించుచున్నారని తెలిసికొంటిమి. ముడి ఉన్ని పరిశుభ్రము చేయుటకుగాను చెత్త చెదారములు వేర్పరుపబడి బాగుగా ఏకబడును. తరువాత రాట్నమునుగాని కదురునుగాని ఉపయోగించి ఊలుదారము తీయుదురు. మగ్గములపై ఈ దారముతో కంబళ్ళు, దుప్పట్లు నేయుదురు.

తివాసీలు : అట్టి ఊలు దారమును వివిధములగు రంగులలో నానవేసి కావలసిన రంగు నిత్తురు. పురి వేసిన నూలుదారమును నేయబోవు తివాసీ పరిమాణములో మగ్గముపై వేసి ఊలు దారముతో ముడులువేయుచు పోవుటయే తివాసీ నేత పనివాని మొదటి పని. 'పర్షియను ముడులు' అని పరిశ్రమలో వ్యవహరించు వీనిని నేయుట ప్రత్యేకము నేర్పరి తనముతో కూడిన గొప్ప విద్యయే. నేతకు బలమిచ్చుటకు జనపనారతాడు ఉపయోగింపబడును. వర్ణవైవిధ్యము లేని ఏక వర్ణపు తివాసీలు, అందమైన పెక్కురంగుల డిజైనులతోకూడిన తివాసీలుకూడ నేయబడును.

పరిశ్రమయందలి నేతపనివాండ్రు బీదజనులు. భారీ పరిశ్రమగా దీనిని కొనసాగించుటగాని, ఫ్యాక్టరీ నెలకొల్పుటగాని వీరు చేయజాలరు. ఏమైనను సహకార సంఘములను మాత్రము ఏర్పాటు చేసికొనకల్గిరి. ఈ సందర్భమున శ్రేయోరాజ్యాదర్శము ధ్యేయముగాగల భారత ప్రభుత్వ మొనర్చిన కృషి మెచ్చదగినది. ఈ సహకార సంఘముల అభివృద్ధికి రాష్ట్రప్రభుత్వము సుమారు రెండులక్షల రూపాయలు మంజూరు చేసినది. తక్కువవడ్డీ చొప్పున ప్రభుత్వ మొసంగిన అప్పుల సహాయముతో మొత్తముమీద 40 ప్రాథమిక సహకార సంఘములు ఉన్ని నేత పరిశ్రమ రంగమంతటిలోను స్థాపించబడినవి. ప్రాథమిక సంఘముల కృషికి ఏకత్వము సంపాదించి కేంద్ర, రాష్ట్రప్రభుత్వములు ముందు ఉన్ని పరిశ్రమకు ప్రాతినిధ్యము వహించుటకుగాను 1955 లో స్థాపించబడిన కేంద్రసంఘము అప్పటి నుండియు ఆశించిన ఫలితములను మించియే పనిచేయుచున్నది. ఈ సంఘము ఖాదీ గ్రామోద్యోగ సంఘముతో సంప్రదించి ఉన్ని చేనేత వస్తువులకు ఖద్దరుతో సమాన ప్రతిపత్తి నొసంగవలెనను అంశముపై విజయమును సాధించినది. చేతితో వడకబడి, చేతితో నేయబడు కంబళ్ళకు ఇందు మూలముగా చిల్లర అమ్మకములో రిబేటు లభించును.

ప్రత్యేకించి కంబళ్ళను నేయు పనివారల ఆర్థికదుస్థితి ఈ సహకార సంఘముల మూలముననే బాగుపడినది. కంబళ్ళను నేయు నేతగాండ్రను 'కుర్మాలు' అందురు. వ్యాపారులు వీరికి ఉన్నిని, కొంత ధనమును బయానా రూపముగా ఇచ్చి తయారైన కంబళ్ళను వారే కొందురు. నేతగాండ్రకు కూలిరూపమున కేటాయించి ఏమియు ఒసంగుట జరుగదు. కాని, ఉన్నిని వ్యాపారులు కుర్మాలకు అమ్మినట్లు, కొంత డబ్బును అప్పుగా ఇచ్చినట్లు, తిరిగి వస్తువును కొనినట్లు – రీతి అంతయు కాన్పించును. ఇట్లు చేయుటవలన పనివారలకు ఇంతకూలి స్పష్టముగా, సూటిగా ముట్టుచున్నదని చెప్పుటకు వీలులేక పోవుచున్నది. ప్రభుత్వ సహాయసాధన సంపత్తులతో స్థాపించబడిన సహకార సంఘములు మధ్యవర్తులైన వర్తకుల బారినుండి పనివారలను రక్షించినవి. సహకార రంగమును ఇంకను విస్తరింప జేయవలసిన అవసరము కలదు.

పరిశ్రమయందు 18 లక్షల కుర్మాలు కలరు. ప్రత్యేకోద్యోగిని నియమించిన గాని పరిశ్రమ అభివృద్ధి చెందదు. నిరుద్యోగము రానంతవరకు పరిశ్రమను యుక్తీకరణ మొనర్చుటయు అవసరము. ఒక రూపాయి అమ్మకముపై 'ఖాదీ గ్రామోద్యోగ కమిషను' ఇచ్చు 19 నయా పైసలు రిబేటుతోను, చేనేత బోర్డు ఇచ్చునట్టి వర్కింగు కేపిటలు, అప్పుల సహాయము తోను పరిశ్రమ ముందుకు సాగినది. రాజస్థాన్, పంజాబు, కాశ్మీరులలోవలె ఆంధ్ర ప్రదేశ్‌లో కూడ పరిశ్రమ ప్రగతిని సాధించ కలదని ఆర్థిక పరిశీలన వలన తేలినది.

అద్దకపు పరిశ్రమ : వస్త్రములపై అద్దకము పని చేయు పరిశ్రమలలో ఆంధ్ర ప్రదేశ్‌నకు చాల పురాతన ప్రసిద్ధి

కలదు. ఈ అద్దకపు పనిలో రాష్ట్రమంతట వేర్వేరు రీతుల సాంకేతిక పద్ధతులు అవలంబింప బడుచున్నవి. ఈ డిజైనులు స్థానిక సంప్రదాయానుగుణముగా నుండును. ఈ సాంకేతిక పద్ధతులను మూడు తరగతులుగా విభజింప వచ్చును.

'రేసిస్టు స్టైల్ లేదా ఇండిగో ప్రాసెస్' : దీనినే కలంకారి అద్దకము అని అందుము. బందరు కలంకారీ అద్దకపు పని దీనికి చక్కని తార్కాణము. స్థానికముగా లభించు కొన్ని మూలికల నుపయోగించి తయారు చేసిన రంగులను అద్దకమున కుపయోగింతురు. కలము లేదా కుంచె నుపయోగించి పట్టపై తెల్లగా నుండవలసిన చోట మైనపు పూత పూయుట వలన ఆ భాగములందు రంగు పట్టక తెల్లగా నుండును. మహాభారతాది ఇతిహాసములందలి కథలు చిత్ర రూపమున వస్త్రములపై అద్దకము చేయబడును. ఇప్పటికిని అనేక దేవాలయములలో కలంకారి అద్దకపు వస్త్ర ముల ముక్కలు కానవచ్చును. ఈ మధ్య కలంకారీ అద్దకములో అందమైన అద్దకపు చీరలు కూడ వచ్చుచున్నవి. పడకలపై పరచుకొను దుప్పట్లు, గుమ్మములకు కట్టుకొను కర్టెనులు, బల్లల మీద వేయు 'టేబిల్ క్లాతులు' అనేక డిజైనులు కలవి కలంకారీ అద్దకములో వచ్చుచున్నవి. చుట్టును జరిగల వస్త్రములపై వివిధములైన డిజైనులతో చేసిన కలంకారీ అద్దకపు పని చాల అందముగానుండి ఇంచుమించు "ఖింఖాబ్" ను పోలియుండును. కలంకారీ అద్దకపు వస్త్రములను విరివిగా ఎగుమతి చేయుటకు అవకాశములు గలవు.

"మోర్డెంట్" లేక "డైడ్ స్టైల్": ఈ పద్ధతిని అలిజరైన్ పద్ధతి అని కూడ అందురు. దస్తరుఖానాలు, గుడారములకు ఉపయోగించు గుడ్డలపై వేయు 'లైనింగులు', గుమ్మములకు తెరలు, 'కుషన్ల' పై వేయు 'కవరింగులు' మొదలగు అనేక రకముల వస్త్రములపై అద్దకమునకు ఈ పద్ధతి అవలంబింతురు. లంబాడీలు ఉపయోగించెడి దుస్తులపై కూడ అద్దకము చేయుటకు ఈ పద్ధతి అవలంబించ బడును. హైదరాబాదు ప్రాంతపు లంబాడీ స్త్రీలు ఇట్టి దుస్తులను విరివిగా ఉపయోగింతురు. ప్రకాశవంతమగు రంగులతోను, డిజైనులతోను ఈ వస్త్రములు కనులకు మిరుమిట్లు గొలుపు చుండును.

"టై అండ్ డై స్టైల్": పోచంపల్లి, చీరాల అద్దకపు చీరలలో అవలంబింపబడు విధానమున కొక ప్రత్యేక విశిష్టత గలదు. వస్త్రములు నేయుటకు ముందుగనే నిర్ణయింప బడిన డిజైను ప్రకారము రంగువేసి పిమ్మట వస్త్రమును నేయుదురు. వస్త్రము నేసిన తరువాత ఏర్పడిన డిజైను సహజముగా అందముగా కన్పడును. ఈ విధముగా అద్దకము చేయబడిన వస్త్రము పై రెండు పద్ధతుల ద్వారా అద్దకము చేసిన వాటికంట మేలు రకముగా ఉండును. వస్త్రము నేయునపుడు డిజైను ప్రకారము రావలసిన వివిధ వర్ణముల నూలు పడుగు పేకలకు ఉపయోగించి సీతాకోక చిలుక రెక్కవంటి కనుల కింపైన బట్టను కళాకారుడు విపణివీథిని ప్రవేశపెట్టుచున్నాడు. పోచంపల్లి, తేలియా రుమాళ్ళు, చీరలు, చీరాల, ఆసియా రుమాళ్ళు, మిర్యాలగూడెము చేనేత చీరలు ఈ విధానమున తయారగుచున్న వస్త్రములు.

జరీ చీరెలు : ఆంధ్రప్రదేశ్ జరీ చీరలకు కూడ ప్రసిద్ధి కెక్కినది. నూలు మీద జలతారు పని చేసిన ఈ జరీ చీరెలు చాల అందముగను, ఆకర్షణీయముగను ఉండి ప్రత్యేక సందర్భములలో ధరించుటకు రమణీయముగ ఉండును. జరీ చీరెలు నేయబడు కేంద్రములలో గద్వాలు, నారాయణవనము, వెంకటగిరి, మాధవరము, ఉప్పాడ ముఖ్యమైనవి. ఇంతేకాక ఆంధ్రప్రదేశ్‌లో సిద్దిపేట, సంగారెడ్డి, ఆర్మూరు, నారాయణపేట, పెద్దాపురము, ధర్మవరము పట్టు చీరలకు ప్రసిద్ధికెక్కినవి. ఈ చీరలలో గల పనితనము, నాణ్యము అతి సులభముగనే దృష్టి నాకర్షించును. శుభకార్యములందు ధరించుటకు ఇవి ప్రత్యేకముగా ఉపయోగించ వచ్చును ప్రకాశవంతమగు రంగులు, భారీ జరీ పనితనము గల ఈ పట్టు చీరలకు దేశమంతట గిరాకీ కలదు.

తుంగ చాపల పరిశ్రమ : నిత్య గృహోపయోగ పరికరములలో చాపల అవసరమును గూర్చి వేరుగా చెప్పనవసరము లేదు. గృహాలంకరణమునకు కూడ ఈ చాపలు పనికి వచ్చుచున్నవి. తుంగచాపల పరిశ్రమ విలసిల్లుచున్న కేంద్రములలో మహబూబు నగరము, నెల్లూరు అతి ముఖ్యమైనవి. అల్లిక డిజైనులలోని చాతుర్యమునకు, వైవిధ్యమునకు మహబూబునగరము చాపలు భారతదేశమంతట ప్రసిద్ధికెక్కినవి. ఇతర చేతి పనుల వలెనే ఈ పరిశ్రమ కూడ సహకార మార్గమున ప్రోత్సహింప బడుచున్నది.

దంతము, కొమ్ము పరిశ్రమలు : విశాఖపట్టణము, సికింద్రాబాదు నగరములలో దంతము, కొమ్ము పరిశ్రమలు విరివిగా సాగుచున్నవి. దంతము పై పని చేయు కళాకారుడు మంచిగంధము పనిని కూడ దీనికి జోడించి వస్తువులను చేయుట ఈ పరిశ్రమ యందలి ఒక విశిష్టత. మరియు నల్లచేవకర్ర, తాబేటిచిప్పలను ఉపయోగించి రమ్యమైన దంతపు కూర్పు వానిపై నమర్చి ముచ్చటగొల్పు వస్తువులుగా వానిని మార్చుట ఈ కళాకారుల నేర్పరితనము

నకు మరియొక నిదర్శనము. అనేకములైన ఆకారములలో సైజులలో ఫొటో ఫ్రేములు, పెట్టెలు మున్నగు వినియోగ వస్తువులపై ఈ దంతపు తాపడము ఆయా వస్తువుల ఆకర్షణను ఇనుమడింప జేయుచున్నది. కొమ్ముతో చేయబడు వస్తువులు కూడ వినియోగ వస్తువులుగ మాత్రమే కాక అలంకరణ వస్తువులుగను చలామణి అగుచున్నవి. పూల కూజాలు, టేబిల్ లాంప్ స్టాండులు, పక్షుల, జంతువుల ప్రతి రూపములు, ఏష్ట్రేలు, ఇంకను చాల రకముల వస్తువులు ఈ కొమ్ము పనులలో కానవచ్చును.

దంతము, కొమ్ము పరిశ్రమల అభివృద్ధికై ప్రభుత్వ సాహాయ్యముతో సికింద్రాబాదు, విశాఖపట్టణము నగరములు రెండిటియందును రెండు సహకార కేంద్రములు నెలకొల్పబడినవి. ఈ పరిశ్రమలో సుమారు 60 మంది పారిశ్రామికులు పని చేయుచున్నారు.

పూసలు, గాజులు : ఆంధ్రప్రదేశ్‌లో పూసల, గాజుల పరిశ్రమ బాహుళ్యముగనే సాగుచున్నది. చిత్తూరు జిల్లాలోని పాపానాయుడుపేట గ్రామములో ఆధునిక పరికరము లేవియు ఉపయోగింపకయే తయారు చేయుచున్న పూసల పనితనము పాశ్చాత్య దేశములలోని నిపుణుల ప్రశంసలను కూడ అందుకొన్నవి. అనంతపురము జిల్లాలోని గుత్తి, చిత్తూరు జిల్లాలోని కాళహస్తి, పాపానాయుడు పేటలు, మహబూబునగరు జిల్లాలోని గాజులపేట ఈ పరిశ్రమకు కేంద్రములు.

వెండినగిషీ పని: ఉత్తమ శ్రేణి నగిషీ వస్తువులకు కరీంనగరము పూర్వము నుండియు ప్రసిద్ధికెక్కినది. ఈ పరిశ్రమలోని ఇచ్చటి కళాకారులు వెండిని వేర్వేరు పరిమాణములు గల తీగెలుగా తయారుచేసి పెక్కు రకముల వస్తువులను సున్నితమైన డిజైనులలో తయారు చేయుదురు. ఏష్ట్రేలు, పెట్టెలు, సిగరెట్టు కేసులు, బ్రోచ్‌లు, గుండీలు, అందమగు పాన్‌దానులు, అతి సుందరమగు అత్తరు పెట్టెలు మొదలగు వస్తువు లెన్నియో ఇచట తయారు చేయబడుచున్నవి. నగిషీ పనిగల ఈ వెండి వస్తువులు ఉపయోగించు వారికే గాక చూపరులకు గూడ ఆనందమును గల్గించును. ఈ పరిశ్రమలో సుమారు వంద మంది పని చేయుచున్నారు. ఒక సహకార సంఘము కూడ నెలకొల్పబడినది.

బిద్రీ పరికరములు : బిద్రీ వస్తువుల పరిశ్రమ నాలుగు వందల సంవత్సరముల నుండి అమలులోనున్న పురాతన పరిశ్రమ. బహ్మనీ రాజుల ఆదరణ పొందిన ఈ పరిశ్రమ కొలది కాలములోనే ఉన్నత ప్రమాణము నందుకొనగల్గెను. అరేబియా, పర్షియాలలో ప్రాచీన కాలమునుండి అవలంబింపబడుచుండెడి ఉక్కు రాగి ధాతువులతో చేయబడిన వస్తువులపై చేయు వెండి, బంగారు చెక్కడపు పని ఈ బిద్రీ పరిశ్రమకు మూలాధారము. ఈ పరిశ్రమలో తయారగు వస్తువులు తుప్పు పట్టక, వన్నె కగ్గక నిలచును. ఈ వస్తువులను తయారు చేయుటలో గల మూడు ఘట్టములు పోత పోయుట, చెక్కుట, మెరుగు పెట్టి నల్ల రంగు వేయుట అనునవి. వస్తువులను ఎఱ్ఱమట్టి దిమ్మలలో పోత పోసి గరుకు కాగితముతో రుద్దుదురు. పిమ్మట స్వచ్ఛమగు వెండితో వాటిపై అవసరమగు రీతిని నగిషీ చేయుదురు. వస్తువు ఎల్లప్పుడు చెక్కు చెదరని నల్ల రంగుతో నుండి దానిపై చెక్కబడిన వెండిపని స్పష్టముగ కన్పించుచు ఎంతయో అందముగ నుండును. మొట్ట మొదట ఈ పరిశ్రమలో హుక్కా గొట్టములు, పాన్‌దానులు, దీపికలు మొదలగు పరికరములు మాత్రమే తయారగుచుండెడివి. కాని ఇటీవల నాగరికులకు కావలసిన సిగరెట్ల, చుట్టల పెట్టెలు, గుండీలు, పూలకూజాలు, ఏష్ట్రేలు, గాజులు, వ్రాతబల్ల పరికరములు, పళ్ళెరములు మొదలగునవి కూడ తయారు చేయబడుచున్నవి.

ఈ బిద్రీ వస్తువుల యందు కళాకౌశలము, సాంకేతిక నైపుణ్యముల సమ్మేళనము కాననగును. ఈ పరిశ్రమకు బీదరు పట్టణము ప్రధానమైనదైనప్పటికి ప్రస్తుతము హైదరాబాదు నగరమున కూడ సుమారు వందమంది పనివారలు ఈ పరిశ్రమ నాధారము చేసికొని జీవించుచున్నారు. వీరికొరకై ప్రభుత్వ సాహాయ్యముతో రెండు పారిశ్రామిక సహకార సంఘములును, ఒక కామన్ ఫెసిలిటీ కేంద్రమును నెలకొల్పబడినవి. సాలీనా ఒక లక్ష రూపాయల విలువగల వస్తువులు ఈ పరిశ్రమద్వారా ఉత్పత్తి యగుచున్నవి. వీటిలో ఎక్కువ భాగము విదేశములకు కూడ ఎగుమతి చేయబడుచున్నవి.

హిమ్రూ వస్త్రములు: శాటిన్ గుడ్డపైగాని, ట్విల్ గుడ్డపైగాని ప్రత్యేకమైన జములునేత చేయబడి అందమైన డిజైనులు చేరుకొని హిమ్రూ వస్త్రములు తయారగుచున్నవి. వీనికి చేతి పనులలో ప్రత్యేక స్థానము కలదు. కనులు మిరుమిట్లు గొలుపు రంగులతో రకరకముల డిజైనులలో నేయబడు ఈ హిమ్రూ వస్త్రములు బ్లౌజులు, జాకెట్లు మున్నగు స్త్రీల ఆకర్షణీయమగు దుస్తులకు ఉపయోగపడుచున్నవి. గుమ్మముల తెరలకు, సోఫాల కవరింగులకు అవి ప్రత్యేకాకర్షణ. హిమ్రూ శాలువలును ఇటీవల గిరాకిని పెంచుకొనుచున్నవి.

ఈ పరిశ్రమాభివృద్ధికై ప్రభుత్వము హైదరాబాదు నగరములో రెండు సహకార సంఘములను, ఒక కామన్ ఫెసిలిటీ కేంద్రమును నెలకొల్పినది. గత రెండు సంవత్సర

మాట. డబ్బును అప్పుగా ఇచ్చుటలో అతి దయచూపుట గాని, విచక్షణలేకుండ ఇచ్చిన ఎడల ఆర్థిక నిల్వలను విచ్ఛిన్నమునకు, ప్రజలమధ్య అనేక క్లిష్టసమస్యలు రేకెత్తుటకు దారి ఏర్పరచి నట్లగును.

బ్యాంకింగు వ్యవస్థ భారతదేశములో నవీనముగ వచ్చినదికాదు ; పూర్వమునుండి ఉండినదేనని చెప్పవచ్చును. పూర్వము జరుగుచువచ్చిన బ్యాంకింగు వ్యాపారము ముఖ్యముగ జానపద ప్రదేశములలో గ్రామీణులకు డబ్బు అప్పులు ఇచ్చుట, పుచ్చుకొనుట రూపములో ఉండెడిది. ఈ డబ్బు అప్పుయిచ్చి పుచ్చుకొనువారిని 'సాహుకారు' అనేవారు. దేశములో 90% నగదు వ్యాపారము, వ్యవహారము అంతయు వారి ద్వారానే సాగి పోయెడిది. కాని ప్రస్తుతము నగదువ్యాపారము జరుపుటకు ఈ సాహుకారు వ్యవస్థ పనికి వచ్చునట్టిది కాదు. జాతీయ, అంతర్జాతీయ వర్తక వాణిజ్యాది వ్యవహారములను చక్కచేయు శక్తిసామర్థ్యములు వట్టి వడ్డీ వ్యాపారము చేయు ఈ సాహుకారులకు అబ్బడము కష్టమై పోయినది. ఇది భారతదేశములోనే కలిగిన వైపరీత్యము కాదు. పారిశ్రామిక విప్లవానంతరము విదేశములలోకూడ ఇట్టిమార్పు వచ్చినది. ఇప్పుడు వారు అధునాతన పద్ధతిని బ్యాంకింగు వ్యవస్థలను నిర్మించిరి. ఈ విధముగ బ్యాంకింగు అన్నది ఒక్క భారతదేశములోనే గాక ప్రపంచ మంతటగూడ ఈ ఇరువదియవ శతాబ్దములో ఏర్పడిన వ్యవస్థయని సిద్ధాంతము చేసిరి.

భారతదేశములో జన సముదాయమునకు ప్రస్తుతము అందుబాటులోనున్న బ్యాంకు వ్యాపారావకాశములు వివిధ సంస్థలనుండి, ధనికులైన వడ్డీ వ్యాపారస్థుల మూలమున గలుగుచున్నవి. నిజముగ వానిలోనివి కొన్ని బ్యాంకులు కావు. ట్రెజరీలు, స్టేట్ బ్యాంకు ఆఫ్ ఇండియా (పూర్వము ఇంపీరియల్ బ్యాంకు), ఇతర వ్యాపార బ్యాంకులు, సహకార బ్యాంకులు, సహకార పరపతి సంఘములు, పోస్టాఫీసు సేవింగ్సుబ్యాంకులు, జీవిత భీమా కార్పొరేషన్ (పూర్వము ఇన్సూరెన్సు కంపెనీలు), నాటు వడ్డీ వ్యాపారస్థులు, సంస్థలు మొదలగునవి ఈ విభాగమునకు చేరును. దేశములోని బ్యాంకింగు విధానములో అన్ని తరగతుల సంస్థలకును దేనికి దానికే ఒక ప్రత్యేక స్థానము కలదు. రిజర్వుబ్యాంకు తోడ్పాటుతోను, కేంద్రరాష్ట్ర ప్రభుత్వముల తోడ్పాటుతోను అవి జరుపు కార్యకలాపములలో వానికి పరస్పర సహకారమున్ను, కనీసపు ఉన్నత ప్రమాణమున్ను సమర్థతయున్ను, ప్రజా సేవాదృష్టియున్ను ముఖ్యముగ అవసరము. పైన చెప్పిన వాటిలో ఏ తరగతి సంస్థనుగాని రద్దు చేయుట ఉపయోగకరము కాదు. అవి అన్నియును కలసి పొందికగ పని చేసి ఉన్నత వ్యాపార పద్ధతులను వృద్ధి చేసినప్పుడే అవి ప్రజాసేవా యోగ్యములగును.

రెండవ ప్రపంచ సంగ్రామము ముగియ వచ్చిన కాలములోను, ఆ తరువాతను ఆహార పంటల ధరలు హెచ్చుట వలన గ్రామములలోని జనుల ఆదాయము పెరిగినది. మొత్తపు జనాభాలో 75% గ్రామములలో నివసించు భారతదేశములో గ్రామస్థులకు పరపతి సౌకర్యములు కల్పించుట భారత దేశాభివృద్ధికి మిక్కిలి అవసరము. గ్రామ ఆర్థిక వ్యవస్థలో గ్రామ సాహుకారు శతాబ్దములుగ ప్రాముఖ్యము వహించెను. కాని ప్రస్తుత పారిశ్రామిక యుగ ప్రభావమువల్ల పెంపొందుచున్న ఆర్థిక వ్యవస్థ యొక్క అవసరములను తీర్చుటకు అన్ని హంగులతోను ఒక చక్కని పద్ధతి ఏర్పరచవలసిన అవసరము కలిగినది. గ్రామాదాయమును ఒకచోట నిలువ చేయుటకు వలసిన మార్గములను అన్వేషించుటకు 1949 లో ఇండియా ప్రభుత్వము 'గ్రామీణ బ్యాంకింగు విచారణ సంఘము' (రూరల్ బ్యాంకింగ్ ఎన్క్వైరీ కమిటీ)ను నియమించినది. గ్రామములకు బ్యాంకింగు సౌకర్యము కలుగుచేయుట గ్రామముల సంచిత ధనము మీద ఆధార పడియుండును ; గనుక ఈ విషయమును గురించి ఆ కమిటీ వారు వారి నివేదికలో బాగుగ చర్చించిరి. ఈ సందర్భములో నోట్లు, నాణెముల మారకము ; బ్యాంకులకు క్రొత్త శాఖలను ప్రారంభించుట, ట్రెజరీ సంస్కరణము, వివిధ రాష్ట్రములలో సహకార పరపతి వ్యవస్థలో మార్పు సహకార పరపతి విద్య, తర్ఫీదు, బ్యాంకుల విధానములో గ్రామీణ ఋణములకు ఎక్కువ సౌకర్యములు కలిగించుట మొదలైన విషయముల నన్నింటిని గురించి ఈ కమిటీ వారు సిఫార్సులు చేసిరి. ఇంపీరియల్ బ్యాంకును స్టేటు బ్యాంకుగ మార్చుటలో దేశములో పరపతి సౌకర్యములు వృద్ధియై పల్లెలలోను, పట్టణములలోను బ్యాంకింగు వ్యాపారము పెరుగ గలదని ఊహించి జాతీయము చేసిరి. 1955 మొదలు 1960 వరకు ఈ బ్యాంకు అనుకున్న ప్రకారము నాలుగు వందల అదనపు శాఖలను దేశమంతటా స్థాపించియున్నది. అటులనే పూర్వము స్వతంత్ర సంస్థానములలో స్థాపింపబడిన బ్యాంకులను కూడ జాతీయము చేసి స్టేటు బ్యాంకునకు ఉపకరణములుగా మార్చబడినవి.

జాతీయాభివృద్ధి ప్రణాళికలలో బ్యాంకింగునకు ఒక ప్రధాన స్థాన మీయబడినది; అది అవసరమైన జాతీయ సేవ. శ్రేయోరాజ్య స్థాపన విషయములోను, జాతీయార్థిక

విధానములను, జాతీయ జీవన సౌకర్యమును పెంపొందించు విషయములోను జరుగు కార్యకలాపములలో బ్యాంకింగు యొక్క ప్రాముఖ్యము గుర్తించుట అవసరము. రిజర్వు బ్యాంకు పర్యవేక్షణ క్రింద మానవ జీవన ప్రమాణమును పెంపొందించుటయే లక్ష్యముగ పెట్టుకొని ప్రజల నిత్యావసరములను తీర్చునట్టి బ్యాంకింగు విధానము జాతియొక్క సక్రమాభివృద్ధి కనువగును.

దేశములోని ఇతర రాష్ట్రములతో పోల్చి చూచిన ఎడల ఆంధ్రప్రదేశ్‌లోని బ్యాంకు వ్యాపారము యొక్క వృద్ధి మొదలే స్వల్పము. అందున మద్రాసునుండి విడివడిన తరువాత మరియు స్వల్పమైనది. బ్యాంకు వ్యాపారమును వృద్ధిపరచు ఉపాయము, అట్టి అభివృద్ధి చేయుటకు సరియైన కార్య విధానము ఏది అను సమస్యలే నేటి భారత ప్రభుత్వ దృష్టిని ఆకర్షింప తగినవి. 1959 వ సంవత్సరాంతమునకు ఆంధ్రప్రదేశ్, మద్రాసు, ఇతర రాష్ట్రములలో రాష్ట్రవారీగ ఉండే ఇండియన్ జాయింటు స్టాకు బ్యాంకుల వివరములు ఈ దిగువ పట్టికలు తెలుపును :

పట్టిక 1. బ్యాంకు ఆఫీసుల యొక్క వ్యాప్తి*

| రాష్ట్రము | స్థలముల సంఖ్య | కార్యాలయముల సంఖ్య |
|---|---|---|
| ఆంధ్రప్రదేశ్ | 128 | 370 |
| మద్రాసు | 188 | 839 |
| ఇతర రాష్ట్రములు | 1771 | 5169 |
| | 2,087 | 6,378 |

* 1959 లో రిజర్వుబ్యాంకు ప్రకటించిన ఇండియాలో బ్యాంకులకు సంబంధించిన లెక్కల పట్టికలనుండి.

ఇండియన్ షెడ్యూలు బ్యాంకులు

| రాష్ట్రము | బ్యాంకుల సంఖ్య | చెల్లించిన మూల ధనము (వేలలో) | క్షేమనిధులు (రిజర్వు వేలలో) | ఆఫీసుల సంఖ్య |
|---|---|---|---|---|
| 1. ఆంధ్రప్రదేశ్ | 3 | 98,50 | 47,88 | 291 |
| 2. మద్రాసు | 10 | 2,23,04 | 1,84,47 | 527 |
| 3. ఇతర రాష్ట్రములు | 65 | 32,93,18 | 28,98,59 | 3,042 |
| | 78 | 36,14,72 | 31,30,94 | 3,860 |

షెడ్యూలు కాని ఇండియన్ బ్యాంకులు

| 1. | 2. | 3. | 4. | 5. |
|---|---|---|---|---|
| 1. ఆంధ్రప్రదేశ్ | 3 | 14,96 | 20 | 7 |
| 2. మద్రాసు | 84 | 1,08,33 | 64,39 | 228 |
| 3. ఇతర రాష్ట్రములు | 177 | 3,80,68 | 1,68,59 | 592 |
| | 264 | 5,03,97 | 2,33,18 | 827 |

ఇండియన్ జాయింట్ స్టాకు బ్యాంకుల మొత్తము

| | | | | |
|---|---|---|---|---|
| 1. ఆంధ్రప్రదేశ్ | 6 | 1,13,46 | 48,08 | 298 |
| 2. మద్రాసు | 94 | 3,31,37 | 2,48,86 | 755 |
| 3. ఇతర రాష్ట్రములు | 242 | 36,73,86 | 30,67,18 | 3,634 |
| | 342 | 41,18,69 | 33,64,12 | 4,687 |

భారత దేశములో 78 ఇండియన్ షెడ్యూలు బ్యాంకులు 264 షెడ్యూలులో చేరని బ్యాంకులు కలవు. వాటి మొత్తపు మూలధనము, క్షేమ నిధులు కలిసి 75 కోట్ల రూపాయలకు పైచిలుకు. డిపాజిట్లు మొత్తము 1883 కోట్ల రూపాయిలకు

రాష్ట్రము, జనసంఖ్యావారీగ ఆఫీసుల వ్యాప్తి† - 1959 లో షెడ్యూలు బ్యాంకులలో డిపాజిట్లు, అడ్వాన్సులు

| రాష్ట్రము | జనసంఖ్య (1951) | 1959 లో వ్యవహరించిన బ్యాంకులు | ఆఫీసుల సంఖ్య | ఒక్కొక్క ఆఫీసు క్రింద జనాభా‡ | డిపాజిట్లు లక్షల్లో | సగటు ఒకరికి డిపాజిట్లు | అడ్వాన్సులు లక్షల్లో | సగటు ఒకరికి అడ్వాన్సులు |
|---|---|---|---|---|---|---|---|---|
| ఆంధ్రప్రదేశ్ | 3,22,00,000 | 19 | 290 | 1,11,034 | 47,83 | 14·9 | 38,24 | 11·9 |
| మద్రాసు | 3,00,00,000 | 40 | 538 | 55,762 | 114,92 | 38·3 | 88,76 | 29·6 |
| ఇతర రాష్ట్రములు | 29,87,92,000 | — | 3104 | — | 16,75,64 | — | 8,35,70 | — |
| | 36,09,92,000 | — | 3932 | 1,66,796 | 18,38,39 | 53·2 | 96,270 | 41·5 |

† 1959 వ సంవత్సరమునకు రిజర్వు బ్యాంకు ప్రకటించిన 'ఇండియాలో బ్యాంకుల స్థితి, అభివృద్ధి' నుండి.

‡ జనాభాలెక్కలు 1951 న సేకరింపబడి తదుపరి రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ సందర్భమున సవరింపబడినవి.

పైగానున్నవి. వీటిలో ఆంధ్రప్రదేశ్‌లో మూడు షెడ్యూలు బ్యాంకులు, మూడు షెడ్యూలులోలేని బ్యాంకులు మాత్రమున్నవి. వాటి మూలధనము క్షేమ నిధులు కలసి 160 లక్షలు, డిపాజిట్ల మొత్తము దాదాపు 33 కోట్ల రూపాయలు. దేశములోని మొత్తపు బ్యాంకుల మూలధనము, క్షేమ నిధులు, డిపాజిట్లతో పోల్చి చూచిన ఇది అంత చెప్పుకో తగ్గది కాదు. వెనుక పుటలోని పట్టికనుబట్టి ఆంధ్రప్రదేశ్‌లో స్థానిక బ్యాంకులవృద్ధి స్వల్పమని స్పష్టమగును.

దేశములో బ్యాంకింగు వ్యవహారములలో కేంద్రాధికారముగల రిజర్వుబ్యాంకుకు ఆంధ్రప్రదేశ్‌లో శాఖలేదు. నోట్ల చలామణి, మారకపు శాఖ మాత్రమున్నది. దక్షిణ దేశమున అనేక చిట్ ఫండ్‌లు, శాశ్వత నిధులు మొదలైనవి ఉన్నవి. పశ్చిమ తీరమున చిన్నచిన్న వ్యాపారస్థుల యొక్క వ్యాపారావసరములకు కావలసిన పరపతి బ్యాంకులు మధ్య తరగతి వారికి తోడ్పడే 'చిట్ ఫండ్' లని వ్యవహరింపబడే బ్యాంకు లనేకములున్నవి. ఆంధ్రప్రదేశ్‌లో మార్వాడీలు, మరికొందరు వ్యక్తులు తమ స్వంత ద్రవ్యములు అప్పుల నిత్తురు. ప్రజల డిపాజిట్లు వసూలు చేసి వర్తక వ్యాపారములకు డబ్బు పెట్టుబడి చేయు సంస్థలు పెరుగలేదు. అందుచే బ్యాంకు వ్యాపారము అభివృద్ధి ఆంధ్ర ప్రదేశ్‌లో మిక్కిలి వెనుకబడి యున్నది. పూర్వపు ఆంధ్రలో సహకారోద్యమము గాఢముగ పాతుకొని శీఘ్రపురోభివృద్ధి చెందినది. దాని ఫలితముగ సహకార పరపతి సంఘములు వ్యవసాయాభివృద్ధి నిమిత్తమున్ను, పంటభూములను బాగుచేసుకొను నిమిత్తమున్ను, రైతులకు కావలసిన డబ్బును స్వల్ప వాయిదా, దీర్ఘ వాయిదా పద్ధతులమీద బహుళముగ అప్పులు ఇచ్చు చున్నవి. ప్రసిద్ధ నాయకులైన శ్రీ పట్టాభిసీతారామయ్య కార్య సాధన నైపుణ్యము వలన పూర్వపు ఆంధ్రలో రెండు షెడ్యూలు బ్యాంకులు, రెండు ఇన్సూరెన్సు కంపెనీలు స్థాపింప బడినవి.

ఇంతవరకు ఆంధ్రప్రదేశ్‌లో వ్యవసాయపు పంట దినుసులలోనే వ్యాపారము జరుగుతున్నది. ఈ పంట దినుసుల నిలువలు విడుదలకు వలసిన ద్రవ్యము ఆంధ్ర ప్రదేశ్‌లో ప్రధాన సంస్థలగు స్టేటుబ్యాంకు ఆఫ్ ఇండియా, స్టేటుబ్యాంకు ఆఫ్ హైదరాబాదు, ఆంధ్రబ్యాంకు, ఇతర షెడ్యూలు బ్యాంకులద్వారా సరఫరా అగుచున్నది. ఈ బ్యాంకులు ఆంధ్రప్రదేశ్‌లో ముఖ్యముగ డెల్టాప్రదేశములలో శాఖోపశాఖలుగ అల్లుకొని యున్నవి. ఇవి ధాన్యము, బియ్యము. వేరుశనగ, ఇతర చమురుగింజలు, పప్పు దినుసులు, గింజ ధాన్యములు, ప్రత్తి, జనుము, పొగాకు మొదలైన పంట దినుసులలో వ్యాపారమునకు కావలసిన సొమ్మును ప్రతి ఋతువులోను కోట్లకొలది అందించుచున్నవి. ఇవి పొలములనుండి బజారునకు, సముద్రపు రేవులకు తీసికొని పోవుటకును, వర్తక కేంద్రములలో సంవత్సరము పొడవునను నిలువ చేయుటకును, ముడివస్తువులను కొని వాటిని పూర్తిగ పరిశ్రమలద్వారా తయారైన వస్తువులుగ మార్చుటకున్ను కావలసిన ద్రవ్య సహాయము చేయుచున్నవి.

ఇంత కాలముగ ఆంధ్రప్రదేశ్ బ్యాంకింగు విషయములో ప్రతికూల వాతావరణములోనే ఉన్నది. దీనికి కారణము పరిశ్రమలను, ఖనిజములను తదితర ప్రకృత్యాధారములను వృద్ధిపరచక పోవుటయే. ఇందుకు కావలసిన చౌకగ లభించు విద్యుచ్ఛక్తిన్ని, ధనమును లేకపోవుట గూడ వేరొక కారణము. ఇందువలన బ్యాంకింగు వ్యాపారమునకు అత్యంత వృద్ధిలేక పోయినది. రాష్ట్రముగుండ ప్రవహించెడు గొప్పనదులు గోదావరి, కృష్ణాలు ఉన్నవి. నాగార్జున సాగరము ప్రాజెక్టు పూర్తి అనంతరము కొంత మేలు కలుగును. ఆంధ్రప్రదేశ్‌కు ప్రథమ శ్రేణి నౌకాశ్రయము కలదు. కాని వర్తకసౌకర్యము లింకను అభివృద్ధి కాలేదు.

ఆంధ్రప్రదేశ్‌లో మనిషి ఒకరికి సగటున డిపాజిట్లు 14.9 రూపాయలు. దేశములో మొత్తముమీద 50.9 రూపాయలు. ద్వితీయ మహాసంగ్రామ కాలములోను, తరువాతను పెరిగిన వ్యవసాయ దినుసుల ధరల మూలమున పట్టణములనుండి డబ్బు పల్లెలకు కదలిపోవుట జరుగుచున్నది. ఆంధ్రప్రదేశ్‌లో వ్యవసాయమే ప్రధానవృత్తి యగుటచేత గ్రామములలో బ్యాంకు వ్యాపారము క్రమాభివృద్ధి పొందవలెననిన గ్రామీణులనుండి డిపాజిట్లు సేకరించి రాష్ట్ర ఆర్థికాభివృద్ధికి ఉపయోగింప వలయును. ఇప్పుడున్న జాయంటు స్టాకు బ్యాంకులు, జీవిత భీమా కార్పొరేషన్ చాలును. ఈ పని నిర్వహింపగల సరియైన అనుసంధాన సంస్థలు, ఇందు నిమిత్తము ప్రభుత్వము చేయుచున్న కార్యకలాపములు శ్లాఘింప దగినవి.

రాష్ట్రములోని మూలమూలలగల ద్రవ్యమును ప్రాతినిధ్య సంస్థలద్వారా సేకరించుటకు పూనుకొని జాతీయ ఋణపథకములను ఏఁటేటా విజయవంత మొనర్చుచున్న రాష్ట్రప్రభుత్వము ఆంధ్రప్రదేశ్‌లో తొమ్మిదికోట్ల రూపాయలకు మించిన ఋణము 1960లో ప్రజల నుండి వసూలు చేయగలుగుటయే ఈ సంస్థల ఉపయోగమునకు గట్టి తార్కాణము.

విదేశ దిగుమతులు, ఎగుమతులు ఎక్కువగా విదేశ మారకపు బ్యాంకులద్వారా దక్షిణదేశమున మద్రాసు నుండి నిర్వర్తింప బడుచున్నది. ఎందుకనగా మద్రాసు ప్రధాన రేవు వ్యాపారము ప్రత్యేకముగ సాగించు మారకపు బ్యాంకు లచట విశేషముగ నున్నవి. విశాఖపట్టణము పెద్ద రేవుగ అభివృద్ధి నొందినది కాని వర్తక ప్రాముఖ్యత అంతగ సంపాదింపలేదు. దాని పరిసర ప్రాంతము అరణ్యమగుటచే విదేశములనుండి జారీయగు పెద్ద దిగుమతులు వచ్చుటకు అవకాశము లేకున్నది. ఖనిజ సంపద ఆంధ్ర ప్రదేశ్‌లో కలదు. ఇదంతయు ఎగుమతుల క్రిందనే వినియోగ పడుచున్నందున ఆంధ్ర ప్రదేశ్‌లో బ్యాంకులు విదేశ మారక వ్యాపారము దాదాపు చాలభాగము కైవసము చేసికొనవచ్చును. రాష్ట్రములో బ్యాంకు వ్యాపారాభివృద్ధికి విశేష సావకాశమిచ్చు వాటిలో ఇది యొకటి.

బ్యాంకు వ్యాపారాభివృద్ధికి పారిశ్రామికాభివృద్ధికి వర్తకవ్యాపార విస్తరణకు పరస్పర సంబంధము కలదు. జల విద్యుచ్ఛక్తి ప్రాజెక్టులు తదితర ప్రణాళికలు పూర్తిగ రూపొందుటతో ఆర్థికముగ ద్రవ్యాధార యభివృద్ధి కవకాశముండును. ఈ విధముగ బ్యాంకు వ్యాపారాభివృద్ధికి ఎక్కువ అవకాశములు సన్నిహిత కాలములోనే లభింపగలవు. రాష్ట్రములో పరిశ్రమల ఆర్థికసహాయము కొరకు రాష్ట్ర ఆర్థిక సహాయసంస్థ (స్టేట్ ఫైనాన్షియల్ కార్పొరేషన్) స్థాపింప బడినది. ఇది దీర్ఘ కాల మధ్యకాల ఋణములను, పరిశ్రమల కిచ్చును. ఇది బ్యాంకు వ్యాపారమును సౌధమునకు బలము కలగించగలదు.

ఒక నియమితస్థాయి నందుకొనగల ఆర్థిక స్వయం సమృద్ధిలో ఆంధ్రప్రదేశ్ కూడ అచిర కాలములో ఇతర ముఖ్యరాష్ట్రముల స్థాయికి రాగలదనుటకు శుభసూచకములు కనుపించుచున్నవి. ఏ. రా. మూ.

# వర్తక వ్యాపారములు

వ్యాపారమునకు పేరుపొందిన తెలుగుదేశము బ్రిటిష్ వారు అడుగుపెట్టిననాటి నుండియు అడుగంటి పోయెను. కోస్తానుండి వ్యాపారము సన్నగిల్లెను. ఓడ వ్యాపారము నశించెను; కలంకారీ క్షీణించెను. నేడు రాష్ట్రమున పండిన ఆహార పదార్థములును తదితర వస్తువులును ఇతర రాష్ట్రములకు తరలింప బడుచున్నవి.

నేడు ఆంధ్రప్రదేశ్ వర్తక వ్యాపారములు ఎట్లున్నవో తెలిసికొనవలె నన్న ముందు రాష్ట్రమున పండుచున్న పలువిధముల సరకుల మొత్తమును తయారగు పారిశ్రామిక వస్తువులును, వీని విలువలును తెలిసికొనినచో ఇందెంత భాగము రాష్ట్రములోనే ఖర్చగు చున్నదో, అందు ఎంతభాగము ఇతర రాష్ట్రముల కెగుమతి యగుచున్నదో, విదేశములకు ఎంత వెళ్ళుచున్నదో తెలిసికొనవచ్చును. ఇతరరాష్ట్రముల నుండియు, విదేశముల నుండియు ఏమి దిగుమతి చేసి కొనుచున్నది కూడ తెలియును.

ఆంధ్ర ప్రదేశ్‌లో వ్యవసాయ సంపద మెండు. ప్రతి సంవత్సరమును సుమారు 308 కోట్ల రూపాయలు విలువగల ఆహార పదార్థములును, ఇతర వ్యవసాయ పదార్థములును రాష్ట్రమున పండుచున్నవి. సుమారు 75 కోట్ల రూపాయలు విలువగల పారిశ్రామిక సంపద, 10.49 కోట్ల రూపాయలు విలువ గల ఖనిజ వర్గములు ఉత్పత్తి యగుచున్నవి.

ఆంధ్ర ప్రదేశపు వ్యవసాయ సంపద

ఉత్పత్తి, మూల్యము

| సరుకు | కొలత టన్నులలో | ఉత్పత్తి లక్షలలో | విలువ కోట్ల రూ॥లలో |
|---|---|---|---|
| 1. వరి | ,, | 30.50 | 124.85 |
| 2. చోళ్ళు | ,, | 11.31 | 27.84 |
| 3. కంబు | ,, | 3.09 | 6.76 |
| 4. రాగులు | ,, | 2.20 | 4.40 |
| 5. కొర్రలు | ,, | 2.14 | 4.69 |
| 6. వరిగ | ,, | 0.91 | 2.37 |
| 7. సైర్లు | ,, | 0.37 | 0.70 |
| 8. జొన్నలు | ,, | 1.12 | 3.06 |
| 9. గోధుమ | ,, | 0.07 | 0.31 |
| 10. శనగలు | ,, | 0.42 | 1.51 |
| 11. ఉలవలు | ,, | 0.79 | 1.72 |
| 12. పెసలు | ,, | 0.71 | 2.24 |
| 13. కందులు | ,, | 0.44 | 1.64 |
| 14. మినుములు | ,, | 0.24 | 1.00 |
| 15. మిరపకాయలు (ఎండు) | ,, | 1.15 | 15.55 |
| 16. ఉల్లి | ,, | 1.69 | 2.28 |
| 17. చెఱకు | ,, | 5.18 | 15.68 |
| 18. వేరుశనగ | ,, | 10.70 | 38.13 |
| 19. బీడి | ,, | 0.52 | 3.13 |
| 20. ఆముదములు | ,, | 0.62 | 2.63 |
| 21. కొబ్బరి | ,, | 0.32 | 2.33 |

| సరుకు | | కొలత టన్నులలో | ఉత్పత్తి లక్షలలో | విలువ కోట్ల రూ॥లలో |
|---|---|---|---|---|
| 22. | పొగాకు | ,, | 1·81 | 23·61 |
| 23. | ప్రత్తి | (392 పౌన్ల బేళ్ళు) | 1·28 | 3·02 |
| 24. | తిండి గింజలు | టన్నులు | 0·90 | 2·00 |
| 25. | పప్పు దినుసులు | ,, | 0·14 | 0·46 |
| 26. | పళ్ళు, కూరలు | ఎకరములు | 3·79 | 9·56 |
| 27. | తమలపాకులు | లక్షలలో | 2·71 | 3·53 |
| 28. | తోళ్ళు, పిచులు | — | 2·64 | 2·78 |

పారిశ్రామిక సంపద: ఆంధ్రకోస్తా జిల్లాలు, రాయలసీమ ప్రాంతములు కలిసిన ఆంధ్ర రాష్ట్రము (1956 లో రాష్ట్ర పునర్వ్యవస్థీకరణకు పూర్వము) నందు కొన్ని పారిశ్రామిక సరకుల ఉత్పత్తి దిగువ రీతిగ నుండెను.

| | | |
|---|---|---|
| 1. పిప్పరమెంటులు | 29 | లక్షలు |
| 2. సిమెంటు | 140 | ,, |
| 3. పింగాణి వస్తువులు | 11 | ,, |
| 4. రసాయనములు | 41 | ,, |
| 5. వస్త్రములు | 51 | ,, |
| 6. సారాయి | 5 | ,, |
| 7. ఇంజనీరింగు పనిముట్లు | 128 | ,, |
| 8. గోగునార | 357 | ,, |
| 9. లోహపు పనిముట్లు | 73 | ,, |
| 10. కాగితపు అట్టలు మొదలగునవి | 3 | ,, |
| 11. బియ్యపు మరలు | 1027 | ,, |
| 12. సబ్బు | 3 | ,, |
| 13. పంచదార | 246 | ,, |
| 14. తోళ్ళు | 196 | ,, |
| 15. వనస్పతి వగైరా | 1,166 | ,, |
| మొత్తము | 3,476 | |

ఇవిగాక చిన్నతరహా పరిశ్రమలు, కుటీరపరిశ్రమలు చాల గలవు. 1958-59 లో ఫ్యాక్టరీల తయారీ ద్వారా రు. 23·05 కోట్లు, చిన్న తరహా పరిశ్రమల ద్వారా రూ. 65·51 కోట్లు విలువగల సరకులు ఉత్పత్తి కాబడెనని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సాంఖ్య, ఆర్థిక విభాగము లెక్క కట్టెను.

ఖనిజ సంపద: ఆంధ్రప్రదేశ్‌లో ఖనిజ సంపదను తెలుపు వివరములు ప్రక్క నీయబడినవి. వీని మొత్తము విలువ సుమారు 10 కోట్ల రూపాయలు.

ఆంధ్రకోస్తా జిల్లాలు రాయలసీమ ప్రాంతమందు ఉత్పత్తియగు వస్తువులలో పొగాకు, వేరుశనగనూనె, ఆముదము, ఇప్పపువ్వు, ఒరిసెలు (నైగర్ సీడ్స్), బెల్లము, ఉల్లిపాయలు, మిర్చి, పసుపు, అభ్రకము, మాంగనీసు, ముడి ఇనుము మొదలైనవి విదేశము

| వివరము | కొలత టన్నులలో | మొత్తములో శాతము | విలువ (లక్షల రూపాయలు) (1956) |
|---|---|---|---|
| 1. రాతినార | 384 | 84 | 2·87 |
| 2. బెరైటీస్ | 6,315 | 100 | 1·01 |
| 3. క్రోమైట్ | 3,782 | 72 | |
| 4. కర్పూర శిలాజిత్తు | 325 | | |
| 5. ఇనుప ఖనిజము | 4,02,382 | 8 | 54·17 |
| 6. మాంగనీసు | 1,42,980 | 13 | 80·09 |
| 7. అభ్రకము (మైకా) | 2,402 | | 153·42 |
| 8. సబ్బురాయి | 5,105 | | ·53 |

(1. మినరల్ వెల్త్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్, 2. ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ సావెనీర్ ల నుండి)

లకు విశాఖపట్టణము, కాకినాడ, మద్రాసు రేవులద్వారా ఎగుమతి యగుచున్నవి. ప్రతి సంవత్సరమును విశాఖపట్టణము నుండి సుమారు 20 కోట్ల రూపాయలు, కాకినాడ నుండి 3 కోట్ల రూపాయలు, మద్రాసు నుండి 56 కోట్ల రూపాయలు; మొత్తము 79 కోట్ల రూపాయలు విలువ గల ఆంధ్రప్రదేశ్ సరకులు ఎగుమతి యగుచుండెను.

విశాఖపట్టణము నుండి మాంగనీసు, పొగాకు, మిర్చి, ఒరిసెలు, వేరుశనగ నూనె, కరక్కాయలు, ముడి ఇనుము, కిత్తనార సంచులు, బెల్లము, జనపనార, ఆముదము, డినెచర్డ్ స్పిరిట్, బాక్సైట్, తాటినార, తోళ్ళు, ఎముకలు, జాబరా గింజలు, పసుపు కొమ్ములు, ధనియాలు, డివిడివి గింజలు, తలనూనెలు, ఉన్ని కంబళ్ళు, ముడి గ్రాఫైట్ ఎగుమతి అగుచున్నవి. మాంగనీసు సుమారు 9 కోట్ల రూపాయలు, పొగాకు సుమారు 7 కోట్ల రూపాయలు, మిర్చి 1½ కోట్లు. విశాఖపట్టణము రేవు ద్వారా ఎగుమతి యగు మాంగనీసులో సగమునకు పైగ మధ్యప్రదేశ్, ఒరిస్సా రాష్ట్రముల నుండి వచ్చుచున్నది. ఇతర రాష్ట్రీయుల నుండి వచ్చెడు వస్తువుల వెలను తీసివేసినచో ఆంధ్రకోస్తా జిల్లాల నుండి సంవత్సరమునకు సుమారు 15 కోట్ల రూపాయల విలువ గల సరకు విశాఖపట్టణము రేవు నుండి విదేశములకు ఎగుమతి యగుచున్నదని అంచనా వేయబడినది.

కాకినాడ ద్వారా పొగాకు, తాటినార, జీడిగింజలు, పొగాకు గింజల నూనె, ఆముదము, వేరుశనగలు, ఎముకలు, ఎముకల పొడి, ఉమ్మెత్త, తాటిజీబులు, తాటినార మోకులు, తోళ్ళు, పశువులు, పసుపు, ఉన్నికంబళ్ళు

మొదలగునవి ఎగుమతి యగుచున్నవి. వీనియొక్క విలువ మొత్తము సుమారు 30 కోట్ల రూపాయ లుండును. వీనిలో పొగాకు విలువ సుమారు 2.3 కోట్లు, తాటినార 0.16 లక్షలు. కాకినాడ నుండి పోవు సరకులన్నియు మన రాష్ట్రములోనే ఉత్పత్తి యగుచున్నవి. కావున ఈ రేవు ద్వారా ఆంధ్రప్రదేశ్ నుండి సుమారు 30 కోట్లరూపాయల విలువ గల వస్తువులు ఎగుమతి అగుచున్నవని అంచనా వేయవచ్చును.

మద్రాసు రేవు నుండి సుమారు 50 కోట్ల రూపాయల విలువగల సరకులు ఎగుమతి యగుచున్నవి. ఈ రేవు ద్వారా ఎగుమతి యగు అభ్రకము, నూనెలు, గింజలు, పొగాకు, మాంగనీస్, మంచిగంధపు నూనె, ముడిఇనుము, కైనైట్ మొదలయినవి ఆంధ్రప్రదేశ్ నుండియే ఎక్కువగ వచ్చుచున్నవి. మద్రాసునుండి 163 లక్షల రూపాయల విలువగల అభ్రకము, 338 లక్షల రూపాయల పొగాకు, 51 లక్షల రూపాయల ముడి మాంగనీసు, 598 లక్షల రూపాయల వేరుశనగ మొదలైన గింజలును, నూనెలును ఎగుమతి యగుచున్నవి. ఇందులో అభ్రకము, పొగాకు అంతయు ఆంధ్రప్రదేశ్ నుండియే వచ్చుచున్నది. ముడి ఇనుము సగము పైగ ఆంధ్రదేశమునుండి వచ్చుచున్నది. ఇటులనే మద్రాసు ద్వారా ఎగుమతి యగు పలువిధముల సరకులలో ముఖ్యముగ మిర్చి, పసుపు, ఎముకల పొడి, తోళ్ళలో సగభాగము కనీసము ఆంధ్రప్రదేశ్ నుండియే వచ్చుచున్నట్లు ఎంచవచ్చును. ఇంతవరకు ఆంధ్రప్రదేశ్‌కు ప్రత్యేకముగ విడి లెక్కలు లేకపోవుట వలన మద్రాసునుండి ఎగుమతి యగు వస్తువులలో 50% గాని, లేదా కనీసము 40% గాని ఆంధ్రప్రదేశ్‌నుండి వచ్చుచున్నవని ఊహించవచ్చును. అందుచేత ఆంధ్ర ప్రాంతమునుండి మద్రాసుద్వారా ఎగుమతి యగు సరకుల విలువ సుమారు 22.00 కోట్ల రూపాయ లుండునని తలంపవచ్చును. మొత్తముమీద ఆంధ్ర కోస్తా జిల్లాలు, రాయలసీమనుండి విదేశములకు అన్ని రేవులద్వారా ఎగుమతియై పోవు సరకుల మొత్తపు విలువ సుమారు 40.0 కోట్ల రూపాయ లుండునని అంచనా వేయవచ్చును.

ఆంధ్ర ప్రాంతమునుండి ఎగుమతి యగు వస్తువులలో సుమారు 37½% గ్రేట్ బ్రిటన్, ఐర్లండులకును; 30% అమెరికాకును; 5% సిలోన్‌కును, 27½% జపాను, జర్మనీ, కెనడా మొదలగు మిగిలిన అన్ని దేశములకును పోవుచున్నవి.

ఆంధ్ర కోస్తా జిల్లాలకు విదేశములనుండి అనేకరకములైన వస్తువులు దిగుమతి యగుచున్నవి. ఈ దిగుమతి వస్తువులు ముఖ్యముగ మద్రాసు రేవుద్వారా వచ్చుచున్నవి. మద్రాసు రేవులో ధాన్యములు, పలురకములైన యంత్ర సామగ్రి, ఖనిజ తైలము, ప్రత్తి, మోటారుబండ్లు ధాతువులు, కాగితము, రసాయన ద్రవ్యములు, మందులు ఎరువులు మొదలైనవి సుమారు 95 కోట్ల రూపాయల విలువగల వస్తువులు దిగుమతి యగుచున్నవి. ఈ దిగుమతుల మొత్తములో సుమారు 40% ఆంధ్రప్రదేశ్‌నకు పోవుచున్నవి. విశాఖపట్టణము, కాకినాడ రేవులద్వారా పోకచెక్కలు, క్రొవ్వు వత్తులు, రసాయన ద్రవ్యములు, బొగ్గు, సైకిళ్ళు, ద్రాక్ష, మందులు, ఎలక్ట్రిక్ సామానులు ఇనుప సామానులు, కందెన నూనెలు, యంత్రములు, ధాతువులు, మోటారుబండ్లు, మేకులు, ఖనిజ తైలములు, పూతరంగులు, వార్నీషు, సోడా, నేసిన నూలు బట్టలు, తంతి, తీగ, తుమ్మ బెరడు మొదలైనవి దిగుమతి యగుచున్నవి. సాలునకు సుమారు 11½ కోట్ల రూపాయల విలువ గల వస్తువులు విశాఖపట్టణములోను 1½ కోట్లు కాకినాడలోను దిగుమతి యగుచున్నవి. ఈ దిగుమతుల విలువను చూచినట్లయిన ఆంధ్రప్రదేశ్ విదేశములనుండి సుమారు 35 కోట్ల రూపాయల విలువగల వస్తువులను దిగుమతి చేసికొనుచున్నట్లు తెలియుచున్నది.

ఈ దిగుమతులలో కూడ విశేష భాగము గ్రేట్ బ్రిటను, ఐర్లండుల నుండియు, కొద్ది భాగము మిగిలిన దేశములనుండియు వచ్చుచున్నది.

ఆంధ్ర ప్రదేశ్‌నుండి పలు రకములైన వస్తువులు విదేశములకే కాక భారతదేశ మందున్న ఇతర రాష్ట్రములకు గూడ అనేక వందల సంవత్సరములనుండి ఎగుమతి యగుచున్నవి. ఆంధ్రరాష్ట్రము వేరుపడక పూర్వము, (1953) మద్రాసు రాష్ట్రపు లెక్కలను బట్టి ఆంధ్రజిల్లాలనుండి ఇతర రాష్ట్రములకు ఏయే సరకులు ఎంత దిగుమతి యగుచుండినవో అంచనా వేసి చెప్పదగినదేగాని, నికరముగ లెక్కలు కట్టి తేల్చుటకు వీలులేదు.* ఆంధ్రరాష్ట్రమునుండి మిగిలిన రాష్ట్రములకు, ముఖ్యముగ పశువులు, గొర్రెలు, ఎముకలు, తోళ్ళు, ధాన్యము, నెయ్యి, మిరపకాయలు, పసుపు, వేరుశనగ, పొగాకు, పంచదార, సిమెంటు మొదలైన వస్తువులు ఎగుమతి యగుచున్నవి. ఈ వస్తువులలో కొన్ని రైళ్ళమీదను, కొన్ని కాలువలమీదను, మరికొన్ని రోడ్ల

*ఇటీవల ఆంధ్ర ప్రాంతమునకు సంబంధించిన ప్రభుత్వపు లెక్కలు లభ్యమగుచున్నవి. కాని తెలంగాణా చేరిన ఆంధ్రప్రదేశ్‌నకు ప్రభుత్వపు లెక్క లింకను లభ్యమగుటలేదు. ఇందువలన ఈ వ్యాసములో ఆంధ్ర, తెలంగాణా ప్రాంతముల వ్యాపారము విడిగా చర్చింపబడినది.

మీదను వెళ్ళుచున్నవి. పూర్వము మద్రాసు రాష్ట్రము నుండి మొత్తము ఎగుమతి యగు పశుసంపదలో 50% ఆంధ్రనుండియే వెళ్ళుచుండెను.

ఇటులనే పూర్వము మద్రాసు నుండి ఇతర రాష్ట్రములకు ఎగుమతి యగుచుండిన వ్యవసాయ సంపదలో అనగా ధాన్యములో 46%, జొన్నలలో 52%, నూనె విత్తులలో 47%; పొగాకు 86%; ప్రత్తిలో 21%; ఆంధ్రజిల్లాల నుండి ఎగుమతి యగుచుండినవి. ఇతర రాష్ట్రములనుండి ఆంధ్ర రాష్ట్రములోనికి వచ్చు నూలు, వస్త్రములు, ఇనుము, ఉక్కు, కాఫీ, తేయాకు, జనపనార సంచులు. పంచదార మొదలైన వస్తువులుగూడ రైలు, రోడ్డు, కాలువ మూలముగ దిగుమతి యగుచున్నవి. ఈ దిగువ నుదాహరించిన పట్టికద్వారా, ఆంధ్ర ప్రదేశ్‌నకును, ఇతర రాష్ట్రములకును ఎగుమతి దిగుమతుల విషయములో ఎటువంటి సంబంధము గలదో విశద మగును.

### ఆంధ్ర ప్రదేశ్ నుండి ఇతర రాష్ట్రములకు ఎగుమతులు

| ఎగుమతులు | మొత్తము మణుగులు | విలువ (రూ॥లలో) |
|---|---|---|
| 1. పశువులు (సంఖ్య) | 819 | 81,900 |
| 2. గొర్రెలు, మేకలు (సంఖ్య) | 3,646 | 1,02,088 |
| 3. ఇతర జంతువులు (సంఖ్య) | 94,715 | 37,88,600 |
| 4. ఎముకలు | 13,117 | 1,24,611 |
| 5. ముడితోళ్ళు* | 23,009 | 12,42,486 |
| 6. ముడి చర్మములు* | 6,719 | 13,43,800 |
| 7. పదునుచేసిన చర్మములు (తోళ్ళు) | 16,279 | 69,176 |
| 8. బియ్యము | 5,70,211 | 85,53,165 |
| 9. ఇతర రకములు | 67,533 | 6,75,330 |
| 10. జొన్నలు | 4,80,906 | 57,70,872 |
| 11. కందులు, పెసలు, | 2,35,088 | 37,61,408 |
| 12. నూనెగింజలు | 13,25,642 | 8,40,37,924 |
| 13. సిమెంటు | 6,00,054 | 18,35,163 |
| 14. జనపనార | 3,30,053 | 1,16,56,855 |
| 15. జనపనార సంచులు | 1,33,096 | 1,48,35,232 |
| 16. మాంగనీసు | 8,90,024 | 50,68,100 |
| 17. ఉప్పు | 12,39,706 | 18,59,559 |
| 18. బెల్లము వగైరా | 5,88,093 | 1,02,91,627 |
| 19. పంచదార | 61,608 | 13,55,376 |
| 20. పొగాకు | 3,85,602 | 3,47,04,180 |
| 21. నెయ్యి | 31,997 | 64,07,199 |
| 22. ఉేకు | 4,08,587 | 1,32,66,464 |
| 23. రంగులు వగైరా | 3,552 | 78,680 |
| 24. పండ్లు | 7,01,657 | 6,45,52,444 |
| 25. కొత్తనార | 19,930 | 5,03,232 |
| 26. లక్క | 343 | 27,440 |
| | మొత్తము | 27,59,97,911 |

* పెద్ద జంతువుల చర్మములను తోళ్ళనియు, చిన్న జంతువుల చర్మములను చర్మము లనియు అందురు.

### ఇతర రాష్ట్రములనుండి ఆంధ్రప్రదేశ్‌లోనికి దిగుమతులు

| దిగుమతులు | మొత్తము మణుగులు | విలువ (రూ॥లలో) |
|---|---|---|
| 1. సిమెంటు | 3,17,801 | 9,17,967 |
| 2. నేలబొగ్గు, కోక్ | 1,43,09,822 | 85,42,785 |
| 3. ఇనుము, ఉక్కు | 11,05,250 | 2,77,69,406 |
| 4. లక్క | 1,780 | 1,42,400 |
| 5. మాంగనీసు | 60,71,346 | 3,45,72,285 |
| 6. కిరసనాయిలు | 1,54,399 | 36,28,376 |
| 7. ఉేకు, ఇతర కలప | 8,13,314 | 4,78,66,094 |
| 8. కాఫీ | 27,978 | 46,38,198 |
| 9. తేయాకు | 42,010 | 35,70,850 |
| 10. నూలు | 89,844 | 1,25,78,160 |
| 11. నూలు వస్త్రములు | 2,88,121 | 2,39,14,048 |
| 12. కొత్తనార | 15,996 | 4,03,899 |
| 13. జనపనార | 94,836 | 33,19,260 |
| 14. ఉన్ని | 2,374 | 7,05,078 |
| 15. జనపనార బట్ట | 70,420 | 78,87,040 |
| 16. పండ్లు | 1,19,623 | 1,10,05,316 |
| 17. నెయ్యి | 485 | 1,09,100 |
| 18. జొన్నలు | 3,72,862 | 44,24,584 |
| 19. పప్పుదినుసులు | 25,75,610 | 4,12,09,760 |
| 20. ఇతరములు | 1,58,594 | 19,85,940 |
| 21. గడ్డి | 61,358 | 1,51,55,421 |
| 22. నూనెగింజలు, తెలగపిండి | 3,33,884 | 35,60,090 |
| 23. పంచదార | 8,05,774 | 1,77,27,022 |
| | మొత్తము | 27,52,33,074 |

పైన ఉదాహరించిన ఎగుమతి దిగుమతుల పట్టీలు సుమారు సాలుసరి ఊహించి వేయబడినవే. కాని, కచ్చితముగ లెక్కల ప్రకారము తయారు చేసినవి కావు. ఇందువలన తేలునది ఏమనగ, ఆంధ్రప్రదేశ్ నుండి ఇతర రాష్ట్రములకు సంవత్సరమునకు సుమారు 27½ కోట్ల రూపాయల విలువగల వస్తు సామగ్రి ఎగుమతి యగుచున్నట్లును,

దాదాపు అంతే విలువగల వస్తువులు ఇతర రాష్ట్రముల నుండి దిగుమతి యగుచున్నట్లును విశదమగుచున్నది.

1956 తరువాత ఆంధ్రప్రదేశ్‌లో చేరిన తెలంగానా జిల్లాల వ్యాపార స్థితి పరిశీలించినచో ఈ జిల్లాలలో నూనె గింజలు (వేరుశనగ, ఆముదము, నువ్వులు), నేలబొగ్గు, ముడి ఇనుము వ్యాపారమున కనుపుగ నున్నవని తోచును. ఇందు నేలబొగ్గు దక్షిణప్రాంత మందలి పరిశ్రమలకు ఆవశ్యకము. ఎగుమతులలో నూనెగింజలు ప్రధాన స్థానము వహించును. జనసంఖ్యను బట్టి చూచినను, ఆర్థిక స్వరూపమును బట్టి పరీక్షించినను తెలంగానా జిల్లాలు నూలు వస్త్రములు, ముడి పొగాకు, పెట్రోలు. తేయాకు, ఇనుము, ఉక్కు యంత్రములు, వాని భాగములు, ఔషధములు విరివిగ దిగుమతి చేసికొనుచున్నట్లు కన్పట్టును. తెలంగానా ప్రాంతపు వ్యాపారమున కనుకూలమగు రేవు పట్టణము లేకుండుట వ్యాపారాభివృద్ధికి ఆటంకము కలదు. ఈ ప్రాంతమునుండి ఎగుమతుల కంటె, దిగుమతి వస్తువుల ప్రమాణము హెచ్చని స్థూలముగ చెప్పవచ్చును. వ్యవసాయోత్పత్తి విషయములో ఎకరమునకు ఫలసాయము సర్కారు ప్రాంతములకంటె తక్కువ. ఖనిజములలో నేలబొగ్గు, ముడి ఇనుము కాక బెరైటీస్, ఫైర్‌క్లే, గ్రాఫైటు, సున్నపురాయి సబ్బురాయి, ముఖ్యము. పంచదార, నూలు, రేయన్ వస్త్రములు కాగితము, సిమెంటు పారిశ్రామిక సంస్థలు తెలంగానా జిల్లాలలో పనిచేయుచున్నవి. కాని వీని ఉత్పత్తి స్థానికావసరములకు వినియోగ మగుచున్నది.

ఆంధ్రప్రదేశ్‌నందు పనిచేయు బ్యాంకులు, ఇన్సూరెన్సు కంపెనీలు, తదితర సంస్థలు చాల భాగము ఇతర రాష్ట్రములలో స్థాపితములైనవి. అవి ఇచ్చట కేవలము శాఖా కార్యాలయములను మాత్రము స్థాపించి యున్నవి. అందుచే ఈ సంస్థల మూలముగను, తదితరముల మూలమునను సాలునకు సుమారు 5 కోట్ల రూపాయలు మొదలు 10 కోట్ల రూపాయల వరకు ఆంధ్ర ప్రదేశ్ నుండి ఇతర రాష్ట్రములకు కనబడని ఎగుమతిగా ధనము పోవుచున్నది.

మొత్తము ఆంధ్రప్రదేశ్ ఎగుమతులు, దిగుమతులు (అనగా విదేశముల, ఇతర రాష్ట్రముల వానిని కలిపి లెక్క చూచినచో, ఎగుమతులకంటె, దిగుమతులే సుమారు పదికోట్ల రూపాయలు అధికముగ నుండునని అంచనా వేయవచ్చును. పారిశ్రామికాభివృద్ధి కార్య ప్రణాళికల ద్వారా ప్రభుత్వము, పారిశ్రామిక వేత్తలు, ఆంధ్రప్రదేశ్ ఆర్థిక స్థితిని మెరుగు దిద్ద వలసి యున్నది.

పైన వివరించిన ఎగుమతి దిగుమతులు గాక ఆంధ్ర ప్రదేశ్ నందే జరుగు వ్యాపారము చాల కలదు. ఇచ్చటనే ఉత్పత్తి అయి ఇచ్చటనే ఖర్చగు వస్తువులు కొన్ని కలవు. ఈ వస్తువుల లెక్క ఎచ్చటను విశదముగ లేదు. కాని ఇవి యన్నియు ఎవరో ఒకరు కొని వాడుకొనుచున్నారు. కావున అమ్మకపు పన్ను లెక్కలను బట్టి ఇట్లు ఉత్పత్తియగు వస్తువుల విలువను కొంతవరకు ఊహింపవచ్చును. ఆంధ్రప్రదేశ్ 308 కోట్లు విలువగల ఆహార పదార్థములును, 75 కోట్ల రూపాయల విలువగల పారిశ్రామిక వస్తువులును, 10 కోట్ల రూపాయల విలువ గల ఖనిజములును ఉత్పత్తి యగుచున్నవి. ఆంధ్రప్రదేశ్ నుండి విదేశములకు ఇతర రాష్ట్రములకు ఎగుమతియగు వస్తువుల మొత్తము పోగా ఇందులో అధిక భాగము ఆంధ్రప్రదేశ్ లోనే ఖర్చు అగుచున్నట్లు తేలుచున్నది. అమ్మకపు పన్నునుబట్టి చూచినచో ఆంధ్ర, రాయలసీమ ప్రాంతములందు జరుగుచున్న వర్తకపు మొత్తము విలువ సుమారు రు. 200 కోట్లు ఉండునని అంచనా వేయవచ్చును. పశ్చిమ బెంగాలు, కేరళ రాష్ట్రములవలె విదేశ వినిమయ ద్రవ్యమును అత్యధికముగ లేకున్నను పొగాకు, మాంగనీసు, ముడి ఇనుము, వేరుశనగ నూనె, తోళ్ళు, కరక్కాయలు మొదలగు సరకుల ఎగుమతులద్వారా విశేషమగు వ్యాపారమును చేయుచున్నది. రాష్ట్రములోని వ్యాపారము చూచినచో ఇంత గొప్ప వ్యాపారము గల రాష్ట్రములు భారత దేశమునందు చాల కొద్దిగ ఉన్నవి. రాష్ట్ర ప్రభుత్వము శ్రద్ధ వహించిన వ్యాపార రంగమున మిగిలిన అన్ని రాష్ట్రములకంటెను ఆంధ్రప్రదేశ్ ముందంజ వేయుటకు అవకాశములు గలవు. జె. వి. సో.

# సహకారము

భారత దేశములోను విదేశములలోను వలెనే పేద వారికి, భాగ్యవంతులకు గల ఆర్థిక ఇబ్బందులను తీర్చు నిమిత్తము సహకారోద్యమము ప్రారంభమైనది. సహకారము జనుల ఆర్థిక పరిస్థితిని చక్కచేయుటయే కాక, వారిలో చక్కని ఆత్మ విశ్వాసమును కూడ చేకూర్చును. ప్రజలు తమ అనుభవమును, జ్ఞానమును పెంచుకొంటూ పరస్పర సహాయము చేసికొనుటవల్ల వ్యక్తిగతమైన సమస్యలను పరిష్కరించుకొనడమే కాక సామాజిక

సమస్యలనుకూడ పరిష్కరించుకొనుటకు ఉత్తమ పౌరులుగ తయారు కాగలరు.

1904 లో సహకార సంఘముల చట్టము ద్వారా సహకారోద్యమమునకు భారతదేశములో పునాది వేయ బడినది. 1912 లో చేయబడిన రెండవ శాసనము ద్వారా ఋణేతర సంస్థలు, కేంద్రబ్యాంకుల స్థాపన కవకాశము కలిగింపబడినవి. కేంద్రశాసనము 1919 క్రింద సహకారోద్యమము రాష్ట్రప్రభుత్వముల అధీనమునకు తీసికొని రాబడిన తరువాతనే చెప్పుకొన తగినంత వృద్ధి కొన సాగినది. 1947 లో స్వాతంత్ర్యము పొందిన నాటినుండి భారత దేశములో సహకారోద్యమము వివిధ రంగములకు విస్తరించుటయేగాక జనబాహుళ్యమునకు చాల ఉపయోగ కారిగ నున్నది. ప్రజాస్వామ్యములో క్రమబద్ధమైన ఆర్థిక అభివృద్ధిని సాధించుటకు సహకారము చక్కని సాధనము. అందువల్ల పంచవర్ష ప్రణాళిక కార్యక్రమములన్నిటిలో సహకార సూత్రము ముఖ్య లక్షణముగ ఉండవలెనని 'యోజన సమితి' (ప్లానింగు కమిషన్) వారు సూచించిరి. అందుల కనువుగ మొదటి రెండు ప్రణాళికల యందు సహకారమునకు ప్రముఖ పాత్ర మివ్వబడినది. 1958 లో సహకార విధానమునకు సంబంధించిన తీర్మానములో జాతీయాభివృద్ధి సాధించుటకు, గ్రామ సమాజమును ప్రాథమిక ప్రాతిపదికగా తీసికొని సహకార సంఘములను ఏర్పాటు చేయవలెనని అంగీకరింపబడినది. ఈ దృక్పథము ననుసరించి రాష్ట్రములను తమ సహకార అభివృద్ధి కార్యక్రమమును సమీక్షించి, రెండవ ప్రణాళిక చివరి రెండు సంవత్సరములు క్రొత్త కార్యక్రమములను తయారు చేయవలసినదిగాను, మూడవ ప్రణాళిక ముగింపు నాటికి గ్రామీణ కుటుంబములన్నిటికి సహాయ పడునట్లుగ సహకార ఉద్యమము అభివృద్ధి చెందవలెనను విశాల లక్ష్యమును కూడ జాతీయ అభివృద్ధి మండలి సూచించినది.

సహకార రంగమున భారతదేశము మొత్తముపై ఆంధ్రప్రదేశ్ నేడు ప్రముఖస్థానము వహించినది. 30 వ జూన్ 1959 నాటికి భారత దేశమున ఉన్న సహకార సంస్థల సభ్యత్వము, వ్యాపార ధనముతో ఆంధ్రప్రదేశ్ నందున్న సభ్యత్వము, వ్యాపార ధనము మొత్తము మీద 11% ఉండెను. సహకారోద్యమాభివృద్ధి, ఆంధ్ర-తెలంగానా ప్రాంతములందు ఆంధ్రప్రదేశ మవతరించు (1956) వరకు వివిధ రకములుగ వ్యాపించి ఉండినది. ఆంధ్ర ప్రాంతమున సహకారోద్యమము ఏడు దశలుగ విభజింప వచ్చును.

1. 1904 - 1918 మొదటి దశ;

2. 1919 - 1930 రెండవ దశ. ఈ కాలమున ఉద్యమము వేగముగ అభివృద్ధి చెందినది. ఈ కాలముననే టౌన్ షెడ్ కమిటీ ఉద్యమాభివృద్ధిని గూర్చి విచారణ జరిపిరి;

3. 1930 - 1936 - 37 మూడవ దశ. ఆర్థిక మాంద్య సమయము. 1930 లో మద్రాసు సహకార సంఘముల శాసనమును; 1934 లో మద్రాసు భూమి తనఖా బ్యాంకుల శాసనమును చేయబడినది;

4. 1937 - 1940 నాలుగవ దశ. శ్రీ విజయరాఘవాచారి కమిటీ, ప్రాథమిక సహకార సంఘములు, భూమి తనఖా బ్యాంకులు, కేంద్ర బ్యాంకులు, మార్కెటింగు సంస్థల గూర్చి చేసిన ప్రతిపాదనలు అమలులో పెట్టబడినవి;

5. 1940-47 ఐదవదశలో ద్వితీయ ప్రపంచ సంగ్రామ సమయము. ఈ కాలమున సహకార సంస్థలు కూడ యుద్ధ రంగమును ప్రవేశించినవి. యుద్ధమువలన గలిగిన పరిస్థితులు ఉత్పత్తి, సరఫరా రంగములలో తోడ్పడినవి;

6. (1947-53) ఆరవదశ యందు ఆహారధాన్య సేకరణ, సరఫరాలలోను పట్టణములలో, పల్లెలలో ఇండ్లవసతి లోటును పూర్తి చేయుటయందును, చేనేతకు కావలసిన నూలును లభింపచేయుట యందును, చేనేత వస్త్రముల విక్రయించుటలోను, మాజీ సైనికులకు, మాజీ కల్లు గీత పనివారలకు జీవనోపాధిని కల్పించుటలోను సహకారోద్యమము తగు కృషి సల్పినది. రాయలసీమ సహకార విచారణసంఘము (రాయలసీమ కో-ఆపరేటివ్ ఎన్క్వైరీ కమిటీ 1945) సిఫారసుల ననుసరించి గ్రామీణ పరపతి సంఘములను బహుళార్థ ప్రయోజక సంఘములు (మల్టిపర్పస్ సొసైటీలు) గ మార్చబడినవి.

7. 1953 నుంచి ఏడవదశగా చెప్పవచ్చును. ఈ సమయముననే సహకారోద్యమము ఆర్థిక రంగమును ప్రవేశించి ప్రజాస్వామ్యము నందొక విశిష్ట స్థానము నాక్రమించినది. ఆంధ్రరాష్ట్రావతరణముతోపాటు ఆంధ్రరాష్ట్ర సహకార బ్యాంకు (ఆంధ్రస్టేట్ కో-ఆపరేటివ్ బ్యాంకు), ఆంధ్ర చేనేత పనివారల కేంద్రసహకార సంఘము, ఆంధ్ర సహకార కేంద్రభూమి తనఖా బ్యాంకు (ఆంధ్ర కో-ఆపరేటివ్ సెంట్రల్ లాండు మార్టగేజ్ బ్యాంకు) వంటి కేంద్ర సంఘము లేర్పడినవి.

తెలంగానా ప్రాంతము: ఈ ప్రాంతమున సహకారోద్యమము కీ.శ. 1914 వ సంవత్సరమున ప్రవేశ పెట్టబడెను. ఆరంభమున వ్యవసాయ ఋణములకు ముఖ్యస్థాన మిచ్చినను, క్రమేణ తక్కిన రంగములలోకూడ సహకారోద్యమము క్రమాభి వృద్ధినొందెను. 1952 వరకు గమనింప

దగ్గ అభివృద్ధి ప్రయత్నములు లేవు. 1952లో రిజర్వు బ్యాంకు చేసిన సిఫారసుల మూలముగ తెలంగానా ప్రాంతములోని సహకారోద్యమమునందు కూడ నూతన చైతన్యము కలిగెను.

1960 జూన్ 30 తేదీ నాటికి మొత్తము ఆంధ్రప్రదేశ్ నందు 12,527 గ్రామీణ పరపతి సంస్థలు 12.62 లక్షల సభ్యులను కలిగి ఉన్నవి. చెల్లింపబడిన షేర్లవిలువ రు. 363.86 లక్షలు, వ్యాపారధనము రు. 2325.11 లక్షలు.

| సంవత్సరము | సంస్థలు | సభ్యులు | ఇచ్చిన ఋణములు (లక్షల రూ॥లు) | నిల్వఉన్న ఋణములు లక్షల రూ॥లలో | వ్యాపార ధనము (లక్షల రూ॥లలో) |
|---|---|---|---|---|---|
| 1941 – 42 | 3,961 | 2,38,707 | 85·85 | 127.48 | 194·45 |
| 1945 – 46 | 4,105 | 2,62,228 | 115·47 | 150·43 | 189·01 |
| 1946 – 47 | 4,357 | 2,90,106 | 153·22 | 176·98 | 221·76 |
| 1950 – 51 | 6,330 | 4,81,000 | 362·13 | 350·66 | 484·21 |
| 1952 – 53 | 6,470 | 5,35,832 | 333·39 | 472·07 | 565·44 |
| 1958 – 59 | 6,883 | 9,24,682 | 1,205·77 | 1,293·85 | 1,547·09 |
| 1959 – 60 | 7,404 | 10,16,438 | 1,422·40 | 1,531·38 | 1,844·66 |

ఆంధ్రప్రదేశ్ అవతరించడముతో (1956) అఖిలభారత గ్రామీణ పరపతి పరిశీలనా కమిటీ సూచించిన విధమున సహకారోద్యమము అభివృద్ధికి తేబడినది. ఆంధ్ర ప్రాంతమున చక్కని సహకార ఋణసంస్థల నిర్మాణము జరిగినది. ఈ క్రింది పట్టిక స్టేట్ కో-ఆపరేటివ్ బ్యాంకును కేంద్రముగ నుంచుకొని జిల్లా స్థాయిలో 15 బ్యాంకులును, ఇతర స్థాయిలలో 7,400 పైగా ప్రాథమిక సహకార సంస్థలు పొందిన అభివృద్ధిని తెలియజేయును.

తెలంగానా ప్రాంతమునందు అపెక్సు కో ఆపరేటివ్ బ్యాంకును కేంద్రముగా ఉంచుకొని జిల్లాస్థాయిలో 10 బ్యాంకులును, గ్రామస్థాయిలో 5,100 పైగా పరపతి సంస్థలు స్థాపింపబడినవి. ఈ క్రిందిపట్టిక తెలంగానా ప్రాంతమున ప్రాథమిక సహకార సంఘములు పొందిన అభివృద్ధిని తేలియజేయును :

| సంఖ్య | 1955–56 | 1958–59 | 1959–60 |
|---|---|---|---|
| 1. సంస్థలు | 3,013 | 4,418 | 5,120 |
| 2. సభ్యత్వము | 95,800 | 1,90,061 | 2,45,651 |
| 3. పెట్టుబడి (లక్షల రూ॥లలో) | 106·89 | 361·08 | 480·45 |
| 4. సంవత్సరమునందివ్వబడిన ఋణములు (లక్షల రూపాయలలో) | 53·01 | 223·83 | 327·78 |
| 5. వ్యాప్తి గ్రామములలో (నూటికి) | 32 | 60 | 70 |
| 6. గ్రామ జనాభా (నూటికి) | 5 | 11 | 14 |

1959-60 సం.లో మొత్తము రు. 17·50 కోట్ల ఋణములు ఈ సంఘములచే మెంబర్లకు ఇవ్వబడినవి.

క్రిందిపట్టిక ప్రాథమిక సహకార సంస్థల ప్రగతిని తెలుపును :

| వివరములు | భారత దేశము | ఆంధ్ర ప్రదేశ్ | ఆంధ్ర ప్రాంతము |
|---|---|---|---|
| 1. మొత్తము ఉద్యమములో ఉన్న గ్రామములు | 60% | 69% | 72% |
| 2. మొత్తము జనాభాలో ఉద్యమమున ఉన్న జనాభా శాతము | 19% | 22% | 27% |
| 3. సరాసరి సంస్థలకు గల సభ్యత్వ సంఖ్య | 65 | 99 | 134 |
| 4. 1958–59 నాటికి ఇవ్వబడిన ఋణములు (కోట్ల రూ॥లలో) | 125 | 14 | 12 |
| 5. సభ్యునకు లభించు సగటు ఋణము (లక్షల రూ॥లలో) | 105 | 128 | 130 |
| 6. సంస్థ ఒకటికి సగటున గల మూలధనము (రూ॥లలో) | 9,320 | 16,383 | 22,483 |

ప్రభుత్వమును, వడ్డీ వ్యాపారస్థులు, సహకార సంస్థలు– ఈ మూడు వర్గములనుండి స్వల్పవాయిదా ఋణములు వ్యవసాయదారులకు లభించుటచేత వారు కావలసిన దానికంటె ఎక్కువగ ఋణమును తీసికొనుచున్నారు. దీనిని అరికట్టుటకు ప్రభుత్వము స్వల్పవాయిదా ఋణములన్నిటినీ సహకార సంస్థల మూలమున లభింపచేయు

పద్ధతిని ఆరు బ్లాకులలో మే 1958 నుండి ప్రవేశ పెట్టినది. అనగా ఇదివరకు బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసరు, వ్యవసాయశాఖ, రెవిన్యూశాఖలు ఇచ్చు ఋణములు నిలిపి వేయబడి, ఆ ఋణములన్నియు సహకార సంస్థల మూలమున అందజేయబడుచున్నవి. ఈ పద్ధతి అవలంబించుటలో ఆంధ్రప్రదేశ్ సమగ్ర భారత దేశమునకు మార్గదర్శియైనది. దీని మూలమున పూర్వముకంటె వ్యవసాయదారులకు వసతి అధికమైనది. జూన్ 1959 నాటికి ఈ ఆరు బ్లాకు ప్రదేశములలో వ్యవసాయదారులకు రు. 122.29 లక్షలు ఋణములు ఈయబడినవి. ఇది 1957-58 లో ప్రభుత్వశాఖల మూలమున ఋణములుగ లభించిన రు. 63.60 లక్షలకు సుమారు రెండింతలు.

సహకార భూమి తనఖా బ్యాంకులు - దీర్ఘవాయిదా ఋణములు: భూమి తనఖా బ్యాంకు వ్యవసాయదారునకు భూమిని అభివృద్ధి చేసికొనుటకు, వ్యవసాయమునకు వలయు యంత్రసామగ్రి కొనుటకు, పాత బాకీలు తీర్చుకొనుటకు కావలసిన దీర్ఘవాయిదా ఋణములను ఇచ్చుచున్నవి. ఆంధ్రప్రదేశ్‌నందు 93 ప్రైమరీ సహకార భూమి తనఖా బ్యాంకులు, కేంద్రస్థాయిలో వీటికి ఋణములిచ్చుటకు రెండు సహకార కేంద్రభూమి తనఖా బ్యాంకులు ఉన్నవి. ఈ బ్యాంకులు 5 సం.లు మొదలు 15 సం.ల కాల పరిమాణముగల ఋణముల నిచ్చుచున్నవి. 1959-60 సం.లో ఇవ్వబడిన ఋణముల మొత్తము రు. 139·14 లక్షలు, 30-6-1960 నాటికి సభ్యులనుండి వసూలు కావలసిన ఋణము మొత్తము రు. 5·89 కోట్లు.

| వివరములు | 1958-59 లో ఇవ్వబడిన ఋణముల మొ॥ (లక్షల రూ॥లలో) | సభ్యులవద్దనుండి రావలసిన మొత్తము (లక్షల రూ॥లలో) |
|---|---|---|
| 1. భారత దేశము | 327·48 | 1514·23 |
| 2. ఆంధ్రప్రదేశ్ | 86·31 | 494·34 |

సహకార విక్రయము: వ్యవసాయదారుని ఉత్పత్తికి తగిన ధర లభించిన అతడు ఋణబాధనుండి విముక్తి చెంది సుఖపడును. కాని మధ్యవర్తుల మూలమున అతనికి తగు ధర లభించుట లేదు. వ్యవసాయదారులకు ఈ ఇబ్బంది తీర్చుటయే సహకార విక్రయ సంస్థల మూల ఉద్దేశ్యము. ఆంధ్రప్రదేశ్‌నందు 204 సహకార విపణి సంస్థలు (కోఆపరేటివ్ మార్కెటింగు సొసైటీస్) ముఖ్య వ్యాపార కేంద్రములలో ఉన్నది. ఇవి వ్యవసాయదారుల ఉత్పత్తిని నిలువ చేయుటలోను, వాటిపై అతనికి అప్పు ఇచ్చియు తగు ధరలకు వాటిని అమ్మి అతనికి లాభము చేకూర్చుటలోను మిగుల సహాయపడుచున్నవి. 1959-60 లలో ఈ నంస్థలు వ్యవసాయోత్పత్తికై రు. 151.28 లక్షల ఋణము ఇచ్చి రు. 173·57 లక్షల విలువగల విత్తనములు, ఎరువులు, వ్యవసాయ పనిముట్లు, వ్యవసాయదారులకు సరఫరా చేసినవి. ప్రభుత్వ సహాయమున మిరపకాయలను ఉల్లిపాయలను ఈ సంస్థలు విదేశముల కెగుమతి చేసి, వ్యవసాయదారులకు హెచ్చు ధరలను చేకూర్చినది.

వ్యవసాయ, పారిశ్రామిక రంగములు - చెఱకు ఉత్పత్తి: ఆంధ్ర ప్రదేశ్‌నందు 1.73 లక్షల ఎకరములలో చెఱకు ఉత్పత్తి యగుచున్నది. చెఱకు ధర ఎక్కువ మార్పులకు లోనగుటచే, ఉత్పత్తిదారులకు సరియైన ఆదాయము లభించుట లేదు. ఈ ఇబ్బంది తీర్చుటకు ఉత్పత్తిదారునికి సహకార సంస్థలు ఎక్కువ తోడ్పడుచున్నవి. విశాఖపట్టణములోని ఏటికొప్పాక సహకార పంచదార ఫ్యాక్టరీ చెప్పదగినది. 2,239 చెఱకు ఉత్పత్తిదారులు సభ్యులుగా గల ఈ సంస్థ మూలధనము (షేర్ క్యాపిటల్) రు. 13.57 లక్షలు. 1959-60 లో ఫ్యాక్టరీ పంచదార ఉత్పత్తి సుమారు 8,382 టన్నులు, ఈ సంస్థ చెఱకునకు తగు ధరల నిచ్చియు సరఫరా చేయబడిన చెఱకుపై బోనసులు ఇచ్చియు, ఎరువులను తక్కువ ధరలకు సరఫరా చేసియు, వలయు పరపతి సహాయము చేసియు చెఱకు ఉత్పత్తిదారులకు మేలు చేయుచున్నది.

రెండవ పంచవర్ష ప్రణాళికలో ప్రభుత్వ సహాయమున సహకార రంగమున ఐదు పంచదార ఫ్యాక్టరీలు స్థాపింపబడెను. 1959-60 లో రెండు ఫ్యాక్టరీలును, 1960-61 నాటికి మరి రెండు ఫ్యాక్టరీలును, 1961-62 లో మరియొక ఫ్యాక్టరీయును పనిచేయ నారంభించును.

చేనేత పనివారల సహకార సంఘము; ఆంధ్ర చేనేత పనివారల సంఘము గుంతకల్లులో ఒక నూలు వడుకు మిల్లు (స్పిన్నింగు మిల్లు)ను స్థాపించినది. ఇందు 1,100 కదుళ్ళ సహాయమున ప్రతి మాసము 500 బేళ్ళు దారము ఉత్పత్తి యగుచున్నది. హైదరాబాదు, చీరాలయందు కూడ రెండు మిల్లుల స్థాపనకు కృషి సాగుచున్నది.

పాల పరిశ్రమ: గ్రామవాసములలో పాడి పరిశ్రమ అతి ముఖ్య స్థానమును వహించుచున్నది. ఆంధ్రప్రదేశ్‌నందు మొత్తము మూడు కోట్ల పశు సంపద కలదు. 1959-60 లో ఆంధ్రప్రదేశ్‌నందు గల 362 పాల సరఫరా ప్రాథమిక సహకార సంస్థలు, 15 పాల కేంద్ర సరఫరా సంస్థలు 28·77 లక్షల రూపాయల విలువగల పాలను అమ్మినవి. ఈ సహకార సంఘములు, సంస్థలు దినమునకు సగటున 30,000 పౌనుల పాలను ఉత్పత్తి చేయుచున్నవి.

పశుపాలన సహకార సంస్థలు (కేటిల్ బ్రీడింగ్ కో-ఆప రేటివ్స్) పశుసంపదను అభివృద్ధి చేయుటకు తోడ్పడుచున్నవి. ఇవి ఉత్తమ జాతి ఆబోతు (స్టడ్ బుల్స్) లను పోషించుచున్నవి. ఆంధ్ర ప్రదేశ్‌నందు గల 22 పశుపాలన సహకార సంస్థలలో 1960 జూన్ 30 నాటికి 26 ఆబోతులు రెండు ఎనుబోతులు ఉన్నవి.

అధిక భూమి సాగు : గ్రామ ప్రాంతములందు నీటి వసతి సదుపాయములు కలిగించుటలో కూడ సహకార విధానము ఉపయోగపడుచున్నది. ఆంధ్ర ప్రదేశ్‌నందు ఇట్టి సహకార సంస్థలు 37 ఉన్నవి. వీటి మూలమున 5,700 మంది వ్యవసాయదారులకు 20,000 ఎకరముల భూమికి నీటి వసతి చేకూర్చి అధిక సాగులోనికి తెచ్చుటకు సహాయ పడుచున్నవి.

సహకార వ్యవసాయ విధానము (కో - ఆపరేటివ్ ఫార్మింగు) : భారతదేశమున ఆధునిక ఆర్థిక సూత్రము లలో ఈ విధానమునకు ప్రముఖ స్థానము ఇవ్వబడినది. భూవసతి లేని వ్యవసాయదారులకు ప్రభుత్వము బంజరు భూములను సహకార సంస్థల మూలమున పంచి పెట్టుచున్నది. కేంద్ర, రాష్ట్రప్రభుత్వముల ఆర్థిక సహాయముతో 37 సహకార సంస్థలు 3,000 మంది వ్యవసాయదారులకు సాగుక్రింద తేబడిన 14,000 ఎకరముల బంజరు భూములు పంచిపెట్టబడినవి. ఇవికాక నాలుగు సాముదాయిక వ్యవసాయ సంఘములు (కలెక్టివ్ ఫార్మింగ్ సొసైటీస్), ఆరు సమష్టి వ్యవసాయ సంస్థలు (జాయింట్ ఫార్మింగు సొసైటీస్), 37 వ్యవసాయ నీటి పారుదల సంస్థలు (ఇరిగేషన్ కో-ఆపరేటివ్ సొసైటీస్) కలవు. ఇవిగాక 30-6-1960 నాటికి 335 కౌలు పద్ధతిని నడుపు సంస్థలు 50,000 ఎకరముల భూమిని ప్రభుత్వము వద్ద తీసికొని సభ్యులకు పంచి పెట్టినవి. తోకపల్లి, బుజబలపట్టణము, సామూహిక సంస్థలు కొల్లేరు ప్రాంతమున 2,300 ఎకరముల భూమిని 1,000 సభ్యులను కలిగి ఉన్నవి. పశ్చిమగోదావరి జిల్లాలోని శంకుచక్రపురములో 59 మంది భూస్వాములు తమ 280 ఎకరముల భూమిని అంతయు చేర్చి సహకార వ్యవసాయము క్రింద సాగుచేయుచున్నారు.

గ్రామీణ నిరుద్యోగ పరిష్కారము : సహకార సంస్థలు ప్రభుత్వమువద్ద, రోడ్డు వేయుట మున్నగు పనులకు కంట్రాక్టుకు తీసికొని గ్రామ వాసులకు పనుల కల్పించుచున్నది. 1959 - 60 లో సుమారు రు. 7·63 లక్షల విలువగల పనులను ఈ సంస్థలు చేసినవి. ఇదే విధముగ ఉప్పు ఉత్పత్తి సంస్థలు ప్రభుత్వమువద్ద 789 ఎకరముల నేలను అద్దెకు తీసికొని 1959 - 60 లో రు. 1·36 లక్షల ఉప్పును అమ్మినది.

గ్రామీణ కుటీర పరిశ్రమలు : ఆంధ్రప్రదేశ్ గ్రామీణ ఆర్థిక వ్యవస్థలో వ్యవసాయము తరువాత, చేనేత పరిశ్రమ ముఖ్య స్థానమును ఆక్రమించుచున్నది. ఆంధ్రప్రదేశ్‌నందు 1960 నాటికి మొత్తము 4·6 లక్షల మగ్గములు ఉన్నవి. 905 సహకార సంస్థలు 2·59 లక్షల చేనేత పారిశ్రామిక సభ్యులుగ కలిగి 576 లక్షల రూపాయల విలువగల వస్త్రములను సంవత్సరమునకు ఉత్పత్తిని చేయుచున్నవి. ఈ చేనేత సహకార సంస్థలకు రెండు కేంద్ర సహకార సంస్థలు నూలు పంచుటకును, ఉత్పత్తి అయిన వస్త్రము లను అమ్ముటకును కావలసిన సాంకేతిక శిక్షణ నిచ్చుటకును నెలకొల్పబడి ఉన్నవి. 1959 - 60 లో ఈ రెండు సంస్థలు 117·26 లక్షల రూపాయల విలువగల వస్త్రములను ఉత్పత్తిచేసి 180·69 లక్షల రూపాయల విలువగలవాటిని అమ్మినది.

తాటిబెల్లపు పరిశ్రమ : మాజీ కల్లు పనివారలకు ఆర్థిక, సాంఘిక సదుపాయములను, వసతులను కల్పించుటలో సహకార సంస్థలు సఫలీకృతములైనవి. 1960 జూన్ 30 వ తేదీ నాటికి రాష్ట్రమున 86,551 మాజీ కల్లు పనివారలతో కూడిన 973 సహకార సంస్థ లుండినవి. 1959 - 60 లో ఈ సంస్థలు 4.53 లక్షల రూపాయలు విలువగల తాటి బెల్లమును ఉత్పత్తి చేసినవి. అదే సంవత్సరమున తయారైన 24 లక్షల గ్యాలన్ల నీరా అమ్ముడుపోయినది.

ఇవికాక కంబళీలు నేయువారలకు, నవారు, తివాచీలు నేయువారలకు, చాపలు నేయువారలకు, బొమ్మలు తయారుచేయువారు మొదలగువారికి చెందిన 914 సహకార సంస్థలు ఆంధ్రప్రదేశ్ నందున్నవి. 1959 లో వీటి ఉత్పత్తి అమ్మకపు విలువలు వరుసగ రు. 59·239 లక్షలు, రు. 52.27 లక్షలుగా ఉండెను.

కొండ జాతులు : గిరిజనులు, హరిజనులు, వెనుకబడ్డ కులముల వారి ఆర్థిక అభివృద్ధికై సహకార సంస్థలు స్థాపింపబడినవి. వీరికి వలయు ఋణ సదుపాయము లను కల్పించి వారు తయారుచేయు వస్తువులకు సక్రమ ధరలను చేకూర్చి వారికి ఇతోధికముగ ఈ సంస్థలు సహకరించుచున్నవి. 1958 - 59 లో వీటి మూలముగ అమ్ముడైన వస్తువుల విలువ 6·53 లక్షల రూపాయలు.

పట్టణవాసులు-సహకారము : ఆంధ్రప్రదేశ్ జనాభాలో మొత్తము 17·4 పట్టణములో నివసించు చున్నారు. వీరి అవసరములను తీర్చుటకును, ఋణములను ఇచ్చుట కును వ్యవసాయ సహకార సంస్థలు ఇచ్చగించవు. కావున వ్యవసాయేతర సహకార సంస్థల ఆవశ్యకత కలిగినది. మొత్తము రాష్ట్రమున గల 847 సంస్థలలో సభ్యత్వము

2.47 లక్షలు. వీటి డిపాజిట్లు మొత్తము 3.81 కోట్ల రూపాయలు. 1959-60 లో ఈ సంస్థలు సభ్యులకు ఋణ రూపమున 390.34 లక్షల రూపాయలు ఇచ్చినవి. అదే సంవత్సరాంతమున సభ్యులనుండి ఈ సంస్థలకు రావలసిన సొమ్ము రు. 465.37 లక్షలు. ఈ సంస్థలు వ్యక్తులకు ఋణములను ఇచ్చుటయే గాక అన్నివిధముల బ్యాంకింగు వ్యవస్థగా కూడ తయారైనవి.

ఇవిగాక 475 అనుభోక్తల కో-ఆపరేటివ్ స్టోర్స్ (కన్స్యూమర్స్ కో-ఆపరేటివ్ స్టోర్స్) 1959-60 లో సుమారు 1.69 కోట్ల విలువగల వస్తువులను సరఫరా చేసినది. ఆంధ్రప్రదేశ్‌నందు సహకారోద్యమము వేరొక మార్గమున కూడ బయలుదేరినది. కళాశాలలందును, ఉన్నత విద్యాలయములందును చదువు విద్యార్థులు, సహకార సంస్థలను ఏర్పరచుకొని తమకు వలయు పుస్తకములు మున్నగువాటిని కొని సభ్యులకు అమ్ముచున్నారు. ఇట్టివి 186 సంస్థలు రాష్ట్రమునందు ఉన్నవి.

గృహ వసతి : సహకార గృహనిర్మాణ సంస్థలు గృహముల కొరతను తగ్గించుటలోను, సభ్యులకు చౌకగ గృహ వసతులను కల్పించుటలోను నిమగ్నమై ఉన్నవి. 30-6-1960 నాటికి 29,684 సభ్యులుగల 315 సంస్థలు కలవు. ఇట్టివి ఆంధ్ర ప్రదేశ్‌లో సభ్యులకు గృహ నిర్మాణమునకు గాను ఇచ్చిన ఋణముల మొత్తము 66.52 లక్షల రూపాయలు. 1960 నాటికి సభ్యుల వద్దనుండి రావలసిన సొమ్ము 294.52 లక్షల రూ.లు. ఇదే సంవత్సరములో నిర్మితమైన గృహముల సంఖ్య 1,436.

జాతీయ అభివృద్ధి మండలిలో పేర్కొనిన విధానము ప్రకారము మూడవ ప్రణాళికలో సహకార కార్యక్రమములు తయారు చేయబడినవి. ఈ విధానము ముఖ్యాంశములు :

1. గ్రామీణ జీవితము అన్ని విధముల అభివృద్ధిని ప్రజల కృషిద్వారా సాధించాలని ఆశించి సమాజ వికాస కార్యక్రమాన్ని కొనసాగించే ముఖ్యసంస్థల సహకార సంఘము, పంచాయితీ ఉండవలెను.

2. గ్రామ వ్యవసాయ ప్రణాళిక సహకార అభివృద్ధి కార్యక్రమమునకు పునాది. దానికి అత్యంత ప్రాధాన్యము చూపాలి.

3. గ్రామ సహకార సంఘపు ముఖ్య కర్తవ్యములు, స్వల్పవాయిదా, మధ్యకాలపు వాయిదా, పరపతిని సమకూర్చుట, వ్యవసాయ, తదితర ఉత్పత్తి అవసరములను సప్లయి, వ్యవసాయ ఉత్పత్తి విక్రయము, వీటికి అదనముగ సహకార సంఘము, గ్రామ వ్యవసాయ ఉత్పత్తి ప్రణాళికలను రూపొందించి అమలు జరుపుటకు తోడ్పడవలెను. ప్రత్యేకమైన పనులకు, కొన్ని గ్రామముల సమూహములకు కలిపి ప్రత్యేక సహకార సంఘములను ఏర్పాటు చేయవచ్చును.

ఉదాహరణకు : పారిశ్రామిక కార్మికులకు ఏదైన ఒక ప్రత్యేక కార్యక్రమమువల్ల బాగుపడు వారి తరపున గ్రామములో ప్రత్యేక సంఘములు ఏర్పాటు చేయవచ్చును.

4. గ్రామ పరిమాణమును ముఖ్య ప్రాతిపదికగా తీసికొని సహకార సంఘమును స్థాపించవలెను. గ్రామములు చిన్నవిగ ఉన్న సందర్భములో ప్రజల సమ్మతితో వేయి జనాభా ఉండునట్లు వాటిని కలిపి, ఒక గ్రామ సహకార సంఘమును ఏర్పాటు చేయవలెను. ఈ జనాభా పరిమాణములో పరిస్థితులకు అనుగుణముగ హెచ్చు తగ్గులు ఉండవచ్చు. ఐతే సహకార సంఘమునకు ముఖ్య లక్షణములైన స్వచ్ఛంద విధానము, సాన్నిహిత్యము, సంఘీభావము, పరస్పర బాధ్యత ఉండునట్లు చూచుటలో శ్రద్ధ తీసికొనవలెను.

5. గ్రామోత్పత్తి కార్యక్రమ సందర్భములో పరపతిని వ్యవసాయోత్పత్తి అధికముచేయు కార్యక్రమములతో జతపరుప వలెను. గ్రామోత్పత్తి ప్రణాళికలో పాల్గొను ప్రతి రైతు రసాయనపు ఎరువులు, మేలురకము విత్తనములు వగైరాలు సప్లయిలను పొందుటకు సాగు ఖర్చులకు అవసరమైన పరపతిని తెచ్చుకొను స్థితిలో ఉండవలెను.

6. పరపతిని విక్రయముతో జోడించవలెను. ఆ ప్రకారము గ్రామ సహకార సంఘములు విక్రయ సంఘముల సభ్యత్వము పొందిఉండి మిగులు వ్యవసాయోత్పత్తిని అమ్మకానికి వాటి ఏజెంట్లుగా పని చేయవలెను.

7. సహకార ఉద్యమమును ప్రజల ఉద్యమముగ అభివృద్ధి పరచుటకు, గ్రామమండలి, జిల్లాస్థాయిలలో ప్రజల సహకార తత్త్వబోధనకు సమగ్ర కార్యక్రమములు ఉండవలెను. అనధికార కార్యకర్తలు చాలమంది ఉద్యమమును నిర్మించుటలో పటిష్టంగా పాల్గొన కలుగుటకు వీలగు పరిస్థితులను కల్పించవలెను. సహకార సంఘముల పర్యవేక్షణ, బోధన అభివృద్ధికి మండల స్థాయిలోగాని, అందుకు సమానమగు స్థాయిలోగాని, పర్యవేక్షణ యూనియన్లను ఏర్పాటు చేయవలెను. ఈ యూనియనులను జిల్లా యూనియనులతోను, రాష్ట్రస్థాయి యూనియన్‌తోను అనుబంధించ వలెను.

8. సహకార ఉద్యమము యొక్క ఒక ముఖ్యలక్ష్యము మితవ్యయము, పొదుపుల అలవాటును అలవరచుట, ప్రతి ప్రాంతములోను, సహకార సంఘములు రూపొందించు

కార్యక్రమము ప్రకారము సభ్యులందరి పరపతి అవసరము లను తీర్చుటకు కృషి జరుగవలెను. తృతీయ పంచవర్ష ప్రణాళికలో కేటాయింపబడిన సొమ్ము సుమారు రు. 5.75 కోట్ల రూపాయలు. ప్రక్క పట్టిక వివరములను ఇచ్చును.

ఇవిగాక సహకార గృహనిర్మాణ సంస్థలకు సుమారు 212 లక్షల రూపాయలను, సహకార పాల పరిశ్రమ సంస్థలకుగాను 72 లక్షల రూపాయలను కేటాయించిరి. రిజర్వు బ్యాంకువద్ద అప్పు తీసికొను సహకార సంస్థల మూలధనమునకు సుమారు ఏడుకోట్ల రూపాయలు చేర్చ బడును. మూడవ ప్రణాళికా కాలమున సాధింపదలచిన వివరముల పట్టిక దిగువ నీయబడినది :

గ్రామీణ పరపతి పెంపొందించు ప్రణాళిక

| | | | |
|---|---|---|---|
| 1. సహకార పరపతి అభివృద్ధి కార్యక్రమాలు | లక్షల | రూ॥లలో | 182.54 |
| 2. సహకార విక్రయము | ,, | ,, | 181.05 |
| 3. పంచదార ఫ్యాక్టరీలు | ,, | ,, | 65.00 |
| 4. సహకార శిక్షణ విద్య | ,, | ,, | 67.81 |
| 5. సహకార వ్యవసాయము | ,, | ,, | 40.00 |
| 6. ఇతరములు | ,, | ,, | 38.60 |
| | మొత్తము | | 575.00 |

| వివరములు | రెండవ ప్రణాళిక అంతమునకు 1961 | మూడవ ప్రణాళిక అంతమునకు 1966 | |
|---|---|---|---|
| 1. ప్రాథమిక గ్రామ సహకార సంఘములు (సేవా సహకార సంఘములు-లక్షలలో) | 20 | 40 | |
| 2. సహకార విధానమున ఉన్న గ్రామీణ కుటుంబములు (నూటికి) | 33.3 | 66.6 | |
| 3. సహకార సంఘములద్వార ఋణములు, అల్పకాలీన, మధ్యకాలీన ఋణములు (కోట్ల రూ॥లలో) | 24 | 60 | |
| 4. దీర్ఘకాలీన ఋణములు (కోట్ల రూపాయలలో) | 2 | 6 | |
| 5. ప్రాథమిక గ్రామ సహకార సంఘముల మూలధనము (కోట్ల రూపాయలలో) | 3.3 | 8.0 | |
| 6. ప్రాథమిక సహకార సంఘములకు ఉండవలసిన మొత్తము డిపాజిట్లు (కోట్ల రూపాయలలో) | 0.85 | 10.0 | |
| 7. విపణి సంస్థల సంఖ్య (కోట్ల రూపాయలలో) | 170 | 40 | అదనంగా |
| 8. ధాన్యాగారములు | | | |
| అ. ప్రైమరీ విపణి సంస్థలవి (కోట్ల రూ.) | 148 | 60 | ,, |
| ఆ. జిల్లా విపణి సంస్థలు ,, | 8 | 5 | ,, |
| ఇ. కేంద్ర విపణి సంస్థ ,, | 1 | — | ,, |
| 9. గ్రామీణ ధాన్యాగారములు | 370 | 600 | ,, |
| 10. సహకార పంచదార ఫ్యాక్టరీలు | 5 | 2 | ,, |
| 11. సహకార వ్యవసాయ కేంద్రములు | 29 | 200 | ,, |
| 12. ప్రాసెసింగు ప్లాంటులు | 90 | 50 | ,, |

జి. నం.

# ఉప్పెనలు

పూర్వకాలములో వచ్చిన ఉప్పెనలను గురించి మనకు తెలిసిన విషయము చాల కొద్ది. ఇదియైనను భారతదేశ ములో ఉండిన, భారత దేశమునకు వచ్చిన యూరోపి యనులు చూచి వ్రాసిన వృత్తాంతముల వల్లనే తెలియు చున్నది. పూర్వమొకప్పుడు ప్రఖ్యాతముగా ఉండిన ఘంట సాల, మోటుపల్లి, కోరంగి, ఇంజరము, బందరు మొదలైన రేవు పట్టణములు నాశనమైనది ఉప్పెనలవల్లనే. ఐతే ఎప్పుడెప్పుడు సంభవించిన ఉప్పెనలవల్ల ఏయే రేవు పట్టణములు ఎప్పుడెప్పుడు పాడైనవో తెలియదు. కోరంగి, బందరు మొదలైన కొన్ని రేవు పట్టణములకు సంభవించిన ఉప్పెన ఉపద్రవమును గురించి మాత్రమే తెలియవచ్చు చున్నది. 1784 లో గొప్ప ఉప్పెన వచ్చినట్లు తెలియు చున్నది. దీనిని గురించిన వివరములు తెలియవు కాని సముద్రము పొంగి ఉవ్వెత్తుగ లేచి వచ్చుట చేత ఓడలు మెట్టను రాజమండ్రి వరకు కొట్టుకొని పోయినవట.

క్రీ. శ. 1789 డిసెంబరులో వచ్చిన ఉప్పెనవల్ల కోరంగి రేవుపట్టణము పూర్తిగ నాశనమైనది. భయంకరమైన తుపానులో మూడు ఉప్పెన కెరటములు మహోత్తుంగముగ లేచి ఒకదాని నొకటి తరుముకొనుచు ఒడ్డుపై ప్రవహించి నవి. ఒక ఫ్రెంచి వర్తకపు టోడ అధికారి క్రీ. శ. 1840లో

ఇట్లు వ్రాసెను: "కోరంగి ఒక్క దినములో నాశన మైనది. ఒక భయంకర సంఘటన వలన దానికి ఇప్పటి స్థితి సంభవించినది. క్రీ. శ. 1789 డిసెంబరు మాసములో ఈశాన్య వాయువు భయంకరముగ వీచుచుండినప్పుడు మహోన్నతమైన ఒక కెరటము తాడి ఎత్తున లేచినది. కొద్ది సేపటిలోనే కోరంగి ప్రజలు మూడు రాక్షసి కెరటములు కొద్ది దూరములోనే ఒకదాని వెంట ఒకటి లేచుట చూచిరి. మొదటి కెరటము అంతను తుడిచి పెట్టుకొనుచు ఊరిలోనికి వచ్చి పడినది. మరొక బ్రహ్మాండమైన కెరటము వెంటనే దాని వెన్నంటి వచ్చి పల్లపు ప్రదేశము నంతను పూర్తిగ ముంచెత్తి వేసెను. ఉత్తుంగమైన మరొక పెద్ద కెరటము వచ్చి ఈ వినాశన కార్యమును పూర్తి చేసెను. కోరంగి పట్టణమును, దానిలో నివసించుచుండిన ఇరువది వేల జనమును త్రుటిలో అంతర్ధానమైరి. కోరంగి సమీపమున నదీ ముఖమున లంగరు వేసి ఉంచిన ఓడలు యానాం చుట్టుపట్లకు కొట్టుకొని పోయినవి. యానాం గ్రామము కూడ చాల నష్టము పాలైనది. నీరు పూర్తిగ తీసి పోయిన తరువాత మిగిలిన దంతయు బురదయు, ఇసుకయును. అందువల్ల పోయిన ఆస్తిని వెదకుటకు కాని, శవములను వెదకుటకు కాని సాధ్యము కాక పోయినది."

క్రీ. శ. 1830 లో ఒకమారు గొప్ప తుపాను వచ్చినది. ఈ భయంకరమైన తుపానుకు అల్లకల్లోలమై చాల ఎత్తుగా లేచిన సముద్రపు కెరటములు నూరు, రెండు వందల టన్నుల ఓడలను కూడ మెట్టను మైళ్ళకొద్ది దూరమునకు కొట్టి వేసినవి.

క్రీ. శ. 1839 లో మరొక పెద్ద తుపాను వచ్చినది. ఇది కూడ చాల గొప్పదని కలెక్టరు నివేదిక వల్ల తెలియుచున్నది. ఈ తుపానులో ఉప్పెన కెరటము లేదు కాని తుపానుగాలి వేగమునకు సముద్రపు నీరు చాల ఎత్తుగలేచి ఊరి లోపలి వరకు వచ్చి ఊరును ముంచి వేసినది. ఇరువది వేలమందికి పైగా జనము చని పోయిరి. నూటయేబది టన్నుల ఓడ మెట్టను నాలుగు మైళ్ళ దూరమునకు కొట్టు కొని పోయినది.

ఈ విధముగనే తూర్పు గోదావరి జిల్లాలోని ఇంజరము కూడ 1787 లో వచ్చిన ఉప్పెనవల్ల నాశనమైనది. క్రీ. శ. 1787 మే 17వ తేదీన పెద్ద గాలి ఆరంభమైనది; 19వ తేది రాత్రి కది పెద్ద తుపానుగ పరిణమించినది; 20వ తేది ఉదయము పదునొకండు గంటలకు పూర్వము గొప్ప హోరుతో ఒక గొప్ప కెరటము మామూలు నీటి మట్టమున కంటె పదునైదడుగుల ఎత్తున లేచి మెట్టకు వచ్చి పడినది. ఆ దినము పగలెల్ల తుపాను గాలి బీభత్సముగా వీచుచు అర్ధ రాత్రి శమించినది. ఈ యుప్పెనతో అంతయు సర్వ నాశనమైనది. ఈ యుప్పెన కెరటము ఇంజరము నుంచి ఉత్తరముగా సముద్ర తీరముననే పదునైదు మైళ్ళ దూరము వ్యాపించినప్పుడు, వేలకొలది జనము, లక్షల కొద్ది పశువులు చని పోయినవి.

ఒకప్పుడు యూరోపు ఖండ దేశములతో గొప్ప వర్తక వ్యాపారము సాగించు చుండిన ప్రసిద్ధమైన రేవు పట్టణము బందరు కూడ ఉప్పెనవల్లనే చెడిపోయినది. క్రీ. శ. 1864 వరకు తూర్పు సముద్ర తీరములో ఉన్న ప్రఖ్యాతములైన రేవు పట్టణములలో బందరు ఒకటి. క్రీ. శ. 1864 నవంబరు 1వ తేదీన మధ్యాహ్నమునకు గాలి ఆరంభమై క్రమముగ హెచ్చి మబ్బు, గాలి వాన - మహాప్రళయముగా తుపాను రేగినది. కన్ను మిన్ను కాన రానంతటి కారు చీకటయినది. వాయువేగమునకు మనుష్యులే ఎగిరి పోయిరి. సముద్రము ఉల్లోలము కల్లోలము అయినది. దీనికి తోడు ఆ దినము సముద్రము సహజముగా పోటు మీద ఉండునట్టి పర్వదినము - అమావాస్య. చీకటి పడిన కొంత సేపటికి పదుమూడడుగుల ఎత్తున బ్రహ్మాండమైన ఉప్పెన కెరటము లేచి తీర ప్రదేశమును ఎనుబది మైళ్ళ వరకు ఉండు గ్రామములు, మనుష్యులు, పశువులు, చెట్లు చేమలు అన్ని జలార్ణవము పాలై సర్వనాశనమైనవి. సముద్రపు నీరు మెట్టను పదునేడు మైళ్ళ దూరము వరకు పోయినది. మొత్తము పూర్తిగా మునిగిపోయిన ప్రదేశము 780 చ. మై. ఈ ఉప్పెనవల్ల ముప్పదివేల జనము నశించినారనీ, పోయిన పశుగణమునకు పరిమితిలేదని చెప్పుదురు. ఉప్పెన తగలని ప్రదేశము గాలివానవల్ల ధ్వంసమైనది. క్రీ. శ. 1864 లో వచ్చిన ఉప్పెన ఇంతవరకు జనులు కని, విని ఎరుగనట్టిది. దీనివల్ల కలిగిన నష్టమునకు మేరలేదు.

మ. సో. శ.

# కరవులు

దేశములో ఒక భాగమునందుగాని, దేశమంతటను గాని ఆహారము లభింపక ఆకలి బాధవలన ప్రజలు చని పోవుచుండు స్థితికి 'కర' వని పేరు. కరవులు కలుగుటకు అతివృష్టి, అనావృష్టి దోషములవలన పంటలుపాడై పోవుట; భూకంపములు, తుపానులు, ఉప్పెనలు మొదలైన ఉపద్రవములు కలుగుట; క్రిమికీటకాదులు, మిడతల దండు, చీడలు మొదలైన ఈతిబాధలు మొదలగునవి దైవిక కారణములు. యుద్ధములు, అందువలన జన

నష్టము కలుగుట, పంటలను ధ్వంసము చేయుట మొదలైనవి రాజకీయ కారణములు. ఇవి కాక ఆహార ధాన్యములను ఉత్పత్తి చేయుటలోను, వానిని రవాణా చేయుటలోను, వాని విక్రయ వినియోగములలో కలుగు లోటుపాటులు కూడ రాజకీయములే. శాస్త్ర విజ్ఞానము అభివృద్ధి అయిన కొలది కొన్ని దైవిక కారణములయొక్క తీవ్రతను నివారింప గలుగుచున్నారు. రవాణా సౌకర్యములను అభివృద్ధి పరచి సుభిక్ష దేశ భాగములనుండి దుర్భిక్ష దేశ భాగములకు ఆహార పదార్థములను రవాణా చేసి కరవు వలన బాధలను తగ్గించ గలుగుచున్నారు.

ఉష్ణదేశములందు కరవులు కలుగుటకు ముఖ్యమైన కారణము అనావృష్టియే. వర్షములు కురియక పోవుట వలన తరచుగ పంటలు పండని ప్రాంతములలో నదులకు ఆనకట్టలు కట్టియు, గొప్ప గొప్ప తటాకములు, బావులు త్రవ్వియు కరవులు రాకుండ జాగ్రత్త తీసికొనుటకు వీలున్నది. ఇట్టి ప్రయత్నములు భారతదేశమున వేలకొలది సంవత్సరములనుండి జరుగుచుండుటను పాడువడిన ఆనకట్టలు, జలాశయములు, బావులు వేనోళ్ళ చాటుచున్నవి.

క్షామ నివారణ పద్ధతులు: భారతదేశము నేలిన పూర్వపు చక్రవర్తులును, మహారాజులును దేశములో అనావృష్టి వలన తరచుగ దుర్భిక్షము సంభవించుట చూచి వీనిని నివారించుటకు నీటివనరులు అభివృద్ధి చేయుట ముఖ్యమని గ్రహించి అందుకొరకు అనేక విధములుగ పాటుపడిరి. చాళుక్యులు, చోళులు, కాకతీయులు, విజయనగర చక్రవర్తులు నిర్మించిన నిర్మాణ శిథిలము లిప్పటికిని దేశమంతటను కనబడుచున్నవి. విజయనగర చక్రవర్తులు కొండలను గోడలుగ ఏర్పరచి మహా తటాకములను నిర్మించిరి; తుంగభద్ర నుండి కాల్వలు త్రవ్వించి సాగుకు వీలు కలుగ జేసిరి. వారిని చూచి వారి సామంత రాజులు, సంపన్నులు కూడ అట్లు చేయుచుండిరి. ఇట్టి నీటివనరులేర్పాటు చేయుట, వీనిని బాగుపరచి చిరస్థాయిగ ఉండునట్లు చేయుట పుణ్యకార్యములుగ ఎంచి ప్రజలు, పాలకులు కూడ యథాశక్తిగ పనిచేయు చుండిరి. ఇట్టి నీటి వనరులు పాడు కాకుండ ఎప్పటి కప్పుడు మరమ్మతు చేయుట కొరకు పల్లపు సాగుచేయు ప్రతి ఎకరము భూమిపైనను ఒక విధమగు పన్ను వసూలు చేసి దానిని అందుకొరకే వినియోగించు చుండిరి. వ్యవసాయము నభివృద్ధి చేయుటకు, నీటి సరఫరా చేయుటకు ప్రత్యేకోద్యోగులను నియమించిరి.

ఇటీవల క్షామదేవతకు పుట్టినిల్లుగ ఉన్న రాయలసీమను విజయనగర చక్రవర్తులేలిన రెండు వందల సంవత్సరములలో కరవులు వచ్చినట్లు ఏ చరిత్రకారుడును చెప్పుటలేదు. సరికదా, ఆ కాలములో ఆ ప్రాంతములను చూచిన పాశ్చాత్యులందరును రాయలసీమ పాడిపంటలతో తులతూగు చుండెనని వ్రాసిరి. వారి కాలములో ఎన్నో నీటివనరులు నిర్మింపబడి యుండుటయు, రాయలసీమలోని నడిబొడ్డు ప్రదేశము వారికి రాజధానిగ ఉండుటయు, ధనరాసులు ధాన్యపురాసులు అక్కడ నిలువ చేసియుంచుటయు ఆ కాలమున అక్కడ కాటకము లేకపోవుటకు కారణము కావచ్చును.

పూర్వము రాజాధిరాజులు పన్నులు ధాన్యరూపముననే వసూలు చేయుచు ఆయా ప్రాంతములలో బ్రహ్మాండములైన ధాన్యపు గాదెలను, కొట్లను నిర్మించి ధాన్యమును నిలువ చేసి యుంచి, క్రొత్త పంట ధాన్యము వచ్చిన పిదప పాత పంట ధాన్యమును విడుదల చేయుట మొదలగు కట్టుబాటులను చేయుచుండిరి. మహమ్మదీయ చరిత్రవల్ల బహ్మనీ సుల్తానుల పరిపాలన కాలములో వచ్చిన ఒకటి రెండు కరవులను గురించి మాత్రము తెలియవచ్చుచున్నది. బహ్మనీ సుల్తాను ఫీరూజ్‌షా రాజ్య కాలమున క్రీ. శ. 1396 లో మహారాష్ట్ర ప్రాంతమున కరవు ప్రారంభమై కృష్ణా, గోదావరి నదులమధ్య ప్రాంతమంతటిని తుడిచి పెట్టినది. ముప్పది సంవత్సరముల వరకు దేశాదాయము మరల యథాస్థితిని కోలుకొనలేదు. దీనికి 'దుర్గాదేవి కర'వని పేరు వచ్చినది. క్రీ. శ. 1472-73 లో రెండవ మహమ్మదుషా తెలంగానా నేలుచుండగా బీజాపూరు కరవు ప్రారంభమై దక్షిణాపథమునకు ప్రాకి ప్రజలను బాధించినది. రెండేండ్లు వర్షములు లేవు. మూడవ సంవత్సరము వర్షము కురిసినది. కాని భూమిని దున్నుటకు రైతులే లేరైరి.

క్రీ. శ. 1633 లో బందరులోనుండిన ఇంగ్లీషు ఫ్యాక్టరీ ఉద్యోగులు ఆ ప్రాంతమున అతి ఘోరమైన కరవు వచ్చినదని, బ్రదికి యున్నవారు శవములను పీకికొని తినుచున్నారని బయట కనబడిన యెడల చంపి తినెదరేమోనను భయముచే ప్రజలు ప్రయాణము చేయుటయే మానుకొని నారని సీమకు వ్రాసిరి.

భారత దేశములోని రాజులు, నవాబులు పరస్పరము కలహించుచుండగా దేశము ఇంగ్లీషు వర్తకుల స్వాధీనమైనది. ఇంగ్లీషు వర్తకులు తమ రాజ్యాధిపత్యమునందు మొదట తమ వర్తక లాభములను చూచుకొనిరే కాని దేశములోని పాడి పంటలను అభివృద్ధి చేయుటకుగాని, నీటి వనరులను కాపాడుటకుగాని చాలకాలము వరకు ప్రయత్నించ లేదు. అందువలన పూర్వ కాలమునాటి జలాశయములు, తటాకములు, నూతులు పాడువడి శిథిలములైనవి.

పుర్రెల కరవు : క్రీ.శ. 1790-92 ల మధ్యవచ్చిన క్షామమునకు 'పుర్రెల కరవ'ని పేరు వచ్చినది. చనిపోయిన వారిని పూడ్చువారైన లేకపోగా దేశమంతయు పుర్రెలతో నిండిపోయినది. ఇది అప్పటి బొంబాయి, హైదరాబాదు రాష్ట్రములనుండి ఉత్తర సర్కారులలోనికి వ్యాపించి దేశమును తుడిచి పెట్టినది. క్రీ.శ. 1791 లో ఇంగ్లీషు తూర్పు ఇండియా వర్తక సంఘమువారు ఉత్తర సర్కారులలో ధాన్యముపైన పన్ను వసూలు మానిరి; దేశములో ఎవరైనను ధాన్యము దాచి యుంచినచో దానిని సేకరించి ప్రజలకు అందుబాటు చేయవలసినదని కలెక్టర్లకు తాఖీదులను పంపిరి. బీదవారు చాలమంది అన్నములేక చనిపోయిరి. చాలమంది దూరదేశములకు వలస పోయిరి. జనసంఖ్య చాల తగ్గినది. వ్యవసాయము, పరిశ్రమలు క్షీణించినవి. మచిలీపట్టణము దగ్గరనున్న సర్కారు భూములలో సర్కారువారు తమవంతు ధాన్యమును తమ సిపాయిల కోసము నిలువ చేయుటకు ఉత్తర్వు చేసిరి. కాని ఉత్తర డివిజను, మధ్య డివిజను కలెక్టరులు తమ ప్రాంతములో తిండిలేక జనులు అల్లాడు చున్నారనియు, అట్లు నిలువచేయ వీలులేదనియు వ్రాసిరి. మచిలీపట్టణము జిల్లాలో జమీందారీలలో పింఛను బకాయిలు పోను మిగిలిన సొమ్మును దుస్థితిలో నున్నవారి నిమిత్తము ఖర్చు పెట్టుటకు సర్కారువారు ఉత్తరువుచేసిరి; బీదవారి పసిపిల్లలను ప్రోగుచేసి వారికి గంజికూడుపెట్టి రక్షింప సాగిరి. జమీందారులు తమ కిస్తీలు చెల్లించుకోలేక బకాయి పెట్టిరి. ఆ కారణమువల్ల జమీందారీ గ్రామములలో శాశ్వత పరిష్కారము చేయవలసి వచ్చినది. కృష్ణానదికి ఉత్తర ప్రాంతములలో బకాయిలు $\frac{1}{8}$ వంతు తగ్గించిరి.

నందన **(1832-33)** నామ సంవత్సరపు కరవు: క్రీ. శ. 1831 నకు పూర్వము కొంత కాలము భారత దేశములో పంటలు సరిగా పండలేదు. క్రీ. శ. 1831 లో అతివృష్టివలన పంటలు పాడైనవి. క్రీ.శ. 1832 మే నెలలో ఒక గొప్ప ఉప్పెనగాలి వచ్చి పాడి పంటలను నాశనము చేసినది. దక్షిణాపథములో పడమటి భాగములో వర్షములు లేక కృష్ణా, గోదావరులలో నీరు రాలేదు. ప్రారంభములో కొంచెము క్రొత్తనీరు తగులునప్పటికి రైతులు ఆశపడి సాగు ప్రారంభించిరి, కాని నీరు మరల రానందున పైరులు ఎండి పోయినవి. 1833వ సం॥ ప్రారంభమైనప్పటినుండి దేశములో దుర్భిక్షము క్రమక్రమముగ వృద్ధియైనది. ఈ కరవును 'పెద్ద కరవు' వని యందురు. గుంటూరు జిల్లాలో చేరిన ఒంగోలునుండి బందరు వరకును మార్గమంతయు పీనుగులతోను ఎముకల ప్రోగులతోను నిండిపోయెను. గోదావరి జిల్లానుండి మద్రాసు వరకును గల రాజబాట కూడ శవములతో నిండి పోయినది. ఇది ఉత్తరసర్కారు జిల్లాలలోను, ముఖ్యముగ గుంటూరు జిల్లాలోను అతి దారుణముగ ఉండి మద్రాసు వరకు కూడ వ్యాపించినది. 38 వేల చ. మైళ్ళ దేశములో 50 లక్షల మంది ఈ కరవులో మునిగి దుర్భరమైన బాధలను అనుభవించిరి. అప్పటి తూర్పు ఇండియా వర్తకకంపెనీ ప్రభుత్వమువారు దీని తీవ్రతను మొదట గ్రహింప లేకపోయిరి. అందువలన వెంటనే దీనిని నివారించుటకు తగిన ప్రయత్నములు కూడ జరుపలేదు. చివరకు వారు మేలుకొనునప్పటికి దాని నాపుటకు శక్యము కాక పోయెను. అసంఖ్యాక జనము మరణించిరి. గ్రామములలోని జనమంతయు పట్టణములకు చేరిరి. అక్కడ వీరికి అన్నము పెట్టుటయు, గంజి పోయుటయు కష్టసాధ్య మయ్యెను. ఒక గుంటూరు జిల్లాలోనే ఐదు లక్షలమంది జనసంఖ్యలో రెండు లక్షల మంది చనిపోయిరి. ఈ దుర్భిక్షము మద్రాసు రాష్ట్రమునకు దగ్గరగా నున్న బొంబాయి రాష్ట్రభాగములకును, మైసూరు, హైదరాబాదు రాష్ట్రములకును కూడ ప్రాకెను,

ప్రజలు ఆకలిబాధ సహించలేక మెల్లమెల్లగ ఒక జిల్లా నుండి మరియొక జిల్లాకు పోవుటకు తమ బిడ్డ పాపలను, ముసలివాండ్రను వెంటబెట్టుకొని మోయగలిగిన సామానులను మోసికొని బయలుదేరిరి; ఇంగ్లీషు వర్తకకంపెనీ సర్కారు వారియొక్క రాజధానియైన మద్రాసు నగరములో అన్నము దొరకునని ఆశతో రాజబాటను పడి పోవుటకు ప్రారంభించిరి. దారిలో తిండిలేక మాడుచు సొమ్మసిలి కొందరు, రోగములువచ్చి కొందరు బాటమీద స్పృహతప్పి పడిపోవుచుండిరి; చాలమంది మరణించిరి. ఆ రాజబాటమీద పడియున్న మానవాస్థిపంజరములలో జీవచ్ఛవములెన్నో, శవములెన్నో గుర్తించుటకూడ కష్టమైపోయెను. కొన్ని శవములను ఆ చోటుప్రక్కనే పూడ్చుచుండిరి. కొన్ని శవములు పూడ్చు దిక్కులేక క్రుళ్ళి దుర్గంధము కొట్టుచుండెను. ఆ రాజబాట యంతయు మహాశ్మశానమై పోయెను. ఈ దుస్థితిలో హైదరాబాదు నుండి కొందరు వ్యాపారులువచ్చి దిక్కులేని వారి ఆడు పిల్లలను కొనిపోవుచుండిరి.

ఎట్టకేలకు మద్రాసు నగరము చేరినవారికి అక్కడ నిలుచుటకు నీడయు, తినుటకు తిండియు లేకుండెను. మహేగారు సత్రాధి కారులు మొదట దినమునకు 1,500 మందికి అన్నదానము చేయసాగిరి. 1833 మే నెల నాటికి దీనులసంఖ్య దినమునకు 12,000 వరకు పెరిగినది. జూన్‌లో దినమునకు

33,000 మంది అన్నమో రామచంద్రా యని అల్లాడ సాగిరి. సత్రాధికారుల కేమియు తోచలేదు. 17,000 మందికి పనిచెప్పి అన్నము పెట్టసాగిరి. క్షామము అతి తీవ్రము కాగా ఆగస్టు 19 వ తేదీన మద్రాసులో ధాన్యము కొట్లు లూటీ జరిగెను. మద్రాసులో అన్నము పెట్టుచున్నారని విని చుట్టుపట్ల దేశములనుండియు, దూర ప్రాంతముల నుండియు కూడ లెక్కలేనంతమంది వచ్చి పడుచుండిరి. దుస్థితి హెచ్చిపోయినది. ఉత్తరసర్కారు జిల్లాలనుండి వచ్చిన అసంఖ్యాక జనమును మరల వారివారి గ్రామములకు పంపుట కష్టసాధ్యమై పోయెను. సర్కారు వారు అపార ధనమును వెచ్చించి గంజి దొడ్లను స్థాపించి అన్నప్రదానము చేయుచు, గంజి పోయుచు జనుల ప్రాణములను కాపాడుటకు ప్రయత్నించిరి. ప్రతి దినము వేయి, రెండువేల తూముల బియ్యము వండి పంచి పెట్టవలసి యుండెను. ఈ సత్కార్యము జాగ్రత్తగ నిర్వహించుటకు సుప్రీముకోర్టులో ఇంటర్‌ప్రెటర్‌గా నుండిన శ్రీ ఏనుగుల వీరాస్వామయ్య మొదలైనవారు చాల కష్టపడి పనిచేసిరి.

1865-66 లలో కూడ అనావృష్టి దోషమువలన తూర్పు కోస్తాజిల్లాలలో కాటకము కలిగినది. ధరలు హెచ్చినవి. ప్రజలు ఆకలిబాధతో మాడిరి.

**ధాతునామ సంవత్సర కరవు :** 1876-78 ల మధ్య దక్షిణ భారతదేశము నంతటను తుడిచిపెట్టిన పెద్దకరవు వచ్చెను. ఇది రెండు లక్షల చ. మైళ్ళలో 3 కోట్ల 6 లక్షల ప్రజలను బాధించినది. నందననామ సంవత్సరపు కరవువలన బాధలు అనుభవించిన ప్రాంతముల వారికి గోరుచుట్టుపై రోకటి పోటుగ ఇది వచ్చిపడినది. కృష్ణానది మొదలు కన్యాకుమారి వరకుగల దక్షిణ దేశమంతట ఈ కరవుబాధ తీవ్రముగ నుండెను. ఆర్కాడు, సేలము, నెల్లూరు, రాయలసీమలో జిల్లాలయందలి దుస్థితి వర్ణనాతీతము. దీనికే 'ధాతు కర'వని పేరు. ఈ కరవు కాలములో ఇతర జిల్లాల నుండి చాల కుటుంబములు కృష్ణా, గోదావరి డెల్టాప్రాంతములకు వచ్చిరి. అప్పుడు వచ్చిన హైదరాబాదు జనులు, తూర్పు జనము ఇప్పటికిని ఇక్కడ ఉన్నారు.

1850 నాటికి గోదావరికిని, 1854 నాటికి కృష్ణాకిను ఆనకట్టలు నిర్మింపబడినందువల్ల ఈ రెండు డెల్టాలును పాడిపంటలతో తులతూగ సాగినవి. 1876 లో దేశము నందలి ఘోరమైన కరవు వచ్చినప్పుడు ఈ డెల్టాలలో ధాన్యము పుష్కలముగనే ఉండెను. అందువల్ల ఇక్కడి ధాన్యమును ఇతర ప్రాంతములకు ఎగుమతి చేయుటవలన ధాన్యమునకు, బియ్యమునకు ఇక్కడ గిరాకీ కలిగినది. ఇక్కడివారు దానినే కరవుగ నెంచిరి.

'ధాతు, ఈశ్వర' సంవత్సరములలో వచ్చిన కాటకములో రూపాయకు పది మానికల బియ్యము అమ్ముచుండిరట. అప్పటి కదే పెద్ద కరవు. కాలము బాగుండిన రూపాయకు ఆరు కుంచముల బియ్యము నిచ్చు ధర్మ కాలమది. పంటలు విస్తరించి పండినచో ఎక్కడి ధాన్యము అక్కడనే ముక్కిపోవుచుండిన దినములవి. ఇప్పుడు రూపాయకు 2 శేర్ల బియ్యము అమ్ముచుండగా ఇది ఒక కరవని మన మను కొనుచున్నాము" అని కీ. శే. శతావధాని చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి వ్రాసిరి (1948).

1876-78 లమధ్య ఇంగ్లీషు ప్రభుత్వమువారు కరవు నివారణకొరకు ప్రయత్నించుచుండగా దేశములో ఆహార పదార్థములే కరవైనవి. ఆ సమయమున ఐరోపా వర్తకులు బర్మానుండి, బెంగాలు నుండి, ఇంక తూర్పు దేశముల నుండి బియ్యమును దిగుమతిచేసి ప్రజలకు మహోపకారము చేసిరి. ఈ సరకును తెచ్చుటలో రైళ్ళు చాల ఉపకరించెను. 18 నెలలలో మొత్తము 7 లక్షల టన్నుల ధాన్యము దిగుమతి అయ్యెను. ఈ కరవులో ఎంతమంది మరణించిరో సరియైన లెక్కలు లేవు. ప్రతి కరవులోను ఈ లోపము కనబడుచున్నది. మొత్తముమీద నలుబది లక్షల మంది చనిపోయిరని అంచనా వేయబడినది. కొన్ని కొన్ని ప్రాంతములలో జనాభాలో సగము అదృశ్యమై పోయినది. ఈ కరవు నివారణ కొరకు సర్కారువారు రెండేండ్లలో 6 కోట్ల 24 లక్షల 50 వేల రూ॥ పైగా ధనమును వెచ్చించిరి. శిస్తు వసూలుగాక ఒక కోటి 91 లక్షల రూపాయలు నష్టమయ్యెను, 8 లక్షల 20 వేల పౌను*లు ఇంగ్లీషుప్రజలు చందాలువేసి క్షామ నివారణ నిధికి పంపిరి. ఈ మొత్తము స్థానిక క్షామ నివారణ సంఘముల ద్వారా విత్తనములు, పశువులు, పరికరములు కొనుటకును, దీన జనమునకు సహాయము చేయుటకును వినియోగింప బడెను.

క్రీ. శ. 1848-55 మధ్య ఇంగ్లీషువారు గోదావరి, కృష్ణా నదులకు ఆనకట్టలు నిర్మించు వరకు క్రొత్త నీటి వనరులేవియు ఏర్పాటు చేయలేదు. ఆనకట్టు నిర్మించినను తక్కిన చోట్ల కాలువలను అభివృద్ధి చేయుట కన్న రైలుమార్గమును విస్తరింప జేయుటయేవారు ముఖ్యముగ నెంచినందున దేశములోని పాడిపంటలు అభివృద్ధి కాలేదు. ధాన్యము నిలువ జేయుటకు క్రొత్త కట్టుబాటులు చేయలేదు. క్షామము వచ్చినప్పుడు కూడ ప్రజలకు సహాయము చేయు పద్ధతులు క్రమబద్ధముగ చేయలేదు. దేశములోపలి భాగములకు అనగా రాయలసీమ మున్నగు ప్రాంతము

* ఒక పౌను విలువ సుమారు 13 రూపాయలు.

లకు అందువలన ఆ దుర్గతి పట్టినది. డెల్టాలు మాత్రము బాగుపడినవి. ఇంగ్లీషువారు పన్నులను రొక్క రూపముగ వసూలు చేయు పద్ధతిని ప్రారంభించి ధాన్యమును నిలువ చేయు అవసరమును, అవకాశమును లేకుండ చేయుట వలన కరవులకు ప్రోద్బలము కలిగించినవారైరి. ఇంగ్లీషు పరిపాలనలో భూమి పన్నును, నీటి పన్నును ఏకము చేసి నందువలన నీటివనరులు మరమ్మతులు లేక శికస్తుపడి కరవుల బాధ హెచ్చినదని గోదావరి ఆనకట్టను నిర్మించిన సర్ ఆర్థర్ కాటన్ వ్రాసిరి. బ్రిటిషు ప్రభుత్వ కాలమున మొత్తము పంటలో మూడవ వంతు విలువను పన్నుగ విధించుట వలన రైతులకు వ్యవసాయపు ఖర్చులు పోను మిగులునది లేకపోవుచున్నదని, అందువలన వారు దరిద్రులై కరవులలో తట్టుకొనలేక మరణించుచున్నారని శ్రీ రమేశచంద్రదత్తు వ్రాసిరి.

క్రీ. శ. 1876-78 లో వచ్చిన కరవులో మద్రాసు, మైసూరు, హైదరాబాదు, బొంబాయి రాష్ట్రములు రెండేండ్లు కరవులో మునిగినవి. తరువాత ఈ కరవు మధ్య పరగణాలకు (నేటి మధ్యప్రదేశ్), సంయుక్త పరగణాలకు (నేటి ఉత్తర ప్రదేశ్)ను, పంజాబునకును కూడ వ్యాపించినది. క్షామ బాధితుల సహాయము నిమిత్తము సర్కారువారు ఎనిమిదిన్నర కోట్ల రూపాయలు ఖర్చు పెట్టిరి. ఈ కరవుల అనుభవము వలన క్షామ నివారణలోని కష్ట సుఖములు, ధన వ్యయములో లోపములు మున్నగునవి తెలియ వచ్చినవి. దీనిని గూర్చి విచారించుటకు ప్రభుత్వమువారు ఒక విచారణ సంఘమును ఏర్పరచి దాని సూచనల ననుసరించి క్షామ నివారణ స్మృతి (famine code) నొక దానిని శాసించిరి. తరువాత ప్రభుత్వము వారు క్షామ నివారణకు ఏర్పాటును బందోబస్తు చేసిరి. వర్షపాతమును గూర్చియు, వాతవరణమును గూర్చియు ఎప్పటికప్పుడు సమాచారములను సేకరించియు, అవసరమునుబట్టి క్షామ నివారణ కొరకు చేయించ దగిన పనులను ముందుగనే నిర్ణయించి యుంచుకొనియు అందుకు వలసిన పరికరములను జాగ్రత్త చేసి యుంచియు అనావృష్టి కలుగగనే క్షామ నివారణ కొరకు సంఘములను ఏర్పాటు చేసియు, శిస్తుల రెమిషనును, వ్యవసాయపు ఋణములను జారీ చేసియు, క్షామ నివారణకు మచ్చు పనులను ప్రారంభించియు చురుకుగ పని చేయ ప్రారంభించుచు వచ్చిరి.

మరల వర్షములు కురియగనే ప్రభుత్వమువారు పనులు చేయు కూలి కేంద్రములనుండి వ్యవసాయపు పనుల నిమిత్తము జనులను వారి వారి గ్రామములకు పంపి చిన్న పనులు చేయించియు, కర్షకులకు వ్యవసాయము సాగు పనుల నిమిత్తము పరికరములను, పశువులను, విత్తనములను కొనుటకు ఋణములను ఇచ్చియు క్షామ నివారణ కేంద్రములను మూసి వేయుచుండిరి. ముందు జాగ్రత్త కొరకు క్షామ నివారణ నిధిని ఏర్పాటు చేయుట అవసరమని గ్రహించి దేశాదాయమునుండి ప్రతి సాలున ఒకటిన్నర కోట్ల రూపాయలు క్షామ నివారణ నిధిక్రింద ప్రత్యేకించుట ప్రారంభించిరి. పైన చెప్పిన విధముగ తగు జాగ్రత్త తీసికొనుట వలన, అక్కడక్కడ అతివృష్టి అనావృష్టి దోషములచే ప్రజలు బాధపడినను, దేశము మొత్తములో క్రీ.శ. 1943 వరకును ఘోరమైన క్షామము కలుగలేదు. ప్రపంచ యుద్ధ (1939-45) పరిస్థితులలో ధరలు హెచ్చినందు వలనను, వర్షములు లేక పంటలు క్షీణించినందునను, బర్మానుండి బియ్యము దిగుమతి ఆగి పోయినందునను, 1943 లో బెంగాలు, ఒరిస్సా, రాష్ట్రములోను, రాయలసీమలోను తీవ్రమైన క్షామము వచ్చినది. 1943 లో బెంగాలులో వచ్చిన కరవులో ప్రజలు పడిన బాధలను గూర్చి కొంత వరకైనను పత్రికలలో ప్రకటితములైనవిగాని, రాయలసీమలోని ప్రజలు పడిన బాధలను గూర్చిన వివరములు లోకమునకు తెలియు అవకాశమే లేక పోయినది.

ఈ దేశమున వివిధ కాలములలో వచ్చిన అన్నికరవులను గూర్చిన వివరములు ప్రకటితములు కాకపోయినను నందన, ధాతు నామ సంవత్సరము మొదలైన తీవ్రమైన కాటకములలోని పరిస్థితులే తక్కిన అన్నికరవులలోను ఉండియున్నవనుటకు సందేహములేదు. అధికారులు ప్రకటించిన మరణముల లెక్కలలోగూడ ఆకలి బాధవలన చనిపోయినట్లు వ్రాయుట అరుదు. సర్వసాధారణముగ ఇతర కారణమేదో వ్రాయుచుందురు. కరవులలోని మరణముల లెక్కలు అప్పటికిని ఇప్పటికిని సరిగా ప్రకటింపబడి యుండలేదు. అర్థశాస్త్రజ్ఞులు మాత్రము ఊహించి తమ గ్రంథములందు వివరించిరి. ఆయా కరవులలో ప్రభుత్వమునకు కలిగిన నష్టములను గూర్చి ప్రభుత్వపు నివేదికలలోల వివరములు చూచినచో ఆ కరవులలో ప్రజలు పడిన బాధలును, జనక్షయమును తెలిసికొన వీలు కలుగుచున్నది. ది. వెం. శి.



# రవాణా సౌకర్యములు

## రైల్వేలు

దక్షిణ ఇండియా రైల్వే కంపెనీ, మద్రాసు రైల్వే కంపెనీ మొట్టమొదట తెలుగు దేశములో రైలుమార్గము ను నిర్మించిరి. తూర్పు సముద్రతీరము గుండ మద్రాసు నుండి కలకత్తాకు పోవు రైలుమార్గము అప్పటి కింకను నిర్మింపబడి యుండలేదు. దక్షిణ ఇండియా రైల్వే కంపెనీ వారు కాట్పాడి నుండి నెల్లూరు వరకును - గూడూరు, రేణిగుంట, చిత్తూరుల గుండ ఒక రైలు మార్గమును నిర్మించిరి. దీనికి జనసామాన్యములో "కర్ణాటకపు రైలు" అను పేరు వాడుక యందుండెను. మద్రాసు, రేణిగుంట, కడప, గుత్తి, ఆదోని మీదుగ రాయచూరు వరకు పోవురైలు మార్గము మద్రాసు రైల్వే కంపెనీ వారిచే నిర్మింపబడినది. తరువాత 1900 ప్రాంతమున పై కంపెనీవారు తూర్పు తీరమున మద్రాసు నుండి వాల్తేరు నకు పోవు రైలుమార్గము వేసిరి. అప్పుడు ఆ కంపెనీ వారు దక్షిణ ఇండియా రైల్వే కంపెనీవారి దగ్గర నుండి నెల్లూరు, గూడూరుల మధ్యనుండిన మార్గమును తీసికొనిరి. 1910 ప్రాంతమున మద్రాసు రైల్వే కంపెనీ వారికే ఒప్పందములు ముగిసెను. అప్పుడు ఆ రైల్వేకు సంబంధించిన శాఖలనన్నింటిని దక్షిణ మహారాష్ట్ర రైల్వే వారు పుచ్చుకొని "మద్రాసు దక్షిణ మహారాష్ట్ర రైల్వే" అను నూతన నామకరణము గావించిరి.

ఈ రీతిని ప్రస్తుతము అతి ప్రధానముగ పరిగణింపబడు తూర్పుకోస్తా రైలుమార్గము మాత్రము పశ్చిమాంధ్ర మునకు పై సౌకర్యములు కల్గిన ఎన్నో ఏళ్ళకుగాని ఏర్పడి యుండలేదు. ఆంధ్ర దేశములో తొలి రైలుమార్గము పడిన ముప్పది సంవత్సరములకు పిమ్మటనే ఈ కోస్తా మార్గము లకు పునాదులేర్పడినవి. ఇవియు తిరిగి మద్రాసు, రైల్వే కంపెనీవారి ప్రాచ్యోత్తర ప్రధాన మార్గ విస్తరణలో ఒక భాగముగ రూపొందినది. 1899 లో ఎన్నూరు నుండి గూడూరు వరకును, 1899 లో గూడూరునుండి బ్రాడ్ గేజ్‌లో నెల్లూరు వరకును,అటనుండి కృష్ణకాలువ వరకును, 1897 లో కృష్ణకాలువనుండి విజయవాడ వరకును ఇనుప దారి వేయబడినది. గూడూరు నుండి నెల్లూరు వరకు అంతకుముందే పది సంవత్సరములుగా ఒక మీటర్ గేజ్ మార్గము యుండెను. అది 1899 లో బ్రాడ్ గేజ్‌కి మార్చ బడినది. 1893 లోనే విజయవాడ నుండి కొవ్వూరు వరకును, రాజమండ్రి నుండి వాల్తేరు వరకును కూడ రైల్వే సౌకర్యములుండెను. ప్రధానమైన రైలుమార్గము మద్రాసు నుండి విజయవాడ వరకు విస్తృతి జెందక పూర్వమే ఈమార్గములు పడినవి. దీని వలన ఒక విషయము గ్రహింపనగును. క్రమముగ మద్రాసు నుండి వాల్తేరువరకు లేదా కలకత్తా వరకు తిన్నగా పోవు ప్రధానమైన రైలు మార్గము పడియుండవలసినను, అట్టి మార్గమే ఆర్థికముగా ఉపయుక్తమైనను, వేరు వేరు ప్రాంతములందలి అవసర ముల మూలముగ కొన్ని కొన్ని రైల్వే సౌకర్యములు ప్రధాన మార్గముల క్రమ విస్తృతికి పూర్వమే ఏర్పడినవి.

ఆంధ్ర దేశపు కోస్తా జిల్లాలలోని వ్యాపారాధిక్యమే ఇందులకు తార్కాణము. పైని పేర్కొనిన రైల్వే విస్తరణ క్రమములో రైల్వే సౌకర్యములు కొవ్వూరు వరకు వచ్చి ఆగినట్లును, తిరిగి రాజమండ్రి నుండి వాల్తేరు వరకు సాగినట్లును గోచరించును. ఈ విధముగా ఏడు సంవత్సరములు గడచినవి. గోదావరినది పైని వంతెన కట్టిన పిమ్మట కొవ్వూరు, రాజమండ్రి మధ్య 1900 లో రైల్వే సౌకర్యములు సమకూరెను. ఇవి లేనంత కాలము సరాసరి రవాణా వ్యాపారము కుంటుపడి యుండెను. దీనికి కారణము సులభగ్రాహ్యమే. ఈ రెండు స్థలముల మధ్య నదిని దాటించవలసిన అవసరము, బాధ కలదు గదా! గోదావరి వంతెన కట్టిన పిమ్మట కోస్తా వ్యాపార మెంతో ఎక్కువగా వృద్ధియయ్యెననుటకు రైల్వే ఆదా యపు లెక్కలే సాక్షి.

దాదాపు ఈ కాలముననే వాల్తేరు నుండి ఉత్తరదిశగా కూడ రైలుమార్గము విస్తరించు చుండెను. కలకత్తా నుండి దిగువకు వచ్చు మార్గము 1893-95ల నాటికి రంభానుండి బరంపురము, పలాసా, నౌపడా, విజయనగరముల మీదుగా వాల్తేరు వరకు వచ్చినది. ఈ విధముగా 1900 నాటికి తూర్పు కోస్తాలో ఒక సమగ్ర మార్గమేర్పడుటే గాక, మిగత దూర ప్రాంతములతో సరాసరి సరకు రవాణా చేయుటకు తగిన సౌకర్య యోగ్యతయు ప్రాప్తించినది. ఆంధ్ర దేశమునకు అతి ముఖ్యమైన మరొక సరాసరి రైలుమార్గమున్నది. అది మీటర్ గేజ్‌లో నిర్మింపబడినది.

ఇది రాయలసీమ జిల్లాల మీదుగా పశ్చిమముగా పోవును. హొస్పేట - బళ్ళారుల మధ్య 1884 లో ప్రారంభమై 1890 నాటికి గుంతకల్లు, నంద్యాల, కంబము, రేవల్లుల మీదుగా విజయవాడ వరకు ఈ మార్గము విస్తరించెను. విజయవాడ నుండి తూర్పున మచిలీపట్టణము వరకు 1908 లో రైల్వే సౌకర్యములు కలిగెను. దీనితో ఆంధ్ర దేశపు మరొక రేవు పట్టణమునకు దూర ప్రాంతములతో వ్యాపారము జరుపుటకు అవకాశము కల్గెను. ఈ సరాసరి మార్గము మీద వ్యాపారపు సరకు కొంత తూర్పునకు పోయి మచిలీపట్టణము నుండి ఎగుమతి యగును. మరికొంత పశ్చిమముగా పోయి మార్మగోవా నుండి ఎగుమతి యగును. రానురాను మార్మగోవాయే అధిక ప్రాముఖ్యములోనికి వచ్చినది.

మచిలీపట్టణము రేవుపట్టణమునుండి మూడు మైళ్ళదూరములో నుండుటచేత ఇచ్చటికి చేరు సరకును సముద్రము వద్దకు తీసికొని వెళ్ళుట కష్టముగా నుండెను. రోడ్డుల ద్వారానో కాలువలద్వారానో సమీపముననున్న వివిధ ప్రదేశముల సరకు మచిలీపట్టణము చేరుచుండెను. కాని అచటి నుండి దానిని సరియైన మార్గము లేనందువలన చెమ్మ నేల లోను, ఇసుకలోను రేవు కడకు జేర్చుట అసాధ్యముగా నుండెను. ఈ సమస్యను గుర్తించియే కాబోలు విజయవాడ-మచిలీపట్టణము రైలుమార్గము పడుటకు సుమారు పది సంవత్సరములకు పూర్వమే పట్టణమునుండి రేవుకు రైలు మార్గము వేయబడినది. ఈ విషయముల వలన భారత దేశములోని వ్యాపారపుసరకు ఎగుమతికి వీలగునట్లు తొలు దొల్తనే రవాణా సౌకర్యము కలిగింప బడుచుండెనని విస్పష్టమగుచున్నది. ఈ సరకు ఎగుమతి విదేశములకే అయి యుండక పోవచ్చును. ఈ కాలములో మచిలీపట్టణము వంటి రేవులనుండి ముఖ్యముగా భారత దేశములోని ఇతరములైన రేవు పట్టణములకే సరకు ఎగుమతి యగుచుండెడిది. అయినను రైల్వే సౌకర్యములు సరాసరిగాను ఒక క్రమపద్ధతిలోను లేని మీటర్ గేజ్, బ్రాడ్ గేజ్ భేదము అధికముగా ఉండిన పరిస్థితులలో సముద్రతీర యాన సౌకర్యముల కెంతయో అవసరము, ప్రాముఖ్యము కలదు. ఈ కారణము వలననే రేవు పట్టణములకు రైలు మార్గములు కొన్ని ముందుగా వేయబడినవి.

రాయలసీమలో మిగిలిన రైలుమార్గములుకూడ ముఖ్యముగా మీటర్ గేజ్‌లోనే నిర్మించబడినవి. గుంతకల్లు నుండి మైసూరు సరిహద్దువరకు పోవు రైలుమార్గము 1892-93 లో ఉపయోగమునకు వచ్చినది. కాట్పాడి - ధర్మవరములకు రైలుమార్గములు 1891 - 92 లోను, పాకాల, తిరుపతి, గూడూరులకు 1887 - 91 లోను, హొస్పేట, కొత్తూరు శాఖామార్గము ఇరువదియవ శతాబ్దపు తొలి సంవత్సరము లోను పడి వాడుకలోనికి వచ్చినవి.

ఇవి సరాసరి రైలుమార్గములు, అనగా దేశములో ఒక మూలనుండి మరొక మూలకు క్రమ పద్ధతిలో పడినవి. ఒక చివర నుండి మరొక చివరవరకు రైళ్ళు సరాసరి పోవును. ప్రయాణికులు మధ్య మధ్య దిగి రైలు మారవలసిన అవసరము ఉండదు. కాని ఈ క్రమ పద్ధతికి బారెడు దూర మటు నిటు నుండు ప్రాంతములు, పురములు అనంతము. ఉదాహరణకు, తెనాలినుండి గుంటూరు వరకు ప్రధాన మార్గయోగ్యత ప్రాప్తించనే లేదు. తెనాలి కన్న బహుళః గుంటూరులోనే వ్యాపార మెక్కువ అయినను గుంటూరు సరాసరి మీటర్ గేజ్ మార్గములో పడిపోయి, బ్రాడ్ గేజ్ ప్రధాన మార్గమునకు దూరమైనది. అందుచేత ఈ రెండు నగరములను కలుపు బ్రాంచి రైలు మార్గమొకటి ఇటీవలనే అనగా 1916 లో నిర్మితమైనది. ఆ సంవత్సరముననే ఈ రైలుమార్గము తెనాలినుండి రేపల్లె వరకు 22 మైళ్ళు పొడిగింపబడినది. నిజమునకు దీనిని గుంటూరు జిల్లాబోర్డువారు వేయించిరి. మద్రాసు, దక్షిణ మహారాష్ట్ర కంపెనీ వారి దృష్టిలో ఇదొక "అతుకు" గా ఉండవచ్చును గాని, ఆ జిల్లాకిది ప్రాణము వంటిది. పైగా ఇటీవలి వరకు, బహుళః నేటికిని, రేపల్లెకు అన్ని ఋతువులలోను నిశ్చయముగా భద్రముగా పోవుట కొక్క మంచి రోడ్డు కూడ లేదు. అట్టిచో ఇట్టి రైల్వే అవసర మెట్టిదో ఊహించు కొనవచ్చును. ఇట్లే మరి కొన్ని బ్రాంచి రైలుమార్గములు క్రమ క్రమముగా నిర్మితమైనవి. 1930 లో గుంటూరు నుండి మాచెర్ల కొక మార్గము వేయబడెను. గుడివాడ - భీమవరముల మధ్య 1928 లోను, నిడదవోలు - నరసాపురముల మధ్య, కాకినాడ సోమగుండముల మధ్య 1929 లోను, రైలుమార్గములువేయబడినవి.

ఇట్లే కోలారు బంగారు గనుల ఉపయోగార్థము ప్రత్యేకముగా బంగారుపేట నుండి మరికుప్పం వరకు పదిమైళ్ళ ఇనుపదారి యొకట 1894 లో వేయబడెను. తెలుగు దేశపు రైల్వే విస్తరణములో పేర్కొనదగిన విషయ మింకొకటి ఉన్నది. విశాఖ పట్టణము రేవు ప్రపంచ వ్యాపారమునకు తెరువబడినప్పటి నుండి ఇచ్చట నుంచి ఎగుమతి కావలసిన వరకు ముఖ్యముగా మధ్య ప్రదేశ్ నుండి రావలసియున్నది. అచ్చటి మాంగనీసును ఈ రేవు పట్టణమునకు కొని వచ్చుటకు రైలు సౌకర్యము లేర్పడినగాని దీనికి అభివృద్ధి కలుగదు. ఈ సందర్భములో పేర్కొన దగిన అదృష్టమొకటి కల్గినది. విశాఖ పట్టణపు రేవు పరిపాలన బెంగాల్

నాగపూరు రైల్వే కంపెనీ వారి కిచ్చినారు. అప్పటికి ఈ కంపెనీ వారి రైలుమార్గములు కలకత్తా నుండి విజయనగరము మీదుగా విశాఖపట్టణము వరకును; నాగపూరు నుండి రాయపూరు వరకును గలవు. ఇక వారి రైలుమార్గము రాయపూరు నుండి విజయనగరము మీదుగా విశాఖపట్టణము వరకును వచ్చుటే కావలసినది. 1931 లో పార్వతీపురమునుండి విజయనగరమునకు రైలు మార్గము వేయుట పూర్తి అయినది. అప్పటికే విజయనగరము - బొబ్బిలి; బొబ్బిలి - పార్వతీపురమునకు రైల్వే సౌకర్యములు కలిగినవి. ఈ విధముగా విశాఖపట్టణపు రేవునకు కావలసిన రైల్వే ఆనుకూల్యము లన్నియు ఏర్పడ జొచ్చినవి.

తెలంగాణాలో తొలుదొల్త 1874 లో ప్రధానమైన బ్రాడ్ గేజ్ రైలుమార్గము పడినది. వాడీ నుండి సికింద్రాబాదు, వరంగల్లు, దోర్నకల్లుల మీదుగా సమగ్ర మార్గము వేయుపని 1889 కే పూర్తియైనది. కాజీపేట నుండి బల్లార్షా వరకు మాత్రము రైల్వే నిర్మాణము 1924 వరకు పూర్తి కానేలేదు. తెలంగాణా భాగములోగల మిగిలిన రైలు మార్గము లన్నియు మీటర్ గేజ్‌లోనే ఉన్నవి. ఈ మార్గముల నిర్మాణము కూడ ఇరువదియవ శతాబ్దములోనే ముఖ్యముగా 1916 తరువాతనే ప్రారంభమైనది. తెలంగాణాలో మొత్తముమీద ప్రధానమైన రైలు మార్గములు రెండు కలవు. వీనికి అక్కడక్కడ కొన్ని శాఖా మార్గములు క్రమ క్రమముగా నిర్మితములైనవి. ప్రధాన మార్గములలో ఒకటి బ్రాడ్ గేజ్‌లో క్రిందటి శతాబ్దములోనే వేయబడినది. రెండవ మార్గము, శాఖా మార్గము మాత్రము ఆర్థికావసరములు హెచ్చిన కొలది ఈ శతాబ్దములోనే నిర్మించబడినవి. తెలంగాణా వంటి విస్తీర్ణము గల ప్రదేశమున కిపుడున్న రైలుమార్గములు చాల తక్కువ.

పైన వివరించిన రైల్వే విస్తరణ చరిత్ర నుండి ప్రధానముగా గ్రహింపవలసిన సూక్ష్మాంశములు కొన్ని యున్నవి. ఆంధ్ర ప్రదేశ్‌లో ప్రధాన రైలుమార్గములు రెండున్నను మిగిలిన వన్నియు అతుకులుగాను తునకలుగాను ఉన్నవి. ఇవి అప్పటప్పటి అవసరములను బట్టి రైలు మార్గములు నిర్మించిన పద్ధతికి ఫలితముగా పరిగణించవలెను. చారిత్రికముగా ఇట్లు చేయుట సహజమేయైనను ఆర్థికముగా ఇందువల్ల కొన్ని ఇబ్బందులు కలుగక తప్పదు. విశాఖపట్టణమునకు తప్ప మిగిలిన రేవు పట్టణములకు సమగ్రమైన రైలుమార్గ సౌకర్యములు తక్కువ. జిల్లా కేంద్రమైన కాకినాడ ప్రధాన మార్గము మీదనే లేదు. దానికి చుట్టు ప్రక్కల నున్న ప్రాంతముతో రైల్వే సౌకర్యములు "అతుకులబొంత" రీతి నున్నవి. మచిలీపట్టణమునకున్న రైల్వే సౌకర్యములు చాల స్వల్పముగా నున్నవి. కృష్ణా జిల్లాలోని దివి మొదలగు తాలూకాల నుండి వ్యాపారపు సరకు ఇచ్చటకు వచ్చుటకు రైల్వే సౌకర్య రూపమున అవకాశములు ఇంతవరకు లేవు. మచిలీపట్టణము రేపల్లె మధ్య రైలుమార్గమును అతుకు పెట్టినచో, "గ్రుడ్డిలో మెల్ల వలె" ఉండక తప్పదు.

ఆంధ్రప్రదేశ్‌లోని రైల్వేలు మీటర్, బ్రాడ్ గేజ్‌లలో నిర్మింపబడినవి. మీటర్ గేజ్ : 3′ 3⅜″, బ్రాడ్ గేజ్: 5′ 6″. ముఖ్యమైన రైలు మార్గములు అనగా సముద్రతీరమునను, రేవు పట్టణముల నుండియు నిర్మితములైనవి సాధారణముగా బ్రాడ్ గేజ్‌లో ఉన్నవి. ఆయా ప్రాంతముల వ్యాపారమునకు తోడ్పడునట్టి కాటక నివారణమునకు ఉపకరించునట్టి చిన్న చిన్న మార్గము లన్నియు మీటర్ గేజ్‌లోనే ఉన్నవి. ఇట్లుండుటకు మీటర్ గేజ్‌లో రైలుమార్గము నిర్మించుటకు ధనవ్యయము తక్కువగుట కూడ మరొక ముఖ్య కారణము. 'గేజ్' భేదము వలన తరచుగా వాగనుల లోని సామానులు దింపి వేరు వాగనులలో ఎక్కించవలసి యుండును. సామానులకు నష్టము కలుగవచ్చును, వాగనుల చలనగతి తగ్గును. మచిలీపట్టణము - విజయవాడ మీటర్ గేజ్ మార్గమును బ్రాడ్ గేజ్ మార్గముగా మార్చుటకు సుమారు 6 లక్షల రూపాయలగునని 1931 లో అంచన వేయబడెను. ఇప్పుడావ్యయ మింకను ఎక్కువ కావచ్చును. మీటర్ గేజ్‌ని బ్రాడ్ గేజ్‌గా మార్చుటకు ఇంత ధనము వెచ్చించుట యుక్తమా అన్నది సమస్య. ఆంధ్రప్రదేశ్ ఆంధ్రప్రాంతమందలి జిల్లాలలో బ్రాడ్ గేజ్, మీటర్ గేజ్ మార్గము లీ క్రింది విధముగా నున్నవి:

| జిల్లా | నేరో గేజ్ (మైళ్ళు) | మీటర్ గేజ్ (మైళ్ళు) | బ్రాడ్ గేజ్ (మైళ్ళు) |
|---|---|---|---|
| 1. అనంతపురము | — | 191½ | 61 |
| 2. చిత్తూరు | — | 165½ | 68¼ |
| 3. కడప | — | — | 121¼ |
| 4. తూర్పుగోదావరి | — | — | 79½ |
| 5. పశ్చిమ గోదావరి | — | 14 | 108 |
| 6. గుంటూరు | — | 162 | 137¼ |
| 7. కృష్ణా | — | 77¼ | 55 |
| 8. కర్నూలు | — | 160 | 5½ |
| 9. నెల్లూరు | — | 59½ | 132¾ |
| 10. విశాఖపట్టణము | — | — | 123 |
| 11. శ్రీకాకుళము | 21 | — | 147 |

ఉత్తరదేశముతోగాని ఇప్పటి మద్రాసు రాష్ట్రముతోగాని పోల్చి చూచినచో ఆంధ్ర ప్రదేశ్‌లోని రైల్వే

సౌకర్యములు అతి స్వల్పమని తోచును. రాయలసీమ జిల్లాలలో చాల ప్రదేశములకు రైల్వే స్పర్శయే లేదు. ఈ కారణమున అచ్చటి ఖనిజ సంపదను ఇతర స్థలములకు పంపుట కష్టసాధ్య మగును. అటులనే తూర్పుగోదావరి, విశాఖపట్టణము జిల్లాలయందలి మన్య ప్రాంతములలో గల సహజ సంపదను ఇతర ప్రదేశములకు గాని, రేవులకు గాని పంపవలెనన్న రైల్వేలు లేకపోవుట పెద్ద ఆటంక మనక తప్పదు.

### ఆంధ్రప్రదేశ్‌నందలి రైల్వే మండలములు

దక్షిణ రైల్వే (సదరన్ రైల్వే): ఆంధ్రప్రదేశ్‌లో దక్షిణ రైల్వే మండలాధీనమున నున్న మార్గము మొత్తము పొడవు 1,714·82 మైళ్ళు; అందు బ్రాడ్‌గేజ్ పొడవు 895·35 మైళ్ళు; మీటర్‌గేజ్ పొడవు 819·47 మైళ్ళు. ఆంధ్రప్రదేశ్‌లో తొట్టదొలుత ఈ మండల ప్రాంతమున వేయబడిన రైలు మార్గము 'అరక్కోణం - నగరి' మార్గము ; 1861 మార్చినాటికి తయారైన ఈ మార్గము పొడవు 17·27 మైళ్ళు. ఆంధ్రప్రదేశ్‌నందు ఈ మండల నిర్వహణ యందున్న స్టేషనులు 297, హాల్టులు (halts) 46, అవుట్ ఏజన్సీలు 11. మూడవ ప్రణాళిక కాలములో అమలు జరుగనున్న అభివృద్ధి పథకముల మూలమున ఆంధ్ర ప్రదేశ్‌నందు రైలు రవాణా సౌకర్యము ఇనుమ డించు ననుటలో సందియము లేదు.

ఆగ్నేయ రైల్వే (సౌత్ ఈస్టరన్ రైల్వే): ఆంధ్ర ప్రదేశ్‌లో ఈ మండలాధీనమున నున్న రైలుమార్గముల మొత్తము పొడవు 259·83 మైళ్ళు. అందు బ్రాడ్‌గేజ్ పొడవు 237·07 మైళ్ళు ; నేరోగేజ్ పొడవు 22·76 మైళ్ళు. బ్రాడ్‌గేజ్‌యందు సుర్లారోడ్డునుండి విశాఖపట్టణము, కొత్తపాలెములకును; విజయనగరము - రాయపూరు మార్గ మున విజయనగరమునుండి జెమడిపేట వరకును ; బొబ్బిలి నుండి సాలూరువరకును గల మార్గము ఈ మండలాధీన మున నున్నది. అటులనే నేరోగేజ్‌యందు నౌపడానుండి పాతపట్నంవరకు గల మార్గము ఈ మండలమునకు చెందినది.

ఆగ్నేయ రైల్వేమూలమున రాష్ట్రములో సుమారు 5,438 చ. మైళ్ళ భూభాగమునకు రైల్వే వసతులు గలుగు చున్నవి. అనగా శ్రీకాకుళము జిల్లా కంతటికిని, విశాఖపట్ట ణము జిల్లాలో భీమునిపట్టణము, విజయనగరము, శృంగ వరపుకోట, విశాఖపట్టణము తాలూకాలకు ఈ రైల్వే ఉపయోగపడుచున్నది. రాష్ట్రమందు ఈ రైల్వే నిర్వహణ యందు 42 స్టేషనులు, 15 హాల్టులు గలవు. ఈ మండలపు ప్రాంతమున వేయబడిన తొట్టదొలి రైలుమార్గము విజయ నగరము - వాల్తేరు మార్గము; 1893 జూలై 15 న తెరువ బడినఈ మార్గము పొడవు 41·35 మైళ్ళు. ఈ మార్గమును నిర్మించినది అప్పటి తూర్పు కోస్తా రైల్వే సంఘము (East Coast Railway). ఈ మండలమున జరుగుచున్న అభి వృద్ధిలో ముఖ్యముగ పేర్కొనదగినది విజయనగరము - గోపాలపట్టణము (వాల్తేరువద్ద) మార్గమున వేయబడు చున్న రెండవ మార్గము 33·6 మైళ్ళ పొడవు గల ఈ నూతన రెండవ మార్గమునందు పని చురుకుగ జరుగు చున్నది (1961).

కేంద్ర రైల్వే (సెంట్రల్ రైల్వే): ప్రస్తుతము ఆంధ్ర ప్రదేశ్‌లో ఈ మండలాధీనమున ఉన్న మొత్తము రైలు మార్గముల పొడవు 856·01 మైళ్ళు: అందు బ్రాడ్‌గేజ్ పొడవు 520·48 మైళ్ళు; మీటర్‌గేజ్ పొడవు 335·53 మైళ్ళు. ఈ మండలాధీనమున నున్న స్టేషనుల సంఖ్య 886; హాల్టులు 38. ఆంధ్రప్రదేశ్‌లో ఈ మండల ప్రాంతమున వేయబడిన మొదటి (1874) రైలు మార్గము నవందీ - సికిందరాబాదు మార్గము.

ఈ విధముగ ఆంధ్రప్రదేశ్‌నకు మూడు రైల్వే మండల ములు ప్రయాణ రవాణా వసతులను గల్గించుచున్నవి.

వే. వేం. రా.

## రోడ్లు

వ్యవసాయము, వాణిజ్యము, పరిశ్రమలు మున్నగు అన్ని రంగముల అభివృద్ధికి రోడ్లు అత్యవసరము. 1943 వరకును భారతదేశములోని రోడ్లు ఏ నిర్ణీత పథకమునకు గాని ప్రణాళికకుగాని చెందియుండలేదు. మొట్టమొదటి రోడ్డు రవాణా అభివృద్ధి ప్రణాళిక 1943 లో వేయ బడినది. దీనిని 'నాగపూర్ ప్రణాళిక' అందురు. ఈ ప్రణాళికయొక్క ముఖ్యోద్దేశములు : 1. బహుజన వాసము లగు గ్రామములు జిల్లారోడ్డుకు రెండుమైళ్ళ దూరము లోపునను, అల్ప జనవాసములగు గ్రామములు 5 మైళ్ళ దూరములోపునను ఉండవలయును; 2. ఐదువందల జనాభా గల ప్రతి గ్రామమునకు ఒక రోడ్డు యుండవలయును. ఇంచుమించు దేశములోని అన్ని రాష్ట్రములును ఈ యుద్దే శ్యములను సాధించిన వనియే చెప్పవలయును. ఆంధ్ర ప్రదేశ్‌లోని రోడ్ల అభివృద్ధి ప్రణాళికల ననుసరించి జరుగు చున్నది. ఆంధ్రప్రదేశ్ (1953-56) రోడ్ల అభివృద్ధి కార్య క్రమములకు వెచ్చించిన మొత్తము రు. 41.61 కోట్లు.

ఆవశ్యకత, ఉపయోగముల ననుసరించి రోడ్లు క్రింది విధముగ విభజింపబడినవి :

1. జాతీయ రహదారులు : రాజధానులను, రేవు పట్టణములను, విదేశ రహదారులను కలుపుచు దేశమునకు వెన్నెముక వలె నుండును ;

2. రాష్ట్రీయ రహదారులు : రాష్ట్రములోని ముఖ్య రహదారు లీ శ్రేణిక్రిందికి వచ్చును.

3. ముఖ్యజిల్లా రహదారులు, సామాన్యజిల్లా రహదారులు : ఉత్పత్తి ప్రాంతములను, విపణులను రాష్ట్రీయ రహదారులతోగాని లేదా రైల్వేలతోగాని కలుపును ;

4. గ్రామ రహదారులు : గ్రామీణుల కుపయోగపడుచు గ్రామముల నొక దానితో నొకటి కలుపును.

జాతీయ రహదారులను కేంద్రప్రభుత్వము నిర్వహించును. రాష్ట్రీయ రహదారులు, రాష్ట్ర ప్రభుత్వ అజమాయిషీ క్రింద నున్న ముఖ్య జిల్లా రహదారులు రాష్ట్ర ప్రభుత్వము నిర్వహించును. జిల్లా పరిషత్తులు, స్థానిక సంస్థలు మిగిలిన జిల్లా రహదారులను, గ్రామ రహదారులను నిర్వహించును.

మొదటి ప్రణాళికలో రోడ్ల అభివృద్ధి (1951-56): మొదటి పంచవర్ష ప్రణాళిక ఆరంభమునాటికి ఆంధ్ర, తెలంగానా ప్రాంతములలో మొత్తము 18,589 మైళ్ళ రోడ్లు కలవు. ప్రణాళిక పూర్తియైన (1956) నాటికి మొత్తము 20,238 మైళ్ళ రోడ్లు ఉండినవి.

జాతీయ రహదారుల నిమిత్తము ఈ ప్రణాళిక కాలములో ఆంధ్రలో ఖర్చు పెట్టబడినది 100 లక్షల రూపాయలు. మద్రాసు - కలకత్తా మార్గములో పెన్ననదిపై నెల్లూరు వద్దను, పంప నదిపై అన్నవరమువద్దను, చంపావతిపై సత్తవలసవద్దను, నెల్లివడ సరస్సు కడ్డముగ విజయనగరము - మధ్యప్రదేశ్ రోడ్డుపైనను వంతెనలను నిర్మించుటకును ; గుంటూరు జిల్లాలో కలకత్తా - మద్రాసు ట్రంకు రోడ్డు 20 మైళ్లు సిమెంటు కాంక్రీటు చేయుటకును, కోడేరు వంకపై 'కాస్‌వే' నిర్మించుటకును ఈ సొమ్ము ఖర్చు పెట్టబడినది.

రాష్ట్రప్రభుత్వము ఈ ప్రణాళిక కాలములో రాష్ట్రీయ రహదారుల నిమిత్తము రు. 228.75 లక్షలు వెచ్చించినది. ఈ కాలములో ఆంధ్రప్రాంతమున 705 మైళ్ళ రోడ్ల నిర్మాణము, 430 మైళ్ళ రోడ్లను కంకర చేయుట, 36 మైళ్ళు తారు వేయుట, 40 మైళ్ళు సిమెంటు చేయుట, 7 పెద్ద వంతెనలు, 20 చిన్న వంతెనలు, 10 కాస్‌వేలు నిర్మించుట జరిగినది. తెలంగానా ప్రాంతములకై మొదటి పంచవర్ష ప్రణాళిక కాలములో కేటాయింపబడిన రు. 99.97 లక్షలు 210 మైళ్ళరోడ్లు నిర్మించుటకును, ఇతర పనులకును ఖర్చు చేయబడినది.

ఆంధ్రప్రదేశ్‌లోని ఏజెన్సీ ప్రాంతముల ఆర్థికాభివృద్ధి నిమిత్తము 50% కేంద్రప్రభుత్వ సహాయముతో రాష్ట్ర ప్రభుత్వము సీతాపల్లినుండి అడ్డతీగల (తూ. గో. జిల్లా) వరకును, అనకంపాలెంనుండి జీలుగుమిల్లి (ప. గో. జిల్లా) వరకును రోడ్లు నిర్మించి విశాఖపట్టణము, అనంతగిరి, అరకుఘాట్ రోడ్డును అభివృద్ధి పరచినది.

రెండవ ప్రణాళికలో రోడ్ల అభివృద్ధి (1956-61) : రెండవ పంచవర్ష ప్రణాళిక ముగియునాటికి (1961) రాష్ట్రములో ఉన్నరోడ్ల మొత్తముపొడవు 21,944 మైళ్ళు. ఈ ప్రణాళిక కాలములో కేంద్రప్రభుత్వము జాతీయ రహదారుల నిమిత్తము ఆదిలో కేటాయించిన రు. 681.07 లక్షలను తదుపరి సవరించి రు. 363 లక్షలుగ మార్చినది. పూర్తియైన పనులలో చెప్పదగినవి: 1. తుంగభద్రనదిపై వంతెన; 2. కడప - కర్నూలు కాలువలపై వంతెన; 3. ఉప్పుటేరు (నెల్లూరుజిల్లా); 4. వేలేరు (తూ. గో. జిల్లా); 5. పాలేరులపై వంతెనల నిర్మాణము; 6. విజయవాడవద్ద కృష్ణా నదిపై నిర్మింపబడిన రెగ్యులేటర్ రోడ్డు వంతెన. ఇదిగాక కృష్ణా నదికి రండాపూర్‌వద్దను, గోదావరి పాయలైన గౌతమి, వశిష్టలకు వరుసగా ఆలమూరు (తూ. గో. జిల్లా), సిద్ధాంతము (ప. గో. జిల్లా) ల వద్ద వంతెనల నిర్మాణము చురుకుగ సాగుచున్నది (1961). ఈ నిర్మాణానంతరము రాష్ట్రమునందు రహదారి రాకపోకల కిదివరకుండిన అడ్డు తొలగిపోయి నూతన సౌకర్యములు కలుగును.

రెండవ పంచవర్ష ప్రణాళికలో రాష్ట్ర పథకములకు కేటాయించినది రు. 561.34 లక్షలు. ఇందు ఆంధ్ర ప్రాంతమునకు రు. 375.94 లక్షలు; తెలంగానా ప్రాంతమునకు రు. 185.40 లక్షలు. 1960-61 సంవత్సరమునకు పథకములనుకూడ చేర్చుకొన్న ఈ ప్రణాళికా కాలములో అభివృద్ధి ఈ క్రింది విధముగ నుండును:

| | | |
|---|---|---|
| నూతన నిర్మాణము | — | 342 మైళ్ళు |
| సిమెంటు కాంక్రీటు లేదా తారు వేయుట | — | 731 ,, |
| కంకర వేయుట | — | 47 ,, |

రెండవ పంచవర్ష ప్రణాళికా కాలములో స్థానికసంస్థల (జిల్లా పరిషత్తులు, పంచాయతీలు) యాజమాన్యమునుండి 1,054 మైళ్ళరోడ్ల పర్యవేక్షణను ప్రభుత్వము తీసికొనినది. మూడవ పంచవర్ష ప్రణాళిక కాలములో ఇంకను మిగిలిన 1,500 మైళ్ళ ముఖ్య జిల్లా రహదారులను ప్రభుత్వపు అజమాయిషీ క్రిందికితెచ్చి వాటిని ప్రభుత్వపు రహదారుల

స్థాయిలో నిర్వహించుచుటకు ఏర్పాటు చేయబడుచున్నది. ఆర్థిక ప్రాముఖ్యతగల రాష్ట్రి రహదారుల అభివృద్ధి పథకముక్రింద రు. 99.00 లక్షలు వెచ్చింపబడినది. కేంద్ర రహదారి నిధినుండి రెండవ పంచవర్ష ప్రణాళికలో వెచ్చించిన సొమ్ము రు. 165 లక్షలు. ఈ డబ్బుతో : 1. కర్నూలు - చిత్తూరు రోడ్డుపై చెన్నూరువద్ద పెన్నానదికి వంతెన నిర్మింపబడినది. 2. దోర్నకల్లునుండి శ్రీశైలమునకు రోడ్డు వేయబడినది; 3. మంజీరనదికి ఆళ్ళదుర్గ - మెటల్‌కుండ రోడ్డుపైనను, మెదకు - పాపన్నపేట ఆళ్ళదుర్గ రోడ్డుపైనను రెండు 'హై లెవెల్ కాస్‌వే'లు నిర్మింపబడినవి.

ఏజన్సీ ప్రాంతముల అభివృద్ధి నిమిత్తము కేటాయించబడిన రు. 108 లక్షలతో 254 మైళ్ళ రోడ్లనిర్మాణము జరుగుచున్నది. పంచదార ఫ్యాక్టరీల చుట్టునుండు రోడ్లనభివృద్ధి పరచి సిమెంటు కాంక్రీటు చేయు నిమిత్తము కేటాయించినది రు. 60 లక్షలు.

ప్రస్తుతము ఆంధ్రప్రదేశ్‌లో నున్న రోడ్లపొడవు 23,821 మైళ్ళు; అవి ఈ క్రింది విధముగ నున్నవి :

| | | మై. | ఫ. |
|---|---|---|---|
| 1. జాతీయ రహదారులు | — | 1,331 | 7 |
| 2. రాష్ట్రీయరహదారులు | — | 1,495 | 4 |
| 3. ముఖ్య జిల్లా రహదారులు | — | 10,325 | 6 |
| 4. సామాన్య జిల్లా రహదారులు | — | 3,467 | 5 |
| 5. గ్రామ రహదారులు | — | 7,200 | 2 |
| మొత్తము | | 23,821 | 0 |

ఈ మొత్తము రోడ్లను నిర్మాణరీతిని విభజించిన క్రింది విధముగ నుండును :

| | | | |
|---|---|---|---|
| 1. సిమెంటు కాంక్రీటు | — | 193 | 0 |
| 2. తారు రోడ్డులు | — | 4,746 | 5 |
| 3. కంకర రోడ్డులు | — | 11,086 | 5 |
| 4. ఇతరములు | — | 7,794 | 6 |
| మొత్తము | | 23,821 | 0 |

ఆంధ్రప్రదేశ్‌లో ప్రస్తుతము ప్రతి చ. మైలునకును 0.24 మై॥ రోడ్లున్నవి. విదేశములతోను, మద్రాసువంటి సరిహద్దు రాష్ట్రములతోను పోల్చి చూచినచో ఇది అత్యల్పము. సమీపమునగల మద్రాసు రాష్ట్రములోనే చ. మైలునకు 0.53 మై॥ వంతున కలదు. అనగా ఆంధ్రప్రదేశ్‌లో చ. మైలునకుగల రోడ్లు పొడవునకు రెండింతలు కలదు.

అఖిల భారత రహదారి అభివృద్ధి ప్రణాళిక : నాగపూర్ ప్రణాళిక ఆశయముల ననేక రాష్ట్రములు సాధించినందున అన్ని రాష్ట్రముల చీఫ్ ఇంజనీర్లు ఏకగ్రీవముగా 20 సంవత్సరముల అఖిలభారత రహదారి అభివృద్ధి ప్రణాళికను రూపొందించిరి. ఇది మూడవ ప్రణాళిక కాలములో ప్రారంభమగును. ఈ ప్రణాళిక కగుఖర్చు మొత్తము రు. 5,200 కోట్లు. అందు ఆంధ్రప్రదేశ్‌నకు కేటాయింప బడినది రు. 480 కోట్లు. ఈ ప్రణాళిక పూర్తియగు నాటికి వ్యావసాయికముగ అభివృద్ధి నొందిన ప్రాంతములలో ప్రతి గ్రామము రోడ్డునకు 1½ మైళ్ళ దూరములోను ముఖ్య రహదారిపై 4 మైళ్ళ దూరములోను ఉండును. మధ్యతరగతి ప్రాంతములలో ప్రతి గ్రామమునకు 3 మైళ్ళ లోపున రోడ్డును, 8 మైళ్ళ లోపున ముఖ్య రహదారియు ఉండును. అభివృద్ధి చెందని ప్రాంతములలో ప్రతి గ్రామము రోడ్డునకు 5 మైళ్ళ దూరము లోపునను, ముఖ్య రహదారికి, 12 మైళ్ళ లోపునను ఉండును. ఈ ప్రణాళిక అంత్యమునాటికి మొత్తము ఆంధ్ర ప్రదేశ్‌నందుండు రోడ్ల పొడవు 55,706 మైళ్ళు. అనగా చదరపు మైలునకు 0.55 మైళ్ళ పొడవు రోడ్లు ఉండును. సర్కారు జిల్లాల కంటె రాయలసీమ, తెలంగానా జిల్లాలందు రోడ్ల వసతి తక్కువ.

రోడ్డు రవాణా: నైజాము ప్రభుత్వము హైదరాబాదు నందలి రోడ్డు రవాణాను జాతీయము చేసినది (1932). ఇది ఆరంభమున నైజాముస్టేటు రైల్వే సంస్థచే నిర్వహింపబడుచుండెను. ప్రయాణీకులకు విరివిగా రవాణా సౌకర్యములు కలిగించుట ప్రజలనుండి వైయక్తిక సంస్థలకు అధిక ధనము లాభ రూపేణ రాకుండ జేయుట, రైల్వే రోడ్డు రవాణాల మధ్య పోటీని నియంత్రించి సామరస్యము చేకూర్చుట ఆనాటి జాతీయ రోడ్డు రవాణా మూలోద్దేశ్యములు. నేడు ఇది ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర రోడ్డు రవాణా సంస్థ (ఆంధ్రప్రదేశ్ స్టేట్ రోడ్ ట్రాన్స్‌పోర్టు కార్పొరేషన్) క్రింద నున్నది.

ఆరంభమున నైజాము స్టేట్ రైల్వే అధీనమున 27 బస్సు లుండినను క్రమక్రమముగ అభివృద్ధి నొందుచు ఆంధ్రప్రదేశ్ అవతరణ నాటికి 775 బస్సులవరకు ఇందు ఉండినవి. కాని హైదరాబాదు రాష్ట్రము విభజింపబడిన తర్వాత ఆంధ్రప్రదేశ్ వాటాకు 526 బస్సులు మాత్రము వచ్చినవి. ప్రక్క పుటలో పట్టిక హైదరాబాదు రాష్ట్రమునందును విభజనానంతరము ఆంధ్రప్రదేశ్‌నందు నుండిన జాతీయ రోడ్డురవాణా శాఖ వివరములను తెలియజేయుచున్నది.

| వివరములు | మొత్తము బస్సులు | ప్రయాణ మార్గముల సంఖ్య | మొ॥ దినసరి ప్రయాణ దూరము | దినసరి ప్రయాణీ కుల సంఖ్య |
|---|---|---|---|---|
| 1. హైదరాబాదు రాష్ట్రము 1-11-56 ముందు | 775 | 197 | 65,073 | 173,000 |
| 2. ఆంధ్రప్రదేశ్ (పునర్వ్యవస్థీకర ణానంతరము) | 526 | 125 | 48,598 | 149,000 |

విభజనానంతరము బొంబాయి, ఆంధ్రప్రదేశ్, మైసూరు రాష్ట్రములు చేసుకొన్న ఒప్పందము ప్రకారము ఆంధ్ర ప్రదేశ్ బస్సులు బొంబాయి, మైసూరు రాష్ట్రములలోనికి వరుసగ 34.6 మైళ్ళును, 80.5 మైళ్ళును చొచ్చుకొనిపోవు చున్నవి. అనగా దినసరి మొత్తము ప్రయాణ దూరము వరుసగ బొంబాయి, మైసూరు రాష్ట్రములలో 216.8 మైళ్ళు, 720 మైళ్ళు. దీనికి బదులుగా బొంబాయి, మైసూరు రాష్ట్రముల బస్సులు ఆంధ్రప్రదేశ్‌లోనికి వరుసగ 30 మైళ్ళు, 59.4 మైళ్ళు చొచ్చుకొని వచ్చును. దినసరి మొత్తము 194.6 మైళ్ళు, 385.9 మైళ్ళు ప్రయాణము చేయుచున్నవి.

విభజనానంతరము కూడ ఆంధ్రప్రదేశ్ స్టేట్ రోడ్డు రవాణా సంస్థ లాభములు ఇదివరకటి వలెనే ఉండినవి. 1957-58 లో ఈ సంఘము యొక్క లాభము రు. 41 లక్షలు. అనగా ఇంచుమించు ఇదివరకు వచ్చుచుండిన లాభమునకు సమాన మగుచున్నది.

జాతీయ రోడ్డు రవాణా క్రమక్రమముగ కృష్ణా, గుంటూరు జిల్లాలలోనే కాక రాష్ట్రమం దంతటను ప్రవేశ పెట్టుటకు సన్నాహములు జరుగుచున్నవి. కృష్ణా, గుంటూరు వంటి జిల్లాలలో రోడ్డు రవాణా జాతీయము గావించబడినది. నేడు భారతదేశ మందలి పెద్ద జాతీయ రోడ్డు రవాణా సంస్థ లన్నిటిలోను ఇది యొక్కటి యని చెప్ప వచ్చును. ఎం. బి. జి. శా.

# తంతి - తపాలా

పూర్వము భారత దేశమును హిందూ మహారాజులు పాలిస్తూ ఉండిన కాలములో ప్రభుత్వమునకు సంబంధించిన నిరూపములు (ఉత్తర్వులు) మొదలైనవి అధికారులకు పంపుటకును, వారియొద్దనుండి ప్రత్యుత్తరములు మొదలైనవి మహారాజుల కందుటకును, అనగా ఉత్తరములు ప్రత్యుత్తరములు మొదలైనవి ఒక చోటనుండి మరొక చోటికి పంపుటకును, తెప్పించుకొనుటకును తపాల విధానము ఏరీతిని ఉండెడిదో తెలియదు. కాని పూర్వపు హిందూ రాజ్యములో 'రాయసము' వారుండినట్లు పెక్కు శాసనముల వలన తెలియుచున్నది. రాయసము అన్నది ఒక ఉద్యోగమునకు పేరు. రాజ సమక్షమునగాని, తదితరులైన దండనాయకులు, దుర్గాధిపతులవంటి రాజకీయ ప్రధానోద్యోగులసమక్షమునగాని ఉండి వారు చెప్పిన జాబులు మొదలైనవి గంటముతో వ్రాయుపనికి 'రాయస' మనిపేరు. ఈ కార్యమును నిర్వహించు ఉద్యోగి రాయకాడని లేదా ఉత్త రాయస మని పేరు. ఈ ఉద్యోగి ఇప్పటి కార్యదర్శి వంటివాడు. ప్రభుత్వపుజాబులు వ్రాయు ఉద్యోగి రాయసకాడు. కొన్ని కుటుంబములలో ఈ యుద్యోగము వంశపారంపర్యముగా వస్తూ ఉండినందువల్ల అటువంటి కుటుంబములవారికి అది ఇంటిపేరైనది. ప్రతి దేశాధిపతి దగ్గర, ప్రతి దుర్గాధిపతి దగ్గర ఇట్టి రాయసము లుండేవారు. రాయసములు వ్రాసిన జాబులకు కూడ 'రాయసములు' అని వాడడము కద్దు.

భారత దేశములో మన పెద్దలు అంచె టపా అని, బేగీరావు టపా అని అంటూ ఉండగా చాలామంది వినియే ఉండవచ్చును. అంచె అనగా ఒక ఘట్టము; దాని మూలమున అది ఒక మకామునుంచి మరొక మకాముకు వెళ్ళవలసిన దూరమునకు గూడ పేరై వర్తించినది. అంచె గుర్రములు అనగా కొంత దూరము వరకు ఒక గుర్రమును, పిదప మరొక గుర్రమును-ఈ విధానమున మకాము మకాముకు ఒక్కొక్కటి చొప్పున మారుచు ఉండే గుర్రములకు అంచె గుర్రములు అని పేరు. ఈ విధంగానే ప్రతి మకామునకు మారి, వేరుగా వచ్చే బోయీలకు అంచె బోయీలని పేరు. అంచె టపా అనగా మకాము మకాముకు మనుష్యులు మారి తీసికొని వెళ్ళు టపా.

టపాను పూర్వము అంచెలమీద మనుష్యులు కాలినడకనయినా అంచె గుర్రాలమీద నయినా తీసుకు వెళ్ళేవారు. బేగీరావు టపా అనగా ఒంటె టపా; మనుష్యులు అంచె ఒంటెలమీద తీసికొని వెళ్ళే టపా. ఈ టపా పద్ధతులన్నీ ప్రభుత్వము తమ టపాను తమ క్రింది ఉద్యోగులకు చేర్చేటందుకును క్రింది ఉద్యోగి వర్గమువారి టపా తమకు చేర్చేటందుకును చేసికొన్న ఏర్పాటులు. ఇట్టి పద్ధతి హిందూ రాజన్యుల కాలములోను ఉండే ఉండవచ్చును. కాని ఉండేదని రుజువుజేసే లిఖిత పూర్వకమైన ఆధారములు లేవు. ఒక వేళ ఉండినప్పటికి ఈ పద్ధతి ప్రభుత్వము

వారి నిమిత్తము ఏర్పడినదే; కాని ప్రజల సౌకర్యము కోసము పుట్టినది కాదు.

ఒక గ్రామంలోనివారు దూరమున ఏ గ్రామములోగాని నగరములోగాని ఉన్న తమ బంధువుల కెవరికయినా లేఖలు పంపవలసి వచ్చిన కూలి ఇచ్చి ఆ గ్రామములోని మంగలిని ఈ పనిమీద పంపేవారు. మాన్యములు గల గ్రామ భటులలో మంగలి ఒకడుగను, మంగలికి సాధారణముగా గ్రామస్థు లిచ్చే వర్తనలు ఉంటవి గనుకను గ్రామస్థుల లేఖలను అతడు ఉచితముగనే తీసికొని పోయేవాడు. అతడు వెళ్ళే ఊరికే ఆ గ్రామములోని ఇతరులు ఎవరయినా ఉత్తరములు పంపవలసి ఉంటే వానినికూడా అతని చేతికే ఇచ్చి పంపేవారు. అతడా లేఖలను తీసికొని వెళ్ళి ఎవరి కివ్వవలసిన లేఖలు వారి కిచ్చేవాడు.

క్రీస్తు శకం పదునాలుగు, పదిహేను శతాబ్దాలలో మహమ్మదీయులు భారత దేశాన్ని పాలిస్తూ వచ్చినప్పటి నుంచి ఇట్టి తపాలాపద్ధతి ప్రభుత్వపరమైనదొకటి అమలులో ఉండినట్లు మహమ్మదీయ వృత్తాంతములవల్లా, విదేశ యాత్రికుల వృత్తాంతములవల్లా తెలుస్తున్నది.

క్రీస్తు శకము పదుమూడవ శతాబ్దములో అలాఉద్దీన్ ఖల్జీ దక్షిణ దేశ దండయాత్రలను గురించిన్ని, పదునాల్గవ శతాబ్దిలో ఉలుఘ్‌ఖాన్ అను పేరుతో యువరాజుగా ఉండిన మహమ్మదుబిన్‌తుఘ్లుకు తెలంగానాపై చేసిన దండయాత్రలను గురించిన్ని వ్రాసిన సందర్భములలో మహమ్మదీయ చరిత్రకారులు 'డాక్ చౌకీ' - తపాలా అందిస్తూవచ్చిన వార్తాహారులను గురించి చెపుతారు. దీని ననుసరించి చూస్తే పదమూడవ శతాబ్దములోనే ఢిల్లీ సుల్తాను లిట్టి వ్యవస్థను ఏర్పరచి సాగిస్తూ వచ్చినట్టు తెలుస్తుంది. తెలంగానామీద మొదటి పర్యాయము దండెత్తి వచ్చిన ఉలుఘ్‌ఖాను దండయాత్ర విఫలమగుటకు వరంగల్లునుంచి ఢిల్లీకి, ఢిల్లీనుండి వరంగల్లుకు డాక్-చౌకీ భగ్నమై వార్తలు సరిగా అందక పోవడమే కారణ మని మహమ్మదీయ చరిత్రకారులు వ్రాశారు. క్రీస్తుశకం పదునాల్గవ శతాబ్దములో భారత దేశం వచ్చిన ఇబన్ బతూతా అనే విదేశయాత్రికుడు అప్పుడు దేశాన్ని పరిపాలిస్తూ ఉండిన ఢిల్లీ సుల్తాను మహమ్మద్ బిన్ తుఘ్లుకు రాజ్యంలో కట్టు జాపైన తపాల విధానం వాడుకలో ఉండినట్లు తెలిపెను. ఈ సుల్తాను కాలములో టపా చేరవేసేటందుకు రెండు రకాల వార్తాహారులుండే వారు. వారిలో ఒకరు అంచె గుర్రపు స్వారులు; అంచె గుర్రాలమీద జాబులు తీసికొని వెళ్ళేవారు; రెండవ రకమువారు కాలినడకను వెళ్ళే అంచెలవారు. వీరు మైలు దూరమున కొక్కరు చొప్పున ఉండేవారు. మకాం చేరుకోగానే వీరు అక్కడ సిద్ధముగా ఉండే అంచెవానికి జాబుల పెట్టె ఇచ్చివేసేవారు. అక్కడినుండి దానిని అందుకొని తరువాతి అంచెవాడు పయనమై పోయేవాడు. ఈ విధముగా మూడేసి మకాములైన తరువాత నాలుగో మకామువద్ద అంచె గుర్రము ఉండేది. కాలినడకను పోయే అంచెవాడు ఒక చేతితో జాబుల పెట్టెను రెండవ చేతితో మొదట మువ్వలు కట్టిన రెండు మూరల కర్రను పట్టుకొని కర్ర ఊగించుకొంటూ పోయేవాడు.

గోల్కొండ రాజధానిగా తెలుగుదేశాన్ని పరిపాలించిన కుతుబుసాహీల కాలములో దూరస్థ ప్రదేశాలనుంచి దేశాధిపతులైన సుల్తానులు వార్తలు తెప్పించు కొనుటకు ఈ అంచె పద్ధతినే అవలంబిస్తూ వచ్చా రనుటకును ఆధారములున్నవి. విదేశముల మీదికి దండు వెళ్ళినప్పుడు, సైన్యాలు పరదుర్గములను జయించినప్పుడు దండయాత్రలోని విశేషములను, విజయవార్తలను ఎప్పటికప్పుడు అంచె పద్ధతిని తెలుసుకొంటూ వచ్చారని మహమ్మదీయ చరిత్ర వృత్తాంతములు చెప్పుతున్నవి.

ఇబ్రాహీం కుతుబుసాహి శాలివాహన శకం 1495 కు సరియైన క్రీస్తు శకం 1573 లో అప్పుడు గజపతులక్రింద ఉండిన రాజమహేంద్రవరాది దుర్గములను జయించుటకై మలికినేబు రఫతుఖానుకు సైన్యమునిచ్చి పంపించాడు. ఈ దుర్గములు వశమైనట్టు తనకు శీఘ్రముగా వార్త తెలిసేటందుకు గోలకొండ మొదలుకొని రాజమహేంద్రవరము పర్యంతమున్న రెండేసి క్రోసుల దూరమున కొక భేరి చొప్పున అంచెలు ఉంచినాడట. రాజమహేంద్ర దుర్గము పడిపోగానే భేరీలు మోగించుడని సుల్తాను ఆజ్ఞ. ఆ యంచె భేరీల శబ్దమునుబట్టి రాజమహేంద్రవరం కోట తురక దండనకు వశమయిన జాముపేళకే గోలకొండకా వర్తమానం తెలిసిందట.

ఒక్క దండయాత్రా విశేషములు, విజయవార్తలు తెలుసుకోడం మాత్రమే కాకుండా వైదికాచార నిరతులు, నిష్ఠాపరులు, భగవద్భక్తులు అయిన హిందూ రాజన్యులు తమ రాజ్యములోని మహాక్షేత్రము నందున్న తమ ఇష్ట దైవమునకు పూజార్థము పుష్పములు మొదలైనవాటిని అంచెలమీద పంపేవారనీ, తమ ఇలవేల్పయిన స్వామి మాధ్యాహ్నిక నివేదనము జరిగినట్లు అంచె నగారాలవల్ల వర్తమానము తెలుసుకొని కాని భోజనము చేసేవారు కారనీ కొందరిని గురించి మన పూర్వులు కథలు చెపుతారు. అందువల్ల ప్రజల విషయంలో కాకపోయినా రాజకీయవార్తల నిమిత్తమును, ప్రభుత్వపు జాబులు

మొదలైనవి బట్వాడా నిమిత్తమును, మత విషయిక విధుల నిర్వహణ సందర్భమునను ఇట్టి అంచె పద్ధతిని పూర్వం దేశాధిపతులు, జమీన్‌దార్లు వాడుకలో పెట్టినట్లు తెలుస్తున్నది.

ఢిల్లీ మొగలాయి పాదుషాల కాలంలోకూడా గొప్ప కట్టుబాటయిన అంచె వ్యవస్థ పైని వర్ణితమైనటువంటిది ఉండేదనీ, అంచెమార్గము (postal road) సునిర్దిష్టమైనది ఉండేదనీ తెలుస్తున్నది.

క్రీస్తు శకం 1672 లో మైసూరు చిక్క దేవరాయ వడయరు సింహాసన మెక్కిన తరువాత పైన చెప్పినటువంటి వ్యవస్థను ఏర్పాటు చేసినట్లున్ను, దీనిని హైదరాలీ ఇంకా కట్టుదిట్టము చేసినట్లున్ను కర్నల్ విల్క్స వ్రాశాడు. అయితే చిక్క దేవరాయ వడయర్లు, అతనిని మించి హైదరాలీ కూడ ఈ వ్యవస్థను ముఖ్యంగా వేగు నడపుట కుపయోగించి దేశంలో తమ అధికారం శాశ్వతముగా ఉండేటట్టు చేసికొనుటకు ఉపయోగించుకొన్నారట. ఈ వ్యవస్థలోని అంచెలవాళ్ళు గుఱ్ఱపుస్వారులు అందరు వేగులవాండ్రే. ఇందువల్ల ఈ వ్యవస్థ నిరంకుశత్వం ప్రబల జేయుటకు ఒక సాధనమైన దని కల్నల్ విల్క్స వ్రాసెను.

తెలుగుదేశంలో శ్రీకాకుళము, రాజమండ్రి, ఏలూరు, కొండపల్లి, గుంటూరులనే ఉత్తర సర్కారులు 1766 నాటికి ఈస్టిండియా కంపెనీవారికి దఖలు పడ్డవి. ఈ కంపెనీవారిని మన పూర్వులు కుంఫిణీవారనీ, వీరి ప్రభుత్వమును కుంఫిణీ ప్రభుత్వ మనీ వ్యవహరించేవారు. 1763 కు పూర్వం కుఫిణీవారికి భారత దేశంలో సముద్ర తీరాన చాలచోట్ల వర్తకపు స్థావరాలు ఉండేవి. ఈ స్థావరాలనుంచి సెంటుజార్జికోటకు, సెంటుజార్జి కోట నుంచి ఈ వర్తకస్థానములకు ప్రభుత్వపు జాబులు అందేటందుకు దారిలో నడుమ నడుమ తపాల కార్యస్థానము లుండేవని తెలుస్తున్నప్పటికి ఆ వ్యవస్థను గురించిన వివరములు మన కేమిన్నీ తెలియవు.

మొత్తముమీద క్రమమైన పద్ధతిని తపాల విధానము 1766 నుండి ఏర్పడినది. అప్పటినుంచి జాబులన్నీ గవర్నమెంటు భవనమునుంచి వెళ్ళేవి. పోస్టుమాస్టరో, అతని సహాయకుడో ఏ జాబులు ఎక్కడికి వెళ్ళవలసినదీ కేటాయించేవారు. వీటిని వేరువేరు సంచులలోపెట్టి కంపెనీసీలు వేసేవారు. కంపెనీ ముఖ్యోద్యోగులుతప్ప ఇతరు లెవ్వరూ ఆ సంచులు విప్పగూడదని, అప్పుడైనా ఆయా శాఖలవారు తమకుచెందిన ప్యాకెట్లు మాత్రమే విప్పవలె నని నిర్ణయము.

1775కు పూర్వం మద్రాసుకు బెంగాలుకు మధ్య తపాలా వారానికి రెండు మూడు మారులు వెడుతూ వస్తూ ఉండేది. అప్పటికింకా మద్రాసు, బొంబాయిలకు కాని, బొంబాయి కలకత్తాలకు కాని క్రమమైన తపాల పద్ధతి ఏర్పడి యుండలేదు. యూరోపియను వర్తకులు కోరిన మీదట మొదటి మారు 1788 లో మద్రాసు, బొంబాయి నగరములకు వఖాని కొకమారు తపాలవ్యవస్థ సక్రమముగా ఏర్పాటైనది. ఈ తపాల మార్గము హైదరాబాదు పూనాల మీదుగా ఉండేది. మద్రాసు బొంబాయి నగరముల మధ్య టపా నడచుటకు 25 దినములు పట్టేది. 1790 నుండి టపా వారాని కొకసారి ఏర్పాటయింది. మార్గముకూడా మారింది. బొంబాయినుంచి జాబులు బందరు వచ్చేవి; అక్కడినుంచి అవి కలకత్తాకు మద్రాసుకు వెళ్ళేవి. ఈ మార్పువల్ల కాలంచాలా కలిసి వచ్చి ఉత్తరాలు బొంబాయినుంచి కలకత్తాకు 26 దినాలలోను, మద్రాసుకు 17 దినాలలోను, మద్రాసు నుంచి కలకత్తాకు 19 దినాలలోను వెళ్ళేవి. 1789 నవంబరు తరువాత హైదరాబాదు నుంచి బొంబాయికి 222 మైళ్ళ దూరము పోయే 2½ రూపాయలు బరువుగల జాబుకు తపాలచార్జి 8 అణాలు; మచిలీపట్నము బొంబాయిలకు 331 మైళ్ళుపోయే 2½ రూపాయల బరువుగల జాబుకు 12 అణాలు; ఇక మచిలీపట్నం మద్రాసులకు 323 మైళ్ళ దూరం పోయేజాబుకు మూడు పణములు(నాలుగణాలు). మచిలీపట్టణము గంజాములకు 428 మైళ్ళదూరము పోయే జాబుకు నాలుగు పణములు.

మొదట తపాల వ్యవస్థకైన వ్యయం అంతా కుంఫిణీ ప్రభుత్వమే వహించేది. ఈ పద్ధతి తరువాత మారినది. 1786 నుంచి ఒక్కొక్క ఉత్తరానికి నూరేసి మైళ్ళకు తపాలచార్జి ఒక పణము. ఈ విధముగా వసూలుచేసినా తపాల వ్యవస్థ కవుతూవచ్చిన ఖర్చు దానికి సరిపోయేది కాదు. అప్పటినుంచి గవర్నరు, కౌన్సిలు సభ్యుడు, సర్వసైన్యాధిపతి, దళవాయి - వీరి సంతకాలుగల ఉత్తరాలు తప్ప మిగిలిన ఉత్తరాల కన్నిటికి తపాలచార్జి వసూలు చేయవలెనని 1798 లో నిర్ణయమైనది. ఒక రూపాయి కాని, అంతకు తక్కువకాని బరువుగల ఉత్తరాలకు నూరేసిమైళ్ళకు ఒకటిన్నర పణముల చొప్పున రేటు విధింపబడినది.

1800 ల వరకు తపా తీసికుని వెళ్ళేవారి దారిలో అడ్డువచ్చే నదులకు వంతెనలు లేకపోవుటచేత తపాలు చాల ఆలస్యంగా వెడుతూ వస్తూ ఉండేవి. అందువల్ల ముఖ్యమైన నదులమీద పడవలను తిప్పవలసిన అవసరము

కలిగి దానికి ప్రత్యేకము సిబ్బంది (నౌక పరిచ్ఛదము) ఏర్పాటు చేయబడినది.

కుంఫిణీవారికి ఒక్కొక్క ప్రాంతము, కొంత కొంత ప్రదేశము వశమవుతూ వచ్చినపిదప వారు అవశ్యకత ననుసరించి, సులువు ననుసరించి, వ్యయము తక్కువగా అగుటకుగల అవకాశముల ననుసరించి ప్రారంభ కాలములో తరుచుగా తపాల మార్గములను మార్పుచేస్తూ వచ్చారు. స్థిరమైన తపాల మార్గములు కుంఫిణీవారికి భారత దేశము స్వాధీనమైన తరువాత చాల కాలమునకు కాని ఏర్పడలేదు. ఈ తపాల వ్యవహారములను చూచుటకు సెంటుజార్జికోటలో పోస్టుమాస్టర్ జనరల్‌ను, తదితర స్థలములలో డిప్యూటీ పోస్టు మాస్టర్లను ఉండేవారు. డిప్యూటీ పోస్టు మాస్టర్లకు కొంత సిబ్బంది ఉండేది. ఈ సిబ్బందికి వేరువేరు డిప్యూటీ పోస్టు మాస్టర్లకు, పెద్దతపాల కార్యస్థానముల కణకువగా ఉండి పనిచేస్తూవచ్చిన తాబే దారీ తపాల కార్యస్థానములకు విపరీత వ్యయమై పోస్టేజివల్ల వచ్చే ఆదాయము తపాల వ్యవస్థకు సరిపోయేది కాదు. ఈ కారణంచేత తపాల వ్యవస్థలో కొంత మార్పు చేశారు. డిప్యూటీ పోస్టు మాస్టర్లను, వారి సిబ్బందిని తీసివేసి 1807 లో ఉత్తర ప్రత్యుత్తరాలు త్వరితగతిని అందుతూ ఉండడానికి, తపాల కార్యస్థానపు ఖర్చులు తగ్గించడానికి ప్రతిజిల్లాలోను జిల్లా కలెక్టరు పర్యవేక్షణ క్రింద ఒక ప్రత్యేక వ్యవస్థను ఏర్పరచి, కలెక్టరే తపాల వ్యవహారాలు చూచేటట్టు నిర్ణయించారు. కలెక్టరు అదనంగా తనపైబడిన ఈ పనిని నిర్వహించుటకు తప్పని సరిగా అవసరమైన నౌకరులను నియమించుకొనుటకు ఆయనకు అధికార మిచ్చారు. ఈ విధంగా 1807 లో తపాల వ్యవస్థలో రెండు విభాగములు : (1) రాజధాని తపాల వ్యవస్థ ; (2) జిల్లాతపాల వ్యవస్థ ఏర్పడి పనిచేసినవి.

1807 నాటికే సాధారణ తపాల వ్యవస్థలో ఉత్తర ప్రత్యుత్తరముల రాకపోకల నిమిత్తము కాకినాడ, కోరంగి, మాధవాయపాలెము, ఇంజరం, గుంటూరు, మచిలీపట్టణము, కొండపల్లి, ఒంగోలు, బెజవాడ, బెల్లం కొండ, తుమురుకోట (గుంటూరు జిల్లా), వినుకొండ, కంబం, కడప మొదలైన గ్రామా లన్నిటికీ పరస్పరమూ సంబంధం కలిగింది. వీటిలో కొన్ని కుంఫిణీ వారి వర్తక స్థానములు ; కొన్ని బ్రిటిషు సైనిక కేంద్రములు ; మరి కొన్ని కుంఫిణీ ప్రభుత్వము వారి రాజ్యవిభాగ ప్రధాన స్థానములు.

ఉత్తరములు తపాలపద్ధతి నిమిత్తము పోస్టువారు కొన్ని రకములుగా ఏర్పాటు చేశారు. ఏదో కొంత నిర్ణీత మైన కొద్ది బరువుకు లోపున ఉండే ఉత్తరమును, అనగా రూపాయి బరువునకు మించని దానిని, ఒకటే ఉత్తరముగా పరిగణించేవారు. రూపాయి మొదలు 1½ రూపాయల బరువునకు మించని ఉత్తరాన్ని రెండు ఉత్తరములుగాను, 1½ రూపాయలు మొదలు 2 రూపాయల బరువుకు మించని దానిని మూడు ఉత్తరాలుగాను, 2 మొదలు 2½ మించని దానిని నాలుగు ఉత్తరాలుగాను పరిగణించేవారు. పెట్టు కొన్న ఏదో ఒక బరువు మితిలోపున అంకశ్రేఢి పద్ధతిని ఒకటే ఉత్తరమును తూకపు బరువు ననుసరించి, రెండో, మూడో, నాలుగో ఇంకా అంత కెక్కువో ఉత్తరాలుగా పరిగణిస్తూ వచ్చేవారు. ఒక్క ఉత్తరమునకే దాని బరువును బట్టి, అది వెళ్ళవలసిన దూరమునుబట్టి వేరువేరు రకము లుగా చార్జి వసూలు చేసేవారు. తపాల మార్గములో తపాలు పోవలసినదూరము, మార్గము మార్పులనుబట్టి తరుగుతూ పెరుగుతూ వచ్చినందున ఆ దూరము ననుస రించి పోస్టేజి (తపాల చార్జి) కూడా తరచుగా మారుతూ వచ్చినది. ఒకమారు పెట్టుకొన్న బరువు నిర్ణయముకూడా అప్పుడప్పుడు మారుతూ వచ్చినది.

1810 జనవరి రెండవ తేదీనుంచి ప్రభుత్వానికి సంబంధించిన 'బంగీ పోస్టు' మద్రాసు సెంటుజార్జి కోట నుంచి కలకత్తా విలియంకోటకు శ్రీరంగపట్నానికి, తిరు చినాపల్లికి మొదట వారానికి మూడు పర్యాయముల చొప్పున ఏర్పాటయినది. వార్తాపత్రికలు, ప్రభుత్వపు టుత్తరములు, ప్యాకెట్టులు మొదలైనవి ఔన్సు బరువును మించినవన్నీ బంగీతపాలాకు ప్రత్యేకింపబడుతూ వచ్చినవి. సంతకాలున్న ఉత్తరాలు ఉచితంగా పంపించవలె నన్న విషయం తరచుగా ఆలోచనకు వస్తూవచ్చింది.

ఇంచుమించుగా 1790 మొదలు 1837, 1840 సంవత్సరాల వరకు తపాలవ్యవస్థ ఈ విధంగానే ఉండేది. ఈ కాలంలో కుంఫిణీవారు కొత్త రాజ్యాలను సంపాదించుటకు కాక అంతవరకు తమకు చేపడిన దేశమును ఒక కట్టుబాటు లోనికి తీసుకొని వచ్చుటకే కృషిచేస్తూ వచ్చారు. వారి అధికారములో చెల్లా చెదురుగా ఉన్న దేశ విభాగాలను, సైనిక కేంద్ర స్థలములను రోడ్లద్వారా కలుపుటకు తగిన చర్యలు తీసుకొన్నారు.

1837 జూలై 24 వ తేదీని పోస్టాఫీసు చట్టము వచ్చింది. ఈ చట్టమును పురస్కరించుకొని కలకత్తా, మద్రాసు, బొంబాయిలలో జనరల్ పోస్టాఫీసులు స్థాపితమైనవి. జనరల్ పోస్టాఫీసు పని చూచుటకున్ను, దీని కణకువ అయి రాజధానిలో ఉన్న వేరువేరు పోస్టా ఫీసులపని సరిగా జరుగుతున్నది లేనిది చూచి వాటిని

అదుపులో ఉంచుటకున్ను జనరల్ పోస్టాఫీసు అధికారి అయిన పోస్టుమాస్టర్ జనరలుకు అధికార మీయబడినది. రాజధానిలో వేరు వేరుచోట్ల ఉండే పోస్టాఫీసుల పనులు నిర్వర్తించే ముఖ్యులకు పోస్టుమాస్టర్లని వ్యవహారము కలిగినది. ఈ క్రొత్త నియమములు 1837 అక్టోబరు 1 వ తేదీనుంచి అమలులోనికి వచ్చినవి. ఈ చట్టంవల్ల కుంఫిణీరాజ్యంలో చార్జి తీసికొని ఉత్తరాలు తపాల ద్వారా ఒక చోటినుంచి మరొకచోటికి తీసికొనివెళ్ళే ప్రత్యేకపు హక్కు కౌన్సిలుతోకూడిన గవర్నరు జనరలుకు మాత్రమే సంక్రమించింది.

ప్రభుత్వానికి రాజధాని నగరమైన మద్రాసుతో కలిపే తపాలా మార్గములు కొద్దిగా యుండేవి; టపాతీసుకు వెళ్ళే అంచెలవా రుండేవారు. ప్రభుత్వపు టపా ద్వారా ప్రభుత్వోద్యోగులు కాని వారి ఉత్తరాలను పంపడం 1837 వ సంవత్సరం వరకు ప్రభుత్వమువారి ఇష్టానిష్టాల మీద ఆధారపడి ఉండేది.

వేరు వేరు చోట్లకు పంపుటకై తీసికొన్న ప్రతివస్తువుకు తపాల శాఖవారు రసీదిచ్చేవారు. తీసికొన్న ప్రతి వస్తువు చేరవలసినవారి చిరునామాలను పట్టికలుగా వ్రాసేవారు. ఈ పట్టికలను తపాలవారి కిస్తే వారు ఆ పట్టికల మీద చిరునామా దారుల సంతకాలు చేయించి తీసికువచ్చేవారు. ఈ వస్తువులు ఏయే పోస్టాఫీసుల గుండా వెళ్ళేవో వాటిలో కూడా వాటి చిరునామాలను వ్రాసి ఉంచేవారు.

తపాలాచార్జి మొదట ఉత్తరము పంపేవారి నుండికాని లేదా ఎవరికాయుత్తరం పంపుదురో వారినుండి కాని వసూలు చేసేవారు. చిరునామాదారు దానిని స్వీకరింపక పోయిన అది పంపిన వానికి త్రిప్పి వేయబడేది. అటువంటి సందర్భాలలో పంపినవారి నుండి తపాలచార్జి వసూలు చేసేవారు; తరువాత ఇట్టి ఉత్తరాల సంఖ్య అధిక మవుతూండగా ఉత్తరానికి పంపుటకైన చార్జి తిరిగి వచ్చుటకైన చార్జి కూడా వసూలు చేసేవారు. తపాలా చార్జి నాణెము రూపమున చెల్లించేవారు. ఈ చార్జి ఇదివరలో చెప్పినట్టు బరువును బట్టి, దూరాన్ని బట్టి తరచు మారుతూ వచ్చేది.

జిల్లా టపా ఒక ప్రత్యేక వ్యవస్థ. ఇది ప్రత్యేకముగా కలెక్టరులు, మేజిస్ట్రేటులు, వారి తాబేదారి ఉద్యోగులు ఆఫీసుకు సంబంధించిన ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుటకు మాత్రమే ఉపయోగపడుతూ ఉండేది. రెండవది సాధారణ తపాల వ్యవస్థ. దీనికిని జిల్లా వ్యవస్థకును ఏ విధమైన సంబంధము ఉండేది కాదు. జిల్లా తపాలును రెవిన్యూ శాఖకు సంబంధించిన బ్రంటోతులు, గ్రామభటులే తీసుకు వెళ్ళేవారు. ఈ తపాల పద్ధతిలో రసీదు లుండేవి కావు. ఈ తపాల నిర్వహణకై ప్రత్యేకపు ఖర్చులను లెక్కలలో విడిగా చూపుటయున్ను ఉండేది కాదు.

1844 లో మద్రాసులో తాలుకా టపా ఏర్పడినది. ఉత్తరములు స్వీకరించ వలెననీ, అవి ముట్టినట్టు రసీదు లియ్యవలెననీ తహసీలుదార్లకు ఉత్తర్వు లీయబడినవి; తమ గ్రామములోను, చుట్టుపట్ల గ్రామాలలోను ఉత్తరములు బట్వాడా చేయించే బాధ్యత వారిపై బడినది.

1846 లో ప్రభుత్వము వారి ఉత్తర్వు ననుసరించి నాణెము రూపమున పోస్టేజి చెల్లించే పద్ధతిని జిల్లా పోస్టును పౌరులు ఉపయోగించుకొనుట కవకాశ మీయబడినది. చెల్లింప వలసిన తపాల చార్జిలో జిల్లా పోస్టు చార్జికిని, సాధారణపు తపాల చార్జికిని వ్యత్యాస ముండేది. జిల్లా పోస్టులో తపాల చార్జి విధించే పద్ధతే వేరు. జిల్లా పోస్టువల్ల ఏ జిల్లాలో వచ్చిన ఆదాయాన్ని ఆ జిల్లా ఆదాయంతో కలిపివేస్తూ వచ్చారు. జిల్లా పోస్టులోని ఉత్తరం సాధారణపు పోస్టులో వెళ్ళవలసి వచ్చినా సాధారణపు పోస్టులోని ఉత్తరం జిల్లాలో పోస్టు లేని ఏ సరిహద్దు గ్రామానికి వెళ్ళవలసి వచ్చినా ఆ రెండు రకాల తపాలా చార్జిలు కట్టవలసి వచ్చేవి. ఈ రెండు రకాలైన పోస్టులు పరస్పర సంబంధమేమీ లేకుండా విడివిడిగా పని చేసేవి.

1850 ప్రాంతాన మద్రాసు రాజధానిలో 130 పోస్టాఫీసు లుండేవి. తెలుగు దేశములోని కడప, గంజాము, గుంటూరు, మచిలీపట్టణము, రాజమండ్రి, విశాఖపట్టణము కలెక్టర్లున్ను, కర్నూలులోని ఏజెంట్లున్ను అధికారరీత్యా పోస్టుమాస్టర్లుగా ఉండేవారు (Ex-officio Post Masters).

1854 లో తపాల వ్యవస్థకు సంబంధించి అదివరకుండిన చట్టములు పోయి కొత్తచట్టము వచ్చింది (Act No. XVII of 1854). భారత దేశములోని తపాల శాఖ ఇప్పుడున్న రీతిని నిర్మాణమగుటకు ఇదే ప్రాతిపదిక. అందువల్ల ఇప్పుడున్న పద్ధతిని తపాల ఏర్పాటు లారంభమవడము 1854 నుంచే. ఈ సంవత్సరమునుంచే భారతదేశ మంతటా ఒకటే విధమైన, సమానమైన తపాల చార్జి ఏర్పడింది. మొదట తపాల బిళ్ళలు (పోస్టేజి స్టాంపులు) ఈ సంవత్సరములోనే అమ్మకమునకు వచ్చినవి. వెళ్ళవలసిన దూరము ఎక్కువఉన్నా తక్కువవున్నా దానితో నిమిత్తం లేకుండా పావుతులం బరువుగల ఉత్తరానికి అర్ధణా (అరణా) చొప్పున దేశమంతటా సరిసమానమైన తపాలా చార్జి ఏర్పాటయినది. బరువు పావుతులానికి మించినట్టయితేను, అరతులానికి మించక పోయినట్టయితేను తపాలా చార్జి అణా, అరతులం బరువుపైనుండి తులం బరువు దాటని

ఉత్తరానికి రెండణాలు; ఒక తులం పైన 1½ తులం లోపున బరువుగల ఉత్తరానికి మూడణాలు, 1½ తులం పైన 2 తులాలు లోపున బరువుగల ఉత్తరానికి నాలుగణాలు. రెండు తులాలకు మించిన బరువుగల ఉత్తరానికి రెండేసి అణా లెక్కువ. ఈ విధంగా పోస్టేజి నిర్ణీతమైనది.

బంగీ రేట్లు మాత్రము బరువును బట్టి, దూరమును బట్టి మారుతూ వచ్చినవి. పోస్టు మాస్టరు జనరలు అందరిమీదా తపాల శాఖ వ్యవహారములను పర్యవేక్ష చేయుటకై కౌన్సిలుతో గూడిన గవర్నరు జనరలు యొక్క అధికారమునకు లోబడి పనిచేసే డైరెక్టరుజనరల్ ఒకడు నియమితుడైనాడు.

1864-65 లో ప్రభుత్వమునకు సంబంధించిన, జనసామాన్యము వ్రాసుకొనే ఉత్తరప్రత్యుత్తరాల పోస్టేజివల్ల వచ్చిన ఆదాయమే తపాల శాఖకైన అన్ని ఖర్చులకు సరిపోయినది. 1866 వరకు ప్రభుత్వమునకు సంబంధించిన అన్ని వస్తువులను (articles) ఉచితముగా రవాణా చేసేవారు. అప్పటినుండి ప్రభుత్వము వారి 'సర్వీస్' తపాల బిళ్ళలు వచ్చినవి. ప్రభుత్వ శాఖలవారు డబ్బిచ్చి వాటిని కొనుక్కునే నియమమేర్పడినది.

జిల్లా టపా సాధారణముగా ఆ జిల్లా సరిహద్దు ప్రదేశమునకు వర్తించే వ్యవస్థ. తపాల పద్ధతి క్రమంగా వృద్ధి చెందుట కారంభమైనప్పటి నుండి అనగా 1864, 1868 సంవత్సరముల ప్రాంతమున జిల్లా తపాలమీద మేజిస్ట్రేటుల కుండిన అధికారం బాధ్యతలు తొలగింపబడినవి. ఈ తపాల మార్గములు తపాల ఆఫీసు వ్యవస్థకు సహకారకముగ నిర్వహింపబడుతూ వచ్చినవి. స్థానికపు పన్ను ఆదాయము నుంచి జిల్లా తపాల నిర్వహణమున కగు ఖర్చులను భరించే వారు. జిల్లా తపాల వ్యవస్థవల్ల వచ్చే ఆదాయము దాని సిబ్బంది కగు ఖర్చుకు సరిపోవునప్పటి నుంచి దానిని సామ్రాజ్యపు టపా వ్యవస్థ తీసికొనుట కంగీకరింప వలెననే నియమమేర్పడినది. 1860 లో ప్రభుత్వమువారు తపాల నిమిత్తం విధిస్తూ వచ్చిన స్థానికపు పన్ను రద్దు చేశారు. అప్పటినుంచి జిల్లా కార్యాలయములు తపాల మార్గములు దేశము మొత్తముమీద ఏర్పడిన సామ్రాజ్య తపాల సాధారణ వ్యవస్థలో క్రమవిభాగములైనవి. వాటి నిర్వహణమునకయ్యే ఖర్చును సామ్రాజ్యపు తపాల వ్యవస్థ భరించుటకు మొదలైనది.

1864 లో రైల్వే మెయిలు సర్వీస్ (రైలుద్వారా తపాలు రాకపోకలు) ఏర్పాటైనది. 1867 లో గ్రామ-తపాలవారు (village post-men) నియమితులైనారు. 1869 లో మొదటిమారు 'పోస్టలు గైడు' ప్రకటితమైనది. 1873 నుంచి అర్ధణా (అరణా) కవరులు వచ్చినవి. అవి చాలా జనాదర పాత్రములైనవి. 1877 డిసెంబరు 1 వ తేదీనుండి వి. పి. పద్ధతి (చెల్లింపవలసిన సొమ్మిచ్చి వస్తువులను పోస్టువారి వద్దనుండి తీసికునే పద్ధతి) ప్రవేశపెట్టబడినది. 1878 లో ఇన్సూరెన్సు పద్ధతి వచ్చినది. 1879 జూలై నుండి పోస్టుకార్డులు వచ్చినవి. 1880 లో పోస్టు ద్వారా సొమ్ము పంపుకునే 'మనీ ఆర్డరు' సౌకర్యము కలిగినది. 1882 నుండి పోస్టాఫీసులలో ద్రవ్యము దాచుకొని అవసరమైనప్పుడు కొద్ది కొద్దిగా తీసికునే 'పోస్టలు సేవింగ్స్ బ్యాంకు' లేర్పడినవి; 1883 లో 'ఇండియా పోస్టల్ నోట్లు' వచ్చినవి. తపాలాశాఖతో తంతిశాఖ కలిపివేయబడుటకు 1883 నుండియే ఆరంభము. అంతవరకవి విడివిడి శాఖలుగనే పనిచేయు చుండెడివి. 1884 అక్టోబరు 1 వ తేదీనుండి తంతి ద్వారా 'మని ఆర్డర్లు' పంపుటకు సౌకర్య మేర్పడినది. ఇండ్లకు తీసికొనివచ్చి పోస్టుమన్ 'మనీ ఆర్డర్లు' ఇచ్చుటకుకూడ అప్పటినుండి ఆరంభము. ఈ సంవత్సరములోనే 'రిప్లై పోస్టుకార్డులు' వచ్చినవి. 1900 లలో జనవరి 1 వ తేదీని కర్నూలుజిల్లా బంగనపల్లి సంస్థానములోని తపాల ఏర్పాటులు సాధారణ సామ్రాజ్య 'పోస్టాఫీసు' వ్యవస్థతో కలిపివేయబడినవి.

హెడ్ ఆఫీసులని, సబ్ ఆఫీసులని, బ్రాంచి ఆఫీసులని పోస్ట్‌ఆఫీసులు మూడు రకములు. హెడ్ ఆఫీసు జిల్లా కేంద్రములో ఉండును. సబ్ ఆఫీసు, బ్రాంచి ఆఫీసుల లెక్కలు హెడ్ ఆఫీసులో ఉండును. బ్రాంచి ఆఫీసు పని నిర్వహించువారిలో చాలమంది బడిపంతుళ్ళు, స్టేషను మాస్టర్లు, దుకాణదారులు (shopkeepers), ఉద్యోగము నుంచి విరమించి పింఛను పుచ్చుకొనేవారు మొదలైన వారు. వీరు తపాల విధులు నిర్వహించినందుకు తపాల శాఖవారు వారికి కొద్దిపాటి ప్రతిఫల మిచ్చెడివారు.

ఆంధ్రరాష్ట్రము వచ్చినప్పటి (1953) నుంచి ప్రత్యేకముగ ఆంధ్రపోస్టలు సర్కిలు ఏర్పాటయినది. ఇండియన్ యూనియన్ ప్రభుత్వమువారి పంచవర్ష ప్రణాళికలో పోస్టాఫీసుల అభివృద్ధికూడ ఒక అంశము. పోస్టాఫీసుల విషయములో యుద్ధానంతర పథకమే పంచవర్ష ప్రణాళికగా మారిందని చెప్పవచ్చును. రెండువేల జనసంఖ్యగల ప్రతి గ్రామానికి ఒక తపాల అఫీసు ఉండునట్లు చూడడమే ఇప్పుడు తపాలశాఖవారు గ్రామ తపాల ఆఫీసుల విషయములో తలపెట్టిన కార్యక్రమము. ఈ విధమైన కార్యక్రమ మిదివరకే ఆరంభమై ఇప్పటికి పూర్తి కావస్తున్నదనే చెప్పవచ్చును. రెండువేల జనసంఖ్యలేని గ్రామాలలోని వారు కూడా తపాలకు సంబంధించిన కార్యముల నిమిత్తము

మూడు మైళ్ళకంటె ఎక్కువ దూరము పయనింప వలసిన ఆవశ్యకత లేకుండునట్లు చూచుటకు కూడా తపాల శాఖ వారు ప్రయత్నిస్తున్నారు.

1952 - 53 లో శాశ్వతమైన పోస్టాఫీసులు తాత్కాలిక పోస్టాఫీసులు అన్నీ కలసి ఆంధ్రరాష్ట్రములో 3,100 వరకు ఉన్నవి. 1947 ఆగస్టు మొదలుకొని 1952-53 చివరివరకు రెండువేలు, అంతకెక్కువ జనాభాగల గ్రామాలలో నెలకొల్పబడిన పోస్టాఫీసులు 1,842; మొత్తముమీద రెండు వేలు, అంతకెక్కువ జనాభాగల గ్రామకూటములలో పెట్టినవి 164; చిన్న గ్రామాలలో నెలకొల్పబడినవి 8.

# తంతి

తంతి ద్వారా వార్తలను పంపుట ఇప్పటికి సరిగా వంద సంవత్సరముల క్రిందట ఆరంభమైనది. 1850 లో విద్యుత్తంతి వార్తలను పంపుటకు హిందూ దేశములో తంత్రీ వార్తా మార్గ నిర్మాణము ఆరంభమైనను ఆంధ్ర దేశములో 1860 - 70 ల మధ్యకాని తీగె ద్వారా వార్తలను పంపుటకు విద్యుత్తంత్రీ వార్తావహ కార్యస్థానములు ఏర్పాటు కాలేదు. తంతి ద్వారా వార్తలను పంపు సౌకర్యము 1855 నుండి కలిగినను ఆ మొదటి సంవత్సరములో ఈ సౌకర్యము ఉపయోగించుకొనుటకు తంతి వార్తా మార్గములును లేవు; కార్యస్థానములును లేవు. అవి 1860 - 70 ల మధ్యనే ఏర్పాటైనవి. క్రమముగా ఈ కార్యస్థానముల సంఖ్య 1900 ల నాటికి పెంపు చెందినది. నేడు సాధారణముగా ఆయా జిల్లాలలోని ప్రతి ముఖ్య పట్టణములోను తంత్రీ వార్తావహ కార్యస్థాన మున్నది.

ఈ తంత్రీవార్తావహ వ్యవస్థ (Telegraph System) 1912 వ సంవత్సరము వరకు భారత ప్రభుత్వమునకు చెందిన వాణిజ్య పరిశ్రమ శాఖలో ఒక ప్రత్యేక విభాగమై తత్ శాఖాధికారికి లోబడిన డైరెక్టర్ జనరల్ ఆఫ్ టెలిగ్రాఫ్స్ అను ఉన్నతాధికారి పరిపాలన క్రింద ఉండెడిది. ఆ సంవత్సరములో తపాల వ్యవస్థను, తంతివార్తావహ వ్యవస్థను ఒకే అధికారి పరిపాలన క్రింద ఉంచవలెనని నిర్ణయమైనది. ఈ విధముగా ఈ రెండు వ్యవస్థలను కలిపిన ఏ విధముగా పని జరుగునో చూచుటకు ముందు రెండు రాష్ట్రములలో ప్రయత్నించి చూచినారు. అది జయావహముగాను, సుకరముగాను ఉండుటవల్ల ఈ రెండు శాఖలను 1914 లో కలిపి వేసిరి. ఆనాటి నుంచి ఈ తంతి, తపాల వ్యవస్థలు రెండును ఒకే అధికారి పరిపాలనలో నున్నవి.

400 మైళ్ళ దూరము పోవు తంతి వార్త ప్రమాణము మొదట పదునాలు మాటలు దీనికి చెల్లింపవలసిన శుల్కము రూపాయి. తపాల పద్ధతిలోవలెనే తంతి పద్ధతిలో కూడ రేటు విషయములోను ప్రమాణముగా ఉండదగిన మాటల విషయములోను మార్పులు వచ్చినవి 1866 లో తంత్రీవార్తా ప్రమాణము ఇరువది మాటలకు హెచ్చింపబడినది; దూరములో సగము, అనగా 200 ల మైళ్ళ మండలములు, పాతిక, అనగా 100 మైళ్ళ మండలములు ఏర్పాటు చేయబడినవి. 400 ల మైళ్ళ దూరము వెళ్ళవలసిన వార్తకు చెల్లింపవలసిన శుల్కము రు. 1-8-0; ప్రమాణమును మించి ఎక్కువగా ఉన్న ప్రతి పది మాటలకు ఎక్కువగా చెల్లింపవలసిన పైకము అర్ధ రూపాయి. 200 ల మైళ్ళు పోవు వార్తకు కట్టవలసియుండిన పైకము రూపాయి; 100 మైళ్ళు పోవు దానికి అర్ధరూపాయి, వార్త ప్రమాణముతో నిమిత్తము లేకుండ ఒక్కొక్క వార్త పట్టినందుకు అదనముగా అర్ధరూపాయి ఇవ్వవలసి ఉండేది. 1872 లో మరొక మార్పు వచ్చినది. ఈ సంవత్సరములో వార్తలకు చెల్లింపవలసిన శుల్కము దూరమును బట్టి వసూలు చేయుట రద్దయినది. దానికి బదులుగా హిందూ దేశములో ఏ ప్రాంతమునకు వార్త నంపినను కట్టవలసిన శుల్కము ఒక రూపాయి. అయితే వార్తా ప్రమాణము మొదట పది మాటలకును, తరువాత ఆరు మాటలకును తగ్గింపబడినది. ఇంకను ఇటువంటి చిన్న మార్పులు కొన్ని జరిగినవి. ప్రకృతము తంత్రీవార్తా ప్రమాణము సాధారణమైన దానికి, 'ఎక్స్‌ప్రెస్' కు కూడ ఎనిమిది మాటలు, రేటు వరుసగా 12 అణాలు; రు. 1-8-0; సాధారణ తంత్రీవార్త అయితే ప్రతి అదనపు మాటకు కట్టవలసిన శుల్కము అణా; ఎక్స్‌ప్రెస్ అయినచో రెండణాలు.

ఆంధ్రప్రదేశ్ తంతి - తపాలా వివరములు
(1960 - 61)

| | |
|---|---|
| 1. తపాలా ఆఫీసులు | 10,369 |
| 2. టెలిగ్రాఫ్ ఆఫీసులు | 531 |
| 3. టెలిఫోను ఎక్స్చేంజిలు | 153 |
| 4. టెలిఫోను కనెక్షనులు | 17,127 |

మ. సో. శ.

# అభివృద్ధి ప్రణాళికలు

## పంచవర్ష ప్రణాళికల యందలి ముఖ్య లక్షణములు

1951 మొదలుగ, ఇప్పటికి ఒక దశాబ్దమునుండియు, జాతీయాభ్యుదయ సాధనకై పంచవర్ష ప్రణాళికల మూలమున స్వీయ ప్రకృతి సంపదలను, స్వీయ ప్రజానీకపు శక్తి సామర్థ్యములను సమీకరించుటకై భారతదేశము కృషి చేయుచున్నది. దేశపు ఆర్థిక వ్యవస్థను ప్రాతిపదిక స్థాయిలో పటిష్ఠతరము చేయుటకై ప్రథమ పంచవర్ష ప్రణాళిక కృషి యొనర్చినది. ఇందులకై (1) యుద్ధమువలనను, దేశ విభజనమువలనను కలిగిన నష్టములను కూడదీయుట; (2) శీఘ్రగతిలో అభ్యుదయమును సాధించుటకు అత్యావశ్యకము లని భావింపబడు కొన్ని ఆర్థిక సాంఘిక చర్యలను గైకొనుట; (3) భారత రాజ్యాంగ చట్టమున ప్రవచితములగు జాతీయ విధాన నిర్దేశక మూలసూత్రములకు అనున్యూతమగు ప్రాతిపదిక సాంఘిక, ఆర్థిక విధానమును ఏర్పరచుట యను కార్య కలాపములను ఆ ప్రణాళిక నిర్వహింప యత్నించినది.

దేశీయ ఆర్థిక వ్యవస్థయందలి అత్యవసర తాత్కాలిక సమస్యలనేగాక దీర్ఘకాలికములగు పరివర్తనములను సైతము కొన్నిటిని దృష్టియం దిడుకొనియే ఈ ప్రథమ ప్రణాళిక యందలి ప్రాముకత క్రమము నిర్ణయింపబడినది. అందువలననే జాతీయ ప్రణాళికయందు నీటి పారుదల, విద్యుదుత్పత్తులతో జతవడిన వ్యవసాయమునకు అగ్రతాంబూలము ఒసగబడినది. ఆహార పదార్థముల ఉత్పత్తియు, పరిశ్రమలకు ఆవశ్యములగు ముడి పదార్థములు ఉత్పత్తియు తగినంతగ అభివృద్ధి చెందనిచో పరిశ్రమల అభ్యుదయ గతి ఉచ్చ స్థాయిలో నిలువ జాలదు. అందులకై, పునాదులందే, ఆర్థిక వ్యవస్థను తొలుతగ పటిష్ఠతరము చేసి, తగినంతగ అదనపు ఆదాయమును వ్యావసాయిక రంగమున ఉత్పత్తి కావించి, ఉద్యోగావకాశములను దినదినాభివృద్ధిగ పెంపొందించుటకై తక్కిన రంగములందు ఈ అదనపు ఆదాయమును వినియోగింపవలసి యున్నది. ఇందులకు తోడుగ దేశమున నానాటికి తీసి కట్టగుచున్న ఆహార పరిస్థితి సైతము వెనువెంటనే నీటి పారుదల వసతులను అభివృద్ధి చేసి దేశమందలి జల సంపదను సద్వినియోగము చేయవలసిన ఆవశ్యకతను కల్పించినది. ఇట్టి సార్వ విషయక విధానమును, అనుసరించియే ఆంధ్ర రాష్ట్ర ప్రణాళిక యందును, నీటి పారుదల విద్యుదుత్పత్తులకు ప్రప్రథమ స్థానము కల్పింపబడినది. ప్రణాళికా వ్యయము మొత్తము రు. 64.32 కోట్లలో నీటి పారుదల, విద్యుదుత్పత్తులకు రు. 39.78 కోట్లు వెచ్చింపబడెను. అనగా ప్రథమ ప్రణాళికా వ్యయమున దాదాపు 61·84% ఇందులకు వ్యయము చేయబడెనని స్పష్ట మగుచున్నది. రాష్ట్రము అత్యధికముగ వ్యవసాయిక స్వభావము కలది యగుటచే మొత్తము ప్రణాళికా వ్యయమున 9·41% వ్యవసాయమునకై ప్రత్యేకింపబడినది. సాంఘిక సేవా కార్యములకై మొత్తము వ్యయమున 19·18% అనగా రు. 12·34 కోట్లు ప్రత్యేకింప బడినవి. 'పరిశ్రమలు' అను పద్దు క్రింద మొత్తము వ్యయమున 1·24% అనగా దాదాపు రు. 80 లక్షలు మాత్రమే ప్రత్యేకించుటలో, ఆంధ్ర రాష్ట్రము పారిశ్రామికముగ వెనుకబడి యున్న దుస్థితి స్పష్టముగ ద్యోతక మగుచున్నది. ఇటుల రాష్ట్ర ప్రణాళికయందు చేరి యున్న నీటిపారుదల వసతుల అభివృద్ధి కార్య క్రమముచే వ్యావసాయి కాభ్యుదయ గతి తీవ్రతరము కాగలదని ఆకాంక్షింప బడినది. అటులే, విద్యుదుత్పత్తివలన గ్రామీణ పరిశ్రమలు పునరుద్ధరితములు కాగల వనియు, పట్టణ పరిశ్రమలు పూర్వము కన్న మిన్నగ విస్తృతి చెందగల వనియు ఆశింపబడినది.

ప్రథమ పంచవర్ష ప్రణాళికను విజయవంతముగ నిర్వహించుట మూలమున ఆర్థిక పురోగమనమును సాధించుటకై తన అమూల్య సహజసంపదలను సమీకరించు మహాత్కార్యమున, ఆంధ్రప్రదేశ్ తన మహత్తర ఉత్పాదనా శక్తిని, అనంత కుశలతా సామర్థ్యములను వినియోగించి పాల్గొనినది. కాని రెండవ ప్రణాళిక మొదలిడిన తరువాత ఏడు నెలలకు అనగా 1956 నవంబరు నెల ఒకటవ తేదిన ఆంధ్రప్రదేశ్ రూపొందుటచే ప్రథమ ప్రణాళికా ఫలితములను విలువ కట్టుటలో తొలుతటి ఆంధ్రరాష్ట్ర ప్రాంతమును మాత్రమే లెక్కలోనికి గ్రహింపవలసి యున్నది.

సమష్టి మద్రాసు రాష్ట్రమునుండి కచ్చితముగ ప్రథమ ప్రణాళికా మధ్య కాలమున విడివడిన ఆంధ్రరాష్ట్రము తన ప్రణాళికా భాగమును ఆ సమిష్టి ప్రణాళిక నుండియే అవలంబించి కొనసాగించినది. యుద్ధానంతరపు అభ్యుదయ

ప్రణాళిక లన్నియు ఇందుల గుదిగూర్చబడిన వనుట తప్ప ఈ ప్రణాళికయందు వేరుగ నూతనత్వ మేదియు అంతగ లేదు. అయినను, వ్యయము చేయ నుద్దేశింప బడిన రు. 64.32 కోట్లకు ప్రత్యామ్నాయముగ రు. 64.52 కోట్లు వెచ్చింప బడినవి. ఈ విధముగ శైశవ దశలో సహజముగ ఎదుర్కొన వలసి వచ్చిన ఇబ్బందులను అన్నిటిని అధిగ మించినది. వివిధములగు అభ్యుదయ కార్యక్రమముల పై ప్రణాళికలో నిర్దేశింప బడిన వ్యయ విభజనమును క్రింది పట్టిక తెలియచేయుచున్నది.

రాష్ట్రపు మొత్తమున వ్యవస్థిత విద్యుత్సామర్థ్యము 21,400 కిలో వాట్లు మాత్రమే కాగా ప్రణాళికాంతము నాటికి ఆ మొత్తము 62,200 కిలో వాట్లకు పెరిగినది. ప్రణాళికారంభము నాటికి 205 పల్లెలకు, పట్టణములకు మాత్రమే విద్యుత్తు సరఫరా జరుగుచుండగా ప్రణాళికాంతమునకు వాని సంఖ్య 681 గ పెరిగినది. విద్యుత్ విషయమున ప్రతి వ్యక్తి వినియోగము ప్రారంభమున 2.5 యూనిట్లు మాత్రమే ఉండెను. కాని ప్రణాళికాంతము నాటికి అది ఎనిమిది యూనిట్లకు పెరిగెను. రహదారుల విషయమున

ప్రణాళికా వ్యయపు విభజన రీతి

| అభ్యుదయ కార్యక్రమ వివరము | ప్రణాళికలో నిర్దేశింపబడిన మొత్తము (లక్షల రూ॥లలో) | ఖర్చు అయిన మొత్తము (లక్షల రూ॥లలో) | ఖర్చునకును నిర్దేశితమగు మొత్తములో% |
|---|---|---|---|
| 1. వ్యావసాయిక, గ్రామీణ అభ్యుదయము | 760.63 | 784.76 | 103.17 |
| 2. నీటిపారుదల, విద్యుచ్ఛక్తి ప్రాజెక్టులు | 3,977.72 | 3,979.64 | 100.04 |
| 3. పరిశ్రమలు | 79.82 | 76.41 | 95.73 |
| 4. రవాణా | 224.22 | 228.75 | 102.02 |
| 5. సాంఘిక సేవ | 1,233.77 | 1,226.52 | 99.41 |
| 6. ఇతరములు | 156.00 | 156.00 | 100.00 |
| మొత్తము | 6,432.16 | 6,452.08 | 600.37 |

వ్యావసాయిక కార్యక్రమము లందును, నీటిపారుదల కార్యక్రమము నందును ప్రథమ ప్రణాళికా కాలమున జరిగిన అభివృద్ధి రాష్ట్రమున వ్యావసాయిక ఉత్పత్తి యందును, భూమి వినియోగ రీతియందును ప్రతిఫలిత మైనది. 1950-51 లో రాష్ట్రమున 173.83 లక్షల ఎకరము లలో మాత్రమే పైరు సాగు కాగా 1955-56 లో ఆ విస్తీర్ణము 184.68 లక్షల ఎకరములకు పెరిగినది. తృణ ధాన్యముల ఉత్పత్తి 1950-51 లో 30.76 లక్షల టన్నులు మాత్రమే, కాని, 1955-56 లో ఈ మొత్తము 39.34 లక్షల టన్నుల వరకు పెరిగినది. 1950-51 లో 7 లక్షల ఎకరములలో మాత్రమే ప్రత్తి సాగు కాగా 1955-56 లో ఆ పైరు 7.11 లక్షల ఎకరములలో సాగై 14 వేల బేళ్ళ ప్రత్తి ఎక్కువగా పండింప బడినది. నూనె గింజల ఉత్పత్తిలో సైతము అభివృద్ధి సాధింపబడినది. 1951-52 లో 8.29 లక్షల టన్నుల నూనె గింజలు ఉత్పత్తి కాగా 1955-56 లో ఆ పంట 8.83 లక్షల టన్నులకు పెరిగినది. ఉత్తమ, మధ్యమ శ్రేణులకు చెందిన నీటిపారుదల ప్రాజెక్టుల వలన ప్రణాళికా కాలమున 31,200 ఎకరముల భూమి అదనముగ నీటిపారుదల క్రిందికి తీసికొని రాబడెను. చిన్ననీటి వసతుల క్రింద అదనముగ 98,800 ఎకరములు సేద్యము చేయబడెను.

విద్యుదుత్పత్తి ప్రాజెక్టుల విషయమున సాధించిన అభివృద్ధి గమనించదగినది. ప్రణాళిక ప్రారంభ కాలమున

ప్రథమ ప్రణాళికా కాలమున కొంత అభివృద్ధి సాధింపబడి 25½ మైళ్ళు కొత్త రోడ్లు వేయబడినవి; 178 మైళ్ళు రోడ్డు మార్గము పై స్థాయికి మార్చబడినది. ఇందులకు తోడుగ రాష్ట్ర ప్రభుత్వ సహాయము పొందిన స్థానిక సంస్థలచే 659 మైళ్ళ క్రొత్త రోడ్లు నిర్మింపబడినవి. ఉన్న రోడ్లలో 313 మైళ్ళ మార్గము ఉన్నత స్థాయికి కొనిపోబడినది. ఇక విద్యారంగమున, ప్రథమ ప్రణాళికా కాలమున, ప్రాథమిక, తదితర విద్యాశాలల మొత్తము 1,500 నూతనముగ స్థాపింపబడినవి.

వైద్యసహాయ్య విషయమునగూడ తగినంత అభివృద్ధి సాధింపబడి తత్ఫలితముగ వేరు వేరు ఆసుపత్రులలో మొత్తము 900 పడకలు అదనముగ ఏర్పరుపబడినవి. రాష్ట్రమందలి ప్రజాస్వాస్థ్యమును అభివృద్ధిచేయు ఉద్దేశముతో సాంక్రామిక వ్యాధి నిరోధకచర్యలు అమలు జరుపబడినవి. 34 మలేరియా నిర్మూలన దళములు పని చేసినవి. బోదకాలు నివారణా కార్యక్రమముగూడ ఆరంభింపబడి, అందులకు ప్రాతిపదికగ తూర్పు పశ్చిమ గోదావరి జిల్లాలలో 41 పంచాయితీ లందును, ఒక మునిసిపాలిటీ యందును విషయపరిశీలన జరుపబడినది. బి.సి.జి. (క్షయ నిరోధము) టీకాల కార్యక్రమముక్రింద 18 లక్షల ప్రజలు పరీక్షింపబడిరి; వారిలో 6.23 లక్షలకు టీకాలు వేయబడినవి. 'యాస్' అనువ్యాధిని నివారించు

టకు నాలుగు సంచారక దళములు పని చేసినవి. తత్ఫలితముగ 2,41,416 మంది పరీక్షింపబడిరి. నూగూరు, భద్రాచలం, పోలవరం తాలూకాలలో 1,214 పల్లెలందు నివసించు 16,473 మందికి ఈ రోగ నివారణ కొరకై పి.ఎ.యం. అను ఔషధమునిచ్చి చికిత్స చేయబడినది. పల్లెపట్టులందు ప్రసూతి, శిశు సంరక్షణ వసతులను అభివృద్ధి చేయుటకై ప్రసూతి-శిశు సంరక్షణా కేంద్రములు ఎనిమిది స్థాపింపబడినవి.

నివాస సౌకర్యముల లేమిని తగ్గించుటకై పట్టణ ప్రదేశములందు 1621 ఇండ్లును, పల్లెపట్టులందు 135 ఇండ్లును నిర్మింపబడినవి. యివిగాక, 1,079 ఇండ్లు పట్టణ ప్రాంతములందును, 84 ఇండ్లు పల్లెప్రాంతములందును నిర్మాణదశలో నున్నవి.

వెనుకబడిన జాతుల శ్రేయస్సు నపేక్షించి కొన్ని ప్రత్యేకచర్యలు గైకొన బడినవి. తత్ఫలితముగ 44 హరిజన శ్రేయో పాఠశాలలును, 21 హాస్టలులును, స్థాపింపబడినవి. ప్రణాళిక కాలము మొత్తమున 65,000 విద్యార్థి వేతనములు ఈయబడినవి.

సామాజిక వికాసన కార్యక్రమమునగూడ ఈ ప్రణాళికా కాలమున పరిగణనీయమగు సర్వతోభివృద్ధి సాధింపబడినది. ప్రణాళికాంతమునకు 11,281 చ. మైళ్ళ ప్రదేశమున 41 లక్షల ప్రజలు నివసించు 2,823 గ్రామములు ఈ కార్యక్రమ పరిధిలోనికి తేబడినవి.

ప్రథమ ప్రణాళిక విజయవంతముగ సాధింపబడుటతో జాతీయ ద్వితీయప్రణాళిక మూలమున ఇంకను మిన్నగ ఉత్పత్తియందును, పెట్టుబడియందును, ఉద్యోగ వసతుల యందును అభివృద్ధిని సాధింప సంకల్పింపబడినది.

ఇదియే గాక, ప్రాతిపదిక పరిశ్రమలను, నిర్మించుటయు, సామాజిక వికాసన, సహకారోద్యమముల మూలమున పల్లెపట్టుల ఆర్థిక వ్యవస్థారీతిని పునర్నిర్మించియు, ఆర్థిక సామాజిక ప్రయోజనముల సాధించి దేశీయార్థిక వ్యవస్థాగతిని ఎక్కువగ చైతన్యవంతము చేయుటకుగూడ ఈ ప్రణాళికయందు ఉద్దేశింపబడినది. ఉద్యోగావకాశములను పెంపొందించియు, ఆదాయము లందును, సంపద లందునుగల వ్యత్యాసములను తగ్గించియు, ఆర్థికశక్తి కేంద్రీకృతము కాకుండ నిరోధించియు, జాతీయార్థిక వ్యవస్థను అభివృద్ధిచేయు విషయమున ఈ ప్రణాళిక ప్రత్యేకశ్రద్ధ వహించినది.

ద్వితీయ ప్రణాళిక ఆరంభింపబడిన తరువాత కచ్చితముగ ఏడు నెలలకు చిరకాల వాంఛితమగు భాషారాష్ట్ర నిర్మాణము రూపుగొని విశాలతరమగు ఆంధ్రప్రదేశము ఏర్పడి తెలుగు మాట్లాడుప్రజలు దాదాపుగ అందరును ఒకే ఒక పరిపాలనక్రిందకు కొనిరాబడిరి. ఇందువలన తెలంగాణా ప్రణాళికను, ఆంధ్రప్రాంతపు ప్రణాళికతో సమన్వయపరచి, వాని ప్రత్యేక వ్యక్తిత్వము సమసి పోకుండ జాగ్రత్త వహించుచునే ఏకైకరాష్ట్ర ప్రణాళికగా రూపొందించు కార్యకలాపము ద్వితీయ ప్రణాళికారంభ కాలమున ప్రాథమిక చర్యగా పరిణమించెను. ఇటుల ఏర్పడిన ఆంధ్రప్రదేశ్ సమగ్ర ప్రణాళికావ్యయము రు. 175.74 కోట్లవరకు ఉండెను; కాని తరువాత జరిగిన సవరణవలన రు. 179.89 కోట్లుగా మార్చబడెను. సవరింపబడిన రీతిలో వేర్వేరు, అభ్యుదయ కార్యక్రమములకు రాష్ట్రస్థాయిలోను, అఖిలభారత స్థాయిలోను నిర్ణయింపబడిన ఖర్చు మొత్తములు దిగువపట్టికలో తెలుపబడినవి.

ద్వితీయ ప్రణాళికా కాలము అయిదేండ్ల మొత్తము మీద ఖర్చు పెట్టుటకై నిర్ణయింపబడిన రు. 179.89 కోట్లకు గాను, ప్రణాళిక అమలు జరుపబడిన గత నాలుగేండ్లలో అనగా 1956-60 మధ్యకాలమున రాష్ట్ర ప్రభుత్వము రు. 132.00 కోట్లను వినియోగించినది. జరుగుచున్న అయిదవ సంవత్సరమున రు. 44.04 కోట్లు ఖర్చునకు సరిపడు ప్రణాళికా కార్యములు నిర్వహణలో ఉన్నవి. సాధన సంపదలు సమకూరుటలో అరగొరలు, యాంత్రిక నిపుణుల అభావత, పరిపాలనాదక్షుల కొరత, దేశమున విదేశ ద్రవ్యవిషయమున ఏర్పడిన క్లిష్ట పరిస్థితి, భాషా విషయికముగ రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ, తత్ఫలితముగ ఏర్పడిన పరిపాలనా విషయిక తీవ్రసమస్యలు, నిర్మాణ పరికర ద్రవ్యములలోటు మొదలగు వివిధ సంక్లిష్టావరోధములను ఈ ద్వితీయ ప్రణాళికాకాలమున ఈ రాష్ట్రము ఎదుర్కొనవలసివచ్చినదను విషయమును గురుతు నందుంచుకొని పరికించిన యెడల ఆంధ్రప్రదేశము ద్వితీయ ప్రణాళికయందు తాను సాధించిన విజయము ప్రశంసార్హమేయని సహేతుకముగ గర్వింపదగును.

ఈ రాష్ట్రమునకు అదనపు ఆహారోత్పత్తి లక్ష్యముగ నిర్ణయింపబడిన 16.42 లక్షల టన్నుల ప్రమాణమును ఈ ద్వితీయ ప్రణాళికాకాలము ముగియునప్పటికి సాధింపవీలగునని ఆశింప బడుచున్నది. జరిగిన నాలుగేండ్ల ప్రణాళికా కాలమున (1956-60) 10.94 లక్షల టన్నుల అదనపు ఉత్పత్తి సాధింప బడినది. కొరవ 5.49 లక్షల టన్నులును ప్రణాళికాకాలపు అయిదవ సంవత్సరమున ఉత్పత్తి చేయబడగలదు. నాగార్జున సాగరము ప్రాజెక్టు పని అనుకొనిన దానికన్న ఎక్కువ వేగముతో ముందునకు సాగుచున్నది. ఉత్తమ, మధ్యమశ్రేణుల నీటిపారుదల

వసతులక్రింద దాదాపు 3.00 లక్షల ఎకరముల 1959 సం. మార్చి నెలాఖరునకు అదనముగ పారుదలలోనికి తీసికొని రాబడినది. విద్యుదుత్పత్తి విషయమున వ్యవస్థిత సామర్థ్యము 1,22,825 కిలోవాట్లకు పెరిగినది. అదనముగ 1,244 పల్లెలకు పట్టణములకు విద్యుత్తు సరఫరా యగు చున్నది. సహకారోద్యమమున జరిగిన సక్రమాభివృద్ధి

| ముఖ్యమగు అభ్యుదయ కార్యక్రమము | అఖిల భారత స్థాయి | | ఆంధ్రప్రదేశ్‌కు కేటాయింపు | |
|---|---|---|---|---|
| | నిర్దేశితమగు మొత్తము (రు. కోట్లలో) | మొత్తము ప్రణాళికా వ్యయమున ప్రతి శాతము | నిర్దేశితమగు మొత్తము (కోట్ల రు.లలో) | మొత్తము వ్యయములో ప్రతి శాతము |
| 1. వ్యావసాయిక కార్యక్రమము | 568.00 | 11.8 | 36.93 | 21.6 |
| 2. నీటి పారుదల | 460.00 | 9.6 | 57.21 | 31.8 |
| 3. విద్యుదుత్పత్తి | 400.00 | 8.3 | 32.69 | 18.2 |
| 4. పరిశ్రమలు | 1,080.00 | 22.6 | 10.98 | 6.1 |
| 5. రవాణా | 1,345.00 | 28.0 | 6.02 | 3.4 |
| 6. సాంఘిక సేవా శాఖలు | 863.00 | 18.0 | 31.20 | 17.3 |
| 7. తదితరములు | 84.00 | 1.7 | 2.86 | 1.6 |
| మొత్తము | 4,800.00 | 100.00 | 179.89 | 100.00 |

మూలమున రాష్ట్రము మొత్తముమీద 548 పెద్దరకపు సహకార సంఘములు క్రొత్తగ స్థాపింపబడినవి. మొత్తము సహకార సంఘములసంఖ్య 11,880 వరకు పెరిగినది. రాష్ట్రమున 71.8 ప్రతి శాతము గ్రామములలో ఇవి పని చేయుచున్నవి. ఇందలి సభ్యులకు ఈయబడిన ఋణముల మొత్తము రు. 13.78 కోట్లు. రోడ్ల అభివృద్ధికికూడ ఇందు ప్రాధాన్యము కల్పింపబడినది. క్రొత్తగా కొన్నిరోడ్లు వేయబడినవి. కొన్ని పాతరోడ్లకు చక్కని మరమ్మతులు చేసి వానిని ఉన్నతస్థాయి రహదారులుగ మార్చుట జరిగినది. ఈ రెండింటి మొత్తపునిడివి 1,806 మైళ్ళు. సాంఘికసేవా కార్యములందుకూడ ఇట్టి అభివృద్ధియే సాధింపబడినది. 6 నుండి 17 సంవత్సరములవరకు వయసు గల బాలురయందు పాఠశాలలలో చేరువారి సంఖ్య 2.27 లక్షలకు పెరిగెను. రాష్ట్రమునందలి వేర్వేరు ఆసుపత్రుల పడకల సంఖ్య మొత్తముమీద 2,246 అధికమయ్యెను. ఇంతే కాకుండ జనరల్ ఆసుపత్రులందు ప్రత్యేక రోగచికిత్సా సౌకర్యములు కొన్ని అదనముగ ఏర్పరుప బడినవి. స్థానికసంస్థల అధీనమున ఉన్న వైద్యశాలలు రాష్ట్రప్రభుత్వపు అజమాయిషిలోనికి తీసికొని రాబడినవి. ప్రాథమిక స్వాస్థ్యకేంద్రముల సంస్థాపన విషయమున గూడ అభివృద్ధి సాధింప బడినది. ఇక రోగనిరోధక కార్యక్రమమున నిర్వహించిన కృషి ఫలితముగ -మలేరియా నిర్మూలన, బోదకాలి జ్వరపు నివారణ, కుష్ఠునివారణ, బి.సి.జి. టీకాలు వేయుట మొదలగు అఖిలభారత కార్యక్రమములు విజయవంతముగ కొనసాగింపబడినవి. గృహ నిర్మాణ కార్యక్రమమున చేసిన కృషివలన, సహకార గృహనిర్మాణ సంఘములు, పారిశ్రామిక గృహనిర్మాణ సంఘములు, తక్కువ ఆదాయము కలవారి గృహనిర్మాణ సంఘములు మొదలగు వానిద్వారా ప్రభుత్వ సహాయ ముతో 6,570 పైగా ఇండ్లు నిర్మింపబడినవి.

సామాజిక వికాసన కార్యక్రమము విజయవంతముగ ప్రణాళికా కాలమున కొనసాగింపబడుచునే యుండినది. అఖిల భారత స్థాయిని సాధింపబడిన ఫలితములను దృష్టి యందిడుకొని చూచిన యెడల ఈ రాష్ట్రము ఈ కార్యక్రమమును నిర్వహించిన తీరు చాలగ ప్రశంసార్హము. ప్రస్తుతము, రాష్ట్రము మొత్తము విస్తీర్ణమున 69 ప్రతిశాతము భూమి యందును మొత్తము గ్రామములలో నూరింట 68 యందు, కార్యక్రమము అమలు జరుపబడినది.యావత్ప్రజానీకమున నూటిలో 72 మందికి ఇందువలన ప్రయోజనము లభించుచున్నది. బ్లాకుల నిర్వహణకై పరిపాలన వికేంద్రీకరింపబడి, త్రిస్థాయీ ప్రభుత్వ విధానము నూతనముగ ప్రవేశ పెట్టబడినది. ఈ విధానము ననుసరించి సమితియు, గ్రామ స్థాయిలో గ్రామ పంచాయితీయు, బ్లాకు స్థాయిలో జిల్లా స్థాయిలో పరిషత్తును పరిపాలనా బాధ్యత వహించు చున్నవి. 1959 సం. జిల్లా పరిషత్ పంచాయతీ సమితుల చట్టముననుసరించి ఈసాధికారిక సంస్థలు నెలకొల్పబడినవి.

రెండవ ప్రణాళిక కాలము ముగియ నుండుటచే మూడవ ప్రణాళికను గురించి ఆలోచించుట మొదలిడ

బడినది. స్వయం పరిపోషక మగు అభ్యుదయ గతిని సాధించుటయే యీ మూడవ ప్రణాళిక పరమాదర్శము. సాలుసరి జాతీయదాయమున 5 ప్రతిశాతము అభివృద్ధిని కలిగించుట; ఆహార ధాన్యముల విషయమున స్వయం పోషకతను సాధించుట; పరిశ్రమలకును, ఎగుమతులకు సరిపోవునటుల వ్యావసాయికోత్పత్తులను పెంచుట; ఉక్కు ఇంధనములు, విద్యుత్తు, యంత్ర నిర్మాణముల వంటి ప్రాతిపదిక పరిశ్రమలను అభివృద్ధి చేయుట; దేశమున గల అంగబలమును సద్వినియోగము చేయుట; ధరలను అదుపులో నుంచుట; సంపదలయందును, ఆదాయములందును కల వ్యత్యాసములను తగ్గించి అధికారమున సమానత్వమును ఎక్కువగ సాధించుట; అనునవి ఈ ప్రణాళిక యందు గల ముఖ్యోద్దేశములు. విశాలత రాదర్శములను, ఆ ఆదర్శ సాధన యందు గర్భితములైయుండు రాజనైతిక క్లిష్టతలను గురుతునందిడికొనియు, జాతీయ ప్రణాళికోద్దేశములు కుంటు వడకుండ జాగ్రత్త వహించియు, పరిమిత సాధన సంపత్తితో ఒక వైపునను అపరిమితములగు అత్యవసర క్లిష్ట సమస్యలతో వేరొక వైపునను సతమతమగు రాష్ట్ర పరిస్థితిని విస్మరించకయు, ప్రాముఖ్యతల క్రమము నిర్ణయమున అడుగడుగున ఎదుర్కొన వలసి వచ్చు అహమహమికలను అనాదరింపక చతురతతో పరిష్కరించియు, ఈ మూడవ ప్రణాళికా కార్య విధానము నిర్ణయింప బడినది. ద్వితీయ పంచవర్ష ప్రణాళికయందు 180 కోట్లు మాత్రమే వెరసి వ్యయముగా నిర్ణయింపబడగా, మూడవ దాని యందు ఈ వ్యయము రు. 482 కోట్లు ఉండునటుల తాత్కాలికముగా ప్రతిపాదింపబడినది.

రు. 482 కోట్ల పెట్టుబడితో నిర్వహింప నుద్దేశింపబడిన ఈ మూడవ ప్రణాళిక సైతము ప్రాముఖ్యతల క్రమము విషయమున రెండవ ప్రణాళికనే అనుసరించినది. రాష్ట్రము ముఖ్యముగ వ్యావసాయిక మగుటచే ఇట్టి అనుసరణ తప్పనిసరి అగుచున్నది. రు. 482 కోట్లలో వ్యావసాయిక కార్యక్రమమునకు రు. 112 కోట్లును, నీటిపారుదల విద్యుదుత్పత్తులకు రు. 216 కోట్ల పై చిల్లరయు, పారిశ్రామిక ఖనిజ, సంపదల అభివృద్ధికి రు. 45 కోట్లును, రవాణా అభివృద్ధికి రు. 26 కోట్లును, సాంఘిక సేవా కార్యములకు రు. 93 కోట్లును ప్రత్యేకింపబడినది. ద్వితీయ ప్రణాళికాంతమున 71 లక్షల టన్నులుగ నున్న ఆహారోత్పత్తి స్థాయిని 98 లక్షల టన్నులకు పెంచుట ప్రణాళికా లక్ష్యము.

వ్యావసాయికాభివృద్ధికై నీటిని పారుదల చేయుటకై పల్లెపట్టులయందు బావులు మొదలగు వానికి విద్యుత్తు సరఫరా చేయుచునే, పరిశ్రమల అభివృద్ధికై చౌకగ తగినంత విద్యుచ్ఛక్తిని సరఫరా చేయుట యీ ప్రణాళికోద్దేశము. అందు వలననే మొత్తము వ్యయమున 18.74 ప్రతిశాతము అనగా రు. 90 కోట్లు విద్యుదుత్పత్తి ప్రాజెక్టుల కొరకై ప్రత్యేకింప బడినది. ఈ ప్రాజెక్టుల వలన ఉత్పత్తి సామర్థ్యము అదనముగ 5.42 లక్షల కిలోవాట్లు పెరిగి, ప్రతివ్యక్తి అనుభవము 40 యూనిట్లకు పోగలదు. ద్వితీయ ప్రణాళికలో పరిశ్రమల అభివృద్ధికి ప్రత్యేకింపబడిన మొత్తమునకు 4 రెట్లు మొత్తము మూడవ ప్రణాళికలో ఆ పద్దు క్రింద ప్రత్యేకింప బడినది. అందులకై రు. 11 కోట్లు మాత్రమే ప్రత్యేకింప బడినది; కాని మూడవ దానిలో దానికొరకై రు. 45 కోట్లు ప్రత్యేకింప బడినది.

ఆంధ్రప్రదేశమున 100 చ. మైళ్ళ విస్తీర్ణ భూమిలో రోడ్డు పొడవు సరాసరిన 18 మైళ్ళు మాత్రమే. అఖిల భారత స్థాయిలో అట్టి విస్తీర్ణమున రోడ్డు పొడవు సరాసరి 25 మైళ్ళు కలదు. ఇటుల అతి హీన పరిస్థితిలో 18 మైళ్ళ సరాసరి రోడ్డు పొడవు కల ఈ రాష్ట్రమునకు 20 ఏండ్లలో 100 చ. మైళ్ళ విస్తీర్ణమున 55 మైళ్ళ రోడ్డు నిడివి గల దానినిగా మార్చుటకై తయారు చేయబడిన రోడ్ల అభివృద్ధి ప్రణాళికా లక్ష్యమును గురుతు నందుంచుకొనియే మూడవ ప్రణాళిక యందు ఈ రాష్ట్రమున రోడ్ల అభివృద్ధి కార్యక్రమమునకు అంచన వేయబడినది.

ప్రథమ, ద్వితీయ పంచవర్ష ప్రణాళికలందు సాంఘిక సేవా కార్య క్రమములకు సముచితమగు ఉన్నత స్థానము లభింప లేదు. ఈ లోటును పూర్తి చేయుటకు మూడవ ప్రణాళిక యందు కృషి జరుపబడి, అందును ముఖ్యముగ విద్య, స్వాస్థ్యము, గృహ నిర్మాణ కార్యక్రమములు అను వాని విషయముననే ప్రత్యేక శ్రద్ధవహింప బడినది. నానా విధ వ్యయముల పద్దుతో కూడ కలిపి చూచిన యెడల సాంఘిక సేవా కార్యక్రమములక్రింద ఈ ప్రణాళికయందు మొత్తము పెట్టుబడిలో 19.3 ప్రతిశాతము అనగా రు. 93.15 కోట్లు ఖర్చు పెట్ట ఉద్దేశింప బడినది.

ఈ తాత్కాలిక ప్రణాళికయందు గమ్యములుగ నిడుకొనిన లక్ష్యములు రాష్ట్రపు శక్తి సామర్థ్యములకు అందుబాటులోనే కలవు. కాని, ఆ కార్యక్రమము సత్వర పరిపూర్తికై అంగబలమును, అర్థబలమును, సాధన సంపత్తులను సమీకరించు విషయమున మాత్రము ప్రత్యేక శ్రద్ధాయుతమగు ప్రగాఢకృషి జరుగవలెను. ఈ కార్యభారమును నిర్వహించు విషయమున సునిశ్చిత సంకల్పము వహించిన ఈ రాష్ట్రమునందు మూడవ ప్రణాళికా కాలమున పరిగణనీయాభివృద్ధి సాధింప బడగలదని ఆశింపదగును.

 చ. న.

# సూచి

ఖ

ధ



న

## ప

## వ

శ

హ





## ACKNOWLEDGMENTS

We are indebted to the following institutions and individuals for the permission they gave us to reproduce illustrations noted against each. Reproduction from this volume in each case is prohibited without the permission of the authority concerned :

1. ALL INDIA PRESS PHOTO AGENCY, MADRAS:
   300
2. SRI BHASKARA REDDY, P. DODDIPATLA:
   Plate: 79 (5),
3. SRI CHANDRASEKHARAN, M. ELURU:
   Plate 79 (2),
4. CURATOR, BRITISH MUSEUM, LONDON:
   Plates 55, 56, (1, 3-5)
5. DEPARTMENT OF ARCHAEOLOGY, GOVERNMENT OF INDIA, NEW DELHI:
   Figures in text: 120, 121, 138, 157-161, 199. 291, 292, 306 and Maps on pages 717, 883, 1237, and Inscriptions 238 A-C.; 238 E., F; 238 H-J, 238 L.
   Figures in Plates: 52, 54, 57-66, 67 (4), 75, 76, 80 (2), 81 (1).
6. DEPARTMENT OF ELECTRICITY, GOVERNMENT OF ANDHRA PRADESH, HYDERABAD:
   Plate 88.(1-2),
7. DIRECTOR, SMALL SCALE INDUSTRIES, GOVT. OF ANDHRA PRADESH, HYDERABAD:
   Plate 88 (1-4),
8. GOVERNMENT OF ANDHRA PRADESH, HYDERABAD:
   Figures in Plate 53
9. H. H. THE RAJA OF PUDUKKOTTAI, TIRUCHIRAPALLI:
   170
10. INFORMATION & PUBLIC RELATIONS DEPARTMENT, GOVT. OF ANDHRA PRADESH, HYDERABAD:
    Figures in text on pages 1510 and 1511;
    Figures in Plates: 77 (2, 3); 79 (3); 81 (2); 83; 84; 85 (3); 87 (2 & 3),
11. INTERNATIONAL PHOTO SERVICE, MADRAS:
    175
12. PORT TRUST, VISAKHAPATNAM PORT:
    Plate: 77 (1),
13. PRINCIPAL, GOVERNMENT ARTS COLLEGE, RAJAHMUNDRY:
    248
14. PRINCIPAL, M. R. COLLEGE, VIZIANAGARAM:
    126, 223, and 310
15. PRINCIPAL, PRESIDENCY COLLEGE, MADRAS:
    269
16. SRI RAMAGOPAL, H. V.: 240
17. REGISTRAR, ANDHRA UNIVERSITY, WALTAIR:
    Plate: 85 (1),

18. REGISTRAR, SRI VENKATESWARA UNIVERSITY, TIRUPATI:
    Plate: 85 (2).

19. SRI RAMAHANUMAJI, PRAJA STUDIO, ELURU:
    133 and 178.

20. SRI RAMAKRISHNA RAO, ABBURI:
    185-188

21. Dr. RAMARAJU, B.
    145, 151, 156, 169, 180, 183, 194, 197, 252, 261, 279, and 294.

22. PROF. SAMBAMURTI, P.
    247, 273, 289, and 297

23. SRI SIVARAMAMURTI, C.:
    244 and 245

24. SRI SOMASEKHARA SARMA, M.
    148, 155, 181, 189-191, 238 డి., జి., కె, ఎమ్., 250, 251, 258, 283,

25. SRI KRISHNA DEVARAYA ANDHRA BHASHA NILLAYAM, HYDERABAD: 268

26. REV. STEWART WILLIAM, PRINCIPAL, SERAMPORE COLLEGE, SERAMPORE:
    Figures 238 ఎస్., టి.

27. SRI SUBBARAO, KALLURI:
    168 239, 241-243 Plates: 67 (1-3);

28. SUPERINTENDENT, GOVERNMENT MUSEUM, MADRAS:
    117, 124 (అ, ఆ) 156 (అ), 160 (అ, ఆ), 290 (అ, ఆ);
    Plates: 56 (2)

29. TIRUMALA TIRUPATI DEVASTANAM;
    Figures in text: 124, 172
    Plate: 82

Our grateful thanks are to those who helped us in securing and supplying photographs for publication in biographical sketches.

Our grateful thanks to Sri C. R. Acharya who had lent his shadowplay figure, *Sri Rama*; to Sri K. Subbarao for kindly lending the painting of '*Gautami Avataranam*' by C. N. Venkatrao, and also to Sri A. Kuppuswami who had kindly lent the painting '*Samudraguptudu*' by Adivi Bapiraju for reproduction.

Note: In regard to figures in plates, unless and otherwise mentioned, the number of the plate denotes all illustrations it contains.

Telugu Bhasha Samiti

---

# SELECT BIBLIOGRAPHY


## WORKS

Ahmed, Syed — *The Telangana Districts* (1956)

Krishnaswamy, S. — *Rural Problem of Madras.*

Natarajan, Dr. B. — *Food and Agriculture in Madras State.*
*Economic Wealth of Andhra* (*Typed Manuscript*)
*Wealth and Welfare of Madras State.*

Ramanadham, Dr. V. V. — *Economy of Andhra Pradesh* (1959).

సుందరయ్య, పుచ్చలపల్లి — విశాలాంధ్రలో ప్రజారాజ్యము

## ARTICLES

Rao, Dr. K. L. — *River Basins of Andhra State* (1953).

Somayajulu, B. R. — *Hydro-Thermal Power Resources in Andhra* (1953).

## REPORTS

Govt. of Madras. — *Season and crop report of Madras State 1950-51.*

*Administrative report of the High Ways Department 1949-50 ; 1950-51.*

*Administrative report of the Agriculture Department 1950-51 ; 1951-52.*

*Administrative report of Madras, Animal Husbandry Department 1949-50 ; 1950-51.*

*Administrative report of Forest Department 1951.*

*Administrative report of Public Works Department* (*irrigation*) *1948-49 Part 11-B.*

*Administrative report of the Public Works Department* (*irrigation*) *1949-50 Part 11 A. 11 B.*

*Administrative report of the Electricity Department 1951-52.*

*Land Revenue Reforms Committee Report, Madras Vols. 1 and 2.*

*Annual report of the Hospital and Dispensaries of indigenous Medicine in the State of Madras 1950.*

*Report on the Health conditions of Madras State 1950.*

*Report on Public Instruction 1947-48; 1949-50; 1950-51.*

*Report on Public instruction quinquennium 1942 to 47.*

*Report on the working of the Factories Act in the State of Madras for the year 1951.*

*Land Resettlement Report 1950-51.*

Govt. of Andhra Pradesh — *Andhra Pradesh State Administration Report 1957-58.*

## GENERAL REFERENCE BOOKS

| | |
|---|---|
| Govt. of Madras | *Statistical Atlas of Madras Province 1940-41.* |
| | *Large Scale Industrial Establishments coming under operation of the Indian Factories Act for the Calendar year 1949.* |
| | *Madras in Maps 1951; Cottage Industries in Madras State; Issues of monthly Digest of Economics and Statistics.* |
| | *Census of India 1951, Madras State (3 Vols.)* |
| | *Census Hand Books (Telugu Districts 1951).* |
| Govt. of India | *Educational Costing Statistics of India, 1949.* |
| | *Record of Geological Survey of India Vol. 81 Part 3 (1950)* |
| | *Memoirs of the Geological Survey of India Vol. 80.* |
| | *Records of Geological Survey of India Vol. LXXVI.* |
| | *Medical Register, 1949.* |
| Govt. of Andhra Pradesh | *Census Statements 1961, Supplied by Andhra Pradesh State Census Superintendent.* |
| | *Statistics relating to Banks in India, 1952.* |
| | *Reserve Bank of India.* |
| | *Statistical Abstract, Govt. of Andhra Pradesh 1958.* |
| | *Souvenir Published by the Chief Conservator of Forests, 1958.* |
| Andhra Chamber of Commerce Madras | *Silver Jubilee Souvenir 1955.* |
| Andhra Pradesh Congress Committee | *Souvenir 1958.* |
| | ఆంధ్ర దర్శిని 1959. |
| | గుంటూరు సర్వస్వము 1959 |

---

